

**అకంపనుడు 1 :** రాక్షసుల్లో గొప్ప వీరుడు. సుమాలి కేతుమతిలకు జన్మించిన వారిలో రెండవవాడు. సీతా పహరణమే రాముని వధకు మార్గమని రావణు నికి సలహా ఇచ్చినవాడు. ఖర, దూషణ, త్రిశురా శులను రామలక్ష్మణులు వధించారని రావణునికి తెలియజేశాడు. హనుమంతునితో తీవ్రంగా పోరాడి అతని చేతుల్లో మరణించాడు. – రామాయణం

**అకంపనుడు 2 :** కృతయుగంలో ఒక రాజు. కుమా రుడు ఓ యుద్ధంలో మరణించగా నిస్పృహ చెందిన వాడు. నారదుడు ఎన్నో కథలు విన్పించి ఇతణ్ణి కార్యో న్ముఖుణ్ణి చేస్తాడు. మహాభారత యుద్ధానంతరం ధర్మ జుడు శోకతప్తుడైనప్పుడు వ్యాసుడు ఇతని కథ చెప్పి ధర్మజుడ్ని ఓదార్చుతాడు. – మహాభారతం

**అకర్కార :** కద్రువకు జన్మించిన ఒక నాగు.

*జన్మవృత్తాంతము :* దక్షుణి 8 మంది కుమార్తెలను కశ్యపుడు వివాహమాడగా అందులో ఒకరైన క్రోదవ శకి 10 మంది జన్మించిరి. ఆ పదిమందిలో ★ కద్రువ ఒకరు. ఆమెకు జన్మించిన ఒక నాగు అకర్కార.

**అకూపార :** హిమాలయాల్లో వున్న ఇంద్రద్యుమ్న మనే కొలనులో నివసించే తాబేలు. దీనిని ఆది కూర్మమని, దేవుని రెండవ అవతారమని పిలుస్తారు. మరిన్ని వివరాలు మహాభారతంలోని అరణ్యపర్వంలో లభిస్తాయి.

**అకృతవర్ణ :** గొప్ప తపస్వి. పరశురాముని శిష్యుడు. నైమిశారణ్యంలో రుషుల సమావేశంలో మొట్ట మొదట మహాభారత కథను విన్పించిన సూతుడు ఇతని శిష్యుడే. – భాగవతం

*పూర్వవృత్తాంతము :* ఇతడొక బ్రాహ్మణ బాలుడు. అరణ్యములో తపస్సు చేసుకొనుచుండగా శాపవ శమున పులిగా మారిన గంధర్వుని కంటబడి చంప బోవుచుండగా శివుని వద్ద అస్త్రశస్త్రములను పొంది తిరిగివచ్చు పరశురాముని వలన కాపాడ బడినాడు. ఆనాటినుండి అతడు జీవితాంతము పరశురాముని వెంటవుండి జీవించెను. పరశు రామ, భీష్ములకుమధ్య జరిగిన యుద్ధములో అతనికి సారధిగా వుండెను. కురుక్షేత్ర యుద్ధములో కూడా పాల్గొని అంపశయ్యపై పరుండిన భీష్ముని దర్శించిన వారిలో ఒకడు. – మహాభారతం

**అకృతశ్రమ :** జీవితంలో నాల్గవ దశ అయిన సన్యాసా శ్రమానంతరం స్వర్గాన్ని చేరిన అతి కొద్ది మందిలో ఒకడు. అంపశయ్యపై నుండి భీష్ముడు ధర్మజునికి చెప్పిన అనేక కథల్లో ఇతని కథ ఒకటి.

**అక్రోధనుడు :** ప్రుధుసార్వుని కూతురైన కామ, పురూర వంశ రాజైన అయుతయువుకి జన్మించిన ప్రముఖ పూరువంశ రాజు.

**అక్షప్రపతాన :** ఆనర్త దేశంలో ఓ ప్రదేశం. ఇక్కడే శ్రీకృష్ణుడు గోపతి, తాలకేతు అనే రాక్షసులను సంహరించెను.

**అక్షమాల :** చూ॥ అరుంధతి.

**అక్షయకుమారుడు (అక్షుడు) :** రావణుని కుమారుడు. హనుమంతుడు లంకనుజేరి వనమును నాశనము చేసి రావణభటులను సంహరించుచుండగా ఇతడు హనుమంతునితో పోరాడి అతనిచే వధింపబడెను. – రామాయణం

**అక్షయపాత్ర :** ధర్మజునికి సూర్యుడు బహుమతిగా ఇచ్చిన తామ్రగిన్నె. పాండవులు జూదంలో ఓడి అర ణ్యవాసం చేయునపుడు అతని అసంఖ్యాక అను చరులు వారితో అడవికి వచ్చిరి. వారికందరికి భోజన సదుపాయములు నెరవేర్చుటకు ధర్మజుడు సూర్యుని ప్రార్థించగ సూర్యుడు ధర్మజునికి ఈ పాత్రను ప్రసా దించెను. ఈ పాత్ర ప్రత్యేకత ఏమనగా ఇది ఎప్పటికీ ఖాళీకాదు. ఎప్పుడు అవసరమైతే అప్పుడు భోజన సదుపాయములను ఒనర్చగలదు. అందువలన పాండవులు తమతో వచ్చిన వారికి ఎప్పుడు కోరితే అప్పుడు భోజన సదుపాయము కల్పించిరి. – మహాభారతం

**అక్షయవటం 1 :** ఇదొక పుణ్యసరస్సు. గంగా – గోమతి సంగమానికి దగ్గరలోవున్న గయ వద్ద కలదని, ఇందు స్నానమాచరించిన విముక్తి లభించునని పులస్త్య ముని పాండవులకు వివరించెను. – మహాభారతం

★ కొన్ని పురాణాలు కద్రువ కశ్యపుని భార్య అని చెప్తున్నాయి.

**అక్షయవటం 2 :** పుష్పభద్ర హిమాలయాలలో పుట్టి 500 యోజనాలు ప్రవహించిన పుణ్యనది. దీని తీరాన అక్షయవటం అనే ఆశ్రమం కలదు. ఓ పెద్ద అరటిచెట్టు ఈ ఆశ్రమంలో వుండటం వల్ల ఈ పేరు వచ్చింది. కపిలముని ఇక్కడే దీక్షవహించెను. శివుడు, భద్రకాళి, స్కందులు వచ్చి ఈ అరటి చెట్టు క్రింద కూర్చుని వెళ్లేవారు. –దేవీభాగవతం

**అక్షర పురుష :** కురుక్షేత్ర యుద్ధం ప్రారంభంలో అర్జునుడు నిర్వేదంతో యుద్ధానికి విముఖత చూపగా శ్రీకృష్ణుడు గీతను బోధించెను. అందులో శ్రీకృష్ణుడు ఇంద్రియగోచరమైనది క్షరమని దాని వెనుక అతీతంగా దాగివున్న శక్తి అక్షరమని వీటికి అతీతంగా వుండే వాడే అక్షర పురుషుడైన భగవంతుడని విశదీకరిస్తాడు.

**అక్షసూత్ర :** ఆపస్తంబు మహర్షి భార్య. గొప్ప పతివ్రత. వీరికి జన్మించిన కుమారుడు గార్కి.

**అక్షహృదయం :** ఇదో మంత్రవిద్య. దీనిని నలుడు రుతుపర్ణుడిద్వారా నేర్చుకున్నాడు. ఈ విద్య తెలిసిన వారు లెక్కించకుండానే ఏ చెట్టుకి ఎన్ని ఆకులు, కొమ్మలు, ఫలాలు వున్నాయో చెప్పగలరు. ఈ విద్య నభ్యసించడం వల్ల నలుడు రెండవసారి పాచికలాటలో గెలిచి, పోయిన తన సామ్రాజ్యాన్ని గెలుచుకుంటాడు.

**అక్షీణుడు :** విశ్వామిత్రుని కుమారుడు.

**అక్రూరుడు :** శపల్క, కాశీ రాజపుత్రిక నందినలకు జన్మించినవాడు. సాత్యకి, అక్రూరులు పినతండ్రి, పెదతండ్రి బిడ్డలు. కంసుని నగరములో నివసించిన యోధుడు. అతని పనుపున కృష్ణుని అస్త్ర పూజకు రావలసినదిగా కోరుటకు వెళ్ళి కృష్ణునికి కంసుని అంతరంగమైన కృష్ణవధను నివేదించినవాడు. ద్రౌపది స్వయంవరంలో కూడా పాల్గొన్న వీరుడు. జరాసంధునితో యుద్ధంలో కృష్ణుని తరపున పోరాడెను. కృష్ణుని తరపున ద్వారకకు ధృతరాష్ట్రుని వద్దకు రాయబారిగా వెళ్లివచ్చెను.

*ఉపకథ :*సత్రాజిత్తు తన కుమార్తెను శతద్వనుని కిచ్చి వివాహము చేసెదనని మాటయిచ్చి కృష్ణునికిచ్చి వివాహము చేసెను. దీనికి అక్రూరుడు కినుకవహించి శతద్వనుని, సత్రాజిత్తును చంపుటకు ప్రోత్సహించెను. కాని కృష్ణుడు అందుకు కోపించి శతద్వనుని చంపెను. అక్రూరుడు శతద్వనునికి సహాయము చేయకపోగా కృష్ణునికి జడిసి ద్వారక విడిచి పారిపోయెను. ద్వారకలో వర్షాభావానికి అక్రూరుడు లేకుండుటయే కారణమని తెలిసి కృష్ణుడు అక్రూరునకు అభయమిచ్చి ద్వారకకు రప్పించెను. ఇందుకు ప్రతిగా అక్రూరుడు తన వద్దగల శమంతకమణిని శ్రీకృష్ణునికిచ్చెను.

**అక్షౌహిణి :** ఓ పెద్ద సేనా వాహిని. 21870 రథాలు, అన్నే ఏనుగులు, 65160 గుర్రాలు, 10950 సైనికులు కలిస్తే ఓ అక్షౌహిణి అవుతుంది. – మహాభారతం

ఒక రథం, ఒక ఏనుగు, మూడు గుర్రాలు, 5 గురు సైనికులు కలిస్తే ఒక పత్తి, అలాంటి 3 పత్తులు ఓ సేనా ముఖం, 3 సేనా ముఖాలు ఓ గుల్మం, 3 గుల్మాలు ఓ వాహిని, 3 వాహినిలు ఒక పృతన, ఇలాంటి ఎన్నో పృతనాలు కలిస్తే ఓ అక్షౌహిణి.

– *మళయాళ మహాభారతం*

**అగతి :** ఇది ఒక నగరం. లక్ష్మణునికి ఊర్మిళకు తక్షక, చత్రకేతు అను ఇద్దరు సంతానం. లక్ష్మణుడు తక్షకుని కొరకు ఈ నగరాన్ని నిర్మించాడు. ఈ నగరానికి ముందు పేరు కనకాల. అక్కడ ఆటవికులు నివసించే వారు. – ఉ. రామాయణం

**అగస్తి :** చూ॥ అగస్త్య.

**అగస్త్య :** ఓ మహర్షి.

*వంశవృక్షం :* విష్ణు – బ్రహ్మ –మరీచి – కాశ్యప – సూర్య – అగస్త్య

*జననం :* సూర్యవంశజుడైన ఇక్ష్వాకుని కుమారుడు నిమి. అతడు రాజ్యాధికారాన్ని చేపట్టగనే ఓ గొప్ప యాగం తలపెట్టి వశిష్ఠుణ్ణి ఆ కార్య భారాన్ని నిర్వహించమని అర్థించగా అదే సమయంలో ఇంద్రుడు చేసే యాగానికి వశిష్ఠుడు వెళ్లవలసి వుండి అంగీకరించలేదు. అందుకు నిమి కుపితుడై గౌతమముని కుమారుడైన సతానందుని సహాయంతో ప్రారంభించగా వశిష్ఠుడు నిమిని అతని శరీరం నుండి జీవి బయటకు పోవునట్లు శపించాడు. నిమి కూడా అదే విధంగా వశిష్ఠుడ్ని శపించాడు. ఆకాశంలో శరీరం లేని వశిష్ఠుడు సంచరిస్తూ, బ్రహ్మను ఓ శరీరాన్ని కోరగా మిత్రావరుణులకు జన్మిస్తావని అభయమిచ్చెను. మిత్రావరుణులు ఒకే శరీరంతో సంచరిస్తూ

సముద్రపు ఒడ్డున అందాల ఊర్వశిని చూసి ఆమెను కౌగిలించుకొనగా వశిష్టుని అంశ ఊర్వశి గర్భమున జేరెను. ఆ తర్వాత మిత్రావరుణులు విడివడి ఎవరి శరీరాకృతి వారు ధరించిరి. వరుణుడు ఊర్వశిని మోహించగా ఆమె తిరస్కరించి మిత్రను మాత్రమే అంగీకరించెను. ఇది చూసిన వరుణుడు అతి మోహంతో వీర్య స్కలనం చేసుకొనెను. అది చూసిన ఊర్వశి వరుణిపై మోహం చెందడం వల్ల ఆమె గర్భం లోని మిత్రాస్కలనం కూడా భూమిపై పడెను. వీరి వీర్యాలను ఓ కుండలో భద్రపరచగా కొన్నాళ్లకు అది విడివడి ఇద్దరు పిల్లలు జన్మించారు. వారే అగస్త్య, వశిష్ఠులు. – *మహాభారతం*

*వివాహము :* అగస్త్యుడు చాలాకాలము బ్రహ్మ చర్యమునే ఆచరించెను. ఒకనాడు అడవిలో సంచ రించు చుండగా తలక్రిందులుగా వ్రేలాడుచున్న దంపతులను జూచి కారణమేమని అడుగగా వారు తమ వంశమువాడైన అగస్త్యుడు వివాహ మాడక యుండెనని అందుకని మాకు ముందుగతులు లేక యిట్లుంటిమనిరి. అగస్త్యుడు దీనిని గ్రహించి తన వరప్రసాదముగా జన్మించిన లూపాముద్రను తనికిచ్చి వివాహము చేయమని విదర్భరాజును కోరెను. కురూపి అయిన అగస్త్యునికి తన కుమార్తెనిచ్చుటకు అతనిచ్చగించ కున్నను లూపాముద్ర అందుకంగీ కరించి అగస్త్యుని వివాహమాడెను.

*వాతాపి జీర్ణం :* అగస్త్యునికి మన్మథ తాపముచే తన భార్య లూపాముద్రను కలవదలచెను. అందుకామె నిరాకరించి ఈ నారచీరతో అలంకారము ఆభరణ ములు లేనిదే అంగీకరించక వాటిని కోరెను. అగస్త్యు డందుకుపక్రమించి శృతపర్వుడను రాజుకడకేగెను. అతని వద్ద తగినంత ధనము లేక ఇద్దరును కలసి ప్రదశ్యుని వద్దకుపోయి అక్కడను సరిపడ ధనము లేక ముగ్గురు కలసి త్రసదస్యుండను రాజు వద్దకు పోయిరి. అక్కడను సరిపడ ధనము లేక ఇల్వలుడి వద్ద అపారధనము గలదని వాని వద్దకు బోయిరి. ఇల్వలుడు వాతాపి అనురాక్షసుని మేకను చేసి వీరికి ఆహారముగా పెట్టెను. ఇది గమనించిన అగస్త్యుడు "వాతాపి జీర్ణం, జీర్ణంజీర్ణం వాతాపి జీర్ణం" అనగానే వాతాపి జీర్ణమయ్యెను. ఇది ఇల్వలుడు బ్రాహ్మణుల జంపుటకు పన్నిన పన్నాగము. ఇల్వలుడు దీనికి భయపడి తనవద్దగల అపార సంపదను, ఆభరణములను అగ స్త్యునికిచ్చి పంపెను. అగస్త్యుడు వాటిని తన భార్య లూపాముద్రకిచ్చి తన కోర్కె తీర్చుకొనగా వారికి దృడస్యుడను పుత్రుడు, రాజస్వి అను పౌత్రుడుకల్గెను.

*అగస్త్యుని శక్తి :* 1. నారదుని సలహా మేరకు వింధ్యా పర్వతములు, తమ శిఖరములను ఆకాశమునంటు నట్లు పెంచి మేరు పర్వతపు గర్వము నణచదలచెను. అందువల్ల సూర్యచంద్రుల ప్రయాణమునకు అంతరా యము కలిగి భూమండలమంతయు అంధకారమల ముకొనెను. దేవతలు వచ్చి వింధ్య నడగగా అది తిరస్కరించెను. అప్పుడు దేవతలు అగస్త్యుని శరణు వేడిరి. అగస్త్యుడు వింధ్యను చేరి నేను దక్షిణాపథము నకు పోవలయును, దారి ఇమ్మని కోరగా వింధ్య భయభ్రాంతియై దారి వదలెను. తర్వాత అగస్త్యుడు దక్షిణా పథము నుండి తిరిగి రాకుండుటచే ఆ దారి అట్లే వుండెను. – *దేవీ భాగవతం*

2. నహుషుడు ఇంద్రత్వమునొంది తన భార్య కోరికపై బ్రాహ్మణులను తన పల్లకి మోయ మనుటయే గాక వారిని "సర్ప, సర్ప"యని వేదించెను. అందుకు అగస్త్యుడు కుపితుడై నహుషుని మహాసర్పము కమ్మని శపించెను. నహుషుడు తనను శాపవిముక్తుడను చేయమని అగస్త్యుని ప్రార్థించగా ధర్మజుని దర్శనముతో అతనికి శాపవిమోచనము కల్గునని ఊరడించెను

– *మహాభారతం*

3. కాలకేయుల సహకారంతో దేవతలను బాధిస్తున్న వృతాశురుడ్ని సంహరించగా కాలకేయులు సముద్ర గర్భమున దాగుకొనిరి. కాని రాత్రి సమయమున వారు బయటకు వచ్చి బ్రాహ్మణులను, వశిష్ఠుడు ఇతరముల పర్ణశాలలను ధ్వంసము చేయుచుండగా వారు విష్ణువు కడకేగి ఉపాయము కోరిరి. విష్ణువు అందుకు సమర్థుడు అగస్త్యుడని శలవిచ్చెను. వారు అగస్త్యుని కోరగా అగస్త్యుడు సముద్రమును మ్రింగి వేసెను. అంతట సముద్రము నుండి బయటపడిన కార్తికేయులు వధింపబడిరి. భూమిపై నీరులేమిని విష్ణువుతో మొరపెట్టుకొనగా భగీరథుడు స్వర్గము నుండి గంగను భూమికి రప్పించెను. దానితో మరల సముద్రము నిండెను. – *మహాభారతం*

4. *కుబేర గర్వభంగం :* కుబేరుడు, అతని స్నేహితుడు మనిమానుడు ఆకాశమున విహరించుచు మనిమానుడు అగస్త్యుని తలపై ఉమ్మివేసెను. అందు కగస్త్యుడు కుపితుడై మనిమానుడు, కుబేరుని సైన్యము ఒక మానవుని చేత వధింపబడుదురని శపించెను. భీముడు తపస్సు చేస్తున్న అర్జునుని చేరుటకు మార్గ మధ్యమున కుబేరపురికేగి కుబేర సైన్యమును, మనిమానుని సంహరించి కుబేరుని కలసెను. అంతటితో కుబేరునికి శాపవిముక్తి కలిగెను.

– *అరణ్యపర్వం మహాభారతం*

5. *భూమండలమును వంచుట :* శివ పార్వతుల వివాహ సందర్భముగా ప్రపంచంలోని జనులందరు అది చూచుటకు హిమాలయములకు తరలివచ్చిరి. అందువల్ల భూమి ఒక వైపుకు ఒరిగిపోయెను. అది గ్రహించిన శివుడు అగస్త్యుని దక్షిణమునకు పంపి అతని శక్తిచే సరిచేయమని కోరెను. అగస్త్యుడు దక్షిణ కొసకుచేరి అక్కడ కూర్చొనగా అతని బరువుతో భూమి పంపు సరియయ్యెను – *స్కందపురాణం*

6. *ఇతర విశేషాలు :* రాముడు అగస్త్యాశ్రమము దర్శించినపుడు అతడు విష్ణువు తనకిచ్చిన ధనస్సును శ్రీరామునికిచ్చెను. రామరావణ యుద్ధంలో రాముడు నిస్పృహ చెందగా అగస్త్యుడు ఆదిత్య హృదయ మంత్రాన్ని బోధించెను. శ్రీరాముడు రావణుని జయించి సీతతో అయోధ్యకు చేరినపుడు అతనికి తోడు వచ్చిన మునివర్యులలో అగస్త్యుడొకడు. తమిళ సాహిత్యాన్నను సరించి తమిళ సంఘాల మూడింటిలో మొదటి రెండు సంఘాలలో ఇతనికి స్థానం వుంది. అగస్త్యుడే మొదటి తమిళ వ్యాకరణకారుడు. ఇతనిని అగస్తి అని కూడా సంబోధిస్తారు.

**అగస్త్యకూటం :** అగస్త్యుడు దక్షిణాపథాన సంచరించు నప్పుడు తపస్సుచేసుకొన్న పర్వతము. సుగ్రీవుడు సీతాన్వేషణకు తన సైన్యాన్ని పంపినపుడు అగస్త్యుని దర్శించుకొమ్మని ఆదేశించెను. ఈ పర్వతాన్ని అగస్త్య పర్వతమని పిలుస్తారు. – రామాయణం

**అగస్త్యతీర్థం :** పంచతీర్థాలలో ఇదొకటి. మిగతా నాలుగు సౌభద్ర, పులోమ, కారంధమ, అతిపావన తీర్థాలు. – మహాభారతం

**అగస్త్యభ్రాత :** అగస్త్యుని సహోదరుడు. తల్లిగర్భము నందే జ్ఞానము సంపాదించుటవల్ల వ్యవహార నామము పెట్టలేదు. పేరుతో పిలవదలచనివారిని అగస్త్యభ్రాత అనెదరు.

**అగస్త్యవటం :** హిమాలయ సానువులలో వున్న పుణ్య స్థలం. అరణ్యవాసమందు అర్జునుడు దీనిని దర్శించెను.

– మహాభారతం

**అగస్త్యాశ్రమం :** అగస్త్యునితో సంబంధమున్న ఎన్నో ఆశ్రమాలను పురాణాలు ఉటంకించాయి. ఇది నాసిక్‌కు 24 మైళ్ల దూరంలో వున్న ఆశ్రమం. అరణ్యవాస మందు పాండవులు ఈ పుణ్యస్థలాన్ని దర్శించారు. ప్రయాగ వద్ద కూడా ఈ పేరున ఆశ్రమం కలదు.

– మహాభారతం

**అగ్రజన్ముడు :** చూ॥ బ్రహ్మ.

**అగ్రణి :** ఓ అగ్నిపేరు. బానునికి విశాదేవికి కల్గిన పుత్రుడు. – మహాభారతం

**అగ్రయణి :** ధృతరాష్ట్ర కుమారుడు. ఇతనిని అగ్రయాయి, అనుయామి అని అంటారు.

**అగ్రసంధని :** యముని వద్ద వుండే ఓ పుస్తకం. ఇందులో మానవుల అదృష్ట దురదృష్టాలు నమోదు చేయబడి వుంటాయి.

**అగ్రహుడు :** భానువనేఅగ్ని సుప్రజల ఆరుగురు పుత్రులలో ఒకడు. చాతుర్మాస యజ్ఞంలో ఇతడు ఎనిమిది రకాల హవిస్సులను స్వీకరిస్తాడు. – మహాభారతం

**అగ్ని :** అగ్గి అని కూడా అంటారు.

*వంశవృక్షం :* విష్ణు → బ్రహ్మ → అంగిరస→ బృహస్పతి → అగ్ని

*జన్మవృత్తాంతం :*

1. బ్రహ్మ మానస పుత్రులలో అంగిరసుడు ఒకడు. అంగిరస శ్రద్ధలకు నల్గురు కుమార్తెలు, ఇద్దరు కుమారులు. అందులో బృహస్పతి ఒకడు. బృహస్పతికి ఆరుగురు దైవాంశ సంభూతులైన పుత్రులు జన్మించిరి. అందులో పెద్దవాడైన సమాయు సత్యాలకు జన్మించినవాడే అగ్ని. – రామాయణం – మహాభారతం

2. అష్టదిక్పాలకులలో ఒకరు. భూగోళాన్ని కాపాడటానికి ఆగ్నేయ దిక్కున ప్రతిష్ఠించిన దిక్పాలకుడు. ఈయన వుండు ప్రదేశాన్ని తేజోవతి అని పిలుస్తారు.

4. భూగోళం 5 మూలకాల సమ్మేళనం అని అంటారు. ఆ అయిదింటిలో అగ్ని ఒకటి.

5. *అజీర్తి – నివారణ :* శ్వేతకి అను రాజు ఎన్నో యాగాలు నిర్వహించేవాడు. అంతంలేని ఈ యజ్ఞాల వల్ల యజ్ఞమంటపం పొగతో కమ్ముకొని పోయెను. తర్వాత యజ్ఞం చేయడానికి మునులను కోరగా అందుకు వారు నిరాకరించి శూద్రులను ఆహ్వానించు కొమ్మని చెప్పిరి. దీనికి రాజు నిరశించి కైలాసమునకు పోయి శివుని గూర్చి ఘోరతపస్సు చేయగా శివుడు దుర్వాసుని యజ్ఞము నిర్వహించుటకు పంపెను. దుర్వాసుడు యజ్ఞగుండము ద్వారా అగ్నిని అంతులేని ఆహారముతో నింపుటవలన అగ్నికి అజీర్తి కలిగెను. ఈ అజీర్తిని భరించలేక అగ్ని బ్రహ్మను ఆశ్రయించగా ఖాండవ దహనంవల్ల అజీర్తి పోవునని తెల్పెను. అతడు ఖాండవ దహనం చేయబోగ అందు నివసించు వారు అడ్డగించుటయే గాక అందులో నివ సించు ఇంద్రుని మిత్రుడగు తక్షకుని రక్షించుటకు ఇంద్రుడు వర్షము కురిపించు చుండెను. అప్పుడు నరనారాయణులైన శ్రీకృష్ణార్జునులను బ్రాహ్మణ వేషమున సహాయము కోరి వరుణుడు ప్రసాదించిన గాండీవమును అర్జును నికి, సుదర్శన చక్రమును కృష్ణునికి ప్రసాదించెను. ఆ తర్వాత అగ్ని ఖాండవ దహనం ప్రారంభించగా అది కొనసాగునట్లు అర్జునుడు తన అస్త్రశస్త్రములతో ఖాండవవనం పై వర్షం కురవకుండా తెరను ఏర్ప రచి వర్షమును అడ్డుకొని అగ్నిదాహం తీర్చెను. అగ్ని శాపవిముక్తుడయ్యెను.

*భృగుని శాపము :* భృగుమహర్షి తన భార్య పులో మాతో ఆశ్రమమున జీవించుచు ఒక దినమున నదీ స్నామునకు బోవుచు అగ్నిని తన ఆశ్రమమును చూచు చుండమని కోరెను. పులోముడను రాక్షసుడు అదే రోజున ఆశ్రమమునకు వచ్చి భృగుని భార్యను ముందు నేను మోహించితిననియు అందువల్ల ఆమె ఎవరికి భార్య అగునని అగ్నిని ప్రశ్నించెను. అగ్ని అసత్యము పలుకజాలక భృగుడు హిందూధర్మ ప్రకారము వివాహమాడలేదని చెప్పగా ఆమెను రాక్షసుడు ఎత్తుకొని పోయెను. దారిలో ఆమె ప్రసవించగా చ్యవ నుడు జన్మించెను. అతడే చ్యవన మహర్షి, ఆ బిడ్డ కాంతిని జూచి రాక్షసుడు మునిపత్నిని, బిడ్డను వదలి పారిపోగా తిరిగి బిడ్డతో ఆశ్రమము జేరి ఈ వృత్తాం తమును భృగున కెరిగించెను. భృగుడు దీనికి కారణము అగ్ని అని తలచి అగ్నిని సర్వనాశనకారుడవు కమ్మని శపించెను. ఇందుకలిగిన అగ్ని ఎవ్వరికి కన్పించక దాగుకొనెను. ఇందువల్ల ముల్లోకాలు ఇబ్బందుల నెదుర్కొని బ్రహ్మకు నివేదించగా బ్రహ్మ అగ్ని దేనిని అంటిన అది స్వచ్ఛతనొందునని శాప విమోచన మొనర్చెను.

*కుమారస్వామి జననం :* శివపార్వతులు శృంగార క్రీడ సలుపుచుండగా అగ్ని తదేకముగా చూచెను. వారి శృంగార క్రీడను భగ్నమొనర్చినందుకు పార్వతి అగ్నిని శివుని వీర్యమును భరించమని శపించెను. అగ్ని గర్భవతియై ఆ భారమును మోయ జాలక దానిని గంగకు అర్పించెను. శివుని వీర్యమువల్ల గంగకు జన్మించిన వాడే కుమారస్వామి.

– *కథాసరిత్సాగరం*

*శిబిచక్రవర్తి దాతృత్వపరీక్ష :* ఇంద్రుడు,అగ్ని శిబి దాతృత్వము పరీక్షించనెంచి ఇంద్రుడు గద్దగామారి పావురముగా మారిన అగ్నిని తరుముచుండెను. పావురము శిబిచక్రవర్తి తొడపై కూర్చొనెను. గద్ద తన ఆహారమైన పావురమును రక్షించుట తగదని శిబిని కోరగా అంతే బరువైన మాంసమును తూచి ఇచ్చెదనని తన శరీరభాగమును కోసి తూచుచుండెను. ఎంతకును సమానముగా తూగకుండుటచే తనే మొత్తముగా త్రాసునందు కూర్చొనగా అగ్ని ఇంద్రా దులు తమ నిజ స్వరూపమును దాల్చి శిబిని కీర్తించిరి.

*ఇతర విశేషాలు :* అగ్ని వామపార్శ్వము నుండి ఒక కన్య జన్మించెను. ఆమె పేరు స్వాహాదేవి. అగ్ని కామె భార్యయయ్యెను. స్వాహాదేవి వల్ల అతనికి ముగ్గురు పుత్రులు, ఆ ముగ్గురికి 45గురు కుమారులు కలిగిరి. పురాణాలలో వివరించబడిన 49 మంది అగ్నులు వీరి సమూహమే. నీలుని కుమార్తె సుదర్శననుకూడా అగ్ని వివాహమాడెను. ధర్మజుని అశ్వమేధయాగ సమయమున సహదేవుడు నీలుని పై దండెత్తగా అగ్ని పాండవ సైన్యమును భస్మీపటలము జేసెను. అర్జునుని ప్రార్థనచే అగ్ని వారిని సజీవులను చేసి పాండవులకు, నీలునికి మైత్రినొనర్చెను.

**అగ్నికుమారుడు :** చూ॥ సుబ్రహ్మణ్యస్వామి.

**అగ్నికేతుడు :** ఒక రాక్షసుడు. రావణుని తరపున యుద్ధంచేసి రాముని చేతిలో మరణించెను.

**అగ్ని కంఠి :** చూ॥ శివుడు.

**అగ్నిచయనం :** ఇది ఓ యజ్ఞకర్మ. తపుడి పదిహేను మంది పుత్రులు యజమానుల యజ్ఞఫలాలను అపహరించకుండుటకు వారి శాంతికోసం ఈ యజ్ఞకర్మ యాగాల్లో చేస్తారు. – పు.నా. చంద్రిక

**అగ్గిచూలి :** చూ॥ సుబ్రహ్మణ్యస్వామి.

**అగ్నితీర్థం (అగ్నిధార తీర్థం ) :** గౌతమ వనంలోని ఓ పుణ్యస్థలి.

**అగ్నిదేశ్యుడు :** ఇతడు ద్రోణుని గురువు. ఇతని వద్దనే ద్రోణుడువిలు విద్యనభ్యసించెను.

**అగ్నిదైవత్వము :** అగ్ని ముని పత్నులను మోహించెనని తెలిసి అగ్నిని ప్రేమించిన స్త్రీ ఆ ముని పత్నుల వేషమున అగ్నితో సంగమించెను. ఆ కళంకము ముని పత్నులకు ఆపాదించబడగా మునులు వారిని విడిచి వేస్తారు. వారు కుమార స్వామిని ప్రార్థించగా ఇంద్రుని సలహాపై వారిని అభిజిత్తు అనే నక్షత్ర స్థానంలో వుంచుతాడు. అగ్ని దైవత్వమనే నక్షత్రం పేరున వారిని ప్రతిష్టించడం వల్ల ఆ పేరు వచ్చింది.

**అగ్నిద్యోతనుడు :** రుక్మిణి తనను వివాహమాడగోరి శ్రీకృష్ణుని వద్దకు పంపిన రాయబారి.

**అగ్నిప :** వేదనిధి అను బ్రాహ్మణ బ్రహ్మచారి. ఐదుగురు గంధర్వకన్యలు అతనిని మోహించి వివాహమాడమని కోరగా అతడు కోపించి పిశాచులు కమ్మని శపించెను. తర్వాత దయగల్గి లోమస ముని సలహా కోరగా ఆ ఐదుగురిని ప్రయాగ తీర్థమున స్నానమాచరించమని కోరెను. అప్పుడు వారు నిజరూపము దాల్చగా వేదనిధి వివాహమాడెను.

**అగ్ని ప్రవేశం :** రావణుని జయించి రాముడు సీతను తీసుకొని వచ్చెను. ప్రజాభిప్రాయమునకు దడిసి సీత స్వచ్ఛతను పరీక్షించనెంచి అగ్ని ప్రవేశము చేయమని కోరెను. అట్లగ్ని ప్రవేశము చేసిన సీత యధాతథముగా బయటకు వచ్చెను. అగ్ని ప్రవేశం పాతివ్రత్యానికి గుర్తుగా పరిగణించబడుచున్నది.

**అగ్నిపురం :** ఇండోర్‌కి దగ్గరలో నర్మదా నది తీరాన గల ఓ పుణ్యతీర్థం. పండితులు మహేశ్వరపురంగా దీనిని గుర్తించారు. – మహాభారతం

**అగ్నిపురాణం :** వ్యాసుడు రచించెనని చెప్పెడి 18 పురాణాలలో ఇది ఒకటి. ఇది అగ్ని మౌఖికంగా ఎందరో ఋషులకు, దేవతలకు, వశిష్ఠ మహర్షికి వివరించెనని చెప్తారు. ఈ పురాణాన్ని మార్గశిర మాసంలో ఒచ్చే సంపూర్ణ పౌర్ణమినాడు సద్బ్రాహ్మణునకు బహుకరించినచో శుభము కల్గునని చెప్తారు. ఈ పురాణం 420 విభాగాలుగా వుండి అన్ని విషయాలను విపులీకరించింది. మహావిష్ణుని దశావతారాలు, రామాయణం, మహాభారతం, దేవతలను పూజించు విధి విధానాలు, విగ్రహ ప్రతిష్ఠాపన, స్వప్నమంత్రాలు, జ్యోతిష్యం, శిల్పకళ, ఆయుర్వేదం, విషవైద్యం, నాటక సూత్రాలు తదితర అలంకార శాస్త్రాలు సవివరంగా వివరించబడినవి.

**అగ్నిపూర్ణ :** ఇతడు విష్ణువు వంశవృక్షము. ఇతని తర్వాత ఈ వంశంలో శీఘ్రు, మాగులు జన్మించారు. వీరితో సూర్యవంశం ముగిసింది.

**అగ్నిబాహుడు :** మొదటి మనువు కుమారుడు.

**అగ్నిభువు :** చూ॥ సుబ్రహ్మణ్యుడు.

**అగ్నిమిత్రుడు :** కాళిదాస నాటకం మాళవికాగ్నిమిత్ర నాటకంలో నాయకుడు. సంఘ వంశపు రాజు. పుష్యమిత్రుని కుమారుడు. – మాళవికాగ్నిమిత్రం

**అగ్నిముఖుడు :** ఒక రాక్షసుడు.

*వంశవృక్షం :* విష్ణు – బ్రహ్మ – మరీచి – కాశ్యప – సూరపద్మ – అగ్నిముఖ.

మాయ కుమార్తె సూరపద్మలకు జన్మించెను. దేవ దానవుల సంగ్రామంలో దానవుల తరపున పోరాడి మరణించెను.

**అగ్నిలోకం :** మహామేరు పర్వత శిఖరంపై గల ఒక లోకము. ఇదే శిఖరంపైన కొన్ని దేవలోకాలు కలవు. అవి ఇంద్రలోకం, యమలోకం, శివలోకం, సత్యలోకం, వైకుంఠం. – దేవీభాగవతం.

**అగ్నివర్చస్సు :** సూతుని శిష్యుడైన గొప్ప పౌరాణికుడు – పు. నా. చంద్రిక.

**అగ్నివర్ణుడు 1 :** కల్మషపాదుని పౌత్రుడైన సుదర్శనుడి పుత్రుడు. – రామాయణం

**అగ్నివర్ణుడు 2 :** రఘువంశపు రాజు. స్త్రీలోలుడు. పుష్యని పౌత్రుడైన సుదర్శనుడి పుత్రుడు. – భాగవతం

**అగ్నివేశుడు :** ద్రోణ, ద్రుపదుల గురువు. ఇతడు అగస్త్యుని 'శిష్యుడు'. అన్ని అస్త్రశస్త్ర ప్రయోగాలలో నిష్ణాతుడు.

**అగ్నిశిఖ :** వరరుచి తండ్రి. అతని మరోపేరు సోమదత్త. – కథాసరిత్సాగరం

**అగ్నిశిరతీర్థం :** యమునానది తీరమున గల ఓ పుణ్యస్థలి. సహదేవుడు ఇక్కడ ఓ యజ్ఞమొనర్చెను.

**అగ్నిశౌచం :** దమయంతిని వీడి నలుడు అరణ్యములో సంచరించునపుడు కార్కోటకుడను సర్పపు కాటువల్ల తన రూపము గోల్పోయెను. అప్పుడు కార్కోటకుడు నలునికి ఓ వస్త్రమునిచ్చెను. అదే అగ్ని శౌచం. అది ధరించిన నలుడు పూర్వ రూపమునొందెను. – కథా సరిత్సాగరం

**అగ్నిష్వత :** అగ్నిస్టోముడని అంటారు. విష్ణువు యొక్క వంశవృక్షంలోని వాడు. నద్వాలామనులకు జన్మించిన పదిమంది పుత్రులలో ఒకడు. – అగ్నిపురాణం

**అగ్నిష్వాత్తులు :** పితృదేవతాగణం (పితృదేవతాగణం ఏడుగురు)

**అగ్ని సంభవుడు :** సూర్యవంశపు రాజులలో ఒకరు. విష్ణు అంశకు చెందినవాడు. పురాణాలలో ఇతన్ని గురించిన ఇతర వివరాలు లేవు.

**అగ్నిసోముడు 1 :** అగ్ని సోమదేవుల కలయికవల్ల జన్మించిన దేవపురుషుడు. హోమగుండంలోని హవిస్సులను స్వీకరిస్తాడు.

**అగ్నిసోముడు 2 :** అగ్నికి ఇద్దరు కుమారులు. అగ్నిదేవుని మూడవ భార్య భానుని వల్ల జన్మించిన ఇద్దరు పుత్రులే అగ్ని మరియు సోమ. వీరిద్దరిని కలిసి అగ్ని సోములని పిలుస్తారు.

**అగ్నిస్తంబం :** ఇదో మంత్రం. దీనికి అగ్ని యొక్క వేడిని తగ్గించే గుణం వుంది.

**అగ్నిహోత్రం :** అగ్ని దేవుడికిచ్చే ఆహారం. ఇది రెండు విధాలు అవి నిత్య, కామ్య.

**అగ్నీధ్రుడు :** విష్ణువారసత్వం. ప్రియవ్రత బర్హిష్మతిల పదిమంది సంతానంలో ఒకరు. అగ్నీధ్రుడు జంబూద్వీపమును చాలాకాలం పరిపాలించెను. అతడు పరిపాలిస్తుండగానే ఓ గుహలో కఠిన తపస్సు నాచరించెను. ఆ తపః భంగమునకు బ్రహ్మ ఓ అందమైన విప్రచిత్తి అను కన్యను పంపి అతని తపః భంగమునకు పూను కొనగా రాజు చలించి ఆమెను వివాహమాడెను. – భాగవతం

**అఘ :** ఇతడొక రాక్షసుడు. పూతన, బకాసురుల సోదరుడు. శ్రీకృష్ణుని వధించుటకు గోకులం వెళ్లెను. అక్కడ కాళింది నదీతీరమున ఇతర బాలురతో శ్రీకృష్ణుడు ఆడుకొనుచుండగా ఇతడు పెద్ద సర్పముగా మారి శ్రీకృష్ణునితో సహా ఇతర పిల్లలను కూడా మింగివేసెను. అప్పుడు శ్రీకృష్ణుడు తన శరీరమును అధికముగా పెంచెను. దానివల్ల సర్పము పొట్ట చీలి అఘుడు మరణించెను. శ్రీకృష్ణుడు, ఇతర బాలురు బయట పడుటయే కాక చనిపోయిన కొందరు గోపకులు కృష్ణ కటాక్షమున సజీవులైరి.

**అఘమర్షణ :** పూజ్యనీయుడైన ఓ గొప్ప ఋషి. వానప్రస్థాశ్రమ విధులను సక్రమంగా నిర్వహించిన వాడు. – మహాభారతం

**అఘమార్షన సూక్తం :** ఇది ఋగ్వేదంలోని ఓ రుక్కు. నీటిలో వుండి దీన్ని మూడుసార్లు జపిస్తే సర్వపాపాలు పోతాయి.

**అఘాశ్వ :** ఓ రాజర్షి. పేరు పెదు – ఋగ్వేదం

**అచల 1 :** గాంధార రాజు, సుబాల పుత్రుడు, శకుని సోదరుడు, కౌరవ పక్షాన పోరాడినవాడు. ధర్మజుని రాజసూయ యాగంలో కూడా పాల్గొన్నాడు. మరో సోదరుడు వృషాక అచలుడు మహాభారత యుద్ధంలో కౌరవుల పక్షాన పోరాడి అర్జునునిచేత వధించబడిరి. – మహాభారతం

**అచల 2 :** స్కందుని పారిషదుల్లోని ఓ ఎద్దు – మహాభారతం

**అచల 3 :** మహావిష్ణువు సహస్ర నామాల్లో ఒకటి.

**అచల 4 :** తారకాసురుని పైకి కుమారస్వామి దండెత్తి వచ్చి సంహరించినపుడు ఎందరో యోధులు, వారి తల్లులు పాల్గొన్నారు. అందలి ఓ మాతృమూర్తిపేరు అచల.

**అచ్యుత :** విష్ణువు పేర్లలో ఒకటి.

**అచ్యుతాయు :** కౌరవ సైన్యంలో గొప్పవీరుడు. శృతాయు ఇతని సోదరుడు. అర్జునుడు వీరిని మహాభారత యుద్ధంలో సంహరించడానికి కష్టించ వలసి వచ్చెను. – మహాభారతం

**అచ్యుతస్థల :** భారతదేశంలో పురాతన గ్రామం. ఇక్కడ వివిధ కులాల శూద్రులు నివసించేవారు. – మహాభారతం

**అచ్ఛోద :** పితృగణాల ఆత్మయొక్క అంశవల్ల జన్మించిన స్త్రీ. అమావసు భౌతిక సౌందర్యాన్ని చూసి ప్రేమిస్తుంది. అతడు నిరాక రించగా తర్వాతి జన్మలో సత్య వతి (మత్స్యగంధి)గా జన్మిస్తుంది.

**అజ 1 :** సూర్యవంశపు రాజు. ఈ వంశములోనే రఘు, దిలీప, దశరథ, లోకారాధకుడు శ్రీరాముడు జన్మించిరి. ఇతడు ఎన్నడు మాంసాహారము భుజించలేదు.

**అజ 2 :** యుధిష్ఠిరుడు పేర్కొన్న వివిధ రకాల మునుల్లో అజ అనే వర్గం వుంది. వీరు స్వతంత్ర అధ్యయనం తోనే స్వర్గానికి చేరేవారు.

**అజ 3 :** పరశురాముని వంశానికి మూలపురుషుడు. జాహ్నవికి అజ అనే కుమారుడు. అతని కుమారుడు ఉశైక. ఉశైక ఇంద్రుని ప్రార్థించడం వల్ల ఇంద్రుడే అతనికి గాధి అనే పేరున జన్మించెను. ఇతనికి సత్యవతి అను కుమార్తె జన్మించెను. ఈమె రుచికుని వివాహమాడెను. పరశురాముని తండ్రి జమదగ్ని ఇతని కుమారుడు. సూర్యుడు, శివుడు, బ్రహ్మ, విష్ణు, శ్రీకృష్ణుడు, విత్తనాలను కూడా అజ అని అంటారు.

**అజక :** ఒక రాక్షసుడు. బ్రహ్మకుమారుడు మరిచి. మరిచికి కశ్యపుడు జన్మిస్తారు. దక్షుణి కుమార్తెలలో ఒకరైన దనువు వివాహమాడగా ఇద్దరు పుత్రులు జన్మిస్తారు. వారు అజక, వృషపర్వ. – మహాభారతం

**అజగరుడు :** ఇతడొక బ్రహ్మణుడు. ప్రహ్లాదుడికి శమం వచ్చే విధానాన్ని పరమహంస ధర్మాన్ని తెలుపుతాడు. నిత్యతృప్తి, శౌచనిరతి, తాల్మి, సమత వుండాలి. మేలు జరగాలని, కీడుపోవాలని కోరరాదు. ఏది జరిగినా తూష్ణీభావంతో మెలగాలి. అప్పుడే శమం కల్గుతుందని చెప్తాడు.

**అజగనం :** మేక ఆవు కొమ్ములతో తయారైన ధనస్సు. వేనరాజు కుడిచేతి బ్రాహ్మణులు బాధిస్తారు. అతని కుమారుడు పృధు అగ్నివలె ప్రకాశిస్తాడు. ఆ సమయంలో మొట్టమొదటి ధనస్సు అస్త్రశస్త్రాలు ఆకాశం నుండి పడతాయి.

**అజనాభం 1 :** ఒక పర్వతం – మహాభారతం

**అజనాభం 2 :** అజనాభమనే రాజు ఓ ప్రాంతాన్ని పాలించాడు. ఆ ప్రాంతం పేరు అజనాభవర్షం – మహాభారతం

**అజపార్శ్వుడు :** శ్వేతకర్ణుని పుత్రుడు. శ్వేతకర్ణుడు సంతానంలేక అడవులకు వెళ్తాడు. అక్కడ అతని భార్య ఓ శిశువును ప్రసవిస్తుంది. బిడ్డను వదలి భార్యాభర్తలు 'మహాప్రస్థానం' చెయ్యడానికి వెళ్తారు. కౌశికుడు, పిప్పలాదుడు అను వారు ఈ బాలుని చూసి ఓ కొండ కాలువ బండమీద పరుండబెట్టి కడుగుతారు. ఆ రాపిడికి పక్కలు నల్లబారి అజపార్శ్వాలవుతాయి. అందుకని అతడు అజపార్శ్వుడయ్యాడు. తరువాత అతని తండ్రి రాజ్యమును ఏలెను. – భవిష్య పురాణం

**అజమీఢుడు 1 :** పూరువంశపు రాజులలో ప్రసిద్ధి చెందినవాడు. శకుంతల దుష్యంతుని కుమారుడైన భరతుని మనవడు. – మహాభారతం

**అజమీఢుడు 2 :** సూర్యవంశపు రాజులలో ఒకడు. ఇతనికి 2400 మంది సంతానం – మహాభారతం

**అజముఖి :** స్కందుని సైన్యంలో ఒకడు. స్కందునికి రాక్షసులకు జరిగిన యుద్ధంలో ఇతడు అసుర, ముధులను సంహరిస్తాడు.

**అజముఖీ (అజాముఖీ) :** ఓ రాక్షస స్త్రీ.

*వంశవృక్షం :* విష్ణు – బ్రహ్మ – మరీచి – కాశ్యప – అజాముఖి. బ్రహ్మ మనుమడు కాశ్యపుడు సురసాని వివాహమాడగా 6 గురు సంతానం కల్గుతారు. ఇందులో సూరపద్ముడు, తారకాసురుడు, అజాముఖి ప్రసిద్ధులు. తారకాసురుడు మాయపురం అనే నగరాన్ని నిర్మించాడు. అజాముఖి భోగలాలసతలో జీవించింది. దుర్వాసుడ్ని వివాహమాడి అతనివల్ల ఇద్దరు రాక్షసులకు జన్మనిచ్చింది. వారు ఇల్వల, వాతాపి. తండ్రి గౌరవాన్ని విభజించుకోడానికి తగువు లాడుకోగా దూర్వాసుడు కోపించి వారు అగస్త్యుని చేతిలో మరణిస్తారని శపిస్తాడు.

*అజాముఖి చేతులు శివుడు నరికివేయుట :* అజాముఖి భోగలాలసలో సంచరిస్తూ కాశీ గుడిలో ఇంద్రుని భార్య శచీదేవిని చూసి ఆమెను తన సోదరుడు సూరపాదునికిచ్చి వివాహము చేయనెంచెను. శచీదేవి భయకంపితురాలై బిగ్గరగా ఏడ్వగా శివుడు ప్రత్యక్షమై అజాముఖి చేతులు ఖండించెను. సూరపాదుడు కుపితుడై బ్రహ్మ ఇతర దేవతలను ఓడించి కారాగారములో పడవేసెను. సూరపాదుని ఆదేశంతో బ్రహ్మ అజాముఖి చేతులు తిరిగి ప్రసాదించెను – స్కందపురాణం

**అజయుడు :** శివనాగుల వంశములోని ఒక రాజు, దర్భకుని కుమారుడు. ఇతని కుమారుడు నంది వర్ధనుడు. *– భాగవతం*

**అజరుడు :** పూర్వజన్మ ప్రతి ఫలాన్ని ప్రతివారు అనుభవించాలనడానికి ఇతని కథ ఓ ఉదాహరణ. పూర్వం వినయశీలుడనే రాజు వుండేవాడు. అతనికి ముసలితనం వల్ల అవయవాలన్ని వంకర తిరిగిపోగా ఓ వైద్యుడు భూమిలో ఆరునెలలు గడపాలని, తను తప్ప ఎవ్వరూ లోనికి రాకూడదని సలహా ఇచ్చాడు. దానిని పాటించిన రాజు. ఆరునెలలు భూమిలోనే గడిపాడు. ఇంతలో అదే రాజు రూపున్న వ్యక్తి తారస పడగా అతనినే రాజుగా బైటకు తీసుకు వచ్చి అసలు రాజుని వధించాడు. ఈ నూతన వ్యక్తే అజరుడు. కొన్నాళ్ల తర్వాత వైద్యుడు ఇతని వద్దకు తనకు బహు మతినివ్వమని వస్తే ఇది తన పూర్వజన్మ సుకృతమని తను పూర్వజన్మలో తపస్సుచేసి నా శరీరాన్ని వదిలే శానని అందుకే ఇప్పుడిలా రాజున య్యానని బహు మతి నిరాకరించాడు. వైద్యుడు వట్టిచేతుల్తో వెనక్కు పోయాడు. *– కథాసరిత్సాగరం*

**అజవిందుడు :** సూర్యవంశంలో జన్మించిన ఒకరాజు. *– మహాభారతం*

**అజహ్నుడు :** జహ్నుడను రాజకుమారుడు. ఇతని కుమారుడు పల్లవ్యుడు. *– మహాభారతం*

**అజాతశతృడు :** శివనాగులలో ఆరవ రాజు, విధిసారుని పుత్రుడు, ఇతని కుమారుడు దర్భకుడు.

**అజామిళుడు :** రాక్షసత్వమున్న వాడికి కూడా విష్ణు మూర్తి మోక్షము ప్రసాదిస్తాడని ఇతని కథ చెప్తుంది. ఇతడొక బ్రాహ్మణ బాలుడు. తండ్రి పనుపున పుష్పాలు కొని తేవడానికి అరణ్యానికి వెళ్లి అక్కడ శూద్ర కన్యను మోహించి వివాహమాడి 87 సం.లు జీవిస్తాడు. అతనికి మృత్యు కాలం వచ్చి యమభటులు రాగా అతడు తన కుమారుడిని “నారాయణ, నారాయణ” అని పిలుస్తాడు. అదివిన్న విష్ణుమూర్తి వచ్చి యమ భటులను పంపి వేస్తాడు. అది చూసిన అజామిళుడు గంగానది ఒడ్డున విష్ణు మూర్తిని గూర్చి తపస్సు చేసి మోక్షం పొందుతాడు.

**అజిత :** ఔశానరపతి కుమార్తె. ఈమె సాత్వేయుడు, శూరసేనుడు, శృతసేనుడు, బిందుసారుడు, అలెసారుడు అను 5 గురు అన్నదమ్ములను ఒకేసారి వివాహమాడెను.

**అజితుడు :** చాక్షుషమనువు కాలంలో విష్ణుమూర్తి వైరాజునకు సంభూతికి జన్మిస్తాడు. ఇతడే అజితుడు.

**అజినుడు :** విష్ణు వంశ వృక్షంలోనివాడు. హవిర్ధాన దిషణలకు ఆరుగురు కుమారులలో అజీనుడొకడు.

**అజీగర్తుడు :** ఇతడొక దురాశపరుడైన బ్రాహ్మణుడు. వరుణుడ్ని ప్రార్థించగా ఓ పుత్రుడు కల్గుతాడు. కాని అతడు వెంటనే మరణిస్తాడని వరమిస్తాడు. హరిశ్చం ద్రుడు విశ్వామిత్రుని వేడుకోగా ఆ పుత్రుని బదులు మరో బాలుణ్ణి అర్పించవచ్చని సలహా ఇస్తాడు. ఆ కుమారుడిని అమ్ముకున్న బ్రాహ్మణుడే అజీగర్తుడు. ఆ బాలుడు సునశ్శేపుడు. *– దేవీ భాగవతం*

**అజుడు 1 :** రఘువు కుమారుడు. ఇందుమతీ స్వయం వరంబునకు బోయి ఆమెచే వరించబడి అడ్డువచ్చిన వీరులను ఓడించెను. ఆమెను తన నగరమున వివాహమాడుచుండగా నారదుని వీణ నుండి సురపుష్పమాలిక వచ్చి ఈమెపై బడి మరణించెను. ఇతడు బ్రాహ్మముహూర్తమున బుట్టుటచే అజుడని నామకరణము చేసిరి.

**అజుడు 2 :** శందుని సోదరుడు. ఇతడు, ఇతని కుమార్తెలు అడవికి పోగా ఓ రాక్షసుని అరుపులకు అందరూ జడిసి పారిపోగా ఇతని కుమార్తెలు మాత్రము అతని చూసి పోరాడనెంచిరి. అది చూసి అజుడు వారికి తగిన సంపదనిచ్చి ఆ రాక్షసునితో వివాహము చేసెను.

**అజేయుడు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. సంజయుడు ధృతరాష్ట్రునికి వివరించిన బలవంతులు దయార్ద్రహృదయులు. దేవతాస్త్రాలు సంపాదించిన రాజులలో ఒకడు.

**అజైకపాదుడు 1 :** స్థాణు దేవుడికి జన్మించిన ఏకాదశ రుద్రులలో ఒకడు. *– మహాభారతం*

**అజైకపాదుడు 2 :** విశ్వకర్మ కొడుకు. ప్రపంచంలోని బంగారాన్ని భద్రపరిచే వారిలో ఒకడు.

**అజోదరుడు :** స్కందుని సైన్యంలో ఒకడు.

**అణిమాండవ్యుడు :** ఇతని అసలుపేరు మాండవ్యుడు. బ్రాహ్మణుడు. తన కుటీరము ముందు చేతులు పైకెత్తి ఎన్నో సంవత్సరాలు తపమాచరించెను. అట్లుతప ములో నుండగా ఒక రోజు ఆ రాజ్యపు రాజు యొక్క

ఆస్తిని దొంగలు కాజేసి పారిపోవు చుండగా రాజ భటులు వెంటపడిరి. అది గమనించి దొంగలు ఆ సొమ్ము మాండవ్యుని ఆశ్రమములో ఒదిలి పారిపోయిరి. రాజభటులు ఆస్తిని, మాండవ్యుని దొరికిన ఇతర దొంగలను రాజు ముందు నిల్పగా రాజు వారందరికి కొరత వేయమని ఆజ్ఞాపించెను. రాజభటులు శూల ముతో దొంగలను పొడిచిచంపిరి. కాని మాండవ్యుని కంఠములో దిగిన శూలము బయటకు రాలేదు. మాండవ్యుడు అట్లే తపమాచరించు కొను చుండెను. ఆ సమయంలో శివుడు ప్రత్యక్షమై ఇతనికి చిరంజీ వత్వము ప్రసాదించెను. ఎంతో మంది మునులు పక్షుల రూపంలో వచ్చి ఈ వింత చూసి వెళ్ళుచుండిరి. రాజు కూడా యధార్థము గ్రహించి మాండవ్యుని చేరి తనను క్షమించమని కోరి శూలమును బయటకు తీయ ప్రయత్నించి సాధ్యముగాక శరీరముపై నున్నంత వరకు శూలమును కత్తిరించిరి. శూలాగ్రము మాత్రము అతని కంఠమందే మిగిలిపోయెను. అప్పటి నుండి అతడు అణిమాండ్యుడని ప్రసిద్ధుడయ్యెను.

– *మహాభారతం*

*యముని శపించుట :* ఇలా కంఠంలో శూలం ధరించి జీవిస్తుండగా ఓ రోజు యమ ధర్మరాజుని నాలాంటి అమాయకుడికి ఈ శిక్ష ఏమిటని ప్రశ్నిస్తాడు. అందుకు నీవు బాలుడిగా వుండగా చిన్న చిన్న పక్షుల్ని చీల్చి చంపావని అందుకే ఈ శిక్ష అని సమాధానం చెప్పగా, శాస్త్రాలు 12 ఏళ్లలోపు వారు చేసే తప్పులు క్షమించ దగ్గవని చెప్పుచున్నవి కనుక ఈ శిక్ష అనుచితమని కావున నీవు శూద్రుడుగా జన్మించమని యముడ్ని శపిస్తాడు. అందుకే యముడు విదురుడుగా జన్మిస్తాడు.

*సూర్యోదయం కాని కథ :* అత్రి మహాముని కుమారుడు ఉగ్రశ్రవుడు. అతని భార్య శీలవతి. భర్తకు అణకువగా వుండే మహాపతివ్రత. ఉగ్రశ్రవుడు ఒక సారి వ్యాధిగ్రస్తుడై తనను ఒక వేశ్య వద్దకు కొని పొమ్మని తన భార్యను ఆదేశిస్తాడు. విధేయురాలైన ఆమె అతనిని తన భుజస్కందాలపై మోసుకొని మాండవ్యుని ఆశ్రమం మీదుగా పోవుచుండగా ఇది విని మాండవ్యుడు సూర్యోదయంలోపు ఉగ్రశ్రవుడు మరణిస్తాడని శపిస్తాడు. ఇది విన్న శీలవతి భర్త విహీనయగుటకు భయపడి సూర్యుడు ఉదయించ కుండునట్లు శపించెను. మరునాడు ప్రపంచ గమనం ఆగిపోగా దేవతలు అత్రిమహామునిని వేడుకొని అతని భార్య అనసూయ ద్వారా శీలవతిని తన శాపాన్ని విరమించుకొనుటకు ప్రయత్నించి సఫలీకృతు లౌతారు. శీలవతి తన శాపం విరమించు కోగానే సూర్యుడు ఉదయిస్తాడు.

**అణువు :** శుక్రబ్రహ్మర్షి అల్లుడు. అతని భార్య పేరు కీర్తి. దిగ్భ్రాజుకుమారుడు. – *దేవీ భాగవతం*

**అణుహ :** ప్రాచీన భారతీయ రాజులలో ఒకడు.

– *మహాభారతం*

**అతలం :** పాతాళంలోని ఏడు విభాగాలలో మొదటిది అతల. తక్కినవి వితల, సుతల, తలాతల, మహా తల, రసాతల, పాతాల. దీనిని మాయ కుమారుడు బలుడు రాజ్యమేలుతాడు. ఇతడు 96 రకాల మాయ లను ఆవిష్కరిస్తాడు. అవి అన్ని రకాల కోరికల్ని తీర్చుతాయి. – *దేవీ భాగవతం*

**అతికాయుడు :** రావణుని కుమారుల్లో ఒకడు.

*పూర్వకథ:* బ్రహ్మ ప్రపంచాన్ని సృష్టించిన తర్వాత అతి గాఢంగా నిద్రిస్తున్న సమయంలో విష్ణువు బ్రహ్మ కళ్లు తెరపించడానికి తన చెవుల నుండి ఇద్దరు రాక్షసులను సృష్టించాడు. వారి అరుపులకు దద్దరిల్లిన బ్రహ్మ విష్ణువును శరణు కోరగా మధుకైటబులు విష్ణువు వద్దకు వచ్చారు. విష్ణువు వారిని వరం కోరు కొమ్మనగా మేమే నీకు వరమిస్తాం, కోరుకొమ్మని విష్ణువుని అడుగుతారు. అయితే మహావిష్ణువు వారిని తన తొడలపై కూర్చొమ్మనగా మేము అందుకు సిద్ధమేగాని ముందుగా యుద్ధం చెయ్యాలనే కోర్కె తీర్చమంటారు. త్రేతా యుగంలో ఖరుడి కోర్కెను తీర్చి నాతో ద్వంద్వ యుద్ధంలో చంపుతానని, అనంతుని అంశ అయిన లక్ష్మణుడు అతికాయుడుగా పుట్టిన కైటబుని సంహరిస్తాడని చెప్పి మధు, కైటబుల్ని తన తొడపై నిలబడమని సుదర్శన చక్రంతో సంహరిస్తాడు.

*అతికాయుని జననం :* రావణుడు కుబేరుణ్ణి జయించి పుష్పక విమానంలో లంకకు వచ్చు చుండగా చిత్రాం గదుడను గంధర్వుని భార్య చిత్రాంగిని మోహించి రహస్య సమాగమం జరుపగా కళ్లు చెదిరే బాలుణ్ణి

ప్రసవించింది. అతణ్ణి తన పుష్పక విమానంలో తీసు కొస్తుండగా విమానం నుండి అడవుల్లో క్రిందపడగా రావణుడు ఏ మాత్రము చెలించని ఆ బాలుడ్ని తన పది చేతులతో ఎత్తబోగా సాధ్యం కాలేదు. అతని 20 చేతులతో ఎత్తబోయినా సాధ్యపడలేదు. ఒక్కసారి ఆ బాలుడే లెగిసి విమానం ఎక్కగా రావణుడు అతనిని ధన్యమాలను పెంచుకొమ్మనెను.

*వరసంపద :* గోకర్ణమున కేగి బ్రహ్మను గూర్చి ఘోరతపమాచరించెను. బ్రహ్మప్రత్యక్షమైనను సమాధి యవస్తయందుండి బ్రహ్మను గమ నించడాయె. బ్రహ్మ జీవముపోసి అతడు కోరిన వరములు ప్రసాదించెను. 1. బ్రహ్మాస్త్రం, 2. కవచం, 3. ఆకలిదప్పులు నశించుట.

*విద్యాబుద్ధులు :* కైలాసానికివచ్చి శివుని వద్ద విద్య నభ్యసించెను. అన్ని శాస్త్రాలు, కళలు, సృతి, స్మృ తులు అభ్యసించి గురుదక్షిణ కోరగా శివుడు మాయా విద్యను మాత్రం అభ్యసించవద్దని కోరెను. అందు కంగీ టకరించగా శివుడు పాశుపతాస్త్రమును బహు మతిగా నొసంగెను.

*విజయగాథలు :* అతికాయుని మేనమామ చంద్ర ఇంద్రుని చేతిలో ఓడిపోయెను. అతికాయుడు పాశు పతాస్త్రంతో తిరిగివచ్చాడని తెలిసి ఇంద్రుని బంధీగా తెమ్మని కోరతాడు. అతికాయుడు స్వర్గం పై దండెత్తగా ఇంద్రుడు మహావిష్ణువు సహాయం కోరతాడు. అతికా యుడు పాశుపతాస్త్రం ప్రయోగించడంతో మహావిష్ణువు సుదర్శన చక్రాన్ని ప్రయోగించి యుద్ధాన్ని నివారించి ఇంద్రుడు ఓడిపోయినట్లుగా అంగీకరింప జేస్తాడు.

*మృత్యువు :* రామరావణ యుద్ధంలో రావణుని తరఫున ఘోరయుద్ధమొనర్చి లక్ష్మణుని చేతిలో మరణిస్తాడు.

**అతిచాంద్రుదు :** శాశ్వతుని కొడుకు. ఇందుదని అంటారు.

**అతిథి 1 :** పూర్వం అతిథి సత్కారాన్ని ఓ యజ్ఞంగా భావించేవారు. భోజన సమయంలో బ్రాహ్మణుడింటికి వచ్చినా వైశ్య, శూద్రులు వారిని ఆదరించాలి.

– మనుస్మృతి

**అతిథి 2 :** జనరంజకుడు అను రాజు. రఘు వంశ జుడు. ఇతని పట్టాభిషేక సమయమున చెఱసాలలో బంధింపబడిన వారినే కాక పంజరములందుంచ బడిన పక్షులను కూడా విముక్తులను చేసెను.

**అతిధన్వుడు :** శూనకర్ని వంశంలోనివాడు. శాండి లుడు, అతని శిష్యుడు. ఉద్గీథ విద్యను శిష్యుని సంత తివారు ఎంతవరకూ నేర్చుకొంటారో అంతరవకు మహాఐశ్వర్యంతో ఉంటారని ఉద్భోదిస్తాడు.

– ఛాంధోగ్యోపనిషత్తు

**అతిధిగ్వుడు :** 'దివోదాసు అనేది మరో నామం. ఋగ్వేద కాలం నాటి రాజు. రాక్షసులతో పోరాడాడు. ఒకసారి రాక్షసులకు భయపడి నీటిలో దాక్కుంటాడు.

– ఋగ్వేదం

**అతిబల 1 :** విశ్వామిత్రుడు తాటక సంహారానికి రామ లక్ష్మణులను అడవులకు గొనిపోవునప్పుడు రెండు మంత్రాలను బోధించెను అవి అతిబల, బల. ఇవి ఆకలి దప్పులను నశింపజేస్తాయి. – రామాయణం

**అతిబల 2 :** వాయువు అనుచరుడు, స్కందుని సైన్యం లోకి పంపాడు.

**అతిబల 3 :** అతిబల మహర్షి రామలక్ష్మణుల మృతికి కారకుడు.

రాముడు రావణ సంహారానంతరం అయోధ్యకు చేరి రాజ్యపాలన చేయుచుండెను. ఆ సమయంలో బ్రహ్మ యముడ్ని పిలిచి విష్ణుకార్యం శ్రీరాముడిగా పూర్త య్యిందని వైకుంఠానికి తిరిగి రమ్మని పిలవచ నంపెను. యముడు అతిబల అనే సన్యాసి రూపంలో చేరి శ్రీరామునితో ఏకాంతంగా మాట్లాడాలని అంత వరకు ద్వారం వద్దకు ఎవరూ రాకుండా అజ్ఞాపించ వలసినదిగా లక్ష్మణుని కోరతాడు. ఎవరినైనా లోపలకురానిస్తే లక్ష్మణుణ్ణి చంపాలని చెప్తాడు. అదే సమయంలో 1000 సంవత్సరాలు తపస్సా చరించి తన శిష్యులతో కలిసి ఆకలిదప్పులు తీర్చమనడానికి దుర్వాసుడు అయోధ్యకు రాగా లక్ష్మణుడు కొంతసేపు దర్శనానికి ఆగమని కోరతాడు. దుర్వాసుడు కోపితుడై అందర్ని భస్మీపటలం చేస్తానని అంటాడు. లక్ష్మణుడు ఈ విషయాన్ని రామునికి నివేదించడానికి వెళ్లగా దుర్వాసుని కోర్కెను మన్నిస్తాడు. అతిబలునికి వ్రతభంగం వల్ల లక్ష్మణుడు సరయూ నదిలో మునిగి మరణిస్తాడు. శ్రీరాముడు దుఃఖ భాజనుడై తన రాజ్యాధికారాన్ని ఇతరులకు అప్పగించి వేలాది మంది చూస్తుండగా తనూ సరయూనదిలో మునిగి తనువు చాలిస్తాడు. – ఉత్తర రామాయణం

**అతిబాహుడు :** కాశ్యప, ప్రధాలకు జన్మించిన గంధర్వుడు. ఇతనికి ముగ్గురు సోదరులు ఆహా, హూహూ, తుంబురు – మహాభారతం

**అతిభీముడు :** అగ్నికి తపకు జన్మించిన కుమారుడు. – మహాభారతం

**అతిమన్యుడు :** మనువు యొక్క పదిమంది పుత్రులలో ఒకడు.

**అతియముడు :** యముడు స్కందునికి యుద్ధంలో తోడ్పడటానికి ఇద్దరు సైనికుల్ని ఇస్తాడు. అందులో ఒకడు యమ, రెండోవాడు అతియమ.

**అతిరథుడు 1 :** పూరు వంశంలో మతినార అను రాజు కలడు. అతనికి నల్గురు కుమారులు. వారు తమాసు, అతిరథ మరియు ద్రుహ్యుడు.

**అతిరథుడు 2 :** సత్యకర్ముడి కొడుకు. ధృతరాష్ట్రుని కొలువులోని వాడు. నదిలో కొట్టుకు వస్తున్న కర్ణుణ్ణి పెంచుతాడు. ఇతని భార్య రాధ.

**అతిరాత్రుడు :** మనువు యొక్క పదిమంది పుత్రులలో ఒకడు.

**అతిలోముడు :** శ్రీకృష్ణుని చేత వధింపబడిన ఒక రాక్షసుడు.

**అతివర్చసుడు :** స్కందునికి హిమవనుడిచ్చిన ఇద్దరు సైనికులలో ఒకడు. రెండోవాడు సువర్చసుడు.

**అతిశృంగుడు :** వింధ్య యుద్ధంలో పాల్గొనుటకు స్కందుని కిచ్చిన సైన్యంలో ఒకడు. రెండోవాడు ఉశృంగ.

**అతిషండుడు :** బలరాముడు తన నిర్యాణం తర్వాత అనంతుని రూపంలో పాతాళం వెళతాడు. అక్కడున్న సర్పాలన్ని బలరాముణ్ణి పూజిస్తాయి. అందులో ఒక సర్పం అతిషండుడు.

**అతిసారుడు :** నితంత్రుని పుత్రుడు. ఇతడు, ఇతని సోదరులు నల్గురు అజితనే వివాహమాడెదరు.

**అతిస్థిరుడు :** మహామేరు స్కందునికి ఇద్దరు సైనికుల్ని పంపుతాడు. అందులో ఒకడు అతిస్థిరుడు, రెండోవాడు స్థిరుడు.

**అత్రి 1 :** బ్రహ్మ మానసపుత్రుడు. సప్తఋషుల్లో ఒకడు. పదిమంది ప్రజాపతులు ఇతని సంతతివారే. ఈ ప్రపంచానికి మూలమైన అష్ట ప్రకృతిల్లో అత్రి ఒకరు. దేవ దానవులకు జరిగిన ఎన్నో యుద్ధాలలో మహావిష్ణువు దేవతలకు సహాయపడ్డాడు. ఓడిన రాక్షసుల్లో ప్రహ్లాదుని సంతతివాడైన మహాబలి ఒకడు. ఈ ఓటమితో అసురులు శుక్రాచార్యుడి నాశ్రయించగా శుక్రుడు శివుని వల్ల గొప్ప శక్తిని సముపార్జించుటకు హిమాలయములకు వెడలెను. తిరిగి వచ్చులోపు మహావిష్ణువు శుక్రుని ఆశ్రమమునకు పోయి అతని తల్లిని వధించెను. దానికి బృగుమహర్షి ఉగ్రుడై శ్రీమహావిష్ణువును ఎన్నోసార్లు మానవుడిగా జన్మించమని శపించెను. దాని ఫలితంగా మహావిష్ణువు అత్రి కుమారుడు దత్తాత్రేయుడుగా జన్మించెను. – దేవీభాగవతం

*బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు అత్రి పుత్రులుగా జన్మించుట:* పతివ్రత అయిన శీలవతి శాపము వలన సూర్యుడుదయించకుండెను. శాప విముక్తి కొరకు త్రిమూర్తులు అత్రిభార్య అనసూయను శీలవతి వద్దకు పంపి ఆమె నూరడించి శీలవతితో శాపవిమోచనం గావించిరి. అందుకు తోడ్పడిన అనసూయను తగిన వరము కోరుకొమ్మనగా ఆమె త్రిమూర్తులను తన పుత్రులుగా జన్మించమని కోరెను. అత్రి అనసూయల సంగమంతో బ్రహ్మ చంద్రుడుగా, శివుడు దూర్వా సుడుగా, మహావిష్ణువు దత్తాత్రేయుడుగా జన్మించిరి.

**అత్రి 2 :** శుక్రాచార్యుడి కొడుకు – మహాభారతం

**అత్రి 3 :** శివునికి మరోపేరు అత్రి – మహాభారతం

**అథర్వా 1 :** ఇతడు చందవేదాన్ని వృత్తిగా ఆలపించే వాడు. భృగు మహర్షి శాపానికి అగ్ని సముద్రంలో దాగినపుడు దేవతల కోరికపై సముద్రంలోకి వెళ్లి అగ్నిని కనుగొన్నాడు. – మహాభారతం

**అథర్వా 2 :** శివునికి గల మరో నామం. – మహాభారతం

**అథర్వా 3 :** వశిష్టుని కుమారుడు. అధర్వ వేదాన్ని వ్రాసినవాడు. బ్రహ్మ వద్దనుండి బ్రహ్మ విద్య నభ్యసించి స్వర్గంనుండి భూమికి తెచ్చినవాడు. – భాగవతం

**అథర్వవేదం :** వేదాలలో నాల్గవస్థానం. దీనిని వశిష్ఠుని కుమారుడు అథర్వణుడు రచించాడు. దీనిలో శతృవులను నిర్జించే క్షుద్రశక్తి గల మంత్రాలు వున్నాయి.

మొదట దీన్ని సుమంతుడు కబందుడికి బోధించాడు. కబందుడు దాన్ని రెండుగా దేవధర్ముడికి, ప్రథ్యుడికి బోధించాడు. ముంజికేశుడు దీన్ని నక్షత్రకల్ప, వేదకల్ప, సంహితాకల్ప, అంగీరస కల్ప, శాంతికల్ప అనే ఐదు భాగాలుగా విభజించాడు.

**అదితి :** బ్రహ్మ మనుమడైన కాశ్యపుడు అదితిని వివాహమాడెను. అదితి దక్ష ప్రజాపతి కుమార్తె. అదితికి 12 మంది సోదరీమణులు. అందులో దితి ఒకటి. దేవతలందరు కాశ్యపునికి అదితివల్ల జన్మించిన సంతానమే. కాశ్యపుడు దక్షప్రజాపతి కుమార్తెలందరిని వివాహమాడెను. అందువల్ల జీవు లందరు కాశ్యపుని సంతతే. అదితికి 33 మంది పుత్రులు.

*మహావిష్ణువు అదితి పుత్రుడైన కథ :* అదితి మహా విష్ణువు తనకు పుత్రుడై జన్మించాలని 1000 సంవత్స రాలు తపమాచరించెను. అదే సమయమున బలి చక్రవర్తి యాగము చేయుచుండెను. అతని యాగ మును భగ్నమొనర్చుటకు దేవతలు విష్ణువును ప్రార్థిం చగా మహావిష్ణువు అదితి గర్భమున వామనుడై జన్మించి బలిని తన మూడు కోర్కెలతో పాతాళము నకు అణచివేసెను. – మహాభారతం

*అదితి పునర్జన్మ :* అదితికి ఇంద్రుడొక కుమారుడు. అదే సమయమున తన సోదరి దితి కూడా గర్భవతి యయ్యెను. అదితి తన కుమారునికంటే గొప్పవాడు దితికి జన్మించునేమోనని కలతచెందుచుండగా ఇంద్రుడు దితి గర్భమున జేరి పిండమును తన వజ్రా యుధంతో 49 ముక్కలు గావించెను. ఆ పిండపు ఏడ్పులకు దితి మేల్కొని విషయము గ్రహించి అదితిని నిర్జన కారాగార ములో పుత్రశోకముతో జీవింపమని శపించెను. అట్లే అదితి ద్వారక యుగమున దేవకిగా జన్మించి కంసుని చెఱలో జీవించెను. తన గర్భమున జన్మించిన శిశువులను కంసుడు నిర్ధాక్షిణ్యముగా ఖండించుచుండగా వ్యథాజీవితము గడిపెను.

– దేవీ భాగవతం

**అదృశ్య :** ఒక నది పేరు. – మహాభారతం

**అదృశ్యంతి :** వశిష్ఠుని కుమారుడైన శక్తి భార్య. వశిష్ఠునికి గల 100 కుమారుల్లో శక్తి ఒకడు. ఇక్ష్వాకు వంశ రాజైన కల్మషపాదుడు ముని ఆశ్రమము చెంతకు వచ్చినపుడు శక్తి, రాజు ఎదురెదురుపడిరి. గర్వంతో ఇద్దరు ఒకరికొకరు దారి వదలకుండిరి. రాజు శక్తిని తోసివెయ్యగా శక్తి రాజును దయ్యంగా మారునట్లు శపిస్తాడు. ఇదే సమయంలో వశిష్ఠ విశ్వా మిత్రులకు ఒకరిపై ఒకరికి సద్భావము లేక విశ్వా మిత్రుడు కింకరుడను రాక్షసుని కల్మషపాదుని శరీరం లోకి ప్రవేశపెట్టటమే కాక తగిన సహాయం చేస్తాడు. దానితో కల్మషపాదుడు వశిష్ఠుని 100 మంది పుత్రుల్ని మింగివేస్తాడు. ఆత్మహత్యా ప్రయత్నం చేసు కోదల చినా వలనుకాక అతని భార్య అదృశ్యంతో జీవిస్తూ వుండగా ఒకరోజు వేదమంత్రాలు విన్పిస్తాయి. అవి శక్తి యొక్క కుమారుడు తన గర్భంలో పెరుగుతు న్నాడని అతని జన్మఘోషే ఆ మంత్రాలని వశిష్ఠునికి చెప్తుంది. కల్మషపాదుడు దానిని నాశనము చేయ బోగా వశిష్ఠుడు అడ్డుకుంటాడు. ఆ పుట్టిన బిడ్డే పరా శరుడు. అతడే వేదవ్యాస మహర్షి తండ్రి.

**అదృష్టభయం :** ఇదొక శాపము. దేవతల కుక్క శరమా యొక్క కుమారుడు కురుక్షేత్రం వద్ద జనమేజయుని యాగం చూడటానికి వెళ్లగా అతని సోదరులు అకారణంగా తరిమివేస్తారు. అందుకు శరమా జనమే జయునికి అదృష్టభయమనే శాపం అనుభవించ మన్నాడు. యజ్ఞానంతరం సోమస్రనాస్ అనుమును లను పిలిచి శాపవిమోచన కొరకు చేయ వలసిన కర్మలు చేస్తాడు.

**అద్వయవాది :** జైనుల దేవత.

**అధ్యపాయన :** సుమంతుని శిష్యుడు. సుమంతుడు విరచించగ అథర్వవేదాన్ని రెండుగా విభజించాడు.

**అద్రి :** విశ్వగశ్వుడి కొడుకు. యువనాశ్వుడి తండ్రి. ఇతడిని అద్రుడు అని అంటారు. – మహాభారతం

**అద్రిక :** ఒక దేవతా స్త్రీ. అమావసుడనువాని భార్య. దేవీభాగవతంలో ఈమెను గురించి ఓ కథ వుంది. బ్రాహ్మణుడి శాపంవల్ల ఈమె చేపగా మారి యమునా నదిలో తిరుగుతూ ఉపరిచర వసువు రేతసును మింగుతుంది. అప్పుడీమెకు మత్స్యరాజు, మత్స్యగంధి జన్మిస్తారు. – మహాభారతం

**అద్వైతం :** ఇది స్మార్తమతము. శంకరాచార్యులు దీనిని విశ్లేషించి జైన బౌద్ధ మతములను నిర్వీర్యము చేసెను.

**అధర్మం :** అధర్మాలకు ప్రతీక అధర్ముడని అంటారు. అధర్ముని భార్యకు ముగ్గురు సంతానం. భయ, మహా భయ, మృత్యు. అతనికి మరో సంతానం సంపదవల్ల కల్గిన ధర్పం. – మహాభారతం

**అధ్యాత్మ రామాయణం :** విశ్వామిత్రుడు రచించెనని చెప్పే రామాయణం. రాముడిని ఆత్మ స్వరూపంగా, సీతను మోక్ష లక్ష్మిగా నిరూపించి ఆత్మపరంగా చెప్పే రామాయణం.

**అధ్యాత్మలు :** పదమూడు రకాల వాయువులు. పిండాండంలోను, బ్రహ్మాండంలోను వుంటాయి.

**అధిరాజ్యం :** ఒక రాజ్యం. దీన్నిపుడు 'రేలా' అని పిలుస్తున్నారు.

**అధశ్శిరస్సు 1 :** ఒక ఋషి హస్తినకు వెళ్లేటపుడు శ్రీకృష్ణుడ్ని కలుసుకుంటాడు – మహాభారతం

**అధశ్శిరస్సు 2 :** లంచం తీసుకునే వాళ్లు అనుభవించే నరకం పేరు. – విష్ణుపురాణం

**అధిష్ఠానపురం :** చేది దేశానికి రాజధాని. – భాగవతం

**అధ్రికుడు :** ఋగ్వేద కాలంలో గొప్ప మునివర్యుడు. – ఋగ్వేదం

**అధీరుడు :** ఒక రాజు. శివభక్తుడు. ఒకసారి అమాయకురాలైన స్త్రీని చంపమని శాసించాడు. శివుని విగ్రహాన్ని నాశనం చేశాడు. ఆ పాపాలవల్ల మరణం తర్వాత దయ్యంగా మారాడు. చివరకు శివుని కృప వల్ల దయ్యం రూపు పోయి శివుని అనుచరుడయ్యాడు.

**అధోక్షజుడు :** మహావిష్ణువుకు పర్యాయపదం. – అమరకోశం

**అనగ్నులు :** బ్రహ్మ సంతానంలో ఒకరు. స్వధవల్ల వీరికి మేన, ధరణులు జన్మిస్తారు.

**అనఘం :** భారతదేశంలోని ఒక ప్రాంతం.

**అనఘుడు 1 :** వశిష్ఠుని కుమారులలో ఒకడు. ఊర్జవల్ల జన్మిస్తాడు. వీరు 7 గురు సోదరులు. మూడో మనువు కాలంలో వీరు సప్తర్షులౌతారు. – మన్వంతరం

**అనఘుడు 2 :** ఓ గంధర్వుడు. అర్జునుని జన్మదిన వేడుకల్లో పాల్గొంటాడు – మహాభారతం

**అనఘుడు 3 :** గరుడిని సంతానంలో ఇదొక పక్షి . – మహాభారతం

**అనఘుడు 4 :** శివునికి మరో పర్యాయపదం. – మహాభారతం

**అనపాయచోళుడు :** చోళవంశపు రాజు – తమిళ కవి సెఖిలార్ ఇతని మంత్రి.

**అనమిత్రుడు 1 :** సూర్యవంశపు రాజు నిఘ్నుడి యొక్క కుమారుడు. – ఆత్మపురాణం

**అనమిత్రుడు 2 :** యాదవ వంశపు రాజు. దృష్టుడి యొక్క కుమారుడు. – ఆత్మపురాణం

**అనమిత్రుడు 3 :** వృష్ణికుమారుడు. శని యొక్క తండ్రి. – మత్స్యపురాణం

**అనమిత్రుడు 4 :** క్రోష్టారాజుకు, అతని భార్య మాద్రికి జన్మించినవాడు.

**అనమిత్రుడు 5 :** చాక్షువు మనువు తండ్రి. – ఆనంద రామాయణం.

**అనమిత్రుడు 6 :** యుధాజత్తు కొడుకు. నిమ్నుడు, శిని, పృశ్ని ఇతని కొడుకులు

**అనరక తీర్థం :** ఓ పవిత్రమైన కొలను. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఇక్కడే స్నానించేవారు. ఇక్కడ స్నానం చేస్తే పాపోశమనం కల్గుతుందని ప్రసిద్ధి.

**అనరణ్య 1 :** ఇక్ష్వాకు వంశపురాజు. ఇతడు శాఖాహారి. రావణుడితో ద్వంద్వ యుద్ధం చేసి చనిపోయేముందు ఇతడు రావణుడ్ని రాముడి చేతిలో మరణిస్తావని శపిస్తాడు. – బ్రహ్మాండపురాణం

**అనరణ్య 2 :** బాణుడి కొడుకు. పృథుడి తండ్రి. – రామాయణం

**అనరణ్యుడు 3 :** త్రసదస్యుడి కొడుకు, హర్యశ్వుడి తండ్రి. – భాగవతం

**అనర్కుడు :** కైప్ల వంశంలో పుట్టిన ఒకరాజు. – అగ్నిపురాణం

**అనల :** దక్ష ప్రజాపతి కూతురు. అదితికి సోదరి. కాశ్యపుని భార్య. చెట్లు, ప్రాకే ప్రాణులు అంతా ఈమె సంతతే.

**అనలుడు :** అష్టవసువులలో ఒకడు. ఇతని భార్య శివ. ఇతని పుత్రులు మనోజవుడు, అజ్ఞాతగతి.

**అనవద్యా :** కాశ్యపుని భార్యయైన అప్సరస. ఈమె అర్జునుని జన్మదినోత్సవంలో పాల్గొంది.

**అనశ్యుడు :** విదూరథుని కుమారుడు. ఈతని భార్య అమృత. కుమారుడు పరీక్షిత్తు. – మహాభారతం

**అనసుడు :** అక్రూరుడి సోదరుడు – మహాభారతం

**అనసూయ :** బ్రహ్మ సంతతి. దేవహూతి కర్ధములకు ఇద్దరు కుమార్తెలు. ఒకరు కళ, రెండు అనసూయ. కళ మరీచిని, అనసూయ అత్రిని వివాహమాడారు.

*అనసూయ తపశ్శక్తి :* ఒకప్పుడు పది సంవత్సరాలు అనావృష్టి తాండవించెను. గంగానది కూడా ఎండి పోయెను. ఆకలి చావులు ప్రపంచ వ్యాప్త మయ్యెను. ఆమె తపశ్శక్తితో చెట్లు కాయలు కాచెను. గంగ తిరిగి ప్రవహించెను. అంతేకాక దేవతల కోరికమేరకు పది రోజులు పగటి సమయాన్ని కూడా రాత్రులుగా మార్చెను. ఒకరోజు త్రిమూర్తులు గగన సంచారులై అత్రి ఆశ్రమ ము పైనుండి పోవుచుండిరి. గరుడుడు ఆ మార్గమున పోజాలకుండెను. అత్రి మహర్షి భార్య మహా పతివ్రత అగుటచే ఆగిపోయెనని వేరు మార్గమున పోయిరి. తిరిగి వచ్చునపుడు ఆమెను పరీక్షించనెంచి విప్ర వేషము ధరించి ఆశ్రమమునకు బోయిరి. అత్రి మహర్షి వారిని భోజనమునకు ఆహ్వానించగా మాకొక నిష్టకలదని నగ్నస్త్రీ వడ్డించినపుడే భుజించుదమని చెప్పిరి. అత్రి అనసూయవంక చూచెను. అనసూయ యేమాత్రము సందేహించక భోజనమునకు కూర్చోమని వారిపై మంత్రజలమును జల్లగా వారు శిశువులుగా మారి పోయిరి. అప్పుడామె వివస్త్రయై వడ్డించి తిరిగి వస్త్రము లను ధరించివచ్చి మరల మంత్ర జలము జల్లెను. తిరిగి వారు సాధారణ బ్రాహ్మణులైరి. వారు భుజిం చిన తదుపరి మరల వారిని మంత్రజలముతో శిశువు లుగా మార్చి తనవద్ద వుంచుకొనెను. పార్వతీ లక్ష్మీ సరస్వతులు వారిని వెతుక్కుంటూ రాగా వారికి వారి భర్తలనిచ్చెను. అప్పుడు త్రిమూర్తులు ఆమెకు వరము ప్రసాదించగా ఆమె వారిని తన బిడ్డలుగా జన్మించమని కోరుకొనెను. త్రిమూర్తులు దత్తాత్రేయుడు, దూర్వా సుడు, చంద్రుడుగా ఆమె గర్భమున జన్మించిరి.

**అనాగత :** ఒకచేప పేరు. జాలరులు ముందే వస్తున్నా రని గ్రహించి తన మిత్రులు ఉత్పన్నమతి, యద్భవి ష్యులకు చెప్తుంది. వారు వినకపోవడంతో తను ముందే ఆ చెరువు విడిచివెళ్తుంది. – పంచతంత్రం

**అనాదిపక :** కాకుల రాజైన మేఘవర్ణుడి మంత్రులలో ఒకడు. గుడ్లగూబ రాజు అమర్ధనుడి దాడినుండి బతికి బయట పడ్డవాళ్లలో ఇతడొకడు. – పంచతంత్రం

**అనాదృష్టి 1 :** పూరు వంశపు రాజు. మిశ్రకేసి అను అప్సర కన్యకు రుద్రాశ్వువు వల్ల జన్మించాడు. ఇతనికి మరో రెండు పేర్లు కూడా కలవు. 1. రుచేయు 2. అన్యగభాను.

**అనాదృష్టి 2 :** ఏడుగురు యాదవ యోధుల్లో ఇతనొ కడు. ఉపప్లావ్యంలో అభిమన్యుని వివాహానికి వచ్చిన వీరుల్లో ఒకడు.

**అనాదృష్టి 3 :** ఇతడు కురుక్షేత్రయుద్ధంలో కృష్ణార్జు నులతో వున్నాడు. వృద్ధక్షేమ మహారాజు పుత్రుడు. అందుల్ల వృద్ధక్షేమి అనికూడా అంటారు.

**అనాదృష్యుడు :** గాంధారి ధృతరాష్ట్రుల పుత్రులలో ఒకడు. – మహాభారతం

**అనానతుడు :** ఒక ఋషి. – ఋగ్వేదం

**అనామిక :** చేతి నాల్గవ వేలు. శివుడు ఈ వేలుతోనే బ్రహ్మ తలను నరికాడు. కాబట్టి అది అపవిత్రమ య్యింది. అందుకే యజ్ఞ యాగాలలో ఈ వేలుకు పవిత్రం పెడతారు.

**అనాయువు :** దక్ష ప్రజాపతి కూతుర్లలో ఒకరు. కశ్యపుడి భార్య. విక్షరుడు, బలుడు, నృతుడు, వీరుడు ఈమె కుమారులు.

**అనాలంబ :** ఒక పవిత్రమైన కొలను. ఇక్కడ స్నానిం చడం పురుషమేధ యజ్ఞంతో సమానం. – మహాభారతం

**అనావు :** యయాతి శర్మిష్టల కొడుకు. – భాగవతం

**అనికేతుడు 1 :** ఒక యక్షుడు. గంధర్వుని కొలువు లోని వాడు. – అగ్ని పురాణం

**అనికేతుడు 2 :** అంగవంశపు రాజు. – మహాభారతం

**అనిమిషుడు 1 :** గరుడి కొడుకు.

**అనిమిషుడు 2 :** శివ, విష్ణువులకు పర్యాయపదాలు – మహాభారతం

**అనిరుద్ధుడు 1 :** శ్రీకృష్ణ రుక్మిణీ దంపతులకు జన్మించిన ప్రద్యుమ్నుని కుమారుడు.

*అనిరుద్ధుని ఎత్తుకొని పోవుట; ఉషతో వివాహము :* మహాబలి 100 మంది సంతానంలో బాణుసురుడు ముఖ్యుడు. అతి బలాఢ్యుడు. 1000 చేతులు కల వాడు. శివుని మెప్పించి తన ముఖద్వారానికి రక్షకులుగా వుండమని కోరెను. శివుడంగీకరించి ముఖ ద్వారపు జండా ఎప్పుడు విరిగి క్రిందపడునో అప్పుడు ఓ వీరుడు నిన్ను జయించునని చెప్పెను. బాణా సురుని కుమార్తె ఉష యవ్వనవతి. ఆమె కలలో ఓ సుందర రూపము చూసి ప్రేమించెను. అది విన్న ఆమె చెలికత్తె చిత్రలేఖ తన మంత్రశక్తితో ద్వారకలోనున్న అనిరుద్ధుని ఉష మందిరమునకు తెచ్చెను. అనిరుద్ధుడు ఉష శయ్యాగారమున నిద్రించుచుండగా బాణాసురునికి తెలిసి అతడ్ని బంధించెను. నారదుని ద్వారా విషయము తెలుసుకున్న శ్రీకృష్ణుడు బాణా సురునిపై దండెత్తెను. శ్రీకృష్ణుడు కోటకు చేరగానే జెండా క్రిందపడి విరిగి పోయెను. బాణుడా యుద్ధములో ఓడి పోయెను. అనిరుద్ధుడు ఉషను పరిణయమాడగా వారికి వజ్రుడను తనయుడు జన్మించెను. – భాగవతం

అనిరుద్ధుడు అస్త్ర విద్యను అర్జునుని వద్ద నేర్చు కొనెను. – మహాభారతం

బ్రహ్మ విష్ణు రూపము పొందిన అదిన అనిరుద్ధుని బొడ్డు నుండి జన్మించెను. – మహాభారతం

విష్ణువుకు మరో పర్యాయపదం అనిరుద్ధుడు. – మహాభారతం

**అనిరుద్ధుడు 2 :** వృష్ణి వంశంలోని ఒక రాజు. పాంచాలి వివాహ సమయంలో ఈ ఇద్దరు అనిరుద్ధులు పాల్గొన్నారు.

**అనిలుడు 1 :** అష్టవసువుల్లో ఒకడు. ఈతని తండ్రి ధర్ముడు, తల్లి శ్వాస అనిలుడు శివని వివాహమాడెను. ఇద్దరు పుత్రులు 1. మనోజవ 2. అవిజ్ఞాతి. – మహాభారతం

**అనిలుడు 2 :** గరుడుని కుమారుడు – మహాభారతం

**అనిలుడు 3 :** శివునికి, విష్ణువుకి పర్యాయపదాలు – మహాభారతం

**అనిలుడు 4 :** వృషదర్భి తన కుమారుడైన అనిరుద్ధుడిని ఓ యజ్ఞంలో సప్తఋషులకు కానుకగా ఇస్తాడు. వెంటనే అనిరుద్ధుడు మరణిస్తాడు. ఆ సమయంలో కరువు తాండ వించగా సప్తఋషులు ఈ శవాన్ని వండుకు తినబోతుండగా సజీవుడవుతాడు. – మహాభారతం

**అనీక విదారుణుడు :** సింధురాజు, జయద్రధుని సోదరుడు. కురుక్షేత్ర యుద్ధంలో అర్జునుడి చేతిలో మరణించెను. – మహాభారతం

**అనీకిని :** సైన్యంలో ఓ విభాగం (చూ॥ అక్షౌహిణి)

**అనీకుడు :** వసుదేవుని తమ్ముడు.

**అనీలుడు :** ఓ ప్రసిద్ధి చెందిన సర్పం పేరు. – మహాభారతం

**అనుకంపనుడు :** అకంపనుడుకి మరో పర్యాయపదం. – రామాయణం

**అనుకర్మ :** ఓ విశ్వదేవుడు – మహాభారతం

**అనుగ :** అవాయువుకి ప్రత్యాయనామం

**అనుగోప్తుడు :** ఓ విశ్వదేవుడు – మహాభారతం

**అనుచక్రుడు :** త్వష్ట అను ప్రజాపతి స్కందునికిచ్చిన యోధుల్లో ఒకడు – రెండోవాడు చక్రుడు.

**అనుతాపకుడు :** దనువు కొడుకు

**అనుదాత్తం :** పాంచజన్యమను అగ్ని సృష్టించిన అనుదాత్తమను మూలకాలు. వాటిని పాంచజన్య తన తపశ్శక్తితో తన రెండు చేతులతో సృష్టించాడు.

**అనుదాత్తుడు :** పాంచజన్యం సృష్టించిన కుమారుడు.

**అనుద్రుహ్యుడు :** శర్మిష్ట యయాతిలకు జన్మించిన కుమారుల్లో ఒకడు. విష్ణు సంతతివాడు.

**అనుపదేవుడు :** అక్రూరుడి రెండవ కుమారుడు – మహాభారతం

**అనుపమ :** నైరుతి మూల వుండే ఆడ ఏనుగు

**అనుముడు :** హనుమంతుడు, ఆంజనేయుడికి మరోపేరు.

**అనుమతి :** అంగిరసుని పుత్రిక, బ్రహ్మమనుమరాలు. – విష్ణుపురాణం

**అనుమ్లోచ :** ఓ అప్సరస – హరివంశం

**అనుయాయి :** అగ్రయాయికి మరో పేరు – ధృతరాష్ట్రుని కుమారుడు. – మహాభారతం

**అనువింద :** శ్రీకృష్ణుని 100 మంది భార్యల్లో ఒకరు. – పద్మపురాణం

**అనువిందుడు :** దుర్యోధనుడి సోదరుడు. పాండవ వనవాస సమయంలో గంధర్వుని చేతిలో బంధించబడినవాడు. కురుక్షేత్ర యుద్ధంలో భీముని చేతిలో మరణించాడు.

**అనుష్టుప్ :** సూర్యదేవుని ఏడు గుర్రాలలో ఒకటి. తక్కిన ఆరు, గాయత్రి, బృహతి, ఉష్ణిక్, జగతి, త్రైష్టుప్, పంక్తి.

**అనుసాల్వుడు :** సాల్వుని తమ్ముడు. తన అన్నను వధించిన కృష్ణుని పై పగతో ధర్మజుడి యాగాశ్వాన్ని ఆపాడు. వృషకేతుడు, ప్రద్యుమ్నుడు ఇతణ్ణి ఓడించి బంధించి కృష్ణుని వద్దకు తీసుకెళ్ళారు.

**అనుహ్లాదుడు :** ప్రహ్లాదుని సోదరుడు. హిరణ్య కశిపుని కుమారుల్లో ఒకడు. కశ్యప దితి యొక్క సంతతిలోని వాడు.

**అనూచాన :** ఓ అప్సరస. అర్జునుడు జన్మించినపుడు భూమి మీదకు వచ్చి నర్తించెను.

**అనూదరుడు :** వందమంది కౌరవ సంతతిలో ఒకడు.

**అనూపకుడు :** అనూప దేశంలోని ఓ వీరుడు. ఈ దేశం నర్మదానది తీరమున కలదు.

**అనూపతి :** కార్తికేయునికి మరోపేరు.

**అనూపావృతం :** ప్రాచీన భారతదేశంలోని ఓ ప్రాంతం.

**అనూరుడు :** వినతా కశ్యపుల కుమారుడు. కద్రువ ముందుగా సంతానాన్ని కనడం చూసి వినత తన అండాన్ని పొడిచి చూస్తుంది. సగం శరీరమే బయటకు వచ్చి తల్లి తొందరపాటుకు శపించి కద్రువకు దాసిగా వుండమని శపిస్తాడు. ఇతడే అనూరుడు. సూర్యునికి రథసారథి. – చూ॥ అరుణుడు

**అనేనసుడు 1 :** చంద్రవంశపు రాజు : పురూరవునికి ఊర్వశి వల్ల జన్మించిన వారిలో పెద్దవాడు. ఆయుష్షు అతని కుమారుడు, అనేనసుడు, యయాతి, పురూరవుడు ఈ వంశంలోని వారే.

**అనేనసుడు 2 :** ఇక్ష్వాకు వంశపురాజు. కాకుస్థుని కుమారుడు.

**అనేపమ్య :** బాణాసురుడి భార్య. యనారదుడి మీద అభిమానాన్ని ప్రదర్శించి కుటుంబ కలహాలకు దారి చూపుతుంది. – పద్మపురాణం

**అన్నపూర్ణ :** కాశీవిశ్వేశ్వరుని భార్య.

**అన్నృతం :** హింసకు అధర్మం వల్ల పుట్టిన బిడ్డ. అన్నృతుడని అంటారు. – విష్ణుపురాణం, అగ్ని పురాణం

**అపరకాశి :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం. – మహాభారతం

**అపరకుంతి :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం. – మహాభారతం

**అపరనంద :** ఇది భారతదేశంలో ఓ పుణ్యనది. అర్జునుడు. దీన్ని ఒకసారి దాటివెళ్లాడు. – మహాభారతం

**అపరబ్రహ్మ :** చూడు : పరబ్రహ్మ

**అపరమ్లేచ్ఛం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం

**అపరవల్లవం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం – మహాభారతం

**అపరశేకం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం – మహాభారతం

**అపర్ణ :** ఈమె పార్వతి యొక్క సోదరి. ఈమెను ఉమ అనికూడా పిలుస్తారు.

**అపరాజితుడు 1 :** కాశ్యపకద్రువలకు జన్మించిన ఓ సర్పం.

**అపరాజితుడు 2 :** కాలకేయులను రాక్షసులకు జన్మించినవాడు. యుద్ధానికి ముందు పాండవులు ఇతనిని ఆహ్వానిస్తారు.

**అపరాజితుడు 3 :** ధృతరాష్ట్రుని కుమారుల్లో ఒకడు. భీముడు ఇతన్ని వధిస్తాడు.

**అపరాజితుడు 4 :** కురువంశపు రాజుల్లో ఒకడు.

**అపరాజితుడు 5 :** 11 మంది రుద్రులలో ఒకడు.

**అపరాజితుడు 6 :** విష్ణువుకున్న పేర్లలో యిదొకటి.

**అపరా విద్య :** జ్ఞానం రెండు రకాలు 1. పరావిద్య : ఇది బ్రహ్మం గురించిన జ్ఞానం 2. అపరావిద్య : ఇది వేద వేదాంగాలు గురించిన జ్ఞానం.

**అపవుడు :** ఓ ముని. ఇతడున్న వనాన్ని హయహయుడు సూర్యుడికాహారంగా ఇచ్చాడు. ఇతడి ఆశ్రమం కాలిపోగా హయహయుడి వెయ్యి చేతుల్ని బలరాముడు ఖండించి వధించేటట్లు శపించాడు.

**అప్పకవి :** ఇతడు 'నన్నయ భట్టీయము' ననుసరించి తెనుగు వ్యాకరణమును పద్యకావ్యముగా రచించెను. ఇతడు 16వ శతాబ్దమున కృష్ణాతీరము నందలి కామెపల్లి యందు వుండెను. – పురాణనామ చంద్రిక

**అప్పయ్య దీక్షిత :** 16వ శతాబ్దంలో ప్రభవించిన సంస్కృత పండితుడు. జయదేవుని చంద్రలోకం వ్యాఖ్యానించడమేగాక, కువలయానంద, చిత్రమీమాంస అనే అలంకార కావ్యాలకర్త.

**అప్రతిరధుడు :** అంతిసారుని కొడుకు. ఇతడి కొడుకే కణ్వమహర్షి. - భాగవతం

**అప్రతిష్టం :** ఓ నరకము

**అప్సరసలు :** అప్సరసలనగా దేవతా స్త్రీలు. సముద్రాన్ని చిలికినపుడు వీరు జన్మించాడు. వీరు వేల సంఖ్యలో వున్నారు. - విష్ణుపురాణం
వీరిలో రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ, ఘృతాచి ముఖ్యులు.

**అపాంతరముడు :** ఓ మహర్షి : విష్ణువు 'భూ' అని నినదించినపుడు ఆ శబ్దానికి జన్మించాడు. ఇతణ్ణి సారస్వతుడని కూడా అంటారు. అజ్ఞానం నుండి బయటపడిన వాడు కనుక ఈ పేరు వచ్చింది. విష్ణువు ఆదేశం మేరకు వేదాలను విభజించాడు.

**అపాల :** అత్రై మహర్షి కుమార్తె. కుష్టువ్యాధి గ్రస్తురాలై భర్త వదలివేయగా తండ్రి ఆశ్రమంలో వుంటూ ఇంద్రుడి గురించి తపస్సు చేసేది. ఒకరోజు నది నుండి వస్తూ ఇంద్రుడికి అర్పించవలసిన సోమాన్ని తను రుచి చూడగా ఆ ధ్వనికి ఇంద్రుడు ప్రత్యక్షమ య్యాడు. సోమాన్ని ఇంద్రుడికివ్వగా సంతసించి ఆమెను కుష్టునుండి విముక్తుడ్ని చేశాడు.

**అప్పాజి :** శ్రీకృష్ణదేవరాయల ప్రధానమంత్రి. విజయ నగర సామ్రాజ్య విస్తరణకు అవిరళ కృషి చేసెను. కృష్ణదేవరాయలకు అత్యంత గౌరవనీయుడైన వ్యక్తిగా చరిత్రలో కీర్తించబడెను. మహామంత్రి తిమ్మరుసుగా ప్రసిద్ధుడు. - పురాణనామ చంద్రిక

**అప్రాచి :** ఓ నరకం - విష్ణుపురాణం

**అపోదధౌమ్య :** చూడుము : అయోధ ధౌమ్య

**అప్నుహోయముడు :** ధర్మజుని సభలో వుండే ఒక మహర్షి. - మహాభారతం

**అబల :** పాంచజన్యునికి జన్మించిన 15 మంది దేవతల్లో ఒకడు. - మహాభారతం

**అబ్జజుడు :** బ్రహ్మ మరోనామం

**అబ్బయామాత్యుడు :** ఓ ఆంధ్రకవి. 'అనిరుద్ధ చరిత్రము', 'పురూరవ చరిత్రము' ఇతని రచనలు. - పురాణనామ చంద్రిక.

**అబ్జుడు 1 :** చూ॥ చంద్రుడు

**అబ్జుడు 2 :** చూ॥ ధన్వంతరి

**అభయ :** ధృతరాష్ట్రుని కుమారుడు. కురుక్షేత్ర యుద్ధంలో భీముని చేతిలో మరణించెను.

**అభయం :** ఇధ్మజిహ్వుడు తన రాజ్యమును 7 భాగాలుగా విభజించి తన కుమారులకు పంచెను. ఇందులో అభయం ఒకటి. దీనిని భీముడు జయించెను. - మహాభారతం

**అభిజిత్తు :** రోహిణి నక్షత్రము ప్రక్కన నుండునది. చంద్రుని భార్య. అందరికంటే తనే ఇష్టసఖిని కావ లెనని తపస్సు చేసెను. ఈమెబదులు కుమారస్వామి అగ్నిదైవత్వమును నక్షత్రమును నిల్పెను.

**అభిధాన చింతామణి :** హేమచంద్రునిచే రచింపబడిన జైనుల మత సిద్ధాంత నిఘంటువు. - పురాణనామ చంద్రిక

**అభిధాన రత్నమాల :** హలాయుధునిచే రచింపడిన ఓ నిఘంటువు. - పురాణనామ చంద్రిక

**అభిప్రతారి :** ఒకముని, కక్షసేనుని వంశమువాడు.

**అభిభువు :** ఓ రాజపుత్రుడు. కాశీరాజు కుమారుడు. పాండవుల పక్షాన పోరాడి వసుధ మునికుమారుని చేతిలో వధించబడ్డాడు. - మహాభారతం.
ఇతని వద్ద అద్భుతమైన గుర్రం వుండేది.

**అభిమన్యుడు :** ఇతడర్జునుని కుమారుడు. పాండవులు వనవాసమున కేగినపుడు తనతల్లి సుభద్ర అనగా కృష్ణుని ఇంటనే వుండెను. బలరాముని కుమార్తె శశి రేఖను బెండ్లియాడెను. పాండవులు అజ్ఞాత వాసమున విరాట నగరము చేరెను. అచ్చట విరాటరాజు కుమార్తెను అర్జునునికిచ్చి పెండ్లి చేయబోగా అర్జు నుడు తన కుమారుడు అభిమన్యునికిచ్చి వివాహము చేయమని కోరెను. పరీక్షిత్తు అభిమన్యుని కుమారుడు. అతని కుమారుడే జనమేజయుడు.

*అభిమన్యుని క్షాత్రము :* కురుక్షేత్ర యుద్ధమున ఇత డెందరో యోధులను ఓడించెను. ఎంతోమంది కౌరవ వీరులను వధించెను. ద్రోణాచార్యుడు పద్మవ్యూహము పన్నగా ఆరోజు అర్జునుడు లేనందున వ్యూహం నుండి బయటకు రావడం తెలియని అభిమన్యుడు ఎందరో యోధులను వధించి ఒకేసారి ద్రోణ, కర్ణ, దుశ్శాసనుల పన్నుగడకు వధింపబడెను.

*పూర్వవృత్తాంతము :* ఇతడు చంద్రుని పుత్రుడు. మంచి వర్చస్సు. దేవతలు భూమిమీద దుర్మార్గులను

సంహరించుటకు పంపమని చంద్రుని కోరగా తనకు అభిమాన పుత్రుడైన ఇతడిని మొదట పంపుటకు ఇష్టపడక తప్పనిసరిగా పంపవలసి వచ్చినచో వెంటనే తిరిగి రావలెనని, 16 సంవత్సరాలకంటే వియోగం భరించలేనని అర్జునుని కుమారుడుగా మాత్రమే జన్మించాలని షరతు విధించెను. అప్పుడు నా కుమారుడు చక్రవ్యూహంలో మరణించి నావద్దకు తిరిగి చేరునని చెప్పెను.

ఇతని ఇతరపేర్లు : ఆర్జుని, సౌభద్ర, అర్జునాత్మజ అర్జునాపర, ఫల్గుణి.

**అభిష్యంతుడు :** కురు రాజుకు పుట్టిన బిడ్డ, వాహిని ఇతని తల్లి. వీరు ముగ్గురు సోదరులు. మరో ఇద్దరు అశ్వవాహనుడు, చైత్రరధుడు.

**అభిసాహి :** అర్జునుడు జయించిన రాజ్యాలలో ఇదొకటి.
– *మహాభారతం*

**అభిసారం :** ప్రాచీన భారతదేశంలో ఓ జనపథం
– *మహాభారతం*

**అభ్రమువు :** తూర్పు దిక్కున వుండే ఆడ ఏనుగు.

**అమధ్యుడు :** శ్రీకృష్ణుని మరోపేరు.

**అమరగుప్తుడు :** విక్రమాదిత్యుడు అవంతిని పాలించే ప్రాచీన కాలంలో అమరగుప్తుడు అతని మంత్రి
– *కథా సరిత్సాగరం*

**అమర సూరన :** చూ॥ సూరన.

**అమరపర్వతం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం. దీనిని నకులుడు జయించాడు. – *మహాభారతం*

**అమరబాహువు :** అనరణ్యుని కుమారుడు. సూర్య వంశపు రాజు. అనరణ్యుని రావణుడు మోసముచేసి చంపెను. అమర బాహువు నారాయణుని ప్రార్థింపగా తనకు దక్క రావణుని చంప సాధ్యముకాదని, నీ వంశంబున జన్మించి రావణుని వధింతునని వరమిచ్చెను.

**అమరసింహుడు :** ఓ జైన పండితుడు. నామలింగాను శాసన గ్రంథకర్త. ఇతడు విక్రమార్కుని కాలము వాడని ప్రసిద్ధి. – *పురాణనామచంద్రిక*

**అమరహ్రదం :** పుణ్యస్నానంచేసే ఒక పవిత్ర ప్రాంతం. ఇక్కడ స్నానం చేస్తే స్వర్గం చేరతారు.
– *మహాభారతం*

**అమరావతి :** బ్రహ్మ సృష్టించిన ప్రపంచం. 10,000 యోజనాలని, ఇది మహామేరుపర్వతం మీద వుంటుందని అంటారు. ఇందులో 8 నగరాలు ఒక్కొక్కటి 2,500 చ. మైళ్లు వుంటుంది. అందులో అమరావతి ఒకటి. ఇక్కడ ఇంద్రుడు నివసిస్తాడు. ఇతడు దేవతలకు రాజు.

**అమరకంతక :** ఇదో పర్వతం. శివుడు భస్మీపటలం చేసిన త్రిపురుని ఖండికలు ఈ పర్వతంమీద పడటం వల్ల ఇదో పుణ్యక్షేత్రమయ్యింది. అశ్వమేధయాగం చేసిన పుణ్యంకంటే పదింతలు పుణ్యం వస్తుందని, ఇక్కడి శివుడ్ని దర్శిస్తే స్వర్గాన్ని చేరతారని అంటారు. ఇక్కడున్న జ్యోతీశ్వరంలో స్నానంచేస్తే స్వర్గప్రాప్తి కల్గుతుందని, ఇక్కడ మరణిస్తే రుద్రలోకం చేరతారని, ఇచ్చట అమరులు, ఋషులు నివసిస్తారని అంటారు. ఈ పర్వతం 8 మైళ్ల విస్తీర్ణం వుంటుంది.

**అమరుకము :** సంస్కృత శృంగార కావ్యం. ఇది అమరు కవి రచన అని కొందరు చెప్పగా మరి కొందరు ఆదిశంకరుడు సరస్వతీ దేవిని జయించు నిమిత్తము పరకాయ ప్రవేశము చేసి శృంగారశాస్త్ర జ్ఞానము తెలిసికొనినపుడు రచించెనని చెప్పుదురు.
– *పురాణనామ చంద్రిక*

**అమవసువు :** పురూరవుని కుమారుడైన విజయుని నామాంతరము. – *పురాణనామ చంద్రిక*

**అమర్ధనుడు :** గుడ్లగూబల రాజు పేరు.
– *పంచతంత్రం*

**అమర్కుడు :** రాక్షసుల గురువైన శుక్రుని కుమారుడు. యాజ్ఞకుడు. – *మహాభారతం*

**అమర్థణుడు :** సంధి కుమారుడు. ఇతని కొడుకు మహాస్వంతుడు.

**అమావసువు :** పురూరవుడికి ఊర్వశికి పుట్టిన కొడుకు.
– *మహాభారతం*

**అమావాసి** : ఒకే రాశిలో సూర్యచంద్రుల కలయికను అమావాసి అంటారు. – *అమరకోశం*

**అమావసు :** పితృగణాలలో ఒకడు. వారి అంశతో జన్మించిన అచ్ఛోదకు ఈమె తండ్రులు సర్వాలంకార భూషితులై ఈమె కొకనాడు కన్పించిరి. తండ్రులలో ఒకడగు అమావసుఁడు అనువాని నీమె వలచెను.

కానియతడు చలింపలేదు. అన్యాయపు కోరికవల్ల ఆమె మహత్తు క్రిందబడి పితరులను వేడెను. వారప్పుడు నీవు మత్స్య యోనిని జనించి పరాశరుని వలన వ్యాసుని చిత్ర విచిత్ర వీర్యులను కనెదవని వరమిచ్చిరి.

**అమాహద :** ఒకసర్పం, సర్పయాగంలో మర ణిస్తుంది. – మహాభారతం

**అమితధ్వజుడు :** ఒక రాక్షసుడు – మహాభారతం

**అమితాశ్వుడు :** ఇక్ష్వాకు వంశజుడు.

**అమితేజుడు :** పాంచాల రాజు. కేతుమంతుడను రాక్షస అంశతో జన్మిస్తాడు. కురుక్షేత్రానికి ముందు పాండవులు ఇతన్ని ఆహ్వానిస్తారు.

**అమిత్రజిత్తు :** ఇతడొక రాజు. ఇతని దేశంలో శివాలయాలు అసంఖ్యాకంగా వుండేవి. దీన్ని చూసి సంతోషించిన నారదుడు రాజు వద్దకు వచ్చి "చంపకావలి నగరంలో మలయగంధిని వుండేది. అమెను కంకాళకేతుడపహరించాడు. ఆమెను విముక్తురాల్ని చేసిన వారినే ఆమె వివాహమాడుతుంది, అని చెప్తాడు. రాజు ఆమెను విముక్తురాల్ని చేసి వివాహమాడతాడు. వీరి కొడుకు వీరుడు. – స్కందపురాణం

**అమూర్తరయసుడు :** ప్రాచీన భారత దేశపు రాజు. గయ అనే రాజుకు తండ్రి. పురు రాజు నుండి ఖడ్గాన్ని బహుమతిగా పొందాడు – మహాభారతం

**అమౌఘ 1 :** శంతన మహర్షి భార్య. ఇతడు లేని సమయంలో బ్రహ్మ ఇతని ఆశ్రమానికి వచ్చి ఈమె సేవలు స్వీకరించి ఆమె అందానికి ముగ్ధుడౌతాడు. అందువల్ల బ్రహ్మకు రేతః పతనమవుతుంది. బ్రహ్మ సిగ్గుపడి ఆశ్రమాన్ని వదలివెళ్తాడు. ముని ఈ రేతస్సును వ్యర్థం చేయకుండా ఆమెను భరించమంటాడు. ఆమె దానిని స్వయంగా భరించలేక నీళ్లలో వుంచుతుంది. అదే లోహితమనే తీర్థంగా ప్రసిద్ధిచెందుతుంది. ఇక్కడే పరశురాముడు క్షత్రియులను వధించి శాపవిముక్తుడవుతాడు.

**అమౌఘ 2 :** భద్రావతానికి శివుడు వెళ్లినపుడు అతనికి తోడుగా వెళ్లిన యక్షుడు –మహాభారతం

**అమౌఘ 3 :** స్కందుడికి, శివునికి, విష్ణువుకు పర్యాయపదాలు.

**అమౌఘం :** బృహస్పతి కుటుంబం నుండి జన్మించిన అగ్ని. –మహాభారతం

**అమృత :** అనశ్వుని భార్య, మగధరాజు కుమార్తె, పరీక్షిత్తుని తల్లి.

**అమృతం :** దేవాసురులు క్షీరమధనం చేయగా పుట్టిన అతివిలువైన ఆహారం. యాచించితే వచ్చే సంపదను మృతం అంటారు, యాచించకుండా సమకూడే సంపదను అమృతం అంటారు – అగ్ని పురాణం

*క్షీరసాగర మధనానికి కారణం :* ఓ రోజు దూర్వాస మహర్షి వనంలో సంచరిస్తూ కల్పక పుష్పాన్ని చేత పట్టుకున్న మేనకను చూసి ఆ పుష్ప సుగంధాన్ని చూసి తనకివ్వమని అడిగాడు. ఆమె అతనికి పాదాభివందనం చేసి ఆ పుష్పాన్ని సమర్పించింది. అది అతను తలను ధరించి దేవలోకంచేరి ఆ పుష్పాన్ని ఇంద్రునికివ్వగా అది అతను తన ఏనుగు ఐరావతం తలపై వుంచాడు. అది దాని వాసనను ఆఘ్రాణించి క్రిందపడవేసింది ఇంద్రుడు తనిచ్చిన బహుమతిని చిన్నచూపు చూశాడని భావించి దేవలోకపు సంపద, గొప్పతనం నశిస్తుందని శపించాడు. ఇంద్రుడు ఎంత ప్రార్థించినా తాను వశిస్ఠుడ్ని, గౌతముణ్ణి కాదని నేను క్షమించనని అక్కడి నుండి వెడలెను. ఆ రోజు నుండి దేవలోక శోభ తగ్గిపోసాగింది. చెట్లు మొక్కలు నశించడం మొదలైంది; యజ్ఞాలు జరగడం లేదు. దేవతలకు ముసలితనంతోబాటు బాధలు పెరిగి పోయాయి. అగ్ని దేవునితో కలసి అందరూ బ్రహ్మ వద్దకు వెళ్ళగా బ్రహ్మ వీరందరిని తీసుకుని శ్రీమహావిష్ణువు వద్దకు వెళ్లి అతన్ని ప్రార్థించగా శ్రీమహావిష్ణువు వారికి అభయమిచ్చి వీరిని, అసురలను కలుపుకొని ఔషధ మొక్కల్ని, వివిధ రకాల చెట్లను క్షీర సాగరంలో వేయమని మంధర పర్వతం కవ్వంగా, వాసుకి తాడుగా దేవతలు అసురులు చెరో ప్రక్కవుండి చిలకమని అప్పుడు అమృతం ఉద్భవిస్తుందని, కష్టంలో రాక్షసులకు భాగం వున్నా అమృతంలో భాగం మాత్రం మీకే చెందేట్లు చేస్తానని అభయమిచ్చాడు. క్షీరసాగర మధనం మొదలయ్యింది. మేరుపర్వతం కవ్వమయ్యింది. వాసుకి తాడయ్యాడు. దేవతలు తోకవైపు, రాక్షసులు తలవైపు పట్టుకున్నారు. శ్రీమహావిష్ణువు

తాబేలు రూపందాల్చి సముద్ర పుటడుగున క్షీరసాగరం మధ్య మేరు పర్వతానికి అడుగున చేరాడు. అంతేకాక మాయారూపంలో పర్వతంపై నుండి పర్వతాన్ని సముద్రంలోకి అణుస్తున్నాడు. సముద్రం నుండి మొదట కామధేనువు, తర్వాత వారుణి దేవి, తర్వాత పారిజాతం పైకి వచ్చాయి. తర్వాత కొందరు అప్సరసలు పైకి వచ్చారు. 5వ సారి చంద్రుడు పైకి రాగా శివుడు దాన్ని స్వీకరించాడు. 6వ సారి విషం పైకి రాగా నాగులు దాన్ని మింగివేశారు. ఆ తర్వాత ధన్వంతరి భగవానుడు అమృతమున్న కమండలంతో పైకి వచ్చాడు. ఆ తర్వాత లక్ష్మీదేవి పైకి వచ్చింది. గంధర్వులు ఆమెను గురించి గానం చేశారు. అప్సరసలు నృత్యం చేశారు. ఆమె స్నానం చేయడానికి గంగ తన ఉపనదులతో అక్కడకు వచ్చింది. బ్రహ్మ ఆమెను సకల ఆభరణాలతో అలంకరించగా, ఆమె విష్ణువు హృదయ పీఠాన్ని అలంకరించింది. రాక్షసులు ఇది చూసి ఓర్వలేక ధన్వంతరి చేతనున్న అమృత కలశాన్ని లాక్కొని పారిపోయారు.

*దేవతలు తిరిగి అమృతం పొందుట :* దేవతలు నిశ్చేష్టులయ్యారు. అమృతం మరల ఎలా సాధించాలో ఆలోచిస్తున్నారు. శ్రీమహావిష్ణువు మోహిని రూపం దాల్చి అసురుల చెంతకు చేరాడు. అసురులు ఆమె అందానికి ముగ్ధులై ఆమెను నీవెవరివని అడుగగా ధన్వంతరి చెల్లినని, నన్ను విడిచి దేవతలు, అసురులు వెడలిపోయారని చెప్పింది. ఆమె మాటలు విన్న రాక్షసులు ఒక్కొక్కరు ఆమెతో స్నేహం చేయసాగారు. అంతే కాకుండా ఆమెను అమృతం తమందరికి పంచమని కోరారు. అందుకామె బదులిస్తూ మీరందరు కళ్లు మూసుకొని వుంటే తను అమృతం పంచుతానని, చివరిగా కళ్లుతెరచిన వాడు తనకు అమృతం పంచాలని, అతన్ని తను వివాహం చేసుకుంటానని చెప్పింది. దీనికి సరేనన్న రాక్షసులు కళ్లు మూసుకోగా క్షణాలలో అమృత భాండంతో సహా శ్రీమహావిష్ణువు దేవలోకం చేరుకున్నాడు.

*రాహువు కంఠం తెగనరకుట :* రాక్షసులు మాయా రూపంలో రాహువుని దేవలోకం పంపారు. దేవలోకపు ద్వారానికి కాపలావున్న సూర్య చంద్రులు ఇతన్ని గుర్తించారు. శ్రీమహావిష్ణువు తన సుదర్శన చక్రంతో రాహువు కంఠాన్ని తెగగొట్టాడు. ఆ కక్షతో రాహువు పారిపోతూ సూర్యచంద్రుల్ని మింగగా వారు కంఠానికున్న బెజ్జం ద్వారా బయటకు వచ్చారు. అందుకే సూర్యగ్రహణం, చంద్రగ్రహణం ఏర్పడతాయని చెప్తారు. దేవతలు అమృతాన్ని సేవించి శక్తివంతులై రాక్షసులను ఓడించారు. కాశ్యపుని భార్యలు కద్రువ, వినత. కద్రువ నాగులకు జన్మనివ్వగా వినత గురుడునికి జన్మనిచ్చింది. వినతా కద్రువులకు స్పర్థలొచ్చి ఓ పందెం కాసుకున్నారు. దేవేంద్రుని గుర్రంయొక్క తోక తెల్లగా వుంటుందని వినత, నలుపని కద్రువ తర్కించుకొని అందులో ఓడిపోయిన వారు మరొకరికి దాసిగా వుండాలని పందెం కాసు కుంటారు. కద్రువ కుమారులైన నాగులు ఆ సమయంలో ఇంద్రుని గుర్రపు తోకను చుట్టుకొని నలుపుగా కన్పించేట్లు చేస్తారు. వినత ఓడిపోయి కద్రువకు దాస్యం చేస్తుంది. దాస్య విముక్తికి దేవలోకంలోని అమృతం తెచ్చివ్వమని వినత బిడ్డ గరుడుని అడుగుతుంది కద్రువ. గరుడుడు దేవతలను ఓడించి అమృతభాండాన్ని నాగులకు అందజేస్తాడు. నాగులు సంభ్రమంతో అమృత భాండాన్ని దర్భ ఆకులపై వుంచి స్నానం చేసి వచ్చి సేవించటానికి స్నానానికి వెళ్లగా ఇంద్రుడు వెంటనే దానిని ఎత్తుకుపోయి దేవలోకం చేర్చుతాడు. చేసేదేమీ లేక అమృత భాండం నుంచి కాస్తయిన అమృతం దర్భలపై వొలికి వుంటుందేమోనన్న ఆశతో నాగులు దర్భాకులను నాకుతాయి. దర్భాకుల ముళ్లకు నాగుల నాలుకలు చీలి పోతాయి. అందుకే సర్పాల నాలుకలు చీలిపోయి వుంటాయని ప్రతీతి. – మహాభారతం

**అమృతమధనం :** చూ॥ క్షీరసాగర మధనం

**అమృతలింగం :** చూ॥ శ్రీకాళహస్తి

**అమృతాంశుడు :** ఇతడు అమృత స్వరూపుడైన చంద్రుడు. దీన్ని కళల రూపంగా దేవతలు పానం చేస్తారు.

**అయశ్శకుడు :** ఓ గొప్ప రాక్షసుడు. కేకేయ రాజ్యానికి రాజకుమారుడు. – మహాభారతం

**అయశ్శిరసుడు :** కాశ్యపుడికి ధనువు వల్ల కల్గిన పుత్రుడు. అతడు కేకేయ రాజుకి జన్మించాడు – మహాభారతం

**అయాతి :** నహుషునికి కుమారుడు. యయాతి చక్రవర్తి తమ్ముడు. – మహాభారతం

**అయావహం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం – మహాభారతం

**అయాగ్యుడు :** ఒక ఋషి. ముఖ్యప్రాణమునే ఉద్గాతృ స్వరూప భావన చేసి కర్మాంగముగ నుపాసించెను. – చారి॥ఉ

**అయుతజిత్తు :** సహస్రజిత్తుని తమ్ముడు.

**అయుతానీకుడు :** మహాభౌముని పుత్రుడు. ఇతని భార్య కాముక. వీరి పుత్రుడు అక్రోదనుడు. – మహాభారతం

**అయుతాయువు 1 :** రథికుని కుమారుడు.

**అయుతాయువు 2 :** సింధుదేపుడి కొడుకు. రుతుపర్ణుడి తండ్రి – విష్ణుపురాణం

**అయోధ దౌమ్యుడు :** ఇతడో గొప్ప ముని పుంగవుడు. అపోద ధౌమ్యుడని, ధౌమ్యుడని పిలుస్తారు. ఇతనికి ముగ్గురు ప్రియ శిష్యులు కలరు. వారు ఆరుణి (అత నిని ఉద్దాలకుడని అంటారు) ఉపమాన్యు మరియు వేదుడు – మహాభారతం

**అయోధ్య :** ఉత్తర భారత దేశంలోని ఒక పట్టణం. సూర్యవంశపు రాజులకు రాజధానిగా ఎన్నో సంవ త్సరాలు తన ప్రతిష్టను చాటుకుంది. ఇక్ష్వాకు వంశ జుడైన శ్రీరాముని జన్మస్థలం. శ్రీరాముని పరిపాలన అనంతరం దీని ప్రాభవం కోల్పోతూ వచ్చింది.

**అయోబాహువు :** గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుడు. ఇతడు కురుక్షేత్ర యుద్ధంలో భీమసేనుని చేత వధింప బడ్డాడు. – మహాభారతం

**అయోముఖి :** ఈమె ఒక రాక్షసి. వనములో సీతను వెదకుచు బోవు లక్ష్మణుని ప్రేమించి తనను వివాహ మాడమని కోరగా శూర్పణకకువలె ముక్కుచెవులు కోసెను. – రామాయణం

**అయోముఖుడు :** ధనువు పుత్రులలో ఒకడు.

**అరక్కిలం :** మైనంతో నిర్మింపబడిన గృహం. కౌరవులు దుష్ట ఆలోచనతో వారణావతంలో మైనపు ఇల్లు గట్టి పాండ వులను అక్కడ వుండమని పంపుతారు. పాండ వులు ఈ రహస్యాన్ని కనిపెట్టి ముందుగానే సొరంగ మార్గం గుండా బయటకు వెళ్తారు. అక్కడ నిద్రిస్తున్న మరో ఆరుగురు, నిప్పంటించిన పురో చనుడు అగ్నికి ఆహుతి అవుతారు.

**అరజ :** ఈమె శుక్రుని కూతురు. ఇక్ష్వాకుని కుమారుడు దండుడు. వింధ్య హిమాలయ మధ్య ప్రాంతానికి రాజు. ఒక రోజు వేటకు వెళ్లి అరజ అందానికి ముగ్ధుడై ఆమెను బలాత్కరిస్తాడు. అది ఆమె తండ్రి శుక్రునికి చెప్పగా ఆమెను తపస్సు చేయమని ఆ శక్తితో అతని అగ్నిజ్వాలలతో రాజ్యాన్ని నాశనం చెయ్యమని చెప్తాడు. ఆమె కోరిక మేరకు ఇంద్రుడు అగ్నిజ్వాలలతో ఆ ప్రాంతాన్ని బూడిద చేస్తాడు. అదే 'దండకారణ్యం'.

**అరత్తం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం. ద్రోణుడు మరణించిన తర్వాత కృతవర్మ ఈ ప్రాంత వీరులతో పారిపోతాడు. – మహాభారతం.

**అరయాణం :** దేవలోకంలోని హంస. ఇవి దేవ లోకపు పక్షులు. హిమాలయాలలోని మానస సరోవరం వీటి నివాస స్థావరం. వీటికి వర్షాకాలం రుచించదు. హిమాలయాల్లో వర్షంకురిస్తే నేలమీదకు, నేలమీద వర్షం రాగానే మానస సరోవరానికి వెళ్తాయి. దక్షుని కుమార్తె షేనికి ఐదుగురు పక్షి సంతతి. అందులో హంస ఒకటి.

*నల–హంస :* నలుడు తన వనంలో ఓ హంసను చూసి పట్టుకున్నాడు. దాని మానసిక వ్యధ చూసి వదలివేశాడు. అందుకు కృతజ్ఞతగా ఆ హంస దమ యంతికి నలుడి దూతగా వెళ్లింది.

*హంస తెల్లని తెలుపుకు కారణం :* ఒకరోజు మరుత్తు డను రాజు యజ్ఞం చేస్తున్నప్పుడు హవిస్సు గ్రహించడానికి ఇంద్రుడు, వరుణుడు ఇతర దేవతలు వచ్చారు. అదే సమయంలో రావణుడు అక్కడకు రాగా అతనికి భయపడి తలా ఒక పక్షి రూపము ధరించారు. దేవతలు కన్పించక రావణుడు వెళ్లిపోగా దేవతలు తాము ధరించిన రూపమున్న పక్షులను దీవించారు. వరుణుడు తను ధరించిన హంసను ఇప్పటి వరకు నలుపు తెలుపుగా వున్న నీవు ఇక నుండి తెల్లని తెలుపుగా ఉందువని దీవించాడు. అప్పటినుండి హంస తెల్లగా మాత్రమే వుండి ఆకర్ష ణీయమయ్యింది. –ఉ. రామాయణం

**అరిచ్ఛత్రం :** మహాభారత యుద్ధంలో కౌరవులకు ఓ విడిది. - మహాభారతం

**అరిమేజయుడు :** పూరువంశపు రాజు.
- మహాభారతం

**అరిష్ఠ :** కశ్యపుడి భార్య. వీరికి గంధర్వులు పుడతారు.
- అగ్ని పురాణం

**అరిష్టక :** ఇతనో రాక్షసుడు. కంసుడు శ్రీకృష్ణుని చంపడం కోసం గోకులం పంపాడు. అక్కడ అది ఎద్దురూపం దాల్చి విధ్వంసం సృష్టించగా శ్రీకృష్ణుడు తన పిడిగుద్దులతో చంపి వంద యోజనాల దూరం విసిరివేశాడు. అది చనిపోయి మామూలు స్వరూపం వచ్చింది.

**అరిష్టనేమి 1 :** దక్షుని కూతురు. ధృతరాష్ట్రి కశ్యపునికి పుట్టిన శుకి యొక్క కూతురు నటా. ఆమెకు కల్గిన కూతుర్లలో ఒకరు వినత. ఆమె 6 గురు కుమారుల్లో అరిష్టనేమి ఒకరు.

**అరిష్టనేమి తపశ్శక్తి :** అరిష్టనేమి అతని కుమారుడు అరణ్యంలో తపస్సు చేసుకొంటున్నారు. లేడి చర్మం ధరించిన ఆ బాలుడ్ని లేడి అనుకొని పరపుంజయ రాజు తన బాణాన్ని సంధించి ఆ పొరపాటు గ్రహించి బాలుడు మరణించాడను కొని అరిష్టనేమిని క్షమాపణ కోరాడు. అప్పుడు అరిష్టనేమి ఆ బాలుణ్ణి చూపి ఇతనినేనా నువ్వు వధించిందని అడిగాడు. రాజు ఆశ్చర్యపోగా భుజశక్తి కంటే తపశ్శక్తి గొప్పదని అందుకే బాలుడు మరణించలేదని చెప్పాడు. రాజు అరిష్టనేమి పాదాలపై సాష్టాంగ పడి తన రాజ్యానికి మరలాడు. - మహాభారతం

సగరుని భార్య సుమతి అరిష్టనేమి కుమార్తె.
- రామాయణం

**అరిష్టనేమి 2 :** కశ్యపుని రెండవ కుమారుడు.

**అరిష్టనేమి 3 :** యముని సభలో వున్న ఒక రాజు.
- మహాభారతం

**అరిష్టనేమి 4 :** సహదేవుడు విరాటుని కొలువులో అజ్ఞాతవాస సమయంలో పెట్టుకున్న పేరు.
- మహాభారతం

**అరిష్టనేమి 5 :** శ్రీకృష్ణునికి గల మరోపేరు.
- మహాభారతం

**అరిష్టనేమి 6 :** ఇతనో రాజు. ప్రపంచంలోని మార్పులను చూసి తన రాజ్యాన్ని వదులుకుని గంధ మాదన పర్వతంమీద తపస్సు చేసుకుంటాడు. ఇంద్రుడు ఇతన్ని తీసుకొని రావడానికి ఓ దూతను విమానంతో పంపుతాడు. స్వర్గంలో కూడా హెచ్చు తగ్గులు, ప్రఖ్యాతి పతనాలు వుంటాయని తెలిసి స్వర్గానికి వెళ్లడానికి తిరస్కరిస్తాడు. తర్వాత ఇంద్రుడు మరో దూతను పంపి రాజుని వాల్మీకి ఆశ్రమానికి పంపుతాడు. వాల్మీకి రామాయణ కథ చెప్పిన, విన్న సంపూర్ణ ముక్తి కల్గుతుందని చెప్తాడు.
- యోగవాసిష్టం

**అరిహుడు :** చంద్ర వంశపు రాజు. పూరు వంశానికి చెందిన అర్వాచీనుడి కొడుకు. మహాభౌముడి తండ్రి.
- మహాభారతం

**అరుజం :** రాక్షసుల్లో ఒక తెగ - మహాభారతం

**అరుణ సంగమం :** అరుణా నది సరస్వతీ నదిలో కలసిన ప్రాంతం. - మహాభారతం

**అరుణా 1 :** సరస్వతి యొక్క ఉపనది.
- మహాభారతం

**అరుణా 2 :** ప్రథావల్ల జన్మించిన అప్సరస.
- మహాభారతం

**అరుణాచలం :** పంచలింగ క్షేత్రాల్లో ఒకటి. దీన్నే తిరువణ్ణామలై అంటారు.

**అరుణాస్పదం :** గంగానది ఒడ్డున గల ఓ పట్టణం. ప్రవరుడి నివాస స్థానం. - మార్కండేయ పురాణం

**అరుణాశ్వుడు :** బర్హిణాశ్వుడి రెండో కొడుకు.

**అరుణి :** స్త్రీ రూపంలో ఇంద్రుని కొలువులో కూర్చున్న అరుణుడి పేరు.

**అరుణుడు 1 :** కశ్యపుని కుమారుడు. వినతకు జన్మించిన మొదటి బిడ్డ. కశ్యపుడు కద్రువ, వినతలను వివాహం చేసుకోగా వారి భక్తికి మెచ్చి కద్రువకు 1000 నాగులు, వినతకు అంతకంటే బలశాలురైన ఇద్దరు సంతానం కల్గుతారని వరమిచ్చాడు. కద్రువ నాగులకు జన్మనివ్వగా వినత త్వరపడి తన పిండాన్ని పగులగొట్టుకొంది. కుమారుడు సగం శరీరంతో బయటకు వచ్చి ఇలా చేసినందుకు తల్లిని కద్రువకి బానిసగా అవుతావని శపిస్తాడు. అతడే అరుణుడు.

ఆ తర్వాత 500 సంవత్సరాలకు మరో పుత్రుడు కల్గుతాడని అప్పుడు కద్రువకి అంగవైకల్యం లేని శిశువు జన్మిస్తాడని చెప్తాడు. అతడే గరుడుడు.

– మహాభారతం

*సూర్యుని సారథిగా అరుణుడు :* రాహువుచే మింగ బడుతూ వున్న సూర్యునికి తనను దేవతలు రక్షించ కుండా మోసం చేశారని ఆగ్రహం చెంది వేడి మరింత ఉధృతం చేస్తూ ప్రయాణిస్తూ దగ్గర దగ్గర అన్ని జీవ జాలాలను నశింపచేస్తున్నాడు. అప్పుడు దేవతలు బ్రహ్మనా శ్రయించగా బ్రహ్మ అరుణుడిని సూర్యుని రథం ముందుండి అతని వేగాన్ని తగ్గించమని కోరగా అప్పటినుండి సూర్యుని రథ సారథ్యం వహిస్తున్నాడు. అరుణుడికి స్యేణి వల్ల ఇద్దరు కుమారులు కలిగారు. 1. సంపాతి, 2. జటాయువు –మహాభారతం

*అరుణుడు స్త్రీగా మారి సంతానం పొందిన కథ :* ఒకసారి శీలవతి శాపంవల్ల సూర్యుడు ఉదయించ లేదు. అందువల్ల అరుణుడుకి కాలయాపన కోసం దేవేంద్ర సభలో అప్సరసలు నృత్యం చేస్తున్నారని తెలిసి స్త్రీగా మారి ఇంద్రలోకం చేరగా ఇంద్రు డామెను మోహించి సంగమించగా ఓ పుత్రుడు జన్మిం చాడు. ఆలస్యానికి కారణం అడుగగా సూర్యునికి పై వృత్తాంతం చెప్పగా సూర్యుడు మరల స్త్రీగా మార మని కోరి సంగమించగా మరోపుత్రుడు జన్మించాడు. వీరిద్దరిని అహల్యాదేవి సాకింది. ఆమె భర్త గౌతము నికి ఇది కోపకారణమై వారిని కోతులుగా మారమని శపించాడు. రుక్షరాజు సంతానం లేక విచారిస్తుండగా ఈ ఇద్దర్ని ఇంద్రుడు అతనికి అప్పగించాడు. వారే వాలి, సుగ్రీవులు.

ఇతనికున్న మరికొన్ని పేర్లు *:* శూరసుత, అనూరు, అరుణకాశ్యపి, గరుడాగ్రజ.

**అరుణుడు 2 :** సూర్యవంశపు రాజు. త్రిశంకుని తండ్రి.

– దేవీ భాగవతం

**అరుణుడు 3 :** ప్రాచీన భారతదేశంలో ఒక ముని. ఒక వర్గపు ఋషిని అరుణుడు అనేవారు. వీరు స్వయం అధ్యయనం వల్ల స్వర్గం చేరేవారు.

**అరుణుడు 4 :** ముఖ్యమైన సర్పాల్లో ఒకరు. తక్షకుడు, వాసుకి, పుండరీక కోవకు చెందినవాడు.

– మహాభారతం

**అరుణుడు 5 :** ఒక ఋషి తైత్తిరీయ అరణ్యకం. ఇతడు బ్రహ్మ సృష్టిగావించేటపుడు బ్రహ్మ శరీరం నుండి జన్మించాడని చెప్తోంది.

**అరుణుడు 6 :** ఓ దానవుడు, విప్రచిత్తి వంశజుడు. గాయత్రీ మంత్రాన్ని ఉచ్చరిస్తూ ఎన్నో సంవత్సరాలు తపమాచరించి బ్రహ్మనుండి యుద్ధంలో మరణం లేనట్లు వరం పొందాడు. అతడు గర్వాంధుడై ఇంద్రు నిపై యుద్ధానికి సన్నద్ధమయ్యాడు. దేవతలు బృహస్ప తిని పంపారు. అరుణుడు వైరివర్గం వాడివి. నా వద్దకు వచ్చావేమని అడిగితే మనమిద్దరము గాయత్రీ మంత్రో పన్యాస కులం కనుక వచ్చాననగా అహంకా రియై అరుణుడు గాయత్రి మంత్రాన్ని వదలి వేశాడు. అంతట గాయత్రి కుపితయై వేల కందిరీగల్ని అతని మీదకు పంపగా సైన్యంతో పారిపోయాడు.

**అరుణుడు 7 :** నరకాసురుని కుమారుడు. శ్రీకృష్ణుని చేతిలో మరణించాడు.

**అరుణోదయం :** ప్లక్ష ద్వీపం నుంచి ప్రవహించే నది. దీని చుట్టుపక్కల పది యోజనాల వరకు సువాస నలతో కూడిన గాలి వీస్తుంది. – దేవీ భాగవతం

**అరుపత్తి మూవర్ :** శివుడి భక్తులు, వీరు 63 మంది. వీళ్లను నయనార్లు అంటారు.

**అరుల్‌మౌలితేవర్ :** తిరుమురల్లో 12 పాట లుంటాయి. వీటిలో మొదటి మూడింటిని అరువలై మూవర్‌లో ప్రసిద్ధులైన తిరుజ్ఞాన సంబంధ, తిరునావుక్కరశ, సుందరమూర్తులు మొదటి ఏడింటిని సంకలనం చేయగా, 12వ పాటను అరుల్ మౌలితేవర్ సంకలం చేశారు. దీనిన పెరియ పురాణమంటారు.

**అర్కపర్ణుడు :** మునీ అనే స్త్రీ వల్ల కశ్యపునికి కల్గిన కుమారుడు. అతడు దేవ గంధర్వుడు.– మహాభారతం

**అర్చనానసుడు :** అత్రి వంశంలోని ముని. ఇతడు రథవతిని వివాహమాడాలని తలుస్తాడు. రథవతి తండ్రి ఆమెను 'మహర్షి' కే ఇస్తానంటాడు.

**అర్థకీల తీర్థం :** దర్భిముని ఒక కొలనుకు నిర్మించిన స్నానఘట్టాలు. ఇదో పుణ్యస్థలం. – మహాభారతం

**అర్థదేవులు :** దేవాలయాల్లో దేవుళ్లు కాకుండా మనకు కన్పించే ఋషులు, వసువులు, నాగులు, అసురులు, పైశాచికులు, కెతాలసులు. వీరిని అర్థ దేవుళ్లంటారు.

**అర్థపతి :** నిషధ దేశపు రాజు. ఇతని కుమార్తెను రఘు వంశజుడను అతిథికి ఇచ్చి వివాహము చేసెను. ఆమె కుమారుడు నిషధుడు.

**అర్ధనారీశ్వరి :** బృంగియను గణనాధుడు పార్వతిని ప్రార్థింపక శివుని మాత్రమే ఆరాధించెను. పార్వతి కోపగించి అతన్ని పీల్చి పిప్పిచేసెను. శివడాతనిని దండమాధారముగా నిచ్చి లేవదీసెను. భక్తునిపై నున్న ప్రేమ తన పై లేనందుకు పార్వతి కుపితయై కేదార మున కేగి కేదారేశ్వరుని ప్రార్థించగా శివుడు ప్రత్యక్షం కాగా అతని అర్ధాంగమును పార్వతి పొందెను. – పు.నా.

**అర్ధనారీశ్వరుడు :** ప్రజాభివృద్ధి సరిగా జరుగక బ్రహ్మ శివుని ప్రార్థించెను. శివుడు ప్రత్యక్షమై తనలో సగభాగమైన నారిని విడిపొమ్మని స్త్రీగా జన్మించమని ఆజ్ఞాపించెను. ఆమెయే దక్షప్రజాపతి కుమార్తె పార్వతి. – పు.గో.చ.

**అర్థసాధకుడు :** దశరథుని 8 మంది మంత్రులలో ఒకరు. ఇతరులు జయంతి, దృష్టి, విజయ, సిద్ధ, అశోక, మంత్రపాల, సుమంత్ర – రామాయణం

**అర్యముడు :** కాశ్యప, అదితిలకు జన్మించిన 12 మంది ఆదిత్యుల్లో ఒకరు.

**అర్యశ్యుడు :** సూర్యవంశపు రాజు.

**అరాళి :** విశ్వామిత్రుని బ్రహ్మవాదినులనే కుమారుల్లో ఒకరు. – మహాభారతం

**అర్థావసువు :** ఒక ఋషి. రైభ్యుని కుమారుడు. పరా వసుని సోదరుడు.

**అర్వావసుడు :** యుధిష్ఠురుని కొలువులో వున్న పూజ్యనీయుడు. రైభ్యుడి పెద్ద కొడుకు. పరావసుడి సోదరుడు. బృహద్ద్యుమ్నుడనే రాజుకు ఋత్వి జులుగా వెళ్లినపుడు పరావసువు పొరపాటున తండ్రిని చంపు తాడు. సోదరుడి బ్రహ్మహత్యా పాతకం పోవడానికి అర్వావసుడు హోమాలు చేస్తాడు. తర్వాత రాజు వద్దకు వెళ్తే సోదరుడే అయిన పదీవసువు ఇతడు బ్రహ్మహత్య చేశాడు గనుక రాతగాడని చెప్తాడు. అర్వా వసుడి సత్య నిష్ఠ తెలిసిన దేవతలు ప్రత్యక్షమై వరం కోరుకోమంటే రైభ్య, యవక్రీత, భరద్వాజుల్ని బతికించ మంటాడు. – మహాభారతం

**అర్చి :** వేనుడి భుజాలు మర్ధించగా పుట్టిన యువతి, లక్ష్మి అంశ. ఈమె భర్త పృధువు. విజితేశ్వరుడు, ధూమ్రకేశుడు, హర్యశ్యుడు, ద్రవిణుడు, వృకుడు ఈమె కుమారులు. – మహాభారతం

**అర్చిక పర్వతం :** వైదూర్య పర్వతానికి మరోపేరు.

**అర్చిరాది మార్గం :** బ్రహ్మోపాసన చేసేవారు బ్రహ్మలోకం పోయేమార్గం ఇది. సూర్య, చంద్ర, విద్యు ల్లోకాలను దాటిన తర్వాత వస్తుంది.

**అర్చితి :** అంగిరసుడి నాల్గవ కూతురు. – మహాభారతం

**అర్చిష్మంతులు :** ఓ పితృగణం – భాగవతం

**అర్ష్టిషేణుడు :** ఒక ముని. ఇతడి ఆశ్రమంలో పాండ వులు కొంతకాలం వున్నారు. – మహాభారతం

**అరంతుక :** ప్రాచీన భారతదేశంలో ఓ పుణ్యస్థలి. ఇది సరస్వతీ నదిలో కలదు. ఇక్కడ స్నానం చేస్తే అగ్ని స్తోమయజ్ఞం చేసినంత పుణ్యం కల్గుతుంది.

**అరంతకుడు :** కురుక్షేత్రపు హద్దులో నిలబెట్టిన కాపలాదారుడు – మహాభారతం

**అర్జునిక :** ఇతనొక వేటగాడు. భీష్ముడు అంపశయ్యపై నుండి ధర్మజునికి ఈ కథ చెప్తాడు. గౌతమి అనే బ్రాహ్మణ స్త్రీ బిడ్డ పాముకాటు వల్ల చనిపోయాడని, అందుకని ఆ పాముని తీసుకు వచ్చానంటాడు. పాము దానికి కారణం నేనుకాదని, మరణ శాసనం వల్ల నేను కాటువేశా నంటుంది. మృత్యువు కూడా దానికి కారణం నేను కాదని, మృత్యుదేవత కారణ మని చెప్తుంది. మరణానికి కారణం బాలుడేనని, ఈ బాలుడిని గౌతమి కనడమే కారణమంటుంది. ఎంతటివారైనా కర్మఫలం అనుభవించక తప్పదని చెప్పడానికి భీష్ముడు ధర్మజుడికి ఈ కథ చెప్తాడు.

**అర్జుని 1 :** బాణాసురుడి కూతురు.

**అర్జుని 2 :** బాహద అనే నది పేరు.

**అర్జునుడు :** పాండవులలో మూడోవాడు.

*వంశవృక్షం :* విష్ణు – బ్రహ్మ – అత్రి – శంతను – వ్యాస – పాండు – అర్జున.

*పూర్వజన్మ :* శ్రీకృష్ణార్జునులను నరనారాయణు లంటారు. పూర్వజన్మలో వీరిద్దరూ నరుడు నారాయ ణుడు అనబడే ఋషులు. వీరిద్దరు బదరికాశ్రమం వద్ద మహాసమాధి చెందారు. ఇందులో నారాయణర్షి

పాక్షిక విష్ణువాంశ. నరర్షి తన తర్వాతి జన్మలో అర్జునుడిగా, నారాయణర్షి శ్రీకృష్ణుడిగా జన్మించారు.
*జననం :* శంతనుని కుమారుడైన విచిత్రవీర్యునికి అంబిక వల్ల ధృతరాష్ట్రుడు, అంబాలిక వల్ల పాండు రాజు జన్మించారు. పాండురాజుకు ఇద్దరు భార్యలు కుంతి, మాద్రి. ఓ మునిచే పాండురాజు తన భార్య లతో సంపర్కం పొందకుండా శపించబడ్డాడు. వివా హానికి పూర్వమే దూర్వాసుని సేవించి కుంతి 5 మంత్రాలను పొందింది. ఈ మంత్రం గనుక ఆమె ఎవరిని గురించి స్మరిస్తే వారివల్ల పుత్రుడు జన్మిస్తాడు. వివాహానికి పూర్వమే ఈ మంత్రాన్ని ఉచ్చరించి సూర్యునివల్ల కర్ణునికి జన్మనిచ్చి సమాజానికి భయపడి అతడ్ని నదిలో ఒదిలివేసింది. అతడే కర్ణుడు. వివాహానంతరం ఆమె యమధర్మరాజుని, ఇంద్రుణి, వాయుదేవుణ్ణి స్మరించి వారివల్ల ధర్మరాజుకి, భీమ సేనునికి, అర్జునుడికి జన్మనిచ్చింది. మిగిలిన 5వ మంత్రాన్ని తన సవతి మాద్రికివ్వగా ఆమె అశ్వనీ దేవతలను స్మరించి వారివల్ల నకుల సహదేవులకు జన్మనిచ్చింది.
*బాల్యం- విద్యాభ్యాసం :* ఉపనయనాన్ని కాశ్యపుడు చేయగా శుకమహర్షి, కృపాచార్యులవద్ద ధనుర్విద్యా భ్యాసం నేర్చుకొని తర్వాత ద్రోణాచార్యునికి ప్రియ శిష్యుడయ్యాడు. కౌరవపాండవులకు అస్త్రశస్త్రాది విద్యలు నేర్పిన ద్రోణుడికి అర్జునిపై ఎక్కువ వాత్సల్యం వుండేది. ఓ రోజు ద్రోణుడు కొలనులో స్నానం చేస్తుండగా అతని కాలుని ఓ ముసలి పట్టుకోగా తన అస్త్రంతో దానిని అర్జునుడు వధించాడు. ద్రోణుడు మెచ్చి ఇతనికి బ్రహ్మాస్త్రాన్ని బహూకరించి దానిని మానవులపై ప్రయోగించ వద్దని కోరాడు.
*విద్యాప్రదర్శన :* ద్రోణుని వద్ద కౌరవపాండవుల విద్యా భ్యాసం పూర్తయిన తర్వాత ధృతరాష్ట్రుడు వారి ప్రావీ ణ్యాన్ని పరీక్షించనెంచి విద్యాప్రదర్శన ఏర్పాటు చేయగా భీమదుర్యోధనులు గదాయుద్ధం చేశారు. అది ఉద్రేకపూరితం కాగా అశ్వత్థామ వారిని విడిపిం చాడు. అర్జునుని అస్త్రవిద్యానైపుణ్యం చూసి అందరూ ఆశ్చర్యానికిలోను కాగా కర్ణుడు అక్కడికి ప్రవేశించి అర్జునుని నేను ఓడించగలనని తన అస్త్రవిద్యను ప్రదర్శించాడు. ద్రోణుడు వీరిద్దరిని సమానులుగా ప్రకటించగా కర్ణుడు క్షత్రియుడుగాడు గనుక ఇందు ప్రవేశార్హత లేదనెను. దుర్యోధనుడు కర్ణునికి అంగ రాజ్యమిచ్చి రాజుని చేసెను. అప్పటినుండి కౌరవ పాండవులమధ్య మరింత పగలు పెరిగెను.
*అర్జునుని గురుదక్షిణ :* విద్యాభ్యాసానంతరం ద్రోణుడు ఒకప్పుడు తనను అవమానించిన తన స్నేహితుడు ద్రుపదుణ్ణి బంధించి తెమ్మని కోరతాడు. భీమార్జునులు పాంచాలరాజు ధృపదుని యుద్ధంలో జయించి అతణ్ణి బంధించి ద్రోణుని ముందుంచగా ద్రోణుడతణ్ణి క్షమిస్తాడు. అతని రాజ్యంలోని అర్థభాగాన్ని ద్రోణునికి ఇస్తాడు.
*ధృతరాష్ట్రుని పుత్రవాత్సల్యం :* పాండవుల వీర గాథలను చూసి తన కుమారులకు అపాయమని భావించి వారణాసికి పంపి అక్కడ వుండమంటాడు. దుర్యోధనుడు లక్క గృహాన్ని నిర్మించి అందులో పాండవులకు నివాసం ఏర్పాటుచేస్తాడు. ఇది ముందే గ్రహించిన పాండవులు ఆ గృహానికి నిప్పంటించిన రోజు ముందే ఏర్పాటు చేసుకున్న సొరంగం ద్వారా బయటపడి ఓ గంధర్వరాజు సలహాపై ధౌమ్యుడిని తమ పూజారిగా నియమించుకుంటారు. అక్కడినుండి మారువేషాల్లో (బ్రాహ్మణ) ఏకచక్రపురంలో నివసిస్తారు.
*పాంచాలీ పరిణయం :* ద్రుపదునికి తన కుమార్తె ద్రౌపదిని అర్జునునికిచ్చి వివాహము చేయవలెనను ఆలోచన వుండెడిది. కాని వారు లక్కగృహమున మరణించిరని ఎంచి ఆమెకు స్వయంవరం ఏర్పాటు చేసి మత్స్యయంత్రమును ఛేదించిన వారికి తన కుమార్తెను ఇవ్వగలనని చాటెను. వీరాధి వీరులైన దుర్యోధనుడు, కర్ణుడు, శిశుపాలుడు ఎందరో పాల్గొని దానిని ఛేదించ లేకపోయిరి. బ్రాహ్మణ వేషమున నున్న అర్జునుడు దానిని ఛేదించి ద్రౌపదిని గ్రహించి ఆమెను తమ ఇంటికి తోడ్కొని పోయెను. మార్గ మధ్యమున తనతో పోరిన రాజులను ఓడించెను. కుంతి భిక్షాటన నుండి ఆహారం తెచ్చారని భావించి అర్జునుడు భిక్షను తీసుకొని వచ్చామని చెప్పగనే మీరు కలసి స్వీకరించండని చెప్పగా మాటజవదాటక ద్రౌప దిని 5గురు పరిణయమాడిరి.
*నారద ఉవాచ అర్జునుని తీర్థయాత్రలు :* ఐదుగురు భర్తలను వివాహమాడిన ద్రౌపదిని పాండవులను కలసి నారదుడు పాండవులకు ఓ సలహా ఇచ్చెను. ద్రౌపది

సంవత్సరమునకు ఒకరితో కాపురము చేయవలెనని, ఒకరితో కాపురము చేయునపుడు వేరొకరు ఆ గృహ మునకు వచ్చినచో వారు ఓ సంవత్సరము తీర్థయాత్రలు చేసి రావలెనని షరతు విధించెను. ఇంద్రప్రస్థమును రాజధానిగా చేసుకొని ధర్మరాజు రాజ్యము చేయు చుండగా, ద్రౌపది ధర్మజుని గృహముననుండగా ఒక బ్రాహ్మణ బాలుడు తనను రక్షించమని అర్జునుని కోరగా అతడు అస్త్రములకొరకు ధర్మరాజు గృహము నకు వెళ్లి ద్రౌపదిని చూసెను. తాము కుదుర్చుకొన్న ఒడంబడిక ననుసరించి అర్జునుడు తీర్థయాత్రలకు వెడలెను. ఆ సమయమున నాగకన్య ఉలూచిని, చిత్రాంగద రాజు చిత్రాంగిని వివాహమాడి వారి వల్ల ఐరావనుడు, బభ్రువాహనులకు జన్మనిచ్చెను. రామేశ్వరమును దర్శించి అచట రాముడు వానరు లతో కలసి లంకకు నిర్మించిన వారధిని చూచి ఈ వారధి నిర్మించుటకు ఇంత కష్టమేల నేను నా శస్త్రాస్త్రములతో ఈ వారధిని నిముషములలో నిర్మించ గలననెను. ఓ కోతిపిల్ల నీవట్లు నిర్మించుము. నేను దానిపై నిలబడెదను. అలా నిర్మించిన వారధి పడిపో కున్నచో నేను నీకు బానిసత్వము చేసెదను. పడిపోయి నచో నీవు నాకు బానిసవు కమ్మనెను. అర్జునుడు పరిహాసముగా వెంటనే వారధిని నిర్మించగా ఆ కోతిపిల్ల అడుగు వేయగానే వారధి కూలిపోయెను. మరల నిర్మించగా మరల కోతిపిల్ల విరగ్గొట్టెను. అర్జునుడు తన ఓటమినంగీకరించి ఆ కోతికి బాని సత్వము చేయ బోవుటకు సంసిద్ధుడు కాగా ఓ బ్రాహ్మణ బాలుడక్కడికి వచ్చి విషయము గ్రహించి మధ్య వర్తిత్వము లేని పందెము న్యాయబద్ధము కాదని, నేను మధ్య వర్తిగా మీరు మరల మీ పందెము కొన సాగించవలసినదిగా కోరెను. అందుకు ఇద్దరూ సమ్మ తించగా అర్జునుడు వారధి నిర్మించెను. ఆ వానరుడు తన శరీరమును ఎంత పెంచి అణగదొక్కినను అది విరగలేదు. అర్జునుడు, ఆ కోతి ఆశ్చర్యచకితులైరి. ఆ బ్రాహ్మణ బాలుడు శ్రీకృష్ణుడని, ఆ వానరం ఆంజనేయుడని అర్జునుడు గ్రహించెను. శ్రీకృష్ణుని కోరికమేరకు అర్జునుని రథం యొక్క జెండాపై ఆంజ నేయుడు వుండుటకంగీకరించెను. ఈ తీర్థయాత్ర సమయముననే అర్జునుడు ద్వారకకు వెళ్లి సుభద్రను వివాహమాడెను. వారికి అభిమన్యుడు జన్మించెను. కృష్ణార్జునులు యమునా తీరమున సంచరించు చుండగా అగ్ని దేవుడు బ్రాహ్మణ రూపమున వచ్చి వీరిని ఓ కోరిక కోరెను. నాకు అజీర్తి రోగమున్నదని దానిని రూపు మాపమని కోరెను. అందుకు ఖాండవ దహనమే పరిష్కారమని అతడు కోరెను. అగ్నిదేవుడు గాండీవాన్ని, ఎన్నో అస్త్రాలను బహూకరించెను. ఆ అరణ్యంపై ఇంద్రుడు వర్షం కురిపించగా అర్జునుడు తన అస్త్రాలతో ఖాండవ వనంపై పందిరివేసి అగ్ని దేవునికి ఆటంకము కల్పించకుండా చేసి తక్షకుని భార్యను వధించెను. మయుని రక్షించెను. ఇంద్రుడు మెచ్చి మరిన్ని అస్త్రాలను అర్జునునికి బహూ కరించెను. ఒక సంవత్సరం తీర్థ యాత్రలు ముగి యడంతో తిరిగి ఇంద్రప్రస్థం చేరెను.

ఇది తెలిసిన కౌరవులు మరింత భయకంపితులై మాయాజూదమున పాండవులను ఓడించి ద్రౌపదిని అవమానించి పందెం ప్రకారం 12 ఏండ్ల వన వాసం, 1 సంవత్సరం అజ్ఞాత వాసానికి పంపిరి.

వనవాస, అజ్ఞాత వాసాలు : ఈ సమయంలో ధర్మజుని, కోరిక మేరకు అర్జునుడు శివుని ప్రార్థించి పాశు పతాస్త్రమును సాధించెను. ఇంద్రుడు ఇన్ని అస్త్రసం పదలున్న అర్జునుని ఇంద్రలోకమునకు రప్పించెను. ఇంద్రలోకంలో ఊర్వశి అర్జునుని మోహించగా అర్జునుడు నిరాకరించెను. ఊర్వశి ఇతనిని బృహన్నల కాగలవని శపించెను. ఇంద్రుడు ఇది ఓ సంవత్సర కాలపరిమితి మాత్రమేనని, అది నీకు ఉపయోగ పడగలదని శాప విమోచనము చేసెను. అజ్ఞాత వాసమున అర్జునుడు బృహన్నలగా జీవించెను. అరణ్య అజ్ఞాత వాసా నంతరం తమ రాజ్య భాగమును కోరగా దుర్యోధ నుడు అందుకు నిరాకరించగా మహా భారత సంగ్రా మము జరిగెను. ఈ యుద్ధంలో అర్జునుడు మహావీరు లైన భీష్ముని, ద్రోణుని, కర్ణుని, శల్యుని, జయద్రథుడిని ఇంకా మరెంతో మంది కౌరవ వీరులను సంహరిం చెను. పాండవుల పక్షాన పోరాడిన అర్జునుని కుమా రుడు పద్మవ్యూహమున మరణించెను.

*అశ్వమేధం – అర్జునుని మరణం – పునర్జన్మ :* కురుక్షేత్ర యుద్ధానంతరం శ్రీకృష్ణుని, వ్యాసుని సలహా

మేరకు ధర్మజుడు హస్తినకు వచ్చి సామ్రాజ్యాధి నేతయై అశ్వమేధయాగము తలపెట్టెను. అర్జునుడు రాజులందరిని ఓడించెను. అర్జునుని కుమారుడు బభ్రువాహనుడు యుద్ధములో అర్జునుని వధించెను. అర్జునుని భార్య ఉలూచి మృత్యు సంజీవిని మంత్రంతో అర్జునుని బ్రతికించి "ఇది కురుక్షేత్ర యుద్ధమున భీష్ముని అధర్మముగా వధించినందుకు అష్టావసు, గంగల శాపమని వారిని తను ప్రార్థించగా బభ్రువాహనుని చేత మరణమే శాప విమోచనమని" అర్జునునితో చెప్పెను. ఇంతలో యాదవ సామ్రాజ్యం నశిస్తోందని తెలిసి అర్జునుడు ద్వారకకు వెళ్లి బలరామ కృష్ణుల నిర్యాణం విని వారికి అంత్యక్రియలు చేసి యాదవ వీరులను కొందరిని వెంటబెట్టుకొని హస్తినకు పయన మయ్యెను. దారిలో దోపిడి దొంగలు వారిని నాశనము చేయగా అర్జునుడు వారిని రక్షింపలేక పోయెను. వ్యాసుడు శ్రీకృష్ణుడు వున్నంతవరకే నీకు శక్తి అని, శ్రీకృష్ణుడు లేనినాడు నీవు అశక్తుడవని బోధించెను. అర్జునుడు హస్తినకు తిరిగివచ్చి తన కుమారునికి రాజ్యము నప్పగించి తన అన్నలు తమ్ములతో కలసి స్వర్గానికి ప్రయాణం కాగా ముందు ద్రౌపది, తర్వాత సహదే వుడు, నకులుడు ఆ తర్వాత అర్జునుడు పడిపోగా భీముడు కారణ మడుగగా అర్జునుడు ఒక రోజులో కౌరవులను సంహరిస్తానని చేయలేక పోయాడు ఆ వాగ్దాన భంగమే కారణమని తెల్పెను.

**అర్కుడు 1 :** సూర్యునికి గల మరోపేరు.
– చూ॥ సూర్యుడు

**అర్కుడు 2 :** ఓ రాజు. – మహాభారతం

**అర్కుడు 3 :** రాజర్షి . అర్కుడను రాక్షసుడి పునర్జన్మ
– మహాభారతం

**అర్బుద 1 :** ఒక రాక్షసుడు. ఇతణ్ణి ఇంద్రుడు వధిస్తాడు.
– ఋగ్వేదం

**అర్బుద 2 :** ఒక నాగువు. పర్వతాలపై వుంటుంది.
– మహాభారతం

**అర్బుద 3 :** అబూపర్వతం – మహాభారతం

**అర్వుడు :** రిపుంజయుడి కొడుకు.

**అరూప :** దక్షుని కూతుర్లలో ఒకరు.
– మహాభారతం

**అరుంధతి :** వశిష్ఠముని భార్య. కర్దమ ప్రజాపతి దేవ హుతిల కుమార్తె. ఈమెకు పతివ్రతలందరిలోకి విశిష్ట స్థానం వుంది. ఒకప్పుడు ఏడుగురు మహామునులు హిమాలయాలలో వుండగా 12 సంవత్సరాలు వర్షాలు కురవక అనావృష్టి తాండ వించింది. అప్పుడు అరుం ధతి శివుని గూర్చి ఘోరతపస్సు చేయగా శివుడు బ్రాహ్మణ రూపంలో ప్రత్యక్షమయ్యాడు. ఆమె దొరికిన కందమూలాల తోనే భోజనం సమకూర్చింది. దానితో వర్షం కురవడం మొదలయ్యింది. శివుడు తన నిజ రూపం దాల్చి ఆమెను అనుగ్రహించాడు.
అరుంధతి వశిష్ఠులు సరస్వతీ తీర్థంలో తపస్సుచేసి సమాధిలోకి వెళ్లారు. అందుకని అది పుణ్యస్థలి అయ్యింది. ఈమెను ఆరంజ్యోతి, అక్షమాల అంటారు. ఈమె నక్షత్రమయ్యింది. వివాహ సమయాల్లో వధూవ రులకు ఈమెను చూపిస్తారు.

**అలక :** కుబేరుడు నివసించే నగరము.

**అలకనంద :** గంగానది దేవలోకంలో ప్రవహించేట ప్పుడు అలకనంద అని పిలుస్తారు. అదే పితృలోకం నుండి ప్రవహించే గంగను వైతరణి అని పిలుస్తారని వ్యాసుడు పేర్కొన్నాడు.
విష్ణు పాదంవద్ద మొదలైన గంగ దేవయానం, చంద్ర మండలం, బ్రహ్మలోకాల గుండా ప్రవహించి అక్కడ నాలుగు భాగాలుగా చీలి నాల్గువైపులకు ప్రవహిం చింది. భరతవర్షం గుండా ప్రవహించే గంగ అన్నింటి కంటే పవిత్రమైనది. ఇక్కడ స్నానం చేస్తే అశ్వమేధ, రాజసూయయాగం చేసినంత ఫలితం వుంటుంది.
– మహాదేవీ భాగవతం

**అలఘుడు :** ఉర్జవల్ల వసిష్ఠునికి జన్మించిన కుమారుడు. గొప్ప మహర్షులు ఇతని సోదరులు. ఇతన్ని అలఘు అని అంటారు. – అగ్నిపురాణం

**అలర్కం :** ఇదొక రకం పురుగు. దీని రూపంలోనే ఓ గంధర్వునితో ఇంద్రుడు కర్ణుని తొడలకు రంధ్రం చేశాడు. – మహాభారతం

**అలర్కుడు :** కాశీకరూష రాజ్యాలను పాలించిన రాజు. రాజ్యాన్ని, సంపదను విడిచి ధర్మమార్గాన్ని, ఎంచు కున్నాడు. యముని కొలువులో ఓ సభ్యుడు. యోగ ధ్యానాల వల్ల ముక్తి పొందాడు. ఇంద్రియ సుఖాలను

అధిగమించడానికి అతడు తన మనసు, నాలుక, చెవి, కళ్లు, చర్మం, తెలివితేటలపై బాణాలు సంధించి విఫలుడయ్యాడు. అయినా ఇంద్రియాలను జయించాలని ధ్యానమార్గాన మోక్షాన్ని పొందాడు.

**అల్పకాలం :** తక్కువ సమయం అని అర్థం. ఓ ఆకు మీద ఆకు వుంచి ఓ సూదితో పొడిస్తే రెండో ఆకుకు సూది చేరేలోపు సమయాన్ని అల్పకాలం అంటారు
– *భాగవతం*

**అలాటాక్షి :** స్కందుని కొలువులోని ఒక స్త్రీ.
– *మహాభారతం*

**అలాయుధాసురుడు :** ఇతడు బకాసురుని తమ్ముడు. భీమునిపై పగతీర్చుకొనడానికి కురుక్షేత్రంలో కౌరవుల పక్షాన భీమునితో, ఘటోత్కచునితో పోరాడి ఘటోత్కచుని చేతిలో మరణిస్తాడు.

**అలోలుప :** ధృతరాష్ట్రుని కుమారుల్లో ఒకడు. అలోలుడని పిలుస్తారు. – *మహాభారతం*

**అలంబతీర్థం :** ఇదో పుణ్యస్థలం. గరుడుడు అమృతం కోసం దేవలోకం వెళ్లేటప్పుడు ఇక్కడ విశ్రాంతి తీసుకున్నాడు. – *మహాభారతం*

**అలంబలుడు :** ఇతడొక నరమాంస భక్షకుడు. జటాసురుని కొడుకు. భీముడు జటాసురుడిని చంపుతాడు. పగతో అతని కొడుకు అలంబలుడు కురుక్షేత్రంలో కౌరవుల తరఫున పోరాడుతాడు. ఘటోత్కచుడు ఇతడ్ని వధించి దుర్యోధనుడి రథం మీదకు విసురుతాడు.
– *మహాభారతం*

**అలంబుస 1 :** ఋష్యశృంగుని కుమారుడు. కౌరవుల పక్షాన పోరాడాడు. ఘటోత్కచుడ్ని తన అస్త్రాలతో బాధించాడు. ఇతడు అభిమన్యుడు, సాత్వతి, కుంతిభోజుడు, భీమసేనుడులాంటి యోధులతో పోరాడి చివరకు ఘటోత్కచుని చేతిలో మరణించాడు. – *మహాభారతం*

**అలంబుస 2 :** రాక్షస రాజు. కౌరవుల పక్షాన పోరాడి సాత్యకి చేతిలో మరణించాడు. –*మహాభారతం*

**అలంబుస 3 :** రాక్షస రాజు, అర్జునుని చేతిలో ఓడి కురుక్షేత్రం నుండి పారిపోయాడు. –*మహాభారతం*

**అలంబుస 4 :** జటాసురుని కుమారుడు. ఈ మహాకాయుడ్ని ఘటోత్కచుడు వధించాడు.
– *చూ॥ అతిబలుడు*

**అలంబుసా :** కాశ్యపునికి ప్రధాలకు జన్మించిన అందాల రాశి.

*దధీచుని తపస్సుని విఘ్నం చేయుట :* సరస్వతీ నదీ తీరాన దధీచుడు దీర్ఘ తపస్సు చేస్తున్నాడు. దాన్ని విఘ్నం చేయడానికి ఇంద్రుడు ఈ కన్యను దధీచి వద్దకు పంపాడు. ఆమె అందానికి ముగ్ధుడైన దధీచికి వీర్యస్రావం కాగా అది సరస్వతీ నదిలో పడింది. సరస్వతీ నది గర్భందాల్చి సారస్వతుడికి జన్మనిచ్చింది. సరస్వతి తన బిడ్డ సారస్వతుడ్ని దధీచి వద్దకు తీసుకొని వెళ్లగా ఇతడు గొప్ప విద్యావంతుడవుతాడని, వర్షా భావంతో జనం విలవిలలాడినప్పుడు ఇతడు బ్రాహ్మణులు వారు మర్చిపోయిన మంత్రాలు గుర్తుచేస్తాడని దానివల్ల మరల వర్షాలు కురుస్తాయని వరమిస్తాడు.

అలంబుసా తన పునర్జన్మలో కృతవర్మ కళావతిల పుత్రిక మార్గావతిగా జన్మిస్తుంది.

**అల్లసాని పెద్దన :** ఓ గొప్ప ఆంధ్రకవి. శ్రీకృష్ణ దేవ రాయల ఆస్థాన పండితుడు. అష్టదిగ్గజములను కవులలో ఒకడు. 'స్వారోచిష మనుసంభవము' ఇతడి రచన.
– పురాణనామ చంద్రిక

**అవక్రీతుడు :** భరద్వాజుని కుమారుడు. విద్యత్తేజోవంతులైన రైభ్యుని, అతని కుమారులను జూసి అసూయచెంది వారికంటెను విద్వాంసుడు కావలె నని తపస్సుచేసెను. ఇంద్రుడు ప్రత్యక్షమై ఏల తపస్సు చేయుచున్నావని అడుగగా నేను చదువకనే సర్వ వేదములు శాస్త్రములు వచ్చునట్లు తపస్సు చేయుచున్నానని సమాధానమిచ్చెను. విద్య గురువుల వద్ద నేర్చుకొనవలెను. ఇట్టి తపస్సు ద్వారా నేర్చుకున్న విద్యవల్ల గర్వము మదము కలుగునని చెప్పెను. అయినను తపము మానకుండుటచే ఇంద్రుడు వరమిచ్చెను. అంతట అతడు రైభ్యుని ఆశ్రమమునకు వచ్చి అచట అతని కోడలిని కామించెను. ఆమె తన మామగారికి ఈ విషయము చెప్పగా ఓ రాక్షసుని సుందరాంగిగా సృష్టించెను. ఆమె అవక్రీతుని వద్దకు బోవగా అతడామెను మోహించెను. అపుడామె అతని కమండలమునడిగెను. ఆమె అడుగగనే కమండలమునిచ్చెను. వెంటనే ఆ సుందరి రాక్షస రూపము దాల్చి అవక్రీతుని వధించెను. అర్వావసువు కోరగా

దేవతలు అవక్రీతుని బతికించిరి. నేను సర్వవిద్యలు నేర్చితిని. రైభ్యునకు నన్ను చంపు శక్తి యెట్లు వచ్చెనని అడుగగా రైభ్యుడు గురు ముఖమున విద్యనభ్య సించెను గాన అతనికాశక్తి వచ్చెనని చెప్పిరి.

– *మహాభారతం*

**అవగాహుడు :** వృష్ణి వంశపు వీరుడు. – *మహాభారతం*

**అవతారం :** శ్రీమహావిష్ణువు వివిధ రూపాలు. ఇందులో మూడు రకాలు. సంపూర్ణ శక్తి అవతారం అని, కాలపరిమితి వున్న రూపాన్ని ఆవేశమని, పాక్షికమైన జన్మను అంశ అని అంటారు. శ్రీమహా విష్ణువు అవతారాలు 10. మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశురామ, శ్రీరామ, బల భద్రరామ, శ్రీకృష్ణ, కల్కి. కొందరు పండితులు బలభద్రరాముడు బదులు బుద్ధుడు అవతారమని పేర్కొంటారు.

అవతారాలకు *కారణం :* శ్రీమహావిష్ణువు ఎన్నో అవతారాలు ఆవేశం, అంశతో ప్రపంచంలో జన్మించాడు. కాశ్యపుని కుమారుడు కశిపుడు. ఇతడు దేవతలకు వ్యతిరేకంగా పోరాడి యుద్ధంలో మరణించాడు. అ తర్వాత అతని కొడుకు ప్రహ్లాదుడు దేవతలతోపోరి ఓడింపబడి విరోచనుని కుమారుడు బలికి రాజ్యాన్ని అప్పగించి గంధ మాదన పర్వతం వెళ్లి తనస్సు చేయ సాగాడు. బలి కూడా దేవతలతో పోరాడి ఓడింప బడ్డాడు. దేవతల వలన కల్గిన కష్టాలు పోగొట్టడానికి రాక్షస గురువు కైలాసం వెళ్లి శివుణ్ణి ప్రార్థించాడు. ప్రహ్లాదుడు దేవతల్ని కలసి యుద్ధం ఆపుదామని ఇక నుండి మేము ప్రశాంత జీవితం గడుపుతామని దేవతలకు మాట ఇచ్చాడు. అయితే దేవతలు శుక్రాచార్యుడు శివుని కృపకోసం కైలాసం వెళ్ళటం, రాక్షసులను బలవంతుల్ని చేయాలనే ఉద్దేశ్యం తెలిసి మహా విష్ణువు ఇంద్రుల నాయకత్వంలో రాక్షసులను తరిమి కొట్టగా వారు శుక్రాచార్యుని తల్లిని శరణువేడగా ఆమె తన తపశ్శక్తితో మహావిష్ణువుని, ఇంద్రుని బాధించగా విష్ణువు తన సుదర్శన చక్రంతో ఆమె తలను ఖండించాడు. ఇది చూసిన భృగుమహర్షి శ్రీమహా విష్ణువుని భూ ప్రపంచంలో ఎన్నోసార్లు జన్మించి బాధలు పడమని శపించాడు. శుక్రాచార్యుని తల్లి దేహంపై తన కమండలంలోని నీరు చిలకగా ఆమె తిరిగి బ్రతికింది. భృగుమహర్షి శాపఫలమే శ్రీమహావిష్ణువు యొక్క పునర్జన్మలు, ఆవేశాలు, అంశతో జన్మించాడు.

– *శ్రీ మహాదేవీ భాగవతం*

శ్రీమహావిష్ణువు అవతారాలు, పాక్షిక రూపాలు, విష్ణ్వాంశతో జన్మించడము జరిగాయి. అవి :

★"సనక, సనంద, శంతన, సనత్కుమార, వరాహ, నారద, నరనారాయణ, కపిల, దత్తాత్రేయ, యజ్ఞ, వృషభ, పృథు, మత్స్య, మోహిని, కూర్మ, గరుడ, ధన్వంతరి, నరసింహ, వామన, పరశురామ, వ్యాస, శ్రీరామ, బలభద్రరామ, శ్రీకృష్ణ, బుద్ధ, కల్కి.

– *శ్రీ మహాదేవీ భాగవతం*

**అవధూతేశ్వరుడు :** శివుని అంశతో జన్మించినవాడు. ఒకసారి ఇంద్రుడు, బృహస్పతి కైలాసానికి వెళ్తుండగా ఓ మేఘం వారిని అడ్డుకుంది. ఇంద్రుడు తొలగమని కోరాడు. ఎంతకూ తొలగక పోతే ఇంద్రుడు వజ్రాయుధం తీశాడు. శివుడు ఉగ్రుడై ముక్కంటి నుండి నిప్పులు కురిపించాడు. బృహస్పతి కోరికపై ఆ అగ్నిని ఉప్పు సముద్రం వైపు మరలించాడు. ఈ అగ్ని నుండే శివునిచే వధింపబడిన జలంధరుడు ఉద్భవించాడు.

**అవబృంధం :** యాగం పూర్తయిన తర్వాత చేసే స్నానం.

– *మహాభారతం*

**అవరోధుడు :** భరతవంశపు రాజు.

**అవసానము :** ప్రాచీన భారతదేశంలో ఓ పుణ్యస్నాన మాచరించే కొలను. ఇక్కడ స్నానం సహస్ర గోదానాలతో సమానం. – *మహాభారతం*

**అవాకిరణం :** సరస్వతీ తీరాన గల ఓ పుణ్యస్థలం.

– *మహాభారతం*

**అవాచీనుడు :** జయత్సేనుడి కుమారుడు. పూరు వంశపు రాజు. తల్లి విదర్భ రాజకుమార్తె శుశ్రేవ. వారికి విదర్భ రాజైన అరిహుడు జన్మించాడు.

**అవికంపనుడు :** జ్యేష్టసౌత్యతధర్మ అనే మునివల్ల పొందిన ప్రాచీన రాజు.

**అవిజ్ఞాతగతి :** అనిల అనే వసుకి తన భార్య శివ వల్ల ఇద్దరు కుమారులు జన్మించారు. ఒకడు అవిజ్ఞాతగతి, రెండోవాడు మనోజవ.

★ వీరి వివరాలు ఆయాపేర్లవద్ద వివరించబడినవి.

**అవిముక్తం :** కాశీలోని మధ్యస్థలి. ఇక్కడో పుణ్య దేవాలయం వుంది. ఇక్కడ ఆత్మహత్య చేసుకుంటే స్వర్గం చేరతారు. మరిన్ని విశేషాలకు చూ॥ దివోదాసు.

**అవిరథుడు :** కర్దమ కుటుంబంలోని ఓ ఋషి. *వంశవృక్షం :* బ్రహ్మ – బ్రాహ్మణ – ధన్వంతరి – కేతుమానుడు – అవిరథుడు.

**అవీక్షిత్తు 1 :** కురు రాజుకు వాహిని అనే భార్య వల్ల కలిగిన ఐదుగురు కుమారుల్లో ఒకరు.

**అవీక్షిత్తు 2 :** ప్రసిద్ధ రాజు. మరుత్త తండ్రి కరంధముడికి జన్మించాడు. ఇతనికి 7 గురు భార్యలు. విద్యావంతుడు జ్ఞాన సంపన్నుడు. ఓ స్వయం వరంలో వైశాలి వంశ రాజకుమారిని కూడా వివాహమాడి ఆ స్వయంవరంలో వచ్చిన రాజులను గెల్చాడు. ఓడిపోయిన రాజులందరు ఒక్కటై ఇతన్ని బంధించగా కరంధముడు కాపాడాడు.

**అవీచి :** 28 నరకాలలో ఇదొకటి. అగ్నిపురాణం. తప్పుడు సాక్ష్యం, తప్పుడు పేరు, తప్పుడు ప్రతిజ్ఞ చేసినవారిని ఈ నరకంలోని యమభటులు పర్వతం మీద నుండి క్రిందకు విసరుతారు. వీరు ముక్కలు ముక్కలుగా అవుతారు. ఈ ప్రక్రియ మరల మరల యమ భటులు చేస్తారు.

**అవ్యయం :** ధృతరాష్ట్ర కుటుంబంలోని ఓ సర్పం. ఇది జనమేజయుని సర్పయాగంలో మరణించింది.

**అవ్వయ్యార్ :** గొప్ప తమిళ కవయిత్రి. తక్కువ కులంలో పుట్టింది. శూద్ర కులంలో పెరిగి 240 సంవత్సరాలు జీవించి ఎన్నో తమిళగ్రంథాలు రచించింది. కవితల్లో నిఘంటువు సంకలనం చేసింది.

**అవంతి :** ప్రాచీన భారతదేశంలో మాళవదేశాన్ని అవంతి అంటారు. ఉజ్జయిని నగరం దేశానికి రాజధాని. కాళిదాసులాంటి గొప్ప కవులు ఇక్కడ నివసించారు. మోక్షం సిద్ధించే ఏడు నగరాలలో ఇదొకటి.
– మహాభారతం

**అవింద్యుడు :** రావణుడికి నమ్మకమున్న వృద్ధ రాక్షసుడు. కాని అతనికి సీతను రాముని చెంతకు పంపవలెనను అభిప్రాయము కలదు. రాముడు రాక్షస జాతిని మొత్తం నాశనం చేస్తాడని రావణుని ప్రాధేయపడినా అతడు వినలేదు. త్రిజట చేత రాముడు సుగ్రీవుని చెంత వున్నాడని సీతకు చెప్పించెను. ఇంద్రజిత్తు సంహరింపబడిన తర్వాత రావణుడు సీతను చంపబోగా ఇది మగటిమికాదని వీరుడవైతే రాముని సంహరించమని సీతను కాపాడెను. యుద్ధానంతరం ఇతడే సీతను వెంటబెట్టుకొని రాముని వద్దకు చేర్చెను.
– మహాభారతం

**అశన :** బలి చక్రవర్తి భార్య. బాణాసురుని తల్లి.
– పురాణనామ చంద్రిక

**అశని :** పూజ్యనీయుడైన ముని. శ్రీకృష్ణుడు హస్తినకు వెళ్లేదారిలో ఇతడ్ని కలిశాడు.

**అశోకతీర్థం :** శూర్పారక దేవాలయ సమీపంలోని ఓ పుణ్యస్థలం. – మహాభారతం

**అశోకదత్తుడు :** అశోక వేగుడనే విద్యాధరుడే అశోకదత్తుడు. ఇతడి సోదరుడు విజయదత్తుడు. మానవ జన్మలో మదనలేఖను విద్యుత్ప్రభను వివాహమాడతాడు. చివరకు ప్రజ్ఞప్తి కౌశికుడి ద్వారా విమోచనమై విద్యాధరుడిగా మారి గోవిందకూటంలో నివసిస్తుండేవాడు. ఇతడు గాలవుని శాపానికి గురై అశోకదత్తుడనే మానవుడుగా జన్మించాడు. – కథాసరిత్సాగరం

**అశోకవనిక :** లంకలోని ఉద్యానవనం. రావణుడు సీతను వుంచింది ఇక్కడే. – రామాయణం

**అశోకవర్ధనుడు :** మగధ రాజైన చంద్రగుప్తుని మనుమడు. బౌద్ధమత వ్యాప్తికి కృషిచేసిన చక్రవర్తి.
– పురాణనామ చంద్రిక

**అశోకుడు 1 :** ఎనిమిది మంది దశరథుడి మంత్రుల్లో ఒకడు. – రామాయణం

**అశోకుడు 2 :** భీముడి రథసారథి. –మహాభారతం

**అశోకుడు 3 :** చూ॥ అశ్వుడు–2.

**అశ్మ :** ప్రాచీన కాలంలో ఓ ముని.

**అశ్మకదాయాదుడు :** కౌరవయోధుల్లో ఒకడు. అభిమన్యుడితణ్ణి వధిస్తాడు. అశ్మకుడి కుమారుడు.

**అశ్మకుడు 1 :** జనకుడి బంధు వియోగ దుఃఖాన్ని పోగొట్టిన బ్రాహ్మణుడు. – మహాభారతం

**అశ్మకుడు 2 :** పాండవుల పక్షాన యుద్ధం చేసిన రాజు. ఇతడు గోదావరి, మహిష్మతి మధ్య ప్రదేశాన్ని పాలించాడు.

**అశ్మకుడు 3 :** ఇతడు కల్పష పాదుడి భార్య దమ యంతికి పుట్టినవాడు. గర్భుందాల్చిన తర్వాత ఏడేళ్లైనా గర్భం నుండి బయటకు రాకపోవడంతో ఆమె అశ్మం (రాతి)తో కడుపును కొట్టుకోగా బయటకు వస్తాడు. అందుకే అతనికాపేరు. ఇతడి కొడుకు మూలకుడు. - భాగవతం

**అశ్మనగరం :** పాతళంలోని ఓ నగరం. రావణుడు కుబేరుడి పుష్పక విమానంలో స్వస్థలానికి వెళ్తూ దీన్ని దర్శిస్తాడు.

**అశ్మస్వప్నం :** గయ దగ్గర వున్న ప్రీతశీలమనే కొలను. ఇక్కడ కర్మచేస్తే బ్రహ్మహత్యాపాతకం నుండి విముక్త మవుతారు.

**అశ్మంతకుడు :** మగధ రాజకుమారుడు. యుద్ధంలో అభిమన్యుడితణ్ణి వధిస్తాడు. - మహాభారతం

**అశ్వకేతుడు :** గంధర్వరాజ కుమారుడు. పాండవుల పక్షాన పోరాడి అశ్వత్థామ చేతిలో మరణిస్తాడు. - మహాభారతం

**అశ్వగ్రీవుడు :** దనుకశ్యపుల కుమారుడు. - మహాభారతం

**అశ్వఘోషుడు :** ప్రసిద్ధి చెందిన సంస్కృత కవి. బుద్ధ చరిత్ర, సౌందరనంద గొప్ప కావ్యాలు కాగా గౌరీపుత్ర ప్రకరణ నాటకం. ఇతడు క్రీ.శ. 2వ శతాబ్దివాడు. ఈయన బుద్ధచరిత్ర క్రీ.శ. 414-421 మధ్య చైనా భాషలోకి కూడా అనువదించ బడింది. ఆచార్యుడు, భదంత, మహా వాది, భిక్షు అనికూడా ఈయనను సంబోధిస్తారు.

**అశ్వతర 1 :** ఓ సర్పం పేరు. - మహాభారతం

**అశ్వతర 2 :** ఓ పవిత్రమైన చెరువు. ఇది ప్రయాగలో నిర్మించబడింది. - మహాభారతం

**అశ్వతీర్థం :** గంగానదీ తీరాన గల పవిత్రస్థలం. ఇది కనూజ్ దగ్గరలో వుంది. వరుణుని ఆశీర్వాదంతో రుచికి తన కోరికపై గుర్రాలు ఇక్కడికి ఎగిరి వచ్చి చేరాయి. - మహాభారతం

**అశ్వత్థవృక్షం :** పార్వతీ పరమేశ్వరులు రతి క్రీడ సలుపు చుండగా అగ్నివెళ్లి వారి క్రీడకు భంగము కలుగజేసెను. పార్వతికి దేవతలందరిపై కోపము వచ్చి వారిని వృక్షము లగునట్లు శపించెను. విష్ణుమూర్తి అశ్వత్థ వృక్షమయ్యెను.

**అశ్వత్థామ :** భరద్వాజుని వీర్యం ఓ చెట్టు తొర్రలో పడగా అందునుండి అశ్వత్థామ తండ్రి, అర్జునుని గురువు అయిన ద్రోణుడు జన్మించాడు. తండ్రి ఆదేశం మేరకు సారద్వతముని కుమార్తె కృపిని వివాహ మాడగా ఆమెకు అశ్వత్థామ జన్మించాడు. అతడు పుట్టగనే ఉచ్చైశ్రవం శబ్దంచేసినట్లు చేయడం వల్ల అతనికా నామకరణ చేశారు.

*శస్త్రవిద్య :* అశ్వద్ధామ కౌరవ పాండవులతోపాటు తన తండ్రి ద్రోణునివద్ద అస్త్రశస్త్ర విద్యల నభ్యసించి తన తండ్రి కౌరవుల పక్షాన పోరాడగా ఇతడు తండ్రి అడుగుజాడలలోనే నడిచాడు.

*మహాభారత యుద్ధం-అశ్వత్థామ :* మహాభారత యుద్ధంలో పాండవ యోధుల్ని ఎందర్నో వధించాడు. కొందర్ని ఓడించాడు. ఒక్కరోజు మాత్రం ఎదురెదురు యుద్ధంలో అర్జునుని చేతిలో ఓడిపోయాడు.

తండ్రి ఇతనికి బ్రహ్మ శిరోనామకాస్త్రం బిచ్చెను. ఇది అమోఘమైనది. మొదట అగస్త్యుడిది ద్రోణుని కిచ్చెను. ద్రోణుడు దీనిని అర్జునిడికి ఉపదేశించెను. దీనినెన్నడు మనుజులపైన ప్రయోగించవద్దని తండ్రి ఇతనికి జెప్పెను.

కురుక్షేత్ర యుద్ధం ముగింపు దశలో దుర్యోధనుని తొడలు విరిగి పడియున్నపుడు అతనిని సంతోష పెట్టుటకు తన తండ్రిని మాయోపాయమున వధిం చిరను కోపము వలనను మిక్కిలి ఉగ్రుడై పాండవులను చంపి వత్తునని శపధము చేసెను. ఆ రాత్రి యతడు చెట్టుపైనున్న కాకులను గుడ్లగూబలు సంహరించుట చూసి రాత్రివేళ పాండవులను దొంగచాటుగా చంప నెంచి పాండవ శిబిరముపై బడి దృష్టద్యుమ్నుని, పాండవసుతులను సంహరించెను. పాండవు లీతడు చేసిన ద్రోహము తెలుసుకొని భీముడు ఇతడి వధించుటకు బయలు దేరెను. ఇతడి శక్తి సామర్థ్యములు తెలిసి యున్న కృష్ణార్జునులు భీమునికి తోడువెళ్లిరి. భీముడి తడ్ని నిందించుచుండగా “అశ్వత్థామ అపాండవమగు గాక” అని బ్రహ్మ శిరోనామకాస్త్రమును సంధించెను. వ్యాసుడు వలదన్నను వినలేదు. శ్రీకృష్ణుడు ఆ అస్త్రమును ఇతరులతో నుపసంహరించినను 12 సంవత్సరములు అనావృష్టి కల్గునని కావున తన తలపైగల మణిహారమునిచ్చి ఓటమినంగీకరించ

మన్నను ఇతడు అస్త్రమును ప్రయోగించెను. "బాల ఘాతివగు నీకు ఆహారము దుర్లభమై ఒంటరిగా తిరుగుచు 3000 యేండ్లు జీవించెదవని శపించి అర్జునుని కూడా అదే అస్త్రమును ప్రయోగించమని చెప్పెను. వ్యాసుడు శ్రీకృష్ణుని శాపము నిజమగుగాక యని శపించెను. వీరిద్దరి అస్త్రప్రయోగమువల్ల లోకము జ్వాలామయమయ్యెను. మునులు అస్త్రములను ఉపసంహరించమని కోరినను అశ్వత్థామకు ఉపసంహరించుట చేతగాక అస్త్రము ఊరకపోదుగాన పాండవేయుల గర్భములకు హాని చేసి ప్రశాంతి పొందునని ఆ అస్త్రము ఉత్తర గర్భమున గల శిశువును బాధింపగా శ్రీకృష్ణుడు రక్షించెను. ద్రౌపది కూడా అశ్వత్థామను వదలివేయుడని చెప్పుటచే అతని శిరస్సు పై గల మణిని స్వీకరించి అతనిని వదలి వేసిరి. అశ్వత్థామ విరాగియై వ్యాసుని ఆశ్రమమున తపస్సుకు పోయెను.

**అశ్వత్థుడు :** ఒక రాక్షసుడు. వృక్షరూపం దాల్చి తన నీడకు వచ్చిన బ్రాహ్మణుల్ని భుజించేవాడు. బ్రాహ్మణులు శనిని ప్రార్థించగా అతడు బ్రాహ్మణ రూపమున రాక్షసుని నీడకు చేరగా అతడు శనిని కూడా భక్షించెను. శని అతనిని చీల్చుకొని బయటకు వచ్చెను. ఇతనితోపాటు తిరుగుతున్న పిప్పలుణ్ణి కూడా శని సంహరిస్తాడు. – బ్రహ్మపురాణం.

**అశ్వనది :** కుంతి భోజుని రాజ్యంనుండి ప్రవహించే ఓ నది. ఇది చర్మన్వతిలో కలసి ప్రవహిస్తుంది. కుంతి, కర్ణుడిని కన్యగా వుండగా సూర్యఅంశతో జన్మనిచ్చి ఈ నదిలోనే వదిలింది. ఓ పెట్టెలో వున్న ఈ బిడ్డను చంపాపురి వద్ద ఓ రథికుడు గమనించి పెంచిపోషిస్తాడు.

**అశ్వని :** భరణీ దక్షుల కూతురు, చంద్రుని భార్య. – మహాభారతం

**అశ్వపతి 1 :** మద్రదేశపు రాజు. మహాపతివ్రతగా పరిగణించే సావిత్రికి జనకుడు. 18 సంవత్సరాలు పిల్లలకోసం సావిత్రి అనే దేవతను పూజించగా జన్మించడం వల్ల సావిత్రిగా నామకరణం చేశాడు. – మహాభారతం

**అశ్వమేథ 2 :** కాశ్యపునికి ధనువువల్ల జన్మించిన కుమారుడు. – మహాభారతం

**అశ్వమేథ 1 :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజ్యం. రోచమానుడు దీనిని పాలించాడు. భీమసేనుడు ఇతణ్ణి జయించాడు. – మహాభారతం

**అశ్వమేథ 2 :** సహస్రానికుని కుమారుడు.

**అశ్వమేధం 3 :** ఇదో యజ్ఞం. ఓ అశ్వానికి విజయ ఫలకం కట్టి అన్ని రాజ్యాలకు పంపుతారు. అశ్వాన్ని ఏ రాజైనా పట్టుకుంటే అతన్ని ఓడించాలి. అన్ని రాజ్యాలు దిగ్విజయంగా అశ్వం తిరిగివస్తే అలాంటి యాగాలు 100 సార్లు చేస్తే ఇంద్రుడవ్వవచ్చు.

**అశ్వమేధ దత్తుడు :** విదేహ రాజకుమార్తెకు శాతానికుని వల్ల జన్మించిన కుమారుడు. – మహాభారతం

**అశ్వరథ :** గంధమాదన లోయలో ప్రవహించే ఓ నది. ఇది అరిష్టసేనుని ఆశ్రమం వద్ద కలదు. చంద్ర వంశపు రాజులు చాలామంది ఈ ఆశ్రమాన్ని దర్శించుకొనేవారు. – మహాభారతం

**అశ్వలాయనుడు :** శౌనక మహర్షి శిష్యుడు, గృహ్య సూత్రాల్ని రచించాడు.

**అశ్వవతి :** ఇదో పుణ్యనది. ఉదయంగాని, మధ్యాహ్నంగాని, సాయంత్రంగాని ఈ నదిని తలచిన మోక్ష సిద్ధి కలుగుతుంది. – మహాభారతం

**అశ్వవానుడు :** కురు మహారాజు ప్రథమ సంతానం. ఇతని తల్లి వాహిని. అవీక్షిత్తు అనికూడా పిలుస్తారు. ఇతనికి ఎనిమిది మంది కుమారులు. – మహాభారతం

**అశ్వశంకుడు :** ధను కశ్యపుల కొడుడు. – మహాభారతం

**అశ్వశిరస్థానం :** భారతదేశంలోని ఒక పుణ్యస్థలం. శ్రీకృష్ణుడితో పాటు తను ఈ స్థలాన్ని దర్శించినట్లు అర్జునుడు కలగంటాడు. – మహాభారతం

**అశ్వశిరసుడు 1 :** ధమ, కశ్యపుల కొడుకు. – మహాభారతం

**అశ్వశిరసుడు 2 :** నరనారాయణాశ్రమ తీరం వద్ద గల వైహాయస కుండం దగ్గర వేదాన్ని బోధించే హయగ్రీవుని పేరు.

**అశ్వశిరుడు 1 :** కశ్యపుడి కొడుకు –మహాభారతం

**అశ్వశిరుడు 2 :** ఒక రాజు. యాగం చేస్తున్నపుడు కపిలుడు, జైగీషవ్యుడు ఇతని దగ్గరకు వస్తారు. విష్ణు

మూర్తిని ఏ విధంగా ప్రార్థిస్తే తన వశమౌతాడో చెప్ప మని కోరతాడు. మేమే భగవత్ స్వరూపుల మంటారు. రాజు కోపిస్తాడు. కాని వారివల్ల దేవుడు సర్వాంత ర్యామి అని తెలుసుకొని కుమారుడైన స్థూల శిరుడికి రాజ్యమునప్పగించి తపస్సుకు అడవులకు వెళ్తాడు. – వరాహపురాణం

**అశ్వసేనుడు :** తక్షకుని కుమారుడు. అతడి సోదరుడైన ఐరావతుడితనిని బెంచెను. ఖాండవ దహన సమ యమున ఇతడు తల్లి నోట దాగుకొనెను. అర్జునుని అస్త్రము ఇతని తల్లి శిరస్సును ఖండించెను. ఇంద్రుడు ఇతడు తన మిత్రుడు తక్షకుడేనని భ్రమించి తన మాయచే ఇతనిని అర్జునుని నుండి రక్షించెను. ఇతడు పగతో కర్ణుడినాశ్రయించెను. కర్ణుడితని ననుదినము ప్రార్థించేవాడు. కురుక్షేత్ర యుద్ధమున అర్జునుని పై కర్ణుడితడ్ని ప్రయోగించగా కృష్ణుడు రథమును కృంగునట్లు చేసి అర్జునుని రక్షించెను. అర్జునుని కిరీటము మాత్రము క్రిందపడెను. మరల ఇతడు అర్జునునిపైకి రాబోగా తన అస్త్రముతో ఇతనిని అర్జునుడు వధించెను. – మహాభారతం

**అశ్వహృదయం :** అశ్వాల్ని నిరోధించగలిగే ఓ మంత్రం.

**అశిలోముడు :** మహిషాసురుని సేనా నాయకులలో ఒకడు. ఇతడు దేవితో యుద్ధము చేసి మరణించెను. – *దేవీ భాగవతం*

**అశ్వనీ కుమార తీర్థం :** ఈ తీర్థంలో స్నానం చేస్తే శారీరక సౌందర్యం ఇనుమడిస్తుంది. – మహాభారతం

**అశ్వనీదేవతలు :** సూర్యపుత్రులు. సూర్యుని భార్య సంజ్ఞాదేవి అతని తేజస్సును భరింపలేక అశ్వ రూపమున కురుదేశమున నుండగ అశ్వ రూపమున సూర్యుడీమెతో సంగమించెను. అపుడు వారికి బుట్టిన సంతానమే అశ్వినులైరి. నాసత్యుడు, దనుడు వారి పేర్లు. వారికి జన్మించిన మూడవ కుమారుడు దేవంతుడు. – విష్ణుపురాణం

అశ్వినులు దేవతలకు వైద్యులు. వీరు యుద్ధంలో కాలు విరిగిన ఖీలునకు ఇనుపకాలు పెట్టిరి.

*సుకన్యను పరీక్షించిన విధానం :* శర్వాతి అనే రాజుకు 4000 మంది భార్యలు, కాని సంతానం లేదు. చివరికి ఓ భార్యవల్ల సుకన్య జన్మిస్తుంది. ఆమె అందాలరాశి. అతని రాజ్యానికి దగ్గరలో ఓ నందనవనం వంటి ప్రదేశం వుంది. అచట చ్యవన మహర్షి తపస్సు చేసుకొంటూ వుండేవాడు. అతని చుట్టూ పుట్ట చెట్లు అతడు కన్పించనంతగా పెరిగాయి. రాజు, రాణులు తమ కుమార్తె సుకన్యతో ఈ ఉద్యానవనంలోకి వెళ్ళి విశ్రాంతి తీసుకుంటుండగా ఈ బాలిక ఈ పుట్టలో వున్న మహర్షి కళ్ళను ఓ పుల్లమొనతో గుచ్చగా అతడు అంధుడయ్యెను. కాని అతడామెను శపించలేదు. కాని వర్షం లేక తిండిలేక ఆ రాజ్యం ఆకలిమయయ్యింది. దానికి కారణం తెలియక రాజు వేదన చెందుచుండగా సుకన్య తను చేసిన అపరాధాన్ని తండ్రికి చెప్పినది రాజు చ్యవనుని వద్దకు వెళ్ళి తమను మన్నించమని కోరగా అటులనే, కాని ఆమెను తనకిచ్చి వివాహము చేయమని కోరెను. రాజు మనోవ్యథ చెందగా సుకన్య తన తండ్రిని అనునయించి ఆమె చ్యవనుని వివాహము చేసుకొని అతనికి సపర్యలు చేయుచుండెను. అశ్వనీ కుమారులు ఇది గమనించి అతని అంధత్వాన్ని పోగొడతామని, తమలో ఒకరిని వివాహమాడమని కోరగా ఆమె అందుకు నిరాకరించెను. అశ్వనీ కుమా రులు చ్యవనుని అంధత్వం పోగొట్టి తాముకూడా చ్యవనుని రూపం దాల్చుతామని అందులో నీ ఇష్టం వచ్చిన వారిని వివాహమాడమని కోరి చ్యవనుని అంధత్వం పోగొట్టి తాము కూడా చ్యవనుని రూపము దాల్చిరి. అయినను ఆమె ఆ ముగ్గురిలో నిజచ్యవనునే ఎంచుకొనెను. చ్యవనుడు అందుకు సంతసించి అశ్వనీ దేవతలను ఓ వరం కోరుకొమ్మనగా ఇంద్రుడు మమ్ము సోమరసం సేవించవద్దని చెప్తున్నాడు. అది మేముకూడా సేవించే అవకాశం ఇప్పించమనగా చ్యవనుడు ఇంద్రునితో వాగ్యు ద్ధంలో జయించి వీరికి సోమరసం త్రాగే భాగ్యం కల్గించెను. – దేవీభాగవతం

*నకుల సహదేవులకు జన్మనిచ్చుట :* వ్యాసుని మంత్ర శక్తితో కుంతి కర్ణుని, ధర్మజుని, భీముని, అర్జునుని పొందెను. 5వ మంత్రాన్ని ఆమె తన సవతి మాద్రికి ఉపదేశించగా ఆ మంత్ర మహిమతో ఆమె అశ్వనీ దేవతలను ధ్యానించి నకుల సహదేవులకు జన్మనిచ్చెను.

**అశ్వినీ సుతుడు :** సుతపస్సు భార్యకు సూర్యుడివల్ల జన్మించినవాడు. సూర్యుడు బలాత్కరించడం వల్ల

ఇతడు జన్మించాడు. భార్యవల్ల తెలుసుకుని ఇతణ్ణి వ్యాధిగ్రస్తుడయ్యేటట్లు సుతపస్సు శపిస్తాడు. అయితే సూర్యారాధనవల్ల అది పోతుందని తర్వాత అనుగ్రహిస్తాడు.

**అశ్వాటకం :** భారతంలో పేర్కొన్న ఒక దేశం.

**అశ్మదు :** ఒక ఋషి.

**అశ్వుడు 1 :** ఒక మహర్షి. ఇతడి కొడుకు వశుడు. - ఋగ్వేదం

**అశ్వుడు 2 :** ఒక రాక్షసుడు. ఇతడే కళింగ రాజు అశోకుడిగా పునర్జన్మిస్తాడు. - మహాభారతం

**అష్టకపాలం :** ఎనిమిది కపాలాల నుండి పురోదాసుడు తయారుచేసిన కపాలం. -మహాభారతం

**అష్టకాదులు :** అష్టకుడు, ప్రవర్ధనుడు, వసుమానుడు, వశీనరుడైన శిబిలను అష్టకాదులనెదరు. వారు యయాతి చక్రవర్తి దౌహిత్రులు. యయాతి వారికి అనేక నీతిబోధలు చేసెను. - పురాణనామ చంద్రిక

**అష్టకాలాస్యం :** కథాకళి నృత్యంలో ఇదో భంగిమ.

**అష్టకుడు 1 :** పూరు వంశ రాజులలో ఒకడు. ఇతడు శునశ్శేపుని సోదరుడు.

*వంశక్రమం :* దుష్యంతుడు - భరతుడు - శుహోత్ర, బృహత్పృత - అజామిధ - అష్టక

**అష్టకుడు 2 :** యయాతి భార్య మాధవికి విశ్వామిత్రునివల్ల జన్మించినవాడు. -మహాభారతం

**అష్టజిహ్యుడు :** స్కందుని సైన్యంలో ఓ సైనికుడు . -మహాభారతం

**అష్టతారాణి :** తారాణీదేవి ఎనిమిదిపేర్లు. అవి తార, ఉగ్ర, మహోగ్ర, వజ్ర, కాళి, సరస్వతి, కామేశ్వరి, చాముండి.

**అష్టదిక్పాలకులు :** బ్రహ్మలోకంలో 3 విభాగాలున్నాయని దేవీభాగవతం చెప్తోంది. బ్రహ్మ మధ్యలో తన నగరమైన మనోవతిలో వుంటాడు. ఒక్కో విభాగం 2500 యోజనాలు వుంటుందని, ఒక్కొక్క దానికి ఒక్కో పాలకుడని చెప్తోంది. అవి :

తూర్పు - ఇంద్రుడు - అమరావతి; ఆగ్నేయం - అగ్ని - తేజోవతి ; దక్షిణం - యముడు - సంయమని ; పడమర - వరుణుడు - శ్రద్ధావతి ; నైరుతి - నిరృతి - కృష్ణాంజనం ; వాయవ్యం - వాయువు - గంధవతి; ఉత్తరం - కుబేరుడు - మహోదయం ; ఈశాన్యం - శివుడు - యశోవతి

**అష్టధర్మ మార్గాలు :** మోక్ష సిద్ధికి 8 ధర్మమార్గాలు అవి 1. యాగం 2 వేద భాష్యం 3. దానం 4. తపస్సు, 5. సత్యం 6. క్షమ 7. దయ

**అష్టపది :** జయదేవుని గీత గోవింద అను సంస్కృత కావ్యము. ఇందు శ్రీకృష్ణుని లీలలు వర్ణించబడెను. - పురాణనామ చంద్రిక

**అష్టనాగులు :** 8 సర్పాలు. వాసుకి, తక్ష, కర్కాటక, శంఖ, గులక పద్మ, మహాపద్మ మరియు అనంత.

**అష్టభార్యలు :** శ్రీకృష్ణుని యొక్క 8 మంది భార్యలు. 1. రుక్మిణి, 2. జాంభవతి, 3. సత్యభామ, 4. కాళింది, 5. మిత్రవిందా 6. సత్యా 7. భద్రా 8. లక్షణ.

**అష్టమంత్రులు :** ఇక్ష్వాకు వంశపు 8 మంది మంత్రులను అష్టమంత్రులంటారు. వారు 1. జయంత 2. దృష్టి, 3. విజయ 4. సిద్ధార్థ, 5. అర్ధసాధక, 6. అశోక 7. మంత్రపాల, 8. సుమంత్ర.

**అష్టమి :** భద్రకాళీ దేవత దక్షునియాగం ఎనిమిదవ రోజున యాగాన్ని ఆపడానికి వస్తుంది. అందుకని దాన్ని పుణ్యదినమని అంటారు.

**అష్టమూర్తులు :** భూమి, గాలి, నీరు, నిప్పు, ఆకాశం, హోత, సూర్యుడు, చంద్రుడు.

**అష్టయోగినులు :** 8 మంది మునికన్యలు. వీరు దుర్గాదేవి సేవికలు. వారు 1. మార్జలి, 2. కర్పూర తిలక, 3. మలయగంధిని, 4. కౌమాదిక 5. బేరుండ 6. మాతాలీ, 7. నాయకీ, 8. జయ (సుభచార)

**అష్టవసువులు :** గణదేవతలను అష్టవసువులంటారు. దక్షుని కూతురు వసువుకి, ధర్మదేవునికి జన్మిం చారు. వారు ధర, ధృవ, సోమ, అహర, అనిల, అనల, ప్రత్యూష మరియు ప్రభాస - మహాభారతం

వీరు కొన్ని పురాణాలలో కశ్యపు కుమారులని పేర్కొన బడింది. అష్ట వసువులకు వివిధ పురాణా లలో వివిధ నామాలు ఇవ్వబడినవి. అవి : అప, ధృవ, సోమ, ధర్మ, అనీల, అనల, ప్రత్యూష, ప్రభాస. - విష్ణుపురాణం

ద్రోణ, ప్రాణ, ధృవ, అర్క, అగ్ని, దోష, వసు, విభావసు. - భాగవతం

అఖ, ధార, ధృవ, సోమ, అనిల, అనల, ప్రత్యూష, ప్రభాస. - హరివంశం

వశిష్ఠుని శాపం : అష్ట వసువులు తమ భార్యలతో విహారయాత్రకు వెళ్లి వశిష్ఠుని ఆశ్రమంలోని గోవును బలవంతంగా తీసుకొని వెళ్తారు. వశిష్ఠుడు తన దివ్యదృష్టితో గమనించి వీరిని భూమిపై మానవులుగా జన్మించమని శపించాడు. పొర పాటును గ్రహించిన వీరు వశిష్ఠుని క్షమించమని కోరగా అతడు మీరు పుట్టిన వెంటనే మరణిస్తారని, ఒక్కడు మాత్రం ఎవ రైతే గోవుని బలవంతంగా తీసుకొనివెళ్లాడో అతడు చిరకాలం జీవిస్తాడని శాప విమోచన గావించాడు. అతడే భీష్ముడు.

**అష్టవిధ ప్రతిమలు :** శిలామయి, ధాతుమయి, లోహ మయి, లేహ్యా, లేఖ్యామృన్మయి, మణిమయి, మనోమయి.

**అష్ట వివాహాలు :** 8 రకాల వివాహాలు. బ్రహ్మ, దైవ, ఆర్ష, ప్రజాపత్య, గాంధర్వ, ఆసుర, రాక్షస, పైశాచ వివాహాలు.

*వివరణ :*

1. పుణ్యనదీ నీటితో తన కుమార్తెను ఏ విధమైన బహుమతి తీసుకోకుండా అవివాహితుడికి వివా హంచేస్తే బ్రాహ్మ.
2. యాగం చేస్తూ తన కుమార్తెను బహుమతిగా యాగం చేయించే వానికిస్తే అది దైవ.
3. ఓ గోవుని కాని, ఎద్దునిగాని ఫణంగా తీసుకుని తన కుమార్తెను అతనికిస్తే అది ఆర్ష.
4. తన కూతురి యొక్క ఆశీస్సులతో వివాహం చేస్తే అది ప్రజాపత్య.
5. ప్రేమికులు వివాహం చేసుకుంటే గాంధర్వం.
6. స్త్రీని బలవంతంగా తీసుకొనిపోయి వివాహం చేసుకుంటే ఆసుర, రాక్షసం.
7. మూర్ఛస్థితిలో వుండగా బలత్కారంగా వివాహం చేసుకుంటే పైశాచికం.

**అష్టవిశిఖిరం :** భారతదేశంలోని ఓ గ్రామం పేరు.
– మహాభారతం

**అష్టాదశ పురాణాలు :** పురాణం : సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశానుచరిత్రల వివరణ పురాణం అని అమరకోశం నిర్వచిస్తోంది.

*సర్గప్రతిసర్గలంటే* ప్రకృతి సృష్టి ప్రతిసృష్టిలు : వంశ మంటే మునులు, భక్తుల చరిత్రలు. మన్వంతర మంటే వివిధ మనువుల కాలపరిధులు, వంశాను చరిత్రమంటే రాజుల వంశ వృక్షాలు. పురాణాల గురించి బ్రాహ్మణాల్లో కూడా చెప్పబడింది. కనుక చరిత్రకు పూర్వమే పురాణాలు వున్నాయి. మహా భారతం పురాణమంటే దేవతల సిద్ధుల వివరాలని చెప్తోంది. ఉపనిషత్తులు పురాణాలు ఇతిహాసాలని అంటే 5వ వేదమని చెప్తున్నాయి. స్మృతులు పురాణాలు వేదాలకు వివరణ అని చెప్తున్నాయి. అన్ని పురాణాలు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను పొగిడేవే. ఇవి క్రీస్తు పూర్వమేవున్నాయి. వ్యాసమహర్షి ఈ పురాణాలను సంకలనం చేశాడని చెప్తారు. అన్ని పురాణాలు మహాభారతంలాగే పద్య కావ్యాలే. సాహిత్య పరంగా మహాభారత మంత గొప్పదనం లేకపోయినా ఇవి భారతీయ సంస్కృతి ఆలోచనలకు దర్పణం పడుతు న్నాయి. పురాణాలు 18. అందులో విష్ణుమూల పురాణాలు 6, బ్రహ్మమూల పురాణాలు 6, శివమూల పురాణాలు 6 కలవు.

*విష్ణుమూల పురాణాలు :* విష్ణుపురాణం, భాగవత పురాణం, నారదీయ పురాణం, గరుడ పురాణం, పద్మపురాణం.

*బ్రహ్మపురాణాలు :* బ్రహ్మపురాణం, బ్రహ్మాండ పురాణం, బ్రహ్మవైవర్తపురాణం, మార్కండేయ పురాణం, భవిష్యపురాణం, వామన పురాణం.

*శివపురాణాలు :* వాయు పురాణం, లింగపురాణం, స్కందపురాణం, అగ్నిపురాణం, మత్స్యపురాణం, కూర్మపురాణం.

ఇవికాక 18 ఉపపురాణాలు కూడ వున్నాయి.

**అష్టావక్రుడు :** పుట్టుకతోనే పండితుడు. ఇతడు ఉద్దాలకుని శిష్యుడు ఖగోదరునికి, అతని కూతురు సుజాతకు జన్మించాడు. తల్లిగర్భంలో వుండగానే తండ్రి చదివే శ్లోకపఠనంలో తప్పులున్నాయని చెప్పాడు. తండ్రి కోపించి ఇతడ్ని 8 వంకర్లతో జన్మించమని శపించాడు. అలా వికృతరూపం దాల్చిన అష్టావక్రుడు ఉద్దాలకుని కుమారుడితో కలిసి చదువు కున్నాడు. ఇతడు జన్మించక ముందే తండ్రి రాజు కొలువులో జరిగిన పాండిత్యపోటీలో ఓడిపోయి పోటీ నిబంధన ప్రకారం దగ్గరలోని నదిలో పడిమరణిం చాడు. అష్టావక్రుడు ఉద్దాలకుని కుమారుని ద్వారా

ఈ విషయం విని బాల్యంలోనే అదే రాజు కొలువులో అదే పండితుణ్ణి ఓడించాడు. నిబంధన ప్రకారం అతడు నదిలో పడి మరణించగా తండ్రిబతికి వచ్చాడు. తండ్రి అష్టావక్రుడిని ఆ నదిలో స్నానం చేయించగా వంకర్లు పోయి అందమైన బాలుడయ్యాడు.

*అష్టావక్రుని వివాహం :* వదాన్యముని కుమార్తె సుప్రభను వివాహం చేసుకో గోరి అతడి నడుగగా ఉత్తరదిక్కుగా పయనించి శివపార్వతులను ప్రార్థించి ఆ తర్వాత అచటగల అందమైన కన్యతో మాట్లాడి తిరిగిరమ్మని అప్పుడే తన కుమార్తెనిచ్చి వివాహం చేస్తానని విశదీకరిస్తాడు. అష్టావక్రుడు అలాగే ఉత్తర దిక్కుకి వెళ్లి శివపార్వతులను పూజించి ఆ తర్వాత మరింత ఉత్తర దిక్కుగా పయనించి 7 గురు అంద గత్తెలను చూసి తక్కువ వారిని వెళ్లిపొమ్మని అందంలో పెద్దదైన ఉత్తరతో సంభాషిస్తాడు. ఆమె ఇతణ్ణి వివాహం చేసు కొమ్మనగా ఇతడు నిరాకరిస్తాడు. ఆమె ఉత్తరదిశ దిక్కుకి రాగానే పదెంలో గెలిచావు కనుక వెళ్లి వివాహం చేసుకొనమంటుంది.

–మహాభారతం

*అష్టవంకర్లకు కారణమైన మరోకథ :* అసిత అనే ముని తపస్సు చేసి శివుడ్ని ప్రార్థించి ఓ పుత్రుడ్ని పొందుతాడు. అతని పేరు దేవళుడు. దేవలోక అప్ప రస రంభ ఇతణ్ణి ప్రేమించగా ఇతడు తిరస్కరిస్తాడు. రంభ ఇతణ్ణి అష్టావక్రుడు కమ్మని శపిస్తుంది. అప్పటి నుండి ఇతడు అష్టావక్రుడిగా పిలవబడ్డాడు. ఇతడు 6000 సంవత్సరాలు తపస్సుచేశాడు. రాధాకృష్ణులు ప్రత్యక్షమై రాధ ఇతడి రూపం చూసి ఆశ్చర్యపడగా కృష్ణుడితడ్ని కౌగిలించుకుంటాడు. వెంటనే ఇతడికి నిజరూపం లభిస్తుంది. ఆ సమయంలో దేవలోకం నుండి వచ్చిన రథంలో ఈ ముగ్గురు దేవలోకం వెళ్లారు. – *బ్రహ్మ వైవర్తపురాణం*

*ఇతర విశేషాలు :* రాముడు అరణ్య వాసం తర్వాత పట్టాభిషిక్తుడైనపుడు ఇతడు కూడా పాల్గొన్నాడు.

– *ఉత్తర రామాయణం*

ఇతడ్ని చూసి అసహ్యించుకున్న అప్సరసలు ఇతడి శాపం కారణంగా భూమిపై కృష్ణుని భార్యలుగా జన్మిస్తారు. – *అగ్నిపురాణం*

**అసమంజసుడు :** సగరుడికి, కేశినికి పుట్టిన ఒకే బిడ్డ. అతిక్రూరుడు. చిన్నపిల్లల్ని నదిలోకి తోసి ఆనం దించేవాడు. ప్రజలితణ్ణి అసహ్యించుకొని సగరుణ్ణి వేడుకోగా ఇతన్ని దేశ బహిష్కరణ చేస్తాడు. ఇతని కుమారుడు అంశుమంతుడు . – రామాయణం

**అసంగుడు :** అక్రూరుడి తమ్ముళ్లలో ఒకడు.

**అసంప్రేక్షకారిత్వం :** విష్ణుశర్మ చెప్పిన పంచతంత్ర కథల్లో ఇది ఒకటి. మందబుద్ధులైన సుదర్శనుడి 5 గురు కొడుకుల్ని తెలివి గల వాళ్లుగా చేయడానికి విష్ణుశర్మ ఈ కథలు చెప్తాడు.

**అస్త్రహృదయం :** యశస్కరము, సకలశతృనాశకరము అయిన ఒక విద్య. దీన్ని రుద్రుడు స్వాయంభవుడికి అతడు వశిష్ఠుడికి అతడు చిత్రాయుధుడికి అతడు తన దౌహిత్రి మనోరమకు ఇవ్వగా ఆమె స్వరోచిష కిస్తుంది. – స్వారోచిష మనుసంభవం

**అస్త్రాలు :** రాముడు తాటకిని చంపిన తర్వాత విశ్వా మిత్రుడు రామలక్షణులకు దివ్యాస్త్రాలను ఉపయో గించే విధానం చెప్తాడు. (దివ్యాస్త్రాలంటే అవి దేవతల అంశ కల్గిన అస్త్రాలు) అందులో కొన్ని దండచక్ర, కాలచక్ర, ఇంద్రచక్ర, శైవశాల, బ్రహ్మశిరాస్త్ర, వాయ వ్యాస్త్ర. ఇవి మొత్తం 46 అస్త్రాలు. వీటిని శ్రీరాముడు తూర్పు దిక్కుకు చూస్తూ నేర్చుకున్నాడు.

– రామాయణం

**అసి :** కాశీ ప్రక్కన ప్రవహించే ఒక నది.

**అసిక్ని 1 :** పంజాబులో ప్రవహించే ఒక నది. దీన్ని చంద్రభాగ మరియు చినా అని అంటారు. ఋగ్వే దంలో కూడా ఉదహరించబడింది. – మహాభారతం

**అసిక్ని 2 :** దక్షప్రజాపతి భార్యలలో ఒకరు. ఈమె ద్వారా 60 మంది పుత్రికలు జన్మించారు. వీరి ద్వారా మానవ సంతతి వృద్ధి చెందింది. – *దేవీ భాగవతం.*

**అసికృష్ణుడు :** అశ్వమేధుని కుమారుడు. సూర్య వంశపు రాజు. – *భాగవతం*

**అసిత :** వ్యాసుని శిష్యుల్లో ఒకడు. జనమేజయుని సర్పయాగంలో పాల్గొన్న ఋత్విక్కులలో ఒకరు. శివుని వరంవల్ల దేవత అనే పుత్రుడు జన్మిస్తాడు. ఇతడు జనమేజయుడికి పునర్జన్మను గురించి వివ రిస్తాడు. – *దేవీ భాగవతం*

**అసితకాశ్యపుడు :** చూ॥ దేవలుడు.

**అసితదేవలుడు :** వ్యాసుడు వ్రాసిన మహాభారతాన్ని ప్రజలకు అందజేసిన వారిలో ఇతడొకడు. మహాభారతాన్ని ఇతడు పితృలోకంలో ప్రచారం చేయగా, శుక్రుడు యక్షులలో, వైశంపాయనుడు మానవుల్లో ప్రచారం చేశారు.

**అసితధన్వుడు :** వేదకాలం నాటి రాజు. అసుర విద్యా అనే వేదం ఇతడు వ్రాసాడని శాంఖ్యాయన సూత్రం పేర్కొంది.

**అసితపర్వతం :** నర్మదానది ఒడ్డున గల ఓ పర్వతము. ఇది పూర్వం ఆనర్తదేశం అనే ప్రాంతంలో కలదు.

**అసితుడు :** జనమేజయుని సర్పయాగంలో ఇతడో రుత్విక్కు. – మహాభారతం

ఇతని కుమారుడు శివుని ఆశీస్సులతో జన్మించిన దేవళుడు. – బ్రహ్మ వైవర్త పురాణం

అసితుడు జనక మహారాజుకి పునర్జన్మ సిద్ధాంతాన్ని వివరించాడు. – బ్రహ్మపురాణం

ఇతడు వ్యాసుని శిష్యుడు – దేవీభాగవతం

**అసిద్ధార్థుడు :** దశరథుని మంత్రులలో ఒకరు. – రామాయణం

**అసిపత్రవనం :** 28 నరకాలలో ఇదొకటి. తమ ధర్మాలను నిర్వర్తించకుండా ఇతరుల విషయాల్లో జోక్యం చేసుకొనే వారిని ఈ నరకంలో శిక్షిస్తారు. ముళ్లున్న చెట్లతో రాళ్లతో చితకబాదుతారు. క్రింద పడిపోయిన తర్వాత మరల ఇదేవిధంగా శిక్షిస్తూనే వుంటారు.

**అసిలోముడు :** మహిషాసురుని ప్రధానమంత్రి . – దేవీభాగవతం

**అసురా :** కాశ్యపునికి దనువువల్ల జన్మించిన కూతురు. –మహాభారతం

**అసురులు :** కాశ్యపునికి దనువు ద్వారా జన్మించిన వారు దానవులు. దితి ద్వారా జన్మించిన వారు దైత్యులు. దానవుల్లో ప్రముఖులు ప్రహ్లాదుడు, సంహ్లాద, అనుహ్లాద, శిఖి, విరోచన, మహాబల, గర్గ మొ॥వారు.

**అసూర్త రజసుడు :** వైదర్భి రాజకుమార్తె వల్ల కుశునికి జన్మించినవాడు. తక్కిన కుశుని ముగ్గురు కుమారులు కుశాంబ, కుశనాభి మరియు వసు. – రామాయణం

**అస్తి :** జరాసంధుని కూతురు. కంసుని భార్య. జరాసంధుని మరోకూతురు కూడా కంసుని భార్యయే. శ్రీకృష్ణుడు కంసుని వధించిన తర్వాత వీరి దుఖాఃన్ని ఆపడానికి జారసంధుడు శ్రీకృష్ణుని పై దండెత్తాడు.

**అహరుడు :** కాశ్యపునికి దనువువల్ల జన్మించిన కుమారుడు. – మహాభారతం

**అహల్య :** పూరువంశ రాజకుమారి.

*వంశవృక్షం :* విష్ణు – బ్రహ్మశ్య – పాంచాల – ముద్గల – అహల్య.

*అహల్య శిలగా మారిన కథ :* ఈమె గౌతముని భార్య. గౌతముడు స్నానానికి వెళ్లినపుడు ఈమెను ప్రేమించిన ఇంద్రుడు గౌతముని రూపములో వచ్చి సంగమించెను. నిజ గౌతముడు వచ్చి ఈ దృశ్యాన్ని చూసి ఈమెను శిలగా మారునట్లు శపించెను. ఇంద్రుని వృషణములు నశించునట్లు శపించెను. కాని గౌతముడు ఈమె యెడల దయతో రాముని పాదం సోకినప్పుడు మరల నిజరూపం దాల్చెదవని అభయమిచ్చెను. వృషణాలు లేని ఇంద్రుడు దేవలోకం చేరగా అతని మిత్రులు మేక వృషణములను అమర్చిరి. శాపవిమోచనం తర్వాత గౌతముడు, అహల్య ఇదే ఆశ్రమంలో చిరకాలం జీవించారు.

*వాలి, సుగ్రీవులను పెంచిన కథ :* సూర్యుని రథసారథి అరుణుడు దేవలోకంలో దేవతల నృత్యం చూడదలచి మగవారికి ప్రవేశం లేదని తెలిసి ఆరుణిదేవి అనే స్త్రీ రూపంలో ఇంద్రసభకు వెళ్లగా ఇంద్రుడతగాడిని మోహించి సంగమించగా ఓ పుత్రుడు జన్మించెను. ఇంద్రుని సలహాపై ఇతనిని అహల్యకు అప్పగించెను. సూర్యుడు అకాల ఆలస్యానికి అరుణుడిని కారణమడిగి నిజం తెలుసుకొని సూర్యుడును స్త్రీ రూపము దాల్చిన అరుణుడితో సంగమించగా మరో పుత్రుడు జన్మించెను. ఇతనిని కూడా అహల్యకు అప్పగించగా వారిద్దరిని ఆమె పెంచి పెద్దచేసెను. వారే వాలి సుగ్రీవులు.

**అహిక్షేత్రం :** ఉత్తర పాంచాలకు రాజధాని.

**అహిచ్ఛత్రం :** పాంచాల సార్వభౌమత్వంలోని ఒక రాజ్యం. దీన్ని అర్జునుడు ద్రుపదుణ్ణి జయించి ద్రోణునికి గురు దక్షిణగా ఇచ్చాడు. – మహాభారతం

**అహిత :** ప్రాచీన భారతదేశంలో ఒక నది.
– మహాభారతం

**అహిర్బుదన్యుడు :** సురభి విశ్వకర్మల కొడుకు.

**అహీనుడు :** సూర్యవంశపు రాజు. దేవానీకుడి కొడుకు పారియాత్రుడి తండ్రి. – భాగవతం

**అహీరధుడు :** పూరు వంశపు రాజు.

**అహుడు :** అష్టవసువులలో ఒకడు. ధర్మ రతీదేవుల పుత్రుడు. – మహాభారతం

**అహువు 1 :** అష్టవసులలో ఒకడు. ధర్మ రతీదేవులకు జన్మించాడు. – మహాభారతం

**అహువు 2 :** ఇదొక సరస్సు. దీనిలో స్నానం చేస్తే సూర్యలోకానికి వెళ్తారు. –మహాభారతం

**అహువు 3 :** రాక్షస వంశంలోనివాడు.

**అహోవీరుడు :** ఒక ఋషి, వానప్రస్థాశ్రమంలోని విధుల్ని అనుసరించాడు. – మహాభారతం

**అహంయాతి :** సంయాతి కొడుకు. ఇతడి భార్య భానుమతి. ఇతని కుమారుడు సార్వభౌముడు.
– మహాభారతం

**అంగకర్మ :** రంగస్థలం మీద అభినయించడం రెండు రకాలు. పెద్ద పెద్ద అవయవాలతో అభినయించడం ఒక రకం, అంటే తల. చిన్న చిన్న అవయవాలతో అభినయించడం మరొక రకం, అంటే కనురెప్పలు మొ॥నవి. పెద్ద అవయవాలతో అభినయించడాన్ని అంగకరణి అని, చిన్న చిన్న అవయవాలతో అభినయించడాన్ని ప్రత్యాంగకర్మ అని అంటారు.

**అంగజుడు :** చూ॥ మన్మథుడు.

**అంగదపురం :** శతృఘ్నుడికి శృతకీర్తి వల్ల జన్మించిన కుమారుడు. అంగదుడు నిర్మించిన పట్టణం.
– రామాయణం.

**అంగదుడు 1 :** శతృఘ్నుడి కుమారుడు. ఇతనిని ఇతని సోదరుడైన చంద్రకేతువు పశ్చిమదేశాలకు రాజుగా చేశాడు. ఇతడు నిర్మించుచున్న పట్టణమే అంగదపురం.

**అంగదుడు 2 :** సూర్యాంశతో జన్మించిన వాలి కుమారుడు. ఇతని తల్లి తార. రామునిచే వాలి వధింపబడి సుగ్రీవుడు కిష్కిందకు రాజయినప్పుడు అంగధుడు యువరాజయ్యెను. సీతను వెదకుటకు సముద్ర తీరమునకుచేరి లంకను చేరలేనందుకు నిరాశచెందగా జాంబవంతుడు ఓదార్చి ఆంజనేయుడు మాత్రమే ఆ పని చేయగలడని చెప్పెను. రామరావణుల యుద్ధమునకు ముందు అంగదుడు రావణుని వద్దకు రాయబారిగా వెళ్ళెను. రావణుని సేనాని మహాకాయుని ఇతడే వధించెను. గొప్పశక్తిని బొంది రామునితో యుద్ధము చేయగోరి రావణుడు హోమము చేయుచుండగా దానిని భగ్నమొనర్చుటకు మండోదరిని జుట్టుపట్టుకొని రావణుని వద్దకు ఈడ్చుకొని పోగా రావణుడు హోమము మాని వానరులతో పోరాడెను. రావణుని మరణానంతము సుగ్రీవుడు రామునితో అయోధ్యకు పోగా అంగదుడు కిష్కిందకు రాజయ్యెను.
– రామాయణం

**అంగదేశము :** సరయు గంగానదులు కలియు చోటులనున్న దేశము. పూర్వము శివునిచే కాల్చబడిన మన్మథుని అంగములు బూడిదయై ఇచట బడెను. కావున ఆ దేశమునకు ఆ పేరు వచ్చెను.
– రామాయణం

**అంగన :** ఉత్తరపు దిక్కున నున్న ఆడ ఏనుగు.

**అంగప్రదక్షిణ :** ప్రతిజ్ఞ ప్రకారం రథం వెనుక గుడి చుట్టూ దొర్లటాన్ని అంగప్రదక్షిణం అంటారు.

**అంగమలజం :** తాటకి నివసించిన నిర్జన ప్రదేశం. వృతుడ్ని ఇంద్రుడు చంపి బ్రహ్మహత్యకు కారణమై ఈ ప్రాంతంలో ధూళిలోపడి నివసించాడు. దేవతలు మురికిగా వున్న ఇంద్రునిపై నీళ్లు గుమ్మరించి శుద్ధి చేసి అతణ్ణి దేవలోకం తీసుకొని వెళ్ళారు. ఇంద్రునికి పట్టిన మట్టి మలినం ఇక్కడ విసర్జించడం వల్ల దీనికి అంగమలజం అని పేరొచ్చింది. ఈ ప్రాంతం ఎన్నో ఏళ్లు పాడు బడివుంది. – రామాయణం.

**అంగ రాజవంశం :** అంగ రాజవంశం విష్ణువు అంశ. ఈ రాజవంశం యయాతి కొడుకైన తుర్వ సుడితో ప్రారంభమై పృధుసేనుడితో ముగుస్తుంది. తర్వాత కర్ణుడు ఈ దేశానికి రాజవుతాడు. కర్ణుని పుత్రుడు వృతసేనుడు అతని పుత్రుడు పృథసేనుడు దీనిని పాలించారు.

**అంగరాజు 1 :** బలియను రాజకుమారుడు. ఇతడు సుదేష్ణకు దీర్ఘతముని వల్ల జన్మించినవాడు. ఇతడేలిన రాజ్యమే అంగదేశము.

**అంగరాజు 2 :** చూ॥ కర్ణుడు.

**అంగవాహుడు :** వృష్టివంశపు రాజు. ఇతడు ధర్మ రాజు చేసిన రాజసూయ యాగంలో పాల్గొన్నాడు.
– మహాభారతం

**అంగారకుడు :** పంది రూపములో వున్న ఒక రాక్షసుడు. ఇతని కుమార్తె అంగారవతి.

ఉజ్జయినిని పాలించే మహేంద్రవర్మకు మహాసేన అనే కుమారుడు వుండేవాడు. అతడు చాలాకాలం తపస్సు చేసి దేవి వద్దనుండి ఖడ్గాన్ని, ఓ భార్య పొందే వరం పొందాడు. ఆమె ఖడ్గాన్నిచ్చి ఈ ఖడ్గం నీ చేతిలో వుండగా నిన్నెవరూ జయించ లేరని, ముల్లోకాలకు అందాలరాశి అయిన అంగారకుని కుమార్తె అంగార వతి నీకు భార్యకాగలదని ఆశీర్వదించింది. ఓ రోజు అతడు రధారూడుడై అడవికేగగా ఓ పంది కన్పించగా దానిపై తన అస్త్రాలను సంధించగా పంది ఏమాత్రం చలించ లేదు. ఇతని రథం అదుపు తప్పి ఓ గుహలోకి వెళ్లింది. దానికోసం ఇతడు ఓ కొలనువైపు వెళ్లగా అతనికి ఓ అందాల యువతి కొందరు సుందరీ మణు లతో కన్పించి తను అంగారకుడనే రాక్షసుడి కుమార్తె నని అతడు పంది రూపంలో వుంటాడని మామూలు రూపంలో వుండగా ఎందరో సుందరీ మణులను తీసుకువస్తాడని అతని శరీరం మణిసదృశ్యమని ఎవరూ అతణ్ణి జయించలేరని చెప్పగా రాజు ఆమెను తన తండ్రి వద్దకు వెళ్లి నిద్రలేపి తాను అడగ మన్నట్లుగా ఆమెను తన తండ్రిని అడగమని చెప్తాడు. "తండ్రీ నీవు ఇన్ని ఘోరకృత్యాలు చేస్తున్నావు, నీవు లేకుంటే నాకు దిక్కెవరు" అని అమె అడుగగా నన్ను ఎవరూ చంపలేరని, నేను విల్లు పట్టుకునే ఎడమ అరచేతికి దెబ్బతగిలితే మాత్రమే నేను మరణించ గలనని చెప్తాడు. వెంటనే రాజు అతనిపై యుద్ధం చేసి తన అస్త్రాలతో అతని ఎడమ అరచేతిని ఖండిం చగా అతడు మరణిస్తాడు. అంగారవతిని వివాహ మాడగా ఇద్దరు కుమారులు గోపాలక, పాలక మరియు కుమార్తె వాసవదత్త జన్మిస్తారు. వాసవ దత్తయే ఉదయనుని భార్య. – కథాసరిత్సాగరం

**అంగారపర్ణుడు :** ఓ గంధర్వుడు, కుబేరుని మిత్రుడు. పాండవులు ద్రుపద నగరమునకు పోవుచుండగా ఈ ప్రాంతము ఈ గంగానది నాది, ఎవరు మీరు ఇది వలదనగా, స్నానమెవరు చేసినచో నది వారిదేనని అర్జునుడు ప్రత్యుత్తరమీయగా వీరిద్దరికి భీకర యుద్ధము జరిగెను. గంధర్వుని రథము కాలి బూడిద య్యెను. గంధర్వుడు ఓడిపోయి అర్జునుడికి బందీయై నాడు. పిదప అతని భార్య వేడుకొనగా విడిచిపెట్టెను. అతడు అర్జునుని బలపరాక్రమములకు మెచ్చి అతనికి జూక్షుషియను గంధర్వ విద్యను ఇచ్చెను. ఇతడే ధౌమ్యుని తమ పురోహితునిగా వుంచుకొమ్మని పాండ వులకు సలహా ఇచ్చి అర్జునునితో ఓడినందున తన పేరును అప్పటి నుండి చిత్రరథుడని మార్చు కొనెను.
– మహాభారతం

**అంగారు :** మహాభారత కాలం నాటి ఒకదేశ పరిసర ప్రాంతం. – మహాభారతం

**అంగారవతి :** చూడుము : అంగారకుడు

**అంగారుడు :** ప్రాచీన భారతదేశపు రాజు. ఇతడిని మాంధాంత యుద్ధంలో ఓడించెను. – మహాభారతం

**అంగాలమ్మ :** శివుని సేవకుడైన వీరభద్రుడి భార్య. ఈమె ఎడమ చేతిలో ఓ తాడు వుంటుంది. దానితో ఎవరి శరీరంలోని ప్రాణాన్నైనా బయటకు లాగుతుంది.

**అంగిరసుడు 1 :** బ్రహ్మ మానస పుత్రులు ఆరుగురిలో ఒకడు. ఇతర ఐదుగురు మరీచి, అత్రి, పౌలస్త్య, పులహ, క్రతులు. – మహాభారతం

బ్రహ్మ ప్రపంచాన్ని సృష్టించడానికి 16 మంది ప్రజా పతులను సృష్టించాడు. అందులో అంగిరసుడు ఒకరు.
– వాల్మీకి రామాయణం

*అంగిరసుని భార్యలు :* సుభ, స్మృతి, శ్రద్ధా, దేవసేనా, వసుధ.

*అంగిరసుని పుత్రులు :* బృహత్కీర్తి, బ్రహజ్యోతి, బ్రహ ద్మంత, బృహద్భాస, బృహస్పతి, బృహద్మన, బృహద్బ్రహ్మ.

*అంగిరసుని కుమార్తెలు :* భానుమతి, రాగా, సినీ వాలీ, అరిష్మతి, హవిష్మతి, మహిష్మతి, మహామతి, కుహష.

ఇతర భార్యలవల్ల సుధాన్వా, కార్తికేయులు జన్మించారు.
– మహాభారతం

*అంగిరసుని ప్రజ్ఞ :* సుదర్శనుడను దైవాంశ సంభూ తుడు కొంతమంది అందగత్తెలతో అంగిరసునికి ఎదురై నీవు ఎంతటి దురదృష్టవంతుడవోకదా అనెను. అందుకు అంగిరసుడు కోపించి అతడ్ని సర్పముక

మ్మని శపించెను. అతడు క్షమించమని కోరగా ద్వాపర యుగమున శ్రీకృష్ణుడు నిన్ను పట్టుకొన్నపుడు నిజ రూపుడవుగుదువని శాపవిమోచనమిచ్చెను. కాళింది ఒడ్డున శ్రీకృష్ణుడు గోపికలతో విహరించు చుండగా శ్రీకృష్ణుని పెంచిననందుడిని ఈ సర్పం కాటువేయగా గోపాలుడు తన చేత్తో పట్టుకొని విసిరి వేయగా అతడు నిజరూపుడయ్యెను. దక్షుని ఇద్దరు కుమార్తెలను అంగిరసుడు పెండ్లాడెను. అంగిరసుడు ఓ సమయంలో ప్రపంచంలోని నీటిని చివరి చుక్క వరకు తాగి దాహం తీరక నూతనంగా నీటిని సృష్టించి వాటిని కూడా తాగివేసెను. – మహాభారతం.

*అంగిరసుడు అగ్నికి పుత్రుడగుట :* అంగిరసుడు ఒకసారి కోపంతో భగ భగ మండగా ప్రపంచ మంతా కాంతివంతమైనది. దీనితో ప్రపంచానికి అగ్ని దేవునితో పనిలేక అగ్ని ఓ అరణ్యంలోకి వెళ్లి దాక్కు న్నాడు. ప్రజలు నిప్పు లేక బాధపడటం చూసి అంగిరసుడు వెళ్లి అగ్నిని సానుకూలపరచి తను అగ్నికి కుమారుడగుటకు అంగీకరించెను.

అంగిరస ముని తనకు ఇంద్రుడు వంటి బిడ్డ కావాలని దేవుళ్లను కోరగా అతడు తనకు పోటీకాగలడని ఇంద్రుడే సత్య అను పేరుతో అంగిరసునికి జన్మించెను. – ఋగ్వేదం

**అంగిరసుడు 2 :** బ్రహ్మమానస పుత్రుడు మరీచి. అతని పుత్రుడు అంగిరసుడు. ఇతడొక రాజు.– విష్ణుపురాణం

**అంగిరసుడు 3 :** ఉల్ముకుని కుమారుడు. అంగుని తమ్ముడు. ఇతని భార్య స్మృతి.

**అంగిరసులు 1 :** మునులు సత్రయాగం చేస్తూ 6వ రోజున చేయవలసిన అర్హకర్మలు తోచక మూఢులైరి. వారికి నాభానుడు వైశ్యదేవ సూక్తాలు రెండు తెల్పాడు. మునులు సంతసించి స్వర్గానికి పోతూ సత్ర పరిశిష్ట ధనాన్ని ఇతనికిచ్చారు. – మహాభాగవతం

**అంగిరసులు 2 :** అంబరీషుడి మనుమలు. హరితుని కుమారులు. వీరు నాగలోకానికి వెళ్లి నాగుల్ని బాధిస్తుంటే నాగులు పురుకుత్సుని ప్రార్థించగా అతడు వీరిని నాగలోకం నుండి తరిమివేశాడు. – విష్ణుపురాణం

**అంగరోభవుడు :** కక్షివానుడనే ఓ ఋషి. – ఋగ్వేదం.

**అంగిదుడు :** అంగుని తమ్ముడు. ఉల్ముకుని కుమారుడు. ఇతని భార్య స్మృతి.

**అంగిరోభవుడు :** కక్షివానుడనే ఋషి – ఋగ్వేదం

**అంగుడు :** ఊరుని కుమారుడు. ఇతనికి దైవభక్తియు, బ్రాహ్మణ భక్తియు అపారము. ఇతని భార్య సునీథ. అంగుడు బంగారు ఆభరణములతో కూడిన ఏనుగులను దానము చేసెను. అర్థించినవారికి బంగారమిచ్చి అనేక యాగములు చేసెను. – విష్ణుపురాణం

**అంజకుడు :** మిథిలానగర రాజు. కుని యొక్క కుమారుడు.

**అంజన :** కుంజరుని కుమార్తె. కేసరికి భార్య. హనుమంతుని తల్లి. ఒకనాడు శివపార్వతులు వానర రూపంలో అడవుల్లో సంచరిస్తుండగా పార్వతి గర్భిణి అయ్యెను. అది ఆమె వాయువు కివ్వగా అతడు ఆ గర్భాన్ని అంజనకిచ్చాడు. ఆమె అట్లు ప్రసవించిన పుత్రుడే హనుమంతుడు. – రామాయణం

పూర్వజన్మలో ఈమె పుంజక స్థల అనే దేవత. శాపం వల్ల వానరరూపం దాల్చి హిమాలయాల్లో విహరిస్తుండేది. హనుమంతుని జననంతో శాపవిముక్తురాలై నిజరూపిణియై దేవలోకము పోయెను. – ఉత్తర రామాయణము

ఈమె గౌతముడు, అహల్యల పుత్రిక. గౌతముడు లేని సమయమున సూర్యుడు ఆమెతో సంగమించగా ఓ పుత్రుడు జన్మించెను. అహల్యకు తర్వాత మరో పుత్రుడు జన్మించెను. ఒకనాడు గౌతముడు అహల్యతో కలసి ప్రయాణిస్తూ పుత్రులను ఎత్తుకొని అంజనను నడిపించెను. అప్పుడు అంజన తండ్రీ నీ పుత్రికను నడిపించి పరాయి పుత్రులను ఎత్తుకొనెదవా అని అడిగెను. గౌతముడది గ్రహించి వారిద్దరిని వానరులు కమ్మని శపించి సముద్రమున బడవేసెను. వారే వాలి సుగ్రీవులు. అహల్య కోపించి అంజనను గుడ్డి దానివి కమ్మని వానరునికి జన్మనివ్వమని శపించెను. ఆ శాప ఫలమే హనుమంతుడు. – విచిత్ర రామాయణం.

**అంజనపర్వుడు :** ఘటోత్కచుని కుమారుడు. మహాభారత యుద్ధమున అశ్వత్థామ ఇతడ్ని వధించెను. – మహాభారతం

**అంజనం 1 :** పడమటి దిక్కున నుండు ఏనుగు.

**అంజనం 2 :** ఓ పర్వతం పేరు. – మహాభారతం

**అంజనావతి :** ఈశాన్య దిక్కున నుండు ఆడ ఏనుగు.

**అంజలికావేదం :** ఏనుగును లొంగదీసుకునే ఓ కళ. దీనిలో భీముడు ప్రావీణ్యుడు. - మహాభారతం

**అంజలికాశ్రమం :** ఇదో పవిత్ర స్థలం. ఇక్కడ నివసిస్తే కన్యాకుమారిలో పుణ్యతీర్థాలను పదిసార్లు దర్శించిన ఫలితం లభిస్తుంది. -మహాభారతం

**అండకటాహం :** పదునాల్గు ప్రపంచాలైన భూలోకం, భువర్లోకం, స్వర్లోకం, మహర్లోకం, జనర్లోకం, తపోలోకం, సత్యలోకం, పాతాళం, రసాతలం, మహా తలం, తలాతలం, సుతల, వితల, అతల లోకాలు కలిస్తే అండకటాహం అంటారు.

**అంతకుడు 1 :** పృథుచక్రవర్తి కోర్కెపై దేవతలు భూమిని, గోవుని చేసి పాలుపిండిరి. దాని ప్రతిఫలమే 12 మంది యముల పుట్టుక. ఇందులో ఒకడు అంతకుడు. - మహాభారతం

**అంతకుడు 2 :** ఇతనో రాజర్షి - ఋగ్వేదం.

**అంతచారం :** భారతదేశంలోని ఓ ప్రాంతం. -మహాభారతం

**అంతపాలుడు :** చూడుము : కేతుమానుడు.

**అంతరిక్షుడు :** మురాసురుని కుమారుడు. శ్రీకృష్ణునిచే చంపబడెను. - భాగవతం

**అంతర్గిరి :** హిమాలయాల్లోని ఓ ప్రాంతం. అర్జునుడు దీన్ని జయిస్తాడు. - మహాభారతం

**అంతర్ధానం :** కుబేరుని ఆయుధం పేరు. - మహాభారతం

**అంతర్ధానుడు :** పృథు యొక్క కుమారుడు. - విష్ణుపురాణం

**అంతర్ధాముడు :** మనువంశంలోని అంశుడి కుమారుడు. ఇతడి కొడుకు హవిర్ధాముడు. - మహాభారతం

**అంతర్థి :** పృథువు కొడుకు. - అగ్నిపురాణం.

**అంతర్యాసం :** భారతదేశంలోని ఒక ప్రాంతం. - మహాభారతం

**అంతశ్శిల :** వింధ్య పర్వతం నుండి ప్రవహించే ఒక నది.

**అంతినారుడు :** పూరుని వంశంవాడు. మనస్విని ఇతని భార్య. సుమతి, అప్రతిరథులు ఇతని పుత్రులు. - విష్ణుపురాణం.

**అంతిసారుడు :** పూరుని వంశస్థుడు. రుచేయువు కుమారుడు. ఇతడికి గల మరో నామం మతిసారుడు.

**అంధకం :** ఒక పుణ్యతీర్థం. ఇక్కడ స్నానం చేస్తే పురుషమేధయజ్ఞం చేసినంత ఫలితం వస్తుంది. - మహాభారతం

**అంధకారకం :** క్రౌంచ ద్వీపంలోని ఒక ప్రాంతం. మరో పర్వతానికి కూడా ఇదే పేరు కలదు. - మహాభారతం

**అంధకాసురుడు :** హిరణ్యాక్షుని పెంపుడు కొడుకు. నిజ జనకుడు శివుడే. శివుని కుమార్తె ఆటగా నెంచి శివుని కళ్లు తన చేతులతో మూయగా అంధకారము వ్యాపించెను. ఆ అంధకారము నుండి ఈ రాక్షసుడు జన్మించెను. శివుని ప్రార్థించుచున్న హిరణ్యాక్షునికి ఇతనిని ప్రసాదించెను. ఇతడు ప్రపంచానికి కోపం తెప్పించినా, తల్లిని పొంద గోరినా, బ్రాహ్మణులను వధించినా నేనే భస్మం చేస్తానని చెప్పెను. - వామన పురాణం.

ఓ రోజు అంధకాసురుడి చూపు పార్వతిపై బడింది. ప్రహ్లాదుడు ఆమె నీ తల్లివంటిదని అది కూడదని సలహా ఇచ్చినా పెడచెవిని బెట్టి ఆమెను తీసుకొని రమ్మని తన అనుచరుడ్ని పంపగా శివుడు అంధకాసురుడు తనతో పాచిక లాడి గెలిస్తే పార్వతిని పంపగలనని చెప్తాడు. అంధకాసురుడు ఓడిపోయి శివుని క్షమాబిక్ష కోరి అసురత్వాన్ని పోగొట్టమని అడుగుతాడు. శివుడు క్షమించి బృంగి వంశానికి అధిపతిని చేస్తాడు.

**అంధకుడు :** సాత్వతి కుమారుడు. భజమానుడు, కింకరుడు, శుచి, కంబళబర్హి ఇతని కుమారులు - భాగవతం

**అంధకూపం :** ఇరవై ఎనిమిది నరకాల్లో ఇదొకటి. ఇక్కడ ఎలుగుబంట్లు, గద్దలు, పాములు, తేళ్లు, క్రిమి కీటకాలు వుంటాయి. భక్తుల్ని, బ్రాహ్మణుల్ని, సన్యాసుల్ని వధించినవారు ఈ నరకానికి వెళ్లి శిక్ష అనుభవిస్తారు. - దేవీభాగవతం

**అంధతామిశం :** ఇరవై ఎనిమిది నరకాల్లో ఇదొకటి. యమభటులు ఇక్కడి పాపుల్ని తాళ్లతో బంధించి హింసిస్తారు. భార్యాభర్తల్లో ఎవరెవర్ని మోసం చేసినా వారు ఈ నరకానికి వెళ్తారు. - దేవీభాగవతం

**అంధుడు 1 :** కశ్యప కద్రువల కుమారుడు.
–మహాభారతం

**అంధుడు 2 :** పాపాత్ముడైన అంధుడనువాడు తపస్సు చేసి వరములు పొంది మనుజులను సంహరించే వాడు. బ్రాహ్మ ఇతడిని అంధుడివి కమ్మని శపించాడు. ప్రజలు పారిపోయి విశ్వామిత్రుని శరణు వేడగా అంగీకరించి ఆ మహాకాయుణ్ణి చూడగనే స్వయం రక్షణార్థమై తనను శరణుజొచ్చినవారిని అంధునికి చూపుతాడు. ఈ పాపంవల్ల విశ్వామిత్రుడు ఓసారి నరకం చేరవలసివచ్చింది. తెలియక పాపంచేసినా నరకం తప్పదని శ్రీకృష్ణుడు అర్జునునికి ఈ కథ చెప్తాడు. – మహాభారతం

**అంధుడు 3 :** దౌమ్యుని శిష్యుడైన ఉపమాన్యుడు తెలియక ఓ చెట్టు ఆకులు తినడం వల్ల అంధుడయ్యాడు.

**అంధ్రకుడు :** ఆంధ్రదేశపు రాజు (ప్రస్తుత ఆంధ్రదేశం). ఇతడు మయసభను సందర్శించాడు. ధర్మజుని రాజసూయ యాగంలో పాల్గొన్నాడు. – మహాభారతం

**అంధ్రకులు :** మహాభారత యుద్ధంలో ఆంధ్ర వీరులు పాల్గొన్నారు. పాండ్యరాజు వీరిని ఓడించాడు. కృష్ణుని ప్రేరణతో అర్జునుడు అంధ్రులను, పుళిందుల్ని వధించాడు. వారిని మ్లేచ్ఛులుగా వర్ణించారు.
–మహాభారతం

**అంధ్రులు :** ఇది నేటి ఆంధ్రప్రదేశ్. మహాభారత కావ్యాన్ని రచించడంలో ఈ దేశానికి ఓ ప్రత్యేకత వుంది. – మహాభారతం

**అంబ :** కాశీ రాజకుమార్తెలలో పెద్దది. తక్కిన ఇద్దరు అంబిక, అంబాలిక. భీష్ముడు తన తమ్మునకు వివాహము చేయగోరి కాశీరాజుని జయించి వీరి ముగ్గురిని తన రాజప్రాసాదమునకు తీసుకొని వచ్చెను. అంబ తానంతకుముందే సాళ్వరాజుని ప్రేమించియున్నానని చెప్పగా భీష్ముడు ఆమెను సాళ్వుని వద్దకు పంపెను. సాళ్వుడు నిన్ను భీష్ముడు జయించి తీసుకొని వెళ్లినాడు గనుక నేను పరిగ్రహింపనని భీష్ముని వద్దకు వెళ్ళమనెను. నేను ఆజన్మ బ్రహ్మచారిని కనుక నేను స్వీకరించనని భీష్ముడు పంపివేసెను. ఆమె పరశురాముడినాశ్రయింపగా అతడు భీష్మునితో పోరెను. ఇరువది నాల్గురోజుల యుద్ధమున ఎవ్వరును ఓడిపోరైతిరి. దేవతలు వీరి యుద్ధమును మన్నించిరి. పరశు రాముడు తన అశ క్తతను తెలియజేయగా ఆమె భీష్మునిపై ప్రతీకా రేచ్ఛతో ఘోరతపస్సుచేసి శివుని మెప్పించెను. శివుడు ప్రత్యక్షమై ఈ జన్మలో భీష్ముని వధింప నీకు సాధ్యము కాదని తర్వాతి జన్మలో ద్రుపదుని ఇంట శిఖండిగా జన్మించి భీష్ముని మరణమునకు కారణ భూతము కాగలవని వరమిచ్చెను. ఆమె వెంటనే చితి పేర్చుకొని అగ్నికి ఆహుతియై పునర్జన్మయందు ద్రుపదుని ఇంట శిఖండిగా జన్మించెను. – మహాభారతం

**అంబరీషుడు :** ఇక్ష్వాకు వంశరాజు. ఈ ప్రపంచాన్ని ఏలిన 16 మంది గొప్ప చక్రవర్తులలో ఇతడొకడని వ్యాసుడు పేర్కొనెను. ఇతడు మాంధాత కుమారుడు. ఇతడెన్నో యజ్ఞయాగాలు చేశాడు. ఒకసారి తన యజ్ఞాన్ని విఘ్నంచేయడానికి ఇంద్రుడు తన యాగశాలలోని గోవుని తీసుకొని పోగా ప్రధాన యజ్ఞకర్త ఆ గోవు బదులు ఓ బాలుడుని అర్పించవచ్చునని చెప్పగా రుచికుడనే మునివద్దకు పోయి లక్ష గోవుల్ని పరిహారంగా ఇవ్వగలను అందుకు ప్రతిగా అతని కుమారుడుని బలికోసం ఇవ్వమని అడిగాడు. తన మధ్యమ కుమారుణ్ణి అతడు అంబరీషుడికి ఇచ్చాడు. అతడిపేరు సునశ్శేపుడు. మధ్యదారిలో ఆ బాలుడు విశ్వా మిత్రుడికి తనకష్టం చెప్పుకోగా విశ్వామిత్రుడు అతన్ని రక్షించడంకోసం తన కుమారుల్లో ఒకర్ని బలికి వెళ్లమనగా వారు నిరాకరిస్తారు. అందుకు విశ్వామిత్రుడు కోపించి తన కుమారుల్ని కుక్క మాంసం భక్షిస్తూ 1000 సంవత్సరాలు బతకమని తనూ యజ్ఞానికి వెళ్తాడు. బలిపీఠం మీద సునశ్శేపుడు వుండగా ఇంద్రుడు ప్రత్యక్షమై అతణ్ణి రక్షించి అంబరీషుడ్ని మెచ్చుకుంటాడు.

*అంబరీష – దుర్వాసులు :* అంబరీషుడు రాజ్యాధిపతి అయినప్పటి నుండి శాంతి సౌభా గ్యాలు విరాజిల్లాయి. అంబరీషుని దయార్ద్రత దైవభక్తికి మెచ్చి విష్ణువు అవసరమైనప్పుడు తన సుదర్శనచక్రం అతని వశమవుతుందని అభయ మిచ్చెను. ఒకరోజు అంబరీషుడు ఏకాదశ వ్రతం చేయుచుండగా, ఇంద్రుడు తన వద్దకు వచ్చిన దుర్వాసుని దానిని చెడగొట్టమని పంపెను.

దుర్వాసుడు ఆ వ్రతమునకు రాగా అంబరీషుడాదరముగా పిలచి స్నానమునకు కాళింది నదికి పంపెను. దుర్వాసుడు స్నానము వద్దనే కాలము గడుపుచుండెను. కాలాతీత మగుటచే వ్రత నియమము ప్రకారము సమయమునకు దేవతలకు వ్రత ఫలము నందించి తనుకూడా భుజించి దుర్వాసునికి కొంత మిగిల్చెను. దుర్వాసుడు ఇది తనను అగౌరవ పర్చినట్లని భావించి రాక్షసుడైన కృత్యుడ్ని సృష్టించి అంబరీషునిపైకి పంపెను. అది అంబరీషుని చంపబోగ విష్ణువర ప్రసాదమైన సుదర్శన చక్రమును ధ్యానించెను. అది ఆ రాక్షసుని తల నరికి దుర్వాసుని వెంట పడగా అతడు ఇంద్రుని శరణు జొచ్చెను. ఇంద్రుడు దానినాపుట తనక సాధ్యమనగా బ్రహ్మ వద్దకు శివుని వద్దకు బోయి సాధ్యముకాదని విష్ణువునే మొర పెట్టుకొనగా నీవు అంబరీషుని వద్దకే వెళ్లమని చెప్పెను. దుర్వాసుడు అంబరీషుని వద్దకు బోయి క్షమాపణ కోరగా అతడు సుదర్శన చక్రమును ఉపసంహరించెను. – భాగవతం

**అంబష్ట దేశం :** ఉశీనరుడి కొడుకు సువ్రతుడు నిర్మించిన రాజ్యం. ఈ దేశ ప్రజలను అంబష్టులంటారు.

**అంబష్టుడు 1 :** శ్రవాయువను రాజు కౌరవుల పక్షమున పోరి అర్జునుని చేతిలో మరణించెను. అతడు అంబష్ట దేశమునకు రాజగుటవలన అంబష్టుడనెడివారు.
– మహాభారతం

**అంబష్టుడు 2 :** పాండవుల పక్షాన యుద్ధము చేసిన యోధులలో కూడా ఓ అంబష్టుడు కలడు. అతడు చేది రాజును సంహరించెను.

**అంబాజన్మ :** నారదుడు నివసించే పుణ్యతీర్థం. ఇచ్చట మరణిస్తే మోక్షం లభిస్తుందని నారధుడి అశీర్వచనం.
– మహాభారతం

**అంబాత్రయా :** జ్ఞానాంబ, భ్రమరాంబ, మూకాంబలను అంబాత్రయం అంటారు.

**అంబాలిక :** కాశీరాజు కూతురు. అంబ, అంబిక ఈమె సోదరీమణులు. స్వయంవరమున భీష్ముడు పల్లవ రాజులను జయించి ఈమెను విచిత్ర వీర్యునికిచ్చి వివాహము చేసెను. సంతానవతి కాక పూర్వమే అతడు మరణించగా వంశము నిల్పుటకై అత్త సత్యవతి వ్యాసుని వలన సంతానము బడయుమని నియోగించెను. వ్యాసుని రూపము జూసి ఈమె వెలవెల బోయెను. అందువలన పాండు దేహుడగు పాండు రాజు ఈమెకు జన్మించెను. పాండు పుత్రులకు, ధృతరాష్ట్ర పుత్రులకు యుద్ధము జరుగునని అది చూడజాలరని కావున తపోవనమునకు పొందని సత్యవతికి, అంబికకు, అంబాలికకు వ్యాసుడు జెప్పెను.
–మహాభారతం

**అంబిక :** కాశీ రాజు ముగ్గురు కుమార్తెలలో ఒకరు. స్వయంవరమున భీష్ముడు ఈమెను తీసుకొనివచ్చి తన తమ్ముడు విచిత్ర వీర్యునికిచ్చి వివాహము చేసెను. సంతాన ప్రాప్తి కలుగకనే విచిత్ర వీర్యుడు మరణించుటచే అత్త సత్యవతి కోరిక మేరకు వ్యాసునిచే పుత్రునికి జన్మనిచ్చెను. వ్యాస సంగమ సమయమున ఈమె కళ్ళు మూసుకొనుట వలన పుట్టుగుడ్డివాడైన ధృతరాష్ట్రుడు జన్మించెను. ఇతని సంతానము వల్ల మహాభారత సంగ్రామము జరుగునని వ్యాసుని వల్ల తెలుసుకొని తన అత్త సత్యవతి, సోదరి అంబాలికతో తపోవనమునకు బోయెను. – మహాభారతం

**అంబుమతి :** ఒక నది – మహాభారతం

**అంబువాహిని :** ఒక నది. ఉభయ సంధ్యా సమయాల్లో దీనికి స్తుతిస్తే దైవత్వం వస్తుంది. – మహాభారతం

**అంబువీచుడు :** మగధ రాజు, ఇతడి మంత్రి మహాకర్ణి.
– మహాభారతం

**అంభోరుహుడు :** విశ్వామిత్రుని కుమారుడు.
– మహాభారతం

**అంశావతారం :** దేవుని పాక్షిక అవతారాల్ని అంశావతారాలంటారు. కశ్యపుడు వసుదేవుడిగా, ఆదిశేషుడు బలరాముడిగా, యముడు ధర్మజుడిగా, నారాయణ శ్రీకృష్ణుడుగా, ధర్ముడు విదురుడుగా, అష్టావశు భీష్ముడిగా, సూర్యుడు కర్ణుడిగా ఇలా పాక్షిక అంశతో జన్మించిన వారిని అంశావతారులు అంటారు.

**అంశుడు :** మరీచి వంశజుడు. ఓ ఋషి. అదితి కశ్యపుల కుమారుడు. ఇతడు ద్వాదశాదిత్యుల్లో ఒకడు. – మహాభారతం

**అంశుధన పట్నం :** ఉత్తర భారతంలోని ఓ పట్టణం. దశరథ మరణవార్త విని భరతుడు కేకేయ దేశం నుంచి అయోధ్యకు వచ్చేటప్పుడు ఈ పట్టణం మీదుగా వచ్చాడు. - రామాయణం

**అంశుమతి :** ప్రమీల అనే గాంధర్వ రాజు కుమార్తె. ఈమె కథ ప్రదోష వ్రతం యొక్క ప్రాముఖ్యత తెలియ జేస్తుంది. సత్యవ్రతుడనే రాజు ఈ వ్రతాన్ని నిత్యం చేసేవాడు. అనుకోని పరిస్థితులలో అతడు ఒకసారి చేయకపోవడం వల్ల తదనంతర జన్మలో విదర్భ రాజుగా పుట్టి సాళ్వరాజుచే జయించబడి చంప బడ్డాడు. ఆ సమయంలో గర్భిణి అయిన అతని భార్య అడవులకు పారిపోయి అచట ఓ బాలుడ్ని ప్రసవించి నదిలో నీరు తేవబోగా ఓ మొసలి ఆమెను పట్టుకుంది. ఉషా అనే బ్రాహ్మణ స్త్రీ, అతని కుమారుడు శుచివ్రతుడు ఆ బిడ్డను తమసొంత కుమారుడుగా పెంచి ధర్మగుప్తుడని పేరు పెట్టారు. ఓ సనాతన బ్రాహ్మణుని సలహాపై సుచిత్రుడు, ధర్మగుప్తుడు క్రమం తప్పక ప్రదోష వ్రతంచేశారు. శివుడు సంతసించి ఎంతో సంపద నిచ్చాడు. అచట ధర్మగుప్తుడు గంధర్వ పుత్రిక అంశుమతిని ప్రేమించి వివాహం చేసుకున్నాడు. ప్రదోష వ్రతం తప్పక చేయడంవల్ల సాళ్వుడిని ఓడించి విదర్భకు తిరిగి రాజయ్యాడు.

**అంశుమాలి :** చూ॥ సూర్యుడు.

**అంశుమంతుడు 1 :** అదితి కశ్యపుల కుమారుడు. ద్వాదశాదిత్యులలో ఒకడు.

**అంశుమంతుడు 2 :** సగరుని మనుమడు. అసమంజసుని పుత్రుడు. సగరుని పుత్రులు మృతి చెందిన పిమ్మట యాగాశ్వమును వెదకి తెమ్మని ఇతనిని కపిలుని వద్దకు పంపెను. ఇతడు తండ్రులు వెళ్లిన మార్గమునే వెళ్ళి కపిలుని ఆశ్రమము వద్దకు వచ్చి కపిలుని ప్రక్కవున్న భస్మరాసులను చూచెను. కపిలుని ప్రార్థించి అశ్వమునిమ్మని అడుగక భస్మరాసులను గురించి తల పెట్టక అటులనే నిలబడెను. కపిలుడు దయగల్గి అశ్వమును విప్పుకొని పొమ్మనియు తన తండ్రుల మరణవృత్తాంతమును సగరునకెరిగింపుమనియు తెల్పెను. అంశుమంతుని భక్తికి మెచ్చి కపిలుడు వరము కోరుకొమ్మనగా తండ్రులకు స్వర్గము ప్రాప్తించు మార్గము తెలుపమనెను. వారు పాపులనియు ఇంకను జన్మము లెత్తుదురనియు అంశుమంతుని మనుమడు భగీరథుని వల్ల ముక్తి లభించునని జెప్పెను. యాగాశ్వమును తీసుకొని సగరునికి అప్పగించెను. సగరుడు యజ్ఞమును పూర్తిచేసి అంశు మంతునికి పట్టాభిషేకము చేసెను. ఇతని కుమారుడు దిలీపుడు. రాజ్యమును దిలీపునకిచ్చి గంగను తన తండ్రుల భస్మము తెప్పించుటకు అడవులకు బోయి తపస్సుచేసి అది పూర్తిగా వించలేక మరణించెను. - భాగవతం.

**అంశువు :** యదువంశజుడు, పురోహితుడి కొడుకు.

**అంహుడు :** ఋగ్వేద కాలంలోని ఓ రాక్షసుడు. మునుల్ని బాధించేవాడు. ఇంద్రుడతణ్ణి, అతడి ఏడు నగరాలను నిర్మూలిస్తాడు. - ఋగ్వేదం



**ఆకదుడు :** మంకణుని పుత్రుడు. గొప్ప శివభక్తుడు. ఒకసారి ఇల్లుకాలి అందులోని శివలింగం కూడా సగం కాలిపోగా తన శరీరాన్ని కూడా అగ్నికి ఆహుతి చేసుకోబోగా శివుడు ప్రత్యక్షమై ఇతడ్ని ఆశీర్వదించాడు. - పద్మపురాణం

**ఆకర్కరుడు :** కద్రువ కొడుకు. - మహాభారతం

**ఆకర్షులు :** ఆకర్షదేశ ప్రజలు. - మహాభారతం

**ఆకృతి :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజు. సౌరాష్ట్ర ప్రాంతాన్ని పాలించాడు. - మహాభారతం

**ఆకృతిపుత్రుడు :** ఇతని పేరు రుచిపర్వుడు. ఆకృతి పుత్రుడు. మహాభారత యుద్ధంలో పాండవుల పక్షాన పోరి భగదత్తుని చేతిలో సంహరింప బడ్డాడు. - మహాభారతం

**ఆకాశజనని :** కోటగోడలకు పెట్టే రంధ్రాలు. వీటి ద్వారా ధనుర్విద్య నేర్చుకుంటారు.

**ఆకాశరాజు :** సుధర్ముని కుమారుడు. ఈతని కుమార్తె పద్మావతి. ఈమెను వెంకటేశ్వరుడు చూచి వలచెను. ఆకాశరాజు తన కూతుర్ని వెంకటేశ్వరునికిచ్చి వివాహము చేసి ఓ గుడి కూడా కట్టించెను. - వెంకటేశ్వర మహాత్మ్యము

**ఆకూపరుడు :** చూ॥ అకూపరుడు.

**ఆకృతి :** స్వాయంభవ మనువుకు షాతీరూప వల్ల కల్గిన కూతురు. ఈమెను రుచి ప్రజాపతి వివాహమాడాడు. ఈమెకు ఇద్దరు కవలలు జన్మించారు. కొడుకు పేరు యజ్ఞ, కూతురుపేరు దక్షిణ.

**ఆక్రోశుడు :** ప్రాచీన భారతదేశపు రాజు. ఈ దేశాన్ని నకులుడు జయించాడు. – మహాభారతం

**ఆగమాలు :** ఇవి పూజావిధుల గురించి చెప్పే శాస్త్రాలు. ఇవి శైవ, వైష్ణవ భేదాలతో రెండు రకాలు. శైవాగమాన్ని 'పాశుపత'మని, వైష్ణవాగమాన్ని 'పాంచరాత్రం, వైఖానసం' అని పిలుస్తారు.

**ఆగ్రాయణుడు :** అగ్నిదేవుని నాల్గవ కుమారుడు. భానుడని అంటారు. – మహాభారతం

**ఆగ్నివేశ్యుడు :** ప్రాచీన ఋషి. బృహస్పతి శక్తితో కూడిన మంత్రాలతో ధనుర్విద్య నేర్చు కున్నాడు. ద్రోణుని గురువు.

**ఆగ్నీధ్రుడు :** ప్రియవ్రతుని పుత్రుడు. జంబూ ద్వీపమును ఏకచ్ఛత్రాధిపత్యముగా నేలెను. పుత్రులకై తపము చేయగా బ్రహపూర్వచిత్తయను అప్సరస దర్శనమిచ్చెను. ఆమెను వలచి వివాహ మాడగా జంబూద్వీపమును 9 ఖండములుగా జేసి ఈమెవల్ల కల్గిన కుమారులను రాజులను చేసెను.

**ఆగ్రేయ :** కర్ణుడు జయించిన రాజ్యం పేరు. – మహాభారతం

**ఆగ్నేయ పురాణం :** చూ॥ అగ్నిపురాణం.

**ఆగ్నేయాస్త్రం :** అర్జునుడు అంగారపర్ణుడను గంధర్వునితో పోరాడినపుడు ఈ ఆగ్నేయాస్త్రం యొక్క శక్తిని వివరించి దీనిని మొదట బృహస్పతి భరద్వాజుడికిచ్చాడని అతడు అగ్నివేశ్యుడికివ్వగా అతడు ద్రోణుడికిచ్చాడని అతడు తనకు ఇచ్చాడని చెప్తాడు. – మహాభారతం

**ఆచమనం :** ముందుగా మూడుసార్లు నీళ్ళు త్రాగి నీటితో రెండుసార్లు కళ్లు చెవులు ముక్కు ముఖము, తల నీళ్లతో కడుక్కోవడాన్ని ఆచమనం అంటారు. – మనుస్మృతి

కుడిచేత్తో నీళ్లు తాగడం ఆచమనం. కుడి అరచేతిని వంచి అందులో నీళ్లు పోసుకొని ఎడమచేత్తో కుడి చేతిని పట్టుకొని బొటనవేలు, చిటికినవేలు ఇతర వేళ్లను అంటకుండా అరచేతిలోని నీటిని తాగాలి. ఇందులో ఏది పాటించకపోయినా ఆ నీరు పరిశుభ్రమైనది కానట్లే. – దేవీభాగవతం

**ఆచారకాండ :** ధర్మశాస్త్రంలో ఓ విభాగం. నాలుగు వర్ణాలవాళ్లు, వారు నిర్వర్తించవలసిన విధులు దీనిలో వున్నాయి. యజన, యాజన, అధ్యయన, అధ్యాపన, దాన, ప్రతిగ్రహాలు బ్రాహ్మణ విధులు. ప్రజాపాలన, దానం, యజ్ఞం, వేదాధ్యయనం క్షత్రియుడి విధులు. పశుపాలన, దాన, యజ్ఞ, వేదాధ్యయనము, స్థల జలాల్లో ధాన్య రత్నాల వ్యాపారం, ధనాన్ని వడ్డీ రూపంలో పెంచడం వైశ్యుడి ధర్మాలు. పై మూడు వర్ణాల వారికి శుశ్రూష చెయ్యడం శూద్రుని విధులు.

**ఆజగరుడు :** ఒక ముని. ప్రహ్లాదుడు ఇతనితో సంభాషించాడు. – అగ్నిపురాణం

**ఆజగరపర్వ :** వనపర్వం (మహాభారతం)లోని ఓ విభాగం. –మహాభారతం

**ఆజగవం :** మాంధాత, పృధు, అర్జునుని గాండీ వాలను ఆజగవం అంటారు. – మహాభారతం

**ఆజానేయం :** ఓ రకమైన మంచి జాతి గుర్రాలు. – మహాభారతం

**ఆజాగరవ్రత :** అజగరుడనే ముని చేసిన వ్రతం. దాని ప్రకారం దొరికిన రోజున ఎంతైనా తినడం లేకుంటే ఎన్నిరోజులైనా ఉపవాసం వుండటం. చక్కటి దుస్తులు వుంటే ధరించడం లేకుంటే ఆకులతో కప్పుకోవడం. దేనిమీద కోరికగాని, దానికోసం వెదుకులాడక పోవడం ఈ వ్రతం లక్షణం.

**ఆజ్యప :** పులహ రాజ్యంలోని పిత్రు సమాజం. వారిని అలా పిలవడానికి కారణం యజ్ఞ సమయంలో కూడా ఆజ్యం సేవిస్తారు. కర్థమ ప్రజాపతి రాజ్యంలో నివసించేవారు.

**ఆటకం :** కురువంశంలో జనించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో బూడిదయ్యింది.

**ఆటకి :** ఈమె ఉషస్తియను వాని భార్య. కురుదేశమున నివసించెడివారు. ఆ దేశమున ఒకసారి పాషాణ వర్షము కురిసి పైరులు నశించి క్షామము ఏర్పడెను. ఆహారము లభ్యముగాక ఈమె కృశించి యుండెను.

ఉషస్తి ఓ మావటి వాని వద్దకు వెళ్ళి అలచందలు దెచ్చెను. అంతకుపూర్వమే ఈమె కొంచెము భుజించుటవల్ల ఈమె వాటిని దాచి వుంచెను. మరునాడు ఉదయము ఉషస్తి రాజు వద్దకు బోయి ధనము సంపాదించు కొద్దామన్నను శక్తిలేక యున్నదని విచారించు చుండగా ఆటకి తను దాచిన అలచందలు అతనికి ఇచ్చెను. – చా. ఉ.

**ఆటవిపురి :** ప్రాచీన భారతదేశంలో ఒక పట్టణం. సహదేవుడు దీన్ని జయించాడు. – మహాభారతం

**ఆడంబరుడు :** బ్రహ్మ ఐదుగురు పార్షదుల్ని స్కందునికి ఇచ్చాడు. అందులో ఇతడొకడు. తక్కిన వారు నల్లు మకుంద, కుసుమ, కుముద మరియు డంబ.

**ఆత్మదేవుడు :** చూడుము : గోకర్ణుడు.

**ఆత్రేయ 1 :** మనువు కుమారుడు ఊరుడు. అతని భార్య ఆత్రేయ. – అగ్నిపురాణం

**ఆత్రేయ 2 :** ఓ నది. – మహాభారతం

**ఆత్రేయం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం – మహాభారతం

**ఆది :** అంధకాసురుని కుమారుడు. తన తండ్రిని చంపిన శివునిపై పగ తీర్చుకోవడానికి బ్రహ్మను గూర్చి తపముచేసి అతడున్న రూపంలో ఎవరూ చంపకుండునట్లు వరం పొందాడు. కైలాసానికి వెళ్లి లోపలకు పాము రూపంలో వెళ్లి పార్వతి రూపంలోకి మారి శివుని వద్దకు వెళ్లగా అది గ్రహించిన శివుడు ఇతణ్ణి వధించాడు. – పద్మపురాణం

**ఆదికూర్మం :** క్షీరసాగర మథనానికి శ్రీమహావిష్ణువు మంధరపర్వతాన్ని పైకి క్రిందకు లెగవడానికి క్రింద కూర్మంగా మారాడు. దీన్నే ఆదికూర్మం అంటారు. – మహాభారతం

**ఆదిగధాధరుడు :** గధ అనే అసురుడి ఎముకలతో చేయబడిన గధ. దీనితో మొదట మహావిష్ణువు హేతి మరి ఇతర రాక్షసులను వధించాడు. ఇదే మొదటి గధ. దానిని ఉపయోగించిన శ్రీమహావిష్ణువే ఆదిగధాధరుడు.

**ఆదిత్యకేతుడు :** ధృతరాష్ట్రుని పుత్రులలో ఒకడు. కురుక్షేత్ర యుద్ధంలో భీముడు అతణ్ణి సంహరించాడు. – మహాభారతం

**ఆదిత్యతీర్థం :** సరస్వతీ తీరంలోని ఓ పుణ్యతీర్థం. – మహాభారతం

**ఆదిత్య వర్ణుడు :** ఆజ్ఞాపించడం, తర్వాత బాధపడటం ఇతని లక్షణం. ఇతనిని గురించి కథా సరిత్సాగరంలో వివరించబడింది.

**ఆదిత్య సేనుడు :** పరాక్రమ శాలియైన ఒక రాజు. కథా సరిత్సాగరంలో ఇతణ్ణి గురించి పెక్కు కథలు కలవు.

**ఆదిత్య హృదయం :** ఇదో గొప్ప మంత్రం. ఇది జపిస్తే ఎంతటి శతృవునయినా జయించవచ్చు. రామరావణ యుద్ధంలో రాముడు అలసిపోగా అగస్త్యుడు రాముడికి ఈ మంత్రాన్ని ఉపదేశించాడు. – రామాయణం

**ఆదిత్యుడు :** చూ॥ సూర్యుడు.

**ఆదిత్యులు :** కాశ్యపునికి అదితి వల్ల కల్గిన 12 మంది సంతానాన్ని ఆదిత్యులంటారు. – మహాభారతం

**ఆదినాధుడు :** జైన గురువు. మొదటి తీర్థంకరుడు.

**ఆదిపర్వతం :** హిమాలయాల్లోని శివుడు నివసించే పర్వతం. – మహాభారతం

**ఆదిబకం :** ఉపయోగం లేని పోటీని ఆదిబకం అంటారు. దీనికి ఉదాహరణ వశిష్ఠ విశ్వామిత్రుల మధ్య పోటీనే. – దేవీ భాగవతం

**ఆదిరాజు :** కురువు యొక్క కుమారుడు. పురువంశపు మొదటి రాజు.

**ఆదివరాహం :** భూమి రసాతలమగ్నమై వుండగా విష్ణువెట్టి రూపమును దాల్చి భూమినుద్ధరించవలెనని ఆలోచించి వరాహ రూపము దాల్చి తన దంతములచే భూమిని పైకెత్తి నిల్పెను. అదియే ఆదివరాహం.

**ఆదిశిశురుడు :** శాకల్యుని శిష్యుడు. వ్యాసుడు వేదాలను తయారుచేసి కొంత భాగాన్ని శాకల్యునికి అందజేశాడు. శాకల్యుడు దాన్ని 5 సమ భాగాలుగా చేసి తన ఐదుగురు శిష్యులకు చెప్పాడు. వారిలో ఆది శిశురుడు ఒకడు. తక్కినవారు వాత్స్యాయన, మాద్గల్య, సారి, గోఖలి.

**ఆదిశేషువు :** కద్రూకశ్యపుల సంతానంలో పెద్దవాడు. తన తల్లి వినత పట్ల చేసే అక్రమాలను సహించలేక అనేక పుణ్యక్షేత్రాల్లో తపస్సుచేసి బ్రహ్మవల్ల భూభారాన్ని మోసే శక్తి సంపాదిస్తాడు. ఇతడికి భృగుని శాపంవల్ల బలరామావతారం కలుగుతుంది.

**ఆదిష్ఠి :** గురువాజ్ఞ వల్ల కొన్ని సంవత్సరాలు బ్రహ్మ చర్యం పాటించినవాడు.

**ఆద్యకధుడు :** ఓ ముని. ఉపచారికుడు చేసిన యజ్ఞంలో పాల్గొన్నాడు. - మహాభారతం

**ఆధూర్త వజరజసుడు :** కుశుని కుమారుడు. ధర్మారణ్యమును పాలించెను. - రామాయణం

**ఆన 1 :** మళయాళంలో ఆన అంటే ఏనుగు. అగస్త్యుని శాపంవల్ల ఇంద్రద్యుమ్నుడు ఏనుగుగా మారాడు. - భాగవతం

**ఆన 2 :** కాశ్యపుని భార్యల్లో ఒకరైన క్రోదవశకు పదిమంది ఆడపిల్లలు. అందులో మాతంగి ఒకరు. మాతంగికి జన్మించిన వారే ఏనుగులు. - వాల్మీకి రామాయణం

**ఆనక :** యదువంశంలోని ఓ వ్యక్తి (చూ॥ యదు వంశం)

**ఆనకదుంధుబి :** శ్రీ కృష్ణుని తండ్రి అయిన వసు దేవుని పేరు. శ్రీకృష్ణుడు జన్మించినపుడు దుందుబులు మ్రోగుటచే ఆ పేరు వచ్చెను.

**ఆనకుడు :** వసుదేవుని తమ్ముడు.

**ఆనర్తం :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజ్యం. దాన్ని అర్జునుడు జయించాడు. - మహాభారతం

**ఆనర్తుడు :** శర్యాతి కుమారుడు. - భాగవతం

**ఆనీకుడు :** వసుదేవుని తమ్ముడైన ఆనకుని రెండో కొడుకు. యదు వంశజుడు.

**ఆనుశాసనిక పర్వం :** మహాభారతంలోని ఓ పర్వం.

**ఆనందతీర్థులు :** ఆచార్యత్రయంలోని రెండోవాడైన మద్వాచార్యులు.

**ఆనందుడు :** చాక్షుషువు విక్రాంతుని ఇంట పెరుగుచున్న పుడు విక్రాంతుని భార్య పెట్టినపేరు. చూ॥ చాక్షుషువు.

**ఆనందం :** మేరు పర్వతం మీదగల అరణ్యం. దేవ గంధర్వ అప్సరస లిక్కడ నివసిస్తారు. - పద్మపురాణం

**ఆపగ :** ఇదో పుణ్యనది. దీని తీరంలో ఓ బ్రాహ్మణుడికి భోజనం పెడితే వేరే ప్రాంతాలలో కోటి మంది బ్రాహ్మణులకు భోజనం అందించినట్లే. - మహాభారతం

**ఆపవనుడు 1 :** వశిష్ఠుడికి మరోపేరు. - మహాభారతం

**ఆపవనుడు 2 :** ప్రాచీన కాలంలో ఓ ముని. ఇతని ఆశ్రమాన్ని కార్తవీర్యార్జునుడు తగులబెడితే ఇతడు కార్తవీర్యార్జునుడ్ని, అగ్నిని శపించాడు. - మహాభారతం

**ఆపుడు 1 :** అష్టావసువుల్లో ఒకడు. ఆపుని కుమారులు వైతంధ, శ్రతు, శాంత, శ్వాని (చూ॥ అష్టావసువులు)

**ఆపుడు 2 :** ఒక అగ్ని. ముదిత ఇతని భార్య. కుమారుడు అద్భుతుడు. ఇతడు దేవతలకు హవ్యం మోసుకెళ్తాడు. ఆ పని చేయలేక అదర్వుడి కప్పగించి సముద్రంలో దాక్కుంటాడు. ఇతని జాడ చేపలు దేవతలకు చెప్పగా వాటిని శపిస్తాడు.

**ఆపూర్ణుడు :** కాశ్యప కుటుంబంలో ప్రసిద్ధి చెందిన సర్పం. - మహాభారతం

**ఆపోదధౌమ్యుడు :** చూడుము : అయోధ ధౌమ్యుడు.

**ఆప్తుడు :** కాశ్యప కుటుంబంలో ప్రసిద్ధి చెందిన సర్పం. - మహాభారతం

**ఆభీరసులు :** సింధూ, సరస్వతీ తీరాల వద్ద నివసించే వారిని ఇలా పిలుస్తారు. వీళ్లుకూడా కలియుగంలో రాజులౌతారని మార్కండేయుడు చెప్తాడు. నిజంగా వీరు రాజులే. పరశురాముడికి భయపడి శూద్రులౌతారు. - మహాభారతం

**ఆభీరం :** సింధూనదికి పడమరగా ఆర్యావర్తానికి దగ్గరగా వుండే ఒక ప్రదేశం. -మహాభారతం

**ఆయతి :** మహా మేరువు యొక్క ఇద్దరు కుమార్తెలలో ఒకరు. రెండవది నియాతి. - విష్ణుపురాణం

**ఆయవసుడు :** ఇతడొక రాజు. - ఋగ్వేదం

**ఆయుధ పరీక్ష :** కౌరవ పాండవుల ఆయుధ విద్యాభ్యాసం తర్వాత ద్రోణుడు వారి ప్రావీణ్య ప్రదర్శన ఏర్పాటు చేశాడు. దీనినే ఆయుధపరీక్ష అంటారు. - మహాభారతం

**ఆయువు 1 :** ఒక మండూక రాజు. అతని కుమార్తె సుశోభన. ఈమె స్త్రీ రూపమును దాల్చి పలువురు రాజులను మోహింపజేయుచుండెను. పరీక్షిత్తు అను రాజు ఆమెను వివాహమాడెను. ఒకనాడు ఆయువు వుండిన కొలనులో భార్యాభర్తలు దిగగా ఆమె అదృశ్యమయ్యెను. అంత పరీక్షిత్తు కోపించి ఆ కొలనులోని కప్పలను సంహరించుచుండెను. అంతట ఆయువు

ప్రత్యక్షమై కప్పలను చంపవలదని తన కుమార్తెను తెచ్చి యిచ్చి ఇందరిని మోసము చేయుచున్న తన కూతురు సుశోభన, ఆమె పుత్రులు కపటవర్తకులగుదురని శపించెను. –మహాభారతం

★**ఆయువు 2 :** ఊర్వశియందు పురూరవునికి పుట్టిన కుమారుడు. పురూరవుని మరణ కారకులైన మునులను సంహరించుటకై ఇతని సోదరులు బయలు దేరగా వారించి వారితో పోరాడి వారి ప్రయత్నాన్ని మాన్పించెను. ఇతని భార్య స్వర్భానవి. నహుషుడు, వృద్ధశర్మ, గయుడు, అనేనుడు ఇతని పుత్రులు. – బ్రహ్మాండపురాణం

**ఆయుర్వేదం :** ధన్వంతరి మహర్షి తన శిష్యుడికి బోధించిన వైద్యశాస్త్రం. ఇది నాల్గువిధాలు. 1. శారీరకం, 2. మానసికం, 3. గాయాలు, దెబ్బలు, 4. సహజ వ్యాధులు. పై వ్యాధుల నివారణోపాయశాస్త్రం ఆయుర్వేదం.

**ఆయుష్మంతుడు :** హిరణ్యకశిపుని నల్గురి కొడుకుల్లో ఒకడైన సంహ్రాదుని కుమారుడు. – అగ్నిపురాణం

**ఆయోషవులు :** ప్రజానీకంలో ఓ ప్రత్యేకమైన వర్గం. వీరి వృత్తి నాటకాలు వేయడం. హస్తకళా నిపుణులు. – అగ్నిపురాణం

**ఆరాళికుడు :** మదమెక్కిన ఏనుగులను నియంత్రించే మావటి. – మహాభారతం

**ఆరుణి 1 :** ఆయోధ ధౌమ్యుడి శిష్యుడు.

**ఆరుణి 2 :** ధృతరాష్ట్ర వంశంలోని ఒక సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణిస్తుంది. – మహాభారతం

**ఆరుణి 3 :** కౌరవ సేనలోని ఓ యోధుడు. శకునితో కలసి అర్జునుడితో పోరాడతాడు. –మహాభారతం

**ఆరుణి 4 :** 108 ఉపనిషత్తుల్లో ఒక ఉపనిషత్తు.

**ఆరుషి :** పరశురాముని పూర్వీకురాలు. మనువు కుమార్తె. ఈమెను చ్యవనుడు పెండ్లాడతాడు. వీరి కొడుకు ఔర్యుడు. ఇతడి కొడుకు రుచికుడు. ఇతని కొడుకు పరశురాముడి తండ్రియైన జమదగ్ని – మహాభారతం

**ఆర్జవుడు :** శకుని సోదరుడు. సుబలుని కుమారుడు. అర్జునుని కుమారుడు ఐరావతుడు ఇతణ్ణి కురుక్షేత్రంలో వధిస్తాడు. – మహాభారతం

**ఆర్షం :** ఒక సాంప్రదాయ వివాహ విధానం. ఒక జత ఆవుల్ని వరుడి దగ్గర నుండి కన్యాదానం చేసే పద్ధతి.

**ఆర్య :** సుబ్రహ్మణ్యస్వామి ఏడుగురు తల్లులలో ఒకరు. –మహాభారతం

**ఆర్యక :** దుర్గాదేవికి మరోపేరు. – అగ్ని

**ఆర్యకుడు 1 :** ఒక సర్పరాజు. దుర్యోధనాదులు భీముడికి విషాహారం ఇచ్చి కొలనులో పడేసినప్పుడు సర్పాలు అతణ్ణి కాటేస్తాయి. విషం విరిగి భీముడు ఆ సర్పాలను చంపేస్తుంటే కొన్ని పారి పోయి వాసుకి దగ్గరకు వెళ్తాయి. అందులో ఆర్యకుడు ఒకడు. భీముడికి రసపానం ఇమ్మని వాసుకి ఆర్యుకుడికి సలహా ఇస్తాడు. – మహాభారతం

**ఆర్యకుడు 2 :** గరుడుడు ఈ ఆర్యకుడి కొడుకు చికురుణ్ణి సంహరించి మనుమడు సుముఖుణ్ణి కూడా సంహరిస్తానని బెదిరిస్తాడు. అప్పుడే మాతలి వచ్చి సుముఖుణ్ణి తన కూతురికిచ్చి వివాహం చేయమంటుంది. ఆర్యకుడు పై విషయం చెప్పగా మాతలి ఇంద్ర విష్ణుల సహాయంతో సుముఖుణ్ణి రక్షిస్తుంది. – మహాభారతం

**ఆర్యావర్తం :** హిమాలయాలకు, వింధ్య పర్వతాలకు మధ్యనున్న భారతదేశం ఆర్యావర్తం. – ఋగ్వేదం

**ఆర్తిమానం :** భయాల్ని పోగొట్టే ఒక మంత్రం. – మహాభారతం

**ఆర్ష్టిషేణుడు 1 :** ఇతడు రాజ్యాన్ని కుమారుడికి అప్పగించి భార్యతో గంగా తీరానికి వెళ్లగా ఇతడ్ని భార్యను, రుత్విజుణ్ణి మిధువనే రాక్షసుడు రసాతలానికి తీసుకుపోగా రుత్విజుడి కొడుకు దేవాపి బైటకు తీసుకు వస్తాడు. – బ్రహ్మాండపురాణం

**ఆర్ష్టిషేణుడు 1 :** భరద్వాజుడి ఆశ్రమానికి కుబేరుడి రాజధానికి మధ్యలో ఇతని ఆశ్రమం వుంది. పాండవులితణ్ణి దర్శిస్తారు. ఇతడో మహర్షి. – మహాభారతం

**ఆర్యులు :** ఆర్యులు ఉత్తర భారతదేశానికి వలస వచ్చిన వారు. వీరికి వ్యవసాయం ముఖ్యవృత్తి. ఇనుము లోహంతో ఆయుధాలు, వడ్రంగి ఇతర వృత్తులు చేసేవారు. మొదట వీరు ఫణి అనే తెగవారి నుండి మొదట నిరోధించడానికి ప్రయత్నించి విఫలులై నారు. వీరి దేవుడు ఇంద్రుడు. అశ్వాలు వీరికి తెలిసిన ముఖ్య

★ నహుషుడు, క్షత్రవృద్ధుడు, రజిరంభుడు, అనేనసుడు ఇతని పుత్రులని భాగవతం చెప్తోంది.

జంతువులు. ఏనుగు అనే జంతువు తెలియదు. మొదట వీరి సమాజం 4గా విభజించబడింది. కొన్ని కుటుంబాలు కలిసి ఓ గ్రామం, కొన్ని గ్రామాలు కలిసి ఓ విషయం, చాలా విషయాలు కలిపి 'జనం' అనేవారు. వీటిపైన ఓ రాజు వుండేవాడు. అతడు శిక్షకు అతీతుడు. అతని వద్ద వుండే ప్రధాన పురోహితుడే ప్రధాన సలహాదారు. ఇందు ప్రధాన ఉదాహరణలు వశిష్ఠుడు, విశ్వా మిత్రుడు. బహుభార్యత్వం వుండేది. విధవా వివాహం వుండేది. ఇతర జాతులతో ఘర్షణ ఏర్పడింది. వీరే దస్యులు, అంటే ద్రావిడ జాతులు. ఇందులో ఎందరో బలవంతులైన రాజులుండేవారు. వీరు సఖ్యతతో వుండి పై నుండి ఇతర ఆర్యులను రాకుండా అడ్డుకున్నారు. వేద కాలం నాటికి అదే పెద్ద యుద్ధం. తర్వాత ఆర్యులు ద్రావిడుల నుండి విగ్రహారాధనను కూడా మిళితం చేసుకొన్నారు. ఈ ఇద్దరి సంకీర్ణ నాగరికతే హిందూ నాగరికత. ఈ నాగరికత మొదట హిమాలయాలనుండి యమునా తీరం వరకు ఏర్పడింది.

**ఆర్చీకము :** సైంధవ అరణ్యానికి ముందున్న పర్వతం. ఇచట మనీషి పురుషులనే జాతి నివసించేవారు.
– *మహాభారతం*

**ఆలజాల :** చూడుము. యమజిహ్వం.

**ఆలంబాయనుడు :** ఇంద్రుని స్నేహితుడు. – *మహాభారతం*

**ఆలంబుడు :** ఓ ముని. యుధిష్ఠురుని ఆస్థానంలో ప్రసిద్ధుడు. –*మహాభారతం*

**ఆళ్వార్ :** చూ॥నమ్మాళ్వార్.

**ఆవరణుడు :** విశ్వామిత్ర రాజవంశీకుడైన రాజు.

**ఆవర్తానందం :** ఇదో పవిత్ర తీర్థం. ఇక్కడ స్నానం చేస్తే నందనవన జీవితాన్ని అనుభవించవచ్చు.
– *మహాభారతం*

**ఆవశీదం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం. కర్ణుడు దీన్ని జయించాడు. – *మహాభారతం*

**ఆవస్థ్యం :** ఒక అగ్ని – *మహాభారతం*

**ఆవహ :** ఒక వాయువు. – *మహాభారతం*

**ఆవంతిక :** యోగంధరాయణుని కుమార్తె. ఉదయనుని కథలో యోగంధరాయణునికి ప్రాముఖ్యత కలదు.
– *చూ॥ యోగంధరాయుడు*

**ఆవిర్హోత్రుడు :** విశ్వమిత్రుని రాజవంశీకుడు. ఒక రాజు. ఇతని వంశము వాడే భరతుడు. అక్కడ నుండే ఈ దేశానికి ఆ పేరు వచ్చింది. అతడు అతని సోదరులు భారతదేశ వివిధ భాగాలను పాలించారు.

**ఆశౌచం :** ఇది రెండు రకాలు 1. జాత 2. మృత. జాతాశౌచాన్ని వృద్ధి పురుడు అని అంటారు. బ్రాహ్మణుల్లో పిత్రాదిన పిండులు మృతులైతే ఆశౌచం పదిరోజులు, క్షత్రియులకైతే 12 రోజులు, శూద్రులకైతే 30 రోజులు. చూడాకర్మవిహీనులైన శిశువులు మరణిస్తే ఆశౌచం ఒక రోజు, చూడాకర్మ చేస్తే ఆశౌచం మూడు రోజులు, పై వర్ణాలవాళ్లు జాతాశౌచాన్ని కూడా మృతాశౌచంలాగా ఆచరిస్తారు. పన్నెండో రోజుదాకా పిండ ప్రదానం చేసి, 11వ రోజున వృషోత్సవం చేసి 11 మంది బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి.

**ఆశ్రమం :** ఆశ్రమవాసులు నాలుగు రకాల జీవితాన్ని గడిపి అందులో పరీక్షకు నిలబడాలి. ఆ నాలుగు బ్రహ్మచర్యం, గృహస్థ్యం, వానప్రస్థం, సన్యాసం.
– విష్ణుపురాణం

*బ్రహ్మచర్యం :* ఇది మొదటి అంకం. ఇందులో ఉపనయనం తర్వాత బ్రహ్మచర్య వ్రతం ఆచ రించాలి. వేద పఠనం చెయ్యాలి. ఇంద్రియ నిగ్రహం పాటించాలి. గురువు వద్దే నివసించాలి. శుచి ఆచారాలను గురువు చెప్పినట్లు పాటిస్తూ అతనికి శుశ్రూష చేస్తూ అతనికి కావలసిన ఫలపుష్పాలను అందజేస్తూ అతడు స్నానం చేసిన నీటిలోనే తనూ స్నానం చేస్తూ ఉదయము సాయంత్రము సూర్యుడికి అగ్నికి సంధ్యావందనం చెయ్యాలి. గురువు కూర్చుంటే అతడు కూర్చోవాలి. గురువు నడుస్తుంటే అతని వెనుక నడవాలి. గురువాజ్ఞకు ఎదురు చెప్పరాదు. అతడు యాచించి తెచ్చుకున్న ఆహారాన్ని భుజించాలి.

*గృహస్థ్యం :* బ్రహ్మచర్యం తర్వాత గురుదక్షిణ చెల్లించి గృహస్థ్యంలోకి ప్రవేశించాలి. గురువు అంగీకారంతో వివాహం చేసుకొని తనకున్న అర్హతకు సరిపడ జీవితాన్ని సాగించాలి. పితృలకు పిండదానం చేయడం, ప్రపంచాన్ని ప్రేమించడం, సుగుణమయిన పనులు చేయడం, సన్యాసులకు బ్రహ్మచారులకు సహాయపడటం ముఖ్యధర్మాలు. అతిథులను గౌరవించడం

చాలా ముఖ్యం. వారు విచారంగా వెళితే ఇతడు చేసిన శుభకార్యాలన్ని పోయినట్లే. గృహస్త ధర్మాన్ని సరిగా నిర్వహిస్తే గౌరవ ప్రపంచంలోకి అడుగు పెట్టినట్లే.

*వానప్రస్తం :* గృహస్తాన్ని నిర్వహించిన తర్వాత భార్యను పిల్లలకు వదలిగాని తనతో తీసుకొనిగాని అడవులకు వెళ్లి తపస్సు చెయ్యాలి. ఆహారంగా ఆకులు పండ్లు వ్రేళ్లు భుజించాలి. జుట్టు గడ్డం పెంచుకొని కటిక నేలపై పరుండాలి. అన్నిరకాల అతిథులను గౌర వించాలి. అతడు వాడే దుప్పటి జంతు చర్మం అయి వుండాలి. లేకుంటే దర్భాకులై వుండాలి. వేడిని చలిని సమానంగా భరిస్తూ తపమాచరించాలి.

*సన్యాసం :* వానప్రస్తం తర్వాత సన్యాసం. శతృత్వం విడనాడాలి. ప్రయాణాల మీద, భార్యమీద, సమస్త వస్తువుల మద మక్కువ పోవాలి. ఒక రాత్రి కంటె ఎక్కువ ఏ గ్రామంలోను, 5 రాత్రులకంటే ఎక్కువ ఏ పట్టణంలోను వుండకూడదు. ఎవరూ ఇతని యెడ రాగ ద్వేషాలను ప్రదర్శించేటట్లు వ్యవహరించ కూడదు. బ్రతకడం కోసం అడుక్కుని తినాలి. అదికూడ బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల గృహాలలోనే. కామ క్రోధ లోభ మదమాత్సర్యాలను త్యజించాలి. ఏ జీవికి భయపడరాదు. వీటిని నిశ్చలంగా ఆచరిం చిన బ్రాహ్మణుడు బ్రహ్మలోకం చేరతాడు.

**అశ్వలాయనుడు :** ఒక ఆచార్యుడు. శౌనకమహర్షి శిష్యుడు. అశ్వలాయన గృహసూత్రాలు, అశ్వలాయన శ్రౌతసూత్రాలు, అశ్వలాయన స్తుతి ఇతని రచనలు.

**అశ్వలాయనుడు :** విశ్వామిత్రుడి కొడుకు. – *మహాభారతం*

**ఆశావహుడు 1 :** అదితి కాశ్యపుల 10 మంది కుమారు లలో ఒకడు.

**ఆశావహుడు 2 :** వృష్ణివంశ రాజకుమారుడు. ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. – *మహాభారతం*

**ఆషాఢకుడు :** కథా సరిత్సాగరంలోని ఉదయుని కథలో భద్రావతి అను ఏనుగు కలదు. దాని మావటి వాడు ఆషాఢకుడు. – *కథా సరిత్సాగరం.*

**ఆశ్రావ్యుడు :** ఇంద్రుని కొలువులోని ఓ ముని. – *మహాభారతం*

**ఆషాఢభూతి :** దేవశర్మ అనే సన్యాసి పిసినారి. ఎవరే మిచ్చినా దాచుకొని ఓ బొంతలో పెట్టుకుని దాచుకొనే వాడు. ఆషాఢభూతి అనేవాడు ఇది కనిపెట్టి అతని వద్ద శిష్యుడుగా చేరి బహునమ్మకంగా కొన్నాళ్లు నటించాడు. ఒక రోజున దేవశర్మ ఆ బొంతను జాగ్రత్తగా చూడమని చెప్పగా అదే అదనుగా అది తీసుకొని పారిపోతాడు. – *పంచతంత్రం*

**ఆషాఢుడు 1 :** ఒక రాజు. క్రోదవశుడి అవతారం. – *మహాభారతం*

**ఆషాఢుడు 2 :** చూ॥ శివుడు

**ఆషాఢం 1 :** ఇదో మాసం పేరు.

**ఆషాఢం 2 :** ఇదో నక్షత్రం. ఈ నక్షత్రం వున్న రోజున ఉపవాసం చేసి బ్రాహ్మణుడికి పెరుగు దానమిస్తే ఆవులు ఎక్కువగా వుండే కుటుంబంలో జన్మిస్తారు. – *మహాభారతం*

**ఆసవబాందేశ్వరుడు :** కాశీలోని దేవత.

**ఆస్తీకుడు :** జరత్కారుడి కొడుకు. ఇతడు చిన్న తనంలోనే సకల విద్యలు అభ్యసిస్తాడు. జరత్కారుడు ఇతణ్ణి సర్పయాగం మానమని సలహా ఇవ్వడానికి జనమే జయుని వద్దకు పంపుతాడు. – *మహాభారతం*

**ఆసురాయణుడు :** విశ్వామిత్రుని కుమారులలో ఒకడు. – *మహాభారతం*

**ఆసురి :** ప్రాచీన కాలపు మహర్షి. పంచశిఖుని గురువు. ఆధ్యాత్మిక చింతనను గురించి ఇతరులకు ఏన్నో బోధనలు చేశాడు. ఇతడీ ఆధ్యాత్మిక శక్తి ఆమె భార్య నుండి పొందాడని చెప్తోంది. – *భాగవతం*

**ఆసురం :** ఓ వివాహ విధానం.

**ఆసంగుడు :** చూ॥ అనషా.

**ఆసంగప్లాయోగి :** ఇతడిని గురించి ఋగ్వేదంలో వివరించబడింది. ఇతడు ప్రకృతి సిద్ధంగా దయార్ద్ర హృదయుడు. ఇతని మగటిమి పోయి స్త్రీగా మారుతాడు. మేధ్యాతిధి అనే మునివల్ల మళ్ళీ పురుషుడవుతాడు.

**ఆసందివుడు :** ఓ బ్రహ్మణ బాలుడు. తండ్రి పెళ్లి చేయ బోగా ఓ రాక్షసి ఇతడ్ని ఎత్తుకుపోయి ఓ కన్యనిచ్చి పెండ్లి చేస్తుంది. ఇతడు భార్యను చూసి ఏడుస్తాడు. ఎందుకని అడిగితే తల్లిరూపంలో వున్న ఆమె రాక్షసి

అని చెప్తాడు. భార్య గౌతమీ తీరానికి వెళ్లి తపస్సు చెయ్యమని సలహాఇచ్చి ఇద్దరూ తపస్సు చేయగా విష్ణువు ప్రత్యక్షమై రాక్షసిని సంహరిస్తాడు.
– మహాభారతం

**ఆహవనీయం :** ఓ అగ్ని. – మహాభారతం

**ఆహుక :** ఆహుకుడి భార్య ఆహుక. చూ॥ ఆహుకుడు.

**ఆహుకి :** దేవకుడి మేనత్త.

**ఆహుకుడు :** భిల్ల వంశంలోనివాడు. పరమ శివభక్తుడు. భార్య ఆహుక. శివుడు వీళ్లను పరీక్షిం చడానికి యతి వేషంలో వచ్చి వారున్న చోటును తనకిమ్మంటాడు. ఆహుకుడు ఒప్పుకోడు. భార్య వత్తిడిమీద యతిని పిలిచి అతడ్ని తన గుడిసెలో పడుకొమ్మంటాడు. ఆ తెల్లవారుజామున ఓ పులి ఆహుకుడ్ని మింగేస్తుంది. ఆహుక సతీసహగమనం చేయబోగా శివుడు ప్రత్యక్షమై మీరు తర్వాతి జన్మలో నలదమయంతులుగా పుడతా రని నేను హంసగా దౌత్యం నెరపుతానని చెపుతాడు.
– శివపురాణం

**ఆహుతి :** ఓ క్షత్రియరాజు. జారూతి నగరంలో శ్రీకృష్ణుడు ఇతనిని సంహరించెను. – మహాభారతం

**ఆంగరిష్టుడు :** ఒక రాజు. ధర్మార్థకామ విషయములను కామాందకుడను ముని వద్ద తెలిసికొనెను.
– మహాభారతం

**ఆంగి :** అరిహుని భార్య, మహాభౌముని తల్లి.
– మహాభారతం

**ఆంగిరసకల్పం :** అధర్వవేదంలోని ఓ భాగం.
– విష్ణుపురాణం

**ఆంగిరసి :** బ్రాహ్మణ వనిత. పుత్రార్థియై ఆమె తన భర్తతో కూడియుండ కల్మషపాదుడామె భర్తను మ్రింగి వేసెను. శోక సముద్రయై ఆమె నీవు, నీ భార్యను కలసినపుడు నీ తల పగులునని శపించెను. వసిష్ఠుని వలన నీ జీవితం నిలచునని అనుగ్రహించి అగ్ని ప్రవేశము చేసెను. – భాగవతం

**ఆంగిరసుడు :** చూ॥ బృహస్పతి.

**ఆంగిరసులు :** రతీ తరుని భార్యయందు అంగి రసుడను ముని వల్ల బుట్టిన కుమారులు. వీరు రధీతర గోత్రులై తేజోవంతులైన బ్రాహ్మణులై వెలసిరి. – భాగవతం

**ఆంఘ్రికుడు :** బ్రహ్మవాదులైన విశ్వామిత్రుడి కుమారుల్లో ఒకడు. – మహాభారతం

**ఆంజనకులం :** సైన్యంలోని గజబలం. – మహాభారతం

**ఆంజనేయుడు :** చూడుము : హనుమంతుడు

**ఆంజలుడు :** ఒక ఋషి. శౌనకుడి సహాధ్యాయి.
– భాగవతం

**ఆంధ్రభృత్యులు :** మగధ దేశపు రాజులైన శూద్రకుడి వంశస్తులు. శాలివాహన శక ప్రారంభంలో రాజ్యం పాలించారు. వీరి తర్వాత ఆభీరులు, గర్ధభులు, శకులు, యవనులు పాలించారు.

**ఆంధ్రం :** చూ॥ అంధ్రం.

**ఆంధ్రులు :** చూ॥ అంధ్రులు.



**ఇ :** ఈ అక్షరానికి అర్థం కామదేవుడు. – అగ్నిపురాణం

**ఇక్షుమతి :** ఇది కురుక్షేత్రం గుండా ప్రవహించే నది. ఇందులో నాగులు, తక్షకులు, అశ్వసేనులు నివసిస్తారు.
– మహాభారతం

**ఇక్షుల :** ఓ ప్రముఖమైన నది. – మహాభారతం

**ఇక్ష్వాకు 1 :** వైవస్వతమనువు కుమారుల్లో ఒకడు. వంశవృక్షం : విష్ణు – బ్రహ్మ – మరీచి, కాశ్యప, వివాస్యానుడు – వైవశ్వతమనువు – ఇక్ష్వాకు. ఇతడు సూర్యవంశ రాజులకు మూలపురుషుడు. సూర్య వంశపు రాజులనడానికి ఇతడు వైవశ్వ తుడికి (సూర్యుడు) జన్మించడమే కారణం. ఇతనికి ముగ్గురు పుత్రులు దండ, వికుక్ష, నిరు. ఈ వంశంలో తర్వాత జన్మించినవారు దశరథుడు, శ్రీరామచంద్రుడు. మనువు తరువాతే ఇక్ష్వాకు జన్మించాడని చెప్తాడు. – భాగవతం

**ఇక్ష్వాకు 2 :** కృతయుగమున మనువు యొక్క మనుమడైన క్షుతాని పుత్రుడు. ఇతనికి నూరుగురు కుమారులు. వీరిలో పెద్దవాడు వింశుడు. – మహాభారతం

**ఇడా 1 :** వాయుదేవుని కుమార్తె, ఈమెకు ధృవుని వల్ల ఉత్కల అనుపుత్రుడు జన్మించెను.

**ఇడా 2 :** మనువు యొక్క కుమార్తె.
– తైత్తిరియోపనిషత్తు

దేవాసురులు త్రివిధాగ్నులతో యజ్ఞం చేస్తున్నారని తెలిసి మనువు ఈమెను అక్కడకు పంపుతాడు. వారు ఆ యజ్ఞాన్ని సరైన పద్ధతిలో నిర్వహించడం లేదని మనువుతో చెప్పి తనే సరైన పద్ధతిలో అమర్చుతుంది. మనువు చెంతనుండగా దేవతలు అసురులు ఈమెను ఒకరు మనసారా, మరొకరు మోసపూరితంగా వారితో రమ్మని కోరగా ఆమె దేవతల పక్షాన చేరుతుంది. దానితో సకల జీవులు దేవతల పక్షాన జేరతాయి.

– తైత్తరియోపనిషత్తు

**ఇతర :** ఈమె ఒక రుషి భార్య. ఈమె కుమారుడు ఐతరేయుడు. అతనికి వేరు భార్యలు కలరు. వారిని వారి పుత్రులను ఆదరించి ఐతరేయుడు తనతొడపై కూర్చుండగా తండ్రి లేవగొట్టెను. అంతట ఇతర భూదేవిని ప్రార్థించగా భూదేవి ప్రత్యక్షమై ఐతరే యుని సింహాసనారూఢుని చేసెను.

**ఇతిహాసాలు :** రామాయణ భారతాలను ఇతిహాసాలు అంటారు. ఇవి చారిత్రకతతో కూడి మానవాళికి జ్ఞానాన్ని అందిస్తాయి.

**ఇధ్మజిహ్వుడు :** స్వాయంభవ మనువుకు ఇద్దరు కుమారులు. ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు. విశ్వకర్మ ప్రజాపతి కుమారైలైన సురూప, బర్హిష్మతిలను, ప్రియవ్రతుడు వివాహమాడగా సరూపకు పుట్టిన 9 మంది కుమారుల్లో పెద్దవాడు ఇధ్మజిహ్వుడు. ఇతనికి 7 గురు కుమారులు. ఈ ఏడుగురికి ప్లక్ష ద్వీపాన్ని ఏడు భాగాలుగా పంచి ఇస్తాడు.

– *మహాదేవీ భాగవతం.*

**ఇధ్మవాహుడు :** లోపాముద్రకు అగస్త్యుని వల్ల జన్మించిన ఏకైక కుమారుడు. తండ్రి హోమానికి కావలసిన వస్తువులను తీసుకువచ్చే వాడు కనుక ఇధ్మవాహుడను పేరు వచ్చింది. అసలుపేరు త్రిదస్యుడు.

సామాన్యశక్తిగల 1000 మంది పిల్లలు కావాలా లేక 10 మంది శక్తిగల 100 మంది కావాలా 100 మంది శక్తిగల 10 మంది పిల్లలు కావాలా 1000 మంది శక్తిగల ఒకే కుమారుడు కావాలా అని కోరితే లోపాముద్ర గొప్పకుమారుడొక్కడే కావాలని కోరితే 7 సంవత్సరాల గర్భిణి తర్వాత ఇతడు జన్మించాడు.

**ఇనుడు :** చూ॥ సూర్యుడు.

**ఇనుప భీముడు :** కురుక్షేత్ర యుద్ధానంతరము పాండవులు ధృతరాష్ట్రుని జూడబోయిరి. భీమసేనుని పరిచయము చేయుచుండగా ధృతరాష్ట్రుడు తన కుమారులను చంపిన కోపము పైకి కన్పించకుండా భీముని రూపమున వుంచిన విగ్రహమును గట్టిగా కౌగిలించుకొని లోలోన సంతసించుచునే ఆ భీముని విగ్రహము ముక్కలైనందునకు విచారము నటించెను. శ్రీకృష్ణుడు ఇది ముందే గ్రహించి భీముని బదులు ఇనుప విగ్రహము చేయించి ధృతరాష్ట్రుని ముందుకు తోసెను. మీ బలము తెలిసియే ఇట్లు చేసితినని శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునికి చెప్పెను. – *మహాభారతం*

**ఇరా 1 :** ఈమె కశ్యపుని భార్యలలో ఒకరు. ఈ ప్రపంచంలోని వృక్షజాతికి ఈమె జన్మనిచ్చింది.

– *అగ్నిపురాణం*

**ఇరా 2 :** కుబేరుని ఆస్థానములోని ఓ దేవత.

– *మహాభారతం*

**ఇరామా :** ఇదొక నది. శ్రీకృష్ణుని ఉదరంలో మార్కండేయుడు దీనిని చూశాడని చెప్తారు. – *మహాభారతం*

**ఇరావతి 1 :** కశ్యపుని మనుమరాలు, కశ్యపుని పదిమంది కూతుర్లలో కద్రువ ఒకరు. కద్రువ యొక్క కూతురు ఇరావతి.

**ఇరావతి 2 :** ఒక నది. – *మహాభారతం* – *రామాయణం*

**ఇరావతి 3 :** ఉత్తరుడి కూతురు. పరీక్షిత్తు భార్య.

– *భాగవతం*

**ఇరావంతుడు :** ఇతడు అర్జునునికి నాగకన్య ఉలూపివల్ల జన్మించిన కుమారుడు. ఇతడు కురు క్షేత్ర యుద్ధంలో పాండవుల తరపున పోరాడాడు. మొదటిరోజున శృతాయువుతో పోరాడాడు. విందారవిందుల్ని ఓడించాడు. శకుని 5 గురు సోదరుల్ని సంహరించాడు. అలంబసునితో జరిగిన యుద్ధంలో మరణించాడు. – *మహాభారతం*

**ఇరి :** యమధర్మరాజు కొలువులో 100 మంది రాజులు వుంటారు. వారంతా యముడ్ని పూజిస్తారు. వీరిని ఇరులు అంటారు. – *మహాభారతం*

**ఇరింపు :** ఇదో మళయాళ పదం. దీని అర్థం ఇనుము. ఇది శివుని వీర్యంయొక్క వేడినుండి ఉద్భవించిందని చెప్పబడింది. – *రామాయణం*

**ఇర్జిక :** మహాభారత కాలంలో ఒక ప్రాంతం.
– మహాభారతం

**ఇల :** వైవశ్వత మనువు కుమార్తె. ఈమె పురుషునిగా మారినప్పుడు ఇతని పేరు సుద్యుమ్నుడు. వైవశ్వత మనువు, అతని భార్య శ్రద్ధా ఓ కుమారుడు కావాలని అగస్త్యుని ఆధ్వర్యంలో యజ్ఞం చేయగా ఓ కుమార్తె జన్మించింది. ఆమె పేరే ఇల. నేను కుమారుడు కావాలని యజ్ఞం చేస్తే కుమార్తె ఎందుకు జన్మించిందని వశిష్ఠ మహర్షిని అడుగగా వశిష్ఠుడు తన శక్తితో ఆమెను పురుషుడుగా మార్చాడు. అతని పేరే సుద్యుమ్నుడు.
– భాగవతం

సుద్యుమ్నుడు మరల స్త్రీయగుట *:* ఒకసారి శునక మహర్షి ఇతర మునులు కైలాసం వద్దవున్న కుమార వనంలోకి వెళ్ళారు. ఆ సమయంలో పార్వతీ పరమే శ్వరులు నగ్నంగా వుండి కామకేళీ విలాసంలో వున్నారు. ఈ మహర్షులను చూసి శివపార్వతులు కోపితులై ఈ అరణ్యంలోకి ఇకముందు ఎవరువచ్చినా స్త్రీలుగా మారిపోతారని శపించాడు. – *భాగవతం.*
ఒకరోజు యువకుడైన సుద్యుమ్నుడు ఈ అరణ్యంలోకి తన స్నేహితులతో వేటకు వెళ్ళి శివుని శాపం ప్రకారం స్త్రీగా మారాడు. ఆ స్త్రీలకు నాయకిగా తిరిగి వస్తూ బుద్ధుడిని ప్రేమించి అతనివల్ల పురూరవుడికి జన్మనిస్తుంది.
స్త్రీ మరల పురుషుడగుట *:* ఇందుకు కలత చెందిన ఇల వసిష్ఠుడిని తరుణోపాయము కోరగా వసిష్ఠుడు పరమశివుడిని కృపచూపమని ప్రార్థించినాడు. ఓ మాసం స్త్రీగావుంటే మరోమాసం పురుషుడిగా మార తాడని ఇది జీవితాంతం భరించవలసినదేనని శివుడు కొంత ఉపశమనం కల్గించగా ఇతడు ఓ నెల రాజ్య భారం మోస్తూ మరోనెల గృహంలో వుండేవాడు. కుమారుడు పురూరవుడు పెద్దవాడయ్యేవరకు ఇతని సోదరుడు ఇక్ష్వాకుడు రాజ్యపాలన సాగించాడు.
– దేవీభాగవతం

పురూరవుడు పెద్దవాడైన తర్వాత రాజ్యాన్ని అతనికి అప్పగించి ఇతడు అరణ్యవాసియై తపమాచరించి మోక్షం పొందుతాడు. పురూరవుడు ఊర్వశిని పెండ్లాడతాడు. – మహాభారతం

**ఇలవు :** చూ॥ వాయువు.

**ఇల్వలుడు :** ఒక రాక్షసుడు. ఇతని సోదరుడు వాతాపి. దుర్వాసుని కుమారుడు. ఇతడు సకల కామ సిద్ధి కొరకు ఒక మంత్రమునుప దేశింపుమని ఒక బ్రాహ్మ ణుని కోరెను. కాని విఫల మనోరధుడై బ్రాహ్మణులను హింసింపజొచ్చెను. ఇతడు బ్రాహ్మణులను భోజన మునకు పిలిచి తన తమ్ముని మేకగా మార్చి వీరికి భోజనంలో వడ్డించెడివాడు. వారు భుజించిన తర్వాత వాతాపిరమ్మని పిలచెడివాడు. అతడు బ్రాహ్మణుల పొట్ట చీల్చుకొని బయటకు వచ్చెడివాడు. ఇది బ్రాహ్మ ణులు అగస్త్యునికి మొరపెట్టుకొనగా అగస్త్యుడు ఇల్వ లుని వద్దకు తగినంత ధనము కావలెనని వచ్చెను. అటులనే ముందు భోజనము చేయుమని కోరి ఇతరు లకు చేసినట్లే అగస్త్యునికి వాతాపిని మేకను చేసి భోజనము పెట్టెను. అగస్త్యుడు భోజనం తరువాత వాతాపిజీర్ణం, వాతాపిజీర్ణం అని అనగా అతడు జీర్ణమైపోయెను. ఇల్వలుడు వాతాపి వాతాపి అని పిలిచినను బయటకు రాకుండుట నెరింగి అగస్త్యునికి తగినంత ధనమిచ్చి పంపెను. – మహాభారతం

**ఇలాపుత్రుడు :** కద్రువకు పుట్టిన ఓ సర్పం. చాలా తెలివైనవాడు. కద్రువ పుత్రులను జనమేజయుని యాగంలో బూడిదవుతారని శపించగా శేషుడు వాసుకి నాయకత్వంలో ఓ సమావేశంలో ఇతడు గొప్ప ఉపన్యాసం ఇచ్చాడు. – మహాభారతం

**ఇలావృత వర్షం :** జంబూద్వీపంలోని మధ్య ప్రాంతాన్ని ఇలావృత వర్షం అని పిలిచేవారు. – మహాభారతం

**ఇలావృతం :** ఇదో ప్రాంతం పేరు.

**ఇలావ్రతుడు :** ప్రియవ్రత రాజవంశం వాడు. ప్రియ వ్రతుడు స్వాయంభవ మనువు కుమారుడు.

**ఇలాస్పదం :** ఓ ప్రాచీన పవిత్ర నదీ తీరం. ఇక్కడ స్నానం చేస్తే దురదృష్టాలు పోతాయి. వాజపేయ యజ్ఞం చేసినంత ఫలితం వస్తుంది. – మహాభారతం

**ఇలినుడు :** పూరువంశపు రాజైన తంసుని కుమారుడు. ఇతని భార్య రతాంతరి. ఈమెకు ఐదుగురు కుమా రులు. దుష్యంతుడు, భీముడు, సుర, ప్రవాసు, వాసు. ఇతనిని ఇలులుడు అనికూడా అంటారు.
– మహాభారతం

**ఇలిబిల :** విశ్రవసుభార్య. విశ్రవసుడు పులస్త్యుని కుమారుడు. విశ్రవసునికి యిద్దరు భార్యలు. ఒకరు ఇలిబిల, రెండు కైకసి. ఇలిబిల కుమారుడు వైశ్రవణ (కుబేరుడు). అందుకే కుబేరుణ్ణి ఇలిబాల అంటారు. కైకసి సంతానం నల్గురు. రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు, శూర్పణక.

**ఇల్లకుడు :** చక్కని కుటుంబ జీవితాన్ని గడిపిన వైశ్యుడు. మధురా నగరవాసి. అతనికో చక్కని భార్య వుండెడిది. ఒకరోజు అతడు వేరే ప్రాంతానికి వెళ్లబోగా భార్య తనతో వస్తానంటే వారించి ఒక్కడే వెళ్లగా ఆమె అతని కోసం ఎదురుచూస్తూ క్రిందపడి చనిపోయింది. ఇది తెలిసి వెనుకకు వచ్చి ఆ శరీరాన్ని తనతొడపై వుంచుకొని దుఃఖిస్తూ అతడు కూడా మరణిస్తాడు.
– కథాసరిత్సాగరం.

**ఇషుపాదుడు :** కశ్యప ధనువులకు జన్మించిన ఒక రాక్షసుడు. – మహాభారతం

**ఇషుమంతుడు :** వసుదేవుడి తమ్ముడైన దేవశ్రీవసుడి రెండో కుమారుడు.

**ఇష్టరశ్మి :** ఋగ్వేదంలో పేర్కొనబడిన ఒక రాజు. ఇతడు చాలా యజ్ఞాలు చేశాడు. – ఋగ్వేదం

**ఇష్టాశ్వుడు :** ఋగ్వేదంలో పేర్కొనబడిన ఒక రాజు. ఇతడు చాలా యజ్ఞాలు నిర్వహించాడు. – ఋగ్వేదం

**ఇంద్రకీలం :** హిమాలయాలకు, గంధమాదన పర్వతాలకు ముందున్న పర్వతం. దీన్ని కుబేరుని భక్తుడు పాలిస్తాడు. – మహాభారతం

**ఇంద్రజిత్తు :** విశ్రవసుని రెండవ భార్య కైకసికి ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె. పెద్దవాడు రావణుడు. రావణ మండోదరిలకు జన్మించిన జ్యేష్టపుత్రుడు మేఘనాధుడు. ఇతడు ఇంద్రుణ్ణి జయించడంవల్ల ఇంద్రజిత్తు అని పేరు వచ్చింది.

*శివుని అంశ :* మధుర అనే దేవకన్య మతపరమైన నిరాహారియై సోమవారం శివుని పూజించడానికి అలంకరించుకొని వెళ్లింది. పార్వతి ఆ సమయంలో లేనందువల్ల శివుని రంజింపజేసి గర్భం దాల్చింది. అప్పుడు వచ్చిన పార్వతి ఇది గ్రహించి ఆమెను పాడుబడిన నూతిలో కప్పవు కమ్మని శపించింది. ఆమె శివుని ప్రార్థించగా అతడు కరుణించి 12 సంవత్సరాల తర్వాత అందమైన స్త్రీగా మారతావని మయుని కూతురుగా రాజుని వివాహమాడగలవని చెప్తాడు. మయూరా సురుడు 12 సంవత్సరాల తర్వాత ఆ నూతిలో ఓ అందమైన బాలిక కన్పించగా తనతో తీసుకొని వెళ్లి తన కూతురుగా పెంచి మండోదరి అని నామకరణం చేసి రావణుడికిచ్చి వివాహం చేస్తాడు. ఆమె శివకృపవల్ల గర్భందాల్చి శిశువును ప్రసవించగా రావణుడు అతనికి మేఘనాధుడని పేరు పెట్టాడు.
– ఉత్తర రామాయణం

*మేఘనాధుని యజ్ఞాలు :* రావణుడు ప్రపంచాన్ని జయించడానికి వెళ్లిన సమయంలో రాక్షస గురువైన శుక్రుని ఆధ్వర్యంలో అశ్వత్థామ 7 యజ్ఞాలు చేస్తాడు. ఇందులో విష్ణువుని గురించిన యజ్ఞం ఒకటి. జైత్రయాత్ర ముగించుకొని వచ్చిన రావణుడు విష్ణువు సంబంధిత యజ్ఞంచేసినందుకు కోపోద్రిక్తుడు కాగా శుక్రుడు రావణుణ్ణి విష్ణువు చేతిలో మరణం కల్గునని శపిస్తాడు. – ఉత్తర రామాయణం

మేఘనాధుడు శైవయాగం చేసి శివుని మెప్పించి సమాధి కళను పొందుతాడు. దీనివల్ల అతడు అందరిలోవున్నా ఎవరికీ కన్పించడు, అతనికి మాత్రం అందరూ కన్పిస్తారు.

ఇంద్రజిత్తు అను పేరుకు కారణం అతని విజయాలు. రావణుడు దేవలోకంపై దండెత్తాడు. రాక్షస సేన దేవలోకాన్ని చుట్టు ముట్టింది. ఇంద్రుడు విష్ణువు నాశ్రయించగా రావణుని మరణానికి ఇంకా సమయం రాలేదన్నాడు. తిరిగివచ్చిన ఇంద్రుడు రావణుడితో తలపడ్డాడు. మేఘనాదుడు శివుడు తన కిచ్చిన వరమైన మాయ రూపంలో ఇంద్రుని కుమారుడు జయంతుని అస్త్రాలతో ముంచెత్తగా జయంతుడు పడిపోయాడు. ఇంద్రుడి తండ్రి పులోముడు జయంతుడ్ని తీసుకొని వెళ్ళి సముద్రంలో దాచాడు. కుపితుడైన ఇంద్రుడు వజ్రాయుధంతో రావణుడ్ని దెబ్బ తీశాడు. రావణుడు క్రిందపడగా ఇంద్రజిత్తు మాయారూపంలో ఇంద్రుని రధమెక్కి అతణ్ణి బంధించాడు. రావణుడు కుమారునితో కలసి ఇంద్రుణ్ణి లంకానగరం తీసుకొని వచ్చాడు. బ్రహ్మలంకను జేరి ఇంద్రుణ్ణి వదలమని కోరగా ఇంద్రజిత్తుకు మరణం లేకుండా వరమిమ్మని బ్రహ్మను కోరాడు. అది అసాధ్యమని నీవు ఓ యజ్ఞం చేస్తే ఓ రధము గుర్రాలు

ప్రత్యక్షమవు తాయని దానిపై నుండి నీవు యుద్ధం చేస్తే నీకు ఓటమి లేదని వరమిస్తాడు. అప్పుడు ఇంద్రుణ్ణి వదిలివేస్తారు. ఇంద్రుడ్ని జయించడం వల్ల ఇంద్రజిత్తు నామం సార్థకమయ్యింది. రామరావణ యుద్ధానికి ముందు హనుమంతుడు లంకను చేరినపుడు వీరిద్దరికి పోరాటం జరగగా ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రంతో హనుమంతుడ్ని బంధించి రాజా స్థానానికి తీసుకువస్తాడు.

*ఇంద్రజిత్తు మరణం :* యుద్ధం తీవ్రరూపం దాల్చింది. లక్ష్మణుడికి, ఇంద్రజిత్తుకి ఘోరయుద్ధం జరిగింది. ఇంద్రజిత్తు తన మాయాజాలంతో సీతను వధించినట్లు భ్రమింపజేస్తాడు. రామలక్షణులు హనుమంతుడు దుఖఃతులై యుద్ధరంగం వీడతారు. ఈ సమయంలో బ్రహ్మ చెప్పిన యజ్ఞం ప్రారంభించడానికి నికుంబిలకు వెళ్తాడు. విభీషణుడు ఇది రాముని కెరిగించి యజ్ఞం పూర్తికాక ముందే అతనితో యుద్ధం చెయ్యాలని చెప్తాడు. వెంటనే రామలక్ష్మణులు అక్కడికి చేరుకోగా యజ్ఞం పూర్తికాకుండానే ఇంద్రజిత్తు లక్ష్మణుడితో తలపడి అతని చేతిలో మరణిస్తాడు.

– రామాయణం

**ఇంద్రతాపుడు :** ఓ రాక్షసుడు. వరుణ దేవుని భక్తుడు.

– *మహాభారతం*

**ఇంద్రతీర్థం :** సరస్వతీ తీరంలోని స్నానఘట్టం. ఇచ్చట ఇంద్రుడు 100 యజ్ఞాలు చేశాడు. – *మహాభారతం*

**ఇంద్రతోయం :** గంధమాదన పర్వతాల వద్ద ప్రవహించే ఒక నది. ఈ నదిలో 3 రోజులు స్నానం చేసి అక్కడ వుంటే అశ్వమేధం చేసిన ఫలితం వస్తుంది.

– *మహాభారతం*

**ఇంద్రదత్తుడు :** చూ॥ వరరుచి.

**ఇంద్రదమనుడు :** ఒకరాజు. ఎంతో ధనాన్ని బ్రాహ్మణులకు దానం చేశాడు. – *మహాభారతం*

**ఇంద్రద్వీపం :** సహస్రబాహుడు జయించిన భారత దేశంలోని ప్రాంతాన్ని ఇంద్రద్వీపం అంటారు.

– *మహాభారతం*

**ఇంద్రద్యుమ్నుడు 1 :** స్వాయంభవ మనువు వంశంలోని ఒక రాజు.

*వంశవృక్షం :* మనువు – ప్రియవ్రత – అగ్నిధార – నాభి – రుషభ – భరత – సుహోవి – ఇంద్రద్యుమ్నుడు.

*ఇంద్రద్యుమ్నుడు ఏనుగైన విధం :* ఇతడు ఎన్నో ఏళ్లు రాజ్యపాలన చేసి గొప్పరాజుగా కీర్తింపబడి ముసలితనం రాగా రాజ్యాన్ని పిల్లలకిచ్చి తపస్సు చేసుకోవడానికి అరణ్యానికి వెళ్లాడు. విష్ణువును గూర్చి తపస్సు చేస్తుండగా అగస్త్యముని అక్కడకు వచ్చాడు. ఆ మహర్షిని గుర్తించక తపస్సులోనే వుండగా అగస్త్యుడు కుపితుడై ఏనుగుగా మారమని శపించాడు. రాజ సేవకులు ఇది చెప్పగా, అతడు అగస్త్యుని ప్రార్థించగా అతడు శాపవిమోచనం చెప్పాడు. విష్ణువు నీపై చెయ్యివేసి నపుడు మోక్షం లభిస్తుంది. అంత వరకు ఏనుగువలెనే విహరించ గలవని శలవిచ్చాడు. ఆ అరణ్యంలోని ఏనుగులతో సంచరిస్తూ త్రికూటం చేరాడు. అదే సమయంలో దేవళుడు అను మహర్షి ముక్తి కొరకు తపస్సు చేస్తుండగా హూనుడు అను గంధర్వరాజు అప్సరస కన్యలతో వచ్చి క్రీడలు ఆడుతుండగా దేవళుడు అతడ్ని మొసలిగా మారమని శపించగా అక్కడే వున్న కొలనులో మొసలిగా సంచరిస్తున్నాడు. ఏనుగుగా మారిన ఇంద్రద్యుమ్నుడు ఒక రోజు నీళ్లుతాగడానికి ఆ కొలనులో దిగగా ఈ మొసలి అతణ్ణి పట్టుకుంది. ఏనుగు, మొసలి 1000 సంవత్సరాలు పెనుగు లాడాయి. చివరకు మొసలితో యుద్ధం చేసే శక్తి లేక ఏనుగు పరమేశ్వరుని ప్రార్థింపగా శ్రీమహా విష్ణువు ప్రత్యక్షమై తన చక్రాయుధంతో మొసలిని సంహరించి ఇంద్రద్యుమ్నుడికి ముక్తిని ప్రసాదించగా స్వర్గం చేరాడు.

*స్వర్గం నుండి భూమిపై పడుట :* మంచి పనులు చేసిన వాటికి సరిపడ కాలం స్వర్గంలో వున్న ఇంద్రద్యుమ్నుడు భూమి మీద పడతాడు. ఇతడు మార్కండేయుని వద్దకు పోగా అతడు ఇతణ్ణి గుర్తించలేదు. అక్కడి నుండి హిమాలయాలలో వున్న ఓ గుడ్లగూబ వద్దకు వెళ్తే అదీ గుర్తించలేదు. దానికంటే ముసలిదైన ఓ మత్స్యం దగ్గరకు వెళ్తే అదీ గుర్తించలేదు. అప్పుడు వారంతా కలిసి అకూపారం (ఆదికూర్మం) వద్దకు వెళ్లగా అది వెంటనే ఇంద్రద్యుమ్నుడిని గుర్తించగా ఇతడు గొప్ప త్యాగనిరతుడైన సుగుణవంతుడైన రాజని మార్కండేయుడికి చెప్పగా అతడు ఇంద్రద్యుమ్నుడ్ని తిరిగి స్వర్గానికి పంపుతాడు. – *మహాభారతం*

**ఇం(ద్రద్యుమ్నుడు 2 :** శ్రీకృష్ణుని సమకాలికుడైన రాజు. ఇతణ్ణి శ్రీకృష్ణుడు వధిస్తాడు. – మహాభారతం

**ఇం(ద్రద్యుమ్నుడు 3 :** ఓ మునివర్యుడు. పాండవుల వనవాసంలో ధర్మజుని వద్దకు వచ్చిన మునుల్లో ఒకరు. – మహాభారతం

**ఇం(ద్రద్యుమ్నుడు 4 :** జనకుని తం(డి. ఒక రాజు.

**ఇం(ద్రద్యుమ్నుడు 5 :** ఇక్ష్వాకు వంశంలోని ఒక రాజు.

**ఇం(ద్రద్యుమ్నుడు 6 :** కృతయుగంలో జీవించిన విష్ణుభక్తుడైన ఒక రాజు. ఓం(డదేశంలోని జగన్నాధుని దేవాలయం దర్శిస్తాడు. శ్రీ మహావిష్ణువు ఇసుకలో దాక్కుంటాడు. నీలి పర్వతం మీద మరణించే వరకు తపస్సు చేయాలని నిర్ణయించుకోగా ఓ దైవ వాణి ఆగమని పిలవగా ఆ రాజు అశ్వాన్ని బలి ఇచ్చి నారదుడు తెచ్చిన నరసింహమూర్తి వి(గహాన్ని ఈ గుడిలో (ప్రతిష్టిస్తాడు. కలలో విష్ణువు (ప్రత్యక్షమై సువాసన పూరితమైన వృక్ష కాండాలతో వి(గహ (ప్రతిష్ఠ చేయమని కోరగా అతడు ఆ చెట్టుతో తయారు చేసిన విష్ణు, బలరామ, సుదర్శన, సుభ(ద వి(గహాలను (ప్రతిష్టిస్తాడు. – *స్కందపురాణం*

**ఇం(ద్రద్యుమ్నం :** ఇదో కొలను. ఈ కొలనులోనే నాడిజంఘం అనే మత్స్యం, ఆదికూర్మం వుండేవి. ఇం(ద్రద్యుమ్నుడు దానమిచ్చిన ఆవులు ఈ దారిలో వెళ్లడం వల్ల ఈ కొలను ఏర్పడింది. – మహాభారతం

**ఇం(ద్రధ్వజం :** జెండా వుండే ఓ కర్ర. దీనిని వర్షం కురవడంకోసం నిలబెడతారు. ఎవరైనా ఇది విరిగినట్లు కలగంటే అది దుస్వప్నం. అంటే దేశానికి ఏదో నష్టం వాటిల్లుతుందని అర్థం. – అగ్నిపురాణం

**ఇం(ద్రదైవతం :** పిల్లలు జన్మించడానికి చేసే ఓ యజ్ఞం. యువనాశ్వుడు ఈ యజ్ఞం చేశాడు. (బాహ్మణులు కుండలో నింపిన నీళ్లు ఈ యజ్ఞం జరిపిన తర్వాత యువనాశ్వుడు సేవించాడు. ఆ తర్వాత పిల్లలు పుట్టారు. – దేవీ భాగవతం

**ఇం(ద్రపర్వతం :** విదేహ రాజ్యంలోని ఒక పర్వతం. – మహాభారతం

**ఇం(ద్రప్రమితి :** పైల మహర్షి శిష్యుడు. ఇతడు వ్యాసుని శిష్య బృందపు వారసుడు.

**ఇం(ద్రప్రస్థం :** (ప్రస్తుత ఢిల్లీ నగరమే ఇం(ద్రప్రస్థం. కృష్ణార్జునులు ఖాండవ దహనం చేయగా మయుడ్ని అర్జునుడు క్షమిస్తాడు. అందుకు మయుడు (ప్రత్యుపకారం చేస్తాననగా శ్రీకృష్ణుడు పాండవుల కొరకు ఈ నగరాన్ని నిర్మిస్తాడు. ఇక్కడే ధర్మజుడు రాజసూయ యాగం చేస్తాడు. ఇక్కడ కట్టిన మయసభా భవనంలోనే దుర్యోధనుడికి గర్వభంగం జరుగుతుంది. – మహాభారతం

**ఇం(ద్రపూజ :** దీన్ని ఇం(ద్రోత్సవం అని కూడా అంటారు. చం(ద్రవంశ రాజైన వసువు మొట్ట మొదట (క్రమ పద్ధతిలో ఈ పూజ నిర్వహించాడు. దీనికి ఇం(ద్రుడు (ప్రత్యక్షమై మెచ్చి వేణుదండాన్ని బహూకరించాడు. దానిని భూమిలో పాతి ఇం(ద్రపూజ మొదలు పెట్టాడు. అక్కడనుండి వేణుదండం పాతడం ఇం(ద్రపూజలో మొదటిదయ్యింది. ఆ దండానికి పుష్పాలంకరణ పైన హంసను పోలిన అలంకరణ చేస్తారు. ఇం(ద్రుడు మొదట వసువుకి హంస రూపంలో కన్పించడం వల్ల అలా చేశాడు. ఇం(ద్రుడు తనను గురించి ఏ రాజు వసువు లాగా పూజ చేసినా వారు అభివృద్ధి చెందుతారని రాజ్యంలోని (ప్రజలు సుభిక్షంగా వుంటారని వరమిచ్చాడు.

**ఇం(ద్రమార్గం :** (ప్రాచీన పుణ్యతీర్థం. ఇక్కడ స్నానంచేస్తే స్వర్గలోక (ప్రాప్తి కల్గుతుంది.

**ఇం(ద్రమాల :** ఒక కమల మాలిక. దీని నెవరు ధరించినను ఆయుధములు తాకవు. ఈ మాలను ఇం(ద్రుడు ఉపరిచరవసువుకిచ్చెను. – మహాభారతం

**ఇం(ద్రవతి :** గోదావరిలో కలిసే ఒక ఉపనది.

**ఇం(ద్రవరజుడు :** శ్రీమహా విష్ణువు అదితికి జన్మించినపుడు ఉపేం(ద్రుడనే పేరు కలదు. – చూ॥ *ఉపేం(ద్రుడు.*

**ఇం(ద్రవర్మనుడు :** మాళ్వరాజు. పాండవుల పక్షాన పోరాడాడు. అశ్వత్థామ అనే ఏనుగు చేతిలో మరణించాడు. – మహాభారతం

**ఇం(ద్రవాహనుడు :** కుకుత్సువను ఇక్ష్వాకు వంశరాజు. ఇం(ద్రుడు రాక్షసులపై యుద్ధం కొరకు ఇతణ్ణి తన వాహనంగా చేసుకొన్నాడు. అందుకని ఇతణ్ణే ఇం(ద్ర వాహనుడంటారు. – చూ॥ కుకుత్సుడు.

**ఇంద్రసావర్ణి :** పదునాల్గవ మనువు. ఇతని కాలమున ఇంద్రుడు శుచి మరియు దేవతలు సాక్ష్యసాధ్యులు.

**ఇంద్రసేన 1 :** పాంచాలి పూర్వజన్మలోని నామం.
– చూ॥ ద్రౌపది

**ఇంద్రసేన 2 :** నలుని కుమార్తె

**ఇంద్రసేన 3 :** అంగరాజ వంశ రాజకుమారి. రుష్య శృంగుణ్ని వివాహమాడింది. ఈమె భర్తను 100 సంవత్సరాలు సేవించింది.

**ఇంద్రసేనుడు 1 :** నలదమయంతుల పుత్రుడు. ఇతని పుత్రుడు చంద్రాంగదుడు.

**ఇంద్రసేనుడు 2 :** పరీక్షిత్తు మహారాజు పుత్రుడు.
– మహాభారతం

**ఇంద్రసేనుడు 3 :** కౌరవుల పక్షాన పోరాడిన ఒక రాజు.
– మహాభారతం

**ఇంద్రసేనుడు 4 :** పాండవుల రథసారథి. ఇతడు పాండవ వనవాస సమయమున కూడా పాండవులతో వున్నాడు. అభిమన్యుని వివాహ సమయంలో ఉపప్లావ్యంలో కూడ వున్నాడు. కొన్నాళ్లు పాండవులి తడ్ని ద్వారకకు కూడా పంపారు. – మహాభారతం

**ఇంద్రాణి :** ఇంద్రుని భార్య శచీదేవి. ఇంద్రుని భార్య అగుట వలన ఇంద్రాణి అంటారు. ద్రౌపది ఈమె అంశతోనే జన్మించిందని చెప్తారు.

**ఇంద్రుడు :** ఇంద్రుడనునది ఒక నామము కాదు. తూర్పు దిక్కునకు, దేవలోకమునకు అధిపతిని ఇంద్రు డందురు. అనగా ఇంద్రపదవి నలంకరించిన వారం దరు ఇంద్రులే. 100 యజ్ఞములు చేసినవారికి ఇంద్ర పదవికి అర్హత కలదు. మన్వంతరములను బట్టి, వారు చేసిన యజ్ఞములను బట్టి, వారి మంచి చెడులను బట్టి ఇంద్రులగుదురు. ఏడవ మన్వంతరమున నాల్గు యుగములు కలవు. మన్వంతరమనగా ఒక మనువు కాలము. ఇంద్రుడనువాడు దేవలోక మునకు అధిపతి అయినను, ఆ పదవిని దక్కించుకొనుటకు ఎన్నో అకృత్యములు చేసినట్లు కన్పించుచున్నది. యజ్ఞములు చెడగొట్టుట, తనపదవికి పోటీవచ్చునను వారిని మోసముతో చంపివేయుట జరిగినట్లు మనకు కన్పించును. ఉత్తమ మన్వంతరములో సుశాలతుడు, చాక్షువ మన్వంతరములో మనోజవుడు ఇంద్రుల య్యారు. రైవత మన్వంతరంలో విభుడు ఇంద్రుడు. నహుషుడింద్రుడై అచిరకాలముననే భ్రష్టుడయ్యెను.

*పూర్వనేపథ్యం :* ఓ బ్రహ్మకాలం కంటె శ్రీ మహా విష్ణువు జీవితకాలం రెట్టింపు. శ్రీ మహా విష్ణువు జీవిత కాలం కంటే మహాశివుని జీవితకాలం రెట్టింపు. ఓ బ్రహ్మ జీవితకాలం 14 మన్వంతరాలు. ప్రతి మన్వంతరానికి ఒక మనువు ఒక ఇంద్రుడు, దేవతలు వుంటారు. మన్వంతరం మారినపుడల్లా ఇంద్రుడు దేవతలు మారుతారు.

*వంశవృక్షం :* విష్ణు – బ్రహ్మ – మరీచి – కాశ్యప – ఇంద్ర – బ్రహ్మ – ఆత్మ భవుడైన మరీచి పుత్రుడు కశ్యపుడు. కశ్యప అదితులకు 12 మంది పుత్రులు. అదితి ఇతర పుత్రులు 21 మంది. అంటే వీరు మొత్తం 33. ఇందులో పెద్దవాడు ఇంద్రుడు. ఇతడు దేవత లకు అధిపతి. అతని సోదరుడు విష్ణువు. ఐరావతం అతని ఏనుగు. ఉచ్చైశ్రవం అతని గుర్రం. ఆయుధం వజ్రాయుధం. ఇంద్రుని భార్య పేరు ఇంద్రాణి, శచీ దేవి. ఇంద్రుని కుమారుడు జయంతుడు. ఇతని ముఖ్య పట్టణం అమరావతి. రథంపేరు విమానం. అతని రథికుని పేరు మాతాలి. అతడి ఉద్యాన వనంపేరు నందనవనం. గృహం పేరు వైజయంతం. అతని ధనస్సు ఇంద్రధనస్సు. అతని ఖడ్గం పరంజయం.

*చారిత్రకత :* రుగ్వేద సంహితకు ప్రముఖ చారిత్ర కారుడు కె.ఎం. ఫణిక్కర తన ముందు మాటలో ఇంద్రుణ్ణి గురించి ఇలా చెప్పాడు. రుగ్వేద కాలంలో ఇంద్రుడే ఆర్యుల ప్రధాన దైవం. రుగ్వేదంలో శివుడిని గురించి ప్రార్థించినదాఖలాలు లేవు. అంతే కాదు విగ్రహారాధన కూడా లేదు. ఇతడు ఆర్యులకు రాజు. ఇతడు దస్యుల నుండి ఆర్యులను రక్షించాడు. ఎంతో మంది దస్యులను సంహరించాడు. శూద్రులు నదిని దాటి దస్యులను ఎదుర్కొనడానికి ఓ నదిని నీరు లేకుండా ఎండగట్టాడు. ఆర్యులు ప్రమాదంలో పడిన పుడల్లా ఇంద్రుడు రక్షించాడు. వాయువు ఇతని వాహనం. అగ్ని ఇతనికి కవల సోదరుడని కూడా పేర్కొనబడింది. కాబట్టి రుగ్వేదంలో దస్యులకు శత్రువుగా, ఆర్యులకు రక్షకుడుగా కన్పిస్తాడు.

*ఇంద్రుని జయాపజయాలు :*

*ఇంద్రార్జునులు :* కుంతి భోజుని కూతురైన కుంతి కన్యగా వుండగనే దుర్వాసుని వల్ల 5 మంత్రాలను పొందింది. ఆ మంత్ర ఉచ్చారణ వల్ల తన ఇష్టదైవం ప్రత్యక్షమవుతాడు. ఆమె వివాహ పూర్వమే ఆ మంత్రంతో సూర్యుని తలచగా అతనివల్ల కర్ణుడు జన్మించాడు. లోకనిందకు భయపడి అతణ్ని ఎవరికి తెలియకుండా నదిలో వదిలింది. శాపగ్రస్తుడైన పాండు రాజువల్ల సంతానప్రాప్తి కలిగే అవకాశం లేక ఆమె మరోమంత్రం ఉచ్చరించి యమధర్మ రాజువల్ల ధర్మజుడికి, వాయుదేవుణ్ని ఉచ్చరించి భీమసేనుడికి, ఇంద్రుణ్ణి ఉచ్చరించి అర్జునుడికి జన్మనిచ్చింది. అందువల్ల అర్జునుడు ఇంద్రుడి మానసపుత్రుడు. శ్రీకృష్ణార్జునులు అగ్నికోరికపై ఖాండవవనాన్ని దహించబోగా ఇంద్రుడు ఆ వనంలో వున్న తన మిత్రులను రక్షించుకోవడానికి వరుణుణ్ణి ఆశ్రయించగా కుంభవృష్టి కురవటం ప్రారంభించగా అది అగ్నికి అడ్డుపడకుండా అర్జునుడు తన అస్త్రాలతో ఖాండవ వనంపైన ఓ తెరను నిర్మిస్తాడు. గత్యంతరం లేని ఇంద్రుడు తన స్నేహితుడైన తక్షకుణ్ని మాత్రం రక్షించుకోగల్గుతాడు. తప్పించుకున్న మయుడు శ్రీకృష్ణునాశ్రయిస్తాడు. అగ్నిదేవుడు అర్జునునికి గాండీవాన్ని బహూకరిస్తాడు. జరుగబోవు కురుక్షేత్ర యుద్ధంలో తన కుమారుడైన అర్జునుణ్ణి రక్షించుకోవడం కోసం ఇంద్రుడు బ్రాహ్మణ రూపంలో కర్ణుని వద్దకు వెళ్ళి దానమడిగి అతని కవచకుండలాలను గ్రహించి కర్ణుడి శక్తి హరిస్తాడు. ఇంద్రుడు అర్జునుణ్ణి దేవలోకమునకు ఆహ్వానించి దేవవేశ్య ఊర్వశిని అర్జునుని చెంతకు పంపగా ఆమెను అర్జునుడు తల్లిగా భావిస్తున్నానని నిరాకరించగా ఊర్వశి అర్జునుణ్ణి నపుంసకుడిగా శపిస్తుంది. ఇంద్రుడు అది అర్జునుని మేలుకొరకే అని చెప్పి మీ అజ్ఞాతవాసంలో ఆ రూపంతో ఓ సంవత్సరం భరించమని ఆశీర్వదించి మేలుచేస్తాడు.

*ఇంద్రుడు-సుబ్రహ్మణ్య స్వామి :* తారకాసురుడు దేవతలను మిక్కిలి బాధించుచుండెను. అతనితో పోరి ఇంద్రుడోడెను. ఇంద్రుడు బ్రహ్మను వేడు కొనగా శివుని వల్ల జన్మించినవాడే తారకాసురుని వధింపగలడని జెప్పెను. శివుని కామాతురుని చేయుటకు ఇంద్రుడు కామదేవుని శివుని వద్దకు పంపగా శివుడు తన మూడో కన్ను తెరవగా కామదేవుడు భస్మమయ్యెను. ఇంద్రుడు బ్రహ్మను వేడుకోగా బ్రహ్మ శివుని వద్దకు బోయి కామదేవుడు లేక సృష్టి ఆగిపోయినదని అతణ్ని బ్రతికించమని కోరెను. శివుడు కామదేవుని తిరిగి సృష్టించెను. ఆ తర్వాత శివపార్వతులు రతిక్రీడ సల్పుచుండిరి. వీరికి బుట్టిన తనయుడు తన కంటే తేజోవంతుడగు నని తలచి రతిక్రీడను భగ్నమొనర్చుటకు ఇంద్రుడు అగ్నిదేవుని పంపెను. అగ్నిదేవుని చూడగనే వారి రతిక్రీడ కాటంకమేర్పడి పార్వతి అగ్నిని శపించెను. శివుని వీర్యమును అగ్ని భరించెను. అతడు భరించలేక దానిని గంగకు అర్పించగా ఆమె కొంతకాలము భరించి తర్వాత చెట్టు బెరడులో వుంచెను. కార్తికలు ఆ చెట్టుబెరడులో ఉద్భవించిన బిడ్డను సాకినవి. అందుకే అతడిని కార్తికేయుడందురు. దేవతలు ఇతని వీరత్వమును ఇంద్రునితో చెప్పగా అతడు తన పదవికి ముప్పువాటిల్లునని తలచి అతనిపై దండెత్తెను. ఇంద్రునితో యుద్ధము చేయుచుండగా శివుడు ప్రత్యక్షమై ఇతని వల్ల నీకు ముప్పులేదని తారకాసురుని వధకు ఇతడు జన్మించాడని ఇంద్రునితో చెప్పగా ఇంద్రుడు సుబ్రహ్మణ్యస్వామిని క్షమాపణ కోరి తన సైన్యానికి అధిపతి కమ్మని కోరెను. సైన్యాధిపతి చేయుటకు తన కమండలంలోని నీటిని సుబ్రహ్మణ్యస్వామిపై చల్లబోగా అవి రాకుండెను. శివుడు ముందు గణపతి పూజ చేయమని తర్వాత మాత్రమే నీరు జల్లమని చెప్పెను. ఆ తర్వాత కుమారస్వామి తన సర్వ సైన్యముతో తారకునిపై దండెత్తి అతణ్ని వధించెను.

*ఇంద్రుడు-ప్రహ్లాదుడు :* మహారాజైన ప్రహ్లాదుడు స్వర్గాన్ని జయించెను. ఇంద్రుడు పదవిని కోల్పోయెను. బృహస్పతి సలహాపై శుక్రాచార్యుడిని కలిసెను. ప్రహ్లాదుడు గౌరవనీయుడైన రాజు సద్గుణ సంపన్నుడు కనుక జయించెనని చెప్పెను. ఇంద్రుడు ఆ సుగుణాలను పొందదలచి బ్రాహ్మణుని వేషములో ప్రహ్లాదుని వద్దకు వెళ్ళి అతని వద్ద శిష్యుడుగా చేరెను. ప్రహ్లాదుడు అద్వితీయ నీతిశాస్త్రములను బోధించెను. తన శిష్యుని

భక్తికి మెచ్చి వరంకోరుకోమని అడుగగా బ్రహ్మణ వేషంలో వున్న ఇంద్రుడు గురువు యొక్క మంచి గుణాలన్ని తనకు ఇవ్వమని కోరగా ప్రహ్లాదుడు అంగీకరించెను. వెంటనే ఓ నీడ ప్రహ్లాదుడి నుండి బయటకు రాగా అదేమని అడుగగా నేను నీ అదృష్టాన్నని చెప్పెను. అంతేకాదు నేను ఈ బ్రాహ్మణ బాలుడి శరీరంలోకి వెళ్తున్నానని చెప్పెను. దానితో పాటు ప్రహ్లాదుని సుగుణాలైన దయ, సత్యం, ఇంద్రుని శరీరంలోకి వచ్చి చేరెను. అపుడు ప్రహ్లాదుడు ఈ మోసపు శిష్యుడు ఇంద్రుడని గ్రహించెను. అప్పటి నుండి ఇంద్రుడు దినదినాభివృద్ధి చెందగా ప్రహ్లాదుడు ప్రకాశహీనుడయ్యెను.

*ఇంద్రుడు – గరుడుడు :* ఒకసారి గరుడుడు తన తల్లి దాస్య విముక్తి కొరకై సవతితల్లి కోరిక మేరకు ఇంద్రుడు కాపాడుచున్న అమృతము తేదలచి దేవలోకమునకు పోయెను. ఇంద్రుడు తన వజ్రాయుధమును గరుడునిపై విసరగా గరుడుడు రెక్కలు విప్పగా వజ్రాయుధపు దెబ్బకు ఒక్క ఈక మాత్రమే రాలెను. ఇంద్రుడు గరుడుని శక్తిని గ్రహించి అతనితో సఖ్యము చేసి అమృత భాండము నిచ్చిపంపెను గరుడుడు అమృత భాండమును కద్రువ కుమారులైన నాగుల కిచ్చిన తర్వాత వారు అమృతమును సేవింపక ముందే మాయోపాయమున ఇంద్రుడు అమృతభాండమును తిరిగి దేవ లోకమునకు తీసుకొనిపోయెను. అప్పటినుండి గరుడుడు శ్రీ మహావిష్ణువుకు వాహనమయ్యెను. వినతకు దాస్య విమోచనమయ్యెను.

*వృతాసురుని వధ :* వృతాసురుడను రాక్షసుడు దేవతలను బాధించుచుండెను. ఇంద్రుడు ఓటమి చెందెను. బ్రహ్మకడకు పోగా విష్ణువునాశ్రయించమనెను. శ్రీమహావిష్ణువు దధీచి వెన్నెముక నుండి చేయబడిన ఆయుధమువల్ల మాత్రమే వృతాసురుడు సంహరించబడునని చెప్పెను. అప్పుడు దధీచి మహర్షిని ప్రార్థించి అతని వెన్నెముకతో వజ్రాయుధమను ఖడ్గమును చేసుకొనెను. ఈ వజ్రాయుధముతోనే ఇంద్రుడు వృతాసురుని చంపెను.

*ఇంద్రాగ్నులు శిభిని పరీక్షించుట :* శిభి చక్రవర్తి అంతటి దానశీలి లేడని తెలిసి అతనిని పరీక్షించనెంచి అగ్ని పావురముగా మారి శిభి తొడపై కూర్చుండెను. ఇంద్రుడు డేగ రూపున వెంటాడి తన ఆహారమును వదలమని శిభి చక్రవర్తి నడుగగా ఆ పావురము సరిపడ తన శరీరభాగము నిచ్చెదను పావురమును వదలమని డేగను కోరెను. అందుకు డేగ సమ్మతించగా తన శరీరభాగము కోసి తూయుచుండగా ఎంతకును తూగక తనే మొత్తము త్రాసులో కూర్చొనెను. ఇందుకు ఆనందించిన ఇంద్రాగ్నులు నిజరూపులై శిభి దానగుణాన్ని మెచ్చుకొని ఆశీర్వదించిరి.

*ఇంద్రుడు – అహల్య :* ఇంద్రుడు అహల్యను మోహించగా బ్రహ్మ అహల్యను గౌతమ మహర్షి కిచ్చి వివాహము చేసెను. ఒకరోజు, ఇంద్రుడు ఆమెను కామించి గౌతముడు తెల్లవారు ఝామున నదికి స్నానమునకు వెళ్లిన సమయమున గౌతముని రూపమున అహల్యను కూడెను. తిరిగివచ్చిన గౌతముడు ఇది గ్రహించి అహల్యను రాయిగా మారునట్లు శపించెను. ఇంద్రుని శరీరమంతయు యోనిలగునని శపించెను. ఇంద్రుడు గౌతముని శరణు వేడగా అవి ఇతరులకు కళ్లుగా కన్పించునని శాపవిమోచనము కల్గించెను. అహల్యను మహాపురుషుని పాదము తాకినపుడు నిజరూపము నొందగలవని శాపవిమోచన మిచ్చెను. సీతాన్వేషణ మున శ్రీరామచంద్రుని పాదము సోకినపుడు అహల్య నిజరూపము పొందెను.

*ఇంద్రుడు–శ్రీకృష్ణుడు :* శ్రీకృష్ణుని పాలనలో యాదవులు ఇంద్రపూజను నిషేధించెను. అందుకు ఇంద్రుడు కుపితుడై గోకులంపై రాళ్లవర్షం కురిపించగా శ్రీకృష్ణుడు గోవర్ధనగిరినెత్తి యాదవులను రక్షించెను. ఇంద్రుడప్పుడు విష్ణ్వాంశ అయిన శ్రీకృష్ణుని గురించి తెలిసికొనెను. నరకాసురుడు దేవతలను బాధించుచుండగా ఇంద్రుడు శ్రీకృష్ణుని శరణువేడగా అతడు సత్యభామాసమేతుడై నరకాసురుని వధించెను.

*ఇంద్ర – దుర్వాస :* ఒకరోజు దుర్వాస మహాముని ఇంద్రలోకమునకు పోయెను. అచ్చట మేనక దుర్వాసుని ఆహ్వానించి సువాసనలు వెదజల్లే ఓ పుష్పాన్నివ్వగా అది అతడు ఇంద్రునికిచ్చాడు. అతడు దానిని తన వాహనం ఐరావతం తలపై పెట్టగా ఐరావతం దానిని క్రిందపడవేసి ముక్కలు ముక్కలు చేయగా దుర్వాసుడు తనకు అపచారంగా భావించి దేవతలను వయసుమీరి వంకర్లు తిరిగి తలనెరసి ఇతర మానవు

ల్లాగే జీవించండని శపించెను. ఇంద్రుడు దుర్వాసుడిని క్షమించమని ప్రార్థించగా క్షీరసాగర మథనం చేయమని అందునుండి అమృతం ఉద్భవిస్తుందని అది సేవించినచో చిరంజీవులై యవ్వనులవు తారని శాప విమోచనం చెప్తాడు. శ్రీమహావిష్ణువు సలహాపై దేవతలు రాక్షసులు కలిసి క్షీరసాగర మథనం చేయగా అమృతం వస్తుంది. దానిని శ్రీమహావిష్ణువు మోహిని రూపంలో రాక్షసుల కన్నుగప్పి దేవలోకం చేర్చగా దేవతలు దానిని సేవించి అమరులౌతారు.

*ఇంద్రుడు–వాలి సుగ్రీవులు :* సూర్యుని రథసారథి అయిన అరుణుడు అప్సరసల నాట్యము చూచుటకు స్త్రీ రూపమున దేవలోకమునకు పోయెను. ఆ స్త్రీ అందాన్ని చూసి ఇంద్రుడు మోహించి సంగమించగా వాలి అను వానరుడు జన్మించెను. ఇంద్రుని సలహాపై అరుణుడు అతనిని అహల్యకివ్వగా ఆమె పెంచెను. సూర్యుడు కూడా స్త్రీ రూపములోని అరుణితో సంగమించగా సుగ్రీవుడు జన్మించెను. అతనిని కూడా అహల్య పెంచెను. – *ఉత్తర రామాయణం*

ఇంద్రుడిని పురంధరుడని పిలుస్తారు. అందుకు కారణం ఎందరో దస్యుల పురాలను (నగరాలు) నాశనం చేయడం అని కొందరు, మహాబలి కుమారుడైన 'పుర్' అనువాడిని సంహరించడంవల్ల పురంధరుడని చెప్తున్నారు. ఇంద్రుడు అహి, తుష్ణ, శాంబర, వల, వృతాసురులను వధించెను. అందుకే ఇతణ్ణి వజ్రపాణి అని కూడా పిలుస్తారు.

**ఇంద్రోత్సవం :** చూ॥ ఇంద్రపూజ.

**ఇంద్రోతుడు :** శుకుడి కొడుకు. శౌనకుడంటారు. ఇతడు జనమేజయుడి బ్రహ్మహత్యాపాతకం పోయే మార్గం చెప్తాడు. – *మహాభారతం*



**ఈ :** ఈ శబ్దానికి అర్థం దేవి.

**ఈరి :** యముణ్ణి ఆరాధించే 100 మంది రాజుల్ని ఈరులంటారు. – *మహాభారతం*

**ఈర్జిక :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం. – *మహాభారతం*

**ఈలినుడు :** పూరు వంశానికి చెందిన రాజు. తంసువు కుమారుడు. ఇతని భార్య రథంతరి. 5 గురు కుమారులు. వారు దుష్యంత, శూర, భీమ, ప్రవస, వసులు. – *మహాభారతం*

**ఈళినుడు :** చూ॥ రైభ్యుడు.

**ఈశానాధ్యుషీతీర్థం :** ప్రాచీన భారతదేశంలో ఓ పుణ్య తీర్థం. ఇచ్చట నీటిని త్రాగితే అశ్వమేధ యాగం చేసినన్ని ఫలితాలు లభిస్తాయి. – *మహాభారతం*

**ఈశానుడు 1 :** అష్టదిక్పాలకులలో ఒకడు. ఈశ్వరుని స్వరూపం.

**ఈశానుడు 2 :** కృష్ణుడు గోకులమునందుండగా అతని వామనేత్రము నుండి భయంకరుడు, త్రినేత్రుడు అగు ఈశానుడు జన్మించెను.

**ఈశుడు :** ఒక విశ్వదేవుడు.

**ఈశ్వరుడు :** చూ॥ శివుడు.



**ఉ :** శివుడు అని అర్థం. – *చూ॥ అగ్నిపురాణం*

**ఉక్త :** పరాకాణి తండ్రి అయిన ఒక అగ్ని. త్రివిధమైన రుక్కులతో దాన్ని ప్రార్థిస్తారు. – *మహాభారతం*

**ఉక్తం :** సామవేదంలోని ఒక విభాగము.

**ఉక్కుభీముడు :** చూ॥ ఇనుప భీముడు.

**ఉగ్రకర్ముడు 1 :** సాళ్వరాజు. భీముసేనుడు ఇతణ్ణి వధిస్తాడు. – *మహాభారతం*

**ఉగ్రకర్ముడు 2 :** కేకేయ రాజపుత్రుడు విశోకుని సేనాని. కర్ణుడితణ్ణి వధిస్తాడు. – *మహాభారతం*

**ఉగ్రకుడు :** ఒక సర్పం. కద్రువ కుమారుడు. – *మహాభారతం*

**ఉగ్రదంష్ట్రి :** మహామేరువు కుమార్తె. మేరుదేవికి 9 మంది కుమార్తెలు. మేరు, ప్రతిరూప, ఉగ్రదంష్ట్రి, లతా, రమ్య, శ్యామా, నారి, భద్రా, దేవవిధి అగ్నీధ్రుని కుమారులను వీరు వివాహం చేసుకున్నారు. – *భాగవతం*

**ఉగ్రపాండ్యుడు :** ఇతడు మధురానగర రాజు. తొంబై తొమ్మిది యజ్ఞాలు చేశాడు. వందవ యజ్ఞం చేయబోతే ఇంద్రుడు అడ్డుపడతాడు. – *స్కాందపురాణం*

**ఉగ్రవసుడు :** ఇతడొక ముని. దుష్టన్యుడను వాడిని చంపాడు. పాటలీపుత్రంలోని ఓ వ్యాపారి కుమారుడు దుష్టన్యుడు. ఆటకాయితనంగా చాలామంది పిల్లల్ని చంపాడు. తండ్రి ఇంటినుండి వెడలగొట్టగా అడవికి పోయి అక్కడ తపస్సు చేసుకొంటున్న ఉగ్రవసుడ్ని చంపాడు. ఉగ్రవసుడు ఇతడ్ని తన తపశ్శక్తితో చంపి అతని ఆత్మను దయ్యంగా మార్చాడు.
– సేతుమహాత్మ్యం

**ఉగ్రశ్రవసుడు 1 :** రోమహర్షుడి కొడుకు. ఒక సూతుడు. వైశంపాయనుడి వద్ద పుణ్యగాథల్ని నేర్చుకొని శౌనకాది మహర్షులకు చెప్తాడు. – భాగవతం

**ఉగ్రశ్రవసుడు 2 :** ధృతరాష్ట్రుడి కొడుకు. కురు క్షేత్ర యుద్ధంలో భీముని చేతిలో మరణిస్తాడు.
– మహాభారతం

**ఉగ్రశ్రవసుడు 3 :** శీలవతి భర్త.

**ఉగ్రసేనుడు 1 :** కంసుడి తండ్రి. మధురకు రాజు. ఇతణ్ణి కంసుడు కారాగారంలో పెట్టి తను మధురకు రాజౌతాడు. శ్రీకృష్ణుడు కంసుణ్ణి సంహరించిన తర్వాత ఇతడు తిరిగి మధురకు రాజౌతాడు. – భాగవతం

**ఉగ్రసేనుడు 2 :** జనమేజయుడి తమ్ముడు. సర్ప యాగం చేసే చోటుకి సారమేయం వస్తే దాన్ని కొడతాడు. సరమ ఈ విషయం జనమేజయుడికి చెప్తుంది. ఇతడు పూర్వజన్మలో స్వర్భానుడు. – మహాభారతం

**ఉగ్రసేనుడు 3 :** కశ్యపుడి కుమారుడు. ఓ గంధర్వుడు
– మహాభారతం

**ఉగ్రసేనుడు 4 :** ధృతరాష్ట్రుని 100 మంది కొడుకుల్లో ఒకడు. ఇతణ్ణి చిత్రసేనుడని అంటారు. – మహాభారతం

**ఉగ్రతపసుడు :** భృగువంశజుడైన ఓముని. ఇతడు శ్రీకృష్ణుని గురించి ధ్యానించి గోపికలపై దృష్టి వుంచాడు. ఇతడు సునందుడికి కుమార్తెగా జన్మించి శ్రీకృష్ణుని సేవిస్తాడు.

**ఉగ్రతీర్థుడు :** క్రోదవసుడనే రాక్షసుడు. పునర్జన్మలో క్షత్రియ రాజుగా జన్మించాడు. – మహాభారతం

**ఉగ్రతేజసుడు :** శివునికి మరోపేరు.

**ఉగ్రాయుధుడు 1 :** ధృతరాష్ట్రుని కుమారుల్లో ఒకడు. ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు.
– మహాభారతం

**ఉగ్రాయుధుడు 2 :** పాంచాల రాజు. పాండవుల పక్షాన పోరాడి కర్ణుని వల్ల గాయపడ్డాడు. – మహాభారతం

**ఉగ్రాయుధుడు 3 :** ఓ శక్తివంతుడైన వీరుడు. కౌరవుల పక్షాన పోరాడాడు. – మహాభారతం

**ఉగ్రాయుధుడు 4 :** భీమునిచే సంహరింపబడిన చక్రవర్తి. – మహాభారతం

**ఉగ్రుడు 1 :** బ్రహ్మకుమారుడు. బ్రహ్మ కుమారులైన రాక్షసులను బ్రహ్మకోరికపై వధిస్తాడు. పుత్రశోకంతో బ్రహ్మ ఉగ్రుడై చూడగా ఉగ్రుడు భస్మమౌతాడు. పుత్ర హత్యకు విచారించిన బ్రహ్మ దక్షిణ కాశికి వెళ్లి తపస్సు చేస్తాడు. అప్పుడితడికి సరస్వతికి రుభుడు జన్మిస్తాడు.
– కాళహస్తి మహాత్మ్యము

**ఉగ్రుడు 2 :** శివుడి మరోపేరు.

**ఉగ్రుడు 3 :** కౌరవుల్లో ఒకడు. ద్రౌపది స్వయంవరానికి వచ్చిన వారిలో ఒకడు – మహాభారతం

**ఉగ్రోద్రుడు :** చంద్ర వంశపు రాజు. – భాగవతం

**ఉచకుడు :** సూర్యవంశపు రాజు – భాగవతం

**ఉచత్యుడు :** వ్యాసముని శిష్యపరంపరలోనివాడు.
– భాగవతం

**ఉచ్చిఖుడు :** తక్షకుని వంశంలో పుట్టిన సర్పం. జనమేజయుని సర్పయాగంలో బూడిద అయ్యింది.
– మహాభారతం

**ఉచ్ఛృంగుడు :** స్కందుని కైవారంలో వింధ్యుడు పంపిన ఇద్దరిలో ఒకడు. మరొకడు అతిశృంగుడు.
– మహాభారతం

**ఉచ్చైశ్రవుడు :** పూరువంశపు రాజు, అవీక్షిత్తు కుమారుల్లో ఒకడు. – మహాభారతం

**ఉచ్చైశ్రవం :** క్షీరసాగరమథనంలో వెలువడిన అశ్వము. ఇంద్రుడు దీన్ని కైవసం చేసుకొని తన వాహనంగా ఉపయోగించు కొన్నాడు. ఈ గుర్రం యొక్క తోకపైన వెంట్రుకలు తెలుపా నలుపా అన్న వివాదంతో కద్రువా వినతలు పందెం వేసుకొని కద్రువ మోసంతో వినత దాసి అయ్యింది. – మహాభారతం

సూర్యుని కుమారుడు రేవంతుడు ఇంద్రుని అనుమతితో ఈ అశ్వంపై శ్రీమహావిష్ణువు దర్శనానికి వైకుంఠం వెళ్ళగా లక్ష్మీదేవి కూడా క్షీరసాగర మథనంలో పుట్టినందున వరుసకు సోదరుడైనందున ఈ

అశ్వాన్ని చూసి ఏకాగ్రత కోల్పోయింది. శ్రీమహా విష్ణువు దీనికి అపోహచెంది లక్ష్మీదేవిని ఆడ అశ్వంగా పుట్టగలవని శపిస్తాడు. ఈ శాపంవల్ల ఆడ అశ్వంగా శ్రీమహాలక్ష్మి జన్మించింది. హేహయ వంశానికి మూలమయ్యింది. - దేవీ భాగవతం

**ఉజ్జపాలకం :** ఉతంకాశ్రమం దగ్గరలో వున్న ఓ ఎడారి. ఇక్కడే దుందుడు అతని పుత్రులైన మదుకైట బులను రాక్షసులు నివసించారు.

**ఉజ్జయంత పర్వతం :** సౌరాష్ట్రంలోగల పిండారక ఆలయం వద్దగల పర్వతం. ప్రసిద్ధులైన సిద్ధులు ఇక్కడ నివసించేవారు. - మహాభారతం

**ఉజ్జయిని :** ప్రాచీన భారతదేశపు ఏడు పుణ్యస్థలాల్లో ఇదొకటి. తక్కిన ఆరు అయోధ్య, మధుర, మాయ, కాశి, కాంచి, ద్వార వతి. ఉజ్జయిని నుండి ప్రవహించే సిప్రానది ఒడ్డున మహాకాళి దేవాలయం వుంది. ఇందులోని ప్రధాన విగ్రహం శివుడు. కోటితీర్థమనే స్నానఘట్టం వుంది. ఇక్కడ స్నానిస్తే అశ్వమేధ యాగ ఫలం దక్కుతుంది. - మహాభారతం

**ఉజ్జయుడు :** విశ్వామిత్రుని సంతతిలో ఒకడు. వీరిని బ్రహ్మావాదినులంటారు. - మహాభారతం

**ఉజ్జానకం :** మానస సరోవరం ఎదురుగా వున్న గంధ మాదన పర్వతాల వద్ద అరిష్టసేన మహర్షి ఆశ్రమం వుంది. ఆ ఆశ్రమం దగ్గరలోవున్న కొలనుపేరు ఉజ్జానకం. ఇందులో ఒకసారి మునిగితే పాప పరిహారం జరుగుతుంది. - మహాభారతం

**ఉతథ్యుడు :** అంగిరస మహర్షి కుమారుడు. మాంధాత మహారాజుకు పరిపాలనా వ్యవహారాలలో సలహా ఇచ్చేవాడు. సోముని కూతురు భద్రను వివాహ మాడాడు. - మహాభారతం

*సముద్రం మింగిన ఉతథ్యుడు :* వరుణుడు ఇతని భార్యభద్రను వలచి బలవంతంగా తనతో సముద్రంలోకి తీసుకుపోయెను. ఉతథ్యుడు నారదునిద్వారా వరుణుడిని తన భార్యను తిరిగి పంపమని కోరగా వరుణుడు పెడ చెవిని పెట్టెను. అంత ఉతథ్యుడు సము ద్రంలోని నీటిని మొత్తంమింగి వేయగా వరుణుడు కొలనుల్లో దాక్కొనగా నీరునిల్చిన అన్ని ప్రాంతాల నీటిని మింగివేయగా వరుణుడు ఉతద్యుని పాదాలపై బడి శరణువేడుకొని భద్రను తిరిగి అప్పగించెను. - మహాభారతం

**ఉత్కలం :** ఇప్పటి ఒరిస్సారాష్ట్రాన్ని ఉత్కలం అనే వారు. ప్రజలు నిర్భయంగా జీవించేవారు. కర్ణుడు దీన్ని జయించాడు. - మహాభారతం

**ఉత్కలుడు :** వైవశ్వత మనువు కుమారుడు. - బ్ర.వై. పురాణం

**ఉత్తమాశ్వం :** ప్రాచీన భారతదేశంలో ఒక ప్రాంతం. - మహాభారతం

**ఉత్తముడు :** స్వాయంభవ మనువు వంశంలోని ఒక రాజు. స్వాయంభవమనువు ఇద్దరు కుమారుల్లో ఒకడు ప్రియవ్రతుడు, రెండోవాడు ఉత్తానపాదుడు. ప్రియవ్రతుడు విశ్వకర్మ ఇద్దరు కుమార్తెలైన సురూప, బర్హిష్మతిల్ని వివాహమాడాడు. వారివల్ల ముగ్గురు కుమారులు జన్మించారు. ఉత్తముడు, తామసుడు, రైవతుడు. వీరు అత్యంత ప్రతి భావంతులై మనువు కాలంలో దేవుళ్లుగా కొనియాడబడ్డాడు. వీరి అండతో ప్రియవ్రతుడు పదికోట్ల సంవత్సరాలు దేశాన్ని పరి పాలించాడు. - దేవీ భాగవతం.

స్వాయంభవ మనువు రెండవ కుమారుడైన ఉత్తాన పాదుడు శురుచి అనే భార్యవల్ల ఉత్తముడ్ని, సునీతి అనే భార్యవల్ల ధృవుడ్ని పొందాడు. - విష్ణుపురాణం

**ఉత్తమోజసుడు :** పాంచాల దేశానికి చెందిన వీరుడు. పాండవుల పక్షాన కురుక్షేత్ర యుద్ధంలో పాల్గొన్నాడు. అర్జునుని కుడి రధచక్రాన్ని కాపాడే వాడు. కృతవర్మతో పోరాడాడు. దుర్యోధనుని చేతిలో ఓడిపోయాడు. కర్ణుడి కుమారుడు సుశేనుణ్ణి సంహరించాడు. అశ్వ త్థామ ఇతణ్ణి వధించాడు. - మహాభారతం

**ఉత్తర :** విరాటరాజు కుమార్తె. అజ్ఞాత వాసంలో అర్జునుడు బృహన్నలగా ఈమెకు గురువై నాట్య సంగీత శాస్త్రాలు నేర్పాడు. అజ్ఞాత వాసానంతరం అర్జునుడి కుమా రుడు అభిమన్యుడు ఈమెను వివాహమాడాడు. కురు క్షేత్ర యుద్ధంలో అభిమన్యుడు మరణించునాటికి ఈమె గర్భిణి. ఈమె కుమారుడే పరీక్షిత్తు మహారాజు. - మహాభారతం

**ఉత్తర ఉలూకం :** ఉత్తర భారతదేశంలోని ఉలూకం అనే రాజ్యం. దీన్ని అర్జునుడు జయించాడు. - మహాభారతం

**ఉత్తరకురువు :** జంబూ ద్వీపంలో ఒక భాగం. నీలగిరి హిమాలయాల మధ్య ప్రాంతం. ఇచ్చటకు చేరడం

అతిదుర్లభం. అర్జునుడు వెళ్లి అక్కడినుండి సంపదలతో తిరిగి వచ్చాడని అంటారు. ఇచ్చటి చెట్ల ఆకులు క్షీరాన్ని స్రవిస్తాయని, ఇక్కడ ఇసుకలో వజ్రాలు దొరుకుతాయని చెప్తారు. – మహాభారతం

**ఉత్తరకోసలం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం. దీనిని భీమసేనుడు జయించాడు. –మహాభారతం

**ఉత్తరగీత :** మహాభారతంలోని ఒక భాగం. ఇందులో వేదాంత విషయాలు విపులీకరించడ్డాయి. – మహాభారతం

**ఉత్తరజ్యోతిషం :** భారతదేశానికి పశ్చిమ తీరంలోని ఓ ప్రాంతం. నకులుడు దీన్ని జయించాడు. – మహాభారతం

**ఉత్తర దిశ :** చూ॥ గాలవుడు.

**ఉత్తర పాంచాలం :** గంగానదికి ఉత్తరానవున్న పాంచాల దేశం. పృష్టుడు చనిపోయిన తర్వాత దృపదుడు రాజయ్యాడు. అర్జునుడు దృపదుడ్ని జయించి ఈ ప్రాంతాన్ని తన గురువు ద్రోణునికి గురుదక్షిణగా ఇచ్చాడు. – మహాభారతం

**ఉత్తరపారియాత్ర :** ఓ పర్వతం – మహాభారతం

**ఉత్తర రామాయణం :** రావణ వధ తర్వాత అరణ్య వాసం ముగించుకొని అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడైనప్పటి నుండి జరిగిన కథను తెలిపేదే ఉత్తర రామాయణం.

**ఉత్తరాపథం :** ఉత్తర భారతదేశం

**ఉత్తరుడు 1 :** విరాటరాజు కుమారుడు. భూమింజయుడు అనేది అతని మరోపేరు. ద్రౌపది స్వయంవరానికి విరాటరాజుతోపాటు వెళ్ళాడు. కురుక్షేత్ర యుద్ధంలో పాండవుల పక్షాన పోరాడాడు. మొదటి రోజు ఇతనికి, వీరబాహుడికి యుద్ధం జరిగింది. శల్యునితో పోరి మరణిం చాడు. యుద్ధంలో మృతి చెందినందువల్ల స్వర్గంలో దేవుళ్లలో స్థానం కల్గిందని చెప్పబడింది. ఇతని కుమార్తె ఐరావతి పరీక్షిత్తు భార్య. – మహాభారతం

**ఉత్తరుడు 2 :** తనకంటే అధికులపై మాత్సర్యం పెంచుకోవడం వల్ల నశించిన రాజు.

**ఉత్తరుడు 3 :** ఓ అగ్ని. – మహాభారతం

**ఉత్తర్మానసం :** ఓ పుణ్యస్థలం. దీన్ని దర్శిస్తే భ్రూణ హత్య పాతకం నుండి విముక్తమవుతారు. – మహాభారతం

**ఉత్పలావతి :** దృఢధన్యుడి కూతురు. క్రీడించబోయే రెండు మృగాల్లో మృగిని పారద్రోలుతుంది. మృగం మనుష్యరూపుడై నన్ను వివాహమాడమంటుంది. ఆమె నిరాకరించగా అతడు నీవు మృగివి కమ్మని శపిస్తాడు. ఆమె శరణువేడగా జన్మాంతరంలో మృగిగా జన్మిస్తావు. నీ గర్భాన లోలుడనే ముని ప్రవేశించును. అప్పుడు నీకు శాపవిమోచన కల్గుతుందని చెబుతాడు. ఈమె తర్వాత, సురాస్త్రుడనే వాడిని వరించి చనిపోయి మృగిగా జన్మిస్తుంది. ఈ సురాస్త్రుడు ఒకసారి నది దాటబోయి ఈ మృగి తోకపట్టుకొని దాని పుచ్చమూలాన్ని స్పృశిస్తాడు. ఆమె గర్భవతియై తామసుడనే మునికి జన్మనిస్తుంది. అతడే పూర్వజన్మలో లోలుడు. – మార్కండేయ పురాణం

**ఉత్పలావతి 2 :** ఓ అప్సరస.

**ఉత్పలావనం :** పంజాబులోని ఓ పవిత్రస్థలం. విశ్వామిత్రుడు ఇక్కడ యాగం చేశాడు. – మహాభారతం

**ఉత్పలిని :** నైమిశారణ్యంలో ప్రవహించే నది. అర్జునుడు ఈ నదిని చూశాడు. – మహాభారతం

**ఉత్పవ సంకీతం :** దక్షిణ భారతదేశంలోని ఓ ప్రాంతం. – మహాభారతం

**ఉత్సవాలు :** ప్రాచీనకాలం నుండి దేవాలయాల్లో చేసే వేడుకలే ఉత్సవాలు. ఇవి నిర్వహించేందుకు కొన్ని విధి విధానాలున్నాయి. విగ్రహప్రతిష్ఠాపన జరిగినపుడు ఈ ఉత్సవాలు ఒకరోజు లేక 3 లేక 7 రోజులు జరుపుతారు. విగ్రహ ప్రతిష్ఠాపన జరిగిన నెలలోనే ఈ ఉత్సవాలు జరుపుతారు. ఈ ఉత్సవాలు నిర్వహించకపోతే విగ్రహప్రతిష్ఠాపన సరైన ఫలితం ఇవ్వదు. ఉత్తరాయణంలోనే విగ్రహ ప్రతిష్ట చేసి 9 రకాల విత్తనాలు నాటి సంగీత నృత్యాలతో ప్రారంభిస్తారు. – మహాభారతం

**ఉత్తానపాదుడు :** స్వాయంభవ మనువు కుమారుడు. ఒక రాజు. ప్రియవ్రతుని సోదరుడు. భార్య సురుచి. ఇతని కుమారుడు ఉత్తముడు. ఇతని మరోభార్య పేరు సునీతి. – విష్ణుపురాణం

**ఉత్తాన బర్హి :** వైవశ్వత మనువు కుటుంబానికి చెందిన ఒక రాజు. – భాగవతం

**ఉత్పాతకం :** ఓ పుణ్యస్నానఘట్టం. ఇక్కడ సాన్నంచేస్తే తపస్సు చేసిన ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**ఉత్తేజినీ :** స్కందదేవుని అనుచరుడు. – మహాభారతం

**ఉత్కోచకం :** ఓ పుణ్య స్థలం. దేవళుని సోదరుడైన దౌమ్యుడు ఇక్కడ నివసించేవాడు. పాండవులు అతడిని ఇక్కడ కలుసుకొని వారి పురోహితుడుగా ఆహ్వానించారు. ఉత్కాచం అని కూడా అంటారు. – మహాభారతం

**ఉత్క్రోశుడు :** ఇంద్రుడు స్కందుని కిచ్చిన ఇద్దరు పరిచారకుల్లో ఒకడు. రెండవవాడు సదాచకుడు. – మహాభారతం

**ఉదక్సేనుడు :** బృహదిఘుడి వంశస్తుడు. విష్వక్సేనుడి కొడుకు.

**ఉదపానతీర్థం :** సరస్వతీ నది ఒడ్డున గల ఒక పుణ్య తీర్థం. బలభద్ర రాముడు ఈ పవిత్ర తీర్థాన్ని దర్శించాడు. ఇది పుణ్యతీర్థం కావడానికి వెనుక ఓ కథ వుంది. పూర్వం గౌతముడనే ముని వుండేవాడు. అతనికి ముగ్గురు కుమారులు. త్రితుడు, ఏకతుడు, ద్వితుడు. గౌతముడు తన పిల్లల బాధ్యతాయుత ప్రవర్తనకు సంతోషించేవాడు. ఒకరోజు యాగంచేసి స్వర్గం వెళ్లాడు. ఆ యాగానికి వచ్చిన రాజులు, పురోహితులు త్రితుడికి గౌరవం ఇచ్చారు. ఇది తక్కిన ఇద్దరు సోదరులకు నచ్చలేదు. ముగ్గురు యాగాలు చేసి గోసంపద పొందారు. ఈ గోవులతో ముగ్గురు తూర్పువైపుకు ప్రయాణించారు. గోవులకు ముందు త్రితుడు వాటి వెనుక ఏకతుడు, ద్వితుడు వుండి ఆ గోవులను వేరే దారికి మళ్లించారు. త్రితుడు ఓ తోడేలును చూసి భయపడి ఓ నూతిలో పడ్డాడు. నూతిలో వుండే ఓ మొక్కనుచూసి దానితో యాగం చేయగా దేవతలు అతని ప్రార్థన విని ప్రత్యక్షమై అతని కోర్కెను వెల్లడించమనగా నూతిలో నుండి బయటకు వస్తే చాలని చెప్పగా సరస్వతీనది అ నూతిలోకి వచ్చిచేరి అతణ్ణి పైకి వచ్చేట్లు చేసింది. దేవతలను ప్రార్థించి ఇంటికి తిరిగివచ్చి తన సోదరుల్ని నక్కలుగా వారి పిల్లల్ని కోతులు గొర్రెలుగా పుడతారని శపించగా అట్లే జరిగింది. అతడు దేవతల వల్ల రక్షింపబడిన ప్రాంతాన్నే ఉదపాన తీర్థం అంటారు.

**ఉదయగిరి 1 :** ఇదో పర్వతం. కవులు సూర్య చంద్రులు ఇక్కడే ఉదయిస్తారని వర్ణించారు.

**ఉదయగిరి 2 :** పుణ్యయాత్రా స్థలాల్లో ఇదొకటి. ఒక సాయంత్రం ఇక్కడ ప్రార్థన చేసి దేవునిపై భక్తి నిలిపితే 12 సంవత్సరాలు ప్రార్థన, ధ్యానం చేసిన ఫలితం లభిస్తుంది.

**ఉదయనుడు :** చంద్రవంశపు రాజుల్లో ప్రసిద్ధుడు. *వంశవృక్షం :* విష్ణు – వ్యాసుడు – పాండు – అర్జున – అభిమన్యు – పరీక్షిత్తు – జనమేజయుడు – శాతానిక – సహస్రానిక – ఉదయనుడు. సహస్రానికుడు బలవంతుడైన రాజు. ఇతడు ఇంద్రునికి సహాయంగా వెళ్లి అసురులను ఓడించాడు. ఇంద్రుడు మెచ్చి తన రథంలో తిలోత్తమతో సహా ఇతడిని అతని దేశానికి పంపాడు. మార్గమధ్యమున అవివాహితుడైన సహస్రానికుడు ఇంద్రుడు చెప్పిన అందాల యువతి భార్య కాగలదనే మాటలను గురించి ఆలోచిస్తూ తిలోత్తమ చెప్తున్న మాటలను వినడంలేదు. అది గ్రహించిన తిలోత్తమ ఇంతగా ఆలోచిస్తున్న నీకు ఓ 12 సంవత్సరాలు భార్యయెడబాటు కల్గుతుందని శపిస్తుంది. మార్గావతిని వివాహమాడిన తర్వాత ఆమెకోరికపై లక్కనీటిలో స్నానం చేస్తుండగా ఓ గద్ద ఆమెను యెత్తుకుపోయి ఉదయన పర్వతంపై వదిలివేస్తుంది. అక్కడ ఆమె ఒక శిశువును ప్రసవిస్తుంది. ఉదయాద్రి పర్వతంపై ప్రసవించడం వల్ల అతనికి ఉదయనుడని పేరు. ఓ పండ్రెండు సంవత్సరాలు జమదగ్ని ఆశ్రమంలో గడుపుతారు. ఇక్కడవున్న విషయం తెలుసుకున్న తండ్రి ఉదయను మార్గావతిని తన వద్దకు రప్పించుకుంటాడు. ఉదయనుడికి రాజ్యాన్ని అప్పగించి సహస్రానికుడు తన భార్యతో స్వర్గానికి వెళతాడు. ఉదయనుడు చండ మహాసేనుడి కూతురు వాసవదత్తను, మరోరాజు కూతురు పద్మావతిని వివాహం చేసుకొని పొరుగు రాజులతో మైత్రీ బంధం ఏర్పరచుకొని తన ప్రజల సౌభాగ్యానికి పాటుబడి గొప్పరాజుగా కీర్తించ బడ్డాడు. ఇతని మంత్రులు యోగంధరాయణుడు, రుమగ్యానుడు, వసంతకుడు. – కథాసరిత్సాగరం

**ఉదయాశ్వుడు :** అజాతశత్రుడి మనుమడు. శైశునాగులలో ఒకడైన మగధదేశపు రాజు. పాటలీపుత్రం నగరాన్ని నిర్మించినదితడే.

**ఉదరశాండిల్యుడు :** ఇంద్రుని సభలోని ఓ మహర్షి
– మహాభారతం

**ఉదరాక్షుడు :** స్కందుని వీరుల్లో ఒకడు.
– మహాభారతం

**ఉదర్కుడు :** మహిషాసురుని మంత్రి. మహిషాసురునికి శక్తివంతమైన మంత్రివర్గం ఉండేది. చిక్షురుడు సైన్యానికి మంత్రి. ఉదర్కుడు సర్వసైన్యాధిపతి.
– చూ॥ మహిషాసురుడు.

**ఉదంకుడు 1 :** ఓ మహర్షి, ఇతడు విష్ణుమూర్తిని గూర్చి ఘోరతపస్సు చేయగా అతడు ప్రత్యక్షమై వరము కోరుకొనమనగా నినుజూచితి నదియే చాలు, నా మనసు సత్యధర్మములందే స్థిరమగునట్లు వరమిమ్మని కోరెను. విష్ణువు అట్లేయని నీకు పరమయోగ జ్ఞానము కలుగును, నీ వలన లోకోప కారము కలుగవలెను. అదేమన దుంధుడను రాక్షసుడు లోకంబులకుపద్రవము చేయుచున్నాడు. వీనిని సంహరించ కువలయాశ్వుని ప్రోత్సహించుము. నా ప్రపాదంబైన యోగ బలమున ఆ రాక్షసుని చంపగలవాడని చెప్పెను. ఆ చెంతనే దుంధుడు బిలము చేసుకొని యుండ అతని ఉచ్ఛ్వాస నిశ్వాసలకే అరణ్యము వణకుచుండెను. అంతట ఉదంకుడు అయోధ్య రాజైన బృదశ్వుని కడకు బోయెను. అపుడే అతడు తన కుమారుడైన కువలయాశ్వునికి రాజ్య మప్పగించి తాను అడవులకు బోవుచుండెను. నేనస్త్రసన్యాసము చేసితిని గనుక నా కుమారుని కోరమని చెప్పగా కువలయాశ్వుడు ఆ రాక్షసుని జంపెను. – మహాభారతం

**ఉదంకుడు 2 :** భృగు వంశమువాడు, గౌతముని శిష్యుడు. గౌతముడు ఇతర శిష్యులకు వరములిచ్చి ఇతడివంక జూడకున్నాడు. అట్లే గురువును కొలుచుచుండెను. ఒకరోజు ఉదంకుడు కట్టెల మోపు తెచ్చుచుండగా అతని జడ కట్టెల మోపులో దిగబడి రాకుండెను. అట్లే గురువు వద్దకు వచ్చి ఏడ్చుచు కూర్చుండెను. అతని కళ్లవెంట అశృ ధారలు కురవగా తన కూతురిని ఆశ్రుధారలు క్రిందపకుండా దోసిలి పట్టమనెను. శిష్యుడు గౌతముని తన కష్టాలకు ఉపాయము లేదా, ఇతరులపై గల దయ నాపై లేదా అని అడుగగా నిన్నెట్లువదలగలను, నాకుమార్తె నిచ్చి పెండ్లి చేసెదనని చెప్పెను. ఆ సంతోషములో ఉదంకుడు గౌతముని భార్యను నీకేమి కావలయునన్న తెచ్చి యిత్తును, కోరుకొమ్మనెను. మిత్రసహుడగు రాజు భార్య దమయంతి వద్దగల కుండలములు తెచ్చి యిమ్మనెను. ఉదంకుడు బయలుదేరి మార్గ మధ్యమున రక్తసిక్తముగా ఉన్న ఒక రాక్షసుని జూచెను. అతడు తనను భక్షించెదనని చెప్పగా నా గురుపత్నికి ఓ వరమిచ్చితిని అది నెరవేరగానే నేను నీవద్దకు వచ్చెదను అట్లే భుజింపుమని కోరెను. పిమ్మట మిత్రసహుని భవనమునకేగి తన గురుపత్ని కోరికను వెల్లడించగా ఆ కుండలములిచ్చి అత్యంత జాగరూకతతో వెళ్లుము. వీటిని అశుభ్రముగా తాకినను లేక ఎక్కడైన భూమిపై పెట్టినను సురలు, గంధర్వులు, ఉరగములు అపహరింతురని జెప్పెను. ఉదంకుడు వెనుదిరిగి మిత్రసహుని జూచి ఇవి మా గురుపత్నికి ఇచ్చి మరల నీ చెంతకు వచ్చెదను భక్షిం పుమనెను. అందుకు రాజు మెచ్చి బ్రాహ్మణులు బహు సమర్థులు. వారి శాపము వలనే ఇట్లుంటినని విలపించగా ఉదంకుడు సృజించగనే నిజరూపుడ య్యెను. మార్గ మధ్యమున ఆకలిగా వుండి ఆ కుండలములను చెట్టుకు కట్టి ఆకలి దీర్చుకొనుటకు చెట్టు ఎక్కగా గాలికి కుండలములు క్రిందపడగా వెంటనే సర్పమొకటి వచ్చి ఆ కుండలములను నాగలోకమునకు తీసుకొనిబోయెను. ఉదంకుడు కర్రతో భూమిని తవ్వుచుండగా ఇంద్రుడు వచ్చి కర్రతో తవ్వగా ఎంత కాలమునకు నాగలోకమునకు వెళ్లగలవు అని అడుగగా ఏది ఏమైనను బ్రహ్మత్వమునైనను వదలు కొందునుగాని త్రవ్వుట ఆపననెను. అప్పుడు ఇంద్రుడు కర్రను శూలముగా చేసెను. భూమియు అతనికి దారి నిచ్చెను. ఉదంకుడు నాగలోకమునకు బోయెను. అచటనొక యశ్వము కన్పించి నాయపాన మెత్తి యూదుము నీ కార్యము సిద్ధించుననెను. అంతే గాక తను గౌతముని గురువగు అగ్నినగుట యెరింగించెను. అట్లు ఊదగా అశ్వము యొక్క వెంట్రుకలన్నియు అగ్నికణములై పొగజిమ్మగా నాగులు దడచి కుండలములు తెచ్చియిచ్చెను. ఉదంకుడు వాటిని దెచ్చి గురుపత్నియగు అహల్యకిచ్చెను.
– జైమిని భారతం

**ఉద్ధవుడు :** ఓ యాదవ కులస్తుడు. శ్రీకృష్ణుని మిత్రుడు, మంత్రి. ఇతడు బృహస్పతి శిష్యుడు. ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. అర్జునుడు సుభద్రను వివాహమాడినపుడు ఇతడు ద్వారక నుండి కట్నరాసులను ఇంద్రప్రస్థానికి చేర్చాడు. శ్రీకృష్ణుడు కంసుడ్ని సంహరించి మధురలో కొంతకాలం వున్నపుడు తన మంచి చెడులను గోపికలకు గోపాలులకు తెలియజేయమని ఇతణ్ణి పంపగా శ్రీకృష్ణుని విజయాన్ని గురించి అక్కడి ప్రజలకు తెలియజేసి వారిచ్చిన బహుమతుల్ని మధురకు తెచ్చాడు. శ్రీకృష్ణుడు యాదవ నాశనాన్ని గురించి తన నిష్క్రమణ గురించి ఇతనికి తెలియజేస్తే ఇతడు కూడా శ్రీకృష్ణునితో వైకుంఠానికి వస్తాననగా ఈ శరీరం ఓ స్వప్నం మాత్రమేనని చెప్తాడు. ఉద్ధవుడు బంధము మోక్షం గురించి ప్రశ్నించగా శ్రీకృష్ణుడు అతనిని సమాధానాలతో సంతృప్తి పరుస్తాడు. ఆ తర్వాత ద్వారక నుండి బదరికాశ్రమానికి వెళ్లి తపస్సు చేస్తాడు. - మహాభారతం

**ఉద్రపాదకం :** ధృతరాష్ట్రుడి వంశంలో జన్మించిన సర్పం. సర్పయాగంలో మరణిస్తుంది. - మహాభారతం

**ఉద్వహుడు :** ఓ క్షత్రియరాజు. క్రోదవశుడను రాక్షస కుటుంబంలో జన్మించాడు. - మహాభారతం

**ఉద్వహం :** వాయువులో ఓ భాగం. గాలి విష్ణువు యొక్క ఉచ్ఛ్వాస నిశ్వాసలంటారు. 49 రకాల వాయువులు న్నాయని అందులో ఏడు ముఖ్యమైనవని చెప్తారు. అందులో ఉద్వహం ఒకటి. ఇది 4 సముద్రాలనుండి నీటిని పైకి తీసుకొని మేఘాలకు అందిస్తుంది. ఎల్లప్పుడు ఈ కార్యనిర్వహణ చేసే వాయువుని ఉద్వహం అంటారు.

**ఉదానం :** పంచప్రాణాల్లో ఒకటి. ప్రాణ, అపాన సమాన, ఉదాన, వ్యానాలు పంచప్రాణ వాయువులు.

**ఉదాపేక్షి :** విశ్వామిత్రుడి కొడుకు. వేదాలను క్షుణ్ణంగా పఠించినవాడు. - మహాభారతం

**ఉద్దాలకుడు 1 :** అయోధధౌమ్యుని శిష్యుడైన ఆరుణినే ఉద్దాలకుడని అంటారు. ఇతడు ఇంద్రుడి కొలువులో ప్రముఖుడు. ఇతడి ఒక కొడుకు శ్వేతకేతు, కుమార్తె సుజాత. సుజాతను కహోద కుడనే శిష్యునికిచ్చి వివాహం చేయగా వీరికి పుట్టినవాడే అష్టావక్రుడు. ఒకసారి ఉద్దాలకుడు యాగంచేసే ప్రదేశానికి సరస్వతీ నదిని రమ్మని మనసులోనే కోరగా అచటికి వచ్చింది. అందుకే సరస్వతీ నదిని మనోరమ అని పిలుస్తారు. తన కుమారుడు శ్వేతకేతుడు బ్రాహ్మణ వ్యతిరేకి అని తెలిసి ఇంటినుండి వెళ్లగొడతాడు. - మహాభారతం

**ఉద్దాలకుడు 2 :** మహాభారతంలో మరో ఉద్దాలకుడు కన్పిస్తాడు. ఇతడో మహర్షి. ఇతడోసారి నది ఒడ్డున పూజలు నిర్వహించడానికి వెళ్లి అక్కడే పూజా ద్రవ్యాలను మరచి తన ఆశ్రమానికి వస్తాడు. అప్పుడు జ్ఞాపకం వచ్చి కొడుకు నాచికేతుడ్ని వాటిని తెమ్మని పంపగా అప్పటికే అవి గాలికి కొట్టుకుపోగా కుమారుడు అదే విషయాన్ని తండ్రికి చెప్తాడు. ఉద్దాలకుడు కోపోద్రిక్తుడై కుమారుడ్ని చనిపొమ్మని శపించి ఆ తర్వాత ఆ శవంపై బడి విలవిలా ఏడుస్తాడు. కళ్లనుండి నీళ్లధార శవంమీద పడగా ఆ శవం సజీవుడవుతాడు. అప్పుడు తండ్రి యమలోకం గురించి వివరించ మనగా కొడుకు యమలోకాన్ని వర్ణిస్తాడు. - మహాభారతం

**ఉదీచ్యుడు :** వ్యాసుని శిష్యులలో ఒకడు. - మహాభారతం

**ఉద్దీపకం :** చూ॥ పంచతంత్రం.

**ఉన్ముడు :** దక్షిణ భారతదేశంలో నివసించిన మహర్షి. - మహాభారతం

**ఉన్మత్తుడు :** యముడు స్కందునికి పంపిన సేవకులో ఒకడు. మరొకడు ప్రమథుడు. - మహాభారతం

**ఉన్నాభుడు :** శిలుడు కొడుకు. ఇతడి కుమారుడు వజ్రనాభుడు. - రఘువంశం

**ఉన్మాథుడు 1 :** యముడు స్కంద దేవునికిచ్చిన ఇద్దరు సేవకుల్లో ఒకరు. రెండోవాడు ప్రమాథుడు. - మహాభారతం

**ఉన్మాథుడు 2 :** పార్వతి స్కందుని వద్దకు పంపిన సేవకుడు. - మహాభారతం

**ఉన్మాదిని :** శ్రావస్తి నగరంలో ఓ వైశ్యుని కుమార్తె. ఎంతో అందమైనది. ఆ వైశ్యుడు తన రాజైన దేవసేనుని వద్దకు వచ్చి ఆమెను వివాహమాడమని కోరతాడు. తన సలహాదారుల సూచనపై అతడు నిరాకరించగా అతని సేనాని వివాహం చేసు కుంటాడు. ఆ తర్వాత అనుకోని విధంగా ఆమెను చూడటం జరుగుతుంది. రాజు ఆమె అందానికి అచ్చెరువొంది ఆమెను వివాహమాడనందుకు విచారపడి దిగులుతో మరణిస్తాడు. - కథాసరిత్సాగరం

**ఉపకృష్ణకుడు :** స్కందదేవుని సైనికుల్లో ఒకడు. - *మహాభారతం*

**ఉపకీచకులు :** విరాటరాజు బావమరిది కీచకునికి 105 గురు సోదరులు. కీచకుని వధకు పాంచాలి కారణ మని ఆమెను వీరు స్మశానవాటికకు తీసుకొని వచ్చి సజీవదహనం చేయదలుస్తారు. వెంటనే భీముడు ఓ వృక్షాన్ని పెకలించి వీరిపై విసరగా మరణిస్తారు. - *మహాభారతం*

**ఉపకోశ :** ఉపవర్షుని కుమార్తె. - చూ॥ వరరుచి.

**ఉపకోసలుడు :** చూ॥ సత్యకాముడు.

**ఉపగాహుడు :** విశ్వామిత్రుని కుమారుడు. ఇతడు బ్రహ్మవాదినుడు.

**ఉపగిరి :** ఉత్తర భారతదేశంలో పర్వత ప్రాంతం. - *మహాభారతం*

**ఉపగుప్తుడు :** చంద్రవంశపు రాజు.

**ఉపచారము :** అతిధులకు చేయవలసిన పరిచర్యలు. ఇవి పదహారు. 1. ఆసనం 2. పాద్యం (కాళ్ళు కడగ టానికి నీరు) 3. అర్ఘ్యం (త్రాగడానికి నీరు) 4. పానీ యం (స్నానం) 5. అనుతాపనం (సువాసన ద్రవ్యాలు) 6. ధూపం (పొగ) 7. దీపం. 8. నైవేద్యం (ఆహారం) 9. తాంబూలం 10. సీతలజలం 11. వసనం (దుస్తులు) 12.భూషణం (అలంకారము) 13. మాల్యం (ఆలింగనం) 14. గంధం (తీపి). 15. ఆచమ నీయకం (నోరు శుభ్రతకు నీరు) 16. సుతల్పం (నిద్రించడానికి ఏర్పాటు)

**ఉపచిత్రుడు :** ధృతరాష్ట్రుని కుమారుడు. కురుక్షేత్ర యుద్ధంలో భీమసేనుడు వధించాడు. - *మహాభారతం*

**ఉపజలం :** మహాభారత కాలంలో ప్రవహించిన ఓ నది. ఈ నదిలో స్నానం చేసిన ఉసినారుడను రాజు శక్తివంతుడై ఇంద్రుని మించి అధికారం పొందాడు. - *మహాభారతం*

**ఉపత్యకం :** భారత వర్షంలోని ఒక రాజ్యం. - *మహాభారతం*

**ఉపదానవి :** వైశ్వానరుడి కూతురు. హిరణ్యాక్షుడి భార్య. - *భాగవతం.*

**ఉపదేవుడు :** పూరువంశపు రాజు.

**ఉపనందుడు 1 :** ధృతరాష్ట్రుని నూర్గురు కొడుకుల్లో ఒకడు. కురుక్షేత్రంలో భీమసేనుడు ఇతణ్ణి వధించాడు. - *మహాభారతం*

**ఉపనందుడు 2 :** ఇదో సర్పం. - *మహాభారతం*

**ఉపనందుడు 3 :** స్కందదేవుని సైన్యంలోని ఒక వీరుడు. - *మహాభారతం*

**ఉపనిషత్తులు :** ఇవి 108. ఇవి వేదాలను వివరిస్తాయి. ఉపనిషత్ అంటే చాలదగ్గర అని అర్థం. ఉపనిషత్తు లను 'వేదాంతా'లని కూడా అంటారు. ఇవి బ్రహ్మ స్వరూపాన్ని వర్ణిస్తాయి. షడ్దర్శనాలకు మూలాలు వీటిలో వున్నాయి. బ్రాహ్మ ణాలు, అరణ్యాలు కూడా వేదాలను వివరించేపని చేస్తాయి.

**ఉపపాండవులు :** పాండవులకు ద్రౌపదివల్ల జన్మించిన పుత్రులు. ధర్మజుని వల్ల ప్రతివింధ్యుడు, భీమునివల్ల శ్రుతసోముడు, అర్జునునివల్ల శృతకీర్తి, నకులునివల్ల శతానికుడు, సహదేవునివల్ల శృతసేనుడు జన్మిస్తారు. వీరినందర్ని అశ్వత్థామ రాత్రికి రాత్రి దుర్యోధనుడి కోరికపై పాండవులని భ్రమించి చంపుతాడు. వీరు పూర్వ జన్మలో విశ్వులనే దేవతలు. విద్యామిత్రుని శాపానికి గురై ఉపపాండ వులుగా జన్మించారు. - *మహాభారతం*

**ఉపపాతకాలు :** ప్రాచీన రాజకీయ తత్వశాస్త్రమైన రాష్ట్ర మీమాంస ప్రకారం నేరాలు రెండురకాలు. పెద్ద నేరాలు పాతకాలు. చిన్న నేరాలు ఉప పాతకాలు.

*ఉపపాతకాలకు కొన్ని ఉదాహరణలు :* గోవధ, యాగార్హత లేకుండా యాగం చేయడం, పరస్త్రీని వ్యామోహించడం, తల్లిదండ్రుల్ని గురువును విస్మరిం చడం, అవివాహితను తూలనాడటం, అప్పుతెచ్చిన డబ్బుతో జీవనం సాగించడం, భత్యం తీసుకొని వేదాలు బోధించడం, అమ్మగూడని వస్తువులను అమ్మడం, ఔషధమొక్కలను నాశనంచేయడం, ఎండిపోని చెట్లను నరికి వంటకు ఉపయోగించడం, అప్పుతీర్చకపోవడం, త్రాగుబోతు, స్త్రీలతో స్నేహం, స్త్రీలను, క్షత్రియుల్ని వైశ్యుల్ని, శూద్రుల్ని చంపడం ఈ కోవలోకి వస్తాయి.

**ఉపపురాణాలు :** ఇవి పురాణాల్లాగే 18. సనత్కుమార, నారసింహ, నారదీయ, శివ, దుర్వాస, కాపిల, మానవ, ఉశన, వారుణ, కాలిక, సాంబ, సౌర, ఆదిత్య, మహేశ్వర, దేవీభాగవత, వాశిష్ఠ, విష్ణు ధర్మోత్తర, నీలమత పురాణాలు.

**ఉపప్లావ్యం :** విరాటరాజు రాజ్యంలో ఓ చిన్న పట్టణం. అజ్ఞాతవాసం తర్వాత ఈ పట్టణంలో పాండవులు నివసించారు. – *మహాభారతం*

**ఉపబర్హణుడు 1 :** ఇంద్రసభలో అప్సరసలు నాట్యం చేస్తుండగా ఇతనికి రేతఃపతనమౌతుంది. ఇది చూసిన బ్రహ్మ శూద్రయోనిలో పుట్టమని శపిస్తాడు. ఇతడు కళావతి అనే గోపికకు కొడుకుగా పుడతాడు. – *బ్రహ్మ వై.పు.*

**ఉపబర్హణుడు 2 :** ఇతడొక గంధర్వుడు. విశ్వస్రష్టలైన బ్రహ్మలు దేవసత్రమనే యాగం చేస్తూ నారాయణ కథల్నిగానం చెయ్యడానికి గంధర్వుల్ని అప్సరసల్ని పిలుస్తారు. ఇతడు కొంతసేపు పాడిన తర్వాత అప్సర సల్ని మోహించి తప్పుకున్నాడు. అందుకు బ్రహ్మలు కోపించి శూద్రయోనిలో జన్మించమని శపిస్తారు. ఇతడు అలానే పుట్టి తర్వాత నారదు డౌతాడు. – *భాగవతం.*

**ఉపమన్యుడు 1 :** అయోధ్యధౌమ్యుని ముగ్గురు శిష్యులలో ఒకరు. తక్కిన ఇద్దరు ఆరుణి, వేదుడు. గురువుచే పరీక్షింపబడి నెగ్గాడు. – *చూ॥ అయోధ్య ధౌమ్యుడు*

**ఉపమన్యుడు 2 :** వ్యాఘ్రపాదుని ఇద్దరు కుమారుల్లో ఒకడు. రెండోవాడు ధౌమ్యుడు. ఇతడే అయోధ్య ధౌమ్యుని శిష్యుడని అంటారు. ఇతడు శివుని గూర్చి ఘోరతపస్సు చేయగా శివుడు ప్రత్యక్షమై ఇతడ్ని దేవుణ్ణి చేశాడు.

**ఉపమన్యుడు 3 :** సుతపస్సు అనే ముని యొక్క కుమారుడు. గరుడుని సోదరిని వివాహమాడనెంచి కశ్యపుడ్ని అడుగుతాడు. అతడు ఈ ముదుసలికి ఇవ్వడానికి ఇష్టపడకపోతే ఒకవేళ నీ కూతుర్ని బ్రాహ్మణుడెవరికైనా ఇచ్చి వివాహంచేస్తే నీతల వెయ్యి ముక్కలవుతుందని శపిస్తాడు.

**ఉపయాజి :** యాజి, ఉపయాజి సోదరులు. మహర్షులు. ద్రోణుని కోరికపై అర్జునుడు ద్రుపదుణ్ణి జయించి అతని రాజ్య భాగాన్ని ద్రోణునికిస్తాడు. ప్రతీకారంతో ద్రుపదుడు ద్రోణుని జయించ నెంచి అతడ్ని ఓడించ గల పుత్రుడు జన్మించాలని యాగం చేయదలచి ఉపయాజిని యాగాన్ని నిర్వహించమని కోరగా మొదట అతడు నిరాకరిస్తాడు. ద్రుపదుడు ఓ సంవత్సరం పాటు ఇతనికి సపర్యలు చేసి ప్రార్థించగా అంగీకరించి తన సోదరుడు యాజితో కలిసి యజ్ఞం చేయిస్తాడు. ఆ యజ్ఞ గుండంలోంచి దృష్టద్యుమ్నుడు, పాంచాలి ఉద్భవిస్తారు. – *మహాభారతం*

**ఉపరిచర వసువు :** ఇతడు చేదిరాజు. ఇంద్రుని స్నేహి తుడు. మొట్టమొదట ఇంద్రోత్సవం చేసిన రాజు. దీనికి మెచ్చి ఇంద్రుడితడికి తనను కలుసుకొనుటకు వీలుగా ఓ దివ్య విమానము, కమలమాలికను, ఒక వేణువునిచ్చెను. ఇతడు తరచుగా ఈ విమానమెక్కి ఉపరితలముపై ప్రయాణించెడివాడు. అందుకని ఇతణ్ణి ఉపరి చరుడు అని పిలిచేవారు.

ఇతని రాజ్యములో శక్తిమతి యను నది ప్రవహించు చుండెడిది. ఇది ప్రవహించకుండా కోలాహలమను పర్వతమడ్డువచ్చెను. వసువు తన కాలితో ఈ పర్వతమును తన్నగా అది రెండుగా విడిపోయి నదికి దారి ఇచ్చెను. శుక్తిమతి తనకు చేసిన ఉపకారము నకు మెచ్చి తనకుమారుడు వసుపదుని కుమార్తె గిరికను ఇతనికిచ్చెను. వసుపదుని తన సైన్యాధిపతిగా జేసి గిరికను తను వివాహమాడెను. ఒకనాడు గిరికకు మాంసా హారము తెచ్చుటకై అడవికి వేటకుబోయి అక్కడకూడా గిరికను జ్ఞప్తికి తెచ్చుకొనగా అతనికి రేవతమయ్యెను. దానిని వృధా పోనివ్వక ఓ ఆకులో వుంచి డేగద్వారా దానిని గిరికకు చేర్చబోయెను. మార్గమధ్యమున అదిజారి ఓ చేపనోట్లోపడెను. ఆ చేప ప్రసవించి ఇద్దరికి జన్మనిచ్చెను. ఒకడు మత్స్య రాజు ఒకతె మత్స్యగంధి (సత్యవతి – శంతనుని భార్య). గిరికను వివాహమాడుటకు ముందు ఇతనికి 5గురు కుమారులు. బృహద్రదుడు, మణివాహనుడు, సాబలుడు, యదువు, రాజన్యుడు. ఒకప్పుడు దేవతలకు, రుషులకు ఒక వివాదము చెలరేగెను. 'అజేనయష్టవ్యం' అను పదములోని అజ అను పదమునకు అర్థము దేవతలు మేకయని, రుషులు భీజములని వాదులాడుచుండిరి. ఈ రెండింటిలో ఏది సరియైనదో విజ్ఞుడైన ఉపరిచరవసువును వివరణ కోరగా ఇంద్రుని పక్షపాతముతో అతడు మేకయని చెప్పెను. రుషులు ఇందుకాగ్రహించి నీవు భూమిపై పడమని శపించిరి. విష్ణుభక్తుడైన ఉపరిచర వసువు విష్ణువుని ప్రార్థించగా మరల అతడ్ని యధా స్థితికి తీసుకువచ్చెను. – *మహాభారతం*

**ఉపవాసం :** పాపజీవితాన్ని పరిహరించుకొని మంచి జీవితాన్ని గడపడాన్ని ఉపవాసం అంటారు. దీన్ని పాటించేవారు మాంసం, కొన్ని రకాల ధాన్యాలు, తేనె స్వీకరించరాదు. స్త్రీని విడనాడాలి. పుష్పాలు, ఆభరణాలు, అందమైన దుస్తులు విసర్జించాలి.
– ఆగ్నిపురాణం

**ఉపవీతం :** జంధ్యం లేక ఉత్తరీయాన్ని ఉపవీతం అంటారు. బ్రాహ్మణ వైశ్య క్షత్రియులు దీన్ని ధరిస్తారు. ఎడమభుజం మీద ధరిస్తే ఉపవీతం, కుడిభుజం మీద ధరిస్తే ప్రాచీనవీతం, మెడచుట్టూ ధరిస్తే నివీతం.
– మనుస్మృతి

**ఉపవేణ :** ఒక నది. అగ్ని దీన్నుండి ఉద్భవించింది.
– మహాభారతం

ఇది దక్షిణ భారతంలోని కృష్ణానదికి ఉపనది.

**ఉపశృతి :** ఉత్తరాయణంలోని ఒక దేవత. ఇంద్రుణ్ణి శచీదేవిని కలిపింది ఈ దేవతే.

**ఉపశృత్యధిదేవత :** ఉపశృతికి అధిష్టానమైన దేవత. తామనుకొనే మాటలు యదార్థమవుతాయో లేదో తెలిపే మాటలను ఉపశృతి అంటారు. శచీదేవిని, ఇంద్రుణ్ణి కలిపింది ఈ దేవతే.

**ఉపశ్లోకుడు :** సైరంధ్రి వల్ల శ్రీకృష్ణుడికి జన్మించిన పుత్రుడు. అతడు అన్ని శాస్త్ర తత్వశాస్త్రాలను అధ్యయనం చేశాడు. సాంఖ్యాయోగ విభాగాన్ని అనుసరించాడు.
– *భగవద్గీత*

**ఉపస్మృతులు :** ఉపస్మృతులు 18. అవి కణ్వ, కపిల, లోహిత, దేవల, కాత్యాయన, లోకాక్షి, బుధ, శాతాతప, అత్రి, ప్రచేత, దక్ష, విష్ణు, వృద్ధవిష్ణు, వృద్ధమను, దౌమ్య, నారదపౌలస్త్య, ఉత్తరాంగిర స్మృతులు.

**ఉపసుందుడు :** నికుంబుడనే రాక్షసుడి కొడుకు. సుందుడి తమ్ముడు. – మహాభారతం

**ఉపాయాలు :** చూ॥ చతుర్వుపాయాలు.

**ఉపావృత్తం :** భారతదేశంలోని ఒక రాజ్యం.
– మహాభారతం

**ఉపేంద్ర :** ఒక నది. – మహాభారతం

**ఉపేంద్రబలుడు :** శ్రీదత్తుడను రాజువద్ద గల మంత్రి యొక్క కుమారుడు.

**ఉపేంద్రుడు :** విష్ణువు యొక్క మరోపేరు. కశ్యప ప్రజాపతికి అదితి వల్ల జన్మించిన శ్రీమహావిష్ణువే ఈ ఉపేంద్రుడు. ఇతడిని వామనుడు అని అంటారు.
– భాగవతం

**ఉమ :** చూ॥ పార్వతి.

**ఉమాపతి :** చూ॥ శివుడు

**ఉమ్లోచ :** ఓ అప్సరస. అర్జునుని జన్మదినోత్సవ వేడుకల్లో పాల్గొంది. – మహాభారతం

**ఉరగులు :** ఒకజాతి సర్పాలు. కశ్యపుని భార్య క్రోదవశకు 10 మంది కూతుళ్లు. వీరిలో సురస అనే కూతురుకు నాగవంశ సర్పాలు, కద్రువకు పుట్టిన వారు ఉరగులు. – రామాయణం

**ఉరుక్రముడు :** వామనుని మరోపేరు.

**ఉరువల్కుడు :** ఇళావసుదేవుల కొడుకు.

**ఉరుశ్రవుడు :** సత్యశ్రవుడి కుమారుడు. ఇతడి కుమారుడు దేవదత్తుడు. – మహాభారతం

**ఉర్వర :** కుబేరుని ఆస్థానంలోని అప్సరస. అష్టావక్రుని ముందు ఇతర అప్సరసలతో కలసి నృత్యం చేసింది.
– మహాభారతం

**ఉర్వరీయాసుడు :** పులహ ప్రజాపతి కుమారుడు. క్షామ అనే భార్య వల్ల ఇతడికి ముగ్గురు కుమారులు. ఇందులో ఒకడు ఉర్వరీయాసుడు, తక్కిన ఇద్దరు కర్ధముడు, సహిష్ణుడు.

**ఉర్వశీతీర్థం :** ఓ పుణ్య స్థలం మరియు స్నానఘట్టం. ఇక్కడ స్నానం చేసినవారిని ప్రజలు గౌరవిస్తారు.
– మహాభారతం

**ఉర్వి :** భూమి. పరశురాముడు భూమినంతా జయించి కశ్యపునికి దానమిచ్చాడు. పాపభారం పెరగగా భూమి పాతాళానికి కృంగింది. కశ్యపుడు దాన్ని తన ఊరువులతో పైకెత్తాడు. అందుకనే భూమిని ఉర్వి అంటారు.
– మహాభారతం

**ఉర్వ్వర :** కుబేరుడి సభలోని దేవకన్య. అష్టావక్రుడి గౌరవర్థం నృత్యం చేస్తుంది. – భాగవతం

**ఉలూకం :** బృహంతుడనే రాజు పాలించిన దేశం
– మహాభారతం

**ఉలూకాశ్రమం :** ఇదో పవిత్ర స్థలం – మహాభారతం

**ఉలూకుడు 1 :** శకుని కుమారుడు. దుర్యోధనుని పనుపున పాండవుల వద్దకు ధూతగా వెళ్లి పాండవుల సందేశాన్ని దుర్యోధనునికి చెప్పాడు. మొదటి రోజు యుద్ధంలో చేదిరాజుతో పోరాడాడు. తర్వాత సహదేవునితో పోరాడాడు. ద్రోణుని మరణం తర్వాత యుద్ధ భూమినుండి పారిపోయి మరల కర్ణుని నేతృత్వంలో పోరాడి సహదేవునితో యుద్ధంలో మరణించాడు. యుయుత్సుడ్ని ఓడించిన వీరుడు. అతని ఇతరపేర్లు శాకుని, కైటక, సాచత్యాసుత.

**ఉలూకుడు 2 :** ఇతడో యక్షుడు. గరుడుడు, ఇతడు ఒకసారి తలపడ్డారు. - *మహాభారతం*

**ఉలూకుడు 3 :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు. భీష్ముడు అంపశయ్యపై వుండగా అతడిని పరామర్శించిన వాళ్లలో ఒకడు. - *మహాభారతం*

**ఉలూతం :** ప్రాచీన భారతంలో ఓ దేశం. - *మహాభారతం*

**ఉల్ముకుడు :** చాక్షుషుడి కొడుకు. భార్య పుష్కరిణి. అంగుడు, సుమనసుడు, ఖ్యాతి, క్రతువు, అంగిరసుడు, గయుడు ఇతడి కుమారులు.

**ఉశన 1 :** భృగువు భార్య. - *భాగవతం*

**ఉశన 2 :** శుక్రుడి తల్లి.

**ఉశనసుడు :** భృగువు కొడుకు. రాక్షసులకు పురోహితుడు. - *మహాభారతం*

**ఉశనుడు :** శుక్రుడి తండ్రి.

**ఉశిక :** దీర్ఘతముడి భార్య. వీరి కొడుకు కాక్షివానుడు. - *రుగ్వేదం*

**ఉశికుడు 1 :** యదు వంశజుడు. కృతి కుమారుడు. చేది తండ్రి. - *మహాభారతం*

**ఉశికుడు 2 :** ఒక రుషి. - *ఋగ్వేదం*

**ఉశీనరుడు 1 :** చంద్రవంశపు రాజుల్లో గొప్ప ప్రజ్ఞాశాలి. ఇతని సంతతివారే శిబి, వేణుడు. అష్టావసుల్లో ఒకరి భార్య ఉశీనరుడి కూతురుకు స్నేహితురాలు. వశిష్టుడి ఆశ్రమంలోని ఆవు నందినిని ఉశీనరుడి కూతురుకు బహుమతి ఇవ్వదలచి అష్టావసువుల్ని కోరగా ఆ ఆవుని వశిష్ఠుడి ఆశ్రమం నుండి తెస్తారు. అ తదుపరి వచ్చి చూసిన వశిష్ఠుడు, అష్టావసువుల్ని మానవ జన్మ ఎత్తమని శపిస్తాడు.

*ఇతర వివరాలు :* - *చూ॥ భీష్ముడు*

శిభిని పరీక్షించినట్లే ఇతని దయార్ద్రతను ఇంద్రాగ్నులు పరీక్షించి అతని గెలుపుకి ఆనందపడతారు. ఉశీనరుడు గాలవునికి 100 ఆవుల్ని బహూకరించి యయాతి కూతురు మాలతిని వివాహం చేసుకుంటాడు. ఇతడు విలుప్తానది తీరంలో యజ్ఞంచేసి ఇంద్రునితో సమానుడవుతాడు.

ఇతడు గోవుల్ని ప్రజలకు బహుమతిగా ఇచ్చి స్వర్గలోక ప్రాప్తి పొందుతారు.

★ **ఉశీనరుడు 2 :** ఓ యదు వంశ రాజు. ద్రౌపది స్వయంవరంలో ఇతడు పాల్గొన్నాడు. - *మహాభారతం*

**ఉశీనరం :** ఇదోప్రాంతం. ఈ ప్రాంతంలోని వీరుల్ని అర్జునుడు సంహరించాడు. - *మహాభారతం*

**ఉశీరభీజం 1 :** ఉత్తరభారతంలోని ఒక పర్వతం. - *మహాభారతం*

**ఉశీరభీజం 2 :** హిమాలయాలకు ఉత్తరానున్న ప్రాంతం. ఇక్కడ మరుత్తుడు యుద్ధం చేస్తాడు. - *మహాభారతం*

**ఉశేనస్సు :** వేదశిరుడి కొడుకు.

**ఉష 1 :** బాణాసురుడి కుమార్తె. అనిరుద్ధుని భార్య. *వంశవృక్షం :* విష్ణు - కశ్యప - హిరణ్యకశిపు - ప్రహ్లాద, విరోచన - మహాబలి - బాణ - ఉష. ఈమె తగిన భర్తకోసం శివపార్వతుల్ని ప్రార్థిస్తుంది. ఈమెకు కలలో అనిరుద్ధుడు కన్పిస్తాడు. అతడు ఎవరో తెలుసుకోవడానికి తన చెలికత్తె చిత్రలేఖతో చెప్తే ఆమె వివిధ రాజకుమారుల చిత్రపటాల్ని ఉషకు చూపగా ఉష అనిరుద్ధుణ్ణి గుర్తు పడుతుంది. చిత్రలేఖ ఓ రోజు రాత్రి అనిరుద్ధుణ్ణి కలసి ఉషమందిరానికి తీసుకువస్తుంది. కొన్నాళ్లకు ఉష గర్భిణి అవుతుంది. ఇది బాణాసురుడికి తెలిసి అనిరుద్ధుడ్ని బంధిస్తాడు. కృష్ణుడు వచ్చి బాణాసురుణ్ణి సంహరించి ఉషను అనిరుద్ధునికిచ్చి వివాహం చేస్తాడు. వీరి కుమారుడు వజ్రుడు. - *భాగవతం*

★ మహాభారతంలో ఇతడు కాశీరాజ్యాన్ని పాలించినట్లు, ఇతని మరోపేరు వృషదార్భి అని పేర్కొనబడింది.

**ఉష 2 :** ఓ ముని కుమార్తె. సాళ్వరాజు రధుడనే విదర్భ రాజుని చంపగా అతని భార్యలు దేశం విడచి అడవికి వెళ్తారు. అందులో ఒక భార్య ఓ నది ఒడ్డున ప్రసవి స్తుంది. ఆమె నదిలోకి దిగగా మొసలి ఆమెను మింగి వేస్తుంది. ఆ పుట్టిన బిడ్డను ఉష పెంచి పెద్దవాణ్ణి చేస్తుంది. – శివపురాణం

**ఉష 3 :** రాత్రిని ఉష అని, పగలును గుస్తి అంటారు. ఈ రెండు కాలాల మధ్య వుండే కాలాన్ని సంధ్య అని పిలుస్తారు. – విష్ణుపురాణం

**ఉషంకుడు :** ఒక రుషి. ముసలితనం వస్తున్నదని గ్రహించి తన శరీరాన్ని పృథూదక ద్వీపంలో వదిలే స్తాడు. విశ్వామిత్ర, సింధు ద్వీపాదులు ఇతని ఆశ్రమంలో తపస్సుచేసి బ్రాహ్మణత్వం పొందుతారు. – మహాభారతం

**ఉషంగవుడు :** యమసభలోని ఒక సభ్యుడు. – మహాభారతం

**ఉషంగుడు 1 :** ఇతర దేశాలలో నివసించిన ఒక రుషి. – మహాభారతం

**ఉషంగుడు 2 :** యదువంశానికి చెందిన రాజు. వృజన వంతుడి కొడుకు. చిత్రరథుడి తండ్రి. – మహాభారతం

**ఉషంగుడు 3 :** చూ॥ శివుడు.

**ఉషస్తి :** ఒక రుషి. భార్య ఆటకి. వీరు నివసించే కురు దేశంలో కాటకం వస్తుంది. ఆకలికి తాళలేక ఓ మావటి వాడింటికి వెళ్లి అలచందలు ఇమ్మంటాడు. మావటివాడు సందేహించినా అవి తీసుకొని తింటాడు. మావటివాడ్ని నీళ్లివ్వమంటే ఎంగిలి కదా అంటాడు. అలచందలు తినలేదా, ప్రాణం నిలుపుకోవడానికి ఎంగిలితో పనిలేదని కొన్ని అలచందలు తీసుకొని తన భార్యకి ఇస్తాడు. తర్వాత సంపాదన కోసం రాజు కొలువుకు వెళ్తాడు. – చా. ఉ.

**ఉష్ట్రకర్ణిక :** దక్షిణ భారతదేశంలోని ఓ ప్రాంతము. సహదేవుని ఆధీనంలోకి వచ్చింది. – మహాభారతం

**ఉష్ణగంగ :** ప్రాచీన భారతదేశంలోని ఒక పుణ్యస్థలం. – మహాభారతం

**ఉష్ణ నాభుడు :** ఒక విశ్వదేవుడు. – మహాభారతం

**ఉష్ణదేశం :** క్రాంచ ద్వీపంలోని ఓ ప్రాంతం. క్రాంచ పర్వతాలు ఇక్కడే వున్నాయి. – మహాభారతం

**ఉషాపతి :** అనిరుద్ధుడు

**ఉష్టికం :** సూర్యుడి సప్తాశ్వాలలో ఒకటి. – విష్ణుపురాణం

**ఉంచ వృత్తి :** ఒక బ్రాహ్మణుడు. అడుక్కుతినేవాడు. ఒకనాడు అలాతెచ్చిన భాగాన్ని సగం తన కొడుకుల కిచ్చి తక్కిన సగం తను తినబోతాడు. ధర్మదేవత బ్రాహ్మణవేషంలో రాగా తన భాగమంతా అతనికిస్తాడు. మరింత కావాలనగా కొడుకు భాగాన్ని కూడా ఇస్తాడు. దీనికి సంతోషించి ధర్మదేవత ఇతణ్ణి స్వర్గానికి తీసు కెళ్తుంది. – మహాభారతం

**ఉండ్రం :** దక్షిణ భారతదేశంలోని ఒక ప్రాంతం. సహదేవుడు దీన్ని జయిస్తాడు. ధర్మజుని రాజ సూయ యాగానికి వచ్చి ఈ ప్రాంత ప్రజలు కానుకల ర్పిస్తారు. – మహాభారతం




**ఊ :** ఈ అక్షరానికి అర్థం 'రక్షణ'

**ఊర్జ :** వశిష్ఠుని ఒక భార్య. రజసుడు, గోత్రుడు, ఊర్ధ్వబాహుడు, శవణుడు, అనఘుడు, సుతపసుడు, శుక్రుడు ఈమె కుమారులు. 3వ మన్వంతరంలో వీరిని సప్తరుషులనేవారు. – విష్ణుపురాణం

**ఊర్జ 2 :** స్వారోచిష మన్వంతరంలోని సప్తర్షులలో ఒకరు. – విష్ణుపురాణం

**ఊర్జ 3 :** హేహయ వంశంలో ఒకరాజు. ఇతడు జరాసంధుని తాత. – అగ్నిపురాణం

**ఊర్జకేతువు :** జనక మహారాజు వంశంలోని ఒక రాజు. – భాగవతం

**ఊర్జవి :** సూర్యుని కుమార్తె – ఋగ్వేదం

**ఊర్జయోని :** విశ్వామిత్రుని సంతతిలోని వాడు. వీరు వేదాలకు భాష్యకారులు. – ఋగ్వేదం

**ఊర్జస్వతి :** ప్రియవ్రతుని కుమార్తె. ఊర్జస్వతికి 10 మంది సోదరులు. ప్రియవ్రతుడు ఈమెను శుక్రాచా ర్యుడికిచ్చి వివాహం చేశాడు. వీరికి పుట్టిన దేవయాని యయాతి భార్య. – భాగవతం

**ఊర్ణ :** స్వాయంభవ మన్వంతరంలో మరీచి భార్య. 6 గురు బలవంతులైన పుత్రులు జన్మించారు. ఒకసారి

వీరు బ్రహ్మను చూడటానికి వెళ్లి కూతుర్ని పెండ్లాడిన తండ్రిగా బ్రహ్మను తూలనాడగా వీరిని బ్రహ్మ రాక్షసులు కమ్మని శపించాడు. ఆ శాపంవల్ల కాలనేమి పుత్రులుగా జన్మించారు. - దేవీ భాగవతం

**ఊర్ణనాభుడు :** ధృతరాష్ట్రుని నూర్గురు పుత్రులలో ఒకడు. కురుక్షేత్రంలో భీమసేనుడితడ్ని సంహరించాడు. - మహాభారతం

**ఊర్ధ్వపుండ్రం :** నుదుటిమీద జేగురు రంగుతో ధరించే చిహ్నం. పర్వతాగ్రాల, నదీతీరాల, సముద్ర తీరాల మట్టితోగాని, జేగురు రంగుతోగాని దీన్ని ధరించ వచ్చు. మట్టిలోని వర్ణభేదాల్ని బట్టి, అది ధరించే స్థలాన్ని బట్టి దాని ఫలితం వుంటుంది. ఏ కాలంలో ధరించామనేదాన్నిబట్టి కూడా ఫలితం మారుతుంది. నుదుటి మీద కేశవ, పొట్ట మీద నారాయణ, హృదయం మీద మాధవ, మెడమీద గోవింద అనీ స్మరించాలి. - దేవీభాగవతం

**ఊర్ధ్వభాకు :** ఓ అగ్ని. బృహస్పతి 5వ కుమారుడు. - మహాభారతం

**ఊర్ధ్వబాహుడు :** ఊర్జవల్ల వశిష్ఠునికి జన్మించిన కుమారుడు. ఇతడు దక్షిణ భారతదేశంలో తపస్సు చేశాడు. - మహాభారతం

**ఊర్ధ్వవేణీధరుడు :** స్కందుని సేవకుడు. - మహాభారతం

**ఊర్వశి 1 :** ప్రసిద్ధి చెందిన అప్సరస.

*ఊర్వశి జననం :* ధర్మ పుత్రులైన నరనారాయణులు బదరికాశ్రమంలో వెయ్యి సంవత్సరాలు బ్రహ్మను గూర్చి తపస్సు చేశారు. ఇంద్రుడు తన పదవికోసం ఈ తపస్సు చేస్తున్నారని భ్రమించి ఎందరో మహర్షుల్ని వారివద్దకు పంపి వరం కోరుకొమ్మని అడిగించాడు. ఇంద్రుడు స్వయంగా కోరినావారు చలించలేదు. ఇంద్రుడు మాయతో వారి తపస్సు భగ్నం చేయదలచి అడవి జంతువులైన సింహాలను, పులుల్ని, పాముల్ని పంపాడు. తుఫానులు, అగ్నివర్షం కురిపించాడు. అయినా చలించక పోయేసరికి కామదేవుడు అతని భార్య రతీదేవిని శీతాకాలంగా సృష్టించాడు. అప్సరసలైన రంభ ఇతరులు అక్కడ నృత్యం చేశారు. తపస్సు చేస్తున్న వీరి హృదయం ఉప్పొంగి కళ్లు తెరచి చూడగా 108 మంది అప్సరసలు కన్పించారు. నారాయణుడు కోపంతో తన చేతిని తన ఊరువులపై కొట్టగా అప్సరసలకంటే సౌందర్య వతిమైన స్త్రీ జన్మించింది. అంతే కాక మరికొంతమంది అందమైన స్త్రీలు జన్మించారు. నారాయణుడి ఊరువుల నుండి జన్మించింది కనుక ఈమెను ఊర్వశి అన్నారు. - దేవీ భాగవతం

ఊర్వశి నృత్యంలో అప్సరసల్లో 11వ స్థానంకాగా అందంలో మొదటి స్థానం. - మహాభారతం

*ఊర్వశీపురూరవులు :* ఇలాబుద్ధుల పుత్రుడు పురూరవుడు. ఇతడు పెరిగి పెద్దవాడై గొప్ప చక్రవర్తిగా కీర్తిగడించాడు. ఇతనికీర్తి అన్నిలోకాలకు వ్యాపించింది. బ్రహ్మశాపం వల్ల ఊర్వశి భూమిపై జన్మించింది. వీరు ఒకరినొకరు చూసుకొని ప్రేమించుకొని వివాహమాడగా ఊర్వశి మూడు షరతులు విధించింది. 1. నెయ్యి మాత్రమే భుజిస్తాను. ఇతర పదార్థాలు భుజించమని బలవంతపెట్టరాదు. 2. నావద్ద రెండు కుందేళ్లు వున్నాయి. వాటిని కాపాడాలి. వాటికి నష్టం జరుగరాదు. 3. క్రీడించే సమయంలో తప్ప దిగంబరంగా కన్పించరాదు. పై షరతులకు ఒప్పుకొని వీరు కాపురం చేయుచుండగా ఇంద్రుడు దేవలోకంలో ఊర్వశి కన్పించక ఈమెను వెదకుటకు విశ్వవసు ఇతర గంధర్వుల్ని పంపగా వారు ఇచట తటస్థించిన ఊర్వశిని, వారి బంధాన్ని తెలుసుకొని ఓ రాత్రి ఆ రెండు కుందేళ్లను అపహరించి తీసుకుపోతారు. ఊర్వశి కోరికపై పురూరవుడు వాటిని తీసుకొని రావడానికి వెళ్లి వాటిని రక్షించి ఆమె వద్దకు వెలుగులో దిగంబరుడై వెళతాడు. ఆమె అతడ్ని చూసి తన షరతును అధిగమించాడు గనుక తన దారిన తను వెళుతుంది. ఆమెకోసం దేశమంతా తిరిగి కురుక్షేత్రంలో ఆమెను కలుసుకొని ఆమె ముందు మోకరిల్లగా "స్త్రీలు నక్కల వంటివారు, వారితో స్నేహం చెయ్యకు. స్త్రీలమీద దొంగల మీద విశ్వాసం ఉంచకు" అని అదృశ్యమవుతుంది. - దేవీభాగవతం

*పురూరవ ఊర్వశిల యెడబాటుకు కారణం :* ఇంద్రుడు అసురులపై యుద్ధము చేయనెంచి పురూరవుని సహాయము కోరెను. అసుర సంహారము తరువాత ఇంద్రసభలో ఇతని గౌరవార్థం రంభ నృత్యము

చేసెను. పురూరవుడు ఆమె నాట్యంలోని లోపాలకు నవ్వగా నాట్యాన్ని గురించి నీకేమి తెలియునని ఆమె ప్రశ్నించెను. నీ గురువైన తుంబురుని కన్న ఊర్వశి బాగా నాట్యము చేయగలదని సమాధానమివ్వగా తుంబురుడు నీకు ఊర్వశితో యెడబాటు కలుగునని శపించెను. ఆశాపఫలమే ఊర్వశిని గంధర్వులు తోడ్కొనిపోవుటకు కారణము. ఆ యెడబాటు తర్వాత పురూరవుడు విష్ణువును గూర్చి గొప్ప తపమాచరించి కనీసం సంవత్సరానికి ఒకసారైనా ఊర్వశిని కలిసే వరము పొందెను. పురూరవుని వల్ల ఊర్వశికి ఆరు గురు పుత్రులు జన్మించిరి.

*అగస్త్య వశిష్టుల పుట్టుక :* పూర్వం నిమి చక్రవర్తి అను రాజు కలదు. అతడు యజ్ఞమాచరించదలచి వశిష్ఠుని యజ్ఞ నిర్వహణ చేయమని కోరగా అపుడే ఇంద్రుడు చేయుచున్న యజ్ఞమునకు వశిష్ఠుడు వెళ్లదలచెను. తను వచ్చువరకు యాగం చేయవలదని చెప్పెను. నిమి చక్రవర్తి అందుకంగీకరించక గౌతముని ఆధ్వర్యములో యజ్ఞము చేసెను. వశిష్ఠుడు తిరిగి వచ్చి ఆగ్రహించి నీ శరీరమునుండి ఆత్మ వేరుకాగ దలని శపించెను. నిమికూడా నీకును అట్లే జరుగునని తిరిగి శపించెను. బ్రహ్మవద్దకు వెడలి వశిష్ఠుడు తనకు జరిగిన ఘోరాన్ని చెప్పుకోగా మిత్రావరుణిడి శరీరం లోకి ప్రవేశించమని అపుడు స్త్రీ గర్భంలో కాకుండా జన్మించగలవని చెప్పగా మిత్రావరుణిడి ఆశ్రమంలోకి వచ్చిన ఊర్వశిని జూచి మిత్రావరుణుడికి రేతఃపతన మయ్యెను. దానిని ఊర్వశి ఓ మట్టికుండలో వుంచగా అందునుండి అగస్త్య వశిష్ఠులు జన్మించిరి.

– దేవీభాగవతం

*అర్జునునికి ఊర్వశి శాపం :* ఇంద్రుడు అర్జునుని తన పట్టణానికి పిలిచి అతని గౌరవార్థం ఓ నృత్య ప్రదర్శన ఏర్పాటు చేసినాడు. ఊర్వశి అర్జునుని అందానికి ముగ్ధురాలై అతనిని కోరుకొనగా నీవు మా వంశపు మూలపురుషుడైన పురూరవుని భార్యవు కనుక నాకు తల్లి వంటి దానివని తిరస్కరించగా ఆమె అర్జునుని షండుడివి కమ్మని శపించెను. ఆశాప ఫలమే బృహన్నల. – మహాభారతం

**ఊర్వశి 2 :** గంగను కూడా ఊర్వశి అంటారు. భగీ రథుని ఊరువుపై కూర్చోవడం వల్ల గంగను ఊర్వశి అని అంటారు.

**ఊర్ణాయువు :** అర్జునుని జన్మదినోత్సవంలో పాల్గొన్న దేవ గంధర్వుడు. ఒకసారి ఇతడు మేనక ప్రేమలో పడ్డాడు. – మహాభారతం

**ఊర్జితుడు :** కార్తవీర్యార్జునుని కుమారుడైన శూరుడు.

**ఊర్మిళ 1 :** జనకుని కూతురు. సీత చెల్లెలు. లక్ష్మ ణుడు ఈమెను వివాహమాడాడు. రామలక్ష్మణుల వనవాస సమయంలో ఈమె అయోధ్యలోనే వుంది. ఈమెవల్ల లక్ష్మణునికి ఇద్దరు కుమారులు జన్మించారు. ఒకడు తక్షకుడు, రెండోవాడు చత్రకేతుడు. మొదటి వాడు తూర్పు దిక్కున అగతి అనే పట్టణాన్ని నిర్మించు కొని రాజ్యమేలాడు. రెండవవాడు పశ్చిమ దిక్కున చంద్రమతి నగరాన్ని నిర్మించు కొని రాజ్య మేలాడు. రాముని శిక్షకు గురై లక్ష్మణుడు సరస్వ తీనదిలో మునిగి మరణించగా తర్వాత ఊర్మిళ అగ్నిప్రవేశం చేసి స్వర్గాన్ని చేరుతుంది. – ఉత్తర రామాయణం

**ఊర్మిళ 2 :** యముని భార్య.

**ఊరుడు :** చాక్షుష మనువు నద్వలకు జన్మించాడు. ఇతడికి తొమ్మిదిమంది సోదరులు. ఊరుడికి ఆత్రేయ వల్ల ఆరుగురు గొప్ప కుమారులు జన్మించారు. అందులో అంగుడు ఒకడు. అంగుని కుమారుడు వేణుడు. ప్రసిద్ధ చక్రవర్తి పృథువు ఇతని పుత్రుడే.

– అగ్నిపురాణం

**ఊర్వుడు :** భృగువంశంలో జన్మించిన ఓ మహర్షి. ఇతడు చ్యవన మహర్షి కుమారుడు. ఊర్వుడు రుచిక మహర్షికి జన్మనిచ్చాడు. మూడు ప్రపంచాలను ఆహుతి చేయగల అగ్నిని ఈ రుచికుడు సృష్టించాడు. అంతేకాకుండా దాన్ని నిర్మూలించడానికి సముద్రంలో కలిపివేశాడు.

**ఊష్మ :** పాంచజన్యమనే అగ్ని కుమారుడు.

– మహాభారతం

**ఊష్మప :** ఓ పితృసమూహం. యముని భవనంలో నివసించేవారు. – మహాభారతం



**ఎ :** ఈ శబ్దానికి అర్థం 'దేవి'

**ఎటశ 1 :** రుగ్వేదంలో పేర్కొనబడిన ఓ రుషి. స్వాశ రాజు యొక్క కుమారుడు ఇతడితో యుద్ధం చేయగా ఇతణ్ణి ఇంద్రుడు రక్షిస్తాడు. – రుగ్వేదం

**ఎటశ 2 :** సూర్యుని అశ్వాలలో ఒకటి – రుగ్వేదం

**ఎవిపూచ్ఛలు :** విదిశా నగరంలో ఓ అరటి చెట్టుమీద ముంగిస, ఎలుక, గుడ్లగూబ, పిల్లి నివసిస్తుండేవి. వీటిలో ఎలుకను మూడు చంపగలవు. పిల్లి మిగతా మూడింటిని చంపగలదు. ముంగిస, ఎలుక పిల్లిని గురించి భయపడుతుండేవి. ఒకసారి వేటగాడు వలతో పిల్లిని పట్టుకుంటాడు. దీన్నిచూసి మిగతా మూడు సంతోషించడమేకాక ముంగిస, గుడ్లగూబ ఎలుకను చంపాలని ప్రయత్నిస్తాయి. వెంటనే ఎలుక వలను కొరికి పిల్లిని రక్షిస్తుంది. అదిచూసిన వెంటనే ముంగిస, గుడ్లగూబ ఎక్కడి వక్కడ పారిపోతాయి. ఎలుక కలుగులో దూరుతుంది. ఒక్కోసారి శతృవులే మితృలుగా ఎలా మారతారో ఈ కథ చెప్తుంది. – కథాసరిత్సాగరం

**ఎల్లు :** ఇదో నూనెగింజ. రుషులకు రాజైన కశ్యపుని శరీరం నుండి ఉద్భవించింది. దీనిని ఎవరికైన ఇవ్వడం దైవకార్యంగా భావిస్తారు. – మహాభారతం



**ఏకచక్రం :** ఇదో గ్రామం. పాండవులు అజ్ఞాత వాసంలో ఇక్కడ కొంతకాలం వున్నారు. ఇక్కడే భీముడు బకుడనే రాక్షసుడ్ని వధిస్తాడు. – మహాభారతం

**ఏకచక్రుడు :** కశ్యప ప్రజాపతికి దనువువల్ల జన్మించిన రాక్షసుల్లో ఒకడు. శంబర, విప్రచిత్తి, నముచి, పులోమ, వివృత, దుర్జయ, అయశ్శిరస, అశ్వశిరస, కేతు, వృషపర్వ, అశ్వగ్రీవ, విరూపాక్ష, నికుంభకపట, ఏకపదులు ఇతని సోదరులు.

**ఏకచూడుడు :** స్కందుని అనుచరుడు. – మహాభారతం

**ఏకచంద్రుడు :** స్కందుని అనుచరుడు. – మహాభారతం

**ఏకజటం :** రావణుని కోటలోని ఓ రాక్షసి. ఈమె సీతకు రావణుని గురించి అందమైన మాటలు చెప్పి ఆమెను ఒప్పించడానికి ప్రయత్నిస్తుంది. – రామాయణం

**ఏకత్వచుడు :** స్కందదేవుని అనుచరుడు. – మహాభారతం

**ఏకతుడు :** మహర్షి గౌతముని కుమారుడు. ఇతని సోదరులు ద్వితుడు, త్రితుడు. ఉపరిచర వసువు చేసిన యజ్ఞంలో పాల్గొన్నాడు. పశ్చిమ భారతదేశ ప్రజలపై ఎక్కువ ఆధారపడ్డాడు. ఇతడు అంపశయ్యపై వున్న భీష్ముడ్ని సోదరులతో వచ్చి పరామర్శించాడు. సోదరుడైన త్రితుణ్ణి మోసంచేసి అతని శాపం వల్ల తోడేలుగా మారతాడు.

**ఏకదంతుడు :** చూ॥ వినాయకుడు

**ఏకపర్ణ :** దుర్గాదేవి సోదరి. హిమవంతునికి మేనకవల్ల ముగ్గురు కుమార్తెలు, ఏకపర్ణ, ఏకపాటల, అపర్ణ. ఏకపర్ణ ఓ ఆకుమాత్రమే భుజిస్తుంది. ఏకపాటల ఆకుల గుత్తులు భుజిస్తుంది. అపర్ణ ఒక్క ఆకుని కూడా భుజించదు. ఏకపర్ణ అసితుడనే మహర్షిని వివాహమాడి దేవలుడనే పుత్రుణ్ణి కన్నది. – హరివంశం

**ఏకపాటల :** ఏకపర్ణ జైగిశవ్య మహర్షి భార్య. ఇతర వివరాలకు – చూ॥ ఏకపర్ణ

**ఏకపాతుడు 1 :** చూ॥ ఏకచక్రుడు.

**ఏకపాతుడు 2 :** విష్ణువు మరోపేరు.

**ఏకపాదం :** ప్రాచీన భారతదేశంలోని ఓ రాజ్యం. దీని రాజు, ప్రజలు ధర్మజుని రాజసూయ యాగానికి వచ్చి లోనికి వెళ్లే దారిలేక బయటే వుండిపోయారు. – మహాభారతం

**ఏక పింగళుడు :** వైశ్రావణుడి మరోపేరు. పరమేశ్వరుని ఎడమ ప్రక్క కూర్చున్న పార్వతిని చూసి అసూయ చెందగా ఓ కన్ను చిట్లింది. పార్వతి ప్రశాంతత చెందిన తర్వాత ఆ కన్ను పింగళరంగు వచ్చింది.

**ఏకరాత్ర తీర్థం :** ఓ పుణ్యస్థలం. ఇక్కడ ఒక రోజు తాదాత్మ్యంతో నివసిస్తే బ్రహ్మలోక ప్రాప్తి కల్గుతుంది. – మహాభారతం

**ఏకలవ్యుడు 1 :** ఆటవిక రాజైన హిరణ్యధనుసు కుమారుడు. ఇతడు విలువిద్య నేర్చుకోవడానికి ద్రోణాచార్యుల వద్దకు వెళ్లగా శూద్రకులస్తుడవు కనుక విలు

విద్య నేర్పనని చెప్పెను. ఇతడు ద్రోణుని విగ్రహం తయారుచేసి దానికి ప్రదక్షిణ చేసి పట్టుదలతో స్వయంగా అస్త్రవిద్యను నేర్చుకొనెను. ఒకరోజు కౌరవ పాండవులు తమ గురువుతో అడవికి వెళ్లగా వారితో వెళ్లిన కుక్క ఏకలవ్యుడ్ని చూసి మొరగగా తన విలు విద్యా ప్రావీణ్యంతో ఒకేసారి ఏడు బాణాలను ఆ కుక్క నోట్లోకి సంధించాడు. అది చూసిన అర్జునుడు నా కంటే అస్త్రవిద్యా నిపుణుడు లేరంటిరి, ఈ దృశ్యము చూడమనగా ద్రోణుడు ఏకలవ్యుని వద్దకు వచ్చి తనే గురువుగా భావించి అస్త్ర విద్య నేర్చుకున్నా నన్న ఏకలవ్యుడ్ని గురుదక్షిణ కోరాడు. అందుకు తన ప్రాణమైనా ఇస్తాననగా అతని బొటన వ్రేలు దక్షిణగా ఇవ్వమని కోరాడు. అలాచేసిన ఏకలవ్యుడు బలహీన పడగా అర్జునుడు బలవంతుడయ్యాడు. ఇతడ్ని శ్రీకృష్ణుడు సంహరించాడు. అశ్వమేధయాగంలో ఇతని కుమారుడు అశ్వాన్ని బంధించగా అర్జునుడు అతణ్ణి వధించాడు. – మహాభారతం

**ఏకలవ్యుడు 2 :** క్రోధవశుని పునర్జన్మ. ఇతడు, పాండవుల తరపున కురుక్షేత్ర యుద్ధంలో పాల్గొన్నాడు. – మహాభారతం

**ఏకలుడు :** వసుదేవుడి తమ్ముడైన దేవశ్రవసుడి కొడుకు. నిషాదులితణ్ణి వధిస్తారు.

**ఏకవీరుడు :** హేహయ రాజవంశ మూలపురుషుడు. *వంశవృక్షం :* విష్ణు – పురూరవుడు – యయాతి – సతాజిత్ – ఏకవీరుడు.

*ఏకవీరుడి జన్మవృత్తాంతం :* ఇంద్రుడి స్నేహితుడు రేవంతుడు ఇంద్రుని అశ్వమైన ఉచ్చైశ్వరం మీద వైకుంఠానికి విష్ణుదర్శనానికి వెళ్లాడు. వీరిని చూసిన లక్ష్మి కళవళ పడింది. విష్ణుమూర్తి చెప్పే విషయాలపై ఆమె మనసు లగ్నం కాలేదు. అది గమనించిన విష్ణువు లక్ష్మీదేవిని ఆడ గుర్రంగా మారమని శపించాడు. లక్ష్మీదేవి అందుకు రోధించి విష్ణువుని శరణు వేడగా తనంతటి కుమారుడు జన్మించిన తర్వాత వైకుంఠం చేరగలవని శాప విమోచన గావించాడు. మహాలక్ష్మి ఆడగుర్రంగా భూమిపై జన్మించి కాళింది, తమస నదుల సంగమ తీరాన 1000 దేవలోక సంవత్సరాలు తపస్సు చేయగా శివ పార్వతులు ప్రత్యక్షమై వరం కోరుకోమనగా తన కథ చెప్పి ఎవరివల్ల పుత్ర సంతానం కల్గుతుందని ప్రశ్నించింది. శివుడు వైకుంఠానికి వెళ్ళి విష్ణువును గుర్రంగా భూలోకానికి పంపగా వారిద్దరి కలయికతో ఓ పుత్రుడు జన్మించగా అతణ్ణి ఆ నదీతీరాన వదలి వైకుంఠం చేరతారు. – దేవీభాగవతం

*ఏకవీరుడు రాజగుట :* యయాతి మనుమడు సత జిత్తు ఇదే నదీతీరంలో పుత్రుల కొరకు తపస్సు చేస్తుండగా విష్ణువు ప్రత్యక్షమై ఈ శిశువును పరిగ్రహించమని చెప్పగా అతడికి ఏకవీరుడు అని నామకరణం చేసి సకల విద్యలు నేర్పి తన రాజ్యాన్ని ఇతనికి వదలి తపస్సు చేసి వైకుంఠం చేరాడు. – దేవీభాగవతం

ఒకరోజు ఏకవీరుడు తన మంత్రి కుమారుడితో వ్యాహ్యాళికి గంగా తీరానికి వెళ్లగా సువాసనలు జిమ్మే పుష్పాలు, 1000 రేకులున్న పుష్పం ప్రక్క దుఃఖంలో వున్న ఓ సుందరి కన్పించారు. ఆమెను వివరణ కోరగా తనపేరు యశోవతి అని ప్రక్కనే గల మరో దేశపు రాజు రైభ్యుని కుమార్తె తను స్నేహితులమని ఇచటికి ఇద్దరమూ రాగా కాళకేతు అను రాక్షసుడు తన స్నేహితురాలు ఏకావళిని ఎత్తుకు పోయాడని చెప్పగా ఏకవీరుడు పాతాళానికి వెళ్లి కాలకేతుని జయించి ఏకావళిని యశోవతిని రైభ్యునికి అప్పగించగా అతడు తన కుమార్తెను ఏకవీరుడు కిచ్చి వివాహం చేశాడు. కార్తవీర్యార్జునుడు వీరి వంశంలోనే పుట్టాడు. – దేవీభాగవతం

**ఏకశృత :** చూ॥ వరరుచి

**ఏకశృంగుడు :** సప్త పిత్రులలో ఒకడు. వీరంతా బ్రహ్మకొలువులో వుంటారు. – మహాభారతం

**ఏకసింగుడు :** చూ॥ ఏకపింగళుడు.

**ఏకహంసతీర్థం :** ప్రాచీన భారతదేశంలో ఓ పుణ్యతీర్థం. ఇక్కడ స్నానం చేస్తే 1000 ఆవులు బహుమతి ఇచ్చినంత ప్రయోజనం కల్గుతుంది. – మహాభారతం

**ఏకాక్షరకోశం :** ప్రతి అక్షరానికి ఓ అర్థం వుంటుంది. ప్రతి అక్షరపు అర్థం చెప్పే నిఘంటువే ఏకాక్షర కోశం. – అగ్నిపురాణం

**ఏకాక్షుడు :** స్కందదేవుని అనుచరుడు. – మహాభారతం

**ఏకాదశ మానుష ధర్మాలు :** స్వాధాయ, బ్రహ్మచర్య, దాన, యజ్ఞ, కృపంత్యవిమోచన, దయ, అహింస, క్షమ, జితేంద్రియత్వ, శౌచ, దైవభక్తులను ఏకాదశ మానుష ధర్మాలంటారు.

★ **ఏకాదశ రుద్రులు :** 11 మంది రుద్రులు. బ్రహ్మ మానస పుత్రులను సృష్టిచేయమని కోరగా వారు నిరాకరించిరి. బ్రహ్మకు కోపమురాగా అతని లలాటము నుండి ఏకాదశ రుద్రులావిర్భవించిరి. వారు మహత్తుడు, మహాత్మ, మతిమంతుడు, భీషణుడు, భయంకరుడు, రుతధ్వజుడు, ఊర్ధ్వ కేశుడు, పింగళాక్షుడు, రుచి, శుచి, కాలాగ్ని రుద్రుడు.

– బ్ర.వై. పురాణం

**ఏకాదశ సంకర వర్గాలు :** 1. కరుణుడు (వైశ్యునివల్ల శూద్రవనితకు జన్మించినవాడు) 2.అంబష్టుడు (బ్రహణుడికి వైశ్య స్త్రీ వల్ల జన్మించినవాడు) 3. ఉగ్రుడు (క్షత్రియుడి వల్ల శూద్రవనితకు జన్మించినవాడు) 4. మాగధుడు (వైశ్యునికి క్షత్రియ కాంతవల్ల జన్మించినవాడు) 5. మహిస్యుడు (క్షత్రియునికి వైశ్యకాంతవల్ల జన్మించినవాడు) 6. క్షత్తుడు (శూద్రునికి క్షత్రియ కాంతవల్ల జన్మించినవాడు) 7. సూతుడు (క్షత్రియునికి బ్రాహ్మణ కాంతవల్ల జన్మించిన వాడు) 8. వైదేహకుడు (వైశ్యునికి బ్రాహ్మణ కాంతవల్ల జన్మించినవాడు) 9. రథకారుడు (మాహిష్యునికి కరణ స్త్రీవల్ల జన్మించినవాడు) 10. పారశవుడు (బ్రాహ్మణుడివల్ల శూద్రస్త్రీకి జన్మించినవాడు) 11. చండాలుడు (శూద్రునికి బ్రాహ్మణ స్త్రీ వల్ల జన్మించినవాడు)

**ఏకాదశాధిపతులు :** 11 మంది అధిపతులు. వీరు దేవతలకు ఇంద్రుడు, నక్షత్రాలకు చంద్రుడు, ప్రజాపతులకు దక్షుడు, సంపద, యక్ష, రాక్షసులకు కుబేరుడు, మనుషులకు మనువు, రుషులకు వశిష్ఠుడు, గ్రహజ్యోతులకు సూర్యుడు, వర్షాలకు వరుణుడు, నదులకు సముద్రుడు, భూతగణాలకు శివుడు, పక్షులకు గరుడుడు అధిపతులు.

**ఏకాదశి :** అమావాస్య/పౌర్ణమిల తర్వాత వచ్చే రోజును ఏకాదశి అంటారు. ఈరోజున చేసే వ్రతాన్ని ఏకాదశి వ్రతం అంటారు. పూర్వం అంబరీష మహారాజు ఇంద్రునితో సమానుడు కావాలని ఈ వ్రతం చేశాడు. దీనిని ఆచరించేవారు ఆహార నియమాలు పాటించాలి. మాంసాహారాన్ని త్యజించాలి. దశమి ఏకాదశి రోజులలో స్త్రీకి దూరంగా వుండాలి. ప్రతినెలలో వచ్చే రెండు ఏకాదశి రోజుల్లో ఉపవాసం వుండాలి. ఏకాదశి ద్వాదశి కలిసే సమయాన్ని హరివాసం అంటారు. ఈ సమయం యజ్ఞ యాగాదులకు మంచిది. దశమి ఏకాదశి కలిసి వున్నరోజు ఏశుభకార్యము చేయరాదు. అలాచేస్తే నరకానికి వెళ్తారు. పుష్యమాసంలో పౌర్ణమి ముందరవచ్చే ఏకాదశిన ఏపనైన చెయ్యవచ్చు. శ్రావణమాసంలో ఏకాదశి ద్వాదశి కలిసివచ్చే రోజు జయానికి చిహ్నం.

– అగ్నిపురాణం

**ఏకాదశేంద్రియాలు :** శ్రోత్ర, థక, చాక్షుస, జిహ్వా, గ్రహణ, వాక్, పాని, పాద, పాయు, ఉపస్త, మెదడులను ఏకాదశేంద్రియాలంటారు.

**ఏకానంగ :** యశోద పుత్రిక. శ్రీకృష్ణుని సోదరి. ఈమెకొరకే శ్రీకృష్ణుడు కంసుడ్ని వధించాడు.

– మహాభారతం

**ఏకావళి :** రైబ్యుని కుమార్తె. హేహేయ వంశం ఈమెతోనే మొదలు. ఇతర వివరాలకు – చూ॥ ఏకవీరుడు.

**ఏడి :** స్కందదేవుని అనుచర గణంలోనివాడు.

– మహాభారతం

**ఏతశం :** సూర్యుడి గుర్రాలలో ఒకటి – ఋగ్వేదం

**ఏతశుడు :** ఓ రుషి. శ్వశుడనే రాజు ఇతనితో పోట్లాడతాడు. ఇతణ్ణి ఇంద్రుడు రక్షిస్తాడు. – ఋగ్వేదం

**ఏరకం** : కౌరవ వంశంలో జన్మించిన సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణిస్తుంది.

– మహాభారతం

**ఏలాపుత్రుడు :** చూ॥ ఇలాపుత్రుడు.



**ఐక్ష్వాకి :** భుమన్యుడి కొడుకైన సహోత్రుడి భార్య. వీరికి అజమీఢుడు, సమీఢుడు, పుదుమీఢుడు పుడతారు.

– మహాభారతం

★ ఒక్కో పురాణాన్ని బట్టి ఏకాదశ రుద్రుల పేర్లు మారాయి.

**ఐతరేయుడు :** ఇతర కుమారుడు. మరిన్ని వివరాలకు చూ॥ ఇతర.

**ఐరావతం 1 :** తూర్పు దిక్కున గల ధవళవర్ణపు ఏనుగు. ఇది క్షీరసాగరమథనం నుండి జన్మించింది. ఇది ఇంద్రుని వాహనము. – భాగవతం

**ఐరావతం 2 :** కద్రువ కుమారుడు. ఇతడు తక్షుని కుమారుడైన అశ్వసేనుని పెంచెను. – మహాభారతం

**ఐరావతి :** ఒక నది. హిమాలయాల్లో పుట్టి చంద్రభాగ నదిలో కలుస్తుంది.

**ఐరావతుడు :** శ్రీకృష్ణుని చేతిలో మరణించిన ఓ రాక్షసుడు. – మహాభారతం

**ఐలబిలుడు :** ఇలబిల కుమారుడు. విశేషాలకు చూ॥ కుబేరుడు.

**ఐలుడు :** ఇలుడి కొడుకు. – మహాభారతం

**ఐలుగు :** యముని సభలో సభ్యుడు. శాకాహారి.



**ఓ :** బ్రహ్మ అని అర్థం. – అగ్నిపురాణం

**ఓఘరథుడు :** ఓఘవాణుడి కుమారుడు. – మహాభారతం

**ఓఘవతి 1 :** ప్రపంచంలో ఏడు సరస్వతీ నదులున్నాయి. వాటి పేర్లు సుప్రభ, కాంచనాక్షి, విశాల, మనోరమ, సరస్వతి, ఓఘవతి, సురేణు. ఈ నదీతీరంలోనే భీష్ముడు అంపశయ్యపై పరున్నాడు. – మహాభారతం

**ఓఘవతి 2 :** ఓఘవాణుడి కుమార్తె. – మహాభారతం

**ఓఘవాణుడు 1 :** నృగ రాజు మనుమడు. ఇతడికి ఓఘరథుడను కుమారుడు ఓఘవతి అను కుమార్తె కలరు. – మహాభారతం

**ఓఘవాణుడు 2 :** కౌరవుల పక్షాన పోరాడిన ఓ వీరుడు. – మహాభారతం

**ఓఢ్రం :** ప్రాచీన భారతదేశంలో ఓ చిన్న రాజ్యం.

**ఓషధీశుడు :** చూ॥ చంద్రుడు

**ఓం :** ఇది మూడక్షరాల కలయిక అ ఉ మ. ఆ విష్ణువుని, ఉ శివుడ్ని, మ బ్రహ్మను ఉద్దేశించినవి.

అకారో విష్ణు రుద్దిష్ట
ఉకారస్తు మహేశ్వర
మకారస్తు స్మృతో బ్రహ్మ
ప్రణవస్తు త్రయాత్మఖ – వాయుపురాణం

ఓం అనే శబ్దం ప్రణవం లేక బ్రహ్మన్. అన్ని మంత్రాలు ఈ శబ్దంతోనే మొదలవుతాయి. ఈ శబ్దాన్ని శూద్రులు తక్కిన తక్కువ కులస్తులు పలకరాదు. వినరాదు. – మాండుక్యోపనిషత్తు.



**ఔక్త్యం :** సామవేదంలోని ప్రసిద్ధిచెందిన ప్రార్థన. – మహాభారతం

**ఔతథ్యుడు :** ఉతత్థుని కుమారుడు.

**ఔదకం :** నరకాసురుడు తన పదివేల మంది కన్యలతో బంధించబడ్డాడు. మణి పర్వతం పై నున్న చదరపు స్థలం. అక్కడ నీరు ఎక్కువగా వుండటం వల్ల ఔదకం అని పేరు. నూరు అనే రాక్షసుడు దీనిని పాలించేవాడు. – మహాభారతం

**ఔద్దాలకం :** ప్రాచీన భారతదేశంలో ఓ పవిత్ర స్థలం. ఉద్దాలకముని ఇక్కడే నివసించాడు. ఈ పుణ్య తీర్థంలో స్నానం చేస్తే పాపపరిహారం జరుగు తుందని నమ్ముతారు.

**ఔదుంబరుడు :** ఉదుంబర రాజ్యానికి రాజు. యుధిష్ఠరుడి మీద గౌరవంతో బహుమతులు ఇచ్చాడు. – మహాభారతం

**ఔధేయులు :** ఉశీనరుడి కొడుకైన నృగుడి వంశస్తులు.

**ఔనికుంబుడు :** కాశీనగరంలో గల ఓ బ్రహ్మణుడు. ఇతనికి కలలో నికుంబుడు కన్పించి విశ్వేశ్వరునికి దేవాలయం కట్టింపుమని చెప్పెను. ఆ సంగతి దివోదాసుతో చెప్పగా అతడు గుడికట్టించెను. – బ్రహ్మపురాణం

**ఔరశీకం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం. శ్రీకృష్ణుడు ఈ ప్రాంతాన్ని ఆక్రమిస్తాడు. – మహాభారతం

**ఔర్వానలం :** ఔర్వుడను మహర్షి సంతానప్రాప్తి కొరకు ఘోరతపము చేసెను. మునులు ప్రత్యక్షమై పుత్రుల

కొరకై ఇట్టి తపస్సు చేసెదవేల సతీసంగమ మున పుత్రులబడయ వచ్చుకదా అనగా బ్రహ్మాదులకు తపో మహిమవల్ల పుత్రులు జన్మించ లేదా అట్లే నేనును అని తన ఊరువును మదించి అగ్నిని రావించెను. అతడే పుత్రుడయ్యెను. అతని కాంతి దిగంతములకు వ్యాపించి లోకములు తాళలేకపోగా బ్రహ్మ ప్రత్యక్షమై అగ్ని నీ పుత్రుడే యగును. అతడు సముద్రగర్భమున నౌర్వానలముగా నుండును. ప్రళయ కాలమునందు నా శక్తియు ప్రవేశించి అతిశక్తివంతుడగును అనిచెప్పి ఔర్యుని సమ్మతింప జేసి సముద్ర గర్భమున దాచెను. అదియే ఔర్వానలము. – హరివంశం

**ఔర్యుడు :** భృగు మహర్షి వంశంలోని ప్రముఖ మహర్షి. *వంశవృక్షం :* విష్ణు – భృగు – చ్యవన –ఔర్య. చ్యవన మహర్షి మనువు కూతురైన ఆరుషిని వివాహ మాడగా వారికి కల్గిన సంతానమే ఔర్యుడు. ఇతడు జమదగ్నికి తాత, పరశురాముడికి ముత్తాత.

భృగు వంశజులు హేహయవంశానికి గురువులు. కార్తవీర్యార్జునుని తండ్రి కార్తవీర్యుడు భృగువంశ జులవద్దే విద్యాభ్యాసం చేశాడు. వీరికి భృగు వంశజుల మీద అపారమైన ప్రేమతో ఎంతో సంపద నిచ్చారు. తరాలు గడచిన తర్వాత భృగు వంశజులు సంపదులు కావటం క్షీణించిన హేహయవంశ రాజులకు ఇష్టం లేక వీరిని బాధించడం, వీరు దాచు కున్న ధనాన్ని వెలికి తీయడం జరిగేది. వీరిని ఆ క్షత్రియ రాజులు తరిమివేశారు. అలా చ్యవన మహర్షి భార్య ఆరుషి తనచంటి బిడ్డను తొడల మధ్య దాచు కొని పారిపోతుండగా ఈ విషయం క్షత్రియ రాజు లకు తెలిసి ఆమెను వెంబడించగా ఆమె విలవిల లాడింది. ఆ సమయంలో ఆమె తొడల నుండి ఆవిర్భం చిన ఔర్యుడు కళ్ళువిప్పి క్రూరంగా చూడగా ఆ క్షత్రి యులు గుడ్డివారయ్యారు. అప్పుడు వారు అతణ్ణి ప్రార్థించగా మరల చూపు వచ్చింది. ఆమె ఊరువుల నుండి జన్మించాడు గనుక ఔర్యుడు అని పేరు.

ఇంకను ఔర్యుని కోపము చల్లారలేదు. అతడు తల్లి గర్భమున నుండగా తన తండ్రుల తాతల హాహాకా రములు వినియున్నాడు. హేహేయ వంశజులపై కక్షతో ఘోరతపస్సు చేసి మూడు లోకములను దగ్ధము చేయగల అగ్నిని బడసెను. అతని పితృదేవతలు ప్రత్యక్షమై నాడు వారు మమ్ముల చంపుట నేడు మేము త్వరగా స్వర్గము చేరవలసి యుండుటకే అట్లు జరిగినది. దానిని మరువుము. నీవు పుట్టించిన అగ్ని నిరుపయోగమైనచో నిన్నే దహించును కాన దానిని సముద్రునిలో పడవేయ మనికోరిరి. అందుకు సమ్మ తించిన ఔర్యుడు తను సృష్టించిన ఔనలమును సము ద్రమున బడవేయగా గుర్రపు తల ఆకారమున సము ద్రమున అట్లే యుండెను. దానిని బడబాగ్ని అని కూడా అందురు. – మహాభారతం

*ఇతర విశేషాలు :* అయోధ్య రాజైన సగరుని పెంచి పెద్దచేసి అతనికి విద్యాబుద్ధులు గరిపెను. ఇతడి కొడుకు రుచికుడు. కందలి అనే కూతురు. ఈమెను దుర్వాసుడికిస్తాడు.

**ఔశనసం :** సరస్వతీ నది ఒడ్డున గల ఓ పుణ్య తీర్థం. బ్రహ్మ, దేవతలు, మహర్షులు ఇక్కడ నివసించారు. ఈ స్థలాన్ని కపాలమోచనం అని అనడానికి ఓ కథ వుంది. దండకారణ్యంలో రాక్షసులను చంపడానికి శ్రీరాముడు ఎన్నో అస్త్రాలను ప్రయోగించాడు. కొందరి రాక్షసుల తలలు ఎగిరి బహుదూరంలో పడి ఆ అస్త్రాల శక్తికి భూమిలో కూడా దిగబడ్డాయి. అలాంటి కపాల మొకటి మహోదరుడను మునిపాదా నికి గుచ్చుకొని రాలేదు. అతడిలాగే ఎన్నో పుణ్య క్షేత్రములు తిరిగాడు. ఇక్కడికి రాగానే అతని పాదంలోని కపాలం బయటకు వచ్చి బాధ నుండి విముక్తుడ య్యాడు. ఆ తర్వాత ఈ పుణ్యస్థలాన్ని బ్రహ్మ, విశ్వామిత్రుడు, బలరాముడులాంటి, మహాపురుషులు దర్శించారు. – మహాభారతం

**ఔశికుడు :** అంగిరసుడి కొడుకు. ఒక రుషి. ధర్మజుని కొలువులో వుంటాడు. – రుగ్వేదం

**ఔశీనర :** శిభి చక్రవర్తి. ఉశీనరుడి కుమారుడు. – *చూ॥ శిభి.*

**ఔశీనరపతి :** అజితకు తండ్రి. అజితను స్వయం వరంలో అన్నదమ్ములు ఏడుగురు వివాహ మాడారు.

**ఔశీనరి :** ఉశీనారదేశంలో జన్మించిన ఓ శూద్ర స్త్రీ. ఈమెకు గౌతముడికి కాక్షివాదులు పుట్టారు.
– మహాభారతం

**ఔష్ణకం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం. ఈ ప్రాంతపు రాజు ధర్మ పుత్రునికి బహుమతులిచ్చి సత్కరించాడు. – మహాభారతం



**క :** ఈ అక్షరానికి ప్రజాపతి, దక్షప్రజాపతి, విష్ణువు, బ్రహ్మ, అనే అర్థాలు కలవు.

**కక్కయ్య :** ఇతడో శివభక్తుడు. ఇతని ప్రసాదము పొందవలెనని బసవన్న పన్నెండేడ్లు ప్రయత్నించినను సాధ్యముకాలేదు. ఒకనాడు కబీరు ప్రసాదకణము తీసుకెళ్లుట చూచి బసవడు ఆ కణమును తన తలపాగలో మూటకట్టి తను స్నానమునకు పోగా ఆతని సోదరి కన్య ఆ ప్రసాద మును తినగా ఆమె గర్భవతియై చెన్నబసవడు జన్మించెను.

**కక్ష :** ప్రాచీన భారతదేశంలో ప్రజా జీవననం గల ఓ ప్రాంతం. – మహాభారతం

**కక్షకం :** వాసుకి కుటుంబానికి చెందిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో బూడిదయ్యింది. – మహాభారతం

**కక్షసేనుడు 1 :** అవీక్షిత్తు మనుమడు. పరీక్షిత్తు కొడుకు. ఉగ్రసేనుడు, ఇంద్రసేనుడు, సుశేనుడు, భీమసేనుడు ఇతని సోదరులు.
ఇతడు యమధర్మజుని కొలువులో ఒక సభ్యుడు. ఇతడు ధర్మ న్యాయపాలనలో శిభి, అంబరీష, జనమేజయ, పరశురామ, శ్రీరాములకు సరిపోల్చ దగినవాడు. వశిష్ఠునికి తగిన బహుమతులిచ్చి మోక్షం పొందిన గొప్ప చక్రవర్తి. – మహాభారతం

**కక్షసేనుడు 2 :** ధర్మరాజు కొలువులో గల మరో రాజు పేరు. – మహాభారతం

**కక్షదేశం :** ఇప్పటి కచ్ ప్రాంతాన్ని కక్షదేశమని, భరుకచ్ఛమని పిలిచేవాడు.

**కక్షసేనాశ్రమం :** అసిత పర్వతం మీదగల ఒక ఆశ్రమం. దీనిని కక్షసేనుడు నిర్మించాడు. – మహాభారతం

**కక్షివత్సుతి :** కాక్షివాణుడి కుమార్తె. ఈమె కుష్టు రోగంతో బాధపడేది. ఈమె అశ్వనీదేవతలను గురించి ప్రార్థించగా వారు ప్రత్యక్షమై ఈమె వ్యాధిని పోగొట్టారు. ఈమె సోదరి భద్ర.

**కక్షివాణుడు :** రుగ్వేదంలో కీర్తించబడిన ఓ మహర్షి. *జన్మవృత్తాంతం* : కళింగరాజుకు సంతానం లేక దీర్ఘ తమసుడిని తన భార్యకు సంతాన ప్రాప్తి కలుగజేయ మనికోరగా ఆమె నిరాకరించింది. దీర్ఘ తమసునికి రాణి దాసి అయిన ఉసికి జన్మించిన వాడే కక్షివాణుడు.
*ఇతర విశేషాలు :* ఇతడు అంగిరసుని కుటుంబం లోని వాడు. ఇతడు రుక్కులను ఉచ్చరించి విష్ణువువల్ల ఎన్నో అదృష్టాలు పొందాడు. ఇతడు గురువు వద్ద విద్యనభ్య సించి తిరిగివెళ్తూ భావయవ్యుడను రాజు కుమారుడైన స్వనయుడిని చూసి అతడి గుణాలకు మెచ్చి తన కుమార్తెనివ్వనిశ్చయించి రాజాస్థాన మునకు వెళ్ళగా రాజు ఇతడిని గౌరవించి ఎన్నో బహుమతులిచ్చాడు. – రుగ్వేదం

**కకుత్స్థుతుడు 1 :** ఇక్ష్వాకురాజైన శశాదరాజు కుమారుడు. అనేనసుడి తండ్రి.

**కకుత్స్థుతుడు 2 :** శ్రీరాముడు కకుత్సుత కుటుంబీ కుడైనందున ఇతడిని కూడా కకుత్సుతుడంటారు.

**కకుద్మి :** రేవతుని కుమారుడు. ఇతని కుమార్తె రేవతి. ఆమెకు వివాహము జేయనెంచి ఇతడు బ్రహ్మ లోక మునకు బోయి దేవతలు నాట్యమాడు చుండ అటులనే చూచుచుండెను. బ్రహ్మయే నీవొచ్చిన పని యేమని అడుగగా తనకుమార్తె వివాహమును గురించి ప్రస్తావించెను. నీవు వచ్చి కొన్ని యుగము లైనది. అప్పుడున్న మనుజులెవ్వరు ఇప్పుడు లేరు. బలరాముడని ఒకడున్నాడు అతనికిచ్చి చేయమని చెప్పగా అతడట్లే చేసెను. – విష్ణుపురాణం

**కకుద్దేవి :** దక్షుడి కూతురు. ధర్ముడి భార్య.

**కకుభ :** ఓఢ్ర దేశంలోని ఓ పర్వతం.

**కచ్ఛపం :** కుబేరుని భాండాగారాలలో ఒకదాని పేరు.

**కచ్ఛపి 1 :** నారదుని వీణ – మహాభారతం

**కచ్ఛపి 2 :** సరస్వతి వీణ – మహాభారతం

**కచ్ఛము :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాసయోగ్య ప్రాంతం – మహాభారతం

**కచుడు :** బృహస్పతి కుమారుడు. తన తండ్రికి తెలియని మృతసంజీవిని విద్యను శుక్రాచార్యుడి వద్ద నేర్చుకోవడానికి వెళ్తాడు. అతడికి శిష్యరికం చేస్తాడు. శుక్రాచార్యుడి కూతురు దేవయాని ఇతణ్ణి ప్రేమిస్తుంది. తమ విద్యలు దేవతలకు తెలియడం ఇష్టంలేని రాక్షసులు కచుణ్ణి చంపుతారు. దేవయాని తండ్రిని

ప్రార్థించి మృతసంజీవిని సహాయంతో అతణ్ణి బ్రతికి స్తుంది. ఈసారి రాక్షసులు అతణ్ణి కాల్చిబూడిద చేసి శుక్రాచార్యుడికి పానీయంలో కలిపి ఇస్తారు. విషయం తెలిసిన శుక్రాచార్యుడు. మృత సంజీవిని విద్యతో అతణ్ణి బ్రతికించి బయటపడి నన్ను రక్షించమని కచుణ్ని అడుగుతాడు. అట్లే కచుడు బయటకు వచ్చి తను వచ్చిన పని అయిపోయిందని వెళ్లిపోబోగా దేవయాని తనను వివాహమాడమని కోరగా గురు పుత్రిక సోదరి వంటిదని నిరాకరిస్తాడు. ఆమెకు కోపంవచ్చి అతడు నేర్చిన విద్య అతడికి పనికిరాదని శపించగా నిన్ను బ్రాహ్మణుడు వివాహమాడడని కచుడామెను శపిస్తాడు. అయితే కచుడు నేర్చిన విద్య ఇతరులకు పనికివస్తుంది. – మహాభారతం

**కట్వాకుడు :** వైవస్వత మనువు కుమారుడు. ఇతడు ఇక్ష్వాకు కన్నా పూర్వుడు. అయోధ్య నగరాన్ని నిర్మించిందితడే. రాజుల్లో మొదటిరాజు. ఇది అష్టదేవతల నగరాలకన్నా బ్రహ్మ నగరం కన్నా అందమైనదని చెప్పబడింది. – బ్రహ్మాండపురాణం

**కఠోపనిషత్తు :** 108 ఉపనిషత్తులలో ఇదొకటి. వేదాల సవ్యాఖ్యానమే ఈ ఉపనిషత్తులు.

**కణికుడు 1 :** ధృతరాష్ట్రుని మంత్రులలో ఒకడు. ఇతడు బ్రాహ్మణుడు. కూటనీతి బాగా తెలిసిన వాడు.

ఒకసారి శత్రువులను జయించడానికి ఉపాయం చెప్పమని అడగగా నాల్గు ఉపాయాలు ఇతడు చెప్తాడు. అవి సామదానబేధ దండోపాయాలు. పిరికివాళ్లను భయపెట్టు, ధైర్యవంతులను గౌరవించి మాయోపాయంతో వధించు, ఆశపరులకు బహుమతులివ్వు, శత్రువైనవాడిని తండ్రైనా పెంచినవాడైనా కొడుకైనా సోదరుడైనా స్నేహితుడైనా వధించు. బాధించే మాటలు మాట్లాడకు. కోపం ప్రదర్శించకు. నమ్మకస్థుల్నిగాని అపనమ్మకస్తుల్నిగాని నమ్మకు. – మహాభారతం

**కణికుడు 2 :** కూటనీతి బాగాతెలిసిన మరో బ్రాహ్మణుడు. భరద్వాజ కుటుంబీకుడు. సౌవీరరాజైన శత్రుంజయుని కొలువులో వుండేవాడు. – మహాభారతం

**కణ్వుడు :** చూ॥ కాశ్యపుడు 1.

**కథకుడు :** స్కందుడి సైనికుల్లో ఒకడు.

**కథాసరిత్సాగరం :** చూ॥ బృహత్కథ

**కథోజుడు :** ఒక రాజు. సంస్మరించదగ్గ గుణరు. – మహాభారతం

**కదళీగర్భ :** మణికణక మహర్షి కుమార్తె.

**కదళీవనం :** కుబేర పుష్కరణి నదీతీరానగల ఓ వృక్ష సముదాయం. ఇది సౌగంధికా పుష్పాలకు నిలయం. ఇక్కడ ఎన్నో రకాల ఫలాలు లభిస్తాయి. హనుమంతుడు ఇక్కడ నివసించాడు. – మహాభారతం

**కదుడు :** అర్జునుడు తీర్థయాత్రలు చేస్తుండగా సుభద్రను గూర్చి తెలియజేశాడు. – మహాభారతం

**కద్రువ :** ఈమె కశ్యపుడి భార్య లేక కూతురు. వ్యాస భారతం ఈమె దక్షప్రజాపతి కూతురని, కశ్యపుని భార్య అని చెప్తోంది. వాల్మీకి రామాయణం ఈమె కశ్యపుని భార్య, క్రోదవతి కూతుర్లలో ఒకరని చెప్తోంది. కద్రువ, వినతలను కశ్యపుడు వరం కోరుకొమ్మనగా కద్రువ 1000 మంది సర్పాలను వినత ఇద్దరు సంతానాన్ని కోరుకోగా కద్రువ 1000 గుడ్లు, వినత 2 గుడ్లు కనగా వాటిని పొదగగా 500 సంవత్సరాల తర్వాత 1000 గుడ్ల నుండి 1000 సర్పాలు వచ్చాయి. వీరే సర్పజాతికి మూలపురుషులు. ఇందులో ముఖ్యులు శేషుడు, వాసుకి, కపింజర, ఉగ్రక మొ ॥ వారు. ఒకసారి ఈమె వినతను మోసం చేయమని తన పుత్రులకు చెప్పగా అందులో కొందరు నిరాకరించినందుకు వారంతా జనమేజయుని సర్ప యాగంలో బూడిదవుతారని శపించింది. కశ్యపుడికిది నచ్చక బ్రహ్మను వేడుకోగా సర్పాలు మనుష్యలకు హానికరం కనుక శాపం తప్పదు, అయితే హానికరం కాకుండా విషాన్ని హరించే విషసంహార విద్యను కశ్యపునికి చెప్పాడు. కద్రువ బ్రహ్మను కొలుస్తూ బ్రహ్మ కొలువులో జీవించింది.

**కనకధ్వజుడు :** ధృతరాష్ట్రుని కుమారుడు. కురుక్షేత్రంలో భీమసేనుడు వధించాడు. – మహాభారతం

**కనకరేఖ :** కనకాపురి రాజకుమార్తె. శాపంవల్ల వర్ధమాన నగరరాజు పుత్రికగా జన్మించింది. శక్తిదేవుడను బ్రాహ్మణుడు ఈమెను వివాహ మాడాడు. – కథాసరిత్సాగరం.

**కనకవర్ణుడు :** గంగానదీ తీరాన ఓ గ్రామాన్ని పాలించినవాడు. – *కథాసరిత్సాగరం.*

**కనకం :** ఓ పెద్దవనం. మహామేరుపర్వతం దగ్గర్లో వుంది. ఇక్కడే అంజనాదేవి హనుమంతుడికి జన్మనిచ్చింది. – *మహాభారతం*

**కనకాక్షుడు :** స్కందుని అనుచరుల్లో ఒకడు. – *మహాభారతం*

**కనకాయువుడు :** ధృతరాష్ట్రుని కుమారుడు. ఇతని మరోపేరు కరకాయుసుడు. ద్రౌపది స్వయం వరంలో కూడా పాల్గొన్నాడు. – *మహాభారతం*

**కనకావతి :** స్కందదేవుని అనుచరుడు. – *మహాభారతం*

**కనకాంగధుడు :** ధృతరాష్ట్రుని కొడుకు. కనక ధ్వజుడని అంటారు. కురుక్షేత్రంలో భీమసేనుడు వధించాడు. – *మహాభారతం*

**కనఖలం 1 :** దక్షుడు యజ్ఞంచేసిన ప్రదేశం. – *వామనపురాణం*

**కనఖలం 2 :** గంగానదీతీరాన గల పవిత్ర తీర్థం. ఇక్కడ స్నానంచేస్తే అశ్వమేధయాగం చేసిన ప్రతిఫలం దక్కుతుంది. కాళిదాసు మేఘదూతంలో ఈ తీర్థాన్ని గురించి వర్ణించపబడింది. వశిష్ఠుని సలహాపై లక్ష్మణుని కుమారుడు తక్షకుడు ఈ ప్రాంత ఆటవికుల్ని ఓడించి ఇక్కడ అగతి అనే పట్టణాన్ని నిర్మించాడు. – *ఉత్తర రామాయణం*

**కన్నడు :** చూ॥ శ్రీకృష్ణుడు

**కన్నప్ప :** చూ॥ తిన్నడు.

**కన్య :** జ్యామిఘడీమెను వివాహం చేసుకుందామని తీసుకువచ్చి తన కుమారుడు విదర్భుడికిచ్చి వివాహం చేస్తాడు.

**కన్యకాగుణం :** ప్రజాజీవనం వున్న ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం. – *మహాభారతం*

**కన్యకాంబ :** ఈమె అసలు పేరు వాసవాంబ. తండ్రి కుసుమశ్రేష్ఠి. తల్లి కుసుమాంబ. వీరు పుత్రకామేష్టి చేయగా విరూపాక్షుడు, వాసవాంబ జన్మిస్తారు. విష్ణువర్ధనుడను రాజు ఈమెను కోరగా వీరంగీకరించరు. రాజు వీరిపై దండెత్తగా తల్లిదండ్రులు అగ్నిప్రవేశం చేయబోగా వాసవాంబ నేను శచీదేవినని శాపవశాన ఇలా జన్మించానని చెప్పి అగ్నిప్రవేశం చేస్తుంది. కన్యకగా తనువు చాలించడంతో ఆమెకాపేరు వచ్చింది. – *కన్యకాపురాణం*

★**కన్యాకుమారి :** దక్షిణ భారతదేశపు కొస. ఇది ప్రాచీన కాలం నుండి పుణ్యస్థలమే. ఇక్కడ ఓసారి నీటము నిగితే పాపపరిహారం జరుగుతుందని ప్రతీతి. ప్రాచీన కాలంనుండి పాండ్యదేశంలో ఇదోభాగం. పాపపరిహారిణి. పాపాత్మురాలైన ఓ బ్రాహ్మణస్త్రీ కాశీనుండి కాలినడకన ఇక్కడకు వచ్చి పాపపరిహారంకోసం ప్రతిరోజు స్నానం చేసి ముక్తిపొందినట్లు ఓ కథ వుంది. – *మణిమేఖల*

*కన్యాకుమార చక్రతీర్థం :* మయాసురుని కుమార్తె కన్యాకుమారి కైలాసానికి వెళ్లి శివుడ్ని ప్రార్థించగా అతడు కావలసిన వరం కోరుకొమ్మన్నాడు. ఆమె శివునిలో ఐక్యంకావాలని కోరగా 10 వైష్ణవ యుగాలు గడిస్తే ఓ శివయుగం వస్తుంది. అప్పుడే నీ కోర్కె తీరుతుంది. అప్పటి వరకు దక్షిణ దిక్కున ధ్యానంలో జీవించు. నీవు నివసించే ఆశ్రమాన్ని కన్యక్షేత్రం లేక తపఃస్థలం అంటారు. అక్కడ నివసించే సమయంలో బాణాసురుడు, ఇతర దుర్మార్గుల్ని చంపు. ప్రజలకు విముక్తి కల్గించు, అప్పుడు నీతో నేను చేరతానని చెప్తాడు. మూడులోకాలు జయించిన బాణాసురుడ్ని ఆమె చంపుతుంది. – *స్కందపురాణం*

**కన్యాకుబ్జం :** గంగానదీ తీరంలోని ఓ పట్టణం. ఇప్పుడు దాన్ని కనోజ్ అంటారు. కుశమహర్షి తన పుత్రులు నల్గుర్ని దేశాన్ని పాలించమనగా అందులో ఒకడైన కుశనాభుడు మహోదయపురాన్ని నిర్మిస్తాడు. ఇతనికి వందమంది కుమార్తెలు. వీరు వాయువు ప్రేమను తిరస్కరించగా వాయువు వీరిని కుబ్జలుగా మారమని శపించాడు. అందుకని ఈ నగరానికి కన్యాకుబ్జం అనే పేరు స్థిరపడింది. బ్రహ్మదత్తుడు వీరిని వివాహం చేసుకోగా వీరి కుబ్జత్వం పోతుంది. కుశనాభుడి కొడుకు గాధి. గాధి కొడుకు విశ్వామిత్రుడు, కూతురు సత్యవతి. ఈమె భర్త రుచికుడు. – *మహాభారతం*

**కన్యాశ్రమం :** ఇదో పుణ్యస్థలం. ఏ మానవుడైనా 3 రాత్రులు ఇక్కడ గడిపితే ముక్తి లభిస్తుంది. – *మహాభారతం*

★ చారిత్రకంగా హెరొడోటస్, టాలమి, మార్కోపోలో కూడ కన్యాకుమారిని దర్శించిన వివరాలు కలవు.

**కన్యాసంవేద్య తీర్థం :** ఇదో పుణ్యస్థలం. దీన్ని దర్శిస్తే ప్రజాపతి మనువు ప్రపంచంలోకి వెళ్తారు.
– మహాభారతం

**కన్యాహ్రదం :** ఓ పుణ్యస్థలం. ఇక్కడ ఒకసారి నివసిస్తే దేవలోకప్రాప్తి కలుగుతుంది. – మహాభారతం

**కపట భిక్షువు :** మోసం చేస్తే అపహసించబడతార నడానికి ఈతని ఉదంతం చెప్తారు.

గంగానది తీరంలో మాకండి నగరంలో ఓ భిక్షువు కలదు. అతడెల్లప్పుడు మౌనం పాటించేవాడు. ప్రతి ఇంటికి వెళ్లి భిక్షాటన చేసేవాడు. ఓ రోజు ఓ వైశ్యుడి ఇంటికి వెళ్లి అందమైన అతని కూతుర్ని చూసి పెదవి విప్పి "ఏమి బాధాకరం" అని ఒకేసారి మాట్లాడి వెళ్లిపోయాడు. ఆ వైశ్యుడు కళవళ పడి ఆ బిక్షువు దగ్గరకు వెళ్లి అలా అనడానికి కారణం అడగగా నీ కూతుర్లో పాపస్వప్నాలున్నాయి. ఆమెను ఎవరికైనా ఇచ్చి వివాహం చేస్తే మీరంతా నశిస్తారని చెప్తాడు. అలాకాకుండా వుండాలంటే ఆమెను ఓ పెట్టెలో పెట్టి నదిలో వదలి ఆ పెట్టెమీద ఓ దీపం పెట్టండి అని చెప్తాడు. వారు అది నిజమని నమ్మి అలాగే చేయగా ఆ రాత్రి నదిలో తేలుతూ వస్తున్న వెలుగుతున్న పెట్టెను చూసి ఓ రాజకుమారుడు మూతతీసి దానిలోవున్న ఆ కన్యను తీసుకొనివెళ్లి ఓ నల్లకోతిని అందులోవుంచి అలాగే మూత వేస్తాడు. అదే రాత్రి కపటభిక్షువు తన శిష్యులతో నదిలో ఓ పెట్టె పైన దీపంతో వెళ్తుంది. దాన్ని తీసుకురమ్మని చెప్తాడు. వారు తీసుకురాగా పైన గదిలో పెట్టించి తన శిష్యులను వెళ్లిపొమ్మని చెప్పి తను పైకెళ్లి ఆ కన్యను చూడదలచి మూత తీయగా ఆనల్ల కోతి ఒక్కఉదుటున బయటకు దూకుతుంది. అలా కపట భిక్షువు మోసపోతాడు.
– కథాసరిత్సాగరం

**కపటుడు :** ఇతడో రాక్షసుడు, ధనువుకు కశ్యపుని వల్ల జన్మించినవాడు. – మహాభారతం

**కపర్ది :** 11 మంది రుద్రులలో ఒకడు. హరుడు, బహు రూపుడు, త్ర్యంబకుడు, అపరాజితుడు, వృషా కర్ది, శంభు, కపర్ది, రైవతుడు, మృగవ్యాదుడు, సర్ప కపాలి అనువారు పదకొండుమంది రుద్రులు.
– అగ్నిపురాణం

**కపాలం :** చూ॥ బ్రహ్మ.

**కపాలమోచనం :** కాశీలోని ఒక తీర్థం. బ్రహ్మ శివుల తగాదాలో బ్రహ్మ శిరస్సును శివుడు భైరవుడి చేత ఖండింపజేస్తాడు. అది భైరవుడి చేతికంటుకోగా విష్ణువు సలహాపై దీన్ని కాశీలో కపాల విమోచన తీర్థంలో పాతిపెడతాడు. ఇతర విశేషాలకు
– చూ॥ కపాల విమోచనుడు.

**కపాలి :** 11 మంది రుద్రులలో ఇతడొకడు. ఒక్కోపు రాణం ఒకోరకంగా 11 మంది పేర్లు చెప్తోంది. బ్రహ్మ కుమారుడైన స్థానువు కుమారుడే కపాలి. ఇతర రుద్రులు మృగవ్యాధుడు, సర్పుడు, నిర్వతి, అజైకపాతి, అహిర్బుధ్న్య, పినాకి, ఈశ్వర, స్థానుడు, భార్గ, ధాన.
– మహాభారతం

**కపిధ్వజుడు :** అర్జునుని రథం యొక్క జెండాపై హను మంతుడు వుంటాడు. కనుక అర్జునునికి మరోనామం కపిధ్వజుడు. – మహాభారతం

**కపిల 1 :** ధరణీ దక్షుల కుమార్తె. కశ్యపుని భార్య. ఘృతాచి మేనకలీమె పుత్రికలు. – మహాభారతం

**కపిల 2 :** కురుక్షేత్రంలోని ఓ పవిత్ర స్థలం.
– మహాభారతం

**కపిల 3 :** ఒక నది. – మహాభారతం

**కపిలకేదార తీర్థం :** ప్రాచీన భారతదేశంలో ఓ పుణ్య తీర్థం. కపిలమహర్షి కొంతకాలం ఇక్కడ నివసిం చాడు. ఇక్కడున్న కొలనులో ఎవరైన స్నానం చేస్తే ఇతరులకు తను గోచరించని 'కళ' అతనికి వస్తుంది.
– మహాభారతం

**కపిల తీర్థం :** కపిలుడనే రాజుయొక్క స్వంత కొలను.
– మహాభారతం

**కపిలహ్రదం :** కాశీలోని ఓ పవిత్ర స్థలం. ఇక్కడ స్నానం చేస్తే రాజసూయయాగం చేసిన ప్రతిఫలం వస్తుంది.
– మహాభారతం

**కపిలావటం :** ఓ పుణ్యస్థలం. ఇక్కడ నివసించి తపస్సుచేస్తే 1000 గోవుల్ని దానం చేసిన పుణ్యం వస్తుంది. – మహాభారతం

**కపిలాశ్రమం :** గంగా సముద్రంలో కలిసే ప్రదేశంలో వుండే సముద్రంలోని ఆశ్రమం.

**కపిలాశ్వుడు :** కువలాశ్వుడి కుమారుడు. దందువనే మహర్షి ఇతణ్ణి నాశనం చేశాడు. – మహాభారతం

**కపిలుడు :** ఓ మహర్షి, కర్దముని కుమారుడు విష్ణు వంశజుడు. ఇతని భార్య సుమతి. ఇతడు సాంఖ్యయో గమునెరిగి ఇతరులకుపదేశించెను. – మహాభారతం

ఇతడు పాతాళ లోకమున తపస్సు చేసుకొనుచుండగా సగర పుత్రులు యజ్ఞాశ్వమునకై వెదకుచూ ఇతడే దొంగిలించెనని ఎంచి ఇతనిని బంధింపబోవగా కపిలుడు కన్నులు తెరచిచూడగా వారు భస్మమయ్యిరి. - చూ॥ *భగీరధుడు.*

ఇతడు నారాయణుడను ఆదిముని. ఇతడొకసారి జైగీషవ్యుడను మునిని వెంటనిడుకొని యశ్వశిరుడు చేయు క్రతువునకు వెళ్లగా రాజు విష్ణుమూర్తి ఏ విధముగా సేవించిన తన వశమగునని అడిగెను. అంత కపిలుడు నేనే విష్ణుమూర్తిని, నన్నే సేవింపుమనగా విష్ణుమూర్తిని నేనెరుగుదును నీవెట్లగుదువనగా కపిలుడు విష్ణు స్వరూపమును ధరించెను. రాజు నేనిది నమ్మను, విష్ణుమూర్తి నాభియందు బ్రహ్మయుండుననగా జైగీశ్వరుడు బ్రహ్మయయ్యెను. రాజు ఇదియంతయూ నీ మాయకాని వేరు కాదనగా మునులంతర్ధానము నొందిరి. అంతట యజ్ఞ భూమి దుష్ట మృగభూయిష్టమయ్యెను. అప్పుడు రాజు మునులను ప్రార్థించగా కపిలుడు మరల ప్రత్యక్షమై వారికి మృగ బాధ లేకుండజేసి రాజా మహా విష్ణువు సర్వాంతర్యామి, అది నీకు తెలిసినచో అతడు నీ వశమగును. అది నీకు తెలియజేయుటకే నేనిట్లు చేసితినని చెప్పెను. - వరాహపురాణం

**కపిస్కంధుడు :** స్కందదేవుని సైనికుల్లో ఒకడు. - మహాభారతం

**కపింజరం :** ఇదో పక్షి. ఇంద్రుణ్ణి వధించడానికి త్వష్ట త్రిశిరసుడ్ని సృష్టిస్తాడు. ఇతనికి మూడు తలలుంటాయి. ఇంద్రుని ఆజ్ఞానుసారం తక్షకుడనువాడు ఈ మూడు శిరస్సుల్ని ఖండిస్తాడు. అక్కడినుండి కపింజల, తిత్తిర, కలపింగళ అనే పక్షులు వస్తాయి. - మహాభారతం

**కపింజల :** ఓ ప్రాచీన నది పేరు. - మహాభారతం

**కపోత తీర్థం :** గౌతమీ తీరంలో ఒక పుణ్యస్థలం. లుబ్ధకుడనేవాడు జంటపావురాల్లో ఆడ పావురాన్ని పంజరంలో బంధిస్తాడు. మగపావురం పంజరం చుట్టూ తిరిగి విలపిస్తుంటే ఆడపావురం ధైర్యం చెప్తుంది. కాని మగపావురం అగ్నిహోత్రం తెచ్చి మంటచేసి దాన్లో పడుతుంది. లుబ్ధకుడు జాలిపడి ఆడపావురాన్ని పంజరం నుండి విడిపించగా అది కూడా అగ్నిలోపడి మాడిపోతుంది. లుబ్ధకుడు ఆశ్చర్యచకితుడై తనకు సన్మార్గం చూపమని వాటిని ప్రార్థిస్తాడు. గౌతమిలో స్నానంచేసి ఆ మలిన దేహాన్ని అందులో వదలమంటాయి. అతడలా చేసి స్వర్గానికి వెళ్తాడు. ఈ కథ జరిగిన ప్రదేశాన్నే కపోత తీర్థం అంటారు. - బ్రహ్మపురాణం

**కపోతలోముడు :** కపోతరోముడని కూడా అంటారు. శిబి చక్రవర్తి కుమారుడు. వరుణుని కొలువులో ముఖ్యుడు. - మహాభారతం

**కపోతుడు :** గరుడుని కుమారుల్లో ఒకడు. - మహాభారతం

**కబళ బర్హిణుడు :** యదువంశజుడు. అంధకుడి కుమారుడు.

**కబంధుడు :** ఒక రాక్షసుడు. ఇతనికి తలయును కాళ్ళును లేవు. పెద్దపొట్టయు దానికి మించిన చేతులును కలవు. చేతులను అటునిటు తిప్పుచు చేతికందిన వారిని పొట్టలోకి తీసుకొనును. సీతను వెదకు రామలక్ష్మణులితనికి చిక్కిరి. వారిని తన చేతులతో లాగుకొనెను. ముందు భయపడి తర్వాత రాముడు తన ఖడ్గంతో ఖండించెను. రాక్షసుడు హతుడై పడి తాను పూర్వము ధనువుననియు శాపవశమున ఇట్లయితినని తనను దహింపుడని కోరెను. రాముడు అగ్నిని పుట్టించి అతనిని దహించగా అతడు నిజరూపమును దాల్చి సీతను రావణుడు తీసుకొని పోయెననియు మీరు సుగ్రీవుని సహాయము పొందమని సలహా ఇచ్చెను. - రామాయణం

**కమల 1 :** ప్రహ్లాదుని తల్లి. - పద్మపురాణం

**కమల 2 :** స్కందదేవుని అనుచరుల్లో ఒకడు. - మహాభారతం

**కమలభవుడు :** చూ॥ బ్రహ్మ

**కమలపాలిక :** హిడింబి పేరు. - మహాభారతం

**కమలావ్రతం :** చూ॥ జయశార్మనుడు.

**కమలాక్షి :** ఓ స్కందదేవుని అనుచరుడు. - మహాభారతం

**కమలాక్షుడు 1 :** కౌరవుల పక్షాన పోరిన ఓ యోధుడు. ఇతనిని అర్జునునిపై పోరాటానికి శకుని పంపాడు. - మహాభారతం

**కమలాక్షుడు 2 :** తారకాసురుని కుమారుడు. త్రిపురాసురుల్లో ఒకడు.

**కయాధువ :** హిరణ్యకశిపుడి భార్య. వీరికి ప్రహ్లాదుడు జన్మిస్తాడు.

**కర :** ఓ పవిత్ర నది. వరుణుడి కొలువులో వుంటుంది. ఈ నదీతీరంలో నివసించి ఉపవసిస్తే అశ్వమేధ యాగం చేసిన ప్రతిఫలం లభిస్తుంది.

**కరకర్షకుడు :** చేదిరాజు సోదరుడు. మరోసోదరుడు శరభుడు. వీరు ముగ్గురు మహాభారత యుద్ధంలో పాండవులకు సహాయపడ్డారు. – మహాభారతం

**కరకం :** జన జీవనం వున్న ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం. – మహాభారతం

**కరకంఠుడు :** చూ॥ శివుడు.

**కరకాశుడు :** మహాభారత యుద్ధంలో కౌరవుల పక్షాన పోరాడిన వీరుడు. ద్రోణుని గరుడ వ్యూహంలో వుండి పోరాడాడు. – మహాభారతం

**కరటక దమనకులు :** పంచతంత్ర గ్రంథంలోని రెండు పాత్రలు. మిత్రభేదంలోని జంబుక సోదరులు. మృగ రాజు కొలువులో వుండేవి. వీటికి రాజనీతి బాగా తెలుసు. అడవిలో తిరిగే ఎద్దంటే సింహానికి భయం పుట్టేలా చేసి రెండింటిని మృగరాజు కొలువులో చేర్చుతాయి. వీటి అవసరం తీరిన తర్వాత వీటిమధ్య వైరం పెంచి సింహంతో ఎద్దుని చంపిస్తారు. మోసగా ళ్లకు పర్యాయపదంగా కరటకదమనకుల్ని పిలుస్తారు. – పంచతంత్రం

**కరటం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాసయోగ్య ప్రాతం. – మహాభారతం

**కరణుడు :** చూ॥ యుత్సుడు.

**కరభాజనుడు 1 :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు.

**కరభాజనుడు 2 :** రుషభదేవుని తొమ్మిదిమంది ప్రసిద్ధ పుత్రుల్లో ఒకడు. దేవతా సమానుడైన తెలివైనవాడు. విదేహరాజు యజ్ఞానికి వచ్చిన ప్రజానీకానికి ఆధ్యాత్మిక చింతనను బోధించాడు. – భాగవతం

**కరభాంజకం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాసయోగ్య ప్రాంతం. – మహాభారతం

**కరభి :** శకుని కుమారుడు. – మత్స్యపురాణం

**కరభుడు :** ఒక రాజు. మగధ రాజైన జరాసంధునికి తలఒగ్గినవాడు. – మహాభారతం

**కరంజ నిలయం :** వృక్షాలకు మాతృక అయిన అనలను కరంజ నిలయమని పిలుస్తారు. ఈమె దక్షుని కూతురు. కశ్యపుని భార్య. ఈమెను వీరుధ అని కూడా పిలుస్తారు. ఈమె కరంజవృక్షంలో నివసి స్తుంది కనుక కరంజనిలయం అని పిలవబడింది. అనల ఆశీర్వచనం కొరకు కరంజ వృక్షాన్ని పూజిస్తారు. – మహాభారతం

**కరంధమనుడు :** చూ॥ కరంధముడు.

**కరంధమనం :** దక్షిణ సముద్రతీరాన గల ఓ పుణ్య తీర్థం. పంచతీర్థాలైన అగస్త్య, సౌభద్ర, పౌలోమ, కారంధమన, భరద్వాజ తీర్థాలలో ఒకటి.

**కరంధముడు :** ఇక్ష్వాకు వంశంలో ఒక రాజు. అసలు పేరు సువర్చసుడు. ఇతడి రాజ్యంలో ఒకసారి క్షామం రాగా ధనాగారం ఖాళీ అయ్యింది. అవకాశం కోసం చూస్తున్న ప్రక్క దేశపు రాజులు ఇతనిపై దండెత్తగా దేవుణ్ణి ప్రార్థించి రెండు చేతులు పైకి ఊపగా శత్రువు లను ఓడించగల సైన్యం జన్మించింది. కరాలతో సైన్యాన్ని సృష్టించాడు కనుక కరందముడు లేక కరంద మనుడు అనుపేరు వచ్చింది. ఇతని కుమా రుడు అవిక్షితుడు. – మహాభారతం

**కరంభి :** యదువంశజుడు. శకుని కుమారుడు. ఇతణ్ణి కుంతి అనికూడా పిలుస్తాడు.

**కరంభుడు 1 :** దనువు కుమారుడు. రంబుడి సోదరుడు. దేవతల్ని గెలవగలిగే కుమారుల్ని కనాలని రంభ కరంబులు ఒక సరస్సులో తపస్సు చేస్తుండగా ఇంద్రుడు మొసలిగా మారి వారిని సంహరిస్తాడు. – దేవీభాగవతం

**కరంభుడు 2 :** మహిషాసురుని కుమారుడు.

**కరవీరపురం :** ఓ పుణ్యస్థలం. ఇచ్చట స్నానం చేస్తే బ్రహ్మత్వం పొందుతారు. – మహాభారతం

**కరవారీక్షుడు :** ఓ రాక్షసుడు. ఇతడు ఖరదూషణ త్రిశిర సులతో కలసి రాముడితో యుద్ధంచేశాడు. – రామాయణం

**కరవీరపురం :** ఓ పుణ్యస్థలం. ఇచ్చట స్నానం చేస్తే బ్రహ్మత్వం పొందుతారు. – మహాభారతం

**కరవీరం 1 :** ఓ ప్రసిద్ధ సర్పం. – మహాభారతం

**కరవీరం 2 :** మహామేరువుకు దక్షిణానగల ఓ పర్వతం. చూ॥ మహామేరువు.

**కరవీరం 3 :** గోమంత పర్వతానికి దిగువనగల ఓ రాజ్యం. శృగాలవాసుదేవుడు దీన్ని పాలించాడు. పర శురాముని ఆజ్ఞపై శ్రీకృష్ణబలరాములితణ్ణి వధించారు. – భాగవతం

**కరహాటకం :** దక్షిణ భారతదేశంలో ఓ రాజ్యం. సహదేవుడు దీన్ని జయించాడు. - మహాభారతం

**కరాలాక్షుడు :** స్కంద దేవుని సైనికుల్లో ఒకడు. - మహాభారతం

**కరాళజనకుడు :** మిథిలా నగర రాజుల్లో ఒకడు. వశిష్ఠుడితనికి ఆధ్యాత్మిక చింతన కల్గించాడు. - మహాభారతం

**కరాళదంతుడు :** ఓ గొప్ప రుషి. ఇంద్రుని సభలో ముఖ్యుడు. - మహాభారతం

**కరాళుడు :** ఓ దేవ గాంధర్వుడు. అర్జునుని జన్మ దినోత్సవ వేడుకల్లో పాల్గొన్నారు.

**కరీతి :** ప్రాచీన భారతావనిలో ఓ నివాస యోగ్యస్థలం. - మహాభారతం

**కరీషకం :** ప్రాచీన భారతావనిలో ఓ నివాసయోగ్య స్థలం - మహాభారతం

**కరీషిణి :** ఒక నది. - మహాభారతం

**కరుణుడు :** చూ।। ధనంజయుడు.

**కరుషుడు 1 :** కారుషదేశపురాజు. ఇతడిని భర్తగా పొందడానికి బాధ అనే స్త్రీ తనస్సు చేసింది. - భాగవతం

**కరుషుడు 2 :** వైవశ్యత మనువు తొమ్మిది మంది కుమారుల్లో ఒకడు. - భాగవతం

**కరుషుడు 3 :** ఒక యక్షుడు. సోదరులతో కలసి 'దేవి'ని గూర్చి తపస్సు చేసి వరం పొందుతాడు. - భాగవతం

**కరూశదేశం :** వృతాసురుడిని చంపిన బ్రహ్మహత్యా పాతకం ఇంద్రుడిచ్చట తనమలినం కడుక్కొని ఆపాతకం నుండి విముక్తుడైన ప్రాంతం. తాటకి ఇచట నివసించి ఈ ప్రాంతాన్ని నాశనం చేసింది. - రామాయణం

**కరూశుడు :** వైవశ్యత మనువు కొడుకు. ఇక్ష్వాకుని తమ్ముడు. ఇతడు పాలించాడు కనుక ఈ దేశానికి కురూశదేశమని పేరొచ్చింది.

**కరేణువతి :** శిశుపాలుడి కుమార్తె నకులుని భార్య. ఈమె పుత్రుడు నిరమిత్రుడు. - మహాభారతం

**కరోటకుడు :** కద్రువ పుత్రుడు.

**కరంభ :** కళింగ దేశ రాజకుమారి. అక్రోదనుడి భార్య దేవాతిధి తల్లి. - మహాభారతం

**కర్మఖండం :** ప్రాచీన భారతీయుల నివాస యోగ్య స్థలం. దుర్యోధనుడి కోసం కర్ణుడు దీన్ని జయిస్తాడు. - మహాభారతం

**కర్కటి :** హిమాలయాల్లో నివసించిన ఓ రాక్షసి. ఎక్కడెక్కడున్న ఆహారం కూడా సరిపోక బ్రహ్మను గూర్చి తనస్సు చేసి 'విసూచిక'గా మారి చెడు ఆహారం తిన్నవారిని, క్రూరుల్ని, నిర్దయుల్ని కబళిస్తుంటుంది. చివరకు విసుగుచెంది మళ్లీ రాక్షసిగా మారి దీర్ఘకాలం తపస్సు చేసి సత్త్వస్థితిని పొందుతుంది. - జ్ఞానవాసిష్టం

**కర్మరుడు :** ఓ సర్పం. కద్రువ సంతతి.

**కర్ణకుడు :** కాశీలో నివసించే ఓ మంగలివాడు. - హరివంశం

**కర్ణనిర్వాహుడు :** ఇతడో రుషి. వాన ప్రస్థాశ్రమాన్ని నిష్ఠగా గడిపి స్వర్గాన్ని చేరినవాడు. - మహాభారతం

**కర్ణప్రావరణం :** దక్షిణ భారతదేశంలోని ఓ ప్రాంతం. ఈ ప్రాంత ప్రజలు దుర్యోధనుడి తరపున పోరాడారు. - మహాభారతం

**కర్ణప్రావరుణుడు :** స్కందుని అనుచరుడు. - మహాభారతం

**కర్ణప్రావరుణులు :** దక్షిణ సముద్ర తీరంలో నివసించే ఓ తెగ ప్రజలు. వీరి చెవులు పెద్దవిగా పాదాలదాకా వెళ్లాడుతుంటాయి. సహదేవుడు వారిని జయించాడు. వీరు ధర్మరాజుకి కానుకలర్పిస్తారు. - మహాభారతం

**కర్ణవేష్టుడు :** క్రోధవశుడే ఈ రాజుగా జన్మించాడు. చూ।। క్రోధవశుడు. - మహాభారతం

**కర్ణశ్రవకుడు :** యుధిష్టరుని కొలువులో ఓ ముని. - మహాభారతం

**కర్దమిలక్షేత్రం :** సమంగ పర్వతం వద్దగల ఓ దేవాలయం. భరతుడి పట్టాభిషేకం ఇక్కడే జరిగింది. - మహాభారతం

**కర్దముడు 1 :** ఓ ముని. త్రేతాయుగమునందు విష్ణు భక్తుడు. సరస్వతీ తీరమున విష్ణువును ప్రార్థించుచుండగా అతడు ప్రత్యక్షమై వరము కోరుకొమ్మనగా నాకొక సద్భార్యనిమ్మని కోరెను. స్వాయంభవ మనువు తన కుమార్తె దేవహూతిని పెండ్లాడుమని తీసుకొని రాగా మహావిష్ణువు ప్రోత్సహించి తానే ఒక అంశతో ఆమెకు జన్మించెదనని చెప్పెను. కర్దముడు తన శక్తిచే ఓ విమానమును సృష్టించి దంపతులిద్దరూ నానా

దేశములు విహరించిరి. వీరికి తొమ్మిదిమంది కుమార్తెలు జన్మించిరి. వారు కళ, అనసూయ, శ్రద్ధ, హవిర్భువు, గతి, క్రియ, ఖ్యాతి, అరుంధతి మరియు శాంతి. అటు పిమ్మట కర్ధముడు సన్యసించబోగా దేవహూతి నాకొకపుత్రుని ప్రసాదించమని కోరగా ఈమె గర్భమున కపిలుడు జన్మించెను. ఇతడు విష్ణువు అంశ. – *భాగవతం.*

**కర్ధముడు 2 :** ఓ అదృష్టశాలి అయిన సర్పం. – *మహాభారతం*

**కర్ధముడు 3 :** ఓ మహర్షి. బ్రహ్మ కొలువులో సభ్యుడు. – *మహాభారతం*

**కర్ధముడు 4 :** విరజుని మనుమడు. ఓ రుషి. ఇతని కుమారుడు అనంగుడు. – *మహాభారతం*

**కర్పరుడు :** చూ॥ ఘటుడు.

**కర్మజిత్తు :** అర్జునుని కుటుంబంలోని వాడు. బృహత్సేనుని కుమారుడు. శృతంజయునికి తండ్రి. – *భాగవతం*

**కర్మభూమి :** భరత భూమిని కర్మభూమి అంటారు. ఇక్కడ జన్మించినవారు, వారి సత్వ రజో తామస గుణాల వల్ల ఇతర లోకాలకు చేరతారు. స్వర్గాన్ని గాని నరకాన్ని గాని చేరతారు. వారి కర్మలను బట్టి వారు ఇతర లోకాలకు వెళ్తారు. కనుక భరత భూమిని కర్మభూమి అంటారు. –*దేవీ భాగవతం*

**కర్వటం :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజ్యం. భీమసేనుడు ఈ దేశపు రాజును సంహరించాడు. – *మహాభారతం*

**కర్ణాటకం :** భారతదేశంలో ఓ రాజ్యం. దక్షిణభారత దేశంలో ద్రవిడ, కేరళ, ప్రాచ్య, మూషిక, వనవాసిక, కర్ణాటక, మాహిసక, వికల్ప, మూసర రాజ్యాలున్నాయి. – *మహాభారతం*

**కర్ణిక :** కాశీనగరంలోని ఓ మంగలివాడు. – *హరివంశం*

**కర్ణికావనం :** సుమేరు పర్వతానికి ఉత్తరానగల ఓ అడవి. ఆరు రుతువులు ఒకేసారి ఇక్కడ కన్పిస్తాయి. కాబట్టి ఈ వనం ఎప్పుడు పుష్పాలతో నిండి వుంటుంది. – *మహాభారతం*

**కర్ణికారుడు :** జటాయువు కొడుకు. – *మత్స్యపురాణం*

**కర్ణుడు 1 :** కుంతి జ్యేష్ఠ పుత్రుడు. మహావీరుడు. దానశీలి.
*జన్మవృత్తాంతము :* కుంతి వివాహానికి పూర్వము తండ్రి పనుపున దుర్వాసునికి పరిచర్యలు చేయగా అతడు మెచ్చి ఆమెకు ఓ మంత్రమునుపదేశించెను. ఆ మంత్ర ప్రభావమున ఆమె ఉచ్చరించిన వారు ప్రత్యక్ష మగుదురు. ఆమె ఆ మంత్రమును పరీక్షించనెంచి సూర్యదేవుని స్మరించగా అతడు ప్రత్యక్షమయ్యెను. ఆమె తాను కన్యనని వేడుకొనగా కన్యత్వము నశించనట్లు వరమిచ్చెను. సూర్యుని అంశగా కుంతికి జన్మించినవాడే కర్ణుడు. ఆమె ఇందుకు వెరచి అతడిని ఓ తొట్టెలో వుంచి నదిలో వదలివేయగా అతిరథుడను సూతుడు ఆ తొట్టెలోని బాలుని తీసుకు వెళ్ళి పెంచుకొనెను. అతని భార్య రాధ. వీరత నికి వసుసేనుడను పేరు పెట్టిరి. – *మహాభారతం*

*విద్యా ప్రదర్శన :* కౌరవ పాండవులు ద్రోణుని వద్ద సకల విద్యలు అభ్యసించిన తర్వాత ద్రోణుడు వీరి నైపుణ్యమును చూడనెంచి అస్త్రశస్త్రాస్త్ర ప్రదర్శన నిర్వహించెను. అర్జునుని మించిన విలుకాడు లేడని ద్రోణుడు ప్రకటించగా కర్ణుడు ప్రత్యక్షమై అర్జుననితో ద్వంద్వ యుద్ధము చేసి ఓడించగలనని చాటగా "నీవు క్షత్రియుడవు కాదు గనుక ఈ ప్రదర్శనకు అనుమతి" లేదని భీష్ముడు ప్రకటించగా దుర్యోధనుడు ఇతడిని అంగరాజును చేసి మిత్రునిగావించుకొనెను.

*కర్ణుని ఆయుధ సంపద :* కర్ణుడు పుట్టుకతోనే కవచ కుండలాలతో జన్మించాడు. అవి వున్నంత వరకు అతడు అజేయుడు. బ్రహ్మాస్త్ర ప్రయోగము నేర్చుకొనదలచి ద్రోణుని వేడగా అతడు నిరాకరించగా పరశురాముని శిష్యరికముచేసి బ్రహ్మాస్త్ర ప్రయోగము నేర్చుకొనెను. ఖాండవ దహనమున పారిపోయిన ఓ నాగు నాగాస్త్రమై కర్ణునిజేరి అర్జునుని సంహరించుటకు ప్రతినబూనెను. ఇంద్రుడితని దానత్వమునకు మెచ్చి శక్తియను ఆయుధమునిచ్చెను.

*శాపగ్రస్త కర్ణుడు :* పరశురాముని వద్ద బ్రాహ్మణుడిగా విద్యాభ్యాసమొనర్చు చుండగా పరశురాముడు కర్ణుని తొడపై తలవుంచి విశ్రమిస్తుండగా ఓ పురుగు ఇతడి తొడను తొలచివేయగా రక్తస్రావమయ్యెను. పరశురామునకు నిద్రాభంగమై ఆ రక్తపు ధారలు చూసి కర్ణుని పుట్టుకను గ్రహించి మోసముతో సంపాదించిన అస్త్రవిద్య అత్యవసర సమయమున నిరుపయోగమగునని శపించెను. పరశురాముని వద్ద విద్య నేర్చుకొని తిరిగి వస్తూ తన విద్యను ప్రదర్శించ బోగా అతడు విడిచిన బాణము ఓ బ్రాహ్మణుని గోవుకి తగిలి మృతిచెందగా ఆ బ్రాహ్మణుడు ఆపత్కాలమున

నీ రథము భూమిలోకి కృంగునని శపించెను.

*కర్ణుని ఔదార్యము :* కర్ణుని శక్తి అర్జునునికి కీడుగా తలచి తన మానసపుత్రుడైన అర్జునుని రక్షించు కొను టకు ఇంద్రుడు బ్రాహ్మణ రూపమున వెళ్ళి కర్ణుని దానము కోరగా అతడు తన కవచకుండలములను ఇంద్రునికి దానమిచ్చెను. దానికి ప్రతిగా ఇంద్రుడు కర్ణునికి శక్తియను ఆయుధమిచ్చెను. మహాభారత యుద్ధ సమయమున ఇతడు సూర్యభగవానుని ప్రార్థించుచుండగా కుంతి అతని జన్మ రహస్యమును చెప్పి పాండవులతో చేరమని కోరగా నిరాకరించి ఆమె కోర్కె నిరాకరించగా ఒక్క అర్జునుని తప్ప తక్కిన పాండవులను అవకాశం వచ్చినా చంపనని మాట ఇచ్చి దానిని పాటించెను.

*మైత్రీ బంధానికి ప్రతీక కర్ణుడు :* అంగరాజుగా చేసిన దుర్యోధనుని ఎడల జీవితాంతం విశ్వాసపాత్రుడుగా మిత్రుడిగా నిలచెను. లక్క ఇంటి దహనం, మాయా జూదం ఇతడికిష్టం లేకున్నను దుర్యోధనుని వారించ లేకపోయెను. దుర్యోధనుని కొరకు ఎన్నో రాజ్యము లపై దండెత్తి జయించెను. మహాభారత యుద్ధ ప్రారంభమున శ్రీకృష్ణుడు ఇతనిని పాండవాగ్రజు డవని పాండవులవైపుకు వచ్చి సర్వరాజ్యమును ఏలుమని బోధించినను ఇతడు నిరాకరించి కౌరవుల పక్షముననే నిల్చి కడదాక పోరాడెను.

*కర్ణుని మరణం :* భీష్ముడు కర్ణుని తూలనాడినందుకు చింతించి భీష్ముని నిర్యాణము వరకు యుద్ధములో పాల్గొనలేదు. ద్రోణుని నాయకత్వములో ఇతడు యుద్ధములో పాల్గొని ఎందరో పాండవ వీరులను వధించెను. అందు ఘటోత్కచుడు ఒకడు. ధర్మజ, భీమసేన, సహదేవులను ఓడించి సంహరించే అవకా శమొచ్చి కూడా తన తల్లికిచ్చిన మాట జ్ఞప్తికి వచ్చి వారిని విడచెను. ద్రోణుని మరణానంతరం సర్వసేనా పతిగా యుద్ధము చేసి అర్జునునితో పోరాడెను. అదే సమయమున శాప ప్రభావమువల్ల రథం భూమిలో నికి కృంగుట, బ్రహ్మాస్త్రము గుర్తుకు రాకుండుట జరిగి అర్జునునిచే వధింపబడెను.

*పుత్రులు :* ఇతనికి ముగ్గురు పుత్రులు. వారు చిత్రసేన, సుసేన, సత్యసేనులు. వీరంతా మహా భారత యుద్ధంలో మరణించారు.

*ఇతర నామాలు :* కర్ణుని ఆధిరథి, ఆదిత్యనందన, అంగరాజ, అర్కపుత్ర, రాధాసుత, రాధేయ, రాధా త్మజ, సూర్యపుత్ర, సూర్యాత్మజ, సూతసుత, సూర్యజ అనికూడా పిలిచేవారు.

**కర్ణుడు 2 :** ధృతరాష్ట్రుని కుమారుల్లో ఒకడు. భీమసేనుడితణ్ణి సంహరించాడు. – మహాభారతం

**కర్ణుడు 3 :** ఘంటాకర్ణుని తమ్ముడు.
– చూ॥ ఘంటా కర్ణుడు

**కర్కోటకుడు :** ఓ భయంకర సర్పం. కద్రువ సంతానం. ఒకసారి కర్కోటకుడు నారదుడ్ని మోసం చెయ్యగా నారదుడు నీవు అడవిలో కదలక పడి వుండు, నలుడు వచ్చి నిన్ను రక్షించేవరకు నీకు ఈ గతి తప్పదని శపించాడు.

*నలుడు–కర్కోటకుడు :* ఓసారి అడవి అంటుకొని మంటలు రేగాయి. కర్కోటకుడు కదలలేడు. అప్పుడు నలుడికోసం అరవగా అడవిలో దమ యంతితో వున్న నలుడు రాగా తన శాపాన్ని వివరించి తనను బొటన వ్రేలంత చేసి కాపాడ మనగా నలుడు అలాగే చేస్తాడు. ఓ పది అడుగుల దూరం నలుడు వెళ్లిన తర్వాత కర్కోటకుడు నలుణ్ణి కాటువేయగా నలుడు నల్లగా మారిపోతాడు. కర్కోటకుడు నిజరూపం ధరించి దీనివల్ల నీకు అపాయం లేదు. నిన్ను బాధిస్తున్న కలి నీలోనే వున్నాడు. నీవు అయోధ్యకువెళ్లి రుతు పర్ణునికి రథసారథిగా వుండి అతని వద్ద అశ్వ హృదయ మంత్రం నేర్చుకో. అప్పుడు నిన్నెవరూ యుద్ధంలో జయించలేరని చెప్తాడు. అంతేకాకుండా రెండు ఆభరణాలు నలునికిచ్చి ఇవి ధరించిన వెంటనే నీకు నిజరూపం వస్తుందని చెప్పి మాయమవుతాడు.
– మహాభారతం

**కలపింగ 1 :** ఓ పుణ్యస్థలం

**కలపింగ 2 :** ఓ రకమైన పక్షి. చూ॥ కపింజల

**కలశపోతకుడు :** ఓ సర్పం. – మహాభారతం

**కలశభవుడు :** అగస్త్యుడు, వసిష్ఠుడు, ద్రోణాచార్యుడు. వీరు ముప్వురును వారి జనకుల రేతస్సులు కలశ మందు భద్రపరచుట వలన జన్మించిరి. కనుక వీరిని కలశభవులందురు.

**కలశి :** ఓ పవిత్ర స్థలం. ఇక్కడి నీటిని కొంచెం సేకరించినా అగ్నిస్తోమయజ్ఞం చేసిన ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**కలశోదరుడు :** స్కందుని సైనికుల్లో ఒకడు.
– మహాభారతం

**కలహ :** సౌరాష్ట్ర పట్టణంలో నివసించే భిక్షువైన బ్రాహ్మణుడి భార్య. భర్త అడిగిందానికి వ్యతిరేకంగా చేస్తుంది. ఇది గమనించి అతడు తనకు కావలసిన దానికి వ్యతిరేకంగా చెప్పి తన పని జరిపించుకొనే వాడు. పొరపాటున ఒకరోజు శ్రాద్ధ పిండాన్ని నీటిలో వెయ్యమనగా ఆమె పెంట కుప్పలో వేస్తుంది. భర్త శాపం వల్ల ఆమె రాక్షస గర్భంలో పుడుతుంది. ఆ తర్వాతి జన్మలో దశరథ కౌసల్యలుగా జన్మిస్తారు. – ఆనంద రామాయణం

**కలహకంటకి :** కాల కౌశికుడి భార్య. హరిశ్చంద్రుడి భార్య చంద్రముఖి కొడుకు లోహితుణ్ణి అనేక కష్టాలు పెడుతుంది.

**కలాపుడు :** ఓ మహర్షి. రాజసూయ యాగానంతరం ధర్మజుడితణ్ణి పూజిస్తాడు. – మహాభారతం

**కలిప్రియ :** ఈమె ఒక వేశ్య. కార్తీక వ్రతాన్ని నిష్టగా ఆచరించి స్వర్గాన్ని చేరింది. – పద్మపురాణం

**కల్పకం :** శివుని ఉద్యానవనం. ఇది కైలాసంలో వుంది. – కథాసరిత్సాగరం.

**కల్పం :** వెయ్యి యుగాలు ఓ కల్పం అని లేక 14 మన్వంతరాలని అంటారు. చూ॥ మన్వంతరం.

**కల్పవృక్షం :** దేవలోకంలోని వృక్షం పేరు. ఏదికోరితే అది ఇచ్చే శక్తి దీనికుంది. 5 రకాల కల్పవృక్షాలు అక్కడున్నాయి. అవి మందార, పారిజాత, సంతాన, కల్పవృక్ష, హరిచందనాలు. కల్పవృక్షం క్షీరసాగర మథనంలో ఉద్భవించింది. – అగ్నిపురాణం

**కల్మాషపాదుడు :** మిత్రసఖుడను రాజు నామాంతరం. ఇక్ష్వాకు వంశ రాజు. శాపగ్రస్తుడై 12 సంవత్సరాలు రాక్షసుడిగా జీవించాడు. ఇతడు సుదాసుడి కొడుకు కనుక సౌదాసుడనబడ్డాడు. వశిష్ఠుని శాపంవల్ల కల్మాషపాదుడని, కల్మాషాంఘ్రి అని పిలువబడ్డాడు.

మిత్రసఖుడు రాక్షసుడుగా మారిన క్రమం : ఒకసారి మిత్రసఖుడు అరణ్యానికి వేటకు వెళ్లగా విశ్వామిత్రుడు ఇతణ్ణి తన శిష్యుడిగా చేసుకుందామని తలుస్తాడు. మార్గమధ్యంలో ఇతనికి వశిష్ఠుని కుమారుడు శక్తి ఎదురౌతాడు. క్షత్రియుడైన మిత్రసఖుడు బ్రాహ్మణుడైన శక్తికి దారి వదలాలా, బ్రాహ్మణుడైన శక్తి క్షత్రియుడైన మిత్రసఖునికి దారివదలాలా అనే మీమాంసలో మిత్రసఖుడు తన పిడికిలితో శక్తిని గుద్దగా శక్తి ఇతణ్ణి రాక్షసుడివి కమ్మని శపించగా విశ్వామిత్రుడు ఇతని శరీరంలోకి దయ్యాన్ని పంపు తాడు. ఆ శాపంవల్ల మిత్రసఖుడు రాక్షసుడిగా 12 సంవత్సరాలు అరణ్యంలో తిరుగుతాడు. – మహాభారతం

మిత్రసఖుడు ఒకసారి వేటకు వెళ్లి సింహం రూపంలో వున్న ఇద్దరు రాక్షసులపై బాణంవెయ్యగా ఒకటి మరణిస్తుంది. రెండవది నిజరూపం దాల్చి సమయం వచ్చినపుడు ప్రతీకారం తీర్చుకొంటానని పారిపోతుంది. ఆ తర్వాత మిత్రసఖుడు తన గురువైన వశిష్ఠుడిని పిలిచి అశ్వమేధయాగం చెయ్యాలనే కోర్కె తెలియజేయగా అతడు యజ్ఞ నిర్వహణకు అంగీకరిస్తాడు. రాజు విందుకు పిలవగా ప్రతీకారం తీర్చుకుందామని చూస్తున్న రాక్షసుడు వశిష్ఠుని రూపంలో మిత్రసఖుని వద్దకు వెళ్లి తనకు మాంసాహారం తినాలనే కోర్కె వుందని చెప్తాడు. ఇది తెలియని రాజు నిజ వశిష్ఠుడికి మాంసాహారంతో విందు ఏర్పాటు చేయగా వశిష్ఠుడు ఆగ్రహించి రాక్షసుడవు కమ్మని శపిస్తాడు. – ఉత్తర రామాయణం

తెలియక చేసిన తప్పుకు వశిష్ఠుడు శపించినందుకు మిత్రసఖుడు ఆగ్రహించి ఇతడు కూడ వశిష్ఠుని శపించదలచి తన చేతిలో నీటిని వుంచి మంత్రించబోగా బ్రాహ్మణుడిని శపించడం క్షత్రియ ధర్మంకాదని భార్య చెప్పగా ఆ కల్మషజలాన్ని తన పాదాలపై పోసుకుంటాడు. ఆ పాపజలం అతడి పాదాలపై పడటంవల్ల కల్మాష పాదుడనే నామం సార్థకమయ్యింది.

రాక్షస జీవనం : ఇతడు అరణ్యంలో రాక్షసుడిగా జీవిస్తూ వశిష్ఠుని పుత్రుడు శక్తితోపాటు తక్కిన 99 మందిని తినివేస్తాడు. వశిష్ఠుడు పుత్రశోకంతో ఆత్మహత్యా ప్రయత్నం చేసుకొని కూడా ఫలించని వాడవుతాడు. ఓ బ్రహ్మణ దంపతులు సంగమిస్తుండగా బ్రాహ్మణుడ్ని చంపుతాడు. బ్రాహ్మణుని భార్య కల్మాషపాదుడిని భార్యతో సంగమిస్తే మరణిస్తావని శపిస్తుంది. బ్రహ్మహత్యాపాతకం వల్ల భయంకర రాక్షసుడిగా మారి ఇతణ్ణి తరమగా పారిపోయి మిథిలా నగరం జేరి గౌతమమహర్షి సలహావల్ల దివ్యజ్ఞానం పొంది కొన్ని సంవత్సరాలు ధ్యానంలో జీవించాడు.

*శాపవిమోచనం :*12 సంవత్సరాల అనంతరం మిత్ర సఖుడుగా మారి వశిష్ఠుడిని తన గురువుగా స్వీకరించి రాజ్య పాలన చేశాడు. బ్రాహ్మణుని శాపం వల్ల తన భార్యకు సంతాన ప్రాప్తి కల్గదని భావించి వశిష్ఠుని కోరగా వశిష్ఠుడు మిత్రసఖుని భార్యతో సంగమించగా ఆమె గర్భవతియై ఓ పుత్రుడికి జన్మనిచ్చింది.
– *మహాభారతం*

**కల్మాషి :** ఒకనది. భృగుమహర్షి ధర్మజుడ్ని ఆశీర్వదించింది ఇక్కడే. కల్మాషి, యమునా నది ఒకటేనని అంటారు. – *మహాభారతం*

**కల్మాషుడు :** కద్రువ కొడుకు. ఒక సర్పం.

**కల్యాణమిత్రుడు :** సుతవుడి కొడుకు – *బ్ర.వై.పు.*

**కల్యాణి 1 :** స్కందదేవుని అనుచరురాలు.
– *మహాభారతం*

**కల్యాణి 2 :** ధరుడనే వసువు భార్య. – *మహాభారతం*

**కల్యాణుడు :** ఒక రుషి. స్వర్గంకోసం ఇతడు మరి కొందరు యజ్ఞం చేస్తారు. – *పంచవంశ బ్రాహ్మణుడు.*

**కలి :** పాపాలకు దేవత. బ్రహ్మపుత్రుడైన కశ్యప మహర్షికి మునివల్ల 16గురు కుమారులు అందులో 15వ వాడు కలి. అతడు దేవగాంధర్వుడు. అభిమన్యుని కుమారుడైన పరీక్షిత్తు రాజ్యమేలుతుండగా ఓ గోవుని ఎద్దుని కలి బాధించడం చూసి పరీక్షిత్తు తన విల్లు ఎక్కుపెట్టి బాణం సంధించగా కలి పరీక్షిత్తు పాదాలపై పడ్డాడు. తన దేశం విడిచి పొమ్మని పరీక్షిత్తు ఆదేశించగా చోటులేక పరీక్షిత్తునే తనకు చోటు కల్పించమనగా ఓ ఐదు ప్రదేశాలు చూపాడు. అవి జూదం, మద్యపానీయం, స్త్రీలోలత్వం, హత్య, బంగారం. – *భాగవతం*

*కలియుగ దేవుడు కలి :* బ్రహ్మ జీవితకాలంలో 14 మన్వంతరాలలో ఇది ఏడవ మన్వంతరం. ప్రతి మన్వంతరంలో నాల్గు యుగాలు. నాల్గవ యుగం కలియుగం. ద్వాపర యుగాంతంలో శ్రీకృష్ణుడి నిర్యాణంతో కలి జన్మించి ప్రపంచాన్ని ఆవరించాడు. కలిగయుగానంతరం 8వ మన్వంతరం మొదలవుతుంది. – *భాగవతం*

*కలి–నలుడు :* చూ॥ నలుడు.

**కలియుగం :** చూ॥ కల్కి.

**కల్కి :** శ్రీ మహావిష్ణువు పదవ అవతారం. దశావతారాల్లో చివరిది.

కలియుగాంతంలో ప్రజలు మతాన్ని విస్మరిస్తారు. దేవుణ్ణి నమ్మరు. దుష్టుల నుండి బహుమతులు స్వీకరిస్తారు. కులాల విభజన చెరిగిపోతుంది. ప్రజలు దొంగలుగా మారతారు. మ్లేచ్ఛులు రాజులౌతారు. అప్పుడు మహావిష్ణువు యజ్ఞవల్క్యుడి పురోహితుడైన విష్ణుయశసుడి పుత్రుడు జన్మించి మ్లేచ్ఛుల్ని నాశనం చేస్తాడు. ఆ తర్వాత దేహం వదలి స్వర్గం చేరతాడు.

కలియుగాన్ని గురించి కొన్ని వైరుధ్యాలున్నాయి. కల్కి అవతారం వెళ్లిపోయిందని కొందరు చెప్తుండగా అది ఇంకా నడుస్తోందని, ఇప్పటికి ద్వాపరయుగం వెళ్లి 500 సంవత్సరాలయ్యింది కనుక ఇంకా 4,26,900 సంవత్సరాలు కలియుగం వుంటుందని, కనుక ఇంకా కల్కి అవతరించలేదని చెప్తారు.

**కల్పుడు :** ధ్రువుని కుమారుడు. – *చూ॥ ధ్రువుడు*

**కళ :** కర్ధమ ప్రజాపతి కూతురు. మరీచి భార్య. కశ్యపుని తల్లి.

**కళావతి :** కాశీరాజు కుమార్తె. ఈమె చిన్ననాటి నుండే దుర్వాసమహర్షి నుండి పంచాక్షరి మంత్రం నేర్చుకుని పఠించింది. ఆ తర్వాత మధుర రాజైన దాశార్హుడు ఈమెను వివాహమాడెను. ఇతడు ఆమె చెంతకు చేరినంతనే అతడికి తీవ్రమైన వేడి జనించేది. అతడామెను కారణమడగగా పాపం చేసినవారు తనను తాకితే అలా జరుగుతుందని చెప్పి అతడిని గర్గ మహర్షి వద్దకు తీసుకువెళ్లగా అతడు రాజును కాళింది నదిలో ముంచగా పాప పరిహారం జరిగింది. ఆ తర్వాత రాజు ఆమెను ఆలింగనం చేసుకోగా ఈమె శరీరం చల్లగా తోచింది. వీరికో పుత్రుడు కూడా జన్మించాడు. – *శివపురాణం*

**కళింగ దత్తుడు :** చూ॥ ధర్మదత్తుడు.

**కళింగసేన :** చూ॥ మదన మంజుక.

**కళింగం :** దక్షిణ భారతదేశంలోని ప్రాచీన ప్రాంతం.

**కళింగుడు 1 :** కళింగ రాజైన రుతాయుడు ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. బలభద్రుడితో రుక్మి కళింగుని సహాయంతో పాచికలాడాడు. దీర్ఘ తమ

సుడను ముని ముసలివాడు, నపుంసకుడైన కళింగ రాజు భార్యను కూడి కక్షివాణుడికి జన్మనిచ్చాడు. – ఋగ్వేదం

**కళింగుడు 2 :** స్కందుని సైన్యంలో ఓ వీరుడు. – మహాభారతం

**కళింగుడు 3 :** కృతయుగంలో జీవించిన ఓ దైత్యుడు. ఇతడు స్వర్గాన్ని జయించి దిక్పాలకులను వెళ్లగొట్టి తన వారిని నియమించాడు. దేవి ఇతణ్ణి చివరికి వధించింది.

**కవచి :** ధృతరాష్ట్రుని కుమారుడు. కురుక్షేత్రంలో భీముని చేతిలో మరణించాడు. – మహాభారతం

**కవచుడు :** ఇంద్రుని కొలువులో ఓ ముని. పశ్చిమ ప్రాంతంలో ప్రభవించిన ఓ ముని. – మహాభారతం

**కవిరాజు :** ఇతని అసలు పేరు మాధవభట్టు. సంస్కృత కవి. ఇతడు 12వ శతాబ్దివాడు. ఇతని రచనలు రాఘవ పాండవీయం, పారిజాతహరణం.

**కవిషుడు :** పశ్చిమ భారతదేశం నుండి వనవాసం తర్వాత శ్రీరాముని దర్శించిన మునుల్లో ఒకడు. ఇతరులు వృశంగుడు, ధౌమ్య, రుద్రేయ, నారద, వానదేవ, సౌభరి, అష్టావక్ర, శుక, భృగు, లోమన, మౌద్గల్య. – ఉత్తర రామాయణం

**కవేరుడు :** ఓ రాజర్షి. ముక్తికోరి శివుని ప్రార్థించగా ముక్తినిచ్చేవాడు బ్రహ్మకనుక అతణ్ణి గూర్చి తపస్సు చేయమని శివుడు చెప్పగా అతడు బ్రహ్మను గూర్చి తపస్సు చేశాడు. బ్రహ్మ ప్రత్యక్షమై తన కూతురు విష్ణుమాయ నీ కూతురుగా జన్మించి ముక్తి ప్రసాది స్తుందని చెప్తాడు. ఆ తర్వాత కొన్నాళ్లకు ఇతడికి ఓ కూతురు జన్మించి ఆమె తపస్సు చేసి ఓ అంశ లోపా ముద్రగా మరో అంశ కావేరీ నదిగా మారుతుంది. కవేరుడు కావేరీ నదిలో స్నానం చేసి ముక్తి పొందు తాడు. – అగ్నిపురాణం

**కవ్వడి :** అర్జునుడి మరో పేరు. – చూ॥ అర్జునుడు

**కశేరకుడు :** ఓ యక్షుడు. కుబేరుడి సభలోవుండేవాడు. – మహాభారతం

**కశేరు :** త్వష్ట ప్రజాపతి కుమార్తె. ఈమెను 14 సంవత్స రాల వయసులో నరకాసురుడు ఎత్తుకు పోతాడు. నరకాసుర వధానంతరం ఈమెను శ్రీకృష్ణుడు పెళ్లాడతాడు. – మహాభారతం

**కశేరుమానుడు:** రాక్షసుడు. యవనుడు. శ్రీకృష్ణుడి తణ్ణి వధిస్తాడు. – మహాభారతం

★ **కశ్యప ప్రజాపతి (కశ్యపుడు) :** ప్రజాపతుల్లో ముఖ్యుడు. బ్రహ్మమానస పుత్రులు 6 గురు. వారు మరీచి, అంగిరస, అత్రి, పులస్త్య, ప్రజహ, క్రతులు. మరీచి పుత్రుడు కశ్యపుడు. ప్రపంచంలోని జీవరాశుల న్నింటికి ఇతడే మూలం. – మహాభారతం

అన్ని జీవరాశులు నాల్గుగోత్రాల నుండి జన్మించాయి. అవి అంగిరస, కశ్యప, భృగు, వశిష్ఠ గోత్రాలు. ఆ తర్వాతే వీటి నుండి అనేక గోత్రాలు ఆవిర్భవించాయి. – మహాభారతం

*కశ్యపుని భార్యలు :* ఇతనికి 21 మంది భార్యలు. అందులో 13 మంది దక్షుని కుమార్తెలు. మొదటి భార్య అదితికి 12 మంది పుత్రులు. వారిని ఆదిత్యు లంటారు. వీరి సంతతే దేవతలు. కశ్యపుని రెండవ భార్య దితి. వీరికి జన్మించిన వారు దైత్యులు. అందులో ముఖ్యులు హిరణ్యకశిప, హిరణ్యాక్ష, సింహి కలు. మరోభార్య దనువు ఆమె సంతతి వారు దానవులు. అందులో ముఖ్యులు ద్విమూర్ధ, శంబర, మహాబాహు, తారక, మహాబల, విప్రచిత్తిలు. తక్కిన దానవులంతా వీరి సంతతే. మరో భార్య సురభి, అజుడు, త్వష్ట, రుద్రుడు మరియు ఏకాదశ రుద్రులకు జన్మనివ్వగా, వినత గరుడుడికి కద్రువ నాగులకు జన్మనిచ్చింది. ప్రపంచంలోని జీవరాశులన్నీ ఏదో ఒక రకంగా కశ్యప సంతతే. – రామాయణం

*కశ్యపుని ఇతర జన్మలు :* చాక్షుష మన్వంతరంలో కశ్యపుడు సుతపుడుగా అదితి పృష్ణిగా జన్మించి 12 వేల సంవత్సరాలు విష్ణువును గూర్చి తపస్సు చేయగా అతడు ప్రత్యక్షమై వారి కుమారుడిగా జన్మిస్తా నని వరమిస్తాడు. వైవశ్వత మన్వంతరంలో అదితికి

★ వాల్మీకి రామాయణం కశ్యపుడు, మరీచి, పులస్త్య, అంగిరసుల తమ్ముడని పేర్కొంది. అంటే బ్రహ్మకు ఇతడు కుమారుడు లేక మనుమడు అనవచ్చు. పురాణాలలో ఈ విషయమై వైరుధ్యాలు ఉన్నాయి.

మహావిష్ణువు వామనుడుగా జన్మించాడు. కశ్యపుడు శాపఫలం వల్ల ద్వాపరయుగంలో గోకాపరి వసుదేవుడుగా అదితి దేవకిగా సురసరోహిణిగా జన్మించగా మహావిష్ణువు శ్రీకృష్ణుడిగా జన్మించాడు.

*ఇతర విశేషాలు :* అర్జునుడు జన్మించినపుడు ఇతడు రుషులతో ఆ స్థలాన్ని దర్శించాడు. ఇతడు బ్రహ్మ కొలువులో వుండేవాడు. ఒకసారి బ్రహ్మ భూమి సంతతిని ఇతనికి దానమిచ్చాడు. పరశురాముడు క్షత్రియులందర్నీ సంహరించి భూమిని కశ్యపునికి దానమివ్వగా కశ్యపుడు పరశురాముడిని వెడల గొట్టగా పరశురాముడు ఓ బాణాన్ని సముద్రంలోకి సంధించి అంతవరకు సముద్రుణ్ణి వెనక్కు పంపి అతడచ్చట నివసించాడు. అదే ఇప్పటి కేరళ. మహాభారత యుద్ధాన్ని ఆపమని ద్రోణుడికి సలహా ఇచ్చాడు. యదు వంశ వినాశానికి కశ్యపుడు కూడా ఇతర మహర్షులతో పాటు కారకుడే.

– *మహాభారతం, భాగవతం*

**కశ్యపుడు :** ఓ సర్పం. అర్జునుడు జన్మించినపుడు అచ్చటే వుంది.

**కశ్మీరం :** ఉత్తర భారతదేశంలోని ఒక ప్రాంతం. అర్జునుడు దీన్ని జయిస్తాడు. ధర్మజుని రాజసూయ యాగానికి ఈ దేశ ప్రజలు వచ్చి కానుకలర్పిస్తారు. శ్రీ కృష్ణుడొకసారి ఈ దేశపు రాజును జయిస్తాడు.

– *మహాభారతం*

**కస్తూరిగంధి :** వ్యాసుడి తల్లి సత్యవతి లేక మత్స్యగంధి. – *చూ॥ సత్యవతి.*

**కహోడుడు :** ఒక రుషి. ఉద్దాలకుడి శిష్యుడు. ఉద్దాలకుణ్ణి శ్వేతకేతువు అంటారు. అతని కూతురు సుజాతను కహోడుడికిచ్చి పెండ్లి చేస్తాడు. వారికి జన్మించినవాడే అష్టావక్రుడు. కహోడుడ్ని కహోడకుడు, ఖగోడకుడు, ఖగోదరుడు అనికూడా అంటారు.

**కహోలుడు :** ఇంద్ర సభలోని ఒక రుషి. – *మహాభారతం*

**కహ్వుడు :** కంసుని తమ్ముడు. – *భాగవతం*

**కంకణుడు :** స్కందదేవుని అనుచరుడు. – *మహాభారతం*

**కంకము :** ఓ పక్షి. సురస కుమారుడు. – *మహాభారతం*

**కంకుడు 1 :** వృష్ణి వంశంలోని అస్త్ర విద్యా నిపుణులైన ఏడుగురిలో ఒకడు. ఇతరులు కృతవర్మ, అనాధృష్టి. సమీక, సమితింజయ, శంకు మరియు కుంతి. – *మహాభారతం*

**కంకుడు 2 :** ప్రాచీన భారతావనిలో ఒక రాజు.

– *మహాభారతం*

**కంకుడు 3 :** అజ్ఞాతవాసం విరాటుని కొలువులో గడిపినప్పుడు ధర్మజుని పేరు. – *మహాభారతం*

**కంజల :** చూ॥ ధర్మశర్మ.

**కంటకిని :** స్కందదేవుని అనుచరుడు. – *మహాభారతం*

**కంటారి :** దక్షిణ భారతదేశంలోని ఓ పట్టణం. ఇది ఈనాటి పండితులు వేణా నదీతీరంలో ఉండేదని చెప్తున్నారు. దీనిని సహదేవుడు జయించాడు.

– *మహాభారతం*

**కంద :** సప్తర్షుల్ని సేవించే దాసి. ఈమె పశుసఖుడి భార్య.

**కందడు :** ఒక ముని. ఇతణ్ణి కంథుడు అని అంటారు.

**కందూతి :** స్కందదేవుని అనుచరుడు. – *మహాభారతం*

**కంతుడు :** చూ॥ మన్మథుడు.

**కంథుడు :** ఓ మహర్షి. ఇతడు గోమతీ తీరంలో తపస్సు చేస్తుండగా ఇంద్రుడు ఇతడి తపస్సును భగ్నం చేయడానికి ప్రమ్లోచనను పంపిస్తాడు. కొంతకాలం ఆమెతో సుఖించి తర్వాత తనపతనానికి తానే దుఃఖించి ఆమెపై కోపగిస్తాడు. ఆమె భయపడగా కంథుని వీర్యం ఆమె శరీరంపై చెమటలా వస్తుంది. ఆమె దాన్ని చెట్ల ఆకులతో తుడవగా అందుండి మారిష పుడుతుంది. – *విష్ణుపురాణం*

**కందరుడు :** స్కందదేవుని అనుచరుడు.

– *మహాభారతం*

**కందర్పుడు :** కామదేవుని మరోపేరు.

**కందుడు :** సంపాతి వంశజుడైన కంకుడి తమ్ముడు.

**కందళి :** ఔర్వుడి కూతురు. దుర్వాసుడికి సంసార సుఖం మీద ఆసక్తి కల్గినపుడు ఔర్వుడు ఈమెను దుర్వాసుడికిచ్చి వివాహం చేస్తాడు. కొంతకాలం సంసార సుఖం అనుభవించిన తర్వాత దుర్వాసుడు తపస్సుకేగగా ఓ బ్రాహ్మణ బాలుడు ఇది నీతికాదని జన్మజన్మలకు ఆమెయే నీ భార్య అని చెప్తాడు. ఈమె కూడా దుర్వాసునివలె కోపిష్ఠి. ఈమె సంతతే కదళీజాతి.

**కంపనుడు :** ఓ బలాఢ్యుడైన రాజు. యుధిష్ఠరుని కొలువులో వుండేవాడు. – *మహాభారతం*

**కంపనం :** ఇదొకనది. ఒక్కడ స్నానం చేస్తే పుండరీక యజ్ఞం చేసిన ప్రతిఫలం వస్తుంది. – *మహాభారతం*

**కంపుడు :** వృష్ణవంశపు రాజకుమారుడు. మరణానంతరం విశ్వదేవుడయ్యాడు. – మహాభారతం

**కంబళ :** కుదికుశ ద్వీపంలో ఓ భాగం. – మహాభారతం

**కంబరుడు :** గొప్ప తమిళ కవి. రాజాజ్ఞపై ఎందరో రామాయణం వ్రాయగా ఇతడి గ్రంథమే కంబ రామాయణంగా ప్రసిద్ధి చెందింది.

**కంబళుడు :** కశ్యప వంశంలోని ప్రసిద్ధి చెందిన సర్పం. దీని నివాసం ప్రయాగ తీర్థం.

**కంబుగ్రీవుడు :** మద్రదేశాధీశుడైన సుధాన్యుడి కొడుకు. సింహళరాజైన చంద్రసేనుడు తన కుమార్తె మందోదరిని ఇతనికిచ్చి వివాహం చేయదలచగా ఆమె అంగీకరించలేదు. – దేవీభాగవతం

**కంస :** ఉగ్రసేనుడి పెద్ద కుమార్తె. దేవి భగుడి భార్య. – భాగవతం

**కంసవతి :** ఉగ్రసేనుడి కూతురు. దేవశ్రవనుడి భార్య. – భాగవతం

**కంసాంతి :** కృష్ణుడి మరో పేరు. కంసుడ్ని చంపినందు వల్ల ఈ పేరు వచ్చింది. – భాగవతం

**కంసుడు :** మథురానగర రాజైన ఉగ్రసేనుడి కొడుకు. కాలనేమి పునర్జన్మ.

*జన్మవృత్తాంతం :* స్వాయంభువ మన్వంతరంలో మరీచికి, ఊర్ణ అనే భార్యకు ఆర్గురు బలవంతులైన పుత్రులు జన్మించారు. వారొకసారి కూతురైన సరస్వతి వివాహమాడినందుకు బ్రహ్మను ఎగతాళి చేయగా బ్రహ్మభూమిపై రాక్షసులుగా జన్మించమని శపించాడు. వారు కాలనేమి అనే రాక్షసికి జన్మించారు. ఆ తర్వాత జన్మలో హిరణ్య కశిపుడికి జన్మించారు. వారు సద్గురులై బ్రహ్మను గూర్చి తపస్సుచేసి వరాలు పొందగా హిరణ్యకశిపుడు అందుకు శపించాడు. వారు తండ్రిని శాపవిమోచనం కోరగా మీరు దేవకి గర్భాన జన్మిస్తారని మీ తండ్రి కంసుడిగా జన్మించి మిమ్మల్ని సంహరించినపుడు శాపవిమోచనం కల్గుతుందని చెప్పాడు. – దేవీ భాగవతం

*మధుర రాజ్య పాలకుడు :* ప్రాచీన కాలంలో మధు వనం అనే ప్రాంతం వుండేది. అచ్చట మధువనే రాక్షసుడు నివసించేవాడు. అతడి కుమారుడు లవణుడు. ఇతడు దేవతల్ని బాధిస్తుంటే దశరథుని కుమారుడు శత్రుఘ్నుడు అతణ్ణి సంహరించి మధుర అనే రాజ్యాన్ని స్థాపించాడు. ఆ తర్వాత శత్రుఘ్నుని కుమారులు దీన్ని పాలించారు. తర్వాతి కాలంలో సూర్యవంశానంతరం యాదవులు దీన్ని పాలించారు. యాదవులలో శూరసేనుడు ప్రసిద్ధుడు. అతని కుమారుడే కంసుని తండ్రి అయిన ఉగ్రసేనుడు.

*కంసుని వధ :* చూ॥ కృష్ణుడు.

కంసుడు జరాసంధుని కుమార్తెలైన అస్తి, ప్రాప్తిలను వివాహమాడాడు.

**కాకకర్ణుడు :** శిశునాగుడి కొడుకు. శిశునాగుడి తర్వాత కాకకర్ణుడు రాజ్యాన్ని పాలించాడు. ఆ తర్వాత ఇతని కుమారుడు క్షేమకర్ముడు ఈ రాజ్యాన్ని పాలించాడు.

**కాకం :** మహాభారత కాలంలోని ఒక పట్టణం. – మహాభారతం

**కాకాసురుడు :** ఇతడో రాక్షసుడు. మందాకినీ తీరంలో సీత నిద్రిస్తున్నపుడు ఆమె పమిటలాగి స్థనాల్ని గీరాడు. రాముడు బాణం వెయ్యగా అతడు క్షమించి రక్షించమని కోరగా తన బాణం అమోఘ మనీ ఏదో ఒక అంగాన్ని అయినా తొలగిస్తుం దనగా కాకాసురుడు తన నేత్రమునిచ్చి ఆ బాధ నుండి విముక్తి పొందాడు. – రామాయణం

**కాకి 1 :** మరీచి కొడుకైన కశ్యపునికి తామ్రం వల్ల జన్మించిన 8 మంది సంతానంలో ఒకటి. ఈ కాకి నుండే ప్రపంచంలో కాకులన్ని జన్మించాయి.

*కాకులు పాపానికి ప్రతీకలు :* కాశీరాజు కుమార్తె కళావతి. బాల్యంలోనే శైవపంచాక్షర మంత్రం నేర్చుకుంది. మధుర రాజైన దాశార్హుడిని వివాహం చేసుకుంది. కాని అతడు పాపి. ఈమె పవిత్ర స్త్రీ. ఆ పాపాలవల్ల తీవ్రమైన వేడివల్ల అతని భార్య సంసార

★ ఉగ్రసేనుని భార్య ఉద్యానవనంలో విహరిస్తుండగా ద్రమిళుడనే గంధర్వుడు ఉగ్రసేనుని రూపంలో బలత్కరించగా ఆమె గర్భిణి అయ్యింది. అది సహించని ఉగ్రసేనుని భార్య ద్రమిళుడిని నరకానికి వెళ్తావని శపించింది. అంతేకాక తనకు అతడివల్ల జన్మించిన కంసుడిని కూడా ఉగ్రసేనుడి వంశంలో జన్మించిన వాడిచేతిలో మరణిస్తావని శపించింది. అందుచేత కంసుడు ఉగ్రసేనుడు, కృష్ణులపై పగ బట్టాడు. అని భాగవతం పేర్కొంది.

సుఖం లేక అతణ్ణి గర్గ మహర్షి వద్దకు తీసుకువెళ్ళగా అతను ఒక పవిత్ర కొలనులో స్నానం చేయమన్నాడు. అలా స్నానం చేసినపుడు అతడు గత జన్మలలో చేసిన పాపాలన్నీ కాకుల రూపంలో ఎగిరిపోయాయి.

– *శివపురాణం*

మరుత్తుడనే రాజు మహేశ్వర సత్రయాగాన్ని చేయగా దేవతలైన ఇంద్రుడు, యముడు తదితర దిక్పాలకులు వస్తారు. ఇది తెలిసిన రావణుడిక్కడికి రాగా దేవతలు రకరకాల పక్షుల రూపంలో ఎగిరిపోతారు. యముడు కాకిగా మారతాడు. అందుకు కృతజ్ఞతగా యముడు పిండ ప్రదానంపై కాకులకే హక్కు అని ఆశీర్వదిస్తాడు.

– *ఉత్తర రామాయణం*

**కాకి 2 :** కాకుల మాతృమూర్తి.

**కాకి 3 :** సుబ్రహ్మణ్యస్వామి శిశువుగా వున్నపుడు పాలిచ్చి పెంచిన ఒక కాకి. తక్కిన వాటి పేర్లు హరిమ, బ్రహ్మిక, మాలిని, పలాల, ఆర్య మరియు మిత్రాదులు.

– *అగ్నిపురాణం*

**కాక్షివత్సుత :** కాక్షివానుడికి జన్మించిన గోష అనే కుమార్తె. ఈమెకు కుష్టు రోగం వుండటంవల్ల ఎవరూ పెండ్లాడలేదు. ఈమె అశ్వనీ దేవతలను గురించి మంత్రం రచించి ప్రార్థించగా ఆ వ్యాధి నయమయ్యింది. తర్వాత వివాహం జరిగింది. – *మహాభారతం*

**కాక్షివదాదులు :** సుదేష్ణదాది కూతురుకి, దీర్ఘతముడికి పుట్టిన సంతానాన్ని కాక్షివదాదులంటారు.

**కాక్షివానుడు :** మహర్షి గౌతముని కుమారుడు. ఈ గౌతముడు అహల్య భర్త గౌతముడు కాదు. గౌతముడు గిరివ్రజంలో వున్నపుడు వుసినార ప్రాంత వనితతో సంబంధంవల్ల కాక్షివానుడు జన్మించాడు. ఇతడు ధర్మజుని కొలువులో వుండేవాడు. ఇతనికి చండకౌశికుడను కుమారుడు, భద్ర, గోష అనే కుమార్తెలు జన్మించారు. – *మహాభారతం*

**కాటకము :** ఒకప్పుడు మహాకాటకం సంభవించగా ఆహారం దొరక్క సప్తర్షులు, అరుంధతి మొదలైన వారంతా అడవిని గాలించారు. ఒక ప్రదేశంలో నీలుడనేవాడి శవం చితిపై కన్పిస్తే దాన్ని తినబోతారు. వృషాదర్భి నేను మీకు సంపదలనిస్తానన్నా మేము ప్రతిగ్రహం చేయమంటారు. రాజు ఇంటికి వెళ్లి కృత్రిమ ఫలాలతో హిరణ్యాన్ని పెట్టి తన మంత్రులతో పంపిస్తాడు. దానిని వాళ్లు స్వీకరించరు. రాజు కోపించి 'కృతి'ని సృజించి పంపిస్తాడు. వీళ్లు ఆహారంకోసం ఒక చెరువులోని తామర తూడుల కోసం వెళ్లబోగా కృత్తి అడ్డుకొని అవి నావంటుంది. వీరితోపాటున్న శునస్సఖుడు కృత్తిని మంత్రులను సంహరించి వీళ్ల అప్రతిగ్రహానికి మెచ్చుకొని శునస్స ఖుడి రూపంలోని ఇంద్రుడు వీరిని దేవలోకం తీసుకు వెళ్తాడు. – *మహాభారతం*

**కాణభూతి :** ఇతడొక పిశాచి. ఇంతకు ముందు ఇతని పేరు సుప్రతీకుడు. గుణనిధికి బృహత్కథ చెప్పిన తర్వాత నిజరూపుడౌతాడు. –*చూ॥ గుణాఢ్యుడు.*

**కాణ్వశిరసులు :** వీరు ఓ కులంవారు. మొదట క్షత్రియులే. వీరికున్న బ్రాహ్మణ ద్వేషంవల్ల వీరు తక్కువ కులంలో జేర్చబడ్డారు. – *మహాభారతం*

**కాణాచి :** ఒక యక్షుడు. కుబేరుడి సేవకుడు. ఇతడో రాక్షసుడితో స్నేహం చేసినందుకు కోపించి వింధ్యాటవిలో తిరుగుతుండమని శపిస్తాడు. శాపవిమోచనం కొరకు వేడుకోగా పుష్పవంతుడి వల్ల విన్న కథను మాల్యవంతునికి చెపితే శాప విమోచనం కల్గుతుందంటాడు. – *కథాసరిత్సాగరం.*

**కాత్యాయని :** యాజ్ఞవల్క్యుడి భార్య.

– *బృహదారణ్యా కోపనిషత్తు*

**కాత్యాయనుడు 1 :** విశ్వామిత్రుడి వంశంవాడు.

**కాత్యాయనుడు 2 :** ఇంద్ర సభలో గొప్ప రుషి

– *మహాభారతం*

**కాత్యాయనుడు 3 :** మహాపండితుడు. పాణిని అష్టాధ్యాయికి వాఖ్యానం వ్రాసినవాడు. శ్రౌత సూత్రాలను, ధర్మశాస్త్ర గ్రంధాలను రచించాడు.

**కాత్యాయనుడు 4 :** వరరుచి మరోపేరు.

– *కథాసరిత్సాగరం*

**కాత్యాయనుడు 5 :** గోభిలుడి కొడుకు.

**కాదంబరి 1 :** చిత్రరథుడను గంధర్వరాజు కుమార్తె. ఈమె సఖి మహాశ్వేత వివాహము చేసుకొనునని వ్రతము బూని యుండుటచే తనూ వివాహము చేసుకొనునని భీష్మించెను. తల్లిదండ్రుల మాటను కూడ

ఈ విషయమున లెక్కచేయకుండెడిది. ఒకనాడు తారాపీడుని కుమారుడైన చంద్రపీడుడు మహాశ్వేత ఆతిధ్యము పొందగా ఆమె ఇతనిని కాదంబరి వద్దకు తీసుకొనిపోయెను. అతడిని చూచిన తర్వాత ఈమె మనసు చంచలమయ్యెను. చంద్రపీడుడు తన నిజ గృహమునకు బోయిన తర్వాత ఈమె అతనిని వెదుకుచూ పోగా మార్గ మధ్యమున చంద్రపీడుడు మృతుడై యుండుట జూచి ఈమెయు ఆత్మహత్య చేసుకొన బోగా ఆకాశవాణి అతడు జీవించుననియు ఆత్మహత్య చేసుకొనవలదని చెప్పగా అట్లే జరిగి ఆమె అతనిని వివాహమాడెను. – *కథాసరిత్సాగరం*

**కాదంబరి 2 :** బాణుడు రాసిన గ్రంథం పేరు. ఇందలి నాయిక పేరు కాదంబరి.

**కాదంబరి 3 :** జంబూ ద్వీపంలోని ఒక నది. కదంబ వృక్షం మొదలు దీని మూలంలో వుంది. – *భాగవతం*

**కానీనుడు :** వివాహిత కాని స్త్రీకి పుట్టిన బిడ్డను కానీనుడంటారు. వ్యాసుడు, కర్ణుడు, శిబి, అష్టక, ప్రతీర్ధనుడు, వసుమానుడు కానీనులు.

**కామక :** పృథశ్రవసుడి కుమార్తె. అయుతానీకుడి భార్య. అక్రోదనుడికి తల్లి. – *మహాభారతం*

**కాపవ్యుడు :** ఒక బోయవాడు. అస్త్రవిద్యయందు నిపుణుడు. అతని చుట్టుప్రక్కల ప్రాంత దస్యులు అతనిని ప్రభువై మమ్ములను పాలించుమని కోరిరి. ఇతడు చెప్పిన మార్గముననే వారు నివసించిరి. – *మహాభారతం*

**కాపాలికం :** ఇదో మతం. ఇది ఈశ్వరుడికి జగత్తుకి భేదాభేదాల్ని ప్రతిపాదిస్తుంది. వీరు శ్మశానవాసం, నరకపాల భోజనం చేస్తారు.

**కాపి :** ఓ నది పేరు. – *మహాభారతం*

**కాపిలశాస్త్రం :** కపిలుడు ఉద్భోదించిన శాస్త్రం. తన తల్లి దేవహుతికి దీన్ని మొదట వివరించాడు. – *దేవీ భాగవతం*

**కాపిలేయుడు :** విశ్వామిత్రుని కుమారుడు. శునశ్శేపుడిని మరణం నుంచి రక్షించిన తర్వాత తన తొడపై కూర్చో బెట్టుకోగా అతని తండ్రి అజిగర్తుడు తన బిడ్డను తనకివ్వమని కోరగా కాపిలేయుడు, బాభ్రవ్యుడులాగే ఇతడు కూడా నా బిడ్డేనని చెప్తాడు కనుక కాపిలేయుడు. – *మహాభారతం*

**కాపిలం :** కుశద్వీపం యొక్క ఏడు భాగాలలో చివరిది. – *మహాభారతం*

**కాపోతుడు :** ఇతడో ముని. కకుత్సత తనయ చిత్రాంగధ ఇతని భార్య. ఇతనికి ఇద్దరు కుమారులు. తుంబురుడు, సువర్చసుడు. ఒకసారి ఇతడు కుబేరుడి వద్ద నుండి గొప్ప సంపద తెచ్చి తన కుమారుల కిచ్చాడు. చంద్రశేఖరుని భార్య తారావతిని కోతి ముఖాలతో వుండే ఇద్దరు పుత్రులకు జన్మనిస్తావని శపిస్తాడు. – *కలికపురాణం*

**కామచరి :** స్కందదేవుని అనుచరిణి. – *మహాభారతం*

**కామతీర్థం :** ఇదో పుణ్యస్థలి. ఇక్కడ స్నానంచేస్తే అన్ని కోర్కెలు తీరతాయని భావించబడింది. – *మహాభారతం*

**కామథం :** స్కందదేవుని మరో అనుచరిణి. – *మహాభారతం*

**కామథుడు 1 :** కాంభోజ రాజ్యానికి రాజు. యుధిష్ఠురుని కొలువులో సభ్యుడు. – *మహాభారతం*

**కామథుడు 2 :** ఓ గొప్పముని. తపశ్శక్తితో జ్ఞానో దయం పొందినవాడు. – *మహాభారతం*

**కామధేనువు (సురభి–నందిని) :** గోవులకు మాతృమూర్తి. ఈమె ఓ దేవత. దేవతలు, మహర్షులు ఎప్పుడు పాలు కావాలన్నా ప్రసాదించే దేవత. ప్రపంచంలోని గోవులన్ని దీనినుండే జన్మించాయని అన్ని పురాణాలు చెప్తున్నాయి.

**కామందకం :** రాజనీతి గురించి చెప్పే గ్రంథం.

**కామందకుడు :** ప్రాచీన కాలంలో ఓ గొప్ప రుషి. అంగిరసుడను రాజుకు రాజధర్మం బోధించిన వాడు. – *మహాభారతం*

**కామపాలుడు :** శ్రీకృష్ణునిపై ఆధారపడిన ఓ యాదవుడు. – *భాగవతం*

**కామరూపం :** ఆర్యావర్తానికి ఆగ్నేయ దిక్కున గల ఓ దేశం.

**కామాక్షి :** కాంచీపురంలోని దేవత పేరు.

**కామ్య :** ఓ దేవతాస్త్రీ. అర్జునుని జన్మదినోత్సవంలో పాల్గొంది. – *మహాభారతం*

**కామ్యకవనం :** పాండవుల వనవాసంలో ఇక్కడే ఎక్కువ కాలం గడిపారు. ఇక్కడ ఎంతోమంది మునులు తపమాచరించారు. పాండవులను వెదకుచూ విదురు

డిక్కడే వారిని కలిశాడు. తర్వాత సంజయుడు వచ్చి విదురుణ్ణి హస్తినకు తీసుకువెళ్లాడు. ఈ వనంలోనే పాండవులు మార్కండేయ, నారద మునుల్ని కలిశారు. - మహాభారతం

**కాముడు 1 :** సౌందర్యాధిదేవత. - చూ॥ మన్మథుడు

**కాముడు 2 :** స్వాహాదేవి పుత్రుడు. ఓ అగ్ని దేవుడు. సుందరాకారుడు. - మహాభారతం

**కాముడు 3 :** పరమశివుని మరోపేరు. - మహాభారతం

**కాముడు 4 :** మహావిష్ణువు మరో పేరు. - మహాభారతం

**కాముడు 5 :** ఓ గొప్ప రుషి. - మహాభారతం

**కామోద :** క్షీరసాగర మథనంలో వెలువడిన దేవత. - చూ॥ విహంథ

**కాయవ్యుడు :** ఇతడో చండాలుడు. క్షత్రియునికి చండాల కన్యవల్ల జన్మించినవాడు. చండాలులు ఇతని నీతి నిబద్ధతలకు మెచ్చి ఆ గ్రామానికి పెద్దగా ఎన్నుకున్నారు. ఇతడు బ్రాహ్మణులను గౌరవిం చాలని మనదేశాన్ని మనం ప్రేమించాలని చెప్పాడు. దేశాన్ని కొల్లగొట్టి సంపాదనులయ్యే వారిని చనిపోయిన శవంమీద పడి బతికే జీవులుగా పరిగణించాడు. - మహాభారతం

**కాయశోధన తీర్థం :** కురుక్షేత్రంలో ఇదో పుణ్యస్థలం. ఇక్కడ స్నానం చేస్తే శరీరం శుద్ధి చెందుతుంది. - మహాభారతం

**కారంధమనం :** దక్షిణ సముద్రతీరంలోని ఓ పుణ్యతీర్థం. దక్షిణ సముద్రతీరంలో గల 5 పుణ్య తీర్థాలు. ఇవి అగస్త్య తీర్థం, సౌభద్రతీర్థం, పౌలోమ తీర్థం, కారంధమన తీర్థం, భరద్వాజ తీర్థం. అర్జునుడు అతని తీర్థయాత్రలలో వీటిని దర్శించి మునిశాపం వల్ల మొసళ్లుగా మారిన దేవకన్యలకు శాపవిమోచనం కల్గించాడు. అంతకుముందు మునులు ఈ తీర్థాన్ని దర్శించేవారు కాదు. - మహాభారతం

**కారపర్వణ :** సర్వతీ నదీ లోయలోని ఓ పుణ్యస్థలం. - మహాభారతం

**కారస్కరం :** చారిత్రకత కందని ప్రాచీన భారతదేశంలో ఓ చిన్న రాజ్యం. - మహాభారతం

**కార్కి :** ఆపస్తంబ మహర్షి, అక్షసూత్రలకు జన్మించిన కుమారుడు.

**కార్ష్ణి :** దేవగాంధర్వుడు. అర్జునుని జన్మదినోత్సవ వేడుకల్లో పాల్గొన్నాడు. - మహాభారతం

**కారీషుడు :** విశ్వామిత్రుని కుమారుడు. - మహాభారతం

**కారూశుడు :** వైవశ్వతమనువు ఆరవ కుమారుడు. - మహాభారతం

**కారూశం 1 :** ప్రాచీన ప్రాంతం. ఈ దేశపు రాజు దొంగలను, దోపిడి దారుల్ని అణచివేశాడు. ఇతడు ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. - మహాభారతం

**కారూశం 2 :** ఇప్పటి బుందేల్కండ్ ప్రాంతాన్ని కారూశం అనేవారు. ఇంద్రుని బ్రహ్మహత్యా పాత కాన్ని బ్రాహ్మణులు ఇక్కడ కడిగారని చెప్తారు. ఇంద్రుడు గోవు పేడ ఇక్కడ వదలాడని అందుకని ఈ పేరు వచ్చిందంటారు.

**కార్తవీర్యార్జునుడు :** హేహయ రాజుల్లో ప్రముఖుడు. ఏకవీరుని వంశవృక్షంలో కృతవీర్యుని కుమారుడు.
*హేహయభార్గవ వంశాలు :* హేహయులు క్షత్రియులు కాగా భార్గవులు బ్రాహ్మణులు. హేహయ రాజులు దాన ధర్మాలతో సంపద పోగొట్టుకోగా భార్గవులు ఆ సంపదను దాచుకున్నారు. హేహయుల సంపద తరిగిపోవడంతో భార్గవుల్ని ధనం కోరగా వారు నిరాక రించగా హేయులు వారిపై దాడి చేయగా భార్గవులు హిమాలయాలకు పారిపోయారు. భార్గవుల వంశంలో ఔర్యుడను శక్తివంతుడైన రుషి జన్మించాడు. అప్పటి నుండి హేహయులు కొంత పట్టు సడలించారు. చాలా కాలం తర్వాత హేహయ వంశంలో కార్తవీర్యార్జు నుడను బలవంతుడైన రాజు, భార్గవ వంశంలో మునిశ్రేష్ఠుడైన జమదగ్ని జన్మించారు. అప్పటి వరకు రెండు వంశాల మధ్య విభేదాలు కొనసాగుతున్నాయి. కార్తవీర్యార్జునుడు నర్మదానదీ తీరంలో మహిష్మతి నగరాన్ని నిర్మించి రాజ్యపాలన చేశాడు.
*కార్తవీర్యార్జునుని జైత్రయాత్ర :* నారదుని సలహాపై తన గురువైన దత్తాత్రేయుడి నిర్వహణలో భద్రదీప ప్రతిష్ఠ యాగం చేశాడు. దత్తాత్రేయుడు వరం కోరు కొమ్మనగా చాలా వరాలు కోరుతూ వాటితో పాటు

1000 చేతులు కావాలని కోరి వరసిద్ధి పొందాడు. రావణుడొకసారి తన జైత్రయాత్ర ముగించుకొని వస్తూ నర్మదా నదిలో స్నానం చేస్తుండగా కార్త వీర్యార్జునుడు ఆ నదిపై భాగంలో వినోద క్రీడలో భాగంగా తన చేతులతో నదీ ప్రవాహాన్ని ఆపాడు. రావణుడు తన సేవకుల్ని పంపి కారణం తెలుసుకొని తన సైన్యంతో కార్తవీర్యార్జునునిపై యుద్ధం చేయగా కార్తవీర్యార్జునుడు రావణుడ్ని బందీని చేసి పులస్త్యుని సలహాపై వదలివేశాడు. అప్పటి నుండి వీరు మిత్రు లయ్యారు. – ఉత్తర రామాయణం

ప్రపంచంలోని రాజులందరూ కార్తవీర్యార్జునుని అధిపత్యం అంగీకరించారు. సూర్య వంశపు రాజుల్ని ఓడించాడు. బంగారు రథంలో ఇతడు దేవతల్ని, యక్షుల్ని, రుషుల్ని ఓడించడానికి వెళ్లాడు. విష్ణువుని కూడా ధిక్కరించాడు. ఇంద్రాణిముందే ఇంద్రుడ్ని పరాభవించాడు. – మహాభారతం

కార్తవీర్యార్జునుని పతనం–మరణం : దత్తాత్రేయుడి నుండి వరం పొంది గర్వాంధుడై వస్తుండగా ఆకాశ వాణి 'క్షత్రియులకంటే బ్రాహ్మణులు ఉన్నతులు' అని చెప్పగా అది వాయుదేవుని మాటగాఎంచి కాదు బ్రాహ్మణులకంటే క్షత్రియులే గొప్పవారని వాదిం చాడు. ఒకసారి అగ్నిదేవుడు ఆహారం కొరకు కార్త వీర్యుడ్ని అర్థించగా ఈ భూ ప్రపంచంలో దేనినైనా స్వీకరించమని అభయమివ్వగా అగ్ని తనకు అడ్డు వచ్చిన వాటిని ఆహుతి చేస్తూ ఆపవుడను రుషి ఆశ్రమాన్ని దగ్ధం చేయబోగా అతడు దీనికి కారణం కార్తవీర్యార్జునుడని తెలిసి పరశురాముడి చేతిలో వధించబడతావని శపిస్తాడు.

ఒకసారి జమదగ్ని భార్య నీళ్లకు వెళ్లి కార్యవీర్యా ర్జునుడు ఆ నీటిని కలుషితం చేస్తుండటం వల్ల సరి యైన చోటు నుండి నీరు తేగా ఆలస్యాన్ని భరించలేని జమదగ్ని తన భార్యను వధించమని తన కుమారు లను కోరగా పరశురాముడు తండ్రి కోర్కెను తీర్చాడు. కార్తవీర్యార్జునుడు తన విజయాలకు తానే మురిసి పోతూ సముద్రుణ్ణి తనతో పోరాడమనగా జమదగ్ని కుమారుడు పరశురాముడే నీతో యుద్ధం చేయగల డని చెప్తాడు. – మహాభారతం

ఒకసారి కార్తవీర్యార్జునుడు వేటకు వెళ్లి జమదగ్ని ఆశ్రమానికి వెళ్లగా జమదగ్ని ఇతడికి షడ్రశోపేతమైన భోజనం పెడతాడు. దానికి కారణం కామధేనువు సోదరి సుశీల అని గ్రహించి దాన్ని బంధించబోగా అది ఆకాశానికి ఎగిరిపోగా కార్తవీర్యార్జునుడు జమదగ్నిని సంహరిస్తాడు. పరశురాముడు ఆశ్రమా నికి తిరిగిరాగా రేణుక తన భర్త మరణానికి 21 సార్లు గుండె బాదుకొనగా పరశురాముడు 21 సార్లు క్షత్రియులపై దండెత్తి సంహరిస్తానని ప్రతిజ్ఞ చేస్తాడు. శుక్ర మహర్షి సుశీలతో వచ్చి జమదగ్నిని తిరిగి బ్రతికిస్తాడు.

పరశురాముడు మహిష్మతి నగర ద్వారం వద్ద నిలబడి కార్తవీర్యార్జునుడ్ని యుద్ధానికి ఆహ్వానించి తన పరశువుతో 1000 చేతులు నరికి కార్తవీర్యార్జునుని సంహరించడమే కాక అతని సంతానాన్ని మొత్తం సంహరిస్తాడు. – బ్రహ్మాండ పురాణం

**కార్తస్వరుడు :** ఒక రాక్షసుడు. ఇతడొకసారి ప్రపంచాన్ని జయిస్తాడు.

**కార్పాసిక :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజ్యం. ధర్మజుని రాజసూయ యాగంలో ఈ దేశపు కన్యలు సేవలు చేస్తారు. – మహాభారతం

**కార్మొలను :** గోదావరి తీరాన ఉండే పట్టణం. ఇక్కడ వుండే శివుడికి కర్కోటకేశ్వరుడని పేరు.

**కార్కోటకం :** తూర్పు సముద్రపు అవతలి ప్రాంతం. సీతోదా నదికి ఎంతో దూరంలో లేదు. ఉదయ పర్వ తాలు అడ్డుగా వున్నాయి. – కథాసరిత్సాగరం

**కాలక (కాలిక) :** దక్షుని కూతురు. కశ్యపుని భార్య. వీరికి జన్మించిన వారే నరకాసురుడు, కాలకేయుడు. ఈమె బ్రహ్మను గూర్చి తపస్సు చేసి తన కుమారులకు మృత్యువు లేకుండా వరం కోరింది. – మహాభారతం

**కాలకక్షుడు :** స్కందదేవుని సైన్యంలో ఒక వీరుడు. – మహాభారతం

**కాలకన్య :** యముని కుమార్తె. – చూ॥ పురంజన

**కాలకలి :** విరోచనుని కుమారుడు. బలికంటె పెద్దవాడు. ఇతడు దేవతలకు భయపడి కపిత్థ వృక్షమయ్యెను. ఆ చెట్లకాయలు, పండ్లు దుర్గంధముగనుండుటచే పశువులకు రోగములు వచ్చుచుండెను. వానిని నివా

రించుటకు నందాదులు శివుని ప్రార్థించగా అతడు శంఖకర్ణుడను వానిని పంపెను. నందాదులు రామ కృష్ణులే ఆ వృక్షమును కొట్టివేయవలెనని వారిచేతనే నరికించిరి. - హరివంశం

**కాలకవృక్షీయుడు :** ప్రాచీన కాలంలో ఓ సాధువు. కోసల దేశ రాజైన క్షేమదర్శనుడి స్నేహితుడు. అతని మంత్రులు అనుచరుల వల్ల ప్రజలు విపరీతమైన బాధలు పడేవారు. ఆ సమయంలో కాకిని ఓ పంజ రంలో వుంచుకొని దేశమంతా పర్యటించి రాజువద్దకు వచ్చి ఈ కాకి తాను చూసిన ప్రజల కష్టాలు, నీ మంత్రులు సేవకులు పెడుతున్న బాధలు చెప్పగలదని చెప్తాడు. అది విన్న మంత్రి ఆ పంజరంలోని కాకిని చంపుతాడు. అప్పుడు కాలక వృక్షీయుడు రాజుకు దీన్ని విశదపరచగా మోసగాళ్లైన మంత్రులను శిక్షించి పరిపాలన సవ్యంగా చేస్తాడు. ఇతడు దృపదుడిని, క్షేమ దర్శినుడ్ని సంధిచేసుకొమ్మని సలహా ఇస్తాడు. ఇతడు ఇంద్రుని సభలో కూడా రాణిస్తాడు. - మహాభారతం

**కాలకాక్షుడు 1 :** స్కంద దేవుని సైన్యంలో ఓ వీరుడు.

**కాలకాక్షుడు 2 :** ఇతడో రాక్షసుడు. గరుడుడు ఇతణ్ణి సంహరిస్తాడు. - మహాభారతం

**కాలకాముఖుడు :** ఇతడో రాక్షసుడు. రావణుని మంత్రి అయిన ప్రహస్తుని సోదరుడు. శ్రీరాముని అరణ్యవాస సమయంలో ఖర, దూషణులతో పాటు ఇతడు వున్నాడు. - రామాయణం

**కాలకాముఖులు :** మానవులకు, రాక్షసులకు జన్మించిన జాతి. దక్షిణాదిని సహదేవుడు జయించినపుడు వీరిని జయించాడు. - మహాభారతం

**కాలకంఠుడు :** చూ॥ శివుడు.

**కాలకీర్తి :** ఓ క్షత్రియరాజు. మయూరుడను అసురుని సోదరుడైన సుపర్ణుని అంగాన్నుండి ఉద్భవించాడు. - మహాభారతం

**కాలకుడు :** కశ్యపుని వల్ల కాలికకు జన్మించిన రాక్షసుడు. - రామాయణం

**కాలకూటం :** క్షీరసాగర మధనంలో వెలువడిన క్రూర విషం. శివుడు దీన్నిమింగి తన కంఠంలో బంధించాడు. అందుకే ఇతణ్ణి నీలకంఠుడు అని అంటారు. అది ప్రపంచాన్ని మొత్తం ధ్వంసం చేసే శక్తివంతమైనది. బ్రహ్మకోరికపై శివుడు దీనిని మింగాడు. - మహాభారతం

**కాలకేతుడు :** కశ్యపుని వల్ల ధనువుకు జన్మించిన అసుర చక్రవర్తి. ఇతడొకసారి ఏకవీరుని భార్య ఏకావలిని అపహరించి పాతాళంలోకి వెళ్ళగా ఏకవీరుడు పాతాళం వెళ్లి ఇతడితో యుద్ధం చేసి ఏకావలిని తీసుకువస్తాడు. - చూ॥ ఏకవీరుడు

**కాలకేయులు :** కశ్యప ప్రజాపతికి, కాల (కాలిక)కు జన్మించిన 60,000 మంది రాక్షసుల్ని కాలకేయు లంటారు. వీరు కొంతకాలం వృతాసురుడి నాయ కత్వంలో, మరికొన్నిసార్లు అసురుల నాయకత్వంలో పోరాడారు. వీరు బ్రాహ్మణ ద్వేషులు. రాత్రి సమ యంలో ఆశ్రమాలపై దాడిచేసి బ్రాహ్మణులను బాధించటం చంపటం చేసేవారు. వీరి ఆగడాలను భరించలేక బ్రాహ్మణులు అగస్త్యునికి విన్నవించు కోగా అగస్త్యుడు వీరిపై దాడిచేయగా కాలకేయులు సము ద్రంలో దాక్కున్నారు. అప్పుడు అగస్త్యుడు సముద్ర నీటిని మొత్తం తాగాడు. అప్పుడు కొందరు పాతా ళంలో దాక్కున్నారు.

*అర్జునుడు-కాలకేయులు :* కాలకేయులు హిరణ్య పురంలో వుండేవారు. అది దేవలోకానికి దగ్గర. వీరు విరాటకవచులను రాక్షసులతో కలసి దేవ లోకంపై దాడిచేయగా ఇంద్రుడు అర్జునుణ్ని కోరాడు. అర్జు నుడు వీరిపై దండెత్తగా చాలామంది విరాటకవచులు, కార్తికేయులు ఆ యుద్ధంలో మరణించారు. - మహాభారతం

**కాలకోటి :** నైమిశారణ్యంలోని ఓ పుణ్యస్థలం. - మహాభారతం

**కాలకౌక్షేయుడు :** కోసల రాజైన క్షేమదర్శి యొక్క మంత్రి. రాజధర్మాలు బాగా తెలిసినవాడు.

**కాలకౌశికుడు :** కౌశీ పట్టణంలోని ఓ బ్రాహ్మణుడు. విశ్వామిత్రుడి ప్రేరణతో హరిశ్చంద్రుడి భార్య చంద్ర మతితో పనులు చేయించుకొని చాలా బాధపెడతాడు. - మార్కండేయ పురాణం

**కాలఘటుడు :** వేదాలలో పాండిత్యమున్న బ్రాహ్మణ పండితుడు. జనమేజయుని సర్పయాగంలో పాల్గొన్నాడు.
– మహాభారతం

**కాలజ్ఞులు :** చూ॥ కాలకేయులు.

**కాలతీర్థం :** అయోధ్యలోని ఓ పుణ్యస్థలం. ఇక్కడ స్నానం చేస్తే 11 గోవుల్ని దానంచేసిన ప్రతిఫలం దక్కుతుంది.
– మహాభారతం

**కాలతోయకం :** ప్రాచీన భారత దేశంలోని ఒక పట్టణ ప్రాంతం. – మహాభారతం

**కాలదం :** ప్రాచీన భారతదేశంలోని ఒక పట్టణ ప్రాంతం.
– మహాభారతం

**కాలదంతకం :** వాసుకి వంశంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణిస్తుంది.
– మహాభారతం

**కాలద్విజం :** ఓ సర్పం. మోక్షం పొందింది. కరవీర పురంలో ఒక స్వార్థపరుడైన శూద్రుడు కలడు. యము డితణ్ణి 4 మన్వంతరాలు నరకంలో జీవించమని శపిస్తాడు. ఆ తర్వాత సర్పంగా జన్మించి రాళ్లు, రప్పలలో జీవించి ఓ సంపూర్ణ పౌర్ణమినాడు ఎండిన వడ్లగింజలు, రాచిప్పలు విసరగా అవి విష్ణువు పాదాలపై పడినాయి. విష్ణువు అతడికి మోక్షమిస్తాడు. అతడు మరణించిన తర్వాత విష్ణువు యొక్క అను చరులు రథంలో ఇతణ్ణి విష్ణులోకం తీసుకొస్తారు.
– పద్మపురాణం

**కాలనాభుడు :** ఇతడి మరోపేరు తారకుడు హిరణ్యాక్షుడి కొడుకు దితి వంశజుడు.

**కాలనిర్ణయం :** చూ॥ కాలమానం

**కాలనేమి 1 :** ఓ గొప్ప రాక్షసుడు. ఇతడే తర్వాత ఉగ్రసేనుని కుమారుడైన కంసుడిగా జన్మించాడు.
– చూ॥ కంసుడు

**కాలనేమి 2 :** ఇతడు మాళవ దేశపు బ్రాహ్మణుడు. ఇతని తండ్రి యజ్ఞసేనుడు – కథాసరిత్సాగరం

**కాలపథుడు :** విశ్వామిత్రుని కుమారుడు. తత్వశాస్త్ర పండితుడు. బ్రహ్మవాది. – మహాభారతం

**కాలపర్వతం 1 :** లంకకు దగ్గరలో వున్న సముద్రపు ఒడ్డున గల పర్వతం. – మహాభారతం

**కాలపర్వతం 2 :** శివుని దర్శనార్థం శ్రీకృష్ణునితో పాటు అర్జునుడు ప్రయాణించినప్పుడు చూసిన పర్వతం.
– మహాభారతం

**కాలపృష్ఠం :** ఇదో సర్పం. శివుడు త్రిపురాసురులను వధించినపుడు తన రథాలకు పూన్చిన గుర్రాల వెంట్రుకలను దీనితోనే రథాలకు ముడివేశాడు.
– మహాభారతం

**కాలబంధకుడు :** మహిషాసురుని సలహాదారుడు. మరోఇద్దరు సలహాదారులు బాస్కలుడు, త్రినేత్రుడు.
– దేవీభాగవతం

**కాలబ్రాహ్మణుడు :** కాలాన్ని జయించిన బ్రాహ్మణుడు. 200 సంవత్సరాలు జపం చేసి తన మంత్రశక్తితో ఆకాశమార్గాన ప్రయాణించే వారిని అడ్డుకున్నాడు. మూడు లోకాలకు తన శక్తిని విస్తరించాడు. బ్రహ్మ వరం కోరుకొమ్మంటే నిరాకరించి అతడు దేవుణ్ణి గురించి జపం తప్ప వేరే కోరిక లేదన్నాడు. మరల బ్రహ్మవరం కోరుకొమ్మనగా నిరాకరించి హిమాల యాలకు వెళ్లి మంత్రోచ్చారణతో జీవించాడు. ఇంద్రుడు అప్సరసలను పంపినా, యముణ్ణి పంపినా ఫలితం లేకపోయింది. చివరకు ఇక్ష్వాకుడు ఈ బ్రాహ్మణుడ్ని అతని శక్తిలో సగం తనకు ఇవ్వమని కోరగా వెంటనే అనుగ్రహించాడు. అప్పుడు ఇక్ష్వా కుడు ప్రపంచమంతా ప్రసిద్ధి చెందాడు. – కథాసరిత్సాగరం

**కాలభైరవుడు :** శివుని వలన జన్మించిన మూర్తి. బ్రహ్మ తన పంచమ శిరముతో శివుని తూలనాడగా ఇతడు పుట్టి బ్రహ్మ పంచమ శిరమును ఖండించెను. ఆ కపాలమితని చేతికి అంటుకొని వచ్చినదికాదు. శివుని కోరగా విష్ణువును దర్శించమని చెప్పెను. అతడు విష్ణువుని దర్శించగా తన భ్రూమధ్య భాగమును పొడిచి రక్తమును కపాలములోనికి పట్టమని చెప్పెను. ఒక సంవత్సరమట్లు గడిచినను ఆ కపాలము ఊడి రాలేదు. విష్ణువప్పుడు దానిని కాశికిబోయి పాతి పెట్ట మని చెప్పెను. ఆ కపాలము పాతిన స్థలమే కపాల మోచన తీర్థమయ్యెను. – చూ॥ కపాలమోచన తీర్థం దక్షయజ్ఞమును ధ్వంసము చేయునపుడు కూడా ఇతడు శివుని వెంటనుండెను. – శివపురాణం

★ **కాలమానం :** ప్రాచీన కాలంలో కాలాన్ని కొలిచే విధానమే కాలమానం. అది ఈ క్రింది విధంగా వివరించబడింది.

సూదితో ఆకుగుచ్చుకొనే కాలం – అల్పకాలం
30 అల్పకాలాలు – 1 తృథి
30 తృథులు – 1 కాలం
30 కాలాలు – 1 కాష్టం
30 కాష్టాలు – 1 నిమిష (మాత్రం)
4 నిమిషాలు – 1 గణితం
10 గణితాలు – 1 నిట్టూర్పు
6 నిట్టూర్పులు – 1 వినాఝకం
6 వినాఝకాలు – 1 ఘటికం
60 ఘటికాలు – 1 రోజు (అహోరాత్రం)
15 అహోరాత్రాలు – 1 పక్షం
2 పక్షాలు – 1 చాంద్రమానం (పితృవులకు ఒక రోజు)
2 మాసాలు – 1 రుతువు
6 రుతువులు – 1 సంవత్సరం (దేవతలకు ఒక రోజు)
3000 మానవ సంవత్సరాలు – 1 దివ్యవర్షం (దేవతలకు 1 సంవత్సరం)
4800 దివ్యవర్షాలు – 1 కృతయుగం
3600 దివ్యవర్షాలు – 1 త్రేతాయుగం
2400 దివ్యవర్షాలు – 1 ద్వాపర యుగం
1200 దివ్యవర్షాలు – 1 కలియుగం
12000 దివ్యవర్షాలు – 1 చాతుర్యగం
71 చాతుర్యగాలు – 1 మన్వంతరం
14 మన్వంతరాలు – 1 ప్రళయం(బ్రహ్మకు 1 రోజు)
– భాగవతం

**కాలయవనుడు :** గర్గాచార్యుని యాదవులు తూలనాడగా అతడు సకల యాదవులకు భయంకరుడగు పుత్రుని కొరకు శివుని ప్రార్థించెను. గర్గుడి ప్రార్థన విన్న యవనుడు అతనిని తన ఆలమందలో నుంచెను. ఒక అప్సరస అతనిని చూచి కామించి అతని వల్ల ఒక పుత్రుని బడసెను. అతడే కాలయవనుడు. కృష్ణుడు జరాసంధుని ఓడించిన తర్వాత నారదుడు కాలయవనుని వద్దకువచ్చి కృష్ణుడు కంసుని సంహరించెను. జరాసంధుని ఓడించెను. అతడు నీకు తెలియక భయపడి ఇట్లుంటివని చెప్పగా అతడు శ్రీకృష్ణునిపై దండెత్తెను. ఇది తెలిసిన కృష్ణుడు ఒకేసారి కాలయవనుని, జరాసంధుని ఎదుర్కొనుట కష్టమని విశ్వకర్మను పిలిచి సముద్ర మధ్యమున ఒక నగరమును నిర్మించమని బలరాముని, తక్కిన యాదవులను అక్కడకు, పంపి తాను నగరము విడిచి బయటకు వచ్చెను. కాలయవనుడు శ్రీకృష్ణుని వెంటపడి ద్వారకను నాశనము చేయుచుండెను. శ్రీకృష్ణుడు ఇతనిని ఉపాయముతోనే జయించవలెనని నన్నుపట్టు కొనగలవా అని పరుగెత్తుచుండెను. కాల యవనుడు వెంటబడెను. కృష్ణుడు ముచి కందుడను మహర్షి గుహలోకి పరుగెత్తెను. కాలయవనుడు నిద్రించు చున్న ముచికందుడే శ్రీకృష్ణుడని భావించి అతనిని కాలితో తన్నెను. ముచికందుడు లేచి కళ్లు తెరవగా కాలయవనుడు భస్మమయ్యెను. – భాగవతం

**కాలవేగం :** వాసుకి వంశంలో జన్మించిన సర్పం. జనమేజయుని సర్పయాగంలో బూడిదయ్యింది. – మహాభారతం

**కాలశైలాలు :** ఉత్తర ఖండంలోని పర్వతశ్రేణులు. – మహాభారతం

**కాలసూత్రం :** ఓ నరకం.

**కాలంజనం :** ఇదో పర్వతం. దీనిపై ఓ గుడి వుండేది. దాని పూజారి దేవ, బ్రాహ్మణ ధనం అపహరించి కుక్కగా పుడతాడు. అప్పుడు ఓ భిక్షువు దీన్ని కొడతాడు. అప్పుడది శ్రీరామునితో మొరపెట్టుకుని ఆ భిక్షువును ఆ దేవాలయానికి పంపడమే సరైన శిక్ష అని చెప్తుంది.

**కాలానలుడు :** అణువు పౌత్రుడు. సభావలుడి కొడుకు.

**కాలాపుడు :** గొప్ప రుషి. ధర్మజుని సభలోనివాడు.

**కాలామ్ర :** చూ॥ భద్రశాల.

**కాలాంతకుడు :** ఘంటా కర్ణుని సోదరుడు. కుబేరుని సేవకుడు. – హరివంశం

**కాలికేయుడు :** చూ॥ కాలకేయులు.

**కాలుడు 1 :** చూ॥ యముడు.

**కాలుడు 2 :** ఓ మహర్షి, ఇంద్రుని సభలో అతణ్ణి పూజిస్తుంటాడు. – మహాభారతం

**కాలుడు 3 :** ధ్రువుడనే వసువు కొడుకు.

**కాలుడు 4 :** భైరవులలో ఒకడు.

★ ఈ కాలమానం విషయంలో దేవీభాగవతానికి, విష్ణుపురాణానికి కొన్ని భేదాలు వున్నాయి.

**కాలులు :** ఓ పితృగణం. వీరు బ్రహ్మ సభలో వుంటారు. – మహాభారతం

**కాలేయులు :** కాలకేయుల్ని కాలేయులని కూడా అంటారు. – చూ॥ కాలకేయులు

**కాలేహిక :** స్కందదేవుని అనుచరురాలు. – మహాభారతం

**కాలోదకం :** ఇదో పవిత్రస్థలం. భ్రూణ హత్యచేసిన వారిక్కడ స్నానం చేస్తే వారిపాపం పోతుంది. – మహాభారతం

**కాల్య :** వ్యాస మహర్షి తల్లి. – అగ్నిపురాణం

**కాళరాత్రి :** మరణం జరిగిన రోజు యొక్క రాత్రిని పాలించే దేవత పేరు కాళరాత్రి. బొగ్గంత నలుపు, వెడల్పైన నోరు, కళ్ళు, అరుణ వస్త్రాలు ఆభరణాలు దరించి దర్శనమిచ్చే దేవత. కఠినమైన ముడితో చనిపోయిన శరీరంనుండి ఆత్మను తీసుకు వెళ్తుంది. – మహాభారతం

**కాళం :** శివుడి అలంకార సర్పాలలో ఒకటి. శివుడి ఆజ్ఞ పాటించనందుకు శివుడు దీన్ని పాతాళంలో వుండమని శపిస్తాడు. శాపవిమోచనం కోరగా కాళావ ణ్యంలో నేను లింగంగా ఆవిర్భవించినపుడు నీవు పాతాళం నుండి మణులు తెచ్చి నన్ను పూజించు అప్పుడు నిన్నో ఏనుగు అడ్డుకుంటుంది అప్పుడు మీరిద్దరికి మోక్షం లభిస్తుందని చెప్తాడు. అదే కాళహస్తి.

**కాళి 1 :** వ్యాసుని తల్లి మరోపేరు. సత్యవతి వ్యాసుని తల్లి.

**కాళి 2 :** పార్వతి యొక్క అంశ. – చూ॥ పార్వతి.

**కాళిక :** పూషణుడు స్కందునికిచ్చిన ఇద్దరు సేవకుల్లో ఒకడు. మరొకడు పాణీతకుడు. – మహాభారతం

**కాళికాశ్రమం :** ఇదో పుణ్యస్థలం. ఇక్కడస్నానం చేసి మూడు రాత్రులు గడిపితే జీవితం, మృత్యువు అనే బాధల నుండి విముక్తులౌతారు. – మహాభారతం

**కాళికాసంగం :** ఇదో పుణ్యస్థలం. కాళికాశ్రమం కున్న గుణాలన్ని వున్న మరో ఆశ్రమం.

**కాళింగుడు :** కళింగదేశపు రాజైన స్మృతాయువు పేరు. ధర్మజుని కొలువులో సభ్యుడు. – మహాభారతం

**కాళింది :** చూ॥ యమున.

**కాళింది ద్వీపం :** పరాశరుడు, సత్యవతిలు ఈ ద్వీపంలో సంగమించారు. దీని పర్యవసానమే వ్యాసుని పుట్టుక.

**కాళీయుడు :** మరీచి కొడుకు. బ్రహ్మపౌత్రుడు అయిన కశ్యపునికి, కద్రువకు పుట్టిన శక్తివంతమైన సర్పాలలో ఒకడు. ఇతడికి 100 తలలు కలవు. – భాగవతం

గరుడుడు నాగులు తమ తల్లులైన కద్రువ వినతల వల్ల శత్రువులై గరుడుడు నాగుల్ని ఎన్నో బాధలకు గురిచేశాడు. చివరికి నాగులు గరుడుడితో ఓ అవగా హనకు వచ్చి కొన్ని రోజులకొకసారి అతనికి ఆహారం కావడానికి అంగీకరించారు. కాళీయుడు మాత్రం అందుకు అంగీకరించక పోరాడి అలసి కాళిందిలో తన సంతతితో దాక్కున్నాడు. గరుడుడు శౌభరి అనే ముని శాపం వల్ల కాళిందిలో ప్రవేశం నిషిద్ధమే కాక వస్తే తల పగులుతుంది. అందువల్ల కాళింది నది కాళీయుడికి రక్షణస్థావరం అయ్యింది.

*కాళీయ మదమణచుట :* కాళీయుని విషంతో కాళింది విషతుల్యమై దాని ఒడ్డునగల చెట్లు చనిపోయాయి. శ్రీకృష్ణుని చెలికాండ్రు, గోపాలుడు కాళింది నీరు త్రాగి చనిపోయారు. అది చూసిన శ్రీకృష్ణుడు ఒక్కసారి కాళీయుని తలలపై దూకి దాని రక్తం కక్కించగా అది శరణువేడుకొని రమణక ద్వీపం చేరుకొని గరుడుని నుండి రక్షణ కోరగా తన పాదాల ముద్రలు చూసి గరుడుడు ఏమీ చేయదని అభయమిస్తాడు. – భాగవతం

**కాళేశ్వరం :** పయోష్ణీ గోదావరి సంగమ స్థానంలో వుండే పుణ్యక్షేత్రం.

**కావేరి :** ఇది దక్షిణ భారతదేశంలోని ఓ పుణ్యనది. దీని తీరానే పుణ్యస్థలాలైన శ్రీరంగం, కుంభకోణం వున్నాయి. వరుణుని సభలో ఈ దేవత అతణ్ణి సేవిస్తూ వుంటుంది. – మహాభారతం

ఒకసారి అగస్త్యమహర్షి భూమిపై పుణ్యస్థలం కావా లని దానికి నీరు కావాలని శివుణ్ణి కోరగా అదే సమ యంలో కావేరికూడా శివుడ్ని ప్రార్థిస్తోంది. శివుడు కావేరి నీటిని ఒక చెంబులోపోసి అగస్త్యుడికిస్తాడు. కైలాసం నుండి వస్తూ అగస్త్యుడు క్రౌంచ రాక్షసుడ్ని శపించి వింధ్య పర్వతాన్ని తన్నగా అది అగస్త్యుడికి దారి ఇస్తుంది. అతడు దక్షిణా వనికివచ్చి ఆ కమండ లంలోని కావేరి నీటిని ముందుంచుకొని ధ్యానం చేస్తాడు. ఇంద్రుని కోరిక పై గణపతి కాకి వేషంలో

వచ్చి కమండలపు ఓ వైపున కూర్చోగా ఆ నీళ్లు ఒలికి కావేరీనదిగా ప్రవహిస్తాయి. అదే ఇప్పటి కావేరి. – *స్కంద పురాణం*

**కావ్యమాత :** ఈమె రాక్షస గురువైన శుక్రాచార్యుడి తల్లి. ఈమెకు అద్భుతమైన శక్తులున్నాయి. ఒకసారి దేవాసురులకు యుద్ధం జరుగగా అసురులు ఓడి శుక్రాచార్యుని సహాయం కోరతారు. వారి హితము కోరి అతడు హిమాలయాలకు వెళ్లి శిరాన్ని నేలపై నిలిపి అధోముఖంగా తపస్సు చేస్తుండగా అదే సమయంలో దేవతలు రాక్షసులపై మరల దండెత్తగా వారు కావ్యమాతను ఆశ్రయించారు. ఆమె ఒక్క చూపుతో దేవతలు గాఢనిద్రలోకి జారుకోగా బ్రహ్మ విష్ణులు స్థాణువుల య్యారు. విష్ణువు తన సుదర్శన చక్రంతో ఆమె తలను ఖండించాడు. భృగు మహర్షి అచటకి వచ్చి ఆమెను బ్రతికించగా ఆమె కోపవశమున శ్రీ మహావిష్ణువును 10 జన్మలెత్తమని శపించింది. అవే దశావతారాలు. – *దేవీభాగవతం*

**కావ్యవాహులు :** వీరొక పిత్రు సముదాయం. బ్రహ్మ మానస పుత్రిక అయిన సంధ్య యొక్క అందమును చూసి దక్షుడు మొదలగువారికి చెమటలు పట్టగా ఆ చెమట బిందువుల నుంచి జన్మించారు.
– *శ్రీదేవీభాగవతం*

**కావ్యుడు 1 :** ప్రజాపతి అయిన కవి యొక్క కుమారుడు.

**కావ్యుడు 2 :** శుక్రుడ్ని కూడా కావ్యుడని పిలుస్తారు.
– *మహాభారతం*

**కాశ్యపి :** భూమిని కాశ్యపి అంటారు. ఎందుకనంటే పరశురాముడు భూమిని జయించి కశ్యపునికి బహుమతిగా ఇస్తాడు. – *బ్రహ్మాండ పురాణం*

**కాశ్యపుడు 1 (కణ్వుడు) :** ఇద్దరు మహర్షులు కశ్యపుడు, కాశ్యపుడు పురాణాలలో కన్పిస్తారు. కొందరు ఇద్దరూ ఒకరేనను కుంటారు. కొన్ని సందర్భాలలో ఒకరి బదులు మరొకరిని ప్రస్తావిం చడం కద్దు. కశ్యపుడు మొత్తం ప్రపంచానికి సృష్టి కర్త. అతడు బ్రహ్మ పౌత్రుడు. ఇతడు మొదటి తల్లులైన దితి అదితిలకు భర్త. ఇతడు కశ్యము సేవిస్తాడు. కనుక కశ్యపు డన్నారు, కాని నిర్ధారణ లేదు. ఏ పురాణము ఇతడు త్రాగుబోతని చెప్పలేదు.

కాశ్యపముని శకుంతలను పెంచిన తండ్రి. కశ్యపుని వంశంలో జన్మించాడనడం కూడా సరికాదు. ఇతని *వంశవృక్షం :* విష్ణు – పురూరవుడు – నహుషుడు – యయాతి – పురు – జనమేజయ – మేధాతిథి – కణ్వుడు (కాశ్యపుడు)

ఇతడు, దుష్యంతుడు అన్నదమ్ముల బిడ్డలు. ఇతడు దుష్యంతుడి కంటే పెద్దవాడు. ఒకటి మాత్రం నిర్ధారించబడింది. కశ్యపునికి కాశ్యపునికి 20 వంశమూలాలు అంతరం వుంది.

కాశ్యపుడు – *తక్షకుడు :* తక్షకుడు పరీక్షిత్తుని కలవడానికి వెళ్ళగా కాశ్యపుడు అతని వెనకే రక్షించ డానికి బయలుదేరగా ఇతడికి తక్షకుడు లంచమిచ్చి పంపాడంటారు, కాని నిర్ధారణకు నిలవదు. ఎందుక నంటే బ్రహ్మ కశ్యపునికి విషానికి ఔషధం చెప్పాడు కాని ఈ కాశ్యపునికి కాదు. అంటే తక్షకుడు కశ్యపుణ్ణి మోసగించి వుండవచ్చు.

కాశ్యపుని కుమారుడు రుష్యశృంగుడు. విశ్వకర్ముడు యజ్ఞానంతరం ఇతడికి బోధన చేశాడు. ఇతడు క్షత్రియ వంశంలో జన్మించిన తర్వాత రుషిగా మారినవాడు.

**కాశ్యపుడు 2 :** వాసుదేవుని పురోహితుడు. ఇతడు చాలాకాలం పాండవులకు మిత్రుడుగా వ్యవహ రించాడు. గుర్తించతగ్గ తాత్వికుడు.

**కాశ్యపుడు 3 :** కశ్యపుని కుమారుడు. ఇంద్రుని కొలువులో సభ్యుడు. పృథు చక్రవర్తి యజ్ఞ నిర్వహ ణలో పాల్గొన్నాడు. – *మహాభారతం*

**కాశ్యపుడు 4 :** ఐదు అగ్నిలలో ఓ అగ్ని. కశ్యపుని కుమారుడు. తక్కినవారు వసిష్టుడు, ప్రాణ, అంగీరసుడు, చ్యవనుడు.

**కాశ్యపుడు 5 :** ఓ బ్రాహ్మణ యువకుడు. ఓ కోపిష్టి వైశ్యుని రథం తగిలి క్రింద పడిపోయాడు.

**కాశ్యపులు :** కశ్యపుని పుత్రులైన విభందరుడు, రాజ ధర్మకుడు, విశ్వవసు, ఇంద్ర, ఆదిత్య, వసువు ఇతర దేవతల్ని కాశ్యపులని పిలుస్తారు.

**కాశి :** ఓ పుణ్యక్షేత్రం.

*పురాణ నేపథ్యం :* గంగానదీ తీరమున గల పుణ్య క్షేత్రం. పార్వతి పుట్టినింట యుండగా మీ అల్లునికి ధనము లేదు, రూపము లేదు, గృహము లేదు అని

మేనక తూలనాడగా ఆమె శివునితో చెప్పగా శివుడు గణనాథుడగు నికుంబుని బిలిచి కాశీ రాజగు దివోదాసుని వెడలగొట్టి పురము గైకొనమని చెప్పెను. ఇతడు ఔనికుంభుడను బ్రాహ్మణుని కలలో కన్పించి ఇచ్చట విశ్వేశ్వరునికి గుడికట్టింపుమని చెప్పెను. ఆ బ్రాహ్మణుడు దివోదాసు అను కాశీరాజుకు చెప్పగా అతడు ఆలయమును కట్టించి ప్రతి దినము పూజ చేసెడివాడు. ఈశ్వరుడు ప్రార్థించిన వారికెల్ల తమ కోర్కెలు నెరవేర్చెను గాని దివోదాసు కోరిక అయిన పుత్రప్రాప్తి కల్గలేదు. అప్పుడు దివోదాసు ఆ గుడిని పగులగొట్టించగా నికుంబునకు కోపము వచ్చి కాశీ జనహీనమగునట్లు శపించి శివపార్వతులను ఇక్కడకు తీసికొని వచ్చెను. – బ్రహ్మపురాణం

ఈ పట్టణాన్ని వారణాసి, బనారస్, దివోదాస అని కూడా పిలుస్తారు. ఇచ్చట 8 తీర్థాలున్నాయి. అన్నింటికి మధ్య వారణాసి కలదు. ఇక్కడ హోమం, జపం, స్నానం, దైవప్రార్థన చేస్తే ముక్తి లభిస్తుంది. కాశీని చారిత్రకంగా భీష్ముడు, పాండు, భీమసేనుడు, సహదేవుడు, కర్ణుడు, అర్జునుడు, శ్రీకృష్ణుడు వేర్వేరు సమయాల్లో జయించారు. – మహాభారతం

**కాశికుడు :** పాండవుల తరపున యుద్ధంలో పాల్గొన్న గొప్ప రథికుడు. – మహాభారతం

**కాశీశ్వరతీర్థం :** కురుక్షేత్రానికి ఆనుకొని వున్న అంబుమతి నదీతీరాన గల పుణ్యతీర్థం. ఇక్కడ స్థానంచేస్తే పాపాలు నశించి బ్రహ్మలోక ప్రాప్తి కల్గుతుంది. – మహాభారతం

**కాశ్మీర మండలం :** కాశ్మీరంలోని ఓ ప్రాంతం. ఇక్కడ రుషుల సమావేశం జరిగింది. ఉత్తర భారతంలోని మహర్షులే కాక నహుషుడు, యయాతి, అసి మరియు కశ్యపులు పాల్గొన్నారు. జీలం, చీనాబ్ నదులు ఈ ప్రాంతం నుంచి ప్రవహిస్తాయి. ఇక్కడ స్నానం చేసిన వారు మునులవుతారు.

**కాశ్యుడు 1 :** కాశీరాజు. క్రోదవశుడని, శేణబిందు అనికూడా అంటారు. అతని కుమార్తెలే అంబ, అంబిక, అంబాలిక. – మహాభారతం

**కాశ్యుడు 2 :** ఓ గొప్ప రుషి. భీష్ముడు అంపశయ్యపై వుండగా అతడిని దర్శించడానికి వచ్చాడు. – మహాభారతం

**కాసారుడు :** బాష్కలి శిష్యుడు. వాలిఖిల్యాఖ్య సంహితము నేర్పెను. – భాగవతం

**కాంచనమాల :** ఉదయనుని భార్య. వాసవదత్త యొక్క చెలికత్తె.

**కాంచనాక్షి :** ఇది నైమిశారణ్యంలో ప్రవహించే నది. ఇది సరస్వతీ నదిలో ఒక భాగం. – మహాభారతం

**కాంచనాక్షుడు :** స్కందదేవుని పరివారంలో ఒక వీరుడు. – మహాభారతం

**కాంచనుడు :** పూరువంశంలో ఒక రాజు. – చూ॥ పూరువంశం

**కాంచి (కాంచిపురం) :** చోళరాజుల రాజధాని. దీన్ని కాంచీవరం అనికూడా అంటారు. ఇదో పుణ్య క్షేత్రం. కామాక్షి ఆలయం ఇక్కడ ప్రసిద్ధి చెందిన దేవాలయం.

**కాంతారకం :** దక్షిణ భారతదేశంలో ఓ పట్టణం. సహదేవుడు దీన్ని జయించాడు. వేగానది ఒడ్డున ఈ పట్టణం వుండేదని ఆధునిక పండితులు చెప్తున్నారు. – మహాభారతం

**కాంతి :** ప్రాచీన భారతదేశంలోని ఓ నగరం. – మహాభారతం

**కాంతిమతి :** ఉగ్ర పాండ్యుని భార్య. వీరపాండ్యుని తల్లి. – స్కాందపురాణం

**కాంతివ్రతం :** కార్తీకమాసంలో చేసే ఓ వ్రతం. బలరామ శ్రీకృష్ణులకు పూజచేసి రాత్రిపూట మాత్రమే భుజించాలి. ఓ సంవత్సరం ఈ వ్రతాన్ని చేస్తే అందం, జీవితకాలం, ఆరోగ్యం పెరుగుతా యని చెప్తారు. – అగ్నిపురాణం

**కాందిని :** అక్రూరుడి తల్లి. భర్త శ్వఫల్కుడు.

**కాంపిల్యం :** దక్షిణ పాంచాలంలోని ఓ పట్టణం. ద్రుపదుని రాజధాని. వివాహానంతరం శిఖండి ఈ పట్టణానికి వచ్చాడు. అంతకు పూర్వం దీనిని బ్రహ్మదత్తుడు పాలించాడు.

**కాంపిల్యుడు :** పాంచాలదేశపు రాజు. భర్మ్యాశ్వుడి కొడుకు.

**కాంభోజకటకుడు :** ఒక రాజు. ద్విగ్విజయార్థమై వెళ్ళిన అర్జునుని పూజించెను. – మహాభారతం

**కాంభోజం :** ఇది ఉత్తర భారతదేశంలో పశ్చిమాన వున్న దేశం. ఇది ఇప్పటి కాబూల్. ఈ రాజ్యపు రాజును అర్జునుడు అణచివేశాడు. యుధిష్ఠరుని

రథానికి పూన్చిన గుర్రాలు ఈ దేశానివే. ఇక్కడ జన్మించిన మ్లేచ్చులు కలియుగంలో రాజులవు తారు.
– మహాభారతం

వీరు యుద్ధంలో కౌరవుల పక్షాన పోరాడారు. నకులుని రథానికి పూన్చిన గుర్రాలు కూడా ఇక్కడివే. ఇవి చిలక ముక్కు రంగులో వుంటాయి. ఈ గుర్రాలు పరుగిడేటప్పుడు తోకగాని చెవులు గాని కదలవు. కాంభోజుడు పాలించిన దేశం కనుక ఆ పేరు. అంతేకాక ఈ దేశాన్ని పాలించిన రాజులందర్నీ కాంభోజులు అంటారు. కురుక్షేత్ర యుద్ధ కాలంలోని కాంభోజుడి పేరు సుదర్శనుడు.

**కితకుడు :** క్రోధవశ రాక్షసుని అంశతో జన్మించిన ఒక రాజు. – మహాభారతం

**కితవులు :** ప్రాచీన ప్రజల్లో ఓ జాతి. వీరొకసారి ఎన్నో బహుమతులతో ధర్మజుడ్ని దర్శించారు.
– మహాభారతం

**కిన్నరుడు :** పులహుడి కొడుకు.

**కిన్నరులు :** దేవతల్లో ఓ విభాగం. వీరు వీణను ధరిస్తారు. వీరికి నర శరీరం, అశ్వముఖం వుంటాయి.
– అగ్నిపురాణం

**కిరాతం :** ప్రాచీన భారతదేశంలో ఓ పట్టణ ప్రాంతం.
– మహాభారతం

**కిర్మిరుడు :** శక్తివంతుడైన రాక్షసుడు. బకాసురుని సోదరుడు. హిడింబాసురుడి స్నేహితుడు. బకాసురుడు చనిపోయిన వార్త విని ఇతడు వనవాసం చేస్తున్న పాండవులపై పడతాడు. భీమునితో చేసిన ద్వంద యుద్ధంలో మరణిస్తాడు. ఇతణ్ణి కిమ్మీరుడని కూడా అంటారు.

**కిరాతుడు :** చూ॥ శివుడు.

**కిరీటి 1 :** అర్జునుని మరోపేరు. – చూ॥ అర్జునుడు

**కిరీటి 2 :** స్కందుని అనుచరుడు. – మహాభారతం

**కిలి :** చిలుక

*వంశవృక్షం :* బ్రహ్మ పౌత్రుడైన కశ్యపుడు దక్ష ప్రజాపతి 8 మంది కూతుర్లను వివాహమాడాడు. అందులో తామ్ర ఒకటి. తామ్రకి 5 గురు కూతుర్లు, వారిలో శుకి ఒకరు. ఆమె సంతతే చిలుకలు.

*చిలుక పలుకుల మాధుర్యం కథ :* తారకాసుర సంహారమునకు కావలసిన బిడ్డడి కొరకు దేవతలు శివుని ప్రార్థించగా శివపార్వతులు కామక్రీడలో పాల్గొన్నారు. సంవత్సరాలు గడిచాయి. ఆ క్రీడ కల్గించిన భయోత్పాతానికి ప్రపంచం దద్దరిల్లింది. ప్రపంచం నశిస్తుందేమోననే భయం ఏర్పడి దేవతలు దాన్ని ఆపడానికి అగ్నిని పంపగా అతడు శివుని వద్దకు వెళ్లడానికి దడచి సముద్రంలో దాక్కున్నాడు. సముద్రము నందలి జంతువులు అగ్ని యొక్క వేడిని భరించలేకపోయాయి. సముద్ర జీవజాలం దేవతలకు ఈ విషయం చెప్పగా అగ్ని వాటిని మూగగా బ్రతకమని శపించి మందర పర్వతం మీద దాక్కు న్నాడు. ఈ విషయాన్ని చిలుకలు దేవతలకు చెప్పగా చిలుకల నాలుక వెనక్కు మడతబడి మూగవవు తాయని శపిస్తాడు. చివరకు చిలుకలు దేవతలను ప్రార్థించగా నాలుక వెనక్కు మడిచినా అవి చేసే శబ్దం మాధుర్యంగా వుంటుందని శాపవిమోచం కల్గిస్తారు. – కథాసరిత్సాగరం.

**కిష్కింద :** ప్రాచీన భారతదేశంలోని ఓ రాజ్యం. దీన్ని వానరులు పాలించారు.

మొదట రుక్షరాజు దీన్ని పాలించాడు. ఇతడికి సంతానం లేదు. ఇంద్రునివల్ల సూర్యునివల్ల ఆరుణీ దేవికి జన్మించిన వాలి సుగ్రీవులను ఇంద్రుడు గౌతముని ఆశ్రమంలో వుంచగా రుక్షరాజు వారిని తీసుకొని వెళ్ళి తన సంతానాలుగా పెంచాడు. వాలి కిష్కిందకు రాజయ్యాడు. సుగ్రీవుడు అతడికి సహకరించాడు. దుందుభిని వాలి చంపినపుడు సుగ్రీవుడు మోసగించా డని తలచి సుగ్రీవుడిని వెడలగొట్టగా రుష్యమూక పర్వతంపై జాంబవంత హనుమంతాదులతో జీవించాడు. రాముడు వాలిని సంహ రించిన తర్వాత సుగ్రీవుడు కిష్కిందకు రాజయ్యాడు. – రామాయణం

సహదేవుడు తన జైత్రయాత్రలో కిష్కింద పై దండెత్తగా అప్పుడు పాలిస్తున్న వానర రాజులు మైంద, ద్వివిదులు ఇతడికి కానుకలిచ్చి పంపారు.
– మహాభారతం

**కిష్కింద గుహ :** దక్షిణ భారతదేశంలోని ఓ పర్వత ప్రాంతం. ఇప్పటి దార్వాడ్ జిల్లాలో వుంది. కొందరు పండితులు ఇదే అసలైన కిష్కింద అని పేర్కొంటున్నారు.

**కింకణుడు :** మహాభోజుని కుమారులలో ఒకడు. తక్కిన వారు నమరోచి, వృష్ణి. వీరు చంద్రవంశపు రాజులు. - భాగవతం.

**కింకరుడు 1 :** ఒకసారి కల్మషపాదుడను రాజుకు వశిష్ఠుని కుమారుడైన శక్తికి యుద్ధం జరిగింది. శక్తి కల్మషపాదుడ్ని రాక్షసుడవు కమ్మని శపించాడు. అప్పుడు విశ్వామిత్రుడు తన రాక్షస సేవకుడైన కింక రుడ్ని కల్మషపాదుని శరీరంలోకి ప్రవేశ పెట్టగా అతని ప్రేరణపై కల్మషపాదుడు వశిష్ఠుని కుమారు ల్నందరిని చంపాడు. - మహాభారతం

**కింకరుడు 2 :** కాలుని కర్ర పేరు కింకరుడు. దీనితో కాలుడు జీవుల్ని చంపుతాడు. - మహాభారతం

**కింకరులు :** ఓ రాక్షస జాతి. ఇంద్రప్రస్థాన్ని నిర్మించిన తర్వాత మాయాసురుడు 80,000 మంది కింకరుల్ని ఈ భవనానికి కాపలా దారులుగా నియమిస్తాడు. వారు ఈ భవనాన్ని కావలసిన చోటకు మోసుకెళ్ల గలరు. - మహాభారతం

**కింకిణీకాశ్రమం :** ఇదో పవిత్ర స్థలం. ఇక్కడ స్నానం చేస్తే స్వర్గానికి వెళ్తారు. - మహాభారతం

**కింజప్య :** కురుక్షేత్రంలో ఓ పుణ్యస్థలం. ఇక్కడ స్నానం చేస్తే గొప్ప ఫలితాలు లభిస్తాయి. - మహాభారతం

**కిందత్తకూపం :** పవిత్ర కొలను. జింజిలి విత్తనాలను ఈ కొలనులో నాటినవారు మూడు రుణాల నుండి విముక్తులౌతారు. రుషిరుణం పితృరుణం, దేవరుణం. - మహాభారతం

**కిందముడు :** ఓ గొప్ప మహర్షి. ఒకసారి అతడు అతని భార్య లేళ్లరూపంలో కామ క్రీడ సల్పు తుండగా పాండురాజు మగలేడిని తన బాణంతో కొట్టగా అతడు నిజరూపం దాల్చి పాండురాజును తన భార్యలను తాకితే ప్రాణాలు విడుస్తాడని శపించి కిందముడు మరణి స్తాడు. అందుకే పాండురాజుకు స్వయంగా సంతానంలేదు. ఒక రోజు తాళలేక మాద్రిని కౌగిలించుకోగా అక్కడి కక్కడే మరణిస్తాడు. - మహాభారతం

**కిందనాం :** కురుక్షేత్రంలోని ఓ పుణ్యస్థలం. ఇక్కడ మునిగిన వారికి మంచి ఫలితాలు వస్తాయి. - మహాభారతం

**కింపున :** దేవలోకంలో ఓ నది. ఇది వరుణుడ్ని పూజిస్తుంది. - మహాభారతం

**కింపురుషుడు :** ప్రియవ్రతుని వంశంలో జన్మించిన అగ్నీధ్రుడు జంబూ ద్వీపమును పాలించెను. ఇతనికి 9 మంది పుత్రులు, అందులో ఒకడు కింపురుషుడు. తన రాజ్యమును 9 భాగములు చేసి 9 మందికి పంచగా కింపురుషునికి సంక్రమించి అతడు పాలిం చిన రాజ్యమును కింపురుష వర్షం అనేవారు. రామా వతారానంతరం హనుమంతుడు రామజపం చేస్తూ ఇక్కడే నివసించేవాడు. - రామాయణం
ఈ దేశాన్ని మహాభారత కాలంలో అర్జునుడు జయిం చాడు. - మహాభారతం

**కింపురుషులు :** దేవతలలో ఒక తెగ. వీరి శరీరము నరశరీరమువలెను, ముఖము అశ్వరూపమున నుండును. వీరు పులహప్రజాపతి సంతివారు, వీరు కుబేరుని కొలనును రక్షిస్తుండేవారు. రావణుని ధాటికి తాళలేక కుబేరుడు వీరి సహాయంతో గంధమాదన పర్వతంపై గడిపాడు. - మహాభారతం

**కీకటం :** కీకటుడు పాలించిన రాజ్యం పేరు. దీనికో కథ వుంది. ఈ దేశంలోని వ్యాపారస్థులు భద్రాచలం నుండి ఖరీదైన రుద్రాక్షలను గాడిదపై పెట్టుకొని తమ వూరు వస్తుండగా ఆ బరువు మోయలేక క్రింద పడి మరణించింది. ఆ గాడిద శివుని మూర్తిగా మారి కైలాసం చేరింది. పవిత్రమైన వాటిని మోస్తే కైలాస ప్రాప్తి కల్గుతుందనటానికి ఇది ఉదాహరణ. - దేవీభాగవతం

**కీకటుడు :** మనువు కుమారుడైన ప్రియవ్రతుని కొడుకు. భరతుని 19 మంది కుమారుల్లో ఒకడు. ఇతడు పాలించిన ప్రాంతాన్ని కీకటం అంటారు. - భాగవతం

**కీచకుడు :** విరాటరాజు బావమరిది. - చూ॥ సింహబలుడు.

**కీచకులు :** కీచకుని సోదరులు. కీచకుని మరణవార్త విని వీరు దానికి కారణం అజ్ఞాతంలో వున్న ద్రౌపది (సైరంధ్రి) అని భావించి ఆమెను కీచకునితోపాటు స్మశానానికి తీసుకువెళ్లి భస్మం చేద్దామని భావిస్తారు. అప్పుడు భీముడు వారిని సంహరిస్తాడు.

**కీటకుడు :** క్రోదవశుడను రాక్షసుడి అంశతో జన్మించిన రాజు. - మహాభారతం

**కీనాశుడు :** యముడి పేర్లలో ఇదొకటి.

**కీర్తి 1 :** వ్యాసుని కుమారుడైన శుక బ్రహ్మర్షి కుమార్తె. అణుడు ఈమెను వివాహమాడగా బ్రహ్మదత్తుడు జన్మించెను. ఇతడు రాజేకాక గొప్ప పండితుడు, మేధావి. నారదుని సలహాపై చాలాకాలం రాజ్యపాలన చేసిన తర్వాత తన కుమారునికి రాజ్యాన్ని అప్పగించి బదర్యాశ్రమంలో తపస్సుచేసి మోక్షం పొందెను.
– *దేవీ భాగవతం*

**కీర్తి 2 :** దక్ష ప్రజాపతి కుమార్తెలలో ఒకరు. ప్రసూతి వల్ల జన్మించింది. ఈమెను ధర్మదేవుడు వివాహ మాడాడు. – *విష్ణుపురాణం*

**కీర్తి 3 :** ఈమె ఓ అదృష్ట దేవత. గొప్పతనానికి పేరు ప్రఖ్యాతులకు ఈమె మూలం. – *మహాభారతం*

**కీర్తిధర్ముడు :** ఓ క్షత్రియ వీరుడు. ధర్మరాజువైపు నిలబడిన వీరుడు. – *మహాభారతం*

**కీర్తిమతి 1 :** ధరణీ దక్షుల కుమార్తె. ధర్ముడను మనువు భార్య. – *మహాభారతం*

**కీర్తిమతి 2 :** అణుహుని భార్య.

**కీర్తిమానుడు 1 :** దేవకి వసుదేవులకు పుట్టిన మొదటి బిడ్డ. వీరికి జన్మించిన అష్టమ గర్భం వల్ల ముప్పు వుందని ఆకాశవాణి పలుకగా కంసుడువింటాడు. అందువల్ల వీరికి పుట్టిన ప్రతి బిడ్డను తన వద్దకు తీసుకు రమ్మని ఆజ్ఞాపించగా ఇతడిని కంసుని వద్దకు తీసుకువెళ్లగా 8వ వాడి వల్ల ముప్పుగాని ఇతనివల్ల కాదని వదిలేస్తాడు. తర్వాత నారదుడి వలన ఇతని పూర్వజన్మ, విష్ణువు యొక్క పుట్టుక గురించి తెలుసు కొని దేవకి వసుదేవుల్ని కారాగారంలో బంధించి కీర్తిమానుడ్ని రాతిపై మోది సంహరిస్తాడు. అంత టితో కీర్తిమానుడి జీవితం ముగుస్తుంది. – *భాగవతం*

**కీర్తిమానుడు 2 :** మహావిష్ణువు మనోనేత్రం నుండి విరజసుడు పుడతాడు. అతని బిడ్డ కీర్తిమానుడు. కీర్తిమానుడికి కర్థముడను కుమారుడు కూడా జన్మిస్తాడు. – *మహాభారతం*

**కీర్తిమానుడు 3 :** ఇతడొక విశ్వదేవుడు. – *మహాభారతం*

**కీర్తిమాలిని :** చంద్రాంగదుని కుమార్తె. భద్రాయువుని భార్య. ఈమె పూర్వజన్మమున పింగళయను వేశ్య.
– *బ్రహ్మాండపురాణం*

**కీర్తిముఖుడు :** శివ గణంలో ఒకడు. శివుని అల్లుకు పోయిన జుట్టు నుండి మూడు ముఖాలు, మూడు తోకలు, మూడుకాళ్లు, ఏడు చేతులతో జన్మించిన వాడు. మొదట ఇతణ్ణి శవాలపైపడి జీవించమ న్నాడు. ఆ తర్వాత ఇతని వీరత్వానికి మెచ్చి తనను దర్శించా లంటే ముందుగా ఇతన్ని తలచాలని లేకుంటే పతన మవుతారని శివుడు వరమిచ్చాడు. – *పద్మపురాణం*

**కీర్తిరాతుడు :** మహాభక్తుని కుమారుడు.

**కీర్తిసేన :** పాటలీపుత్రంలోని ఓ వ్యాపారి అయిన ధనపా లుడి కుమార్తె. సౌందర్యవతి. మరోవ్యాపారి అయిన దేవసేనుడిని వివాహమాడుతుంది. అతడు వ్యాపార నిమిత్తం వేరేప్రాంతానికి వెళ్లగా ఈమె అత్త ఈమెను ఓ చీకటి గదిలో బంధిస్తుంది. ఓ ఇనుప ఊచతో రంధ్రం చేసుకొని తెలివిగా అక్కడినుండి పారిపోయి అరణ్యంలోకి వెళ్లి ఓ చెట్టుపై కూర్చుంటుంది. అప్పటికే ఆ చెట్టు క్రింద ఒక రాక్షసస్త్రీ తన పిల్లలతో కూర్చొని వుంటుంది. వాసుదత్తపురపు రాజుకి ఓ పురుగు చెవిలో దూరి బాధ పెడ్తుంది. అది మరిన్ని పిల్లల్ని కని మరింత బాధపెడుతూ వుంటుంది. దానికి వైద్య మెలాగో రాక్షసస్త్రీ తన పిల్లలకు వివరించడం కీర్తిసేన విని రాజు కొలువులో చేరి రాక్షసి చెప్పిన ప్రకారం రాజుకి వైద్యం చేసి అతని బాధను పోగొడ్తుంది. రాజు ఈమెకు ఎన్నో బహుమతులిచ్చి సత్కరిస్తాడు. – *కథాసరిత్సాగరం.*

**కీర్తిసేనుడు :** నాగుల రాజైన వాసుకి సోదరుని కుమా రుడు. బ్రాహ్మణపుత్రిక అయిన శృతార్థను ప్రేమించి పెళ్లి చేసుకుంటాడు. వారికి ఓ బిడ్డ జన్మిస్తాడు.
– *కథాసరిత్సాగరం.*

**కుకర్థముడు :** పిండారక దేశాన్ని పాలించిన పాపా త్ముడైన రాజు. ఇతడు ఓ దయ్యం గర్భంలో జన్మించ వలసివుండగా కహోదుడనే మహర్షి ఆశ్రమం వద్దకు రాగా పూర్వజన్మలో తన శిష్యు డిగా గుర్తించి దయ్యం కాకుండా మంత్రించాడు. – *మహాభారతం*

**కుక్షి :** బ్రహ్మపుత్రుడైన స్వాయంభవ మనువుకి ఇద్దరు కుమారులు. వారు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు. ప్రియవ్రతుని కుమార్తెను కర్థమ ప్రజాపతి వివాహ మాడగా వారికి ముగ్గురు కుమారులు జన్మించారు. వారు సామ్రాటుడు, కుక్షి, విరాటుడు.
– *అగ్నిపురాణం*

**కుకుద్మినుడు :** వైవశ్వతమనువు కుమారుడు. శర్యాతికి ఆనర్తుడను కుమారుడు కల్గెను. ఇతని కుమారుడు రేవతుడు కుకస్థలి ద్వీపాన్ని రాజధానిగా చేసుకొని పాలించాడు. ఇతనికి 100 మంది కుమారులు, ఒక కుమార్తె. అందులో పెద్దవాడు కుకుద్మినుడు.
– దేవీభాగవతం

**కుకురుడు 1 :** వృష్ణి వంశపు రాజు. ఈ వంశంలో కుకురుడు ప్రముఖుడు. వీరు కృష్ణుని సామంతులు. కుకువంశులు, అంధక వంశజులు త్రాగుబోతులై శ్రీకృష్ణ నిర్యాణానంతరం ఒకరి కొకరు కలహించు కొని మరణించారు. – మహాభారతం

**కుకురుడు 2 :** కశ్యపుని వంశంలో జన్మించిన ఓ సర్పం.
– మహాభారతం

**కుక్కుట ముని :** ఒక ముని. తల్లిదండ్రులకు సేవ చేయు టయే ఇతడు చేసినతపస్సు. దాని వలన ఇతడు మహనీయుడయ్యెను. "గంగ, యమున, సరస్వతీ" నదులలో మునిగి వారి కంటిన మాలిన్య ముని పోగొట్టుకొనుటకు ఇతని ఆశ్రమమును దర్శించి సేవచేసి వెళ్లెదరు.

**కుక్కుటిక :** స్కంద దేవుని పరివారంలో ఓ స్త్రీ.
– మహాభారతం

**కుక్కురం :** ఇది ప్రాచీన భారతదేశంలో ఒక పట్టణ ప్రాంతం. – మహాభారతం

**కుక్కురుడు 1 :** చంద్రవంశపు రాజు. కుక్కుర రాజ్యానికి వ్యవస్థాపకుడు.

**కుక్కురుడు 2 :** లబ్ధప్రతిష్టుడైన ముని. ధర్మజుని కొలు వులో వుండేవాడు. – మహాభారతం

**కుచేలుడు :** శ్రీకృష్ణుని చిన్ననాటి స్నేహితుడు. ఇద్దరూ సందీపుని ఆశ్రమంలో చదువుకున్నారు. ఒక రోజు అడవికి కట్టెల కొరకువెళ్ళి రాత్రంతా అడవిలో గడిపారు. తదనంతర కాలంలో శ్రీకృష్ణుడు ద్వారకకు పాలకుడుకాగా కుచేలుడు పెక్కు సంతానంతో గృహస్త జీవితం గడుపుతూ శ్రీకృష్ణుని సహాయార్థం తోడుగా ఓ అటుకుల మూట తీసుకొని వెళ్లాడు. శ్రీకృష్ణుడు ఓ గుప్పెడు అటుకులు తిని కుచేలునితో కొంత సమ యం గడిపాడు. ఆ తర్వాత వెనక్కు వెళ్తూ శ్రీకృష్ణుడు తనకు సహాయపడటం లేదని భావించాడు. కాని ఇంటికి వెళ్లి చూడగా అతడి ఇల్లు భవంతిగా మారి పిల్లలు ఆనందంతో గడుపు తున్నారు. ఇతడి చిన్న నాటి పేరు సుదామనుడు. – భాగవతం

**కుజభుడు :** ఒక రాక్షసుడు, జంబాసురుని సోదరుడు. ఇతనిని ఇంద్రుడు సంహరించెను. – రామాయణం

**కుజుడు :** ఇతడు దేవగణంలో ఓ ప్రత్యేక ప్రతిపత్తి కలవాడు. అతని ఆయుధం శక్తి. ఇతడు అక్షమాల (రుద్రాక్షలు) ధరిస్తాడు.

**కుజృంభుడు :** శక్తివంతుడు, విరోచితుడైన రాక్షసుడు. ఇతని వద్ద గల ఇనుప కర్రపేరు సునంద. ఈ ఊచ స్త్రీలను తాకనంతవరకు అతి శక్తివంతమైనది. నిర్వింధ్యా నదీ తీరంలోగల అడవిలో నివసించేవాడు. ఇతడు వైశాలి రాజకుమార్తె అందాలరాశి అయిన ముదావతిని అపహరించాడు. భలందన కుమారుడైన వత్సప్రి ముదావతిని ఆ ఇనుప ఊచ పట్టుకొనేటట్లు చేసి దాన్ని శక్తిహీనం చేసి తర్వాత ఆ రాక్షసుణ్ణి వధిస్తాడు. ఆ తర్వాత రాజకుమార్తె అయిన ముదావ తిని వివాహమాడతాడు. – మార్కండేయ పురాణం

**కుటవుడు :** ఒక రుషి.

**కుటిల :** హిమవంతుడి కుమార్తె. బ్రహ్మశాపం వల్ల బ్రహ్మలోకంలో నదిగా మారుతుంది.

**కుట్టాలం :** దీనిని కుర్తాలం అని కూడా అంటారు. దక్షిణ భారతంలోని శివాలయాలలో ప్రసిద్ధి చెందింది. ఇది వైష్ణవాలయం. తదుపరి శివాల యంగా మారింది. అగస్త్యుడు దక్షిణ భారతదేశంలోనికి వచ్చినపుడు కుర్తాలం (తిరునల్వేలి జిల్లా) వచ్చి విష్ణుదర్శనం చేసు కోబోగా నుదుట బూడిదవున్న యితడ్ని అక్కడి పూజా రులు నిరాకరిస్తారు. వెంటనే విష్ణుభక్తుడిగా మారగా దర్శనానికి అనుమతిస్తారు. విష్ణువు తాను శివుడు ఒకటేనని తెలియజెప్పడానికి, అగస్త్యుని గొప్పతనం తెలియడానికి విష్ణువు శివలింగంగా మారుతాడు. అప్పటి నుండి అది శివాలయంగానే వుంది.
– స్కందపురాణం

**కుతరుడు :** కద్రువ కొడుకు.

**కుణి** : యదువంశజుడు. యుగంధరుడి తండ్రి.

**కుణిగర్గుడు :** ఓ గొప్ప మహర్షి. అతని తపఃశక్తితో ఓ యువతిని సృష్టించి తర్వాత సమాధిలోకి వెళ్లాడు.

ఆ యువతి పేరు ఖనిపుత్రిక. ఆ యువతి వివాహం చేసుకోవడం ఇష్టంలేక కన్యగానేవుండి తపస్సు చేస్తుంది. ఆమె అలాగే వృద్ధురాలవుతుంది. నారదుడు అవివాహిత స్త్రీలకు మోక్షప్రాప్తి కల్గదని చెప్పగా తన తపశ్శక్తిలో సగభాగంతో ఓ పురుషుణ్ణి సృష్టించి అతనితో ఓ రాత్రి గడిపి మోక్షం పొందుతుంది. - మహాభారతం

**కుణీందుడు :** ఓ ఉన్నతుడైన బ్రాహ్మణుడు. రాజ సూయ యాగ సమయంలో ధర్మజుడికి దైవికమైన శంఖాన్ని ఇచ్చాడు. - మహాభారతం

**కుతపకాలం :** మధ్యాహ్నం కాలం. ఈ సమయంలో పితృలకు పిండార్పణ చేస్తే మంచిది. - మహాభారతం

**కుత్సుడు :** రురు అను రాజర్షి కుమారుడు. ఇంద్రునితో పాటు ఇతణ్ణి చాలాసార్లు రుగ్వేదంలో పేర్కొనడం జరిగింది. - రుగ్వేదం

**కుథారం :** ధృతరాష్ట్ర వంశంలో జన్మించిన నాగు. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. - మహాభారతం

**కునడీకుడు :** స్కందదేవుని పరివారంలో ఓ వీరుడు.

**కుని :** మిథిలా నగర రాజు. సితధ్వజుడి కుమారుడు. ఇతని కుమారుడు అంజకుడు.

**కుపటుడు :** ఓ దైత్యుడు. దనుకశ్యపుల కుమారుడు. - మహాభారతం

**కుబేరతీర్థం :** సరస్వతీ నదీతీరాన గల పవిత్ర స్థలం. ఇక్కడే కుబేరుడికి దేవతలు ప్రత్యక్షమై సంపదపై అధికారాన్నిచ్చారు. శివునితో స్నేహం, దైవత్వాన్ని, ప్రపంచాన్ని పరిపాలించే హక్కు కల్పించారు. మరుద్గణాలు రాజుని చేశారు. ఇక్కడే ఇతనికి నలకు బేరుడు జన్మిస్తాడు. అందుకనే ఈ స్థలానికి ఆ తర్వాత అంతప్రసిద్ధి వచ్చింది. - మహాభారతం

**కుబేరుడు :** బ్రహ్మ కుమారుడైన పులస్త్యుని మనుమడు. విశ్రవసు ఇలిబిలకు జన్మించాడు. రావణ, కుంభకర్ణ, విభీషణులు విశ్రవసుడికి మరో భార్యవల్ల జన్మించారు.

*కుబేరుని ప్రాముఖ్యత :* ఒకసారి దేవతలు కుబేరుడి తరఫున వరుణుడు యాగంచేసి సముద్రుడికి నదులకు అధిపతిని చేయగా అవి ఇతనికి ఎంతో సంపదని చ్చాయి. శివుడు కూడా కుబేరుడికి స్నేహితుడయ్యాడు. - మహాభారతం

*లంకానగర రాజు :* కుబేరుడు బ్రహ్మను గూర్చి తపస్సు చేయగా బ్రహ్మ ప్రత్యక్షమై వరం కోరు కొమ్మ నగా దిక్పాలకుడ్ని కావలెనని; సంపదకు అధిపతిని కావాలని కోరుకోగా బ్రహ్మ ప్రసాదిస్తాడు. కుబేరుడు తన తండ్రికి తానుపొందిన వరాలను గూర్చి చెప్పి తనకో నగరం నిర్మించమని చెప్పగా విశ్రవసుడు దక్షిణ సముద్రంలో లంకానగరాన్ని నిర్మించగా కుబేరు డిందు నివసించాడు. బ్రహ్మ నుండి సంపదతో పాటు పుష్పక విమానం కూడా పొందుతాడు.

*రావణుని లంక :* విశ్రవసువుకు మరో భార్య వల్ల జన్మించిన రావణుడు బ్రహ్మనుండి ఎన్నో వరాలు పొంది తన సైన్యంతో కుబేరునిపై దండెత్తి లంకా ధీశుడు కాగా కుబేరుడు గంధమాదనం పైకి వెళ్లి అలకాపురిని నిర్మించుకుని అచటే కొలువుంటాడు.

*రావణ కుబేరుల యుద్ధం :* రావణుడు దేవతల్ని బ్రహ్మణుల్ని హింసిస్తుండగా వారు మహావిష్ణువును ఆశ్రయిస్తారు. ఇది తెలిసిన కుబేరుడు తన సోదరుడైన రావణుడిని నీతిగా జీవించమని తన ధూతతో కబురు చేయగా అతడిని నరికివేయడమేకాక ముందుగా కుబేరునిపై దండెత్తి అతడ్ని ఓడించగా యక్షులు ఓ విమానంలో కుబేరుడ్ని తరలించి కాపాడుతారు.

*కుబేరుడు ఊసరవెల్లిగా మారుట :* మరుత్త మహా రాజు మహేశ్వర యజ్ఞంచేస్తూ ఇంద్ర, కుబేర, వరుణ, యముల్ని ఆహ్వానిస్తాడు. అదే సమయంలో రావ ణుడు తన జైత్రయాత్ర ముగించుకొని. ఈ యాగానికి రాగా వారు వివిధ రూపాలలో పారిపోతారు. కుబేరుడు ఊసరవెల్లిగా మారతాడు.

*కుబేరునికి గల శాపాలు :*

1. ఒకసారి పార్వతి శివుని తొడపై కూర్చొని వుండగా కుబేరుడు ఈర్ష్యతో చూడగా పార్వతి ఇతడి కన్నుపో యేటట్లు శపించింది. కుబేరుడు శాపవిమోచన కోరగా ఆ కన్ను గవ్వకన్నుగా మారుతుందని శాపవి మోచన కల్గిస్తుంది.

2. ఒకసారి కుబేరుని అనుచరుడైన మణిమానుడు అగస్త్యుని తలపై ఉమ్మివేయగా ఇతడు ఇతడి సైన్యము ఓ మానవునిచే చంపబడతారని అందుకు నీవు దుఃఖిస్తావని శపిస్తాడు. భీమసేనుడు సౌగంధిక పుష్పా

లకొరకు గంధమాదనం వెళ్లినపుడు మణి మానుడిని అతడి సైన్యాన్ని సంహరిస్తాడు. భీముడు కుబేరుడిని చూసినపుడు ఆ పాప పరిహారం జరుగుతుంది.
– మహాభారతం

కుబేరుని భార్య పేరు భద్ర. ఇతడు నరవాహనుడు. ఇతడి వాహనాన్ని నరులు మోస్తారు.

*కుబేరుని ఇతర నామాలు :* అలక ధీప, ధనేశ్వర, ధనపతి, కైలాసనిలయ, నరవాహన, పౌలస్త్య, రాజరాజ, రాక్షసాధిపతి, రాక్షసేశ్వర, వైశ్రావణ, యక్షధీప, యక్షాధిపతి, యక్షపతి, యక్షరాజు.

**కుబ్జ :** ఈమె ఒక వికార రూపిణియైన స్త్రీ. ఈమె బాల్యంలోనే భర్త చనిపోయాడు. 8 సంవత్సరాలు అన్ని పుణ్యకార్యాలు చేస్తూ గడిపింది. ప్రతి సంవత్సరము మాఘస్నానంచేసి ముక్తి పొందింది. అదే సమయంలో సుందోపసుందులు ప్రపంచాన్ని బాధిస్తుండగా ఆమె తిలోత్తమగా మారింది. ఈమెను మోహించిన వీరు ఆమెకోసం ఒకరికొకరు తలపడి మరణించారు. బ్రహ్మ సంతోషించి ఈమెకు సూర్యలోకంలో స్థానం కల్పించాడు. – పద్మపురాణం

**కుబ్జామ్రకం :** ఇదో పుణ్యస్థలం. దీన్ని ఒక్కసారి దర్శిస్తే 1000 గోవుల్ని దానంచేసిన పుణ్యం లభిస్తుంది. స్వర్గప్రాప్తి కలుగుతుంది. – మహాభారతం

**కుభ :** ఋగ్వేదంలో పేర్కొనబడిన ముఖ్యనదుల్లో ఇదొకటి. తక్కినవి సింధు, సువాస్తు, వితస్త, అసిక్ని, పరుష్ణి, విపాశ, శాతద్రు, సరస్వతి, యమున.
– ఋగ్వేదం

**కుమార 1 :** చూ॥ సుబ్రహ్మణ్యస్వామి.

**కుమార 2 :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. పాండవుల పక్షాన పోరి ద్రోణుని చేతిలో మరణించాడు. – మహాభారతం

**కుమార 3 :** ఓ ముని. శాంత కుమారుడుగా ప్రసిద్ధుడు. – *చూ॥ శాంత కుమారుడు.*

**కుమార 4 :** గరుడుని ప్రసిద్ధిగాంచిన పుత్రులలో ఒకడు.

**కుమారకోటి :** ఓ పవిత్ర స్థలం. ఈ స్థలాన్ని దర్శిస్తే 1000 గోవులను దానమిచ్చిన ప్రతిఫలం కల్గుతుంది.
– మహాభారతం

**కుమారతీర్థం :** గంగానదిలో ఒక తీర్థం. కుమారస్వామి దేవతా స్త్రీలను వలచి వారి వెంటపడతాడు. ఇది చూసి పార్వతీ దేవి వారి వేషాల్లో వస్తుంది. ఇది తెలుసుకున్న కుమారస్వామి స్త్రీలందరు తల్లితో సమానమని గుర్తించి ఇక్కడస్నానం చేసి పుణ్యం పొందుతాడు. ఈయన స్నానం చేశాడు కాబట్టి ఈ తీర్థానికి ఆ పేరు వచ్చింది. – బ్ర.వై. పురాణం

**కుమారదత్తుడు :** మూషికుడనే వైశ్యుడ్ని పోషించాడు. తల్లికి సంరక్షకుడు. – చూ॥ మూషికుడు

**కుమారదాస :** 7వ శతాబ్దిలో ప్రభవించిన సంస్కృత కవి. జానకీహరణం ఇతని ప్రసిద్ధ కావ్యం.

**కుమారధార :** ఇదో నది. దీని మూలం బ్రహ్మసరస్సు. ఈ నదిలో స్నానంచేసిన వారు తెలివైనవారు సంపదపరులు అవుతారు. – మహాభారతం

**కుమారవనం :** సుద్యుమ్నుడు స్త్రీగా మారి బుధుని వల్ల పురూర వసులకు జన్మనిచ్చిన ప్రదేశం. ఒకసారి సనక మహర్షి ఇతర మునులు శివుని దర్శనానికి వెళ్ళగా శివుని తొడపై పార్వతి కూర్చొని వుంది. వీరిని చూసిన పార్వతి కోపించి ఈ వనంలోకి ఇంకెప్పుడైన వస్తే స్త్రీలుగా మారతారని శపిస్తుంది. దాని పర్యవసానమే సుద్యుమ్నుడు స్త్రీగా మారతాడు.
– దేవీభాగవతం

**కుమారవర్షం :** రైవతక పర్వతం దగ్గరలోని ఓ ప్రాంతం.
– మహాభారతం

**కుమారస్వామి :** చూ॥ సుబ్రహ్మణ్యస్వామి.

**కుమారీ 1 :** కేకేయ రాజకుమార్తె. ప్రతి శ్రవసులకు తల్లి. ఈమె పూరువంశరాజైన భీమసేనుని భార్య.
– మహాభారతం

**కుమారీ 2 :** స్కందుని శరీరం నుండి వెలువడిన కన్యలు. వీరు స్త్రీల గర్భంలోని పుట్టని శిశువులను తినేవారు. అందుకని వీరిని కుమారీలు అని పిలిచేవారు.
– మహాభారతం

**కుమారీ 3 :** ధనంజయుడను సర్పం యొక్క భార్య.
– మహాభారతం

**కుమారీ 4 :** ప్రాచీన భారతదేశంలోని ఒక నది.
– మహాభారతం

**కుమారీ 5 :** శాఖ ద్వీపంలో ప్రవహించే ఒక నది.
– మహాభారతం

**కుమారులు :** ఎప్పటికి యవ్వనంలో వుండే సనక సనందన, శంతకుమార, సనత్సుజాతుల్ని కుమారులు అనేవారు. వారు బ్రహ్మ పుత్రులు.

**కుముదమాలి :** స్కందునికి బ్రహ్మ ఇచ్చిన నలుగురు సేవకుల్లో ఒకరు. తక్కినవారు నందిసేనుడు, ఘంటాకర్ణుడు, లోహితాక్షుడు. వీరు గాలి కంటే వేగవంతులు, కామశక్తిలో అమోఘులు. – మహాభారతం

**కుముదాక్షం :** ప్రసిద్ధి చెందిన సర్పం. – మహాభారతం

**కుముదాక్షుడు :** విష్ణు పరిచారకులలో ఒకడు.

**కుముదుడు 1 :** మహావిష్ణువుకు మరోపేరు.
– మహాభారతం

**కుముదుడు 2 :** స్కందదేవునితో పోరాడిన ఓ యోధుడు.
– మహాభారతం

**కుముదుడు 3 :** స్కందునికి బ్రహ్మదేవుడిచ్చిన 5 గురు సేవకుల్లో ఒకడు. – మహాభారతం

**కుముదాదుడు :** వేదపండితుడు. వ్యాసుని శిష్య పరంపరలోని వాడు. అధర్వణ వేదంలో నిష్ణాతుడు. అధర్వణవేదాన్ని కబందుడు రెండు భాగాలు చేసి ఒకటి దేవదర్శుడికి రెండవది పత్యుడికి ఇచ్చాడు. పత్యుని శిష్యులలో కుముదాదుడు ఒకరు. మరో ఇద్దరు జాబాలి, శేనకుడు. – విష్ణుపురాణం

**కుముదోదరం :** శాఖ ద్వీపంలో ఒక ప్రత్యేక ప్రాంతం.
– మహాభారతం

**కుముద్వతి 1 :** కిరాత దేశ రాజైన విమర్శనుడి భార్య. కుముద్వతి తన భర్త కిరాతకాలను మానమని కోరగా పూర్వజన్మలో నేను ఓ కుక్కనని శివాలయంవద్ద లింగాన్ని చూస్తూ కూర్చొని వుండగా ప్రజలు నన్ను చచ్చేవరకూ కొట్టమనగా నేను ఆ దేవాలయం చుట్టూ మూడుసార్లు పరుగెత్తడం వల్ల రాజుగా జన్మించానని కాని తన పాత కార్యాలు మానలేకున్నాని చెప్పి తన భార్య పూర్వజన్మలో పావురమని ఆమె కూడ మూడు సార్లు శివాలయం చుట్టూ ప్రదక్షిణ చేయడం వల్ల రాణిగా జన్మించిందని చెప్తాడు. – శివపురాణం

**కుముద్వతి 2 :** శ్రీరాముడు కుమారుడైన కుశుని భార్య. ఒకసారి కుశుడు సరయు నదిలో జలక్రీడలాడుతుండగా చేతి ఆభరణాలు నదిలో పడిపోగా కుశుడు నదిపై బాణాన్ని ఎక్కుపెట్టగా నదీ దేవత ప్రత్యక్షమై పోయిన ఆభరణాలను ఇచ్చి కుముదవతిని కూడా కుశునికిచ్చి వివాహం చేసింది.
– ఆనంద రామాయణం

**కుమందాక్షుడు :** కద్రువ కుమారుడు.

**కుయవుడు :** ఓ అసురుడు. – ఋగ్వేదం

**కురపర్వతం :** మహామేరువు చుట్టూవుండే ఒక పర్వతశ్రేణి. – దేవీభాగవతం

**కురంగక్షేత్రం :** ఇదో పుణ్యక్షేత్రం. ఇక్కడ స్నానం చేసి మూడు రాత్రులు గడిపితే ముక్తి లభిస్తుంది.
– మహాభారతం

**కురుక్షేత్రం :** సరస్వతీ నదీతీరాన దృషద్వతికి ఉత్తరాన గల పుణ్యస్థలం. మహాభారత యుద్ధ వల్ల ఇది ప్రసిద్ధి చెందింది. ఇచ్చట నివసించిన ప్రజలు స్వర్గం చేరతారు. ఖాండవ దహనం ముందు తక్షకుడు కురుక్షేత్రంలో గల ఇక్ష్వాకులీనదీతీరంలో నివసించారు. కురుడు ఇచ్చటే మొదట తపస్సు చేశాడు. సుంద ఉపసుందలు ప్రపంచాన్ని జయించి ఇక్కడ జీవించారు. మంధాత కురుక్షేత్రంలోనే యజ్ఞం చేశాడు. భీష్మ పరశురాములు కాశీరాజకుమార్తె అంబ విషయంలో వచ్చిన ప్రతిష్టంబన వల్ల ఇచ్చటే యుద్ధం చేశారు. భీష్ముడు అంపశయ్యపై శయనించింది ఇక్కడే. కౌరవ పాండవుల యుద్ధానికి వేదిక కావడం అన్నిటికంటే దీనికి ప్రాముఖ్యత ఏర్పడింది. – మహాభారతం

**కురుజాంగలం :** ఇదో రాజ్యం. దీనికి హస్తినాపురం రాజధాని. కురు రాజువల్ల దీనికా పేరువచ్చింది.
– మహాభారతం

**కురుజిత్తు :** జనకుని వంశంలో జన్మించిన ఒక రాజు. ఇతని తండ్రి అజుడు. ఇతని కుమారుడు అరిష్టనేమి.
– భాగవతం

**కురుటుడు :** ఇతని మరోపేరు రుద్రాశ్వుడు. ఓ ముని.
– ఋగ్వేదం

**కురుడు 1 :** ధ్రువుని వంశంలోని రాజు. చాక్షుష మనువు కుమారుడు. ఇతడు వేణుడి తాత, పృథు చక్రవర్తి ముత్తాత. పురాణాలలో ఇతడిని గురించి మరింత వివరణ లేదు. – విష్ణుపురాణం

**కురుడు 2 :** స్వాయంభవ మనువు శతరూపలకు ఉత్తానపాద, ప్రియవ్రతులు జన్మించారు. ఉత్తాన పాదుని వంశంలో కురుడు అనే రాజు జన్మించాడు. ప్రియవ్రతుని వంశంలో కూడా కురుడు కన్పిస్తాడు. – విష్ణుపురాణం

**కురుడు 3 :** రంతి దేవుని సోదరుడు. ఒక రాజు.

**కురుడు 4 :** పూరువంశంలో జన్మించిన ప్రసిద్ధరాజు. నహుషుడు, భరతుడు, అజమీదుడు ఈ వంశంలోని వారే. అజమీదుని మునిమనుమడు కురుడు. కురునికి పరీక్షిత్తు, సుధామసుడు, జహ్నుడు, నిషదాశ్వుడు జన్మించారు. జహ్నువు సంతతిలో ప్రతీచకుడికి దేవాపి, శంతను బాల్హికులు జన్మించారు. శంతనుని సంతతిలో కౌరవులే కురు వంశరాజులు. పాండవులు దేవతల సంతతి కనుక ఈ ఐదుగురు కౌరవులని పిలవబడరు. కురుడి తపస్సు వల్ల కురుక్షేత్రం పవిత్ర స్థలమయ్యింది. కురుడు కురుక్షేత్రాన్ని దున్నుతుండగా ఇంద్రుడు ప్రత్యక్షమై ఇతడితో సంభాషించాడు. ఒకసారి ఇతడు కురు క్షేత్రంలో యజ్ఞం చేస్తుండగా సరయూనది అచటికి ప్రవహించి పవిత్రం చేసింది. – మహాభారతం

**కురుడు 5 :** భీష్ముడు అంపశయ్యపై నుండగా దర్శించిన మునుల్లో ఒకడు.

**కురుడు 6 :** సంవర్తుని వల్ల తపతికి జన్మించిన కుమారుడు. – వామనపురాణం

**కురుతీర్థం :** కురుక్షేత్రంలోని తైజసతీర్థానికి దక్షిణానవున్న మరో పుణ్యస్థలం. ఇక్కడ స్నానం చేస్తే బ్రహ్మలోక ప్రాప్తి కల్గుతుంది. – మహాభారతం

**కురుదేశం :** కురువు పాలించిన దేశం అవడంవల్ల ఈపేరు. దీని రాజధాని హస్తినాపురి.

**కురుధాముడు :** దుష్యంతుని కుమారుడు.

**కురుపాంచాలం :** కురుపాంచాల దేశాలను కలిపి ప్రాచీన కాలంలో కురుపాంచాలం అనేవారు. – మహాభారతం

**కురువంశం :** చూ॥ కురుడు.

**కురువర్ణకం :** ప్రాచీన భారతదేశంలో ఓ పట్టణ ప్రాంతం. – మహాభారతం

**కురువర్షం :** కురుడు పాలించిన దేశాన్ని కురువర్షం అనేవారు. – మహాభారతం

**కురువిందం :** ప్రాచీన భారతదేశంలో ఓ పట్టణ ప్రాంతం. ఈ ప్రాంత ప్రజల్ని కురువిందులనేవారు. – మహాభారతం

**కురంగం :** ఇది మహామేరువు చుట్టూ వున్న పర్వత శ్రేణి. – దేవీభాగవతం

**కులతం :** భారతదేశంలో ఓ పుణ్యక్షేత్రం. – మహాభారతం

**కులశేఖరుడు :** మధురా నగరాన్ని నిర్మించిన రాజు. ఇతని కుమారుడు మలయధ్వజుడు. – స్కందపురాణం

**కులాచలం (కల పర్వతాలు) :** ఏడు పర్వతాలను కులాచలం అంటారు. అవి మహేంద్ర, మలయ, సహ్య, సూక్తిమాను, రుక్షవాను, వింధ్య మరియు పారియాత్ర పర్వతాలు. – మహాభారతం

**కులిక :** కద్రువకు జన్మించిన సర్పాలలో ప్రముఖమైనది.

**కులంపున :** ప్రతిరోజు స్మరించదగ్గ ఓ పవిత్ర నది. – మహాభారతం

**కుల్యుడు :** వ్యాసుని శిష్యపరంపరలో ప్రముఖుడు. – భాగవతం

**కుళిందకుడు :** చందనావతి నగర రాజు. ఇతడికి సంతానం లేదు. ఓ రోజు వేటకు వెళ్లి వేలుతెగి ఏడుస్తున్న బాలుణ్ణి చూసి తీసుకొని వచ్చి చంద్రహాసుడని నామకరణం చేసి పెంచి పెద్ద చేశాడు. – జైమిని భారతం

**కువలయాపీడనం :** శ్రీకృష్ణుని బలరాముని చంపడానికి కంసుడు మధురాపురి ద్వారం వద్ద వుంచిన ఏనుగు. బలరామ కృష్ణులు ఆ ఏనుగును మావటిని కూడా చంపుతారు. – భాగవతం

**కువలయాశ్వుడు :** శత్రుజిత్తు కుమారుడు. పేరు రుతుధ్వజుడు. ఇతడు గాలవుడను మునికి కువలయాశ్వాన్నిచ్చాడు కనుక ఈ పేరు వచ్చింది. పాతాళ కేతుని సంహరించి మదాలసను వివాహమాడతాడు. ఇతని కుమారులు విక్రాంతుడు, సుబాహువు, శత్రువర్ధనుడు, అలర్కుడు, కువలయాశ్వుడు. – మార్కండేయ పురాణం

**కువీరం :** ఓ నది. – మహాభారతం

**కుశద్వీపం :** ఏడు ద్వీపాలలో ఇదొకటి. ఇది ముత్యాలకు ప్రసిద్ధి. – మహాభారతం

కుశద్వీపం సురసముద్రాన్ని చుట్టి వుంటుంది. ఇది ఏడు విభాగాలు. ఇక్కడ. దైత్యులు, దానవులు, దేవతలు, మానవులు, కిన్నెర, కింపురుషులు జీవి స్తారు. మానవుల్లో 4 వర్ణాలు వున్నాయి. ఈ ద్వీపంలో కుశస్తంభం వుంది. అది కుశపుగడ్డితో ఎత్తుగా ఓ స్తంభంలా వుండి ఆకర్షిస్తుంది. ఈ ద్వీపాన్ని ఘృతసముద్రం చుట్టి వుంటుంది. – విష్ణుపురాణం

**కుశధార :** భారతీయులు ఈ నది నీటినే సేవించే వారు. – మహాభారతం

**కుశధ్వజుడు 1 :** ఇతడొక బ్రాహ్మణుడు. కడుపేదరికంలో సాళ్వరాజు సహాయం కోరగా నిరాకరింపబడి భగవతిని ధ్యానిస్తూ తపమాచరించగా అతని నోటినుండి ఓ అందమైన యువతి వెలువడింది. ఆమె పేరు దేవవతి. ఆమె అందాన్ని చూసి సాంబుడను రాక్షసుడు వివాహమాడ తాననగా కుశధ్వజుడు నిరాకరిస్తాడు. కోపంతో అతడు నిద్రిస్తుండగా రాక్షసుడు వధిస్తాడు. దేవవతి శపించగా సాంబుడు బూడిద అవుతాడు. ఆ తర్వాత ఆమె మహావిష్ణువును తన భర్తగా కోరి తపస్సు చేస్తుండగా రావణుడు చూసి ఆమె జుట్టుపట్టుకొని లాక్కొని పోబోగా తన వేళ్లతో జుట్టును నరకి ఆమె భస్మమౌతుంది. ఈమెయే తర్వాత సీతగా జన్మిస్తుంది. – ఉత్తర రామాయణం

**కుశధ్వజుడు 2 :** జనకుని తమ్ముడు. ఇక్షుమతి నదీ తీరాన వుంటాడు. ఇతని కుమార్తె ఊర్మిళ. లక్ష్మణుడ్ని వివాహమాడుతుంది. – రామాయణం

**కుశధ్వజుడు 3 :** ఇతడు పూర్వజన్మలో వానరుడు. శివుని ఊయలను రాత్రింబవళ్లు ఊపేవాడు. ఇందుకు మెచ్చి శివుడితడికి కుశధ్వజుడను రాజుగా జన్మనిచ్చాడు. అగ్నివేశ మహర్షి కూతురు స్నానం చేస్తుండగా ఎత్తుకుపోగా అతడు కుశధ్వజుడ్ని రాబంధువు కమ్మని శపిస్తాడు. శాపవిమోచనం కోరగా ఇంద్రద్యుమ్నుడికి సహాయం చేసినపుడు నిజరూపం ప్రాప్తిస్తుందంటాడు. – దేవీ భాగవతం

**కుశనాభుడు :** వైదర్భిరాజు కుశుని కుమారుడు కుశనాభుడు. కుశనాభుడు పుత్రకామేష్టి యాగం చేయగా గాధి అనే కుమారుడు జన్మించాడు. గాధి కుమారుడే విశ్వామిత్రుడు. విశ్వామిత్రుని సోదరి సత్యవతి. ఈమెను రుచికుడు వివాహమాడాడు. – రామాయణం

**కుశప్లవనం :** ఇదో పుణ్యస్థలం. ఇచ్చట స్నానం చేసి మూడురోజులు గడిపితే అశ్వమేధ యాగం చేసిన ఫలితం లభిస్తుంది. – మహాభారతం

కశ్యపుని భార్య దితీదేవి ఇచ్చట తపస్సు చేసి ఇంద్రునితో సమానుడైన కుమారుడికై ప్రార్థించగా ఇంద్రుడు దితి గర్భంలోని శిశువును ముక్కలుగా నరికాడు. – రామాయణం

**కుశబీర :** ప్రాచీన కాలంలో భారతీయులు ఈ నది నీటిని త్రాగేవారు. – మహాభారతం

**కుశబిందువు :** ప్రాచీన భారతదేశంలో ఓ పట్టణ ప్రాంతం. – మహాభారతం

**కుశలవులు :** సీతకు జన్మించిన శ్రీరాముని కుమారులు. – రామాయణం

**కుశలం :** క్రౌంచ పర్వతందగ్గరున్న పుణస్థలం. – మహాభారతం

**కుశల్య :** ప్రాచీన భారతావనిలో ఓ పుణ్యస్థలం. – మహాభారతం

**కుశవతి :** దేవలోకంలో ఓ పట్టణం. ఇక్కడ ఒకసారి దేవతలు మంత్రయజ్ఞం చేశారు. ఈ యజ్ఞానికి వెళ్తూ అగస్త్యుడు కుబేరుడ్ని అతడి సేవకుడు మణిమానుణ్ణి శపించాడు. – మహాభారతం

**కుశవానం :** మానస సరోవరం దగ్గర్లోని ఉజ్జానక కొలనులో లోతైన ప్రాంతం. – మహాభారతం

**కుశస్తంభం :** కుశద్వీపంలో ఓ పుణ్యస్థలం. ఇక్కడ స్నానం చేస్తే దేవతా స్త్రీల మధ్య స్వర్గంలో గడుపుతారు. – మహాభారతం

**కుశస్థలి :** ద్వారకాపురికి పూర్వనామం. దీనిని రేవతుడు స్థాపించగా అతని తండ్రి అనర్తుడు దీని చుట్టూ కోటను నిర్మించాడు. ఆ తర్వాత కొంత కాలానికి ఇది నీటిలో మునిగిపోయింది. తర్వాత శ్రీకృష్ణుడు ఇక్కడే ద్వారకా నగరాన్ని నిర్మించాడు. శ్రీకృష్ణుని

నిర్యాణా నంతరం మరల ఇది సము ద్రంలో మునిగి పోయింది. ఇప్పటికీ గుజరాత్‌లోని పశ్చిమతీరంలో ద్వారక అనే స్థలం వుంది. – దేవీభాగవతం.

**కుశాగ్రుడు :** కురువంశస్థుడు. బృహద్రథుడి కొడుకు. జరాసందుడి సోదరుడు.

**కుశాద్యం :** ప్రాచీన భారతావనిలో ఓ రాజ్యం. – మహాభారతం

**కుశావర్తం :** ప్రాచీన భారతదేశంలో ఓ పుణ్యస్థలం. – మహాభారతం

**కుశావర్తుడు :** రుషభ రాజు కుమారుడు. ఇతనికి 19 మంది సోదరులు. – భాగవతం

**కుశాశ్వుడు :** సహదేవుని కుమారుడు. సోమదత్తుని తండ్రి. ఇక్ష్వాకు వంశజుడు. – రామాయణం

**కుశాంబుడు 1 :** ఉపరిచరవసువు మూడవ కుమారుడు. మణివాహుడని కూడా అంటారు. వసువు తక్కిన నల్గురు కుమారులు బృహద్రథుడు, మావెల్ల, యదు మరియు రాజన్యుడు.

**కుశాంభుడు 2 :** కుశుని కుమారుడు. అతడు నిర్మించిన నగరం పేరు కుశాంబి. సూర్యవంశపు రాజైన బభ్రశ్రేణ్యుడు ఇతడి కూతురు చార్వాంగిని వివాహ మాడాడు. – బ్రహ్మాండపురాణం

**కుశికుడు :** ప్రసిద్ధిచెందిన చక్రవర్తి. పురువంశజుడు. విశ్వామిత్రుని తాత. గాధికి తండ్రి.

**కుశికాశ్రమం :** కోశీ నదీ తీరాన వున్న ఓ పుణ్యస్థలం. ఇక్కడ కుశికుడను మహర్షి జీవించాడని చెబుతారు. – మహాభారతం

**కుశీదం :** తప్పని పరిస్థితులలో డబ్బును వడ్డీకి వ్వడం, వ్యవసాయం, వ్యాపారం చెయ్యడం బ్రాహ్మణులు వృత్తిగా స్వీకరించడాన్ని కుశీదం అంటారు. – అగ్నిపురాణం

**కుశీదుడు :** ఒక ముని. వ్యాసుని శిష్యపరంపరలోని వాడు. – భాగవతం

**కుశీలవుడు :** మైత్రేయుడి తండ్రి.

★**కుశుడు 1 :** సీతారాముల ఇద్దరు కుమారుల్లో ఒకడు. రెండోవాడు లవుడు. జన్మవృత్తాంతం *:* శ్రీరాముడు సీతను గర్భిణిగా అరణ్యంలో వదలినపుడు ఆమె వాల్మీకి ఆశ్రమంలో నివసించినపుడు లవుడు జన్మించాడు. సీత లవుడిని నదికి స్నానానికి తీసుకు వెళ్లగా ఇది గమనించని వాల్మీకి లవుడు కన్పించక కుశదర్భలతో ఓ బొమ్మను చేసి ప్రాణంపోశాడు. కుశదర్భల వల్ల ప్రాణం పోసుకున్నాడు కనుక కుశుడని పిలవబడ్డాడు. ఆ తర్వాత సీత వచ్చి ఇతడిని కూడా తన కుమారుడిగా పెంచింది. – *ఉత్తర రామాయణం, కథాసరిత్సాగరం*

*కుశుడు అయోధ్యకు చేరిన విధం :* రాముడు సీత బంగారు విగ్రహాన్ని పెట్టుకొని అశ్వమేధయాగం జరపగా అశ్వం వెంట వెళ్లిన శతృఘ్నుడితో లవ కుశులు యుద్ధం చేయగా వాల్మీకి నివారించి వారి ద్దరిని అయోధ్యకు తీసుకువెళ్లగా వీరు రామ కథాగానం చేశారు. రాముడు వీరిని గుర్తించి సీతతో సహా అయోధ్యకు రావించాడు. లక్ష్మణుడి నిర్యాణా నంతరం రాముడు కుశలవులకు తన రాజ్య భాగాన్ని సమంగా పంచగా కుశుడు కుశావతిని రాజధానిగా నిర్మించుకొని పాలించాడు. – *ఉత్తరరామాయణం*

**కుశుడు 2 :** కురువంశంలో జన్మించిన ఒకరాజు. కురు సంతతిలోని సుహోత్రునికి గిరికవల్ల ఏడుగురు పుత్రులు జన్మించగా అందులో కుశుడు ఒకరు. – అగ్నిపురాణం

**కుశేశయం :** కుశ ద్వీపంలోని ఆరు పర్వతాల్లో ఒకటి.

**కుసుంభపర్వతం :** మహామేరువు చుట్టూ వున్న పర్వతాల్లో ఒకటి. – దేవీభాగవతం

**కుసుంభి :** ద్వారక దగ్గరలోని ఓ అరణ్యం. – మహాభారతం

**కుసుమపురం :** పాటలీపుత్రానికి మరోపేరు.

**కుసుమశ్రేష్ఠి :** చూ॥ కన్యకాంబ.

**కుసుముడు :** ధాత స్కందదేవునికిచ్చిన 5 గురు సేవకుల్లో ఒకడు. – మహాభారతం

**కుసుమేషువు :** చూ॥ మన్మథుడు.

**కస్తుంబురుడు :** కుబేరుని కొలువులోని ఓ రాక్షసుడు. – మహాభారతం

★ కథాసరిత్సాగరం లక్ష్మణుడు లవుడ్ని నరమేధం కోసం అయోధ్యకు తీసుకువెళ్లగా అతడ్ని తీసుకొని రావడానికి కుశుడు వెళ్లి లక్ష్మణుడ్ని ఓడించగా రాముడు అతణ్ణి గుర్తించి సీతతో సహా వారిని అయోధ్యకు రావించాడని చెప్తోంది.

**కుహరుడు :** ఓ కళింగరాజు. క్రోధవశుడను రాక్షసుని అంశతో జన్మించాడు. - మహాభారతం

**కుహుడు :** సౌవీర రాజకుమారుడు. జయద్రథుని అనుసరించాడు. - మహాభారతం

**కుహూవు :** అంగిరసుడను ప్రజాపతి కుమార్తె. స్మృతివల్ల అంగిరసునికి నల్గురు కుమార్తెలు కుహూవు కాక సీనీవాలీ, రాకా, అనుమతి. - విష్ణుపురాణం

**కుహూదేవి :** ధాత భార్యలలో ఒకరు.

**కుండజుడు (కుండభేది) :** ధృతరాష్ట్రుని కుమారుడు. కురుక్షేత్రంలో భీముడితణ్ణి వధించాడు. - మహాభారతం

**కుండల :** కౌరవ వంశంలో జన్మించిన సర్పం. జనమే జయుని సర్పయాగంలో బూడిదయ్యింది. - మహాభారతం

**కుండలపురుషుడు :** చూ॥ హస్తసాముద్రిక శాస్త్రం.

**కుండలీ 1 :** గరుడుని పిల్లల్లో ఒకరు. - మహాభారతం

**కుండలీ 2 :** భారతీయులు త్రాగడానికి ఉపయోగించే నీరు వున్న ఒక నది. - మహాభారతం

**కుండలీడు 1 :** ధృతరాష్ట్రుని పుత్రుల్లో ఒకడు. - మహాభారతం

**కుండలీడు 2 :** శ్రీకృష్ణుని మరోపేరు. - భాగవతం

**కుంతి :** పాండురాజు భార్య. పాండవుల తల్లి. శ్రీకృష్ణుని తండ్రి వసుదేవుని సోదరి. అసలుపేరు పృథ. కుంతి భోజుడు అనే రాజుకి సంతానం లేక ఈమెను దత్తత తీసుకోవడం వల్ల కుంతిగా ప్రసిద్ధి కెక్కింది. - మహాభారతం

*కుంతి – మంత్రం :* కుంతిభోజుని ఇంట అతిథులను గౌరవించుట ఈమె దినచర్య. ఒక రోజు దుర్వాస మహర్షి రాగా అతనికి పరిచర్యలు చేయగా అతడు మెచ్చి ఓ మంత్రోపదేశం చేశాడు. అంతేకాక ఆ మంత్రోచ్చారణ చేసి దేవతను కోరుకున్న వారు ప్రత్యక్షమై వారి అంశతో సంతానప్రాప్తి కల్గుతుందని ఆశీర్వదిస్తాడు.

*మంత్ర పరీక్ష :* దుర్వాసుడు వెడలిన తర్వాత ఆమె ఆ మంత్రాన్ని పరీక్షించబోయి మంత్రాన్ని ఉచ్చరించి సూర్యదేవుని తలంచగా అతడు ఓ బ్రాహ్మణ రూపంలో ప్రత్యక్షంకాగా ఈమె తాను కన్యనని తెలియక మంత్రోచ్చారణ చేశానని చెప్పగా ఇది దైవ లిఖితమని కాని దీనివల్ల నీ కన్యత్వానికి నష్టం లేదని తెలియ జేయగా ఆమెకు కర్ణుడు జన్మించాడు. లోకానికి వెరచి ఆమె అతడిని ఓ పెట్టెలో వుంచి నదిలో వదలి వేసింది.

కుంతిభోజుడు స్వయంవరం ప్రకటించగా కుంతి పాండవ రాజుని వరించి వివాహమాడింది. పాండు రాజు మద్రదేశాన్ని జయించి మాద్రిని వివాహ మాడాడు. వీరు ముగ్గురు ఒకసారి అరణ్యానికి వేటకు వెళ్ళి జంతువుల రూపంలో వున్న బ్రాహ్మణులు కామక్రీడ సల్పుచుండగా పాండురాజు వదలిన బాణ ఘాతానికి ముని భార్య చనిపోగా ముని పాండు రాజుని 'నీ భార్యతో సంగమిస్తే మరణిస్తావని'శపిస్తాడు.

ఆ తర్వాత పాండురాజు తన భార్యలను గౌరవ వ్యక్తులతో సంతాన ప్రాప్తి పొందమని చెప్పగా కుంతి తనకున్న వరం చెప్పగా పాండురాజు అంగీకారంతో ఇంద్రుని వల్ల అర్జునునికి, యముని వల్ల భీమ సేనుడికి జన్మనిస్తుంది. తన సవతి మాద్రికి ఈ మంత్ర ఫలంగా అశ్వనీ దేవతలవల్ల నకుల సహదేవులు జన్మి స్తారు. ఓ చలికాలంలో కామోద్రేకంతో మాద్రితో సంగమించబోగా బ్రాహ్మణుని శాపంవల్ల పాండు రాజు మరణించగా కుంతి తన సంతానమైన పాండ వులతో హస్తినకు రాగా మాద్రి పాండు రాజు చితి పైబడి తనూ మరణిస్తుంది.

*కుంతి హస్తినాపుర జీవనం :* కౌరవులతో పాటు పాండవులు విలువిద్య నేర్చుకొంటారు. కౌరవ పాండవుల మధ్య పొడసూపిన వైషమ్యాలు కుంతిని కృంగదీస్తాయి. మాయాజూదంలో రాజ్యంపోయి పాండవులు వనవాసం చేయగా కుంతి హస్తినలో విదురుని ఇంట గడుపుతుంది. వనవాసానంతరం పాండవులు తమ రాజ్యభాగం కోరగా కౌరవులు నిరాకరించగా శ్రీకృష్ణుడు యుద్ధాన్ని ప్రోత్సహిస్తాడు. కుంతి మొదటి సంతానమైన కర్ణుడు మహావీరుడే కాక దుర్యోధనుని స్నేహితుడు అగుట ఎంచి యుద్ధ నివారణకు ఓ నదీ తీరంలో కర్ణుడిని కలసి అతడి జన్మవృత్తాంతమెరిగించి యుద్ధ నివారణ కోరగా అతడు తనకు మైత్రీబంధమే ముఖ్యమని తల్లిగా నీవు

కోరుతున్నావు కనుక అర్జునుణ్ణి తప్ప తక్కిన పాండవులలో అవకాశం వచ్చినా ఎవరిని వధించ నని, నేను మరణించినా, అర్జునుడు మరణించినా పాండవులు ఐదు గురేనని తేల్చి చెప్పాడు. – మహాభారతం

*కుంతి చివరి రోజులు :* మహా భారత యుద్ధానంతరం కర్ణుడు మరెంతోమంది కౌరవ పాండవీరులు చనిపోవడం కుంతికి వ్యధ కల్గించి ధృతరాష్ట్ర గాంధారిలతోపాటు వనవాసం వెళ్లి కొంతకాలానికి అరణ్యపు మంటలలో వారిద్దరితోపాటు మరణించి స్వర్గం చేరుతుంది. – మహాభారతం

**కుందాపరాంతం :** ప్రాచీన భారతదేశంలో ఓ పట్టణ ప్రాంతం. – మహాభారతం

**కుందారిక :** స్కందదేవుని ఓ స్త్రీ సేవిక. – మహాభారతం

**కుందాశి :** ఇతడ్ని కుండాలీడు అనికూడా అంటారు. ధృతరాష్ట్రుని పుత్రుడు.

**కుండికుడు :** కురువంశంలోనివాడు. ధృతరాష్ట్రుని కుమారుడు. – మహాభారతం

**కుండినగరం :** విదర్భ రాజ్య రాజధాని. ధమయంతి ఇక్కడే పుట్టిపెరిగింది.

**కుండీవృశం :** ప్రాచీన భారతదేశంలో ఓ పట్టణ ప్రాంతం. – మహాభారతం

**కుండీవిశం :** ప్రాచీన భారతదేశంలో ఓ పట్టణ ప్రాంతం. – మహాభారతం

**కుందుడు :** ఓ బ్రహ్మర్షి. జనమేజయుని సర్ప యాగంలో పాల్గొన్నాడు. – మహాభారతం

**కుండభేది :** ధృతరాష్ట్రుని కుమారుడు. భీముడితణ్ణి చంపాడు. – మహాభారతం

**కుండోధరుడు 1 :** ధృతరాష్ట్రుని కుమారుడు. కుండధారుడని అంటారు. కురుక్షేత్రంలో భీముడి తణ్ణి చంపాడు. – మహాభారతం

**కుండోధరుడు 2 :** ఓ ప్రసిద్ధి గాంచిన సర్పం. – మహాభారతం

**కుండోధరుడు 3 :** జనమేజయుని ఆరవ కుమారుడు. జనమేజయునికి 8 మంది కుమారులు. వారు ధృతరాష్ట్రుడు, పాండు, బాల్హిక, నిషధ, జాంబు నాధ, కుండోధర, పదాతి మరియు వసాతి.

**కుంతలం :** ప్రాచీన దక్షిణ భారతదేశంలో ఓ రాజ్యం. దీని రాజుని కుంతలుడని, ప్రజల్ని కుంతలులని పిలిచేవారు.

**కుంతలుడు :** ఇతడ్ని కుంతకుడని కూడా పిలుస్తాడు. 11వ శతాబ్దివాడు. సంస్కృతకవి. అభినగుప్తుని సమకాలికుడు. నిజమైన కవిత్వం వక్రోక్తి అనే వాడు. వక్రోక్తి అంటే సాదాగా సూటిగా చెప్పకుండా అలంకృతంగా చుట్టూ పరిభ్రమిస్తూ చెప్పాలని అర్థం.

**కుంతిపురి :** ఇప్పటి గ్వాలియర్ పట్టణానికి పూర్వనామం కుంతిపురి.

**కుంతిభోజుడు :** సూరసేనుని సోదరి కుమారుడు. యదువంశ రాజు. వసుదేవుని తండ్రి. ఇతడు కుంతిని పెంచిన తండ్రి. వసుదేవుని కుమారుడే శ్రీకృష్ణుడు. సూరసేనుని కుమార్తె కుంతి. కుంతి భోజుని కుమారుని పేరు కూడా కుంతిభోజుడే. సహదేవుడు ఒకసారి ఈ దేశాన్ని జయించాడు. ఇతడు ధర్మజుని రాజసూయయాగంలో పాల్గొ న్నాడు. ఇతడు పాండవులకు మేనమామలు. కురు క్షేత్ర యుద్ధంలో పాండవుల పక్షాన పోరాడాడు. మొదటిరోజు యుద్ధంలో విందార విందులతో యుద్ధం చేశాడు. దృష్టద్యుమ్నుడు క్రౌంచ వ్యూహం పన్నినపుడు దానికంటి స్థానంలో నిలబడ్డాడు. మకర వ్యూహంలో పాదాల వద్ద నిలబడ్డాడు. అలంబసునితో యుద్ధం చేశాడు. ఇతని పదిమంది పుత్రుల్ని అశ్వత్థామ సంహరించాడు.

**కుంభకర్ణాశ్రమం :** ఓ పుణ్యస్థలం. దీనిని దర్శించిన వారు ఇతరుల గౌరవం పొందుతారు.

★ **కుంభకర్ణుడు :** రావణుని సోదరుడు.

*వంశవృక్షం :* విష్ణు – బ్రహ్మ – పులస్త్య – విశ్రవసు – కుంభకర్ణుడు.

విశ్రవసువుకి కైకసికి జన్మించిన ముగ్గురు పుత్రులు రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు. పుష్పోత్కట విశ్రవసులకు రావణ, కుంభకర్ణులు, విశ్రవసు రాకాలకు విభీషణుడు, విశ్రవసు మాలినిలకు ఖర, శూర్పణఖ జన్మించారు . – రామాయణం

*కుంభకర్ణుని పూర్వజన్మలు :* పూర్వజన్మలో రావణ కుంభకర్ణులు జయ, విజయలను దేవతలు. వీరు

★ అగ్నిపురాణం పుష్పోత్కట, కైకసి ఒకరేనని చెప్తోంది.

విష్ణు ద్వారం వద్ద కాపలాదారులు. సనకమహర్షిని ఇతరుల్ని విష్ణుదర్శనం కాకుండా ద్వారం వద్ద ఆపడంతో వీరిద్దరిని రాక్షసులుగా పుట్టమని శపిస్తారు. వీరు విష్ణువుని శరణువేడగా 3 రాక్షస జన్మల తర్వాత దేవలోకం వస్తారని శాపవిమో చనంగావిస్తాడు. విజ యుని మూడు రాక్షసజన్మలు హిరణ్యకశిపుడు, కుంభకర్ణుడు, దంతవక్రుడు.

*కుంబకర్ణుని వివరాలు :* కుంభకర్ణుడు తన సోదరులతో గంధమాదన పర్వతంపై తన తండ్రి ఆశ్రమంలో పెరిగేవాడు. అప్పటికే కుబేరుడు గొప్పవాడై లబ్ధప్రతిష్టుడయ్యాడు. ఇది చూసి రావణ, కుంభ కర్ణ, విభీషణులు ఒకే కాలుపై నిలబడి 1000 సంవత్సరాలు తపమాచరించారు. అయినా బ్రహ్మ ప్రత్యక్షం కాలేదు. వీరు తపస్సు విరమించలేదు. మరో 100 సంవత్సరాలు తపస్సు చేశారు. వీరికి ఖర, శూర్పణఖలు సహాయం చేశారు. రావణుడు తన 10 తలల్ని నరికి వేసుకోగా బ్రహ్మ ప్రత్యక్షమై మానవులతో తప్ప ఇతరులతో నీకు మరణం లేదని వరమిస్తాడు. కుంభకర్ణుడు కూడా అలాంటి వరమే కోరతాడేమోనని దేవతలు భయపడి సరస్వతిని వేడుకోగా ఆమె కుంభకర్ణుని నాలుకపై ప్రవేశించి అతడు 'నిర్దేవతం' అని కోరబోగా 'నిద్రావత్వం' అని కోరాడు. అందుకని అతడు సంవత్సరంలో 6 నెలలు నిద్రలో, మరో 6 నెలలు మేల్కొని వుంటాడు. వీరు బ్రహ్మాస్త్ర ప్రయోగం వరంగా పొంది కుబేరుడ్ని పారద్రోలి లంకను వశం చేసుకుంటాడు.

*కుంభకర్ణుని మరణం :* రామ, రావణ, యుద్ధంలో లక్ష్మణుడు, సుగ్రీవుడు కుంభకర్ణునితో యుద్ధంచేసి అతణ్ణి జయించలేక పోతారు. రాముని అస్త్రాలతో మరణిస్తాడు.

*ఇతర విశేషాలు :* ఇతడు పాపి అని చెప్పడానికి వీల్లేదు. రావణునికి చక్కటి సలహాలు ఇచ్చేవాడు. రామరావణయుద్ధం ముందు రావణుడు ఏర్పరచిన సమావేశంలో ఎవరి సలహా లేకుండా సీతను అపహరించడం తప్పని వాదిస్తాడు. అయితే సోదరుడు కనుక నీతోనే వుండి రాముడితో యుద్ధం చేస్తానని ప్రకటిస్తాడు.

**కుంభకుడు 1 :** స్కందదేవుని వెంటవున్న వీరుల్లో ఒకడు. – మహాభారతం

**కుంభకుడు 2 (నికుంభకుడు) :** ప్రసిద్ధి చెందిన మహర్షి. సాయంత్రానికి ఏ వూరువెళ్తే అక్కడి నుండి 1000 సంవత్సరాల తర్వాత వెళ్లేవాడు. క్షేమక రాక్షసుడ్ని చంపిన తర్వాత దివోదాసు కాశీని పాలించేవాడు. ఆ సమయంలో ఈ మహర్షి కాశీ వెళ్లాడు. అతడి ఆశ్రమం చుట్టూ 3 యోజనాల వరకు సశ్యశ్యామ లంగా వుండేది. కాశీకి కరువు తాండవించగా అక్కడి ప్రజలు తమ గోవులని ఈ ఆశ్రమం వద్దకు తెచ్చి పోషించుకునేవారు. ఒకసారి వాటితోపాటు కుంభ కుడు గోవునికూడా తీసుకొనిపోగా ఇతడు కాశీని ఎడారిగా మారేట్లు శపించాడు. దివోదాసు. గోమతి ఒడ్డున మరో రాజ్యం స్థాపించాడు.

**కుంభయోని 1 :** చూ॥ అగస్త్య.

**కుంభయోని 2 :** అర్జునుడు ఇంద్రలోకం వచ్చినపుడు నృత్యం చేసిన అప్సరస. – మహాభారతం

**కుంభరేతసుడు :** రత ప్రభు, రతద్వానుడు అని కూడ అంటారు. భరద్వాజుడు వీరాలకు జన్మించిన అగ్ని దేవుడే కుంభరేతసుడు.

**కుంభవక్రుడు :** స్కందదేవుని పరివారంలోని ఒక వీరుడు. – మహాభారతం

**కుంభశ్రవసుడు :** స్కందదేవుని ఒక సేవకుడు. – మహాభారతం

**కుంభాండుడు :** బాణాసురుని మంత్రి. ఇతని కూతురు చిత్రలేఖ బాణాసురుని కుమార్తె. ఉషకు స్నేహితురాలు. – భాగవతం

**కుంభీనది :** సుమతి అనే రాక్షసునికి కేతుమతి వల్ల జన్మించిన కూతురు. మధుర రాజు మధుపుడు ఈమెను ఎత్తుకుపోగా రావణుడు అతణ్ణి చంపాడు.

**కుంభీనస :** ఓ క్రూర రాక్షసుడు. – మహాభారతం

**కుంభీనసి 1 :** అంగారపర్ణుడను గంధర్వుని భార్య. అర్జునుడు చిత్రరథుణ్ణి చంపబోగా ఈమె యుధిష్ఠరుడ్ని తన భర్తను కాపాడమని అడుగుతుంది. అతడు అలాగే రక్షింపబడ్డాడు.

**కుంభీనసి 2 :** విశ్వవసువుకి అనలవల్ల కల్గిన కూతురు. మధువను రాక్షసుడు ఎత్తుకుపోయి వివాహం చేసుకోగా లవణాసురుడు జన్మిస్తాడు.

**కుంభీపాకం :** 28 నరకాల్లో ఇదొకటి. ఆహారం కోసం హానికరం కాని జంతువుల్ని, పక్షుల్ని చంపినవాడు ఈ నరకంలో శిక్షింపబడతారు. – దేవీభాగవతం

**కుంభుడు :** కుంభకర్ణుడి కొడుకు. అంగదుని కొడుకుని యుద్ధంలో ఓడిస్తాడు. సుగ్రీవుడు ఇతణ్ణి వధిస్తాడు. – రామాయణం

**కూటుడు :** కంసుడు మధురలో ధనుర్యజ్ఞం చూడటానికి వెళ్లిన శ్రీకృష్ణుడ్ని చంపడానికి వినియోగించిన వారిలో ఒకడు. చానురుడు, ముష్టికుడు, శాలుడు, కోసల అనే వారిని కూడా కంసుడు ఇందుకు వినియోగించాడు. – భాగవతం

**కూర్మపురాణం :** అష్టాదశ పురాణాల్లో ఒకటి. – చూ॥అష్టాదశ పురాణాలు

**కూర్మం :** ఓ ప్రసిద్ధ సర్పం – కద్రువ సంతతి. – మహాభారతం

**కూర్చాముఖుడు :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు. వీరు బ్రహ్మావాదినులు. – మహాభారతం

**కూష్మాండకం :** ఓ ప్రసిద్ధ సర్పం. – మహాభారతం

**కేకటుడు :** సంకటుడి కుమారుడు. ఇతడికి దుర్గాభిమానులైన దేవతలు జన్మించారు.

**కేకయుడు 1 (కేకయరాజు) :** శిభిచక్రవర్తి నలుగురు కుమారుల్లో కేకయుడొకరు. ఇతడు పాలించిన దేశాన్ని కేకయమని, ప్రజల్ని కేకయులని పిలిచే వారు. ఇతడు ధర్మపాలన చేయుచుండగా ఒకరోజు బటయకు వెళ్లగా ఓ రాక్షసి ఇతనిని బట్టుకొనెను. అతడు నా రాజ్యమునందు ఏ వర్గము వారును తమ ధర్మములు తప్పుటలేదే, నాయందే లోటులేదే ఏలా నన్నిట్లు పట్టితివని అడిగెను. ఇట్లు వర్గ రక్షణము చేయు రాజ్యానికెన్నడును కీడురాదని తెలుపుటకే నిన్ను పట్టు కొంటినని చెప్పి అతనిని వదలి వెళ్లెను. – మహాభారతం ఇతడు కైకేయి తండ్రి. ఒక సిద్ధుడిచ్చిన వరము వలన మృగకోటి భాష ఇతనికి తెలియును. ఒకనాడు చీమలు మాట్లాడుకొనుచుండగా అది వినిన ఇతనికి నవ్వువచ్చెను. భార్య ఏల నవ్వితిరని అడుగగా అది చెప్పిన మరణము సంభవించునని చెప్పకుండెను. అయినను చెప్పమని అడుగగా సిద్ధుడు చెప్పవద్దని ఆజ్ఞ ఇచ్చెను గాన చెప్పననెను. – రామాయణం

**కేకయుడు 2 :** సూర్యవంశపు రాజు. ఇద్దరు మాళవ రాజకుమార్తెలను వివాహమాడగా పెద్దభార్యకు కీచకుడు, ఉపకీచకులు చిన్న భార్యకు కేకయి (సుదేష్ణ) జన్మించెను. ఈ సుదేష్ణ విరాటరాజైన మత్స్యరాజు భార్య. – మహాభారతం

**కేకరలోహితం :** ఇదో సర్పం. చ్యవనమహర్షి శివుడ్ని ప్రార్థించిన నకులేశ్వర తీర్థంలో స్నానం చేయుచుండగా ఈ కేకరలోహితం ఇతడ్ని కాటువేసి పాతాళానికి లాక్కుపోయింది. చ్యవనుడు ధ్యానం చేయగా ఆ విషం ఇతని శరీంలోకి ఎక్కకపోవడం వల్ల వదలివేసింది. పాతాళం నుండి నాగకన్యలతో వచ్చిన చ్యవనుడు ప్రహ్లాదుడ్ని కలిసి భూగోళంలోని పుణ్యతీర్థాలను గురించి వర్ణించాడు. ఆ తర్వాత ప్రహ్లాదుడు నైమిశారణ్యం దర్శించాడు. – వామన పురాణం

**కేతకి :** ఓ పుష్పం. ఇది శివుని శిరస్సుపై అలంకరించబడినా పూజార్హంకాదు. దానికి కారణం శివలింగపు ఆద్యంతాలు చూడటానికి బ్రహ్మ విష్ణువులు పోటీ పడగా ఈ మొగలిపువ్వు బ్రహ్మ తరపున తప్పుడు సాక్ష్యం చెప్పడం వల్ల శివుడు పూజార్హం కాకుండా శపించాడు.

**కేతు 1 :** ప్రాచీన భారతదేశంలో ఓ ముని. ఆత్మజ్ఞానంతో మోక్షం పొందాడు. – మహాభారతం

**కేతు 2 :** శివుని మరో పేరు.

**కేతుమతి :** రావణుని మంత్రి అయిన ప్రహస్తుని తల్లి. ఈమెకు మరోఇద్దరు సోదరీమణులు కలరు. వారు సుందరి, వసుధ. వీరు ముగ్గురు గంధర్వస్త్రీ కుమార్తెలు. దైవవతి వల్ల సుకేశుడికి ముగ్గురు కుమారులు జన్మించారు. వారు మాల్యవంతుడు, సుమాలి, మాలి. వీరు ముగ్గురు సుందరి, కేతు మతి, వసుధలను వివాహమాడారు. కేతుమతి సుమాలికి భార్య. వీరికి 10 మంది కుమారులు. ఇందులో ప్రహస్తుడు, అకంపనుడు ముఖ్యులు. వీరిలో ఎక్కువ మంది రావణుని మంత్రులు. – ఉత్తర రామాయణం.

**కేతురథుడు :** భగీరథుని తండ్రి, కేతుమంతుడి కొడుకు. కాశ్యుని వంశస్తుడు.

**కేతుమానుడు 1 :** ఓ దానవుడు. బ్రహ్మ కుమారుడైన కశ్యపదనువులకు జన్మించాడు. ఇతడు ఓ గ్రహంగా విలసిల్లాడు. ఇతడికి 33 సోదరులు. – మహాభారతం

**కేతుమానుడు 2 :** ధర్మజుని సభలో ఓ సభ్యుడు. మహాభారత యుద్ధంలో కౌరవుల పక్షాన పోరాడి భీముని చేతిలో మరణించాడు. – మహాభారతం

**కేతుమానుడు 3 :** పాండవుల పక్షాన పోరాడిన యోధుడు. ధృతరాష్ట్రుడు ఇతడి శక్తి సామర్థ్యాలు ఒకసారి వివరిస్తాడు. – మహాభారతం

**కేతుమానుడు 4 :** సృష్టి మొదలైనపుడు బ్రహ్మ నాల్గు దిక్కుల నల్గురిని కాపలా వుంచాడు. కేతుమానుడు పశ్చిమానికి కాపలాదారు. – అగ్నిపురాణం

**కేతుమానుడు 5 :** పురు వంశంలోని ఒక రాజు. – మహాభారతం

**కేతుమానుడు 6 :** ఆయుర్వేదాన్ని ప్రపంచాని కందించిన ధన్వంతరి కొడుకు. ఇతని కొడుకు భీమ రథుడు. – భాగవతం

**కేతుమానుడు 7 :** ఏకలవ్యుని కొడుకు. ఆటవిక రాజు. కౌరవుల పక్షాన పోరాడి భీమునిచే వధించబడ్డాడు. – మహాభారతం

**కేతువర్మ :** త్రిగర్త దేశానికి రాజు. సూర్యవర్మ చిన్న తమ్ముడు. అర్జునుడు అశ్వమేధయాగంలో అశ్వాన్ని ముందుండి నడిపినపుడు ఇతడు అర్జునుని వెంట వున్నాడు. – మహాభారతం

**కేతుశృంగుడు :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు.

**కేదారం 1 :** హిమాలయ పర్వతాల్లో ఒక శిఖరం. ఇక్కడో శివలింగం వుంది.

**కేదారం 2 :** కురుక్షేత్రంలో ఒక పవిత్ర స్థలం. జ్యోతిర్లింగాలలో ఒకటి ఇక్కడ వుంది. – మహాభారతం

**కేదారేశ్వర వ్రతం :** ఆశ్వయుజ బహుళ చతుర్థశిన ముత్తయిదువలు భర్త అనుగ్రహంకోసం చేసే వ్రతం. – చూ॥ అర్ధనారీశ్వరి

**కేదారేశ్వరుడు :** ఒక శివుని మూర్తి. చూ॥ అర్ధనారీశ్వరి.

**కేరకులు :** ప్రాచీన భారతదేశంలోని ఓ దేశపు ప్రజల్ని కేరకులు అంటారు. సహదేవుడు ఈ రాజ్యాన్ని జయించాడు. – మహాభారతం

**కేరళ :** భారతదేశానికి నైరుతి మూలనున్న ప్రాంతం. ఇది సముద్రంలో మునిగిపోగా పరశురాముడు తను జయించిన రాజ్యాలను కశ్యపుడి కివ్వగా తాను నివసించడానికి భూమి లేక ఓ బాణాన్ని సముద్రం లోకి సంధించగా సముద్రుడు అంతవరకూ వెనక్కు వెళ్లగా ఈ దేశం తిరిగి ఏర్పడింది. అందుకే దీన్ని శూర్పారకం అనికూడా పిలుస్తారు. – బ్రహ్మాండపురాణం

యదు సోదరుడైన తుర్వాసుడి వంశంలో గాంధారుడనే రాజు జన్మించాడు. ఇతడి నుండే గాంధార, కేరళ, చోళ, పాండ్యాది కుటుంబాలు ఆవిర్భవించాయి. – అగ్నిపురాణం

**కేరళుడు :** సుధృతి కొడుకైన నరుడి కొడుకు. ఇతడు పాలించిన దేశమే కేరళదేశం. ఇతడు మరుత్తు వంశంవాడు. – విష్ణుపురాణం

**కేవలం :** ప్రాచీన భారతదేశంలో ఒక పట్టణం. – మహాభారతం

**కేవలుడు :** సౌదృతేయుడి కుమారుడు. ఇతడి కుమారుడు బంధుమిత్రుడు – భాగవతం

**కేశమంత్రి :** స్కందుడి అనుచరుడు. – మహాభారతం

**కేశవుడు :** చూ॥ కృష్ణుడు.

**కేశి 1 :** ఒక రాక్షసుడు. ఇంద్రుడితో పోరి ఓడిపోతాడు. విష్ణువుకు కేశికి 13 రోజుల భీకర యుద్ధం జరుగుతుంది. – మహాభారతం

**కేశి 2 :** కంసుడి అనుచరుడు. శ్రీకృష్ణుణ్ణి చంపడానికి అశ్వరూపంలో గోకులానికి వెళ్లి శ్రీకృష్ణుని చేతిలో మరణిస్తాడు. అందుకనే శ్రీకృష్ణుణ్ణి కేశవుడంటారు.

**కేశి 3 :** వసుదేవుడి కొడుకు. కౌసల్య ఇతని తల్లి. – భగవద్గీత

**కేశిద్వజుడు :** కృతద్వజుడి కొడుకు. చూ॥ ఖాండిక్యుడు.

**కేశిని 1 :** కశ్యపునికి ప్రథవల్ల జన్మించిన 12 మంది దేవ కన్యలలో ఒకరు. ఆ పన్నెండు మంది అలంబుస, మిశ్రకేశి, విద్యుత్పర్ణి, తిలోత్తమ, అరుణ, రక్షిత, రంభ, మనోరమ, కేశిని, సురత, సురజ మరియు సుప్రియ. – మహాభారతం

**కేశిని 2 :** అజమీఢుని భార్య. ఇతనిది పూరు వంశం. ఈమెవల్ల ఇతనికి ముగ్గురు కుమారులు. జహ్నుడు, వ్రజుడు, రూపిణుడు. – అగ్నిపురాణం

**కేశిని 3 :** దమయంతి యొక్క సేవకురాలు. ఋతుపర్ణుని సారధి బాహుకుడిగా నలుడు వచ్చిన పుడు దమయంతి కోరికపై బాహుకుడికి కొన్ని పరీక్షలు పెట్టి నలుడేనని నిర్ధారించింది. – మహాభారతం

**కేశిని 4 :** పార్వతి యొక్క సేవిక - *మహాభారతం*

**కేశిని 5 :** అంగిరసుని కుమారుడు సుధాన్యుడికి, ప్రహ్లాదుని కుమారుడు విరోచనుడికి కేశిని అనే ఆమెను వివాహమాడగోరి బ్రాహ్మణులు గొప్ప వారా, అసురులు గొప్పవారా అని పోట్లాడు కొని ప్రహ్లాదుని తీర్పుకోరగా ప్రహ్లాదుడు బ్రాహ్మణులే గొప్పవారని తీర్పుచెప్పాడు. అందుకని సుధాన్యుడు విరోచనుడ్ని చంపకుండా వదలి వేస్తాడు. అయితే కేశిని చెంత సుధాన్యుడి పాదాలు కడగమని విరోచనుడ్ని కోరగా అట్లే చేస్తాడు. కేశిని సుధాన్యుడ్ని వివాహమాడుతుంది. - *మహాభారతం*

**కేసరి :** ఓ ఆటవిక రాజు. మహామేరువుపై నివసించే వాడు. హనుమంతుని తల్లి అంజనాదేవికి భర్త. పార్వతి గర్భం వాయువుకివ్వగా వాయువు అంజనా గర్భంలో ఉంచగా అది వానర రూపంలో ఆంజనే యుడిగా జన్మిస్తుంది. అందుకనే హనుమంతుడిని అంజనాపుత్రుడుగా కాక కేసరీపుత్ర అనికూడా పిలుస్తారు. - *మహాభారతం*

**కేసి :** ఒక రాక్షసుడు. అరిష్టనేమి కూతురైన దేవసేనను ఎత్తుకుపోగా ఇంద్రుడితణ్ణి సంహరించి ఆమెను రక్షిస్తాడు. - *మహాభారతం*

**కేసరం :** శాక ద్వీపంలో ఒక పర్వతం. ఈ పర్వతం మీద గాలి ఎల్లప్పుడు సువాసనలు వెదజల్లుతుంది. - *మహాభారతం*

**కైకసి :** బ్రహ్మ సంతతి పరంపరలోని స్త్రీ. కేతుమతి వల్ల సుమాలికి 10 మంది కుమారులు, నలుగురు కూతుర్లు జన్మించారు. ఒకసారి భార్యా పిల్లలతో ప్రయాణి స్తుండగా విశ్రవసు కుమారుడైన వైశ్రా వణుడికి చాలామంది పూజలు చేయడం గమనించి కైకసిని విశ్రవసుని ఇంట వుంచుతాడు. ఆమె సేవ లకు మెచ్చి ఆమెను వైశ్రావణుడు భార్యగా గ్రహిస్తాడు. అతని వల్ల కైకసికి జన్మించినవారే రావణ కుంభకర్ణ విభీషణులు. కుమార్తె శూర్పణక. - *ఉత్తర రామాయణం*

**కైకేయి 1 :** అజమీఢుడి భార్యల్లో ఒకరు. - *మహాభారతం*

**కైకేయి 2 :** దశరథుని ముగ్గురు భార్యలో ఒకరు. కేకయు రాజు సోదరి.

*దశరథుని వరాలు :* ఒకసారి దేవతలకు సాంబుడి మధ్య జరిగిన యుద్ధంలో దశరథుడు దేవతల తరపున పోరాడాడు. ఆ పోరాటంలో దశరథుడు తన రథాగ్ని ఒకేసారి 10 ముఖాల తిప్పి యుద్ధం చేసినపుడు రథపు శీల ఊడిపోగా కైకేయి తన బొటన వేలిని శీలగా వుంచింది. యుద్ధానంతరం దశరథుడు ఇది గుర్తించి ఆమెను రెండు వరాలు కోరుకొమ్మనగా తనకప్పుడు అవసరం లేదని అవసరమయినప్పుడు కోరుకుంటానని చెప్తుంది.

*శ్రీరాముని అరణ్యవాసం :* దశరథుడు శ్రీరామునికి పట్టాభిషేకం చేయ నిశ్చయించగా కైకేయి సేవిక మందర కైకేయితో భరతుడిని పట్టాభిషిక్తుడ్ని చేయ మని సలహా ఇస్తుంది. కైకేయి అప్పుడు దశరథుడిని తనకిచ్చిన రెండు వరాలు ఇమ్మని కోరగా అతను అంగీకరించాడు. అప్పుడామె మొదటి వరం భరతు డిని పట్టాభిషేకం చేయడం, రెండవది శ్రీరాముడిని అరణ్యవాసానికి పంపడం అని కోరుకుంటుంది. అతడు మూర్ఛిల్లినా ఆ మాటకు కట్టుబడి నెరవేర్చుతాడు.

**కైకేయి 3 :** చూ॥ సుధేష్ణ.

**కైటవం :** ప్రాచీన భారతావనిలో ఓ రాజ్యం. - *మహాభారతం*

**కైటవుడు :** శకుని కుమారుడైన ఉలూకుని మరో పేరు. - *మహాభారతం*

**కైటబుడు :** చూ॥ మధుకైటబులు.

**కైలగిల :** ఇదో పట్టణం. పూర్వం ఇది కొంకణ ప్రాంతా నికి రాజధానిగా వుండేది.

**కైలాసకం :** కశ్యపుని వంశంలో జన్మించిన ఓ సర్పం. - *మహాభారతం*

**కైలాసం :** మహామేరువు 18 వేల నాజికాసులు వుంటుంది. ఎత్తు 2 వేల నాజికాలు వుంటుంది. దక్షిణం దిశగా కైలాస పర్వతం, కరవీర పర్వతం వుంటాయి. శివునికి కుబేరునికి ఇది నివాసస్థలం. శివుడ్ని ప్రసన్నుడ్ని చేసుకోవడానికి మహావిష్ణువు ఒకసారి, సగరుడొకసారి, భగీరథుడు గంగను భూమి పైకి తేవడానికి ఒకసారి కైలాసంపై తపస్సు చేశారు. ఇది 100 యోజనాల ఎత్తు వుంటుంది. యక్ష, కింపురుష, గంధర్వ, రాక్షసులకు ఇది నిలయం. - *మహాభారతం*

**కైశికుడు :** చూ॥ జ్యామఘుడు.

**కైశికం :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజ్యం. విదర్భ రాజైన భీష్మకుడు దీన్ని జయిస్తాడు. – మహాభారతం

**కొట్టువ :** కొట్టువ అనగా ఆవలించడం. బ్రహ్మ నుండి వరాలు పొంది వృత్రాసురుడు ఇంద్రుణ్ణి మింగుతాడు. దేవతలంతా బృహస్పతి సలహా మేరకు వృత్రాసురుడ్ని ఆవలించేటట్లు చేస్తారు. నోరు తెరచిన తర్వాత అతడికి కష్టమవుతుంది. ఈ సమయంలో ఇంద్రుడు బయటకి వస్తాడు.

**కొమరసామి :** చూ॥ కుమారస్వామి.

**కొల్లగిరేయ :** ప్రాచీన దక్షిణ భారతదేశంలో ఓ రాజ్యం. అర్జునుడు దీన్ని జయించాడు. – మహాభారతం

**కొల్లవర్షం :** మళయాళ శకవర్షం. దీని ప్రారంభ విషయంలో ఎన్నో వాద ప్రతివాదాలున్నాయి.

**కొంకణం :** ప్రాచీన దక్షిణ భారతదేశంలో ఒక రాజ్యం. – మహాభారతం

**కోకనుదుడు 1 :** ఒకరాజు. ఇతడర్జునుణ్ణి క్షమించమని కోరతాడు. – మహాభారతం

**కోకనుదుడు 2 :** స్కంద దేవుడి యోధుల్లో ఒకడు. – మహాభారతం

**కోకవకం :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజ్యం. – మహాభారతం

**కోకాముఖం :** ఇదో పవిత్ర స్థలం. ఇక్కడ స్నానం చేస్తే పూర్వజన్మలు గుర్తుకు వస్తాయి. – మహాభారతం

**కోకిల :** చూ॥ ధింధిక.

**కోకిలకుడు :** స్కందదేవుని పరివారంలోని ఓ యోధుడు. – మహాభారతం

**కోకిలాదేవి :** ద్రుపదుడి భార్య. – మహాభారతం

**కోటరకం :** కశ్యపుడి వంశంలో జన్మించిన ఒక సర్పం. – మహాభారతం

**కోటికాస్యుడు :** జయద్రధుడి అనుచరుడు. పాండవులు కామ్యకవనంలో వున్నప్పుడు ద్రౌపది ఒంటరిగా వున్నప్పుడు జయద్రధుడితణ్ణి ద్రౌపది వద్దకు పంపుతాడు. ఇతడు సురధుడి కొడుకు. భీముడితణ్ణి సంహరిస్తాడు. – మహాభారతం

**కోటి తీర్థం :** ఒక పవిత్రస్థలం. ఇక్కడ స్నానం చేస్తే అశ్వమేధ యజ్ఞం చేసిన ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**కోటీశం :** వాసుకి వంశంలో జన్మించిన ఓ సర్పం. – మహాభారతం

**కోపవేగుడు :** ఒక రుషి. ధర్మరాజుకి సలహాలిస్తుంటాడు. – మహాభారతం

**కోలగిరి :** ఇది ప్రాచీన దక్షిణ భారతదేశంలోని ఒక ప్రాంతం. సహదేవుడు ఈ ప్రాంతాన్ని జయిస్తాడు. – మహాభారతం

**కోలశ్రూప :** కేరళలోని ఒక రాజవంశం.

**కోలాహలం :** ఒక పర్వతం. హిమవంతుడి కొడుకు. శుక్తిమతి అనే నదిని కామిస్తాడు. వీరికి వసువ ధుడు, గిరిక జన్మిస్తారు. శుక్తిమతి ప్రవాహానికి అడ్డుగా వున్నందున దీన్ని వసురాజు కాలితోతన్ని మార్గం చేస్తాడు. – మహాభారతం

**కోలాహలుడు :** ఇతడో రాక్షసుడు. దేవదానవుల యుద్ధంలో మాల్యవంతుడితణ్ణి చంపుతాడు. – పద్మపురాణం

**కోలిక :** చూ॥ దిండిక

**కోలి సర్ప :** ఇదో మానవ జాతి. వీరు క్షత్రియులు. ఓ బ్రాహ్మణుడి శాపం వల్ల శూద్రులయ్యారు. – మహాభారతం

**కోశకారుడు :** చూ॥ నిశాకారుడు.

**కోశలులు :** కోశల దేశ క్షత్రియులు. జరాసంధునికి భయపడి దక్షిణ దేశాలకు పారిపోయారు.

**కోస్తవనం :** ఇదో పర్వతం. ఇది ఇతర పర్వతాలకంటే పెద్దది. – మహాభారతం

**కోసలం :** సరయూ తీరంలోని దేశం. దీనికి రాజధాని అయోధ్య. దీన్ని మనువు నిర్మించాడు.

**కోసలుడు :** కంసుని మల్లయోధుల్లో ఒకడు. కంసుని ప్రముఖ మల్లయోధులు చానూర, ముష్టిక, కూట, శాల, కోసల.

**కోష :** భారతదేశంలోని ఓ నది. దీని నీటిని భారతీయులు త్రాగేవారు. – మహాభారతం

**కోహళుడు 1 :** ఒక సంగీత శాస్త్ర కర్త.

**కోహళుడు 2 :** ఒక పండితుడు. సర్పయాగంలో పాత్రధారి. భగీరధుడు ఇతడికి లక్షదేనువులను ఇస్తాడు.

**కౌకిలికుడు :** స్కందదేవుడి అనుచరుడు. – మహాభారతం

**కౌకుహకం :** దక్షిణ భారతదేశంలోని ఓ ప్రాచీన ప్రాంతం. - *మహాభారతం*

**కౌటిల్యుడు :** చూ॥ చాణుక్యుడు.

**కౌణపం :** వాసుకి వంశంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో బూడిదౌతుంది. - *మహాభారతం*

**కౌణపాషాణం :** కౌరవుడి వంశంలో జన్మించిన ఓ సర్పం. - *మహాభారతం*

**కౌణికుత్స్యుడు :** ఓ ఉన్నత బ్రాహ్మణుడు. పాము కాటుతో మరణించిన ప్రమద్వరుడ్ని చూడటానికి వచ్చాడు. - *మహాభారతం*

**కౌత్సుడు :** ఓ ఉన్నత బ్రాహ్మణుడు. జనమేజయుని సర్పయాగానికి వచ్చాడు. - *మహాభారతం*

**కౌథుమి :** హిరణ్యనాభుడను బ్రాహ్మణుడి కొడుకు. ఇతడు ఒకసారి జనకుని కొలువులో ఇతర బ్రాహ్మణులతో సంవాదం చేసి కోపంతో ఓ బ్రాహ్మణుడ్ని చంపాడు. అప్పటి నుండి అతడు కుష్ఠువ్యాధితో బాధపడి తండ్రి సలహాపై సూర్యుడ్ని ప్రార్థించి కుష్ఠువ్యాధి నుండి విముక్తి పొందుతాడు. - *భవిష్య పురాణం*

**కౌమదకి :** శ్రీకృష్ణుడి గదపేరు. ఖాండవ వనాన్ని దహించేటపుడు వరుణుడు శ్రీకృష్ణుడికి బహు మతిగా ఇస్తాడు. - *మహాభారతం*

**కౌరవుడు :** కద్రువ కుమారుడు. - *మహాభారతం*

**కౌరవులు :** ప్రసిద్ధ రాజైన కురురాజు సంతతి వారిని కౌరవులంటారు. శంతనుని కుమారుడు భీష్ముడు తన తండ్రికి వివాహం చేయడానికి తాను వివాహమాడనని ప్రతిజ్ఞ చేసి సత్యవతితో శంతనునికి వివాహం జరిపించాడు. వారికి చిత్రాంగధుడు, విచిత్రవీర్యుడు జన్మించగా విచిత్రవీర్యుడు అకాల మరణం చెందుతాడు. భీష్ముడు కాశీరాజు కుమార్తెలైన అంబిక, అంబాలికలను చిత్రాంగదుడికిచ్చి వివాహం జరిపించగా అనతికాలంలోనే చిత్రాంగధుడు చనిపోతాడు. వంశ వృద్ధికొరకు సత్యవతి వ్యాసుని కోరగా అతడి వల్ల అంబికకు ధృతరాష్ట్రుడు, అంబాలికకు పాండురాజు జన్మిస్తారు. ధృతరాష్ట్రుడికి గాంధారివల్ల 100 మంది పుత్రులు, ఓ కుమార్తె జన్మిస్తారు. వీరినే కౌరవులని పిలుస్తారు.

**కౌరవ్య :** ఓ ఉన్నత సర్పం. ఐరావతికి జన్మించింది. - *మహాభారతం*

**కౌశాంబి :** బ్రహ్మ కుమారుడైన కుశునికి విదర్భ రాజకుమారి వల్ల నల్గురు పుత్రులు, వారిలో ఒకడు కౌశాంబుడు. నల్గురుకి నాల్గు నగరాలు నిర్మించి ఇచ్చాడు. కౌశాంబుడికి నిర్మించిన నగరం కౌశాంబి. ఆ తర్వాత పాండవుల సంతతిలో జన్మించిన ఉదయనుడు ఈ నగరాన్ని రాజధానిగా చేసుకొని రాజ్యపాలన చేశారు. ఇది వత్సదేశానికి మధ్యలో వుంటుంది. - *రామాయణం*

**కౌశికం :** గోమతి నదికి మరో పేరు. దీని తీరాన విశ్వామిత్రుడి ఆశ్రమం వుంది. ప్రస్తుతం ఆ నది పేరు కోసి. ఇది బీహార్ రాష్ట్రంగుండా ప్రవహిస్తుంది. ఇక్కడ స్నానంచేస్తే పాపహరణం జరుగుతుంది. - *మహాభారతం*

**కౌశిక కుందరం :** ఇదో పవిత్ర స్థలం. విశ్వామిత్రుడు మోక్షాన్ని పొందిందిక్కడే. - *మహాభారతం*

**కౌశిక చిత్రసేనులు :** హంసడింభకులు. వీరు మహాసేనాన్వితులై జరాసంధునికి దక్షిణ వామ భుజములై వర్తించెడివారు. - *భాగవతం*

**కౌశికపత్ని :** చూ॥ సుమతి.

**కౌశికాచార్యులు :** ఆకృతి మరో పేరు. ఇతడు పౌరాష్ట్రను పరిపాలించాడు. - *మహాభారతం*

**కౌశికాశ్రమం :** ఇదో పవిత్ర స్థలం. అంబ ఇక్కడే తపస్సు చేస్తుంది.

**కౌశికుడు 1 :** చూ॥ విశ్వామిత్రుడు.

**కౌశికుడు 2 :** ధర్మరాజు సభలో వుండేవాడు. శ్రీకృష్ణుడు హస్తినకు వెళ్లే సమయంలో ఇతణ్ణి కలిశాడు. - *మహాభారతం*

**కౌశికుడు 3 :** జరాసంధుని మంత్రుల్లో ఒకడు. ఇతడి మరోపేరు హంసుడు. - *మహాభారతం*

**కౌశికుడు 4 :** ఇతడొక బ్రాహ్మణుడు. ఓ చెట్టు క్రింద తపస్సు చేసుకుంటుండగా ఓ కొంగ అతని తలపై రెట్టవేయగా అతడు తీక్షణంగా దానివంక చూడగా అది బూడిదయ్యింది. అందుకు అతడు పశ్చాత్తాపపడి గ్రామీణ ప్రాంతాలకు వెళ్లి నివసిస్తూ ఒకసారి ఓ బ్రాహ్మణుడి ఇంటికి అతిధ్యానికి వెళ్ళాడు. ఆ బ్రాహ్మ

ఋని భార్య భర్తకు సేవచేస్తూ ఇతడికి ఆతిథ్యం ఇవ్వడానికి కొంత జాగుచేయగా ఆమెపై కోపగించగా బ్రాహ్మణులకిది తగదని మిథిలాపురికి వెళ్లి ధర్మ వ్యాధుని వద్ద సలహా తీసుకొమ్మని చెప్తుంది. ఆ తర్వాత తన గృహానికి వెళ్లి ప్రశాంతంగా జీవించాడు.
– మహాభారతం

**కౌశికుడు 5 :** ఓ ప్రాచీన రుషి. కురుక్షేత్రంలో నివసించే వాడు. ఇతనికి ఏడుగురు పుత్రులు. వీరు గర్గుని వద్ద విద్య నభ్యసించేవారు. వీరి తండ్రి చనిపోగా గర్గుని ఆశ్రమంలోనే జీవించేవారు. అనావృష్టి వల్ల గర్గుడు తన గోవుని మేతకు అడవికి వారితో పంపగా వీరు దాన్ని చంపి వండుకు తిన్నారు. అంతకు ముందు పితృగణాలకు అర్పించారు. గర్గుడికి తర్వాత పులితిందని చెప్పారు. అందువల్ల వారు మరణా నంతరం కొన్ని పునర్జన్మలు పొంది నిష్ఠతో జీవించి బ్రహ్మహత్యాపాతకం పోగొట్టుకొని చివరికి మోక్షం పొందారు. – పద్మపురాణం

**కౌశికుడు 6 :** పురువంశంలోని ఒక రాజు. ఇతని తండ్రి కపిలుడు. గృతస్పతి ఇతడి సోదరుడు. గృతస్పతే నాల్గు వర్ణాలయిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలు ఏర్పడటానికి కారకుడు. – అగ్నిపురాణం

**కౌశికుడు 7 :** ఒక రాజు. ఇతడు రాత్రుళ్లు కోడి పుంజుగా మారేవాడు. అతని భార్య వగచి గాలవ మహర్షి వద్దకు వెళ్లి ఈ విషయం తెలుపగా ఇతడు పూర్వ జన్మలో కోడిపుంజుల్ని భక్షించేవాడని గుడ్ల గూబల రాజు శాపం వల్ల ఇలా జరుగుతోందని చెప్పి శివుడ్ని గూర్చి ప్రార్థించమని సలహా ఇవ్వగా అది పాటించడం వల్ల శాపవిమోచనుడయ్యాడు.
– స్కందపురాణం

**కౌశిక్యరుణాసంగమం :** పవిత్రస్థలం. ఇక్కడ ఉప వాసం చేస్తే సర్వపాపాలు పోతాయి. – మహాభారతం

**కౌషీతకి :** ఒక ముని. నేను సూర్యుడ్ని ఒకే రకంగా పూజించడం వల్ల ఒక్కడివే జన్మించావు. నీవు బహు ముఖాల సూర్యుడ్ని పూజించమని కుమారుడితో చెప్తాడు. – చాన్దోగ్యోపనిషత్తు

**కౌసలుడు :** స్కందుని మరోపేరు. ఒకసారి తన ముఖాన్ని మేక ముఖంగా మార్చుకోవడం వల్ల అతణ్ణి కౌసలుడన్నారు. – మహాభారతం

**కౌసల్య 1 :** దశరధుని భార్య. శ్రీరాముని తల్లి. దశరధునికి ముగ్గురు భార్యలు కౌసల్య, కైకేయి, సుమిత్ర కౌసల్యకు శ్రీరాముడు, కైకేయికి భరతుడు, సుమిత్రకు లక్ష్మణ, శతృఘ్నులు జన్మించారు.
– రామాయణం

**కౌసల్య 2 :** కాశీరాజు భార్య. అంబ, అంబిక, అంబా లిక ఈమె కుమార్తెలు. అంబాలికను కూడా కౌసల్య అని పిలుస్తారు. పాండురాజు మరణానంతరం అంబి కతోపాటు ఈమెకూడా వనవాసం స్వీకరించింది.
– మహాభారతం

**కౌసల్య 3 :** ఓ యాదవ రాజు భార్య. వీరికి జన్మించిన పుత్రుడు కేశిని. – దేవీ భాగవతం

**కౌసల్య 4 :** యయాతి కుమారుడైన పురు చక్రవర్తి భార్య. ఈమెవల్ల పురుచక్రవర్తికి జనమేజయుడను కుమారుడు జన్మించాడు. – మహాభారతం

**కౌసల్య 5 :** మిథిలా నగర రాజైన జనకుని భార్య. ఇతడొక సారి తన భవంతిని కూడా అమ్మి ఆహార సంపాదనకు దేశంవిడిచి వెళ్లబోగా ఆమె ధైర్యం చెప్పి నివారించింది.

**కౌసల్యుడు :** సుకర్మని శిష్యుడు. వ్యాస శిష్య పరంపరలో ఒకడు. ఇతణ్ణి హిరణ్యానాభుడని కూడా పిలుస్తారు.
– విష్ణుపురాణం

**కౌండిన్యుడు 1 :** ధర్మజుని సభలోని ఓ ముని.
– మహాభారతం

**కౌండిన్యుడు 2 :** ఇతడొక బ్రాహ్మణుడు. ఇతడు తన ఆశ్రమాన్ని హస్తిమతి సభ్రమతీ సంగమ తీరంలో నిర్మించుకోగా వరదలకు ఒకసారి ఆశ్రమం కొట్టు కుపోగా ఈ రుషి నదిలోని నీటిని ఎండిపొమ్మని శపిస్తాడు. – మహాభారతం

**కౌస్తుభం :** ఇదో రత్నం. క్షీరసాగరమధనంలో వెలువడు తుంది. దీన్ని విష్ణువు తన వక్షస్థలం మీద ధరిస్తాడు.
– మహాభారతం

**కృకణీయుడు :** మిత్రకేశరేద్రాశ్యుల కుమారుడు.
– మహాభారతం

**కృతకుడు :** యదువంశజుడు. వసుదేవుడి కుమారుడు.
– భాగవతం

**కృతకృత్యుడు :** త్రికకుత్తుడి కొడుకు.

**కృతఘ్నుడు :** చూ॥ ధనశర్మనుడు.

**కృతచేతనుడు :** ప్రాచీన కాలంలో ఓ గొప్ప రుషి.

**కృతధ్వజుడు :** జనకవంశపు రాజు.

**కృతపర్వుడు :** యాదవ వంశంలో ఒక రాజు.
– *చూ॥ యాదవ వంశం*

**కృతమూల :** శ్రీ మహావిష్ణువు మొదట మత్స్యంగా కన్పించిన నది. – *చూ॥ మత్స్యావతారం*

**కృతయుగం :** నాలుగు యుగాలలో ఇదొకటి. ఆ నాలుగు కృతయుగం, త్రేతాయుగం, ద్వాపర యుగం, కలియుగం. కృతయుగంలో మంచితనమే వుండగా కలియుగం నాటికి అది దిగజారి పాపం తాండవ మాడుతుంది. కలియుగం పూర్తయ్యేసరికి శ్రీ మహా విష్ణువు కల్కిగా అవతరించి పాపప్రక్షాళన చేస్తాడు. మరల కృతయుగం మొదలవుతుంది.

**కృతవర్మ 1 :** వృష్టివంశపు రాజు. హార్ధికుని 4 గురు కొడుకుల్లో ఒకడు. ఇతని సోదరుడు శూరుడి 10 మంది కుమారుల్లో శ్రీకృష్ణుని తండ్రి వసుదేవు డొకడు. అంటే శ్రీకృష్ణుని తాత సోదరుడు. ఇతడు అక్రూరునికి బాల్యస్నేహితుడు. శమంతకమణి విషయంలో అక్రూర, కృతవర్మలు శ్రీకృష్ణునిపై నిందలు మోపి శ్రీకృష్ణుని తప్పించుకొని కాశీవద్దకు పోయి తపస్సు చేశారు. ద్వారకలో వర్షాలు పడక కరువు ఏర్పడగా శ్వఫల్కుని కుమారుడు అక్రూ రుడు ఎక్కడ వుంటే అక్కడ వర్షం పడుతుందని తెలిసి వారిని క్షమించి ద్వారకకు రావించాడు.

**కృతవర్మ 2 :** ఇతడు గొప్ప విలువిద్యా నిపుణుడు. పాంచాలి స్వయంవరంలో పాల్గొన్నాడు. ఇతడు శ్రీకృష్ణుని భక్తుడు. సుభద్రకు కృష్ణుని తరపున ఖాండవ ప్రస్థానానికి బహుమతులు తీసుకు వెళ్ళాడు. వృష్టి వంశంలో 7 గురు మహారథులున్నారు. అందులో శ్రీకృష్ణుడు, చారుదేక్షణ, సైవేయ, చక్రదేవ, ప్రద్యు మ్నుడు, సాంబుడు, కృతవర్మ. ఇతడికి దుర్యోధ నునితో వున్న స్నేహం వల్ల కురుక్షేత్రంలో కౌరవుల పక్షాన పోరాడాడు. కురుక్షేత్ర యుద్ధంలో ఆసాంతం పాల్గొన్న వీరుడు. అశ్వత్థామ రాత్రిపూట పాండవ పుత్రుల్ని చంపినపుడు కూడా తోడున్నాడు. కురుక్షేత్ర యుద్ధానంతరం శ్రీకృష్ణుని నిర్యాణానంతరం యదు వంశంలో ముసలం వచ్చినపుడు ఒకరినొకరు చంపు కున్నపుడు మరణించాడు. మరణానంతరం మరుద్గ ణంలో చేరి ప్రసిద్ధిచెందాడు.

ఇతణ్ణి ఆనర్తవాపీ, భోజుడు, భోజరాజు, హార్ధిక్యుడు, హార్ధిక్యాత్మజ, మాధవుడు, శాత్యత, వార్ష్ణేయుడు, వృష్టి సింహుడని పిలిచేవారు.

**కృతవాక్కు :** ఓ గొప్ప మహర్షి. ధర్మజుని యెడల అపార గౌరవం కలవాడు. – మహాభారతం

**కృతవీర్యుడు :** కార్తవీర్యార్జునుని తండ్రి. భృగు మహర్షి వంశస్తులతో సోమయజ్ఞం నిర్వహించాడు. వారి వంశం వారికి కోరినంత సంపద నిచ్చాడు. ఇతడు యముని కొలువులో సభ్యుడు. ఇతని కుమార్తె భాను మతిని అహంయాతికిచ్చి వివాహం చేశాడు.
– మహాభారతం

**కృతవేగుడు :** పుణ్యపురుషుడైన రాజర్షి. యముని కొలువులో వుండేవాడు. – మహాభారతం

**కృతశౌచం :** కురుక్షేత్రంలో ఓ పుణ్యస్థలం. ఇక్కడ స్నానంచేస్తే పుండరీకయజ్ఞం చేసిన ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**కృతక్షణకుడు :** విదేహ దేశ రాజు. ధర్మజునికి పద్నాలుగు వేల అశ్వాలు బహూకరిస్తాడు.
– మహాభారతం

**కృతద్యుతి :** చిత్రకేతుడను రాజు భార్య. వీరికి సంతానం లేక అంగిరసుడ్ని ప్రార్థించగా ఓ కుమారుడు జన్మించగా సవతులు అది భరించలేక విషమిచ్చి అతణ్ణి చంపగా నారద ఇతర మహర్షులు బ్రతికించ డానికి ప్రయత్నించి విఫలులు కాగా భార్యాభర్తలు దేశాటన చేస్తూ పార్వతి శాపంవల్ల చిత్రకేతుడు వృతాసురుడను రాక్షసుడికి పునర్జన్మించగా కృతద్యుతి ఇది భరించలేక మృతి చెందింది. – భాగవతం

**కృతశ్రముడు :** ఓ గొప్ప మహర్షి. యుధిష్ఠురుని కొలువులో వున్నాడు. వానప్రస్థాశ్రమం స్వీకరించి స్వర్గం చేరాడు. – మహాభారతం

**కృతప్రవణుడు :** ఒక రుషి. పరశురాముడి అనుచరుడు.

**కృత్య 1 :** ఓ రాక్షసి. అథర్వవేదంలోని దుష్టశక్తి. మంత్రా లను నేర్చుకొని శత్రువులను సంహరించేది. ఇది ఒక్కోసారి మగ రూపంలోకూడా కన్పించేది.

కృత్య ఒకసారి అసురులు పూజించగా దుర్యోధనుణ్ణి పాతాళానికి తీసుకువెళ్లగా అసురులు దుర్యోధనుడికి పాండవులకు అర్థ రాజ్యం ఇవ్వవద్దని చెప్పి కృత్యతో తిరిగి దుర్యోధనుడ్ని హస్తినకు పంపారు. ఒకసారి మదన అనే పేరుతో జన్మించి చ్యవన మహర్షి మంత్ర శక్తి వల్ల భయంకర రూపందాల్చి ఇంద్రుణ్ణి భయపెట్టి అశ్వనీదేవతలకు సురపానీయం ఇచ్చేటట్లు ఒప్పిస్తాడు. ఒకసారి అంబరీషుడు ఏకాదశ వ్రతం చేస్తుండగా దేవతలకోరికపై దుర్వాసుడు దుష్టశక్తులను ప్రార్థించి కృత్యను అంబరీషుడిపైకి పంపగా అతడు విష్ణువును ప్రార్థించగా మహావిష్ణువు సుదర్శనచక్రంతో కృత్య తలను ఖండించి దూర్వాసుడి వెంటపడగాముల్లో కాలు పరుగెత్తి చివరకు అంబరీషుడినే శరణువేడాడు.

★ కృత్య–ప్రహ్లాదుడు : హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని విష్ణుభక్తిని అంగీకరించక అతడిని మార్చడానికి కొందరు అసురుల్ని వినియో గించగా వారు కృత్యను ప్రహ్లాదునిపైకి పంపగా కృత్య విసిరిన శూలం ప్రహ్లాదుని కంఠానికి తగిలి ముక్కలుకాగా కృత్యను సృష్టించిన వారినే చంపగా ప్రహ్లాదుని కర స్పర్శతో వారు పునరుజ్జీవులవుతారు. – విష్ణుపురాణం

**కృత్య 2 :** ఓ నది. ఈ నదినీటిని భారతీయులు సేవించే వారు. – మహాభారతం

**కృత్యమదుడు :** సుహోత్రుడి కొడుకు. శునకుడి తండ్రి.

**కృతాగ్ని :** కార్తవీర్యార్జునుని తండ్రి. కృతవీర్యుని సోదరుడు. మరోసోదరుడు కృతాయుడు. ఇతడు యదువంశ రాజు. – భాగవతం

**కృతాంతుడు :** చూ॥ యముడు.

**కృతాయువు :** కృతవీర్యుడు, కృతాగ్నిల సోదరుడు. – భాగవతం

**కృతాశ్వుడు :** ప్రాచీన భారతావనిలో గొప్పమహర్షి. దక్షప్రజాపతి 60 మంది కుమార్తెలలో ఇద్దర్ని కృతాశ్వుడికిచ్చి వివాహం చేశాడు. – దేవీభాగవతం

**కృతి 1 :** వేదవ్యాసుని శిష్య పరంపరలో ఒకరు. జైమిని వ్యాసుని శిష్యుడు. జైమిని కుమారుడు సుమంతుడు. సుమంతుని కుమారుడు సుకర్మకు ఇద్దరు శిష్యులు. ఒకరు హిరణ్యనాభుడు, మరొకరు పుష్పింజి. హిరణ్యనాభుడి శిష్యుడే కృతి. ఇతడు సామవేదంలో 24 సంహితల్ని చేకూర్చాడు. – విష్ణుపురాణం

**కృతి 2 :** యమధర్మరాజు కొలువులోని సాధువర్త నుడైన రాజు. – మహాభారతం

**కృతి 3 :** ఒక విశ్వదేవుడు. – మహాభారతం

**కృతి 4 :** మహావిష్ణువుకి గల ఎన్నో పేర్లలో ఇదొకటి.

**కృతి 5 :** శుక్రదేశపు రాజు. ధర్మజునికి 100 ఏనుగుల్ని బహూకరించాడు. – మహాభారతం

**కృతి 6 :** నహుషుని కుమారుల్లో ఒకడు. ఇతరులు యతి, యయాతి, సమ్యాతి, ఆయాతి, వియాతి. కృతి అందరికంటే చిన్నవాడు.

**కృతిమంతుడు :** యమీనరుడి కొడుకు.

**కృత్తిక :** ఓ పుణ్య స్థలం. ఇక్కడ స్నానం చేస్తే అతిరాత్ర యజ్ఞం చేసిన ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**కృత్తికలు :** సుబ్రహ్మణ్య స్వామి జన్మించినపుడు దేవతలు ఆరుగురు స్త్రీలను పాలివ్వడానికి పంపారు. వారినే కృత్తికలు అంటారు. అతడు 6 తలలతో జన్మించి నందువల్ల 6 గురు స్త్రీలను వినియోగించారని కొన్ని పురాణాలు, 6 గురు స్తన్యం ఒకేసారి తాగడం వల్ల 6 తలలు ఏర్పడ్డా యని కొన్ని పురాణాలు చెప్తుండగా ఇవన్నీ పార్వతి రూపాలేనని మరికొన్ని పురాణాలు చెప్తున్నాయి. కృత్తికల వల్ల పెంచబడ్డాడు కనుక ఇతన్ని కార్తికేయుడన్నారు. –*స్కందపురాణం, రామాయణం, కథాసరిత్సాగరం.*

**కృత్తికాశ్రమం :** ఓ పుణ్యస్థలం. ఇక్కడ స్నానంచేసి పితృదేవుల్ని పూజిస్తే పాపనాశం జరుగుతుంది. – మహాభారతం

**కృత్తికాంగారకం :** ఓ పుణ్యక్షేత్రం. ఇక్కడ స్నానం చేసి 2 వారాలు నిరాహారులై ధ్యానిస్తే పాప పరిహారం జరుగుతుంది. – మహాభారతం

**కృత్తివాసేశ్వరుడు :** చూ॥ శివుడు

**కృత్వి :** ఈమెను కీర్తిమతి అనికూడా అంటారు. అణుహుని భార్య. శుకుడి కూతురు. వీరి కొడుకు బ్రహ్మదత్తుడు.

★ ఒకసారి కృష్ణుడు ద్వారకను పాలిస్తుండగా పౌండ్రకుడు నేనే వాసుదేవుడినని తన పాదాలకు మొక్కమనగా శ్రీకృష్ణుడు అతడిని సుదర్శన చక్రంతో వధించగా అతడి కుమారుడు కృత్యను ప్రార్థించగా అది కృష్ణునిపైకి వెళ్లగా అదే సుదర్శన చక్రంతో కృత్యను వధించాడు.

**కృతుడు 1 :** జనకవంశపు రాజు. విజయుని కుమారుడు. శునకుని తండ్రి. ఇతనికి ఏడుగురు అందమైన కుమార్తెలు. తండ్రీ పిల్లల బాంధవ్యం సరిగా లేక వీరు ఇతణ్ణి విడిచి స్మశానానికి వచ్చి జంతువులు పక్షులకు ఆహారంగా మారి ముక్తి పొందు తారు.
– కథాసరిత్సాగరం

**కృతుడు 2 :** ఒక విశ్వదేవుడు. – మహాభారతం

**కృతేజసుడు :** కృతాగ్ని అనికూడ అంటారు.
– చూ॥ కృతాగ్ని

**కృతేయువు :** అంగవంశంలో జన్మించిన ఒక రాజు.

**కృథుడు :** విదర్భుడి కొడుకు.

**కృపావతి :** ఒక గోరువంక కుక్కలచేత తరుమబడి క్రిందపడెను. దానిని సుధధుడను రాజర్షి తీసి కాపాడెను. అతని అంగయష్టివలన ఓ కుమార్తె జన్మించెను. ఆమెకు కృపావతి అని పేరుపెట్టెను. ఈమె చెలికత్తెతో కూడి వశిష్ఠుని ఆశ్రమము వద్ద ఆడుకొనుచుండగా వీరి అల్లరికి కోపించి వశిష్ఠుడీమెను వైశ్యకన్యగా జన్మించమని శపించెను. శాపవిమోచనము కై వేడుకొనగా నీకు కుమారుడు కల్గి అతడు యుద్ధము చేసిన తర్వాత వైశ్యత్వము పోవునని చెప్పెను. ఈమెయే సుప్రభయై జన్మించెను. – మార్కండేయ పురాణం

**కృపి :** శారద్వనుడి వీర్యం ఓ బాణం పై పడి ఇద్దరు పిల్లలు జన్మించారు. ఒకడు కృపుడు, మరొకరు కృపి. శంతనుని కృపవల్ల పెంచబడ్డారు కనుక వీరికాపేరు వచ్చింది. ఈమె ధనుర్విద్యాకోవిదుడైన ద్రోణాచార్యుడ్ని వివాహమాడింది. వీరి కుమారుడే అశ్వత్థామ. మహాభారతంలో శారదాదేవి, గౌతమి అనికూడా ఈమె పేరు పేర్కొనబడింది. – మహాభారతం

**కృపీట జన్ముడు :** ఉదకం నుండి జన్మించినవాడని అర్థం. అగ్ని, చంద్రుడు అలా జన్మించారు.

**కృపీటయోని :** చూ॥ కృపీట జన్ముడు.

**కృపుడు :** శారద్వనుడు బ్రాహ్మణుడై కూడా అస్త్రవిద్య చూసి దేవతలు అతడి విద్యాకౌశాల్యాన్ని భగ్నం చేయ డానికి పంపగా అతడు నిలకడ కోల్పోయి రేతపతనమై ఓ బాణంపై పడగా అందుండి ఓ బాలుడు, ఓ బాలిక జన్మించారు. వారిని శంతనుడు పెంచాడు. వారే కృపుడు, కృపి. ఈ విషయాన్ని తెలుసుకున్న శారద్వనుడు శంతనుని వద్దనున్న కృపునికి శస్త్రాస్త్ర విద్యలు నేర్పాడు.
శస్త్రాస్త్ర విద్యలు నేర్చుకున్న కృపుడే కృపాచార్యుడు. ఇతడు కౌరవ పాండవ యదు వృష్ణి వంశజులకు అస్త్రవిద్య నేర్పాడు. ద్రోణాచార్యునికి ముందు కురు పాండవులకు ఇతడే గురువు. కురువంశాన్ని అంటి పెట్టుకుని జీవించినవాడు. పాండవ కౌరవుల అస్త్ర విద్యా ప్రదర్శనలో కర్ణుడు పాల్గొనుటకనర్హుడని మొదట ప్రకటించిందితడే. దుర్యోధనుని కోర్కెపై పాండవుల వనవాస అజ్ఞాతవాసాల ఆచూకి తెలుసుకోవడానికి గూఢచారుల్ని పంపించాడు. దుర్యోధనునితో పాండవ సైన్యాన్ని ఓ మాసంలో సంహరించగలనని ప్రకటించిన ధనుర్విద్యా కోవిదుడు. కురుక్షేత్ర యుద్ధానంతరం కౌరవ యోధులలో మిగిలిన ముగ్గురు వీరుల్లో ఒకడు. తక్కిన ఇద్దరు కృతవర్మ, అశ్వత్థామ. ద్రోణుని మరణానంతరం యుద్ధభూమినుండి పారిపోయి మరల తిరిగి వస్తాడు. యుద్ధానంతరం అశ్వత్థామతో కలసి పాండవులను మట్టుపెట్టడానికి వ్యూహం పన్నుతాడు. రాత్రిపూట పాండవుల గుడారాలపై పడి అక్కడివారిని నరికి వేస్తాడు. కృపుడు ఆ గుడారాలకు నిప్పంటించి ధృతరాష్ట్రునికి కౌరవులు పాండవులు మొత్తం నశించారని చెప్పాడు. ధృతరాష్ట్రుడు గాంధారితో వనవాసానికి వెళ్తుంటే వారికి తోడు వెళ్లబోగా ధృతరాష్ట్రుడు పాండవులవద్దే సలహాదారుగా వుండమని కోరతాడు. పాండవులు కూడా స్వర్గారోహణం చేస్తూ పరీక్షిత్తు బాధ్యతలను ఇతనికి అప్పగిస్తారు. పరీక్షిత్తు పెరిగిన తర్వాత అరణ్యానికి వెళ్లి తపస్సుచేసి స్వర్గస్తుడవుతాడు. ఇతణ్ణి ఆచార్య, ఆచార్య సత్తమ, భరతాచార్య, బ్రహర్షి, శారద్వత, శారద్వతపుత్ర, గౌతమ అని పిలుస్తారు. – మహాభారతం

**కృమి 1 :** అంగవంశపు రాజు. క్రుమి ఉశీనరుల కొడుకు. – అగ్నిపురాణ

**కృమి 2 :** ఊశీనరుడి భార్య.

**కృమి 3 :** ఒక క్షత్రియవంశం. – మహాభారతం

**కృమి 4 :** ఒక నది. – మహాభారతం

**కృమిభోజనం :** ఇరవై ఎనిమిది నరకాల్లో ఒకటి.

**కృశకుడు :** కశ్యపవంశలో జన్మించిన ఓ సర్పం.

**కృశ్రద్ధుడు :** శిభిసోదరుడు. తితిక్షుడి కుమారుడు. – మహాభారతం

**కృశానుడు :** కృత్యుడు చేసే యజ్ఞంలో సోమరసానికి కాపలాకాసే ముని. – ఋగ్వేదం

**కృశానురేతుడు :** చూ॥ శివుడు.

**కశానువు :** చూ॥ అగ్ని

**కృశాశ్వుడు :** దక్షప్రజాపతి కుమార్తెలైన జయ, సుప్రభలను కృశాశ్వప్రజాపతి వివాహమాడగా వారికి ఒక్కొక్కరికి 50 మంది పుత్రులు జన్మించారు. వీరు అసలు సంహార అనే బాణాలు. విశ్వామిత్రుడు తన తపశ్శక్తితో వీటిని తనవిగా చేసుకున్నాడు. వీటినే విశ్వామిత్రుడు రామలక్ష్మణు లకిచ్చాడు. – రామాయణం

**కృశాశ్వుడు 2 :** సూర్యవంశపు రాజుల్లో ఒకడు – భాగవతం.

**కృశాశ్వుడు 3 :** యముని కొలువులో అతణ్ణి సేవించే ఒకరాజు.

**కృశుడు 1 :** శృంగి మహర్షి స్నేహితుడు. శమీకుడి మెడపై సర్పాన్ని వేసింది పరీక్షిత్తేనని ఇతడే శృంగితో చెప్తాడు. ధర్మరక్షణకు అనేక త్యాగాలు చేసి శరీరాన్ని కృశింపచేసుకున్నాడు గనుక కృశుడు అన్నారు. – మహాభారతం

**కృశుడు 2 :** ఐరావత వంశంలో పుట్టిన వంశంలో ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో బూడిదైంది. – మహాభారతం

**కృశుడు 3 :** ఓ మహర్షి. భీష్ముడు అంపశయ్యపై వుండగా అతణ్ణి దర్శించాడు. – మహాభారతం

**కృషీయుడు :** పురువంశంలో పుట్టిన ఒక రాజు.

**కృషీవలుడు :** ఇంద్రసభలోని ఒక రుషి. – మహాభారతం

**కృష్ణ 1 :** కృష్ణుడు, శ్రీకృష్ణుడిగా ప్రసిద్ధుడు. మహావిష్ణువు తొమ్మిదవ అవతారం. ఇతడు యాదవ వంశంలోని దేవకీ వసుదేవులకు జన్మించాడు. శూరసేనుడికి 10 మంది సంతానం. వారిలో వసుదేవుడొకడు. అతడు దేవకిని వివాహమాడాడు. ఇతని మరో భార్య రోహిణికి జన్మించిన వాడు బలరాముడు.

*కృష్ణుని పూర్వజన్మలు :* వరుణుని శాపం వల్ల కశ్యపుడు అతని భార్యలు అదితి సురసలు వసుదేవుడు, దేవకి, రోహిణిలుగా జన్మించారు. అలాగే వారి పుత్రుడుగా జన్మించిన మహావిష్ణువు కూడా శాప వశమున వీరికి కృష్ణుడుగా జన్మించాడు.

*శ్రీకృష్ణుని పూర్వ జన్మ :* బ్రహ్మ హృదయం నుండి ధర్ముడు జన్మించగా దక్షప్రజాపతి 10 మంది కుమార్తెలను వివాహమాడాడు. అతడికి, హరి, కృష్ణ, నర, నారాయణులు జన్మించారు. హరికృష్ణులు గొప్ప యోగులుకాగా నరనారాయణులు గొప్ప పండితులై హిమాలయాల్లో బ్రహ్మను గూర్చి 1000 సం॥రాలు తపస్సు చేశారు. వీరి తపస్సు భగ్నం చేయడానికి ఇంద్రుడు అప్సరసల్ని పంపగా నారాయణుడు కోపగించి వారిని శపించబోగా నరుడు అడ్డువచ్చి శాంతింపచేశాడు. నారాయణుడు తన తర్వాతి జన్మలో వారి కోర్కె తీర్చుతానని దేవతలతరపున మానవుడిగా జన్మిస్తానని యాదవ వంశంలో కృష్ణుడుగా జన్మిస్తానని చెప్తాడు. – భాగవతం

*శ్రీకృష్ణ జననం – కంసుని వధ :* వసుదేవుడు ఉగ్రసేనుడి కూతురు కంసుని సోదరి అయిన దేవకిని వివాహమాడు. కంసుడు వారిని రథం పై తీసుకు వెళ్తుండగా ఆకాశవాణి దేవకి అష్టమ గర్భమున జన్మించిన వాడు నిన్ను సంహరిస్తాడని పలుకుతుంది. వెంటనే కంసుడామెను చంపబోగా వసుదేవుడు ఆమెకు పుట్టిన సంతానాన్ని కంసునికి అప్పజెప్తానని అతణ్ణి శాంతింప చేస్తాడు.

దేవకి వసుదేవులకు మొదట కీర్తిమానుడు జన్మించగా నారదుడు అతడి పూర్వజన్మ కృష్ణుని పుట్టుకను గురించి వివరించగా కంసుడు కీర్తిమానుడ్ని రాతిపై మోది చంపి దేవకి వసుదేవుల్ని కారాగారంలో బంధిస్తాడు. కంసుని జన్మ వృత్తాంతం తెలుసుకొని తండ్రిని కూడా బంధిస్తాడు. – *చూ॥ కంసుడు*

దేవాసురులకు 100 సంవత్సరాలు యుద్ధం జరిగింది. ఇంద్రుడు మహావిష్ణువు సహాయం కోరగా అసురులు శుక్రుని తల్లి కావ్యమాత ఆశ్రయం పొందగా మహావిష్ణువు తన చక్రాయుధంతో ఆమెతల నరుకుతాడు. స్త్రీని సంహరించినందుకు భృగువు మానవుడిగా

జన్మించమని మహావిష్ణువుని శపిస్తాడు. ఆశాపఫలమే కృష్ణుని జన్మ కారణమని దేవీ భాగవతం చెప్తోంది. ఆ తర్వాత కారాగారంలో దేవకి ఆరుగురు పుత్రుల్ని ప్రసవించగా వారిని కూడా కంసుడు వధించాడు. అనంతుని అంశగా జన్మించిన బలరాముడు మహా విష్ణువు సలహాపై మాయాదేవి దేవకి గర్భంలోని శిశువుని యశోద గర్భంలోకి చేర్చింది. ఏడవ గర్భం గర్భస్రావం జరిగిందని కంసుడికి తెలిసింది. సింహరాశిలో శ్రీకృష్ణుడు అష్టమ గర్భంగా జన్మించి వసుదేవుడికి మహావిష్ణువుగా దర్శనమిచ్చి తనను గోకులంలో యశోద ఓ ఆడపిల్లకు జన్మనిచ్చిందని నన్ను తీసుకొని అచటవుంచి ఆమెను ఇక్కడ వుంచ మని చెప్పి శిశువుగా మారాడు. నందగోపుని భార్య యశోదవద్ద వున్న శిశువును ఇక్కడకు తెచ్చి శ్రీకృష్ణుడిని యశోద ప్రక్క పరుండ బెట్టాడు. కంసుడు ఆ అష్టమ గర్భంలో జన్మించిన శిశువు ఆడపిల్లగా గ్రహించి ఆమెను రాతి బండపై మోదబోగా ఆమె ఆకాశానికి ఎగిరి నీ శక్తిని స్త్రీలపై ప్రయోగించకు నిన్ను చంపే వాడు వేరొకచోట పెరుగుతున్నాడని చెప్తుంది.

*కృష్ణుని రంగు :* శ్రీకృష్ణుడు నలుపు, బలరాముడు తెల్లగాను వుంటారు. దానికి కారణం దేవతలు పాపుల్ని నాశనం చేయడానికి భూమిపై అవతరించ మనగా మహావిష్ణువు రెండు తల వెంట్రుకలను లాగి భూమిపైకి వేశాడు. నల్లవెంట్రుక దేవకి గర్భంలోను తెల్లవెంట్రుక రోహిణి గర్భంలోను జన్మిస్తారని చెప్తాడు. అందుకని దేవకి గర్భంలో జన్మించిన శ్రీకృష్ణుడు నీలి రంగులో రోహిణి గర్భమున జన్మిం చిన బలరాముడు తెలుపు రంగులో వుంటారు.

– మహాభారతం

*కృష్ణుని బాల్యం :* కంసుడు ఆకాశవాణి మాటలు విని ఆ రాజ్యంలో పిల్లల్ని అందర్ని చంపడానికి తన అనుచరుల్ని పంపాడు. అలా పంపిన వారిలో మరణించిన వారు .....

*పూతన మరణం :* ఓ గోపస్త్రీగా వచ్చి నిద్రిస్తున్న కృష్ణునికి పాలివ్వబోగా విషపూరితమైన పాలతోపాటు ఆమె రక్తాన్నికూడా శ్రీకృష్ణుడు పీల్చగా ఆమె నిజరూపిణియై మరణించింది.

*శకటాసురుని వధ :* ఆ తర్వాత కంసుడు మరో రాక్షసుడ్ని పంపగా శకటంగా ఘోర శబ్దం చేస్తూ కృష్ణునిపైకి రాగా ఒక్క తోపుతో శకటం ముక్కలై అతడు మరణించాడు.

*తృణావర్తాసుర వధ :* కంసుని తరఫున తృణవర్తా సురుడు శ్రీకృష్ణుని తన శక్తితో ఆకాశానికి ఎత్తుకు పోగా తన చేతులతో అతడి మెడకు చుట్టుకొని తన శరీరాన్ని బరువు పెంచగా ఆ బరువు మోయలేక అతడు భూమిపైపడి మరణించాడు.

*వత్సాసురవధ :* కంసుడు ఇతణ్ణి పంపగా ఇతడు గోవుగామారి అంబడిలోని గోవులతోకలిసి సంచరి స్తుండగా కృష్ణుడు అది గమనించి దాని రెండుకాళ్లు పట్టుకొని ఓ చెట్టుకు మోదగా అతడు మరణించాడు. మరొకసారి పోతన సోదరుడు బకుడిని పంపగా అతడు తన వెడల్పైన నోటిని తెరచి గోపకులను మ్రింగబోగా శ్రీకృష్ణుడు అతడి నోటిలో దూరి కడుపులో అన్నివైపులా తిరిగి నోటి నుండే బయటకు రాగా ఇతడితోపాటు రక్తంకూడా చిమ్ముకొని బయటకువచ్చి బకుడు మరణించాడు.

*అఘాసురుని వధ :* బకుని సోదరుడైన అఘాసురుడు సర్పంగా మారి తన నోటితో గోపాలురను మింగి వేయగా బలరామకృష్ణులు నోటిలో దూరగా దాని కడుపు చీలి రక్తం కక్కి మరణించింది. దాని కడుపు చీల్చుకొని బలరామకృష్ణులు బయటకు వచ్చారు.

*కృష్ణుని మరికొన్ని శౌర్యగాథలు :* ఒకసారి శ్రీకృష్ణుడు మన్నుతిన్నాడని గోపికలు యశోదతో చెప్పగా ఆమె శ్రీకృష్ణుని నోరు తెరవమని కోరగా ఆమె అతని నోటిలో కన్పించిన ప్రపంచాన్ని తనను చూసుకొని ఆశ్చర్యపోయింది. ఒకసారి బ్రహ్మ మానవ జన్మలోని మహావిష్ణువుకి ఎన్ని మాయలు వుంటాయో అని పరీక్షించనెంచి గోపాలుర పశుసంపదనంతా ఎత్తుకు పోయాడు. గోపాలురు శ్రీకృష్ణునికి చెప్పగా అతడు గోవర్ధనగిరినంతా కలియతిరిగి గోపాలురి వద్దకు రాగా వారు మాయమయ్యారు. కృష్ణుడు తన దివ్య శక్తితో జరిగింది గ్రహించి గోవులను గోపాలురను సృష్టించాడు. ఒకరోజు వారితో గోవర్ధన గిరిపై నుండగా బ్రహ్మ చూశాడు. ప్రతిగోవులో గోపాలురు విష్ణురూపం చూసి మరో బ్రహ్మకూడా కన్పించగా

బ్రహ్మ మహావిష్ణువును ప్రార్థించగా నిజకృష్ణుడిని గోపాలురను చూశాడు. కాళింది ఒడ్డున సంచరిస్తూ దేనుకాసురుడిని వధించాడు.

*కాళీయ మర్దనం :* గరుడునికి దడచి కాళీయసర్పం కాళిందిలో నివసిస్తూ వుండేది. దాని విషంవల్ల ఆ నది నీరు కలుషితం కాగా నది ఒడ్డున చెట్లు కూడా నశిస్తుండగా గోవులు ఒకరోజు ఆ నీటిని త్రాగి మరణించగా కృష్ణుడు ఓ చెట్టు ఎక్కి కాళింది తలపై దూకి దాన్ని మర్దించి దాని తలపై నృత్యం చేశాడు. కాళీయుడు అలసి శరణువేడి కాళిందిని విడిచి రమణక ద్వీపం చేరింది. *– భాగవతం*

అంగిరసుని శాపంవల్ల కొండచిలువగా మారిన సర్పాన్ని తన్ని శాపవిమోచన కల్గిస్తాడు.

ఆ తర్వాత కంసుడు అరిష్టాసురుడిని ఎద్దు రూపంలో కేశిని గుర్రం రూపంలో వ్యోమాసురుడిని గొర్రె రూపంలో పంపి కృష్ణుడిని మట్టుబెట్టబోగా వారంతా కృష్ణుని చేతిలో మరణిస్తారు. *– భాగవతం*

*కంసుని వధ :* కృష్ణుడిని మాయోపాయంతో చంపడం సాధ్యంకాక అంబడికి అక్రూరుడిని రాయబారిగా పంపి ఆయుధపూజకు మధురాపురికి రమ్మని ఆహ్వానిస్తాడు. అక్రూరుడికి విశ్వరూప సాక్షాత్కారమై శ్రీకృష్ణునికి కంసుని మంత్రాంగం తెలియజేస్తాడు. మధురానగరికి చేరిన తర్వాత యజ్ఞమందిరంలోకి రాగా ఓ విల్లు ఎక్కుపెట్టి వుంటుంది. కాపలాదారులు వచ్చేలోపే కృష్ణుడు దానిని తన ఎడమ చేతితో విరగ్గొట్టాడు. యుద్ధవిద్యాప్రదర్శన కాకుండా కువలయాపీడ అనే ఏనుగును శ్రీకృష్ణునిపైకి పంపగా శ్రీకృష్ణుడు దానిని, మావటిని చంపి యుద్ధ విద్యాశాలలో అడుగు పెడతాడు. చాణూరుడు కృష్ణుడితో ముష్టికుడు బల రాముడితో యుద్ధంచేసి చనిపోతారు. వీరి మరణంతో కంసుడు ఉగ్రుడై తన ఆసనం నుండి లేవబోతుండగా కృష్ణుడు అతనిపైబడి తన గదతో మోది చంపుతాడు. వసుదేవుడిని, దేవకిని, ఉగ్రసేనుడిని చెరనుండి విడిపించి ఉగ్రసేనుడిని మధురకు రాజును చేస్తాడు.

*బలరామకృష్ణుల విద్యాభ్యాసం :* బలరామకృష్ణులు గర్గుని సలహాపై సందీపుని ఆశ్రమానికి విద్యనభ్యసించడానికి వెళ్లారు. అచట కుచేలునితో స్నేహం ఏర్పడుతుంది. ఒక రాత్రి కట్టెలు తేవడానికి అడవికి వెళ్లి ఉరుములు వర్షంతో ఆ రాత్రి గడిపి తిరిగి ఆశ్రమానికి చేరతారు. అచటే శ్రీకృష్ణుడు 64 కళలు ధనుర్వేదం నేర్చుకున్నాడు.

*గురుదక్షిణ :* విద్యాభ్యాసానంతరం గురుదక్షిణ కోరమనగా సందీపుడు ప్రభాతతీర్థంలో మునిగిన తన కుమారుడిని తెచ్చి ఇవ్వమనగా సముద్రం ఒడ్డుకు వెళ్ళి వరుణుడిని కోరగా పంచజనుడను రాక్షసుడు చంపాడని చెప్పగా సముద్రంలోదూకి పంచజనుడిని చంపుతాడు. ఇతడు శంఖరూపుడు. ఆ శంఖమే పాంచజన్యం. ఆ తర్వాత యమలోకం వెళ్లి యముడినడిగి గురుపుత్రుడ్ని బ్రతికించి గురువుకు దక్షిణగా ఇస్తారు. తన చిన్ననాటి స్నేహితుడైన కుచేలుడికి ద్వారకలో వుండగా సహాయపడతాడు. *– చూ॥ కుచేలుడు*

*ద్వారకా నగర నిర్మాణం :* ఈ మధ్య కాలంలో కౌరవులు పాండవులకు చేసిన అన్యాయాన్ని తెలుసుకుంటాడు. మధురను చేరిన బల రామకృష్ణులకు కంసుని మామ అయిన జరాసంధుడు అల్లుడి మరణం కూతుళ్ల బాధను చూసి మధురపై దండెత్తాడు. ఆకాశవాణి జరాసంధుడిని చంపడం సాధ్యం కాదని చెప్పింది. జరాసంధుడు కూడా తన మనమలకు మధురను కట్టబెట్టడానికే ఈ యుద్ధం చేస్తున్నాడని దీనివల్ల యాదవుల బలం క్షీణిస్తోందని గ్రహించి శృగాల వాసుదేవుణ్ణి వధించి అతని ధనాగారం కొల్లగొట్టి ద్వారక అనే ద్వీపంలో విశ్వకర్మతో ద్వారకానగరం నిర్మించి అచట ప్రశాంత జీవనం గడుపుతాడు.

*బలరామకృష్ణుల వివాహం :* బలరాముడు ఆనర్తుని కుమార్తె రేవతిని వివాహమాడగా, శ్రీకృష్ణుడు రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవింద, సత్య, భద్రలను వివాహమాడటమేగాక నరకాసురుని చెర నుండి విడిపించిన 16000 మందిని తన భార్యలుగా పరిగ్రహిస్తాడు. *– చూ॥ నరకాసురుడు*

*కృష్ణుని కుమారులు – మనుమలు :*

రుక్మిణి సంతానం : ప్రద్యుమ్నుడు, చారుదేష్ణుడు, చారుదేహుడు, సుచారుడు, చారుగుప్తుడు, భద్రచారు, చారుచంద్ర, సుదేక్షణుడు, అతిచారు, చారుడు.

జాంబవతి సంతానం : సాంబుడు, సుమిత్రుడు.

సత్యభామ సంతానం : భాణుడు, సుభాణుడు, స్వర్భాణుడు,

ప్రభాణుడు, భాణుమానుడు, చంద్రభాణుడు, బృహద్భాణుడు, హవిర్భాణుడు, శ్రీబాణుడు, ప్రతిభాణుడు.
కాళింది సంతానం : నాశృత
మిత్రవింద సంతానం : వృకహంస
సత్యసంతానం : భానుచంద్రుడు
భద్రసంతానం : సంగ్రామచిత్త
లక్ష్మణ సంతానం : ప్రఘోషుడు
రుక్మిణి సోదరుడు రుక్మికి రుక్మావతి జన్మించగా ప్రద్యుమ్నుడీమెను వివాహమాడెను. వీరి కుమారుడు అనిరుద్ధుడు, రుక్మిణి మరో కూతురు చారుమతి కృతవర్మ కుమారుని వివాహమాడింది. బలరాముని కుమార్తె సుభద్ర అర్జునుని వివాహ మాడింది.

*- చూ॥ సుభద్ర*

ఈ కాలంలోనే ఘంటాకర్ణుడికి శాపవిమోచన కల్గించారు. మురాసురుడిని, నరకాసురుడిని సంహరించాడు. *- చూ॥ ఘంటాకర్ణుడు, నరకాసురుడు, మురాసురుడు.*

ఇతడు బాణాసురుడిని, పౌండ్రక వాసుదేవుడిని వధించాడు. చూ॥ బాణాసురుడు, పౌండ్రక వాసుదేవుడు.

*పాండవులతో మైత్రి :* ఆ తర్వాత కృష్ణుని జీవిత కాలమంతా పాండవులతో పెనవేసుకుపోయింది.

ఇతడు విరామం లేకుండా యజ్ఞం చేశాడు. ధర్మజుడితో రాజసూయ యాగం చేయించాడు. భీముడితో కలసి మధురకు వెళ్లి జరాసంధుడ్ని సంహరించాడు. రాజసూయ యాగ సమయంలో శిశుపాలుణ్ణి వధించాడు. ద్రౌపది వస్త్రాపహరణ సమయంలో ఆమెను రక్షించాడు. అభిమన్యుని వివాహానికి వచ్చాడు. పాండవులు తమ వనవాసానంతరం అర్ధ రాజ్యం కోరగా కౌరవులు నిరాకరించగా ఇద్దరూ శ్రీకృష్ణుని సహాయం కోరి రాగా నిద్రలో వున్నట్లు నటించి ముందుగా అర్జునుణ్ణి తను చూశాను కనుక సహాయం అర్జునుణ్ణే ముందు కోరుకొమ్మంటాడు. అర్జునుడు శ్రీకృష్ణుడిని కోరగా తక్కిన యాదవసైన్యాన్ని దుర్యోధనుడు పొందుతాడు. ఆ తర్వాత కౌరవ సభకు ధూతగా వెళ్ళి సంధి ప్రయత్నం చేసి విఫలుడై దారిలో కర్ణుడిని కలసి అతడి జన్మవృత్తాంత మెరిగించి అతడికి పాండవుల యెడ మమకారం పెంచడంలో కృతకృత్యు డవుతాడు. కురుక్షేత్రంలో అర్జునుడు తన ఎదుటి సైన్యాలను చూసి బంధునాశనానికి వెరవగా కర్మ సిద్ధాంతాన్ని బోధిస్తాడు. అదే 'భగవద్గీత'గా వినుతి కెక్కింది. ఆ తర్వాత యుద్ధంలో ఎందరో వీరాధి వీరులు మరణిస్తారు. పాండవులకు హస్తినను అప్పగించి తాను తిరిగి ద్వారకకు తిరిగివెళ్తాడు. అశ్వత్థామ శరానికి ఉత్తర గర్భంలోని శిశువు మృతిచెందాడని తెలిసి హస్తినకు వెళ్లి అతణ్ణి సజీవుణ్ణి చేసి ద్వారకకు వస్తాడు. అతడే పరీక్షిత్తు.

*కృష్ణుని అంతిమ జీవనం - నిర్యాణం :*

గాంధారి శాపం : దుర్యోధనుడు మరెంతో మంది వీరాధివీరులు కురుక్షేత్ర యుద్ధంలో మరణించారని తలచి దీనికి బంధుత్వాలను కూడా చూడకుండా యుద్ధకారకుడు కృష్ణుడని భావించి "నా భర్తకు నా సేవ పవిత్రమైనదే అయితే ఆ శక్తితో నిన్ను శపిస్తున్నాను. 36 సంవత్సరాల తర్వాత నీవు నీ బంధువులు కూడా ఇలాగే నశించి నీ స్త్రీ జనం విలపిస్తారు" అని శపిస్తుంది. - మహాభారతం

36 సంవత్సరాల తర్వాత మరో శాపం కూడా యాదవుల్ని నాశనం చేసింది. విశ్వామిత్ర, నారద, కణ్వ మహర్షులు రాగా సాంబుడిని స్త్రీ వేషం వేయించి ఆమెకు పుట్టబోయేది స్త్రీనా పురుషుడా అని అడగగా మునులు ఓ ఇనుప రోకలి పుడుతుందని శపిస్తారు. శ్రీకృష్ణునికీ విషయం చెప్పగా కాలనిర్ణయం ఎలా వుంటే అలా జరుగుతుందంటాడు. ఆ మరుసటి రోజే సాంబుడు ఓ ఇనుప ఊచకు జన్మనిచ్చాడు.

*యాదవ నాశనం :* శ్రీకృష్ణ బలరామ ఉద్దవులు పుణ్య తీర్థాలకు వెళ్లగా యాదవ వంశజులు మద్యం సేవించారు. సాంబుడికి జన్మించిన ఇనుప ఊచను నులిమి సముద్రంలో వెయ్యగా అది గడ్డిపోచలై అవే బాణాలై యాదవుల్ని గుచ్చాయి. వాటితో ఒకరినొకరు పోరాడి చనిపోయారు. శ్రీకృష్ణుడు తన పరివారానికి వసుదేవుడికి వీడ్కోలు చెప్పి బలభద్రరాముడిని కలవడానికి వెళ్లగా అప్పటికే అతడి ఆత్మ తెల్లని సర్పంగా శరీరం నుండి వెలువడి పాతాళం వెళుతోంది. శ్రీకృష్ణుడు నిశ్చల మనస్కుడై యోగముద్రతో తన పాదం పై కెత్తి వుండగా జర అనే అసురుడు లేడి అనుకొని వదలిన బాణం శ్రీకృష్ణుని పాదానికి తగలగా వెంటనే మరణించి మహావిష్ణువు రూపంలో స్వర్గం చేరాడు.

శ్రీకృష్ణుని నిర్యాణానంతరం అర్జునుడు ద్వారకకు వచ్చి కృష్ణుడి కర్మకాండ నిర్వహించాడు. బాధను చూడలేని రుక్మిణి జాంబవతి ఇతర భార్యలు శ్రీకృష్ణుని చితిపైపడి మరణించగా తక్కిన భార్యలను తనతో తీసుకు వెళ్తుండగా అటవికులు వెంటపడగా వారు భయపడి సరస్వతీ నదిలో దూకి మరణించారు.

శ్రీకృష్ణుని పేర్లు *:* అచ్యుత, అధిదేవ, అధోక్షజ, ఆది దేవ, అజ, ఆమధ్య, అనాది, అవ్యక్త, అవ్యవ్య, భోజ రాజాన్యవర్ధన, వృష్ణనాథ, భూతేశ్వర, భూతపతి, చక్రధర, చక్రధారి, దామోదర, దేవదేవ, దేవకీ నందన, గదాగ్రజ, గరుడధ్వజ, గోపాల, గోపేంద్ర, గోవింద, హరి, జనార్ధన, కేశవ, యదుపుంగవ, యదూత్తమ, యోగీశ్వర, యోగీశ, యాదవాగ్ర్య, వృష్ణి పతి అనునవి కొన్ని పేర్లు.

**కృష్ణ 2 :** చూ॥ ద్రౌపది - మహాభారతం

**కృష్ణ 3 :** దుర్గాదేవి మరో పేరు. - మహాభారతం

**కృష్ణ 4 :** దక్షిణ భారతదేశంలో ఒక నది.

**కృష్ణ 5 :** స్కంద దేవుని స్త్రీ పరిచారిక. - మహాభారతం

**కృష్ణకర్ణి :** స్కందదేవుని పరివారంలో ఒక స్త్రీ. - మహాభారతం

**కృష్ణకేశుడు :** స్కందదేవుని పరివారంలో ఓ యోధుడు. - మహాభారతం

**కృష్ణజయంతి :** శ్రావణ బహుళ అష్టమి. ఈ రోజున శ్రీ మహావిష్ణువు కృష్ణావతారం ఎత్తినందువల్ల దీన్ని పుణ్యదినంగా ఎంచి వ్రతంగా ఆచరిస్తారు.

**కృష్ణదేవి :** కృష్ణానది మరోపేరు.

**కృష్ణదేవుడు :** చూ॥ దేవనాథుడు

**కృష్ణద్వైపాయనుడు :** చూ॥ వ్యాసుడు.

**కృష్ణపర్వతం :** కుశద్వీపంలోని ఓ పర్వతం. విష్ణువుకి ప్రీతిపాత్రమైనది. - మహాభారతం

**కృష్ణవర్తనుడు :** అగ్నికి మరోపేరు. ఆస్తిక మహర్షి సర్పయాగంలో అగ్నిని ఈ విధంగా పిలిచాడు. - మహాభారతం

**కృష్ణవేణి :** దక్షిణ భారతదేశంలో ఓ పుణ్యనది. ఈ నదిలో స్నానం చేస్తే పూర్వజన్మ జ్ఞప్తికి వస్తుంది. దీని హృదయం నుండే అగ్ని జనించిందంటారు. - మహాభారతం

**కృష్ణాంజనం :** నిరృత్తి రాజధాని. ఇతడు అష్ట దిక్పాల కుల్లో ఒకడు. - దేవీభాగవతం

**కృష్ణాత్రేయుడు :** ప్రాచీన భారతదేశంలో ఓ గొప్ప రుషి. ఇతడు ఆయుర్వేదాన్ని సంపూర్ణంగా గ్రహించి తన తపశ్శక్తితో ఆచరించాడు. - మహాభారతం

**కృష్ణానుభౌతికుడు :** ఓ గొప్ప మహర్షి. భీష్ముడ్ని అంప శయ్యపై వుండగా దర్శించాడు. - మహాభారతం

**క్రతుస్థల :** ఓ యువతి. ఈమె వసురుచియను వానిని ప్రేమించి అతనిని పెండ్లి చేసుకొనదలచెను. యక్షు డనువాడు ఈమెను పెండ్లి యాడదలచి కోరగా ఆమె నిరాకరించెను. ఈమె వసురుచిని పెండ్లియాడదలచి నదని తెలుసుకొని అతని రూపమున యక్షుడీమె చెంతకేగెను. తాను వలచిన వాడు వచ్చెనని క్రతుస్థల తలచి సంతోషముతో అతనిని కూడెను. ఆమె గర్భ వతియై రజితనాభుడనువానికి జన్మనిచ్చెను. తర్వాత యక్షుని నిజరూపమును తెలుసుకొని ఇక చేయునది లేక అతనితోనే కాపురము చేసెను. - బ్రహ్మాండపురాణం.

**క్రథుడు 1 :** ఓ క్షత్రియ రాజు. క్రోధవసుని పునర్జన్మ. - మహాభారతం

**క్రథుడు 2 :** భీమసేనుడు తన జైత్రయాత్రలో ఓడించిన ఒక రాజు. - మహాభారతం

**క్రథుడు 3 :** ఓ ముని. ఇతడు శ్రీకృష్ణుడు హస్తినాపురం వెళ్లే దారిలో కలుస్తాడు. - మహాభారతం

**క్రథుడు 4 :** కౌరవుల పక్షాన పోరాడిన ఓ యోధుడు. - మహాభారతం

**క్రథుడు 5 :** స్కందదేవుని యోధుల్లో ఒకడు. - మహాభారతం

**క్రథుడు 6 :** ఓ యక్షుడు. గరుడుడు అమృతం కొరకు దేవలోకం వెళ్లినపుడు ఇతడితో పోరాడాడు. - మహాభారతం

**క్రథుడు 7 :** ఓ అసురుడు. ఇతడు పునర్జన్మలో సూర్యా క్షుడను రాజుగా జన్మించాడు. - మహాభారతం

**క్రథుడు 8 :** ధృతరాష్ట్రుని కుమారుల్లో ఒకడు. - మహాభారతం

**క్రమజిత్తు :** ఓ క్షత్రియరాజు. అతడెల్లపుడు ధర్మజుణ్ణి అనుసరించేవాడు. - మహాభారతం

**క్రమపాఠం :** వేదాలను బోధించే విధాన క్రమం. ఈ విధానాన్ని పాటించడం వల్ల కాలాతీతంగా పాఠాంత రాలకు అవకాశం లేకుండా వేదాలు వర్ధిల్లుతున్నాయి. వేదపఠనం, పద పఠం, క్రమపాఠం, జటాపాఠం, ఘంటాపాఠం.

**క్రమపుడు :** పులహుడికి క్షామవల్ల జన్మించినవాడు. ఇతడికి సహిష్ణుడనే సోదరుడున్నాడు. – అగ్నిపురాణం

**క్రమవుడు :** క్షమ, పులహుల కొడుకు. ఇతడి సోదరుడు సహిష్ణువు. – అగ్నిపురాణం

**క్రవ్యాదులు :** ఒక పితృగణం. – అగ్నిపురాణం

**క్రాథుడు 1 :** ప్రాచీన భారతదేశంలో గొప్ప రాజు. సింహిక కుమారుడైన రాహువు యొక్క పునర్జన్మ. ఇతడు ద్రౌపది స్వయంవరానికి వెళ్లాడు. జారులి నగరం వద్ద శ్రీకృష్ణుడితణ్ణి ఓడించాడు. మహాభారత యుద్ధంలో ఇతడు అభిమన్యుడిపై పోరాడాడు. ఇతడు కళింగ రాజకుమారుడ్ని సంహరించి పర్వత రాజు చేతిలో మరణించాడు. – మహాభారతం

**క్రాథుడు 2 :** పురువంశంలో ఒక రాజు. – మహాభారతం

**క్రాథుడు 3 :** వానర సేనలో ఓ విభాగానికి అధిపతి. – రామాయణం

**క్రాథుడు 4 :** స్కందదేవుని యోధుల్లో ఒకడు. – మహాభారతం

**క్రాథుడు 5 :** ఓ ప్రముఖ సర్పం. బలభద్రరాముని ఆత్మను పాతాళానికి తీసుకువెళ్లే సమయంలో మందు వుంటుంది. – మహాభారతం

**క్రాథం :** ఒక ప్రాచీన దేశం. విదర్భరాజు భీష్మకుడు దీన్ని జయిస్తాడు. – మహాభారతం

**క్రిమిలాపురం :** ఇదో పట్టణం. క్రిమి అనేవాడిచే నిర్మించబడింది. కాబట్టి ఈ పేరు వచ్చింది.

**క్రిమిలుడు :** పూరువంశపు రాజు. – అగ్నిపురాణం

**క్రిమిశం :** 28 నరకాల్లో ఇదొకటి.

**క్రియ 1 :** క్రతువు భార్య. కర్ధమ ప్రజాపతి కుమార్తె. – భాగవతం

**క్రియ 2 :** దక్షప్రజాపతి ధరణిలకు జన్మించిన కూతురు. ధర్ముడనే మనువు భార్య. – మహాభారతం

**క్రీడి :** చూ॥ అర్జునుడు.

**క్రూర 1 :** దక్ష ప్రజాపతి కుమార్తె. కశ్యపుడి భార్య. అనేకమంది రాక్షసులు వీరికి జన్మిస్తారు. వీరినే క్రోధవశులంటారు. – మహాభారతం

**క్రూర 2 :** ప్రాచీన భారతదేశంలోని ఓ ప్రాంతం. – మహాభారతం

**క్రోధ :** కశ్యపునికి కాలకు జన్మించిన ప్రసిద్ధ రాక్షసుడు. – మహాభారతం

**క్రోధనుడు :** స్కందదేవుని అనుచరుడు. – మహాభారతం

**క్రోధవర్ధనుడు :** ఓ రాక్షసుడు. ఇతడు తర్వాతి జన్మలో దండధరుడుగా జన్మించాడు. – మహాభారతం

**క్రోధవశ :** కశ్యప ప్రజాపతి భార్య క్రోధ వశకు జన్మించిన వారు రాక్షసులు. వీరు కుబేరుని కొలనుకు కాపలాదారులుగా వుండేవారు. భీమసేనుడు ఈ కొలనులోని పుష్పాల్ని త్రుంచినపుడు వీరు కుబేరునికి చెప్తారు. క్రోదవశులు రావణుని తరఫున యుద్ధం చేశారు. – రామాయణం

**క్రోధవశుడు :** ఇంద్రజిత్తు అనుచరుడు. మాయా యుద్ధంలో చాలామంది వానరుల్ని బాధించాడు. ఈ మాయా యుద్ధం తెలిసిన విభీషణుడి సహా యంతో వానరులు ఇతణ్ణి చంపారు. – మహాభారతం

**క్రోధశత్రువు :** కశ్యప ప్రజాపతి భార్య కాలకు జన్మించిన రాక్షసుడు. – మహాభారతం

**క్రోధహంతుడు :** ఓ ప్రముఖ అసురుడు. కశ్యప ప్రజాపతికి కాలవల్ల జన్మించినవాడు. వృత్రా సురుడు ఇతని సోదరుడు. – మహాభారతం

**క్రోధుడు 1 :** భైరవులలో ఒకడు.

**క్రోధుడు 2 :** బ్రహ్మ కనురెప్పల నుండి జన్మించాడు. జమదగ్ని ఒకసారి పితృ గణాలకు తర్పణ చేస్తుండగా గోవుపాలతో తయారుచేయబడిన ఆహారంలో విషం కలిపాడు. అది తెలిసికూడా జమదగ్ని కోపించక పోవడం చూసి "ఓ మహర్షీ భృగు వంశజులు కోపిష్ఠు లని విన్నాను. కాని మీరు ప్రశాంతంగా వున్నారు. నన్ను మన్నించండి అని వేడుకోగా పితృగణం శపి స్తుంది అని చెప్తాడు. పితృగణాల శాపం వల్ల ముంగిసగా జన్మించి ధర్మస్థలిలో ఉంచవృత్తి అనే బ్రాహ్మణుడి కథను శ్రీకృష్ణునికి విన్పించగా నిజరూపుడుగా మారాడు. – జైమిని భారతం

**క్రోశవ** : స్కందదేవుని పరివారంలోని ఓ స్త్రీ.
– మహాభారతం

**క్రోష్టుకి** : ఒక ముని. మార్కండేయుని వలన అనేక విషయము లెరిగి జ్ఞానము పొందెను.
– మార్కండేయ పురాణం

**క్రోష్టువు** : యదుపుత్రులలో రెండోవాడు. వృజినవంతుడి తండ్రి.

**క్రోష్మ** : యదువు కుమారుడు. – హరివంశం

**క్రౌంచ 1** : ఓ అసురుడు. స్కందుడితణ్ణి సంహరించాడు.

**క్రౌంచ 2** : ఓ జాతి పక్షి.

**క్రౌంచద్వీపం** : సప్త ద్వీపాలలో ఇదొకటి.
– దేవీభాగవతం

ఈ ద్వీపంలో క్రౌంచ, వామనక, అంధకార, మైనాక, గోవింద, నిబధ, విశకంభ పర్వతాలువున్నాయి. కుశల, మనోనుహ, ఉష్ణ, ప్రావరక, అంధకారక, మునిదేశ, దుంధిభీశ్వర దేశాలు వున్నాయి.
– మహాభారతం

**క్రౌంచనిషూదనం** : సరస్వతీ తీరాన గల ఓ పుణ్య తీర్థం. ఇక్కడ స్నానం చేస్తే విమానం పొందుతారు.
– మహాభారతం

**క్రౌంచపది** : ఇదో పుణ్యతీర్థం. ఇక్కడ ఉడికించిన బియ్యంతో ముద్దలు చేసి వుంచితే అతనికి బ్రహ్మ హత్యా పాతకం నశిస్తుంది. – మహాభారతం

**క్రౌంచ పర్వతం** : ఓ పర్వతం.

★ *పూర్వ కథ :* అగస్త్యుడొకసారి శివుడ్ని పూజించగా వరం కోరుకొమ్మన్నాడు. అప్పుటే కావేరి కూడా వుంది. నేను తన్నితే వింధ్యపర్వతాలు కూడా ఎగిరిపడే వరమిమ్మని దానివల్ల అచట ఓ పుణ్యస్థలం ఏర్పరుస్తానని చెప్పగా అనుగ్రహించి కావేరిని నదిగా మార్చి ఓ కమండలంలో వుంచి అగస్త్యుడికిస్తాడు. అతడు ప్రయాణిస్తుండగా ఓ పర్వతం అడ్డువచ్చి పెను తుఫాను వచ్చి అగస్త్యునికి అగమ్యంగావుంది. కారణం గమనించి క్రౌంచుడనే రాక్షసుని పనిగా భావించి తన కమండలంలోని నీటిని మంత్రించి విసరగా అవి క్రౌంచునిపై బడి ఓ పర్వతంగా మారతాడు. శాప విమోచన కోరగా శివుని కుమారుడైన కుమారస్వామి శరసంధానంవల్ల నీకు శాపవిమోచనం జరుగు తుందని చెప్తాడు. ఆ పర్వతాన్నే క్రౌంచ పర్వతమంటారు.
– స్కందపురాణం

**క్రౌంచవ్యూహం** : క్రౌంచ పక్షిని తలపించే సైన్య వ్యూహం. దీన్ని మొదటి భీష్ముడు కౌరవుల పక్షాన నిర్మించాడు. దీనిలో 8 ఎత్తుగడలు వుంటాయి. ఆస్థాన నియతి స్థానాలు ముఖం, కళ్లు, తల, మెడ, పొట్ట, ఎడమచెయ్యి, కుడిచెయ్యి, తొడలు. ద్రోణుడు ముఖం వద్ద కృప అశ్వద్ధామలు కళ్లవద్ద, హార్దిక్యుడు తలవద్ద, సుశీనుడు మెడవద్ద, ప్రగ్జోతిష రాజు పొట్టవద్ద, తశరసులు, యవనులు, శాఖాసులు, కుష్ణమి కుడిచేతి వద్ద, సృతాయసుడు, భోరిశ్రవుడు తొడల భాగంలో నిలబడ్డారు. – మహాభారతం

**క్రౌంచారుణవ్యూహం** : క్రౌంచవ్యూహానికి మరోపేరు. దృష్టద్యుమ్నుడు ఈ వ్యూహాన్ని తన సైన్యంతో నిర్మించాడు. – మహాభారతం

**క్రౌంచి** : కశ్యప ప్రజాపతికి తామర అనే భార్యవల్ల 5 గురు కుమార్తెలు. వారు క్రౌంచి, భాసి, స్యేని, ధృతరాష్ట్రి మరియు నర. క్రౌంచినుండి గుడ్ల గూబలు జన్మించాయి.
– రామాయణం



**క్ష** : అనగా క్షత్రియుడని, క్షేత్రమని, నరసింహుడు, హరి, దేవాలయ రక్షకుడు, కాంతి, ధ్వంసం, దయ్యం అనే అర్థాలు కలవు.

**క్షత్త** : చూ॥ వర్ణములు.

**క్షత్రదేవుడు** : శిఖండి కుమారుడు. ఇతడు భగదత్తుడితో యుద్ధం చేశాడు. కుడిచెయ్యి గాయ పడింది. ద్రోణుడితో, ఉత్తర కుమారుడితో తలపడ్డాడు. ఉత్తర కుమారుడితణ్ణి వధించాడు. – మహాభారతం

**క్షత్రధర్ముడు** : దృష్టద్యుమ్నుడి కుమారుడు. అస్త్రవిద్యాని పుణైన ద్రోణుడితణ్ణి సంహరించాడు. – మహాభారతం

★ క్రౌంచ పర్వతం మైనాక పర్వతం యొక్క పుత్రుడని బాణాసురుడు ఈ పర్వతంలో దాక్కోగా కుమారస్వామి శరసంధానానికి ఈ పర్వతం రెండుగా చీలిందని హరివంశం పేర్కొంది.

**క్షత్రబంధుడు :** ఇతడొక రాజు. బ్రాహ్మణ స్థలం నుండి గాలికి వచ్చే రేణువునుచూసి పక్కకు పరుగెత్తే మాల వాణ్ని చూసి ఎందుకు భయపడుతున్నావని అడిగాడు. నేను తొలి జన్మలో బ్రాహ్మణుడ్ని భిక్షాన్నం తినాలను కోరికతో తిరుగుతుంటే బ్రాహ్మణ స్థలం నుంచి ధూళివచ్చి అన్నంలో పడింది. అది కడుపులోకి వెళ్ళి ఆ పాతకం వల్ల నాకీజన్మ వచ్చింది. బ్రాహ్మణుల పాదరేణువు హరించినా ఇలా అవు తుంది. నిన్నరాత్రి కలలో ఈ బ్రాహ్మణుడు కన్పించి రేపు నాకు క్షత్ర బంధు సంవాదంతో దుఃఖం పోతుందని చెప్పాడని వివరించి మరణిస్తాడు. - మహాభారతం

**క్షత్రవర్మ :** దృష్టద్యుమ్నుని కొడుకు. కురుక్షేత్రంలో జయద్రధుడితో యుద్ధం చేశాడు. ద్రోణుడితడ్ని వధించాడు. - మహాభారతం

**క్షత్రవృద్ధుడు :** పురూరవుడి కొడుకు. నహుషుడి తమ్ముడు. - మహాభారతం

**క్షత్రంజయుడు 1 :** దృష్టద్యుమ్నుడి కుమారుడు. ద్రోణుడితడ్ని సంహరించాడు. - మహాభారతం

**క్షత్రంజయుడు 2 :** మహోత్రుడు, కుశుడు ఇతని కొడుకులు. - భాగవతం

**క్షత్రియులు :** బ్రహ్మహృదయం నుండి జన్మించిన వారు. దానాలు చెయ్యడం వేదపఠనం యజ్ఞాలు చెయ్యడం వీరి విధి. దుష్టశిక్షణ శిష్ట రక్షణ వీరి ప్రత్యేకత. బ్రాహ్మణులను తప్ప వేరేకులం వారిని వివాహం చేసు కోవచ్చు. చాతుర్వర్ణ వ్యవస్థలో బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్రులలో ఒకరు. - విష్ణుపురాణం

**క్షత్రోపేతుడు :** అక్రూరుడి తమ్ముడు.

**క్షమకుడు :** పూరువంశపు రాజు. - అగ్ని

**క్షమావర్తుడు :** దేవలుడి పెద్ద కొడుకు.

**క్షితికంపనుడు :** స్కందదేవుని కొంత సైన్యానికి నాయకుడు. - మహాభారతం

**క్షీరవతీ :** ఓ పవిత్ర నదీతీరం. ఇక్కడ స్నానం చేస్తే వాజపేయ యజ్ఞం చేసిన ప్రతిఫలం లభిస్తుంది. - మహాభారతం

**క్షీరసాగరం :** బ్రహ్మ ఎక్కువ అమృతం తాగి కక్కుకోగా అందుండి సురభి ఉద్భవించింది. ఆ ఆవుపాలు ధారగా ప్రవహించి సముద్రంలోకి చేరినాయి. ఈ సముద్రాన్నే క్షీరసాగరం అంటారు.

**క్షీరసాగరమధనం :** అమృతం కొరకు దేవాసురులు క్షీరసాగరాన్ని మధించడాన్ని క్షీరసాగర మధనం అంటారు. - చూ॥ అమృతం

**క్షీరిని :** ఉత్తర కురు వంశంలోని ఓ వృక్షం. ఈ వృక్షానికి 6 రకాల రుచులుంటాయి. ఈ చెట్టు నుండి పాలు ఎప్పుడూ స్రవిస్తాయి. దీని పండు నుండి గుడ్డ, ఆభర ణాలు వస్తాయి. - మహాభారతం

**క్షుతుడు 1 :** బ్రహ్మ తుమ్మగా అతడి గర్భం నుండి జన్మించాడు. ఇతడే బ్రహ్మ చేసే యజ్ఞాలకు రుత్విజు డయ్యాడు. - మహాభారతం

**క్షుతుడు 2 :** కృత యుగంలో దండనీతి కోవిదుడైన మనువుకు ప్రజాని అనే కుమారుడు జన్మించాడు. ప్రజాని కొడుకు క్షుతుడు. ఇతని కొడుకు ఇక్ష్వాకుడు. - మహాభారతం

**క్షుద్రకం :** ప్రాచీన భారతదేశంలో క్షుద్రకం అనే దేశం కలదు. క్షుద్రకులు నివసించే ప్రాంతం కనుక ఈ పేరొచ్చింది. వీరు ధర్మజునికి బహుమతులు అందజే శారు. కురుక్షేత్ర యుద్ధంలో కౌరవుల తరపున పోరా డారు. ఒకసారి శకుని కుమారుణ్ణి రక్షించారు. భీష్ముని కోరికపై వీరు అర్జునుణ్ణి ఎదిరించారు. చాలామంది క్షుద్రకులు పరశు రాముడు క్షత్రియుల్ని చంపినపుడే నశించారు. - మహాభారతం

**క్షుధాతీర్థం :** పూర్వము కరువు కాటకము వచ్చినపుడు కణ్వ మహాముని ఆహారము లేక బాధపడుచూ కూడా గౌతముని ఆశ్రమమునకు బోక గౌతమీ తీరమునకేగి ఆ నదియందు ప్రార్ధన చేశెను. గౌతమి ప్రత్యక్షమై వరము కోరుకొమ్మనెను. నిన్ను వేడుకున్నవారికి ఈతిబాధలు గాని ఆకలి బాధలుగాని లేకుండునట్లు వరమిమ్మని కోరెను. అతడు ప్రార్థించిన తీరమే క్షుధాతీర్థము. - బ్రహ్మపురాణం

**క్షుపుడు 1 :** ఓ ప్రజాపతి. బ్రహ్మ ఓసారి యజ్ఞం చేయ దలచి సరైన రుత్వికుడు లేక తనే సృష్టించ దలచాడు. అతనికి తలలో గర్భం వచ్చి 1000 సంవత్సరాల తర్వాత ఈ ప్రజాపతి జన్మించగా ఇతడ్ని తన యజ్ఞానికి రుత్వికుడుగా నిర్ణయించుకున్నాడు. రుద్రభగవానుడి తణ్ణి ప్రజాపతిగా నియమించాడు. - మహాభారతం

**క్షుపుడు 2 :** ఇక్ష్వాకుని తండ్రి. వైవశ్వత మనువు మనుమడు. అతని మరణానంతరం యముని కొలువులో జీవించాడు. ఇతడు మాంసాహారం భుజించేవాడు కాదు. – మహాభారతం

**క్షురకర్ణి :** స్కంద దేవుని పరివారంలోని ఓ సేవకుడు. – మహాభారతం

**క్షేత్రాలు :** పుణ్యస్థలాలు. మళయాళంలో దేవాలయాలని అంటారు. మనిషి శరీరంలో ఆత్మ వున్నట్లే దేవాలయాలలో దేవుడుంటాడని చెప్పబడింది. భారత దేశంలో రెండు రకాల దేవాలయాలు న్నాయి. 1. గ్రామదేవతల క్షేత్రాలు, 2. ప్రత్యేకంగా దేవతలైన విష్ణు, శివ, గణపతి దేవాలయాలు.

*గ్రామదేవతల దేవాలయాలు :* భద్రకాళిని పూజించడం పూర్వకాలం నుండి వున్నా బౌద్ధమతం కొంత నిర్వీర్యం చేసింది. ఆ తర్వాత కలకత్తా కాళి, చిదంబరంలోని కాళి, మైసూర్‌లోని చాముండి, కంచిలోని కామక్షి, మధురలోని మీనాక్షి, ఉత్తర కర్ణాటకలోని మూగాంబిక ప్రముఖ గ్రామదేవతలు.

**క్షేమ :** ఓ దేవకన్య. అర్జునుని జన్మదినోత్సవ వేడుకల్లో పాల్గొంది. – మహాభారతం

**క్షేమకుడు 1 :** ఓ రాక్షసుడు. కాశీలో నివసించేవాడు. దివోదాసు ఇతణ్ణి వధించి అక్కడో పట్టణాన్ని నిర్మించాడు. – బ్రహ్మాండపురాణం

**క్షేమకుడు 2 :** కద్రువ కశ్యపుల సంతానంలోని ఓ సర్పం. – మహాభారతం

**క్షేమకుడు 3 :** ధర్మజుని కొలువులోని ఓ రాజు. – మహాభారతం

**క్షేమగిరి :** భద్రకాళి మరో పేరు. ఆర్య, దుర్గ, వేదగర్భ, అంబిక, భద్రకాళి, భద్ర క్షేమ్య, నైకబాహు అనే నామాంతరాలన్ని ఈమెకు చెందినవే. – అగ్నిపురాణం

**క్షేమదర్శి :** కోసల దేశపు రాజు. ధనాగార కాపలాదారు తన స్వంతానికి ధనాన్ని ఉపయోగించుకునేవాడు. కాలక వృక్షేయుడు రాజును అతడ్ని మోసం చేసే వారి నుండి రక్షించాడు. ఓ కాకిని పంజరంలో బంధించి దేశాటనచేసి దానికి భూతభవిష్యత్ వర్తమానాలు తెలుసునని ప్రచారం చేశాడు. ఇది తెలుసుకున్న రాజు అతణ్ణి రప్పించగా ఆ రాత్రి రాజుని మోసం చేసే వారంతా కలసి పంజరంలోని కాకిని చంపుతారు. కాలక వృక్షేయుడు ఈ విషయాన్ని రాజుకి తెలుపగా అతడు మంత్రుల్ని సలహాదారుల్ని తీసివేసి ఇతణ్ణి మంత్రిగా చేసుకొని రాజ్యాన్ని పాలించాడు. – మహాభారతం

**క్షేమధన్వుడు :** ఇతడో గొప్ప రధికుడు. దుర్యోధనుని రధాన్ని నడిపాడు. – మహాభారతం

**క్షేమధూర్తి 1 :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజు. క్రోధవశుడను రాక్షసుడి ఓ భాగం నుండి జన్మించాడు. కౌరవుల పక్షాన కురుక్షేత్రంలో పోరాడి భీముని చేతిలో మరణించాడు. – మహాభారతం

**క్షేమధూర్తి 2 :** బృహంతకుని సోదరుడు. ఓ రాజు. కౌరవుల పక్షాన పోరాడాడు. సాత్యకితో యుద్ధం చేశాడు. – మహాభారతం

**క్షేమవర్యుడు :** కాకర్ణుడి కొడుకు. ఇతడి తదుపరి ఇతని కుమారుడు క్షేత్రజ్ఞుడు రాజ్యం పాలించాడు. – భాగవతం

**క్షేమవాహుడు :** స్కందదేవుని అనుచర వీరుల్లో ఒకడు. – మహాభారతం

**క్షేమవృద్ధి :** సాళ్వరాజు మంత్రి. అతడు సర్వసేనాధిపతికూడా. శ్రీకృష్ణుని కుమారుడు సాంబుడు ఇతణ్ణి ఓడించాడు. – మహాభారతం

**క్షేమశర్మ :** కౌరవుల పక్షాన పోరాడిన ఓ యోధుడు. కర్ణుడు పన్నిన గరుడ వ్యూహంలో మెడవద్ద నిలబడ్డాడు. – మహాభారతం

**క్షేమంకరుడు :** జయద్రధుని స్నేహితుడు. త్రిగర్త దేశాధిపతి. నకులుడితణ్ణి వధించాడు. – మహాభారతం

**క్షేముడు 1 :** ఒక రాజు. క్రోశుడనే రాక్షసుడిలా జన్మిస్తాడు. ఇతడు కురుక్షేత్ర యుద్ధంలో పాండవుల పక్షాన పోరి ద్రోణుని చేతిలో మరణిస్తాడు. ఉగ్రాయుధుడి కొడుకు. – మహాభారతం

**క్షేముడు 2 :** సునీతుని కొడుకు. సుకేతుని తండ్రి. కాశ్యుని వంశస్తుడు.

**క్షేమ్యుడు :** ఉగ్రాయుధుడి కొడుకు. – మహాభారతం



**ఖ :** అనగా ఖాళీ అని అర్థము. అంతేకాకుండా స్పర్శగల అవయవము.

**ఖగముడు :** ఇతడో బ్రాహ్మణుడు. ఇతని సహాధ్యాయుడు సహస్రపాదుడు. సహస్రపాదుడు ఒకసారి యజ్ఞం దగ్గర ఖగముడి పైకి ఓ గడ్డిపోచను విసిరి సర్పమని భయపెడతాడు. దీనికి కోపించి సహస్రపాదుడ్ని బలహీనమైన సర్పం కమ్మని శపిస్తాడు. శాపవిమోచన కోరగా రురుడు నీకు ఎదురైనపుడు నిజరూపం దాల్చుతావని చెప్తాడు. ఆ తర్వాత చాలా దేశాలు తిరుగుతాడు. రురుని భార్య ప్రమద్వర సర్పం కాటుతో మరణిస్తుంది. అప్పటి నుండి రురుడు సర్పాలపై కోపంతో వాటిని నాశనం చేస్తుంటాడు. ఒకసారి అనుకోకుండా సహస్రపాదుడ్ని కలుస్తాడు. కన్పించగానే సహస్ర పాదుడు నిజరూపుడౌతాడు.
– *మహాభారతం*

**ఖగుడు :** శివుని మరో నామం.

**ఖగండు :** శ్రీరాముని వంశంలో పుట్టిన ఓ రాజు. వజ్రనాభుని కొడుకు. విధృతి కుమారుడు.
– *భాగవతం*

**ఖగం :** కశ్యపుని వంశంలో జన్మించిన ఓ సర్పం.
– *మహాభారతం*

**ఖగేంద్రుడు :** పక్షిరాజు. చూ॥ గరుడుడు.

**ఖగోదరుడు :** చూ॥ కహోదుడు.

**ఖట్వాంగదిలీపుడు :** ఇక్ష్వాకు వంశమువాడు. దిలీపుడని అంటారు. కల్మషపాదుని మనుమడు. ఇతడు రాజర్షి. ఇతడు దేవుణ్ణి సంతృప్తిపరచి ఎంతకాలం బ్రతుకుతాడో తెలుసుకొని తన మంత్రులకు రాజ్యాల్ని అప్పగించి తక్కిన కాలాన్ని దేవుని ధ్యానంలో గడిపాడు.
– *భాగవతం*

ఇలబిల యొక్క కుమారుడు. ఇతడికి దిలీపుడను పేరు కలదు. ప్రసిద్ధ 16గురు చక్రవర్తులలో ఒకడు. ఇతడు 100 యజ్ఞాలు చేశాడు. యజ్ఞ సమయంలో బంగారు బాటలు వేశాడు. ఇంద్రుడు కూడా యజ్ఞానికి వచ్చాడు. దేవతలు కూడా ఇతణ్ణి ఆశీర్వదించారు.
– *చూ॥ దిలీపుడు.*

**ఖండపరశువు :** శివుని మరోపేరు.

*నామప్రాశస్త్యం :* దక్షుడు యాగం చేస్తూ అల్లుడైన శివుడ్ని పిలవనందుకు తన త్రిశూలాన్ని విసరగా అది దక్షయజ్ఞాన్ని నాశనం చేసి నరనారాయణులు బదర్యాశ్రమంలో తపస్సు చేస్తుండగా నారాయణుడి వక్షానికి తగలగా వక్షం పై వెంట్రుకలు ముంజ రంగుగా మారాయి. అప్పటి నుండి నారాయణుడ్ని ముంజుకేశుడని పిలుస్తారు. నరుడు ఇందుకు సహించక ఓ అస్త్రాన్ని శివునిపై సంధించగా శివుడు దాన్ని ఖండించగా అది గొడ్డలి రూపం దాల్చగా శివుడు దాన్ని ఖండించాడు. ఆ తర్వాత ఆ గొడ్డలిని శివుడు తన శిష్యుడైన పరశురాముడికిచ్చాడు. అప్పటి నుండి శివుడిని ఖండ పరశువు అని పిలుస్తారు.
– *మహాభారతం*

**ఖడ్గబాహువు :** చూ॥ దుశ్శాసనుడు

**ఖడ్గం :** బ్రహ్మతపః ప్రభావం వల్ల పుట్టిన భూతం ఖడ్గాకారం దాల్చింది. బ్రహ్మ దాన్ని శివుడికిచ్చాడు. దీంతో శివుడు దైత్య సంహారంచేసి తర్వాత విష్ణువుకిస్తాడు.
– *భాగవతం*

**ఖడ్గి :** చూ॥ కల్కి.

**ఖడ్గుడు :** స్కందదేవుని పరివారంలో ఓ యోధుడు.
– *మహాభారతం*

**ఖనకుడు :** పాండవులు లక్క ఇంటిలో వున్నపుడు విదురుడు తన దూతగా ఇతణ్ణి పంపి ఆ లక్క ఇంటిని దుర్యోధనుడు ఎప్పుడైనా తగుల బెట్ట వచ్చును కనుక జాగ్రత్త వహించమని చెప్తాడు.

**ఖనిత్రుడు :** ప్రాంసు, సుప్రజాపతి కొడుకు. ఇతని కుమారుడు క్షుపుడు.

**ఖనినేత్రుడు :** సూర్యవంశపురాజైన వివంశుడి పెద్ద కుమారుడు. ఇతడి బాధలు భరించలేక ప్రజలు ఇతణ్ని దేశం నుండి వెడలగొడతారు. – *మహాభారతం*

**ఖనిపుత్రిక :** చూ॥ కుణిగర్గుడు.

**ఖమిత్రుడు :** ప్రమతి కుమారుడు. ఇతడి కొడుకు చాక్షుసుడు.

**ఖరకర్మి :** స్కందదేవుని పరివారంలోని ఓ స్త్రీ.
– *మహాభారతం*

**ఖరజంఘుడు :** స్కందదేవుని అనుచరుడు.

**ఖరి :** స్కందదేవుని పరివారంలో ఓ పరిచారిక. - మహాభారతం

**ఖరుడు :** విశ్రవసునికి ఇద్దరు భార్యలు. మొదటి భార్యకు పుట్టిన వారు రావణ, కుంభకర్ణ, విభీషణులు. రెండవ భార్య పాకకు పుట్టినవారు దూషణుడు, ఖరుడు, శూర్పణక. శూర్పణక ముక్కు చెవులు కోశారని ఈ ఇద్దరు సోదరులు రామ లక్ష్మణులపై దండెత్తి వారి చేతిలో మరణిస్తారు. - మహాభారతం

**ఖలీ 1 :** మహావిష్ణువు ఎన్నో నామాలలో ఇదొకటి. - మహాభారతం

**ఖలీ 2 :** ఇది అసుర రాజ్యం. దీనిని తన తపఃశక్తితో వశిష్ఠుడు నశింపజేస్తాడు. - మహాభారతం

**ఖలు :** ప్రాచీన భారతదేశంలో ఓ నది. - మహాభారతం

**ఖశ :** కశ్యప ప్రజాపతి భార్యలలో ఒకరు. - విష్ణుపురాణం

**ఖసృముడు :** దనువు వంశంవాడు.

**ఖసం :** ప్రాచీన భారతదేశంలోని ఓ రాజ్యం. - మహాభారతం

**ఖండఖండ :** స్కందదేవుని పరివారంలోని ఓ స్త్రీ. - మహాభారతం

**ఖాత్యి :** ఊరుని కొడుకు. - మత్స్యపురాణం

**ఖాశిరం :** భారతదేశంలోని ఈశాన్య ప్రాంతం. - మహాభారతం

**ఖ్యాత :** స్కంద దేవుని పరివారంలోని సేవకుడు. - మహాభారతం

**ఖ్యాతి 1 :** దక్షప్రజాపతి కుమార్తెల్లో ఒకరు. భృగు మహర్షి వివాహమాడాడు. ఓ కూతురు లక్ష్మి, ధాత, విధాతలనే పుత్రులు జన్మించారు. - అగ్నిపురాణం

**ఖ్యాతి 2 :** కురువు కుమార్తె. ఆగ్నేయికి 6 గురు కుమారులు, ఒక కుమార్తె. ఈమె పేరే ఖ్యాతి.

**ఖాండవప్రస్థం :** చూ॥ ఇంద్రప్రస్థం.

**ఖాండవ వనం :** చాలా పురాతన కాలంలో శ్వేతకి అనే రాజు 100 సంవత్సరాలు యాగం చేశాడు. బ్రాహ్మణులు పౌరోహిత్యం వహించి ఆ పొగ భరించలేక కొందరు వెళ్లిపోగా యజ్ఞం ఆగిపోయింది. అతడు దీన్ని గురించి శివుని గూర్చి తపస్సు చేయగా దుర్వాసుడిని పురోహితుడుగా పంపాడు. కొంతకాలం ఆ యాగం జరిగేసరికి అగ్నికి అజీర్తి వల్ల అతని ముఖం రక్తహీనమై సన్నబడి రుచి తెలియక బ్రహ్మ ఖాండవ వనంలో దేవతలకు ఎందరో శతృవులు ఉన్నారని వారిని దహించితే నీ వ్యాధి నయమవు తుందని చెప్పగా ఖాండవవనం వచ్చాడు.

ఖాండవ వనంలో ఇంద్రుడి స్నేహితుడు తక్షకుడు నివసిస్తున్నాడు. అగ్ని దహించబోతుండగా ఇంద్రుడు వర్షం కురిపిస్తూ ఆటంక పరుస్తున్నాడు. ఇది తిరిగి బ్రహ్మకు చెప్పగా నరనారాయణుల సహాయం తీసుకొమ్మని చెప్తాడు.

కృష్ణార్జునులు వేసవికాలంలో యమునలో స్నానంచే యడానికి వెళ్లగా అగ్ని బ్రాహ్మణ రూపుడై జరిగింది చెప్పి తనకు సహాయం చేయమని కోరగా వారందుకు అంగీకరించారు. అగ్ని వీరికి వరుణుని సహాయంతో తన అస్త్ర సంపదను ఇచ్చాడు. అర్జునుడికి గాండీవం శ్రీకృష్ణుడికి సుదర్శన చక్రం బహూకరించగా వారు ఖాండవ వనం నుండి ఎవ్వరూ తప్పించుకోకుండా కాపలా కాశారు. ఇంద్రుడు వర్షం కురిపించగా అర్జునుడు బాణాలతో తెరచాపను సృష్టించాడు. తక్షకుని కుమారుడు అశ్వసేనుడు గాయపడి తప్పించుకొని అర్జునునిపై పగబట్టి కర్ణుడిని చేరాడు. ఐరావతంపై ఇంద్రుడు, కాలుడు, కుబేరుడు, స్కందుడు, అశ్వనీ దేవతలు వచ్చి శ్రీకృష్ణార్జునులతో యుద్ధం చేసినా వీరే గెలిచారు. మయుడు తప్పించుకొని శ్రీకృష్ణుని పాదాలపై పడగా అభయమిచ్చి పాండ వులకు ఓ భవంతిని నిర్మించ మన్నాడు. ఖాండవ వనం నుండి జరితార దాని సంతతి అయిన పక్షులు మాత్రం రక్షింపబడ్డాయి. అగ్ని ఖాండవ దహనం చేసి స్వర్గం చేరాడు. - మహాభారతం

**ఖాండిక్యుడు :** ఓ క్షత్రియ రాజు. కేశిధ్వజుడు ఇతడి తండ్రి సోదరుడి కుమారుడు. ఇద్దరూ ఆధ్యాత్మిక జీవనులు. ఖాండిక్యుడు కర్మ యోగంలో అభినివేశం వున్నవాడు. కేశిధ్వజుడు జ్ఞానయోగంలో పండితుడు. ఇద్దరూ ఒకరిని ఒకరు మించిపోవాలని చూస్తారు. ఖాండిక్యుడు రాజ్యం కోల్పోయి తన మంత్రి పురోహితుడితో అరణ్యవాసం చేశాడు.

కేశిధ్వజుని గోవు మరణించింది. కారణం తెలుసు కోవడానికి ఎందరో మహర్షులని అడిగి సరైన సమాధానం రాక అరణ్యానికి వెళ్లగా వెంటనే ఖాండిక్యుడు అతణ్ణి వధించడానికి ఖడ్గంతీయగా తను వచ్చిన కారణం చెప్పగా సరియైన సలహా ఇచ్చి పంపుతాడు. యజ్ఞానంతరం కేశిధ్వజుడు మరల రాగా ఖాండిక్యుడు మరల ఖడ్గం తీయగా గురుదక్షిణ చెల్లించు కోవడానికి వచ్చానని చెప్పగా ఖాండిక్యుడు తన తొందరపాటుకు పశ్చాత్తాపపడగా కేశిధ్వజుడు సంపూర్ణ ముక్తి మార్గం చెప్తాడు. - నారదపురాణం

**ఖాండవాయనులు :** పరుశురాముడు తను జయిం చిన రాజ్యాలన్నింటిని కశ్యపుడికి దానం చేశాడు. వాటితో పాటు బంగారు పాచికలను బహూకరించాడు. ఖండవాయనులను కశ్యపుని శిష్యులు ఈ పాచికలు ముక్కలు చేసి పంచుకున్నారు. - మహాభారతం

**ఖిల :** మహాభారతానికి అనుబంధ భాగాన్ని ఖిల అంటారు. దీనిని హరివంశం అనికూడా అంటారు. ఇది కూడా వ్యాసవిరచితమే.



**గగనమూర్ధుడు :** దనువువల్ల కశ్యపునికి జన్మించిన ప్రసిద్ధ రాక్షసుడు. ఆ తర్వాత కేకయ వంశంలో ఐదుగురు రాజుల్లో ఒకడిగా జన్మిస్తాడు. కేకేయ రాజులు. అయశిరస్సుడు, అశ్వశిరసుడు, అయ శంభుడు, గగన మూర్ధుడు, వేగవాణుడు.
- మహాభారతం

**గజ కచ్ఛపాలు :** ఒక ఏనుగు, తాబేలు ఎడతెగని. పోరాటం చేస్తాయి. వేల సంవత్సరాలు పోరాడు కుంటాయి. తల్లి దాస్యవిముక్తి కోసం తండ్రి సలహా ప్రకారం గరుత్మంతుడు వీటిని భక్షిస్తాడు. అందు వల్ల ఇతనికి స్వర్గలోకం చేరి అమృతం తెచ్చేశక్తి కల్గుతుంది. - మహాభారతం

**గజకర్ణుడు :** కుబేరుని ఆస్థానంలోని ఓ యక్షుడు.
- మహాభారతం

**గజశిరసుడు :** స్కందదేవుని పరివారంలోని ఓ వీరుడు.
- మహాభారతం

**గజాసురుడు :** మహిషాసురుడి కుమారుడు. శివుని చేతిలో మరణం కోరి అనేక అకృత్యాలు చేసి తన కోర్కె నెరవేర్చుకుంటాడు. ఇతడి చర్మాన్ని శివుడు ధరించి కృత్తివాసుడయ్యాడు. - శివపురాణం

**గజాస్యుడు :** వినాయకుడి మరోపేరు.
- చూ॥ వినాయకుడు

**గజుడు 1 :** ఓ వానర రాజు. రాముడి పక్షాన రామ రావణ యుద్ధంలో పోరాడుతాడు. - మహాభారతం

**గజుడు 2 :** శకుని తమ్ముడు. సబలుడి కుమారుడు. కౌరవుల పక్షాన కురుక్షేత్రంలో పోరాడి ఇరావణుడి చేతిలో మరణిస్తాడు. - మహాభారతం

**గజేంద్ర మోక్షం :** ఇంద్రద్యుమ్నుడు శాపంవల్ల ఏనుగుగా మారి విష్ణు భాగ్యంవల్ల మోక్షం పొందిన కథే గజేంద్ర మోక్షం చూ॥ ఇంద్రద్యుమ్నుడు.

**గజేంద్రుడు :** అగస్త్యుని శాపంవల్ల ఏనుగుగా మారిన ఇంద్రద్యుమ్నుడే గజేంద్రుడు. - చూ॥ ఇంద్ర ద్యుమ్నుడు

**గణ :** స్కందదేవుని పరివారంలోని ఓ స్త్రీ.
- మహాభారతం

**గణపతి :** చూ॥ వినాయకుడు

**గణపతిదేవుడు :** ఓ ప్రామాణిక ఆంధ్రకవి. “శివ యోగ సారం” అనే వేదాంత గ్రంథం రచియించెను.
- పురాణనామ చంద్రిక

**గణం :** సైన్యంలో ఒక భాగం. - చూ॥ అక్షౌహిణి

**గణితుడు :** ఓ విశ్వదేవుడు. యుగాలను గణించి వాటి గతిని విశదీకరించేవాడు. - మహాభారతం

**గణేశుడు :** చూ॥ వినాయకుడు

**గతి 1 :** కర్దమ ప్రజాపతి కూతురు. ఈమె పులహుడి భార్య. - మహాభారతం

**గతి 2 :** పంచజనుడికి తల్లి. సంహ్లాదుడి భార్య.
- భాగవతం

**గతితాలి :** స్కందదేవుని సైనికుల్లో ఒకడు.
- మహాభారతం

**గద :** కశ్యప ప్రజాపతి కుమారుడైన గదుడను రాక్షసుడ్ని విష్ణువు సంహరించగా అతని ఎముకల నుండి విశ్వకర్మ ఓ ఆయుధాన్ని తయారుచేశాడు. అదే గద.
- అగ్నిపురాణం

**గదాధరం :** ఇదో పుణ్య తీర్థం. చిచ్చుకుడు ఇక్కడ స్నానం చేసి బ్రాహ్మణ హత్యాపాతకాన్ని పోగొట్టు కున్నాడు. – *బ్రహ్మాండ పురాణం*

**గదాధరుడు :** మహావిష్ణువుకి మరోపేరు. గయుడను రాజు హిమాలయానికి దక్షిణాన కల గయ అనే ప్రాంతంవద్ద అశ్వమేధ, నరమేధ, మహామేధ యజ్ఞాలు నిర్వహించగా దీనికి మహావిష్ణువు ద్వారపా లకుడిగా వ్యవహరించాడు. అప్పుడు గదను తన చేత పట్టుకొని నిలబడడం వల్ల అతనికి గదాధరుడను పేరువచ్చింది.

**గదావసానం :** మధురాపురిలోని ఓ ప్రాంతం. శ్రీకృష్ణుడు కంసుడ్ని వధించగా అతని మామ జరా సంధుడు తన గదను 99 సార్లు మధురపై విసురు తాడు. అతడు గదను విసరగా అది పడిన ప్రాంతాన్ని గదావసానంగా ప్రసిద్ధి చెందింది. – మహాభారతం

**గదుడు :** బలరాముని సోదరుడు, ఓ యాదవుడు. వసుదేవునికి దేవకి కాకుండా ఏడుగురు భార్యలు. అందులో ఒకరు రోహిణి. రోహిణికి 6గురు పుత్రులు. వారు బలభద్ర రాముడు, గద, సారన, దుర్దమ, వికలుడు, కృతుడు – మహాభారతం

ఇతడు ద్రౌపదీ స్వయంవరంలో పాల్గొన్నాడు. అర్జునుడు సుభద్రను వివాహమాడినప్పుడు ద్వారక నుండి ఇంద్రప్రస్థానికి కట్నకానుకలను తీసుకు వచ్చాడు. యుధిష్ఠరుని రాజసూయ యాగంలో పాల్గొన్నాడు. సాళ్వరాజుల నుండి ద్వారకను రక్షించ డంలో ప్రముఖపాత్ర వహించాడు. యుధిష్ఠరుని అశ్వమేధయాగంలో శ్రీకృష్ణునితోపాటు పాల్గొ న్నాడు. ద్వారక యుగాంతంలో యాదవులు ఒకరి నొకరు కొట్టుకొంటూ గదుడ్ని కూడా కొట్టినపుడు శ్రీకృష్ణుడు తీవ్రంగా ఆగ్రహించాడు.

**గయ :** ప్రస్తుతం నేపాల్‌లో గల ఒక పుణ్యతీర్థం. ఇక్కడ గయపర్వతం, ఓ పుణ్యతీర్థం ఉన్నాయి. బుద్ధుడు ఇచట తపమాచరించాడనే కథకూడా వుంది. మహాభారత కాలంలో ఇచ్చటి ప్రజలు ధర్మజు డికి ఎన్నో కానుకలు ఇచ్చారు. – మహాభారతం

**గయపర్వతం :** ఇదో పవిత్రపర్వతం. యమధర్మరాజు దీనిని ఒకానొక సమయంలో పూజించాడు. దేవతలు చుట్టూ పహారావుండే బ్రహ్మసరస్సు ఈ పర్వతంపై వుంది. మరణించినవారికి శ్రాద్ధకర్మలు చేయడం పూజ్యనీయమైంది. – *చూ॥ గయతీర్థం*

**గయశిరస్సు :** గయ పర్వతంయొక్క శిఖరాగ్రం. దీనిని గయశీర్షం అనికూడా అంటారు. – మహాభారతం

**గయతీర్థం :** గయాసురుడను రాక్షసుడు ఇక్కడ విష్ణువును గూర్చి ఘోరతపమాచరించి మహాశక్తి వంతుడయ్యెను. దేవతలు దినదినము ఇతడి శక్తి పెరుగుట చూచి విష్ణువునాశ్రయించగా వారి కోర్కెను మన్నించి విష్ణువు గయాసురునికి ప్రత్యక్షమై అతడు కోరిన విధంగా అత్యంత పవిత్ర స్థలంగా నీవు జీవించిన ప్రాంతం ప్రసిద్ధి చెందు తుందని వరమిచ్చెను.

గయాసురుని శక్తికి భయపడి బ్రహ్మ ఇతర దేవతలు విష్ణువు సలహా కోరగా బ్రహ్మను యజ్ఞంకోసం గయాసురుని శరీరాన్ని కోరమని సలహా ఇచ్చాడు. బ్రహ్మ అట్లే గయాసురుని కోరగా అతడు భూమిపై పరుండెను. బ్రహ్మ అతని తలపై కదలకుండా ఒక శిలను వుంచి యజ్ఞం ప్రారంభించగా గజాసురుని శరీరము కదలుచుండెను. బ్రహ్మ విష్ణుమూర్తిని ప్రార్థిం చగా విష్ణువు అతని శరీరముపై నిలుచుండెను. అంత అసురుడు నేను కదలకుండుటకు, విష్ణువు నాపై నిలబడనేల ? నేనే కదలకుందును. కాని ఈ ప్రదేశ మును పుణ్యతీర్థమగునట్లు ప్రజలు ఇచట తమ పితరులకు పిండ ప్రదానము చేసినచో వారికి ముక్తి కల్గునట్లు వరమివ్వవలసినదిగా విష్ణుమూర్తిని కోరగా విష్ణువు అనుగ్రహించెను. అప్పటి నుండి అది గయతీర్థంగా ప్రసిద్ధి చెందెను. – వాయుపురాణం

**గయుడు 1 :** అమూర్తరయసుడను వానికి జన్మించిన రాజర్షి. ఇతడెన్నో యజ్ఞాలు నిర్వహించాడు. ఇతడు యమ ధర్మజుని కొలువులో సభ్యుడు. దుర్యోధనుడు పాండవులు అజ్ఞాత వాసంలో వుండగా విరాటుని గోవుల్ని తరలిస్తుండగా అర్జున కృపాచార్యుల మధ్య జరిగిన యుద్ధాన్ని తన విమానంలో వుండి వీక్షించాడు. శ్రీకృష్ణుడు ద్వారక నుండి హస్తినాపురం వెళ్లే సమయంలో ఇతణ్ణి కలుసుకున్నాడు. ఇతడు పాండవులపక్షాన పోరే సమయంలో మాంధాత ఇతణ్ణి ఓడించాడు. విశాల అనే పేరుతో సరస్వతి ఇతడు చేసే యజ్ఞాన్ని వీక్షిం చింది. ఇతడొ కసారి భూమినంతటిని బ్రాహ్మణునికి దానం చేశాడు. ఇతడు మాంసాహారం స్వీకరించేవాడు కాదు. – మహాభారతం

**గయుడు 2 :** చూ॥ గయతీర్థం.

**గయుడు 3 :** పురూరవుని కుమారుడైన ఆయుస్సు కుమారుడు. ఇతడు నహుషునికి సోదరుడు.
– *మహాభారతం*

**గయుడు 4 :** పృథువంశంలోని ఓ రాజు. పృథుకు మారుల్లో హవిర్ధానుడొకడు. అగ్ని వంశంలో జన్మించిన ధిషణను ఇతడు వివాహమాడగా వీరికి ఆరుగురు కుమారులు జన్మించారు అందులో గయుడొకడు.
– *హరివంశం*

**గయుడు 5 :** ఇతడొక రాజు. ధృవుని వంశంలోని వాడు. – *అగ్నిపురాణం*

**గయుడు 6 :** పుష్కరిణీ ఉల్ముకుల పుత్రుడు. అంగుడు, ఖ్యాతి ఇతని సోదరులు. – *భాగవతం*

**గయుడు 7 :** హవిర్ధానుని పుత్రుడు. బర్హిష్మతి, జితవ్రతుడు మొదలగు వారితని సోదరులు. – *భాగవతం*

**గయుడు 8 :** సుద్యుమ్నుని కుమారుడు. – *భాగవతం*

**గయుడు 9 :** ఊరువు కుమారుడు. తల్లి ఆగ్నేయి.
– *మత్స్యపురాణం*

**గయుడు 10 :** భరతుని వంశము వాడగు నక్తుని పుత్రుడు. జయంతి ఇతని భార్య. వీరి కుమారులు చిత్రరథుడు, స్వాతి, అవరోధుడు. రాజర్షియైన ఇతడు రాజ్యమును ధర్మ మార్గమున పాలించి తన రాజ్యమును కామధేనువుగా మార్చి అఖిలజీవ జాతికి నానందమొనర్చెను. – *మహాభారతం*

**గయుడు 11 :** ఇతడు ఏడు అశ్వమేధయాగములు చేసెను. అసంఖ్యాకమైన ధనమునిచ్చెను. అక్షయమైన ఇంద్రలోక సుఖమును పొందెను. ఆ ప్రదేశము పయోష్ఠి తీర్థమయ్యెను. – *మహాభారతం*

**గయుడు 12 :** మణిపురమును పాలించిన గంధర్వ రాజు. ఒకనాడు తన విమానములో ప్రయాణించుచు ఉమ్మివేయగా సూర్యోదయమున అర్ఘ్యమిచ్చు శ్రీకృష్ణుని దోసిలియందుపడెను. సూర్యభగవానుని ప్రార్థించుచుండగా తన దోసిలియందు ఉమిసిన వానిని వధింతునని శ్రీకృష్ణుడు శపథము చేయగా అది తెలిసి గయుడు శివుని శరణువేడెను. శివుడు శివకేశవులకు భేదము లేదని తాను రక్షించలేనని చెప్పగా నారదుని సలహాపై అర్జునుని శరణువేడెను. శపథం చేసినది శ్రీకృష్ణుడని తెలియక అర్జునుడు అభయమిచ్చి అది నిలుపుకొనుటకు శ్రీకృష్ణునితో యుద్ధమొనర్చెను. చివరకు దేవతలు వచ్చి శ్రీకృష్ణుని ప్రార్థించి యుద్ధము మాన్పించిరి. గయుడు శ్రీకృష్ణుని శరణు వేడగా క్షమించి వదలెను. – *గయోపాఖ్యానం*

**గర్భం :** గర్భం గురించి అసితుడు జనకుడికి వివరించిన విధానములో శుక్లం అత్యంత ముఖ్యమైనది. అది రక్తంతో కలిస్తే గర్భం వస్తుంది. రక్తం ఎక్కువై శుక్లం తగ్గితే ఆడపిల్ల, శుక్లం ఎక్కువై రక్తం తగ్గితే మగబిడ్డ, సమానంగా వుంటే ఎవరైనా జన్మించవచ్చు. ఇవి కలిసిన నెలవరకు శిశువు ద్రవంగాను రెండవ నెలకు ముద్దగాను క్రమంగా చెవులు ముక్కు తదుపరి ఏర్పడతాయి. – *బ్రహ్మాండపురాణం*

**గరిష్ఠుడు :** ఇంద్ర సభలో ఇంద్రుని పూజించే ఒక రుషి. – *మహాభారతం*

**గరుట్మంతుడు :** చూ॥ గరుత్మంతుడు.

**గరుడతీర్థం :** ఓ పుణ్యతీర్థం. చూ॥ గరుత్మంతుడు.

**గరుడ పంచమి :** శ్రావణ శుక్ల పంచమి. ఇది సుమంగళులకు ఓ వ్రత దినము. – *పురాణనామ చంద్రిక*

**గరుడపురాణం :** 18 పురాణాల్లో ఇదొకటి. ఇది విష్ణువు గరుడుడికి చెప్పాడని చెప్తారు. గరుడుని జన్మవృత్తాంతం ఇందులోని ప్రధానాంశం. దీనిలోని 'తార్ఢ్య కల్పమే' విష్ణువుదని చెప్తారు. గరుడ పురాణాన్ని బహుమతిగా ఇవ్వడం బంగారు హంసను బహుమతిగా నిచ్చినదానితో సమానమని భావిస్తారు. మరణించిన వ్యక్తికి అతడి బంధువులకు పుణ్యం కలగాలని సౌచదినాల్లో ఈ పురాణాన్ని పఠించడం ఓ ఆచారంగా వస్తోంది. –*అగ్ని పురాణం*

**గరుడ వ్యూహం :** యుద్ధంలో సైన్యాన్ని గరుడా కృతిలో నిలబెట్టడాన్ని గరుడ వ్యూహం అంటారు.
– *మహాభారతం*

**గరుడాచలం :** వరాహావతారానంతరం ఆ రూపంతో లక్ష్మీదేవికి కన్పించడం ఇష్టపడక శ్రీ మహావిష్ణువు స్వర్గంలోని తన క్రీడాచలం తెమ్మని గరుత్మంతుడ్ని స్వర్గం పంపుతాడు. గరుడునిచే తేబడిన క్రీడా చలం కనుక దానికి గరుడాచలమని లేక వేంకటా చలమని పేరు వచ్చింది. – *వేంకటాచల మహాత్మ్యం*

**గరుత్మంతుడు :** పక్షిరాజు.

*వంశవృక్షం :* విష్ణు – బ్రహ్మ – మరీచి – కశ్యపుడు – గరుడుడు.

బ్రహ్మ మనుమడైన కశ్యపుడు దక్షప్రజాపతి 8 మంది కుమార్తెలను వివాహమాడగా అందులో ఓ భార్య తామ్రకు 5 గురు కుమార్తెలు జన్మించారు. అందులో ఒకరు శుకి. ఆమెకు నల జన్మించగా నలకు వినత జన్మించింది. వినతకు కలిగిన సంతానమే అరుణుడు, గరుడుడు. – రామాయణం

కశ్యపుడు కద్రువ, వినతల సేవకు మెచ్చి వరాలు కోరుకొమ్మని కోరగా కద్రువ 100 మంది సంతానాన్ని, వినత ఆ వందమందికంటే బల వంతులైన ఇద్దరు సంతానాన్ని కోరుకుంది. కద్రువ గ్రుడ్డు నుండి 100 మంది నాగులకు జన్మనివ్వగా వినత తనకు ఇంకా బిడ్డలు కలుగనందుకు తను కన్న రెండు గుడ్లలో ఒకదానిని బలంగా విడ దీయగా అరుణుడు ఉద్భవించి బలవంతంగా జన్మనిచ్చినందుకు నీవు కద్రువకు బానిసత్వం చేస్తావని శపించి తల్లి వేడుకోగా తర్వాత పుట్టే తనయుడు బంధవిముక్తుడ్ని చేస్తాడని అభయ మిచ్చి సూర్యునివద్దకేగి సూర్యుని రథసారథిగా జీవిస్తాడు. ఆ తర్వాత 500 సంవత్సరాలకు మరో గుడ్డు నుండి గరుడుడు జన్మించాడు. – మహాభారతం

*వినత దాస్యం :* ఇంద్రుని ఉచ్చైశ్రవసుని తోక నలుపా తెలుపా అనే చర్చ కద్రువ వినతల మధ్య రాగా కద్రువ తను గెలవనెంచి తన పుత్రులైన సర్పాలను అశ్వం తోకను చుట్టివుండమని చెప్పి వినతను మోసంచేసి తన బానిసను చేసుకుంటుంది. ఆ సమయంలోనే వినతకు గరుడుడు జన్మించి తల్లి కష్టానికి వగచుటయే కాక తనూ వారికి దాస్యం చేసేవాడు.

*వినత దాస్య విముక్తి :* ఆ దాస్యాన్ని భరించలేక దాస్య విముక్తిని కోరగా కద్రువ ఇంద్రలోకంలోని అమృతాన్ని తెచ్చి యివ్వమని షరతు విధించింది. అంతట గరుత్మంతుడు తన తండ్రి సలహాపై గజకచ్ఛ పాలను భక్షించి బలవంతుడై ఇంద్రలోకం చేరి అడ్డు వచ్చిన వారిని ఎదిరించి అమృతభాండాన్ని తీసుకొని రాబోతుండగా ఇంద్రుడు వజ్రాయుధం విసరగా ఓ ఈక మాత్రమే ఊడింది. ఇంద్రుడు గరుత్మంతుడి శక్తిని గ్రహించి అతనితో రాజీపడగా తన తల్లి, తన దాస్య విముక్తికి అమృతం తీసుకొని వెళ్ళుట తప్పని సరి అని, వారికి అందజేసిన తర్వాత దానిని తీసుకొని వెళ్లమని చెప్పి అమృత కలశాన్ని తీసుకువెళ్ళి దర్భ ఆకులపై వుంచి కద్రువకు అందజేస్తాడు. నాగులు ఆతురతతో అక్కడికి చేరగా ఇంతలో ఇంద్రుడు తన మాయో పాయంతో ఆ కలశాన్ని ఎత్తుకుపోతాడు. కాస్తయినా అమృతం దర్భలపై ఒలికి వుంటుందనే ఆశతో ఆ దర్భలను నాకిన నాగుల నాలుకలు రెండుగా చీలిపోతాయి. అప్పటినుండి సర్పాల నాలుకలు చీలే వుంటాయి.

*గరుడుని గర్వభంగం :* క్షీరసాగర మథనం సమయంలో విష్ణువు వాసుకిని తీసుకొని రమ్మని గరుడుడిని పంపగా అతడు వాసుకి తోకపట్టుకొని తీసుకొని రాబోగా తల సముద్రంలోనే వుండి పోతుంది. మొత్తం వాసుకి దేహాన్ని ఎత్తలేక తన ముక్కుతో వాసుకి మధ్య భాగాన్ని ఎత్తాడు. అయినా వాసుకి రెండుకొసలు సముద్రంలోనే వుండిపోగా శివుడు తన చిటికెన వేలుతో వాసుకిని ఎత్తి దేవతలకు అందిస్తాడు. అప్పుడు గరుడుడు తన శక్తికి గల పరిమితులు గ్రహిస్తాడు.

*గరుత్మంతునికి గల పేర్లు :* గరుత్మానుడు, వైనతేయుడు, ఖగేశ్వరుడు, నాగాంతక, విష్ణురథ, సుపర్ణ, పన్నగాశన.

**గర్గుడు :** విష్ణు అంశతో జన్మించిన వాడు.

*జన్మవృత్తాంతం :* బృహస్పతి గర్భిణి అయిన తన సోదరుని భార్య మమతతో సంగమించగా అప్పటికే గర్భిణి అయిన ఆమె ఇద్దరికి జన్మనిచ్చి పిల్లల్ని వదలివెళ్లిపోగా దేవతలు వీరిని పెంచుతారు. భరతునికి జన్మించిన పిల్లలు అవినీతిపరులగుట వలన వారిని వారి తల్లులే చంపగా దేవతలు ప్రసాదించిన వీరిని తన వారసులుగా పెంచు కుంటాడు. వారే భరద్వాజుడు, నరుడు. భరద్వాజుని వంశంలో జన్మించినవాడే గర్గుడు. గర్గుని కుమారుడు శాని. కొంత కాలానికి గర్గుడు యాదవులకు గురువుగా పరిణమిస్తాడు. – భాగవతం

రాముడు వనవాసం నుండి తిరిగి వచ్చినప్పుడు అతణ్ణి దర్శించినవారిలో గర్గుడొకడు. ఇతడు ఖగోళ శాస్త్రంలో ప్రజ్ఞావంతుడు. పృథుని రాజ్యంలో ఇతడు ముఖ్య ఖగోళశాస్త్రవేత్త. సరస్వతీ నదీ తీరంలో గర్గస్రోత అనే స్థలం వుంది. గ్రహాల కదలిక నక్షత్రాల గమనం గురించి విపులీకరించాడు. – మహాభారతం

**గర్భుడు :** భరతుని కుమారుడు. దుష్యంతుని మనుమడు. - అగ్నిపురాణం

**గవయుడు :** శక్తివంతుడైన ఒక వానర రాజు. ఓ దళానికి నాయకత్వం వహించి రామరావణ యుద్ధంలో రాముని తరఫున పోరాడెను. - రామాయణం

**గవల్గణుడు :** మహాభారతంలో ప్రసిద్ధ వ్యక్తి అయిన సంజయుని తండ్రి. - మహాభారతం

**గవాక్షుడు 1 :** ఓ వానరరాజు. 60,000 వానరులతో రాముని తరఫున రావణునితో పోరాడెను. - రామాయణం

**గవాక్షుడు 2 :** శకుని చిన్న తమ్ముడు. కురుక్షేత్రంలో భీకరంగా పోరి అర్జునుని కుమారుడు ఇరావంతుని చేతిలో మరణించెను. - మహాభారతం

**గవాయనం :** గవమాయనం అనికూడా అంటారు. ఇదో యజ్ఞం. - మహాభారతం

**గవిజాతుడు 1 :** ఇతడో ముని కుమారుడు. దేవి భక్తుడు. ఇతని తండ్రి తన ఆశ్రమంలో తపమాచరించు చుండగా పరీక్షిత్తు మహారాజు వేటకు వెళ్లి దాహార్తియై ఇతని ఆశ్రమమునకు వచ్చి మంచినీరు కోరగా తపస్సులో వున్న ముని విన్పించుకోలేదు. పరీక్షిత్తు కుపితుడై ఓ చనిపోయిన పామును ఓ కర్రతో అతని పైకి విసిరి తన రాజ ప్రాసాదమునకుపోయెను. ముని కుమారుడైన గవిజాతుడు ఈ పని చేసినది ఎవరనేది తెలుసుకోకుండా తన తండ్రిని అవమానించినవాడు 7 రోజులలో తక్షకునిచే చంపబడతాడని శపించి తర్వాత అది చేసినది పరీక్షిత్తు మహారాజుగా గ్రహించి తన శాపమును గూర్చి పరీక్షిత్తుకు తెలియజేయగా విధి బలీయమని పరీక్షిత్తు బదులిచ్చెను. - మహాభారతం

**గవిజాతుడు 2 :** ఇతడో ముని. చ్యవన మహర్షి తపస్సు చేసుకొనుచూ జలములో క్రుంగెను. జాలరులు చేపలతోపాటు చ్యవనుని కూడా తమ వలలో పట్టి దానికి తగిన వెల ఇవ్వమని నహుషుడను రాజు నడుగగా ఇతడు తన రాజ్య మంతయు నిచ్చెదననెను. అది సరియైన విలువ కాదని చ్యవనుడు చెప్పగా గవిజాతుడు బ్రాహ్మణునితో సమానమైనది గోవు తప్ప మరొకటి కాదని చెప్పెను. - మహాభారతం

**గవిష్ఠుడు :** ప్రసిద్ధ రాక్షసుడు. ఈ భూమిపై ద్రువం సేవలుడను రాజుగా పునర్జన్మించాడు. - మహాభారతం

**గహ్వుడు :** కంసుని సోదరులలో ఒకడు. బలరామ కృష్ణులను కంసుడు జంపపోయినపుడు వారితో ఇతడు పోరగా బలరాముడితనిని వధించెను. - భాగవతం

**గాత్రుడు :** వశిష్ఠుని కుమారుడు. ఒక ముని. ఇతనికి ఊర్జ్వవల్ల ఏడుగురు పుత్రులు జన్మిస్తారు. - అగ్నిపురాణం

**గాధి 1 :** విశ్వామిత్రుని తండ్రి

*జన్మవృత్తాంతం :* భరత సంతతిలోని కుశునకు వైదర్భి వల్ల నల్గురు కుమారులు. అందులో కుశనాభుడొకరు. ఇతనికి ఘృతాచి అను దేవతాస్త్రీ వల్ల 100 మంది కుమార్తెలు కలిగారు, కాని కుమారులు లేరు. పుత్రకామేష్ఠి యాగం చేయగా గాధి జన్మించాడు. గాధి కుమార్తె సత్యవతి. ఆమెను రుచికుడు వివాహమాడాడు. కుమార్తె వివాహా నంతరం తన కుమారుడు విశ్వామిత్రుడ్ని రాజ్యాభి షిక్తుడ్ని చేసి తపస్సుచేసుకోవడానికి అరణ్యానికి వెళ్లాడు. కొంతకాలం రుచికుని ఆశ్రమంలో వుండి స్వర్గానికి మహాభినిష్క్రమణం చేశాడు.

**గాధి 2 :** ఇతడొక బ్రాహ్మణుడు. ఇతడు విష్ణువు యొక్క మాయాశక్తిని చూపాడు. - చూ॥ మాయ.

**గానబంధుడు :** ఓ గుడ్లగూబ. పూర్వజన్మలో భువనేశుడను రాజు. ఆ సమయమున హర మిత్రుడను బ్రాహ్మణుడు విష్ణుభక్తుడై సదా విష్ణుగానము చేయువాడు. అతనిని విష్ణుగానము మాని తన గానము చేయమని రాజు కోరగా అందుకు అతడు నిరాకరించగా అతడు పూజచేయు ప్రతిమను పారవైచెను. ఆ పాపమున గుడ్లగూబగా మారి మానసోత్తర మహాశైలమున శవములను తినుచుండెను. అది చూసి హరమిత్రుడు ఇట్లేల అయితివి అని పూర్వజన్మను గుర్తుచేయగా తన తర్వాతి జన్మ శునక జన్మయని సమాధానమిచ్చెను. తన కథవల్ల ఇట్లయినందుకు చింతించి ఇక నీకు శునక జన్మము రాదు విష్ణు గానము చేయమని కోరెను. అతడట్లే చేయు చుండగా విష్ణువు నారదుని విష్ణుగానము నేర్చుకొనుటకు ఈ గానబంధుని వద్దకు పంపెను. - రామాయణం

**గాయకుడు :** స్కందుని యోధుల్లో ఒకడు.
– *మహాభారతం*

**గాయత్రి 1 :** ప్రసిద్ధి చెందిన వేదమంత్రం. దీనికి 24 అక్షరాలు. ఈ ప్రపంచంలో 19 రకాల కదిలే కదలని వస్తువులున్నాయి. వీటికి 5 మూలకాలను కలిపితే 24 అంకె ఏర్పడుతుంది. గాయత్రి మంత్రానికి 24 అక్షరాలకు కారణమదే. త్రిపుర దహనంలో ఈ మంత్రాన్ని శివుడు తన రథానికి పైన కట్టుకున్నాడు.
*గాయత్రి గొప్పతనం :* ఒక్కసారి గాయత్రిని ఉచ్చరిస్తే అప్పుడు చేసిన పాపాలు, 10 సార్లు ఉచ్చరిస్తే ఆ రోజు చేసిన పాపాలు పోతాయి. అంటే 100 సార్లు ఉచ్చరిస్తే ఓ నెలలో చేసిన పాపాలు, 1000 సార్లు ఉచ్చరిస్తే ఓ సంవత్సరం చేసిన పాపాలు, ఓ లక్షసార్లు ఉచ్చరిస్తే జీవితకాలపు పాపాలు, 10 లక్షల సార్లు చేస్తే ఇంతకు ముందు జన్మలో చేసిన పాపాలు, 100 లక్షల సార్లు ఉచ్చరిస్తే అన్ని జన్మల పాపాలు పోతాయి. మోక్షం లభిస్తుంది. – *దేవీ భాగవతం*

**గాయత్రీస్థానం :** ఉత్తర భారత దేశంలోని ఓ పవిత్ర స్థలం. ఇక్కడో రాత్రి గడిపితే వెయ్యి గోదానాల ప్రతిఫలం లభిస్తుంది. – *మహాభారతం*

**గార్గస్రోత :** చూ॥ గార్గ్యుడు.

**గార్గ్యం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాస ప్రాంతం. దీనిని శ్రీకృష్ణుడు తన అధీనం చేసుకున్నాడు.
– *మహాభారతం*

**గార్ధభాసురుడు 1 :** ఒక రాక్షసుడు. ఇతడు పూర్వ జన్మమున సాహిసికుడు అనబడేవాడు. – *భాగవతం*

**గార్ధభాసురుడు 2 :** దేనుకాసురుడు గార్ధభ రూపమున వుండుటచే గార్ధభాసురుడనెడివారు.
– *చూ॥ దేనుకాసురుడు.*

**గార్ధభి :** విశ్వామిత్రుని కుమారుడు. ఇతడు బ్రహ్మవాది.
– *మహాభారతం*

**గార్హపతి 1 :** ఓ అగ్ని – *మహాభారతం*

**గార్హపతి 2 :** ఏడుగురు పితరుల్లో ఒకడు. వైరాజన, అగ్నిస్వాత్త, గార్హపతి, సోమన, ఏకశృంగ, చతుర్వేద, కలలు, సప్తపితరులు. – *మహాభారతం*

**గార్హస్థ్యం :** మానవుడు తన జీవితకాలంలో ఆచరించ వలసిన నాలుగు ధర్మాలలో ఇదొకటి. ఉన్నదాంతో సంతృప్తిగా జీవించడం, అతిథులను సమాద రించ డం, స్వోత్కర్ష నివారించుకోవడం, గార్హస్థ్య ధర్మం.
– *మహాభారతం*

**గార్గాయని :** గురుపరంపరలోని ఓ స్త్రీ. వేదాలను విస్తృత పరచిన వేదాధ్యయని. – *చూ॥ గురుపరంపర*

**గార్గి :** గర్గుని వంశంలో జన్మించిన ప్రసిద్ధ బ్రహ్మ వాది.

**గారుడము :** ఇదో పురాణము. గరుడోద్భవ బ్రహ్మాండ విషయములు దీని వృత్తాంతము.
– *పురాణనామ చంద్రిక*

**గార్గ్యుడు 1 :** ఓ ప్రసిద్ధముని. విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు. గుడవసుల పురోహితుడు. 'గార్గస్మృతి' అనే రచన చేశాడు. ఇతణ్ణి త్రిజట అని కూడా అంటారు.
– *రామాయణం*
*గార్గ్యుని సంపద :* శ్రీరాముడు వనవాసానికి వచ్చాడని తెలిసి ఎందరో మునులు అక్కడకు వచ్చారు. ఈ వార్త తన భార్యద్వారా ఆలస్యంగా తెలిసిన గార్గ్యుడు చివరగా రాముణ్ణి దర్శించాడు. శ్రీరామునికి తన కోర్కెలు తెలుపగా యమునా నదీ తీరంలోని గోవుల్ని చూపి ఓ కర్ర విసరమని చెప్తాడు. ఆ కర్రను బలంగా విసరగా ఎంత దూరాన పడిందో చూసుకొని ఆ పడిన లోపువున్న గోవుల్ని గార్గ్యుడ్ని తీసుకెళ్లమంటాడు. అందుకని గార్గ్యునికి వెలలేని గో సంపద లభించింది. ధర్మమంటే ఏమిటో నిర్వచించిన మహర్షి ఇతడు. వ్యాసుడు మొదలుకొని సంసార వరకు వున్న వశిష్ఠ పరంపరలో గార్గ్యుడొకడు. వీరిని రుగ్వేదాచార్యు లని పిలుస్తారు. – *భాగవతం*
ఇతడు ఇంద్రుని సభలో సభ్యుడు. – *మహాభారతం*

**గార్గ్యుడు 2 :** చూ॥ బాలాజికి

**గాలవుడు 1 :** ఇతడు విశ్వామిత్రుని కుమారుడు. ఇతడు బ్రహ్మవాది. ఇతని అసలుపేరు తెలియదు.
*గాలవుడికి ఆ పేరు రావడానికి కారణం :* మాంధాత వంశంలో అరుణుడనే రాజు వుండే వాడు. అతని కుమారుడు సత్యవ్రతుడు. ఇతడు బ్రాహ్మణుని వివాహ మందిరంలోకి వెళ్లి పెళ్లి కూతుర్ని ఎత్తుకొస్తాడు. అది సహించని రాజు ఇతణ్ణి దేశ బహిష్కరణ చేస్తాడు. అందువల్ల దేశంలో కరువుకాటకాలు వస్తాయి. విశ్వామిత్రుడు కౌశిక ప్రాంతానికి తపస్సుకు వెళ్లగా ఇచ్చట

విశ్వామిత్రుని భార్య పిల్లలు ఆకలి బాధ తాళలేక వీధిన పడతారు. విశ్వామిత్రుని భార్య అందరూ ఆకలితో చనిపోవడం కంటే ఒకర్ని అమ్మి ఇతరుల్ని బ్రతికించాలని తలచి గాలవుడి మెడచుట్టూ దర్భలు చుట్టి వీధికి తీసుకెళ్లి అమ్మాలని ప్రయత్నిం చగా సత్యవ్రతుడు వీరిని విశ్వామిత్రుడు వచ్చేవరకు ఆదుకుంటాడు. గాలవుడు తప్పించుకుంటాడు. అలా తప్పించుకున్నాడు కనుక గాలవుడని పేరు వచ్చింది.
– *దేవీ భాగవతం / హరివంశం*

**గాలవుడు 2 :** ఇతడు విశ్వామిత్రుని శిష్యుడు. ఒకసారి ధర్మదేవత వశిష్ఠుని రూపంలో విశ్వామిత్రుని పరీక్షించ డానికి వచ్చింది. ఆహారం తీసుకొని బయటకు వచ్చేలోగా ధర్మదేవత వెళ్లిపోగా విశ్వామిత్రుడు వశిష్ఠు నికోసం నిరీక్షించాడు. ఓ వంద సంవత్సరాలు అలాగే నిలబడగా గాలవుడు విశ్వామిత్రుడి రక్షణ భారం తీసుకొన్నాడు. దానికి మెచ్చి గురుదక్షిణ లేకుండానే గాలవుణ్ణి వెళ్ళి పొమ్మనగా గురుదక్షిణ తప్పనిసరి అని విశ్వా మిత్రుడ్ని ఒత్తిడిచేయగా కోపంతో ఓ చెవి నలుపుగా వున్న 900 గోవుల్ని ఇవ్వమంటాడు. గాలవుని మిత్రుడు గరుడుడు ఈ బాధాకర కథ విని అతణ్ణి యయాతి రాజు వద్దకు తీసుకువెళ్లగా తన వద్ద అలాంటి గోవులు లేవని తన కుమార్తె మాధవిని గాలవునికిచ్చి ఈమెకు ఏ రాజుతోనైనా వివాహం చేసి ఆ గోవుల్ని సంపాదించ మంటాడు. వారామెను ఇక్ష్వాకు రాజు హర్యాశ్వుని వద్దకు తీసుకొనివెళ్లగా నా వద్ద 200 గోవులే వున్నా యని చెప్తాడు. మాధవి అలాగే తీసుకొమ్మని తన కన్యత్వం పోని వరం వుందని చెప్పి ఇలా నలుగురు రాజులకు అమ్మమని చెప్తుంది. అలా అతడు తర్వాత కాశీరాజు దివో దాసుకి, ఉశీనరుడికి అమ్మగా 600 గోవులు లభిం చాయి. ఇంక గోవులు లేక 600 గోవుల్ని, మాధవిని విశ్వామిత్రుడికి ఇవ్వగా విశ్వామిత్రుడికి మాధవి వల్ల అష్టకుడు జన్మిస్తాడు.

*గాలవుడు–చిత్రసేనుడు :* ఓ సాయం సంధ్యా సమయమున గాలవుడు నది ఒడ్డున ప్రార్థన చేస్తుం డగా చిత్రసేనుడను గంధర్వుడు ఉమ్మివేయగా గాల వుడు శ్రీకృష్ణునితో చెప్పగా చిత్రసేనుడ్ని సంహరి స్తానని హామీ ఇస్తాడు. నారదుని సలహాపై చిత్రసేనుడి భార్యలు సుభద్రను శరణువేడగా కృష్ణార్జునుల యుద్ధం జరుగుతుంది. చిత్రసేనుణ్ణి గాలవుని కాళ్లకు మొక్కమని శ్రీకృష్ణుడు ఆదేశిస్తాడు. – *పద్మపురాణం.*

**గిరిక :** శుక్తిమతియను నదికి కోలాహలమను పర్వత సంయోగము వల్ల బుట్టిన కుమారిత. ఆ నదికడ్డ ముగా నున్న కోలాహల పర్వతమును ఉపరిచర వసువు త్రోసిపుచ్చెను. అందువల్ల శుక్తిమతి గిరికను వసువుకిచ్చి వివాహము చేసెను. ఆమె ఋతుమతి యైన తదుపరి వసువు తల్లిదండ్రు లామెకు మాంసా హారము పెట్టమని కోరగా అతడు అడవికి పోయెను. ఆ సమయమున గిరిక సౌందర్యమును తలచుకొనగా అతనికి రేత పతనమ య్యెను. దానిని గిరిక కిమ్మని ఓ పర్ణమున నుంచి డేగతో పంపగా అది మత్స్యము నోటబడెను. – *మహాభారతం*

**గిరిగహ్వారం :** భారత దేశంలోని ఈశాన్య వాసులు నివసించు ప్రాంతం. – *మహాభారతం*

**గిరినాథ దీక్షితుడు :** చూ॥ గుణనిధి.

**గిరిప్రస్థం :** నిషధ దేశంలోని ఓ పర్వతం. ఒకసారి ఇంద్రుడీ పర్వతంపై దాక్కున్నాడు. – *మహాభారతం*

**గిరిభద్ర :** మిత్రుడను రాజు భార్య. చాక్షుషమను వీమెకు జన్మించెను. శిశువు జన్మించిన ఆరవ రోజున ఆ శిశువును ముద్దాడుచుండగా "ఏల నన్ను ముద్దాడు చుంటివి, నేను నీకేమి యుపకారము చేసియుండ లేదే, అదిగాక నన్ను జాతహారిణియను పిల్లి తినుటకు సిద్ధముగ నున్నది'అని శిశువు ప్రశ్నించెను. నీవింత చిన్నదానివే ఏల అట్లందువని కోపముతో పురిటి గదిని విడిచిపోగా జాతహారిణి శిశువునెత్తుకుపోయెను.
– *మార్కండేయ పురాణం*

**గిరివ్రజపురం :** పురాణాలలో కన్పించే ప్రసిద్ధ నగరం. పూరువంశంలో కుశుడను రాజు జన్మించెను. ఇతడికి నల్గురు పుత్రులు. ఆ నల్గురు తలావొక నగరాన్ని నిర్మించుకున్నారు. అందులో వసు డొకడు. అతడు నిర్మించిన పట్టణమే గిరివ్రజ పురం. ఇతని మనుమడు జరాసంధుడు. ఇతని కాలంలో ఇది నందనోద్యాన వనంగా ప్రకాశించింది. ఈ నగరం ఐదు పర్వతాల మధ్య నుండి శత్రుదుర్భేద్యంగా వుండేది. ఇక్కడినుండే

జరాసంధుడు మధురపైకి 99 సార్లు తన గదను విసిరాడు. ఆ తర్వాత శ్రీకృష్ణుడు, భీముడు, అర్జునుడు బ్రాహ్మణ వేషాల్లో ఈ నగరానికి వచ్చి భీముడు జరాసంధుడితో ముష్టియుద్ధంచేసి వధిస్తాడు. జరాసంధుడి కుమారుణ్ణి ఈ నగరానికి రాజుని చేస్తారు.
– *మహాభారతం*

**గిల్లమిష :** బాబిలోనియన్ల అత్యంత ప్రాచీన గ్రంథం. రుగ్వేదమంత ప్రాచీన గ్రంథం. ఇంత పురాతన గ్రంథం మరొకటి 'బుక్ ఆఫ్ ది డెడ్' అనే ఈజిప్టు వాసులది. – *చూ॥ జలప్రళయం*

**గీత :** చూ॥ భగవద్గీత

**గీతప్రియుడు :** స్కందదేవుని అనుచరుడు.
– *మహాభారతం*

**గీత విద్యాధరుడు :** ఓ గొప్ప సంగీత విద్వాంసుడు, సంగీత ప్రియుడు. ఓ గంధర్వుడు పులస్త్య మహర్షి సంగీత ప్రియుడు కాదని తలచి అతణ్ణి ఏడిపిస్తాడు. కోపించిన పులస్త్యుడితణ్ణి అడవిపంది కమ్మని శపిస్తాడు. ఇక్ష్వాకుడితణ్ణి వేటకు వెళ్లి వధించగా తిరిగి నిజ రూపం పొందుతాడు. – *పద్మపురాణం*

**గీతుడు :** భరత వంశపు రాజు. – *భాగవతం*

**గుజరాత్ :** ఘూర్జర దేశం. దీన్ని పూర్వం నర్త దేశమని పిలిచేవారు.

**గుడాకేశుడు :** అర్జునుడికి గల మరోపేరు. నిద్రను జయించాడు గనుక ఈ పేరు వచ్చింది.
– *మహాభారతం*

**గుణకేశి :** మాతలి కుమార్తె. సుముఖుని భార్య. ఈమెవల్లనే సముఖుని ఆయుర్ధాయము పెరిగెను.
– *చూ॥ సుముఖుడు.*

**గుణనిధి 1 :** యజ్ఞదత్తుని కుమారుడు. ఇతడే తర్వాత కుబేరుడయ్యెను. – *చూ॥ కుబేరుడు.*

**గుణనిధి 2 :** పురాణంలోని ఓ ముఖ్యపాత్ర. ఎన్నో పాపాలు చేసికూడ స్వర్గం చేరినవాడు. కోసల దేశంలో గుణనాథ తీర్థుడనే గౌరవనీయుడైన బ్రాహ్మణుడుండేవాడు. ఇతడి కుమారుడితడు. గుణనిధి సుధేష్ణుడి వద్ద విద్యనభ్యసించి గురుపత్ని ముక్తావళిని కామించి అక్రమసంబంధం పెట్టుకున్నవాడు. ఇది గురువును విషం ఇచ్చి చంపేవరకు వెళ్లింది. ఇది తెలిసిన తల్లి దండ్రులు ఇతడ్ని దండించగా వీరినికూడా విషమిచ్చి చంపాడు. ఉన్నదంతా హరించి ముక్తావళితో కలిసి దారినపోయిన వారిని హింసించడం దొంగతనాలు చేయడం నిత్యకృత్యమై జీవించి కొంతకాలానికి అతని వెనుక రుద్రాక్ష వృక్షాని మిగిల్చి చనిపోయాడు. యమ దూతలు విష్ణు దూతలు ఇతణ్ణి తీసుకొనివెళ్తానికి రాగా శివ దూతలు అతడు రుద్రాక్ష వృక్షాన్ని మిగిల్చి చనిపోయాడు కనుక మాకే చెందుతాడని తీసుకు వెళ్తారు. రుద్రాక్ష వృక్ష మహిమను తెల్పడానికి ఈ కథను చెప్తారు. – *దేవీ భాగవతం*

**గుణముఖ్య :** ఈమె ఓ అప్సరస. అర్జునుడి జన్మదినోత్సవాలలో నాట్యం చేసింది. – *మహాభారతం*

**గుణవతి 1 :** రావణుని భార్య మండోదరి తల్లి.
– *చూ॥ మండోదరి.*

**గుణవతి 2 :** సునాభుని కుమార్తె. ఈమె అక్క చంద్రమతి. సునాభుడు వజ్రనాభుని సోదరుడు. వజ్రనాభుని కుమార్తె ప్రభావతి శ్రీకృష్ణుని కుమారుడైన ప్రద్యుమ్నుడిని వివాహమాడుతుంది. చంద్రమతిని శ్రీకృష్ణుని సోదరుడు గదుడికి, గుణ వతిని శ్రీకృష్ణుని కుమారుడు సాంబుడికి ఇచ్చి వివాహం చేస్తారు.
– *హరివంశం*

**గుణవర :** వీరభుజుడను రాజు భార్య. ఇతనికి ఈమె కాక 99 మంది రాణులు, అయితే అతడీమెను అందరికన్నా ప్రేమగా చూసేవాడు. సంతానం లేక రాజ్యవైద్యుడి సలహామేరకు వీరితో మేక మాంసం భుజింపచేస్తాడు. ఈమెకు మిగల్చకుండా తక్కిన 99 మంది తినగా మేక కొమ్ములతో తయారుచేసిన వంట కాన్ని పెడతాడు. అందరికి ఒక్కో కుమారుడు జన్మిస్తారు. తక్కిన భార్యలు అసూయతో ఈమెకు ఓ సేవకునితో సంబంధముందని అపోహలు సృష్టించగా సేవకుణ్ణి తరిమి ఈమెను బంది ఖానాలో వుంచుతాడు రాజు. ఈమె కుమారుడు శృంగ భుజుడు. శిఖుడనే రాక్షసుడు దయ్యంగా కోటలో ప్రవేశించగా తక్కిన కుమారులు భయపడగా ఇతడు బంగారు అస్త్రంతో దయ్యాన్ని కొట్టగా అది ఆ బంగారు అస్త్రంతో పారిపోతుంది. బంగారు అస్త్రం ఇతడివల్లే పోయిందనే అపనింద రాకుండా రక్తపు చుక్కలుపడిన వెంట వెళ్ళి అగ్నిశిఖుడనే రాక్షసుణ్ణి కలసి అచట అతని కుమార్తె

రూపశిఖను వివాహమాడెను. వారిద్దరు తర్వాత ఇతడిని విడిచి పారిపోతారు. అయినా అగ్నిశిఖుడు వెంటబడగా రూపశిఖ మాయాజాలం అతణ్ణి వెనక్కు పంపుతుంది. ఆ తర్వాత వారు వీరభుజుణ్ణి చేరగా రాజు ఈ కథ విని తన కుమారుణ్ణి మరల రాజ్యానికి రప్పించి తన పొరపాటు తెలుసుకొని గుణవరను కూడా చెర నుండి విముక్తి కల్గించి అమితంగా ప్రేమిస్తాడు.
– *కథాసరిత్సాగరం.*

**గుణకర్మ :** ఇతని కుమార్తె తేజస్వతి. ఈమె ఉజ్జయిని రాజైన ఆదిత్య సేనుడిని వివాహమాడుతుంది.
– *కథాసరిత్సాగరం*

**గుణశర్మ :** ఉజ్జయినిలోని ఆదిత్యశర్మ కుమారుడు. ఆదిత్యశర్మ దేవలోకంలోని వాడు. ఒకనాడింద్రుడు ఇతనివద్దకు రాగా పరధ్యానములో నిలబడి గౌరవించ కుండుటచే మానవజన్మఎత్తమని శపించగా అతడు శాపవిమోచన కోరెను. నీకు ప్రతిగా నీ కుమారుడు మానవునిగా జన్మించవచ్చునని శాపవిమోచన కల్గించెను. అతడే గుణశర్మ. ఇతడు సర్వ కళాశాస్త్ర రంగ ప్రవీణుడు. ఇది చూసిన ఉజ్జయిని రాజు మహాసేనుడు ఇతడ్ని తన కొలువున ఉంచుకొని గౌరవించెను. ఇతడు తన మంత్ర విద్యతో రాజును అంతఃపుర శత్రువుల నుండి రక్షించి మరింత చేరువయ్యెను గాని రాణి ఇతన్ని ప్రేమించి ఇతడు నిరాకరించుట వల్ల ఆమె ఇతనిపై రాజుకు అపోహలు గల్గించి రాజ్యము నుండి వెడలగొట్టించెను. తదుపరి ఇతడు ఓ బ్రాహ్మణుని ఇంటవుండి అతని కుమార్తెను పెండ్లాడి తన విద్యలకు మరింత సానబట్టి రాజు మహాసేనుని వెడలగొట్టి ఆ దేశమునకు రాజయ్యెను. – *కథాసరిత్సాగరం*

**గుణాఢ్యుడు :** సంస్కృత సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన బృహత్కథ రచయిత. ఇతడు దీన్ని పైశాచిక భాషలో వ్రాయగా క్షేమేంద్రుడు దీన్ని బృహత్కథా మంజరి పేరుతో సంస్కృతంలోకి అనువదించాడు. ఇది సంక్షిప్త రచనకాగా సోమదేవుడు విపులంగా కథాసరిత్సాగరం పేరుతో అనువదించాడు.

*పూర్వకథ :* శివుని ఓ గణానికి అధిపతి అయిన పుష్పదంతుని స్నేహితుడు మాల్యవాణుడు పార్వతి శాపంవల్ల గుణాఢ్యుడిగా జన్మించాడు. ఒకసారి పార్వతి ఇంతకుముందెన్నడు తను వినని కథ చెప్పమని కోరగా శివుడు ఆ కథ చెప్తుండగా పుష్పదంతుడు వారికి తెలియ కుండా విని తన భార్య జయకు చెప్పగా ఆమె అదే కథను పార్వతికి చెప్తుంది. పార్వతి శివుని ఇదెలా సాధ్యమైందని అడుగగా శివుడు ధ్యాన దృష్టితో జరిగింది చూసి పుష్పదంతుని పిలిచి వివరణ కోరగా తన మిత్రుడు మాల్యవాణుడితో శివపార్వతుల దగ్గరకు వచ్చి తను ఎలా ఆ కథను విన్నది చెప్తాడు. పార్వతి వీరిద్దర్ని భూమి మీద జన్మించి ఈ కథను ప్రజలకు తెలియజేయమని శపిస్తుంది. పుష్పదంతుడు కణభూతికి ఈ కథలను చెప్పి శాపవిమోచనం పొందగా కణభూతి నుండి ఆ కథలను విన్న గుణాఢ్యుడు గ్రంథస్థం చేసి శాపవిమోచనం పొందాడు. ఆ కథే బృహత్కథ.

**గుణావతి :** ఇదోనది. ఈ నదీ తీరాన పరశురాముడు కొందరు క్షత్రియుల్ని వధిస్తాడు. – మహాభారతం

**గుణావర :** ఈమె ఓ దేవకన్య. అర్జునుడి జన్మదినోత్సవాల్లో నృత్యం చేస్తుంది. – మహాభారతం

**గుప్త :** ఓ కులం పేరు. – అగ్నిపురాణం

**గుప్తకుడు :** సౌవీర దేశ రాజకుమారుడు. జయద్రథునికి మిత్రుడు. కురు క్షేత్ర యుద్ధంలో అర్జునుడు ఇతణ్ణి వధిస్తాడు. – మహాభారతం

**గుప్తులు :** ఆంధ్రభృత్యుల కాలమున మగధ రాజ్యము అనేక భాగములయ్యెను. అందు ప్రయాగ వరకు గల గంగా తీర ప్రాంతమును పాలించిన సామంత రాజులే గుప్తులు. – పు.నా. చంద్రిక

**గురుడు 1 :** చూ॥ బృహస్పతి

**గురుడు 2 :** సంకృతి కుమారుడు. పూర్వనామం రుచిరథుడు.

**గురుదారుడు :** గరుడిడి కొడుకు. – మహాభారతం

**గురుపరంపర :** చతుర్వేదాలను విభజించి విస్తరించిన వారిని గురుపరంపర అంటారు. ఋగ్వేద విస్తారకుల్లో పైలుడు, ఇంద్రప్రమతి, బాష్కలుడు, బోధి, ఆదిమాధవుడు, యాజ్ఞవల్క్యుడు, పరాశరుడు, మాండుకేయుడు. గార్గాయని ముఖ్యులు. యజుర్వేదాన్ని విస్తరించిన వారిలో వైశంపాయనుడు, బ్రహ్మరాతుడు, యాజ్ఞవల్క్యుడు, సామవేదాన్ని జైమిని, సుమంతు,

సుత్వుడు, సుకర్మ, హిరణ్యనాభుడు, అథర్వణ వేదాన్ని సుమంతుడు, కబందుడు, దేవాదర్శుడు, పథ్యుడు విస్తరింప జేశారు. అలా విస్తరింపజేసినవారిలో బోధాయన, యాతు పర్గ, శాలి, సంపార, సామగాదులుకూడా వున్నారు.

**గురువు :** తల్లి, తండ్రి, గురువు, అగ్ని, ఆత్మల్ని గురువుగా భావిస్తారు. – *అగ్నిపురాణం*

**గుల్మకుడు :** బృహత్కథ గ్రంధకర్త అయిన గుణాఢ్యుడి పెద తండ్రి. సుప్రతిష్ఠపురంలో సోమశర్మ అనే బ్రాహ్మణుడికి జన్మించిన ముగ్గురు కుమారుల్లో గుల్మకుడొకడు. తక్కిన ఇద్దరు వత్సుడు, శ్రుతార్ధుడు శ్రుతార్థుడి కుమారుడే గుణాఢ్యుడు. – *కథాసరిత్సాగరం*

**గుల్మం :** ఇది సైన్యంలో ఓ విభాగం. – *చూ॥ అక్షౌహిణి*

**గులిక :** ఇతడొక వేటగాడు. విష్ణు దేవాలయంపైగల బంగారు కవచాలను ఎత్తుకుపోబోగా ఉత్తంగముని ఇతడిని ఆపబోగ ఇతడు ఉత్తంగుడ్ని చంప బోయాడు. ఉత్తంగుడు ఇతడ్ని తన శాపఫలంతో చంపాడు. తర్వాత అతనిపై జాలితో గంగాజలం చల్లగా అతనికి మోక్షం లభించి వైకుంఠం చేరుకున్నాడు.
– *నారదీయ పురాణం*

**గుహసేనుడు :** చూ॥ దేవస్మిత.

**గుహుడు :** ఇతడో కిరాతక తెగవాడు. నిషాదరాజు. శృంగి దేవపురం ఇతని నగరం. రామభక్తుడు. ఇతడే సీతారామ లక్ష్మణుల్ని వనవాసం వెళ్లేటప్పుడు నదిని దాటిస్తాడు. భరతుడు రాముని చూడటానికి రాబోగా యుద్ధముఖుడై వస్తున్నా డని అడ్డగిస్తాడు. భరతుడు వివరం చెప్పగా దారి ఇచ్చి వెళ్లడానికి అంగీకరిస్తాడు.
– *రామాయణం*

**గుహులు :** భారతదేశంలోని ప్రజల్లో ఒక తెగ.
– *మహాభారతం*

**గుహ్యకులు :** గోకులము నందు శ్రీకృష్ణుడుండగా అతని గుహ్య దేశం నుండి పుట్టినవారు. అందులో పెద్దవాడు కుబేరుడు. వీరు కుబేరుని నవ విధులను పాలించువారు. – *బ్రహ్మాండ పురాణం*
భీమసేనుడు గంధమాదన పర్వతంపై చాలా మంది గుహ్యుల్ని వధించాడు. – *మహాభారతం*
కురుక్షేత్రంలో చనిపోయిన కొంతమంది వీరులు గుహ్య ప్రపంచం వెళ్ళారు. – *మహాభారతం*

**గూఢసేనుడు :** పుష్కరావతి దేశపు రాజు.
– *మహాభారతం*

**గూర్ణిక :** దేవయాని సహచరి – *మహాభారతం*

**గొడుగు :** చూ॥ జమదగ్ని

**గో :** ఈమె పులస్త్యుడి భార్య. వీరికి వైశ్రవణుడు జన్మిస్తాడు. ఇతడు తల్లిదండ్రులనువదలి బ్రహ్మవద్దకు వెళ్తాడు. – *మహాభారతం*

**గోకర్ణ :** కురుక్షేత్ర సంగ్రామంలో కర్ణుడు అర్జునుడి మీదికి అశ్వసేనుడను నాగాస్త్రాన్ని వదుల్తాడు. అశ్వసేనుడి తల్లి గోకర్ణ. – *మహాభారతం*

**గోకర్ణక్షేత్రం :** ఇదో పుణ్య తీర్థము. ఇది మునులకు నివాసయోగ్యమైనది. సగర పుత్రులు అశ్వమును వెదకుటకై భూమిని త్రవ్వుచూ ఈ క్షేత్రమును కూడ తవ్వివేసిరి. అందువల్ల ఇదియును సముద్రములో కలిసిపోయెను. అంతట మునులు పరశురాముని వేడుకొనగా అతడు సముద్రుని ఈ క్షేత్రమును బైట పెట్టమని ఆజ్ఞాపించగా సముద్రుడటనుండి వెడలి పోయెను. మునులచటకు తిరిగి ప్రవేశించిరి.
– *బ్రహ్మపురాణం*

**గోకర్ణి :** స్కందదేవుని అనుచరుడు. – *మహాభారతం*

**గోకులం :** యమునా నది తీరంలో బృందావనం వద్దగల ఓ గొల్ల పల్లె. శ్రీకృష్ణుడిక్కడే పెరిగి పెద్దవాడవుతాడు. దీనిని వ్రేపల్లె అనికూడా పిలుస్తారు.
– *భాగవతం*

**గోఖలి :** వ్యాసమహర్షి శిష్యపరంపరలో ఒకడు. శాకల్యుడి శిష్యుడు. – *భాగవతం*

**గోతముడు :** రహోగణుడి కుమారుడు. ఋగ్వేదం మొదటి మండలంలోని పదమూడో అనువాకం లోని డెబ్భై నాలుగో సూక్తాన్నితడే రూపొందించాడు.
– *ఋగ్వేదం*

**గోత్రములు :** ఎన్నో రకముల గోత్రములు కలవు. ఇందు ముఖ్యమైనవి 50. వీటిలో కొన్ని శిష్యపరంపర, పుత్రపరంపరను తెలియజేయును. ఇందు ప్రధానమైనవి కాశ్యప భరద్వాజ హరిత కౌండిన్య కౌశిక వశిష్ఠ గౌతమ గార్గేయ, శ్రీవత్స ఆత్రేయ ముద్గల శఠమర్షణాదులు. ప్రతి పై ప్రధాన గోత్రములలో అంతర్భాగములు కలవు. అదిగాక ఏకాక్షీ, ద్వార్షేయ,

త్రార్షేయ పంచార్షేయములని కూడా విభజించెదరు. అనగా ఒక రుషిని, ఇద్దరు రుషులను, ముగ్గురు రుషులను, ఐదుగురు రుషులను గూర్చి చెప్పి తెలియ జేయుదురని అర్థము. – పురాణనామ చంద్రిక

**గోతీర్థం :** సరయూనది యందలి ఒక తీర్థము. ఇచ్చటనే శ్రీరాముడును అతని వెంట వచ్చిన ప్రజలును నదిలో మునిగి దివమునకేగిరి. ఆ దిగిన ప్రజల సమూహము గోవుల ఈతవలె నుండుటచే దానికా పేరు వచ్చెను. – రఘువంశం

**గోత్రుడు :** వశిష్ఠుడి కుమారుడు. ఊర్ధ్వవశిష్ఠులకు జన్మించిన ఏడుగురు కుమారుల్లో ఇతడొకడు. వీళ్లు మూడో మన్వంతరంలో సప్తర్షులౌతారు.
– విష్ణుపురాణం

**గోద :** ప్రాచీన భారతదేశంలోని ఒక గ్రామం.
– మహాభారతం

**గోదానం :** ప్రాచీన భారతదేశంలో గోదానం ఓ పుణ్య కార్యం. తనకు పాత తరంనుండి వచ్చిన ఆస్తితో గోవుల్ని కొని దానం చేసినా, జూదంవంటి వృత్తిలో సంపాదించిన ధనంతో గోవుల్ని కొని దానం చేసినా పుణ్యం లభిస్తుంది. – మహాభారతం

**గోదావరి :** అశ్వని కుమారుడు తీర్థయాత్రకు పోవు చున్న బ్రాహ్మణకాంతను మోహించి బలాత్కారమున వీర్యదానము చేసెను. ఆమెకు కుమారుడు జన్మించెను. ఆమె సిగ్గుపడి కుమారుని తీసుకొని భర్త సుతవుని దగ్గరకు పోగా అతడామెను త్యజించెను. ఆమె యాగ ముచే నది అయ్యెను. అదే గోదావరి.
– బ్రహ్మవైవర్తపురాణం

ఇది గంగానది పార్శ్వమని చెప్పుదురు. అట్లు చెప్పు టకు ఓ పూర్వకథ కలదు. ఒకసారి మహా కాటకము సంభవించి జనులు తిండి లేక మలమల మాడిపోవు చుండిరి. మునులు గౌత ముని ఆశ్రయించగా అతడు వీరికి ఆహారం సమకూర్చెను. ఎచ్చటపండకున్నను గౌతముని పొలము మాత్రము పండుచుండెను. బ్రాహ్మణులు అసూయచెంది ఓ మాయ గోవుని ఆ పొలములో మేయుటకు పంపిరి. ఇది గౌతముడు చూసి తన కమండలములోని నీటిని దానిపై వర్షింపగా అది అశువులు బాసెను. గోవధ మహా పాతకమని ఈ గోవధ చేసిన వారి ఇంట భుజింపమని బ్రాహ్మ ణులు వెడలిపోయిరి. ఈ గోహత్యాపాతకమెట్లు పోవునో తెల్పమని బ్రాహ్మణులను కోరగా గంగను తీసుకొనివచ్చిన పాతకము పోవునని చెప్పిరి. గౌతముడు శివునిగూర్చి ప్రార్థించగా అతడు ప్రత్యక్షమై తన జట నొకదానిని ఇచ్చి దానిని పిందుము గోవు బ్రతుకునని చెప్పెను. అతడట్లే చేయగా గోవు బ్రతికెను. ఆ పిండిన జలమే నదియయ్యెను. గోవుని బ్రతికించెను గాన గోదావరి అని, గౌతముడు తెచ్చెను గనక గౌతమి అని ఈ నదిని పిలిచెడివారు. – వరాహపురాణం

*ఇతర విశేషాలు :* వరుణుని కొలువులో ఓ సభ్యురాలు. నాసిక్ వద్దగల త్రయంబక జ్యోతిర్లింగం వద్ద పుట్టిన అతిలోతైన నది. దీనిని ఎందరో మహర్షులు పూజించారు. – మహాభారతం

ఈ నదిలో స్నానంచేస్తే గోమేధ యజ్ఞంచేసిన ఫలితం లభిస్తుంది. అంతేకాకుండా మరణానంతరం వాసుకి సామ్రాజ్యాన్ని చేరుకుంటారు. – మహాభారతం

అగ్ని గోదావరి నుండే పుట్టింది. – మహాభారతం

సీతారామ లక్షణులు వనవాసకాలంలో ఈ నదీ తీరమైన పంచవటి వద్ద ఎక్కువ కాలం ఉన్నారు.
– రామాయణం

**గోదిలుడు 1 :** ఓ సామవేదమూర్తి. ఇతని శాపంవల్ల ఉతత్యుడు సత్యతపసుడిగా మారాడు.
– చూ॥ సత్యతపసుడు.

**గోదిలుడు 2 :** వైశ్రావణుడి అనుచరుడైన ఓ యక్షుడు. ఓసారి ఆకాశంలో వెళ్తూ విదర్భరాజు ఉగ్రసేనుని భార్య కొలనులో స్నానం చేస్తుండగా ఆమె అందాన్ని చూసి మోహించి కొలను వద్దకు ఉగ్రసేనుని రూపంలో వెళ్ళగా ఆమె తన భర్తేనను కొని అతనిని ఆలింగనం చేసుకుంటుంది. అతని చర్యలను బట్టి తన భర్త కాదని గ్రహించగా అతడు సత్యం చెప్పి వెడలిపోతాడు.
– పద్మపురాణం

**గోదుడు :** స్కందదేవుని అనుచరుడు. – మహాభారతం

**గోదేవి :** బ్రహ్మదత్తుడి భార్య. ఈమె కుమారుడు విష్వక్సేనుడు. – మహాభారతం

**గోనందుదు :** స్కందదేవుని యోధుల్లో ఒకడు.
– మహాభారతం

**గోపతి 1 :** శిఖి చక్రవర్తి మనుమడు. పరశురామునికి వెరచి అరణ్యములకేగి అచట గోవులను రక్షించు చుండెడివాడు. - మహాభారతం

**గోపతి 2 :** ఓ పిశాచం. మహేంద్ర పర్వతంమీద శ్రీకృష్ణుడితణ్ణి వధిస్తాడు. - మహాభారతం

**గోపతి 3 :** శివుడి మరోపేరు.

**గోపతి 4 :** విష్ణువు మరోపేరు

**గోపరాష్ట్రం :** ప్రాచీన భారతదేశంలోని ఓ నివాస యోగ్య ప్రాంతం. - మహాభారతం

**గోపాయనం :** గోపకుల సైన్యాన్ని గోపాయనం అంటారు. - మహాభారతం

**గోపాలకుడు :** చంద్ర మహాసేన అంగారవతిలకు జన్మించినవ వాడు. వారి మరో కుమారుడి పేరు సాలకుడు. - కథాసరిత్సాగరం

**గోపాలి 1 :** ఓ అప్సరస. అర్జునుని గౌరవార్థం ఇంద్ర సభలో నృత్యం చేస్తుంది. - మహాభారతం

**గోపాలి 2 :** స్కందుడి అనుచరి - మహాభారతం

**గోప్తతార :** సరయు నదికి ఉత్తరపు ఒడ్డు. ఇచట నుండే శ్రీరాముడు తనసైన్యంతో వాహనాలతో స్వర్గానికి వెళ్తాడు. - మహాభారతం

**గోబిలుడు :** ఇతడొక బ్రాహ్మణుడు. దేవదత్తుడను బ్రాహ్మణుడు చేయు యాగమునకు ఉద్గాతగా నుండి స్వరము తప్పు పలికెను. దేవదత్తుడాగ్రహించి మూర్ఖుడా అని అతనిని తిట్టెను. అందుకు గోబిలుడు కుపితుడై నీకు మూర్ఖుడను కుమారుడు జన్మించుగాక యని శపించెను. అప్పుడు దేవదత్తుడు క్షమింపుమని అతని పాదములపై పడగా కొంతకాలమునకు నీ పుత్రుడు కవియగునని అనుగ్రహించెను. - దేవీభాగవతం

**గోభానుడు :** పూరువంశ రాజైన తుర్వసు మనుమడు, వర్గరాజు కుమారుడు. ఇతని కుమారుడు త్రైసాని. - అగ్నిపురాణం

**గోమతి :** పురాణ కాలంలో ఓ పుణ్యనది. దీనిని దేవతగా పూజిస్తారు. కంభరామాయణం ప్రకారం ఈమె విశ్వామిత్రుని సోదరి కౌశిక. రుచికుని భార్య. ఒకసారి రుచికుడు బ్రహ్మ దర్శనానికి దేవలోకం వెళ్లగా భర్త ఎడబాటును సహించలేక ఆమె అతని ననుసరించగా రుచికుడు ఈమెను నది కమ్మని శపిస్తాడు. ఆరోజు నుండి కౌశికి నదిగా ప్రవహిస్తోంది. - రామాయణం శ్రీరాముడు అశ్వమేధయాగం ఈ నదీతీరాన నిర్వహించాడు. - ఉత్తర రామాయణం ఈ నదీ నీటిని తాగితే పాపాలు నశిస్తాయి. - మహాభారతం ఈ నది దేవత వరుణుని కొలుస్తూ అతని కొలువులో వుంటుంది. - మహాభారతం

**గోమతీమంత్రం :** గోవుల నుండి దీవెన పొందడానికి ఈ మంత్రాన్ని ఉచ్చరిస్తారు. గోవుల మధ్య వుండి ఈ మంత్రాన్ని పఠిస్తే సంతాన ప్రాప్తి, సంపద కల్గుతాయి. స్త్రీ కనుక అలాచేస్తే భర్త అనురాగాన్ని పొందుతుంది. - మహాభారతం

**గోమంతం 1 :** ద్వారక దగ్గర్లోని ఓ పర్వతం. ఇక్కడే బలరాముడు జరాసంధుడ్ని పట్టుకుని వదిలేస్తాడు. దీన్ని దైవతకమని అంటారు. - భాగవతం

**గోమంతం 2 :** ప్రాచీన భారతదేశంలోని ఓ నివాస యోగ్య ప్రాంతం. - మహాభారతం

**గోమంతం 3 :** కుశ ద్వీపంలోని ఓ పర్వతం పేరు. - మహాభారతం

**గోముఖుడు :** శాకల్యుని శిష్యుడు. తానభ్యసించిన ఋగ్వేద సంహితను జాతుకర్ణు దనువానికి ఉపదేశించెను. - భాగవతం

**గోమేదకం :** నవరత్నాలలో ఒకటి. చూ॥ నవరత్నాలు.

**గోరథం :** మగధ దేశంలోని ఓ భవనం. ఇది గిరి వ్రజపురం దగ్గరలో వుంది. - మహాభారతం

**గోలకి :** మధుపుడనే రాక్షసుని తల్లి. ఈమె కృత యుగంలో బ్రహ్మముఖం నుండి జన్మించింది. - ఉత్తర రామాయణం

**గోలోకం :** ఓ దైవికలోకం. ఇక్కడ గోవులు నివసిస్తాయి. ఇతర అన్ని లోకాల కంటే పై నుంటుంది. దక్షుని కూతురు సురభి ఈ లోకంలో తపస్సుచేసి ఎన్నో శక్తుల్ని పొందింది. పండితులు గోలోకం విష్ణువు పై పెదవి అని బ్రహ్మలోకం మహావిష్ణువు క్రింది పెదవి అని చెప్తారు. - మహాభారతం

**గోవర్ధనగిరి :** గోకులంలో ఇదోపర్వతం. ఇది శ్రీకృష్ణుని ప్రతిరూపమంటారు. ఇచ్చటి ప్రజలు ఎంతోకాలంగా

ఇంద్రుణ్ణి కొలిచేవారు. అప్పుడే వర్షాలు కురుస్తాయని భావించేవారు. శ్రీకృష్ణుడు ఈ పర్వతాన్ని కొలిస్తే చాలు వర్షాలు వస్తాయని ఈ ప్రజలకు తెలుపగా ఇంద్రుడు కుపితుడై గోకులం (అంబడి) మునిగి పోయేంత వర్షం కురి పించగా వారిని రక్షించడానికి ఈ పర్వతాన్ని శ్రీ కృష్ణుడు పైకెత్తుతాడు.
– మహాభారతం

**గోవాసనం :** ప్రాచీన భారతదేశంలోని ఓ ప్రాంతం. ఈ ప్రాంత ప్రజలు ధర్మజునికి ఎన్నో కానుకలు సమర్పించారు. – మహాభారతం

**గోవాసనుడు :** శిబి అనే దేశపురాజు. ఇతని కుమార్తె దేవికను యుధిష్ఠురుడు స్వయం వరంలో వివాహ మాడతాడు. ఇతడొకసారి కాశీరాజు అభిభుడితో ద్వంద యుద్ధం చేస్తాడు. – మహాభారతం

**గోవితతం :** గుర్రాన్ని బలిఇచ్చే ఓ విధానం. కణ్వ మహర్షి తన మనుమడు భరతునితో ఈ యజ్ఞాన్ని నిర్వహింపజేశాడు. – మహాభారతం

**గోవిందగిరి :** క్రౌంచ ద్వీపంలోని ఓ పర్వతం.
– మహాభారతం

**గోవింద దత్తుడు :** ఓ ప్రసిద్ధి చెందిన బ్రాహ్మణుడు. బహుసువర్ణకం అనే గంగా నదీతీరాన గల పట్ట ణంలో నివసించేవాడు. ఇతనికి ఐదుగురు పుత్రులు. ఇతడు ఇతని భార్య ఇంట లేనప్పుడు వైశ్వానరుడు తన ఇంటికి రాగా అతనికి తగిన గౌరవ మర్యాదలు ఇవ్వలేదని తెలిసి తన పిల్లల్ని ఇంటినుండి పంపి వేస్తాడు. – కథాసరిత్సాగరం

**గోవింద భగవత్పాదాచార్యులు :** గౌడపాదాచార్యుని శిష్యుడు. శ్రీమత్ శంకరాచార్యుల వారి గురువు.

**గోవింద శర్మ :** కాశీలో ప్రాచీన కాలంలో నివసించిన ఓ బ్రాహ్మణుడు. – చూ॥ సింహధ్వజుడు

**గోవిందుడు :** శ్రీకృష్ణుని మరోపేరు. ఇతడు గోవర్ధ నగిరిని గొడుగులా ఎత్తి అంబడి ప్రజలను ఇంద్రుడు సృష్టించిన వర్షంనుండి రక్షించాడు కనుక ఆ పేరు వచ్చింది. – మహాభారతం

**గోవులు :** చూ॥ సురభి

**గోవ్రజుడు :** స్కందదేవుని సైనికుల్లో ఒకడు.
– మహాభారతం

**గోశృంగం :** దక్షిణ భారతంలో ఓ ముఖ్య పర్వతం. దీన్ని సహదేవుడు ఆక్రమిస్తాడు. – మహాభారతం

**గోసవం :** ఒక మహాయజ్ఞం. – మహాభారతం

**గోస్తని :** స్కందదేవుని అనుచరుల్లో ఒకడు.
– మహాభారతం

**గోహత్య :** ప్రాచీన భారతదేశంలో గోహత్య మహా పాతకమని భావించేవారు. ఈ హత్యచేసిన వాడికి క్రూరమైన శిక్షకూడా వుండేది. 2 నెలలు గోమూ త్రంతో స్నానించాలి. పగలు గోవుల రక్షణ బాధ్యత స్వీరించాలి. నిరాహారియై పదిగోవుల్ని, ఓ ఎద్దుని దక్షిణగా ఇవ్వాలి. గోవులంటే భయపడే బ్రాహ్మణుడికి అతని సంపదనంతా ఇవ్వాలి. గోవధ చేసేవారి కోసం గోవుని ఆపితే శిక్షలో నాల్గవవంతు, గోవుని ఆపి కట్టివేసి గోవధకు సిద్ధంచేస్తే సగం శిక్ష, అలా కట్టి వేయడమే కాకుండా దాన్ని చంపడానికి ఆయుధాన్ని సమకూరిస్తే ముప్పావు శిక్ష భరించాలి.
– అగ్నిపురాణం

**గోళకుడు :** శాకల్యుడి శిష్యుడు.

**గౌడపాదాచార్యులు :** శ్రీశకుల శిష్యుడు. ఇతని శిష్యుడు గోవింద భగవత్పాదులు. ఈయన ఉత్తర గీతకు భాష్యం చెప్పారు.

**గౌడపురి :** లక్షణవతి అనికూడా నామాంతరము కలదు. వంగ దేశమందలి ముఖ్య పట్టణము. ఇచ్చట జహ్ను మహర్షి ఆశ్రమము ఉండెడిదని చెప్పెదరు. ఇచ్చట వుండు బ్రాహ్మణులను గౌడులు అని పిలుస్తారు. వీరు పరీక్షిత్తు కాలంలో కురు, కోసలముల నుండి వచ్చి ఇచట స్థిరపడిరి.

**గౌడము :** ఇప్పటి బెంగాల్ ప్రాంతము. వంగదేశము. ఈ ప్రాంత ప్రజలు గౌడులలో ఒకరు.

**గౌతమాశ్రమం :** ఇది విశాలపురం నుండి మిథిలకు పోవు మార్గములో కలదు. దీనికి సమీపంలో నిమి చక్రవర్తి నిర్మించిన జయంతిపురమను పట్టణము కలదు.

**గౌతమి 1 :** చూ॥ గోదావరి

**గౌతమి 2 :** గౌతముని కుటుంబంలోని జటిలను కూడా గౌతమి అంటారు. – చూ॥ జటిల

**గౌతమి 3 :** ఓ బ్రాహ్మణ వనిత. కుమారుడు పాము కాటుకు మరణించాడు. చూ॥ అర్జునుడు

**గౌతమీ :** ద్రోణాచార్యుని భార్య కృపి యొక్క మరో పేరు.

**గౌతముడి గోవు :** క్షామకాలమున గౌతముడు తన తపశ్శక్తితో పంటపండించి తన ఆశ్రమమునకు వచ్చిన వారికి ఆహారపు కొరత తీర్చెను.

క్షామానంతరము వీరు ఈర్ష్యతో ఇతని పొలములోనికి మాయ గోవును పంపగా గౌతముడుదర్భలతో అద లించగా అది మరణించెను. బ్రాహ్మణులు గోహత్య చేసితివి గనుక చాంద్రాయణ వ్రతమాచరింపమని వెడలిరి. ఇట్లు వూరకనే అదలించిన మాత్రము బాధిం పబడినట్లు నటించు వారిని 'గౌతముని గోవు అని పిలుచుట సాంప్రదాయమయ్యెను. – చూ॥ గోదావరి

**గౌతముడు 1 :** ధర్మజుని కొలువులోని ఓ బ్రాహ్మణుడు. ఇతడు ఇంద్రసభలో కూడా సభ్యుడు. గిరివ్రజ పురంలో ఇతడు నివసిస్తున్నపుడు ఓ శూద్రస్త్రీతో సంబంధం వుంది. వారికి జన్మించిన వాడే కక్షిరాయదు. – మహాభారతం

**గౌతముడు 2 :** ఓ పండితుడు. ఇతని ముగ్గురు పుత్రులు ఏకత, ద్విత, త్రిత. – మహాభారతం

**గౌతముడు 3 :** ఓ అదృష్ట జాతకుడైన బ్రాహ్మణుడు. ఒకసారి అరణ్యంలో సంచరిస్తుండగా ఓ ఏనుగుపిల్ల కనపడగా దాన్ని తెచ్చి పెంచాడు. ఇంద్రుడు ధృత రాష్ట్రుని వేషంలో వెళ్లి ఈ ఏనుగుని తీసుకు పోబోగా గౌతముడు అడ్డుపడగా ఈ ఏనుగు బదులు 1000 గోవులు, ధనము ఇస్తానన్నా నిరాకరించాడు. ఇంద్రుడు ఇందుకు సంతసించి ఏనుగుని, గౌతముణ్ణి స్వర్గానికి తీసుకెళ్లాడు. – మహాభారతం

**గౌతముడు 4 :** ఓ విశ్వాసఘాతకుడైన బ్రాహ్మణుడు. మధ్యదేశంలో పుట్టి తల్లిదండ్రులను విడచి అడవుల్లోకి వెళ్లి అక్కడి వారితో కలిసి పనిచేస్తూ ఆటవిక జాతి స్త్రీనే వివాహమాడి అక్కడే నివసించేవాడు. ఓ రోజు ఒక బ్రాహ్మణుడు అడవికి వచ్చి కనీసం బ్రాహ్మణ కులంలో పుట్టినందువల్ల ఇతని ఇంట్లో ఒక రోజు వుంటాడు. రక్తసిక్తమైన గౌతముని శరీరం చూసి బ్రాహ్మణ జన్మ జన్మించి ఇది నీకు తగదని అక్కడ భోజనం చేయకుండానే వెళ్లి పోయాడు. గౌతముడు ఆలోచనలోపడి అక్కడ నుండి వెళ్లి ఓ సముద్రపు ఒడ్డున వ్యాపారస్తులతో కలసి ప్రయాణిస్తుండగా అడవి ఏనుగు వారిపై దాడిచేయగా ఇతడు తప్పించు కొని పారిపోయి ఓ అరటి చెట్టు క్రింద అలసిపడు కుంటాడు. ప్రతిరోజు బ్రహ్మను పూజించి, సాయం త్రానికి ఆ చెట్టు మీద నివసించే నాడిజంగమ అనే గ్రద్ద ఇతణ్ణి చూసింది. ఇతడు దాన్ని చంపి తిందా మనుకొంటుండగా అది ఇతనికి అతిధి మర్యాదలతో ఆహారం పెట్టి వివరాలు కనుగొని తన మిత్రుడు విరుపాక్షుడను దయ్యం వున్నాడని నీకు కావలసిన సంపదనిస్తాడని చెప్పగా అతడు వెళ్ళి అతడికిచ్చిన బంగారాన్ని మోసుకుంటూవచ్చి ఆ చెట్టుక్రిందే కూర్చొని ఆ గ్రద్ద వచ్చిన తర్వాత ఒక్క ఉదుటున దాన్ని చంపి తిని బంగారం మూట పట్టుకొని వెళ్తాడు. విరూపాక్షుడు తన మిత్రుడు నాడీజంగముడు రెండు రోజులు కన్పించకపోయేసరికి తన కుమారుడ్ని పంపుతాడు. అతడు ఆ చెట్టు క్రింద ఎముకలు చూసి విషయం గ్రహించి గౌతముణ్ణి వెంటాడి పట్టుకొని తన తండ్రివద్దకు తీసుకొస్తాడు. విరూపాక్షుడు ఇతణ్ణి ముక్కలు ముక్కలుగా నరికి కాకులకు వెయ్యగా అవి కూడా తినవు. తన మిత్రుడికి శ్రాద్ధకర్మలు నిర్వ హించగా దేవతలు ఆకాశంనుండి చూశారు. సురభి పాలు చల్లగా ఆ గ్రద్ద బతికి గౌతముణ్ణికూడ బ్రతికిం చమని కోరుతుంది. అలా బతికిన గౌతముడు మరల శిబిరాల లోనికి వచ్చి ఓ శూద్రవనితను వివాహ మాడి నీతిలేని సంతానం పొందుతాడు. దేవతలు ఇది చూసి అతణ్ణి శపించి నరకానికి పంపుతారు. – మహాభారతం

**గౌతముడు 5 :** పురాణాలు ఇతని వంశవృక్షాన్ని గురించి ఎక్కడా చెప్పలేదు. ఇతని భార్య అహల్య జన్మవృ త్తాంతం మాత్రం చెప్పబడింది. బ్రహ్మ అహల్యను సృష్టించాడు. ముందుగా ఎవరు భూ ప్రదక్షిణం చేసి వస్తే వానికి ఈమెనిచ్చి వివాహం చేస్తానంటాడు. దేవతలు మరికొందరు భూ ప్రదక్షిణం చేయుచుండగా గౌతముడు సగం ఈనిన ఆవుచుట్టును ప్రదక్షిణము చేసి ముందుగా బ్రహ్మవద్దకు వచ్చెను. గోవు ప్రద క్షిణము భూ ప్రదక్షిణముతో సమానము గనుక అహ

ల్యని తనకిచ్చి వివాహము చేసెను. ఇతని కుమారులు శరద్వానుడు, చిరాకారి. శరద్వానుని పుత్రుడు కృపుడు, పుత్రిక కృపి. అందువల్లనే వీరిని గౌతమ, గౌతమి అని అంటారు.

*అహల్య ఇంద్రులకు శాపం :* ఇంద్రుడు అహల్యను మోహించి తెల్లవారకుండానే కోడి కూసినట్లు అరవగా గౌతముడు స్నానార్థియై ఆశ్రమము విడిచి వెళ్లగా ఇంద్రుడు గౌతముని రూపమున అహల్యతో సంగ మించెను. ఎంతకును తెల్లవారక గౌతముడు వెనుకకు వచ్చి అహల్య, ఇంద్రులను జూచి అహల్యను శిలగా, ఇంద్రుని శరీరమంతయు యోనులుండునట్లు శపిం చెను. ఇంద్రుడు క్షమా పణలు కోరగా అహల్య శ్రీరాముని పాదస్పర్శవల్ల నిజరూపము దాల్చునని, ఇంద్రుని యోనులు ఇతరులకు కళ్ళుగా కన్పించునని శాపవి మోచన మిచ్చెను.

*ఇతర విశేషాలు :* గౌతముడు సప్తర్షుల్లో ఒకడు. బ్రహ్మ కొలువులో అతణ్ణి పూజిస్తుండేవాడు. భీష్ముడు అంపశయ్యపై నుండగా దర్శించిన వారిలో ఒకడు. కురు క్షేత్ర యుద్ధాన్ని ఆపమని ద్రోణునికి సలహా ఇచ్చాడు. – *ఉత్తర రామాయణం*

**గౌరపృష్ఠుడు :** ఓ రాజర్షి. ఇతడు యముని కొలువులో యముడి ప్రార్థనలో వుంటాడు. – *మహాభారతం*

**గౌరప్రభుడు :** వ్యాసుని కుమారుడు శకుడు. అతనికి పివరివల్ల జన్మించిన పుత్రులలో గౌరవ ప్రభుడు ఒకరు. తక్కినవారు కృష్ణ, భూరి, దేవశృతుడు. మరో కూతురు కీర్తి. – *దేవీభాగవతం*

**గౌరముఖుడు :** పరీక్షిత్తుని తక్షకుని కాటుకు మరణిస్తావని శపించిన శృంగియొక్క శిష్యుడు. శపించిన తర్వాత పరీక్షిత్తుకి ఈ విషయాన్ని తన శిష్యుడైన గౌరముఖుడితో కబురంపుతాడు. – *దేవీభాగవతం*

**గౌరం :** కుశద్వీపంలోని ఓ పర్వతం. – *మహాభారతం*

**గౌరవాహనుడు :** యుధిష్ఠురుని రాజసూయ యాగంలో పాల్గొన్న ఓ రాజు. – *మహాభారతం*

**గౌరశిరసుడు :** ప్రాచీన కాలంలోని ఓ రుషి. ఇతడు ఇంద్రసభలో అతణ్ణి కొలుస్తూ జీవిస్తాడు. – *మహాభారతం*

**గౌరి 1 :** చూ॥ పార్వతి

**గౌరి 2 :** పార్వతి వద్దవుండే ఓ స్త్రీ సేవిక.

**గౌరి 3 :** వరుణదేవుని భార్య. – *మహాభారతం*

**గౌరి 4 :** ప్రాచీన భారతదేశంలో ఓ నది. – *మహాభారతం*

**గౌరీగంగ :** కైలాస పర్వతమునందలి ఒక నది.

**గౌరీశిఖరం :** హిమాలయాల్లోని ఓ పుణ్యస్థలం. ఇక్కడున్న స్థానకుండంలో స్నానంచేస్తే వాజపేయ, అశ్వమేధయాగాలు చేసిన ఫలితం లభిస్తుంది. – *మహాభారతం*

**గౌరీశుడు :** ఓ రాజర్షి, యముని కొలువులో ఓ సభ్యుడు. – *మహాభారతం*

**గంగ :** ప్రసిద్ధిగాంచిన భారతదేశంలోని పవిత్ర నది. మొదటి జన్మంలో కర్ధమ పుత్రికయైన కళయందు మరీచికకు జన్మించిన కుమార్తె. ఈమె పేరు పూర్ణిమ. – *భాగవతం*

శ్రీ మహావిష్ణువు వామనావ తారమున తన ఎడమ పాదమును ఆకాశమున నుంచెను. అప్పుడతని ఎడమకాలి గోళ్లు పైకి లేవగా ఆ గోళ్ళమధ్య నుండి గంగ ఉద్భవించి కైలాసమున పడెను. దానిని అందు కనే విష్ణుపది అని అనేవారు. అది ఆకాశంలోనే చాలాకాలం వుంది. దీనిని ధ్రువ మండలం అనేవారు. సప్తర్షులు ఈ మండలానికి వెళ్లి విష్ణుపదిలో స్నానం చేసి పునీతులయ్యేవారు. ఇది నాల్గు భాగాలుగా చీలింది. ఇందులో ఓ ఉపనది అలకనంద భరత వర్షంలో ప్రవహించి అన్నింటికంటే పవిత్రమైనదిగా భావించబడింది. కొన్ని వేల సంవత్సరాలు స్వర్గంలో ప్రవహించిన తర్వాత భూమిపై పడింది. – *భాగవతం*

గంగ, సరస్వతి, లక్ష్మి విష్ణుమూర్తి భార్యలు. గంగ రెప్పవేయక తన భర్తను చూచుచుండగా అతడామెను ముద్దాడెను. ఇది సహించలేని సరస్వతి గంగను భూమిపై నదివి కమ్మని శపించెను. గంగయు ప్రతి శాపమిచ్చెను. అట్లే చూచుచున్న లక్ష్మిని అయోనిజగా భూమిపై పుట్టుమని విష్ణువు శపించెను.

భగీరదుడను రాజు సగర పుత్రులైన తన తాతలను పునీతులను చేయుటకు రమ్మని గంగను ప్రార్థించగా ఆమె వచ్చెదనుగాని నేను భూమిపై బడినపుడు నన్ను మోయగలవాడెవనగా భగీరదుడు శివుని గూర్చి

ప్రార్థించగా గంగ శివుని తలపైకి దూకగా తన జటా జూటమున బంధించెను. అతడు ఆ జటము నుండి వదలగా అది భూమిపై బడి గంగగా ప్రవహించింది. ఆ ప్రవాహ సమయమున అది జహ్ను మహర్షి ఆశ్రమము నుండి ప్రవహించి అతనికి కోపకారణం కాగా అతడు గంగను మింగివేసెను. భగీరదుడు జహ్నువును ప్రార్థించగా అతడు తన చెవినుండి బయటకు వదలెను. అందుకనే గంగను జాహ్నవి అనికూడా పిలుస్తారు. తరువాత అది పాతాళమునకు ప్రవహించి సగర పుత్రులను పావనం చేయగా వారికి ముక్తి లభించెను.

*బ్రహ్మ శాపం, భీష్ముని పుట్టుక :* ఓ రోజు గంగ బ్రహ్మలోకముననుండగా ఈమె పయ్యద తొలగగా మహాభీషుడామెను సమ్మోహనముగా చూసెను. బ్రహ్మ కోపించి ఈమెను, మహాభీషుని భూమిపై జన్మించ మని శపించెను. అతడే శంతనుడు. ఈమె శాపవ శమున భూమిపైకి వస్తుండగా అష్టావసువులు వశిష్ఠుని శాపవశమున భూమిపై జన్మించ వలసి వచ్చెనని నీ గర్భమున జనింతుమనిమమ్ము వెంటనే భూమి నుండి స్వర్గమునకు పంపమని వేడుకొనిరి. గంగ ప్రతీపుడను రాజు ధ్యానిస్తుండగా అతని కుడితొడపై కూర్చుండి తనను వివాహమాడమని కోరెను. కుడి తొడపై కూతురుగాని కోడలుగాని కూర్చొనుటకు అర్హులని కాన నీవు నా కుమారుడైన శంతనుని వివాహమా డమని కోరగా ఆమె కొన్ని షరతులతో శంతనుని వివాహమాడెను. ఆమెకు జన్మించిన అష్టమ గర్భ తనయుడే భీష్ముడు. అతడిది అష్టావసువులలో ఒకరి పునర్జన్మ. – మహాభారతం

**గంగాదత్తుడు :** చూ॥ భీష్ముడు.

**గంగాద్వారం :** హిమాలయాల నుండి గంగ క్రిందకు దుమికే ప్రదేశం. దీనిని హరిద్వారమని పిలుస్తారు. దీనికి ఎన్నో పురాణ విశేషాలు ఉన్నాయి.

1. ఇచ్చట ప్రతీపుడు తపమాచరించాడు.
2. భరద్వాజ మహర్షి గంగాతీరం వద్ద గల హరి ద్వారం వద్ద నివసించాడు.
3. అర్జునుడు తన యాత్రలో దీనిని దర్శించాడు.
4. అగస్త్యుడు అతని భార్య లోపాముద్ర ఇక్కడ తపస్సు చేశారు.
5. ఇక్కడే జయద్రధుడికి శివుడు ప్రత్యక్షమై వరమిచ్చెను.
6. హరిద్వారంలోని కంకలలో దక్షుడు తపస్సు చేసెను.
7. భీష్ముడు తన తండ్రికి ఇచ్చట శ్రాద్ధకర్మలు నిర్వహించాడు.
8. ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతి ఇచ్చటి అరణ్యం లోనే దగ్ధంకాగా వారి శ్రాద్ధకర్మలను ధర్మజుడిక్కడే నిర్వహించాడు. – మహాభారతం

**గంగామహాద్వారం :** గంగపుట్టిన హిమాలయ శిఖరం. ఇది మంచు ఘనీభవించి నివాస యోగ్యంకాక ఎవ్వరు సంచరించలేరు. ఒక్క నరనారాయణులు మాత్రమే దీనిని దాటారు. – మహాభారతం

**గంగాయమునా సంగమం :** ఇదో పుణ్యతీర్థం. దీనిని ప్రయాగ అంటారు. ఇచ్చట స్నానంచేస్తే అశ్వమేధ యాగం చేసిన ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**గంగాసరస్వతీ సంగమ :** ప్రయాగవద్ద గల పుణ్యతీర్థం. ఇక్కడ స్నానంచేస్తే స్వర్గలోక ప్రాప్తి కల్గుతుంది. – మహాభారతం

**గంగాసాగర సంగమం :** ఇదో పుణ్యతీర్థం. ఇచ్చట స్నానంచేస్తే 10 అశ్వమేధయాగాలు చేసిన ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**గంగాహ్రదం :** కురుక్షేత్రం వద్ద గంగానది సుడులు తిరుగుతూ ప్రవహిస్తూ చాలా లోతుగా వుంటుంది. – మహాభారతం

**గంగోద్భేదం :** ఇదో పుణ్యతీర్థం. ఇచ్చట మూడు రాత్రులు నిరాహారులై శయనిస్తే వాజపేయ యజ్ఞం చేసిన ప్రతిఫలం లభిస్తుంది. – మహాభారతం

**గండ :** సప్తర్షుల్ని సేవించిన ఓసేవిక. – మహాభారతం

**గండకం :** గండకీ నది తీరంలోని ఓ ప్రత్యేక ప్రాంతం. దీనిని భీమసేనుడు జయించెను. – మహాభారతం

**గండకండుడు :** కుబేరుని కొలువులోని ఓ యక్షుడు. – మహాభారతం

**గండకీ నది :** ఉత్తర భారతదేశంలో గంగానదిలో కలిసే ఒక నది. – మహాభారతం

**గంధకాళి :** సత్యవతికి మరోపేరు. – మహాభారతం

**గంధమాదనం :** హిమాలయాలకు తూర్పున ఉన్న పర్వతము. పురాణాలలో దీనికి ఎంతో ప్రాముఖ్యతవుంది. *విశేషాలు :* కశ్యప ప్రజాపతి ఇక్కడ తపమాచరించాడు. – మహాభారతం

ఆదిశేషుడు ఇచట తపస్సు చేశాడు. - మహాభారతం

పాండురాజు శాతశృంగ పర్వతంపై తన భార్యలు కుంతి మాద్రిలతో తపస్సు చేయడానికి వెళ్లినపుడు ఈ పర్వతాన్ని దర్శించాడు. - మహాభారతం

ఈ పర్వతం దేవతా స్వరూపం పొంది కుబేరుని కొలువుకు వెళ్లి అతన్ని కొలిచింది. - మహాభారతం

శ్రీకృష్ణుడు నారయణశ్రీతో కలిసి 10,000 సంవత్సరాలు ఇక్కడ గడిపాడు. అర్జునుడు, కైలాస పర్వతంపై తపస్సు చేయడానికి దీనిని దాటివెళ్లాడు.

- మహాభారతం

ఈ పర్వత శిఖరంపై బదరీ వృక్షం క్రింద నరనారాయణాశ్రమం వుంది. యక్షులు ఎల్లప్పుడు ఇక్కడే నివసిస్తారు. - మహాభారతం

ఒకసారి పాండవులు ఘటోత్కచుని సహాయంతో ఈ పర్వతం పైకి వెళ్లారు. - మహాభారతం

ఈ పర్వతం మీదే భీముడు కుబేరుడి స్నేహితుడు మణిమానుడ్ని సంహరించాడు. - మహాభారతం

లంకనుండి పారద్రోలగా మొదట కుబేరుడు ఇక్కడే కొంతకాలం నివసించాడు. - మహాభారతం

**గంధమాదనుడు 1 :** ఓ వానరం. కుబేరుని సంతానం. శ్రీరామునికి సహాయం చేశాడు. - రామాయణం

ఈ వానరుడు గంధమాదనం మీద నివసించే వాడు. రామరావణ యుద్ధంలో ఓ సైన్య విభాగాన్ని నడిపాడు. - మహాభారతం

**గంధమాదనుడు 2 :** ఓ రాక్షసుడు. కుబేరుని కొలువులో వుండేవాడు. - మహాభారతం

**గంధర్వతీర్థం :** ఉత్తర భారతదేశంలో సరస్వతీ నదీ తీరంలో ఓ పుణ్యతీర్థం. విభావసుడను గంధర్వుడు తన సహచరులతో నృత్యం చేసేవాడు. బలభద్ర రాముడు ఈ తీర్థాన్ని దర్శించాడు. - మహాభారతం

**గంధర్వనగరం :** మనిషి ఆలోచనలను బట్టి ఆకాశంలో చెట్లు, నగరాలు వున్నట్లు, వేసవిలో ఎడారుల్లో కాంతి పరావర్తనం చెంది ఆకాశంలో నగరాలు, భవనాలు వున్నట్లు గోచరిస్తాయి. ఆ పరావర్తనాలు భూమిమీద కన్పించవచ్చు. అలా భ్రమింపచేసే నగరాలనే గంధర్వ నగరం అంటారు. - హిందీ శబ్దసాగరం

**గంధర్వసేన :** గంధర్వుడైన ధనవాహణుడి కుమార్తె. కైలాసంలోని స్వయంప్రభా నగరంలో వుండేవాడు. ఈమె కుష్టువ్యాధి సోమవారవ్రతం చేయడంవల్ల పోయింది. - స్కందపురాణం

**గంధర్వి :** గుర్రాల జాతికి మాతృమూర్తి. కశ్యప ప్రజాపతికి క్రోదవశ వల్ల 10 మంది కుమార్తెలు. అందులో సురభి ఒకరు. ఆమెకు ఇద్దరు సంతానం రోహిణి, గాంధర్వి. రోహిణి వల్ల ఆవులు, గంధర్వి వల్ల గుర్రాలు జన్మించాయి.

- రామాయణం

**గంధర్వుడు :** జనమేజయుని వంశంలో జన్మించిన ఓ రాజు. - మహాభారతం

**గంధర్వులు :** కశ్యప ప్రజాపతికి అరిష్టవల్ల జన్మించిన సంతతే గంధర్వులు. వీరు దేవతల తెగకు చెందినవారు.

**గంధవతి :** చూ॥ సత్యవతి.

**గంభస్తిమంతం :** ఇదొక ద్వీపం. దీన్ని సహస్ర బాహువు ఆక్రమిస్తాడు. - మహాభారతం

**గంభీరుడు :** రచసుడి కుమారుడు.

**గాండీవం :** ఈ ధనస్సును బ్రహ్మ మొదట తయారు చేశాడు. అన్యాయవంతుల్ని క్రూరుల్ని దండిస్తుంది.

- మహాభారతం

*ప్రత్యేకత :* ఒకేసారి ఒకేసమయంలో ఒక లక్ష మందితో పోరాడగల శక్తి దీనికి వుంది. దేవతల్ని మనుషుల్ని దీనితో ఓడించవచ్చు. దీన్ని దేవతలు, దానవులు, గంధర్వులు పూజించారు. అవసరాన్నిబట్టి దీని శక్తి తగ్గడం పెరగడం జరుగుతుంది.

- మహాభారతం

*చరిత్ర :* 1000 సంవత్సరాలు బ్రహ్మ వద్ద వుంచుకున్నాడు. తర్వాత 1000 సంవత్సరాలు ప్రజాపతి దగ్గర వుంది. తర్వాత 3585 సంవత్సరాలు ఇంద్రుడు ఉపయోగించాడు. తర్వాత 500 సంవత్సరాలు చంద్రునివద్ద వుంది. ఆ తర్వాత వరుణుడు దీన్ని పొందాడు. 100 సంవత్సరాల తర్వాత అర్జునుడికి ఇచ్చాడు. అగ్ని ఖాండవ వనాన్ని దహిస్తున్నపుడు ఇంద్రుడు దానిని అడ్డుకొనుటకు ఆ వనంపై వర్షం కురిపిస్తాడు. ఆ వర్షమును నిలువరించుటకు అగ్ని దేవుడు ఈ గాండీవాన్ని, బాణాలను, ఓ రథాన్ని అర్జునునికి బహూకరిస్తాడు. ఈ గాండీవంతోనే అర్జునుడు

ఖాండవ వనంపై వర్షం పడకుండా దాని పైన ఒక రక్షణ పొరను ఏర్పరుస్తాడు. తర్వాత ఎన్నో యుద్ధాలలో దీన్ని ఉపయోగించి విజయుడయ్యాడు. మహాభారత యుద్ధానంతరం శ్రీకృష్ణుని నిర్వాణానంతరం పరీక్షిత్తుకు రాజ్యభారం అప్పగించి అరణ్యాలకు ప్రయాణించగా ఓ ఎర్ర సముద్రం ఎదురయ్యింది. అగ్నిదేవుడు ఎదురై గాండీవంతో పని అయిపోయింది కనుక దానిని వదిలి వేయమనగా అతడు దాన్ని సముద్రంలోకి విసిరి వేశాడు. ఆ తర్వాత పాండవులు తమ మహాప్రస్థానాన్ని కొనసాగించారు. - *మహాభారతం*

**గాంధర్వం :** స్త్రీ పురుషులు తమంతట తామే ప్రేమించి పెళ్లిచేసుకోవడం గాంధర్వం. ఆరు రకాల వివాహాలలో ఇదొకటి. తక్కిన ఐదు, ఆర్ష, ప్రాజాపత్య, రాక్షస, ఆసుర, పైశాచికాలు. - *చూ॥ వివాహాలు.*

★ **గాంధారం :** ప్రాచీనా భారతదేశానికి ఓ తీరంలోని ప్రాంతం. ఇది సింధూనది నుండి కాబూల్ వరకు విస్తరించివుంది. సుబలుడు ఓ శక్తివంతుడైన రాజు. అతని కుమార్తె ధృతరాష్ట్రుని భార్య గాంధారి. - *మహాభారతం*

**గాంధారి :** గాంధార దేశపు రాజగు సుబలుని కుమార్తె. ఈమె సోదరుడు శకుని. ఈమె ధృతరాష్ట్రుని తప్ప వేరువారిని వివాహము చేసుకొనని చెప్పగా పుట్టు గుడ్డివాడైన అతనితో వివాహము జరిగెను. ఈమె జీవితకాలము తన భర్తననుసరించి తన కళ్లకు గంతలు కట్టుకొని ప్రపంచమును చూడలేదు. పాండురాజు భార్య కుంతి ఈమెయు ఒకేసారి గర్భము ధరించగా కుంతి ముందుగా ధర్మజునికి జన్మనిచ్చెను. ఈమె ముందుగా సంతానవతి కానందుకు వగచి తన గర్భమును తాండవము చేసుకొనగా ఓ మాంసపు ముద్ద బయటపడెను. అప్పుడు వ్యాసుడు వచ్చి ఇందుండి నూర్గురు కుమారులు, ఓ కుమార్తె జన్మించెదరని ఆ మాంసపు ముద్దను ఖండ ఖండములుగా చేయమని సలహా ఇచ్చెను. వారే దుర్యోధనాధులైన వందమంది కుమారులు, దుశ్శల అను కుమార్తె. వీరును పాండవులును వైరముతో నున్నపుడు మిక్కిలి వారించెను. యుద్ధానంతరము ఈ కలహమునకు కారణము శ్రీకృష్ణుడేయని భావించి యదువంశము కూడా అంతఃకలహాలతో నశించునని శపించెను. కురుక్షేత్రానంతరము తన భర్త, కుంతి సంజయులతో అరణ్యమునకు పోయి దావానలము వ్యాపించగా సంజయుని పంపివేసి వీరు తూర్పు దిక్కునకు కూర్చొని ఆ దావానల ములో మరణించారు. - మహాభారతం

**గాంధారుడు :** యయాతి కొడుకైన దృహ్యుడి పౌత్రుడికి పౌత్రుడు. ఇతడి పేరుతోనే గాంధారదేశం ఏర్పడింది. - *మహాభారతం*

**గిందముడు :** ఇతడో ముని. ఇతడును ఇతని భార్యయు లేళ్ల రూపములో సంచరించు చుండగా వేటకు వచ్చిన పాండురాజు బాణంతో కొడతాడు. మగలేడి చనిపోతూ రాజు ఏఏ జంతువుల్ని వేటాడరాదో చెప్తుండగా పాండురాజు కోపంతో పరుషంగా మాట్లాడగా అతడు పాండురాజును స్త్రీతో సంగమం వల్ల మరణిస్తావని శపిస్తాడు. - మహాభారతం

**గృత్సపతి :** పూరువంశపు రాజైన కపిలుని కుమారుడు. ఇతనికి కౌశికుడను సోదరుడు కలడు. ఇతనికి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రకులాలలో సంతానం కలరు. - అగ్నిపురాణం

**గృత్సమదుడు 1 :** వీతహవ్యుని కుమారుడు. ఇతని కుమారుడు సుతేజసుడు. - మహాభారతం

**గృత్సమదుడు 2 :** సుహోత్రుని కుమారుడు. ఇతని కుమారుడు శునకుడు. - భాగవతం

**గృధ్రకూటం :** ఉత్తర భారతదేశంలోని ఓ పర్వతం. బృహద్రదునికి ఈ పర్వతంపై లంశురులు రక్షణ కల్పించారు. - మహాభారతం

**గృధ్రగోమాయ సంవాదం :** ఓ శిశువు చనిపోగా తల్లిదండ్రులు దానిని స్మశానానికి తెచ్చి ఏడ్చుచుండిరి. ఓ గ్రద్దయు, నక్కయు అక్కడకు వచ్చి ఆ శవమును తినుటకు ఆశపడిరి. గ్రద్ద వారి వద్దకు వచ్చి మీరేల ఏడ్చెదరు ? చనిపోయిన వారు తిరిగి రారు కదా ! రాత్రి అయినచో రాక్షసి వచ్చి మిమ్ము

★ అగ్నిపురాణం గాంధారులకు ద్రావిడులకు సంబంధం వుందని గాంధారులనుండి ఐదు ప్రాంతీయ తెగలు గాంధారాలు, కేరళులు, చోళులు, పాండ్యులు, కోలలు ఏర్పడ్డాయని చెప్తోంది.

లను కూడా తినివేయును. కనుక శిశువును విడిచి వెళ్లిపొమ్మని చెప్పగా నక్క వచ్చి "గ్రద్ద నీవట్లనెదవేల ఏ మునియో వచ్చి శిశువును రక్షించునేమో దుఃఖము తీరువరకు ఏడ్చుటకును వీలులేదా ? అందువల్ల వారిని చీకటిపడు వరకు వుండనిమ్మని వారి హితము కోరుదానివలె చెప్పెను. దీనినే గృధ్రగోమాయ సంవాద మనెదరు. - మహాభారతం

**గృధ్రపత్రుడు :** స్కందదేవుని యోధుల్లో ఒకడు. - మహాభారతం

**గృధ్రవటం :** హిమాలయాల్లోని ఓ పర్వతం. ఇది మహాదేవుని నివాస ప్రాంతం. దీన్ని దర్శించిన బ్రాహ్మణులకు మోక్షం లభిస్తుంది. ఇతర కులాల వారు దర్శిస్తే పాపప్రక్షాళన జరుగుతుంది. - మహాభారతం

**గృధ్రిక :** తామ్రవల్ల కశ్యపునికి జన్మించిన పక్షి జాతిలో ఒకరు. - అగ్నిపురాణం

**గృహదేవి :** జరా అనే రాక్షసి మరోపేరు. -చూ॥ జర

**గృహపతి :** ఇతడో ముని. నర్మదానది తీరంలో విశ్వనరుడు అతని భార్య సుచిమతి తమ కుటీరంలో నివసించేవారు. పుత్రలేమితో బాధపడుతున్న సుచిమతి భర్త దగ్గర వాపోగా అతడు కాశీకి వెళ్లి విశ్వేశ్వరుడ్ని గూర్చి తపస్సు చేయగా శివుడు ప్రత్యక్షమై కుమారుడు కల్గునని అభయమిచ్చెను. ఆ కుమారుడే గృహపతి. అతనికి తొమ్మిదేళ్ల ప్రాయంలో అగ్ని గండం వుందని నారదుడు చెప్పగా విశ్వనరుడు వెంటనే శివుని గూర్చి ప్రార్థించి అగ్ని లక్షణాలు తన కుమారునికి ప్రాప్తించే వరం సంపాదించాడు. అందువల్ల గృహ పతి కాశీలో శివుని విగ్రహ ప్రతిష్ట చేసి అతనికి అగ్నీశ్వరుడని నామకరణం చేశాడు. - శివపురాణం

**గ్రసనుడు :** ఓ రాక్షసుడు. తారకాసుర యుద్ధమున విష్ణువు ఇతనిని వధించెను. - పు.నా.చంద్రిక

**గ్రస్తుడు :** ఓ రాక్షసుడు. భృగుపత్నిని బలవంతంగా ఎత్తుకొని పోతుంటే కీటకం కమ్మని శపిస్తుంది. పరశు రాముడు నిద్రపోయే సమయంలో ఈ కీటకమే కర్ణుడి తొడను తొలుస్తుంది. పరశు రాముడి ముఖం చూడగనే దీనికి శాపవిమోచనం కలుగుతుంది. - మహాభారతం

**గ్రహపీడ :** జ్యోతిష్య శాస్త్రవేత్తలు గ్రహాలు ప్రజల మీద ప్రభావం చూపుతాయని బాల్యం నుండి ఒక్కో దశలో ఒక్కో గ్రహం ప్రభావం చూపుతుందని దాని నివారణకు మార్గాలున్నాయని చెప్తారు. పుట్టిన తర్వాత మొదటిరోజు ఏ గ్రహం ప్రభావం చూపుతుంది, రెండవరోజు, మూడవరోజు, నాల్గవ రోజు అలాగే 10వ రోజు వరకు ఒక్కొక్క గ్రహం ప్రభావం చూపుతుందని వాటికి నివారణలున్నాయని, పుట్టిన నెలలో మూడవ నెలలో అలాగే 9వ సంవత్సరంలో అంతే కాక జీవితంలోని కొన్ని కొన్ని దశల్లో కొన్ని కొన్ని గ్రహ ప్రభావాలు వుంటాయని వాటికి నివారణలు వున్నాయని, శాస్త్రాలు చెప్తున్నాయి. - అగ్నిపురాణం

**గ్రంథికుడు :** నకులుడు అజ్ఞాతవాసంలో విరాటుని కొలువులో వున్నప్పటి మారుపేరు. - మహాభారతం

**గ్రామణి :** శివుని భూతగణాల్లో ఒకడు. ఇతడ్ని పూజిస్తే అన్ని పాపాల నుండి విముక్తులవుతారు. - మహాభారతం

**గ్రామణీయుడు :** క్షత్రియకులంలో పుట్టినవాడు. ఓ గ్రామానికి అధిపతి. అశ్వమేధయాగ సమయంలో నకులుడు ఇతణ్ణి జయిస్తాడు. - మహాభారతం

**గ్రామదేవతలు :** భారతదేశం ప్రధానంగా వ్యవసా యమే ఆధారంగా జీవించే దేశం. గ్రామీణులు ఎక్కువగా వర్షాధారంమీద ఆధారపడి పంటలు, పశువుల్ని పెంచుతారు. వాటికి రకరకాల వ్యాధులు సహజం. వాటిని దేవతలు వర్షాలు కురిపించి రక్షిస్తారని నమ్ముతారు. ఒక్కొక్క గ్రామానికి ఒకో దేవతను ఆ ప్రాంత ప్రాముఖ్యతనుబట్టి పూజిస్తారు. ముఖ్యంగా దక్షిణ భారతంలో దేవి అంటే దుర్గ, కాళి ప్రధాన గ్రామ దేవతలు. 64 రకాలుగా ఈమెను పూజిస్తారు. కన్య, కామాక్షి, మూకాంబిక అనే పేర్లతో పూజిస్తారు. కేరళలో భగవతి అని పిలుస్తారు. ఆంధ్రలో జోగులాంబిక, తమిళ నాడులో మరియమ్మ, కలియమ్మ, ద్రౌపదమ్మ అని పిలుస్తారు. ఇంతేకాక ప్రాంతాలను బట్టి భారతదేశంలో ఎన్నో గ్రామదేవతలు వాటి విగ్రహాలు వున్నాయి.

**గ్లావుడు :** చూ॥ బకుడు.

**గ్రీవ :** కశ్యప ప్రజాపతికి తామ్రవల్ల పక్షిరూపాన జన్మించిన సంతానం. గ్రీవకు కాకి, శ్యేని, భాసి, గృధ్రిక, శుచి అనే సోదరీమణులు కలరు. అందరిదీ పక్షిజాతే. - అగ్నిపురాణం



**ఘటజానకుడు :** ధర్మజుని కొలువులో ఓ రుషి. ఒకసారి శ్రీకృష్ణుడితణ్ణి కలుసుకుంటాడు. – మహాభారతం

**ఘటం :** ప్రాచీన భారతదేశంలో ఓ పట్టణ ప్రాంతం. – మహాభారతం

**ఘటిక :** ఇదో కాలమానం. ఇది ఇరవైనాలుగు నిమిషాలతో సమానం. అరవై వినాడికలు ఒక ఘటిక.

**ఘటుడు :** ఇతడో దొంగ. ఇతని స్నేహితుడు కర్పరుడు. వీరిద్దరు ఓ రోజు అంతఃపురంలో దొంగతనానికి వెళ్తారు. ఘటుడు తలుపు దగ్గర వుండగా కర్పరుడు లోపలికి వెళ్లగా రాజకుమారి ఇతడితో సుఖించి అతనికి ఆభరణాలు ఇస్తుంది. కర్పరుడు వాటిని ఘటుడికిస్తాడు. ఇది నిత్యకృత్యం కాగా బడలికతో ఓ రోజు తెల్లవారినా అంతఃపురం నుండి కర్పరుడు బయటకు రాకపోవడంతో రాజ భటులు రాజకుమారిని ఇతణ్ణి పట్టుకొని రాజుకి అప్పజెప్పగా వీరిద్దరికి మరణశిక్ష విధిస్తాడు. కర్పరుడు రాజకుమారిని రక్షించమని ఘటుడ్ని అడుగుతాడు. అతడలాగే రక్షించి రాజభటుల కన్నుకప్పి తన స్నేహితుడికి కర్మకాండలు కూడా నిర్వహించి ఆమెతో కలిసి ఓ సన్యాసి ఇంట్లో వుంటాడు. అంతలోనే సన్యాసి ప్రేమలోపడిన రాజకుమారి ఘటుడ్ని విషమిచ్చిచంపి సన్యాసితో కలిసి వెళ్లిపోతుంది. – పురానిక్ ఎన్‌సైక్లోపేడియా

**ఘటోత్కచుడు :** భీముని వల్ల హిడింబి అను రాక్షసికి జన్మించినవాడు. రాక్షసుడైనను పాండవులయెడ అమిత ప్రేమ గలవాడు. తన మాయా బలముచే కురుసేనను కకావికలురను చేసెను. ఇరావంతుని చంపిన అలంబసునిపై యుద్ధము చేసి అతనిని చంపెను. ఇతని పరాక్రమమునకు కర్ణుడు దడిచి తనవద్ద ఇంద్రుడిచ్చిన శక్తిని ప్రయోగించి వధించెను. ఇతడు చనిపోయినందుకు భీముడు చింతించు చుండగా శ్రీకృష్ణుడు ఇది చింతించ సమయముకాదని ఇంద్రుడిచ్చిన శక్తి యుండగా శ్రీకృష్ణార్జునులు కూడా కర్ణునికి సాటిరారని ఆ శక్తి నిరూపయోగంచేసి ఘటోత్కచుడు తమకు మేలు చేసెనని ఓదార్చెను. అంతేకాక అతడు రాక్షసాంశ అయినందువల్ల అట్లు మరణించ కున్నను తానే వధించెడివాడనని చెప్పెను. మేఘ వర్ణుడు, అంజనపర్వుడు ఘటోత్కచుని కుమారులు.

**ఘనాపాఠం :** ఇది వేదాభ్యాస విధానం. వేదాభ్యాసం నాల్గు విధాలు 1. జటాపాఠం, 2. ఘనాపాఠం, 3. పదపాఠం, 4. క్రమపాఠం. ఒక పదాన్ని విడగొట్టి దానిముందు వెనుక పదాలతో కలిపి చదివితే జటా పాఠం అని దీనిలోని తప్పును సరిదిద్ది అభ్యసించడం ఘనాపాఠం అంటారు. పదపాఠం, క్రమపాఠం ఘనా పాఠంలో భాగాలే. వేదాన్ని సరిగా చదివిన వారిని ఘనాపాటి అని అంటారు.

**ఘర్ముడు :** అంగవంశపు రాజు. – మహాభారతం

**ఘర్మ్యుడు :** గాంధారుడి కొడుకు. చూ॥ గాంధారుడు.

**ఘూర్జరం :** ప్రాచీన భారతదేశంలోని పశ్చిమ సముద్ర తీరంలోని ఓ ప్రాంతం. అది ఇప్పటి గుజరాత్.

**ఘూర్జరులు :** ఘూర్జర దేశ ప్రజలు. పంచ ద్రావిడులలో ఒక తెగవారు.

**ఘూర్ణిక 1 :** ఈమె దేవయాని పరిచారిక. దేవయానిని శర్మిష్ఠ నూతిలోనికి తోసినపుడు ఆమెను వెతుక్కుంటూ వస్తుంది. – మహాభారతం

**ఘూర్ణిక 2 :** శుక్రాచార్యుడి కుమార్తె. దేవయానిని పెంచిన తల్లి. – మహాభారతం

**ఘోరకం :** భారతదేశానికి నైరుతి దిక్కునున్న పట్టణ ప్రాంతం. ధర్మరాజుకు ఇక్కడి ప్రజలు ఎన్నో బహుమతులు బహూకరించారు. – మహాభారతం

**ఘోరుడు :** అంగిరసుడి కుమారుడు. శిష్యుడైన కృష్ణుడికి పురుష యజ్ఞ విజ్ఞానం నేర్పాడు. – చా. ఉపనిషత్తు

**ఘోషమణి :** పాండవులలోని నకులుడి శంఖం పేరు. – మహాభారతం

**ఘోషయాత్ర :** పాండవులు తమ అరణ్యవాస సమయంలో ద్వైతవనంలో వుండగా వారిని మరింత ఇబ్బందులకు గురిచేయుటకు ఘోషయాత్ర నెపమున ధృతరాష్ట్రుని నమ్మించి దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకునిలు అచటికివెళ్లి విచిత్ర వీర్యుడను ఇంద్రుని మిత్రుని చేతిలో గర్వభంగము గావింపబడిరి. వారిని రక్షింపమని దుర్యోధనుని సేవకులు ధర్మజుని కోరగా భీముడు కాగల కార్యము గంధర్వులే తీర్చిరని ఆనంద

పడగా ధర్మజుడు వారు మన సోదరులనియు వారిపై మరొకరు దాడిచేసినచో వారిని రక్షించుట మన బాధ్యత అని భీమార్జునులను దుర్యోధనుని విడిపించమని పంపగా విచిత్రవీర్యుడు దుర్యోధనుని దురాలోచనను వివరించి తనను ఇంద్రుడే పంపెన నియు మీ కోర్కె అటులేయనిన వదిలివేసెదనని వారిని విడిచిపెట్టెను. – మహాభారతం

**ఘోషవతి :** ఉదయనుడి వీణపేరు. – కథాసరిత్సాగరం

**ఘోషా :** ఋగ్వేదంలో ఉదహరించబడిన ఓ తపస్విని. దృగత మహర్షి మనుమరాలు, కాక్షివాణ మహర్షి కుమార్తె. ఈమెకు చిన్నతనంలోనే కుష్టువ్యాధి రాగా ఎవరూ వివాహం చేసుకోరు. అశ్వనీ దేవతలను గురించి ఓ మంత్రాన్ని రూపొందించి వారిని ప్రార్థించగా కుష్టువ్యాధి నయమై వివాహం జరుగుతుంది. – ఋగ్వేదం

**ఘోషుడు :** పుళిందుడను రాజు కొడుకు. ఇతని కుమారుడు వజ్రమిత్రుడు. – భాగవతం

**ఘంటాకర్ణుడు :** ఘంటుడు, కర్ణుడు అనే ఇద్దరు రాక్షస సోదరులు. వీరు విష్ణువును ప్రార్థించి మోక్షం పొందారు. అయితే పెద్దవాడైన ఘంటుడినే ఘంటాకర్ణుడని పిలుస్తారు. – భాగవతం

*ఘంటాకర్ణుని జననం :* దారుకుడను రాక్షసుడు శివునివల్ల వరాలు పొంది ప్రపంచాన్ని బాధిస్తుంటే అతణ్ని వధించడానికి భద్రకాళిని తన మూడవ కంటి నుండి సృష్టించగా ఆమె దారుకాసురుణ్ణి వధించింది. దారుకుని భార్య మాయ శివునికి మొరపెట్టుకోగా అతని శరీరంనుంచి చెమట బిందువులు ఇచ్చి వీటిని ఎవరిమీదైన చల్లితే వారికి మశూచి సోకుతుందని వారు నిన్ను మండోదరిగా ప్రార్థిస్తారని చెప్తాడు. అప్పటి నుండి మశూచి అమ్మవారుగా మండోదరికి పేరొచ్చింది. అయితే ఆమె తన భర్త మరణాన్ని జీర్ణించుకోలేక ఆ బిందువుల్ని భద్రకాళిపై జల్లగా భద్రకాళి మశూచితో క్రిందపడిపోయింది.

ఇది గమనించిన శివుడు ఘంటా కర్ణుడనే రాక్షసుణ్ణి సృష్టించి అతడు ఎవరిని నాకితే వారికి మశూచి తగ్గుతుందని చెప్తాడు. ఘంటా కర్ణుడు భద్రకాళి శరీరాన్ని నాకగా మశూచి పోయింది. అయితే ఆమె ముఖాన్ని నాకబోగా మనం సోదరీ సోదరుల మని తన ముఖాన్ని అలా నాకడం తప్పని చెప్తుంది. అందుకే భద్రకాళి ముఖానికి ఇదో ఆభరణంలా కన్పిస్తుంది. ఇతడు విష్ణువుకి మొదట శత్రువు. అతని పేరు కూడా చెవిన పడకూడదని తన చెవుల్లో గంటలు పెట్టుకొని విష్ణుశబ్దం వినకుండా తిరిగేవాడు. అప్పటి నుండి అతనికి ఘంటాకర్ణుడని పేరొచ్చింది.

ఘంటాకర్ణుడు కుబేరుని సేవలో వుండి ముక్తి కొరకు శివుడ్ని ప్రార్థించగా శివుడు ప్రత్యక్షమై నాకంటే విష్ణువు గొప్పవాడని అతణ్ణి గురించి తపస్సు చేయమని చెప్తాడు.

బదర్యాశ్రమం వద్ద శ్రీకృష్ణుడు ఘంటాకర్ణుడు విష్ణుస్తోత్రం చేస్తుండగా తన విశ్వరూపం చూపగా రాక్షసుల ఆచారం ప్రకారం సగం కాలిన శవాన్ని కృష్ణుడికి బహుమతిగా ఇవ్వగా అతడు నిరాకరించి అతని భుజాన్ని తట్టగా శరీరం వదలి వైకుంఠం చేరుకున్నాడు. – భాగవతం

ఘంటాకర్ణుడు రాక్షసుడైనా ముక్తి లభించడం వల్ల అతడి విగ్రహాలు గుళ్లలో వుంటాయి. ఇతడు మశూచి నుండి ప్రజల్ని రక్షిస్తాడని ప్రతీతి.

**ఘంటుడు :** వశిష్ఠుని కుటుంబంలో జన్మించిన ఓ బ్రాహ్మణుడు. ఇతడు 100 సంవత్సరాలు శివుడి గురించి తపస్సు చేశాడు. దేవల మునిని అతని కూతుర్నిచ్చి వివాహం చేయమని కోరగా ఇతని అంద వికారాన్ని చూసి అంగీకరించడు. ఘంటుడు ఆమెను ఎత్తుకుపోగా దేవలుడు ఇతణ్ణి గబ్బిలం కమ్మని శపిస్తాడు. అయితే ఇంద్రద్యుమ్ను డికి సహాయంచేస్తే పూర్వరూపం వస్తుందని శాప విమోచనం చెప్తాడు. – స్కందపురాణం

**ఘంటోదరుడు :** ఇతడో రాక్షసుడు. కుబేరుని సభలో సభ్యుడు. – మహాభారతం

**ఘృతపసుడు :** ఓ ఋషి. నెయ్యితాగి జీవించేవాడు. బ్రహ్మయొక్క శిష్యుడు. సనాతన ధర్మాన్ని బోధిస్తాడు. – మహాభారతం

**ఘృతపృష్ఠుడు :** స్వాయంభవమనువుకు ఇద్దరు కుమారులు. ఒకడు ప్రియవ్రతుడు, రెండవవాడు ఉత్తానపాదుడు, ప్రియవ్రతుడికి విశ్వకర్మ ప్రజాపతి

కూతురైన సురూపవల్ల 10 మంది పుత్రులు, ఒక పుత్రిక. ఆ పదిమంది పుత్రుల్లో ఘృతపృస్థుడు ఒకరు.
– దేవీభాగవతం

**ఘృతవతి :** భారతదేశంలోని ఓ నది పేరు.
– మహాభారతం

**ఘృతాచి :** ఈమె అతి సుందరాంగి అయిన అప్సరస. ఈమె తన అందంతో ఎంతోమంది రుషుల తపస్సు భగ్నంచేసి వారివల్ల సంతానాన్ని పొందింది. వ్యాసుడు సంతానం కోరి మహామేరు పర్వతం మీద ఘోరత పస్సు చేసి శివుడ్ని ప్రత్యక్షం గావించుకుంటాడు. శివుడు ఓ కుమారుడు జన్మిస్తాడని ఆశీర్వదిస్తాడు. తన కుటీరానికి వచ్చి అగ్నిపుట్టించడానికి రెండు కట్టెల్ని రుద్దుతూ వివాహమే కాని తనకు పిల్లలెలా జన్మిస్తారని ఆలోచనలో పడగా ఘృతాచి మేఘాల నుండి ఇతని ముందు నిలబడి అతడి తీక్షణ దృష్టికి దడచి చిలుకగా మారి ఎగిరిపోతుంది. వ్యాసునికి ఆ సుందరిని చూసి రేతపతనమై ఆ కట్టెలపై పడి ఆ కట్టెలను రుద్దగా అందుండి ఓ శిశువు జన్మిస్తాడు. అతడే తర్వాత కాలంలో గొప్పముని అయిన శుకుడు.
– దేవీభాగవతం

గంగాతీరంలో భరద్వాజమహర్షి స్నానం చేస్తుండగా ఘృతాచి అక్కడే స్నానం చేసింది. ఆమె సౌందర్యానికి భరద్వాజునికి వీర్యస్కలనం కాగా అది ఓ కమం డలంలో పడి అందులో పాండవుల గురువైన ద్రోణా చార్యుడు జన్మించాడు. మరొకసారి ఈమెవల్ల భర ద్వాజునికి శృతావతి జన్మించింది. – మహాభారతం ప్రమతి అనే రాజువల్ల ఈమెకు రురుదు జన్మిం చాడు. ఘృతాచివల్ల విశ్వకర్మకు చిత్రాంగదుడు జన్మించాడు. ఈమెకు దేవవతి అనే కుమార్తె కూడా జన్మించింది.

**ఘృతుడు :** అంగవంశపు రాజు. ఘర్మనుడి కుమారుడు. విదుషుడి తండ్రి. – అగ్నిపురాణం

**ఘృతేయుడు :** అంగవంశంలోని ఒక రాజు.
– అగ్నిపురాణం

**ఘ్రూణాశ్రవసుడు :** స్కందదేవుని అనుచరుడు. బ్రాహ్మణ పక్షపాతి. వారి శుభంకోసం ప్రయత్నించాడు.
– మహాభారతం



**చకోరం :** తూర్పు కనుమలలోని ఓ కొండ.

**చక్రకుడు :** విశ్వామిత్రుడి కుమారుడు. – మహాభారతం

**చక్రదేవుడు :** వృష్ణి వంశంలో జన్మించిన వీరుడు.
– మహాభారతం

**చక్రద్వారం :** ఓ పెద్ద పర్వతం. దీనిపై ఇంద్రుడు యజ్ఞ మొనర్చాడు. – మహాభారతం

**చక్రధనుస్సు :** కపిల మహర్షికి మరోపేరు.
– చూ॥ కపిలుడు.

**చక్రధరుడు :** వత్సరాజ చరిత్రంలో ఓ పాత్ర. చాలా తెలివైనవాడు. ఒంటి కంటివాడు. నడుం ఒంగి వుండేవాడు. చూ॥ విధూషకుడు

**చక్రధర్ముడు :** విద్యాధరులకు నాయకుడు. ఇతడు ఇతని చిన్న సోదరుడు కుబేరుడ్ని గురించి గానం చేసి పూజించేవారు. – మహాభారతం

**చక్రనేమి :** స్కందదేవుని స్త్రీ పరిచారిక – మహాభారతం

**చక్రమందం :** ఇదో సర్పం. బలరాముని ఆత్మను పాతా ళానికి నాగరాజైన అనంతుని ఆజ్ఞపై తీసుకు వెళ్లాడు.
– మహాభారతం

**చక్రవాళం :** ఇదో పర్వతశ్రేణి. చక్రాకారంగా భూమిని చుట్టి వుంటుంది. కాబట్టి దీనికా పేరు వచ్చింది.

**చక్రవ్యూహం :** ఇదో సైనిక వ్యూహం. కురుక్షేత్ర యుద్ధంలో అర్జునుడు లేని సమయంలో ద్రోణాచార్యుడు ఈ వ్యూహాన్నిపన్నాడు. అర్జునుని కుమారుడు అభి మన్యుడు లోనికి వెళ్లడమేగాని బయటపడటం తెలియక ఆ వ్యూహంలో చిక్కుకుని మరణించాడు.
– మహాభారతం

**చక్రవంతం :** ఇది ఒక ప్రసిద్ధ పర్వతం. సుగ్రీవుడు సీతను వెదకాల్సిన పర్వతాలను గురించి వానరులకు చెప్తూ దీన్నిగురించి ప్రత్యేకంగా ప్రస్తావిస్తాడు. విశ్వ కర్మ సుదర్శన చక్రాన్ని ఇక్కడే తయారు చేశాడు.
– రామాయాణం

**చక్ర సమీర దైత్యుడు :** చూ॥ తృణావర్తుడు

**చక్రం :** విష్ణువుయొక్క ఆయుధము. ఇది దదీచి ఎము కలతో చేయబడినది. సూర్యుని తేజస్సును అతని

భార్య భరించలేకపోవుటచే విశ్వకర్మ సూర్యుని సానబట్టి ఆ రాలిన తేజస్సుతో కలిపి తయారు చేయ బడెను. దీనిని విష్ణువు ప్రయోగించినచో ఎంత వారి నైనను ఖండించి తిరిగి విష్ణువును చేరును.
– మహాభారతం

**చక్రకుడు :** ఇతడు అడవిలో నివసించే విష్ణుభక్తుడు. పండ్లు ఫలాలు వ్రేళ్లు తను రుచిచూచి విష్ణువుకి నైవేద్యం చేసేవాడు. ఒకరోజు అలాచేస్తుండగా ఓ ఫలం అనుకోకుండా గొంతులోకి వెళ్లి బయటకి రాకపోయేసరికి తన కత్తితో కంఠాన్ని కోసుకొని ఆ ఫలాన్ని బయటకు తీసి విష్ణువుకర్పించగా విష్ణువు అతని భక్తికి మెచ్చి ప్రత్యక్షమై పునర్జన్మ నిచ్చాడు. ఆ తర్వాత ద్వారక దేవాలయం వద్ద మరణించి ముక్తిని పొందాడు. – పద్మపురాణం

**చక్రాతి :** ప్రాచీన భారతదేశంలోని ఓ పట్టణం.
– మహాభారతం

**చక్షుర్నది :** గంగ యొక్క ఉపనది.

**చక్షుర్మనువు :** సర్వతేజస్సు కొడుకు. ఇతని తల్లి ఆకూతి. భార్య నడ్వల.

**చక్షుర్వర్ధనిక :** శాక ద్వీపం నుంచి ప్రవహించే ఒక నది. – మహాభారతం

**చక్షువు 1 :** సర్వతేజస్సుకు ఆకూతి వల్ల జన్మించిన వాడు. ఇతని భార్య నడ్వల. త్రితుడు, ద్యుమ్నుడు మొదలగువారితని పుత్రులు.

**చక్షువు 2 :** యయాతి పౌత్రుడు. తండ్రి అనువు.

**చక్షుషువు :** చాక్షుషమనువు తండ్రి. పుష్కరిణి భర్త. ఇతడు సుచ్ఛాయ, శిష్టుల కుమారుడు. – విష్ణుపురాణం

**చక్రుడు 1 :** వాసుకి పుత్రుడు. జనమేజయుని సర్ప యాగంలో మరణిస్తాడు. – మహాభారతం

**చక్రుడు 2 :** స్కందునికి శ్రీమహావిష్ణువు ఇచ్చిన ముగ్గురు యోధుల్లో ఒకడు. తక్కినవారు సంక్రమణ, అతి క్రమణలు. – మహాభారతం

**చక్రుడు 3 :** స్కంద దేవునికి తృష్ణ ఇచ్చిన ఇద్దరు అనుచరుల్లో ఒకడు. మరొకడు అనుచక్రుడు.
– మహాభారతం

**చక్రోద్దత్తుడు :** యయాతి వంశంలోని ఓ రాజు.
– భాగవతం

**చతురశ్వుడు :** ఓ రాజర్షి. యముడి సభలో ఓ సభ్యుడు.
– మహాభారతం

**చతురంగుడు :** శాంతా రుష్యశృంగుల కుమారుడు. ఇతని కుమారుడు పృథులాక్షుడు. – పద్మపురాణం

**చతురంస్తుడు :** స్కందుడి అనుచరుడు. బ్రాహ్మణ భక్తిపరుడు. – మహాభారతం

**చతుర్దశి మహాత్మ్యం :** ఈ రోజు శివుణ్ణి పూజిస్తే అన్ని కోరికలు నెరవేరతాయని నమ్మకం.

**చతురాస్యుడు :** ఓ రాక్షస వీరుడు. ఇతడు రంభను ప్రేమించి ఆమె చెలికత్తె స్వయంప్రభ ద్వారా కార్యాన్ని సాధించి దక్షిణ భారతదేశంలో మయునితో నిర్మించిన సుందర భవనంలో గడుపుతాడు. ఇంద్రుడు రంభ ఎడబాటును సహించలేక భూలోకం వచ్చి చతురా స్యుడ్ని వధించి రంభను వెంటతీసుకుపోయి స్వయం ప్రభను భూమిపైనే వుండమని శపిస్తాడు. శాపవిముక్తి కోరగా సీతను వెతకడానికి వచ్చిన వానరులను ఆదరించి నపుడు శాపవి ముక్తి కల్గుతుందని చెప్తాడు. ఈ కథను వానరులకు స్వయంప్రభే చెప్తుంది.
– కంభ రామాయణం

**చతురిక :** ఈమె ఒక వేశ్య. ఒకసారి ఓ పేద బ్రాహ్మణు డికి ప్రతిఫలంగా బంగారం దొరకగా దాన్ని ఏంచే యాలని ఓ విటుణ్ణి అడుగుతాడు. అతడు చతురికను కలిసి ఆ బంగారం ఇస్తే ఆమె యాత్రలకు ఎలా వెళ్లాలో తెలియజేస్తుంది కాకుంటే ఆమెకు తియ్యని మాటలు చెప్పాలని చెప్తాడు. ఆ పేద బ్రాహ్మణుడు ఆమె వద్దకు వెళ్లి బంగారాన్నిచ్చి తియ్యని మాటల బదులు సామవేదం పఠించగా ఆమె తోటివాళ్లు అప హాస్యం చెయ్యగా అతడు తిరిగి విటుడి వద్దకు వచ్చి జరిగింది చెప్తాడు. అతడు పేద బ్రాహ్మణుణ్ణి చతురిక వద్దకు తీసుకువెళ్లి బ్రాహ్మణుడు అమాయకుడని చెప్పగా తిరిగి బంగారం ఇచ్చి వేస్తుంది.
– కథాసరిత్సాగరం

**చతుర్థీ వ్రతం :** చతుర్దశి తర్వాత నాల్గవ రోజున గణ పతిని పూజిస్తూ ఆ రోజు ఉపవాసం వుండాలి. అలా చేస్తే శివలోక ప్రాప్తి లభించడమే గాక ఓ సంవత్సరం సంతోషంగా వుండటం, తన కోరికలు తీరడం జరుగుతాయి. – అగ్నిపురాణం

**చతురుపాయాలు :** పూర్వకాలంలో తమ కార్య నిర్వహణకు 4 విధాల ఉపాయాలు వినియోగించే వారు. అవి సామ, దాన, భేద, దండోపాయాలు. ఇంకో మూడు ఉపాయాలు వున్నా అవి అంత ముఖ్యమైనవి కావు. అయితే ఆ మూడింటితో కలిపి సప్తోపాయాలు అనేవారు.

**చతుర్యుగాలు :** ఓ మన్వంతరానికి 71 చతుర్యుగాలు అవి కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలు.
- చూ॥ కాలమానం.

**చతుర్వ్యూహులు :** మనో, బుద్ధి, చిత్త, అహంకారాలే చతుర్వ్యూహులు. అవి వాసుదేవుడు, ప్రద్యు మ్నుడు, అనిరుద్ధుడు, సంకర్షణుడిలో వరుసగా వున్నాయి. శివుడు మాత్రం ఆ నాల్గు రూపాల్లో వుంటాడు.

**చతుర్వేదులు :** సప్త పితరుల్లో ఒకరు. ఆ ఏడు పితరులు 1. వైరాజసులు, 2. అగ్నిష్వాత్తులు, 3. గార్హపత్యులు, 4. సోమవులు, 5. ఏకశృంగులు 6. చతుర్వేదులు, 7. కాలసులు.

**చతుష్కర్ణి :** స్కందదేవుని స్త్రీ పరిచారిక. - మహాభారతం

**చతుష్పథరత :** స్కందదేవుని స్త్రీ పరిచారిక.
- మహాభారతం

**చత్వరవాసిని :** స్కందదేవుని స్త్రీ పరిచారిక. - మహాభారతం

**చపలుడు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు.
- మహాభారతం

**చపుడు :** ఒక విద్యాధరుడు. మదాలస భర్త. తుర్వసుడి ఆశ్రమం వద్ద దొరకగా అతణ్ణి ఇంద్రుడి వద్దకు తీసుకువెళ్లగా ఇతడు విష్ణువు కుమారుడని అతడిని కాళిందీ నదీతీరంలో వదలమని చెప్పగా అలాగే ఆ బాలుణ్ణి ఆ నదీతీరంవద్ద వదలి వెళ్తాడు. అతడికి తర్వాత అరణ్యంలో దొరికిన బాలుడే ఏకవీరుడు. ఇతడు హేహే వంశానికి ఆద్యుడు. - దేవీభాగవతం

**చమత్కారాలు :** చూ॥ పట్టు.

**చమరం :** ఇదో జంతువు. దీనితోక అన్ని భాగాలలో ముఖ్యమైనది. ఇది అడవిలో సంచరించేటప్పుడు దానితోక ఎక్కడ అంటుకుపోతే దానంతట అది స్వేచ్ఛగా విడిపోయే వరకు అక్కడే వుంటుంది. కశ్యపుని భార్య క్రోధవశకు 10 మంది కుమార్తెలు అందులో ఒకరు మృగమద. మృగమద సంతానమే చమరాలు, శృమరాసులు. - రామాయణం

**చమసుడు :** ఇతడో యోగి. ప్రియవ్రత వంశము వాడైన భరతుడు ఈ దేశాన్ని పాలించడంవల్ల భారతదేశమని పిలవబడెను. ఇతనికి 9 మంది సోదరులు. మరో తల్లివల్ల ఇతనికి మరో తొమ్మిది మంది సోదరులు కలరు. వారిని నవయోగులు అంటారు. అందులో ఒకడు చమసుడు. - భాగవతం

**చమసోద్భేదం :** వినాశ అనే పుణ్యస్థలంలోని ఓ భాగం. ఇది సౌరాష్ట్రంలో వుంది. కన్పించని సరస్వతీ నదిని ఇచ్చటే మొదట కనుగొన్నారు. ఇక్కడ ఒకసారి స్నానం చేస్తే జ్యోతిష్టోమ యజ్ఞం చేసిన ప్రతిఫలం లభిస్తుంది.
- మహాభారతం

**చమోహరుడు :** ఒక విశ్వదేవుడు. - మహాభారతం

**చర్మణ్వతి :** దశార్థ దేశమందలి ఒక నది. రంతి దేవుడొనర్చిన యాగమందు గోవుల రక్తము నదియై ప్రవహించగా ఆ పశువుల చర్మములు నదికి గట్టులయ్యెను.
- మహాభారతం

**చర్మమండలం :** ప్రాచీన భారతదేశంలోని నివాస అనుకూలమైన పట్టణం. - మహాభారతం

**చర్మవంతుడు :** సుబలుడి కుమారుడు. శకునికి సోదరుడు. అర్జునుని కుమారుడైన ఇరావంతుడి చేతిలో మరణిస్తాడు. - మహాభారతం

**చర్వాంగి :** భద్రసేన్యుడి భార్య. కుశాంబుడి కూతురు.
- బ్రహ్మాండ పురాణం

**చల :** క్షీరసాగరమదనంలో వెలువడిన ఉచ్చైశ్రవాన్ని అధిరోహించి సూర్య కుమారుడైన రేవంతుడు వైకుంఠానికి రాగా ఆ అశ్వ సౌందర్యాన్ని చూసి లక్ష్మి ముగ్ధురాలై మహావిష్ణువు చెప్తున్న మాటలు వినదు. ఇందుకు కోపించిన విష్ణువు లక్ష్మీదేవిని భూమిపై జన్మించవలసినదిగా శపించి ఇకనుండి చల, రమ అని పిలవబడతావని చెప్తాడు. చల, రమ అంటే చపలచిత్త అని అర్థం. - దేవీభాగవతం

**చలుడు :** బలుడి కొడుకు. ఇతని కుమారుడు వజ్రనాభుడు. - భాగవతం

**చాక్యార్కూత్తు :** ఇదో కళారూపం. కేరళ దేవాలయాల్లో అభ్యసిస్తారు. చాక్యారులనే తెగవారు దీన్ని ప్రదర్శించారు కనుక ఈ పేరు వచ్చింది. జనాలలో అధ్యాత్మిక చింతన పెరగటానికి ఇది ఉపయోగపడేది.

**చాక్షుషి :** ఇదో విద్య. దీన్ని అభ్యసించడానికి షాణ్మా సవ్రతం చెయ్యాలి. దీనివల్ల ముల్లోకాలు చూడ వచ్చు. ఇందువల్లనే మానవుల కంటే గంధర్వులు విశిష్టుల య్యారు. - మహాభారతం

**చాక్షుషుడు :** ఖమిత్రుడి కుమారుడు. ఇతని కుమారుడు వివింశతి. - మహాభారతం

**చాక్షుషువు :** బృహతి రివుల కొడుకు. పుష్కరిణి ఇతడి భార్య. వీరి కుమారుడే చాక్షుష మనువు. అన మిత్రుడి కొడుకైన ఆనందుడి పునర్జన్మే చాక్షుష మనువు. ఇతని కాలంలోనే నరనారాయణులు ధర్ముడి కుమారులుగా, బ్రహ్మ చంద్రుడిగా, విష్ణువు దత్తాత్రేయుడిగా, శివుడు దుర్వాసుడిగా జన్మించారు. - దేవీభాగవతం

**చాణకం:** ఆవు పేడను చాణకం అంటారు. లక్ష్మీదేవి ఒక ఆవుల మందను చూసి ముచ్చటపడి వరం కోరుకొమ్మంటుంది. గోవులు తిరస్కరించినా లక్ష్మీదేవి బలవంతం మీద వాటి పేడకూడా పవి త్రం కావాలని కోరుకుంటాయి. అప్పటినుండే ఆవుపేడ పవిత్ర మయ్యింది. - దేవీభాగవతం

**చాణుక్యుడు :** కౌటిల్యుడనికూడా పిలుస్తారు. రాజకీయ శాస్త్రంమీద ఇతడు వ్రాసిన బృహద్గ్రంథమే 'అర్థశాస్త్రం'.

**చాణూరుడు 1 :** మయసభలో ధర్మజునికి సేవచేసిన రాజు. - మహాభారతం

**చాణూరుడు 2 :** ఇతడో మల్లయోధుడు. శ్రీకృష్ణుణ్ణి చంపడానికి కంసుడు ఇతణ్ణి, ముష్టికుణ్ణి నియోగి స్తాడు. వీరిని శ్రీ కృష్ణుడు వధిస్తాడు. - భాగవతం

**చాతుర్వర్ణ్యం :** బ్రహ్మ చతుర్వర్ణాలు సృష్టించాడని పురా ణాల ఉవాచ. బ్రహ్మ ముఖంనుండి బ్రాహ్మ ణులు, హృదయంనుంచి క్షత్రియులు, తొడల నుండి వైశ్యులు, కాళ్లనుండి శూద్రులు జన్మించారు. - విష్ణుపురాణం

**చాతుర్మాస్యం :** నాలుగు నెలలపాటు చెయ్యాల్సిన వ్రతం. ఈ కాలంలో సద్భావనతో వేదపఠనం చెయ్యాలి. పాండవులు ఈ వ్రతాన్ని గయవద్ద చేశారు. - మహాభారతం

**చాతూకర్ణుడు :** ఓ ముని. పరాశరుడితనికి పురాణ ములను ఉపదేశించెను. ఇతడు వాటిని కృష్ణ ద్వైపా యనునికి తెలియజేసెను. - బ్రహ్మపురాణం

**చాపయజ్ఞం :** ధనుస్సును పూజించడాన్నే చాప యజ్ఞ మంటారు. కంసుడు దీన్ని పద్నాలుగు రోజులు చేశాడు. - భాగవతం

**చామరం :** ఇదో ఈకల గొడుగు. రాజు గొడుగుకైతే బంగారు కాడ వుండాలి. ఈ గొడుగుకు హంస, నెమలి బలాకాది పక్షుల ఈకలు వుండాలిగాని కలవ కూడదు. వృత్తాకారంలో వుండే కాడకు మూడునుండి ఎనిమిది అతుకులుండాలి. - అగ్నిపురాణం

**చాముండ :** పార్వతీదేవి మరోపేరు. - చూ॥ పార్వతి

**చాముండి :** ఈమె ఈశ్వర శక్తి. ఈమె మరుడనే రాక్షసుడి చర్మాన్ని మొండాన్ని రెండుగా చేసింది కనుక చాముండి అనే పేరొచ్చింది. - వరాహపురాణం

**చారణులు :** దేవతల్లో ఓ తెగ. ఇంద్రుణ్ణి పొగడడమే వీరి వృత్తి.

**చార్వాకుడు 1 :** ఇతడొక రాక్షసుడు. దుర్యోధనుని స్నేహితుడు. కృతయుగంలో బ్రహ్మను గూర్చి తపస్సు చేసి అన్ని జీవరాసుల నుండి ప్రాణభయం లేనట్లు వరం కోరుకుంటాడు. బ్రాహ్మణులు ఇతని అకృత్యా లకు మొరపెట్టుకోగా ఇతడు దుర్యోధనుడి స్నేహితుడ వుతాడని బ్రాహ్మణుల కోపానికి మసి అవుతాడని అభయమిస్తాడు.

కురుక్షేత్ర యుద్ధానంతరం హస్తినకు ఎందరో బ్రాహ్మ ణులు ధర్మజుడ్ని ఆశీర్వదించడానికి రాగా ఇతడు కూడా బ్రాహ్మణ వేషంలో వచ్చి ధర్మజుణ్ణి నీ ప్రజలకు నీవే శతృవని ధూషిస్తాడు. అక్కడున్న బ్రాహ్మణులు ఇతణ్ణి గుర్తించి శపించగా బూడిదవుతాడు.

- మహాభారతం

**చార్వాకుడు 2 :** కొన్ని సంస్కృత గ్రంథాలు ప్రాచీన భారతదేశంలో చార్వాకుడను తాత్వికుడు కలడని అతడు నాస్తికుడని చనిపోయిన తర్వాత స్వర్గ నరకాలు చేరడమనేదిలేదని గట్టిగా బోధించాడని పేర్కొన్నాయి. అతని తాత్వికతను చార్వాకం అంటారు.

**చారుగుప్తుడు :** కృష్ణునకు రుక్మిణి యందు జన్మించిన కుమారుడు. - భాగవతం

**చారుచంద్రుడు :** కృష్ణునకు రుక్మిణి యందు జన్మించిన కుమారుడు. - భాగవతం

**చారుదేహుడు :** కృష్ణునకు రుక్మిణియందు జన్మించిన కుమారుడు. – భాగవతం

**చారుధి :** మహామేరువుకు దగ్గర్లోని మరో పర్వతం. – దేవీభాగవతం

**చారునేత్ర :** ఓ దేవకన్య. కుబేరుడి సభలో వుండేది. – మహాభారతం

**చారుపదుడు :** పూరుని వంశంలోని వాడు. మనస్యుడి కుమారుడు.

**చారుభద్రుడు :** కృష్ణునకు రుక్మిణియందు జన్మించిన కుమారుడు. – భాగవతం

**చారుమతి :** రుక్మి కుమారిత. కృతవర్ముని కుమారు డీమెను పరిణయమాడెను. – భాగవతం

**చారుమత్స్యుడు :** విశ్వామిత్రుని కుమారుడు. – మహాభారతం

**చారుయశసుడు :** కృష్ణుని వల్ల రుక్మిణికి జన్మించిన కుమారుడు. – మహాభారతం

**చారువక్త్రుడు :** స్కందదేవుని అనుచరుడు, బ్రాహ్మణ భక్తుడు. – మహాభారతం

**చారువు :** కృష్ణునకు రుక్మిణివల్ల జన్మించిన కుమారుడు. – భాగవతం

**చారువేశుడు :** కృష్ణునకు రుక్మిణి వల్ల జన్మించిన పుత్రుడు. – భాగవతం

**చారువేష్ణుడు :** కృష్ణనకు రుక్మిణి యందు జన్మించిన కుమారుడు. – భాగవతం

**చారుశీర్షుడు :** అలంబ గోత్రంలో జన్మించిన ఓ మహర్షి. ఇంద్రునికి స్నేహితుడు. ధర్మజుడికి శివుడి గొప్పదనాన్ని విశదీకరిస్తాడు. – మహాభారతం

**చారుశ్రవసుడు :** కృష్ణునకు రుక్మిణియందు జన్మించిన పుత్రుడు. – భాగవతం

**చావేట్టు పతం :** సైన్యంలో ఓ విభాగం. విజయమో వీరస్వర్గమో అనేది వీరి నినాదం. ఈ విధానం కేరళలో వుండేది. ఈ విభాగంలో వుండి చనిపోయిన వారి కుటుంబాలకు రాజమర్యాదలు లభించేవి.

**చాషవక్త్రుడు :** స్కందదేవుని అనుచరుడు. బ్రాహ్మణ భక్తిపరుడు. – మహాభారతం

**చికితాయనుడు :** చైకితాయనుని తండ్రి. – చాన్దోగ్యోపనిషత్తు

**చికురుడు :** సర్పరాజైన ఆర్యకుని కుమారుడు. ఇతని కుమారుడు సుముఖుడు. గరుడుడు చికురుడిని భక్షించాడు. – మహాభారతం

**చిక్షురుడు :** మహిషాసురుని మంత్రి. సైనిక వ్యవహారాలు చూసేవాడు. తామరుడు ఆర్థిక మంత్రి. అశిలోముడు ప్రధానమంత్రి. బిడాలుడు విదేశాంగ మంత్రి, ఉదిర్కుడు సైన్యాధిపతి, శుక్రుడు విద్యా మంత్రి. – దేవీభాగవతం

**చిచ్చుకుడు :** ఇదో రెండు తలల పక్షి. పూర్వజన్మలో మానవుణ్ణని బ్రాహ్మణ హత్యవల్ల ఇలా అయ్యానని పవమానుడనే రాజుకు వివరిస్తాడు. అంతేకాదు పాపపరిహారం కోసం తపం చేస్తున్నానని ఇక్కడున్న గదాధరం అనే తీర్థం వద్ద స్నానం చేస్తే పాతకం పోతుందని చెప్తాడు. – బ్రహ్మపురాణం

**చితల్ :** చితల్ అంటే చెదపురుగులు అని అర్థం. విష్ణుమూర్తి ధనస్సుమీద తలపెట్టి నిద్రిస్తున్నప్పుడు దాన్ని భగ్నంచేయడానికి బ్రహ్మ వీటిని సృష్టించాడు. యజ్ఞ భాగాల్లో కొంత వీటికి చెందేట్లు వరం పొందాయి. – దేవీమహాత్యం

**చిత్ర 1 :** కుబేరుడి కుమార్తె. ఈమెను బుధుడు గాంధర్వ పద్ధతిలో వివాహమాడాడు. ఈమె కొడుకు చైత్రుడు. – బ్ర.వై. పురాణం

**చిత్ర 2 :** ఓ ఏనుగు పేరు. స్కందుడు చిన్నతనంలో దీనితో ఆడుకున్నాడు.

**చిత్రకుడు :** ధృతరాష్ట్ర, గాంధారీల కుమారుడు. కురుక్షేత్ర యుద్ధంలో భీముడితణ్ణి వధించాడు. – మహాభారతం

**చిత్రకుండకుడు :** దీర్ఘలోచనుడని అంటారు. 100 మంది కౌరవుల్లో ఒకడు. కురుక్షేత్రంలో భీముడి తణ్ణి వధించాడు. – మహాభారతం

**చిత్రకూటం :** ఓ పర్వతము. దీనివద్దనే అరణ్యవాసమునకు పోయిన రాముని భరతుడు కలిశాడు. – రామాయణం

**చిత్రకేతువు 1 :** శిశుపాలుడి కుమారుడు. – భాగవతం

**చిత్రకేతువు 2 :** ఓ పాంచాల రాజకుమారుడు. పాండవ పక్షపాతి. – మహాభారతం

**చిత్రకేతువు 3 :** గరుత్మంతుడి కుమారుల్లో ఒకడు. – మహాభారతం

**చిత్రకేతువు 4 :** ఓ రాజు. అంగిరసుడి వరం వల్ల ఓ పుత్రుడు పుట్టి అనతికాలంలో మరణిస్తాడు. బ్రహ్మ, నారదుడు ఇతడు బాధపడుతుంటే ఓదారుస్తారు. ఇతడు శాంతించిన తర్వాత గంధర్వుడిగా మారి విమానం సంపాదించి భార్యతో సహా విహరిస్తూ కైలాసం పైనుండి వెళ్తూ శివుడి తొడపై కూర్చున్న పార్వతిని చూసి నవ్వుతాడు. పార్వతి ఇతడ్ని శపించగా వృత్రాసురుడనే రాక్షసుడిగా జన్మిస్తాడు.
– *భాగవతం*

**చిత్రకేశి :** ఓ అప్సరస. వత్సరాజు వల్ల ఈమెకు వృషాదులు జన్మించారు. – *భాగవతం*

**చిత్రగుప్తుడు :** సూర్య వంశజుడను చిత్రుడు చిరకాలము సూర్యుడినారాధించెను. సూర్యుడు ఇతని భక్తికి మెచ్చి వరము కోరుకొమ్మనగా సర్వ కార్యములందు ప్రౌఢత్వము సర్వజ్ఞత్వము కావలెనని కోరుకొనెను. సూర్యుడు అతని కోర్కె నెరవేర్చగా ఇట్టివాడు తనకు లేఖకుడుగా కావలెనని ఇతడు లవణ సముద్రములో స్నానము చేయుచుండగా యముడు సశరీరముతో రావించు కొనెను. ఇతడివల్ల ప్రాణులు చేయు కార్యములను లిఖించుచుండును. ఇతనికి చిత్రాదిత్యుడను వాహనము కూడా కలదు.

**చిత్రచాపుడు :** 100 మంది కౌరవుల్లో ఒకడు.
– *మహాభారతం*

**చిత్రదేవుడు :** స్కందదేవుని అనుచరుడు. బ్రాహ్మణ భక్తి మిక్కుటం. – *మహాభారతం*

**చిత్రధర్ముడు :** ప్రాచీన భారతదేశపు ఒక రాజు. విరూపాక్షుడను రాజు చిత్రధర్ముడిగా జన్మించాడు. పాండవులు తమతో కలసి పోరాడమని ఆహ్వానించారు. – *మహాభారతం*

**చిత్రపుష్పం :** ద్వారకకు పడమరన గల శుకాక్ష పర్వతం మీదగల ఓ ఉద్యానవనం. ఇక్కడ చిత్ర విచిత్రమైన పుష్పాలు లభిస్తాయి. – *మహాభారతం*

**చిత్రబర్హుడు :** గరుడుడి కుమారుడు. – *మహాభారతం*

**చిత్రబాణుడు :** గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రులలో ఒకడు. – *మహాభారతం*

**చిత్రముఖుడు :** ఒక రుషి. వైశ్యుడిగా జన్మించి బ్రాహ్మణుడిగా మారతాడు. – *మహాభారతం*

**చిత్రరథుడు 1 :** గాంధారీ పుత్రులైన కౌరవులలో ఒకడు.
– *మహాభారతం*

**చిత్రరథుడు 2 :** శశిబిందుని తండ్రి.

**చిత్రరథుడు 3 :** చూ॥ రోమపాదుడు.

**చిత్రరథుడు 4 :** అంగారపర్ణుని మరోపేరు.
– *చూ॥ అంగారపర్ణుడు*

**చిత్రరథుడు 5 :** అంగదేశపు రాజు. ఇతని భార్య, దేవశర్మయను బ్రాహ్మణుని భార్య అక్క చెల్లెండ్రు.
– *మహాభారతం*

**చిత్రరూపుడు :** శివుని సేవకుడు. మహావిష్ణువు లక్ష్మిని శపించినపుడు ఇతనితో విష్ణువుకు శివుడు ఓ వర్తమానం పంపుతాడు. – *దేవీభాగవతం*

**చిత్రరేఖ 1 :** చూ॥ చిత్రలేఖ.

**చిత్రరేఖ 2 :** ఓ అప్సరస. నాట్యం చేస్తున్నపుడు కొన్ని లేళ్లురాగా ఈమె మనసు వాటిపై మరల్చగా ఇంద్రుడు మృగివై జన్మించమని శపిస్తాడు. మృగి రూపంలో ఈమె రుష్యశృంగుడికి జన్మనివ్వగా శాపవిమోచనం కల్గుతుంది. – *విచిత్ర రామాయణం*

**చిత్రలేఖ 1 :** ఓ ప్రముఖ యువతి. ఒకసారి ఈమె పాండవుల సభలో నాట్యం చేసింది. – *మహాభారతం*

**చిత్రలేఖ 2 :** బాణాసురుని కూతురు ఉషకు చెలికత్తె. ఈమె చిత్రలేఖనంలో మేటి. ఉష కలలో ఊహించుకున్న అనిరుద్ధుడి చిత్రాన్ని గీసి అనిరుద్ధుడు ఉష అంతఃపురంలోకి రావడానికి తోడ్పడి వారి వివాహానికి పరోక్షంగా సహాయపడింది.
– *చూ॥ అనిరుద్ధుడు.*

**చిత్రవర్మ 1 :** 100 మంది కౌరవుల్లో ఒకడు. కురుక్షేత్ర యుద్ధంలో భీముడితణ్ణి వధించాడు. – *మహాభారతం*

**చిత్రవర్మ 2 :** పాంచాల రాజకుమారుడు. సుచిత్రుడను రాజుయొక్క కుమారుడు. ఇతనికి మరో నలుగురు సోదరులు. అందులో ఒకడైన విక్రకేతుణ్ణి ద్రోణుడు కురుక్షేత్రంలో వధించగా తక్కిన నల్గురు ద్రోణునితో పోరాడి అతని చేతిలో మరణించారు.
– *మహాభారతం*

**చిత్రవర్మ 3 :** సీమంతిని తండ్రి. ఈమె చంద్రాంగద రాజు భార్య. *చూ॥ చంద్రాంగదుడు*

**చిత్రవాహ :** పురాణ కాలంలో భారతదేశంలోని ఓ నది. – మహాభారతం

**చిత్రవాహనుడు :** పురాణకాలంలో మణిపూర్‌ను ఏలిన రాజు. చూ॥ చిత్రాంగధ.

**చిత్రరేగిక :** కురువంశంలోని ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో భస్మమవుతుంది. – మహాభారతం

**చిత్రశరాసనుడు :** చిత్రచాపుడు, శరాసనుడు అని కూడా అనేవారు. 100 మంది కౌరవుల్లో ఒకడు. కురుక్షేత్రంలో భీముడితణ్ణి వధించాడు. – మహాభారతం

**చిత్రశిఖండి :** సప్తర్షులైన మరీచి, అంగిరస, అత్రి, పులస్త్య, పులహ, క్రతు, వశిష్టులను చిత్ర శిఖండులని పిలిచేవారు. – మహాభారతం

**చిత్రశీల :** పురాణ కాలంలో భారతదేశంలోని ఓ నది. ఈ నది నీటిని ప్రజలు త్రాగేందుకు ఉపయోగించేవారు. – మహాభారతం

**చిత్రసేన 1 :** ఓ అప్సరస. కుబేరుని సభలో వుండేది. అర్జునుని గౌరవార్థం జరిగిన సభలో నృత్యం చేసింది. – మహాభారతం

**చిత్రసేన 2 :** ఇది ప్రాచీన భారతదేశంలో ఓ నది. ఈ నీటిని భారతీయులు తాగడానికి ఉపయోగించే వారు. – మహాభారతం

**చిత్రసేన 3 :** స్కందదేవుని అనుచరుడు. – మహాభారతం

**చిత్రసేనుడు 1 :** ఇతడొక గంధర్వుడు. ఇతనికి ఇద్దరు భార్యలు. ఒకరు సంధ్యావళి, రెండవది రత్నావళి. ఒకసారి ఇతడు విమానంలో వెళ్తూ సంధ్యా ప్రార్థన నిర్వహి స్తున్న గాలవుడిపై పొరపాటున ఉమ్మివేయగా గాలవుడు శ్రీకృష్ణుడికి చెప్పగా అతణ్ణి వధిస్తానని అభయమిస్తాడు. అతని భార్యలు అర్జునుని ఆశ్రయించగా రక్షింపబడతాడు. – చూ॥ గాలవుడు. ఘోషయాత్ర సందర్భంగా చిత్రసేనుడు దుర్యోధనుడ్ని బంధించగా ధర్మజుని ఆజ్ఞమేరకు అర్జునుడు ఇతడ్ని ఓడించి దుర్యోధనుడ్ని విడిపిస్తాడు. – చూ॥ ఘోషయాత్ర

ఇతడు కుబేరుని సభలో సభ్యుడు. ఇంద్రుని సభకు కూడా వెళ్లేవాడు. ఊర్వశి అర్జునుణ్ణి శపించగా శాప విమోచనం చేయమని ఇంద్రుని పనుపున ఊర్వశిని కోరతాడు. – మహాభారతం

**చిత్రసేనుడు 2 :** ధృతరాష్ట్రుని కుమారుల్లో ఒకడు. ఇతడు పాంచాలి స్వయంవరానికి వెళ్లాడు. కురుక్షేత్ర యుద్ధంలో భీమసేనుడితో, సుశర్మతో, సాత్యకితో పోరాడతాడు. భీమసేనుడు ఇతణ్ణి వధిస్తాడు. – మహాభారతం

**చిత్రసేనుడు 3 :** పూరు వంశపు రాజు. పరీక్షిత్తు కుమారుడు. అవిక్షిత్తు మనుమడు. – మహాభారతం

**చిత్రసేనుడు 4 :** జరాసంధుని మంత్రుల్లో ఒకడు. ఇతణ్ణి ఢింబకుడని అంటారు. – మహాభారతం

**చిత్రసేనుడు 5 :** అభిసారదేశపు రాజు. ఇతడు కౌరవుల పక్షాన పోరాడి శృతకర్ముడి చేతిలో మరణిస్తాడు. – మహాభారతం

**చిత్రసేనుడు 6 (శృతసేనుడు) :** త్రిగర్త రాజైన సుశర్మ సోదరుడు. వీరిద్దరూ అర్జునుని బాణాలతో ముంచెత్తుతారు. – మహాభారతం

**చిత్రసేనుడు 7 :** పాంచాలదేశ వీరుడు. పాండవుల పక్షాన పోరాడి కర్ణుడి చేతిలో మరణిస్తాడు. – మహాభారతం

**చిత్రసేనుడు 8 :** కర్ణుడి కుమారుడు. ఇతణ్ణి నకులుడు సంహరించాడు. – మహాభారతం

**చిత్రసేనుడు 9 :** కర్ణుని సోదరుడు. ఇతణ్ణి యుధామన్యుడు వధించాడు.

**చిత్రసేనుడు 10 :** సముద్ర తీరంలోని ఒక రాజు. పాండవుల పక్షాన పోరాడి సముద్రసేనుని చేతిలో మరణిస్తాడు. – మహాభారతం

**చిత్రసేనుడు 11 :** ఇదో సర్పం. కృష్ణార్జున యుద్ధంలో అర్జునుని పక్షాన వుంది. – మహాభారతం

**చిత్రసేనుడు 12 :** ఓ పాపాత్ముడైన రాజు. అయినప్పటికి అష్టమ రోహిణి వ్రతంచేసి ముక్తిని సాధించాడు. – పద్మపురాణం

**చిత్రసేనుడు 13 :** వైవశ్వత మనువు వంశంలోని ఓ రాజు. – భాగవతం

**చితాయువు :** పూరు వంశంలోని ఒక రాజు. ఇతని తండ్రి భద్రాశ్వుడు. – అగ్నిపురాణం

**చిత్తావస్థలు :** మానసిక అవస్థలు పదింటిని చిత్తా వస్థలు అంటారు. అవి. 1. కామ, 2. సంకల్ప, 3. విచికిత్స, 4. శ్రద్ధ, 5. అశ్రద్ధ, 6. ధృతి, 7. అధృతి, 8. లజ్జ, 9. ధీ, 10. భీతులు.

**చిత్రాక్షుదు :** ధృతరాష్ట్రుని వందమంది పుత్రుల్లో ఒకదు. కురుక్షేత్రంలో భీముడితణ్ణి వధించాడు.
- మహాభారతం

**చిత్రాదేవుదు :** స్కందుని పరిచారకుడు. బ్రాహ్మణు లను గౌరవించేవాడు. - మహాభారతం

**చిత్రాయుధుదు 1 :** ఇతణ్ణి చిత్రబాహుదని అంటారు. ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకదు. కురుక్షేత్ర యుద్ధంలో భీముడితణ్ణి వధించాడు.
- మహాభారతం

**చిత్రాయుధుదు 2 :** ఇతణ్ణి దృధాయుదని అంటారు. 100 మంది కౌరవుల్లో ఒకదు. కురుక్షేత్ర యుద్ధంలో భీముడితణ్ణి వధించాడు. - మహాభారతం

**చిత్రాయుధుదు 3 :** ఇతదు సింహపుర రాజు. పాండవుల జైత్రయాత్రలో అర్జునుడు ఇతణ్ణి జయించాడు.
- మహాభారతం

**చిత్రాయుధుదు 4 :** చేది వీరుడు. పాండవుల పక్షాన పోరాడాడు. ఇతని గుర్రం రక్తపుటెరుపు. కురుక్షేత్రంలో కర్ణుడితణ్ణి వధించాడు. - మహాభారతం

**చిత్రాశ్వుదు :** సత్యవాణుడి మరోపేరు. మట్టితో ఇతదు అశ్వరూపాలను చేసేవాడు. అందుకని ఇతనిని చిత్రాశ్వుదు అని పిలిచేవారు. - మహాభారతం

**చిత్రాంగద :** అర్జునుడు దేశాటనము చేయునపుదు చిత్రవాహనుడను రాజుకుమార్తె చిత్రాంగదను వివాహమాడగా ఈమెకు బబ్రుహవాహనుదు జన్మించెను. పాండవుల అశ్వమేధయాగ సమయ మున ఇతదు అర్జునునితో పోరాడి మూర్చ పోయెను. అర్జునుదు మరణించెను. నాకు పుత్రుని కంటే భర్త మరణం బాధాకరమని విలపించగా అర్జునుని మరో భార్య ఉలూచి సంజీవినితో అర్జునుని బ్రతికించెను.
- మహాభారతం

**చిత్రాంగదుదు 1 :** సత్యవతి శంతనులకు జన్మించిన ఇద్దరు కుమారుల్లో ఒకదు. రెండోవాదు చిత్ర వీర్యుదు. ఇతదు ఓ గంధర్వుడితో యుద్ధంచేసి మరణిస్తాడు. మొదట భీష్ముడితణ్ణి రాజును చేస్తాడు.
- మహాభారతం

**చిత్రాంగదుదు 2 :** గాంధారీ ధృతరాష్ట్ర పుత్రులైన 100 మంది కౌరవుల్లో ఒకదు. - మహాభారతం

**చిత్రాంగి 1 :** రాజరాజ నరేంద్రుడను రాజుయొక్క రెండవ భార్య. ఇతని పెద్ద భార్య కుమారుదు సారంగ ధరుదు. ఈమె సారంగధరుని రూప లావణ్యములను విని మోహించెను. ఒకనాదు తన పావురము చిత్రాంగద అంతఃపురములోకి వెళ్లగా ఇతదు ఆమె వద్దకు వచ్చెను. ఆమె ఇతణ్ణి తనను సుఖింపజేసి జన్మసాఫల్యము చేయమని కోరగా మాతృమూర్తిగా భావించిన అతదు అందుకు నిరాకరించగా అతని ఉత్తరీయము లాగు కొని రాజుతో సారంగధరుదు మాన భంగము చేయ యత్నించెనని బొంకెను. రాజు సారంగధరుని జంపించెను. తర్వాత విషయము తెలుసు కొని ఈమెను కూడా సంహరించనాజ్ఞాపించెను.
- సారంగధర చరిత్ర

**చిత్రాంగి 2 :** హేహయ రాజైన బద్రశ్రేణ్యుని కుమార్తె. ఈమె దుర్మదుని భార్య. చూ॥ దుర్మదుడు.

**చిత్రుదు 1 :** ధృతరాష్ట్రునికి జన్మించిన కుమారుల్లో ఒకదు. - మహాభారతం

**చిత్రుదు 2 :** కౌరవుల పక్షాన పోరాడిన కురు వంశస్తుదు. ప్రతివింద్యుడి చేతిలో మరణిస్తాడు.
- మహాభారతం

**చిత్రుదు 3 :** చేదిరాజు. పాండవుల పక్షాన పోరాడి కర్ణుని చేతిలో సంహరింపబడతాడు. - మహాభారతం

**చిత్రోపచిత్తుదు :** 100 మంది కౌరవుల్లో ఒకదు. కురుక్షేత్ర యుద్ధంలో భీమసేనుడితణ్ణి వధించాడు.
- మహాభారతం

**చిత్రోపల :** పురాణ ప్రసిద్ధి చెందిన ఓ నది.
- మహాభారతం

**చిదంబరుదు :** సితాంబర అనికూడా పిలుస్తారు. 16వ శతాబ్దిలో విజయనగర సామ్రాజ్యాన్ని ఏలిన వెంకటుని సభలో వున్న కవి. ఇతని ప్రముఖ కావ్యం రాఘవ యాదవ పాండవీయం. ఇందులో మూడు కాండలు న్నాయి. ఒకటి శ్రీరాముడ్ని రెండవది శ్రీకృష్ణుడ్ని మూడవది పాండవుల్ని ప్రస్తుతిస్తూ వ్రాయబడినవి.

**చిదంబరం :** ఇదో దివ్యక్షేత్రము. పంచ లింగములలో ఒకటైన ఆకాశలింగపు మూర్తి ఇచట కలదు. ఇది తమిళనాడులో కలదు.

**చిన్నయసూరి :** ఓ ఆధునిక తెలుగు పండితుడు. నీతి చంద్రిక గ్రంధకర్త. ఇతడు తెలుగు భాషకు ఓ వ్యాక రణ గ్రంథమును కూర్చెను. అదే బాల వ్యాకరణము. ఈ వ్యాకరణమునకు తెలుగులో ఎన్నో వ్యాఖ్యాన ములు వచ్చినవి.

**చిబుక :** నందిని వల్ల జన్మించిన తక్కువ జాతి సంతతి. ఇది విశ్వామిత్రుడికి నందినికి జరిగిన పోరాటంలో జన్మించింది. - మహాభారతం

**చియ్యాలి :** దక్షిణ భారతదేశంలోని ఓ పుణ్యస్థలం. - చూ॥ అగస్త్యుడు.

**చిరకం :** ప్రజా జీవనం వున్న ప్రాచీన భారతదే శంలోని ఓ ప్రాంతం. దీన్ని కర్ణుడు జయించాడు. అప్పటి నుండి అది దుర్యోధనుడి ఏలుబడిలో వుంది. - మహాభారతం

**చిరకారి :** గౌతమ మహర్షి పుత్రుడు. ఏ కార్యాన్ని చేపట్టిన్నా చాలా లోతుగా ఆలోచించి చేసేవాడు. అందుకని ఆ పేరువచ్చింది. తన తండ్రి తన భార్య పాతివ్రత్యం మీద అపనమ్మకంతో తన కుమారుడైన చిరకారిని తన భార్య తల నరకమని ఆదేశించి బయ టకు వెళ్లగా అతడు సందేహిస్తూ ఆమె చనిపోతే తన తండ్రిని ఎవరు చూస్తారు అదీ కాకుండా మాతృ హత్య పాపంకదా అంతేకా కుండా తండ్రి ఆలోచించు కొని తన తప్పుకు చింతించవచ్చు అని వదిలివేయగా అంతలో తండ్రి తను అలా ఆజ్ఞ ఇవ్వడం పొరపాటని దుఖిఃస్తూ ఇంటికి వచ్చి ఆమె బ్రతికేవుండటం చూసి ఆనందించాడు. - మహాభారతం

**చిరదాత :** చిరపురంలో చిరదాత అనే రాజు వుండే వాడు. అతడు స్వతహాగా మంచివాడే అయినా చుట్టూతా చెడ్డ సలహా దారులుండేవారు. ఒకసారి ప్రసంగుడు, అతని ఇద్దరు స్నేహితులు రాజు దర్శ నానికి వస్తే దర్శనం కానివ్వలేదు. వారు ఐదు సంవ త్సరాలు అలాగే గడపగా ఒకరోజు రాజు కుమారుడు చనిపోగా రాజు ఆ శవంవద్ద విచారిస్తూ వుండగా ప్రసంగుడు, అతని ఇద్దరు స్నేహితులు అక్కడకు వచ్చి ఈ చనిపోయిన బాలుడు రాజై అప్పుడైనా తమను కలిసే అవకాశం కల్పిస్తాడేమోనని అలాగే 5 సంవత్సరాల నుండి గడుపుతున్నామని చెప్పగా రాజు తన పొరపాటు తెలుసుకొని వారికి తగిన బహుమతు లిచ్చి పంపాడు. - కథాసరిత్సాగరం

**చిరవాససుడు 1 :** ఓ క్షత్రియరాజు. ఇతడు క్రోధవ శుడను రాక్షసుడి పునర్జన్మ. - మహాభారతం

**చిరవాససుడు 2 :** ఓ యక్షుడు. కుబేరుని కొలువులో అతనిని పూజిస్తూ వుండేవాడు. - మహాభారతం

**చిరంజీవి :** ఇదో కాకి పేరు. పంచతంత్రంలో ఓ పాత్ర. - చూ॥ పంచతంత్రం

**చిరంతకుడు :** గరుడుడి కొడుకు. - మహాభారతం

**చిరాయువు :** చిరాయు అనే ప్రాచీన దేశపు రాజు. నాగార్జునుడు ఇతని మంత్రి. నాగార్జునుడికి రసా యన సిద్ధి తయారుచేసే రహస్యం తెలుసు. అలాచేసి రాజు, తను దాన్ని స్వీకరించారు. దానివల్ల ఎన్నాళ్ళైనా వారు యువకులుగానే వుంటారు. కొంతకాలానికి చిరాయువు తన కుమారుడైన జీవహరుడిని యువ రాజును చేయగా అతడా విషయాన్ని తన తల్లికి చెప్పగా ఆమె దానివల్ల నీవెప్పటికి రాజువు కాలేవని ఇప్పటికే రాజు 800 సంవత్సరాలు బ్రతికాడని ఇలా యువరాజులైనవారు రాజులు కాకుండానే మరణిం చారని దానికి కారణం నాగార్జునుడేనని కాబట్టి అతణ్ణి వధించమని చెప్తుంది. ఈ సలహా నచ్చి ఓ మధ్యాహ్నం నాగార్జునుడి ఇంటికి వెళ్ళగా అతని కోరిక తెలుసుకొని తన తలను నరక మంటాడు. జివహరుడు తన ఖడ్గంతో ఎన్నిసార్లు అతని మెడ నరికినా కనీసం గాటుకూడా పడలేదు. అంతలో రాజువచ్చి దీన్ని హర్షించక పోగా ఇంతకుముందు పూర్వజన్మల్లో తన తల ఇలానే నరకబడిందని చెప్పి తన దేహంనుండి చూర్ణం తీసి ఆ ఖడ్గానికి పూయగా వెంటనే తల తెగిపోయింది. చిరాయువు దుఃఖితుడై అరణ్యానికి వెళ్లి సాధుజీవనం గడిపాడు. చిరాయువు కుమారుడు జీవహరుడు రాజయ్యాడు. కాని నాగా ర్జునుని కొడుకులు ఇతణ్ణి వధించగా దుఖంతో అతని తల్లి మరణించింది. - కథాసరిత్సాగరం

**చిరుతొండదు :** కాంచీ నగరములోని వైశ్యుడు. ఇతని భార్య తిరువెంగమాంచి. వీరిపుత్రుడు సిరియాళుడు. వీరు శివభక్తులు. ఇతడు పూర్వ జన్మమున తుంబు రుడు. శాపవశమున చిరుతొండడుగా జన్మించెను. ఇతడు ప్రతిరోజు జంగములకు భోజనం పెట్టిన తర్వాతే వీరు భుజించెడి వారు. ఒకరోజు జంగము

లెవ్వరూ రాకుండిరి. చిరుతొండడు నాల్గు వీధులు తిరిగి ఎక్కడా కన్పించక ఓ వృద్ధ దంపతులను చూసి వీరిని తన ఇంటికి భోజనమునకు ఆహ్వానించెను. శివవ్రతము చేసియుంటిమనియు, అది ఉద్యాపనము కావలెనని అట్లగుటకు తాము కోరినది ఈయవలె నని ఆ వృద్ధ దంపతులు కోరిరి. వారి కోరిక ఏమనగా చిరుతొండని కుమారుని మాంసముతో భోజనము పెట్టమనిరి. ఇది తన భార్యకు వెల్లడించగా అంతే కాదు మనమును వారికి ఆహారమగుదమని వారిని రావింపుమని కోరెను. వారు తమ కుమారుని ఖండించి వారికి భోజనం ఏర్పాటు చేయగా నీయింట బాలురె వ్వరునూ లేరా బాలుడు లేని ఇంట మేము భుజింప మని అనగా వున్న ఒక్క కుమారుడుని మీకే వడ్డించితి మని ఇంకెవ్వరూ లేరని చెప్పగా ఆ అతిథి తన కుమారుడిని పేరు పెట్టి బిగ్గరగా పిలవమని ఆదే శించెను. అట్లు పిలవగా సిరియాళుడు వీధిలో నుండి వచ్చి వీరికి నమస్కరించెను. అప్పుడు పార్వతీ పరమే శ్వరులైన వృద్ధదంపతులు తమ నిజరూపము జూపి వారి శివభక్తికి మెచ్చి వారి పూర్వజన్మ వృత్తాంతము చెప్పి సిరియాలుడు కుమారస్వామియని తెల్పిరి.

– హరవిలాసం

**చీరిణి :** ఓ నది. ఈ నదీ తీరాన వైవశ్వత మనువు తపస్సు చేశాడు. – మహాభారతం

**చుచుకం :** ప్రాచీన దక్షిణ భారతదేశంలో ఓ స్థలం. – మహాభారతం

**చూచుకులు :** వీరు దక్షిణ భారతదేశంలోని తక్కువ కులంవారు. వీరు మహాభారత కాలంకంటే ముందు వారు. – మహాభారతం

**చూదాల :** శిఖిధ్వజుడను రాజు భార్య. సాధువర్తని. రాజు ఒకసారి విరక్తితో అరణ్యానికి వెళ్లగా ఆమె ఆత్మజ్ఞానం బోధించి వెనక్కు రప్పిస్తుంది.

– యోగవాసిష్టం

**చురయ్కు :** పృథువు ఈ భూమిని పాలిస్తుండగా భూమి గోవుగా మారి పాలుకారటం మొదలయ్యింది. ప్రతి వారికి ఒక్కో పదార్థం లభించింది. నాగులకు విషం లభించింది. వారు విషాన్ని పిండి చురయ్కు లాంటి పాత్రలో పిండారు.

**చుటక :** ఇదోనది. ప్రాచీన భారతావనిలో ఈ నది నీటిని తాగేవారు. – మహాభారతం

**చూతు :** అనగా పాపమని అర్థం. ఇది జూదం, వేట, మద్యం, స్త్రీలోలత్వంలో వుండునట్లుగా చ్యవనుడు ఆదేశిస్తాడు. ఒకసారి చ్యవనుడు చేస్తున్న యజ్ఞాన్ని నిరోధించడానికి ఇంద్రుడు రాగా ఆ యజ్ఞగుండం నుండి ఓ రాక్షసుడు ఉద్భవించి ఇంద్రుణ్ణి సంహరించ బోతాడు. ఇంద్రుడు చ్యవణుడి శరణువేడగా ఆ రాక్షసుడ్ని నాల్గు భాగాలు చేసి పై నాల్గు గుణాలలో ఉండమని ఆదేశిస్తాడు. – దేవీభాగవతం

**చూడాకర్ణుడు :** పంచతంత్రంలోని ఓ సన్యాసి పాత్ర. – పంచతంత్రం

**చూలి :** ఇతడో ముని. ఓ గంధర్వుని కూతురైన సోమద ఇతణ్ణి సేవించగా ఈమెను వరం కోరుకొమ్మంటాడు. ఆమె ఇతని వల్ల ఓ పుత్రుడు కావాలని కోరుకుం టుంది. అలా జన్మించినవాడే బ్రహ్మదత్తుడు. ఇతడు కుశనాభుని వందమంది పుత్రికల్ని వివాహమాడాడు.

– వాల్మీకి రామాయణం

**చెన్నబసవడు :** ఇతడు భూమిపై జన్మించిన కుమార స్వామి. ఇతని తల్లి నాగమాంబ. ఇతని మేనమామ బసవడు తెచ్చిన ప్రసాదం తిన్న ఈమె గర్భవతి అవు తుంది. బసవడు దుఃఖిస్తాడు. శివుడు ప్రత్యక్షమై ఈమె పార్వతి చెలికత్తె అని చెప్తాడు. రాజు బసవణ్ణి పిలిచి సంజాయిషీ కోరగా తన చెల్లెల్ని అడగమంటాడు. ఆమె తన కుమారుణ్ణి అడగమంటుంది. గర్భస్థ పిండం గర్భంలో ఎలా ప్రవేశించిందో వివరించి ఆమె ఎడమ చెవి నుండి బయటకు వచ్చి పన్నెండేళ్ల బాలు డుగా మారతాడు. అతడే చెన్నబసవడు.

– చె.బ.పు.

**చేకితానుడు :** ఒక యాదవ రాజు. పాండవుల పక్షాన పోరాడి కృపునితో యుద్ధం చేశాడు. ఈ యుద్ధంలో ఇద్దరూ మూర్ఛపోయారు. – మహాభారతం

**చేదిపురం :** ఉపరిచర వసువు పాలించిన దేశం. మహాభారత కాలంలో శిశుపాలుడు దీన్ని పాలిం చాడు. – చూ॥ మహాభారతం

**చేదిషుడు :** కురువంశజుడు. ఉపరిచర వసువు చివరి కొడుకు.

**చేపలు :** అద్భుతుడు ప్రజలు వీటిని వధించెదరని శాప మిచ్చెను. - చూ॥ మత్స్యముల శాపము.

**చేరుడు :** ఓ సర్పరాజు

**చైకితాయనుడు :** ఇతడు చికితాయనుడి కుమారుడు. ఇతడు శిలకుడూ ఉద్గీథ విద్య గురించి తర్కించు కున్నారు. ఇతనికి సరిగా రానందున శిలకుడి శిష్యుడై ఆ విద్యను నేర్చుకున్నాడు. - చా. ఉ.

**చైతన్యులు :** వర్ణాశ్రమ ధర్మాల్ని నిరాకరించే ఓ వర్గం. వీళ్లకు భక్తి ముఖ్యం. విష్ణుపూజ చేస్తారు. - చాద్యోగ్యం

**చైత్రరథం 1 :** ఒక పర్వతము. - మహాభారతం

**చైత్రరథం 2 :** కుబేరుని ఉద్యానవనం పేరు.

**చైత్రరథుడు :** వాహిని కురులకు జన్మించిన కుమారుడు. - మహాభారతం

**చైత్యకం :** ఇదొక పర్వతం. మగధ రాజధాని అయిన గిరివ్రజం వద్ద వుంది. అక్కడి ప్రజలు దీనిని పూజిస్తారు. - మహాభారతం

**చైత్రుడు 1 :** చిత్రాబుధుల కుమారుడు. ఇతడి కొడుకు అధిరథుడు. - బ్రహ్మపురాణం

**చైత్రుడు :** విక్రాంత హైమినుల కొడుకు. జాతహరిణి అనే పిల్లి పుట్టగనే ఈ శిశువును విశాలపురంలోని బోధకుడనే బ్రాహ్మణుడి భార్య పక్కలో వుంచి గిరిభద్ర శిశువైన చాక్షుషుణ్ణి హైమిని పక్కలో వుంచుతుంది. విక్రాంతుడి కొడుకు చైత్రుడే అని ఛాక్షువు చెప్పగానే ఆ బ్రాహ్మణుడి వద్దనుండి చైత్రుణ్ణి తెప్పించు కుంటాడు. - మార్కండేయ పురాణం

**చైద్యుడు :** చేది దేశపు రాజైన శిశుపాలుణ్ణి ఈ పేరున పిలుస్తారు. దుష్టకేతును కూడా ఇలానే పిలుస్తారు. - మహాభారతం

**చైద్యులు :** యాదవులలో ఒక తెగ. విదర్భుడి కొడుకైన రోమపాదుడి వంశస్థుడైన చేది వల్ల జన్మించారు కనుక చైద్యులు అనేవారు.

**చోళం :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజ్యం. ఈ దేశపు రాజులు రుక్మిణీ స్వయంవరానికి వచ్చారు. అర్జునుడు వీరిని జయించాడు. - మహాభారతం

**చోళుడు :** అశ్రితుని కొడుకు. దుష్యంతుని పౌత్రుడు. ఇతడు పరిపాలించిన దేశమే చోళ దేశము.

**చౌరసులు :** బ్రాహ్మణుల శాపంవల్ల శూద్రులుగా మారిన క్షత్రియులు. పాండ్య, కాండ్య, సిరాఖ్య, లాట, ద్రావిడ, కేరళ, చేర, దర్య, దరద, శౌండ్య, శబర, అర్చర, కిరాత, యవనులందరూ మొదట క్షత్రియులే.

**చంచలాక్షి :** ద్వాపర యుగంలో జీవించిన ఓ వ్యభి చారిణి. ఓ విటుడి కోసం ఓ గుహ వద్ద నిల బడి వుంది. అలా అతని కోసం నిరీక్షిస్తూ వుండగా ఓ ముంగిస ఈమెను చంపగా యమభటులు, విష్ణు సేవకులు ఆమెను తీసుకొని వెళ్లానికి వస్తారు. ఆమె ఒకసారి గుడిలో గోడలను సున్నంతో కడిగి శుభ్రం చేసింది కనుక స్వర్గానికే చెందుతుందని యమభటు లతో వాదించి స్వర్గానికి చేరుస్తారు. - పద్మపురాణం

**చండకుడు :** ఓ ఆటవిక వేటగాడు. శివలింగ ప్రార్థనతో ముక్తి లభించినవాడు. ఒకరోజు చండకుడు వేటకు అడవికి వెళ్లి అక్కడ శిథిలమై పోయిన ఒక శివాలయాన్ని చూస్తాడు. ఈ దృశ్యం అతన్ని బాధించి పాంచాల రాజు కుమారుడైన సింహకేతువుకు నివేదించగా చండకులకు కూడా శివుడిని ప్రతిష్టించి రోజు ప్రార్థిం చేందుకు శాస్త్రాలు అనుమతిస్తున్నాయి. కాకుంటే ప్రతిరోజు స్మశానం లోని బూడిద శరీరం మీద రాసు కొని పూజించాలని చెప్తాడు. అలాగే చండకుడు ఓ రాతి కొండపై విగ్రహాన్ని ప్రతిష్ఠించి అతడు అతని భార్య పులింది ప్రతిరోజు స్మశానవాటిక నుండి తెచ్చిన బూడిద రాసుకొని పూజించేవారు. కొన్ని రోజులకు బూడిద లేదు. అప్పుడు పులింది నేను అగ్నికి ఆహుతి అవుతాను ఆ బూడిదను ఉపయోగించి శివపూజ చేయమని భర్తను కోరగా అయిష్టంగానే ఒప్పుకున్నాడు. మరునాడు పులింది బూడి దతో పూజచేసి సాయంత్రం బిగ్గరగా పులింది పులింది అని రోదించగా ఎదురుగానే ఇంతకు ముందుకంటే ఆరోగ్యంగా నిలబడివుంది. అంతేకాకుండా ఓ విమానం వచ్చి వారిద్దరిని శివలోకం తీసుకొని వెళ్లింది. - శివపురాణం

**చండకౌశికుడు :** ఇతడో మహర్షి. ఇతని అనుగ్రహం వల్లే బృహద్రథుడికి సంతానం కలుగుతుంది. ఆ సంతానమే జరాసంధుడు. ఇతడి జన్మానంతరం చండకౌశికుడు మగధకు వచ్చి ఇతడో బలవంతుడైన రాజవుతాడని దీవిస్తాడు. మగధరాజులకు చాలా కాలం సలహాదారుగా వున్నాడు. - మహాభారతం

**చండతుండసుడు :** గరుడుని కుమారుల్లో ఒకడు.

**చండదేవుడు :** ఇతడు మతంగుడనే బ్రాహ్మణుడు. ఇంద్రుడి వరంవల్ల కామరూపం పొంది చండదేవుడిగా ప్రసిద్ధి చెంది సుస్త్రీల పూజలు పొందుతుండేవాడు.

**చండబలుడు :** ఇదో ప్రముఖ వానరం. రామరావణ యుద్ధంలో ఇది కుంభకర్ణుడిని మిక్కిలి బాధించింది.
– రామాయణం

**చండభార్గవుడు :** చ్యవనముని వంశంలో జన్మించిన విశిష్ట బ్రాహ్మణుడు. గొప్ప పండితుడు. జనమేజయుని సర్పయాగం నిర్వహించిన మహర్షి. వేదాలను లోతుగా అధ్యయనం చేసినవాడు. – మహాభారతం

**చండమహాసేనుడు :** ఉజ్జయినిని పాలించిన రాజుల్లో సుప్రసిద్ధుడు, ఉదయనుని భార్య వాసవదత్త ఇతని కుమార్తె.

**చండముండులు :** వీరు రాక్షస సోదరులు. ఇతర రాక్షసుల్ని సమీకరించి జీవితాన్ని గడిపి తర్వాత శుంభనిశంభుల సేవకులయ్యారు. పార్వతి అంశ ఐన కౌశికను చూసి ఆమె అందాన్ని శుంభనిశుంభులతో చెప్తారు. చివరకు వీరు దేవి చేతిలో మరణిస్తారు. – మార్కండేయ పురాణం

**చండవేగుడు :** ఓ గంధర్వుడు. – చూ॥ పురంజనుడు

**చండామార్కులు :** రాక్షస గురువైన శుక్రాచార్యుని కుమారులు. దైత్యులకు పురోహితులు. ప్రహ్లాదుడికి గురువులు. – *భాగవతం*

**చండాలుడు :** చూ॥ చాతుర్వర్ణ్యం.

**చండిక 1 :** పార్వతి దేహంనుండి పుట్టిన దేవి. ఈమె చండుని చంపుటచే చండిక అని పేరు వచ్చెను. ఆ రాక్షసులను చూడగనే ఆమె ముఖము నల్లబడి అందుండి కాళి ఉద్భవించెను. కాళికూడా యద్ధము చేసి రక్తభోజుని చంపి అతని రక్తము క్రిందపడకుండా త్రాగివేసెను. – మార్కండేయ పురాణం

**చండిక 2 :** ఈమె ఉద్దాలకుడను బ్రాహ్మణుని భార్య. ఈమె దుష్ట చింతన పరురాలు. భర్త ఏది చెప్పినా తద్విరుద్ధమైన పనులు చేయుచుండెడిది. ఇది గమనించి అతడు తనకు కావలసినదానికి వ్యతి రేకముగా చెప్పుచుండెడివాడు. ఒకనాడు పితృ కార్యము రాగా నీవు స్నానము చేయక అశుచివై వంటచేయమని చెప్పగా ఆమె స్నానంచేసి శుచియై వంటచేసెను. ఇది చూసి అతడు ఆనందపరవశుడై తన ఉపాయము మరచి పితృలకు పిండ ప్రదానము చేయమని కోరగా ఆమె వాటిని పెంటకుప్పపై పడవేసెను. ఉద్దాలకుడు కోపించి నీవు "వింధ్యాటవియందు శిలవై వుండుమని" శపించెను. ఆమె ప్రాధేయపడగా ధర్మజుని అశ్వమేధ యాగ సమయమున అశ్వము నిన్ను తొక్కినపుడు శాపవిమోచనము కల్గునని అను గ్రహించెను.
– *జైమిని భారతం*

**చండుడు :** శుక్రుడి కొడుకు. రాక్షసులకు యాజ్ఞికుడు. హిరణ్యకశిపుడి కోరికపై ప్రహ్లాదుడికి విష్ణుద్వేషం పెంచడానికి ప్రయత్నించి విఫలుడౌతాడు. – *భాగవతం*

**చందన :** అంగదేశం నుండి ప్రవహించే ఓ నది.
– *మహాభారతం*

**చంద్ర :** ఒక నది. – *మహాభారతం*

**చంద్రకాంత :** వేదరాశి అను బ్రాహ్మణుడి భార్య. ఓ జారిణి ప్రోత్సాహం వల్ల జారిణిగా మారగా అతడు ఇంటినుంచి గెంటేస్తాడు. ఈమె అలాగే జారిణిగా జీవించి కొంతకాలానికి మరణించి దాసిగా జన్మిస్తుంది. ఒకసారి కావేరీ నదికి వచ్చి అచట స్నానం చేస్తూ దాని మహిమ బ్రాహ్మణుల వల్ల విని స్వర్గం చేరుతుంది. – అగ్నిపురాణం

**చంద్రకేతుడు 1 :** శ్రీరాముని సోదరుడైన శత్రుఘ్నుని కుమారుడు. శృతకీర్తి వల్ల శత్రుఘ్నునికి ఇద్దరు కుమారులు. ఒకడు చంద్రకేతుడు. రెండోవాడు అంగదుడు.

**చంద్రకేతుడు 2 :** ఓ విద్యాధర రాజు.

**చంద్రగుప్తుడు 1 :** రావణుని రెండవ కుమారుడు. ఇతడొకసారి సుగ్రీవుని కూతుర్ని, విభీషణుడి కోడల్ని అపహరించగా శ్రీరాముని ఆజ్ఞపై హనుమంతుడు వారిని విడిపిస్తాడు. – *కంభ రామాయణం*

**చంద్రగుప్తుడు 2 :** ఇతడు కార్తవీర్యార్జునుని మంత్రి. సుశీల అనే దేవతా గోవువల్ల సుష్టిగా తిని సుశీలను బలవంతంగా తీసుకురాబోగా అది ఆకాశంలోకి మాయమవుతుంది. చంద్రగుప్తుని సేవకులు పిల్లగోవును బలవంతంగా ఎత్తుకుపోతుంటే జమదగ్ని అడ్డుపడగా అతణ్ణి చంద్రగుప్తుడు తన ఖడ్గంతో ఖండిస్తాడు.
– చూ॥ కార్తవీర్యార్జునుడు

**చంద్రగుప్తుడు 3 :** నందుడి దాసి కుమారుడైన మౌర్యుడి కొడుకు పాటలీపుత్రరాజు ఇతణ్ణి అనాదరిస్తాడు. ఓ బ్రాహ్మణుడైన చాణుక్యుడ్ని కూడా నందుడు అవమానించగా చంద్రగుప్తుడు చాణుక్యుడు ఏకమై నందులను ఓడించి చాణుక్యుడు చంద్రగుప్తుడ్ని మగధ రాజ్యానికి రాజుని చేస్తాడు. అచటినుండి మౌర్యవంశస్తులే ఈ రాజ్యాన్ని పాలించారు. బౌద్ధమతాన్ని స్వీకరించి ప్రచారం చేసిన అశోక చక్రవర్తి ఇతని మనుమడు. – *ముద్రారాక్షసం*

**చంద్రగుప్తుడు 4 :** శ్రీశైలం దగ్గర రాజు. సౌందర్యవతి అని తన కూతుర్నే మోహించగా ఆమె పారిపోయి శ్రీశైలంలో శివునిలో ఐక్యమవుతుంది. – *శ్రీశైలమహాత్యం*

**చంద్రగుప్తుడు 5 :** శృంగార శేఖరుడి నగరంలోని ఓ బ్రాహ్మణుడు. రాజు కుమార్తె రాగమంజరి, దండనాయకుడి కుమార్తె మదనరేఖ ఇతణ్ణి ప్రేమించగా రాజాజ్ఞతో వీరినేకాక పురోహితుని కూతురైన శీలవతినికూడా వివాహం చేసుకుంటాడు. వరరుచి, భట్టి, భర్తృహరి ఇతని కుమారులు. – *విక్రమాంకదేవ చరిత్ర*

**చంద్రప్రభ :** సోమప్రభ తల్లి. – *చూ॥ సోమప్రభ*

**చంద్రభాగ :** ఇదొక నది. ఇది పుట్టిన పర్వతాలపై బ్రహ్మచంద్రుణ్ణి విభజించాడు.

**చంద్రమతి 1 :** హరిశ్చంద్ర మహారాజు భార్య. ఈమె పతిభక్తి పరాయణురాలు. – *చూ॥ హరిశ్చంద్రుడు*

**చంద్రమతి 2 :** ఇదోనగరం. లక్ష్మణునికి ఊర్మిళ వల్ల ఇద్దరు కుమారులు. ఒకరు తక్షకుడు రెండో వాడు చిత్రకేతుడు. పశ్చిమతీరాన మ్లేచ్ఛులను జయించి చంద్రమతి నగరాన్ని నిర్మించి దానికి చిత్రకేతుణ్ణి రాజుని చేశాడు. – *ఉత్తరరామాయణం*

**చంద్రమసుడు :** ఓ రుషి. ఇతడు సంపాతికి ఆత్మజ్ఞానాన్ని బోధించి జటాయువుకి సీతాన్వేషణకు వానరులకు దారి చూపమని చెప్పాడు. – *రామాయణం*

**చంద్రరేఖ :** ఒక అప్సరస

**చద్రలోకం :** స్వర్గంలో పితరులుండే లోకం. దీన్ని పితృలోకమని అంటారు.

**చంద్రవక్రుడు :** చంద్రకేతుడి మరోపేరు.

**చంద్రవతి :** చంద్రగుప్తుడను రాజు కుమార్తె. ఈమె రూపమును జూచి తండ్రే మోహింపగా ఈమె శ్రీశైల మేగి శివుని గూర్చి ప్రార్థన చేసెను. శివుడు ప్రత్యక్షం కాగా తన వద్దనున్న మల్లికాథామము శివునికిచ్చి అతనితో ఐక్యమును కోరెను. ఆ దండను తీసుకొని శివుడామెను తనలో ఐక్యము చేసుకొనెను. కావున మల్లికార్జునుడయ్యెను. – *భో. మహాత్మ్యము*

**చంద్రవత్సం :** చంద్రవత్సుడనే రాజునుండి ఉదయించిన ఓ క్షత్రియవంశం. – *మహాభారతం*

**చంద్రవర్మ :** ఇతడు కాంబోజ రాజు. చంద్రుడనే రాక్షసుడి కులంలో పుట్టాడు. దృష్టద్యుమ్నుడి చేతిలో మరణించాడు. – *మహాభారతం*

**చంద్రవంశం :** ద్రుహ్యు, అనుద్రుహ్యు, పూరు వంశాలన్నీ చంద్రవంశం నుంచి పుట్టినవే. అనుద్రుహ్యుని సంతతిలోని ప్రముఖులు మహామానస, ఉశీనర, తితిక్షులు, ఉశీన, చంద్ర వంశానికి మూలపురుషులనవచ్చు. ఉశీనరుని పుత్రుల్లో శిభి ఒకడు. శిభికి 5 గురు పుత్రులు భద్ర, సువీర, కేకయ, వృషదర్ప, కపోతరోములు. కేకయ పుత్రులు కీచకులు.

*తితిక్షుని వంశవృక్షం :* కృశరథ – హోమ – సుతపాసు – బలి. ప్రతిరథ, సింధురథ, రుక్ష, సుదాను, జహ్నూ, బృహదిశు, నీల, యదు వంశాలన్ని చంద్రవంశంలో శాఖోపశాఖలే. పై రాజ వంశాలన్ని చంద్రవంశంలోనివే. – *అగ్నిపురాణం*

**చంద్ర వినాశనుడు :** ఓ రాక్షసుడు. జానకి అనే రాజుగా ప్రఖ్యాతుడు. – *మహాభారతం*

**చంద్రశర్మ 1 :** మాయాపురంలో అగ్నిహోత్ర వంశంలో జన్మించిన బ్రాహ్మణుడు. దేవశర్మకు శిష్యుడు, అల్లుడు. దర్భలకోసం అడవికి వెళ్లి రాక్షసుల చేతిలో ఇద్దరు మరణిస్తారు. ద్వాపర యుగంలో ఇతడు అక్రూరుడిగా జన్మిస్తాడు. – *పద్మపురాణం*

**చంద్రశర్మ 2 :** ఇతడు పాపి. గురుహత్య చేసిన వాడు. నాలుగు పాపాలు వరుసగా బ్రహ్మహత్య, గురుహత్య, అగమ్యగమన, గోహత్య. బ్రాహ్మణ హత్యచేసిన విదురుడు, అగమ్యగమనం (పరస్త్రీ సంగమం) చేసిన వేదశర్మనుడు, గోవధ చేసిన వైశ్యుడైన వణుజులుడు కలిసి తమ తమ పాపాలను ఒకరి కొకరు వివరించు

కొని బాధపడు తుండగా ఓ సిద్ధుని సలహాపై గంగా నదిలో స్నానం చేసి పాపవిముక్తి పొందుతారు. ఈ నల్గురు పాపుల్లో గురుహత్య చేసినవాడు చంద్రశర్మ.
– పద్మపురాణం

**చంద్రశేఖరుడు :** పౌష్యుని పుత్రుడు. ఒకరాజు. పౌష్యుడికి సంతానం లేక శివుని గూర్చి ప్రార్థించగా అతడు ప్రత్యక్షమై ఓ ఫలాన్ని ఇచ్చాడు. అది అతని ముగ్గురు భార్యలకు కోసి పంచాడు. ముగ్గురు ప్రస వించి మూడు భాగాలకు జన్మనివ్వగా వాటిని కలిపి తేనే సంపూర్ణ శిశువయ్యాడు. అతడే చంద్ర శేఖరుడు. అందువల్ల అతణ్ణి త్ర్యంబకుడు అనికూడా అనేవారు. కకుత్సుతుని కూతురు తారావతిని వివాహమాడాడు. కపోతముని శాపంవల్ల మహాకాలుడు జన్మించారు. వీరు గాక దమ, ఉపరిచర, అలర్కులు ఇతని ఔరస పుత్రులు. – పద్మపురాణం

**చంద్రశ్రీ :** ప్రతిష్ఠానపురంలోని ఓ వైశ్యుడి భార్య. భర్త వుండగనే కిటికీలోనుండి ఓ యువకుడ్ని చూసి వ్యామోహంలోపడి అతనితో సంబంధం నెరపుతుంది. చాలాకాలం అలా గడిపి తను మంచం మీద పడి వున్నా ఆ సంబంధం ఒదులుకోదు. ఊరిలో వారంద రికి తెలిసినా తన భర్తకు తెలియదు. ఒకరోజు విటుడితో వుండగా తన భర్త చనిపోయాడని తెలిసి వెంటనే భర్తతో పాటు సతీసహగమనము చేస్తుంది. పరపురుష వ్యామోహం తాత్కాలికమని భర్తమీద అభిమానం శాశ్వతమని ఈ కథచెప్తుంది.
– కథాసరిత్సాగరం

**చంద్రసీత :** స్కందదేవుని అనుచరి. – మహాభారతం

**చంద్రస్వామి :** ఇతడో బ్రాహ్మణుడు. సూర్యుని ప్రార్థించి సుఖజీవనం గడిపాడు. కమలవర్మని రాజ్యంలో నివసించేవాడు. భార్య దేవమతి. కుమారుడు మహీ పాలుడు, కూతురు. చంద్రమతి ఆ దేశం కరువుకాట కాలతో నిండివుండగా భార్యను ఇంటివద్ద వదలి పిల్లలతో మామగారి ఇంటికి బయలుదేరి ఓ అరణ్యంలో చిక్కుకుంటాడు. అతడు దారితప్పి ఓ ఆటవిక రాజు చేతికి చిక్కుతాడు. ఏడుస్తున్న పిల్లల్ని తారాపుర రాజు వద్ద మంత్రి అయిన అనంతస్వామి కాపాడి తన రాజ్యానికి తీసుకువెళ్తాడు. చంద్రస్వామిని బలి ఇవ్వబోగా సూర్యుడు అతణ్ణి రక్షిస్తాడు. పిల్లలకోసం ఎన్నో దీవులు వెదకి చివరికి తారాపుర రాజువద్ద వున్న తన పిల్లల్ని కలుసుకుంటాడు. ఆ రాజు తన కూతుర్ని చంద్రస్వామి కుమారుడైన మహీపాలుడి కిచ్చి వివాహం చేసి అర్థరాజ్యం ఇస్తాడు. తర్వాత తన భార్యను కూడా తీసుకొని వచ్చి ఆ రాజ్యంలోనే సుఖంగా జీవిస్తాడు. – కథాసరిత్సాగరం

**చంద్రసేనుడు 1 :** సింహళ దేశ రాజు. ఇతనికి ఇద్దరు కుమార్తెలు. వారు మండోదరి, ఇందుమతి. కంభ గ్రీవుడు మండోదరిని వివాహమాడతాననగా నిరాక రించింది. కోసల దేశ రాజైన వీరసేనుడిని కూడా వివాహమాడటానికి నిరాకరించి తనకు వివాహం చేసుకోవడమే ఇష్టం లేదని చెప్పగా రెండవ కుమార్తె ఇందుమతి స్వయంవరంలో అందగాడైన సుదేష్ణుడ్ని వివాహం చేసుకుంది. అతడు అందగాడే కాని తిరుగు బోతు. ఈమె పరిచారికతో అతడు అక్రమ సంబంధం పెట్టు కోవడం చూసి అతణ్ణి వదలి తండ్రి వద్దకు వచ్చేసింది. మహిషాసురుడు స్త్రీలు ఆలోచనల్లో బల హీనులని చెప్పడానికి ఈ కథ చెప్తాడు.
– దేవీభాగవతం

**చంద్రసేనుడు 2 :** ఉజ్జయినీ రాజు. గొప్ప శివ భక్తుడు. దానధర్మాలు చేసేవాడు. ఇతని భక్తికి మెచ్చి శివుడు తన సేవకుడి ద్వారా ఓ మణిని బహూకరిస్తాడు. దానికి ప్రకృతికందని శక్తులున్నాయి. దాన్ని కొన డానికి ఎందరో రాజులు ప్రయత్నించినా అతడు అమ్మడు. రాజులందరు ఇతనిపై పగబట్టి ఇతడిమీదకు దండెత్తగా ఉజ్జయినిలోని మహాకాళి గుడిలో దాక్కుంటాడు. అందులో శివుని విగ్రహంవుంది. శివుడు ప్రత్యక్షమై ఇతనికి ముక్తిని ప్రసాదిస్తాడు. – శివపురాణం

**చంద్రసేనుడు 3 :** ఇతడు సముద్రసేనుని కొడుకు. ద్రౌపది స్వయంవరంలో పాల్గొంటాడు. ఇతడ్ని ఇతడి తండ్రిని భీమసేనుడొకసారి జయించగా ఇతడు పాండవులతో సఖ్యతగా వుండి కురు క్షేత్రంలో పాండ వుల తరపున పోరాడి అశ్వత్థామ చేతిలో మరణిస్తాడు.
– మహాభారతం

**చంద్రసేనుడు 4 :** ఇతడు కౌరవుల స్నేహితుడు. ఇతడు శల్యుని రథ చక్రాలు రక్షించేవాడు. ధర్మజు డితణ్ణి వధిస్తాడు. – మహాభారతం

**చంద్రహర్త :** దక్ష ప్రజాపతి కూతురైన సింహికకు కశ్యపుని వల్ల జన్మించిన కుమారుడు.
- *మహాభారతం*

**చంద్రహంతుడు :** ఓ రాక్షసుడు. పునర్జన్మలో శునక రాజుగా జన్మించాడు. - *మహాభారతం*

**చంద్రహాసుడు :** కేరళ రాజు కుమారుడు. చిన్నతనంలోనే ఇతని తండ్రిని శతృవులు చంపుతారు. తల్లి చనిపోతుంది. ఇతడు అనాథ బాలుడిగా కుంతల దేశం వస్తాడు . కుంతల దేశ మంత్రియైన దుష్టబుద్ధి ఇతణ్ణి గుర్తించి ఎప్పటికైన ప్రమాదమని ఇతణ్ణి చంపమని కింకరులను పంపుతాడు. వారు జాలిపడి అతనికి ఆరువేళ్లు వుంటే ఒకదానిని నరికితెచ్చి అతనిని చంపిన గుర్తుగా చూపుతారు. మకరధ్వజుడు, పద్మాక్షుడు ఇతని కుమారులు. - *జైమిని భారతం*

**చంద్రహాసం :** రావణుని ఖడ్గం పేరు. రావణుడు కైలాసాన్ని ఎత్తి అవతలకు విసురుదామని తన 20 చేతులు పర్వతం క్రింద పెట్టగా శివుడు పర్వతాన్ని క్రిందకు నొక్కుతాడు. ఆ చేతులు బయటకు రాక శివుణ్ణిగూర్చి వెయ్యేళ్ళు ప్రార్థిస్తాడు. శివుడు ప్రత్యక్షమై ఇతనికి చంద్రహాసమనే ఖడ్గాన్ని ప్రసాదిస్తాడు.
- *ఉత్తర రామాయణము*

**చంద్రాంగదుడు :** చిత్రవర్మ అల్లుడు. ఇతడు నలుని కుమారుడైన ఇంద్రసేనుని కుమారుడు
- *చూ॥ సీమంతిని*

**చంద్రాపీడుడు :** జనమేజయుని కుమారుల్లో ఒకడు. ఇతని పుత్రుడు సత్యకర్ణుడు. - *భవిష్య పురాణం*

**చంద్రావతి :** హరిశ్చంద్రుని పూర్వజన్మలో అతని భార్యల్లో ఒకరు. - *చూ॥ హరిశ్చంద్రుడు*

**చంద్రావలోకుడు :** చిత్రకూట నగరపు రాజు. కణ్వుడి కూతురు ఇందీవర ప్రభను వివాహమాడతాడు. జంతువధ చేయనని కణ్వాశ్రమంలో ప్రతిజ్ఞ చేస్తాడు.
- *కథాసరిత్సాగరం*

**చంద్రాశ్వుడు :** ఇక్ష్వాకు వంశంలోని కువలయాశ్వుని కుమారుడు. ఇతనికి మరో ఇద్దరు సోదరులు. ఒకడు దృఢాశ్వుడు రెండోవాడు కపిలాశ్వుడు.
- *మహాభారతం*

**చంద్రుడు 1 :** సూర్య వంశంలో జన్మించిన విశ్వరంధి కుమారుడు. ఇతని కుమారుడు యువనాశ్వుడు.

**చంద్రుడు 2 :** క్షీరసాగర మదనంలో వెలువడిన అమూల్య వస్తువుల్లో చంద్రుడొకడు. అందునుండి జనించిన ఇతరాలు : మహాలక్ష్మి, సురా, ఉచ్ఛైశ్వరం, కౌస్తుభం, పారిజాతం, కామధేనువు, ధన్వంతరి, అమృతం, కాలకూతం. - *మహాభారతం/విష్ణుపురాణం*
పాపాల దేవత జ్యేష్ట, ఐరావతం, చింతామణి, అప్సరసలైన తార, రుమ కూడా ఇందుండి జనించారు.
- *కంభ రామాయణం*

**చంద్రుడు 3 :** చూ॥ చంద్రవర్మ

**చంద్రుడు 4 :** అనసూయ అత్రిమహర్షులకు పునర్జన్మించిన బహ్మే చంద్రుడు. - *దేవీభాగవతం*
దేవ పురోహితుడైన బృహస్పతి భార్య తార ఓసారి చంద్రుడి వద్దకు వచ్చి అతని అందానికి ముగ్ధురాలై అతనితోనే వుండిపోయింది. వారిద్దరూ సుఖ సంతోషాలతో కాలం గడిపారు. ఇది తెలిసిన బృహస్పతి తన శిష్యుల్ని చంద్రుడి వద్దకు తారను పంపమని కబురు చేయగా అతడు తిరస్కరించాడు. పదే పదే పంపి విఫలుడై తనే చంద్రుని ఇంటికి వచ్చి తారను పంపమని అడగగా చంద్రుడు నిరాకరిస్తాడు. బ్రాహ్మణహత్య, బంగారాన్ని దొంగతనం చేసేవాడు, త్రాగుబోతు, ఇతరుల భార్యలను వివాహం చేసుకున్నవాడు పాపులని వారు దేవలోకంలో వుండదగరని చెప్తాడు. చంద్రుడు ఆమె ఇష్టప్రకారం వచ్చిందని తన కిష్టమైతే వెళ్లవచ్చుగాని తనకు తానుగా పంపనని నిశ్చయంగా చెప్తాడు. బృహస్పతి శపిస్తానన్నా వినడు. కొంతకాలం తర్వాత బృహస్పతి చంద్రుని వద్దకు వెళ్లబోగా ద్వారపాలకులు అడ్డగిస్తారు. బృహస్పతి ఇంద్రునికి తన బాధ చెప్పుకోగా ఇంద్రుడు చంద్రుడిపై యుద్ధం ప్రకటించాడు. ఇదే అదనుగా శుక్రాచార్యుని సలహాపై రాక్షసులు చంద్రునికి సహాయపడగా వీరిద్దరి మధ్య యుద్ధం జరిగింది. బ్రహ్మ వచ్చి ఆ యుద్ధాన్ని ఆపి తారను బృహస్పతికి ఇప్పించాడు. అప్పటికే గర్భవతియైన తార ఓ అందమైన బాలుడికి జన్మనిచ్చింది. చంద్రుడు,

బృహస్పతి ఆ బాలుడు తమకే చెందుతాడని మరల వాగ్వాదం జరపగా బ్రహ్మ తారను ఎవరి పుత్రుడని అడుగగా అతడు చంద్రుడి పుత్రుడేనని చెప్పగా బ్రహ్మ అతణ్ణి చంద్రుడికి అప్పచెప్తాడు. – దేవీభాగవతం

చంద్రుడు దక్షుని 27 మంది కూతుర్లను పెండ్లాడ తాడు. ఈ భార్యలే 27 నక్షత్రాలు. అవి అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, జనకం, ఫాల్గుణం, ఉత్తరాఫాల్గుణి, హస్త, చిత్ర, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రోణ, స్రావిష్ఠ, ప్రచేతసు, పూర్వప్రోష్ఠాపాద, ఉత్తర ప్రోష్ఠాపాద రేవతి.

*గ్రహణాల చరిత్ర :* క్షీరసాగర మదనంలో అమృతం ఇతర అమూల్య వస్తువులు బయటకు రాగా దేవ దైత్యులు అవి పంచుకొనే పనిలో వుండగా సైంహికే యుడను మాయావి అమృత కలశాన్ని పాతాళానికి ఎత్తుకుపోగా మహావిష్ణువు మోహినీ రూపంలో అతడి నుండి అమృతకలశం తెచ్చి దేవతలకిచ్చాడు. దేవతలు దాన్ని పంచుకొని సేవిస్తుండగా ఆ రాక్షసుడు బ్రాహ్మణ రూపుడై వచ్చి తనూ అమృతం సేవిస్తుండగా సూర్యచంద్రులు కనుగొని మహావిష్ణువుకు చెప్పగా సుదర్శన చక్రంతో వారి కంఠం ఖండించాడు. తల మొండెం వేరై తాగిన అమృతం మెడకు పైభాగంలో కొంత క్రింద భాగంలో కొంతవుండి కొన్ని చుక్కలు క్రింద పడ్డాయి. ఆ చుక్కలు ఎర్రవుల్లి, తెల్లవుల్లిగా జన్మిం చాయి. రక్తంనుండి జనించినవి కనుక ఎర్రవుల్లని కొందరు బ్రాహ్మణులు స్వీకరించరు. తలా మొండెం విడిపోయినవే రాహు కేతువులు. సూర్యచంద్రులపై కోపంతో అవకాశం వచ్చిన ప్పుడు వారిని మింగు తారు. తెగిన రంధ్రం నుండి సూర్యచంద్రులు బయట పడుతూ వుంటారు. అవే సూర్యచంద్ర గ్రహణాలు – *భాగవతం*

పృధు చక్రవర్తి కాలంలో పృధువు భూమిని గోవుగా మార్చి తర్వాత దేవతలు కూడా భూమిని గోవుగా మార్చగా చంద్రుడు పిల్లగా మారి పాలుపిండాడు. దీనికి సంతోషించిన బ్రహ్మ చంద్రుడ్ని నక్షత్రాలకు, రాజుని చేశాడు. – *హరివంశం*

అష్టవసువుల్లో చంద్రుడొకడు. అతనికి 4 కుమారులు. వర్చసుడు, శిశిరుడు, ప్రాణ, రమణులు. వర్చసుడే అభిమన్యుడిగా పునర్జన్మించాడు. – మహాభారతం

**చంద్రోదయుడు :** విరాటరాజు సోదరుడు. – మహాభారతం

**చంపకమాల :** కుంతలదేశ రాజు కుమార్తె. చంద్ర హాసుని భార్య. – *జైమిని భారతం*

**చంపకారణ్యం :** ఉత్తర భారతదేశంలోని ఒక పవిత్ర స్థలం. ఇక్కడో రోజు వుండి స్నానం చెయ్యడం వల్ల వెయ్యి గోవులను దానం చేసిన ఫలితం వస్తుంది. – మహాభారతం

**చంపకుడు :** 'చపుడు' నే చంపకుడని అంటారు. – చూ॥ చపుడు

**చంపానగరం :** చంపుడు నిర్మించిన నగరము.

**చంపు :** ఓ కథను చెప్పే రీతి. ఇది గద్య పద్యాల సమ్మిశ్రమం. సంస్కృత భాషలోనే కాకుండా మళయాల భాషలో చంపూకావ్యాలు ప్రసిద్ధి చెందాయి. మళయాళంలో పునం, నంబూతిరి, నీలకంఠలు చంపూ కావ్యాలు వ్రాసిన ప్రసిద్ధులు.

**చంపుడు 1 :** అంగ వంశంలో జన్మించిన ఒక రాజు

**చంపుడు 2 :** హితుని కుమారుడు. ఇతడు తన పేర చంపానగరము నిర్మించెను. ఇతని పుత్రుడు సుదేవుడు. – *భాగవతం*

**చంపుడు 3 :** పృధులాక్షుని కుమారుడు.

**చాంద్రమసి :** బృహస్పతి భార్య తారకు మరోపేరు చాంద్రమసి. చంద్రునితో ప్రేమలోపడి అతనితో కొంతకాలము జీవించినందువల్ల ఆమెకా పేరు వచ్చెను. – మహాభారతం

**చాంద్రవ్రతం :** ధనుర్మాసంలో పౌర్ణమి రోజున చేసే వ్రతం. దీనివల్ల అందం, ఆనందం, ప్రఖ్యాతి వస్తుంది. – మహాభారతం

**చాంద్రాయణం :** ఓ వ్రతం. – చూ॥ వ్రతాలు

**చాంపేయుడు :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు. బ్రహ్మవాది. – మహాభారతం

**చింతామణి :** ఇదో వజ్రం. క్షీరసాగర మదనంలో ఐరావతం, ఉచ్చైశ్వరంలాంటి ప్రతిష్ఠాత్మకమైన వాటితో పాటు బయటకు వచ్చింది. – *కంభ రామాయణం*

**చెంకణ్ణరాజు :** చూ॥ జంబుకేశ్వరుడు

**చెంబు :** శివుని వీర్యం గంగలో పడినప్పుడు సుబ్రహ్మణ్య స్వామి జన్మించాడు. గంగనుండి ఆ తర్వాత బంగారం, వెండి ఉద్భవించాయి. ఆ వేడి నుండి ఇనుము, రాగి వెలువడినాయి. రాగినే చెంబు అంటారు.

**చ్యవన సరోవరం :** ఇదో పుణ్యస్థలం. పితృదేవతలను పూజించడానికి ఇది సరైన వేదిక. – మహాభారతం

**చ్యవనాశ్రమం :** ఇదో పుణ్యస్థలం. కాశీరాజు కుమార్తె అంబ ఇక్కడే నిత్యం స్నానం చేసేది. – మహాభారతం

**చ్యవనుడు :** భృగుని కుమారుడు. ఇతని తల్లి పులోమ. పులోముడను రాక్షసుడు ఆమె వివాహమునకు పూర్వమే ప్రేమించి నిరాశ చెంది వివాహానంతరం వరాహ రూపమున గర్భిణిగా వున్న పులోమను ఎత్తు కొని పోగా గర్భంలోని శిశువు క్రిందపడెను. ఆ శిశువు తీక్షణ దృష్టికి రాక్షసుడు మసి అయ్యెను. ఆ బిడ్డే చ్యవనుడు. ఇతడు పెక్కేండ్లు తపస్సుచేయగా అతడు చుట్టూ పెరిగిన పుట్టలో మునిగి పోయెను. రాజు శర్యాతి తన సేనతోను, కుమార్తె సుకన్యతోను ఆ ప్రదేశమున సంచరించుచుండగా ఆ పుట్టనుండి వచ్చు కాంతిని చూసి సుకన్య ఆ పుట్టను తవ్వగా చ్యవనుడు గుడ్డివాడయ్యెను. అందువల్ల శర్యాతి రాజ్య ప్రజలకు అనేక వ్యాధులు సంభవించెను. కారణం తెలుసుకున్న రాజు చ్యవనుని నివారణో పాయము కోరగా సుకన్యను తనకిచ్చి వివాహము చేయమని కోరెను. రాజు అయిష్టముగనే కుమార్తెనడుగగా ఆమె అంగీకరించి చ్యవనుని వివాహమాడెను. ఆమె అతనికి సపర్యలు చేయుచూ కాలము గడిపెను.

ఒక రోజు సుకన్య నదిలో స్నానంచేసి వస్తుండగా ఇంద్రునిచే సోమం నిరాకరించబడిన అశ్వనీ దేవతలు ఈమె అందాన్ని చూసి ముగ్ధులై తమను వివాహ మాడమని అట్లయిన నీ భర్తను యువకుడ్ని చేస్తామని గుడ్డితనంకూడా పోతుందని మేమిద్దరము, చ్యవనుడు నదిలో మునిగిన తర్వాత నీ ఇష్టం వచ్చిన వారిని వివాహం చేసుకోవచ్చునని చెప్పారు. అందుకు నిరాక రించి చ్యవనునితో చెప్పగా అతడు వారి ప్రతి పాదనకు అంగీకరించమని చెప్తాడు. వీరు ముగ్గురు నదిలో మునిగి ముగ్గురు యువకులు బయటకు రాగా సుకన్య తన భర్తను గుర్తించి అతనినే వరిస్తుంది. చ్యవనుడు అశ్వనీ దేవతలకు ఇంద్రుడు సోమాన్ని నిరాక రించిన కథవిని తనే యజ్ఞంచేసి సోమాన్ని అశ్వనీ దేవతలకు ఇవ్వబోగా ఇంద్రుడు ఆగ్రహించి దేవతలతో వచ్చి చ్యవనుని తన ఖడ్గంతో ఖండించ బోతాడు. చ్యవనుని చూపుకు ఖడ్గం నిశ్చలమై ఇంద్రుని కాళ్లుకూడా కదలక విగ్రహ స్వరూపుడవు తాడు. తక్కిన దేవతలు పారిపోతారు. ఇంద్రుడు బృహస్పతిని ప్రార్థించగా చ్యవనుని శరణువేడమని చెప్తాడు. చ్యవనుడు తను సృష్టించిన దయ్యాన్ని ఖండించి ఇంద్రుణ్ణి రక్షిస్తాడు. – మహాభారతం



**ఛత్రకేతుడు :** ఊర్మిళవల్ల లక్ష్మణుడికి జన్మించిన రెండవ కుమారుడు. పెద్దవాడు తక్షకుడు. శ్రీరాముడు అరణ్య వాసానంతరం తూర్పు సముద్రతీరంలో అగతి అనే రాజ్యాన్ని స్థాపించి తక్షకుని రాజుని చేశాడు. అదే అగతి. దానికి పడమరన మ్లేచ్ఛులను జయించి అక్కడ చంద్రమతి అనే రాజ్యాన్ని స్థాపించి దానికి ఛత్రకేతుణ్ణి రాజుని చేశాడు. – ఉత్తర రామాయణం

**ఛత్రవతి :** ప్రాచీన భారతదేశంలో అహిఛత్రదేశం కలదు. దీని ముఖ్యపట్టణం ఛత్రవతి. ఈ దేశాన్ని ఛత్రవతి అనేవారు. – మహాభారతం

**ఛందోదేవుడు :** మాతంగుడిని అతని పూర్వజన్మలో ఛందోదేవుడనేవారు. – చూ॥ మాతంగుడు

**ఛాగముఖుడు :** సుబ్రహ్మణ్యస్వామి మరోపేరు. ఇతడి క్కడ మేకతలను పోలిన ముఖం కల్గిన విగ్రహంగా కన్పిస్తాడు. – మహాభారతం

**ఛాయ :** విశ్వకర్మ కూతురైన సంజ్ఞయొక్క ఛాయ. సూర్యుని వల్ల సంజ్ఞకు ముగ్గురు సంతానం. వారు మను, యమ, యమి. సూర్యుని వేడిని భరించలేక తనకు మారుగా తనలాంటి మరో రూపాన్ని సృష్టించి సూర్యునికి వదలి తను తన తండ్రిని చేరింది. ఆ సృష్టించబడినదే ఛాయ. ఛాయవల్ల సూర్యునికి ముగ్గురు సంతానం. వారు శని, శావర్ణమను, తపతి. ఛాయ తన పుత్రులను యెక్కువ ప్రేమించేది. యముడు

కోపంతో తన కాలెత్తి తన్నబోగా ఛాయ అతని కాళ్లు ఊడి పోయేటట్లు శపిస్తుంది. యముడు తన తండ్రికి ఈ విషయం చెప్పగా తన కాళ్లలోని కొంత మాంసమే భూమిపై పడుతుందని అది సూక్ష్మ జీవులకు ఆహారం అవుతుందని ఉపశమనం ఇచ్చి ఛాయ అసలు స్వరూపం తెలుసుకొని ఆమెను పంపివేసి తన అసలు భార్యను తీసుకొచ్చాడు.

**ఛాయా(గాహి :** ఓ రాక్షసస్త్రీ. హనుమంతుడు లంక పైకి లంఘించినపుడు ఈమె హనుమంతుడ్ని తన మాయతో అడ్డుకోగా హనుమంతుడు తన ఎడమ కాలితో ఈమెను తన్ని వధించి తన దారికి అడ్డు తొలగించుకొన్నాడు. – *కంభ రామాయణ*

**ఛాయాసుతుడు :** ఇతడు ఛాయపుత్రుడు. ఇతని పేరు శని. – *మహాభారతం*



**జక్కన :** విక్రమార్క చరితమునకు ఆంధ్రానువాదము చేసిన గొప్ప రచయిత. ఇందు అనేక అద్భుత కథలు కలవు.

**జగతి :** సూర్యుడి సప్తాశ్వాలలో ఒకటి. తక్కిన ఆరు గాయత్రి, బృహస్పతి, ఉష్ణిక్కు, త్రిష్టుపు, అనుష్టపు, పంక్తి. – *విష్ణుపురాణం*

**జగన్నాథమూర్తి :** కృష్ణుడు మరణించిన పిమ్మట అతని శరీరము దారువులో ఉంచగా విగ్రహమయ్యెను. అదియే జగన్నాథమూర్తి విగ్రహము. – *జగన్నాథ మహాత్మ్యం*

**జగన్నాథం :** పురుషోత్తమ క్షేత్రం. శ్రీకృష్ణుడు నిర్వాణం చెందినపుడు ఆయన దేహాన్ని దహనం చేస్తుంటే సముద్రం ద్వారకను ముంచెత్తింది. పూర్తిగా కాలని ఆయన శరీరాన్ని భక్తులు దారువులో సంపుటం చేసి పూరీలో ప్రతిష్టించారు.

**జగన్మోహిని :** క్షీరసాగర మదనం తర్వాత అమృతం వెలువడినపుడు దానిని దేవతలకు మాత్రమే పంచుటకు శ్రీమహావిష్ణువు జగన్మోహిని అవతారమెత్తి రాక్షసులను సమ్మోహితులను చేసి మోసపుచ్చెను. ఇది చూసిన శివుడు ఆ రూపమును చూడనెంచి మరల ఆ రూపమును పొందుమని విష్ణువును కోరగా జగన్మోహినిగా మారెను. అప్పుడు శివుడు మరులు గొని జగన్మో హినితో రతి క్రీడ సల్పగా ఆమెకు పుట్టిన చెమట నదీ రూపము దాల్చెను. అదే గండకీ నది. ఈమెకు పుట్టిన పుత్రుడే కాలభైరవుడు. – *భాగవతం*

**జటాపాఠం :** వేదాలను పఠించే పద్ధతుల్లో ఒకటి. – *చూ॥ ఘనాపాఠం.*

**జటాయువు :** శ్వేని, అనూరుల కొడుకు. సంపాతి ఇతని సోదరుడు. శ్వేనిని మహాశ్వేత అనికూడా అంటారు. సంపాతి, జటాయువులు పోటీపడి సూర్యమండలం దాకా ఎగురుతారు. ఆ వేడికి తట్టుకోలేక క్రింద పడతారు. రావణుడు సీతను అపహరిస్తుండగా జటాయువు రావణుణ్ణి ఎదిరించగా దీనిని రావణుడు ఖండిస్తాడు. ఇది మరణిస్తూ రాముడికి సీతాపహరణం సంగతిని వివరిస్తుంది. రాముడే దీనికి దహన సంస్కారాలు చేస్తాడు. – రామాయణం

**జటాలిక :** స్కందదేవుని అనుచరి. – మహాభారతం

**జటాసురుడు 1 :** ధర్మజుని సభలో ఓ సభ్యుడైన రాజు. – మహాభారతం

**జటాసురుడు 2 :** ఇతడొక రాక్షసుడు. బ్రాహ్మణుని వేషంలో వుండి పాంచాలిని వారి ఆయుధాలను ఎత్తుకుపోవాలని చూస్తాడు. అర్జునుడు భీముడు లేని సమయంలో తక్కిన పాండవుల్ని ద్రౌపదిని ఆయుధాలను ఎత్తుకుపోతాడు. సహదేవుడు జారిపోతాడు. ధర్మజుడు సాయంత్రంలోపు సంహరింపబడతావని ప్రతిజ్ఞ చేస్తాడు. భీముడు వచ్చి అతణ్ణి చంపి వీరం దరిని రక్షిస్తాడు. – మహాభారతం

**జటాసురుడు 3 :** అలంబసుని తండ్రి. అలంబసుడు దుర్యోధనుని పక్షాన కురుక్షేత్రంలో పోరాడి ఘటోత్కచుని చేతిలో మరణిస్తాడు. – మహాభారతం

**జటి :** స్కందదేవుడి అనుచర యోధుల్లో ఒకడు. – మహాభారతం

**జటిల :** మంచి సుగుణవతి అయిన స్త్రీ. గౌతముని వంశంలో జన్మించింది. ఈమె ఒకసారి సప్తర్షుల సహాయం కోరింది. – *చూ॥ గౌతమి*

**జటిలుడు :** శివుడు బ్రహ్మచారిగా వ్యవహరించినపుడు అతడు పెట్టుకున్నపేరు. పార్వతి శివుడ్ని పొందగోరి తపస్సు చేస్తుండగా ఆమెను పరీక్షించడానికి శివుడు జటిలుడను బ్రహ్మచారి రూపంలో వెళ్లాడు. – శివపురాణం

**జఠర పర్వతాలు :** నీల, నిషధ పర్వతాల నడుమ గల పర్వతాలు. ఇక్కడ నివసించే ప్రజలను జఠరులని పిలుస్తారు.

**జఠరం 1 :** మహా మేరువు సమీపంలో గల మరో పర్వతం. – దేవీభాగవతం

**జఠరం 2 :** ప్రాచీన భారతదేశంలోని ఓ పట్టణ ప్రాంతం. – మహాభారతం

**జఠరుడు :** వేద పండితుడైన ఓ బ్రాహ్మణుడు. జనమేజయుడు నిర్వహించిన సర్పయాగంలో ప్రముఖ పాత్ర నిర్వహించాడు. – మహాభారతం

**జడుడు :** ఓ నీతిలేని బ్రాహ్మణుడు. వ్యాపార నిమిత్తం వెళ్తుండగా దొంగలు చంపివేయగా అతని పూర్వ జన్మ పాపాలవల్ల పిశాచంగా మారాడు. నీతి వంతుడైన అతని కుమారుడు శ్రాద్ధకర్మలు నిర్వహించడానికి కాశీకి వెళ్లి తన తండ్రి పిశాచంగా వున్న దగ్గరే శ్రాద్ధకర్మలు నిర్వహించాడు. అక్కడే భగవద్గీతలోని మూడవ అధ్యాయాన్ని పఠించగా పిశాచి అయిన తండ్రికి మోక్షం లభించింది. – పద్మపురాణం

**జతుగృహం :** లక్క ఇల్లు. – చూ॥ అరక్కిలం

**జనకుడు :** సీతాదేవిని పెంచిన తండ్రి.

*వంశవృక్షం :* ఇక్ష్వాకు పుత్రుల్లో దండ, వికుక్షి, నిమిలు ప్రసిద్ధులు. వికుక్షి సంతతిలో క్రథ, మందాత, త్రిశంకు, హరిశ్చంద్ర, సగర, భగీరధుడి వంటి ప్రముఖులు జన్మించారు. శ్రీరాముడు కూడా ఈ సంతతి వాడే. వికుక్షి చిన్న తమ్ముడు నిమి. అతడు యాగార్ధియై వశిష్టుడ్ని కోరగా వేరే యాగ కార్యక్రమంలో వున్నందువల్ల కొంతకాలం ఆగమన్నాడు. నిమి గౌతముడ్ని యాగ నిర్వాహకుడిగా యజ్ఞం చేశాడు. వశిష్ఠుడు కుపితుడై విదేహుడవు కమ్మని శపించాడు. నిమి జీవచ్ఛ వంకాగా అతనికి సంతతి లేనందువల్ల మునులు ప్రార్థించి అతని శరీరాన్ని మదించి ఓ బిడ్డను సృష్టించి అతనికి మిధి జనకుడని నామకరణం చేశారు. అప్పటినుండి ఆ సంతతి వారందరికి జనకుడు అనే పేరు సర్వనామంగా మారింది. మిధి పాలించిన రాజ్యం విదేహ అని ఆ నగరాన్ని మిథిల అని పిలిచేవారు. ఆ వంశంలో జన్మించినవాడు శీరధ్వజుడు. శీరధ్వజుని పుత్రికే సీత.

*శీరధ్వజుడు :* శీరధ్వజుడు మిధిలను పాలిస్తుండగా సాంకశ్యరాజు సుధాన్వనుడు మిధిలపై దండెత్తగా అతణ్ణి వధించి తన తమ్ముడు కుశధ్వజుడ్ని ఆ రాజ్యానికి రాజుని చేస్తాడు. అతని కుమార్తెలే మాండవి, ఊర్మిళ, శృతకీర్తి.

*సీత జన్మవృత్తాంతం :* జనకుడు నాగలిపట్టి భూమి దున్నగా ఆ నాగేటి చాళ్లలో సీత ఓ పెట్టెలో దొరికింది. అమెనే తన కూతురుగా పెంచి పెద్ద చేసి ఆమె శక్తిని గ్రహించి తన ఇంటనున్న విష్ణు చాపాన్ని విరిచినవారికే తన కుమార్తెనిచ్చి వివాహం చేస్తానని స్వయంవరం ప్రకటించగా విశ్వామిత్రుని యజ్ఞాన్ని రాక్షసుల బారినుండి కాపాడిన రాముడు ఈ స్వయంవరానికి విశ్వా మిత్రునితో వచ్చి విష్ణుచాపాన్ని విరిచి సీతను పరిగ్రహిస్తాడు. తన సోదరుడి పుత్రికలైన మాండవి, ఊర్మిళ, శృతకీర్తిలను వరుసగా భరతుడు, లక్ష్మణుడు, శతృఘ్నులకు ఇచ్చి వివాహం చేస్తాడు. – రామాయణం

**జనదేవుడు** మిథిలను పాలించిన ఓ జనక రాజు. మహావిష్ణువితణ్ణి పరీక్షించి వరాలిచ్చాడు. – మహాభారతం

**జనమేజయుడు :** కురు వంశంలో జన్మించిన గొప్ప పరిపాలనా దక్షుడు. పాండవుల మరణానంతరం అభిమన్యుని కుమారుడు పరీక్షిత్తు రాజయ్యేను. అతని కుమారుడే జనమేజయుడు.

*పరీక్షిత్తు మరణం :* అభిమన్యుని కుమారుడైన పరీక్షిత్తు కురు దేశాన్ని 60 సంవత్సరాలు పరి పాలించి గొప్ప ప్రజారంజకుడిగా పేరొందాడు. అతడోరోజు వేటకు వెళ్లి అలసిపోయి సమీపమున వున్న ఒక కుటీరమునకు వెళ్ళి తపస్సు చేస్తున్న బ్రాహ్మణుణ్ణి మంచినీరు అడుగగా అతని నుండి సమాధానంరాలేదు. కుపితుడైన పరీక్షిత్తు ఓ చనిపోయిన పాముని అతని మెడలో వేసి స్వగృ హానికి తిరిగి వచ్చాడు. ఇంతలో బయట నుండి వచ్చిన ఆ ముని కుమారుడు గవిజాతుడు ధ్యాన నిమగ్నుడైయున్న తండ్రిమెడలోని నిర్జీవ సర్పమును చూసి ఆగ్రహంతో, ఈ పని చేసిన దురాత్ముడు ఏడు రోజులలో తక్షకుని కాటుకు బలియగునని శపిస్తాడు. ఆ శాప పర్యవసానంగా తక్షకుని కాటుకు పరీక్షిత్తు మరణిస్తాడు. అప్పటికి జనమేజయుడు

పసివాడు. మంత్రులే రాజ్య భారాన్ని నిర్వహించి కొంతకాలానికి ఓ శుభ ముహూర్తాన జనమేజయుణ్ణి రాజ్యాధిపతిని చేశారు. అతడికి ధనుర్విద్యను కృపుడు నేర్పాడు. గొప్ప పరిపాలకుడిగా గుర్తింపబడ్డాడు.

*సర్పయాగం :* ఉత్తంక మునివల్ల తన తండ్రి మరణ కారణం తెలుసుకొని మొత్తం సర్పజాతిని నాశనం చెయ్యాలని నిర్ణయించుకుని దానికి ప్రయత్నాలు ప్రారంభించాడు. అదే సర్పయజ్ఞం. ఓ బ్రాహ్మణుడు ఈ యజ్ఞాన్ని ఆపే అవకాశం వుందని మునులు చెప్పగా తెలియని ఎవర్నీ యజ్ఞశాల వద్దకు రాని వ్వద్దని చెప్తాడు. ఉత్తంక, చంద్రభార్గవ, వ్యాస, ఉద్దాల కుల వంటి మునులు రుత్విక్కులు కాగా సర్పాలు ఒక్కొక్కటి హోమ గుండంలోపడి నశిస్తుండగా కొందరు ఇంద్రుని వల్ల దాక్కున్నారు. మంత్ర శబ్దాలు పెరుగు తుండగా మాడు వాసన వాసుకి నాసిక పసిగట్టి తన చెల్లెలు జరత్కారిని దీనినుండి తప్పించుకొనే అవకాశాలు కనుగొనమని చెప్పగా ఆమె తన పుత్రుడు ఆస్తికుణ్ణి యజ్ఞం ఆపడానికి పంపుతుంది. రుత్విక్కులు ఎంతసేపు చూసినా తక్షకుడు రాలేదు. ఉత్తంకుడు తన దివ్యదృష్టితో తక్షకుడ్ని ఇంద్రుడు రక్షిస్తున్నాడని గమనించి మరింత కోపోద్రిక్తుడై తక్షకుడు, ఇంద్రుని సింహాసనం కూడా యజ్ఞ గుండంలో పడేందుకు జపించాడు. కొద్ది నిముషాల్లో తక్షకుడు ఇంద్రునితో సహా యజ్ఞ గుండంలో పడి భస్మమయ్యేవాడే. కాని అదే సమయంలో ఆస్తికుడు యజ్ఞశాల వద్దకు ప్రవే శించగా జనమేజయుడు స్వాగతించి నీకు నచ్చిన వరం కోరుకొమ్మనగా సర్పయజ్ఞాన్ని ఆపమని కోరు కుంటాడు. ఇష్టంలేకుండా తను ఇచ్చిన మాట తప్పవద్దని ఆస్తికుడు కోరగా జనమేజయుడు సర్ప యాగాన్ని ఆపాడు. ఆస్తికుడు మరణించిన సర్పాలకు ముక్తి లభిస్తుందని వరమిచ్చాడు. – దేవీభాగవతం

సర్పయాగం చేస్తున్నపుడు దేవతల కుక్క అయిన శరమ సోదరులు యజ్ఞంవద్దకు రాగా జనమేజయుని సోదరులు అకారణంగా కొడతారు. వారు శరమతో చెప్పగా జనమేజయుడ్ని అతని సోదరుల్ని శపిస్తుంది. అది తెలిసిన జనమే జయుడు ఆ శాపవిముక్తికి మరో యజ్ఞం చేశాడు.

*ఇతర విశేషాలు :* 1. జనమేజయుడు తక్షశిల రాజుని ఓడించాడు. 2. జనమేజయుడు అశ్వమేధయాగం చెయ్యగా వ్యాసమహర్షి చావు పుట్టుకలు ముక్తి మార్గా లను గురించి ఉపన్య సించగా జనమేజయుడు తన తండ్రిని చూపమనగా పరీక్షిత్తుని స్వర్గంనుండి రప్పించి జనమేజయుడికి చూపుతాడు. 3. జనమేజ యుణ్ణి భారత, భారత శార్దూల, భరతశ్రేష్ఠ, భరతాధ్వ భరత శతాత్మ, కౌరవ, కౌరవ శార్దూల, కౌరవేంద్ర, కురుకుల శ్రేష్ఠ, పాండవ, పాండవనందన, పాండ వేయ, పరీక్షిత్, పౌరవ్య అనే పేర్లతో పిలిచేవారు.

**జనలోకం :** పద్నాలుగు లోకాల్లో ఇదొకలోకం. ఇది ధ్రువపదం నుంచి మూడుకోట్ల యోజనాల దూరంలో వుంది. – విష్ణుపురాణం

**జనస్థానం :** దండకారణ్యంలోని ఒక భాగం. శ్రీరా ముడు సీతా లక్ష్మణులతో కలసి ఎక్కువ కాలం నివ సించిందిక్కడే. లక్ష్మణుడు శూర్పణక ముక్కు చెవులు కోసింది, రావణుడు సీతను ఎత్తుకు పోయింది, వీరు ఇక్కడ నివసించిన సమయంలోనే. – రామాయణం

**జనార్ధనుడు 1 :** మహావిష్ణువుకు గల మరోపేరు. ఎవరు కమలాసనుడో, మార్పులేనివాడో, నశింపని వాడో, ఎవరినిచూస్తే రాక్షసులు కంపించిపోతారో అతడే జనార్ధనుడు. – మహాభారతం

**జనార్ధనుడు 2 :** చూ॥ ఢిబకుడు

**జపలు :** ఓ దేవతాగణం. మూడో మన్వంతరంలోని వారు. మూడో మన్వంతరంలో ఉత్తముడనే వాడు మనువు; సుశాంతి అనేవాడు ఇంద్రుడు.

**జపాసురుడు :** చూ॥ సోమకుడు.

**జపేశ్వరం :** నైమిశారణ్యంలోని ఓ పుణ్యక్షేత్రం – మహాభారతం

**జబాల :** సత్యకాముని తల్లి. – చూ॥ సత్యకాముడు

**జమదగ్ని :** సత్యవతీ రుచీకుల కుమారుడు. రేణుకకు భర్త. రేణుక చిత్రరథుడ్ని కామించిందని అనుమా నంతో తన కుమారుల్ని తల్లిని వధించమని చెప్పగా పరశురాముడు తప్ప తక్కినవారు అంగీకరించరు. పరశురాముడు తల్లిని వధిస్తాడు. తండ్రి వరం కోరు కొమ్మనగా తల్లిని బ్రతికించమని కోరతాడు. జమదగ్ని

రేణుకను బ్రతికిస్తాడు. హైహయుడికి ఆతిథ్యమివ్వగా కామధేనువు నిమ్మని హైహయుడు కోరగా నిరాకరించినందుకు ఇతణ్ణి హైహెయుని సైన్యం వధించగా భృగుమహర్షి బతికిస్తాడు. ఇతడి మేనమామ విశ్వామిత్రుడు. – మహాభారతం

**జయ 1 :** ధృతరాష్ట్రుని కుమారుడు. గోగ్రహణ యుద్ధంలో అర్జునునితో యుద్ధం చేశాడు. కురుక్షేత్రంలో నకులుడితో భీముడితో యుద్ధం చేశాడు. భీముని చేతిలో మరణించాడు. – మహాభారతం

**జయ 2 :** దేవ గణంలోని వాడు. ఖాండవ దహన సమయంలో ఇతడు కృష్ణార్జునులతో యుద్ధం చేశాడు. – మహాభారతం

**జయ 3 :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. యముని సభలో సభ్యుడు. – మహాభారతం

**జయ 4 :** సూర్యునికి మరో నామాంతరం. – మహాభారతం

**జయ 5 :** విరాటుని కొలువులో ధర్మజుడు పెట్టుకున్న పేరు. ధర్మజుడు జయ, భీముడు జయంతుడు, అర్జునుడు విజయుడు, నకులుడు జయత్సేనుడు, సహదేవుడు జయద్బలుడు అనునవి విరాటుని కొలువులో పెట్టుకున్న పేర్లు. ద్రౌపది వీరందర్నీ జయ అనే పిలిచేది. – మహాభారతం

**జయ 6 :** కశ్యపుని వంశంలోని ఓ నాగు. – మహాభారతం

**జయ 7 :** కౌరవుల పక్షాన పోరాడిన ఒక యోధుడు. ఇతడు, శకుని ఒకేసారి అర్జునునితో యుద్ధం చేస్తారు. – మహాభారతం

**జయ 8 :** పాంచాల రాజ్యంలోని ఓ యోధుడు. పాండవుల పక్షాన పోరాడి కర్ణుడివల్ల గాయపడతాడు. – మహాభారతం

**జయ 9 :** స్కందదేవునికి నాగరాజైన వాసుకి ఇచ్చిన ఇద్దరు సేవకుల్లో ఒకడు. రెండోవాడు మహా జయుడు. – మహాభారతం

**జయ 10 :** మహావిష్ణువుకి గల మరోపేరు. – మహాభారతం

**జయ 11 (జయవిజయులు) :** వీరు వైకుంతపు ద్వార పాలకులు. శనకమహర్షి ఇతరులు మహా విష్ణువు దర్శనానికి వెళ్లబోగా వీరు అడ్డగించారు. అందుకు కోపించి శనకమహర్షి మూడు జన్మలు రాక్షసులుగా జన్మిస్తారని శపిస్తాడు. శాపవిమోచనానికి ప్రార్థించగా మహా విష్ణువుచే చంపబడి శాపవిముక్తి కల్గి మరల వైకుంతం చేరతారని మహర్షి శాపవిమోచనం చెప్తాడు. వారి పునర్జన్మలే హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడు; రావణ; కుంభకర్ణులు; శిశుపాల, దంతవక్త్రులు. వీరు వరుసగా శ్రీమహావిష్ణువు అవతారాలైన నరసింహ, శ్రీరామ, శ్రీకృష్ణుని చేతిలో సంహరింపబడి వైకుంతం చేరతారు. – భాగవతం

**జయ 12 :** విరాధుడను రాక్షసుడి తండ్రి. విరాధుడిని రాముడు సంహరిస్తాడు. – రామాయణం

**జయ 13 :** మహాభారత గ్రంథకర్త అయిన వ్యాసుని అసలుపేరు. ఇప్పుడున్న మహాభారత గ్రంథం మొత్తం వ్యాస విరచితం కాదు. 8, 800 శ్లోకాలు మాత్రమే వ్యాసుడు రచించాడు. అదే జయుడు వ్రాసింది. వైశంపాయనుడు 15,200 శ్లోకాలు కలిపాడు. దీనిని భారత సంహిత అనేవారు. నైమిశారణ్యంలో సూతుడు మహాభారతాన్ని ఇతర మునులకు చెప్పినప్పుడు లక్ష శ్లోకాలు వున్నాయి. అప్పటినుండి అది మహాభారతంగా పిలవ బడుతుంది.

– హిస్టరీ ఆఫ్ శాన్స్క్రిట్ లిటరేచర్

**జయత్సేనుడు 1 :** అజ్ఞాతవాసంలో నకులుని పేరు. – మహాభారతం

**జయత్సేనుడు 2 :** మగధ సామ్రాజ్యంలోని ఒక రాజు. కాలకేయ కుటుంబంలోని వాడు. పాండవులకు స్నేహితుడు. మహాభారత యుద్ధం చివర్లో ధర్మజుని కోరికమేరకు అక్షౌహిణి సైన్యాన్ని పాండవుల పక్షాన పంపాడు. – మహాభారతం

**జయత్సేనుడు 3 :** పూరువంశపు రాజు. ఇతని తండ్రిపేరు సార్వభౌముడు, తల్లికేకయ వంశ యువరాణి సునంద. ఇతడు విదర్భ రాజకుమార్తె సుశ్రవసుని వివాహమాడాడు. అర్వాచీనుడు వీరి కుమారుడు. – మహాభారతం

**జయత్సేనుడు 4 :** జరాసంధుని కుమారుడు. కౌరవులకు అక్షౌహిణి సైన్యాన్ని పంపి యుద్ధంలో కూడా పాల్గొని అభిమన్యుని చేతిలో మరణించాడు. – మహాభారతం

**జయదేవుడు 1 :** ఓ సంస్కృత కవి. 13వ శతాబ్ది వాడు. శ్రీకృష్ణుని భక్తుడు. చంద్రాలోకమను అలంకార శాస్త్ర గ్రంథాన్ని రచించాడు. రామా యణాన్ని మహా వీర చరిత్ర పేరుతో రచించాడు. ఈ కావ్యంలో బాణా సురుడు, రాముడుకూడా సీతను ప్రేమిస్తారు. ఇతని ముఖ్య రచన గీత గోవిందం. ఇందులో రాధాకృష్ణుల ప్రేమ అమోఘంగా వర్ణించబడింది. ఇతడు శ్రీకృష్ణుని విగ్రహం ముందు పద్యాలు పాడితే అతని భార్య అందుకనుగుణంగా నృత్యం చేసేది.

**జయదేవుడు 2 :** చూ॥ దుశ్శాసనుడు-2.

**జయద్రథుడు :** ఇతడిని సైంధవుడని అంటారు. సింధుదేశపు రాజు. ధృతరాష్ట్రుని కూతురైన దుస్స లను వివాహమాడాడు. పాండవుల అరణ్యవాస సమ యంలో ద్రౌపదిని కామించి భీముని చేతిలో పరా భవం పొందుతాడు. శివుని ప్రార్థించి అర్జునుని తప్ప పాండవులను ఒక రోజు జయించే వరం పొందు తాడు. అర్జునుడు లేని సమయంలో ద్రోణాచార్యుని పద్మవ్యూహంలో తక్కిన పాండవులను పద్మవ్యూహం ఛేదించకుండా ఆపి అభిమన్యుని మరణానికి కారకుడై తర్వాత అర్జునుని చేతిలో మరణిస్తాడు. - మహాభారతం

**జయద్బలుడు :** అజ్ఞాతవాసంలో సహదేవుని పేరు. - మహాభారతం

**జయద్వజుడు :** కార్తవీర్యార్జునుడి కుమారుడు. పరశురాముడికి భయపడి దాక్కున్నాడు. ఇతని కుమా రుడు తాలజంఘుడు. - బ్రహ్మపురాణం

**జయప్రియ :** స్కందదేవుని అనుచరి. - మహాభారతం

**జయరాతుడు :** కళింగ రాజకుమారుడు. కౌరవుల పక్షాన పోరాడి భీమసేనుడి చేతిలో మరణిస్తాడు. - మహాభారతం

**జయవిజయులు :** చూ॥ జయ

**జయశర్మ :** ఇతడు శివశర్మ కుమారుడు. అందరి కంటే చిన్నవాడు. దుష్టుడగుటవల్ల సోదరులు, తండ్రి ఇతణ్ణి వదలివేస్తారు. దేశదిమ్మరిలా తిరుగుతూ చివరకు త్రివేణీ మహాతీర్థం చేరుకుంటాడు. అలసిపోయి వుండటంవల్ల దానిలో స్నానంచేసి హరిమిత్రుడు ఆశ్రమానికి వెళ్లి అక్కడ కమలాపత్రాన్ని చూస్తాడు. దేవి ప్రత్యక్షమై ఇతనికి తగిన భాగ్యాన్ని కల్గిస్తుంది. - పద్మపురాణం

**జయసేనుడు 1 :** చండ మహాసేనుడను ప్రసిద్ధి చెందిన రాజుయొక్క తండ్రి. - చూ॥ చండ మహాసేనుడు.

**జయసేనుడు 2 :** మగధ రాజకుమారుడు. ధర్మజుని సభలో సభ్యుడు. - మహాభారతం

**జయసేనుడు 3 :** అవంతి నగర రాజు. పట్టపురాణి అయిన రాజాధిదేవి వల్ల మిత్రవింద జన్మించగా ఆమెను శ్రీకృష్ణుడు వివాహమాడాడు. - మహాభారతం

**జయంతపురం :** గౌతమాశ్రమ సమీపంలో వున్న ఒక పట్టణం. దీన్ని నిర్మించింది నిమి.

**జయంతి 1 :** సరస్వతీ నదీతీరంలోని ఓ పవిత్ర స్థలం. ఇక్కడున్న తీర్థంపేరు సోమతీర్థం. ఇక్కడ స్నానంచేస్తే రాజసూయ యాగం చేసిన ఫలితం లభిస్తుంది. - మహాభారతం

**జయంతి 2 :** జయంతుడి సోదరి, ఇంద్రుని కుమార్తె. ఈమె శుక్రాచార్యునికి 10 సంవత్సరాలు భార్యగా జీవిస్తుంది. శుక్రాచార్యుడు దానవులు దేవతల చేతిలో ఓడినప్పుడు దానవులకు నూతన శక్తులు సమకూర్చ డానికి శివుణ్ణి గూర్చి ఘోర తపస్సు చేశాడు. ఇంద్రుడు భయపడి తన కూతురు జయంతిని తన అందంతో తపోభంగం చెయ్యమంటాడు. ఆమె కిష్టం లేకపో యినా తండ్రి మాట కాదనలేక శుక్రాచార్యుని వద్దకు వెళ్ళి అతడు తపస్సు చేసినంతకాలం గురుభక్తితో సేవిస్తుంది. శివుడు శుక్రాచార్యునికి వరాలిచ్చిన తర్వాత అతడు జయంతితో మాట్లాడి ఆమె కోర్కెపై 10 సంవత్సరాలు వారికి కన్పించకుండా ఏకాంతంగా జీవిస్తాడు. - భాగవతం

**జయంతి 3 :** రుషభరాజు భార్య. ఇతడు అగ్నీంద్ర వంశంలో జన్మించినాడు. ఈమెవల్ల ఇతనికి 100 మంది సంతానం జన్మించారు. - చూ॥ రుషభుడు

**జయంతుడు 1 :** ఇతడు ఇంద్రుడికి శచీదేవి వల్ల జన్మించిన కుమారుడు. సీతారామలక్ష్మణులు అరణ్య వాసంలో వుండగా శ్రీరాముడు సీతతొడపై తలవాల్చి నిద్రిస్తుండగా కాకి రూపం ధరించి ఆమె వక్షాన్ని గీరాడు. శ్రీరాముడు కుపితుడై బ్రహ్మాస్త్రాన్ని ప్రయో గించగా అతడు లోకాలన్నీ తిరిగి బ్రహ్మ, విష్ణు, మహే శ్వరులను శరణు వేడగా లాభం లేక రాముని పాదా లపై పడగా బ్రహ్మాస్త్రం వృథా పోదు కనుక నీ కుడి కన్ను పోతుందని చెప్తాడు. అప్పటి నుండి జయంతుడు ఒంటికంటి వాడయ్యాడు. - రామాయణం

రావణుడు ఇంద్రునిపై యుద్ధానికి రాగా మేఘనాదుడు జయంతుణ్ణి ఎదుర్కొంటాడు. శచీదేవి తండ్రి పులో ముడితణ్ణి సముద్రంలో దాస్తాడు. రావణుడు ఇంద్రుణ్ణి జయించి తన బందీగా లంకకు తీసుకెళ్తాడు.
– ఉత్తర రామాయణం

*జయంతుడు వెదురుగా మారిన కథ :* ఓసారి అగస్త్యుడు ఇంద్రసభకు రాగా అతని గౌరవార్థం ఊర్వశి నాట్యం చేస్తుంది. జయంతుడిని చూసి ఊర్వశి కాళ్లు తడబడ్డాయి. నారదుని తుంబుర సరిగా మోగలేదు. అగస్త్యుడు ఊర్వశిని మాధవిగా జన్మించమని, జయం తుడ్ని వెదురుగా మారమని, నారదుడి తుంబుర సర్వజనులకు చెందినది కమ్మని శపిస్తాడు.
– వాయుపురాణం

పారిజాతాపహరణ సమయంలో శ్రీకృష్ణుని పుత్రుడు ప్రద్యుమ్నుడితణ్ణి ఓడిస్తాడు. – విష్ణుపురాణం

**జయంతుడు 2 :** అజ్ఞాతవాసంలో భీముని పేరు.
– మహాభారతం

**జయంతుడు 3 :** పాంచాల దేశపు ఓ వీరుడు.
– మహాభారతం

**జయంతుడు 4 :** 11 మంది రుద్రుల్లో ఒకడు.
– మహాభారతం

**జయంతుడు 5 :** మహావిష్ణువు మరోపేరు.

**జయంతుడు 6 :** దశరధుని మంత్రులైన 8 మందిలో ఒకడు. – రామాయణం

**జయానీకుడు 1 :** ధృపదుడి మనుమడు. ఇతణ్ణి అశ్వత్థామ వధిస్తాడు. – మహాభారతం

**జయానీకుడు 2 :** విరాటరాజు సోదరుడు.
– మహాభారతం

**జయాశ్వుడు 1 :** ధృపదుని కుమారుడు. కురుక్షేత్ర యుద్ధంలో అశ్వత్థామ ఇతణ్ణి వధించాడు.
– మహాభారతం

**జయాశ్వుడు 2 :** విరాట రాజు సోదరుల్లో ఒకడు.
– మహాభారతం

**జయుడు :** చూ॥ జయ (జయ విజయ)

**జయులు :** ప్రతి కల్పంలోను మొదటి పన్నెండు మంది దేవర్షులు. వీరు ప్రతి మన్వంతరంలోనూ దేవతలుగా పుడతారు. – చూ॥ ఆదిత్యులు

**జయం :** ఒక శుభసమయం. దీన్ని విజయమని కూడా అంటారు. – మహాభారతం

**జర :** ఓ రాక్షసి. ఈమెను గృహదేవి అనికూడా పిలుస్తారు. బృహద్రధుడు పారవేసిన అసంపూర్ణ శిశుదేహాన్ని కలిపింది కాబట్టి ఆ బిడ్డకు జరాసంధుడని పేరొచ్చింది. ఈ జరాసంధుడు మగధదేశపు ప్రసిద్ధ రాజు.
– మహాభారతం

**జరత్కారి :** వాసుకి సోదరి. ఈమె జరత్కారుడి భార్య. ఈమె తన కుమారునితో సర్పయాగాన్ని ఆపిస్తుంది.
– చూ॥ జనమేజయుడు.

**జరత్కారుడు :** పురాణ ప్రసిద్ధి చెందిన మహర్షి. యాయా వరస బ్రాహ్మణ వంశంలో జన్మించిన వాడు. జర అంటే ఆరగించు, కారు అనగా వికారి. ఇతడు వికారంగా బలంగా వుండేవాడు. తపస్సుచేసి శరీరం సన్నగా మృదువుగా తయారు కావడం వల్ల జరత్కారుడనబడే వాడు. ఇతడు చాలాకాలం వివాహం చేసుకోలేదు. పితృల స్వర్గ ప్రాప్తి కొరకు వారి మాటకాదనలేక వివాహం చేసుకోవడానికి నిర్ణయించి అదే పేరున్న స్త్రీని మాత్రమే వివాహమాడదలచాడు. సర్పరాజైన వాసుకి ఇది తెలుసుకొని తన సోదరి జరత్కారినిచ్చి వివాహం చేశాడు. అయితే అతని ఏకార్యానికైనా ఆమె విఘ్నం కలిగిస్తే వదిలేస్తానని హెచ్చరించాడు. ఓ రోజు భార్య తొడపై నిద్రిస్తుండగా సాయంత్రం అవడం వల్ల పూజా సమయం అవుతోందని అతణ్ణి నిద్రలేపగా ఉగ్రుడై ఆమెను వదిలివేస్తాడు. గర్భిణి అయిన జరత్కారి ఓ బిడ్డకు జన్మనిస్తుంది. అతడే అస్తికుడు. జనమేజయుడి సర్పయాగాన్ని మాన్పించిన వారిలో ముఖ్యుడు.

**జరంధర :** భీముడి భార్య. ఈమె కొడుకు సర్వగుడు.
– మహాభారతం

**జర్జరానశుడు :** స్కందదేవుని అనుచరుడు.
– మహాభారతం

**జరాయువు :** స్కందదేవుని అనుచరుడు. – మహాభారతం

**జరాసంధుడు :** మగధదేశపు రాజు. బృహద్రధుని కుమా రుడు. బృహద్రధునికి ఇద్దరు భార్యలు. సంతానము లేక చండకౌశికుడను మునికి నమస్కరించి తన వ్యధ చెప్పుకొనగా అతడో ఫలమునను గ్రహించి అతని

భార్యల కివ్వమనెను. అతడా ఫలమును రెండు భాగములు చేసి భార్యల కివ్వగా వారు గర్భము దాల్చి రెండు అర్థ శిశువులకు జన్మనిచ్చిరి. ఓ కన్ను, ఓ కాలు, ఓ చెయ్యి అలా రెండు సమాన భాగములైన శిశు ఖండములను చూసి వారు భయపడి బయట పారవేసిరి. ఈ శిశు ఖండములను జర అను రాక్షసి సంగ్రహించి భుజించుటకు దగ్గరకు చేర్చగనే అవి కలుసుకొని ఓ బిడ్డడయ్యెను. ఆ రాక్షసి కంగారుపడి మానవ స్త్రీగా మారి ఆ బాలుణ్ని బృహద్రధుని కప్పగించి వెడలెను. జరవల్ల ఈ రూపము నొందుట వల్ల ఇతనికి జరాసంధుడను నామము వచ్చెను. ఇతడత్యంత పరాక్రమశాలి. ఎందరో రాజులను బంధించెను. ఇతని ఇద్దరు కుమార్తెలను కంసునికి ఇచ్చి వివాహము చేసెను. శ్రీకృష్ణుడు కంసుని వధించినప్పటి నుండి ఆతనిపై వైరము పెంచుకొని 18 సార్లు దండెత్తెను. ఇతడు ఆయుధములతో మరణములేకుండునట్లు వరము పొందినవాడు. ధర్మజుడు రాజసూయ యాగము చేయు సందర్భ మున శ్రీకృష్ణ భీమార్జునులు బ్రహ్మణ వేషమున మగధలోని జరాసంధుని వద్దకు రాగా బ్రాహ్మణులన్న విపరీత గౌరవమున్న జరాసంధుడు వీరి కోరిక తెలుపమని కోరగా మాలో ఒకరితో మల్లయుద్ధము చేయమని కోరిరి. జరాసంధుడు తన కుమారుని రాజ్యమునఅధిష్టింపజేసి భీమునితో 14 రోజులు పోరాడి మరణించెను. – భాగవతం

**జరిత :** నల్గురు పిల్లలు గల తల్లి పక్షి. ఖాండవ దహనంలో బాధలుపడ్డ పక్షి. – మహాభారతం

**జరితారి :** జరిత పిల్లల్లో ఒకటి. – మహాభారతం

**జర్తిక :** వాహికుల్లో ఒకతెగ. ఆ తెగల్లో కూడా అధమ జాతివారు. – మహాభారతం

**జరుడు :** ఓ బోయవాడు. శ్రీకృష్ణుణ్ణి జంతువనుకొని బాణం వెయ్యగా శ్రీకృష్ణుడు మరణించాడు. – మహాభారతం

**జలసంధుడు :** ధృతరాష్ట్రుని కుమారుడు. – మహాభారతం

**జలదం :** శాక ద్వీపంలోని ఓ పర్వతం. కుముదోత్తర వర్షమనే దేశం దీనికి దగ్గరలోనే వుంది. – మహాభారతం

**జలంధముడు :** స్కందుని అనుచర యోధుల్లో ఒకడు. – మహాభారతం

**జలంధర :** భీముడి భార్య. సర్వకుడు వీరికుమారుడు. ఈమెను జరంధర అనికూడా అంటారు. – మహాభారతం

**జలంధరుడు :** శివుడు మన్మధుని తన మూడో కంటితో భస్మముచేయగా ఆ భస్మం కొంత సముద్రములో పడెను. ఆ శబ్దము ప్రళయధ్వని సృష్టించగా దేవతలు బ్రహ్మనడిగిరి. బ్రహ్మ తక్కిన దేవతలు సముద్రుణ్ణి వివరణ కోరగా అతడు తన కుమారుడని నామ కరణం చేయమని బ్రహ్మ నడిగెను. బ్రహ్మ ఇతడికి జలంధరుడని నామకరణంచేసి శివునివల్ల తప్ప భయం లేదని చెప్పెను. జలంధరుడు రాక్షస గురువైన శుక్రుని వల్ల జల సంపద అంతా దేవతల వశమైందని విని మహావిష్ణువు పై దండెత్తుతాడు. విష్ణువేస్వయంగా యుద్ధం చేసినా గెలవలేక జలంధరుణ్ణి వరం కోరు కొమ్మంటాడు. శ్రీమహాలక్ష్మితో వచ్చి తన ఇంట విష్ణువుని వుండమంటాడు. నారదుని వల్ల పార్వతి అత్యంత సౌందర్యవతి అని విని పార్వతిని పంపమని శివుణ్ణి కోరగా శివుడు ఇతనితో యుద్ధం చేస్తాడు. జలంధరుడు ఎంతకూ ఓడిపోక పోవడం వల్ల పార్వతి శ్రీ మహా విష్ణువును ప్రార్థించి జలంధరుని భార్య బృంద పాతి( వత్యం చెడినగాని జలంధరుడు మరణించడని చెప్తుంది. శ్రీమహావిష్ణువు మాయా జలంధరుడుగా బృందను వంచించగా శివునిచేతిలో జలంధరుడు మరణిస్తాడు. – శివపురాణం

**జలధార :** శకద్వీపంలోని పర్వతం పేరు. – మహాభారతం

**జలధి :** ఓ మొసలి. ఇది వరుణుడి వాహనం. – వామన పురాణం

**జలపద :** ఓ అప్సరస

**జలపది :** జానపదికి మరోపేరు. – చూ॥ జానపది

**జలసంధుడు :** గాంధారి ధృతరాష్ట్రుల కుమారుడు. – మహాభారతం

**జలుడు :** ఒక జలదేవత. బ్రహ్మణ కొలువులో ఓ సభ్యుడు. – మహాభారతం

**జలేయుడు :** మిత్రకౌశి రౌద్రాశ్వుల కుమారుడు. – మహాభారతం

**జలేలుడు :** స్కందదేవుని అనుచరుడు. – మహాభారతం

**జలేశ్వరి :** స్కందదేవుని అనుచరి. – మహాభారతం

**జవుడు :** స్కందదేవుని అనుచరుల్లో ఒక వీరుడు. – మహాభారతం

**జహ్నుడు :** పూరువంశపు రాజు. అజమీఢుని కుమారుడు. ఇతని తర్వాతి తరం వారిని కౌశికులంటారు. ఇతడు తన రాజ్యాన్ని బాలకాశ్యునుకి అప్పగించి తపస్సు చేస్తూ జీవించాడు. బాల కాశ్యుని కుమారుడు కౌశికుడు. ఇతడు తపమాచరించుచుండగా భగీరథుని కోరికపై గంగ భూమిమీద ప్రవహిస్తూ జహ్నుడి ఆశ్రమాన్ని ముంచెత్తింది. జహ్నుడు కుపితుడై గంగను మింగివేశాడు. భగీరథుని కోరికపై గంగను తన చెవి నుండి వదలివేశాడు. అందుకనే గంగను జాహ్నవి అని పిలుస్తారు. *చూ॥ గంగ* – *భాగవతం*

**జహ్నువు 1 :** పురూరవుని కుమారుడైన విజయుని వంశములోని వాడగు విజహోత్రుడు. – భాగవతం

**జహ్నువు 2 :** కురుని కుమారుడు. ఇతని కుమారుడు సురథుడు. – భాగవతం

**జాగుడం :** ప్రాచీన భారతదేశంలోని ఒక ప్రాంతం. ధర్మజుని రాజసూయ యాగంలో ఈ ప్రాంత రాజు పాల్గొన్నాడు. – మహాభారతం

**జాగ్రదవస్థ :** రుషుల దర్శనాలననుసరించి ప్రతి జీవంలో నాల్గు దశలుంటాయి. అవి జాగ్రత, స్వప్న, సుషుప్తి, తురీయాలు. జాగ్రదవస్థలో ఆత్మ చైతన్యంగా వుండి పంచేంద్రియాలు పనిచేస్తాయి. ఈ పంచేంద్రియాలతో ప్రపంచాన్ని చూడటాన్ని బహిప్రజ్ఞ అంటారు. – మాండూక్యోపనిషత్తు

**జాజిలి :** ఇతడొక ముని. ఇతడు తపస్సు చేసుకొనుచుండగా జట్టు పెరిగి తలపై పిచ్చుకలు గూళ్ళు కట్టుకొనెను. గుడ్లు కూడా పెట్టెను. తాను కదలక యుండినచో పిచ్చుకలకు యెట్టి హాని జరగదని కదలక అట్లే తపస్సు చేసుకొనువాడు. తాను తపస్సిద్ధినొంది తినని గర్వముగా తలచెడివాడు. అట్లుండగా యేమి ఇతని తపో మహిమ, నిశ్చలత్వము అని పిచ్చుకలు పొగడగా ఇతనికంటె ఘనుడు తులాధరుడు కాశీ యందు గలడని ఆకాశవాణి పల్కెను. అచటకి వెళ్లగా 'పిచ్చుక పిల్లలకు అపాయము కలుగక నిల్చితివి నీవెంతటి వాడవనెను'. అట్లనగా నీకెట్లు తెలియునని అడిగెను. నేను నిత్య సంతృప్తుడను. నాకు బంగారము, మన్ను సమానము. దేనిని కోరను, వచ్చిన దానిని వద్దనను. ఇదే నేను చేయునది. ఫలాకాంక్షతో చేసిన యజ్ఞము దేవతలు మెచ్చరు అని తులాధరుడు పలికెను. నీవేల కర్మమానవని జాజిలి అడుగగా పనులు చేయుటయందును అసంగతానిష్ఠమతికిని నిష్కర్మత్వానందసిద్ధి కలుగును. నీ తలయందున్న పిచ్చుకలనడుగుము అని చెప్పగా పిచ్చుకలు మేము ధర్మదేవతలమని ఈర్ష్య, కళంక, మత్సరము లేనివాడు సుఖించును. ఇవి కూడనివి అని చెప్పెను. తులాధరుడు బ్రహ్మ గీతలు చెప్పెను.

**జాతరూపశిల :** ఇదో పర్వతం. సీతను వెదకటానికి వానరులు ఈ పర్వతం కూడా గాలించారు. – రామాయణం

**జాతవేదుడు :** అగ్నికి మరోపేరు. – చూ॥ పురూరవుడు

**జాతహారిణి :** ఇదొక పిల్లి. చాక్షుషువు పుట్టిన ఏడో రోజున అతణ్ణి తీసుకెళ్ళి విక్రాంతుడి భార్య పక్కలో వుంచి అక్కడున్న శిశువును ఇంకోచోట వుంచి అదే స్థలంలోని మరో శిశువును తీసుకొని వెళ్లి తింటుంది. – మార్కండేయ పురాణం

**జాతస్మరకీటం :** వ్యాసుడి సలహా పొంది ముక్తి నొందిన ఒక కీటకం. అంతకు ముందు జన్మలలో వరుసగా ఒక శూద్రుడు, ఒక రాజు. ఆ తర్వాత బ్రాహ్మణుడుగా జన్మించి మోక్షాన్ని పొందుతాడు. – మహాభారతం

**జాతిస్మరహ్రదం :** ఇదో పవిత్రక్షేత్రం. ఇక్కడ స్నానం చేస్తే పూర్వజన్మ జ్ఞాపకానికి వస్తుంది. – మహాభారతం

**జాతిస్మరం :** ఓ పవిత్ర తీర్థక్షేత్రం. ఇక్కడ స్నానం చేస్తే శరీరం, మనసు పరిశుద్ధతనొందుతాయి. – మహాభారతం

**జాతుకర్ణ :** పంచేంద్రియాలను తన ఆధీనంలో వుంచు కొన్న ప్రాచీన మునిశ్రేష్ఠుడు. యుధిష్ఠురుని కొలువులో సభ్యుడు. – మహాభారతం

**జాథరుడు :** స్కందదేవుని అనుచర వీరుల్లో ఒకడు. – మహాభారతం

**జానకి 1 :** చంద్ర వినాశనుడను రాక్షసి యొక్క పునర్జన్మయే ఈ జానకి అనే క్షత్రియరాజు. పాండవులు

ఇతన్ని కురుక్షేత్రయుద్ధంలో తమవైపు పాల్గొమ్మని ఆహ్వానించారు. - మహాభారతం

**జానకి 2 :** చూ॥ సీత.

**జానపది :** ఓ అప్సరస స్త్రీ. శరద్వంతుడి తపస్సు భగ్నం చెయ్యడానికి ఈమెను ఇంద్రుడు పంపగా ఈమెను చూడగనే శరద్వంతుడికి రేతఃపతన మౌతుంది. వీరికి కృపుడు, కృపి జన్మిస్తారు. కృపిని ద్రోణాచార్యుడు వివాహమాడతాడు. - మహాభారతం

**జానశృతి :** జనశృతి కుమారుడు, దైవభక్తుడు. ఇతడు పోషించిన రుషులు హంసల రూపంలో వచ్చి ఇతణ్ణి మెచ్చుకొని రైభ్యుని ప్రస్థావనతెచ్చి ఇతడు అతడికంటే ఘనుడా ? అని సంవాదించు కుంటాయి. జానశృతి ఇది విని రైభ్యుడివద్దకు వెళ్లి గోవుల్ని, ఆభరణాల్ని, రథాన్ని ఇచ్చి తన కూతుర్నికూడా ఇచ్చి బ్రహ్మజ్ఞానాన్ని సంపాదిస్తాడు.

**జానుజంఘుడు :** ప్రాతః సంధ్యా వేళలో స్మరించదగ్గ రాజు. - మహాభారతం

**జాపకుడు :** ఇతడొక బ్రాహ్మణుడు. నిత్యం గాయత్రి జపించేవాడు. గాయత్రి ఉచ్చారణలో దోషాలు దొర్లడం వల్ల ఇతణ్ణి నరకానికి పంపబోతే సావిత్రీ దేవి ప్రత్యక్షమై ఇతణ్ణి స్వర్గానికి పంపిస్తుంది. - మహాభారతం

**జాబాల :** సత్యకామ జాబాలిగా ప్రసిద్ధుడైన జాబాలి తల్లి. - చూ॥ సత్యకాముడు.

**జాబాలి 1 :** విశ్వామిత్రుని కుమారుడు. కానీ ఇతడు వశిష్టునికి సన్నిహితంగా వుండేవాడు. రాముడు రాజ్యాన్ని భరతుడికి అప్పగించి వెళ్ళడాన్ని పొర పాటని రాముడితో వాదిస్తాడు. రాముడికి కోపంరాగా వశిష్ఠుడు శాంతింపజేస్తాడు. ఇతడు అథర్వ వేదానికి వ్యాఖ్యానం చేశాడు. - విష్ణుపురాణం

**జాబాలి 2 :** పథ్యుడి శిష్యుడు.

**జాబాలి 3 :** చూ॥ సత్యకాముడు.

**జాబాలి 4 :** ఓ రుషి. ఇతడి తపస్సు భగ్నం చేయడానికి ఇంద్రుడు రంభను పంపగా అతడు ఆమె అందానికి ముగ్ధుడై ఆమెను కూడగా వారికి ఓ కుమార్తె జన్మించెను. చిత్రాంగదుడను రాజు ఆ అప్సరసను ఎత్తుకుపోగా జాబాలి చిత్రాంగదుడిని కుష్టు వ్యాధి గ్రస్తుడవు కమ్మని శపించెను. - స్కందపురాణం

**జాబాలి 5 :** ఇతడు మందర పర్వతంపై తన శిష్యులతో కలసి తపస్సు చేసెను. ఇతడి శిష్యులను కూడా ఇదే పేరుతో పిలుస్తారు. కృష్ణుని గురించి ధ్యానంలో వుండి పునర్జన్మలో చిత్రాంగదుడనే గోపాలుడుగా జన్మించాడు. - పద్మపురాణం

**జామఘుడు :** యయాతి వంశంలోని ఒక రాజు. - భాగవతం

**జామదగ్న్యుడు :** పరశురాముడి మరోపేరు. - చూ॥ పరశురాముడు

**జారుధి (జారూధి) :** ప్రాచీన భారతదేశంలోని ఒక ప్రాంతం. శ్రీకృష్ణుడు శిశుపాల జరాసంధుల్ని ఇక్కడ ఒకసారి జయించాడు. - మహాభారతం

**జాలపాదుడు :** చూ॥ దేవదత్తుడు.

ఒకసారి శత్రువులు ఇతడిని చుట్టుముట్టగా అశ్వనీ దేవతలు తమ రథంలో తీసుకొని వెళ్లి రక్షించి ఓ పరత్వంపై వుంచారు. - రుగ్వేదం

**జాహుషుడు :** రుగ్వేదకాలంలోని ఒక రాజు.

**జాహ్నవి :** గంగానదికి మరోపేరు. - చూ॥ గంగ

**జితపతి :** ఉశీనరపతి కుమార్తె. అష్టమ వసువగు ప్రభా సుని భార్యకు ప్రాణస్నేహితురాలు. ఈమెకిచ్చుటకే వసువులు వసిష్ఠుని హోమదేనువును దొంగిలించి శాపమునొందిరి. - మహాభారతం

**జితాత్ములు :** దేవగణంలో ఒకతెగ. - మహాభారతం

**జితాశ్వుడు :** పృథు చక్రవర్తి కుమారుడు. పృథువు యాగము చేయుచుండగా అందలి అశ్వమును ఇంద్రుడు అపహరించగా ఇతడు ఇంద్రునిపై యుద్ధముచేసి అశ్వమును మరల తెచ్చెను. అందుకే ఇతనికా పేరు వచ్చెను. - భాగవతం

**జితుడు :** జయవిజయుల కింకరుడు. ఇతణ్ణి సనకస నందాదులు వధించారు. ఇతడే పునర్జన్మలో మారీచుడిగా పుట్టి రామునిచే వధింపబడ్డాడు. - బ్ర.వై. పురాణం

**జిష్ణు కర్మ :** చేది దేశపు ఒక వీరుడు. కురుక్షేత్ర యుద్ధంలో పాండవుల పక్షాన పోరాడాడు. - మహాభారతం

**జిష్ణువు 1 :** అర్జునుడి మరోపేరు. - చూ॥ అర్జునుడు

**జిష్ణువు 2 :** శ్రీకృష్ణుడి మరోపేరు. ఏ యుద్ధంలోను ఓటమి చెందకపోవడం వల్ల ఈ పేరొచ్చింది.
– మహాభారతం

**జిష్ణువు 3 :** చేది దేశపు యోధుడు. కురుక్షేత్ర యుద్ధంలో కర్ణుడితడ్ని సంహరిస్తాడు. – మహాభారతం

**జిహ్వ :** ఓ సేవిక. అంతఃపురం నుండి ఆభరణాలను దొంగిలించింది. – చూ॥ హరిశర్మానుడు

**జీబలుడు :** ప్రవాహణుడి తండ్రి. – చూ॥ చా. ఉ.

**జీమూతకేతువు 1 :** శివుని మరోపేరు. ఎండవేడిమి భరించలేక పార్వతి శివుణ్ణి ఇల్లు కట్టుకుందామని అడుగగా నాకిల్లు లేదుకనుక ఇలా తిరుగుతున్నానని చెప్తాడు. అలాగే వర్షాకాలం రాగా వర్షానికి తడుస్తు న్నామని తన బాధ వ్యక్తం చెయ్యగా ఆమెను తనతో పాటు మేఘాలపైకి తీసుకెళ్తాడు. ఆ మేఘం శివునికేత వంలా కన్పించింది గనుక శివుడికి జీమూతకేతువు అని పేరొచ్చింది. – వామన పురాణం.

**జీమూతకేతువు 2 :** చూ॥ జీమూత వాహనుడు.

**జీమూతవాహనుడు :** జీమూతకేతువు కొడుకు. విద్యాధ రుడు. కల్పవృక్షాన్ని జనులంతా సుఖంగా జీవించే టట్లు చెయ్యమని కోరగా అది భూమిమీద బంగారం కురిపిస్తుంది. ఇతడు తన స్నేహితుడి సోదరి మలయ వతిని వివాహమాడుతాడు. అతని స్నేహితుడు మిత్రా వసువువల్ల నదీ తీరంలోని సర్పాల ఎముకల కథవిని నాగుల్ని రక్షించాలను కొని శంఖచూడుడను సర్పం బదులు తనే గరుత్మంతుడికి ఆహారంగా వెళతాడు. దేవి మహాత్మ్యంవల్ల గరుడుడు ఇతణ్ణి భుజించలేక పోతాడు. జీమూతవాహనుడి కోరికపై గరుడుడు నాగుల్ని తినడం మానివేస్తాడు. – కథాసరిత్సాగరం

**జీమూతుడు :** యయాతి వంశంలో జన్మించిన ఒక రాజు. – భాగవతం

**జీర్ణోద్ధారం :** ఆలయాల్లో శిథిలమైన విగ్రహాల్ని పునర్ని ర్మించి పవిత్రం చెయ్యడాన్ని జీర్ణోద్ధారం అంటారు.
– అగ్నిపురాణం

**జీవ జీవకుడు :** పక్షిరాజు. – చూ॥ మహాభారతం

**జీవల 1 :** తక్షకుడి కూతురు. ఈమె భర్త రుక్షుడు. ఈమె కొడుకు మతినారుడు. – మహాభారతం

**జీవల 2 :** నీలధ్వజుడి భార్య.

**జీవలుడు :** ఋతుపర్ణుడి కొలువులోనివాడు. నలదమ యంతుల ఎడబాటుకి కారణమేమని నలుణ్ణే అడుగు తాడు. – మహాభారతం

**జీవాత్మ :** పరబ్రహ్మ సర్వవ్యాపి అయిన భగవంతుడని సూక్ష్మమైన పరబ్రహ్మను జీవాత్మ అంటారు. ఆ పర బ్రహ్మ యొక్క పదార్థ రూపమే శరీరం. దాని సూక్ష్మ రూపం ఆత్మ. పదార్థ రూపమైన శరీరాన్ని అన్నమయ కోశమనీ అంటారు. దీనిలో ప్రాణమయ కోశముంటుంది. ప్రాణమయ కోశం మానవా కృతిలో వుంటుంది.
– తైత్తరియోపనిషత్తు

**జీవుడు :** బృహస్పతి మరోపేరు. – చూ॥ బృహస్పతి

**జుహుడు :** యయాతి వంశంలోని ఒక రాజు.
– భాగవతం

**జైత్రం :** హరిశ్చంద్రుడి రథం పేరు. దీనిమీద వెళ్తూ అనేక జైత్రయాత్రలు చేశాడు. – మహాభారతం

**జైత్రుడు :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. భీముడితణ్ణి కురుక్షేత్ర యుద్ధంలో వధిస్తాడు.
– మహాభారతం

**జైనులు :** బౌద్ధులవలే వీరుకూడా ఒక మత అవలం బికులు. వేదాలు ఈశ్వర ప్రోక్తాలనిగానీ, అవన్నీ సత్యాలనిగానీ నమ్మరు. జీవహింసను వ్యతిరేకిస్తారు. వీరిలో రెండు శాఖలున్నాయి. శ్వేతాంబరులు, దిగంబరులు.

**జైమిని :** వ్యాసుని శిష్యుడు. వ్యాస భారతానికి ఇతడు, వైశంపాయనుడు మరికొన్ని శ్లోకాలు చేర్చారు. జనమే జయుని సర్పయాగానికి వస్తాడు. జైమిని భారతంలో ఒక్క అశ్వమేధ పర్వమే వుంది. – మహాభారతం

**జంతుడు :** పూరు వంశపు రాజు. సోమకుడి కుమారుడు. సోమకుడికి నూర్గురు భార్యలు. ఒక్కడే కుమారుడు. ఇతనికి చీమకుట్టినా భార్యలందరూ రాజువద్దకు వచ్చి బాధపడ్తారు. ఇది చూసి కొడుకుల్లేకున్నా ఫరవాలేదు గాని ఒక్కడే వుంటే బాధాకరమని తలచి పురోహితుణ్ణి కలవగా ఇతణ్ణి త్యాగం చేస్తే వందమంది పుడతారని అందులో ఇతడుకూడా వుంటాడని చెప్తాడు. వారలా చేసి వందమంది కొడుకుల్ని పొందుతారు.
– మహాభారతం

**జంతుధవ :** అజుడనే వానరుని కూతురు. ఈమె అడవిలో తిరుగుతున్నప్పుడు ఓ రాక్షసుడు అరుస్తాడు. అందరూ భయపడినా జంతుధవ భయపడదు. ఈమె చెల్లెలు కూడ భయపడదు. వీరి తండ్రి వీరిద్దర్ని అతనికిచ్చి పెళ్లి చేస్తాడు. – బ్రహ్మపురాణం

**జంబుకుడు (జంబూకుడు/జంబుమాలిక) :** ఓ శూద్ర రుషి. రామరాజ్య కాలంలో ఓ బ్రాహ్మణ బాలుడు మరణిస్తాడు. నారదుణ్ణి రాముడు కారణమడగగా ఓ శూద్రుడు తపస్సు చేయడమే కారణమని చెప్తాడు. శ్రీరాముడు జంబుకుణ్ణి వధించగా బ్రాహ్మణ బాలుడు తిరిగి సజీవుడవుతాడు. – ఉత్తర రామాయణం

**జంబుకుమారుడు :** శూర్పణఖ కుమారుడు. తండ్రి విద్యుజ్జిహ్వుడు. దేవతలు తన తండ్రి మరణము నకు కారణమని వీరిపై పగతీర్చుకొనుటకు ఇంద్రుని గూర్చి తపస్సు చేయగా చంద్రహాసమను ఆయుధ మిచ్చెను. తన తపస్సుకు ఇది సరియైన ఆయుధము కాదని ఎంచి దానిని తన తలపై వుంచుకొని మరల తపస్సు చేయగా చుట్టూ వెదురు పొదలు పెరిగి అతడు అందులో మూసుకు పోయెను. లక్ష్మణుడు అరణ్య వాస సమయమున అచటకు వచ్చి పండ్లు కోసు కొనుచూ ఆ ఆయుధమును చూసి దానిని గ్రహించి ఝళి పించగా మునులు ఆ ఆయుధముతో పండ్లేల ఆ వెదురు పొదను నరకమనగా అతడట్లే చేసెను. ఆ పొదలలోని జంబు కుమారుడుకూడా ఆ చంద్ర హాసమునకు బలియయ్యెను. – రామాయణం

**జంబుకేశ్వరుడు :** మైసూర్‌లో గల శివలింగం పేరు. జంబు అనేది ఒక వృక్షం. ఇచ్చట జంబుకేశ్వరాల యాన్ని కట్టించింది వెంకణ్ణరాజు – తిరువానక్కా పురాణం

**జంబుమాలి :** రాక్షస జాతికి చెందిన ప్రహస్తుడి కొడుకు. ఇతణ్ణి సీతను వెదకడానికి వెళ్లిన హనుమంతుడు వధిస్తాడు. – రామాయణం

**జంబుమాలిక :** చూ॥ జంబుకుడు

**జంబూకుడు :** స్కందదేవుని యోధుల్లో ఒకడు. – మహాభారతం

**జంబూద్వీపం :** మేరుపర్వతానికి దక్షిణాన వున్న ద్వీపం. ఇక్కడి జంబూ వృక్షంవల్ల ఈ పేరు వచ్చింది. దీనికి సుదర్శనమనే పేరు కూడా వుంది. దీనిలో ఏడు ఖండాలున్నాయి. అవి కురు, హిరణ్మయి, రమణక, ఇలావృత, భద్రాశ్వ, కేతుమాల, హరివర్ష, భారతవర్ష, కింపురుషాలు – మహాభారతం

**జంబూనది :** మేరుపర్వతానికి దక్షిణానవున్న జంబూ వృక్షం ఫలరసాలతో ఏర్పడిన ఒక నది. ఈ నీరు ప్రాకిన ప్రాంతమంతా బంగారమవుతుంది. ఈ నీరు తాగినవారికి జరావ్యాధులుండవు. దప్పిక వుండదు. ఇక్కడ జంబాద్విని అనే దేవత వుంది. – దేవీభాగంతం

**జంబూమార్గం :** ఇదొక పవిత్ర స్థలం. దీన్ని దర్శిస్తే అశ్వమేధయాగం చేసిన ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**జంబూవృక్షం :** మేరు పర్వతానికి దక్షిణానవున్న ఓ వృక్షం. ఈ వృక్షంవల్లే ఈ ద్వీపానికి ఆ పేరు వచ్చింది. – మహాభారతం

**జంభకుడు :** శ్రీకృష్ణుడి చేతిలో మరణించిన ఒకరాజు. ఇతడి కొడుకు రాజుకాగా సహదేవుడితణ్ణి వధిస్తాడు. – మహాభారతం

**జంభాసురుడు :** ఇతడో రాక్షసుడు. అమృతాన్ని ధన్వంతరి నుండి ఎత్తుకుపోయినవారిలో ముఖ్యుడు. – అగ్నిపురాణం

పురాణాలలో చాలామంది జంభాసురులున్నట్లు పేర్కొనబడింది. అయితే వీరంతా కశ్యపునికి దనువు వల్ల జన్మించినవారే. – మహాభారతం

ఓ జంబాసురుడ్ని శ్రీకృష్ణుడు చంపగా ఇంకొకర్ని ఇంద్రుడు చంపాడు. మరో జంబాసురుడ్ని అర్జునుడు వధించాడు. – మహాభారతం

**జంభారి :** ఇంద్రుడి మరోపేరు. జంభుడనే రాక్షసుణ్ణి వధించాడు కనుగ ఈ పేరు వచ్చింది.

**జంభుడు 1 :** ఒక రాక్షసుడు. దేవదానవ సమరంలో ఇంద్రుడితణ్ణి వధిస్తాడు. – భాగవతం

**జంభుడు 2 :** యజ్ఞాలను ధ్వంసం చేసే ఒక రాక్షసుడు. విష్ణుమూర్తి యజ్ఞపురుషుడుగా అవతరించి ఇతణ్ణి సంహరిస్తాడు. – మహాభారతం

**జంభుజడు 3 :** తాటక భర్త. ఇతని కుమారుడు సునందుడు. – రామాయణం

**జాంగలం :** ప్రాచీన భారతదేశంలోని ఓ ప్రాంతం. - మహాభారతం

**జాంబవతి :** జాంబవంతుడి కుమార్తె. ఈమెను శ్రీకృష్ణుడు వివాహమాడతాడు. వీరికి పుట్టిన కుమారుడు సాంబుడు. - దేవీభాగవతం

**జాంబవంతుడు :** మధుకైటభులు బ్రహ్మను యుద్ధానికి పిలిస్తే బ్రహ్మకు చెమటలు పుడతాయి. ఆ చెమట నుంచి జాంబవంతుడు జన్మిస్తాడు. జంబూ పథంలో మొదట ప్రవేశించినవాడు గనుక జాంబవంతుడన్నారు. ఇతడు వానరరాజు సుగ్రీవుడికి మంత్రి. హనుమంతుడు సముద్రాన్ని దాటడానికి సంశయించగా అతని బలాన్ని వివరించి హనుమంతుడు లంకపైకి లంఘించడానికి ప్రేరేపిస్తాడు. ఇతడు విష్ణువు దశావతారాలు చూసేంతకాలం జీవించాడు. ద్వాపర యుగంలో శ్రీకృష్ణుడితో యుద్ధంచేసి తన కోర్కె నెరవేర్చుకొని తన కుమార్తె జాంబవతిని శ్రీకృష్ణునికిచ్చి వివాహం చేశాడు. - భాగవతం

**జృంబాదేవి :** చూ॥ కొట్టుక

**జ్వరం :** ఇదొక వ్యాధి. ఓ భూతం వల్ల ఈ వ్యాధి రకరకాల జీవుల్లో 8 రకాలుగా వస్తుందని పురాణ ఇతిహాసాలు చెప్తున్నాయి.

*జ్వరం జన్మవృత్తాంతం :* శివపార్వతులు మహామేరువుపై గల జ్యోతిష్కంలో స్నానం చేస్తూ ముచ్చటించుచుండగా గంగా ద్వారంలో దక్షుడు యజ్ఞం చేస్తున్నాడు. బ్రహ్మ ఇతర దేవతలు వారి వాహనాలపై ఆ యజ్ఞానికి వెళ్తుండగా పార్వతి శివుడ్ని ఆ యజ్ఞానికి పిలవని విషయాన్ని శివుని ద్వారానే విని బాధపడింది. ఆ బాధనుచూసి శివుని మూడో కంటినుండి చెమట బిందువు రాలింది. దాని నుండి ఓ శక్తివంతమైన భూతం వెలువడింది. దీనికి శివుడు జ్వర అని నామ కరణం చేశాడు.

ఈ భూతంవల్ల బ్రహ్మ ఇతర గణాలు ఒణికి పోయాయి. క్రిందపడిపోయారు. బ్రహ్మ ఇతర దేవతలు శివుని వద్దకు వచ్చి ప్రార్థించగా జ్వరాన్ని ఖండ ఖండాలుచేసి ఒకో ఖండాన్ని ఒకో జీవిని పట్టి పీడించే ఉపశమనం ఇచ్చాడు. అందువల్ల పాములకు పొరలు వూడటం, మనుషులకు జ్వరం, గుర్రాలకు గొంతునొప్పి, పులులకు బద్దకం ఏర్పడినాయి. వృత్తాసురుడ్నికూడా ఈ జ్వరం పట్టి పీడించగా ఇదే సమయంలో ఇంద్రుడు తన వజ్రాయుధంతో అతణ్ణి సంహరించాడు. - మహాభారతం

**జ్ఞానపావన తీర్థం :** ఇదో పవిత్రస్థలం. ఇక్కడ స్నానంచేస్తే అగ్నిస్తోమ యజ్ఞం చేసిన ప్రతిఫలం లభిస్తుంది. - మహాభారతం

**జ్ఞానప్రసూనాంబ :** పార్వతి. చూ॥ శ్రీకాళహస్తి.

**జ్వాల :** రుక్షుని భార్య. మతినారుని తల్లి. - మహాభారతం

**జ్వాలాజిహ్వుడు :** స్కందదేవునికి అగ్నిదేవుడిచ్చిన అనుచరుల్లో ఒకడు. మరొకడు జ్యోతి. - మహాభారతం

**జ్వాలేశ్వరుడు :** చూ॥ త్రిపుర

**జ్యామఘుడు 1 :** రుచికుడి కుమారుడు. - చూ॥ రుచికుడు

**జ్యామఘుడు 2 :** ఇక్ష్వాకు వంశంలోని ఒక రాజు. రుక్మకవచుడి కొడుకు. ఇతని సోదరులు ఇతణ్ణి రాజ్యం నుంచి వెళ్లగొడతారు. సంతానం లేదు. ఒక రోజు భోజ అనే కన్యను తన రథంమీద తీసుకువచ్చి ఈమె నీ కోడలని తన భార్య శైల్యకు చెప్తాడు. తర్వాత ఇతనికి విదర్భుడనేవాడు జన్మిస్తాడు. - పద్మపురాణం

**జ్యేష్టపుష్కరం :** ఇదో పవిత్ర స్థలం. దీన్ని దర్శిస్తే అగ్నిస్థోమ యజ్ఞం చేసిన ప్రతిఫలం లభిస్తుంది. - మహాభారతం

**జ్యేష్టసామం :** జ్యేష్టుడనే రుషి ధ్యానించిన సామవేదం. - మహాభారతం

**జ్యేష్ఠాదేవి :** బ్రహ్మ మానసపుత్రిక. వరుణుని వలన ధర్ముడను పుత్రునికి జన్మనిచ్చెను.

**జ్యేష్ఠిల :** ఇదో నది. వరుణుని కొలువులో అతణ్ణి పూజిస్తూ వుంటుంది. - మహాభారతం

**జ్యేష్ఠుడు :** ఓ బ్రాహ్మణుడు. సామవేదంలో సంపూర్ణ ప్రావీణ్యం కలవాడు. బర్హిషదుల సలహా స్వీకరించినవాడు. - మహాభారతం

**జ్యోతి :** అహుడను వసువు కుమారుడు. - మహాభారతం

**జ్యోతికం :** ఓ ప్రసిద్ధ సర్పం. కశ్యప కద్రువలకు జన్మించింది. – మహాభారతం

**జ్యోతిరథ :** ప్రాచీన భారతదేశంలోని ఓ నది. ఈ నది నీటిని ప్రజలు తాగేవారు. – మహాభారతం

**జ్యోతిర్వసుడు :** పురూరవుని వంశంలో జన్మించిన వాడు. సుమతి కుమారుడు. ప్రతీకకు తండ్రి. – భాగవతం

**జ్యోతిర్ధాముడు :** తామసుడు మనువయిన కాలంలో సప్తర్షుల్లో ఒకడు. – బ్రహ్మపురాణం

**జ్యోతిష్కం :** సుమేరు పర్వత శిఖరాన్ని జ్యోతిష్కమని అంటారు. – మహాభారతం

**జ్యోతిష్మానుడు :** కుశద్వీప ప్రాచీన రాజు. ఇతనికి ఏడు గురు కుమారులు. కుశద్వీపాన్ని ఏడుగా విభజించి వాటికి అతని కుమారుల పేర్లయిన ఉద్భీద, వేణుమాన, వైరధ, లంబన, ధృతి, ప్రభాకర మరియు కపిల అని పేర్లు పెట్టాడు. – విష్ణుపురాణం

**జ్యోత్స్నాకాళి :** చంద్రుని రెండవ కుమార్తె. ఈమె అతి సౌందర్యవతి, సూర్యుడ్ని వివాహమాడింది. – మహాభారతం

## ఝ

**ఝ :** ఈ అక్షరానికి అర్థం ప్రసిద్ధత.

**ఝర్ఝుడు :** సుందుని తండ్రి. సుందుని కుమారుడు తాటకి కుమారుడైన మారీచుడు. – రామాయణం

**ఝర్ఝరుడు :** హిరణ్యాక్షుని కొడుకు. – భాగవతం

**ఝిల్లి 1 :** వృష్ణివంశంలోని ఓ యాదవుడు. ద్వారకలో శ్రీకృష్ణుని ఏడుగురు ప్రధాన మంత్రుల్లో ఒకడు. – మహాభారతం

**ఝిల్లి 2 :** వృష్ణి వంశంలోని వీరుడు. ద్రౌపది స్వయం వరంలో పాల్గొన్నాడు. శుభద్ర కట్న కానుకల్ని అర్జునుడికి అందజేశాడు. కురుక్షేత్ర యుద్ధంలో పాల్గొన్నాడు. – మహాభారతం

**ఝిల్లికం :** దక్షిణ భారతదేశంలోని ఓ ప్రాచీన పట్టణం.

**ఝీంకు :** ఇది నేలమీద పాకే జంతువు. దీనిని ఝిల్లీ అనీ అంటారు.

## ట

**టిట్టిభసరస్సు :** టిట్టిభం అంటే నీటికోడి. వాల్మీకి ఆశ్రమం వద్ద ఒక కొలను వుండేది. ఈ సరస్సు వద్ద నీటికోళ్లు వుండేవి. ఒక మగకోడి ఆహారంకోసం వెళ్లి తిరిగి వచ్చే సమయంలో చాలా నీటికోళ్లు కన్పించి తన తోటి స్త్రీ కోడి పాతివ్రత్యాన్ని అనుమానిస్తుంది. స్త్రీకోడి ఇది భరించలేక అష్టదిక్పాలకుల్ని ప్రార్థించగా వారు వెంటనే ప్రత్యక్షమై స్త్రీ కోడిని ఆ కొలనులో ఓ వైపునుండి మరో తీరానికి ప్రమాదం లేకుండా చేరమంటారు. ఆ కోడి అలా చేరగా అది పవిత్రమైందని మగ కోడితో చెప్తారు. వాల్మీకికూడా సీతకు ఇలాంటి పరీక్ష పెట్టగా తన మనసులో పరపురుషుడి తలంపే లేనియెడల నన్ను ఆవలిగట్టుకు జేర్చమనగా అలా చేరిన సీత కనీసం తడవలేదు. అందుకని ఆమెను మహాసాధ్వి అని పిలిచేవారు. – కథాసరిత్సాగరం

**టిట్టిభుడు :** ఇతడో రాక్షసుడు. వరుణుని సభలో వుండేవాడు. – మహాభారతం

## ఠ

**ఠింటాకరాళుడు :** ఉజ్జయిని పట్టణంలో నివసించిన ఓ జూదగాడు. ఇంద్రుడి శాపాన్ని పొందిన కాలవతి అనే అప్సరస ఇతని భార్య. పాచికలాటలో ప్రవీణుడు. దేవతలుకూడా ఇతనితో ఆడలేమని చెప్తారు. ఇతడు మహాకాలుడి ఆలయంలో నివసించేవాడు. మహాకాలుణ్ణి ఆటకు పిలవగా అతడు నిరాకరిస్తాడు. అపుడితడు తపస్సు చేసి మహాకాలుణ్ణి ప్రసన్నం చేసుకోగా అతడు ఆశీర్వదించగా అతని భార్యతో కలసి స్వర్గంలో ఆనందంగా నివసిస్తాడు. – కథాసరిత్సాగరం

## డ

**డిభకుడు :** చిత్రసేనుడనునది మరోపేరు. హంసుని సోదరుడు. దేవతలవల్ల ఎవరివల్ల మరణం లేనట్లు వరం పొందాడు. జరాసంధునికి స్నేహితుడు.

బ్రహ్మదత్తునికి శివుని వరం వల్ల ఇతని ఇద్దరు భార్యలకు ఒక్కో కుమారుడు జన్మించారు. వీరే హంస, డిభకులు. వీరు కశ్యపాశ్రమానికి దుర్వాసుని ఆశ్రమానికి వెళ్లి వాటిని నాశనం చేయగా దుర్వాసుడు శ్రీకృష్ణుడికి తమ బాధలు చెప్పుకున్నాడు. అంతే కాకుండా వీరు రాజసూయ యాగం చేస్తూ శ్రీకృష్ణుణ్ణి పాదాక్రాంతం కావలసి నదిగా కబురు చేయగా శ్రీకృష్ణుడు బలరాముడు సాత్యకితో వచ్చి శ్రీకృష్ణుడు హంసుడిని, బలరాముడు డిభకుణ్ణి వధించారు.

– మహాభారతం

వీరికి ఎవ్వరి వల్ల మరణం కలుగదని వరం ఉండటం వల్ల శ్రీకృష్ణుడు డిభకుడు చనిపోయాడని హంసుడికి, హంసుడు చనిపోయాడని డిభకుడికి కబురందేటట్లు చేయగా సోదర మరణానికి చింతించి మనోవ్యథతో ఇద్దరూ మరణిస్తారు. – ఉత్తర రామాయణం

**డింబరుడు :** స్కందదేవునికి బ్రహ్మఇచ్చిన ఇద్దరు అనుచరుల్లో ఒకడు. రెండోవాడు ఆడంబరుడు.

– మహాభారతం

**డిండికం :** బిడాలోపాఖ్యానంలో ముఖ్యపాత్ర వహించిన ఎలుకపేరు. ఒకప్పుడు గంగానదీ తీరంలో ఓ పిల్లి తపస్సు చేస్తుండేది. దాని తపస్సుకుమెచ్చి పక్షులు జంతువులు దాన్ని పూజించేవి. ఒకసారి అది ఎలుకల్ని అన్నింటినీ పిలిచి నేను తపస్సు చేస్తున్నాను. ఆధ్యాత్మిక జీవితం గడుపుతున్నాను. భౌతిక జీవనం, ఆధ్యాత్మికజీవనం ఒకేసారి చెయ్యలేము కదా నేను మీ కోసం కూడా ఆధ్యాత్మిక జీవనం గడుపుతాను, మీరు నా భౌతిక అవసరాలు చూడమనగా ఎలుకలు దానికి ఆహారం సమకూరుస్తుంటాయి. అయితే పిల్లి మాత్రం తన దగ్గరకు వచ్చిన ఎలుకల్ని ఒకోదాన్ని తింటూ వుంటుంది. ఇది గమనించిన డిండికం ఎలుకల సమావేశాన్ని ఏర్పాటుచేసి ఆ వృత్తాంతం చెప్తుంది. ఇంతలో పిల్లి డిండికాన్ని కూడా భక్షించగా కోకిల అనే ఎలుక నాయకత్వంలో అవి తప్పించుకుంటాయి. చేసేది లేక పిల్లికూడా అక్కడ్నుంచి వెళ్లిపోతుంది.

– మహాభారతం

**దుండుభం :** ఒక సర్పం. రురుడు దీన్ని కొట్టబోగా అది మునిగామారి కొట్టడానికి కారణం అడుగుతాడు. నా భార్యను పాముకరిచింది. అప్పట్నించి ప్రతి పామును కొడుతున్నానని ఇంతకీ నీవెవ్వరని అడుగుతాడు. ఆ ముని నేను సహస్రపాదుడ్ని. శాపవశాన ఇలా అయ్యాను. జీవహింస బ్రాహ్మణ ధర్మం కాదని రురుడితో పాముల్ని కొట్టడం మాన్పిస్తాడు.

– మహాభారతం



**ఢాకిని :** ఓ తెగ స్త్రీలు. వీరికి తంత్రవిద్యలో ప్రవేశం వుంటుంది. మంత్రాలతో కొన్ని కార్యాలు నిర్వహిస్తారు.



**త :** ఈ అక్షరానికి అర్థం దొంగ, లేక పక్షి అడుగుభాగం.

**తక్షకుడు 1 :** కద్రువ వల్ల కశ్యపునికి జన్మించిన సర్పం. ఇదో సర్పరాజు. కద్రువ వినతల పందెంలో వినతను ఓడించడానికి తన కుమారులైన సర్పాలను మోసానికి పాల్పడమంటుంది. అందుకు కొన్ని అంగీకరించవు. కద్రువ వారిని జనమే జయుని సర్పయాగంలో భస్మం కమ్మని శపిస్తుంది. ఆమెమాటను తిరస్కరించిన వారు విడిపోయి వెళ్లి పోతారు. అలా వెళ్లిపోయిన సర్పాలకు నాయకుడు తక్షకుడు.

ఆస్తికుని శాపం వల్ల పరీక్షిత్తు మహారాజు ఏడు రోజులలో, తక్షకుని కాటుకు మరణించాలి. ఈ శాపం విన్న పరీక్షిత్తు ఏడంతస్తుల భవనంలో అన్ని రక్షణ చర్యలు తీసుకొని వుంటాడు. ఎంతోమంది బ్రాహ్మణులు, వైద్యులు పరీక్షిత్తుని రక్షించడానికి సిద్ధంగా వుంటారు. అతణ్ణి రక్షించడానికి కశ్యపుడనే బ్రాహ్మణ వైద్యుడు, అతని కరవడానికి బ్రాహ్మణ వేషంలో వున్న తక్షకుడు ప్రయాణంలో కలుస్తారు. ఒకర్నొకరు పరిచయం చేసుకొని వారి శక్తిని పరీక్షించు కుంటారు. తక్షకుడు ఓ అరటిచెట్టును తన కాటుతో నశింపచేయగా కశ్యపుడు దాన్ని తన వైద్య ప్రావీణ్యంతో బ్రతికిస్తాడు. ఇతడుండగా తన కార్యం సాధ్యంకాదని అతడికున్న ధనాశగ్రహించి కావలసిన ధనం ఇచ్చి వెనక్కు పంపుతాడు. ఆరురోజులు గడచినాయి ఏడవరోజు వచ్చింది.

తక్షకుడు తనతోటి వారితో వచ్చి ఆ భవనమంతా రక్షణ వలయంలో వుండటం చూసి అతడు అతని మిత్రులు బ్రాహ్మణ వేషాలు ధరించి రాజుని చూడ గోరతారు. రాజ భటులు వారిని ఆపి పరీక్షిత్తుకు ఆ విషయం చెప్పగా వారిచ్చిన ఫలాలు పంపమని వారిని మరుసటిరోజు కలవమని చెప్తాడు. తక్షకుడు ఆ పండ్లలో అన్నిటికంటే అందమైన దానిలో పురుగుగా ప్రవేశిస్తాడు. పరీక్షిత్తు ఏడవరోజు సాయంత్రం ఆ ఫలాలను తన మంత్రులకు తలా ఒకటి ఇచ్చి అందమైన ఫలాన్ని తను తీసుకుని కోయగా ఈ పురుగు కన్పిస్తుంది. పరీక్షిత్తు బ్రాహ్మణుని శాపం వృధాకారాదని ఆ పురుగును తన కంఠంపై వుంచుకోగా అది తక్షకుడుగా మారి పరీక్షిత్తును కాటు వేయగా మరణిస్తాడు. – దేవీభాగవతం

*ఇంద్రునికి మిత్రుడగుట :* ఉత్తంకుడు వేదుడను గురువు దగ్గర విద్యనభ్యసించి గురుదక్షిణ ఏమి కావలయుననగా, అతడు క్షత్రియరాజైన పుష్యుని భార్య చెవి ఆభరణాలు గురుదక్షిణగా కోరతాడు. వాటిని తెచ్చేలోపు ఇంద్రుని కోరికపై తక్షకుడు వాటిని అపహరించి ఇస్తాడు. అప్పటినుండి తక్షకుడు ఇంద్రుడికి మిత్రుడు, ఉత్తంకుడికి శత్రువు అవుతాడు.

*సర్పమేదయాగం :* పరీక్షిత్తు కుమారుడు పెద్దవాడై ఉత్తంకుని ద్వారా తన తండ్రి మరణానికి కారకుడు తక్షకుడని తెలుసుకొని సర్పాలపై ఆగ్రహంతో వుండగా ఉత్తంకుడు తక్షకునిపై తనకు కూడా వున్న కోపం కారణంగా జనమేజయుడితో సర్పయాగం చేయిస్తాడు. ఒక్కోసర్పం యజ్ఞగుండంలో పడి భస్మం అవుతున్నా తక్షకుడు మాత్రం రాలేదు. అందరి పెదాలపై తక్షకుడే. ఉత్తంకుడు మంత్రాన్ని జపిస్తూ తక్షకుడ్ని కదలించి వేస్తున్నాడు. తక్షకుడు ఇంద్రుణ్ణి శరణు వేడుకోగా తన సింహాసనంపై కూర్చో పెట్టుకున్నారు. ఉత్తంకుడు దివ్యదృష్టితో గమనించి తన మంత్రోచ్చారణ తీవ్రంచేసి తక్షకుడ్ని ఇంద్రుణ్ణి కూడా పిలుస్తున్నాడు. ఇంద్ర సింహాసనంతో సహా ఇంద్రుడు, తక్షకుడు వచ్చి యజ్ఞగుండంలో పడతారనగా జరాత్కారి పుత్రుడు బ్రాహ్మణ బాలుడు అయిన ఆస్తికుని కోరికపై యజ్ఞం ఆపబడి తక్షకుడు రక్షింపబడ్డాడు. ఇంద్రుని కోరికపై తక్షకుడు ఖాండవవనంలో వుండగా అర్జునుడి బారినుండి ఇంద్రుడు ఇతణ్ణి రక్షించాడు గాని ఇతని భార్య వధింపబడింది. ఒకసారి భూమి గోమాతకాగా ఎవరి కోరిక ప్రకారం వారు పాలు పిండుకోగా దూడగా తక్షకుడు విషం పిండుకున్నాడు. బలభద్రరాముని ఆత్మ పాతాళానికి చేరినపుడు తక్షకుడు భక్తితో స్వీకరించాడు. – మహాభారతం

**తక్షకుడు 2 :** లక్ష్మణుని ఇద్దరు కుమారుల్లో పెద్దవాడు. లక్ష్మణుడు తూర్పుతీరాన్ని జయించి అగతి అనే నగరాన్ని నిర్మించి ఇతణ్ణి రాజుని చేస్తాడు.
– ఉత్తర రామాయణం

**తక్షశిల :** ప్రాచీన భారతదేశంలో రెండు ప్రపంచ ప్రసిద్ధి విద్యా సంస్థలుండేవి. ఒకటి నలంద రెండవది తక్షశిల. ఇది ఉత్తర భారతదేశానికి పశ్చిమతీరాన వుంది. వితస్థా నదీతీరాన గల ఈ ప్రాంతంలోనే జనమేజయుడు సర్పయాగం చేసి మహాభారత కథను విని బ్రాహ్మణులకు బహుమతులు అందజేశాడు.
– మహాభారతం

**తక్షుడు :** భరతునికి మాండవి వల్ల కల్గిన పుత్రుడు. ఇతని సోదరుడు పుష్కరునితో కలిసి గాంధార దేశాన్ని జయించి తాక్షశలాంగరిని సృష్టించాడు.
– రామాయణం

**తటాతక :** మలయధ్వజుని కుమార్తె. తల్లి కాంచనమాల. ఈమె మూడు కుచములతో జన్మించెను. తండ్రి ఆశ్చర్యమొందుచుండగా శివుడు ప్రత్యక్షమై ఈమె పార్వతి పునర్జన్మయని వివాహానంతరము మూడో కుచము అదృశ్యమగునని చెప్పెను. ఈమె తండ్రితోనే వుండి విజయయాత్రలు చేయు చుండెడిది. ఒకసారి సోమసుందరునిపైకి యుద్ధ మునకు బోయి అతని సుందర రూపము చూసి వివాహమాడగా మూడవ కుచము అదృశ్యమ య్యెను. ఈ దంపతులకు ఉగ్రపాండ్యుడు జన్మించెను. పుత్రుని జన్మానంతరము సోమసుందరుని ఆలయమునకు పోయి అదృశ్యమయ్యెను.
– స్కాందపురాణం

**తడిత్ప్రభ :** స్కందదేవుని స్త్రీ సేవకుకురాళ్లలో ఒకరు.
– మహాభారతం

**తనయం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాస స్థలం.
– మహాభారతం

**తనువు :** ప్రాచీన కాలంలోని ఓ సాధువు. వీరద్యుమ్ను డను రాజు కొలువులో చాలాకాలం నివసించాడు. – మహాభారతం

**తపతి :** సూర్యుని కుమార్తె. సూర్యుని భార్య సంజ్ఞ సూర్యుని వేడి తట్టుకోలేక తన పరిచారిక ఛాయను సూర్యుని పరిచారికగా వుంచుతుంది. ఈవిడ సంజ్ఞ రూపంలో సూర్యుడ్ని సేవించగా అతని సంపర్కం వల్ల తపతి జన్మిస్తుంది. సూర్యవంశరాజైన ఋక్షుని కుమారుడు వశిష్ఠునికి శిష్యుడు అయిన సంకర్షుడు తపతిని చూసి మూర్ఛపోతాడు. కారణం అతడు తపతిని ప్రేమించడమేనని తెలిసి వశిష్ఠుడు ఇతని తరఫున సూర్యుని ఒప్పించి వీరికి వివాహం చేస్తాడు. కురు చక్రవర్తి వీరికి జన్మించాడు. సూర్యుని కూతు రవటం వల్ల ఆకాశాన్ని వేడిగా వుంచ గలగడం వల్ల ఈమెకు తపతి అని పేరొచ్చింది. – మహాభారతం సూర్యుని వరంవల్ల ఈమె వింధ్యలో పుట్టి పశ్చిమానికి ప్రవహించే తపతీనదిగా మారింది. – భవిష్య పురాణం

**తపనుడు :** పాంచాల రాజ్యంలోని ఓ వీరుడు. మహా భారత యుద్ధంలో కర్ణుడితణ్ణి వధించాడు. – మహాభారతం

**తపస్వి :** నాదావళి వల్ల చాక్షుష మనువుకు జన్మించిన కుమారుడు. – మహాభారతం

**తపుడు :** అగ్ని స్వరూపుడైన దేవుడు. కశ్యప, వశిష్ఠ, ప్రాణక, చ్యవన, త్రివర్చస్సుల తపశ్శక్తి వల్ల జన్మిం చాడు. ఐదుగురి శక్తివల్ల జన్మించాడు కనుక పాంచ జన్య అనికూడా అంటారు. ఇతడు తదేక తపస్సు చేసి తపుడు అనే పేరుపొందాడు. అతని తల అగ్నిలా, చేతులు సూర్యునిలా, చర్మము, కళ్లు బంగారు వర్ణంలో, హృదయం నీలంగా వుంటుంది. – మహాభారతం

**తపోలోకం :** వైరజులు నివసించే పైలోకం. అగ్నివల్ల కూడా చలనం లేనివారు. ధృవపథానికి 11 కోట్ల యోజనాలపైన వుంటుంది. – విష్ణుపురాణం

**తప్తకుంభం :** ఇదో నగరం. 28 రకాల నరకాల్లో ఇదొ కటి. – విష్ణుపురాణం

**తప్తమూర్తి :** ఇదో నరకం.

**తమస 1 :** ఓ పుణ్యనది. ప్రజలు ఈ నీటిని త్రాగేవారు. ఈ నదీతీరానే వాల్మికి ఆశ్రమం కలదు. క్రౌంచ పక్షుల ప్రసిద్ధ కథకు కేంద్ర స్థలం. – రామాయణం

**తమస 2 :** ఓ నరకం.

**తమస 3 :** ఆత్మయొక్క మూడు గుణాల్లో ఒకటి. ఆ మూడు గుణాలు సత్వ, రజ, తమసాలు.

**తమోంతకృత్తు :** స్కందదేవుని యోధుల్లో ఒకడు. – మహాభారతం

**తరంతుకుడు :** ఓ యక్షుడు. కురుక్షేత్రపు హద్దులో ఉంచబడ్డాడు. ఇచట ఒకరోజు రాత్రి గడిపితే 1000 ఆవుల్ని బహుమతిగా ఇచ్చిన ప్రతిఫలం లభిస్తుంది. – మహాభారతం

**తరళం :** ప్రాచీన భారతదేశంలోని ఓ నివాసయోగ్య స్థలం. దీన్ని కర్ణుడు జయించాడు. – మహాభారతం

**తర్ధముడు :** శృతసేనకు శారదండాయని క్షేత్రపుత్రు డుగా జన్మించినవాడు. – మహాభారతం

**తర్పణము :** శ్రాద్ధ కర్మకాండలోని ఓ భాగము. జలము విడిచి పితృదేవతలను తృప్తిపొందించుట దీని ఉద్దేశ్యము. – పురాణనామ చంద్రిక

**తరుణకం :** ధృతరాష్ట్రుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో భస్మమయ్యింది. – మహాభారతం

**తలాతలం :** ఓ పాతళలోకం. ఇది గులకరాళ్లతో నిండి వుండును. కాలనేమి మొదలయిన దానవుల ఏలిక.

**తలుడు :** శలుని తమ్ముడు. – చూ॥ శలుడు

**తాటక :** ఓ రాక్షస స్త్రీ. అగస్త్యుని శాపంవల్ల రాక్షసిగా మారింది. సురక్షుడను యక్షుని కుమారుడు సుకేతుడు బ్రహ్మనుగూర్చి సంతానంకోసం తపస్సు చేయగా ఓ బాలిక జన్మించింది. ఆమే తాటక. బ్రహ్మ ఆమెకు వెయ్యి ఏనుగుల బలాన్ని ప్రసాదించాడు. తాటక ప్రకృతిసిద్ధంగానే క్రూరమైన కార్యాలు చేసేది, మాయలు చేసేది. జర్జ అనువాడి కుమారుడు సుందుడ్ని వివాహమాడగా మారీచ సుభాహులు జన్మించారు. ఒకసారి సుందుడు అగస్త్యాశ్రమంపై దాడిచేయగా అతడు భస్మం చేశాడు. తాటక విషయం తెలుసుకొని కుమారులతో కలిసి అగస్త్యునిపై దాడిచేయగా అతడు వీరిని రాక్షసులు కమ్మని శపించాడు. రాక్షసికాగానే

మారీచ సుబాహులతో పాతాళంలోనికి వెళ్లి రాక్షస రాజు సుమాలిని కలిసి తర్వాత రావణుని వెంట వెళ్లింది. రావణుని సహాయంతో కారుశ అరణ్యాన్ని జయించి అక్కడే నివసించేది. అన్ని జీవజాతులు దేవ తలతో సహా ఆ అరణ్యంలోకి వెళ్లడానికి భయపడే వారు. విశ్వామిత్రుని యాగ రక్షణకు వచ్చిన రామ లక్ష్మణులు ఈ అరణ్యంలోకి రాగా తాటక వారిపై పడింది. ఒకే ఒక్క బాణంతో రాముడు ఈమెను వధించగా ఓ పర్వతం పడినట్లు భూమిపై పడి శాపవిమోచనం పొంది రాముని కీర్తించి ఆ ప్రాంతం వీడింది.

– రామాయణం

**తాటంకుడు :** పూర్వజన్మలో సింహళరాజైన సింహ ద్వజుని పేరు. – చూ॥ సింహద్వజుడు.

**తాతకాయనుడు :** విశ్వామిత్రుని కుమారుడు. ఒక బ్రహ్మవాది. – మహాభారతం

**తాపత్యులు :** తపతి వంశమున జన్మించిన వారు. కురు పాండవులు ఈ వంశమువారే.

**తాపసారణ్యం :** సాధువులతో నిండి వున్న నివేశన పవిత్ర స్థలం. – మహాభారతం

**తామసుడు :** నాల్గవ మనువు. బ్రహ్మ పుత్రుడు స్వాయం భవ మనువు మొదటి మనువు. అతని సంతతిలో జన్మించిన ప్రియవ్రతుని రెండవ భార్య బర్హిస్మతికి ముగ్గురు పుత్రులు. వారు ఉత్తమ, తామస, రైవత. వారు తదనంతరం వరుసగా మనువులయ్యారు.

– భాగవతం

ఉత్పలావతి శాపవశమున మృగిగా వుండగా సురా ష్ట్రుడు స్పృశించడంతో ఇతడు జన్మించాడు. ఇతని పేరు లోలుడు. లోకాలు చీకటిగా వున్నపుడు జన్మిం చాడు గనుక తామసుడని పేరుపెట్టారు. ఇతడు 6వ మనువయ్యెను. ఇతడి మన్వంతరమున శిఖి ఇంద్రుడయ్యెను. – మార్కండేయ పురాణం

**తామస్రం :** ఒక నరకం పేరు.

**తామ్ర 1 :** ఓ రాక్షసుడు. మురాసురుని ఏడుగురు కుమారుల్లో ఒకడు. మహిషాసురుని మంత్రుల్లో ఒకడు. ఇతడు ఆర్థికమంత్రి. ఇతణ్ణి ఇతడి తండ్రి మురాసురుణ్ణి శ్రీకృష్ణుడు సంహరించాడు.

– భాగవతం

**తామ్ర 2 :** దక్షుని కుమార్తె. ఈమె కశ్యపుడ్ని వివాహ మాడగా ఐదుగురు కుమార్తెలు జన్మించారు. వారు క్రౌంచి, భాస, శ్యేని, ధృతరాష్ట్రి మరియు శుఖి. వీరు రకరకాల పక్షులకు జంతువులకు జన్మనిచ్చారు.

– రామాయణం

**తామ్రచూడ :** స్కందదేవుని అనుచరురాలు.

– మహాభారతం

**తామ్రద్వీపం :** దక్షిణ భారతదేశంలోని నివాస ప్రాంతం. తన జైత్రయాత్రలో సహదేవుడు దీన్ని జయించాడు.

– మహాభారతం

**తామ్రధ్వజుడు :** మణిపుర రాజైన మయూర ధ్వజుని పుత్రుడు. ఇతడు ధర్మజుని యాగాశ్వమును పట్టు కొని కృష్ణార్జునులతో యుద్ధముచేసి వారిని ఓడించి గుర్రమును తన తండ్రివద్దకు తీసుకొని వెళ్లెను. కృష్ణా ర్జునులు బ్రాహ్మణ వేషమున వచ్చి మయూర ధ్వజుని అతని శరీరము కోసి ఇమ్మని కోరిరి. తన శరీరము కోసి ఇచ్చెదననగా కుమారుడు తన తండ్రి శరీమును కోసి ఇచ్చెను. అపుడు శ్రీకృష్ణుడు తన నిజరూపము చూపెను. – జైమినిభారతం

**తామ్రం :** కార్తికేయుడి వీర్యం.

**తామ్రపర్ణి :** దక్షిణ కేరళలోని పవిత్ర నది. ముక్తికోసం దేవతలు ఈ నదీ తీరాన తపస్సు చేశారు.

– మహాభారతం

**తామ్రలిప్త :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజు. సహ దేవుడు తన జైత్రయాత్రలో ఇతణ్ణి జయించాడు.

– మహాభారతం

**తామ్రలిప్తకం :** ఉత్తర భారతదేశంలోని తూర్పువైపున గల ప్రాచీన భారతదేశ నివేశన ప్రాంతం.

– మహాభారతం

**తామ్రలిప్తి :** గంగానది సముద్రంలో కలిసే చోటున వున్న పట్టణం. – మహాభారతం

**తామ్రవతి :** ఓ ప్రాచీన నది. ఇందులో నుండి అగ్నిపుట్టె నని నమ్మిక. – మహాభారతం

**తామ్రామమణ తీర్థం :** ఇదో పుణ్యస్థలం. ఈ స్థలాన్ని సందర్శిస్తే అశ్వమేధయజ్ఞం చేసిన ప్రతిఫలం లభించి బ్రహ్మలోకం చేరతారు. – మహాభారతం

**తా(మ్రోష్టుడు :** ఓ యక్షుడు. కుబేరుని కొలువులో వుండేవాడు. – *మహాభారతం*

**తార 1 :** శ్రీరామ భక్తుడైన వానరుడు. ఇతడు బృహస్పతి కొడుకు. బృహస్పతి ఇతణ్ణి శారీరకంగాను, తెలివి లోను ఇతర వానరులకంటే గొప్ప వాడుగా చేశాడు. వీరివద్ద ఇతడు మంత్రి. రామరావణ యుద్ధంలో ఇతడు నిఖర్వతుడితో యుద్ధం చేశాడు.

– *రామాయణం*

**తార 2 :** బృహస్పతి భార్య. – *చూ॥ చంద్ర*

**తార 3 :** వానర రాజైన వాలి భార్య. ఈమె క్షీరసాగర మదనంలో ఐరావతం, రమ, చంద్రులతోపాటు జన్మించింది. – *కంభరామాయణం*

ఈమె సుసేనుడి కుమార్తె అని ఈమె గుణవతి విద్యా వతి ఏ సమస్యకైనను సరైన పరిష్కారం చెప్ప గలదని వాలి చనిపోతూ చెప్పాడు. – *వాల్మీకి రామాయణం*

**తారక :** కాశ్మీర రాజైన భద్రసేనుడి కుమారుడు. ఇది ఓ కోడిపుంజు పునర్జన్మ. భద్రసేనుడి మరో కుమారుడు సుధర్ముడు. ఇతడు ఓ వానరం పునర్జన్మ.

*కోడిపుంజు – వానరం మానవులుగా పునర్జన్మించిన కథ :* నంద అనే గ్రామంలో మహానంద అనే వ్యభి చారిణి వుండేది. ఆమె బ్రతుకుతెరువు కోసం ఆ వృత్తిలో వున్నా ఆమె గొప్ప శివభక్తురాలు. ఆమెవద్ద ఓ కోడిపుంజు, ఓ వానరం వుండేవి. ఆమె శివుని గురించి ప్రార్థించే సమయంలో శివునికి ప్రీతి పాత్ర మైన రుద్రాక్షమాలను ఆ రెండింటి మెడలో వేస్తే అవి ఈమె పాటకు తగినట్లు నృత్యం చేసేవి. ఒకరోజు శివలింగం వున్న వజ్రంతో ఓ వైశ్యుడు ఈమె వద్దకు రాగా ఆ వజ్రాన్ని తనకిమ్మని అలా ఇస్తే అతనితో 3 దినాలు భార్యగా గడుపుతానని చెప్తుంది. ఆ వజ్రాన్ని భద్రమైన స్థలంలో వుంచి అతడితో ఆమె ఒక రోజు రతి కార్యక్రమంలో పాల్గొని ఆదమరిచి నిద్రపోతుం డగా ఇంటికి నిప్పంటుకొని తగల బడింది. ఆ వజ్రం ముక్కలై బూడిదయ్యింది. వైశ్యుడు బాధతో ఆ మంటల్లో దూకగా ఆమెకూడా అదే మంటల్లో దూకబోగా శివుడు ప్రత్యక్షమై నీ భక్తిని పరీక్షించడానికి నేనే వైశ్యుడిగా వచ్చానని, ఆమె భక్తికి మెచ్చివరం కోరుకొమ్మనగా తనను శివునితో కైలాసానికి తీసుకు వెళ్లమంటుంది. శివుడు అందుకు సమ్మతించడమే కాక ఆమె పెంచిన వానరం, కోడి పుంజు తర్వాతి జన్మలో కాశ్మీర రాజు సంతతిగా జన్మిస్తారని వరమిస్తాడు. వారే తారక, సుధర్ముడు. – *శివపురాణం*

**తారకజిత్తు :** చూ॥ సుబ్రహ్మణ్యస్వామి.

**తారకాక్షుడు (తారాక్షుడు) :** తారకాసురుని కుమారుడు. త్రిపురా నగరానికి రాజు. త్రిపురా సురల్ని సంహరించే టప్పుడు శివుడు ఇతణ్ణి సంహరించాడు.

– *మహాభారతం*

**తారకాసురుడు :** ఓ రాక్షసరాజు. ఇతడు శివుణ్ణి గురించి తపస్సు చేసి శివుని కుమారునివల్ల తప్ప మరణం లేనట్లు వరంపొంది లోక కంతకుడుగా మారగా సుబ్ర హ్మణ్యస్వామి శివుని పుత్రుడుగా జన్మిస్తాడు. దేవాసుర సంగ్రామంలో సుబ్రహ్మణ్య స్వామి ఇతణ్ణి వధిస్తాడు. ఇతనికి ముగ్గురు కుమారులు. తారాక్షుడు, కమ లాక్షుడు, విద్యున్మాలికుడు. – *మహాభారతం*

**తారాదత్త :** తక్షశిల రాజైన కళింగదత్తుని కుమార్తె. ఇంద్రుని శాపంవల్ల ఓ దేవకన్య అయిన సురభి తారాదత్త కుమార్తె కళింగసేనగా జన్మించింది.

– *చూ॥ ధర్మదత్తుడు.*

**తార్క్షి :** ఒక పక్షి. కందరుడి కూతురు. మందపాలుడి కుమారుడు ద్రోణునితో వివాహం జరుగుతుంది. కురుక్షేత్ర యుద్ధంలో అర్జునుడు భగదత్తుడి మీద వదలిన బాణం దీనికి తగిలి గర్భంచీలి గ్రుడ్లు క్రింద పడతాయి. దానితో దీనికి శాపవిమోచన మవుతుంది. ఇది పూర్వజన్మలో ఒక వసువు.

– *మార్కండేయ పురాణం*

**తారుడు :** తార తండ్రి. బృహస్పతి యొక్క తనయుడు.

**తార్క్ష్యుడు 1 :** గరుడుడు. – *చూ॥ గరుడుడు.*

**తార్క్ష్యుడు 2 :** శివుని మరో పేరు.

**తార్క్ష్యుడు 3 :** తార్క్ష్య దేశపు క్షత్రియుడు. ధర్మజుని రాజసూయ యాగానికి వచ్చి ఎంతో సంపద ఇచ్చాడు.

– *మహాభారతం*

**తార్క్ష్యుడు 4 :** ఓ ముని. ఇంద్రుని సభలో సభ్యుడు. ఇతడిని అరిష్టనేమి అనికూడా అంటారు. ఇతడు 'ఆత్మ'ను గురించి సరస్వతీ దేవితో చర్చించాడు.

– *మహాభారతం*

**తాల :** ఇదొక నరకం. నీటి అడుగు భాగాన వుండే నరకాల్లో ఇదొకటి. - విష్ణుపురాణం

**తాలచరం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివేశన స్థలం. - మహాభారతం

**తాలధ్వజుడు 1 :** చూ॥ సింహధ్వజుడు.

**తాలధ్వజుడు 2 :** నారదుని మిథ్యా భర్త. నారదుడు స్త్రీగా మారగా తాలధ్వజుడను రాజు పెండ్లాడి పుత్ర పౌత్రులకు జన్మనిస్తాడు. మహావిష్ణువు మాయావాదం గురించి నారదుడికి తెలియజేయడానికి ఈ పని చేస్తాడు. ఒకసారి నారదుడు జీవిత రహస్యాన్ని గురించి మహావిష్ణువుని అడగ్గా జీవితం లేదని మనస్సుయొక్క భ్రమే జీవితమని చెప్పగా అదేమిటో తెలియజేయమంటాడు. విష్ణువు నారదుడ్ని గరుడ వాహనంపై ఎక్కించుకొని భూలోకంలో ఓ కొలను ఒడ్డుకు వస్తాడు. మహావిష్ణువు నారదుణ్ణి తన తుంబుర ప్రక్కన పెట్టి ఓసారి కొలనులో దిగి స్నానం చెయ్యమని చెప్తాడు. నారదుడు అలా కొలనులో స్నానం చెయ్యగానే ఓ అందమైన స్త్రీగా మారి పూర్వ జన్మ మర్చిపోయి చుట్టూ చూస్తుండగా తాలధ్వజుడను రాజు ఓ గుర్రంపైన అటుగా వస్తూ ఈ సుందరిని చూసి సౌభాగ్య సుందరీ అని పిలిచి మోహించి వివాహం చేసుకోగా అతని వల్ల ఈమెకు రెండేళ్లకోసారి ఓ పుత్రుడు జన్మిస్తారు. అలా 24 సంవత్సరాలకు 12 మంది పుత్రులు, తర్వాత 8 మంది పుత్రికలు జన్మిస్తారు. వీరికి వివాహమై తాలధ్వజునికి పౌత్రులు కల్గి పెద్ద కుటుంబంగా మారుతుంది. ఒకరోజు చాలా సుదూర ప్రాంత రాజు కన్యాకుబ్జం పై పడి ఇతని పుత్రపౌత్రుల్ని అందర్ని సంహరిస్తాడు. తాలధ్వజుడు దుఃఖంతో తన భవనానికి చేరుకుంటాడు. సౌభాగ్య సుందరి విలపిస్తుంది. మహావిష్ణువు బ్రాహ్మణ వేషంలో వచ్చి ఆ రాజ దంపతులకు జీవిత సత్యాలు బోధించి ఈమెను, తాలధ్వజుడిని ఆ పాత కొలను దగ్గరకు రమ్మని చెప్తాడు. ముందుగా ఆమెను ఆ కొలనులో మునగమని చెప్పగా ఆమె కొలనులో మునిగి తన నిజరూపమైన నారదుడిగా మారగా మహావిష్ణువు స్నానానికి ఇంత ఆలస్యమేమని ప్రశ్నిస్తాడు. నారదునికి జరిగింది అర్థమవుతుంది. అయోమయంతో తాలధ్వజుడు నాభార్య ఏమైందని నారదుడ్ని ప్రశ్నించగా మహావిష్ణువు జరిగింది వివరించగా అతడు ఆ కొలనులో స్నానంచేసి అడవులకు వెళ్లి తపస్సు చేసి మోక్షం పొందుతాడు. - దేవీభాగవతం

**తాలాకటం :** ప్రాచీన దక్షిణ భారతదేశంలోని ఓ నివేశన స్థలం. - మహాభారతం

**తాళకేతుడు :** ఓ రాక్షసి. మహేంద్ర పర్వతం మీద శ్రీకృష్ణుడు హంసనేమి పథంవద్ద చంపుతాడు. - మహాభారతం

**తాళజంఘుడు :** కార్తవీర్యార్జునుని మనుమడు. - భాగవతం

**తాళజంఘులు :** కార్తవీర్యుని 5వ కుమారుడు జయద్వజుడు. ఇతని కుమారుడు తాళజంఘుడు. ఈ వీరుని సంతతిని తాళజంఘులు అనేవారు. ఒకసారి వీరిలో పెద్దవాడైన వితిహోత్రుడికి, పరశు రామునికి మధ్య గొప్ప యుద్ధం జరుగుతుంది. - బ్రహ్మాండపురాణం

**తాళవనం 1 :** ప్రాచీన దక్షిణ భారతదేశంలో ఓ నివేశన స్థలం. దీన్ని సహదేవుడు జయిస్తాడు. - మహాభారతం

**తాళవనం 2 :** ద్వారక దగ్గర గల లతానేష్ట పర్వతం దగ్గర్లోని ఓ ఉద్యానవనం. - మహాభారతం

**తిక్కన సోమయాజి :** ఓ గొప్ప ఆంధ్రకవి. తండ్రి కొమ్మ నామాత్యుడు. కొడుకు మారన. సోదరులు కావ్య తిక్కన, ఖడ్గతిక్కన. ఇతడు నెల్లూరును పాలించిన మనుమసిద్ధి అను రాజు కొలువున నుండిన పండితులలో ముఖ్యుడు. నన్నయ తెనిగించి, ఎర్రాప్రగడ తెనిగించిన భారత భాగములు కాక తక్కిన భారతము నంతయు తెనిగించి లబ్ధప్రతిష్ఠుడయ్యెను. వీరు ముగ్గురు భారతమును తెనిగించుటచే వీరి ముగ్గురిని కవిత్రయమందురు. ఇదికాక ఇతడు నిర్వచనోత్తర రామాయణం అనుపేర రామాయణ ఉత్తర కాండ మును తెనిగించెను.

**తితిక్ష :** దక్షునికి ప్రశూతి వల్ల జన్మించిన 16 మంది కూతుర్లలో ఈమె ఒకరు. ఇందులో 13 మందిని ధర్మదేవుడు వివాహమాడాడు. అందులో తితిక్ష ఒకరు. - భాగవతం

**తితిక్షుడు :** తురు వంశంలో జన్మించిన రాజు. ఉశీనా రుడి కుమారుడు. ఇతని కుమారుడు రుషద్రథ.
– మహాభారతం

**తిత్తిరం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివేశన ప్రాంతం.
– మహాభారతం

**తిత్తిరి 1 :** కద్రువ యొక్క కుమారుడు. ఓ సర్పం.
– మహాభారతం

**తిత్తిరి 2 :** ఇదో రకానికి చెందిన పక్షి.
– చూ॥ త్రిశిరస్సు.

**తిత్తిరి 3 :** ఓ సాధువు. ధర్మజుని కొలువులో ఓ సభ్యుడు.
– మహాభారతం

**తిత్తిరి 4 :** అశ్వాలలో ఓ జాతి అశ్వం. ఈ జాతిని అర్జునుడు తన జైత్రయాత్రలో గంధర్వ నగరం నుండి తెస్తాడు. – మహాభారతం

**తిన్నడు :** ఒక చెంచు జాతివాడు. పరమ శివభక్తుడు. తను భుజించు మాంసమును శివలింగముకు పెట్టెడివాడు. శివలింగముపై బూజు వుండుటచే తన చేతిలో మాంసపు ముక్కలుండుట వల్ల తన కాళ్లతో తుడిచి నోటిలోని కల్లుతో కడిగెడివాడు. ఒకరోజు శివ లింగము యొక్క ఓ కంటినుండి రక్తము స్రవించగా తన కన్నునొక దానిని పెకలించి దాని స్థానమున అమర్చెను. రెండవ కన్ను కూడా ద్రవించుచుండగా గుర్తుగా తన కాలి బొటన వ్రేలిని రెండవ కంటిపై వుంచి తన రెండవ కన్నును కూడా పెకలించి అమ ర్చగా శివుడు ప్రత్యక్షమై మోక్షము అనుగ్రహించెను.
– శ్రీకాళహస్తి మహాత్మ్యం

ఇతడు పూర్వ జన్మలో అర్జునుడు. పాశుపతాస్త్రము కొరకు ప్రార్థించుచుండగా శివుడు కిరాతకుడుగా మారి అర్జునునితో పోరెను. శివునితో పోరినందుకు అర్జునుడు పశ్చాత్తాప పడగా తన తదుపరి జన్మలో నన్ను ఆరాధించమనెను. అతడే తిన్నడు.
– శ్రీకాళహస్తి మహాత్మ్యం

**తిమ్మన :** శ్రీకృష్ణదేవరాయల అష్టదిగ్గజములను పండి తులలో ముఖ్యుడు. ఇతడి రచన "పారిజాతాపహ రణము". ఇతడి కవిత ముద్దుగా నుండునని "ముక్కు తిమ్మనార్యుని ముద్దుపలుకు" అను ప్రశస్తినొందెను.

**తిమింగిలుడు :** ఓ రాజు. సహదేవుడు దక్షిణ భారత జైత్రయాత్రలో ఇతణ్ణి జయిస్తాడు. – మహాభారతం

**తిమిధ్వజుడు :** విజయంతపురాన్ని పాలించిన రాక్షసుడు. ఇతడు దేవలోకంపైకి యుద్ధానికి వెళ్ళగా ఇంద్రుడు దశరథుని సహాయం అడుగుతాడు. దశర థుడు ఇతనితో యుద్ధంచేస్తూ మూర్ఛపోగా కైకేయి రథాన్ని ప్రక్కకు మరల్చి ప్రథమ చికిత్స చేయగా దశరథుడు సంతోషించి రెండు వరాలు కోరుకొమ్మం టాడు. ఈమె మందర సలహాపై శ్రీరాముని పట్టాభిషేక సమయమున శ్రీరాముణ్ని అరణ్యవాసానికి పంపమని భరతుణ్ణి పట్టా భిషిక్తుణ్ణి చేయమని ఆ రెండు వరాలు కోరుకుని నెరవేర్చు కుంటుంది. – రామాయణం

**తిరుణాన సంబంధర :** ఓ శివభక్తుడు. శివుని స్తుతిస్తూ పాటలు పాడుతూ గడిపేవాడు. ఇతనికి అతని తండ్రి వివాహం చేయబోగా ఆ గుడిలోకి వచ్చి వివాహం చేసుకోకుండానే శివసాయుజ్యం చెందాడు. నల్గురు ప్రసిద్ధ మతాచార్యుల్లో ఇతడొకరు.

**తిరునావుక్కరస :** ఇతడొక శివ భక్తుడు. తిరుణాన సంబంధర శిష్యుడు. ఇతడు శివుడ్ని గురించి 4,900 గీతాలు రచించగా ప్రస్తుతం 312 మాత్రమే లభ్యమ వుతున్నాయి.

**తిరుపతి :** ఇదో దివ్యక్షేత్రం. ఇచట విష్ణువు శ్రీవేంకటే శ్వరుడు / శ్రీనివాసుడు అను పేరుతో సాక్షాత్కరించాడు. ఇతణ్ణి అగస్త్య, పులస్త్యాదులు పూజించారు. దీని ప్రాశస్త్యాన్ని తెలిపే గ్రంథం 'వేంకటాచల మహాత్మ్యం'.

**తిరువెంగమాంచి :** చిరుతొండని భార్య.
– చూ॥ చిఱుతొండడు

**తిలభారం :** ఉత్తర భారతంలో తూర్పునగల ప్రాంతం.
– మహాభారతం

**తిలోత్తమ :** కశ్యపుని భార్య పృథకు జన్మించిన అప్సరస. రక్షిత, రంభ, మనోరమ వంటి అప్సరసలు ఈమె తోబుట్టువులు. *జన్మవృత్తాంతం :* సుంద ఉపసుందులను రాక్షసుల మధ్య వైరం ఏర్పరచి చంపడం కొరకు బ్రహ్మ ఈమెను సృష్టిలో పృథ గర్భంలో జన్మించేటట్లు చేశాడు. బ్రహ్మ సలహాపై విశ్వకర్మ ప్రపంచంలోని అన్ని వస్తువులలోని అందమైన ముక్కల్ని సేకరించి ఈమెను తయారు చేశాడు కనుక తిలోత్తమ (తిలమస అనగా చిన్న చిన్న ముక్కలు, ఉత్తమ అనగా ఉత్తమమైనవి)
– మహాభారతం

సుందోపసుందుల మధ్య విభేదాలు సృష్టించడానికి వెళ్లేముందు ఈమె దేవలోకం వెళ్లి దేవతల మధ్య నిలబడగా శివుడు ఉత్తర దిక్కున బ్రహ్మ ఆమెకు దక్షిణ దిక్కున కూర్చున్నారు. తిలోత్తమ దేవతల చుట్టూ ప్రదక్షిణ చేస్తుండగా శివుడు ఆమెను ఎల్లప్పుడు చూడాలనే క్షాంక్షతో తన నాల్గువైపులా నాల్గు మార్గాలు సృష్టించుకొన్నాడు. ఇంద్రుడికి రెండుకళ్లు చాలకపోవడం వల్ల అతని ముఖానికి వెయ్యి కళ్ళు వచ్చాయి. – *చూ॥ సుందోపసుందులు*

**తీరగ్రహం :** తూర్పు, ఉత్తర భారతదేశంలో ఉన్న ప్రాచీన ప్రాంతం. – *మహాభారతం*

**తీర్థకారులు :** జైనమత గురువులు. వీరు 24 మంది. వీరిలో మొదటివాడు అదినాథుడు. – *చూ॥ జైనుడు*

**తీర్థకోటి :** ఓ పవిత్ర స్థలం. దీన్ని దర్శిస్తే విష్ణులోక ప్రాప్తి కలుగుతుంది. పుండరీక యజ్ఞంచేసిన ఫలితం లభిస్తుంది. – *మహాభారతం*

**తీర్థనేమి :** స్కందదేవుని స్త్రీ అనుచరి. – *మహాభారతం*

**తుగ్రుడు :** రుగ్వేదంలో ప్రస్తావించబడిన రాజు. ద్వీపాంతరంలోని రాజ్యాలను జయించాలని యువరాజుని, సైన్యాన్ని పడవల్లో పంపగా తుఫానుకు అవి నాశనమవుతాయి. ఆ యువరాజు అశ్విని దేవుడ్ని ప్రార్థించగా అతడు, సైన్యము రక్షింపబడి నిజగృహానికి వెళ్తారు. ఈ పడవలు నీటిలోను గాలిలోను ప్రయాణించగలవు. – *రుగ్వేదం*

**తుర్వయణుడు :** రుగ్వేదంలో ఉదహరించబడిన ఒక రాజు. – *రుగ్వేదం*

**తుర్వసుడు :** దేవయాని వల్ల యయాతి మహారాజుకు జన్మించిన ఇద్దరు కుమారుల్లో ఒకడు. రెండోవాడు యదువు.

**తురీయం :** ప్రాచీన భారతావనిలో నివాసయోగ్యమైన ఓ ప్రాంతం.

**తుర్వీతి 1 :** రుగ్వేదంలో ప్రస్తావించబడిన ఒక రాజు. – *రుగ్వేదం*

**తుర్వీతి 2 :** ఒతడొక రాజు. ఇతడు మునిగా కూడా పేర్కొనబడ్డాడు. అంటే మొదట రాజుగా వుండి తపస్సుచేసి మునిగా మారాడు. ఇతడొకసారి నీట మునగగా ఇంద్రుడు రక్షించాడు. – *రుగ్వేదం*

**తులసి :** ఇది హిందువులకు పవిత్ర మొక్క. ఇది లక్ష్మీదేవి స్వరూపమని భావిస్తారు.

*పురాణ కథ :* శ్రీమహావిష్ణువు భార్యలైన లక్ష్మి, సరస్వతి, గంగ అతని చెంత కూర్చొని వుండగా గంగ కన్నార్పక విష్ణువును చూస్తుండగా సరస్వతి కోపంతో గంగ జుట్టుపట్టుకొని కొడుతుండగా లక్ష్మీదేవి దాన్ని ఆపడానికి ప్రయత్నించింది. ఇది భరించలేని సరస్వతి లక్ష్మిని భూలోకంలో ఓ మొక్కగా జన్మించమని శపిస్తుంది. గంగ సరస్వతిని నదిగా కమ్మని శపించగా తిరిగి సరస్వతి గంగనూ నదికమ్మని శపిస్తుంది. శ్రీమహావిష్ణువు అన్యాయంగా లక్ష్మి శపించబడటాన్ని చూసి విచారించకు, నీవు భూలోకంలో పూజనీయమవుతావు. నా శక్తిలో భాగమైన శంఖచూడుడు నిన్ను వివాహమాడిన తర్వాత నీవు తిరిగి నన్ను చేరగలవు. ఆ మొక్కగా నిన్ను భూమిమీది ప్రజలు పూజించడమే గాక నీ శక్తిలో భాగం పద్మావతి నదిగా మారుతుందని వివరిస్తాడు. – *దేవీ భాగవతం*

**తులాధారుడు :** దయామయుడు సన్మార్గుడైన కాశీలోని వైశ్యప్రముఖుడు. జాజిలి మునికి ధర్మబోధచేసి ఇద్దరూ స్వర్గం చేరతారు. – *చూ॥ జాజిలి*

**తులాపురుష దానం :** చూ॥ మేరుదానం

**తుల్యభాగం :** ఇది ఒక నది. తుల్యభాగుడను దానవుని వల్ల ఈ పేరు వచ్చినది. భీమేశ్వరుడు ప్రత్యక్షమగునని ఇంద్రాదులు చూడవచ్చుచుండిరి. సప్తమునులు గోదావరిని తీసుకొని వచ్చుచుండిరి. మార్గమధ్యమున నది ప్రక్కదానవులు తపస్సు చేసుకొనుచుండిరి. మునులు తీసుకొనివచ్చు నది పొంగి దానవుల పదార్థములను ముంచగా వారు ఈ నది శుష్కమ గునని శపించగా, దానవులు చేరియున్న ఈ నది అపవిత్రమై అస్పృశ్యమగునని మునులు శపించిరి. తుల్యభాగుడను దానవుడు సన్మార్గుడై నందువల్ల ఇట్లొకరినొకరు శపించుకొనుట యుక్తము కాదని శాపవిమోచనము గావించ కొనుడని సలహా ఇచ్చెను. శాపము పూర్తిగా విమోచనం సాధ్యంకాదు గనుక పర్వదినములందు, ఆదివారము నందు ఈ నదిలో స్నానము చేసిన పుణ్యము కల్గునట్లు, భార్యతో కలసి స్నానము చేసిన సంతానము కలుగునట్లు దేవతలు వరమిచ్చిరి. – *భీమేశ్వర పురాణం*

**తుల్యభాగుడు :** ఓ దానవుడు. – చూ॥ తుల్యభాగ

**తుషారం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాసయోగ్య ప్రాంతం. ఇప్పటి తఖారిస్తాన్ అప్పటి తుషారం. ఈ ప్రాంత ప్రజల్ని తుషారసులని, రాజుని తుషారుడు అనేవారు. ధర్మజుని రాజసూయ యాగంలో ఇతడు వస్తువులు భద్రపరిచే గదికి సంరక్షకుడు. పాండవులు ద్వైతవనం వెళ్లేప్పుడు ఈ దేశం మీదనుండే వెళ్లారు. – మహాభారతం

**తుషారులు :** మాందాత రాజ్యంలోని ఆటవిక తెగల్ని కూడా తుషారులని పిలిచేవారు. – మహాభారతం

**తుషిత :** స్వారోచిష మనువు కాలంలో వేద శివుడను విప్రుని కుమార్తె. ఈమెకు విష్ణుమూర్తి విభుడను కుమారునిగా జన్మిస్తాడు. – భాగవతం

**తుషితులు :** చాక్షుష మనువు కాలంలో 12 మంది దేవతలు కలరు. చాక్షుష మనువు అనంతరం వైవశ్వత మనువు కాలంలో వీరు అదితివల్ల కశ్యపునికి జన్మించారు. అదితివల్ల జన్మించారు కనుక ద్వాదశాదిత్యులనేవారు. వీరిలో విష్ణువు ఒకడు. చాక్షుష మన్వంతరంలోని తుషితులే వైవశ్వత మనువు కాలంలోని ద్వాదశాదిత్యులు. – విష్ణుపురాణం

**తుష్టి :** దక్షుని కుమార్తెలలో ఒకరు. ధర్మదేవుణ్ణి వివాహమాడుతుంది. ధర్మదేవుడు తుష్టితో కలిసి దక్షుని 13 మంది కుమార్తెలను వివాహమాడతాడు. దక్షుని చిన్న కుమార్తె ఖ్యాతి మొదలగు వారిని మరీచి వివాహమాడెను. – విష్ణుపురాణం

**తుష్టిమానుడు :** యయాతి వంశంలోని ఒక రాజు. – భాగవతం

**తుహరుడు :** సుబ్రహ్మణ్యస్వామి సైనికుల్లో ఒకడు. – మహాభారతం

**తుహండుడు :** దనువు వల్ల కశ్యపునికి జన్మించిన రాక్షసుడు. తారకాసురునితో కలిసి సుబ్రహ్మణ్యస్వామితో యుద్ధం చేస్తాడు. ఇతడు గణపతిపై ఓ ఇనుప గునపం విసరగా గణపతి ఓ రాయిని విసురుతాడు. వజ్రాలు పొదిగిన ఆ గునపం ఆరు ముక్కలవుతుంది. రాక్షసుడు గణపతి ముఖంపై దాడిచేయగా గణపతి తన గొడ్డలితో ఇతణ్ణి నరకగా రెండు ముక్కలవుతాడు. అయినా అతని రెండు చేతులు గణపతిని వదలకపోయేసరికి కుండోదరుడను గణపతి సేనలోని వీరుడు ఆ చేతుల్ని నరుకుతాడు. – వాయుపురాణం ఇతడు తర్వాతి జన్మలో సేనాబిందుడను రాజుగా జన్మిస్తాడు. – మహాభారతం

**తూవలకుడు :** ఓ రాక్షసుడు. చాణూర ముష్టికులతో సహా ఇతణ్ణి శ్రీకృష్ణుడు మల్లయుద్ధంలో వధించాడు. – భాగవతం

**తేజశ్చంద్రుడు :** ఓ దేవుడు. ప్రతిరోజు ఓ పుష్పంతో సూర్యుడ్ని ఆరాధిస్తాడు. దేవాలయాల్లో ఇతని విగ్రహాన్ని ప్రతిష్ఠిస్తారు. పెద్దముఖం ఓ చేతిలో ఖడ్గం, రెండోచేతిలో పుష్పం వుంటాయి. – అగ్నిపురాణం

**తేజశ్రవ :** గాంధారి సోదరి. ఈమెనుకూడా ధృతరాష్ట్రుడు వివాహమాడాడు. – మహాభారతం

**తేజస్వి 1 :** ఐదుగురు ఇంద్రుల్లో ఒకడు. – చూ॥ పాంచాలి.

**తేజస్వి 2 :** అగస్త్యుని పౌత్రుడు, దృశ్యుని పుత్రుడు. – చూ॥ ఇధ్మవాహనుడు

**తేజేయుడు :** పురుడి కుమారుడైన రౌద్రాశ్వుడికి మిశ్రకేశి వల్ల జన్మించిన రాజకుమారుడు. – మహాభారతం

**తేజోవతి :** అగ్నిదేవుని ముఖ్యపట్టణం. మహామేరుపర్వతానికి ఆగ్నేయ దిశలో వుంటుంది. – దేవీభాగవతం

**తైజసం :** కురుక్షేత్రంలో గల ఓ పుణ్య స్థలం. ఇచ్చటే దేవతలంతా సుబ్రహ్మణ్యస్వామిని తమ సేనా నాయకుడిగా ఎన్నుకున్నారు. – మహాభారతం

**తైత్తిరి :** ఓ రుషి. ఉపరిచర వసువు చేసిన యాగానికి వెళ్లాడు. – మహాభారతం

**తైత్తరీయం :** ఒక ఉపనిషత్తు. యాజ్ఞవల్క్యుడు గురుద్రోహం చెయ్యడంతో వైశంపాయనుడు ఆగ్రహించి నేర్చుకున్న విద్యను తిరిగి ఇమ్మంటారు. యాజ్ఞవల్క్యుడు యజుర్గణాన్ని కక్కుతాడు. అప్పుడు ఆ శాఖ అధిదేవతలు తిత్తిరి పక్షులై దాన్ని భుజిస్తారు. అప్పటినుండి ఆ శాఖలు తైత్తరీయాలయ్యాయి. – ఉపనిషత్తులు

**తౌమరం :** ప్రాచీన భారతదేశంలో ఉత్తర భారతానికి తూర్పున వున్న నివేశన ప్రాంతం. – మహాభారతం

**తోయజగర్భుడు :** బ్రహ్మయొక్క మరో పేరు. – చూ॥ బ్రహ్మ

**తోరణ స్ఫాటికం :** దుర్యోధనుడు పాండవుల్ని పాచికల ఆటలో జయించాలని నిర్ణయించుకుంటాడు. వీరు పాచిక లాడటానికి ధృతరాష్ట్రుడు ఓ భవంతిని నిర్మిస్తాడు. దానిపేరే తోరణస్ఫాటికం. వజ్రపూరితమైన ఈ భవంతిని ధ్యూత భవనం అనికూడా పిలుస్తారు. - మహాభారతం

**తోల :** క్రీ.శ. 978 -1027లో జీవించిన గొప్ప మానవతావాది. వ్యంగ్య మళయాళ రచయిత. ఇతడి అసలు పేరు నీలకంఠుడు. నంబూద్రి వంశం. బ్రాహ్మణ కుటుంబంలో జన్మించి చక్కి అను తక్కువ కులం స్త్రీతో సంబంధం వుందని ఇతనిపై నిందవేయగా బ్రహ్మచర్యానికి గుర్తుగా వున్న తన జంధ్యాన్ని తీసివేశాడు.

**తంగణం :** ప్రాచీన భారతదేశంలో నివేశన యోగ్యమైన ప్రాంతం. - మహాభారతం

**తండి :** ఓ గొప్ప ముని. శివుని వెయ్యిపేర్లను పలుసార్లు ఉచ్చరించి బ్రహ్మకు చెప్పాడు. - మహాభారతం

**తంత్రీపాలుడు :** పాండవుల అజ్ఞాతవాస సమయమున గోవులకాపరి వేషమున నున్న సహదేవుడు పెట్టుకున్న పేరు. - మహాభారతం

**తంతు :** విశ్వామిత్రుని కుమారుడు. బ్రహ్మవాది. - మహాభారతం

**తందుతలికాశ్రమం :** ప్రాచీన భారతదేశంలో ఓ పుణ్యస్థలం. దీన్ని దర్శిస్తే బ్రహ్మలోక ప్రాప్తి కల్గుతుంది. - మహాభారతం

**తంశుడు :** పూరువంశ రాజు. ఇతని కుమారుడు ఈలనుడు. ఇతని తండ్రి మతినారుడు. - మహాభారతం

**తాండ్యుడు :** ఇతడో ముని. ఇంద్రుని స్నేహితుడు. ఉపరిచర వసువు యజ్ఞంలో పాల్గొన్నాడు. వానప్రస్థ ధర్మాన్ని ఖచ్చితంగా పాటించి స్వర్గలోకం చేరాడు. - మహాభారతం

**తాండ్రచెట్టు :** విభాతక వృక్షమని పిలుస్తారు. నలునిలో వున్న కలి ఈ వృక్షంలోకి ప్రవేశిస్తాడు. రుతుపర్ణుడు తన అక్ష విద్యతో ఆ చెట్టుకున్న ఆకుల్ని కాయల్ని ఎన్ని వున్నాయో లెక్కించకుండానే చెప్తాడు. - మహాభారతం

**తుంగకారణ్యం :** ఇదో పుణ్యస్థలం. సారస్వతుడు దేవతాధ్యయనం చేసిందిక్కడే. - మహాభారతం

**తుంగవేణ :** భారతదేశపు పురాతన నది. ఈ నది నీరు తాగి ప్రజలు పునీతులయ్యారు. - మహాభారతం

**తుండికేరం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం. ఈ ప్రాంత ప్రజలు మహాభారత యుద్ధంలో పాల్గొన్నారు. - మహాభారతం

**తుండుడు 1 :** ఇతడొక రాజు. పాండవులు కురుక్షేత్ర యుద్ధంలో పాల్గొనమని ఆహ్వానిస్తారు. - మహాభారతం

**తుండుడు 2 :** ఓ రాక్షసుడు. రావణుని తరపున రామరావణ యుద్ధంలో పాల్గొంటాడు. నీలుడనే వానరుడితో పోరాడాడు. - రామాయణం

**తుంబురుడు 1 :** ఓ దేవగాంధర్వుడు. గంధర్వుల్లో గొప్ప సంగీత విద్వాంసుడు. తుంబురుడు బ్రహ్మమనుమడు. కశ్యపునికి ప్రధవల్ల జన్మించినవాడు. కశ్యపుని 4 గంధర్వ కుమారులైన తుంబురు, బాహు, హాహా, హూహూ లందరూ చక్కటి సంభాషణా కళాప్రవీణులే.

తుంబురుడు పాండవుల యెడ మిక్కిలి అభిమానము కలవాడు. ఇతడు అర్జునుని జన్మోత్సవంలో పాల్గొన్నాడు. మరొకసారి ధర్మజునికి 100 గుర్రాలు బహూకరించాడు. అర్జునుడు దేవలోకం వచ్చినపుడు స్వాగతం పలికాడు. విరాటుని కొలు వులో వుండగా గోగ్రహణ సమయంలో కౌరవులకు అర్జునుడికి జరిగిన యుద్ధాన్ని తిలకించాడు. ధర్మజుని అశ్వమేధయాగానికి వచ్చాడు. - మహాభారతం

*కుబేరుని శాపం - విమోచనం :* తుంబురుడు పాపం చేశాడని రాక్షసుడిగా జన్మించమని కుబేరుడు శపించాడు. శాపవిమోచనానికి వేడుకోగా రాముని బాణానికి హతుడవై నిజరూపం దాల్చగలవని చెప్తాడు. ఇతడు విరాధుడను రాక్షసుడిగా జన్మించి రామలక్ష్మణుల అరణ్యవాస సమయమున వీరి పైకి రాగా రాముని బాణానికి హతుడై గంధర్వ రూపం దాల్చి కుబేరుని చేరతాడు.

*పూరూరవుని శపించుట :* ఊర్వశిని పెండ్లాడిన తర్వాత ఇంద్రుని ఆహ్వానంపై దేవలోకం వెళ్ళి అసుర సంహారంలో సహాయపడ్డాడు. మాయాధరుడను రాక్షసుడ్ని చంపిన రోజు ఇంద్రుని కొలువులో రంభ నాట్యం చేయగా ఆమెనాట్యంలో పొరపాట్లకు పురూ

రవసుడు నవ్వగా రంభ దేవనాట్యం గురించి నీకేమి తెలుసు అని ప్రశ్నించగా నీ గురువైన తుంబురుని వద్దకంటే ఊర్వశి వద్ద నాట్యాన్ని గురించి ఎక్కువ తెలుసుకున్నానని జవాబిస్తాడు. తుంబురుడు కోపంతో నీకు ఊర్వశి నుండి ఎడబాటు కల్గుతుందని మహా విష్ణువుని ప్రార్థించినగాని తిరిగి కలవరని శపించి ఊర్వశిని తీసుకెళ్తాడు. – చూ॥ పురూరవసుడు

తుంబురుడు ఇంద్ర, కుబేర సభల్లో సభ్యుడు. ఇతని గానం పౌర్ణమి రోజు గంధమాదన పర్వతాలపై నుండి విన్పిస్తుంది. – మహాభారతం

**తుంబురుడు 2 :** ఇతడో ముని. శ్రీరాముడు అరణ్య వాసానంతరం అయోధ్యకు చేరుకొనేటప్పుడు కలసిన మహర్షుల్లో ఇతడొకడు. – రామాయణం

**తృణకుడు :** ఓ సాధుస్వభావుడైన రాజు. ఇతడు యముని కొలువులో అతణ్ణి పూజిస్తూ వుండేవాడు. – మహాభారతం

**తృణపుడు :** ఓ దేవ గాంధర్వుడు. అర్జునుని జన్మోత్సవ వేడుకల్లో పాల్గొన్నాడు. –మహాభారతం

**తృణబిందుడు :** ఓ ముని. కుషతీర్థంలో తపస్సు చేశాడు. రావణుని తండ్రి విశ్రావసుడు తృణ బిందుని కుమార్తె వల్ల జన్మించిన కుమారుడు. పులస్త్యుడు అడవిలో తపస్సు చేసుకుంటుండగా దేవగాంధర్వ వనితలు అచటికి వెళ్లి తెలియక అతనికి తపోభంగం కల్గించగా ఈ ప్రాంతానికి వచ్చిన కన్యలు గర్భవతు లౌతారని శపిస్తాడు. అలా శపించబడిన గంధర్వ వనిత తృణబిందుని కుమార్తె మాలిని. ఆమె తండ్రిని వేడుకోగా అతడు తన కుమార్తెను పులస్త్యుని వద్దకు తీసుకువెళ్లి వివాహం చేసుకొమ్మంటాడు. వారికి జన్మించినవాడే విశ్రావసువు. – ఉ. రామాయణం

*హనుమంతుని శపించుట :* హనుమంతుడొకసారి ఓ సింహంతో ఏనుగుతో పోరాడి వాటిని ఓడించి తృణబిందుడి ఆశ్రమానికి ఇరువైపులా కట్టేస్తాడు. తృణబిందుడు బయటకు వచ్చి చూసి భయపడి విషయం గ్రహించి హనుమంతుని దైవిక శక్తులు నశిస్తాయని శపిస్తాడు. హనుమంతుడు అతణ్ణి ప్రాధేయపడగా సీతాన్వేషణలో వుండగా నీకు మరో శక్తివంతుడు నీకంటే పెద్దవాడైన వానరుడు నీశక్తిని గుర్తుచేసి నపుడు నీదైవిక శక్తులు మరల పొందుతా వని శాపవి మోచనం చెప్తాడు. హనుమంతుడు లంకా నగరానికి లంఘించడానికి శంకిస్తున్నపుడు జాంబవంతుడు ఇతనిలో వున్న శక్తిని తెలియ జేయగా అప్పటినుండి తన పూర్వశక్తి అతనికి వస్తుంది. – ఉత్తర రామాయణం

**తృణామాంగిరసుడు :** ప్రాచీన దక్షిణ భారతదేశంలో నివసించిన ముని. – మహాభారతం

**తృణావర్తుడు :** తారకాసురుని కుమారుడు. ఇతడు కంసుని సేవిస్తూ వుండేవాడు. కంసుని పనుపున శ్రీకృష్ణుని చంపడానికి అంబడికి వెళ్లాడు. అప్పుడే యశోద శ్రీకృష్ణునికి పాలిస్తోంది. బాలుడు బరువెక్కు తున్నాడు. ఆమె మొయ్యలేక అతణ్ణి ఓ చాపపై పరుండబెట్టి ముఖంచేతులు శుభ్రం చేసుకోవడానికి వెళ్ళగా ఓ సుడిగాలి బాలుణ్ణి ఎత్తుకుపోయింది. బాలు డైన శ్రీకృష్ణుడు ఈ రాక్షసుడి కంఠాన్ని హృదయాన్ని గట్టిగా పట్టు కున్నాడు. ఆ బాలుడు మరింత బరువవు తుంటే అతణ్ణి వదలి వెళ్దామన్నా వెళ్ళలేక ఊపిరాడక చనిపోతాడు. – భాగవతం

**తృతీయ :** ఇదోనది. వరుణుడి కొలువులో అతడ్ని పూజి స్తుంటుంది. – మహాభారతం

**త్రయీ :** రుగ్వేదం, యజుర్వేదం, సామవేదం ఈ మూడింటిని కలిపి త్రయీ అనేవారు. మొట్ట మొదట ఈ మూడు వేదాలే ఉండేవి.

**త్రయ్యారుణి :** వ్యాసుడి శిష్యుడు. రుక్షయుడి కుమారుడు.

**త్రయ్యారుణుడు :** సూర్య వంశపు రాజు. త్రిధన్యుడి కుమారుడు. త్రిశంకుడి తండ్రి. – బ్రహ్మపురాణం

**త్రసదస్యుడు :** ఇక్ష్వాకు వంశ రాజు. పురుకుత్సుని కుమారుడు. ఇతడు సన్యాసం స్వీకరించి రాజర్షిగా మారాడు. ఇతడు దస్యుల్ని గడగడలాడించాడు గనుక త్రసదస్యుడని పేరొచ్చింది. –దేవీ భాగవతము

అశ్వని దేవతలు ఇతణ్ణి ఒకసారి రక్షించారు. –ఋగ్వేదం

అగస్త్యుడు ఇతర మహర్షులు ఇతని రాజ్యానికి రాగా, ఎదురేగి వారి రాకకు కారణం అడగగా వారు ధనం కావాలని చెప్తారు. అతడి లెక్కలన్నీ చెప్పితాను పేద వాడినని చెప్తాడు. ఇతడు ప్రాతః కాలంలో స్మరించ దగ్గ గొప్పవాడు. – మహాభారతం

**త్రసరేణువు :** తూనికకు ప్రాచీన గణాంక పద్ధతి. 8 త్రసరేణువుల్ని ఈరు అని, మూడు ఈరుల్ని మంకటుకు అని, అట్టి మూడు మంకతువుల్ని వేణకతుకు అనే వారు. 6 వేణుకతుకుల్ని ఒక మధ్య స్త్రీయవ, మూడు మధ్య స్త్రీయవలు ఒక కున్ని క్కురువు, 5 కున్ని కురులు ఒక మాశ, 16 మాశాలు ఒక సువర్ణ అంటారు. ఒక సువర్ణం రెండున్నర వరహాలు, 4 సువర్ణాలు ఓ పల, 10 పలాలు ఒక ధారణ అంటారు. - మనుస్మృతి

**త్రసుడు :** మతినారుని కుమారుడు. ఇతని భార్య కాళింది. త్రసుడికి కాళిందికి జన్మించినవాడు కిలులుడు. - మహాభారతం

**త్ర్యంబకుడు :** ఏకాదశ రుద్రుల్లో ఒకడు. (11 మంది రుద్రులు) - చూ॥ ఏకాదశ రుద్రులు.

**త్ర్యంశుడు :** విప్రచిత్తి కొడుకు. - మహాభారతం

**త్ర్యక్షం :** ప్రాచీన భారతదేశంలో నివాసయోగ్య ప్రాంతం. ఈ ప్రాంత రాజు బహుమతులతో ధర్మజుని దర్శనానికి వెళ్లగా ద్వారపాలకులు వెళ్లని వ్వలేదు. - మహాభారతం

**త్వష్ట :** ఒక ప్రజాపతి. ఇతడు ఓ అసురుడు.

*జన్మవృత్తాంతం :* పురాణాలలో ఇతని జన్మవృత్తాంతంపై వైరుధ్యాలున్నాయి.

1. విశ్వకర్మకు నలుగురు కుమారులు. అహిర్బుధ్న్య, త్వష్ట, అజైకపాత మరియు రుద్రుడు. ప్రతిభావంతుడైన విశ్వరూపుడు త్వష్ట కుమారుడు. - విష్ణుపురాణం
2. కశ్యపునికి సురభివల్ల ఏకాదశ రుద్రులు జన్మించారు. సురభి తపశ్శక్తివల్ల మరో 5 గురు కుమారులు జన్మించారు. అందులో ఒకడు త్వష్ట. ఇతని కుమారుడే విశ్వరూపుడు. - అగ్నిపురాణం
3. కశ్యపమహర్షికి అదితి వల్ల త్వష్ట జన్మించాడు. - మహాభారతం

*ఇంద్రునితో శతృత్వం :* త్వష్టకు మొదటినుండి ఇంద్రుడి మీద పగవుంది. ఇతడు తన భార్య రేచన వల్ల ఇంద్రుడిని చంపడానికి విశ్వరూపుడికి జన్మనిచ్చాడు. ఇతణ్ణి త్రిశిరసుడని అంటారు. విశ్వరూపుడు తపస్సు చేస్తుండగా ఇంద్రుడు తన వజ్రాయుధంతో ఇతణ్ణి వధించాడు. మరింత కోపంతో ఇతడు వృతుడికి జన్మనిచ్చాడు. ఇంద్రుడు వృతాసురుణ్ణి కూడా సంహరించాడు. దీనితో త్వష్ట ఇంద్రుణ్ణి పుత్ర దుఃఖంతో బాధపడతావని శపించి మేరుపర్వతంపై తపస్సుకు వెళ్తాడు.

*ఇతర విశేషాలు :*

1. ఇతణ్ణి రుద్రుడిగా పరిగణిస్తారు. - విష్ణుపురాణం
2. ఖాండవ దహన సమయంలో పర్వతాలను పెకలించి కృష్ణార్జునులపై విసిరి ఇంద్రుడికి సహాయ పడ్డాడు. - మహాభారతం
3. ఇతని కుమార్తె కుశేరుని నరకాసురుడు ఎత్తుకు పోతాడు. - మహాభారతం
4. విశ్వకర్మను కూడా త్వష్ట అని పిలుస్తారు. - మహాభారతం
5. నలుడనే వానరుడు ఇతని పుత్రుడు.
6. ఇతడు చక్ర, అనుచక్రులను సైనికుల్ని స్కంద దేవునికి బహూకరిస్తాడు. - మహాభారతం

**త్వష్ట 2 :** భరతుని వంశంలోని ఓ రాజు. భౌనుడి కొడుకు. విరజకు తండ్రి. - భాగవతం

**త్వష్ట :** సూర్యుని భార్య సంజ్ఞాదేవి సూర్యుని వేడి భరించలేక ఛాయను సృష్టించి తను ఆడ గుర్రంగా తిరుగుతుంది. త్వష్టద్వారా విషయం తెలిసి ఇతడు అశ్వరూపుడై ఈమెను కలుస్తాడు. వీరికి జన్మించిన వారే అశ్వనీ దేవతలు.

**త్వష్టాధ్వజుడు :** శుక్రాచార్యుడి ఇద్దరు కుమారుల్లో ఒకడు. రెండోవాడు అత్రి. - మహాభారతం

**త్వాష్టుడు :** శుక్రుని కుమారుడు. - మహాభారతం

**త్రికకుత్తు :** రజస్సు కుమారుడు.

**త్రికకుబ్ధాముడు :** మహావిష్ణువు నామాంతరము. - మహాభారతం

**త్రికళ :** మరోమాయ. బ్రహ్మావిష్ణు మహేశ్వరుల వీక్షణం వల్ల జనించింది. ఈమె శరీరంలోని మూడు వర్ణాల్లో ఒకటి శ్వేత పర్వతానికి వెళ్లి బ్రహ్మను గూర్చి తపమాచరించి అతనిలో లీనమయ్యింది. రెండవదైన నారాయణి మందర నగరంలో వుండి నారదుని ప్రేరణతో మహిషాసురుణ్ణి సంహరిస్తుంది. మూడో శక్తి అయిన ఈశ్వర శక్తి రురుణ్ణి చంపుతుంది. అతడి చర్మాన్ని మొండాన్ని వేరు చేసింది కనుక చాముండి అనే పేరు వచ్చింది. - వరాహపురాణం

**త్రికాలజ్ఞుడు :** ఒక ముని. సుశర్మ అను రాజు తన భార్య జాడ తెలియక త్రికాలజ్ఞుడ్ని అడగడానికివస్తే ఇతడు తన శిష్యుణ్ణి ఆర్ఘ్యమిమ్మంటాడు. ఇతడు భార్యా విహీనుడవడం వల్ల శిష్యుడు ఆర్ఘ్యమివ్వడు. సుశర్మ వచ్చినపని తెలుసుకొని అతని భార్యను బలాకు డెత్తుకుపోయాడని చెప్తాడు. రాజు ఆర్ఘ్యమివ్వని కారణ మడుగగా భార్యావిహీనులకు ఆర్ఘ్యమివ్వరాదని చెప్తాడు. – మార్కండేయపురాణం

**త్రికూటం :** ఇదొక పర్వతం. మహామేరువుకు నాలుగు దిక్కులా 20 పర్వతాలున్నాయి. అందులో ఒకటి త్రికూటం. దీనిపైనే లంకా నగరం వుంది.

*లంకానగర కథ :* సర్ప రాజైన వాసుకికి వాయుదేవు డికి ఒక తగువొచ్చింది. అదీ ఎవరు శక్తివంతులని. వాసుకి తన శరీరంతో మహామేరు వుని బిగించాడు. వాయువు తన శక్తినంతా ఉపయోగించినా అతని పట్టునుండి మహా మేరువును కదలించలేదుగాని ఆ గాలికి దేవతలు భయపడి మహావిష్ణువుతోపాటు శివుడ్ని, బ్రహ్మను తీసుకువెళ్లారు. శ్రీమహావిష్ణువు ఇద్దర్ని పిలిచి ఈ పోటీ ఆపమని ఆదేశించగా వాసుకి కొంత సడలించాడు. వాయువు శక్తికి త్రికూటం ఎగిరి దక్షిణ భారతదేశానికి దక్షిణాన గల సముద్రంలో పడగా దానిపై లంకా నగరం విశ్వకర్మచే నిర్మించబడింది.

**త్రిగంగ :** ఓ పుణ్యస్థలం. – మహాభారతం

**త్రిగర్తం :** సుశర్మ ఏలిన రాజ్యం. ఇతడు కౌరవులతో కలసి పాండవుల అజ్ఞాతవాస సమయంలో గోగ్ర హణానికి పాల్పడతాడు. అరణ్యవాస సమయంలో పాండవులు ఈ నగరం మీదనుంచే వెళ్లారు. త్రిగర్త రాజు సురదుణ్ణి నకులుడు సంహరిస్తాడు. – మహాభారతం

**త్రిజట :** రావణుని భవనంలో ఓ సేవిక. అశోక వనం లోని సీతకు సపర్యలు చేసి కాపలా వుంచిన వారిలో ఈమె ఒకతె. అందరు రాక్షసస్త్రీలు నిద్రిస్తుండగా ఈమె రావణుని నాశనాన్ని, రాముని ఔన్నత్యాన్ని సహచరులకు చెప్తుంది. రామరావణ యుద్ధం తర్వాత రాముడీమెకు బహుమతులిస్తాడు. – రామాయణం

**త్రిజటుడు :** చూ॥ గార్గ్యుడు.

**త్రితుడు :** గౌతముని ముగ్గురు కుమారుల్లో ఒకడు. మరో ఇద్దరు ఏకత, ద్విత. వీరు దేవతల చేతులు శుభ్రం చేయడానికి పుట్టారు. ఒకసారి త్రితుడు ఓ నూతిలో పడగా అసురులు ఆ నూతిని మూసివే యగా పై భాగాన్ని తొలగించి బయటకు వచ్చాడు. మరొకసారి ముగ్గురు అన్నదమ్ములు ఎడారిలో నీటి కోసం వెతుకుతూ త్రితుడు ఓ నూతిలోకి దిగగా తక్కిన ఇద్దరు ఓ బండి చక్రాన్ని ఆ నూతిపై కప్పి వెళ్లగా త్రితుడు అశ్వనీ దేవతలను ప్రార్థించగా వారు ప్రత్యక్షమై రక్షించారు. – ఋగ్వేదం

**త్రిదశ్యుడు :** లోపాముద్ర వల్ల అగస్త్యునికి జన్మించిన కుమారుడు. – *చూ॥ ఇధనువాహుడు*

**త్రిదిక :** భారతదేశంలోని ఓ నది. – మహాభారతం

**త్రిధన్వుడు :** సూర్యవంశపు రాజు. త్రిశంకుని తాత. – దేవీ భాగవతం

**త్రినేత్రుడు :** మహిషాసురుని మంత్రి. బిక్షారుడు రక్షణ, తామ్రుడు ఆర్థిక, ఉదర్కుడు సైన్యాధిపతులు కాగా వారి సలహాదారులు బాస్కల, త్రినేత్ర, కాలబంధకులు. – దేవీభాగవతం

**త్రిపాదుడు :** ఓ రాక్షసి. దేవాసుర యుద్ధంలో సుబ్ర హ్మణ్య స్వామి ఈ రాక్షసిని చంపాడు. – మహాభారతం

**త్రిపురం–త్రిపురాసురులు :** మయుడు నిర్మించిన అద్భుత భవనం త్రిపురం. తారకాసురుని కుమారులైన కమలా క్షుడు, తారకాక్షుడు, విద్యున్మాలినులను త్రిపురాసురు లని పిలుస్తారు.

*పూర్వవృత్తాంతం :* కశ్యపుని ఇద్దరు భార్యల్లో అదితికి దేవతలు, దితికి దానవులు జన్మించారు. అదితి, దితి ఇద్దరూ దక్షప్రజాపతి కుమార్తెలే. వారిమధ్య ఎల్ల ప్పుడూ యుద్ధాలు జరిగేవి. అమృతం సేవించిన దేవతలదే ఎప్పుడూ గెలుపు. సుబ్రహ్మణ్యుడు తార కాసురుణ్ణి వధించడంతో దానవులు మరింత బలహీ నులయ్యారు. తారకాసురుని కుమారులైన కమలా క్షుడు, తార కాక్షుడు, విద్యున్మాలి బ్రహ్మనుగూర్చి ఘోరతపమాచరించగా అతడు ప్రత్యక్షమై వరం కోరు కొమ్మనగా తమకు మృత్యువు లేనట్లు వరమిమ్మంటాడు.

అది సాధ్యం కాదని చెప్పగా అయితే మాకు మూడు నగరాలు కావాలి. వెయ్యేండ్లకొకసారి మేము ఒకేచోట కలుస్తాము. అప్పుడు ఆ మూడు నగరాలు ఒకేచోట కలవాలి. మేము ముగ్గురం ఒకే బాణంతో చని పోవాలి అని వరం కోరుకుంటారు. బ్రహ్మ వరమిచ్చి మాయమవుతాడు. తర్వాత వీరు మయుడ్ని పిలిచి ఒకటి బంగారంతో, రెండోది వెండితో, మూడోది ఇనుముతో మూడు నగరాలు నిర్మించమని కోరతారు. ఒకటి స్వర్గంలో, ఒకటి ఆకాశంలో, ఒకటి భూమి మీద వుంటాయి. హిరణ్యకశిపుని సంతతివాడైన బాణుడు ఈ నగరాల పర్యవేక్షణ చూసే వాడు. ఈ మూడు నగరాలను కలిపి త్రిపుర అనేవారు.

*మృతసంజీవిని :* త్రిపురాసురులున్నా దానవులు ఎక్కు వగా చనిపోవడం వారి సంఖ్య తగ్గడం వారిని కలచివేసింది. తారకాసురుని కుమారుల్లో ఒకడైన హరి బ్రహ్మనుగూర్చి తపస్సు చేయగా అతడు ప్రత్యక్షమయ్యాడు. అతని కోరిక ప్రకారం మయుడు ఓ తొట్టెను నిర్మించి అందులో అమృతం నింపు తాడు. చనిపోయిన దానవుల్ని దానిలో ముంచితే సజీవులవు తుంటారు. దానితో శక్తివంతులైన దానవుల ధాటికి దేవతలు భయకంపితులై బ్రహ్మ సలహా అడగగా తనకు సాధ్యం కాదని వారిని శివుని వద్దకు తీసుకువెళ్తాడు.

*త్రిపురాసుర సంహారం :* శివుడు వారి సంహారానికి ప్రయత్నాలు ప్రారంభించి తపతీనదీ తీరమే సరైన స్థలంగా భావించాడు. నారదుడి ద్వారా అసురుల భార్యలకు దేవతల మంచితనాన్ని చాటి వారిని దేవతలవైపు మరల్చాడు. దేవతల శక్తిలో సగభాగాన్ని తీసుకొని దాన్ని తన త్రిశూలంలో కలుపుకున్నాడు. అక్కడ శివుడు వీరి కలయిక కోసం వెయ్యేళ్లు గడిపాడు. మంద్ర పర్వతాన్ని తన విల్లుగా వాసుకిని వింటి త్రాడుగా శ్రీమహావిష్ణువును తన అస్త్రంగా చేసుకున్నాడు. అగ్నిని బాణంకొసగా వాయువును బాణం మూలంగా వుంచుకున్నాడు. భూమి రథమైంది. అశ్వనీ దేవతలు రథచక్రాలయ్యారు. బ్రహ్మరథికు డయ్యాడు. శివుడు ఎప్పుడైతే త్రిపురాసురులు కలుసు కున్నారో అప్పుడు తన త్రిశూలాన్ని విసరగా ఆ మూడు నగరాలు విడిపోయాయి. శివుడు సంధించిన శ్రీమహావిష్ణువు ఒకేసారి త్రిపురాసురుల్ని వధించగా ఆ నగరాల్లోని అసురులందరూ భస్మమయ్యారు.
– భాగవతం

**త్రిపురి :** ప్రాచీన దక్షిణ భారతదేశంలో ఓ రాజ్యం. సహదేవుడు తన జైత్రయాత్రలో దీన్ని జయించాడు.
– మహాభారతం

**త్రిపృష్ఠుడు :** ఓ యాదవుడు. ధృతి వసుదేవుల కొడుకు.
– భాగవతం

**త్రిబంధనుడు :** అరుణుని పుత్రుడు. ఇతని పుత్రుడు సత్యవ్రతుడు. ఈ సత్యవ్రతుడ్ని త్రిశంకుడు అని కూడా అంటారు. – భాగవతం

**త్రిభానుడు :** యయాతి కుటుంబంలో జన్మించిన ఒకరాజు. – భాగవతం

**త్రిమూర్తులు :** బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను త్రిమూర్తులంటారు. వీరు సృష్టి స్థితి లయకారులు.
– *చూ॥ బ్రహ్మ, శ్రీమహావిష్ణువు, శివుడు*

**త్రిరథికులు :** ముగ్గురు రథికులు. అశ్వత్థామ, కృపుడు, సాత్యకి. ఈ ముగ్గురు విలువిద్యా వీరుల్ని త్రిరథికులు అని అంటారు. – మహాభారతం

**త్రిరావుడు :** గరుడుని పిల్లల్లో ఒకడు. – మహాభారతం

**త్రిలింగము :** క్షితధరము, కాళేశ్వరము, ద్రాక్షారామము అను మూడు లింగములకు మధ్య వుండు ప్రాంతమును త్రిలింగ దేశమని పిలిచెడివారు. ఈ ప్రాంతప్రజల భాష తెలుగు.

**త్రిలోకీతిలకం :** ఓ యోగీశ్వరి మంత్రం. దీన్ని ప్రతిరోజు 101 సార్లు పఠిస్తే ఓ యోగిగా మారతాడు. అంతే కాదు అతడు ఎక్కడికి కావాలంటే అక్కడికి వెళ్ల గలడు. ఆ మంత్రం "హీమ్ గౌరి, రుద్రమయి, తెయో గేశ్వరి హంఫట్ స్వాహా" – దేవీ భాగవతం

**త్రిలోచనుడు :** రుద్రుడు. మూడు కన్నుల కలవాడని అర్థం.

**త్రివక్ర :** ఈమె కంసుడి దాసి. మధురలో శ్రీకృష్ణుణ్ణి చూసి కంసుడికి తీసుకెళ్తున్న సుగంధాల్ని కృష్ణుడి కివ్వగా త్రివక్రంగా వుండే ఈమె గూని పోగొడతాడు. మూడు వంకర్లుగా వుండేది కనుక త్రివక్ర అనేవారు. గూనిపోగొట్టగా కృష్ణుడ్నితనతో ఒక రాత్రి గడప మంటుంది. కాని కృష్ణుడు తర్వాత రోజు వస్తానని చెప్తాడు. వీరికి జన్మించినవాడు ఉపశ్లోకుడు. – భాగవతం

**త్రివర్చసుడు :** ఇతడో రుషి. అంగిరసుడు, కశ్యపుడు, ప్రాణుడు, చ్యవనుడు అగ్నితో తమ శక్తితో సమాను డైన ఓ పుత్రుడికి జన్మనిస్తారు. అందుకే ఇతణ్ణి పాంచ జన్యుడంటారు. – అగ్నిపురాణం

**త్రివిక్రమసేనుడు :** ఒక రాజు.

**త్రివిక్రముడు :** వామనుడికి మరొక పర్యాయనామం.

**త్రివిష్టవం :** కురుక్షేత్రంలోని ఓ పుణ్యస్థలం. ఇక్కడ స్నానంచేసి శివారాధన చేస్తే స్వర్గానికి వెళ్తారు. – మహాభారతం

**త్రివృష్ణుడు :** ఓ యాదవుడు. ధృతి, వసుదేవుల కొడుకు. – భాగవతం

**త్రిశంకుడు :** బ్రహ్మ వంశంలోని వాడు. సుధాముని మనుమడు. అసలు పేరు సత్యవ్రతుడు. సత్యవ్రతుడు చిన్నతనం నుండి అల్లరి బాలుడు. కోరికలు ఎలాగైనా నెరవేర్చుకోవాలనే స్వార్థపరుడు. ఒకసారి బ్రాహ్మణుల ఇంట వివాహం జరుగుతుండగా బలవంతంగా పెండ్లి కుమార్తెను ఎత్తుకుపోయాడు. ఈ విషయాన్ని తండ్రికి బ్రాహ్మణులు ఇతరులు చెప్పగా అతని తండ్రి త్రయ్యారుణుడితణ్ణి ఇంటి నుండి గెంటివేశాడు. తండ్రి కోపంలో ఇంటినుండి వెళ్ల గొట్టాడని తలచాడే గాని తండ్రిపై గౌరవం తగ్గలేదు. కాని ఈ తప్పుకు తమ కుల గురువు వేసిన శిక్ష పెద్దదని భావించి అతనిపై కోపంతో వుండేవాడు. అతడు దేశం విడిచి హరిజన ప్రజలతో కలిసి జీవించినా వారి జీవన విధానానికి అలవాటు పడలేదు.

*సత్యవ్రతుడు – విశ్వామిత్రుని కుటుంబం :* సత్యవ్రతుడు వెళ్లిపోయిన తర్వాత అతని తండ్రి విచార గ్రస్తుడై మరో కుమారుడికోసం తపస్సు చేయడానికి అడవులకు వెళ్లాడు. తనయుణ్ణి పంపిన పాపాన ఆ దేశంలో 12 సంవత్సరాలు క్షామం వచ్చింది. ఆహారం దొరక్క ప్రజలు విలవిలలాడారు. విశ్వామిత్రుడు కౌశికాతీరాన తపస్సుకు వెళ్లగా భార్య అతని ముగ్గురు కుమారులు తీవ్ర క్షామానికి లోనై విశ్వామిత్రుని భార్య తన రెండవ కుమారుణ్ణి అమ్మివేయడానికి నిర్ణయించు కోగా అది చూసి సత్యవ్రతుడు దాన్ని విరమింపజేసి వారి రక్షణ బాధ్యత తీసుకొని వారికి కావలసిన మాంసం, పళ్లు, తక్కిన ఆహార పదార్థాలు సంపాదించి ప్రతి రోజు వారికి అందించేవాడు.

*వశిష్ఠుని శాపం :* ఒకరోజు వేటలో ఏమీ దొరక లేదు. వశిష్ఠుని ఆశ్రమం వద్ద అతని గోవు నందిని కన్పించగా కోపం మరింత పెరిగి ఆ గోవును వధించి కొంత తను భుజించి తక్కినది విశ్వా మిత్రుని కుటుం బానికి పెట్టాడు. వశిష్ఠుడు గోవు కన్పించక విషయం గ్రహించి సత్యవ్రతుడ్ని పిలిచి నీవు మూడు పాపాలు (తండ్రి కోపానికి బలి కావడం, ఇతరుల భార్యను అపహరించడం, గోమాంసం భుజించడం) చేశావు కనుక నీవు త్రిశంకు (3 పాపాలు) అవుతావని శపిస్తాడు. సత్యవ్రతుడు త్రిశంకుడను చండాలుడుగా మారి వీధుల వెంట తిరుగుతూ వుంటాడు.

*త్రిశంకుడు రాజగుట :* త్రిశంకుడు దుఃఖితుడై తండ్రి నిరాదరణ, గురువు శాపం బాధించగా అడవుల్లో తిరుగుతూ గడిపాడు. బ్రాహ్మణులను తను విముక్తుడ వడానికి యాగం చేయాలని కోరగా అందుకు వారు నిరాకరించగా అగ్నిగుండం చేసుకొని అందులో దుమికి మరణిద్దామని తలవగా ఓ దేవత ప్రత్యక్షమై నీ తండ్రి ముసలివాడయ్యాడు. నేడో రేపో నీవు పట్టాభిషిక్తుడవుతావు. నీ తండ్రి యొక్క మంత్రి నిన్ను తీసుకువెళ్తాడని చెప్తుంది. నారదుడు ఈ విషయాన్ని అతని తండ్రికి నివేదించగా సత్యవ్రతుడ్ని రాజుని చేసి అతడు తపోవనానికి వెళ్తాడు.

*సత్యవ్రతుడు తిరిగి చండాలుడగుట :* ఇతడు ఎంతో కాలం రాజ్యం చేసి గొప్ప పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నాడు. కాని బొందితో స్వర్గానికి వెళ్లాలనే కోరిక కల్గింది. వశిష్ఠుడ్ని కోరగా అది అసాధ్యమని అందుకు ఎలాంటి క్రతువు లేదంటాడు. వశిష్ఠుని పుత్రులు కూడా తిరస్కరిస్తారు. అయితే ఎవరైనా అలా పంపేవారుంటారేమో చూస్తానని సత్యవ్రతుడు అనగా వశిష్ఠుడు కోపంతో తిరిగి చండాలుడిగా మార మని శపిస్తాడు. అతని కుమారుడైన హరిశ్చంద్రుడు రమ్మని కోరినా రాజప్రాసాదానికి రాకపోవడం వల్ల హరిశ్చంద్రుణ్ణి పట్టాభిషిక్తుణ్ణి చేస్తారు.

*విశ్వామిత్రుడు – త్రిశంకుడు :* విశ్వామిత్రుడు తన తపస్సు తర్వాత తిరిగివచ్చి తన కుటుంబ సభ్యుల ద్వారా మొత్తం కథ విని సత్యవ్రతుడు తపస్సు చేస్తున్న అంబ వనానికి వెళ్లి అతణ్ణి కలుస్తాడు.

త్రిశంకు స్వర్గం : విశ్వామిత్రుడు త్రిశంకుని కోరిక విని తాను బొందితో స్వర్గానికి పంపుతానని యాగం మొదలు పెడతాడు. వశిష్ఠుని అయిష్టత వల్ల తక్కిన మునులెవ్వరు పాల్గొనరు. విశ్వామిత్రుడు తన తపశ్శక్తి వినియోగించగా త్రిశంకుడు అలాగే పైకి లేచి శరీరంతో స్వర్గానికి చేరుకోగా ద్వారపాలకులు అడ్డుకొని ఇంద్రుడితో చెప్పగా అతడు తన శక్తితో త్రిశంకుడ్ని భూమివైపు తోస్తాడు. తల క్రిందికి, కాళ్ళుపైకి వున్న త్రిశంకుడు భూమివైపు వస్తూండగా విశ్వామిత్రుడు తన తపశ్శక్తితో అతనిని ఆపుతాడు. అలా త్రిశంకుడు క్రిందపడకుండా స్వర్గానికి భూమికి మధ్య వుండి పోతాడు. విశ్వామిత్రుడు తన ప్రతిన నెరవేర్చుకోవ డానికి త్రిశంకుని చుట్టూ స్వర్గాన్ని నిర్మిస్తాడు. అదే త్రిశంకు స్వర్గం. ఇంద్రుడు దేవతల్ని సృష్టించడం, మరో స్వర్గం ఏర్పడటం చూసి విశ్వామిత్రుని వద్దకు వచ్చి దాన్ని నివారించమని త్రిశంకుడికి స్వర్గంలో చోటిస్తానని చెప్తాడు. ఓ బంగారు విమానంలో త్రిశంకుడ్ని స్వర్గానికి తీసుకు వెళ్తాడు. – దేవీభాగవతం

**త్రిశంకు స్వర్గం :** త్రిశంకుడు భూ స్వర్గలోకాలకు మధ్య నిలిచిపోయిన స్థానం. – చూ॥ త్రిశంకుడు

**త్రిశిఖుడు :** తామస మనువు కాలంలో ఇంద్రుడయిన వాడు. – భాగవతం

**త్రిశురుడు :** ఇతడొక రాక్షసుడు. రావణుని స్నేహితుడు. లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులు కోసినపుడు ఖరధూషణులు, త్రిశురుడు కలిసి రాముడిమీద దాడి చేస్తారు. ఇతడు రాముడి నుదుటికి గాయం చేస్తాడు. – రామాయణం

**త్రిశిరుడు :** ఇతడు రేచన, త్రిష్టక కుమారుడు. త్రిష్ట ఇంద్రునిపై పగతో ఇతణ్ణి ప్రేరేపించగా ఇతడు తపస్సు చేస్తుండగా ఇంద్రుడితణ్ణి తన వజ్రా యుధంతో ఖండిస్తాడు. ఇతడి పేరు విశ్వరూపుడు. మూడు తలలుండటం వల్ల త్రిశిరుడు అనబడే వాడు. – దేవీభాగవతం

**త్రిశూలఖాతం :** ఓ పుణ్యస్థలం. ఇక్కడ స్నానంచేసి దేవతల్ని, పితరుల్ని ప్రార్థిస్తే గణపతితో సమానమైన స్థానాన్ని పొందుతారు. – మహాభారతం

**త్రిశూలం :** శివుని ఆయుధం. సూర్యుణ్ణి మదించగా జనించిన వైష్ణవ తేజస్సు దీనిలో వుంది. – విష్ణుపురాణం

**త్రిశోకుడు :** ఓ రుషి. కణ్వుడి కుమారుడు. అశ్వినీ దేవతలు ఇతడి గోవుల్ని విడిపిస్తారు. – రుగ్వేదం

**త్రిస్రోతసి :** ఓ పుణ్యనది. వరుణుడి సభలో వుంటుంది. – మహాభారతం

**త్రిశృంగం :** ఓ పర్వతం. మహామేరువు పర్వతానికి ఉత్తరాన వుంది. – దేవీభాగవతం

**త్రిషవణుడు :** ఓ రుషి. పాండవుల తరఫున రాయ భారానికి వెళ్లిన శ్రీకృష్ణుణ్ణి ఇతడు హస్తినలో కలుస్తాడు. – మహాభారతం

**త్రిష్టుప్పు :** సూర్యుని రథానికి ఏడు అశ్వాలుంటాయి. అందులో ఒకటి త్రిష్టుప్పు. – విష్ణుపురాణం

**త్రుటి 1 :** ముప్పై అల్పకాలాలు ఒక త్రుటి. – చూ॥ కాలమానం.

**త్రుటి 2 :** సుబ్రహ్మణ్యుని అనుచరి. – మహాభారతం

**త్రేతాగ్నులు :** తనను వదలి వెళ్లిన ఊర్వశిని ఇప్పింపుమని పురూరవుడు గంధర్వులను ప్రార్థించగా వారు అగ్నినిచ్చి దానినర్పింపుమనిరి. అతడు దానిని మూడు భాగములుగా జేసి పూజించి స్వర్గమును పొందెను. ఉపాసనార్థంబై మూడుగా విభజింపబడిన అగ్ని త్రేతాగ్నులయ్యెను. ఇవి శిఖండికి పావకుడు, పవమానుడు, శుచులుగా జన్మిస్తాయి. – భాగవతం

**త్రేతాయుగం :** చతుర్యుగాల్లో రెండవది. ఈ యుగానికి మూడువేల దేవ సంవత్సరాలు. శ్రీరాముడు ఈ యుగాంతంలో జన్మించాడు. ఇది క్రీ.పూ. 867100లో అంతమయ్యింది. శ్రీరాముడు 11000 సంవత్సరాలు పాలించాడు.

**త్రైబలి :** ఓ రుషి. ధర్మజుని సభలో వుండేవాడు. – మహాభారతం

**త్రైవర్గికులు :** బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యుల్ని కలిపి త్రైవర్గికులంటారు. – రుగ్వేదం

**త్రైశానుడు :** తుర్వసు వంశానికి చెందిన రాజు. కరంధముడి తండ్రి.



**దక్షసావర్ణి :** 9వ మనువు పేరు. ఈ మనువు కాలంలో మూడు రకాల దేవ గణాలున్నాయి. పర్ణసులు, మరీచ గర్భసులు, సుధర్మమసులు. ప్రతి గణానికి 12 మంది దేవుళ్లున్నారు. వారి రాజు ఇంద్రుడిపేరు అద్భుతుడు. పవనుడు, ద్యుతి మానుడు, భవ్యుడు, వసు, మేథాతిథి, జ్యోతి ష్మానుడు, సత్యుడు సప్తర్షులు. ధృతకేతు, దీప్తి కేతు మొదలగువారు అతని పుత్రులు.

– విష్ణుపురాణం

**దక్షిణ :** ప్రజాపతి రుచి, ఆకూతిలకు జన్మించిన కుమార్తె. స్వాయంభవ మనువు తన సోదరి సత రూపను వివాహమాడెను, వారికి ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. అందులోని కూతురు ఆకూతి. ఈమె ప్రజాపతి రుచిని వివాహమాడగా వారికి యజ్ఞ అనే కుమారుడు, దక్షిణ అనే కుమార్తె జన్మించారు. ఈమె తన సోదరుడయిన యజ్నుడ్ని వివాహమాడగా 12 మంది యములనే దేవతా గణం జన్మించారు. ఈమె తన పునర్జన్మలో గోకులంలో సుశీలగా జన్మించింది.

**దక్షిణ కాశి (దక్షిణ కైలాసం) :** కాళహస్తి, త్రిశివ పెరూర, త్రికోణమలలను దక్షిణ కైలాసం లేక దక్షిణ కాశి అని పిలుస్తారు.

**దక్షిణ పాంచాలం :** గంగానదికి దక్షిణాన చంపావతి వరకు గల దేశమే పాంచాలం. జరాసంధునికి దడిచి ఈ దేశ రాజు దక్షిణానికి పారిపోయాడు. ద్రుపదుని కాలంలో పాంచాలం ప్రసిద్ధి చెందింది. ద్రుపదుణ్ణి అర్జునుడు జయించి పాంచాలంలో సగభాగం ద్రోణుడికి కానుకగా ఇచ్చాడు. ఆ సగభాగం ఉత్తర పాంచాలం.

– మహాభారతం

**దక్షిణ మల్లం :** ప్రాచీన భారతదేశంలోని ఓ రాజ్యం. దీని రాజధాని కుశినగరం. దీన్ని మల్లరాజ్యం అనే వారు. భీమసేనుడు దీనిని ఆక్రమించాడు.

– మహాభారతం

**దక్షిణ సింధువు :** దక్షిణ సముద్ర తీరానగల పుణ్యస్థలం. దీన్ని దర్శిస్తే అగిస్థోమ యజ్ఞం చేసిన ప్రతిఫలం లభిస్తుంది. దేవతల విమానంలో ప్రయాణంచేసే అవకాశం లభిస్తుంది. – మహాభారతం

**దక్షిణాగ్ని :** పాంచజన్యుడను అగ్నినుండి వెలువడిన బలమైన వాయువు. – మహాభారతం

**దక్షుడు1 :** చాలా పురాణాలలో ఇద్దరు దక్షులున్నట్లు పేర్కొనబడగా కొన్ని పురాణాలు ఒక దక్షుడే వున్నట్లు చెప్తున్నాయి. అయితే అతని కథా వృత్తాంతం గమనిస్తే అతనిజీవితం రెండు దశలుగా వుందని, దక్ష యజ్ఞంలో శివుడు చంపిన వరకు ఒక దశతిరిగి బ్రతికించబడిన తర్వాత మరో దశగా కన్పిస్తుంది.

బ్రహ్మ కుడి బొటన వేలి నుండి జన్మించాడు. బ్రహ్మ ఎడమబొటన వేలినుండి జన్మించిన వీరణి, అశిక్నిని వివాహమడాడు. ఇతనికి ఎంతోమంది కుమారులు, చివరికి సతి అనే కుమార్తె జన్మిస్తుంది. సతిని శివుడు వివాహమాడాడు. శివుడు బ్రహ్మ కొలువులో దక్షుడ్ని గౌరవించలేదని ఇతడు చేసిన యజ్ఞానికి దేవత ల్నందర్ని పిలిచి అల్లుడైన శివుడ్నిమాత్రం ఆహ్వానిం చడు. సతి పిలవక పోయినా వెళ్లి తండ్రి చేతలకు భంగపడి ఆ యజ్ఞంలో దూకి మరణిస్తుంది. శివుడు భైరవుణ్ణి సృష్టించి దక్షుని యాగాన్ని నాశనం చేస్తాడు. శివుడు దక్షుని తల నరకుతాడు. దేవతలు ఓ మేక తలను ఇతని మొండానికి అతికించి బ్రతికిస్తారు. గొర్రెతల వుండటం వల్ల ఇతణ్ణి అజముఖుడని అంటారు.

– దేవీభాగవతం

ఇతడు మరు జన్మంబున ప్రచేతసులకు, మారీషకు పుడతాడు. ఇతడికి హర్యశ్యులు 5000 మంది పుడతారు. నారదుడి ప్రోద్బలంపై వీరు నలుదిక్కు లకు వెళ్లగా మరో 1000 మంది శబలాశ్యులకు జన్మనిస్తాడు. వీరిని నారదుడట్లే పంపగా నారదుని సొంతగూడులేని తిరుగుబోతువు కమ్మని శపిస్తాడు. ఇరవై ఏడు నక్షత్రాలు ఇతని సంతతే. వీరందర్ని చంద్రుడికిచ్చి వివాహం చేయగా చంద్రుడు రోహిణిని ప్రత్యేక దృష్టితో చూడగా తక్కిన కూతుర్లు దక్షునికి విన్నవించుకోగా చంద్రుణ్ణి దక్షుడు కుష్ఠివ్యాధి గ్రస్తుడవు కమ్మని శపిస్తాడు. మొత్తం దక్షుని 27 మంది సంతతి నుండే జీవకోటి ఉద్భవించింది.

– మహాభారతం

**దక్షుడు 2 :** శ్రీరాముని తమ్ముడైన భరతుని కుమారుడు. ఇతని పేరుతోనే దక్షపురాన్ని నిర్మించారు.

– రామాయణం

**దక్షుడు 3 :** పరిష్వంతుని కొడుకైన చిత్రసేనుడి కుమారుడు. ఇతని కుమారుడు మేధావంశుడు. *- మహాభారతం*

**దత్త (దత్తక) :** చూ॥ దత్తాత్రేయుడు.

**దత్తకచ్ఛం :** నర్మదానదీ తీరాన గల ఓ ప్రాచీన దేశం. *- కథాసరిత్సాగరం*

**దత్తమిత్రుడు :** సుమిత్రుడి మరోపేరు. ఇతడు సౌవీర రాజు. అర్జునుడు తన జైత్రయాత్రలో ఈ దేశాన్ని జయించాడు. *- మహాభారతం*

**దత్తాత్రేయుడు :** అత్రి అనసూయలకు దత్తాత్ముడు. ఓ విశ్వదేవుడు *- మహాభారతం*

మహావిష్ణువు అంశతో జన్మించినవాడు. కార్తవీర్యార్జునుడితడికోసం తపస్సుచేసి వెయ్యి చేతులు, నిత్య యౌవ్వనం వరాలుగా పొందుతాడు. *- బ్రహ్మపురాణం*

ఇతడు రావణాసురుడు జలాపహరణం చేసి నందుకు శపిస్తాడు. *- రామాయణం*

**దత్తిలుడు :** ఒక సంగీత శాస్త్రకర్త.

**దత్తోలి :** ప్రతివల్ల పులస్త్యమునికి జన్మించిన కుమారుడు. స్వాయంభవ మనువు కాలంలోని అగస్త్యుని పునర్జన్మే దత్తోలి. *- విష్ణుపురాణం*

**దధిముఖుడు 1 :** ఓ ప్రసిద్ధ సర్పం. కద్రువ కశ్యపుల సంతతి. *- మహాభారతం*

**దధిముఖుడు 2 :** ఓ ప్రముఖ వానరం. ఇదిపెద్ద వానర సేనకు సేనాని. ఇది శ్రీరాముడికి సహాయ పడింది. *- మహాభారతం*

**దధిమండోదకం :** ఒక సముద్రం ఘృతోద సముద్రానికి దగ్గరగావుంది. *- మహాభారతం*

**దధివక్త్రుడు :** ఓ వానరుడు. శ్రీరామునికి సహాయపడ్డాడు. ఇతడు సుగ్రీవుని మేనమామ. *- ఆనంద రామాయణం*

**దధివాహనుడు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. గౌతమ మహర్షి పరశురాముడి నుండి ఇతని కుమారుణ్ణి రక్షించాడు. *- మహాభారతం*

**దధీచం :** కురుక్షేత్రంలోని ఓ పవిత్ర స్థలం. సరస్వతి పుత్రుడైన అంగిరసుడు ఇచట జన్మించడం వల్ల పవిత్రమయ్యింది. ఇక్కడొకసారి స్నానంచేస్తే అశ్వమేధయాగ ఫలం లభించి సరస్వతీలోకం చేరతారు. *- మహాభారతం*

**దధీచి :** ఓ ప్రసిద్ధ మహర్షి – బృహ మహర్షి కుమారుడు. ప్రపంచసారం పెద్ద శరీరంలోకి నింపబడినవాడు దధీచి. *సారస్వత మహర్షి జననం :* సరస్వతీ నదీతీరంలో ఓ కుటీరం వేసుకొని దధీచి తపస్సు చేస్తుండేవాడు. అతని తపశ్శక్తి రోజురోజుకు పెరగటం చూచి ఇంద్రుడు సహించలేక అలంబుస అనే అప్సర కన్యను ఇతని ఆశ్రమానికి పంపాడు. ఆమె తన ఆట పాటలతో కవ్వించగా దధీచికి వీర్యస్రవమై సరస్వతీ నదిలో పడి ఓ బిడ్డ జన్మకు కారణమయ్యింది. అతడే సారస్వతుడు. ఒకసారి ఇతడు దేవలోకం వెళ్లి ఇంద్రుడితో పాటు భూమిమీదకు చూడగా భూమంతా రాక్షసులతో నిండివుంది. ఇంద్రుడు వారిని చంపడానికి ప్రయత్నించి విఫలుడై దధీచి వెనుకనున్న గొర్రె పుర్రెలోని ఎముకతో భూమిపైగల అసురుల్ని వధించాడు. *- ఋగ్వేదం*

వృతాసురుని నాయకత్వంలో అసురులు ఇంద్రునిపై యుద్ధానికి రాగా ఇంద్రుడు వారిని జయించ లేక బ్రహ్మనాశ్రయించగా దధీచి ఎముకలతో చేసిన ఆయుధం అతణ్ణి చంపగలదని చెప్తాడు. ఇంద్రుడు నరనారాయణులతో కలసి దధీచిని కలసి వివరించగా అసురులను చంపడానికి తన అంగీకారం తెలిపి శరీరాన్ని వదలివేస్తాడు. అతడి ఎముకలనుండే ఇంద్రుని వజ్రాయుధం చేయబడింది. దీనితో ఇంద్రుడు వృతాసురుణ్ణి వధించాడు. *- మహాభారతం*

**దధ్యంగుడు :** అధర్వుడి కుమారుడు. ఇంద్రుడితడికి మధువిద్యను ప్రవర్గ విద్యను నేర్పి దాన్నెవరికీ చెప్ప వద్దంటాడు. అశ్వనీదేవతలు ఇతని తలతీసి గుర్రం తల అతికించి ఆ విద్యను నేర్చుకోగా ఇంద్రుడితడి గుర్రపు తలను నరకగా అశ్వనీ దేవతలు అసలు తలను తెచ్చి అతికిస్తారు. *- ఋగ్వేదం*

**దనాయుషు :** దక్ష ప్రజాపతి కుమార్తె. కశ్యప ప్రజాపతి దనాయుషును వివాహమాడగా వీరికి నల్గురు పుత్రులు జన్మించారు. వారు విక్షర, బల, వీర, వ్రతలు. *- మహాభారతం*

**దనుడు :** ఓ రాజు. ఇద్దరు కుమారులు జన్మించారు. వారు రంభ, కరంభు. *- చూ॥ కరంభుడు*

**దనువు 1 :** ఒక గంధర్వుడు. *- చూ॥ కబంధుడు*

**దనువు 2 :** ఒక రాజు. రంభ కరంభులితడి కుమారులు.

**దనువు 3 :** ఈమె దక్షప్రజాపతి కుమార్తె. ఈమె కశ్యప ప్రజాపతిని వివాహమాడినది. ఈమె సంతతే దానవులు. 100 మంది సంతానం. వీరిలో ముఖ్యులు 1. విప్రచిత్తి 2. శిబర, 3. నముచి, 4. పులోమ 5. అసిలోమ 6. కేశి 7. దుర్జయ 8. అయశ్శిరస 9. అశ్వశిరసు 10. అశ్వశంకు 11. గర్గ 12. అమూర్ధ 13. వేగవాను 14. కేతుమాను 15. స్వర్భాను 16. అశ్వ 17. అశ్వపతి 18. వృషపర్వాన 19. అజక 20. అశ్వగ్రీవాని 21. సూక్ష్మ భుతుహుండ 23. ఏకపాద, 24. ఏకచక్ర 25. విరూపాక్ష 26. హరిహర 27. నిచంద్ర 28. నికుంభ 29. కపత 30. శరభ 31. శలభ 32. సూర్య 33. చంద్ర. ఈ సూర్య చంద్రులు గ్రహాలు కాదు. వీరినుండి 10 రాక్షస వంశాలు పుట్టాయి. ఈ వంశాలకు మూలపురుషులు 10 మంది. 1. ఏకాక్ష 2. అమృత 3. ప్రలంబ 4. నరక 5. వాతాపి 6. తపన 7. శార 8. మహాహను 9. గర్విష్ఠ 10. దీర్ఘజిహ్వ. దానవులంతా ఏదోరకంగా పైవారి సంతతికి చెందినవారే.

**దభీతి :** ఓ రుషి. ఇతడి గొప్పతనం గురించి రుగ్వేదంలో పేర్కొనబడింది. ఇంద్రుని కుమారుడైన ఇతణ్ణి అశ్వనీ దేవతలు ఒకసారి కాపాడారు. – రుగ్వేదం

**దమ 1 :** దమయంతి సోదరుడు.

**దమ 2 :** ఇతడొక రుషి. భీష్ముడు అంపశయ్యపై నుండగా దర్శించిన వారిలో ఒకడు. – మహాభారతం

**దమ 3 :** చూ॥ శంబరుడు.

**దమఘోషుడు :** చేది వంశ రాజైన శిశుపాలుడి తండ్రి. – మహాభారతం

ఇతని మరో కుమారుడు సాల్వుడు.

**దమనకం :** ఇదో తాతిరి వృక్షం. ఈ వృక్షాన్ని పూజించడాన్నే దమనకారోహణ విధి అని అంటారు.

*పూర్వకథ :* శివుని క్రోధంనుండి భైరవుడు ఆవిర్భవించాడు. శివుని కోరికకు వ్యతిరేకంగా ఇతడు దేవతల్ని చంపడం వల్ల శివుడు కోపించి ఓ వృక్షంగా మారమని శపించాడు. భైరవుడు శివుణ్ణి ప్రార్థించగా సువాసనలతో కూడిన వృక్షంగా భూమిమీద వెలుస్తావని నిన్ను అందరూ పూజిస్తారని అనుగ్రహిస్తాడు. – అగ్నిపురాణం

**దమనకుడు 1 :** పంచతంత్రంలోని మిత్రభేదంలో ఓ కల్పిత పాత్ర. – పంచతంత్రం

**దమనకుడు 2 :** ఓ దైత్యుడు. శ్రీ మహావిష్ణువు మత్స్యావతారం ఎత్తినపుడు సముద్రంలో వుండే ఇతణ్ణి సంహరించాడు. శ్రీమహావిష్ణువు ఇతణ్ణి సముద్రం నుండి భూమిపైకి విసరగా సువాసనలు వెదజల్లే ఓ మొక్కగా మారాడు. అదే దమనకం. – స్కందపురాణం

**దమని :** హ్లాదుని భార్య. వాతాపి ఇల్వలుల తల్లి. – భాగవతం

**దమనిక :** ఓ అప్సరస. మేనక కూతురు. కందరుడనే పక్షి భార్య.

**దమనుడు 1 :** దమయంతి సోదరుడు. మహారాజైన భీమునికి దమయంతి అనే కూతురు, దమ, దమన, దంత అనే కుమారులు కలరు. – మహాభారతం

**దమనుడు 2 :** ఓ రుషి. విదర్భరాజైన భీముడికి సంతానం కల్గునట్లు దీవించగా దమయంతి మరి ముగ్గురు పుత్రులు జన్మించారు. – మహాభారతం

**దమనుడు 3 :** పౌరవ రాజు కుమారుడు. దృష్టద్యుమ్నుడితణ్ణి కురుక్షేత్ర యుద్ధంలో వధించాడు. – మహాభారతం

**దమనుడు 4 :** భరద్వాజుని కుమారుడు. ఇతడు ప్రయాణంలో అమరకం వద్ద గర్గుడిని కలసి కాశీ యొక్క గొప్పతనం విని ఆధ్యాత్మిక జ్ఞాన సంపాదనపై అభిమాని అయిన ఇతడు అక్కడే కూర్చుని తపస్సుచేసి శరీరాన్ని వదలి స్వర్గం చేరాడు. – స్కందపురాణం

**దమయంతి 1 :** విదర్భ రాజైన భీముడి కుమార్తె. కలి ఈమెను వివాహమడాలని తలుస్తాడు కాని నలుణ్ణి వివాహమాడుతుంది. కలి నలునిలో ప్రవేశించి అతణ్ణి అష్టకష్టాలు పెడతాడు. దమయంతిని వదిలేస్తాడు. సుదేవుడను బ్రాహ్మణుడు ఈమెను వెతకటానికి వెళ్తాడు. ఆమె ఎన్నో కష్టాలు ఎదుర్కొని తన తండ్రి భీముడి ఇల్లు చేరుతుంది. తండ్రి ఈమెకు తిరిగి స్వయంవరం ప్రకటించగా ఈమె బాహుకుడి వేషంలో వున్న నలుణ్ణే మళ్ళీ వరిస్తుంది. – మహాభారతం

**దమయంతి 2 :** ప్రమ్లోచ కుమార్తె.

**దమలిప్తులు :** గంగకు పశ్చిమాన ఉండే ప్రజలు. – మహాభారతం

**దముడు 1 :** విదర్భరాజు భీముడి కుమారుడు. ఇతని సోదరి దమయంతి. – మహాభారతం

**దముడు 2 :** ఒక రుషి. భీష్ముడు కురుక్షేత్రంలో అంపశయ్యపై నుండగా దర్శించిన రుషుల్లో ఒకడు. – మహాభారతం

**దముడు 3 :** మరుత్తు కొడుకు. ఇతని కుమారుడు రాజవర్ధనుడు. – భాగవతం

**దముడు 4 :** శత శృంగుడి కొడుకు. ఒక రాక్షసుడు. సుదేవుడి చేతిలో మరణిస్తాడు. – మహాభారతం

**దముడు 5 :** పరిష్యంతుడి కొడుకు. సుమన భర్త. – మార్కండేయ పురాణం

**దముడు 6 :** అరిందముడనే రాజకుమారుడు. పూర్వ జన్మమున ఇతడు యజ్ఞదత్తుడను బ్రాహ్మణుని కుమారుడు. దముడిగా వున్నపుడు పార్వతీ పరమేశ్వరులను కొలవగా వీరు ప్రత్యక్షమైనపుడు ఇతడు పార్వతి సౌందర్యాన్ని వర్ణిస్తాడు. పార్వతి కోపించి ఇతని కన్నుపగిలేట్టు శపిస్తుంది. శివుడు నచ్చజెప్పి దృష్టిలోపం లేకుండా చేసి అలకా పట్టణాన్ని కూడా ఇస్తాడు. – శివపురాణం

**దమి :** ప్రసిద్ధ పవిత్ర స్థలం. బ్రహ్మ తరచు ఇక్కడ కూర్చొని శివుణ్ణి ప్రార్థిస్తాడు. ఇక్కడ స్నానంచేస్తే సకల పాపాలు పోతాయి. – మహాభారతం

**దరదం :** ఉత్తర భారతంలోని తూర్పున వున్న ఓ దేశం. అర్జునుడు తన జైత్రయాత్రలో వీరిని జయించాడు. పాండవుల వనవాసంలో ధర్మజునికి వీరు కృతజ్ఞతా పూర్వకంగా వున్నా కురుక్షేత్ర యుద్ధంలో వీరు కౌరవుల పక్షాన పోరాడారు. సాత్యకి వీరిని సంహరించాడు. ఈ దేశ ప్రజల్ని దరదులు అని పిలిచేవారు.

**దరదుడు :** ప్రాచీన భారతదేశంలో బాల్హిక రాజ్యాధిపతి. సూర్యుడను అసురుని పునర్జన్మ ఇతడు పుట్టినపుడు ఇతని బరువుకు భూమి చీలింది. – మహాభారతం

**దరదులు :** ఓ తెగ ప్రజలు. మొదట క్షత్రియులైనా బ్రాహ్మణ వ్యతిరేకతతో వీరు శూద్రులయ్యారు. – మహాభారతం

**దరుడు :** యాదవుడు. అణువు కొడుకు. అంధకుడి పేరు.

**దర్పకుడు :** మన్మధుడి పేరు.

**దర్భకుడు :** అజాతశత్రువు కొడుకు. శిశునాగుడి వంశంలోవాడు. ఇతడి కొడుకు అజయుడు.

**దర్భలు :** ఓ వృక్ష జాతి ఆకులు. గరుత్మంతుడు తన తల్లి దాస్య విముక్తికై దేవలోకం నుండి అమృత బాండాన్ని తెచ్చి ఈ ఆకులపై పెట్టి కద్రువ కుమారులైన సర్పాలకు ఇచ్చాడు. ఈ దర్భలను నాకడంవల్ల సర్పాల నాలుకలు రెండుగా చీలాయి. అమృతం దర్భలపై పెట్టి తీసుకు రావడంవల్ల వాటికి పవిత్రత వచ్చింది.

**దర్భశయనం :** రాముడు సేతుబంధం నిమిత్తం ప్రాయోపవేశం చేసిన చోటు. – రామాయణం

**దర్మషణుడు :** సృంజయుడి రెండో కొడుకు.

**దరిద్రుడు :** యయాతి కుటుంబంలో జన్మించిన ఓ రాజు. దుందుబి కుమారుడు. ఇతని కుమారుడు వసుడు. – మహాభారతం

**దర్భి :** ఓ ప్రాచీన రుషి. కురుక్షేత్రంలో ఇతడు స్నాన తీర్థం కట్టించాడు. ఇక్కడ స్నానంచేసి ఉపవాసం వుంటే మంత్రపఠనం నేర్చుకొని బ్రాహ్మణులు కావొచ్చు. ఈ రుషి నాల్గు సముద్రాల నీటిని ఇచ్చట కలిపాడని పురాణాలలో వుంది. – మహాభారతం

**దర్వీసంక్రమణం :** ఇదో పవిత్ర స్థలం. దీన్ని దర్శించిన వారికి అశ్వమేధయాగం చేసిన ఫలితం లభించి స్వర్గానికి వెళ్తారు. – మహాభారతం

**దర్పుడు :** యయాతి కుటుంబంలోని ఓ రాజు. – మహాభారతం

**దర్మకం :** ప్రాచీన భారతంలో ఓ దేశం. – మహాభారతం

**దల్భుడు :** అభిజిత్తు కొడుకు. దల్భుడి కుమారుడే దుందుబి.

**దవిద్యోతుడు :** అభిజిత్తు మరోపేరు. యదు వంశస్తుడు. దుందుబి కుమారుడు. – మహాభారతం

**దశకంఠుడు :** చూ॥ రావణుడు

**దశగ్రీవుడు :** చూ॥ రావణుడు

**దశజ్యోతి :** శుభ్రాత రాజు కుమారుడు. – మహాభారతం

**దశద్ర్యుడు :** ఓ రుషి. అంతేకాకుండా వీరుడు కూడా. – రుగ్వేదం

**దశమాలిక :** ప్రాచీన భారతావనిలో ఒక దేశం.
– మహాభారతం

**దశముఖ రావణుడు :** చూ॥ రావణుడు

**దశరథుడు :** నెమి అనికూడా అంటారు. ఇక్ష్వాకు వంశపు రాజు. శ్రీరామచంద్రుని తండ్రి. విష్ణు అంశతో జన్మించిన ఈ వంశంలో హరిశ్చంద్రుడు, త్రిశంకుడు, ఖట్వాంగుడు, రఘుడు ముఖ్యులు. అందుకే ఈ వంశ జుల్ని ఇక్ష్వాకులని, రఘువంశజులని అంటారు. రఘువు కుమారుడు అజుడు, అతని కుమారుడు దశరథుడు. అజునికి ఇందుమతి వల్ల జన్మించిన వాడు. దశరథుని జీవిత ప్రథమాం కంలో ఒకరోజు వేటకు వెళ్లి సాయంత్రం వరకు వేటలో పాల్గొన్నాడు. సాయం సంధ్య వేళ ఓ నది ఒడ్డు నుండి శబ్దం వినబడి ఏనుగు నీరు త్రాగు తుందని తలచి బాణం సంధించి ఆ శబ్ధం వచ్చినవైపు వదలగా అది తన ముసలి తల్లి దండ్రులకు నీరు తీసుకొని వెళ్లడానికి వచ్చిన ఓ ముని కుమారుడికి తగుల్తుంది. ఆ ఏడ్పువిని దశరథుడు ఆ బాలుడి వద్దకు వెళ్లి బాధపడి ఆ బాలుడు కోరగా అతని తల్లిదండ్రులకు నీరు తీసుకొని ఆశ్రమానికి వెళ్తాడు. వారికి జరిగింది వివరించగా ఆ బాలుడి వద్దకు తీసుకొని వెళ్లమని కోరతారు. ఆ బాలునికి చితి పేర్చి ఆ బాలునితో పాటు వారు చితిలో దూకి మరణిస్తూ నీవుకూడ మావలెనే పుత్రశోకంతో మరణిస్తావని దశరథుని శపిస్తారు.
– రామాయణం

*కైక వరం–దశరథ బిరుదు :* దేవలోకంలో అసురులతో ఇంద్రుడు యుద్ధం చేస్తూ దశరథుని సహాయం కోరతాడు. ఇతడితోపాటు ఇతని భార్య కైకేయి కూడా వెళ్తుంది. సాంబరుడితో జరిగిన యుద్ధంలో దశరథుడు ఒకసారి మూర్ఛపోతాడు. రథం శీల ఊడిపోగా తన వేలునే శిలగా కైకేయి వుంచి రక్షిస్తుంది. తెప్పరిల్లిన రాజు సాంబరుడితో యుద్ధం చేస్తాడు. సాంబరుడు తన మాయతో 10 చోట్లనుండి యుద్ధం చేస్తుంటే దశరథుడు ఒకేసారి తన రథాన్ని పదిచోట్లకు పోనిచ్చి అతణ్ణి జయిస్తాడు. 10 చోట్లనుండి ఒకేసారి యుద్ధం చేయడం వల్ల బ్రహ్మ ఇతనికి దశరథుడని నామకరణం చేస్తాడు. యుద్ధంలో సహాయపడిన కైకేయికి తన ఇష్టం వచ్చినపుడు కోరుకొమ్మని రెండువరాలు ఇస్తాడు.

*పుత్రుల జన్మ :* ఓ కుమార్తె జన్మించగా దశరథుడు ఆమెను తన స్నేహితుడు లోమపాదుడికిస్తాడు. లోమపాదుడామెను రుష్యశృంగుడికిచ్చి వివాహం చేస్తాడు. అయితే చాలాకాలం అతనికి మరల పిల్లలు జన్మించక రుష్యశృంగుని ఆధ్వర్యంలో వశిష్ఠుని సలహాపై పుత్రకామేష్ఠి యాగంచేసి తన భార్య కౌసల్యవల్ల శ్రీరాముడ్ని, కైకేయివల్ల భరతుడిని, సుమిత్ర వల్ల లక్ష్మణ, శతృఘ్నులకు జన్మనిస్తాడు.

*మరణం :* శ్రీరాముని పట్టాభిషిక్తుడ్ని చేయ తలపెట్టగా కైకేయి తనకిచ్చిన వరాలను తన దాసి మందర సలహాపై కోరుతుంది. అవి శ్రీరాముని అరణ్యవాసం, భరతుని పట్టాభిషేకం. ఇదివిన్న దశరథుడు నిర్ఘాంతపోగా శ్రీరామచంద్రుడు అరణ్యవాసానికి వెళ్తాడు. దశరథుడు విచారగ్రస్తుడై మునిశాపం జ్ఞప్తికి వచ్చి మరణిస్తాడు.

**దశార్ణ :** ధృతరాష్ట్రుడి భార్య. గాంధారి తోబుట్టువు.
– మహాభారతం

**దశార్హుడు :** యదువంశ రాజు. ఇతని సంతతిని దశార్హులని పిలిచేవారు. వీరి సంతతిలోవాడే శ్రీకృష్ణుడు. అందువల్ల ఇతడిని దశార్హుడని పేర్కొనబడింది.
– మహాభారతం

**దస్యులు :** భారతావనిలో ప్రాచీనకాలంలో నివసించిన ప్రజలు. ఆర్యులు యమునా నదీ తీరం వరకు కాబూల్ నుండి వచ్చే వరకు వీరి నాగరికత వుండేది. రుగ్వేదం వీరు ఆర్యులకంటే ఉన్నత నాగరికత అని, వీరు 100 పట్టణాలను పాలించారని, వీరిది చొట్టముక్కు అని చెప్తోంది. వీరు ఆర్యులకు ప్రధాన శత్రువులు. రుగ్వేదంలో ధుని, చుమూరి, పిప్రు, వర్చసు, శింబరులు దస్యులలో ప్రధాన రాజులని వీరు నలుపుజాతి అని చెప్తోంది. దీన్నిబట్టి దస్యులే ద్రావిడులని చెప్పవచ్చు. వీరు ఇంద్రుడ్ని పూజించేవారు కాదు.
– రుగ్వేదం

**దస్రులు :** మొదటి దేవుళ్లయిన దస్ర, నాసత్యుల్ని కలిపి అశ్వనీ దేవులని పిలిచేవారు. – మహాభారతం

**దహతి :** అంశ అనే దేవుడు స్కందదేవునికిచ్చిన సేవకుడు. ఇతడొక యోధుడు. – మహాభారతం

**దహదహుడు :** స్కందదేవుని సేవకుడు.
– మహాభారతం

**దహుడు 1 :** 11 మంది రుద్రులలో ఒకడు. బ్రహ్మ మనుమడు. స్థాణుడి కుమారుడు. – మహాభారతం

**దహుడు 2 :** స్కందదేవుని పరివారంలోని వాడు. – మహాభారతం

**దాక్షాయణి :** దక్షుని కుమార్తె. ఈ పేరు దక్షుడి కూతుర్లకు, మనుమరాళ్లకు కూడా ఉపయోగిస్తారు.

**దాక్షిణాత్యులు :** మహాభారత కాలంలో దక్షిణభారత ప్రజల్ని దాక్షిణాత్యులనేవారు. అప్పటి వారి రాజు భీష్మకుడు. – మహాభారతం

**దాతకచ్ఛ :** నర్మదానది తీరానగల ఒక దేశం. – కథాసరిత్సాగరం

**దానదారి :** ప్రాచీన భారతదేశంలో ఒక పట్టణం. – మహాభారతం

**దానవులు :** దనువు వల్ల ప్రజాపతికి జన్మించిన సంతానం. – చూ॥ దనువు

**దామగ్రంధి :** అజ్ఞాతవాస సమయంలో నకులుడు విరాటుని కొలువులో వున్నపుడు తాను పెట్టుకున్న పేరు. – మహాభారతం

**దామచంద్రుడు :** ఓ శక్తివంతుడైన వీరుడు. ఇతడు ధర్మజుని స్నేహితుడు. – మహాభారతం

**దామో :** ఓ రుషి. యుధిష్ఠురుని కొలువులో వుండేవాడు. హస్తినకు వచ్చినపుడు శ్రీకృష్ణుడినితడు కలుసుకున్నాడు. – మహాభారతం

**దామోదరుడు :** శ్రీకృష్ణుడు పిల్లవాడుగా వున్నపుడు యశోద ఇతడి అల్లరి భరించలేక ఓ రోలును ఇతని పొట్టకు కలిపి తాడుతో కడుతుంది. అతడుదాన్ని తెంచుకుని పారిపోతాడు. దామం అంటే తాడని, ఉదరం అంటే పొట్ట అని, పొట్టకుతాడు బిగించి వుంది కనుక దామోదరుడని పిల్చేవారు. – భాగవతం

**దామోషుడు :** ఒక రుషి. ఇతడొకసారి శ్రీకృష్ణుణ్ణి కలుస్తాడు. – భాగవతం

**దారకుడు :** ఓ బోయవాడు. పింగాక్షుడి పినతండ్రి. – కాశీమహాత్మ్యం

**దారదం :** ప్రాచీన భారతదేశంలోని ఓ ప్రాంతం. – మహాభారతం

**దార్వం 1 :** ప్రాచీన భారతావనిలో ఒక ప్రాంతం. – మహాభారతం

**దార్వం 2 :** క్షత్రియ ప్రజానీకంలో ఒక తెగ. వీరు ధర్మజుని అమూల్యధనంతో సత్కరిస్తారు. – మహాభారతం

**దార్వాది పౌరులు :** ఓ నిమ్నజాతి ప్రజలు. – మహాభారతం

**దారి :** ధృతరాష్ట్రుని కుటుంబంలో జన్మించిన సర్పం. జనమేజయుని సర్పయాగంలో బూడిదయ్యింది. – మహాభారతం

**దార్వి :** ప్రాచీన భారతదేశంలోని ఓ పట్టణం. – మహాభారతం

**దారుకవనం :** ఆర్యావర్తంలోని ఒక అరణ్యం. ఇచట మునులు తపస్సు చేసుకుంటారు. మునులిక్కడే శివుణ్ణి శపిస్తారు. శివలింగం ఇక్కడే ఆవిర్భవించింది. – బ్రహ్మపురాణం

**దారుకుడు 1 :** మహిషాసురుని రథసారధి. – చూ॥ ఘంటాకర్ణుడు

**దారుకుడు 2 :** గరుత్మంతుని కుమారుడు. – మహాభారతం

**దారుకుడు 3 :** శ్రీకృష్ణుని రథసారథి. ఇంత గొప్ప రథికులు చాల కొద్దిమందే వున్నారు. శ్రీకృష్ణుడు సాళ్వుడితో చేసిన యుద్ధంలో ఇతడు బాణాలతో మూయబడ్డాడు. మహాభారత సంగ్రామం శ్రీకృష్ణుని శంఖారావంతో మొదలుకాగానే ఇతడు రథంతో కృష్ణునివద్దకు వచ్చాడు. సాత్యకి కర్ణుడితో యుద్ధం చేసేప్పుడు సారధిగా ఇతని ప్రావీణ్యం అమోఘం. యాదవ నాశనం గురించి ఇతడు అర్జునునితో చెప్పి అతణ్ణి ద్వారకకు తీసుకువెళ్ళింది దారుకుడే. – మహాభారతం

**దారుణం :** ఓ నరకం. – చూ॥ నరకం

**దార్వుడు :** ద్వారమనే రాజ్యానికి రాజు. ఇదో కులమో ప్రాంతం పేరో తెలియదు. – మహాభారతం

**దాల్భ్యఘోషం :** దాల్భ్య అనే ఆశ్రమానికి మరో పేరు. – మహాభారతం

**దాల్భ్యం :** ఉత్తర భారతదేశంలో ఓ పుణ్యస్థలం. – మహాభారతం

**దాల్భ్యుడు :** నైమిశారణ్యంలోని ఒక మహర్షి. ఇతని నాయకత్వంలో మునులు ధనంకోసం ధృతరాష్ట్రుడ్ని

ఆశ్రయిస్తారు. రాజు ఇతడిని అవమానిస్తాడు. దాల్బ్యుడు ఇతని రాజ్యానికి అపకారం చేయదలచి హోమం చేయబోతాడు. రాజు శరణువేడడం వల్ల హోమాన్ని విరమిస్తాడు. - వామన పురాణం

**దాశ :** ప్రాచీన భారతావనిలో ఓ దేశం. - మహాభారతం

**దాశరాజు :** శంతనుని భార్య సత్యవతి. అమెను పెంచిన తండ్రి దాశరాజు. ఓ జాలరికి యమునా నదిలో దొరికిన కన్యను దాశరాజుకివ్వగా అతడామెను మత్స్యగంధి అను పేరుతో పెంచి పెద్ద చేస్తాడు. ఈమె పడవ నడుపుతుండగా శంతనుడు చూసి మోహించి వివాహమాడదలచి దాశరాజు నడగగా మత్స్యగంధికి పుట్టినవాడే కురు రాజు కావాలని షరతు విధిస్తాడు. శంతనుడు విచారగ్రస్థుడై వెళ్లిపోగా భీష్ముడు దాశరాజుకు తన అంగీకారాన్ని తెలియజేసి మత్స్యగంధి (సత్యవతి)ని తన తండ్రి వివాహ మాడ టానికి దోహదపడతాడు. - మహాభారతం

**దాశరాజ్ఞం :** ప్రాచీన కాలంలో జరిగిన మహారణం ఇది. అప్పటి ఈ దేశ మూలవాసులు కొందరు ఆర్యులు కలిసి పంచనదాల్లోవున్న ఆర్యులతో యుద్ధం చేసి ఆర్యుల్ని ఓడించారు. కాని ఆ తదుపరి ఈ మూలజాతులు ఆర్యులు కలసిపోయి కొత్త జాతి అదే హిందూజాతి ఏర్పడింది. - ఋగ్వేదం

**దాశార్ణం :** ప్రాచీన భారతావనిలో ఓ ప్రాచీన దేశం. నేటి పాట్నా చుట్టూవున్న ప్రాంతాలను తూర్పుదాశార్ణం అని మాళ్వ ప్రాంతాన్ని పశ్చిమ దాశర్ణం అని అంటారు. విదేశ నగరం దాశార్ణానికి ముఖ్య పట్టణం. ఇప్పటి భిల్సాపట్టణమే అది. పాండురాజు మొదట దీన్ని జయించాడు. మరోసారి భీమసేనుడు జయించాడు. నకులుడు మరోసారి జయించాడు. - మహాభారతం

సుధాముడను రాజు ఈ దేశాన్ని పాలించిన కాలంలో అతనికి ఇద్దరు కుమార్తెలు. విదర్భరాజు భీముడొక కుమార్తెను చేదిరాజు మరో కుమార్తెను వివాహ మాడారు. ఆ భీమరాజు కుమార్తె దమయంతి. ఆమెనే నలుడు వివాహమాడాడు. మహా భారత యుద్ధానికి ముందు ఈ దేశాన్ని హిరణ్యవర్మ పాలించాడు. ఇతని కుమార్తెను శిఖండి వివాహమా డాడు. దాశర్ణరాజు మహాభారత యుద్ధంలో కౌరవుల పక్షాన పోరాడాడు. అశ్వమేధ సమయంలో ఈ దేశాన్ని పాలిస్తున్న చిత్రాంగదుడ్ని అర్జునుడు జయించాడు. - మహాభారతం

**దాశార్హి :** దాశార్హి కుటుంబానికి చెందిన స్త్రీ. దృమాన్యుడి భార్య విజయ, వికంతన భార్య సుదేవ, కురుడి భార్య శుభాంగి, పాండు రాజు భార్య కుంతిని దాశార్హి అని పిలుస్తారు. - మహాభారతం

**దాశార్ణుడు :** దాశార్ణ దేశపు ప్రజల్ని, ఆ దేశపు రాజుని దాశార్ణులని, దాశార్ణుడని అంటారు. - మహాభారతం

**దాశావరుడు :** ఇతడో అసురుడు. వరుణుడి కొలువులో అతణ్ణి పూజిస్తుంటాడు. - మహాభారతం

**దశాశ్వమేధం :** కురుక్షేత్రంలో గల ఓ పవిత్రస్థలం. ఇక్కడ స్నానం చేస్తే 1000 గోదానాలు చేసిన ప్రతి ఫలం లభిస్తుంది. దీనిని దాశాశ్వమేధికం అని కూడా పిలుస్తారు. - మహాభారతం

**దాశాశ్వుడు :** ఇక్ష్వాకు రాజు 10వ కుమారుడు. మహిష్మతి నగరాన్ని పాలించాడు. ఇతనికి మదిరాశ్వుడను కుమారుడు కలడు. - మహాభారతం

**దాశూరుడు :** ఓ ఋషి

**దాశేరకం :** ఇదో ప్రాంతం పేరు. ఈ ప్రాంతానికి పశ్చిమ ప్రాంతంలో శ్రావణ ద్వాదశి పూజలు నిర్వహించి ఓ వైశ్యుడు స్వర్గం చేరాడు. - చూ॥ శ్రావణ ద్వాదశి

**దాశేరకులు :** ఓ క్షత్రియ తెగకు చెందిన ప్రజలు. - మహాభారతం

**దాసి :** భారతదేశంలోని ఓ ముఖ్యనది. - మహాభారతం

**దిక్కన్యలు :** బ్రహ్మ సృష్టిచేయ తలపోయుచుండగా అతని చెవినుండి పూర్వ, ఉత్తర, దక్షిణ మొదలగు దిక్కులు జన్మించి తమకు నిలుచుండుటకు స్థానమేదని బ్రహ్మ నడిగిరి. "ఇది బ్రహ్మాండము, మీ ఇచ్ఛ వచ్చిన చోట మీరు నిలుచుండుడు. మీ పతులను మీ వద్దకే పంపుదుమని ఇంద్రుడు మొదలగు దిక్పాలకులను వారి వద్దకు పంపెను. వారి పేర్లనుబట్టి పూర్వదిక్కు, ఉత్తర దిక్కు అనుపేర్లు వచ్చెను.

**దిక్పాలకులు :** చూ॥ అష్టదిక్పాలకులు

**దిక్కు :** ప్రాచీన భారతదేశంలో ఓ నది. ఈ నది నీటిని ప్రజలు సేవించేవారు. – *మహాభారతం*

**దిగ్గజాలు :** చూ॥ అష్టదిగ్గజాలు

**దితి :** దక్షప్రజాపతి కుమార్తెలలో ఒకరు. కశ్యప ప్రజాపతి భార్య. ఈమెకు జన్మించిన వారే దైత్యులు (అసురులు).

*దితి గర్భంలోని పిండాన్ని ఇంద్రుడు ముక్కలు చేసిన కథ :* క్షీరసాగర మదనంలో దితి యొక్క సంతతిని ఇంద్రుడు సంహరించగా ఆమె తన భర్త కశ్యపుడ్ని ప్రార్థించి తనకు ఇంద్రుణ్ణి జయించ గల పుత్రుడు జన్మించేట్లు వరం కోరగా 100 సంవత్సరాలు దీక్షతో దేవుడ్ని ప్రార్థిస్తే అలాంటి పుత్రుడు జన్మిస్తాడని చెప్తాడు. ఆమె అలాగే చేస్తుంది. 100 సంవత్సరాలు కావస్తుండగా ఇంద్రుడు విషయం తెలిసి ఆమె నిద్రిస్తుండగా ఆమె గర్భంలోని పిండాన్ని తన వజ్రాయుధంతో 7 ముక్కలుగా చేస్తాడు. వారు అరవబోగా 'మారుద్ర' అని గట్టిగా అరచి ప్రతి ముక్కను మళ్ళీ 7 ముక్కలు చేయగా మొత్తం 49 ముక్కలై 'మారుత్సులను' దేవతలుగా ఆవిర్భవించి ఇంద్రుని సహాయ కులవుతారు. – *హరివంశం*

*హిరణ్యకశిప, హిరణ్యాక్షుల జననం :* కశ్యపుని ఇతర భార్యలకు సంతానం వుండి తనకు లేక పోవడంవల్ల దైవభక్తిలో మునిగివున్న సమయంలో అతనితో సంగమం కోరుకుంది. ఇది రతి సమయం కాదని చెప్పినా ఆమె వినకుండుటచే అయిష్టంగానే అతడు రతి కార్యక్రమంలో పాల్గొనగా దానివల్ల బలాఢ్యులైన ఇద్దరు పుత్రులు జన్మిస్తారని వారు ముల్లోకాలను వణికిస్తారని మహా విష్ణువువల్ల వధింపబడతారని చెప్తాడు. వారే హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు. అయితే నీ మనుమడు విష్ణుభక్తుడు కాగలడని చెప్తాడు. అతడే ప్రహ్లాదుడు. – *భాగవతం*

**దిలీపాశ్రమం :** ఓ పవిత్ర స్థలం. కాశీరాజు కుమార్తె అంబ తపస్సు చేసినదిక్కడే. – *మహాభారతం*

**దిలీపుడు 1 :** ఇక్ష్వాకు వంశంలో జన్మించిన ప్రసిద్ధ రాజుల్లో ఒకడు. ఇతడి కాలంలో రాజ్యం సుభి క్షంగా వున్నా ఇతడు సంతానలేమితో బాధపడుతూ తమ కులగురువైన వసిష్ఠుడ్ని కారణమడగ్గా అతడు తన దివ్యదృష్టితో జరిగింది గ్రహించి కారణం వివరించాడు. ఇంద్రుని చూడటానికి వెళ్లి తిరిగి వస్తూ కల్పవృక్షం క్రిందవున్న కామధేనువును గమనించలేదు. కామధేనువు తనపట్ల అగౌరవంగా భావించి తన కూతురు నందినినైనా దిలీపుడు పూజిస్తే తప్ప సంతానం కలుగదని శపించింది. రధికుడికి గాని దిలీపుడికి గాని విషయం తెలియలేదు. కామ ధేనువు ఓ యజ్ఞం కొరకు పాతాళానికి వెళ్లింది కనుక నందినిని పూజించాలని దిలీపుడు తలచాడు. దిలీపుడు, అతని భార్య నందిని వెనుకే వుంటూ 21 రోజులు దాన్ని పూజించారు. ఒకరోజు అనుకోకుండా అది ఓ గుహలోకి వెళ్లగా దానివెంట దిలీపుడు వెళ్లాడు. అక్కడో సింహం నందినిని చంపబోగా దిలీపుడు విల్లుఎక్కుపెట్టగా చేతులు కదలలేదు. సింహం ఇది తన ఆహారమని కనుక నీవు రక్షించడానికి వీల్లేదని చెప్పగా తనను భుజించి నందినిని విడువమని ప్రార్థిస్తాడు. సింహం మాయమై నందినిని, నిన్ను పరీక్షించడానికి నేనే ఈ నాటకం ఆడాను. అతనితో పాటు నందిని తన ఆశ్రమానికి వచ్చి దిలీపుడ్ని అతడికి సంతానం కలిగేటట్లు వరమిస్తుంది. వీరికి కల్గిన పుత్రుడే ప్రసిద్ధి గాంచిన రఘువు. ఇక్కడి నుండే ఈ వంశానికి రఘు వంశమని పేరు వచ్చింది.

*వీరసేనుని కథ :* వీరసేనుడను రాక్షసుడు వైశ్రావణుడిపై పడగా అతడు శివుడ్ని ప్రార్థిం చాడు. శివుడు అతణ్ణి జయించలేక విష్ణువు దగ్గరకు వెళ్లమంటాడు. విష్ణువు కూడా జయించ లేక దిలీపుడి సహాయం తీసుకొమ్మంటాడు. దిలీపుడు అలకాపురికి వెళ్ళి వీరసేనుడితో యుద్ధం చేస్తాడు. ఇతడు వదలిన బాణాలకు వీరసేనుడి శరీరం నుండి రక్తపు చుక్కలు పడి అవి మరో వీరసేనుడిగా ప్రత్యక్షమవుతుంటే అందరూ దిలీపుడితో యుద్ధం చేశారు. అప్పుడు దిలీపుడు రక్తేశ్వరిని ప్రార్థించగా ఆమెపడిన రక్తాన్నంతా తాగివేయగా దిలీపుడు వీరసేనుడ్ని చంపాడు. – *కంభ రామాయణం*

**దిలీపుడు 2 :** కశ్యపుని కుటుంబంలో జన్మించిన సర్పం. – *మహాభారతం*

**దివఃపుత్రుడు :** సూర్యుని రూపంలో జన్మించిన 12 మంది సూర్యుల్లో ఒకడు. – *మహాభారతం*

**దివాకరుడు 1 :** సూర్యుని మరోపేరు.

**దివాకరుడు 2 :** గరుత్మంతుని కుమారుడు

**దివాకరుడు 3 :** చూ॥ నిశాకరుడు

**దివాకరుడు 4 :** ఓ రాజు. ఈ రాజు కాలంలోనే మత్స్యపురాణం రచించబడింది.

**దివిరథుడు 1 :** భరతుని వంశంలోని ఓ రాజు. భరతుని మనుమడు. భూమన్యుని కుమారుడు. – మహాభారతం

**దివిరథుడు 2 :** ఓ రాజు. దధివాహనుడి కుమారుడు. పరశురాముడు క్షత్రియుల్ని వధించే సమయంలో దివిరథుడి ఓ కుమారుణ్ణి గౌతమమహర్షి ఆశ్రయ మిచ్చి రక్షించాడు. – మహాభారతం

**దివోదాసు :** ఇతడ్ని అతిథిగ్యుడు అనికూడా అంటారు. ఇతడు కాశీరాజు. విష్ణు అంశతో జన్మించిన వంశం లోని వాడు. దివోదాసు ముత్తాత తండ్రి కాశుడు. అతడి నుండి వారణాశిని వీరే పాలించిరి కనుక కాశీరాజ్యమని పేరొచ్చింది.

*దివోదాసు పరిపాలన కాలం :* దివోదాసు రాజ్య పాలన మొదలు కాగానే క్షేమకుడను రాక్షసుడ్ని వధించి రాజ్యాన్ని విస్తృత పరచాడు. భద్రశ్రేణ్యుడను రాజు దివోదాసుపై దండెత్తగా అతని 100 మంది పుత్రుల్ని జయించాడు. ఆ సమయంలోనే కుంభకుడను ముని వారణాసి వచ్చాడు. సాయంత్రానికి ఎక్కడికి చేరితే అక్కడే వుండిపోవడం అతని ఆచారం. అలా కుంభ కుడు వారణాసిలో 100 సంవత్సరాలు వుండి పోయాడు. ఆ సమయంలో వారణాసిలో కరువుకాట కాలు ఏర్పడ్డాయి. కుంభకుడి ఆశ్రమం చుట్టూ మాత్రం పచ్చటి పొలాలు పంటలు పండుతున్నాయి. వారణాసి ప్రజలు వారి ఆవుల్నికూడా అక్కడ మేపుకొని వెళ్లేవారు. ఒకరోజు వారి పశువులతో పాటు కుంభకుడు పూజించే గోవుని కూడా తోలు కెళ్లారు. కుంభకుడు అంతా వెదికి తన దివ్యదృష్టితో గ్రహించి వారణాసి నశించునట్లు శపించి అచట నుండి వెళ్లిపోయాడు.

*హరివంశం చెప్పే వారణాసి నాశనం :* శివుడు హిమ వంతుని కూతురు పార్వతిని వివాహమాడి అతని ఇంటే వుండేవాడు. కైలాసాన్ని పట్టించుకోలేదు. లోక సంచారిగా తిరిగేవాడు. ఇది దేవతలు పార్వతి యొక్క తల్లికి నివేదించగా ఆమె పార్వతి వద్ద శివుడ్ని తిరుగు బోతని తలదాచుకొనే నీడలేనివాడని నిందించగా పార్వతి శివుడ్ని సొంత స్థలం కావాలని కోరగా కాశీని తన నివాస స్థలంగా ఎంచుకొని ముందుదాన్ని నాశనం చేయడానికి కుంభకుడను రుషిని పంపాడు. కుంభ కుడు శివుడు తనకు ఆదేశించిన పని ఓ కర్ణకుడనే మంగలికి చెప్పగా అతడు మరునాటికి ఓ గుడి కట్టిం చగా కుంభకుడు అక్కడేవుండి అందరికి తన ఆశీర్వచ నాలు ఇచ్చేవాడు. సంతానంలేని దివోదాసు తన భార్యను ఈ రుషి వద్దకు ఎన్నోసార్లు పంపినా సంతాన ప్రాప్తి కల్గలేదు. చివరకు దివోదాసు వచ్చి తన భార్యకు అతని అనుగ్రహం ఇవ్వనందుకు దూషించగా కుంభ కుడు కాశీనగరం నశిస్తుందని శపించాడు. ఆ తర్వాత శివ పార్వతులు వచ్చి కాశీలో స్థిరపడ్డారు. దివోదాసు చివరి రోజుల్లో రాజర్షిగా మారాడు. ఇతడు 200 శ్యామవర్ణాశ్వాలను ఇచ్చి మాధవిని కొనుక్కొని ఆమె ద్వారా ఓ పుత్రుడ్ని పొందాడు. ఇతడు యముని కొలువులో సభ్యుడు.

**దివ్యకటకం :** పశ్చిమ భారతదేశంలోని ఓ నగరం. దీన్ని నకులుడు జయించాడు. – మహాభారతం

**దివ్యకర్మకృతుడు :** ఓ విశ్వదేవుడు. – మహాభారతం

**దివ్యవర్షం :** మానవులకు 365 రోజులు ఓ సంవ త్సరం. మానవుల ఓ సంవత్సరం దేవతలకు ఒక రోజు. అంటే 365 రోజులు ఓ దివ్యవర్షం లేక సంవత్సరం. – చూ॥ కాలమానం.

**దివ్యశానుడు :** ఓ విశ్వదేవుడు. – మహాభారతం

**దివ్యాదేవి :** దివోదాసు కుమార్తె. ఇతడు ప్లక్ష ద్వీపరాజు. ఇతడు తన కుమార్తె దివ్యాదేవిని రూపదేశ రాజైన చిత్రసేనుడికిచ్చి వివాహం తలపెట్టగా ముహూర్తపు రోజుకి ముందే అతడు అకాల మరణం చెందాడు. బ్రాహ్మణుల సలహాపై అదే ముహూర్తానికి రూపసేను డికిచ్చి వివాహం చెయ్యగా వెంటనే అతడు మరణిం చాడు. ఆ తర్వాత 21 మందితో ఆమెకు వివాహం చేయగా అందరూ అలాగే మరణించారు. ఆమెపై జాలితో మంత్రుల సలహాపై స్వయంవరం ప్రకటిం చగా దానికి వచ్చిన రాజులు ఒకరితో ఒకరు పోరాడు కుని చనిపోగా రాజు విరక్తిచెంది దేశాన్ని వదలి తపస్సు చేసుకోవడానికి అరణ్యాలకు వెళ్లాడు. ఉజ్వ

లుడను శకుడు ఇది చూసి జాలితో ఆమెను 'అశ ఊన్యశయన' వ్రతం చెయ్యమనగా ఆమె నాల్గు సంవత్సరాలు ఆ వ్రతం చెయ్యగా మహావిష్ణువు ప్రత్యక్షమై తనతోబాటు ఆమెను వైకుంఠానికి తీసుకువెళ్లాడు. – పద్మపురాణం

**దివ్యుడు :** యదువంశంవాడు. సాత్వతుడి కొడుకు. – భాగవతం

**దిశాచక్షువు :** గరుడుని సంతతిలో ప్రముఖుడు. – మహాభారతం

**దిషణ :** హవిర్ధానుడి భార్య. ప్రాచీన బర్హి, శుక్లుడు మొదలైన వారీమె కొడుకులు – బ్రహ్మపురాణం

**దిష్యంతుడు :** దుష్యంతుని సోదరుడు.

**దిష్టుడు :** ఇక్ష్వాకు రాజు తమ్ముడు.

**దీననాథుడు :** ద్వాపర యుగంలోని ఒక రాజు. సంతానం లేక గాలవుణ్ణి సంప్రదించగా వర్చస్సు కల్గిన బాలుణ్ణి బలిఇస్తే సంతాన ప్రాప్తికల్గుతుందని సలహా ఇస్తాడు. రాజభటులు దేశమంతా వెదకి కృష్ణదేవుడి రెండో కొడుకుని పట్టుకుపోబోగా విశ్వామిత్రుడు వారిని అడ్డగించి విషయం తెలుసుకొని వారితోపాటు రాజువద్దకు వెళ్లి నరబలి లేకుండానే యాగఫలితంగా సంతానప్రాప్తి కలిగేట్లు చేస్తానని చెప్పి ఆ బాలుణ్ణి విడిపిస్తాడు. – పద్మపురాణం

**దీపకర్ణి :** ఇతడొక రాజు. ఇతని భార్య శక్తిమతి. ఈమె పాముకాటుకు మరణిస్తుంది. ఇతడు బ్రహ్మచర్యం స్వీకరిస్తాడు. అయితే పిల్లలు లేరనే బాధ వేదిస్తుండగా శివుడు ప్రత్యక్షమై నీవు అరణ్యంలో వేటలో వుండగా నీకో బాలుడు లభిస్తాడు. అతణ్ణి నీ పుత్రుడుగా పెంచమని చెప్తాడు.

తన కల నిజమవుతుందని తలుస్తూ అరణ్యంలో తిరుగుతుండగా ఓ సింహంపై ఎక్కి కూర్చున్న బాలుడు కన్పిస్తాడు. తన బాణంతో ఆ సింహాన్ని వధించగా ఆ సింహం తన నిజరూపాన్ని పొంది తానొక యక్షుణ్ణని గాంధర్వ పద్ధతిలో ఓ రుషి కుమార్తెను వివాహమాడగా రుషులు తనను తన భార్యను సింహాలుగా మారమని శపించారని, ఆ సమయంలో గర్భిణియైన నా భార్య ఈ బాలుణ్ణి ప్రసవించిందని నీ శరాఘాతంతో మాకు శాప విమోచనం కలిగిందని అదృశ్యమవుతాడు. రాజు ఆ బాలుణ్ణి తెచ్చి పెంచుకొని అతడికి తన రాజ్యాన్నిస్తాడు. సింహవాహనంపై దొరికాడు గనుక శాతవాహనుడని పేరొచ్చింది. – కథాసరిత్సాగరం

**దీప్త :** ఉత్తముడను మనువు కుమారుడు. ఉత్తముడు మూడవ మనువు. అతని కుమారులు అజ, పరాశు, దీప్త.

**దీప్తకేతువు :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. – మహాభారతం

**దీప్తరోముడు :** ఓ విశ్వదేవుడు. – మహాభారతం

**దీప్తాక్షం :** ఓ క్షత్రియజాతి. ఈ వంశంలోనే ప్రసిద్ధి చెందిన పురూరవసుడు జన్మించాడు. – మహాభారతం

**దీప్తి :** ఓ విశ్వదేవుడు. – మహాభారతం

**దీప్తుడు :** చూ॥ దీప్త

**దీర్ఘకర్ణ :** ఓ కుందేలు. నీచ ప్రవృత్తి కలవారిని నమ్మితే జరిగే అపాయాలను గురించి చెప్పే పంచతంత్ర కథలో ఓ పాత్ర. – పంచతంత్రం

**దీర్ఘజంగుడు :** ఓ యక్షుడు. పుష్పదత్తుని పెద్దన్న. – కథాసరిత్సాగరం

**దీర్ఘ జిహ్వుడు :** దనువువల్ల కశ్యపునికి జన్మించిన దానవుడు. – మహాభారతం

**దీర్ఘతపసు :** చూ॥ పుణ్య.

**దీర్ఘతపసుడు 1 :** ధన్వంతరి తండ్రి. – చూ॥ ధన్వంతరి

**దీర్ఘతపసుడు 2 :** చూ॥ పుణ్య

★**దీర్ఘతమసుడు :** బ్రహ్మ తనయుడయిన అంగిరసుడికి ఇద్దరు కుమారులు. ఒకరు ఉతథ్యుడు రెండోవాడు బృహస్పతి. ఉతథ్యుడు ఇంటలేని సమయంలో బృహస్పతి ఉతథ్యుని భార్య మమతను కామిస్తాడు. నీ సోదరుని బిడ్డ కడుపులో వున్నాడని, అత్యంత శక్తివంతమైన వీర్యం లోనుండగా నీ వీర్యం కూడా వెళ్తే ప్రమాదమని ఆమె ప్రాధేయపడినా అతడు వినకుండా రతిలో పాల్గొనగా అతని వీర్యం గర్భంలోకి ప్రవేశించగనే గర్భంలోని శిశువు ఈ వీర్యాన్ని బయటకు తన్నగా

★ బృహస్పతి మమతను కలసిన తర్వాత జన్మించిన వాడు భరద్వాజుడని భాగవత పురాణం చెప్తుండగా దీర్ఘతమసుడని మహాభారతం చెప్తోంది.

బృహస్పతి కోపంతో పుట్టుగుడ్డిగా జన్మించమని శపిస్తాడు. ఈ పుట్టిన బిడ్డే దీర్ఘతమసుడు.

– మహాభారతం

*కుటుంబ జీవనం :* ఇతడు బృహస్పతి అంతటి శక్తివంతుడు. ప్రద్వేశి అనే బ్రాహ్మణిని వివాహ మాడగా చాలామంది పిల్లలు జన్మించారు. అందులో ముఖ్యుడు గౌతముడు. ఆ తర్వాత ఇతడు తప్పుడు పనులకు పాల్పడటం వల్ల ఇతణ్ణి భార్య తన పిల్లల సహాయంతో ఓ చిన్న పడవలో ఎక్కించి నదిలోకి తోసేసింది. ఆ నదిలో వెళ్తున్న దీర్ఘ తమసుడిని గుర్తించి బలి అనే రాజు ఒడ్డుకు చేర్చి తనకు పుత్రబిక్ష పెట్టమని తన భార్య సుధేష్ణను అతని వద్దకు పంపగా ఆమె తాను తప్పుకొని తన సేవికను పంపుతుంది. అతనివల్ల ఆమెకు కాక్షివాణుడు మరి పదిమంది పండితులు జన్మించారు. రాజు మరల రాణి సుధేష్ణను పంపగా అతడామెను స్పృశించి ఆశీర్వదించగా 5 గురు ప్రజ్ఞావంతులైన పుత్రులు జన్మిస్తారు. వారు అంగ, వంగ, కళింగ, పుండ్ర శృంగులు. వారు 5 రాజ్యాలను స్థాపించారు. అవి వారి పేరుతో ప్రసిద్ధి చెందాయి. – మహాభారతం

**దీర్ఘదర్శి :** ఇదొక చేప. ఇది మరో రెండు చేపలు ప్రాప్తకాలజ్ఞుడు, దీర్గసూత్రుడు ఓ మడుగులో వుండేవి. వేసవిలో జాలర్లవల్ల ప్రమాదం వుంటుందని దీర్ఘదర్శి చెప్పగా ఎప్పుడో వచ్చే ఆపదలకు ఇప్పుడు దిగులెందుకంటాయి తక్కిన రెండుచేపలు. దీర్ఘ దర్శి వేరే చెరువుకి వెళ్లగా తక్కిన రెండూ ఆ మడుగులోనే వుంటాయి. జాలర్లు చేపలు పట్టుకొని తాడుకు గుచ్చుతున్నారు. ప్రాప్తకాలజ్ఞుడు తానే వెళ్లి తాడుని పట్టుకోగా దీర్ఘసూత్రుడు వారికి పట్టుబడతాడు. ప్రాప్తకాలజ్ఞుడు మెల్లగా తప్పించుకొని మళ్లీ నీళ్లలోకి వెళ్తాడు.

– మహాభారతం

**దీర్ఘప్రజ్ఞుడు :** ఒక క్షత్రియరాజు. వృషపర్వుడి వంశంలోనివాడు. కురుక్షేత్ర యుద్ధ సమయంలో ఇతణ్ణి పాండవులు ఆహ్వానిస్తారు. – మహాభారతం

**దీర్ఘబాహుడు 1 :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. కురుక్షేత్రంలో భీమసేనుడు ఇతణ్ణి వధించాడు.

– మహాభారతం

**దీర్ఘబాహుడు 2 :** ఓ ప్రసిద్ధ రాజు. ఇతన్ని గురించి పురాణకథల్లో వైరుధ్యాలున్నాయి.

**దీర్ఘయజ్ఞుడు :** అయోధ్యరాజు. భీమసేనుడు తన సంభాషణలతో తనవైపుకు మరల్చుకున్నాడు.

– మహాభారతం

**దీర్ఘరోముడు :** దీర్ఘలోచనుడు అనీ అంటారు. కౌరవుల్లో ఒకడు. కురుక్షేత్ర యుద్ధంలో భీముడితడ్ని వధించాడు.

– మహాభారతం

**దీర్ఘలోచనుడు :** 100 మంది కౌరవులలో ఒకడు.

– మహాభారతం

**దీర్ఘశ్రవసుడు :** దీర్ఘతమసుని కుమారుడు.

– ఋగ్వేదం

**దీర్ఘసత్రం :** ఓ పుణ్యస్థలం. ఈ స్థలాన్ని దర్శించిన వారికి అశ్వమేధయాగం, రాజసూయయాగం చేసిన ప్రతిఫలం లభిస్తుంది. – మహాభారతం

**దీర్ఘసూత్రుడు :** చూ॥ దీర్ఘదర్శి

**దీర్ఘాయుషుడు :** గ్రుతాయుషు సోదరుడు. కళింగ రాజు. అర్జునుడు కురుక్షేత్ర యుద్ధంలో ఇతణ్ణి వధించాడు.

**దీర్ఘిక :** విశ్వకర్మ కుమార్తె. ఈమె అసాధారణ పొడవును చూసి శాస్త్రాలు అలాంటి స్త్రీని వివాహ మాడినవాడు 6 నెలలలో చనిపోతాడని చెప్తుండటం వల్ల ఎవరూ ఆమెను వివాహమాడ లేదు. ఈమె మంచి భర్తకోసం దీర్ఘ తపస్సుచేసి ముసలితనం కూడా వచ్చింది. ఆ సమయంలో అనారోగ్య వంతుడు ముసలివాడైన వాడు కొన్ని షరతులతో ఆమెను వివాహమాడాడు. ఒకసారి అతని కోర్కెపై ఆమె తన భుజాలపై ఎక్కించుకొని దూరప్రయాణం సాగించారు. మాండవ్యుడు ఇతణ్ణి శపించినా ఈమె పాతివ్రత్యంవల్ల శాపం ఫలించలేదు. శాండిలి, దీర్ఘిక కథలు ఒకేలా వుండ టంవల్ల ఇద్దరూ ఒకరే కావొచ్చును.

**దీర్ఘుడు :** మగధ రాజు. పాండురాజితణ్ణి వధిస్తాడు.

– మహాభారతం

**దురాధరుడు :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. ఇతణ్ణి కురుక్షేత్ర యుద్ధంలో భీముడు వధించాడు. ఇతణ్ణి దురాధారుడు అనికూడా అంటారు.

– మహాభారతం

**దురాశదుడు :** బాణాసురుని కుమారుడు. శివుడి నుండి పంచాక్షరి విద్య నేర్చుకున్నాడు. దానిని మరల పఠిస్తూ

వుండగా శివుడు వరాలిచ్చాడు. దానితో ప్రతివారిని హింసించడం ప్రారంభించాడు. ప్రపంచంలో అశాంతి పెరగటంతో శక్తి కుమారుడైన ధుండి ఇతణ్ణి సంహరించాడు. – *గణేశ పురాణం*

**దురితక్షయుడు :** మహావీర్యుడను రాజు కుమారుడు. దురితక్షయుడికి ముగ్గురు కుమారులు. వారు త్రయ్యారుణి, కవి, పుష్కరారుణి – *భాగవతం*

**దుర్గజం :** ప్రాచీన భారతదేశంలో ఓ నగరం. – *మహాభారతం*

**దుర్గ 1 :** లోకానికి దేవత. ఎన్నోరూపాలు ఎన్నో గుణాలు. శివుని భార్య పార్వతి దుర్గ అంశే. భక్తుల ప్రార్థనలను బట్టి ఈ దేవి 64 రూపాలలో వుంది. దక్షిణ భారత దేశంలో ఎన్నో రౌద్రరూపాల్లోను కన్య, కామాక్షి, ముకాంబిక వంటి శాంత స్వరూపిణిగాను దర్శనమిస్తుంది. కేరళలో భగవతి, ఆంధ్రలో జోకులాంబిక, తమిళనాడులో కణ్ణకి అనునవి దేవి రూపాలే. దేవీ పూజ భారతదేశంలో 4000 సంవత్సరాల నుండి జరుగుతోంది. ఆధునిక భారతదేశంలో రామకృష్ణ పరమహంస దుర్గాదేవి పరమభక్తుడు. మహాభారత సమయంలో కూడా దుర్గాదేవి పూజవుంది. విరాటుని కొలువులో అజ్ఞాతంలో వుండేముందు పాండవులు దుర్గాదేవిని పూజిస్తారు. కురుక్షేత్ర యుద్ధానికి ముందు శ్రీకృష్ణుడు అర్జునుడ్ని దుర్గాదేవిని పూజించ మంటాడు.

**దుర్గ 2 :** ప్రాచీన భారతదేశంలో ఒక నది. పాండవులు ఈ నది నీటిని తాగారు. – *మహాభారతం*

**దుర్గముడు :** హిరణ్యాక్షుని వంశంలోని ఓ రాక్షస రాజు. తరుని కుమారుడు. పుట్టినప్పటి నుండి దేవతలకు వ్యతిరేకే. అయితే దేవతల బలమంతా వేదాలలో వుందని వేదాలు లేకుంటే యజ్ఞాలు లేవని యజ్ఞమే లేకుంటే వారికి యజ్ఞఫలంలో భాగం వుండదని నమ్మి ఆహారం, నీళ్ళు మాని హిమాలయాలకు వెళ్లి బ్రహ్మను గూర్చి ఘోర తపస్సు చేసి వరంగా వేదాలను, బ్రాహ్మణులకు తెలిసిన మంత్రాలు, మంత్రాలకు సంబంధించిన గణాలు కావాలని, దేవతల్ని అందర్నీ ఓడించే బలం కావాలని కోరగా బ్రహ్మ అనుగ్రహించాడు. దేవతలకు ముసలితనం వచ్చింది. యజ్ఞాలు లేవు హోమాలు లేవు. దుర్గముడు దేవతల్ని దేవలోకం నుండి పారద్రోలగా గుహల్లో దాక్కున్నారు. 100 సంవత్సరాల్లో లోకం నాశనమయ్యింది. బ్రాహ్మణులు హిమాలయాలలోని జగదాంబిక వద్దకు వెళ్ళి తమ బాధల గాథలు కన్నీటితో చెప్పుకోగా అంబికకు కన్నీళ్ళు వచ్చాయి, దానితో నీటి కొరత పోయింది. అంబిక వారికి కూరగాయ లిచ్చింది. అందుకే ఆమెను శాకాంబరి అంటారు. ఆమె కంటినుండి నీరు కారడం వల్ల ఆమెను శాతాక్షి అని పిలిచేవారు. వీటిని గురించి విన్న దుర్గముడు దేవిపై దండెత్తాడు. దేవి శరీరాన్నుండి ఎన్నో శక్తులు ఆవిర్భవించాయి. ధరణి, బాల, త్రిపుర, భైరవి, కాళి ఒక్కొక్కరు 10,000 చేతులతో దుర్గముడితో యుద్ధం చేయగా అతని సైన్యం నశించింది. చివరికి దేవి స్వయంగా ఒకేసారి 15 బాణాలను అతనిపై సంధించగా అతడు మరణించాడు. – దేవీభాగవతం

**దుర్గశైలం :** శాఖా ద్వీపంలోని ఓ పర్వతం. – *మహాభారతం*

**దుర్గం :** కోట అని అర్థం. ఆరు రకాల కోట లున్నాయి. 1. మరుదుర్గం, 2. జలదుర్గం, 3. పృథ్వీదుర్గం, 4. వన దుర్గం, 5. పర్వత దుర్గం. 6. మానుష్య దుర్గం. అన్నింటిలోను మానుష్య దుర్గమే ముఖ్యమైనది. – *మహాభారతం*

**దుర్జయ 1 :** దనువు కుమార్తె. – *మహాభారతం*

**దుర్జయ 2 :** దుర్జయమణిమతి నగరానికి సంక్షిప్త నామం. కొందరు పండితులు ఎల్లోరా గుహల్ని దుర్జయ అని చెప్తారు. మహాభారత కాలంలో గొప్ప ప్రసిద్ధి చెందిన నగరం. – *మహాభారతం*

**దుర్జయుడు 1 :** ఓ క్రూరమైన రాజు. ఇతడు చేసిన పాపాలకు కాల ఇతడిని 21 సార్లు జంతువుగా బ్రహ్మరాక్షసిగా పునర్జన్మలెత్తమని శపించాడు. అతడు బ్రహ్మరాక్షసిగా అడవిలో సంచరిస్తూ మహాదేవుడను శివయోగిని పట్టుకున్నాడు. ఆ శివయోగి శరీరానికి వున్న బూడిదను బ్రహ్మ రాక్షసి తన శరీరానికి పూసుకోగా తన నిజరూపం వచ్చి స్వర్గానికి వెళ్లాడు. – *శివపురాణం*

**దుర్జయుడు 2 :** కశ్యప ప్రజాపతికి దనువు వల్ల జన్మించిన దానవుడు. – *మహాభారతం*

**దుర్జయుడు 3 :** దష్పరాజయుడని అంటారు. ధృత రాష్ట్రుని 100 కుమారుల్లో ఒకడు. – మహాభారతం

**దుర్జయుడు 4 :** ఒక రాజు. ద్రుపదుడు ఇతణ్ణి యుద్ధానికి ఆహ్వానించమని పాండవులకు సలహా ఇచ్చాడు. – మహాభారతం

**దుర్జయుడు 5 :** ఇక్ష్వాకు వంశంలోని ఓ రాజు. సువీరుని కుమారుడు. – మహాభారతం

**దుర్జయుడు 6 :** మహావిష్ణువు మరోపేరు. – మహాభారతం

**దుర్జయుడు 7 :** సుప్రతికుని కుమారుడు. ఓ గొప్ప వీరుడు. ఇతడెన్నో రాజ్యాలను జయించాడు. ప్రసిద్ధ చింతామణి వజ్రం గౌరముఖమునివద్ద వుందని తెలిసి అతనివద్దకు వెళ్లి పోరాడి మరణిస్తాడు. అతడు చనిపోయిన ప్రాంతానికి తర్వాతి కాలంలో నైమిశారణ్యం అని పేరొచ్చింది. – వరాహపురాణం

**దుర్జయుడు 8 :** కార్తవీర్యార్జునుడి సంతతివాడు. ఊర్వశిని మోహిస్తాడు. భార్య ప్రేరణవల్ల కణ్వాశ్రమానికి వెళ్లివస్తూ తను ఊర్వశికిచ్చిన హారం గంధర్వుడి దగ్గర వుండటం చూసి దాన్ని లాక్కొని ఊర్వశిని కూడా తనతో రమ్మనగా కణ్వుడికి భయపడి ఆమె రాదు. బలవంతం చేయబోగా ఆమె రోమమయదేహ, పింగళ నేత్రాలు చూపగా విరక్తుడై వెళ్లిపోతాడు. – భవిష్యపురాణం

**దుర్దముడు 1 :** ఇతడో గంధర్వుడు. పేరు విశ్వవసుడు. ఒకసారి వసిష్ఠుడు, అత్రిలాంటి మహర్షులు కైలాసంలో శివుడ్ని పూజిస్తుండగా ఇతడు తన 1000 మంది భార్యలతో నగ్నంగా కొలనులో స్నానం చేస్తూ క్రీడా వినోదంలో మునిగాడు. ఇది చూసిన వసిష్ఠుడు రాక్షసుడివి కమ్మని శపించాడు. అతడు ప్రాధేయపడగా 17 సంవత్సరాల తర్వాత శాపవిమోచనం కల్గుతుందని వశిష్ఠుడు శాపవి మోచనం చేస్తాడు. 17 ఏళ్ల తర్వాత రాక్షసుడిగా గాలవుడ్ని బాధించగా మహావిష్ణువు సుదర్శనచక్రం ఇతణ్ణి ఖండించగా నిజరూపం ప్రాప్తిస్తుంది. – స్కందపురాణం

**దుర్దముడు 2 :** ఇతడొక రాజు. ఇతడొకనాడు ప్రముఖుడను ముని ఆశ్రమమునకు బోయి అతని గానక అతని కుమార్తె అయిన రేవతీకన్యను ప్రియా! ముని ఎచ్చటికేగెనని అడిగెను. ముని బయటకు వచ్చి ప్రియా అని పిలిచావు, నా కుమార్తెను నీకిచ్చి వివాహము చేసెదను ఓ వరము కోరుకొమ్మనగా నాకు మనువు కాగల పుత్రుడు జన్మింపవలెననెను. రేవతియందు దుర్దముడికి పుట్టిన రైవతుడు మనువయ్యెను. – మార్కండేయ పురాణం

**దుర్దమ్నుడు :** ఓ బోయవాడు. యుధాజిత్తుతో భారద్వాజ ఆశ్రమానికి వెళ్లాడు. – దేవీభాగవతం

**దుర్ధర్షుడు :** ధృతరాష్ట్రుని కుమారుడు. – మహాభారతం

**దుర్మర్షణుడు 1 :** ధృతరాష్ట్రుని 100 మంది సంతానంలో ఒకడు. కురుక్షేత్రంలో ఇతడి గజసేనను అర్జునుడు నాశనం చేస్తాడు. సాత్యకి గాయపరుస్తాడు. చివరికి భీమసేనుడు వధిస్తాడు. – మహాభారతం

**దుర్మర్షణుడు 2 :** సృంజయుడి కుమారుడు. – భాగవతం

**దుర్మర్షణుడు 3 :** ఒక రాజు. సత్యరథుణ్ణి ఓడించి అతని రాజ్యం గెల్చుకుంటాడు. సత్యరథుడి కొడుకు ధర్మగుప్తుడితణ్ని చంపి తిరిగి రాజ్యం పొందుతాడు. – బ్రహ్మపురాణం

**దుర్గాపూజ :** చూ॥ నవరాత్రులు.

**దుర్ముఖి :** అజముఖి అను రాక్షస స్త్రీ సహచరి. – *చూ॥ అజముఖి.*

**దుర్ముఖుడు :** రావణుని మంత్రులలో ఒకడు. రాముడితో యుద్ధము చేయుటయే ఉచితమని సలహా ఇచ్చెను. – రామాయణం

**దుర్యోధనుడు 1 :** మహాభారత ప్రతినాయకుడు. కౌరవాగ్రజుడు. వ్యాసకటాక్షమున శంతనుని కోడళ్లైన అంబిక, అంబాలికలకు ధృతరాష్ట్రుడు, పాండురాజు జన్మించగా వారి దాసికి విదురుడు జన్మించెను.

పుట్టు అంధుడైన ధృతరాష్ట్రుడు గాంధార రాజ కుమార్తె గాంధారిని వివాహమాడెను. ఒకసారి వ్యాసుడు రాగా అతనిని గాంధారి పూజింపగా 100 మంది కుమారులు జన్మిస్తారని ఆశీర్వదిస్తాడు. గర్భిణి అయి సంవత్సరం దాటినా ప్రసవించకుండుటచే ఆమె తన గర్భమును బాదు కొనగా శిశువులు కాక ఓ మాంసపు ముద్దజన్మించెను. వ్యాసుని సంప్రదించగా ఆ ముద్దను

100 ముక్కలు చేసి నేతితో నింపిన 100 కుండలలో వుంచి మిగిలిన చిన్న చిన్న ముక్కల్ని 101వ కుండలో వుంచారు. ఆ కుండల నుండి 100 మంది పుత్రులు, 101వ కుండ నుండి పుత్రిక జన్మించారు. వీరిలో పెద్దవాడు దుర్యోధనుడు. కూతురు దుస్సల.

దుశ్శకునాలు : ఇతడు పుట్టగానే గాడిదలా అరుస్తాడు. ఆ అరుపులకు చుట్టుపక్కల గాడిదలు అరుస్తాయి. తోడేళ్ల అరుపులు రాబందుల చప్పుళ్లు, గుడ్ల గూబల అరుపులు వినపడతాయి. ఇది చూసి ధృతరాష్ట్రుని సలహా దారులు ఇతడివల్ల కురు వంశానికి నష్టం జరుగుతుందని, ఇతణ్ణి వదిలెయ్యమని చెప్తారు. కాని కుమారుణ్ణి వదలలేకపోతాడు ధృతరాష్ట్రుడు. పాండవుల్లో ముఖ్యంగా భీముడంటే వైరం, కారణం భీముడు తన పిల్లచేష్టలతో కౌరవుల్ని కొట్టేవాడు. దుర్యోధనుడు అది భరించలేక గంగా నదీ తీరానికి ఆటలకు వెళ్లి భీముడికి కాలకూట విషం ఇచ్చి అతడు మత్తులో వుండగా గంగానదిలోకి విసిరేస్తాడు. అందులోని సర్పాలు కాటువేయగా ఆ విషం కాలకూట విషానికి విరుగుడై భీముడు బ్రతుకుతాడు. సర్పరాజైన వాసుకి ఇతణ్ణి ఆదరించి అతడితో నాగరసం సేవింపజేస్తాడు. 100 ఏనుగుల బలం వస్తుంది. ఆ తర్వాత బయటకు వచ్చి ధర్మజునితో జరిగింది చెప్పగా దీన్ని రహస్యంగా వుంచమంటాడు. నాగరసం ఇతని శరీరంలో వుండటం వల్ల ఇతనికి మరోసారి విషాహారం ఇచ్చినా హానికలుగలేదు.

కర్ణునితో మిత్రత్వం : ద్రోణాచార్యుని వద్ద కురు పాండవులు విద్యనభ్యసించిన తదుపరి ఆ విద్యా నైపుణ్య ప్రదర్శనమునకు ఏర్పాటు చేయబడగా దుర్యోధనుడు భీముని గెలవజాలక పోయెను. అర్జునుని ధనుర్విద్యకు తను తులతూగడు. సభామధ్యమునకు వచ్చి కర్ణుడు అర్జునుని ఎదుర్కొనగలనని నిరూపించుటచే అతనితో మిత్రత్వము చేసి అతనికి అంగ రాజ్యము, అర్థ సింహాసనమిచ్చి గౌరవించెను.

కురు సామ్రాజ్యానికి ధర్మజుడు యువరాజైన, తన సంతతివారే రాజులగుదురని మేము వారి ఆశ్రమమున బ్రతకవలెనని దుర్యోధనుడు తన తండ్రితో చెప్పి పాండవులను వారణాసికి పంపి అక్కడ లక్క ఇంటిలో వుంచి వారిని చంపనెంచెను గాని ముందే తెలుసుకున్న పాండవులు తప్పించు కొనిరి. తిరిగి వచ్చిన పాండవులకు ధృతరాష్ట్రుడు కొంత రాజ్యము నిచ్చెను. ఇంద్రప్రస్థమును రాజధానిగా పాలించిరి. ధర్మజుడు రాజసూయ యాగమును నిర్వర్తించెను. దుర్యోధనుడు పగతో పాండవులను జ్యూత క్రీడకు రావించి శకునిచే మాయాద్యూతమున ఓడించగా వారు రాజ్యమును, వారును ఓడిపోగా దుశ్శాసనుడు అన్న ఆజ్ఞపై ద్రౌపదిని పరాభవించెను. ధృత రాష్ట్రుడు విదురుని సలహాపై వారిని విడిపించి వారి రాజ్యమును వారికి వదలి పంపగా మరల ద్యూత క్రీడకాహ్వానించి ఈసారి షరతుగా 12 ఏండ్లు అరణ్యవాసము, 1 ఏడు అజ్ఞాతవాసము పందెముగా నిర్ణయించి పాండవులను ఓడించి అరణ్యములకు పంపెను. అరణ్య అజ్ఞాత వాసానంతరము వారి రాజ్యమును వారికిమ్మని అడుగగా సూది మొనంత స్థలం కూడా ఇవ్వనని చెప్పెను. యుద్ధమునకు సన్నద్ధులై ఇరు పక్షములు తమ తమ మిత్రులను సంప్రదించిరి. అర్జున దుర్యోధనులిద్దరు శ్రీకృష్ణుని సహాయము కోరగా తన సైన్యమును దుర్యోధనునికిచ్చి తాను పాండవుల తరపున వుండెను. యుద్ధం ప్రారంభించిన తర్వాత ఒక్క అభిమన్యుని తప్ప మరెవ్వరినీ మోసపూరితమున చంపినట్లు కన్పించదు. యుద్ధమున ధీరోదాత్తుడి వలెనే పోరాడి యోదానుయోధులైన భీష్మ, ద్రోణ, కర్ణ, శల్యులు మరణించి నను భీమునితో ద్వంద యుద్ధము చేసి మోసపూరిత యుద్ధమున మరణించెను.

– మహాభారతం

**దుర్యోధనుడు 2 :** ఉపదానవి పుత్రుడు.

**దులిదుహుడు :** ఒక రాజు. – మహాభారతం

**దుశ్శాసనుడు :** కౌరవుల్లో రెండోవాడు. దుర్యోధనుని తమ్ముడు. అయితే అన్న చెప్పిన పని తప్పక పాటించడమే కాని ఇతడు ఎప్పుడూ అన్నకు సలహా ఇచ్చినట్లుగాని అన్న ఇతడి సలహా అడిగినట్లుగాని కన్పించదు. దుర్యోధనుని ఆదేశంమేరకు జూదంలో పాండవులు ఓడగా ద్రౌపదిని సభకు ఈడ్చుకొచ్చి భీముని శపథానికి కారకుడై కురుక్షేత్రంలో భీమునితో యుద్ధం చేసి మరణిస్తాడు. ఇతని రక్తాన్ని భీముడు ద్రౌపది కురులకు పూసి తన శపథం నెరవేర్చుకుంటాడు.

– మహాభారతం

**దుర్మదుడు :** ధృతరాష్ట్రుని పుత్రుడు. భీముడీతనిని కురుక్షేత్రమున వధించెను. – మహాభారతం

**దుర్మర్షుడు :** ఓ అసురుడు. క్షీరసాగర మదన సమయంలో దేవతలతో తలపడ్డాడు. – భాగవతం

**దుర్వాక్షి :** వసుదేవుడి తమ్ముడైన వృకుడి భార్య. – భాగవతం

**దుర్వారణుడు 1 :** కాంభోజ రాజు సైన్యాధిపతి. కురుక్షేత్ర యుద్ధంలో సాత్యకి ఇతణ్ణి వధించాడు. – మహాభారతం

**దుర్వారణుడు 2 :** జలంధరుని రాయబారి. క్షీరసాగర మదనంలో పుట్టిన వజ్రాలను దేవేంద్రుడు మోసంతో 14 వజ్రాలను తీసుకోగా ఇతణ్ణి ఇంద్రుని వద్దకు తమ వాటాకోసం పంపగా ఇంద్రుడు నిరాకరించడమే గాక యుద్ధానికి సమాయత్తం అవుతాడు. జలంధరుడు మొదట శ్రీమహావిష్ణువుతో యుద్ధం చేయాలా లేక శివుడితో యుద్ధం చేయాలా అని సందేహిస్తుండగా దుర్వారణుడు శివుడితో యుద్ధం చెయ్యమంటాడు. – పద్మపురాణం

**దుర్వారుడు :** కుండిల నగర రాజైన సురథుని కుమారుడు. శ్రీరాముని అశ్వాన్ని పట్టుకున్నప్పుడు శ్రీరామునితో యుద్ధంలో ఇతడూ పాల్గొన్నాడు. – పద్మపురాణం

**దుర్వాసుడు :** ఇతడొక రుషి. ముక్కోపి. చిన్న విషయానికి కూడా అతిగా స్పందించే స్వభావి. ఇతడు శివుని అంశవల్ల జన్మించాడు.

*జన్మవృత్తాంతము :* ఈ రుషి జన్మను గురించి మూడు విరుద్ధ కథలు పురాణాల్లో కన్పిస్తున్నాయి.

1. శివుడికి బ్రహ్మకు ఓ ఘర్షణ జరిగింది. శివుని కోపాగ్నికి దేవతలు భయంతో పారిపోయారు. పార్వతి ఈ భయంకర రూపంలో శివునితో జీవించడం అసాధ్యమంది. దీన్ని గ్రహించిన శివుడు తన ఈ స్వభావాన్ని ఇంకొకరిలో ప్రవేశపెట్టదలచాడు. ఇదే సమయంలో అణుమాండవ్యుడు శీలవతి భర్తను సూర్యోదయంలోపు తలపగలి చనిపోతావని శపిస్తాడు. పతివ్రత అయిన శీలవతి సూర్యోదయం కాకుండునట్లు ప్రతిశాపం ఇస్తుంది. అలాగే సూర్యుడు ఉదయించ లేదు. లోకం చీకటి మయమయ్యింది. దేవతలు, త్రిమూర్తులు అత్రిమహర్షి భార్య అనసూయతో వచ్చి శీలవతి శాపాన్ని ఉపసంహరింపజేస్తారు. అందుకు ప్రతిగా దేవతలు అనసూయను ఒక వరం కోరుకొమ్మనగా, ఆమె త్రిమూర్తుల అంశతో తనకు పుత్రులు కావాలంటుంది. ఆమెకోర్కె ప్రకారం బ్రహ్మ అంశ చంద్రుడిగా మహావిష్ణు అంశ దత్తాత్రేయుడిగా జన్మించగా శివుడు దాచిన తన కోపిష్టి స్వభాన్ని తన అంశంగా దుర్వాసుడికి జన్మనిచ్చాడు – బ్రహ్మాండపురాణం.

2. బ్రహ్మచేత ఓడిన శివుడు భయంతో తపస్సు చేసుకుంటున్న నరనారాయణుల్ని ఆశ్రయించగా అతని శూలంతో వారి ఎడమ చేతిని నరకమని చెప్పారు. అలా చేయగా మూడు రక్తపు ధారలు స్రవించాయి. ఒక ధార నక్షత్రాలవైపు మరోధార శివుని చేతిలోని కపాలంలోకి వెళ్లింది. మూడో ధారనుండి దుర్వాసుడు జన్మించాడు. ఈ అద్భుతాన్ని చూసిన బ్రహ్మ యుద్ధం మాని అతని లోకానికి చేరాడు. – వామన పురాణం

3. త్రిపురాసుర వధకు చివరగా కోపంతో ఓ బాణం సంధించగా అది వారిని చంపి తర్వాత ఓ బాలుడి రూపంధరించి శివుని తొడపై కూర్చున్నాడు. అతడే దుర్వాసుడు – మహాభారతం

*విశిష్టత :* దుర్వాసుడు కుంతికి పంచమంత్రాన్ని ఉపదేశిస్తాడు. ఆ మంత్రఫలితమే కర్ణ, పాండవుల జననం, విష్ణుభక్తుడైన అంబరీషునిపై తన శక్తిని ప్రయోగించి విఫలుడై తిరిగి అంబరీషునే శరణు వేడతాడు.

– *చూ॥ అంబరీషుడు*

ముద్గలుడికి ముక్తినిస్తాడు. హంసడిభకులితణ్ణి బాధిస్తారు. కళావతికి శైవపంచాక్షరి నుపదేశిస్తాడు. శకుంతలను శపిస్తాడు. ఇంద్రుడి సభలో ఇతనికి ప్రాధాన్యత వుంది. పాండవ వనవాస సమయంలో శ్రీకృష్ణుడితణ్ణి పరాభవిస్తాడు. – మహాభారతం

**దుర్విగాహుడు :** గాంధారి ధృతరాష్ట్రుల కుమారుడు – మహాభారతం

**దుర్విభాగం :** ప్రాచీన భారతావనిలో ఓ ప్రాంతం. ఇక్కడి క్షత్రియ రాజులు ధర్మజుని రాజసూయ యాగానికి వచ్చి ఆహారధాన్యాలు, ధనము బహుమతిగా ఇచ్చారు. – మహాభారతం

**దుర్విమోచనుడు :** ధృతరాష్ట్రుని 100 మంది పుత్రుల్లో ఒకడు. కురుక్షేత్రంలో భీముడితణ్ణి వధించాడు.
– మహాభారతం

**దుర్విరోచనుడు :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. ఇతణ్ణి కురుక్షేత్రంలో భీముడు వధించాడు.
– మహాభారతం

**దుర్విషహుడు :** గాంధారి ధృతరాష్ట్రుల కుమారుడు.
– మహాభారతం

**దుర్గుడు :** ఒక రాక్షసుడు. వాడి బాధను తాళలేక మును లీశ్వరుని ఆశ్రయించారు. ఈశ్వరుడు పార్వతితో చెప్పగా ఆమె వింధ్యకు పోయి తపస్సు చేసి కాళరాత్రి యను శక్తిని ఆ రాక్షసుని వద్దకు పంపి బాధించుట మానుమని చెప్పించగా కాళ రాత్రినే అతడు బంధించ బోగా ఆమె పరుగున పార్వతి వద్దకు రాగా అతడా మెను తరుముతూ పార్వతి వద్దకు రాగా ఆమె అతడిని సంహరించెను. – కాశీమహాత్మ్యం

**దుశ్శీల :** ప్రతిష్ఠానపురంలో నివసించిన ఓ వ్యభిచారిణి. తన భర్త దేవదాస బయటకు వెళ్లి నపుడు తన విటుణ్ణి గదిపైన కూర్చోబెట్టి భర్తలోనకు రాగానే చంపించి తన భర్తను దొంగలు కొట్టి చంపారని చుట్టుపక్కల వారికి చెప్తుంది. ఆమె నాలుగేళ్ల బాలుడి వల్ల విషయం తెలుసుకున్న పొరుగు జనం ఆమెను కొట్టి చంపుతారు. – కథాసరిత్సాగరం

**దుష్కరుడు :** ధృతరాష్ట్రుని 100 మంది పుత్రుల్లో ఒకడు.
– మహాభారతం

**దుష్కర్ణుడు :** ధృతరాష్ట్రుని 100 మంది పుత్రుల్లో ఒకడు. కురుక్షేత్ర యుద్ధంలో శతానీకు ఇతడిని ఓడిస్తాడు.
– మహాభారతం

**దుష్టచతుష్టయం :** మహాభారతంలోని దుర్యోధన, దుశ్శా సన, కర్ణ, శకునిలను దుష్టచతుష్టయం అంటారు.

**దుష్టబుద్ధి :** పంచతంత్రంలోని భాగమైన మిత్రబేధంలోని ఓ పాత్ర. – చూ॥ పంచతంత్రం

**దుష్పణ్యుడు :** పాటలీపుత్రంలోని ఓ వర్తకుడి చిన్న కుమారుడు. ముక్కోపి, దుష్టుడు అయిన ఇతడు చాలా మంది పిల్లల్ని బలిగొంటాడు. రాజు ఇతణ్ణి దేశం విడిచి పొమ్మంటాడు. అడవిలో తిరుగుతూ ఉగ్ర శ్రవసు మహర్షి కుమారుణ్ణి ఇలాగే చంపగా ముని ఇతణ్ణి అలాగే చావమని శపించి అతని ఆత్మను బాధతో తిరగమని శపిస్తాడు. ఇతడు మరణించిన తర్వాత చాలాకాలం ఆత్మ అలా తిరుగుతూ అగస్త్య మహర్షిని వేడుకోగా అగస్త్యుడు తన శిష్యుడితో అగ్నితీర్థం నుండి పుణ్య జలాలు తెప్పించి ఆ ఆత్మపై జల్లగా ముక్తి లభిస్తుంది. – సేతు మహాత్మ్యం

**దుష్ప్రధర్షణుడు :** ధృతరాష్ట్రుని 100 మంది పుత్రుల్లో ఒకడు.

**దుష్పరాజయుడు (దుర్జయుడు) :** ధృతరాష్ట్రుడి కొడుకు. గంధర్వుల చేతికి చిక్కుతాడు. బాలుడితో పోరాడ తాడు. భీముడి చేతిలో మరణిస్తాడు. – మహాభారతం

**దుష్యంతుడు :** భరత వర్షమునకు ఇతని కుమారుని పాలనవల్లే ఆ పేరు వచ్చింది. ఇతడు చంద్ర వంశపు రాజు. మతినారునికి ఇద్దరు కుమారులు శంతురో ధుడు, ప్రతిరథుడు. శంతురోధుని ముగ్గురు పుత్రుల్లో దుష్యంతుడొకడు. ప్రతిరథుని పుత్రుడు కణ్వుడను మహర్షి. ఇతని పాలనలో రాజ్యం సర్వదిక్కుల వ్యాపిం చింది. అన్ని కులాలు సుఖశాంతులతో జీవించి నాయి. భూమి ప్రశాంతంగా ప్రజలను ఎలా మోస్తుం దో పాలనా భారాన్ని దుష్యంతుడంత ప్రశాం తంగా నిర్వహించాడు.

ఒకరోజు ఇతడు అరణ్యానికి వేటకు వెళ్లి కణ్వుని ఆశ్రమానికి వెళ్లాడు. అక్కడ అతి మనోహరమైన శకుంతలను చూసి ప్రేమించి గాంధర్వ వివాహం చేయ నిశ్చయించుకోగా తను విశ్వామిత్ర మేనకల తనయనని కణ్వుని ఆదరణలో నున్నానని తన కుమా రుడు రాజ్యానికి వారసుడగుచో సమ్మతించెదననగా అతడు అంగీకరించి వివాహమాడి ఆమెతో కొద్ది కాలం గడిపి తిరిగి రాజ్యమునకు వెళ్లిన తర్వాత సాదరముగా రాజలాంచనాలతో తీసుకొని వెళ్తానని చెప్తాడు. కణ్వుడు వచ్చి తన దివ్యదృష్టితో విషయం గ్రహిస్తాడు. దుష్యంతుని పిలుపు రాక శకుంతల దిగులు చూసి కణ్వుడు తప్పక నీ కోర్కె నెరవేరు తుందని చెప్పి 6 సం. ఆ బాలుణ్ణి పెంచి తర్వాత వారిని రాజ ప్రాసాదానికి పంపుతాడు. శకుంతల దుష్యంతునితో తమ పరిణయ విషయం చెప్పగా దుష్యంతుడు అమాయకునిలా ఈ విషయమే తెలియ

దని చెప్పగా ఆమె హృదయ భారంతో వెనక్కు తిరుగు తుండగా దివ్యవాణి అతడు నీ కుమారుడని, కాబోవు చక్రవర్తి అని పలుకు తుంది. దుష్యంతుడికి శకుంతల పరిచయం జ్ఞప్తికి వచ్చి వారిని స్వీకరించగా ఆ పుత్రుడే భరతుడను పేర భారతదేశమునేలెను. దుష్యం తుని మరుపుకు కారణం శకుంతలకు దుర్వాసుడిచ్చిన శాపమే. – మహాభారతం

**దుస్సల :** గాంధారి ధృతరాష్ట్రుల ఏకైక కుమార్తె. సైంధ వుడి భార్య. ఈమె మనుమలు ధర్మజుని యాగాశ్వాన్ని పట్టుకోగా అర్జునుడు వారిని వధించబోతే ఈమె కోరికపై వారిని వదిలేస్తాడు. – మహాభారతం

**దుస్సలుడు :** ధృతరాష్ట్రుని కుమారుడు. కురుక్షేత్ర యుద్ధంలో భీముడితణ్ణి వధిస్తాడు. – మహాభారతం

**దుస్సేనుడు :** 100 మంది కౌరవుల్లో ఒకడు. – మహాభారతం

**దూర్వాక్షి :** వసుదేవుని సోదరుడైన వృకుని భార్య. – భాగవతం

**దూషణుడు :** ఖరదూషణాదుల్లో ఒకడు. ఖరుడి సోద రుడు. రావణుడి పిన్ని కొడుకు. శ్రీరాముడి చేతిలో మరణిస్తాడు. – రామాయణం

**దేవకి :** శ్రీకృష్ణుని తల్లి. వసుదేవుని భార్య.

*జన్మవృత్తాంతం :* ఈమె దేవాపు కుమార్తె. ఇతని ఏడుగురు కుమార్తెలలో దేవకి ఒకరు. దేవకి కంసుని సోదరి అని కొన్ని పురాణాలు చెప్తున్నాయి. కాని అది సరికాదు. కంసుడు దేవకుడి సోదరుడైన ఉగ్ర సేనుడి కుమారుడు. దేవకుడి కుమారుడు దేవాపి. అతని కుమార్తె దేవకి. కంసుడు, దేవకి మేనమామ మేనకోడలు అవుతారు.

*పూర్వజన్మ :* దేవకి తన పూర్వజన్మలో దక్షుని కూతురు కశ్యపుని భార్య అయిన అదితి. మహా విష్ణువు తన తదుపరి జన్మలో ఆమెకు జన్మిస్తానని వరమిచ్చాడు.

*వివాహం పిల్లలు :* ఈమె వసుదేవుడను యాదవుని వివాహం చేసుకుంటుంది. దేవకి అష్టమ గర్భంలో జన్మించిన వాడివల్ల తనకు మరణం సంభవమని ఆకాశవాణి పలుకుట విని కంసుడు దేవకి వసుదే వుల్ని ఖైదుచేసి పుట్టిన బిడ్డను పుట్టినట్లు 6 గుర్ని చంపుతాడు. 7వ బిడ్డ గర్భంలో వుండగానే వసుదేవుని మరోభార్య రోహిణి గర్భంలోకి జేరి బలభద్ర రాముడిగా జన్మిస్తాడు. అష్టమ గర్భాన శ్రీకృష్ణుడు జన్మిస్తాడు. – చూ॥ కృష్ణుడు

*ఇతర విశేషాలు :* దేవకి స్వయంవరానికి ఎందరో రాజులు వచ్చారు. – మహాభారతం

శ్రీకృష్ణుని నిర్యాణానంతరం అనగా యదువంశం వినాశం తర్వాత వసుదేవుడు, దేవకి, రోహిణి తమ తనువు చాలిస్తారు. – భాగవతం

**దేవకీసుతులు :** దేవకి అష్టమ గర్భంలో జన్మించిన వానివల్ల తనకు మరణం వుందని తెలిసి ఆమెను ఖైదుచేసి ఆమె పుట్టిన బిడ్డల్ని పుట్టినట్లు వధిస్తాడు. అలా ఆరుగురుని చంపుతాడు. ఆ ఆరుగురు పూర్వ జన్మమున వర్ష, మరీచి కుమారులు. వారు బ్రహ్మ తన కూతురుతో రమించడం చూసి నవ్వగా వారిని అసుర గర్భమున జన్మించమని శపిస్తాడు. వారు హిరణ్యకశి పుని భార్య కాలనేమి గర్భంలో పుట్టగా యోగమాయ వారిని దేవకి గర్భంలోకి జేర్చుతుంది. వీరినే కంసుడు సంహరిస్తూ వుంటాడు. తదనంతర కాలంలో దేవకీ వసుదేవులు వీళ్లను చూడాలని కోరగా శ్రీకృష్ణ బల రాములు వీరిని బలినడిగి పాతాళం నుండి తీసుకొని వచ్చి చూపిస్తారు. – దేవీ భాగవతం

**దేవకుడు 1 :** ధర్మజునకు పౌరవతియను భార్య యందు జన్మించిన పుత్రుడు. – భాగవతం

**దేవకుడు 2 :** ఆహుకుని కుమారుడు. ఇతని కుమార్తెల నందరిని వసుదేవుడు వివాహమాడెను. దేవకి తండ్రి. ఇతడు ఉగ్రసేనుని సోదరుడు. – భాగవతం

**దేవకుండం 1 :** ఇదో పవిత్ర స్థలం. ఇక్కడ స్నానంచేస్తే అశ్వమేధ యాగ ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**దేవకుండం 2 :** కృష్ణవేణీ నదిలో ఒక భాగం. దీన్ని జాతిస్మరణ హ్రదం అని అంటారు. ఇక్కడ స్నానం చేస్తే పూర్వజన్మ స్మృతులు కల్గుతాయి. – మహాభారతం

**దేవకుల్య :** గంగ కుమార్తె. పూర్వజన్మమున మరీచి మనుమరాలు. స్వాయంభువు మనువుకాలంలో జీవిం చింది. మహావిష్ణువు పాదాలు కడిగినందు వల్ల తర్వాతి జన్మలో గంగ కుమార్తెగా జన్మించింది. – భాగవతం

**దేవకూటం 1 :** ఇది మహామేరువుకు తూర్పున వున్న పర్వతం. 18,000 మైళ్ల వైశాల్యం, 2000 మైళ్ల ఎత్తు వుంది. – దేవీభాగవతం

**దేవకూటం 2 :** ఇదొక పవిత్ర స్థలం. ఇక్కడ స్నానం చేస్తే అశ్వమేధయాగం చేసిన ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**దేవక్షత్రుడు :** యయాతి వంశంలోని ఒక రాజు. – భాగవతం

**దేవగర్భుడు :** ఒక రుషి. పుష్కర దేవాలయం వద్ద బ్రహ్మయజ్ఞం చేస్తున్నప్పుడు ఇతడొక పురోహితుడుగా వ్యవహరించాడు. – పద్మపురాణం

**దేవగిరి :** శతద్రూ నదికి యమునా నదికి మధ్యగల ప్రాంతం. – మహాభారతం

**దేవగ్రహం :** ఇదో దుష్టగ్రహం. దీని దర్శనంవల్ల పిచ్చి వాళ్లవుతారు. – మహాభారతం

**దేవజిత్తు :** సుమతి కుమారుడు. ఇతని కుమారుడు దేవద్యుమ్నుడు. – భాగవతం

**దేవదత్తం :** అర్జునుడి శంఖంపేరు. దీన్ని యముడు అర్జునుడికిస్తాడు. కురుక్షేత్ర యుద్ధంలో శ్వేతాశ్వాన్ని అధిరోహించి దీన్ని పూరించాడు. – మహాభారతం

**దేవదత్తుడు 1 :** ఒక బ్రాహ్మణుడు. ఇతడు పుత్రార్థియై గోబిలుడనువానిని ఉద్గాతగా వుంచి యజ్ఞము చేసెను. గోబిలుడు స్వరము తప్పుచెప్పగా మూర్ఖుడా ! అట్లు చెప్పెదవేల ? యని దేవదత్తుడు అడుగగా నీవు నన్ను మూర్ఖుడా అని తిట్టితివిగాన అట్టివాడే నీ కుమారునిగా జన్మించునని శపించెను. దేవతదత్తుడు అతని కాళ్లపైబడి క్షమింపుమని వేడగా నీ కుమారుడు పిమ్మట గొప్ప కవియగునని అనుగ్రహించెను. అతని కట్లే ఓ పుత్రుడు జన్మించెను. వానికుపనయనము తర్వాత వానికెంత చెప్పినను అక్షరమైన రాకుండెను. తెలివితేటలు కూడా లేని అతనిని తల్లిదండ్రులు విడనాడిరి. ఎల్లప్పుడు సత్యమే పలుకుటచే అతనికి సత్యవ్రతుడను పేరువచ్చెను. ఇతడు సరస్వతి అనుగ్రహమున గొప్ప కవియయ్యెను. – దేవీభాగవతం

**దేవదత్తుడు 2 :** ఉరుశ్రవుని పుత్రుడు. అతని కుమారుడు అగ్నివేశుడు. – భాగవతం

**దేవదారువనం :** ఓ పవిత్రస్థలం. ఇక్కడ స్నానం చేస్తే సత్ఫలితాలు కలుగుతాయి. – మహాభారతం

**దేవదాసు :** ఓ ధనవంతుడైన వైశ్యుడు. పాటలీపుత్ర నివాసి. పుండ్రవర్ధనానికి చెందిన మరోధనిక వైశ్యుడి కుమార్తెను వివాహమాడాడు. తండ్రి చనిపోయిన తర్వాత జూదంలో ఆస్తి పోగొట్టుకున్నాడు. భార్య వదలి పుట్టింటికి వెళ్లింది. కొన్నాళ్లు అటూఇటూ తిరిగి తన భార్య ఇంటికి వెళ్లాలని తలచాడు. ఓ అర్థరాత్రి ఆమె ఇంటికి వెళ్ళగా ఆమె ఒక విటునితో వుండి "దేవదాసు ఇంట్లో నాల్గు మూలలా భూమి అడుగున ధనం దాచివుందని అది అతని తాత ముత్తాతల వద్ద నుండి వుందని అతని తల్లి ద్వారా ఈ విషయం తెలిసిందని దాన్ని చౌకగా కొనమని" ఆ విటునితో చెప్పుండగా దేవదాసు విని వెంటనే ఇంటికి వెళ్లి నాల్గుమూలలా తవ్వి ధనవంతుడయ్యాడు. ఇది తెలియని విటుడు ఆ యింటిని అనుకున్న దానికంటే ఎక్కువ ధరకు కొని తవ్విచూడగా ఏమీలేదు. మరల అదే ధరకు దేవదాసును కొన మనగా నిరాకరించి రాజువద్ద సమస్యను పెట్టగా అది విన్నరాజు దేవదాసుని తన భార్యను వదిలెయ్య మని మరో యువతిని వివాహమాడమని ఆజ్ఞాపిస్తాడు. – కథాసరిత్సాగరం

**దేవదూత :** దేవతల తరపున వార్తాహరుడు. ధర్మజుడు స్వర్గంలో తన సోదరులు లేనిదే వుండలేననగా ధర్మజుడ్ని ఇతనికిచ్చి పంపి కర్ణాదులను చూపిస్తాడు. – మహాభారతం

**దేవద్యుతి :** సర్వస్వతీ నదీ తీరాన ఓ ఆశ్రమంలో నివసించిన రుషి. విష్ణువు ఆశీర్వాదంతో సుమిత్రుడను పుత్రుడు జన్మిస్తాడు. వెయ్యేండ్ల కఠిన తపస్సువల్ల ఇతడు ఎంతో ప్రసిద్ధి చెందుతాడు. వైశాఖ మాసంలో విష్ణువు ప్రత్యక్షమై వరం కోరుకొమ్మంటే నిరాకరించి విష్ణుపూజ చాలంటాడు. – పద్మపురాణం

**దేవద్యుమ్నుడు :** భరత వంశపు రాజు. ఇతడు ప్రతీపుని తాత. పరమేష్ఠి అనే రాజుకు తండ్రి. – భాగవతం

**దేవనది :** ఇంద్రుడి సభలో వుండే ఒక నది. – మహాభారతం

**దేవపథం :** ఓ పుణ్యక్షేత్రం. ఇక్కడుండి స్నానం చేస్తే దేవసత్ర యజ్ఞం చేసిన ప్రతిఫలం లభిస్తుంది. – మహాభారతం

**దేవపుష్కరిణి :** భారతదేశంలో ఓ పురాతన పుణ్య తీర్థం. ఇక్కడ స్నానం చేస్తే అశ్వమేధ యజ్ఞం చేసిన ప్రతి ఫలం లభిస్తుంది. - మహాభారతం

**దేవప్రతిష్ఠ :** దేవతా విగ్రహాలను గుడిలో ప్రతిష్ఠించే విధానాన్ని దేవప్రతిష్ఠ అంటారు. ఏ దేవతా విగ్రహం ఎక్కడ వుండాలి, విగ్రహాలు ఏఏ వస్తువులతో చెయ్యాలి, అడవిలో ప్రతిష్ఠించేప్పుడు ముందుగా వన పూజ చేయడం, విగ్రహాలు ఏ ఆకారంలో వుండాలి, ఏ ఆకారంలో వున్న రాతిని ఏమంటారు, విగ్రహ ప్రతిష్ఠ సమయంలో పాటించ వలసిన నియమాలు మంత్రాలు తెలియజేసేదే దేవప్రతిష్ఠాశాస్త్రం. - అగ్నిపురాణం

**దేవప్రథుడు :** యయాతి వంశంలోని ఓ రాజు. - భాగవతం

**దేవప్రయాగ :** అలకనంద గంగలో కలిసేచోటు. ఇక్కడ తొమ్మిదివందల అడుగుల పొడవున రామచంద్ర స్వామి గుడి వుంది.

**దేవప్రస్థం :** ప్రాచీన భారతదేశంలో ఉత్తరానవున్న ఓ పురాతన నగరం. సేనబిందు అను రాజుకి ఇది రాజధాని. - మహాభారతం

**దేవభాగశ్రేతార్షుడు :** ఓ రుషి. శృతుని కుమారుడు. ఇతడు యజ్ఞఫలాన్ని ఏ భాగాన్ని ఎలా పంచాలో ఎవరికి పంచాలో ఖచ్చితంగా తెలిసినవాడు. ఈ విషయం అతడు చనిపోయేవరకు ఎవరికి తెలియదు. ఆ తర్వాత మానవాతీతుడు ఎవరో బభ్రు కుమారుడు గిరిజకి చెప్పాడు. - ఐతరేయ బ్రాహ్మణాలు

శృంజయులు, కురు రాజులు శతృవులుగా వున్న వారితో దాక్షాయణ యజ్ఞం చేయించాడు. సావిత్రాగ్ని గురించిన ఇతని సిద్ధాంతాలు తైత్తరీయ బ్రాహ్మణాల్లో పేర్కొనబడినవి. - భాగవతం

**దేవభాగుడు :** యయాతి వంశంలోని ఒక రాజు. - భాగవతం

**దేవభ్రాతుడు :** ప్రసిద్ధ దేవతా పురుషుడు. రవి యొక్క కుమారుడు. సుభ్రాతుని తండ్రి. - మహాభారతం

**దేవమత :** భారతదేశంలో ఓ ప్రాచీన ముని. ఇతడు ఆత్మను గూర్చి నారదునితో చర్చించాడు. - మహాభారతం

**దేవమిత్రాశాకల్యుడు :** మాండుకేయ ముని కుమారుడు. వేదపండితుడు. 5 సంహితాలను తన శిష్యులైన ముద్గల, గోకల, మత్స్య ఖాలీయ, శైశిరేయులకు బోధించాడు. - చూ॥ యాజ్ఞవల్క్యుడు

**దేవమిత్ర :** సుబ్రహ్మణ్యస్వామి సేవకురాలు. - మహాభారతం

**దేవమీఢుడు :** యదు వంశంలో జన్మించిన ప్రసిద్ధ యాదవుడు. ఇతడు వసుదేవుని తాత, శూరసేనుడి తండ్రి. - మహాభారతం

**దేవమీఢుడు :** భోజుడి కొడుకైన హృదికుడి కుమారుడు. ఇతణ్ణి హరుదని కూడా అనేవారు. ఇతడి భార్య మరీష. వీరికి సుదేవుడు, దేవ భాగుడు, దేవశ్రవుడు, అనకుడు, సృంజయుడు, శ్యాముకుడు జన్మించారు. - భాగవతం

కుంతి భోజుడితడి మేనత్తకొడుకు. ఇతడికి సంతానం లేకపోవడంతో పృథను ఇచ్చాడు. - మహాభారతం

**దేవయజ్ఞం :** ప్రయాగను దేవయజ్ఞమంటారు. ఇది దేవతలకు యజ్ఞం చేయడానికి కేంద్రస్థానం. కాశీ రాజు కుమార్తె అంబ ఇచట కఠిన తపస్సు ఆచరించింది. - మహాభారతం

**దేవయాజి :** సుబ్రహ్మణ్య స్వామి యోధుల్లో ఒకడు. - మహాభారతం

**దేవయాని :** స్వాయంభవ మనువుకు ఇద్దరు కుమారులు. వారు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు. ప్రియవ్రతుడు విశ్వకర్మ ప్రజాపతి కుమార్తెలైన సరూప, బర్హిష్మతిలను వివాహమాడాడు. సరూప వల్ల ప్రసిద్ధులైన 10 మంది కుమారులు, ఒక కూతురు. ఆ కూతురు ఊర్జస్వతి. ఆమె అసుర గురువైన శుక్రాచార్యుడ్ని వివాహమాడగా ఆమెకు దేవయాని జన్మించింది. - దేవీభాగవతం

*కచుని శాపం :* బృహస్పతి కుమారుడైన కచుడు మృతసంజీవిని విద్య నేర్చుకోవడానికి శుక్రా చార్యుని శిష్యుడుగా చేరతాడు. దేవయాని అతణ్ణి ప్రేమిస్తుంది. ఆ విద్య నేర్చుకున్న తర్వాత దేవయానిని వివాహం చేసుకోకుండా దేవలోకం వెళ్లిపోగా ఆమె అతడికి ఆ విద్య వుపయోగపడదని శపించగా దేవలోకంలోని వారెవరూ ఆమెను వివాహమాడరని తిరిగి శపిస్తాడు.

వృషపర్వుణుడు అసురులకు రాజుగా వుండగా శుక్రాచార్యుడు అతని భవనంలో వుండేవాడు. అతని కుమార్తె శర్మిష్ఠ. దేవయాని, శర్మిష్ఠలు స్నేహంగా వుండేవారు. ఒకసారి ఇద్దరు కొలనులో స్నానం చేస్తుండగా ఇంద్రుడు గాలి రూపంలో వారి వస్త్రాలు చెదర గొట్టగా శర్మిష్ఠ దేవయాని వస్త్రాలు ధరించగా శర్మిష్ఠనుండి దేవయాని ఆ బట్టలు లాక్కోబోగా శర్మిష్ఠ దేవయాని తండ్రిని దూషించి దేవయానిని ఓ నూతి లోకి తోసివెళ్లిపోగా యయాతి అను రాజు ఆమెను రక్షిస్తాడు. అయినా ఆమె ఇంటికి రాదు. శుక్రాచార్యుడు వెళ్లి కారణమడుగగా జరిగింది వివరించి రాజభవనానికి రానననగా శుక్రాచార్యుడు అందుకు అంగీకరించి రాక్షస రాజుపై కోపం వహిస్తాడు. రాజు బ్రతిమాలగా దేవయాని శర్మిష్ఠ ఆమె సేవకురాళ్లు తనకు సేవకురాళ్లుగా వుంటేనే వస్తానని తన పంతం నెగ్గించుకుంటుంది.

ఆ తర్వాత దేవయాని తన చెలికత్తెలతో విహరిస్తుండగా మరల యయాతిని చూసి అతణ్ణి తనను వివాహం చేసుకోమని అడుగగా శుక్రాచార్యుని అనుమతితో ఆమెను వివాహం చేసుకుంటాడు. యయాతి వల్ల ఈమెకు ఇద్దరు పుత్రులు యదు, తుర్వాసులు జన్మిస్తారు. శర్మిష్ట కూడా యయాతివల్ల ముగ్గురు పుత్రులకు జన్మనిస్తుంది. – మహాభారతం

**దేవరక్షిత :** శ్రీకృష్ణుడి తల్లి అయిన దేవకి సోదరి. – భాగవతం

**దేవరాజు 1 :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. యముని కొలువులో అతణ్ణి పూజిస్తూ వుండేవాడు. – మహాభారతం

**దేవరాజు 2 :** ఓ నీతిలేని బ్రాహ్మణుడు. కిరాత నగరంలో వ్యాపారస్తుడు. ఓ వ్యభిచారిణిని మోహించి తల్లిదండ్రుల్ని భార్యను చంపుతాడు. ఒకసారి ప్రతిష్ఠానపురం వెళ్లి ఎన్నో పుణ్యకథలు విని భక్తుడవుతాడు. చెడ్డవాడైనా ఓ నెల రోజులు శివుడ్ని పూజించటంవల్ల చనిపోయిన తర్వాత కైలాసం చేరుకుంటాడు. – శివపురాణం

**దేవరాతుడు 1 :** నిమికి ఆరవ సంతతివాడు. కేతుని కుమారుడు. దక్షయజ్ఞ ధ్వంసమునకు శివుడు ఉపయోగించిన చాపమును (విల్లు) శివుడు దేవతలకివ్వగా వారు ఇతనికిచ్చారు. ఇతడు ఇతని సంతతి వారు ఈ చాపమును పూజించెడివారు. దీనినే రాముడు సీతా స్వయంవరమున విరిచెను. ఇతని కుమారుడు బృహద్రధుడు.

**దేవరాతుడు 2 :** విశ్వామిత్రుని కుమారుడు. శునశ్శేపు అనికూడా అంటారు. యూపస్తంభమునకు కట్టబడి బ్రహ్మదేవుని అనుగ్రహముచే విముక్తుడయ్యెను. అందువల్ల దేవరాతుడను పేరువచ్చెను. – భాగవతం

**దేవరూపిణి :** ధర్మవ్రతయను నామె శాపవశమున శిలగా మారెను. అదే దేవరూపిణి. గయాసురుడు కదలకుండ నుండుటకై విష్ణువు ఈ శిలనే అతని శిరముపై బెట్టి నిలుచుండెను. – భాగవతం

**దేవలుడు 1 :** ఓ ప్రసిద్ధ రుషి. అష్టావసువుల్లో ఒకడైన ప్రత్యూషుడి కుమారుడు. గజేంద్రమోక్షంలో ఇతడొక పాత్రధారి. – మహాభారతం

**దేవలుడు 2 :** ఓ రుషి. వేదపండితుడు. దౌమ్య మహర్షి పెద్దన్న. జనమేజయుని సర్పయజ్ఞంలో పాల్గొన్నాడు. ద్వారకనుండి హస్తినకు వెళ్తూ శ్రీకృష్ణుడితణ్ణి ఒకసారి కలిశాడు. కురుక్షేత్ర యుద్ధానంతరం ధర్మజుణ్ణి కలిసిన రుషుల్లో ఇతడొకడు. ఇతని కూతురు సువర్చల స్వయంవరంలో శ్వేతకేతుణ్ణి వివాహమాడింది. ఇతనికి తెలివైన ఇద్దరు కుమారులు కలరు. – విష్ణుపురాణం

**దేవలుడు 3 :** వ్యాసుని శిష్యుల్లో ఒకడు. అసిత, దేవలి, వైశంపాయన, సుమంతు, జైమిని అనువారు వ్యాసుని ముఖ్యశిష్యులు. శివప్రసాదంవల్ల అసిత మునికి జన్మించాడు. రంభ ఇతణ్ణి ప్రేమించగా నిరాకరించాడని శరీరవైకల్యం కలగాలని శపిస్తుంది. అప్పటి నుండి అతణ్ణి అష్టావక్రుడనే వారు. ఇతడు 6000 సంవత్సరాలు ఘోరతపస్సు చేశాడు. రాధాకృష్ణులు ఇతణ్ణి దర్శించగా రాధ ఇతడ్ని చూసి నవ్వింది. కాని కృష్ణుడు మెచ్చి అతణ్ణి కౌగిలించుకోగా నిజరూపం వచ్చింది. స్వర్గం నుండి వచ్చిన విమానంలో ఇతడు, రాధాకృష్ణులు వెళ్లిపోతారు. – బ్రహ్మవైవర్తపురాణం

**దేవవతి 1 :** మణిమయుడను గంధర్వుని కుమార్తె. సుకేశుడను రాక్షసుడు ఈమెను వివాహమాడగా మాల్యవాణుడు, సుమాలి, మాలి అనువారు జన్మించారు. వీరు రావణుని సేవించేవారు. – ఉత్తర రామాయణం

**దేవవతి 2 :** శ్రీరాముని భార్య సీత పూర్వజన్మలో దేవవతి అనే దేవకన్య - *చూ॥ సీత.*

**దేవవతి 3 :** మందారమాలి అను అసురుని కుమార్తె.

**దేవవనం :** ఓ పుణ్యస్థలం. బాహుద, నందా నదులు ఈ ప్రాంతం గుండా ప్రవహిస్తాయి. - మహాభారతం

**దేవవర్ణిని :** భరద్వాజ మహర్షి కుమార్తె. విశ్రవసుడను ముని వివాహమాడెను. వారి పుత్రుడు కుబేరుడు.

**దేవవర్ధనుడు :** యదు వంశంవాడు. దేవకుడి కొడుకు. - *భాగవతం*

**దేవవాహుడు :** యయాతి వంశంలోని రాజు. - *భాగవతం*

**దేవవీతి :** అగ్నీధ్రుడను రాజు కోడలు. అగ్నీధ్రుని భార్య పూర్వచిత్తి అను అప్సరస. వీరికి 9 మంది కుమారులు. అందులో చివరివాడు కేతుమాలుడు అతని భార్య మేరువు, కుమార్తె, దేవవీతి. - *భాగవతం*

**దేవవ్రతుడు 1 :** భీష్ముని మరోపేరు.

**దేవవ్రతుడు 2 :** యజ్ఞాలను నమ్మే బ్రాహ్మణుడు. తర్వాత తీర్థజలాల ప్రభావం వల్ల వెదురుగా పుడతాడు. దీనితోనే శ్రీకృష్ణుడు వేణువు తయారు చేసుకున్నాడు. అందువల్ల దేవవ్రతుడికి మోక్షం లభిస్తుంది. - పద్మపురాణం

**దేవశర్మ 1 :** ఇతడొక వేద పండితుడైన బ్రాహ్మణుడు. తన మతపరమైన బాధ్యతల్ని సక్రమంగా నిర్వహించేవాడు. అతనికి పిల్లలు చుట్టాలు గోవులు ఎన్నో వున్నాయి. కాని ప్రోస్త పదంలో అతడు శుక్ర పంచమిని ఆచరించలేదు. ఆరోజు అతని తండ్రి మరణించిన రోజు. అంతకుముందు సాయంత్రమే బ్రాహ్మణుల్ని పిలవాలి. ధాన్యంతో చేసిన 18 రకాల వంటలతో భోజనం పెట్టాలి. అప్పుడు అతని తండ్రి ఆత్మకు శాంతి కల్గుతుంది. ఆ సాయంత్రం వేదపండితుడైన బ్రాహ్మణుడ్ని గౌరవించాలి. ఆ సాయంత్రం తన భార్య తెచ్చిన నీళ్లతో కాళ్లుకడుక్కొంటూ ఓ ఎద్దు, కుక్క మాట్లాడు కోవడం విన్నాడు. వారి మాటలవల్ల ఆ ఎద్దు, కుక్క తన తల్లిదండ్రులని గుర్తించి అలా పుట్టడానికి కారణమేమిటని ఓ పండితుడైన బ్రాహ్మణుణ్ణి అడగ్గా పూర్వజన్మలో వారు వారి తల్లిదండ్రులకు శ్రాద్ధ కర్మలు సరిగా నిర్వహించలేదు. అతని భార్య బహిష్టు వుండికూడా బ్రాహ్మణులకు భోజనం పెట్టడం వల్ల ఈ జన్మలో ఇలా పుట్టారని విశదీకరించగా తన తల్లిదండ్రులకు ముక్తిలభించే మార్గం వశిష్ఠుడిని అడగ్గా భాద్రపదంలో రుషి పంచమి నాచరించమని చెప్తాడు. అలా ఆచరించగా ఏనుగు కుక్కగా వున్న అతని తల్లిదండ్రులకు మోక్షం లభిస్తుంది. - పద్మపురాణం

**దేవశర్మ 2 :** ఓ బ్రాహ్మణుడు. కావేరీ నదికి ఉత్తర ప్రాంతంలో జీవించేవాడు. ఒకరోజు తన కుమారుణ్ణి స్నానం చెయ్యమంటే నిరాకరించగా ఎలకగా మారమని శపిస్తాడు. తండ్రిని ప్రార్థించి శాపవిమోచనం కోరగా కార్తీకమాసం గొప్పతనం వింటే నిజస్వరూపం వస్తుందని శాపవిమోచనం చెప్తాడు. ఒకరోజు ఈ ఎలుక అడవుల్లో సంచరిస్తూ విశ్వామిత్రుడు తన శిష్యులకు కార్తీకం యొక్క గొప్పతనాన్ని గురించిన కథ చెప్తూ వుంటే విని నిజరూపం దాల్చుతుంది. - పద్మపురాణం

**దేవశర్మ 3 :** పంచతంత్రంలోని మిత్రభేదంలోని ఓ పాత్ర. - *పంచతంత్రం*

**దేవశర్మ 4 :** విష్ణుశర్మ సుదర్శనుడి 5 గురు అమాయకులైన కుమారులకు 5 రకాల బుద్ధి కుశలు కావడానికి సూక్ష్మాలు చెప్తాడు. 5వ ఎత్తుగడ అసంప్రేక్ష కారిత్వం. ఇందులో తొందరపడి తీసుకొనే నిర్ణయాలు ఎంతనష్టమో సత్యం తెలుసుకోకుండా వ్యవహరిస్తే జరిగే నష్టమేమిటో తెలియడానికి రెండు ముఖ్య కథలు చెప్తాడు. అందులోని ఓ కథలో దేవశర్మ నాయకుడు.

**దేవశర్మ 5 :** ఒక ముని. ఇతడి భార్య రుచి. ఈమెను ఇంద్రుడు కామించాడు. ఇది గ్రహించిన దేవశర్మ తను యాగానికి వెళ్తూ తన శిష్యుడు విపులుడిని భార్యకు కాపలా పెట్టి వెళ్తాడు. - మహాభారతం

**దేవశిల :** చూ॥ గయాతీర్థం.

**దేవశ్రవసుడు 1 :** వసుదేవుని సోదరుడు. - భాగవతం

**దేవశ్రవసుడు 2 :** యయాతి వంశపు రాజు - *భాగవతం*

**దేవశ్రవసుడు 3 :** కుశిక గోత్రానికి చెందిన మాంత్రికుడు.

**దేవశ్రుతుడు :** శుకముని కుమారుడు. ఇతని తల్లి పీవరి. - దేవీభాగవతం

**దేవసత్రం :** ఇదొక యజ్ఞం. - మహాభారతం

**దేవసమం :** ఇదొక పర్వతం. అగస్త్యుడు కొన్నాళ్లిక్కడ నివసించాడు. - మహాభారతం

**దేవసావర్ణి :** విష్ణుసావర్ణి కుమారుడు. ఇతని కుమారుడు రాజసావర్ణి.

**దేవసేన :** దక్షుని కూతురు. ఈమె, ఇతని సోదరి దైత్యసేన మానస సరోవరంలో విహరిస్తుండగా కేశి అనే రాక్షసుడు వీరిని ప్రేమిస్తాడు. దైత్యసేన అతణ్ణి వివాహమాడగా దేవసేన నిరాకరిస్తుంది. కేశి ఆమెను బలాత్కరించబోగా ఇంద్రుడితడితో పోరాడగా అతడు దైత్యసేనతో కలసి పారిపోతాడు. ఇంద్రుడీమెను వరం కోరుకొమ్మనగా దేవ, దానవ, యక్షుల్ని ఓడించగల వాడు తనకు భర్తగా కావాలని కోరుతుంది. ఇంద్రుడు బ్రహ్మతో సమాలోచన జరిపి శివుని వద్దనుండి సుబ్రహ్మణ్యస్వామిని తీసుకువచ్చి వివాహం జరిపిస్తాడు. ఈమె దేవాసురయుద్ధంలో సుబ్రహ్మణ్యస్వామికి సహాయపడుతుంది. - మహాభారతం

**దేవసేనుడు 1 :** కీర్తిసేన భర్త. - చూ॥ కీర్తి సేనుడు

**దేవసేనుడు 2 :** శ్రావస్థి నగరాన్ని రాజధానిగా పాలించిన తెలివైన రాజు.

**దేవస్థానుడు :** ఓ ముని. మహాభారత యుద్ధానంతరం ధర్మజునికి హితం చెప్పి శాంతపరుస్తాడు. - మహాభారతం

**దేవస్వామి :** ఓ బ్రాహ్మణుడు. - చూ॥ వరరుచి

**దేవస్మిత :** గుహసేనుని భార్య. - చూ॥ గుహసేనుడు

**దేవహవ్యుడు :** ఓ రుషి. ఇంద్రసభలో వుండేవాడు. - మహాభారతం

**దేవహూతి :** స్వాయంభవ మనువు కుమార్తె. కర్దమ ప్రజాపతి ఈమెను వివాహమాడాడు. వీరికి జన్మించిన కపిలుడు శాంఖ్య తత్వచింతనకు ఆధ్యుడు. ఇతడు తన తల్లికి కపిలశాస్త్రాన్ని బోధించి ఈమెను వదిలి వెళ్తాడు. తర్వాత ఈమె సరస్వతీ నదీ తీరంలో తన తనయుడు చెప్పిన విధంగా తపస్సుచేసి సమాధిలోకి వెళ్తుంది. ఈమె తపస్సు చేసిన ప్రాంతాన్ని సిద్ధపథం అంటారు. - దేవీభాగవతం

**దేవహోత్రుడు :** ఓ మహర్షి. ఉపరిచర వసువు చేసిన యజ్ఞంలో ఇతడో గౌరవ సభ్యుడు. - మహాభారతం

**దేవహ్రదం :** కాలంజర పర్వతంమీద గల పుణ్య స్థలం. ఇక్కడ స్నానంచేస్తే 1000 గోదానాల ప్రతిఫలం లభిస్తుంది. - మహాభారతం

**దేవానికుడు :** శ్రీరాముని వంశంలో జన్మించిన రాజు. రుక్షుని తండ్రి. పారియాత్రుడికి తాత. - రామాయణం

**దేవాతిథి :** పూరువంశంలోని ఓ రాజు. ఇతని తండ్రి అక్రోదుడు, తల్లి కళింగ రాజకుమార్తె కరంభ. ఇతడు విదేహ రాజపుత్రిక మర్యాదను వివాహ మాడాడు. - మహాభారతం

**దేవాదర్శుడు :** వ్యాసుని శిష్య పరంపరలోనివాడు. కబంధుని శిష్యుడు. ఇతని శిష్యుల్లో ముఖ్యులు మేథ, బ్రహ్మబలి, సౌతాయన, పిప్పలుడు.

**దేవాధిపుడు :** ఇతడొక రాజు. పూర్వజన్మలో ఇతడొక అసురుడు. - మహాభారతం

**దేవానికుడు :** శ్రీరాముని వంశంలో జన్మించిన ఒక రాజు. క్షేమధాముని కుమారుడు. రుక్షుని తండ్రి. పారియాత్రుడి తాత. - భాగవతం

**దేవాంతకుడు :** ఓ రాక్షసుడు. రుద్రకేతు కుమారుడు. ముల్లోకాలు ఇతడికి భయపడగా గణపతి కశ్యపుని ఇంట్లో ప్రత్యక్షమై ఇతణ్ణి వధించాడు. - పద్మపురాణం

**దేవాపి 1 :** చంద్ర వంశంలో జన్మించిన ఒక రాజు. ప్రతీపునికి ముగ్గురు పుత్రులు దేవాపి, శంతను, బాహ్లిక. దేవాపి చర్మవ్యాధి గ్రస్తుడగుటవలన ప్రతీపుడు ప్రజల కోరిక మేరకు శంతనుని పట్టాభిషిక్తుని జేసెను. దేవాపి అసంతృప్తుడై అడవికి వెళ్లి తపస్సు చేస్తూ తన తదనంతర జీవితాన్ని గడిపెను. ఇతడు పృథోదొక తీర్థంలో తపస్సు చేసి చివరికి ముక్తిని పొందెను. - మహాభారతం

**దేవాపి 2 :** పాండవుల పక్షాన పోరాడిన చేది దేశపు వీరుడు. ఇతడిని కర్ణుడు సంహరించాడు. - మహాభారతం

**దేవాపుడు :** యయాతి వంశంలో పుట్టిన ఒక రాజు. - భాగవతం

**దేవారణ్యం :** ఇదో పవిత్రస్థలం. ఇచ్చటే కాశీరాజు కుమార్తె అంబ తపస్సు చేసెను. - మహాభారతం

**దేవవృధుడు 1 :** ఓ వీరుడు. పాండవులకు వ్యతిరేకంగా కురుక్షేత్ర యుద్ధంలో పోరాడాడు. - మహాభారతం

**దేవవృధుడు 2 :** ఓ రాజు. బంగారు గొడుగు దానంగా ఇవ్వడంవల్ల ఇతడు తన పరివారంతో సహా స్వర్గానికి వెళ్లాడు. - మహాభారతం

**దేవాసుర యుద్ధాలు :** దేవతలకు రాక్షసులకు మధ్య జరిగిన యుద్ధాలు. ఇవి మొత్తం పద్నాలుగు. - పద్మపురాణం

**దేవాహ్యయుడు :** ప్రాచీన భారతావనిలో ఓ రాజు. - మహాభారతం

**దేవిక 1 :** శైబ్యరాజు గోవాసుడి కుమార్తె. ధర్మజుని భార్య. వీరి కుమారుడు యౌధేయుడు. - మహాభారతం

**దేవిక 2 :** ఇదో పవిత్ర క్షేత్రం. ఇక్కడి నీటిలో ఒకసారి మునిగితే యజ్ఞఫలితం లభిస్తుంది. - మహాభారతం

**దేవీతీర్థం :** కురుక్షేత్రంలోని మూడు పవిత్ర తీరాలకు గలపేరు. ఆ క్షేత్రాలు శంఖిని, మధుమతి, మృగధూమల. శంఖినిలో స్నానంచేస్తే శారీరక సౌందర్యం, తక్కిన రెండింటిలో స్నానంచేస్తే వెయ్యి గోదానాల ఫలితం లభిస్తుంది. - మహాభారతం

**దేవీపీఠం :** శచీదేవి శరీరం ముక్కలు ముక్కలై భారత దేశంలో అనేకచోట్ల పడింది. ఈ పడిన ప్రదేశాలన్నింటినీ దేవీ పీఠాలంటారు.

**దేవీస్థానం :** ఒక పవిత్రస్థలం. - మహాభారతం

**దేవుడు1 :** ఒక మనువు, ప్రజాపతి తండ్రి.

**దేవుడు 2 :** దేవతలు 33 కోట్లు. వారికి ప్రతినిధులు 33. అందులో ఆదిత్యులు 12, రుద్రులు 11, వసువులు 8, అశ్వనీదేవతలు 2. మొత్తం 33.

**దైత్యదీపుడు :** గురుత్మంతుడి కొడుకుల్లో ఒకడు. - మహాభారతం

**దైత్యసేన :** అరిష్టనేమి కూతురు. దేవసేన సోదరి. కేశిభార్య. - చూ॥ దేవసేన

**దైత్యులు :** దక్షప్రజాపతి కూతురైన దితి సంతతి. దితి కశ్యపుని భార్య. ఈమె సంధ్యాసమయమున కశ్యపుడు అనాసక్తిగా వున్నపుడు అతడితో రమించింది. కశ్యపుడు ఈమెకు జన్మించిన వారు అసురులు కాగలరని శపిస్తాడు. ఈమెకు హిరణ్య కశిపుడు, హిరణ్యాక్షుడు, సింహిక అనే కుమార్తె జన్మించారు. ఈమె వంశపారంపర్య సంతతి రాక్షసులయ్యారు. దితివల్ల జన్మించారు కనుక దైత్యులంటారు.

**దైవం 1 :** భగవంతుడు

**దైవం 2 :** ఓ వివాహ విధానం. తన పుత్రికను పురోహితుడికి గాని గురువుకిగాని ఇచ్చి వివాహం చేయడం ఈ విధానంలో ప్రధానమయినది.

**దైవాలికం :** ప్రాచీన భారతావనిలో ఒక దేశం. ఈ దేశ ప్రజలు, రాజు ధర్మజుని రాజసూయ యాగానికి వస్తారు. - మహాభారతం

**దోష :** పుష్పార్ణుడి రెండోభార్య. వ్యుష్టి తల్లి.

**దండకరుడు :** ఓ శూద్రుడు. 'విష్ణు పంచకం' పఠించి నరకం వెళ్లకుండా తప్పించుకున్నాడు. త్రేతాయుగంలో నివసించిన ఈ శూద్రుడు చాలా తప్పుడు పనులు చేశాడు. చివరికి బ్రాహ్మణుల సలహాపై విష్ణు పంచకం పఠించి స్వర్గం చేరాడు. - పద్మపురాణం

**దండకారణ్యం :** గంగా తీరాన గల లోయ ప్రాంతం. దీనికి రామాయణంలో చాలా విశిష్టతవుంది. జటాయువుని రావణుడిక్కడే ఖండించాడు. రాముడు అరణ్యవాసంలో ఇక్కడే ఆశ్రమం నిర్మించుకున్నాడు. శూర్పణఖ ముక్కు చెవులు లక్షణుడు కోసిందిక్కడే. ఖర, దూషణ, త్రిశిరులను వారి సేనను రాముడు నాశనం చేశాడు. రావణుడు సీతను ఎత్తుకు పోయింది, మారీచుణ్ణి శ్రీరాముడు వధించింది ఇక్కడే. - మహాభారతం

**దండకుడు :** దండుడు

**దండకేతు :** పాండవుల పక్షాన పోరాడిన వీరుడు. అందమైన అశ్వంపై వుండి యుద్ధం చేశాడు. - మహాభారతం

**దండగౌరి :** ఓ అప్సరస. అర్జునుని గౌరవార్థం ఇంద్ర సభలో నాట్యం చేసింది. - మహాభారతం

**దండధరుడు 1 :** మగధ దేశపు క్షత్రియరాజు. క్రోధవర్ధనుడి పునర్జన్మగా చెప్తారు. భీమసేనుడు తన జైత్రయాత్రలో ఇతణ్ణి ఇతడి సోదరుడు దండుడిని జయిస్తాడు. కురుక్షేత్ర యుద్ధంలో కౌరవుల పక్షాన పోరాడి అర్జునుని చేతిలో మరణిస్తాడు. - మహాభారతం

**దండధరుడు 2 :** ధృతరాష్ట్రుని 100 మంది కొడుకుల్లో ఒకడు. కురుక్షేత్ర యుద్ధంలో భీముడితణ్ణి వధిస్తాడు.

**దండధరుడు 3 :** ఓ రాజు. పాండవులకు సహాయపడతాడు. మణిమానుడిపేరు కూడా ఇతని పేరుతో ఎప్పుడు కలిసివుంటుంది. అతడు ఇతని సోదరుడుకా వొచ్చు. ద్రౌపది స్వయంవరంలో కూడా పాల్గొంటాడు. కురుక్షేత్ర యుద్ధంలో ద్రోణుడితణ్ణి వధిస్తాడు. - మహాభారతం

**దండధరుడు 4 :** పాంచాల దేశపు వీరుడు. ధర్మజుని సైన్యాన్ని వెనకుండి నడిపేవాడు. కర్ణుడి చేతిలో మరణిస్తాడు. - మహాభారతం

**దండనీతి :** ఇది నేరానికి రాజులు విధించే శిక్ష. ప్రాచీన భారతదేశంలో ఈ విధానం అన్ని రాజ్యాలలోని రాజులు పాటించేవారు. 250 ఫణాలు మొదటి శిక్ష, 500 ఫణాలు మరింత పెద్ద శిక్ష. మరింత తప్పుకు 1000 ఫణాలు రుసుముగా కట్టించేవారు. అది అన్నిటికన్నా పెద్ద శిక్ష. - అగ్నిపురాణం

**దండపాణి 1 :** యయాతి వంశంలోని రాజు. విభినారుడి కుమారుడు. ఇతని కుమారుడు నిమి. - భాగవతం

**దండపాణి 2 :** పుండరకుని కుమారుడు. పుండరకుడిని శ్రీకృష్ణుడు చంపగా ఇతడు శ్రీకృష్ణుడిని ఎదుర్కోలేక శివుణ్ణి గూర్చి తపస్సు చేయగా శివుడు కృత్యను సృష్టించి ద్వారకపైకి పంపగా సుదర్శన చక్రం దానిపై ప్రయోగించగా అది వారణాసి పరుగెత్తుతుంది. సుదర్శన చక్రం వెంటాడి దీన్ని భస్మం చేస్తుంది. - పద్మపురాణం

**దండబాహు :** సుబ్రహ్మణ్యస్వామి (స్కందుడు) అనుచరుల్లో ఒకడు. - మహాభారతం

**దండం 1 :** ప్రాచీన భారతదేశంలోని ఓ ప్రాంతం. పంపానది తీరంలో వుంది. ఇక్కడ స్నానంచేస్తే 1000 గోవుల్ని దానంచేసిన ప్రతిఫలం లభిస్తుంది. - మహాభారతం

**దండం 2 :** యముని దైవికమైన ఆయుధం. దీన్ని యముడు అర్జునుడికి కానుగా ఇచ్చాడు. - మహాభారతం

**దండం 3 :** దండనీతి సూత్రాలలో ఇదొకటి. సామ, దాన,భేద, దండోపాయాలలో ఇది చివరిది, వీటిల్లో సామ, దండోపాయాలు ఆ దేశ సౌభాగ్యానికి అత్యంత ఆవశ్యకమైనవి.

**దండాశ్వుడు :** ఇక్ష్వాకు వంశస్తుడు. దృఢాశ్వుడి మరో పేరు. తండ్రి దుందుమారుడు. ఇతని కొడుకు హర్యశ్వుడు.

**దండి 1 :** ధృతరాష్ట్రుని కుమారుల్లో ఒకడు. - మహాభారతం

**దండి 2 :** ఒక దేవుడు. సూర్యుణ్ణి సేవిస్తుంటాడు. - అగ్నిపురాణం

**దండుడు 1 :** ఇక్ష్వాకుని ముగ్గురు కుమారుల్లో చివరివాడు. ఇతడు క్రోధహంతు అను రాక్షసుని పునర్జన్మ. ఇతడు గొప్ప విలువిద్యా నిపుణుడు. ఇతడు దేవాసుర యుద్ధంలో పాల్గొని ఎంతోమంది అసురుల్ని సంహరించాడు. - బ్రహ్మాండపురాణం

ఇక్ష్వాకుడు ఇతనికి హిమాలయ వింధ్య పర్వత మధ్య ప్రాంతాన్నిచ్చి రాజును చేశాడు. ఇతడు మధుమిత్ర నగరాన్ని రాజధానిగా చేసుకొని పాలించాడు. ఇతనికి చతురంగబలాలు వుండేవి. ఇతని పురోహితుడు శామనుడు. - ఉత్తర రామాయణం

*దండకారణ్యం పుట్టుక :* శుక్రుడను ముని కుమార్తెను ఇతడు తపస్సు చేసుకుంటుండంగా బలాత్కరించాడు. శుక్రుడు ఆగ్రహించి అగ్ని జ్వాలలతో ఇతని దేశాన్ని దహింపచేశాడు. అప్పటి నుండి ఇది దండకారణ్యమయ్యింది.

**దండుడు 2 :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. విదండుని కుమారుడు. విదండుడు, దండుడు కూడా ద్రౌపది స్వయంవరానికి వచ్చారు. భీమసేను డితణ్ణి ఓడించాడు. ఇతడు ఇతని సోద రుడు మగధరాజు అయిన దండధరుడు అర్జునుని చేతిలో సంహరింపబడ్డారు. - మహాభారతం

**దండుడు 3 :** ఇతడు సూర్యుని సేవకుడు. - మహాభారతం

**దండుడు 4 :** చేది రాజ్యంలోని ఒక వీరుడు. పాండవుల పక్షాన పోరాడి కర్ణుని చేతిలో మరణించాడు. - మహాభారతం

**దండుడు 5 :** మహావిష్ణువుకు గల పెక్కుపేర్లలో ఇదొకటి. - మహాభారతం

**దండుడు 6 :** ఓ రాక్షసుడు. సుమాలి అనే రాక్షసుడి తనయుడు. రావణుని తొమ్మిది మంది మంత్రులు ఇతని సోదరులే. - ఉత్తర రామాయణం

**దండుడు 7 (దండకుడు) :** ద్వాపర యుగంలో ప్రజల్ని భయపెట్టిన ఓ గజదొంగ. ఇతడు బ్రాహ్మణుల సంపదను దోచుకొనేవాడు. నమ్మినవాళ్లను చంపేవాడు. అబద్ధాలు చెప్పేవాడు. మానభంగాలు చేయడం,

గోమాంసం భుజించడం సర్వ సాధారణం. ఒకసారి వైష్ణవాలయంలోకి వెళుతూ కాళ్ళు శుభ్రం చేసుకొని వెళతాడు. అప్పుడు ఆ గుడిలోని చిన్న గొయ్యి ఇతని తడికాళ్లకున్న మట్టి వల్ల సమతలం అవుతుంది. గుడిలోకి వెళ్లి రాధాకృష్ణుల విగ్రహాలనుచూసి పాదాభివందనం చేస్తాడు. దానితో అతని పాపాలన్నీ పోతాయి. అయినా శ్రీకృష్ణుని వస్త్రం లాగి అందులో ఆభరణాలన్ని మూటకట్టుకొని పోతుండగా కాళ్లు వణికి మూటక్రిందపడగా చుట్టుప్రక్కల ప్రజలు ఇతణ్ణి పట్టుకొని చితకబాదగా చనిపోయి యమలోకం వెళ్తాడు. యముడు ఇతణ్ణి గురించిన మంచి చెడులను విశదీకరించమనగా చెయ్యాని పాపంలేదని ఒక్క వైష్ణ వాలయంలోని గొయ్యి మాత్రం పూడ్చాడని చెప్పగా విష్ణులోకం వెళ్ళమని మృత్యుబాధలు అక్కడ వుండవని యముడు చెప్తాడు. – పద్మపురాణం

**దంతఘాతుకుడు :** ఇతడు విశ్వామిత్రుడు సృష్టించిన రాక్షసుడు. హరిశ్చంద్రుణ్ణి భ్రమింపజేసి అతణ్ణి బేతాళ వటం క్రిందకు చేర్చడానికి విశ్వామిత్రుడితణ్ణి సృష్టించాడు.

**దంతధ్వజుడు :** తామసుడనే మనువు కుమారుడు. ఇతడొకసారి పుత్ర ప్రాప్తికై రక్తమాంసాలను హోమంలో వేస్తాడు. ఫలితం లేక తనే దూకుతాడు. అప్పుడితడికి ఏడుగురు పుత్రులు జన్మిస్తారు. వీళ్లే మరుత్తులు. తామస మన్వంతరంలో వీరు మనువులవుతారు. – వామనపురాణం

**దంతవక్త్రుడు 1 :** కారూప దేశానికి చెందిన క్షత్రియ రాజు. క్రోదవశుడను రాక్షసుడి పునర్జన్మ. – మహాభారతం

**దంతవక్త్రుడు 2 :** వైకుంఠ ద్వారపాలకులైన జయవిజయుల్లో విజయుడి పునర్జన్మ. ఇతడు శ్రీకృష్ణుని సమకాలికుడు. శ్రీకృష్ణుని చేతిలో మరణించి వైకుంఠం చేరాడు. – చూ॥ జయ విజయులు

**దంతిముఖుడు :** ఇతడొక అసురుడు. సుబ్రహ్మణ్య స్వామితో యుద్ధంలో మరణించాడు. – స్కందపురాణం

**దంబర :** బ్రహ్మ సుబ్రహ్మణ్యస్వామికిచ్చిన ఇద్దరు అనుచరుల్లో ఒకడు.

**దంభ :** విప్రచిత్తికి జన్మించిన అసురుడు. విప్రచిత్తి కశ్యపదనులకు జన్మించిన అసురుడు. ఇతని కుమారుడు శంఖచూడుడు. శుక్రాచార్యుని వద్ద విష్ణు మంత్రం తెలుసుకుని ఓ లక్ష సంవత్సరాలు తపస్సు చేయగా శంఖచూడుడు జన్మించాడు. – దేవీభాగవతం

**దంభోద్భవుడు :** ఒకరాజు. ఇతడు ప్రపంచాన్నంతా ఓడిస్తాడు. బ్రహ్మ సలహాపై నరనారాయణులతో యుద్ధం చేసి ఓటమిపాలవుతాడు. అప్పటినుండి సుచరితుడై జీవిస్తాడు. – మహాభారతం

**దంష్ట్రి :** శుక్రుడి కుమారుడు. దైత్యుల గురువు.

**దంసుడు :** అలర్కం అనే కీటకంగా జన్మించిన రాక్షసుడు. పేడపురుగు రూపంలో వచ్చి కర్ణుడి తొడను తొలుస్తాడు. ఈ రూపం పొందక మునుపు భృగువు భార్యను ఎత్తుకుపోయాడు. – మహాభారతం

**దాంత :** ఒక అప్సరస. అష్టావక్రుడి గౌరవార్థం నృత్యం చేస్తుంది. – భాగవతం

**దాంతుడు :** దమయంతి సోదరుడు. ఇతని మరోసోదరుడు దముడు. విదర్భరాజు భీముని కొడుకు. – మహాభారతం

**దుండి :** దుంధి విఘ్నేశ్వరుడని కూడా అంటారు. కాశీలో ప్రతిష్ఠింపబడిన విఘ్నేశ్వరుడు.

**దుందుడు :** ఒక రాక్షసుడు. ఇతడిని వధించడం వల్ల కువలయాశ్వునికి దుందుమారుడను పేరొచ్చింది. – చూ॥ దుందుమారుడు

**దుందుభి 1 :** ఓ భయంకర రాక్షసుడు. మయుని కుమారుడు. మాయావికి అన్న. దనుకశ్యపుల సంతతికి జన్మించిన వారు అసురులు. ఆ సంతతిలో జన్మించిన మయుడు గొప్ప శిల్పి. ఒకసారి మయుడు దేవలోకంలో దేవకన్యలు నాట్యం చేస్తుండగా హేమ అనే అప్సరసను మోహించి హిమాలయాలకు దక్షిణాన గొప్పభవనం నిర్మించుకొని నివాసమున్నాడు. వారికి ఇద్దరు పుత్రులు జన్మించారు. ఒకడు దుందుభి రెండోవాడు మాయావి. – ఉత్తర రామాయణం

*రావణునితో బాంధవ్యం :* మయుడు హిమాలయాలకు పశ్చిమాన ఓ కుమార్తెకోసం తపస్సు చేశాడు. ఒకరోజు సుబ్రహ్మణ్యస్వామి జన్మ దినోత్సవం జరపడానికి బ్రాహ్మణులకు దానం చేయడానికి కైలాసం నుండి రాగా అదే సమయంలో శివభక్తురాలైన మధుర సోమవార వ్రతం జరిపి శివుని దర్శనార్థం కైలాసానికి

వచ్చింది. ఆమె తిరుగు ప్రయాణంలో ఆమె స్తనాలకు విభూతి వుండటం చూసి పార్వతి ఆమెను నూతిలో కప్పగా వుండమని శపించింది. మధుర శివుడ్ని వేడుకోగా ఓ 12 సంవత్సరాల తర్వాత నీకు శాప విమోచనం కల్గుతుందని చెప్తాడు. ఆమె మయుడు తపస్సు చేసే ప్రక్క బావిలో వుంటుంది. 12 సంవత్స రాలకు ఆమె నిజరూపం దాల్చగా మయుడు శివ ప్రసాదమని తలచి ఆమెను తన కుమార్తెగా స్వీకరించి మండోదరిగా నామకరణం చేస్తాడు. రావణుడు ఆమెను వివాహమాడతాడు. కనుక దుందుభి రావణుడు బావ బావమరుదులవుతారు.

*దుందుభి ఉత్తానపతనాలు :* కైలాస పర్వతాన్ని తల పించి జడలబర్రెలా వుండే ఈ దుందుభి శివుడిచ్చిన వరాలతో 1000 ఏనుగుల బలంతో సముద్రునితో పోరాడటానికి వెళ్లాడు. – *శివపురాణం*

దుందుభి శక్తిని చూసి వరుణుడు నీతో పోరాడే శక్తి నాకు లేదు. హిమవంతుడే నీకు దీటైనవాడని చెప్పగా హిమవంతుడి దగ్గరకు వెళ్లాడు. అతడు తనకంత శక్తి లేదని దక్షిణాన వానర రాజు నీతో పోరాడగల శక్తి కలవాడని చెప్పగా కిష్కిందకు వచ్చి కోటబైట వుండి తన అరుపులతో వాలిని ఆహ్వానిస్తాడు. మనకు వైరంలేదు కనుక నీతో యుద్ధం చేయనన్నావినడు. వాలి ఇంద్రుడు ప్రసాదించిన హారాన్ని ధరించి దుందుభితో మల్ల యుద్ధానికి ముందుకువస్తాడు. అతని సోదరుడు సుగ్రీవుడు కూడా వెళ్తాడు. భూమిపై పోరాడగా పోరాటం తీవ్రతరం అవుతుండగా వాలి శక్తి వంతుడు, దుందుభి శక్తిహీనుడూ అవుతుంటారు. చీకటి పడటం వల్ల దుందుభి ఆకాశమార్గాన యుద్ధం చేయతలచి విఫలుడౌతాడు. ఇలా వీరు మల్లయుద్ధం చేస్తూ వుంటే దుందుభి ఓ గుహలోకి వెళ్తాడు. వాలి వాడివెంట లోపలికి వెళ్తాడు. ఓ సంవత్సరమైనా తిరిగి రారు. ఆ తర్వాత రక్తం ఆ గుహ ద్వారం గుండా ప్రవహించింది. సుగ్రీవుడు తన అన్న చనిపోయాడని తలచి ఆ గుహకు మూతపెట్టి కిష్కింద వస్తాడు. దుందుభిని చంపిన వాలి ఆ రాతిని తొలగించుకొని బయటకు వచ్చి తమ్ముడు తనకు అపకారం చేశాడని తలచి అతణ్ణి కిష్కింధ నుండి తరిమివేస్తాడు. దుందుభి నుండి వచ్చిన రక్తం ఆకాశానికి చిందుతుంది. కొంత రుష్యమూక పర్వతం మీద పడగా మాతంగ మహర్షి ఆగ్రహించి ఈ రక్తం ఎవరిదైనా ఎవరివల్ల పడినా అతడీ రుష్యమూక పర్వతం పైకివస్తే అతని తల 1000 వక్కలవుతుందని శపిస్తాడు. వాలిచే తరిమివే యబడ్డ సుగ్రీవుడు రక్షణ కొరకు రుష్యమూక పర్వతం పై నివసిస్తాడు. – రామాయణం

**దుందుభి 2 :** చూ॥ మంథర

**దుందుభినిహ్రాదుడు :** ఇతడొక రాక్షసుడు. దితి కుమా రుడు. ప్రహ్లాదుడి బాబాయి. దేవాసుర యుద్ధంలో తన ఓటమికి బ్రాహ్మణులు కారణమని వారిని హింసి స్తాడు. కాశీ దేవాలయాన్ని, ఇతర దేవాలయాల్ని ఆక్రమిస్తాడు. శివుడు బ్రాహ్మణులకు ఆశ్రయమిచ్చి ఇతణ్ణి వధిస్తాడు. – *శివరుద్ర సంహిత*

**దుందుభీస్వనం :** కుశద్వీపంలో ఓ ప్రాంతం. – *మహాభారతం*

**దుందుమారుడు :** ఇక్ష్వాకు వంశస్తుడు. పేరు కువలయా శ్వుడు. దుందుడను రాక్షసుణ్ణి చంపడం వల్ల ఈ పేరు వచ్చింది.

**దుఃఖం :** అధర్ముడి భార్య హింస. అనృతుడు, నికృతి ఇతని సంతానం. వీరికి భయ, నరక, మాయా, వేద నలు జన్మిస్తారు. మాయకు మృత్యువు, వేదనకు రౌరం వల్ల దుఃఖం పుడుతుంది. – అగ్నిపురాణం

**దృఢక్షత్రుడు :** గాంధారీ ధృతరాష్ట్రుల కొడుకు. – *మహాభారతం*

**దృఢదస్యుడు :** ఒక రాజు. ఉత్పలావతికి తండ్రి. – మార్కండేయ పురాణం

**దృఢనేమి :** పూరు వంశపు రాజు. సత్యహ్రాది కుమా రుడు. సుపార్శ్వుడికి తండ్రి. – *భాగవతం*

**దృఢరథాశ్రయుడు :** ఇతడ్ని దృఢరథుడని కూడా అంటారు. గాంధారి ధృతరాష్ట్రుల కొడుకు. – *మహాభారతం*

**దృఢరథుడు :** కక్షాయుడి వంశంలోని వాడు. జయద్ర దుడి కొడుకు. – *మహాభారతం*

**దృఢవర్మ :** గాంధారి ధృతరాష్ట్రుల కుమారుడు. ఇతణ్ణి దృఢుడు అనికూడా అంటారు. కురుక్షేత్ర యుద్ధంలో భీముడు వధించాడు. – *మహాభారతం*

**దృఢవ్రతుడు :** దక్షిణ భారతదేశంలో నివసించిన బ్రహ్మర్షి. ఇతణ్ణి దృఢాయువు అనికూడా అంటారు.
– మహాభారతం

**దృఢవ్యుడు :** ఇతడొక మహర్షి. ధర్మజుని 7 గురు రుత్విక్కుల్లో ఒకడు. – మహాభారతం

**దృఢసంధుడు :** గాంధారీ ధృతరాష్ట్రుల తనయుల్లో ఒకడు. – మహాభారతం

**దృఢసేనుడు :** ఇతడొక రాజు. యయాతి వంశంలోని వాడు. పాండవుల పక్షాన పోరాడి ద్రోణుడి చేతిలో మరణించాడు. – మహాభారతం

**దృఢహనువు :** బృహదిషుడి వంశస్తుడు. సేవజిత్తు కుమారుడు.

**దృఢహస్తుడు :** గాంధారీ ధృతరాష్ట్రుల 100 మంది పుత్రుల్లో ఒకడు. – మహాభారతం

**దృఢాయుధుడు :** ధృతరాష్ట్రుని కొడుకు. కురుక్షేత్ర యుద్ధంలో మరణించాడు. – మహాభారతం

**దృఢాయువు :** ఊర్వసీ పురూరవుల కొడుకు. ఉత్తర భారతదేశపు రాజు. భారతయుద్ధ కాలంలో జీవించిన వాడు. – మహాభారతం

**దృఢాశ్యుడు 1 :** దుందుమారుడి కొడుకు. ఇతడి కొడుకు హర్యశ్యుడు.

**దృఢాశ్యుడు 2 :** కువలయాశ్వుడి కొడుకు.
– మహాభారతం

**దృఢాస్యుడు :** అగస్త్యలోపాముద్రల కుమారుడు. ఇతని కుమారుడు తేజస్వి. ఇతడ్ని ఇధ్మవాహుడని కూడా అంటారు. – మహాభారతం

**దృఢేయుడు :** ప్రాచీన భారతావనిలో పశ్చిమ ప్రాంతంలో నివసించిన రుషి. – మహాభారతం

**దృఢేష్టధి :** ప్రాచీన భారతదేశంలోని రాజుల్లో ఒకడు.
– మహాభారతం

**దృశ్యుడు :** అగస్త్యుని కుమారుడు.

**దృషద్వంతుడు :** పూరు వంశపు రాజు. వరాంగి ఇతడి భార్య. ఇతని అల్లుడు సంయాతి. – చూ॥ సంయాతి.

**దృషద్వతి :** కురుక్షేత్రానికి దక్షిణాన గల నది. పాండవులు అరణ్యవాసంలో ఈ నది నీటినే త్రాగారు. దీనికి ఉత్తరాన నివసించడం స్వర్గంలో నివసించిన దానితో సమానం – మహాభారతం

**దృహి :** యయాతి వల్ల శర్మిష్టకు జన్మించిన ముగ్గురు కొడుకుల్లో ఒకడు. యయాతి తన ముసలితనాన్ని స్వీకరించమని కోరగా ఇతడు నిరాకరిస్తాడు. యయాతి వృద్ధాప్యం రాకుండానే మరణించేటట్లు, ఇతని వంశం వారికి రాజ్యప్రాప్తి లేకుండా శపిస్తాడు.
– మహాభారతం

**ద్రమిళుడు :** కన్యాకుబ్జంలోని ఒక గోపరాజు. భార్య కళావతి. ఆమెకు సంతానము లేదు. తపస్సు చేసి కశ్యపుని యెదుట నిలచెను. భర్తతో ఈ కథ చెప్పగా బ్రహ్మణుని వీర్యమున భగవత్భక్తుడు పుట్టునని ఆమెను బ్రాహ్మణుని వెంటనే వుండుమని చెప్పి తన సర్వస్వమును బ్రాహ్మణులకు దానముచేసి యోగం వల్ల గంగా తీరమున శరీరము విడిచెను. నారదుడీమె గర్భమున జనించెను. బ్రహ్మశాపము వల్ల శపించ బడిన ఉపబర్హణుడీమె గర్భముననే జన్మించెను.
– బ్రహ్మవైవర్తపురాణం

**ద్రవిధుడు 1 :** ప్రియవ్రతుని వంశంలోని ఒక రాజు. ప్రియవ్రతుడు మనువు కుమారుడు – భాగవతం

**ద్రవిధుడు 2 :** ఓ గంధర్వుడు. ఇతడు కంసుని తండ్రి. ఈ గంధర్వుని కూతురు అంశుమతి.

**ద్రవిణసుడు :** ఓ ప్రచేతసుడు. ప్రాచీన బర్హిషుడి 10 మంది పుత్రుల్లో ఒకడు. – భాగవతం

**ద్రవిణుడు :** ధరుడి కుమారుడు.

**ద్రవిరధుడు :** అంగ వంశంలోని ఒక రాజు. దధివాహణుని కుమారుడు. ధర్మరధునికి తండ్రి.
– అగ్నిపురాణం

**ద్రవిళుడు (ద్రవిడుడు) :** ఉగ్రసేనుని భార్యను వలచిన రాక్షసుడు. ఒకసారీమె స్నానానికి వెళ్ళగా ఉగ్రసేనుడి రూపంలో వచ్చి రమిస్తాడు. ఈమెకు కంసుడు పుడతాడు. జరిగిన మోసం తెలుసుకుని నీ వంశంలో పుట్టినవారే నిన్ను సంహరిస్తారని ఈమె ద్రవిళుణ్ణి శపిస్తుంది. – భాగవతం

**ద్వయాక్షం :** ప్రాచీన భారతావనిలో ఒక దేశం. ఈ రాజు యుధిష్ఠురునికి బహుమతులిస్తాడు.
– మహాభారతం

**ద్రాక్షారామము :** ఇది ఆంధ్రదేశమున గల ఒక శివ క్షేత్రము.

**ద్రావిడభాష :** భాషాపండితులు ప్రపంచంలోని భాషల్ని కొన్ని సముదాయాలుగా పేర్కొన్నారు. వాటిలో ముఖ్య మైనవి ఇండోయురోపియన్, సెమిటిక్, హమిటిక్, ఉరల్ అల్టాయిక్, సౌత్ఈస్ట్ ఏసియాటిక్, ద్రవిడ, ఆస్ట్రిక్, బంటు మరియు చైనీస్. దక్షిణ భారతదేశంలో దాదాపు అన్నీ ద్రవిడ భాషా సముదాయం క్రిందికే వస్తాయి. అవి తమిళం, తెలుగు, కన్నడ, మళయాళం, తుళు, కుఠికు, తోఠ, కాఠ, బధక, కురుక్ మరియు బ్రాహ్యూ. ఇందులో బ్రాహ్యూమాత్రం బెలూచిస్థాన్ పర్వత ప్రాంతాలలో వుంది. కొందరు భాషా పండి తులు ద్రవిడ, ఆస్ట్రేలియా భాషలకు సంబంధం వుందని చెప్తున్నారు. ఆర్యభాష ద్రావిడ భాషలన్నిం టిపై ప్రభావం చూపిందిగాని ద్రవిడంపై అతి తక్కువగా మాత్రమే పడింది. కారణం ప్రాచీన కాలం నుండి ద్రవిడ భాషలో సంస్కృతి సాహిత్య వికాసం ఎక్కువగా వుంది. ద్రావిడభాష నాల్గు విభాలుగా విభ జించబడింది. తూర్పు, పడమర, ఉత్తర, దక్షిణ భాషలు. ఇందులో ఉత్తర భాషపై ఇరానీ భాషా ప్రభా వం ఎక్కువగా వున్నా ఇంకా పదాలు, వ్యాకరణం ద్రావిడ రూపంలోనే వున్నాయి. తూర్పు విభాగంలో తెలుగు, గోండి, కురుక, కొలామి, మాల్బ వస్తాయి. కాని తెలుగు మాత్రం సాహితీ వికాసంతో తనస్వంత భాషగా బలపడింది. దీనిపై సంస్కృత ప్రభావం కూడా వుంది.

కన్నడ, కులుకు, తోట, కోడ పశ్చిమ విభాగంలోకి వస్తాయి. ఆధునిక కన్నడ భాష 16వ శతాబ్దం నుండే ఉపయోగంలో వుంది. తమిళం, మళ యాళం దక్షిణ విభాగంలోకి వస్తాయి. ప్రాచీన తమిళ భాష క్రీ.పూ. 30వ శతాబ్దిలోనే వుంది. అందులో సంఘ సాహిత్యం ముఖ్యం. మళయాళం క్రీ.శ. 3వ శతాబ్దం లో స్వంతభాషగా ఏర్పడింది. ద్రవిడం నుండి మొట్టమొదట వేరుపడిన భాష తెలుగు.

**ద్రావిడులు :** ద్రావిడులు అసలు క్షత్రియులు. బ్రాహ్మ ణుల శాపం వల్ల శూద్రులయ్యారు. – మహాభారతం

**ద్వాదశభుజుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. – మహాభారతం

**ద్వాదశాక్షుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. – మహాభారతం

**ద్వాదశాదిత్యులు :** అదితి వల్ల కశ్యపునికి జన్మించిన 12 మంది కుమారుల్ని ద్వాదశాదిత్యు లంటారు. ఆదిత్యులనగా అదితికి జన్మించినవారు. వారి పేర్లు, ఏ రాశిలో వారు ప్రాముఖ్యత వహిస్తారో వాటి రంగు పేర్కొనబడినవి.

| | | |
|---|---|---|
| 1. వరుణుడు | మేషరాశి | – నలుపు |
| 2. సూర్యుడు | రుషభరాశి | – రక్తపుటెరుపు |
| 3. సహస్రాంశుడు | మిధునరాశి | – సాధారణ ఎరుపు |
| 4. ధాత | కర్కాటక రాశి | – పసుపు |
| 5. తపన | సింహరాశి | – తెలుపు |
| 6. సమితా | కన్యారాశి | – స్వచ్ఛమైన తెలుపు |
| 7. గభస్తి | తులారాశి | – చంద్రుడి రంగు |
| 8. రవి | వృశ్చికరాశి | – పసుపు |
| 9. పర్జన్య | ధనురరాశి | – చిలుకపసుపు |
| 10. త్వష్ట | మకరరాశి | – మంచుతెలుపు |
| 11. మిత్ర | కుంభరాశి | – పొగరంగు |
| 12. విష్ణు | మీనరాశి | – నీలం |

**ద్వాదశీవ్రతం :** హిందూధర్మం ప్రకారం బాధల నుండి పేదరికం నుండి విముక్తం కావడానికి చేసే వ్రతం. ఫల్గుణ మాసంలో శుద్ధ పాడ్యమినాడు ఈ వ్రతం చేస్తారు. *పూర్వకథ :* మహాబలి తన సైన్యంతో దేవతలతో యుద్ధంచేసి వారిని స్వర్గంనుండి తరిమివేయగా అదితి తన సంతానికి కలిగిన నష్టాన్ని గురించి కశ్యపు నికి చెప్పగా కశ్యపుడు ఈ వ్రతం ఆచరించమంటాడు. అదితి అట్లు ఆచరించగా శ్రీమహావిష్ణువు వామనుడై బలిని పాతాళానికి తొక్కివేస్తాడు. ఆ రోజునుండి ఈ వ్రతం ప్రసిద్ధ మయింది. – భాగవతం

**ద్వాపరయుగం :** చాతుర్యుగాల్లో మూడవది. ఈ యుగంలో వ్యాసుడు వేద విభజన చేశాడు.

– చూ॥ కాలమానం.

**ద్వాపరుడు 1 :** కలియొక్క స్నేహితుడు. దమయంతి స్వయంవరానికి కలితోపాటు వెళ్తాడు.

**ద్వాపరుడు 2 :** ద్వాపరయుగంలోని దైవం.

– చూ॥ యుగాలు

**ద్వారక :** శ్రీకృష్ణుని రాజధానీ నగరం. మగధ రాజైన జరాసంధుడు యాదవులకు శత్రువు. యాదవులంతా శ్రీకృష్ణుని నాయకత్వంలో పశ్చిమతీర ద్వీపంలో ఓ

అందమైన నగరాన్ని నిర్మించుకున్నారు. అదే ద్వారక. దాన్ని కుశస్థలి అనికూడా అంటారు. రైవతక పర్వతాలు కోటలా ఈ పట్టణాన్ని రక్షిస్తాయి. రైవతం 3 యోజ నాల పొడవుంటుంది. ప్రతి యోజనంలో 3 విభాగల సైన్యం, ప్రతియోజనానికి 100 తలుపులు వాటికి బలమైన రక్షక భటులు వుండేవారు. దీనిని విశ్వకర్మ నిర్మించాడు. నగరానికి తూర్పున ఓ కొలను నగ రంలో నాలుగు ఉద్యానవనాలైన నందన మిశ్రక చైత్ర రథ వైభ్రాజలున్నాయి.

*ఇతర విశేషాలు :* అర్జునుడి తీర్థయాత్రలో ద్వారకను సందర్శించాడు. సాళ్వుడు ఈ నగరంపై దాడిచేసి పారిపోయాడు. ఇక్కడే ఇనుప రోకలి పుట్టి యాదవ నాశనానికి కారణమయ్యింది. శ్రీకృష్ణుని నిర్యాణం తర్వాత ఈ నగరాన్ని సముద్రం ముంచివేసింది.

*నేటిస్థితి :* గుజరాత్‌కి పశ్చిమాన సముద్రపు ఒడ్డున చిన్న ప్రాంతం వుంది. దాన్ని ద్వారక అని పిలుస్తారు. అక్కడి ప్రజలు ఇప్పటికి పాడి పరిశ్రమ జీవనాధారంగా వున్నారు. వారు శ్రీకృష్ణుని వారసులమని చెప్తారు.

**ద్వారపాలపురం :** ప్రాచీన భారతదేశంలోని ఓ ప్రాచీన నగరం. నకులుడు దీన్ని జయించాడు. – మహాభారతం

**ద్వారవతి :** ద్వారకకు మరో పేరు. – చూ॥ ద్వారక

**ద్వితుడు :** ఏకతుడు, ద్వితుడు సోదరులు. త్రితుడ్ని ఏకతుడు ద్వితుడు నూతిలోకితోసి మోసం చేస్తారు. త్రితుడి శాపంవల్ల అతడు తోడేలుగా జన్మించి కోతికి మండ్రగబ్బకు జన్మనిస్తాడు. – మహాభారతం

**ద్విమేధుడు :** పూరు వంశపురాజు. అజమీఢుడు, పురుమీఢుడు, ఇతని సోదరులు – అగ్నిపురాణం

**ద్విమూర్ధనుడు :** హిరణ్యాక్షుని కుమారుడు. ఇతని సోద రులు, సాంబరుడు, శకుని, ద్విమూర్ధనుడు, శంకు, ఆర్యుడు. – అగ్నిపురాణం

**ద్విద్విమోచకుడు :** గాంధారీ ధృతరాష్ట్రుల కుమారుడు. – మహాభారతం

**ద్వివిదుడు :** ఇతడో వానరుడు. శ్రీరాముని సైన్యంలో ఓ యోధుడు. – రామాయణం

**ద్రుపదుడు :** (సౌముకి యజ్ఞసేన) : పాంచాలి తండ్రి. విష్ణు సంతతివాడు. పృష్టకుమారుడు. అత్రి, దుష్యంత, భరత, పాంచాల, ముద్గల, దివోదాసులాంటి ప్రముఖులు ఇతని వంశ పూర్వీకులు. విద్యార్థియై భరద్వాజుని ఆశ్రమానికి వెళ్లాడు. ద్రోణుడు ఇతని సహాధ్యాయి. విలువిద్యా సమయంలో మిత్రులయ్యారు. విద్యా భ్యాసం తర్వాత తన దేశానికి రాగా అతని తండ్రి పృష్ట మరణించగా ఉత్తర పాంచాలానికి పట్టం కట్టారు. విద్యాభ్యాస సమయంలోనే వారు స్నేహితులుగా వుండగా ద్రుపదుడు తన స్నేహితునితో తన తండ్రి తనను ఉత్తర పాంచాలానికి రాజుని చేస్తానన్నాడని తాను రాజైతే రాజసంపద నీదేనని చెప్పాడు. విద్యాభ్యాసం తర్వాత ద్రోణుడు వివాహం చేసుకు న్నాడు. అశ్వత్థామ అనే కుమారుడు జన్మించాడు. పేదరికంలో వుండి తన స్నేహితుడు గుర్తుకు రాగా ద్రుపదుని వద్దకు వెళ్తాడు. ద్రుపదుడు ఇతణ్ణి గుర్తించ కపోగా ఇతడు వారి స్నేహాన్ని గుర్తుచేస్తే నవ్వి ధనవంతుడు, పేదవాడికి స్నేహమేమిటి చదువుకున్న వాడికి, చదువురాని వాడికి స్నేహమేమిటి; వీరుడికి పిరికివాడికి మధ్య స్నేహం ఎలావుంటుంది. అలాంటి స్నేహం వుంటే అది నిజమైన స్నేహం కాదని హేళన చేశాడు. ద్రోణుడు భార్య పిల్లవాడితో భవంతి నుండి బయటకు వచ్చి ద్రుపదుణ్ణి ఎదుర్కొనే శిష్యుల కోసం వేట సాగించాడు.

*ద్రోణుని ప్రతీకారం :* భీష్ముడికి తన కథ చెప్పగా అతడు కురు, పాండవులకు విలువిద్య నేర్పమని చెప్పాడు. అస్త్రవిద్యానంతరం ద్రుపదుడిని బందీగా నా వద్దకు తీసుకురావాలని షరతు విధించి కురు పాండవులకు సకల శస్త్రాస్త్ర విద్యలు బోధించి తన కోరిక నెరవేర్చమన్నాడు. ధుర్యోధన, కర్ణ, యుయుత్స, దుశ్శాసన వికర్ణ జరాసంధులు ద్రుపదుని పైకి వెళ్ళి ఓటమి చెంది తిరిగిరాగా అర్జునుడు, భీమనకుల సహదేవుల సహాయంతో ద్రుపద సైన్యాన్ని కకావికలు చేసి ద్రుపదుడ్ని బంధించి తీసుకురాగా “నీ దేశాన్ని నాశనం చేశాను, నీవిప్పుడు నా దయపై ఆధారప డ్డావు. పాత స్నేహం స్నేహం కాదా” అని అడిగాడు. ద్రుపదుడు భవిష్యత్తులో కూడా మనం స్నేహితులంగా వుందామనగా అతణ్ణి వదలి ఉత్తరపాంచాలాన్ని ద్రుప దుడికిచ్చి దక్షిణ పాంచాలాన్ని తను స్వీకరించాడు.

*ద్రుపదుని సంతానం :* స్నేహితులుగా మెలగుతున్నా ద్రుపదుడికి ద్రోణునిపై పగ చల్లారలేదు. ద్రోణుడ్ని

వధించగల పుత్రుడు కావాలని కోరుకున్నాడు. గంగా నదీ తీరంలో వున్న యాజ, ఉపయాజుల్ని అర్థిం చాడు. ఓ సంవత్సరం ఉపయాజకు సేవకుడిగా గడి పాడు. అప్పుడు వారిద్దరు ద్రుపదుడి కోసం యజ్ఞం చేశారు. ఆ యజ్ఞగుండం నుండి ఒక బాలుడు, ఓ బాలిక బయటకు వచ్చారు. వారే ధృష్టద్యుమ్నుడు, కృష్ణ (పాంచాలి). అప్పుడు ఆకాశవాణి ఆ బాలుడు ద్రోణుడిని సంహరిస్తాడని పలికింది. పాంచాలికి యుక్త వయస్సు వచ్చింది. పాండవులు లక్క గృహంలో తగలబడి పోయారనే వార్త వచ్చింది. అర్జునుడు సజీ వుడో కాదో తెలుసుకోడానికి ఓ పరీక్ష పెట్టదలచాడు. స్వయంవరం ప్రకటించాడు. అర్జునుడు మత్స్య యం త్రాన్ని ఛేదించాడు. పాండవులు ఐదుగురు పాంచా లిని వివాహమాడదలచగా ద్రుపదుడికి ఇష్టం లేదు. వ్యాసుడు ద్రౌపది పాండవుల పూర్వజన్మ వృత్తాంతం చెప్పగా ద్రుపదుడు సర్వ సంపదలతో తన కూతుర్ని పాండవులతో పంపాడు.

ద్రుపదుడు అభిమన్యుడి వివాహ సమయంలో వీరితో వున్నాడు. మహాభారత యుద్ధంలో తన సైన్యాన్ని మొత్తం పాండవుల పక్షాన తరలించాడు. ద్రుపదుడు పాండవుల ఏడుగురు సేనాపతుల్లో ఒకడు. కురు క్షేత్రంలో ద్రోణుని చేతిలో మరణించాడు.

– మహాభారతం

**ద్రుమసేనుడు 1 :** ఓ క్షత్రియ రాజు. గర్విష్టుడను రాక్షసుని శరీర భాగం నుండి జన్మించాడు. శల్యుని రథానికి కావలిగా వుండి యుధిష్టరుని చేతిలో మరణించాడు. – మహాభారతం

**ద్రుమసేనుడు 2 :** కౌరవుల పక్షాన పోరాడిన వీరుడు. ద్రుపదుని కుమారుడైన ధృష్టద్యుమ్నుడితణ్ణి వధించాడు. – మహాభారతం

**ద్రుముడు 1 :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. – మహాభారతం

**ద్రుముడు 2 :** శిబి అనే రాక్షసుని పునర్జన్మ. ఇతడొక రాజు. – మహాభారతం

**ద్రుముడు 4 :** కిన్నిరులకు నాయకుడు. కుబేరుని కొలువులోని సంగీతకారుడు. భీష్మకుని కుమారుడు. రుక్మిణుడికి సంగీతం నేర్పాడు. – మహాభారతం

**ద్వైతం :** హిందూ మత శాఖల్లో ఇదొకటి. శంకరుని అద్వైతం, మద్వాచార్యుని ద్వైతం, రామాను జార్యుల విశిష్టాద్వైతం ముఖ్యమైనవి.

ద్వైతం జీవాత్మ పరమాత్మ వేరుకాదని చెప్తుంది. జీవాత్మ సుకృతి, దుష్కృతి భేదాలలో రెండు రకాలు. ముక్తి కలగడానికి జ్ఞానం కావాలి, అవి ఐదు రకాలు. 1. జీవేశ్వర 2. జీవపరస్పర, 3. జడజీవి 4. జడేశ, 5. జడపరస్పరాలు. దీని స్థాపకుడు ఆనందతీర్థుడు. ఇతడ్ని మద్వా చార్యుడని, దీన్ని మద్వమతమని, దీని అనుయాయుల్ని మద్వులని అంటారు.

**ద్వైతవనం :** ఇదో అరణ్యం. వనవాస కాలంలో పాండ వులు కొంతకాలమిక్కడ నివసించారు.

– మహాభారతం

**ద్వైదీభావం :** ఆరు గుణాలలో ఇదొకటి. ఆ ఆరు ద్వైదీ భావం, సంధి, విగ్రహ, యాన, ఆసన, సంశ్రయాలు. సైన్యాన్ని రెండుగా విభజించడాన్ని ద్వైదీభావ మంటారు. – మనుస్మృతి

**ద్వైపాయనహ్రదం :** కురుక్షేత్రంలోని సరస్సు. మహా భారత యుద్ధం చివర్లో ఓటమిని జీర్ణించుకోలేని దుర్యోధనుడు ఇందులో దాక్కున్నాడు. – మహాభారతం

**ద్వైపాయనుడు :** వ్యాసుని మరోపేరు. – చూ॥ వ్యాసుడు

**ద్రోణం :** ఓ ఔషధ మొక్క – చూ॥ మరుత్వానులు

**ద్రోణశర్మపదం :** ఓ పవిత్రతీర్థం – మహాభారతం

**ద్రోణుడు :** పాండవ కౌరవులకు విలువిద్యా గురువు.

*జన్మవృత్తాంతం :* ఇతడు భరద్వాజ మహర్షి కుమా రుడు. ఒకసారి భరద్వాజుడు స్నానానికి నదికి వెళ్లగా ఘృతాచి అను ఓ అప్సరస కన్పించి ఇతడిని చూడ గానే పరుగుతీసింది. అప్పుడామె వస్త్రం గడ్డికి చుట్టు కుని ఊడిపోగా ఆమె అందంచూసి భరద్వాజునికి వీర్యస్కలనం కాగా దానినతడు ఓ మట్టి కుండలో వుంచాడు. అందుండి జన్మించినవాడే ద్రోణుడు. అతడు భరద్వాజుని ఆశ్రమంలోనే పెరిగాడు.

*విద్య వివాహాలు :* ధనుర్విద్యాభ్యాసం తన తండ్రివద్ద, అగ్నివేశుని వద్ద నేర్చుకున్నాడు. అప్పుడు ద్రుపదుడు తన సహాధ్యాయి, స్నేహితుడు. శారద్వానుని కుమార్తె కృపిని వివాహమాడగా వారికి పుత్రుడు జన్మించాడు. అశ్వత్థామ అని నామకరణం చేశాడు. పరశురాముడు

బ్రాహ్మణులకు ధన ఆస్తులను బహుమతిగా ఇస్తున్నాడని తెలిసి మహేంద్రగిరి వెళ్లగా తనవద్దవున్నదంతా దానం చేశానని ఇక మిగిలింది తన శరీరము, కొన్ని ఆయుధాలేనని చెప్పగా ఆయుధాలు బహుమతిగా స్వీకరించాడు.

*ద్రుపదుని చేతిలో అవమానం* –చూ॥ ద్రుపదుడు

*ఏకలవ్యుడు :* ఏకలవ్యుడను ఆటవికుడు ద్రోణుని వద్దకు ధనుర్విద్య నేర్చుకోవడానికి రాగా బ్రాహ్మణుడు ఆటవికులకు ధనుర్విద్య నేర్పడం సూత్ర బద్ధం కాదని నిరాకరించగా అతడు ద్రోణుని ప్రతి మను మట్టితో చేసి ధనుర్విద్యను స్వయంగా నేర్చుకుంటాడు. అర్జునుడు వేటకు వచ్చి ఏకలవ్యుని ప్రావీణ్యం చూసి ద్రోణుడిని తనకంటే ధనుర్విద్యలో మొనగాడున్నాడని అది మీరిచ్చిన వాగ్దానానికి భిన్నమనగా ద్రోణుడు ఏకలవ్యుని గురుదక్షిణగా బొటన వేలుని కోరతాడు. దానితో అతడు అర్జునుని కంటే తక్కువస్థాయి నిపుణుడవుతాడు. ఒకసారి ద్రోణుడు స్నానం చేస్తుండగా ఓ మొసలి ఇతడి కాలుపట్టుకొనగా అర్జునుడు ఒకేసారి 5 బాణాలు సంధించి ఆ మొసలిని చంపగా ద్రోణుడితడికి 'బ్రహ్మశిరాస్త్రాన్ని' బహుమతిగా ఇస్తాడు.

*విలువిద్యా ప్రదర్శన :* విద్యానంతరం కురు, పాండవుల విలువిద్యా ప్రదర్శన జరిపిస్తాడు. అర్జునుడి విలువిద్యా నైపుణ్యానికి ప్రశంసలు కురుస్తుండగా కర్ణుడు ప్రవేశించి తన నైపుణ్యం ప్రదర్శించి దుర్యోధనుడికి సన్నిహిత మిత్రుడవుతాడు.

*దృపదుని పరాభవించుట :* – చూ॥ ద్రుపదుడు

*మహాభారత యుద్ధం వరకు ద్రోణుని పాత్ర :* కౌరవ పాండవుల మధ్య వైరం తగ్గించడానికి ప్రయ త్నించి విఫలమౌతాడు. పాండవుల యెడ అభిమానమున్నను వృత్తి ధర్మంగా దుర్యోధనునితోనే కలిసి నడవక తప్పలేదు. యుద్ధానికి ముందు ధర్మజుడు ద్రోణుని దర్శించుకోగా మనిషి ధనానికి బానిస అని, కాబట్టి నేను కౌరవుల పక్షాన పోరాడతానని, శ్రీకృష్ణుడు ఎవరితో వుంటే వారిదే జయమని అయితే తన్ను జయించడం కష్టమని ఏదైనా విచారకర వార్త విన్నపుడు నా ధనస్సు వదలినప్పుడే నన్ను చంపడం సాధ్యమని, నేను చనిపోవడానికి సిద్ధమేనని చెప్తాడు.

*కురుక్షేత్ర యుద్ధం :* భీష్ముని నిర్యాణం తర్వాత కురుసేనకు ద్రోణుడు నాయకత్వం వహిస్తాడు. అభిమన్యుడ్ని చక్రవ్యూహంలో బంధించి అతని విల్లు విరచి అభిమన్యుని మరణానికి కారకుడౌతాడు. ద్రుపదుడ్ని ఓడిస్తాడు. ధృష్టద్యుమ్నుడి తనయుల్ని, ఎందరో పాండవవీరుల్ని వధిస్తాడు. అశ్వత్థామ చనిపోయాడనే వార్తవిని విచారగ్రస్తుడై ధనస్సు వదలి నిర్వికారంగా నిలబడగా ధృష్టద్యుమ్నుడితడి తల నరుకుతాడు.

– మహాభారతం

**ద్రౌపది :** చూ॥ పాంచాలి.



**ధ :** ఈ అక్షరానికి అర్థం ధారణ, శోభన, ధాత, ధత్తూర (ఓ చెట్టు)

**ధనకుడు :** యయాతి వంశపు రాజు. – భాగవతం

**ధనంజయ నిఘంటువు :** ఇదో సంస్కృత నిఘం టువు. ఇది రెండు భాగములుగా విభజించబడి రెండవ భాగములో నానార్థములు కలిగివుండును. దీనిని ధనంజయుడను పండితుడు సంకలనం చేసెను.

– పురాణనామచంద్రిక

**ధనంజయుడు 1 :** అర్జునుని మరోపేరు. చూ॥ అర్జునుడు. – మహాభారతం

**ధనంజయుడు 2 :** సుబ్రహ్మణ్యస్వామికి శివుడిచ్చిన సైన్యం పేరు. – మహాభారతం

**ధనంజయుడు 3 :** ప్రసిద్ధ సర్పం. కద్రువ, కశ్యప ప్రజాపతి సంతతి. శివుడు ఈ సర్పాన్ని త్రిపురాసురుల్ని వధించడానికి తన అశ్వాలను కలిపివుంచే బంధంగా ఉపయోగించాడు. ఇది వరుణుని సేవిస్తూ అతడి కొలువులో వుంటుంది. – మహాభారతం

**ధనంజయుడు 4 :** సంస్కృత విమర్శకుడు. ఇతడు 11, 12వ శతాబ్దిలో జీవించాడు. ముంజరాజు కొలువులో వుండేవాడు. ఇతని ముఖ్య రచన 'దశరూ పకం'. దీనిని నాల్గు విభాగాలుగా విభజించారు. ఇతని మరణానంతరం ఇతని సోదరుడు ధనికుడు దీనికి 'దశా రూపావలోకనం' అనే వ్యాఖ్యానం వ్రాశాడు.

ధనంజయుని మరో ముఖ్య కావ్యం రాఘవపాండ వీయం. ఈ గ్రంథం శ్రీరాముడు, పాండవుల జీవితాల ఆధారంగా వ్రాయబడింది.

– *క్లాసికల్ శాంస్క్రిట్ లిటరేచర్*

**ధనంజయుడు 5 :** ఒకప్పుడు వశిష్ఠ గోత్రంలో ధనంజయుడను బ్రాహ్మణ పండితుడుండేవాడు. ఇతనికి 100 మంది భార్యలు. ఒక్కొక్కరికి ఓ పుత్రుడు జన్మించాడు. సలోకవల్ల కరుణముని జన్మించాడు. వంద మందికి ధనంజయుడు తన ఆస్తిని సమానంగా పంచినా ఒకరితో ఒకరు పోట్లాడుకొనేవారు.

కొంతమంది మునులతోపాటు కరుణముని కూడా నరసింహుడిని పూజించడానికి భవనాశిని వెళ్లాడు. ఓ బ్రాహ్మణుడు మంచి విభూతిని తేగా కరుణముని అది తీసుకొని వాసన చూశాడు. ఆ బ్రాహ్మణుడందుకు కోపించి ఇతణ్ణి కీటకం కమ్మని శపిం చాడు. దధీచి నిజరూపాన్ని కలుగజేస్తాడని చెప్పాడు. వెంటనే ఇతడు కీటకంగా మారి తన భార్యతో చెప్పుకోగా రక్షణ కోరాడు. తన సోదరులొకసారి నూనెలో పడవేసి చంపివేయగా అతని భార్య సుచిస్మిత ఆ శరీరాన్ని తన ఒళ్లో పెట్టుకొని విలపిస్తుండగా అరుంధతీ దేవి అటుగా వెళ్తూ చూసి యజ్ఞగుండంలోని బూడిదను మృత్యుంజయ మంత్రాన్ని చదివి ఆ కీటకం మీద జల్లగా సజీవమయ్యింది. ఓ వంద సంవత్సరాల తర్వాత అతని చుట్టాలు మరల చంపగా సుచిస్మిత మహర్షి దధీచి వద్దకు తీసుకువెళ్లగా పుణ్యభస్మం నన్ను, కశ్యపుడ్ని, జమదగ్నిని దేవతల్ని 3 సార్లు బ్రతికించింది అని చెప్పి శివుణ్ణి ప్రార్థించి తన చేతుల లోని భస్మం మరణించిన కీటకంపై జల్లగా అది తన నిజరూపమైన కరుణమునిగా అవతరించగా భార్యాభర్తలు సంతోషంగా వారి ఆశ్ర మానికి చేరారు.

– పద్మపురాణం

**ధనపాలుడు :** అయోధ్యా నగరంలో జీవించిన ఓ వైశ్యుడు. అయోధ్యలో సూర్య దేవునికి ఓ దేవాలయం కట్టి ఓ సంవత్సరానికి సరిపడ పూజలకు ధనమిచ్చి ఓ పురోహితుణ్ణి నియమించాడు. అలాచేసిన 6 నెలలకే అతడు చనిపోగా లోకానికి అతడు చేసిన ఉపకారానికి సూర్యదేవుడు తన రథంలో వుంచి అతణ్ణి తనతో తీసుకువెళ్లి తన ఆసనంలో కూర్చోబెట్టాడు. తర్వాత ఇతడు బ్రహ్మలోకం తీసుకెళ్లబడ్డాడు.

– భవిష్యపురాణం

**ధనవర్ధనుడు :** కృతయుగంలో నివసించిన వైశ్యుడు పుష్కర ద్వీపంలో నివసించేవాడు. అతడు భోజనం చేస్తుండగా బయట నుండి 'అన్నం దేహి' అనే మాటలు విని ఆహారం ప్రక్కకు పెట్టి బయటకు వెళ్లి చూసి ఎవరూ కన్పించక మరల లోనికి వచ్చి వదలిన ఆహారం మరల భుజించబోగా అతని శరీరం వెయ్యి ముక్కలయ్యింది. – భవిష్యపురాణం

**ధనశర్మ :** మధ్య దేశంలోని ఓ బ్రాహ్మణుడు. దర్భల కోసం ఇతడు అడవికి వెళ్లగా 3 ప్రేతాత్మలు ఎదుర్కోగా ఇతడు వెనక్కు పారిపోయాడు. అవి వెంట పడగా ఆ బ్రాహ్మణుడు "శ్రీమహావిష్ణువు మిమ్మల్ని ఆశీర్వదించుగాక, నన్ను బాధించకండి' అన్నాడు. అలా అనగానే వాటిలో మార్పువచ్చి తమ కథ బ్రాహ్మణుడితో చెప్పాయి. వారి పేర్లు వైశాఖ, సుదాస, అద్వైతులని వైశాఖకునికి కృతజ్ఞత లేనివాడవడం వల్ల కృతఘ్నుడనే వారని, అద్వైతు దైతే ఒక రాజని వారి పాపాల వల్ల ఇలా మారా మని చెప్తారు. వారి మాటల వల్ల వైశాఖుడు తన తండ్రి అని గ్రహించి వారికి ముక్తికల్గే మార్గం చెప్పమనగా వైశాఖ పూర్ణిమ వ్రతం చేయమని వైశాఖుడికి చెప్పాడు. అతడు ఆ వ్రతం చేయగా ఆ ముగ్గురు స్వర్గం చేరతారు.

– పద్మపురాణం

**ధని :** కపులను రాక్షసుల రాయబారి. రాక్షసులితణ్ణి ఒకసారి బ్రాహ్మణులకు నీతిబోధ చేయడానికి పంపారు.

– మహాభారతం

**ధనిక :** ధనంజయుని తమ్ముడు. 'దశరూపావలోక' గ్రంథకర్త : – *చూ॥ ధనంజయు 4.*

**ధనుర్ధరుడు :** (ధనుగృహ, ధనుగ్రహ) : ధృతరాష్ట్రుని 100 మంది పుత్రుల్లో ఒకడు. కురుక్షేత్ర యుద్ధంలో భీమసేనుడితణ్ణి వధించాడు. – మహాభారతం

**ధనుర్వేదం :** ప్రాచీన భారతదేశంలో యుద్ధ తంత్రాన్ని గురించిన విధివిధానాలను ధనుర్వేదం అనేవారు. దాని ప్రాముఖ్యత వల్ల దీన్ని వేదంగా పరిగణించబడింది. క్షత్రియ యువకులకు నేర్పడానికి ఎన్నో గ్రంథాలు వెలువడ్డాయి. మధుసూదన సరస్వతి తన ప్రస్థాన భేద అనే గ్రంథంలో ఇది యజుర్వేదంలో ఓ భాగమని పేర్కొన్నాడు. దీన్ని చతుష్పదం అంటారు. అందుకు కారణం ఇందులో రథాలు, ఏనుగులు, గుర్రాలు, మనుషులు పాల్గొనడం కారణం. ధనుర్వేదం 5 విభాగాలుగా వర్గీకరించబడింది. 1. యంత్రముక్తి,

2. పాని ముక్తం, 3. ముక్త సంధారిత, 4. అముక్త, 5. బాహుయుద్ధం. మరో రకమైన విభజన 1. అస్త్రం, 2. శస్త్రం. మరికొందరు పండితులు దీన్ని మాయా, రుజు అనే విభాగాలుగా వర్గీకరించారు. ధనుర్విద్యను బ్రాహ్మణుడే నేర్పాలి. క్షత్రియ, వైశ్యులే నేర్చు కోవడానికి అర్హులు. శూద్రుడు ప్రమాదంలో వున్నప్పుడే తన స్వశక్తితో నేర్చుకోవాలి. వేరు ముఖంగా నేర్చుకోరాదు. మిశ్రమ సంతతి యుద్ధ సమయంలో రాజుకి సహాయకులుగా వుండాలి. – అగ్నిపురాణం

**ధనువక్రుడు :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరయోధుల్లో ఒకడు. – మహాభారతం

**ధనుషుడు :** ప్రాచీన కాలంలోని ఓ రుషి. ఉపరిచర వసువు చేసిన యాగంలో పురోహితుడు. – మహాభారతం

**ధనుసాక్షుడు :** ప్రాచీనకాలంలో ఓ రుషి. బాలాధి కుమారుడైన మేధావిని ఇతడు రుషులను అవమానించినందుకు చంపాడు. – మహాభారతం

**ధనేశ్వరుడు :** అవంతీ నగరంలో జన్మించిన బ్రాహ్మణుడు. అతడు చేయని పాపం లేదు. అతడు పాపాలకు ప్రతీక. బ్రాహ్మణుడై జన్మించినా ఏ బ్రాహ్మణ ఆచారాన్ని పాటించలేదు. వ్యాపారం చేస్తూ ఒకసారి కార్తీక వ్రతం చేసే చాలామందితో కలిశాడు. అతని మరణానంతరం కాలపురికి చేరగా చిత్రగుప్తుడు ఇతడు చేసిన పుణ్యకార్యమేది కన్పించలేదని, అన్ని పాపాలకు ప్రతీక అనగా వెంటనే యముడు కోపోద్రిక్తుడై గదతో మోది సలసల కాగే నూనెలో వెయ్యమనగా అతణ్ణి అందులో పడవేయగానే ఆ నూనె చల్లారిపోయింది. ఆ విచిత్రాన్ని కాపాలకుడు యమునికి చెప్పగా అతడు ఆశ్చర్యపోయి తిరిగి అతణ్ణి వివరం కోరుతుండగా నారదుడు వచ్చి అతడు కార్తీక వ్రతం చేసే ప్రజలతో కొన్నాళ్లు గడపడమే ఇందుకు కారణమని చెప్పగా యముడతణ్ణి నగరం చుట్టూ తిప్పి యక్షుడికివ్వవలసిన స్థాయినిచ్చి కుబేరుని వద్దకు పంపాడు. – పద్మపురాణం

**ధన్య :** దక్షుడి మనుమరాలు. విష్ణుమూర్తిని దర్శించడానికి వెళ్లినపుడు సనత్కుమారుల్ని చూసి కూడా లేవదు. వారీమెను నరస్త్రీగా పుట్టమని శపిస్తారు. శాపవిమోచనం కోరగా భూలోకంలో జనకుని భార్యగా జన్మించినపుడు సీత నీకు కూతురవుతుంది. అపుడు శాపవిమోచనమై స్వర్గానికి చేరుకుంటావని చెప్తారు. – శివపురాణం

**ధన్యమాల :** అతికాయుడిని పెంచిన తల్లి. – చూ॥ అతికాయుడు

**ధన్వంతరి 1 :** ఆయుర్వేదానికి మూలకారకుడైన దేవతా గణంలోనివాడు.

*జననం :* దేవతలు రాక్షసులు కలిసి అమృతం కొరకు క్షీరసాగరమధనం చేసిన 1000 సంవత్సరాల తర్వాత ఓ దేవతాపురుషుడు ఒక చేత కమండలం, మరోచేత ఓ పూలహారంతో సముద్రం నుండి ఉద్భవించాడు. అతడే ధన్వంతరి. – రామాయణం

సముద్రం పైకి వచ్చిన అతడు శ్రీ మహావిష్ణువును పూజిస్తూ అలాగే నీటిపై నిలబడగా విష్ణువితనికి అబ్జుడని నామకరణం చేశాడు. అప్పుడు అబ్జుడు ప్రభూ నేను నీ పుత్రుడ్ని, యజ్ఞభాగం పంచమని కోరగా యజ్ఞ భాగాన్ని దేవతలందరికీ పంచేశాను. నీవు దేవతల తర్వాత జన్మించావు. కాబట్టి నిన్ను దేవతగా పరిగణించలేము. నీ పునర్జన్మలో గర్భంలో వుండగనే అనిమా మరియు గనిమా జ్ఞానం పొందుతావు. ఆయుర్వేదం మీద గ్రంథం వ్రాస్తావు. అప్పుడు నీవు దేవతాంశతో జన్మిస్తావని చెప్పి శ్రీహరి మాయమవుతాడు. నీ రెండో జీవితం ద్వాపర యుగంలో కల్గుతుందని చెప్తాడు.

*పునర్జన్మ :* కాశీరాజు సంతతి అయిన ధన్వుడు పుత్రార్థియై అబ్జుడ్ని ప్రార్థించగా నీకు పుత్రుడుగా జన్మిస్తానని అభయమిస్తాడు. అలా జన్మించగా రాజితడికి ధన్వంతరి అని నామకరణం చేస్తాడు. అతడు ఆయుర్వేదం మీద గ్రంథం వ్రాస్తాడు. ఇతని సంతతి వారే కేతుమానుడు, భీమరథ, దివో దాసులు. పరీక్షిత్తును తక్షకుడు కాటువేసినపుడు ధన్వంతరి రక్షించగలడని తెలిసి అతనికి ధనమిచ్చి వెనక్కు పంపాడని కొన్ని పురాణాలు చెప్తుండగా కొన్ని పురాణాలు కశ్యపుడను వైద్యుడని చెప్తున్నాయి.

*ధన్వంతరి – మానసాదేవి :* ఒకసారి ధన్వంతరి అతని శిష్యులు కైలాసానికి వెళ్తుండగా తక్షకుడను సర్పం వారిపై విషం చిమ్మగా ఓ శిష్యుడు మూర్ఛ

పోయాడు. ధన్వంతరి తన వనస్పతి మందుతో అతడ్ని తేరుకునేట్లు చేయగా మరో శిష్యుడు తక్షకుని తలపైనున్న ఫణిని లాగి నేలకు కొట్టగా అది సర్ప రాజు వాసుకికి తెలిసి కొన్నివేల సర్పాలను పంపగా అవి వెలువరించిన విషానికి ధన్వంతరి శిష్యులంతా మూర్ఛపోగా తన వనస్పతి ద్వారా వారిని సాధారణ స్థితికి తెచ్చి వచ్చిన సర్పాలను మూర్ఛపోయేటట్లు చేశాడు. వాసుకి శివుని శిష్యురాలు సర్వదేవత అయిన మానసాదేవిని ఇతడిపైకి పంపి ధన్వంతరి శిష్యుల్ని పడగొట్టగా ధన్వంతరి తన విషవిద్య ద్వారా తిరిగి వారిని బ్రతికించాడు. మానసాదేవి ఆగ్రహంతో త్రిశూలాన్ని ధన్వంతరిపై విసరబోగా శివుడు బ్రహ్మ ప్రత్యక్షమై ఆమెను శాంతపరుస్తారు.

– *బ్రహ్మవైవర్తపురాణం*

**ధన్వంతరి-2 (అమృతాచార్య) :** ధన్వంతరికి ఇతనికి సంబంధమున్నట్లు ఏ పురాణాలు చెప్పడంలేదు. గాలవుడు ఓసారి ప్రయాణిస్తూ దప్పికతో వుండగా అతడికి నీళ్లు పోస్తుంది. అతడు సుపుత్రుడు కల్గుతా డని దీవించగా నేను కన్యను గదా ! ఎలా సంభవ మనగా దర్భలనుండి ఓ పురుషుడ్ని సృష్టిస్తాడు. ఓ బ్రాహ్మణుడికి వైశ్యస్త్రీకి జన్మించి నందువల్ల ఇతడ్ని అంబష్టుడని అంటారు. అమృతాచార్యుడని పేరొం దాడు. ఇతడు గొప్ప శాస్త్ర వేత్తగా పేరొందాడు.

– *అంబష్ట చరత్ చంద్రిక*

**ధన్వుడు :** ఒక కాశీరాజు. ఇతని కుమారుడు ధన్వంతరి.

– *చూ॥ ధన్వంతరి*

**ధమధముడు :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు.

– *మహాభారతం*

**ధర 1 :** ధర్ముడికి ధూమ్రవల్ల జన్మించిన మొదటి వసువు. – *మహాభారతం*

**ధర 2 :** ధర్మరాజుకి స్నేహితుడైన ఒకరాజు.

– *మహాభారతం*

**ధరణం :** ప్రాచీనకాలంలో ఓ కొలమానం. 10 పల సులు ఓ ధరణం అంటారు. – *మనుస్మృతి*

**ధరణి :** బ్రహ్మ వామాంగుష్ఠమున పుట్టిన ఈమె దక్షుని పరిణయమాడెను. వీరికి కీర్తి, లక్ష్మి, ధృతి, అశ్విని, సింహిక, దితి, అదితి మొదలైన 50 మంది కుమార్తెలు, 50 మంది కుమారులు జన్మించిరి. – *మహాభారతం*

**ధరా :** ద్రోణుడను వసువు యొక్క భార్య. భార్యా భర్తలిద్దరూ విష్ణుమూర్తి కోసం తపస్సుచేసి అతడెంతకీ ప్రత్యక్షంకాక అగ్నిప్రవేశం చేస్తారు. తర్వాతి జన్మలో యశోదానందులుగా జన్మిస్తారు. – *బ్ర.వై.పురాణం*

**ధరాత్రుడు :** శుక్రుని కుమారుడు –*మహాభారతం*

**ధర్మాపాలుడు :** విదీష రాజ్యాన్ని ప్రాచీనకాలంలో పాలించిన రాజు. వెతసీ, వెత్రవతి సంగమం వద్ద ఓ పుణ్యస్థలం వద్ద ఓ దేవాలయం నిర్మించాడు.

*ఈ గుడి నిర్మాణానికి గల కథ :* పార్వతి లేని సమ యంలో శివపార్శదుడు ఓ స్త్రీని శివునివద్దకు తీసుకు రాగా ఆమె శివుడు సరససల్లాపాలు కావిస్తుండగా పార్వతి వచ్చి పార్శ్వదుడ్ని నక్కగా జన్మించమని శపిం చింది. ఈ నక్క ఈ రెండు నదుల సంగమం వద్ద తపస్సు చేసి మోక్షం పొందింది. పార్శదుడ్ని ఓ దివ్య విమానం వచ్చి ఎక్కించుకోవడాన్ని ధర్మపాలుడను రాజు చూసి ఆ స్థలంలో ఓ దేవాలయం నిర్మించి వేద పండితు లతో పద్మపురాణం చదివించాడు. అతడు కూడా పద్మపురాణం పఠించి మోక్షం పొందాడు.

– *పద్మపురాణం*

**ధర్మకీర్తి :** చంద్రవంశపు రాజు. ఆదర్శ పాలకుడు. ఒకరోజు వేటకు వెళ్ళి దారి తప్పి ఏకాదశీ వ్రతాన్ని చేసేవారిని చూసి తాను ఆచరిస్తాడు. అందువల్ల పుణ్యలోకాలకు వెళ్తాడు. పునర్జన్మలో గాలవుడి కొడు కైన భద్రశీలుడుగా జన్మిస్తాడు. – *నారదీయ పురాణం*

**ధర్మకేతువు :** భార్గవ గోత్రికుడైన రాజు. సుకేతుని కుమారుడు. సత్యకేతుని తండ్రి – *భాగవతం*

**ధర్మగుప్తుడు 1 :** ప్రశోశ వ్రత మాచరించి శివుని ఆశీ ర్వాదం పొందిన యువరాజు. అలా చేయడం వల్ల తను పోగొట్టుకున్న రాజ్యాన్ని తిరిగి పొందుతాడు.

**ధర్మగుప్తుడు 2 :** చంద్ర వంశపు యువరాజు. వేటకు వెళ్లి ఎలుగబంటిని తరుముకుంటూ వస్తున్న సింహాన్ని చూసి ఓ చెట్టెక్కుతాడు. ఎలుగుబంటి కూడా అదే చెట్టు ఎక్కి రాత్రి కాగా రాజకు మారుడితో అర్థరాత్రి వరకు సింహం బారి నుండి నేను నిద్రిస్తుంటే నువ్వు కాపాడు. ఆ తర్వాత నిన్ను నేను కాపాడతాననగా ఒప్పుకొని నిద్రిస్తాడు. సింహం యువరాజును తనకు వదలత్తె ఎలుగుబంటిని వదిలేస్తాననగా అందుకు అంగీకరిం

చదు. తర్వాత ఎలుగుబంటి నిద్రిస్తుండగా యువరాజు కాపలా కాస్తుంటే సింహం యువరాజుని ఎలుగుబంటిని క్రిందకు తోస్తే అతణ్ణి వదిలివేస్తానంటే అతడు ఎలుగుబంటిని క్రిందకు తోస్తాడు. ఎలుగుబంటి క్రిందపడకుండా కొమ్మలు పట్టుకొని జాగ్రత్తపడి ధర్మగుప్తుడ్ని పిచ్చివాడివి కమ్మని శపిస్తుంది. ఇతడు చివరికి పుష్కరిణిలో స్నానం చేసి పిచ్చిపోగొట్టుకుంటాడు. ఎలుగుబంటి తను బృగు వంశానికి చెందిన రుషినని, నేను కావాలనుకున్న రూపం పొందగలనని ఈ సింహం కుబేరుని మంత్రి అయిన భద్రుడని గౌతముని ఆశ్రమం ముందు ఓ ఎలుగు బంటితో రతిక్రీడ జరపడం వల్ల అతని శాపం వల్ల సింహంగా మారాడని నాతో మాట్లాడినప్పుడు ఇతడు నిజరూపం దాల్చగలడని గౌతముడు శాపవిమోచనం కల్గించాడని చెప్తుంది. – *స్కంద పురాణం*

**ధర్మతీర్థం 1 :** ప్రాచీన భారతదేశంలో ఓ పుణ్య తీర్థం. ఇక్కడి కొలనులో స్నానం చేస్తే అన్ని పాపాలు నశిస్తాయి. – *మహాభారతం*

**ధర్మతీర్థం 2 :** ప్రాచీన భారతదేశంలో మరో పుణ్యతీర్థం. ఇక్కడ స్నానం చేస్తే వాజపేయ యజ్ఞం చేసిన ప్రతిఫలం లభిస్తుంది. – *మహాభారతం*

**ధర్మదత్తుడు :** ఇతడు కోసల దేశపు రాజు. ఇతని భార్య నాగశ్రీ. ఆమె పాతివ్రత్యం వల్ల భూలోక అరుంధతి అనేవారు. వారికి తారాదత్త అనే పుత్రిక జన్మించింది. భార్యాభర్తలిద్దరూ సంభాషించు కుంటుండగా వారి పూర్వజన్మవృత్తాంతం జ్ఞాపకం వచ్చింది. కాని అది గనుక వెల్లడిస్తే తల పగిలి చనిపోతారని తెలిసికూడా నాగశ్రీ ఆపుకోలేక తన పూర్వజన్మ వృత్తాంతం చెప్పింది. ఇదే ప్రదేశంలో ఓ పరిచారికనని నా భర్త దేవదాసుడని అతడొక వ్యాపారి కుమారుడని మేము ఓ చిన్న ఇల్లు కట్టుకొని జీవిస్తూ ఇద్దరం కష్టపడి సంపాదించిన ఆహారంలో కొంతభాగం అతిథులకు, పిత్రులకు వదిలేవారమని ఆతర్వాత మిగిలిందే దాచుకొనే వారమని చెప్పింది. ఆ తర్వాత దేశంలో కరువు వచ్చి మా సంపాదన తగ్గి ఆకలితో జీవించే వారమని ఒక రోజు బడలికతో వచ్చిన సన్యాసికి మేము సంపాదించిన ఆహారం మొత్తం అతనికే ఇచ్చామని ఆరోజు రాత్రి తన భర్త మరణించాడని అతని చితిలోనే దూకి తాను మరణించి ఓ రాజు కుటుంబంలో జన్మించి నీ భార్యనయ్యానని చెప్పింది. ధర్మదత్తుడు తన పూర్వజన్మ గుర్తుకు వచ్చి ఆ దేవదాసుని నేనేనని చెప్పగా వెంటనే భార్యాభర్త లిద్దరూ మరణించారు. వారి కుమార్తె తారాదత్త అనాథకాగా ఆమె తల్లి చెల్లెలు ఆమెను సాకింది. ఓ రోజు ఓ మహర్షి వచ్చి ఈమెను ఆశీర్వదించగా కళింగసేనుడను రాజు భార్య అయ్యింది. వీరికి కళింగసేన అనే కుమార్తె జన్మించింది.

– *కథాసరిత్సాగరం*

**ధర్మదత్తుడు 2 :** కరవీర నగరంలో జీవించిన ఓ బ్రాహ్మణుడు. ఒకరోజు పూజాద్రవ్యాలతో గుడికి వెళ్తుండగా కలహ అనే ఓ దయ్యం ఇతడిపై పడగా పూజా ద్రవ్యాలను ఆ దయ్యంపై విసిరాడు. అందులోని తులసి ఆకు ఆమె ముఖంపై పడి ఆమె పూర్వ జన్మ గుర్తుకు వచ్చి ధర్మదత్తుడిని ఈ బాధల నుండి విముక్తి పొందే మార్గం చూపమని కోరుతుంది. కార్తీకవ్రతం చేసిన పుణ్యాన్ని అతడామెకు ధారపోస్తాడు. – పద్మపురాణం

ధర్మదత్తుడు, కలహా కార్తీక వ్రతం చేసిన పుణ్యం వల్ల తర్వాతి జన్మలో ధశరథ కైకేయిలుగా జన్మిస్తారు.

– *ఆనంద రామాయణం*

**ధర్మదుడు :** సుబ్రహ్మణ్య స్వామి అనుచరుడు.

– *మహాభారతం*

**ధర్మధ్వజుడు :** చూ॥ తులసి

**ధర్మనందనుడు :** భార్గవ వంశంలోని ఓ రాజు.

– *భాగవతం*

**ధర్మనేత్రుడు 1 :** హేహయ వంశంలోని ఒక రాజు. కృతియొక్క తండ్రి. ఇతడు హేహయుని కుమా రుడు.

– *బ్రహ్మాండపురాణం*

**ధర్మనేత్రుడు 2 :** ధృతరాష్ట్రుని పుత్రుల్లో ఒకడు.

– *మహాభారతం*

**ధర్మ పక్షులు :** పింగాక్ష విరాట వృత సుముఖుడను పక్షులు. వీటితల్లి తార్క్షి కురుక్షేత్రమున నాకాశమున ఎగురుచుండగా అర్జునుని బాణము తగిలి ఆమె గర్భము ఛేదింపబడి గ్రుడ్లుక్రిందపడగా భగదత్తుని ఏనుగు గంటలు ఆ గ్రుడ్డు పై బడి పక్షులు బయటపడి ఆగంటలో ధ్వని చేయుచుండెను. శమీకముని ఆ

ధ్వని విని వీటిని తీసి పెంచగా అవి పెరిగి "మునీంద్రా మేము ప్రబుద్ధులమైతిమి మేమేమి చేయవలె" నని అడిగి తమ పూర్వకథను చెప్పి వింధ్య నగరమునకేగి తపస్సు చేసుకొనుచుండగా జైమిని అను ముని వచ్చి భారతములోని సందేహములు తీర్చుకొనెను.

ఇవి పూర్వజన్మమున సుకృతుడను బ్రాహ్మణుని పుత్రులు. ఇతనికడకొకసారి ఇంద్రుడు వచ్చి నరమాంసము ఆహారముగా కోరగా కుమారులకు ఇంద్రుని కాహారము కండని ఆజ్ఞాపించగా వారు తిరస్కరించిరి. తండ్రి వీరిని పక్షులగునట్లు శపించగా తండ్రిని వారు శరణు వేడగా వీరికి మనుష్య భాష వచ్చునట్లు సకల శాస్త్రములు తెలియునట్లు అనుగ్రహించెను.

– మార్కండేయ పురాణము

**ధర్మపాలుడు :** ధశరథుని మంత్రుల్లో ఒకడు. దశరథునికి 8 మంది మంత్రులు. వీరు సృష్టి, జయంత, విజయ, సిద్ధార్థ, రాష్ట్రవర్ధన, అశోక, ధర్మపాల, సుమంత్రులు. – అగ్నిపురాణం

**ధర్మప్రస్థం :** ఓ పుణ్యస్థలం. ధర్మరాజు యొక్క నివేశన స్థలం అని చెప్తారు. ఇక్కడున్న నూతిలోని నీటిని తాకితే అన్ని పాపాలు పరిహరించబడతాయి.

– మహాభారతం

**ధర్మబుద్ధి :** పంచతంత్రంలోని మిత్రభేదమనే భాగంలో ఓ కల్పిత పాత్ర. – పంచతంత్రం

**ధర్మపుత్రుడు (ధర్మరాజు) :** పాండురాజు యొక్క ప్రథమ పుత్రుడు. పాండురాజు అనుమతితో ధర్ముని అంశతో జన్మించెను. ధర్మునిపుత్రుడగుటచే ధర్మస్థితి మనస్కుడగుటచే యుధిష్టురుడను పేరు ఆకాశవాణి ఇచ్చెను. పాండురాజు మరణా నంతరము కుంతి తన పుత్రులతో హస్తినకు రాగా ధృతరాష్ట్రుడు వీరిని తన పుత్రుల తోపాటు సాకి ధర్మపుత్రుని యువ రాజును చేసి ద్రోణాచార్యునిచే ధనుర్విద్యా భ్యాసముగావించెను. ధృతరాష్ట్రుని కుమారుడు అసూయా పరుడగుటచే పాండవులను అందున భీముని అవమానంపాలు చేయుచుండెడి వాడు. ధృతరాష్ట్రుడు కూడా పుత్ర ప్రేమచే మిన్నకుండె. వీరిని వారణాసికి పంపెను. మార్గ మధ్యమున వీరిని కడతేరనెంచి దుర్యోధనుని కుటిల పన్నాగముచే లక్కగృహమునకు నిప్పంటించగా విదురునివల్ల ఆ దుష్టాలోచన విన్న పాండవులు ఓ బిలముగుండా తప్పించుకొని ఏకచక్రపురమున మారువేషమున నుండిరి. ఏక చక్రపురవాసులను బాధించుచున్న బకుని భీముడు వధించెను. ద్రౌపదీ స్వయంవరానంతరము పాండవులు సజీవులని తెలిసి ధృతరాష్ట్రుడు వీరికి రాజ్యభాగ మివ్వగా ఇంద్రప్రస్థమను నగరమును నిర్మించు కొనిరి. ఇచ్చటే ధర్మజుడు రాజసూయ యాగము నిర్వహించెను. అది సహించని దుర్యోధనుడు మాయాజూదంలో వీరిని ఓడించి 12 ఏండ్లు వనవాసము ఒక ఏడాది అజ్ఞాత వాసమునకు పంపెను. అరణ్య వాస సమయమున దాహార్తులు కాగా ఓ కొలనులో నీటికి వెళ్లి నకులుడు, తర్వాత సహదేవుడు అర్జునుడు భీముడు వెనుకకు రాలేదు. ధర్మజుడు వారికై వెళ్లి వారు అచట పడివుండుట చూసి దుఃఖించి నా సోదరులు మహాశక్తివంతులు. దేవదానవు లెవ్వరూ ఓడించలేరు. ఇట్లేల పడివుండిరని ఆశ్చర్యపోగా ఆకాశవాణి ఇట్లు పలికెను. నా ప్రశ్నలకు సమాధానమిచ్చిన గాని కొలనులో నీరు త్రాగరాదు. అట్లు సమాధాన మిచ్చినచో నీ సోదరులు సజీవులగుదురనెను. అవే యక్ష ప్రశ్నలు. ధర్మజుని సమాధానములకు మెచ్చి ఇతని సోదరులను బ్రతికించెను. అజ్ఞాత వాసానంతరము సంధి కుదరక కురుక్షేత్ర మారంభమయ్యెను. భీష్ముడు కౌరవుల సేనా నాయకుడుగా వుండగా పాండవులకు జయం అసాధ్యమని తెలిసిన ధర్మజుడు భీముని ఏకాంతమున కలసి అతడిని జయించు మార్గము నర్థించెను. భీష్ముని సలహా మేరకు శిఖండిని ముందుంచి అర్జునునితో యుద్ధముగావించి భీష్ముని పడగొట్టెను. భీష్ముడు అంపశయ్యపై నున్న తర్వాత ఇతడు యుద్ధము సేయక భీష్మునివద్ద రాజనీతిని గూర్చి తగు సలహాలను పొందెను. కురుక్షేత్ర యుద్ధానంతరం పట్టాభిషిక్తుడై బహుకొద్ది కాలమే పరిపాలించి శ్రీకృష్ణుని నిర్యాణానంతరం అభిమన్య కుమారుడైన పరీక్షిత్తును పట్టాభిషిక్తుని చేసి సోదరులతో పయనమై స్వర్గపురికి వెళ్లెను.

– మహాభారతం

**ధర్మబృతుడు :** దండకారణ్యంలో నివసించిన ఓ మహర్షి. ఇతడు ఇక్కడ గల 'పంచాప్సర' కొలను, అందుండి ఉద్భవించిన గానధారను గురించిన కథను శ్రీరాముడికి వివరించాడు. – రామాయణం

**ధర్మరథుడు :** సగరుని పుత్రులలో నొకడు. కపిలుని కోపాగ్నికి భస్మము కాకుండా మిగిలిని పుత్రుడు.
– *మహాభారతం*

**ధర్మరాజు 1 :** గౌడదేశపు రాజు. ఇతని పరిపాలనా కాలంలో జైనిజం ప్రభావం పెరిగి వేద ధర్మం తగ్గిపో తోంది. ఇది గమనించి ఇతడే పురోహితుడుగా మారి వేదధర్మ బోధన చేసి ఈ ధర్మాన్ని కాపాడటానికి కృషిచేశాడు. – *భవిష్యపురాణం*

**ధర్మరాజు 2 :** చూ॥ ధర్మపుత్రుడు.

**ధర్మవతి :** ధర్మదేవుని భార్య. ఈమె కుమార్తె ధర్మవ్రత. ఈమె బ్రహ్మకుమారుడైన మరీచిని వివాహ మాడింది.
– *చూ॥ గయతీర్థం*

**ధర్మవర్ణుడు :** కలియుగంలో ఆనర్త దేశంలో నివసించిన బ్రాహ్మణుడు. ఇతడు చనిపోయిన వాళ్లు వుండే లోకానికి వెళ్లగా తన తల్లిదండ్రులు దర్భలకు వేలా డుతూ కన్పించగా అతడు ఈ కష్టాలకు కారణం అడగగా ధర్మవర్ణుడు వివాహం చేసుకొని పుత్రులకు జన్మనిస్తే మోక్షం లభిస్తుందని చెప్తారు. వారు చెప్పినట్లే వివాహమాడి కుమారుడు జన్మించిన తర్వాత తపస్సు చేసుకోవడానికి వెళ్తాడు. – *స్కందపురాణం*

**ధర్మవ్రత :** ధర్మదేవుని కుమార్తె. ఈమె భర్త బ్రహ్మ కుమారుడైన మరీచి.

**ధర్మవ్యాధుడు :** ఆటవికునిగా జన్మించినా ధర్మబుద్ధితో ప్రవర్తించడం వల్ల సాధువయ్యాడు.ఇతడి పూర్వ జన్మలో ఓ బ్రాహ్మణుడు. ఒకరోజు ఇతడి స్నేహితుడైన రాజకుమారుడు, ఇతడు అడవికి వేటకు వెళ్లాడు. ఈ బ్రాహ్మణుడు ఓ బాణం అడవి జంతువుపైకి సం ధించగా అది ఒక మహర్షికి తగిలి బాణంపై దొర్లుతూ ఇతణ్ణి నీ పునర్జన్మలో వేటగాడిగా పుట్టిమాంసం అమ్ముకుని బ్రతక మంటాడు. బ్రాహ్మణుడు మహర్షిని క్షమించమని ప్రార్థించగా నీవు వేటగాడిగా జన్మించినా గొప్ప పండితుడుగా బాధ్యతతో జీవించి మోక్షం పొందుతావని పేర్కొంటాడు. అలా జీవిస్తుండగా కౌశికుడను బ్రాహ్మణుడు ఓ చెట్టుక్రింద తపస్సు చేసు కొంటుండగా ఆ చెట్టుపై నున్న కొంగ రెట్టవేయగా మీద పడింది. ఇతని తీక్షణ దృష్టికి అది మసై క్రింద పడింది. తర్వాత ఓ ఇంటికి బిక్షాటనకు వెళ్లగా ఆ యింటి ఇల్లాలు ముందు నా భర్త ఆరోగ్య పరిస్థితి చూసి రావాలనగా ఆమె వంక తదేకంగా చూడగా ఆమె నేను కొంగను గాను బూడిదవడానికి అని సమాధానమిస్తుంది. కౌశికుడు వెనుదిరగగా నా శక్తికి కారణం నా భర్త యెడల నాకున్న భక్తే కారణం. ముందు నీ గర్వం నశించాలి. అందుకు నువ్వు ధర్మవ్యాధుడి వద్దకు వెళ్లమని సలహా ఇస్తుంది. కౌశికుడు ధర్మవ్యాధుడి వద్దకు వెళ్లి అతడికి శిష్యరికం చేస్తాడు. అతడు వర్ణధర్మం, శిష్టచరసు, హింస, అహింస, మీమాంస మరియు బ్రహ్మవిద్య యొక్క ప్రాముఖ్యత; పంచేంద్రియాలపై ఆధిపత్యం మున్నగు విషయాలను బోధించగా కౌశికుని గర్వం పోయి ఇంటికి వచ్చి తల్లి దండ్రులపై లగ్నం వుంచి స్వర్గం చేరాడు. – *మహాభారతం*

**ధర్మశర్మ 1 :** తర్వాతి జన్మలో కంజల అనే చిలుకగా మారిన బ్రాహ్మణుడు. విద్యాధరుడను ప్రముఖ బ్రాహ్మ ణుని ముగ్గురు కుమారుల్లో ఒకడు. తక్కిన ఇద్దరూ పండితులు కాగా ఇతడు మొద్దుగా ఏమీ చదువు కోకుండా జీవించాడు. తండ్రి సలహా పాటించకచెడు స్నేహితులతో తిరుగుతూ జీవితం గడిపాడు. చాలా కాలం తర్వాత ఇందుకు బాధపడి పాతజ్ఞాపకాలను నెమరు వేసుకుంటూ ఓ గుడిలో కూర్చున్నాడు. ఒకరోజు ఓ సిద్ధుడు ఆ గుడికి వచ్చి ఏకాంత ప్రదే శంలో కళ్లుమూసుకొని ధ్యానం చేసుకొంటుండగా అతని వద్ద నిలబడి చూస్తున్నాడు. సిద్ధుడు కళ్లు తెరచి ఇతణ్ణి వివరాలడగగా తనకు జ్ఞానోదయం కావాలని కోరతాడు. సిద్ధుడు జ్ఞానోపదేశం చేయగా ఇతడు కూడా సిద్ధుడిగా మారతాడు. ఆ తర్వాత యాత్రలకు బయలుదేరి మధ్యలో ఓ చిలుకను సంపాదించి దాన్ని సొంత బిడ్డవలె పెంచి ప్రేమగా చూసు కుంటాడు. ఓ రోజు పండ్లు ఫలాలు తేవడానికి వెళ్లి వచ్చేసరికి ఓ పిల్లి ఈ చిలుకను సంహరించగా బిగ్గరగా ఏడుస్తూ పిచ్చివాడై కొన్నాళ్లకు మరణించి తర్వాతి జన్మలో చిలుకగా పుడతాడు. అయినప్పటికి చిలుకగావుండగా కూడా అతడి జ్ఞానం అలాగే తర్వాతి జన్మలో కూడా వుంటుంది. – పద్మపురాణం

**ధర్మశర్మ 2 :** చూ॥ శివశర్మ.

**ధర్మసఖుడు :** కేకయ వంశంలోని ఒక రాజు. చాలా కాలం సంతానం లేదు. ముసలి వయసులో కూడా పిల్లలు లేరు. చివరికి తన అన్న భార్య సుచంద్రకు మాత్రం ఓ కుమారుడు జన్మించాడు. తన భార్యల బాధ చూడలేక తన మంత్రుల సలహా మేరకు హను మత్కుండం వద్ద పుత్రకామేష్టి చేయగా తన 100 మంది భార్యలకు ఒక్కోపుత్రుడు జన్మించారు.
– *స్కందపురాణం*

**ధర్మసావర్ణి :** ఇతడు 11వ మనువు.
– *చూ॥ మన్వంతరం.*

**ధర్మశుడు :** ఓ బ్రాహ్మణుడు. గంగానది నుండి నీరు తెస్తూ ఎద్దుపొడిచి చంపబడిన కాపకల్పి అనే పాపి అయిన సేవకుడిపై జల్లగా అతడు సజీవుడయ్యాడు. అప్పటి నుండి ధర్మశుడు నిత్యం గంగను పూజించే వాడు. గంగ ఇతడిని చిరంజీవిగా వరమిచ్చి తనను తలచి మృత్యువును కోరుకుంటేనే మరణం సిద్ధిస్తుం దని వరమిస్తుంది. – *పద్మపురాణం*

**ధర్మాయువు :** పూరు కుటుంబీకుడైన ఒక రాజు. ఇతని తండ్రి రౌద్రాశ్వుడు.రౌద్రాశ్వుడు దేవకన్య అయిన మిశ్ర కేశికి పూరువు వల్ల జన్మించాడు. – *మహాభారతం*

**ధర్మారణ్యం :** పుణ్యస్థలమైన ఓ అడవి. ఒకప్పుడిది అసూతరజసుడనే రాజు రాజధాని. ఈ అరణ్యం లోకి వెళ్తే పాప పరిహారం జరుగుతుంది. – *మహాభారతం*

**ధర్మాంగదుడు :** విష్ణుభక్తుడైన బ్రాహ్మణుడు. ఇతడు రుక్మాంగదుడి కుమారుడు. రుక్మాంగదుడు రుతు ధ్వజుడి కుమారుడు. శ్రీమహావిష్ణువు ఇతని వైష్ణవ భక్తికి మెచ్చి ఇతణ్ణి ఇతని తండ్రితోపాటు వైకుంఠం తీసుకు వెళ్లాడు. కొన్ని వేల సంవత్సరాలు వైకుం ఠంలో దైవికమైన సుఖాలు పొంది తిరిగి సోమశర్మ కుమారుడైన సువ్రతుడిగా జన్మించాడు. ఇతడు కామ క్రోధాలను వదలి మహావిష్ణువును గూర్చి తపస్సు చేసి 100 సంవత్సరాలు అలానే గడపగా మహా విష్ణువు ఇతడిని ఇతని తండ్రిని వైకుంఠం తీసుకెళ్లాడు. మరల ఇతడు కశ్యపుని పుత్రుడుగా జన్మించాడు. అయితే అతనికి తన పూర్వజన్మపై జ్ఞాపకాలు ఎప్పుడూ గుర్తుండేవి. – *పద్మపురాణం*

**ధర్ముడు (ధర్మదేవుడు) :** ఓ దేవుడు. జీవితంలోని భాగ్యానికి అధిపతి.
*జననం :* బ్రహ్మ కుడి స్తనంనుండి వెలువడి మానవ రూపం పొందాడు. ఇతనికి ముగ్గురు కుమారులు సామ, కామ, హర్షులు. కామ రతీ దేవిని, సామ ప్రాప్తిని, హర్ష నందాను వివాహ మాడారు. ధర్ముడు ప్రజాపతి కుమార్తెలు 13 మందినే కాక మరో 10 మందిని వివాహ మాడాడు. – *భాగవతం*
ఇతని సంతతి నుండి ఎందరో దేవతలు, నరనారాయ ణులు, విశ్వ దేవులు, అష్టవసువులు జన్మించారు. అష్ట వసువుల్లో మొదటి వాడైన ద్రోణుడు ఇతని సంతతిలోని వాడే. అతడే పునర్జన్మలో వసుదేవుడుగా జన్మించాడు.
*ప్రసిద్ధ సంతతి :* హరి, కృష్ణ, నర, నారాయణులు ప్రసిద్ధులు. హరికృష్ణులు గొప్ప యోగులు కాగా నర నారాయణులు మహాపండితులు.
*ఇతర విశేషాలు :* ధర్మవ్రత ఇతనికి ధర్మవతి వల్ల జన్మించిన కుమార్తె. ధర్మవ్రత బ్రహ్మ కుమారుడైన మరీచిని వివాహమాడింది.
అణిమాండవ్యుని శాపం వల్ల ధర్ముడు విదురుడిగా జన్మించాడు. ధర్ముని నివాసస్థలం ధర్మప్రస్థం.
ఒకసారి యక్షుడిగా మారి ధర్మరాజుని తప్ప తక్కిన పాండవులను మూర్ఛిల్ల చేస్తాడు. తర్వాత వారిని స్వస్వరూపుల్నిగావిస్తాడు. ఇతడొకసారి విశ్వామిత్రుని వేషంలో వశిష్ఠుడ్ని పరీక్షిస్తాడు. ఓసారి బ్రహ్మ సల హాపై దేవదానవుల్ని తాటితోకట్టి వరుణి ముందు వుంచుతాడు. మహావిష్ణువు ఇతని కుమారుడుగా జన్మి స్తాడు (చూ॥ నరనారాయణలు) పాండవుల స్వర్గారో హణంలో ఇతడు కుక్క రూపంలో వీరిని అనుసరించాడు.
*ధర్మదేవుడు యముడు :* ధర్ముడు కాలపురి అధి పతి కాలుడు (యముడు) ఒకరేననే తప్పుడు అవగాహన కొన్ని పురాణాలలో వుంది. వారు వేర్వేరనడానికి ఈ క్రింది తార్కాణాలున్నాయి.
ధర్ముడుకి తల్లిదండ్రులు బ్రహ్మకాగా యముని తల్లిదం డ్రులు సంజ్ఞ సూర్యుడు. అంతేకాక కాలుడు విష్ణువు యొక్క ఆరోతరంవాడు.
కాలుడు (యముడు) మనిషి మంచి చెడ్డలను బేరీజు వేస్తాడు. కనుక ధర్మరాజను పేరురాగా ధర్మదేవుడికి స్వీయ నిగ్రహం వుండటం వల్ల యముడని పిలిచే వారు. యముడికి సంతానం లేదు. ధర్ముడికి విదురుడు, యుధిష్ఠురుడు సంతానం.

**ధవళగిరి :** శ్వేత పర్వతమని కూడా అంటారు. అర్జును డొకసారి ఈ పర్వతం పై నివాసమున్నాడు.
– మహాభారతం

**ధవళాంగుడు :** ఒక ముని. కైకేయి ఇతని వద్ద రాక్షస మాయలకు ప్రతీకారం చేసే విద్యను నేర్చుకుంటుంది.
– రామాయణం

**ధాత 1 :** 12 మంది ఆదిత్యుల్లో ఒకడు. ఖాండవదహన సమయంలో శ్రీకృష్ణార్జునులను ఎదుర్కొన్నవారిలో వున్నాడు. ఇతడు సుబ్రహ్మణ్య స్వామికి తన 5 గురు అనుచరులను ఇచ్చాడు. వారు కుండ, కుసుమ, కుముద, ధంబర, ఆథంబరులు. – మహాభారతం

**ధాత 2 :** భృగు మహర్షికి ఖ్యాతి అనే భార్యవల్ల ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె. అందులో ఒకడు ధాత రెండోవాడు విధాత. కుమార్తె లక్ష్మి. లక్ష్మి శ్రీమహా విష్ణువును పెండ్లాడగా మేరువు కూతుర్ల యిన ఆయతి నియతిలను ధాత, విధాతలు వివాహమాడారు.
– విష్ణుపురాణం

**ధాతకి :** పుష్కరద్వీప రాజైన వసుడి కుమారుడు. ఇతడి వల్లనే పుష్కర ద్వీపానికి ధాతకీ ఖండమనే పేరొచ్చింది.
– బ్రహ్మాండపురాణం

**ధాత్రిక :** చూ॥ ధాత్రేయిక

**ధాత్రేయిక :** ద్రౌపది వద్ద పరిచారిక. ఈమె వనవాస సమయంలో ద్రౌపదిని జయద్రథుడు ఎత్తుకు పోయి నట్లు పాండవులకు తెలియజేసింది. ఈమెను ధాత్రిక అనికూడా అంటారు. – మహాభారతం

**ధాన్యమాలి :** ఈశ్వరుడిచ్చిన వాహనంలో సర్వ లోకాలూ సంచరిస్తుండేది. శాండిల్యుడీమెను మోహిం చగా నేను రజస్వలను కాన స్నానంచేసి వస్తానం టుంది. స్నానంచేసి వస్తుండగా రావణుడీమెను బల త్కరిస్తాడు. వీరికి అతికాయుడు జన్మిస్తాడు. శాండిల్యు డీమెను మొసలి కమ్మని శపిస్తాడు. శాపవి మోచనం కోరగా రామకార్యంపై హనుమంతుడు వెళ్తూ నిన్ను తన్నినపుడు శాపవిమోచనమౌతుందని చెప్తాడు.
– రామాయణం

**ధాన్యమాలిని :** అశోకవనం క్రింద సీత వున్నపుడు ఆమెకు కాపలావున్న రాక్షసి. రావణుడు సీతను బలవంతం పెడుతుంటే ఇష్టంలేని స్త్రీతో ఎందుకు? నన్ను రమించరాదా అని రావణుడితో అంటుంది.
– రామాయణం

**ధాముడు :** గంగా మహా ద్వారాన్ని రక్షించే ఓ మహర్షి.
– మహాభారతం

**ధార :** ఇదో పవిత్ర స్థలం. ఈ పవిత్ర స్థలంలో స్నానం చేస్తే బాధలన్నీ నశిస్తాయి. – మహాభారతం

**ధారణం :** రాజయోగం పొందడానికి 8 మార్గాలలో ఇదొకటి. ఆ ఎనిమిది మార్గాలు యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధిలు. – చూ॥ రాజయోగం

**ధారణుడు 1 :** చంద్రవత్స కుటుంబంలో జన్మించిన ఓ రాజు. – మహాభారతం

**ధారుణుడు 2 :** కశ్యపుని కుటుంబంలో జన్మించిన ఓ నాగు. – మహాభారతం

**ధారాపురం :** భోజుడి కాలంలో విదర్భ దేశానికి రాజధానిగా వున్న పట్టణం.

**ధారిణి :** బ్రహ్మ సృష్టించిన పితృలకు జన్మించిన కుమార్తె. మేన ఈమె అక్క, వీరిద్దరు వేదాలను ప్రచారంచేశారు.

**ధారేశ్వరి :** పవిత్ర తీర్థంలో నివసించే ఓ దేవత. ఈమె పార్వతి యొక్క మరో స్వరూపం. – దేవీభాగవతం

**ధార్ష్ణవంశం :** ఇక్ష్వాకు వంశంలోని ఓ ప్రత్యేక కుటుం బం. ఇక్ష్వాకు సోదరుడైన ధృష్టుని సంతతి కనుక ధార్ష్ణవంశం అంటారు. – దేవీభాగవతం

**ధిషణ :** పృధువంశంలో జన్మించిన హవిర్ధానుడి భార్య. ఈమె అగ్నినుండి జన్మించింది. ధిషణకు హవిర్ధాను డికి ఆర్గురు పుత్రులు. వారు ప్రాచీన బర్హి, శుక్రుడు, గయ, కృష్ణ, వ్రకు, అజిన. – అగ్నిపురాణం

**ధీమానుడు :** పురూరవసు రెండవ కుమారుడు.
– మహాభారతం

**ధీరథి :** ఇతడు కాశీలో నివసించే బ్రాహ్మణుడు. శివభ క్తుడు. ఎల్లప్పుడు శివుడినే కొలిచేవాడు కనుక శివుడి తడికెల్లప్పుడు సహాయపడేవాడు. అతనికింత ప్రత్యే కత ఇవ్వడానికి శివగణాలు శివుణ్ణి కారణ మడగగా "ఈ బ్రాహ్మణుడు పూర్వజన్మలో ఓ హంస అని అతడు కొలను దాటుతుండగా నీళ్లలో పడి నల్లగా మారగా మరో హంస సలహాపై గీత 10వ అధ్యాయం చదువుతూ

శివప్రార్థన చేయడం వల్ల బ్రాహ్మణుడుగా జన్మించాడని అంతకు ముందు జన్మలో బ్రాహ్మణుడుగా జన్మించి గురువును తన్నడం వల్ల హంసగా మారాడని శివధ్యానం వల్ల మరల బ్రాహ్మణుడిగా జన్మించాడు" అని చెప్పాడు. – పద్మపురాణం

**ధీరోష్ణి :** శ్రాద్ధకర్మల దేవత. – మహాభారతం

**ధురంధరం :** ప్రాచీన భారతావనిలో ఓ దేశం. – మహాభారతం

**ధుర్యచిత్తుడు :** యయాతి వంశంలోనివాడు. ఇతని మరోపేరు మరుత్తుడు. దుష్యంతుణ్ణి పెంచాడు.

**ధూతపాప :** పంచనదాల్లో ఒకటి. వేదశిరుడికి ఓ అప్సరస కనపడగానే రేతః పతనమౌతుంది. అందులోనుండి ఓ పుత్రిక జన్మిస్తుంది. ఆమె ధూత పాప. బ్రహ్మ వరమడిగితే నన్ను అన్నిటి కంటే పవిత్రురాలిని చెయ్యమంటుంది. ఈమెను ధర్ముడు బలవంతం చెయ్యబోగా ధర్ముణ్ణి నది కమ్మని శపిస్తుంది. ధర్ముడీమెను శిల కమ్మని ప్రతిశాప మిస్తాడు. ఈ విషయం తండ్రికి చెప్పగా ధర్ముడి శాపం తప్పదని చంద్రోదయం తర్వాత తిరిగి నదిగా మారతావని ధర్ముడికి భార్యవవు తావని చెప్తాడు. – కాశీ మాహాత్మ్యం.

**ధూమపాల :** ఓ నది. – మహాభారతం

**ధూమపులు :** ఓ గణంగా ఏర్పడిన పితరులు. వీరు బ్రహ్మపుత్రులు. దక్షయజ్ఞ సమయంలో కన్పిస్తారు. – మహాభారతం

**ధూమాది మార్గం :** కర్మకులు పితృలోకానికి పోయే మార్గం. పుణ్యక్షయం తర్వాత వీరికి పునర్జన్మ వుంటుంది. వీళ్లు చేసే అగ్నిహోత్ర ధూమం ద్వారా వీళ్లకు ఈ లోకం వస్తుంది కాబట్టి దీనికీ పేరు వచ్చింది.

**ధూమావతి :** ఓ పవిత్ర స్థలం. ఇక్కడ మూడు రోజులు ఉపవాసముంటే కోరిన కోర్కెలు నెరవేరతాయి. – మహాభారతం

**ధూమిని :** పురు వంశంలోని అజమీఢుని భార్య. ఈమె వల్ల అతడికి రక్ష అనే కుమారుడు జన్మించాడు. – మహాభారతం

**ధూమోర్గ 1 :** యముడి భార్య. – మహాభారతం

**ధూమోర్గ 2 :** మార్కండేయుడి భార్య. – మహాభారతం

**ధూమ్ర :** దక్షుని కుమార్తె. ధర్ముని భార్య. ఈమె కుమారుడు ధరుడు. – మహాభారతం

**ధూమ్రకేతువు :** భరతుని కుమారుడు. పంచజని వల్ల భరతునికి ఐదుగురు కుమారులు. వారు సుమతి, రాష్ట్రభృతుడు, సుదర్శనుడు, వరుణుడు, దూమ్ర కేతువు.

**ధూమ్రకేశుడు 1 :** ఇక్ష్వాకు వంశంలో ఒక రాజు. – మహాభారతం

**ధూమ్రకేశుడు 2 :** రావణుని మంత్రులలో ఒకడు. – రామాయణం

**ధూమ్రలోచనుడు :** శంభునిశంభుల సేనాపతి. కుంభుడితణ్ణి కౌశికను తీసుకొని రమ్మని పంపగా ఆమె ఇతణ్ణి వధిస్తుంది. – మార్కండేయ పురాణం

**ధూమ్రాక్షుడు 1 :** ఇక్ష్వాకు వంశంలోని ఒక రాజు.

**ధూమ్రాక్షుడు 2 :** రావణుని మంత్రుల్లో ఒకడు.

**ధూమ్రుడు 1 :** ఓ రుషి. ఇంద్రసభలో సభ్యుడు.

**ధూమ్రుడు 2 :** సుబ్రహ్మణ్యుని యోధుల్లో ఒకడు.

**ధేనుకం :** ప్రాచీన భారతావనిలో ఒక దేశం. – మహాభారతం

**ధేనుకాశ్రమం :** ఇదో పుణ్యస్థలం. మృత్యుదేవుడైన యముడు మానవరూపంలో ఇక్కడొకసారి తపస్సు చేసెను. – మహాభారతం

**ధేనుకాసురుడు :** ఇతడో భయంకర రాక్షసుడు. గాడిద రూపంలో వుండేవాడు. కాలీ అనే అరణ్యంలో వుండేవాడు. ఈ అరణ్యం గుండా ప్రయాణించడానికి ప్రజలు భయపడేవారు. శ్రీకృష్ణుడు తన అన్న బలభద్ర రాముడితో అరణ్యానికి వెళ్లి ముష్టి యుద్ధంలో ఇతణ్ణి వధించాడు. దేనుకాసురుడు కంసుని అనుచరుడు. శ్రీకృష్ణ బలరాములు గోవులకు కాపలా కాస్తుండగా ఆ గోవుల మధ్య నుండి ఈ అసురుడు బయటకు రాగా ఇతణ్ణి కృష్ణుడు ఓ చెట్టుకేసి బాది చంపాడు. – భాగవతం

**ధేనుతీర్థం :** ఇదో పుణ్యస్థలం. ఇచ్చట తిలాపుష్పాలను కానుకగా ఇస్తే పాపవిముక్తి కలుగుతుంది. – మహాభారతం

**ధేనుమతి :** దేవద్యుమ్నుని భార్య. – భాగవతం

**ధేనువు :** చూ॥ సురభి

**ధౌతమూలకుడు :** మహా భారతకాలంలో జన్మించిన ఒక రాజు. – మహాభారతం

**ధౌమ్యుడు :** ఓ రుషి. ఇతడు దేవల మహర్షి సోదరుడు. పాండవులు లక్క ఇంటి నుండి తప్పించుకుని గంగా తీరం చేరుకున్నారు. అక్కడ చిత్ర రథుడను గంధ ర్వుడ్ని అర్జునుడు ఓడించగా అతడు తన పురోహితు డైన ధౌమ్యుడ్ని వారి పురోహితుడిగా వుంచుకొమ్మని సలహా ఇచ్చాడు. అప్పటి నుండి ధౌమ్యుడు పాండవు లకు పురోహితుడుగా వ్యవహరించాడు.

పాంచాలి స్వయంవరం తర్వాత ద్రౌపదితో పాండవు లకు శాస్త్రోక్తంగా వివాహం జరిపాడు. రాజసూయ యాగంలో ఇతడే ముఖ్య పురోహితుడు. పాండవులతో పాటు అరణ్య వాసానికి వెళ్లాడు. ధర్మజునికి భారత దేశంలోని వివిధ పుణ్య తీర్థాలను గురించి వివరిం చాడు. అజ్ఞాత వాసంలో పాండవులు మారు పేర్లతో ఎలా వ్యవహరించాలో సలహా ఇచ్చాడు. భారత యుద్ధం తర్వాత పాండవుల వైపు మరణించిన వారికి శ్రాద్ధ కర్మలు నిర్వ హింప జేశాడు. ధర్మజుడు రాజ్యాధి కారం చేపట్టిన తర్వాత రాజనీతిని ఉద్బోధించాడు.

– *మహాభారతం*

**ధౌమ్యుడు 2 :** ఇతడు ఉపమన్యుడి సోదరుడు. పురా ణాలు ఇతడిని అయోధ దౌమ్యుడు, ఆయోధ ధౌమ్యుడు, అపోధధౌమ్యుడు అని పేర్కొన్నాయి.

– *చూ॥ అయోధధౌమ్యుడు.*

**ధౌమ్రుడు :** ఓ ప్రాచీన రుషి. భీష్ముడు అంపశయ్యపై నుండగా కలసినవారిలో ఇతడొకడు. – మహాభారతం

**ధుంధుకారి :** చూ॥ గోకర్ణం

**ధుంధుమారుడు :** ఇక్ష్వాకు వంశంలోని ఒక రాజు. ఇతణ్ణి కువలయాశ్వుడని కూడా అంటారు.

– *చూ॥ కువలయాశ్వుడు*

**ధుంధుమూకుడు :** ఓ క్రూరుడైన రాజు. విశాల్య ఇతని భార్య. ఇతని కుమారుడి పెళ్ళి సమయానికి కూడా ఇతడు మారలేదు. అప్పుడు కూడా ఇతడొక శూద్ర స్త్రీతో కామ క్రీడలు సలిపేవాడు. ఆ తర్వాత ఆ శూద్ర స్త్రీని చంపగా ఆమె సోదరుడు రాజుని రాజు భార్యను వధించాడు. కుమారుడు కూడా క్రూరుడే అయినా ఓ సాధువు సలహాపై శివార్చన చేయగా తల్లిదండ్రు లకు మోక్షం లభించింది. – *లింగపురాణం*

**ధుంధురుడు :** ఓ రాక్షసుడు. ఈ రాక్షసుడు చిలుక రూపంలో కశ్యపుని ఇంటికి వెళ్లి గణేశుడిని చంప బోయి అతని చేతిలో వధించబడ్డాడు.

– *గణేశపురాణం*

**ధుంధులి :** చూ॥ గోకర్ణం

**ధుంధువు :** ఓ క్రూర రాక్షసుడు. మధుకైటబుల్లో మధువు యొక్క పుత్రుడు. శ్రీమహావిష్ణువు మధుకైటబుల్ని సంహరించాడని అతనిపై పగ పెంచుకొని ఒంటి కాలిపై ఘోరతపస్సు చేసి దేవతల వల్ల, రాక్షసులవల్ల, యక్ష గంధర్వుల వల్ల, సర్పాల వల్ల మరణం లేకుండు నట్లు బ్రహ్మనుండి వరంపొంది మరుధాన్యంలో ఇసు కలో జీవించేవాడు. అదే స్థలంలో ఉత్తంకుడు తపస్సు చేస్తూ ఇతడి అకృత్యాలను చూసి విష్ణువుకి మొర పెట్టుకోగా కువలయాశ్వుడను రాజు ఇతణ్ణి చంప గలడని అతడ్ని అర్థించమని సలహా ఇస్తాడు. ఇక్ష్వాకు వంశపు రాజైన కువలయాశ్వుడు తన కుమారులతో వచ్చి ధుంధువును సంహరిస్తాడు. అందువల్ల కువల యాశ్వుడికి దుంధుమారుడను పేరుకూడా వచ్చింది.

– *మహాభారతం*

**ధృతకేతువు 1 :** భృగు వంశపు రాజు.

**ధృతకేతువు 2 :** సన్నతి వంశం వాడైన సుకుమారుడి కుమారుడు.

**ధృతదేవి :** దేవకుడి కూతురు. వసుదేవుని భార్య. వీరికి జన్మించిన పుత్రుడు విప్రష్ణుడు. – *భాగవతం*

**ధృతరాష్ట్రి :** కశ్యప ప్రజాపతికి తామ్రవల్ల జన్మించిన కుమార్తె. హంసలు ఈమె సంతతి. – రామాయణం

**ధృతరాష్ట్రుడు :** విచిత్రవీర్యుని కుమారుడు. విచిత్ర వీర్యుడు సంతానము లేకయే మరణించగా అతని వంశక్షయము జరగకుండుటకై అతని తల్లి సత్యవతి వ్యాసుని వలన పుత్రుని బడయుమని అంబికను నియోగించెను. అంబిక వ్యాసుని గడ్డము రూపము చూసి కనులు మూసుకొనుటచే ధృతరాష్ట్రుడు గర్భము నందే అంధుడయ్యెను. భీష్ముడితణ్ణి రాజ్యా భిషిక్తుని చేసి తానే రాజ్యపాలనము చేయగా పాండు రాజతనికి సహాయకారిగా నుండెను. ధృతరాష్ట్రుడు గాంధార దేశ రాజైన సుబలుని కూతురు గాంధారిని ఆమె సోదరీమణులను వివాహమాడగా గాంధారి యందు

100 మంది కుమారులు, కుమార్తె దుస్సల జన్మించిరి. తక్కిన భార్యల యందును ఎందరో సంతానము జన్మించిరి. పాండురాజు మరణానంతరము పాండవులను కూడా తానే పెంచి ద్రోణాచార్యుని వద్ద ధనుర్విద్య నేర్పించి ధర్మజుని యువరాజుని చేసెను. కాని తన కుమారుడి దుష్టబుద్ధి ఇతని నిస్సహాయత, పుత్రప్రేమ పాండవులను వారణాసికి పంపెను. లాక్షా గృహము దహించబడి పాండ వులు మరణించారని తెలిసి మిక్కిలి దుఃఖించెను. కాని ద్రౌపదీ స్వయంవరం తర్వాత వారు జీవించే వుండిరని తెలిసి కొంత అసంతృప్తి చెందినట్లు కన్పించును. అయినను రాజ్య భాగమిచ్చి పంపెను. దుర్యోధనుని పలుమార్లు హెచ్చరించియూ అతనికి ఎదురు మాట్లాడలేక ద్రౌపదీ వస్త్రాపహరణము కూడ ఆపలేక తిరిగి వారి రాజ్యము వారికప్పించెను. పాండవులు అరణ్య అజ్ఞాత వాసానంతరం కురుక్షేత్రమున సంజయుని ద్వారా 18 రోజులు జరిగిన యుద్ధవిశేషాలను గురించి నిత్యము తెలిసికొనెను. కురుక్షేత్ర యుద్ధానంతరం పాండవులు ఈయన ఆశీర్వచనము కొరకురాగా భీముని కౌగలించుకొను సమయమున కృష్ణుడు ధృతరాష్ట్రుని మనసు నెరిగి ఇనుప భీముని అతని ముందుంచగా తన బలంతో కౌగిలిబిగించగా అది వ్రక్కలయ్యెను. తదుపరి రాజ్యమును విడచి గాంధారి కుంతితో కలసి అరణ్యములకేగి దావాగ్నిలో ముగ్గురు ఆహుతయ్యిరి. ఇతడిని అంబికేయుడని కూడా అంటారు.

**ధృతరాష్ట్రుడు 2 :** తామ్రయందు కశ్యపునకు పుట్టిన పక్షి.

**ధృతరాష్ట్రుడు 3 :** జనమేజయుడి కుమారుడు. – మహాభారతం

**ధృతరాష్ట్రుడు 4 :** కద్రువ కొడుకు. బభ్రువా హనుడితణ్ణి ఓడిస్తాడు. – *జైమిని భారతం*

**ధృతవతి :** గృతవతి అనికూడా పిలుస్తారు. ఇదో ప్రసిద్ధ నది. – మహాభారతం

**ధృతవర్మ :** త్రిగర్త దేశపురాజైన సుశర్మ సోదరుడు. మరోసోదరుడు కేతువర్మ. ధర్మజుని యాగాశ్వాన్ని బంధించగా అర్జునుడు వీరిపై యుద్ధం చేశాడు. సూర్యవర్మ ఓడిపోగా తర్వాత కేతువర్మ అర్జునుని చేతిలో మరణించాడు. ధృతవర్మ అర్జునుని గాయపరచగా గాండీవం కూడా క్రిందపడింది. అర్జునుని కోపాగ్నికి 18 మంది త్రిగర్త వీరులు మరణించగా ధృతవర్మ అర్జునుని పాదాలపై పడి ధర్మజుని ఆధిక్యతను గౌరవించాడు. – మహాభారతం

**ధృతవ్రతుడు :** యయాతి కుటుంబంలో జన్మించిన ఒక రాజు. – భాగవతం

**ధృతసేనుడు :** ఇతడొక వీరుడు. కౌరవుల పక్షాన పోరాడాడు. – మహాభారతం

**ధృతి :** దక్ష ప్రజాపతి కుమార్తె. ధర్మదేవుని భార్యల్లో ఒకరు. ధర్మదేవునివల్ల ఈమెకు నియముడు జన్మించాడు. ఈమె పునర్జన్మలో నకుల సహదేవులు తల్లి మాద్రిగా జన్మించింది. – మహాభారతం

**ధృతిమంతం :** కుశద్వీపంలోని ఒక దేశం. – మహాభారతం

**ధృతిమానుడు :** యయాతి కుటుంబంలో జన్మించిన ఒక రాజు. – భాగవతం

**ధృతిమాను :** కుశద్వీపంలోని ఒక దేశం. – మహాభారతం

**ధృతుడు 1 :** మిథిలా నగర రాజు. అజుడి తండ్రి.

**ధృతుడు 2 :** గాంధారుడి మనుమడు. – మహాభారతం

**ధృవకుజ :** సుబ్రహ్మణ్యస్వామి సైన్యంలో ఓ వీరుడు. – మహాభారతం

**ధృవరత్నుడు :** సుబ్రహ్మణ్యస్వామి సేవకుడు. – మహాభారతం

**ధృష్టకర్ముడు :** యయాతి వంశంలోని ఒక రాజు. – భాగవతం

**ధృష్టకేతువు 1 :** ఒక రాక్షసుడు. – మహాభారతం

**ధృష్టకేతువు 2 :** ధృష్టద్యుమ్నుడి కొడుకు. మహా భారత యుద్ధంలో మరణించాడు. – మహాభారతం

**ధృష్టకేతువు 3 :** చేది దేశానికి రాజు. శిశుపాలుడి కొడుకు. పాండవుల పక్షాన పోరాడి కురుక్షేత్ర యుద్ధంలో మరణించాడు. – మహాభారతం

**ధృష్టద్యుమ్నుడు :** ద్రుపదుని కుమారుడు. పాంచాలి సోదరుడు.

*జన్మవృత్తాంతం :* ద్రుపదుడు ద్రోణుని చేతిలో భంగపడి ద్రోణుని చంపే శక్తిలేక అతడ్ని చంపే పుత్రుడి కోసం యజ్ఞం చేయగా ఆ యజ్ఞగుండం నుండి ఓ

యువతి ముందు బయటకు వచ్చింది. ఆమే పాంచాలి. ఆమెకప్పుడు పెట్టిన పేరు కృష్ణ. ఆ తర్వాత యజ్ఞ గుండం నుండి చేతిలో ఆయుధాలు కవచధారుడై కిరీటధారియై మరో యువకుడు వచ్చాడు. రావడమే యుద్ధోన్ముఖుడై రథంపై కూర్చున్నాడు. అతడు పుట్టగనే ఆకాశవాణి పాంచాల దేశపు భయం పోగొడతాడని ద్రోణుణ్ణి సంహరిస్తాడని పలికింది.
– మహాభారతం

*కురుక్షేత్ర యుద్ధం వరకు ధృష్టద్యుమ్నుని కార్యకలాపాలు :* ద్రోణ సంహారానికే ధృష్టద్యుమ్నుడు జన్మించాడనే వార్తలు వ్యాపించాయి. ద్రోణుడు మాత్రం దైవేచ్ఛగా భావించి ద్రుపదుడిని కలిసి ధృష్టద్యుమ్నుడ్ని తీసుకువెళ్లి ధనుర్విద్య నేర్పాడు. ద్రౌపది స్వయంవర సమయంలో విధివిధానాలను ఇతడే ప్రకటించాడు. మత్స్యయంత్ర భేదనం అనంతరం అజ్ఞాత రూపంలో వున్నవారు తగిన వరులేనని నిర్ధారించి ద్రుపదుడికి తెలియజేశాడు. పాండవుల వనవాస సమయంలో వారిని దర్శించి ద్రౌపదీ సుతుల్ని తన దేశంలోనే వుంచుకున్నాడు. కురుక్షేత్ర యుద్ధం తప్పదని తేలిన తర్వాత పాండవులు ధృష్టద్యుమ్నుడ్ని సర్వసేనానిని చేశారు.

*కురుక్షేత్ర యుద్ధంలో ధృష్టద్యుమ్నుడు :* ఇతడు ఎందరో కురువీరుల్ని సంహరించాడు. ద్రోణుడితో యుద్ధం చేసి అతణ్ణి మూర్ఛిల్ల చేశాడు. అతని చేతిలోనే ఓడిపోయాడు. ఒకసారి కర్ణుడి చేతిలో అశ్వత్థామ చేతిలో ఓడిపోయాడు. శల్యపుత్రుడ్ని సంహరించాడు. దుర్యోధనుడిని ఓడించాడు. నిషధ రాజుల్ని వధించాడు. చివరికి ద్రోణుడు తన కుమారుడు మరణించాడనే తప్పుడు వార్తవిని రథం దిగి నిర్జీవంకాగా అతని తల తెగనరికి పగ తీర్చు కున్నాడు. యుద్ధానంతరం ఇతడు, ఉపపాండవులు గాఢనిద్రలో వుండగా అశ్వత్థామ వారిని చంపి వేశాడు.

*ధృష్టద్యుమ్నుని పేర్లు :* ఇతణ్ణి ద్రౌపది, ద్రోణహంత, పాంచాల, పాంచాలదాయాద, పాంచాలకుల వర్ధన, పాంచాల ముఖ్య, పాంచాలపుత్ర, పాంచాల రాజ, యజ్ఞసేనాసుత, యజ్ఞసేని అని పిలిచేవారు.

**ధృష్టబుద్ధి :** సరస్వతీ నదీతీరంలోని భద్రావతి నగరంలో నివసించే వైశ్యుడు. ధృతిమంతుడా దేశపు రాజు. మొదట ధృష్టబుద్ధి తిరుగుబోతు. కౌండిన్యుడను ముని ఆశీస్సులవల్ల వైశాఖవ్రతం చేసి స్వర్గం పొందుతాడు.
– పద్మపురాణం

**ధృష్టవర్ముడు :** యదువంశంలోనివాడు. అక్రూరుని తమ్ముడు. – భాగవతం

**ధృష్టి :** దశరథుని ఎనిమిది మంది మంత్రులలో ఒకడు. ఆ ఎనిమిది మంది జయంత, ధృష్టి, విజయ, అశిధార్థ, అర్థసాధక, అశోక, మంత్రపాల, సుమంత్రులు.
– రామాయణం

**ధృష్టుడు :** వైవశ్వత మనువు కుమారుల్లో ఒకడు. ఇక్ష్వాకుని తమ్ముడు. ఇతని కుమారుడు నాభాగుడు.
– భాగవతం

**ధ్వజవతి :** హరిమేధ మహర్షి కుమార్తె. సూర్యుని ఆజ్ఞపై ఆకాశంలో సూర్యుడు చెప్పిన ప్రదేశంలో వుంటుంది.
– మహాభారతం

**ధ్వజని :** ప్రాచీన భారతావనిలో ఒక దేశం.
– మహాభారతం

**ధ్వని :** ఎనిమిది మంది వసువుల్లో ఒకడైన ఆపుడి కుమారుడు. తక్కిన ముగ్గురు వైతాండ, శ్రమ, శాంత.
– విష్ణుపురాణం

**ధ్వన్యుడు :** ఇతడొక రాజు. లక్ష్మణుని కుమారుడు.
– రుగ్వేదం

**ధ్వసంతి :** రుగ్వేద కాలంలోని ఓ రుషి. అశ్వనీ దేవతలు ఇతడ్ని కాకుండా మరి ముగ్గురు రుషులైన తుర్విత, దభాతి, పురుషంతిలను కాపాడారు. – రుగ్వేదం

**ధ్యానం :** ప్రాచీన కాలం నుండి భారతీయులు ధ్యానం వల్ల స్వర్గప్రాప్తి కల్గుతుందని విశ్వసిస్తారు. ధ్యానానికి శాస్త్రీయ పద్ధతులున్నాయి. ధ్యాయి అనగా ఆలోచన. ధ్యానమంటే దేవునిపై కేంద్రీకరించి ఆలోచించుట. దేవుడు స్వరూప రహితుడు. కనిపించనివాడు కనుక దేవుడనే ప్రతిమపై లగ్నం చేసి మొదట ధ్యానం చెయ్యాలి. ధ్యానంలో శరీరాన్ని త్యజించినవాడు దైవ సాయుజ్యం పొందుతాడు. దేవుని ఓ క్షణం లేక రెండు క్షణాలు ధ్యానించినా స్వర్గం పొందుతాడు. త్యాగం కంటే ధ్యానం గొప్పది. ధ్యానానికి నాల్గు మూలాలు. ధ్యానించే వాడు, ధ్యానించుట, ధ్యేయం (ఎవరి గురించిన ధ్యానం) ధ్యాన ప్రయోజనం. ధ్యానించే

వాడు విష్ణుభక్తుడై 'శక్తివంతుడై' వుండాలి. ముందు కనబడే వాటిపై కేంద్రీకరించి ధ్యానం చేసి తర్వాత కన్పించని మన పంచేంద్రియాలకు అందని వాటిపై కేంద్రీకరించి "అహం బ్రహ్మజ్యోతిరాత్మ వాసుదేవ విముక్త" అని ఆలోచించాలి. - అగ్నిపురాణం

**ధ్రువసింధువు (ధ్రువసంధి)** : కోసల దేశపు రాజు. ఇతని తండ్రి పుష్యుడు. కొడుకు సుదర్శనుడు. మనోరమా లీలావతులితని భార్యలు. మనోరమకు సుదర్శనుడు, లీలావతికి శత్రుజిత్తు జన్మిస్తారు. ధ్రువ సింధువు మరణానంతరం లీలావతి తండ్రి మనో రమను సుదర్శనుణ్ణి వెళ్ళగొట్టి తన మనుమడు శత్రు జిత్తును రాజును చేస్తాడు. కాని కాళికామాత అను గ్రహం చేత ధ్రువసింధువు స్నేహితుడు నిషాదుడి సహాయం వల్ల మంత్రి విదల్లుడి సహాయంవల్ల రాజ్యం తిరిగి చేజిక్కించు కొని శశికళను వివాహ మాడి చాలాకాలం రాజ్యపాలన చేస్తాడు.

- దేవీభాగవతం

**ధ్రువసేవ :** భరతుడి కొడుకైన సుమతి భార్య.

- భాగవతం

**ధ్రువుడు 1 :** బ్రహ్మ పుత్రుడైన మనుస్వాయంభవుకు ఇద్దరు కుమారులు. ఉత్తానపాదుడు, ప్రియవ్రతుడు. ఇద్దరూ మహావీరులు. న్యాయ నిరతులు. ఉత్తానపా దుడికి ఇద్దరు భార్యలు సురుచి, సునీతి. సురుచి కుమారుడు ఉత్తముడు, సునీతి కుమారుడు ధ్రువుడు. ఉత్తానపాదుడు ఉత్తముడి పైనా సురుచి పైనా ఎక్కువ మక్కువ చూపేవాడు.

ఒకరోజు ఉత్తానపాదుడు సింహాసనం పై కూర్చొని వుండగా ఉత్తముడు అతని తొడపై కూర్చోగా ధ్రువుడు కూడా వెళ్లి కూర్చోబోగా సురుచి అసహనం చూపి అతన్ని దగ్గరకు తీసుకోలేదు. సురుచి ధ్రువుడితో నీవు రాజు తొడపై కూర్చో వాలంటే నా గర్భంలో జన్మించి వుండవలసిందని నీకంత ఆశవుండరాదని చెప్పగా అదినచ్చక అతడు వెళ్లి తన తల్లి ఒడిలో కూర్చున్నాడు. సునీతి కన్నీళ్లు పెట్టుకోగా ధ్రువుడు ఒక్క ఉదుటున లేచి నా తండ్రి కంటే గొప్పస్థాయికి ఎదుగు తాను, అదిన్నూ నా స్వయంశక్తితోనని ప్రతిజ్ఞ చేశాడు.

ధ్రువుడు మధువనమనే అరణ్యంలో అతి చిన్న వయసులో విష్ణువును గూర్చి తపస్సు ప్రారంభిం చాడు. తల్లి తమ భవంతికి రమ్మన్నా వినకుండా మరింత పట్టుదలతో తపస్సు కొనసాగించగా శ్రీ మహావిష్ణువు ప్రత్యక్షమయ్యాడు. అతడు నీకేవరము కావలయుననగా ధృవుడు ప్రపంచంలోనే ప్రసిద్ధ శాశ్వత స్థానం కావాలని కోరుకోగా నీకు గ్రహాలకంటే నక్షత్రాల కంటే గొప్ప స్థానం లభిస్తుందని కల్పాంతం వరకు ఓ నక్షత్రంగా వెలుగొందుతావని నీ తల్లి కూడా నక్షత్రమై శివుని దగ్గరలో ధ్రువుడు వున్నంతకాం వుంటుందని వరమిచ్చాడు. - విష్ణుపురాణం

మహావిష్ణువు తెల్పిన ధ్రువుని పూర్వజన్మ : ఇతడొక బ్రాహ్మణ బాలుడు, విష్ణు భక్తుడు. ఇతనికి ఓ రాజకు మారుడితో స్నేహం కలిగి అతని భోగ భాగ్యాలు చూసి విష్ణువును తనకు కూడా ఆ స్థానం కావాలని కోరగా తదుపరి జన్మలో అది సిద్ధిస్తుందంటాడు. అందువల్లనే ఉత్తానపాదుడి కొడుకైన ధ్రువుడిగా జన్మించాడు. - విష్ణుపురాణం

*ధ్రువుని పాలన-ముగింపు :* విష్ణు ప్రసాదియై తిరిగి తన దేశానికి రాగా ధ్రువుని పట్టాభిషిక్తుడ్ని చేసి ఉత్తాన పాదుడు అరణ్యవాసానికి వెళ్లాడు. ధ్రువుడు శివకుమా రుడను ప్రజాపతి కుమార్తె బ్రాహ్మిని వివాహ మాడగా కల్ప వత్సరులు జన్మించారు. వాయుపుత్రిక అయిన ఇలాను వివాహమాడగా ఉత్కలుడను పుత్రుడు జన్మించాడు. సోదరుడైన ఉత్తముడు వివాహం చేసుకోలేదు. ఓసారి అడవికి వేటకు వెళ్లగా ఓ యక్షుడు ఇతణ్ణి వధించాడు. అడవిలో మంటలు రేగి అతని తల్లి మరణించగా ధ్రువుడు తన ఆయుధాలతో యక్షునిపై దండెత్తి వారిని ఓడించాడు. కుబేరుడు ప్రత్యక్షమై ఇతణ్ణి తన విమానంలో తీసుకెళ్లి గ్రహాలకంటే పై స్థాయిలో కూర్చోబెట్టాడు.

*ధ్రువుని వారసులు - అతని స్థానం :* ఇతని వారసు లలో చాక్షుష మనువు, కురు, పూరుడు, అంగిరసుడు, శిభి, పృధుచక్రవర్తుల వంటి మహామహులు కలరు. గంగ స్వర్గంలో విష్ణు పాదాల వద్ద పడుతుంది. అచటనే ధ్రువుడు విష్ణువును పూజిస్తూ వుంటాడు.

- దేవీభాగవతం

**ధ్రువుడు 2 :** నహుషుని కుమారుడు. యయాతి సోదరుడు. - మహాభారతం

**ధ్రువుడు 3 :** ఇతడొక రాజు - యముని కొలువులో అతణ్ణి పూజిస్తూ వుంటాడు.

**ధ్రువుడు 4 :** కౌరవుల పక్షాన పోరాడిన యోధుడు. భీమసేనుని చేతిలో మరణిస్తాడు. – మహాభారతం

**ధ్రువుడు 5 :** ఓ రాజు. ధర్మపుత్రుడి వైపు నిలబడ్డాడు. – మహాభారతం



**న :** 'న' అనే అక్షరార్థం 'కూర్పు' మరియు 'బుద్ధ' – అగ్నిపురాణం

**నకులుడు :** పాండవులలో మూడవవాడు. అశ్వనీ దేవతల వల్ల కుంతి ఇచ్చిన మంత్రం వల్ల మాద్రికి జన్మించాడు. పాండవులలో అందరి కంటే అందగాడు కావడం వల్ల నకులడని పేరు. హస్తినాపురం వెళ్లక ముందు శకుని వద్ద అస్త్రవిద్య నేర్చుకున్నాడు. పాండు రాజు మరణానంతరం తక్కిన పాండవులతో హస్తినకు వెళ్లాడు. ద్రోణాచార్యుని వద్ద ధనుర్విద్య అభ్యసించాడు. ద్రౌపది వల్ల ఇతనికి శతానికుడు జన్మించాడు. చేది రాజకుమార్తె రేణుమతిని వివాహమాడగా నిరమిత్రుడు జన్మిచాడు. రాజసూయయాగంలో ఇతడు పశ్చిమ రాజ్యాలను జయించి సకలసంపదలను ఇంద్ర ప్రస్థానానికి తెచ్చాడు. పాండవుల అరణ్య వాసంలో కొలనులో నీటికి వెళ్లి మృత్యు వాతపడగా ధర్మజుడు రక్షించాడు. అజ్ఞాత వాసంలో ఇతనిపేరు గ్రంధికుడు. ఆ తర్వాత కురుక్షేత్ర యుద్ధంలో ఎందరో వీరులతో పోరాడాడు. కర్ణుని కుమారుల్ని వధించాడు. ద్రోణ, కర్ణ, దుర్యోధనుని చేతుల్లో ఓడాడు. యుద్ధానంతరం ఇతడు ధర్మజునికి గృహస్థ ధర్మాలు వివరించాడు. ధర్మజుడు పట్టాభిషి క్తుడైన తర్వాత ఇతణ్ణి సైన్యాధిపతిని చేశాడు. మహా ప్రస్థానంలో అడవిలో మరణించి సహదేవునితో కలిసి అశ్వనీదేవతల స్థానం పొందాడు.

**నకులం :** ఓ ముంగిస. ధర్మరాజు అశ్వమేధాన్ని గొప్పగా నిర్వహించగా అక్కడికో నకులం (ముంగిస) వచ్చి సక్తుప్రస్తుడి యాగంతో ఎక్కడ సరిపోతుంది ? అనగా అక్కడి బ్రాహ్మణుల కోరిక మేరకు సక్తుప్రస్థుడి యజ్ఞ కథ వివరిస్తుంది. అప్పుడు దీనికి శాపవిమోచన మౌతుంది. – మహాభారతం

**నక్తుడు :** రెండో పృథువు కుమారుడు.

**నక్షత్ర కల్పం :** అధర్వణ వేదంలో ఒక భాగం. మంజకేశ మహర్షి అధర్వణవేదాన్ని ఐదు భాగాలుగా విభజించాడు. అవి నక్షత్ర కల్పం, వేద కల్పం, సంహిత కల్పం, ఆంగిరస కల్పం, శాంతి కల్పం. నక్షత్రాలను పూజించే క్రమాల్ని వివరించేదే నక్షత్ర కల్పం. – విష్ణుపురాణం

**నక్షత్రకుడు :** విశ్వామిత్రుడి శిష్యుడు. హరిశ్చంద్రుణ్ణి పరీక్షించడానికి సకల బాధలు పెడతాడు. చివరికి హరిశ్చంద్రుణ్ణి ఓ మాలవాడికి అమ్ముతాడు. – మార్కండేయ పురాణం

**నక్షత్ర యోగం :** పురాణాలలో ఒకో నక్షత్రాన్ని ఒకో రోజున పూజిస్తే ఒక్కో కోరిక నెరవేరుతుందని చెప్పబడింది. దీనినే నక్షత్రయోగం అంటారు. అవి :

*అశ్వయికం :* గుర్రాలు, రథాలు ఇస్తే తిరిగి గౌరవ వంశంలో జన్మిస్తాడు.

*భరణి :* భూమి, గోవులు బ్రాహ్మణులకు దానమిస్తే గొప్ప గోసంపద లభించి స్వర్గలోక ప్రాప్తి కల్గుతుంది.

*కృత్తిక :* వరి అన్నంతో బ్రాహ్మణులకు కడుపు నిండా భోజనం పెడితే మరణానంతరం ప్రముఖ లోకాలు చేరతాడు.

*రోహిణి :* పాల అన్నం, నెయ్యితో కూడిన భోజనం బ్రాహ్మ ణులకు పెడితే పితృ రుణం తీరుతుంది.

*మృగశిర :* పాలిచ్చే గోవుని ఈ రోజు దానం చేస్తే స్వర్గలోక ప్రాప్తి కల్గుతుంది.

*ఆర్ధ్ర :* ఉపవాసముండి అల్లపు నూనె దానంచేస్తే అతనికి పర్వతాలు, గుట్టలు ఎక్కే శక్తి లభిస్తుంది.

*పునర్వసు :* రొట్టెలు గనుక ఈ రోజు దానం చేస్తే సద్గుణమైన కుటుంబంలో తిరిగి జన్మిస్తాడు.

*పుష్యమి :* బంగారం బహుమతిగా ఇస్తే కాంతి వంతమైన గ్రహాలు చేరతారు.

*ఆశ్లేష :* వెండితో చేసిన ఎద్దుల్ని బహూకరిస్తే పిరికితనం పోతుంది.

*మాఘ :* జింజెల్లిని కనుక బహూకరిస్తే గోసం పదతో తులతూగుతారు.

*పూర్వఫల్గుణ :* నెయ్యితో కూడిన అన్నం బ్రాహ్మణులకు పెట్టి ఆ రోజు ఉపవాసముంటే సంతోషంతో సంపదతో తులతూగుతారు.

ఉత్తర ఫల్గుణ : నివర రకపు అన్నం, పాలు నెయ్యి కలిపి భోజనం పెడితే స్వర్గంలో గౌరవించబడ తారు.
హస్త : 4 గుర్రాలు, ఓ ఏనుగు ఈ రోజు బహుమతిగా ఇస్తే మంచి లోకాల ప్రాప్తి కల్గుతుంది.
చిత్ర : ఎద్దుల్ని సుగంధ ద్రవ్యాలను ఈ రోజు బహూ కరిస్తే దేవతా స్త్రీలు వుండే ఉద్యానవనాలలో నివసించే భాగ్యం కల్గుతుంది.
స్వాతి : ఏ రకమైన సంపదను దానంగా ఇచ్చినా ప్రపం చఖ్యాతి లభిస్తుంది.
విశాఖ : గోవుపాలు, విత్తనాల పెట్టె, బండి, వడ్లు, వజ్రాలు దానమిస్తే స్వర్గం లభిస్తుంది
అనూరాధ : బట్టబియ్యం, దుప్పటి దానం చేస్తే 100 యుగాలు స్వర్గంలో గౌరవించబడతారు.
జ్యేష్ఠ : పచ్చదనం, వృక్షసంపద దానం చేస్తే వారి కోరికలు నెరవేరతాయి.
మూల : వ్రేళ్లు, గింజలు బ్రాహ్మణులకు దానమిస్తే పితృలోకం సంతసిస్తుంది.
పూర్వాషాఢ : వేదపండితులైన బ్రాహ్మణులకు పెరుగు దానం చేసి ఉపవాసముంటే గోసంపద గల కుటుం బంలో జన్మిస్తారు.
ఉత్తరాషాఢ : తెలివైన వారికి పాలు, నెయ్యి దానం చేస్తే స్వర్గంలో గౌరవించబడతారు.
శ్రావణ : బట్టదుప్పటి ఈ రోజు దానమిస్తే స్వర్గంలోక ప్రాప్తి లభిస్తుంది.
శ్రావిష్ఠ : పశువులు, బళ్లు, బట్టలు దానమిస్తే స్వర్గ ప్రాప్తి లభిస్తుంది.
శతభిషక్ : గంధపు చెక్కలు దానమిస్తే దేవలోక ప్రాప్తి లభిస్తుంది.
పుణ్య ప్రోష్ఠపథ : ఈ రోజు నాణాలు బహూకరిస్తే సంతోషకర లోక ప్రాప్తి లభిస్తుంది.
ఉత్తరప్రోష్ఠపథ : మాంసాన్ని దానమిస్తే పితృలకు సంతోషం కల్గిస్తుంది.
రేవతి : పాలిచ్చే గోవుల్ని దానమిస్తే ఏలోకమైనా ప్రాప్తిస్తుంది.

**నక్షుడు :** ఆకుతి వల్ల ప్రుధుసేనుడికి జన్మించిన పుత్రుడు. ఇతనికి ధృతి వల్ల గయుడు జన్మించాడు. – భాగవతం

**నగరం :** ప్రాచీన కాలం నుండి నగర నిర్మాణానికి కొన్ని నిబంధనలు వుండేవి. ఈ నిబంధనలకు లోబడి వుంటేనే నగరం అని పిలవబడేది. అవి : ఓ యోజనం గాని అందులో సగం భూమి వుండాలి. వాస్తు దేవతను పూజించిన తర్వాతే నగర నిర్మాణం చేపట్టాలి. తూర్పు, పశ్చిమ, ఉత్తర, దక్షిణాలు నాల్గు వైపులా నాల్గు ప్రధాన ద్వారాలు వుండాలి. దక్షిణ ద్వారం గంధర్వ పథం, తూర్పు ద్వారం సూర్యపథం, ఉత్తర ద్వారం చంద్ర పథం, పశ్చిమ ద్వారం వరుణపథం వైపు వుండాలి. చిన్న ద్వారాలు ఏనుగులు నడిచే వెడల్పు వుండాలి. ఒక్కో కులం వారు ఒక్కో వృత్తివారు ఒక్కో దిక్కున నివసించాలి. ఇళ్లుకూడా నిబంధనల కను గుణంగా నిర్మించాలి. – అగ్నిపురాణం

**నగ్నజిత్తు 1 :** ఓ క్షత్రియ రాజు. ఇషుపాదుడను రాక్షసుని శరీరభాగం నుండి జన్మించాడు. ఇతడు గాంధార రాజు. ఇతడిని కర్ణుడు సంహరించాడు. ఇతడి పుత్రులను శ్రీకృష్ణుడు ఓడించాడు.
– మహాభారతం

**నగ్నజిత్తు 2 :** ప్రహ్లాదుని శిష్యుడైన ఓ అసురుడు. పునర్జన్మలో సుబలుడను రాజుగా జన్మించాడు.
– మహాభారతం

**నచికేతసుడు :** చూ॥ నాచికేతుడు.

**నచినం :** ప్రాచీన భారతావనిలో ఓ ప్రాంతం.
– మహాభారతం

**నడాగిరి :** ఓ తెలివైన ఏనుగు. తార్కికంగా ఆలోచించే శక్తిగల జంతువు. – కథాసరిత్సాగరం

**నడీజుడు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. ఇతడిని పాండవులు కురుక్షేత్ర యుద్ధానికి ఆహ్వానించారు.
– మహాభారతం

**నడ్వలా :** చాక్షువ మనువు కుమారుడైన మనువు భార్య. నడ్వలావల్ల మనువుకు ఊరు, పూరు, శాతద్యుమ్న, తపస్వి, సత్యవాక్కు, కలి, అగిష్ఠు అతి రాత్ర, సుద్యుమ్న, అతిమాన్యులు జన్మించారు. – అగ్నిపురాణం
వైరాజ ప్రజాపతి కుమార్తె. మనువువల్ల ఈమెకు పది మంది పుత్రులు. వారు కురు, పూరు, శత ద్యుమ్న, తపస్వి, సత్యవానుడు, శుచి, అగ్నిస్తోమ, అతిరాత్ర, సుద్యుమ్న, అభిమన్యుడు. – విష్ణుపురాణం

**ననగాభుడు :** యయాతి కుటుంబంలోని ఓ రాజు.
– భాగవతం

**నన్నయ :** రాజమహేంద్రవరమను నగరమును రాజ ధానిగా చేసుకొని వేంగి రాజ్యమును పాలించిన రాజ రాజ నరేంద్రుని ఆస్థాన పండితుడు. ఇతడు భారత మును ఆది, సభా, అరణ్య పర్వములు సగమును తెనిగించెను. తక్కిన భాగములను తిక్కన ఎఱ్ఱా ప్రగడ తెనిగించిరి. ఇతడో వ్యాకరణ గ్రంథమును రచించెను. వాగనుశాసనుడను బిరుదాంకితుడు. ఇతని సమకాలీ నుడు భీమకవి. ఇతడింతకు ముందే మహాభారత మును తెనిగిం చెనని ఆది నన్నయ ద్వారా రాజుకు చూపి సన్మానము చేయించమని కోరెనని అందుకు నన్నయ నేను ఆది పర్వమును తెనిగించు చున్నాను. ఇప్పుడే విషయము తెలిసిన యెడల రాజు సన్మానము నకు తిరస్కరించవచ్చును. సమయము చూసి రాజుకి చెప్పి సన్మానము చేయించుదునని తెల్పి ఆ గ్రంథమును తని వద్దనే వుంచుకొని తర్వాత దానిని కాల్చివేసెను. కొంతకాలమునకు భీమకవి నన్నయ ఇంటికివచ్చి నన్నయ లేకపోవడంతో అతని భార్యను నన్నయ భారతానువాద మెంత వరకు వచ్చినదని అడుగగా అరణ్య పర్వములోనున్నాడని చెప్పెను. భీమన అది అగునంతవరకు తన భారతమును బయటకు రానివ్వడని తెలిసి ఇంకనూ అరణ్యమందే వున్నాడా అని అడిగి వెడలిపోయెను. అదే శాపముగా మారి నన్నయ ఓసారి అడవికి వెళ్ళి మృత్యువాతబడెను.
– పురాణ నామచంద్రిక

**నప్త :** ఒక దేవుడు. – మహాభారతం

**నభకాననం :** ప్రాచీన దక్షిణ భారతావనిలో ఒక దేశం.
– మహాభారతం

**నభగుడు :** ఇక్ష్వాకుని 10 మంది సోదరుల్లో ఒకడు.
– భాగవతం

**నభశ్వానుడు :** నరకాసురుని ఏడుగురు ముఖ్య కుమా రుల్లో ఒకడు. – భాగవతం

**నభాస్వతి :** అంతర్ధానుని రెండవ భార్య. హనిర్ధానుని తల్లి.

**నభస్వంతుడు :** మురాసురుని కొడుకు. శ్రీకృష్ణునిచే వధింపబడెను. – భాగవతం

**నభుడు :** విప్రచిత్తి కుమారుడు.

**నభోదుడు :** చిరంజీవుడైన ఓ విశ్వదేవుడు. తండ్రులకు శ్రాద్ధకర్మలు నిర్వహించే విధుల్ని గమనిస్తాడు.
– మహాభారతం

**నమస్యుడు :** యయాతి కుటుంబంలోని ఒక రాజు.
– భాగవతం

**నముచి 1 :** హిరణ్యాక్షుని సేనాని. ఇంద్రునితో యుద్ధంలో తన మాయా జాలంతో ఎన్నో పురుగుల్ని సృష్టించాడు. విష్ణువు తన సుదర్శన చక్రంతో వాటిని సంహరించగా ఇంద్రుడు ఇతణ్ణి తన వజ్రాయుధంతో ఖండించాడు.
– పద్మపురాణం

హిరణ్యాక్షుని సైన్యాధిపతి. ఇతడు ఇంద్రునిపైకి శక్తి వంతమైన ఐదు బాణాలు సంధించగా ఇంద్రుడు వాటిని తుంచివేశాడు. ఇతడు తన మాయాజాలంతో చీకటి మయం చేశాడు. దీన్నికూడా ఇంద్రుడు పటా పంచలు చేయగా ఐరావతం కొమ్ములు పట్టుకొని ఇంద్రుణ్ణి క్రిందపడవేయగా ఇంద్రుడు లేచి తన వజ్రా యుధంతో ఇతణ్ణి ఖండించాడు. – పద్మపురాణం

**నముచి 2 :** ఓ శక్తివంతమైన రాక్షసుడు. కశ్యప ప్రజాపతికి దనువువల్ల జన్మించాడు. ఇతడు గొప్ప రాక్షస సేనతో దేవలోకం పైకి యుద్ధానికి వెళ్లగా ఘోర యుద్ధం జరిగింది. రాక్షసులు చనిపోయినా ఇతడు పారిపోయి సూర్యుని చాటున దాక్కున్నాడు. ఇంద్రుడు అతణ్ణి చంపనని వాగ్దానం చేసి సంధి కుదుర్చుకున్నాడు. "తడివల్ల గాని, పొడివల్లగాని, రాత్రిగాని, పగలుగాని చంపను" అని ఇంద్రుడు వాగ్దానం చేశాడు. తర్వాత రాక్షసుల వెంటబడి నముచి సోదరులైన శుంభ, నిశుంభుల్ని సంహ రించాడు. తర్వాత నముచిని వెంటాడి సముద్రంలో సముద్రపు నురగతో ఇతణ్ణి వధించగా వాగ్దాన భంగం చేసినందుకు ఇంద్రుడికి బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంటుంది. ఈ పాతకానికి నివారణ అడగగా బ్రహ్మ అరుణా సంగమంలో స్నానం చేయమంటాడు. అలా చేయడంవల్ల ఇంద్రునికి బ్రహ్మహత్యాపాతకం పోయి ఈ స్థలం పుణ్య తీర్థమవుతుంది.
– మహాభారతం

**నమ్మాళ్వార్‌లు :** మొట్టమొదటి 12 మంది గొప్ప ఆళ్వా రులను నమ్మాళ్వారులంటారు. శైవభక్తుల్ని నాయ నార్లని వైష్ణవ భక్తుల్ని ఆళ్వారులని అంటారు. వైష్ణవ మతం ప్రకారం ఈ 12 మంది ఆళ్వారులు ఆదిశేష గరుడల అంశలని వారు విష్ణువు సుదర్శన చక్రాన్ని శంఖాన్ని అనుసరిస్తారని చెప్పబడింది. విష్ణు భక్తులైన

వీరు కలియుగంలో ద్రావిడ ప్రాంతంలోని తామ్రపర్ణి, కృత మాల, పాప నాశిని, కావేరీ నదీతీరాలలో ఏ కులంలో అయినా జన్మిస్తారు. - భాగవతం

**నయనారులు :** దక్షిణ భారత శైవమత అవలంబులను నయనారులని, విష్ణుభక్తులను ఆళ్వారులని అంటారు.

**నరకము 1 :** పాతాళంలోని నరకాసురుని కుమారుడు భగదత్తుడు పాలించిన దేశం. భగదత్తుడ్ని నరుడని అంటారు.

**నరకము 2 :** చూ।। యముడు.

**నరకాసురుడు :** ఓ రాక్షస వీరుడు.

*జన్మవృత్తాంతం :* హిరణాక్షుడు సముద్రంలో జలకా లాడుతో తన బలమైన చేతుల్తో అలల్ని బాదగా వరు ణుడు శ్రీమహావిష్ణువుని ఇతడి అకృత్యాలను గురించి మొరపెట్టుకున్నాడు. శ్రీమహా విష్ణువు ఇతడిని చంప డానికి బయలుదేరగా హిరణ్యాక్షుడు పందిరూపుడై భూమిని తన కొమ్ముల్తో భూమిని ఎత్తి పాతాళానికి వెళ్లాడు. కొమ్ముల వాడికి భూమాత ఓ వీరుడికి జన్మ నిచ్చింది. అతడే నరకాసురుడు. భూమాత ఆ బిడ్డను మహావిష్ణువు వద్దకు తీసుకొని వెళ్లి ఆశీర్వ దించమని కోరగా నారాయణాస్త్రాన్ని ప్రసాదించి నావల్ల తప్ప మరణం లేదని వరమిస్తాడు.

*నరకాసురుని పూర్వజన్మ :* ఎంతో కాలం క్రితం 16,000 మంది కూతుర్లకు తండ్రియైన రాజు ఒక డుండేవాడు. అతని భవనంలో వీరందరితో కలసి వుండగా శ్రీమహావిష్ణువు మునిరూపంలో అక్కడికి రాగా 16,000 మంది అతణ్ణి చుట్టు ముట్టగా రాజు కోపించి వీరిని శపించగా వీరు తండ్రిని వేడుకోగా మీరు తర్వాతి జన్మలో శ్రీ మహావిష్ణువు భార్యల వుతారని శాపవిమోచనం చేశాడు. వీరు తర్వాతి జన్మలో వేర్వేరు దేశాలలో జన్మించగా నరకాసురుడు వారందరిని బంధించి జేడకంలో ఉంచాడు.

- భాగవతం

నరకాసురుడు ప్రాగ్జోతిషాన్ని రాజధానిగా చేసుకొని అసుర చక్రవర్తిగా చాలాకాలం పాలించాడు. త్వష్ఠ కుమార్తె కశేరుని బలాత్కరించాడు. భూమిపైన దేవలో కంలోని 16,100 కన్యలను బంధించి మణి పర్వతం పైన గల జేడకంలో బంధించాడు. నల్గురు యోధులు హయగ్రీవ, నిశుండ, పంచనద, మురలనే రాక్షసు లను తన ద్వారానికి కాపలాగా నియోగించాడు. నరకాసురుని 10 మంది కుమారులు రాజ్య రక్షణ కావించేవారు. నరకాసురుడు 16,000 తాళ్లతో రాజ్యానికి హద్దులు ఏర్పరచాడు. సుగ్రీవుడు ప్రాగ్జోతి షంలో సీతను వెతకడానికి ప్రత్యేక సూచనలు చేశాడు.

*నరకాసుర వధ :* నరకాసురుడు తన శక్తి సంపదతో ముల్లోకాలను బంధించాడు. ఇంద్రుని తల్లి అదితి చెవి పోగులను ఇంద్రుని గొడుగును అపహరించాడు. ఇంద్రుడు ద్వారకకు వెళ్లి శ్రీకృష్ణునికి మొర పెట్టుకోగా శ్రీకృష్ణుడు సత్యభామా సమేతుడై గరుడ వాహనం పైవెళ్లి రాక్షసులను వధించి చివరికి నరకుడితో తల పడి అతణ్ణి వధించి అదితి చెవి పోగులను, ఇంద్రుని గొడుగును వారికిచ్చి నారాయణాస్త్రాన్ని నరకుని కుమారుడు భగదత్తుని కిచ్చాడు. - భాగవతం

**నరకుడు 1 :** ప్రజాపతి కశ్యపునికి ధనువు వల్ల జన్మిం చిన రాక్షసుడు. ఇంద్రుడితణ్ణి వధించాడు. మరణా నంతరం వరుణుడి సేవిస్తూ అతని కొలువులో వుండే వాడు. - మహాభారతం

**నరకుడు 2 :** నరకాసురుని కుమారుడు భగదత్తుడు. పాతాళలోకంలోని నరకాన్ని పాలించేవాడు. భగద త్తుడు నరకాన్ని పాలించాడు కనుక నరకుడనేవారు.

**నరనారాయణులు :** ఇద్దరు మహర్షులు. భద్రాశ్రమం వద్ద కొన్ని వేల సంవత్సరాలు తపస్సుచేశారు. వారు పునర్జన్మలో నరుడు అర్జునుడిగా, నారాయణుడు శ్రీకృష్ణుడుగా జన్మించారు.

- *చూ।। నరుడు, నారాయణుడు*

**నరరాష్ట్రం :** ప్రాచీన భారతావనిలో ఒకదేశం. సహ దేవుడీ రాజ్యాన్ని జయించాడు. - మహాభారతం

**నరవాహనదత్తుడు :** ఓ ప్రసిద్ధ విద్యాధరుడు. ఉదయా నుడను రాజు ఆటపాటలతో తన భార్యలైన పద్మావతి, వాసవదత్తలతో కాలక్షేపం చేస్తుండగా నారదుడు ప్రత్యక్షమై నీ భార్య వాసవదత్త రతీదేవి యొక్క అంశ. ఆమెకు జన్మించినవాడు విద్యాధరులకు చక్రవర్తి కాగలడని చెప్తాడు. కొంతకాలానికి వాసవదత్త ఓ పుత్రునికి జన్మనిచ్చింది. అతడే నరవాహనదత్తుడు. అదే సమయంలో ఇంద్రుని శాపంవల్ల కళింగసేనుడు స్త్రీగా మారి ఓ కుమార్తెకు జన్మనిచ్చాడు. ఆమెపేరు మదన మంచుక. వాసవదత్త ఈ బిడ్డను కళింగసేనను

తన భవంతికి తీసుకురాగా ఆ పిల్లలిద్దరూ ఒకరి కొకరు తదేకంగా చూసుకుంటుంటే అది గమనించి తర్వాత వారిద్దరికి వివాహం జరిపారు.

నరవాహన దత్తుడ్ని రాజ్యపట్టాభిషిక్తుడ్ని చేశారు. ఒక సార తడు తన మంత్రి గోముఖుడితో వేటకు వెళ్లగా అతిలోక సుందరి అయిన రత్నప్రభ కన్పించింది. – *చూ॥ రత్నప్రభ*

ఒకసారి నరవాహనుడు వేటకువెళ్ళి దారితప్పి ఓ దేవతా స్వరం విన్నాడు. ఆ స్వరం వినవచ్చిన వైపుకు నడవగా ఓ శివదేవాలయంలోకి వెళ్లాడు. అందులో ఓ అప్సరస తన సేవికలతో శివుడ్ని ఆరాధిస్తూ కన్పించింది. అంతలో ఆకాశం నుండి ఓ విధ్యాధర స్త్రీ క్రిందికి దిగివచ్చి ఆ అప్సరస స్త్రీని నరవాహన దత్తుడి కిచ్చింది. ఆమె పేరు అలంకారవతి.

అలంకారవతితో కాలం గడుపుతూ ఓసారి వేటకు వెళ్ళి బంగారు పుష్పాలున్న కొలను చూశాడు. నలుగురు మనుషులు వాటిని కోసుకొని వెళ్ళడం చూసి వారి నడగగా విష్ణువుకు అర్పించ డానికి తీసుకెళ్తు న్నామని చెప్పగా వారిని అనుసరించి విష్ణువు వద్దకు వెళ్లి చేతులెత్తి విష్ణువుని ప్రార్థించగా శ్రీమహావిష్ణువు విద్యాధరులకు చక్రవర్తివి కమ్మని ఆశీర్వదించాడు.

– *కథాసరిత్సాగరం*

**నరవాహనుడు :** ఓ క్షత్రియ రాజు. వైశాఖవ్రత మాచరించి బ్రహ్మహత్యాపాతకం నుండి విముక్తి పొందాడు. పాంచాలరాజైన నరవాహనుడు తన బాణంతో ఓ బ్రాహ్మణుడ్ని హత్యచేసి పాపచింతనతో తన యజ్ఞోపవీతాన్ని వీడి దేశదిమ్మరిగా తిరిగాడు. మణిశర్మ అను బ్రాహ్మణుడికి తన కథ వివరించగా వైశాఖ ఉపవాసాన్ని గురించి వివరించగా రాజు వైశాఖ ఉపవాసాన్నాచరించి పాపవిముక్తి పొందాడు. – *పద్మపురాణం*

**నరసింహుడు :** చూ॥ అవతారాలు.

**నరాంతకుడు 1 :** రావణుని ఒక సైన్యానికి అధిపతి. రావణుని సేనాధిపతుల్లో దేవాంతక నరాంతకులు ముఖ్యులు. అంగదుడు నరాంతకునితో ఘోర యుద్ధం చేసి వధించాడు. – *రామాయణం*

**నరాంతకుడు 2 :** ఓ క్రూర అసురుడు. రుద్రకేతువు కుమారుడు. ముల్లోకాలను వణికించి గణేశుని మట్టుపెట్టడానికి అతనిపైకి యుద్ధానికి వెళ్ళి గణేశుని చేతిలో వధింపబడ్డాడు. – *గణేశపురాణం*

**నరిష్యంతుడు 1 :** వైవశ్వత మనువు కుమారుడు. ఇక్ష్వాకుని సోదరుడు. – *భాగవతం*

**నరిష్యంతుడు 2 :** మరుత్తుని కుమారుడైన ఓ రాజు. దముడు అతని కుమారుడు. అతని భార్య ఇంద్రసేన. ఒకసారి అరణ్యంలో కుటుంబ జీవనం చేయుచుండగా వపుష్మానుడితణ్ణి వధించగా ఇంద్రసేన అదే చితిలో దూకి మరణించెను. – *మార్కండేయపురాణం*

**నరుడు 1 :** దైవిక శక్తి గల ఓ రుషి.

*జన్మవృత్తాంతం :* బ్రహ్మ శరీర భాగం నుండి ధర్మదేవుడు జన్మించాడు. ఇతడు దక్షుని 10 మంది పుత్రికలను వివాహమాడగా చాల మంది సంతానం జన్మించారు. అందులో ముఖ్యులు హరి, కృష్ణ, నర, నారాయణ. హరి, కృష్ణులు గొప్ప యోగులు కాగా నరనారాయణులు గొప్ప రుషులయ్యారు. హిమాలయాల లోని బదరికాశ్రమంలో వేల సంవత్సరాలు బ్రహ్మను గూర్చి తపస్సు చేశారు. వీరు ఊర్వశికి జన్మనిచ్చారు.

– *చూ॥ ఊర్వశి.*

*అమృతాన్ని కాపలాకాయుట :* దేవదానవులు క్షీరసాగర మదనం చేసి అమృతం వెలువడగా మోహిని రూపంలో శ్రీ మహావిష్ణువు దానవుల్ని మోసగించి అమృతాన్ని ఇంద్రునికి అప్పగించగా దానవులు ఇంద్రునిపై దండెత్తగా నరనారాయణులు ఇంద్రుని పక్షాన పోరాడి దానవులను పారద్రోలగా నరుడ్ని అమృత రక్షకుడిగా ఇంద్రుడు నియమించాడు.

*శివునితో పోరాటం :* దక్ష యజ్ఞానికి ఆహ్వానించనందుకు శివుడు కోపించి తన శక్తిని దక్షునిపైకి పంపగా ఆ యజ్ఞాన్ని భగ్నం చేసి గాలిలో విహరిస్తూ బదరికాశ్రమాన్ని చేరి తపస్సు చేస్తున్న నారాయణుడి హృదయాన్ని తాకగా నారాయణుని 'హమ్' అను శబ్దం వెలువడి ఆ శక్తికి చోటులేక వెనక్కు మరలి శివుడ్ని చేరగా శివుడు నరనారాయణులపైకి దండెత్తి వచ్చాడు. నరుడు మంత్రించి ఓ గడ్డి పరకను విసరగా అది గొడ్డలిగా మారి శివుని పైకి రాగాదాన్ని శివుడు విరగ్గొట్టాడు. అందువల్ల శివుడ్ని ఖండ పరశుడంటారు. నారాయణుడి నుండి వెడలిన శక్తి వేడికి శివుడి తల వెంట్రుకలు నల్లబడి ఎండిన గడ్డిలా మారాయి.

– *మహాభారతం*

ప్రహ్లాదునితో పోరు : చ్యవన మహర్షి అనివార్యంగా పాతాళానికి వెళ్లగా ప్రహ్లాదుడు ప్రపంచంలోని గొప్ప పుణ్యక్షేత్రాలను చెప్పమని కోరతాడు. చ్యవనుడు "భూమిమీద నైమిశారణ్యం, ఆకాశంలో పుష్కరం, పాతాళంలో చక్రతీర్థం" అని చెప్పగా ప్రహ్లాదుడు నైమిశారణ్యం వస్తాడు. ప్రహ్లాదుడు నైమిశ తీర్థంలో స్నానం చేసి వేటకు వెళ్లగా అక్కడో వృక్షం దాని క్రింద తపస్సు చేసుకుంటున్న ఇద్దరు రుషులు కన్పించారు. ఆ చెట్టు కొమ్మలకు ఆకులకు ఆయుధాలు వుండటం చూసి వీరిని గురించి ప్రశ్నించగా వాగ్వాదం జరిగి బలాబలాలు తేల్చుకో దల్చుకుంటారు. అజగవమనే వింటితో ప్రహ్లాదుని పైకి బాణాలు సంధిస్తాడు. వాటిని త్రుంచి వేయగా అతడు మరిన్ని బాణాలు సంధించినా ప్రహ్లాదుడు వాటిని ఎదుర్కోగా నారాయణుడు ముందుకు వచ్చి ప్రహ్లాదుడితో ఘోరయుద్ధం చేయగా ప్రహ్లాదుడు పడిపోతాడు. ఆ బాణాలు గుచ్చుకొని ప్రహ్లాదుడి హృదయం చీలుతుంది. ప్రహ్లాదుడు ఇతడ్ని శ్రీమహా విష్ణువుగా గుర్తించి అతడ్ని ప్రార్థిస్తాడు. వీరు సహస్ర కవచుడి 999 కవచాలు బద్దలు కొడతారు. అతడు కర్ణుడిగా జన్మించగా 1000 కవచాన్ని ఛేదించడానికి కృష్ణార్జునులుగా జన్మిస్తారు.

*ఇతర విశేషాలు :* పాంచాలి వస్త్రాపహరణ సమయంలో ద్రౌపది నరనారాయణుల్ని స్మరించుకుంది. శ్రీకృష్ణార్జునులు నరనారాయణుల పునర్జన్మలు. భృగుని శాపం వల్ల వీరు కృష్ణార్జునులుగా జన్మించారు.

**నరుడు 2 :** ఓ గాంధర్వుడు. కుబేరుని కొలువులో వుంటాడు. – *మహాభారతం*

**నర్మద :** దక్షిణ భారతదేశంలోని ఓ పుణ్యనది. అమ్రకంటకంలో నుండి వెలువడి కంభాత లోయ గుండా ప్రవహించి సముద్రంలో కలుస్తుంది. ఇది సూర్యుని కుమార్తె అయిన తపతి యొక్క పునర్జన్మ.

– *చూ॥ తపతి.*

*నర్మద పవిత్రత :* గంగానది ఖంకాళంలోను సరస్వతి కురుక్షేత్రంలోను అతి పవిత్రమైనవి కాగా నర్మద ప్రవహించిన ప్రాంతమంతా పవిత్రమైనదే. గంగ ఒక రోజులో, సరస్వతి మూడు రోజుల్లో కల్మషాన్ని పోగొడితే నర్మదను చూస్తేనే కల్మష రహితం అవుతారు. ముల్లోకాలలోను పుణ్యనది అయిన ఇది ముందు కళింగదేశంలోని అమరకం లోకాన్ని చుట్టి 100 యోజనాల పొడవు 2 యోజనాల వెడల్పు వుంటుంది. దేవాసురులు, గంధర్వులు, రుషులు ఇందులో స్నానం చేసి పవిత్రులయ్యారు. తమ గుణాలను విస్మరించి ఓ రోజు ఉపవాసముండి ఈ నదిలో స్నానంచేస్తే 100 జన్మలవరకు సర్వసంపదలతో తులతూగుదురు. ఈ నదికి 60 కోట్ల అంకాల పుణ్యతీర్థాలున్నాయి.

– పద్మపురాణం

*ఇతర విశేషాలు :* నర్మద వరుణుని పూజిస్తూ అతని కొలువులో వుంటుంది. అరణ్యవాస సమయంలో ధర్మజుడు తన సోదరులతో నర్మదాదేవిని దర్శించాడు. అగ్ని నర్మదలోనే జన్మించింది.

**నర్మద 2 :** చూ॥ పుష్పోత్కత.

**నర్మద 3 :** పురుకుత్సుని భార్య. పురుకుత్సుడు మాంధాత కుమారుడు. – విష్ణుపురాణం

**నర్యుడు :** రుగ్వేద కాలంనాటి రాజు. ఇంద్రుడు నర్య, తుర్వసు, యదురాజులను రక్షించాడు. – రుగ్వేదం

**నలకూబరుడు :** వైశ్రావణుడి కుమారుడు. ఇతని సోదరుడు మణిగ్రీవుడు.

*రావణుని శపించుట :* రావణుడు లంకను పాలించుచూ పదునాల్గు లోకాలను గడగడలాడించుచుండెను. అతడలా జైత్రయాత్ర చేస్తూ ఓరోజు రాత్రి కైలాసంలోని పర్వతంపై విశ్రమించగా గాజుల సవ్వడి విని అతని 20 నేత్రాలు తెరచి ఓ అందాల స్త్రీని చూసి ఆమె చెయ్యి పట్టుకొన్నాడు. ఆమె "నేను రంభనని నలకూబరుడు తన భర్త అని అతడు నీ సోదరుడైన కుబేరుని కుమారుడు గనుక నీ కుమారుడని, నన్ను బలాత్కరించుట అన్యాయమని" ప్రాధేయపడింది. అయినా రావణుడు లెక్కచేయక ఆమెను బలవంతంగా అనుభవించాడు. ఈ గాథను తన భర్త నలకూ బరునితో చెప్పగా అతడు ఏ స్త్రీని కూడా ఆమె అంగీకారం లేకుండా బలాత్కరించినచో నీ తల ఏడు ముక్కలవుతుందని రావణుడిని శపించాడు. అందువల్లనే సీతను రావణుడు ఎత్తుకొచ్చి కూడా బలాత్కరించ లేదు.

– ఉత్తర రామాయణం

నలకూబరుని మరో భార్య మయుని కుమార్తె సోమప్రభ – *కథాసరిత్సాగరం.*

*నారదునిశాపం :* నలకూబరుడు అతని సోదరుడు మణిగ్రీవుడు అప్సరసలతో గంగానదిలో జల క్రీడలాడుచుండగా నారదుడటుగా వచ్చెను. నారదుని చూసి అప్సరసలు వస్త్రాలు ధరించి భక్తితో నిలబడగా నారదుని గమనించని నలకూబరుడు అతని సోదరులు నగ్నంగా నిలబడివుండగా మరుత్తు వృక్షాలుగా మారమని శపించాడు. వారు ప్రాధేయపడగా మీరు విష్ణువు అవతారమైన కృష్ణుని చూసినపుడు శాపవిముక్తులవుతారని చెప్తాడు. బాలకృష్ణుడు మన్నుతినగా యశోద అతడిని ఓ బండి చక్రానికి కట్టివేయగా అతడు తాడుతో సహా పరుగెత్తి ఆ రెండు వృక్షాల మధ్య నుండి వెళ్లగా శాపవిమోచనమై శ్రీకృష్ణునికి నమస్క రించి వైశ్రావణ పురానికి వెళ్తారు. *- భాగవతం*

**నలతంతుడు :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు. బ్రహ్మచారి. *- మహాభారతం*

**నలపాకం :** నలుడు కొంచెము గడ్డిపుచ్చుకొని విరసగానే అగ్గిపుట్టును. అతడి వంట అగునంత వరకు వేరే కట్టెలు లేకనే మండుచుండును. నీళ్ళు కావలసినచో బిందెలలో వాటంతట అవే నిండును. రెండు చేతులు చరచిన సుగంధ ద్రవ్యములు వచ్చును. ఆ వంట రుచి అమోఘముగ నుండును.

**నలసేతువు :** రాతితో కట్టిన వంతెన. శ్రీరామ చంద్రుడు వానర సైన్యంతో ఈ వంతెనపై నుండే లంకకు వెళ్తారు. ఇది నలుడను వానరం పర్య వేక్షణలో నిర్మించబడింది కనుక నలసేతువు అంటారు.

*- మహాభారతం*

**నలాయనుడు :** ఓ రుషి. ఇంద్రసేన తండ్రి.

*- చూ॥ ఇంద్రసేన.*

**నలిని :** గంగానది యొక్క ఒక పార్శ్వము. భగీరథుని కోరికపై స్వర్గము నుండి శివుని తలపై దూకి అక్కడి నుండి నేలపై పడినపుడు ఏడు పాయలుగా చీలింది. అందులో నలిని ఒకటి. తక్కినవి హ్లాదిని, పావని, సుచక్షువు, సీత, సింధు, గంగ. *- రామాయణం*

**నలుడు 1 :** నిషధ రాజు. ఇతడు నిషధ రాజు వీరసేనుని కుమారుడు. ఒకసారి బృహదాశ్వ మహర్షి వీరసేనుని వద్దకు వచ్చి నలుని సుగుణాలను గురించి చెప్పాడు. ఒకసారి నలుడు బంగారు రెక్కలతో ఉన్న హంసలను పట్టుకోగా వాటిని విడిచిపెడితే అతనిని గురించి దమయంతికి వివరిస్తామనగా అతడు వాటిని వదలివేస్తాడు. అవి విదర్భ రాజకుమార్తె వద్దకు వెళ్లి నలుడి గుణగణాలు వివరించి అతణ్ణి ప్రేమించేటట్లు ప్రేరేపిస్తాయి. నలుడి మరణానంతరం ఇంద్రుని రథంలో ఆకాశమార్గాన విహరిస్తూ అర్జునుడికి కౌరవులకు మధ్య జరిగిన యుద్ధాన్ని తిలకించాడు.

*- మహాభారతం*

*పూర్వజన్మ :* 1. పూర్వజన్మలో నలుడొక వైశ్యుడు. గౌడ దేశంలోని పిప్పల పట్టణం. తన సర్వ సంపదలను దానం చేసి అడవికి వెళ్లి గణేశుడను మహర్షి సలహాపై తపస్సు చేయగా తదనంతర జన్మలో నలుడిగా జన్మించాడు. *- గణేశ పురాణం*

2. నలదమయంతులు ఆటవికులు. పేర్లు ఆహుక, ఆహుకాలు. శివుడు వీరి భక్తికి మెచ్చి రాజ వంశంలో జన్మించే వరమిచ్చి హంసగా మారి వీరికి సహాయం చేశాడు. *- శివపురాణం*

ఇతర విశేషాలకు *- చూ॥ దమయంతి*

**నలుడు 2 :** ప్రాచీన భారతదేశంలో ఓ రుషి. ఇంద్ర భవంతిలో నివసించాడు. *- మహాభారతం*

**నలుడు 3 :** ఓ వానరం. శ్రీరాముడు లంకను చేరడానికి సేతువు నిర్మించదలచగా వరుణుడు ప్రత్యక్షమై నలుడు విశ్వకర్మ కుమారుడని అతడివల్ల వాస్తుశాస్త్ర సంపద లభించింది కనుక నలుని పర్యవేక్షణలో సేతువు నిర్మించమని శ్రీరామునికి చెప్తాడు.

నలుడు రామరావణ యుద్ధంలో తుండకుడితో పోరాడతాడు *- రామాయణం / భారతం*

**నవకన్యకలు :** నవరాత్రి పూజలో ముఖ్యమైనది. 9 రకాల కన్యలు. 2 సంవత్సరాల నుండి 9 సంవత్సరాల వయసు మధ్యగలవారు 9 రోజులు శక్తి పూజ చేయడాన్ని నవకన్యకలు అని అంటారు.

*- చూ॥ కుమారీపూజ*

**నవభాండాలు :** చూ॥ : నవవర్షాలు

**నవగ్రహాలు :** తొమ్మిది గ్రహాలు. అవి సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని, రాహువు, కేతువు.

**నవగ్నులు :** అంగిరసుల్ని నవగ్నులంటారు. రుగ్వేద కాలంలో వీరి ప్రస్థావన వుంది. *- రుగ్వేదం*

**నవనందులు :** మహాపద్ముని కొడుకులైన సుమాద్యుల తర్వాత వారిని మహా పద్మునికి శూద్రవనితవల్ల జన్మించిన నవనందులు రాజ్యమేలారు. వీరు క్షత్రియుల్ని బాధించారు. బ్రాహ్మణులను చులకన చేశారు. చాణ క్యుడను బ్రాహ్మణుడు ముర కుమారుడైన చంద్ర గుప్తుని ద్వారా వీరిని జయించి చంద్రగుప్తుని రాజుని చేశాడు. అప్పటి నుండి మగధ సామ్రాజ్యం మౌర్య వంశుల పరమయ్యింది.

**నవమీవ్రతం :** ఆశ్వయుజ మాసంలో పౌర్ణమి రోజున చేసే వ్రతం. ఉపవాసముండి గౌరీదేవిని పూజిస్తారు. దీన్నే గౌరీనవమి, పిట్టక నవమి అంటారు. ఈ వ్రతం ఆచరిస్తే భుక్తి, ముక్తి పొందుతారు. – అగ్నిపురాణం

**నవరత్నాలు 1 :** అరుదైన లోహాలైన ముత్య, మాణిక్య, వజ్ర, వైడూర్య, గోమేధ, విద్రుమావు, పద్మరాగ, మరకత, నీలాశ్చేతిలను నవరత్నాలని పిలుస్తారు.

**నవరత్నాలు 2 :** విక్రమాదిత్యుని కొలువులోని 9 మంది పండితుల్ని నవరత్నాలనేవారు. వారు ధన్వంతరి, క్షపణకుడు, అమరసింహుడు, శంభు, వెతాలభట్ట, ఘతకర్పర, కాళిదస, వరాహమిహిర, నరరుచిలు.

**నవరధుడు :** యదువంశంవాడు. భీమరధుడి కుమారుడు.

**నవరాత్రులు :** దుర్గాదేవికి చేసే పూజను నవరాత్రి పూజ అంటారు. శరత్కాలంలో దీన్ని చేస్తారు. ఈ తొమ్మిది రోజులు దుర్గాదేవిని నవ విధాల పూజించి తొమ్మిది రూపాల్లో కొలుస్తారు. నవరాత్రి పూజా విధానాన్ని వ్యాసుడు వివరించాడు.

**నవవర్షాలు :** భరత, హేమకూట, నైషధ, ఇలావృత, నీల, శ్వేత, కురు, భద్రాశ్వ, కేతుమాల దేశాలను నవవర్షాలని పిలుస్తారు.

**నవవిధసృష్టి :** తమస్, తిర్యక్, దేవ, అర్వాక్, అనుగ్రహ, కౌమాశ, మహత్, పంచతాన్మాత్ర, పంచభూ తేంద్రియాత్మకమైన నవవిధాల సృష్టి జరిగింది. సత్య జ్ఞాన సుఖాలనే వాటిలో ఇచ్చ పుట్టిస్తుంది. అదే విష్ణు స్వరూపం.

**నవవ్యూహార్చన :** అంటువ్యాధిని నివారించడానికి చేసే పూజ. ఈ పూజా విధానాన్ని నారదుడికి విష్ణువు వివరిస్తాడు. – అగ్నిపురాణం

**నవుడు :** అణు వంశస్థుడు. ఉశానరుడి కొడుకుల్లో ఒకడు.

**నహుషప్రశ్న :** నహుషుడు అగస్త్యుని శాపం వల్ల సర్పంగా మారతాడు. నహుషుడు శాపవిమోచనం కోరగా నీకీ ప్రశ్నలకు ఎవరైతే సమాధానాలు చెప్తారో అప్పుడే నీ శాపవిమోచనం జరుగుతుందంటాడు. పాండవుల వనవాస సమయంలో భీముడు సమాధానం చెప్పలేక దీనికి దొరుకుతాడు. ధర్మరాజు ఆ ప్రశ్నలకు సమాధానం చెప్పి భీముణ్ణి విడిపిస్తాడు. అప్పుడు నహుషుడికి శాపవిమోచన మవుతుంది.

– మహాభారతం

**నహుషుడు :** చంద్ర వంశంలో జన్మించిన ప్రసిద్ధ చక్రవర్తి. పురూరవసుని మనుమడు. ఆయుషు కుమారుడు. పురూరవసు కుమారుడైన ఆయుషుడికి ఇందుమతి వల్ల దత్తాత్రేయ వరప్రసాదంగా నహుషుడు జన్మించాడు.

*నహుషుని పుట్టుక – వివాహం :* ఒకసారి శివ పార్వతులు ప్రేమానురాగాలతో కైలాసంలో వుండగా పార్వతి శివుణ్ణి బ్రహ్మ సృష్టించిన గొప్ప ఉద్యానవనా లేవని ప్రశ్నించగా అతడు పార్వతిని నందనవనం తీసుకెళ్లాడు. అక్కడో కల్పవృక్షాన్ని చూసి ముగ్ధురాలై దాని గొప్పదనాన్ని చెప్పమని కోరింది. ఏది కోరినా ఈ కల్పవృక్షం ఇస్తుందని చెప్పగా పరీక్షార్థం ఓ అందమైన కన్యను కోరగా కల్పవృక్షం నుండి ఓ అందాలరాశి వుద్భవించింది. పార్వతి ఆమెకు అశోక సుందరి అని నామకరణం చేసి తన కుమార్తెలా పెంచి చంద్ర వంశంలో జన్మించే నహుష చక్రవర్తి నీకు భర్త కాగలడని వరమిచ్చింది.

ఒకసారి ఆమె దేవకన్యలతో నందనవనంలో సంచరిస్తుండగా విప్రాచి పుత్రుడైన హుండుడీమెను చూసి మోహించి తనను వివాహమాడమని కోరగా చంద్ర వంశపు చక్రవర్తి నహుషుడు తనకు భర్త కాగలడని అతణ్ణి తిరస్కరించింది. ఇంతవరకూ నహుషుడు జన్మించలేదు. అతడు యుక్త వయస్కుడయ్యేటప్పటికి నీకు వయసు మీరుతుందన్నా ఆమె నిరాకరి స్తుంది. హుండుడు పరిపరివిధాల ఆలోచించి ఓ స్త్రీ రూపుడుగా మారి నా భర్తను హుండుడువధించాడు. నేను తపస్సు చేయడానికి వెళ్తున్నాను, నాతో రమ్మని అశోక సుందరిని తీసుకువెళ్తాడు. ఆమె తీసుకువెళ్లింది హుండుడి భవనమని తెలిసి "నీవు నహుషుని చేతిలో మరణి

స్తావని శపించి కైలాసానికి పారిపోయింది. హుండుడు రెండు విధాల చింతించనారంభించాడు. ఒకటి అశోక సుందరి దక్కడం. రెండు నహు షుడ్ని సంహరించడం. అతడు తన మంత్రిని ఆయుషు భార్య ఇందుమతి గర్భంలోనే నహుషు డిని చంపడం లేక ఎత్తుకు రావాలని ఆదేశించాడు.

ఆయుషుకు సంతానం లేక అత్రి మహర్షి కుమారుడైన దత్తాత్రేయ మహర్షిని ఆశ్రయించాడు. దత్తాత్రేయుడు ఇతడిని చూడగనే కళ్లు మూసుకొని ధ్యానంలోకి వెళ్తాడు. ఇది వంద సంవత్సరాలు పట్టింది. అయినా ఆయుషుడు దత్తాత్రేయుడ్ని సేవిస్తూనే వుండగా నీకు దేవదానవ, రాక్షస, కిన్నెర, కింపురుష క్షత్రియులె వ్వరూ జయించలేని పుత్రుడు జన్మిస్తాడని అతడు వేద పండితుడు కాగలడని చెప్పి ఓ ఫలాన్నిచ్చి అతని భార్యకివ్వమని చెప్తాడు.

ఆ ఫలాన్ని ఆరగించిన ఇందుమతి ఓ పుత్రునికి జన్మ నివ్వగా హుండుడు ఆ బిడ్డను ఎత్తుకుపోయి తన భార్యకు ఇచ్చి పులుసుపెట్టమని చెప్పాడు. ఆమె ఓ దాసికివ్వగా వేరే మాంసం వండి ఈ బాలుణ్ణి వశిష్ఠుని ఆశ్రమం ముందు వదలగా వశిష్ఠుడితణ్ణిపెంచాడు. ఒకరోజు బాలుడైన నహుషుడు సమిధలకై అడవికి వెళ్లగా దేవకన్యలు ఇతని కథ చెప్తుండగా విని వశిష్ఠుడ్ని అడగగా అతడు నిజమేనని చెప్పగా విల్లు బాణాలతో హుండుడిని వధించడానికి బయలు దేరతాడు.

హుండుడు నహుషుణ్ణే తినివేశానని తలచి అశోక సుందరికీ విషయం చెప్పి తనను వివాహమాడమని కోరగా విద్యాధరుడనే గంధర్వుడు తన భార్యతో వచ్చి నహుషుడు బ్రతికే వున్నాడని అతడు హుండుడిని సంహరించి నిన్ను వివాహమాడతాడని, నీ సంతానం ప్రపంచ ప్రసిద్ధి పొందుతారని చెప్తాడు.

ఆ గంధర్వుడు పలికినవిధంగానే నహుషుడు సర్వ సైన్యాలతో హుండుడి మీదకు దండెత్తి భయంకర యుద్ధంలో అతణ్ణి వధించి దేవతల సమక్షంలో అశోక సుందరిని పెండ్లాడి తన రాజ్యానికి చేరుకున్నాడు.

– పద్మపురాణం

నహుషునికి అశోక సుందరివల్ల యయాతి చక్రవర్తి 100 మంది పుత్రికలు జన్మించారు. యయాతికి నల్గురు కుమారులు జన్మించారు. వారు తుర్వసు, పురు, కురు, యదువులు. వీరంతా లోక ప్రసిద్ధులయ్యారు. యయాతి చక్రవర్తిగా గుర్తించబడ్డాడు.

*నహుషుడు – ఇంద్రపదం :* వృతాసురుడిని వధించడం వల్ల బ్రహ్మహత్యకు గురై మానస సరోవ రంలో దాక్కోగా దేవతలు ఇంద్రుడు లేమిచే నహు షుడ్ని ఇంద్ర పదవి నలంకరింపజేశారు. నహుషుడు ఇంద్రాణిని పొందగోరాడు. అగస్త్యుడు నహుషుడ్ని సర్పంకమ్మని శపించగా నహుషుడు శాపవిమోచనం కోరగా పాండవులను దర్శించి నప్పుడు నిజరూపం దాల్చగలవని చెప్తాడు.

*ఇతర విశేషాలు :* ఇతని పుత్రులు యతి, యయాతి, సమ్యాతి, ఆయతి, అయతి, ధ్రువుడు. మహాభార తంలో ఇతడు ఈ క్రింది పేర్లతో పేర్కొనబడ్డాడు. దేవరాజు, దేవరాత, దేవేంద్ర, జగత్పతి, నాగ, నాగేంద్ర, సురాధిపతి, సురపతి.

**నహుషుడు 2 :** కశ్యప ప్రజాపతికి కద్రువకు జన్మించిన ప్రసిద్ధ సర్పం. – మహాభారతం

**నాకులం :** ప్రాచీన భారతావనిలో ఒక దేశం. – మహాభారతం

**నాగతీర్థం 1 :** గంగాద్వారం వద్ద గల ఓ పుణ్యస్థలం. నాగరాజైన కపిలుడి జ్ఞాపకాలను గుర్తు చేస్తుంది. – మహాభారతం

**నాగతీర్థం 2 :** కురుక్షేత్రం యొక్క సరిహద్దున గల ఓ పుణ్యతీర్థం. ఇచ్చట స్నానం చేస్తే అగ్నిహోమ స్తోమ యాగం చేసిన ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**నాగదత్తుడు :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. భీమసేనుడితణ్ణి కురుక్షేత్రంలో వధించాడు. – మహాభారతం

**నాగద్వీపం :** సుదర్శన ద్వీపంలో ఓ ప్రాంతం. ఈ ప్రాంతం చంద్రునిలో కన్పించే కుందేలు చెవి రూపంలో వుంటుంది.

**నాగధన్వం :** సరస్వతీ నది తీరాన గల పుణ్యతీర్థం. వాసుకి ఇక్కడే వుంటాడు. ఇక్కడే వాసుకిని నాగులు తమ రాజుగా ఎన్నుకున్నారు. – మహాభారతం

**నాగపురం :** నైమిశారణ్యంలోని గోమతీ నదీతీరంలో గల ఓ ప్రాంతం. పద్మనాభుడను నాగువు ఇక్కడ నివసించడం వల్ల ఈ పేరు వచ్చింది. – మహాభారతం

**నాగముఖ్యులు :** కద్రు కశ్యపుల సంతానం. వీరిలో ముఖ్యులు వాసుకి, శేషుడు, ఐరావత, తక్షక, కర్కోటక, ధనుంజయ, కాళీయులు.

**నాగలోకం :** పాతాళం లేక నాగలోకం. దీని అధిపతి వాసుకి. ఇక్కడున్న కొలనులో నీరు త్రాగితే 100 ఏనుగుల బలం వస్తుంది. భూమికి వేల మైళ్ళ లోతున వుంటుంది. ఇది 1000 యోజనాల కంటే యెక్కువ వైశాల్యం వుండి దీని కోటలు వజ్రాలతో పొదగబడి వుంటాయి. కోట ముఖ ద్వారపు మెట్లు కూడా వజ్రాలతో పొదగబడి వుంటాయి. ఇందులో పూలతోటలు, పళ్ళ తోటలు వుంటాయి. - మహాభారతం

**నాగా :** ఓ అసురుడు. - చూ॥ నాగాస్త్రం.

**నాగతి :** దక్షప్రజాపతి కూతురైన యామికి జన్మించిన కుమార్తె. - విష్ణుపురాణం

**నాగశత :** ఇదో పర్వతం. పాండురాజు కుంతి, మాద్రితో కలసి ఇక్కడ తపస్సు చేశాడు. - మహాభారతం

**నాగశ్రీ :** కోసల రాజైన ధర్మదత్తుని భార్య. తారాదత్త ఈమె కుమార్తె. - చూ॥ ధర్మదత్తుడు.

**నాగారి :** గరుడిని పుత్రుల్లో ఓ ప్రముఖుడు. - మహాభారతం

**నాగార్జునుడు :** చిరాయుషు అనే రాజుయొక్క మంత్రి. - చూ॥ చిరాయుషుడు.

**నాగాస్త్రం :** ఓ వినాశకర అస్త్రం.
ప్రాచీన కాలంలో ఓ శక్తివంతుడు నీచుడైన నాగు అనే రాక్షసుడుండేవాడు. బ్రహ్మ తన తంత్ర విద్యతో యజ్ఞగుండం నుండి నాగపాశమనే శక్తిని సృష్టించాడు. దాన్ని నాగుని పైకి పంపాడు. త్రిమూర్తులు దాన్ని అనుసరించారు. అతడు నాగాసురుని నగరానికి వెళ్లి కోటఎక్కి గొప్ప శబ్దం అవ్వగా గర్భవతులైన నాగులకు గర్భస్రావమయ్యింది. ఎంతోమంది పిల్లలు చని పోయారు. నాగుని సేనాని వీరసేనుడు. ఈ నాగశక్తిని చంపడానికి రాగా మరో అరుపుకి వీరసేనుడు అతని సైన్యం ఎగిరిపడి బూడిదయ్యారు. నాగాసురుడు కోపోద్రిక్తుడై కోట్లాది సైన్యంతో ఇతని పైకి యుద్ధానికి వచ్చాడు. నాగశక్తి ఆ సైన్యాన్ని నాశనం చేసి నాగాసురుడిని మింగి త్రిమూర్తులకు వందనం చేశాడు. శివుడు అత్యుత్సాహంతో దాన్ని తన మెడలో ధరించాడు. ఒకసారి ఇతడు లోకాలు చుట్టి వస్తానని శివుడ్ని కోరగా సాల్మలద్వీపం మాత్రం వెళ్లకు తక్కిన లోకాలన్నీ చూసి రమ్మన్నాడు. అతడు అన్నీ తిరిగి వచ్చేదారిలో సాల్మల ద్వీపం వెళ్లగా అక్కడున్న నాగులు ఇతడిని చూసి ఏ మాత్రం భయపడలేదు. ఇతడాశ్చర్యపోయి కోపంతో చూడగా మాకు అత్యంత శక్తివంతుడైన శత్రువున్నాడు. అతడితో మేము సంధిచేసుకొని రోజు కొకరం ఆహారమవుతాం, నీవంతకంటే వీరుడి వయితే అతన్ని జయించమంటాయి. అలా జయిస్తే నిన్ను మా రాజుగా అంగీకరిస్తామని చెప్తాయి.
నాగుల శక్తివంతుడైన శతృవు గరుడుడు. అతడు రాగానే నాగులన్నీ పారిపోగా నాగపాశుడు మాత్రం కదలక అలాగే నిలబడ్డాడు. కాని గరుడునితో గెలవ లేక పారిపోయి శివుని వద్దకు చేరాడు. గరుడుడు వెంటపడి శివుడ్ని తన ఆహారం తనకు దక్క నివ్వ మనగా ఇకముందెప్పుడైనా నీకు సంబంధించిన వారి జోలికి వస్తే అలాగే తిను ప్రస్తుతానికి వదిలెయ్యమని చెప్తాడు. అప్పటి నుండి నాగపాశుడు వైకుంఠంలోనే గడుపుతాడు. అతడే నాగాస్త్రం లేక నాగపాశంగా మారాడు. - కంభరామాయణం

**నాగులు :** సర్పాలలో ఒక తెగ. కశ్యపునికి సురసవల్ల నాగులు, కద్రువ వల్ల ఉరగలు జన్మించారు. రెండూ సర్పాలే అయినా మాతృకలోని తేడా మాత్రమే నాగుల్ని ఉరగల్ని వేరుచేస్తుంది. - రామాయణం

**నాగోద్భేదం :** వినాశన తీర్థం వద్ద గల ఓ పుణ్య స్థలం. సరస్వతీ నది ఇక్కడ కన్పించకుండా ప్రవహిస్తుందని ప్రతీక. ఇక్కడ స్నానం చేస్తే నాగలోక ప్రాప్తి లభిస్తుంది. - మహాభారతం

**నాచికుడు :** విశ్వామిత్రుని కుమారుడు. బ్రహ్మ వాదుల్లో ఒకడు. - మహాభారతం

**నాచికేతుడు (నచికేతుడు) :** ప్రాచీన కాలంలోని ఓ ముని. ఉద్దాలకి యొక్క కుమారుడు. ఇతడు ప్రతిరోజు అరణ్యానికి వెళ్లి తండ్రికి యజ్ఞంలో తోడ్పడే వాడు. ఓ రోజు అడవికి వెళ్లి పుష్పాల కోసం వెదకి దొరకక ఆశ్రమానికి రాగా తండ్రి కోపించి యమ లోకానికి వెళ్లమని శపిస్తాడు. అతడు యమలోక ద్వారం వద్ద యముని కోసం వేచి యుండగా ఎంతకూ

దర్శనం కాక అతణ్ణి గురించి పాటలు పాడాడు. యముడు నాచికేతునికిచ్చిన సలహానే కఠోపనిషత్తు. ఆ సలహాను అర్థం చేసుకొని తండ్రి వద్దకు రాగా పుత్రుడు పండితుడై నందుకు సంతసించాడు.
– మహాభారతం

**నాటకీయం :** ప్రాచీన భారత దేశంలోని ఒక ప్రాంతం.
– మహాభారతం

**నాడీచక్రం :** యోగి ధ్యానంద్వారా నాడీచక్రంలోని 10 నాడులలో పంచ ప్రాణాలను స్వాధీనం చేసుకుంటాడు. నాభి నుండి 72,000 నాడులు శరీరమంతా నిండి వుంటాయి. అందులో 10 నాడులు ముఖ్యమయినవి. అవి ఇఢా, పింగళ, సుషుమ్న, గాంధారి, హస్తి, జిహ్వ, పృథ, యశా, అలంబుస, కుహూ మరియు శాంఖిని. ఈ నాడుల్లో దేనికి లోపం వచ్చినా బాధ కల్గి చనిపోయే ప్రమాదం వుంది.
– అగ్నిపురాణం

**నాడీ జంఘుడు 1 :** ఓ ప్రసిద్ధ మొసలి. ఇంద్రద్యుమ్న మనే కొలనులో వుండేది. – చూ॥ ఇంద్రద్యుమ్నుడు.

**నాడీజంఘుడు 2 :** కశ్యపుని సంతతి అయిన ఓ కొంగ. బ్రహ్మ స్నేహితుడు. దీనిని రాజధర్మ అని కూడా పిలిచేవారు. కృతఘ్నుడైన ఒక బ్రాహ్మణుడు దీనిని చంపాడు. – చూ॥ గౌతముడు.

**నాభాగారిష్టుడు :** వైవశ్వత మనువు కుమారుడు.
– మహాభారతం

**నాభాగుడు :** ఇక్ష్వాకుని సోదరుల్లో ఒకడు. అంబరీష చక్రవర్తి యొక్క తండ్రి. లోకాలన్నింటిని జయించిన తర్వాత తన రాజ్యాన్ని ఓ క్రమ పద్ధతిలో పాలించాడు. జీవిత చరమాంకంలో తన భూభాగమంతా బ్రాహ్మణులకు దానం చేశాడు. భూమి ఏ మాత్రము మిగలక భూదేవి స్త్రీ రూపంలో నాభాగుడితో నేవుంటానని వచ్చింది. ఇతడెన్నడు మాంసాహారం ముట్టలేదు. ఇతడు బ్రహ్మలోకంలో జీవించాడు. – మహాభారతం

**నాభావరుడు :** శ్రుతుడి కుమారుడు. ఇతడి కొడుకు సింధు ద్వీపుడు. – భాగవతం

**నాభి :** ఒక రాజు. అగ్నీధ్రుడి కొడుకు. సంతానం కోసం శ్రీమహావిష్ణువును గూర్చి తపస్సు చేయగా తానే పుడతానని విష్ణువు ఆశీర్వదిస్తాడు. నాభి, సుదేవులకు వృషభుడుగా (రుషభుడు) విష్ణువు జన్మిస్తాడు. ఇతడి మనుమడే భరతుడు. – భాగవతం/విష్ణుపురాణం

**నాయనార్లు :** దక్షిణ భారత దేశంలోని శైవభక్తి మార్గ ప్రచారకుల్ని నాయనార్లని విష్ణు భక్తి ప్రచార కుల్ని ఆళ్వారులని అంటారు.

**నారది :** విశ్వామిత్రుని కుమారుడు. ఇతడు బ్రహ్మవాది.
– మహాభారతం

**నారదీయ పురాణం :** 18 పురాణాల్లో ఒకటి.
– చూ॥ అష్టాదశ పురాణాలు

**నారదీయం 1 :** పద్దెనిమిది పురాణాల్లో ఒకటి. బృహత్కల్ప ధర్మాదులందులో ఉన్నాయి.

**నారదీయం 2 :** ఉప పురాణాల్లో ఒకటి.

**నారదుడు 1 :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు. ఇతడు బ్రహ్మవాది. – మహాభారతం

**నారదుడు :** పురాణ కాలం నాటి ప్రసిద్ధ మహర్షి.

*జననం :* బ్రహ్మ పుత్రుడు. సప్తర్షులు బ్రహ్మ మానస పుత్రులు కాగా బ్రహ్మ రౌద్రం నుండి రుద్రుడు, తొడ నుండి నారదుడు, కుడి బొటన వేలు నుండి దక్షుడు, మనసు నుండి శంఖుడు ఇతరులు, ఎడమ బొటన వేలు నుండి విరాగి అనే పుత్రిక జన్మించగా దక్షుడు విరాగిని వివాహమాడాడు.

*నారదుని జన్మలు :* పురాణాలు నారదుడు 7 సార్లు జన్మించినట్లుగాను బ్రహ్మశాపం వల్ల అనేక జన్మలు పొందినట్లు చెప్తున్నాయి. మొదట బ్రహ్మ కుమారుడు తర్వాత బ్రహ్మశాపంవల్ల ఉపబర్హణుడను గంధర్వుడుగా జన్మించాడు. ఆ తర్వాత దృమిల చక్రవర్తి కుమారుడిగా జన్మించి నారదుడనే పేరుతోనే జీవించాడు. తిరిగి బ్రహ్మ కుమారుడైన నారదుడిగా జన్మించి దక్షుని శాపానికి గురయ్యాడు. ఆ తర్వాత దక్షుని కుమారుడిగా పురుగా జన్మించాడు. ఇవన్నీ ఒకే మన్వంతరంలో జరుగలేదు. అందులో ముఖ్యమైన జన్మలు ఐదు. అయితే పురాణాలలో ఇంతటి విలక్షణమైన వ్యక్తి, ప్రసిద్ధుడు మనకు కన్పించడు.

*మొదటి జన్మ :* బ్రహ్మ నారదుణ్ణి తన ఇతర కుమారులైన మరీచి శనకునిలా సృష్టికి కారణం కమ్మనగా నారదుడు నిరాకరించగా బ్రహ్మ 50 మంది అప్సరసలకు భర్తవు కమ్మని జ్ఞానం నశించి ఉపబర్హణుడనే

గంధర్వుడుగా జన్మించి వేణుగానంలో సుప్రసిద్ధుడవై మరణానంతరం ఓ పరిచారికగా జన్మించి విష్ణుభక్తుడవు కమ్మని తర్వాత నా కుమారునిగా జన్మించి జ్ఞానోదయం పొందమంటాడు. అందువల్ల నారదుడు చిత్రకేతుడను గంధర్వునికి కుమారుడుగా జన్మించి బృహస్పతి వల్ల విష్ణుభక్తుడై హిమాలయాల్లో తపస్సు చేశాడు. అలా తపస్సు చేస్తుండగా 50 మంది దేవకన్యలు పాటలు పాడుతూ వెళ్తూ ఇతణ్ణి చూసి ప్రేమించగా అతడు వారిని వివాహమాడాడు. ఒక సారి విష్ణువును గురించి ఆలపించడానికి బ్రహ్మలోకం వెళ్లి రంభను మోహించగా ప్రజాపతి ఇది చూసి శపించగా తిరిగి గృహానికి రాగానే మరణించాడు. నారదుని పెద్ద భార్య బ్రహ్మ, యముడ్ని శపించ బోగా విష్ణువు బ్రహ్మ రూపంలో ప్రత్యక్షమై మరో వెయ్యేళ్లు జీవిస్తాడని ప్రజాపతి శాపం ఈ మరణానికి కారణ మని అనగానే నిద్రనుండి లేచినట్లు ఉపబర్హిణుడు లేచి మరో వెయ్యేళ్లు జీవించి పుత్రపౌత్రులకు జన్మనిచ్చి మరణిస్తాడు. – *భాగవతం*

*రెండవజన్మ :* కన్యాకుబ్జాన్ని ద్రుమిళుడను రాజు పాలించేవాడు. అతని భార్య కళావతి. సంతానం లేక గంగా తీరంలో తపస్సు చేస్తారు. కశ్యపుని గూర్చి ఆమె పూజలు చేయగా అతని అనుగ్రహం వల్ల గర్భిణి అవుతుంది. ఈ లోపు రాజు తన సంపదను బ్రాహ్మణులకు దానమిచ్చి అడవిలో తపస్సు చేస్తూ మరణిస్తాడు. ఆమెకూడా అదే అగ్నిలో దూకి మరణించ బోగా ఆకాశవాణి ఆమెను ఆపగా ఓ బ్రాహ్మణ కుటుంబంలో బానిసగా జీవిస్తుంది. కొంతకాలానికి ఓ పుత్రుడు జన్మించాడు. అతడు జన్మించగానే వర్షాలు కురిసి దేశం సుభిక్షం కాసాగింది. ఇతనికి నారదుడని నామకరణం చేయగా కొంతకాలానికి తన తల్లికి తన పూర్వ జన్మ వృత్తాంతం చెప్పి విష్ణుభక్తుడిగా మారతాడు. తల్లి పాము కాటుకు మరణించగా తల్లిలేని బిడ్డగా మారి విష్ణువును పూజిస్తూ గొప్ప సంగీత విద్వాంసుడిగా మారి విష్ణుభక్తి తత్పరుడై జ్ఞానోదయమై కొన్ని సంవత్సరాలు గంగాతీరంలో తపస్సు చేసి అక్కడే మరణిస్తాడు. – *భాగవతం*

*మూడవ జన్మ (వానరజన్మ) :* గంగా తీరాన తపస్సు చేసిన నారదుడు ముక్తి పొంది మరల బ్రహ్మపుత్రుడుగా జన్మించాడు. తండ్రి వివాహం చేసుకోమన్నా అతడు విముఖత చూపగా ఎందుకు కుటుంబ వ్యవస్థను వ్యతిరేకిస్తున్నావు. జీవితంలోని 4 ధర్మాలు ఆచారించి నప్పుడే ముక్తి లభిస్తుంది. అందులో ఒకటి గృహస్త ధర్మం కనుక మాలతికి నీవు భర్తకాగలవని వరమిచ్చాడు. నీవు నరనారాయణులను దర్శించి ఆమెను వివాహమాడ మంటాడు. అతడు నరనారాయణులను బదరికాశ్ర మంలో కలుసుకోగా మాలతిని నారదునికిచ్చి వివాహం చేస్తారు. అదే కాలంలో మరో ఋషి పర్వతుడు నారదుడు యాత్రలు చేస్తూ సంజయుని ఆతిథ్యం స్వీకరించారు. అప్పుడు పర్వతుని కూతురు మాలతి నారదునిపై ఎక్కువ శ్రద్ధ కనబరచింది. పర్వతుడు ఈ విషయాన్ని నారదుని అడుగగా సరైన సమాధానం చెప్పకపోగా పర్వతుడు నారదుణ్ణి వానరుడు కమ్మని శపించగా నారదుడు పర్వతుడికి 100 ఏళ్లు యమలోక ప్రాప్తి సంభవిస్తుందని శపించాడు. ఈ సమయంలోనే సంజయుని మంత్రులు రాజకుమారికి వివాహం చేయమని సలహా ఇవ్వగా ఆమె అసంతృప్తి వ్యక్తం చేయగా ఆమె మనోభ్యం తెలుసుకొని వానరుడిగా మారిన నారదుడికిచ్చి వివాహం చేశాడు. ఈలోపు 100 సంవత్సరాలు గడచి పర్వతుడు నారదుడ్ని కలసి శాపవిమోచనం గావించగా మాలతీ నారదులు ఎంతోకాలం సంసార జీవితం గడిపి మాలతి మరణానంతరం బ్రహ్మలోకం చేరాడు.

*దక్షుని పుత్రుడగుట :* దేవతలను సృష్టించిన తర్వాత బ్రహ్మ దక్షుడ్ని పిలచి వీరిని వివాహమాడి సృష్టికార్యం చేయమనగా వారికి 5000 మంది హర్యాశ్వులు జన్మించారు. నారదుడు వచ్చి ఇంతమంది జన్మిస్తే భూమి మీద స్థలం ఏది. ఎంత స్థలముందో చూసి రమ్మని వారికి సలహా ఇవ్వగా వారు అన్వేషణకు బయలుదేరారు. హర్యాశ్వులు ఎంతకు తిరిగి రాకపోగా దక్షుడు శంబలాశ్వులను సృష్టించాడు. నారదుడు వారికి కూడా అదే సలహా ఇచ్చి పంపివేయగా దక్షుడు కోపించి నారదుణ్ణి నీవు కూడా నిలకడలేక అన్ని ప్రాంతాలూ తిరుగుతూ జీవిస్తావని అంతేకాక నా కుమారుడిగా జన్మిస్తావని శపిస్తాడు. అలా నారదుడు దక్ష పుత్రుడుగా జన్మిస్తాడు. – *దేవీభాగవతం*

*పురుగుగా జన్మించుట :* ఒకసారి రాజు రథం పై వెళ్తుండగా ఓ పురుగు అడ్డుపడి రథం క్రింద పడి నలిగిపోతానేమోనని కంగారుగా ప్రక్కకు తప్పుకోగా రాజు పరిహసిస్తాడు. శరీరం లేనిదే ఆత్మలేదు. నీ శరీరం నీకెంత ముఖ్యమో నా శరీరము నాకంతే ముఖ్యమని చెప్తుంది. - మహాభారతం

మాయను గురించి విష్ణువు బోధించుట : చూ॥ తాళధ్వజుడు.

*నారదుడు స్త్రీగా మారుట :* నారదుడొకసారి ద్వారకకు వెళ్లి శ్రీకృష్ణునితో అతని రథంపై విహరి స్తుండగా ఓ కొలను వద్దకు వచ్చారు. నారదుడు దాహార్తియై ఆ కొలనులో నీరు త్రాగబోగా నేను స్నానం చేసేవరకూ నీరు త్రాగవద్దని చెప్పగా నారదుడు పెడచెవినపెట్టి నీరు త్రాగగా వెంటనే స్త్రీగా మారాడు. స్త్రీగా మారిన నారదునికి రథము కృష్ణుడు కన్పించక ఓ ఆశ్రమం చేరగా ఆ రుషి కళ్లు తెరచి చూస్తే ఓ అందాల స్త్రీ కన్పించి తనను శిష్యురాలిగా అంగీకరించమని కోరింది. అతడామెను వివాహం చేసుకోగా 60 మంది సంతానం జన్మించారు. ఒక రోజు ఆ 60 మంది రుషి మరణించారు. వారికి కర్మకాండ చేయడానికి కూడా శక్తి లేక ఓ ఫలాన్ని కోయబోతే అందలేదు. అది అందు కోవడానికి ఆ శవాలను ఒక దానిపై ఒకటి పేర్చి వాటిపై ఎక్కి ఆ ఫలాన్ని అందుకొనగానే ఒక బ్రాహ్మ ణుడు ప్రత్యక్షమై భర్త పిల్లలు చనిపోయినప్పుడు స్నానం చేయకుండా ఆహారం తీసుకోవద్దని చెప్పగా ఆ ఫలాన్ని చేత పట్టుకొని కొలనులో దిగగా ఆ స్త్రీ నారదుడుగా మార తాడు. ఒడ్డుకు రాగా ఆ బ్రాహ్మణుడు శ్రీకృష్ణుడిగా మారతాడు. ఆ కొలనులోనికి దిగి చేతిలో ఉన్న ఫలాన్ని తీసుకొని రమ్మనగా అది వీణగా మారు తుంది. అప్పుడు కృష్ణుడు నారదునితో ఆ రుషి కలిపు రుషుడని ఆ 60 మంది పిల్లలు ప్రభవ విభవ, తదితర సంవత్సరాలని చెప్పి ఇద్దరూ ద్వారకకు తిరిగి వస్తారు. - భాగవతం

*నారదుని గర్వభంగం :* నారదుడు గొప్ప సంగీత విద్వాంసుడనని గర్వించేవాడు. శ్రీ మహావిష్ణువు అతని హద్దులు తెలియజేయడానికి ఒకసారి ఓ అడవికి తీసుకువెళ్లగా ఎక్కడో కొందరు స్త్రీలు కాళ్లు తెగి బాధలనుభవిస్తూ కన్పించగా శ్రీమహావిష్ణువు ఎవరు మీరు ఈ బాధకు కారణమేమని అడగగా మేము వివిధ రాగాలకు దేవతలమని నారదుడు ఆ రాగాలను ఆలపించడంలో వారిని దిగజార్చడం వల్ల ఇలా అయ్యామని చెప్పగా నారదుడు సిగ్గుతో తలవంచుకున్నాడు. - అద్భుత రామాయణం

నారదుడొకసారి హనుమంతుడిని కలసి ఓ పాట పాడమనగా అతడు ఆలపిస్తుండగా నారదుడు తన్మయుడై తన వీణను ఓ బండరాతిపై వుంచగా ఆ రాయి కరిగి ఆ వీణ అందులో కూరుకు పోయింది. పాట ఆగిపోగా మరల రాయి ఘనీభవించింది. హను మంతుడు నారదుడిని తన రాగా లాపనతో ఆ రాయిని కరగించి వీణను తీసుకొని వెళ్లమనగా నారదుడు గానం చేసినా ఆ రాయి కరగలేదు. తర్వాత హనుమం తుడు తన రాగా లాపనతో ఆ రాయిని కరిగించగా నారదుడు సిగ్గుతో వీణతీసుకొని వెళ్లిపోయాడు.

*శ్రీకృష్ణుని పరీక్షించుట :* 16008 మంది భార్యలతో శ్రీకృష్ణుడు ఎలా గొడవలు లేకుండా కాపురం చేస్తు న్నాడో పరీక్షించడానికి నారదుడు ద్వారకలోని రుక్మిణి ఇంటికి వెళ్లి శ్రీకృష్ణుడ్ని దర్శించి సత్యభామ ఇంటికి వెళ్లి అక్కడా అదే కృష్ణుడ్ని దర్శించి తర్వాత మిగిలిన భార్యల వద్దకూ వెళ్లి శ్రీకృష్ణుని దర్శించి శ్రీకృష్ణుని దైవశక్తిని గ్రహించి వెనుదిరి గాడు. - భాగవతం

**నారసింహం :** చూ॥ అవతారాలు.

**నారాయణకవచము :** ఇదో మహామంత్రము. దీనిని జపించిన విష్ణుభక్తులకు మోక్షము కల్గును.

**నారాయణ గోపాలురు :** కృష్ణుడితో సమానులైన యాదవులు. వీరు కృష్ణుని ఆజ్ఞపై దుర్యోధనుని పక్షంలో పోరాడి అర్జునుని చేతిలో మరణిస్తారు.

- మహాభారతం

**నారాయణ వర్మ మంత్రం :** త్వష్టుని కుమారుడైన విశ్వ రూపుడు ఇంద్రుడు రాక్షసులను వధించుటకు అనుగ్ర హించిన మంత్రం. ఈ మంత్రాన్ని ఉచ్చరిం చదలచిన వారు మొదట చేతులు, కాళ్ళు శుభ్రం చేసుకొని కుశ గడ్డి పరకలు చేతిలో ఉంచుకొని ఉత్తర దిక్కున కూర్చోవాలి. అపాయాన్ని శంకించి నప్పుడే ఈ మంత్రాన్ని ఉపయోగించాలి.

**నారాయణ సరస్సు :** సింధునది సముద్రంలో కలిసే చోటునగల ఒక తీర్థం. ఇక్కడే దక్షుని పుత్రులైన హర్యశ్వులు, శభళాశ్వులు తపస్సు చేస్తారు.
*– భాగవతం*

**నారాయణ స్థానం / సాలగ్రామతీర్థం :** శ్రీ మహా విష్ణువు ఎల్లప్పుడు వుండే పుణ్యస్థలం. బ్రహ్మ, దేవతలు, సన్యాశినులు, ఆదిత్యులు, వసులు, రుద్రులు శ్రీ మహా విష్ణువును సేవిస్తూ వుంటారు. సాలగ్రామంవద్ద శ్రీమహావిష్ణువు పూజింప బడుతూ వుంటాడు కనుక సాలగ్రాముడని పిలుస్తారు. ఈ పుణ్యతీర్థాన్ని దర్శిస్తే అశ్వమేధ యాగ ఫలితం లభించి వైకుంఠప్రాప్తి కల్గుతుంది. *– మహాభారతం*

**నారాయణాఖ్యానం :** నారాయణ రుషి నారదుడికి చెప్పిన శృతి గీత.

**నారాయణాశ్రమం :** ఓ పుణ్య స్థలం. *– మహాభారతం*

**నారాయణాస్త్రం :** ఇదొక దివ్యాస్త్రం. దీనిని యెదిరించిన యెడల వధించి తీరును. దీని యెదుట అస్త్రసన్యాసము చేసి దీనికి నమస్కరించినచో మిన్నకుండును. భీముడె దిరించబోగా కృష్ణార్జునులు వారించిరి. అర్జునుడు అస్త్రసన్యాసముచేసి నమస్కరించెను. అశ్వత్థామ ఉప పాండవులను వధించి పారిపోయి నపుడు భీముడు కృష్ణార్జునులు అతని వెంటపడగా అతడీ అస్త్రమును ప్రయో గించెను. *– మహాభారతం*

**నారాయణుడు 1 :** నరనారాయణ మహర్షుల్లో ఒకరు. *జననం :* బ్రహ్మ కుమారుడైన ధర్ముడు దక్షుని 10 మంది కుమార్తెలను వివాహమాడగా నల్గురు ప్రసిద్ధ పుత్రులు జన్మించారు. వారు హరి, కృష్ణ, నర, నారాయణులు. అందులో నరనారాయణులు విడదీయలేని మహర్షులు, బ్రహ్మను గూర్చి వారు వెయ్యేళ్లు బదరికాశ్రమంలో తపస్సుచేశారు.

నరనారాయణులు బదరికాశ్రమమున తపస్సుచేసు కొనుచుండగా ఇంద్రుడు తపోభంగము చేయ నెంచి తన ఘీంకార ధ్వనులతో భయపెట్టెను. భయంకర తుఫానులు వర్షములు సృష్టించెను. వీరికి వరము నిచ్చెదను కోరుకొమ్మనగా కోర్కెలు తీరుటకు తపస్సు చేయుటలేదు గనుక మేము తపస్సు నాపజాలమనెను. ఇంద్రుడు తన ఇంద్రపదవి కొరకు తపంబాచరించు చున్నారే మోనని యెంచి కామధేనువును, రతీదేవిని రంభ మేనక ఇత్యాది దేవతలను వీరి తపస్సు భగ్నము చేయుటకు పంపెను. వారు వీరు తపస్సు చేయు ఆశ్రమమునకు వచ్చి తమ ఆటపాటలతో అభిన యించిరి. నారాయణశ్రీ అర్ధనిమీలిత నేత్రుడై వీరిని చూసి తన ఊరువులపై చేతితో స్పృశించగా వీరికంటే అందగత్తెయైన ఓ అప్సర కన్య ప్రత్యక్ష మవ్వగా వారా శ్చర్యపోయిరి. నారాయణుడు ఈమెను కూడా మీతో దేవలోకమునకు తీసుకొని వెళ్లమని వారితో చెప్పగా వారు చకితులై సిగ్గుతో దేవలోకమునకు వెడలిరి.
*– చూ॥ నరుడు, అర్జునుడు, కృష్ణుడు*

**నారాయణుడు 2 :** శ్రీమహావిష్ణువు మరోపేరు. విష్ణువు నారయందు శయనించుటచే ఈ పేరు వచ్చెను.

**నారాయణుడు :** అజామిళుని కుమారుడు. *– భాగవతం*

**నారి :** మేరువు యొక్క కుమార్తె. ఈమె సోదరీ మణులు అగ్నిదారుని కుమారుల్ని వివాహ మాడారు.
*– భాగవతం*

**నారీకవచుడు :** ఒక రాజు. *– చూ॥ మూలకుడు*

**నారీతీర్థాలు :** అగస్త్య, సౌభద్ర, మౌలోమ, కారంధామ, భరద్వాజ తీర్థాలను నారీ తీర్థాలని అంటారు. ఒక సారి అర్జునుడు భరద్వాజ తీర్థంలో స్నానం చేశాడు. వర్గలు అనే అప్సర స్త్రీలు శాపవశమున మొసలిగా ఈ తీర్థంలో వుండేది. అర్జునుని రాకతో అప్సరసలకు శాపవిమోచనం జరిగి నిజరూపులై దేవలోకం వెళ్లారు.

**నాలాయని :** చూ॥ ఇంద్రసేనుడు

**నాళీకజంఘుడు :** ఒక కొంగ. మార్కండేయుడి కన్నా పెద్దది. దీనికన్నా ఆకూపారుడనే తాబేలు పెద్దది.
*– చూ॥ నాడీజంఘుడు*

**నాన్యాశ్రమం :** లోమపాద మహర్షి నిర్మించిన ఆశ్రమం. రుష్యశృంగ మహర్షి ఓసారి లోమ పాదుని దేశానికి ఓ పడవలో వచ్చాడు. నావలో వచ్చాడు కనుక దీనికి నాన్యాశ్రమం అని పేరొచ్చింది.
*– చూ॥ రుష్యశృంగుడు*

**నాసత్యుడు :** అశ్వనీ కుమారుల్లో ఒకడు.
*– మహాభారతం*

**నాసికుడు :** లోమపాదుని మనుమడు. *– భాగవతం*

**నికుంభీలం :** లంకాపురికి ఆవలవున్న అరణ్యంలోని ఒక ప్రాంతం. - ఉత్తర రామాయణం

**నికుంభుడు 1 :** ఓ బలవంతుడైన రాక్షసుడు. కుంభ కర్ణుని ఇద్దరు కుమారులైన కుంభ నికుంభుల్లో ఒకడు. రామరావణ యుద్ధంలో కుంభుడు చనిపోయిన తర్వాత ఘోరయుద్ధం చేసి హనుమంతుని చేతిలో మరణించాడు. - రామాయణం

**నికుంభుడు 2 :** ప్రహ్లాదుని మూడవ కుమారుడు. - మహాభారతం

**నికుంభుడు 3 :** హిరణ్యకశిపుని వంశంలో జన్మించిన రాక్షసుడు. ఇతని కుమారులు సుందుడు, ఉపసుందుడు. - మహాభారతం

**నికుంభుడు 4 :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరవీరుల్లో ఒకడు. - మహాభారతం

**నికుంభుడు 5 :** ఇక్ష్వాకు వంశంలో జన్మించిన రాజు. ఇతని తండ్రి హర్యాశ్వుడు. కొడుకు సంహితాశ్వుడు. - బ్రహ్మాండపురాణం

**నికుంభుడు 6 :** గణపతి యొక్క మరోరూపం. వారణాసిలోని నికుంభ దేవాలయంలో పుత్రార్థియై కాశీరాజు దివోదాసు భార్య పూజలు చేసేది. సంతానం కలుగనందుకు కోపించి దివోదాసు గుడిలోని విగ్రహాన్ని ధ్వంసం చేశాడు. నికుంభుడు వారణాసి ఖ్యాతి నశిస్తుందని శపించాడు. ఈ శాప ఫలితంగా తాలజంఘు మొదలగు హేహయ రాజులు వారణాశిని ధ్వంసం చేసి దివోదాసుని వెళ్లగొడతారు. నికుంభ దేవాలయం పునర్నిర్మించిన తర్వాత వారణాశి తిరిగి ప్రసిద్ధి చెందింది. - వాయుపురాణం

**నిక్షుభ :** ఓ అప్సరస. సూర్యుని శాపంవల్ల సుజిహ్వుడనే బ్రాహ్మణుడి కుమార్తెగా జన్మిస్తుంది. తండ్రి ఆజ్ఞానుసారం ఈమె యజ్ఞం చేసే అగ్నిని చల్లారకుండా వుంచేది. ఒకసారి అవి మంటలుగా లేచి ఆమె ఆ కాంతిలో అందంగా కన్పించగా సూర్యుడు మోహించి మరునాడు సుజిహ్వునిడితో ఈమె గర్భవతియని నేనామెను వివాహమాడెదనని చెప్పగా తండ్రి ఈమెను నీ కుమారులు ప్రజలచే బహిష్కరించ బడతారని శపిస్తాడు. సూర్యుడు నీ కుమారులు ప్రజలచే బహిష్కరింపబడినా పండితులవుతారని అగ్ని పూజకు అర్హులవుతారని వరమిస్తాడు. కొంత కాలం తర్వాత సూర్యునివల్ల చాలా మంది పుత్రులు జన్మిస్తారు. ఆమె శాఖ ద్వీపంలో వుండగా శ్రీకృష్ణుని కుమారుడు సాంబుడు వీరిని సూర్యదేవాలయంలో పూజారులుగా నియమిస్తాడు. ఈమె కుమారులు భోజ కుటుంబానికి చెందిన కన్యలను వివాహమాడతారు. - భవిష్యపురాణం

**నికృతి :** గాంధారి సోదరి. ధృతరాష్ట్రుడీమెను కూడా వివాహమాడాడు. - మహాభారతం

**నికృంతనం :** ఒక నరకం.

**నిఖర్వతుడు :** రావణుని సైన్యంలో ఒకడు. రామరావణ యుద్ధంలో ఇతడు తార అనే వానరుడితో తలపడ్డాడు. - రామాయణం

**నిగమశర్మ :** పీఠికాపురమందలి ఓ బ్రాహ్మణ పుత్రుడు. ధర్మము వీడి వేశ్యాలోలుడై తిరుగు చుండెడివాడు. ఇతని సోదరి ఇతడికి ధర్మబోధ చేయుచు తన తల్లిదండ్రులతో పాటు ఇతనికి భోజనము పెట్టుచుండెను. కొంతకాలము తర్వాత ఇంటియందలి నగలు ఎత్తుకొని పారిపోగా అడవిలో దొంగలు చితకబాది పార వేసిరి. వీనిపై ఒక కాపరి దయతలచి ఇంటికి తీసుకొనిపోయి సంరక్షించుచుండగా కొన్ని దినముల తర్వాత అతని భార్యను లేవదీసుకొనిపోయెను. ఇట్లు పాపుడై తిరుగుచూ భోజనము మాని నృసింహతీర్థము వద్ద పడి మృతి చెందెను. ఆ కారణంచేత ఇతనికి స్వర్గలోక ప్రాప్తి కల్గెను. - పద్మపురాణం

**నిఘ్నుడు :** ఓ అయోధ్యారాజు. అనరణ్యుని కుమారుడు. ఇతనికి ఇద్దరు కుమారులు 1. అనమిత్రుడు, 2. రఘూత్తముడు. - పద్మపురాణం

**నిచకుడు :** అర్జునుని పుత్రుడైన అభిమన్యునికి ఏడవ తరమువాడు. ఇతని కాలమున గంగ హస్తినా పురమును ముంచివేసెను. ఇతడు తన రాజధానిని కౌశాంబికి మార్చెను.

**నిచంద్రుడు :** ఓ రాక్షసుడు. - మహాభారతం

**నిచిత :** ప్రాచీన భారతావనిలో ఓ నది. - మహాభారతం

**నితంతుడు :** ఒక రాజర్షి. ఇతని కుమారులైన సాల్వేయుడు, శూరసేనుడు, శృతసేనుడు, బిందు సారుడు అజిత అను ఒకే కన్యను పెండ్లాడిరి. - మహాభారతం

**నితంబుడు :** ఓ గొప్ప మహర్షి. భీష్ముడు అంపశయ్యపై నుండగా దర్శించిన మునులలో ఒకడు. - మహాభారతం

**నిధాఘుడు :** ఓ మహర్షి. చూ॥ ఋభుడు.

**నిధ్రువుడు :** కశ్యపుని వంశంలో జన్మించిన వత్సార రుషి కుమారుడు. సూక్తసులను చూసినవాడు. చ్యవనుని కుమార్తె. సుమేధసును వివాహమాడాడు. కుండపాయినులు ఇతని కుమారులు.

– వాయుపురాణం

**నిబిడం :** క్రౌంచ ద్వీపంలోని ఓ పర్వతం.

– మహాభారతం

**నిమి 1 :** ఇక్ష్వాకుని కుమారుడు. ఇక్ష్వాకుని కుమారుల్లో దండుడు, వికుక్షి, నిమి ప్రసిద్ధులు.

నిమి దయార్ద్ర హృదయుడు. ఇతడొకసారి యజ్ఞం చేయదలచి తన తండ్రి ఇక్ష్వాకుని అనుజ్ఞతో బృగు, వామదేవ, పులస్త్య, పులహ రుచికుల్ని యజ్ఞానికి పిలిచి చివరగా తనకుల గురువైన వశిష్ఠుడికి విన్న వించుకొని యజ్ఞకార్య భారాన్ని నిర్వహించ మనగా తనకు దేవలోకంలో వేరే కార్యం వుంది కనుక తను వచ్చేవరకూ ఆగమని చెప్తాడు.

నిమి ఎంతో వ్యయప్రాయాసలు చిరకాలం చేయ వలసింది గనుక గౌతమమహర్షిని యజ్ఞ నిర్వాకుడిగా నియమించుకొని యజ్ఞం చేశాడు.

వశిష్ఠుడు యజ్ఞానంతరం రాజు దర్శనార్ధమై వచ్చి యజ్ఞం జరిగినట్లు విని రౌద్రుడై నిమిని నీ శరీరం నుండి ఆత్మవేరవుగాక అని శపించగా నిమి పరుగున వచ్చి వశిష్ఠునికి పాదాభినందనం చేసినా విన్పించు కోకపోగా నిమికి కోపంవచ్చి కారణరహితంగా కోపం వచ్చినవాడు చండాలునితో సమానం కనుక నీ శరీరం కూడా ఆత్మనుండి విడివడి నేలపై పడుతుందని శపించాడు. వశిష్ఠుడు పరుగున బ్రహ్మ వద్దకు వెళ్లి విన్నవించు కోగా నీ పొరపాటును గ్రహించు. దీనికి నివారణ నీవు మిత్రావరుణలతో ఐక్యం అయితే స్త్రీ గర్భాన కాకుండా జన్మిస్తావు. వేద జ్ఞానంతో అందరితో గౌరవించబడతావని చెప్పగా వశిష్ఠుడు బ్రహ్మ చెప్పిన దానిని పాటిస్తాడు. ఒకసారి దేవవేశ్య ఊర్వశి మిత్రా వరుణుల ఆశ్రమానికి రాగా ఆమె అందం చూసి వీర్యస్రావం కాగా దాన్ని ఓ కుండలో వుంచగా అందుండి అగస్త్యుడు, వశిష్ఠులు జన్మించారు.

నిమి యజ్ఞశాలకు వచ్చి మహర్షులకు వివరించి విదేహుడు కాగా ఆ దేహాన్ని కుళ్లకుండా మందులు వాడి దేవత లను ప్రార్థించగా దేవతలు ప్రత్యక్షమై నిమి ఆత్మను మానవశరీరం కావాలా దేవశరీరం కావాలా అని కోరగా దేవ శరీరం కావాలనగా దేవతలతో స్వర్గానికి వెళ్లాడు. నిమి అసంతుడవడం వల్ల అతని కర్మకాండలు చేయ డానికి అతని శరీరాన్ని మదించి మంత్రాలు చదవగా ఆ దేహం నుండి ఓ వ్యక్తి జన్మించాడు. అతడు శరీర మదనం వల్ల జన్మించాడు గనుక అతడిని మిధి అని, జీవచ్ఛవాన్నుండి జన్మించాడు కనుక జనకుడని, విదేహం నుండి జన్మించాడు గనుక విదేహుడని పిలవబడ్డాడు. సీత తండ్రి ఈ వంశంలోని వాడే. ఈ వంశంలో జన్మించిన వారందరిని జనకులని, వీరి వంశాన్ని జనక వంశం అని విదేహ వంశమని అనేవారు. – దేవీభాగవతం

**నిమి 2 :** అత్రి వంశంలోని దత్తాత్రేయుని కుమారుడు.

– మహాభారతం

**నిమి 3 :** విదర్భ రాజు యొక్క కుమారుడు. అతని కుమార్తెను అగస్త్యునికిచ్చి వివాహం చేసి స్వర్గం చేరాడు. – మహాభారతం

**నిమిషం :** కంటి రెప్ప. నిమి విదేహుడైనప్పటికి ప్రజలకు కన్పించాడు. కాబట్టి కనురెప్పకు నిమిషం అనే పేరొచ్చింది.

**నిమేషం :** చూ॥ కాలమానం

**నిమేషుడు :** గరుడుని కుమారుల్లో ఒకడు.

– మహాభారతం

**నిమ్ముడు :** ఓ యాదవుడు. – మహాభారతం

**నిమ్రోచి :** యాదవ వంశంలో జన్మించిన ఓ రాజు. భోజుని కుమారుడైన నిమ్రోచికి ఇద్దరు సోదరులు. వారు కింకణ, వృష్ణి. – భాగవతం

**నియతి :** భృగు మహర్షికి ఖ్యాతి వల్ల ధాత, విధాత అనే కుమారులు, లక్ష్మి అనే కుమార్తె జన్మించారు. ధాత, విధాతలు, మేరువు కుమార్తెలైన ఆయతి నియతిల్ని వివాహమాడారు. విధాతకు ప్రాణుడు జన్మించాడు. అతడు మృకండుడికి తండ్రి, మార్కండేయుడికి తాత.

– విష్ణుపురాణం

**నియుతాయువు :** శృతాయువు కుమారుడు. అర్జునుడు శృతాయువు నోడించగా నియుతాయువు కూడా అర్జునుడితో యుద్ధం చేసి ఓడిపోతాడు.
– జైమిని భారతం

**నియోగం :** సంతానం లేనివాళ్లలో భర్తగాని భార్యగాని ఇతరుల సహకారంతో సంతానం పొందే విధానాన్ని నియోగమంటారు. ఇది వేద కాలంలో ఆచరణలో వుంది. తర్వాత కనుమరుగయ్యింది. – అగ్నిపురాణం

**నిరమిత్రుడు 1 :** నకులుని కుమారుడు. ఇతని తల్లి కరేణుమతి. – మహాభారతం

**నిరమిత్రుడు 2 :** త్రిగర్త యువరాజు. కురుక్షేత్రంలో సహదేవుడితణ్ణి వధించాడు. – మహాభారతం

**నిరవింద :** ఓ ప్రాచీన పర్వతం. ఈ పర్వతం పై గల కొలనులో స్నానం చేస్తే మోక్షం లభిస్తుంది.
– మహాభారతం

**నిరామయ :** ఓ నది. ఈ నది నీరు ప్రాచీన భారతీయులకు ప్రీతిపాత్రమయినది. – మహాభారతం

**నిరామయుడు :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజు.
– మహాభారతం

**నిరామర్ధుడు :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజు.
– మహాభారతం

**నిరృతి 1 :** ఓ దేవతా పురుషుడు. అష్ట దిక్పాలకుల్లో ఒకడు. నైరుతి మూలకు అధిపతి. ఏకదశ రుద్రుల్లో ఇతడొకడు. బ్రహ్మ ఇతని తాత, సతానుడితడి తండ్రి. ఇతడు అర్జునుని జన్మదినోత్సవానికి వచ్చాడు. దేవాలయాల్లో ఇతడి విగ్రహం ఓ కత్తితో గాడిదపై ఆసీనుడై ప్రతిష్టింపబడి వుంటుంది. – అగ్నిపురాణం

**నిరృతి 2 :** అధర్ముడను దేవతా పురుషుని భార్య. ఈమెకు ముగ్గురు పుత్రులు. వారు భయ, మహాభయ, అంతకులు. ఈ రాక్షసుల్ని నైరుతాసులంటారు.
– మహాభారతం

**నిర్వృతి :** యదు వంశంవాడు. దృష్టి కుమారుడు.
– భాగవతం

**నిర్ఘోషుడు :** వేదధర్ముడి శిష్యుడు. ఇతడు అధర్వ వేదాన్ని పఠించాడు. – భాగవతం

**నిర్మోచనం :** మురాసురుని భవంతి. – మహాభారతం

**నివాతకవచులు :** దైత్యులలో ఓ వర్గం వారు. హిరణ్య కశిపుని నల్గురు కుమారుల్లో ప్రహ్లాదుడొకడు. అతని కుమారుడు విరోచనుడు. విరోచనుని కుమారుల్లో ఒకడు మహాబలి. బాణాసురుడు విరోచనుని కుమారుల్లో పెద్దవాడు. ప్రహ్లాదుని వంశం నుంచి జన్మించిన దైత్యుల్ని నివాతకవచులని పిలుస్తారు. వీరు, కాళి కేయులు కలసి ఎన్నోసార్లు దేవలోకంపై దండెత్తారు. వీరి బాధను భరించలేక ఇంద్రుడు అర్జునుని కోరగా అర్జునుడు వీరితో యుద్ధం చేసి ఎందరో నిరాతకవచుల్ని, కాళకేయుల్ని వధించాడు. ఒకసారి వీరు రావణుడుతో తలపడగా భీకర యుద్ధం జరిగింది. బ్రహ్మ ఇరువైపులను సముదాయించి సంధి చేశాడు. అప్పటి నుండి వీరు రావణుడి మిత్రులయ్యారు.
– ఉత్తర రామాయణం

**నివితం :** ఇదో మంత్రం. యాగానంతరం ఉక్త, నిహితా లనే మంత్రాలను ఉచ్చరిస్తారు. – ఋగ్వేదం

**నివీతం :** బ్రాహ్మణులు ఎడమ భుజానికి కుడి చేతి క్రిందకు తగిలించుకునే పవిత్ర నూలుపోగుని ఉపవీత మని, కుడిభుజానికి ఎడమ చేతి క్రిందకు ధరించే పవిత్ర నూలుపోగుని ప్రాచీనవీతం అని మెడచుట్టూ దండలా ధరించే పవిత్ర నూలుపోగుని నివీతమని అంటారు.

**నివృతి :** యయాతి వంశంలోని ఒక రాజు.
– భాగవతం

**నిశ :** బాణుడను అగ్నికి మూడవ భార్య. వీరికి ఏడుగురు కుమారులు, ఒక కూతురు. కుమారులు : అగ్ని, సోమ, వైశ్వానర, విశ్వపతి, సన్నిహిత, కపిల, అగ్రణి కుమార్తె రోహిణి. – మహాభారతం

**నిశాకరుడు 1 :** ఓ మహర్షి. వింధ్య పర్వతంపై ఇతడి ఆశ్రమం. దేవతలు కూడా ఇతణ్ణి గౌరవించే వారు. ఒకప్పుడు సంపాతి, జటాయువు పందెం వేసుకొని ఆకాశంలోకి ఎగరగా సంపాతి యొక్క రెక్కలు కళ్లు సూర్యుని వేడికి కాలి ఈ పర్వతం పై పడగా ఆ బాధవిని ఈ మహర్షి సుశ్రూష చేసి తన దూరదృష్టితో వానరులు సీత జాడ కోసం ఇచ్చటికి వస్తారని సంపాతి సీత జాడ తెలిపినపుడు రెక్కలు కాళ్లు తిరిగి వస్తాయని చెప్పి అతడు సమాధిలోకి వెళ్లాడు. 8000 ఏళ్ల తర్వాత సీత కోసం వానరులు వచ్చి సంపాతి వల్ల విషయం తెలుసుకుంటారు. – కంబరామాయణం

★ **నిశాకరుడు 2 :** ఓ గొప్ప మహర్షి. ఎన్నో జన్మల అనంత రం స్వర్గాన్ని చేరాడు. ముద్గలుని కుమారుడైన కోశాకారుడు ఓ మహాపండితుడు. వాత్స్యాయను కుమార్తె ధర్మిష్ఠ అతని భార్య. వారికి మూగ చెవిటి బిడ్డ ఒకడు జన్మించగా తల్లి ఇంటి బయటే వదలి వేసింది. అదే సమయంలో పిల్లల్ని ఎత్తుకుపోయే శూర్పాక్షి అనే రాక్షసి ఓ బిడ్డను తీసుకొస్తూ ఈ పిల్ల వాడిని చూసి తన వద్దవున్న బాలుడ్ని అక్కడ వదలి అక్కడున్న కోశాకారుడి బిడ్డను ఎత్తుకుపోయి తన భర్తకు ఈ విషయాన్ని వివరించగా అతని తండ్రి గొప్ప పండితుడని అతడు శపిస్తే మనం నాశనమవు తామని చెప్పగా ఆ రాక్షసి వెంటనే ఆ బాలుడ్ని తిరిగి తేగా అంతలో కోశాకారుడు తన ఇంటి ముందున్న బిడ్డను చూసి ఎవరో మోసం చేశారని ఆ బాలుణ్ణి కట్టివేసి దర్భలు చేతబట్టి మంత్రోచ్చారణ చేశాడు. రాక్షసి తన చేతిలోని బిడ్డను విసిరివేసి తను అక్కడుంచిన బిడ్డను మాత్రం తీసుకుపోలేక పారిపో యింది. దయార్ద్రుడైన కోశాకారుడు ఆ పిల్లవాడ్ని గూడా భార్యకు అప్పగించి ఇద్దర్ని పెంచారు. రాక్షస బాలుడికి దివాకరుడని మరో బిడ్డకు నిశాకరుడని నామకరణం చేసి పెంచారు. దివాకరుడు వేదపఠనం చేయగా నిశాకరుడు చేయకపోవడం వల్ల తండ్రి అతణ్ణి ఓ పాడుపడిన బావిలోకి తోసి పైన ఓ మూత పెట్టాడు. 10 సంవత్సరాల తర్వాత అతని తల్లి ఆ నూతి వద్దకు వెళ్లగా శబ్దాలు విని మూతతీయగా తల్లీ నన్ను తండ్రి ఈ బావిలోకి తోశాడు నన్ను బయటకు లాగమనగా నా కొడుకు దివాకరుడు, నువ్వెవరవని అడుగగా నేను నీ కుమారుడినే నా పూర్వజన్మ వల్ల ఈ జన్మలో ఇలా జరిగింది అనగా అమె అతణ్ణి బయటకు లాగి ఇంటికి తీసుకొచ్చి ఎందుకలా జరిగిందని ప్రశ్నించగా తన పూర్వజన్మ వృత్తాంతం చెప్పాడు.

తండ్రీ నేను చెవిటి మూగగా జన్మించడానికి కారణం ఇంతకు ముందు జన్మలో ఓ గౌరవ ప్రదమైన కుటుంబంలో జన్మించి వేద వేదాంగాలు చదివి కూడా మోసగాడిగా మారి ఇతర స్త్రీలను కామించడం ఇతరుల సొమ్ము దొంగిలించడం చేయడం వల్ల రౌరవనరకంలో పడ్డాను. 1000 సం॥ తర్వాత కూడా కొంత పాపం మిగిలి ఓ పులిగా జన్మించగా ఓ రాజు నన్ను బంధించి తన నగరానికి తీసుకువెళ్లాడు. బందీగా వుండగా ధర్మ, కామ, అర్థశాస్త్రాలు జ్ఞప్తికి వచ్చాయి. ఓ రోజు రాజు విహారానికి వెళ్లగా అతని భార్య అందాన్ని చూసి కామకాంక్ష పెరిగి నా కోర్కెను తెలియ జేయగా ఆమెకూడా అంగీకారం తెలిపి నన్ను విడిపించగా రాజభటులు నన్ను చెట్టుకు కట్టి కొట్టి చంపారు. తిరిగి నా ఆత్మ నరకం చేరి 1000 సంవ త్సరాల తర్వాత ఓ బ్రాహ్మణుని ఇంట తెల్లగాడిదగా జన్మించాను. గిన్నికాశ్యుడను ఆ బ్రాహ్మణునికి చాలా మంది భార్యలు. అప్పుడు నా జ్ఞానం తెలివి గుర్తు కొచ్చాయి. ఆ బ్రాహ్మణుని భార్యలను మోయడం నా బాధ్యత. ఓ రోజు అతని భార్య నొకర్తె ఆమె పుట్టింటికి తీసుకు వెళ్తుండగా మార్గ మధ్యంలో ఆమె ఓ కొలనులో స్నానం చేస్తుండగా తడి బట్టలలో వున్న ఆమె నగ్న శరీరం నన్ను మత్తెక్కించి నేను కొలనులో దూకి ఆమె పైబడగా ఆమె తప్పించుకుందిగాని నేను బయటకు రాలేక మృతి చెందాను. తిరిగి నేను నరకం చేరాను. ఆ తర్వాత ఓ చిలుకగా జన్మించి ఓ వైశ్యుని ఇంట్లో గడిపి ఆమె తనను పట్టుకొని తనస్తనాలపై వుంచుకోగా నాలో మరల కామోద్రేకం కల్గి రెక్కలు వదలి క్రిందపడి మరణించి మరల నరకం చేరాను. ఆ తర్వాత ఓ ఎద్దుగా జన్మించి చండాలుని బండి లాగుతూ ఓ రోజు అతని భార్యను బండిలో తీసుకెళ్తూ ఆమె పాటకు ముగ్ధుడనై వెనుకకుచూసి కాలుజారిపడి మరణించి నరకంచేరి 1000 సంవత్సరాల తర్వాత మీ ఇంట జన్మించాను. ఇప్పుడు నాకు జ్ఞానోదయమ య్యింది. నేను తపస్సు చేసుకోవడానికి అడవికి వెళ్తున్నాను. దివాకరుడు గృహధర్మాలను నిర్వహి స్తాడని చెప్తాడు. – వామన పురాణం

**నిశాతుడు 1 :** వృష్ణి వంశంలోని రాజకుమారుడు. రేవతికి బలభద్ర రాముని వల్ల జన్మించాడు. సుభద్ర కట్నకానుకలను ఖాండవప్రస్థానికి తీసుకెళ్లాడు. రాజ సూయ, అశ్వమేధ యాగాలకు వచ్చాడు. మరణానం తరం విశ్వదేవులతో ఐక్యమయ్యాడు. – మహాభారతం

★ సంపాతిని రక్షించిన నిశాకరుడు, ఇతడు ఒకరే అనడానికి ఏ పురాణాలలోను ఆధారాలు లేవు.

**నిశాతుడు 2 :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. మరణానంతరం యముని సభలో అతడిని పూజి స్తుండేవాడు. – మహాభారతం

**నిశీథుడు :** ధ్రువుని వంశంలోని ఒక రాజు. ధ్రువుని కుమారుడు ఉత్కళుడు. ఉత్కళుని కుమారుడు పుష్పార్ణుడు. పుష్పార్ణుడికి ప్రభవల్ల జన్మించినవాడు నిశీథుడు. ఇతని సోదరులు ప్రదోష, వ్యూషలు.

**నిశుంభుడు :** చూ॥ శుంభనిశుంభులు.

**నిశ్చ్యవనుడు :** బృహస్పతి యొక్క రెండవ కుమారుడు. పాపరహితుడు, పుణ్యాత్ముడు, నిష్కళంకుడు. – మహాభారతం

**నిశ్చిర :** పురాణాలలో దీని గొప్పదనం విశదీకరించ బడిన ఒక నది. ముల్లోకాలలో ప్రసిద్ధి చెందింది. ఈ నదిలో స్నానం చేస్తే అశ్వమేధ యాగ ప్రతిఫలం లభించి ఇంద్రలోక ప్రాప్తి కల్గుతుంది. – మహాభారతం

**నిషంగి :** ధృతరాష్ట్రుని కుమారుల్లో ఒకడు. మహా భారత యుద్ధంలో భీముడితణ్ణి వధించాడు. – మహాభారతం

**నిషధుడు 1 :** శ్రీరాముని వంశంలో జన్మించిన ఓ రాజు. శ్రీరాముని కుమారుడు కుశుడు. అతని పుత్రుడు అదితి. అదితి కుమారుడు నిషధుడు. నభసుడు నిషధుడి కుమారుడు. – భాగవతం

**నిషధుడు 2 :** భరత వంశంలోని వాడు. పురు చక్రవర్తి మనుమడు జనమేజయుని నాల్గవ కుమారుడు. ఇత డొక గొప్ప మానవతావాది. ప్రజల సంతృప్తి కొద్దీ రాజ్యపాలన చేశాడు. – మహాభారతం

**నిషధం :** మేరు పర్వతం వద్దగల ఓ పర్వతం. అర్జునుని జైత్రయాత్రలో ఈ ప్రాంత ప్రజల్ని జయించాడు. – మహాభారతం

**నిషాదన రేశుడు :** భారతంలో ప్రసిద్ధుడైన రాజు. ఇతడు దైత్య కాలకేయ క్రోధహంత అంశలతో జన్మించాడు. – మహాభారతం

**నిషాదం :** ప్రాచీన భారతదేశంలోని ఓ ప్రత్యేక ప్రాంతం. – మహాభారతం

**నిషాదుడు :** ఓ అడవిలో నివసించే మానవుడు. నిషా దసుల జాతికి ఇతడు మూల పురుషుడు.

పూర్వకథ : వేణ అనే రాజు అవినీతి పాలన చేస్తూ ప్రజలచే ఏవగించుకోబడ్డాడు. ధర్మం నశించింది. మహర్షులు దర్భగడ్డితో మంత్రించి ఇతణ్ణి వధించారు. ఆ తర్వాత దుమ్ముధూళితో ఆ ప్రాంతం నిండిపోగా మహర్షులు అచటి ప్రజల్ని అడగగా రాజు లేక పేద ప్రజలు దొంగలుగా మారి వారి పరుగుల వల్ల ఈ దుమ్ము ఎగసిపడుతోందని చెప్పగా బ్రాహ్మణులు వేణుని తొడను మదించగా ఓ పొట్టి నల్లనివాడు జన్మించాడు. నేనేమి చేయాలని అతడు బ్రాహ్మణుల్ని అడగగా ఇక్కడే కూర్చోమన్నారు. అతడే నిషాదుడు. అతని సంతతివారు వింధ్య పర్వతంపై స్థిరపడి ఎన్నో పాపకర్మలు చేసి వేణుని శాపవిముక్తుల్ని చేశారు కనుక వీరిని నిషాదులన్నారు. – విష్ణుపురాణం

**నిషాదులు :** చూ॥ నిషాదుడు.

**నిష్కుటం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం. అర్జునుడు దీన్ని జయించాడు. – మహాభారతం

**నిష్కుటిక :** సుబ్రహ్మణ్యస్వామి స్త్రీ అనుచరిణి. – మహాభారతం

**నిష్కుంభుడు :** ఓ గొప్ప రాక్షసుడు. వృషపర్వకుని అనుచ రుడు. ఇతడెన్నో దేవదానవ యుద్ధాలలో పాల్గొన్నాడు. – భవిష్యపురాణం

**నిష్కృతి :** బృహస్పతి కుమారుడు. ఇతడో అగ్ని. ప్రజలను విచారాల నుండి విముక్తులను చేస్తాడు గనుక నిష్కృతి అనబడ్డాడు. – మహాభారతం

**నిష్ఠానకుడు :** ఓ ప్రసిద్ధ సర్పం. కశ్యపునికి కద్రువ వల్ల జన్మించినవాడు. – మహాభారతం

**నిష్ఠురకుడు :** ప్రాచీన దక్షిణ భారతదేశంలో ఓ ప్రసిద్ధ రాజు. ఇతడు ఉత్తర భారత దేశంలో శ్రీ దత్తుడను రాజుపై ఆధారపడ్డాడు. – చూ॥ శ్రీదత్తుడు

**నిష్ఠూరిక :** కశ్యపుని వంశంలో జన్మించిన ఓ నాగు. – మహాభారతం

**నిసుందుడు :** శ్రీకృష్ణునిచే సంహరించబడిన ఓ అసురుడు. – మహాభారతం

**నీతి :** అనంగుడనే రాజు కొడుకు. భార్య సునీథ. కొడుకు వేనుడు. – మహాభారతం

**నీతిగోత్రుడు :** భృగు వంశంలో జన్మించిన ఒక రాజు. – భాగవతం

**నీతిశాస్త్రం :** త్రేతాయుగం నుండి కామక్రోధాలు పెరగడంతో వాటిని నిర్మూలించడానికి బ్రహ్మ రాసిన నూరు వేల అధ్యాయాల గ్రంథం. విరూపాక్షుడు దీన్ని విశాలాక్షుడనే పేరుతో పదివేల అధ్యాయాలు చేశాడు. ఇంద్రుడయిదువేలు అధ్యాయాలుగా కుదించాడు. కర్దముడి కొడుకు అంగుడు ఈ శాస్త్రం ప్రకారం భూమిని పాలించాడు. – మహాభారతం

**నీధుడు :** వృష్ణి వంశంలో జన్మించిన ఓ రాజు. – మహాభారతం

**నీపం 1 :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజ్యం. దీని రాజు ధర్మజుని రాజసూయ యాగంలో పాల్గొన్నాడు – మహాభారతం

**నీపం 2 :** ఓ క్షత్రియవంశం. జనమేజయుడను రాజు ఈ వంశంలో జన్మించాడు. – మహాభారతం

**నీపాతిథి :** సూక్తదర్శుడు. రుగ్వేదంలో ప్రస్తావించ బడిన ఓ మహర్షి. – రుగ్వేదం

**నీపుడు :** పూరువంశంలోని ఓ ప్రసిద్ధ రాజు. కృతి లేక కృతిమతి వల్ల బ్రహ్మదత్తుడు జన్మించాడు. బ్రహ్మదత్తునికి కీర్తి వర్ధనుడితో పాటు వందమంది పుత్రులు. వీరందరిని నీపులని పిలిచేవారు. – భాగవతం

**నీల 1 :** కపిశునికి కేశిని వల్ల జన్మించిన కూతురు. – బ్రహ్మాండపురాణం

**నీల 2 :** ఓ గోపిక. శ్రీకృష్ణుడు బృందావనంలో గోపికలతో విహరిస్తుండగా వారు శ్రీకృష్ణుడికి తామంటే పిచ్చని భావించగా శ్రీకృషు డొక్కసారిగా మాయమై నీలతో సరసాలాడాడు. నీల అది గమనించి శ్రీకృష్ణుడికి తానంటేనే మక్కువ అని ఇతరుల కంటే తనంటేనే మోహమని తలచి శ్రీకృష్ణుడిని తన భుజంపై కూర్చోబెట్టుకొమ్మని కోరగా అతడు నిలబడ్డాడు ఆమె అతని మెడ పట్టుకునేంతలో మాయమవ్వగా గోపికలందరకు గర్వభంగమ య్యింది. – మళయాళ కృష్ణగాథ

**నీలకంఠక్షేత్రం :** హిమాలయాల దగ్గరలో కౌశికీ నది జన్మించే చోటు.

**నీలకంఠ దీక్షితుడు :** 17వ శతాబ్దంలోని ఓ సంస్కృత కవి. తిరుమల నాయకుని కొలువులో ఆ స్థానకవి. సాహిత్య శాఖలన్నింటిలో రచనలు చేశాడు. ఈయన ముఖ్య రచనలు శివలీలార్ణవం. గంగావతరణం.

**నీలగిరి :** జంబూద్వీపంలోని ఇలావృత ప్రాంతంలోని ఓ పర్వతం పేరు. ఇలావృతంలో మూడు ముఖ్య పర్వతాలున్నాయి. అవి నీలగిరి, శ్వేతగిరి, శృంగవాణి. వీటి మధ్య మూడు ప్రాంతాలున్నాయి. అవి రమ్యక, హిరణ్మయ, కురు ప్రాంతాలు. – దేవీభాగవతం

**నీలధ్వజుడు :** మాహిష్మతి పురాణాధిపతి. ఇతడి భార్య జ్వాల. వీరికి స్వాహా జన్మిస్తుంది. స్వాహా అగ్నిని వరిస్తుంది. నీలధ్వజుడు ధర్మజుని అశ్వమేధ యాగాన్ని కట్టేస్తాడు. అర్జునుడితణ్ణి ఓడిస్తాడు. ఇతడి పిరికితనాన్ని చూసి ఇతని రెండవ భార్య ఇతణ్ణి విడిచివెళ్తుంది. – జైమిని భారతం

**నీలి :** అజమీఢుని రెండవ భార్య. ఈమెవల్ల దుష్యంతుడు, పరమేష్టి అనే కుమారులు జన్మించారు. – మహాభారతం

**నీలిని :** సునశ్శేపుడి భార్య. నీలిని వల్ల ఇతనికి శాంతి అనే కుమార్తె జన్మించెను. – అగ్నిపురాణం

**నీలుడు 1 :** కశ్యప ప్రజాపతి వల్ల కద్రువకు జన్మించిన ప్రముఖ సర్పం. – మహాభారతం

**నీలుడు 2 :** హేహయవంశంలో జన్మించిన ఒక రాజు. ఇతడు క్రోదవశుడను రాక్షసుని పునర్జన్మ. ఇతడిని దుర్యోధనుడని కూడా అంటారు. ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. ఒకసారి సహదేవుడితనితో యుద్ధం చేయగా అగ్నిదేవుని కోరికపై యుద్ధ విరమణ చేశాడు. కర్ణుడు తన జైత్ర యాత్రలో ఇతణ్ణి ఓడించాడు. కురుక్షేత్ర యుద్ధంలో కౌరవుల తరఫున పోరాడిన మహారథుల్లో ఒకడు. ఇతనికి నర్మద అనే భార్య వల్ల సుదర్శన అనే కూతురు జన్మించింది. – మహాభారతం

**నీలుడు 3 :** ఓ వానరాధిపతి. శ్రీరాముని అనుచ రుడు. ఇతడు పాదకమను అగ్నిపుత్రుడు. అత్యంత బలశాలి అయిన ఇతడ్ని సీతాన్వేషణకు పంపాడు. రామరావణ యుద్ధంలో దూషనుడను రాక్షసుని సోదరుడు ప్రమాధిని సంహరించాడు. – రామాయణం

**నీలుడు 4 :** అనూపదేశ వీరుడు. పాండవుల తరఫున పోరాడాడు. దుర్జయునితో, అశ్వత్థామతో పోరాడి అశ్వత్థామ చేతిలో మరణించాడు. – మహాభారతం

**నీలుడు 5 :** ఉత్తర పాంచల ప్రసిద్ధ రాజు. పాంచాల ప్రసిద్ధ 16 మంది రాజుల్లో ఒకడు.

**నేమి :** దశరథుని అసలు పేరు. – చూ॥ *దశరథుడు*

**నేపాలం :** హిమాలయాలకు ఆనుకొనివున్న ప్రాచీన దేశం. అత్యంత ప్రాచీన హిందూ దేశం. దీనిని కర్ణుడు జయించాడు. – *మహాభారతం*

**నేమిచక్రుడు :** హస్తినాపురాన్ని పరిపాలించిన ఓ రాజు. ఇతని పాలన సమయంలో హస్తినాపురం వరదల్లో మునిగిపోగా కౌశాంబి నగరాన్ని నిర్మించాడు. – *భాగవతం*

**నేమిహంసపదం :** ప్రాచీన భారతదేశంలో ఓ ముఖ్య ప్రాంతం. ఆనర్త ప్రాంతంలోని అక్షప్ర పతనం వద్ద వుంది. ఇచ్చటే శ్రీకృష్ణుడు గోపతి, తాళకేతుల్ని సంహరించాడు. – *భాగవతం*

**నైకపృష్ఠ :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం. – *మహాభారతం*

**నైగమేయుడు :** సుబ్రహ్మణ్యుని చిన్న తమ్ముడు. తక్కిన ఇద్దరు తమ్ముళ్లు శాఖ, వైశాఖులు. – *విష్ణుపురాణం*

**నైకబాహు :** పార్వతికి మరోపేరు. – *అగ్నిపురాణం*

**నైధృవుడు :** కశ్యప రాజ్య వంశానికి ఆధ్యుడు. అవత్సర మహర్షి కుమారుడు. కశ్యప మహర్షి మనుమడు. కశ్యపుని కుటుంబంలోని ఆరుగురు బ్రహ్మవాదుల్లో ఒకడు. తక్కిన ఐదుగురు కశ్యప, అవత్సర, రైభ్య, అసిత, దేవలులు. – *వాయుపురాణం*

**నైమిశారణ్యం :** పురాణాలలో నైమిశారణ్యానికి ఎంతో ప్రాముఖ్యత వుంది. ఇది అత్యంత పుణ్య స్థలంగా ప్రసిద్ధి చెందింది. ఇది ఇప్పటి ఉత్తర ప్రదేశ్‌లోని సీతాపూర్ జిల్లాలో వుంది.

*నామవిశేషము 1 :* గౌరముఖుడను మహర్షి ఆశ్రమము ఈ అరణ్యమున నుండెను. దుర్జయడను రాజు వేటకేగి అలసియుండగా మహర్షి విష్ణుమూర్తిని ప్రార్థించి ఓ మణిని తెచ్చి దాని ప్రభావమున రాజుకు అతని సైన్యమునకు షడ్రశోపేతమైన విందుగా వించగా రాజు దానిని తన కిమ్మనగా ఆ ముని నిరాకరించగా బలవంతముగా తెండని తన సేనలను రాజు ఆజ్ఞాపించెను. అప్పుడు ముని గంగాతీరమునకు వెళ్లెను. రాజసైన్యము రాగా మణి నుండి ఎందరో శూరులు ఉద్భవించి రాజు సైన్యముతో యుద్ధము చేయుచుండిరి. ముని వచ్చి విష్ణుమూర్తిని ప్రార్థించగా విష్ణుమూర్తి ప్రత్యక్షమై రాజు సేనలను నిముషములో సంహరించెను. నిముషములోనే నశించిరి గనుక ఈ స్థలానికి నైమిశారణ్యమను పేరు వచ్చెను. – *వరాహపురాణం*

*నామవిశేషము 2 :* బ్రాహ్మణులు కొందరు బ్రహ్మకడ కేగి మేము తపస్సు చేయతలంచితిమి. మాకు తగిన ప్రదేశము చూపమనగా బ్రహ్మ దర్భలతో ఓ రథము చేసి విసిరెను. అది పడినచోటే పుణ్యస్థలమని చెప్పగా ఆ రథము యొక్క నేమి పడిన చోటుకు నైమిశారణ్యమని పేరువచ్చెను. – *స్కాందపురాణం*

*నామవిశేషము :* పూర్వము పరమేశ్వరుడు లోకములు నిర్మించుటకై రథముపై ప్రయాణించుచుండగా దానినేమి ఈ ప్రాంతమున పడెను. అదే నైమిశారణ్యం.

*ఇతర విశేషాలు :* పూర్వమొకసారి దేవతలు ఇచ్చట యజ్ఞము చేసిరి. అర్జునుడిచ్చట ప్రవహించు ఉత్పాలవి నదిలో స్నానమాచరించెను. గోమతీ నది, దేవతల యజ్ఞభూమి, సూర్యుని యజ్ఞపాత్ర ఇచ్చట కన్పించెను. ధర్మజుడు తన సోదరులతో వచ్చి స్నానం చేసి గోవులను దానం చేసెను. ఈ స్థలం దర్శించగనే సగం పాపాలు పోతాయి. ఈ స్థలం వదలి వెళ్లేలోపు పాపాలన్నీ పోతాయి. ఓ నెలరోజులు ఇక్కడ గడిపితే గోమేధయజ్ఞ ఫలితం లభిస్తుంది. ఇక్కడ ఉపవాసం ఉండి మరణిస్తే అన్ని లోకాల ప్రాప్తి కల్గుతుంది. – *మహాభారతం*

**నైమిషకుంజం :** కురుక్షేత్రం యొక్క సరిహద్దున గల ఓ పుణ్యస్థలం. నైమిశారణ్యంలోని ఋషులు దీన్ని నిర్మించారు. ఇక్కడ స్నానం చేయడం వల్ల అగ్ని స్తోమ యజ్ఞం చేసిన ఫలితం లభిస్తుంది. – *మహాభారతం*

**నైమిషేయం :** ఇదో పవిత్ర స్థలం. పడమరగా ప్రవహించే ఈ నది ఇక్కడి నుండి తూర్పు దిక్కుగా పయనిస్తుంది. అందువల్ల ఇది నైమిశారణ్యంలో నివసించే ఋషుల్ని దర్శించగల్గుతుంది. – *మహాభారతం*

**నైరృతం :** ప్రాచీన భారతదేశంలో ఓ పట్టణ ప్రాంతం. – *మహాభారతం*

**నైరృతి :** ఓ రాక్షసుడు. ప్రాచీన ప్రపంచ రక్షకుల్లో ఇతడి పేరు కూడా పేర్కొనబడింది. – *మహాభారతం*

**నోధసుడు :** రుగ్వేద కాలంలోని ఓ ముని. దేవతల్ని స్తుతించి తన కోర్కెలన్నింటినీ తీర్చుకున్నాడు.
– రుగ్వేదం

**నౌకర్ణి :** సుబ్రహ్మణ్య స్వామి స్త్రీ పరిచారిక.
– మహాభారతం

**నౌబంధనం :** ఓ హిమాలయ శిఖరం. ఒకసారి హిరణ్య కశిపుడను రాక్షసుడు వేదాలను అపహరించి సముద్రంలో దాక్కున్నాడు. శ్రీ మహావిష్ణువు మత్స్యావ తారుడై వేదాలను రక్షించాడు. ప్రపంచమంతా నీటిలో మునిగిపోగా రుషులు ఓ నౌకలో కూర్చొని మకర మత్స్యా నికి ఆ నౌకను బంధించి హిమాలయ శిఖరా నికి కట్టుకొని రక్షింపబడ్డారు. అందువల్ల ఆ శిఖరాన్ని నౌబంధనం అన్నారు. – మహాభారతం

**నంద 1 :** హర్షుని భార్య. హర్షుడు ధర్మదేవుని మూడవ కుమారుడు.

**నంద 2 :** ఓ పుణ్యనది.

**నందకం 1 :** ఒక వాద్యం. ధర్మజుని జెండా ఎగుర వేసినపుడు నందక, ఉపనందకలను మ్రోగించే వారు.
– మహాభారతం

**నందకం 2 :** శ్రీ మహావిష్ణువు యొక్క ఖడ్గం పేరు.

**నందగోపుడు :** శ్రీకృష్ణుని పెంచిన తండ్రి.

*పూర్వజన్మ 1 :* ఎనిమిదిమంది వసువుల్లో ఒకడు. ద్రోణుడు అతని భార్య ధార ఓ తప్పు చేయగా బ్రహ్మ వీరిని దేవతలు కాకుండా పశుకాపరులుగా జన్మించ మని శపించాడు. శాప విమోచనం కోరగా శ్రీమహా విష్ణువు శ్రీకృష్ణునిగా మీకు జన్మిస్తాడని తర్వాత మీకు శాపవిమోచనం జరుగుతుందని చెప్తాడు. అలాగే ద్రోణుడు నందగోపుడుగా ధార యశోదగా జన్మించారు.
– భాగవతం

*పూర్వజన్మ 2 :* చంద్రసేనుడను రాజు ఉజ్జయినిలోని మహాకాళి దేవాలయంలో తపస్సుకు కూర్చోగా శివుడుమెచ్చి అతనికో మణినిచ్చాడు. అది అతని కోరిన కోర్కెలు నెరవేర్చుతుంది. ఇతర రాజులు ఆ మణి కోసం ఇతనిపైకి దండెత్తగా అతడు ఆ దేవాల యంలో దాక్కున్నాడు. అదే సమయంలో ఓ పశుకా పరికి శ్రీకరుడను పుత్రుడు జన్మించాడు. అతడికి దేవుడంటే భయం. అతడు మహాకాళి దేవాలయం లోకి వచ్చి శివుడ్ని ప్రార్థిస్తు న్నాడు. మణికోసం వచ్చిన రాజులు ఆ దేవాలయానికి వచ్చి శ్రీకరుడి నుండి ప్రసరిస్తున్న కాంతికి ఆశ్చర్యపోతుండగా హనుమం తుడు ప్రత్యక్షమై ఓ రాజులారా శ్రీకరుడు పశుకాపరైన బాలుడుకాడు. దేవుడితడి భక్తికి మెచ్చాడు. ఇతని 8వ జన్మలో నందగోపుడుగా జన్మిస్తాడు. శ్రీ మహా విష్ణువుకి జన్మనిస్తాడని చెప్తాడు.

*నందగోపుడు శ్రీకరుని 8వ జన్మ :* నందగోపు డొక సారి యమునా నదిలో స్నానం చేస్తుండగా వరుణుని సేవకుడు ఇతణ్ణి కొలనులోపలకు లాక్కెళ్లగా శ్రీకృష్ణుడు కొలనులో దూకి వరుణుని నగరం చేరగా వరుణుడు శ్రీకృష్ణ దర్శనార్థమే నందగోపాలుడిని తీసుకువచ్చానని తనను క్షమించమని కోరతాడు. శ్రీకృష్ణుడు నంద గోపుడ్ని తిరిగి అంబడికి తీసుకువస్తాడు. శ్రీకృష్ణ నిర్యాణా నంతరం ఇతణ్ణి ఓ పెద్ద కొండ చిలువ మింగివేస్తుంది.

**నందనవనం :** ఇంద్రుని ఉద్యానవనం.

**నందభద్రుడు :** ఇతడొక సదాచార వైశ్యుడు. కపిలేశ్వరుని భక్తుడైన ఇతడికి వయసు మీరినా సంతానం లేదు. పెద్ద వయసులో ఓ పుత్రుడు జన్మించగా అతడి వివా హానంతరం మరణించాడు. అందుకు విచారించి చేసేది లేక ఆధ్యాత్మిక జ్ఞానం పొందాడు. అప్పుడో ఏడేళ్ల బాలుడు ఇతని వద్దకు వచ్చి ఆధ్యాత్మిక జ్ఞానం ప్రసాదించమంటాడు. ఆ తర్వాత శివుని సూర్యుడ్ని ధ్యానించి స్వర్గలోక ప్రాప్తి పొందుతాడు.
– స్కందపురాణం

**నందాశ్రమం :** ఇదో పుణ్యస్థలం. కాశీ రాజు కుమార్తె అంబ ఒకసారి ఇక్కడ తపస్సు చేసింది.
– మహాభారతం

**నంది 1 :** ఓ దేవ గాంధర్వుడు. అర్జునుని జన్మదిన వేడుకల్లో పాల్గొన్నాడు. – మహాభారతం

**నంది 2 :** శివుని దేవగణంలోనివాడు.
– చూ॥ నంది కేశుడు

**నందికుండ :** ఇదో పుణ్యస్థలం. గర్భస్రావం చేసిన పాతకం ఇక్కడ స్నానం చేయడం వల్ల పోతుంది.
– మహాభారతం

**నందికేశుడు :** శివుని భూత గణాలకు అధిపతి. ఇతడు వానర రూపం ధరించి రావణుడ్ని శపించాడు.
– రామాయణం

**నందిగ్రామం :** శ్రీరాముని వనవాస సమయంలో భరతుడు శ్రీరాముని పాదుకలను వుంచి 12 సంవత్స రాలు పూజించాడు. ఇది అయోధ్యకు 14 మైళ్ల దూరంలో వుంది. – రామాయణం

**నందిదుర్గం :** ఇదో కొండ. దీని దగ్గర గల ఊరును ఈ పేరుతో పిలుస్తారు. ఇక్కడ నుండే ఉత్తర పినాకిని, క్షీర నదులు పుడుతున్నాయి.

**నందిని 1 :** దేవలోకంలోని గోవులకు దేవత అయిన సురభి కశ్యపుల కూతురు. వశిష్ఠుడి హోమదేనువు. వసువు లొకసారి దీన్ని దొంగిలించగా వశిష్ఠుడు వారిని శపించగా వారు మానవ లోకంలో జన్మిస్తారు. దిలీపుడు దీన్ని సేవించి పుత్ర సంతానం పొందుతాడు. – భాగవతం

**నందిని 2 :** ఇదో పవిత్ర స్థలం. ఇక్కడున్న బావిలో స్నానం చేస్తే నరమేధ యజ్ఞ ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**నందివర్ధనుడు :** సూర్యవంశపు రాజు. విరదుని కుమారుడు. సుకేతునికి తండ్రి. – భాగవతం

**నందివర్ధనం :** సాత్యకి యొక్క శంఖం పేరు. – మహాభారతం

**నందివేగం :** ప్రాచీన భారతదేశంలోని ఓ క్షత్రియ కుటుంబం. శాముడను ప్రసిద్ధరాజు ఈ కుటుంబంలో జన్మించాడు. – మహాభారతం

**నందిసేనుడు :** బ్రహ్మ సుబ్రహ్మణ్యస్వామికిచ్చిన నలుగురు పరివారంలో ఒకడు. తక్కిన ముగ్గురు లోహితాక్షుడు, ఘంటాకర్ణుడు, కుముదమాలి. – మహాభారతం

**నందీశ్వరుడు :** చూ॥ నందికేశుడు.

**నందుడు 1 :** మహానందుడి కొడుకు. ఇతడికి 9 మంది పుత్రులు. వారే నవనందులు. ఇతనికి తన దాసి మురవల్ల జన్మించినవాడు చంద్ర గుప్తుడు.

**నందుడు 2 :** ధృతరాష్ట్రుని కుమారుల్లో ఒకడు. – మహాభారతం

**నందుడు 3 :** మదిర వసుదేవుల కుమారుడు. – భాగవతం

**నందులు :** చూ॥ నవనందులు

**నందో రాజాభవిష్యతి :** ఉత్తంగభుజుడనే రాజు కొడుకు పేరు నందుడు. రాజు తన భార్యను కుమారుడిని నిర్లక్ష్యం చేసి ఒక వేశ్య వద్ద వుండే వాడు. ఓ వ్యాపారి రాణి దగ్గరకు ఓ నగతీసుకువస్తే అది కొనాలని ఉత్సాహపడుతుంది. కాని ధనం లేక విచారిస్తుంది. దాసి ముందు నగతీసుకో "ఈ లోపు రాజే మరణిస్తాడో ! వర్తకుడే మరణిస్తాడో లేక నందుడే రాజౌతాడో ఏం చెప్పగలం" అంటుంది. అదియే నందో రాజభవి ష్యతి అనే నానుడిగా వచ్చింది.

**నృగుడు :** వైవశ్వత మనువు వంశంలోని ఓ రాజు. ఇక్ష్వాకుని చిన్న తమ్ముడు. ఇతడు దయార్ద్ర హృదయుడైన రాజు. ఒకసారి ఇతడు తన గోవులను బ్రాహ్మణులకు దానం చేశాడు. ఒకే గోవు మిగలగా పర్వతుడనే బ్రాహ్మణుడికి దానమివ్వగా అతడు దానినొక కొలనువద్ద కట్టివుంచి అడవికి వెళ్లాడు. ఆ తర్వాత ఆనక్తుడను బ్రాహ్మణుడు దానానికి రాగా నృగచక్రవర్తి ఆ కట్టేసి వున్న గోవును పొరపాటున ఆనక్తుడికిచ్చాడు. పర్వతుడు తిరిగి వచ్చి తన గోవు కనిపించక వెదకగా ఆనర్తుని ఆశ్రమం వద్ద వుండగా ఇద్దరూ తనదంటే తనదని వాదులాడు కొనుచుండిరి. విషయం తేలక ఇద్దరూ రాజు దర్శనానికి వచ్చి ద్వార పాలకులకు తమరాక తెలియజేయగా వారు రాజుకి తెలియజేయలేదు. రాజుకూడా వారిని కలవలేదు. అందుకు కోపించి ఆ బ్రాహ్మణులు ఇతడిని ఊసర వెల్లిగా మారమని శపించారు. రాజు వీరిని శాపవిమోచనం కొరకు ప్రార్థించగా శ్రీకృష్ణుడు తాకినపుడు నిజ స్వరూపుడవు కాగలవని చెప్పారు. ఆ శాపంవల్ల ఇతడు ఊసరవెల్లిగా జన్మించి ద్వారకలోని ఓ నూతిలో నివసిస్తాడు. సాంబుడు ఇతరులు దీనిని బయటకు లాగబోగా అది రాదు. శ్రీకృష్ణుడు దీనిని తాకగా నిజరూపుడు కాగా ఆశ్చర్యపోతారు. అతడు తన కథ నివేదిస్తాడు. ఇతని మరణానంతరం యముడ్ని పూజిస్తూ అతని కొలువులో వుంటాడు. భారతీయులకు అత్యంత ప్రీతిపాత్రమైన రాజు. శ్రీకృష్ణుడితడికి ముక్తిని ప్రసాదిస్తాడు. – మహాభారతం

**నృచక్షుషుడు :** యయాతి వంశంలో ఒక రాజు. – భాగవతం

**నృషదుడు :** ఓ మహర్షి. కణ్వమహర్షి తండ్రి.
– రుగ్వేదం

**నృషక్తుడు :** రుగ్వేద కాలంనాటి రుషి. ఇతడి తనయుడు చెవిటివాడు. – రుగ్వేదం

**నృసింహమూర్తి :** హిరణ్య కశిపుడికి నరులవల్లగాని మృగాల వల్లగాని రాత్రిగాని పగలుగాని ప్రాణితోగాని అప్రాణితోగాని మరణంలేనట్లు బ్రహ్మ వరమివ్వగా గర్వుడై ముల్లోకాలను బాధించగా హిరణ్యకశిపుడ్ని సంహరించడానికి బ్రహ్మ వరాలకు భంగం కలగ కుండా విష్ణువు ధరించిన అవతారం నృసింహమూర్తి.
– భాగవతం

**న్యగ్రోధతీర్థం :** ఉత్తరభారత దేశంలోని దృషాద్వతీ నదీతీరంలోని ఓ పుణ్యస్థలం – మహాభారతం

**న్యగ్రోధుడు :** ఉగ్రసేనుని కుమారుడు. శ్రీకృష్ణుడు కంసుని వధించినప్పుడు న్యగ్రోధుడు కృష్ణునితో ఇత రులతో పోరాడాడు. బలభద్రరాముడితణ్ణి వధించాడు.
– భాగవతం



**ప :** ఓ ఉద్యానవనం. – అగ్నిపురాణం

**పకల్ :** ఇదో మళయాళ పదం. దీని అర్థం పగలు. గొప్ప శూన్యం ఏర్పడినప్పుడు దేవుళ్లు, కొండలు అన్నీ పరబ్రహ్మంలో మిళితమౌతాయి. బ్రహ్మ జగత్ సృష్టికి ధ్యానం చేసి సృష్టిని ప్రారంభిస్తాడు. జీవజాలంలోని నాల్గుజాతులు దేవతలు, రాక్షసులు, పితృలు, మాన వులు సృష్టించబడతారు. తమోగుణంలో రాక్షసులు జన్మిస్తారు. అది తగ్గిన తర్వాత బ్రహ్మ నుదుట నుండి దేవతలు జన్మిస్తారు. వారుసత్వ గుణానికి ప్రతినిధులు. రజోగుణంలో మానవులు జన్మిస్తారు. సాయం సంధ్యలో పితృలు ఉద్భవిస్తారు. అందువల్ల రాత్రిపూట రాక్షసులు, పగలు దేవతలు బలవంతులు అవుతారు.

**పక్షం :** చూ॥ కాలమానం

**పక్షాలిక :** సుబ్రహ్మణ్యస్వామి స్త్రీ సేవిక. – మహాభారతం

**పక్షివంశం :** విష్ణు అంశతో కశ్యపప్రజాపతి జన్మిం చాడు. అతనికి తామ్రవల్ల ఐదుగురు కుమార్తెలు. వారు క్రౌంచి, భాసి, శ్యేని, ధృతరాష్ట్రి, శుకి. క్రౌంచికి ఉలూకలు, భాసికి భాపసులు, శ్యేనికి రాబందులు, ధృతరాష్ట్రికి హంసలు జన్మించాయి. పక్షిజాతి మొత్తం వీటినుండి జన్మించినదే. – రామాయణం

**పక్థుడు :** వేదకాలంనాటి రాజు. అశ్వినీ దేవతలు ఇతణ్ణి రక్షించారు. ఇతనిమీద ఇంద్రుడికి అభిమానం. దాశ రాజ్ఞ యుద్ధంలో త్రసదుస్యులతరపున సుదాసులతో పోరాడాడు. – రుగ్వేదం

**పటచ్చరం :** ప్రాచీన భారతావనిలో ఓ నివాసప్రాంతం. పుర్వకాలంలో జరాసంధునికి దడిసి దక్షిణ భారత దేశానికి వచ్చి నివసించారు. దక్షిణ భారతదేశ జైత్రయాత్రలో సహదేవుడు వీరిని ఓడించాడు. కురుక్షేత్రయుద్ధంలో పాండవుల తరపున పోరాడారు. పాండవులు క్రౌంచవ్యూహాన్ని ఏర్పరచినపుడు వెనుక భాగాన నిలబడ్డారు. – మహాభారతం

**పటవాసకం :** ధృతరాష్ట్రుని వంశంలోని ఓ సర్పం. ఇది జనమేజయుని సర్పయాగంలో బూడిదయ్యింది.
– మహాభారతం

**పట్టత్తాన :** ఇది కేరళలోని హిందూ ఆచారం. పట్ట అంటే సంస్కృత పండితుడని అర్థం. మూడు ఉన్నత వర్గాలకు శాస్త్రాలు ఉపనిషత్తులను, జన సమూహాలకు ఆధ్యాత్మిక చింతన పెంపొందించడానికి వీరిని దేవాలయాల్లో నియమించేవారు. ముఖ్య దేవాలయాల్లో మావారత పట్టలని నియమించేవారు. వీరు ప్రతిరోజు దేవాల యాల్లో మహాభారత కథ చదివి విన్పించేవారు.

**పతత్రి :** కౌరవుల పక్షాన పోరిన ఓ గొప్ప వీరుడు. భీమునితో చేసిన యుద్ధంలో ఇతడు తన రథాన్ని పోగొట్టుకున్నాడు. – మహాభారతం

**పతంగం :** ఓ పర్వతం. మహామేరుపర్వతానికి చుట్టూ గల ఇరవై పర్వతాలలో ఇదొకటి.

**పతంజలి 1 :** ఓ ప్రసిద్ధ సంస్కృత వ్యాఖ్యాత. పాణిని వ్యాకరణ సూత్రాలకు భాష్యం చెప్పిన పండితుడు. ప్రజలు ఇతనికి పాదాభివందనం చేసేవారు కనుక ఇతనికి పతంజలి అనే పేరు వచ్చింది. ఇతడు యోగ సూత్రాలు, చరకసంహిత రచించాడు. ఇతడ్ని ఆదిశేషుని అంశగా భావిస్తారు. పతంజలి చరిత్ర గ్రంథం ఆధారంగా ఇతడు ఓ మహర్షి కుమార్తె గోణిక యొక్క తపస్సు వల్ల శివుని ప్రసాదంగా జన్మించాడని, ఇతడు శివుని

పూజించి పాణిని సూత్రాలకు భాష్యం చెప్పే అను గ్రహం పొందాడని చెప్తుంది. ఇతని శిష్యపరంపరలో ఒకడైన చంద్రగుప్తునికి ఓ శూద్ర స్త్రీవల్ల జన్మించిన వాడు భర్తృహరి అని చెప్తారు. 'గోల్డ్ స్టికర్' మాత్రం ఇతడు పుష్యమిత్రుడి వార్తాహరుడని ఇతడు మెనాం డర్ సాకేతుడిపై యుద్ధం చేసిన సమయంలో జీవిం చాడని వివరించాడు. ఆధునిక పండితులు పాణిని వ్యాకరణ భాష్యకారుడు, యోగ సూత్రాల గ్రంధకర్త ఒకరు కాదని చెప్తున్నారు.

**పతంజలి 2 :** ప్రాచీన యోగి కుమారుడు. ఇతడు షట్సంహితలను రచించాడు. – *బ్రహ్మాండపురాణం*

**పతా :** కౌరవ సైన్యంలోని వీరుడు. దుర్యోధనుడు శకునికి ఇతని సహాయంతో అర్జునుడితో పోరాడమని చెప్తాడు. – *మహాభారతం*

**పత్తి :** ఓ సైన్య విభాగం. – *చూ॥ అక్షౌహిణి*

**పత్రేశ్వరం :** ఓ పుణ్యస్థలం. నర్మదానదికి ఉత్తరతీర ప్రాంతంలో వుంది. ఇక్కడ స్నానంచేస్తే అప్సరస కన్యలతో 5000 సంవత్సరాలు సంతోషంగా జీవిస్తారు. – *పద్మపురాణం*

**పత్తోర్ణుడు :** ఓ క్షత్రియ రాజు. ధర్మజునికి రాజసూయ యాగంలో బహుమతులు అందజేశాడు. – *మహాభారతం*

**పథర్వణుడు :** రుగ్వేదంలో పేర్కొనబడిన ప్రసిద్ధ రాజు. – *రుగ్వేదం*

**పథికృతం :** ఇదో అగ్ని. యజ్ఞ సమయంలో యజ్ఞం ఆగిపోతే ఇతడ్ని ప్రార్థించాలి. – *మహాభారతం*

**పథ్యుడు :** ప్రాచీన గురు పరంపరలో ముఖ్యుడు. – *చూ॥ గురుపరంపర*

**పదపాఠం :** వేదాలను పఠించే ప్రాచీన విధానం. – *చూ॥ ఘనపాఠం*

**పదాతి :** జనమేజయుని 8 మంది పుత్రుల్లో ఒకడు. తక్కినవారు ★ ధృతరాష్ట్రుడు, ★ పాండు, బాల్హిక, నిషధ, జాంబూనాథ, కుండోదర, వసాతి.

**★పదారువేల భార్యలు :** నరకాసురుడు 16,000 మంది స్త్రీలను బంధించాడు. నరకాసుని వధించి శ్రీకృష్ణుడు వీరిని బంధవిముక్తుల్ని చేయగా వారు శ్రీకృష్ణుని వివాహమాడదలచగా వారిని పరిగ్రహిస్తాడు. – *భాగవతం*

**పదార్థం :** చూ॥ పంచభూతాలు

**పద్మ 1 :** కద్రువకు కశ్యప మహర్షి వల్ల జన్మించిన సర్పం. – *మహాభారతం*

**పద్మ 2 :** ఇదో నిధి. ఇది కుబేరునిది. శంఖునిధి, పద్మనిధి, పుష్పక విమానం కుబేరునికి బ్రహ్మ బహూకరించాడు. – *ఉత్తర రామాయణం*

**పద్మకల్పం :** సృష్టిలో ఒక కాలం. విష్ణునాభిలోని పద్మం నుండి బ్రహ్మ జన్మించి సృష్టి చేసిన కాలం. ఇతర కల్పాలు బ్రహ్మ, వరాహ కల్పాలు. – *బ్రహ్మావైవర్తపురాణం*

**పద్మకూటం :** శ్రీకృష్ణుని భార్య సుప్రభ ఈ భవనంలో నివసించేది. – *మహాభారతం*

**పద్మకేతనుడు :** గరుడుని కుమారుల్లో ఒకడు. – *మహాభారతం*

**పద్మకోమల :** త్వష్ట ప్రజాపతి కుమార్తె. శూరపద్మాసురుడి భార్య. – *స్కాందపురాణం*

**పద్మపురాణం :** అష్టాదశ పురాణాల్లో ఒకటి. – *చూ॥ అష్టాదశ పురాణాలు*

**పద్మనాభుడు 1 :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. – *మహాభారతం*

**పద్మనాభుడు 2 :** ఓ సర్పం. ఇది గోమతీ నదీ పరివాహకంలో నివసించేది. ఈ నది నైమిశారణ్యం గుండా ప్రవహిస్తుంది. ఈ సర్పం ఒకసారి భీష్ముడితో ధర్మాన్ని గురించి చర్చించింది. – *మహాభారతం*

**పద్మరాగం :** నవరత్నాలలో ఒకటి. – *చూ॥ నవరత్నాలు*

**పద్మశేఖరుడు :** ఓ గంధర్వరాజు. కథాసరిత్సాగరంలో ఎన్నో కథల్లో ఈ గంధర్వ రాజు పాత్ర వుంది. పద్మావతి ఇతని కుమార్తె. పద్మావతీ లంబకం ఆసాంతం ఈమె కథలతోనే నిండివుంటుంది.

---

★ ఇచట పేర్కొన్న ధృతరాష్ట్ర, పాండులు కౌరవ, పాండవుల తండ్రులు కారు.

★ 16,000 మంది వివరణకు 'నరకాసురుడు' గాథ చూడవచ్చు

**పద్మసరస్సు :** ఉత్తర భారతదేశంలో కలువపూలు వికసించే ఓ కొలను. ఖాండవప్రస్థం నుండి గిరి వ్రజానికి వస్తూ ఈ కొలనువద్ద పాండవులు శ్రీకృష్ణ నితో కొంత సేపు సంభాషించారు. – మహాభారతం

**పద్మసౌగంధికం :** చేది దేశంవద్ద కలువలు మిక్కుటంగా వున్న ఓ కొలను. మహాభారత కాలంలో వ్యాపార కూటమిని అడవి ఏనుగులు ఇక్కడ ప్రతిఘటిస్తాయి. – మహాభారతం

**పద్మాకరుడు :** శివయోగిని గొప్పదనాన్ని వివరించే ఒక పాత్ర. – *శివపురాణం*

**పద్మాక్షుడు :** చంద్రహాసుడి కొడుకు. – *జైమిని భారతం*

**పద్మావతి 1 :** ఓ నది. మహాలక్ష్మి అంశతో జన్మించింది. – చూ॥ *గంగ*

**పద్మావతి 2 :** ఉదయన మహారాజు భార్య. – చూ॥ ఉదయనుడు

**పద్మావతి 3 :** సుబ్రహ్మణ్య స్వామి స్త్రీ అనుచరి. – మహాభారతం

**పద్మావతి 4 :** ఆకాశరాజు కుమార్తె. ఈమె వెంకటేశ్వర స్వామిని వివాహమాడెను.

**పద్మావతి 5 :** విదర్భరాజైన సత్యకేతుని కుమార్తె. ఈమె ఉగ్రసేనుని వివాహమాడెను. భర్తలేని సమయంలో తన స్వగృహంలో కుబేరుని సేవకుడితో అక్రమ సంబంధం చేసుకోగా గర్భం ధరించింది. ఆ గర్భాన్ని విచ్ఛిన్నం చేసుకోబోగా, పిండం నేను కాలనేమిని సంహరించిన శ్రీమహావిష్ణువును సంహరించడానికి జన్మిస్తున్నాను అని పల్కుతాడు. ఆ జన్మించిన బిడ్డే కంసుడు. – పద్మపురాణం

**పద్మావతి 6 :** ప్రణిధి అనే వైశ్యుని భార్య. ఒకసారి వ్యాపారార్థం అతడు వేరే వూరికివెళ్ళగా పద్మావతి తన స్నేహితురాళ్లతో దగ్గరలోని నదిలో స్నానం చేస్తుం డగా ఓ శూద్రుడు ఆమె అందాన్ని చూసి వెళ్లలేక అలాగే నిలబడి చూస్తుంటాడు. ఆమె స్నేహితురాళ్లు అతణ్ణి ఆటపట్టించడానికి గంగా, యమునా సంగమం వద్ద నీవు ప్రాణాలు విడిస్తే పద్మావతి దక్కుతుందని చెప్తారు. అతడు వెంటనే వారు చెప్పిన ప్రాంతానికి వెళ్లి ప్రాణాలు విడుస్తాడు. అతడు పద్మావతి భర్త ప్రణిధి రూపుడై పద్మావతి వద్దకు వస్తాడు. అంతలో అసలు భర్త ప్రణిధి కూడా రాగా ఎవరు తన భర్తో తేల్చుకోలేక పోతుండగా శ్రీమహావిష్ణువు ఇద్దరితోను కాపురం చేయమంటాడు. కులస్త్రీనైన నాకు అది సాధ్యంకాదని చెప్పగా శ్రీమహావిష్ణువు ఆ ముగ్గుర్ని వైకుంఠానికి తీసుకు వెళ్తాడు. – పద్మపురాణం

**పద్మావతి 7 :** సహస్రముఖ రావణుని కొడుకైన చంద్ర గుప్తుడి భార్య. – చూ॥ *సహస్రముఖ రావణుడు.*

**పద్మావతి 8 :** ఇక్ష్వాకు వంశంవాడైన అంబరీషుడి తల్లి. విష్ణుమూర్తి వరంవల్ల ఈమెకితడు జన్మిస్తాడు. – *లింగపురాణం*

**పద్మావతి 9 :** సింహళ దేశాధిపతి బృహదశ్వుడి కూతురు. శివభక్తురాలు. విష్ణువు ఈమెకు భర్తవు తాడని శివుడు వరమిస్తాడు. ఈమెను కల్కి వివాహ మాడతాడు. – కల్కిపురాణం

**పద్ముడు 1 :** ఓ రాజు. యముని కొలువులో అతణ్ణి పూజిస్తుంటాడు. – మహాభారతం

**పద్ముడు 2 :** సుబ్రహ్మణ్యస్వామి సైనికుల్లో ఒకడు. – మహాభారతం

**పనసుడు :** శ్రీరాముని వానరసేనలో ముఖ్యుడు. 51 కోట్ల వానర సేనకు నాయకత్వం వహించి రావణునితో పోరాడాడు. ముఖ్యంగా పరుషుని సేనను నిర్వీర్యం చేయడం ఇతని ధ్యేయం. – రామాయణం

**పయస్యుడు :** అంగిరసుని కుమారుడు. అంగిరసునికి 8 మంది కుమారులు. వారిని వరుణులంటారు.వారు బృహస్పతి, ఉతత్య, పయస్య, శాంతి, ఘోర, విరూప, సంవర్త, సుధాన్యులు. – మహాభారతం

**పయోద :** సుబ్రహ్మణ్య స్వామి స్త్రీ సేవికల్లో ఒకరు. – మహాభారతం

**పయోష్ణి :** ఇదో పవిత్రనది. వింధ్య పర్వతాలలో పుట్టి పశ్చిమానికి ప్రవహిస్తుంది. నలదమయంతులు దీని తీరం వెంబడి నడిచారు. ఈ నదిలో స్నానంచేస్తే 1000 గోదానాల ప్రతిఫలం లభిస్తుంది. ఈ నది ఒడ్డునగల వరాహతీర్థం వద్ద నృగుడు యాగం చేయగా ఇంద్రుడు బ్రాహ్మణులు సోమపానం సేవిం చారు. ఈ నది నీటి చుక్క తగిలినా పాప నాశనం జరుగుతుంది. శివుని సంగీత పరికరం శృంగ ఈ

నదిలోనే వుంది. ధర్మరాజు ఇచ్చట కొన్నాళ్లు నివసించి ఈ నది నీటిని సేవించాడు. అమూర్తరయసుని కుమారుడైన గయుడు ఇచ్చట ఏడు అశ్వమేధ యాగాలు చేసి ఇంద్రుణ్ని మెప్పించాడు. – మహాభారతం

**పరతంగణం :** ప్రాచీన భారతదేశంలో నివాసయోగ్య ప్రాంతం. – మహాభారతం

**పరపురంజయుడు :** హేహయ వంశంలోని రాజు. అడవి జంతువని తలచి మునిపై బాణం వేశాడు. – *చూ॥ అరిష్టనేమి*

**పరబ్రహ్మ :** విశ్వాత్మ. సృష్టికి మూలం బ్రహ్మ. బ్రహ్మ నుండి ఆకాశం. ఆకాశం నుండి గాలి, గాలినుండి అగ్ని, అగ్నినుండి నీరు, నీటినుండి భూమి అవతరించాయి. – అగ్నిపురాణం

ఇది స్థల కాలాలకతీతమైనది. తెలుసును కొన్నవాడికి తెలియనట్లు, తెలియదనుకొన్నవాడికి తెలిసినట్లు, రుగ్వేదం తొలుత అస్తిత్వంగాని, నాస్తిత్వంగాని లేదని చెప్తోంది. బ్రహ్మ రెండు రూపాలు, పరబ్రహ్మ, అపర బ్రహ్మ. పరబ్రహ్మ స్వరూపం లేనిది అపరబ్రహ్మం మూర్తిమత్వం. అమూర్త బ్రహ్మను పరబ్రహ్మం, పరమాత్మని గురుబ్రహ్మ అంటారు. కన్పించిన విషయాలను అపరబ్రహ్మం అంటారు.

**పరమకాంభోజం :** ఉత్తర భారతదేశంలోని పశ్చిమ ప్రాంతాన గల నివాసయోగ్య ప్రాంతం. దీనిని అర్జునుడు జయించాడు. – మహాభారతం

**పరమక్రోధి :** విశ్వదేవులలో ఒకరు. – మహాభారతం

**పరమాణువు :** చూ॥ త్రసరేణువు.

**పరమాత్మ :** చూ॥ పరబ్రహ్మ.

**పరమేష్ఠి 1 :** చంద్రవంశపు రాజు. ప్రతిహారుని తండ్రి. ఇంద్రద్యుమ్నుని కుమారుడు. – విష్ణుపురాణం

★ **పరమేష్ఠి 2 :** ఓ వైదికసూక్తద్రష్ట. బ్రహ్మయొక్క శిష్యుడు. – బ్రహదార్యాకోపనిషత్తు

**పరమేష్ఠి 3 :** ఓ పాంచాలదేశపు రాజు. నీలివల్ల అజమీఢునికి జన్మించాడు. పరమేష్ఠిని దుష్యంతుని కుమారుల్ని పాంచాలురని పిలుస్తారు. – మహాభారతం

**పరశురామ కుండం :** పరశురామహ్రదానికి మరోపేరు. సమంతక పంచకమనే ఐదు రక్తపు మడుగులు. వీటిని కురుక్షేత్రం వద్ద పరశురాముడు నిర్మించాడు. – *చూ॥ పరశురాముడు*

**పరశురాముడు :** మహావిష్ణువు మానవ అవతారం పరశురాముడు. భృగువంశంలోని రుచికుని కుమారుడైన జమదగ్ని పుత్రుడు.

*పరశురామావతార కారణం 1 :* ఒకసారి అగ్ని కార్తవీర్యార్జునుని వద్దకు వెళ్ళి తనకు ఆహారం కావాలని కోరగా నా రాజ్యంలో నీ ఇష్టమొచ్చిన ప్రాంతాన్ని ఎంతకావాలంటే అంత తీసుకొమ్మనగా అగ్ని పర్వతాలను అడవుల్ని దహించివేస్తూ వచ్చాడు. ఆపవ అనే మహర్షి అడవి మధ్య తపస్సు చేస్తుండగా అతని ఆశ్రమము కూడ దహించబడెను. దీనికి మూల కారకుడు కార్తవీర్యార్జునుడని గ్రహించి క్షత్రియుల అహంభావం పెరిగిందని వారిని శిక్షించడానికి మహావిష్ణువు పరశురాముడిగా అవతరించాలని కోరతాడు. అతని కోరిక ప్రకారం భృగువంశంలో పరశురాముడు జన్మించాడు. – హరివంశం

*పరశురామావతారం 2 :* భూదేవి గోవు రూపంలో విష్ణువు వద్దకు వెళ్లి దుర్మార్గులైన కొందరు క్షత్రియుల వల్ల బాధకల్గుతోందని విన్నవించగా మహావిష్ణువు పరశురాముడిగా జన్మించి క్షత్రియ సంహారంచేస్తానని అభయమిచ్చాడు. – బ్రహ్మాండపురాణం

*జననం :* జమదగ్ని మహర్షికి ప్రశేనజిత్తు కుమార్తె రేణుకవల్ల 5 గురు పుత్రులు. ఐదవవాడు పరశురాముడు. – బ్రహ్మాండపురాణం.

*బాల్యం–విద్య :* పరశురాముడు తన బాల్యాన్ని తండ్రి ఆశ్రమంలోనే గడిపాడు. వేదాలు చదివిన దాఖలాలు లేవు. ఇతనికి ధనుర్విద్యపైనే ఆసక్తి మెండు. తండ్రి తల్లిని శంకించి ఆమెను వధించమని కుమారులను కోరగా, పెద్దవాళ్లు నల్గురు నిరాకరించగా పరశురాముడు తండ్రి ఆజ్ఞపై తల్లిని వధిస్తాడు. తండ్రి అందుకు ప్రతిగా వరం కోరుకొమ్మనగా తల్లిని బ్రతికించి అన్నలను శాపవిముక్తులను చేయమని కోరతాడు. ధనుర్విద్యాభ్యాసం కొరకు శివుడ్ని ప్రార్థించ

★ జైమిని రచనల ప్రకారం పరమేష్ఠి ప్రజాపతి శిష్యుడు.

డానికి హిమాలయాలకు వెళ్లి చాలాకాలం తపస్సు చేశాడు. ఆ సమయంలో దేవతలు రాక్షసుల నుండి కాపాడమని శివుణ్ణి వేడుకోగా శివుడు పరశురాముణ్ణి రాక్షసుల పైకి వెళ్లమనగా ఆయుధాలు లేని నాకెలా సాధ్యమనగా నా ఆశీర్వచనాలు చాలని చెప్తాడు శివుడు. వెంటనే పరశురాముడు దేవతల తరఫున రాక్షసులతో యుద్ధం చేసి వారిని వధించి తిరిగి శివుని వద్దకు రాగా శివుడు ఎన్నో వరాలు ఆయుధాలు ఇస్తాడు. ఆ ఆయుధాల్లో ఒకటి ★పరశువు. అంతకు ముందు ఇతని పేరు రాముడే. పరశువును గ్రహించిన తర్వాత పరశురాముడిగా పిలవబడ్డాడు.

*యుద్ధానికి కారణం :* కార్తవీర్యార్జునుడు ఒకసారి అడవికి వేటకు వెళ్ళి దాహార్తియై జమదగ్ని ఆశ్రమానికి వెళ్లగా తన వద్ద గల సుశీల అనే గోవు మహాత్యంతో రాజుకి, రాజు సైన్యానికి విందు చేశాడు. ఇది గమనించిన రాజు ఆ గోవును తన రాజ్యానికి తీసుకురమ్మని తన సేనాని చంద్రగుప్తునికి చెప్పి అతడు తన రాజధానికి చేరుకోగా ఆ గోవును తీసుకు రమ్మన్న రాజాజ్ఞను జమదగ్నికి వివరించగా అతడు నిరాకరించాడు. చంద్రగుప్తుడు బలత్కారంగా ఆ గోవుని తీసుకొని వెళ్తుండగా జమదగ్ని వెంటపడగా అతణ్ణి చంపివేశాడు. రేణుక తన భర్తను అనుసరించి వెళ్లి అతడు చనిపోయి వుండటం చూసి రోధిస్తూ 21 సార్లు తన గుండెను బాదుకుంది. పరశు రాముడు వచ్చి తన తండ్రి చనిపోవడం చూసి 21 సార్లు క్షత్రియులపై దండెత్తి వారిని నాశనం చేస్తానని శపథం చేశాడు. జమదగ్ని దేహాన్ని కట్టెలపై వుంచి నిప్పంటించబోతుండగా శుక్రముని వచ్చి మృతసంజీవిని మంత్రాన్ని జపించి సజీవుణ్ని చేశాడు. ఈలోపు సుశీల తప్పించుకొని ఆశ్రమానికి రాగా పరశురాముడు దూడను కూడా తీసుకువస్తానని కార్తవీర్యార్జునుని నగరంపైకి తనశిష్యుడితో వెళ్లి అతనితో ఘోర యుద్ధం చేసి అతణ్ణి వధించి దూడను ఆశ్రమానికి తీసుకువస్తాడు. జమదగ్ని ఈ పాపానికి ప్రాయశ్చిత్తంగా మహేంద్రగిరి వెళ్లి తపస్సు చేయమని పరశురామునికి చెప్తాడు. పరశురాముడు లేని సమయం చూసి కార్తవీర్యార్జునుని కుమారుడైన శూరసేనుడు తన సేనలతో వచ్చి జమదగ్ని తల నరకుతాడు. పరశురాముడు మహేంద్రగిరి నుండి వచ్చి తండ్రి దహనసంస్కారాలు చేయగా రేణుక అదే అగ్నిలో దూకి మరణించింది. అక్కడి నుండి పరశురాముడు క్షత్రియుల్ని నిరంతరాయంగా వధిస్తూ వచ్చాడు.

*సమంత పంచక నిర్మాణం :* 21 సార్లు క్షత్రియులను సంహరించి ఆవర్తమును నింపుటకు కురుక్షేత్రమున 5 కుద్యములు నిర్మించి క్షత్రియుల రక్తముతో నింపగా పితరులు అమాయక క్షత్రియుల వధ న్యాయము కాదని ఈ పాపము శమించుటకు యజ్ఞము చేయమనిరి. అతడు జయించిన సంపదను బ్రాహ్మణులకు దానమిచ్చెను. తను జయించిన రాజ్యములను కశ్యపునకు దానమివ్వగా కశ్యపుడు రాజ్యములన్నింటిని నాకు దానమిచ్చితివి కనుక రాజ్యము విడచివెళ్ళమనగా అతడు దక్షిణాదికి వెడలెను. సముద్రుడు అడ్డు రాగా నాగాస్త్రమును సంధించగా వరుణుడు ప్రత్యక్షమై నీకు కావలసినంత దూరము దారి ఇచ్చెదననగా పరశురాముడు సూర్పారకమును విసరగా అది రెండు యోజనముల దూరమున పడెను. వరుణుడు ఆ రెండు యోజనములు వెనక్కు వెళ్లెను. అదే గోకర్ణము (కేరళ). దానిని కూడా బ్రాహ్మణులకు దానమిచ్చి మేరు పర్వతముపై తపస్సునకు వెళ్లెను.

*పరశురాముడు–ద్రోణుడు–కర్ణుడు :* ద్రోణుడు, కర్ణుడు పరశురాముని వద్ద ధనుర్విద్య అభ్యసించినట్లు పురాణాలు చెప్తున్నాయి. బ్రాహ్మణులకు దానమిస్తున్నాడని ద్రోణుడు పరశురాముని వద్దకు వెళ్లగా అప్పటికే సకల సంపదలను దానమిచ్చిన పరశురాముడు తన వద్ద నేను, నా ధనుర్విద్య తప్ప ఏమి మిగలలేదని చెప్పగా ద్రోణుడు ధనుర్విద్యను గ్రహించెనని చెప్పబడింది. కర్ణుడు పరశురాముని వద్ద విద్యనభ్యసించగా ఓ కీటకము కర్ణుని శరీరమును గాయపరచి చాలా రక్తము స్రవించగా పరశురాముడు అతడు బ్రాహ్మణుడు కాదని గ్రహించి తనవద్ద అభ్యసించిన విద్య సరైన సమయమున ఉపయోగపడదని శపించెను. ఇది కొంత గందరగోళముగా కన్పించుచున్నది.

★ పరశువు : చూ॥ నరనారాయణులు.

పరశురాముడు ధనుర్విద్యను ద్రోణునికిచ్చిన తర్వాత కర్ణుడికెట్లు నేర్పెను. అట్లుకాకున్నచో ద్రోణునికంటే ముందే కర్ణుడు పరశురాముని వద్ద ధనుర్విద్య అభ్యసించి వుండ వచ్చును. అనగా కురుపాండవులకు ధనుర్విద్య నేర్పిన తర్వాత ద్రోణుడు పరశురాముని కలిసివుండ వచ్చునని ఊహించవలసి వచ్చుచున్నది.

*ఇతర విశేషాలు :* శ్రీరాముడు, సీతా స్వయంవరమున విష్ణుచాపమును విరచి అయోధ్యకు వచ్చుచుండగా పరశురాముడెదు రేగి శ్రీరాముడ్ని పరుష వాక్కులతో శివధనస్సును కూడా ఎక్కుపెట్టగలవా అని ప్రశ్నించగా శ్రీరాముడు ప్రశాంత వదనంతో అతని చేతి నుండి శివచాపము తీసుకొని వింటిని సారించగా శ్రీరాముడు సాక్షాత్తు మహావిష్ణువని గ్రహించి పరశురాముడు శ్రీరాముడ్ని ఆశీర్వదించి వెడలెను.

అంబవల్ల ఒకసారి భీష్మ పరశురాములకు గొప్ప యుద్ధం జరిగింది.

శ్రీకృష్ణుడు కౌరవ సభకు దూతగా వచ్చినపుడు పరశు రాముడు ఆ సభలో వుండెను.

*క్షత్రియనాశనం :* పరశురాముని జీవితంలోని ముఖ్యాంశం క్షత్రియ వినాశనం. ఇతడు క్షత్రియులపై 18 సార్లు యుద్ధం చేసి నాశనం చేశాడని కొన్ని పురాణాలు చెప్తుండగా 21 సార్లు యుద్ధం చేసినట్లు మహాభారతం చెప్తోంది. దీనికి ప్రధానకారణం కుటుంబ కలహం.

*కుటుంబ కలహం :* ఒకప్పుడు హేహయ రాజులు అత్యంత శక్తివంతులు. వీరు బ్రాహ్మణులకు ఇతరులకు దానధర్మాలు విరివిగా చేసేవారు. భార్గవులు వీరికి వంశపారంపర్య పురోహితులు. హేహయుల దానధర్మాలతో వారు చివరికి రాజ్య పాలనకు కూడా ధనం లేనివారు కాగా భార్గవులు ధనవంతులయ్యారు. హేహయరాజులు భార్గవ వంశజుడైన రుచికుడ్ని ధన మడగగా అతడు నిరాకరించగా హేహయ క్షత్రియులు బ్రాహ్మణులపై పగతో అందర్ని వధించగా రుచికుని భార్య పారిపోయి హిమాలయాల్లో దాక్కుని ఔర్యుడికి జన్మనిచ్చింది. అతడు గర్భంలో వుండగనే తన పూర్వీకులను చంపిన క్షత్రియులపై పగ బూనాడు. అతని కాంతి బడబాగ్నిగా మారి క్షత్రియులను నాశనం చేసింది. దేవతలు, ఔర్యుడ్ని క్షత్రియ నాశనాన్ని ఆపమనికోరి అతని ముఖంలోని ఉజ్వల కాంతిని సముద్రంలో దాచారు. దానినే బడబాగ్ని అంటారు.

ఔరవునికి జమదగ్ని, అతనికి పరశురాముడు జన్మించగా అదే కాలంలో హేహయ వంశంలో బహు పరాక్రమ శాలి అయిన కార్తవీర్యార్జునుడు జన్మించాడు. ఇతడు దత్తాత్రేయ వరప్రసాదియై తన తోటి రాజులను ఓడించి సముద్రం వద్దకు వెళ్లి వరుణుడిని కూడా యుద్ధానికి ఆహ్వానించగా వరుణుడు తనకంత శక్తి లేదని జమదగ్ని కుమారుడు పరశురాముడు తగిన వాడని చెప్తాడు.

**పరశువనం :** నరకంలోని ఓ అడవి. పాపులు నరకంలోని సలసల కాగే నెత్తురు పారే వైతరణిని దాటిన తర్వాత అసిపత్రవనం వెళ్తారు. కత్తికంటే పదునైన అసిపత్ర ఆకులతో వారి శరీరం ఖండించబడిన తర్వాత వారు పరశువనం చేరతారు. – *మహాభారతం*

**పరసువు :** ఓ కామరూపి అయిన రాక్షసుడు. బ్రాహ్మణ హంతకుడు. శాకల్యమునిని చంపబోయి విఫలం చెంది అతడ్ని శరణువేడతాడు. జ్ఞానమిమ్మని కోరగా గౌతమీ నదిలో స్నానం చేసి సరస్వతిని ప్రార్థించమని చెప్తాడు. – *బ్రహ్మాండపురాణం*

**పరహణుడు :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. – *మహాభారతం*

**పరావహువు :** ఒక వాయువు.

**పరావిధ్య :** చూ॥ అపరావిధ్య.

**పరుచ్ఛేదుడు :** వేదకాలం నాటి ఓ మహర్షి. ఇతడు సూక్త దృష్టి. అతని మాటల్లో ప్రత్యేక ధ్వనులుండేవి. నృమధశ, పరుచ్ఛేదులు మంత్ర ఉచ్చారణలో పోటీ పడేవారు. ఎవరు గొప్పో తేల్చుకోవాలని తలచేవారు. ఒకసారి నృమధశుడు తన మంత్ర శక్తితో తడికట్టెల నుండి పొగ తెప్పించగా పరుచ్ఛేదుడు కట్టెలు లేకుండానే మంటలు సృష్టించగా నృమధశుడు తన ఓటమిని అంగీకరించాడు. – *తైత్తరీయ సంహిత.*

**పరుదు 1 :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. – *మహాభారతం*

**పరుదు 2 :** విశ్వామిత్రుని కుమారుడు. బ్రహ్మావాది. – *మహాభారతం*

**పరుణీధుడు :** రుగ్వేదంలో పేర్కొనబడిన ఓ రాజు.
– రుగ్వేదం

**పరుషుడు :** ఓ రాక్షసుడు, రామునితో యుద్ధం చేయడానికి ఖరునికి సహాయపడిన 12 మంది రాక్షసుల్లో ఒకడు. – రామాయణం

**పర్వణులు :** రాక్షస దయ్యాల కూటమి. పర్వణులు, పతనసులు, జంబులు, ఖరులు, క్రోధవసులు, హరిలు, ప్రరుజసులు, అరుజసులు, ప్రఘుజసులు, మాయారూపులైన రాక్షసులు – వీరు రావణుని తరఫున శ్రీరామునితో యుద్ధం చేశారు. – రామాయణం

**పర్వతీశ్వరుడు :** విద్య దేశాధిపతి. ప్రజల్ని ధనంకోసం పీడించేవాడు. అతడి మరణానంతరం నరకానికి వెళ్లి తదనంతర జన్మలో కోతిగా జన్మించాడు. అతని ఓ పురోహితుడు ఓ పక్షిగా జన్మించాడు. ఓ రోజు కోతి ఆ పక్షిని వెంటాడగా ఆ పక్షి తమ పూర్వజన్మ వృత్తాంతం చెప్పి తర్వాతి జన్మలో హంసలుగా జన్మిస్తామని ఆ తర్వాత మానవ జన్మలో జన్మిస్తామని చెప్పాడు.
– పద్మపురాణం

**పరావర్తనం :** 28 నరకాలలో ఒకటి. – చూ॥ కాలుడు

**పరావసుడు :** రైభ్య మహర్షి కుమారుడు. అర్వావసువు సోదరుడు. – చూ॥ అశ్వావసుడు

**పరాశర స్మృతి :** కలియుగంలో ఆచరించవలసిన ధర్మాల గురించి చెప్పే శాస్త్రం. దీనికి మాధవీయం పేరుతో మాధవాచార్యులు, విద్యానారాయణుడు వ్యాఖ్యానం చేశాడు.

**పరాశరుడు 1 :** వశిష్ఠుని కుమారుడైన శక్తికి అదృశంతి వల్ల జన్మించిన కుమారుడు. ఇతడు పుట్టుకతోనే పండితుడు. ఇతడు తల్లి గర్భంలో వుండగనే ఇతని తండ్రి శక్తిని కల్మషపాదుడను రాక్షసుడు తిని వేయడం వల్ల పుట్టుక నుండి రాక్షస వ్యతిరేకత్వాన్ని పెంచుకున్నాడు. రాక్షస సంహారానికి ఓ యాగం చేసి వేల రాక్షసులను బలితీసుకోగా ఇతని తాత వసిష్ఠుడు అమాయక రాక్షసులను బలిగొంటానికి చింతించి పరాశరుని వద్దకు వచ్చి ఇది న్యాయం కాదని నీకోపాన్ని అణచుకొమ్మని ప్రతిజీవి పుట్టుక మరణాలు దైవలిఖితమని, కోపం గొప్పతనాన్ని నశింపజేస్తుంది కనుక ఈ యాగాన్ని ఆపమని కోరగా తాత మాట మన్నించి యాగాన్ని ఆపాడు. బ్రహ్మకుమారుడైన పులస్త్య మహర్షి కూడా అప్పుడక్కడికి రాగా వశిష్ఠుడు అర్ఘ్యమిచ్చి అతడ్ని సాదరంగా ఆహ్వానించాడు. వశిష్ఠుడు, పులస్త్యుడు పరాశరుడ్ని దీవించి నీవు పురాణ సంహిత గ్రంథానికి రచయితవు కాగలవని చెప్తారు. అందువల్ల ఇతడు గురుపరంపరలో ఘనత వహించిన మహర్షి అయ్యాడు. పరాశరునికి శూద్రకన్య అయిన సత్యవతివల్ల ఓ కుమారుడు జన్మించాడు. అతడే ప్రసిద్ధ మహర్షి అయిన వ్యాసుడు. గర్భంలో వుండగనే తన తండ్రిని రాక్షసుడు తిన్నప్పుడు తన తాత అయిన వశిష్ఠుడిని శాంతింప జేశాడు గనుక పరాశరుడనే పేరొచ్చింది.
ఇతడు భీష్ముడు అంపశయ్యపై నుండగా దర్శించిన మునుల్లో ఒకడు. ఇతడు జనకుడ్ని కలిసి ఆధ్యాత్మిక విషయాలను గురించి చర్చించాడు.
చూ॥ సత్యవతి – మహాభారతం

**పరాశరుడు 2 :** ధృతరాష్ట్రుని వంశంలో జన్మించిన సర్పం. జనమేజయుని సర్పయాగంలో బూడిదయ్యింది.
– మహాభారతం

**పరాంతం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాస యోగ్య ప్రాంతం.

**పరిఘుడు 1 :** అంశుడనే దేవతా పురుషుడు. సుబ్రహ్మణ్య స్వామికిచ్చిన పారషదసుల్లో ఒకడు. ఇతర నల్గురు వత, భీమ, దహతి మరియు ధహనుడు.
– మహాభారతం

**పరిఘుడు 2 :** ఓ అటవికుడు.
– చూ॥ బిధాలోపాఖ్యానం.

**పరిబర్హుడు :** గరుడుని సంతతిలో ఒకడు.
– మహాభారతం

**పరివాహం :** చూ॥ పరీవహం.

**పరివ్యాధుడు :** పశ్చిమ భారతదేశ ప్రాంతంలో నివసించిన తొమ్మిదిమంది మహర్షుల్లో ఒకడు. ఇతరులు ఉషంగుడు, కురుషుడు, ధౌమ్యుడు, సువీర్యవాణుడు, ఏకతుడు, ద్వితుడు, త్రితుడు, సారస్వతుడు.
– మహాభారతం

**పరిశ్రుతుడు :** సుబ్రహ్మణ్యస్వామి అనుచర వీరుడు.
– మహాభారతం

**పరిహరుదు :** చిత్రకూటం దగ్గరలోని కాలంజర దేశపు రాజు. ఇతడు అధర్వణ వేద పారాయణుడు. బౌద్ధమత వ్యాప్తిని ఆపిన రాజుల్లో ఒకడు. – మహాభారతం

**పరిహ్వాంగుడు :** మరీచి రుషికి ఊర్ణవల్ల జన్మించిన ఆర్గురు పుత్రుల్లో ఒకడైన మహర్షి. తక్కిన ఐదుగురు స్మర, ఉద్గీత, క్షుధ, భృత, అగ్నిష్వాత్త, ఘృణిలు. ఇతడు తర్వాతి జన్మలో శ్రీ కృష్ణుని బంధువుగా జన్మించి కంసుని చేతిలో మరణించాడు. – భాగవతం

**పరీక్షిత్తు 1 :** అర్జునుని మనుమడు. అభిమన్యుని కుమారుడు. జనమేజయుని తండ్రి. కురుక్షేత్ర యుద్ధానంతరం పాండవులకు మిగిలిన ఏకైక వారసుడు. కురుపాండవ యుద్ధం నాటికి అభిమన్యుని భార్య ఉత్తర గర్భవతి. యుద్ధం ముగిసే సమయంలో అశ్వత్థామ రాత్రి సమయంలో పాండవుల గుడారాలలోకి వెళ్లి చీకట్లో పాండవ సంతానాన్ని మొత్తం సంహరించాడు. భీమార్జునులు అతని వెంటపడగా అశ్వత్థామ బ్రహ్మ శిరోమణి అస్త్రాన్ని వీరిపైకి వదలగా అర్జునుడు కూడా అదే అస్త్రాన్ని సంధించాడు. ప్రళయమై ఆ శక్తులు ప్రపంచాన్ని నాశనం చేస్తుంటే దేవతలు, మహర్షులు వచ్చి అస్త్రాలను ఉపసంహరిం చుకోమని కోరగా అది ఉపసంహరించు కోవడం తెలియని అశ్వత్థామ వల్ల ఆ శక్తి ఉత్తరగర్భాన్ని తాకింది. పాండవులు ఉపప్లావ్యంలో వుండగా ఓ బ్రాహ్మణుడు పాండవుల చివరి రోజుల్లో నీవు గర్భం దాల్చగలవని ఆ శిశువు గర్భంలో వుండగానే పరీక్షకు గురౌతాడని భవిష్యత్తు చెప్తాడు.

అశ్వత్థామ శక్తి వల్ల ఉత్తర గర్భంలోని శిశువు మరణించగా శ్రీకృష్ణుడు అశ్వత్థామ చేసిన పాపానికి ఒంటరిగా చిరకాలం పాపాలు ఆవరించిన దేహంతో జీవిస్తావని శపిస్తాడు. యుద్ధానంతరం అశ్వమేధ యాగం పూర్తవుతుండగా ఉత్తర అకాల ప్రసవం జరిగిందని ఆరు నెలలకే ఓ ప్రాణంలేని జీవిని ప్రసవించిందని విని అక్కడ వున్న ప్రముఖులందరూ చేరారు. ఉత్తర రోదనతో శ్రీకృష్ణుణ్ణి తన శిశువును బ్రతికించమని కోరగా ఆ శిశువుకు శ్రీకృష్ణుడు ప్రాణంపోశాడు. బ్రాహ్మణుని ఉవాచప్రకారం అతడికి శ్రీకృష్ణుడు పరీక్షిత్తుగా నామకరణం చేశాడు.

– మహాభారతం

పరీక్షిత్తు మాద్రావతిని వివాహమాడగా అతనికి నల్గురు పుత్రులు జన్మించారు. వారు జనమేజయుడు, ఉగ్రసేనుడు, శృతసేనుడు, భీమసేనుడు.

*మునిశాపం :* పరీక్షిత్తుకు వేట అంటే ఆసక్తి. ఓ రోజు అడవికి వెళ్లి వేట అనంతరం దాహార్తి అయ్యి ఓ ముని ఆశ్రమంలోకి వెళ్లి నీరడగగా అతడు నిశ్చల తపస్సులో వుండి మాట్లాడలేదు. పరీక్షిత్తు అతడిని అహంకారిగా భావించి ఓ చనిపోయిన పామును అతని మెడలో వేసి ఇంటికి తిరిగి వచ్చాడు. ఆ మహర్షి కుమారుడు వచ్చి తన తండ్రికి జరిగిన అవమానానికి ఉగ్రుడై ఇతడెవరైనా కానివ్వు వారం రోజుల్లో తక్షకుని కాటుకు మరణిస్తాడని శపించి తర్వాత మహారాజైన పరీక్షిత్తు అని తెలిసి తన శాపం గురించి గౌరముఖుడను బ్రాహ్మణునితో రాజుకు విషయం తెలియజేస్తాడు.

*తక్షకుని కాటు – పరీక్షిత్తు మరణం :* పరీక్షిత్తు ఇది తెలిసి ఓ గొప్ప స్తంభాన్ని నిర్మించి దానిపై భవనం నిర్మించి తక్షకుని నుండి తప్పించు కోవడానికి సకల రక్షణ చర్యలు తీసుకుని ఆ భవనంలో ఉంటాడు. ఆరు రోజులు గడచినాయి. ఏడవరోజు తక్షకుడు కాటు వెయ్యడానికి బయలుదేరాడు. అదే రోజు విషం నుండి రక్షించగల వైద్యుడైన కశ్యపుడు కూడా రాజు వద్దకు బయలుదేరాడు. మార్గమధ్యంలో వారిద్దరూ తారసపడి తక్షకుని కాటు ప్రభావం, కశ్యపుని వైద్య ప్రభావం పరీక్షించుకొంటారు. తక్షకుడు అతని శక్తిని గ్రహించి తాను రాజిచ్చే పారితోషికం కంటే ఎక్కువ ఇస్తానని అతణ్ణి పంపించివేస్తాడు. ఆ తర్వాత తన సహసర్పాలను బ్రాహ్మణ వేషంలో పంపి పరీక్షిత్తు దర్శనం కోరగా రక్షకులు సాధ్యపడదని చెప్తారు. వారు తెచ్చిన ఫలాలను రాజుకి పంపుతారు. పరీక్షిత్తు ఓ ఫలాన్ని తినదలచి ముక్కలు చేయగా పురుగుగా వున్న తక్షకుడు నిజరూపియై పరీక్షిత్తును కాటువేసి అదృశ్యుడౌతాడు పరీక్షిత్తు మరణిస్తాడు.

*పరీక్షిత్తు పాలన :* చాలమంది చరిత్రకారులు పరీక్షిత్తు పాలనాకాలం గురించి ఈ విధంగా తెలియజేస్తున్నారు. క్రీ.పూ. 3138లో కురుక్షేత్ర యుద్ధం జరిగింది. ధర్మరాజు 36 ఏళ్లు పాలించాడని అంటే పరీక్షిత్తు పాలన క్రీ.పూ. 3102లో మొదలయ్యిందని అతడు 60 ఏళ్లు రాజ్యమేలాడని అంటే క్రీ.పూ. 3042 వరకు పాలించాడని నిర్ధారిస్తున్నారు. – మత్స్య, విష్ణుపురాణాలు.

పరీక్షిత్తు మరణించగానే స్వర్గం చేరలేదు. అతడు స్వర్గం చేరడం కొరకు నారదుని సలహాపై జనమే జయుడు అంబాయాగం చేశాడు. అప్పుడు శ్రేష్ఠులైన బ్రాహ్మణులతో దేవీభాగవతం చదివించగా పరీక్షిత్తు ఆత్మ స్వర్గం చేరింది. – దేవీ భాగవతం

**పరీక్షిత్తు 2 :** కురువంశంలోని రాజుల పరంపరలో ఒకడు. అవిక్షిత్తు కుమారుడు. ఇతనికి ఆరుగురు పుత్రులు. వారు కాక్షసేనుడు, ఉగ్రసేనుడు, చిత్ర సేనుడు, ఇంద్రసేనుడు, భీమసేనుడు. వారందరూ పండితులు, జ్ఞానులు. – మహాభారతం

**పరీక్షిత్తు 3 :** కురు వంశంలోని అవశ్యుడను రాజు కుమారుడు. ఇతని తల్లి పేరు అమృత. ఇతనికి సుయ శవల్ల భీమసేనుడను పుత్రుడు జన్మించాడు.
– మహాభారతం

**పరీక్షిత్తు 4 :** ఇతడు కురు వంశంలోని ఒక రాజు.
– మహాభారతం

**పరీక్షిత్తు 5 :** ఇక్ష్వాకు వంశంలో జన్మించిన ఒక రాజు. ఇతడొక రోజు అడవిలో వేటాడుతూ ఓ జింక వెంట పడి అలసి దప్పిక కాగా ఓ చక్కని పచ్చిక పైరు దాని ప్రక్క ఓ నది కన్పించాయి. తన గుర్రానికి నీరు త్రాగించి తను త్రాగి ఆ పచ్చికలో విశ్రమి స్తుండగా ఓ అందాల స్త్రీ కన్పించగా ఆమెతో మాట్లాడి తనకు భార్యగా వుండమని కోరాడు. ఆమె తనకు నీరు తగలకుండా చేసేటట్లయితే తనకు అంగీకార మేననే షరతుని విధించింది. రాజు ఆమెకోసం ఓ భవంతి చుట్టూ ఉద్యానవనం మధ్యలో ఓ కొలను నిర్మించాడు. ఆ కొలనులో నీరువున్నా లేనట్లే కన్పి స్తుంది. ఆ తర్వాత రాజు ఆ స్త్రీ ఆ భవంతిలోను తోటలోను విహరించి ఆ కొలనులో నీరు వున్నట్లు కన్పించక అందులో దిగారు. వెంటనే రాణి నీటిలో మాయమయ్యింది. రాజు కొలనులో నీరు మొత్తం తోడించగా అడుగున ఓ కప్ప మాత్రమే వుంది. రాజు ఆమె అదృశ్యం కావడానికి కప్పలే కారణమని భావించి కప్పలన్నింటిని చంపడం మొదలు పెట్టాడు. కప్పలు భయాందోళనతో కప్పలరాజైన ఆయుష్షు వద్దకు వెళ్ళగా అతడు ఓ ముని రూపంలో రాజు వద్దకు వెళ్ళికప్పలను చంపవద్దని మనవి చేయగా అందుకు అతడు అంగీకరించక కప్ప తన భార్యను చంపిందని చెప్పాడు. అప్పుడు ఆ బ్రాహ్మణుడు నేను కప్పల రాజునని తన కూతురైన శుశోభనయే రాజు భార్య అని, ఆమె ఇలా ఎందరో రాజుల్ని మోసం చేస్తోందని చెప్పాడు.

రాజు శుశోభను తిరిగి ఇవ్వమనగా ఆయుష్షు తిరిగి ఆమెను రాజుకు అప్పగించి కూతుర్ని చాలామంది రాజుల్ని మోసం చేస్తున్నావు గనుక చెడ్డదారిన నడిచే సంతానం కల్గుతుందని శపిస్తాడు. ఆమెకు ముగ్గురు కుమారులు శల, బల, దల జన్మించగా రాజు శలను రాజుని చేసి అడవికివెళ్లి తపస్సు చేసుకుంటాడు.
– మహాభారతం

**పరోక్షుడు :** చంద్ర వంశంలోని ఓ రాజు. – భాగవతం

**పరోపకారి :** చూ॥ కనకరేఖ.

**పర్జన్యుడు :** ఓ దేవుడు. చూ॥ దేవవతి 3.

**పర్ణయుడు :** ఋగ్వేద కాలంనాటి ఓ రాక్షసుడు. కరం జయ వణగృధులు ఇతని స్నేహితులు. ఆర్య సంతతికి చెందిన అతిథిశ్వ, ఋజిశ్వులపై బడగా ఇంద్రుని సహా యంతో ఈ రాక్షసుల్ని ఓడించారు. – ఋగ్వేదం

**పర్ణశాల :** యమునా పర్వత సానువుల్లో గంగా యము నల మధ్యనున్న ఓ గ్రామం. ఇచ్చట అగస్త్య గోత్రుడైన శర్మి అనే బ్రాహ్మణ పండితుడుండేవాడు. కాలుని ఆజ్ఞపై యమభటులు పొరపాటున ఇతడ్ని యమ లోకం తీసుకువెళ్లగా కాలుడు పొరపాటు తెలుసుకొని వెనక్కి పంపబోగా శర్మి శేషజీవితాన్ని ఇక్కడే గడుపుతా నంటాడు. కాలుడు తిలవస్త్రదా నాలిచ్చి ఇతడ్ని తిరిగి పర్ణశాలకు పంపుతాడు. – మహాభారతం

**పర్గాదుడు 1 :** ప్రాచీన భారత దేశంలో ఓ ముని. ఇతడు ధర్మజుని కొలువులో వుండేవాడు.
– మహాభారతం

**పర్గాదుడు 2 :** విదర్భ రాజ్యంలో ఓ బ్రాహ్మణుడు. ఇతడ్ని రాజు నలుడు వున్నాడో మరణించాడో విచా రించమని పంపగా బాహుకుడిగా జీవిస్తూ నలుడు బ్రతికేవున్నాడని కనుగొని రాజుకి తెలియజేశాడు.
– చూ॥ దమయంతి

**పర్ణాశం :** పశ్చిమ భారతదేశంలోని ఓ నది. ఇది వరు ణుని కొలువులో అప్సరస రూపంలో వుంటుంది.

కురుక్షేత్రంలో ఈమె కుమారుడైన శృతాయుధుడు కౌరవుల పక్షాన అర్జునుడితో పోరాడాడు. ఇతడు జన్మించినపుడు ఈమె వరుణుడిని ఎవరివల్ల మరణం లేనట్లు వరం కోరగా వరుణుడు ఇతనికి ఓ ఆయుధం బహుమతిగా ఇచ్చాడు. దీని ప్రత్యేకత ఏమనగా యుద్ధం చేయని వారిపై ప్రయోగించరాదు. శృతా యుధుడు యుద్ధ సమయంలో ఇది మరచి యుద్ధం చేయని శ్రీకృష్ణుని పై ప్రయోగించగా అది వెనుదిరిగి ఇతణ్ణే సంహరించింది. - మహాభారతం

**పర్యంత భూములు :** ఆర్యావర్తానికి వెలుపలవున్న మ్లేచ్ఛ దేశాలు.

**పర్వతాలు :** కృతయుగంలో పర్వతాలకు రెక్కలు వుండేవని అవి వాటి ఇష్టం వచ్చిన చోట దిగేవని ఒకోసారి మునులు నివసించే ప్రాంతంలో కూడా దిగిపోయేవని చెప్తారు. మునులు ఇంద్రునికి మొర పెట్టుకోగా అవి తిరస్కరించడంతో ఇంద్రుడు తన వజ్రాయుధంతో వాటి రెక్కలు తెగగొట్టడం వల్ల ఒకేచోట వుండిపోయాయి. వాయుదేవుని చిన్ననాటి స్నేహితుడైన మైనాక పర్వతం మాత్రం తప్పించు కుంది. వాయుదేవుడు ఈ పర్వతాన్ని సముద్రంలో దాచాడు. దానికి కృతజ్ఞతగా వాయుపుత్రుడైన హను మంతుడు లంకను చేరడానికి సముద్రందాటే సమయంలో ఈ పర్వతం అతనికి విశ్రాంతి ప్రాంతంగా సముద్రమధ్యంలో నిలిచింది. - రామాయణం

**పర్వతుడు :** ఇతడో మహర్షి. నారదుని సోదరి కుమారుడు. నారదునికి అత్యంత స్నేహితుడు.

*నారద, పర్వత శాప ప్రతిశాపాలు : - చూ॥ నారదుడు*

ఇతడు జనమేజయుని సర్పయాగంలో పాల్గొన్న ఓ మహర్షి. ఇతడు, నారదుడు ద్రౌపది స్వయంవరాన్ని వీక్షించడానికి వచ్చారు. యుధిష్ఠరుని కొలువులో పర్వతుడు, నారదుడు సభ్యులు. వీరిద్దరూ ఇంద్ర సభలో కూడా సభ్యులే. అంతేకాదు కుబేరుని సభలో కూడా సభ్యులే. కామ్యాకవనంలో పాండవులున్న ప్పుడు పర్వతుడు విహారయాత్రలు జరపమని సలహా ఇచ్చాడు. కురుక్షేత్ర సమయంలో ఓ రోజు రాత్రి కూడా యుద్ధం కొనసాగుతుండగా పగటికాంతిని పాండవులకు చూపాడు. - మహాభారతం

**పల :** ప్రాచీన కాలంలో ఓ కొలమానం.
- *చూ॥ త్రిసరేణు*

**పలాల :** సుబ్రహ్మణ్యస్వామి ఏడుగురు తల్లులలో ఒకరు. తక్కినవారు కాకి, హలిమ, బ్రహ్మిక, మాలిని, ఆణ్య, మిత్ర. - మహాభారతం

**పలాశవనం :** ఓ పుణ్యారణ్యం. జమదగ్ని ఒకసారిక్కడ యాగం చేశాడు. అన్ని లోకాలలోని నదులు వాటి నీటిని తీసుకువచ్చాయి. జమదగ్ని ఇక్కడ యాగం చేస్తున్నప్పుడు అందరికి మద్యం ఇచ్చాడు.
- మహాభారతం

**పలాశిని :** ఓ నది. శుక్తిమంతంలో జన్మించి మహా నదిలో కలుస్తుంది.

**పల్లాంతు :** విష్ణు చిత్తరుడు. అధ్యాత్మికుడు. అతడు పాడే ఆధ్మాత్మిక గీతాల్ని పల్లాంతులంటారు.

**పలిత :** ఓ ఎలుక. బిడాలోపాఖ్యానంలోని పాత్ర. లోమశ అనే పిల్లితో ఇది సంవాదం చేస్తుంది.
- *చూ॥ బిడాలోపాఖ్యానం*

**పల్లవుడు :** జహ్నుడి మనుమడు. అజహ్నుడి కొడుకు. ఇతడి కొడుకు కుశికుడు. - మహాభారతం

**పల్వలుడు :** రాక్షసుడు. ఇల్వలుడి కుమారుడు. ఇతడు కూడా యజ్ఞాలు పాడుచేస్తుండేవాడు. మునులు వీణ్ణి చంపమని నైమిశారణ్యానికి వచ్చిన బలరాముణ్ణి ప్రార్థిస్తారు. బలరాముడితణ్ణి సంహరిస్తాడు.
- *భాగవతం*

**పవనహ్రదం :** కురుక్షేత్ర తీరాన వున్న ఓ పవిత్ర కొలను. దీనిలో స్నానం చేస్తే వైకుంఠ ప్రాప్తి లభిస్తుంది.
- మహాభారతం

**పవమానం 1 :** బ్రహ్మ పెద్ద కుమారుడైన అగ్నికి జన్మిం చిన ఓ పుత్రుడు. స్వాహాదేవివల్ల ఇతనికి ముగ్గురు పుత్రులు. వీరు పవమాన, పావక, శుచి. ఈ ముగ్గురికి 45 మంది పుత్రులు. మొత్తం ఈ సంతతిని 49 మంది అగ్నులంటారు. - విష్ణుపురాణం

**పవమానం 2 :** ఇదో పర్వతం. మహామేరువుకు దగ్గర్లో వుంది. - దేవీభాగవతం

**పవమానుడు :** విజితాశ్వుని ముగ్గురు కుమారుల్లో ఒకడు. ఇతడి పూర్వజన్మలో అగ్ని, వశిష్ఠుని శాపం వల్ల మాన వునిగా జన్మించాడు. - *భాగవతం*

**పవిత్రవాణి :** ఇంద్ర, ధర్మజుని కొలువులో దర్శనమిచ్చే మహర్షి. – మహాభారతం

**పవిత్రారోపణం :** ఒక పూజావిధానం. ఈ పూజచేస్తే ఓ సంవత్సరకాలం విష్ణువును పూజించినట్లే. ఈ పూజను ఆషాడ శ్రావణ, ప్రొష్ఠపది, అశ్వ, కార్తీక మాసాలలో నిర్వహించాలి. శుద్ధి చేసిన నూలు త్రాడును తయారు చేసుకొని గాయత్రీమంత్రాన్ని పఠించాలి. 108 సార్లు గాయత్రీ మంత్రాన్ని పఠించి ఈ తాడును శుద్ధి చేసి "ఓం నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీంబి తన్నో విష్ణూ ప్రచోదయాత్" అని పూజించాలి. – అగ్నిపురాణం

**పశుపతి :** దక్షయజ్ఞానికి దేవతలు వెళ్ళగా ఆ యజ్ఞ ధ్వంసంలో భాగంగా శివుడు దేవతల్ని కూడా శిక్షిస్తాడు. అప్పుడు దేవతలు దక్షయజ్ఞానికి వచ్చి మేము కూడా పశువులమయ్యాము. మమ్ము క్షమించమంటారు. అందుకని శివుణ్ణి పశుపతి అంటారు.

**పశుపతి 2 :** చూ॥ శివుడు.

**పశుసఖుడు :** సప్తర్షుల సేవిక అయిన గండ యొక్క భర్త. – చూ॥ సప్తర్షులు

**పహ్లవం :** పశ్చిమ భారత ప్రాంతంలో ప్రాచీన కాలంలో గల నివాసయోగ్యస్థలం. – మహాభారతం

**పాక :** కుబేరుడు విశ్రవసుకు పంపిన ముగ్గురు రాక్షస స్త్రీలలో ఒకతె. ఈమెకు విశ్రవసుడివల్ల ఖరుడు, శూర్పణక జన్మించారు. – మహాభారతం

**పాకుడు :** ఓ బలవంతుడైన రాక్షసుడు. పెద్ద సైన్యాన్ని పెంపొందించుకొని ఇంద్రుని పైకి యుద్ధానికి వెళ్లగా ఇంద్రుడు ఇతని సైన్యాన్ని, ఇతణ్ణి నాశనం చేశాడు. అందువల్ల ఇంద్రుడికి పాకశాసనుడని పేరు వచ్చింది. – వాయుపురాణం

**పాకయజ్ఞం :** చూ॥ యజ్ఞాలు.

**పాకశాసనుడు :** ఇంద్రుడు. చూ॥ పాకుడు.

**పాఖండం :** దక్షిణ భారతదేశంలోని ఓ నివాసయోగ్య ప్రాంతం. సహదేవుడు తన దూతల ద్వారా దీన్ని జయించాడు. – మహాభారతం

**పాటల :** ఓ వానరం. ఇది శ్రీరాముడు విభీషణుణ్ణి కలుసుకోవడానికి లంకకు వెళ్తున్నప్పుడు శ్రీరాముణ్ణి కలిసింది. – రామాయణం

**పాటలావతి :** ఉత్తర భారత దేశంలోని ఓ పవిత్ర నది. – మహాభారతం

**పాటలి :** ఒక రాజకుమారి. – చూ॥ పాటలీపుత్రం

**పాటలీపుత్రం :** భోజుడి మనుమడు పుత్రకుడు. ఇతడు యజ్ఞదత్తుడి ఇంట్లో జన్మిస్తాడు. పాటలి పూర్వజన్మలో మహేంద్రుడి కుమార్తె. పుత్రకుడికి శివానుగ్రహం వుంది. ఇతడు మయుడి కొడుకుల్ని మోసగించి మహిమాన్వితమైన కర్ర, కుండ, చెప్పులు తీసుకొని వచ్చి వాటి సహాయంతోనే రాజు కూతురు పాటలిని వివాహమాడి ఈ నగరాన్ని నిర్మిస్తాడు. అందువల్ల ఈ నగరానికి పాటలీపుత్రమనే పేరు వచ్చింది. ఇది గంగానదీ తీరానగల నగరం. – కథాసరిత్సాగరం

**పాణికూర్చుడు :** సుబ్రహ్మణ్యస్వామి సైనికుల్లో ఒకడు. – మహాభారతం

**పాణిఖాతం :** కురుక్షేత్ర పరిసరంలో గల ఓ పుణ్యతీర్థం. ఇక్కడ స్నానంచేసి పితృగణాలను పూజిస్తే అగ్నిస్తోమ, అతిరాత్ర, రాజసూయయాగాలు చేసిన ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**పాణిని :** ఇతడు 'పాణినీయము' అను సంస్కృత వ్యాకరణ కర్త. పాణినీయమంతటి శాస్త్రీయ గ్రంథం ప్రపంచంలో లేదని, ఇందులో నాల్గువేల సూత్రాలున్నాయని, ఇతడు శివుని ప్రేరణ గల రుషి అని చెప్తారు. పతంజలి ఇతణ్ణి ఆచార్యుడని, భగవానుడని, మహర్షి అని సంబోధించగా చైనా యాత్రికుడు హ్యూన్‌సాంగ్ ప్రపంచంలోని అన్ని భాషలకు పాణిని వ్యాకరణమే మూలమన్నాడు. రామభద్ర దీక్షితుడు పాణిని పాణి అనే మహర్షి కుమారుడని పేర్కొన్నాడు. పండితుల వివిధ అభిప్రాయాలననుసరించి ఇతడు బుద్ధునికంటే ముందువాడని, క్రీ.పూ. 7 లేక 6వ శతాబ్దివాడు అని చెప్పవచ్చు.

పుట్టుక–విద్యాభ్యాసం *:* గాంధార రాజ్యంలో జన్మించాడని చెప్తారుగాని సరైన ఆధారాలు లేవు. విద్యాభ్యాసం మాత్రం పాటలీపుత్రంలో జరిగినట్లు చెప్ప బడింది. ఇతని గురువుకి ఇతని అభ్యాసంపై నమ్మకం లేదుగాని గురువు భార్య శివుని గూర్చి తపస్సుచేసి విద్యావంతుడివి కమ్మని చెప్పగా అతడట్లే చేసి తన తరంలోని ఇతర పండితుల్ని పాండిత్య ప్రదర్శనంలో ఓడించాడు.

*'పాణినీయం' గ్రంధావిష్కరణ :* పాణిని శివునిగూర్చి తపస్సు చేస్తుండగా శివుడు ప్రత్యక్షమై తన సంగీత పరికరమైన 'ధక్క'తో 14 సార్లు మ్రోగించగా 14 రకాల శబ్దాలు విన్పించాయి. పాణిని ఈ శబ్దాలను 14 సూత్రాలుగా మలచాడు. వాటిని మహేశ్వర సూత్రాలంటారు. ఇతని గ్రంథంలో శబ్దాలపుట్టుక, రెండు పదాలకుండే సంబంధంలాంటి భాషాపరమైన విషయాలను చర్చించాడు. ఇది వ్యాకరణమనడం కంటే భాషాశాస్త్రమని చెప్పవచ్చు.

**పాణిమానం :** ఇదో సర్పం. వరుణుడి సభలో వుంటుంది. – *మహాభారతం*

**పాణీతకుడు :** పూషుడను దేవతాపురుషుడు సుబ్రహ్మణ్య స్వామికిచ్చిన ఇద్దరు పార్షదస్సుల్లో ఒకడు. రెండో వాడు కాళికుడు. – *మహాభారతం*

**పాణులు :** రుగ్వేదకాలంలో ఆర్యులను ఎదిరించిన ఓ తెగ ప్రజలు. యాగ్కనిరుక్తం వీరి ప్రధాన వృత్తి వ్యాపారమని చెప్తోంది. – *రుగ్వేదం*

**పాతాళకేతుడు :** ఇతడో రాక్షసుడు. విశ్వావసు కుమార్తె మదాలసను పాతాళానికి ఎత్తుకుపోగా రుతధ్వజ రాజు పాతాళానికి వెళ్లి ఇతడ్ని ఓడించి మదాలసను రక్షించాడు. – *చూ॥ రుతధ్వజుడు.*

**పాతాళం :** భూమి అడుగున ఆరు భాగాలున్నాయని అవి అతల, వితల, శుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళాలని అంటే ఇది భూమి అడుగున చివరి లోకమని చెప్తారు. పాతాళం నాగుల లోకమని చెప్పబడింది. – *దేవీభాగవతం*

**పాతాళ రావణుడు :** రాక్షసుల్లో ఒకరాజు. రావణుడు, పాతాళ రావణుడు ఒకరు కాదు. ఇతడు మలయ వాణుని సోదరి కుమారుడు. ఓ తెగ రాక్షసులు మహా విష్ణువుకి భయపడి పాతాళానికి వెళ్లి అక్కడే రాజ్యం నిర్మించుకున్నారు. అలా వెళ్లినవారి నాయకుడే పాతాళ రావణుడు. ఇతని సోదరుడు కుంభోదరుడు. పాతాళ రావణుడు, లంకారావణులు స్నేహితులు. రావణుడు ఓటమి అంచులలో వుండగా ఇతనితో సంప్రదింపులు జరిపి రాముణ్ణి ఓడించడానికి ప్రయత్నించారు. బ్రహ్మ నుండి పొందిన వరముల వల్ల ఇతడు వాహనం లేకుండానే ఏ ప్రాంతానికైనా వెళ్లగలడు. ఇతడికి బ్రహ్మ ఇచ్చిన వజ్రం వల్ల ఆ వజ్రం పగలనంతవరకు అతడు మరణించడు. ఈ శక్తితో అతడు వానర సైన్యాన్ని ఆకాశ మార్గాన వీక్షించి యుద్ధం చేసి గెలవడం సాధ్యం కాదని రాముడ్ని తన మంత్రశక్తితో పాతాళానికి తీసుకుపోవాలని నిర్ణయించి హనుమంతుని రక్షణలోవున్న రాముడ్ని ఎత్తుకెళ్ళడం అసాధ్యమని భావించి రాముడు నిద్రించే ప్రాంతంలో భూమి అడుగు నుండి ఓ రంధ్రం తవ్వి రాముడ్ని మూర్ఛకు గురిచేసి పాతాళానికి తీసుకువెళ్లాడు. అతడిని బలియివ్వాలని తలచాడు. హనుమంతుడు రామలక్ష్మణులు అదృశ్యం కావడం గమనించి విభీషణుడు జరిగింది చెప్పగా శ్రీరాముని సైన్యంతో ఇతని పై యుద్ధానికి వెళ్లాడు. బ్రహ్మ నుండి పొందిన వజ్రాన్ని హనుమంతుడు దొంగిలించి తన పుక్కిట వుంచుకొని ఇతనితో యుద్ధం చేశాడు. హనుమంతుడు కోపంతో పళ్లు పట పట లాడించగా ఆ వజ్రం ముక్కలై ఇతడు మరణించాడు. – *కంభరామాయణం*

**పాద్మకల్పం :** చతుర్ముఖబ్రహ్మ ఆయుః పరిమాణంలో పూర్వార్థం. – *చూ॥ వరాహకల్పం*

**పాద్మం :** ఇదో పురాణం. పద్మగర్భప్రోక్తమైన పాద్మకల్ప వివరణలున్నాయి.

**పాపప్రణాశనం :** ఇదో తీర్థము. ధ్రుతవతుడను బ్రాహ్మణునకు మహియను భార్య కలదు. వీరికి సనజాతుడను కుమారుడు జన్మించెను. ధ్రువవ్రతుడు చనిపోగా మహికుమారుని గాలవుని ఆశ్రమమున చిన్న వయసులోనే వదిలి స్వైరిణిగా తిరిగెను. కుమారుడు కూడా చెడు మార్గము పట్టి దేశదేశాలు తిరిగి కొంత కాలమునకు ఇద్దరు ఒకే నగరమునకు చేరి ఒకరి కొకరు తెలియక కామక్రీడ సల్పిరి. తర్వాత తల్లి కుమారులుగా తెలుసుకొని బాధపడి గాలవుని వద్దకు వచ్చి పాపపరిహారము కోరగా గౌతమిలో స్నానము చేసిరండని చెప్పెను. వీరు స్నానము చేసి ముక్తిపొందిన ప్రదేశమే పాపప్రణాశనం. దీనికి గాలవమని, ధౌత పాపమని పేర్లుకలవు. – *బ్రహ్మపురాణం*

**పాపభయుడు :** గాంధారీ ధృతరాష్ట్రుల 100 మంది పుత్రుల్లో ఒకడు. – *మహాభారతం*

**పాపశోధనం :** భారతదేశంలోని ఓ పుణ్యస్థలం. చేది రాజైన ఇంద్రదత్తుడు ఇక్కడొక దేవాలయం నిర్మించాడు. – *కథాసరిత్సాగరం*

**పార :** కౌశిక నదికి మరోపేరు. – *మహాభారతం*

**పారదం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం. ఇక్కడ నివసించేవారిని పారదులు అంటారు. వీరి సంతతి వారు ఉత్తర బెలూచిస్థాన్‌లో వున్నారు. పారదులు ధర్మజునికి ఎన్నో కానుకలిచ్చారు. వీరు భీష్ముడి అనుచరులు. – *మహాభారతం*

**పారశవుడు :** శూద్రవనిత వల్ల బ్రాహ్మణునికి జన్మించిన పుత్రుడు. విదురుడు అలా జన్మించాడు కనుక అతణ్ణి పారశవుడని అంటారు. – *మహాభారతం*

**పారశరం :** ఒక ఉపపురాణం.

**పారసీకం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాసయోగ్య ప్రాంతం. – *మహాభారతం*

**పార్వతి :** శివుని భార్య.

ఉమ, కాత్యాయని, గౌరి, కాళి, హైమవతి, ఈశ్వరి, శివా, భవాని, రుద్రాణి, శర్వాణి, సర్వమంగళ, అసర్గ, దుర్గ, మృదాని, చండిక, అంబిక, ఆర్య, దాక్షాయాని, గిరిజ, మేనకాత్మజ, చాముండి, భైరవి అనునవి పార్వతికున్న వివిధ జన్మలలో గల పేర్లు. – *అమరకోశం.*

*సతి జన్మవృత్తాంతం :* బ్రహ్మ దైత్యుల సృష్టిగావించగా వారు బ్రహ్మనుండి వరములు పొంది ముల్లోకాలను బాధించగా శివుడు, విష్ణువుకూడా వారితో యుద్ధం చేసి అలసిపోగా బ్రహ్మ పుత్రులైన దక్షుడు ఇతరులు బ్రహ్మను వేడుకోగా నేను శివుడు విష్ణువు చేసే కార్యక్రమాన్ని కొనసాగిస్తాను. మీరు మహామాయను గూర్చి తపస్సుచేస్తే ఆమె అంశవల్ల భూమిపై సుఖశాంతులు కల్గుతాయని చెప్పగా ప్రజాపతులు మహామాయను గూర్చి 10వేల ఏళ్లు తపస్సు చేయగా 3 కన్నులు 4 చేతులతో దేవత ప్రత్యక్షమై దక్షుని కుమార్తెగా జన్మిస్తానని వరమిచ్చింది. ఆమె దక్షుని కుమార్తె సతిగా జన్మించింది. ప్రజాపతులందరూ కూడి శివుని వద్దకు వెళ్లి సతిని వివాహమాడమని కోరగా అతడు వివాహమాడాడు. జగదాంబిక వల్ల పొందిన దైవహారాన్ని దుర్వాసుడు దక్షునికి బహుమతిగా ఇవ్వగా దాన్ని దుర్వినియోగం చేయడంవల్ల స్వచ్ఛత కోల్పోయి ఆ సువాసనలకు దక్షునికి సతిని ద్వేషించేట్లు చేసింది. అందువల్ల కుమార్తెను అల్లుడిని తూలనాడి అతడు చేయు యజ్ఞానికి శివుని గాని, తన కుమార్తె సతిని గాని ఆహ్వానించ లేదు. పిలవని యజ్ఞానికి వెళ్లి దక్షుడు అపహాస్యం చేయగా సతి ఆ యజ్ఞగుండంలో దూకి మరణించగా శివుడు ఆగ్రహోదగ్రుడై దక్షుని యజ్ఞాన్ని భగ్నం చేయడమేగాక సతీ .... సతీ .... సతీ అని దుఃఖంతో లోకమంతా తిరిగాడు.

*సతి/పార్వతి/కాళి :* ఇదే సమయంలో కశ్యపునికి దితి వల్ల వజ్రాంగుడు జన్మించాడు. ఈ రాక్షసుడు 1000 సంవత్సరాలు తపస్సుచేసి తర్వాత తన భార్యకు ఇంద్రుని వల్ల జరిగిన అవమానం విని కోపంతో ఇంద్రుడ్ని జయించడానికి మరల తపస్సు చేయబోగా బ్రహ్మ ప్రత్యక్షమై వరం కోరుకొమ్మనగా దేవతలను ఇంద్రుడిని చంపగల పుత్రుడిని ప్రసాదించమనగా వారికి తారకాసురుడు జన్మించెను. తారకాసురుడు పంచాగ్నుల మధ్య కూర్చొని బ్రహ్మను గూర్చి తపస్సు చేసి మరణం లేనట్లు ఒకవేళ మరణమే సంభవిస్తే ఏడు రోజుల వయసుగల పాపవల్ల మాత్రమే మరణం కల్గునట్లు వరం కోరుకున్నాడు. ఈ వరాలతో ఇతర అసురులతో కలసి ముల్లోకాలను బాధించాడు. ఈ సమయంలోనే శివుడు తన భార్య సతికోసం విలపిస్తూ తిరుగుతున్నాడు.

ఇంద్రుని నాయకత్వంలో తారకాసురుడి బాధను విముక్తం చేయమని బ్రహ్మను కోరగా శివుని వీర్యం వల్ల జన్మించిన వాడు మాత్రమే ఇతణ్ణి చంపగలడు. కనుక శివుడ్ని వివాహం చేసుకొనే ప్రయత్నం చేయమని సలహా ఇచ్చాడు. ఆ సమయంలో శివుడు సతినే తలస్తూ ఒకసారి కాళింది నదిలో స్నానం చేయగా ఆ నది నీరంతా నల్లబడి పోయింది. ఇంద్రుడు ఇతర దేవతలు బృహస్పతి సలహా కోరగా హిమవంతుడు సంతానం కొరకు ప్రార్థిస్తున్నాడు. అప్పుడే అతడు శివుని వరంవల్ల సతి హిమవంతుని కుమార్తెగా జన్మించిందని చెప్తాడు. హిమమంతుడు మేనలకు ముగ్గురు కుమార్తెలు, ఒక కుమారుడు జన్మించారు. కుమార్తెలు రాగిణి, కుటిల, కాళి. వీరి ముగ్గురిని ఇంద్రుడు బ్రహ్మవద్దకు తీసుకువెళ్లగా రాగిణి, కుటిల శివుని

శక్తిని భరించ లేరనగా వారు బ్రహ్మను దూషించగా బ్రహ్మ వారిని శపించాడు. హిమవంతుని భార్య భయంతో కాళిని ఉమను తపస్సుమాని వెళ్లిపొమ్మని (ఉమ అనగా విడిచో అని అర్థం) అని కేకవేసింది. అందుకని ఆమెకు ఉమ అనేపేరు. పర్వతుని (హిమ వంతుడు) కుమార్తె కనుక పార్వతి అనేపేరు వచ్చాయి. శివుడు సతిని వెతుకుతూ ఒకరోజు హిమవంతుని నివాసమునకు వెళ్లగా అతని కుమార్తె కాళి శివుని గూర్చి తపమాచరించుచున్నదని తెలిసి ఆమె వద్దకు వెళ్లగా ఆమె నేత్రములు తెరచి చూడగనే అతడదృ శ్యుడయ్యెను. ఆమె నిరాశతో తిరిగి తపము కొనసా గించగా వటుని రూపమున శివుడు ప్రత్యక్షమై కారణ మడిగెను. శివుని వివాహమాడనెంచితినని చెప్పగా ఎద్దు వాహనముపై తిరుగు ఆ ముదుసలి నీకేలయనగా కాళి ఉగ్రరూపము దాల్చగా నిజరూపుడై కాళి (ఉమ)ని వివాహమాడెను.

వివాహానంతరము వారు విహారయాత్రలతో క్రీడిం చుచు ఒకసారి కాళి కనపడక కాళి, కాళి, కాళి అని పిలువగా తన నలుపు రంగు వల్ల శివుడు ఎగతాళి చేయుచున్నాడని తలచి అదృశ్యురాలై ఓ అరణ్యమున తపస్సుచేసి ఆ శక్తితో నల్గురు పరిచారికలను సృష్టించి బ్రహ్మకడకుపోయి తన బాధను వివరించగా బ్రహ్మ తన నల్లని శరీరము ఊడి ధవళకాంత వర్ణమగు శరీరము కల్గునని వరమిచ్చెను. ఆమెయే గౌరి. అదే సమయంలో రంభ, కరంబులను రాక్షసులు పుత్రా ర్థులై ఘోర తపస్సు చేయుచుండగా ఇంద్రుడు మొసలి రూపములో కరంబుని మింగివేయగా రంభుడు అగ్నిదేవుని వరమువల్ల ఘోర రాక్షసుడైన మహి షాసురునికి జన్మనిచ్చెను. ఇతని ఘోరకృత్యాలకు దేవతలు బెదరిపోయారు. శివుడు, విష్ణువు బ్రహ్మ ఒకరితో నొకరు సంభాషించుకొని వారి శక్తి రూప మున కాత్యాయన మహర్షి ఆశ్రమమునకు వెళ్లి అతని శక్తితోనూ కలసి కాళి వదలిన చర్మములో ప్రవేశించగా ఆ చర్మము కాత్యాయని రూపముదాల్చెను. ఆమెకు శివుడు, విష్ణువు ఇతర దేవగణం ఆయుధాలు సమ కూర్చగా ఆమె రాక్షసులను దునుమాడెను. చివరకు మహిషాసురునితో పోరాడెను. ఆమె ఉగ్రిణియై తన జడను నేలకు విసరికొట్టగా సప్త మాతృలు జన్మిం చారు. వారు చాముండి, బ్రహ్మణి, మహేశ్వరి, వైష్ణవి, వారాహి, నారసింహి. వీరంతా కాత్యాయని వివిధ రూపాలు. సప్త మాతృలు ఘర్జిస్తూ అసురులను చివరకు మహిషాసురుడిని వధించారు.

*సుబ్రహ్మణ్యస్వామి జననం : – చూ॥ సుబ్రహ్మణ్య స్వామి* శివుని వీర్యం నుండి ఉద్భవించిన సుబ్రహ్మణ్యస్వామి దేవగణాలకు అధిపతియై తారకాసురుని వధించెను.

**పార్వతీయుడు :** మహాభారత కాలంలో ఒక రాజు. కుక్షి అను దానవుని జాతిలో జన్మించినవాడు.
– *మహాభారతం*

**పార్వతీయులు :** పార్వతీయమనే ప్రాచీన భారత దేశంలోని ఓ దేశ ప్రజలు. రాజసూయంలో ధర్మజు నికి కానుకలిచ్చారు. అర్జునుడు వనవాస సమయంలో జయద్రధునితో యుద్ధం చేసినపుడు వారు జయద్ర ధునితో వున్నారు. కురుక్షేత్రంలో కూడా దుర్యోధనుని పక్షాన పోరాడారు. శ్రీకృష్ణుడొకసారి వీరిని ఓడించాడు.
– *మహాభారతం*

**పార్వతేయుడు :** ఓ రాజర్షి. కపఠ అనే రాక్షసి సంతతిలో జన్మించాడు. – *మహాభారతం*

**పార్శ్వమౌళి :** మణిచరుడను రాక్షసుడి మరో పేరు.
– *చూ॥ మణిచరుడు*

**పార్శ్వరోమం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాస యోగ్య ప్రాంతం. – *మహాభారతం*

**పారావతం :** ఐరావత కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో బూడిదయ్యింది.
– *మహాభారతం*

**పారాశర్యుడు 1 :** పరాశరుని కుమారుడైన వ్యాసుడు.
– *చూ॥ వ్యాసుడు*

**పారాశర్యుడు 2 :** ఇతడు పరాశరుని కుమారుడైన వ్యాసుడు కాదు. ఇతడు ధర్మజుని కొలువులో ఒక సభ్యుడు. ఇంద్రుని కొలువులో కూడా సభ్యుడు. ద్వారక నుండి హస్తినకు వెళ్తూ శ్రీకృష్ణుడితణ్ణి ఒకసారి కలిశాడు.
– *మహాభారతం*

**పారిజాతకుడు :** ధర్మరాజుని కొలువులోని ఓ ప్రఖ్యాత ముని. – *మహాభారతం*

**పారిజాతం 1 :** చూ॥ కల్పవృక్షం.

**పారిజాతం 2 :** ఐరావత కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో బూడి దయ్యింది.
– *మహాభారతం*

**పారిజాతుడు :** నారదునితోపాటు మయసభకు విచ్చేసిన ఓ మహర్షి. – మహాభారతం

**పారిపత్రం :** వింధ్యపర్వతానికి ఉత్తరానవున్న పట్టణం. కురూశదేశాలకు ముఖ్యపట్టణం.

**పారిప్లవం :** కురుక్షేత్ర సమీపంలో గల ఓ పుణ్యస్థలం. ఎవరైనా ఈ పుణ్యస్థలాన్ని దర్శిస్తే అగ్నిస్థోమ యజ్ఞం, అతిరాత్ర యజ్ఞం చేసిన ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**పారిప్లవుడు :** భరత వంశంలోని ఓ రాజు. నలుని మనుమడు, నృచక్షసు కుమారుడు. ఇతని కుమారుడి పేరు మేధావి. – భాగవతం

**పారిభద్రికులు :** పారిభద్ర ప్రాంతంలో నివసించే ప్రజలు. ఈ ప్రాంతసైనికులు దుర్యోధనుని పక్షాన యుద్ధం చేశారు. – మహాభారతం

**పారియాత్రం :** పురాణ ప్రసిద్ధి చెందిన ఓ పర్వతం. ఈ పర్వత గణాధిపతి కుబేరుని కొలువులో ఓ సభ్యుడు. గౌతమమహర్షి ఈ పర్వతంపై గల ఆశ్రమంలో నివసించాడు. ఇది మహామేరువుకు పశ్చిమాన వుంది. బాలముకుందిని గర్భంలో మార్కండేయుడీ పర్వతాన్ని చూశాడు. – మహాభారతం

**పార్మి ్నక్షేముడు :** ఓ విశ్వదేవుడు. వీరు పదిమంది. విశ్వుని కుమారులు. – బ్రహ్మపురాణం

**పారుడు 1 :** బృహదిషుడి వంశంవాడు. పృథుసేనుడి కొడుకు. ఇతని కొడుకు నీపుడు.

**పారుడు 2 :** బృహదిషుడి వంశంవాడు. సమరుడి కొడుకు.

**పారుడు 3 :** ఇతడొక రుషి. తన కూతురు కళావతిని గంధర్వునికిచ్చి వివాహంచేయ నిరాకరించి అతని చేతిలో మరణిస్తాడు.

**పార్థుడు :** పృథయొక్క కుమారుడు. కుంతి అసలు పేరు పృథ. అర్జునుడి మరోపేరు. – చూ॥ అర్జునుడు

**పాల :** వాసుకి వంశంలో జన్మించిన ఓ సర్పం. ఇది జనమేజయుని సర్పయాగ సమయంలో ఆత్మహత్య చేసుకుంది. – మహాభారతం

**పాలకావ్యుడు :** "హస్తాయుర్వేద సంహిత" గ్రంథకర్త. ఈ గ్రంథం 160 అధ్యాయాలతో పెద్ద వ్యాధులు, చిన్న వ్యాధులు, శల్యస్థానం, ఉత్తర స్థానం వ్యాధుల గురించి వివరించబడింది. దీనిని ఇతడు అంగదేశాధీశుడైన రామపాదుడికి నేర్పాడు. – అగ్నిపురాణం

**పాలకుడు :** అంగారవతికి, చంద్రసేన మహారాజుకి జన్మించిన ఇద్దరు కుమారుల్లో ఒకడు. రెండోవాడు గోపాలకుడు. – కథాసరిత్సాగరం

**పాలిత :** స్కందదేవుని స్త్రీ సేవిక. – మహాభారతం

**పాలీ :** వ్యావహారిక సంస్కృత భాషను పాలీ భాష అని పిలుస్తారు.

**పావకుడు :** అగ్నిదేవునికి స్వాహాదేవి వల్ల కల్గిన ముగ్గురు కుమారుల్లో ఒకడు. తక్కిన ఇద్దరూ పవమానుడు, శుచి. ఈ ముగ్గురికి 45 మంది పుత్రులు. మొత్తం ఈ 49 మందిని అగ్నులంటారు. పావకుడు మరో పేరు మహానుడు. – మహాభారతం

**పావనం :** కురుక్షేత్ర పొలిమేర్లలో గల ఓ పుణ్యస్థలం. ఇక్కడ దేవతల్ని, పితరుల్ని పూజిస్తే అశ్వమేధయాగం చేసిన ప్రతిఫలం లభిస్తుంది. – మహాభారతం

**పావనుడు 1 :** ఓ విశ్వదేవుడు. విశ్వుని పదిమంది కుమారుల్లో ఒకడు. – మహాభారతం

**పావనుడు 2 :** మిత్ర విందకు శ్రీకృష్ణుని వల్ల జన్మించిన పుత్రుడు. – భాగవతం

**పాశాశివి :** ప్రాచీన భారతదేశంలోని ఓ నది. – మహాభారతం

**పాశి :** ధ్రుతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. కురుక్షేత్ర యుద్ధంలో భీముడితణ్ణి సంహరించాడు. – మహాభారతం

**పాశివాత :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాసయోగ్య ప్రాంతం. – మహాభారతం

**పాశుపతశులు :** శివుని భూతగణాలను పాశుపతశులు అని పిలుస్తారు.

**పాశుపతుడు :** ఓ ముసలి బ్రాహ్మణుడు. – చూ॥ విరూపాక్షుడు

**పాశుపతం :** శివుని అస్త్రం పేరు.

శివుని విల్లు పేరు పినాకం. అదో సర్పం. ఇంద్ర ధనస్సు రంగుల్లో వుంటుంది. పాశుపతం అనేది ఈ విల్లుకి ఎక్కుపెట్టబడి ఏడుతలలతో ఎల్లప్పుడు విషం చిమ్ముతుంది. ఇది సూర్యుడంత ప్రకాశవంతంగా వుండి దేన్ని అంటుకున్నా భస్మీపటలం చేయగలదు. నారాయణ, బ్రహ్మ, ఆగ్నేయ, వరుణాస్త్రాలు కూడా దీని ముందు నిలబడవు. దీనితోనే శివుడు త్రిపురాసురుల్ని వధించాడు. అర్జునుడు శివుడి నుండి ఈ అస్త్రమును తపస్సు చేసి పొందాడు. – మహాభారతం

**పాశం :** వరుణిని ఆయుధం. ఈ ఆయుధమంత వేగంగా పయనించే ఆయుధం మరొకటి లేదు.
– మహాభారతం

**పాషాణతీర్థం :** జమదగ్ని వేదిలో గల శూర్పారక దేవాలయంలో వున్న ప్రాంతం. ఇదో పుణ్యస్థలం.
– మహాభారతం

**పిచ్ఛలం :** వాసుకి కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో బూడిదై మరణించింది.
– మహాభారతం

**పిచ్ఛిలం :** పురాణాలలో ప్రసిద్ధి చెందిన భారతదేశంలోని ఒక నది. – మహాభారతం

**పితరకుడు :** కశ్యపుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో బూడిదై మరణించింది. – మహాభారతం

**పితరుడు :** ఓ గణాధిపతి. ఇతడు వరుణిని కొలువులో వుంటాడు.

**పితరులు :** ఉపదేవతాగణం. వీరిని సప్త రుషులు సృష్టించారు అగ్నిష్వాత్తులు, బరిషదులు, సోమవులు, యమ, అనల, సోమ, ఆర్యములు మొదలైన వారు పితరులు. పితృదేవతలు వసు, రుద్ర, ఆదిత్యరూపులై చంద్రలోకంలో వుంటారు. వీళ్లు అగ్నిష్వాత్తులు, బార్హిదలు అని రెండు రకాలు. బార్హిదులు యజ్ఞం చేస్తారు. అగ్నిష్వాత్తులు యజ్ఞం చెయ్యరు.
– చూ॥ అగ్నిష్వాత్తులు

ఈ రెండు రకాలుగానే కాకుండా ఈ క్రింది వర్గాలుగా విభజించబడినారు.

*సోమసదస్యులు :* విరాట్ పురుషుడు వీరిని సృష్టించాడు. సాధ్యదేవసులకు వీరు ఆరాధ్య దైవాలు.

*అగ్నిస్వత్తులు :* దేవతలకు ఆరాధ్యదైవాలు.

*బర్హిషదసులు :* అత్రి మహర్షి సృష్టించినవారు. వీరు దైత, దానవ, యక్ష, గంధర్వ, నాగ, రాక్షసులకు ఆరాధ్య దైవాలు.

*సోమపులు :* భృగువుకు జన్మించిన దేవగణం. వీరు బ్రాహ్మణులకు ఆరాధ్య దైవాలు.

*హవిర్భుకులు :* వీరికి అంగిరసుడు తండ్రి. వీరు వైశ్యులకు ఆరాధ్య దైవాలు.

*ఆజ్యపులు :* పులస్త్యుని పుత్రులు. శూద్రులకు ఆరాధ్యదైవాలు.

పితృగణాలను మరీచి మొదలగు సప్తర్షులు సృష్టించగా వీరికి దేవాసురులు అంతేకాక సకల జీవులకు సృష్టి కర్తలయ్యారు. –మనుస్మృతి

**పితామహసరస్సు :** హిమాలయాల దిగువన వున్న ఓ పుణ్య స్థలం. ఇక్కడున్న కొలనులో స్నానం చేస్తే అగ్నిష్టోమ యజ్ఞం చేసిన ప్రతిఫలం లభిస్తుంది.
– మహాభారతం

**పితృతీర్థం :** నరకాల్లో ఒకటైన కుంభీపాక నరకాన్ని ఈ పేరున పిలుస్తారు. – దేవీభాగవతం

**పినాకం :** శివుని ధనస్సు. శివుని ఆయుధమైన త్రిశూలం ఒకసారి చేతినుండి జారిపడి ధనస్సు రూపం పొందింది. – చూ॥ పాశుపతం

**పినాకి 1 :** పినాకమనే ధనస్సు ధరించడంవల్ల శివునికా నామం వచ్చింది.

**పినాకి 2 :** 11 మంది రుద్రుల్లో ఒకడు. ఇతడు స్థానువు కుమారుడు. బ్రహ్మ మనుమడు. ఇతడు అర్జునుని జన్మదినోత్సవ వేడుకల్లో పాల్గొన్నాడు.
– మహాభారతం

**పిప్పలస్థానం :** జంబూద్వీపంలోని ఓ భాగం.
– మహాభారతం

**పిప్పలాదుడు 1 :** ఒక రుషి. బ్రహ్మ జ్ఞానమునెరుగదలచి భరద్వాజ గోత్రుడైన సుకాశుడు, శిభి కుమారుడైన సత్యకాముడు, సౌర్యుని కుమారుడైన గార్గ్యుడు, అశ్వలుని పుత్రుడైన కౌశల్యుడు, భృగుపుత్రుడైన వైదర్భి, కత్యుని కుమారుడు కబంధియు శిష్యులై సమిధలతో వెళ్లగా వారు వచ్చిన కార్యము తెలుసుకొని వీరినొక సంవత్సరము పుణ్యవ్రతములు చేయుచు తన ఆశ్రమమునందు వుండి బ్రహ్మచర్యమాచరించిన వారడిగిన ప్రశ్నలకు తనకు తెలిసిన సమాధానములు చెప్పెదననగా వారట్లాచరించి అతనిని ప్రశ్నించి తెలిసికొనిరి. – ప్రశ్నోపనిషత్తు

*పిప్పలాదుని జ్ఞానోదయం :* కొండలుడను బ్రాహ్మణునికి సుకర్మ అను పుత్రుడు కలదు. సుకర్మ తల్లిదండ్రులు ముసలి వారగుట వలన సుకర్మ వారికి పరిచర్యలు చేస్తూ వేద వేదాంగాలను చిన్ననాడే తండ్రి వద్ద నేర్చుకున్నాడు. అదే సమయంలో కశ్యపుని గోత్రంలో పుట్టిన పిప్పలాదుడు వేల సంవత్సరాలు

తపస్సు చేయగా బ్రహ్మ ప్రత్యక్షమై సర్వకామ్య సిద్ధి రస్తు అని వరమిచ్చాడు. బ్రహ్మ అనుగ్రహం వల్ల ఇతడు పండితుడయ్యాడు.

బ్రహ్మ అనుగ్రహంతో పండితుడనను గర్వంతో వుండే వాడు. ఒకరోజు కొలనుగట్టున వుండగా ఓ హంస కన్పించి పిప్పలాదా ! నీవు గర్విష్టివి. నీ కంటే సుకర్ముడు జ్ఞానవంతుడు. అతడి ముందు నువ్వెంత? అంతకంటే మహాజ్ఞాని లేడు. అతడు నీలాగా వేల యేళ్లు తపస్సు చెయ్యలేదు. అతడు యజ్ఞయాగాదులు చెయ్యలేదు. అతడు బాలుడైనా అతనికున్న జ్ఞానం నీకు లేదు, ఎందువలననగా అతడు తన తల్లిదండ్రుల బాగోగులు చూశాడు, నీవు అదేమీ లేకుండా నువ్వు సాధించిన వాటిని చూసి గర్వపడుతున్నావనగా పిప్ప లాదుడు సుకర్మను కలసి తనతో మాట్లాడిన హంస బ్రహ్మ అనిగ్రహించి సుకర్మ తనకంటే జ్ఞానవంతుడని అంగీకరించాడు.

– పద్మపురాణం

**పిప్పలాదుడు 2 :** రుషభదేవునికి జయంతి వల్ల జన్మిం చిన 9 మంది కుమారుల్లో ఒకడు. ఇతడు ఒక రాజు.
– *దేవీ భాగవతం*

**పిప్పలుడు 1 :** మిత్ర గణాధిపతికి రేవతివల్ల జన్మించిన ముగ్గురు కుమారుల్లో చిన్నవాడు. – భవిష్యపురాణం

**పిప్పలుడు 2 :** కశ్యపుని వంశంలో జన్మించిన బ్రాహ్మ ణుడు. ఇతడు ఘోరతపస్సు చేసి గర్వంతో వుండే వాడు. సుకర్మ మహర్షి అతని తల్లిదండ్రులను సేవించడం చూసి తన గర్వాన్ని కొంత తగ్గించు కున్నాడు.
చూ॥ పిప్పలాదుడు – పద్మపురాణం

**పిశంగం :** ధృతరాష్ట్రుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో బూడిదై మరణించింది. – *మహాభారతం*

**పిశాచిక :** రుక్ష పర్వతం మీద పుట్టిన నది.

**పిశాచ దేశాలు :** పాండ్య, కేకయ, నేపాళ, బాహ్లిక, కుంతల, చోళ మొదలగు దేశాలను పిశాచ దేశాలని పిలుస్తారు.

**పిశాచం 1 :** క్రూరమైన ఓ ప్రాణి. బ్రహ్మ సృష్టించాడు. కుబేరుడి ఆస్థానంలో వుండి అతణ్ణి పూజిస్తుంది. రక్త మాంసాలు దీని ఆహారం. దేవతలకు మానవు లకు కూడా ఇది శత్రువు. – *మహాభారతం*

**పిశాచం 2 :** పిశాచ దేశాల నివాసులు. కురుక్షేత్ర యుద్ధంలో పాండవుల పక్షాన పోరాడుతారు. శ్రీకృష్ణుడి శాపానికి గురవుతారు. – *మహాభారతం*

**పిశాచం 3 :** ఓ యక్షుడు. – *మహాభారతం*

**పిష్టాదనవమి :** చూ॥ నవరాత్రులు.

**పీఢుడు :** ఇదో రాక్షసి. శ్రీకృష్ణుడు దీన్ని సంహరించాడు.
– *మహాభారతం*

**పీవరి :** వ్యాసుని కుమారుడైన శుకమహర్షి భార్య. ఈమెకు నల్గురు కుమారులు. కృష్ణ, గౌరప్రభ, భూరి, దేవశ్రుతులు. – *చూ॥ శుకుడు*

**పుచ్ఛాండకం :** తక్షకుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో బూడిదై మరణించింది. – *మహాభారతం*

**పుణ్యకృత్తు :** ఓ విశ్వదేవుడు. – *మహాభారతం*

**పుణ్యజని :** శివ పార్శదసుల్లో ఒకడైన మణిభద్రుని భార్య. ఈమెతండ్రి క్రతుస్థ. పుణ్యజనికి మణిభద్రుని వల్ల పదముగ్గురు కుమారులు. – బ్రహ్మాండపురాణం

**పుణ్యజనుడు :** ఇతడొక రాక్షసుడు. శర్యాతి వంశం వాడైన కుశస్థలిరాజు రైవతుడు బ్రహ్మదర్శ నార్థం వెళ్లగా పుణ్యజనుడు రాజభవనాన్ని ఆక్రమించగా రాజు సోదరులు పారిపోయారు. ఆ తర్వాత కొంత కాలానికి ఈ రాజ్యం హేహయ రాజ్యంలో మిళితమ య్యింది. – విష్ణుపురాణం

**పుణ్యతోయ :** బాల ముకుందుని గర్భంలోకి మార్కండే యుడు వెళ్లినపుడు చూసిన ఓ నది.
– *చూ॥ మార్కండేయుడు*

**పుణ్యనాముడు :** సుబ్రహ్మణ్యస్వామి అనుచర వీరుడు.
– *మహాభారతం*

**పుణ్యనిధి :** చంద్ర వంశపురాజు. విష్ణుభక్తుడు. విష్ణువును పూజించడానికి వెళ్లగా అతని నిశ్చలభక్తికి మెచ్చి శ్రీ మహావిష్ణువు సేతు మాధవుడను పేరుతో రామేశ్వరం లోనే జీవించాడు. – *స్కందపురాణం*

**పుణ్యం :** విభాండకుడను ముని ఆశ్రమంపేరు.
– *మహాభారతం*

**పుణ్యశీలుడు :** గోదావరి నదీతీరంలో నివసించిన ఓ బ్రాహ్మణుడు. ఇతడొకసారి శ్రాద్ధకర్మలు నిర్వహించ

డానికి ఓ వితంతువును నియోగించాడు. ఈ పాపం వల్ల ఇతని ముఖం గాడిద ముఖంగా మారింది. పాప విముక్తికొరకు వెంకటాచలం వద్ద గల స్వామి తీర్థం, ఆకాశగంగా తీర్థంలో స్నానమాచరించగా పాపం నశించి నిజస్వరూపుడయ్యాడు. – స్కందపురాణం

**పుణ్యశ్రవసుడు :** ఇతడో మహర్షి. మహావిష్ణువు శ్రీకృష్ణుడిగా అవతరించినపుడు నందగోపాలుడు శ్రీకృష్ణుడ్ని పెంచాడు. పుణ్యశ్రవసుడు నందగోపుడి సోదరుడికి లవంగ అనే కుమార్తెగా జన్మించాడు. – పద్మపురాణం

**పుణ్యుడు :** దీర్ఘతమసుడను ముని కుమారుడు. జ్ఞాన వాసిష్టలో ఇతణ్ణి గురించి వివరించబడింది. జంబూ ద్వీపంలో మహేంద్ర పర్వతం అనే పర్వతం కలదు. దీర్ఘతమసుడు ఇక్కడ తపస్సు చేస్తూ ఇద్దరు కుమారులకు జన్మనిచ్చాడు. ఒకడు పుణ్యుడు రెండోవాడు పావనుడు. పుణ్యుడు అదృష్టవంతుడు సంయమనం కలవాడిగా పెరిగాడు. దీర్ఘతమసుడు మరణించగా పుణ్యుడు శ్రాద్ధకర్మలు నిర్వహించగా పావనుడు దుఃఖంతో ఎటో వెళ్లి అరణ్యాలలో తిరుగుతూ గడిపాడు. కొన్నాళ్ల తర్వాత పుణ్యుడు సోదరుడ్ని వెతుకుతూ వెళ్లి అతనికి నీతివాక్యాలు చెప్పి కొన్నాళ్లు ఇద్దరూ కలసి అడవిలోనే జీవించి పరమపదించారు.

**పుత్తు :** ఒక నరకము. ఈ నరకము నందు పడనీయక తండ్రిని కాపాడువాడు గనుక సుతునకు పుత్రుడను పేరు కలిగెను. పుత్రులు 12 రకాలు. 1. రస, 2. క్షేత్రం, 3. దత్త, 4. కృత్రిమ, 5. గూడోత్పన్న, 6. అపవిద్ధ, 7. కానీన, 8. సహొడ, 9. క్రీతక, 10. పౌనర్భవ, 11. స్వయందత్త, 12. శౌద్ర (పారశక)

**పుత్రకుడు :** ఒక రాజు. – చూ॥ *పాటలీపుత్రం*

**పుత్రికాపుత్రుడు :** వేశ్యకుగాని, సోదరులు లేని స్త్రీకిగాని పుట్టిన బిడ్డను పుత్రికా పుత్రుడంటారు.

– మనుస్మృతి.

**పునర్జన్మ :** మనిషి మరణించినా అతని ఆత్మ మరల మరో జన్మకు ఆస్కారం కల్గిస్తుందనేదే పునర్జన్మ సిద్ధాంతం. మరణమంటే ఆత్మ. దాని ఉపాధులతోపాటు శరీరాన్ని వీడటం. ఆత్మ దాని ఉపాధులు శరీరంలో వున్నపుడు శరీరం వేడిగా వుంటుంది. అవి శరీరాన్ని వదలినపుడు చల్లబడుతుంది. అదే మరణానంతరం ఆత్మ తన సహచరాలతో దేహాన్ని విడచి తిరిగి క్రియాశీలకంగా మారుతుంది. క్రియాశీలంగా మారిన తర్వాత దాని చర్యలు అది పూర్వజన్మలో చేసిన ఆధ్యాత్మిక పర్యవసానాలను బట్టి ప్రవర్తిస్తుంది. ఆ చర్యలు మూడు రకాలు. ఒకటి అపరబ్రహ్మోపాసన. 2. అపర విద్యోపాసన, 3. పాపపాశన.

మొదటి చర్యలో పునర్జన్మ కల్గుతుంది గాని ఆత్మ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులుగా వారు చేసిన సద్గుణాల క్రమాన్ని బట్టి పునర్జన్మనిస్తుంది. రెండవ చర్య అయిన అపర విద్యోపాసనలో ఆత్మకు ముక్తి లభించి పునర్జన్మ లేకుండుటగాని, కొన్ని పునర్జన్మల తర్వాత ముక్తి లభించడంగాని జరుగుతుంది. మూడవదైన పాపపాశనలో ముక్తి లభించక తృతీయ మార్గమైన పురుగులు కీటకాలుగా పునర్జన్మ కల్గుతుంది.

– *చాందోగ్యోపనిషత్, గీత, భాగవతం.*

**పునార్వసువు :** ప్రాచీన ఆయుర్వేద వైద్యకారుడు. అగ్నివేశతంత్రాన్ని వ్రాసిన అగ్నిదేవుని గురువు. బ్రహ్మ మానసపుత్రుడైన అత్రి కుమారుడు. అత్రికూడా ఆయుర్వేదంలో ప్రసిద్ధుడు. కాశ్యప సంహిత ప్రకారం ఇంద్రుడు ఆయుర్వేదాన్ని కశ్యప, వశిష్ఠ, అత్రి, భృగులకు బోధించగా అత్రి కొంత రచించిన "ఆయుర్వేద చికిత్సా తంత్ర" గ్రంథాన్ని పునార్వసువు పూర్తిచేశాడు. ఇతని తల్లిపేరు చంద్రభాగ. తన తండ్రి నుండి భృగు మహర్షి నుండి ఆయుర్వేదాన్ని అభ్యసించి 'ఆత్రేయ సంహిత' గ్రంథాన్ని రచించాడు.

**పునశ్చంద్ర :** ఓ పుణ్య స్థలం.

**పుర :** ఓ రాక్షసి.

**పురమాలిని :** పురాణ కాలం నాటి ప్రసిద్ధి చెందిననది.

– మహాభారతం

**పురయుడు :** వేదకాలం నాటి రాజు. ఋగ్వేదంలో ఇతడి ప్రశస్తి వివరించబడింది. – ఋగ్వేదం

**పురాణ ప్రవర్తకలు :** వ్యాసుని శిష్యపరంపరలోని వారు. వ్యాసుని శిష్యుడైన రోమహర్షుణి వల్ల పురాణములు నేర్చుకొని వానిని లోకమునకు చాటి పురాణ ప్రవర్తకులను పేరు పొందిరి. వారు త్రైయారుణి, కశ్యపుడు, సావర్ణి, అకృతవ్రణుడు, వైశంపాయనుడు, హరితకుడు.

**పురాణం :** సర్గశ్చప్రతిసర్గశ్చ, వంశోమన్వంతరాణిచ వంశానుచరితం కాపి పురాణం పంచలక్షణం.

– *అమరకోశం.*

పురాణమనగా సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశాను చరితల వివరణ. సర్గ ప్రతిసర్గలనగా ప్రకృతి సృష్టి, స్థితులు. వంశాలనగా మునులు భక్తుల చరిత్రలు. మన్వంతరమనగా మనువుల కాల పరిధులు. వంశాను చరితలనగా రాజుల పుట్టుక. ఇప్పుడు పురాణాలలో ఈ పై ఐదు విభాగాలలో కొన్ని కన్పించవు. బ్రాహ్మ ణాలలో కూడా పురాణాల చర్చ వుంది. అంటే చరిత్రకు ముందే వున్నట్లు తెలుస్తోంది. మహాభారతంలో పురా ణమనగా దేవతల సిద్ధుల చరిత్రలనే అర్థంలో వాడబడగా ఉపనిషత్తులు ఇతిహాసాలని, ఇవి పంచ మవేదాలని చెప్తున్నాయి. సంస్కృత పండితుడైన రంగాచార్య పురాణాలంటే పాతవే అయినా ఇప్పటికి నూతనత్వం కలవని అవి ఎప్పటికి నిలిచేవని చెప్పాడు. అన్ని పురాణాలు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను గూర్చి పొగడబడ్డాయి. మత్స్యపురాణం పురాణాలను మొదట వ్యాసుడు సంకలనం చేశాడని చెప్తోంది. పురాణాలు 18, ఉపపురాణాలు 18. పురాణాలు మూడు రకాలు.

*విష్ణు మూలం :* 1. విష్ణుపు రాణం, 2. భాగవత పురాణం, 3. నారదీయ పురాణం, 4. గురుడ పురా ణం, 5. పద్మపురాణం, 6. వరాహపురాణం.

*బ్రహ్మ మూలం :* 1. బ్రహ్మపురాణం, 2. బ్రహ్మాండ పురాణం, 3. బ్రహ్మవైవర్త పురాణం, 4. మార్కండేయ పురాణం, 5. భవిష్యపురాణం, 6. వామన పురాణం.

*శివమూలం :* 1. వాయుపురాణం, 2. లింగ పురాణం, 3. స్కాందపురాణం, 4. అగ్నిపురాణం, 5. మత్స్యపురాణం, 6. కూర్మపురాణం. **– H.S.L.**

**పురాణాలు :** చూ॥ అష్టాదశ పురాణాలు, అష్టాదశ ఉపపురాణాలు, పురాణం.

**పురావతి :** పురాణ ప్రసిద్ధి చెందిన ప్రాచీన భారతదేశం లోని ఓ నది. – *మహాభారతం*

**పురిక :** ప్రాచీన భారతదేశంలో ఓ నగరం. పౌరికుడను రాజు దీన్ని పాలించాడు. – *మహాభారతం*

**పురుకుత్సుడు :** ప్రసిద్ధ మహారాజైన మాంధాతకు బిందుమతి వల్ల జన్మించినవాడు. ఇతని సోదరుడు ముచుకుందుడు. త్రిశంకుడు ఈ వంశంలో జన్మించి నవాడే. ఇతనిని నాగులు తమ లోకమునకు తీసుకొని పోయి తమసోదరి నర్మదనిచ్చి వివాహము చేసిరి. అంగిరసులు నాగులను బాధపెట్టుచుండగా నర్మద వల్ల తెలుసుకొని అంగిరసులను నాగలోకము నుండి తరిమివేసెను. అనేక గంధర్వనాగులను వధించెను. తన నాగలోక సంచారమును తలచుకొను వారికి సర్పభయము లేనట్లు వరము పొందెను. పురుకు త్సునకు త్రసదస్యుడను కుమారుడు కలడు.

– *భాగవతం*

**పురుచ్ఛేపుడు :** దివోదాసుని కుమారుడు. ఋగ్వేదంలో కూడా ఇతడు ప్రశంసించబడ్డాడు. – *ఋగ్వేదం*

**పురుజిత్తు :** కుంతిభోజుని కుమారుడు. పాండవుల తల్లి అయిన కుంతి సోదరుడు. ఇతని సోదరుని పేరుకూడా కుంతి భోజుడే. ఇతడు కౌరవ సైన్యంలోని దుర్ముఖులతో పోరాడాడు. మరణానంతరం యమ లోకం వెళ్లాడు. – *మహాభారతం*

**పురుజుడు :** పూరుని వంశంలోని వాడు. సుశాంతి కుమారుడు.

**పురుడు :** ఒక రాక్షసుడు.

**పురునీథుడు :** ఋగ్వేదకాలం నాటి ఒక రాజు.

– *ఋగ్వేదం*

**పురుమీఢుడు :** పూరు వంశపు రాజు. ఇతడు బృహత్ పుత్రుని కుమారుడు. ఇతని సోదరులు అజమీఢుడు, ద్విమీఢుడు. అజమీఢుడు ఇతని రాజ్యాన్ని విశాల పరచి ప్రఖ్యాతుడయ్యాడు.

**పురుమిత్రుడు 1 :** ధృతరాష్ట్రుని పుత్రుల్లో 11 మంది గొప్ప వీరులు. వీరిలో ఇతడొకడు. కురుక్షేత్ర యుద్ధంలో అభిమన్యుడితణ్ణి గాయపరచాడు.

– *మహాభారతం*

**పురుమిత్రుడు 2 :** ఋగ్వేదంలో ఓ యువ రాజర్షి విమదుడు పురుమిత్రుడి కుమార్తెను వివాహమాడి నట్లు పేర్కొనబడింది. – *ఋగ్వేదం.*

**పురువు 1 :** ఒక రాజు. మనువు కుమారుడు. నడ్వల మనువులకు 11 మంది కుమారులు. వారిలో ఇతడొకడు.

**పురువు 2 :** ఒక పర్వతం. – *మహాభారతం*

**పురుయశసుడు :** ఓ పాంచాల రాజు. భూరియశసుని కుమారుడు. రాజ పురోహితులైన యాజ, ఉపయాజుల సలహామేరకు 'వైశాఖధర్మం' నిర్వర్తించి మరింత ప్రసిద్ధుడయ్యాడు. - స్కందపురాణం

**పురుషంతి :** రుగ్వేదంలో ప్రముఖంగా ప్రస్తావించబడిన మహర్షుల్లో ఒకడు. అశ్వనీదేవతలు ఇతడు ఇబ్బందుల్లో వున్నపుడు రక్షించారు. - రుగ్వేదం

**పురుషాదకం :** భారతదేశంలో ఓ ప్రాచీన ప్రాంతం. - మహాభారతం

**పురుషుడు :** చూ॥ ప్రకృతి

**పురుషోత్తముడు :** శ్రీకృష్ణుని మరోపేరు. ఇతడు పూరణ, సాధనలు చేయడం వల్ల ఈపేరొచ్చింది. - మహాభారతం

**పురుహోత్రుడు :** యదు వంశంలోనివాడు. అనువు కుమారుడు. - భాగవతం

**పురూధుడు :** యదు వంశంలోనివాడు. వసుదేవునికి సహదేవి వల్ల జన్మించినవాడు. - భాగవతం

**పురూరవసుడు 1 :** చంద్రవంశపు రాజు. షట్చక్రవర్తులలో ఒకడు.

*జన్మం :* బృహస్పతి భార్య అయిన తార చంద్రునితో కొంతకాలం కాపురం చేయగా బుధుడు జన్మించాడు. బుధునికి ఇలకు జన్మించినవాడు పురూరవసుడు. బుధుడు 100 అశ్వమేధయాగాలు చేసి ప్రపంచ ప్రసిద్ధుడై బ్రహ్మ వరం వల్ల గ్రహాలలో ఒకడయ్యారు. - పద్మపురాణం

*పురూరవునికి పరీక్ష మరియు శాపం :* పురూరవసుడు తన సామర్థ్యంతో 100 అశ్వమేధ యాగాలు చేసి హిమాద్రి శృంగంలో జీవించాడు. కేశివంటి రాక్షసులు ఇతనికి సేవకులయ్యారు. ఊర్వశి ఇతని అందానికి మోహించి వివాహమాడింది. ఒకసారి ధర్మ అర్థ కామాలు ఇతణ్ణి పరీక్షించనెంచి మారువేషంలో వెళ్లగా ఇతడు ధర్ముడికి ఎక్కువ గౌరవం ఇవ్వగా అర్థ కామాలు ఇతడు సంపదను పోగొట్టుకుంటాడని ఊర్వశి నుండి దూరమై బ్రతుకుతాడని శపించగా ధర్ముడు నీవు బహుకాలం గౌరవంగా జీవిస్తావని, ఊర్వశి నుండి ఓ 60 సంవత్సరాలు మాత్రమే దూరంగా వుంటావని అనుగ్రహిస్తాడు. అంతేకాక ఊర్వశి ఓ మన్వంతరకాలం నీతో కలిసి జీవిస్తుందని అనుగ్రహిస్తాడు. - పద్మపురాణం

పురూరవుడు ప్రతిరోజు ఇంద్రుడిని కలిసేవాడు. ఒక రోజు గాలిలో దనుర్బాణాలతో వెళ్తుండగా కేశి అనే రాక్షసుడు ఊర్వశి చిత్రలేఖలను అపహరించుకు పోతుండగా వారిని ఓడించి ఈ అప్సరస స్త్రీలను ఇంద్రునికి అప్పజెప్పగా ఇంద్రుడు ఇతని గౌరవార్థం ఇంద్రసభలో ఊర్వశీ మేనకలతో ఓ నాటకం ఆడిస్తాడు. పురూరవుణ్ణి చూసిన ఊర్వశికి అడుగులు తడబడగా నారదుడీమెను నీ విద్య మరచిపోతావని 60 సంవత్సరాలు లతగా మారతావని శపిస్తాడు. పద్మపురాణం ఈ శాపాన్ని భరతుడిచ్చినట్లు పేర్కొంది.

*పురూరవుని సంతతి :* ఊర్వశివల్ల పురూరవసువుకు ★8 మంది పుత్రులు వారు ఆయుసుడు, ధ్రుధాయుసుడు, వశ్యాయుసుడు, దనాయుసుడు, వృత్తిమానుడు, వసువు, దివిజాతుడు, సుబాహు. ఆయుసుడు ఈ వంశాన్ని వృద్ధిచేశాడు. ఇతనికి పుట్టిన వారిలో 5 గురు ప్రసిద్ధులు. అందులో ఒకడైన రాజేయసుడికి వందమంది పుత్రులు. వారిని రాజేయసులంటారు. - పద్మపురాణం

ఒకసారి ఇతడు బ్రాహ్మణుల సంపదను అపహరించగా వారు సంతకుమారుని నాయకత్వంలో పురూరవసుని కలసి వారి సంపద వారికిమ్మని కోరగా అతడు నిరాకరిస్తాడు. బ్రాహ్మణుల శాపానికి గురై సంపదను కోల్పోతాడు. తిరిగి స్వర్గం నుండి త్రేతాగ్నులను రావించి యాగం చేసి తిరిగి సంపన్నుడవుతాడు. - మహాభారతం

**పురూరవసుడు 2 :** దీప్తక వంశంలోని ఒక రాజు. - మహాభారతం

**పురోచనుడు :** దుర్యోధనుని మంత్రుల్లో ఒకడు. ఇతడి సలహాపై పాండవులను దహించడానికి లక్క ఇల్లు నిర్మించబడి చివరికి ఇతడు ఆ లక్క ఇంటిలోనే మరణిస్తాడు. - మహాభారతం

★ కొన్ని పురాణాలు 6 గురు, మరికొన్ని పురా ణాలు7గురు పుత్రులని చెప్తున్నాయి.

**పురోజవుడు :** వసువు చిన్న కుమారుడు. ఇతనికి ఇతని భార్య ఊర్జస్వతివల్ల ప్రాణుడు జన్మిస్తాడు.
– *భాగవతం*

**పురోవసుడు :** అంగ వంశపు రాజుల్లో ఒకడు. ఇతడు బభ్రుసేతు కుమారుడు. ఇతడు గాంధారదేశాన్ని పాలించాడు. – *అగ్నిపురాణం*

**పురంజనుడు :** విజ్ఞాతుడను వానికి మిత్రుడగు ఒక రాజు. అందమైన నగరమునకై వెదకి వెదకి చివరకు హిమసానువులలో గల గొప్ప భవనమును చూచి అందు ప్రవేశించి ఆ నగరమును పాలించు ప్రమదోత్త మను వివాహమాడి తన సర్వస్వము ఆమెయే అని భావించగా కాలపుత్రిక ఈ పురముపై దాడి చేసి ఇతనిని తరిమివేశెను. పురంజనుడు భార్యనే తలచు కొనుచు ప్రాణములు విడిచెను. ఇతడు నరకమున కేగగా ఇతనిచే హింసింపబడిన యజ్ఞపశువులు ఇత నిని గుఠారములచే నరకెను. అప్పుడును భార్యనే తలచుటచే తర్వాత జన్మమున విదర్భరాజు గృహ మున స్త్రీగా జన్మించి మలయకేతుని వివాహమాడెను.
– *భాగవతం*

**పురంజయుడు 1 :** ఓ అయోధ్యా నగర రాజు.
– చూ॥ కాకుత్షధ

**పురంజయుడు 2 :** ఒక రాజు. బృహద్రధుని కుమా రుడు. ఇతని మంత్రి శేనకుడు. శేనకుడు పురంజ యుని చంపి రాజయ్యెను. – *భాగవతం*

**పురంధరుడు 1 :** వైవస్వత మన్వంతరంలో ఇంద్రుని పేరు. – *మహాభారతం*

**పురంధరుడు 2 :** పాంచజన్యుడనే అగ్ని కొడుకు. ఇంద్రుడొకసారి పురంధరుడి కొడుకవుతాడు.
– *మహాభారతం*

**పురంధరుడు 3 :** శివుడు రాసిన 'వైశాలాక్ష' అనే గ్రంధాన్ని 5 వేల అధ్యాయాలకు కుదిస్తాడు. దీనిపేరు బాహుదంతకం. – *మహాభారతం*

**పులకుడు :** ఓ దైత్యుడు. ఇతడు తపస్సు చేసి శివుని వల్ల తన శరీరంలో సుగంధపు వాసనలు వుండేట్లు వరంకోరి అప్సరకన్యలను కూడా ఆ వాసనలతో మత్తె క్కించేవాడు. అలా అతడు ముల్లోకాలను బాధించగా దేవతలు శివుని వేడుకోగా శివుడితణ్ణి జంతువుగా మారమని శపిస్తాడు. జంతువుగా మారినా తన శరీరంలోని వాసనలు పోకుండా వరమడగగా శివుడు అనుగ్రహిస్తాడు – *స్కందపురాణం*

**పులస్త్యుడు :** ఇతడొక ప్రజాపతి.

*జననం :* పులస్త్యుడు బ్రహ్మ మానస పుత్రులలో ఒకడు. బ్రహ్మ చెవి నుండి జన్మించాడు.
– *మహాభారతం*

పులస్త్యునికి అతని భార్య ప్రీతివల్ల దత్తోలి అను ఓ కుమారుడు జన్మించాడు. అతడు అంతకు ముందు జన్మలో స్వాయంభవ మన్వంతరంలో అగస్త్యుడు.
– *విష్ణుపురాణం*

పులస్త్యునికి అతని భార్య హరిర్భు అనబడే మానిని వల్ల విశ్రవసుడు జన్మించాడు. ఈమె కాక పులస్త్యునికి సంధ్య, ప్రతీచి అను భార్యలు కలరు. అనగా పులస్త్యునికి నల్గురు భార్యలు.

*పులస్త్యుని వంశం :* పులస్త్యుని కుమారుడైన విశ్రవ సునికి ఇద్దరు భార్యలు ఒకరు కైకసి రెండోది ఇలబిల. కైకసికి ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె. వారు రావణ, కుంభకర్ణ, వీభీషణులు. కూతురు శూర్పణక. విశ్రవసు రెండో భార్య ఇలబిలకు వైశ్రావణుడు జన్మిం చాడు. అతడే కుబేరుడు.

ఒకసారి రావణుడిని కార్తవీర్యార్జునుడు బంధించగా పులస్త్యుడు అతనితో మాట్లాడి తన మనుమడైన రావణుడిని విడిపించారు. – *బ్రహ్మాండపురాణం*

*ఇతర విశేషాలు :*

1. పరాశరుడ్ని పురాణాలు రాసినందుకు అభినందించాడు.
2. రాక్షస, వానర, కిన్నెర, గంధర్వ, యక్షులకు జన్మనిచ్చాడు.
3. రాక్షస సంహారానికి యాగం చేసిన పరాశరుడ్ని యాగాన్ని విరమింప జేశాడు.
4. భీష్ముడికి భారతదేశంలోని పుణ్యతీర్థాలను వివరించాడు.
5. 21 ప్రజాపతుల్లో ఇతడొకడు.
6. అష్ట ప్రకృతుల్లో ఇతడొకడు.
7. బ్రహ్మర్షి, విప్రయోగిగా వర్ణించబడ్డాడు.

**పులహుడు :** ప్రజాపతుల్లో ఒకడు. బ్రహ్మమానస పుత్రుడు. ఇతనికి క్షమ అనే భార్యవల్ల కర్దమ, ఉర్వరి వాణ, సహిష్ణులు జన్మించారు. – *విష్ణుపురాణం*
ఇతనికి క్షమవల్ల మరో కుమారుడు కర్మశ్రేష్ఠుడు జన్మించాడు. – *అగ్నిపురాణం*

ఇతడు మహాశక్తివంతులైన 6 గురు మునుల్లో ఒకడు. ఇతడు సీతాకోక చిలుకలకు, పులులకు, సింహాలకు, తోడేళ్లకు, కుందేళ్లకు, కింపురుషులకు జన్మనిచ్చాడు. పరాశరుని తపస్సును ఆపమని కోరిన మునుల్లో ఇతడొకడు. ఇతడు ఇంద్రసభలో సభ్యుడు. ఇతడు బ్రహ్మను పూజిస్తాడు. చాలాకాలం అలకానంద తీరంలో తపస్సు చేశాడు. సుబ్రహ్మణ్యస్వామి జన్మోత్సవంలో పాల్గొన్నాడు, చిత్ర శిఖండులను సప్తర్షులలో ఒకడు. 21 మంది ప్రజాపతుల్లో ఒకడు. – మహాభారతం

**పులోమ :** భృగుమహర్షి భార్య.
ఈమె భృగు మహర్షిని వివాహమాడకముందే పులోముడను రాక్షసుడీమెను ప్రేమించాడు. ఈమె భృగుని వివాహమాడగా ఆ అసురుడు పగపెంచుకొని సమయం కోసం చూస్తుండగా భృగు మహర్షి స్నానానికి నదికి వెళ్లినపుడు ఇతడు అశ్రమంలోకి వెళ్లి అగ్నిని ఈమె భృగుని సూత్రబద్ధంగా వివాహం చేసుకుందా అని అడిగి అతడు కాదని చెప్పగా పులోమను ఎత్తుకుపోయాడు. అప్పటికే గర్భిణియైన పులోమ దారిలోనే ప్రసవించగా చ్యవనుడు జన్మించాడు. అతడు కళ్లు తెరచి చూడగా ఆ రాక్షసుడు భస్మమయ్యాడు.

**పులోమి :** ఓ రాక్షస స్త్రీ. ఈమె సంతతిని పులోమసులంటారు. ఈమె సోదరి కాళక. వీరిద్దరూ బ్రహ్మను గూర్చి తపస్సు చేసి వీరి కుమారులకు మరణం లేకుండా వరం కోరారు. వీరికి ఆకాశంలో ఓ గొప్ప నగరాన్ని నిర్మించి నశించకుండా వరమిచ్చాడు బ్రహ్మ.
– మహాభారతం

**పులోముడు 1 :** కశ్యపదితిలకు జన్మించిన రాక్షస వంశంలోనివాడు. ఇతడు భృగుని భార్యపులోమిని ప్రేమించాడు. ఇంద్రుని భార్య శచీదేవి ఇతని కుమార్తె. – అగ్నిపురాణం.

**పుల్కసుడు :** శూద్రుని వల్ల క్షత్రియ స్త్రీకి జన్మించిన వాడిని పుల్కసుడని పిలుస్తారు.

**పుళింది :** చూ॥ చండకుడు.

**పుళిందులు 1 :** పుళింద దేశ ప్రజల్ని పుళిందులని పిలుస్తారు. వీరు క్షత్రియులు. బ్రాహ్మణుల శాపం వల్ల శూద్రులయ్యారు. మ్లేచ్ఛులైన వీరు కలియుగంలో రాజులయ్యారు. వశిష్ఠుని గోవైన నందిని ఉగ్రురాలైనప్పుడు దాని నోటి నురగనుండి జన్మించారు. భీముడు వీరితో యుద్ధం చేసి వారి నగరాలను ధ్వంసం చేశాడు. వీరు కురుక్షేత్ర యుద్ధంలో దుర్యోధనుని పక్షాన పోరాడారు.
– మహాభారతం

**పుళిందులు 2 :** దక్షిణ భారతదేశంలోని ఓ మ్లేచ్ఛ తెగ ప్రజలు. – వామనపురాణం.

**పుష్కరధారిణి :** విదర్భదేశంలో సత్యుడను ముని భార్య. అహింసను నమ్మే ఇతడు యాగంలో కనీసం ఏదో ఒకటి బలి ఇవ్వవలసివున్నా ఫలాలతో వ్రేళ్లతో యాగం చేశాడుగాని కనీసం గొర్రెను కూడా బలివ్వలేదు. భర్త శపిస్తాడేమోనని ఈమె దానిని వ్యతిరేకించలేదు. ఇతని స్నేహితుడు ఓ శాపం వల్ల జింక రూపంలో అడవిలో నివసిస్తూ యజ్ఞం వద్దకు వచ్చి తనను బలివ్వమని కోరినా నిరాకరించగా సావిత్రీదేవి ప్రత్యక్షమై జింకను సంహరించమని ఆదేశించగా అన్యనమస్కంగానే బలివ్వగా అతని తపశ్శక్తి నశించింది. ఆ తర్వాత పుష్కరధారిణి తపస్సు చేయగా ధర్ముడు ప్రత్యక్షమై సత్యుని తపశ్శక్తిని పునరుద్ధరించాడు.
– మహాభారతం

**పుష్కరమాలిని :** ఓ అదృష్టవంతురాలైన సత్యుడను ముని భార్య. ఇతడు ఆకులు, అలములు తిని జీవించేవాడు. ఈమె వ్రతాలను నిష్టగా చేయడంవల్ల ఆమె సన్నగా వున్నాస్వచ్ఛంగా వుండేది. ఈమె తన భర్తకు అణకువగా వుండి తన దుస్తుల్ని కూడా నెమలి ఈకలతో తనే తయారుచేసుకొనేది. ఈమె యజ్ఞాలలో గోవధను వ్యతిరేకించేది. – మహాభారతం

**పుష్కరవతి :** ఇదొక పట్టణం. శ్రీరాముని తమ్ముడైన భరతుని రెండో కుమారుడైన పుష్కరుడు దీనిని నిర్మించాడు.

**పుష్కరశాలి :** కుండల అనే స్త్రీకి భర్త. ఇతణ్ణి శంభుడనే రాక్షసుడు చంపాడు. – మార్కండేయ పురాణం

**పుష్కరాక్షుడు 1 :** పురాణ ప్రసిద్ధుడైన ఒక రాజు. ఇతడు పూర్వజన్మమున తామ్రలిప్తి నగరమున ధర్మసేనుడను వైశ్యుడు. ఇతని భార్య విద్యుల్లేఖ. వారి సంపదను దొంగలు ఎత్తుకుపోగా విచారంతో ఆత్మ హత్య చేసుకోగా పునర్జన్మతో హంసలుగా జన్మించారు. అప్పుడు కూడ వారు భార్యభర్తలే. ఓ తుఫానుకు విడిపోయి

అష్టకష్టాలుపడి తిరిగి కలుసుకొని ఓ వేటగాడి బాణానికి గురై మరణించారు.

తక్షశిలా నగరంలో భద్రాక్షుడను రాజు భగవతిని 108 పుష్పాలతో పూజిస్తూ ఓ పుష్పం విరిగిపోగా తన హృదయం చీల్చి తన గుండెతో ఆ పుష్పస్థానాన్ని పూరించగా దేవి ప్రత్యక్షమై చక్రవర్తికాగల పుత్రుడు జన్మిస్తాడని వరమిచ్చింది. అతనికి జన్మించిన వాడే పుష్కరాక్షుడు. అతడే పూర్వజన్మలో ధర్మసేనుడు. ఇతడు శివుని గూర్చి తపస్సు చేసి తనకు తగిన భార్య కావాలని వరం పొంది, ఓ ఆశ్రమంలో పెరుగుతున్న వినయవతి తనకు అనుకూలమైన భార్యగా నెంచి ఆ ఆశ్రమంలోని ముని ఆశీర్వాదంతో వివాహమాడాడు. వినయవతి తన పూర్వజన్మమున పుష్కరాక్షుడి పూర్వజన్మ అయిన ధర్మసేనుడి భార్య విద్యుల్లేఖ.

*– కథాసరిత్సాగరం*

**పుష్కరాక్షుడు 2 :** సుచంద్రుడను రాజపుత్రుడు. ఇతడిని పరశురాముడు వధించాడు. *– బ్రహ్మాండపురాణం*

**పుష్కరారణ్యం :** పుష్కరతీర్థం వద్దగల అరణ్యం.

**పుష్కరారుణి :** పూరుని వంశంలో జన్మించినవాడు. రుక్షయుడి కొడుకు. ఇతడి వంశస్తులు బ్రాహ్మణులౌతారు.

**పుష్కరిణి 1 :** భరత రాజ్యానికి రాజైన భుమన్యుని భార్య. ఈమెవల్ల భుమన్యుడికి ఆరుగురు కుమారులు. వారు సుహోత్ర, దివిరథ, సుహోత, సుహవిసు, సుయజుసు, రుచికులు.

**పుష్కరిణి 2 :** చాక్షుష మనువు భార్య. ఈమెవల్ల మనువను కుమారుడు జన్మించాడు. *– అగ్నిపురాణం*

**పుష్కరిణి 3 :** ఉన్ముఖుడను రాజు భార్య. ఈమెవల్ల ఇతనికి ఆరుగురు కుమారులు. వారు అంగ, సుమనసు, ఖ్యాతి, క్రతు, అంగిరస, గయులు.

*– భాగవతం*

**పుష్కరుడు 1 :** వరుణుని కుమారుడు. సోముని కుమార్తె ఇతని అందానికి ముగ్ధురాలై వివాహమాడింది.

*– మహాభారతం*

**పుష్కరుడు 2 :** నలుని తమ్ముడు. కలితో కలసి పాచికల ఆటలో నలుణ్ణి ఓడించి రాజ్యం నుండి వెడలగొట్టి రాజయ్యాడు. తర్వాత నలునికి క్షమాపణలు చెప్పి అతని రాజ్యం అతనికి ఇచ్చివేశాడు.

*– చూ॥ దమయంతి.*

**పుష్కరుడు 3 :** ఓ ముని. పరశురాముని గురువు.

*– అగ్నిపురాణం*

**పుష్కలుడు 1 :** రావణుని తరపున పోరాడిన వీరుడు. హనుమంతుడితో యుద్ధం చేసి హతుడయ్యాడు.

*– పద్మపురాణం*

**పుష్కలుడు 2 :** రాముని తమ్ముడైన భరతుని చిన్న కుమారుడు. మాండవి ఇతని తల్లి. శ్రీరాముని అశ్వమేధ సమయంలో యాగాశ్వం వెంట వుండి ఎందరో రాజుల్ని ఓడించాడు. రాముని కుమారుడు లవుడి చేతిలో ఓడిపోయాడు. ఇతడు గాంధార దేశాన్ని జయించి అక్కడ ఓ నగరాన్ని నిర్మించుకొని ఆ రాజ్యాన్ని పాలించాడు. ఆ నగరం పేరు పుష్కలావతి.

*– రామాయణం*

**పుష్టి :** దక్షప్రజాపతికి ప్రసూతి వల్ల జన్మించిన కుమార్తె. ఈమె 12 మంది సోదరీమణులను, ఈమెను ధర్ముడు వివాహమాడెను. వీరేకాక ప్రసూతికి దక్షుణి వల్ల మరో 11 మంది కుమార్తెలు. వారు ఖ్యాతి, సతి, సంభూతి, స్మృతి, ప్రీతి, క్షామ, సంతతి, అనసూయ, ఊర్జ, స్వాహాదేవి మరియు స్వధ. వీరిని వరుసగా భృగు, శివ, మరీచి, అంగిరస, పులస్త్య, పులహ, క్రతు, అత్రి, వశిష్ట, అగ్ని మరియు పితృలు వివాహమాడారు. *– మహాభారతం*

**పుష్టిమతి :** భరత అనే అగ్నియొక్క మరోపేరు. ఈ అగ్నిని సంతోషపెడితే ఆరోగ్యంగా వుంటారు.

*– మహాభారతం*

**పుష్ప :** కశ్యపుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం.

*– మహాభారతం*

**పుష్పకం 1 :** ఆకాశ మార్గాన పయనించే ఓ దివ్య విమానం. *పుట్టుక :* విశ్వకర్మ కుమార్తె సంజ్ఞ. ఈమెను సూర్యుడు వివాహమాడాడు. ఆమె సూర్యుని వేడి భరించలేక తండ్రికి తన బాధ చెప్పుకోగా అతడు సూర్యుడ్ని తన ఉష్ణాన్ని తగ్గించుకొమ్మని ఆదేశించగా అతడు మరరాతికి రుద్దుకోగా ఆ వేడికి 8వ వంతు కూడా తగ్గలేదు గాని అతని శరీరం నుండి పొడిరాలగా విశ్వకర్మ

వాటిని జేర్చి నాల్గు విశిష్ఠ వస్తువుల్ని తయారుచేశాడు. ఒకటి శ్రీమహావిష్ణువు చక్రా యుధం, రెండు శివుని త్రిశూలం, మూడు పుష్పక విమానం, నాల్గు సుబ్రహ్మణ్యస్వామి ఆయుధమైన శక్తి. వీటిని విశ్వకర్మ బ్రహ్మకు బహుమతిగా ఇచ్చాడు.

*కుబేరుడు పుష్పకాన్ని పొందిన విధం :* భరద్వాజుని కుమార్తె దేవవర్ణినికి విశ్రావసుకు జన్మించిన కుమా రుడు విశ్రావణుడు. ఇతడిని కుబేరుడని అంటారు. కుబేరుడు చిన్ననాడే హిమాలయ లోయలో తలక్రిం దులుగా 1000 సంవత్సరాలు తపస్సు చేశాడు. ఆ తర్వాత ఒంటికాలిపై నిలబడి పంచాగ్నిలో 1000 సంవత్సరాలు తపస్సు చేసి బ్రహ్మను మెప్పించి గగాధి పతి కావాలని వరం పొందాడు. బ్రహ్మ ఇతనికి శంఖ నిధి, పద్మనిధి అనే సంపదతోపాటు పుష్పక విమానం కూడా బహుమతిగా ఇవ్వగా త్రికూట పర్వతంపై దక్షిణ సముద్రంలో లంకానగరం నిర్మించుకొని అక్కడ జీవించడం మొదలు పెట్టాడు.

*రావణుడు పుష్పక విమానం పొందిన విధం :* విశ్రా వసువుకు మరో ముగ్గురు కుమారులు కలరు. వారు రావణ, కుంభకర్ణ, విభీషణులు. రావణుడు శివుని గురించి తపస్సు చేసి ఎన్నో దివ్యశక్తులు పొంది లంకపై దండెత్తి కుబేరుడ్ని పారద్రోలి లంకను ఆక్రమించుకోగా కుబేరుడు ఉత్తరానికి పారిపో యాడు. రావణుడు పుష్పక విమానాన్ని కూడా కుబేరుడి నుండి పొంది దానిపై జైత్రయాత్ర కొనసాగించాడు. సీతను అపహరించి ఈ విమానంలోనే లంకకు తీసు కొని వెళ్లాడు. రాముడు రావణుడిని సంహరించిన తర్వాత ఈ విమానాన్ని కుబేరునికి అప్పగించాడు. ఒకసారి శూద్రుడైన శంభకుణ్ణి వధించడానికి ఈ విమానాన్ని కుబేరుని వద్ద తీసుకొని శంభకుని సంహరించిన తర్వాత కుబేరునికి పంపాడు.

– ఉత్తర రామాయణం

**పుష్పకం 2 :** ద్వారకాపురికి దక్షిణానగల లతావేష్ఠ పర్వతం ప్రక్కనగల పెద్ద అడవి. – మహాభారతం

**పుష్పదంతం :** అష్ట దిగ్గజాలలోని ఓ ఏనుగు.

**పుష్పదంతి :** చిత్రసేనుడను గంధర్వుని బంధువు. మాల్యవాసి అనే మరో గంధర్వ కన్య అందాన్ని చూసి ఈమె నాట్యంలో తప్పులు దొర్లడంతో ఇంద్రుడిద్దర్ని శపిస్తాడు. ఏకాదశి వ్రత మాచరించి వీరు శాపవిము క్తులవుతారు. – పద్మపురాణం

**పుష్పదంతుడు 1 :** శివుని సేవకుల్లో ఒకడు. ఓ శాపం వల్ల ఇతడు భూమిపై వరరుచిగా జన్మించాడు. ఇతనిపై మరో శాపంకూడా వుంది. – *చూ॥ జంబు కేశ్వరుడు*

**పుష్పదంతుడు 2 :** పార్వతి సుబ్రహ్మణ్యస్వామికిచ్చిన ముగ్గురు సైనికుల్లో ఒకడు. తక్కిన ఇద్దరు ఉన్మాదుడు, శంకుకర్ణుడు. – మహాభారతం

**పుష్పదంష్ట్రుడు :** కశ్యపుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. – మహాభారతం

**పుష్పరథం :** వసుమనసుడను రాజు యొక్క రథం పేరు. ఈ రథం గాలిలో, పర్వతాలపై, సముద్రాలలో సంచరించగలదు. – మహాభారతం

**పుష్పరాగ ప్రాకారం :** (రత్నశాల) రత్న ఖచితమైన ఓ కోట. స్వర్గలోకానికి బ్రహ్మలోకానికి పైన మణి ద్వీపమే పుష్పరాగం. ఇది ఏడు యోజనాల ఎత్తువుండి అందు లోని నేల, చెట్లు, పక్షులు, జంతువులు, తోటలు రత్నా లతో నిండి ఎర్ర రంగులో వుంటుంది. అందుకే దీన్ని రత్నశాల అని అంటారు. దిక్పాలకులు తమ కుటుం బాలతో ఇక్కడే నివసిస్తారు. – దేవీ భాగవతం

**పుష్పవతి :** ఓ పుణ్యస్థలం. ఇక్కడెవరైనా 3 రాత్రులు వుండి ఉపవాసం వుండి ఇక్కడ స్నానంచేస్తే 1000 గోదానాలు చేసిన ప్రతిఫలం లభిస్తుంది. అంతేకాక వీరి కుటుం బాలు పాపరహితాలవుతాయి. – మహాభారతం

**పుష్పవానుడు :** ఓ రాజు. ముల్లోకాలను జయించిన వాడు. కాని మరణించాడు. జీవితం శాశ్వతంకాదని చెప్పడానికి భీష్ముడు ఇతని కథను వివరిస్తాడు. – మహాభారతం

**పుష్పవాహనుడు :** రతాంతరకల్పంలో ఒక రాజు. ఇతడు పూర్వజన్మలో విష్ణుభక్తుడు. ఇతడు ప్రతిరోజు విష్ణు వును పూజించి ద్వాదశ వ్రతాన్ని పాటించి ఓ వేశ్యకు పుష్పాలు తీసుకొని వెళ్లి ఇచ్చేవాడు. అందువల్ల ఇతడు పుష్పవాహనుడుగా జన్మించి తన భార్య లావణ్యవతి వల్ల 10 వేలమంది కుమారుల్ని పొందాడు. భృగు మహర్షి ఇతని పూర్వజన్మవృత్తాంతం చెప్పి ద్వాదశ వ్రతం చేయమని చెప్పగా దాన్ని ఆచరించి మోక్షం పొందుతాడు. – పద్మపురాణం

**పుష్యమిత్రుడు :** మగధదేశపు రాజులయిన మౌర్యులలో చివరివాడైన బృహద్రథుడి సేనాపతి. ఇతడు రాజును చంపి తానే రాజయ్యాడు. ఇతడి కొడుకు అగ్నిమిత్రుడు. ఇతడి వంశజుల్ని శృంగులంటారు.

**పుష్పాననుడు :** ఓ యక్షుడు. కుబేరుని కొలువులో ఉండేవాడు. – మహాభారతం

**పుష్పార్ణుడు :** ధ్రువుని కుటుంబంలో జన్మించిన ఒక రాజు. ప్రభా అనే కన్యను వివాహమాడాడు. – భాగవతం

**పుష్యుడు :** హిరణ్యనాభుడి కొడుకు. ఇతని కుమారుడు ధ్రువసంధి. – భాగవతం

**పుష్పోత్కట :** సుమాలి కుమార్తె. విశ్రవసు భార్యల్లో ఒకరు. ఈమెకు మహోదరుడు, మహాపార్శ్వుడు జన్మించారు. – ఉ. రామాయణం

**పూజని :** ఓ తెలివైన పక్షి.

క్షత్రియుల్ని నమ్మరాదనడానికి ఈ పక్షి వృత్తాంతాన్ని భీష్ముడు చెప్తాడు. కాంపిల్యనగరంలో బ్రహ్మదత్తుడనే దేవరాజుండేవాడు. ఇతనికి పూజని అనే పక్షి స్నేహితురాలు. రాజుకి ఓ పుత్రుడు జన్మించగా పూజనికి కూడా ఓ బిడ్డ జన్మించింది. రాజకుమారుడు చిన్న పక్షికూడా స్నేహంగా పెరిగారు. ఆ చిన్న పక్షి తన ముక్కుతో ఆహారం సేకరించి రాజకుమారుడికి అందించేది. ఒకసారి పూజని తన పంజరం నుండి బయటకు వెళ్లగా రాజకుమారుడు చిన్న పక్షిని వధించాడు. పూజని వచ్చి విషయం గ్రహించి రాజకుమారుడి కళ్లుపొడిచి "క్షత్రియుల్ని నమ్మరాదని" పలికి రాజువద్ద నుండి వెళ్లిపోయింది. – మహాభారతం

**పూతన :** శ్రీకృష్ణునిచే చంపబడిన ఓ రాక్షసి. ఆమె పుట్టుక, కంసునితో ఆమె సంబంధాలు వివిధ పురాణాలలో వివిధంగా వున్నాయి.

1. పూతన కైతు అనే రాక్షసి కుమార్తె. ఈమె కంసుని భార్యకు సేవిక. ఈమె సోదరి వృకోదరి. – మహాభారతం
2. కంసుని పెంచిన తల్లి. ఈమె గోకులంలోకి పక్షి రూపంలో వెళ్లింది. – హరివంశం.
3. ఈమె కంసుని సోదరి. ఘటోదరుని భార్య. – బ్రహ్మ వైవర్త పురాణం

*పూర్వజన్మ :*

1. పూతన తన క్రితం జన్మలో మహాబలి కూతురు రత్నమాల. శ్రీ మహావిష్ణువు వామనుడిగా అవతరించినపుడు ఈమెకు అతణ్ణి పాలిచ్చిపెంచితే బాగుండునని తలచింది. అతడు నా బిడ్డగా జన్మించకూడదా అని తలచింది. శ్రీమహావిష్ణువు ఇది గ్రహించి శ్రీకృష్ణుడిగా అవతరించినపుడు ఆమె కోర్కె తీర్చాడు. – బ్రహ్మవైవర్తపురాణం
2. కాల భీరువు కూతురైన చారుమతి. ఈమె కాక్షివాణుణ్ణి వివాహమాడింది. కాక్షివాణుడు యాత్రలకు వెళ్లినపుడు ఓ శూద్రుడీమెను తన ఉంపుడుగత్తెగా వుంచుకోగా కాక్షివాణుడు తిరిగి వచ్చి ఈమె తనను మోసగించినందుకు రాక్షసిగా జన్మించమని శపిస్తాడు. ఆమె శాపవిమోచనం కోరగా శ్రీమహావిష్ణువు శ్రీకృష్ణుడిగా అవతరించినపుడు శాపవిమోచనం కలుగుతుందని చెప్తాడు. ఆ చారుమతే ఈ పూతన. – మహాభారతం

**పూతాత్ముడు :** కశ్యపుడి దాయాది. కాశీనగరంలో శివుణ్ణి పూజించి శివుని వల్ల వరములు పొందాడు. శివుడి తనికి దిక్పతిత్వాన్ని, ప్రాణపానాది పంచముక్తి త్వాన్ని, సర్వగతాన్ని, సర్వసత్తాక బోధకత్వాన్ని ప్రసాదించాడు. ఇతడే వాయుదేవుడయ్యాడు. – కాశీమాహాత్మ్యం.

**పూతిక :** ఇదో అల్లుకొని పాకే చెట్టు. సోమలతకు బదులు దీన్ని యాగాలలో వుపయోగిస్తారు. – మహాభారతం

**పూయవహం :** ఓ నరకం.

**పూరణుడు 1 :** ప్రాచీన మహర్షి, భీష్ముడు అంపశయ్యపై నుండగా దర్శించిన వారిలో ఒకడు. – మహాభారతం

**పూరణుడు 2 :** కద్రువ కుమారుడు. – మహాభారతం

**పూరుడు 1 :** చంద్రవంశంలో జన్మించిన ప్రసిద్ధ రాజు.

*జన్మం :* చంద్రవంశంలో జన్మించిన నహుషుడి మనుమడు. యయాతి కుమారుడు. యయాతికి ఇద్దరు భార్యలు 1. శర్మిష్ఠ, 2. దేవయాని. శర్మిష్ఠ ద్రుహ్యు, అను, పూరులకు జన్మనివ్వగా దేవయాని యదు, తుర్వసులకు జన్మనిచ్చింది.

*పూరుడు రాజయిన విధం :* యయాతి ముదుసలియై కోర్కెలు నశించక తన కుమారుల్ని తన ముసలితనం

తీసుకొని వారి యవ్వనాన్ని తనకివ్వమని కోరగా పుత్రులందరూ నిరాకరించారు. ఒక్క పూరుడు మాత్రమే అంగీకరించి తన యవ్వనాన్ని తండ్రికిచ్చాడు. యయాతి 1000 సంవత్సరాలు యవ్వ సంతోసంతోషంగా జీవించి పూరుడికి తిరిగి అతని యవ్వనాన్ని అతని కిచ్చి రాజ్యాన్నికూడా అతనికి కట్టబెట్టాడు.

*ఇతర విశేషాలు :* పౌష్ఠ అను భార్యవల్ల పూరుడికి ముగ్గురు కుమారులు జన్మించారు. మరణానంతరం యముని సభలో సభ్యుడు. ఇతడు ఇంద్రుని విమానంలో ఇంద్రుని ప్రక్కన కూర్చొని మహాభారత యుద్ధం తిలకించాడు. ఒకసారి ఇతడు మాంధాత అను రాజు చేతిలో ఓడిపోయాడు. – మహాభారతం

**పూరుడు 2 :** అర్జునుని రథసారథి పేరు. – మహాభారతం

**పూర్ణభద్రం :** కశ్యపుని కుటుంబంలో జన్మించిన ప్రసిద్ధ సర్పం. – మహాభారతం

**పూర్ణభద్రుడు :** గంధమాదన పర్వతంపై నివసించే రత్న భద్రుని కుమారుడైన యక్షుడు. ఇతని కుమారుడు హరికేశుడు (పింగళుడు). పూర్ణభద్రుడు కుబేరుని భక్తుడు కాగా హరికేశుడు శివభక్తుడవడం వల్ల ఇంటి నుండి పంపివేశాడు. శివుడు ఇతణ్ణి తన సేవకుడిగా నియమించుకున్నాడు. – మత్స్యపురాణం

**పూర్ణం 1 :** వాసుకి కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. ఇది జనమేజయుని సర్పయాగంలో బూడిదై మరణించింది. – మహాభారతం

**పూర్ణ 2 :** తిథులపేర్లు. పంచమి, దశమి, పంచదశులను కలిపి పూర్ణం అంటారు. ధర్మరాజు పూర్ణ అనే పంచమి రోజున జన్మించాడు. – మహాభారతం

**పూర్ణముఖుడు :** ధ్రుతరాష్ట్రుని వంశంలో జన్మించిన ఓ సర్పం. ఇది జనమేజయుని సర్పయాగంలో బూడిదై మరణించింది. – మహాభారతం

**పూర్ణాంగద :** ధ్రుతరాష్ట్రుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో బూడిదై మరణించింది. – మహాభారతం

**పూర్ణాయుషుడు :** ప్రధవల్ల కశ్యపునికి జన్మించిన దేవ గాంధర్వుడు. – మహాభారతం

**పూర్ణిమ :** మరీచి కూతురు. తర్వాతి జన్మలో ఈమె గంగ అనే పేరుతో జన్మించింది. – భాగవతం

**పూర్ణుడు :** ప్రధవల్ల కశ్యపునికి జన్మించిన ఓ దేవగాంధర్వుడు. – మహాభారతం

**పూర్వచిత్తి :** ఓ అప్సరాంగన. ప్రసిద్ధి చెందిన ఆరుగురు అప్సరసల్లో ఈమె ఒకరు. వారు ఊర్వశి, పూర్వచిత్తి, సహజన్య, ఘృతాచి, విశ్వాచి, మేనక. ఈమె అర్జునుడి జన్మదిన వేడుకల్లో పాల్గొంది. అర్జునుడు స్వర్గానికి వెళ్లినపుడు అతని గౌరవార్థం నృత్యం చేసిన వారిలో ఒకరు. – మహాభారతం

**పూర్వదిశ :** తూర్పు దిక్కును పూర్వదిశ అంటారు. అన్ని దిశల కంటే ఇది ప్రసిద్ధం.

1. సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు.
2. సాధ్యులు సాయంసంధ్యలో తూర్పుకువెళ్లి తపస్సు చేస్తారు.
3. చంద్రుడు ఉదయిస్తాడు.
4. అగ్నికి ఆహుతిచేసే హవిస్సులు అగ్నిరూపంలో తూర్పుకు వెళ్తాయి.
5. దక్షుని కుమార్తెలు కశ్యపుణ్ణి వివాహమాడిన తర్వాత తూర్పు దిక్కున ప్రసవించారు.
6. దేవతలు ఇంద్రుణ్ణి తూర్పు దిక్కుకు నాయకుణ్ణి చేశారు.
7. ఇంద్రుడు దేవతలు కలిసి తూర్పు దిక్కునే తపస్సు చేశారు.
8. దేవతలు ఈ దిక్కునే ముందు ఎన్నుకున్నారు గనుక పూర్వదిశ అన్నారు.
9. సూర్యుడు యజుర్మంత్రాలను తూర్పునే బహుమతిగా ఇచ్చాడు.
10. దేవతలు సోమ రసాన్ని తూర్పు దిక్కుకు కూర్చుని సేవించారు.
11. వరుణుడు తూర్పు దిక్కుగుండా పాతాళానికి వెళ్లి సంపదలు పొందాడు.
12. ఇంద్రుడు బలి ఇచ్చే జంతువుల్ని ఇక్కడే ఎన్నుకుంటాడు.
13. మానవుని ఆత్మ స్వర్గంలోకి తూర్పు దిక్కునుండే ప్రవేశిస్తుంది. – మహాభారతం

**పూర్వపాతి :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజు. పాండవులు కురుక్షేత్ర యుద్ధంలో పాల్గొంటానికి ఇతడ్ని ఆహ్వానించారు. – మహాభారతం

**పూర్వభిరామం :** పురాణకాలంలో ప్రసిద్ధ నది. – మహాభారతం

**పూర్వాశ్రమం :** సరయూనది తీరంలోని ఓ పుణ్యస్థలం. విశ్వామిత్రుడు రామలక్ష్మణులను యాగ రక్షణకు తీసుకువెళ్తూ ఈ స్థల ప్రాముఖ్యత తెలియజేశాడు. శివుడిక్కడే కామదేవుడ్ని భస్మం చేశాడు. కామదేవుని కిక్కడే అనంగుడను పేరొచ్చింది. – రామాయణం

**పూషణుడు :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు. – మహాభారతం

**పూషుడు :** సూర్యుని మరోపేరు. – మహాభారతం

**పెదు :** ఓ రాజర్షి. ఇతణ్ణి అణకాశ్యుదని అంటారు. – రుగ్వేదం

**పెరుక :** వేదకాలం నాటి ఓ రాజు. భరద్వాజునికి ఆశ్రయమిచ్చాడు. – రుగ్వేదం

**పైజననుడు :** ఓ శూద్రుడు. ఇంద్రాగ్న యజ్ఞమంత గొప్ప యజ్ఞం చేసి పురోహితులకు బంగారు కలశాలు బహుమతిగా ఇచ్చాడు. – మహాభారతం

**పైథకుడు :** ఇతడొక రాక్షసుడు. శ్రీకృష్ణుడితణ్ణి వధించాడు. – మహాభారతం

**పైలగర్గుడు :** ఇతడో ప్రాచీన మహర్షి. కాశీ రాజ కుమార్తె అంబ ఇతని ఆశ్రమంలో పూజా విధానాలను నేర్చుకుంది. – *చూ॥ అంబ*

**పైలుడు :** వ్యాసుని శిష్యుల్లో ఒకడు. వ్యాసుని మొదటి శిష్యబృందంలోని ఐదుగురు సుమంతుడు, జైమిని, పైలుడు, శుకుడు, వైశంపాయనుడు. వీరు మహాభారతానికి మరింత ప్రచారం తెచ్చారు.

**పైశాచం :** వివాహ విధానాల్లో ఇదొకటి. – *చూ॥ వివాహాలు*

**పోతకం :** కశ్యపుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. – మహాభారతం

**పోతరాజు :** ఒక పురుష దేవత. శంకరాంశ అయిన వీరభద్రుణ్ణి గ్రామాలలో ప్రతిష్ఠించి ప్రజలు పూజిస్తారు.

**పోలేరమ్మ :** ఓ గ్రామ దేవత. పరశురాముడి తల్లి రేణుకాదేవిని పరాశక్తిగా భావించి ఈ పేరున అనేక ప్రాంతాలలో పూజిస్తారు.

**పౌదన్యం :** ప్రాచీన భారతదేశంలోని ఓ నగరం. పౌదాసుని కుమారుడైన అష్మకుడు దీన్ని నిర్మించాడు. ప్రస్తుతం గోదావరికి ఉత్తర తీరానగల పైఠను పట్టణం ప్రాచీన పౌదాన్యం అని పండితుల నమ్మకం.

**పౌనర్భవుడు :** చూ॥ బంధుదాయాదులు.

**పౌరవకులు :** ఓ క్షత్రియ తెగవారు. వీరు పాండవుల పక్షాన కురుక్షేత్రయుద్ధంలో పాల్గొన్నారు. క్రౌంచ వ్యూహంలో వీరొక భాగం. – మహాభారతం

**పౌరవతి :** ధర్మరాజు భార్య. వీరి కొడుకు దేవకుడు. – భాగవతం

**పౌరవుడు 1 :** ఓ రాజర్షి. ఇతడు పర్వత రాజౌతాడు. అర్జునుడు ఇతణ్ణి ఓడిస్తాడు. కురుక్షేత్ర యుద్ధంలో కౌరవుల పక్షాన పోరాడి అర్జునుని చేతిలో మరణిస్తాడు. – మహాభారతం

**పౌరవుడు 2 :** విశ్వామిత్రుడి కొడుకు. – మహాభారతం

**పౌరవుడు 3 :** అంగరాజు. సృంజయుడి అశ్వమేధానికి ధనమిచ్చి సహాయపడతాడు. – మహాభారతం

**పౌరవి 1 :** శ్రీకృష్ణుని తండ్రియైన వసుదేవుని భార్యల్లో ఒకరు. – భాగవతం

**పౌరవి 2 :** ధర్మజుని భార్యల్లో ఒకరు. ఈమె వల్ల దేవకుడను పుత్రుడు జన్మించాడు. – భాగవతం

**పౌరికుడు :** పురికానగరి అనే ప్రాచీన దేశపు రాజు. ఇతడు పాపకర్ముడగుట వల్ల తర్వాతి జన్మలో నక్కగా జన్మించాడు. – మహాభారతం

**పౌరిషేయుడు :** ఇతడొక రాక్షసుడు. ఇతడు జ్యేష్ఠ మాసంలో సూర్యునితో పాటు ప్రయాణిస్తుంటాడు. – భాగవతం

**పౌర్ణమాసుడు :** మరీచి కుమారుడు. ఇతని తల్లి సంభూతి. పౌర్ణమాసుడికి ఇద్దరు కుమారులు. వారు విరజసుడు, పర్వతుడు.

**పౌలస్త్యులు :** పౌలస్త్యుని వంశంలో జన్మించిన రాక్షసుల్ని పౌలస్త్యులంటారు. వీరు దుర్యోధనుని సోదరులుగా జన్మించారు. ఈ కుటుంబంలో జన్మించిన రావణుడిని కూడా పౌలస్త్యుడంటారు. – మహాభారతం

**పౌలోమం 1 :** పంచతీర్థమనే పుణ్యస్థలానికి మరోపేరు. – *చూ॥ పంచతీర్థం*

**పౌలోమం 2 :** నారీ తీర్థాలలో ఒకటి. – *చూ॥ నారీ తీర్థాలు*

**పౌలోమి :** ఇంద్రుని భార్య శచీదేవి మరో పేరు.

**పౌలోములు :** పులోమ అనే రాక్షసి సంతతిని పౌలోము లంటారు.

**పౌషజిత్తు :** వ్యాసుని శిష్యపరంపరలో ఒక ముని.
– చూ॥ గురుపరంపర

**పౌష్పంజి :** వ్యాసుని శిష్య పరంపరలో ఒక ముని.
– చూ॥ గురుపరంపర

**పౌష్యమహాదేవి :** పౌష్యమహారాజు భార్య. అశుచిగా వున్నవారికీమె కన్పించదు. పౌష్య మహారాజు తన భార్య కుండలాలు తీసుకొమ్మని ఉదంకుడిని పంపగా ఈమె అతనికి కన్పించలేదు. అతడు కాళ్లు, చేతులు కడుగుకొని వచ్చిన తర్వాత కనిపించి కుండ లాలిచ్చింది.
– మహాభారతం

**పౌష్యమహారాజు :** ఒక రాజు. ఉదంకుడను ముని శిష్యుడితని కడకు వచ్చి రాజుభార్య కుండలాలు గ్రహించి రాజు ఇచ్చిన ఆతిథ్యాన్ని స్వీకరిస్తాడు. ఈ బ్రాహ్మణునకు భోజనములో తలవెంట్రుక ఒకటి కనిపించగా కోపంతో పౌష్య మహారాజును అంధుడవు కమ్మని శపిస్తాడు. అకారణముగా శపించెనని తలచి రాజు అపుత్రుడవు కమ్మని ఉదంకునికి ప్రతిశాపమిస్తాడు. ఈ శాపము మరలింపుమని కోరగా పౌష్య మహారాజు తనకు సాధ్యము కాదని చెప్పెను. పౌష్య మహారాజు కూడా తనకు శాపవిమోచనమిమ్మని ఉదంకుని కోరగా అచిర కాలముననే శాపవిమోచన మగునని అనుగ్రహిస్తాడు. – మహాభారతం

**పౌషమాసం :** ఇదో మాసం పేరు. ఇప్పుడు జనవరిగా పిలుస్తారు. ఈనెలలో పౌర్ణమిరోజున పుష్యుడు చంద్రుడు కలుస్తారు. ఈ నెలలో రోజుకి ఒకసారి మాత్రమే ఆహారం స్వీకరిస్తే అందం, ఐశ్వర్యం, ప్రఖ్యాతి వస్తాయి.
– మహాభారతం

**పౌష్టి :** పురురాజు భార్య. ఈమెవల్ల ముగ్గురు కుమారులు. ప్రవీర, ఈశ్వర, రుద్రాశ్వులు. ఈమెను కౌసల్య అని కూడా అంటారు. – మహాభారతం

**పౌష్పింజి :** వ్యాసుని శిష్యపరంపరలోని ఓ ముని.
చూ॥ గురుపరంపర – మహాభారతం

**పంకజిత్తు :** గరుడుని కుమారుడు. – మహాభారతం

**పంకదిగ్ధాంగుడు :** ఒక దేవుడు. సుబ్రహ్మణ్య స్వామితో పాటు రాక్షసులకు వ్యతిరేకంగా పోరాడిన వీరుడు.
– మహాభారతం

**పంక్తి :** సూర్యుని రథాన్ని లాగే ఓ గుర్రం. సూర్యుని రథాన్ని ఏడు గుర్రాలు లాగుతాయి. అవి : గాయత్రి, బృహతి, ఉష్ణిక, జగతి, త్రిష్టుభ, అనుష్టుభ, పంక్తి.

**పంచకర్ణవాత్స్యాయనుడు :** ఓ వేద పండితుడు. వాత్స్యుని కుటుంబంలో జన్మించడం వల్ల వాత్స్యాయనుడనేవారు. మానవుని తలలోని సప్త సూర్యులను గురించి అధ్యయనం చేసి వివరించాడు. కనుక పంచ కర్ణ వాత్స్యాయనుడు అని పిలిచేవారు.
– తైత్తరీయ ఆరణ్యకం

**పంచకర్పటం :** పశ్చిమ భారతదేశంలోని ప్రాచీన రాజ్యం. నకులుడు ఈ రాజ్యాన్ని జయించాడు.
– మహాభారతం

**పంచకుడు :** సుబ్రహ్మణ్యస్వామికి ఇంద్రుడిచ్చిన ఇద్దరు సైనికుల్లో ఒకడు. రెండోవాడు ఉత్క్రోశుడు.
– మహాభారతం

**పంచగణం :** ప్రాచీన ఉత్తర భారతదేశంలోని ఒక రాజ్యం. మహాభారత కాలంలో అర్జునుడు ఈ దేశపు రాజును ఓడించాడు. – మహాభారతం

**పంచగౌళులు :** సారస్వత, కన్యాకుబ్జ, మిథిల, గౌఢి, ఉత్కల దేశాల్లో నివసించే బ్రాహ్మణులను పంచగౌళులని పిలుస్తారు.

**పంచచూడ :** ఓ అప్సరస. వ్యాసుని కుమారుడైన శుకుడు తన యోగ విద్యతో ఆకాశంలోకి వెళ్లగా ఇతడిపై గౌరవంతో పంచచూడ ఇతర అప్సరసలతో వచ్చి అతని ముందు నిలబడ్డారు.

**పంచజని :** విశ్వరూపుని అందాల కుమార్తె, చంద్ర వంశపు రాజైన రుషభుడీమెను వివాహమాడగా ఐదు గురు కుమారులు జన్మించారు. వారు సుమతి, రాష్ట్ర భృతుడు, సుదర్శనుడు, ఆవర్ణుడు, ధూమ్రకేతుడు.
– భాగవతం

**పంచజనుడు 1 :** ఓ ప్రజాపతి. ఇతని కుమార్తె పంచనిని. ఇతని కుమార్తె అశిక్నిని ఓ గొప్ప మహర్షి అయిన దక్షునికిచ్చి వివాహం చేశాడు. – భాగవతం

**పంచజనుడు 2 :** ఇతడొక బలమైన రాక్షసుడు. ఓ శంఖంలో వుండేవాడు. శ్రీకృష్ణ బలభద్రరాముల గురువైన సాందీపుని పుత్రుడ్ని ఈ రాక్షసుడు ఎత్తుకుపోగా గురు దక్షిణగా తన కుమారుణ్ణి రక్షించమని కోరతాడు.

శ్రీకృష్ణ బలరాములు వరుణుని సహాయంతో ఈ పంచజనుడిని సంహరించి ఆ బాలుణ్ణి గురువుకప్పగించి ఆ శంఖాన్ని శ్రీకృష్ణుడు పరిగ్రహిస్తాడు. అందువల్ల శ్రీకృష్ణుడ్ని పాంచజన్యుడని కూడా పిలుస్తారు.
– *భాగవతం*

**పంచజనుడు 3 :** సంహ్లాదుని కుమారుడు.

**పంచజనులు :** బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు నాల్గు కులాలు. నిషాదులు ఐదోకులం. మొత్తం కలిపి పంచజనులంటారు. – *ఋగ్వేదం*

**పంచజుడు :** సూర్యవంశ రాజైన సాగరునికి కేశిని అనే భార్యవల్ల అసమంజసుడు జన్మించాడు. ఇతడు పంచజసుడుగా ప్రసిద్ధి కెక్కాడు ఇతడు అంశు మానుడికి తండ్రి, దిలీప చక్రవర్తికి తాత. – *హరివంశం*

**పంచతంత్రం :** ఓ ప్రాచీన గ్రంథం. ఇది కథల రూపంలో విష్ణుశర్మ రచించిన ప్రసిద్ధ గ్రంథం. చిన్న పిల్లలనుద్దేశించి జీవితంలోని వివిధ కోణాలను చక్కగా కథారూపంలో చెప్పబడిన రచన.

*రచనా నేపథ్యం :* అమరశక్తి అను రాజుకు ముగ్గురు కుమారులు. వారికి సరైన తెలివితేటలు లేవని భావించి వారికి విద్యాబుద్ధులు నేర్పనెంచగా అతని మంత్రి ఒకరు విష్ణుశర్మ అను పండితుడు మనదేశంలోనే కలడు. అతడు వీరికి తగిన విధంగా విద్యాబుద్ధులు నేర్పగలడని చెప్పగా రాజు వారిని విష్ణు శర్మకు అప్పగించగా 6 నెలలలో వీరికి కథా రూపంలో ప్రభుత్వాన్ని పాలించే విధానం నేర్పాడు. అదే పంచతంత్రం.

*పంచతంత్ర స్థూలకథ :* ఈ రచన ఐదుభాగాలు. ఒక్కో భాగం ఒక్కో ఎత్తుగడ – వ్యవహరించే విధానాన్ని తెలియజేస్తుంది. అవి మిత్రభేదం, మిత్ర లాభం (సుహృల్లాభం), సంధి, విగ్రహం, లబ్ధనాశం, అసంప్రేక్ష్యకారిత్వం.

*మిత్రభేదం :* విభజించి పాలించడమనే సూత్రాన్నిది నేర్పుతుంది. ఇందులోని ప్రధాన పాత్రలు కరటక దమనకమనే నక్కలు, సంజీవకమనే ఎద్దు, పింగళకమనే సింహం. ఇందులో జిత్తులమారి నక్కలు సింహము – ఏనుగుల స్నేహాన్ని ఎలా చెడగొట్టినవో చెప్పబడింది.

*మిత్రలాభం :* స్నేహితుల్ని ఎన్నుకొనేప్పుడు ఎంత జాగ్రత్తగా వుండాలో ఎంత బాగా అర్థం చేసుకొని స్నేహంచెయ్యాలో వివరిస్తుంది. ఇందుకు ఎన్నుకున్న పాత్రలు తాబేలు, జింక, కాకి, ఎలుక.

*సంధి విగ్రహం :* పుట్టుకతోనే శత్రువులైన వారి మధ్య స్నేహం ఎంతటి చెడుకు దారితీస్తుందో ఈ కథలోని పాత్రలు వివరిస్తాయి. ఇందులోని పాత్రలు కాకి, గుడ్లగూబ.

*లబ్ధనాశం :* మనిషి తను సంపాదించిన దాన్ని తెలివి తక్కువతనంతో ఎలా పోగొట్టుకుంటాడో వివరిస్తుంది. దీనిలోని ముఖ్యపాత్రలు ఒక కోతి, మొసలి.

*అసంప్రేక్ష్యకారిత్వం :* మనం విన్న కథలోని చెడు పార్శ్వాన్ని ఎలా గమనించామో తెలియజేస్తుంది. ఇది నిరూపించడానికి ఎన్నో కథలు ఇందులో వివరించబడ్డాయి.

*గ్రంథప్రాముఖ్యత :* మహిళారోప్యానికి అమరశక్తి రాజని దక్కనులో చారిత్రక ఆధారాలు లేకున్నా సంస్కృతం నుండి ఇది ఎన్నో ప్రపంచ భాషల్లోకి అనువదించబడింది. క్రీ.శ. 531–575 ప్రాంతాలలో పెర్షియన్, క్రీ.శ. 570లో సిరియా, క్రీ.శ. 750లో అరబిక్ భాషల్లోకి అనువదించబడగా ఈ అరబిక్ అనువాదం నుండి గ్రీకు, లాటిన్ ఇతర పాశ్చాత్య భాషల్లోకి తర్వాత అనువదించబడి బైబిల్ తర్వాత అత్యంత ప్రసిద్ధి చెంది 50 భాషల్లో 200 రకాల అనువాదాలు వచ్చినట్లుగా గొప్ప భాషాశాస్త్ర పండితుడైన హెర్బల్ పేర్కొన్నాడు.

దీనిలో రెండు రకాల రచనలున్నాయి. ఒకటి కాశ్మీరంలో ప్రసిద్ధం. దీనిపేరు తంత్రాఖ్యాయిక. రెండవది కథాసరిత్సాగరం, బృహత్కథలో చెప్పబడిన ప్రసిద్ధ కథావిధానం, కాలాన్ని బట్టి కథల్లో కూడా కొన్ని మార్పులు చోటు చేసుకోబడ్డాయి.

**పంచతీర్థం :** ఇదో పవిత్రస్థలం. ఇక్కడ గల కొలనులో వర్గ తన సహచర నల్గురు దేవకన్యలు శాపవశాన మొసళ్లుగా జీవించారు. అర్జునుడు ఈ కొలనుకు వచ్చి వారికి శాపవిమోచనం కల్గించాడు. అప్పటి నుండి ఆ కొలనుకు పంచతీర్థం లేక సౌభద్రకా తీర్థం అనే పేరు వచ్చింది.

**పంచదేవి :** దుర్గ, రాధ, లక్ష్మి, సరస్వతి, సావిత్రిలను పంచదేవి అని అంటారు. ఇవి ప్రకృతి భిన్న రూపాలు.

**పంచద్రావిడులు :** ఆంధ్ర, ద్రవిడ, కర్ణాటక, మహారాష్ట్ర, ఘూర్జర దేశాల్లోని బ్రాహ్మణులను పంచద్రావిడులని పిలుస్తారు.

**పంచధనుసుడు :** పూరు వంశంలోని ఒక రాజు. ఇతడు సృంజయుని కుమారుడు. సోమదత్తునికి తండ్రి.
– అగ్నిపురాణం

**పంచనదం 1 :** ఉత్తర భారతదేశంలోని పశ్చిమ ప్రాంతం. ఇది ఇప్పటి పంజాబ్. నకులుడు దీన్ని జయించాడు. విపాశ, షతాద్రు, ఐరావతి, చంద్రభాగ, వితస్త నదులు ఈ ప్రాంతం గుండా ప్రవహిస్తాయి. అందుకని దీన్ని పంచనదం అంటారు.

**పంచనదం 2 :** కురుక్షేత్రంలోని ఓ పుణ్యస్థలం. ఇక్కడున్న కోటి తీర్థంలో స్నానం చేస్తే అశ్వమేధ యాగం చేసిన ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**పంచపర్వాలు :** సంక్రమణ, అమావాస, పూర్ణమాసి, కృష్ణాష్టమి, కృష్ణ చతుర్ధశులను పంచ పర్వాలని పిలుస్తారు.

**పంచపాండవులు :** చూ॥ పాండవులు.

**పంచప్రాణాలు :** ప్రతిజీవి యొక్క ఐదు ప్రాణాలు (జీవశ్వాస). ఇవి ప్రాణ, అపాన, వ్యాన, సమాన మరియు ఉదాన.

*జననం :* శ్రీకృష్ణుడు రాధాదేవి నిరాస మండలంలో కలసి కామక్రీడ సలపగా ఆ ప్రాంతంలో రాధాదేవి అలసిసొలసి దీర్ఘ ఉచ్వాస నిశ్వాసలు విడచింది. ప్రపంచమంతా ఆమె చెమట ముంచెత్తింది. ఆమె జీవించే శ్వాసకు దేవతయ్యింది. ఆ దేవత ఎడమవైపు నుండి వాయుపత్ని జన్మించగా ఆమె నుండి పంచ ప్రాణాలు జనించాయి. ఇవికాక 5 ఉపప్రాణాలు జనించాయి. దేవి చెమట నుండి వరుణుడు, అతడి ఎడమ వైపునుండి వారుదేవి జన్మించారు.
– దేవీభాగవతం

పంచప్రాణాల కర్తవ్యం : మొదటి ప్రాణం జీవి నిద్రిం చేటప్పుడు లేచివున్నపుడు శ్వాసనిస్తూనే వుంటుంది. నిద్రలో లేనప్పుడు మాత్రమే మెదడు నాడులు పనిచేస్తాయి. అందుకని దీన్ని ముఖ్య ప్రాణమంటారు. అపానం పొట్ట అడుగుభాగాన వుండి మూత్ర విసర్జనకు తోడ్పడుతుంది. వ్యానం శరీర మంతా వ్యాపించి శ్వాస ఆగినపుడు కూడా కొంత సమయం జీవింపచేస్తుంది. సమాన ఉచ్వాస నిశ్వాసలను క్రమ బద్ధీకరిస్తుంది. ఉదానం శ్వాస ఆగి జీవి మరణించి నపుడు ఆత్మ బయటకు వెళ్ళడానికి తోడ్పడుతుంది.
– మాండూక్యోపనిషత్తు

**పంచబ్రహ్మాసనం :** ఇదో దివ్య మంచం. బ్రహ్మ, రుద్ర, ఈశ్వర, విష్ణువులు దీని కోళ్ళుగా వుంటారు. సదాశివుడు పరుపుగా వుంటాడు. దేవి ఎల్లప్పుడు దీనిపై పవళిస్తుంది. – దేవీభాగవతం

**పంచభూతాలు :** భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశాల్ని పంచభూతాలంటారు. మనకు కనబడే ప్రపంచ పదార్థాలన్నీ వీటివల్లే ఏర్పడినాయని చెప్తారు. అలా చెప్పే సిద్ధాంతాన్ని "పాంచ భౌతికమని" అంటారు.

**పంచమహాయజ్ఞాలు :** జల్లెడ, రుబ్బురోలు, చీపురు, రోలు, కుండలను వాడటం వల్ల పాపం కల్గుతుంది. ఈ పాపాల నివారణకు చేసే యజ్ఞాలైన బ్రహ్మ, పితృ, దేవ, భూత, మానుష యజ్ఞాలను పంచ మహా యజ్ఞా లంటారు. – మనుస్మృతి

**పంచమి :** ప్రాచీన భారతదేశంలో ఓ నది. అప్పటి ప్రజలు ఈ నది నీటిని త్రాగేవారు. – మహాభారతం

**పంచయజ్ఞం :** భారతదేశంలోని ఓ పవిత్ర స్థలం. ఈ స్థలాన్ని దర్శిస్తే మోక్షం లభిస్తుంది. – మహాభారతం

**పంచరాత్రం :** ఓ ఆగమశాస్త్రం. ఇదో తాత్విక చింతన.
– మహాభారతం

**పంచలింగాలు :** శివక్షేత్రములలో మిక్కిలి ప్రసిద్ధి చెందిన ఐదు. ఒకటి కంచి యందు, రెండు జంబు కేశ్వరమునందు, మూడు అరుణాచలమునందు, నాలుగు కాళహస్తి యందు, ఐదు చిదంబరమునందు కలవు. ఈ శివక్షేత్రములలో ప్రతిష్ఠింపబడిన శివలింగాలను పంచలింగాలు అని పిలుస్తారు.

**పంచవక్త్రుడు :** సుబ్రహ్మణ్య స్వామి తరఫున దానవులతో యుద్ధం చేసిన వీరుడు.

**పంచవటం :** శ్రీరాముడు సీతా సమేతుడై లక్ష్మణుడితో కలసి అరణ్యవాసంలో ఇచ్చట ఓ కుటీరం నిర్మించు కొని చాలాకాలం నివసించాడు.

ఇది గోదావరి నదికి పశ్చిమతీరాన వుంది. ఐదు అరటి చెట్ల మధ్య ఈ కుటీరం నిర్మించబడింది. ఈ

అరటి చెట్లకు ఓ ప్రత్యేకత వుంది. ఒకప్పుడు ఐదు గురు గంధర్వులు అగస్త్యుడు తపం చేసు కుంటుం డగా అతడ్ని ఎటూ వెళ్లనివ్వకుండా చుట్టూ నిలబడి ఆయనను ఆటపట్టించగా వీరిని అరటి బోదెలు కమ్మని ఇక్కడే నిలబడిపొమ్మని శపించగా వారు అరటి బోదెలుగా మారకముందే అగస్త్యుని ప్రార్థిం చగా శ్రీరామచంద్రుని అనుగ్రహం వల్ల మీకు ముక్తి లభిస్తుందని శాపవిమోచనం కావిస్తాడు. ఆ ఐదుచెట్ల మధ్యే శ్రీరామచంద్రుడు ఆశ్రమం నిర్మించాడు. పంచ వటాల మధ్య ఈ ఆశ్రమం నిర్మించబడింది గనుక దీన్ని పంచవటి అని పిలిచారు. – *కంభరామాయణం*

**పంచవీరుడు :** ఓ సనాతన విశ్వదేవుడు. విశ్వుని 10 మంది కుమారులైన దేవగణాలలో ఇతడొకడు.
– *మహాభారతం*

**పంచశిఖుడు :** ప్రాచీన కాలంలోని ఓ మహర్షి.

**పంచసాయకుడు :** పంచ భాగములైన అరవింద, అశోక, చూత, నవమల్లిక, నీలోత్పలాలను తన భాగ ములుగా ఉన్నవాడు కనుక మన్మథునికి పంచ సాయ కుడను పేరు వచ్చెను.

**పంచాక్షర మహాత్మ్యం :** 'నమశ్శివాయ' అనే మంత్రం ఉచ్చరించడం వల్ల కలిగే ఫలితాలు మహత్తు కల్గి వుండుటచే దాని మహత్తులను పంచాక్షర మహాత్మ్యం అంటారు. – *చూ॥ కళావతి*

**పంచాగ్ని :** మనువను అగ్నికి నిశకు జన్మించిన ఐదు గురు కుమారులను పంచాగ్నులంటారు. వారు వైశ్వా నర, విశ్వపతి, సన్నిహిత, కపిల, అగ్రణులు.

**పంచాప్సరసం :** ఇదో కొలను. దీని గొప్పతనాన్ని అగస్త్యుడు శ్రీరాముని వనవాస సమయంలో వివరిం చాడు. చాలాకాలం క్రితం మాంధకర్ణి అనే రుషి ఈ కొలను నిర్మించాడు. ఇతడు గాలిలోనే జీవిస్తూ ఈ కొలనులో నిలబడి 10,000 సంవత్సరాలు తపస్సు చేయగా ఇంద్రుడు భయపడి ఇతని తపస్సు భగ్నం చేయడానికి ఐదుగురు దేవకన్యలను పంపాడు. ఆ రుషి ఈ కొలనులోనే ఓ భవంతిని నిర్మించుకొని అప్సరసలతో గడిపి తర్వాత అతడు అప్సరసలు ఈ కొలనును వదిలారు. అయినప్పటికి ఆ తర్వాత కూడా ప్రజలు ఈ కొలను నుండి నృత్య, సంగీత శబ్దాలు వినేవారు. 5 గురు అప్సరసలు ఈ కొలనులో వున్నారు కనుక ఇది పంచాప్సరసం అని పిలవబడింది.
– *రామాయణం*

**పంచాశ్వుడు :** పురువంశంలోని ఓ రాజు.
– *చూ॥ పురువంశం*

**పంచేంద్రులు :** వైవస్వతుడి తపం కారణంగా మను జులు మరణం లేకుండుటచే మనకు మనుజుల కును బేధములేదని బ్రహ్మకు చెప్పగా యముడే వారిని సంహరిస్తాడని చెప్తాడు. అక్కడున్న శివుని ఇంద్రుడు గుర్తించక వరుణుడని తలచి పరిహసించగా శివుడు శపించిన కారణంగా ఇంద్రాదులే భూమిపై పాండవు లుగా జన్మిస్తారు. – *మహాభారతం*

**పండితకుడు :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. కురుక్షేత్ర యుద్ధంలో భీమసేనుడితణ్ణి వధించాడు. – *మహాభారతం*

**పంప :** రుష్యమూక పర్వతం దగ్గరలోని ఓ కొలను. సుగ్రీవుడు ఈ కొలను దగ్గర నివసించేవాడు.
– *రామాయణం*

**పాంచజన్యం 1 :** శ్రీకృష్ణుని శంఖం పేరు.
– *చూ॥ పంచజుడు*

**పాంచజన్యం 2 :** దాక్షిణాత్య పథంలోని రైవతక పర్వతం వద్దగల అరణ్యం. – *మహాభారతం*

**పాంచజన్యం 3 :** ఇదో అగ్ని. ఐదుగురు రుషుల వివిధ భాగాల వల్ల పుట్టింది గనుక పాంచజన్యం అంటారు. దీన్ని తపం అనికూడా పిలుస్తారు. – *మహాభారతం*

**పాంచజన్యుడు :** శ్రీకృష్ణుడి శంఖం పేరు పాంచజన్యం కనుక ఇతణ్ణి పాంచజన్యుడని కూడా పిలుస్తారు.
– *మహాభారతం*

**పాంచరాత్రం 1 :** తత్వశాస్త్రంలో ఓ విభాగం. ఇది ఆగమాలలో ఒకటి. – *మహాభారతం*

**పాంచరాత్రం 2 :** ఆధ్యాత్మిక చింతనలకు సంబంధిం చిన రచన. దీన్ని అధ్యయనం చేసినవాడు ఉపరిచర వసువు స్థానం పొందగలడు. – *మహాభారతం*

**పాంచాలం 1 :** భారతదేశంలోని ఓ ప్రాచీన దేశం. పాండవుల భార్య పాంచాలి పాంచాలి రాజైన ద్రువ రుని కుమార్తె – *మహాభారతం*

**పాంచాలం 2 :** ప్రాచీన భారతదేశంలోని ఓ గ్రామం.
– మహాభారతం

**పాంచాలుడు :** ఓ రుషి. వామదేవుని సిద్ధాంతాన్నను సరించి దేవుణ్ణి ప్రార్థించాడు. దేవుని అను గ్రహంతో వేదాలలోని క్రమ విభాగంలో ఒకడయ్యాడు.
– మహాభారతం

**పాంచాలి :** ద్రౌపది మరో పేరు. పాండవుల భార్య. మహాభారత యుద్ధానికి కారణాల్లో ఒకరైన పాంచాలికి ఎన్నో పూర్వజన్మలు కలవు. ద్రుపదుడి కుమార్తెగా జన్మించినపుడు 5 గురు భర్తలకు భార్యవు కాగలవని ఎందరో భగవంతులు వరమిచ్చారు. అవి పురాణాల లోని కథల్లో అక్కడక్కడా కన్పిస్తాయి.

*మాయాసీత :* రామలక్ష్మణులు అరణ్యవాసంలో వుండగా అగ్ని ప్రత్యక్షమై రావణుడు సీతను తీసుకుపోగలడని అందుకని సీతను తాను తీసుకొని వెళ్లి దాస్తానని ఆమె బదులు అదే రూపంలోని ఓ స్త్రీని సీత బదులు ఇచ్చట వుంచి వెళ్తానని చెప్పి సీత ఛాయ నుండి జన్మించిన మాయా సీతను ఆశ్రమంలో వుంచి నిజ సీతను అగ్ని దాస్తాడు. రావణుడు లంకకు తీసుకు వెళ్లింది ఈ సీతనే. రామరావణ యుద్ధానంతరం మాయాసీత తన కార్యం ముగిసి రాముని ముందు మోకరిల్లగా అతడాశీర్వదించి తపస్సు చేయమని చెప్తాడు. ఆమె శివుని గూర్చి తపస్సు చేయగా శివుడు ప్రత్యక్షమై వరం కోరుకొమ్మనగా "భర్త కావాలని" పదే పదే ఉచ్చరించగా నీ తర్వాతి జన్మలో ద్రుపదుని కుమార్తెగా జన్మిస్తావని, అప్పుడు మహనీయులయిన 5 గురు భర్తలకు భార్యవు కాగలవని వరమిస్తాడు. ఆ వర ప్రతిఫలమే ద్రౌపది జననం.

*నీలాయని/ఇంద్రసేన :* మరో జన్మలో ఈమె ముద్గల్యుని భార్యగా జన్మించి అతనికి సకల పరిచర్యలు చేస్తుంది. అతడు ముదుసలి. చివరి రోజుల్లో అతడు కుష్టువ్యాధిగ్రస్తుడవుతాడు. అయినా ఆమె అతడిని సేవిస్తూనే వుంటుంది. ఒకరోజు ఆమె తినే ఆహారంలో అతడి కాలువిరిగి పడుతుంది. అయినా అదే ఆహారాన్ని భుజిస్తుంది. ఆమె సేవకు మెచ్చి ఆమెను వరం కోరుకొమ్మని ముని కోరగా అతనితో 5 రూపాల్లో కామేచ్ఛ తీర్చుకోవాలని కోరుతుంది. అలా అతడు ఆమెను సంతృప్తి పరచడానికి ప్రయత్నించి తర్వాత తపస్సు చేయ నిర్ణయించుకోగా సంతృప్తి చెందని ఆమెను ముద్గల్యుడు తర్వాతి జన్మలో ద్రుపదనందనగా జన్మించి 5 గురు భర్తలకు భార్యకాగలవని శపిస్తాడు. ఆ శాపఫలమే ద్రౌపది జననం. ఈమె ఐదుగురు భర్తలైనను తన కన్యత్వానికి ముప్పురానట్లు వరం కోరుకుంటుంది. శివుడు గంగా జననం దగ్గరకు వెళ్ళి అక్కడొక అందమైన యువకుడుంటాడు అతణ్ణి తీసుకురమ్మని ఆదేశిస్తాడు. అదే సమయంలో కాలుడు నైమిశారణ్యంలో యజ్ఞం చేస్తుంటాడు. అది కలకాలం కొనసాగుతుండగా మరణాలు సంభవించవు. దేవతలు ఈ చిత్రానికి భయపడి బ్రహ్మ వద్దకు వెళ్లగా అతడు వారందరిని కాలుని దగ్గరకు పంపుతాడు. ఆ సమయంలో గంగానదిలో బంగారు పుష్పాలు పయనిస్తూ వుంటాయి. దీనికి ఆశ్చర్యపడిన ఇంద్రుడు ఆ పుష్పాలు వచ్చే దిక్కుగా పయనించి గంగా జననం వద్దకు వెళ్లగా నీలాయని అతణ్ణి శివుని వద్దకు తీసుకొని వెళ్తుంది. శివపార్వతులు పాచికలాడుతూ వుండగా వారిని ఇంద్రుడు గుర్తించక పోవడంతో శివుడు అతని వెంటపడగా అతడు పారిపోయి ఓ గుహద్వారం వద్దకు చేరతాడు. శివుడు నీలాంటి ఇంద్రులు నా దృష్టిలో నల్గురు ఈ గుహలో వున్నారు చూడమనగా అది చూసి ఇంద్రుడు ఆశ్చర్యపోగా మీ ఐదుగురు మానవ జన్మ ఎత్తి నీలాయనికి భర్తలు కాగలరని శపిస్తాడు. ఇంద్రుడు అతని అంశలు నల్గురు పాండవులుగా జన్మిస్తారు. అలా జన్మించడానికి ముందే వారు మహావిష్ణును ప్రార్థించగా అతడు తన శరీరం నుండి రెండు వెంట్రుకలు లాగి వారికిచ్చి మీరు పాండవులుగా జన్మించినపుడు వీరు మీకు సహాయపడగలరని వరమిస్తాడు. ఆ ఇద్దరే బలరామకృష్ణులు.

*పాంచాలి జననం–వివాహం :* ద్రోణునిచే పరాభవింపబడి ద్రుపదుడు ప్రతీకారేచ్ఛతో ద్రోణుని జయించగల కుమారుడు కావాలని యజ్ఞం చేయగా అందుండి ఓ బాలిక, ఓ బాలుడు జన్మిస్తారు. యజ్ఞం నిర్వహించిన యాజి, ఉపయాజులు వారికి ధృష్టద్యుమ్నుడని, కృష్ణయని నామకరణం చేస్తారు. ఇలా జన్మించిన

కృష్ణయే పూర్వజన్మమున మాయాసీత, నీలాయని. తదనంతరం పాంచాల రాజ కుమార్తె గనుక పాంచాలి అని, ద్రుపదనందన కనుక ద్రౌపది అని పిలువబడింది. ఇదే కాలంలో దుర్యోధనుని దుశ్చర్యలలో భాగమైన లక్క ఇంటిని దహింపచేయగా పాండవులు తప్పించు కొని ఏకచక్ర పురంలో బ్రాహ్మణ వేషంలో జీవిస్తుం టారు. ద్రౌపదికి సరిజోడు అర్జునుడేయని తలచి నప్పటికి, లక్క ఇంటిలో పాండవులు మరణించారని తెలిసి గత్యంతరం లేక ద్రౌపదీ స్వయంవరం ప్రకటిం చగా బ్రాహ్మణ వేషంలో వున్న అర్జునుడు మత్స్య యంత్రాన్ని బేధించి ద్రౌపదిని చేపట్టగా తల్లి కోర్కెపై పాండవులైదుగురు ఆమెను వివాహమాడతారు.

*మహాభారతంలో ద్రౌపది పాత్ర :* ధర్మజుడ్ని దుర్యోధ నుడు పాచికల ఆటకు ఆహ్వానించి మాయజూదంలో ఓడించాడు. చివరకు ద్రౌపదిని కూడా పణంగా పెట్టి పాచికలాటలో ధర్మజుడోడిపోగా దుశ్శాసనుడు ద్రౌప దిని వివస్త్రను గావించబోగా కృష్ణుడు రక్షిస్తాడు. అప్పుడు ద్రౌపది కౌరవుల వినాశనానికి శపధం చేసింది. ధృత రాష్ట్రుడు పాండవుల రాజ్యం మరల వారికి యివ్వగా దుర్యోధనుడు మరల పాచికల ఆటలో శకుని సహా యంతో ధర్మజుని ఓడించి 12 ఏళ్లు అరణ్యవాసం 1 ఏడు అజ్ఞాత వాసం పంపుతాడు.

అరణ్యవాస సమయమున ద్రౌపదిని ఎత్తుకుబోజూసిన జయద్రధుడ్ని భీముడు ఓడించి పరాభవిస్తాడు. అజ్ఞాత వాస సమయంలో విరాటుని కొలువులో వుండగా కీచకుడీమెను బలాత్కరించబోగా అతడిని భీముడు వధిస్తాడు. అజ్ఞాతవాసంలోని ద్రౌపదే దీనికి కారణ మని ఉపకీచకులు ఈమెను అవమానింపబోగా వారిని భీముడు వధిస్తాడు. పాండవులు అరణ్య అజ్ఞాత వాసా నంతరం శ్రీకృష్ణుడు సంధికొరకు రాయబారం నడప డాన్ని ద్రౌపది వ్యతిరేకిస్తుంది. కురుక్షేత్ర యుద్ధం ముగింపు దశలో అశ్వత్థామ అర్ధరాత్రి పాండవుల గుడారంలో ప్రవేశించి నిద్రిస్తున్న వారి నందరిని వధించినపుడు ఈమె పుత్రులైన ప్రతి వింధ్య, శృత సోమ, శృతకీర్తి, శాతానిక, శృతకర్మలు కూడా వధింపబడతారు.

యుద్ధానంతరం ధర్మజుడు కొంతకాలం రాజ్య పాలన చేసి అభిమన్యుని కుమారుడైన పరీక్షిత్తుకు పట్టాభిషేకం చేసి తక్కిన పాండవులు ద్రౌపదితో స్వర్గారోహణానికి బయలుదేరగా మొదట ద్రౌపదే మృతిచెందుతుంది. భీముడు ధర్మజుడ్ని కారణ మడగగా ఆమెకు ఐదుగుర్ని వివాహమాడినా అర్జునుని యందు ఎక్కువ ప్రీతి కల్గియుండుటయే కారణమని వివరిస్తాడు.

**పాంచాలికుడు (పాంచాలికేశుడు) :** కుబేరుని కుమారు డైన ఓ యక్షుడు. భారతదేశంలోని కొన్ని ప్రాంతాలలో ఇతడి విగ్రహానికి పూజలు చేస్తారు. పాంచాలికుడికి ఇతణ్ణి పూజించిన పురుషుడుకిగాని స్త్రీగాని ఉత్సా హం, ఉద్వేగాలు కల్గుతాయని వరమిచ్చాడు.

*వరానికి వెనుకగల కథ :* దక్షయజ్ఞంలో శివుని భార్య సతి యజ్ఞగుండంలో దూకి మరణించగా శివుడు వగచి ఆమెను తలస్తూ లోకమంతా తిరుగుతూ నిర్వి కారంగా జీవిస్తుండగా దేవతల కోర్కెపై కామ దేవుడు శివునిపై ఓ బాణం విసరగా శివునికి మోహం పెరిగి అది భరించలేక కాళింది నదిలో దూకగా ఆ నది నీరు నల్లబడింది. శివుని ఆత్మను భరించలేక కాళింది నదినుండి పారిపోగా కామదేనువు మరో అస్త్రమైన ఉన్మాదాస్త్రాన్ని శివునిపై ప్రయోగించాడు. ఈ రెండు అస్త్రాల తాకిడిని భరించలేక తనకెదురైన కుబేరుని కుమారుడైన పాంచాలికుడ్ని ఈ బాణాల శక్తిని గ్రహిం చమని కోరగా అతడు స్వీకరించాడు. శివుడు అందుకు ప్రతిఫలంగా నిన్నుప్రజలు చైత్రమాసంలో పూజిస్తారని అలా పూజించినవారి ఉడిగిన శక్తి మరల పొందగ లరని వరమిస్తాడు. అప్పటినుండి పాంచాలికుడికి పాంచాలకేశుడను పేరు సార్థకమయ్యింది.

**పాంచాల్యం :** ప్రాచీన భారతదేశంలోని ఓ ఆశ్రమం. పాంచాల రాజైన న్యాగ్రోధుడు ఇక్కడ ఎంతోకాలం తపస్సు చేశాడు. – మహాభారతం

**పాండరం :** ఐరావతుని వంశంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో బూడిదై మరణించింది. – మహాభారతం

**పాండవులు :** పాండురాజుకు అతని భార్యలైన కుంతి మాద్రిల క్షేత్రబీజమున జన్మించిన పుత్రులు. వారు ధర్మజ భీమసేన అర్జున నకుల సహదేవులు.

– *చూ॥ ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకుల సహదేవులు.*

**పాండుడు :** ఆర్యావతికి కణ్వుని వల్ల జన్మించిన కుమారుల్లో ఒకడు. ఇతడు సరస్వతీ పుత్రికని వివాహమాడగా 17 మంది సంతానం జన్మించారు. వీరు పదముగ్గురు విధ తెగలకు మూలపురుషులు.

– భవిష్యపురాణం

**పాండురాజు :** పాండవుల తండ్రి.

*జన్మవృత్తాంతం :* చంద్రవంశపు రాజైన శంతనునికి ఇద్దరు భార్యలు. గంగ, సత్యవతి. సత్యవతికి పరాశరునివల్ల వ్యాసుడు జన్మించాడు గాని ఆ మహర్షి వరం వల్ల ఆమె కన్యత్వం పోలేదు. ఆమెకు శంతనునివల్ల ఇద్దరు కుమారులు 1) చిత్రాంగదుడు, 2) విచిత్రవీర్యుడు. శంతనుడు సత్యవతికిచ్చిన మాట ప్రకారం రాజ్యాధికారం సత్యవతి పుత్రులకే దక్కుతుంది. చిత్రాంగదుడు చనిపోగా శంతనుని కుమారుడైన భీష్ముడు (గంగా తనయుడు) అంబిక, అంబాలిక అను కాశీరాజు కుమార్తెలకు వివాహం చేశాడు. వంశాంకురం లేకుండానే విచిత్ర వీర్యుడు చనిపోగా సత్యవతి వంశాన్ని వృద్ధి చేయడానికి వ్యాసుడుని కోరగా ఒకరోజు అంబికతో మరోరోజు అంబాలికతో మరోరోజు దాసితో గడిపాడు. వ్యాసుని రూపం గడ్డం మురికి శరీరం అంటుకుపోయిన జుట్టు చూసి కళ్ళు మూసు కున్న అంబికకు గుడ్డివాడైన ధృతరాష్ట్రుడు, ఈ రూపం చూసి పాలిపోయిన అంబాలికకు పాలిపోయిన తెల్లని శరీరంతో జన్మించిన పాండురాజు; సంతోషంతో ఆహ్వానించిన దాసికి విదురుడు జన్మించారు. – మహాభారతం

*బాల్యం : రాజ్యాధికారం, వివాహం :* భీష్ముడు ధృతరాష్ట్రుడిని, పాండురాజును, విదురుడిని తన పుత్రుల వలె పెంచి వారికి వేదాలు, ధనుర్విద్య, న్యాయ శాస్త్రాల గురించి బోధించాడు. ధృతరాష్ట్రుడు గుడ్డివాడు, విదురుడు దాసి కుమారుడు అగుటవలన పాండురాజును యువరాజును చేశాడు. భీష్ముని కోరికపై వసుదేవుని సోదరి, కుంతిభోజుని దత్తపుత్రిక అయిన కుంతిని, మద్రరాజు కుమార్తె అయిన మాద్రిని వివాహమాడాడు. ఎన్నో రాజ్యాలపై దండెత్తి తన జైత్రయాత్రలతో రాజ్యాన్ని సంపన్నవంతం చేశాడు.

*పాండురాజు మరణం – పాండవుల జననం :* ఒక రోజు పాండురాజు తన భార్యలతో అడవికి విహార యాత్రకువెళ్ళి లేడిరూపంలో వున్న కందముని పై తన సహజ కుతూహలంతో ఓ బాణాన్ని సంధించి వధించాడు. కందముని మరణిస్తూ నేను నా భార్యతో క్రీడించుచుండగా నన్ను వధించావు కనుక నీ భార్యలను తాకినంతనే నీవు మరణిస్తావని శపించాడు. అనూహ్యంగా ఇది మరచి మాద్రిని ఆలింగనం చేసుకోగా వెంటనే అరణ్యంలోనే మరణించాడు. కుంతి బాల్యంలోనే దూర్వాసుని అనుగ్రహంవల్ల ఓ మంత్రం పొందింది. ఆ మంత్ర మహిమ 5 సార్లే వుంటుంది. కుంతికి మొదటి మంత్రం పరీక్షించబోయి వివాహానికి ముందే కర్ణుడు, పాండురాజు మరణానంతరం 3 మంత్రాలవల్ల ధర్మజ భీమార్జునులు జన్మించారు. ఐదో మంత్రాన్ని మాద్రికుపదేశించారు. దానివల్ల నకుల సహదేవులు జన్మించారు.

పాండురాజును భారత, భారతర్షభ, భారతశతాత్మ, కౌరవ, కౌరవ నందన, కురుద్వహ, కురుకులోద్వహ, కురునందన, కురుపతి, కురుప్రవీర అనే ఇతర పేర్లతో పిలిచేవారు.

**పాండ్య :** దక్షిణభారతదేశంలోని పురాణప్రసిద్ధ స్థలం. చేర, చోళ, పాండ్యరాజ్యాలు ప్రాచీనకాలం నుండి దక్షిణాపథంలో ప్రముఖ రాజ్యాలు. పాండ్యరాజ్యం చారిత్రకంగా పురాణ ప్రసిద్ధమైన రాజ్యం.

*చారిత్రకత :* ఇదో ప్రాచీన రాజ్యం. క్రీ.పూ. 4వ శతాబ్దంలో మెగస్తనీస్ ఈ రాజ్యాన్ని గూర్చి పేర్కొన్నాడు. ఇటలీ చక్రవర్తి క్రీ.పూ. 361 లో పాండ్యులు తనను దర్శించినట్లు పేర్కొన్నాడు. క్రీ.శ. 7వ శతాబ్దంలో కతుంకుడు ఈ రాజ్యాన్ని పునర్మించాడు. అప్పటి నుండి 16వ శతాబ్దం వరకు మధుర రాజధానిగా పాలించాడు. ఉచాంగి వంశం కూడా పాండ్య వంశపు సంతతి అనేవారు. వీరు క్రీ.శ. 9వ శతాబ్దం నుండి 13వ శతాబ్దం వరకు తుంగభద్రా నదికి దక్షిణ ప్రాంతాన్ని పాలించారు. పాండ్యరాజులు శివ భక్తులు. ఒక్కోసారి చేర, చోళ దేశాలను కూడా వీరే పాలించారు. 12, 14 శతాబ్దాల మధ్య దక్షిణ భారత దేశంలో నెల్లూరు వరకు పాలించారు. ఢిల్లీ సుల్తానుల శక్తి పెరిగిన తర్వాత ఈ వంశం నశించింది. ఆ మధ్య ప్రాంతాల లోనే కేరళకూడా పాండ్యరాజ్యం నుండి విడిపోయింది.

పురాణకథ : పాండ్యరాజైన మలయద్వజుని తండ్రిని శ్రీకృష్ణుడు సంహరించగా మలయద్వజుడు తన సైన్యంతో ద్వారకపై దండెత్తబోగా స్నేహితులు నివారించారు. ఇతడు అప్పుడప్పుడు ధర్మజుని సభకు వెళ్ళేవాడు. రాజసూయయాగానికి బహుమతులు అందజేశాడు. పాండ్యరాజు కురుక్షేత్ర యుద్ధంలో తన సేనలతో పాండవులవైపున పోరాడాడు. ద్రోణుడిని గాయపరిచాడు. ఇతడు అశ్వత్థామతో కూడా పోరాడాడు. – మహాభారతం

**పాండు రాష్ట్రం :** ప్రాచీన భారతదేశంలోని ఓ నివాస యోగ్య ప్రాంతం. – మహాభారతం

**పాండురుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. – మహాభారతం

**పాండ్యుడు :** శివభక్తుడైన ఓ విదర్భ రాజు. ఇతడో రోజు సాయంత్రం శివుని గూర్చి పూజచేస్తున్న సమయంలో పరదేశ రాజులు తన కోటపైకి యుద్ధానికి వచ్చారని తెలిసి పూజ మధ్యలోనే లెగిసి వారిని సంహరించి పూజ ముగించకుండానే వెళ్లి ఆహారం తీసుకున్నాడు. అదో పాపం కావడం వల్ల తర్వాతి జన్మలో సత్యరథుడను రాజుగా జన్మించి శతృవుల చేతిలో మరణించాడు. – శివపురాణం

**పాండ్యులు :** చూ॥ పాండ్యం.

**పాంశువు :** భారతదేశంలోని ఓ ప్రాచీన రాజ్యం. ఈ దేశ రాజైన వసుదానుడు 26 ఏనుగులు, 2000 గుర్రాలను పాండవులకిచ్చి కురుక్షేత్ర యుద్ధంలో వారికి సాయపడ్డాడు. – మహాభారతం

**పింగతీర్థం :** ప్రాచీన భారతదేశంలోని ఓ పుణ్యస్థలం. – మహాభారతం

**పింగళ 1 :** అవంతీ దేశంలో జన్మించిన ఓ వేశ్య. రుషభుడను మహర్షికి చేసిన సేవలవల్ల తరువాతి జన్మలో చంద్రాంగదుడను రాజు కుమార్తె కీర్తి మాలినిగా జన్మించి భద్రాయుడిని వివాహమాడింది.

**పింగళ 2 :** అయోధ్యా నగరంలో నివసించిన స్త్రీ. ఈమె శ్రీరామునిపై మక్కువతో అతని వద్దకు వెళ్లగా "నేను ఏక పత్నీ వ్రతుడను, తర్వాతి జన్మలో శ్రీకృష్ణుడిగా జన్మించి కంసుడి సేవికగా వున్న నిన్ను వివాహమాడెదను అని అభయమిచ్చెను. ఇది విన్న సీత ఈమెను మూడు వంకరలతో జన్మిస్తావని శపించగా ఈమె సీతను ప్రాధేయపడగా శ్రీకృష్ణుడు నిన్ను సస్వరూపిణిగా మార్చుతాడని శాపవిమోచనమిచ్చింది. – *ఆనందరామాయణం.*

**పింగళరాజు :** ఓ యక్షుడు. స్మశానవాటికలో వుంటాడు. ఇతడు శివునికెల్లప్పుడు ముందుండి దారి చూపుతారు. – మహాభారతం

**పింగళుడు 1 :** ఓ దేవుడు. సూర్యదేవుని సేవకుడు. సూర్యదేవుని రథంపై కుడివైపున దండి, ఎడమవైపున పింగళుడు కూర్చొని వుంటారు. – అగ్నిపురాణం

**పింగళుడు 2 :** ఓ రుషి. జనమేజయుని సర్పయాగం నిర్వహించిన పురోహితుల్లో ఒకడు. – మహాభారతం

**పింగళుడు 3 :** యక్షరాజు. శివుని స్నేహితుడు. స్మశాన సంచారంలో శివుడు వున్నపుడు అతనికి రక్షకుడుగా వుంటాడు. ఇతడు ప్రజలందరికి సంతోషాన్ని పంచుతాడు. – మహాభారతం

**పింగళుడు 4 :** దుర్గుణాలున్న బ్రాహ్మణుడు. వేశ్య అయిన ఇతని భార్య ఇతడిని చంపగా తర్వాతి జన్మలో ఇతడు రాబందుగా, ఇతని భార్య చిలుకగా జన్మిస్తారు. రాబందు పగతో ఈ చిలుకను చంపగా ఆ తర్వాత ఓ సింహం రాబందుని తినివేస్తుంది. ఓ బ్రాహ్మణుడు గీతలోని 5వ అధ్యాయం వీరి ఆత్మలకు చదివి విన్పించగా ముక్తి లభిస్తుంది. – పద్మపురాణం

**పింగళుడు 5 :** ఓ రాక్షసుడు. ఇతడు అడవిలో తిరుగుతుండగా ఓ ఆటవికుడు భయపడి శమీ వృక్షం ఎక్కగా ఓ కొమ్మవిరిగి ఆ చెట్టుక్రింద నున్న గణేశుడిపై పడగా అదో పూజగా భావించబడి ఆటవికుడు, రాక్షసుడు ఉన్నతి పొందుతారు. – గణేశపురాణం

**పింగళుడు 6 :** పంచతంత్రంలోని ఓ పాత్ర.

– *చూ॥ పంచతంత్రం*

**పింగాక్షి :** సుబ్రహ్మణ్యస్వామి స్త్రీ సేవిక. – మహాభారతం

**పింగాక్షుడు :** చూ॥ దుర్ముఖుడు.

**పింజరకుడు :** కద్రువవల్ల కశ్యపునికి జన్మించిన పుత్రుడు. – మహాభారతం

**పింజల :** పురాణ కాలం నాటి ప్రసిద్ధ నది. దీని ఘనత మహాభారతంలో వివరించబడింది.

– మహాభారతం

**పిండసేక్తం :** తక్షకుని వంశంలోని ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో బూడిదై మరణించింది. – మహాభారతం

**పిండారకం 1 :** కశ్యపుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. ఇది జనమేజయుని సర్పయాగంలో మరణించింది. – మహాభారతం

**పిండారకం 2 :** సౌరాష్ట్రంలోని ద్వారక వద్దగల పవిత్ర స్థలం. ఇక్కడున్న నదిలో స్నానం చేస్తే కావలసి నంత బంగారం లభిస్తుంది. ఈ స్థలాన్నిమునులు పూజించారు. ఇక్కడొక రోజు విశ్రమించి ఇచ్చటి నదిలో స్నానం చేస్తే అగ్నిస్థోమయాగం చేసిన ప్రతిఫలం లభిస్తుంది. – మహాభారతం

**పిండిక :** దేవతావిగ్రహాలను ప్రతిష్టించే ఓ పరికరం. ఈ పరికరం పొడవు విగ్రహంతో సమానంగా వుండాలి. వెడల్పు అందులో సగం అంతే మందంతో వుండాలి. విగ్రహాన్ని ప్రతిష్టించే స్థలాన్ని మేఖలం అని అక్కడుండే రంధ్రం ఉత్తరానికి వంగి వుండాలి. దేవాలయాన్ని ఏడు విభాగాలుగా చేసి పిండికను గర్భగృహంలోని బ్రహ్మభాగంలో వుంచాలి. – అగ్నిపురాణం

**పుంచుడు :** సూర్యవంశపు రాజు. హరితుని కుమారుడు. విజయునికి తండ్రి. – బ్రహ్మాండ పురాణం

**పుంజికస్థల 1 :** ఓ దేవకన్య. బృహస్పతి సేవిక. ఓ రోజు ఉద్యానవనంలో కొన్ని జంటలు శృంగార కేళిలో గడపడం చూసి ఆమెలో కోర్కె జనించి భర్తలేనందుకు చింతించి ఆశ్రమానికి వెళ్ళి బృహస్పతి చెయ్యి పట్టుకోగా అతడీమెను చూసి కోతిగా జన్మించమని శపిస్తాడు. ఈమె అతని పాదాలపై పడగా అతడు దయతో నీ కోతి జన్మలో నీవెన్నుకొనే భర్త దొరుకుతాడని, నీకు శివప్రసాదియైన కుమారుడు జన్మిస్తాడని చెప్తాడు. ఆ శాప ఫలమున ఈమె అంజనగా జన్మించి కేసరిని వివాహమాడి శివుని వీర్యం ఈమె గర్భంలో చేరడంవల్ల రామాయణ ప్రసిద్ధుడైన హనుమంతుడు జన్మిస్తాడు. – కంభ రామాయణం

11 మంది దేవకన్యలలో ఈమె ఒకరు. ఈమె కుబేరుని కొలువులో నృత్యం చేస్తుంది. హనుమంతుడి జననంతో శాపవిమోచనమౌతుంది. – మహాభారతం

**పుంజికస్థల 2 :** ఓ అప్సరస. రావణుడీమెను బలాత్కరిస్తాడు. ఈమె బ్రహ్మకు చెప్పుకోగా అన్యకాంతను స్పృశిస్తే తల పగులుతుందని బ్రహ్మ రావణుడిని శపిస్తాడు. – రామాయణం

**పుండరీక :** వశిష్ఠుడి కూతురు. ప్రాణుడి భార్య. ఈమె కొడుకు ద్యుతిమంతుడు. – బ్రహ్మపురాణం

**పుండరీకం 1 :** ఓ గొప్ప యజ్ఞం – మహాభారతం

**పుండరీకం 2 :** కురుక్షేత్రానికి దగ్గరలోని ఓ పుణ్యస్థలం. ఇక్కడ గల కొలనులో స్నానంచేస్తే పుండరీక యజ్ఞం చేసిన ఫలితం లభిస్తుంది. ఇక్కడే మహావిష్ణువు పుండరీకుడికి మోక్షం ప్రసాదించడం వల్ల ఈ స్థలానికి ఆ ప్రాముఖ్యత కల్గింది. – మహాభారతం

**పుండరీకం 3 :** అష్టదిగ్గజాల్లో ఒకటి.

– చూ॥ అష్ట దిగ్గజాలు

**పుండరీకాక్షుడు :** విష్ణువుకు మరో పేరు. తామరల వంటి కన్నులు కలవాడు గనుక ఈ పేరు వచ్చింది.

**పుండరీకుడు 1 :** శ్రీరాముని వంశంలో జన్మించిన రాజు. ఇతడు హరితుని కుమారుడు. ఇతని కుమారుడు విజయుడు. – బ్రహ్మాండపురాణం

**పుండరీకుడు 2 :** ఓ బ్రాహ్మణుడు. నారదుని జీవనకాలంలో జీవించాడు. 'అదృష్టం' పై వీరిద్దరు పండిత చర్చ జరిపారు. ఒకసారి ప్రత్యక్షంగా మహా విష్ణువుని దర్శించి అతనిలో సాయుధ్యం పొందాడు. – మహాభారతం

**పుండరీకుడు 3 :** నభుడి కొడుకు. ఇతని కొడుకు క్షేమధ్వనుడు. – భాగవతం

**పుండరీకుడు 4 :** జహ్నుడను ముని కుమారుడు. ఇతడు తల్లిదండ్రులకు సేవచేయక తన సుఖసంతోషములే ప్రాధాన్యముగా తిరుగుచుండువాడు. ఒకనాడు కుక్కుటముని ఆశ్రమము వద్దకుపోగా ఆ ముని హితబోధవలన గంగా స్నానము కంటెను తల్లిదండ్రుల సేవ పరమ పవిత్రమని గ్రహించి వెనుదిరిగి తల్లిదండ్రుల సేవే పరమ పవిత్రముగా నొనర్చు చుండగా శ్రీమహావిష్ణువు వచ్చినను తల్లిదండ్రుల పరిచర్యలు పూర్తియగు వరకు వేచియుండమని ఒక ఇటుకను చూపెను. అతని మాతృమూర్తుల భక్తికి మెచ్చి అతనిని మహావిష్ణువు తనలో సాయుధ్యము చేసుకొనెను. ఆ ప్రాంతాన్ని పుండరీకమని, పండరీపురమని/పాండు రంగ క్షేత్రమని పిలుస్తారు. – భవిష్యపురాణం

**పుండరీక ముఖుడు :** ఓ సుప్రసిద్ధుడైన సర్పరాజు. ఇతడోబంగారంతో నిర్మించబడిన నగరంలో నివసిస్తూ వుండేవాడు. ఇతని అనుచరులు, గంధర్వులు, కిన్నెరలు ఇచట నివసించేవారు. లలితుడను గంధర్వుడు, వీరధ న్వుడను గంధర్వుని కుమార్తె లలితను వివాహ మాడెను. సర్పరాజు కోర్కెపై లలితుడు గానం చేస్తూ భార్యను తలచి లయతప్పుటచే అతని అనుచరుని ద్వారా కారణం తెలుసుకున్న సర్పరాజు లలితుడ్ని రాక్షసి కమ్మని శపించాడు. రాక్షసిగా మారిన లలితుడు అడవిలో తిరుగాడు తుండగా అతని భార్య విచారంతో భర్తకోసం అడవంతా తిరుగుతూ ముని ఉపదేశంతో ఏకాదశవ్రతం చేయగా భర్తకు శాపవిమోచనం జరిగి మరల గంధర్వలోకం చేరతాడు. – పద్మపురాణం

**పుండరీయకుడు :** ఓ విశ్వదేవుడు. – మహాభారతం

**పుండ్రం :** ప్రాచీన భారతదేశంలోని ఓ రాజ్యం. కోశీనదికి తూర్పు దిక్కున వున్న ప్రాంతం. పాండు రాజు ఒకసారి దీన్ని జయించాడు. ఈ దేశ రాజైన పుండ్రక వాసుదేవుడ్ని శ్రీకృష్ణుడు ఓడించాడు. ఈ దేశాన్ని వేర్వేరు సమయాల్లో అర్జునుడు, కర్ణుడు జయించారు. ధర్మజుని రాజసూయ యాగంలో ఈ దేశ ప్రజలు కానుకలిచ్చారు. – మహాభారతం

**పుండ్రుడు :** ప్రాచీ భారతదేశంలోని ఓ రాజు. – మహాభారతం

**పైంగుడు :** జాతకర్ణి వల్ల రుగ్వేద సంహితను ఉపదేశం పొందాడు. – భాగవతం

**పౌండ్రకం :** యముని వాహనమైన జడలబర్రె. – వామన పురాణం

**పౌండ్రక వాసుదేవుడు :** ప్రాచీన భారతదేశంలో కారూష రాజ్యానికి రాజు. ఇతడు శ్రీకృష్ణుడికి తనే వాసు దేవుణ్ణని నీ రాచరికం వదలి నా పాదలపై పడి శరణు వేడమని కబురు చేయగా శ్రీకృష్ణుడు కుపితుడై ఇతనిపై సైన్యసమేతుడై యుద్ధంచేసి సంహరించాడు. – భాగవతం

**పౌండ్రకుడు :** నికుంభుని కుమారుడు. రామ రావణ యుద్ధంలోని కుంబుడు మరణించగా ఇతడు రాము నితో పోరి మరణించాడు. – ఆనంద రామాయణం

**పౌండ్రం :** భీమసేనుని శంఖం పేరు. ఇతడు కురుక్షేత్ర యుద్ధం ప్రారంభ సమయంలో ఒకసారి, దుర్యోధ నుని మరణానంతరం ఒకసారి పూరించాడు. – మహాభారతం

**పౌండ్రుడు :** పౌండ్రదేశపు ప్రజల్ని, ఈ దేశపు రాజుని ఈ పేరుతో పిలుస్తారు. ఈ దేశాన్ని శ్రీకృష్ణుడు, కర్ణుడు వేరు వేరు సమయాల్లో జయించారు. దీన్ని పుండ్రం అనికూడా అంటారు. – మహాభారతం

**పౌండ్రమాత్స్యకుడు :** ఓ క్షత్రియరాజు. దశాయుడు అనేస్త్రీకి, వీర అనే రాక్షసుని వల్ల జన్మించాడు. – మహాభారతం

**పృతన :** సైన్యంలోని ఓ విభాగం. – చూ॥ అక్షౌహిణి

**పృథ :** పాండురాజు భార్య అయిన కుంతి జన్మించి నప్పుడు పెట్టిన పేరు. – చూ॥ కుంతి

**పృథాశ్వుడు :** యముని పూజించే ప్రాచీన భారతీయ రాజు. – మహాభారతం

**పృథుకం :** రైవత మన్వంతరంలోని ఓ దేవ గణం.

**పృథుకర్ముడు :** యదువంశంలోని వాడు – భాగవతం

**పృథుకీర్తి :** యదువంశంలోని వాడు – భాగవతం

**పృథుదాసుడు :** యదువంశంలోనివాడు. – భాగవతం

**పృథుగ్రీవుడు :** రామలక్ష్మణులు పంచవటిలో వుండగా లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులు కోయగా ఖర, దూషణుల నాయకత్వంలో ఓ రాక్షస సేన వీరిపై యుద్ధానికి వచ్చింది. అందులోని 12 మంది వీరుల్లో పృథుగ్రీవుడు ఒకరు. – రామాయణం

**పృథుడు :** అసేనసుడి కుమారుడు. ఇతని కుమారుడు యశ్వగంధుడు. – భాగవతం

**పృథుదర్భుడు :** అంగవంశంలోని ఒక రాజు. – అగ్నిపురాణం

**పృథుయశుడు :** యదు వంశంలోని వాడు. – భాగవతం

**పృథురశ్మి :** యతులనబడే వారిలో ఒకడు. యతులు యజ్ఞాలను నిరసించేవారు. ఇంద్రుడి కోపానికి మాడి పోయారు. అయితే ముగ్గురు యతులైన బృహద్గిరి, రయోవాజ, పృథురశ్మిలను మాత్రం రక్షించి వీరికి, బ్రహ్మవిద్య, క్షత్రియవిద్య, వైశ్యవిద్య నేర్పాడు. పృథు

రశ్మి మాత్రం క్షత్రియవిద్యతోపాటు క్షాత్ర తేజం కూడా కావాలని ఇంద్రుడిని కోరాడు. ఇప్పటికీ పృథురశ్మి పేరుతో ఓ సామం వుంది. (పంచముఖ బ్రాహ్మణ)

**పృథులాక్షుడు :** అంగ వంశంలో జన్మించిన రాజు. ఇతడు యముని కొలువులో అతడ్ని పూజిస్తుంటాడు.
– *మహాభారతం*

**పృథురాశ్వుడు :** ఇక్ష్వాకు వంశంలోని ఒక రాజు. ఇతడు పృథుని కుమారుడు. అద్రుడికి తండ్రి.
– *బ్రహ్మాండ పురాణం*

**పృథువస్త్ర :** సుబ్రహ్మణ్యస్వామి స్త్రీ సేవిక.
– *మహాభారతం*

**పృథువు :** ధ్రువుని వంశంలో జన్మించిన గొప్ప చక్రవర్తి. *జన్మవృత్తాంతం :* చాక్షుసుమనువు కుమారుడు కురుడు. అతడి మనుమడు వేనుడు. ఈ వేనుడు పరమ దుర్మార్గుడు. తానే దైవాన్నని, యజ్ఞయాగాలు చేయవద్దని, నాకంటే గొప్పవాడులేడని బ్రహ్మ, విష్ణుమహేశ్వరులు ఇతర దేవతా మూర్తులు ఐక్యమ య్యారుకనుక విష్ణువును గూర్చి యజ్ఞం చేయవలసిన అవసరం లేదని శాసించగా బ్రాహ్మణులు మంత్రించిన కుశాలతో ఇతణ్ణి వధిస్తారు. దేవుళ్లను వ్యతిరేకించి నందుకు అంతకు ముందే ఆత్మ నశించడం వల్ల భూమి నుండి పొడలు లేచి భూమి ధూళిధూషితం కాగా బ్రాహ్మణులు కారణ మడగగా రాజు లేని రాజ్యం గతి ఇంతేనని చెప్పగా వేనుడి తొడలను మర్థించగా పొట్టిగా వుండే విషదుడు జన్మించాడు. అతడు వేనుడి పాపాలకు ప్రతీకగా వింధ్య పర్వతాలకు వెళ్లి ఆటవిక సంతతికి జన్మిస్తాడు. బ్రాహ్మణులు వేనుడి కుడి చేతిని మర్థించగా పృథువు జన్మిస్తాడు.

పృథువుపాలన *:* వేనుడెంత అధర్మంగా పాలించాడో ఇతడంతటి ధర్మపాలన చేశాడు. వేనుడి అధర్మపాలన వల్ల భూమాత క్షీరాన్ని వర్షించక క్షామం అలుము కోగా పృథువు భూమాతపై దండెత్తగా ఆమె పారి పోయి ఇతడు వెంటాడగా చివరికి పృథువునే శరణు వేడగా పృథువు తన ప్రజల సుఖసంతోషాలు కోరగా వివిధ ప్రజలు జంతువులు, ఇతర వర్గాలు భూమాత గోవుగా మారగా ఆమె దూడలుగా మారిన ప్రజాప తులు క్షీరం పిండగా లోకం సస్యశ్యామలమయ్యింది. ఇతడు 99 అశ్వమేధ యాగాలు చేశాడు. ఇంద్రుడి తడి అశ్వాన్ని అపహరించగా పృథువు ఇతని పై దండెత్తి తర్వాత స్నేహితులౌతారు.

పృథువు *మరణం :* చాలా కాలం సస్యశ్యామలంగా పాలించి ముసలితనం రాగా తన కుమారుడు విజితాశ్వుడికి రాజ్యభారం అప్పగించి తన భార్య అర్చసుతో కలసి చాలాకాలం తపస్సు చేసి పరబ్రహ్మలో లీనమోతాడు. అతని భార్య అతనిచితిలో దూకి మరణిస్తుంది. ఇతని కుమారులైదుగురు పెద్దవాడైన విజితాశ్వుడి నాయకత్వాన ప్రపంచాన్నంతా పాలించారు.
– పద్మపురాణం

**పృథువేగుడు :** యముని కొలువులోని ఒక రాజు.
– *మహాభారతం*

**పృథుశ్రవసుడు 1 :** రుగ్వేద కాలంలోని ఒక రాజు. ఇతడి శత్రువుల్ని ఇంద్రుడు సంహరిస్తాడు.
– రుగ్వేదం

**పృథుశ్రవసుడు 2 :** ధర్మరాజు స్నేహితుడు.
– *మహాభారతం*

**పృథుశ్రవసుడు 3 :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు.
– *మహాభారతం*

**పృథుశ్రవసుడు 4 :** ద్వారకాపుర పరిరక్షకుడు. అర్జునుడు సుభద్రను ఎత్తుకుపోతుంటే అడ్డగిస్తాడు.
– *మహాభారతం*

**పృథుశ్రవుడు :** రఘువు కొడుకు. ఇతని కుమారుడు అజుడు. – *భాగవతం*

**పృథుసేనుడు :** ప్రాచీన భారతదేశంలోని ఒక రాజు.
– *భాగవతం*

**పృథూదకం :** కురుక్షేత్ర పరిసరంలోగల ఓ పుణ్య కొలను. భారత దేశంలోని ప్రసిద్ధ తీర్థాలలో ఇదొకటి. ఇక్కడ స్నానం చేస్తే అశ్వమేధయాగ ఫలితం లభిస్తుంది. – *మహాభారతం*

**పృథూదరుడు :** ఓ ప్రసిద్ధ యక్షుడు. ఇతని కుమార్తె సౌదామిని. ఒకరోజు సౌదామిని తన స్నేహితురాలు కపిశాభ్రుతో విహారయాత్రలకు వెళ్లి య ఃక్ష పుత్రుడైన అట్టహాసుడి ప్రేమలో పడి తండ్రికి విన్నవించగా అతడు అంగీకరించడు. మరుసటి రోజు కపిశాభ్రు పృథూదరుడి ఇంటికి వచ్చి అట్టహాసుడు తన సోద

రుడు దీప్తశిఖుడు ఓ నాటకం వేశారని, అందులో అట్టహాసుడు రాజుగాను దీప్తశిఖుడు నలకూబరుడిగా నటించారని చెప్పగా ఆ దారిన వెళ్తున్న నలకూబరుడు ఇది చూసి రాజవ్వాలనే కోరిక అతడికి వుండటం తప్పుగా భావించి మానవునిగా జన్మించమని శపించా డని చెప్తుంది. అయితే అట్టహాసుడు సరదాకోసం వేసిన నాటకమేగాని నాకే కోరికా లేదని నలకూబరు డిని ప్రార్థించగా తన దివ్యదృష్టితో గ్రహించి మానవు నిగా వున్నపుడు రాజవుతాడని అతడు కోరుకున్న స్త్రీ భార్య అవుతుందని దీప్తశిఖుడు పుత్రుడుగా జన్మిం చినపుడు శాపవిముక్తులౌతారని, దీప్తశిఖుడు కూడా కొంత కాలం రాజ్యమేలిన తర్వాత శాపవిమోచనం పొందుతాడని చెప్తాడు.

అట్టహాసుడు పవిత్రధరుడను త్రిగర్త రాజుగా జన్మిం చగా సౌదామిని అతని భార్య అయ్యింది. వారికి దీప్తశిఖుడను పుత్రుడు జన్మించగా వీరు శాపవిము క్తులై స్వర్గం చేరారు. – *కథాసరిత్సాగరం*

**పృథ్వీతీర్థం :** కురుక్షేత్ర పరిసరంలో గల ఓ పుణ్య కొలను. ఇక్కడ స్నానం చేస్తే 1000 గోదానాల ప్రతి ఫలం లభిస్తుంది. – *మహాభారతం*

**పృథ్వీరూపుడు :** ప్రతిష్ఠాన పురాన్ని పాలించిన అంద మైన రాజు. ఒకసారి ముగ్గురు యోగినులు వచ్చి మేము ప్రపంచమంతా చుట్టివచ్చాం. ముక్తి ద్వీపంలో రూపలత అనే రాజకుమార్తె వుంది. ఆమె మాత్రమే నీ అందానికి తులదూగగలదని చెప్పగా తన కొలువు లోని కళాకారుడిని పిలిచి తన చిత్రాన్ని గీసి ముక్తి ద్వీపానికి వెళ్లి ఈ చిత్రపటం చూపి ఆమె చిత్తరువు గూడా గీసి తన వద్దకు తీసుకొని రమ్మని ఆదేశిం చాడు. అతడు ముక్తిద్వీపం వెళ్లి రాజుని కలసి తన కళానైపుణ్యం చెప్పగా తన కుమార్తె చిత్రం గీయమని కోరాడు. ఆ చిత్రపటాన్ని చూసి ఈమెకు సరిజోడైన యువకుడ్ని చూడమనగా వారు పృథ్వీ రూపుడి చిత్రం చూపగా రాజు వారినే వివాహానికి రాయబారం పంపగా వారిద్దరికి ఘనంగా వివాహం జరిగింది. – *కథాసరిత్సాగరం*

**పృశ్ని 1 :** సుతపసుడను ప్రజాపతి భార్య. – *చూ॥ అదితి*

**పృశ్ని 2 :** ఓ ఋషి. కురుక్షేత్ర యుద్ధ సమయంలో ద్రోణుని వద్దకు వచ్చి యుద్ధం ఆపమని కోరాడు. ఇతడు తన తపశ్శక్తితో స్వర్గం చేరాడు. – *మహాభారతం*

**పృశ్ని గర్భుడు :** శ్రీమహావిష్ణువు మరోపేరు. ఈ పేరుకి కారణం పురాణాలు ఇలా వివరిస్తున్నాయి.

1. స్వాయంభువు మనువు కాలంలో సుతపసుడను ప్రజాపతి అతని భార్య పృశ్ని 12 వేల దేవ సంవత్స రాలు తపస్సు చేసి విష్ణువు తమకు జన్మించాలని కోరుకున్నారు. ఆ కారణంగా శ్రీ మహావిష్ణువు పృశ్ని గర్భంలో జన్మించాడు. ఇది శ్రీకృష్ణుడికి కూడా సరి పోలుతుంది. – *భాగవతం*

2. అన్నం, వేదం, జలం, అమృతాలను పృష్ణి అంటా రు. ఇవన్నీ శ్రీమహావిష్ణు గర్భంలో వున్నాయి కనుక పృశ్ని గర్భుడంటారు. – *మహాభారతం*

**పృషతాశ్వుడు :** సూర్య వంశంలోని ఒక రాజు. ఇతడ్ని విరూపుడని అంటారు. ఇతడు, కేతుమానుడు, శాంభుడు, అంబరీషుని కుమారులు. – *భాగవతం*

**పృషతుడు :** పాంచాల రాజు. భరద్వాజుని స్నేహితుడు. ద్రుపదునికి తండ్రి. ద్రుపదుని కూతురైన పాంచాలికి పార్షతి అనే పేరుకు కారణం ఇదే. – *మహాభారతం*

**పృషదశ్వుడు :** భారతదేశంలోని ఓ ప్రాచీన రాజు. అష్టకుడను రాజునుండి ఖడ్గం పొందాడు. – *మహాభారతం*

★ **పృషధ్రువు 1 :** వైవశ్వత మనువు తొమ్మిదవ కుమా రుడు. కురుక్షేత్రం వద్ద తపస్సుచేసి స్వర్గం చేరాడు. ఇతడు చిన్నతనం నుండి తపస్సు చేసేవాడు. నిత్య జీవితం మీద విరక్తి కలవాడు. అందుకు కారణం అతడు తన గురువు గోసాలకు రక్షణగా వుండగా ఓ సింహం ఆవుల మందలోపడగా తన కత్తితో దానిని చంపబోయి పొరపాటున గోవును వధించాడు. ఆ పాపకార్యానికి చింతించి కురుక్షేత్రం వెళ్లి తపస్సు చేశాడు. – *మహాభారతం*

★ పద్మపురాణంలోని ఈ కథకు కొంత తేడా వుంది. ఇతడు బ్రహ్మణుడని పొరపాటున సింహాన్ని చంపబోయి గోవును వధించగా గురువు శూద్రుడుగా జన్మించమని శపించగా అడవిలో తిరుగుతూ శాపవశాన అడవి మంటలోపడి మరణించాడు

**పృషధ్రువు 2 :** ద్రుపదుని కుమారుల్లో ఒకడు. కురుక్షేత్ర యుద్ధంలో అశ్వత్థామ ఇతణ్ణి వధించాడు.
– *మహాభారతం*

**ప్రకాలం :** వాసుకి వంశంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది.
– *మహాభారతం*

**ప్రకాశుడు :** భృగుని కుటుంబంలో జన్మించిన ఓ బ్రాహ్మణుడు. ఘృతవంశంలోని తమసుని కుమారుడు.
– *మహాభారతం*

**ప్రకృతి, పురుషుడు :** ప్రకృతి అనగా పదార్థం, పురుషుడనగా ఆత్మ. ఈ ప్రపంచ పుట్టుకకు ఇవే మౌలికమైనవి. పురుషుడు, స్త్రీ ఎలా పునరుత్పత్తికి కారణాలో ప్రపంచం ఇదే స్థితిలో వుండటానికి కారణం. పురుషుడి నుండి ప్రకృతి జనించగా ఈ రెండింటి కలయిక ప్రపంచాన్ని సృష్టించింది. ప్ర అనగా మూలమని కృతి అనగా సృష్టి అని అర్థం. ప్ర అంటే ముందు కృతి అనగా సృష్టి. ప్రకృతి అనగా సృష్టికి ముందు అనికూడా అర్థం. – *దేవీభాగవతం*

**ప్రఘసులు :** రాక్షసుల్లో ఒక తెగ. – *మహాభారతం*

**ప్రఘసి 1 :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరి. – *మహాభారతం*

**ప్రఘసి 2 :** ఓ రాక్షసి. ఈమె అశోకవృక్షం క్రింద సీత కూర్చున్నపుడు రావణుని తరపున కాపలావుండి సీతను రావణుని వివాహం చేసుకొమ్మని చెప్పడానికి ప్రయత్నించింది. – *రామాయణం.*

**ప్రఘోషుడు :** శ్రీకృష్ణుని కుమారుల్లో ఒకడు. – *భాగవతం*

**ప్రచండుడు :** ఓ రాక్షసుడు. పరమశివుడు త్రిపురాసురుల మధ్య యుద్ధం జరుగుతున్నప్పుడు ఇతడు కార్తికేయుడితో యుద్ధం చేశాడు. – *గణేశపురాణం*

**ప్రచేతసులు :** పృథు చక్రవర్తికి ఇద్దరు కుమారులు. అంతర్థానుడు, వాడి. అంతర్థానుడికి శిఖండిని వల్ల హవిర్ధానుడు జన్మించాడు. అగ్ని వంశంలో జన్మించిన ధిషణను ఇతడు వివాహం చేసుకోగా ప్రాచీన బర్హిసుడు మరో ఐదుగురు కుమారులు జన్మించారు. ప్రాచీన బర్హిసునికి పదిమంది కుమారులు. వారిని ప్రచేతసులు అంటారు. వారు ప్రజాపతులు. ఈ పదిమందిలో ఒకడైన మారిషకు దక్షుడు జన్మించాడు. అందువల్ల దక్షుడిని ప్రచేతసుడని కూడా అంటారు.
– *మహాభారతం*

**ప్రజంఘుడు :** రావణుని రాక్షస సైన్యంలో ఒకడు. అంగదుడు ఇతణ్ణి వధించాడు. – *రామాయణం*

**ప్రజాగర :** ఓ అప్సరస. అర్జునుడు ఇంద్రసభకు వెళ్లినపుడు ఇంద్రుని కోరికపై నృత్యం చేసింది.
– *మహాభారతం*

**ప్రజాపతివేది :** కురుక్షేత్రంలో గల నాల్గు పుణ్య స్థలాల మధ్యగల పవిత్ర స్థలం. దీన్ని ప్రజాపతి యొక్క ఉత్తర వేది అంటారు. దీన్ని కాకుండా ప్రతిష్ఠానపురి, కంచల, అశ్వతార, భోగతారలను కూడా ప్రజాపతి వేది అని అంటారు. ఈ అయిదింటిని 'బ్రహ్మవేది' అనికూడా అంటారు. – *మహాభారతం*

**ప్రబుద్ధుడు :** మనువు కుమారుడైన ప్రియవ్రతుని వంశంలో జన్మించిన రాజు. – *భాగవతం*

**ప్రభద్ర :** అంగరాజైన కర్ణుని కుమారుని భార్య. ఈమెను భద్రావతి అనికూడా అంటారు. – *జైమిని భారతం*

**ప్రభద్రుకం :** పాంచాల రాజుయొక్క ప్రత్యేక సైన్య విభాగం. ఇందులో క్షత్రియులు మాత్రమే వుంటారు. దీనికి ధృష్టద్యుమ్నుడు, శిఖండి నాయకత్వం వహించారు. ఈ సైన్యంలో చాలా మందిని శల్యుడు వధించగా మిగిలిన వారిని అశ్వత్థామ నిద్రిస్తుండగా వధించాడు.
– *మహాభారతం*

**ప్రభాకరుడు 1 :** కశ్యపుని వంశంలో జన్మించిన ఓ సర్పం. – *మహాభారతం*

**ప్రభాకరుడు 2 :** అత్రి వంశంలో జన్మించిన ఓ రుషి. భద్రాశ్వుడికి ఘృతాచికి జన్మించిన 10 మంది కుమార్తెలను ఇతడు వివాహమాడాడు.

**ప్రభాకరుడు 3 :** చూ॥ సూర్యుడు.

**ప్రభాకరం :** కుశద్వీపంలోని 6వ భాగం.
– *మహాభారతం*

**ప్రభాత 1 :** ధర్మదేవుని భార్య. ఈమెకు ఇద్దరు కుమారులు. ఒకడు ప్రభాసుడు, రెండోవాడు ప్రత్యుషుడు. వీరిద్దరు వసువులయ్యారు. – *మహాభారతం*

**ప్రభానుడు :** సత్యభామకు శ్రీకృష్ణుని వల్ల జన్మించిన పుత్రుడు. – భాగవతం

**ప్రభావంతుడు :** ప్రభావతి ప్రద్యుమ్నుల కొడుకు. వజ్ర నాభుడి మరణం తర్వాత అతని నగరానికి ప్రభావం తుడిని కృష్ణుడు రాజుని చేశాడు. – భాగవతం

**ప్రభావతి 1 :** మయాసురుని నగరంలో తపస్సు చేసు కునే స్త్రీ. సీతను అన్వేషించడానికి వెళ్లిన వానరులు ఈమెను కలిశారు. – రామాయణం

**ప్రభావతి 2 :** సూర్యదేవుని భార్య. – మహాభారతం

**ప్రభావతి 3 :** స్కందదేవుని అనుచరిణి. – మహాభారతం

**ప్రభావతి 4 :** అంగరాజైన చిత్రరధుని భార్య. ఈమె దేవశర్మ భార్య రుచి యొక్క సోదరి. – మహాభారతం

**ప్రభావతి 5 :** వజ్రనాభుడను రాక్షసుని కుమార్తె. ఈమెను శ్రీకృష్ణుని కుమారుడైన ప్రద్యుమ్నుడు వివాహమాడాడు.

*ప్రభావతి ప్రద్యుమ్నుల వివాహ కథ :* వజ్రనాభుడు మహావీరుడైన రాక్షసుడు. ఇతడు ప్రపంచాన్ని జయించి ఇంద్రలోకానికి వెళ్లి ఇంద్ర సింహాసనం కోరాడు. అంతేకాక నేను నువ్వు కూడా కశ్యప్రజాపతి పుత్రులమే. నేనెందుకు ఇంద్ర సింహాసనమధిష్టించ రాదని ఇంద్రుని ప్రశ్నించగా తండ్రి కశ్యప ప్రజాపతి యాగం చేస్తున్నాడు కనుక అతడు తిరిగి వచ్చిన తర్వాత అతడినే అడుగుదామని ఇంద్రుడు సమాధాన పరచి అతణ్ణి ఈలోపు చంపడానికి ప్రయత్నం చేసి ద్వారకకు వెళ్లి శ్రీకృష్ణుడి సహాయం కోరతాడు. సమయం వచ్చినపుడు తప్పక అతని కోరిక నెరవేరుతుందని చెప్తాడు. శ్రీకృష్ణుని కుమారుడైన ప్రద్యుమ్నుడికి ప్రభావతి అందచందాలను హంసలద్వారా ఇంద్రుడు తెలియజేసి ఒకరిపై ఒకరికి మక్కువ కలిగేటట్లు చేయగా ప్రద్యుమ్నుడు, శ్రీకృష్ణుడు వజ్రనాభుని భవనంలోకి మారువేషంలో ప్రవేశిస్తారు. ప్రద్యుమ్నుడు ప్రభావతిని కలిసి ఆమెతో గడుపుతాడు. వజ్రనాభుడు తెలుసుకొని ప్రద్యుమ్నుడితో యుద్ధం చేసి అతని చేతిలో మరణిస్తాడు. అప్పటికి కశ్యప ప్రజాపతి యాగం పూర్తిచేసుకొని దేవలోకం వెళ్తాడు. – విష్ణుపురాణం

**ప్రభాసం :** ఓ పుణ్యస్థలం. ప్రభాస తీర్థమని కూడా అంటారు. భారతదేశానికి పశ్చిమ తీరంలోని సౌరాష్ట్రంలో వుంది. దీనిని సోమతీర్థమని కూడా అంటారు. ఇచ్చట అర్జునుడు ఒంటికాలిపై నిలబడి 100 దేవ సంవత్సరాలు తపస్సు చేశాడు. అగ్ని దేవుడిక్కడ నివసిస్తాడు. ఇచ్చట స్నానంచేస్తే అగ్ని స్థోమ యజ్ఞం చేసిన ప్రతిఫలం లభిస్తుంది. ఒకసారి ధర్మజుడు తన సోదరులతో ఇక్కడికి వచ్చి తపస్సు చేశాడు. ఇచ్చటే యాదవులు ఒకరితో ఒకరు కలహించి నశించారు. బలరామకృష్ణుల ఆత్మలు సర్వాత్మలో కలిశాయి.

**ప్రభాసుడు :** ప్రభాతవల్ల ధర్మదేవునికి జన్మించిన పుత్రుడు. ఇతడు అష్టావసువుల్లో ఒకడు. ఇతడు బృహస్పతి సోదరిని వివాహమాడాడు. – విష్ణుపురాణం

**ప్రభువు :** సుబ్రహ్మణ్యస్వామి సైనికుల్లో ఒకడు. – మహాభారతం

**ప్రభంజనుడు 1 :** మణిపుర రాజైన చిత్రవాహనుడి మొదటి కుమారుడు. పుత్రార్థియై శివుని గూర్చి తపస్సు చేయగా శివుడు అనుగ్రహించగా ఇతడు జన్మించాడు. – మహాభారతం

**ప్రభంజనుడు 2 :** ఒక రాజు. 10 వేల సంవత్సరాలు శివుడి గూర్చి పూజ చేసి దిక్పాలకత్వాన్ని పొందాడు. ఇతని కుమారుడు పూతాత్ముడు. – స్కందపురాణం

**ప్రభంజనుడు 3 :** ఓ క్షత్రియ రాజు. ఓ లేడి తన పిల్లకు పాలిస్తుండగా చంపి ఆ లేడి శాపానికి గురై సింహంగా మారి 100 సంవత్సరాలు జీవిస్తాడు. ఆ తర్వాత ఓ గోవు సలహాతో నిజరూపుడవుతాడు. – పద్మపురాణం

**ప్రమగంధుడు :** కికటసుల రాజు. – రుగ్వేదం

**ప్రమతి 1 :** బృగుపులోమలకు చ్యవనుడు జన్మించగా చ్యవనుడికి అతని భార్య సుకన్యవల్ల ప్రమతి జన్మించాడు. ఇతడు ప్రతాపిని వివాహమాడగా రురుడు జన్మించాడు. – చూ॥ రురుడు.

**ప్రమతి 2 :** ప్రయాగలో శూరుడను బ్రాహ్మణుని కొడుకు. కృతయుగాంతంలో బ్రాహ్మణులు ఇతడి నాయకత్వంలో క్షత్రియుల్ని ఓడించారు. – విష్ణు ధర్మోత్తరపురాణం

**ప్రమతి 3 :** విభీషణుని నల్గురు మంత్రుల్లో ఒకడు.

**ప్రమందుడు :** హరిశ్చంద్రుని ధనాగారానికి కాపరి. ఓ యక్షుడు. విశ్వామిత్రుడు ఇతడిపై పుణ్యజలం జల్లి ఇతని శరీరంలోని చెడు వాసన పోగొట్టాడు. – స్కందపురాణం

**ప్రమనకుడు :** ఒక రుషి. సర్పయాగం నిర్వహించే వారిలో ఒకడు. – మహాభారతం

**ప్రమద్వర :** మేనకకు విశ్వావసువు వల్ల జన్మించిన కుమార్తె. ఈమెను అడవిలో వదలి మేనక దేవలోకానికి వెళ్ళిపోగా ఈమెను స్థూలకేశుడు పెంచుతాడు. మనువు ఈమెను ప్రేమించి పెళ్లి చేసుకోవడానికి నిర్ణయించుకోగా పెళ్లికి ఒక రోజు ముందు పాము కాటుకు మరణిస్తుంది. మనువు తన ఆయుష్షులో సగమిచ్చి ఈమెను బతికించుకుంటాడు. – మహాభారతం

**ప్రమథగణం :** శివుని సేవకులు. వీరు ధర్మాధర్మ విచక్షణ బాగా తెలిసినవారు. – మహాభారతం

**ప్రమదుడు :** వశిష్ఠుని కుమారుడు. ఉత్తర మన్వంతరం లోని సప్తర్షుల్లో ఒకడు. – భాగవతం

**ప్రమదోత్తమ :** హిమవత్పర్వతాలవద్ద బంగారు గోపురాలు, నవద్వారాలు ఉన్న నగరాన్ని పాలించిన స్త్రీ. – భాగవతం.

**ప్రమాణకోటి :** గంగానదీ తీరంలోని ఓ పవిత్ర స్థలం. ఒక్కటొక పెద్ద అరటిచెట్టు వుంది. దానిపేరు ప్రమాణ కోటి. ఇక్కడే దుర్యోధనుడు భీముడికి విషాహారమిచ్చి నదిలోకి తోశాడు. పాండవుల అరణ్యవాసంలో మొదటి రాత్రి ఇక్కడే గడిపాడు. – మహాభారతం

**ప్రమాథిని :** ఓ దేవ కన్య. ఈమె అర్జునుని జన్మదిన మహోత్సవంలో నృత్యం చేసింది. – మహాభారతం

**ప్రమాథుడు 1 :** ధృతరాష్ట్రుడి కొడుకుల్లో ఒకడు. – మహాభారతం

**ప్రమాథుడు 2 :** ఘటోత్కచుని స్నేహితుడు. కురుక్షేత్రంలో ధృతరాష్ట్రుని కొడుకు ప్రమాథుడిని సంహరించాడు. – మహాభారతం

**ప్రమాథుడు 3 :** ఇతడొక రాక్షసుడు. ఖరదూషణులకు మంత్రి. – రామాయణం

**ప్రమీల :** స్త్రీ రాజ్యానికి నాయకురాలు. పాండవులు యుద్ధానంతరం అశ్వమేధయాగం చేయగా అర్జునుడు ఆ అశ్వానికి రక్షకుడు. ఈ గుర్రాన్ని ప్రమీల కట్టి వేసింది. అర్జునుడు ఈమెతో యుద్ధం చేసి ఓడిపోగా ఆకాశవాణి అర్జునుడితో ఆమెను వివాహం చేసుకొమ్మని ఒకవేళ యుద్ధంలో గెలిచినా అశ్వం బ్రతకదని చెప్పింది. అప్పుడు అర్జునుడు ఆమెతో సంధి చేసుకొని వివాహమాడాడు. – జైమిని భారతం.

**ప్రమృతం :** సంపాదనకు గల ఐదు మార్గాలలో ఇదొకటి. పొలం నుండి ధాన్య సేకరణ ఒకటి. యాచించకుండా సంపాదించడం ప్రమృతం. యాచించి సంపాదించడం మృతం. వ్యవసాయంతో సంపాదించడం ప్రమృతం. వ్యాపారం ద్వారా సంపాదించడం సత్యానృతం, మోసంచేసి సంపాదించడం నివారణీయం. – మనుస్మృతి

**ప్రమోచన :** ఓ అప్సరస. వరుణుడి కుమారుడు పుష్కరుడి వల్ల ఈమెకు మాలిని జన్మిస్తుంది. ఆమెను రుచి అనే రాజుకిచ్చి వివాహం చేస్తాడు. – మార్కండేయ పురాణం

**ప్రమోదుడు 1 :** బ్రహ్మ మానస పుత్రుల్లో ఒకడు. బ్రహ్మ కంఠం నుండి ఇతడు జన్మించాడు. – బ్రహ్మపురాణం

**ప్రమోదుడు 2 :** సుబ్రహ్మణ్య స్వామి సైనికుల్లో ఒకడు. – మహాభారతం

**ప్రమోదుడు 3 :** ఐరావతుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. – మహాభారతం

**ప్రమోహిని :** ఓ గంధర్వకన్య. తన స్నేహితురాళ్లు మరి నల్గురితో కలసి శీతాకాలంలో అడవికి వెళ్లి అచ్ఛోద అనే కొలనులో స్నానం చేసి అంబిక విగ్రహాన్ని తయారు చేసి పూజిస్తుండగా అదే కొలనులో వేదనిధి అనే యువకుడు స్నానం చేయడానికి వచ్చాడు. అతని అందానికి ముగ్ధులై అతడిని చుట్టుముట్టగా అతడు తప్పించుకున్నాడు. ఆ రాత్రి వారికి నిద్రలేదు. శరీరం వేడెక్కింది. తల్లిదండ్రులు కారణ మడిగినా చెప్పక మరునాడు కూడా కొలను వద్దకు వెళ్లారు. వేదనిధి అక్కడకు రాగా అతణ్ణి ప్రమోహిని తక్కిన నల్గురు

వలయాకారంలో చుట్టి నిలబడ్డారు. ప్రమోహిని వెంటనే అతడి కాళ్లు పట్టుకొని లాగగా మరో కన్య అతణ్ణి ఆలింగనం చేసుకుంది. మరో కన్య ముద్దాడింది. ఆ యువకుడు వీరిని దయ్యాలు కమ్మని శపించగా వీరుకూడా అదే ప్రతి శాపమిచ్చి ఆ కొలనువద్దే తిరుగుతూ జీవించారు. ఆ సమయంలో లోమపాద మహర్షి ఆ కొలనువద్దకు రాగా అతని శక్తికి భయపడి దూరంగా జరిగారు. తపశ్శక్తి గల వేదనిధి లోమపాదుని కాళ్లపైబడి తమ కథ వివరించగా అతడు వీరికి శాప విముక్తి కల్గించాడు. అప్పుడు వేదనిధి వీరయిదుగురిని వివాహమాడి కొంతకాలం జీవించి అందరూ స్వర్గం చేరారు. - పద్మపురాణం

**ప్రమందుడు :** హరిశ్చంద్రుని ధనాగారానికి కాపరి. ఓ యక్షుడు. విశ్వామిత్రుడు ఇతడిపై పుణ్యజలం జల్లి ఇతని శరీరంలోని చెడు వాసన పోగొట్టాడు. - స్కందపురాణం

**ప్రమ్లోచన :** ఓ అప్సరస. కణ్వుడి తపోభంగం చేయడానికి ప్రయత్నించింది. - చూ॥ మునికరణుడు.

**ప్రయాగ :** గంగాయమునల సంగమ స్థలం. ఇచ్చట స్నానంచేస్తే 10 అశ్వమేధ యాగాలు చేసిన ప్రతిఫలం లభిస్తుంది. - మహాభారతం

ఇచ్చట బ్రహ్మ దేవగణం, దిక్పాలకులు, లోక పాలకులు, సాధ్వసులు, పితృలు మరియు మహర్షులైన సంతకుమార, అంగిరస, బ్రహ్మర్షులు, నాగులు, గరుడుడు, సిద్ధులు, సూర్యుడు, మహావిష్ణువు కన్పిస్తారని నమ్మకం. ఇక్కడ మూడు యజ్ఞ గుండాలుండి గంగ అందుండి ప్రవహిస్తుందని ఇది త్రివేణి సంగమ ప్రాంతమని ఇచ్చట స్నానం చేస్తే అశ్వమేధ, రాజసూయ యాగాలు చేసిన ప్రతిఫలం లభిస్తుందని చెప్తారు.

ప్రపంచం మొత్తంలో 70 వేల తీర్థాలున్నాయని 10,000 ఒక రకం, 60,000 ఒక రకమని ఇక్కడ అన్ని తీర్థాలు కన్పిస్తాయి కనుక ఇది ప్రపంచంలోనే గొప్ప తీర్థ స్థలమని అంటారు. - అగ్నిపురాణం

**ప్రయుతుడు :** ఓ దేవ గాంధర్వుడు. ముని అనే స్త్రీ వల్ల దక్షప్రజాపతికి జన్మించాడు. - మహాభారతం

**ప్రరలజుడు :** అమృతానికి ఒకసారి కాపలావున్న దేవతల్లోనివాడు. ఇతడు ఒకసారి గరుడుడితో తలపడ్డాడు. - మహాభారతం

**ప్రరురుజులు :** రాక్షసులు పిశాచాల్లో ఓ విభాగం. - మహాభారతం

**ప్రలంబుడు 1 :** దనువువల్ల తక్షుకుడికి జన్మించిన క్రూరరాక్షసుడు. - మహాభారతం

**ప్రలంబుడు 2 :** ఓ రాక్షసుడు. ఇతడు శ్రీకృష్ణుడిని బలరాముడ్ని ఒకసారి ఎదుర్కొని బలరాముని చేతిలో మరణించాడు. - భాగవతం

**ప్రవరసేనుడు :** క్రీ.శ. 6వ శతాబ్దిలో జీవించిన రచయిత. ప్రాకృత భాషలో 'సేతు బంధ' అనే రచన చేశాడు. ఈ కావ్యాన్ని సేతుకావ్యం లేక రావణవధ అనికూడా పిలుస్తారు.

**ప్రవర్షణ :** గోమంత పర్వతం యొక్క శిఖరం పేరు. శ్రీకృష్ణ బలరాములు ఈ శిఖరాన్ని ఎక్కి తమ శత్రువులైన మాగధుల కదలికలు గమనించారు. - భాగవతం

**ప్రవరాఖ్యుడు :** అరుణాస్పదమునందలి సదాచార బ్రాహ్మణుడు; రూపవంతుడు. తన ఇంటికి వచ్చిన అతిథులను సత్కరించి వారినుండి పుణ్యకథలు వినుచుండును. ఒకనాడొక సిద్ధుడు రాగా అతని వల్ల ఎన్నో పుణ్యతీర్థముల గురించి విని ఇన్ని దర్శించుట ఎట్లు సాధ్యమైనదని యడుగగా ఒకపాద లేపనము వలన క్షణములో ఎచ్చటకైననూ పోవచ్చునని విని అతనివద్ద ఆ పాద లేపనము తీసుకొని పుణ్యతీర్థ దర్శనార్థమై బయలుదేరెను. తలచినదే తడవుగా హిమవన్నగరమునకు పోయెను. అది చూచిన తదుపరి ఎండవేడికి పాదలేపనము కరిగిపోయి ఎచటకూ పోలేక వరూధిని యను వనిత కనపడగా తన నగరమునకు పోవుటకు దారియేది అని అడిగెను. అతని రూపలావణ్యమును చూచి తనతో ఈ నగరముననే వుండమని మోహపరవసు రాలవ్వగా ఎటులో తప్పించుకొని "నేను ధర్మపరుడనైతినేని నన్ను ఇల్లు చేర్చుమని" అగ్నిని దలచగా అతడు సచ్ఛీలుడగుట వలన క్షణములో ఇల్లు చేరెను.

- మార్కండేయ పురాణం

**ప్రవర్ధనుడు :** కాశీరాజుకు దివోదాసుకు మాధవి యందు జన్మించిన కుమారుడు. హేహేయ వంశ రాజగు వీతవహ్యుడు దివోదాసును వెడలగొట్టి అతని తండ్రి సుదేవుని సంహరించెను. ప్రతీకారముచే ప్రవర్ధనుడు వీతవహ్యుని పుత్రులను జంపి అతడిని కూడా జంపబోగా అతడు భృగుని ఆశ్రమములో చేరెను. ప్రవర్ధనుడు ఆయాశ్రమము కడకేగి మునిని రాజెక్కడని అడుగగా "ఇచ్చట బ్రాహ్మణులు తప్ప రాజులెవ్వరూ" లేరని చెప్పగా ఇదియే చాలును "నిజ జాతిని నెడబాసిన వానిగా జేసితిని అది సిగ్గు కాదా నీ వాక్య మనృతము కాదని" వెడలిపోయెను. – మహాభారతం

**ప్రవర్షణగిరి :** గోమత పర్వత శిఖరం పేరు. – చూ॥ ప్రవర్షణ

**ప్రవసుడు :** చంద్రవంశజుడైన ఇలినుడికి రతంతకి వల్ల జన్మించిన కుమారుడు. ఇతనికి నలుగురు సోద రులు. వారు దుష్యంతుడు, శూరుడు, భీముడు, వసుడు. – మహాభారతం

**ప్రవరం :** పురాణ కాలంలో ప్రసిద్ధి చెందిన ఓ నది. – మహాభారతం

**ప్రవరుడు :** ఓ యాదవుడు. శ్రీకృష్ణుని మంత్రుల్లో ఒకడు. – విష్ణుపురాణం

**ప్రవహం :** ఇదో వాయువు, జీవుల శరీరంలో ఇది క్రింది నుండి పైకి ప్రవాహిస్తుంది. – మహాభారతం

**ప్రవాలకుడు :** కుబేరుని కొలువులోని ఓ యక్షుడు. – మహాభారతం

**ప్రవాహణుడు :** పాంచాల దేశానికి రాజు. ఇతడు ఉద్దాలకుని సమకాలికుడు.

**ప్రవాహుడు :** సుబ్రహ్మణ్యస్వామి సైనికుల్లో ఒకడు. – మహాభారతం

**ప్రవీరుడు 1 :** పురువంశపు రాజుల్లో ఒకడు. ఇతని తండ్రి సంతు రోధుడు. ఇతనికిద్దరు సోదరులు. వారు దుష్యంతుడు, సుమంతుడు. – అగ్నిపురాణం

**ప్రవీరుడు 2 :** పూరుడి కుమారుడు, ఇతని తల్లి పౌష్టి. ఇతనికి ఇద్దరు సోదరులు. వారు ఈశ్వరుడు, రుద్రాశ్వుడు. ఇతనికి శూరసేన వల్ల మనస్యుడను కుమారుడు జన్మించాడు. ఈ కుమారుణ్ణి జనమే జయుడని కూడా అంటారు. ప్రవీరుడు 3 అశ్వమేధ యాగాలు చేసిన తర్వాత వానప్రస్థం స్వీకరించాడు. – మహాభారతం

**ప్రవీరుడు 3 :** ఓ చండాలుడు. హరిశ్చంద్రుడు తన మాట నిలబెట్టుకోవడానికి ఇతడికి అమ్ముడు పోయాడు. ఈ ప్రవీరుడను చండాలుడెవరోకాదు; శివుడే. – చూ॥ హరిశ్చంద్రుడు

**ప్రవీరులు :** క్షత్రియుల్లో ఓ ప్రత్యేక వర్గంవారు. వృష ధ్వజుడు ఈ వర్గంలోనే జన్మించాడు. – మహాభారతం

**ప్రవేణి :** ఇదో నది. దీని తీరానే కణ్వుని ఆశ్రమం కలదు. – మహాభారతం

**ప్రవేపనం :** తక్షకుని కుటుంబంలోని ఓ సర్పం. జనమే జయుని సర్పయాగంలో మరణించింది. – మహాభారతం

**ప్రవృత్తం :** మతపరమై కర్మలను రెండు రకాలుగా విభజిస్తారు. భౌతిక జీవితానికి సంబంధించిన వాటిని ప్రవృత్తం అని, ఆత్మసంబంధాలను నివృత్తం అని అంటారు. – అగ్నిపురాణం

**ప్రవృషేయం :** ప్రాచీన భారత దేశంలో ఓ నివాసయోగ్య ప్రాంతం. – మహాభారతం

**ప్రశమి :** అలకాపురిలోని ఓ దేవకన్య. అష్టావక్రుని గౌరవార్థం నృత్యం చేసింది. – మహాభారతం

**ప్రశస్తం :** ఓ పుణ్యనది. పాండవుల విహారయాత్రలో ఇచ్చటికి వచ్చి ఈ నదిలో స్నానం చేశారు. – మహాభారతం

**ప్రశాంతాత్మ :** సూర్యునికి గల మరోపేరు. – మహాభారతం

**ప్రశుశుక్రుడు :** మరుత్తు కుమారుడు. ఇతడి కుమా రుడు సంధి. – భాగవతం

**ప్రశ్రములు :** యదు వంశంలోని వారు. శాంతి వసు దేవుల కుమారులు. – భాగవతం

**ప్రశ్రయుడు :** మను వంశంలో జన్మించిన ఒక రాజు. – భాగవతం

**ప్రశ్రుతుడు :** ఇదో రాక్షసి. గరుడుడు దీన్ని సంహరిం చాడు. – మహాభారతం

**ప్రసన్న :** నారీ తీర్థాల్లో ఒకటి. – చూ॥ నారీతీర్థాలు

**ప్రసన్నుడు :** మతంగుడి కొడుకు. ధర్మవ్యాధుడి అల్లుడు. ఇతడి భార్య అర్జునకి. – వరాహపురాణం

**ప్రసాదుడు :** మనువంశంలోని ఒక రాజు. – భాగవతం

**ప్రసుశ్రతుడు :** శ్రీరాముని వంశంలో జన్మించిన ఒక రాజు. – భాగవతం.

**ప్రసుహ్మాం :** ఇది ప్రాచీన భారతావనిలో ఒక దేశం. దీన్ని మహాభారత కాలంలో భీమసేనుడు జయించాడు. – మహాభారతం

**ప్రసూతి :** స్వాయంభవ మనువు కుమార్తె. వీరు ముగ్గురు అక్క చెల్లెండ్లు. వారు ఆకూతి, దేవహూతి, ప్రసూతి. ఈమెను దక్షప్రజాపతి వివాహమాడగా ఈమెకు అందరు ఆడపిల్లలే జన్మించారు. – దేవీ భాగవతం

**ప్రసేనజిత్తు 1 :** మహాభీముడి భార్య అయిన సుయాజ్ఞ యొక్క తండ్రి. ఇతడు రాజుగా ఎన్నో గోదానాలు చేసి పుణ్యలోకాలు వెళ్లాడు. – మహాభారతం

**ప్రసేనజిత్తు 2 :** పరశురాముని తండ్రి జమదగ్ని భార్య అయిన రేణుక తండ్రి. జమదగ్ని ఒకసారి రేణుకను వదలివేయగా శాపభయంతో తిరిగి రేణుకను పరశు రామునికి అప్పగించాడు. – బ్రహ్మాండపురాణం

**ప్రసేనజిత్తు 3 :** భవుడని పిలవబడే సత్రాజిత్తు యొక్క సోదరుడు. సత్రాజిత్తు నుండి మణిని గ్రహించి కృష్ణుడ డుగగా ఇవ్వలేదు. ఒకరోజు అరణ్యమున తిరుగుచూ సింహముచే చంపబడెను. శ్రీకృష్ణుడే మణికోసమి తనిని చంపెనను అపవాదు వచ్చెను. – భాగవతం

**ప్రసేనజిత్తు 4 :** శ్రావస్తీపురాన్ని ఏలిన రాజు. ఓ బ్రాహ్మ ణుడు పోగొట్టుకున్న సంపదను తన తెలివి తేటలతో దొంగను కనిపెట్టి తిరిగి బ్రాహ్మణునికి ఇప్పించాడు. – కథాసరిత్సాగరం

**ప్రసేనుడు 1 :** కర్ణుని కుమారుడు. కురుక్షేత్ర యుద్ధంలో ఇతణ్ణి సాత్యకి వధించాడు. – మహాభారతం

**ప్రసేనుడు 2 :** చూ॥ ప్రసేనజిత్తు

**ప్రసంధి :** వైవస్వత మనువు కొడుకు. ఇతని కుమారుడు క్షుపుడు. – మహాభారతం

**ప్రస్కణ్వుడు 1 :** ఓ ముని. కణ్వమహర్షి కుమారుడు. – ఋగ్వేదం

**ప్రస్కణ్వుడు 2 :** దేధాతిథి, కుమారుడు. ఒక రాజు. ప్రస్కణ్వుని వంశంలోని వారు మొదట క్షత్రియులు, తర్వాత బ్రాహ్మణులయ్యారు. – భాగవతం

**ప్రస్థల 1 :** సుశర్మ యొక్క భవంతి పేరు. చూ॥ సుశర్మ.

**ప్రస్థల 2 :** తీవ్రంగా గర్వించబడిన స్థలం. – మహాభారతం

**ప్రహస్తుడు :** రావణుని మంత్రి. విష్ణు సంతతి వాడు. సుమాలికుమారుడు. సుకేశ రాక్షసునికి దేవవతి వల్ల ముగ్గురు కుమారులు. వారు మాల్యవానుడు, సుమాలి, మాలి. సుమాలికి సేతుమతి వల్ల 10 మంది కుమా రులు. అందులో ప్రహస్తుడొకడు. ఇతడు రావణుని ప్రధానమంత్రి. ఇతడు రామరావణ యుద్ధంలో విభీషణునితో పోరాడి మరణించాడు. – ఉత్తర రామాయణం

**ప్రహాసం :** ధృతరాష్ట్రుని కుటుంబంలో జన్మించిన సర్పం. జనమేజయుని సర్పయాగంలో మర ణించింది. – మహాభారతం

**ప్రహాసుడు :** సుబ్రహ్మణ్యస్వామి సైనికుల్లో ఒకడు. – మహాభారతం

**ప్రహూతం :** ఓ గొప్ప యజ్ఞం. ఈ క్రింది ఐదింటిని గౌరవించుటను యజ్ఞం అంటారు. దేవత, అతిథి, సేవకుడు, తల్లిదండ్రులు, స్వయం గౌరవం. మొదటి దాన్ని ఆహుతం అని, రెండవదాన్ని అహుతమని, మూడవది అనగా సేవకుల్ని గౌరవించడం ప్రహూ తం అని, నాల్గవదాన్ని బ్రాహ్మహూతం అని, ఐదవ దాన్ని ప్రాశితం అని అంటారు. – మనుస్మృతి

**ప్రహేతి :** ఒక అసురుడు. ఒకసారి బ్రహ్మ కోపంతో కొన్ని శబ్దాలు చేయగా ఆ శబ్దాలు రాక్షసులుగా యక్షు లుగా మారాయి. రక్షమహీ అనగా రాక్షసులు, యక్ష మహీ అనగా యక్షులు జన్మించారు. ప్రహేతి రాక్షసు లకు మూలపురుషుడుకాగా, హేతి యక్షులకు మూల పురుషుడయ్యాడు. ప్రహేతి సద్గుణ ప్రవృత్తివల్లే మోక్షం లభిస్తుందని వివాహం కూడా చేసుకోక హిమాలయ సానువుల్లో తపస్సుచేసి మోక్షం పొందగా హేతి కాలుని సోదరి భయను వివాహమాడగా విద్యుత్కేశుడికి జన్మనిచ్చింది. సాలకంతకను విద్యుత్కేశుడు వివాహ

మాడాడు. వారికి జన్మించిన రాక్షస వంశం పాతాళంలో జీవిస్తూ రామరావణ యుద్ధంలో చనిపోయారు.

**ప్రహ్లాది :** ఇదో సర్పం. ఇది వరుణుని కొలువులో వుండి అతణ్ణి పూజిస్తుంది. – మహాభారతం

**ప్రహ్లాదం :** పురాణ ప్రసిద్ధమైన మానవ నివాసయోగ్య స్థలం. – మహాభారతం

**ప్రహ్లాదుడు 1 :** రాక్షస రాజైన హిరణ్యకశిపుని కుమారుడు. నరసింహ రూపమున మహా విష్ణువును దర్శించినవాడు.

*వంశవృక్షం :* బ్రహ్మ పుత్రుడైన మరీచి కుమారుడు కశ్యపుడు. అతని ఇద్దరు పుత్రులలో ఒకడైన హిరణ్యకశిపుని కుమారుడు.

*జననం :* కశ్యప ప్రజాపతికి దితి వల్ల హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడు జన్మించారు. కుమార్తె సింహిక. హిరణ్యాక్షుడు బ్రహ్మవల్ల వరములు పొంది ముల్లోకాలను జయించి భూమిని సముద్రములోకి నెట్టగా మహావిష్ణువు వరాహరూపమున హిరణ్యాక్షుని చంపి భూమిని పైకెత్తి యధాస్థితిలో నుంచెను. హిరణ్యకశిపుడు మహా విష్ణు వుపై కోపంతో అతడిని జయించవలెనని అడవికి వెళ్లి బ్రహ్మను గూర్చి తపస్సు చేయుచుండగా దేవతలు ఇదే అదనుగా అసురులపై బడగా వారు దేవతలను ఓడించిరి. ఇంద్రుడు పారిపోతూ హిరణ్యకశిపుని భార్యను ఎత్తుకుపోతుండగా నారదుడు ఆమెను ఇంద్రుడి నుండి రక్షించి తన ఆశ్రమమున వుంచి ఆశ్రయ మిచ్చెను. అప్పటికే ఆమె గర్భిణి. శిశువు గర్భమున నుండగనే నారదుడు విష్ణుతత్వమును, వేద వేదాంగాలను నేర్పెను. ఆ జన్మించిన శిశువే విష్ణు భక్తుడైన ప్రహ్లాదుడు. ప్రహ్లాదునికి ముగ్గురు పుత్రులు విరోచన, కుంభ, నికుంభులు. విరోచనుని కుమారుడే ప్రసిద్ధుడైన మహాబలి. – అగ్ని–విష్ణుపురాణాలు

హిరణ్యకశిపుడు ప్రహ్లాదుడికి విద్యాబుద్ధులు గరపడానికి గురువుల్ని నియమించి ఎక్కడైనా నారాయణుడ్ని జపించరాదని హిరణ్యకశపుడ్ని జపించాలని చెప్పి తన రాజ్యంలోని ప్రతి విష్ణు విగ్రహాన్ని ధ్వసం చేస్తాడు. విద్యాభ్యాసానంతరం ప్రహ్లాదుడు గురువుతో సహా తండ్రిని కలసి తను నేర్చుకున్న విద్య ఏమని తండ్రి అడగగా 'కన్పించేది, కన్పించనిది ఈ లోకాన్ని నడిపేది విష్ణువే' నని చెప్పగా ఉగ్రుడై తిరిగి సరైన విద్య నేర్పమని మరల గురువుతో పంపుతాడు. మరల అతడిలో ఏమార్పూ లేక పోవుటతో నీవన్న విష్ణు వెక్కడున్నాడో చూపించగలవా అని కుమారుడినడుగగా' ఎందులేదు, ఎక్కడ కావాలంటే అక్కడ నీలో నాలో ప్రతిచోట విష్ణువేననగా హిరణ్యకశిపుడు ఈ స్తంభంలో కలడా అని తన గదతో స్తంభాన్ని మోదగా అదిపగిలి విష్ణువు నరసింహావతారుడై రెప్పపాటులో హిరణ్యకశిపుని పొట్టచీల్చి ప్రేగులు లాగి వధిస్తాడు. అతని మరణానంతరం ప్రహ్లాదుడు పాతళమున దైత్యులకు రాజై శాంతిగా పాలిస్తాడు. –భాగవతం

*ప్రహ్లాద–నరనారాయణులు :* భృగువంశంలోని చ్యవనుడు ఓ తీర్థంలో స్నానం చేస్తుండగా సర్పం కాటుకు గురై పాతాళానికి వెళ్లాడు. ప్రహ్లాదుడితణ్ణి పూజించి ప్రపంచంలోని పుణ్యతీర్థాలను వివరించమని కోరి భూమిపై నైమిశారణ్యం ఒకటని తెలుసుకొని ప్రహ్లాదుడు తన సర్వసైన్యాలతో ఆ తీర్థ దర్శనాలకు వెళ్లి ఓ శమీ వృక్షం క్రింద తపస్సుచేస్తున్న నరనారాయణుల్ని ఆ వృక్షంపై గల విల్లంబులను చూసి వీరు కపటమహర్షులని తలచి వారితో యుద్ధం చేస్తాడు. ఆ భీకరయుద్ధంలో నరనారాయణులు విష్ణు అంశలని గ్రహించి భక్తితో మాత్రమే వారిని జయించగలనని తలుస్తాడు. పాతాళానికి వచ్చిన తర్వాత అంధకుడిని రాజ్యపాలన చేయమని అతడు తపస్సు చేసుకుంటాడు. – వామనపురాణం

అంధకుని తదనంతరం ప్రహ్లాదుని మనుమడు బలి దైత్యులకు రాజయ్యాడు. ప్రహ్లాదుడు గంధమాదన పర్వతాలకు తపస్సుకు వెళ్లాడు. బలి దేవతల ద్వేషి. ఆ సమయంలో దేవదానవ యుద్ధం జరగగా మహా విష్ణువు దానవులను ఓడించగా దైత్యగురువైన శుక్రాచార్యుడు తన తపశ్శక్తితో రాక్షసులను రక్షించడానికి తపస్సుకు వెళ్లగా బృహస్పతి శుక్రుని వేషంలో దైత్యులకు గురువై శుక్రాచార్యుడు వచ్చే సరికి దేవలోకం వెళ్తాడు. శుక్రుడు ఆగ్రహించి దేవతలను

నాశనం చేయాలనుకుంటాడు గాని బలి సలహాపై ఇది తగిన సమయంకాదని ఉపేక్షించగా దైత్యులంగీ కరించకపోవడం వల్ల ప్రహ్లాదుడు ఇంద్రుడితో పోరి అతణ్ణి ఓడిస్తాడు. దేవి అనుగ్రహం వల్ల సంధిచేసు కొని ఎవరిస్థానానికి వారు వెళ్తారు. – దేవీభాగవతం

**ప్రహ్లాదుడు 2 :** బాల్హిక కుటుంబంలోని ఓ క్షత్రియరాజు. బాల్హిక కుటుంబం శలభ రాక్షసుని వంశంలో జన్మిం చిన రాజపరంపరలోనిది. – మహాభారతం

**ప్రహ్లాదుడు 3 :** ఓ సర్పం. వరుణుని కొలువులో అతడిని పూజిస్తుంటుంది. – మహాభారతం

**ప్రాణాయామ :** ప్రాణమనగా శరీరంలోని గాలి. ఆయమం అనగా గాలిని కదల్చకుండా వుంచడం, ఉచ్ఛ్వాశ నిశ్వాసలను ఆధీనంలో వుంచుకోవడం. తెల్లని వస్త్రంపై గాని కుశ ఆకులపైకాని కూర్చొని ఒక కాలుపై మరో కాలు వేసుకొని నాడీ వ్యవస్థను మన ఆధీనంలో వుంచుకొని ఒకే విషయంపై లగ్నం చేసి ప్రాణా యామం చెయ్యాలి. ప్రాణాయామం 3 విధాలు – రేచకం, పూరకం, కుంభకం. రేచకమంటే ఎడమ చేతితో ముక్కు రంధ్రాలు మూసుకొని కుడిచేతిని పొట్టపై రుద్దుకొంటూ గాలిని గర్భంలో నుండి బయటకు పంపడం. పూరక మనగా కుడిచేత్తో ముక్కు రంధ్రాలు మూసి ఎడమ చేత్తో కడుపుపై రుద్దుకుంటూ గాలిని బయటకు పంపడం. కుంభక మనగా గాలిని పూర్తిగా నింపుకొని గాలిని బయటకు వదలకుండా లోనికి పీల్చకుండా వుండటం. – అగ్నిపురాణం

**ప్రహ్లాదం :** పురాణకాలం నాటినివేశన యోగ్యస్థలం. – మహాభారతం

**ప్రళయం :** ప్రళయమంటే నశించడం. ఇది నాల్గు విధాలు ఒకటి నిత్య ప్రళయమని రెండు బ్రహ్మ ప్రళ యమని మూడు ప్రకృతి ప్రళయమని నాల్గు ఆర్యంతిక ప్రళయమని చెప్పబడినవి. ప్రతిరోజు భూమిపై వుండే జీవ, అజీవ పదార్థాల నాశనాన్ని నిత్యప్రళయమని అంటారు. రెండవదైన బ్రహ్మ ప్రళయం ప్రతికల్పానికి ఒకసారి జరుగుతుంది. కల్పమనగా బ్రహ్మకు ఒకరోజు. మూడవదైన ప్రకృతి ప్రళయమంటే సంపూర్ణ నాశనం. ఇది నాల్గు యుగాలకొకసారి జరుగుతుంది. అప్పుడు శూన్యం మాత్రమే మిగులు తుంది. నాల్గవది ఆర్యంతిక ప్రళయం. ఇందులో ఆత్మ పరమాత్మలో ఐక్యమవుతుంది. – అగ్నిపురాణం

**ప్రాకృతుడు :** ఇతడో యక్షుడు. కేవలం 12 రోజుల్లో గొప్ప ధనవంతుడయ్యాడు. – మహాభారతం

**ప్రాక్కోసల :** కోసల దేశానికి తూర్పున గల ప్రాంతం. దక్షిణ భారతదేశంలోగల ఈ రాజ్యాన్ని సహదేవుడు జయించాడు. – మహాభారతం

**ప్రాగహి :** ఓ వేదపండితుడు. ఇతని రచన "సాంఖ్యా యన బ్రాహ్మణ ప్రాగ్రహి"లో యజ్ఞాలను గురించిన ఇతడి ఆలోచనలు వివరించాడు. యజ్ఞంలో పొర పాటున ఏదైనా కర్మకాండ మరచిపోతే నివారణ పద్ధ తులు తెలియజేశాడు. – సాంఖ్యాయన బ్రాహ్మణం

**ప్రాగ్దంశుడు :** ఓ అసురుడు. భృగుపత్నిని అపహ రించగా కీటకము కమ్మని భృగువు శపించెను. శాప విమోచనము కోరగా భార్గవుని మోము చూచినపుడు శాపవిమోచనమగుననెను. చూ॥ అలర్కము, కర్ణుడు.

**ప్రాగ్జ్యోతిషం :** నరకాసురుని భవంతి. ఇతడిని భీమాసు రుడని కూడా అనేవారు. ఇతని మరణానంతరం దీనికి భగదత్తుడు రాజయ్యాడు. ఈ నగరం రాక్షసు లకు దుర్భేద్యమైన రక్షణగా నిలిచింది. – మహాభారతం

**ప్రాఘోషుడు :** శ్రీకృష్ణుని కుమారుడు. – భాగవతం

**ప్రాజాపత్యం :** ఇదో వివాహ విధానం. బ్రహ్మచారిని తన ఇంటికి ఆహ్వానించి అతణ్ణి పూజించి తన కుమా ర్తెకిచ్చి వివాహం చేసే పద్ధతి. – మనుస్మృతి

**ప్రాజ్ఞుడు :** పూరు వంశంలోనివాడు. రుచిరాశ్వుడి కొడుకు.

**ప్రాచ్యం :** పురాణ ప్రసిద్ధమైన ప్రాచీన కాలం నాటి నివాసయోగ్య ప్రాంతం. – మహాభారతం

**ప్రాచిన్వానుడు :** పూరు రాజు మనుమడు. జనమే జయుడి కుమారుడు. ఒక్క రోజులో ప్రాచీన దేశాలను జయించాడు గనుక ప్రాచీన్వానుడని పేరు వచ్చింది. ఇతనికి అశ్మకి వల్ల సమ్యాతి అనే పుత్రుడు జన్మిం చాడు. ఇతనికి మనస్యుడనే కుమారుడు కూడా కలడు. – అగ్నిపురాణం

**ప్రాచీన బర్హిషుడు :** పృథు వంశంలోని ఓ ప్రజాపతి. పృథువుకు ఇద్దరు కుమారులు. ఒకడు అంతర్థానుడు,

రెండోవాడు వాడి. అంతర్థానుని పుత్రుడు హవిర్ధానుడు. అగ్ని వంశంలో జన్మించిన ధిషణ హవిర్ధానుడిని వివాహమాడగా ఆరుగురు పుత్రులు జన్మించారు. అందులో ప్రాచీన బర్హిషుడు ఒకరు. ఇతడు గొప్ప ప్రజాపతిగా వెలుగొందాడు. ఇతడు ఘోర తపస్సు చేసి సముద్రుని కుమార్తె సువర్ణను వివాహమాడగా 10 మంది పుత్రులు జన్మించి గొప్ప ధనుర్విద్యాపారంగతులై సముద్రం అడుగున 10 వేల సంవత్సరాలు తపస్సు చేయగా బ్రహ్మ ప్రాచీన బర్హిషుడుని వీరి తపస్సు ఆపించమని కోరగా కుమారులకు చెప్పగా తండ్రి ఆజ్ఞానుసారం ధ్యానంతో విష్ణువును ప్రార్థిస్తూ 10 వేల సంవత్సరాలు తపస్సు చేయగా మహావిష్ణువు ప్రత్యక్షమై వరం కోరుకొమ్మనగా ప్రజలు సుఖశాంతులతో జీవించే వరం అడిగారు. – విష్ణుపురాణం

**ప్రాచీనశాలుడు :** ఉపమన్యుడి కొడుకు. వేదాలు నేర్చుకున్నా బ్రహ్మస్వరూపం తెలియక సత్యయజ్ఞుడితో కలసి ఉద్దాలకుడి దగ్గరకు వెళ్తాడు. అచట నుండి అశ్వపతి వద్దకు వెళ్లి బ్రహ్మ స్వరూపం తెలుసుకుంటారు. – చూ॥ ఉద్దాలకుడు

**ప్రాచీనావీతం :** పవిత్ర నూలుపోగును ఎడమ భుజం పైనుండి కుడిచేతి క్రిందికి ధరించడాన్ని ఉపవీతమని, దానికి వ్యతిరేక స్థితిలో అనగా కుడి భుజం పైన ఎడమచేతి క్రిందుగా పవిత్ర నూలుపోగును ధరించడాన్ని ప్రాచీనా వీతమని అంటారు. ఇది మెడచుట్టు అలంకారంగా ధరించడాన్ని నివీతం అంటారు. – మనుస్మృతి

**ప్రాచీశుడు :** పురూరవుని పుత్రుడగు జనమేజయుని కుమారుడు. ఇతడు ఉదయాచల పర్వతము వరకు దిగ్విజయ యాత్ర చేసెను. ఇతని భార్య అశ్మక. వీరి పుత్రుడు సంయాతి. – భాగవతం

**పాణ్ణధితక :** ధృతరాష్ట్రుని వందమంది కుమారుల్లో ఒకడు. కురుక్షేత్ర యుద్ధంలో భీమసేనుడి చేతిలో మరణించాడు. – మహాభారతం

**ప్రాణ 1 :** భృగుమహర్షి మనుమడు. ఖ్యాతి అనే భార్య వల్ల భృగునికి లక్ష్మి అనే కుమార్తె, ఇద్దరు కుమారులైన ధాత, విధాతలు జన్మించారు. ధాత ఆయాతిని, విధాత వియాతిని వివాహమాడారు. వారికి ఇద్దరు పుత్రులు. వారు ప్రాణుడు, మృకణుడు. మృకణుడికి జన్మించిన వాడే మార్కండేయుడు. – విష్ణుపురాణం

**ప్రాణ 2 :** మనోహరకు సోముడను వసువువల్ల జన్మించిన కుమారుడు. ఇతడు వర్చసుడి చిన్న తమ్ముడు. వీరికి మరిద్దరు సోదరులు కలరు. వారు శిశిర రమణులు. – మహాభారతం

**ప్రాణ 3 :** ప్రాణవాయువు. దీన్ని జీవవాయు అని అంటారు. – చూ॥ ప్రవాహం

**ప్రాణకుడు :** ప్రాణం అనబడే అగ్ని కుమారుడు. – మహాభారతం

**ప్రాణధరుడు :** కంచిని బాహుబలుడను రాజు పాలిస్తున్న కాలంలో జీవించారు. ప్రాణధరుడు వ్యసనాలకు బానిసయై సంపద పోగొట్టుకోగా సోదరుడు సహాయపడి ఇద్దరూ దరిద్రులవుతారు. తమకు తెలిసిన మెళకువలతో రాజు ధనాగారానికి ఓ చిలుకను పంపి వజ్రవైఢూర్యాలు దొంగిలిస్తారు. తమ్ముడు ఇకచాలని చెప్పినా ప్రాణధరుడు అదే పని మరల మరల చేస్తుండగా భాండాగార అధిపతి రాజుకి విన్నవించగా గూఢచర్యంతో దీనికి కారణం ప్రాణధరుడని గ్రహించి వారిని పట్టుకోబోగా విమానాలు తయారుచేసుకొని చెరోదిక్కుకి పారిపోయి జీవితంలో తిరిగి కలుసుకోరు. – *కథాసరిత్సాగరం*

**ప్రాణాయామం :** ప్రాణమనగా శరీరంలోని వాయువు. ఆయామం అంటే నిరోధం. ఇది శ్వాసను నిరోధించడాన్ని ప్రాణాయామం అంటారు. ఇది రేచన, పూరక, కుంచకాలని మూడు విధాలు. – అగ్నిపురాణం

**ప్రాతరుడు 1 :** కౌరవ్య వంశంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. – మహాభారతం

**ప్రాతరుడు 2 :** ఏడవ ఆదిత్యుడైన ధాతకు రాక వల్ల జన్మించిన కుమారుడు. – భాగవతం.

**ప్రాతికామి :** దుర్యోధనుని రథసారధి. ఇతడు ద్రౌపదిని ధర్మజుడు జూదంలో ఓడినపుడు సభకు తీసుకు వచ్చాడు. ఇతడు కురుక్షేత్ర యుద్ధంలో పాండవుల చేతిలో చంపబడ్డాడు. – మహాభారతం

**ప్రాతికుడు :** వసు అను రాజుయొక్క కుమారుడు. – భాగవతం

**ప్రాతిశాఖ్య :** చూ॥ క్రమపాధుడు.

**ప్రాధ :** దక్షుని కుమార్తెలలో ఒకరు. కశ్యపుని భార్యలలో ఒకరు.

**ప్రాప్తకాలజ్ఞుడు :** చూ॥ దీర్ఘదర్శి.

**ప్రాప్తి :** కంసుని భార్యల్లో ఒకరు. రెండోభార్య అస్తి. – *భాగవతం.*

**ప్రాయశ్చిత్తం :** ప్రాచీన భారతదేశంలో చేసిన పాపాలను పోగొట్టుకోవడానికి తగిన స్వయం శిక్ష ఆపాదించు కొనేవారు. దానినే ప్రాయశ్చిత్తం అనేవారు.
హత్యచేసిన వారేగాక దాన్ని తలపెట్టినవారు కూడా హంతకులే. వైద్యుని చేతిలో మరణిస్తే హత్యకాదు. కుమారుణ్ణి శిష్యుణ్ణి భార్యను శిక్షించినపుడు మరణిస్తే అది పాపం కాదు. బ్రహ్మణుడిని కాని గోవునుకాని హత్యచేసి తర్వాత ఆత్మహత్య చేసుకుంటే ప్రాయ శ్చితం అవుతుంది లేకపోతే 12 సంవత్సరాలు అడు క్కుంటూ ఇతరుల ముష్టిపై జీవిస్తే హత్యాపాతకం పోతుంది. తన సొంతలాభం కోసం హత్యచేస్తే 12 సంవత్సరాలు, అలాకాకుండా హత్యచేస్తే 6 సంవత్స రాలు భిక్షాటన చాలు. బ్రాహ్మణుడు వైద్యుడిని చంపితే ఒకరకమైన శిక్ష, క్షత్రియుడు శూద్రుణ్ణి హత్యచేస్తే మరో శిక్ష. తల్లితోగాని చెల్లితోగాని గురుపత్నితోగాని శారీక సంబంధం కల్గితే కాలే ఇనుప పాత్రలోపడి కాలిపోవాలి. అలాగే వివిధ పాపాలకు వివిధ రకాల ప్రాయశ్చిత్తాలు నిర్ణయించబడ్డాయి. – *అగ్నిపురాణం*

**ప్రాయోపవేశం :** దేహత్యాగం చేయడం కోసం దర్భా సనం మీద శయనించడాన్ని ప్రాయోపవేశ మంటారు.

**ప్రావరకం :** క్రౌంచ ద్వీపంలో కలసివున్న పురాణకాలం నాటి స్థలం. – *మహాభారతం*

**ప్రావారకర్ణుడు :** హిమాలయాల్లో చిరంజీవిగా వున్న గుడ్లగూబ. – *చూ॥ ఇంద్రద్యుమ్నుడు*

**ప్రావృషేయం :** ప్రాచీన భారతదేశంలోని ఓ నివాస యోగ్య ప్రాంతం. – *మహాభారతం*

**ప్రాశితం :** పంచమహాయజ్ఞాలలో ఒకటి. తక్కిన నాలుగు ఆహుతం, హుతం, ప్రహుతం, బ్రహ్మ హుతం. – *చూ॥ ప్రహూతం*

**ప్రాప్తి :** జరాసంధుడి కుమార్తె. ఆస్తి చెల్లెలు. ఈమె కంసుడి రెండోభార్య. – *భాగవతం*

**ప్రాంశునృగుడు :** ఓ మనువు. ఇక్ష్వాకు, నాభాగ, శార్యాతి, నరిశ్వంత, ప్రాంశునృగులందరూ మనువులు. – *దేవీభాగవతం*

**ప్రాంశువు :** వత్సప్రీతి కొడుకు. ఇతని కుమారుడు ప్రమతి.

**ప్రియ :** దక్షుడి కుమార్తె. దక్షుడీమెను బ్రహ్మకిచ్చాడు. వీరి కుమారుడు నారదుడు. – *మహాభారతం*

**ప్రియకుడు :** సుబ్రహ్మణ్యస్వామి సైనికుల్లో ఒకడు. – *మహాభారతం*

**ప్రియదర్శనుడు 1 :** సుబ్రహ్మణ్యస్వామి సైనికుల్లో ఒకడు. – *మహాభారతం*

**ప్రియదర్శనుడు 2 :** ద్రుపదుని కుమారుడు. ద్రౌపది స్వయం వరానంతరం జరిగిన యుద్ధంలో కర్ణుడితణ్ణి వధించాడు. – *మహాభారతం*

**ప్రియభృత్యుడు :** ప్రాచీన భారతదేశంలోని ఒక రాజు. – *మహాభారతం*

**ప్రియమాల్యానుతపనుడు :** సుబ్రహ్మణ్యస్వామి సైనికుల్లో ఒకడు. – *మహాభారతం*

**ప్రియవర్చస్సు :** కుబేరుని కొలువులో ఓ నర్తకి. ఈమె శాపంవల్ల మొసలిగా మారి కొలనులో జీవించినపుడు అర్జునుడు రక్షించాడు. – *స్కందపురాణం*

**ప్రియంవద :** రాధిక యొక్క సహచరిణి. అర్జునుడు అర్జునికి అను స్త్రీగా మారి జలానుష్ఠానం చేసినప్పుడు ఈమె అర్జునుడ్ని రక్షించి సేవలు చేసింది. – *పద్మపురాణం*

**ప్రియంవదుడు :** ఒక గంధర్వుడు. మతంగముని శాపం వల్ల ఏనుగౌతాడు. శాపవిమోచనం కోరగా అజుడు నీ కుంభ స్థలంపై కొట్టగా శాపవిమోచన మౌతుందని చెప్తాడు. శాపవిమోచనానంతరం ఇతడు అజుడికి సమ్మోహనాస్త్రం ఉపదేశిస్తాడు. – *రఘువంశం.*

**ప్రియవ్రతుడు :** స్వాయంభవు అనంతల కుమారుడు. ఉత్తానపాదుడికి సోదరుడు. అకూతి, దేవహూతి, ప్రసూతులు ఇతని సోదరీమణులు. కుక్షి, బర్హిష్మతిలు ఇతని భార్యలు. అగ్నీంద్రుడు, మేధాతిథి మొదలగు వారితని పుత్రులు. ఇతడు మొదట రాజ్యపాలనకంగీ కరించలేదు. బ్రహ్మబోధనలవల్ల అంగీకరించాడు. – *భాగవతం*

**ప్రీతి :** పులస్త్యుని భార్య. ఈమెకు పులస్త్యుని వల్ల దత్తోలి అను కుమారుడు జన్మించాడు. ఇతడు అంతకు ముందు జన్మలో స్వాయంభువ మన్వంతరంలోని అగస్త్యుడు. – విష్ణుపురాణం

**ప్రేక్షాగృహం :** నాటకాలు పండగలు నిర్వహించడానికి నిర్మించబడిన భవనం. ద్రోణాచార్యుడు గొప్పవాస్తు శిల్పులతో ఓ ప్రేక్షాగృహం నిర్మించి పాండవ కౌరవుల ధనుర్విద్యా ప్రదర్శన నిర్వహించాడు. – మహాభారతం

**ప్రోషకం :** పశ్చిమ ప్రాచీన భారతదేశంలోని నివాసయోగ్య ప్రాంతం. – మహాభారతం

**ప్రోష్ఠం :** భారతదేశంలోని ఓ ప్రాచీన నగరం. – మహాభారతం

**ప్రోష్మ :** ప్రాచీన భారతదేశంలోని ఒక నగరం. – మహాభారతం

**ప్లక్షజాతం :** గంగానది యొక్క ఉపనది. దీన్ని సరస్వతి అవతారమని, దీని నీటిని త్రాగితే సకల పాపాలు నశిస్తాయంటారు. – మహాభారతం

**ప్లక్షద్వీపం :** ఏడుద్వీపాలలో ఒకటి. చూ॥ సప్తద్వీపాలు.

**ప్లక్ష ప్రసవనతీర్థం :** సరస్వతీ నది జన్మించిన పవిత్ర స్థలం. – మహాభారతం

**ప్లక్షవతి :** ఇదో నది. పురాణాలలో ఇది పవిత్రనదిగా చెప్పబడింది. – మహాభారతం

**ప్లక్షావతరణం :** యమునా నది పుట్టిన పుణ్య స్థలం. ప్రాచీన భారతీయులు దీన్ని స్వర్గానికి ద్వారంగా అభివర్ణించారు. – మహాభారతం

**ప్లాక్షాయణుడు :** ప్రాచీన వైయాకరుణుడు. విసర్గ సంధిని గూర్చి ఇతని అభిప్రాయాలు తైత్తరీయ ప్రాతిశాఖ్యంలో వివరించబడినవి.



**ఫ :** ఈ అక్షరానికి అర్థం ఝుంఝువటం. 'ఫు' అనగా పుత్కార, అనగా ఓ శబ్ద లక్షణం లేక నిరుపయోగం. – అగ్నిపురాణం

**ఫలకక్షుడు :** ఓ యక్షుడు. కుబేరుని కొలువులో వుంటాడు. – మహాభారతం

**ఫలకేతనం :** ఓ పుణ్యస్థలం. ఒకసారి దేవతలు చిరకాలం పూజలు నిర్వహించారు. ఇది వెయ్యి సంవత్సరాల పైగా కొనసాగింది. అప్పటి నుండి ఇది పుణ్యస్థలమయ్యింది. – మహాభారతం

**ఫలోదకుడు :** కుబేరుని కొలువులోని ఓ యక్షుడు. – మహాభారతం

**ఫలౌదకుడు :** ఓ యక్షుడు. కుబేరుని కొలువులో వుంటాడు. – మహాభారతం

**ఫల్గు :** ఓ పుణ్యనది. ఈ నదిని దర్శిస్తే అశ్వమేధయాగం చేసిన ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**ఫల్గుణుడు :** అర్జునుడి మరోపేరు. ఫల్గుణ మాసంలోని ఉత్తరార్థంలో జన్మించాడు కనుక ఫల్గుణుడని లేక ఫాల్గుణుడని పిలవబడ్డాడు.

**ఫల్గుతంత్రుడు :** అయోధ్యా రాజు, ఇక్ష్వాకు వంశ ప్రసిద్ధుడు అయిన సగరుని తండ్రి. ఇతని పెద్ద వయసులో తాలజంఘుని నాయకత్వంలో హైహ యులు అయోధ్యపై దండెత్తి ఫల్గుతంత్రుడ్ని పారద్రోలగా ఔర్య ముని ఆశ్రమంలో కొంతకాలం జీవించి స్వర్గస్తుడు కాగా అప్పటికే గర్భిణి అయిన అతని భార్య సగరుడికి జన్మనిచ్చింది.

**ఫాల్గుణం :** ఇదో మాసం (మార్చి నెల). ఫల్గుని నక్షత్ర యోగం ఈ నెలలోనే కన్పిస్తుంది. తానొక రోజులో ఒకసారి భుజించే ఆహారాన్ని ఇతరులకు బహుమతిగా ఇస్తే భార్యచే కొనియాడబడతాడు. అతనికి చంద్రలోక ప్రాప్తి లభిస్తుంది. – మహాభారతం

**ఫేనవుడు :** భృగు కుటుంబంలో ఓ గోత్రానికి ఆద్యుడు. గోవుల గొప్పదనాన్ని ధర్మజుడికి వివరించేటప్పుడు ఇతడిని గురించి పేర్కొనబడింది. ఇతని అసలు పేరు సుమిత్రుడు. త్రిశిఖ్య పర్వతం వద్దగల కులజా నదీతీరంలో గోవుల పాలపై నురుగును త్రాగి జీవించేవాడు కనుక ఈ పేరు వచ్చింది. ఫేన అనగా నురుగు అని అర్థం. – మహాభారతం

**ఫేనుడు :** ఉశీనార వంశంలోని ఒక రాజు. ఇతని కుమారుడు సుతపసుడు. మనుమడు ఔశినారుడు. – హరివంశం.



**బక/బకం :** సుమాలి అనే రాక్షసుడి కూతురు.
– ఉత్తరరామాయణం

**బకదాల్బ్యుడు :** ఓ గొప్ప తపశ్శక్తివంతుడు. అతని యజ్ఞగుండంలో ధృతరాష్ట్రుడి రాజ్యాల్ని విసిరాడు.

**బకాసురుడు :** ఓ రాక్షసుడు. దుర్యోధనుని దురాలోచనచే నిర్మించబడిన లక్క గృహం తగలబడినపుడు పాండవులు బ్రాహ్మణ వేషధారులై ఏకచక్రపురంలో ఓ బ్రాహ్మణుడి ఇంట తలదాచుకుంటారు. ఆ నగరానికి దగ్గరలో ఓ గుహలో బకుడను రాక్షసుడు వుంటూ ఈ ఊరిపై పడి మనుషుల్ని తిని బ్రతికేవాడు. ఆ రాక్షసునతో ఆ ఊరి ప్రజలతో ఓ అంగీకారానికి వచ్చి ఒక్కోరోజు ఒక్కో ఇంటినుండి ఆహారంతో పాటు ఓ మనిషి అతనికి ఆహారంగా వెళ్లేవారు. పాండవులు వీరి ఇంటనున్న సమయంలో వీరివంతు వచ్చి తండ్రీ కొడుకులు నేను వెళ్తానంటే నేను వెళ్తానని రెండోవారు బ్రతకాలనే కోర్కెతో వాదులాడుకొంటుండగా కుంతి వారి బదులు భీముడ్ని పంపుతుంది. భీముడు ఆ గుహవద్దకు ఆలస్యంగా వెళ్లి అతనికి తెచ్చిన ఆహారం కూడా తనే భుజించి బకుడి కోపకారణమై ముష్టి యుద్ధం చేయగా బకుడు మరణిస్తాడు. కిర్మీరుడను రాక్షసుడు బకుని సోదరుడు. – మహాభారతం

**బకుడు 1 :** ఓ రాక్షసుడు. కంసుని పనుపున శ్రీకృష్ణుని వధించుటకు మొసలిగావెళ్లి శ్రీకృష్ణుని మ్రింగగా శ్రీకృష్ణుడు ఆ రాక్షసుడి శరీరానికి తగలగనే దాని గొంతు మంటలు పుట్టి శ్రీకృష్ణుడిని వదలి అది మరణించింది.

**బకుడు 2 :** చూ॥ బకదాల్బ్యుడు.

**బకుడు 3 :** దల్బుని పుత్రుడు. గ్లావుడని కూడా పిలిచెదరు. ఇతడు ముఖ్య ప్రాణాత్మ స్వరూపము కలవాడు. ఇతడు నైమిషీయ ఋషులకు ఉద్గాతగా నుండి వారి కోరికలు తీర్చెను. – చాందోగ్యోపనిషత్తు

**బటువు :** గీతను నిత్యం పఠించే బ్రాహ్మణుడు. ఇతడు తన కర్తవ్యాన్ని త్వరగా ముగించేవాడు కనుక మరణానంతరం స్వర్గం వెళ్లాడు. ఇతని మృత శరీరాన్ని పక్షులు ఆరగించగా ఎముకలు మిగిలాయి. వర్షం వల్ల పుర్రెలో నీరు చేరగా ఓ పాపి ఆ దారిన వెళ్తూ ఈ పుర్రెను అంటుకోగా ఇతనికి ముక్తి లభించింది. – పద్మపురాణం

**బడబాగ్ని :** చూ॥ ఔర్వుడు.

**బదరికాశ్రమం :** హిమాలయాలలోని ఓ పుణ్యస్థలం. ఇచ్చటే నరనారాయణులు వేల సంవత్సరాలు తపస్సు చేశారు. అందువల్లనే ఇది గొప్ప పుణ్యస్థలంగా ప్రసిద్ధి కెక్కింది.

**బదరి పాచనం :** కురుక్షేత్రంలో ఓ పుణ్య స్థలం. కాలాన్ని మరచి 12 సంవత్సరాలు నిరాహారిగా జీవిస్తే వశిష్ఠుడంతటి మహర్షి కాగలరు. దీన్ని బదరీపచన తీర్థమని కూడా అంటారు. – మహాభారతం

**బభ్రుదైవావృధుడు :** ఓ యాదవ రాజు. ఇతడు యజ్ఞ నిర్వహణలో నిపుణుడు. ఇతడు నారదునికి, పర్వత మహర్షికి శిష్యుడు. – ఐతరేయ బ్రాహ్మణం.
యాదవ రాజుల వద్ద గల ఏడుగురు గొప్ప మంత్రుల్లో ఇతడొకడు. వృష్ణి వంశంలో జన్మించాడు. ఈ రాజర్షి శ్రీకృష్ణుడి దర్శనార్థం వెళ్లినపుడు శిశుపాలుడితడి భార్యను ఎత్తుకుపోయాడు. ద్వాపర యుగాంతంలో యాదవులు ఒకరినొకరు చంపుకుంటుంటే శ్రీకృష్ణుడి తణ్ణి, ద్వారకుణ్ణి పంపగా ఓ గదకు బలై మరణించాడు. – మహాభారతం

**బభ్రుమాలి :** ఇతడొక మహర్షి. ధర్మరాజు సభను తేజోవంతం చేసిన మహర్షుల్లో ఒకడు. – మహాభారతం

**బభ్రువాహనుడు :** అర్జునుని కుమారుడు.
*జననం :* పాండవులు ద్రౌపదిని వివాహమాడినప్పుడు వారి మధ్య విభేదాలు రాకుండా నారదుడు ద్రౌపది ఒక్కోసంవత్సరం ఒక్కొక్కరితో ఆమె వుండేటట్లు సలహా ఇచ్చాడు. దీనికి భంగం కల్గించినవారు ఒక సంవత్సరం వనవాసం చేయాలనే నియమం విధించాడు. ఒకసారి ధర్మజుడు పాంచాలితో వుండగా అర్జునుడు అతని ఇంటికి వెళ్లి నియమానికి భగ్నం కల్గించడం వల్ల వనవాసం చేశాడు.ఆ సమయంలో గంగా ద్వారం వద్ద నాగకన్య అయిన ఉలూచిని తర్వాత తుణలూరు దేశం వెళ్లి రాజు కోర్కెపై అతని కుమార్తె చిత్రాంగధను వివాహమాడాడు. చిత్రాంగధకు జన్మించినవాడే బభ్రువాహనుడు.
*అర్జునునికి గంగ శాపం :* కురుక్షేత్ర యుద్ధంలో గంగా తనయుడు, తన తాత అయిన భీష్ముడిని శిఖండిని అడ్డుపెట్టుకొని అర్జునుడు జయించగా గంగ తన కుమారుని మోసపూరితంగా జయించినందుకు అర్జునుణ్ణి

"కుమారుల చేతిలోనే సంహరింప బడతావని" శపిస్తుంది. ఉలూచి ఇది విని తన తండ్రి కౌరవ్యుడితో చెప్పగా అతడు గంగను ప్రార్థించి శాపవిముక్తి కోరగా బభ్రువాహనుడు వధిస్తాడని, మృత సంజీవని రాయి అతని హృదయంపై వుంచితే పునరుజ్జీవుడవుతాడని చెప్తుంది.

అర్జునుని మరణం : మహాభారత యుద్ధానంతరం అర్జునుడు జైత్రయాత్ర చేస్తూ తుణలూరు దేశం వెళ్లగా ఆ అశ్వాన్ని బంధించిన బభ్రువాహనుడు ఉలూచి కోరికపై అర్జునుడితో యుద్ధం చేస్తాడు. ఓ శరాఘాతానికి అర్జునుడు మరణించగా చిత్రాంగధ కోరికపై ఉలూచి నాగలోకం వెళ్లి మృత సంజీవనిని తెచ్చి అర్జునుణ్ణి బ్రతికిస్తుంది. – మహాభారతం

**బభ్రువు 1 :** వ్యాసుని శిష్య పరంపరలోని ఓ మహర్షి. – చూ॥ *గురుపరంపర*

**బభ్రువు 2 :** వృష్ణి వంశంలో జన్మించిన యాదవుడు. ఇతడు యాదవ వీరుల్లో ముఖ్యుడు. ఇతడు వృద్ధాప్యంలో కూడా తపస్సు చేశాడు. ఇతడొకసారి ద్వారకలో వుండగా శిశుపాలుడు ఇతని భార్యను ఎత్తుకుపోయాడు. ఇతడు శ్రీకృష్ణుని స్నేహితుడు. వ్యాసుని బాణం తగిలి మరణించాడు. – మహాభారతం

**బభ్రువు 3 :** ఓ కాశీరాజు. శ్రీకృష్ణుని సహాయంతో రాజ్యలక్ష్మిని పొందాడు. – మహాభారతం

**బభ్రువు 4 :** విరాటరాజు కుమారుల్లో ఒకడు. – మహాభారతం

**బభ్రువు 5 :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు. ఇతడు బ్రహ్మవాది. – మహాభారతం

**బభ్రుసేతువు :** ఓ గంధర్వరాజు. దృహ్యుని సోదరుడు, పురోవసుడికి తండ్రి. – అగ్నిపురాణం

**బర్బరం :** పురాణ ప్రసిద్ధమైన ఒక దేశం. ఈ దేశ ప్రజల్ని బర్బరులంటారు. వీరు తక్కువ కులం వారుగా పరిగణించబడ్డారు. వీరు నందిని అనే గోవు ప్రక్క భాగాల నుండి జన్మించారని చెప్పబడింది. భీమసేనుడొకసారి, నకులుడొకసారి ఈ దేశాన్ని జయించారు. ధర్మజుని రాజసూయ యాగానికి కానుకలు సమర్పించారు. – మహాభారతం

**బర్బరికుడు :** భీముని కుమారుడైన ఘటోత్కచునికి మోర్వివల్ల జన్మించిన కుమారుడు.

బర్బరికుడు పూర్వజన్మలో ఓ యక్షుడు. దానవుల బాధపడలేక మహావిష్ణువు సహాయం కోరగా ఇతడు దానికి విష్ణువు అవసరమే లేదు నేనే వారిని నాశనం చేయగలనని గర్వంతో పలుకగా బ్రహ్మ నీ పునర్జన్మలో మహావిష్ణువుచే చంపబడతావని శపిస్తాడు. ఆ శాప ఫలమున ఇతడు ఘటోత్కచుని తనయుడైన బర్బరికుడిగా జన్మించాడు.

ఆ శాపం యొక్క శక్తిని తగ్గించడానికి శ్రీకృష్ణుడు దేవిని పూజించమని చెప్పగా విజయుడను బ్రహ్మణుని సహాయంతో దేవిని పూజించి మహాజిహ్వుడు, రేపతేంద్రుడను రాక్షసులను వధిస్తాడు. ఆ బ్రాహ్మణుడు విభూతి అనే శక్తినిచ్చి ఇది పాండవుల పక్షాన పోరాడే సమయంలో కౌరవులపై ప్రయోగిస్తే ముఖ్య భాగాలను చీల్చివేస్తుందని చెప్తాడు.

ఒకసారి తన తాత భీముడితోనే పోరాడి అతణ్ణి గాయపరచి పశ్చాత్తాపంతో ఆత్మహత్య చేసుకోబోగా దేవి ప్రత్యక్షమై శ్రీకృష్ణుని చేతిలో మరణం వల్లనే ముక్తి లభిస్తుంది గనుక ఆత్మహత్య చేసుకోవద్దని చెప్తుంది. కురుక్షేత్ర యుద్ధంలో ఇతడు పాండవులను తప్ప తక్కినవారిపై ఈ ఆయుధాన్ని ప్రయోగిస్తాడు. కృపాచార్యునిపై అశ్వత్థామపై ప్రయోగిస్తాడు. అతడు కృష్ణుని కూడా వదలిపెట్టక అతనిపైన విసరగా అది శ్రీకృష్ణుని కాళ్లవద్ద పడుతుంది. శ్రీకృష్ణుడు తన సుదర్శన చక్రంతో ఇతడిని వధించగా దేవి ప్రత్యక్షమై ఇతడ్ని బ్రతికిస్తుంది. యుద్ధానంతరం శ్రీకృష్ణుని సలహాపై గుప్తక్షేత్రంలో నివసిస్తాడు. – స్కందపురాణం

**బర్హణాశ్వుడు :** పృథు చక్రవర్తి వంశంలో జన్మించిన రాజు. నికుంబుని కుమారుడు. మాంధాత ఇతని సంతతిలోనివాడే. ఇతడిని బర్హిణాశ్వుడని కూడా అంటారు. – దేవీ భాగవతం

**బర్హిషదుడు :** బర్హిష్మంతుడి మరోపేరు. ఇతనికి ప్రాచీన బర్హి అను పేరు కూడా వచ్చింది. – చూ॥ ప్రాచీన బర్హి

**బర్హిషదులు :** పితృగణంలో ఒక తెగ. బ్రహ్మ రెండు రకాల పితృ గణాలను సృష్టించాడు. అగ్నిష్వాత్తులు, బర్హిషదులు. బర్హిషదులు మృతి చెందిన వారి కర్మకాండల నిర్వహణకు మంత్రాలు పఠిస్తారు. బర్హిషదు

ల ద్వారానే బ్రహ్మ ఓ బ్రాహ్మణుడికి సాత్వత ధర్మం నేర్పగా తర్వాత అతడే జ్యేష్టుడని ప్రసిద్ధి చెందాడు. – *మహాభారతం*

బర్హిషదులు అత్రి మహర్షి కుమారులు. వీరు దైత్య దానవ యక్ష గంధర్వ, రాక్షస, ఉరగ, సువర్ణ, కిన్నెరు లకు జన్మనిచ్చారు. – *మనుస్మృతి*

**బర్హిష్మతి :** స్వాయంభవ మనువు కుమారుడైన ప్రియ వ్రతుని భార్యల్లో ఒకరు. మరో భార్య సురూప. ఇద్దరూ విశ్వకర్మ ప్రజాపతి కుమార్తెలే. బర్హిష్మతికి ముగ్గురు పుత్రులు. వారు ఉత్తమ, తమస, రైవతులు. ఆ తర్వాతి కాలంలో ఈ ముగ్గురూ మన్వంతరాధి పతులయ్యారు. – *దేవీ భాగవతం*

**బర్హిస్సులు :** దేవ గాంధర్వ తెగకు చెందినవారు. పృథ వల్ల కశ్యప ప్రజాపతికి జన్మించారు. – *మహాభారతం*

**బల :** ఇదొక మంత్రం. – *చూ॥ అతిబల*

**బలదుడు :** బానుడను అగ్ని యొక్క మొదటి కుమారుడు. అగ్నే సకల జీవజాలాలకు జీవాన్ని బలాన్ని ఇస్తోంది. – *మహాభారతం*

**బలంధనుడు :** నాభాగుడి కుమారుడు.

**బలంధర :** కాశీరాజు కుమార్తెలలో ఒకరు. అతి బలవంతుడైన మానవుడే ఈమెను వివాహం చేసుకోవాలని కోరగా భీమసేనుడు బలవంతుల్ని అందర్ని ఓడించి ఈమెను వివాహమాడాడు. ఈమెకు జన్మించిన కుమారుడు సర్వశుడు. – *మహాభారతం*

**బలబంధుడు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. – *మహాభారతం*

**బలభద్రరాముడు :** బలభద్రరాముడు, బలరాముడు, బలదేవుడు అనికూడా పిలవబడతాడు. శ్రీకృష్ణుని అన్న అయిన బలరాముడు శ్రీమహావిష్ణువు 8వ అంశగా జన్మించాడని చెప్తారు. రాజుల దుర్మార్గం పెచ్చరిల్లటంతో భూదేవి శ్రీమహావిష్ణువు నాశ్రయించగా వసుదేవుని కుమారులైన బలరామ కృష్ణులుగా జన్మించి దుర్మార్గులను నాశనం చేస్తానని అభయ మిస్తాడు. మధుర రాజైన శూరసేనుడి కుమారుడు వసుదేవుడు. అతడు ఉగ్రసేనుని కుమార్తె దేవకిని వివాహం చేసుకోగా అదేరోజు అశరీరవాణి దేవకి 8వ సంతతి కంసుడిని వధిస్తుందని చెప్పగా కంసుడు దేవకి వసుదేవుల్ని కారాగారంలో వుంచి పుట్టిన బిడ్డను పుట్టినట్లు వధిస్తాడు. శ్రీమహావిష్ణువు ఇది గ్రహించి దేవకి సప్తమ గర్భంలోని పిండాన్ని మహామాయ ద్వారా వసుదేవుని మరోభార్య రోహిణి గర్భంలోకి మార్చగా దేవకికి గర్భస్రావం జరిగినట్లు కంసుడు భావిస్తాడు. ఆ సప్తమ గర్భమే రోహిణికి జన్మించిన సంఘర్షణుడు, అతడినే బలరాముడనే వారు.

*బలరామకృష్ణుల రూపం వెనుక కథ :* శ్రీ మహావిష్ణువు దుర్మార్గులను చంపనెంచెనని తలచి దేవతలు అందుకు మేమూ తోడ్పడతామని చెప్పగా శ్రీమహావిష్ణువు తన తలలోని తెల్ల వెంట్రుకను లాగి రోహిణి గర్భంలోకి, ఓ నల్లవెంట్రుకను దేవకి గర్భంలోకి చేర్చగా బలరాముడు తెల్లటి రంగుతో, శ్రీకృష్ణుడు నల్లని రంగుతో జన్మించారు. బలరామునికి రోహిణి వల్ల జన్మించిన 6 గురు సోదరులు. వారు గద, శారణ, దుర్దమ, విపుల, ధ్రువ, కృతులు. – భాగవతం

శ్రీకృష్ణ, బలరాముల వివాహం వరకు శ్రీకృష్ణుడు అంబడిలో, బలరాముడు మధురలో జీవించారు. గర్గ మహర్షి ఒక రోజు వసుదేవుని ఇంటికి వచ్చి వీరి కథ చెప్పగా వసుదేవుడు బలరాముడిని కూడా అంబడికి తీసుకువచ్చాడు. బలరామ శ్రీకృష్ణులు అంబడిలో వుండగా ఎన్నో ముఖ్య సంఘటనలు జరిగాయి. వీరిద్దరు ఎంతో మంది అసురులను ఇక్కడే సంహరించారు. – *చూ॥ శ్రీకృష్ణుడు*

కంసుడు శ్రీకృష్ణుడిని వధించడానికి చాప పూజ నిర్వహించాడు. శ్రీకృష్ణ బలరాములు మధురకు వెళ్లి కంసుడిని సంహరించారు. ఆ తర్వాత సాందీప మహర్షి వద్ద విద్యనభ్యసించి వస్తూ తపస్సులో వున్న పరశురాముని కలసి అతని సలహాపై శృగాల వాసు దేవుణ్ణి సంహరించి అతని సంపదతో యాదవులతో వచ్చి ద్వారకా నగరాన్ని నిర్మించుకొన్నారు. – భాగవతం

ద్వారకను వారు ఆక్రమించక ముందు దీని పేరు కుశస్థలి. దీన్ని రాజర్షి అయిన రేవతుడు పాలించేవాడు. ఇతనికి 100 మంది కుమారులు, రేవతి అనే కుమార్తె. పెద్ద కొడుకు కుకుద్మినుడు. రేవతికి వివాహం చేయడానికి బ్రహ్మ సలహా కోరగా బల రాముడే తగిన వరుదని చెప్పగా ఆమెను బలరామునికిచ్చి వివాహం చేస్తాడు. – *దేవీ భాగవతం*

*బలరాముని తీర్థయాత్రలు :* కౌరవ పాండవ యుద్ధ సమయంలో దాన్ని ఆపడానికి ప్రయత్నించి విఫలుడై ఆ యుద్ధం నుండి దూరంగా వుండటానికి తీర్థ యాత్రలు చేశాడు. నైమిశారణ్యంలో సూతుడు పురాణ కథలు చెప్తుండగా తనను చూసి గౌరవించ లేదని అతడిని వధించగా మునులు బలరాముడి చర్యకు బాధపడగా వేద వేదాంగ పండితుడ్ని వధించినందుకు ప్రతిగా అతణ్ణి సజీవుణ్ణి చేస్తాడు. మునులకోరికపై నైమిశారణ్యంలో వారిని బాధిస్తున్న బల్వలుడను రాక్ష సుడ్ని తన హలాయుధంతో వధిస్తాడు. – *భాగవతం*

*నిర్యాణం :* ఒకసారి నారదుడు, కణ్వుడు, విశ్వా మిత్రుడు ద్వారకకు రాగా వారిని హేళన చేయడానికి ఓ పురుషుడ్ని గర్భిణీ ఆకారంలో చూపి ఈమెకు ఎవరు జన్మిస్తారో చెప్పమని కోరగా మునులు ఉగ్రులై ఓ రోకలి జన్మించి యాదవ నాశనం చేస్తుందని శపిస్తారు. అదే యాదవ నాశనానికి కారణమయ్యింది.

మహాభారత యుద్ధానంతరం యాదవ రాజ్యం 36 సంవత్సరాలే వుంది. ఆ తర్వాత మునుల శాపం వల్ల యాదవులు మద్యం సేవించి ఒకరినొకరు చంపు కొంటారు. ఇది ప్రబాస తీర్థం వద్దే జరుగగా బలరా ముడు ధ్యానంలోకి వెళ్లగా అతని నోటి నుండి ఆత్మ తెల్లని సర్పం రూపంలో బయటకు వచ్చి నాగలోకం వెళ్ళింది. బలరాముని పూర్తి వృత్తాంతం శ్రీకృష్ణుడిని గురించి కూడా తెలిసినప్పుడే పూర్తిగా అవగతమవు తుంది. దానికి కారణం ఇద్దరి జీవితాలు జీవి తాంతం ముడిపడి వున్నాయి. – చూ॥ కృష్ణుడు

**బలం :** ఇవి పది రకాలు. – చూ॥ పట్టు

**బలమిత్రుడు :** ఒక రాజు. శత్రుఘ్నుడు శ్రీరాముని అశ్వమేధయాగ సమయంలో అశ్వరక్షకుడిగా వున్న పుడు వీరమణితో యుద్ధం చేశాడు. ఆ సమయంలో బలమిత్రుడు వీరమణి తరపున పోరాడాడు.
– పద్మపురాణం

**బలయోధకుడు :** కుండలి నగరి రాజైన సురధుని కుమారుడు. – పద్మపురాణం

**బలసూదనుడు :** ఇంద్రుడి మరోపేరు. బలుడనే రాక్ష సుణ్ణి వధించడం వల్ల ఈ పేరొచ్చింది.

**బలాకాశ్వుడు :** జుహ్నువను ముని యొక్క మనుమడు, సింధు ద్వీపుడనబడే అజుని కుమారుడు. బలకాశ్వుడి కుమారుడి పేరు కుశికుడు. – మహాభారతం

**బలాకి :** ధృతరాష్ట్రుని వంద మంది పుత్రులలో ఒకడు. ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు.
– మహాభారతం

**బలాకుడు :** ఓ అటవికుడు. ప్రతిరోజు అడవికి వెళ్లి ఆహారం తెచ్చి తన తల్లిదండ్రులకు పెట్టేవాడు. ఒక రోజు మొత్తం గాలించినా ఆహారం దొరకలేదు. ఆరోజు అలా తిరుగుతూ ఓ నది ఒడ్డున ఓ వింత జంతువును చూశాడు. ఆ వింత జంతువు బ్రహ్మను గూర్చి చిన్న వయసు నుండి తపస్సు చేసి కన్పించిన ప్రతిదాన్ని నాశనం చేసే వరం పొందింది. బ్రహ్మ ఈ వింత జంతువును చంపినవాడికి దేవతల సరసన చోటు దక్కుతుందనే అనుగ్రహం ఇచ్చాడు. ఆ వింత జంతువు నదిలో నీరు త్రాగుతుండగా బలాకుడు దాన్ని చంపగనే దేవతలు ఇతనిపై పుష్పవర్షం కురి పించి దైవికమైన రథంపై స్వర్గానికి తీసుకువెళ్లారు.
– మహాభారతం

**బలాక్షుడు :** భారతదేశ ఓ ప్రాచీన రాజు. విరాటుని కొలువు నుండి అజ్ఞాతవాసం వీడి అర్జునుడు ఉత్తర గోగ్రహణంలో కౌరవులతో యుద్ధం చేస్తుండగా దేతలు పై నుండి ఈ యుద్ధం వీక్షించారు. దేవతలతో పాటు ఈ రాజు కూడా యుద్ధం చూశాడు.
– మహాభారతం

**బలాతీర్థం** గంధమాదన పర్వతం వద్దగల పుణ్యస్థలం. ఇచ్చట స్నానం చేసిన వారు భగవంతునివలే కాంతి వంతమై ప్రసిద్ధి చెందుతారు. – మహాభారతం

**బలానీకుడు 1 :** ద్రుపదుని కుమారుల్లో ఒకరు. కురుక్షేత్ర యుద్ధంలో అశ్వత్థామ ఇతణ్ణి వధించాడు.
– మహాభారతం

**బలానీకుడు 2 :** విరాట రాజైన మత్స్యుని సోదరుడు. ఇతడు పాండవుల పక్షాన పోరాడాడు.
– మహాభారతం

**బలాయుశుడు :** ఊర్వశీ పురూరవుల ఎనిమిదిమంది సంతానంలో ఒకడు. – పద్మపురాణం

**బలాశ్వుడు :** ఖనిత్రుడి కుమారుడు. ఇతడిని కరంధ ముడని అంటారు. – *చూ॥ కరంధముడు*

**బలాహకం :** ఓ ప్రసిద్ధి చెందిన గుర్రం. శ్రీకృష్ణుని రథానికి కుడివైపున వుంటుంది. – *మహాభారతం*

**బలాహకుడు 1 :** వరుణుని కొలువులో వుండే ఓ ప్రసిద్ధ సర్పం. ఇది వరుణుడిని పూజిస్తుంది.
– *మహాభారతం*

**బలాహకుడు 2 :** సింధురాజైన జయద్రధుని సోద రుడు. ద్రౌపది అపహరణానికి ఇతడు జయద్రధుడికి సహకరించాడు. – *మహాభారతం*

**బలాహకుడు 3 :** ఒక రాజు. శివుడొకసారి గోవు, దూడగా దర్శనమిచ్చాడు. తర్వాత దూడ కన్పించిన ప్రాంతంలో ఓ శివలింగం ఆవిర్భవించి ప్రతిరోజు అణుమాత్రం పెరుగుతుండేది. కర్మఫలం వల్ల కుల హీనుడు దీన్ని దర్శించినపుడు పెరుగుదల ఆగి పోయింది. – *స్కందపురాణం*

**బలి (మహాబలి) 1 :** అసుర చక్రవర్తి. విరోచనుని కుమారుడు. ప్రహ్లాదుని మనుమడు.

*వంశవృక్షం :* కశ్యప ప్రజాపతికి దితి వల్ల జన్మించిన వారే రాక్షసులు లేక దైత్యులు. అందులో ప్రముఖులు హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు. హిరణ్యకశిపునికి నలుగురు కుమారులు. వారిలో ప్రహ్లాదుడు విష్ణు భక్తుడు. అతనికి విరోచనుడు జన్మించగా అతనికి జన్మించినవాడే మహాబలి. ఇతని పుత్రుడు బాణా సురుడు. ఇతడు ఎందరో అసురులకు జన్మనిచ్చాడు.

*క్షీరసాగర మదనం :* ఒకసారి బలిచక్రవర్తి దేవతలను ఓడించి వారి సంపదను తెస్తుండగా అవి సముద్రంలో పడిపోయాయి. రాక్షసులకు అమృత సంజీవని వుంది గాని దేవతలకు లేదు. సముద్రం నుండి అమృతాన్ని పొందడానికి ఇదో ఉపాయంగా భావించి దేవతలు మహాబలిని సముద్రమదనం చేద్దామని, పోయిన సంపద దొరుకుతుందని చెప్పారు. మంత్రద్రుముడు ఇంద్రుడుగా వున్నపుడు ఈ సంఘటనలు జరిగాయి.
– *విష్ణుపురాణం – మత్స్యపురాణం*

కొంత కాలం మహావిష్ణువుకు దేవతలపై ఆగ్రహం కల్గింది. ఈ సమయంలో అసుర గురువు శుక్రా చార్యుడు బలిని దేవతలపై దండెత్తమనగా బలి వారితో పోరాడి ఇంద్రుడిని పారద్రోలి తానే ఇంద్ర పదవినలంకరించాడు. అప్పుడు దేవలోకం కూడా బలి పాలన క్రిందకు వచ్చింది. అప్పుడు తన తాత ప్రహ్లాదుడిని రావించి ఉచితాసనమిచ్చి గౌరవించగా ప్రహ్లాదుడు బలిని ఇంద్రుడిగా ప్రకటించాడు. దేవలోకాన్ని ఎలా పాలించాలో ప్రహ్లాదుణ్ణి కోరగా సద్గుణం మాత్రమే రాజ్యాన్ని పాలిస్తుందని చెప్తాడు. బలి దానినే ఆదర్శంగా పాలిస్తాడు. అప్పుడతడు ముల్లోకాలలో ప్రసిద్ధ దయ్యాడు. – *వామన పురాణం*

బలి అసుర చక్రవర్తిగా వున్నపుడు క్షీరసాగర మదనం జరిగింది. దేవతలు అమృతం దొంగిలించినపుడు దేవాసుర యుద్ధంలో మహాబలి మరణించగా అసురులు అతడి శరీరాన్ని ఎత్తుకుపోతారు. అసుర గురువు శుక్రాచార్యుడు మృతసంజీవనితో అతణ్ణి బ్రతికించగా మహాబలి దేవతలపై మరింత ఘోరయుద్ధం చేసి దేవతలను ఓడించి వారిని పారద్రోలాడు.
– *భాగవతం*

*ప్రహ్లాదుని శాపం :* మొత్తం మీద స్వర్గలోకమంతా మహాబలి పాలన క్రిందకు వచ్చింది. కొందరు దేవతలు వెడలిపోయారు. అయితే అతని పాలనలో దేవతలు బ్రాహ్మణులు వివక్షకు గురికాగా వారు మహా విష్ణువుతో చెప్పుకోగా అతడు తన భక్తుడని అయినా కొంత కాలం వేచి వుంటే నేను వామనుడిగా జన్మించి మీ కష్టాలు తీర్చుతానని అభయమిచ్చాడు. అప్పటి నుండి రాక్షస రాజ్యం క్షీణించడం మొదలు కాగా మహాబలి ప్రహ్లాదుడికి ఈ విషయం వివరించాడు. మహావిష్ణువు వామనుడిగా అదితి గర్భంలో వున్నాడని రాక్షస వినాశనం జరుగుతుందని చెప్పగా "రాక్షసులు మహావిష్ణువు కంటే బలవంతులని మహాబలి సమాధానమిచ్చాడు. ప్రహ్లాదుడు కోపించి "నీ రాజ్యం నశించుగాక" అని శపించాడు. బలి ప్రహ్లాదుడిని క్షమించమని కోరగా మహావిష్ణువువల్ల ముక్తి లభిస్తుం దని చెప్తాడు.

*బలి ఓటమి :* ఓడిపోయిన దేవతలు అడవుల్లో దాక్కు న్నారు. దేవతల తల్లి అయిన అదితి బాధపడి తన భర్త ఆజ్ఞప్రకారం మహావిష్ణువును గూర్చి తపస్సు చేయగా శ్రీ మహావిష్ణువు ప్రత్యక్షమై వరం కోరు కొమ్మంటే తన కుమారుడిగా జన్మించి రాక్షసులను

పారద్రోలి దేవతలకు స్వర్గాన్ని ఇవ్వమని కోరింది. అదితి గర్భవతియై వామనుడికి జన్మనిచ్చింది. ఇది మహావిష్ణువు ఐదవ అవతారం.

ఇదే సమయంలో మహాబలి నర్మదానది తీరంలో యాగం చేస్తుండగా వామనుడు ముని బాలుడిగా బలి చక్రవర్తి వద్దకు వెళ్లి నేను నిస్సహాయుడనైన ముని బాలుడినని నాకు మూడడుగుల నేల ఇప్పించ మని కోరగా బలి అదెంత భాగ్యం, నా రాజ్యాన్నే ఇవ్వగలనంటాడు. నాకు వేటిమీదా కోర్కెలేదు ఆ మూడడుగుల నేల తప్ప అనగా చుట్టూవున్న అసురులు వింతగా చూస్తుండగా శుక్రాచార్యుడు ఇందులో ఏదో మోసం వుందని బలికి చెప్పినా తిరస్కరించి అంగీకార చిహ్నంగా కమండలంలోని నీరు వామ నుడి దోసిలిలో పోయబోగా శుక్రాచార్యుడు సూక్ష్మ రూపంలో ఆ నీటికి అడ్డుపడగా వామనుడు దర్భతో పొడవగా శుక్రాచార్యుని ఓ కన్ను గాయ పడుతుంది. అప్పటి నుండి శుక్రాచార్యునికి ఒక కన్నే వుంటుంది. వామనుడు నేలను కొలుస్తూ విశ్వరూపుడై ఒక పాదం భూమి మీద రెండవ పాదం ఆకాశంలో వుంచి మూడో అడుగు ఎక్కడ వెయ్య మంటావో చెప్పమని బలినడుగగా మహాబలి ఈ శరీరం నాదే కనుక మూడో పాదం నా శిరస్సుపై నుంచమంటాడు. మహా విష్ణువు మూడో పాదాన్ని బలి శిరస్సుపై వుంచి అణగ ద్రొక్కగా బలి పాతాళంలోకి నెట్టబడ్డాడు. అప్పటి నుండి అసురులు పాతాళంలో నివాసమేర్పరచు కున్నారు. – *భాగవతం*

*బలి – రావణుడు :* రావణుడొకసారి పాతాళానికి వెళ్లి బలికి విష్ణువు బంధం నుండి విముక్తికై నేను సహాయపడగలనని చెప్పగా బలి తన ప్రక్కనే గల కుండలాలను తీసుకు రమ్మని కోరతాడు. అవి హిరణ్యకశిపుడివి. రావణుడు ఆ కుండలాలను కనీసం కదిలించలేక మూర్ఛపోగా "అవి నా ముత్తాత హిరణ్యకశిపుడివి. వాటినే కదల్చని నీవు విష్ణువు నేమి చెయ్యగలవు" అనగా సిగ్గుతో రావణుడు వెళ్లి పోతాడు. – రామాయణం

**బలి 2 :** ఓ రుషి. ఇతడు హస్తినలో జీవించేవాడు. – *మహాభారతం*

**బలి 3 :** శివుని అంశ. గంధమాదనంలో బాల ఖిల్యా సుల ఆశ్రమంలో జన్మించాడు. ఇతనికి నలుగురు కుమారులు. సుధాముడు, కశ్యపుడు, వశిష్ఠుడు, విరజసుడు. – శివపురాణం

**బలి 4 :** ఓ యాదవరాజు. కృతవర్మ కుమారుడు. రుక్మిణి కుమార్తె చారుమతిని వివాహమాడాడు. – *భారతం*

**బలి 5 :** ఆనవ దేశానికి చెందిన ప్రసిద్ధ వానర రాజు. సుతపసుని కుమారుడైన ఇతడు సగర చక్రవర్తి సమ కాలీనుడు. ఇతడు బ్రహ్మను గూర్చి తపస్సు చేయగా నీవు గొప్ప రుషిగా ఓ కల్పం జీవిస్తావని వరమిస్తాడు. – *హరివంశం*

ఇతనికి సంతానం లేక దీర్ఘతమసుని కోరగా 5 గురు పుత్రులు జన్మించారు. వారు అంగ, వంగ, కళింగ, పాండు, సుహ్మలు. కల్పాంతంలో స్వర్గం చేరతాడు. దానికి ముందే తన రాజ్యాన్ని 5 విభాగాలు చేసి పుత్రులకు పంచాడు. – *భాగవతం*

**బలివాక్కు :** ఓ మహర్షి. ధర్మజుని కొలువులో వుండే వాడు. – *మహాభారతం*

**బలీహం :** క్షత్రియులు పాలించిన ప్రాచీన భారతదేశం లోని ఒక రాజ్యం. దీనిని అర్జునుడు కొంత కాలం పాలించాడు. – *మహాభారతం*

**బలుడు 1 :** ధనాయు వల్ల కశ్యప ప్రజాపతికి జన్మించిన రాక్షసుడు. ఇతనికి ముగ్గురు సోదరులు. వీక్షర, వీర, వృత్తులు. ఇతడే తర్వాత కాలంలో పాండ్య దేశ రాజ య్యాడు. ఇతడిని ఇంద్రుడు సంహరించాడు. – *మహాభారతం*

**బలుడు 2 :** వరుణుడికి తన అన్న భార్యవల్ల జన్మించిన వాడు. – *మహాభారతం*

**బలుడు 3 :** ఇక్ష్వాకు వంశ రాజైన మంధూక రాజు కుమార్తెకు పరీక్షిత్తు వల్ల జన్మించిన కుమారుడు. ఇతనికి శాల, దల అను ఇద్దరు భార్యలు. – *మహాభారతం*

**బలుడు 4 :** ఓ వానరం. కుంభకర్ణునితో యుద్ధంలో ఎంతో ధైర్యం ప్రదర్శించింది. – రామాయణం

**బలుడు 5 :** సుబ్రహ్మణ్య స్వామికి వాయుదేవుడిచ్చిన ఇద్దరు వీరుల్లో ఒకడు. రెండోవాడు అతిబలుడు. – *మహాభారతం*

**బలుడు 6 :** ప్రాచీన భారతదేశంలో ఓ రుషి. ఇతడు అంగిరస మహర్షి పుత్రుడు.

**బలుడు 7 :** ఓ సనాతన విశ్వదేవుడు. – మహాభారతం

**బలుడు 8 :** శ్రీమహావిష్ణువు పార్షదుడు. బలిని వామనుడు పాతాళానికి అణగద్రొక్కినపుడు అసురులు యజ్ఞ మండలం ఎక్కి భీభత్సం సృష్టించగా పార్షదుడగు బలి దీన్ని నిరోధించాడు. – భాగవతం

**బలుడు 9 :** మాయాసురుని కుమారుడు. నరకంలోని అతలంలో జీవించేవాడు. 96 రకాల మాయలను సృష్టించి దేవతలను బాధించాడు. ఒకసారి ఇతడికి ఇంద్రుడికి జరిగిన యుద్ధంలో ఇంద్రుడు ఘోరంగా ఓడి అతడిని కీర్తించగా నీ ఇష్టమైనది కోరుకొమ్మని ఇంద్రుణ్ణి కోరగా ఇంద్రుడు బలుడి భౌతిక శరీరాన్ని కోరగా తన శరీరాన్ని ముక్కలు ముక్కలుగా నరుక్కుంటాడు. ఆ శరీర భాగాలను ఇంద్రుడు అన్ని వైపులా విసిరివేయగా ఆ పడిన ప్రాంతాలు వజ్రపు ఘనులయ్యాయి. అతని మరణానంతరం అతని భార్య ప్రభావతి కులగురువైన శుక్రాచార్యుడ్ని తన భర్తను బ్రతికించమని కోరగా అది నాకు సాధ్యం కాదని, కాని అతని గొంతు వినేటట్లు చేయగలనని చెప్పగా ఆమె అంగీకరిస్తుంది. "నీ శరీరాన్ని వదలి నాతో కలసి పొమ్మని" విన్పించగా ఆమె వెంటనే మరణించి బలుడితో కలసి నదిగా మారుతుంది. – పద్మ పురాణం

**బలోత్కట :** సుబ్రహ్మణ్యస్వామి సేవిక. – మహాభారతం

**బల్లవం :** ప్రాచీన భారతదేశంలో ఇదొక రాజ్యం. – మహాభారతం

**బల్లవుడు :** అజ్ఞాతవాసంలో విరాటుని కొలువులో పాండవులు జీవించినపుడు భీముడు ఈ పేరుతో వున్నాడు. వలలుడని కూడా కొన్ని పురాణాలు పేర్కొన్నాయి. – మహాభారతం

**బల్వలుడు :** ఇతడొక రాక్షసుడు. నైమిశారణ్యంలోని మునుల్ని బాధించేవాడు. బలభద్రరాముడితణ్ణి వధించాడు.

**బల్లాలుడు :** కళ్యాణుడను వైశ్యుని కుమారుడు. ఇతడు చిన్న తనం నుండి మట్టి పెళ్లలు పేర్చి గణేశుడిగా పూజించేవాడు. అతని తల్లిదండ్రులకు నచ్చకపోయినా అతడు మానలేదు. ఒకరోజు అతణ్ణి చెట్టుకి కట్టి కొట్టారు. ఒకరోజు అనూహ్యంగా ఇతడు పూజించే ప్రదేశం వద్దే గణేశ విగ్రహం వెలసింది. – గణేశపురాణం

**బల్లేశ్వరుడు :** బల్లేసుమల్లయ అను శివభక్తుడుండెడివాడు. అతడు వైశ్యుడు. వ్యాపారార్థియై ఎచటికి వెళ్ళినను శివపూజ చేసిగాని భుజించెడివాడుకాదు. ఇతడిని ఆట పట్టించుటకు పూరిగుడిసె వేసి అందులో కుంచెము పెట్టి పైన గోగుపూలు జల్లి ఇదే లింగమనిరి. అతడు అచటనే లింగార్చనము చేసి భుజించెను. ఈ ఊరి ప్రజలు మరునాడు అతనిని తీసుకొనిపోయి లింగమును చూపమనగా ఆ గుడిసెయే దేవాలయమై ఆ కుంచెమే లింగమై దర్శనమిచ్చెను. అందుకని ఈ లింగానికి బల్లేశు లింగమని పేరు వచ్చింది.

**బసవడు :** ఇతడు లింగధారి మతస్థాపకుడు. ఇతని తండ్రి శిలాదుడు. ఈ మతస్తులు శివుణ్ణి ఆరాధిస్తారు. వేదాలను శంకరాచార్యుడ్ని నమ్ముతారు. జాతిభేదాల్ని బ్రాహ్మణుల గొప్పతనాన్ని ఒప్పుకోరు. ఈ మతాన్ని అంగీకరించిన బ్రాహ్మణుల్ని ఆరాధ్యులంటారు.

**బసవన్న :** మండెంగు మాదిరాజు పుత్రుడు – తిల్లనందికేశ్వరునారాధించగా అతని వర ప్రసాదమున జన్మించినాడు. తండ్రి ఉపనయనము చేయబోగా వలదని వారించెను. తన మేనమామ కూతురుని వివాహమాడెను. పిమ్మట తన గురువును చూచుటకు వెళ్లి సంగమేశ్వరాలయములో శివుని గూర్చి ప్రార్థించెను. ఇతని గొప్పతనము విని బిజ్జలుడను రాజు ఇతనిని తన మంత్రిగా నియమించుకొనెను. ఒకరోజు శివుడు అల్లమనువు రాజుగా ప్రత్యక్షమై నాకాహారముగా నేదైన పెట్టమనగా నీకు పెట్టు వాడను నేనా పరమేశ్వరాయని కొనియాడగా తనను గుర్తించి నందులకు పెక్కు వరములిచ్చెను.

ఒక రోజు జంగము వచ్చి రాజు యొక్క పేటికలోని ధనమంతా ఇమ్మనికోరగా ఇచ్చివేసెను. రాజు తనకిది తగునా పరుల సొమ్మునట్లు దానము చేయవచ్చునాయని అడుగగా భక్తులకు ధనము యొక్క కొదవ వుండదు నీ ధనము నీ పెట్టెలోనే కలదు చూచుకొమ్మనగా రాజు చూసి ఆశ్చర్యపడెను.

**బహిర్గివి :** ప్రాచీన భారతదేశంలోని ఓ పర్వత ప్రాంతం. హిమాలయ సానువుల్లో వుంది. ఈ దేశాన్ని అర్జునుడొకసారి జయించాడు. – మహాభారతం

**బహిష్పక మానం :** ఒక మత కర్మ విధానం.

**బహుగవుడు :** యయాతి కుటుంబంలో జన్మించిన ఒక రాజు. - భాగవతం

**బహుదంతకం :** నీతి శాస్త్రంపై రచించబడిన బృహద్గ్రంథం. బ్రహ్మరచనగా పేర్కొనబడింది. 10 వేల అధ్యాయాలున్న గ్రంధం. పురంధరుడు దీన్ని 5 వేల అధ్యాయాలకు కుదించాడు. - మహాభారతం

**బహుదంతి :** మనువైవశ్వత మన్వంతరంలో ఇంద్రుడైన పురందరుని తల్లి. - చూ॥ పురందరుడు

**బహుదాముడు :** సుబ్రహ్మణ్యస్వామి సేవకుడు. - మహాభారతం

**బహుపుత్రిక :** సుబ్రహ్మణ్యస్వామి సేవిక. - మహాభారతం

**బహుపుత్రుడు :** ఒక ప్రజాపతి. ఇతడు బ్రహ్మమానస పుత్రుడు. - వాయుపురాణం

**బహుమూలకుడు :** కద్రువకు, కశ్యప ప్రజాపతికి జన్మించిన ఓ సర్పం. - మహాభారతం

**బహుయోజన :** సుబ్రహ్మణ్య స్వామి సేవకుల్లో ఒకడు. - మహాభారతం

**బహురథుడు :** భరతుని కుటుంబంలోని ఒక రాజు. - భాగవతం

**బహురూపుడు :** ఏకాదశ రుద్రుల్లో ఒకడు. సురభికి కశ్యపుని వల్ల జన్మించాడు. - అగ్నిపురాణం

**బహుళ 1 :** పురాణకాలంలో ప్రసిద్ధి చెందిన ఒక నది. - మహాభారతం

**బహుళ 2 :** సుబ్రహ్మణ్య స్వామి అనుచరుడు. - మహాభారతం

**బహుళ 3 :** విదురుడను బ్రాహ్మణుని భార్య. ఈమె భర్త వేశ్యావాటికలకు వెళ్లే అలవాటు వున్నవాడు. భర్త మరణానంతరం ఈమె గోకర్ణం వెళ్లి పురాణ కథలు వింటూ కాలం గడిపింది. అందువల్ల ఆమె భర్త పాపవిముక్తుడయ్యాడు. - స్కందపురాణం

**బహుళ 4 :** ఉత్తముని భార్య. భర్త అనురాగంతో చూసినా ఆమె అతడిని తిరస్కరించి అవమానము చేసెడిది. ఇతడు తప్పక ఈమెను అరణ్యములకు పంపెను. సాలపోతకుడను సర్పరాజీమెను ప్రేమించి తన ఇంటికి తీసుకెళ్లగా ఇతని కూతురు తల్లికి కోపమువచ్చునని వేరు ఇంటపెట్టి పోషించెడిది. కొంతకాలం తర్వాత బలాకుడీమెను ఉత్తముని వద్దకు చేర్చెను. ఉత్తముని మిత్రుడు సుశర్మ క్రతువొనర్చి ఈమె నడవడికను మార్చెను. భర్తతో అప్పటి నుండి సుఖముగా జీవిస్తూ ఉత్తముడను పుత్రునికి జన్మనిచ్చెను. పుత్రుడు మనువయ్యెను. - మార్కండేయ పురాణం

**బహుళాశ్వరుడు 1 :** శ్రీరాముని వంశంలో జన్మించిన ఒక రాజు. - భాగవతం

**బహుళాశ్వరుడు 2 :** మిథిలానగరాన్ని పాలించిన ఒక రాజు. భగవంతుడంటే భయస్తుడు. శ్రీకృష్ణుడొకసారి ఈ నగరాన్ని దర్శించినప్పుడు శ్రీకృష్ణుడి నుండి సలహాలు స్వీకరించాడు. - భాగవతం

**బహువాద్యం :** ప్రాచీన భారతదేశంలోని ఒక రాజ్యం. - మహాభారతం

**బహువిధుడు :** అంగరాజు కుటుంబంలోని ఒక రాజు. - అగ్నిపురాణం

**బహుసువర్ణకం :** గంగా నదీ తీరంలో ప్రాచీన భారత దేశంలోని ఒక రాజ్యం. - మహాభారతం

**బహ్వృచప్రవరుడు:** శౌనకుడి కొడుకు. - భాగవతం

**బహ్వాశి :** ధృతరాష్ట్రుని వందమంది పుత్రుల్లో ఒకడు. కురుక్షేత్ర యుద్ధంలో భీముడితణ్ణి వధించాడు. - మహాభారతం

**బాణాసురుడు :** ఓ శక్తివంతుడైన రాక్షసుడు.

*వంశవృక్షం :* ప్రహ్లాదుడి మనుమడైన మహాబలి యొక్క కుమారుడు. బాణాసురుడు తన పాలన శోణితపురం రాజధానిగా మొదలుపెట్టాడు. హిమాలయాలకు వెళ్లి తపస్సుచేసి శివుని వల్ల వరాలు పొందాడు. పార్వతి కుమారునిగా భావించి 1000 చేతులు కావాలని కోరాడు. పార్వతి ఇతణ్ణి సుబ్రహ్మణ్యస్వామి తమ్ముడుగా భావించింది. ఆ తర్వాత తన రాజ్యానికి వచ్చి పాలన కొనసాగించాడు.

ఇతడిని మహాకాళుడని పిలుస్తారు. అసుర గురువు ఇతడికెప్పుడూ సహాయపడేవాడు. శ్రీకృష్ణునితో యుద్ధంలో ఇతడికి శివుడు, సుబ్రహ్మణ్యస్వామి, అగ్ని సహాయపడ్డారు. ఇతడు క్రౌంచ పర్వతం కవచంగా

చేసుకొని దేవతలపై యుద్ధం చేసేవాడు. శ్రీకృష్ణుడు తన సుదర్శన చక్రంతో ఈతని 1000 చేతులు నరికివేశాడు. - మహాభారతం

బాణాసురుని కుమార్తె ఉషను శ్రీకృష్ణుని కుమారుడు ప్రద్యుమ్నుడు వివాహమాడెను. చూ॥ ప్రద్యుమ్నుడు.

**బాణుడు :** ఇతడు క్రీ.శ. 7వ శతాబ్దంలో జీవించిన ప్రసిద్ధ సంస్కృత కవి. హర్షవర్ధనుడను చక్రవర్తి కొలువులో వుండేవాడు. ఇతని 'హర్షచరిత్ర' సంస్కృ తంలో వెలువడిన మొట్టమొదటి వచన కావ్యం.

**బాణుడు 2 :** సూర్య వంశపు రాజు. వికుక్షిపుత్రుడు. ఇతని పుత్రుడు అనరణ్యుడు. - రామాయణం

**బాదరాయణుడు :** వ్యాసుడిపేరు. - చూ॥ వ్యాసుడు

**బాదులి :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు. ఇతడు బ్రహ్మవాది. - మహాభారతం

**బాభ్రవ్యం :** ప్రాచీన భారతదేశంలో బ్రాహ్మణుల్లో ఓ గోత్రికులు. గాలవ మహర్షి ఈ గోత్రికుడే. - మహాభారతం

**బాభ్రవ్యుడు :** 'ప్రేమశాస్త్రం'గురించి వ్రాసిన గ్రంథ కర్త. శ్వేతకేతువు కామశాస్త్రాన్ని గురించి వ్రాసిన మొదటి రచయిత. బాభ్రవ్యుడు ఆ గ్రంథాన్ని సంక్షిప్తీకరించాడు.

**బార్హదిషులు :** బృహదిషుడి వంశం వారు. ఈ వంశంలో చివరివాడు భల్లాదుడు.

**బార్హద్రధులు :** మగధ దేశపు రాజులు. ఇందులో బృహద్రధుడు మొదలుకొని రిపుంజయుడి వరకు మగధను 1000 మంది పాలించారు.

**బార్హస్పత్యం :** బ్రహ్మ రచించిన నీతిశాస్త్రం. దీనిలో 10000 అధ్యాయాలున్నాయి. దీన్ని బృహస్పతి సంక్షిప్త పరచి 3000 అధ్యాయాలు చేశాడు. - మహాభారతం

**బాలఖిల్యాసులు :** వీరొక రుషి సముదాయం.

*జననం :* సప్తర్షులలో ఒకడైన క్రతువుకు అతని భార్య సంతతి వల్ల జన్మించారు. వీరు 60 వేల మంది. ఒక్కొక్కరు బొటన వేలులో సగమంత వుంటారు. కాని ప్రతివారు వారి మనస్సుపై ఆధిపత్యం కలవారే. ఇంద్రుడు వీరి శాప ఫలితంగా గరుడుడి చేతిలో ఓడిపోయాడు. వీరు సూర్యమండలంలో పక్షుల రూపంలో వుంటారు. దేవతా కార్యాలు విధిగా నిర్వహిస్తారు. - మహాభారతం

**బాలధి :** ఓ ప్రాచీన మహర్షి. శక్తివంతుడు. సంతానం కోసం తపస్సుచేసి మేధావినుడను పుత్రుడికి జన్మ నిచ్చాడు. మేధావినుడు ధనుషాక్షుడను గొప్ప మహర్షిని అవమానపరచి అతని శాపానికి గురై మరణించాడు. - మహాభారతం

**బాలయోగి :** అంగదేశపు రాజు. బలి కుమారుడు. - అగ్నిపురాణం

**బాలవత్స :** సత్యవంతుని తల్లి. ద్యుమత్సేనుని భార్య.

**బాలవినష్టకుడు :** చాలాకాలం క్రితం రుద్రశర్మ అనే బ్రాహ్మణుడుండేవాడు. అతనికిద్దరు భార్యలు. ఒక్కో భార్యకు ఒక్కో బిడ్డ జన్మించాడు. ఒక భార్య చనిపోగా సవతి తల్లి చనిపోయిన భార్య బిడ్డకు సరైన ఆహారం పెట్టక ఇబ్బందులకు గురి చేస్తుండేది. 5 ఏళ్ల ఆ బాలుడు తన తండ్రి ఒళ్లో కూర్చొని "నాకు ఇద్దరు తండ్రులు" కలరని చెప్పగా రుద్రశర్మకు తన భార్యకు మరో ప్రేమికుడున్నాడనే అనుమానం కలిగి తన భార్యను అభిమానించక పరాకుగా వున్నట్లు జీవించే వాడు. భార్య దానికి కారణం ఈ సవతి కుమారుడైన బాలవినష్టకుడేనని అనుమానించి కారణమడగగా "నీవు నన్ను జాగ్రత్తగా చూసు కుంటానంటే తండ్రిని మార్చగలను" అని చెప్తాడు. ఆమె అంగీకరించిన తర్వాత తన తండ్రి వద్దకు ఓ అద్దం తీసుకెళ్లి అతని ముందుంచి "తండ్రీ నాకు ఇద్దరు తండ్రులున్నారు "చూడుమనగా అతడు యదార్థం గ్రహించి భార్యను తిరిగి అభిమానంగా చూశాడు. - కథాసరిత్సాగరం

**బాలస్వామి :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరవీరుల్లో ఒకడు. - మహాభారతం

**బాలాకి :** ఇతడొక ముని. గర్గమహర్షి కుమారుడగుట వల్ల గార్గ్యుడని అంటారు. చాలా జ్ఞానాన్ని సంపాదించానని గర్వంగా వుంటాడు. అందుకని ఇతణ్ణి గుప్తశాలికి అనికూడా అనేవారు. ఒకరోజు కాశీ రాజు వద్దకు వెళ్లి బ్రహ్మజ్ఞానాన్ని బోధిస్తానంటాడు. అయితే 1000 గోవుల్ని ప్రదానం చేస్తానంటాడు. బాలాకి సూర్యదేవుడు బ్రహ్మ అని చెప్తాడు. రాజు ఆ విషయం తనకు ఇంతకు ముందే తెలుసు నంటాడు. ఇతడు ఏది చెప్పినా రాజు తనకు తెలిసిన విషయమేనని చెప్పి ఓ నిద్రపోతున్న మనిషి వద్దకు తీసుకు వెళ్ళి

అతడు ఎక్కడికి వెళ్ళాడో చెప్పమంటాడు. బాలాకి నిద్రపోతున్న మనిషి ఎక్కడకు వెళ్లాడో చెప్పలేక పోతాడు. అప్పుడు రాజు నిద్రిస్తున్న మనిషి దేవునిలో తాదాత్మ్యం చెందుతాడని, ఆత్మజ్ఞానం పొందిన వాడికి మాత్రమే అన్ని విషయాల పరిజ్ఞానం తెలుస్తుందని చెప్తాడు. – బృహదారణ్యకోపనిషత్తు

**బాలాయని :** ఓ ఉపాధ్యాయుడు. బాష్కలుడు ఇతనికి బాలఖిల్యసంహితను బోధించాడు. – *భాగవతం*

**బాలావతి :** కణ్వమహర్షి కుమార్తె. సద్గుణవంతుడైన భర్తకోసం సూర్యుడిని ప్రార్థించగా అతడు ప్రత్యక్షమై కర్జూరపళ్లు ఇచ్చి వాటిని ఉడికించి తెమ్మంటాడు. ఆమె వాటిని ఎన్ని కట్టెలతో ఉడికించబోయినా, ఉండకనందున తన కాళ్లను కట్టెల బదులు పెడుతుంది. సూర్యుడు ప్రత్యక్షమై ఆమె కోర్కెనెరవేరునట్లు వరమిస్తాడు. ఆ స్థలాన్ని బాలాపం అని పిలుస్తారు. – పద్మపురాణం

**బాలిశాఖం :** కద్రువకు కశ్యపప్రజాపతి వల్ల జన్మించిన సర్పం. – *మహాభారతం*

**బాల్హికదేశం :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజ్యం. – *మహాభారతం*

**బాల్హికుడు 1 :** అహక కుటుంబంలో జన్మించిన శక్తివంతుడైన రాజు. – *మహాభారతం*

**బాల్హికుడు 2 :** ఒక రాజు. పూర్వజన్మలో క్రోదవశుడను రాక్షసుడు. ఇతడు కురుక్షేత్ర యుద్ధంలో కౌరవులకు సహాయపడ్డాడు. – *మహాభారతం*

**బాల్హికుడు 3 :** జనమేజయుని మూడవ కుమారుడైన ఒక రాజు. కురు రాజు యొక్క మనుమడు. – *మహాభారతం*

**బాల్హికుడు 4 :** కురు వంశ రాజైన ప్రతీపుని కుమారుడు. ఇతనికి ఇద్దరు సోదరులు శంతనుడు, దేవాపి. వీరి తల్లి దేవాపి. బాల్హికుడికి సోమదత్తుడనే కుమారుడు కలడు. ఇతడు కురుపాండవులకు ఇద్దరికీ మిత్రుడే. యుద్ధం వలదని చివరివరకు ప్రయత్నించి చివరికి కౌరవుల పక్షాన పోరాడాడు.

ఇతడు కురుక్షేత్ర యుద్ధంలో దృష్టకేతువుతో, భీమసేనుడితో, ద్రుపదుడితో, శిఖండితో పోరాడాడు. చివరకు భీమసేనుడితణ్ణి వధించాడు. – *మహాభారతం*

**బాల్హికుడు 5 :** ధర్మరాజు యొక్క రథసారధి. – *మహాభారతం*

**బాలుడు :** పద్నాల్గు సంవత్సరములు దాటువరకూ పురుషుడు బాలుడని, అనగా ఆ వయస్సులోపువారు ఏమిచేసినను పాపము కలుగదని మాండవ్యుడు శాసించెను. మాండవ్యుని “చిన్నతనములో తూనీగలను హింసించగా శిక్షవిధించితిని” అని యముడు చెప్పగా మాండవ్యుడు పై విధముగా శాసించెను. – *మహాభారతం*

**బాష్కలుడు 1 :** వ్యాసుని శిష్యుడు. – చూ॥ *గురుపరంపర*

**బాష్కలుడు 2 :** ఓ రాక్షస రాజు. హిరణ్యకశిపుని కుటుంబంలో జన్మించాడు. రాక్షస చక్రవర్తి అయిన బాణాసురుడి మంత్రుల్లో ఒకడుగా ప్రసిద్ధి చెందాడు. దేవదానవ యుద్ధంలో బాణాసురుడు చాలామందిని పోగొట్టుకొని చివరగా బాష్కలుడిని, దుర్ముఖుడిని పంపాడు. బాష్కలుడు దేవితో యుద్ధం చేసి ఆమెపై గద విసరగా ఆమె ఇతనిపై శూలం విసరగా మరణించాడు. – దేవీ *భాగవతం*

**బాహుకుడు 1 :** కౌరవ్యవంశంలో జన్మించిన సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. – *మహాభారతం*

**బాహుకుడు 2 :** వృష్ణి వంశంలో జన్మించిన గొప్ప వీరుడు. – *మహాభారతం*

**బాహుకుడు 3 :** నలుడు రుతుపర్ణుని భవనంలో వున్నపుడు అజ్ఞాతంగా వుండటం కోసం ఈ పేరుతో ఆ భవనంలో చేరాడు. – చూ॥ *నలుడు*

**బాహుకుడు 4 :** వృకుని పుత్రుడు. ఇతడి రాజ్యమును శత్రువులు వశపరచుకొనగా ఇతడు తన భార్యలతో అరణ్యమునకేగెను. భార్యగర్భవతియై యుండగా ఇతడు మరణించెను. ఆ జన్మించిన పుత్రుడే సగరుడు. – *భాగవతం*

**బాహుద :** ఇదో పవిత్ర తీర్థం. ఇచట ఒకరోజు నిరాహారంగా వుండి స్నానంచేస్తే దేవతలను గూర్చి తపస్సు చేసిన ఫలితం లభిస్తుంది. ఆధునిక చారిత్రకారులు ఈ స్థలం దవళ నదీతీరం వద్దగల ఆవధి వద్ద కలదని చెప్తారు.

**బహుదాసుయశ :** కురువంశజుడైన పరీక్షిత్తు భార్య. ఈమెవల్ల ఇతనికి భీమసేనుడను పుత్రుడు జన్మించాడు. – *మహాభారతం*

**బాహువు 1 :** పాండవులు కౌరవులతో యుద్ధం చేయడానికి ఇతడిని కూడా ఆహ్వానించదలచారు. – మహాభారతం

**బాహువు 2 :** సుందరవంశంలోని ఒక రాజు. – మహాభారతం

**బాహుశాలి :** అవంతీనగర రాజకుమారుడు. ఇతడు శ్రీదత్తుని మిత్రుడు. – చూ॥ శ్రీదత్తుడు

**బాహ్యకర్ణుడు :** కశ్యప ప్రజాపతికి కద్రువ వల్ల జన్మించిన సర్పం. – మహాభారతం

**బాహ్యకుండుడు :** కశ్యపప్రజాపతి కుటుంబంలో జన్మించిన సర్పం. – మహాభారతం

**బాహ్యాశ్వనుడు :** పూరువంశంలోని ఒక రాజు. ఇతడు పురుజాతి కుమారుడు. ఇతనికి 5 గురు కుమారులు. ఈ ఐదుగురు పాంచాలసులుగా ప్రసిద్ధి చెందారు. వీరిలో ముకులుడొకడు. ఇతని సంతతిని ముకుల్యసులని రెండవతరగతుల దేవాలయాలు వీరికుండేవని చెప్పబడింది. ముకులునికి పంచాశ్వుడను పుత్రుడు జన్మించాడు. పంచాశ్వునికి దివోదాసు అనే పుత్రుడు, అహల్య అనే కుమార్తె జన్మించారు. అహల్య శారద్వతుడనే మునిని వివాహమాడి శాతానందుడికి జన్మనిచ్చింది. – అగ్నిపురాణం

**బిడాలుడు :** మహిషాసురుని మంత్రుల్లో ఒకడు. – దేవీ భాగవతం.

**బిడాలోపాఖ్యానం :** చూ॥ ఢిండికుడు.

**బిదేజసుడు :** విష్ణువు కృపవల్ల అథితికి జన్మించిన కుమారుడు. – పద్మపురాణం

**బిల్వకతీర్థం :** హరద్వారం వద్దగల పుణ్యస్థలం. ఇక్కడ స్నానం చేస్తే స్వర్గ ప్రాప్తి లభిస్తుంది. – మహాభారతం

**బిల్వకం :** ఓ సర్పం. కద్రువకు కశ్యప ప్రజాపతి వల్ల జన్మించింది. – మహాభారతం

**బిల్హణుడు :** ఇతడొక కవి. మిక్కిలి రూపవంతుడు. ఆ సమయమును ఆ రాజ్యమునేలు మదనాభిరాముడు తన కుమార్తె యామినీ పూర్ణ తిలకకు విద్య చెప్పుటకు ఇతనిని రావించెను. ఇతడి రూపము చూచి తన కుమార్తె వలచునేమోనని. అతడు గ్రుడ్డివాడని ఆమెకు చెప్పి బిల్హణుడికి తన కుమార్తె కుష్ఠురోగియని చెప్పి ఒకరి నొకరు చూడకుండా ఓ తెర మధ్య నుంచెను. అతడు వర్ణించు తీరుచూసి గ్రుడ్డివాడట్లెట్లు వర్ణించునని తెరతీసి అతని రూపము చూసి మోహించెను. అతడును ఆమె వ్యాధిగ్రస్తురాలు కాదని గ్రహించి ఆ రాత్రియే వారు కామక్రీడ సల్పిరి. అది తెలిసిన రాజు. బిల్హణుని కారాగారమున ఉంచెను. బిల్హణుడు 2 పద్యములు రాసి రాజుకు పంపెను. రాజు కరుణించి ఇతనికి తన కుమార్తెనిచ్చి వివాహము చేసెను. – కథాసరిత్సాగరం

**బిల్వతేజం :** తక్షకుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో బూడిదై మరణించింది. – మహాభారతం

**బిల్వపత్రం :** కశ్యప ప్రజాపతి కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. – మహాభారతం

**బిల్వపాండురం :** కశ్యప ప్రజాపతి వల్ల కద్రువకు జన్మించిన సర్పం. – మహాభారతం

**బిల్వుడు :** ఓ విష్ణు భక్తుడు. మొదట విష్ణు భక్తుడుగా వుండి తర్వాత శివభక్తుడయ్యాడు.

**బీభత్సుడు :** అర్జునునికి గల పేర్లలో ఒకటి. యుద్ధంలో దిగజారిన కార్యాలు చేయను కనుక దేవతలు, మానవులు నన్ను బీభత్సుడన్నారని అర్జునుడు చెప్పుకున్నాడు. – మహాభారతం

**బుద్ధి :** ధర్మదేవుని భార్యల్లో ఒకరు. ధర్మదేవుడు దక్షుని 13 మంది పుత్రికలను వివాహం చేసుకున్నాడు. వారిలో ఒకరు బుద్ధి.

**బుద్ధికాముడు :** సుబ్రహ్మణ్యస్వామి సేవకుల్లో ఒకడు. – మహాభారతం

**బుద్ధఘోషుడు :** ప్రాచీన సంస్కృత కవి. ఇతడు క్రీ.శ. 4వ శతాబ్దివాడని చెప్తారు. ఇతని ముఖ్య రచన 'పద్య చూడామణి'. ఇందులో 10 అధ్యాయాలలో బుద్ధుని చరిత్ర చెప్పబడింది. కాళిదాసు, అశ్వఘోషుల కవిత్వానికి పోలికలున్నాయి. క్రీ.శ. 351 ప్రాంతంలో శ్రీలంక వెళ్లి ఎన్నో బౌద్ధ గ్రంథాలు అనువదించాడు.

**బుద్ధుడు :** బౌద్ధమతస్థాపకుడు. ఇతడు విష్ణ్వంశగా కొందరు పేర్కొంటారు. దేవాసుర యుద్ధంలో దేవతలు ఓడిపోగా వారు విష్ణువునాశ్రయించగా శుద్ధోదనుడి

కొడుకైన గౌతమ బుద్ధుడు (సిద్ధార్థుడు)గా జన్మించి అసురుల వద్దకు వెళ్లి వేదాలను నిరాకరించ మని అప్పటి న్యాయ సూత్రాలను బహిష్కరించమని చెప్పగా అసురులు బౌద్ధులై నరకానికి వెళ్లారు. – అగ్నిపురాణం

గౌతమబుద్ధుడు క్రీ.పూ. 560లో హిమాలయాల దగ్గర గల కపిలవస్తు నగరంలో శాఖ్య వంశంలో శుద్ధోదనుడికి సిద్ధార్థుడనే పేరుతో జన్మించారు. శుద్ధోదనుడితణ్ణి బయట ప్రపంచం తెలియకుండా బాధలకు దూరంగా పెంచాడు. అలా అతడి బాల్యంలో దుఃఖమంటే ఏమిటో బాధంటే ఏమిటో తెలియకుండా జీవించాడు. అనుకోకుండా ఒకరోజు ఓ వృద్ధుడ్ని, ఓ వ్యాధిగ్రస్తుడ్ని, ఓ మృతుడ్ని చూసి అప్పటి నుండి ప్రపంచం నుండి దుఃఖబాధలను పోగొట్టాలని ఆలోచిస్తూ ఇల్లు విడిచి ఎన్నో ప్రాంతాలు తిరిగి ఎందరో గురువుల వద్ద పాఠాలు నేర్చు కున్నాడు. కాని శాంతి లభించలేదు. ఓ పౌర్ణమి రోజు గయవద్ద ఓ అరటి చెట్టు క్రింద ధ్యానం చేస్తూ నిశ్చల సమాధిలో వుండగా జ్ఞానోదయం కలిగింది. అప్పటి నుండి అతడిని బుద్ధ డన్నారు. ఆ తర్వాత కాశికి వచ్చి తన బోధనలను ప్రచారం చేశాడు. అప్పటి నుండి ఎందరో శిష్యులేర్ప డ్డారు. అతడు ప్రవచించిన బోధలు బౌద్ధమతంగా వ్యాపించాయి. బాధలకు మూలం కోరిక. కోరికలు లేనివారికి బాధ నుండి విముక్తి లభిస్తుందన్నది అతని సిద్ధాంతం. ఎల్లకాలం శాంతి లభించాలంటే సత్య సంధత, ఆలోచనల్లో ధర్మం, ఇతరులను వధించ కుండటం ముఖ్య సూత్రాలు. బౌద్ధమతం భారతదేశ మంతటా వ్యాపించింది. ఇతడు తన 82వ ఏట పరమ పదించాడు. – *చరిత్ర గ్రంథాలు*

**బుద్బుద :** ఓ దేవ కన్య. అందాలరాశి అయిన వర్గ సేవకురాలు. – *చూ॥ వర్గ*

**బుధుడు 1 :** చంద్రుని కుమారుల్లో ఒకడు. చంద్రుని గురువైన బృహస్పతి భార్య తారవల్ల జన్మించాడు. బృహస్పతి, చంద్రుడు ఈ విషయంపై యుద్ధానికి దిగగా దేవతలు తారనడిగి అతడు చంద్రుని తనయు డేనని తేల్చి చంద్రునికి అప్పగిస్తారు.

– *చూ॥ బృహస్పతి, తార, చంద్రుడు*

బుధుడని చంద్రుడితనికి నామకరణం చేస్తాడు. అతడు యువకుడైన తర్వాత కుమార వనంలోకి వచ్చిన రాజు సుద్యుమ్నుడిగా మారగా అతడిని బుధుడు వివాహమాడగా (స్త్రీగా మారిన రాజు పేరు ఇతి) వారికి పురూరవసుడు జన్మించాడు. బుధుడు రుద్రాక్ష మాల ధరిస్తాడు. ఇతడు బ్రహ్మ కొలువులో ప్రసిద్ధ సభ్యుడు. – *అగ్నిపురాణం – మహాభారతం*

**బుధుడు 2 :** ఓ మహర్షి. ఇతడు ప్రస్థానం యొక్క ప్రాముఖ్యత గురించి వివరించాడు. ఇతడు తన మొత్తం జీవితాన్ని వానప్రస్థంలో గడిపాడు.

– *మహాభారతం*

**బుధుడు 3 :** నీతి శాస్త్రంపై గొప్ప కృషి సల్పిన శాస్త్ర వేత్తగా 'ధర్మశాస్త్రం' అనే రచన చేశాడు. మనిషి పిండం నుండి ఉపనయనం వరకు పెరుగుదల, రకరకాల వివాహాలు, పంచ మహాయజ్ఞాలు, శ్రాద్ధ కర్మలు, సాఖ్యయజ్ఞం, సోమయాగాలను గురించిన నీతి శాస్త్రాలను వివరించాడు.

**బుధుడు 4 :** గౌడ దేశంలోని ఒక బ్రాహ్మణుడు. ఇతడు దుర్గుణాలకు ప్రతీకగా మద్యం సేవించి ఓ వేశ్యా గృహం బయట పడివుండగా తండ్రి మందలించి లేపగా తండ్రిని చంపి ఇంటికి వస్తాడు. తల్లి, భార్య ఇతడ్ని వారించగా వారిని కూడా వధిస్తాడు. ఒకసారి కాలభూతి ముని భార్యను ఎత్తుకుపోగా అతడు కుష్టు వ్యాధి గ్రస్తుడవు కమ్మని శపిస్తాడు.

బుధుడు తిరిగి తిరిగి సూరసేనుడను రాజు నగరానికి వెళ్లాడు. అదే రోజు తన నగర ప్రజలతో విమానంలో స్వర్గానికి ప్రయాణం అవుతుండగా ఆ విమానం కదలదు. అప్పుడు దేవతలు ఆ కుష్టు వ్యాధి గ్రస్థుడిని అక్కడి నుండి పారద్రోలితే కాని విమానం కదలదని చెప్పగా సూరసేనుడు ధర్మచింతనుడు దయార్ద్రుడు అవడం వల్ల బుధుడిని తనతోపాటు విమానంలో స్వర్గానికి తీసుకెళ్తాడు. – *గణేశపురాణం*

**బేతాళుడు :** పిశాచాలకు అధిపతి. స్మశానాల్లో వుంటాడు. ఇతడు పూర్వజన్మలో పుష్పదంతుడు.

– *చూ॥ పుష్పదంతుడు*

**బోధన :** రామగిరికి తూర్పు దిశన గల కొండ.

**బోధం :** ప్రాచీన భారతదేశంలో ఒక ప్రాంతం. పురాణా లలో ఈ స్థలం ప్రస్తావన వుంది. – *మహాభారతం*

**బోధాయనుడు :** గురుపరంపరలోని ఒక బోధకుడు.

– *చూ॥ గురుపరంపర*

**బోధిసత్వుడు :** సద్గుణ సంపన్నుడైన భర్త. ఇతడొక వైశ్యుని కుమారుడు. తల్లి చనిపోగా తండ్రి మరో వివాహం చేసుకున్నాడు. ఇతనికి అదే సమయంలో వివాహం జరిగింది. తండ్రి తన సవతి తల్లికి భయపడి ఇతడిని ఇంటి నుండి వెళ్లగొట్టగా ఇతడు భార్యతో అనేక ప్రాంతాలు తిరిగి చివరకు ఎడారుల్లోకి వెళ్లాడు. భార్య నడవలేక తిండి నీరు లేక అలమటిస్తుంటే ఆమెను తన భుజాలపై మోసుకుంటూ తిరిగాడు. ఆహారం దొరక్కపోతే తన శరీరాన్నే ఆహారంగా ఇచ్చి చివరికి పండ్లు, ఆహారం దొరికే ఓ ప్రాంతం వెళ్లాడు. భార్యతో ఓ కొలను వద్ద వుండగా కాళ్లు లేని వ్యక్తి కన్పించగా అతని వివరాలు తెలుసుకొని దయార్ద్రతతో అతణ్ణి తనతోపాటు తీసుకొనివెళ్ళి వారివద్దే వుంచుకొని అతనికీ ఆహారం సమకూరుస్తాడు. కొంతకాలానికి అతని గాయాలు మాని మామూలు మనిషి అవుతాడు. బోధిసత్వుడు ఆహారం సంపాదించడానికి వెళ్లినపుడు భార్య అతనితో అక్రమ సంబంధం పెట్టుకొని భర్తను మోసంతో నూతిలోకి తోసివేస్తుంది. ఆ నూతికి వున్న ప్రవాహ ద్వారంగుండా అతడో నదిలోకి కొట్టుకు వచ్చి ఓ చెట్టు క్రింద కూర్చొని స్త్రీల క్రూరత్వాన్ని గురించి ఆలోచిస్తుంటాడు. ఆ ప్రక్కనేగల నగర రాజు చనిపోవడంతో అతనికి సంతానం లేనందువల్ల పురోహితులు ఓ పూలదండను ఏనుగుకిచ్చి అది ఎవరి మెడలో వేస్తే అతడినే రాజుగా ఎన్నుకోవాలని నిర్ణయిస్తారు. ఆ ఏనుగు ఆ పూలదండను బోధిసత్వుడి మెడలో వేయగా అతడు ఆ నగర రాజౌతాడు. కొంతకాలానికి అతని భార్య తను వుంచుకున్న తన భర్త రక్షించిన పురుషుణ్ణే తన మెడపై ఎత్తుకొని తన బాధలు చెప్పుకుంటూ అడుక్కుతింటూ ఈ నగరం చేరగా ఆమెను రాజు వద్దకు తీసుకువెళ్లగా ఆమె తన బాధలు చెప్పుకుంటుంది. రాజామెను గుర్తించి తన కథ మంత్రులతో చెప్పగా వారామెను వెడలగొడతారు. ఇది స్త్రీలు ఎంత క్రూరులో వివరించడానికి చెప్పబడిన కథ.

– కథాసరిత్సాగరం

**బోధుడు 1 :** ఒక రాజు. జరాసంధునికి భయపడి దక్షిణ భారత దేశానికి పారిపోయాడు.

– మహాభారతం

**బోధుడు 2 :** విశాల అనే గ్రామంలోని బ్రాహ్మణుడు. ఇతడి భార్య ప్రసవించగా ఒక పిల్లి శిశువును ఎత్తుకుపోయి విక్రాంతుడనే శిశువును అక్కడ పెడుతుంది. బోధుడితడికి చైత్రుడని పేరు పెడతాడు.

– మార్కండేయ పురాణం

**బోధ్యుడు :** ఓ ప్రసిద్ధ పురోహితుడు. ఉపాధ్యాయుడు. ఒకసారి ఇతడికి నహుషుడికి తాత్వికతపై చర్చ జరిగింది. అప్పుడతడు "నేనెవరికీ గురువును కాదు, ఇతరులకు సలహా ఇచ్చే ముందు నేను ఆచరిస్తాను. నిరపాయకరంగా వుండటాన్ని సర్పాలనుండి, అసంతృప్తిని పింగళుడి నుండి నేర్చుకున్నాను" ప్రపంచమే నా గురువు అని పేర్కొన్నాడు. ఇతడు యయాతి చక్రవర్తికి తాత్వికత, నీతి సిద్ధాంతాలను బోధించాడు.

– మహాభారతం

**బౌధాయనుడు :** పండితుడు, గురువు. కల్ప సూత్రాల ననుసరించి కర్తవ్య నిర్వహణ చేశాడు.

**బౌద్ధులు :** నిరీశ్వరవాదులు. ఈ మత స్థాపకుడు గౌతమ బుద్ధుడు. ఈ మతం పుట్టింది భారతదేశంలోనే అయినా ప్రపంచ వ్యాప్తంగా వ్యాపించింది. భారత దేశంలో మాత్రం క్షీణించింది. ప్రపంచం మొత్తం మీద 150 కోట్లమంది ప్రజలున్నారని చెప్పబడుతోంది. సత్యం, శీలం, దయాగుణాల్ని ఈ మతం విశేషంగా బోధిస్తుంది. వేద పురాణాలను, వర్ణాశ్రమ ధర్మాల్ని వీరు నిరసిస్తారు.

**బంధుడు :** తృణబంధుడి తండ్రి. వేదవంతుడి కుమారుడు.

– భాగవతం

**బంధుదాయాదుడు :** వారసత్వపరమైన కుమారుడు. వీరు 6 రకాలు.

1. స్వయంజాతుడు *:* తన భార్యకు తన వల్లే జన్మించినవాడు.
2. ప్రణీతుడు *:* తన భార్యకు పూజ్యనీయుని వల్ల జన్మించినవాడు.
3. పుత్రికా పుత్రుడు : తన కుమార్తెకు జన్మించిన పుత్రుడు.
4. పౌనర్భవ *:* తిరిగి వివాహం చేసుకున్న స్త్రీవల్ల జన్మించిన వాడు.
5. కానీనుడు : వివాహానికి ముందే జన్మించినవాడు.
6. భానాడు : సోదరికి జన్మించిన కుమారుడు.

**బంధుమతి :** ఉదయనుని భార్య అయిన వాసవదత్త పరిచారిక. - చూ।। వాసవదత్త

**బంధుమంతుడు 1 :** విదేహ రాజ్యానికి రాజుల్లో ఒకడు. - బ్రహ్మాండపురాణం

**బంధుమంతుడు 2 :** కేవలుడి కొడుకు. ఇతడి కుమారుడు వేదవంతుడు. - భాగవతం

**బంధుమానుడు :** విదేహ దేశపు రాజు. - బ్రహ్మపురాణం

**బృద్నాశ్వుడు :** ఒక రాజు. అగస్త్యుడొకసారి సంపద కొరకు ఇతని వద్దకు వెళ్లాడు. - మహాభారతం

**బృబుతక్షుడు :** వేదకాలం నాటి రాజు. ఇతనికి వాస్తు శాస్త్రం, నిర్మాణాల మీద మక్కువ. భరద్వాజ మహర్షికి ఇతడెన్నో కానుకలిచ్చాడు. - రుగ్వేదం

**బృహకుడు :** ఓ దేవ గాంధర్వుడు. అర్జునుని జన్మది నోత్సవ వేడుకల్లో పాల్గొన్నాడు. - మహాభారతం

**బృహజ్జాతకము :** ఇదో జ్యోతిష్య గ్రంథము. దీని రచయిత వరాహమిహిరుడు.

**బృహజ్జ్యోతి :** శుభవల్ల అంగిరసునికి జన్మించిన పుత్రుడు. - మహాభారతం

**బృహతి 1 :** చాక్షుషమనువు యొక్క తల్లి. ధ్రువునికి శంభువల్ల ఇద్దరు కుమారులు జన్మించారు. ఒకరు శిష్ఠి రెండోవాడు భవ్యుడు. శిష్ఠికి సుచాయవల్ల 5 గురు కుమారులు. అందులో రిపుడొకడు. రిపుని భార్య బృహతి. ఈమెకు జన్మించినవాడే చాక్షుష మనువు. - విష్ణుపురాణం

**బృహతి 2 :** సూర్యుని రథానికి వుండే ఏడు గుర్రాలలో ఓ గుర్రం పేరు. - విష్ణుపురాణం

**బృహత్కథ :** చూ।। గుణాఢ్యుడు.

**బృహత్కరుడు :** అంగదేశపు రాజు. బద్రరథుడి కుమారుడు.

**బృహత్కర్మ :** అంగ రాజ వంశంలో జన్మించిన ఒక రాజు. - అగ్నిపురాణం

**బృహత్తం :** పాంచజన్యుడి శిరస్సునుండి వెలువడిన పాలు. - మహాభారతం

**బృహత్కాయుడు :** భరతుని కుటుంబంలో జన్మించిన ఒక రాజు. - భాగవతం

**బృహత్సామం :** ఒక రుక్కు పేరు. - రుగ్వేదం

**బృహత్సాయుడు :** అంగిరసుని కుటుంబంలో జన్మించిన ఓ గురువు. ఇతడి కాలంలో క్షత్రియులితణ్ణి బాధించగా క్షత్రియ నాశనం జరిగింది. - అథర్వవేదం

**బృహత్కీర్తి :** అంగిరసునికి శుభవల్ల జన్మించిన సంతానంలో ఓ పుత్రుడు. - మహాభారతం

**బృహత్తుడు 1 :** సూర్యుడికి గల మరో పేరు. - మహాభారతం

**బృహత్తుడు 2 :** కాలేయుడనే రాక్షసుడికి జన్మించిన రాజు. - మహాభారతం

**బృహత్పుత్రుడు :** పురువంశంలోని ఒక రాజు. తండ్రి సుహోత్రుడు. ఇతని పుత్రులు అజమీఢుడు, ద్వీమీ ఢుడు, పురుమీఢుడు. - అగ్నిపురాణం

**బృహత్వుడు :** ఓ దేవ గాంధర్వుడు. - మహాభారతం

**బృహత్కేతువు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. - మహాభారతం

**బృహత్సేని :** దమయంతి యొక్క పరిచారిక. నలుడు పాచికలలో ఓడినపుడు ఈ విషయాన్ని ఈమె ద్వారా మంత్రులకు తెలియజేసింది. - మహాభారతం

**బృహత్సేనుడు 1 :** క్రోధవశుని శరీరం నుండి జన్మించిన అసురుడు. ఇతని కుమార్తె లక్ష్మణ శ్రీకృష్ణుని భార్యల్లో ఒకరు. ఇతడు కురుక్షేత్రంలో కౌరవుల పక్షాన పోరాడాడు. - మహాభారతం

**బృహత్సేనుడు 2 :** భరతుని కుటుంబంలో జన్మించిన ఒక రాజు. - భాగవతం

**బృహత్సేనుడు 3 :** ఇతడో గురువు. నారదుడితనికి బ్రహ్మ విద్యను నేర్పాడు.

**బృహత్క్షత్రుడు 1 :** భగీరథుని కుటుంబంలో జన్మించిన రాజు. ఇతడు పాంచాలీ స్వయంవరానికి వచ్చాడు. - మహాభారతం

**బృహత్క్షత్రుడు 2 :** కేకేయ దేశపు ఒక రాజు. ఇతడు పాండవుల పక్షాన కృపుడితో పోరాడాడు. యుద్ధంలో క్షేమదుర్తిని సంహరించాడు. ద్రోణునితో యుద్ధంలో మరణించాడు. - మహాభారతం

**బృహదశ్వుడు 1 :** ఓ ప్రాచీన రుషి. ధర్మజునితోపాటు కామ్యకవనం వెళ్లాడు. రాజ్యం పోయిన బాధలో వున్న

ధర్మజుడికి నలుని వృత్తాంతం చెప్పాడు. ఆ కథ చెప్పిన తర్వాత అక్షరాధ్యాయ, అశ్వ శిరస్సులను ఉపదేశించాడు. - మహాభారతం

**బృహదశ్వుడు 2 :** ఇక్ష్వాకు వంశంలోని ఒక రాజు. శ్రావస్థుని కుమారుడు. ఇతని కుమారుడు కువలయాశ్వుడు. - మహాభారతం

**బృహదంతుడు 1 :** ఉలూక దేశపురాజు. అర్జునుడితడ్ని ఒకసారి యుద్ధంలో జయించాడు. ఇతడు కురుక్షేత్రంలో పాండవుల తరఫున పోరాడి మరణించాడు. - మహాభారతం

**బృహదంతుడు 2 :** క్షేమదూర్తికి సోదరుడు. పాండవుల పక్షాన పోరాడి కురుక్షేత్ర యుద్ధంలో మరణించాడు. - మహాభారతం

**బృహదాత్మ :** అంగ వంశంలోని ఒక రాజు. - అగ్నిపురాణం

**బృహదారణ్యకోపనిషత్తు :** బౌద్ధ మతం ప్రబలక ముందు గల ఉపనిషత్తుల్లో ఇదొకటి.

**బృహదిక్షుడు :** భరత వంశంలోని ఒక రాజు. - భాగవతం

**బృహదిష్ముడు :** పురువంశంలోని ఒక రాజు. - అగ్నిపురాణం

**బృహద్గర్భుడు :** శిభి చక్రవర్తి కుమారుడు. - చూ॥ అష్టకుడు

**బృహద్గిరి :** యతి అనే వ్యక్తి పేరు. బలిని వ్యతిరేకించిన పండితుడు. - చూ॥ పృధురశ్మి

**బృహద్గురుడు :** ప్రాచీన భారతదేశంలోని ఒక రాజు. - మహాభారతం

**బృహద్ధనుడు :** బృహదిషుడి వంశంలోని వాడు. బృహదిషుడి కుమారుడు. ఇతని కొడుకు బృహత్కాయుడు.

**బృహద్ధలద్వజుడు :** కుష్టు వ్యాధిగ్రస్తుడైన ఓ ముని. సూర్యుని గూర్చి ప్రార్థన చేయడంవల్ల ఈ వ్యాధి నశించింది. - భవిష్యపురాణం

**బృహద్ధలుడు 1 :** చూ॥ బృహద్బలుడు 2.

**బృహద్ధలుడు 2 :** చూ॥ బృహద్బలుడు 3.

**బృహద్ధలుడు 3 :** ఓ యాదవ రాజు. వసుదేవుని సోదరుడైన దేవభాగుని కుమారుడు. - భాగవతం

**బృహద్ధ్వజుడు :** ఇతడొక రాక్షసుడు. ఇతరుల స్త్రీలను ధనాన్ని అపహరిస్తుంటాడు. ఒకసారి భీమకేశుడను రాజు భార్యను అపహరిస్తాడు. అందుకు ఆమె కూడా సహకరిస్తుంది. వీరిద్దరూ గంగా సాగర సంగమం వద్దకు చేరతారు. ఆ ప్రాంతం కూడా భీమకేశుడి రాజ్యంలోదేనని తెలిసి అతని భార్య భయంతో మరణించగా ఆమెను వదలి వుండలేక బృహద్వజుడు కూడా మరణిస్తాడు. గంగాసాగర సంగమం వద్ద మరణించడం వల్ల విష్ణులోకం చేరతాడు. - స్కందపురాణం

**బృహద్ధ్వని :** ప్రాచీన భారతదేశంలో పురాణ ప్రసిద్ధమైన నది. - మహాభారతం

**బృహద్బలుడు 1 :** ప్రాచీన భారత దేశంలో ఒక రాజు. - మహాభారతం

**బృహద్బలుడు 2 :** సుబలుడను గాంధార రాజు కుమారుడు. పాంచాలి స్వయంవరానికి ఇతడు ఇతని సోదరులు వచ్చారు. - మహాభారతం

**బృహద్బలుడు 3 :** కోసల దేశ రాజు. తూర్పు రాజ్యాలను జయించే సమయంలో భీమసేనుడు ఇతడిని జయించాడు. రాజసూయయానికి 14000 గుర్రాలు కానుకగా ఇచ్చాడు. కౌరవుల పక్షాన పోరాడి అభిమన్యుని చేతిలో మరణించాడు. - మహాభారతం

**బృహద్బ్రహ్మ :** చూ॥ బృహద్కీర్తి.

**బృహద్రధుడు 1 :** ఒక రాజు. కొంతకాలం పాలన చేసి తన కుమారుడిని రాజుని చేసి అరణ్యాలకు వెళ్లి శేషజీవితాన్ని తపస్సులో గడిపాడు. ఒకరోజు శాకాయన మహర్షి ఇతని వద్దకు వచ్చి వరం కోరుకొమ్మంటే నిత్యసత్యమేది; నాకు ఆధ్యాత్మిక జ్ఞానాన్ని ప్రసాదించు అని కోరగా రుషి అంగీకరిస్తాడు. - మైత్రీ ఉపనిషత్తు.

**బృహద్రధుడు 2 :** అంగ కుటుంబంలోని ఒక రాజు. జయద్రధుని కుమారుడు. ఇతని కుమారుడు విశ్వజిత్తు. పరశురాముడు పరంపరగా క్షత్రియ వధ చేస్తుండగా గృధ్రకూటంలోని లంసురసు తెగవారు ఇతణ్ణి పరశురాముడి బారినుండి రక్షిస్తారు. - మహాభారతం

**బృహద్రధుడు 3 :** ఇదో అగ్ని. ఇతడు వశిష్ఠుని కుమారు డగుట వల్ల వశిష్ఠుడని కూడా అంటారు. ఇతనికి ప్రణితి అను కుమారుడు కలడు. – అగ్నిపురాణం

**బృహద్రధుడు 4 :** పురు వంశపు రాజుల్లో ఒకడు. గిరిక ఏడుగురు కుమారుల్లో ఇతడొకడు. – అగ్నిపురాణం

**బృహద్రధుడు 5 :** సూక్ష్మ అను రాక్షసుడి ఆధీనంలో వున్న రాజు. ఇతడు పాంచాలి స్వయంవరానికి వచ్చాడు. – మహాభారతం

**బృహద్రధుడు 6 :** చేదిరాజైన ఉపచరుని కుమారుడు. ఇతణ్ణి తండ్రి మగధకు రాజుని చేశాడు. 3 అక్షౌహిణీల సైన్యంతో బలవంతుడైన రాజుగా పేరొందాడు. ఇతనికి ఇద్దరు భార్యలు. సంతానలేమి ఇతణ్ణి బాధించగా చండకౌశికుడను రుషి వద్దకు కానుకలతో వెళ్ళి తన కథ విన్పించగా ఓ ఫలాన్నిచ్చి ఈ ఫలం వల్ల జన్మించిన పుత్రుడికి రాజ్యాన్నిచ్చి తిరిగి తన ఆశ్రమానికి రమ్మన్నాడు. ఆ ఫలాన్ని రెండుగా కోసి తన ఇద్దరు భార్యలకు ఇవ్వగా వారు రెండు శరీర విడి భాగాలకు జన్మనిచ్చారు. భయకంపితులై వారు ఆ రెండు భాగాలను బయట పారవేయగా జర అను రాక్షసి ఆ రెండింటిని దగ్గరకు చేర్చగా ఏకరూప శిశువు అయ్యాడు. అతడే ప్రసిద్ధ జరాసంధుడు. జరాసంధుడు యువకుడయిన తర్వాత బృహద్రధుడు పట్టాభిషేకం చేసి చండకౌశికుని ఆశ్రమానికి వచ్చాడు. – మహాభారతం

**బృహద్బాలిక :** సుబ్రహ్మణ్యస్వామి సేవిక. – మహాభారతం

**బృహద్భానువు 1 :** ఓ అగ్ని.

**బృహద్భానువు 2 :** వేద వేదాంగాలను క్షుణ్ణంగా తెలిసిన పండితుడు. – మహాభారతం

**బృహద్భాస 1 :** చూ॥ బృహద్కీర్తి.

**బృహద్భాస 2 :** సూర్యుని కుమార్తె. భానుడను అగ్ని యొక్క భార్య. – మహాభారతం

**బృహద్వతి :** ప్రాచీన భారతదేశంలో ఓ నది. – మహాభారతం

**బృహద్విషుడు :** భరతుని వంశంలోని ఒక రాజు. – భాగవతం

**బృహద్కీర్తి :** అంగిరస కుశుభి వల్ల జన్మించిన ఏడుగురు కుమారులు. ఒక కుమార్తెల్లో ఓ కుమారుడు.

**బృహదుక్థ :** పాంచాజన్యుడను ముని కుమారుడు. ఇతడే భగవంతుడిగా మారాడు. అగ్నిహోత్ర క్రతువు జరిగే ముందు ఇతడ్ని తలచుకుంటారు.

**బృహద్యుమ్నుడు :** చూ॥ అర్వావసుడు.

**బృహన్నల :** అజ్ఞాత వాస సమయంలో విరాటుని కొలువులో జీవించినపుడు అర్జునుడి పేరు.

**బృహన్మనసుడు :** ఓ మహర్షి. అంగిరసునికి సుమన వల్ల కల్గిన ఏడుగురు పుత్రుల్లో ఒకడు. – మహాభారతం

**బృహన్మేదసుడు :** ఓ యాదవ రాజు. వపుస్మాదుడి కొడుకు. శ్రీదేవుని తండ్రి. – కూర్మపురాణం.

**బృహస్పతి :** దేవతలకు గురువు.

*జన్మవృత్తాంతం :* రుద్రుడు చేస్తున్న యాగానికి వెళ్లిన బ్రహ్మకు అక్కడవున్న అప్సరసలను చూసి వీర్యస్కలనం జరిగింది. బ్రహ్మ దానిని అగ్నిలో పడ వేయగా అందుండి మారిచ, భృగు, అంగిరసులు మొదలగు వారు జన్మించారు. అంగిరసునికి అతని భార్యవల్ల 8 మంది కుమారులు కలిగారు. వారు ఉతత్యుడు, బృహస్పతి, వయస్య, శాంతి, ఘోర, విరూప, సంవర్త, మరియు సుధాన్యులు. వీరి తల్లి వసుద★.

దేవగురువు జన్మించినప్పటి నుండి దేవతలకు అసురులకు ముల్లోకాలపై ఆధిపత్యం, సంపదల కొరకు పోరాటం జరుగుతూనే వుండేది. అసురులు శుక్రాచార్యుడిని తమ గురువుగా ఎంపిక చేసుకోగా దేవతలు బృహస్పతిని తమ గురువుగా ఎంచు కున్నారు.

*బృహస్పతి వైవాహిక జీవితం – సంతతి :* బృహస్పతి భార్య తార. ఈమె చంద్రుడి అందాన్ని చూసి అతణ్ణి మోహించి అతనితో కొంతకాలం జీవించగా తారా చంద్రులకు బుధుడు జన్మించాడు. ఈ విషయమై బృహస్పతి చంద్రుల మధ్య చాలాకాలం పోరాటం జరిగి చివరకు దేవతలు రాజీచేసి తారను బృహస్పతి వద్దకు పంపారు. బృహస్పతికి కచుడను పుత్రుడు కలడు. కచుని కథ కొరకు – *చూ॥ దేవయాని*

★ కొన్ని పురాణాలలో ఈమె పేరు శ్రద్ధ అని పేర్కొనబడింది.

బృహస్పతి గర్భిణిగా ఉన్న తన అన్న ఉతత్యుని భార్యను బలాత్కరించగా ఆమె గర్భంలో వున్న బిడ్డ ఇతనిని నిందించగా బృహస్పతి అతనిని గుడ్డివాడిగా పుట్టమని శపించెను. బృహస్పతి వీర్యము వల్ల ఈమెకు జన్మించిన కుమారుడే భరద్వాజ మహర్షి. ఈ భరద్వాజ మహర్షి కుమారుడే ద్రోణుడు.

*బృహస్పతి మాయా రూపం :* శుక్రాచార్యుడు అసురులను రక్షించుటకొరకు హిమాలయాలకు వెళ్లి 1000 సంవత్సరములు తపస్సుచేసి మంత్రశక్తిని సాధించాడు. ఇంద్రుడు దీనిని నిర్వీర్యం చేయడానికి తన కుమార్తె జయంతిని పంపగా ఆమె సేవలందించి తపస్సు పూర్తయిన పిదప శుక్రాచార్యుడ్ని మోహించానని చెప్పగా ఇద్దరూ 10 ఏళ్లు గడుపుతారు. ఇదే అదనుగా బృహస్పతి శుక్రుని రూపంలో అసురుల వద్దకు చేరి వారికి గురువుగా బోధన చేస్తాడు. ఆ పది సంవత్సరాల తర్వాత శుక్రాచార్యుడు తిరిగి అసురుల వద్దకు రాగా బృహస్పతి (శుక్రుని రూపం) తమ గురువని పల్కగా శుక్రాచార్యుడు అసురులను నాశనమవుతారని శపిస్తాడు. వెంటనే బృహస్పతి నిజరూపుడై దేవలోకం వెళ్తాడు.

*రావణుని శపించుట :* రావణుడు దేవతలను జయించి గర్వంగా తిరిగి వస్తుండగా బృహస్పతి కుమార్తె సులేఖ అతడ్ని చూసి భయపడి పారిపోగా రావణుడామె వెంటపడగా ఆమె బృహస్పతి వెనుక దాక్కుంది. రావణుడామెను బలాత్కరించబోగా "మన్మథ బాణాలతో మైమరచి ప్రవర్తించిన నువ్వు రామబాణంతో వధించబడుదువుగాక" అని బృహస్పతి రావణుని శపించాడు.

*ఇతర విశేషాలు :* ఇతడు శుక మహర్షికి గురువు. భరద్వాజుడికి ఆగ్నేయాస్త్రం ప్రసాదించాడు. పృథు చక్రవర్తి పాలనలో భూమాత గోవైనప్పుడు బృహస్పతి దూడగా దేవతలకు కావలసిన పలు ఔషధులను పిండాడు. బృహస్పతి గొప్ప చింతనా పరుడు. చాలా విషయాలపై నిర్దుష్టమైన అభిప్రాయాలు కలవాడు. దేవతల ప్రతి కదలిక బృహస్పతి ఆలోచనా స్రవంతిలో భాగమే. దేవతలను మునులను రాజులను తన తాత్విక చింతనతో ఏదో ఒక సమయంలో ప్రభావితం చేసిన చింతనా పరుడు.

**బృహంతి :** సుబ్రహ్మణ్య స్వామి ఏడుగురు తల్లులలో ఒకరు. – మహాభారతం

**బృహంతుడు 1 :** ధర్మరాజు అశ్వమేధయాగం చేసే సమయంలో ఇతడు ఆ గుర్రాన్ని ఆపాడు. అర్జునుడు ఇతణ్ణి ఉత్తర దిక్కున జైత్రయాత్రలో ఓడించాడు. ఇతడు అర్జునునికి కానుకలు సమర్పించాడు. – మహాభారతం.

ఇతడు కురుక్షేత్ర యుద్ధంలో పాండవుల పక్షాన పోరాడి దుశ్శాసనుని చేతిలో మరణించాడు. – మహాభారతం

**బృహంతుడు 2 :** కౌరవుల వైపున పోరాడిన వీరుడు. ఇతడు క్షేమదూర్తి సోదరుడు. సాత్యకి ఇతణ్ణి వధించాడు. – మహాభారతం

**బ్రద్నాశ్వుడు :** ఒక రాజు. అగస్త్యుడొకసారి కానుకల కొరకు ఇతని వద్దకు వెళ్లాడు. – మహాభారతం

**బ్రహ్మ :** హిందూ మతం మౌలికంగా త్రిమూర్తుల చుట్టూ పరిభ్రమిస్తుంది. ఈ త్రిమూర్తులు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు. బ్రహ్మ సృష్టికి, విష్ణువు స్థితికి, శివుడు వినాశానికి కర్తలని పురాణాలు పేర్కొంటాయి.

*బ్రహ్మజననం :* విష్ణువు నాభి నుండి బ్రహ్మ జన్మించాడు. మొదట మహావిష్ణువు అరటి ఆకుపై ఓ శిశువుగా పరుండి ఆలోచిస్తున్నాడు. "నేనెవరు? ఎవరు నన్ను సృష్టించారు ? ఎందుకు సృష్టించారు? నా కార్యక్రమమేమిటి ? ఎక్కడ చెయ్యాలి ?" అప్పుడో ఆకాశవాణి గొంతు విన్పించింది. మహావిష్ణువు ఆ పలుకులు విన్నాడుగాని ఎవరి ధ్వనో అది తెలియలేదు. అప్పుడు మహాదేవి 4 చేతులతో చేతిలో ఆయుధాలతో అనంతశక్తులతో ప్రత్యక్షం కాగా మహావిష్ణువు ఆశ్చర్యచకితుడయ్యాడు. "ఓ విష్ణు! ఆశ్చర్యపోవడానికేముంది. ప్రతిసారి ఈ లోకం సృష్టించి మనుగడసాగించి వినాశనం అవుతుంది. నీవు ఆ మహాశక్తికి జన్మించావు. మహాశక్తి గుణరహితమయినది. మనమంతా ఏదో గుణాలున్న వారిమి. నీ ముఖ్య సుగుణం సత్యం. నీ నాభి నుంచి బ్రహ్మ ఉద్భవిస్తాడు. అతడు రజో గుణవంతుడు. అంటే క్రియ కోర్కె కదలిక. అతని నుదుటి నుండి రుద్రుడావిర్భవిస్తాడు. అతడు అంధకారానికి గుర్తు. బ్రహ్మ తన తపశ్శక్తితో రక్తపు రంగులో సృష్టిచేయగా నీవుదాన్ని రక్షిస్తుంటావు.

రుద్రుడు కల్పాంతంలో నాశనం చేస్తాడు అంది మహాదేవి. అట్లే విష్ణువు నాభి నుండి బ్రహ్మ జనించగా మహావిష్ణువు జగదాంబల ముందు తపస్సు చేయగా అతనికి వరాలనిచ్చారు. ఆ తర్వాత బ్రహ్మ సృష్టి ప్రారంభించాడు. అతడి మనసు నుండి సప్తర్షులు, ప్రజాపతులు వారి నుండి కదిలే కదలని వస్తుజాల మంతా సృష్టించబడింది. – దేవీభాగవతం

కాలానికి ఎంతో ముందు లోకమంతా సముద్రంగా వున్నప్పుడు జీవజాలపు శక్తి అంతా ఓ గుడ్డుగా మారింది. అందులో బ్రహ్మ కొన్ని యుగాలు నిద్రలో వున్నాడు. దేవతాశక్తి ఆ గుడ్డును ముక్కలు చెయ్యగా ఓంకార నాదం వెలువడింది. దాని మొదటి శబ్దం భూ రెండవది భువ మూడవది స్వహ అంటే భూర్భువ స్వహ. అప్పుడు ఆగ్రుడ్డు మధ్య నుండి బ్రహ్మ ఉద్భవించాడు. – వామనపురాణం

*బ్రహ్మ ఐదవతల తెగుట :* ఎంతో పాతకాలంలో మహావిష్ణువు, బ్రహ్మ వారి కార్యసిద్ధికై తపస్సు చేసి విశ్రాంతి కొరకు బయలుదేరి ఒకరినొకరు కలుసు కొని నువ్వెవరంటే నువ్వెవరని ఎవరు గొప్పంటే ఎవరు గొప్పని వాదులాడుకొనుచుండగా, వారి మధ్య ఓ లింగం ప్రత్యక్షమయ్యింది. అంతలో ఆకాశవాణి మీలో గొప్ప ఎవరో తెలుసుకోవాలంటే ఆ లింగం ఆద్యంతాలు ఎవరు చూసి తిరిగి వస్తే వారే గొప్ప వారని పలికింది. బ్రహ్మ ఊర్ధ్వ భాగానికి, మహా విష్ణువు అథోభాగానికి వెళ్లారు. విష్ణువు ప్రయాణించి ప్రయాణించి సాధ్యంకాక బయలుదేరిన చోటకే వచ్చి కూర్చోగా బ్రహ్మ పైకి ప్రయాణించగా ఆకాశం నుండి వచ్చి పడుతున్న మొగలి పువ్వు దక్కగా దానిని తీసు కొని మహావిష్ణువు వద్దకు వచ్చి లింగం పై భాగం నుండి ఈ మొగలి పువ్వును తెచ్చానని చెప్పగా మహా విష్ణువు నమ్మలేదు. మొగలిపువ్వు నిజమేనని పల్కింది. మహావిష్ణువు శివుడు చెప్తే నమ్ముతాననగా శివుడు ప్రత్యక్షమై మొగలిపువ్వుకు తన పూజా పుష్పాలలో స్థానం లేకుండా శపించి బ్రహ్మయొక్క ఒక తలను త్రుంచివేసెను.

*బ్రహ్మ నదియగుట :* చాక్షుష మనువు కాలంలో బ్రహ్మ యజ్ఞం చేయదలచి భృగు మహర్షిని నిర్వహించమని కోరగా విష్ణువు శివుడు కూడా ఆ యజ్ఞానికి వచ్చారు. భృగుమహర్షి ఇతర రుషులు యజ్ఞం ప్రారంభించ బోగా సమయానికి బ్రహ్మ భార్య స్వరాదేవి రాకపోవ డంతో సమయం మించిపోతుందని చెప్పగా మహా విష్ణువు గాయత్రిని బ్రహ్మ ప్రక్కన కూర్చోబెట్టి యజ్ఞం ప్రారంభించమంటాడు. గాయత్రి కూర్చోగా ఆ తర్వాత స్వరాదేవి వచ్చి ఆగ్రహించి తన సవతి భార్యకు అలాంటి గౌరవమిచ్చి నందుకు బ్రహ్మను, గాయత్రిని, విష్ణుమహేశ్వరులను నదులు కండని శపించింది. గాయత్రి స్వరాదేవిని కూడా నదియగు మని ప్రతిశాప మిచ్చింది. బ్రహ్మ కుకుద్మతి నదిగా మారాడు. – పద్మపురాణం

*బ్రహ్మ పూజానర్హత :* ఒకసారి మహావిష్ణువు, బ్రహ్మ శివుని దర్శనం చేసుకొని అతడిని పూజించగా శివుడు వారిని కావలసిన వరం కోరుకొమ్మనగా బ్రహ్మ శివుడ్ని తన కుమారుడిగా జన్మించమని కోరాడు. శివుడు బ్రహ్మ యొక్క గర్వానికి కోపించి అతనికి లోకమున పూజార్హత లేనట్లు శపించగా విష్ణువు శివుని పాదాల సేవకుడిగా వుండటానికి వరమడిగాడు. విష్ణువే శివశక్తిగా ఆవిర్భవించాడు. విష్ణువు యొక్క అంశ పార్వతిగా మారింది. – కథా సరిత్సాగరం.

*బ్రహ్మ నివాసం :* చూ॥ బ్రహ్మపురి.

*బ్రహ్మ కాలప్రమాణం :* దేవతలకు నాల్గు యుగాల కాలం దేవచాతుర్యం అంటారు. 1000 చాతుర్యు గాల కాలం ఒక మహాయుగం అంటారు. అది బ్రహ్మకు ఒక రోజు. ఆ ఒక్కరోజులో 14 మంది మనువులు బ్రహ్మ సృష్టికి సహకరిస్తారు. బ్రహ్మ జీవిత కాలం 100 సంవత్సరాలు అంటే 36 వేల బ్రహ్మ రోజులు (రాత్రింబవళ్లు). ఈ కాలం రాగానే బ్రహ్మ అంతరించి నారాయణుడిలో లీనమై మహావిష్ణువు నాభినుండి మరో బ్రహ్మ జన్మిస్తాడు. ఇది నిరంతర ప్రక్రియ. – భాగవతం

*బ్రహ్మసృష్టి – ప్రతిసృష్టి :* కమలం నుండి ఉద్భవించిన బ్రహ్మ సృష్టి చేసినపుడు కొన్ని కల్పముల తర్వాత (బ్రహ్మ ఒక రోజు) కూడా వుండి ప్రతిసృష్టి చేస్తూనే వుంటాడు. వాటిని సర్గలని అంటారు. అవి బ్రహ్మ సృష్టికి ప్రతిరోజు తోడ్పడతాయి. వారినే ప్రజాపతులని అంటారు. సనకుడి నుండి స్వాయంభువ మనువు వరకు ఆ తరగతివారే. వీరిని ప్రకృతి సృష్టి అని

అంటారు. సృష్టించబడి ఒక కల్పంలోనే నాశనమయ్యే వాటిని అప్రాకృతసృష్టి లేక ప్రతిసర్గ అంటారు. అవి భూలోకం, స్వర్లోకం, ధాతువులు, చెట్లు, జంతువులు.

– భాగవతం

*బ్రహ్మ ఇతర విశేషాలు :* బ్రహ్మ కాముకత వల్ల సర స్వతి జన్మించగా అతడామెను వివాహమాడాడు. కులవ్యవస్థ బ్రహ్మనోటినుండే వెలువడింది. మేఘ దూతుడను రావణుడి కుమారుడికి ఇంద్రజిత్తు అను నామకరణం చేసింది బ్రహ్మే. త్రిపురాసుర వధలో బ్రహ్మ శివుని రథికుడిగా వ్యవహరించాడు. బ్రహ్మ గయాసురుని తలపై యజ్ఞం చేశాడు. వరుణుని యాగం వద్ద బ్రహ్మకు భృగు మహర్షి జన్మించాడు. బ్రహ్మ కుడి బొటన వ్రేలి నుండి దక్షుడు, ఎడమ బొటన వ్రేలి నుండి అతని భార్య జన్మించారు. పుల స్త్యుడు బ్రహ్మ కుమారుడే.

అన్ని పురాణాలు బ్రహ్మచతుర్ముఖుడని చెప్తున్నాయి. నాల్గు ముఖాలకు కారణం బ్రహ్మ తన శరీరంలోని సగ భాగం నుండి శత రూపను సృష్టించి ఆమెను భార్యగా స్వీకరించాడు. ఆమె నుండి ఏ మాత్రము ఎడబాటును భరించలేక ఆమె తన చుట్టూ తిరుగు తున్నపుడు అదిసాధ్యంగాక 4 ముఖాలు ఆవిర్భవిం చాయి. ఆమె అతనిపై భాగాన విహరిస్తుంటే 5వ ముఖము జన్మించింది. అయితే దానిని శివుడు త్రుంచివేశాడు.

*బ్రహ్మకు గల వివిధ నామాలు :* బ్రహ్మ, ఆత్మభు, సురజ్యేష్ఠ, పరమేష్ఠి, పితామహ, హిరణ్యగర్భ, లోకేశ, స్వయంభు, చతురానన, ధాత, అజ్జయోని, ద్రుహిణ, విరించి, కమలాసన, సృష్టి, ప్రజాపతి, వేధ, విధాత, విశ్వస్పత, విధి, నాభిజన్మ, అండజ, హంసవాహన.

**బ్రహ్మకల్పం :** సృష్టియందొక కాలము. మధుకైటభుల మెదడు నుండి మేదిని ఏర్పడి సృష్టి చేయబడిన కాలం. ఇతర కల్పాలు పద్మ కల్పం, వరాహకల్పం.

– *బ్రహ్మవైవర్తపురాణం*

**బ్రహ్మవైవర్తం :** ఇదో పురాణం. వసిష్ఠప్రోక్తం. స్రష్టసృష్టి వివరణ విష్ణుధర్మాలు ఇందులో చెప్పబడినవి.

**బ్రహ్మచర్యం :** ప్రాచీన భారతదేశంలో ఆదర్శవంతమైన జీవితం నాలుగు అంచెలుగా భావించారు. అవి : 1. బ్రహ్మచర్యం, 2. గృహస్థాశ్రమం, 3. వానప్రస్థం, 4. సన్యాసం. బ్రహ్మచర్యంలో పాటించవలసిన *నియమాలు :* బ్రహ్మచారి తన గురువుతో జీవించే సమయంలో సూర్యోదయాన లేచి స్నానం చేసి దేవత లకు పితృలకు తర్పణ చేయాలి. తేనె మాంసాహారం భుజించరాదు. ఒంటరిగానే నిద్రించాలి. వీర్యస్ఖలనం కారాదు. ఒక వేళ కలలో స్ఖలనం జరిగితే ఉదయమే సూర్యుడ్ని ప్రార్థించి మూడుసార్లు మంత్రోచ్చారణ చేయాలి. గురువు ఆజ్ఞను ధిక్కరించరాదు. గురువు చెప్పినట్లు వేదపఠనం చెయ్యాలి. గురువు బ్రహ్మచర్యం పూర్తయిందని చెప్పేవరకూ గురువును వీడరాదు. వేదాల్ని యాగాలను నమ్మేవారి ఇంటి నుండి బిక్షాన్ని గ్రహించాలి. వరుసగా ఏడురోజులు బ్రహ్మచారి నియ మాల్ని పాటించకపోతే వ్రత భంగమయినట్లుగా భావించాలి.

**బ్రహ్మచారి 1 :** చూ॥ బ్రహ్మచర్యం.

**బ్రహ్మచారి 2 :** పృథ, కశ్యపుల కుమారుడు. ఇతడు దేవగాంధర్వుడు. అర్జునుని జన్మదినోత్సవ వేడుకల్లో పాల్గొన్నాడు. – మహాభారతం

**బ్రహ్మజిత్తు :** కాలనేమి కుమారుల్లో ఒకడు.

– *బ్రహ్మాండపురాణం*

**బ్రహ్మతీర్థం :** కురుక్షేత్రంలో గల ఓ పవిత్ర స్థలం. ఇక్కడ స్నానంచేస్తే బ్రాహ్మణేతరుడు బ్రాహ్మణత్వం పొందుతాడు. – మహాభారతం

**బ్రహ్మతుంగం :** ఇదో పర్వతం. శ్రీకృష్ణుడు తను శివుని సమక్షంలో దీన్ని దర్శించినట్లు అర్జునుడు కలకన్నాడు.

– మహాభారతం

**బ్రహ్మదత్తుడు 1 :** ఒక రాజు. చూ॥ పూజని.

**బ్రహ్మదత్తుడు 2 :** నీపుడను రాజుకు శకుని కుమార్తె యగు సుందరియందు పుట్టిన కుమారుడు. ఇతనికి గోదేవియను భార్యవలన విష్వక్సేనుడు జన్మించెను.

– భాగవతం

**బ్రహ్మదత్తుడు 3 :** ఒక రాజు. గౌతముడను ముని ఇతని ఇంటికి వచ్చి ఆహారము పెట్టమనెను. ఆ ముని నూట ఇరువది సంవత్సరములు ఇతని ఇంట నుండెను. ఒకనాడు భోజనము చేయుచుండగా అన్న ములో మాంసము వచ్చెను. ముని కోపమున వచ్చి

నీవు గ్రద్ధవై జన్మించుమని శపించెను. తెలియక జరిగినది, అట్టిదానికి శపించుట న్యాయమా అని వేడుకొనగా "శ్రీరాముడు నిన్ను తాకును. అపుడు నీకు శాపవిమోచనమగును" అని తెల్పెను. ఇతడు గ్రద్దగా మారి ఓ గుడ్లగూబతో తగవుపడి తీర్పు చెప్పమని శ్రీరాముని కడకు పోగా శ్రీరాముడు గ్రద్దను తాకగా అతనికి శాపవిమోచనమయ్యెను.

– ఉత్తర రామాయణం.

**బ్రహ్మదత్తుడు 4 :** చూలియను మునివలన సోమద యందు పుట్టిన కుమారుడు. ఇతడు కాంపిల్య దేశమునకు రాజయ్యెను. కుశనాభుడు శాపవశమున వికృత రూపులైన తన నూర్గురు కుమార్తెలను ఇతని కిచ్చి వివాహము చేయగా ఇతడు వారిచేయి పట్టగనే వికృత రూపము పోయి సౌందర్యవంతులైరి.

– రామాయణం.

**బ్రహ్మదత్తుడు 5 :** ఇతడు అనఘుడను రాజు కుమారుడు. ఇతడికి పశుపక్ష్యాదుల భాషలన్నియు తెలుసును. ఒక రోజితడు తన భార్యతో అరణ్యమున కేగి ఓ జంట పక్షులు మాట్లాడుకొనుట విని నవ్వెను. భార్యతనను చూసి హేళనగా భావించి ఇతనితో మాట్లాడుట మానివేసెను. ఇతడేడు రాత్రులు విష్ణుమూర్తిని ప్రార్థించగా కలలోకి విష్ణుమూర్తి వచ్చి మరునాడు బ్రాహ్మణులను కలుసుకొమ్మని చెప్పెను. మరునాడు సభలోనికి ఓ బ్రాహ్మణుడు వచ్చి ఓ శ్లోకము చదివెను. దాని అర్థము మొదట బ్రాహ్మణ పుత్రులైరి, తర్వాత గుప్తవ్యాధులై ఆ తర్వాత చక్ర వాకములైన వారు ఇపుడేమయిరో అను అర్థమురాగా రాజుకు పూర్వజన్మ గుర్తుకు వచ్చెను.

పూర్వజన్మమున ఇతడిపేరు పితృవర్తి. కౌశికుడను బ్రాహ్మణుని ఏడుగురు కుమారుల్లో ఒకడు. వీరు గర్గుని శిష్యులు. ఆహారలేమి వల్ల గురువు మేపుకు రమ్మన్న గోవునే వధించి భుజించి గురువుతో ఓ సింహము తినివేసినదని అబద్ధము చెప్పిరి. అందువల్ల ఇతడు రెండు జన్మలు దాటి మూడవ జన్మమున బ్రహ్మదత్తుడను రాజయ్యెను. మరి ఇద్దరు ఇతడి మంత్రులైరి. తక్కిన నల్గురును రాజసభకు వచ్చి శ్లోకము చెప్పినవానికి పుత్రులుగా జన్మించి తపస్సున కేగిరి. – మత్స్యపురాణం

**బ్రహ్మదేవుడు :** పాండవుల పక్షాన కురుక్షేత్రంలో పోరాడిన యోధుడు. సైన్యం వెనుక వుండి సైన్యాన్ని రక్షించడం ఇతని బాధ్యత. – మహాభారతం

**బ్రహ్మధన :** ఓ వానరుని కూతురు. ఈమె తండ్రి శండుడు అను వానరుడు. – బ్రహ్మాండపురాణం

**బ్రహ్మపుత్ర :** ఇదొక నది.

*జననం :* బ్రహ్మ శాంతనువు అను మునియొక్క భార్యను జూచి చిత్త విభ్రమను పొందెను. మునిలేని సందర్భముగా బ్రహ్మ అతని ఆశ్రమమునకేగి అతని భార్య అమోఘను తన కోర్కె తీర్చమని కోరగా ఆమె తలుపు మూసుకొని అట్లు బ్రహ్మకోరినచో శపింతునని చెప్పగా బ్రహ్మ తేజస్సు జారి క్రిందపడెను. శాంతనువుడు తన ఆశ్రమమునకు వచ్చి పద్మపాదములను వీర్యమును చూచి భార్యను వివరణకోరగా ఆమె జరిగిన కథ చెప్పగా ఇది దైవకార్యమని యెంచి ఆ వీర్యమును తన భార్య గర్భమున నుంచగా ఆమె యందు జనించిన శిశువును పర్వతముల మధ్య వుంచెను. అది జలరూపమున పెరిగి బ్రహ్మపుత్ర యను నదియయ్యెను. పరశురాముడిందే స్నానం చేసి తన పాతకము పోగొట్టుకొనెను.

**బ్రహ్మపురాణం :** బ్రహ్మ మరీచికి దీన్ని బోధించాడు. అష్టాదశ పురాణాల్లో ఇదొకటి. దీనిలో 25 వేల శ్లోకాలున్నాయి. వైశాఖమాసంలో పౌర్ణమి రోజున ఈ గ్రంథాన్ని, గోవును, జలాన్ని బ్రాహ్మణుడికి దానం చేస్తే స్వర్గలోకప్రాప్తి కల్గుతుంది. – అగ్నిపురాణం

**బ్రహ్మపురి :** బ్రహ్మ నివాస స్థలం. దీని వైశాల్యం పద్నాలుగు వేల యోజనాలు. ఇది మేరు శిఖరం మీద వుంది. దీని నాల్గు వైపులా 8 నగరాలు వున్నాయి. వీటిలో ఇంద్రాదులు వుండి రక్షిస్తారు. విష్ణుపాదాల నుండి భూమిపై గంగ బ్రహ్మపురి పై పడి నాల్గు భాగాలుగా చీలి నాల్గు వైపులా ప్రవహిస్తుంది. ఆ నాల్గు గంగా విభాగాల పేర్లు సీత, అలకనంద, చాక్షుష, భద్రలు. ఇది మలయ వాన, గంధమాదన, నీలగిరి, నిషధ పర్వతాల మధ్య వుంటుంది.

– విష్ణుపురాణం

**బ్రహ్మప్రళయం :** ముప్పై ఆరు లక్షల మానవ సంవత్సరాలు ఒక చతుర్యుగం. డెబ్బై ఒక్క చతుర్యుగాలు

ఒక మన్వంతరం. పద్నాలుగు మన్వంతరాలు ఒక కల్పం. ఈ కల్పం బ్రహ్మకు ఓ పగలు. అంటే రెండు కల్పాలు బ్రహ్మకు ఒక రోజు. ఇలాంటి 360 బ్రహ్మ రోజులు ఓ బ్రహ్మ సంవత్సరం. నూట ఇరవై బ్రహ్మ సంవత్సరాల తర్వాత ఓ బ్రహ్మ ప్రళయం వస్తుంది.
- చూ॥ కాలమానం

**బ్రహ్మబలి :** గురుపరంపరలోని ఓ రుషి.

**బ్రహ్మమేధ్యం :** పురాణ ప్రసిద్ధి చెందిన ఒక నది.
- మహాభారతం

**బ్రహ్మయజ్ఞం :** బ్రాహ్మణులు మాత్రమే చేయాల్సిన యజ్ఞమిది. నోటిని నీటితో మూడుసార్లు పుక్కిలించి రెండుసార్లు కడుక్కోవాలి. ఒకసారి మొహం, చేతులు, కాళ్లు కడుక్కొని నీళ్లు నెత్తిన చల్లుకొని "నేను బ్రహ్మయజ్ఞం చేస్తున్నానని" మొదలుపెట్టాలి.
- దేవీ భాగవతం

**బ్రహ్మయోని :** కురుక్షేత్రంలో గల ఓ పుణ్యస్థలం. ఇక్కడ స్నానం చేస్తే బ్రహ్మలోక ప్రాప్తి లభిస్తుంది.
- మహాభారతం

**బ్రహ్మర్షిదేశం :** కురుక్షేత్రం, మత్స్యదేశం, పాంచల దేశం, శూరసేదేశం. వీటిని బ్రహర్షి దేశాలని పిలుస్తారు.

**బ్రహ్మవేధ్య :** పురాణ ప్రసిద్ధమైన ఒక నది.
- మహాభారతం

**బ్రహ్మ వైవర్త పురాణం :** అష్టాదశ పురాణాల్లో ఇదొకటి. సావర్ణి మనువు దీన్ని నారదుడికి చెప్తాడు. దీనిలో 18 వేల శ్లోకాలున్నాయి. రథందరుడి కథ ఇందులోని ఇతివృత్తం. - అగ్నిపురాణం

**బ్రహ్మశాల :** గంగాతీరంలో ఓ పవిత్రస్థలం. దీన్ని దర్శించినంతనే స్వర్గలోక ప్రాప్తి లభిస్తుంది.
- మహాభారతం

**బ్రహ్మశిరం :** చూ॥ బ్రహ్మాస్త్రం.

**బ్రహ్మశిరస్సు :** చూ॥ బ్రహ్మాస్త్రం.

**బ్రహ్మసరస్సు :** ధర్మారణ్యంలోని ఓ పవిత్ర స్థలం. ఇక్కడొక రాత్రి ఉపవాసం వుంటే బ్రహ్మలోకం చేరతాము. బ్రహ్మ విసిరిన కొయ్య ఇక్కడుంది. దీనికి ప్రదక్షణ చేస్తే వాజపేయ యజ్ఞం చేసిన ఫలితం వస్తుంది. ఇదే పేరుతో గయలో కూడా ఓ పుణ్యస్థలం వుంది.
- మహాభారతం

**బ్రహ్మసావర్ణి :** ఇతడు 10వ మనువు.

**బ్రహ్మస్థానం :** ఇదో పవిత్ర స్థలం. దీన్ని దర్శిస్తే అశ్వమేధ యాగ ఫలితం లభిస్తుంది. - మహాభారతం

**బ్రహ్మసూత్రం :** వ్యాస మహర్షిచే చేయబడిన బ్రహ్మమీమాంస. ఇది స్రష్ట సృష్టి సంబందమును తెలియజేయు గ్రంథం. దీనిని త్రిమతస్థులు అంగీకరించారు.

**బ్రహ్మహత్య :** వృతుడను రాక్షసుని చంపుటచే ఇంద్రునకు బ్రహ్మహత్యాపాతకము కల్గెను. దీన్నుండి ఉపశమనము కల్గించమని ఇంద్రుని ప్రార్థించగా అతడు జలమును, అగ్నిని, వృక్షములను, స్త్రీలను పిలచి హత్యాపాతకము నాల్గుభాగములు చేసి వాటికి పంచెను. అవి మాకు ప్రాయశ్చిత్తమెట్లని అడుగగా "అగ్నిని ప్రజ్వలింపక దేహ విప్రదినము చేసిన వారికిని, జలము నందు మూత్ర విసర్జనము చేయువారికి, రజస్వలయైనపుడు సంగమము చేయువారికిని ఈ పాతకము మీరొసంగుడని చెప్పెను. - మహాభారతం

**బ్రహ్మావర్తం 1 :** సరస్వతి దృషద్వతి నదుల మధ్యగల భూభాగాన్ని బ్రహ్మావర్తం అంటారు. దీన్ని దేవతలు సృష్టించారు. - మనుస్మృతి

**బ్రహ్మావర్తం 2 :** కురుక్షేత్రంలోని ఒక పవిత్ర స్థలం. ఇక్కడ స్నానం చేస్తే బ్రహ్మలోక ప్రాప్తి కల్గుతుంది.
- మహాభారతం

**బ్రహ్మాంజలి :** శిష్యుడు గురువుల ఎదురుగా రెండు చేతులు ముడిచి నిలబడాలి. ఇలా రెండు చేతులు ముడిచి నిలబడటాన్ని బ్రహ్మాంజలి అంటారు.
- మనుస్మృతి

**బ్రహ్మాండపురాణం :** అష్టాదశ పురాణాల్లో ఒకటి. బ్రహ్మ బ్రహ్మాండ ఘనతను గురించిన ఉపన్యాస మిస్తాడు. దీనిలో 12 వేల శ్లోకాలున్నాయి. - అగ్నిపురాణం

**బ్రహ్మాండం :** విశ్వంయొక్క ఆవిర్భావానికి మూలమైంది బ్రహ్మాండం. అన్ని లోకాలు దీన్లోనే వున్నాయి.
- దేవీ భాగవతం

**బ్రహ్మాదుంబరం :** కురుక్షేత్రంలోని ఓ పవిత్ర స్థలం. ఇది బ్రహ్మను గూర్చి పూజ చేయడానికి పవిత్ర స్థలం.
- మహాభారతం

**బ్రహ్మాస్త్రం :** దీనిని బ్రహ్మ శిరాస్త్రం అనికూడా అంటారు. శివుడు దీన్ని అగస్త్యునికివ్వగా అతడు అగ్నివేశుడి

కిచ్చాడు. ఇతడు ద్రోణుడికివ్వగా ద్రోణుడు అర్జునుడికి చ్చాడు. దీనిని ఉపయోగించే విధానం ద్రోణుడిలా చెప్పాడు. "ఇది మానవుని మీద ఉపయోగించరాదు. నీచుల మీద ఉపయోగిస్తే ముల్లోకాలు నశిస్తాయి. దీనికి సమానమైన అస్త్రం ప్రపంచంలో లేదు. మానవుడు తప్ప ఇంకెవరైనా నిన్నెదుర్కొన్నప్పుడు వారిని ఎదుర్కొనడానికి దీన్ని ఉపయోగించు".

**బ్రహ్మం :** చూ॥ త్రిమూర్తులు.

**బ్రాహ్మణం :** బ్రాహ్మణాలు యజ్ఞాలకు సంబంధించిన మంత్ర తంత్రాలను వివరిస్తాయి. సంహితాలు, బ్రాహ్మ ణాలు వేద విభాగాలు. అరణ్యకాలు బ్రాహ్మణాలకు అనుబంధాలు. ఉపనిషత్తులు అరణ్యకాలకు అనుబం ధాలు, వీటి మొత్తాన్ని కలిపి వేద సాహిత్యమంటారు.

**బ్రాహ్మముహూర్తం :** సూర్యోదయానికి ముందున్న 48 నిముషాల కాలాన్ని బ్రాహ్మ ముహూర్తమని అంటారు. ఈ సమయంలో ప్రార్థనలోగాని ధ్యానంలోగాని నిమగ్నులైవుండాలి. – మహాభారతం

**బ్రాహ్మహుతం :** ఇదొక విధమైన యజ్ఞం. ఐదురకాల యజ్ఞాలున్నాయి. అవి ఆహత, హత, ప్రహత, బ్రహ్మహత, ప్రాశితలు. ఆహత, బ్రహ్మహత దేవత లకు, ప్రహత భూతాలకు, బ్రాహ్మహుతం మానవులకు, ప్రాణిత పితృదేవతలకు సంబంధించిన యజ్ఞాలు. – మనుస్మృతి

**బ్రాహ్మం :** ఒక పురాణం. దీనిలో బ్రహ్మ మరీచ్యాదులకు చెప్పిన బ్రహ్మకల్ప విశేషాలున్నాయి.



**భక్షకుడు :** ఓ పాపియైన శూద్రుడు. ఇతడొకసారి అగ మ్యగోచరంగా తిరుగుతూ దాహంతో తులసి చెట్టుకు పోసి నిల్చివున్న నీటిని త్రాగగా మోక్షం లభించింది. ఆ తర్వాత కొంత కాలానికి ఓ ఆటవికుడి చేతిలో మరణించి స్వర్గలోకం వెళ్లాడు. ఇతడు పూర్వ జన్మలో ఓ రాజు. ఓ అందమైన పతివ్రతా స్త్రీని బలాత్కరిం చడం వల్ల తర్వాతి జన్మలో భక్షకుడను శూద్రుడిగా జన్మించాడు. – పద్మపురాణం

**భక్తి :** ద్రవిడ దేశంలో జన్మించిన దేవి. ఆమె తన కుమారులు. జ్ఞాన, వైరాగ్యులతో గోకులంలోని బృందావనానికి కర్నాటక, మహారాష్ట్ర, గుజరాత్ మీదుగా వెళ్లింది. అంతదూరం అంతకాలం ప్రయా ణించి గోకులం వెళ్లేసరికి ఆ ముగ్గురు ముసలి వాళ్లయ్యారు. గోకులంలో అడుగుపెట్టగనే భక్తి యవ్వ నవతి అయ్యింది కాని కుమారులు యువకులు కాలేదు. ఆమె నారదుడ్ని వారిని కూడా యువకుల్ని చేయమని కోరగా నారదుడు వారికి వేద వేదాంతాలు భగవద్గీత బోధించాడు. అయినా వారు యువకులుగా మారలేదు. అప్పుడు సనక, సనంద, సనత్కుమారులు నారదుడితో భాగవతం బోధించమని చెప్పగా నార దుడు భాగవతం చదివి విన్పించగా భక్తి కుమారులు కూడా యువకులయ్యారు. – పద్మపురాణం

**భగద :** సుబ్రహ్మణ్య స్వామి సేవిక. – మహాభారతం

**భగదత్తుడు :** నరకాసురుని కుమారుడు. ప్రాగ్జోతిషపు రానికి రాజు. పాండురాజు స్నేహితుడు. రాజసూయ యాగానికి వచ్చి కానుకలు సమర్పించాడు. కర్ణుడొక సారి ఇతడ్ని ఓడించాడు. కురుక్షేత్ర యుద్ధంలో ఇతడు కౌరవుల పక్షాన పోరాడి భీమ సేనుడిని, ఘటోత్క చుడు లాంటి వీరుల్ని ఓడించాడు. దశార్ణ, రుచిపర్ణు లను వధించాడు. ఇతడు అర్జునునిపై వైష్ణవాస్త్రాన్ని ప్రయోగించగా అర్జునుడు దాన్ని నశింపచేసి భగదత్తుడ్ని వధించాడు. ఇతని మరణా నంతరం ఇతని కుమా రుడు వజ్రదత్తుడు ఆ నగరానికి రాజు కాగా అర్జునుడు అతణ్ణికూడా వధించాడు. – మహాభారతం

**భగనంద :** సుబ్రహ్మణ్యస్వామి పరిచారిక. – మహాభారతం

**భగవతి :** భగవానుడు, భగవతి అంటే పరమాత్మ ప్రకృతి అని అర్థం. ప్రకృతిని శక్తి అనికూడా అంటారు. – దేవీ భాగవతం

**భగవంతుడు :** "సంభర్తృత్వము భర్తృత్వము నేతృత్వము గమయి తృత్వము స్రష్టృత్వము సర్వ శరీరతము సర్వ భూతాంతరాత్మత్వము నిరస్తనిఖిల దోషత్వము షాడ్గుణ్య పూర్ణత్వము" కల గుణములు కలవాడు భగవంతుడు. సంభర్తృత్వమంటే ప్రకృతి పురుషకాలములకు కార్య ములను పుట్టించునట్టి యోగ్యత కలుగజేయుట.

భర్తృత్వమనగా స్థితిని కలుగచేయుట, గమయితృ త్వమనగా సంహారము చేయుట, స్రష్టత్వమనగా సృజి యించుట, సర్వశరీరత్వమనగా ప్రపంచము శరీర ముగా కలిగివుండుట, సర్వభూతాంత రాత్మత్వము అనగా ఎల్ల భూతములకు లోపల ఆత్మగావుండుట, నిరస్తనిఖిల దోషత్వమనగా ప్రకృతి సంబంధమైన దోషములు అంటకుండుట, షాడ్గుణ్య పూర్ణత్వ మనగా ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీజ్ఞానము, వైరా గ్యము అను గుణములు కలిగి వుండుట.

– *పురాణనామచంద్రిక.*

**భగవద్గీత :** 650 శ్లోకాలు, 18 అధ్యాయాలతో కూడిన కావ్యం. ఇది మహాభారతంలోని 25–45 అధ్యాయాల మధ్యగల కావ్యం. ఇది శ్రీకృష్ణునికి అర్జునునికి మధ్య సంభాషణలా సాగింది. కురుక్షేత్ర యుద్ధం ప్రారం భంలో అర్జునుడు ఎదుటి సైన్యాన్ని చూసి అందరూ తన బంధువులు మిత్రులేనని, వీరితో ఎలా యుద్ధం చేస్తానని నిరాసక్తత తెలుపగా శ్రీకృష్ణుడు యుద్ధానికి కార్యోన్ముఖుడ్ని చెయ్యడానికి అర్జునునికి బోధించిందే ఈ గీత. ఇది కర్మయోగాన్ని, జ్ఞానయోగాన్ని, భక్తియోగాన్ని బోధిస్తుంది. ఇది హిందూ ధర్మాన్ని బోధించే తాత్విక చింతనగా ఎన్నబడి దీనికి ఆదిశంక రుడు, మధ్వాచార్యుడు, రామానుజాచార్యుడు వ్యాఖ్యా నాలు ప్రకటించారు. ఇది అన్ని ప్రపంచ భాషలలోకి అనువదించబడింది. కొందరు పండితులు ఇది క్రీ.పూ. 4 లేక 3వ శతాబ్దిలో రచించబడి క్రీ.శ.2వ శతాబ్దిలో మహా భారత కావ్యంలో చేర్చబడిందని కూడా చెప్తారు.

**భగిని :** స్త్రీ నుద్దేశించిన పదం. ఇతరుల భార్యలను, బంధువులు కాని వారిని భవతి / సుభగే / భగినీ అని పిలవాలి. – *మనుస్మృతి.*

**భగీరథుడు :** ఇతడు దిలీపుని కుమారుడని మహా భారతం చెప్తుండగా, ఎక్కువ పురాణాలు అంశుమానుడి పుత్రుడని పేర్కొంటున్నాయి.

*జన్మవృత్తాంతం :* సగరునికి ఇద్దరు భార్యలు కేశిని, సుమతి. కేశినికి అసమంజసుడు, సుమతికి 60,000 మంది పుత్రులు జన్మించిరి. 60 వేల మంది సగరుని అశ్వమేధ రక్షణ కేగి కపిలుని శాపానికి భస్మంకాగా సగరుడు అసమంజసునికి కర్మకాండల భారం మోపి మరణించాడు. అతడు అతని కుమారుడు అంశుమా నుడికి ఆ కార్యాన్ని అప్పజెప్పగా అతడు దాన్ని తన కుమారుడు భగీరథునికి అప్పగించాడు. అనగా సగరుని కుమారులు 60 వేల మంది భగీరథునికి తాతలవుతారు.

*భగీరథ ప్రయత్నం :* భగీరథుడు తన తాతలకు మోక్షం కొరకు గంగాదేవిని ధ్యానిస్తూ తపస్సు చేయగా దేవి ప్రత్యక్షమై వరం కోరుకొమ్మంది. పాతాళంలోవున్న 60,000 సగర పుత్రులైన తన తాతలకు కర్మకాండ నిర్వహించమని కోరగా గంగాదేవి సమ్మతించి నేను దివి నుండి భువికి వచ్చునపుడు ఆ భారం మోయ వలెను. ఒక్క శివుడు తప్ప అన్యులవల్ల కాదు. శివుని గూర్చి ప్రార్థించి అతడిని ఒప్పిస్తే కార్యభారం నిర్వ హిస్తానని చెప్పగా భగీరథుడు కైలాసం వెళ్లి శివుడ్ని గూర్చి 1000 సంవత్సరాలు తపస్సు చేయగా గంగా దేవి స్వర్గం నుండి భుమికి పడే శక్తిని నేను నా తలలో బంధించగలనని చెప్పగా గంగ శివుని ఆ చుట్టుకుపోయిన కేశాల మధ్య దూకింది. శివుడు తన కేశాలను బయటకు దారి లేకుండా ముడివేయగా గంగ శివుని కేశాలలో బంధించబడి బయట పడక పోగా భగీరదుడు శివుడిని గూర్చి మరల 1000 సంవత్సరాలు తపస్సు చేయగా శివుడు కరుణించి తన కేశాలను సడలించగా అందుండి గంగ భూమి పై పడి నదిగా ప్రవహించింది. అదలా ప్రవహిస్తూ జహ్నుమహర్షి ఆశ్రమాన్ని ముంచెత్తగా అతడు గంగను మింగివేశాడు. భగీరదుడు మరల ఆ మహ ర్షిని వేడుకోగా అతడు గంగను తన చెవినుండి బయ టకు వదలగా అది పాతాళానికి ప్రవహించి సగర పుత్రుల బూడిదపై ప్రవహించి పునీతుల్ని చేసింది. అలా సగర పుత్రుల కర్మకాండలు నిర్వహించబడి ముక్తి లభించింది. – భాగవతం

*ఇతర విశేషాలు :* ఇతడు తన గురువైన త్రితులుని కోర్కెపై తన సర్వస్వాన్ని త్యజించి సన్యాసిగా అన్ని దేశాలు పర్యటించి చివరికి తన ప్రజల కోర్కె గురువు ఆజ్ఞపై తిరిగి రాజ్యపాలన చేశాడు. – *జ్ఞానవాసిష్టం.* శివుడితనికి ఎన్నో వరాలు ప్రసాదించాడు. ఇతనికి గోదానం చేయడం అత్యంత ప్రీతీపాత్రమైనది. ఇతడు యముని కొలువులో సభ్యుడై అతణ్ణి పూజిస్తుంటాడు.

– *మహాభారతం*

**భగుడు 1 :** కశ్యప ప్రజాపతికి అదితికి కుమారులుగా జన్మించిన 12 మంది ఆదిత్యుల్లో ఒకడు. చివరి చాక్షుష మన్వంతరంలో తుషతసులుగా ప్రసిద్ధి చెందారు. ఇతడు సిద్ధిని వివాహమాడగా ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు జన్మించారు. ఇతడు అర్జునుని జన్మదినోత్సవ వేడుకల్లో పాల్గొన్నాడు. ఖాండవ దహన సమయంలో శ్రీకృష్ణార్జునులపై ఇంద్రుడు యుద్ధంచేసినపుడు సహాయపడ్డాడు. అంతేకాక ఇంద్రుని కొలువులో సభ్యుడు. సుబ్రహ్మణ్యస్వామిని సైన్యాధిపతిని చేసినపుడు ఇతడు కూడా వున్నాడు. దేవయాగానంతరం యజ్ఞ ఫలితాన్ని దేవతలు పంచుకొని రుద్రుడ్ని వదలివేయగా అతడు తన బాణాలతో ఇతని కళ్ళు పొడిచాడు. దేవతలు ప్రార్థించగా తిరిగి దృష్టి వచ్చింది. – మహాభారతం

**భగుడు 2 :** వేదాలలో ఒక దేవుడు. ఇతడు సంపద, అధికారం, సంతోషాలకు అధిపతి. ఋగ్వేదంలో పేర్కొనబడిన 6 గురు ఆదిత్యుల్లో ఒకడు. – ఋగ్వేదం

**భగోళం :** చూ॥ సూర్యుడు.

**భగ్నరథుడు :** చిత్రరథుని మరోపేరు.

– *చూ॥ చిత్ర రథుడు*

**భజమానుడు :** సత్వత కౌసల్యలకు జన్మించిన యాదవ రాజు. భజమానుడు సంజయుడి ఇద్దరు కుమార్తెలైన బాహ్యక, ఉపబాహ్యకలను వివాహం చేసుకోగా వారి వల్ల 6 గురు పుత్రులు జన్మించారు. – *భాగవతం*

**భజి :** సాత్వతుడి కొడుకు.

**భజ్యుడు :** గురుపరంపరలో ఒకడు. బాష్కలి వద్ద ఇతడు వాలఖిల్య సంహితను అభ్యసించాడు. – *భాగవతం*

**భట్టి 1 :** క్రీ.శ. 7వ శతాబ్దిలో జీవించిన ప్రసిద్ధ సంస్కృత గ్రంథకర్త. రావణ వధ అనే కావ్యం ఇతనికి గొప్ప ప్రసిద్ధత చేకూర్చింది. దీనిని భట్టి కావ్యమని కూడా అంటారు. 22 కాండలుగా రామాయణాన్ని రచించాడు. శ్రీధర సేనుడను రాజు కోర్కెపై దీనిని రచించినట్లు చెప్తారు.

**భట్టి 2 :** చంద్రగుప్తుడను బ్రాహ్మణుడికి సుమతివల్ల జన్మించిన కుమారుడు భట్టి. చంద్రగుప్తుడికి ఇతర భార్యలవల్ల విక్రమార్కుడు, వరరుచి, భర్తృహరి జన్మించారు. – *విక్రమాంక దేవచరితం*

**భట్టుమూర్తి :** గొప్ప ఆంధ్రకవి. ఇతడి రచనలు వసు చరిత్రము, హరిశ్చంద్ర నలోపాఖ్యానము, కావ్యాలంకార సంగ్రహము. రామరాజ భూషణుడనునది ఇతడి మరోపేరు. మొదటి రెండును పద్య కావ్యములు కాగా మూడవదైన కావ్యాలంకార సంగ్రహము అలంకార శాస్త్రమునకు సంబంధించినది. అలంకార శాస్త్రమున ఇప్పటికిని ఇదియే తెలుగున ప్రామాణిక గ్రంథము. శ్రీకృష్ణదేవరాయలిచ్చిన బిరుదము భట్టుమూర్తి.

**భద్ర 1 :** కృష్ణుడి భార్య. శృతకీర్తి కుమార్తె. – *భాగవతం*

**భద్ర 2 :** కృషితాశ్వుడనే రాజు భార్య. ఈమెకు సంతానం కలుగక ముందే భర్త మరణించగా శవంపై పడి దుఃఖిస్తుండగా "నువ్వు ఋతుమతివైన 8–14 రోజుల మధ్య భర్తను తలచుకుంటే సంతానం కల్గుతుంది". అని ఆకాశవాణి చెప్తుంది. అలాగే చేయగా ఆమెకు సంతానం కల్గుతుంది. – మహాభారతం

**భద్ర 3 :** కుబేరుని భార్యల్లో ఒకరు. – మహాభారతం

**భద్ర 4 :** శ్రీకృష్ణుడి సోదరి సుభద్ర మరో పేరు.

– *చూ॥ సుభద్ర*

**భద్ర 5 :** విశాల దేశ రాజపుత్రిక. ఈమె కరూశ దేశానికి రాణి కావాలని తలంచగా శిశుపాలుడు కరూశ రాజు రూపంలో వచ్చి ఎత్తుకు పోయాడు. – మహాభారతం

**భద్ర 6 :** వసుదేవుడి భార్యల్లో ఒకరు. – భాగవతం

**భద్ర 7 :** కాశీరాజు కుమార్తె. సగరుని మనుమడు ఈమెను వివాహమాడాడు. – *బ్రహ్మాండపురాణం*

**భద్ర 8 :** అగ్నీధ్రుడి భార్య. కురువు కుమార్తె.

– *భాగవతం*

**భద్ర 9 :** సోముడి కుమార్తె. ఉతథ్యుడి కోసం తపస్సు చేసి అతణ్ణి పొందుతుంది. వరుణుడీమెను ఎత్తుకు పోగా ఉతథ్యుడు మొత్తం నీటిని తాగి ఈమెను రక్షించుకుంటాడు. – మహాభారతం

**భద్ర 10 :** చూ॥ భద్రకాళి.

**భద్ర 11 :** మేరువు యొక్క కుమార్తె. ఈమెను అగ్నీధ్రుడు వివాహమాడెను. ఈమెకు 8 మంది సోదరీమణులు.

– *భాగవతం*

**భద్రకర్ముడు :** శుక్రాచార్యుని పుత్రుడు. దైత్య గురువు.

**భద్రకర్ణేశ్వరం :** ఇదో పుణ్యస్థలం. ఈ స్థలాన్ని దర్శించి పూజలు చేస్తే దురదృష్టం వెన్నాడదు. – మహాభారతం

**భద్రకారుడు :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. జరాసంధుడికి భయపడి దక్షిణ భారతదేశానికి వచ్చాడు. - మహాభారతం

**భద్రకాళి :** పార్వతి యొక్క మరో రూపము. దక్ష యజ్ఞ సమయంలో తన భర్తను ఆహ్వానించనందుకు శివుని భార్య, దక్షుని కూతురు అయిన సతి ఆ యజ్ఞ గుండంలో దూకి మరణించింది. ఇది తెలిసిన శివుడు అచటికి వచ్చి ఉగ్రుడై తన అంటుకుపోయిన కేశాలను నేలపైకి విసికొట్టగా బీరభద్రుడు, భద్రకాళి జన్మించారు. ఈ భద్రకాళి సతి లేక పార్వతి యొక్క అంశ.

*భద్రకాళి–కంసుడు :* దేవకి అష్టమ గర్భమున శ్రీకృష్ణుడు జన్మిస్తాడని తెలిసి కంసుడు ఆ పుట్టిన శిశువును చంపడానికి వెళ్తాడు. అప్పటికే భద్రకాళి దేవకి గర్భమున జేర్చబడి ఆమె గర్భములో గల శ్రీకృష్ణుడు యశోద గర్భంలోకి మార్చబడతాడు. కంసుడు దేవకి గర్భంలో జనించిన భద్రకాళిని పట్టుకొని రాతిపైకి విసరగా ఆమె అతడి చేతుల నుండి తప్పించుకుని ఆకాశానికి వెళ్తుంది. ఆమె భద్రకాళి మరోరూపం. - అగ్నిపురాణం

**భద్రకుడు 1 :** అంగ వంశంలో జన్మించిన ఒక రాజు. - అగ్నిపురాణం

**భద్రకుడు 2 :** ఓ వెలివేయబడ్డ బ్రాహ్మణుడు. ఇతడు చేయని పాపం లేదు. అయితే అనూహ్యంగా ప్రయాగలో మాఘమాసంలో 3 రోజులు స్నానం చేసి పునీతుడయ్యాడు. 17 అశ్వమేధ యాగాలు చేసి అవంతి రాజ్యాన్ని పాలించిన వీరసేనుడు, భద్రకుడు ఒకే రోజున మరణిస్తారు. మాఘస్నానం చేయడం వలన భద్రకుడు అవినీతిపరుడైనా వీరసేనుడితోపాటు స్వర్గానికి వెళ్తాడు. - పద్మపురాణం

**భద్రచారువు :** ప్రద్యుమ్నుని కుమారుల్లో ఒకడు. - భాగవతం

**భద్రతనుడు :** ఓ నీతిలేని బ్రాహ్మణుడు. దంతుని సలహాపై విష్ణుభక్తుడై మోక్షం పొందాడు. - పద్మపురాణం.

**భద్రతుంగం :** ఓ పుణ్యస్థలం. ఇచట స్నానంచేస్తే బ్రహ్మలోక ప్రాప్తి లభిస్తుంది. - మహాభారతం

**భద్రదేహుడు :** వసుదేవుడు దేవకిల సంతానంలో ఒకడు. ఇతడొకరాజు. - విష్ణుపురాణం

**భద్రబాహువు :** పూరు వంశంలో జన్మించిన ఒక రాజు. - భాగవతం

**భద్రమత/భద్రమన :** కశ్యప క్రోదవశుల కూతురు. - రామాయణం

క్రోదవశకు 100 మంది కూమార్తెలు.

**భద్రమతి :** ఓ పేద బ్రాహ్మణుడు. ఇతనికి ఇద్దరు భార్యలు. 244 మంది కుమార్తెలు. - నారదపురాణం ఒకసారి భూదానం యొక్క గొప్పదనాన్ని గురించి విని భూదానం చెయ్యాలని సంకల్పిస్తాడు. కాని ఇతడికి స్వంత భూమే లేదు. అప్పుడు కౌశాంబి రాజు వద్దకు వెళ్లి భూమిని దానం కోరతాడు. అతడు దానం చెయ్యగనే దాన్ని పేద బ్రాహ్మణులకు బహుమతిగా ఇస్తాడు. ఆ తర్వాత వెంకటాచలం వద్దగల పాప నాశన తీర్థంలో స్నానం చేస్తాడు. సుగుణ కార్యం చేసినందుకు ముక్తి లభిస్తుంది. - స్కందపురాణం

**భద్రరథుడు :** అంగదేశపు రాజు. చంపుడి మనుమడు. బృహత్కర్ణుడి తండ్రి.

**భద్రవటం :** పార్వతీపరమేశ్వరుల నివాస స్థలం. దీని గొప్పదనం మహాభారతంలో వర్ణించబడింది. - మహాభారతం

**భద్రశాకుడు :** సుబ్రహ్మణ్యస్వామి మరోపేరు. సుబ్రహ్మణ్యస్వామి గొర్రె ఆకారంలో వున్నపుడు అతని పేరు. - మహాభారతం

**భద్రశారుడు :** కాశ్మీర దేశపు రాజు. అతని ఒక్కగానొక్క కుమారుడు సుధర్మనుడు శివభక్తుడై ఎక్కువ కాలం అతని పూజలోనే గడిపేవాడు. భద్రశారుడు కుమారుడిని ఈ అతిశ్రద్ధ నుండి తప్పించడానికి ప్రయత్నించి విఫలుడవుతాడు. పరాశర మహర్షి ఒక రోజు రాజువద్దకు రాగా ఈ విషయాన్ని చెప్పగా సుధర్ముడి పూర్వజన్మను గురించి వివరించి రాజునే 'రుద్రాభిషేకం' చేయమని కోరతాడు. అప్పుడు రాజ్యాన్ని కుమారుడికి అప్పగించి అడవులకెళ్లి సాధు జీవనం గడుపుతాడు. - స్కందపురాణం

**భద్రశాలం :** మహామేరువుకు తూర్పున గల భద్రాశ్వ వర్షం అనే పర్వతంపై గల అరణ్యం. అరణ్యంలో కాలాామ్రమనే వృక్షం వుంది. అది అన్ని వృక్షాలకంటే మైళ్ల ఎత్తులో వుంటుంది. వృద్ధచారణులు దీన్ని

పూజించేవారు. దీన్ని పూజించే పురుషులు తెల్లగా అందంగా వుంటారు. దీని ఆకుల రసం తాగే స్త్రీలు ఎల్లకాలం యవ్వనంగా వుండి నృత్య సంగీతాలలో ప్రావీణ్యం లభించి 1000 సంవత్సరాలు జీవించ డమే కాక ఎల్లప్పుడు యవ్వనంతో వుంటారు.

– మహాభారతం

**భద్రశీలుడు :** గాలవుడి కుమారుడు. ఇతడు పూర్వ జన్మలో ధర్మశీలుడనే రాజు. – నారదీయపురాణం

**భద్రశ్రవసుడు :** పురాణాలు ద్వాపరయుగంలో సౌ రాష్ట్రను పాలించిన రాజుగా పేర్కొంటున్నాయి. లక్ష్మీదేవి మానవుల గృహాలను ఎలా పావనం చేస్తుం దో తెలియజేయడానికి సూతమహర్షి నైమిశారణ్యం వద్ద ఇతని కథ చెప్పాడు.

భద్రశ్రవసుడు తన భార్య సురతి చంద్రికతో కలసి సౌరాష్ట్రాన్ని పాలించేవాడు. అతనికి 7 గురు కుమా రులు, శ్యామబాల అనే కుమార్తె జన్మించారు. స్వచ్ఛ మైన గుణరాశి అయిన శ్యామబాల ఆకుపచ్చని చెట్టు క్రింద వజ్రాలు బంగారం ఇసుక రేణువులతో ఆడు కుంటూ వుండేది. సంపదలకు దేవత ఓ రోజు ఓ వృద్ధురాలిగా రాజభవనానికి వచ్చి రాణిని చూడ గోరగా కాపలాదారులు అనుమతించడానికి వివరణ కోరగా ఆమె ఈ క్రింది కథ చెప్పింది.

"నా పేరు కమల, నా భర్త పేరు భువనాశ్వుడు. మేము ద్వారకలో జీవించేవాళ్లం. మీ రాణి పూర్వ జన్మలో ఓ వైశ్య స్త్రీ. ఆమె భర్త ఆమెను అకారణంగా కొట్టి ఇంటి నుండి పంపివేయగా ఆమె కథవిని 'పుణ్యవ్రతం' చేయమని చెప్పగా సంతోషంతో ఆ వ్రతం చేసి గొప్ప సంపద సుఖసంతోషాలు పొందింది. ఒక రోజు భార్యాభర్తలు చనిపోగా యమభటులు వారిని తాళ్లతో బంధించి తీసుకుపోగా విష్ణు సేవకులు ఆ తాళ్ళు తెంపివేసి వీరిని లక్ష్మీ నివాసానికి తీసుకు వెళ్లారు. పుణ్యవ్రతం చేసిన సద్గుణం ఇంకా మిగిలి వుండటం వల్ల వీరు ఈ రాజ్యానికి రాజు, రాణులుగా జన్మించారుగాని పుణ్యవ్రతాన్ని మరచారు. నేను దాన్ని వారికి గుర్తుచేయడానికి వచ్చానని వివరించింది.

ద్వారపాలకులు వెళ్లి రాణికి ఈ విషయాన్ని విన్న వించగా ఆమె కోపంతో ఆ వృద్ధ మహిళను బలవం తంగా బయటకు త్రోయించివేయగా ఆమె కన్నీళ్ళతో ఆ ప్రదేశాన్ని దాటుతుండగా వారి కూతురు శ్యామ బాల ఆ స్త్రీనుండి పుణ్యవ్రతాన్ని గురించి విని ఆమె ఆచరించగా అతి త్వరలో ఆమెకు వివాహమై తన భర్త ఇంటికి వెళ్లి సంపదలతో తులదూగింది. కుమార్తె భర్త ఇంటికి వెళ్లిన తర్వాత భద్రశ్రవసుడు అతని భార్య ఆస్తులు నిదానంగా తరిగిపోయి బాధలు అనుభ విస్తూ రాజు కుమార్తె ఇంటికి వెళ్లగా ఓ బంగారు అచ్చు కాగితంలో చుట్టి ఇచ్చింది. ఇంటికి వచ్చి చూడగా అది బొగ్గుగా మారివుంది. అతని దుఃఖానికి అంతులేదు. రాణికూడా కుమార్తె ఇంటికి వెళ్లగా పుణ్యవ్రతం రోజు రాగా ఆమె తల్లిని కూడా ఆ వ్రతం ఆచరించమని చెప్పింది. వ్రతమాచరిస్తూనే ఆకలికి తాళలేక పిల్లల కుంచిన ఆహారం తిని వ్రతభంగమొనర్చింది. ఆ మరుసటి నెలలో కూతురి కోర్కెపై నిష్టగా ఆ వ్రతం చేయగా తిరిగి వారు సంపన్నులయ్యారు.

– పద్మపురాణం

**భద్రశ్రేణ్యుడు :** హేహయ రాజు. మహిష్మతి రాజధానిగా పాలించాడు. కాశీరాజు దివోదాసుతో చాలా యుద్ధాలు చేశాడు. – చూ॥ దివోదాసు

**భద్రసేనుడు :** ఒక రాజు. ఉద్దాలక మహర్షి ఇతడ్ని నాశనం చెయ్యడానికి రాక్షస యాగం చేశాడు.

– సత్పథబ్రాహ్మణం

**భద్రాయువు :** శివభక్తుడైన ఒక రాజు. ఇతడు కుష్టు వ్యాధి పీడితుడు. ఇతని భార్య కీర్తిమాలిని అణకువ గల స్త్రీ. ఇతని 16వ జన్మదినం రోజు శివుడు ప్రత్యక్షమై రాజధర్మాలను వివరించి ఇతనికో ఖడ్గాన్ని, శంఖాన్ని, 12 వేల ఏనుగుల్ని కానుకగా ఇచ్చాడు. వీటివల్ల అపజయమే ఎరుగని రాజుగా వెలుగొందాడు.

– శివపురాణం

భద్రాయువు పాలన కాలంలో ఒక రోజు శివుడు పులిరూపంలో వచ్చి ఓ బ్రాహ్మణుని భార్యను ఎత్తుకు పోగా తన భార్యను బ్రహ్మణునికిచ్చి అగ్ని ప్రవేశం చేయదలచాడు. శివుడు ఇతని రాజధర్మానికి మెచ్చి ప్రత్యక్షమై బ్రాహ్మణుని భార్యను తిరిగి ఇచ్చి రాజుని దీవించాడు. భద్రాయువు పూర్వజన్మలో మందరుడను రాజు, కీర్తిమాలిని అతని భార్య పింగళ.

– స్కందపురాణం

**భద్రావతి :** యవనాశ్వుడనే రాజు పాలించిన దేశం.
– *జైమిని భారతం*

**భద్రావతం :** పార్వతీ పరమేశ్వరుల నివాస స్థలం.
– *మహాభారతం*

**భద్రాశ్వం :** మేరు పర్వతం వద్ద గల ఒక ద్వీపం. ధర్మరాజు దీన్ని పాలించాడు. – *మహాభారతం*

**భద్రాశ్వుడు 1 :** మనువు యొక్క మనుమడు, ప్రియ వ్రతుడి కుమారుడు అయిన అగ్నిధ్రుడికి పూర్వ చిత్తి వల్ల 9 మంది పుత్రులు జన్మించారు. వారిలో ఒకడు భద్రాశ్వుడు. ఇతడు పాలించిన ప్రాంతాన్ని భద్రాశ్వం అనేవారు. ఇది గంధమాదన పర్వతానికి తూర్పున ఉంది. – *భాగవతం*

**భద్రాశ్వుడు 2 :** పూరు వంశంలోని ఒక రాజు. రహోవాది కుమారుడు. ఇతని భార్య కాంతిమతి. వీరికి పదిమంది కుమారులు. అగస్త్యుడు ఇతని భవనంలో 7 రోజులు గడిపాడు. ఆరోజుల్లో ఇతడు కాంతిమతిని పొగిడేవాడు. రాజు అందుకు కారణం కోరగా "కాంతి మతి పూర్వజన్మలో ఓ ధనికుని ఇంటి పనిమనిషి. ఆమె తన యాజమాని చెప్పిన విధంగా తులా మాసంలో ద్వాదశి రాత్రి ప్రతి గుడిలోనూ దీపాలు ఆరిపోకుండా జాగ్రత్త వహించింది. అలా బాధ్యతగా వున్న ఫలితంగా కాంతిమతి అనే రాణిగా పునర్జన్మించిందని వివరిస్తాడు. అప్పటినుండి భద్రాశ్వుడు, కాంతిమతి ఆ వ్రతాన్ని ఆచరించి, విష్ణువు సాన్నిధ్యం పొందుతారు. – *వాయు పురాణం.*

**భద్రుడు 1 :** చేదిదేశపు రాజు. పాండవుల తరపున కురుక్షేత్ర యుద్ధంలో పాల్గొని కర్ణుని చేతిలో మరణిస్తాడు. – *మహాభారతం*

**భద్రుడు 2 :** పాతాళం నుండి భూమిని మోసే నాల్గు ఏనుగుల్లో ఒకటి. – *చూ॥ అష్టదిగ్గజాలు*

**భద్రుడు 3 :** స్వాయంభవ మనువుకు శతరూప వల్ల శ్రద్ధ అనే కుమార్తె జన్మిస్తుంది. శ్రద్ధ కుమారుల్లో భద్రుడొకరు. – *భాగవతం*

**భద్రుడు 4 :** ఓ యక్షుడు. కుబేరుని మంత్రుల్లో ఒకడు. గౌతమి మహర్షి శాపం వల్ల సింహంగా జన్మిస్తాడు.

**భద్రుడు 5 :** ఓ మహర్షి. ప్రమతి కుమారుడు. ఉపమన్యుడి తండ్రి.

**భద్రుడు 6 :** శ్రీకృష్ణునికి కాళింది వల్ల జన్మించిన కుమారుడు. – *భాగవతం*

**భద్రులు :** భద్రగణదేశపు ప్రజలను భద్రులని పిలుస్తారు. ఈ రాజ్య క్షత్రియ వంశజులు ధర్మరాజు రాజసూయ యాగానికి వచ్చి కానుకలు సమర్పించారు.
– *మహాభారతం*

**భనందనుడు :** కన్యాకుబ్జపు రాజు. ఇతడు తన కూతురు కళావతిని వృషభానుడికిచ్చి వివాహం చేశాడు.
– *బ్రహ్మ వైవర్తపురాణం*

**భనందుడు :** నాభాగుడి కొడుకు. తల్లి సుప్రభ ఓ వైశ్యకాంత. అందువల్ల నాభాగుడు వైశ్యవృత్తినే పాటిస్తాడు. ఇతడొక రాజ్యాన్ని జయించి తన తండ్రిని పాలించమనగా అతడు తిరస్కరిస్తాడు.
– *మార్కండేయ పురాణం*

**భయ :** ఓ రాక్షసి. కాలకు సోదరి. హేతిని వివాహమాడింది. వీరి కుమారుడు విద్యుత్కేశుడు. ఇతడు శాల కంఠకను వివాహమాడాడు. ఆమె సంధ్య కుమార్తె.
– *ఉత్తరరామాయణం*

**భయుడు :** యవన రాజు. నారదుడు కాలపుత్రిని ఇతడి దగ్గరకు వరుడి కోసం పంపగా కాలపుత్రి ఇతణ్ణి వివాహమాడమని కోరుతుంది. కాని ఇతడు ఆమెను తీసుకొని పురంజనుడి నగరానికి వచ్చి ఈమెన తడికిస్తాడు. – *భాగవతం*

**భయం :** అధర్ముని భార్య హింస. వారికి అనృతుడను కుమారుడు, నిరుతి అనే కుమార్తె జన్మిస్తారు. వారి నుండి భయం, నరకం, మాయ మరియు వేదనలు జన్మించారు. – *అగ్నిపురాణం*
అధర్మ నిర్రుతికి భయ, మహాభయ, మృత్యు అనే రాక్షసులు జన్మించారు. వీరు పాప జీవితం గడిపారు.
– *మహాభారతం*

**భయంకరి :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరి.
– *మహాభారతం*

**భయంకరుడు 1 :** సౌవీర దేశ యువరాజు. జయద్రథుని పై ఆధారపడ్డాడు. ద్రౌపదిని అరణ్యవాస సమయములో జయద్రథుడు ఎత్తుకుపోయినపుడు సహాయ పడ్డాడు. అర్జునుడితణ్ణి సంహరించాడు.
– *మహాభారతం*

**భయంకరుడు 2 :** ఓ సనాతన విశ్వదేవుడు.
– మహాభారతం

**భరణి :** 27 నక్షత్రాలలో ఇదొకటి. భరణీ నక్షత్రం రోజున బ్రాహ్మణుడికి గోవును దానమిస్తే పుణ్యం లభిస్తుంది. – మహాభారతం

**భరతి :** భరతుడను అగ్నియొక్క పుత్రిక.
– మహాభారతం

**భరతుడు 1 :** శకుంతలకు దుష్యంతునివల్ల జన్మించిన పుత్రుడు. వేటకని వెళ్ళిన దుష్యంతుడు కణ్వాశ్రమంలో శకుంతలను చూసి ప్రేమించి గాంధర్వ వివాహం చేసుకుంటాడు. తర్వాత ఆమెకు ఓ బిడ్డ జన్మిస్తాడు. ఆ బిడ్డ దుష్యంతునివద్దకు వెళ్ళగా అతడు గుర్తించడు. ఆమె కొన్నాళ్ళు బిడ్డతో కణ్వాశ్రమంలో వుంటుంది. ఈ బాలుడు వీరవిహారం చేసి జంతువుల్ని వేటాడటం వల్ల కణ్వుడితడికి సర్వద మనుడను పేరు పెడతాడు. ఆ తర్వాత దుష్యంతుడు శకుంతలను గుర్తించి ఆమెను తన భార్యగా గ్రహించి ఈ బిడ్డను తన బిడ్డగా భావిస్తాడు. అందువల్ల భరతుడయ్యాడు. దుష్యంతుని తర్వాత ఇతడు రాజై సకల దేశాలను జయించి ప్రసిద్ధుడయ్యాడు. భరతు డికి ముగ్గురు భార్యలు. వారివల్ల జన్మించిన బిడ్డలంతా క్రూరులగుటవల్ల తల్లులు వారిని చంపివేస్తారు. పుత్రులు లేని విచారంతో వుండగా బృహస్పతి వల్ల అతని సోదరుని భార్యకు జన్మించిన శిశువు భరద్వాజుడిని దేవతలు ఇతనికి ఇస్తారు. ఇతనికి భరతుడు వితథుడు★ (దీర్ఘత మసుడు) అని పేరు పెట్టి తన కుమారుడిగా పెంచుతాడు. భరతుడు 27 వేల సంవత్సరాలు పాలించి వితథుడికి రాజ్య పాలన వదలి వనవాసానికి వెళ్ళాడు
– మహాభారతం.

**భరతుడు 2 :** దశరథునికి, కైకేయికి జన్మించిన కుమారుడు. శ్రీరాముని తమ్ముడు. దశరథుని కుమారులైన రామ, లక్ష్మణ, భరత, శతృఘ్నులు మిథిలా నగర రాజైన జనకుని పుత్రికలను వివాహమాడారు. భరతుడు మాండవిని వివాహమాడాడు. భరతుని తల్లి కైకేయి కోరికపై రాముడు అరణ్యవాసం చేయగా భరతుడు శ్రీరాముని తిరిగి రప్పించడానికి ప్రయత్నించి విఫలుడై అయోధ్యలో శ్రీరాముని పాదరక్షలను సింహాసనంపై వుంచి తాను ప్రక్కనేగల ఓ గ్రామంలో వుండి శ్రీరాముడు తిరిగి పట్టాభిషిక్తుడగు వరకు రాజ్యపాలన చేశాడు.

భరతునికి మాండవి వల్ల ఇద్దరు కుమారులు. వారు సుబ్రాహుడు, సూరసేనుడు. శ్రీరాముడు రాజ్యపాలన చేస్తుండగా కైకేయి రాజ్యంలో గంధర్వులు వినాశం సృష్టిస్తున్నారని తెలిసి శ్రీరాముడు భరతుడిని అక్కడకు పంపగా భరతుడు వారిని అణచివేసి సింధునదికి రెండువైపుల వున్న ప్రాంతాలను రెండు రాజ్యాలుగా చేసి తన కుమారులను రాజులుగా చేసి అయోధ్యకు తిరిగివచ్చి శ్రీరామునితోపాటు సరయూ నదిలో మునిగి దేహం విడుస్తాడు. – రామాయణం

**భరతుడు 3 :** రుషభుని కుమారుడు. నాభి మనుమడు. ప్రియవ్రత చక్రవర్తి తన దేశాన్ని 8 భాగాలుగా విభజించి తన 8 మంది కుమారులకు పంచాడు. అందులో ఒక కుమారుడు అగ్నిధ్రుడు. ఇతనికి జంబూద్వీపం వచ్చింది. అగ్నిధ్రునికి 9 మంది కుమారులు. జంబూద్వీపాన్ని 9 విభాగాలు చేసి తన కుమారులకు పంచాడు. ఆ కుమారుల్లో నాభి ఒకడు. నాభికి హిమదేశం రాగా అది అతని మనుమడు రుషభుని కుమారుడైన భరతునికి సంక్రమించింది.
– విష్ణుపురాణం

ఇతడు విశ్వరూపుని కూతురైన పంచజనిని వివాహమాడాడు. వీరికి 5గురు కుమారులు. ఇతడు పాలించడంవల్లనే ఈ దేశానికి భరతవర్షం అనే పేరు వచ్చింది. – భాగవతం

ఇతడు తన తాతవలే గొప్ప పాలనాదక్షుడు, దైవ భక్తుడు. ఇతడు కోటి సంవత్సరాలు పాలించి దేశాన్ని తన కుమారులకు వదలి పులహమహర్షి ఆశ్రమంలో శేష జీవితాన్ని గడపడానికి వెళ్ళాడు – భాగవతం. ఇతడు తర్వాతి జన్మలో లేడిగా తర్వాత బ్రాహ్మణుడిగా జన్మించి ఆ తర్వాత ముక్తి పొందుతాడు.
– భాగవతం

★ వితథుడిని కూడా భరతుడనేవారు. ఇతనికి 5గురు కుమారులు. - భాగవతం

**భరతుడు 4 :** ఓ రుషి. 'నాట్యశాస్త్ర' గ్రంథకర్త. క్రీ.పూ. 400 సం. జీవించాడు. కాళిదాసు ఇతడు దేవతలకు నాట్యం నేర్పాడని పేర్కొన్నాడు. ఇతని గ్రంథం 37 అధ్యాయాలతో నృత్య సంగీతాలను గురించి వివరించింది. ఈ గ్రంథం మీద ఎన్నో వ్యాఖ్యాన గ్రంథాలు ప్రచురించబడ్డాయి.

**భరతుడు 5 :** సమ్యుడనువాడు. "భరతుడను" అగ్ని కుమారుడు. ఇతడిని ఊర్జుడనికూడా అంటారు. 'భారత' అనే కుమారుడు గల అగ్ని పేరు కూడా భరతుడే. ఇతడిని పుష్టిమానుడని అంటారు. 'అద్భుత' అను అగ్ని కుమారుడి పేరుకూడా భరతుడే. ఈ అగ్నిని నియతుడని కూడా అంటారు. – మహాభారతం

**భరద్వాజుడు 1 :** దీర్ఘతమసుడి మరోపేరు. ఇతడు పురాణాలలో ప్రసిద్ధుడైన భరద్వాజుడు కాదు. పురాణ ప్రసిద్ధుడైన భరద్వాజుడు ద్రోణుని తండ్రి. అత్రి మహర్షి కుమారుడు. చూ॥ దీర్ఘతమసుడు.

**భరద్వాజుడు 2 :** శామ్యు అను అగ్నియొక్క పెద్ద కుమారుడు. – మహాభారతం

**భరద్వాజుడు 3 :** ఓ ప్రసిద్ధ రుషి. పూరు వంశపు రాజైన భరతునికి పుత్ర సంతానం లేక విచారిస్తుండగా మరుత్తుడు ఈ భరద్వాజుడిని భరతుడి కిచ్చాడు. ఇతడు పుట్టుకతో బ్రాహ్మణుడయినా భరతుడికివ్వడంతో క్షత్రియుడయ్యాడు. – మత్స్యపురాణం

**భరద్వాజుడు 4 :** అంగిరసుని వంశంలో జన్మించిన రుషి. ఇతడు విశ్వామిత్రుని కుమారుడైన రైభ్యుని స్నేహితుడు. ఇతని కుమారుడు యవక్రీతుడు. రైభ్యుడొక పారిక్రిత్యను సృష్టించగా అది యవ క్రీతుడిని సంహరించింది. ఆ దుఃఖాన్ని భరించలేక ఇతడు జీవితాన్ని చాలించబోగా ఆర్యావసుడు యవ క్రీతుడ్ని బ్రతికించాడు. కుమారుడిని చూసి ఆనందించి తన జీవితాన్ని ముగించి స్వర్గం చేరాడు. – మహాభారతం

**భరద్వాజుడు 5 :** పూర్వమన్వంతరంలో జీవించిన ఓ రుషి. ఇతడు గంగాతీరంలో జీవిస్తూ దీర్ఘ తపస్సు చేశాడు. ఇతడో ప్రత్యేక యజ్ఞం తలపెట్టి గంగలో స్నానంచేయడానికి ఇతర రుషులతో వెళ్ళి అక్కడ స్నానం చేస్తున్న అప్సరస ఘృతాచిని చూసి వీర్య స్ఖలనం చేసుకున్నాడు. ఆ వీర్యం నుండి శృతవతి జన్మించింది. – మహాభారతం

**భరద్వాజుడు 6 :** అన్ని శాస్త్రాలు తెలిసిన పండితుడు. ఇతడు "ధర్మసూత్రాలు" "సాతసూత్ర" అనే గ్రంథాన్ని రచించాడు. (ముంబై విశ్వవిద్యాలయంలో ఇతడు రచించిన 'సాతసూత్రం' పాండులిపిలో చేతివ్రాతతో కలదు.)

**భరద్వాజుడు 7 :** పురాణ ప్రసిద్ధుడైన మహర్షి. ఇతడు అత్రి మహర్షి కుమారుడు. ఇతడు కొన్నివేల సంవత్సరాలు జీవించాడు. రామాయణ గ్రంథకర్త వాల్మీకి శిష్యుడు. ఇతడు అవిశ్రాంతంగా వేదాధ్యయనం చేశాడు. ఇతడు తన జీవితకాలాన్ని వేల సంవత్సరాలు పొడిగించుకోవడానికి ఇంద్రుడు నుండి వరం కోరి ఈ సమయాన్ని వేదాధ్యయనానికి ఉపయోగించాడు. ఇతని ఆశ్రమం చిత్రకూటం మీద వుండేది. రాముని వనవాస ప్రారంభంలో సీతారామలక్ష్మణులు ఇతని ఆశ్రమంలో నివసించారు. అయోధ్య నుండి భరతుడు శ్రీరాముడ్ని తిరిగి తీసుకురావడానికి భరద్వజుని ఆశ్రమానికి వెళ్ళగా భరద్వజుడు వారి గౌరవార్థం తన మంత్రశక్తితో గొప్ప విందు ఏర్పాటు చేశాడు. ఇందులో అప్సరసలు పాల్గొని కనువిందు చేశారు. తెల్లవారేసరికి అంతా మాయమయ్యింది. అందువల్ల భరద్వజుడి విందుకు ప్రసిద్ధత వచ్చింది. ఇతనికి ఘృతాచి వల్ల ద్రోణుడు జన్మించాడు.

– చూ॥ ద్రోణుడు

"నేను నా పుత్రులు కానివారిని కూడా రక్షిస్తాను. నా శిష్యుల్ని, దేవతల్ని, బ్రాహ్మణుల్ని రక్షిస్తాను. నా భార్యను రక్షిస్తాను. అంతేకాదు వీటన్నింటిని అతి సులభంగా చేయగలను. అందుకే నన్ను భరద్వాజుడన్నారు. – *భాగవతం.*

రుగ్వేదంలోని 6వ మండలంలో భరద్వజుడు పాడిన పాటలు వుంటాయి. ఇతని కుమార్తె దేవవర్షిని. ఈమెను విశ్రావసుడు వివాహమాడగా కుబేరుడు జన్మించాడు. ఆగ్నేయాస్త్రాన్ని అగ్నికౌశుడికి నేర్పాడు. ఇతడు కురుక్షేత్ర యుద్ధానికి వచ్చి ద్రోణుడిని యుద్ధం ఆపమని కోరాడు. – మహాభారతం.

**భరద్వాజం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాసయోగ్య స్థలం. – మహాభారతం

**భరుకక్షం :** ప్రాచీన భారతదేశంలోని ఓ గ్రామం. శూద్రులు మాత్రమే ఇక్కడ నివసించేవారు. ధర్మరాజు రాజసూయ యాగానికి ఈ గ్రామప్రజలు కానుకలు సమర్పించారు.

– మహాభారతం

**భరుకుడు :** సూర్యవంశపు రాజు. సుదేవుని కుమారుడు. భరకుడు బాహుకునికి తండ్రి. – భాగవతం

**భరుడు :** అర్చిషేణుడి కుమారుడు.

**భర్గం :** ప్రాచీన భారతదేశంలో నివాసయోగ్యమైన ఓ గ్రామం. – మహాభారతం

**భర్గుడు 1 :** కాశీరాజు దివోదాసు కుమారుడైన ప్రతర్ధనుడి కొడుకు. ఇతని సోదరుడు వత్సుడు. – అగ్నిపురాణం

**భర్గుడు 2 :** శివుడి మరోపేరు.

**భర్తృస్థానం :** ప్రాచీన భారతదేశంలో ఓ గొప్ప పుణ్యస్థలం. ఈ స్థలాన్ని చూసిన మాత్రానే అశ్వమేధ యాగం చేసిన ఫలితం వస్తుంది. దీని ప్రాముఖ్యతకు కారణం సుబ్రహ్మణ్యస్వామి ఇక్కడ జీవించాడు. – మహాభారతం

**భర్తృహరి :** ఓ సుప్రసిద్ధ సంస్కృత కవి.

*జననం :* పాటలీపుత్రంలో విద్యాసాగరుడను బ్రాహ్మణుడు కలడు. అతడు గొప్ప పండితుడు. మరింత శాస్త్ర విజ్ఞానం కోసం దేశాటనం చేసి తనకు గురువే దొరకక ఓ నదిలో నీరు తాగి ఓ అరటిచెట్టు క్రింద నిద్రపోయాడు. ఆ మరునాడు మధ్యాహ్న సమయంలో ఓ బ్రహ్మరాక్షసుడు ఇతడినో బ్రాహ్మణుడిగా గుర్తించి, "ఓ విద్యాసాగరా నీవు పండితుడవే. నాకెన్నో శాస్త్రాలు తెలుసు. నీవు నాతో 6 నెలలు గడుపు. నీకు ఆకలిదప్పులు లేకుండా చేస్తాను. నాకు తెలిసిన శాస్త్రాలు నీకు బోధిస్తాను" అని చెప్పగా విద్యాసాగరుడంగీకరించి అతనివద్ద పలు శాస్త్రాలు అభ్యసించాడు. ఆ తర్వాత బ్రహ్మరాక్షసుడు మాయమవ్వగా తిరిగి వస్తున్న విద్యాసాగరుడికి ఆకలిదప్పులు ప్రారంభమై వాటికి తాళలేక ఓ శూద్ర వనిత ఇంటి గడపలో పడిపోయి అలాగే నిద్రించాడు. ఆమె పేరు మందాకిని. ఇతడికి ఆమె సకల సపరిచర్యలు చేసి తనను వివాహం చేసుకొమ్మని కోరగా విద్యాసాగరుడు నిరాకరించాడు. ఈమె అతణ్ణి రాజుదగ్గరకు తీసుకు వెళ్ళగా రాజు ఇతని గొప్పతనం గ్రహించి అప్పటి ఆచారం ప్రకారం తన కూతురు కళావతిని తర్వాత తన మంత్రి బ్రాహ్మణుడైన వాని కుమార్తె మాతలి, తర్వాత వైశ్యకన్య సుమంగళితో వివాహం జరిపి ఆ తర్వాత శూద్రవనిత మందాకినితో వివాహం జరిపించాడు. విద్యాసాగరునివల్ల కళావతికి విక్రమార్కుడు, బ్రాహ్మణ వనిత వల్ల వరరుచి, వైశ్య వనితవల్ల భట్టి, శూద్రవనిత మందాకిని వల్ల భర్తృహరి జన్మించారు. రాజు ముసలివాడైన తర్వాత విద్యాసాగరుడికి రాజ్యం వదలగా విద్యాసాగరుని పుత్రులందరూ భర్తృహరిని రాజుగా ఎన్నుకుంటారు. కొన్నాళ్ళు ఇతడు రాజ్య పాలన చేసిన తర్వాత భార్యవల్ల మోసపోయి "స్త్రీలందరూ మోసపూరితులు" అనే అవగాహనకు వచ్చి దేశం విడిచి విరాగియై దక్షిణాపథం వచ్చి ఓ గుడివద్ద కూర్చొని భిక్షాటనతో గడిపాడు. మరో భిక్షకుడు ఇతడిని దానం చేయమనగా అతని భిక్షా పాత్రను కూడా దానమిచ్చాడు. ఇతడు ప్రపంచ ప్రసిద్ధ గ్రంథాలు రచించాడు. అవి 1) నీతిశతకం, 2) శృంగార శతకం, 3) వైరాగ్యశతకం, 4) సుభాషితాలు.

**భర్మ్యశ్వుడు :** పురుజుడి కుమారుడైన అర్కుడి కొడుకు.

**భర్మ్యాశ్వుడు :** పాంచాల దేశపు ప్రముఖ రాజు. ఇతనికి 5 గురు వీరులైన కుమారులు. అందులో ముద్గలుడొకడు. – భాగవతం

ఇతడిని హర్యశ్వుడని కూడా అంటారు.

**భలందనుడు :** నాభాగుని కుమారుడు. ఒక రాజు. ఇతడు బ్రాహ్మణుడిగా జన్మించినా వైశ్యుడిగా మారి వర్తక వ్యాపారాలు చేశాడు. – మార్కండేయ పురాణం

**భల్లాటుడు :** భరతుని వంశవృక్షంలోని ఒకరాజు. ఇతడు విష్వక్సేనుడి కుమారుడు. బృహదాశ్వుడి తండ్రి. – భాగవతం

**భల్లాటం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాసయోగ్య ప్రాంతం. భీమసేనుడు తన జైత్రయాత్రలో ఈ ప్రాంతాన్ని జయించాడు. – మహాభారతం

**భల్లాణుడు :** సింధుకటక దేశములకు రాజు. ఇష్టదాన వ్రతం చేసి ఎవరేది అడిగినను ఇచ్చెదనని ప్రకటించెను. ఇతడిని శివుడు పరీక్షించనెంచి అతిథిగా వచ్చి వేశ్యను కోరెను. ఇతడు నగరమంతా వెతికించినా ఒక్క వేశ్యయును దొరకక వ్రతభంగము కాకుండుటకై తన భార్యనే పంపెను. ఇతని వ్రత నిష్ఠకు మెచ్చుకొని నిజస్వరూపుడై ఇతనికి వరము లిచ్చెను.

**భల్లాదుడు :** ఉదక్సేనుని కొడుకు. ఇతడు కురుక్షేత్ర యుద్ధమున కర్ణునిచే చంపబడెను. – మహాభారతం

**భవభూతి :** ఓ సంస్కృత కవి. క్రీ.శ. 7వ శతాబ్దంలో జీవించాడు. ఇతడు కశ్యప గోత్రీకుడు. నీలకంఠుని కుమారుడు. ఇతడు శివభక్తుడగుటవలన భవభూతి అనే పేరు వచ్చింది. అసలుపేరు నీలకంఠుడు. విదర్భ రాజ్యంలోని పద్మపురంలో జన్మించాడు గాని కనూజ్ రాజైన యశోధర్ముని కొలువులో జీవించాడు. ఇతడి ప్రసిద్ధ గ్రంథాలు 3 నాటకాలు : 1) మాలతీ మాధవం, 2) మహావీరచరిత్ర, 3) ఉత్తరరామ చరిత్ర.

**భవతి :** బంధువు, ఇతరుల భార్యలు కాని స్త్రీలను ఈ పదంతో సంబోధించాలి లేక సుభాగి, భగిని అని కూడా సంబోధించాలి. –మనుస్మృతి.

**భవదుడు :** స్కందదేవుని అనుచరుడు. –మహాభారతం

**భవన్మన్యుడు :** పూరువంశంలో ఒకరాజు. ఇతనికి ఐదుగురు కుమారులు. – విష్ణుపురాణం

**భవాని :** పార్వతి యొక్క మరోపేరు.

**భవిష్యపురాణం :** ఈ పురాణంలో సూర్యుడు మనువు కిచ్చిన బోధనలున్నాయి. దీనిలో 14వేల గ్రంథాలున్నాయి. ఇది అన్ని విషయాలపై చర్చించిన పురాణం. సృష్టి, కాలం, గర్భాదానం, గోదానం, ఆశ్రమ ధర్మాలు, లింగశాస్త్రం, విషచికిత్స, ఆయుర్వేద చికిత్స ఇందు చర్చించబడ్డాయి.

**భవిష్యరామాయణం :** ఉత్తర రామాయణం తర్వాతి భాగం. కుశలవులు రాముని ఎదుట చెప్పిన రామాయణకథ భవిష్యరామాయణమని ఉత్తర రామాయణం చెప్తోంది.

**భవుడు 1 :** బ్రహ్మ మనుమడు. స్థాణువు కుమారుడు. 11 మంది రుద్రుల్లో ఒకడు. – మహాభారతం.

**భవుడు 2 :** సనాతన విశ్వదేవుడు. – మహాభారతం.

**భవుడు 3 :** సురభివల్ల కశ్యపునికి జన్మించిన కుమారుల్లో ఒకడు.

**భవ్యుడు 1 :** ధ్రువుని కుమారుడు. ఇతని భార్య శాంభువల్ల ఇద్దరు కుమారులు కలరు. వారు శిష్ఠి, భవ్యుడు.

**భవ్యుడు 2 :** ధక్షసావర్ణిమన్వంతరంలోని సప్తరుషుల్లో ఒకడు.

**భవ్యుడు 3 :** స్వాయంభవ మనువు కుమారుల్లో ఒకడు. ఇతడొక ద్వీపమును పాలించెను. ఇతనికి ఏడుగురు పుత్రులు. – మార్కండేయ పురాణం

**భవ్యులు :** రైవత మన్వంతరంలో దేవతల్లో ఒక తెగ. పరిమితి, మతి, కున, విచేతస, విజయ, సుజయలు ఇందులో ముఖ్యులు. – బ్రహ్మాండపురాణము

**భస్మం :** పుణ్యధూళి. – చూ॥ దుర్జయుడు

**భస్మాసురుడు :** శివుని శరీరానికి వుండే బూడిదనుండి జన్మించాడు. ఇతని శివభక్తికి మెచ్చి శివుడు వరం కోరుకోమనగా తన చెయ్యి ఎవరి నెత్తిన పెడితే వాడు భస్మమయ్యేటట్లు వరం కోరుకున్నాడు. ఆ వరంతో అతడు గర్వితుడై ప్రపంచాన్ని భయపెట్టాడు. అప్పుడు మహావిష్ణువు మోహినిగా ప్రత్యక్షమై తన అందంతో కవ్వించి ముక్త నృత్యం చేశాడు. ఆ నృత్య సందర్భంగా భస్మాసురుడి చేతిని అతని తలపైనే వుంచుకొనేటట్లు చేయగా భస్మీపటలమయ్యాడు. – శివలీలామృతం

**భాగవతం :** అష్టాదశ పురాణాల్లో ప్రసిద్ధ పురాణం. ఇందలి ప్రధాన ఇతివృత్తం గాయత్రి బాధ్యతలను గురించి సారస్వత కల్పంలోని ధర్మాలను గురించి వివరిస్తుంది. పరమాత్మారాధనవిచారము వృతాసుర చరిత్రము చెప్పబడినది. కృష్ణలీలలు వినోదకరంగా చెప్పబడిన గ్రంథం. ఇది వ్యాసప్రోక్తమయిన అష్టాదశ పురాణములలో ఒకటి కాదని బొప్పనభట్టు అనే కవి రచించిన కావ్యమనియు కొందరు పేర్కొనుచున్నారు.

**భగీరథి :** గంగ మరోపేరు. చూడుము : గంగ.

**భాగురి :** సర్వశాస్త్రాలలో పండితుడు. ఇతడు వ్యాకరణ కారుడు, కోశకారుడు, జ్యోతిష్యశాస్త్రజ్ఞుడు మరియు స్మృతికారుడు.

**భానవి :** ప్రాచీన భారతదేశంలో ఒక నది. రామ లక్ష్మణులు చిత్రకూటం నుండి అరణ్యాలలోకి వెళ్తూ ఈ నదిని దాటారు. – రామాయణం.

**భానుకోపుడు :** ఓ రాక్షసుడు. ఇతడు సుబ్రహ్మణ్య స్వామిపై యుద్ధం చేశాడు. – స్కంద పురాణం.

**భానుడు 1 :** శ్రీకృష్ణునికి సత్యభామకు జన్మించిన పుత్రుడు. – భాగవతం

**భానుడు 2 :** సూర్యుని గురువుల్లో ఒకడు. ఆకాశ పుత్రుడు. – మహాభారతం

**భానుడు 3 :** కశ్యప ప్రజాపతికి పృథవల్ల జన్మించిన ఓ దేవగాంధర్వుడు. – మహాభారతం

**భానుడు 4 :** పాంచజన్యమను అగ్ని కుమారుడు. అంగిరస, చ్యవనుల మానసపుత్రుడు. ఇతడిని మను వని, బృహద్భానుడని పిలుస్తారు. - మహాభారతం

**భానుడు 5 :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. ఇంద్రుని విమానంలో కురుక్షేత్ర యుద్ధంలో ద్రోణార్జు నుల పోరు వీక్షించాడు. - మహాభారతం

**భానుడు 6 :** ఓ యాదవుడు. ప్రద్యుమ్నునివద్ద అస్త్రవిద్య అభ్యసించాడు. భానుమతి అను ఇతని కుమార్తెను సహదేవుడు వివాహమాడాడు. - హరివంశం.

**భానుదత్తుడు :** శకుని యొక్క సోదరుడు. ఇతడు కురుక్షేత్రంలో భీముడి చేతిలో మరణించాడు. - మహాభారతం

**భానుదేవుడు :** పాంచాల రాజ్యంలో ఒకవీరుడు. కర్ణుడి తణ్ణి సంహరించాడు. - మహాభారతం

**భానుమతి 1 :** భానుడను యాదవుని కుమార్తె. పిండార కమను పుణ్యస్థలానికి శ్రీకృష్ణుడు తన సైన్యంతో వెళ్ళగా ఓ మధ్యమహోత్సవం జరిగింది. ఆ సమయం లో నికుంబుడను రాక్షసి భానుమతిని ఎత్తుకు పోయింది. రైవత వనంలో దుర్వాస మహర్షిని గౌర వించనందువల్ల అతని శాపమే దీనికి కారణం. ఆమె దుర్వాసుణ్ణి ప్రార్థించగా నీకు సహదేవునితో వివాహం జరుగుతుందని అభయమిచ్చాడు. అలాగే శ్రీకృష్ణుడు నారదుడి సమక్షంలో భానుమతి సహదేవుల వివాహం జరుగుతుంది. - విష్ణుపురాణం

**భానుమతి 2 :** కృతవీర్యుని కుమార్తె. అహంయాతి భార్య. అహంయాతి పురువంశ చక్రవర్తి. వీరికి జన్మించిన కుమారుడు సార్వభౌముడు.

**భానుమతి 3 :** అంగిరసుని కుమార్తె. ఈమె అద్భుత మైన అందగత్తె. - మహాభారతం

**భానుమతి 4 :** దుర్యోధనుని భార్య. కురుక్షేత్ర యుద్ధ సమయమున ఒక ముంగిస నూరు పాములను చంపి నట్లు కలగని అది కౌరవుల మరణానికి సూచికగా భావించి దుర్యోధనునికి వివరించగా అతడు బెదిరియు పాండవులతో పోరాడి మరణించెను.

**భానుమానుడు 1 :** శ్రీరాముని వంశంలో జన్మించిన ఒక రాజు. ఖాండక్యుని కుమారుడు. శక్రద్యుమ్నుడను రాజుకితడు తండ్రి. - భాగవతం

**భానుమానుడు 2 :** శ్రీకృష్ణ సత్యభామలకు జన్మించిన ఒక కుమారుడు. - భాగవతం

**భానుమానుడు 3 :** కళింగదేశ యువరాజు. కౌరవుల పక్షాన పోరాడి భీమునిచేతిలో మరణించాడు. శృతా యువు సోదరుడు. - మహాభారతం

**భానుమంతుడు 1 :** సీత తండ్రియగు జనకునికి అమిత ధ్వజుడు, కృతధ్వజుడు అను ఇరువురు పుత్రులు. కృతధ్వజునికి కేశిధ్వజుడు, అమితధ్వజునికి ఖాండి క్యుడు జన్మించిరి. ఖాండిక్యుని కుమారుడు భాను మంతుడు. కొందరు పండితులు ఇతడు జనకుని కుమారుడని పేర్కొనిరి.

**భానుమంతుడు 2 :** కళింగదేశపు రాజైన శ్రుతాయువు తమ్ముడు.

**భామసేనుడు :** కర్ణుని కుమారుడు. భీమసేనుడితణ్ణి వధించాడు. - మహాభారతం

**భామహుడు :** ఓ విమర్శకుడైన పండితుడు. క్రీ.శ. 6వ శతాబ్దంలోనివాడు. 'కావ్యాలంకారం' ఇతని ప్రసిద్ధ గ్రంథం. ఇందులో 6 అధ్యాయాలున్నాయి. దండి గొప్ప కావ్యానికి 10 లక్షణాలుండాలనగా ఇతడు వక్రోక్తి అలంకారమే కాదని అది అతిశయోక్తి అని పేర్కొన్నాడు.

**భామిని :** వైశాలి రాజైన అవీక్షిత్తు భార్య. మరుత్తుడు వీరి కుమారుడు. ఈమె ఒకసారి నాగలోకంవెళ్ళి నాగులను కాపాడింది. - మార్కండేయపురాణం.

**భారతం :** భరతవంశపు రాజుల చరిత్ర భారతం. ఇదో ఇతిహాసం. భరతుడు ఈ దేశపు మొదటి చక్రవర్తి. ఈ గ్రంథం ముఖ్యంగా భరతవంశపు రెండు కుటుంబాలకు చెందిన రాజులమధ్య యుద్ధంగా పరిగణించవచ్చు. దీని విస్తృతి ఇందుగల వివేకం దీన్ని మహాభారతమని పిలవడానికి కారణమని చెప్ప వచ్చు. దేవతలొకసారి వేదాలను మహాభారతాన్ని తూచి వేదాలకంటే మహాభారతమే గొప్పదని భావించారు. మహాభారతం లక్ష శ్లోకాలతో ఉన్న బృహద్గ్రంథం. దీనిలో ప్రపంచంలో చర్చించబడని విషయం లేదు. ఇది గ్రీకు మహాకావ్యాలైన ఇలియడ్ ఒడిస్సీలు కలిపి చూసినా వాటికంటే రెట్టింపు గ్రంథం. ఇదో కావ్యం కాదు. భారతీయ చింతనకు ప్రతీక. హిందూమతానికి

పునాదివంటి భగవద్గీత ఇందులో ఒక భాగం. ఇది 18 పర్వాలు. అంతేకాక కృష్ణుని చరిత్ర తెలిపే హరి వంశం దీనికి అనుబంధ గ్రంథం. ఈ 18 పర్వాలు వాటి పేర్లు అందులోని విషయాలను తెలియజేస్తాయి. రచయిత : వ్యాసభగవానుడు ఈ కావ్యరచయిత. ఇతడు పాండవ కౌరవుల సమకాలికుడు. దీనిలోని కొన్ని సంఘటనలకు ఇతడు ప్రత్యక్ష సాక్షి. ఈ గ్రంథ రచనకు ఇతనికి మూడు సంవత్సరాల సమయం పట్టింది. ఈ కావ్యం ద్వాపరయుగం కలియుగాల సంధికాలంలో రచించబడిందని వామనపురాణం పేర్కొంటోంది. వ్యాసుడు వ్రాసినపుడు ఈ కావ్యం పేరు 'జయ్'. ఇతని శిష్యులైన సుమంతుడు, జైమిని, పైలుడు, శుకుడు, వైశంపాయనుడు దీనికి ప్రాచుర్యం తెచ్చారు. సర్ప యాగ సమయంలో జనమేజయుడు వైశంపాయ నుడిని కోరగా మరిన్ని ఆధారాలతో ఈ గ్రంథాన్ని విస్తృతీకరించి 'భారతసంహిత'గా పేర్కొన్నాడు. సూత మహర్షి నైమిశారణ్యంలో ఈ కావ్యాన్ని తన శిష్యులకు చెప్తూ మరిన్ని శ్లోకాలను చేర్చి మహాగ్రంథమైన 'మహా భారతం' ఇప్పటి స్థితికి తీసుకు వచ్చాడు. అనగా మహాభారతం మూడంచెలుగా వ్రాయబడింది. ఒకటి వ్యాసుడు వ్రాసింది. తర్వాత జైమిని కలిపింది. ఆ తర్వాత సూతమహర్షి కలిపింది. ఇది క్రీ.పూ. 3వ శతాబ్దంలో రచింపబడిందని పండితులు చెప్తున్నారు. ఈ గ్రంథం మనుస్మృతి కంటే ముందు వ్రాయబడింది.

**భారతవర్షం :** పురాణాల ప్రకారం ప్రపంచం ఏడు ఖండాలని అందులో జంబూద్వీపం ఒకటని పేర్కొన బడింది. ఆ జంబూద్వీపమే భారతవర్షం. రుషభుడి కొడుకు భరతుడు దీనిని పాలించడంవల్ల భారతవర్షం అనే పేరు వచ్చింది. ఇది హిమాలయాలకు దిగువన వున్న ప్రాంతం. దీన్ని ఆర్యావర్తమని కూడా పిలుస్తారు. – భాగవతం

**భారతసంహిత :** మహాభారతానికి గల మరోపేరు.

**భారతి 1 :** పురాణాలలో పేర్కొనబడిన నది. దీనినుండే అగ్ని జన్మించింది. – మహాభారతం

**భారతి 2 :** భరతుడి కూతురు. శంయుత మనుమరాలు.

**భారద్వాజి :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రసిద్ధ నది. – మహాభారతం

**భరద్వాజపుత్రుడు :** ఓ పండితుడు. పారాశరి పుత్రుడి శిష్యుడు. వాత్సవీ మాండలి పుత్రుడని కూడా అంటారు. – బృహదారణ్యకోపనిషత్తు

**భారద్వాజుడు 1 :** ఓ మహర్షి. సత్యవాణుడి తండ్రి ద్యుమత్సేనుడు చిరకాలం జీవిస్తాడని చెప్పాడు. – మహాభారతం.

**భారద్వాజుడు 2 :** ఉపనిషత్తుల్లో పేర్కొనబడిన ఒక తెగవాడు. వీరు భారద్వాజ, పారాశర్య, వలాక, కౌశిక, ఐతరేయ, ఆసురాయణ, బైజపాపాయనులకు శిష్యులు. – బృహదారణ్యకోపనిషత్తు.

**భారద్వాజుడు 3 :** ఓ వ్యాకరణ పండితుడు. సామవేదం బ్రహ్మ మొదటి వ్యాకరణ కర్త అని, అతడు బృహ స్పతికి బోధించగా అతడు ఇంద్రుడికి, ఇంద్రుడు భారద్వాజుడికి అతని శిష్యులకు బోధించాడు.

**భారద్వాజం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాసయోగ్య ప్రాంతం. – మహాభారతం

**భారవి :** క్రీ.శ. 6వ శతాబ్దంలో ప్రసిద్ధుడైన సంస్కృత కవి. మహాకావ్యమనదగ్గ 'కిరాతార్జునీయం' గ్రంథకర్త. సంస్కృత కవుల్లో కాళిదాసు తర్వాత అంతటి ప్రసిద్ధ కవి. 'కిరాతార్జునీయం'లో శివుడు వేటగాడిగా అర్జునునితో పోరాడిన సంఘటన ఇతివృత్తం.

**భారు :** దక్ష ప్రజాపతి కుమార్తెలలో ఒకరు. దక్షునికి వైరిణివల్ల ఒకసారి 60 మంది పుత్రికలు జన్మించగా వారిని దేవతలకిచ్చాడు. భారును విశ్వదేవతల కిచ్చాడు. – హరివంశం

**భారుండం :** ఉత్తర కురువర్షంలోని ఓ పక్షి. పెద్ద ముక్కుండి శవాలను దానితో ఎత్తుకుపోయి తింటుంది. దీన్ని భేరుండం అనికూడా అంటారు. – మహాభారతం

**భార్గభూమి :** భార్గవుని కుమారుడు, క్షత్రవృద్ధుని వంశ ములోనివాడు. "కాశ్యులు" అనేవారిలో చివరివాడు. ఇతడు ఇంద్రుని కోర్కెపై అసురులను పారద్రోలి తిరిగి రాజ్యము పొందెను. ఇతని పుత్రులు మదాందుల గుటచే ఇంద్రుడు వారిని పారద్రోలెను. – భాగవతం

**భార్గవుడు 1 :** పరశురాముడి మరోపేరు. – చూ॥ పరశురాముడు

**భార్గవుడు 2 :** భృగువంశానికి చెందినవాడు.

**భార్గవం 1 :** ఉప పురాణాల్లో ఇదొకటి.

**భార్గవం 2 :** ప్రాచీన భారతదేశంలో ఒక పట్టణం.

**భార్య :** భీష్ముడు భార్యనుగూర్చి ఇలా ప్రవచించాడు. "భార్యలేని భవనం అరణ్య సమానం. ధర్మ అర్థ కామాలలో సహాయకారి. యాత్రలలో వున్నపుడు ఆమె నీకు విధేయురాలై వుంటుంది. సుదూరమైన జీవిత కాలంలో గొప్ప సహాయకారి. వ్యాధుల నుండి ఇతర బాధల నుండి భార్యను మించిన నివారిణి లేదు. భార్యకంటే బంధువు లేదు. ధర్మాచరణలో భార్యను మించిన సహచరి లేదు. గృహ విషయాలను చక్కబరచని భార్య లేకుంటే అతడు అరణ్యాలకు పారిపోవలసిందే.

**భాలుకి 1:** ఓ మహర్షి. పాండవులతోపాటు ఇతడు ద్వైతవనం వెళ్ళాడు. – మహాభారతం

**భాలుకి 2 :** ఓ రుషి. ధర్మరాజు కొలువులో ఒక సభ్యుడు – మహాభారతం

**భావనిక :** మృగణావతి సహచరి. – చూ // శ్రీదత్తుడు

**భావయవ్యుడు :** ఓ రుషి. బృహస్పతి కూతురు రోమశను వివాహమాడాడు. ఒకసారీమె ఇతని పొందుకోరి రాగా నవ్వి ఊరుకున్నాడు. రుగ్వేదంలో ఇతడి గొప్పతనం ప్రస్తావించబడింది.

**భావిని :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరి. – మహాభారతం

**భావుకుడు :** సూర్యవంశపు రాజు. రవీయుడి కుమారుడు. చక్రోద్ధతుడికి తండ్రి. – భాగవతం

**భావులు :** ఒకానొక దేవగణం. దివ్యబృగులకు జన్మించిన సంతతి.

**భావం :** పురాణాల్లో ప్రసిద్ధమైన ఒక అరణ్యం. ఇది రేణుమందరపర్వతం దగ్గర వుంది. ఈ పర్వతం ద్వారకకు సమీపంలో వుంది. – మహాభారతం

**భాసకర్ణుడు :** రావణుడి సైనిక అధికారి. హనుమంతుడితణ్ణి వధిస్తాడు. – రామాయణం

**భాసి :** దక్షుడి మనుమరాలు. కశ్యపునికి భామివల్ల జన్మించిన కుమార్తె. ఈమె కుమారులను భాసులని అంటారు. వీరు దేవతల్లో ఒక తెగ.

**భాస్కరపంతులు :** విష్ణువర్ధనుడనే రాజు కన్యకాపరమేశ్వరిని అవమానించాడు. తనను ధిక్కరించిన వైశ్యులను వర్గభ్రష్టులను చేసేవాడు. కన్యకా పరమేశ్వరి వృత్తాంతాన్ని 'కన్యకాపురాణం' అనే పేరుతో రచించాడు. ఇతడు పెనుగొండ, కొండవీడు ప్రదేశాల్లో వున్న వైశ్యులకు ఆచార్యుడుగా వ్యవహరించిన బ్రాహ్మణుడు.

**భాస్కర రామాయణం :** భాస్కరుడు రచించిన రామాయణం. దీన్ని ఇతడు ఇతని కుమారుడు మల్లికార్జునుడు, శిష్యుడు కుమార రుద్రదేవుడు, స్నేహితుడు అయ్యలార్యుడు కలసి రచించి రాజుకి కాక అతడి రౌతుకు అంకితమిచ్చారు.

**భాస్కరాచార్యుడు :** జ్యోతిష్యశాస్త్ర పండితుడు. భూమి గుండ్రంగా వుంటుందని ప్రకటించిన మొదటి శాస్త్రకారుడు.

**భాస్కరి :** ఓ మహర్షి. భీష్ముడు అంపశయ్యపైనుండగా దర్శించిన మునుల్లో ఇతడొకడు. – మహాభారతం

**భాస్కరుడు :** ద్వాదశాదిత్యుల్లో ఒకడు. ఇతడు అదితి, కశ్యపుల సంతతి. – మహాభారతం.

**భాస్వరుడు :** సుబ్రహ్మణ్యస్వామికి సూర్యుడిచ్చిన ఇద్దరు అనుచరుల్లో ఒకడు. రెండోవాడు సుబ్రాజుడు.

**భాస్వరులు :** గణదేవతల్లో ఒక తెగవారు. వీరు అరవైనల్గురు.

**భిక్షుతాడిత :** ఓ కుక్క. రాముడు కొలువులోనుండగా తనను కలియుటకు ఎవరైనా వచ్చినచో లోనికి తీసుకురమ్మని లక్ష్మణుని ద్వారము వద్ద నిలబెట్టగా ఈ కుక్క వచ్చి లక్ష్మణుడు లోనికి తీసుకు రాబోగా నేను "రాజులు, మునులు వుండుచోటకు నేనెట్లు వచ్చెద" ననగా రాముడే బయటకు వచ్చి రక్తసిక్తమైన తలతో గల కుక్కను చూసి ఎవరు నిన్ను కొట్టారనగా ఓ బిక్షువును జూపెను. రాముడు బిక్షువునడగగా "నేను బిక్షాటనము వల్ల తెచ్చుకొనుచున్న అన్నమును అడ్డగించి తినుచుండెను. అందువల్ల కొట్టితిని. నన్ను శిక్షింపుడు" అనెను. రాముడు ఏ శిక్ష విధించవలెనని తలంచుచుండగా కాలాంజనమనుగిరిలో కల దేవాలయము పాలించుటకు పంపుమని కుక్క సలహా యివ్వగా తప్పుచేసినవాడికిది శిక్షయగునా అని శ్రీరాముడడుగగా "నేను ఆ దేవళమున పనిచేసి దేవబ్రాహ్మణుల ధన మపహరించుటచే ఈ జన్మమెత్తితిని. ఇంతకంటే అతనికి శిక్షయేల అని పలికి పిమ్మట కాశీకేగి అచ్చటనే స్వర్గలోకమందెను.

**భీమకుడు :** కుండి నగరపు రాజు. ఇతడి కూతురు రుక్మిణి. ఇతని కుమారులు రుక్మధరుడు, రుక్మ బాహువు, రుక్మకేశి, రుక్మనేత్రుడు. – మహాభారతం

**భీమజానువు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. ఇతడు యముని సేవిస్తూ అతని కొలువులో వుంటాడు. – మహాభారతం

**భీమబలుడు (భూరిబలుడు) 1 :** ధృతరాష్ట్రుడి 100 మంది కుమారుల్లో ఒకడు. భీమసేనుడితణ్ణి సంహరించాడు. – మహాభారతం

**భీమబలుడు 2 :** పాంచజన్యుడను రాక్షసుని 5 గురు కుమారుల్లో ఒకడు. వీరు దేవతల యజ్ఞాలకు విఘ్నాలు సృష్టించేవారు. – మహాభారతం

**భీమభటుడు :** ఓ గంధర్వుడు.

ఏకలవ్య నగరాన్ని శృతధరుడు పాలించేవాడు. ఇతని కుమారుల్లో చిన్నవాడైన సత్యధరుడు అన్నను రాజ్యం నుండి గెంటివేసి తానే రాజయ్యాడు. అలా వెళ్ళిపోయిన శీలధరుడు శివుని ప్రార్థించి సత్యధరుడు మరణించాలని తను గంధర్వుడు కావాలని వరం పొందాడు. శివుని అనుగ్రహంవల్ల సత్యధరుడు మరణించి సమరభట్టుగా, శీలధరుడు భీమభటుడుగా ఉగ్రభటుడికి జన్మించి అతని తదనంతరం భీమభట్టు సమరభట్టుని వధించి తాను రాజయ్యాడు. తదనంతరం ఓ మునిశాపం వల్ల ఏనుగుగా మారి తన వృత్తాంతాన్ని ఓ యాత్రికుడికి చెప్పుకోగా గంధర్వుడిగా మారాడు. – కథాసరిత్సాగరం.

**భీభత్సుడు :** అర్జునుడి మరోపేరు. – చూ॥ అర్జునుడు

**భీమరథి :** పురాణాలలో పేర్కొనబడిన దక్షిణభారతదేశ నది. ఇందులో స్నానంచేస్తే పాపాలు నశిస్తాయి. దీని తీరాన పండరపురం అనే పుణ్యతీర్థం వుంది. – మహాభారతం

**భీమరథుడు 1 :** విశ్వామిత్రుని కుటుంబంలోని ఒక రాజు. కేతుమయుడి కుమారుడు. దివోదాసు తండ్రి. – భాగవతం

**భీమరథుడు 2 :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. భీమసేనుడు ఇతణ్ణి కురుక్షేత్ర యుద్ధంలో వధించాడు. – మహాభారతం

**భీమవేగుడు :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. – మహాభారతం

**భీమశరుడు :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. – మహాభారతం

**భీమసేనుడు (భీముడు) :** కుంతికి దూర్వాస మహర్షి ఇచ్చిన మంత్రోపదేశంతో పాండురాజు అనుమతితో వాయుదేవుని వరప్రసాదం వల్ల జన్మించిన పాండవ పుత్రుల్లో రెండోవాడు. ఇతడు జన్మించి బాలుడుగా వుండగనే కుంతి చేతుల నుండి జారి బండ రాళ్ళపై పడగా ఆ రాళ్లు బ్రద్దలయినవిగాని అతనికేమియును కాలేదు. ఇతడు తన అన్న చెప్పిన మాటకు ఎదురాడువాడు కాడు. మహాబలశాలి యయ్యి తన అన్న ధర్మరాజు యందు భక్తి గలిగి ఎన్ని ఇక్కట్లు వచ్చినా అతడికి తోడునీడగా జీవించాడు. కుంతి పాండురాజు మరణానంతరం పాండవులను హస్తినాపురం తీసుకు వెళ్లగా భీష్ముడు హస్తినలో కౌరవులతో పాటు వీరికి ద్రోణునిచే అస్త్ర విద్యాభ్యాసము నేర్పించెను. మొదటి నుండి ఇతని యెడల దుర్యోధనునికి వైరముండెడిది. ఒకసారి విషమిచ్చి కొలనులో తోయించెను. వీరి వైరమును గమనించి ధృతరాష్ట్రుడు వీరిని వారణావ్రతం వెళ్లమని కోరగా వీరికి మార్గమధ్యమున దుర్యోధనుడు ఓ లక్క ఇల్లు నిర్మించి విడిదిగా ఏర్పాటుచేసి వీరిని మట్టు బెట్టనెంచగా అది తెలిసి సొరంగ మార్గమున తల్లిని సోదరులను మోసుకొనివెళ్లి భీముడు రక్షించెను. ఆ సమయమున వీరు ఓ చెట్టు క్రింద నిద్రించుచుండగా భీముడు వారికి కాపలాకాసెను. హిడింబాసురుడు వారిపైకి రాగా అతనిని భీమసేనుడు వధించెను. ధర్మజుని ఆజ్ఞపై హిడింబాసురుని సోదరి హిడింబిని ఇతడు వివాహమాడగా ఘటోత్కచుడను పుత్రుడు జన్మించెను. అచటి నుండి బ్రాహ్మణ వేషధారియై ఏకచక్ర పురమున ఓ బ్రాహ్మణుని ఇంట జీవించుచుండగా బకాసురుడను రాక్షసునివల్ల ఆ గ్రామానికి ముప్పువాటిల్లెనని అందునా వారి గృహంలోని వారికీ ఆపద వాటిల్లెనని తెలిసి కుంతి ఆజ్ఞాను సారం భీముడు బకుని గుహకు వెళ్లి అతడిని చంపాడు. ఆ తదుపరి ద్రుపదుని కొలువుకు ద్రౌపదీ స్వయంవరానికి వెళ్లి పార్థుడు బ్రాహ్మణ వేషమున మత్స్య

యంత్రమును ఛేదించి ద్రౌపదిని వశము చేసుకోగా అక్కడున్న క్షత్రియ వీరులు వారిపై యుద్ధము చేయగా అర్జుననికి బాసటగా నిలిచి వారందరిని ఓడించెను. ద్రౌపదిని వారి గృహమునకు తీసుకువెళ్లి తల్లి ఆజ్ఞాను సారం పాండవులు ఐదుగురు ద్రౌపదిని వివాహ మాడిరి. ద్రౌపదికి భీముని వల్ల శృతసోముడు జన్మిం చాడు. భీమునికి జలంధరయందు మరో కుమారుడు జన్మించాడు. ద్రౌపదిని వివాహమాడింది పాండవు లేనని తెలిసి ధృతరాష్ట్రుడు వీరిని హస్తినకురావించి వారికి తమ రాజ్యభాగమివ్వగా ఇంద్రప్రస్థ పురమును నిర్మించుకొని ధర్మజుడు పాలించెను. ఇచ్చటే ధర్మజుడు రాజసూయ యాగము చేసి లబ్ధ ప్రతిష్టుడయ్యెను. ఇది చూసి ఇంద్రప్రస్థమున అవమానమొందిన దుర్యో ధనుడు ధర్మజుని జూదమునకు పిలిచి మాయాజూ దమున ఓడించి ద్రౌపదిని అవమానపరచగా భీముడు కౌరవ సంతానాన్ని వధిస్తానని శపథం చేస్తాడు. ధృత రాష్ట్రుడు విచారించి తిరిగి వారి రాజ్యం వారికి ఇప్పించగా దుర్యోధనుడు ధర్మజుని జూదమునకు రప్పించి ఓడిన వారికి 12 ఏళ్లు అరణ్యవాసం ఒక ఏడు అజ్ఞాతవాసం షరతుగా జూదమాడించెను. ఆ షరతుకు లోబడి వారు అరణ్యవాసాన్ని కామ్యక వనంలో అజ్ఞాత వాసాన్ని విరాటుని రాజ్యంలో గడిపారు. ఆ సమ యంలో భీముడు జీముతుడను మల్లయోధుణ్ణి, ద్రౌపదిని అవమానించిన విరాటుని బావమరిది కీచ కుడ్ని, అతని సోదరులు ఉపకీచకుల్ని వధించాడు. అజ్ఞాతవాసానంతరం వీరి రాజ్యం వీరికిచ్చుటకు దుర్యోధనుడు సమ్మతించక శ్రీకృష్ణుని దౌత్యము విఫల మవ్వగా కురుక్షేత్ర యుద్ధము అనివార్యమయ్యెను. ఈ మహాభారత యుద్ధమున భీముడు ఎందరో యోధులతో పోరి కౌరవ పుత్రులనందరిని దుర్యోధ నునితో సహా వధించెను. కౌరవుల ఎన్నో అక్షౌహినిల బలాన్ని చతురంగ బలాన్ని సంహరించెను.

*భీముని గర్వభంగం :*

1. అరణ్యవాస సమయమున ద్రౌపది కోరికపై భీముడు గంధర్వ నగరంలోని పుష్పాలను తేవడానికి వెళ్లి అచటనున్న ముసలికోతి హనుమంతుడని తెలి యక తూలనాడి ఆ తోకను తన చేత్తో విసరబోయి తర్వాత తన శక్తినంత కూడతీసుకొని కూడా ఆ తోకను కదల్చలేక ఇతడెవ్వడో మహానుభావుడని తలచి ప్రార్థించగా హనుమంతుడు నిజరూపుడై భీముని ఆశీర్వదించెను. – మహాభారతం

2. మహాభారతానంతరం పాండవులు కృష్ణుడు యుద్ధ విశేషాలు చర్చించుకుంటుండగా తక్కిన పాండవు లందరూ శ్రీకృష్ణుడే ఈ విజయానికి కారణమనగా భీముడు మాత్రం తన బలమే ఇందుకు కారణమని బదులిచ్చాడు. అప్పుడు శ్రీకృష్ణుడు భీముడ్ని తన గరుడ వాహనంపై తీసుకువెళ్లి ఓ కొలనుచూపి దాని మూలం కనుక్కోవలసినదిగా కోరగా ఆ కొలనులోకి వెళ్లి అంతు తెలియక అతనిపై కొందరు రాక్షసులు యుద్ధం చేయగా వెనక్కు తిరిగి వచ్చి శ్రీకృష్ణుడికి విన్నవించగా తన చేతి వుంగరంతో ఆ కొలనును అక్కడి నుండి నెట్టివేసి ఆ వుంగరం హిరణ్యకశిపుని చెవి వుంగరమని భీమునికి చెప్పగా భీముడు ఆశ్చర్య చకితుడై శ్రీకృష్ణుని ప్రార్థించెను. – స్కందపురాణం

*భీమసేనుని ఇతర ముఖ్యనామాలు :* అచ్యుతానుజ, అనీలాత్మజ, వాయుపుత్ర, మహితాత్మజ, మారుతి, వాయుసుత, వృకోదర.

**భీమాక్షుడు :** ఓ రాక్షసుడు. కాశీ, కోసల దేశాలపైపడి బాధించేవాడు. ఈ రెండు రాజ్యాల రాజులు కలసి ఇతడిని తుదముట్టించారు. చివరికితణ్ణి హర్యశ్వనుడు సంహరించాడు. – బ్రహ్మాండపురాణం

**భీమాసురుడు :** కుంభకర్ణుడి కొడుకు. లోకాలకు ఆపదలు కల్గిస్తుంటే శివుడితణ్ణి వధించాడు.

**భీముడు 1 :** పరీక్షిత్తు కుమారుడు. జనమేజయుని సోదరుడు. సర్పయాగ సందర్భంగా వచ్చిన దేవతల కుక్క అయిన శరమకుమారుడ్ని అకారణంగా కొట్టాడు. – మహాభారతం

**భీముడు 2 :** ఓ దేవగాంధర్వుడు. కశ్యప ప్రజాపతికి ముని వల్ల జన్మించాడు. ఇతడు అర్జునుని జన్మది నోత్సవ వేడుకల్లో పాల్గొన్నాడు. – మహాభారతం

**భీముడు 3 :** చంద్రవంశపు రాజైన అవీక్షిత్తు మనుమడు. ఇతని తల్లి శుయశ. కేకేయ రాజకుమార్తె అయిన కుమారిని వివాహమాడగా ప్రతిశ్రవసుడు జన్మించాడు. – మహాభారతం

**భీముడు 4 :** కాశీరాజైన దివోదాసు తండ్రి. – మహాభారతం

**భీముడు 5 :** నలుని భార్య దమయంతి తండ్రి.
– చూ॥ దమయంతి

**భీముడు 6 :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. కురుక్షేత్ర యుద్ధంలో ఇతణ్ణి భీమసేనుడు వధించాడు. – మహాభారతం

**భీముడు 7 :** ఇలినుడను రాజు. రథంధరికి జన్మించిన 5గురు కుమారుల్లో భీముడనువాడొకడు.
– మహాభారతం

**భీముడు 8 :** అంశ అనే దేవత సుబ్రహ్మణ్యస్వామికిచ్చిన అయిదుగురు సేవకుల్లో ఒకడు. – మహాభారతం

**భీముడు 9 :** ఓ యాదవరాజు. అంధకుని తండ్రి. ఇతడు శ్రీరాముని సమకాలీనుడు. శతృఘ్నుడు స్థాపించిన మధురాపురిలోని మధుడను రాక్షసుడ్ని వధించి మధురాపురిని జయించాడు.

**భీముడు 10 :** రావణుని స్నేహితుడు. లంకను చేరిన హనుమంతుడు మొదట ఇతని భవంతిపై కూర్చున్నాడు. – మహాభారతం

**భీముడు 11 :** ప్రాచీన భారత దేశపు రాజు. యముడ్ని పూజిస్తూ అతని కొలువులో వుంటాడు. యముని కొలువులో భీముని పేరుతో 100 మంది రాజులున్నారు.
– మహాభారతం

**భీముడు 12 :** ఇతడొక శూద్రుడు. వైశ్య వృత్తి చేస్తూ వైశ్య స్త్రీతో కలసి జీవించాడు. ఇతడెందరో బ్రాహ్మణులను చంపి వారి ధనమును అపహరించాడు. ఎంతో మంది పెద్ద వాళ్ల భార్యలను బలాత్కరించాడు. ఇతడు దోపిడీలు చేసేవాడు. ఒకసారి ఓ బ్రాహ్మణుడి ఇంటికి వెళ్లి బాధ నటించి ఒంటరి వాడినని నాకు ఆహారం కావాలని అడగగా అతను తాను ఏకాకినని తల్లి తండ్రి, భార్యపిల్లలు లేనివాడినని అయినా నేను సహాయపడతానని అతడే వండి పెట్టగా అతని వద్ద సేవకుడుగా చేరి సమయం చూసి సంపద కొల్లగొట్ట వచ్చునసుకున్నాడు. ప్రతిరోజు బ్రాహ్మణుడు కాళ్లుకడుక్కున్న నీరు తన తలపై పోసుకునేవాడు. ఒక రోజు ఓ దొంగ ఈ ఇంటిలోకి రాగా అతడిని భీముడెదుర్కోగా వెంటనే అతడు ఇతని తల నరికాడు. బ్రాహ్మణుని కాళ్లుకడిగిన నీరు తలపై పోసుకున్నందు వల్ల ఇతడికి వైకుంఠప్రాప్తి లభించింది. – పద్మపురాణం

**భీమ :** మణిభద్రుడు పుణ్యజనిలకు జన్మించిన కుమారుడు.

**భీషణుడు :** బకుని కుమారుడు. భీముడు బకుడ్ని చంపినప్పటి నుండి పాండవులపై పగబట్టి వీరు అశ్వమేధ యాగం చేసేటప్పుడు ఏకచక్రం వద్ద అడ్డగించి అర్జునునితో పోరాడి అతని చేతిలో మరణించాడు.
– జైమిని భారతం.

**భీషదుడు :** భైరవుల్లో ఒకడు. – చూ॥ భైరవులు

**భీష్మకుడు :** విదర్భరాజు. భోజ వంశంలో జన్మించాడు. శ్రీకృష్ణుని భార్య అయిన రుక్మిణికి తండ్రి. ఇతనికి ఐదుగురు పుత్రులు. భీష్ముని స్నేహితుడు, ప్రపంచంలో నాల్గోవంతు భూభాగాన్ని జయించాడు. జరాసంధునికి భక్తుడు. అశ్వమేధయాగ సమయంలో సహదేవుడితణ్ణి ఓడించాడు. ఇతడిని హిరణ్య రోముడని కూడా అంటారు. – మహాభారతం

**భీష్ముడు :** కురువంశంలో జన్మించిన శంతనుని కుమారుడు.
*జననం, బాల్యం :* భీష్ముని చిన్ననాటి పేరు దేవవ్రతుడు. ఇతడు పూర్వం జన్మించిన అష్టవసువుల్లో ఒకరి పునర్జన్మ. వశిష్ఠుని శాపవశమున గంగాదేవి అష్టమ గర్భమున శంతన మహారాజుకి జన్మించాడు.
– చూ॥ శంతనుడు, అష్టవసువులు

ప్రతీపుడను రాజు పుత్రార్థియై తపమాచరించగా శంతనుడు జన్మించాడు. ఇతడు బహుకాలం కురురాజ్యాన్ని పాలించాడు. గంగానదీ తీరంలో శాపవశమున మానవ రూపంలోవున్న గంగను వివాహం చేసుకోవాలని తలంచగా గంగ తన షరతులకు ఒప్పుకుంటేనే వివాహమాడగలనని చెప్పగా శంతనుదందుకు అంగీకరించెను. గంగాశంతనులకు 7 గురు పుత్రులు జన్మించగా ఆమె వారిని గంగానదిలో పడవేసింది. అష్టమ గర్భుడైన దేవవ్రతుడు జన్మించగా అతడిని కూడ గంగానదిలో పడవేయబోగా శంతను డడ్డ గించగా తన షరతులకు శంతనుడు అంగీకరించనందున అతడిని విడచి కుమారుని తనతో తీసుకు వెళ్లింది. ఇతడు వశిష్ఠుని వద్ద గంగాదేవి వద్ద సకల విద్యలు అభ్యసించాడు. 32 ఏళ్ల తదుపరి శంతనుడు గంగాతీరానికి వచ్చి ఆ బాలుణ్ణి చూసి గంగను ప్రార్థించగా ఆమె ఆ బాలుణ్ణి శంతనుడి కప్పగించగా శంతనుడతణ్ణి యువరాజును చేశాడు.

*భీష్మ ప్రతినామము :* శంతన మహారాజు ఒకసారి విహా రార్థమేగి అచట మత్స్యగంధిని చూసి మోహించగా ఆమెను తనకిచ్చి వివాహము చేయుటకు ఆమెకు పుట్టిన పుత్రులే పాలకులు కావాలని షరతు విధించగా శంతనుడంగీకరించక వెనుకకు మరలి వచ్చి మనో వ్యాకులుడయ్యెను. అది తెలిసిన దేవవ్రతుడు మత్స్యగంధి ఇంటికివెళ్లి వారిని ఒప్పించబోగా రాజ్యమెదులుకొనుటకు నీవు అంగీకరించినను నీ సంతానము వదలవలెనని ఏమున్నదని ప్రశ్నించగా నేనాజన్మ బ్రహ్మచారిగా నుందునని, ఈమెకు పుట్టిన సంతానమే రాజ్యపాలన చేయుటకు సహకరింతుని భీష్మప్రతిజ్ఞచేసి ఆమెను తీసుకువచ్చి తన తండ్రికిచ్చి వివాహము చేసెను. అట్లు భీషణ ప్రతిజ్ఞ చేయుటవల్ల అతని పేరు భీష్ముడుగా ప్రసిద్ధి కెక్కెను.

*కురువంశ వృద్ధి :* శంతన మహారాజుకు మత్స్య గంధి అనగా సత్యవతి వల్ల ఇద్దరు కుమారులు జన్మించారు. వారు చిత్రాంగధుడు, విచిత్రవీర్యుడు. చిత్రాంగధుడు మరో చిత్రాంగధుడను గంధర్వునితో యుద్ధం చేసి మూడు సంవత్సరాలు రాజ్యపాలన తర్వాత హతుడవ్వగా విచిత్రవీర్యుడు పట్టాభిషిక్తుడయ్యెను. కాని రాజ్యభారమంతయు భీష్ముడే చూసెడివాడు. విచిత్రవీర్యునికి వివాహము చేయ నెంచి కాశీరాజు తన కుమార్తెలైన అంబ, అంబిక, అంబాలికలకు స్వయంవరం ఏర్పాటు చేసెనని తలచి భీష్ముడటకేగ వృద్ధులకు తావులేదన్ననూ అది ధర్మసమ్మతమేనని ఎదురొచ్చిన రాజులను ఓడించి అంబ, అంబిక, అంబాలికలను తెచ్చి విచిత్రవీర్యునికిచ్చి వివాహము చేయనెంచగా అంబ పూర్వమే తనమనసు వేరొకనితో లగ్నమైనదని చెప్పగా ఆమెను అతని వద్దకు పంపగా అతడు తిరస్కరించెను. చేయునది లేక ఆమె భీష్ముని వివాహమాడమని కోరగా తాను ఆజన్మ బ్రహ్మచారినని తిరస్కరించెను. అంబికా, అంబాలికలను విచిత్రవీర్యునికిచ్చి వివాహం చేసెను. అంబ భీష్మునిపై పగబూని పరశురాముని శరణు వేడగా భీష్ముడు పరశురామునితో కూడా యుద్ధము చేసెను గాని ఆమెను వివాహమాడుటకు అంగీకరించలేదు. అంబ శివుని గూర్చి తపస్సు చేసి ద్రుపదుని ఇంట శిఖండిగా జన్మించెను. అంబికా అంబాలికలకు పుత్రజననం జరుగకముందే విచిత్రవీర్యుడు మరణించగా సత్యవతికి కుమారుడగు వ్యాసుని ఆశ్రయించగా అతని వల్ల అంబికకు అంధుడైన ధృతరాష్ట్రుడు, అంబాలికకు పాండురాజు, వారి దాసి వల్ల విదురుడు జన్మించారు. భీష్ముడే ధృతరాష్ట్రునికి గాంధార రాజపుత్రిక అయిన గాంధారితో వివాహము జరిపించగా ఆమెకు దుర్యోధనునితో సహా 100 మంది పుత్రులు, ఓ కూతురు జన్మించారు. పాండు రాజు కుంతిభోజుని కుమార్తెయగు కుంతిని, మద్రదేశ యువరాణి మాద్రిని వివాహమాడెను. కుంతికి, మాద్రికి పాండురాజు అనుమతితో దుర్వాసుడిచ్చిన మంత్రఫలంగా పాండవులు జన్మించారు.

*కౌరవ పాండవ యుద్ధం – భీష్మునిపాత్ర :* భీష్ముడు కౌరవ పాండవులకు అస్త్ర విద్యను అభ్యసించడానికి ద్రోణాచార్యుడిని నియమించాడు. పాండవులకు అర్థ రాజ్యమివ్వమని దుర్యోధనునికి సూచించాడు. ధర్మజుని రాజసూయయాగ పర్యవేక్షణ చేశాడు. కౌరవ పాండవులకు వైరం కూడదని శాంతిగా జీవించమని దుర్యోధనునికి సలహా ఇచ్చాడు. అజ్ఞాత వాసం తర్వాత దుర్యోధనుడు వారి రాజ్యం వారికివ్వడానికి నిరాకరించగా కృష్ణార్జునుల గొప్పతనాన్ని వివరించాడు. కర్ణుని తూలనాడాడు. యుద్ధం తప్పని సరికాగా ఇతడు హస్తినాపురంలో ధృతరాష్ట్రునితోనే వుండటం వల్ల పాండవులపై అభిమానమున్నను కౌరవుల పక్షాన అవిశ్రాంతంగా పోరాడాడు. యుద్ధం కొనసాగుతుండగా భీష్ముడున్నంతవరకు జయం లభించదని తెలిసి శ్రీకృష్ణుని సలహాపై భీష్ముని చెంతకు ధర్మజుడు వెళ్లగా శిఖండితో నేను యుద్ధం చేయననే నియమం కలవాడనని చెప్పి తన మరణానికి తనే పాండవులకు దారిచూపాడు. అర్జునుడి బాణాలకు నేలకొరిగిన భీష్ముడు తన తండ్రి ఇచ్చిన వరం వల్ల ఉత్తరాయణం వచ్చేవరకు కురుక్షేత్రంలోనే అంపశయ్యపై జీవించాడు. భీష్ముడు మరణానంతరం స్వర్గంలోని అష్టవసువుల్లో ఒకడయ్యాడు.

*భీష్మునికి గల ఇతరపేర్లు :* ఆపగేయ, అపగాసుత, భాగీరథీపుత్ర, పితామహ, భరతసత్తమ, భీష్మక, శాంతనవ, శాంతనూపుత్ర, శాంతనుసుత, గంగాసుత, గాంగేయ, కురుశార్దూల, కురుశ్రేష్ఠ, కురుకుల శ్రేష్ఠ, సత్యసంధి, తాలధ్వజ అనునవి కొన్ని పేర్లు.

**భుజకేతువు :** దుర్యోధనుని పక్షాన పోరాడిన ఒక రాజు. - *మహాభారతం*

**భుజంగుడు :** కద్రువకు, కశ్యప ప్రజాపతికి జన్మించిన కుమారుడు.

**భుజ్యువు :** ఓ రాజర్షి. ఇతని తండ్రి పెద్ద సైన్యంతో ఇతడ్ని శత్రువులను జయించడానికి వేరే ద్వీపానికి పంపగా సముద్రం మధ్యలో పడవ మునిగిపోయింది. రాజకుమారుడు సైనికులు సముద్రంలో మునిగిపోగా వీరు అశ్వనీదేవతలను ప్రార్థించగా పడవల్లో రథాలలో గాలిలో ప్రయాణింపజేసి అశ్వనీదేవతలు నిజభవనానికి తీసుకువెళ్లారు. - *ఋగ్వేదం*

**భుమన్యుడు :** భరతుని కుమారుడు, దుష్యంతుని మనుమడు. ఇతడు భరద్వాజుని అనుగ్రహం వల్ల జన్మించాడు. కాశీ రాజకుమార్తె అయిన సునంద ఇతని తల్లి. భుమన్యుడు పెద్దవాడైన తర్వాత భరతుడు రాజ్యపాలనను ఇతనికి అప్పగించాడు. పుష్కరిణి అనే భార్యవల్ల ఇతనికి ఆర్గురు కుమారులు. దాశార్హ అనే యువతివల్ల ఇతనికి విజయుడను కుమారుడు కూడా కలడు. - *మహాభారతం*

**భువన :** బృహస్పతి సోదరి. అష్టావసువుల్లో ఒకరైన ప్రభాసుడి భార్య. వీరికి విశ్వకర్మ అనే పుత్రుడు జన్మించాడు. - *బ్రహ్మాండపురాణం*

**భువనుడు 1 :** ఓ రుషి. భీష్ముడు అంపశయ్యపై నుండగా దర్శించిన వారిలో ఒకడు. - *మహాభారతం*

**భువనుడు 2 :** ఓ సనాతన విశ్వదేవుడు. - *మహాభారతం*

**భువనేశుడు 1 :** చూ॥ భద్రశ్రవసుడు.

**భువనేశుడు 2 :** ఒక రాజు. ఇతని రాజ్యంలో ఓ బ్రాహ్మణుడు విష్ణుగానం చేస్తుండేవాడు. అట్లుగాక తనను గురించి గానం చేయమని ఆదేశించగా హరి మిత్రుడను ఆ బ్రహ్మణుడు నిరాకరించగా అతడు పూజచేయు ప్రతిమలను పారవేసి అతడిని హింసించగా రాజు ఉలూక జన్ముడయ్యెను. - *చూ॥ గానబంధుడు*

**భువనేశ్వరి :** ఒక స్త్రీ దేవత. ఓండ్ర దేశంలో వుంటుంది.

**భుగుండం :** ఓ సహృదయ అయిన కాకి. మహామేరు పర్వతంపై గల కల్పవృక్షంపై ఓ గూడులో నివసించేదీ. దేవలోకంలో దీనిగురించి విని వశిష్ఠుడు కలసి దీని వివరాలు అడగగా నేను చుండుడనే కాకికి అలంబసుని వాహనాలు నైహంసలకు జన్మించిన 21 మంది సంతానంలో ఒకతెనని, తక్కినవారు కొన్ని యుగాలు జీవించి అర్థరహితమైన జీవితం గడపలేక శరీరాన్ని విడిచి స్వర్గం చేరాయని చెప్పింది. అంతేగాక నేను కొన్ని యుగాలు చూశానని బ్రాహ్మణులు తాగుబోతులుగా శూద్రులు అదృష్టవంతులుగా వుండటం చూశానని నాకు ఇది 80వ జన్మ అని ఎందరో ఇంద్రుల్ని చూశానని హిరణ్యాక్షుడు మూడు సార్లు భూమిని పాతాళంలోకి తొక్కడం చూశానని దేవుడు ఎన్నో అవతారాలు ఎత్తడం గమనించానని శివుడు శ్రీకృష్ణుడితో 7 సార్లు యుద్ధం చేయడం చూశానని రామాయణగాథ విన్నానని చెప్పగా వశిష్ఠుడు దానిని దీవించి అక్కడనుండి వెళతాడు. - *జ్ఞానవాశిష్టం*

**భూకంపం :** విరూపాక్షుడను ఏనుగు ఈ భూమి భారం మోస్తూ ఉంటుందని భూమి బరువై బాధించి నపుడు ఈ ఏనుగు తల విదిల్చినపుడు భూకంపం పుడుతుందని చెప్పబడింది. - *రామాయణం*

**భూతకర్ముడు :** కౌరవుల పక్షాన పోరాడిన వీరుడు. నకులుని కుమారుడైన శతానికుడు ఇతడిని వధించాడు. - *మహాభారతం*

**భూతజ్యోతి :** ఒక రాజు. సుమతి యొక్క కుమారుడు. వసువుకు తండ్రి.

**భూతదాముడు :** ఇతడొక ఇంద్రుడు. దేవతల అధిపతి అయిన ఇంద్రుడు కాదు. - *మహాభారతం*

**భూతమథనుడు :** సుబ్రహ్మణ్యస్వామి అనుచర వీరుల్లో ఒకడు. - *మహాభారతం*

**భూతలయం :** పురాణకాలం నాటి ఓ గ్రామం. ఇది దొంగలకు దోపిడీదారులకు నిలయం. ఈ గ్రామం గుండా ప్రవహించే నదిలో శవాలను పడవేశేవారు. ఈ నదిలో స్నానం చేయడం శాస్త్ర విరుద్ధం. - *మహాభారతం*

**భూతశర్మ :** కౌరవుల పక్షాన పోరాడిన యోధుడు. ద్రోణుడు ఏర్పరచిన గరుడ వ్యూహంలో ఓ ముఖ్య ప్రాంతంలో నిలబడ్డాడు. - *మహాభారతం*

**భూతసంతాపనుడు :** హిరణ్యాక్షుని కుమారుల్లో ఒకడు. - *భాగవతం*

**భూతాలు :** రుద్రుడు సృష్టించిన జీవులు. వీరు మానవుల్లో ఒక తెగ. వీరిని నాల్గు చిన్న తెగలుగా పురాణాలు విభజించాయి. అవి ధర్మ ప్రజ, ఈశ్వర ప్రజ, కాశ్యపేయ ప్రజ, పులహప్రజ.

*జననం :* వీరి సంతతికి ఆధ్యుడు పులహుడు. బ్రహ్మ రుద్రుణ్ణి సృష్టిచేయమని కోరగా ఇతడు తన భార్య సతివల్ల వేల భూతాలకు జన్మనిచ్చాడు. వారంతా రుద్రుని పోలికలే. సన్నని కాళ్లుచేతులు, పొడవైన చెవులు, బండగావుండి వేలాడే పెదాలు, ఎర్రని కళ్లు, పెద్ద కనుబొమలు, కరకుగా పొడవైన పళ్లు, పొడవైన గోళ్లు, మురికిపట్టిన జుట్టు, వీరంతా నగ్నంగా చేతిలో పుర్రెతో శివుని కొలువులో వుండేవారు. వీరి ఆయుధం త్రిశూలం, విల్లు, ఖడ్గం. రుద్రుడే వీరికి నాయకుడు. అందుకే ఇతడ్ని భూత నాయకుడని, గణ నాయకుడని అంటారు. భూతాలను పాలించిన ఎవరినైనా రుద్రుడనే పిలుస్తారు. వరుణ పురాణం ప్రకారం 11 కోట్ల భూతాలున్నాయి. శివునికి అంధకాసురునికి మధ్య జరిగిన యుద్ధంలో శివుని పక్షాన పోరాడాయి. వీరు దేవతలతో కలసి అసురులతో చాలాసార్లు పోరాడారు. దక్షయజ్ఞ సమయంలో మాత్రం వీరు దేవతలతో పోరాడారు. వీరెన్నో సార్లు దేవతలతోను, అసురుల తోను కలసి యుద్ధాలు చేశారు. ఉత్తర భారతాన్ని వదలి దక్షిణ భారతదేశం వచ్చారు. వైవశ్వ మన్వంతర సమయానికి వీరు దక్షిణాది వారయ్యారు.

**భూతివర్మ :** కణభూతి స్నేహితుడైన ఓ రాక్షసుడు.
– *కథాసరిత్సాగరం*

**భూతుడు :** యదువంశంవాడు. వసుదేవుడి కొడుకు. సుభద్రుడి సోదరుడు.

**భూపతి :** ఓ విశ్వదేవుడు. – మహాభారతం

**భూమి 1 :** పురాణాల ప్రకారం భూమి ఒక దేవత. భూమిపుట్టుక దాని మూల దేవతను గూర్చి వైరుధ్యమైన కథలున్నాయి.

భూమిదేవి బ్రహ్మ కుమార్తె. మహావిష్ణువు వివాహమాడాడు. మనం నివసించే భూమి మృతపిండం. దీని మూలదేవత భూమిదేవి. పురాణాల ప్రకారం భూమి పుట్టుక ప్రధానంగా మూడు రకాలు.

1) ఎంతో కాలం క్రితం భూమి ద్రవ రూపంలో వుంది. శివుడు తన తొడను కోసి ఓ చుక్క రక్తం పోయగా గుడ్డుగా మారింది. దానిని ఖండించగా ఓ మానవుడు బయల్పడ్డాడు. అదే ప్రకృతి. ఒక భాగం భూమిగా రెండవ భాగం ఆకాశంగా మారాయి.
– *కథాసరిత్సాగరం*

2) ఎక్కడ చూసినా నీరుండగా మహావిష్ణువు నీటిపై తేలుతుండగా విష్ణువు నాభినుండి బ్రహ్మ ఉద్భవించాడు. విష్ణువు చెవుల నుండి ద్రవం స్రవించింది. అందుండి మధుకైటబులు జన్మించి బ్రహ్మపైకి వెళ్లారు. మహావిష్ణువు వారిని వధించగ వారి చిక్కని శరీరం నీటితో కలసి భూమి ఏర్పడింది. – *భాగవతం*

3) మహావిరాట్ స్వరూపుడైన మహావిష్ణువు జగమంతా నిండి నీటిపై తేలియాడుతున్నాడు. ఆ మహావిరాట్ స్వరూపంలో ప్రతిభాగంలో బ్రహ్మాండం నిండి వుంది. కొంతకాలానికి మహావిరాట్‌కి మెదడు వచ్చింది. ఆ మెదడు ఇతర మహావిరాట్ అన్ని భాగాలలో కలసి పంచభూతాలు ఏర్పడ్డాయి. వాటి కలయిక వల్ల మహాపృథ్వి ఏర్పడింది. అది ఎన్నోభాగాలుగా ఖండించబడి 'భూమి' శకలాలు ఏర్పడ్డాయి. వరదలొచ్చి ఈ భాగాలన్ని విడిభాగాలయ్యాయి. ప్రతి ఇలాంటి బ్రహ్మాండంలో భూమి, పర్వతాలు, అడవులు, సముద్రాలు, సూర్యుడు, ఇతర గ్రహాలు వున్నాయి. ప్రతి ఖండానికి ఒక్కొక్క బ్రహ్మ, విష్ణువు, శివుడు, దేవతలున్నారు. ఇవన్నీ కూడా వరదల్లో నశిస్తాయి. – దేవీభాగవతం

భూమిదేవి మహావిష్ణువు యొక్క భార్య. ఒకసారి హిరణాక్షుడను రాక్షసుడు భూమినెత్తి నీటి అడుక్కి తోసివెయ్యగా మహావిష్ణువు వరాహరూపుడై తన కొమ్ములతో భూమిని పైకి తీసుకురాగా భూమిదేవి ప్రత్యక్షమై మహావిష్ణును వరించింది. వారి కలయిక ఓ దేవతా వర్షకాలం జరిగింది. అప్పటినుండి ఆమె మహావిష్ణువు భార్య అయ్యింది. వారికి జన్మించిన బిడ్డే మంగళుడు. – దేవీభాగవతం

నరకాసురుడు కూడా భూమిదేవి పుత్రుడే. హిరణ్యాక్షుడు భూమిని తన కొమ్ములతో పాతాళానికి నెట్టిన పుడు వారిద్దరి కలయికవల్ల నరకాసురుడు జన్మించగా భూమిదేవి శ్రీకృష్ణుడిని ప్రార్థించి నరకాసురునికి వైష్ణవాస్త్రాన్ని ప్రసాదింపజేసింది. రాముని భార్య సీత కూడా భూమిదేవి కూతురే. అందు వల్లనే సీతను చివరి క్షణాలలో తనలో కలుపుకుంది.

ప్రహ్లాదుడు హిరణ్యాక్షుడి సోదరుడైన హిరణ్యకశిపుని కుమారుడు. ప్రహ్లాదుడ్ని అతని తండ్రి ఓ భవంతి నుండి క్రిందకు పడవేయగా భూమిదేవి అతనికి అపాయం లేకుండా తన చేతుల్లోకి తీసుకుంది.
- బ్రహ్మాండపురాణం

శివపార్వతుల సంగమాన్ని భగ్నం చేసిందని పార్వతి భూమిదేవిని సంతాన హీనగా శపించింది.
- రామాయణం

పరశురాముడు భూమినంతా జయించి కశ్యపునికి దానమిచ్చినందువల్ల ఈమెను కాశ్యపి అనికూడా పిలుస్తారు.

**భూమి 2 :** ధ్రువుని భార్య. ఈ భూమిదేవి శిశుకుమారుని కుమార్తె. ఈమెకు కల్ప, వత్సలులను ఇద్దరు పుత్రులు ధ్రువునివల్ల జన్మించారు. - భాగవతం

**భూమి 3 :** భూమిపతి అనురాజు యొక్క భార్య.
- మహాభారతం

**భూమింజయుడు :** కౌరవుల పక్షాన పోరాడిన ఓ వీరుడు. ద్రోణుడు పన్నిన గరుడవ్యూహం మధ్య భాగంలో ఉన్నాడు. - మహాభారతం

**భూమిపతి :** ఓ విశ్వదేవుడు. - మహాభారతం

**భూమిపాలుడు :** ప్రాచీన భారతదేశంలో ఓ క్షత్రియ రాజు. క్రోధవశుని ఓ శరీరభాగం నుండి జన్మించాడు. - మహాభారతం

**భూమిశయుడు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. అమూర్తదయనుడను రాజు ఇతనికి ఓ ఖడ్గాన్ని బహూకరించగా ఇతడు దాన్ని దుష్యంతుని కుమారుడైన భరతుడికిచ్చాడు. - మహాభారతం

**భూరి :** భూరిశ్రవుడి సోదరుడు. కురుక్షేత్ర యుద్ధంలో మరణించాడు. - చూ॥ భూరిశ్రవుడు

**భూమికీర్తి :** ఓ రాజు. ఇతనికి ఇద్దరు కుమార్తెలు. చంపిక, సుమతి. వీరిని లవుడు, కుశుడు వివాహమాడారు. - ఆనందరామాయణం

**భూరితేజసుడు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. క్రోధవశుడను రాక్షసుని శరీర భాగం నుండి జన్మించాడు.
- మహాభారతం

**భూరిద్యుమ్నుడు 1 :** యముని కొలువులో ఒక రాజు. గోదానం చేయడం వల్ల స్వర్గం వెళ్లాడు.
- మహాభారతం

**భూరిద్యుమ్నుడు 2 :** ఓ రుషి. శాంతిదూతగా హస్తినాపురం వెళ్లాడు. మార్గమధ్యంలో శ్రీకృష్ణుడిని కలసి అతనికి ప్రదక్షిణం చేశాడు. - మహాభారతం

**భూరిద్యుమ్నుడు 3 :** వీరద్యుమ్నుని ఏకైక కుమారుడు. ఇతడు అరణ్యంలో తప్పిపోయాడు. - మహాభారతం

**భూరిచలుడు (భీమబలుడు) :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. ఇతణ్ణి కురుక్షేత్ర యుద్ధంలో భీమసేనుడు వధించాడు. - మహాభారతం

**భూరిశ్రవుడు :** కురు వంశరాజైన సోమదుని కుమారుడు. ఇతనికి భూరి, శాలుడను సోదరులు కలరు. వీరంతా ద్రౌపది స్వయంవరానికి వచ్చారు. ఇతడు పాండవుల పరాక్రమాలను వివరించి దుర్యోధనుడ్ని వారితో శాంతంగా వ్యవహరించమని సలహా ఇచ్చాడు. ధర్మజుని రాజసూయ యాగానికి వచ్చాడు. దుర్యోధనునికి సహాయం చేయడానికి అక్షౌహిణి సైన్యంతో వచ్చాడు. భీష్ముడితణ్ణి రక్షకుడుగా యుద్ధపతిగా అభివర్ణించాడు. సాత్యకితో పోరాడాడు. సాత్యకి 10 మంది కుమారుల్ని వధించాడు. భీమసేనుడితో, శిఖండితో ద్వంద్వ యుద్ధం చేశాడు. సాత్యకి దెబ్బకు క్రింద పడగా అర్జునుడి అస్త్రంతో ఓ చెయ్యి తెగింది. సాత్యకి ఇతణ్ణి వధించగా స్వర్గం చేరాడు. విశ్వదేవుల్లో ఒకడయ్యాడు. - మహాభారతం

**భూరిసేనుడు :** ఇక్ష్వాకుడి తమ్ముళ్లలో ఒకడైన శర్యాతి కుమారుల్లో ఒకడు.

**భూరిహనుడు :** ఓ రాక్షసుడు. అంతకుముందు ఇతడొక రాజు. - మహాభారతం

**భూలింగం :** హిమాలయాల కవతల నివసించే ఓ పక్షి. 'మాసాహస' అని దీని అరుపు వినిపిస్తుంది. సింహం నోటిలోని మాంసం తిని జీవిస్తుంది. - మహాభారతం

**భేది :** సుబ్రహ్మణ్యస్వామి సేవిక. - మహాభారతం

**భేరీస్వత :** సుబ్రహ్మణ్యస్వామి సేవిక. - మహాభారతం

**భేరుశంకుడు :** రుశంకుడి మరోపేరు. యదు వంశం వాడు. శ్వాహితుడి కొడుకు. శశిబిందువు పితామహుడు.

**భేరుశేకుడు :** చిత్రరధుడి తండ్రి. క్రోష్టుపు వంశం వాడు. - భాగవతం.

**భేల :** ఇతడు పునర్వసు ఆత్రేయ శిష్యుడు. పునర్వసువు ఆయుర్వేదాచార్యుడు. ఇతడు అగ్నివేశుని సమకాలీనుడు. 'భేల సంహిత' అనే ఆయుర్వేద గ్రంథం రచించాడు.

**భేషజం :** ఆయుర్వేదంలో వైద్య చికిత్సా విధానం.

**భైరవి :** అంబికా దేవియొక్క ఎనిమిది రూపాల్లో ఒకటి. ఆ రూపాలు రుద్రార్చిక, రుద్రచండి, నటేశ్వరి, మహాలక్ష్మి, సిద్ధచాముండిక, సిద్ధయోగేశ్వరి, భైరవి, రూపవిద్య.

**భైరవుడు 1 :** ధృతరాష్ట్ర కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. ఇది జనమేయుని సర్పయాగంలో మరణించింది.
– *మహాభారతం*

**భైరవుడు 2 :** శివుని పార్షదుడు.

దక్షయజ్ఞమునకు శివుని ఆహ్వానించకపోగా అతని సతిని అగౌరవ పరచగా ఆమె యజ్ఞగుండమున దూకెను. శివుడు వచ్చి ఉగ్రుడై తన జుట్టు ముడిని నేలకు విసరికొట్టగా ఓ వికృతరూపుడు జన్మించి శివుని అనుమతి లేకయే దేవతలను సంహరించగా శివుడు వృక్షంగా మారమని శపించాడు. ఇంతలోనే శివుడు కరుణించి దేవుళ్లను పూజించేవారికి సంపూర్ణ అనుగ్రహం కావాలంటే భైరవుని కూడా పూజించాలని శాపవిమోచనం చేశాడు. దేవతలను ఓడించాడు కనుక ఈ చెట్టును దమనకం అని, తాతిరి వృక్షమని పిలుస్తారు. – *అగ్నిపురాణం*

ఒకసారి బ్రహ్మ విష్ణువులు గర్వంతో వాదు లాడుకొనుచుండగా బ్రహ్మ శివుడిని కూడా ఎగతాళి చేయగా శివుని ఆగ్రహ జ్వాలనుండి భైరవుడు జన్మించి బ్రహ్మ ఐదో తలను త్రుంచివేశాడు. – *లింగపురాణం*

బ్రహ్మ శిరస్సును త్రుంచుటవల్ల బ్రహ్మహత్యా పాతకమంటుకొనగా దానిని పోగొట్టుకొనుటకు బ్రహ్మ కపాలముతో బిక్షాటన చేస్తూ బయలుదేరగా శివుడు 'బ్రహ్మహత్య' అను స్త్రీని సృష్టించి అతని వెనుక పంపెను. ఇతడెన్నో పుణ్యక్షేత్రాలు తిరిగినా ఆ పాతకం పోనందున శివుని ఆజ్ఞపై వారణాసికి వెళ్లి ఆ పాపం పోగొట్టుకొని ఆ కపాలాన్ని వారణాసిలో పాతిపెట్టెను. అందువల్ల ఆ స్థలానికి 'కపాలమోచన తీర్థం' అని పేరు వచ్చెను.

*ఇతర విశేషాలు :* బృంగి శివుని ద్వారపాలకుడు. పార్వతి శాప వశమున భైరవునిగా జన్మించెను.
– *చూ॥ బృంగి 2*

**భైరవులు :** గోలోకంలో శ్రీకృష్ణుడి ఎడమ కంటి నుండి జన్మించారు. వీరు త్రినేత్రులు, దిగంబరులు, చంద్రశేఖరులు, రురువు, సహారుడు, కాలుడు, అసితుడు, క్రోధుడు, భీషణుడు, మహాభైరవుడు, ఖట్వాంగుడు.

**భోగవతి :** ఇదో నగరం. నాగులు నివసిస్తారు. ఇక్కడే సర్పరాజు వాసుకి వుంటాడు. సుగ్రీవుడు సీతను వెదకటానికి పాతాళంలోని ఈ నగరానికి కూడా పంపాడు.
– రామాయణం

**భోగవంతం :** ఇదో పర్వతం. భీముడు దీన్ని గెలుచుకున్నాడు. – *మహాభారతం*

**భోజ :** సౌవీర దేశంలోని ఓ అందాల యువతి. ఈమెను సాత్యకి ఎత్తుకుపోయి వివాహం చేసుకున్నాడు.
– *మహాభారతం*

**భోజకటం :** విదర్భ రాజ్య రాజధానీ నగరం. దీన్ని ఒకసారి సహదేవుడు జయించాడు. శ్రీకృష్ణుడిక్కడే రుక్మిణి సోదరుడు రుక్మిని ఓడించి రుక్మిణిని తీసుకు వెళ్లాడు. దీని పూర్వనామం కుండినపురం.
– *మహాభారతం*

**భోజం/భోజవంశం :** యదువంశంలోని ఒక తెగ.
– *మహాభారతం*

**భోజకుడు :** ఓ బ్రాహ్మణుడు. –*చూ॥ పాటలీపుత్రం*

**భోజుడు 1 :** మార్తికావటమను ప్రాచీన దేశపు రాజు. ఇతడు ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. కురుక్షేత్ర యుద్ధంలో అభిమన్యుడితణ్ణి వధించాడు.
– *మహాభారతం*

**భోజుడు 2 :** యదువంశపు రాజు. ఉశీనార మహారాజు దెబ్బకు మరణించాడు. భోజవంశం ఇతనితోనే ప్రారంభమయ్యింది.

**భోజుడు 3 :** సంస్కృత పండితుడైన ఒక రాజు. ఇతడు క్రీ.శ. 1018 నుండి 1054 వరకు ధారా నగరాన్ని రాజధానిగా పాలించాడు. సరస్వతీ కంఠాభరణం, శృంగార ప్రకాశిక ఇతని ముఖ్య రచనలు. మొదటి గ్రంథంలో కవిత్వపు మంచి చెడులను చర్చించాడు. రుద్రకుడు చెప్పిన నాల్గురీతులే గాక అవంతి, మాగధ రీతుల్ని ప్రవేశపెట్టాడు.

**భోజుడు 4 :** సుదాసుని అనుయాయి. విశ్వామిత్ర మహర్షి అశ్వమేధ యాగానికి సహాయపడ్డాడు.
– రుగ్వేదం

**భోజుడు 5 :** కన్యాకుబ్జ రాజు. ఇతడొక విచిత్ర యువతిని చూశాడు. ఆమె శరీరం మానవాకృతి, ముఖం మాత్రం ఆడలేడి ముఖం. ఆమెను దీని వెనుక కథ అడగగా "నా క్రితం జన్మలో ఆడలేడినని నేనొక కొలనులో దిగగా మునిగిన వరకు మానవ శరీరాకృతి వచ్చిందని చెప్పింది. అప్పుడు రాజు ఆమెను అదే కొలనుకు తీసుకువెళ్లి ఆ పవిత్ర నదిలో మొత్తం ముంచగా నిజస్త్రీగా మారింది. అతడామెను వివాహమాడాడు. – *స్కందపురాణం*

**భోజులు :** యాదవులలో ఒక తెగ. సాత్వతుడి కొడుకైన భోజుడి వంశస్తులు. వీరి ముఖ్య పట్టణం ధారాపురం.

**భోజ్య :** భోజ యువరాణి. ఈమెను జ్యామఘుడను యాదవుడు ఎత్తుకువెళ్లి విదర్భుడను తన కుమారుడికిచ్చి వివాహం చేశాడు. – *మహాభారతం*

**భౌముడు 1 :** ఇతడు 14వ మనువు. ఈ మనువు కాలంలో శుచి ఇంద్రుడవుతాడు. ఇతని ఆధీనంలో 5 తెగల దేవతలుంటారు. వారిని చాక్షుషులు, పవిత్రసులు, కనిష్ఠసులు, భ్రాజికసులు, వాపావృద్ధసులు అంటారు. ఆ కాలపు సప్తర్షులు అగిబాహు, శుచి, శుక్ర, మాగధ, అగ్నీద్రు, యుక్త, జితలు. ఆ కాలంలో భూమిని కాపాడే మనువు కుమారులు ఊరు, గంభీర బుద్ధి మరి ఇతర రాజులు. – *విష్ణుపురాణం*

**భౌముడు 2 :** నరకాసురుని మరో పేరు.

**భౌముడు 3 :** సింహికకు విప్రచిత్తి వల్ల జన్మించిన రాక్షసుడు. పరశురాముడితణ్ణి వధించాడు. – *బ్రహ్మాండపురాణం.*

**భంగకారుడు 1 :** చంద్రవంశజుడైన కురుని మనుమడు. అవిక్షిత్తు కుమారుడు. – *మహాభారతం*

**భంగకారుడు 2 :** యదువంశపు రాజు. రైవత పర్వతంపై జరిగిన ఉత్సవాలలో పాల్గొన్నాడు. – *మహాభారతం*

**భంగాసురి :** రుతుపర్ణుడను రాజు యొక్క మరోపేరు.

**భంగాస్వనుడు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. కొడుకుల కోసం యాగం చేయగా వందమంది పుడతారు. వేటకు వెళ్లి దాహార్తియై ఓ కొలనులో దిగి ఇంద్రుడి మాయవల్ల స్త్రీగా మారి బయటకు వస్తాడు. స్త్రీగా కూడా పిల్లల్ని కని రాజ్యానికి పంపగా ఇంద్రుడు వారి మధ్య వైరం కల్పించి వారంతా మరణించేట్లు చేస్తాడు. ఈమె ఇంద్రుడి శరణువేడగా అందర్నీ బ్రతికించి పురుషత్వంకూడా ఇస్తానని ఇంద్రుడు చెప్పగా స్త్రీకే సుఖం ఎక్కువ కనుక ఆమె పురుషత్వాన్ని కోరుకోదు. – *మహాభారతం*

**భంగం :** తక్షకుని వంశంలోని ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణిస్తుంది. – *మహాభారతం*

**భృగుడు :** ఓ రుషి. బ్రహ్మ తనయుడు. భృగు వంశానికి మూలపురుషుడు. భృగు వంశ కుటుంబీకుల్ని భార్గవులని అంటారు. ఈ వంశంలో ప్రసిద్ధులైన రుషులు జన్మించారు.

*జననం :* భృగుడు బ్రహ్మచర్మం నుండి జన్మించాడు. వహ్ని అనే అగ్నినుండి జనించాడు.

పై రెండు వైరుధ్యాలను బట్టి భృగునికి రెండు జన్మలున్నాయని తెలుస్తోంది. దక్షయజ్ఞ సమయంలో శివుని భార్య సతి యజ్ఞగుండంలో దూకకా శివుడు రుద్రుడై భైరవుడ్ని సృష్టించగా అతడు దేవతల్ని చంపాడని అందులో భృగుడు కూడ వున్నాడని భాగవతం చెప్తోంది. అనగా బ్రహ్మ చర్మంనుండి జన్మించిన భృగుడు దక్ష యజ్ఞ సమయంలో మరణించాడు. భృగుడు వరుణ పుత్రుడని కొన్ని పురాణాలు అభివర్ణిస్తున్నాయి. వైవశ్వత మన్వంతరంలో వరుణుడు యజ్ఞం చేస్తుండగా అక్కడకు వచ్చిన బ్రహ్మకు ఓ అప్సరసను చూసి వీర్యస్కలనం జరగగా అది అగ్నిలో పడి అందుండి భృగుడు జన్మించాడని కొన్ని పురాణాలు చెప్తున్నాయి. అనగా దక్ష యజ్ఞంలో మరణించిన భృగుడు వరుణుడి యజ్ఞంలో బ్రహ్మపుత్రుడుగా పునర్జన్మించాడు.

*భృగు వంశాలు :* భృగుని రెండు జన్మల్లో రెండు కుటుంబ వంశాలకు కారణమయ్యాడు.

*మొదటి కుటుంబం :* భృగుడు ఖ్యాతిని వివాహమాడగా అతనికి లక్ష్మి అనే పుత్రిక, ధాత, విధాత, కవి అనే కుమారులు జన్మించారు. ధాత, విధాతలు, మహామేరువు కుమార్తెలైన ఆయతి, నియతిలను వివాహమాడారు. ధాతకు ప్రాణుడు, విధాతకు మృకండుడు జన్మించాడు. ప్రసిద్ధ మార్కండేయుడు మృకండుని కుమారుడు. మార్కండేయుని కుమారుడు వేదశిరసు.

*రెండవ కుటుంబం :* భృగుని రెండవ జన్మలో పులోమను వివాహమాడగా వారికి భూత, చ్యవనుడు,

వజ్రశిరసు, శుచి, శుక్ర, సాతనులు జన్మించారు. భూతకు ఏకాదశ, కోటిరుద్రులు జన్మించగా, చ్యవనుని ఇద్దరు భార్యల వల్ల ఘృతాచి అతని సంతతిలో శౌనకమహర్షి జన్మించాడు. చ్యవనుని రెండవ భార్య ఆరుషి వల్ల ఔర్యుడు అతని సంతతిలో రుచికుడు, జమదగ్ని, పరశురాముడు వంటి ప్రసిద్ధులు జన్మించారు.

*భృగువు మహావిష్ణును శపించుట :* దేవదానవులకు యుద్ధం జరుగగా అసురుల తల్లి దితి భృగువుకు మొరపెట్టుకోగా భృగువుభార్య దేవతల మరణానికి తపస్సు చేయసాగింది. దేవతలు మహావిష్ణువు అనుగ్రహం కోరగా అతడు తన వజ్రాయుధంతో ఆమెను వధించాడు. భృగువు కోపావేశంతో మహా విష్ణువును మానవజన్మ ఎత్తి భార్యా వియోగంతో జీవించమని శపించాడు. ఆ శాపఫలమే మహావిష్ణు శ్రీరామావతారం, సీతావియోగం.

*మహావిష్ణువే గౌరవనీయుడని నిర్ణయించుట :* దేవతల మధ్య త్రిమూర్తులలో వైరుధ్యాలేర్పడి కొందరు బ్రహ్మ మరికొందరు శివుడు ఇంకొందరు మహావిష్ణువు గొప్పవారని వాదోపవాదాలాడుకొని ఆ నిర్ణయభారాన్ని భృగునిపై వేశారు. భృగుడు ముగ్గుర్ని దర్శించి బ్రహ్మ, శివుడు పూజనీయులు కారని, మహావిష్ణువే పూజనీయుడని తేల్చాడు. - *భాగవతం*

*భృగుతీర్థం :* దశాశ్వమేధానికి దగ్గరలో భృగుడు చిరకాలం శివుడ్ని గూర్చి తపస్సు చేశాడు. ఆ తపశ్శక్తి వల్ల ఆ ప్రాంతం ప్రసిద్ధికెక్కి భృగు తీర్థమని పిలవబడింది. - పద్మపురాణం

యాదవులను శపించిన వారిలో భృగువు ఒకడు. పరశురాముడు క్షత్రియ సంహారానంతరం తన మూల పురుషుడైన భృగుని దర్శించి అతని ఆశీర్వాదం పొందాడు. భృగుడు మహాభారతయుద్ధం ఆపే ప్రయత్నం చేశాడు. ఇతడు ఇంద్ర, యమ సభల్లో సభ్యుడు.

**భృగుతీర్థం :** భృగుడు తపస్సు చేయడం వల్ల పుణ్య తీర్థంగా మారిన ప్రాంతం. - చూ॥ *భృగుడు*

**భృగుతుంగం :** భృగుడు తపస్సుచేసిన శిఖరం. ఇచ్చట రుచికుడు భార్యాబిడ్డలతో నివసించాడు. - రామాయణం

**భృగువు :** ఓ ముని. వరుణుడి కుమారుడు. తండ్రి వద్దకు వెళ్లి 'బ్రహ్మ' గురించి తెలుసుకొనే మార్గం తెలుపమంటాడు. అన్న, ప్రాణ, చక్షువానందాదులు బ్రహ్మమని తండ్రివల్ల తెలుసుకొంటాడు. - *ఐతరేయ ఉపనిషత్తు.*

**భృగుప్రవణం :** హిమాలయాల్లో సగరుడు తపస్సు చేసిన పర్వతం.

**భృశాశ్వుడు 1 :** ఒక ప్రజాపతి. దక్షప్రజాపతి కుమార్తెలు జయ, సుప్రభలను వివాహమాడతాడు. వీరి సంతానం 'అస్త్రా' లు కాగా విశ్వామిత్రుడు గ్రహిస్తాడు. - రామాయణం

**భృశాశ్వుడు 2 :** విశ్వామిత్రుడికి అస్త్రవిద్య నేర్పిన గురువు. - *ఉత్తర రామాయణం*

**భృశుంది :** ఓ మత్స్యకారుడు. దొంగతనాలు చేసి జీవించేవాడు. ముద్గల మహర్షి అడవిలో ప్రయాణిస్తుండగా ఇతడు అడ్డగించి ముని బ్రహ్మతేజస్సు చూసి ఆశ్చర్యపోగా ముద్గలుడు గణేశుడిని ప్రార్థించమని సలహా ఇస్తాడు. దాన్ని భృశుంది ఆచరించగా ఏనుగు తొండం ఒకటి అతని ముఖం నుండి జన్మించగా ఇంద్రుడొకసారి నిజగణేశుడని పొరబడి ఇతణ్ణి దర్శించాడు. - *గణేశ పురాణం*

**భృంగి 1 :** శివభక్తుడైన ఓ మహర్షి. ఒకసారి కైలాసం వెళ్లి శివునికి ప్రదక్షిణం చేయబోగా శివపార్వతులు ఒకే శరీరులై వుండగా శివుని చుట్టూ మాత్రమే ప్రదక్షిణ చేయడం సాధ్యంకాక పురుగుగా మారి శివపార్వతులు కలసిన భాగాన్ని తొలచుకుంటూ వెళ్ళి శివునికి మాత్రమే ప్రదక్షిణం చేశాడు. పార్వతి ఆగ్రహించి శారీరకంగా బలహీనుడవుకమ్మని శపించింది. అతని కాళ్లు బలహీనమై శరీరాన్ని మోయలేకపోగా మరల శివుణ్ణి ప్రార్థించగా అతనికి మూడవకాలు ఇచ్చి శివుడు అనుగ్రహించాడు. అందు వల్ల భృంగి మహర్షుల్లో మూడు కాళ్లు కలవాడయ్యాడు.

**భృంగి 2 :** శివుని వీర్యమును అగ్ని ధరించినపుడు రెండు బిందువులు గిరి ప్రస్థమున పడగా అందుండి భృంగి, మహాకాళి జన్మించిరి. భృంగి శివుని ద్వారపాలకుడయ్యెను. పార్వతి వివస్త్రగా వున్నపుడు భృంగి చూసెను. ఆమె కోపించి మనుష్య జాతియందు

జన్మించ మని శపించెను. ఇతడు పార్వతీపరమే శ్వరులను ప్రార్థించగా మీకు మేమే జన్మనిచ్చెదమని చెప్పిరి. దక్షయజ్ఞ సమయమున శివుడు తన జుట్టు ముడిని కోపంతో నేలకు కొట్టగా భృంగి భైరవుడుగా, మహాకాళి బేతాళుడై జన్మించిరి. – కాళికా పురాణం

**భ్రమరాంబ :** శ్రీశైలంలో ప్రతిష్టించబడిన పరాశక్తి యొక్క అవతారం.

**భ్రమరుడు :** సౌవీర రాజకుమారుడు. జయద్రథుని స్నేహితుడు. ద్రౌపదిని జయద్రథుడు అరణ్యవాస సమయంలో ఎత్తుకెళ్లే సమయంలో అతని వెనుక వున్నాడు. అర్జునుడు ఇతణ్ణి వధించాడు.

– *మహాభారతం*

**భ్రమి :** శింశుమారుడను రాజు కూతురు. ధ్రువుడి భార్య. ఈమె కుమారులు వత్సలుడు, కల్పుడు.

– *భాగవతం*

**భ్రామరి :** జంభాసురుని అనుచరి అయిన ఓ రాక్షసి. జంభాసురుని ఆనతిపై గణేశుని వధించడానికి కశ్యపుని ఇంట జన్మించి విషాహారం ఇవ్వబోగా అది గమనించిన గణేశుడు ఈ రాక్షసిని చంపాడు.

– *గణేశ పురాణం*

**భ్రాసకర్ణుడు :** ఓ రాక్షసుడు. సుమాలి కేతుమతిల కుమారులు పదిమందిలో ఒకడు. వీరుకాక నల్గురు పుత్రికలు. – *ఉత్తర రామాయణం.*



**మ :** ఈ అక్షరానికి సంపద, గౌరవం, మాతృమూర్తి అని అర్థం.

**మకరగిరి :** మహామేరు వద్ద గల ఒక పర్వతం. మహా మేరు పర్వతం 2 వేల యోజనాల పొడవు, 6 వేల యోజనాల ఎత్తు వుంటుంది. దీనికి నాల్గు వైపులా రెండేసి పర్వతాలు వుంటాయి. దీని ఉత్తర దిక్కున గల రెండు పర్వతాల్లో మకరగిరి ఒకటి.

– *దేవీ భాగవతం*

**మకరదంష్ట్ర :** శ్రీకృష్ణుని జన్మస్థానమైన మధురలో ఓ వేశ్య. ఈమె కథను గూర్చి వసంతకుడు వాసవదత్తకు వివరించాడు.

ఈమె వేశ్యయే కాక అందర్ని మోసపుచ్చి ధన సంపాదనే ధ్యేయంగా జీవించేది. ఈమె కుమార్తె రూపిణిక. ఈమెనుకూడా వేశ్యావృత్తిలోకి దింపాలని ప్రయత్నించింది. ఒకసారి తల్లి కోర్కెపై సుదూరంలో గల ఓ గుడికి పూజకై వెళ్లి అక్కడున్న లోహజం ఘుడను బ్రాహ్మణ యువకుని చూసి మోహించింది. ఆమె అందానికి అతడు ముగ్ధుడై ఆమె కోర్కెపై రూపి ణిక ఇంటికి వచ్చి మకరదంష్ట్ర లేని రాత్రి ఆమెతో గడిపాడు. ధనహీనుడైన బ్రాహ్మణుని ప్రేమలోపడి వృత్తికి దూరమవుతుందని గ్రహించి రాజ యువకుడ్ని రావించి లోహజంఘుడ్ని కొట్టి, దూరంగా తీసుకు వెళ్ళి దాచి వెయ్యగా అతడు తప్పించుకొని అనూ హ్యంగా విభీషణుని నగరం చేరాడు. అతని భటులి తణ్ణి విభీషణుని ముందుకు తీసుకు వెళ్లగా తాను విష్ణుభక్తుడినని నా కష్టాలు తీర్చగలరని మీ దర్శనా నికి వచ్చానని చెప్పగా అతడు విష్ణు ముద్రికలు నాణాలు ధనము కానుకగా ఇచ్చి పంపగా ఇతడు తిరిగి మధురానగరం చేరుకున్నాడు. అతడు మకర దంష్ట్రను అవమానపరచి రూపిణికను వివాహమాడా లని నిశ్చయించుకొని కొంతధనం వేరేచోట దాచు కొని కొంతఖర్చుపెట్టి దానితో విష్ణు రూపందాల్చి మకరదంష్ట్ర ఇంటికి వెళ్లి రూపిణికతో గడుపుతాడు. మకరదంష్ట్ర ఇతని విషయం కుమార్తెనడుగగా అతడు మహావిష్ణువని అతడు తలచినంతనే వైకుంఠానికి తీసుకువెళ్లగలడని వివరించగా పేరాశతో అతడిని వైకుంఠం తీసుకొని వెళ్లమని కోరింది. ఈ రూపం వైకుంఠం వెళ్లడానికి అడ్డం అని చెప్పి నగ్నంగా గుండు గీయించుకొని రంగుపులుముకుని వుంటే ఈశ్వరుని సేవికగా కన్పించి వైకుంఠానికి తేలిగ్గా తీసుకొని వెళ్లగలనని చెప్తాడు. ఆమె అలా తయారు కాగా అతడు తన గాలిపటంపై ఆమెను ఎక్కించుకొని ఓ గుడి గోపురంపై కూర్చోబెట్టగా వెంటనే వైకుంఠం చేరతాననే భ్రమలో వుంటుంది. ఈలోపు లోహజం ఘుడు గుడిలో ప్రార్థిస్తున్న విష్ణుభక్తుల నుద్దేశించి "మారి" అనే రాక్షసి మీద పడబోతుందని అది సర్వనా శనకారి అని అది పడకుండా విష్ణువును ప్రార్థించమని కోరతాడు. ఒకరాత్రి ఒక పగలు గడచిపోతుంది. ఆమె అలాగే కూర్చొని భయపడుతుంది. కిందవున్న

ప్రజలు ఆమె రాక్షసి అని భావించి తమపై పడకుండా పూజలు చేస్తుండగా విష్ణువు రూపంలో వున్న లోహ జంఘుడు నిజరూపంలో గుడిలోని భక్తులతో కలసి వినోదిస్తుంటాడు. రాజభటులు ఈ విషయం రాజుకు తెలియ జేయగా అతడొచ్చి ఆమెని గుర్తించి అందరినీ మోసం చేసే మకరదంష్ట్రను మోసంచేసిన వ్యక్తి ఎవరో తెలియజేస్తే బహుమతిగా నా రాజ్యాన్ని ఇస్తానని ప్రకటించగా లోహజంఘుడు ముందుకొచ్చి తన కథ రాజుకు వివరించగా రాజు మాటకు కట్టుబడి తన రాజ్యాన్ని లోహజంఘుడికిస్తాడు. ఇతడు రూపిణికను కూడా స్వంతం చేసుకుంటాడు. – కథాసరిత్సాగరం

**మకరద్వజుడు 1 :** హనుమంతుని కుమారుల్లో ఒకడు. హనుమంతుడు లంకకు లంఘిస్తుండగా అతని చెమట బిందువులు ఓ ముసలి నోట్లోపడగా ఇతడు జన్మించాడు. – ఆనంద రామాయణం

**మకరద్వజుడు 2 :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. కురుక్షేత్ర యుద్ధంలో భీముడితణ్ణి వధించాడు.

**మకరాక్షుడు :** ఖరుని కుమారుడు. రామరావణ యుద్ధంలో కుంభనికుంభుల మరణం తర్వాత రామునితో యుద్ధం చేసిన అసురుల్లో ప్రముఖుడు. రామునితో మహాసంగ్రామం చేసి చివరికి రాముని చేతిలో మర ణించాడు. – రామాయణం

**మకరి :** ప్రాచీన భారతదేశంలో పురాణ ప్రసిద్ధ నది. – మహాభారతం

**మక్షోపేతుడు :** ఓ దైత్యుడు, ఇతడు కార్తీక మాసంలో విష్ణువను ఆదిత్యుని చుట్టూ ప్రదక్షిణచేస్తుంటాడు. – భాగవతం

**మఖ :** ఇదో నక్షత్రం. చంద్రుడు దీనికి దగ్గరగా వుండటం అశుభశూచకం.

**మగద :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రసిద్ధ నగరం. ఇప్పటి దీని పేరు రాజగృహం. పురాణాలు ఎందరో ప్రసిద్ధ రాజులు దీన్ని పాలించినట్లు చెప్తున్నాయి. బృహద్రదుడు ఒకసారి దీన్ని పాలించాడు. కాలకే యుడైన జయత్సేనుడు పాలించాడు. పాండురాజు దీర్ఘుడను రాజును సంహరించి ఈ నగరాన్ని వశపరచు కున్నాడు. బృహద్రధుని కాలంలో జర అను రాక్షసిని కొలవవలసినదిగా ప్రజలను ఆజ్ఞాపించాడు. మహా భారత కాలంలో జరాసంధుడు దీన్ని పాలించాడు. భీముడితడ్ని మల్లయుద్ధంలో చంపగా జరాసంధుడి తమ్ముడు సహదేవుణ్ణి ఈ రాజ్యం పాలించమని శ్రీకృష్ణుడు ఆజ్ఞాపించాడు. రాజసూయ యాగంలో ఈ నగర ప్రజలు ధర్మజునికి కానుక లిచ్చారు. మహా భారత యుద్ధంలో ఈ దేశ రాజు, ప్రజలు పాండవుల పక్షాన యుద్ధం చేశారు. – మహాభారతం

**మగలు :** శాకద్వీపంలోని బ్రాహ్మణులను మగలు అని పిలుస్తారు. శ్రీకృష్ణుని కుమారుడు పాలించాడు. సూర్యుని గూర్చి తపస్సుచేసి సూర్య విగ్రహాన్ని గ్రహించి చంద్రభాగానదీతీరాన ఓ గుడి కట్టి ఈ విగ్రహాన్ని ప్రతిష్ఠించి దేవాలయంలో పూజలు చేయడానికి శాక ద్వీపం నుండి ఈ బ్రాహ్మణులను తీసుకువచ్చి నియ మించాడు. శాంబుని కోరికపై అక్కడున్న 18 బ్రాహ్మణ కుటుంబాలు ఈ దేవాలయానికివచ్చి ఇక్కడే స్థిర పడ్డారు. వారిని మగలు అని పిలుస్తారు. – భవిష్య, సాంబపురాణాలు

**మఘం :** ఇదో పవిత్ర స్థలం. దీన్ని దర్శిస్తే అగ్నిస్తోమ, అతిరాత్రాల వంటి యజ్ఞాలు చేసిన ప్రతిఫలం లభిస్తుంది. – మహాభారతం

**మచకృతం :** కురుక్షేత్రానికి ప్రక్కనే గల ఓ పవిత్ర స్థలం. దీనికి మచకృతుడను యక్షుడు కాపలా వుంటాడు. ఈ యక్షునికి నమస్కరిస్తే 1000 గోదానాల ప్రతి ఫలం లభిస్తుంది. – మహాభారతం

**మజ్జనుడు :** సుబ్రహ్మణ్య స్వామి అనుచరవీరుల్లో ఒకడు. – మహాభారతం

**మణి 1 :** ధృతరాష్ట్రుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. – మహాభారతం

**మణి 2 :** ఓ ముని. బ్రహ్మ కొలువులో సభ్యుడు. – మహాభారతం

**మణి 3 :** చంద్రుడు సుబ్రహ్మణ్యస్వామికిచ్చిన ఇద్దరు పార్షదసుల్లో ఒకడు. రెండోవాడు సుమణి. – మహాభారతం

**మణి 4 :** కద్రువకు కశ్యప ప్రజాపతివల్ల జన్మించిన వాడు. గిరివ్రజంలో నివసించేవాడు. ఇతడు శివుడ్ని ప్రార్థించి గరుడుని వల్ల అపాయం లేకుండా వరం పొందాడు. – బ్రహ్మాండపురాణం

**మణికాంచనం :** శాకద్వీపంలోని ఓ భూభాగం. ఇది శ్యామగిరి వద్ద వుంది. – మహాభారతం

**మణికుట్టిక :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు. – మహాభారతం

**మణిగ్రీవుడు :** నలకూబరుని సోదరుడు. – చూ॥ నలకూబరుడు

**మణిచరుడు :** ఓ యక్షుడు. రావణ కుబేరులకు జరిగిన యుద్ధంలో కుబేరునికి సహాయపడటమేగాక రావణుని సైన్యంలో బీభత్సం సృష్టించాడు. – ఉత్తర రామాయణం

**మణిద్వీపం :** దేవి నివాసస్థలం. ఇదో ద్వీపం. కైలాసానికి చాలా దూరంలో వుంది. – దేవీ భాగవతం

**మణినాగుడు :** కశ్యప ప్రజాపతికి కద్రువ వల్ల జన్మించిన సర్పం. ఇది గిరివ్రజంలో నివసించింది. – మహాభారతం

**మణినాగం :** ఇదో పవిత్ర స్థలం. ఇక్కడో రాత్రి గడిపితే 1000 గోదానాల ప్రతిఫలం లభిస్తుంది. ఇక్కడున్న దేవతకు పెట్టిన ప్రసాదం తింటే పాముకాటు వల్ల సంభవించే విషపు ప్రమాదం వుండదు. – మహాభారతం

**మణిపర్వతం :** పురాణ ప్రసిద్ధమైన పర్వతం. 16100 కన్యలను బలవంతంగా తీసుకు వచ్చి కంసుడు దక్షిణా పథంలోని ఈ పర్వతంపై బంధించాడు. – మహాభారతం

**మణిపుష్పకం :** పాండవులలో ఒకడైన సహదేవుని శంఖం పేరు. – మహాభారతం

**మణిపురం :** అర్జునుని భార్య చిత్రాంగధ జన్మస్థలం. అర్జునుని తీర్థయాత్రలో ఈమెను వివాహమాడి ఈమెతో 3 సంవత్సరాలు కాపురమున్నాడు. వారికి జన్మించిన కుమారుడే బభ్రువాహనుడు.

**మణిప్రవాళం :** మళయాళ సంస్కృతీ భాషల మిళితం వల్ల ఏర్పడిన భాష. మళయాళంలోని ప్రసిద్ధ గ్రంథాలన్ని ఈ భాషలోనే రచింపబడ్డాయి.

**మణిభద్రుడు 1 :** ఇతడో యక్షుడు. ఇతడిని పూజించిన వారి కోరికలు నెరవేరతాయి. తామ్రలిప్తి వద్దగల గుడిలో ఇతని విగ్రహాన్ని కూడా ప్రతిష్టించారు. ఎవరైన అక్రమ సంబంధం కలిగివుంటే వారిని మణిభద్రుడు ఆ రాత్రి గుడిలో బంధించి మరుసటి రోజు రాజు వద్ద ప్రవేశ పెడితే వారికి రాజు మరణ దండన విధిస్తాడు. ఒకరోజు సముద్రదత్తుడనే వైశ్యుడు మరోస్త్రీతో అక్రమ సంబంధం నెరపగా మరో గృహస్థుడు దీన్ని మణిభద్రుడికి తెలియజేయగా వారిని గుడిలో బంధిస్తాడు. భర్తను రక్షించుకొనడానికి సముద్రదత్తుడి భార్య పూజ కొరకు గుడికి వెళ్లినట్లు వెళ్లి తన దుస్తుల్ని లోనున్న స్త్రీకి ధరింపజేసి తాను ఆమె దుస్తులు ధరించి ఆమెను బయటకు పంపుతుంది. మరుసటి రోజు గుడి తలుపులు తీసి భార్యా భర్తలు మాత్రమే గుడిలో వుండటం గమనించి తప్పుడు సమాచారం ఇచ్చినందుకు గృహస్తుడ్ని శిక్షిస్తారు. – కథాసరిత్సాగరం

**మణిభద్రుడు 2 :** చంద్రవంశపు రాజు. అతనికి ఏడుగురు కుమారులు. వీరు ఆకతాయితనంతో అగస్త్య మహర్షిని అవమానించగా అతడు వీరిని అరటి చెట్లు కమ్మని శపిస్తాడు. వీరు శాపవిమోచన కోరగా శ్రీరాముడి వల్ల మీకు శాపవిమోచన లభిస్తుందని చెప్తాడు. – చూ॥ అగస్త్యుడు

**మణిభద్రుడు 3 :** ఓ యక్షుడు. ఇతడు వ్యాపారులకు యాత్రికులకు దేవతామూర్తి. ఇతడు కుబేరుని కొలువులో వుంటాడు. ఒకసారి కుండధనుడనే మేఘం కోరికపై బ్రాహ్మణుడికి వరమిచ్చాడు. అష్టావక్రుడొకసారి ఇతణ్ణి ఆహ్వానించాడు. మరుత్తుని సంపద తీసుకొని రావడానికి వెళ్లినపుడు ఇతణ్ణి దర్శించగా మణిభద్రుడితణ్ణి ఆశీర్వదిస్తాడు.

**మణిమతిపురి :** అసురులు కలిసే స్థలం. క్రూర రాక్షసుడైన ఇల్వలుడు ఇక్కడ నివసించాడు. నివాత కవచులను రాక్షసులు ఇక్కడే దాక్కోగా రావణుడు వీరిపై యుద్ధానికి వెళ్లాడు. – ఉత్తర రామాయణం

**మణిమయుడు :** శుకేశుడను అసురుని మామ. మణిమయుని కుమార్తె దేవవతిని శుకేశుడు వివాహమాడగా ముగ్గురు కుమారులు జన్మించారు. వారు మలయవానుడు, సుమాలి, మాలి. – ఉత్తర రామాయణం

**మణిమానం 1 :** ఇదో పుణ్యస్థలం. ఇక్కడొక రాత్రి ఎవరైనా గడిపితే వారికి అగ్నిస్తోమ యజ్ఞం చేసిన ప్రతిఫలం లభిస్తుంది. – మహాభారతం

**మణిమానం 2 :** ఇదో సర్పం. వరుణుడి కొలువులో అతడ్ని పూజిస్తుంటుంది. – మహాభారతం

**మణిమానుడు 1 :** ఓ రాజు. దనాయు అను అసురుని అంశతో జన్మించాడు. 'ద్రౌపది స్వయంవరానికి వచ్చాడు. భీమసేనుడు తన మొదటి జైత్రయాత్రలో ఇతణ్ణి ఓడించాడు. ఇతడు పాండవుల పక్షాన పోరాడి భూరిశ్రవసుడి చేతిలో మరణించాడు. - మహాభారతం

**మణిమానుడు 2 :** కుబేరుని స్నేహితుడైన ఓ యక్షుడు. అగస్త్యుడు ఇతణ్ణి మానవుని చేతిలో మరణిస్తావని శపిస్తాడు. ఆ శాపఫలం వల్ల ఇతడు భీమసేనుని చేతిలో మరణిస్తాడు. - మహాభారతం

**మణిమంతం :** ఓ పర్వతం. శ్రీకృష్ణుడు శివుని గూర్చి కోట్ల సంవత్సరాలు ఇక్కడ తపస్సు చేశాడు.
- మహాభారతం

**మణిమంతుడు :** ఓ యక్షుడు. కుబేరుని స్నేహితుడు. ఇతడు కుబేరుని పుష్పకములో తిరుగుచూ క్రిందకు ఉమ్మివేయగా అది అగస్త్యునిపై బడెను. అగస్త్యుడు ఓ నరునిచే చంపబడెదవని శపించెను.
పాండవుల అరణ్యవాసమున ద్రౌపదికోరికపై భీముడు సౌగంధిక పుష్పములకొరకు కుబేరుని వనమునకుపోయి వాటి రక్షకుడుగా వున్న మణిమంతుని సంహరించెను.
- మహాభారతం

**మణివక్త్రుడు :** ఆపుడను వసువు యొక్క కుమారుడు.

**మణివట్టాపాదం :** పురాణ ప్రసిద్ధమైన కొండ. రావణుడు రంభతో ఒక రాత్రి ఇక్కడ గడిపాడు. రంభ నలకూబరుని కోసం వెళ్తుండగా ఆమెను చూసి ఎత్తుకొచ్చాడు.
- ఉత్తర రామాయణం

**మణివరుడు :** ఓ యక్షుడు. మందర పర్వతం మీద నివసించేవాడు. - మహాభారతం

**మణివాహనుడు :** కుశాంబుడను రాజు మరో పేరు.
- మహాభారతం

**మణిస్కందం :** ధృతరాష్ట్రుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది.
- మహాభారతం

**మణీజలం :** శాకద్వీపంలోని ఓ ప్రసిద్ధ నది.
- మహాభారతం

**మతి :** దక్షప్రజాపతి కుమార్తెలలో ఒకరు. ఈమె ధర్మదేవుని భార్య అవుతుంది. - మహాభారతం

**మతినారుడు :** పూరువంశంలోని ఒకరాజు. ఇతనికిద్దరు కుమారులు. సంతురోధుడు, ప్రతిరథుడు. శకుంతల భర్త అయిన దుష్యంతుడు సంతునారుడి కుమారుడు.
- మహాభారతం

**మతిసారుడు :** పూరు వంశస్తుడు. ఇతడి మరోపేరు అంతిసారుడు. ఇతడు రుచేయువు కొడుకు.

**మతంగకేదారం :** ఓ పవిత్ర స్థలం. ఇచటి కొలనులో స్నానం చేస్తే 1000 గోదానాల ప్రతిఫలం లభిస్తుంది.
- మహాభారతం

**మతంగముని :** ప్రసన్నుడి తండ్రి. ధర్మవ్యాధుడి వియ్యంకుడు.

**మతంగుడు 1 :** ఓ ప్రాచీన రుషి. క్రౌంచవనం దాటిన రామలక్ష్మణులు మతంగుని ఆశ్రమం చేరారు. ఇక్కడే రామలక్ష్మణులు కబంధుడిని వధించారు. కబంధుడు రాక్షస రూపు వీడిన తర్వాత మతంగుని గొప్పతనాన్ని రామునికి విశదీకరించాడు.
ఈ ఆశ్రమంలోని పుష్పాలు వాడిపోవు, ఎల్లప్పుడు నిత్యనూతనంగా వుంటాయి, శబరి ఇక్కడే తపస్సు చేసింది. వాలిపైకి దుందుబి ద్వంద యుద్ధానికి రాగా ఘోరయుద్ధం తర్వాత వాలి దుందుబి శరీరాన్ని రుష్యమూక పర్వతం పైకి విసరివేయగా ఆ రక్తం మతంగుని అరచేతిలో పడగా మతంగుడు వాలిని ఈ పర్వతం ఎక్కితే తల బ్రద్దలవుతుందని శపించాడు. అందువల్ల వాలి సుగ్రీవుడిని తన రాజ్యం నుండి తరిమినపుడు ఈ పర్వతం మీదే తలదాచుకున్నాడు. - రామాయణం

**మతంగుడు 2 :** త్రిశంకునికి గల మరోపేరు.
- చూ॥ త్రిశంకుడు

**మతంగుడు 3 :** ఓ రుషి. బ్రాహ్మణుని కుమారుడు. తండ్రి ఆనతిపై కొన్ని పదార్థములు తెచ్చుటకు వెళ్లి మార్గమధ్యమున ఓ గాడిద పిల్లను కొట్టగా అది తన తల్లితో ఓ బ్రాహ్మణ బాలుడు తనను కొట్టెనని చెప్పగా "వాడు చండాలుడు. వాని స్వభావమెట్లు బోవును" అని గాడిద తల్లి అనగా ఆ భాష తెలిసిన బ్రాహ్మణ బాలుడు నేను బ్రాహ్మణుడను గదా ! ఎలా ఇట్లంటివని అడుగగా "నీవు నీ తల్లికి ఓ మంగలి వానివల్ల జన్మించితివి" అని చెప్పగా అది విని తండ్రి వద్దకు బోయి విషయము చెప్పి బ్రాహ్మణత్వము పొందుటకు

తపస్సు చేసెను. ఇంద్రుడు ప్రత్యక్షమై వరమును కోరు కొమ్మనగా బ్రాహ్మణత్వము కోరుకోగా అతడు నిరాక రించి వెడలిపోయెను. మతంగుడు నిలబడి 100 ఏళ్లు తపస్సు చేయగా మరల ఇంద్రుడు ప్రత్యక్షమై వరము కోరుకొమ్మనగా బ్రాహ్మణత్వమునే కోరు కొనెను. బ్రాహ్మణత్వము కష్టతరము. నీవుచేసిన తప మునకు 10 రెట్లు చేసిన చండాలుదు శూద్రుడగును. దానికి నూరురెట్లు చేసిన శూద్రుడు వైశ్యుడగును అని చెప్పి వరమివ్వలేదు. ఆ తర్వాత మతంగుడు మునివేళ్లపై నిలబడి నూరేండ్లు తపస్సుచేయగా నీవెంత తపస్సు చేసినను బ్రాహ్మణత్వమురాదు. నీవు చండదేవుడవని ప్రశస్థి పొంది సుస్త్రీలచే పూజిం పబడెదవని ఇంద్రుడు వరమిచ్చెను. – మహాభారతం

**మత్తమయూరులు :** క్షత్రియుల్లో ఒక తెగ. పశ్చిమ రాజ్యాలను జయించే సమయంలో పాండవుల్లో ఒకడైన నకులుడు వీరిని జయించాడు.
– మహాభారతం

**మత్స్యకాలుడు :** ఓ పూరువంశ రాజు. గిరిక పుత్రులను ఏడుగురు ప్రసిద్ధ రాజుల్లో ఒకడు. తక్కినవారు బృహ ద్రధుడు, కుశ, యదు, పత్యగ్ర, బల, వీరులు.
– అగ్నిపురాణం

**మత్స్యగంధి :** చూ॥ సత్యవతి.

**మత్స్యపురాణం :** అష్టాదశ పురాణాల్లో ఒకటి. మహా విష్ణువు మత్స్యావతారం సమయంలో ఈ పురాణాన్ని మనుసత్యవ్రతుడికి చెప్పాడు. ఇందులో 13 వేల శ్లోకాలు ఉన్నాయి. ఈ పురాణాన్ని బంగారు మత్స్య ముద్రికతో బహుమతిగా ఇస్తే సకల సంపదలు ప్రాప్తి స్తాయి. – చూ॥ అగ్నిపురాణం

**మత్స్యయంత్రం :** ద్రుపదుడు తన కుమార్తె ద్రౌపదికి వివాహం చేయ నిశ్చయించి దానికి పరీక్షగా ఓ మత్స్యయంత్రాన్ని తయారుచేసి దాన్ని ఛేదించిన వారికి ఆమెనిచ్చి వివాహం చేస్తానని ప్రకటిస్తాడు. అర్జునుడొక్కడే దాన్ని ఛేదించాడు. – మహాభారతం

**మత్స్యరాజు :** యమునా నదిలోని చేపగర్భాన ఉపరిచర వసువు వీర్యం వల్ల జన్మించినవాడు. ఇతణ్ణి జాలరులు దాశరాజుకివ్వగా ఇతడు మత్స్యదేశానికధిపతి అవుతాడు. – మహాభారతం

**మత్స్యాలు :** అద్భుతనాముడనే అగ్ని దేవతలహవిస్సు మోసి మోసి దాన్ని అథర్వుడికప్పగించి సముద్రంలో దాక్కోగా ఇంద్రాది దేవతలు ఇతని కోసం వెతుకు తుండగా మత్స్యాలు ఇతడు వున్న ప్రాంతాన్ని తెలియ జేయగా ఇతడు కోపించి జనులు మిమ్ము నిర్ధయగా వధింతురుగాక" అని శపిస్తాడు. – మహాభారతం

**మత్స్యావతారం :** మహావిష్ణువు యొక్క మొట్టమొదటి అవతారం. వైవస్వత మనువు అర్ఘ్యమిస్తుంటే మత్స్యం అతడి దోసిలిలో పడుతుంది. అది తన్ను రక్షించమం టుంది. అది రోజురోజుకు పెరగడం చూసి నువ్వెవ రవని అడగ్గా నేను జనార్ధనుణ్ణి, ఇంకో వందేళ్లలో ప్రళయం వస్తుందని అప్పుడు మహాసత్యాల్ని వేదాల్ని నావలో వుంచి నాకు కట్టమని చెప్పి అతడికోనావ నిచ్చి అదృశ్యమవుతుంది. అతడలాగే చేస్తాడు.
– మత్స్యపురాణం

**మత్తుడు :** ఓ రాక్షసుడు. మలయవానుడు అనే అసురు నికి సుందరివల్ల జన్మించాడు. ఇతనికి ఆరుగురు సోదరులు. రామరావణ యుద్ధంలో ఇతడు మరణించాడు.
– ఉత్తర రామాయణం

**మత్కులికుడు :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు.
– మహాభారతం

**మత్స్యోదరి :** వ్యాసుడితల్లి. సత్యవతికి మరోపేరు. మత్స్య గంధి అనికూడా పిలుస్తారు.

**మథనద్వాదశీవ్రతం :** ఆశ్వయుజ శుక్లపక్ష ఏకాదశి మొదలు కార్తీక శుక్లపక్ష ఏకాదశి వరకు విధి పూర్వ కంగా విష్ణువును తులసి దళాలలతో పూజచేసే వ్రతం. దీన్ని నారదుడు శ్రీకృష్ణుడికి ఉపదేశిస్తాడు.

**మథనుడు :** తారకాసురుని తరఫున పోరాడిన అసురుడు. మహావిష్ణువు ఇతణ్ణి వధించాడు. – మత్స్యపురాణం

**మథుర :** శ్రీకృష్ణుని జన్మస్థలం. – భాగవతం

**మదధార :** ఓ పర్వతం. తూర్పు ప్రాంతాన్నిజయిస్తూ భీముడు ఈ పర్వతాన్ని కూడా ఆక్రమించాడు.
– మహాభారతం

**మదనమాల :** ప్రతిష్ఠానపురంలోని ఓ వేశ్య. విక్రమా దిత్య చక్రవర్తికి ప్రతిష్ఠానుడు వశంకాక ఈ వేశ్య ద్వారా నరసింహుడను ప్రతిష్ఠానపుర రాజును ఓడించి ఈమెను తన భవనంలో వుంచాడు. – కథాసరిత్సాగరం

**మదనమంచుక :** 'వత్సరాజచరితం'లో ఓ నాయకి. ఈమె తల్లి పూర్వజన్మలో ఓ అప్సరస. ఇంద్రుని శాపం వల్ల కళింగసేనగా జన్మించి ఉదయనుని భవనంలో వుంది. ఆమె ఉదయనుడిని పెండ్లాడ నెంచెను గాని ఉదయనుడి వేషధారణలో మదన వేగుడను గంధర్వుడు వచ్చి ఈమెను వివాహమాడగా వారికి రతీదేవి మదనమంచకగా జన్మించింది. ఆమె పెరిగి పెద్దదై ఉదయనుని కుమారుడైన నరవాహన దత్తుడిని వివాహమాడింది. – కథాసరిత్సాగరం

**మదనరేఖ :** శృంగారశేఖరుడి దండనాయకుడు వీర వర్యుడు. ఇతడు శూద్రుడు. అతడి కూతురు మదన రేఖ. ఈమె చంద్రగుప్తుడనే బ్రాహ్మణుణ్ణి వివాహమాడుతుంది. వారికి జన్మించినవాడే భర్తృహరి.
– విక్రమాంక చరిత్ర.

**మదనవేగుడు :** ఓ గంధర్వుడు.
– చూ॥ మదన మంచుక.

**మదనిక :** ఓ అప్సర. మేనక కుమార్తె. విద్యుద్రూపుడను రాక్షసుడు ఈమెను వివాహమాడాడు. గరుడ కుటుంబంలోని కంధరుడు ఇతణ్ణి వధించి ఈమెను తీసుకెళ్లాడు. వీరికి తారాక్షి అనే పుత్రిక జన్మించింది.
– మార్కండేయపురాణం

**మదనుడు :** దుష్టబుద్ధి కొడుకు. ఇతడి సోదరి 'విషయ'. తండ్రి రాసిన ఉత్తరం చూసి 'విషయ'ను చంద్రహాసుడికిచ్చి వివాహం చేస్తాడు. చంద్రహాసుడి బదులు ఇతడు చండిక గుడికి వెళ్తాడు. అక్కడ చంద్రహాసుణ్ణి చంపడానికి దుష్టబుద్ధి నియమించిన తలారులు ఇతణ్ణి వధిస్తారు. అయితే చంద్రహాసుడి భక్తికి మెచ్చి చండి ఇతణ్ణి బతికిస్తుంది. – జైమినిభారతం

**మదయంతి :** కల్మషపాదుడను రాజు భార్య. ఇతడిని మిత్రసహుడు, సాదాసుడని అంటారు. వశిష్ఠుని శాపంవల్ల ఈమెకు అష్మకుడు జన్మిస్తాడు. మదయంతి తన చెవి ఉంగరాలను ఉత్తంకమునికి కానుకగా ఇస్తుంది.
– చూ॥ ఉత్తంక, కల్మషపాదుడు

**మదాలస 1 :** ఓ విద్యాధరి. చంపకుడను విద్యాధరుడిని వివాహమాడింది. – చూ॥ చంపకుడు

**మదాలస 2 :** కాశీరాజైన రుతధ్వజుని భార్య. పాతళకేతుడనురాక్షసుడీమెను ఎత్తుకుపోగా రుతధ్వజుడితణ్ణి ఓడించి భార్యను కాపాడుకుంటాడు. వానికి జన్మించిన కుమారుడు అలర్కుడు.

**మదిర :** శ్రీకృష్ణుని తండ్రైన వసుదేవుని భార్యల్లో ఒకరు.
– మహాభారతం

**మదిరాక్షుడు 1 :** విరాటుని సోదరుడు. దక్షిణ గోగ్రహణంలో విరాటుని తరపున పోరాడాడు. కురుక్షేత్ర యుద్ధంలో పాండవుల పక్షాన పోరాడి ద్రోణాచార్యుని చేతిలో మరణించాడు. – మహాభారతం

**మదిరాక్షుడు 2 :** ఇక్ష్వాకు వంశంలో ఒక రాజు. దాశాశ్వుని కుమారుడు. సద్గుణ సంపన్నుడు. ఇతనికి ధ్యూతిమానుడు అను కుమారుడు, సుమధ్వ అనే కుమార్తె కలరు. కుమార్తెను హిరణ్యహస్తుడను రుషికిచ్చి వివాహం చేసి స్వర్గస్తుడవుతాడు. – మహాభారతం

**మదుడు 1 :** ఓ అసురుడు. చ్యవనుడు యజ్ఞగుండం నుండి ఇంద్రుడ్ని వధించడానికి సృష్టించాడు.
– చూ॥ చ్యవనుడు

**మదుడు 2 :** బ్రహ్మమానస పుత్రుల్లో బ్రహ్మ గర్వం నుండి జన్మించినవాడు. – మత్స్యపురాణం

**మదోత్కటం :** ఓ క్రూరమైన సింహం. ఇది పంచతంత్రంలోని ఒక పాత్ర. – చూ॥ పంచతంత్రం

**మద్యం :** సారాయి. మద్యం మత్తెక్కడానికి ఓ కారణం వుంది. ఒకసారి ఇంద్రుడు అశ్వనీ దేవతలను ఇంద్రలోకం నుండి వెడలగొట్టి వారికి మద్యం ఇవ్వకుండా ఆజ్ఞ ఇచ్చాడు. వారు చ్యవనుడి రక్షణ కోరగా అతడో యజ్ఞం జరిపి అశ్వనీ దేవతలను కూడా పాల్గొనమనగా ఇంద్రుడు చ్యవనునిపై దండెత్తగా చ్యవనుడు యజ్ఞగుండం నుండి 'మద' అనే రాక్షసిని సృష్టించగా అది ఇంద్రుడ్ని చంపడానికి వెళ్లగా ఇంద్రుడు చ్యవనుడి శరణువేడాడు. చ్యవనుడు ఆ రాక్షసిని నాల్గు ముక్కలుచేసి పాచికలు, మద్యం, వేట, స్త్రీలలో ప్రవేశ పెట్టాడు. అందువల్ల ఆ నాల్గు వ్యసనాలయ్యాయి. ప్రాచీన భారతదేశంలో మత్తు నిచ్చేవన్ని మద్యం క్రింద పరిగణింపబడలేదు. ద్రాక్షసారాయి, తేనె, తాటికల్లు, చెరకు రసం మద్యం క్రిందకు రావు. 'సురా'పానియం (బియ్యం నుండి ఉత్పత్తి కాబడే పదార్థం) మాత్రం మూడు వర్ణాలకు నిషేధించబడింది. వారు బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియులు. వారు గనుక దానిని సేవిస్తే ఓ

సంవత్సరం మంచినీరు మాత్రమే సేవించాలి. సురా పానియం కోసం వాడిన పాత్రలో నీరు త్రాగినా ఓ వారం రోజులు వ్రతం చెయ్యాలి. – అగ్నిపురాణం

**మద్ర :** అత్రిమహర్షి 10 మంది భార్యల్లో ఒకరు. వీరి కొడుకు సోముడు. – బ్రహ్మాండపురాణం

**మద్రకలగం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాసయోగ్య స్థలం. – భారతదేశం

**మద్రకుడు :** ప్రాచీన భారతదేశంలో ఓ క్షత్రియ రాజు. క్రోదవశుడను రాక్షసుని అంశ నుండి జన్మించాడు. – మహాభారతం

**మద్రకులు :** మద్రదేశపు సైనికుల్ని మద్రకులని పిలిచేవారు. వీరు కౌరవసైన్యంలో భాగం. – మహాభారతం

**మద్రం :** ప్రాచీన భారతదేశంలో జీలం నదీ తీరాన గల ప్రాంతం. పాండురాజు భార్య మాద్రి ఈ ప్రాంతం యువరాణి. సావిత్రి తండ్రి అశ్వపతి ఈ దేశరాజు. కర్ణుడు ఈ దేశాన్ని మద్ర, వాహికలుగా చీల్చాడు. – మహాభారతం

**మధుకుంభుడు :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు. – మహాభారతం

**మధుపర్కుడు :** గరుదుని బిడ్డల్లో ఒకడు. – మహాభారతం

**మధురస్వర :** ఓ అప్సరస. అర్జునుని గౌరవార్థం ఓసారి నృత్యం చేసింది. – మహాభారతం

**మధుర :** సుబ్రహ్మణ్యస్వామి సైనికుల్లో ఒకడు. – మహాభారతం

**మధువనం :** యమునా నది తీరమున గల ఒక వనం. ఇందు ధ్రువుడు ఆశ్రమము నిర్మించుకొని తపస్సు చేసెను.

**మధుమతి :** కురుక్షేత్రం ప్రక్కనే గల ఓ పుణ్యస్థలం. ఇక్కడున్న కొలనులో స్నానంచేసి పితృగణాలను పూజిస్తే 1000 గోదానాలు చేసిన ప్రతిఫలం లభిస్తుంది. – మహాభారతం

**మధువర్ణుడు :** సుబ్రహ్మణ్యస్వామి సైనికుల్లో ఒకడు. – మహాభారతం

**మధువిద్య :** దేవతలు చేసే వింతగానం. ఇంద్రుడు దధ్యడను రుషికి అలవడేటట్లు చేశాడు. – చూ॥ దధ్యన్యుడు

**మధువిలం (మధుబిలం) :** కర్దమీల తీర్థానికి ప్రక్కనుండి ప్రవహించే ఓ నది. దీని మరోపేరు సుమంగ. ఇది గొప్ప పుణ్యస్థలం. ఇంద్రుడు వృతాసురుడిని సంహ రించి బ్రహ్మహత్యాపాతకం నుండి విముక్తుడవటానికి ఈ తీర్థంలో స్నానం చేశాడు. అష్టావక్రుడు తన తండ్రి సలహాపై ఇక్కడ స్నానం చేసి తన శరీరపు 8 వంకర్లు పోగొట్టుకున్నాడు. – మహాభారతం

**మధుశక్తుడు :** ఇతడో అసురుడు. పృధుచక్రవర్తి కాలంలో భూమి గోవుగా మారినపుడు ప్రజలు తమకు కావలసినవి తాము పిండుకోగా అసురుల తరపున ఇతడు పిండాడు.

**మధుస్రవం :** కురుక్షేత్రంలో పృథూదక క్షేత్రానికి దగ్గరున్న మరోపుణ్యస్థలం. ఇక్కడున్న కొలనులో స్నానం చేస్తే 1000 గోదానాల ప్రతిఫలం లభిస్తుంది. – మహాభారతం

**మధుసూదనుడు :** శ్రీకృష్ణుని మరోపేరు. మధుడను రాక్షసుడిని చంపడం వల్ల ఇతనికీ పేరొచ్చింది. – మహాభారతం

**మధుస్యందుడు :** విశ్వామిత్రుని కుమారుడైన ఒక రుషి. – రామాయణం

**మధూలిక :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరి. – మహాభారతం

**మధ్యదేశం :** విపాశకు తూర్పున, ప్రయాగకు పశ్చిమాన వుండే హిమవద్వింధ్య మధ్య గల దేశం.

**మధ్వాచార్యులు :** 13, 14వ శతాబ్దాలలో జీవించిన వేదాంతి. ఇతడు ద్వైతమత స్థాపకుడు. శంకరుని అద్వైతాన్ని నిరసించాడు. ఇతడు ఉడిపి వద్దగల పాచక క్షేత్రంలో జన్మించాడు.

**మనస్విని :** దక్షప్రజాపతి కుమార్తెలలో ఒకరు. ధర్మ దేవుని భార్య. వీరికి చంద్రుడు జన్మించాడు. – మహాభారతం

**మనస్యుడు :** పూరు వంశపు రాజు. ప్రవీరుని కుమా రుడు. పూరుడి మనుమడు. ఇతని తల్లి శూరసేన. సౌవీర అనుభార్య వల్ల శాక్త, సహన, వాగ్మి అనే పుత్రులు జన్మించారు. – మహాభారతం

**మనుకన్యక :** చ్యవనుడి భార్య. ఔర్యుని తల్లి.

**మనుమసిద్ధి :** ప్రాచీన కాలమున నెల్లూరును పాలించిన రాజు. ఇతని ఆస్థాన పండితుడు తిక్కన సోమయాజి.

**మనుదేవుడు :** బ్రహ్మపుత్రులలో ఒకడు. – మహాభారతం

**మనువు 1 :** పాంచజన్యుడనే అగ్ని కుమారుడు.
– మహాభారతం

**మనువు 2 :**పృధాకశ్యపుల కూతురు. ఒక అప్సరస.

**మనువు 3 :** ఓ మనువు జీవిత కాలం 71 చాతుర్యు గాలు. ఒక కల్పం అనగా బ్రహ్మ ఒక రోజు కాలం. ఓ కల్పంలో 14 మంది మనువులు జన్మించి ప్రపంచాన్ని పాలిస్తారు. ఒక్కో మనువు కాలంలో ఒక్కో ఇంద్రుడు, వేర్వేరు సప్తర్షులు వుంటారు. ఆ 14 మంది మనువులు : 1. స్వాయంభువ, 2. స్వారోచిష, 3. ఉత్తమ, 4. తామస, 5. రైవత, 6. చాక్షుష, 7. వైవశ్వత, 8. శాకర్ణి, 9. దక్షసావర్ణి, 10. బ్రహ్మసావర్ణి, 11.ధర్మసావర్ణి, 12.రుద్రసావర్ణి, 13. రేచ్య దేవసావర్ణి, 14. ఇంద్రసావర్ణి. – చూ॥ మన్వంతరం

★ **మనుష్యుడు :** మనిషి పుట్టుక గురించి పురాణాలలో అంతవివరణ కన్పించదు. మను, కశ్యపుల నుండి అన్ని జీవాలు సృష్టించబడినట్లు చెప్పబడింది.
– రామాయణం

**మనుస్మృతి :** మానవజాతికి తండ్రి వంటివాడైన మనువు రాసిన గ్రంథం. దీనిలో 12 అధ్యాయాలున్నాయి. సామాజిక జీవనం సాఫీగా సాగడానికి విధివిధానాల ప్రకటనే ఈ గ్రంథముఖ్యోద్దేశ్యం. ఇది క్రీ.పూ. 500లో రచించబడింది.

*1వ అధ్యాయం :* ప్రపంచం పుట్టుక స్మృతుల పుట్టుకను వివరిస్తుంది.

*2వ అధ్యాయం :* ఇంద్రియ నిగ్రహాలను గురించి బ్రాహ్మణుల గుణగణాలను గురించి వివరిస్తుంది.

*3వ అధ్యాయం :* వేదాధ్యయనానంతరం గృహస్థుడు పాటించవలసిన నియమాలు, 8 రకాల వివాహాలు, స్త్రీలను పిల్లలను రక్షించే విధానాలు వివరించ బడ్డాయి.

*4వ అధ్యాయం :* బ్రాహ్మణుని బాధ్యతలు, వేదాధ్యయనం, స్నాతకుని బాధ్యతలు వివరించబడ్డాయి.

5వ అధ్యాయం : స్వచ్ఛమైన ఆహారం, అపరి శుభ్రమైన ఆహారం శుభ్రపరిచే విధానం, స్త్రీలు వారి బాధ్యతలు వివరించబడ్డాయి.

*6వ అధ్యాయం :* వానప్రస్తాశ్రమం, సాధుజీవనం గడిపేవారి బాధ్యతలు వివరించబడ్డాయి.

*7వ అధ్యాయం :* రాజు, మంత్రుల యొక్క బాధ్యతలు వివరించబడ్డాయి.

*8వ అధ్యాయం :* న్యాయం చట్టములు వివరించబడ్డాయి. న్యాయం నిలబెట్టడానికి కొన్ని సూత్రాలు, వైరుధ్యాలు వచ్చినపుడు పరిష్కరించే విధానాలు, అప్పులు, పరిష్కరణ, హక్కులేకుండా అమ్మడం, భాగస్వామ్యాలు, గొడవలు, దొంగతనాలు, వ్యభిచారం వీటికి సంబంధించిన న్యాయపరమైన పరిష్కారాలు వివరించబడ్డాయి.

*9వ అధ్యాయం :* భార్యభర్తల బాధ్యతలు, ఆస్తి హక్కులు, విభజన హక్కులు, వీటిని రాజు పరిష్కరించే విధానం వివరించబడ్డాయి.

*10వ అధ్యాయం :* వివిధ కులాల బాధ్యతలు, మిశ్రమ కులాలు, ప్రమాదంలో వున్నపుడు బాధ్యతలు వివరింపబడ్డాయి.

*11వ అధ్యాయం :* తపస్సు, వ్రతాలు, యాగాలు, యజ్ఞాలు, పండితులకు ఇవ్వవలసిన రుసుం అంతే కాక తప్పులకు శిక్ష, హత్యకు వ్యభిచారానికి శిక్ష వివరించబడ్డాయి.

*12వ అధ్యాయం :* జన్మ సిద్ధాంతం. ఈ జీవితంలో మనం ఆచరించే జీవన విధానం పునర్జన్మలో మన జీవన విధానానికి ఎలా సూచికలో వివరించబడ్డాయి. ఆత్మజ్ఞానం పొందడం, మోక్షానికి మార్గాలు వివరించ బడ్డాయి.

**మన్మథకరుడు :** సుబ్రహ్మణ్యస్వామి అనుచర వీరుడు.
– మహాభారతం

**మన్మథుడు :** విష్ణుమూర్తి సంతానమునకై శివుని ప్రార్థించగా జన్మించెను. కాని విష్ణువు పార్వతిని ప్రార్థించక పోవుటచే ఆమెకు కోపము వచ్చి విష్ణుమూర్తికి జన్మించు కుమారుడు శివుని నేత్రాగ్నికి భస్మమగు గాకయని శపించెను. అప్పుడు విష్ణువు ప్రార్థించగా పుట్టిన

★ దశావతార క్రమానికి, డార్విన్‌పరిణామ సిద్ధాంతానికి కొన్ని పోలికలు వున్నట్లు కన్పిస్తుంది. రెండుకూడా మొదట నీరే వుందని, అక్కడే జీవి ఉద్భవించినట్లు చెప్తున్నాయి.

కుమారుడు మరల బ్రతుకునని అనుగ్ర హించెను. అలా జన్మించిన వాడే మన్మథుడు. ఇతడు గొప్ప అందగాడు. ఇతని భార్య రతీదేవి. ఈమె మన్మథుని వామభాగము నుండి జనించెను. పుష్పములే ఇతని ఆయుధములు. ఒకసారి తన బాణములతో బ్రహ్మను కూడా బాధపెట్టెను. ఆ బాధవల్ల బ్రహ్మ తన కుమార్తె అయిన సరస్వతితో రమించెను. పిమ్మట సిగ్గుపడి అందుకు కారణము మన్మథుడేయని తలచి అచిరకాల మున భస్మమగుదువని శపించెను. అతడు బ్రహ్మను ప్రార్థించగా యదువంశములో తిరిగి జన్మింతువని బ్రహ్మనుడివెను. – మత్స్యపురాణం

బ్రహ్మవరప్రసాదియైన తారకాసురుని బాధ భరించ లేక దేవతలు బ్రహ్మను శరణువేడగా శివుని కుమారుడు మాత్రమే అతడిని సంహరించగలడని చెప్పెను. ఇంద్రుడు శివుడు అవివాహితుడుగాన మన్మథుని పొగిడి శివుని గెల్చి పార్వతిని వివాహమాడునట్లు చేయమని కోరెను. శివుడు తపస్సు చేసుకొనుచుం డగా పార్వతి అచటనే సంచరించుచుండగా మన్మథుడు శివుని తన బాణముతో కొట్టగా శివుని మనసు చలించి ఎవడిట్లు చేసెనని కోపముతో తన మూడవ కన్ను తెరచి మన్మథుని భస్మముచేసెను. మన్మథుడే తిరిగి ప్రద్యుమ్నుడుగా జన్మించెను. – శివపురాణం

**మన్వంతరాధిపులు :** 14 మంది మనువులు. ఒక్కో మనువు కాలంలో దేవతలు, రుషులు, వేరు వేరుగా వుంటారు. ఉదాహరణకు స్వారోచిషమనువు కాలంలో ఇంద్రుడు విపశ్చిత్తు. దేవతలు తుషితులు. రుషులు ఊర్జాదులు.

**మన్వంతరం :** ఓ మనువు యొక్క జీవిత కాలాన్ని మన్వంతర మంటారు. ప్రతి మన్వంతరంలో ఆ కాలానికి సంబంధించిన అష్టదిక్పాలకులు, సప్తర్షులు వుంటారు. – చూ॥ కాలమానం

**మన్యుమానుడు :** భానుడనే అగ్ని రెండవ కుమారుడు. – మహాభారతం

**మన్యువు 1 :** వేదకాలం నాటి దేవుడు. ఒకసారి దేవాసు రులకు యుద్ధం జరుగగా దేవతలు ఓడిపోయి గౌతమీ నదీతీర ప్రాంతంలో శివుని గూర్చి తపస్సు చేయగా తన మూడో కంటినుండి మన్యువును సృష్టించగా ఇతని సహాయంతో దేవతలు అసురుల్ని ఓడించారు. – బ్రహ్మపురాణం

**మన్యువు 2 :** పూరు వంశపు రాజు. భరద్వాజుని కుమా రుడు. ఇతనికి జన్మించిన ఐదుగురు పుత్రుల్లో బృహత్ క్షయుడొకడు. – భాగవతం

**మనోగుణం :** మనిషి ఎన్ని పనులు చేసినా తప్పుగాని, ఒప్పుగాని, మంచిగాని, చెడుగాని మనసు యొక్క నిష్కళంకతే ముఖ్యం. మన ఆలోచనలు గుణం మీద మన జీవితం ఆధారపడి వుంటుంది. దీన్ని తెలియజే యడానికి కథాసరిత్సాగరంలో ఒక కథ వుంది.

గంగానది ఒడ్డున, ఒక బ్రాహ్మణుడు, ఓ చండాలుడు తపస్సు చేసుకుంటూ వుంటారు. కొన్నాళ్ళు అలా తపస్సు చేసుకున్న తర్వాత ప్రక్కనే వున్న జాలర్లను చూసి బ్రాహ్మణుడు “వీళ్లెంత అదృష్టవంతులో మంచి చేపల్ని తింటున్నారు” అనుకుంటాడు. చండాలుడు “వీరెంత క్రూరులో ఆహారంకోసం అమాయక ప్రాణుల్ని తింటున్నారు” అనుకుంటాడు. ఆ తర్వాత బ్రాహ్మ ణుడు జాలరిగా, చండాలుడు రాజకుమా రుడిగా జన్మిస్తారు. బ్రాహ్మణుడప్పుడు పశ్చాత్తా పపడతాడు. ఇదే మనోగుణ ప్రాధాన్యత.

**మనోజవుడు 1 :** అనిలుడను వసువు యొక్క కుమా రుడు. ఇతని తల్లిపేరు శివ. – మహాభారతం

**మనోజవుడు 2 :** చాక్షుష మనువు కాలంలో దేవతల నాయకుడైన మనోజవుడు ఇంద్రుడు. – విష్ణుపురాణం

**మనోజవుడు 3 :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు. – మహాభారతం

**మనోజవం :** కురుక్షేత్రం దగ్గరలో గల వ్యాసవనంలోని ఓ పవిత్రస్థలం. ఇచటగల కొలనులో స్నానం చేస్తే 1000 గోదానాల ప్రతిఫలం లభిస్తుంది.

**మనోదరి :** దారుకాసురుని భార్య. చూ॥ ఘంటాకర్ణుడు.

**మనోనుగం :** క్రౌంచద్వీపంలో వామన పర్వతం దగ్గ రలోగల ప్రాంతం. – మహాభారతం

**మనోరథ :** ఓ గోవు పిల్ల. ఇది శ్రీకృష్ణుని ఆత్మశక్తితో జన్మించింది. – చూ॥ సురభి

**మనోరమ 1 :** కోసల రాజైన ధ్రువసంధి భార్య. – చూ॥ ధ్రువసంధి

**మనోరమ 2 :** ఓ పుణ్యాంగన. కశ్యప ప్రజాపతికి ప్రధవల్ల జన్మించింది. ఈమె అర్జునుని జన్మదినోత్సవ వేడుకల్లో పాల్గొంది. – మహాభారతం

**మనోవతి :** బ్రహ్మ నివసించు మేరుపర్వతం పై గల నగరం. ఇది మహామేరువుపై 9 నగరాల మధ్య వుంటుంది. అష్టదిక్పాలకుల నగరాలు దీని చుట్టూ వున్నాయి. – *దేవీ భాగవతం.*

**మనోహర 1 :** అలకాపురిలోని అప్సరస. అష్టావక్రుడు కుబేరుని కొలువుకు వెళ్లినపుడు అతని గౌరవార్థం నృత్యం చేసింది.

**మనోహర 2 :** సోముడను వసువు భార్య. వర్చసుడు ఆమెకు మొదట జన్మించాడు. తర్వాత ముగ్గురు పుత్రులు జన్మించారు. వారు శిశిరుడు, ప్రాణుడు, రమణుడు. – *మహాభారతం*

**మధువు :** శ్రీ మహావిష్ణువు చెవినుండి పుట్టిన అసురుడు. అలాపుట్టిన మరో అసురుడు కైటభుడు. – *చూ॥ మధుకైటభులు*

**మధుకైటభులు :** మహావిష్ణువు నీటిపై శయనించి ఉండగా నాభి నుండి బ్రహ్మయు చెవుల నుండి మధు కైటభులును జన్మించిరి. వారెక్కడినుండి జన్మించిరో తెలియక శక్తి వలన జన్మించితిమని తలచి ఆమెను ప్రార్థించి ఆమె ప్రసాదముచే మహా బలవంతులై బ్రహ్మను బాధపెట్టుచుండగా బ్రహ్మ విష్ణువును ప్రార్థించగా అతని కభయహస్తమిచ్చి వారితో పోరాడెను. ఎంతపోరాడినను వారిని గెలువ లేక మీరిద్దరు పోరుచుండిరి, నాకు కొంత విశ్రాంతి నిమ్మని వారిని కోరగా అందుకు వారు అంగీకరించిరి. విష్ణువు శక్తిని ప్రార్థించగా ఆమె వారిని మోహితులుగాజేసెను. అప్పుడు విష్ణువు "దానవు లారా మీరు నాతో పోరలేరు, నన్ను ప్రార్థించి శరణు వేడమనగా నీవే ప్రార్థింపుము వరము ఇత్తుము అనిరి. అంత విష్ణుమూర్తి మీరు నాచే హతులగునట్లు వరమిమ్మని కోరెను. అంత వారికి సంకటమేర్పడి అట్లయిన మమ్ము జలములేని చోట చంపుమనిరి. విష్ణుమూర్తి తన ఊరువులను పెంచి వారిని తన ఊరువులపై నుంచి చంపెను. వీరి మేధస్సు తెగిపడి భూమియయ్యెను. – *దేవీ భాగవతం*

వీరు గజకచ్ఛపములై ఒకరితో నొకరు కలహించుకొనుచుండగా అమృతముతేబోవు గరుడుడు వీరిని భక్షించెను. – *మహాభారతం*

**మధుచ్ఛందుడు :** విశ్వామిత్రుని 100 మంది కొడుకుల్లో 51వ వాడు. ఇతడు శునశ్శేపుడిని అన్నగా అంగీకరిస్తాడు. రుగ్వేదంలోని మొదటి సూక్తాన్ని రచించాడు. – రుగ్వేదం

**మధుడు 1 :** యమునా నదీతీరంలో ఒకసారి మధుడను అసురుడుండేవాడు. శతృఘ్నుడితణ్ణివధించి ఇచట మధురాపురి అనే రాజ్యాన్ని స్థాపించాడు. – *కంభరామాయణం*

**మధుడు 2 :** యముని కొలువులో వుండి అతణ్ణి పూజించే ఒక రాజు. – మహాభారతం

**మధుమంతం :** వింధ్య పర్వతం వద్ద దండుడనేవాడు నిర్మించిన పట్టణం. – ఉత్తర రామాయణం

**మధురాపురం :** చూ॥ మధుడు 1.

**మధువనం :** సుగ్రీవుడను వానర రాజుకు చెందిన అటవిక ఉద్యానవనం. సీత ఎక్కడుందో తెలుసుకున్న తర్వాత హనుమంతుడు అంగదుడు ఇతర వానరులతో వెళ్లి వారికి సంతృప్తికరంగా తేనె సేవించారు. – రామాయణం.

**మమత :** దీర్ఘతమసుని తల్లి. – *చూ॥ దీర్ఘతమసుడు*

**మమ్మటుడు :** గొప్ప సంస్కృత పండితుడు. క్రీ.శ. 11వ శతాబ్దంలో జన్మించాడు. 'కావ్యప్రకాశిక' అనునది ఇతని ప్రసిద్ధ రచన. ఇందులో 10 అధ్యాయాలున్నాయి. వీటిలో 9 అధ్యాయాలే ఇతని రచనలని 10వ అధ్యాయాన్ని అలకుడను పండితుడు రచించాడని విమర్శకులు అంటారు. పతంజలి వ్యాఖ్యాత కయ్యట ఇతని సోదరుడు.

**మయుడు :** ఓ దానవరాజు. ఇతడు దేవతలకు రాక్షసులకు వాస్తుశిల్పిగా భవన నిర్మాణకర్తగా వ్యవహరించాడు. మరీచి పుత్రుడైన కశ్యప ప్రజాపతి దక్షుని కూతుర్లలో 13 మందిని వివాహమాడాడు. అందులో ఒకరు దనువు. వారికి జన్మించిన వారే దానవులు. అందులో ముఖ్యుడు మయుడు. ఇతడు దానవ రాజయ్యాడు. మయునికి చిన్నతనము నుండియు శిల్ప కళపై మక్కువ కలదు. బ్రహ్మను గూర్చి తపస్సు చేయగా దేవతలకు, దానవులకు, అసురులకు నీవు శిల్పాచార్యుడవగుదవని వరమిచ్చెను. ఆ కాలమున దేవాసురుల మధ్య వైరము లేదు. దేవతలకు, అసు

రులకు, దానవులకు భవన నిర్మాణము చేసెడివాడు. ఒకసారి దేవలోకమునకు బోగ అచట హేమయను దేవతాంగనపై మక్కువచూపగా ఆమెయు ఇతని ప్రేమను కోరగా దేవతల అంగీకారమున ఆమెను వివాహమాడెను. – *ఉత్తరరామాయణం*

మయుడు హేమ హిమవానుని దక్షిణ ప్రాంతమున చక్కని భవనము నిర్మించుకొని కాపురముండగా వారికి మాయావి, దుందుభి అను కుమారులు జన్మించిరి. ★ మండోదరి ఇతని పెంపుడు కుమార్తె. ఈమెను రావణుడు వివాహమాడెను.

ఖాండవ వనం దహన సమయమున మయుడు తక్షకుని గృహమున దాగుకొనియుండగా శ్రీకృష్ణుడితణ్ణి వధించబోగా అర్జునుని శరణువేడెను. శ్రీకృష్ణు డప్పుడు పాండవులకు భవన నిర్మాణము చేయమని కోరగా ఇంద్రప్రస్థ నగరమును, మయసభను నిర్మించి ఇచ్చెను. ఇతడు త్రిపురాసురులైన కమలాక్ష, తారకాక్ష, విద్యున్మాలి కొరకు మూడు మాయా భవంతులు నిర్మించి ఇచ్చెను. ఇతడు విశ్వకర్మ అంశ అని కథాసరిత్సాగరంలో చెప్పబడింది. వామనావతార సమయములో బలిని తన మూడవ పాదంతో అణగదొక్కతున్నపుడు విష్ణువుతో పోరాడి పారిపోయి పాతాళంలో దాక్కున్నాడు. – *వామనపురాణం*

**మయూరధ్వజుడు :** రత్న నగర రాజు. ఏడు అశ్వమేధ యాగాలు చేశాడు. ఎనిమిదోది నర్మదానదీతీరంలో ప్రారంభిస్తాడు. ఇతని కుమారుడు తామ్రధ్వజుడు. ధర్మజుని యాగాశ్వాన్ని ఇతడు బంధిస్తాడు. కృష్ణార్జునులితణ్ణి ఓడించలేక బ్రాహ్మణ వేషధారులై మయూరధ్వజుడి దగ్గరకు వెళ్లి మార్గం మధ్యలో తమ బాలుణ్ణి సింహం పట్టుకుందని అది రాజు శరీరంలో సగభాగం ఇస్తేనే బాలుణ్ణి వదుల్తానని చెప్పిందని చెప్తారు. అది కూడా భార్య కుమారుడు కోసి ఇవ్వాలని షరతు పెట్టినట్లు చెప్తారు. రాజు దాని కంగీకరించగా వారలా చేయగా శ్రీకృష్ణుడు తన విశ్వరూపం చూపి వారిని అనుగ్రహిస్తాడు. – *జైమిని భారతం*

**మయూరుడు :** ఓ అసురుడు. సుబ్రహ్మణ్యస్వామికి వ్యతిరేకంగా పోరాడి మరణించి విశ్వుడనే రాజుగా పునర్జన్మిస్తాడు. – *స్కందపురాణం*

**మరణం :** ఓ దేవత. ఈమెకు పూర్వం మరణమనేది లేదు. తన బరువును మోయలేక భూమాత బ్రహ్మను ప్రార్థించగా బ్రహ్మ మృత్యుదేవతను సృష్టిస్తాడు.

**మరీచి 1 :** బ్రహ్మ మానసపుత్రుడైన ఓ మహర్షి. మరీచికి చాలామంది భార్యలు సంతతివున్నారు. ఇతడు కర్దమ ప్రజాపతి కుమార్తె కళను వివాహమాడగా కశ్యప, పూర్ణిమానులు జన్మించారు. ఈకశ్యపుడే జీవజాతి పుట్టుకకు మూలకారకుడు. ఊర్ణ మరీచి మరోభార్య. ఈమెకు ఆర్గురు పుత్రులు. బ్రహ్మశాపమున మొదట హిరణ్యకశిపునికి తర్వాత జన్మమున దేవకికి శ్రీకృష్ణునికి ముందు జన్మించిన మొదటి ఆరుగురు వారే. వారిని కంసుడు సంహరించెను – *చూ॥ కంసుడు*

ధర్మదేవుని కుమార్తె ధర్మవ్రత మరీచి మరో భార్య. మరీచి ధర్మవ్రతతో చాలాకాలం కాపురం చేశాడు. ఒకసారి బ్రహ్మ మరీచి ఆశ్రమమునకు రాగా మరీచి నిద్రించుచుండగా భార్య కాళ్లు నొక్కుచుండెను. ఆమె మామ అయిన బ్రహ్మను గౌరవించుటకు లేచి మర్యాదలు చేయుచుండగా మరీచి మేల్కొని అకారణముగా ఈమెను శిలయగునట్లు శపించెను. అందుకు ధర్మవ్రత శివుని శాపానికి లోనుకాగలవని తిరిగి శపించింది.

**మరీచి 2 :** ఓ దేవకన్య. అర్జునుని జన్మదినోత్సవ వేడుకల్లో నాట్యం చేసింది. – మహాభారతం

**మరీచి 3 :** ధర్మశాస్త్ర గ్రంథకర్త.

**మరుడు 1 :** ఇక్ష్వాకు వంశంలోని రాజు. ప్రశుశ్రుతుడి తండ్రి. శ్రీఘ్రుని కుమారుడు. ఇతని యోగశక్తి వల్ల చిరంజీవిగా మిగిలాడు. కలియుగంలో క్షత్రియ కుటుంబాలన్ని నశిస్తాయి. ఆ సమయంలో మరుడు తిరిగి వచ్చి క్షత్రియ సంతతిని పునరుద్ధరిస్తాడు. – *భాగవతం*

**మరుడు 2 :** నిమి చక్రవర్తి వంశం వాడు. విదేహరాజు. – *భాగవతం*

**మరుడు 3 :** నరకాసురుని ముఖ్యసైన్యాధికారుల్లో ఒకడు. శ్రీకృష్ణుడితణ్ణి వధించాడు.

**మరుడు 4 :** మన్మథుని మరోపేరు.

★ మండోదరి : చూ॥ మండోదరి.

**మరుత్వతి :** ఇద్దరు మరుత్వానులకు తల్లి. ఈమె దక్షుని కూతురు. ధర్మదేవుని భార్య. ఈమెకు జన్మించిన వారే మరుత్వానులు.

**మరుత్వానులు :** మరుత్వతి కుమారులు. ధర్మదేవుని వల్ల జన్మించారు. – విష్ణుపురాణం

**మరుత్వమలం :** ఇది హిమాలయాలలోని ఒక పర్వతం. రామరావణ యుద్ధ సమయంలో రావణుని బాణానికి లక్ష్మణుడు మూర్ఛపోగా జాంబవంతుడు ద్రోవణం అనే ఆకుపసరు దీనికి చికిత్స అనీ, యిది హిమాల యాలలోని మరుత్వమలపై వుంటుందని చెప్పగా హనుమంతుడు ఆ ఆకు ఏదో తెలియక ఆ పర్వతాన్ని పెకలించుకు రాగా దానిలో కావలసిన ఆకు జాంబ వంతుడు ఉపయోగించిన తర్వాత లక్ష్మణుడు మూర్ఛ నుండి తేరుకున్నాడు. ఆ తర్వాత దక్షిణ భారతదేశపు చివరి కొసన ఈ పర్వ తాన్ని పడవేశారు. ఆ పర్వతమే మరుత్వ మలం.

**మరుత్తు :** అవీక్షిత్తు కుమారుడు. తల్లి విశాల. తుంబు రుడు మరుత్తులన్నియు ఇతనికి శుభము చేయునని చెప్పగా మరుత్తు అని నామకరణము చేసిరి. మరుత్తు సకల గుణ సంపన్నుడై సంపదలో ఇంద్రుని మించిపోయెను. ఇంద్రునికి తనపై ఈర్ష్య కలదు. ఇతడు యాగము తలపెట్టి బృహస్పతిని కోరగా ఇంద్రుడడ్డుపడెను. నారదుని సలహాపై సంవర్తుని ఉపద్రష్టగా పిలిచి యాగము తలపెట్టెను. ఈ యాగమునకు బంగారము కొరకు శివుడు తపస్సు చేసిన కడకేగి బంగారము తవ్వి తెచ్చెను. ఇంద్రుడు యాగవిఘ్నమునకు అగ్నిని పంపగా మరుత్తు అతడిని భస్మముచేసెదననగా వెడలి పోయెను. ఇంద్రుడో గంధర్వుని పంపి యాగము మానకున్నచో తన వజ్రాయుధముతో కొట్టెదనని కబురంపిననూ వినలేదు. అంతేకాక సంవర్తుని మంత్ర శక్తితో ఇంద్రాదులను యాగఫలము గైకొనునట్లు చేసెను. రావణుడు కుబేరుని ఓడించి శివ ప్రసాదియై ఈ యాగమునకు వచ్చి యాగఫలమును దేవతలకే ఇత్తువేల నాకు ఇమ్ము లేక, యుద్ధము చేయమని కోరెను. మునులు క్రతువు ముగియకుండ యుద్ధము చేయరాదని కోరగా ఇతడు యుద్ధము మానుకొనగా రాక్షస గురువు శుక్రుడు రావణుడే జయించెనని ప్రక టించెను. క్రతువు అనంతరము తన వద్ద మిగిలిన బంగారమును అక్కడే పాతిపెట్టెను. తర్వాతి కాల మున ధర్మరాజు యాగము చేయునపుడు భీమార్జు నులు ఈ బంగారమునే తవ్వి తెచ్చిరి. – భాగవతం

మరుత్తు రాజ్యపాలన చేయుచుండగా నాగులు ముసు లను బాధపెట్టుచుండగా వారు మరుత్తును రక్షింప మని కోరగా ఇతడు సంవర్తానాస్త్రము వేసి నాగ లోకమును దహించెను. ఆ నాగులు భయపడి మరుత్తు తల్లి విశాలాక్షిని రక్షింపమని కోరగా మరుత్తునకు అతని తండ్రి అవీక్షిత్తునకు ఈవిషయమై యుద్ధము జరిగెను. అంతలో మునులు వచ్చి నాగుల వలన మృతులైన వారు సజీవులయిరనియు నాగులను వదలిపెట్టి మీరు యుద్ధమాపమనియు కోరిరి. మరు త్తుని తర్వాత ఆ రాజ్యమునకు అతనికి సంతతి లేనందు వల్ల పూరువంశజుడైన దుష్యంతుని దత్తత చేసుకొని అతడికి రాజ్యమునప్పగించెను.

– భాగవతం

**మరుత్తులు :** వీరు దేవతలు. కశ్యపదితి కుమారులు. దితి కుమారులను ఇంద్రుడు చంపుచుండగా ఆమె కశ్యపుని ఇంద్రుని జయించు కుమారుడు కావలెనని ప్రార్థించెను. అతడనుగ్రహించగా ఆమె గర్భవతి అయ్యెను. తనను చంపు పుత్రుడు జన్మించనున్నాడని తెలిసి ఇంద్రుడు బాలుని రూపమున దితి వద్దకు చేరి ఆమెకు సపర్యలు చేయుచూ ఆమె నిద్రించువేళ ఇంద్రుడా గర్భమున ప్రవేశించి ఆ పిండమును ఏడు ముక్కలు చేశెను. తిరిగి ఆ ముక్కలను ఒక్కొక్క దానిని ఏడు ముక్కలుకావించుచుండగా దితిమేల్కొని అట్లు చంపవలదని వారు నీకు మిత్రులే యగుదురని ఇంద్రుని కోరెను. వారెంతకును మరణించకుండుటచే వారును దేవతలేయని పల్కి వారికి మరుత్తులని నామ కరణము చేసెను. వారే మరుద్గణం.

**మరుదేశం :** మహాభారత యుద్ధ సమయమున కురు సైన్యమునకు విడిది.

**మరుభూమి/మరుధన్యం :** ఇప్పటి రాజస్థాన్ పూర్వ నామం. పశ్చిమ భారతాన్ని జయించే సమయంలో నకులుడు దీన్ని జయించాడు. తృణబందు సరోవరం వున్న కామ్యకవనం ఇక్కడే వుంది. దీన్ని మార్వాతి అనికూడా అంటారు. ఉత్తంక మహర్షి ఇక్కడే నివసించాడు. శ్రీకృష్ణుడిక్కడే ఉత్తంకుడికి తన విశ్వరూపం చూపాడు. – మహాభారతం

**మరుడు 1 :** ప్రశుశ్రుతుడను ఇక్ష్వాకు వంశ రాజు కుమారుడైన శీఘ్రుని కుమారుడు. యోగా శక్తి వల్ల చిరంజీవి అయ్యాడు. కలియుగంలో క్షత్రియ కుటుంబాలన్ని నశించగా ఇతనివల్ల మరల క్షత్రియ వంశాలు పునరుత్థానం చెందుతాయి. *- భాగవతం*

**మరుడు 2 :** నిమివంశంలో జన్మించిన విదేహరాజు. *- భాగవతం*

**మరుడు 3 :** నరకాసురుని ముఖ్య సేనానుల్లో ఒకడు. శ్రీకృష్ణుడితణ్ణి వధించాడు.

**మర్యాద 1 :** ఓ విదర్భ రాజకుమారి. అర్వాచినుడను రాజు వివాహమాడాడు. వీరికి అరిహడను పుత్రుడు జన్మించాడు. *- మహాభారతం*

**మర్యాద 2 :** విదేహ రాజకుమార్తె. పూరువంశరాజైన దేవాతిథి వివాహమాడాడు. అరిహడను పుత్రుడు జన్మించాడు. *- మహాభారతం*

**మలజం :** ప్రాచీన భారతదేశంలో ఒక పట్టణం. దీన్ని అంగమలజమని కూడా అంటారు. *- చూ॥ అంగ మలజం*

**మలద :** అత్రిమహర్షి భార్యల్లో ఒకరు. *- బ్రహ్మాండపురాణం*

**మలదకరూశాలు:** అంగదేశానికి దగ్గరలో గంగకు దక్షిణాన గల రెండు దేశాలు. వృతాసురుణ్ణి వధించిన ఇంద్రుడి మలాన్ని, కరూశాన్ని గంగాభిషేకంతో దేవత లక్కడ తొలగించారు. అందువల్ల వాటిని మలద కరూశాలని పిలుస్తారు. వీటిని పుణ్యక్షేత్రాలుగా భావిస్తారు.

**మలదులు :** ప్రాచీన భారతదేశంలో నివసించిన ఓ కులం వారు. వీరు కౌరవ పక్షపాతులు. *- మహాభారతం*

**మలదం :** ప్రాచీన భారతావనిలో ఒక దేశం.

**మలయధ్వజుడు :** ఓ పాండ్యరాజు. ఇతడు పాండవుల తరపున పోరాడి అశ్వత్థామ చేతిలో మరణించాడు. *- మహాభారతం*

**మలయప్రభుడు :** పురాణ ప్రసిద్ధుడైన రాజు. ఇతని కాలంలో కరువుకాటకాలతో ప్రజలు ఇబ్బంది పడుతుంటే ప్రజలకు అన్ని పన్నుల నుండి మినహాయించాడు. అయితే అతని దుర్బుద్ధులైన మంత్రుల తణ్ణి తప్పుదోవ పట్టించి ప్రజలను ఇబ్బంది పెట్టేటట్లు చేయగా అతని కుమారుడైన ఇందుప్రభుడు రాజు కల్పవృక్షమని, ప్రజలు కామధేనువులని ప్రజలను రక్షించాల్సిన బాధ్యత రాజుదని చెప్పగా రాజు నవ్వి "అయితే నువ్వు కల్పవృక్షమే" అన్నాడు. వెంటనే ఇందుప్రభుడు ఇంద్రుని గూర్చి తపస్సుచేసి కల్ప వృక్షమై నిలచాడు. కరువుకాటకాల అనంతరం ఇంద్రుడు ప్రత్యక్షమై స్వర్గానికి రమ్మనగా నా ప్రజలను స్వర్గానికి తీసుకువెళ్లమని కోరగా ఇంద్రుడు మెచ్చి ఇతణ్ణి నిజరూపుణ్ణిచేయగా బోధిసత్వాచార్యుడయ్యాడు. *- కథా సరిత్సాగరం*

**మలయుడు 1 :** రుషభదేవుని కుమారుడైన ఒకరాజు. ప్రియవ్రతుని వంశంలో జన్మించాడు. *- భాగవతం*

**మలయుడు 2 :** గరుడుని కుమారుడు. *- మహాభారతం*

**మలయం 1 :** దక్షిణ భారతదేశంలోని ఒక పర్వతం. ఈ పర్వతదైవం కుబేరుని కొలువులో వుంటాడు. ఈ పర్వతంపై గల చందనాన్ని పాండ్యచోళ రాజులు ధర్మజునికి కానుకగా ఇచ్చారు. సీతను వెతకడానికి వెళ్లిన వానరులు ఈ పర్వతందాటి వెళ్లారు. భారతదేశంలోని ఏడు ముఖ్య పర్వతాల్లో ఇదొకటి. మృత్యు దేవత ఒకసారి ఈ పర్వతంపై తపస్సుచేసింది. త్రిపుర సంహారంలో శివుడు ఈ పర్వతాన్ని తన జెండాపై వుంచుకున్నాడు. *- మహాభారతం*

**మలయం 2 :** దక్షిణ భారతదేశంలోని మలయ పర్వతం కాకుండా మరో పర్వతముంది. శుక్రుడు స్వర్గానికి వెళ్తూ ఈ పర్వతాన్ని చూశాడు. ఊర్వశీ విప్రచిత్తులు ప్రతిరోజు ఇక్కడ నాట్యం చేసేవారు. ఇది కైలాసానికి పైన వుంది. *- మహాభారతం*

**మల్లన :** ఓ ఆంధ్రకవి. పోతన అను కవి కుమారుడు. రుక్మాంగద చరిత్ర ఇతడి రచన.

**మల్లనాగ :** వాత్స్యాయన గోత్రీకుడు. కామసూత్రముల కర్త.

**మల్లయ :** చూ॥ బల్లేశుడు.

**మల్లరాష్ట్రం :** ప్రాచీన భారతావనిలో ఒకదేశం. ఇప్పటి కుశీనగరం దీని రాజధాని. మహాభారతకాలంలో పార్థివుడను రాజు దీన్ని పాలించేవాడు. భీమసేనుడు ఒకసారి దీన్నిజయించాడు. అజ్ఞాత వాసంలో పాండవులు ఇక్కడ నివసించడానికి ఆలోచించారు. *- మహాభారతం*

**మల్లికార్జునుడు :** శివుని అవతారం. శ్రీశైల సమీపమున చంద్రగుప్తుడను రాజు కలడు. అతని కుమార్తె చంద్రవతి. ఆమె అపురూప సౌందర్యవతి. తండ్రికి ఈమెపై మోహము కలుగగా ఆమె ఆశరీరముతో నుండ జాలక శ్రీశైలమునకేగి శివునిగూర్చి తపస్సుచేయగా శివుడు ప్రత్యక్షమయ్యెను. ఆమె శివునికి మల్లికాదామము నివ్వగా శివుడు తెల్ల నయ్యెను. ఈమె మల్లికా దామము పుచ్చుకొనగా రూపము మారినది గనుక మల్లికార్జునుడుగా పిలవబడెదవని ఈమె అనెను.
– శ్రీశైలమహాత్మ్యం.

**మశకం :** శాకద్వీపంలో ఒక ప్రాంతం. ప్రాచీన కాలంలో రాజులు తమకోర్కెలు తీరడానికి ఇక్కడ కొంతకాలం నివశించేవారు. – మహాభారతం

**మశర్మారుడు :** రుగ్వేదకాలంనాటి ఒక రాజు. ఇతడు ఆర్యులను బాధించేవాడు. – రుగ్వేదం

**మసీరం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాసయోగ్య ప్రాంతం.
– మహాభారతం

**మహతి :** నారదుని వీణ పేరు.

**మహత్తరుడు :** పాంచజన్యుడను అగ్నికుమారుడు.

**మహర్లోకం :** ప్రాచీన ప్రజలు ధ్రువపదానికి కోటి యోజనాల దూరంలో వున్న లోకమని నమ్మేవారు. భృగువు వంటి మహర్షులు కల్పాంతం వరకూ ఇక్కడే జీవించారు. – మహాభారతం

**మహాకదంబం :** సుపార్శ్వ పర్వత శిఖరం పై గల ఓ వృక్షం. 5 పెద్ద నదులు ఈ వృక్షకాండం నుండి జనించినవని చెబుతారు. ఆ కాండం నుండి శిఖరం పై పడి ఇలావృతుని పశ్చిమం గుండా ప్రవహిస్తాయి. దేవతలు ఈ నది నీటిని త్రాగి వదలిన గాలి వల్ల 100 యోజనాలు సువాసనలు వెదజల్లబడతాయి. ఈ ప్రాంత దేవతను ధారేశ్వరి అంటారు.
– దేవీ భాగవతం

**మహాకపాలుడు :** పంచవటి వద్ద రామలక్ష్మణులకు, ఖరదూషణులకు మధ్య జరిగిన యుద్ధంలో పాల్గొనిన ముగ్గురు భయంకర రాక్షసుల్లో ఒకడు. తక్కిన ఇద్దరూ స్థూలాక్షుడు, ప్రమాథిని. – రామాయణం

**మహాకర్ణి 1 :** మగధరాజైన అంబుబిచుని మంత్రి. ఓ క్రూరుడు. – మహాభారతం

**మహాకర్ణి 2 :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరి.
– మహాభారతం

**మహాకాయ :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరస్త్రీ.
– మహాభారతం

**మహాకాలుడు :** ఓ శివపార్షదుడు. మహాకాలులనే శివ పార్షదులు కుబేరుని కొలువులో వుంటారు.

**మహాకాలం :** విప్రానదీపరివాహక ప్రాంతంలోని ఉజ్జయినిలో గల ఓ పుణ్యస్థలం. ఇక్కడ ప్రతిష్టింప బడిన శివలింగాన్ని మహాకాలుడని అంటారు. ఇక్కడున్న కోటి తీర్థంలో స్నానం చేస్తే అశ్వమేధ యాగఫలం లభిస్తుంది. – మహాభారతం

**మహాకాశం :** శాక ద్వీపంలో ఓ ప్రత్యేక ప్రాంతం.
– మహాభారతం

**మహాక్రౌంచం :** క్రౌంచద్వీపంలో ఒక పర్వతం.
– మహాభారతం

**మహాగోళం :** పుణ్యప్రసిద్ధ నది. జరాసంధుని వధించడానికి శ్రీకృష్ణభీమార్జునులు మగధవెళ్లడానికి ఈ నదిని దాటి వెళ్లారు. – మహాభారతం

**మహాగౌరి :** భారతదేశంలో ఓ ప్రసిద్ధనది.
– మహాభారతం

**మహాగంగ :** ఓ పవిత్ర స్థలం. ఇక్కడ స్నానం చేసి ఓ పక్షం రోజులు ఉపవాసం చేస్తే స్వర్గలోక ప్రాప్తికిదారి ఏర్పడుతుంది. – మహాభారతం

**మహాచూడ :** సుబ్రహ్మణ్యస్వామి స్త్రీ అనుచరి.
– మహాభారతం

**మహాజయుడు :** సుబ్రహ్మణ్యస్వామికి వాసుకి ఇచ్చిన ఇద్దరు పారిషదుల్లో ఒకడు. రెండోవాడు జయుడు.
– మహాభారతం

**మహాజకి :** సుబ్రహ్మణ్యస్వామి అనుచర గణంలోని ఓ స్త్రీ.

**మహాజ్వాల :** నరకాలలో ఇదొకటి. – చూ॥ నకరం

**మహాతపసుడు :** ఓ గొప్ప రుషి. ఇతడు శంభుడనే రాజుకి విష్ణువుని పూజించమని సలహా ఇచ్చాడు.

**మహాతలం :** పాతాళంలో ఒక భాగం. కద్రువ సంతతి వారు ఇక్కడ నివసిస్తారు. ఈ సర్పాలు ఎక్కువ తలలతో భయంకరంగా వుంటాయి. వీటిలో ముఖ్యులు, కేహక, తక్షక, సుషేన, కాళీయులు. వీరంతా సన్నగా

పొడవుగా వుండి పెద్దతలతో క్రూరమైన జీవులు. అయినా గరుడునికి భయపడి మహాతలంలో దాక్కున్నారు. – *దేవీ భాగవతం*

**మహాతేజసుడు :** సుబ్రహ్మణ్య స్వామి వీరుల్లో ఒకడు. – *మహాభారతం*

**మహాదానం :** మహాదానాలు 16. అవి : 1. తులాపురుషదానం, 1. హిరణ్యగర్భదానం, 3. బ్రహ్మాండదానం, 4. కల్పకవృక్షదానం, 5. గోస హస్రదానం, 6. హిరణ్యకామధేనుదానం, 7. హిరణ్యాశ్వదానం, 8. హిరణ్యాశ్వరథదానం, 9. హేమహస్తి రథదానం, 10. ధారాదానం, 11. పంచలా గలకదానం, 12. విశ్వచక్రదానం, 13. కల్పలతా దానం, 14. సప్తసాగరకదానం, 15. రత్నకదేను దానం, 16. మహాపూతఘటదానం.

**మహాదేవుడు :** చూ॥ శివుడు.

**మహాద్యుతి 1 :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. – *మహాభారతం*

**మహాద్యుతి 2 :** మణిభద్ర పుణ్యజనిలకు జన్మించిన కుమారుడు.

**మహాధృతి :** సూర్యవంశపు రాజుల్లో ఒకడు. – *భాగవతం*

**మహానది 1 :** పురాణప్రసిద్ధ నది. ఉత్కళప్రాంతంగుండా ప్రవహిస్తుంది. అర్జునుడు ఒకసారి దీనిలో స్నానం చేశాడు. – *మహాభారతం*

**మహానది 2 :** శాకద్వీపంలో ఒక నది. – *మహాభారతం*

**మహానందుడు :** ఓ రాక్షసుడు. రావణుని పినతండ్రి. అంతేకాక మంత్రి. – *రామాయణం*

**మహానాభుడు :** హిరణ్యాక్షుడి కొడుకు. – *మత్స్యపురాణం*

**మహానుడు 1 :** పూరువంశ రాజు. మతినారుని కుమారుడు. – *మహాభారతం*

**మహానుడు 2 :** భరతుడను అగ్నికుమారుడు. ఇతడొక అభినందీయుడు. ఇతడొక ప్రజాపతి. – *మహాభారతం*

**మహానంది :** ఓ మగధరాజు. నందివర్ధనుని కుమారుడు. శిశునాగ వంశంలో చివరిరాజు. నందుడను రాజు ఇతనికి శూద్రవనితవల్ల జన్మించిన కుమారుడు. – *మత్స్యపురాణం*

**మహానందుడు 1 :** చూ॥ తారకుడు.

**మహానందుడు 2 :** రుద్రదేశపురాజు. సుమన స్వయంవర సమయంలో పరిష్యంతుని కుమారుడైన దముడు ఇతడ్ని సంహరించాడు. – మార్కండేయ పురాణం

**మహానందం :** ఓ పుణ్యస్థలం. ఇచ్చట పూజలు నిర్వహిస్తే నందనవనానికి వెళ్లడానికి అర్హత లభిస్తుంది.

**మహాపగ :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రసిద్ధనది. – *మహాభారతం*

**మహాపద్మపురం :** గంగానదీ పరీవాహకప్రాంతంలో దక్షిణాన గల ప్రాచీన ప్రాంతం పేరు. – మహాభారతం

**మహాపద్మవతి :** మహానందికి శూద్రస్త్రీ వల్ల జన్మించిన వాడు. ఇతడితో క్షత్రియ వంశం అంతరించింది. ఇతడి కొడుకు సుమాల్యుడు. నందులు వీరి తర్వాత రాజులయ్యారు. – *భాగవతం*

**మహాపారిపదేశ్వరుడు :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు. – *మహాభారతం*

**మహాపార్శ్వం :** శివుని నిలయమైన కైలాసపర్వతానికి ఈశాన్య దిక్కున గల పర్వతం. – *మహాభారతం*

**మహాపార్శ్వుడు :** రావణుని సైన్యంలోని ప్రసిద్ధ వీరుల్లో ఒకడు. రామరావణ యుద్ధంలో ఈ వీరులందరూ మరణించారు. – *రామాయణం*

**మహాపుమారసం :** ఓ పర్వతం. – *మహాభారతం*

**మహాబలి :** చూ॥ బలిచక్రవర్తి.

**మహాబలుడు 1 :** శ్రీ దత్తుని మంత్రి. చూ॥ శ్రీదత్తుడు.

**మహాబలుడు 2 :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు. – *మహాభారతం*

**మహాబాహుడు :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. కురుక్షేత్ర యుద్ధంలో భీమసేనుని చేతిలో మరణించాడు. – *మహాభారతం*

**మహాభయుడు :** అధర్ముడికి నిర్రుతి అనే భార్యవల్ల జన్మించిన రాక్షసుడు. ఇతనికిద్దరు సోదరులు. వారు ఛాయ, మృత్యులు. – *మహాభారతం*

**మహాభిషకుడు :** ఇక్ష్వాకువంశంలో ఒకరాజు. ఇతని మరో పేరు శంతనుడు. – *చూ॥ శంతనుడు*

**మహాభైరవుడు :** భైరవుల్లో ఒకడు. – *చూ॥ భైరవులు*

**మహాభోజుడు :** ఓ యాదవరాజు. సాత్వతుడి కుమారుడు. – *భాగవతం*

**మహాభౌముడు :** పురువంశ రాజైన అరిహుడి కుమారుడు. ఇతనికి సుయజ్ఞ అను భార్యవల్ల అయుత నాయి అనే పుత్రుడు జన్మించాడు. – మహాభారతం

**మహాభ్రకుడు :** రుథితుడి వంశజుడైన రాజు. కీర్తిరాతుడి తండ్రి.

**మహామఘం :** మాఘ శుద్ధ పౌర్ణమి రోజు ఏ సంవత్సరంలో సింహరాశిలో బృహస్పతి ప్రవేశిస్తాడో ఆ మాఘశుద్ధ పౌర్ణమి రోజు కుంభేశ్వరతీర్థంలో స్నానం చేయడం అత్యంత పుణ్యప్రదం.

**మహామతి :** అంగిరసుని ఏడవ కుమారుడు.
– మహాభారతం

**మహామనసుడు :** అంగవంశ రాజైన జనమేజయుని మనుమడు. మహాశాలుడితని కుమారుడు. మహాశాలుని కుమారుడు మహామనసుడు. ఉశీనరుడు మహామనసుడి కుమారుడు. – అగ్నిపురాణం

**మహామాయుడు :** పాతాళ లోకాల్లో ఒకటైన అతలానికి రాజు.

**మహామాలి :** శూర్పణఖకు జరిగిన అవమానానికి నొచ్చుకొని రావణుడు రాముని పైకి ఖరుడి నాయకత్వంలో సైన్యాన్ని పంపాడు. పంచవటి వద్ద వీరి మధ్య జరిగిన యుద్ధంలో మహామాలి మరణించాడు.
– రామాయణం

**మహాముఖుడు :** జయద్రధుడి సైన్యంలోని ఓ యోధుడు. ఇతడ్ని నకులుడు సంహరిస్తాడు. – మహాభారతం

**మహాయశస్సు :** సుబ్రహ్మణ్య స్వామి అనుచరి.
– మహాభారతం

**మహాయానం :** బౌద్ధమతంలో ఒక శాఖ. దీని ప్రవేశంతో బౌద్ధమతంలో సంస్కరణాభిలాష తగ్గి ఆ మతం మూఢ విశ్వాసాలలో కూరుకుపోయింది.

**మహాయుగం :** నాలుగు యుగాల కలయిక కాలము. ఇది 4,31,000 సంవత్సరాలు.

**మహారవుడు :** యదువంశంలోని ఒక రాజు. రైవత పర్వతం పై జరిగిన ఉత్సవంలో ఇతడు పాల్గొన్నాడు.
– మహాభారతం

**మహారాజకులు :** గణ దేవతాభేదం. వీళ్ల సంఖ్య 202.

**మహారాష్ట్రులు :** మహారాష్ట్ర ప్రాంతవాసులు. వీరు పంచద్రావిడులలో ఒకరు.

**మహారాష్ట్రం :** ఘూర్జర దేశానికి దక్షిణాన, కర్ణాటకానికి ఉత్తరాన ఆంధ్రదేశానికి పశ్చిమాన వుండే ప్రాంతం. ఈ ప్రాంత భాషను కూడా అలాగే పిలుస్తారు. ఈ భాషను ప్రాకృతమంటారు.

**మహారోముడు :** సూర్య వంశపు రాజుల్లో ఒకడు. ఇతడు కృతిరీతుని కుమారుడు, సర్వరోముని కి తండ్రి.
– భాగవతం

**మహారౌద్రుడు :** ఘటోత్కచుని స్నేహితుడైన ఓ రాక్షసుడు. ఇతడిని కురుక్షేత్ర యుద్ధంలో దుర్యోధనుడు సంహరించాడు. – మహాభారతం

**మహారౌరవం :** ఓ నరకం. – చూ॥ నరకాలు

**మహావీతుడు :** పుష్కర ద్వీపమునకు రాజైన సురసుని పుత్రుడు. ఇతని వలననే ఈ ద్వీపమునకు మహావీత ఖండమని పేరు వచ్చింది.

**మహావీరుడు 1 :** జైన గురువులలో ఒకడు. ఇతడు కడపటి తీర్థంకరుడు.

**మహావీరుడు 2 :** స్వాయంభవ మనువు ఇద్దరు ప్రసిద్ధ కుమారుల్లో ఒకడైన ప్రియవ్రతుడు విశ్వకర్మ ప్రజాపతి కుమార్తెలైన సురూప, బర్హిష్మతిలను వివాహం చేసుకొనగా వారికి 10 మంది కుమారులు జన్మించారు. వారిలో మహావీరుడు ఒకరు. – దేవీ భాగవతం

**మహావీరుడు 3 :** క్రోధవశుని పునర్జన్మ మహావీరుడు.
– మహాభారతం

**మహావీర్యుడు :** మన్యువు కుమారుడు. ఇతని పుత్రుడు ఉరుక్షయుడు. – భాగవతం

**మహావేగుల :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరురాలు.
– మహాభారతం

**మహాశని :** హిరణ్యుడను రాక్షసుని పుత్రుడు. ఇతడింద్రునితో పోరి పాతాళమునకు అణగదొక్కెను. తర్వాత వరుణునితో యుద్ధమునకు వెళ్లగా వరుణుడు భయపడి ఇతనితో చెలిమి చేసి కన్యాదానము చేశెను. దేవలోకమున ఇంద్రుడు లేకపోవుటచే దేవతలు విష్ణుమూర్తికడకు వెళ్లిరి. విష్ణువు కూడా ఇతని సంహరించజాలక ఇంద్రుని తీసుకురమ్మని వరుణునితో చెప్పెను. వరుణుడు మహాశని వద్దకు పోగా అతనిని గౌరవించి ఏమి కావలెనో కోరు కొమ్మనెను. ఇంద్రుని ఇప్పించుమని కోరగా అతడు ఇంద్రుని వదలివెయ్యగా

దేవలోకమునకు పోయి విష్ణువు సలహాపై శివుని గూర్చి తపస్సు చేయగా శివుడు మహాశనిని సంహరించెను.
- బ్రహ్మపురాణం

**మహాశంఖం 1 :** పురాణ ప్రసిద్ధమైన మొసలి. దాని భార్య శంఖిని. వీరికి పుట్టిన 7గురు పుత్రులు స్వారోచిషమనువు కాలంలో మరుత్తులయ్యారు.

పూర్వకథ : స్వారోచిష మనువు కుమారుడైన రుతద్వజుడికి 7 గురు వీరులైన కుమారులున్నారు. వారు మేరుపర్వతంపై ఇంద్రపదవి కొరకు బ్రహ్మను గూర్చి తపస్సు చేశారు. ఇంద్రుడు భయపడి వారి తపస్సును భంగపరచుటకు పూతన అనే అప్సర కన్యను పంపుతాడు. పూతన ఒకసారి ప్రక్కనే వున్న నదిలో స్నానం చేయడానికి వెళ్లగా ఆ అప్సర కన్యను చూసి వీరికి రేత పతనమయ్యింది. మహాశంఖుని భార్య శంఖిని ఈ రేతాన్ని మింగింది. రాజకు మారులు తపభంగమై తిరిగి భవనానికి వచ్చారు. పూతన ఇంద్రలోకం చేరింది. శంఖిని ఓ మత్స్యకారుడి వలలో చిక్కగా దాన్ని అతడు ఆ రాజ వీరులకు అప్పగించగా వారు దాన్ని ఓ తొట్టెలో వుంచారు. అది ప్రసవించి 7 గురు పుత్రులకు జన్మనివ్వగా వారు తల్లి లేక పాలు లేక అలమటిస్తుంటే బ్రహ్మ ప్రత్యక్షమై వారిని ఆకాశమార్గాన తీసుకువెళ్లి వాయుస్కందంలోవుంచి స్వారోచిష మనువు కాలంలో మరుత్తులవుతారని వరమిచ్చాడు.
- వామన పురాణం

**మహాశంఖం 2 :** ఓ నాగు. ఇది మార్గశిర మాసంలో సూర్యుని చుట్టూ తిరుగుతుంటుంది. - భాగవతం

**మహాశిరసుడు :** ఓ ప్రాచీన మహర్షి. ధర్మరాజు కొలువులో కన్పించేవాడు. - మహాభారతం

**మహాశిరసుడు 2 :** ఓ నాగు. ఇతడు వరుణుని కొలువులో అతడ్ని పూజిస్తుండేవాడు. - మహాభారతం

**మహాశ్రమం :** ఓ పుణ్యస్థలం. ఇచ్చట ఓ రాత్రి ఉపవాసం వుండి నిద్రిస్తే శుభలోకం లభిస్తుంది. ఎవరైన ఓ నెలరోజులు దీన్ని పాటిస్తే "పరమసిద్ధుడు" అవుతాడు. - మహాభారతం

**మహాశ్వనుడు :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు.
- మహాభారతం

**మహాశ్వుడు :** పురాణ కాలంలో ప్రసిద్ధరాజు. ఇతడు యముని కొలువులో వుంటాడు. - మహాభారతం

**మహాసాలుడు :** అంగ వంశంలోని ఒక రాజు. జనమేజయుని కుమారుడు. మహామనసుని తండ్రి.
- అగ్నిపురాణం

**మహాసురుడు :** సుబ్రహ్మణ్యస్వామితో పోరాడిన రాక్షస వీరుల్లో ఒకడు. - స్కందపురాణం

**మహాసేన :** ఉజ్జయిని రాజకుమారుడు.
- చూ॥ అంగారక *1*

**మహాసేనుడు 1 :** సుబ్రహ్మణ్య స్వామికి గల మరోపేరు.
- చూ॥ *సుబ్రహ్మణ్య స్వామి*

**మహాస్వనుడు :** సుబ్రహ్మణ్య స్వామి అనుచరుడు.
- మహాభారతం

**మహాస్వంతుడు :** అమర్షణుడి కొడుకు. ఇతని కొడుకు విశ్వసాహ్యుడు. - భాగవతం

**మహాహనుడు :** తక్షకుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది.
- మహాభారతం

**మహాహమస్సు :** వసుదేవుడికి రోహిణికి జన్మించిన కుమారుల్లో ఒకడు. - మత్స్యపురాణం

**మహాహయుడు :** యయాతి వంశంలోని ఒక రాజు.
- భాగవతం

**మహాహ్రదం :** ఓ పవిత్ర స్థలం. ఇక్కడ స్నానం చేస్తే దురదృష్టం దరిచేరదు. ఇక్కడ స్నానం చేసి ఓ నెల రోజులు ఉపవాసం వుంటే ముక్తి లభిస్తుంది.
- మహాభారతం

**మహిమానుడు :** ఓ ఆదిత్యుడు. ఇతడు భగుడికి సిద్ధి వల్ల జన్మించాడు. - భాగవతం

**మహిలారోప్యం :** చూ॥ పంచతంత్రం.

**మహిషకం / మాషికం :** ఇప్పటి మైసూర్ ప్రాంతానికి ప్రాచీన నామం. - మహాభారతం

**మహిషాద :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరి.
- మహాభారతం

**మహిషాక్షుడు :** సుబ్రహ్మణ్య స్వామితో పోరాడిన ఓ అసురుడు. - మహాభారతం

**మహిషాననుడు :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు.
- మహాభారతం

**మహిషాసుర మర్ధని :** చూ॥ త్రికళ, మహిషాసురుడు.

**మహిషాసురుడు :** అసుర రాజైన దనువుకు ఇద్దరు కుమారులు. వీరు రంభ కరంభులు. వీరిద్దరు సంతానం లేక మాలవత యక్షుడిని సంతానం కొరకు ప్రార్థించెను. కరంబుడు నీటి మధ్య, రంభుడు అగ్ని మధ్య తపస్సు చేస్తుండగా ఇంద్రుడు మొసలి రూపంలో నీటిలో వుండి కరంభుడిని అంతమొందించగా రంభుడు దీన్ని చూసి ఆత్మహత్య చేసుకోబోగా అగ్ని ప్రత్యక్షమై ఆత్మహత్య పాపమని చెప్పి నీకు కావలసిన వరం కోరుకొమ్మనగా "ముల్లో కాలను జయించగల వాడు, దేవాసురులచే మరణం లేనివాడు" అయిన పుత్రుడిని ప్రసాదించమనగా నీ హృదయాన్ని గెలిచిన స్త్రీ కన్పిస్తే ఆమెవల్ల అలాంటి పుత్రుడు జన్మిస్తాడని వరమిచ్చాడు. రంభుడు మాలయక్షమునకు ప్రయాణిస్తుండగా ఎన్నో జంతువులు కన్పించాయి. అందులో ఏనుగులు, గుర్రాలు, మహిషాలు, ఆవులు, గొర్రెలు కన్పించాయి. అందులో ఓ ఆడ మహిషాన్ని చూసి రంభుడు మోహంలో పడగా అదికూడా రంభుడిని చూసి ప్రేమలో పడింది. వారిమధ్య సంయోగం జరిగింది. వారికి ఓ మహిషి రూపంలో వుండే అసురుడు జన్మించాడు. మహిషి గర్భిణి కాగా దాన్ని పాతాళంలోని తన స్వగృహానికి తీసుకు వెళ్లగా ఇతడిని సహచరులు ఈసడించగా తిరిగి మలయక్షయానికి వెళ్లి అక్కడ కాపురం చేయగా ఒక పురుష మహిషం, స్త్రీ మహిషం పైకి రాగా రంభుడు దానిని సంహరించడానికి వెళ్లగా అది తన కొమ్ములతో చంపింది. రంభుడిని దహనం చేస్తుండగా స్త్రీ మహిషం ఆ చితిలో దూకి మరణించింది. ఆ మంటల మధ్య నుండి ఓ వికృత రూపుడు అవతరించి అక్కడున్న యక్షుల్ని సంహరించాడు. ఒక్క రంభుని వల్ల జన్మించిన మహిషాన్ని మాత్రమే వదిలాడు. అతడే రక్తబీజుడు. మహిషం వల్ల జన్మించిన వాడు కనుక మహిషాసురుడను పేరు వచ్చింది. ఇతడు అసురులకు రాజై ముల్లోకాలను భయపెట్టాడు.

– *దేవీ భాగవతం*

*మహిషాసుర పాలన :* అతడు పొందిన వరములచే గర్వంతో ముల్లోకాలను జయించాడు. ఓ గొప్ప పాలనా వ్యవస్థను ఏర్పాటు చేసుకుని తన రాజ్యాన్ని సుస్థిరం చేసుకున్నాడు. వివిధ శాఖలకు వివిధ మంత్రుల్ని, సైన్యాధిపతుల్ని నియమించాడు. ఆ తర్వాత స్వర్గంపై దండెత్తాడు. ఇంద్రుని లొంగి పొమ్మని దూతనుపంపగా ఇంద్రుడు తిరస్కరించాడు. మహిషుడు ఉగ్రుడై స్వర్గం పై దండెత్తాడు. ఈ లోపు ఇంద్రుడు దేవగణాలతో మహావిష్ణువును సంప్రదించి యుద్ధానికి సన్నద్ధమయ్యాడు.

*దేవాసుర యుద్ధం :* మహిషుడే నేరుగా యుద్ధ రంగంలోకి వచ్చాడు. దేవతలు చెల్లాచెదరయ్యారు. మహావిష్ణువు మూర్ఛిల్లాడు. శివుడు ఇతనితో యుద్ధం చేశాడు. అంతలో విష్ణువు శివునితో కలిసి మహిషునితో యుద్ధం చేయగా మహిషుడు నిజరూపుడై కొండల్ని పిండి చేశాడు. వృక్షాలను పెకలించి లోకాన్ని అల్లకల్లోలం చేశాడు. అతని అరుపులకు దేవతలు భయపడగా విష్ణువు పాంచజన్యపు మోత అసురుల్లో భయోత్పాతం కల్గించింది.

*మహిషుని మరణం :* రాక్షసుల్లో ఆత్మవిశ్వాసం నింపడానికి సింహం రూపంలో దేవతలపైకి దూకి ఎంతో మందిని వధించాడు. మహావిష్ణువు చక్రా యుధం, శివుని త్రిశూలం ఇతడినేమీ చేయలేక పోవుటచే వారు వారి వారి స్థానాలకు చేరుకున్నారు. ఆ తర్వాత దేవతలు సమాలోచన జరిపి బ్రహ్మ ఏ పురుషుడి వల్ల మరణం లేనట్లు వరమివ్వడమే ఇందుకు కారణ మనగా బ్రహ్మ తన తేజస్సు నుండి ఓ స్త్రీ మూర్తిని సృష్టించాడు. దేవతలు, విష్ణువు, శివుడు, వరుణుడు, అగ్ని తమ తేజస్సులను ఆ స్త్రీ మూర్తిలో నింపగా ఆమె దేవిగా మారింది. ఆమె సౌందర్యమునకు ముగ్ధుడైన మహిషాసురుడు ఆమెను తనను వివాహం చేసుకొమ్మని కోరగా తనను జయించిన వారినే వివాహం చేసుకుంటానని బదులిచ్చింది. మహిషాసురుడు ఆమెతో పోరాడగా ఆమె మహావిష్ణువు సుదర్శన చక్రంతో ఇతణ్ణి వధించింది.

– *దేవీ భాగవతం*

**మహిషుడు :** అనుహోతుడి కొడుకు. ఇతని తల్లి సూర్య.

– *భాగవతం*

**మహిష్మతి/మాహిష్మతి :** అంగిరసుని ఆరవ కుమార్తె. ఈమెను అనుమతి అనికూడా అంటారు.

**మహిష్మానుడు 1 :** హేహయ వంశంలో ఒక రాజు. నర్మదా నదీ తీరంలో మహిష్మతి నగరాన్ని నిర్మించింది తడే. ఇది కార్తవీర్యార్జునుని రాజధాని అయ్యింది. మహిష్మానుడు నిర్మించాడు గనుక ఈ నగరానికి ఆ పేరు వచ్చింది.

– *బ్రహ్మాండ పురాణం*

**మహిష్మానుడు 2 :** వృష్ణి వంశంలోని రాజు. కుని అనే రాజు యొక్క కుమారుడు. కునికి మరో ముగ్గురు పుత్రులు కూడా వున్నారు. వారు సభాజిత్తు, భద్ర సేనుడు, దుర్దముడు. – భాగవతం

**మహీజిత్తు :** ద్వాపరయుగంలో మహీష్మతి నగరాన్ని పాలించిన రాజు. శ్రావణ మాసంలో ఏకాదశ వ్రతం చేయడం వల్ల పుత్రప్రాప్తి కల్గింది. – పద్మపురాణం

**మహీదాసుడు :** ఓ ఆచార్యుడు. "ఐతరీయ బ్రాహ్మణాలు" మరియు ఐతరీయ ఆరణ్యకాలు రచించాడని చెప్ప బడింది. ఇతడు వ్యాధిగ్రస్తుడై కూడా 117 సంవత్స రాలు జీవించాడు. – చాంద్యోగ్యోపనిషత్తు

**మహీరథుడు :** వైశాఖ మాసంలో వ్రతం చేయడం వల్ల గొప్ప పుణ్యం సంపాదించిన రాజు. ఇతడు ఒక రోజు చేసిన పుణ్యం దానంచేసి నరకంలోని వ్యక్తుల్ని తప్పించాడు. ఇతని గురువు కశ్యపుడు. అతని సలహా పై వైశాఖ మాసంలో వేదాలనను సరించి పూజలు నిర్వహించాడు. ఇతడు మరణించి నపుడు కాలుడి సేవకులు ఇతని ఆత్మను తీసుకు వెళ్లడానికి రాగా మహావిష్ణువు యొక్క సేవకులు వారిని తోసివేసి ఇతడి ఆత్మను నరకం గుండా స్వర్గానికి తీసుకువెళ్లారు. నరకం గుండా వెళ్లే సమయంలో మహీరథుడు నరకం లోని వారి బాధలు విని అతని ఒక రోజు పుణ్యాన్ని వారికి దానం చేయగా నరకంలోని వారు కూడా స్వర్గానికి వెళ్లారు. – పద్మపురాణం

**మహీశుడు :** శివుని అవతారం. శివుని ద్వారపాలకుడు వెతాలుడు భూమిపై జన్మించినపుడు శివుడు మహే శుడిగా, పార్వతి శారదగా జన్మించారు. – శివపురాణం

**మహేంద్ర విక్రమ వర్మ :** ఓ సంస్కృత ఉపాధ్యాయుడు. కీ.శ. 7వ శతాబ్దిలో జీవించాడు. ఇతడు క్రీ.శ. 600–630 మధ్య పల్లవ రాజ్యాన్ని పాలించాడు. ఇతడు మత్తవిలాసమనే కావ్యం రచించాడు. ఇతని రాజధాని కాంచి.

**మహేంద్రం :** ఓ పవిత్ర పర్వతం. దీనికెంతో పురాణ ప్రాముఖ్యత వుంది. పరశురాముడు క్షత్రియుల్ని నాశనం చేసిన తర్వాత దీన్ని తన నివాసంగావించు కున్నాడు. అర్జునుడొకసారి దీన్ని దర్శించాడు. ఈ పర్వత గణ దేవత కుబేరుని కొలువులో అతణ్ణి పూజి స్తుంటుంది. ఈ శిఖరంపై గల రామతీర్థ కొలనులో స్నానం చేస్తే అశ్వమేధయాగ ఫలితం లభిస్తుంది. బ్రహ్మ ఒకసారి ఇచట యజ్ఞం చేశాడు. ధర్మజుడు తన యాత్రలో ఒకసారి ఈ శిఖరం ఎక్కి పరశు రాముణ్ణి దర్శించాడు. హనుమంతుడు కూడా ఈ పర్వతం చూశాడు.

**మహేంద్రుడు :** పాటలీపుత్ర నగర యువరాణి – చూ॥ పాటలీపుత్రం

**మహేశ్వరపురం :** ఓ పుణ్యస్థలం. ఇక్కడ శివుడ్ని పూజిస్తే కోరిన కోర్కెలు సిద్ధిస్తాయి.

**మహేశ్వరీధారం :** ఓ పుణ్యస్థలం. దీన్ని దర్శించిన వారికి అశ్వమేధయాగ ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**మహేశ్వరుడు :** శివుని మరోపేరు. చూ॥ శివుడు.

**మహోత్థం :** ప్రాచీన భారతదేశంలోని పురాణ ప్రసిద్ధ జనపథం. ఈ జనపథం ముఖ్యుడు అక్రోశుడు. నకులుడు దీన్ని తన జైత్రయాత్రలో జయించాడు. – మహాభారతం

**మహోదయపురి :** కుబేరుని రాజధానీ నగరం. దీన్ని అలకాపురి అనికూడా అంటారు.

**మహోదయుడు :** వశిష్ఠుని కుమారుల్లో ఒకడు. ఒకసారి త్రిశంకుడు విశ్వామిత్రుడు రుత్విక్కు యజ్ఞాన్ని ప్రారం భించి వశిష్ఠునికి అతని కుమారుడైన మహోదయుడికి ఆహ్వానం పంపగా మహోదయుడు దానికి వెళ్ళక త్రిశంకుడ్ని, విశ్వామిత్రుడ్ని చండాలురుగా పేర్కొంటూ ఓ వార్త పంపగా విశ్వామిత్రుడు కోపించి ఇతణ్ణి శూద్రుడు కమ్మని శపించాడు. – రామాయణం

**మహోదరుడు 1 :** కద్రువకు కశ్యపుని వల్ల జన్మించిన ఓ సర్పం. – మహాభారతం

**మహోదరుడు 2 :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. కురుక్షేత్రయుద్ధంలో భీముడితణ్ణి వధించాడు. – మహాభారతం

**మహోదరుడు 3 :** ఘటోత్కచుని స్నేహితుడు. ప్రాగ్జ్యోతిష పురంపై ఘటోత్కచుడు దండెత్తినపుడు అతణ్ణి అనుస రించాడు. – మహాభారతం

**మహోదరుడు 4 :** రావణుని సైన్యాధిపతుల్లో ఒకడు. - రామాయణం

**మహోదరుడు 5 :** ఓ ప్రాచీన మహర్షి. - చూ॥ కపాల మోచనం

**మహోదరుడు 6 :** రావణుని కుమారుల్లో ఒకడు. రామ రావణ యుద్ధంలో ఇతడు మొదట అంగదుడితో యుద్ధం చేశాడు. ఆ తర్వాత నీలుడను వానర సైనికుడితో యుద్ధం చేసి మరణించాడు. - రామాయణం

**మహోదరుడు 7 :** రావణుని తాత అయిన సుమాలి వద్ద మంత్రి. ఇతడు రామరావణుని యుద్ధంలో సుమాలితో కలసి పాల్గొన్నాడు. - రామాయణం

**మహోదరుడు 8 :** విశ్రవసుకి పుష్పోత్కట వల్ల జన్మించిన కుమారుల్లో ఒకడు. ఈ రాక్షసుడ్ని రామరావణ యుద్ధంలో హనుమంతుడు వధించాడు. - రామాయణం

**మహోదర్యుడు :** ప్రతి ఉదయం జ్ఞాపకం చేసుకోదగ్గ రాజు. - మహాభారతం

**మహూజసుడు :** ప్రాచీన భారత దేశంలో ఒక రాజు. పాండవులు మహాభారత యుద్ధంలో పాల్గొనడానికి ఇతణ్ణి ఆహ్వానించారు. - మహాభారతం

**మహూజసం :** ఓ క్షత్రియ వంశం. వరయుడను రాజు ఈ వంశంలోనే జన్మించాడు. - మహాభారతం

**మాకంది :** ద్రుపదుడి పట్టణం. ఇది గంగా నదీ తీరంలో వుంది. - చూ॥ కపట భిక్షువు

**మాగధి :** 5 పర్వతాల మధ్య గుండా ప్రవహించే ఒక నది. - రామాయణం

**మాగధులు :** ఓ తెగ జాతి ప్రజలు. వీరి వృత్తి ముఖస్తుతి చేయడం. - అగ్నిపురాణం

పృథు చక్రవర్తి జన్మించినపుడు బ్రహ్మ ఓ యాగం చేశాడు. అప్పుడే ఆ యాగ సమయంలో ఓ సూతుడు, ఓ మాగధుడు జన్మించారు. రుషులు వీరిని అప్పుడే జన్మించిన పృథు చక్రవర్తిని పొగడమని చెప్పగా పుట్టిన బిడ్డ గుణాలు తెలియక ఎలా పొగడ గలమని ప్రశ్నించగా అనంతరకాలంలో ఇతడు చేసే ఘనకార్యాలను పొగడమని చెప్పారు. వీరలాగే చేయగా పృథుచక్రవర్తి సూతుడిని రథిసారథిగా మాగదుడ్ని తన కొలువులో విధూషకుడిగా నియమించుకున్నాడు. వారి సంతతి వారే సూతులు - మాగధులు. - విష్ణుపురాణం

**మాఘం :** సంవత్సరంలో వుండే నెలల్లో ఒకటి. పౌష్య, ఫల్గుణ మాసాల మధ్య వస్తుంది. ఈ నెలలో ప్రయాగలో స్నానం చేస్తే పాపాలన్నీ పోతాయి. ఈ నెలలో ఒంటి పూట భోజనం చేస్తే తర్వాతి జన్మలో ధనవంతులుగా పుడతారు. భీష్ముడీ నెలలోనే మరణించాడు. - మహాభారతం

**మాణిధరుడు :** ఒక యక్షుడు. - చూ॥ దేవారణ్యం

**మాణిభద్రుడు 1, 2, 3 :** చూ॥ మణిభద్రుడు 1, 2, 3.

**మాణిభద్రుడు 4 :** శివుని పారిషదుడు.

**మాణిభద్రుడు 5 :** కుండదారుడి వద్ద వుండే గంధర్వుడు. ఇతడో బ్రాహ్మణుడికి ధనానికున్న అనిత్యత్వాన్ని, మనిషి అనిత్యత్వాన్ని గురించి చెప్పి ధనం ఇవ్వకుండగనే పంపిస్తాడు. - మహాభారతం

**మాణిభద్రుడు 6 :** కుబేరుడి దళవాయి. ప్రహస్తుడితో యుద్ధం చెయ్యడంతో ఇతడి తల వంకర తిరుగుతుంది. అందుకని ఇతడిని పార్శ్వమౌళి అంటారు. - ఉత్తర రామాయణం

**మాణివరుడు :** మందర పర్వతం మీద నివసించే ఓ యక్షుడు. - మహాభారతం

**మాతరిశ్వునుడు :** ఓ దేవత. అగ్ని మేఘాల్లో జనించి కాంతి రూపంలో భూమిని చేరుకున్న మనుషులకు కన్పించకుండా అదృశ్యరూపంలో వుంటుందని వేదాలు చెప్తున్నాయి. దీన్ని మాతరిశ్వనుడు భృగువు కుటుంబానికిచ్చి ఎప్పుడు కావాలంటే అప్పుడు ఏర్పర చుకొనే సౌకర్యం కల్పించాడు. - రుగ్వేదం

**మాతలి :** ఇంద్రుని రథసారథి. శమక మహర్షికి ఓ పుత్రుడు జన్మించాడు. ఆ సమయంలో దేవాసుర యుద్ధం జరుగుతోంది. ఇంద్రుని వజ్రాయుధం విరిగింది. మహావిష్ణువు అగ్నిని ప్రార్థించమని చెప్పగా ఓ దివ్యాయుధం లభించింది. గంధర్వులిచ్చిన బంగారు రథంలో అతడు వేగంగా రథంపై వెళ్తుండగా భూమి కంపించింది. అదే సమయంలో శమీక మహర్షి తన భార్య సలహాపై బిడ్డను ఆశ్రమం బయట భూమిపై వుంచాడు. ఓ జ్యోతిష్యుడు భూ ప్రకంపన సమయంలో అలా కూర్చోబెడితే ఇద్దరు బిడ్డలవు తారని చెప్తాడు. ముని భార్య తనకు మరో కుమారుడు కావాలనగా అదే రూపంతో ఉన్న మరోబిడ్డ ప్రత్యక్షమై వెంటనే

ఆకాశానికి ఎగిరి ఇంద్రుడి రథానికి సారథ్యం వహిస్తా నన్నాడు. అలా అతడు ఇంద్రుని రథసారథి అయ్యాడు.

**మాతంగి :** ఏనుగులకు ఆదిమాత. క్రోదవశ కూతురు. మాతంగికి ఏడుగురు సోదరీమణులు. మాతంగికి జన్మించినవే ఏనుగులు. – రామాయణం

**మాతంగుడు :** చూ॥ మతంగుడు.

**మాతృకలు :** అంధకాసురడితో యుద్ధం చేసేటప్పుడు రుద్రుడి అంగం నుంచి, విష్ణుమూర్తి అంగం నుంచి పుట్టిన కొందరు స్త్రీ గణ దేవతలు, బలి, పూజాదులు ఇచ్చేవాళ్లను వీళ్లు రక్షిస్తుంటారు. వీరిలో బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండి అనే గణ దేవతలు ముఖ్యులు. వీరిని సప్త మాతృకలని కూడా అంటారు.

**మాతృతీర్థం :** కురుక్షేత్రానికి ప్రక్కనే గల ఓ పుణ్యస్థలం. ఇక్కడున్న కొలనులో స్నానం చేస్తే పుత్ర సంపద లభిస్తుంది. – మహాభారతం

**మాథరవనం :** దక్షిణ భారతదేశంలోని ఒక పుణ్యస్థలం. మాథరకుని విజయ చిహ్నంగా ఇక్కడో స్థూపం వుంది. – మహాభారతం

**మాథరుడు 1 :** సూర్యుని సహాయార్థం ఇంద్రుడు పంపిన దేవతాస్వరూపుడు. ఇతడెల్లప్పుడు సూర్యుని కుడివైపున వుంటాడు. – భవిష్యపురాణం

**మాథరుడు 2 :** అష్టాదశ వినాయకుల్లో ఒకడు. – సాంబపురాణం

**మాథరుడు 3 :** ఓ పండితుడు. 'సాంఖ్యకార్తికా వృత్తి' గ్రంథకర్త.

**మాద్రవతి 1 :** అభిమన్యుని కుమారుడైన పరీక్షిత్తు భార్య. జనమేజయునికి తల్లి. – మహాభారతం

**మాద్రవతి 2 :** పాండు రాజు భార్య మాద్రి మరోపేరు. – చూ॥ మాద్రి

**మాద్రి :** మద్రరాజు కుమార్తె. పాండు రాజు రెండవ భార్య. శల్యునికి సోదరి. నకుల సహదేవులు అశ్వనీ దేవతల అనుగ్రహంతో జన్మించిన పుత్రులు. కిందముని శాపం వల్ల పాండురాజు మాద్రిని కౌగలించుకోగా మరణించాడు. ఈమె పాండురాజు చితిలో దూకి మరణించింది. – మహాభారతం

**మాద్రేయజాంగలం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాస యోగ్యస్థలం. – మహాభారతం

**మాధవి :** యయాతి కుమార్తె. ఈమె యెల్లప్పుడు మృగ వ్రతం చేసేది. గాలవుడు యయాతిని గుర్రాలను కోరగా ఈమెను గుర్రాలకు బదులు గాలవుడికిచ్చి గుర్రాలను సంపాదించుకోమంటాడు. ఈమెకు హర్యా శ్వుని వల్ల వసుమానుడు జన్మిస్తాడు. ఈమెను తిరిగి గాలవుడు కాశీరాజైన దివోదాసు కివ్వగా ఈమెకు ప్రతరదనుడు జన్మిస్తాడు. ఆ తర్వాత ఉశీనారుడి కివ్వగా అతని వల్ల శిభి జన్మిస్తాడు. ఆ తర్వాత గాలవు డీమెను విశ్వామిత్రునికివ్వగా అతనివల్ల అష్టకుడు జన్మిస్తాడు. అలా గాలవుడు తనకు కావలసిన గుర్రా లను మాధవి ద్వారా పొంది గురువైన విశ్వామిత్రుడి కిస్తాడు. – చూ॥ గాలవుడు

**మాధవుడు 1 :** శ్రీకృష్ణుని మరోపేరు. శ్రీకృష్ణుడిని మననం, ధ్యానం, యోగం వల్ల మాత్రమే అర్థం చేసుకో గలం కనుక ఈ పేరు వచ్చింది. – మహాభారతం

**మాధవుడు 2 :** తాళధ్వజ రాజైన విక్రముడి కుమారుడు. ఇతడు ఓ క్షత్రియ కన్య, అందాల రాశి అయిన చంద్రకళను వివాహం చేసుకోవాలని తలచగా ఆమె ఇష్టం లేక ప్లక్ష ద్వీపంలో తనకంటే సుందరి అయిన సులోచన అనే రాజకుమారి నీకు సరిజోడని ఆమెను వివాహం చేసుకొమ్మని సలహా ఇవ్వగా ఇతడు ప్రచేష్ఠుడను అతని భటుడు ఆ ద్వీపానికి వెళ్తారు. వివాహం జరిగే సమయంలో మాధవుడు నిద్రించగా అతడి భటుడు ప్రచేష్ఠుడామెను ఎత్తుకుపోగా సులోచనకు ఇష్టంలేక అతడినుండి తప్పించుకు పారిపోయి చివరికి మాధవు డినే కలసి వివాహం చేసుకుంటుంది. – కథాసరిత్సాగరం

**మాధవుడు 3 :** యదువుకు నాగకన్య అయిన ధూమ్ర వర్ణ వల్ల జన్మించిన పుత్రుడు. యదువంశం యదువు ఇతని కుమారుడైన మాధవుడి వల్లనే స్థాపించబడింది. – హరివంశం

**మాధవుడు 4 :** ఓ బ్రాహ్మణుడు. ఇతడొక మేకను బలి ఇవ్వబోగా అది మానవ భాషలో తన పూర్వ జన్మవృత్తాంతం చెప్పి గీతలోని 9వ అధ్యాయం పఠించి బలి ఇవ్వమని కోరగా అతడు దాన్ని ఆచరించడం వల్ల మేకకు మోక్షం సిద్ధిస్తుంది. – పద్మపురాణం

**మాధవుడు 5 :** క్రీ.శ. 14వ శతాబ్దికి చెందిన వేదాంతి.

**మాధ్యమికవాదం :** క్రీ.శ. 2వ శతాబ్దిలో ప్రభవిల్లిన ఓ బౌద్ధ శాఖ. దీన్ని నాగార్జునుడు స్థాపించాడు. దీని ప్రకారం జగత్తు శూన్యం.

**మానగర్వ :** ఓ అప్సరస. బ్రహ్మ శాపం వల్ల వానరస్త్రీగా మారి కేసరి అనే వానరుడిని వివాహమాడుతుంది. ఆమెను అంజన అనేవారు. వారి పుత్రుడే హనుమంతుడు. – చూ॥ హనుమంతుడు

**మానవత :** ఓ పండితుడు. ధర్మశాస్త్ర పారంగతుడు. ఇతడు 'మానవ ఉపపురాణ', 'మానవ శ్రేతసూత', 'మానవ వాస్తు లక్షణ' అనే గ్రంథాలు రచించాడు.

**మానవర :** కాంచీ నగర రాజు వద్ద ఇంటి బాధ్యతలు చూసే సేవకుడైన అర్థలోభుడి భార్య. ఈమె అతనికి విడాకులిచ్చి ఇతనికంటే ధనవంతుడిని వివాహ మాడింది. – కథాసరిత్సాగరం.

**మానవర్జకం :** ప్రాచీన భారతదేశంలో నివాసయోగ్య స్థలం. – మహాభారతం

**మానలి :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రసిద్ధ నది. – మహాభారతం

**మానసద్వారం :** మానస సరస్సు వద్ద గల ఒక పర్వతం. మానస సరస్సుకు ఈ పర్వతంపైనుండే వెళ్లాలి కనుక ఈ పేరు వచ్చింది. ఈపర్వతం మధ్యనే పరశురా ముని ఆశ్రమం వుంది. – మహాభారతం

**మానస పుత్రులు :** బ్రహ్మ, మనసునుండి సృష్టించబడిన ప్రజాపతులను మానస పుత్రులంటారు. వారు తొమ్మి దిమంది. వారు భృగు, పులస్త్య, పులహ, క్రతు, అంగిరస, మరీచి, దక్ష, అత్రి, వశిష్ఠులు. వారి భార్యలు వరసగా ఖ్యాతి, భూమతి, సంభూతి, క్షామ, ప్రీతి, సన్నతి, ఊర్జ, అనసూయ, ప్రసూతి.

**మానసాదేవి :** కశ్యప ప్రజాపతి మానస పుత్రిక. ఈమెను జరత్కారు అనికూడా పిలుస్తారు. – చూ॥ జరత్కారు

**మానస 1 :** వాసుకి కుటుంబంలో జన్మించిన సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. – మహాభారతం

**మానస 2 :** ధృతరాష్ట్రుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. ఇది జనమేజయుని సర్పయాగంలో మరణించింది. – మహాభారతం

**మానసం (మానస సరోవరం) :** హిమాలయ శిఖరా గ్రాన గల ఒక కొలను. అర్జునుడు దీన్ని దర్శించాడు. ఇక్కడ భక్తులు శివుడ్ని గురించి పూజిస్తారు. యుగాం తంలో శివునిలో ఐక్యమవుతారని నమ్మిక. దీనిలో స్నానంచేస్తే మోక్షం లభిస్తుంది. దీనిని ఉజ్జానిక అనికూడా పిలుస్తారు. వశిష్ఠుడు, అరుంధతిలకు ఇక్కడే ఆత్మజ్ఞానం కల్గుతుంది. – మహాభారతం ఇక్కడ ఓ రుషి హంస రూపంలో వుండి భీష్ముడు అంపశయ్యపై వుండగా దర్శించాడు. – మహాభారతం బ్రహ్మ దీన్ని సృష్టించాడు. అంతేకాక సరయూనది దీని నుండే మొదలవుతుంది. – రామాయణం

**మానిని :** రావణుని తండ్రి అయిన విశ్రవసువుకు తల్లి. తృణబిందు రుషికి భార్య. – చూ॥ తృణబిందు

**మానుషతీర్థం :** కురుక్షేత్రానికి ప్రక్కనే గల పుణ్యతీర్థం. ఈ కొలనుకో చరిత్ర వుంది. ఓ వేటగాడు లేడిని వేటాడగా అది ఈ కొలనులో పడి బయటకు రాగా మనుష్యరూపం పొందింది. అప్పటి నుండి అది పుణ్య తీర్థమై మానుష తీర్థమని పిలవబడుతుంది. – మహాభారతం

**మానుషాధం :** ఒకవృషభం. దీని చర్మంతో చేసిన భేరులు జరాసంధుడి చైత్రికగిరి శృంగాల్లో వున్నాయి. అక్కడకు ఇతరులు ప్రవేశిస్తే ఆ భేరులు వాటంతట అవే మోగుతాయి.

**మాన్యవతి :** కరంధాముని పుత్రుడైన అవీక్షిత్తు భార్య. భీమరాజు తనయ అయిన ఈమెను పెండ్లి మంటపం నుండి బలవంతంగా ఎత్తుకుపోయి వివాహం చేసుకున్నాడు. – మార్కండేయ పురాణం

**మాష్టి 1 :** గౌతముని శిష్యుడు. ఆత్రేయకు గురువు. – బృహదారణ్యకోపనిషత్తు

**మాష్టి 2 :** ఓ శివభక్తుడు. కాలభీతి తండ్రి. – చూ॥ కాలభీతి

**మాయ 1 :** శ్రీ మహావిష్ణువు సహచరం. ఈ జగత్తు నిజంకాదని ఓ భ్రమ అని ఈ మాయవల్లనే మనం నిజమని భావిస్తున్నామని పురాణాలు చెప్తున్నాయి. పుట్టుక, అధర్ముని భార్య హింస – వారి సంతానం అనృత, నికృతి. వారినుండి జనించినవి భయ, నరక, మాయ (భాను), వేదన, మాయ మరణానికి జన్మనిచ్చింది.

మరణం వ్యాధి, జర, శోక, తృష్ణ, క్రోధాలకు జన్మనిచ్చింది. "భూమిమీద జీవితం లేదని, మాయవల్ల భ్రమకల్గి జీవం వున్నట్లు భ్రమిస్తాము" అని మహావిష్ణువు నారదుడికి బోధించి అందుకు ఉదాహరణగా నారదుడ్ని ఓ నదీతీరానికి తీసుకువెళ్లి మాయ యొక్క ఆశ్చర్యకరమైన పనితనాన్ని చూపిస్తాడు.

– చూ॥ *తాళధ్వజుడు 1*

మాయను విష్ణువు గాధికి ప్రదర్శించి చూపాడు. గాధి అనే బ్రాహ్మణుడు ఓ కొలనులో నిలబడి తపస్సు చేయగా విష్ణువు ప్రత్యక్షమయ్యాడు. వరం కోరుకొమ్మంటే మాయా దేవిని చూపమని కోరతాడు.

గాధి భ్రమలో ఎన్నో జీవితాలను చండాలుడిగా, రాజుగా జీవించి తిరిగి అదే కొలనులో తపస్సు చేసుకుని పై జీవితమంతా మాయగా తలుస్తాడు. అంతలో అతడి ఆశ్రమానికి వచ్చిన స్నేహితుడు కూడా తాను భ్రమించిన కథనే వివరిస్తాడు. తన స్నేహితుడు వర్ణించిన దేశాన్ని దర్శించగా తన కలలో చూపినది యథాతథంగా గోచరిస్తుంది. అప్పుడతడు విష్ణువు యొక్క 'మాయ' ప్రదర్శనే ఇదని భావించి ఓ గుహలోకి వెళ్లి తపస్సు చేసుకుంటుండగా మహావిష్ణువు ప్రత్యక్షమై ఇతడిని ఆశీర్వదిస్తాడు. – జ్ఞానవాశిష్ఠం.

**మాయ 2 :** వేదకాలం మొదట ఈపదానికి 'భ్రమ' అన్న అర్థం లేదు. ఉపనిషత్తుల 'భావవాదం' విజృంభించిన తర్వాత ఈ జగత్తు భ్రమ అనే అర్థంలో 'మాయ' అనే పదాన్ని ఉపయోగించారు. ఆది శంకరుడు 'మాయి' అనే పదాన్ని భౌతిక సత్యం అనే అర్థంతో ఉపయోగించాడు. అతని దృష్టిలో సత్యం రూపరహితమైన అగోచరమైన బ్రహ్మ మాత్రమే.

**మాయ 3 :** గంగాద్వారానికి మరో పేరు.

**మాయాకేకి (నెమలి) :** మరుత్తుడు యాగం చేస్తుండగా ఇంద్రుడితో సహ దేవతలు హవిస్సు స్వీకరించడానికి రాగా దేవతలు ఇంద్రుడు రావణునికి భయపడి పక్షి రూపాలు ధరిస్తాడు. ఇంద్రుడు నెమలిగా మారతాడు. రావణుడు వెళ్లిన తర్వాత నెమలి రూపానికి మెచ్చుకొని దానికి తన కళ్లను బహూకరించి నీలి రంగుగా వుండే నెమలికి తన కళ్లతో వింతశోభను చేకూర్చి నెమళ్ళకు మరణం లేనట్లు వర్షాకాల ఆరంభంలో నృత్యం చేసేటట్లు వరమిస్తాడు. ఆ నెమళ్లనే మాయాకేకి అంటారు.

**మాయాధరుడు :** ఓ అసురుడు. ఇంద్రుడి తరఫున పురూరవసుడు ఇతనితో యుద్ధం చేసి చంపుతాడు. పురూరవసుడి గౌరవార్థం ఇంద్రుడు రంభతో నాట్యం చేయిస్తాడు. పురూరవసుడు ఈ నృత్యాన్ని విమర్శించగా తుంబురుడు కోపించి ఇతడిని తన భార్య ఊర్వశితో ఎడబాటు కల్గుతుందని శపిస్తాడు. అందువల్ల ఊర్వశిని ఒకసారి పురూరవసుని గృహం నుండి గంధర్వులు ఎత్తుకుపోతారు. – కథాసరిత్సాగరం

**మాయామృగం :** రావణుని మేనమామ మారీచుడు శ్రీరాముని ఆశ్రమము చెంత లేడిగా తిరుగుతూ సీతను ఆకర్షిస్తాడు. దీనినే మాయామృగం అంటారు.

– చూ॥ మారీచుడు

**మాయాపురి :** ఓ నగరం. ఇది అసురులకు చెందింది.

– చూ॥ *క్రౌంచం*

**మాయావతి :** రతీదేవి యొక్క అంశ. శంచరుడను రాక్షసుడు ఈమెను వివాహమాడగా శ్రీకృష్ణుని కుమారుడు ఈమెను ద్వారకకు ఎత్తుకు పోయాడు.

– చూ॥ ప్రద్యుమ్నుడు

**మాయా వశిష్ఠుడు :** సూర్య వంశపు రాజులలో మిత్రసహుడొకరు. అయోధ్య ఇతని రాజధాని. వేటకు వెళ్ళి సింహం రూపంలో వున్న ఇద్దరు రాక్షసులను వేటాడి ఒకదానిని చంపుతాడు. మరో రాక్షసుడు కక్షసాధించడానికి సమయం కోసం వేచివుండి మిత్రసహుడు అశ్వమేధయాగం చేస్తుండగా వశిష్ఠునిరూపంలో వచ్చి రహస్యంగా మాంసాహారం కావాలని కోరతాడు. రాజు ఆ ఏర్పాటు చేయగా నిజ వశిష్ఠుడు మాంసాహారం చూసి కోపించి మిత్రసహుడ్ని రాక్షసుడివి కమ్మని శపిస్తాడు. వశిష్ఠుడి రూపంలో వచ్చిన రాక్షసుడ్ని మాయా వశిష్ఠుడంటారు.

– చూ॥ కల్మషపాదుడు

**మాయావాదం :** ఇంద్రియ గోచరమైన భౌతిక ప్రపంచం మాయ అనే సిద్ధాంతం.

**మాయావి 1 :** అసురుల్లో గొప్ప వాస్తు శిల్పి అయిన మయుని కుమారుడు.

**మాయావి 2 :** దుందుబి అను అసురుని కొడుకు. తండ్రిని చంపాడన్న పగతో వాలిపై పోరాడి అతని చేతిలో

మరణించాడు. ఇతనిని వెంటాడగా ఇతడో గుహలో దూరెను. వాలి తన తమ్ముడు సుగ్రీవునితో తెల్లని రక్తము బయటకు వచ్చినచో తాను మరణించినట్లు, ఎర్రని రక్తము బయటకు వచ్చినచో మాయావి రక్తమని చెప్పి గుహలోకి వెళ్తాడు. మాయావి తను మరణిస్తూ తన మాయతో తన రక్తము తెల్లగా మారునట్లు చేయగా సుగ్రీవుడు వాలి చనిపోయెనని తలచి ఆ గుహకు అడ్డుగా ఓ బండరాతిని వుంచి కిష్కింద వెళ్తాడు. – *కంభరామాయణం*

**మాయాశివుడు :** దేవదానవ యుద్ధంలో జలంధరుడికి శివుడికి ఘోర యుద్ధం జరుగుతుంది. అలా యుద్ధం జరుగుతుండగా మరి కొందరు వీరుల్ని శివునితో పోరాడమని జలంధరుడు శివుని వేషంలో పార్వతిని మోసగించి వశపరచుకోవడానికి వెళ్తాడు. ఇతడు వినాయకుడి, సుబ్రహ్మణ్య స్వామి తలలుగా రెండు తలలు చూపి గాయాలతో పార్వతిని నమ్మించి ఆమెను ఆలింగనం చేసుకోబోగా ఇంతటి విపత్కర సమయంలో ఆలింగనానికి సమయంకాదని చెప్పి దూరంగా వెళ్తుంది. మహావిష్ణువు గరుడుని ద్వారా ఈ కపట శివుని కథ తెలిసి జలంధరుడి రూపంలో అతని భార్యతో సంగమిస్తాడు. ఆ తర్వాత ఆమె గ్రహించగా శివుడు విష్ణువు ఒకటేనని శివుడ్ని మోసం చేయబోయినందుకు యిది ప్రతీకారమని చెప్పగా ఆమె మహావిష్ణువును శపిస్తుంది. ఈలోపు పార్వతి మాయా శివుడ్ని జలంధరుడిగా గుర్తిస్తుంది. జలంధరుడే మాయాశివుడు. – *పద్మపురాణం*

**మాయాసీత :** సీతారామలక్ష్మణులు అరణ్య వాసం చేస్తున్నప్పుడు రావణుడు సీతనెత్తుకు పోవడానికి వచ్చినపుడు సీత అగ్నిలో ప్రవేశిస్తుంది. మాయాసీత రావణుడి ముందు ఆవిర్భవిస్తుంది. ఈమెనే అసలు సీతగా భావించి రావణుడెత్తుకు పోయింది, లంకలో దాచింది. రావణుని మరణం తర్వాత అగ్నిప్రవేశం చేసింది కూడా మాయా సీతయే. అగ్ని ప్రవేశం చేసినపుడు అసలు సీత రాముని ముందు ప్రత్యక్షమవుతుంది.

**మాయాసురుడు :** ఒక రాక్షసుడు. ఇతడి కూతురు సోమప్రభ. – *కథాసరిత్సాగరం*

**మారిష 1 :** దేవమీఢుని భార్య. ఇతడిని శూరదని కూడా అంటారు. వీరి కుమారులు వసుదేవుడు మొదలగువారు. కుమార్తెలు పృథ మొదలగువారు.
– చూ॥ దేవమీఢుడు.

**మారిష 2 :** ఈమె పూర్వ జన్మమున ఒక బాల వితంతువు. ఈమె విష్ణుమూర్తిని ప్రార్థించి తనకు భర్తలనిమ్మని కోరెను. కంథుడను ముని తపస్సు చేసుకొనుచుండగా ఆ తపోవిఘ్నమునకు ఇంద్రుడు ప్లమోచనను పంపెను. ఈ ముని వలన ఆమె గర్భవతియయ్యెను. ఒకనాడాముని ఈమెను కోపించగా అతని వీర్యము ఈమె చెమట రూపమున దేహము నుండి వెలువడగా అది చెట్ల చిగుళ్లతో తడిసెను. ఆ వీర్యమే ఒక బాల అయ్యెను. ప్రచేతను డొకసారి ఈ వృక్షములను దహింపచేయరాగా చంద్రుడు ఆ బాలికనిచ్చి వీరికి వివాహము చేసెను. ఆమెయే మారిష. వీరివలన ఆమెకు దక్షుడు మరియు చంద్రవతి జన్మించిరి.
– విష్ణు, మత్స్యపురాణాలు

**మారీషం 1 :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాస యోగ్య ప్రాంతం. – *మహాభారతం*

**మారీషం 2 :** పురాణ ప్రసిద్ధి గాంచిన ఓ నది.
– *మహాభారతం*

**మారీచుడు :** సరయూ నదీ తీరంలో మలద కరూశాలనే ప్రాంతాలున్నాయి. ఇంద్రుడు ఇచట తన పాపాల నుండి విముక్తి చెందాడు. కొంతకాలానికి అచట తాటక అనే రాక్షసి జన్మించింది. ఆమెకు ఇద్దరు పుత్రులు జన్మించారు. వారే మారీచ సుబాహులు.

*మారీచుని పూర్వజన్మ :* పూర్వ జన్మమున వైకుంఠ ద్వారం వద్ద సేవకుడు. మహావిష్ణువు ఒకసారి ఇతినిపై అసంతృప్తితో రాక్షసుడిగా జన్మించమని శపించి తన రామావతార సమయమున నా బాణపు దెబ్బతో ముక్తి లభించి తిరిగి వైకుంఠం చేరగలవని చెప్తాడు. అందువల్ల ఇతడు రావణుని మేనమామగా జన్మించాడు.

*ఆశ్రమజీవితం :* ఇతడు ఇతని సోదరుడు సుబాహుడు బ్రాహ్మణులను బాధిస్తూ వుండేవారు. విశ్వామిత్రుడు యాగార్థియై రామలక్ష్మణులపై రక్షణ భారం పెట్టి అరణ్యానికి రాగా రాముని వింటి శబ్దానికి మారీచుడు సముద్రపు ఆవలికి పారిపోయి ఆశ్రమ జీవితం గడిపాడు.

*మరణం :* దండకారణ్యంలో సీతాసమేతుడై రామలక్ష్మణులుండగా రావణుని సోదరి శూర్పణక లక్ష్మణుని మోహించగా లక్ష్మణుడు ఆమె ముక్కుచెవులు కోసి పంపగా రావణుడు రాముని చంపి సీతను ఎత్తుకుపోవడానికి నిశ్చయించి మారీచుని సహాయం కోరతాడు. రావణుని చేతిలో గాని రాముని చేతిలోగాని చావు నిశ్చయమని తలచి రావణునికి సహాయపడ నిశ్చయించి మాయాలేడిగా రాముని ఆశ్రమం వద్ద తిరుగుతుంటుంది. సీత ఈ వింత బంగారు లేడిని చూసి రాముని దాన్ని తెమ్మని కోరగా అతడు దాని వెంటబడగా అది తప్పించుకు పోతూవుంటుంది. చివరికి రాముడు దానిపై ఓ అస్త్రాన్ని ప్రయోగించగా అది మరణించగా మారీచునికి ముక్తి లభిస్తుంది. మరణిస్తూ మారీచుడు రాముని గొంతుతో అరవగా సీత లక్ష్మణుని రాముని సహాయానికి పంపుతుంది. ఆ సమయంలో రావణుడు మాయా వేషధారుడై వచ్చి సీతను ఎత్తుకు పోతాడు.
– రామాయణం

**మారుత :** 49 వాయువులు. – చూ॥ దితి

**మారుతగణ తీర్థం :** ఓ పవిత్ర స్థలం. – మహాభారతం

**మారుతంతవ్యుడు :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు.
– మహాభారతం

**మారుతం :** దక్షిణ భారతదేశంలోని ఓ నివాసయోగ్య ప్రాంతం. ధృష్టద్యుమ్నుడు కురుక్షేత్రంలో క్రౌంచ వ్యూహం పన్నినపుడు ఈ ప్రాంత ప్రజలు ఈ వ్యూహానికి కుడివైపున నిల్చారు. – మహాభారతం

**మారుత స్కందం :** దేవతలలో ఓ సైన్య విభాగం. దీనికి సుబ్రహ్మణ్య స్వామి నాయకత్వం వహించాడు.
– మహాభారతం

**మారుతాశనుడు :** సుబ్రహ్మణ్యస్వామి సైనికుల్లో ఒకడు.
– మహాభారతం

**మారుధం :** పురాణ ప్రసిద్ధమైన ఒక దేశం. దక్షిణ దేశ జైత్రయాత్రలో నకులుడు దీన్ని జయించాడు.
– మహాభారతం

**మార్కండేయ పురాణం :** అష్టాదశ పురాణాల్లో ఒకటి. ఇందులో 9 వేల గ్రంథాలున్నాయి. ఇందులో ధర్మాధర్మ విషయాలు కూలంకషంగా చర్చించబడ్డాయి. కార్తీక మాసంలో పౌర్ణమి రోజున దీన్ని బహుమతిగా ఇస్తే చాలా మంచిది. – అగ్నిపురాణం

**మార్కండేయుడు :** మృకండుని కుమారుడు. ఇతడు గొప్ప శివభక్తుడు.

*వంశవృక్షం :* బ్రహ్మ మానస పుత్రుడైన భృగునికి ఖ్యాతి వల్ల లక్ష్మి అనే కుమార్తె, ధాత, విధాతలను కుమారులు జన్మించారు. విధాతకు మృకండుడు జన్మించాడు. మృకండుని కుమారుడే మార్కండేయుడు. ఇతని కుమారుడు వేదశిరసుడు.

*మార్కండేయుని జననం :* మృకండుడికి చాలాకాలం సంతానం లేదు. అందువల్ల మృకండుడు శివుని గూర్చి తపస్సు చేయగా శివుడు ప్రత్యక్షమై "నీకు తెలివైన సచ్ఛీలుడైన 16 సంవత్సరాలు జీవించే కుమారుడు కావాలా, పాప గుణాల, క్రూరుడు అయి ఎక్కువ కాలం జీవించే కుమారుడు కావాలా" అని కోరగా మృకండుడు మొదటి వాడినే కోరుకున్నాడు. అలా జన్మించిన వాడే మార్కండేయుడు. అతడికి చిన్న తనం నుండి వేదాలు, శాస్త్రాలు తెలుసు. అతని అణుకువ గురువులను మెప్పించింది. కాని తల్లి దండ్రులు అతడిని చూసినప్పుడల్లా విచార వదనంతో వుండేవారు. మార్కండేయుడు కారణం తెలుసుకోగా తండ్రి తన జీవిత కాలపరిమితి గురించి చెప్పగా ఆనాటి నుండి చెట్ల బెరడు వస్త్రాలుగా ధరించి తీవ్రమైన తపస్సు చేశాడు. మరణించే రోజు వచ్చింది. మార్కండేయుడు శివుని విగ్రహం ముందు కూర్చుని ధ్యానంలో వున్నాడు. మృత్యు దేవత సేవకులు వచ్చి అతడి శరీరం నుండి వస్తున్న కాంతికి భయపడి వెనక్కు వెళ్లగా కాలుడే వచ్చాడు. మార్కండేయుడు బిగ్గరగా శివుడ్ని తలస్తూ ఆ విగ్రహాన్ని గట్టిగా పట్టుకోగా కాలుని తాడు విగ్రహాన్ని బాలుణ్ని చుట్టి వేయగా ఉగ్రుడైన శివుడు విగ్రహం నుండి ప్రత్యక్షమై యముని సంహరించి బాలుణ్ణి రక్షించాడు. ఆ తర్వాత దేవతల కోరికపై కాలుణ్ణి రక్షించి నీకు ఎల్లప్పుడు 16 ఏళ్ల వయసేనని బాలుణ్ణి దీవించాడు.

*మార్కండేయుని తపస్సు :* శివుని వరం తర్వాత మార్కండేయుడు 10 కోట్ల సంవత్సరాలు జీవించాడు. ఇతను ధ్యానంలో వుండగనే 6 మన్వంతరాలు పూర్తయ్యాయి. 7వ మన్వంతరంలో ఇంద్రుడు ఇతడి తపస్సును భగ్నం చేయనెంచి వివిధ రకాల ప్రయత్నాలు చేసి విఫలుడయ్యాడు. ఇంద్రాదులు వెళ్లిన తర్వాత

మహావిష్ణువు ఋషులతో కలసి రాగా మార్కండేయుడు ధ్యానం నుండి మేల్కొని మహావిష్ణువును పూజించాడు.

*ప్రళయ దర్శనం :* ఒక సాయంత్రం పుష్ప భద్రా తీర్థంలో కూర్చొని వుండగా ఎక్కడి నుండో గాలి రావడం ప్రారంభించి ఉధృతం కాసాగింది. ఆకాశం మేఘావృతమై ఉరుములు మెరుపులు తీవ్రవర్షం రానారంభించింది. నదులు ఉప్పొంగాయి. అన్నీ నీటిలో మునిగిపోయాయి. మార్కండేయుడు అతుక్కుని పోయిన జుట్టుతో గాలిలో కదులుతున్నాడు. మార్కండే యుడు ఎటు వెళ్తున్నాడో తెలియడం లేదు. సుడిగా లిలో పడవేయబడ్డాడు. ఆ పైకి చూస్తే ఓ అరటి చెట్టు కన్పించింది. ఆ చెట్టుపై ఓ శిశువు కన్పించి అది పీల్చగా మార్కండేయుడు ఆ శిశువులోకి లాగ బడ్డాడు. ఆ శిశువు గర్భంలో మార్కండేయుడు జగత్తు నంతా చూశాడు. ఆకాశాన్ని, నక్షత్రాలను, సముద్రా లను, పర్వతాలను, భూమి విస్తృతిని చూశాడు. సురలు, అసురులు, అడవులు అన్నీ వాటి వాటిస్థానా లలో గమనించాడు. అతని కళ్లముందే యుగాలు, మన్వంతరాలు కన్పించాయి. ఆ శిశువు ఊపిరి వద లగా మార్కండేయుడు బయటపడి నీటిపై పడ్డాడు. ఆ శిశువు మాత్రం ఆ అరటి బోదెపై వున్నాడు. అతడే మహావిష్ణువని తెలుసుకొని అతడిని కౌగలిం చుకోవడానికి వెళ్లగా అది మాయమయ్యింది. మార్కం డేయుడు మహావిష్ణువును ప్రార్థించగా పార్వతీపర మేశ్వరుల దర్శనం, తిరిగి పుష్పభద్రా తీర్థంలో కూర్చొని వుండి మరల ధ్యానం చేస్తుండగా శివపార్వతులు ప్రత్యక్షమై అతడు వారిని పూజించాడు. నీ కోర్కెలు తీరతాయని ప్రపంచం ముగిసే వరకూ జీవిస్తావని నీ రంగు రూపు మారదని చెప్పాడు.

*ఇతర విశేషాలు :* ఇతడు ధర్మజుని కొలువులో వుండే వాడు. బ్రహ్మ కొలువులో అతడిని పూజించేవాడు. ఇతడు పాండవులకు ధర్మోపదేశం చేశాడు. ఇతడు ధర్మజునికి రాజుల ఋషుల కథలు వివరించాడు. ఇతడు బాలముకుందుడి గర్భంలోకి వెళ్ళాడు. కలియుగాన్ని గురించి వివరించాడు. త్రిపురవధను గూర్చి ధర్మజుడికి వివరించాడు. భీష్ముడు అంపశయ్య పై నుండగా దర్శించాడు. మాంసాహారం వల్ల జరిగే నష్టాన్ని వివరిస్తాడు. ఇతనికి గల పేర్లు భార్గవ, భార్గవ సత్తమ, భృగుకుల శార్థూల, భృగునందన, బ్రహ్మర్షి, విప్రర్షి

**మార్కండేయం :** ఓ ప్రసిద్ధ పుణ్యస్థలం. ఇది కాశీకి 18 మైళ్ల దూరంలో వుంటుంది. గంగా గోమతి నదుల సంగమ ప్రాంతం. దీన్ని దర్శిస్తే అగ్ని స్తోమ యజ్ఞ ప్రతిఫలం లభిస్తుంది. కుటుంబ గౌరవం ఇనుమడి స్తుంది. - మహాభారతం

**మార్గణ ప్రియ :** కశ్యప ప్రజాపతికి ప్రధవల్ల జన్మించిన కూతురు. - మహాభారతం

**మార్గశీర్షమాసం :** ధానుర్మాసాన్ని ఈ పేరుతో కూడా పిలుస్తారు. ఈ నెలకు పురాణ ప్రసిద్ధి వుంది. ఈ నెలలో రోజుకి ఒకసారి మాత్రమే ఆహారం తీసు కుంటే వ్యాధుల నుండి పాపాలనుండి విముక్తి పొందు తారు. ద్వాదశిరోజు ఓ రోజు మొత్తం ఉపవాసం వుండి కేశవుడిని పూజిస్తే అశ్వమేధ యజ్ఞం చేసిన ప్రతిఫలం లభిస్తుంది. - మహాభారతం

**మార్గమహర్షి :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు. బ్రహ్మవాది. - మహాభారతం

**మార్జారుడు :** జాంభవానుడి కుమారుడు. మార్జాలాలు పుట్టుకకు (పిల్లులు) ఇతడే కారణం. - బ్రహ్మపురాణం

**మార్తాండుడు :** హవిర్భాగములను దేవతలకందకుండా దైత్యులే అపహరించుచుండగా దేవతలార్తినొందిరి. వీరిని కాపాడుటకు అదితి సూర్యుడినారాధించగా అతడు ప్రత్యక్షమయ్యెను. నీ అంశమున నాకు పుత్రుడు జన్మించి దేవతలను రక్షింపవలెనని కోరెను. 'సుషుమ్న' యను అశ్మి అదితి గర్భమున మార్తాండుడు జన్మించెను. అతని తేజస్సును భరించలేక పలువురు దైత్యులు భస్మమైరి. - మార్కండేయ పురాణం

**మార్తికావనం :** భారతావనిలో ఓ ప్రాచీన దేశం. శల్యుడీ దేశాన్ని మహాభారత కాలంలో పాలించాడు. పరశు రాముడీ దేశపు క్షత్రియుల్నందర్నీ వధించాడు. అర్జునుడు కృతవర్మ కుమారుడిని ఈ దేశానికి రాజును చేశాడు. - మహాభారతం

**మాల :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాసయోగ్య స్థలం. - మహాభారతం

**మాలతికుడు :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు. - మహాభారతం

**మాలవతి :** ఉపబర్హణుడను గంధర్వుని భార్య. ఇతడికి ఇంద్రసభయందు రంభను చూడగనే రేతః పతనమ

య్యేను. వీనిని శూద్ర యోని యందు పుట్టమని శపించెను. వెంటనే అతడు మరణించగా మాలవతి దేవతలను ప్రార్థించగా వారు మిన్నకుండిరి. ఆమె దేవతలను శపించబోగా ఆమె పాతివ్రత్యమెరిగి బ్రహ్మాదులు విష్ణువుతో చెప్పుకొనగా అతడు కాలము, మరణము మొదలగు అనేక విషయములను చర్చించి నను ఆమె తన భర్తనిమ్మని ప్రార్థించెను. మహావిష్ణువు ఆమె మహాపతివ్రత అనియు ఆమె శాపము దేవత లకు కీడు కల్గించునని చెప్పగా బ్రహ్మ ఉపబర్హణుడు నారదుని పునర్జన్మయే అనియు అతని ఆయుష్కాల మింకను కలదని అతనిని బ్రతికించెను. అతనితో ఆమె పేక్కేండ్లు కాపురము చేసిన తర్వాత అతడు బ్రహ్మ శాపము వల్ల శరీరము విడువగా ఆమె బ్రహ్మ కుండంబున ప్రవేశించి 'జాతష్మరణ' గా జన్మించి ఉపబర్హణుడినే భర్తగా కోరెను. – బ్రహ్మవైవర్తపురాణం

**మాలి :** బలశాలి అయిన ఓ రాక్షసుడు.

*వంశవృక్షం – జననం :* రాక్షస వంశంలో ఇద్దరు వీరులున్నారు. వారు హేతి, ప్రహేతి. మహాబలికి మిత్రులు. ప్రహేతి బ్రహ్మచారిగా వుండి మత కార్య క్రమాలు నిర్వహించేవాడు. హేతి భయుని సోదరికా లను వివాహమాడగా విద్యుత్కేశుడు జన్మించాడు. విద్యుత్కేశుడి కుమారుడు సుకేశుడు. అతడు దేవవతిని వివాహమాడగా వారికి ముగ్గురు పుత్రులు జన్మిం చారు. వారు మాలి, సుమాలి, మాల్యవానుడు.

వీరు ముగ్గురు బ్రహ్మను గూర్చి తపస్సుచేసి అపజయం లేనట్లు, శత్రువులను జయించేటట్లు, ధనవంతులు శక్తి వంతులగుటయే కాక వారి మధ్య విభేదాలు రాకుండా వరం కోరుకున్నారు. వరం పొందిన తర్వాత విశ్వకర్మను ఓ భవంతిని నిర్మించ మని కోరగా వారికి లంకా నగరమే సరైనదని చెప్పగా అక్కడ నివాస మేర్పరచుకొని గంధర్వకన్యలను వివాహమాడి సంతానవతులయ్యారు.

*మరణం :* మాలి నాయకత్వంలో దేవలోకంపై వీరు దాడిచేయగా ఓ గొప్ప యుద్ధం జరిగింది. మహా విష్ణువు చక్రాయుధం వల్ల ఇతడు మరణించాడు.

**మాలిని 1 :** కణ్వమహర్షి ఆశ్రమం ప్రక్కనుండి ప్రవహించే నది. షహర్నపూర్ గుండా ప్రస్తుతం ప్రవ హించే ప్రస్తుతనదే ఈ మాలిని. ఇది హిమాలయాల వద్ద నుండి ప్రవహిస్తుందని అంటారు. ఈ నదీ తీరం లోనే శకుంతల జన్మించింది. – మహాభారతం

**మాలిని 2 :** సుబ్రహ్మణ్య స్వామి ఏడుగురు తల్లుల్లో ఒకరు. – మహాభారతం

**మాలిని 3 :** ఓ రాక్షసి. కుబేరుడు రావణుని తండ్రి విశ్రవసుడికి సేవచేయడానికి పంపాడు. రావణుని సోదరుడు విశ్రవసు మాలినిలకు జన్మించాడు.
– మహాభారతం

**మాలిని 4 :** అంగదేశంలో పురాణ ప్రసిద్ధమైన నగరం. జరాసంధుడు కర్ణుడికి ఈ నగరాన్ని ఇచ్చాడు.
– మహాభారతం

**మాలిని 5 :** పూర్వజన్మలో శబరి పేరు. – చూ॥ *శబరి*

**మాలేయసులు :** విభీషణుని మంత్రులందరిని కలిపి పిలిచేవారు. వారు అనల, అనిల, హర మరియు సంపాతి. – రామాయణం

**మాల్యపిండకం :** కశ్యపుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. – మహాభారతం

**మాల్యవానుడు 1 :** శివుని పార్షదుడు. ఇతని ఆప్తమి త్రుడు పుష్పదంతుడు. వివరణకు.
– చూ॥ *కణభూతి, గుడాఢ్యుడు*

**మాల్యవానుడు 2 :** సుకేశ అనే రాక్షస పుత్రుడు. ఇతడు మాలి, సుమాలిల సోదరుడు. ఇతడు రావణుని తల్లికి సోదరుడు. వీరు పాతాళంలో నివసించేవారు. రావ ణుడు కుబేరుడ్ని జయించి లంకకు రాజైన తర్వాత వీరు లంకకు వచ్చారు. రామరావణ యుద్ధంలో సుగ్రీవుడు రావణుని ముఖంపై తన్నగా కిరీటంపడి పోయింది. రావణుడు తన ఇంటికి వచ్చినపుడు సీతను రాముడి కప్పగించి సంధి చేసుకొమ్మని ఇతడు సలహా ఇవ్వగా రావణుడు తిరస్కరిస్తాడు.
– చూ॥ *మాలి*

**మాల్యవనం 1 :** మేరు మందర పర్వతాల మధ్యగల ఇలావృత దేశంలోగల పర్వతం. ఇది బంగారంలా మెరుస్తుంది. – మహాభారతం

**మాల్యవనం 2 :** ఆర్షిసేనుని ఆశ్రమం నుండి పాండవులు గంధమాదన పర్వతం వెళ్తూ ఈ పర్వతం మీదగా వెళ్లారు. ఇది హిమాలయాలకు దగ్గరవుంది.
– మహాభారతం

**మాల్యవనం 3 :** కిష్కింద రాజ్యంలో గల ఒక పర్వతం. తుంగభద్రా నదీతీరంలో వుంది. వాలి సుగ్రీవులిక్కడే యుద్ధం చేస్తారు. సుగ్రీవుని భవంతి ఈ పర్వతం మీదే వుంది. రాముడు ఇచ్చట నాల్గు నెలలు విశ్రాంతి తీసుకున్నాడు. – ఉత్తర రామాయణం

**మాళవి :** గుర్తించదగిన పురాతన నది. – మహాభారతం

**మాళవులు :** పశ్చిమ తీర ప్రాంతంలోని ఓ రాజ్యం. వీరు ధర్మజుని రాజసూయ యాగంలో పాల్గొన్నారు. ఈదేశ క్షత్రియ యువకులు రాజసూయ యాగంలో ఎన్నో కానుకలిచ్చారు. కర్ణుడొకసారి ఈ దేశాన్ని జయించాడు. భీష్ముని ఆజ్ఞపై వీరు అర్జునునితో యుద్ధం చేశారు. శ్రీకృష్ణుడొకసారి ఈ దేశాన్ని జయించాడు. పరశురాముడు ఈ ప్రాంత క్షత్రియుల్ని నాశనం చేశాడు. – మహాభారతం

**మావసుడు :** అచ్ఛోద తండ్రి. – చూ॥ అచ్ఛోద

**మావెల్లకం :** ప్రాచీన భారతదేశంలో ఒక ప్రాంతం. సుశర్మ ఈ ప్రాంత ప్రజలతో కలసి అర్జునునితో పోరాడగా ఈ ప్రజలు మరణించారు. – మహాభారతం

**మావెల్లుడు :** ఉపరిచరవసు నాల్గవ కుమారుడు. ఇతడు ధర్మరాజు రాజసూయ యాగానికి వచ్చాడు. – మహాభారతం

**మాషం :** ప్రాచీన భారతదేశంలో బరువును తూయడానికి ఓ కొలమానం. – చూ॥ త్రసరేణువు

**మాసం/మాషం :** ఎక్కడైన ఓ సంవత్సరానికి 12 నెలలు అని అంగీకరించబడ్డాయి. భారత దేశంలో 6 రకాల నెలలు పరిగణనలో వున్నాయి.

**★భారత దేశంలో పరిగణనలో వున్న నెలలపేర్లు**

| మళయాళం | తమిళం | అరబిక్ | సంస్కృతం | ఇంగ్లీషు | సురియాని |
|---|---|---|---|---|---|
| చిణ్ణం | ఆవణి | ముహరమ్ | శావణం | ఆగస్ట్ | ఓఫ్ |
| కన్ని | పురట్టాశి | సఫర్ | ప్రోష్ఠపధ | సెప్టెంబర్ | ఇలూన్ |
| తులామ్ | ఐప్పశి | యులవన్ | ఆశ్వినా | అక్టోబర్ | తశ్రంకదిమ్ |
| వృశ్చికం | కార్తికై | ఉత్సాని | కార్తీక | నవంబర్ | తెస్రిన్హోయి |
| ధను | మార్కళి | జమదుల్ అవ్వల్ | మార్గశీర్ష | డిసెంబర్ | కొనూణ్కదిమ్ |
| మకరం | తై | జమతుత్సని | పౌష | జాన్యువరి | కొనూన్ హ్రోయి |
| కుంభం | మాసి | రజబ్ | మాఘ | ఫిబ్రవరి | శీబొట్టు |
| మీనం | పంకుని | షావాల్ | ఫాల్గుణ | మార్చ్ | ఓడోర్ |
| మెధం | చిత్తిరై | రంజాన్ | చైత్ర | ఏప్రిల్ | వీసన్ |
| ఇధవం | వైకాశి | శావ్వాల్ | వైశాఖ | మే | ఐయోర |
| మిథునం | ఆణి | దుల్వాద్ | జ్యేష్ఠ | జూన్ | హర్సస్ |
| కర్కఠకం | ఆరీ | దుల్వాజ్ | ఆషాఢ | జులై | తొమ్మూస్ |

**మాసవ్రతోపవాసం :** పురాణాలలో ఏ వ్రతం ఏ నెలలో చేయాలో విశదీకరించబడింది. దానినే మాసవ్రతోపవాసం అంటారు. తులామాసంలో రోజుకొకసారి భుజిస్తే సంతాన ప్రాప్తి, వాహన ప్రాప్తి కల్గి నిష్కల్మషంగా వుంటారు. ద్వాదశిలో రోజంతా ఉపవాసం వుండి విష్ణువును ప్రార్థిస్తే సహస్ర గోదాన ప్రతిఫలం లభిస్తుంది. వృశ్చిక రోజున ఒకసారి మాత్రమే భుజిస్తే ధైర్యవంతుడై బహుభార్యలు కల్గి ప్రసిద్ధుడౌతాడు. వృశ్చికంలో ద్వాదశిరోజు ఉపవాసం వుండి విష్ణువును పూజిస్తే గోదాన యజ్ఞ ఫలితం లభిస్తుంది. మేషంలో ఒకసారి మాత్రమే భుజిస్తే బంగారం, ముత్యాలు, రత్నాలు, సమృద్ధిగా లభించి తర్వాతి జన్మలో గొప్పకుటుంబంలో జన్మిస్తాడు. మేషంలో ద్వాదశి రోజు ఉపవాసం వుంటే పుండరీక యజ్ఞ ప్రతిఫలం లభిస్తుంది.

★ తెలుగు దేశంలో వాటి పేర్లు : శ్రావణం, భాద్రపథం, ఆశ్వీజం, కార్తీకం, మార్గశిర, పుష్యం, మాఘం, ఫల్గుణం, చైత్రం, వైశాఖం, జ్యేష్ఠం, ఆషాఢం.

మిథునంలో రోజుకొకసారి మాత్రమే భుజిస్తే సంపాదనా పరుడౌతాడు. మిథునంలో ద్వాదశి రోజంతా ఉపవాసం వుండి త్రివిక్రమ పూజ జరిపితే గోమేధ యజ్ఞ ఫలితం లభించడమే కాక అప్సరసల సాంగత్యం లభిస్తుంది.

**మాహికం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాసయోగ్య ప్రాంతం. – మహాభారతం

**మాహిష్మతి :** విప్రజిత్తి అనే రాక్షసుడి కూతురు. ఇది శాపంవల్ల మహిషంగా మారుతుంది. దీనికే మహిషాసురుడు జన్మిస్తాడు. – వరాహపురాణం

**మాహిష్మతిపురం :** నర్మదా నదీతీరాన గల ప్రాచీన నగరం. నీలుడను రాజు దీన్ని రాజధానిగా చేసుకొని పాలించాడు. దక్షిణ జైత్రయాత్రలో నకులుడు దీన్ని జయించాడు. కార్తవీర్యార్జునుడికి ఇదే రాజధాని. అగ్నిదేవుడి వరాల కారణంగా ఇచటి స్త్రీలు జారిణులైనా దోషాన్ని పొందరు. – మహాభారతం

**మాహేయులు :** ఇప్పటి 'ముల్తాన్' అనే ప్రాంతంలో వున్న ప్రాచీనులు.

**మాహేయం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాస యోగ్య ప్రాంతం. – మహాభారతం

**మాహేశ్వరపురం :** ఓ పుణ్యస్థలం. ఇచట శివుడ్ని పూజిస్తే అన్ని కోర్కెలు తీరతాయి. – మహాభారతం

**మితధ్వజుడు :** విదేహ రాజు. ఇతడు ధర్మధ్వజుని కుమారుడు. – మహాభారతం

**మిత్ర :** పార్వతి యొక్క సహచరురాలు. – మహాభారతం

**మిత్రఘ్నుడు :** రావణుని తరపున పోరాడిన రాక్షసుడు. రాముడితణ్ణి వధించాడు. – రామాయణం

**మిత్రజ్ఞుడు :** పాంచజన్యమను అగ్ని కుమారుడు. పాంచదేవ వినాయకుల్లో ఒకడు. – మహాభారతం

**మిత్రదేవుడు :** త్రిగర్త రాజైన సుశర్మ సోదరుడు. అర్జునుడితణ్ణి మహాభారత యుద్ధంలో సంహరించాడు. – మహాభారతం

**మిత్రధర్ముడు :** పాంచజన్యుడను అగ్ని కుమారుడు. – మహాభారతం

**మిత్రభేదం :** చూ॥ పంచతంత్రం.

**మిత్రవర్ధనుడు :** పాంచజన్యుడను అగ్నికుమారుడు. ఇతడు పాంచదేవ వినాయకుల్లో ఒకడు. – మహాభారతం

**మిత్రవర్మనుడు :** త్రిగర్త రాజైన సుశర్మ సోదరుడు. అర్జునుడు మహాభారత యుద్ధంలో ఇతణ్ణి వధించాడు. – మహాభారతం

**మిత్రవానుడు 1 :** పాంచజన్యుడను అగ్ని కుమారుడు. ఇతడు పాంచదేవ వినాయకుల్లో ఒకడు. – మహాభారతం

**మిత్రవానుడు 2 :** సౌపుర నగరంలో జీవించిన పండితుడు. శివుని దేవాలయంలో కూర్చొని గీత రెండవ అధ్యాయం పఠించి మానసిక ప్రశాంతత పొందాడు. దేవశర్మ అనే బ్రహ్మణుడు ముక్త కర్ముడను రుషిని మానసిక ప్రశాంతత కొరకు సలహా అడగగా అతణ్ణి మిత్రవానుడి వద్దకు పంపగా గీత రెండవ అధ్యాయం చదవమని సలహా ఇచ్చాడు. – పద్మపురాణం

**మిత్రవింద :** శ్రీకృష్ణుని తండ్రి యొక్క సోదరి కుమార్తె. ఈమె తల్లి రాజాధిదేవి అవంతి రాణి. ఈమె సోదరులు కౌరవుల స్నేహితులు. శ్రీకృష్ణుడు వారిని ఓడించి ఈమెను ద్వారకకు తీసుకు వెళ్లాడు.

**మిత్రవిందుడు :** దేవత. తంతరమనే అగ్నికి ఈ హవిస్సు చెందుతుంది. – మహాభారతం

**మిత్రసఖుడు (మిత్రసహుడు) :** సూర్య వంశపురాజు. ఇతడిని కల్మషపాదుడనికూడా పిలుస్తారు. – చూ॥ కల్మషపాదుడు

**మిత్రసేనుడు :** సుశర్మ సోదరుడు. త్రిగర్తాధిపతి. మహాభారత యుద్ధంలో కౌరవుల పక్షాన పోరాడిన రాజు. అర్జునుడితణ్ణి వధించాడు. – మహాభారతం

**మిత్రాయువు :** పాంచాలదేశపు రాజు. దివోదాసుకి కొడుకు.

**మిత్రావరుణులు :** ద్వాదశాదిత్యుల్లో ఇద్దరికి కలపిన పేరు. వీరు మిత్ర, వరుణులు. వీరెల్లప్పుడు కలిసే దర్శనమిస్తారు. అగస్త్యుడు, వశిష్ఠుడు వీరి సంతానమే. వీరి శాపం వల్లనే ఊర్వశి పురూరవసుడిని వివాహమాడింది. మనువుకు సంతానం లేక వారిని పూజించగా, అందులో కొన్ని దోషాలుండటం వల్ల కుమార్తె జన్మించింది.

**మిత్రుడు :** ద్వాదశాదిత్యుల్లో ఒకడు. ఇతడిని వరుణుడిని కలిపి పూజిస్తే వర్షాలు కురుస్తాయి. ఇతడు సుబ్రహ్మణ్యస్వామికి సువ్రత, సత్యసంధులనే వారిని ఇచ్చాడు. – భాగవతం

**మిత్రుడు :** ఒక రాజు. చాక్షుషమనువు ఇతని కుమారుడు. మిత్రుడి భార్య గిరిభద్ర.

**మిత్రేయుడు :** చంద్రవంశపు రాజు. చ్యవనుని తండ్రి. దివోదాసు కుమారుడు.

**మిథి :** జనకుని పేరు. నిమిని మథించగా జన్మించాడు కనుక మిథి అనేవారు.

**మిథిల :** మిథి పాలించిన దేశం. జనకుడు దీన్ని పాలించాడు. ఇది విదేహ దేశపు రాజధాని.
– *కంభరామాయణం*

**మిథువు :** ఓ రాక్షస వీరుడు. ఆరిష్టసేనుని కుమారుడైన భరతుడు సరస్వతీ నదీతీరాన అశ్వమేధయాగం ఉపమన్యుడిని పురోహితుడిగా నియమించి తలపెట్టగా వారిద్దరిని పాతాళానికి తీసుకువెళ్లాడు. ఉపమన్యుని కుమారుడైన దేవాపి శివుని ప్రార్థించి వారిని మిథువు నుండి తప్పించాడు. – *బ్రహ్మపురాణం*

**మిశ్రకం 1 :** ఓ ప్రత్యేకజాతి గుర్రాలు. – *మహాభారతం*

**మిశ్రకం 2 :** ద్వారకలోని ఓ ఉద్యానవనం. ఈ దివ్య వనం వల్ల ద్వారక మరింత ప్రసిద్ధి చెందింది.
– *మహాభారతం*

**మిశ్రకం 3 :** కురుక్షేత్రంలో గల ఓ పవిత్ర స్థలం. ఇచ్చటున్న కొలనులో స్నానం చేస్తే భారతదేశంలోని అన్ని పవిత్ర కొలనుల్లో స్నానం చేసినట్టే.
– *మహాభారతం*

**మిశ్రకేశి :** కశ్యప ప్రజాపతి భార్య ప్రథకు జన్మించిన అప్సరస. పూరువు కుమారుడైన ద్రాశ్వుడు ఈమెను వివాహమాడాడు. అన్యగ్నానుడే కాక మరి తొమ్మిది మంది కుమారులు ఈమెకు జన్మించారు. అర్జునుడొకసారి ఇంద్రలోకం వెళ్లినప్పుడు అతని గౌరవార్థం నాట్యంచేసింది. – *మహాభారతం*

**మిశ్రి :** ఓ సర్పం. బలరాముని ఆత్మను పాతాళానికి తీసుకువెళ్లే సమయంలో వున్న సర్పాలలో ఇదొకటి.
– *మహాభారతం*

**మీఢ్వాంశుడు :** దక్షుడను రాజు కుమారుడు. ఇతని పుత్రుడు శర్వుడు. – *భాగవతం*

**మీనాక్షి :** రెండవ మధుర★లోని దేవి.

**మీనాంకుడు :** మన్మథుని మరోపేరు.

**మీమాంస :** వేదాలకు సంబంధించిన న్యాయాన్ని తెలియజేసే శాస్త్రం. దీనిలోని పూర్వకాండని పూర్వమీమాంస అని, బ్రహ్మకాండని ఉత్తర మీమాంస అని అంటారు. వీటిని కర్మ మీమాంస, బ్రహ్మ మీమాంస అనికూడా అంటారు.

**ముకుటుడు :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు.
– *మహాభారతం*

**ముకుటం :** ఓ క్షత్రియ కుటుంబం. ఈ కుటుంబంలోనే క్రూరుడైన విగాహనుడను రాజు జన్మించాడు.
– *మహాభారతం*

**ముకులుడు :** పూరు వంశపురాజు. బాహ్యాశ్వుడి ఐదుగురి పుత్రుల్లో ఇతడొకడు. వీరైదుగుర్ని పాంచాలులని అంటారు. ముకులుని కుటుంబాన్ని మోకుల్యులంటారు. ఇతని కుమారుడు పంచాశ్వుడు.
– *అగ్నిపురాణం*

**ముక్తాఫలకేతువు :** ఓ విద్యాధరుడు. విద్యుద్వజుడను రాక్షస వీరుడ్ని చంపడానికి జన్మించాడు.

విద్యుత్ప్రభుడను రాక్షసుడు బ్రహ్మను గూర్చి తపస్సు చేసినందున విద్యుద్వజుడు జన్మించాడు. ఇతడు బ్రహ్మను గూర్చి చాలాకాలం తపస్సుచేసి బ్రహ్మాస్త్రం సాధించాడు. అయితే పాశుపతాస్త్రానికి సాటిరాదని, దీనిని అకారణంగా ఉపయోగించరాదని షరతు విధించాడు. ఇతడు ఇంద్రునిపై దండెత్తాడు. ఈ యుద్ధంలో తండ్రి మరణించగా కోపంతో ఇంద్రునిపై బ్రహ్మాస్త్రం ప్రయోగించగా ఇంద్రుడు పాశుపతం ప్రయోగించగా ఇతడు మూర్ఛపోయాడు. ఆ తర్వాత ఇతడు శివుని గూర్చి తపస్సు చేయగా శివుడు ప్రత్యక్షమవ్వగా ఇంద్రుడ్ని ఓడించే శక్తిని కోరాడు. శివుడు వరమివ్వగా ఇతడు తిరిగి ఇంద్రునిపై దండెత్తాడు. ఈ యుద్ధంలో ఇంద్రుడు పడిపోగా ఇతణ్ణి దేవతలు వెంటనే బ్రహ్మలోకం తీసుకువెళ్లారు.

విద్యుద్వజుడు అమరావతిని ఆక్రమించి పరిపాలించసాగాడు. విద్యాధరులకు రాజైన చంద్రకేతు వాయు

★ జరాసంధుడు పాలించిన మధురకాదు. తమిళనాడులోని మధురా పట్టణం

లోకంలో జీవిస్తూ దేవలోకం పోగొట్టుకొని ఎలా జీవించాలి, విద్యుధ్వజుడి నుండి ఎలా విముక్తి పొందాలి అని ఆలోచిస్తుండగా అతని మిత్రుడు గంధర్వరాజైన పద్మశేఖరుడు శివుణ్ణి ప్రార్థించానని నాకు ఓ కుమారుడు, కుమార్తె జన్మిస్తారని నా కూతుర్ని చేసుకున్న వీరుడు విద్యుద్వజుడ్ని సంహరిస్తాడని చెప్పాడు. చంద్రకేతుడు విష్ణువును ప్రార్థించగా శివుడే దీనికి సమాధానం చెప్పగలడని చెప్తాడు. అప్పుడితడు శివుని ప్రార్థించగా నీకు ఓ వీరుడైన కుమారుడు జన్మిస్తాడని అతడు విద్యుద్వజుడ్ని సంహరిస్తాడని చెప్తాడు. ఆ జన్మించిన కుమారుడే ముక్తాఫలకేతువు. ఇతడు పెద్దవాడై దేవలోకం వెళ్లి విద్యుద్వజుడిని సంహరించి పద్మశేఖరుని కుమార్తె పద్మావతిని వివాహమాడాడు. – కథాసరిత్సాగరం

**ముఖకర్ణి :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు. – మహాభారతం

**ముఖమండిక :** ఓ పాపాత్మ. ఇది శిశువుల్ని బాధిస్తుంది. దీనిని దితి అని అంటారు. – మహాభారతం

**ముఖరం :** కశ్యపుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. – మహాభారతం

**ముఖసేచకం :** ధృతరాష్ట్రుని కుటుంబంలో జన్మించిన ఒక సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. – మహాభారతం

**ముచుకుందు :** సూర్యవంశపు రాజుల్లో ప్రసిద్ధి పొందినవాడు. ఇక్ష్వాకుతదనంతర రాజులలో ఒకడైన మాంధాత కుమారుడు. మాంధాతకు ముగ్గురు కుమారులు, 50 మంది కుమార్తెలు. కుమారులు అంబరీష, ముచుకుంద, పురుకుత్సులు. ముచుకుందని కుమార్తె చంద్రముఖి, ఈమె చంద్రసేనుడి కుమారుడు శోభనుడిని వివాహమాడింది. ఒక రోజు అతడు అత్త వారింటికి వచ్చి ఏకాదశి వ్రతంలో పాల్గొని మృతి చెందగా అతని ఆత్మ మందర పర్వతంపై స్వర్గ సుఖం అనుభవించింది. ఇది సోమశర్మ వల్ల తెలుసుకున్న చంద్రముఖి కూడా సంతసించింది. ముచుకుందుడు యముని కొలువులో వుంటాడు. కుబేరుడు ఇతడి సద్గుణాలకు మెచ్చి ప్రపంచాన్నంతా బహుమతిగా ఇస్తానంటే నాశక్తివల్ల కాక బహుమతిగా పొందిన వాటిని స్వీకరించనని చెప్తాడు. కుబేరుని శక్తిని పరీక్షనెంచగా కుబేరుడు పంపిన రాక్షసి చేతిలో ఓడి వశిష్ఠుడిని ప్రార్థించి కుబేరుడి సైన్యాన్ని మొత్తం ఓడిస్తాడు. పరశు రాముడితడికి ధర్మోపదేశం చేస్తాడు. కాంబోజుడిచ్చిన ఖడ్గాన్ని మరుత్తుడికి బహూకరిస్తాడు. – మహాభారతం

**ముదావతి :** విదూరథుడను రాజు కుమార్తె. గుజంబుడను రాక్షసుడు ఈమెను ఎత్తుకొనిపోయి పాతాళమున దాచెను. ఈమెకు స్త్రీ స్పర్శ తగిలిన అతడి ఆయుధమైన ముసలము శక్తి హీనమగునని తెలియును. ఈమెను విడిపించుటకు రాజు తన కుమారులైన సుమతి, సునీతులను పంపగా రాక్షసుడు వీరిని కూడా బంధించెను. వీరి నందరిని విడిపించుటకు వత్సంధ్రుడను రాజు వచ్చి రాక్షసునితో పోరుచుండగా ముదావతి శేషుని తలచుకొని అతడి ఆయుధమైన ముసలమును స్పృశించెను. వత్సంధ్ర గుజంబుల పోరాటము తీవ్రముకాగా గుజంబుడు తన ఆయుధమైన ముసలమును చేతపట్టుకొనెను. కాని ముదావతి కరస్పర్శచే శక్తిహీన మగుటవలన వత్సంధ్రుని చేతిలో రాక్షసుడు మరణించగా ముదావతిని ఆమె సోదరులను వత్సంధ్రుడు విడిపించగా విదూరథుడు తనకు మార్తె ముదావతిని అతడికిచ్చి వివాహముచేయగా ఈమెకు ప్రాంశుడు, ప్రవీరుడు, శూరుడు, సుచక్రుడు, విక్రముడు, క్రముడు, బలి, బలాకుడు, చండుడు, ప్రచండుడు అను పుత్రులు జన్మించిరి. – మార్కండేయపురాణము

**ముదావర్తుడు :** హేహయ వంశంలో జన్మించిన ఒక రాజు. – మహాభారతం

**ముదిత :** సహ అను అగ్నికి భార్య. – మహాభారతం

**ముద్గరపర్ణకం :** కశ్యపుని కుటుంబంలో జన్మించిన సర్పం. – మహాభారతం

**ముద్గర పిండకం :** కశ్యపునికి కద్రువకు జన్మించిన సర్పం. – మహాభారతం

**ముద్గలుడు 1 :** పురాణప్రసిద్ధుడైన రుషి. ఇతడికి కోపం అనేది లేదు. సాదువర్తనుడు. కురుక్షేత్రంలోగల ఇతని ఆశ్రమానికి దుర్వాసుడు రాగా తాను తినే ఆకు అలముల్నే అతనికి పెడతాడు. భిక్షాటన వల్ల కూడింది కూడా

దుర్వాసునికే సమర్పిస్తాడు. ఇది చాలా రోజులు జరిగింది. దుర్వాసుడు ఇతని గుణానికి మెచ్చి బొందితో స్వర్గానికి పంపుతాననగా దేవతలు విమానంలో రాగా అచట సౌఖ్యాలు విని వెళ్లడానికి తిరస్కరిస్తాడు. వేదపారంగ తుడైన ముద్గలుడు జనమేజయుని సర్పయాగంలో పురోహితుడుగా వ్యవహరిస్తాడు. భీష్ముడు అంపశ య్యపై నుండగా దర్శించిన రుషుల్లో ఒకడు. చోళ రాజు యజ్ఞానికి కూడా పురోహితుడుగా వ్యవహరిస్తాడు.
– మహాభారతం; పద్మపురాణం

**ముద్గలుడు 2 :** తక్షకుని కుటుంబంలో జన్మించిన సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది.

**ముద్గలం :** ప్రాచీన భారతావనిలో ఒక దేశం. శ్రీకృష్ణ డొకసారి దీన్ని జయించాడు. – మహాభారతం

**ముద్రలు :** మాంత్రికుడు మంత్రోచ్చారణ చేసే సమ యంలో ఆ మంత్రాలకు తగిన రీతిలో తన చేతులను తగు విధంగా హృదయం పై వుంచుతాడు. ఆ భంగిమలు అంజలి ముద్ర, వందిని ముద్ర, ఊర్థ్వముద్ర, వరాహ ముద్ర అను నాల్గు విధాలు. – అగ్నిపురాణం

**ముని 1 :** యక్షులకు తల్లి. కశ్యప ప్రజాపతికి మునివల్ల యక్షులు జన్మించారు. – అగ్నిపురాణం
ఈమెకు 16 మంది గంధర్వులు జన్మించారు. అందులో మొదటివాడు భీమసేనుడు★.
– మహాభారతం

**ముని 2 :** అహహ్ అనే వసువు కుమారుడు.
– మహాభారతం

**ముని 3 :** పూరు వంశంలోని రాజైన కురువు యొక్క కుమారుడు. కురువుకు వాహిని అనే స్త్రీ వల్ల జన్మిం చిన ఐదుగురు పుత్రుల్లో ఒకడు. – మహాభారతం

**ముని 4 :** ద్యుతిమానుడను రాజు ఏడుగురు పుత్రుల్లో ఒకడు. – మార్కండేయ పురాణం

**ముని దేశం :** క్రౌంచ ద్వీపంలోని ఒక దేశం.
– మహాభారతం

**మునివీర్యుడు :** విశ్వదేవతల్లో ఒకడు. – మహాభారతం

**ముముచుడు :** ప్రాచీన దక్షిణ భారతదేశంలో జీవించిన ఓ రుషి. – మహాభారతం

**ముర 1 :** తొమ్మిదో నందుడి భార్య. ఈమె శూద్ర స్త్రీ. ఈమెకు జన్మించిన వాడే చంద్రగుప్తుడు.

**ముర 2 :** తాలజంఘుని కుమారుడు. చంద్రావతి ఇతని రాజధాని. బ్రహ్మ తేజస్సుడైన ఈ అసురుడు దేవత లను భయపెట్టాడు. ఇతడు మహావిష్ణువును ఒకసారి ఓడించగా విష్ణువు ఓ గుహలో దాక్కొనగా ఇతడు అక్కడికే వెళ్లాడు. విష్ణువు యోగ మాయతో ఓ దేవిని సృష్టించగా అది ఇతడ్ని సంహరించింది.

**మురాసురుడు :** కశ్యప ప్రజాపతి దనువు వల్ల జన్మించిన అసురుడు. ఇతడు అసురుల శవాల గుట్టలు చూసి భయకంపితుడై తన తాత బ్రహ్మను గూర్చి తపస్సు చేశాడు. అతడు వరం కోరుకొమ్మనగా "నేనెవరిని అంటుకుంటే అతడు చిరంజీవి అయినా మరణం చెందాలి" అని కోరగా బ్రహ్మ ఆ వరం ప్రసాదించాడు.
– వామనపురాణం
ఇతడు ప్రాగ్జోతిషాన్ని కాపలాకాసేవాడు. ఇతడికి నాల్గువేల మంది సంతానం. వీరిలో 10 మందిని రాశి భవనానికి కాపలా దారులుగా వుంచాడు. ఇతడు ప్రాగ్జోతిష నగరాన్ని 6000 తాళ్లతో ఎవరూ ఛేదించ కుండా రక్షణ కవచంగా చుట్టాడు. వీటిని మౌర్యపా శాలు అంటారు. – మహాభారతం
ఇతడు తనకున్న వరాలతో ఇంద్రుడ్ని జయించాడు. ఇంద్రుడు పారిపోయి కాళింది నదీతీరాన దేవతలతో కలసి జీవించాడు. ఒకరోజు ఇంద్రుని ఐరావతంపై భూమిపైకి వచ్చి రఘువు యాగం చేస్తున్న వద్దకు వచ్చి తనతో యుద్ధం చేయమని కోరగా రాజపురోహి తుడు 'సామాన్య మానవులను వధించనేల' నీవు వీరుడవయినచో అంతకుని జయించమనగా ఇతడు అట్లే యమధర్మరాజుపైకి యుద్ధానికి వెళ్లాడు. యముడు తాను నిమిత్త మాతృడనని విష్ణువు చెప్పిన కార్యనిర్వాహణయే నా బాధ్యత కనుక విష్ణువుతో యుద్ధం చేయమని కోరాడు. అప్పుడు విష్ణువు, శ్రీకృష్ణుని అవతారంలో నరకాసురుని వధించడానికి ప్రాగ్జోతిషంపై యుద్ధానికి వెళ్లి మురతాళ్లతో ఏర్పరచిన బంధాలను తెంచి తన సుదర్శన చక్రంతో మురాసురుడిని, నరకాసురుడిని వధించాడు. అందుకనే శ్రీకృష్ణుడిని మురామదనుడని పిలుస్తారు. – భాగవతం

★ పాండురాజు కుమారుడు కాదు.

**మురుడు :** ఓ యాదవరాజు. జరాసంధుని పొరుగు దేశం వాడు. ఇతని కుమార్తె కామకంఠకతను ఘటో త్కచుని కిచ్చి వివాహం చేశాడు. – స్కందపురాణం

**మురుద :** ప్రాచీన భారతావనిలో ఓ దేశం. భగదత్తుడు ఈ దేశానికి రాజు. – మహాభారతం

**మురు్మరం :** ఓ నది. అగ్ని ఇందుండే జన్మించాడు. – మహాభారతం

**ముష్టికుడు :** కంసుని సేవకుడైన ఓ అసురుడు. బలభద్ర రాముడితణ్ణి వధించాడు.

**ముహూర్త :** రెండో దక్ష ప్రజాపతి కుమార్తె. ధర్ముడి భార్య. వీరి సంతానాన్ని ముహీర్తికులని పిలుస్తారు.

**మూకుడు 1 :** ఓ రాక్షసుడు. శివభక్తుడు. శివుడు అర్జునుణ్ణి పరీక్షించడానికి కిరాతకునిగా వచ్చినపుడు ఇతడు పందిరూపంలో అర్జునుడిపై పడతాడు. – మహాభారతం

**మూకుడు 2 :** తక్షక కుటుంబంలోని ఓ సర్పం. జనమే జయుని సర్పయాగంలో మరణిస్తుంది.

**మూకుడు 3 :** ఓ చండాలుడు. నరోత్తముడనే బ్రాహ్మ ణుడు ఇతడి వద్ద నీతి సూత్రాలు నేర్చుకున్నాడు. – పద్మపురాణం

**మూకాంబ :** సహ్యపర్వతం దగ్గర ఆవిర్భవించి వుండే పరాశక్తి అవతారం.

**మూర్తి :** దక్ష ప్రజాపతి 13 మంది కుమార్తెల్లో ఒకరు. ఈమెను ధర్ముడు వివాహమాడగా ఆమెకు నరనా రాయణులు జన్మించారు. – భాగవతం

**మూర్తులు :** చూ॥ అష్ట మూర్తులు.

**మూలకుడు :** కుంభకర్ణుని కుమారుడు. మూలనక్షత్రం రోజు జన్మించడం వల్ల అది పవిత్రమైన రోజు కాదని అతణ్ణి పారవేయగా తేనెటీగలు పెంచాయి. ఇతడు పెరిగిన తర్వాత ప్రజల్ని బాధిస్తుంటే శ్రీరాముని సహాయంతో సీత ఇతణ్ణి వధించింది. – ఆనందరామాయణం

**మూషకాందం :** కశ్యప ప్రజాపతికి కద్రువ వల్ల జన్మించిన సర్పం. ఇది వరుణుని కొలువులో అతడ్ని పూజిస్తుం టుంది. నారదుడు దీన్ని ఒకసారి మాతాలికి పరిచ యం చేశాడు. – మహాభారతం

**మూషికం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాస యోగ్య స్థలం. ఇప్పటి కొచ్చిన్ అనబడే ప్రాంతం. – మహాభారతం

**మూషికస్త్రీ :** చూ॥ పంచతంత్రం.

**మూషికుడు :** చనిపోయిన ఎలుకనే పెట్టుబడిగా పెట్టి ధనవంతుడైన ఓ వ్యాపారి. మూషికంతో వ్యాపారం చేశాడు కనుక మూషికుడను పేరు వచ్చింది.

ఒకసారి ఓ పేదవాడు ఓ ధనిక వర్తకుడి ఇంటికి వెళ్లగా అతడు తన కులానికే చెందిన యువకుడితో "ఈ చచ్చిన ఎలుకను చూడు దీనితో తెలివైన వాడైతే వ్యాపారం చేయగలడు, నీకు చాలాసార్లు ధన సహాయం చేశాను. సంపాదించకపోగా అంతా పోగొట్టావు అని చెప్పడం విని ఆ పేదవాడు ఆ చచ్చిన ఎలుకను ఇమ్మని అడిగి తీసుకొని ఓ ధనవంతుడి పిల్లికి ఆహారంగా అమ్మి అతడి నుండి సెనగలు తీసుకుంటాడు. ఆ సెనగలు రొట్టెలు చేసి కట్టెలమ్ముకునే వారికి ఆహారంగా ఇచ్చి కట్టెలు తీసుకుంటాడు. అలా సంపాదించిన కట్టెలను వర్షాకాలంలో ఎక్కువ ధరకు అమ్మి ధనవంతుడౌ తాడు. అలా చనిపోయిన మూషికం పెట్టుబడిగా పెట్టి ధనవంతుడయ్యాడు కనుక అతడికి మూషికు డను పేరు వచ్చింది. – కథాసరిత్సాగరం

**మేకపెంటిక :** కాటకోటకుడను గొల్లడు పెంటికను శివునిగా భావించుచు దానిపై క్షీరమంతయు అభి షేకము చేయుచుండగా వాని తండ్రి ఎగతాళిచేసి పాలు వృధాచేస్తున్నందువల్ల పెంటికను కాలితో తన్నగా కాటకోటకుడు తండ్రి తల నరికెను. అప్పుడు కైలాస మందలి హర్మ్యకటకములు విరిగిపడి పోయెను. ఆ పెంటిక తక్షణమే శివలింగమై ప్రకాశించెను. – బసవపురాణం

కోటడను గొల్లవాని కొడుకు కూటడను వాడు కలడు. ఓ బ్రాహ్మణుడు శివలింగమునకు క్షీరాభిషేకము చేయుచూ అతడిని పాలనిమ్మని కోరగా తన కుమా రుని ఇవ్వమని చెప్పగా కుమారుడు శివపూజ యెట్టిదో తనకు చెప్పినగాని పాలనియ్యననెను. ఆ బ్రాహ్మణుడు ఒక మేక పెంటికపై పాలు పోయించి ఇదే 'శివపూజ' యని చెప్పెను. ఆ బాలుడు ప్రతి దినము అట్లుచేయుచుండుటచే ఇంటికి తెచ్చుపాలు తక్కువగుటను చూసి కారణమడుగగా శివపూజ చేయుచున్నట్లు చెప్పెను. శివపూజను చూపించమని తండ్రి అడగగా మేకపెంటికను చూపించెను. అంత ఆ పెంటిక శివలింగమై ప్రత్యక్షమయ్యెను. ఆ లింగమునే 'కోట కూటేశ్వర లింగము' అని అందురు.

**మేఖల :** ప్రాచీన భారతదేశంలో ప్రసిద్ధి నొందిన దేశం. ఈ ప్రాంతవాసులను మేఖలులంటారు. వీరు భీష్ము నికి అంగరక్షకులుగా వుండేవారు. ఒకసారి కర్ణుడీ దేశాన్ని జయించాడు. మొదట వీరు క్షత్రియులు. వీరు బ్రాహ్మణులను కించపరచడం వల్ల శూద్రులయ్యారు. – *మహాభారతం*

**మేఖలకన్యక :** నర్మదా నదికి మరోపేరు. మేఖల పర్వతంలో పుట్టింది కనుక ఈ పేరు వచ్చింది.

**మేఖలుడు :** వింధ్యపర్వత ప్రాంతంలో గల ఓ ప్రదేశం.

**మేఘకర్ణి :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరస్త్రీ. – *మహాభారతం*

**మేఘనాదుడు 1 :** రావణుని కుమారుడైన ఇంద్రజిత్తు మరోపేరు. చూ॥ ఇంద్రజిత్తు

**మేఘనాదుడు 2 :** సుబ్రహ్మణ్యస్వామి సైనికుల్లో ఒకడు. – *మహాభారతం*

**మేఘపుష్ప :** శ్రీకృష్ణుని రథం నడిపే దేవాశ్వం. – *మహాభారతం*

**మేఘమాల :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరస్త్రీ. – *మహాభారతం*

**మేఘమాలి 1 :** ఖరుడను అసురుని సేనానాయకుల్లో ఒకడు. ఇతడు రామలక్ష్మణులతో పోరాడాడు. – *రామాయణం*

**మేఘమాలి 2 :** సుబ్రహ్మణ్య స్వామి అనుచరస్త్రీ. – *మహాభారతం*

**మేఘకర్ణుడు 1 :** పంచతంత్రంలోని ఓ పాత్ర. – *చూ॥ పంచతంత్రం*

**మేఘకర్ణుడు 2 :** ఘటోత్కచుని కుమారుడు. అశ్వమేధ యాగ సమయంలో ఇతడు అర్జునునితో పాటు వెళ్లాడు. – *మహాభారతం*

**మేఘవాసుడు :** ఓ అసురుడు. ఇతడు వరుణుని కొలువులో అతడ్ని పూజిస్తుంటాడు. – *మహాభారతం*

**మేఘవాహనుడు :** ఒక రాజు. జరాసంధునిపై ఆధారపడి పరిపాలించాడు. – *మహాభారతం*

**మేఘవాహిని :** స్కందదేవుని అనుచర స్త్రీ. – *మహాభారతం*

**మేఘవేగుడు :** ఓ వీరుడైన సైనికుడు. కురుక్షేత్ర యుద్ధంలో కౌరవుల తరపున పోరాడి అభిమన్యుని చేతిలో మరణించాడు. – *మహాభారతం*

**మేఘశర్మ :** సూర్యభక్తుడైన ఓ బ్రాహ్మణుడు. శంతనుని పరిపాలనా కాలంలో అనావృష్టి రాగా ఇతడు సూర్యుడ్ని పూజించి వర్షం కురిపించాడు. – *భవిష్యపురాణం*

**మేఘశ్వన :** సుబ్రహ్మణ్యస్వామి అనుచర స్త్రీ. – *మహాభారతం*

**మేఘసంధి :** ప్రాచీన మగధ దేశంలో ఓ యువరాజు. ఇతడొకసారి అర్జునుడితో పోరాడి ఓడిపోయాడు. – *మహాభారతం*

**మేఘహాసుడు :** రాహువు యొక్క పుత్రుడు. ఇతడి తండ్రి తలను మహావిష్ణువు నరికాడని గౌతమీ నదీ తీరంలో తీవ్రమైన తపస్సు చేశాడు. అందువల్ల ఇతడు ఆకాశం లోని గ్రహాలలో ఒకడయ్యాడు. – *బ్రహ్మాండపురాణం*

**మేద :** ఐరావత వర్గానికి చెందిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది.

**మేదిని :** భూమికి మరోపేరు.

**మేధ :** దక్ష ప్రజాపతి వల్ల అతని భార్య ప్రసూతికి జన్మించిన 24 మంది కుమార్తెలలో ఒకరు. ఇందులో మేధతో కలిపి పదముగ్గురిని ధర్మదేవుడు వివాహ మాడాడు. – *విష్ణుపురాణం.*

**మేధాతిథి 1 :** పూరు వంశంలోని ఓ రాజర్షి. కణ్వుని కుమారుడు. మేధాతిథికి ఇద్దరు కుమారులు. వారు దుష్యంతుడు, ప్రవీరుడు. ఈ దుష్యంతుడే శకుంతల భర్త. మేధాతిథి భారతదేశంలోని గొప్ప రుషుల్లో ఒకడు. ఒకసారి ఇతని సోమరసాన్ని ఇంద్రుడు మేక రూపంలో వచ్చి సేవించగా ఇంద్రుణ్ణి మేష అని అన్నాడు. అప్పటి నుండి ఇంద్రుడిని మేష అని పిలుస్తారు. – *రుగ్వేదం*

ఇతడు ఇంద్రుని కొలువులో ఒక రాజు. ఇతని కుమారుడు కణ్వముని తూర్పు తీరంలో ప్రసిద్ధ రుషి. ఇతడు వానప్రస్థం ఆచరించి స్వర్గం చేరాడు. ఇతడు భీష్ముడ్ని దర్శించడానికి వెళ్లగా ధర్మజుడు ఇతడ్ని ఆదరించాడు. – *మహాభారతం*

**మేధాతిథి 2 :** స్వాయంభవ మనువు మనుమడు. ప్రియ వ్రతుడికి సరూపవల్ల జన్మించాడు. అగ్నీధ్రుడు మొదలగువారు ఇతని సోదరులు. ప్రియవ్రతుని తర్వాత మేధాతిథి ప్లక్ష ద్వీపానికి రాజయ్యాడు. – *దేవీ భాగవతం*

మేధాతిథికి ఏడుగురు కుమారులు. వీరంతా ప్లక్ష ద్వీపానికి రాజులయ్యారు. వీరు పాలించిన రాజ్యాలు వారి పేర్లతోనే పిలవబడ్డాయి. ఈ అందమైన దేశాలలో దేవతలు, గంధర్వులు సుగుణ సంపన్ను లెందరో జీవించారు. - విష్ణుపురాణం

**మేధాతిథి 3 :** ఇదో నది. ఇందుండి అగ్ని జ్వలించింది. - మహాభారతం

**మేధాతిథి 4 :** ఓ రుషి. అరుంధతి తండ్రి. అరుంధతి వశిష్ఠుని భార్య. ఇతడు చంద్రభాగ నదీతీరంలోని ఓ ఆశ్రమంలో జీవిస్తూ జ్యోతిష్టోమ యజ్ఞం చేశాడు. - కాళికా పురాణం

**మేధానిధి :** ఓ రుషి. మనుధర్మశాస్త్రానికి వ్యాఖ్యానం చేశాడు. - చూ॥ చిరికారి

**మేధావి 1 :** ఒక బ్రాహ్మణ బాలుడు. ఆయువు తరుము కొస్తున్నది. జనులేమి చేయువారలో యనగా ఇతని తండ్రి "భార్యను, పుత్రులను పొందిన పిమ్మట, యాగ ములు చేసి తదుపరి అడవులకేగి ముక్తి మార్గము చూసుకొనవలెను" అనగా మేధావి కాలము నీ వశమై నట్లు పల్కకుము. తల్లి గర్భమున పడినప్పటి నుండి మృత్యువు హరింపచూచుచుండును. పశు యజ్ఞము కూడ హింసయేకదా ! అది అనంత ఫలము కాదు. మేధావి విరోధులను జయించి నిన్ను నీవు తెలుసు కొనుటకు యత్నము చేయమని తండ్రితో చెప్పి అతడిని ఒప్పించెను. - మహాభారతం

**మేధావి 2 :** బాలది అనే ముని పుత్రుడు. మంజుఘోష ఇతడ్ని ప్రేమిస్తుంది. కొన్నాళ్లు కలసి జీవిస్తారు. ఇత డొక సారి సాయంసంధ్య వార్చేదాకా వేచివుండమని చెప్పగా ఇప్పటికి 55 సంవత్సరాల 9 నెలల 3 రోజులుగా వార్చని సంధ్య ఇప్పుడే వార్చాలా ! అని అడగగా తన తపస్సు గుర్తుకువచ్చి ఆమెను శపిస్తాడు. ఆమె శాపవిమోచనం కోరగా చైత్ర కృష్ణైకాదశిన ఉపవాస ముంటే శాపవిమోచనమౌతుందని చెప్తాడు. - పద్మపురాణం

**మేధ్య :** ప్రాచీన భారతదేశంలో పశ్చిమ తీరాన గల ఓ పుణ్యస్థలం. ఓ నది ఈ ప్రాంతం గుండా ప్రవహిస్తుంది. ఈ నది నుండే అగ్ని జన్మించిందని నమ్ముతారు. ఇది ప్రతిరోజు ఉదయం సాయంత్రం స్మరించదగిన నది. - మహాభారతం

★ **మేన 1 :** మహామేరు కుమార్తె. హిమవంతుడి భార్య. ఈమెకు అతిలోక సుందరీమణులైన ఇద్దరు కుమార్తెలు. - రామాయణం

మేనకు అందమైన ఇద్దరు కుమార్తెలుంటారు. గంగ, ఉమ. వీరిని శివుడు వివాహమాడాడు. - మహాభారతం

మేనకు ముగ్గురు కుమార్తెలు, ఒక కుమారుడు. వారు రాగిణి, కుటిల, కాళి. కుమారుడు. సునాభుడు. - వామన పురాణం

**మేన 2 :** పితృగణాల కుమార్తె. పితృగణాలు ద్వివిధం, అనగ్నులు, సాగ్నిసులు. అనగ్నిలు యాగాలు చేయరు. సాగ్నిలు యాగాలు చేస్తారు. స్వధ వారందరి కుమార్తె. స్వధకు ఇద్దరు కుమార్తెలు. మేన, ధరణి. వీరు జ్ఞాన సంపన్నులు, బ్రహ్మణులు. - విష్ణుపురాణం

**మేనక :** ఓ అప్సరస. ఇంద్రుని ఆజ్ఞపై ఎందరో రుషుల తపస్సును చెడగొట్టింది. విశ్వావసువు వల్ల ఈమెకు ప్రహద్వర జన్మించగా ప్రసవించిన రోజే ఆ శిశువును నదీతీరంలో వదలి స్వర్గానికి వెళ్లగా స్థూలకేశుడు ఈమెను పెంచాడు. రురుడు ఈ బాలికను వివాహ మాడాడు. ఒకసారి ఇంద్రుని ఆజ్ఞపై తపస్సుచేస్తున్న విశ్వామిత్రుడి తపస్సు భగ్నం చేసి అతనితో గడపగా ఈమెకు ఓ బాలిక జన్మించింది. ఆ బాలిక ఆ తర్వాతి కాలంలో శకుంతలగా ప్రసిద్ధి చెందింది. దుర్వాసుడు ఇంద్రలోకం వచ్చినపుడు ఈమె అతడికి ఓ పుష్పాన్ని బహూకరించింది. ఈ సంఘటన చివరకు క్షీర సాగర మదనానికి దారితీసింది. అర్జునుని జన్మోత్సవంలో గానం చేసింది. ప్రసిద్ధ అప్సరసల్లో ఈమె ఒకరు. తక్కిన ఐదుగురు ఊర్వశి, పూర్వచిత్తి, సహజన్య, ఘృతాచి, విశ్వాచి. - మహాభారతం

★ వామన పురాణంలో కాళి, రామాయణంలోని ఉమ ఒక్కరే కావొచ్చు. ఈ పురాణ సారాంశం నల్గురు కుమార్తెలుగా వారు గంగ, రాగిణి, కుటిల, కాళి అని కుమారుడు సునాభుడని చెప్పవచ్చు.

**మేరుదానం :** మేరువంత రాశిపోసిన దానాలను మేరు దానాలని పిలుస్తారు. అవి ధాన్యమేరు, లవణ మేరు, గుఢమేరు, స్వర్ణమేరు, తిలమేరు, కార్పాస మేరు, ఘృతమేరు, రజతమేరు, శార్కణ మేరు. వీటిని దానం చెయ్యడం వల్ల మంచి ఫలితాలు లభిస్తాయి.

**మేరుదేవి :** మహామేరు కుమార్తెలలో ఒకరు. ఈమె భర్త నాభి. నాభి అగ్నీధ్రుడికి, పూర్వచిత్తికి జన్మించిన 9 మంది రాజుల్లో ఒకడు. - భాగవతం

**మేరుప్రభ :** ద్వారకాపురికి దక్షిణాన లతావేష్ట పర్వతం వద్ద గల ఓ అరణ్యం. అక్కడ మరో రెండు అరణ్యాలు కూడా వున్నాయి. అవి తాళవనం, పుష్పకవనం.

**మేరుభూతం :** ప్రాచీన భారతదేశంలో ఓనివాస యోగ్య ప్రాంతం. - మహాభారతం

**మేరుమందరం :** ఇదో పర్వతం. మేరు పర్వతానికి నాల్గు వైపుల నుండి తోడ్పాటునిచ్చే పర్వతాలు నాలుగు. అవి మందర, మేరుమందర, సుపార్శ్వ, కుముదాలు. - భాగవతం

**మేరువు :** ఇది బంగారు పర్వతం. భూమి చుట్టూ వడ్డాణంలా వుంటుంది. దీని చుట్టూ సూర్యచంద్రులు పరిభ్రమిస్తుంటారు. దీని శిఖరాలపై దేవతలు నివసిస్తారు. దీనికి అయితి, నియతి అనే కూతుళ్లు, వీరిని ధాత, విధితలకిచ్చి వివాహం చేస్తుంది. - బ్రహ్మాండపురాణం

**మేరువ్రజ :** ప్రాచీన భారతదేశంలో ఓ నగరం. విరూపాక్షుడను రాక్షసుడు ఇక్కడ నివసించేవాడు. - మహాభారతం

**మేరుసావర్ణి :** ఓ మనువు. స్వయంప్రభ అనే ఇతడి కూతురు సీతను వెతకడానికి హనుమంతుడు యాత్ర లో వుండగా అతడిని కలిసింది. - రామాయణం.

**మేషహృత్తు :** గరుడుని కుమారుడు.

**మేషుడు 1 :** ఇంద్రుడి మరో పేరు. మేధాతిథి సోమరసాన్ని మేషరూపంలో వెళ్లి స్వీకరించడం వల్ల ఇతడికీ పేరు సార్థకమయ్యింది. - ఋగ్వేదం

**మేషుడు 2 :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. - మహాభారతం

**మైత్ర 1 :** ఓ రాక్షస తెగ. లోంశుడను రుషి వారి నుండి విముక్తం చేయమని ధర్మరాజుని కోరాడు.

**మైత్ర 2 :** ఓ శుభ సమయం. ఈ సమయంలోనే శ్రీకృష్ణుడు హస్తినకు బయలుదేరి వెళ్లాడు. - మహాభారతం

**మైత్ర 3 :** ఓ తారాగణం. - మహాభారతం

**మైత్రావరుణులు :** ద్వాదశాదిత్యుల్లో ఇద్దరి పేర్లు. వీరు జంటగా వుంటారు కనుక ఇలా పిలుస్తారు. అగస్త్య, వశిష్ఠులు ఈ రూపంలో జన్మించారు.

**మైత్రేయి :** యజ్ఞవల్క్య మహర్షి భార్య. ప్రాచీన భారతావనిలో జ్ఞానవంతురాలైన స్త్రీలలో ఒకరు.

**మైత్రేయుడు :** ఓ గొప్ప రుషి. వనవాసం చేస్తున్న పాండవుల యోగక్షేమాలు ధృతరాష్ట్రుడికి చెప్తాడు. దుర్యోధనుడు అపహాస్యం చెయ్యగా భీముడితడి తొడలు విరగ్గొడతాడని శపిస్తాడు. విదురుడికి ధర్మాన్ని బోధించమని శ్రీకృష్ణుడితడికి చెప్పగా విదురుడితని దగ్గర తాత్వికత నేర్చుకుంటాడు. - భాగవతం

**మైనాకం 1 :** ఇదో పర్వతం. మేనకాహిమవంతుల కొడుకు. ఇంద్రుడు పర్వతాల రెక్కలు తెగవేస్తుంటే ఇతడు భయపడి దక్షిణ సముద్రంలో దాక్కుంటాడు. అందుకని ఇతని రెక్కలు మిగిలేవుంటాయి. లంకకు వెళ్తున్న హనుమంతుణ్ణి తనపై విశ్రమించమని కోరగా ఆ కోర్కె తీర్చబడుతుంది. భగీరదుడు దీనిమీదే తపస్సు చేస్తాడు. ఇది సువర్ణ శిఖరాలతో అలరారుతుంది. - రామాయణం

**మైనాకం 2 :** నర్మదా నదీ తీరాన గల ఒక ప్రాంతం.

**మైనాకం 3 :** ఒక పర్వతం. ఇది క్రౌంచ ద్వీపంలో వుంది. - మహాభారతం

**మొగలిపువ్వు :** శివలింగపు ఆద్యంతాలు చూడాలని బయలుదేరిన బ్రహ్మ విష్ణువులు అది సాధ్యంకాక తిరిగి శివుని వద్దకు వస్తారు. బ్రహ్మ ఒక కొసను చూశానని దానికి సాక్ష్యంగా ఓ మొగలిపువ్వును చూపిస్తాడు. విష్ణువు అలా చూడగలిగినందుకు బ్రహ్మకు మొక్కగా శివుడు బ్రహ్మ అబద్దానికి ఆగ్రహిస్తాడు. తప్పుడు సాక్ష్యం చెప్పినందుకు మొగలిపువ్వుకు పూజార్హత లేదని శపిస్తాడు. - శివపురాణం

**మోక్షం 1 :** ప్లక్ష ద్వీపంలోని 7 విభాగాలలో ఒకటి. ఆ ఏడు విభాగాలు శివ, యవస, సుభద్ర, శాంత, మోక్ష, అమృత, అభయాలు. - భాగవతం

**మోక్షం 2 :** ఆత్మ ఎన్నో పునర్జన్మల తర్వాత స్వేచ్ఛ పొందడాన్ని మోక్షం అంటారు. మానవ శరీరంలోని జీవాత్మ సంతోషం బాధలున్నాయనే భ్రమలో వుంటుంది. సత్యం అందుకు విరుద్ధం. మోక్షం అంటే జీవాత్మ పరమాత్మలో విలీనం కావడమే. జీవాత్మ ఎన్నో శరీరాలద్వారా పయనించి ముక్తిని పొంది పరమాత్మలో లీనమౌతుంది. దానినే మోక్షం అంటారు.

**మోఘవతి 1 :** మోఘవంతుడి కూతురు. భర్త సుదర్మ నుడు. ఈమెతో నృగు వంశం అంతరించింది.

**మోఘవతి 2 :** కురుక్షేత్రం వద్దగల ఒక నది. దీన్ని ఓఘపతి అనికూడా అంటారు. – మహాభారతం

**మోఘవంతుడు :** నృగుడి వంశంలోని ఒక రాజు.

**మోదాకి :** శాకద్వీపంలోని కేసర పర్వతం వద్దగల మైదాన ప్రాంతం. – మహాభారతం

**మోదాగిరి :** ప్రాచీన భారతావనిలో ఒక దేశం. ఈ దేశపు రాజును భీమసేనుడు వధించాడు.
– మహాభారతం

**మోదాపురం :** ప్రాచీన భారతావనిలో ఒక దేశం. అర్జునుడు ఒకసారి ఈ దేశపు రాజును ఓడించాడు.
– మహాభారతం

**మోదుడు 1 :** హిరణ్యాక్షుని సహచర రాక్షసుడు. దేవాసుర యుద్ధంలో వాయుదేవుడితణ్ణి వధించాడు.

**మోదుడు 2 :** ఐరావత తెగకు చెందిన సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది.
– మహాభారతం

**మోహకుడు :** శ్రీరాముని భక్తుడైన సురతుని కుమారుడు. యాగాన్ని సురతుడు ఆపినపుడు తండ్రి తరపున యుద్ధంలో పాల్గొన్నాడు. – పద్మపురాణం

**మోహన :** సుగ్రీవుని భార్య. ఈమె శ్రీరాముని అశ్వాన్ని అశ్వమేధయాగ సమయంలో స్నానం చేయించడానికి సరయూనది నీటిని తేవడానికి తోడ్పడింది.
– రామాయణం

**మోహనం :** ప్రాచీన భారతదేశంలో ఓనివాస యోగ్య ప్రాంతం. కర్ణుడు దీన్ని జయించాడు.

**మోహిని :** మహావిష్ణువు యొక్క స్త్రీ రూపం. క్షీర సాగర మదనంలో అమృతం వెలువడినపుడు దేవతలకు అందకుండా దానిని రాక్షసులు ఎత్తుకుపోగా మహావిష్ణువు మోహినిగా మారి వారిని తన అందంతో మత్తెక్కించగా ఈ లోపు దేవతలు అమృతాన్ని సంగ్రహించారు. శివుడు ఆమెను చూసి మోహించగా వారి కలయిక వల్ల శాస్త్రం అనే శిశువు జన్మించాడు.
– భాగవతం

**మోహుడు :** బ్రహ్మతేజస్సు నుండి జన్మించినవాడు.
– భాగవతం

**మౌద్గల్యుడు :** ఓ మహర్షి. ఇతడు రావణుణ్ణి శపించాడు. ఒకసారి కదంబారణ్యంలో యోగ ముద్రలో కూర్చొని ఉండగా రావణుడు తన జైత్ర యాత్ర ముగించుకొని వస్తూ ఇతడు కూర్చున్న విధానం చూసి ఆటకాయితనంగా తన చంద్రహాసంతో మౌద్గల్యుని ఊతకర్రపై కొట్టాడు. అది విరిగి మౌద్గల్యుడు క్రిందపడి వెన్నుదెబ్బతినగా అతడు ఆగ్రహించి చంద్రహాసం శక్తి నశిస్తుందని శపించాడు.
– కంభ రామాయణం

**మౌద్గల్యులు :** ముద్గుల గోత్రంలో జన్మించిన బ్రాహ్మణులు.
– చూ॥ ముద్గులుడు

**మౌనేయులు :** కశ్యపునికి మునివల్ల జన్మించిన గంధర్వ సంతానం. వాళ్ళను పురుకుత్సుడు నాగలోకం నుండి తరిమికొట్టాడు.

**మౌర్వి :** ఒక రకమైన గడ్డి. దీనితో రుషులు మేఖలలు తయారు చేస్తారు. – మహాభారతం

**మౌర్యులు :** చంద్రగుప్తుడి వంశస్థులైన మగధరాజులు. వీరు పది మంది నూట ముప్పై ఏళ్ళు రాజ్యపాలన చేశారు. ఇందులో అశోకుడు ముఖ్యుడు.

**మౌహూర్తికాగతి :** సూర్యుడు పుష్కర ద్వీపం మధ్య గుండా ప్రయాణిస్తున్నపుడు భూమి 13వ వంతు భాగాన్ని కప్పివేస్తుంది. సూర్యుని పవనాన్ని మోహర్తికాగతి అంటారు.

**మౌహూర్తికులు :** ముహూర్త ధర్ములకు జన్మించిన దేవగణం.

**మంక :** ప్రాచీన శాక ద్వీపంలోని నివాస యోగ్య ప్రాంతం. ఇక్కడ బాధ్యతాయుతులైన బ్రాహ్మణులు నివసించేవారు.
– మహాభారతం

**మంకరుడు :** వారణాసిలోని ఓ ముసలివాడు. 2వ దివోదాసు రాజ్యపాలన చేస్తుండగా శివుడు కాశీని ధ్వంసం

చేయడానికి నికుంబుడిని పంపాడు. నికుంబుడు తన భక్తుడైన మంకణుడిని కాశీ శివారు ప్రాంతంలో ఓ గుడిని నిర్మించమని కోరాడు. అతడు ఆ దేవాలయాన్ని నిర్మించి అతడే ప్రతిష్టించుకొని నికుంబ మందిరమని దానికి పేరుపెట్టాడు. భక్తులు తరలిరాగా ఇతడు వారికి వరాలిచ్చాడు. దివోదాసు కూడా పుత్రార్థియై వెడలగా నికుంబుడు నిరాక రించగా దివోదాసు ఆ దేవాలయాన్ని ధ్వంసం చేశాడు. ఇందుకు ఆగ్రహించి నికుంబుడు కాశీ నిర్మానుష్యమవుతుందని శపించాడు. అలా శివుని కోర్కె నెరవేరుతుంది. –బ్రహ్మాండ పురాణం

**మంకణకుడు :** వాయుభగవానుడికి సుకన్యక వల్ల జన్మించిన రుషి. వామన పురాణం మాత్రం కశ్యప ప్రజాపతి మానసపుత్రుడని చెప్తోంది. ఇతడికి కుశ దర్భ వేలికి తగిలి అది తెగి శాఖారసం కారుతుంది. అతడు ఆశ్చర్యంతో తాండవం చేస్తాడు. భూమి వొరు గుతుంది. శివుడు మారువేషంలో ప్రత్యక్షమై అతడి తెగిన వేలిని పట్టుకోగా చెరుకురసం కారుతుంది. అప్పుడు రుషి ముని రూపంలోవున్న శివుడ్ని గుర్తించి అతడి పాదాలపై పడతాడు. కాని వామనపురాణం అతడి కాలినుండి బూడిదకారినట్లు చెప్తోంది. శివుడి తనికి వరాలిచ్చాడు. మంకణుడు అందాల యువతి రూపంలో వచ్చిన సరస్వతిని చూసి రేతపతనం కాగా అది నీటిపై పడింది. అపుడతడు దానిని ఓ కుండలో వుంచగా అందుండి 7గురు పుత్రులు జన్మించారు. వారు కాక కదలీగర్భ అనే కుమార్తె వుంది. ఆమెకు జన్మించిందే మేనక. ఇతడే సరస్వతీనదిని దారిమరల్చి కురుక్షేత్రం గుండా ప్రవహింపచేశాడు.

– మహాభారతం

**మంకి 1 :** ఓ రుషి. భీష్ముడు అంపశయ్యపై వుండి ఇతడి కథ చెప్పాడు. ఇతడికి లౌకిక వ్యామోహం వుంది. ఎద్దులు వుండేవి. వీటితో పొలం దున్నేవాడు. ఒక రోజు అలా దున్నుతుండగా ఒంటె వీటిని ఎత్తుకు పోయింది. ఇతడాశ్రమానికి వచ్చి విలపించాడు. ఆ విషాద ఆలాపన మంకీగీతగా పేరొందింది. ఆ గీతం చివరికొచ్చేసరికి అతడి మనసు భౌతికమైన కోర్కెల నుండి మరలి మోక్షం సిద్ధించింది. – మహాభారతం

**మంకి 2 :** త్రేతాయుగంలో జీవించిన రుషి. కౌశికి బ్రాహ్మణుని కుమారుడు. విష్ణుభక్తుడు. ఇతని భార్యలు సురూప, విరూప. కుమారులు లేక గురువు సలహాపై సబర్మతీ తీరానికి వెళ్లి తపస్సు చేశాడు. చాలాకాలం అలా తపస్సు పూజలు చేసిన తర్వాత చాలామంది పిల్లలు జన్మించారు. ఆ తర్వాత ఈ తీరానికి మంకి తీర్థమని, సప్తసారస్వతమని పేరొచ్చింది. ద్వాపర యుగంలో పాండవులు దీన్ని దర్శించి సప్తధార అని నామకరణం చేశారు. – పద్మపురాణం

**మంగళచండిక :** ఒకదేవి. భక్తుల కోర్కెలు తీర్చే దేవత అని వేదాలు, వేదపండితులు పేర్కొంటారు. ఆమె భక్తుల కోర్కెలు తీర్చుతుంది కనుక మంగళచండిక అని కుజుడు (మంగళ) పూజించాడు గనుక ఆపేరు వచ్చిందని, మంగళుడను రాజు పూజించటంవల్ల ఆ పేరు వచ్చిందని, రకరకాల వ్యాఖ్యానాలున్నాయి. దుర్గాదేవి అంశ కనుక ఈమె తన భక్తులను దయతో చూసేది. శివుడు త్రిపురాసురుల్ని వధించేముందు ఈమెను పూజించాడు. – దేవీభాగవతం.

**మంగళుడు :** ఓ దేవగణం. కుజుడని అంటారు. దీని పుట్టుకపై వివిధ కథనాలున్నాయి.

1. దక్షయజ్ఞంలో సతి చితిలోపడి భస్మంకాగా శివుడు ఘోరతపస్సు చేయగా అతడి నుదుటి నుండి ఓ స్వేద బిందువు పడింది. అదే మంగళుడయ్యాడు.

– శివపురాణం.

2. హిరణ్యాక్షుడి కుమార్తె వికేశిని శివుడు వివాహ మాడి కామకేళిలో వుండగా అగ్ని వారివద్దకు వచ్చాడు. శివుని కంటి నుండి వెలువడిన వేడినీటి చుక్క వికేశిపైబడి ఆమె గర్భం ధరించింది. ఆ తర్వాత ఆమె ఆ శిశువును భరించలేక గర్భస్రావంకాగా, ఓ శిశువు జన్మించాడు. ఆ శిశువుకు భూమి దేవి పాలిచ్చి పెంచగా తర్వాత అతడు మంగళుడుగా పేరొందాడు.

– స్కందపురాణం

3. భవిష్యపురాణం శివుడి రక్తపు చుక్కనుండి జన్మిం చాడని, గణేశపురాణం భరద్వాజుడి పుత్రుడని చెప్తున్నాయి.

4. వరాహకల్పంలో మునులు, దేవతలు, బ్రాహ్మణులు, మనువులు, గంధర్వులు భూమిని పూజించారు. భూమి వరాహావతారంలో వున్న మహా విష్ణువుతో సంభోగం వల్ల మంగళుడు జన్మించాడు. – దేవీభాగవతం

**మంజుఘోష :** ఒక అప్సరస. మేధావి అనే ముని శాపం వల్ల పిశాచంగా మారుతుంది.

**మంజుల :** పురాణాలలో పేర్కొనబడిన ఒకనది.
– మహాభారతం

**మంజువంతం :** హిమపర్వతానికి ఉత్తరాన వుండే ప్రాంతం. ఇక్కడ 100 యోజనాల విస్తీర్ణం గల సరస్సు వుంది. ఈ సరస్సులోని కమలాల నాళంలోనే పదవీభ్రష్టుడైన దేవేంద్రుడు దాక్కున్నాడు.

**మండగుడు :** మణిభద్రుడను యక్షుడికి పుణ్యజనివల్ల జన్మించిన కుమారుడు.

**మండగం :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాసయోగ్య ప్రాంతం. – మహాభారతం

**మండలకం :** తక్షకుని కుటుంబంలో జన్మించిన సర్పం. ఇది జనమేజయుని సర్పయాగంలో మరణించింది.
– మహాభారతం

**మండూకం :** గుర్రాలలో ఓ తెగ. ఈ తెగ గుర్రాలు శ్రేష్ఠమైనవని అంటారు. అర్జునుడు తన జైత్ర యాత్రలో ఈ గుర్రాలు ఉపయోగించాడు.
– మహాభారతం

**మండూకసులు :** ఓ తెగ ప్రజలు. వీరి రాజు ఆయుసుడు. ఇతని పుత్రిక సుశోభను పరీక్షిత్తుడను ఇక్ష్వాకు వంశరాజు వివాహమాడగా ఈమెకు ముగ్గురు పుత్రులు జన్మించారు. వారు శాల, దల, బలలు. – మహాభారతం

**మంత్రపాలుడు :** దశరథుని 8 మంది మంత్రుల్లో ఒకడు. – రామాయణం

**మంథర 1 :** దశరథుని భార్య కైకేయి పరిచారిక. దుందుభి అనే గంధర్వ కుమార్తె. ఓ గూని స్త్రీ. ఈమె కైకేయితో శ్రీరాముడిని అరణ్యానికి పంపమని సలహా ఇచ్చింది. ఈమె సలహా సూర్యవంశపు చరిత్రను మలుపుతిప్పింది. – రామాయణం

**మంథర 2 :** విరోచనుడను రాజు కుమార్తె. ఇంద్రుడీమెను వధించాడు. – రామాయణం.

**మంథిని :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు.
– మహాభారతం

**మందకం :** పురాణ ప్రసిద్ధి వహించిన నివాసస్థలం
– మహాభారతం

**మందగ 1 :** పురాణాలలో పేర్కొనబడిన ఓ నది.
– మహాభారతం

**మందగ 2 :** శకద్వీపంలోని ఓ ప్రాంతం. ఇక్కడి శూద్రులు జ్ఞానవంతులు. – మహాభారతం

**మందపాలుడు :** ఓ రుషి. తన తపశ్శక్తివల్ల పితృలోకాలకు వెళ్లి వుండలేక భూమికి తిరిగివచ్చాడు. ఆ తర్వాత ఓ పక్షిని వివాహమాడి వైవాహిక జీవితం గడిపాడు.

**మందప్రజ్ఞుడు :** రుతుపర్ణుని ఇంట వుండిన బాహుకుడు భార్యావియోగముచే ఏడ్చుచుండగా సుదేవుడేల విలపించుచుంటివని అడుగగా "మందప్రజ్ఞుడు" ఇట్లు విలపించెనని దానిని నేను అనుకరించుచుంటి నని సమాధానమిచ్చెను.

**మందర 1 :** పంచతంత్ర కథల్లోని ఓ కల్పితపాత్ర అయిన తాబేలు. – చూ॥ పంచతంత్రం

**మందర 2 :** విశ్వకర్మ భార్యల్లో ఒకరు. నలుడను వానరుడు ఈమె కుమారుడు. లంకకు వారధి కట్టిన వానరులకు నాయకత్వం వహించాడు. విశ్వకర్మ ఏదో ఒకరోజు కీర్తిగడిస్తాడని మందరకు వరమిస్తాడు.
– రామాయణం

**మందరుడు :** ఒక బ్రాహ్మణుడు. పూర్వజన్మలో అజామిళుడు. వేశ్యాలోలుడు.

**మందవాహిని :** శుక్తిమంతంలో పుట్టిన నది.

**మందవిసర్పిణి :** ఓ పేను పేరు. ఇది పంచతంత్రంలో ఓ కల్పిత పాత్ర. – చూ॥ పంచతంత్రం

**మందాకిని 1 :** భర్తృహరి ప్రేమలో పడిన ఓ పరి చారిక.
– చూ॥ భర్తృహరి

**మందాకిని 2 :** చిత్రకూట పర్వతం నుండి ప్రవహించే నది. ఈ నదిలో స్నానంచేస్తే అశ్వమేధయాగం చేసిన ఫలితం లభిస్తుంది. ఒకవేళ అక్కడే జీవిస్తూ ప్రతిరోజు స్నానంచేస్తే రాజ్యలక్ష్మి వరిస్తుంది. – మహాభారతం

**మందాకిని 3 :** ఉత్తరాఖండ్ ప్రాంతంలో కేదార పర్వతాలలో పుట్టి ప్రవహించే నది. దీనిని మందాకిని, కాళిగంగ అనికూడా పిలుస్తారు. – మహాభారతం

**మందాకిని 4 :** కుబేరుని ఉద్యానవనం గంగానది నీటితో తడుపుతారు కనుక మందాకినిగా పేరొచ్చింది.
– మహాభారతం

**మందార లక్ష్మి :** సింహధ్వజుని భార్య.
– చూ॥ సింహ ధ్వజుడు

**మందారవతి :** కథాసరిత్సాగరంలోని ఓ కథలో నాయకి. ఈ కథను వెతాలుడు త్రివిక్రమసేనుడను రాజుకు చెప్పాడు. – చూ॥ వెతాలుడు

**మందారుడు 1 :** హిరణ్యకశిపుని పెద్దకుమారుడు. శివుని వరంవల్ల ఇంద్రుడితో కోట్ల సంవత్సరాలు పోరాడి మహావిష్ణువు చక్రం, ఇంద్రుని వజ్రాయుధంతో ముక్కలై మరణించాడు. – మహాభారతం

**మందారుడు 2 :** దౌమ్యుని కుమారుడు. మాళవ ప్రాంత బ్రాహ్మణ కన్య శామికను వివాహమాడాడు.
– గణేశ పురాణం

**మందుడు :** చ్యవనుడు చేసిన హోమగుండం నుండి ఉద్భవించిన ఓ రాక్షసుడు. ఇంద్రసంహారానికి చ్యవనుడితణ్ణి సృష్టిస్తాడు. ఇతడు దేవతల్ని కబళించబోగా ఇంద్రుడు చ్యవనుడి శరణు వేడతాడు.
– మహాభారతం

**మందేహసులు :** ఒక రాక్షస తెగ. సంధ్యాసమయంలో సూర్యుణ్ణి కబళించాలని వీరు ప్రయత్నిస్తారు. ప్రజాపతి శాపంవల్ల ప్రతిరోజు మరణిస్తారు. బ్రాహ్మణులు సంధ్యావందనం చేసేటప్పుడు పలికే ఓంకారనాదం. చల్లే నీళ్ళు వజ్రాయుధంగా మారి వారిని సంహరిస్తాయి.
– విష్ణుపురాణం

**మందోదరి (మండోదరి) 1 :** రావణుడి భార్య.
*జన్మవృత్తాంతం :* మయుడను రాక్షసుడు ప్రముఖ వాస్తుశిల్పి. ఇతడు ఒకసారి దేవలోకం వెళ్ళి ఓ అప్సరసను వివాహమాడి హిమవనం దక్షిణ ప్రాంతంలో ఓ భవంతి నిర్మించుకొని జీవించేవాడు. అతడికి ఇద్దరు కుమారులు. మాయావి, దుందుభి. కుమార్తె కోసం శివుని గూర్చి తపస్సు చేశాడు. ఓ అప్సరస అయిన మధుర కైలాసం వెళ్ళి పార్వతి లేని సమయంలో శివుడ్ని ఆలింగనం చేసుకొంది. వచ్చి చూసిన పార్వతి ఈమెను 12 సంవత్సరాలు కప్పగా జీవించమని శపించగా శివుడు నీవు ఆ తర్వాత ఓ అందమైన యువతిగా మారి ఓ నరుణ్ణి వివాహమాడతావని అభయమిస్తాడు. శివుడు తపస్సు చేసుకుంటున్న మయుడికి యువతిగా మారిన కప్పను ప్రసాదిస్తాడు. అతడు ఈమెను తన స్వంత కుమార్తెగా పెంచి రావణుడికిచ్చి వివాహం చేశాడు. ఈమెకు రావణుని వల్ల ముగ్గురు కుమారులు జన్మించారు. వారు మేఘనాథుడు, అతికాయుడు, అక్ష కుమారుడు.
– ఉత్తరరామాయణం.

**మండోదరి 2 :** సింహళ రాజకుమార్తె. ఈమె అవివాహితగా వుండాలని నిశ్చయించుకుంది కాని విధివల్ల దయాహీనుడైన ఓ క్రూరుడిని వివాహమాడింది. రాజు ఈమెను పదేళ్ల వయసు వున్నపుడే మద్రరాజు కుమారునికి ఇచ్చి వివాహంచేయ నిశ్చయించగా ఆమె నిరాకరించింది. యువతిగా వున్నపుడు ఇంద్రసేన మహారాజు ఈమెను వివాహమాడదలచగా తిరస్కరించింది. కాని తన సోదరి ఇందుమతికి వివాహం చేయవలసిన సమయమున చుట్టుప్రక్కల నున్న రాజుల నందరిని రావించగా అందులో చారుదేష్ణ అనే రాజును చూసి మండోదరి అతని అందానికి ముగ్ధురాలై వివాహమాడ నిశ్చయించింది. ఆ తర్వాత అతనితో జీవితం కొంతకాలం సవ్యంగానే సాగింది. ఒక రోజు ఇతడు తన పరిచారికతో శృంగార కేళిలో వుండగా ఆమె మందలించింది. మరుసటి రోజే మరో పరిచారికతో అదే అవస్థలో చూసి భరింపలేక భవంతి విడచి అడవులకేగి శేషజీవితాన్ని తపస్సులో గడిపింది. ఈ వృత్తాంతాన్ని మహిషాసురుడు దేవికి చెప్పాడు.

**మంత్రపాలుడు :** దశరథుడి 8 మంది మంత్రుల్లో ఒకడు.
– రామాయణం

**మాండవి :** భరతుని భార్య. రాముడు సీతను, భరతుడు మాండవిని, లక్ష్మణుడు ఊర్మిళను, శత్రుఘ్నుడు శ్రుతకీర్తిని వివాహమాడారు. సీతకాక తక్కిన ముగ్గురు జనకుని సోదరుడైన కుశధ్వజుని పుత్రికలు. ఈమె వల్ల భరతునికి ఇద్దరు కుమారులు సుబాహు, శూరసేనులు. సింధూనదికిరువైపులా వున్న గంధర్వులను జయించి నగరాలు నిర్మించుకున్నారు.
– ఉత్తర రామాయణం

**మాండవ్యుడు :** ఓ రుషి. ఇతడిని అణిమాండవ్యుడని కూడా అంటారు. ఇతడిని రావణుడొకసారి కొట్టగా ఓ వానరంవల్ల నీవిలాగే దెబ్బలుతింటావని శపించాడు.
– కంభ రామాయణం

ఇతడి ఆశ్రమాన్ని పవిత్రస్థలంగా భావిస్తారు. కాశీ రాజు ఇచ్చట ఘోరతపస్సు చేశాడు.

*ఇతర విశేషాలు : – చూ॥ అణిమాండవ్యుడు*

**మాండుకేయుడు :** పైలుడి శిష్యుడైన ఇంద్రప్రమతి యొక్క శిష్యుడు. రుగ్వేద సంహితను గురువు వద్ద నభ్యసించి దాన్ని దేవమిత్రుడికుపదేశించాడు.

– *భాగవతం*

**మాందకర్ణి (శాతకర్ణి) :** ఓ రుషి. 10వేల సంవత్సరాలు కొలనులో తపస్సు చేస్తూ గడిపాడు. ఇంద్రుడు దీనిని విఘ్నం చేయనెంచి ఐదుగురు అప్సరసలను పంపగా ఆ కొలనులో భవంతిని నిర్మించుకొని వారితో సకల కళా విన్యాసాలలో మునిగాడు. అందుకనే ఆ కొలనుకు 'పంచాప్సరసు' అనే పేరు వచ్చింది. రామ లక్ష్మణులు సీతతో అరణ్యవాస సమయమున ఈ భవంతిని చూశాడు.

– *రామాయణం*

★**మాంధాత :** ఇక్ష్వాకు వంశంలో ప్రసిద్ధుడైన చక్రవర్తి. *జననం :* యువనాశ్వునికి 100 మంది భార్యలు అయినా పుత్ర సంతానం లేదు. అందుకై బ్రాహ్మణుల సలహాపై ఇంద్రద్వైతమను యాగము చేసెను. ఆ యాగము చేయుచుండగా యాగార్థమై తెచ్చిన మంత్ర జలమును దప్పికయై సేవించగా ఇతడే గర్భము ధరించి అతని గర్భం చీల్చుకుని మాంధాత జన్మించెను. అతడిని విడిచివేయగా ఇంద్రుడు తన వేలిని నోట వుంచి పాలిచ్చి పెంచెను. అందువల్ల ఇతడు మాంధాతయయ్యెను. – *దేవీ భాగవతం*

*పాలన–వివాహం :* ఇతడు బలవంతుడయ్యేసరికి తండ్రిచనిపోగా ఇతడే రాజై చక్రవర్తిగా వెలుగొందెను. ఎన్నో రాజ్యాలను జయించాడు. ఇతడు దస్యులను భయపెట్టడంవల్ల త్రసదస్యుడని కూడా పిలువబడ్డాడు. శాశబిందురాజు కుమార్తె బిందుమతిని వివాహ మాడగా ఈమెకు పురుకుత్స, ముచుకుందులు జన్మించారు.

*వర్షాలు కురిపించిన విధం :* ఇతడు పాలించిన దేశంలో వరుసగా అనావృష్టి సంభవించి కరువు కాట కాలు వచ్చాయి. కారణం తెలియని మాంధాత అరణ్యానికి వెళ్ళి మునులను సంప్రదించగా ఇది కృత యుగమని ఈ యుగంలో ధర్మం నాల్గుపాదాల నడుస్తుందని, నీ దేశంలో ఓ శూద్రుడు తపస్సు చేస్తున్నాడని బ్రాహ్మణులకే ఆ అర్హత వుందని, కాబట్టి వర్షాలు కురవడం లేదు కనుక ఆ శూద్రుడిని చంపమని సలహా ఇస్తాడు. ఒక అమాయకుడ్ని చంపడం తనకు ఇష్టం లేదని వేరే మార్గం చూపమనగా ఏకాదశవ్రతం నీవేకాక నీ ప్రజలు కూడా చేస్తే మరల వర్షాలు కురిసి సుభిక్షమవు తుందనగా మాంధాత దాన్ని పాటిస్తాడు

– *పద్మపురాణం*

*ఇతర విశేషాలు :* ఇతడు రావణుడ్ని ఒకసారి బంధించి బ్రహ్మకోర్కెపై వదిలివేస్తాడు. ఇతడు ప్రపంచాన్ని మొత్తం ఒక రోజులో జయించాడు. కాని లవణుడను వాని చేతిలో ఓడిపోయాడు. ఇతడు శాఖాహారి.

– *మహాభారతం*

**ముంజకేతువు :** ఒక రాజు. ధర్మరాజు కొలువులో వుండేవాడు. – *మహాభారతం*

**ముంజకేశుడు :** ఇతడొక రాజు. నించంద్రుడనే రాక్షసాంశలో జన్మించాడు. యుద్ధంలో పాల్గొనమని పాండవులితణ్ణి ఆహ్వానిస్తారు. – *మహాభారతం*

**ముంజసృష్ఠం :** హిమాలయాల్లోని ఒక ప్రాంతం. రుద్రుడిక్కడ తపస్సు చేశాడు.

**ముంజవటం 1 :** కురుక్షేత్రం దగ్గరలోని ఓ పవిత్ర స్థలం. ఇక్కడోరాత్రి గడిపితే గణపతికి సమానులౌతారు. – *మహాభారతం*

**ముంజవటం 2 :** గంగానదీ తీరాన గల ఓ పవిత్ర స్థలం. ఇక్కడ గంగాస్నానం, శివుణ్ణి ఆరాధించడమనే రెండు పనులవల్ల సర్వపాపవిముక్తి జరుగుతుంది.

– *మహాభారతం*

**ముంజవానం :** ఇదొక పర్వతం. హిమాలయ శ్రేణుల్లో వుంది. శివుడు తరచుగా ఇక్కడే తపస్సు చేసేవాడు. సాధ్య, రుద్ర, విశ్వదేవ, వాయు, యమ, వరుణ, భూత, నాసత్య, గంధర్వ, యాతు ధనాదులు శివుణ్ణి ఆరాధించడానికి ఇక్కడికి వచ్చేవారు. – *మహాభారతం*

**ముంజావటం :** హిమాలయాల్లోని ఓ ప్రదేశం. ఒకసారి పరశురాముడు వచ్చి అక్కడి మునులకు జడలు ముడివేసుకొమ్మని చెప్పాడు. – *మహాభారతం*

★ కొన్ని పురాణాలు ఇతనికి అంబరీషుడు మరో 50 మంది కుమార్తెలు కలరని ఆ కుమార్తెలను సౌభారి రుషి వివాహ మాడాడని చెప్తున్నాయి.

**ముంజుడు :** రుషి. ధర్మరాజును గౌరవించేవాడు.
- మహాభారతం

**ముండకం :** ఇదో అరణ్యం. అగస్త్యుడిక్కడే నివసించే వాడు. రాముడు అరణ్యవాసం చేయడానికి ఇక్కడే అరణ్యంలోకి ప్రవేశిస్తాడు. - కంబ రామాయణం

**ముండవేదాంగం :** ధృతరాష్ట్రుడి వంశంలోని సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణిస్తుంది.
- మహాభారతం

**ముండి :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరి.
- మహాభారతం

**ముండుడు :** చూ॥ చండముండులు.

**మైందుడు :** సీతాన్వేషణలో రాముడికి తోడ్పడిన వానరుల్లో ఒకడు. ఇతడు కిష్కిందలోని ఓ గుహలో వుండేవాడు. సహదేవుడు తన దక్షిణదేశ జైత్ర యాత్రలో ఇతడితో తలపడి ఓడిపోయాడు. అయినా అతడు కానుకలిచ్చి అతడి యాత్రను సుగమం చేశాడు.
- మహాభారతం

ఇతడు సుగ్రీవుని మంత్రుల్లో ఒకడు. రామాయణ యుద్ధంలో లక్ష్మణుడితోపాటు ఇతడూ మూర్చపోయాడు. - రామాయణం

**మృకండుడు :** మార్కండేయుని తండ్రి.
- చూ॥ మార్కండేయుడు

**మృగధూమం :** కురుక్షేత్రం ప్రక్కనగల ఓ పవిత్రస్థలం. ఇక్కడకు వెళ్ళి మహాదేవుడిని పూజిస్తే ఓ అశ్వమేధ యాగ ఫలితం లభిస్తుంది.

**మృగమంద :** కశ్యపుని కుమార్తెలలో ఒకరు.
- చూ॥ మృగాలు

**మృగవ్యాధుడు 1 :** పరశురాముడి భక్తిని పరీక్షించడానికి శివుడు ధరించిన రూపం. పరశురాముడు శివుడి గూర్చి తపస్సు చేయగా ఓ వేటగాడి రూపంలో శివుడు వచ్చి పరశురాముణ్ణి వివిధ రకాలుగా పరీక్షించి అతడి తపోనిష్టకు మెచ్చి ధనుర్విద్యలో శిక్షణనిచ్చి ప్రపంచమంతా చుట్టి రావడానికి అనుమతించాడు.
- బ్రహ్మాండపురాణం

**మృగవ్యాధుడు 2 :** ఏకాదశ రుద్రుల్లో ఒకడు. ప్రజాపతి.

**మృగాలు :** అన్ని జంతుజాలాలు కశ్యప సంతతే. మరీచుని కుమారుడైన కశ్యప ప్రజాపతి దక్షప్రజాపతి 8 మంది కుమార్తెలను వివాహమాడాడు. తామ్రకు పక్షులు జన్మించగా, క్రోదవశకు 10 మంది కుమార్తెలు జన్మించారు. అవి మృగి, మృగమంద, హరి, భద్రమద, మాతంగి, శార్దూల, శ్వేత సురభి, సురప, కద్రులు. మృగాలు మృగి యొక్క సంతానం.
- రామాయణం

**మృగాంకకం :** ఓ ఖడ్గం. ఒకసారి కుబేరుడు ఓ యక్షుడిని సింహంగా శపించి మహాబలి ద్వారపాలకుడవు గమ్మన్నాడు. అతడు శాపవిమోచనం కోరగా ఓ మానవుడు నిన్ను ఓడించినపుడు శాపవిమోచనమవుతుందని చెప్పగా ఓ బ్రాహ్మణ వీరుడైన శ్రీదత్తుడు ఈ సింహాన్ని ఓడించగా నిజరూపుడై శ్రీదత్తుడికి ఓ ఖడ్గం బహుకరిస్తాడు. అదే మృగాంకకం.
- కథాసరిత్సాగరం

**మృగాంకవతి :** ప్రాచీన రాజైన శ్రీబింబికి కుమార్తె.
- చూ॥ శ్రీదత్తుడు.

**మృగావతి :** చూ॥ ఉదయనుడు.

**మృగి :** లేడి. జంతువులకు మాతృక. చూ॥ మృగాలు

**మృచ్ఛకటిక :** ఇదో ప్రసిద్ధ సంస్కృత నాటకం. శూద్రకుడు దీన్ని రచించాడు.

**మృడుడు :** రుద్రుడి మరోపేరు. సుఖింపచేసేవాడనే అర్థంలో అతడిని అలా పిలుస్తారు.

**మృతం :** చూ॥ ప్రమృతం

**మృతసంజీవిని :** ఇదో వ్యాధి నివారిణియైన మొక్క. దీనివల్ల మరణించిన వారు కూడ బ్రతుకుతారు.

**మృత్తికావతి :** ప్రాచీన భారతదేశంలో ఓ నివాస యోగ్య ప్రాంతం. - మహాభారతం

**మృత్యువు :** మృత్యుదేవత. హింస అధర్ముడి భార్య. వీరి కుమారుడు అనృతుడు కుమార్తె నికృతి. వారి బిడ్డలు భయ, నరక, మాయ, వేదన. ఇందులో మాయ మృత్యువుకు జన్మనిచ్చింది. ఇది పదార్థాన్ని నశింపచేస్తుంది. మహాభారతం మృత్యువును దేవుడు; దేవత అని పేర్కొంది. - అగ్నిపురాణం

భూభారాన్ని భరించలేని భూమి బ్రహ్మను ప్రార్థించగా దాన్ని తగ్గించే ఉపాయం తెలియక బ్రహ్మకు కోపం వస్తుంది. ఆ కోపం నుండి ఓ స్త్రీ జన్మిస్తుంది. ఆమే మృత్యువు. - మహాభారతం

**మృదుకుడు :** యదు వంశంలోని వాడు. అక్రూరుడి తమ్ముడు. – భాగవతం

**మృదుపత్తు :** యదువంశంలోనివాడు. అక్రూరుడి తమ్ముడు. – భాగవతం

**మృష :** అధర్ముని భార్య. అధర్ముని వల్ల ఈమెకు ఇద్దరు పిల్లలు. ధంబా, మయ. – భాగవతం

**మ్లేచ్ఛులు :** ప్రాచీన భారతదేశంలోని ఓ తెగ ప్రజలు. వశిష్ఠుని గోవు నందిని తోక నుండి జన్మించారు. విశ్వామిత్రుడు వశిష్ఠుని గోవును ఎత్తుకుపోబోగా ఆ గోవు తోకనుండి జన్మించి విశ్వామిత్రుని సైన్యాన్ని భయకంపితులు చేశారు. – మహాభారతం

*ఇతర విశేషాలు :* భీమసేనుడొకసారి సముద్రతీరాన వున్న వీరిని ఓడించి విలువైన ఆభరణాలను పన్నుగా లాక్కున్నాడు. సహదేవుడు కూడా ఒకసారి వీరిని జయించాడు. నకులుడొకసారి జయించాడు. మహాభారతకాలంలో భగదత్తుడు వీరి రాజు. ఇతడు ధర్మ రాజు రాజసూయ యాగాన్ని సందర్శించాడు. కర్ణుడు తన జైత్రయాత్రలో వీరిని జయించాడు. అంగరాజను మ్లేచ్ఛావీరుడు కురుక్షేత్ర యుద్ధంలో భీమసేనుడి చేతిలో మరణించాడు. అశ్వమేథయాగ సమయంలో కూడా అర్జునుడు ఎందరో మ్లేచ్ఛులను ఎదుర్కొన్నాడు. – మహాభారతం



**య :** ఈ అక్షరం అర్థం యాగం లేక యాత అనగా నాయకుడు.

**యక్షగ్రహం :** ఓ గ్రహం. ఇది యక్షులకు సంబంధించిన దుష్టగ్రహం అంటారు. ఈ గ్రహం ప్రభావం వల్ల ప్రజలు పిచ్చివాళ్ళవుతారు. – మహాభారతం.

**యక్షప్రశ్నలు :** యక్షుడు వేసిన చిక్కు ప్రశ్నలు. పాండవుల అరణ్యవాసాంతమున ఓ బ్రాహ్మణుడు వచ్చి తన అరణిని ఓ మృగము ఎత్తుకొని పోవుచున్నది కాన కాపాడుమని పాండవుల నడిగెను. వారు దాని వెంట పడగా అది కొంత దూరము పరుగెత్తిన తర్వాత అదృశ్యమయ్యెను. అప్పుడు వీరు ఒకచోట కూర్చొని దాహార్తులై ధర్మజుడు ఎచ్చటైనా నీరు దొరకునేమో తెమ్మని నకులుని పంపెను. నకులుడు ఆ దగ్గరలోని ఓ కొలనులో నీరు త్రాగుటకు దిగుచుండగా "ఈ కొలను నాది, ముందుగా నా ప్రశ్నలకు సమాధానము చెప్పినగాని నీరు త్రాగనంగీకరించననెను". ఈ మాటలను లెక్కచేయక నకులుడు కొలనులో దిగి మరణించెను. అట్లే ధర్మజుడు తప్ప తక్కిన పాండవులును మృతులైరి. అప్పుడు ధర్మజుడు రాగా నేనొక బకమును, ఈ కొలను నాది, నీవు నీరు త్రాగదలచిన నా ప్రశ్నలకు సమాధానమిమ్ము లేకున్న వీరివలెనె మృతి చెందుదువు" అనగా నీవు బకమువుకాదు, బకమైన నా సోదరులట్లు పడజాలరు. నీవెవ్వరో మహానుభావుడవని ధర్మజుడనగా ఓ యక్షుడు ప్రత్యక్షమై అట్టహాసము చేసెను. "ఈ కొలను నాది, నా ప్రశ్నలకు సమాధానము చెప్పనిచో ఇట్లే నిహతుల గుదురు" అనగా నాకు తెలిసినంతవరకు సమాధాన మివ్వగలవాడనని ధర్మజుడు పల్కెను. "సూర్యుని ఏది నడుపును ? వాని కాధారమేది ? ఎట్లు మానవుడు బుద్ధిమంతుడగును ? నిద్రించియు యేది కన్ను మూయదు?" వంటి కొన్ని ప్రశ్నలువేయగా ధర్మజుడు సమాధానములు చెప్పెను. యక్షుడు సంతోషించి నీ తమ్ములలో ఒకరిని బ్రతికింతును కోరుకొమ్మనగా కుంతీపుత్రుని నేనున్నాను" మాద్రి పుత్రులలో ఒకడైన నకులుని బ్రతికింపుమనెను. ధర్మజుని సత్యసంధతకు మెచ్చి నేను యమధర్మరాజునని మిమ్ము పరీక్షించ నెంచి ఇట్లు చేసితినని చెప్పి అందరినీ బ్రతికించి అజ్ఞాతవాస సమయమున మీరు కోరిన రూపము పొందగలరని వరమిచ్చెను.

**యక్షవాటం :** పురాణ ప్రసిద్ధమైన స్థలం. ఇక్కడే రంభుడను అసురుడు ఓ మహిషిని వివాహమాడెను. – దేవీ భాగవతం

**యక్షి/యక్షిణి :** యక్షస్త్రీలు. యక్షిణి విగ్రహాలను దేవాలయాలలో పొడవైన కళ్ళతో ప్రతిష్టిస్తారు. యక్షిణి దేవి స్వరూపిణి. ఈ దేవి ప్రసాదం తినడంవల్ల బ్రాహ్మణ హత్యాపాతకం నశిస్తుంది. – మహాభారతం

**యక్షిణీతీర్థం :** కురుక్షేత్రానికి ప్రక్కనగల ఓ పవిత్ర స్థలం. ఇచ్చట స్నానం చేస్తే కోర్కెలు తీరతాయి. ఇచ్చట పితృగణాలను పూజిస్తారు. ఈ స్థలాన్ని దర్శిస్తే అశ్వమేధయాగ ఫలితం లభిస్తుంది. దీనికి పరశురాముడే ప్రారంభకుడు.

**యక్షుడు :** ఇతడు క్రతుస్థల అనే ఆమెను వివాహమాడాలనుకుంటాడు. కాని ఆమె వసురుచి అనే గంధర్వుణ్ణి ప్రేమించడం వల్ల ఇతడ్ని తిరస్కరిస్తుంది. ఇతడు వసురుచి రూపంలో వచ్చి ఈమెను వివాహమాడగా రజితనాభుడనే పుత్రుడు జన్మిస్తాడు. అప్పుడు యక్షుడు తన నిజస్వరూపం చూపగా చేసేదిలేక ఇతడితోనే కాపురం చేస్తుంది. – బ్రహ్మపురాణం.

**యక్షులు :** ఉపదేవతలు. ఇందులో మూడు తరగతులున్నారు. దేవతలు, గణదేవతలు, ఉప దేవతలు. గణదేవతలు 12 మంది ఆదిత్యులు, 10 మంది విశ్వదేవతలు, 8 మంది వసువులు, 36 మంది తుష్టితులు; 64 మంది ఆభాస్వరసులు, 49 మంది అనిలసులు, 220 మంది మహారాజకసులు, 12 మంది సాధ్యసులు, మరియు 11 మంది రుద్రులు. ఉపదేవతలు 10 రకాలు. వారు విద్యాధరులు, అప్సరసలు, యక్షసులు, రాక్షసులు, గంధర్వులు, కిన్నెరలు, పిశాచులు, గుహ్వారులు, సిద్ధులు, భూతాలు.

**యక్షేశ్వరుడు :** శివుని అంశ. దేవతలు క్షీరసాగర మదనం తర్వాత అమృతం సంపాదించి గర్వితులై వుండేవారు. వారి శక్తి వారికి తెలియజెప్పడానికి ఈ జన్మ ఎత్తాడు. ఒకసారి ఓ గడ్డిపరకను వారి ముందుంచి పైకెత్తమనగా కనీసం దానిని కదిలించలేకపోయారు. అప్పుడు వారు వారి శక్తిహీనతను గుర్తించారు. – శివపురాణం

**యక్ష్మం :** ఇదో వ్యాధి. బోదకాలు అని పిలుస్తారు. దీనిని దక్ష ప్రజాపతి సృష్టించాడనే కథనం వుంది.

**యజతుడు :** రుగ్వేదంలో పేర్కొనబడిన ఓ యజ్ఞ కర్త. – రుగ్వేదం

**యజుర్వేదం :** చతుర్వేదాలలో ఒకటి. వైశంపాయనుడు దీన్ని 27 విభాగాలు చేశాడు. వ్యాసుడు దీన్ని మొదట వైశంపాయనుడికి బోధించాడు.

**యజ్ఞకోపుడు :** మాల్యవంతుడి కొడుకు. – రామాయణం

**యజ్ఞఘ్నుడు :** దను వంశస్థుడు. యజ్ఞమూర్తి అయిన విష్ణువితణ్ణి సంహరిస్తాడు.

★ **యజ్ఞదత్తుడు 1 :** ఓ యువ రుషి. సరయూ నదీ తీరంలో దశరథుడు ఏనుగుగా భ్రమించి బాణం విడువగా అది ఇతడికి తగిలి మరణించాడు.

**యజ్ఞదత్తుడు 2 :** యమునా పర్వత తీరంలో యజ్ఞదత్తుడను పండితుడు విద్యావంతుడు అయిన బ్రాహ్మణుడు కలడు. అదే గ్రామంలో ఇతడి రూపుదే అయిన బ్రాహ్మణుడు కలడు. అతడిని తీసుకురావలసినదని యముడాజ్ఞాపించగా పొరపాటున ఇతడిని తీసుకు వెళ్లగా యముడు పొరపాటు గ్రహించి ఇతడిని భూలోకం వెళ్లమనగా అతడు నిరాకరిస్తాడు. – పద్మపురాణం

**యజ్ఞదత్తుడు 3 :** చూ॥ పాటలీపుత్రం

**యజ్ఞదత్తుడి కుమారుడు :** ఇతడు యజ్ఞదత్తుడనే సద్బ్రాహ్మణుడి కుమారుడు. ఇతడు క్రూరుడు. భార్య బిడ్డల్ని వదిలేస్తాడు. ఇతడికొడుకొకసారి తిండిలేక ప్రసాదాన్ని దొంగిలించి తింటాడు. అతణ్ణి విష్ణు దూతలు తీసుకువెళ్లగా తర్వాతి జన్మలో అరిందముడికిద ముడిగా జన్మిస్తాడు. – శివపురాణం

**యజ్ఞపురుషుడు :** విష్ణువు అవతారమైన యజ్ఞమూర్తి, యజ్ఞ విధ్వంసకుడైన జంభుడనే రాక్షసుణ్ణి వధిస్తాడు. – మహాభారతం

**యజ్ఞబాహువు :** ఓ రుషి. ప్రియవ్రతుడికి అతని భార్య సురూపవల్ల జన్మించాడు. – భాగవతం

**యజ్ఞం :** దేవతలను మెప్పించి వారి ప్రీతికోసం చేసే అగ్నిసూత్ర కార్యక్రమం. ఇది 21 రకాలు.
1. సప్తపాక యజ్ఞాలు, 2. సప్తహ విద్యజ్ఞాలు, 3. సప్తసోమ సంస్థలు. ఇవిగాక అశ్వమేధ, రాజసూయ, పౌండరీక, బృహస్పతి మొదలైన యజ్ఞాలు కూడా వున్నాయి. ఆపస్తంబ సూత్రాల్లో యజ్ఞ విధాన వివరణ వుంది. ఇవికాక బ్రాహ్మణుడు నిత్యం దేవ, పితృ, భూత, మనుష్య, బ్రహ్మ యజ్ఞాలు చెయ్యాలి.

**యజ్ఞవాహం :** సృష్టిని పెంచి భూమిని పాలించమని బ్రహ్మ స్వారోచిషమనువుకు చెప్తాడు. అప్పుడు భూమి రసాతలంలో నీటిలో మునిగి వుంది. బ్రహ్మ పరమేశ్వ

★ వాల్మీకి రామాయణం దశరథుని బాణానికి మరణించింది శ్రవణుడు అని పేర్కొంది.

రుణ్ణి ప్రార్థిస్తే వరాహ రూపంలో అతడు భూమిని పైకి తెస్తాడు. - భాగవతం

**యజ్ఞవరాహావతారం :** చూ॥ వరాహావతారం.

**యజ్ఞవాహుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. - మహాభారతం

**యజ్ఞశతృవు :** ఖరుడను రాక్షసుడి సేనా నాయకుడు. రామలక్ష్మణులకు వ్యతిరేకంగా పోరాడాడు. - రామాయణం

**యజ్ఞశర్మ :** శివశర్మ కుమారుడు. పురాణ ప్రసిద్ధ పురుషుడు. - చూ॥ *శివశర్మ*

**యజ్ఞసేన :** చూ॥ పంచతంత్రం.

**యజ్ఞసేనుడు :** పాంచాల రాజు కుమారుడైన ద్రుపదుడు. - చూ॥ *ద్రుపదుడు*

**యజ్ఞసేని :** ద్రౌపది మరో పేరు. ద్రుపదుని పేరైన యజ్ఞసేనుడు కుమార్తె గనుక ఈపేరు. - మహాభారతం

**యజ్ఞుడు 1 :** మహావిష్ణువు యొక్క అవతారం. స్వాయంభవ మనువుకి ఇద్దరు కుమారులు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు మరి ముగ్గురు కుమార్తెలు. వారు ఆకూతి, ప్రసూతి, దేవహూతి. రుచి ప్రజాపతి ఆకూతిని వివాహమాడగా యజ్ఞుడు జన్మించాడు. - దేవీ భాగవతం

యజ్ఞుడికి దక్షిణ అనే సోదరి కవల. వారిద్దరూ వివాహం చేసుకోగా 12 మంది యామములను దేవతలు జన్మించారు. - విష్ణుపురాణం

యజ్ఞుని 12 మంది కుమారులు తోష, ప్రతోష, సంతోష, భద్ర, శాంతి, ఇఢాస్పతి, ఇధ్మ, కవి, విభు, ప్రఘ్న, సుదేవ, విరోచక. స్వాయంభవ మనువు కాలంలో యజ్ఞుడే ఇంద్రుడు. - భాగవతం

**యజ్ఞుడు 2 :** స్వాయంభవ మనువునకు దౌహిత్రుడు. ఇతడు రుచి ఇంట పెరిగెను. స్వాయంభవ మనువు అతని భార్యశతరూపయును సంసారమును విడచి సునందానదీతీరమున తపస్సు చేసుకొనుచుండగా రాక్షసులు వారిని తినరాగా యజ్ఞుడు ఆ రాక్షసులను సంహరించెను. - భాగవతం

**యతి 1 :** నహుషుని పెద్దకుమారుడు, యయాతికి పెద్దన్న. ఇతడు యోగియై అరణ్యంలో జీవించాడు. - మహాభారతం

**యతి 2 :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు. - మహాభారతం

**యతి 3 :** ఓ కాలం ప్రజలు. వీరు యజ్ఞాలకు వ్యతిరేకం. - ఋగ్వేదం

**యతినాధుడు :** శివుని అవతారం. అర్బుదారణ్యంలో నివసించే అటవికులను ఇతడు అనుగ్రహించగా వీరు తర్వాతి జన్మలో నలదమయంతులుగా జన్మించారు. - శివపురాణం

**యతిరాజు :** చూ॥ రామానుజాచార్యులు.

**యథావాసుడు :** ఓ ఋషి. ఇతడు వానప్రస్థానం నిష్ఠగా కొనసాగించి స్వర్గం చేరాడు. - మహాభారతం

**యదుగిరి :** మైసూరు దగ్గరలో గల ఓ విష్ణుక్షేత్రం. ఇప్పటి మేలుకోటకు ప్రాచీన నామం. దీన్ని యాదవగిరి అనికూడా అంటారు.

**యదువు 1 :** యాదవ వంశ సంస్థాపకుడు.

జన్మవృత్తాంతం : నహుషుని కుమారుల్లో ఒకడైన యయాతి కుమారుడు. యయాతికి ఇద్దరు భార్యలు శర్మిష్ఠ, దేవయాని. యయాతికి దేవయాని వల్ల ఇద్దరు కుమారులు యదువు, తుర్వసు. యదువు గొప్ప వీరుడే అయినా చతురుడు కాడు. తనతండ్రి ఆజ్ఞను పాటించక రాజ్యం కోల్పోయాడు. ఈ వంశంలో ఒక కుటుంబంలో కంసుడు, మరో కుటుంబంలో మరికొందరు జన్మించారు. ఈ వంశంలో జన్మించిన గొప్ప మహానుభావుల్లో శ్రీకృష్ణుడొకడు.

**యదువు 2 :** ఉపరిచర వసువు కుమారుడు. ఓటమి యెరుగని వీరుడు. - మహాభారతం

**యదువు 3 :** ఓ యాదవ రాజు. ఋగ్వేదంలో ఇతని ప్రస్తావన వుంది.

**యమకం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రాంతం. ఈ ప్రాంత ప్రజల్ని యమకులనే వారు. వీరు యుధిష్టరుని అశ్వమేధ యాగానికి కానుక లిచ్చారు. - మహాభారతం

**యమజిహ్వ :** ఓ వేశ్య. కథాసరిత్సాగరంలో ఈమెను గురించి ఓ కథ వుంది. చిత్రకూటమనే నగరంలో రత్నవర్మ అనే వైశ్యుడుండేవాడు. అతని కుమారుడు ఈశ్వరవర్మ. రత్నవర్మ తన కుమారుడు వేశ్యాలోలుడు కాకుండ వుండటానికి అతణ్ణి యమజిహ్వ వద్దకు

1000 నిఖాలు (నిఖా అనగా ఒక బంగారు నాణెం) ఇచ్చి ఉపాయాలు నేర్చుకోవడానికి పంపాడు.

అలా నేర్చుకున్న ఈశ్వరవర్మ తన తండ్రి వద్ద 5 కోట్ల నిఖాలు తీసుకొని మిత్రుడితో వ్యాపారం చేయ డానికి బయలుదేరి కాంచనపురం అనే నగరంలో సుందరి అనే వేశ్య వలలో పడి మొత్తం ధనం పోగొట్టు కొని ఇంటికి తిరిగి వచ్చాడు. తండ్రి కుమారుడిని యమజిహ్వ వద్దకు తీసుకొని వెళ్లి కథంతా వివరించగా ఆ ధనం తిరిగి వచ్చే ఉపాయం చెప్తానని చెప్పి తన వద్ద వున్న ఓ కోతిని ఈశ్వర వర్మతో పంపగా అది చేసిన మాయలు చూసి మరింత ఎక్కువ సంపాదించ వచ్చని సుందరి ఆశపడి ఈశ్వర వర్మవద్ద కాజేసిన సొమ్మేకాక తన వద్ద వున్న సొమ్ము కూడా ఇచ్చి ఆ కోతిని కొనుక్కుంది. ఈశ్వర వర్మ ఆ ధనంతో వెడలి పోయిన రెండు రోజులకు ఈ కోతి బంగారు నాణాలు కక్కే కోతి కాదని గమనించి దాన్ని కొట్టగా అది సుందరిని ఆమె తల్లిని కరవగా దాన్ని కొట్టి చంపారు. కాని సుందరి మాత్రం సంపదంతాపోయి నిరాశతో కృంగి పోయింది. - కథాసరిత్సాగరం

**యమదూత :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు. ఇతడు బ్రహ్మవాది. - మహాభారతం

**యమసభ :** యముని కొలువు. దీనిని విశ్వకర్మ నిర్మిం చాడు. దీని పొడవు వెడల్పులు 100 యోజనా లుంటాయి. ఇది సూర్యకాంతితో ప్రకాశిస్తున్నా వాతా వరణం సమతూకంలోనే వుంటుంది. విచారం, ముస లితనం, ఆకలి దప్పులు ఇక్కడ తెలియవు. ప్రాచీన కాలంలోని ప్రసిద్ధులైన మృతులు ఈ కొలువులో సభ్యులు. - మహాభారతం

**యమి :** సూర్యుని కుమార్తెలలో ఒకరు. విశ్వకర్మ కుమార్తె సంజ్ఞను సూర్యుడు వివాహమాడగా ముగ్గురు పిల్లలు జన్మించారు. వారు మను, యమ, యమి. - విష్ణుపురాణం

**యముడు :** మృత్యుదేవత. బ్రహ్మ జీవరాశులకు కాల నిర్ణయం చేస్తాడు. కాలం గడచిన జీవులను యముడు తన దూతలను పంపి వారి ఆత్మలను యమపురికి తెప్పించి పుణ్యాత్మలను స్వర్గానికి పాపాత్మలను నర కానికి పంపుతాడు.

*యముని వంశవృక్షం - జననం :* మహావిష్ణువు - బ్రహ్మ - మరీచి - కశ్యప - సూర్య - యమ. సూర్యుడు విశ్వకర్మ కుమార్తె సంజ్ఞను వివాహమాడగా వారికి మను, యమ, యమి జన్మించారు. ఒకసారి సంజ్ఞ సూర్యుని వేడిని భరించలేక తన దాసి ఛాయను సూర్యునికి సేవలందించమని వనాలకు వెళ్లగా ఆమెను సంజ్ఞ అనుకొని ఆమెను కూడి శనీశ్వరుడు, మను, తపతిలకు జన్మనిచ్చాడు. ఛాయ యముని శపించగా సూర్యుడు, యముడు ఆమె సంజ్ఞ కాదని గుర్తించారు, తర్వాత సంజ్ఞవల్ల సూర్యునికి అశ్వనీ కుమారులు, రేవంతుడు, భయుడు జన్మించారు. సునీత యముని కుమార్తె. ఆమె అంగుడిని వివాహ మాడగా వేణుడను రాజు జన్మించాడు.

- విష్ణుపురాణం

*దిక్పాలకుడు :* కుబేరుడు దిక్పాలకుడ్ని కావాలని బ్రహ్మను గూర్చి తపస్సుచేయగా బ్రహ్మ ఇంద్రుడ్ని తూర్పుకు, యముడ్ని దక్షిణానికి, వరుణుడిని పశ్చి మానికి, కుబేరుడిని ఉత్తరానికి దిక్పాలకుల్ని చేశాడు. అణిమాండ్యుడి శాపంవల్ల యముడు విదురుడుగా పునర్జన్మించాడు. - చూ॥ అణిమాండ్యుడు

*యముడు రుషియగుట :* రామావతారం ముగియ టంతో శ్రీరాముడిని వైకుంఠం తీసుకు వెళ్లడానికి అయోధ్యకు మునిరూపంలో వచ్చి లక్ష్మణుని అను మతితో శ్రీరాముని వద్దకు వెళ్తాడు. తను బయటకు వచ్చేవరకు ఇతరులెవ్వరూ లోనికి రాకూడదని షరతు విధిస్తాడు. రుషిరూపుడైన యముడు శ్రీరామునితో సంభాషిస్తుండగా దుర్వాసుడు శ్రీరాముని దర్శనార్థం రాగా దుర్వాసుని ఆగ్రహం తెలిసిన లక్ష్మణుడు దుర్వా సుని రాకను గూర్చి తెలియజేయడానికి లోపలికి వెళ్లగా వ్రతభంగం జరిగింది కనుక లక్ష్మణుడు దండనీయుడని రుషి పేర్కొనగా వశిష్ఠుడు దేశ బహి ష్కరణ కూడా మరణంతో సమానమనగా లక్ష్మణుడు బయటకువెళ్లి సరయూనదిలో మునిగి తనువుచా లించగా శ్రీరాముడు కూడా సరయూనదిలో మునిగి మరణించగా వారి ఆత్మలను యముడు వైకుంఠం చేర్చుతాడు. - ఉత్తర రామాయణం

మరుత్తుని యజ్ఞానికి వచ్చిన యముడు రావణుడికి భయపడి కాకిరూపంలో పారిపోతాడు.

- ఉత్తర రామాయణం

*యముడులేని కాలం :* కృత యుగంలో ఒకసారి యముడు లేకపోగా జీవరాశుల భారంతో భూమి సముద్రంలో మునిగిపోగా మహావిష్ణువు వరాహంగా మారి భూమిని పైకెత్తాడు. మరొకసారి మార్కండే యుడిని 16 ఏండ్ల ప్రాయంలో తీసుకుపోబోగా అతడు శివుని వెనుక దాక్కొనెను. యముడు తన పాశాన్ని విసరగా అది శివుని కంఠానికి చుట్టుకోగా శివుని మూడోకంటి జ్వాలకు భస్మమయ్యాడు, మూడో సారి పాంచాలి పూర్వజన్మ అయిన నీలాయని యజ్ఞం చేసినపుడు యముడు పౌరోహిత్యం చేశాడు. ఆ సమయంలోకూడా తన ధర్మాన్ని నిర్వర్తించలేదు.

యముడు సత్యవాణుడి ప్రాణాలను అతని సతి పతిభక్తికి మెచ్చి తిరిగి ఇచ్చాడు.

– *చూ॥ సావిత్రి, సత్యవాణుడు*

ఇతడు మరణించిన వారి పాపాలు వాటికి తగిన ప్రమాణంలో వివిధ రకాలలో శిక్షింపజేస్తాడు. నర కాలు 28. రావణుడు ఇతర దేవతలపై వలె యము డిపైనా దండెత్తాడు. ఏడురోజుల భీకర యుద్ధం తర్వాత బ్రహ్మ ప్రత్యక్షమై యముడ్ని యుద్ధం నుండి వెనక్కు పంపగా రావణుడు జయించినట్లు ప్రకటించు కున్నాడు. యముని భార్యపేరు ధూమోర్ణ.

**యమునాతీర్థం :** సరస్వతీ నదీతీరంలోని ఓ పుణ్యస్థలం. అదితి కుమారుడైన వరుణుడు ఇచ్చట అశ్వమేధ యాగం చేశాడు. – *మహాభారతం*

**యమునా ద్వీపం :** యమునా నదిలోని ఓ ద్వీపం. ఇచ్చట పరాశర సత్యవతిలకు వ్యాసుడు జన్మించాడు. – *మహాభారతం*

**యమునా ప్రభవం :** ఇదో పుణ్య స్థలం. ఇచ్చట స్నానం చేస్తే అశ్వమేధ యాగ ఫలితమే గాక స్వర్గం చేరతారు. – *మహాభారతం*

**యములు :** స్వాయంభవ మనువు యొక్క ఓ ప్రత్యేక దేవతలు. – *చూ॥ మన్వంతరం*

**యయాతి :** చంద్రవంశపు రాజుల్లో ప్రముఖుడు.

*వంశవృక్షం :* బ్రహ్మ – అత్రి – చంద్ర – బుధ – పురూరవసు – అయుసు – నహుషుడు – యయాతి.

యయాతికి ఇద్దరు భార్యలు. దేవయాని, శర్మిష్ఠ. దేవయానివల్ల ఇద్దరు పుత్రులు. వారు యదువు, తుర్వసుడు, శర్మిష్ఠ వల్ల ముగ్గురు పుత్రులు. ద్రుహ్యా, అనుద్రుహ్యా, పురువు.

*యయాతి వివాహం :* యయాతి శుక్రాచార్యుని కుమార్తె దేవయానిని, వృషపర్వుని భార్య శర్మిష్ఠను వివాహమాడాడు.

*యయాతి వివాహ కథ :* ఒకప్పుడు దేవాసురులకు వైరం తీవ్రంగా వుండేది. విజయం కొరకు అసురులు శుక్రాచార్యుడ్ని, దేవతలు బృహస్పతిని గురువుగా ఎంచుకున్నారు. దేవతలు అసురుల్ని చంపినా శుక్రా చార్యుని మంత్రశక్తివల్ల (మృతసంజీవిని) తిరిగి బ్రతికే వారు. ఈ మంత్రశక్తి దేవతలకు తెలియదు. కచుడనే అందమైన యువకుణ్ణి ఆ జ్ఞాన సముపార్జనకు శుక్రా చార్యుని వద్దకు పంపగా అతడు శుక్రాచార్యుని వద్ద శిష్యరికం చేస్తూనే అతని కుమార్తెతో ప్రేమలోపడ్డాడు. మృత సంజీవిని విద్య నేర్చుకొన్న తర్వాత అతడు దేవయానిని వివాహం చేసుకోవడానికి నిరాకరించగా కచుడు నేర్చుకున్న మృతసంజీవని విద్య ఉపయోగ పడదని దేవయాని శపించగా, మునుల కుమారులు దేవయానిని వివాహమాడరని కచుడు శపించాడు. దైత్యరాజైన వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ. దేవయాని స్నేహితురాళ్లు. వీరిద్దరు ఓ కొలనులో స్నానం చేసి బయటకు వచ్చేసరికి దేవేంద్రుని మాయవల్ల అందరి బట్టలు గుట్టలుగా పడగా దేవయాని, శర్మిష్ఠల దుస్తులు ఒకరి ఒకరు వేసుకొని అకారణంగా పోట్లాడుకొనగా శర్మిష్ఠ దేవయానిని ఓ నీరు లేని బావిలోకి తోసి వేసింది. అప్పుడటుగా వస్తున్న యయాతి ఆమెను రక్షించి ఇంటికి చేర్చాడు. ఈ విషయాన్ని దేవయాని తన తండ్రి శుక్రాచార్యునికి చెప్పగా అతడు వృష పర్వుడిపై ఆగ్రహించగా వృషపర్వుడు శుక్రాచార్యుని మన్నించమని అతడు చెప్పిన శిక్షను అనుభ విస్తాననగా శర్మిష్ట 1000 దాసీలతో తన కుమార్తెకు సేవకురాళ్లుగా వుండాలని షరతు విధించాడు. అలా శర్మిష్ఠ దేవయానికి సేవకురాలయ్యింది. ఆ తర్వాత కొంతకాలానికి వేటకు వచ్చిన యయాతి సేవకు రాళ్లతో గడుపుతున్న దేవయానిని చూశాడు. దేవ యాని ఇతణ్ణి ప్రేమిం చింది. యయాతి శుక్రాచార్యుని అనుమతిలేనిదే వివాహం చేసుకోలేననగా శుక్రా చార్యుడు దానికి అనుమతించగా ఆమెను వివాహ

మాడి ఆమెతో పాటు ఆమె సేవకురాళ్ళను కూడా తన భవంతికి తీసుకు వెళ్లాడు. – మహాభారతం

*గృహస్త జీవితం :* దేవయాని యయాతి భవనంలో కలసి జీవించగా శర్మిష్ఠ అశోక వనంలో జీవించేది. దేవయానికి ఓ పుత్రుడు జన్మించాడు. శర్మిష్ఠకు మాత్రేచ్ఛ కల్గి యయాతిని కోరగా ఆమెతో కూడా అతడు సంసార సుఖం అనుభవించగా ఆమెకు ఓ పుత్రుడు జన్మించాడు. అలా దేవయానికి ఇద్దరు పుత్రులు, శర్మిష్టకు ముగ్గురు పుత్రులు జన్మించారు. శర్మిష్టకు జన్మించిన వారు కూడా యయాతి పుత్రులేనని తెలిసి దేవయాని తన తండ్రితో చెప్పగా అతడు యయాతిని వృద్ధాప్యం కల్గునట్లు శపించాడు. యయాతికి సంసార సుఖేచ్ఛ నశించక శుక్రుని ప్రార్థించగా నీ ముసలి తనం నీ కుమారులెవరైనా స్వీకరిస్తే వారి యవ్వనం నీకు వస్తుందని శాప విమోచన చేశాడు. యయాతి తన కుమారులైన యదు, తుర్వాసు, ద్రుహ్యు, అను ద్రుహ్యులను తన కోర్కె తీర్చమని కోరగా వారు నిరాక రించారు. అందుకు వారిని వివిధ రకాలుగా శపిం చాడు. పురువు మాత్రం తన అంగీకారాన్ని తెలియ జేసి యయాతి ముసలి తనాన్ని స్వీకరించి తన యవ్వ నాన్ని తండ్రికివ్వగా 1000 సంవత్సరాలు రాజ్యాధి కారం అనుభవించిన తర్వాత తన కుమారుడు పురు వుకి తిరిగి యవ్వనాన్ని, రాజ్యాన్ని అప్పగించి వాన ప్రస్థానం స్వీకరించి తదుపరి స్వర్గలోకము చేరెను. స్వర్గలోకమున ఇంద్రుడితని తపస్సును మెచ్చుకొనెను. ఇతడు గర్వించి నా తపస్సునకు ఇచ్చటి వారెవ్వరునూ సాటిరారని పలుకగా ఇంద్రుడు ఇతనిని స్వర్గ లోక భ్రష్టునిగావించెను. ఇతడు తిరిగి భూలోకమునకు వెళ్లుటకు ఇష్టపడక ఇంద్రుని కోరి అంతరిక్షమున యుండునట్లు కోరుకొని అచట తనదౌహిత్రులతో కొంతకాలం సాంగత్యము చేసి ఊర్ధ్వలోకమునకు పోయెను. – మహాభారతం

**యయాతి పతనం :** ఇదొక పుణ్యస్థలం. దీన్ని సందర్శిస్తే అశ్వమేధ యజ్ఞ ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**యవక్రీతుడు 1 :** అర్వావసువు.

**యవక్రీతుడు 2 :** అంగిరసుని కుమారుడు. తూర్పు భూమిని సమర్థించాడు. – మహాభారతం

**యవక్ష :** భరత వర్షంలో ఓ ప్రసిద్ధనది. – మహాభారతం

**యవనం :** ఒక ప్రాచీన దేశం. ఇప్పటి అరేబియా ప్రాంతం.

**యవనాశ్వుడు :** విశ్వగంధుడి కొడుకైన చంద్రుడి కుమా రుడు. ఇతడి కొడుకు శవస్తుడు. – భాగవతం

**యవసు :** ప్లక్షద్వీపంలోని 7 విభాగాలలో ఒకటి.

**యవీనరుడు :** పూరు వంశపు రాజు. బాహ్యాసుని 5 గురు కుమారుల్లో ఒకడు. వీరైదుగురు తర్వాతి కాలంలో పాంచాలురుగా ప్రసిద్ధి చెందారు. – అగ్నిపురాణం

**యశఃకేతువు :** శోభవతి అను నగర రాజు. కథా సరిత్సాగరంలో వెతలుడు చెప్పిన 6వ కథలో ముఖ్య పాత్రధారి. – కథాసరిత్సాగరం

**యశస్విని 1 :** సుబ్రహ్మణ్యస్వామి సేవిక. – మహాభారతం

**యశస్విని 2 :** పాంచాలికి ఓ సోదరి. – మహాభారతం

**యశస్సు :** కల్కి తండ్రి. – అగ్నిపురాణం

**యశోద :** శ్రీకృష్ణుని పెంచిన తల్లి. అష్టావసువుల్లో ఒకడైన ద్రోణునిపై బ్రహ్మ కోపించి ఆ దంపతులను పశువుల భూమిపై జన్మించమని శపిస్తాడు. వారు కన్నీటితో బ్రహ్మను వేడుకొని అప్పుడు మాకు విష్ణు దర్శనం కావాలని వేడుకొనగా అనుగ్రహిస్తాడు. వారే ద్రోణుడు నందగోపుడుగా, అతని భార్య యశోదగా జన్మిస్తారు. – భాగవతం

**యశోధర :** త్రిగర్త రాజకుమార్తె. పూరు వంశరాజైన హస్తి ఇతడిని వివాహమాడాడు. వికంతుడు వీరి కుమారుడు. – మహాభారతం

**యశోధరుడు 1 :** శ్రీకృష్ణునికి యశోధర వల్ల జన్మించిన కుమారుడు. – మహాభారతం

**యశోధరుడు 2 :** పాండవుల పక్షాన పోరాడిన దుర్ము ఖుని కుమారుడు. – మహాభారతం

**యశోభద్రుడు :** మనోభద్రుడను రాజు యొక్క కుమా రుడు. ఇతడు పూర్వ జన్మలో గంగా నదిలో స్నానం చేయడం వల్ల రాజవంశంలో జన్మించాడు. – మహాభారతం

**యశోమతి/యశోవతి :** ఇశానుడి నగరం పేరు. ఇశానుడు ఉత్తర భారత తూర్పు ప్రాంతాన గల ఈ నగరంలో వుండేవాడు. – దేవీభాగవతం

**యశోవతి :** ఓ రాజకుమారి. చూ॥ ఏకవీర.

**యాజుడు 1 :** ఇతడొక ముని. ద్రుపదుడి పుత్రకామేష్టి యాగం నిర్వహించాడు. ఇతడి అనుగ్రహం వల్లే యజ్ఞగుండంలో ధృష్టద్యుమ్నుడు, ద్రౌపది జన్మించారు. – మహాభారతం

**యాజుడు 2 :** కశ్యప గోత్రంలోని ఒక రుషి.

**యాజ్ఞవల్క్యం :** అష్టాదశ స్మృతుల్లో ఇదొకటి. దీనికి విజ్ఞానేశ్వర యోగి 'మితాక్షర' మనే పేరుతో వ్యాఖ్యానం రాశాడు. అందువల్ల దీన్ని విజ్ఞానేశ్వరీయం అని అంటారు.

**యాజ్ఞవల్క్యుడు :** ప్రాచీన రుషి. ఓ గొప్ప పండితుడు. ఇతడు ఎక్కువ కాలం జనకుని కొలువులో వున్నాడు. జనకుని పురోహితుడు కూడా. మహాభారతం ఇతడు విశ్వామిత్రుని కుమారుడని, బ్రహ్మవాది అని పేర్కొంది. జనకుడొకసారి యాగం చేసి దానం గోవులు ఎవరికి వ్వాలో తెలియక మునులందర్ని పిలచి మీలో ఉత్తము లెవరో వారు తీసుకెళ్లమనగా ఇతడు తన శిష్యుల్ని పిలిచి ఆ గోవుల్ని తన ఇంటికి తీసుకెళ్ళమనగా తక్కిన రుషులు ఎన్నో ప్రశ్నలు వేయగా వాటికి సమాధానం చెప్పి తనే ఉత్తముడుగా నిరూపించుకున్నాడు. కాత్యాయని, మైత్రేయ ఇతని భార్యలు. ఇతడి శిష్యుల్ని వాజపేయులంటారు. ఇతడు రచించిన గ్రంథం 'మితాక్షర'. సూర్యుడు, వైశంపాయనుడు ఇతని గురువులు. – మహాభారతం

**యాతినాథ :** శివుని అవతారం. ఆసుకుడను అటవికుడు, అతని భార్య యాతినాధుని అనుగ్రహం వల్ల తర్వాతి జన్మలో నలదమయంతులుగా జన్మించారు. – శివపురాణం

**యాతుకర్ణుడు :** దేవగురువు. – చూ॥ గురుపరంపర

**యాతుధాని :** వృషాదర్భియాగం చేసినప్పుడు జన్మించిన రాక్షసి. రాజు సూచనపై అడవికి వెళ్లి సప్తర్షులైన అత్రి, వసిష్ఠ, కశ్యప, విశ్వామిత్ర, గౌతమ, భరద్వాజ, శునశ్శఖ మహర్షులను చంపదలచింది. ఓ నీటి గుండంలో వీరు స్నానం చేయడానికి రాగా వారి పేర్లు, వారి అర్థం చెప్పిన తర్వాతే ఆ నీటి గుండం లోకి ప్రవేశమిస్తాననగా మొదటి ఆరుగురు అలాగే దిగారు. శునశ్శఖుడు అందుకు నిరాకరించగా యాతుధాని అతణ్ణి నిర్బంధించబోగా తన త్రిదం డంతో కొట్టగా అది మరణించింది. ఇంద్రుడే శునశ్శ ఖుడి రూపం. – మహాభారతం

**యాతుధానుడు :** కాశ్యప సురసలకు జన్మించినవాడు. ఈ సంతతి రాక్షసుల్ని యాతుధానవులంటారు.

**యాదవం :** చూ॥ యాదవులు.

**యాదవకుల ముసలం :** శ్రీకృష్ణుని చూచుటకు కణ్వుడు, విశ్వామిత్రుడు మొదలగు మునులు ద్వారకకు రాగా కొందరు యాదవులు సాంబునకు స్త్రీ వేషము వేసి వారికి జూపి ఈమెకెవరు జన్మింతురో చెప్పుడని ఎగ తాళి చేసిరి. వారు ఇతడు సాంబుడని గ్రహించి ఇతనికి రోకలి పుట్టును దాని వలన మీ వినాశనము జరుగునని శపించిరి. శ్రీకృష్ణునికిది యాదవులు తెలియజేయగా శ్రీకృష్ణుడు యాదవ వినాశనం దాపు రించెనని గ్రహించి ఆ రోకలిని పొడిచేసి సము ద్రమున కలిపి రండని చెప్పగా వారట్లు చేయగా ఓ చిన్న ముక్క ఆ తీరమున మిగిలిపోయెను. యాద వులు మద్యము సేవించి ఒకరినొకరు కొట్టు కొనిరి. ఆ ముక్క రోకలిగా మారగా దానితో ఒకరి నొకరు బాదు కొని మరణించిరి.

**యాదవి :** సగరుడి తల్లి. – చూ॥ సగరుడు

**యాదవులు :** యదు వంశస్థులు. వీరిలో అనేక శాఖల వారున్నారు. సహస్రజిత్తు నుండి హేహయ వంశం మొదలయ్యింది. వీరి ముఖ్య పట్టణం మహిష్మతి. ఈ వంశంలో కార్తవీర్యార్జునుడు ముఖ్యుడు. క్రోష్టువు వంశం, చేది వంశం, భోజ వంశం, అంధక, వృష్ణి వంశాలన్నీ యాదవ వంశ శాఖలే.

**యానం :** రాజ సుగుణాలలో ఒకటి. సంధి, విగ్రహం వంటివి.

**యామి / యమి :** ధర్మదేవుని భార్యల్లో ఒకరు. ధర్మ దేవునికి 10 మంది భార్యలు. వారు అరుంధతి, వసు, యామి, లంభ, భాను, మరుత్వతి, సంకల్ప, ముహూర్త, సాధ్య మరియు విశ్వ.

**యామిని :** దక్ష ప్రజాపతి కుమార్తెలలో ఒకరు. ఈమెను కశ్యపుడు వివాహమాడాడు. – భాగవతం

**యామినీపూర్ణతిలకం :** మదనాభిరాముడనే రాజు కుమార్తె. ఈమెకు బిల్హణుడనే గురువును కుదిర్చి వారు ప్రేమలో

పడతారని తలచి గురువు గుడ్డివాడని కుమార్తెకు, కుమార్తె కుష్ఠివ్యాధి గ్రస్తురాలని బిల్హణుడికి చెప్పాడు. తర్వాత వారు నిజం తెలుసుకొని ప్రేమించు కుంటారు. రాజుకూడా విషయం తెలుసుకొని వారికి వివాహం చేస్తాడు.

**యాముసం 1 :** ప్రాచీన భారతదేశంలో ఓ పట్టణం. – మహాభారతం

**యాముసం 2 :** గంగా యమునల మధ్యగల పర్వతం. – మహాభారతం

**యాములు :** మహావిష్ణువు అవతారమైన యజ్ఞుని కుమారులు. వీరు 12 మంది. స్వాయంభవ మన్వంతరంలో వీరు దేవతలు.

**యాయాతం :** భారతదేశంలోని ఓ పుణ్యస్థలం. ఇక్కడ యయాతి యాగం చేశాడు. – మహాభారతం

**యాయావరులు :** బ్రాహ్మణులలో ఒక తెగ. వీరు ఎప్పుడూ సంచరిస్తూ జీవిస్తారు. ఇందులో ప్రముఖుడు జరత్కారుడు. – మహాభారతం

**యాస్కుడు :** నిరుక్తాన్ని రచించిన సంస్కృత వ్యాకరణ పండితుడు. – మహాభారతం

**యుక్తాశ్వుడు :** రుషి, వేదపండితుడు. ఒకసారి ఇద్దరు శిశువుల్ని వధించగా వేదజ్ఞానం పోతుంది. తిరిగి వేదజ్ఞానం పొందడానికి తపస్సు చేస్తాడు. – పంచవింశ బ్రాహ్మణం

**యుగంధరుడు 1 :** పాండవుల పక్షాన పోరాడిన యోధుడు. ద్రోణుడితణ్ణి వధిస్తాడు. – మహాభారతం

**యుగంధరుడు 2 :** వత్సరాజు మంత్రి.

**యుగంధరుడు 3 :** ప్రతాపరుద్రుడి మంత్రి.

**యుగంధరులు :** యుగంధర పర్వతం దగ్గర నివసించే ప్రజలు. వీరు గాడిద, ఒంటె పాలు త్రాగుతారు. – మహాభారతం

**యుగపుడు :** ఒక దేవ గాంధర్వుడు. అర్జునుని జన్మదిన వేడుకల్లో పాల్గొన్నాడు. – మహాభారతం

**యుధాజిత్తు 1 :** కేకయ రాజు. ఇతడు దశరథుని భార్య కైకేయి సోదరుడు. భరతుని మామ. భరతుడు తన మేనమామ యుధాజిత్తు ఇంటివద్ద వుండగనే దశరథుడు మరణించాడు. – రామాయణం

**యుధాజితుడు / యుధాజిత్తు 2 :** అవంతీనగర రాజు.

**యుధామన్యుడు :** ద్రుపదుని కొడుకు. కురుక్షేత్ర యుద్ధ చరమాంకంలో శిబిరంలో నిద్రిస్తుండగా అశ్వత్థామ ఇతణ్ణి వధించాడు. – మహాభారతం

**యుద్ధం :** ప్రాచీన కాలంలో యుద్ధాన్ని ఓ రాజ ధర్మంగా గుర్తించేవారు. దీనికో న్యాయం వుంది. ఈ న్యాయానికి లోబడి చేసేదే ధర్మయుద్ధం. శరణు వేడిన వారిని, నిద్రించే వారిని, నగ్నంగా వున్నవారిని, వేరేవారితో యుద్ధంలో పాల్గొన్నవాడిని, నిరాయుధుల్ని చంపరాదు. – మనుస్మృతి

**యుయుత్సుడు :** సాత్యకి మరోపేరు. – చూ॥ సాత్యకి

**యుయుధనుడు :** సాత్యకి పేరు. – చూ॥ సాత్యకి

**యువకేతుడు :** ఓ రాజర్షి. ఇతని తేజస్సు జలంలో పడగా దాన్నో కన్య తాగుతుంది. ఆమె గర్భవతి అవుతుంది. – బ్రహ్మాండపురాణం

**యువనాశ్వుడు 1 :** ఇక్ష్వాకు వంశ రాజు.
*వంశవృక్షం :* వైవస్వత మనువు కుమారుడైన ఇక్ష్వాకు వంశంలో జన్మించిన ప్రసేనజిత్తు కుమారుడు. ఇతని కుమారుడు మాంధాత. ఇతడు యెన్నో యాగాలు చేశాడు. పుత్రార్థియై యాగం చేస్తూ దాహార్తియై తెలియక మంత్రజలం సేవించి గర్భవంతుడై మాంధాతకు జన్మనిచ్చాడు. ఇతడు రైవతుడి నుండి గొప్ప ఖడ్గాన్ని పొంది దాన్ని రఘువుకిచ్చాడు. ఇతడు మాంసాహారాన్ని త్యజించాడు. – మహాభారతం

**యువనాశ్వుడు 2 :** ఇక్ష్వాకు వంశంలో విశ్వగాశ్వుని మనుమడు. అద్రి కుమారుడు. శ్రావుడను రాజుకు తండ్రి. – మహాభారతం

**యువనాశ్వుడు 3 :** వృషదర్భుని కుమారుడు. నగలు, స్త్రీలు, గృహాలు, దానమిచ్చి స్వర్గం పొందాడు. – మహాభారతం

**యువనాశ్వుడు 4 :** ఇక్ష్వాకు వంశంలో ప్రసిద్ధుడైన మాంధాత మనుమడు. – రుగ్వేదం

**యూధిక :** ధర్మరాజు భార్య. – మహాభారతం

**యూపాక్షుడు 1 :** రావణుని సైన్యాధిపతుల్లో ఒకడు. రామరావణ యుద్ధంలో హనుమంతుడితణ్ణి వధించాడు. – రామాయణం

**యూపాక్షుడు 2 :** ఓ రాక్షసుడు. రామరావణ యుద్ధంలో మైంధుడను వానరుడితణ్ణి వధించాడు.
– రామాయణం

**యోగమాయదేవి :** యోగ స్థితిలోని మాయ రూపం.
– *దేవీ భాగవతం*

**యోగము :** జీవాత్మ పరమాత్మలో కలియుట యోగ.
– *అగ్నిపురాణం*

నిత్య జీవితంలో యోగ రెండు విధాలుగా విభజించ వచ్చు. ఒకటి మన శరీర అవయవాలను మన ఆధీనంలో వుంచుకోవడానికి చేసే వివిధ ఆసనములు. దీనిని హఠయోగం అంటారు. మన ఇంద్రియాలను మన ఆధీనంలో వుంచుకోవడాన్ని రాజయోగం అన బడును. హఠ, రాజయోగాల కలయికే యోగం.

**యోగవతి :** మేన మూడవ కుమార్తె. జైగీషవ్యుడి భార్య.
– *పద్మపురాణం*

**యోగసిద్ధి :** అంగిరసుడి కుమార్తె. బృహస్పతి చెల్లెలు. ప్రభాసుడను వసువు భార్య. ఈమె కుమారుడు విశ్వకర్మ.
– *భాగవతం*

**యోగీశ్వరులు :** యోగులలో ఓ తెగ. కవి, హరి, అంత రీక్ష, ప్రయద్ధ, పిప్పలాయన, అవిర్హోత్ర, ద్రుమిళ, చమిస, ఖరభజనులు ఈ తెగలోవారు. వీరు రుషభుని కుమారులు. వీరు దిగంబరులుగా సంచారం చేస్తారు. నిమి చేసిన యజ్ఞంలో పాల్గొని అతనికి భాగవత ధర్మాన్ని బోధించారు. – *భాగవతం*

**యోగుడు :** ధర్మశ్రద్ధల కుమారుడు. – *భాగవతం*

**యోజన గంధి :** చూ॥ సత్యవతి.

**యోతిమత్తకుడు :** ప్రాచీన భారతదేశపు ఒక రాజు. పాండవులితణ్ని యుద్ధంలో పాల్గొనడానికి ఆహ్వాని స్తారు. – *మహాభారతం.*

**యౌధ్యం :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజ్యం. కర్ణుడు దీన్ని జయించాడు. – *మహాభారతం*

**యోనితీర్థం :** ఉత్తర భారతదేశంలో ఓ పుణ్యస్థలం. ఇక్కడ స్నానం చేస్తే స్ఫురద్రూపియై 1000 గోవుల్ని బహుమతిగా పొందగలడు. – *మహాభారతం*

**యోనిద్వారం :** ఉదయ పర్వతంపైన ఓ పుణ్యస్థలం.
– *మహాభారతం*

**యౌగంధరాయణుడు :** పురాణ ప్రసిద్ధుడైన ఉదయన రాజకుమారుడి మంత్రి.

**యౌధేయుడు 1 :** ధర్మజుని కుమారుల్లో ఒకడు. శిబి ప్రాంత రాజైన గోవాసనుని కుమార్తె దేవికాదేవి వల్ల ధర్మజునికి జన్మించిన పుత్రుడు.

**యౌధేయుడు 2 :** ఒక రాజు. ప్రతివింధ్యుని కుమారుడు.
– *మత్స్యపురాణం*

**యౌధేయుడు 3 :** యోధేయ దేశపు వీరుడు. ఇతడు ధర్మజుని రాజసూయ యాగంలో పాల్గొన్నాడు.
– *మహాభారతం*

**యౌనులు :** మహారాష్ట్ర ప్రాంతంలో ఓ కులస్థులు. వీరు చండాలురు. పక్షులు జంతువులవలే అజ్ఞానులు.
– *మహాభారతం*

**యౌయుధాని :** యాదవరాజైన సాత్యకి కుమారుడు. యాదవ కులం నశించినపుడు తప్పించుకొని సరస్వతీ నదీతీర ప్రాంతాన్ని ధర్మజుని సహాయంతో పాలించాడు.
– *మహాభారతం*

**యౌవనాశ్వుడు :** మాంధాత తండ్రి. – చూ॥ *మాంధాత*

**యౌవనుడు :** ప్రియవ్రతుడి వంశస్థుడు. ధీమంతుడి కొడుకు.



**ర :** ఈ అక్షరానికి అర్థం నిప్పు, బలం, ఇంద్రుడు.
– *అగ్నిపురాణం*

**రక్షసులు :** అసురుల్లో ఓ ప్రత్యేక తెగ. కశ్యప ప్రజాపతికి మునివల్ల యక్షులు, రక్షసులు జన్మించారు.
– *అగ్నిపురాణం*

**రక్తజుడు :** అర్జునుని పూర్వజన్మలోని పుట్టుక. శివుడు బ్రహ్మ 5వ తలను పెకలించగా బ్రహ్మ నుదుటినుండి ఆగ్రహం వల్ల చెమట ఉద్భవించగా దాని నుండి వెయ్యి కవచాలతో, విల్లమ్ములతో శ్వేదజుడు జన్మించి అతడు శివుని వెంటపడగా శివుడు తన కపాలంతో విష్ణువు వద్దకు పరుగెత్తాడు. విష్ణువు తన చేతిని ఆ కపాలంలో వుంచగా అందుండి రక్తం స్రవించింది. ఆ రక్తం నుండి రక్తజుడు జన్మించాడు. రక్తజుడు, శ్వేదజుడు రెండేళ్లు యుద్ధం చేశారు. వారిని శాంతింపచేసి మీరు

ద్వాపర కలియుగాలలో జన్మించి మీలో వీరులెవ్వరో తేల్చుకొమ్మని యుద్ధాన్ని ఆపుతారు. మహావిష్ణువు నరుడుగా జన్మించే రక్తజుడికి తన సహకారం వుంటుందని అభయమిస్తాడు. ఆ నరుడే అర్జునుడు. మహావిష్ణువు కృష్ణుడుగా స్వేదజుడు కర్ణుడుగా జన్మిస్తారు. – పద్మపురాణం

**రక్తబీజుడు :** మహిషాసురుని తండ్రియైన రంభుని పునర్జన్మే రక్తబీజుడు. రంభుడు మరణించగా చితిపేర్చి అతనికగ్నికార్యము చేసి తానును చితి నెక్కెను. అందుండి రౌద్రాకారుడగు ఒక పురుషుడు జన్మించెను. అతడే రక్తబీజుడు. ఇతడు శంభు నికుంభులకు సేనాపతియై దేవితో యుద్ధము చేసెను. ఇతడి శరీరము నుండి రక్తబిందువులు నేలపై పడి ప్రతి బిందువు నుండి ధనుజులు జన్మించుచుండిరి. ఇతనిని చంపుట కష్టమై దేవి చాముండిని సృష్టించగా ఆమె రక్తబిందువులను త్రాగుచూ అవి క్రిందపడ కుండా చేయగా దేవి రక్తబీజుణ్ని వధించెను. – దేవీభాగవతం

**రక్తాంగం :** ధ్రుతరాష్ట్రుని వంశంలో జన్మించిన ఓ నాగు. ఇది జనమేజయుని సర్పయాగంలో మరణించింది. – మహాభారతం

**రక్షిత :** కశ్యప ప్రజాపతికి ప్రధ వల్ల జన్మించిన కూతురు. ఒక అప్సరస. – మహాభారతం

**రక్తుడు :** మహిషాసురుని కుమారుల్లో ఒకడు. ఇతని కుమారులు బల, అతిబలులు. ఇతని క్రింద ధూమ్రాక్షుని వంటి సైన్యాధిపతులు, ఒక్కొక్క అధిపతి క్రింద 1000 అక్షౌహిణీల సైన్యం వుంది. – మహాభారతం

**రక్షోభిక్షం :** ఓ నరకం. – చూ॥ నరకాలు

**రక్షోవాహం :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజ్యం. ఇచ్చటి క్షత్రియుల్ని పరశురాముడు నిర్వీర్యం చేశాడు. – మహాభారతం

**రఘువు :** సూర్య వంశపు రాజులలో ప్రసిద్ధుడు. దిలీపుని కుమారుడు. ఇతడి వంశంలో జన్మించిన వారే దశరధుడు, శ్రీరాముడు. ఇతడు ప్రాచీన భారతదేశపు రాజులలో ప్రసిద్ధుడు. మహాభారత కాలంలో గోగ్రహణ సమయంలో అర్జునుడికి, కౌరవులకు జరిగిన యుద్ధాన్ని ఇంద్రుడితో కలసి వీక్షించాడు. ఇతడు యువనాశ్వుడి నుండి పొందిన ఖడ్గాన్ని హరిణాశ్వుడికి బహుమతిగా ఇచ్చాడు. యజ్ఞమును చేసినపుడు ఆ అశ్వమును ఇంద్రుడు అపహరించగా రఘువు అతనితో పోరగా ఇంద్రుడు మెచ్చుకొని వరములిచ్చెను. ధనార్థియై వచ్చిన కౌత్సునికి ధనము లేక కుబేరుని వద్ద తెచ్చి దానము చేసెను. ఇతని కుమారుడు అజుడు.

**రజతనాభుడు :** ఒక యక్షుడు. అనుహ్రాద కుమార్తె మణివరను వివాహమాడగా మణివర, మణిభద్రులు జన్మించారు.

**రజస్సు :** అనేనస్సు వంశస్థుడు. భార్య త్వష్ట.

**రజి :** పూరు వంశంలో ఓ ప్రసిద్ధ రాజు. ఆయుష్షు స్వర్భానులకు కలిగిన ఐదుగురు కుమారుల్లో ఒకడు. ఇతరులు నహుషుడు, క్షత్రవృద్ధుడు, రంభుడు, అనేనసుడు. – మహాభారతం

దేవాసుర యుద్ధంలో దేవతలు ఓడిపోతారని భయపడి రజిని తమతరపున యుద్ధం చేయమని అందుకు ప్రతిఫలంగా ఇంద్రపదవి నలంకరించమని కోరగా ఇతడు దేవతల తరపున యుద్ధం చేసి ఇంద్ర పదవి చేపట్టాడు. ఇతనికి వేలకొలది పుత్రులు జన్మించినా ఎవ్వరూ ఇంతటి శక్తివంతులు, ప్రసిద్ధులు కాలేకపోవుటచే దేవగురువైన బృహస్పతి సూచనపై వారందరిని ఇంద్రుడే సంహరించి తిరిగి తన పదవిని చేపట్టాడు. – *భాగవతం* – వాయుపురాణం

**రజుడు 1 :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. – మహాభారతం

**రజుడు 2 :** వశిష్ఠ ఊర్జలకు జన్మించిన పుత్రుడు. ఒక రుషి.

**రజుకంఠుడు :** ఓ వ్యాకరణ కర్త. వేద జ్ఞాన సంపన్నుడైన మహర్షి. – అష్టాధ్యాయి

**రణుడు :** ఓ రాక్షసుడు. హిరణ్యాక్షుడికి దేవతలకు జరిగిన యుద్ధంలో వాయుదేవుడితణ్ణి వధించాడు. – పద్మపురాణం

**రణోత్కటుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. – మహాభారతం

**రత :** దక్షప్రజాపతి కుమార్తె. ఈమెను ధర్ముడు వివాహమాడగా అహరుడను వసువు జన్మించాడు. – మహాభారతం

**రతి 1 :** కామదేవుని భార్య. కొన్ని పురాణాలు కాముడు బ్రహ్మపుత్రుడైన ధర్ముని కుమారుడని చెప్తున్నాయి.

జన్మం : బ్రహ్మ మొదట 10 మంది ప్రజాపతులను సృష్టించి తర్వాత ఓ అందాల స్త్రీ సంధ్యను సృష్టించాడు. ఆమె జన్మించగానే బ్రహ్మ ఉలిక్కి పడ్డాడు. ప్రజాపతులు స్పందించారు. బ్రహ్మ కొలువు కలగాపులగంగా వుండగా బ్రహ్మ మనసునుండి ఓ అందాల యువకుడు జన్మించాడు. అతని జెండాపై చేపవుంది. "తండ్రీ నేనేమి చెయ్యాలి ? నా పేరేమిటి? నా స్థానమేమి? ఓ భార్యను కూడా ఇమ్ము" అని కోరాడు. ప్రపంచమంతా నీదే. సృష్టికి మూలం నీవే. నీ ఆయుధాలు పుష్పాలు. నీ ఆయుధాలను దేవతలు కూడా ఆపలేరు. విష్ణువు, శివుడు, నేను కూడా నీ ఆయుధాలను భరించలేము. నీకిప్పుడే సరైన నామకరణం చేస్తాను" అని బ్రహ్మ పలికాడు.

ప్రజాపతులు బ్రహ్మ మనసు గ్రహించి వారిలో వారు సంభాషించుకొని మా మనసులు దోచి జన్మించావు కనుక మన్మథుడని పిలవబడతావు. కాని శివుని కోపం ముందు తలవంచక తప్పదు. దక్షప్రజాపతి నీకు భార్యనిస్తాడు అని పల్కారు.

బ్రహ్మ మాటలకు సంతసించి తన బాణాలైన హర్షణం, రోచనం, మోహనం, శోషణం, మారణాలను మొదట బ్రహ్మపై తర్వాత ప్రజాపతులపై ప్రయోగించగా వారు వాటిని తట్టుకోలేక సంధ్య వైపు పరుగులు తీశారు. సంధ్య కూడా సమ్మోహితురాలై 49 భాగాలుగా, 69 కళలుగా విడిపోయి వాటిని బ్రహ్మ, ఇతర దేవతలపై ప్రయోగించింది. బ్రహ్మ వదనం చూసి సంధ్య ప్రేమలో పడింది. ఆకాశంలో వెళ్తున్న శివుడు వారిని చూసి బ్రహ్మను ఎగతాళి చేసి కాముడు కూడా మూర్ఖుడని అతడి విద్యను ఇచట ప్రదర్శించరాదని చెప్పగా బ్రహ్మ సిగ్గుపడి సంధ్యను వదలివేస్తాడు. బ్రహ్మ తన చేతులతో తన శరీరంపై గల చెమట బిందువులను తుడుచుకోగా అవి భూమిపై పడి 64,000 అగ్నిస్వత్తులు, 4,80,000 బర్హిషదసులు జన్మించారు. ప్రజాపతుల చెమట బిందువుల నుండి దేవతలు జన్మించారు.

తనమీదే బాణాలు ప్రయోగించిన కాముని యెడల బ్రహ్మ కోపంతో శివుని నేత్రాగ్నికి భస్మమవుతావని శపించగా కాముడు బ్రహ్మ కాళ్లపై పడగా తిరిగి జన్మిస్తావని శాపవిమోచన కల్గిస్తాడు.

దక్షుని చెమట బిందువుల నుండి జన్మించిన బాలిక రతీదేవి నీ భార్య కాగలదని చెప్పగా అతడామెను వివాహమాడతాడు. మరు జన్మలో మన్మధుడు ప్రద్యుమ్నుడుగా, రతీదేవి అతని భార్యగా పునర్జన్మిస్తారు.
– కాళికా పురాణం

**రతి 2 :** అలకాపురిలోని అప్సరస. అష్టావక్రమునిని కుబేరుడు ఆహ్వానించినపుడు ఈమె నృత్యం చేసింది.
– మహాభారతం

**రతి 3 :** అజరాభివర్షం రాజైన రుషభదేవుని భార్య. పృథుసేన ఈమె కుమార్తె. – భాగవతం

**రతిగుణుడు :** ఓ దేవ గాంధర్వుడు. కశ్యప ప్రజాపతి ప్రధలకు తనయుడు. – మహాభారతం

**రతివిదగ్ధ :** హస్తినాపురానికి చెందిన ఓ వేశ్య. బ్రాహ్మణులకు భోజనం పెట్టడంవల్ల మరణానంతరం వైకుంఠం చేరింది.

**రత్నకూట :** అత్రి మహర్షి భార్యల్లో ఒకరు.
– పద్మపురాణం

**రత్నగ్రీవుడు :** కాంచనగిరి రాజు. విష్ణుభక్తుడు. ఇతడు తపస్సుచేసి వైకుంఠం చేరాడు. – పద్మపురాణం

**రత్నమాల :** మహాబలి చక్రవర్తి కుమార్తె. వామనుణ్ణి చూసి తన కలాంటి పుత్రుడు జన్మించాలని కోరుకోవడంవల్ల ద్వాపర యుగంలో పూతకిగా జన్మించింది.
– బ్రహ్మ వైవర్తపురాణం

**రత్నసానువు :** మేరు పర్వతానికి మరోపేరు. రత్నాలుండే చరియలు కలది కావడం వల్ల ఈ పేరుతో పిలవబడింది.

**రత్నాకరుడు 1 :** ఒక వైశ్యుడు. ఓ ఎద్దు తన్నినందువల్ల మరణించగా ధర్మాశ్వుడనే బ్రాహ్మణుడు జల్లిన మంత్ర జలం వల్ల వైకుంఠం వెళ్లాడు. – పద్మపురాణం

**రత్నాకరుడు 2 :** సూర్యుని పేర్లలో ఒకటి.

**రథకృతుడు :** ఓ యక్షుడు. ఇతడు చైత్రమాసంలో ధాత అనే ఆదిత్యునితోపాటు పరిభ్రమిస్తుంటాడు. – భాగవతం

**రథచిత్ర :** పురాణకాలం నాటి ప్రసిద్ధ నది.

**రథధ్వజుడు :** విదేహ రాజైన కుశధ్వజుని తండ్రి. వేదవతి ఇతని మనుమరాలు. – చూ॥ వేదవతి

**రథద్యానుడు :** శామ్యుని కుమారుడైన విరాగిణికి మరోపేరు.

**రథంతరి (రతంతర్య) :** ఇలలుడి భార్య. దుష్యంతుడి తల్లి. ఈలునుడి కూతురు. ఈమెకు దుష్యంతుడు కాక సూర, భీమ, ప్రవస, వసులను పుత్రులు కలరు. – మహాభారతం

**రథంతరుడు :** పాంచజన్యుడనే అగ్ని కుమారుడు. ఇతడిని తరసాహరుడని కూడా అంటారు. – మహాభారతం

**రథంతరం :** ఓ సోమం. ఓ రూపం పొంది బ్రహ్మను పూజిస్తుంటుంది. దీనికి మూర్ఛపోయిన వారిని తేరుకునేటట్లు చేసే గుణం వుంది. దీనితో వసిష్ఠుడు మూర్ఛిల్లిన ఇంద్రుడిని మేల్కొల్పాడు. – మహాభారతం

**రథప్రభువు :** శంయుడి కొడుకు. విరాగ్నికి మరోపేరు. – మహాభారతం

**రథవాహనుడు :** విరాటరాజు సోదరుడు. ఇతడు పాండవులకు వ్యతిరేకంగా పోరాడాడు. – మహాభారతం

**రథవీతి :** ఇతడో మహర్షి. హిమాలయాలకు దూరంగా ఓ పర్వత ప్రాంతంలో నివసించేవాడు. తరంతరుడను రాజు హోమం చేయదలిచి శ్వావాస్యమహర్షి ద్వారా ఇతడిని ఆహ్వానించాడు. రథవీతి తన కుమార్తెతో హోమానికి రాగా శ్వావాస్య మహర్షి తండ్రి శ్వావాస్యుడికి రథవీతి కుమార్తెనిచ్చి వివాహం చేయమనగా అతడు అంగీకరించక పోవుటచే యజ్ఞ వేదిక నుండి పంపివేశాడు. కాని చివరికి రాజు కోరికపై రథవీతి తన కుమార్తెను శ్వావాస్యుడికిచ్చి వివాహం చేశాడు. – ఋగ్వేదం

**రథసేనుడు :** పాండవుల పక్షాన పోరాడిన గొప్ప వీరుడు. ఇతని గుర్రాలు చాలా గొప్పవి. – మహాభారతం

**రథస్థ :** గంగానది ఏడు ఉపనదులలో ఒకటి. ప్రాచీన కాల ప్రజలు ఇందులో స్నానం చేస్తే పాపపరిహారం జరుగుతుందని నమ్మేవారు. – మహాభారతం

**రథస్తుడు :** ఓ యక్షుడు. జ్యేష్ఠమాసంలో మిత్రుడగు ఆదిత్యునితో కలసి పరిభ్రమిస్తాడు. – భాగవతం

**రథాక్షుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. – మహాభారతం

**రథాగ్రణి :** ఓ వీరుడు. శ్రీరాముడు అశ్వమేధయాగం చేసినపుడు శత్రుఘ్నుడు దాని రక్షణ బాధ్యత తీసుకున్నపుడు అతనికి తోడున్నాడు. – పద్మపురాణం

**రథావర్తం :** శాకంబరీ దేవి కుడివైపున గల పుణ్యస్థలం. ఈ స్థలాన్ని దర్శించిన వారికి శివుని అనుగ్రహంవల్ల ముక్తి లభిస్తుంది. – మహాభారతం

**రథికుడు :** కురువంశస్థుడు. జయత్సేనుడి కుమారుడు.

**రథీతరగోత్రులు :** రథీతరుడి భార్యలందు అంగిరసుడను ముని పుట్టించిన బ్రహ్మతేజోధనుల సంతతి.

**రథీతరుడు :** పృషతాశ్వుని కుమారుడు. సూర్యవంశపు రాజుల్లో ఒకడు. – మహాభారతం

**రఫేణకం :** తక్షకుని వంశంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయజ్ఞంలో మరణించింది. – మహాభారతం

**రభసుడు 1 :** శ్రీరాముని వానరసేనలో ఓ వానరం. – రామాయణం

**రభసుడు 2 :** రావణుని తరఫున పోరాడిన ఓ రాక్షసుడు. – రామాయణం

**రభ్యుడు :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజు. న్యాయ ధర్మాలకు కట్టుబడి పాలించినవాడు. – చూ॥ ఏకవీరుడు

**రమ :** మహాలక్ష్మిపేరు. ఒకసారి సూర్యుని కుమారుడు రైవతుడు అతని అశ్వాలపై వైకుంఠం రాగా వారి అందం చూసి ఆమె కళ్లు చలించగా విష్ణువు ఆమెను ఆడ గుర్రం కమ్మని శపించాడు. ఆమె దృష్టితో సూర్యుని పుత్రుడ్ని, అశ్వాన్ని రమించింది కనుక ఆమెకు రమ అనే పేరొచ్చింది.

**రమణకుడు :** ప్రియవ్రతుని కుమారుడైన యజ్ఞబాహువు యొక్క మూడవ కుమారుడు. – భాగవతం

**రమణకం :** ద్వారక వద్దగల ఓ ద్వీపం. ఇదో అరణ్యం. ఇచ్చటే వినతా కద్రువలు నివసించేవారు. గరుడుడు తన తల్లి కద్రువను బానిసత్వం నుండి విముక్తం చేసిన తర్వాత నాగుల్ని ఇచటి నుండి వెళ్లగొట్టాడు. అక్కడి నుండి నాగులు పాతాళం చేరగా కాళీయుడు మాత్రం కాళిందిలో నివసించాడు. శ్రీకృష్ణుడు దీనిని అణగ దొగ్గిన తర్వాత శ్రీకృష్ణుని సలహాపై రమణకంలో నివసించాడు. – భాగవతం

**రమణచీనం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రత్యేక ప్రాంతం. – మహాభారతం

**రమణం :** చూ॥ రమణకం

**రమణుడు :** సోముడను వసువుకు మనోహరవల్ల జన్మించిన కుమారుల్లో ఒకడు. – మహాభారతం

**రమణ్వతుడు :** జమదగ్ని పెద్దకుమారుడు. తన తల్లిని వధించమని జమదగ్ని ఆదేశించగా ఇతడు నిరాకరిస్తాడు.

**రమథులు :** మాంధాత పాలించిన రాజ్యంలో నివసించిన తక్కువ జాతి ప్రజలు. వారిని మ్లేచ్ఛులని పిలిచే వారు. – మహాభారతం

**రమ్యకం :** 7 ఖండాలలో ఒకటైన ఇలావృతంలోని ఒక ప్రాంతం. ఇలావృతం తూర్పున నీలగిరి, శ్వేత గిరి, శృంగవాన పర్వతాలు వుండేవి. ఇవి సముద్రం వరకూ వ్యాపించి ఒక దానికి ఒక దానికి మధ్య 2 వేల మైళ్ల దూరం వుండేది. ఇవి ఎన్నో నదులకు ఆధారాలు. ఈ మూడు పర్వతాలమధ్య భూభాగాన్ని రమ్యక, హిరణ్మయ, కురు ప్రాంతాలని పిలిచేవారు.

**రమ్యగ్రామం :** మహాభారత కాలంలో ఓ రాజ్య రాజధాని. సహదేవుడు తన జైత్రయాత్రలో దీన్ని జయించాడు. – మహాభారతం

**రమ్యుకుడు :** అగ్నీధ్రుడు పూర్వచిత్తికి జన్మించిన 9 మంది కుమారుల్లో ఒకడు. ఇతడు రమ్యక వనాన్ని పాలించాడు. ఇది నీలగిరి వద్ద వున్న ప్రాంతం. అర్జునుడు దీన్ని జయించి అచటి నుండి పన్నులు వసూలు చేశాడు. – మహాభారతం

**రయుడు :** చంద్ర వంశపు రాజు. పురూరవసు కుమారుడు. ఊర్వశికి కల్గిన ఏడుగురు పుత్రుల్లో ఒకడు. – భాగవతం

**రవి 1 :** సౌవీర దేశ యువరాజు. జయద్రధుని రథం వెనుక వుండి ద్రౌపదిని అరణ్యవాస సమయంలో అపహరించబోయినప్పుడు జయద్రధుడికి తోడున్నాడు. అర్జునుడితణ్ణి వధించాడు. – మహాభారతం

**రవి 2 :** ధ్రుతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. కురుక్షేత్ర యుద్ధంలో భీముడు ఇతణ్ణి వధించాడు. – మహాభారతం

**రశ్మికేతుడు :** ఓ రాక్షసుడు. రామరావణ యుద్ధంలో రావణుని పక్షాన పోరాడాడు. – రామాయణం

**రశ్మివానుడు :** ఓ విశ్వదేవుడు. – మహాభారతం

**రస :** ప్రజాపతి భార్య. అహుడనే వసువుకు తల్లి.

**రసాతలం :** నివాతకవచులు నివసించే పాతాళంలోని ఒక భాగం. మహా ప్రళయం సంభవించినపుడు అగ్ని ఇందులో దాగింది. కృత్య అనే రాక్షసి ఒకసారి దుర్యోధనుణ్ణి ఇచటకు తీసుకువెళ్ళింది. రసాతలం భూమి ఏడు పొరల్లో ఒకటి. సురభి ఇక్కడే జన్మించింది. నాగ, స్వర్గ లోకాలకంటే ఇక్కడ జీవించడం సుఖమయం. హయగ్రీవుని రూపంలో మహావిష్ణువు రసా తలంలో మధుకైటబుల్ని వధించాడు. ఇది అనంతుని నివాసం. అతని అంశతో జన్మించిన బలరాముడు దేహం విడచిన తర్వాత ఇచటికి చేరాడు. – మహాభారతం

**రహస్యము :** స్త్రీలకు రహస్యము దాగకుండుగాక అని కురుక్షేత్ర యుద్ధానంతరము ధర్మజుడు శపించెను. కురుక్షేత్ర యుద్ధమున మరణించిన వీరులకు కర్మ కాండలు నిర్వహించుచుండగా కర్ణుడికిని కర్మ కాండలు చేయమని అందుకు కారణం అతడు తన పుత్రుడని చెప్పగా తన అన్నను చంపుకున్న బాధతో తల్లి ఇంతవరకు ఆ రహస్యాన్ని దాచినందుకు తల్లిని గూర్చి పల్కిన శాపవచనములు. – మహాభారతం

**రహస్యవేదం :** అర్వావసువు రచించిన వేదం. ఇది సూర్యుడు గురించి చెప్పే వేదం. – మహాభారతం

**రహూగణుడు :** రుగ్వేద కాలంలో జీవించిన ఓ ముని. ఇతని కుమారుడైన గౌతముడు రుగ్వేదంలోని కొంత భాగాన్ని రచించాడు. – రుగ్వేదం

**రహోవాది :** పూరు వంశంలోని ఒక రాజు. సంయాతి కుమారుడు. భద్రాశ్వునికి తండ్రి. – అగ్నిపురాణం

**రాక 1 :** పౌర్ణమినాడు కొలిచే దేవత. సుబ్రహ్మణ్యస్వామి జన్మం రోజు ఈమెకూడా వుంది. రాకాదేవి అంగిరసుని కుమార్తె – విష్ణుపురాణం

**రాక 2 :** ఓ రాక్షస బాలిక. కుబేరుని కోరికపై మహర్షి విశ్రవసుడిని సేవించగా ఖరుడను కుమారుడు, శూర్పణఖ అనే కుమార్తె జన్మించారు. – మహాభారతం

**రాక్షసగ్రహం :** రాక్షసులకు సంబంధించిన దుష్టశక్తి. ఇది మానవులను ఆవరిస్తే పిచ్చివాళ్లవుతారు. – మహాభారతం

**రాక్షస యజ్ఞం :** కల్మష పాదుడను రాక్షసుడు వసిష్ఠుని కుమారుడు పరాశరుని తండ్రి అయిన శక్తిని భుజించగా పరాశరుడు రాక్షసులను నశింపజేయడానికి ఈ యజ్ఞం తలపెట్టాడు. ఈ యజ్ఞం చివరి క్షణాలలో పులస్త్య, పులహ క్రతులు పరాశురుడిని ఒప్పించి ఆ

యజ్ఞం విరమింప జేశారు. అందలి అగ్ని హిమాలయ సానువుల్లో ప్రవహించింది. పురాణాల ప్రకారం ఇప్ప టికీ ఆ అగ్ని రాక్షసుల్ని, చెట్లను, కొండల్ని దహిస్తూ వుంటుంది. – చూ॥ కల్మషపాదుడు–పరాశరుడు

**రాక్షసుడు :** పాటలీపుత్రం రాజైన నందుడి మంత్రి. చాణక్యుణ్ణి చంపాలని సకల ప్రయత్నాలు చేసి విఫ లుడై చివరికి చాణక్యుని సలహాపైనే చంద్ర గుప్తుడికి మంత్రి అవుతాడు. – ముద్రారాక్షసం

**రాక్షసులు :** అసురుల్లో ఒక తెగ. సాయం సంధ్యవేళ వీరిని చంపరాదు. – రామాయణం

కృతయుగంలో బ్రహ్మ మంత్రోచ్చారణ చేయుచుండగా అతడికి ఆకలి దహించింది. అప్పుడతడి ముఖం నుండి కొన్ని రూపాలు జనించాయి. అతడి కోపం నుండి రాక్షసులు జనించగా ఆకలి నుండి యక్షులు జన్మిం చారు. రాక్షసులు దుష్టబుద్ధులై గోవుల్ని, బ్రాహ్మణుల్ని భక్షించేవారు. ప్రహేతి, హేతి మొదట జన్మించిన రాక్షసులు. హేతి కాలుని కుమార్తె భయను వివాహ మాడగా విద్యుత్కేశుడు జన్మించాడు. విద్యుత్కేశుడు సంధ్య కుమార్తె సాలకంఠకను వివాహమాడగా ఓ బిడ్డ జన్మించగా దాన్ని హిమాలయ సానువుల్లో ఒదలి వేశారు. శివపార్వతులు ఆ శిశువును చూసి ఆశీర్వ దించారు. అతడే సుకేశుడు. అతడు గంధర్వ కన్య దేవవతిని వివాహమాడగా ముగ్గురు కుమారులు జన్మించారు. వారు మలయవానుడు, సుమాలి, మాలి. వారు ముగ్గురు బ్రహ్మను గూర్చి తపస్సుచేసి అతడి నుండి వారి మధ్య కలహాలు కలగకుండా, ఎవరి వల్ల ఓటమి లేకుండా వరం పొంది విశ్వకర్మను పిలిచి త్రికూట పర్వతంపై లంకా నగరాన్ని నిర్మించుకున్నారు. మలయవానుడికి ఏడుగురు కుమారులు, ఒక కుమార్తె. సుమాలికి 10 మంది కుమారులు, నల్గురు కుమార్తెలు. సుమాలికి నల్గురు పుత్రులు. వారికి పుత్ర పౌత్రులు జన్మించి ప్రపంచాన్ని భయకంపితులు చేశారు. సుమాలి కుమార్తెలు నల్గురు ఒక సారి అరణ్యంలో బ్రహ్మ వద్దకు వెళ్తున్న కుబేరుడిని చూసి అతడి గొప్పతనానికి విశ్రవసుని కుమారుడగుటయే కారణ మని తలచారు. అందులో ఒకరైన కైకసి విశ్రవసు వును పుత్రభిక్ష పెట్టమని కోరగా అతని వల్ల ఆమెకు రావణ, కుంభకర్ణ, విభీషణులు, ఓ కూతురు శూర్పణఖ జన్మించారు. వీరు తపస్సు చేసి వరాలు పొందారు. రావణుడు లంకకు రాజయ్యాడు.

**రాక్షసం :** వివాహ పద్ధతుల్లో అంగీకరించబడిన పద్ధతి.

**రాగఖాండవం :** దిలీపుడు చేసిన యజ్ఞంలో ఏర్పడిన రొట్టెలాంటి మెత్తటి పదార్థం. – మహాభారతం

**రాగమంజరి :** శృంగార శేఖరుడను రాజు కూతురు. ఈమె చంద్రగుప్తుడను బ్రాహ్మణుని ప్రేమిస్తుంది. వీరి కుమారుడు విక్రమార్కుడు. – విక్రమార్క చరిత్ర

**రాగిణి :** ఓ దేవకన్య. హిమవంతుని కుమార్తె. పార్వతికి సోదరి. – చూ॥ పార్వతి

**రాజగృహం (గిరివ్రజం) :** ఓ ప్రాచీన నగరం. మగధ రాజ్యానికి రాజధాని. పాండు రాజుదీని రాజైన దేరుడిని సంహరించాడు. – మహాభారతం

అంబువీచుడు కొంతకాలం పాలించిన తర్వాత జరా సంధుడు దీనికి రాజయ్యాడు. ఇదో పుణ్యస్థలం కూడా. ఇక్కడ స్నానం చేస్తే కాక్షివానుడంతటి గొప్ప వాడవుతాడు. – మహాభారతం

**రాజధర్ముడు :** కశ్యప ప్రజాపతి పుత్రుడైన ఓ మొసలి. బ్రహ్మకు స్నేహితుడు. దీనిని నందిజంఘుడని కూడా పిలుస్తారు. – చూ॥ నందిజంఘుడు

**రాజని :** ప్రాచీన భారతదేశంలో ఓ పవిత్ర నది. – మహాభారతం

**రాజనీతి :** రాజకీయాల పరిపాలనా విధానాన్ని రాజనీతి అంటారు. రాజు 6 రకాల సైన్యాన్ని ఏర్పరచి యుద్ధా నికి వెళ్లాలి. అవి మూలబల, భూతబల, శ్రేణి బల, శుహృద్బల, శతృబల, అటవిక బలాలు. సైన్యం ఆరు భాగాలుగా చెయ్యాలి. మంత్ర, కోణ, పదాతి, తురగ, గజ, రథాలు. రథాలు ఎక్కడ వుండాలి, ఏను గుల్ని ఎక్కడ మోహరించాలి, సేనాని ఎక్కడ వుండాలి, రాజు ఎక్కడ వుండాలి అనేవి యుద్ధనీతిలో భాగం. – అగ్నిపురాణం, మనుస్మృతి

**రాజన్యుడు :** ఉపరిచర వసువు కుమారుడు. – మహాభారతం

**రాజపురం 1 :** కాంభోజ రాజ్యంలో ప్రసిద్ధ నగరం. కర్ణుడు కాంభోజుల్ని ఇక్కడ ఓడించాడు. – మహాభారతం

**రాజపురం 2 :** కళింగ రాజైన చిత్రాంగదుడి రాజధాని. ఇతని కుమార్తె స్వయంవరానికి లెక్కలేనంత మంది రాజులు ఈ నగరానికి వచ్చారు. - మహాభారతం

**రాజముఖి :** ఓ అప్సరస (దేవకన్య)- స్కందపురాణం

**రాజయోగం :** ఇంద్రియ నిగ్రహంతో ప్రజ్ఞ సాధించడమే రాజయోగం. - చూ॥ యోగ

**రాజరాజ నరేంద్రుడు 1 :** చాళుక్యరాజు. భారతాన్ని తెలుగులో అనువదించడానికి సహకరించాడు. - భాగవతం

**★ రాజరాజ నరేంద్రుడు 2 :** రాజ మహేంద్రవరాన్ని ఏలిన రాజు. ఇతని భార్య చిత్రాంగి. కుమారుడు సారంగధరుడు. కుమారునికి వివాహం చేద్దామని, చిత్రాంగద అనే కన్యను తెచ్చి తనే మనసుపడి వివాహమాడతాడు. చిత్రాంగద మాత్రం సారంగ ధరుడిని మోహిస్తుంది. అందుకతడు నిరాకరించగా రాజుకతనిపై "తనను బలాత్కరించాడు" అని అబద్ధ మాడి నమ్మించగా రాజు కుమారుడి చేతులు కాళ్లు నరికిస్తాడు. ఆ తర్వాత నిజం తెలుసుకుని చిత్రాంగదను వధిస్తాడు.

**రాజవర్ధనుడు :** దముడి కుమారుడు. ఇతడి కొడుకు సుధృతి. - భాగవతం

**రాజవానుడు :** భృగు వంశంలో జన్మించిన ఓ రుషి. భృగుకి ఖ్యాతివల్ల విష్ణువు భార్య లక్ష్మి, ఇద్దరు కుమారులైన ధాత, విధాతలు జన్మించారు. వారు మేరువు కుమారులైన అయతి, నియతిలను వివాహమాడగా వారికి ప్రాణుడు, మృకుండుడు జన్మించారు. మృకుండుడికి మార్కండేయుడు, అతనికి వేదశిరసుడు జన్మించాడు. ప్రాణుడికి ధృతిమానుడు జన్మించాడు. ధృతిమానుడికి రాజవానుడు జన్మించగా అలా భృగు వంశం విస్తరించింది. - విష్ణుపురాణం

**రాజశేఖరుడు :** క్రీ.శ. 7వ శతాబ్దంలో జన్మించిన సంస్కృత నాటక కర్త. ఇతడు కవి రాజుగా ప్రసిద్ధుడు. ఇతడి రచనలు బాల రామాయణం, కర్పూర మంజరి ప్రసిద్ధాలు. ఇతడు కావ్య మీమాంస అనే గ్రంథాన్ని కూడా రచించాడు. కొందరితడు 10వ శతాబ్దం వాడని చెప్తారు.

**రాజశ్రవసుడు :** నాచికేతుడు తండ్రి. గోవులన్నింటిని దానం చేస్తుంటే కొడుకు నన్నెవరికిస్తావని ప్రశ్నించగా యముడికిస్తానని బదులిస్తాడు. కొడుకు యమపురికి వెళ్లి యముని అనుగ్రహం వల్ల తిరిగి వస్తాడు.

**రాజసావర్ణి :** దేవసావర్ణి కొడుకు. ఇతని కుమారుడు వృషధ్వజుడు. - బ్రహ్మావైవర్త పురాణం

**రాజసూయం :** ఓ గొప్ప యజ్ఞం. దీన్ని హరిశ్చంద్రుడు, ధర్మరాజు నిర్వహించారు. - మహాభారతం

**రాజాధిదేవి :** శూర మారిషలకు జన్మించిన 5 గురు పుత్రికల్లో చిన్నది. అవంతి నగర రాజు జయసేనుడీమెను వివాహమాడాడు. విందానువిందులు వారి కుమారులు. కుమార్తె మిత్రవింద. - భాగవతం

**రాజు 1 :** సూర్యుని ద్వారపాలకుల్లో ఒకడు. - భవిష్యపురాణం

**రాజు 2 :** చంద్రుడి మరోపేరు.

**రాజు (లు) :** రాజుల ప్రాముఖ్యతను అన్ని పురాణాలు పేర్కొన్నాయి. ప్రతి జీవజాలానికి దానికి సంబంధించిన రాజులుంటారు. మొదటి రాజు బ్రహ్మ. ప్రజాపతుల్ని సృష్టించిన తర్వాత చంద్రుడ్ని నక్షత్రాలకు, వైద్యానికి రాజుని చేశాడు. వరుణుడిని నదులకు సముద్రాలకు, విశ్రవానుడిని రాజులకు రాజును, దేవతలకు విష్ణువును, దక్షుడ్ని ప్రజా పతులకు, ప్రహ్లాదుడిని దానవులకు, వాసుకిని నాగులకు, గరుడుని పక్షులకు- ఇలా అన్ని జీవ రాశులకు రాజులేర్పడ్డారు. *రాజు విధినిర్వహణ :* మానవ జాతిలో రాజు క్షత్రియుడ్నిగాని, బ్రాహ్మణుడ్ని గాని, సర్వసేనాపతిని, చెయ్యాలి. అతడు గౌరవ కుటుంబంలో జన్మించి న్యాయ ధర్మ శాస్త్రాలు తెలిసి వుండాలి. సంభాషణాచతురుడ్ని దౌత్యవేత్తగా నియమించాలి. మంత్రులకు ధర్మశాస్త్రం తెలిసి వుండాలి. రాజు ఉదయం 3 గంటలకు లేచి గూఢచారులతో మాట్లాడి పూజలు నిర్వహించుకొని కొలువుకు రావాలి. - అగ్నిపురాణం

**రాజ్ఞి :** విశ్వవానుడి ముగ్గురు భార్యల్లో రెండవది. వీరికి జన్మించిన పుత్రుడు రేవతుడు.

**రాజ్యవర్ధనుడు :** వైశాలిని పాలించిన రాజు. మహాపండితుడు. భూత భవిష్యత్ వర్తమాన కాలాలను గణించ

★ ఈ కథకు చారిత్రక ఆధారాలు లేవు.

గల మేధావి. తన మరణమాసన్నమైనదని తెలిసితన తోటివారికి చెప్పి అడవికి వెళ్లి తపస్సు చేశాడు. రాజు అరణ్యానికి వెళ్లగా అతని మంత్రులు ఇతర అధికారులు సూర్యుని గూర్చి తపస్సుచేసి 1000 సంవత్సరాలు జీవించే టట్లు ఓటమెరుగనట్లు వరం పొంది రాజును తిరిగివచ్చి రాజ్యపాలన చేయమని కోరగా అతడు తన జీవితకాలంలో తన ప్రజల, మరణ దుఃఖాలను చూడలేను కనుక నేను తిరిగిరానని చెప్పి సూర్యుని గూర్చి తపస్సు చేసి తన జీవితకాలంలో తన ప్రజలు, తన సేవకులు మరణం చెందకుండా వరం పొందాడు.

**రాణాయని :** వ్యాసుడి శిష్యపరంపరలోని వాడు. సామ వేద శాఖకు సంబంధించినవాడు.

– *జైమినీయ గృహ్యసూత్రం.*

**రాత్రి :** యమీ, యములలో యముడు మరణించినపుడు యమి దుఃఖాన్ని పోగొట్టడానికి దేవతలు రాత్రిని సృష్టించారు.

**రాధ 1 :** శ్రీకృష్ణుని ప్రియురాలు. ఈమె లక్ష్మీదేవి మరో రూపమని చెప్పబడింది. శ్రీకృష్ణుడు రెండు చేతులతో జీవించినపుడు రాధ ఇతని ఇష్టురాలు కాగా 4 చేతుల విష్ణుమూర్తికి లక్ష్మీదేవి ఇష్టురాలు.

– *దేవీ భాగవతం*

*రాధ జన్మ వృత్తాంతం :* గోకులంలో వృషభానుని కుమార్తెగా జన్మించింది. – *నారదపురాణం*

వృషభానుడను రాజు భూమిని యజ్ఞం కొరకు త్రవ్వుతుండగా ఈమె భూమి కన్యగా జన్మించింది.

– *పద్మపురాణం*

శ్రీకృష్ణుని ఎడమ భాగం నుండి జన్మించింది.

– *బ్రహ్మవైవర్తపురాణం*

శ్రీకృష్ణుని జన్మ సమయంలో మహావిష్ణువు తన సహచరుల్ని భూమిపై జన్మించమనగా రాధ గోకులంలో శుక్లాష్టమి ఉదయాన జ్యేష్ట నక్షత్రంలో భాద్రపద మాసంలో జన్మించింది. – *మహాభారతం*

మహావిష్ణువు సృష్టిగావించినపుడు అతడి ఐదు శక్తులలో రాధ ఒకరు. – *దేవీభాగవతం*

**రాధ 2 :** కుంతీపుత్రుడైన కర్ణుని పెంచిన తల్లి. అతిరథుని భార్య. – *మహాభారతం*

**రామకం :** ఇదో పర్వతం. సహదేవుడు దక్షిణ దేశాల జైత్రయాత్రలో ఈ పర్వతాన్ని కూడా ఆక్రమించాడు.

– *మహాభారతం*

**రామకృష్ణుడు :** ఇతడు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానములోని కవులలో ముఖ్యుడు. హాస్య చతురుడుగా ప్రసిద్ధుడు. ఇతడి విశిష్ట రచన "పాండురంగ మహాత్యం". ఇతని స్వగ్రామం తెనాలి.

**రామగిరి :** నాగపురం వద్ద గల ఓ కొండ.

**రామణీయకం :** రమణక దేశానికి మరోపేరు.

– *చూ|| రమణకం*

**రామతీర్థం 1 :** గోమతి నదిలోని ఓ పుణ్య తీర్థం. ఇచ్చట స్నానం చేస్తే అశ్వమేధ యాగం చేసిన ఫలితం లభిస్తుంది. – *మహాభారతం*

**రామతీర్థం 2 :** మహేంద్రపర్వతం పై ఓ పుణ్యప్రదేశం. పరశు రాముడిక్కడ నివసించాడు. ఇచ్చట స్నానం చేస్తే అశ్వమేధ యాగ ఫలితం లభిస్తుంది.

– *మహాభారతం*

**రామధులు :** పురాణ కాలంలో దక్షిణ భారతదేశంలో జన్మించిన తక్కువ కులం ప్రజల తెగ. వీరిని మ్లేచ్ఛులు అంటారు. నకులుడు వీరిని జయించాడు. అప్పటి నుండి వీరు పాండవులకు విధేయులుగా వుండేవారు. రాజసూయ యాగానికి కూడా వచ్చారు.

– *మహాభారతం*

**రామహ్రదం :** కురుక్షేత్రానికి దగ్గరలోగల పుణ్యస్థలం. కాశీరాజు కుమార్తె అంబ ఇక్కడ స్నానం చేసింది.

– *మహాభారతం*

**రామానుజాచార్యులు :** విశిష్టాద్వైత మతాన్ని పునరుద్ధరించి ప్రతిష్ట తెచ్చినవాడు. సరోయోగి మొదలైన పన్నెండు మంది విశిష్టాద్వైతాన్ని ప్రవచించారు. వాళ్లని సన్నిదరాళ్వార్లు అని పిలుస్తారు. ఈ మతానికి జవజీవాలు చేకూర్చింది రామానుజాచార్యులు. ఇతని తండ్రి కేశవాచార్యులు. తల్లి కాంతిమతి. ఈయనను యతిరాజని అంటారు. వ్యాస సూత్ర భాష్యం, గీతాభాష్యం, తర్క భాష్యం, వేదార్థ సంగ్రహం, న్యాయామృతం, వేదాంత ప్రదీపం, గాధాత్రేయం ఇతని రచనలు.

**రామాయణం :** దీన్ని ఆది కావ్యమని అంటారు. బహుశా ప్రపంచంలోనే మొట్టమొదటి పద్య కావ్యం

కావొచ్చు. సంస్కృత భాషలో మాత్రం ఇదేమొదటి పద్య కావ్యం. ప్రాచీన వర్ణనలు, సంఘటనలు వుండటం వల్ల దీనిని ఇతిహాసమని పిలుస్తారు. దీని రచయిత వాల్మీకి. ఇతడు, శ్రీరాముడు ఒకే కాలంలో జీవించారు. శ్రీరాముడితడి ఆశ్రమాన్ని దర్శించాడు.

*రామాయణ రచన :* తమసా నది వద్ద నుండి తన ఆశ్రమానికి వస్తూ ఓ వేటగాడు క్రౌంచ పక్షిని వేటాడగా వాల్మీకి నోటి నుండి ఓ పద్యం వెలువడింది. అది విన్న బ్రహ్మ ప్రత్యక్షమై రాముని భూత భవిష్యత్ వర్తమానాలను గురించి ఓ కావ్యం వ్రాయమని వాల్మీకిని కోరగా అతడు 24,000 శ్లోకాలతో ఏడు భాగాలుగా రామ కథను రచించాడు. అవి బాలకాండ, అయోధ్య కాండ, అరణ్యకాండ, కిష్కిందకాండ, సుందరకాండ, యుద్ధకాండ, ఉత్తరకాండ.

*రచయితను గురించిన వైరుధ్యాలు :* రామాయణ రచయిత వాల్మీకిగా చెప్పబడినా పాశ్చాత్యపండితులు బాలకాండలో కొంత భాగం, ఉత్తరకాండ ప్రక్షిప్తాలని అవి తర్వాత రామాయణంలో చేర్చబడ్డాయని చెప్తూ ఈ క్రింది ఆధారాలు చూపుతున్నారు. బాల కాండ లోని 1, 3 సర్గలు కొన్ని రామాయణాల్లో కన్పించడంలేదు కనుక అవి తర్వాత చేర్చబడ్డాయి. బాల కాండ, ఉత్తర కాండలో మాత్రమే రాముడు విష్ణువు అవతారమని చెప్పబడగా తక్కిన 5 కాండల్లో అతడో వీరుడుగా మాత్రమే పేర్కొనబడ్డాడు. ఇతర భాషల్లోని మొట్టమొదటి అనువాదాల్లో ఉత్తరకాండ లేదు. బాల కాండలో వాల్మీకి రామాయణాన్ని కుశలవులకు చెప్పినట్లు వుండగా అవన్నీ ఉత్తరకాండలో తిరిగి చెప్పబడ్డాయి.

*రామాయణ రచనాకాలం :* భారతీయ పండితులు రామాయణం త్రేతాయుగ కాలంలో క్రీ.పూ. 8,67,000లో వ్రాయబడిందని పేర్కొంటుండగా కొందరు పండితులు మహాభారతం తర్వాతే రామాయణం రచింపబడిందంటున్నారు. కాని రామాయణంలో మహాభారత సంఘటన ఎక్కడా పేర్కొనబడలేదు. రామాయణం మహాభారతం కంటె ఎంతో ముందు రచింపబడిందని చెప్పవచ్చు.

*రచనను గురించిన వైరుధ్యాలు :* భారతదేశంలో మూడు రకాల రామాయణాలు లభిస్తున్నాయి. ఒకటి మరాఠీ, రెండు బెంగాలీ, మూడు కాశ్మీరీ. వాటిల్లో మూడోవంతు రచనలో ఒకదానితో ఒకటి పోలిక లేదు. రామాయణం మొదట ప్రాకృతంలో రచింపబడి తర్వాత సంస్కృతంలోకి అనువదించబడటంవల్ల ఈ వైరుధ్యాలు ఏర్పడ్డాయి. వాశిష్ఠ రామాయణం, అద్భుతరామాయణం, ఆనంద రామాయణం, మూల రామాయణం, విచిత్ర రామాయణం అనే పేర్లతో వివిధ రకాల రామాయణ రచనలు భారతదేశంలో వున్నాయి.

**రాముడు :** మహావిష్ణువు ఏడవ అవతారం. సూర్య వంశపు రాజుల్లో అత్యంత శక్తివంతుడు. ఈ వంశ ప్రసిద్ధుల్లో ఇక్ష్వాకుడు, త్రిశంకు, హరిశ్చంద్ర, సగర, భగీరథ, ఖాట్వాంగ, దిలీప, రఘు, దశరథులు ప్రసిద్ధులు. దశరథుని కుమారుడే రాముడు.

*జన్మ కారణం :* రావణుడు లంకను పాలిస్తూ మూల్లో కాలను భయభ్రాంతులను చేస్తూ దేవతలను హింసించేవాడు. దేవతలు బ్రహ్మకు చెప్పుకోగా రావణవధ తనకు సాధ్యంకాదని వారిని వెంట తీసుకొని శివుని వద్దకు వెళ్లగా తను రావణుడ్ని చంపడం ధర్మంకాదని అతడు వీరందరిని తోడ్కొని మహావిష్ణువు వద్దకు వెళ్లగా రావణ వధకై నేను భూలోకంలో దశరథ తనయుడుగా జన్మిస్తానని మీరు మానవులుగా, వానరులుగా జన్మించి సహకరించ మని చెప్పాడు.

– *కంభరామాయణం*

*జననం :* కోసల రాజ్యాన్ని అయోధ్య రాజధానిగా దశరథుడు పాలించేవాడు. అతనికి ముగ్గురు భార్యలు కౌసల్య, సుమిత్ర, కైకేయి. కాని సంతానం లేదు. వారి కుల గురువైన వశిష్ఠుని ఆదేశం మేరకు పుత్ర కామేష్టి యాగం చేయగా యజ్ఞ పురుషుడు ఓ పాత్రతో పాయసం ఇవ్వగా దానిని దశరథుడు కౌసల్య, కైకేయిలకు పంచాడు. వారి భాగాలలో కొంత సుమిత్రకు ఇవ్వగా కౌసల్యకు శ్రీరాముడు, కైకేయికి భరతుడు, సుమిత్రకు లక్ష్మణ, శతృఘ్నులు జన్మించారు. రామ లక్షణ భరత శతృఘ్నులు అస్త్ర శస్త్ర విద్యలు నేర్చుకొని యువకులుగా వుండగా విశ్వామిత్రుడు తన యాగరక్షణార్థం శ్రీరాముణ్ణి తనతో పంపమని దశరథుని కోరగా, మొదట సంశయించినా విశ్వామిత్రుని కోపానికి వెరచి రామలక్ష్మణులను అతనితో పంపగా విశ్వామిత్రుడు తన తపశ్శక్తితో సాధించిన అస్త్రశస్త్రాస్త్ర విద్యలు వారికి నేర్పాడు. రాముడు తాటకిని

వధించాడు. విశ్వామిత్రుడి యాగాన్ని నాశనం చేయ బోయిన మారీచ, సుబాహుల్ని తన అస్త్రవిద్యతో చెదరగొట్టి కాపాడినాడు. విశ్వామిత్రుడు తోడ్కొని వెళ్లగా సీతా స్వయంవరానికి వెళ్ళి శివధనుర్భంగం కావించి సీతను వివాహమాడి అయోధ్యకు తిరిగి వచ్చాడు.

*కైకేయి వరం – రాముని వనవాసం :* నెమి చక్రవర్తి శంబరుడనే అసురుణ్ని సంహరించడానికి దేవతలకు సహాయపడటానికి వెళ్లి శంబరుడితో యుద్ధం చేశాడు. అతడు మాయారూపంలో 10 వైపుల నుండి దాడిచేయగా తన రథాన్ని ఒకే సమయంలో 10 వైపులకు మళ్ళించి అతడిని సంహరించడం వల్ల దశరథుడని పిలవబడ్డాడు. ఆ సమయంలో యుద్ధంలో తోడున్న కైకేయిని రెండు వరాలు కోరు కొమ్మన్నాడు. ఆమె సమయం వచ్చినపుడు అడుగుతానని చెప్పింది. రామునికి పట్టాభిషేక మొనర్చ దలచినపుడు కైకేయి ఈ రెండు వరాలు తీర్చమని దశరథుని కోరింది. అందులో ఒకటి తన కుమారుడైన భరతుణ్ణి పట్టాభిషిక్తుడ్ని చేయడం, రెండవది శ్రీరాముడిని 14 సంత్సరాలు వనవాసం పంపడం. రాముడు ఆ ఆజ్ఞను శిరసా వహించి సీతాలక్ష్మణ సమేతుడై అరణ్యవాసానికేగాడు. రాముడితో పాటు వెళ్లిన సుమంతుడు అయోధ్యకు తిరిగి వచ్చేసరికి దశరథుడు దుఃఖ భారంతో మరణించగా భరత శతృఘ్నులు కేకయ దేశ నుండి తిరిగి వచ్చి రాముని వనవాసం, దశరథుని మరణవార్త విని దుఃఖపూరితులయ్యారు. భరతుడు రాముని కొరకు అరణ్యానికి వెళ్లి తనను మన్నించి తిరిగి రాజ్యానికి రమ్మని కోరగా రాముడు నిరాకరించాడు. భరతుడు చేయగలిగింది లేక రాముని పాదరక్షలు వెంటతీసుకు వచ్చి అయోధ్యలో వుంచి అతడు నంది గ్రామంలో వుండి రాముణ్ణి పూజిస్తూ రాజ్యపాలన చేశాడు.

*పంచవటి ఆశ్రమజీవితం :* సీతారామలక్ష్మణులు చిత్రకూటం నుండి గోదావరి నదీ తీరానగల పంచవటి తీర్థం చేరారు. 5 వృక్షాల నడుమ గల ప్రాంతం అవడం వల్ల దాన్ని పంచవటి అన్నారు. అచ్చట ఓ రాక్షసుడు సీతను ఎత్తుకు పోబోగా అతణ్ణి సంహరించడమేకాక మునుల్ని ప్రజల్ని భయభ్రాంతుల్ని చేస్తున్న రాక్షసుల్ని సంహరించడానికి నిశ్చయించుకున్నాడు. అగస్త్యుడు రాముడికి విష్ణుచాపాన్ని బ్రహ్మాస్త్రాన్ని శివుని అమ్ముల పొదిని ఇవ్వగా అవసరమైనప్పుడు తీసుకుంటానని చెప్తాడు. పంచవటి వద్ద వున్న ఒక రాక్షసుడ్ని సంహరించాడు. అతడు శూర్పణఖ తన యుడయిన శంభు కుమారుడు. రాముడు పంచవటి ఆశ్రమంలో ఉన్నాడని తెలిసి దండ కారణ్యంలోని రుషులు వచ్చి ఇతడి ఆశ్రమంలో 13 సంవత్సరాలు గడిపారు.

*శూర్పణఖ వృత్తాంతం :* శూర్పణఖ భర్త విద్యుజిహ్యుడు దేవదానవ యుద్ధంలో పొరపాటున చని పోగా రావణుడు ఆమెకు నచ్చినవాడిని కోరుకుంటే వివాహం చేస్తానని అభయమివ్వగా ఆమె తగిన భర్త కోసం అన్వేషిస్తూ పంచవటిలో రాముణ్ణి చూసి మోహించగా అతడు తిరస్కరిస్తాడు. ఆ తర్వాత లక్ష్మణుడ్ని వివాహం చేసుకొమ్మని కోరగా, అతడు ఆమె ముక్కు చెవులు కోసి అవమానిస్తాడు.

*ఖరుని వధ :* ఇది విన్న ఖరుడు 14మంది రాక్షసుల్ని రాముడి పైకి పంపగా రామలక్ష్మణులు వారిని వధిస్తారు. ఖరుడు పెద్ద రాక్షస సైన్యంతో రాముడిపైకి దండెత్తగా వారిని కూడా సంహరిస్తారు. ఈ వృత్తాంతమంతా శూర్పణఖ తన అన్న రావణుడికి తెల్పి యుద్ధంలో అతణ్ణి ఓడించడం కష్టమని అతడి భార్యను ఎత్తుకొని వస్తే రాముడు దుఃఖ భారంతో మరణిస్తాడని, రాముడు చనిపోతే ఆ బాధ భరించలేక లక్ష్మణుడు చనిపోతాడని సలహా ఇస్తుంది.

*సీతాపహరణం :* ఆ మరుసటి రోజు ఓ లేడి ఆశ్రమం చెంత బంగారు రంగులో ప్రత్యక్షంకాగా సీత దానిని కోరగా రాముడు దానిని వెంబడించాడు. అది తప్పించుకొని రాముడ్ని చాలా దూరం తీసుకువెళ్లగా తన బాణంతో దాన్ని వధించగా అది చనిపోతూ "హా సీతా, హా లక్షణా" అంటూ అరచి మరణించగా సీత లక్ష్మణుడ్ని రాముడి రక్షణార్థం పంపగా ఇదే అదనుగా రావణుడు మాయా రుషిగా వచ్చి సీతను అపహరించి అడ్డువచ్చిన జటాయువు రెక్కలు నరికి తన పుష్పక విమానంలో సీతను కొనిపోయి లంకా నగరంలోని అశోకవనంలో వుంచుతాడు. రామలక్ష్మణులు తిరిగి వచ్చి సీత కన్పించక అన్వేషిస్తూ వెళ్లగా జటాయువు సీతాపహరణం చెప్పి మరణిస్తుంది.

*కబంధుని శాప విముక్తి – శబరి భక్తి :* రామ లక్ష్మణులు సీతాన్వేషణలో దక్షిణానికి ప్రయాణిస్తుండగా కబంధుడను ఓ రాక్షసుడు వీరికి అడ్డుపడగా రామ లక్ష్మణులు అతడి రెండు చేతులను తమ బాణాలతో త్రుంచగా అతడు నిజరూపుడై గంధర్వుడుగా మారి రామునికి పాదభివందనం చేసి అదృశ్యుడయ్యాడు. ఆ తర్వాత రామలక్ష్మణులు శబరి ఆశ్రమం చేరి ఆమె ఆతిథ్యం స్వీకరిస్తారు. ఆమెకు ముక్తిని ప్రసాదిస్తారు.

సుగ్రీవునితో బంధం – వాలి వధ : రామలక్ష్మణులు పయనిస్తూ పంపానదీ తీరంలోని రుష్యమూక పర్వతం వద్దకు రాగా అక్కడ తన సైన్యంతో నివసిస్తున్న సుగ్రీవుడు తన మంత్రి హనుమంతుణ్ణి వీరిని గురించి వివరాలు తెలుసుకోవడానికి పంపగా హనుమంతుడు బ్రాహ్మణరూపంలో వారిని కలసి వీరి కథ విని నిజరూపుడై రామలక్ష్మణుల్ని తన భుజాలపై కూర్చుండబెట్టుకొని సుగ్రీవుని వద్దకు తీసుకువెళ్లగా శ్రీరాముడు, సుగ్రీవుడు ఓ ఒడంబడిక చేసుకుంటారు. సుగ్రీవుని అన్న వాలిని శ్రీరాముడు వధించి కిష్కిందకు సుగ్రీవుని రాజును చేయుటయు, అందుకు ప్రతిగా సీతాన్వేషణకు సుగ్రీవుడు తన సైన్యంతో సహకరించుట ఈ ఒడంబడిక సారాంశం.

*వాలివధ : చూ॥ వాలి.*

సీతాన్వేషణకై వానర సైన్యం నలుమూలలకు పంపబడింది. వారికి సంపాతి అనే జటాయువు అన్న కన్పించి సీత లంకలో వుందని చెప్పగా అంగదుడు సముద్రంలో దూకి లంక చేరి సీతాన్వేషణ చేయడానికి నిశ్చయించగా హనుమంతుడు మాత్రమే దానికి సమర్థుడని జాంబవంతుడు చెప్పగా లంకను చేరిన హనుమంతుడు సీతను గుర్తించి వెనక్కు తిరిగి వచ్చి శ్రీరామునికి నివేదిస్తాడు. శ్రీరాముడు సీతను తిరిగి పంపమని రావణుని వద్దకు రాయబారం పంపగా అందుకు రావణుడు ఇష్టపడక పోవడంతో యుద్ధం తప్పనిసరి అవుతుంది.

మొదటి రోజు యుద్ధంలో మహాబాహు మహాకాయుల వంటి రాక్షసులు వధించబడ్డారు. రెండవ రోజు రావణ కుమారుడైన అతికాయుడి నాయకత్వంలో యుద్ధం జరగగా లక్ష్మణుడితణ్ణి సంహరించాడు. త్రిశిరసుడు, మేఘనాధుడు, లక్ష్మణుడితో తలపడ్డారు. ఎదురెదురు పోరాటంలో లక్ష్మణుడ్ని ఎదుర్కొనడం సాధ్యంకాక మేఘనాధుడు మాయగా మారి మేఘాల చాటునుండి బ్రహ్మ ప్రసాదించిన నాగాస్త్రంతో లక్ష్మణుడితో పోరాడగా లక్ష్మణుణ్ణి నాగాస్త్రం బంధించింది. తక్కిన వీరులంతా నిశ్చేష్టులు కాగా గరుడుడు వచ్చి నాగాస్త్రం నుండి లక్ష్మణుడ్ని విముక్తుణ్ణి చేశాడు. ఆ తర్వాతి రోజు రాముడు రెండు రోజుల్లో యుద్ధం ముగించాలని నిర్ణయించాడు. లక్ష్మణుడు ఇంద్రజిత్తును ఎదుర్కొంటానన్నాడు. ఇంద్రజిత్తు విడిచిన బ్రహ్మాస్త్రంతో లక్ష్మణుడు మూర్ఛిల్లగా జాంబవంతుని సలహాపై హనుమంతుడు సంజీవిని పర్వతాన్ని తీసుకొచ్చి మృతసంజీవిని ఉపయోగించగా లక్ష్మణుడు సజీవుడయ్యాడు. ఆ తర్వాత జరిగిన యుద్ధంలో లక్ష్మణుడు ఇంద్రజిత్తును సంహరించాడు. చివరికి రావణుడు తనే స్వయంగా యుద్ధరంగానికి వచ్చాడు. ఈ యుద్ధంలో రాముడు రావణుడ్ని వధించి విభీషణుడ్ని లంకకు రాజును చేశాడు. సర్వాలంకరణతో విభీషణుడు సీతను లంక నుండి తీసుకురాగా ఆమెను తిరిగి చేపట్టుటకు శ్రీరాముడు సంశయించగా, సీత అగ్ని ప్రవేశం చేసి తన పాతివ్రత్యాన్ని నిరూపించుకుంటుంది. అంతట శ్రీరాముడు సీతను వెంటబెట్టుకొని అయోధ్యకు తిరిగి వచ్చాడు.

అయోధ్యకు తిరిగివచ్చి పట్టాభిషిక్తుడై భరతుణ్ణి యువరాజుగా, లక్ష్మణుడ్ని సైన్యాధిపతిగా, శతృఘ్నుడ్ని ఆర్థిక మంత్రిగా నియమించాడు.

*సీతను అడవికి పంపుట :* అయోధ్యను పాలిస్తూ రాత్రిపూట సంచరిస్తూ తన పాలన గురించి ప్రజల అభిప్రాయం తెలుసుకుంటూ ఓ చాకలివాడు సీతను గూర్చి మాట్లాడిన మాటలువిని నిండు గర్భిణి అయిన సీతను అడవులకు పంపగా ఆమె వాల్మీకి ఆశ్రమంలో తలదాచుకొని అచ్చటే ప్రసవించి కుశలవులకు జన్మనిచ్చింది. శ్రీరాముడు అశ్వమేధ యాగం చేయ నిర్ణయించాడు. ఆ అశ్వాన్ని తన కుమారులైన లవకుశులు బంధించగా అతడే వారితో యుద్ధానికి తలపడి అచట సీతను చూసి ఆశ్చర్యపడ్డాడు. కుశలవులు రాముడు తన తండ్రి అని తెలిసి పాదాభివందనం చేశారు. మరల సీతను కుమారులతో పాటు అయోధ్యకు తీసుకువచ్చి అశ్వమేధయాగం పూర్తి చేశాడు. కైకేయికి సీతపై

ద్వేషం పోలేదు. ఆమె సీతతో రావణుడి చిత్రాన్ని గీయించి దాన్ని రాముడికి చూపగా రాముడు అతడి చిత్రాన్ని గీచినందుకు సీతకు మరణ శిక్ష విధించగా భూమాత రెండుగా చీలి సీతను తనలో ఇముడ్చు కుంది. ఆ తర్వాత కొంతకాలం రాజ్యం చేసి శ్రీరాముడు తన అవతారం చాలించి వైకుంఠం చేరాడు.

**రామేశ్వరం :** దక్షిణ భారత దేశంలోని గొప్ప పుణ్యస్థలం. సీతకోసం లంకకు వెళ్లేముందు రాముడు నల, నీలుడను వానరుల ఆధ్వర్యంలో ఈ దేవాలయం నిర్మించాడు. లంకకు తేలికగా వెళ్లడానికి ఇక్కడో దేవాలయం నిర్మించి శివలింగాన్ని ప్రతిష్టించాలని తలచి హనుమంతుడిని కైలాసం వెళ్లి శివలింగాన్ని తెమ్మన్నాడు. ప్రతిష్టించవలసిన సమయానికి హను మంతుడు రాకపోవుటచే ప్రతిష్టించవలసిన స్థలం ముందు శ్రీరాముడు నిలబడగా ఓ దివ్యతేజస్సు అతని ముఖం నుండి వెలువడి శివలింగంగా ప్రతిష్టిం చబడింది. ఆ తర్వాత హనుమంతుడు శివలింగంతేగా రాముడు దాన్ని తొలగించి హనుమంతుడు తెచ్చిన దాన్ని పెట్టమనగా తన తోకతో పెకలించ ప్రయత్నించి క్రిందబడి మూర్ఛిల్లాడు. శ్రీరాముని ఆశీర్వచనంతో తేరుకొని దేవాలయ తూర్పు శిఖరానికి ముందు హను మంతుని కోర్కె తీర్చడానికి దాన్ని ప్రతిష్టించి దేవా యంలోకి వెళ్లేముందు దీన్ని ప్రార్థించాలని శ్రీరాముడు ఆనతిచ్చాడు. ఇప్పటికీ అదే ఆచారమయ్యింది.

– *కంభ రామాయణం*

**రాయణుడు :** శ్రీకృష్ణుని పెంపుడు తల్లి అయిన యశోదకు సోదరుడు. – *బ్రహ్మవైవర్త పురాణం*

**రావణుడు :** రాక్షస రాజు – లంకా నగర పాలకుడు. 10 తలలు కలవాడు.

*వంశవృక్షం :* బ్రహ్మ–పులస్త్య–విశ్రవసు–రావణుడు.
*జననం :* పులస్త్యుని కుమారుడైన విశ్రవసుడు సుమాలి కుమార్తె కైకసిని వివాహమాడగా ఆమె వల్ల ముగ్గురు పుత్రులు, ఒక కుమార్తె జన్మించారు. రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు, కుమార్తె శూర్పణఖ. కుబేరుడు విశ్రవసుని మరో భార్యకు జన్మించిన కుమారుడు. ఇతడు బ్రహ్మను ప్రార్థించి లంకా నగరాధిపతి అయ్యాడు.

*పూర్వజన్మలు :* రావణుడు పూర్వజన్మలో మహావిష్ణువు ద్వార పాలకులైన జయ విజయల్లో ఒకడు. రుషుల శాపంవల్ల మొదటి జన్మలో హిరణ్యాక్ష హిరణ్య కశిపు లుగా తర్వాతి జన్మలో రావణ, కుంభకర్ణులుగా జన్మించారు.
*రావణుడికి గల వర సంపద :* కైకసి తన సవతి కుమారుడు కుబేరుడి ఔన్నత్యం చూసి తన కుమా రులు అతడికంటే గొప్పవాళ్లు కావాలని ప్రేరేపించగా రావణుడు తన సోదరులైన కుంభకర్ణ విభీషణాదులతో 10,000 సంవత్సరాలు తపస్సు చేశాడు. బ్రహ్మ ప్రత్యక్షమై కుంభకర్ణుడిని వరం కోరుకొమ్మనగా నిర్దేశత్వాన్ని కోరుకోబోయి నిద్రాత్వం అని కోరాడు. విభీషణుడు విష్ణుభక్తుడ్ని కావాలని వరం కోరాడు. రావణుడు పంచాగ్నుల మధ్య నిలబడి ఘోరతపస్సు చేసి 1000 సంవత్సరాల కొకసారి తన 10 తలలలో ఒకటి ఖండించుకుంటూ వచ్చాడు. 10,000 సంవత్సరం నాటికి వున్న ఒక్క తలను ఖండించుకో బోగా బ్రహ్మ ప్రత్యక్షమై వరమడగగా ఒక్క మానవు లతో తక్క వేరెవ్వరితోను ప్రాణభయం లేకుండునట్లు వరం కోరగా బ్రహ్మ ప్రసాదించాడు. వర ప్రసాదియై తిరిగి వస్తూ రావణుడు లంక నుండి కుబేరుడిని తరిమి లంకాధీశుడయ్యాడు. అతడి పుష్పకవిమా నాన్ని స్వంతం చేసుకున్నాడు.

*కుటుంబం :* మయాసురుని పెంపుడు కుమార్తె మండో దరిని వివాహమాడాడు. వీరికి ముగ్గురు పుత్రులు జన్మించారు. మేఘనాథుడు, అతికాయుడు, అక్ష కుమా రుడు. కుమారులు, రాక్షసుల సహకారంతో ప్రపం చాన్ని జయించి దేవలోకం వెళ్లి ఓడి పట్టుబడగా మేఘనాథుడు మాయాజాలంతో ఇంద్రుడ్ని బంధించి తండ్రిని విడిపించాడు. అందువల్ల మేఘనాథుడ్ని ఇంద్రజిత్తు అని కూడా పిలిచారు.

*శాపగ్రస్థ రావణుడు :* ఇతడిని విజయాలతో పాటు 18 శాపాలు వరించాయి.

1. రావణుడు నలకుబేరుని భార్య అయిన రంభను బలాత్కరించగా ఇష్టపడని స్త్రీని బలత్కరిస్తే రావణుని తల 1000 వక్కలవుతుందని నలకూబరుడు శపిస్తాడు.
2. కుశధ్వజుని కుమార్తె వేదవతి శ్రీమాధవుణ్ణి వివాహ మాడనెంచి తపస్సు చేస్తుండగా ఆమెను బలా త్కరించగా నిన్ను శ్రీరాముడు వధిస్తాడని శపిస్తుంది.

3. శివుడిచ్చిన త్రిపుర సుందరి విగ్రహ ప్రతిష్ఠాపనకు ఓ బ్రాహ్మణుడ్ని రమ్మని కోరి కొంచెం ఆలస్యంగా వచ్చినందుకు అతణ్ణి ఏడురోజులు కారాగారంలో వుంచగా నిన్ను కూడా ఓ మానవుడు ఏడు రోజులు కారాగారంలో వుంచుతాడని శపిస్తాడు.

4. కైలాసం వెళ్లి నందికేశ్వరుడ్ని కోతి అని తూల నాడగా వానరులు నీ లంకా రాజ్యాన్ని నాశనం చేస్తారని శపిస్తాడు.

5. వశిష్ఠుడిని వేదాలు నేర్పమనగా అతడు నిరాక రించినందుకు బంధించగా సూర్యవంశపు రాజైన కువలయాశ్వుడు రావణుడ్ని ఓడించి వశిష్ఠుడ్ని విడి పించగా సూర్యవంశపు రాజు చేతిలో మరణం సంభ విస్తుందని వశిష్ఠుడు శపిస్తాడు.

6. ఒకసారి అష్టావక్ర మహర్షిని ఒక్క తన్ను తన్ని నీ అష్టవంకరలు సరి అవుతాయనగా అష్టావక్రుడు నిన్ను తలనుండి కాళ్ల వరకు కాళ్ల నుండి తల వరకు వానర మూక తంతారని శపిస్తాడు.

7. దత్తాత్రేయుడు మంత్ర జలంతో తన గురువుకు అభిషేకం చేయాలని తలచగా ఆ మంత్రజలాన్ని తన తలపై పోసుకున్న రావణుడ్ని నీ తల వానరుల కాళ్ల తన్నులతో అపవిత్రమవుతుందని శపిస్తాడు.

8. ద్వైపాయనుని సోదరిని అతని కళ్ల ముందే బలాత్క రించగా నీ సోదరి కూడా అలాగే అవమానించ బడుతుందని శపిస్తాడు.

9. తన భార్యతో విహారయాత్రకి వెళ్లి మాండవ్య మహ ర్షిని బాధించగా నిన్ను వానరాలు ఇలాగే బాధిస్తా యని శపిస్తాడు.

10. అత్రి మహర్షి భార్యను జుట్టుపట్టి ఈడ్చగా అత్రి మహర్షి నీ భార్యను కూడా వానరులు జుట్టుపట్టి ఈడ్చుకెళ్తారని శపిస్తాడు.

11. నారదుడ్ని 'ఓం' అనే మాటకు వివరణ కోరి చెప్పనందుకు నారదుని నాలుక కత్తిరిస్తాననగా నారదుడు నీ పది తలలు ఓ నరుడు ఖండిస్తాడని శపిస్తాడు.

12. రుతువర్మనుడి భార్య మదన మంజరిని బలా త్కరించగా రుతువర్ముడు ఓ నరుడి చేతిలో మరణి స్తావని శపిస్తాడు.

13. మోద్గల్య మహర్షి యోగ దండాన్ని రావణుడు తన చంద్రహాసంతో విరవగా ఆ మహర్షి నీ చంద్రహాసం ఇక శక్తిని కోల్పోతుందని శపిస్తాడు.

14. బ్రాహ్మణ బాలికలు ఓ కొలనులో స్నానం చేస్తుం డగా వారిని అవమానించగా వారి తల్లులు నీ కళ్లముందే నీ భార్య వానరులచే అవమానించ బడుతుందని శపిస్తారు.

15. రావణుడు అగ్ని భార్య స్వాహా దేవిని అతని ముందే అవమానించగా నీ ముందే నీభార్య వాన రులవల్ల అవమానించబడుతుందని అగ్ని శపిస్తాడు.

16. అవరణ్యుడను సూర్యవంశపు రాజు రావణుని వద్దకు ఆశ్రయం కోరి వెళ్లగా ఓ గుద్దుతో అతణ్ని చంపగా అతడు సూర్యవంశపు రాజే నిన్ను వధిస్తా డని శపిస్తాడు.

17. రావణుడు దేవలోకాన్ని జయించి వస్తుండగా బృహస్పతి కూతురు సులేఖాదేవి పారిపోబోగా రావ ణుడు ఆమెను వెంటాడగా బృహస్పతి రామ బాణా లచే వధింపబడతావని శపిస్తాడు.

18. బ్రహ్మ కుమార్తె పుంజికా దేవిని అవమానించగా బ్రహ్మ ఇష్టం లేని స్త్రీని తాకితే రావణుని తల 1000 ముక్కలవుతుందని శపిస్తాడు.

*విజయాలు–పరాభవాలు :* ఇతడు మరుత్తుడ్ని, కాలు డ్ని, తక్షకుడ్ని ఓడిస్తాడు. వాలి చేతిలో పరాభవించబడి అతడితో స్నేహం చేస్తాడు.

*రావణ వధ :* పంచవటి వద్ద రావణుని సోదరి శూర్ప ణఖ శ్రీరాముడ్ని వివాహమాడమని కోరగా నిరాకరి స్తాడు. తర్వాత లక్ష్మణుడ్ని కోరగా నిరాకరించడమే కాక ఆమె ముక్కు చెవులు కోసి పంపుతాడు. అందుకు ఉగ్రుడైన రావణుడు తన మాయా రూపంతో వచ్చి సీతను ఆశ్రమం నుండి ఎత్తుకుపోయి లంకలోని అశోకవనంలో బంధిస్తాడు. శ్రీరాముడు వానరుల సహాయంతో లంకకు వారధి నిర్మించి లంకపై దండెత్తి రావణుడ్ని సంహరిస్తాడు.

రావణుని వధ – చూ॥ రాముడు.

**రాశులు :** ఇవి పన్నెండు లగ్నాలు – మేషం, వృషభం, మిధునం, కర్కాటకం, సింహం, కన్య, తుల, వృశ్చికం, ధనుస్సు, మకరం, కుంభం, మీనం. ఇవి సౌర మాసంలో 'మాసాలు' అవుతాయి.

**రాష్ట్రపాలుడు :** యదువంశంలో జన్మించినవాడు. కంసుని తమ్ముడు.

**రాష్ట్రపాలిక :** ఉగ్రసేనుడి ఐదవ కూతురు, సృంజయుడి భార్య

**రాష్ట్రవర్ధనుడు :** దశరథుని మంత్రుల్లో ఒకడు.
– *అగ్నిపురాణం*

**రాష్ట్రుడు :** కాశి కొడుకు. ఇతడి కుమారుడు దీర్ఘతపుడు.
– *భాగవతం*

**రాహువు :** సింహిక కొడుకు. ఓ రాక్షసుడు. విష్ణువు అమృతాన్ని దేవతలకే పంచుతున్నాడని తెలిసి దేవతల వరుసలో కూర్చుంటాడు. సూర్యచంద్రులీ విషయాన్ని విష్ణువుతో చెప్పగా తన చక్రంతో ఇతని తల ఖండిస్తాడు. అమృతం సేవించడం వల్ల ఇతని తల సజీవంగా వుంటుంది. అప్పుడప్పుడు ఇతడు సూర్య చంద్రుల్ని కబళిస్తుంటాడు. అప్పుడే సూర్య చంద్ర గ్రహణాలు ఏర్పడతాయి. – *భారతం*

రాహువు సూర్యుడికి 10,000 యోజనాల క్రిందవుంటాడు.
– *భాగవతం*

రాహువును దేవాలయాలలో అర్ధచంద్రుడిని తలపై ధరించినట్లుగా ప్రతిష్టిస్తారు. – *అగ్నిపురాణం*

**రాహోదరుడు (రహోదరుడు) :** ప్రాచీనకాలంలో ఓ రుషి. ఓ కపాలం ఇతని మెడపై పడగా దానిని అతడి మెడ నుండి తీసి క్రిందపడవేసిన ప్రాంతాన్ని కపాల మోచనం అని పిలవబడింది. శ్రీరాముడు తన బాణంతో దానవుల్ని సంహరించగా ఆకాశానికి రాక్షసుడి తల ఎగిరిపడి ముని మెడకు గుచ్చుకుంది. అది ఎంతకూ రాకపోవుటచే అలానే అన్ని పుణ్య క్షేత్రాలు దర్శించి రుషుల సలహాపై ఔశానస తీర్థంలో స్నానం చేయగా ఆ కపాలం విడిపోయింది. అప్పటి నుండి కపాల మోచన తీర్థమని పిలవబడుతోంది.
– *వామనపురాణం*

**రాళ్లవాన :** నందాదులు వర్షము కురియుటకు ఇంద్ర యాగము చేయబూని శ్రీకృష్ణుని సలహా కోరగా ఎవరికర్మకెవరు బాధ్యులు, వర్షము కురవకున్న ఇంద్రుడేమి చేయగలడని చెప్పగా ఇంద్రుడు కోపించి యాదవులపై రాళ్ల వర్షం కురిపించగా వారు శ్రీకృష్ణునితో మొరపెట్టుకొనిరి. అంతట శ్రీకృష్ణుడు గోవర్ధనగిరిని పైకెత్తి గొడుగువలె పట్టుకొనగా అందు యాదవులు పశువులు తలదాచుకొనిరి. 7 దినములైనా వారికి నష్టము జరుగకుండుట ఇంద్రుడు గ్రహించి శ్రీకృష్ణుని మహిమ నెరిగి అతడిని శరణు వేడెను. – *భాగవతం*

**రిపుడు :** ధ్రువుని మనుమడు. శంభువల్ల ధ్రువునికి శిష్ఠి, భవ్య జన్మించారు. శిష్ఠికి అతని భార్య సుభయ వల్ల జన్మించిన ఐదుగురు పుత్రుల్లో రిపుడు ఒకరు. రిపునికి అతని భార్య బృహతివల్ల చాక్షుష మనువు జన్మించాడు. – *విష్ణుపురాణం*

**రిపుంజయుడు 1 :** కండల నగర రాజైన సురతుని కుమారుడు. శ్రీరాముని అశ్వాన్ని పట్టుకున్నపుడు శత్రుఘ్నుడికి సురతునికి జరిగిన గొప్ప యుద్ధంలో రిపుంజయుడు కూడా పాల్గొన్నాడు. – *పద్మపురాణం*

**రిపుంజయుడు 2 :** ఓ బ్రాహ్మణుడు. ఆ తర్వాత ఇతడే దివోదాసుగా జన్మించాడు. కాశీనగరంలో అగ్నిలేనప్పుడొకసారి ఇతడే అగ్నిగా వ్యవహరించాడు.

**రిపుంజయుడు 3 :** రిపుని సోదరుడు చూ॥రిపుడు.

**రిభులు :** రుగ్వేదకాలంనాటి ఓ మానవ తెగ. వీరు చేతి వృత్తులు ఆధారంగా జీవించేవారు.
– *చూ॥ రుగ్వేదం*

**రుక్షదేవుడు :** శిఖండి కుమారుడు. ఇతడి అశ్వం తెలుపు ఎరుపు రంగుల్లో వుంటుంది. – *మహాభారతం*

**రుక్షయుడు :** పూరు వంశస్థుడు. మహావీర్యుడి కుమారుడు. ఇతని కుమారులు పుష్కరారుణి, కవి, త్రయ్యారుణి. వీరి సంతతి వారు బ్రాహ్మణులయ్యారు.

**రుక్షరజసుడు :** వాలి సుగ్రీవుల పెంపుడు తండ్రి. కిష్కింద రాజు. అహల్య పెంచిన వాలి సుగ్రీవులను ఆమె అనుమతితో తీసుకువచ్చి పెంచాడు.
– *ఉత్తర రామాయణం*

*జన్మవృత్తాంతం :* మేరు పర్వతంపై బ్రహ్మ తపస్సు చేస్తుండగా అతడి కన్నీళ్ళు అతడి దోసిలిలోనే పడ్డాయి. ఆ కన్నీటి నుండి రుక్షరజసుడు జన్మించాడు. ఒకసారి ఇతడు దాహంతో ఓ కొలను వద్దకు వెళ్లి వంగి చూడగా అతడి రూపము నీళ్లలో కన్పించగా శతృవనుకొని కొలనులో దూకి బైటకు వచ్చాడు. కొలనులో నుండి బయటకు రాగా స్త్రీ రూపుడయ్యాడు. సూర్యచంద్రులు ఆ అందం చూసి వీర్యం స్రవించగా

సూర్యుని వీర్యం ఆమె తలపై, చంద్రుని వీర్యం మెడపై పడి అందుండి వాలి సుగ్రీవులు జన్మిం చారు. ఆ రాత్రి గడిచిన తరువాత పురుషరూపం పొందిన రుక్ష రజసుడు వారిని బ్రహ్మ వద్దకు తీసుకు వెళ్లాడు. బ్రహ్మ రుక్షరజసుడిని కిష్కిందకు రాజును చేయగా తదనంతరం వాలి రాజయ్యాడు. – రామాయణం

**రుక్షవానం :** ప్రాచీన భారతదేశంలోని ఏడు పర్వతాలలో ఒకటి. – మహాభారతం

**రుక్షవిరజుడు :** రుక్షరజసుడని కూడా అంటారు. చూ॥ రుక్షరజసుడు.

**రుక్షశృంగుడు :** దీర్ఘ తపసుని చిన్న కుమారుడు. కాశీకి ఉత్తరాన ఇతడు తపస్సు చేస్తుండగా చిత్ర సేనుడితణ్ణి వధించగా ఇతని సహచరులు ఆత్మహత్య చేసుకున్నారు. దీర్ఘతపసుడు వీరి ఎముకల్ని శూలభావ తీర్థమనే పుణ్యస్థలంలో పాతిపెట్టగా వీరంతా స్వర్గం చేరారు. – స్కందపురాణం

**రుక్మకేశుడు :** విదర్భ రాజైన భీష్మకుని ఐదుగురు కుమారుల్లో చిన్నవాడు. – *భాగవతం*

**రుక్మధరుడు :** రుక్మి తమ్ముడు. – *భాగవతం*

**రుక్మనేత్రుడు :** రుక్మి తమ్ముడు. – *భాగవతం*

**రుక్మబాహువు :** రుక్మి సోదరుడు. – *భాగవతం*

**రుక్మరథుడు 1 :** మద్రదేశాధీశుడైన శల్యుని కుమారుడు. ఇతడు ద్రౌపది స్వయంవరానికి వచ్చాడు. శ్వేతుని అస్త్రానికి కురుక్షేత్రయుద్ధంలో మూర్చిల్లాడు. అభిమన్యుడితణ్ణి వధించాడు. – మహాభారతం

**రుక్మరథుడు 2 :** ద్రోణాచార్యునికి మరోపేరు. బంగారు రథంపై పయనించేవాడు కనుక ఈ పేరొచ్చింది. – మహాభారతం

**రుక్మరథులు :** త్రిగర్త రాజుల్లో ఒక తెగ. వీరు కౌరవుల పక్షాన పోరాడారు. – మహాభారతం

**రుక్మరేఖ :** ఏకావలి తల్లి. రైభ్యుడను రాజు భార్య. – *చూ॥ ఏకావలి*

**రుక్మలోచన :** రుక్మ మనుమరాలు. అనిరుద్ధుడి భార్య. – *చూ॥ అనిరుద్ధ చరిత్రము*

**రుక్మశుక్రుడు :** ఉత్తానపాదుని సోదరుడైన ప్రియవ్రతుని కుమారుడు. ప్రజాపతి విశ్వకర్మ తన కుమార్తెలైన సురూప, బర్హిష్మతిలను ప్రియవ్రతుడికిచ్చి వివాహం చేయగా వారికి జన్మించిన సంతానంలో రుక్మశుక్రు డొకరు.

**రుక్ష :** చంద్రవంశపు రాజైన అజమీఢుని భార్య. – మహాభారతం

**రుక్మాంగదుడు 1 :** మద్రరాజైన శల్యుని కుమారుడు. రుక్మరథుని సోదరుడు. ద్రౌపది స్వయంవరానికి వచ్చాడు. – మహాభారతం

**రుక్మాంగదుడు 2 :** విష్ణుభక్తుడైన ధర్మాంగదుని తండ్రి. విధీషరాజైన రుతధ్వజుని కుమారుడు. – *చూ॥ ధర్మాంగదుడు.*

**రుక్షాంబిక :** స్కంద దేవుని అనుచరి. – మహాభారతం

**రుక్మావతి :** ప్రద్యుమ్నుడి భార్య. రుక్మి కుమార్తె. వీరి కుమారుడు అనిరుద్ధుడు. – *భాగవతం*

**రుక్మి :** విదర్భ రాజ్యంలోని భోజకర ప్రాంతాన్ని పాలించిన రాజు. క్రోధవశుడను రాక్షసుని అంశవల్ల జన్మించాడు. – మహాభారతం

భీష్మకునికి ఇద్దరు సంతతి రుక్మి మరియు రుక్మిణి. రుక్మి సోదరి రుక్మిణిని శ్రీకృష్ణుడు బలవంతంగా తీసుకుపోగా రుక్మి శ్రీకృష్ణుని చేతిలో అవమానించబడి శివుని గూర్చి తపస్సుచేసి ఓ విల్లును బహుమతిగా పొందాడు. శివుడు మహావిష్ణువుపై ఎక్కు పెడితే మాత్రం విరుగుతుందని చెప్తాడు.

స్కందదేవుడు ఆ ప్రాంతంలో జైత్రయాత్ర చేసినపుడు, తర్వాత కర్ణుడు జైత్రయాత్ర చేసినపుడు వారి ఆధిపత్యాన్ని అంగీకరించాడు. ఇతడు ద్రుముడి వద్ద అస్త్ర విద్యనభ్యసించి శ్రీకృష్ణునితో యుద్ధంచేసి భోజకటకం వద్ద ఓడిపోయాడు. శ్రీకృష్ణునిపై పగ పెంచుకున్నాడు. మహాభారత సమయంలో పాండవులు ఇతణ్ణి ఆహ్వానించగా అర్జునుడు యుద్ధం చేయడానికి భయపడినపుడు తాను వస్తానని చెప్పి అర్జునుడిని హేళన చేసి దుర్యోధనుని పక్షాన పోరాడటానికి వెళ్లగా అచ్చట పరాభవం చెందుతాడు. – మహాభారతం

*రుక్మి మరణం :* నిర్వీర్యంగా భోజకటకంలో నివసిస్తుండగా కళింగరాజు బలభద్రరాముడితో పాచికలాడమని సలహా ఇస్తాడు. బలభద్రరాముడికి పాచికలాట చేతకాకున్నా అతడి ఆహ్వానాన్ని మన్నించి రుక్మితో పాచికలాడి ఓడిపోతాడు. రెండవసారి బలభద్రుడు

గెలుస్తాడు. ఈ ఓటమిని రుక్మి, కళింగ రాజు అంగీకరించరు. రాజులంతా రుక్మితరఫునే నిలబడగా ఆకాశ వాణి బలభద్రుడు గెలిచాడని పల్కగా వారు సభంతా భగ్నంచేయబోగా బలరాముడు ఓ ఇనుప గునపంతో రుక్మిని మోది చంపగా తక్కిన రాజులు పారిపోయారు. – *భాగవతం*

**రుక్మిణి :** పురాణాలు రుక్మిణి లక్ష్మీదేవి అవతారమని చెప్తున్నాయి. లక్ష్మీదేవి అంశ భీష్మకుని కుమార్తెగా జన్మించింది. – *మహాభారతం*

మొదట లక్ష్మీదేవి భృగు ఖ్యాతిలకు జన్మించగా తర్వాత మహావిష్ణువు పరశురాముడుగా జన్మించగా లక్ష్మి భూమిపుత్రిగా, రామావతారంలో సీతగా, శ్రీకృష్ణావతారంలో రుక్మిణిగా జన్మించింది. – *విష్ణుపురాణం*

భీష్మకునికి 5 గురు పుత్రుల తర్వాత రుక్మిణి జన్మించింది. కుమారుల్లో పెద్దవాడు రుక్మి. ఇతడు శ్రీకృష్ణుని విరోధి. రుక్మిణి శ్రీకృష్ణుడ్ని వరించగా ఇతడు అంగీకరించకపోవుటచే శ్రీకృష్ణుడు రుక్మిణిని తన రథంలో తీసుకుపోగా బలరాముడు రుక్మిని, అతని సైన్యాన్ని ఓడించాడు.

శ్రీకృష్ణ రుక్మిణులకు 10 మంది పుత్రులు. వారు ప్రద్యుమ్న, చారుదేష్ణ, సుదేష్ణ, చారుదేహ, సుచారు, చారుగుప్త భద్రచారు, చారుసుందర, చారుభద్ర మరియు చారు.

శ్రీకృష్ణుడి నిర్యాణానంతరం అర్జునుడు ద్వారకకు రాగా అతనిని రుక్మిణి ఉపశమింప జేసి బంగారు ఆసనంపై ఆశీనుణ్ణి చేసింది. ఆ తర్వాత శ్రీకృష్ణుని ఇతర భార్యలతో కలసి చితిలో దూకి మరణించింది. – *భాగవతం*

**రుకుడు :** ఇక్ష్వాకు వంశస్థుడు. విజయుడి కుమారుడు. వృకుడి తండ్రి.

**రుక్కు :** వేదాలలో చిన్న భాగం. భగవంతుడి ముఖం నుండి వెలువడిన వేదాలు 4 విభాగాలు రుక్కు అనే పదంతో మొదలవుతాయి. రుక్కు అనగా దైవప్రార్థన.

**రుక్షుడు 1 :** పూరు వంశపు రాజు. ఇతడి తండ్రి సంవర్గుడు. – *మహాభారతం*

**రుక్షుడు 2 :** హరిహుడను రాజుకు సుదేవ వల్ల జన్మించిన కుమారుడు. రుక్షుడికి జ్యాతవల్ల మతి నారుడు జన్మించాడు. – *మహాభారతం*

**రుక్మడు 1 :** అర్జునుడి సారథి. ధర్మరాజు చేసే యజ్ఞోపకరణాలు తేవడానికి ఇతణ్ణి నియమించారు. – *మహాభారతం*

**రుక్మడు 2 :** యదు వంశంవాడు. రుచికుడి కుమారుడు. జ్యామఘుడి సహోదరుడు.

**రుక్మేషువు :** యదువంశంలోని వాడు. రుచికుడి కుమారుడు. జ్యామఘుడి సహోదరుడు. – *మహాభారతం*

**రుగ్వేదం :** ప్రపంచంలోనే అతి ప్రాచీనమైన గ్రంథం రుగ్వేదం. ఈజిప్ట బాబిలోనియన్లు కూడా తమ గ్రంథాలు అతి ప్రాచీనమని చెప్పినా పండితులు రుగ్వేదమే అతి ప్రాచీనమైనదని చెప్తున్నారు. వేదాలలో రుగ్వేదం మొదటిది. తక్కినవి యజుర్వేదం, సామవేదం, అధర్వణ వేదాలు. రుగ్వేదం 10 మండలాలుగా విభజించబడింది. 1017 సూక్తాలు, 10472 రుక్కులు ఇందులో వున్నాయి. ఈ సూక్తాలన్ని దైవప్రార్థనలే. ఆర్యులు భారతదేశంలో అడుగిడినపుడు వారి అనుభవాలే ఈ సూక్తాలు. ఇవి క్రీ.పూ. 2,500–2000 కాలంలో రచించబడినాయి.

*ప్రాచీన భావన :* బ్రహ్మణుల ముఖాల నుండి 4 వేదాలు జనించాయి. కృతయుగంలో వీటిని బ్రహ్మతన కుమారులకిచ్చాడని, ద్వాపరయుగంలో రుషులకు ఇవి లభించాయని, ద్వాపరయుగంలో మహావిష్ణువు వేదవ్యాసుడుగా జన్మించి ధర్మాన్ని నిలబెట్టడానికి వేదాలను తన కుమారులకు, శిష్యులకు చెప్పాడని చెప్పబడింది. – *భాగవతం*

**రుచక పర్వతం :** మహామేరువు దగ్గరలో గల ఒక పర్వతం. – *దేవీ భాగవతం*

**రుచకుడు :** ఉశనుడి కొడుకు. జ్యామఖాదులు ఇతని కుమారులు. – *భాగవతం*

**రుచి 1 :** అలకాపురిలోని ఓ అప్సరస. అష్టావక్రుడు కుబేరుని సభకు వెళ్లినపుడు ఈమె నృత్యం చేసింది.

**రుచి 2 :** దేవశర్మ అనే రుషి భార్య. – చూ॥ విపుల

**రుచి 3 :** బ్రహ్మ అనే ప్రజాపతి కుమారుడు. మను స్వాయంభవు కుమార్తె ఆకూతిని ఇతడు వివాహమాడగా ఓ కుమారుడు, ఓ కుమార్తె జన్మించారు. కుమారుడు విష్ణువు యొక్క అవతారమైన యజ్ఞుడు. మహాలక్ష్మి అవతారమైన కుమార్తె పేరు దక్షిణ. యజ్ఞుడు

రుచి ఇంట పెరగగా, దక్షిణ స్వాయంభువు వద్ద పెరిగింది. వారిద్దరు వివాహమాడగా 12 మంది కుమారులు జన్మించారు. మనుస్వాయంభువు కాలంలో వీరు తుషితులనే దేవతలు.

**రుచికుడు 1 :** అజిగర్తుడని కూడా అంటారు. ప్రసిద్ధ రుషి. ఇతడు పరశురాముడి తాత. జమదగ్నికి తండ్రి. చంద్ర వంశపు రాజైన గాధికి సత్యవతి అను కుమార్తె కలదు. రుచికునికి ఈమెను వివాహమాడాలనే కోర్కె వెల్లడించగా నల్లని చెవులున్న 1000 గుర్రాలను ఇస్తే తనకంగీకారమేనని తెల్పగా రుచికుడు వరుణుడిని పూజించగా గంగా నది నుండి 1000 గుర్రాలు పైకి లేచాయి. వాటిని గాధికిచ్చి సత్యవతిని వివాహమాడి అరణ్యాలకు వెళ్లాడు. ఒకరోజు సత్యవతి సంతానంకోసం రుచికుడిని ప్రార్థించగా ఉడికిన అన్నం రెండు ముద్దలు చేసి ఒకదానిలో బ్రహ్మతేజస్సు, మరో దానిలో క్షాత్రతేజస్సు నింపి సత్యవతికివ్వగా ఆమె ఓ ముద్ద తల్లికి ఇవ్వగా ఇద్దరూ గర్భవతులై ఒకరు జమదగ్నికి, మరొకరు విశ్వామిత్రుడికి జన్మనిచ్చారు. ఆ తర్వాత సత్యవతికి ముగ్గురు సంతానం కల్గారు. వారు శునఃపుచ్ఛ, శునశ్శేపుడు, మనోలాంగులు. అంబరీషుడు యాగం చేయతలపెట్టగా దానికి ఇంద్రుడు విఘ్నం తలపెట్టి యాగ సమిధ అయిన గోవును మాయం చేస్తాడు. పురోహితులు అదే గోవుకాని లేక ఓ మానవుడ్నిగాని బలిఇవ్వాలని చెప్పగా అంబరీషుడు ఆ గోవు దొరకక రుచికుడికి 100000 గోవులనిచ్చి శునశ్శేపుణ్ణి బదులుగా తీసుకుంటాడు. శునశ్శేపుడు విశ్వామిత్రునికి వివరించగా అతని బదులు తన కుమారుడిని ఇవ్వబోగా వారు నిరాకరిస్తారు. అప్పుడు నీవు వధ్య శిలపై నుండగా అగ్నిని ప్రార్థించమని అప్పుడు సిద్ధినొందగలవని చెప్తాడు. అతడు అలాగే చేయగా ఇంద్రుడు ప్రత్యక్షమై శునశ్శేపుడిని రక్షించి అంబరీషుని యాగానికి అనుమతిస్తాడు.

– రామాయణం

**రుచికుడు 2 :** 12 మంది ఆదిత్యుల్లో ఒకడు.

– మహాభారతం

**రుచికుడు 3 :** ధ్యుమాన్యుని కుమారుడు. భరతుని మనుమడు. – మహాభారతం

**రుచిపర్వుడు :** ఆకృతి అను రాజు కుమారుడు. భీమసేనుడ్ని రక్షించడానికి భగదత్తుని ఏనుగుతో పోరాడి మరణించాడు. – మహాభారతం

**రుచిరధుడు :** పూరు వంశస్థుడు.

**రుచిరాశ్వుడు :** చంద్రవంశపు రాజుల్లో ఒకడు.

– భాగవతం

**రుచేయువు :** పూరు వంశపు రాజు. విష్ణువు నుండి జనించిన రుద్రాశ్వుని కుమారుడు. ఈ వంశంలో వహుకుడు, యయాతి ప్రసిద్ధ రాజులు.

ఇతని తల్లి మిశ్రకేశి అను దేవత. ఇతనికి అన్యగ్భాను, అనావృష్టి అనే పేర్లు కలవు. ఇతని కుమారుడు మతినారుడు. – మహాభారతం

**రుజిశ్వుడు :** రుగ్వేదంలో ప్రస్తావించబడిన ఒక రాజు. ఇంద్రుడి సహాయంతో వంగృదుడి నగరాన్ని ముట్టడిస్తారు. – రుగ్వేదం

**రుజ్రాశ్వుడు :** రుగ్వేదం ప్రస్తావించిన ఓ రుషి. వృషాగిరుడి కుమారుడు. తండ్రే ఇతణ్ణి గుడ్డివాణ్ణి చేస్తాడు.

– రుగ్వేదం

**రుతధాముడు :** శ్రీకృష్ణుని మరో పేరు.

**రుతధ్వజుడు :** చూ॥ కువలయాశ్వుడు.

**రుతస్తుభుడు :** ఓ ముని. ఇతడు వరుణుడికి రుత్విక్కు.

– రుగ్వేదం

**రుతీయువు :** చూ॥ కళింగుడు.

**రుతుకాలం :** స్త్రీ పురుషుడితో సంభోగించడానికి సరైన కాలాన్ని రుతుకాలమంటారు. స్త్రీ గర్భం దాల్చడానికి పూర్వులు కొన్ని రోజులు సూచించారు. బైటచేరిన తర్వాత మగ శిశువు కావాలంటే సరి సంఖ్యలైన 4, 6, 8, 10, 12, 14 రోజులు. ఆడపిల్ల కావాలంటే 5, 7, 9, 11, 13, 15 రోజులు మంచివి.

– అగ్నిపురాణం

**రుతుడు 1 :** 11 మంది రుద్రుల్లో ఒకడు.

**రుతుడు 2 :** చూ॥ ప్రమృతుడు.

**రుతుపర్ణుడు :** ఇక్ష్వాకు వంశంలోని ఒక రాజు. భగీరధుని మునిమనుమడైన ఆయుతాయుసు కుమారుడు. ఇతడు అయోధ్యను పాలించాడు. నలుడు బాహుకుని పేరుతో ఇతడి రథాన్ని తోలాడు. దమయంతికి మరో వివాహం జరుగుతోందని తెలిసి రుతుపర్ణుడు నలుడు

రథసారధిగా వెళ్లాడు. మధ్య మార్గంలో నలుడి వద్ద నుండి అశ్వహృదయ విద్యను నేర్చుకొని అతనికి అక్ష హృదయమనే కళను నేర్పాడు. విదర్భకు వెళ్లిన తర్వాత మరో రూపంలోని నలుడ్ని గుర్తించి ఇద్దరూ కలుసుకొని అయోధ్యకు రుతుపర్ణుడితో వస్తారు. – మహాభారతం

**రుతువంతుడు :** ఒక రుషి. ముసలితనంలో ఓ కొడుకు పుడతాడు. అతడు పరమ దుర్మార్గుడవుతాడు. ఆ దుర్మార్గాన్ని చూసి రోగపీడితుడై కారణం తెలుసుకోవ డానికి గర్గుడి వద్దకు వెళ్తాడు. రేవతీ నక్షత్ర చతుర్థ పాదంలో పుట్టడం వల్ల ఇలా జరిగిందని చెప్తాడు. రుతువంతుడు కోపించి రేవతి కిందపడాలని శపిస్తాడు. రేవతి నక్షత్ర మండలం విడిచి కుముదగిరి మీద పడుతుంది. – మార్కండేయపురాణం

**రుతుస్థల :** ఓ దేవకన్య. అర్జునుడి జన్మదినోత్సవ వేడుకల్లో పాల్గొంటుంది. – మహాభారతం

**రుతేయువు 1 :** చంద్రవంశపు రాజు.

**రుతేయువు 2 :** పశ్చిమ ప్రాంతానికి చెందిన మహర్షి. వరుణుడి రుత్విక్కు. – మహాభారతం

**రుతంభరుడు :** ఓ ప్రాచీన రాజు. ఇతడు కామధేనువుని పూజించగా ఓ పుత్రుడు జన్మించాడు. ఆ కుమారుడు విష్ణు భక్తుడు. అతని పేరు సత్యవానుడు. శ్రీరాముని అశ్వమేధయాగ సమయంలో శతృఘ్నుడు సత్యవా నుడి నగరం దర్శించాడు. – పద్మపురాణం

**రుత్వ :** దేవగంధర్వ స్త్రీ. అర్జునుడి జన్మదినోత్సవ వేడుకల్లో పాల్గొంది. – మహాభారతం

**రుత్విక్కు :** యజ్ఞాన్ని నిర్వహించే పురోహితుడు లేక పండితుడు. – మనుస్మృతి

**రుద్రకేతువు :** ఓ రాక్షసుడు. ఇతనికి దేవాంతక నరాంతకులను ఇద్దరు కుమారులు. వీరి వీరత్వానికి సంతసించి నారుదుడు 'పంచాక్షరి మహా విద్య' నేర్పు తాడు. దానితో వారు గర్వాంధులు కాగా గణేశుడు వీరిని వధిస్తాడు. – *గణేశపురాణం*

**రుద్రకోటి :** ఉత్తర భారతదేశంలో ఓ పుణ్యస్థలం. ఒకసారి ఎందరో రుషులు ఇచట శివుని గూర్చి తపస్సు చేయగా లింగ రూపాలతో శివుడు దర్శనమిస్తాడు. అప్పటి నుండి అది పవిత్ర స్థలమయ్యింది. – మహాభారతం

**రుద్ర పదం :** భారతదేశంలోని ఓ పవిత్ర స్థలం. ఇచట శివుడిని గూర్చి పూజలు చేస్తే అశ్వమేధ ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**రుద్ర పర్వతం :** గంగ సమీపంలో గల ఒక పర్వతం.

**రుద్ర మార్గం :** ఓ పవిత్ర స్థలం. ఇచ్చట ఓ పగలు రాత్రి ఉపవాసంచేస్తే ఇంద్రలోక ప్రాప్తి కల్గుతుంది. – మహాభారతం

**రుద్రరోముడు :** సుబ్రహ్మణ్య స్వామి సేవకుడు. – మహాభారతం

**రుద్రసావర్ణి :** ఓ మనువు. – చూ॥ మన్వంతరాలు

**రుద్రసేనుడు :** ధర్మజునికి సహకరించిన ఒక రాజు. – మహాభారతం

**రుద్రాక్ష :** రుద్రవృక్షాల విత్తనాలు. భక్తులు ధరించే పవిత్రమైనవి. అసుర రాజైన త్రిపురాసురుడు లోకా లను అల్లకల్లోలం చేస్తుంటే దేవతలు శివుడికి మొర పెట్టుకోగా అతడిని వధించడమెలాగో ధ్యానిస్తు కూర్చున్నాడు. అలా 1000 దేవ సంవత్సరాలు నిశ్చ లంగా వుండగా అతడి కంటి నుండి కన్నీరు కారి భూమిపై పడి అందుండి రుద్రాక్ష వృక్షం జన్మించింది. సూర్యుని కాంతి నుండి 12 రకాలు, చంద్రుని కాంతి నుండి 16 రకాలు, అగ్ని కాంతి నుండి 10 రకాల రుద్రాక్షలు ఏర్పడ్డాయి. సూర్యకాంతి వల్ల రక్తపు రంగు రుద్రాక్షలు, చంద్రుని కాంతి నుండి తెలుపురంగు రుద్రాక్షలు, అగ్ని నుండి నలుపు రుద్రాక్షలు ఏర్పడినవి ఉడికిన రుద్రాక్షలను బ్రాహ్మణ కులమని, ఎరుపు వాటిని క్షత్రియులని, తెలుపుని వైశ్యకులమని, నలుపు రంగువి శూద్రకులమని అంటారు.

*గుణాలను బట్టి రుద్రాక్షలు :* రుద్రాక్షల ముఖాలను బట్టి వాటి గుణాలు నిర్ణయించబడ్డాయి.

*ఏకముఖి :* శివుని ఆకారం. ఇది బ్రహ్మహత్యాపాతక నివారిణి.

*ద్విముఖి :* గౌరీశంకరుడని చెప్తారు. తెలిసీ తెలియని తప్పుల నుండి నిష్కృతి లభిస్తుంది

*త్రిముఖి :* అగ్ని రూపం. స్త్రీ హత్యా పాతక నివారిణి.

*చతుర్ముఖి :* బ్రహ్మరూపం. నరహత్యా పాతక నివారిణి.

*పంచముఖి :* కాలాగ్ని రూపం. భుజించకూడనిది భుజించడం, పొందగోరని స్త్రీని పొందడంవల్ల కరిగే పాపం నశిస్తుంది.

*షణ్ముఖి :* కార్తికేయ రూపం. అన్ని పాపాల నుండి విముక్తి లభిస్తుంది.

*సప్తముఖి :* మన్మథ రూపిణి. బంగారం దొంగిలించిన పాపం నశిస్తుంది.

*అష్టముఖి :* వినాయక రూపిణి. కొలతల, తూకాల, గుణాల మోసం, క్రూర స్త్రీల సాంగత్యం వల్ల కల్గేపాపం నశిస్తుంది.

నవముఖి : భైరవరూపం. దైవ శక్తిగలవాడు. దైవభక్తుడై ముక్తి పొందుతాడు.

*దశముఖి :* జనార్ధనరూపం. రాక్షస, భేతాళ, దయ్యాల భయం నుండి ముక్తి లభిస్తుంది. పాముకాటుకు విరుగుడు లభిస్తుంది.

*ఏకాదశ ముఖి :* ఏకాదశ రుద్రుల రూపం. 1000 అశ్వమేధయాగాలు, 100 వాజపేయి యాగాల ప్రతిఫలం అభిస్తుంది.

*ద్వాదశ :* ద్వాదశాదిత్యుల రూపం. సూర్యదేవునికి అభిమానపాత్రుడై అశ్వమేధ గోమేధ ఫలితం లభిస్తుంది.

*త్రయోదశ :* కార్తికేయ ముఖం. లోకంలోని సంతోషాలన్ని లభిస్తాయి. ఇతడు నిజమైన పరమేశ్వరుడి స్వరూపం.

**రుద్రాణి :** పార్వతికి గల మరోపేరు. – చూ॥ పార్వతి

**రుద్రాణిరుద్ర :** ఒక పవిత్ర స్థలం. ఉత్తర దేశాలకు పయనిస్తూ అష్టావక్రుడు ఈ స్థలాన్ని దర్శించాడు. – మహాభారతం

**రుద్రావర్తం :** ఓ పవిత్ర స్థలం. ఇచ్చట స్నానం చేస్తే స్వర్గలోక ప్రాప్తి కల్గుతుంది. – మహాభారతం

**రుద్రుడు :** శివుని రూపాలలో ఒకటి. రుద్రుడు బ్రహ్మ సృష్టి. ప్రజాపతులను సృష్టించకముందు సనందన, సనక, సనాతన, సనత్కుమారులను సృష్టించాడు. వీరు సృష్టి చేయడానికి నిరాకరించగా బ్రహ్మ కోపంతో ముల్లోకాలను నశింపచేయబోగా ఆ వేడికి అతడి కనుబొమ్మల నుండి తీవ్రమైన కాంతితో రౌద్రంగా మధ్యాహ్నపు సూర్యుడిలా ఒకడు జన్మించాడు. అతని శరీరంలో సగ భాగం పురుషుడు కాగా మరో సగ భాగం స్త్రీ. శరీరాన్ని విడదీయమనగా స్త్రీ పురుషులుగా విడిపోయారు. పురుషుడ్ని మరల 11 భాగాలుగా విడగొట్టగా 11 మంది రుద్రులయ్యారు. ఈ ఏకాదశ రుద్రులను రకరకాల పురాణాల్లో రకరకాల పేర్లతో పిలుస్తారు. ఓ పురాణం ప్రకారం మన్యు, మను, మహినస, మహాన్, శివ, రుతుధ్వజ, ఉగ్రరేతసు, భావ, కామ, వామదేవ, ధృతవ్రత. ఇంకొన్ని పురాణాల్లో అజ, ఏకపాద, అహిర్‌బుధ్న్య, త్వష్ట, రుద్ర, హర, శంభు, త్ర్యంబక, అపరాజిత, ఈశన, త్రిభువన రుద్రుడు పురుషుడు స్త్రీగా విడినప్పుడే స్త్రీ భాగం కూడా 11 భాగాలయ్యింది. వారిని రుద్రాణిలని పిలుస్తారు. వారుధీ, వృత్తి, ఉషన, ఉమ, నియుత, సర్పిస్, ఇలా, అంబిక, ఐరావతి, సుధా, బిక్ష. ఈ 11 మంది రుద్రాణిలు 11 మంది రుద్రుల్ని వివాహమాడారు. *ఇతర విశేషాలు :* జననం, జీవితం గురించి వివిధ పురాణాలు ఇలా పేర్కొన్నాయి.

1. ప్రజాపతి కశ్యపుడికి అదితివల్ల 33 మంది సంతానం వారు ఆదిత్యులు, వసువులు, రుద్రులు, అశ్వినిలు. – రామాయణం

2. బ్రహ్మ రౌద్రం నుండి రుద్రుడు, తొడల నుండి నారదుడు, కుడి బొటన వేలి నుండి దక్షుడు, మనసు నుండి సనకాదులు, ఎడమ బొటన వ్రేలినుండి వీరణి అనే కుమార్తె జన్మించారు. – *దేవీ భాగవతం*

3. బ్రహ్మ కల్పం మొదట తనలాంటి పుత్రుడు కోసం ధ్యానించగా అతడి తొడ నుండి ఓ బాలుడు జన్మించి రోధిస్తున్నాడు. బ్రహ్మ అతనికి రుద్రుడని నామకరణం చేశాడు. అతనికి మరో 7 పేర్లు పెట్టాడు. అనగా 8 మంది రుద్రులు అవతరించారు. బ్రహ్మ వారికి భార్యలను, సంతానాన్ని ఇచ్చాడు. ఈ రుద్రుడు దక్షప్రజాపతి కుమార్తె సతిని వివాహమాడాడు. ఇతర విశేషాలకు – చూ॥ *శివుడు.*

**రుద్రులు :** బ్రహ్మ మానసపుత్రులు. వీరు 11 మంది. 1. అజుడు, 2. ఏకపాదుడు, 3. అహిర్బుధన్యుడు, 4. హరుడు, 5. శంభుడు, 6. త్ర్యంబకుడు 7. అపరాజితుడు, 8. ఈశానుడు. 9. త్రిభువనుడు, 10. త్వష్ట, 11. రుద్రుడు.

**రుధిరాంభసం :** ఓ నరకం.

**రుధిరాశనుడు :** ఖరుని ఆధ్వర్యంలో శ్రీరామునితో యుద్ధంచేసిన రాక్షస వీరుల్లో ఒకడు. శ్రీరాముని బాణానికి వీరంతా హతులయ్యారు. – రామాయణం

**రుధిరుడు :** ఒక రాక్షసుడు. వశిష్ఠుడి కొడుకైన శక్తి మొదలగు వారిని మింగాడు. *- లింగపురాణం*

**రుద్ధి :** వరుణుని భార్య. *- మహాభారతం*

**రుద్ధిమానం :** ఓ గొప్ప సర్పం. గరుడుడు దీన్ని చంపాడు. *- మహాభారతం*

**రుభుమహర్షి :** ఓ ప్రాచీన మహర్షి. బ్రహ్మ కొడుకు. మహాపండితుడు. నిదాఘుడికి అన్ని విద్యలు నేర్పు తాడు. కాని నిదాఘుడికి అద్వైతం మీద మక్కువ లేనందుకు విచారిస్తాడు. కాని తర్వాత దాని మీద కూడా మక్కువ కల్గిస్తాడు. *- విష్ణుపురాణం*

**రుభువులు :** ఓ శాఖకు చెందిన దైవిక శక్తి కలవారు. దేవతలు కూడా వీరిని పూజిస్తారు. బ్రహ్మ కుమారుడైన అంగిరసుడికి సుధాన్యుడను కుమారుడు జన్మించాడు. సుధాన్యునికి ముగ్గురు కుమారులు. వారు రుభుక్షానుడు, విభ్యానుజు, వాజుడు. వీరి ముగ్గుర్ని రుభువులని పిలుస్తారు. *- రుగ్వేదం*

*రుభువులు–మాంత్రికత :* ఒకసారి ఓ రుషి గోవు మరణించగా దూడ ఏడుస్తుంటే ఓ ఆవును చేసి చనిపోయిన ఆవు చర్మాన్ని దానికి తొడిగగా దూడ తల్లిగా నమ్మింది. వీరు వీరి తండ్రిని వృద్ధాప్యం నుండి యువకుల్ని చేశారు. వీరు ఇంద్రుని గుర్రాలను, అశ్వనీ దేవతల రథాన్ని, బృహస్పతి గోవును సృష్టించారు. *- రుగ్వేదం*

**రుభుక్షానుడు :** రుభువులనబడే ముగ్గురిలో పెద్దవాడు.

**రుమ 1 :** దేవాసురులు క్షీరసాగర మదనం చేసినపుడు అమృతానికి ముందు ఎన్నో వెలలేని జీవజాలం స్వర్గంలో నివసించే 10 మంది అప్సరసకన్యలు ఉద్భవించారు. అందులో మహాలక్ష్మి, తార, రుమ కొందరు. *- కంభరామాయణం*

**రుమ 2 :** సుగ్రీవుని భార్య. ఈమె పనసుడను వానరుని కూతురు. *- బ్రహ్మాండపురాణం*

సుగ్రీవుడ్ని కిష్కింద నుండి బహిష్కరించినపుడు వాలి ఈమెను తనతో బలవంతంగా వుంచుకున్నాడు. వాలి మరణానంతరం సుగ్రీవుని వద్దకు తిరిగి వచ్చింది. *- రామాయణం*

**రుమకుడు :** ఇక్ష్వాకు వంశంలో ఒక రాజు. ఇతడు అర్థశాస్త్రంలో, పరిపాలనలో పండితుడు. *- హరివంశం*

**రుమణ్యాముడు 1 :** సుప్రతిపుని కొడుకు. ఉదయనుడి సైన్యానికి నాయకుడు. *- చూ॥ ఉదయనుడు*

**రుమణ్యాముడు 2 :** జమదగ్ని రేణుకలకు జన్మించిన పెద్ద కుమారుడు. జమదగ్ని రేణుకను సంహరించమని ఆదేశించగా తల్లిని సంహరించడానికి నిరాకరించి జమదగ్ని శాపానికి గురౌతాడు. *- మహాభారతం*

**రురుడు 1 :** పురాణ ప్రసిద్ధుడైన రుషి. భృగు పులోమలకు చ్యవన మహర్షి జన్మించాడు. చ్యవనుని కుమారుడు ప్రమతి. ప్రమతికి ప్రమాతి అనే అప్సరస వల్ల రురుడు జన్మించాడు. *- దేవీ భాగవతం*

ఇతడు విశ్వావసు కుమార్తె ప్రమద్వరను ప్రేమించి వివాహమాడ బోవుచుండగా వివాహ సమయం సమీపిస్తుండగా ఓ పాము కాటుకు ప్రమద్వర మరణించింది. రురుడిది చూసి గంగలో మునిగి పైకి లేచి తన దోసిలిలో గంగ నీటిని వుంచి "దేవుని దయవల్ల దైవభక్తి గురుభక్తి వేదాధ్యయనం గాయత్రి జపం, ప్రార్థనలు ధ్యానం, తపస్సు, పుణ్యాగ్నికి నేనిచ్చిన సమిధలు సత్యమే అయితే ప్రమద్వర జీవించుగాక"! అని పల్కగా స్వర్గం నుండి దూత ప్రత్యక్షమై నీ జీవిత కాలంలో సగం ఆమెకు వదలితే ఆమె బ్రతుకుతుందనగా రురుడు అంగీకరించాడు. ఆమెను వివాహమాడాడు. *- దేవీభాగవతం*

సర్పాలంటే అప్పటి నుండి పగ పెంచుకొని సర్పాల వేట మొదలుపెట్టి కన్పించిన సర్పాలను చంపేవాడు. జనమేజయుని సర్పయాగం పట్ల రురుడికి పట్టరాని సంతోషం వుండేది. *- మహాభారతం*

**రురుడు 2 :** ఓ శక్తివంతుడైన రాక్షసుడు. బ్రహ్మ నుండి వరాలు పొంది దేవతలను బాధించేవాడు. దేవతలు ఇతని చేతిలో ఓడిపోయి నీలపర్వతం వెళ్లి శక్తి అనే దేవత పాదాలపై పడ్డారు. శివుని జటాజూటం నుండి శక్తి జన్మించింది. రురుడు దేవతలను అనుసరించి నీల పర్వతం తన సైన్యంతో వెళ్లాడు. ఆమె భయంకరమైన నవ్వుకి ఎన్నో భూతాలు జనించి రురుడి సైన్యాన్ని చంపగా శక్తి తన కాలి గోటితో రురుడ్ని వధించింది. - పద్మపురాణం

**రురువు :** భైరవులలో ఒకడు. - చూ॥ భైరవులు

**రుశంకుడు :** భేరుశంకుడి మరోపేరు.

**రుశముడు :** వేదాధ్యయనం చేసిన పండితుడు. కురు క్షేత్రం చుట్టూ తిరిగిరావడం వల్ల ప్రపంచ పర్య టన చేసిన ఫలితం పొందాడు. - పంచవింశ బ్రాహ్మణం

**రుషగిరి :** మగధదేశంలో వరాహపర్వతం ఎదుట వుండే పర్వతం

**రుషంగుడు :** ఓ ప్రాచీన రుషి. ఒకసారి అరిష్ట సేనుడను రుషి ఇతడి ఆశ్రమానికి వచ్చి ఘోర తపస్సు చేశాడు. విశ్వామిత్రుడిక్కడే తపస్సు చేసి బ్రాహ్మణత్వం పొం దాడు. రుషంగుడు అతని పుత్రులు జీవిత చరమాం కంలో పృథూదక తీర్థం వచ్చి ఆ తీర్థాన్ని గూర్చి పొగుడుతూ పాడారు. ఇచట తపస్సు చేసి ఈ తీర్థంలో స్నానం చేస్తే మరణానంతరం బాధలుండ వని చెప్తారు. - మహాభారతం

**రుషద్రథుడు :** అంగ కుటుంబంలోని ఒక రాజు. పైలుని తండ్రి. తితిక్షు కుమారుడు. వ్యాసుని శిష్యపరంపర లోని వాడు. - అగ్నిపురాణం

**రుషద్రుడు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. యముని కొలువులో సభ్యుడు. - మహాభారతం

**రుషభకూటం :** చూ॥ రుషభ పర్వతం.

**రుషభతీర్థం :** అయోధ్యలో గల ప్రాచీన పుణ్య కొలను. ఇచటి తీర్థంలో ఉపవాసం వుంటే 1000 గోవుల దానం, రాజసూయ యజ్ఞంతో సమానం. - మహాభారతం

**రుషభ ద్వీపం :** సరస్వతీ నదీతీరాన గల ఓ పుణ్యతీర్థం. ఇచ్చట స్నానం చేస్తే దేవ విమానం లభిస్తుంది. - మహాభారతం

**రుషభ పర్వతం :** మహామేరువుకు చుట్టూ 20 పర్వతాలు న్నాయి. రుషభ పర్వతం అందులో ఒకటి.

**రుషభుడు 1 :** చంద్రవంశపు రాజు. ఉపరిచర వసువు మునిమనుమడు ఇతడు ద్రోణుడు పన్నిన గరుడ వ్యూహంలో వుండి పోరాడాడు. - మహాభారతం

**రుషభుడు 2 :** ఓ నాగువు. ధృతరాష్ట్రుని కుటుంబంలో జన్మించి జనమేజయుని సర్పయాగంలో మరణించింది. - మహాభారతం

**రుషభుడు 3 :** ఓ అసురుడు. - మహాభారతం

**రుషభుడు 4 :** అగ్నీధ్రుని మనుమడైన ఓ ముని. ఇతడు నాభి అనే రాజుకు మేరుదేవి వల్ల జన్మించాడు. ఇతనికి జయంతి అనే భార్యవల్ల 100 మంది కుమా రులు జన్మించారు. రాజ్యాన్ని తన పెద్ద కుమారు డైన భరతునికి అప్పగించి పులహుని ఆశ్రమంలో తపస్సు చేశాడు.

*రుషభుడు-రుషభకూటం :* రుషభుడు అరణ్యంలో చాలా కాలం తపస్సు చేశాడు. అతడు తపస్సు చేసిన పర్వత శిఖరాన్ని రుషభ కూటమనేవారు. రుషభుడు దాని చుట్టుప్రక్కల ప్రశాంతత వుండటం కొరకు ఎవరిని ఆ ప్రాంతానికి రావడం ఇష్టదేవాడు కాదు. ఎవరైనా ఆ పర్వతం ఎక్కితే రాళ్లు మీద పడతాయని శపించాడు. ఆ పర్వతం ప్రక్కన వెళ్లే గాలిని కూడా నిశ్శబ్దత పాటించమని శాసించాడు. రుషభకూటంలో శబ్దం చేస్తే పిడుగు పడుతుంది.

*రుషభుని యాగశక్తి :* ఇతడు వానప్రస్థాన విధులనను సరించి తపస్సుచేశాడు. శాస్త్ర సమ్మతమైన యాగాలు చేశాడు. ఇతని నిష్టవల్ల శరీరం శుష్కించి నరాలు కూడా కన్పించాయి. శరీరాన్ని త్యజించ దలచి అరణ్యంలో తిరుగుతుండగా అగ్నికి ఆహుతై శివలోకం చేరాడు. - విష్ణుపురాణం

**రుషముడు :** ఓ పురోహితుడు. వేదాలను అధ్యయనం చేసినవాడు. పంచవింశ బ్రాహ్మణంలో ఇతణ్ణి గురించిన వివరణ వుంది.

**రుషర్జికుడు :** ఓ క్రూరుడైన రాజు. సౌరాష్ట్ర వంశంలోని వాడు. - మహాభారతం

**రుషాభాన :** హిరణ్యాక్షుడి భార్య. - భాగవతం

**రుషి :** 'ర' అనే అక్షరం అర్థం శబ్దమని, రుషి అనేపదం అక్షరానికి మూలమని వ్రాతలేనప్పుడు వేదాలు, శాస్త్రాలు, వీరి నోటినుండి వెలువడినవి. 'ఆర్ష' భారత పదాలు కూడా రుషుల నోటినుండి వెలువడినవి. వేదాలు రుషుల ఉత్తేజం, ఆధ్యాత్మిక దృష్టికల్గి వెలువడినవి. - అగ్నిపురాణం

భారతదేశం ఎందరో రుషులకు జన్మనిచ్చింది. అన్ని వర్గాల ప్రజల్లోను రుషులున్నారు. 48,000 మంది రుషులున్నట్లు సాధారణమైన నమ్మకం. శ్రీరాముడు అరణ్యవాసం ముగించుకొని అయోధ్యకు తిరిగి వచ్చినపుడు భారతదేశపు నలుమూలల నుండి రుషులు అయోధ్యకు వచ్చినట్లు చెప్పబడింది.

తూర్పు ప్రాంతం నుండి విశ్వామిత్ర, యవక్రేత, రైభ్యా మొదలగువారు, దక్షిణం నుండి దత్తాత్రేయ, వాల్మీకి, అగస్త్యులు మొదలగువారు, పశ్చిమం నుండి వృశం, కలిశ, నారద, అష్టావక్ర, శుక్ర, భృగులు మొదలగు వారు, ఉత్తరాన్నుండి అత్రి, దుర్వాస, తుంబుర, మాతంగ, సప్తర్షులు మొదలగువారు వచ్చారు.
– రామాయణం

రుషులు మూడు తరగతులు 1. బ్రహ్మర్షులు, 2. రాజర్షులు, 3. దేవర్షులు. ఉదాహరణకు వశిష్ఠుడు బ్రహ్మర్షి, విశ్వామిత్రుడు రాజర్షి, కశ్యపుడు దేవర్షి.
– ఉత్తర రామాయణం

**రుషికుడు :** ఓ రాజర్షి. అసుర నాయకుడైన అర్కుని పునర్జన్మ. – మహాభారతం

**రుషికుల్య :** ప్రాచీన భారతదేశంలో ఓ పుణ్యనది. ఇచట స్నానం చేస్తే ముక్తి లభిస్తుంది. – మహాభారతం

**రుషికం :** ప్రాచీన భారతదేశంలోని ఓ పట్టణం. ఇక్కడ అర్జుడికి రుషికుడికి మహా సంగ్రామం జరిగింది.
– మహాభారతం

**రుషిగిరి :** మగధ రాజ్య పరివాహకంగావున్న పర్వతం. దీనిని మాతంగ పర్వతమని కూడా అంటారు.
– మహాభారతం

★ **రుష్యమూకం :** ఓ పర్వతం. ఈ పర్వత శిఖరం మీద రామలక్షణులు మార్కండేయుడిని చూశారు. ఇచ్చటే రామలక్ష్మణులు సుగ్రీవుడిని కలిశారు.
– రామాయణం

**రుష్యశృంగుడు :** విభాండకుడను రుషి కుమారుడు. విభాండకుడు ఒకసారి ఊర్వశి అందాన్ని చూసి వీర్యస్కలనం జరగగా అది నీటిలో పడింది. ఓ ఆడ లేడి నీటితో సహా దానిని మింగగా రుష్యశృంగుడు రెండు కొమ్ములతో జన్మించాడు. విభాండకుడు తన కుమారుని గుర్తించి ఇద్దరూ కలసి ఓ ఆశ్రమంలో జీవించారు. అతడు యువకుడయ్యే వరకు తన తండ్రిని తప్ప ఎవరినీ చూడలేదు.

*అంగదేశ వర్షాభావం – రుష్యశృంగుని శక్తి :* అంగరాజ్యాన్ని లోమపాదుడు పాలిస్తున్న సమయంలో ఒకసారతడు బ్రాహ్మణులను మోసగించాడని బ్రాహ్మణులు దేశం విడిచి పోగా అనావృష్టి తాండవించింది. లోమపాదుడు మరికొందరు బ్రాహ్మణులను పిలిచి వర్షాలు కురిసే మార్గం చెప్పమని కోరగా స్త్రీని ఇంత వరకూ ఒక్కసారి కూడా చూడని బ్రాహ్మణుడు యాగంచేస్తే వర్షాలు కురుస్తాయని చెప్పగా అలాంటి బ్రాహ్మణుడి కొరకు తన మనుషుల్ని పంపాడు.

రుష్యశృంగుడు ఒక్కడే ఏ స్త్రీని చూడలేదని తెలుసుకుని అంగ రాజ్యానికి రప్పించే మార్గం ఆలోచించి తన రాజ్యంలోని వేశ్యలను రావించి అతణ్ణి తన రాజ్యానికి రప్పించదలచగా ఒక్కరు తప్ప ఎవ్వరూ అంగీకరించ లేరు. ఆమె విభాండకుడు లేని సమయంలో అతని ఆశ్రమానికి వచ్చి అతనికి మక్కువ కల్గించి రెండవ సారి తనతో అంగరాజ్యం తీసుకువెళ్లింది. అంగరాజు తన కుమార్తెనిచ్చి రుష్య శృంగుడితో వివాహం జరిపాడు. విభాండకుడిని సంతోషపెట్టడానికి ధనధాన్యాలను పంపాడు. విభాండకుడు, అంగదేశం వచ్చి తన కుమారుడు రాజకుమార్తెను వివాహమాడాడని తెలుసుకొని సంతానం కల్గిన తర్వాత ఆశ్రమానికి రమ్మని కొడుకు నాదేశించాడు. – మహాభారతం

దశరథుడు పుత్రకామేష్ఠి యాగం చేసినపుడు లోమపాదుడు రుష్యశృంగుని పంపగా ఆ యాగాన్ని నిర్వహించగా ఓ నల్లని శక్తి ఉద్భవించి ఓ కలశంలో ద్రవపదార్థం దశరథుడికివ్వగా దానిని తన భార్యలకు పంచగా సంతాన ప్రాప్తి కల్గింది. – రామాయణం

**రుహ :** నాగులకు తల్లి అయిన సురస యొక్క కుమార్తె. ఈమెకు ఇద్దరు సోదరీమణులు. వారు అనల, విరుధ.
– మహాభారతం

**రూప :** శుక్తిమంతం నుంచి వెలువడే ఒక నది.

**రూపవతి :** త్రేతాయుగంలో జీవించిన ఓ వేశ్య. అరణ్యంలో గృహస్థ జీవితం గడిపి ఈమె, అతని ప్రియుడు దేవదాసు ముక్తి పొందారు'. – పద్మపురాణం

**రూపవాహిక :** ప్రాచీన భారతావనిలో ఒక దేశం.
– మహాభారతం

**రూపవాహికులు :** రూపానదీ తీరవాసులు.

★ ఇతర విశేషాలకు చూ॥ వాలి సుగ్రీవులు, దుందుబి, మాతంగి.

**రూపవిద్య :** దేవి యొక్క రూపం. 12 చేతులతో కూర్చొని వున్న దేవిని రూపవిద్య అంటారు. – అగ్నిపురాణం

**రూపాశ్వుడు :** ఇక్ష్వాకు వంశంలో జన్మించినవాడు. కృతాశ్వుడి మరోపేరు.

**రూపిణుడు :** అజమీఢునికి కేశిని వల్ల జన్మించిన పుత్రుడు. ఇతని సోదరులు జహ్ను, వ్రజలు.
– మహాభారతం

**రేణుక :** జమదగ్ని భార్య. – చూ॥ జమదగ్ని

**రేణుకం :** ఓ శక్తివంతమైన సర్పం. పాతాళంలో నివసించేది. దేవతల ఆజ్ఞపై భూభారం మోసే దిగ్గజాల వద్దకు వెళ్లి బాధ్యత, మంచి మొదలగు విషయాలను గూర్చి ప్రశ్నించింది. – మహాభారతం

**రేణుడు 1 :** ఓ పురోహిత. గురువు. విశ్వామిత్ర మహర్షి కుమారుడు, ఋగ్వేదంలోని సూక్తాన్ని రచించాడు.
– ఐతరేయ బ్రాహ్మణం

**రేణుడు 2 :** ఇక్ష్వాకు వంశంలోని ఒక రాజు. జమదగ్ని భార్య రేణుక ఇతని కుమార్తె. ఇతని ఇతర పేర్లు ప్రసేన జిత్తు, ప్రసేనుడు, సువేణు. – మహాభారతం

**రేణుమతి :** నకులుడి భార్య. వీరి కొడుకు నిరమిత్రుడు.
– మహాభారతం

**రేఫ :** ఋగ్వేదకాలంనాటి ఒక ఋషి. ఇతడిని అసురులొకసారి నీటిలో తోసివేశారు. దానికి కారణం ఇతడి పూర్వజన్మలో చేసిన పాపాలే. – ఋగ్వేదం

**రేవతి :** బలభద్ర రాముని భార్య. కుశస్థలిని పాలించిన రేవంతుడికి 100 మంది కుమారులు. ఆ తర్వాత ఓ కుమార్తె. ఆమే రేవతి. బ్రహ్మ ఆజ్ఞపై రేవంతుడు తన కుమార్తె రేవతిని బలభద్రరామునికిచ్చి వివాహం చేశాడు. – భాగవతం

**రేవతి 2 :** అదితి దేవిని రేవతి అని కూడా పిలిచేవారు.
– మహాభారతం

**రేవతి 3 :** 21 నక్షత్రాలలో రేవతి ఒకటి. శ్రీకృష్ణుడు మైత్ర సమయాన కార్తీక మాసంలో రేవతీ నక్షత్రాన తన యాత్ర ప్రారంభించాడు. ఈ నక్షత్రం రోజు గోవును బహుమతిగా ఇస్తే ఆ గోవు స్వర్గానికి చేరి ఆ గోవును పంపినవారికి అన్ని సుఖసంతోషాలు కల్గుతాయి. ఈరోజు పితృలకు అర్ఘ్యమిస్తే సంపన్నుడవుతాడు. – మహాభారతం

**రేవతుడు :** బలభద్రరాముని భార్య అయిన రేవతి తండ్రి. ఇతడు సార్యాతి మనుమడు ఆనర్తుని కుమారుడు. కుశస్థలి ద్వీపంలో రాజధానిని నిర్మించుకుని పాలించిన మొదటి రాజు.

**రేవుడు :** వతుడి తండ్రి.

★**రేవంతుడు :** సూర్యుని కుమారుడు. సూర్యుడు విశ్వకర్మ కుమార్తె సంజ్ఞను వివాహమాడగా మను, యమ, యమిలు జన్మించారు. సూర్యుని వేడిమికి తట్టుకోలేక సంజ్ఞ సూర్యుడిని వదలిపోగా ఆమె సేవిక ఛాయ సూర్యుడిని సేవించగా ఆమెకు శనైశ్చర్య, మమ, తపతి జన్మించారు. ఒకసారి ఛాయ యముని శపించగా సూర్యునికి సంజ్ఞ జ్ఞప్తికి వచ్చింది. అప్పుడు సంజ్ఞ ఆడగుర్రంగా అరణ్యంలో తపస్సు చేస్తోంది. సూర్యుడు అశ్వమై ఆమెను కలవగా అశ్వనీ దేవతలు మరియు రేవంతుడు జన్మించారు. – విష్ణుపురాణం

**రైక్వపరాలు :** రైక్వుడికిచ్చిన భూములు. – మహాభారతం

**రైక్వుడు :** జానపృతి అనే జనహృదయుడైన రాజు వుండేవాడు. ఓ రాజు రాత్రి అతడు నిద్రిస్తుండగా మునులు హంసల రూపంలో వచ్చారు. అందులో ఒక హంస ఇతడి గొప్పదనాన్ని వివరించగా ఇతర హంసలు రైక్వుడి గొప్పతనం ముందు ఇతడే పాటి అని పల్కాయి. జానపృతి ఇది విని రైక్వుడిని దర్శించి తన కుమార్తెతో పాటు సంపదనంతా అతనికిచ్చి వివాహం చేశాడు.

**రైభ్యుడు 1 :** యుధిష్ఠురుని కొలువులో ప్రసిద్ధుడైన ఒక మహర్షి. అంగిరసుని కుమారుడు. భరద్వాజుని స్నేహితుడైన ఇతనికి అర్వావసు, పరావసు అనే ఇద్దరు కుమారులు. భరద్వాజుడు తన కుమారుడైన యవక్రీతుడిని రైభ్యుని ఆశ్రమానికి వెళ్లవద్దని ఆదేశించగా రైభ్యుడు కోపంతో తన కేశాలను నేలపైబాది ఓ క్రూర మాయావిని సృష్టించి యవక్రీతుడ్ని చంపమని ఆదేశించాడు. భరద్వాజునికిది తెలిసి అచటకి వచ్చి రైభ్యుని పెద్ద కుమారుడే రైభ్యుని వధిస్తాడని

★ రేవంతుని చూసి లక్ష్మి పులగించగా విష్ణువామెను శపించాడు

శపిస్తాడు. పరావసు ఒకసారి తండ్రిని క్రూరమైన జంతువుగా భావించి వధించగా అతని తమ్ముడు అర్వావసు సజీవుణ్ణి చేస్తాడు.
ఉపరిచర వసువు చేసిన యాగానికి రైభ్యుడు సహకారి. భీష్ముడు అంపశయ్యపై నుండగా దర్శించిన వారిలో ఇతడొకడు. - మహాభారతం

**రైభ్యుడు 2 :** ప్రాచీన రుషి. వీరణుడి నుండి సాత్వత ధర్మాన్ని నేర్చుకొని తన కుమారుడు దిక్పాలకునికి దాన్ని నేర్పుతాడు. - మహాభారతం

**రైభ్యుడు 3 :** శకుంతల భర్త అయిన దుష్యంతుడి తండ్రి. ఇతడు సుమతి కుమారుడు. - భాగవతం

**రైభ్యుడు 4 :** బ్రహ్మ కుమారుడు. ఇతడొకసారి వసు అంగిరసులతో బృహస్పతి వద్దకు వెళ్లి నిరంతర మోక్షం ఎలా సాధించాలని అడుగుతాడు. బృహస్పతి మన క్రియలవల్ల కాక భక్తివల్ల మాత్రమే స్వర్గం లభిస్తుందని చెప్తాడు. అతడు వెంటనే గయకు వెళ్లి తపస్సు చేస్తూ అక్కడ సంతకుమారులను కలుస్తాడు. ఊర్వశి ఇతడి తపస్సు భగ్నం చేయడానికి వెళ్లి శాపానికిగురై అతడ్ని క్షమాపణ కోరగా శాపవిమోచనం గావిస్తాడు. - వరాహపురాణం

**రైవతకుడు :** ప్రియవ్రతుని కుమారుడు. ప్రియవ్రతునికి ఇద్దరు భార్యలు. సురూప, బర్హిష్మతి. బర్హిష్మతికి ఉత్తమ, తామస, రైవతులు జన్మించారు. ఆ తదనంతరం ఓ మన్వంతరానికి రాజ్యాధిపతులయ్యారు.

**రైవతకం 1 :** శాక ద్వీపంలోని ఒక పర్వతం. - మహాభారతం

**రైవతకం 2 :** గుజరాత్‌లోని ఒక పర్వతం. ప్రస్తుతం జునాగడ్ వద్ద వుంది. దీని ప్రస్తుత నామం గిర్నర్. మహాభారత కాలంలో ఉజయంత గిరి అనేవారు. శ్రీకృష్ణార్జునులు ప్రభాస క్షేత్రం వెళ్లేదారిలో ఈ పర్వతం ఉంది. - మహాభారతం

**రైవతుడు 1 :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. మందర పర్వతాలకు దక్షిణాన సామవేదం పాడుతున్న గంధర్వులగానం విని తన దేశాన్ని ప్రజల్ని భార్యను సర్వస్వాన్ని త్యజించి అరణ్యాలకు వెళ్దామని తలుస్తాడు. ఇతడు శాఖాహారి. ఇతడు నిద్రలేవగనే నిద్రించుటకు ముందు స్మరింపదగ్గ మహాపురుషుడు. - మహాభారతం

**రైవతుడు 2 :** 11 మంది రుద్రులలో ఒకడు. - మహాభారతం

**రోచన 1 :** దేవకుడను రాజు కుమార్తె. వసుదేవుడీమెను వివాహమాడగా హేమ, హేమాంగదలు జన్మించారు. - భాగవతం

**రోచన 2 :** రుక్మి మనుమరాలు. భోజకటం వద్ద శ్రీకృష్ణుని మనుమడైన అనిరుద్ధుడీమెను వివాహమాడెను. - భాగవతం

**రోచనాముఖుడు :** ఓ అసురుడు. గరుడుడు ఇతణ్ణి వధించాడు. - మహాభారతం

**రోచనుడు :** స్వారోచిష మనువు కాలంలో ఇంద్రుడు. - భాగవతం

**రోచమానుడు 1 :** స్కంద దేవుని అనుచరుడు. - మహాభారతం

**రోచమానుడు 2 :** ఓ క్షత్రియ రాజు. అశ్వగ్రీవుడను అసురుని అంశవల్ల జన్మించాడు. ఇతడు ద్రౌపది స్వయంవరానికి వచ్చాడు. అశ్వమేధమనే రాజ్యానికి రాజు. భీమసేనుడొకసారి ఇతణ్ణి ఓడించాడు. పాండవులు కురుక్షేత్ర యుద్ధానికి ఆహ్వానించగా పాండవుల పక్షాన పోరాడి కర్ణునితో ద్వంద్వ యుద్ధంలో మరణించాడు. - మహాభారతం

**రోచిష్మతుడు :** స్వాయంభవ మనువు కుమారుడు. - భాగవతం

**రోధం :** ఓ నరకం. - చూ॥ నరకం

**రోమకం :** ప్రాచీన భారతావనిలో ఒక దేశం. ఈ దేశ ప్రజల్ని రోమకులనేవారు. ధర్మజుని అశ్వమేధ యాగానికి వీరు కానుక లిచ్చారు. - మహాభారతం

**రోమపాదుడు :** చూ॥ లోమపాదుడు.

**రోమశుడు 1 :** ఒక ముని. ఇంద్రుడితడి ద్వారా ధర్మరాజుకు వర్తమానం పంపుతాడు. - మహాభారతం

**రోమశుడు 2 :** ఒక పిల్లి. - చూ॥ సలితుడు

**రోమశ :** బృహస్పతి కుమార్తెలలో ఒకరు. ఈమె భర్త వేధించినపుడు ఈమె సమాధానం చెప్పిన విధానం రుగ్వేదంలో పేర్కొనబడింది. - రుగ్వేదం

**రోమహర్షిణి :** ముని. వ్యాసుని శిష్యుడు. ఉగ్ర శ్రవసుడి తండ్రి. - భాగవతం

**రోమహర్షణుడు :** వ్యాసుని శిష్యుల్లో ప్రసిద్ధుడు. పురాణ సంకలనాలను వ్యాసుడితడికిచ్చాడు. రోమహర్షణుడికి

ఆరుగురు శిష్యులు. వారు సుమతి, అగ్నివర్చస్సు, శాంశపాయన, ఆకృత వర్ణ, సావర్ణిలు.

**రోహిణం :** చూ॥ రౌహిణం

**రోహిణి 1 :** గోవులన్నింటికి తల్లి. కశ్యప ప్రజాపతి సురభిని వివాహమాడగా రోహిణి, గంధర్విణి జన్మించారు. రోహిణికి గోవులు, ఎద్దులు జన్మించగా గంధర్విణికి అశ్వాలు జన్మించాయి. - రామాయణం

రోహిణికి విమల, అనల జన్మించగా వారి నుండి గోసంతతి జన్మించింది. - మహాభారతం

**రోహిణి 2 :** చంద్రుని భార్యలలో ఒకరు. 27 నక్షత్రాలలో ఒక నక్షత్రం. చంద్రునికి అతి ప్రియమైనది.

**రోహిణి 3 :** బలభద్రరాముని తల్లి. వసుదేవుని ఇద్దరు భార్యలలో దేవకి శ్రీకృష్ణునికి జన్మనివ్వగా బలభద్ర రామునికి రోహిణి జన్మనిచ్చింది.

*పూర్వజన్మ :* వరణుని శాపం వల్ల కశ్యప ప్రజాపతి వసుదేవుడుగా, అతని భార్యలు అదితి, సురసలు దేవకి, రోహిణిలుగా జన్మించారు. దేవకికి జన్మించిన 7వ గర్భం రోహిణి గర్భంలోకి చేర్చగా బలభద్రుడిగా జన్మించాడు. దారుకుడు యాదవ వినాశనాన్ని గురించి వసుదేవునికి, దేవకి, రోహిణిలకు చెప్పగా వీరు తనువు చాలించారు. - *భాగవతం*

**రోహిణి 4 :** మనువు అను అగ్నియొక్క మూడవ భార్య నిశకు రోహిణి అనే కుమార్తె జన్మించింది. ఈమె కొన్ని చెడ్డ పనులు చేయడం వల్ల హిరణ్యకశిపుని భార్య అయ్యింది. - మహాభారతం

**రోహిణి 5 :** ఓ ప్రసిద్ధ రుషి అయిన ఉతత్యుని తల్లి. - *చూ॥ సత్యంతపముడు*

★**రోహితకం :** పురాణ ప్రసిద్ధి చెందిన పర్వతం. దీని చుట్టుప్రక్కల ప్రాంతాన్ని కూడా ఈ పేరుతోనే పిలుస్తారు. నకులుడు జైత్రయాత్ర చేసేటప్పుడు దీని గుండా ప్రయాణించాడు.

**రోహితుడు :** హరిశ్చంద్రుని కుమారుడు. వరుణుని ఆశీర్వాదం వల్ల జన్మించాడు. కాని వరుణుడే ఇతడిని బలిచేయమనగా హరిశ్చంద్రుడు క్షోభపడ్డాడు. ఇతని కుమారుడు హరీతుడు.

- *చూ॥ హరిశ్చంద్రుడు* - *భాగవతం*

**రౌహితం :** ఒక అరణ్యం. మహాభారత యుద్ధ సమయమున కౌరవులకు విడిది. - మహాభారతం

**రౌచ్యుడు :** ఒక మనువు. రుచి కుమారుడు. తల్లి మాలిని. ఇతడి మన్వంతరంలో బృహస్పతి ఇంద్రుడు. ఇతడి కొడుకులైన చిత్ర సేనాదులు రాజులు.

- మార్కండేయ పురాణం

**రౌద్రకర్ముడు :** ధ్రుతరాష్ట్రుని 100 మంది పుత్రుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో భీముడితణ్ణి వధించాడు.

- మహాభారతం

**రౌద్రాశ్వుడు 1 :** పూరు చక్రవర్తికి పౌష్టి వల్ల జన్మించిన కుమారుడు. ఇతని సోదరులు ప్రవీర, ఈశ్వరులు. ఒకసారి రౌద్రాశ్వుడు, మిశ్రకేశి అనే అప్సరస ప్రేమలో పడ్డాడు. దానివల్ల అన్వగ్భాను మొ॥ పది మంది పుత్రులు జన్మించారు. - మహాభారతం

**రౌద్రాశ్వుడు 2 :** కాత్యాయుని శిష్యుడైన ఓ రుషి. ఒకసారి మహిషాసురుడు ఇతడి తపస్సు చెడగొట్ట డానికి అందమైన స్త్రీగా వచ్చాడు. అప్పుడు రౌద్రా శ్వుడు 'ఓ స్త్రీ వల్ల నీకు మరణం కల్గుతుంది అని మహిషాసురుడిని శపించాడు. - కాళికాపురాణం

**రౌద్రుడు :** గాంధారీ ధ్రుతరాష్ట్రుల పుత్రుల్లో ఒకడు.

**రౌద్రులు :** మహాకాయులైన ఓ తెగ ప్రజలు. కైలాస మహామేరువుపై జీవించేవారు. లోమశుడు పాండవుల అరణ్యవాసంలో వారితో జాగ్రత్తగా వుండవలసిందని సలహా ఇచ్చాడు. - మహాభారతం

**రౌప్య :** ప్రాచీన భారతావనిలో పురాణ ప్రసిద్ధమైన నది. ఈ నదీతీరానే జమదగ్ని స్నానం చేసిన పవిత్ర ఘట్టమైన ప్రసర్పణం వుంది. - మహాభారతం

**రౌభ్యుడు :** ఓ రుషి – లంక నుంచి తిరిగి వస్తున్న రాముణ్ణి ఆహ్వానిస్తాడు. - ఉత్తర రామాయణం

**రౌమ్యులు :** శివుని గణాలలో ఓ గుంపు. వీరు శివుని గణాధిపతి అయిన వీరభద్రుని జంటల నుండి జన్మించారు.

- మహాభారతం

**రౌరవం :** 28 నరకాల్లో ఇదొకటి. - *చూ॥ నరకం*

**రౌహిణం :** ఇదో మహావృక్షం. గజకచ్ఛపములను గరుత్మంతుడు తీసుకొనిపోవుచుండగా తనపై విశ్ర మించమని కోరెను. గరుత్మంతుడు విశ్రమించగా

★ ఇప్పటి ఈ ప్రాంతం పేరు రోహితక్ (హర్యానా)

ఓ కొమ్మవిరిగి దానికి వాలఖిల్యాదులుండగా వారికి దెబ్బ తగలకుండా ఆ కొమ్మను తన ముక్కున కరచు కొని క్రిందపడకుండా తీసుకువెళ్లెను. – మహాభారతం

**రంగనాథుడు :** ఓ ఆంధ్రకవి. ఇతడు రామాయణమును ద్విపదకావ్యముగా రచించెను. ఈ కావ్యమును రంగ నాథ రామాయణమని పిలిచెదరు.

**రంతిదేవుడు :** సంకృతి కుమారుడు. తన సంపదను దీనులకిచ్చి అరణ్యమున జీవించువాడు. ఒకసారి ఇతడు అన్నము భుజించుటకు కూర్చొనగా ఓ బ్రాహ్మ ణుడు ఆకలితో రాగా తన ఆహారములో సగమిచ్చెను. ఆ తర్వాత మరియొకడు రాగా తక్కిన అన్నమును కూడా అతడికి ఇచ్చివేసెను. ఆ తర్వాత దాహార్తియై మరియొకడు రాగా తన వద్దగల నీటిని కూడా అతడి కిచ్చి ఆకలి దప్పులకు ఓర్చి ఈశ్వరార్చన చేయు చుండగా బ్రహ్మాది దేవతలు వచ్చి ఇతడి దానగుణము నకు మెచ్చి ఇతనికి మోక్షము ప్రసాదించిరి.

**రంభ :** ఒక అప్సరస. దేవకన్యలలో అందమైనదని ప్రసిద్ధి. ఈమెకు నలకూబరుని యెడల ప్రేమ కలదు. ఒకరోజు ఈమె నలకూబరుని భవనమునకు పోవు చుండగా రావణుడీమెను బలాత్కరించబోగా తప్పించు కొని నలకూబరునికీ విషయము చెప్పెను. అంత నలకూబరుడు పరస్త్రీని చేపట్టినచో రావణుని తల వేయి ముక్కలగునని శపించెను.

ఒకసారి విశామిత్రుడు బ్రహ్మర్షి కాగోరి తపస్సు చేయు చుండగా దానిని భగ్నము చేయుటకు రంభను పంపెను. ఈమె భయపడుతూనే వచ్చెను. విశ్వా మిత్రుడు ఈమెను చూచి 10 వేల యేండ్లు శిలవగు దువని శపించెను. – రామాయణం

**రంభుడు :** మహిషాసురుని తండ్రి. నికుంబుని సోదరుడు. – చూ॥ మహిషాసురుడు



**ల :** ఈ అక్షరానికి అర్థం సృష్టి.

**లక్షణ 1 :** దుర్యోధనుని కుమార్తె – సాంబుని భార్య. – చూ॥ సాంబుడు

**లక్షణ 2 :** శ్రీకృష్ణుని అష్ట భార్యలలో ఒకరు. మద్రదేశపు రాజైన బృహత్సేనుడి కుమార్తె. ఈమెవల్ల శ్రీకృష్ణునికి 10 మంది కుమారులు. అందులో ప్రఘోషుడు, గాత్రవానుడు, సింహ, బల మొదలగువారు కలరు. – భాగవతం

**లక్ష్మణ కవి :** ఇతడు భర్తృహరి సుభాషితములను ఆంధ్రానువాదము చేసి లబ్ధ ప్రతిష్ఠుడయ్యెను. ఏనుగు లక్ష్మణ కవిగా ప్రసిద్ధుడు. ఇతని అనువాద రచన పేరు "సుభాషిత రత్నావళి".

**లక్ష్మణవతి :** గౌడపురికి మరోపేరు.

**లక్ష్మణుడు 1 :** దశరథ సుమిత్రల కుమారుడు. దశరథుడు పుత్రకామేష్ఠి యాగం చేయగా రుష్య శృంగుడు ఆధ్వర్యం వహించాడు. యజ్ఞ పురుష డిచ్చిన ఫలాన్ని దశరథుని ముగ్గురు భార్యలకు ఇవ్వగా కౌసల్యకు శ్రీరాముడు, సుమిత్రకు లక్ష్మణ, శత్రు ఘ్నులు, కైకేయికి భరతుడు జన్మించారు. లక్ష్మణుడు ఆదిశేషుని అవతారం అవడంవల్ల విష్ణువు అవతార మైన శ్రీరామునితో జీవితాంతం కలసి పయనిం చాడు. విశ్వామిత్రుడు యాగ రక్షణకు రామలక్ష్మ ణులను తీసుకువెళ్లగా రాక్షస వధానంతరం సీతా స్వయంవరానికి వెళ్లి శ్రీరాముడు సీతను వివాహ మాడగా లక్ష్మణుడు ఆమెకు సోదరి అయిన ఊర్మి ళను వివాహమాడాడు. కైకేయి వరాలకు తలవంచి శ్రీరాముడు సీతతో వనవాసం వెళ్లగా అతనితో కలసి లక్ష్మణుడు కూడా వెళ్లాడు. రావణుని సోదరి శూర్పణఖ ముక్కుచెవులు కోసి అవమానించాడు. రాముడు వానరసేనతో లంకపై దండెత్తి నపుడు లక్ష్మణుడొక సారి మూర్ఛిల్లగా హనుమంతుడు తెచ్చిన సంజీవిని వల్ల తెప్పరిల్లాడు. రాముడు రావణుడిని వధించి అయోధ్యకు తిరిగి వచ్చి అశ్వమేధయాగం చేసినపుడు దాని రక్షణ బాధ్యత తీసుకొని లవకుశులతో పోరా డాడు. రాముడు అవతారం చాలించినపుడు వెంటనే ఇతడు తన జీవితాన్ని చాలించాడు. – రామాయణం

**లక్ష్మణుడు 2 :** దుర్యోధనుని కుమారుడు. ఇతడు అభిమ న్యుడితో క్షాత్రదేవుడితో పోరాడాడు. అభిమన్యుడి చేతిలో వధింపబడ్డాడు. యుద్ధానంతరం గాంధారి కుంతిలు మరణించిన వీరుల్ని చూపమనగా వ్యాసుడు తన యోగశక్తితో చూపిన వారిలో లక్ష్మణుడు కూడా వున్నాడు. – మహాభారతం

**లక్ష్మి 1 :** మహావిష్ణువు భార్య.

జననం : పరమాత్మ ఎడమ భాగం నుండి దేవి జన్మించింది. పరమాత్మ ఆదేశంపై ఆమె రెండుగా విడివడింది. ఒకరు రాధాదేవి, రెండు లక్ష్మీదేవి. ఇద్దరూ అందంలో వయసులో ప్రేమలో సమానులే. రాధ రెండు చేతులున్న శ్రీకృష్ణుణ్ణి వివాహమాడగా రమ కూడా అతడినే వివాహమాడబోగా భగవానుడు శ్రీకృష్ణుడు 4 చేతులున్న మహావిష్ణువుగా విడివడ్డాడు. మహావిష్ణువును రమాదేవి వివాహమాడింది. – దేవీభాగవతం

లక్ష్మి అవతారాలు : వివిధ సమయాలలో వివిధ రూపాలలో లక్ష్మీదేవి భూమిపై అవతరించింది. ఒకసారి దుర్వాసుని శాపంవల్ల దేవతలకు ముసలితనం వచ్చింది. ఇంద్రుడు సింహాసనం కోల్పోయాడు. స్వర్గ లక్ష్మి దేవతలను వదలి వైకుంఠం చేరింది. అప్పుడు వారు మహావిష్ణువును ప్రార్థించగా మహావిష్ణువు లక్ష్మిని క్షీరసాగర కన్యకగా అవతరించమనగా క్షీరసాగరమదనం సమయంలోఅందుండి వెలువడిన దేవతలను ఆశీర్వదించి మహావిష్ణువు మెడలో పూలమాలతో అలంకరించగా దేవతలు తిరిగి తమ సంపదను పొందారు. మహాలక్ష్మి ఒకసారి ఆడగుర్రంగాను, మరొకసారి తులసిగా అవతరించింది. మహావిష్ణువు శ్రీరాముడిగా అవతరించినపుడు సీతగా, వేదవతిగా అవతరించింది. విష్ణువు పరశురాముడుగా అవతరించగా లక్ష్మి భూమాతగా అవతరించింది.

లక్ష్మి రెండు పార్శ్వాలు : లక్ష్మి రాజ్యలక్ష్మి, విష్ణు ప్రియలక్ష్మి. పాతివ్రత్యానికి అదృష్టానికి ప్రతీకగా రాజ్యలక్ష్మి ఎక్కడ సంపదవుంటే అక్కడ వుంటుంది లేనిచోటునుండి వెడలిపోతుంది.

**లక్ష్మి 2 :** దక్ష ప్రజాపతి కుమార్తెలలో ఒకరు. ఈమె ధర్మదేవుడిని వివాహమాడింది.

**లక్ష్మీదాసుడు :** ఓ సంస్కృత కవి. శుక సందేశమనే గ్రంథ రచయిత. ఈ గ్రంథం కాళిదాసు మేఘసందేశాన్ని పోలివుంటుంది. ఇతడు నంబూద్రి అనే బ్రాహ్మణ కులంలో జన్మించాడు.

**లఘుపతనం :** చూ॥ పంచతంత్రం.

**లజ్జ :** దక్షునికి ధరణివల్ల జన్మించిన కూతురు. ధర్ముడి భార్య. – మహాభారతం

**లత :** ఓ దేవకన్య. వర్గ అనే మరోదేవి సహచరి. ఓ బ్రాహ్మణుని శాపంవల్ల మొసలిగా మారి అర్జునుడి వల్ల శాపవిముక్తి పొందింది. – చూ॥ పంచతీర్థం

**లతావేష్టం :** ద్వారకకు దక్షిణాన గల ఓ పర్వతం. ఇది ఐదురంగుల్లో వుండి ఇంద్ర చాపాన్ని గుర్తు చేస్తుంది. – మహాభారతం

**లపిత :** మందపాలుడను రుషి రెండవ భార్య. – చూ॥ మందపాలుడు.

**లపేటికం :** ఓ పుణ్యస్థలం. దీన్ని దర్శిస్తే వాజపేయ యజ్ఞ ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**లబ్ధనాశం :** చూ॥ పంచతంత్రం.

**లయుడు :** ప్రాచీన రాజు. యముని కొలువులో సభ్యుడు. – మహాభారతం

**లలాటాక్షం :** ప్రాచీన భారతావనిలో ఒకదేశం. ఈదేశ రాజు యుధిష్ఠురుని యజ్ఞానికి కానుకలతో వచ్చాడు. – మహాభారతం

**లలిత :** చూ॥ పుండరీక ముఖం.

**లలితకం :** ప్రాచీన భారతదేశంలో ఓ పుణ్యస్థలం, ఇక్కడున్న కొలనులో స్నానం చేస్తే పాపవిముక్తులౌతారు. – మహాభారతం

**లలితుడు :** ఓ గంధర్వుడు. ఇతడు శాపంవల్ల జన్మించి కామదా ఏకాదశి వ్రతం చేసి శాపవిముక్తుడై తిరిగి గంధర్వుడౌతాడు. – పద్మపురాణం

**లలిత్థం :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజ్యం. ఇచ్చట ప్రజల్ని లలితసులంటారు. వీరు కౌరవుల పక్షాన పోరాడి అర్జునుని వధించగలమని ప్రగల్భాలు పలికారు. వీరి రాజు అభిమన్యుడితో పోరాడాడు. అర్జునుడు వీరందర్ని వధించాడు. – మహాభారతం

**లవణం :** ఓ నరకం. – చూ॥ నరకాలు

**లవణాశ్వుడు :** ఓ రుషి. ధర్మరాజును అత్యంత గౌరవంగా చూసినవాడు. – మహాభారతం

**లవణుడు 1 :** ఓ రాక్షసుడు. తండ్రి మధు. మధువనం వీరి నివేశనం. ఈ రాక్షసుడు దేవతలను అణగ దొక్కేవాడు. శతృఘ్నుడితణ్ణి సంహరించి అచట ఓ సుందర నగరం నిర్మించి అచట నివసించాడు. సంపద పెరిగి ఈ నగరం మధురా నగరమని పిలవబడింది. శతృఘ్నుడి మరణానంతరం ఇతని ఇద్దరు కుమారులు ఇచ్చట నివసించారు. – దేవీ భాగవతం

**లవణుడు 2 :** రామణీయక ద్వీపంలో నివసించిన ఓ రాక్షసుడు. సర్పాలు ఈ దీవికి రాకముందే ఇతడక్కడ నివసించాడు. సర్పాలు ఇతణ్ణి దర్శించాయి.
– మహాభారతం

**లవణుడు 3 :** హరిశ్చంద్రుడి మనుమడైన ఓ చక్రవర్తి. ఇతడు రాజసూయ యాగం తలపెట్టి తన ఊహల్లో మాత్రమే ఒకేరోజు చేసి చండాలుడిగా మారాడు. వసిష్ఠుడు శ్రీరాముడికి ఈ లోకం తన అమాయ కత్వంతో ఓ భ్రాంతిగా భావించడం తప్పని తెలియ జేయడానికి ఇతని కథ చెప్తాడు.

లవణుడు రాజసూయయాగం అన్ని హంగులతో ఆర్భాటంతో చేయనెంచి తన మానసంలో విధి విధా నాలు నిర్వర్తించినట్లు భావించి యాగం సాయం త్రానికే పూర్తిచేసి తన దినచర్యలలో నిమగ్ను డయ్యాడు. రాజసూయయాగం చేసినవాడు 12 సంవ త్సరాలు కష్టనష్టాలు భరించాలి. అలాంటి దేమీ లేకుండా మనసులోనే యాగం పూర్తిచేశాడు కనుక మానసికంగా అతడికి కష్టాలు కల్గించాలని తలచి ఇంద్రుడొక మాంత్రికుణ్ణి లవణుడి సభకు పంపు తాడు. అతడు మీ సింహాసనంలోనే కూర్చొని ఎన్నో విచిత్రాలు చూడగలరు. చంద్రుడు భూమిపై నుండి లెగుస్తాడు. దాన్ని కూడా మీరు వీక్షించగలరని చెప్పి నెమలి ఈకలు రాజు కళ్లకు ఎదురుగా వుంచి ఎన్నో వస్తువులు దృశ్యాలు కన్పించేటట్లు చేస్తాడు. అంతలో సైంధవ రాజు స్నేహితుడి అశ్వం అచ్చటికి రాగా ఓ రాజా ఈ అశ్వంపై ప్రయాణించి రండి. అలా ప్రయాణిస్తే మంచి మనుషులకు అన్ని మంచి దృశ్యాలు కన్పిస్తాయని చెప్పగా లవణుడు ఆ అశ్వంపై వెళ్లి అరణ్యంలో వదలివేయబడి ఒంటరివాడై ఓ చండాలి కను వివాహమాడవలసివచ్చి ఆమెవల్ల సంతానం పొంది వారిని రక్షించడానికి ఎన్నో కష్టాలు ఎదుర్కొం టాడు. ఈ కష్టాలు భరించలేక ఒక్కసారి కళ్లుతెరవగా నిజలోకంలోని తన ఆసనంలో కూర్చొని వుంటాడు. రాజా ! మీరు చూసిన దృశ్యాలు నిజమో కాదో చూసి రండని చెప్పగా అతడు ఆ అడవిలో ప్రయాణించగా చండాలిక నివసించిన స్థలం పిల్లలు అందరూ గోచరి స్తారు. తిరిగి వచ్చిన తర్వాత ఇంద్రుడి మాంత్రికుడు – నీవు భ్రమలో రాజసూయ యాగం చేశావు. దాని ఫలితమే ఈ దుఃఖభాజనమైన దృశ్యాలు. నిజ జీవితంలో చేయవలసిన కార్యక్రమాలు భ్రాంతితో చేస్తే భ్రాంతిలో కన్పించిన దృశ్యాలు నిజమవుతాయి అనడానికి ఉదా హరణ ఇది. కనుక రాజ సూయయాగం నిర్వహించ వలసిన పద్ధతిలోనే నిర్వ హించగలగాలి. ఊహాజని తంగా కాదు అని చెప్తాడు. – జ్ఞానవాసిష్ఠం

**లవణుడు 4 :** హరిశ్చంద్రుని వంశంలోని మహారాజు. ఇతడు ఎన్నో రాజసూయ యాగాలు నిర్వహించాడు.

**లవుడు :** సీత కుమారుడు. – చూ॥ కుశుడు

**లాక్షా గృహం :** లక్కతో చేయబడిన ఇల్లు. పాండవులు ఈ గృహం నుండే సొరంగం తవ్వి తప్పించుకొని ఏకచక్రపురం చేరారు. – మహాభారతం

**లాట :** క్షత్రియుల్లో ఒక తెగ. ఈ క్షత్రియులు బ్రాహ్మ ణుల యెడ ద్వేషం వల్ల 'లాట' లయ్యారు.
– మహాభారతం

**లాలాభక్షం :** ఓ నరకం – చూ॥ నరకాలు

**లావణకం :** మగధవద్ద గల పురాణ ప్రసిద్ధమైన ప్రాంతం. ఇచ్చట ఎన్నో అరణ్యాలుండటం వల్ల ఎందరో రాజులు వేటకు వచ్చేవారు.

**లిఖితుడు 1 :** ఓ ప్రాచీన రుషి. ఇతడి సోదరుడు శంఖుడు. లిఖితుడొకసారి తనసోదరుని ఇంటికి వెళ్లి ఆకలికి తట్టుకోలేక సోదరుని అనుమతి లేకుండా అచటి ఆహారం తినగా శంఖుడితణ్ణి రాజు వద్దకు పంపాడు. అనుమతి లేకుండా ఇతరుల ఆహారం తినడం నేరం కనుక సుద్యుమ్నుడను అప్పటి రాజు ఇతడి రెండు చేతులు ఖండించాడు. అప్పుడు లిఖితుడు తన సోదరుడి కాళ్లకు మొక్కగా బాహుత నదిలో స్నానం చేయమని చెప్పాడు. అలా స్నానం చేస్తుండగా రెండు చేతులు తిరిగి రాగా అన్నను అడిగాడు. తన తపశ్శక్తి వల్లనే అలా వచ్చినాయని చెప్పగా ముందే తన తపశ్శక్తిని ఎందుకు ఉపయోగిం చలేదనగా శిక్ష రాజధర్మం కనుక అతడది నిర్వర్తించి ధన్యుడయ్యాడు. శిక్షపడింది కనుక నిన్ను రక్షించడం నా బాధ్యతగా నిర్వర్తించానన్నాడు. – మహాభారతం

**లిఖితుడు 2 :** ఓ మలినాత్ముడైన పురోహితుడు. ఇతడి సోదరుడు శంఖుడు కూడా రాజైన హంసధ్వజుడి పురోహితుడే. ధర్మజుడు అశ్వమేధయాగం చేస్తున్న

ప్పుడు రాజు అశ్వాన్ని పట్టుకోగా అర్జునుడు ఈ రాజుతో యుద్ధం చేశాడు. రాజు యుద్ధానికి సన్నద్ధుడై తెల్లవారేసరికి ప్రతి సైనికుడు విధిగా ఒకచోట కలవాలని ఇందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తే సలసలకాగే నూనెలో పడవేస్తానని చాటిస్తాడు. ఆ మరుసటి ఉదయం సైన్యాధిపతి అయిన హంసధ్వజుడి పుత్రుడు సుధాన్యుడు తప్ప అందరూ సమయానికి వచ్చారు. లిఖితుడు ఇతడిని కూడా శిక్షించాల్సిందేనని చెప్పగా రాజు సందేహిస్తున్నాడు. రాజు మరిగిన నూనెలో కుమారుడ్ని తొయ్యగా ఏ మాత్రం చెక్కుచెదరక బయటకు వచ్చాడు. రాజు ఆశ్చర్యపడుతుండగా లిఖితుడు, అతడి సోదరుడు నూనె సరిగా మరగలేదని మరల మరిగించి సుధాన్యుడ్ని దానిలో పడవేయగా మధ్య భాగం నుండి పెద్ద వృక్షం పెరిగివచ్చి రెండుగా చీలి లిఖితుడు అతడి సోదరుడిపై పడగా వారు మరణించారు. – *జైమిని భారతం*

**లిపి :** నోటి నుండి వెలువడే శబ్దాలకు రాత పూర్వకంగా రూపమివ్వడమే లిపి. ప్రాచీన కాలంలో తమ భావాలను వ్యక్తం చెయ్యడానికి బొమ్మలు గీసేవారు. కాలక్రమేణా ఈ బొమ్మలు మరుగునపడి అక్షరాలు వాటి స్థానాన్ని ఆక్రమించాయి.

*ప్రాచీన భావనలు :* జావా ప్రజలు లిపి అచ్చట మొదలయ్యిందని చెప్తారు. దానికాధారమైన ఓ కథ ప్రచారంలో వుంది. క్రీ.పూ. 78లో అజశిఖుడను బుద్ధ సాధువు దీనికి ఆద్యుడు. ఇతడు ఇతని శిష్యులు కాండటాంగ్ పర్వతాలలో నివసించేవారు. ఆ రాజ్యాన్ని బకుడనే క్రూరుడు పాలించేవాడు. ఇతడు రోజుకో మనిషిని ఆహారంగా తినేవాడు. ఈ రాజు నుండి ప్రజల్ని రక్షించడానికి తన కత్తికి వస్తువులకు ఓ శిష్యుడ్ని కాపలా వుంచి తనకు తప్ప ఎవరడిగినా ఇవ్వవద్దని మరో శిష్యుడితో కలసి బకుడు వద్దకు వెళ్లి తనను మరునాడు భుజించుమని ఈలోపు ఆ తలపై ధరించిన వస్త్రంలో పట్టేంత బొమ్మని ఇమ్మంటాడు. ప్రయత్నించి విఫలుడై ఇద్దరూ మల్లయుద్ధం చేయగా బకుడు మరణిస్తాడు. ప్రజలు ఇతణ్ణి రాజును చేస్తారు. అజశిఖుడు దొరను తమ మరోశిష్యుడి వద్ద వున్న కత్తి ఇతర సామాగ్రి తెమ్మని పంపగా అజశిఖుడు తనకు మాత్రమే ఇవ్వమని చెప్పాడు గనుక ఇతనికి ఇవ్వదలచక పోరాడుకొని ఇద్దరూ మరణిస్తారు. తన శిష్యుల జ్ఞాపకార్థం నాల్గు పంక్తుల అక్షరాలు ఒక్కొక్కటి ఐదక్షరాలలో రాస్తాడు. అదే మొదటి లిపిగా ప్రసిద్ధి నొందింది.

హెనెకొరికొ – ఇద్దరు శిష్యులున్నారు. టొబొ గోవోలో – వారి గురువు ఆజ్ఞవల్ల శత్రువులయ్యారు.
పొదొజొయొన్యో – ఇద్దరూ ధైర్యవంతులే
మొగొబొదొర్గో – ఇద్దరూ చనిపోయారు

ప్రాచీన భారతదేశంలో ఎన్నో రకాల లిపులు ప్రచారంలో వున్నాయి. లలితుస్తాం 64 రకాల లిపులున్నట్లు పేర్కొంది. కాని గుహల్లో దానిపై శాసనాలు చూస్తే ఇవన్నీ కూడా రెండు ప్రధానమైన లిపుల నుండి పుట్టినట్లు గోచరిస్తుంది. అవి బ్రాహ్మిలిపి, ఖరోష్ఠి. ఖరోష్ఠి ఉత్తరభారతంలోని ఈశాన్య ప్రాంతంలో వాడుకలో వుండగా తక్కిన భారతదేశమతా బ్రాహ్మిలిపి ప్రచారంలో వుండేది. క్రీ.శ. 4వ శతాబ్దానికి ఖరోష్ఠి కూడా అంతరించి బ్రాహ్మీ లిపి మాత్రమే మిగిలింది. అయితే ఉత్తర భారతంలో దక్షిణాదిలో చిన్న తేడాలు వుండి దక్షిణ భారత లిపి ద్రావిడం అనబడింది. ఖరోష్ఠివలే బ్రాహ్మీ కూడా మొదట కుడి నుండి ఎడమకు వ్రాయబడినా తర్వాత ఎడమ నుండి కుడికి వ్రాయడం మాత్రమే జరుగుతోంది. పండితులు కొందరు ఇది చైనా నివాసుల నుండి పుట్టిందని, సెమిటిక్ భాషల నుండి పుట్టిందని, క్రీ.పూ. ప్రాచీన యాత్రికుల నుండి జనించిందని చెప్తారు. పురాణ గాథలు మాత్రం బ్రహ్మచేతుల్లో పత్రాలు వుండేవని వీటిపై లిపి వుండేదని కాలక్రమంలో మాయమై తరు వాత వ్యాసుడు దాన్ని పునరుద్ధరించాడని చెప్తాయి.

**లీలాద్యుడు :** విశ్వామిత్రుడి కొడుకు. బ్రహ్మవాది. – *మహాభారతం*

**లీలాతిలకం :** సాహిత్య విమర్శపై మలయాళ భాషలో వెలువడిన మొదటి గ్రంథం.

**లీలావతి 1 :** కోసల రాజైన ధ్రువసంధి భార్య. – *చూ॥ ధ్రువసంధి*

**లీలావతి 2 :** ప్రోష్ఠపద మాసంలో శుక్లాష్టమి వ్రతం చేసి స్వర్గం చేరిన వేశ్య. కృతయుగంలో లీలావతి

అనే వేశ్య సంపాదన పెరగడం కొరకు వున్న ప్రాంతం నుండి మరో నగరానికి వచ్చి ఓ దేవాలయంలో రాధా ష్టమి వ్రతం జరుగుతుండగా దీని గొప్పతనం గురించి వారి నడిగింది. ఈ వ్రతంలో పాల్గొంటే చేసిన పాపాలు నశిస్తాయని చెప్పగా అందులో ఆమె పాల్గొంది. ఆ తర్వాత కొంతకాలానికి ఓ పాముకాటుకు గురై ఆమె మరణించగా యమదూతలు ఆమెను తీసుకుపో వడానికి రాగా విష్ణుభక్తులు శంఖ చక్ర గధాధారులై వచ్చి వారి నడ్డగించి ఆమెను విమానంలో స్వర్గానికి తీసుకువెళ్లారు. – పద్మపురాణం

**లుశుడు :** రుగ్వేదకాలం నాటి రుషి. ఇంద్రుని కృప కోసం లుశుడు, కత్యుడు. విరోధులుగా వుండే వారు. ఒకసారి వారిద్దరు ఇంద్రుణ్ణి ఆహ్వానించగా ఇంద్రుడు లుశుడిని కారాగారంలో బంధించాడు. అందులో వుండి కూడా ఇంద్రుణ్ణి రమ్మని పూజించాడు. – రుగ్వేదం

**లేఖులు :** ఓ దేవగణం. రైవతమన్వంతరంలోని వారు. ఇందులో 8 మంది దేవతలున్నారు. వారు ధ్రువుడు, ధృవక్షితి, ప్రఘాస, ప్రచేతస, బృహస్పతి, మనోజవ, మహయశస్సు, యువనాగుడు. – బ్రహ్మాండపురాణం

**లోకపాలుడు :** ఇంద్ర, అగ్ని, యమ, వరుణుల్ని లోక పాలకులంటారు. – మహాభారతం

**లోకం :** విశ్వసృష్టి, వినాశం గురించి పురాణాల్లో ఎన్నో కథనాలున్నాయి.

1) విశ్వానికి ముందు సర్వాంతర్యామి, అదృశ్యశక్తి కలవాడు, మనకు తెలియని వాడు అయిన మహా విష్ణువే వున్నాడు. అప్పుడు రాత్రికాని పగలుకాని లేదు. సృష్టి మొదలైనప్పుడు ప్రకృతి పురుషుని ఉద్రేకంవలే విష్ణువుతో కలసింది. అప్పుడు ఓ గొప్ప మహత్తు ఏర్పడింది. మహత్తు నుండి అహంకారమేర్పడగా అందుండి వైకారిక, తైజస, తమస్సు లేర్పడ్డాయి. అహంకారం నుండి ఆకాశం, ఆకాశం నుండి గాలి, గాలి నుండి నీరు, నీటి నుండి భూమి ఏర్పడ్డాయి. మహా విష్ణువు తన శక్తిని నీటితో నింపాడు. మహా విష్ణువు యొక్క ఆ శక్తే జీవం. – అగ్నిపురాణం

2) మహా విష్ణువు జీవరాశులెన్నింటినో సృష్టించదలచి నీటిని మొదట సృష్టించి తన శక్తిని నీటితో నింపగా ఓ గుడ్డు ఏర్పడింది. ఆ గుడ్డు నుండి బ్రహ్మ జన్మిం చాడు. ఆ గుడ్డును మహావిష్ణువు రెండుగా పగల గొట్టగా మొదటిభాగం స్వర్గం, రెండవభాగం భూమి అయ్యాయి. ఈ రెండింటి మధ్య ఆకాశాన్ని సృష్టిం చాడు. ఆ తర్వాత భూమిపై ప్రజాపతుల్ని కాలమానస వాక్ కామక్రోధ రతిల్ని సృష్టించాడు. తన ముఖం నుండి రుగ్వేద, సామవేద, యజుర్వేదాల్ని సృష్టిం చాడు. ప్రజాపతి తన శరీరాన్ని రెండుగా చీల్చుకోగా పురుషుడు, స్త్రీలయ్యారు. సృష్టికి మూలం అదే. – అగ్నిపురాణం

మహావిష్ణువు వటపత్రశాయిగా వుండగా మహామాయను తానెవరని ప్రశ్నించాదని మనమంతా భ్రమలమని అందరము నాశనమవుతామని నీవు సృష్టికర్తవని నీ నాభినుండి బ్రహ్మ ఉద్భవిస్తాడని బ్రహ్మ సృష్టికార్యం జరుపుతాడని నీవు దాన్నే కాపాడుతావని శివుడు నాశనం చేస్తాడని అప్పుడు ప్రళయం వస్తుందని సృష్టి మొత్తం నశించగా మరల నీవు ఆ ప్రక్రియను కొనసా గిస్తావని చెప్తుంది. – దేవీ భాగవతం

*అంతం :* ప్రపంచంలోని భౌతిక వస్తువులన్నీ భ్రమలే. అగ్ని పెరుగుతోంది. కుండపోతగా వర్షం సంభ విస్తుంది. ప్రపంచం వేడెక్కి కరిగిపోతుంది. నీటిపోత లాంటి వర్షంలో లోకమంతా నీరై మహావిష్ణువు ఒక్కడే వటపత్రశాయి ప్రత్యక్షమవుతాడు.

**లోకాలోకం :** లోక అలోకాల మధ్య లోకాలోక పర్వతం వుండేది. దాని పరిసర ప్రాంతాన్ని లోకాలోకం అనేవారు. లోకాలోక పర్వతం మానసోత్తర మహా మేరువుల మధ్యగల దూరమంత పొడవు వుండేది. ఈ ప్రాంతం బంగారు రంగులో వుండి కాంతిలేనిది. ఇక్కడ ఎవ్వరూ జీవించేవారు కాదు. దేవుడు దీన్ని ముల్లోకాలకు హద్దుగా సృష్టించాడు. సూర్యుడు కూడా కాంతిని ఇచట నుండి పొందాడు. బ్రహ్మ దీనికి నాల్గు దిక్కులు నాల్గు దిగ్గజాలను వుంచాడు. అవి వృషభ, పుష్పబోడ, వామన, అపరాజితులు. – దేవీభాగవతం

**లోకోదారం :** పురాణ ప్రసిద్ధమై పుణ్యస్థలం. మహా విష్ణువు అన్ని లోకాలను ఇచట నుండే పైకెత్తాడు. ఇచట గల కొలనులో స్నానం చేస్తే పితరుల ఆత్మలకు కూడా ముక్తి లభిస్తుంది. – మహాభారతం

**లోపాముద్ర :** అగస్త్యుని భార్య. - చూ॥ అగస్త్యుడు

★**లోభుడు :** బ్రహ్మ మానస పుత్రుడు. బ్రహ్మ పెదవుల నుండి జన్మించాడు. - మత్స్యపురాణం

**లోమపాదుడు (రోమపాదుడు) 1 :** అంగదేశపు రాజుల్లో ఒకడు. సత్యరథుని కుమారుడు. ఒకసారి ఇతడి రాజ్యంలో కరువుకాటకాలు ఓ రుషి శాపంవల్ల కల్గాయి. శాప విముక్తి కొరకు తన పెంపుడు కుమార్తెను రుష్యశృంగుడికిచ్చి వివాహం చేశాడు. అప్పటి నుండి ఆ దేశంలో వర్షాలు కురిశాయి. లోమపాదుడు రుష్యశృంగుడికి కొత్త ఆశ్రమం కట్టించి ఇచ్చాడు.

**లోమపాదుడు 2 :** యదు వంశపు రాజు. విదర్భుడి కొడుకు. - పద్మపురాణం

**లోమశుడు 1 :** ఓ రుషి. పురాణాలలో ఎన్నో కథల్ని గాథల్ని ధర్మజునికి పాండవులకు తెలియజేశాడు. ఇతడు ఉత్తర భారతదేశంలోని ఓ రుషి. ఇతడే దధీచి ఎముకల వల్ల తయారుచేయబడిన ఆయుధం వల్లనే అసురుల్ని ఎదుర్కోగలరని దేవతలకు సలహా ఇస్తాడు. ఇంతడెందరో అప్సరసలకు శాపవిమోచనం చేశాడు. - మహాభారతం

**లోమశుడు / రోమశుడు 2 :** ఓ పిల్లి. - చూ॥ ధింధిక

**లోమహర్షణుడు :** సూతుని తండ్రి. పురాణ కథలు చెప్పేవాడు. యుధిష్ఠురుని కొలువులో సభ్యుడు. - మహాభారతం

**లోలార్కుడు :** సూర్యుని నామాంతరం. శివుడు దివోదాసుని వంచించమని పంపగా అది సాధ్యంకాక శివుడికి ఎదురుపడలేక లోలార్క ఉదయార్కాది రూపాల్లో కాశీలోనే వుండిపోతాడు. కాశీలో నివాసం వుండటం వల్ల మనసు లోలమవడంతో లోలార్కుడనే పేరు వచ్చింది. - కాశీమాహాత్మ్యం

**లోలుడు :** సిద్ధవీరుడను ముని కుమారుడు. ఇతడు తదనంతర జన్మలో ఉత్పలావతి అనే రాణికి జన్మించాడు. అప్పుడతని పేరు తామసుడు. ఇతడొక మనువు. - మార్కండేయ పురాణం

**లోహజంఘుడు :** చూ॥ మకరదంష్ట్ర.

**లోహమేఖలుడు :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు. - మహాభారతం

**లోహవక్త్రుడు :** సుబ్రహ్మణ్యస్వామి అనుచర యోధుల్లో ఒకడు. - మహాభారతం

**లోహం :** భారతావనిలోని ఓ ప్రాచీన స్థలం. అర్జునుడు దీన్ని జయించాడు. - మహాభారతం

**లోహిత :** ఓ సర్పం. ఇది వరుణుని సభలో ఓ సభ్యురాలు. - మహాభారతం

**లోహితగంగ :** పురాణ ప్రసిద్ధమైన ప్రాంతం. పాంచజ, విరూపులనే రాక్షసుల్ని శ్రీకృష్ణుడిక్కడ వధించాడు. - మహాభారతం

**లోహితాక్షి :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరి. - మహాభారతం

**లోహితాక్షుడు :** జనమేజయుని సర్పయాగంలో ఓ రుత్వికుడు. సర్పయాగం పూర్తికాదని ఇతడే ముందుగా చెప్పాడు. - మహాభారతం

**లోహితాయని :** ఎర్రసముద్రపు కుమార్తె. సుబ్రహ్మణ్యస్వామిని పెంచిన తల్లులలో ఒకరు. ఈమె కాదంబ వృక్షాన్ని పూజించేది. - మహాభారతం

**లోహితారని :** ప్రాచీన భారతదేశంలో పురాణ ప్రసిద్ధ నది. - మహాభారతం

**లోహితాశ్వుడు :** హరిశ్చంద్రుని కుమారుడు. - చూ॥ హరిశ్చంద్రుడు.

**లోహితాయణి :** కుమారస్వామి జనించి బాలక్రీడలు ఆడుచుండగా ఇతడికి భయపడి సప్తమాతృకలను ఇతడిని చంపమని పంపగా అతని తేజస్సుకు భయపడి అతని శరణువేడిరి. ఈ మాతృకకు క్రోదము వల్ల ఒక భామిని జన్మించెను. ఆమెయే లోహితాయణి. ఈమె కుమారస్వామిని లాలించెను. - మహాభారతం

**లోహితుడు 1 :** హరిశ్చంద్రుని కుమారుడు. - చూ॥ హరిశ్చంద్రుడు

**లోహితుడు 2 :** ప్రాచీన దేశంలోని ఒక రాజు. ఇతడిని అర్జునుడు జయించాడు. - మహాభారతం

**లోహితం :** ఓ సర్పం. వరుణుని కొలువులో ఓ సభ్యురాలు. - మహాభారతం

★ మాయ యొక్క కుమారుడు - *భాగవతం*

**లోహిత్య :** ఓ గొప్పనది. దీని ప్రస్తుత నామం బ్రహ్మ పుత్ర. ఈ నదీ దేవత వరుణుని కొలువులో అతడిని పూజిస్తుంటుంది. - మహాభారతం

**లోహుడు :** ఓ అసురుడు. పాండవులు అజ్ఞాతవాసంలో వుండగా వారి ఆయుధాలను ఓ రహస్య స్థావరంలో దాచారు. దీన్ని అవకాశంగా తీసుకొని అతడు పాండవుల పైకి రాగా దేవతలు ఇతణ్ణి గుడ్డివాడిని చేసి పాండవులను రక్షించారు. - స్కందపురాణం

**లౌహిత్యం 1 :** పురాణ ప్రసిద్ధమైన దేశం. శూద్రులు నివసించే ఈ దేశాన్ని భీముడు జయించి రకరకాల వజ్రాల్ని సేకరించాడు. - మహాభారతం

**లౌహిత్యం 2 :** శ్రీరాముడి కాలంలో నిర్మించిన ఓ పవిత్ర స్థలం. ఇచ్చటి కొలనులో స్నానం చేస్తే బంగారు వర్ణం పొందుతారు. - మహాభారతం

**లంకా లక్ష్మి :** పూర్వ జన్మలో ఈమె బ్రహ్మ నిధికి కాపలాదారు. ఈమె పేరు విజయలక్ష్మి. విధి నిర్వహణలో నిర్లక్ష్యం వల్ల బ్రహ్మ ఈమెను రావణుడి ద్వారపాలకురాలిగా శపిస్తాడు. శాపవిమోచనం కోరగా హనుమంతుడి దెబ్బకు శాపవిమోచన మౌతుందని చెప్తాడు. ఈమె లంకలో వుండి హనుమంతుణ్ణి అడ్డగించగా హనుమంతుడు కొట్టగా శాపవిమోచనమౌతుంది. - కంభరామాయణం

**లంకిణి :** రావణుని పాలనలో గల లంకను కాపాడే రాక్షసి. హనుమంతుడు లంకలోకి చేరకుండా అడ్డుండి అతనితో పోరాడి ఓడుతుంది. - రామాయణం

**లంగలి :** పురాణ ప్రసిద్ధ నది. ఇది వరుణిని కొలువులో వుండి దేవి రూపంలో వరుణుడిని పూజిస్తుంది. - మహాభారతం

**లంఘతి :** పురాణ ప్రసిద్ధమైన ఒక నది. ఇది వరుణుని కొలువులో వుండి వరుణుడిని పూజిస్తుంది. - మహాభారతం

**లంపాకం :** పురాణ ప్రసిద్ధ స్థలం. ఈ ప్రాంత ప్రజలు కౌరవుల పక్షాన పోరాడారు. సాత్యకితో యుద్ధం చేసి మరణించారు. - మహాభారతం

**లంబ :** దక్ష ప్రజాపతి కుమార్తె. దక్ష ప్రజాపతికి అశిక్ని వల్ల 100 మంది కుమార్తెలు. అందులో 10 మందిని ధర్ముడికిచ్చి వివాహం చేశాడు. అందులో లంబ ఒకరు. - విష్ణుపురాణం

**లంబని :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు. - మహాభారతం

**లంబపయోధరి :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరి. - మహాభారతం

**లంబోదరుడు :** చూ॥ వినాయకుడు.

**లింగపురాణం :** చూ॥ పురాణాలు

**లింగం :** శివుడి మూర్తి. శివుడి రూపానికి పూజలేనట్లు భృగువు శపిస్తాడు. కనుక లింగాకారంలోనే అతణ్ణి పూజిస్తారు. దారుకా వనంలో శివుడు మునుల తపస్సుకు భంగం కల్గిస్తుండేవాడు. వారి శాపం కూడా ఫలించేది కాదు. ఇతడు లింగాకారంలో వీరి ఎదుట నిలుస్తాడు. బ్రహ్మ లింగాన్ని పూజించమని చెప్తాడు. - బ్రహ్మాండపురాణం

**లైంగం :** నందికేశ్వర ప్రోక్తమయిన ఒక పురాణం. ఈశాన కల్ప విషయాలను తెలియజేస్తుంది.



**వ :** ఈ అక్షరానికి అర్థం వరుణుడు.

**వకదాల్భ్యుడు :** ప్రాచీన కాలంలో ఓ రుషి. ఇతడు ధర్మజుని కొలువులో సభ్యుడు. ఆ కొలువులో ఒకసారి బ్రాహ్మణుల గొప్పతనం గూర్చి ఉపన్యసించాడు. ఇతడొకసారి ఇంద్రుడికి అమృత మూర్తుల గురించి వర్ణించాడు. ఒకసారి కృష్ణుడు రాయబారిగా వెళ్తున్నప్పుడు అతడితో మాట్లాడాడు. ఒకసారి ధృతరాష్ట్రుడి రాజ్యం ఎలా నశిస్తుందో వివరించాడు. - మహాభారతం

**వకనఖుడు :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు. వేదాలను ప్రచారం చేశాడు. - మహాభారతం

**వకుడు :** చూ॥ బకాసురుడు.

**వక్త్రయోధి :** దను వంశస్థుడు. విప్రచిత్తి కొడుకు.

**వక్త్రుడు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. ఇతడిని దంత వక్త్రుడని కూడా అంటారు.

**వక్షోగ్రీవుడు :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు. వేద ప్రచారకుడు. - మహాభారతం

**వచక్నువు :** గార్గి తండ్రి

**వజ్రకంటసాలి :** ఓ నరకం. - చూ॥ నరకాలు

**వజ్రజ్వాల :** మహాబలి కుమార్తె. కుంభకర్ణుని భార్య.
- ఉత్తర రామాయణం

**వజ్రదత్తుడు :** ప్రాగ్జ్యోతిషపురరాజు. భగదత్తుని కుమారుడు. ఇతడు చుట్టుపక్కల రాజుల్ని ఓడించాడు. ధర్మరాజు అశ్వమేధయాగాశ్వాన్ని బంధించి అర్జునునితో మూడు రోజులు పోరాడి ఓడాడు.
- మహాభారతం

**వజ్రదంష్ట్రుడు 1 :** ఓ అజానుబాహుడు. రావణుని అనుచరుడు. రామరావణ యుద్ధంలో అంగదుడు ఇతణ్ణి వధించాడు. - రామాయణం

**వజ్రదంష్ట్రుడు 2 :** త్రిపురాసురుల సైన్యానికి నాయకుడు. కొన్ని గ్రామాలు పాతాళాన్ని ఆధీనంలోకి తెచ్చినందుకు ఇతనికి దుస్తులు బహుమతిగా ఇచ్చాడు.
- గణేశపురాణం

**వజ్రనాభుడు 1 :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు.
- మహాభారతం

**వజ్రనాభుడు 2 :** శ్రీరాముని కుటుంబంలో జన్మించిన ఒక రాజు. శ్రీరాముని కుమారుడైన కుశుని వారసత్వంలోనివాడు. ఖగనుడు ఇతని కుమారుడు.
- భాగవతం

**వజ్రనాభుడు 3 :** మధురను పాలించిన ఒక రాజు. పరీక్షిత్తు మహారాజుకు స్నేహితుడు. శాండిల్యుని కోరికపై ఉద్ధవుడు భాగవత ప్రశస్థిని వజ్రనాభుడికి వివరించాడు.

**వజ్రనాభుడు 4 :** ఓ అసురుడు.
ఇతడు వజ్రపురానికి అధిపతి. తపస్సుచేసి బ్రహ్మ వలన దేవతల వల్ల ఓటమి లేనట్లు వరము పొందెను. ఇతడు దేవతలను బాధపెట్టుచూ స్వర్గాధిపత్యమిమ్మని ఇంద్రుని కోరగా కశ్యపుడెట్లు చెప్పిన అట్లు చేయుదునని చెప్పి ఇతడిని చంపమని శ్రీకృష్ణుని కోరెను. ఇతని కుమార్తె ప్రభావతికి శ్రీకృష్ణుని కుమారుడైన ప్రద్యుమ్నుని యెడల ప్రేమ గలదు. ప్రద్యుమ్నుడు రహస్యముగ ఆమె మందిరము చేరెను. వజ్రనాభుడితడిని చంపబోగా శ్రీకృష్ణుడు సకల సైన్యములతో ముట్టడించి ఇతనిని వధించెను. ఆ తదుపరి ఇతని కుమార్తె ప్రభావతిని శ్రీకృష్ణుని కుమారుడైన ప్రద్యుమ్నుడు వివాహమాడాడు. - చూ॥ ప్రభావతి

**వజ్రప్రాసాదం :** స్వర్గంలోని ఒక భవనం.
- దేవీభాగవతం

**వజ్రబాహుడు 1 :** ఓ క్రూర రాక్షసుడు. చంచలాక్షి అనే విద్యాధర అప్సరను సహస్రముడను రాక్షసుడు బలాత్కరించగా జన్మించాడు. ఇతడు శివుని గురించి ప్రార్థించి పాశుపతాస్త్రం సంపాదించాడు. ఆ తర్వాత ఇతడు ఇంద్రుణ్ణి బంధించగా సుబ్రహ్మణ్యస్వామి ఇతడ్ని వధించి ఇంద్రుణ్ణి రక్షించాడు. - కంభరామాయణం

**వజ్రబాహుడు 2 :** ఓ వానరం. ఇతర వానరాలతో కలసి కుంభకర్ణుడి ముఖాన్ని దేహాన్ని రక్కగా కుంభకర్ణుడు వారిని పట్టుకుని తినేశాడు. - మహాభారతం

**వజ్రమిత్రుడు :** ఘోషుడనే రాజు కొడుకు. భాగవతుడి తండ్రి. - భాగవతం

**వజ్రముష్టి :** సుందరి మలయవానులకు పుట్టిన భీకరుడు. ఇతనికి ఆర్గురు సోదరులు, ఒక సోదరి.
- ఉత్తర రామాయణం

**వజ్రవాలి :** మహాబలి కుమార్తె. కుంభకర్ణుని భార్య.
- ఉత్తర రామాయణం

**వజ్రవిష్కంభం :** గురుడుని బిడ్డ. - మహాభారతం

**వజ్రవేగుడు :** ఖర, దూషణ, త్రితింసులకు సోదరుడు. కుంభకర్ణుడికి రామరావణ యుద్ధంలో సహకరించి శ్రీరామునితో యుద్ధంచేశాడు. హనుమంతుడితణ్ణి వధించాడు. - మహాభారతం

**వజ్రశీర్షుడు :** భృగు మహర్షి కుమారుల్లో ఒకడు.
- మహాభారతం

**వజ్రాయుధం :** ఇంద్రుని ఆయుధము. వృత్రాసురునకు భయపడి ఇంద్రుడు, సకల దేవతలు మహావిష్ణువును సంప్రదించగా "దదీచి ఎముకలతో తయారు చేసిన ఆయుధముతో వానిని సంహరించవచ్చునని చెప్పగా, ఇంద్రుడు దదీచి మహర్షిని ఆశ్రయించగా, అతడు యోగాగ్నిలో భస్మమై ఇంద్రునికి తన ఎముకలను సమర్పించాడు. ఆ ఎముకల నుండి తయారు చేసినదే ఇంద్రుని వజ్రాయుధం.

**వజ్రాంగి :** దితి వంశస్థురాలు. వజ్రాంగుడి భార్య. తారకాసురుడి తల్లి. - శివపురాణం

**వజ్రాంగుడు :** ఓ అసురుడు. కశ్యపునికి దితివల్ల జన్మించాడు. ఇతనికి వరాంగివల్ల తారకాసురుడు జన్మించాడు.
- శివపురాణం

**వ(జి 1 :** వ(జాయుధాన్ని ధరించినవాడు. అనగా ఇం(దుడు.

**వ(జి 2 :** ఓ విశ్వదేవుడు. పితృ గణాలలో ఒకడు.

**వ(జుడు 1 :** విశ్వామి(తుని కుమారుల్లో ఒకడు. వేదాలకు భాష్యం చెప్పాడు. – మహాభారతం

**వ(జుడు 2 :** శ్రీకృష్ణుని మనుమడైన అనిరుద్ధుని కుమారుడు. యాదవ ముసలం తర్వాత మిగిలిన యాదవులకు అర్జునుడు ఇతణ్ణి రాజును చేశాడు. పాండవులు మహా(ప్రస్థానానికి వెళ్తూ సుభ(ద్రను ధర్మజుడు పిలిచి ఇతడిని జా(గ్రత్తగా చూసుకొమ్మని చెప్పాడు. – మహాభారతం

**వటస్థానం :** మహాభారత యుద్ధ సమయంలో కురుసేనకు విడిది. – మహాభారతం

**వటుడు :** అంశుడనే దేవుడు సు(బ్రహ్మణ్యస్వామికిచ్చిన ఐదుగురు అనుచరుల్లో ఒకడు. – మహాభారతం

**వడముడి :** భీముడి పేరు.

**వత్సకుడు :** యదువంశం వాడు. వసుదేవుడి తమ్ముడు. – భాగవతం

**వత్సనాభుడు :** ఓ రుషి. ధర్ముడొకసారి గేదగామారి తీ(వ్రమైన వర్షం నుండి ఇతణ్ణి రక్షించాడు. ఆ తరువాత నేను పాపాత్ముడ్ని కనుక శరీరం విడవాలనే కోర్కెను వెల్లడించగా ధర్ముడు ఆ కోర్కెను విరమింపజేశాడు. – మహాభారతం

**వత్సం(ధుడు :** వనందుడి కొడుకు. విధూరథుడి కొడుకులు, కూతురు మూదావతిని కుజంబుడు పాతాళంలో బంధించగా వత్సం(ధుడు పాతాళానికి వెళ్లి కుంజబుడ్ని ఓడించి ముదావతిని వివాహమాడతాడు. వీరికి చండుడు, బల మొదలైన సంతానం కల్గుతారు. – మార్కండేయ పురాణం

**వత్స(ప్రీతి :** హలంధనుడి కొడుకు. ఇతడి కొడుకు (ప్రాంశువు. – భాగవతం

**వత్సరాజు :** ఒక రాజు. రాజ్యాన్ని కోల్పోయి వసిష్ఠా(శమానికి వెళ్లగా నారసింహ (వ్రతం చేయమని వసిష్ఠుడితనికి సలహా ఇస్తాడు. ఆ (వ్రతం చేయగా కోల్పోయిన రాజ్యం తిరిగి పొందుతాడు. – వరాహపురాణం

**వత్సరుడు :** (ధ్రువుని ఇద్దరు కుమారుల్లో చిన్నవాడు. పెద్దవాడైన ఉత్కలుడు రాజ్యార్హుడు కానందువల్ల (ధ్రువుని తర్వాత ఇతడే రాజ్యాధికారం స్వీకరించాడు. ఇతని భార్య సర్వర్ధి. ఇతనికి పుష్పార్ణుడు, చం(ద్రకేతుడు, ఊర్జువు, వసువు, జయుడు అను ఐదుగురు కుమారులు. – భాగవతం

**వత్సలుడు :** సు(బ్రహ్మణ్యస్వామి అనుచరుడు. – మహాభారతం

**వత్సాసురుడు :** ఓ రాక్షసుడు. యమునాతీరంలోవున్న బలరామకృష్ణుల్ని చంపడానికి లేగదూడ రూపంలో రాగా శ్రీకృష్ణుడు ఇతణ్ణి గుర్తించి సంహరిస్తాడు. – భాగవతం

**వత్సుడు 1 :** కాశీరాజైన (ప్రతర్దనుడి కొడుకు. పరశురాముడి ధాటికి ఆగలేక అడవులకెళ్లి పశువులు కాసేవాడు. – మహాభారతం

**వత్సుడు 2 :** శర్యాతి కుటుంబంలోని రాజు. ఇతడు తాలజంఘుడు, హేహయులకు తం(డ్రి. – మహాభారతం

**వధూసరి :** ఓ నది. చ్యవనుని ఆ(శ్రమ పరిసరాలగుండా (ప్రవహిస్తుంది. భృగుమహర్షి భార్యాపు(త్రుల కన్నీటి ధారల నుండి ఇది జన్మించింది. పరశురాముడు ఇందులో స్నానం చేయడం వల్ల అతని శరీరం కాంతులీనేది. – మహాభారతం

**వదాన్యుడు :** ఓ (ప్రాచీన రుషి. – చూ॥ అష్టావ(క్రుడు

**వధ్యశ్వుడు :** (ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. ఇతని ఆత్మ యముని కొలువులో వుండి అతణ్ణి పూజిస్తుంది. – మహాభారతం

**వ(ధం :** (ప్రాచీన భారతావనిలో ఒక దేశం. – మహాభారతం

**వ(ధిమతి :** రుగ్వేదంలో స్తుతించబడిన ఓ రాణి. ఈమె భర్త నపుంసకుడగుట వల్ల కన్నీళ్ల పర్యతం ఏడ్చి అశ్వనీ దేవతలను (ప్రార్థించగా హిరణ్యహస్తుడను పు(త్రుడు జన్మించాడు. – రుగ్వేదం

**వధుడు :** యాతుధానుడను రాక్షసుని పు(త్రుడు. విఘ్న, శ్యాములను ఇద్దరు కుమారులు కలరు. – (బ్రహ్మాండ పురాణం

**వనవాసికం :** (ప్రాచీన భారతావనిలో ఒక రాజ్యం. – మహాభారతం

**వనస్పతి 1 :** పూలు పూయకనే కాయలు కాసే వృక్షాలను వనస్పతి వృక్షాలంటారు. – మనుస్మృతి

**వనస్పతి 2 :** స్మృతపృష్ఠ అనే రాజు ఏడుగురు కుమారుల్లో ఒకడు. – భాగవతం

**వనాయువు 1 :** దను కశ్యప ప్రజాపతిలకు జన్మించిన పదిమంది కుమారుల్లో ప్రముఖుడు. – మహాభారతం

**వనాయువు 2 :** పురూరవసు ఊర్వశిలకు జన్మించిన కుమారుల్లో ఒకడు. – మహాభారతం

**వనాయువు 3 :** ప్రాచీన భారతదేశంలోని ఓ రాజ్యం. – మహాభారతం

**వనేయుడు :** ఒకరాజు. రుద్రాశ్వుడి కొడుకు. ఇతని తల్లి మిశ్రకేశి. – మహాభారతం

**వపుస 1 :** దక్షుని కుమార్తెల్లో ఒకరు. ధర్మదేవుడు ఈమెను వివాహమాడాడు. – విష్ణుపురాణం

**వపుస 2 :** ఓ అప్సరస. ఇంద్ర సభల్లోని అప్సరసల్లో ఎవరు గొప్ప అనే ప్రశ్న వచ్చినపుడు దాన్ని తీర్చమని నారదుణ్ణి కోరగా దుర్వాసుడ్ని చలింపజేయగలిన వారు గొప్ప అని నారదుడు సమాధానమిస్తాడు. ఈమె ఆ ప్రయత్నం చేయబోయి దుర్వాసుడి శాపానికి గురై కుందముని కుమార్తె తార్క్షి అనే పక్షిగా పునర్జన్మిస్తుంది. – మార్కండేయ పురాణం

**వపుష్టమ :** జనమేజయుని భార్యల్లో ప్రసిద్ధి చెందినది. ఈమె కాశీరాజు సువర్ణ వర్మ కుమార్తె. శాతానిక శంకుకర్ణులీమె కుమారులు. – మహాభారతం

**వపుష్మతి :** సింధు దేశ రాజకుమార్తె. ఈమె మరుత్తునికి భార్య అవుతుంది. – మార్కండేయపురాణం

**వపుష్మంతుడు :** ప్రియవ్రతుడి కొడుకు. శాల్మలీద్వీపానికి రాజు. ఇతనికి ఏడుగులు కొడుకులు. – బ్రహ్మాండపురాణం

**వపుష్మానుడు :** విదర్భ రాజైన సంక్రందన కుమారుడు. విష్ణ వంశపు రాజైన దముడు దాశర్ణ రాజైన చారువర్మ కుమార్తె సుమనను ఎత్తుకుపోగా వపుస్మానుడు దములు శత్రువులయ్యారు. సమయం చూసి వపుష్మానుడు దముని తండ్రిని చంపాడు. దముని తల్లి దుఃఖితురాలు కాగా పెద్ద సైన్యంతో వపుష్మానుడిపై దండెత్తి అతడిని వధించి అతని రక్తంతో తన తల్లిదండ్రుల ఆత్మలకు శాంతి చేకూర్చాడు. – మార్కండేయపురాణం

**వమ్రి :** ఓ కీటకం. విష్ణువు ఎక్కుపెట్టిన ధనస్సుపై చేరి ఆ వింటి నారిని కొరకగా ఆ దెబ్బకు విష్ణుమూర్తి తల ఊడిపోతుంది. – దేవీభాగవతం

**వయ్యుడు :** రుగ్వేదకాలంనాటి గొప్ప రాజర్షి. కర్మాంధుడు, ఇతడు రుగ్వేదంలో ప్రస్తావించద్దారు. – రుగ్వేదం

**వరణ 1 :** పురాణప్రసిద్ధ నది. భగవానుని కుడి కాలి నుండి వరణ, ఎడమ కాలి నుండి అసి నదులు ప్రారంభమయ్యాయి. ఇవి రెండూ ప్రయాగవద్ద కలుస్తాయి. – చూ॥ వారణాసి

**వరణ 2 :** ప్రాచీన భారతావనిలో ఓ రాజ్యం. కౌరవ సైన్యం దీన్ని చుట్టుముట్టింది. – మహాభారతం

**వరతనుడు :** ఓ కురురాజు. పూర్వ జన్మలో ఇతడు చేసిన పాపం వల్ల సంతానం లేదు. తర్వాతి జన్మలో ఇతడి పేరు శ్రీధరుడు. ప్రభావతిని వివాహమాడి చాలాకాలం జీవించాడు. కాని సంతానం లేదు. వ్యాసుడొకసారి రాగా కారణమడిగాడు. సంతాన లేమికి కారణం నీవు పూర్వజన్మలో వరతనుడను బ్రాహ్మణుడివి, నీ భార్య శంకరి. ఓ తక్కువ కులం బిడ్డడు నీటిలో మునగగా నీవు పట్టించుకోకుండా వెళ్లిపోయావు. మీరు రాజవంశంలో జన్మించినా మీ పూర్వజన్మలోని ఆ పాపం వల్ల సంతానం కలుగలేదని చెప్పగా బాలుర రక్షణ కొరకు వ్యాసుని సలహాపై బాలవ్రతం చేసి ఆ పాపంనుండి విముక్తుడు కాగా ఓ కుమారుడు జన్మించి ఆ వంశానికి మూలపురుషుడౌతాడు. – పద్మపురాణం

**వరతంతుడు :** కౌత్సుడను రుషి యొక్క గురువు. – చూ॥ కౌస్తుడు

**వరత్రి :** శుకుడి నల్గురు కొడుకుల్లో ఒకడు. ఈ నల్గురు కొడుకులు యాగాలకు వ్యతిరేకులవడం వల్ల ఇంద్రుడు వీరిని వధించగా వీరి తలల నుండి ఖర్జూర చెట్లు మొలిచాయి.

**వరద :** ఒకనది. విదర్భ దేశంలో ప్రవహించి గోదావరిలో కలుస్తుంది.

**వరదానం :** ద్వారక వద్ద గల ఓ పుణ్యస్థలం. ఇక్కడే దూర్వాసుడు శ్రీకృష్ణునికి వరాలిచ్చాడు. అప్పటి నుండి ఇది పుణ్యస్థలమయ్యింది. ఇచట స్నానం చేస్తే 1000 గోవుల్ని దానమిచ్చిన ప్రతిఫలం లభిస్తుంది. – మహాభారతం

**వరదాసంగమం :** ఓ పవిత్ర స్థలం. ఇచట స్నానమాచరిస్తే 1000 గోవులు దానమిచ్చిన ప్రతిఫలం లభిస్తుంది. – మహాభారతం

**వరదుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. - *మహాభారతం*

**వరమణి :** వజ్రంతో చేయబడిన మణి. పాతాళ రావణుడిని చంపాలంటే ఈ మణి నోటిలో వుంచుకుని యుద్ధం చేస్తేనే చంపగలరు. ఈ విషయం రావణుడికి ఇతర రాక్షసులకే తెలుసు. ఇది పాతాళంలోని కాళీదేవాలయంలో వుంది. రామరావణ యుద్ధం జరుగుతుండగా హనుమంతుడు తన తోక చుట్టి ఒక కోటగా చేసి రామలక్ష్మణులను దాయగా భూమికి సొరంగం చేసి పాతాళ రావణుడు రామలక్ష్మణులను ఎత్తుకు పోయాడు. విభీషణుని సలహాపై హనుమంతుడు పాతాళం వెళ్లి ఆ మణిని సంగ్రహించి తన నోట్లో దాన్ని వుంచుకొని పాతాళరావణుడిని ఓడించి రామలక్ష్మణులను విముక్తులను చేశాడు. - *కంభరామాయణం*

**వరమిత్రుడు :** ఓ బ్రాహ్మణుడు. సారస్వతుడి స్నేహితుడు. ఇతని కుమారుడు సుమేధుడు.

**వరయుడు :** మహీజసుల కుటుంబంలో జన్మించిన రాజు. - *మహాభారతం*

**వరరుచి 1 :** ఇతడు ఏకసంధాగ్రాహి, ఏక శృతుడు. పూర్వజన్మమున పుష్పదంతుడను గణనాయకుడు. పార్వతికి శివుడు కథ చెప్పుచుండగా ఇతడు వారికి తెలియకుండా విని పార్వతి శాపానికి గురియై సోమదత్త వసుదత్తలను దంపతులకు జన్మించాడు. వ్యాలి, ఇంద్రజిత్తులితడి ఏకసంధాగ్రహత్వం చూసి వర్షుడికి శిష్యుడిగా చేర్చుతారు. ఇంద్రోత్సవం చూడడానికి వెళ్లి వర్షుడి సోదరుడు ఉపవర్షుడి కుమార్తెను ప్రేమించి వివాహమాడతాడు. గురుదక్షిణ చెల్లించడానికి రాజు వద్దకు వెళ్లగా అప్పటికే రాజు మరణిస్తాడు. ఇంద్రదత్తుడు రాజు శరీరంలోకి ప్రవేశించి ఇతడడిగిన దానం ఇస్తాడు. ఇది గమనించిన రాజు మంత్రి శకటాలుడు చనిపోయిన శరీరాలన్నింటిని దహనం చేయగా ఇంద్రదత్తుడి శరీరం కూడా దహించబడి రాజు శరీరంలోనే వుండిపోతాడు. ఇతడు వరరుచిని మంత్రిగా జేర్చుకుంటాడు. రాజు భార్యతో సంబంధం వుందని తెలిసి వరరుచిని చంపబోగా పారిపోయి తన ఇంటికి చేరి తల్లిదండ్రులు మరణించారని తెలిసి చివరికి తపస్సుచేసి తిరిగి పుష్పదంతుడౌతాడు. - *కథాసరిత్సాగరం*

**వరరుచి 2 :** శీలవతి చంద్రగుప్తుల కొడుకు. - *విక్రమాంక చరిత్రము*

**వరలక్ష్మీ వ్రతం :** శ్రావణమాసంలో శుక్లపక్షంలో శుక్రవారాన ముత్తైదువలు లక్ష్మీదేవికి అర్చన చేసే వ్రతం.

**వరస్త్రీ :** బృహస్పతి సోదరి. ప్రభాసుడను వసువు భార్య. వేదాలకు భాష్యం చెప్పింది. పరమాత్మలో ఐక్యమై సృష్టిని విస్తరింపజేసింది. - మహాభారతం

**వరాహకర్ణుడు :** ఓ యక్షుడు. ఇతడు కుబేరుని కొలువులో వుంటాడు. - మహాభారతం

**వరాహకల్పం :** శ్రీ మహావిష్ణువు రసాతలంలోని భూమిని సముద్రం పైకెత్తి నిలబెట్టినప్పటి తర్వాతి కాలాన్ని వరాహకల్పం అంటారు. - *బ్రహ్మవైవర్త పురాణం*

**వరాహతీర్థం :** ఇదొక పుణ్యతీర్థం. ఇచ్చట మహావిష్ణువు ఆదివరాహమయ్యాడు.

**వరాహపురాణం :** చూ॥ పురాణాలు

**వరాహకం :** ధృతరాష్ట్రుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. - *మహాభారతం*

**వరాహమిహిరుడు :** జ్యోతిష్య శాస్త్రవేత్త ఇతడు క్రీ.శ. 1400 ముందువాడు. ఇతడి ప్రసిద్ధ రచనలు బృహజ్జాతకం, బృహత్సంహిత.

**వరహాంబుడు :** ఒక రాక్షసుడు. - మహాభారతం

**వరాహుడు :** ఓ ప్రాచీన రుషి. ధర్మజుని కొలువులో సభ్యుడు.

**వరాహం 1 :** మగధ రాజధాని గిరివ్రజం వద్దగల ఒక పర్వతం. - మహాభారతం

**వరాహం 2 :** కురుక్షేత్రానికి మధ్యగల ఓ పుణ్యస్థలం. మహావిష్ణువు వరాహ రూపంలో ఇచ్చట కొంతసేపు వున్నాడు. ఇచ్చట స్నానం చేస్తే అగ్నిష్ఠోమ యజ్ఞ ప్రతిఫలం లభిస్తుంది.

**వరాహం 3 :** శ్రీ మహావిష్ణువు 10 అవతారాల్లో ఇదొకటి. మహావిష్ణువును శనక మహర్షి దర్శించడానికి వెళ్లగా జయవిజయలను ద్వారపాలకులు అతణ్ణి అగౌరవపరచగా రాక్షసులుగా జన్మించమని శపించాడు. అందువల్ల జయ విజయలు కశ్యప ప్రజాపతికి దితివల్ల హిరణ్యాక్ష, హిరణ్యకశిపులుగా జన్మించారు.

హిరణ్యాక్షుడు భూమిని సముద్రంలో ముంచగా మహావిష్ణువు వరాహరూపుడై భూమిని పైకెత్తుతాడు. వందకమనే తన గదతో మోదిహిరణ్యాక్షుడిని సంహరిస్తాడు.
– *భాగవతం*

**వరి :** పితృదేవతలకు సంబంధించిన ఓ విశ్వదేవుడు.

**వరిష్ఠుడు :** మనుచాక్షువు కుమారుడు. ఇతడు గృత్యముడు స్నేహితులు. ఇంద్రుడొకసారి 1000 సంవత్సరాలు యాగం చేశాడు. దీనిలో వీరిద్దరు పాల్గొన్నారు. గృత్యముడి ఉచ్చారణలో తప్పులుదొర్లగా వశిష్ఠుడు ఇతణ్ణి జంతువుగా జన్మించి పదివేల నూట పద్దెనిమిది సంవత్సరాలు అరణ్యంలో తిరగమని శపించాడు. – *మహాభారతం*

**వరీతాక్షుడు :** ఓ అసురుడు. ఒకప్పుడు రాజు. దుర దృష్టం ఇతడిని అసురుడ్ని చేసింది. – *మహాభారతం*

**వరుణద్వీపం :** పురాణ ప్రసిద్ధమైన ఒక ద్వీపం.
– *మహాభారతం*

**వరుణపోతసం :** దక్షిణ భారతదేశంలోని మాదర అరణ్యంలో గల పుణ్యస్థలం – *మహాభారతం*

**వరుణాని :** వరుణుని భార్య.

**వరుణుడు 1 :**భూమిని రక్షించే అష్టదిక్పాలకుల్లో ఒకడు.

*జననం :* ప్రజాపతి కశ్యపునికి అదితికి జన్మించాడు. ఇతడు అదితి 12 మంది పుత్రుల్లో ఒకడు. అందుకే ఇతణ్ణి ద్వాదశాదిత్యుల్లో ఒకడంటారు. ధాత, ఆర్య మానుడు, మిత్ర, శిక్ష, వరుణ, అంశ, భగ, వివశ్వాణ, పూష, పవిత, త్వష్ట, విష్ణువు, ద్వాదశాదిత్యులు. చాక్షుష మనువు కాలంలో ఈ 12 మంది దేవతల్ని తుషతులనేవారు. వైవశ్వత మన్వంతరం ప్రారంభంలో వీరు ఏకమై కశ్యపుని కుమారులుగా జన్మించారు.

*నీటిపై ఆధిపత్యం :* కృతయుగంలో దేవతలు వరుణుని వద్దకువచ్చి ఇంద్రుడు మమ్మల్ని రక్షిస్తాడు. నీవు నీటిపై ఆధిపత్యం వహించు. సముద్రపు హృదయ ంలో నివసించు నదులన్నీ నాలోకి ప్రవహిస్తాయి అని చెప్పగా అతడంగీకరించి వాటికి రాజయ్యాడు.
– *మహాభారతం*

*పశ్చిమాధిపతి :* బ్రహ్మ వరుణుడిని పశ్చిమ దిక్కుకు అధిపతిని చేశాడు. వైశ్రావణుడు బ్రహ్మ వద్దకువచ్చి నాల్గుదిక్కుల్లో ఒకదానికి అధిపతిని చేయమని కోరగా ఇప్పటికే ఇంద్రుడ్ని, వరుణుడ్ని, యముడ్ని అధిపతులను గావించాన, నాల్గవ వారెవరా అని ఆలోచిస్తు న్నాను, కనుక ఈ రోజు నుండి ఇంద్రుడు తూర్పుకు, వరుణుడు పడమరకు, యముడు దక్షిణానికి, నువ్వు ఉత్తరానికి అధిపతులు కండని ఆదేశించాడు.
– *ఉత్తర రామాయణం*

*కుటుంబం :* ఇతనికి చాలామంది భార్యలు. అందులో ముఖ్యులు గౌరి, వరుణాణి, చార్షణి, దేవి, జ్యేష్ఠి. ఇతనికి సువేష్ణ, వంది, వశిష్టుడు, ఇలని కుమారులు. వారుణి ఇతని కుమార్తె. వరుణుని రేతస్సు వాల్మీకం పైబడగా వాల్మీకి జన్మించాడు. 9వ మనువైన దాక్షసావర్ణి కూడా వరుణుడి కుమారుడే. పుష్కరుడు, అష్టావక్రుని చేతిలో వోడిన వంది వరుణుని కుమారులే
– *మహాభారతం & రామాయణం*

ఇతడొకసారి చంద్రుని కుమార్తె సుందరి అయిన భద్రను ఎత్తుకుపోగా ఆమె భర్త ఉతత్యుడు కోపించి వరుణుడిని మొత్తం తాగేయగా భద్రను వదలి వేశాడు. కశ్యపుడొకసారి యాగార్థియై వరుణుని హోమ గోవుని అపహరించగా వరుణుడు కోరినా ఇవ్వకపోగా బ్రహ్మకు చెప్పాడు. బ్రహ్మ చెప్పినా కశ్యపుడు వినక పోవడంతో బ్రహ్మ వరుణులు కశ్యపుడ్ని గోపాల కుడిగా జన్మించమని శపించారు. కశ్యపునికి శాపం వల్ల కల్గిన పునర్జన్మే శ్రీకృష్ణుని తండ్రి గోపాలకుడు అయిన వసుదేవుడు.

*ఇతర విశేషాలు :*

భార్గవరాముడిచ్చిన వైష్ణవచాపాన్ని శ్రీరాముడు వరుణుడికిచ్చాడు. వరుణుని రాజధాని శ్రద్ధావతి. ఖాండవదహన సమయంలో అగ్ని వరుణుడి సహాయం కోరగా ఇతడు అర్జునుడికి గాండీవాన్ని అక్షయతూణీరాన్ని బహూకరించాడు. వరుణా మిత్రులు వర్షానికి గణాధిపతులు, వరుణుడు రుచి కుడికి నల్లచెవులున్న 1000 గోవుల్ని బహూకరించాడు. అర్జునుడు మహా ప్రస్థానానికి ప్రయాణించేటప్పుడు తనకు బహుమతిగా ఇచ్చిన గాండీవాన్ని సముద్రంలో విసిరివేశాడు.

**వరూధిని :** ఓ అప్సరస. అర్జునుని గౌరవార్థం ఇంద్ర సభలో నాట్యంచేసింది. – *మహాభారతం*

**వరూధిని :** ఓ గంధర్వ కాంత. ఈమెనొక గంధర్వుడు వలచెనుగాని ఈమె కిష్టము లేదు. హిమాలయ ములపై ప్రయాణించు ప్రవరాఖ్యుడను బ్రాహ్మణ బాలునీమె వరించెను కాని అతడీమెను వదలించు కొని పారిపోయెను. గంధర్వుడు ఇదే సమయమని తలచి ప్రవరాఖ్యుని రూపముదాల్చి ఓ కొలనులో స్నానము చేయుచుండగా వరూధిని ఇతడే ప్రవరా ఖ్యుడని సంతసించి అపర ప్రవరాఖ్యుని చేరగా అతడీ మెతో సంభోగించగా ఈమెకు స్వరోచి జన్మించెను. – మార్కండేయ పురాణం

**వరూధుడు :** అంగవంశపు రాజు. – అగ్నిపురాణం

**వరేణ్యుడు :** భృగు మహర్షి ఏడుగురు పుత్రుల్లో ఒకడు. తక్కినవారు చ్యవనుడు, శుచి, ఔర్యుడు, శుక్రుడు, వజ్రశిరసుడు, సవనుడు. – మహాభారతం

**వర్గ :** ఓ దేవకన్య. ఓ ముని తపస్సు భగ్నం చేయడానికి వెళ్లి తన చెలికత్తెలతో సహా ఆ రుషి శాపం వల్ల మొసలిగా మారి పంచతీర్థంలో జీవిస్తుంది. అర్జునుడి వల్ల శాప విముక్తురాలవుతుంది. – మహాభారతం

**వర్చస్సు 1 :** అష్టవసువుల్లో ఒకడైన సోముడి కుమా రుడు. మనోహర ఇతని తల్లి. ఇతడు పునర్జన్మలో అభిమన్యుడుగా జన్మించాడు. – చూ॥ అభిమన్యుడు

**వర్చస్సు 2 :** గృత్సమదుడి కుటుంబంలో జన్మించిన సుచేతసు కొడుకు. ఇతని కుమారుడు విహవ్యుడు. – మహాభారతం

**వర్గసంకరం :** చూ॥ ఏకాదశ వర్గ సంకరాలు.

**వర్ణం :** కులం. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర కులాలే కాక ఈ నాల్గు కులాల సంకరం వల్ల ఏర్పడిన మరి 11 రకాల కులాలు గుర్తించబడ్డాయి. మొదటి నాల్గు కులాలు గురించి చాతుర్వర్ణ వ్యవస్థ వివరించింది.

**వర్ధనుడు :** మిత్రవిందకు శ్రీకృష్ణుని వల్ల జన్మించిన పుత్రుడు. – భాగవతం

**వర్ధమానం :** పంచతంత్రంలో ఓ పాత్ర. – చూ॥ పంచతంత్రం

**వర్మ :** ఇది భారతదేశ ప్రాచీన ఆచారం. క్షత్రియుల పేరుకు చివర వర్మ, బ్రాహ్మణుల పేరుకు చివర శర్మ, వైశ్యుడు పేరు చివర గుప్త, శూద్రుల పేరుకు చివర దాస అని పిలిచేవారు.

**వర్మచిత్తుడు :** చంద్ర వంశపు రాజుల్లో ఒకడు.

**వర్మదృక్కు :** యదు వంశంలోనివాడు. అక్రూరుడి తమ్ముడు. – భాగవతం

**వర్ష 1 :** వరరుచి గురువు. – చూ॥ వరరుచి

**వర్ష 2 :** చూ॥ కాలమానం.

**వర్షకేతువు :** క్షేమకుని కుమారుడు. పూరువంశపు రాజు. ఇతని కుమారుడు విపుడు. – అగ్నిపురాణం

**వర్షుడు :** వరరుచి గురువు. – చూ॥ వరరుచి

**వలలుడు :** అజ్ఞాతవాసంలో విరాట నగరంలో వంటవా డిగా వున్నపుడు భీముని పేరు. – మహాభారతం

**వలాకుడు :** ఓ ఆటవికుడు. – చూ॥ బలాకుడు

**వలీముఖుడు :** శ్రీరాముని వానర సైన్యంలో ఓ ప్రముఖ వానరుడు. – రామాయణం

**వలుడు :** ఓ రాక్షసుడు. బలుడని అంటారు. సము ద్రతీరాన పూజచేస్తున్న ఇతణ్ణి ఇంద్రుడు తన వజ్రా యుధంతో సంహరిస్తాడు.

**వల్లభి :** రాజపుత్ర స్థానంలోని ఒక పట్టణం.

**వల్లభుడు 1 :** హేమప్రభ అను వేశ్య భర్త. – చూ॥ హేమప్రభ

**వల్లభుడు 2 :** బాలకాశ్యుని కుమారుడు. ఇతడు సద్గుణుడైన రాజు. ఇతని కుమారుడు కౌశికుడు. – మహాభారతం

**వల్గు జంఘుడు :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు. ఇతడు బ్రహ్మావాది. – మహాభారతం

**వశవర్తి :** ఓ దేవతాగణం. మూడవ మన్వంతరంలో ఐదు రకాల దేవతలున్నారు. ఒక్కోగణంలో 12 మంది దేవతలు. ఆ గణాలు సుధామసులు, సత్యసులు, జపసులు, ప్రతర్ధవసులు మరియు వశావర్తినులు.

**వశాతలం :** పురాణ ప్రసిద్ధి చెందిన భారతదేశ రాజ్యా లలో ఒకటి. ఈ దేశ రాకుమారులు ధర్మజుని రాజ సూయ యాగానికి కానుకలిచ్చారు. – మహాభారతం

**వశిష్ఠాపావహం :** సరస్వతీ నదీతీరంలోగల ఓ పుణ్య తీర్థం.

**వశిష్ఠుడు :** బ్రహ్మ పుత్రుడైన మహర్షి.

బ్రహ్మ కాంతి నుండి జన్మించిన వశిష్ఠునికి మూడు జన్మలున్నాయి.

*మొదటి జన్మ :* నారదుడు బ్రహ్మ తొడల నుండి, దక్షుడు కుడి బొటన వ్రేలి నుండి, వశిష్ఠుడు బ్రహ్మ శ్వాస నుండి జన్మించారు. ఈ జన్మలో అరుంధతి ఇతని భార్య. ఈమెను ఊర్జ అని కూడా పిలిచేవారు.
*అరుంధతి జననం-వివాహం : -చూ॥ అరుంధతి.* దేవతల సమక్షంలో వశిష్ఠుడు అరుంధతిని వివాహ మాడగా వారికి ఏడుగురు పుత్రులు జన్మించారు. వారంతా బ్రహ్మర్షులయ్యారు.
*మరణం :* దక్షుని యజ్ఞంలో ఎందరో దేవతలు, రుషులు మరణించారు. అందులో వశిష్ఠుడొకరు. అతనితోపాటు అరుంధతి మరణించింది.
*రెండవ జన్మ :* వశిష్ఠుడు బ్రహ్మ యజ్ఞగుండం నుండి తిరిగి ఆవిర్భవించాడు. ఈ జన్మలో అతని భార్య అక్షమాల. ఈమె అరుంధతి పునర్జన్మ. ఇక్ష్వాకు చక్రవర్తి ప్రతి శాపం వల్ల వశిష్ఠుడు మరణించాడు.
*మూడవజన్మ :* ఇతడు ఈ పునర్జన్మలో వరుణామిత్రుల కుమారుడుగా జన్మించాడు. కుండలో జన్మించిన ఈ జన్మలో ఇతని సోదరుడు అగస్త్యుడు. ఇతని భార్య నారదుని సోదరి అరుంధతి.
పురాణాలను పరిశీలిస్తే వశిష్ఠుడు మూడు జీవితాలు అనుభవించాడని, మూడుసార్లు అరుంధతే అతని భార్య అని తెలుస్తున్నా ఈయన జీవితంలోని పెక్కు ముఖ్య సంఘటనలు రెండు మూడవ జన్మల్లోనే జరిగాయి.
*కొన్ని ఘటనలు :*
*వసిష్ఠుడు విశ్వామిత్రుల వైరం :* విశ్వామిత్రుడు ఒక రాజు. అతడు అతని పరివారమే అతడికి ముఖ్యం. ఒకసారి వేటకు వెళ్లి అలసి వశిష్ఠుని ఆశ్రమానికి వెళ్లగా వశిష్ఠుడు అతనికి, అతని పరివారానికి షడ్రసో పేతమైన విందుభోజనం ఏర్పాటు చేశాడు. ఆశ్చర్య పోయిన విశ్వామిత్రుడు కారణం వసిష్ఠుని కామధేను వేనని తెలిసికొని ఆ కామధేనువును తనకిస్తే వెయ్యి గోవుల్ని ఇస్తాననగా వశిష్ఠుడు నిరాకరిస్తాడు. నేను రాజును, ఈ రాజ్యంలో సమస్త వస్తువులు నా సంప దలో భాగం కనుక కామధేనువును బలవంతంగా తీసుకుపోతానని అనగా కామధేవును శరీరం నుండి ఎందరో సైనికులు పుట్టి విశ్వామిత్రుని సైన్యాన్ని, పుత్రుల్ని ఓడిస్తారు. విశ్వామిత్రుడు బాణాలు సంధించగా అవి వశిష్ఠుని హృదయంతాకి పుష్పాలయ్యాయి. బ్రాహ్మణుని తపశ్శక్తి క్షత్రియుని శక్తికంటే అధికమని విశ్వామిత్రుడు ఓటమినంగీకరించాడు. కాని మనసులో వశిష్ఠునిపై కోపం పెంచుకొని తన స్నేహితులకు రాజ్యభారం అప్పగించి తపస్సు కొరకు అడవులకు వెళ్ళాడు. తన తపశ్శక్తితో రాజర్షిగా మారాడు. అప్పటి నుండి వారి మధ్య వైరం మరింత పెరిగింది.
*రెండవ వివాదం :* సూర్యవంశపు రాజైన త్రిశంకుడను రాజుకు బొందితో స్వర్గానికి వెళ్లాలనే తలంపు కలదు. వశిష్ఠుడినడుగగా అది సాధ్యంకాదని చెప్పగా అతడు విశ్వామిత్రుడ్ని ఆశ్రయించాడు. వశిష్ఠునిపై తన ఆధిపత్యాన్ని ప్రదర్శించడానికి తన తపోశక్తిని ధార పోసి అతణ్ణి స్వర్గానికి పంపగా ఇంద్రుడు అడ్డుపడగా అతడు భూమివైపుకు జారబోగా తన శక్తితో స్వర్గానికి భూమికి మధ్య కృత్రిమ స్వర్గాన్ని ఏర్పరచి త్రిశంకుడిని అక్కడే ఆపాడు. దాన్నే త్రిశంకు స్వర్గమంటారు.
*మూడవ వివాదం :* హరిశ్చంద్ర మహారాజు వరుణుని ఆశీర్వాదం వల్ల ఓ పుత్రుడైన లోహితుడుని పొందాడు. వరుణునికి తన కుమారుడిని బలిచేయడానికి కూడ ఒప్పుకుంటాడు. ఇది తెలిసిన లోహితుడు పారిపోగా హరిశ్చంద్రుడు తనమాట నిలుపుకోనందుకు చింతిస్తుండగా వశిష్ఠుడు మరో బ్రాహ్మణ బాలుడిని లోహితుడికి బదులు బలి ఇవ్వమని సలహా ఇస్తాడు. శునశ్శేపుడనే బ్రాహ్మణ బాలుడిని దీనికి వినియోగించ డానికి తేగా విశ్వామిత్రుడు అడ్డుపడటమేగాక హరి శ్చంద్రుడ్ని తన వలలో వేసుకొని రాజ్యహీనుణ్ణి చేసి కడకు కాటికాపరిగా మార్చుతాడు.
*నాల్గవ వివాదం :* ఒకసారి వశిష్ఠ విశ్వామిత్రులు ఇద్దరూ అడవిలో ఒకరికొకరు తటస్తించగా వశిష్ఠుడు హరిశ్చంద్రుడ్ని హింసించినందుకు నీవు తపస్సం పన్నుడవుకావు. కొంగజపం చేసి చేపల్ని తినే కొంగ తపస్వి లాంటివాడివి కనుక కొంగగా మారమని శపిస్తాడు. విశ్వామిత్రుడు కూడా వశిష్ఠుడ్ని లకుముకి పిట్ట కమ్మని ప్రతిశాపం ఇస్తాడు. వీరిద్దరూ పక్షులుగా మారి కూడా ఒకరి నొకరు పొడుచుకుంటూ రక్తసిక్తమై వుండగా బ్రహ్మ ప్రత్యక్షమై వీరిని శాపవిముక్తులను చేశాడు. *- దేవీ భాగవతం*

*ఐదవ వివాదం* : విశ్వామిత్రుడొకసారి సరస్వతీ నదిని తన ప్రవాహంతో పాటు వశిష్ఠుడ్ని ఈడ్చుకు రమ్మని ఆదేశించగా ఆ నది భయపడి తన వేగంతో వశిష్ఠుడిని విశ్వామిత్రుని ఆశ్రమం వద్దకు లాగుకొని వచ్చి విశ్వామిత్రుడి దయతో బ్రతకటం ఇష్టంలేక అదే వేగంతో విశ్వామిత్రుడి ఆశ్రమం దాటి తీసుకు పోగా విశ్వామిత్రుడు సరస్వతీనది నీటిని రక్త వర్ణంగా మార్చగా దేవతలు వచ్చి వీరిద్దరి మధ్య సఖ్యత కుదిర్చారు. *- మహాభారతం*

*ఇతర విశేషాలు :* మొదటి మన్వంతరంలో వశిష్ఠుడు, ఊర్జకు జన్మించిన పుత్రులు సప్తర్షులయ్యారు. *- విష్ణుపురాణం*

ఋగ్వేదంలోని 10 మండలాలలో 7వ మండలాన్ని వశిష్ఠుడు రచించాడు.

ఇతడ్ని రావణుడొకసారి బందీగా తీసుకువెళ్లి వేదాలను నేర్పమనగా అందుకు నిరాకరిస్తాడు. సూర్య వంశ రాజైన కువలయాశ్వుడితణ్ణి విడిపించగా వశిష్ఠుడు సూర్యవంశపు రాజుల వల్ల నీ వినాశనం జరుగు తుందని రావణుడ్ని శపిస్తాడు. *- కంభ రామాయణం*

పరాశరుడు రాక్షస సంహారానికి యాగం చేసినపుడు వశిష్ఠుడు దాన్ని ఆపుతాడు.

శ్రీరామునికి ఇక్ష్వాకు వంశ చరిత్రను చెప్తాడు. ఒక సారి వశిష్ఠుని కామధేనువును అష్టవసువులు తీసుకు పోగా వారిని మానవులుగా జన్మించమని శపిస్తాడు. అందులో ఒకడు బీష్ముడుగా జన్మిస్తాడు. ఇతడు భీష్ముడికి గురువవుతాడు. వశిష్ఠుడు సప్తర్షుల్లో ఒకడు. ఆపక, అరుంధతీపతి, బ్రహ్మర్షి, దేవర్షి, హైరణ్య గర్భ, మిత్రావరుణి, వారుణి అనికూడా ఇతడిని పిలుస్తారు.

**వశుడు :** ఋగ్వేదంలో ప్రముఖుడుగా పేర్కొనబడిన ఋషి. *- ఋగ్వేదం*

**వసాతి :** ప్రాచీన భారతదేశంలోని ఒక రాజ్యం. ఈ దేశ ప్రజలు కౌరవుల పక్షాన పోరాడి భీష్ముణ్ణి రక్షించే ప్రయత్నం చేస్తారు. *- మహాభారతం*

**వసాతికుడు :** కౌరవుల పక్షాన పోరాడిన వీరుడు. అభి మన్యునితో యుద్ధంలో మరణించాడు.

**వసాతుడు 1 :** చంద్ర వంశపు రాజు. జనమేజయుడి ఎనిమిదవ కుమారుడు. *- మహాభారతం*

**వసాతుడు 2 :** మహాభారత యుద్ధంలో కౌరవుల పక్షాన పోరాడిన వీరుడు. అభిమన్యుడ్ని వధించకపోతే ఆత్మ హత్య చేసుకుంటానని శపథం చేసి అతడితో యుద్ధం చేసి మరణించాడు. *- మహాభారతం*

**వసాయువు :** పురూరవసు ఊర్వశిలకు జన్మించిన కుమారుడు. *- పద్మపురాణం*

**వశిష్ఠాశ్రమం :** నిశ్చిరా సంగమం వద్దగల ఒక పుణ్య స్థలం. ఇది ముల్లోకాలలో ప్రసిద్ధిగాంచింది. ఇచట స్నానం చేస్తే వాజపేయ యజ్ఞం చేసిన ప్రతిఫలం లభిస్తుంది. *- మహాభారతం*

**వసుచంద్రుడు :** ధర్మజునికి అండగా నిలచిన రాజు. ఇతడు ఇంద్రుడంతటి శక్తివంతుడు. *- మహాభారతం*

**వసుజ్యేష్ఠుడు :** ఓ రాజు. పుష్యమిత్రుని కుమారుడు. *- మత్స్యపురాణం*

**వసుద :** నర్మద అనే గంధర్వ స్త్రీ కూతురు. మాలి భార్య. ఈమెకు నల్గురు కుమారులు. *- ఉత్తర రామాయణం*

**వసుదత్త 1 :** వరరుచి తల్లి. *- చూ॥ వరరుచి*

**వసుదత్త 2 :** సుదేవి తండ్రి. *- చూ॥ సుదేవి*

**వసుదానపుత్రుడు :** కౌరవుల పక్షాన పోరాడిన రాజు. కాశీరాజు కుమారుడైన అభిభుడిని ఇతడు వధించాడు. *- మహాభారతం*

**వసుదానుడు 1 :** ఓ క్షత్రియరాజు. ధర్మజునికి, ధృష్టద్యు మ్నుడికి అండగా నిలిచేవాడు. ఇతడు 26 ఏనుగుల్ని, రెండువేల గుర్రాలను ధర్మజుడికిచ్చాడు. ద్రోణుని చేతిలో మరణించాడు. *- మహాభారతం*

**వసుదానుడు 2 :** పాంచాల రాజకుమారుడు. పాండ వుల పక్షాన పోరాడి ద్రోణునిచే చంపబడ్డాడు. *- మహాభారతం*

**వసుదాముడు :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు. *- మహాభారతం*

**వసుదుడు :** ఇక్ష్వాకు వంశంలోని త్రసదస్యుడి మరోపేరు.

**వసుదేవ :** వికంఠనుడి భార్య. అజమీఢుడి తల్లి.

**వసుదేవుడు :** శ్రీకృష్ణుని తండ్రి.

పూర్వజన్మలో ఇతడు కశ్యపుడు. కశ్యపుని భార్యలు అదితి, సురసలు దేవకి, రోహిణిగా జన్మించారు. ఆ జన్మమున కశ్యపుడు సముద్రుని హోమదేనువును ఎత్తుకురాగా సముద్రుడు తిరిగి ఇవ్వమని కోరగా

ఇతడు నిరాకరించినందువల్ల సముద్రుడు కశ్యపుని గోవులకాపరిగా జన్మించమని శపించెను. అందువల్ల ఇతడు కంసుని గోవులకు అధిపతి అయ్యెను.

– హరివంశము.

పూర్వజన్మమున నితడు సుతపుడను ప్రజాపతి. ఇతడు భార్యతో చాలాకాలము విష్ణువును గూర్చి తపమాచరించి అతడు ప్రత్యక్షమై వరము కోరు కొమ్మనగా విష్ణువును తమకు పుత్రుడుగా జన్మించ మని కోరెను. ఆ వరమువలన సుతపుడు వసు దేవుడుగా, మహావిష్ణువు అతని కుమారుడు శ్రీకృష్ణునిగా జన్మించెను.

– బ్రహ్మవైవర్తపురాణం

*వివాహం కుటుంబ వివరాలు :* వసుదేవుని భార్య రోహిణి వల్ల బలరాముడు, సారణుడు, దుర్భరుడు, దముడు, పిండారకుడు, మహాహనుడు జన్మించారు. దేవకి వల్ల చిన్న కుమారుడు శ్రీకృష్ణుడు, సుభద్ర అనే కుమార్తె జన్మించారు. ఉపదేవి అనే భార్యవల్ల విజయ, రోచమాన, వర్ధమాన, దేవళులు జన్మించారు. వృకదేవి వల్ల అణ్వావా, మందగలు, సప్తమీదేవి వల్ల ఓటమే యెరుగని రేవంతుడు జన్మించారు. వసుదేవుని పెద్ద కుమారుడైన కౌశికుడు శ్రద్ధాదేవి అనే వైశ్యకాంత వల్ల జన్మించాడు. శృకంధర వల్ల మహాబలవంతుడైన కపిలుడు, జనా అనే భార్యవల్ల సౌభద్రుడు, అభవుడు జన్మించారు. – పద్మపురాణం

*ఇతర విశేషాలు :* ఇతడు ఉగ్రసేనునికి మంత్రి. శూరసేనుని కుమారుడు, కుంతికి సోదరుడు.

మహాభారత యుద్ధం తర్వాత శ్రీకృష్ణుని ద్వారా యుద్ధ విశేషాలు తెలుసుకున్నాడు.

అభిమన్యునికి శ్రాద్ధకర్మలితడే నిర్వహించాడు. యాదవ ముసలం సమయంలో బలరామ శ్రీకృష్ణులు ఇతనికి పాదాభివందనం చేసి తపస్సుకు వెళ్ళారు. వృష్ణి వంశం సర్వనాశనమవడం చూసి ఇతని శరీరం నుండి ఆత్మ బయటకు వెడలింది. అర్జునుడు ఇతనికి చితిని పేర్చి అతని నల్గురు భార్యలు అతనితో సహగమనానికి తోడ్పడ్డాడు. వసుదేవుడు స్వర్గంచేరి విశ్వదేవతల్లో ఒకడయ్యాడు. – మహాభారతం

ఇతడిని ఆనక దుందుభి, శౌరి, శౌరపుత్రి, తారతాణుయదూద్యకుడని పిలిచేవారు.

**వసుధ :** ఓ గంధర్వ స్త్రీ. నర్మద ముగ్గురు కుమార్తెలు వసుధ, సుందరి, కౌతుమతి. చూ॥ పుష్పోత్కర

**వసుధార :** ఓ పుణ్యస్థలం. ఈ స్థలాన్ని దర్శిస్తే అశ్వమేధ యాగం చేసిన ఫలితం లభిస్తుంది. ఇచ్చట స్నానం చేసి పితరులకు తర్పణం విడిస్తే విష్ణులోక ప్రాప్తి కల్గుతుంది. ఇచ్చటున్న అష్టవసుకొలనులో స్నానం చేస్తే అష్టవసువులకు ప్రీతిపాత్రులౌతారు.

– మహాభారతం

**వసుపదుడు :** శుక్తిమతి అను నదికి కోలాహలమను పర్వతము వలన కల్గిన కుమారుడు. ఇతనిని శుక్తిమతి ఉపరిచర వసువుకివ్వగా ఇతడు అతనికి సేనాధిపతి అయ్యెను. – మహాభారతం

**వసుప్రభుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు.

– మహాభారతం

**వసుమానుడు 1 :** ధర్మజుని కొలువులో ప్రసిద్ధుడైన ఒక రాజు. – మహాభారతం

**వసుమానుడు 2 :** ఇదో అగ్ని. బ్రహ్మకొలువులో వుటుంది. – మహాభారతం

**వసుమానుడు 3 :** జనకుని కుటుంబంలోని ఒక రాజు. ఓ రుషి ఇతడికి ధర్మబోధ చేశాడు. – మహాభారతం

**వసుమానుడు 4 :** ఇక్ష్వాకువంశంలోని ఓ ప్రసిద్ధరాజు. ఇతడు వాజపేయి యజ్ఞం చేస్తుండగా యయాతి స్వర్గం నుండి ఈ యజ్ఞం వద్ద పడ్డాడు. ఇతడొకసారి ధర్మపాలన గురించి బృహస్పతితో చర్చించాడు. కురుక్షేత్ర యుద్ధాన్ని ఇంద్రుడితో కలసి చూశాడు.

– మహాభారతం

**వసుమిత్రుడు 1 :** ఓ ప్రాచీన క్షత్రియ రాజు. దనాయువు పుత్రుడైన విక్షర అనే అసురుడి శరీర భాగం నుండి జన్మించాడు. – మహాభారతం

**వసుమిత్రుడు 2 :** శుంగ వంశంలో జన్మించిన రాజు. భద్రకుడు అనబడే ఉదంకుడు ఇతని కుమారుడు.

– భాగవతం

**వసురాతుడు :** భనందుని పిన తండ్రి కొడుకు. రాజ్యమంతా ఇతడే పాలించుచుండగా భనందుడు తన భాగము తన కిమ్మనగా ఇతడు నిరాకరించెను. భనందుడు ఇతడితో యుద్ధము చేసి ఇతనిని సంహరించెను. – మార్కండేయపురాణం

**వసువు 1 :** చూ॥ ఉపరిచర వసువు.

**వసువు 2 :** శ్రీరాముని కుమారుడైన కుశుని కుమారుడు. గిరివ్రజపురమునకు రాజు.

– రామాయణం

**వసువు 3 :** పరశురాముని సోదరుడు. తండ్రి జమదగ్ని తన తల్లిని చంపమన్న ఆదేశాన్ని శిరసావహించ నందుకు జమదగ్ని శపించగా పరశురాముని కోరికపై శాపవిమోచనం చేస్తాడు. – మహాభారతం

**వసువు 4 :** భూతజ్యోతి కొడుకు. ప్రతీతుడికి తండ్రి. – భాగవతం

**వసువు 5 :** కృమి వంశపు రాజు. – మహాభారతం

**వసువు 6 :** రథంతరి, ఈలినుల కొడుకు. – మహాభారతం

**వసువు 7 :** పైలుడి తండ్రి. – మహాభారతం

**వసువు 8 :** శివుడి పేరు. – మహాభారతం

**వసువు 9 :** విష్ణువు పేరు. – మహాభారతం

**వసువు 10 :** సూనృత ఉత్తానపాదుల కొడుకు. బ్రాహ్మణులితణ్ని శపించగా తపస్సుచేసి స్వర్గానికి వెళ్తాడు. – మత్స్యపురాణం

**వసువు 11 :** కాశ్మీర రాజు. ఇతడు వనమున తపస్సు చేసి పుండరీకాక్ష పారస్తవము పఠనము చేయుచుం డగా ఇతని శరీరమునుండి ఓ వికృతరూపుడు వచ్చి నావలన నీకేమి కావలెనని కోరెను. నీవెవ్వరు ? ఇట్లేల వచ్చితివని రాజు ప్రశ్నించగా నీవు పూర్వజ న్మమున పౌండ్రవంశమున ఒక రాజువు. నేను బ్రహ్మ హత్యను. అప్పుడు నీవు వేటకు బోయి లేడియని తలచి మునిని కొట్టితివి. ఆ పాపము పోవుటకు నీవనేక పూజలు చేసితివి. కాని నీకు ఉదర శూల రోగము వచ్చినది. నీ మరణకాలమున నీ భార్యయగు నారాయణిని తలచుటచే నిన్ను స్వర్గమునకు కొని పోవుటకు విష్ణుదూతలు రాగా నేనడ్డుపడితిని. నన్ను వారు మోదగా సూక్ష్మరూపుడనై నీ శరీరమున దాగి యుంటిని. స్వర్గమునకు పోయిన పిమ్మట బ్రహ్మ నిన్ను మరల కాశ్మీరరాజుగా పుట్టించినా నేను నీలోనే దాగివుంటిని. ఇపుడు నీవు 'పుండరీకాక్ష' పారస్థవము చేయుట వలన నీ శరీరము నుండి వెడలగొట్టబడి తినని చెప్పగా నీవలన నా పూర్వజన్మవృత్తాంతము తెలిసికొంటిని నీవు ధర్మ వ్యాధుడవై వుండమని చెప్పి తాను స్వర్గమునకు పోయెను. – వరాహపురాణం

**వసువులు :** వీరు ఎనిమిదిమంది. ఆపుడు, ధ్రువుడు సోముడు, ధనుడు, అనిలుడు, అనలుడు, ప్రత్యూషుడు, ప్రభాసుడు. వీరంతా భార్యలతో వశిష్ఠాశ్రమానికి వస్తారు. అందులో ప్రభాసుడి భార్య వశిష్ఠుని నందిని అనే దేనువును తన పరిచారికకు కావాలని చెప్పగా దాన్ని వీరు దొంగిలిస్తారు. వశిష్ఠుడు కోపించి మను షులుగా జన్మించమని శపిస్తాడు. ప్రభాసుడే భీష్ము డుగా జన్మించి చిరకాలం జీవిస్తాడు.

**వసుశర్మ :** చూ॥ ధర్మశర్మ.

**వసుశ్రీ :** సుబ్రహ్మణ్యస్వామి పరిచారిక. – మహాభారతం

**వసుసేనుడు :** కర్ణుని చిన్ననాటి పేరు. కర్ణుని పెంపుడు తండ్రి అధిరథుడు, పెంపుడు తల్లిరాధ. ఇతడికి పెట్టిన పేరు వసుసేనుడు. – మహాభారతం

**వసుహోముడు :** అంగదేశపు రాజు. ఇతడు మాంధా తకు ధర్మతత్వాన్ని విశదీకరించాడు. – మహాభారతం

**వసోర్ధార :** వసు అను అగ్నికి భార్య. – భాగవతం

**వసంతకుడు :** ఉదయనుని కథలో ఒక పాత్ర. – చూ॥ ఉదయనుడు

**వసంతసేన :** ఈమె ఓ వారకాంత. చారుదత్తుడను బ్రాహ్మణుని పై మక్కువ కలదు. ఇతడు వ్యాపారమున నష్టపోయి పేదరికముతో నుండగా ఈమె తన నగను చారుదత్తునకు పంపెను. వసంతసేన పరిచారిక మదనిక ఈమె ప్రియుడు శర్విలకుడు. ఇతడు ఆ నగను చారుదత్తుని వద్ద నుండి తస్కరించి తన ప్రియు రాలు మదనికకివ్వగా ఆమె అది వసంతసేనదని గ్రహించి భయపడి ఆ నగను తిరిగి వసంతసేనకి చ్చెను. చారుదత్తుడు ఆ నగ పోవుట గమనించి తన భార్య నగను వసంతసేనకు పంపెను. రెండు నగలను చూసిన వసంతసేన మదనిక అభిమానమునకు మెచ్చి మదనికను శర్విలకునకిచ్చి వివాహము చేసెను. ఒక రోజు చారుదత్తుడు వసంతసేన కొరకు ఓ శకటము పంపగా అందు పరుపులేదని గ్రహించి వెనుకకు పంపగా శర్విలకుడు పంపిన బండినెక్కగా శర్విల కుడు వసంతసేనను బలాత్కరించబోగా ఆమె తిరస్క రించి మూర్ఛబోయెను. ఆమెపై ఎండుటాకులు కప్పి చారుదత్తుడామెను నగకై చంపెనని రాజుతో చెప్పెను. రాజు విచారించి శర్విలకుడే దోషియని గ్రహించి వసంతసేనను చారుదత్తునికిచ్చి వివాహముచేసి రాజ్య మునిచ్చెను.

**వస్త్రపులు :** క్షత్రియుల్లో ఓ తెగ. ఈ తెగ క్షత్రియులు ధర్మరాజుకి కానుక లిచ్చారు. - మహాభారతం

**వస్యనంతుడు :** యుధుడి తండ్రి. ఉపగుప్తుని కుమారుడు. ఇతడు విదేహ రాజు. - భాగవతం

**వస్యోకసావ :** గంగానది ఏడు శాఖల్లో ఒకటి. - మహాభారతం

**వహి :** విపాశా నదిలో జీవించే ఓ దయ్యం. దీని స్నేహితురాలు హిక. వీరి సంతానాన్ని వాహికులంటారు. వీరు ప్రజాపతులు సృష్టించినవారు కాదు. - మహాభారతం

**వహీనరుడు :** యముని భవనంలో నివసించే ఓ రాజు. - మహాభారతం

**వహ్ని 1 :** ఓ అసురుడు. ప్రాచీన కాలంలో ఇతడొక లోకపాలకుడు. - మహాభారతం

**వహ్ని 2 :** తుర్వసు కుమారుడు. ఇతని కుమారుడైన భర్గుడు అత్యంత ప్రసిద్ధుడు. - భాగవతం

**వహ్ని 3 :** మిత్రవిందకు శ్రీకృష్ణుని వల్ల జన్మించిన పుత్రుల్లో ఒకడు. - భాగవతం

**వహ్నిజ్వాలం :** ఓ నరకం. - చూ॥ నరకాలు

**వాక :** మాల్యవానుడి కుమార్తె. విశ్రవసు★వీమెను వివాహమాడగా ముగ్గురు కుమారులైన త్రిశిరసు, దూషణ, విధ్యుజిహ్వ; కుమార్తె అనుపాలిక జన్మించారు. - బ్రహ్మాండపురాణం

**వాక్పారుష్యం :** సత్యా సత్యాలతో సంబంధం లేకుండా ఎదుటివారిని తమమాటలతో బాధించడాన్ని ప్రాచీన కాలంలో వాక్పారుష్యం అని, అందుకు శిక్ష కూడా వేసేవారు. శారీరక, మానసిక వికలాంగులను గూర్చి గాని, హృదయాన్ని గాయపరిచే మాటలు మాట్లాడితే రాజు ఇతడికి 25 ఫణాలు శిక్ష క్రింద కట్టించేవాడు.

**వాగింద్రుడు :** గృత్యమదుని కుటుంబంలో జన్మించిన ప్రకాశుడను రాజు కొడుకు. ఇతడు ప్రమితికి తండ్రి. - మహాభారతం

**వాగ్మి :** పురుచక్రవర్తి మనుమడైన మనస్సుని కుమారుడు. శాక్త, సంహనునుడు ఇతని సోదరులు.

**వాగ్దుష్టుడు :** కౌశిక మహర్షి ఏడుగురు కుమారుల్లో ఒకడు. పితృవర్ధి ఇతని చిన్న తమ్ముడు. - మహాభారతం

**వాజపేయం :** ఓ యాగం

**వాజశ్రవసుడు :** నాచికేతసుని కుమారుడైన ఓ పురోహితుడు. - బృహదారణ్యకోపనిషత్తు

**వాజసనేయులు :** పురోహితుల్లో ఓ శాఖ. వ్యాసుని యజుర్వేద పరిష్కర్తలలో యాజ్ఞవల్క్యుడొక శిష్యుడు. యాజ్ఞవల్క్యుని శిష్యులు 15 మంది. వీరిని వాజసనేయులంటారు. సూర్య భగవానుడి నుండి పొందిన యజుర్వేదాన్ని యాజ్ఞవల్క్యుడు 15 శాఖలుగా విభజించాడు. ఒక్కోదాన్ని ఒక్కొక్కరికి ఇవ్వగా ఆ రోజు నుండి వీరు వాజసనేయులని పిలవబడ్డారు. - బృహదారుణ్యకోపనిషత్తు

**వాజసనేయం :** ఓ మతం. కలియుగాంతంలో ప్రజలు దొంగలై సద్గుణాలు వీడి చరిస్తారని, వేద వాజసనేయంలో 15 శాఖలు మాత్రమే నిత్యజీవితంలో పరిగణించబడతాయని చెప్తుంది. - అగ్నిపురాణం

**వాజుడు :** అంగిరసుని కుమారుడు సుధాన్యుడు. సుధాన్యుని కుమారుడు వాజుడు. ఇతని సోదరులు రుభుడు, విచ్వనుడు. - ఋగ్వేదం

**వాజ్మి :** సౌవీరి మనస్యుల కుమారుడు. శక్తుడు, సంహననుడు ఇతని కుమారులు. - మహాభారతం

**వాటధానుడు :** ఓ క్షత్రియరాజు. క్రోదవశుడను రాక్షసుని శరీరభాగం నుండి జన్మించాడు. - మహాభారతం

**వాటధాన్యం :** ప్రాచీన భారతావనిలో ఒక రాజ్యం. ఈ రాజ్య ప్రజల్ని వాటదానులంటారు. నకులుడు ఈ రాజ్యాన్ని జయించాడు. - మహాభారతం

**వాటరోధం :** ఓ నరకం. - చూ॥ నరకాలు

**వాతఘ్నుడు :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు. వేదాలను ప్రచారం చేశాడు. - మహాభారతం

**వాతజం :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజ్యం. - మహాభారతం

★ మహాభారతంలో విశ్రవసుకు ముగ్గురు భార్యలని వారు ప్రప్తోత్కట, రాక, మాలిని అని చెప్పబడింది.

**వాతవేగుడు 1 (వాయువేగుడు) :** ధ్రుతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. ఇతడు ద్రౌపది స్వయం వరానికి వచ్చాడు. మహాభారత యుద్ధంలో భీమసేను డితణ్ణి సంహరించాడు. – మహాభారతం

**వాతవేగుడు 2 :** గరుడుని ప్రసిద్ధి చెందిన కుమారుల్లో ఒకడు. – మహాభారతం

**వాతశిఖి :** కద్రువ కొడుకు. – మహాభారతం

**వాతస్కందుడు :** ఓ రుషి. ఇంద్రుని సభలో వుండి అతణ్ణి పూజిస్తుంటాడు. – మహాభారతం

**వాతాధిపుడు :** పురాణ ప్రసిద్ధుడైన రాజు. దక్షిణాపద జైత్రయాత్రలో సహదేవుడితణ్ణి ఓడించాడు. – మహాభారతం

**వాతాపి 1 :** ఓ అసురుడు. అగస్త్యుడు ఇతడ్ని ఆరగించాడు. – చూ॥ అగస్త్యుడు

**వాతాపి 2 :** కశ్యప దనులకు పుట్టిన క్రూర రాక్షసుడు. – మహాభారతం

**వాతికుడు :** సుబ్రహ్మణ్య స్వామి యోధుల్లో ఒకడు. – మహాభారతం

**వాతుడు :** స్వారోచిష మన్వంతరంలోని సప్తర్షుల్లో ఒకడు. ఈ మన్వంతరంలో విప్రచిత్తు ఇంద్రుడు. – విష్ణుపురాణం

**వాత్స్యాయనుడు :** గురుపరంపరలోనివాడు. వాత్స్యాయన కామసూత్ర గ్రంథ రచయిత. జనమే జయుని సర్పయాగంలో ఇతడొక అతిథి. ఇతడు భీష్ముడు అంపశయ్యపై నుండగా దర్శించిన రుషుల్లో ఒకడు. – మహాభారతం

**వాత్స్యం :** పురాణ ప్రసిద్ధమైన దేశం. దీన్ని వత్స దేశమని కూడా పిలుస్తారు.

**వాది :** పృధుచక్రవర్తి ఇద్దరు ప్రసిద్ధకుమారుల్లో ఒకడు. రెండోవాడు అంతర్ధానుడు. – విష్ణుపురాణం

**వానప్రస్థం :** మానవుని జీవితకాలంలో ఆచరించ వలసిన జీవనప్రస్థానంలో ఒకటి. గృహస్తు జీవితం తర్వాత అరణ్యంలో ఆశ్రమవాసం చెయ్యాలి. దానినే వానప్రస్థం అంటారు. – మనుస్మృతి

**వానరం :** శ్రీరాముని భక్తుడైన హనుమంతుని కుటుంబంలో జన్మించిన వానరులకు పురాణాల్లో ప్రముఖ స్థానం వుంది. హనుమంతుడ్ని పూజిస్తారు. దేవతల్లో వానరాలకు ప్రసిద్ధస్థానం వుంది. వానరుల్లో వాలి, సుగ్రీవుడు, అంగదుడు, మైందుడు, గవ్యుడు, ద్వివిదుడు, గవాక్షుడు, గజుడు, శరభుడు, సూర్యాక్షుడు, హనుమంతుడు, విద్యున్మాలి, వీరాబాహుడు, సుబాహుడు, నలుడు, కుముదుడు, జాంబవంతుడు, తార, సుపాటల, సునేత్ర, నీల, దదివక్త్రులు ప్రసిద్ధులు.

మహేంద్ర పర్వతం, హిమాలయాలు, వింధ్య పర్వతాలు, కైలాస శిఖరం, శ్వేతపర్వతం మందర పర్వతం వీటి నివేశ స్థలాలు. నల్లనేలపై నివసించే వానరాలు నీలంగా, ఎర్రగుహల్లో నివసించేవి పసుపురంగులో, మహామేరు ధూమ్ర పర్వతాలపై నివసించేవి ఉదయించే సూర్యుని రంగులో వుంటాయి. – రామాయణం

**వానవం :** పురాణ ప్రసిద్ధమైన ఓ రాజ్యం. – మహాభారతం

**వాభ్రరాయణి :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకరు. బ్రహ్మవాది. – మహాభారతం

**వామదేవుడు 1 :** ఓ ప్రాచీన రుషి.

వామదేవుడు–శలుడు : పరీక్షిత్తు అను రాజుకు ముగ్గురు కుమారులు శల, దల, బల. శలుడికి రాజ్యమిచ్చి పరీక్షిత్తు వానప్రస్థాశ్రమం స్వీకరించాడు. ఒకసారి శలుడు వేటకువెళ్లి తన రథం ఓ లేడి పరుగును అందుకోలేకపోవుటచే దానిని దాటగల గుర్రాలను కోరగా రధికుడు వామదేవుడి వద్ద కలవని చెప్తాడు. శలుడు తన కార్యం కాగానే తిగిరి గుర్రాలను ఇచ్చే షరతుపై ఆ గుర్రాలను వామదేవుడి నుండి తీసుకొని ఆ తర్వాత ఇవ్వ నిరాకరించాడు. తన శిష్యులను పంపినా ఫలితం దక్కక తనే రాజు వద్దకు రాగా గుర్రాలను ఇవ్వడానికి నిరాకరించగా ఈలోపు భయంకర రూపులైన అజానుబాహులు త్రిశూలంతో రాజును వధించారు. – మహాభారతం

ఇతర విశేషాలు : ఇతడు వశిష్ఠునికి స్నేహితుడు, దశరథునికి పురోహితుడు. రుగ్వేదంలోని నాల్గవ మండలాన్ని రచించాడు. ఇతడు ఇంద్రుని కొలువులో సభ్యుడు.

**వామదేవుడు 2 :** ఇతడొక రాజు. అర్జునుడు తన ఉత్తర భారత దిగ్విజయ యాత్రలో ఇతణ్ణి ఓడించాడు. – మహాభారతం

**వామనం 1 :** లోకాన్ని మోసే అష్టదిగ్గజాలనబడే ఏనుగుల్లో ఒకటి. ఇది ఐరావతి అనే ఏనుగు నల్గురి సంతతిలో ఒకటి. మహాభారత యుద్ధంలో ఇది ఘటోత్కచుని వాహనం - మహాభారతం

**వామనం 2 :** కురుక్షేత్రానికి సరిహద్దులో గల ఓ పుణ్యస్థలం. ఇక్కడున్న విష్ణుపాదం వద్ద స్నానంచేసి వామనుడిని పూజిస్తే విష్ణులోక ప్రాప్తి కల్గుతుంది.
- మహాభారతం

**వామనం 3 :** ఓ పుణ్యస్థలం. ఇచ్చట విష్ణువును గూర్చి పూజిస్తే పేదరికం దరిచేరదు. - మహాభారతం

**వామనం 4 :** క్రౌంచ ద్వీపంలోని ఓ పర్వతం.
- మహాభారతం

**వామనికుడు :** సుబ్రహ్మణ్యస్వామి పరివారంలో ఒకడు.
- మహాభారతం

**వామనుడు :** మహావిష్ణువు అవతారాల్లో ఒకటి. మహావిష్ణువు పది అవతారాల్లో ఇది ఐదవది. పురాణాలలో వామనావతారానికి రెండు కారణాలు కన్పిస్తున్నాయి. మొదటిది బలిచక్రవర్తిని పాతాళానికి అణగదొక్కడం, రెండవ కథ మహాబలికి బదులు ధుందుడను అసురుడ్ని పాతాళానికి అణగ దొక్కడం.

మొదటి ఇతివృత్తం *:* కశ్యపునికి అదితివల్ల దేవతలు, దితివల్ల బలి మొదలగు అసురులు జన్మించారు. అసురులు దేవతలను పెడుతున్న బాధలకు తట్టు కోలేక అదితి కశ్యపుని శరణువేడగా అతడు మహా విష్ణువును ప్రార్థించమని చెప్పాడు. అదితి మహావిష్ణువును గూర్చి తపస్సు చేయగా అతడు ప్రత్యక్షమై వరం కోరుకొమ్మనగా తన సంతానాన్ని రక్షించడానికి విష్ణువును తన పుత్రుడుగా జన్మించమని కోరింది. కశ్యపుని తపశ్శక్తి వల్ల నేను నీ గర్భంలో ప్రవేశిస్తానని విష్ణువు చెప్పగా కశ్యపుడు తన తపశ్శక్తిని వినియోగించగా మహావిష్ణువు వామనుడుగా అదితికి జన్మించాడు. అతడు మరుగుజ్జుగా అవతరించగా దేవతలు బహుమతులిచ్చారు. సూర్యుడు సావిత్రి మంత్రం ఉపదేశించాడు. బృహస్పతి జంధ్యం అలంకరించాడు. అదితి వస్త్రాలిచ్చింది. ఆకాశం గొడుగుని ప్రసాదించింది. సప్తర్షులు కుశదర్భలిచ్చారు. బ్రహ్మ నీళ్లకుండను, కుబేరుడు కమండలం ఇచ్చారు. ఆ సమయంలో మహాబలి ముల్లోకాలను జయించి భార్గవ బ్రాహ్మణుల్ని పురోహితులుగా అశ్వమేధ యాగం చేస్తున్నాడు. వామనుడు ఆ యాగస్థలికి వెళ్లగా ఆ బ్రాహ్మణ బాలుడ్ని మహాబలి ఏమికావాలో కోరుకొమ్మనగా మూడడుగుల నేల చాలన్నాడు. మహాబలి అందుకంగీకరించగా అసుర గురువైన శుక్రాచార్యుడు దీన్ని శంకించి వలదన్నా మహాబలి ఆడినమాట తప్పనన్నాడు. శుక్రాచార్యుడు సర్వనాశనమవుతావని బలిని శపించాడు. మహాబలి వామనుడి పాదాలు కడిగాడు. అప్పుడు వామనుడు ఊహాతీతంగా ఒక్కసారి విశాలరూపుడై ఆకాశమంత ఎత్తు ఎదిగాడు. మహాబలికి అతని రూపంలో ఇంద్రుడు, బ్రహ్మ, అసురులు, ముల్లోకాలు దర్శనమిచ్చారు. వామనుడు ఓ పాదంతో ఆకాశాన్ని కొలిచాడు. రెండోపాదంతో ముల్లోకాలను కొలిచాడు. మూడవ అడుగు ఎక్కడ వెయ్యనని బలినడుగగా తన శిరస్సు చూపాడు. మూడవ పాదం అతని శిరస్సుపై వుంచగా అతడు పాతాళానికి నెట్టబడ్డాడు.
- భాగవతం

రెండవ ఇతి వృత్తం *:* ఇందులో ధుందుబుడను రాక్షస రాజును మూడడుగుల నేల అడిగి పై కథలాగే అతడిని కూడా అణగద్రొక్కుతాడు. - పద్మపురాణం

**వాముడు :** సుబ్రహ్మణ్యస్వామి పరిచారకుడు.
- మహాభారతం

**వామ్య :** వామదేవుడను రుషి యొక్క అశ్వం పేరు.
- మహాభారతం

**వాయదగ్ధవిద్య :** కాకితో భూత, భవిష్యత్కాలాలను చెప్పించే కళ. - చూ॥ కాలవృక్షిక

**వాయుచక్రుడు :** ఓ రుషి. మంకనకుడి వీర్యాన్ని ఓ కుండలో భద్రపరచగా అందుండి ఇతడు జన్మించాడు. ఇతనితోపాటు వాయుబల, వాయుజ్వాల, వాయుమండలుడు మరి కొందరు రుషులు జన్మించారు.

**వాయు జ్వాలుడు :** చూ॥ వాయు చక్రుడు.

**వాయు పురాణం :** అష్టాదశ పురాణాల్లో ఇదొకటి.
- చూ॥ పురాణాలు

**వాయుబలుడు :** చూ॥ వాయుచక్రుడు.

**వాయుభక్షుడు :** ఓ ప్రాచీన రుషి. ఇతడు ధర్మజుని కొలువులో ప్రసిద్ధ సభ్యుడు. - మహాభారతం

**వాయుమండలుడు :** చూ॥ వాయుచక్రుడు.

**వాయురేతసుడు :** చూ॥ మంకనకుడు.

**వాయువు 1 :** అష్ట దిక్పాలకుల్లో ఒకడు. విశ్వపురుషుని శ్వాస నుండి జన్మించాడు. త్వష్ట ఇతడి మేనల్లుడు. ఇతడి భవనాన్ని గంధవతి అని పిలుస్తారు.

*వాసుకితో పరీక్ష :* నాగరాజైన వాసుకి, వాయుదేవుడు ఎవరు బలవంతులో తేల్చుకోదలచి హిమాలయాలను వాసుకి చుట్టగా తన శక్తితో వాయువు హిమాలయాలను పెకలించాలని తలుస్తాడు. హిమాలయాలలోని ఓ శిఖరమైన త్రికూటం విరిగి దక్షిణ సముద్రంలో పడగా దానిపైనే లంకానగరం ఏర్పడింది.

హనుమంతుడు, భీమసేనుడు వాయుపుత్రులని చెప్పబడింది. రాపిడికి అగ్నిపుట్టడానికి ఆ రాపిడికి కావలసిన శక్తిని వాయువు ప్రసాదించాడు కనుక రుగ్వేదంలో అగ్నికూడా వాయుజనితం అని చెప్పబడింది.

*ప్రత్తిచెట్టు గర్వమణచుట :* పూర్వకాలంలో ఓ పెద్ద ప్రత్తి వృక్షం హిమాలయాలపై చాలా ఎత్తు పెరిగి ఆకులు కొమ్మలతో వుండేది. నారదుడొకసారి దీని చెంతకు వచ్చి ఈ వృక్షాన్ని నీవెంత పొడగరివి ? నిన్ను తుఫానుగాని ప్రకృతిగాని ఏమి చెయ్యలేదనగా అది గర్వించి ఈదురుగాలులు నా సేవకులని చెప్పింది. నారదుడీవిషయాన్ని వాయువుతో చెప్పగా అతడు ఆ వృక్షం చెంతకు వెళ్లి ఒకసారి బ్రహ్మసృష్టి చేస్తూ నీపై విశ్రాంతి తీసుకొన్నాడు. అందుకని నిన్ను వదలి వేశాను అని చెప్పి తన ప్రతాపం చూపగా ఆకులు వూడి కొమ్మలు విరిగి దానికి గర్వభంగమయ్యింది. శతృవుని ఉపేక్షిస్తే ఎంత గర్విస్తాడో చెప్పడానికి భీష్ముడు ధర్మజుడికి ఈ కథ చెప్తాడు. – మహాభారతం

*ఇతర విశేషాలు :* ఇంద్రుడు పర్వతాల రెక్కలను తన వజ్రాయుధంతో ఖండించగా మైనాక పర్వతాన్ని సముద్రంలో దాచి వాయువు రక్షించాడు. – రామాయణం

ఇంద్రుడు విశ్వామిత్రుడి తపోభంగానికి మేనకతో పాటు వాయువును పంపాడు. అందుకే ఆమె వస్త్రాలు గాలికి ఎగిరాయి. – మహాభారతం

ఇతడు దేవతలకు వార్తాహరుడు. – మహాభారతం

**వాయువు 2 :** ప్రాచీన భారతీయ రుషి. భీష్ముడు అంపశయ్యపై నున్నపుడు దర్శించిన వారిలో ఇతడొకరు.
– మహాభారతం

**వాయువేగుడు 1 :** ఓ క్షత్రియ రాజు. క్రోధవశుడను అసురుని శరీర భాగం నుండి జన్మించాడు.
– మహాభారతం

**వాయువేగుడు 2 :** మంకనకుడను రుషి కొడుకు.
– చూ॥ మంకనకుడు

**వాయు వేగుడు 3 :** ధృతరాష్ట్రుని కుమారుల్లో ఒకడు. ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. – మహాభారతం

**వాయుహుడు :** మంకనకుడను రుషి కొడుకు.
– చూ॥ మంకనకుడు

**వారణావతం :** పాండవులను మట్టుపెట్టడానికి దుర్యోధనుడు ఇక్కడే లక్క ఇల్లు నిర్మించాడు. మీరట్‌కు 19 మైళ్ల దూరంలో గల వర్ణవ అనే ఇప్పటి గ్రామమే వారణావతం. పాండవులు కనీసపు కోర్కెగా అడిగిన 5 గ్రామాలలో ఇదొకటి. ధృతరాష్ట్రుని కుమారుడైన యుయుత్సుడు యుద్ధాన్ని ఇక్కడ ఆరు నెలలు కొనసాగించాడు. – మహాభారతం

**వారణాసి (కాశి) :** ముందుగా ఈ నగరం పేరు ప్రయాగ తర్వాత వారణాసిగా ఆ తదుపరి కాశీగా రూపాంతరం చెందింది. రెండు నదుల నుండి ఈ పేరు ఉద్భవించింది. మహా విష్ణువులో భాగమైన భగవాన్ యోగసాయి ప్రయాగలో వున్నపుడు కుడి కాలువ నుండి వరణ అనే నది, ఎడమ కాలువ నుండి అసి అనే నది జన్మించాయి. ఈ నదుల మధ్య ప్రాంతంలో యోగసాయి దేవాలయం వుంది. ఈ రెండు నదులు మధ్య ఈ దేవాలయం వుండటంవల్ల ఈ నగరానికి వారణాసి అనే పేరు ప్రసిద్ధమయ్యింది.
– వామన పురాణం

*వారణం :* ప్రాచీన భారతదేశంలో ఒక రాజ్యం. దీన్ని కౌరవ సేన చుట్టు ముట్టింది. – మహాభారతం

**వారాహం :** కురుక్షేత్రం మధ్యలో గల ఓ పుణ్యస్థలం. మహావిష్ణువు వరాహంగా వున్నపుడు కొంతసేపు ఇక్కడ వున్నాడు. ఇచట స్నానంచేస్తే అగ్నిష్ఠోమ యాగం చేసిన ప్రతిఫలం లభిస్తుంది. – మహాభారతం

**వారిసారుడు :** చంద్రగుప్తుడి కొడుకు. అశోక చక్రవర్తికి తండ్రి.

**వారిసేనుడు :** ఒక రాజు. ఇతడు యమ సభలో అతణ్ణి పూజిస్తుంటాడు. – మహాభారతం

**వారుణతీర్థం :** సింధునది ముఖ ద్వారం వద్దగల ఓ పుణ్యస్థలం. ఇచ్చట స్నానం చేస్తే ప్రకాశవంతుడై వరుణలోక ప్రాప్తి కల్గుతుంది. - మహాభారతం

**వారుణహ్రదం :** వరుణుని ఓ కొలను. అగ్ని దేవుడెల్ల పుడు ఇందులో ప్రకాశిస్తుంటాడు. - మహాభారతం

**వారుణి 1 :** దక్షుని యజ్ఞంలో మరణించిన భృగుమహర్షి వరుణుని యజ్ఞంలో తిరిగి జన్మించాడు. అప్పుడితడిని వారుణి భృగుడని పిలిచారు.

**వారుణి 2 :** వరుణి కుమార్తె. క్షీరసాగర మదనం సమయంలో వరుణుడు సోముని ద్వారా నల్గురు దేవకన్యలతో అమృతకలశం బయటకు పంపాడు. ఆ నల్గురు దేవకన్యలు సులక్ష్మి, వారుణి, కామొద, శ్రేష్ఠ. ఇందులో వారుణిని దేవతలు వివాహమాడారు. - పద్మపురాణం

**వారుణీతీర్థం :** దక్షిణభారతదేశంలోని పాండ్య రాజ్యం లోగల ఓ పుణ్యస్థలం. - మహాభారతం

**వారుణులు :** అంగిరసుని పుత్రులు. - చూ॥ పయశ్యులు

**వారుణం :** ఒక ఉప పురాణం.

**వార్క్షి :** కందుడను రుషి కూతురు. ఈమె 10 మంది ప్రచేతసులకు భార్య. - మహాభారతం

ఈమె కుమారుడు దక్షుడు. - మహాభారతం

**వార్థక్షేమ :** వృష్ణి వంశంలో ఓ బలవంతుడైన రాజు. ఇతడు పాండవుల పక్షాన పోరాడాడు. ఇతడు ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. ధనురాచార్యుడైన కృపుడితో కురుక్షేత్ర యుద్ధంలో పోరాడి మరణించాడు. - మహాభారతం

**వార్షగణ్యుడు :** ఓ ప్రాచీన రుషి. గంధర్వరాజైన విశ్వావసుడు ఇతని వద్ద జీవాత్మ పరమాత్మలకు గల సంబంధాన్ని తెలుసుకున్నాడు. - మహాభారతం

**వార్తుడు :** ప్రాచీన భారతీయ రాజు. ఇతడు యముని సభలో వుండి అతణ్ణి పూజిస్తుంటాడు. - మహాభారతం

**వార్ష్ణేయుడు 1 :** నలుని రథసారథి. ఇతడు రాకుమార్తె ఇంద్రసేన, రాకుమారుడైన ఇంద్రసేనుల్ని నలుడు జూదంలో ఓడిన తర్వాత కుండినాపురం తీసుకు వెళ్ళాడు. ఆ తర్వాత అయోధ్యకువెళ్లి రుతుపర్ణుడికి సారథి అయ్యాడు. నలుని కనుగొనడంలో ఇతడు ముఖ్యపాత్ర వహించాడు. - చూ॥ నలుడు

**వార్ష్ణేయుడు 2 :** మహా విష్ణువు మరో పేరు.

**వార్ష్ణేయం :** ఓ ప్రాచీన రాజ్యం. ఈ రాజ్యాధిపతి ధర్మజుని రాజసూయ యాగానికి కానుకలు సమర్పించాడు. - మహాభారతం

**వాలఖిల్యులు :** (బాలఖిల్యులు) ఓ రుషుల తెగ.

*జననం :* సప్తర్షుల్లో ఒకడైన క్రతువుకు తన భార్య సంతతికి 60 వేల మంది రుషులు జన్మించారు. వారే వాలఖిల్యులు. ప్రతి జీవి బొటన వ్రేలులో సగం మాత్రమే వుంటారు. కాని సూర్యకాంతివలె ప్రకాశిస్తారు. నిగ్రహ శక్తి కూడా కలవారు.

*గరుడుడు - వాలఖిల్యులు :* కశ్యప ప్రజాపతి ఒకసారి సంతాన ప్రాప్తికి యాగం చేస్తూ దానికి కావలసిన వంటచెరకు తెచ్చే బాధ్యత ఇంద్రుడు, ఇతర దేవతలకు అప్పగించాడు. ఇంద్రుడు గుట్టలు గుట్టలు తెస్తుంటే వాలఖిల్యులు చిన్న చిన్న ముక్కలు తేవడం చూసి ఇంద్రుడు నవ్వాడు. వాలఖిల్యులు కోపంతో మరో ఇంద్రుణ్ణి సృష్టించడానికి తపస్సు చేయసాగారు. ఇంద్రుడు భయపడి కశ్యపుడినాశ్రయించగా వారి తపం వృధాకాదు. వారి తపశ్శక్తి వల్ల ఇంద్రుడి కంటే శక్తి వంతుడైన పుత్రుడు వినతకు జన్మిస్తాడని చెప్పాడు. అట్లే వినతకు గురుడుడు జన్మించాడు. ఒకసారి అమృతం తేవడానికి దేవలోకం వెళ్లిన గరుడుడు ఇంద్రుణ్ణి ఓడించాడు. - మహాభారతం

*జీవనం :* వీరు సూర్యమండలంలో పక్షులరూపంలో తిరుగుతుంటారు. వీరికి పాపమంటే తెలియదు. దైవ కార్యాలకు సహాయపడతారు. చంద్ర మండలంలో కూడా నివసిస్తారు. వీరు నిత్యం సూర్యుడ్ని పూజిస్తారు. ప్రపంచంలోని జీవులు సత్యసంధతతో జీవించడానికి వీరే కారణం.

*ఇతర విశేషాలు :* గరుడొకసారి అమృతం కొరకు దేవలోకం వెళ్తూ ఓ అరటి చెట్టుపై విశ్రాంతి తీసుకోగా ఆ కొమ్మ విరిగింది. దీనికి వేలాడుతూ తపస్సు చేస్తున్న వాలఖిల్యులకు ప్రమాదం జరగకుండా ఆ కొమ్మను గరుడుడు తన ముక్కున కరచుకొని గంధ మాదన పర్వతంపై వుంచాడు. వీరు సూర్యుని రథంలో కూర్చొని వేదాలు శాస్త్రాలు అధ్యయనం చేస్తారు.

**వాలి :** ఓ బలశాలి అయిన వానర రాజు.

*జనన వృత్తాంతం :* వాలి ఇంద్రుని కుమారుడు. శిలావతి తన భర్తను కాపాడుకోవడానికి సూర్యుడు ఉదయించకుండునట్లు శపించగా సమయమైనా సూర్యుడు కదలక కూర్చున్నాడు. సూర్యుని రథికుడైన అరుణుడు చేసే పని లేక స్త్రీ రూపంలో ఇంద్రసభలో దేవతాంగనల నృత్యం చూడడానికి వెళ్లగా ఇంద్రుడు స్త్రీ రూపంలోని అరుణుడిని మోహించి సంగమించగా వాలి జన్మించాడు. అరుణుడి ఆలస్యానికి కారణం తెలుసుకున్న సూర్యుడు స్త్రీ రూపంలో వున్న అరుణుడితో కామకలాపాలాడగా సుగ్రీవుడు జన్మించాడు. వీరిని గౌతముడు అరుంధతిని పెంచమని కోరగా వాలిసుగ్రీవులిద్దరూ అరుంధతి పిల్లలుగా పెరిగారు. కిష్కిందను పాలిస్తున్న వానర రాజైన ఋక్ష రాజుకు సంతానం లేక ఇంద్రుడ్ని ప్రార్థించగా గౌతముడి ఆశ్రమం నుండి వాలిసుగ్రీవులను తెచ్చి ఇతనికి ఇచ్చాడు.

– *ఉత్తర రామాయణం : కంభ రామాయణం*

*వివాహం–రాచరికం :* అభిప్రాయ భేదాల వల్ల వాలి అసురుల్ని ఓడించి దేవతలకు దగ్గర కాగా క్షీరసాగరమదనంలో దేవతలకు సహాయపడ్డాడు. క్షీరసాగర మదనంలో వెలువడిన తారనిచ్చి వాలికి వివాహం చేశారు. సుగ్రీవుడు రుమను వివాహమాడాడు. ఈ సమయంలోనే ఋక్షరాజు మరణించగా వాలి కిష్కిందకు రాజయ్యాడు.

*హనుమంతుడితో శతృత్వం :* పార్వతీ పరమేశ్వరులు వానర రూపంలో కామక్రీడలు సలపగా ఆ గర్భాన్ని వాయుదేవునికివ్వగా అతడు దానిని అంజనా గర్భంలో వుంచాడు. నారదుని ద్వారా ఈ విషయం తెలుసుకున్న వాలి తన కంటే బలవంతుడైన వానరుడు జన్మిస్తాడని తలచి పంచ లోహాలను అంజనా గర్భంలోకి పంపినా హనుమంతునికి ఏ ఆపద కలుగక జన్మించాడు.

*వాలి సుగ్రీవుల వైరం : –చూ॥ దుందుబి, మాతంగుడు.*

*రావణుని ఓటమి :* దేవతలు వాలికి ఓ వరం ఇచ్చారు. ఎవరైన అతని ఎదురుగా నిలబడి పోరాడితే ఎదుటవాని శక్తిలో సగభాగం వాలికి వస్తుంది. రావణుడికి ఇది తెలిసికూడా వాలిని ఓడించాలని అతడు నదిలో స్నానం చేస్తుండగా అతడి వెనుక నుండి చంపబోగా వాలి అది గ్రహించి తన తోకతో రావణుణ్ణి బంధించి యధావిధిగా ప్రతిరోజు దర్శించే ప్రదేశాలు దర్శించి రావణునితో సహా కిష్కిందకు చేరగా రావణుడు ఓటమినంగీకరించాడు.

*వాలి మరణం :* సీతాన్వేషణకు వచ్చిన రామ లక్ష్మణులకు హనుమంతుని ద్వారా సుగ్రీవునితో స్నేహమేర్పడి వారో ఒడంబడికకు వచ్చారు. వాలిని శ్రీరాముడు చంపి సుగ్రీవుని కిష్కిందకు రాజును చేయుట, సుగ్రీవుడు వానర సైన్యంతో సీతాన్వేషణకు సహాయపడుట అందులో భాగం. ఆ తర్వాత సుగ్రీవుడు వాలిని ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానించగా ఎదురుగా వుండి యుద్ధం చేయడంలో వాలికి గల శక్తి నెరంగిన శ్రీరాముడు చెట్టుచాటు నుండి తన బాణంతో వధించాడు. చనిపోతూ వాలి శ్రీరాముని నిష్టూరమాడి తారను అంగదుడిని శ్రీరామునికి అప్పగించారు.

– *కంభరామాయణం*

**వాలిఖుడు :** కశ్యప ప్రజాపతికి కద్రువ వల్ల జన్మించిన సర్పం. – *మహాభారతం*

**వాల్మీకి 1 :** ఓ రుషి. కవుల్లో మొదటివాడు. రామాయణ గ్రంథ కర్త. ఇతడు వరుణుడి 10వ కుమారుడని పురాణాలు చెప్తున్నాయి. ప్రచేతసుడి కొడుకని, వరుణుడి కొడుకని రామాయణం, బ్రహ్మ కుమారుడని ఉత్తర రామాయణం పేర్కొంటున్నాయి. బ్రహ్మశాపం వల్ల బోయవాడని రామాయణం చెప్తోంది. మొదట ఇతడు దుర్మార్గులతో స్నేహం చేసి దుర్మార్గంగానే జీవించాడు. అప్పుడతని పేరు వాల్మీకి కాదు. ఇతడు సంతానాన్ని పోషించడానికి యాత్రికుల్ని దోపిడీ చేసేవాడు. ఒకసారి సప్తర్షుల్ని పట్టుకున్నాడు. సప్తర్షులు నీవు చేసే పాపాలు నీ భార్యా పిల్లలు పంచుకుంటారేమో అడగమని చెప్పగా అతడు వెంటనే ఇంటికి వెళ్లి భార్యను పిల్లల్ని అడగగా వారు నిరాకరించడంతో అతని జీవితం ఒక్కసారిగా మారి పోయింది. అతడు వెంటనే సప్తర్షుల పాదాలపైపడగా అతనికి వేదజ్ఞానం బోధించారు. వెంటనే అతని నోటి వెంట 'రామ రామ' అనే పలుకులు వచ్చాయి. అలాగే తపస్సు చేశాడు. ఆ తపస్సులో వుండగనే అతడి చుట్టూ, చీమలున్న పుట్ట పెరిగింది. అలాగే నిశ్చలతపస్సులో

వుండగా సప్తర్షులు తిరిగి వస్తూ ఆ పుట్టను తవ్వి ఇతడిని పైకి తీశారు. వాల్మీకం నుండి బయటకు వచ్చాడు కనుక ఇతడు వాల్మీకిగా ప్రసిద్ధుడయ్యాడు. తమసా నదీతీరాన ఆశ్రమమేర్పరచుకొని తన శిష్యులతో జీవించాడు. ఇచ్చటే ఇతడు రామాయణ గాథ రచించాడు.

**వాల్మీకి 2 :** గరుడుని ప్రసిద్ధ తనయుల్లో ఒకడు.
– *మహాభారతం*

**వాసన :** అర్కుడను వసువు భార్య. – *భాగవతం*

**వాసవదత్త :** ఉదయనుని భార్య. – *చూ॥ ఉదయనుడు*

**వాసవి :** వ్యాసుని తల్లి సత్యవతికి మరో పేరు.
– *మహాభారతం*

**వాసవుడు :** ఇంద్రుడి మరోపేరు.

**వాసుకి :** ఓ ప్రసిద్ధ సర్పం.

*జననం :* ఉరగలు, సర్పాలు కశ్యపునికి కద్రువ వల్ల జన్మించిన సంతానం. వీరిలో పెద్దవాడు వాసుకి.

*వైరుధ్యాలు :* కద్రువ, వినత ఉచ్చైశ్రవం తోక నలుపా తెలుపా అని పందెం వేసుకొని అది నల్లగా కన్పించడానికి కద్రువ తన సంతానాన్ని అశ్వపు తోకను చుట్టుకొమ్మని చెప్పింది. వాసుకి మరికొంత మంది అందుకు నిరాకరించగా కద్రువ కోపానికి గురై వీరు కుటుంబంనుండి వేరుపడ్డారు.

*వాసుకి పొడవు :* దేవాసురులు క్షీరసాగర మదనం చేయడానికి నిశ్చయించి దేవతలు మందర పర్వతాన్ని కవ్వంగా ఉపయోగించడానికి తేబోయి సాధ్యం కాలేదు. అప్పుడు విష్ణువు గరుడుని ఆదేశించాడు. కవ్వానికి తాడుగా వాసుకిని ఉపయోగించదలచి దేవతల వల్ల కాక గరుడుని అడుగగా అదెంతపని అని వాసుకి మధ్య భాగాన్ని తన ముక్కున కరచుకొని తేబోగా రెండు కొసలు పాతాళంలోనే వున్నాయి. వాసుకిని రెండుగా మడచి తేబోయినా రెండు కొసలు పాతాళంలోనే వుండటంతో గరుడునికి గర్వభంగమయ్యింది. శివుడు తన చేతిని పాతాళంలోకి చాచగా శివుని చేతికి గాజు చుట్టుకున్నంత తేలిగ్గా రాగా క్షీరసాగర మదనం మొదలయ్యింది.

*ఇతర విశేషాలు :*

1. తన సోదరులైన నాగుల రక్షణార్థం తన సోదరి జరత్కారిని జరత్కారుడికిచ్చి వివాహం చేశాడు.
2. నాగులు వాసుకిని తమ రాజుగా ఎన్నుకొన్నారు.
3. జనమేజయుని సర్పయాగంలో సర్పాలు బూడిదవుతుంటే తన మేనల్లుడు ఆస్తికుడ్ని దాన్ని ఆపమని కోరాడు.
4. ఆర్యకుని కోరికపై భీమసేనుడికి అద్భుత రసాన్నిచ్చాడు. త్రిపుర సంహారంలో శివుని ధనస్సుకు తాడుగా ఉపయోగపడ్డాడు. బలభద్ర రాముడు తన జీవిత చరమాంకంలో పాతాళం వెళ్లగా వాసుకి ఇతడ్ని సాదరంగా ఆహ్వానించాడు.

ఒకసారి వాయువు, వాసుకి ఎవరు బలవంతులో తేల్చుకోవడానికి పోటీపడి తమ ప్రతాపాన్ని మహామేరు పర్వతంపై చూపగా త్రికూట పర్వతం మహామేరువు నుండి విడివడి దక్షిణాపథాన ఎగిరిపడింది.
– *మహాభారతం*

**వాసుకి తీర్థం :** ప్రయాగవద్ద గంగా నదీతీరంలో గల పుణ్యతీర్థం. దీన్ని భోగవతి తీర్థమని కూడా పిలుస్తారు. ఇచ్చట స్నానం చేస్తే అశ్వమేధ ప్రతిఫలం లభిస్తుంది. – *మహాభారతం*

**వాసుదేవ భట్టతిరి :** కేరళలో జన్మించిన ఓ సంస్కృత కవి. ఇతడి ప్రసిద్ధ రచనలు. యుధిష్టర విజయం, త్రిపుర దహనం, వాసుదేవ విజయం, గజేంద్ర మోక్షం.

**వాసుదేవుడు 1 :** వసుదేవుని కుమారుడైన శ్రీకృష్ణుని మరోపేరు. – చూ॥ కృష్ణుడు

**వాసుదేవుడు 2 :** చూ॥ పౌండ్రక వాసుదేవుడు.

**వాస్తు పురుషుడు :** ప్రాచీన కాలంలో ఓ ప్రేతం వుండేది. దాన్ని దేవతలంతా భూమిలో పాతి పెట్టారు. అదే వాస్తు పురుషుడు. భూమిపై మనం నిర్మించే ప్రతికట్టడానికి ఇది అధిదేవత. ఇతడికి సమర్పించే దాన్ని పురావాస్తు బలి అంటారు. – *అగ్ని పురాణం*

**వాశిష్ఠ పర్వతం :** పురాణ ప్రసిద్ధమైన ఓ పర్వతం. అర్జునుని విహారయాత్రలో ఈ పర్వతం ఎక్కాడు.
– *మహాభారతం*

**వాశిష్ఠం 1 :** ఇదో పుణ్యతీర్థం. ఇచట స్నానం చేస్తే బ్రాహ్మణత్వం లభిస్తుంది. – *మహాభారతం*

**వాశిష్ఠం 2 :** ఓ అగ్ని. – *మహాభారతం*

**వాహనాలు :** ప్రయాణ సాధనాలు. రుద్ర, యమ ఇతర దేవతల ప్రయాణ సాధనాలు. – *చూ॥ జలధి*

**వాహికుడు :** వేదాలు తెలిసిన బ్రాహ్మణుడు. ఉప్పుకూడా అమ్మేవాడు. చాలా పాపాలు చేశాడు. ఓ సింహం ఇతడిని చంపగా ఇతని శరీరం గంగలో పడటం వల్ల పాపవిముక్తుడయ్యాడు. - స్కందపురాణం

**వాహిని 1 :** సైన్యంలో ఒక విభాగం. - చూ॥ అక్షౌహిణి

**వాహిని 2 :** కురురాజు భార్య. ఇతడు చంద్రవంశ రాజు. ఈమెవల్ల అశ్వవానుడు మరికొందరు పుత్రులు జన్మించారు. - మహాభారతం

**వాహ్యకలు :** సృంజయుని ఇద్దరు కుమార్తెలు. యాదవ రాజైన భజమానుడు వీరిని వివాహమాడాడు. నిమి, కృమిల, వృష్ణిలు వీరికి జన్మించారు. - మత్స్యపురాణం

**వికంకత పర్వతం :** మేరు పర్వత సానువుల్లోని మరో పర్వతం. - మహాభారతం

**వికట :** రావణుని కొలువులో ఓ రాక్షసి. ఈమె సీతా రావణుల్ని కలపాలని ప్రయత్నించింది.

**వికటుడు 1 :** ప్రహస్తుని సోదరుడు. - చూ॥ అకంపనుడు

**వికటుడు 2 :** పంచతంత్ర కథలోని ఓ కల్పిత పాత్ర. - చూ॥ పంచతంత్రం

**వికద్రువు :** ఓ యాదవ ప్రముఖుడు. ఇతడు జరా సంధుడు మధురాపురిపైకి 18వ సారి దండ యాత్ర చేయబోతున్నాడని శ్రీకృష్ణునికి తెలియజేశాడు. - మహాభారతం

**వికర్ణం :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజ్యం. ఈ రాజ్యం వీరులు శకునితో చేరి పాండవులతో కురుక్షేత్ర యుద్ధంలో పోరాడారు. - మహాభారతం

**వికర్ణుడు 1 :** శివభక్తుడైన రుషి. ఇతని భక్తికి మెచ్చి శివుడు ఇతనికి వరాలిచ్చాడు.

**వికర్ణుడు 2 :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో పాల్గొన్న 11 మంది మహారథుల్లో ఒకడు. ద్రుపదుడి పైకి యుద్ధానికి వెళ్లిన ద్రోణుని శిష్యుల్లో ఒకడు. ద్రౌపది స్వయం వరంలో పాల్గొన్నాడు. కురు సభలో ద్రౌపదిని వివస్త్రను కావించ పూనినప్పుడు దాన్ని వ్యతిరేకించాడు. గోగ్రహణంలో అర్జునుడితో పోరాడాడు. కురుక్షేత్ర యుద్ధంలో ఎందరో వీరులతో పోరాడి చివరకు భీమ సేనుడి చేతిలో మరణించాడు. - మహాభారతం

**వికర్తనుడు :** సూర్యవంశపు రాజు. కుష్ఠు వ్యాధిగ్రస్తుడు. సాభ్రమతీ నదిలో స్నానం చేసి ఆ వ్యాధి నుండి విముక్తుడయ్యాడు. - పద్మపురాణం

**వికల్పం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రసిద్ధ రాజ్యం. - మహాభారతం

**వికాథిని :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరి. - మహాభారతం

**వికుంజం :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజ్యం. ఈ రాజ్యవీరులు భీష్ముని గరుడ వ్యూహంలో ఎడమ వైపు నిలబడి పోరాడారు. - మహాభారతం

**వికుంఠ :** దేవతల్లో ఓ తెగ. రైవత మన్వంతరంలోని దేవతలు. ఇందులో 14 మంది దేవతలున్నారు. వీరి తల్లి వికుంఠ.

**వికుంఠనుడు :** చంద్ర వంశ రాజైన హస్తికి, త్రిగర్త రాకుమారి యశోధరకు జన్మించిన కుమారుడు. దశార్ణ రాకుమారి సుదేవ ఇతడిని వివాహమడగా వారికి అజమీఢుడు జన్మించాడు. - మహాభారతం

**వికుక్షి :** అయోధ్యను పాలించిన ఇక్ష్వాకుని కుమారుడు. శర్యాతి మరణానంతరం రాక్షసులు అయోధ్యను నాశనం చేయగా ఈ వంశస్థులు అక్కడ నుండి పారి పోగా ఇక్ష్వాకులే మిగిలి అయోధ్యను పాలించారు. ఇతనికి 100 మంది కుమారులు. అందులో వికుక్షి ఒకడు. ఒకసారి మహా ప్రళయ శ్రాద్ధకర్మ నిర్వహించ దలచి వికుక్షిని దానికి సరిపడ మాంసం తెమ్మని అడవికి వేటకు పంపగా ఇతడు వేటాడి అలసి కొంత మాంసాన్ని భుజించి తక్కినది తీసుకురాగా రాజ పురో హితుడు ఇది గ్రహించి ఎంగిలి మాంసం శ్రాద్ధ కర్మకు పనికి రాదనగా రాజు కోపించి కుమారుడ్ని దేశబహి ష్కరణ చేయగా ఇతడు అరణ్యంలో దేవిని గూర్చి తపస్సు చేశాడు. ఇక్ష్వాకు మరణం తర్వాత ఇతడు అయోధ్యకు తిరిగి వచ్చి రాజ్యపాలన చేశాడు. శశాన్ని తినడం వల్ల ఇతడికి శశాదుడను పేరు కూడా కలదు. ఇతడు తర్వాత సరస్వతీ తీరాన ఎన్నో యజ్ఞాలు చేశాడు. కకుత్సరుడు ఇతని కుమారుడు. - దేవీ భాగవతం

**వికుండలుడు :** ఓ వైశ్యుడు. ఇతని సోదరుడు కుండ లుడు. వీరి తండ్రి హేమకుండలుడు వ్యాపారం చేసి

ఎంతో బాగా సంపాదించి వేదాలలో చెప్పినట్లు తన లాభాలలో కొంత దానాలకు ఇతర కార్యక్రమలకు వెచ్చించి కుమారులకు తగినంత ఆస్తి ఇచ్చి మరణించాడు. ఆ తర్వాత సోదరులిద్దరు త్రోవతప్పి చరించి ధనవిహీనులై దొంగతనాలుచేస్తూ రాజుకు భయపడి అరణ్యంలో తలదాచుకోగా ఒకరిని పులిచంపగా రెండవవాడు పాముకాటుకు మరణించాడు. కుండలుడు నరకానికి చేరగా వికుండలుడు స్వర్గానికి వెళ్లాడు. వికుండలుడు తనకు తన సోదరుడికి తేడా ఏమని యమ భటులను ప్రశ్నించగా "నీస్నేహితుడైన బ్రాహ్మణుని వల్ల నీవు మాఘమాసంలో రెండుసార్లు కాళిందీ నదిలో స్నానం చేశావని మొదటి సారి స్నానం చేయడం వల్ల నీ పాపాలు నశించినాయని, రెండవ సారి స్నానం చేయడం వల్ల స్వర్గప్రాప్తి లభిం చిందని చెప్పారు. – పద్మపురాణం

**విక్షరుడు :** కశ్యప ప్రజాపతి దనువులకు పుట్టిన సలక్షణ సంపన్నుడైన అసురుడు. ఇతడు వసుమిత్రుడను రాజుగా పునర్జన్మించాడు. – మహాభారతం

**వికృతి :** యయాతి కుటుంబంలో ఒక రాజు. ఇతని తండ్రి జీమూతుడు. ఇతని కుమారుడు భీమరథుడు. – భాగవతం

**వికృతుడు :** మన్మథుడు బ్రాహ్మణ రూపంలో ఇక్ష్వాకునితో సంవాదం చేసినపుడు ధరించిన పేరు. – మహాభారతం

**విక్రమశీలుడు :** మార్కండేయ పురాణంలో పేర్కొన్న ప్రసిద్ధ రాజు. కాళింది ఇతని భార్య. దుర్గముడితని కుమారుడు.

**విక్రమార్కుడు (విక్రమాదిత్యుడు) :** భారతదేశంలో శక్తివంతుడు. ధర్మపాలుడు. తెలివైన చక్రవర్తుల్లో ఒకడు. ఇతడు మహేంద్రాదిత్యుని కొడుకు. ఉజ్జయిని రాజధానిగా చాలాకాలం పాలించాడు. మహేంద్రాదిత్యుడు అతని భార్య సౌమ్యదర్శన సంతానం లేక మదనపడుతుండేవారు. అదే సమయంలో ప్రధాని సుమతి, సేనాని వజ్రాయుధుడు, పురోహితుడు మహీధరుడు అంతే అసంతృప్తితో నుండగా దేవతలు భూమిపై దుర్మార్గులు అనాగరికులు పెరిగారని మీరు విష్ణువు రాక్షసులను వధించి మమ్మల్ని రక్షించారని ప్రస్తుతం బ్రాహ్మణులకు రక్షణలేదని వారి హవిస్సులే మాకు ఆహారం కనుక మమ్మల్ని రక్షించమని శివుడ్ని ప్రార్థించగా మలయవానుడిని మహేంద్రాదిత్యుడికి పుత్రుడుగా జన్మించి అనాగరికుల నుండి ప్రజలను రక్షించమని ఆదేశించగా అతడు ఆ రాజదంపతులకు విక్రమాదిత్యుడిగా జన్మించాడు. – కథాసరిత్సాగరం

భారతీయ సాహిత్యంలో విక్రమార్కుడిని గురించి వివిధ వృత్తాంతాలున్నాయి. అవి :

1. శృంగార శేఖరుడను రాజు కూతురు రాగ మంజరి, చంద్రగుప్తుడను బ్రాహ్మణుని ప్రేమించి వివాహమాడెను. చంద్రగుప్తునకు రాగ మంజరి యందు విక్రమార్కుడు, విష్ణుశర్మ కూతురగు శీలవతి యందు వరరుచి, సుమతి యందు భట్టి, మదన రేఖ యందు భర్తృహరి జన్మించిరి. – విక్రమాంకదేవ చరిత్రం

2. ఇతడు భర్తృహరి సోదరుడు. భర్తృహరి కొంత కాలము ఉజ్జయినిని పాలించి విరాగియై అడవుల కేగుచూ సోదరునికి రాజ్యాధికారమప్పగించెను. ఇతడు అద్భుతమైన తెలివిగలవాడు. ఒకసారి ఓ అపరిచితుడు నేను యాగము చేయుచున్నాను. నాకు సహాయము రమ్మని అడవికి తీసుకొని వెళ్లి ఇతడిని చంపబోగా విక్రమార్కుడే అతనిని వధించెను. అది చూసిన భేతాళుడు ఇతనికి మిత్రుడయ్యెను.

ఒకసారి ఊర్వశీ, రంభల నృత్య నైపుణ్యమును గూర్చి వివాదము రాగా ఇంద్రుడే ఇతనిని రప్పించి తీర్పు చెప్పమనగా వారి నృత్యము చూసి ఊర్వశియే మిక్కిలి నైపుణ్యము గలది" అని చెప్పగా ఇంద్రుడు మెచ్చి 32 సాలభంజికలుగల సింహాసనము బహుమతిగా నిచ్చెను. అందు ఆశీనుడై విక్రమార్కుడు చిరకాలము రాజ్యపాలన చేసెను. ఇతని మరణానంతరము ఆ సింహాసనము భోజరాజు గైకొనెను. – విక్రమోర్వశీయం

**విక్రాంతుడు :** ఒక రాజు. సుధృతికి తండ్రి. దముడను రాజు కొడుకు. ఇతడు తన ప్రజల్ని పరివారాన్ని ధర్మంగా పాలించిన రాజు. – వాయుపురాణం

**విఖనసుడు :** ఒక ఋషి. వైఖాన సాగమాన్ని రూపొందించాడు. దీన్ని పాటించేవారు వైఖానసులు.

**విగాహనుడు :** ముకుట వంశంలోని ఓ ప్రసిద్ధిచెందిన రాజు. – మహాభారతం

**విగ్రహుడు :** సముద్రుడు సుబ్రహ్మణ్యస్వామికిచ్చిన ఇద్దరు పరిచారకుల్లో ఒకడు. మరొకడు సంగ్రహుడు. - మహాభారతం

**విగ్రహం 1 :** రాజుకుండవలసిన ఆరు సద్గుణాల్లో ఇదొకటి. - చూ॥ సద్గుణాలు

**విగ్రహం 2 :** దేవతలకు ప్రతి రూపాలుగా ప్రతిష్టించే రూపాలు. ఇది సాలగ్రాను, లింగాదుల రూపంలో వుంటుంది.

**విఘనుడు 1 :** రావణుని తరపున పోరాడిన ఓ రాక్షసుడు. - రామాయణం

**విఘనుడు 2 :** మకుట వంశంలో జన్మించిన ప్రసిద్ధ రాజు. - మహాభారతం

**విఘ్నేశ్వరుడు :** చూ॥ వినాయకుడు.

**విచఖ్నుడు :** ప్రాచీన భారతీయ రాజు. అహింసావాది. ఇతడు మద్యం, మత్తు మందులు, తేనె, మాంసం తీసుకోవడానికి వ్యతిరేకి. ఇవి సేవించాలని వేదాలలో పేర్కొనబడలేదని చెప్పాడు. - మహాభారతం

**విచారుడు :** రుక్మిణి శ్రీకృష్ణులకు జన్మించిన పుత్రుల్లో ఒకడు. - భాగవతం

**విచిఖ్యుడు :** ఒక రాజు. యజ్ఞంలో వృషభాన్ని బ్రాహ్మ ణులు హింసించడం చూసి జాలితో గోవులకు స్వస్తి అగుగాక అంటాడు. - మహాభారతం

**విచిత్రవీర్యుడు :** ధ్రుతరాష్ట్రుని తండ్రి. - చూ॥ ధ్రుత రాష్ట్రుడు - భీష్ముడు

**విచిత్రుడు :** ఓ క్షత్రియ రాజు. క్రోధవసుడను రాక్షసుడి శరీరం నుండి జన్మించాడు. - మహాభారతం

**విచింత్యుడు :** సాల్వుడి సేనానాయకుల్లో ఒకడు. యుద్ధంలో చారుదేష్ణుడితణ్ణి ఓడిస్తాడు. - మహాభారతం

**విజయ 1 :** దాశార్హుడి కూతురు. భుమన్యుడికి భార్య. సుహోత్రుడికి తల్లి. - మహాభారతం

**విజయ 2 :** ద్యుతిమంతుడి కూతురు. సహదేవుడి భార్య. సుహోత్రుడి తల్లి. - మహాభారతం

**విజయ 3 :** దుర్గకు మరో పేరు. - మహాభారతం

**విజయ 4 :** వైకుంఠంలోని ద్వారపాలకుడు. - చూ॥ జయ

**విజయదశమి :** భారతీయ పండుగల్లో ముఖ్యమైనది. ఈ వుత్సవాన్ని 9 రోజులు చేసి 10వ రోజైన విజయ దశమి రోజున ముగిస్తారు. 10వ రోజును దసరా అని పిలుస్తారు. అదే విజయ దశమి. 10వ రోజున దుర్గ మహిషాసురుడిని చంపిందని, మహిషాసురుడు నివాసం మైసూర్ అనే భావనతో ఇచ్చట విజయ దశమి ఘనంగా జరుపుతారు. ఇందులో రాజకుటుంబాలు పాల్గొంటాయి. ఆరోజు ఎవరి వృత్తులవారు వారికి సంబం ధించిన వస్తువులను దుర్గాదేవి ముందుంచి పూజిస్తారు.

**విజయలక్ష్మి :** అష్టలక్ష్మిలలో ఒకరు. ఈమె బ్రహ్మ ధనాగారానికి కాపలా వుండేది. ఒకసారి ఈమె అజా గ్రత్తగా వుండటం వల్ల బ్రహ్మ శపించగా రావణుని లంకానగరానికి ద్వారపాలికలకు లక్ష్మిగా వుంది. హనుమంతుడు ఈమెను మోదగా నిజరూపిణియై తిరిగి తన పూర్వస్థానానికి వెళ్లింది.

**విజయం 1 :** శివుడి త్రిశూలం పేరు. - మహాభారతం

**విజయం 2 :** ఇంద్రుడి ధనుస్సు పేరు. - మహాభారతం

**విజయం 3 :** కర్ణుడి ధనుస్సు. - మహాభారతం

**విజయం 4 :** పురాణ ప్రసిద్ధమయిన ప్రాచీన భారత దేశంలో ఓ రాజ్యం. - మహాభారతం

**విజయాశ్వుడు :** చూ॥ విజితాశ్వుడు.

**విజయ :** దశరథుని కుమార్తె. భూమాన్య చక్రవర్తి ఈమెను వివాహమాడాడు. సుహోత్రుడు వీరి కుమారుడు.

**విజయుడు 1 :** దశరథుని మంత్రుల్లో ఒకడు. - రామాయణం

**విజయుడు 2 :** కోసల దేశపు రాజు. పరశురాముడితో యుద్ధం చేసి ఓడిపోయాడు.

**విజయుడు 3 :** ధృతరాష్ట్రుని వందమంది పుత్రుల్లో ఒకడు. ఇతడు జయదుర్జయులతో కలసి కాశ్యజయ త్సేనులతో పోరాడాడు. - మహాభారతం

**విజయుడు 4 :** విష్ణువుకు పర్యాయపదం. - మహాభారతం

**విజయుడు 5 :** శివుడికి పర్యాయపదం. - మహాభారతం

**విజయుడు 6 :** వారణాసిని పాలించిన శక్తి వంతుడైన రాజు. ఖాండవ నగరాన్ని ధ్వంసం చేయగా ఖాండవ వనం ఏర్పడగా ఇంద్రుడికిచ్చాడు. ఈ వంశంలో ఉపరిచరుడు అత్యంత శక్తివంతుడైన రాజు. - కాళికాపురాణం

**విజయుడు 7 :** పురూరవసుని కుమారుల్లో ఒకడు. పురూరవసుడికి ఊర్వశికి జన్మించిన ఆరుగురు పుత్రుల్లో ఒకడు. - *భాగవతం*

**విజితాశ్వుడు :** పృథు చక్రవర్తి 5 గురు కుమారుల్లో ఒకడు. ఇతడు 100 అశ్వమేధయాగాలు చేయ తల పెట్టి 99 చేశాడు. ఇంద్రుడు భయపడి అశ్వాన్ని ఎత్తుకు పోయాడు. విజితాశ్వుడు ఇంద్రునిపై పోరాడి విజయం సాధించి ఎత్తుకెళ్లిన అశ్వాన్ని తిరిగి పొం దాడు. అప్పటి నుండి ఇతనికి విజయాశ్వుడనే పేరొ చ్చింది. ఇతడి యుద్ధ ప్రావీణ్యం చూసి ఇంద్రుడితడికి మాయావి విద్య నేర్పాడు. - *భాగవతం*

**విజ్వలుడు :** కుంజప పక్షి కుమారుడు. కుంజ పక్షి గొప్ప పాండిత్యమున్న పక్షి. - *చూ॥ సుభాహుడు*

**విటకుడు :** సుమాలి కొడుకు. ఓ అసురుడు.

**విటభూతుడు :** ఓ అసురుడు. వరుణుని కొలువులో వుండి అతణ్ణి పూజిస్తుంటాడు. - *మహాభారతం*

**వితత్యుడు :** గృత్యమదుడి వంశంలోని విహవ్యుడి కొడుకు. సత్యుడను రాజుకి తండ్రి. - *మహాభారతం*

**వితథుడు :** దీర్ఘతమసుడి మరోపేరు. ఇతడు భరతుని పెంపుడు కుమారుడు. - *చూ॥ భరతుడు*

**వితద్రువు :** ఓ యాదవుడు. యదువంశంలోని ఏడుగురు యాదవరాజుల్లో ఒకడు. - *మహాభారతం*

**వితర్కుడు :** ధ్రుతరాష్ట్రుని కుమారుల్లో ఒకడు. - *మహాభారతం*

**వితల :** పాతాళంలో ఒక భాగం. - *చూ॥ పాతాళం*

**వితస్త :** పురాణ ప్రసిద్ధిచెందిన ఓ నది. ఇప్పటి జీలమ్ నదే పురాణకాలంలోని వితస్త. ఈ నదీ దేవత వరు ణుని కొలువులో వుండి అతడిని పూజిస్తుంది. ఈ నదిలో స్నానం చేసి దేవతల్ని, పితృగణాల్ని పూజిస్తే వాజపేయ యజ్ఞం చేసిన ప్రతిఫలం లభిస్తుంది. కాశ్మీరంలో తక్షకుని భవనంపేరు కూడా వితస్త. ఒకసారి బ్రాహ్మణులకు చెందిన నల్ల చెవులున్న గోవులు ఈ నదీ ప్రవాహంలో కొట్టుకు పోయాయి. ఈ నదిలో స్నానం చేసి 7 రోజులు ఉపవాసం వుంటే రుషులంత నిర్మల హృదయులౌతారు. పార్వతికి సల హాలిచ్చిన నదీ దేవతల్లో వితస్త ఒకరు. - *మహాభారతం*

**వితండవాదుడు :** వాదించేవాడికి గాని వాదింపబడే వాటికి గాని ఉపయోగకరం కాని వాదనలు చేసే వాడిని వితండవాదుడని అంటారు. - *మహాభారతం*

**విత్తదుడు :** సుబ్రహ్మణ్యస్వామి పరిచారకుడు. - *మహాభారతం*

**విదండుడు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. విదం డుడు, ఇతని కుమారుడు దండుడు ద్రౌపది స్వయం వరానికి వచ్చారు. - *మహాభారతం*

**విదముడు :** శతశృంగుడి కొడుకైన ఒక రాక్షసుడు. దముడు, సుదముడు ఇతని సోదరులు, అంబరీశుడి రాజ్యంపై దండెత్తుతారు. సుదేవుడు వీరిని వధిస్తాడు.

**విదర్భ :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజ్యం. సహదేవుడు ఈ దేశంలోని ఓ ప్రాంతమైన భోజక టకం పై దండెత్తి భీష్మకుడను రాజును ఇచట నుండి తరిమివేశాడు. నమకుడను రుషి అనుగ్రహం వల్ల దమ, దాంత, దమన అనే కుమారులు, దమయంతి అనే కుమార్తె భీష్మకుడికి జన్మించారు. దమయంతి స్వయంవరానికి, ఇంద్రుడు, అగ్ని, వరుణుడు, యముడు వంటి దేవతలు కూడా హాజరయ్యారు. విదర్భ రాజకుమారి కనుక దమయంతిని వైదర్భి అనికూడా పిలిచేవారు. శ్రీకృష్ణుని భార్య రుక్మిణి ఓ విదర్భ రాజు కూతురు. - *మహాభారతం*

**విదర్భుడు 1 :** భరతుని సోదరుల్లో ఒకడు. కుశావ్రత, ఇలావ్రత, ఆర్యావ్రత, భద్రకేతు, సేన, విదర్భులు భరతుని సోదరులు. నిమి చక్రవర్తి విదర్భుడి కుమారుడు. - *భాగవతం*

**విదర్భుడు 2 :** చూ॥ జ్యామఘుడు.

**విదల్లుడు :** ద్రువసంధి అనే రాజు వద్ద మంత్రి. - చూ॥ ద్రువసంధి.

**విదిశ :** ఓ నది. ఇది వరుణుని సభలో అతణ్ణి పూజిస్తుంది. - *మహాభారతం*

**విదురుడు :** ఇతడో మానవాతీత వ్యక్తి. ధృతరాష్ట్రుని సోదరుడిగా, అద్భుతమైన తెలివి గలవాడిగా, కౌరవ పాండవుల కార్యక్రమాల వీక్షకుడిగా, ధృతరాష్ట్రుని సలహాదారుగా, జ్ఞానసంపన్నుడిగా ప్రసిద్ధికెక్కాడు. *ధర్మదేవుని అవతారం :* ప్రాచీన కాలంలో మాండవ్య డనే మహర్షి అరణ్యంలో తపస్సుచేసుకొంటుండగా

ఆ రాజ్యభటులు దొంగలను వెంటాడుతూ దొంగల తోపాటు మాండవ్యుడిని కూడా రాజు వద్దకు తీసుకు వెళ్లగా రాజు వీరిని త్రిశూలంతో పొడిపించాడు. దొంగలు మరణించారు కాని మాండవ్యుడు మరణిం చలేదు. ధర్మదేవుడిని కలసి నాకెందుకు ఈ శిక్ష విధించబడిందని అడగగా ధర్మదేవుడు నీ బాల్యంలో తూనీగలను పట్టుకొని బాధించావు కనుక ఈ శిక్ష వేయబడిందనగా 12 ఏళ్ల లోపు వయస్సున్న వారు చేసే తప్పులు పాపాలు కావని వాదించి పొరపాటు శిక్ష విధించినందుకు ధర్మదేవుడ్ని శూద్ర వనిత గర్భాన జన్మించమని శపిస్తాడు. ఆ శపించబడిన ధర్మదేవుడే విదురుడు. – మహాభారతం

**విదుషుడు :** అంగ వంశంలోని ఒక రాజు. ఘృతుడు ఇతని తండ్రి. ప్రచేతసుడు ఇతని కుమారుడు. – అగ్నిపురాణం

**విదుళ :** ప్రాచీన భారతదేశంలో జీవించిన ఓ వీరవనిత. పాండవుల అరణ్య అజ్ఞాత వాసానంతరం శ్రీకృష్ణుడు రాయబారం విఫలమైన తర్వాత విదురుని ఇంటికి వెళ్లి కుంతిని కలసి జరిగింది వివరించగా కుంతి శ్రీకృష్ణునికి, ఈ వీర వనిత యుద్ధం నుండి వెనక్కు వచ్చిన కుమారుడిని ఈసడించుకొని పారిపోయి రావడం కంటే యుద్ధంలో మరణించడం వీరులు లక్షణం అని వివరించిన కథ చెప్పింది. – మహాభారతం

**విదూరథుడు 1 :** భరతుని కుటుంబంలో జన్మించిన ఒక రాజు. ఇతని తండ్రి సురతుడు, కుమారుడు సార్వభౌముడు. – భాగవతం

**విదూరథుడు 2 :** దంత వక్త్రుని సోదరుడు. శ్రీకృష్ణుడు దంతవక్త్రుడిని ఓడించినపుడు విదూరథుడు శ్రీకృష్ణు నితో పోరాడి మరణించాడు. – భాగవతం

**విదూరుడు :** కురువంశంలోని ఒక రాజు. శుభాంగిని కురురాజువల్ల జన్మించాడు. ఇతడు సంప్రియ అనే యదురాజవంశ రాకుమార్తెను వివాహమాడాడు. అనశ్యుడను పుత్రుడు జన్మించాడు. – మహాభారతం

**విదేఘమాధవుడు :** మధువంశంలో జన్మించిన రాజు. ఇతడు అగ్నిని నోట్లో బంధించి అది వెడలి బయటకు పోతుందనే భయంతో మాట్లాడేవాడు కాదు. అతని పురోహితుడు అగ్నిని వదలమని చెప్పడానికి ప్రయ త్నించినా వదలలేదు. ఒకరోజు పురోహితుడైన రాహుగుణుడి నోటి నుండి ఘృత అనే శబ్దం రాగా రాజు నోట్లో బంధించబడిన అగ్నిబయటకు వచ్చి ప్రపంచాన్ని దహించివేస్తూ అది రాజును కూడా కబళించబోగా విదేఘుడు సదానీరమనే నదిలో దిగి అగ్నినుండి తప్పించుకున్నాడు. – సత్పథబ్రాహ్మణం

**విదేహుడు :** నిమికి మరో పేరు. – చూ॥ జనకుడు

**విదేహం :** మిథిలా రాజ్యాన్ని విదేహం అని పిలుస్తారు. ఉత్తర భారతంలో తూర్పున గల ఈ దేశాన్ని విదేహ వంశజులైన క్షత్రియులు పాలించారు. భీమ సేనుడొక సారి దీన్ని జయించాడు. ఇది సీత జన్మించిన రాజ్యం. పరశురాముని ఆశ్రమం విదేహకు ఉత్తరాన వుంది. విదేహ రాజులు కురుక్షేత్రయుద్ధంలో అర్జునుడితో పోరాడారు. కర్ణుడొకసారి ఇచ్చటి రాజును జయిం చాడు. పరశురాముడొకసారి ఇక్కడి క్షత్రియుల్ని వధించాడు. – మహాభారతం

**విదైవతం :** ఓ దయ్యం. పూర్వజన్మలో ఓ క్షత్రియరాజు, పేరు హరిహరుడు. దేవుడిని నమ్మకపోవడం వల్ల మరు జన్మలో దయ్యంగా జన్మించాడు. – పద్మపురాణం

**విద్య 1 :** ఉమాదేవి పరిచారిక. – మహాభారతం

**విద్య 2 :** ఓ దేవత. మూడు వేదాలకు దేవతగా పూజి స్తారు. ఒకసారి ఈమె ఓ బ్రాహ్మణుడి వద్దకువచ్చి "నేను నీ భాగ్యాన్ని. నీ బాధ్యత స్వచ్ఛమైన, నీతి వంతులైన న్యాయబద్ధులైన శిష్యులు నన్ను ఆవేశింప నివ్వు అని చెప్పింది. – ఋగ్వేదభాష్యం

**విద్యాతీర్థం :** భారతదేశంలోని ఓ పుణ్యతీర్థం. ఇచ్చట స్నానం చేస్తే జ్ఞానసంపద వస్తుంది. – మహాభారతం

**విద్యాధరులు :** ఉపదేవతల్లో ఓ గుంపు. విద్యాధరులు, అప్సరసలు, యక్షులు, రాక్షసులు, గంధర్వులు, కిన్నెరలు ఉపదేవతలు. విద్యాధరులు పూలదండ హారంగా ధరిస్తారు. ఆకాశంలో నివసిస్తారు. – అగ్నిపురాణం

జనమేజయుని సర్పయాగానికి ఇంద్రుడు వెళ్లినపుడు వీరు అతని వెనుక వెళ్లారు. – మహాభారతం

**విద్యావతి :** విశ్వావసుడను గంధర్వుని కుమార్తె. దేవతా స్త్రీలలో ఉత్తమురాలెవరని తండ్రి నడుగగా

మీనాక్షియని చెప్పెను. ఈమె అప్పుడు మీనాక్షిని ప్రార్థించగా ఆమె మూడేండ్ల బాలికగా ప్రత్యక్షమై వరము కోరుకొమ్మనెను. ఈమె మీనాక్షిని తన కుమార్తెగా జన్మించమని కోరగా ఈ జన్మమున కాదు నీవు మలయధ్వజుని భార్యవైనపుడు నీ కుమార్తెగా జన్మించెదని చెప్పెను. విద్యావతి కాంచనమాలగా జన్మించి మలయధ్వజుని భార్యయయ్యెను.
– మార్కండేయ పురాణం

**విద్యాసాగరుడు :** భర్తృహరి తండ్రి. – చూ॥ భర్తృహరి

**విద్యుజ్జిహ్వుడు 1 :** ఓ రాక్షసుడు. ఘటోత్కచుని స్నేహితుడు. మహాభారత యుద్ధంలో దుర్యోధనుడితణ్ణి సంహరించాడు. – మహాభారతం

**విద్యుజ్జిహ్వుడు 2 :** శూర్పణఖ భర్త. వారికి శంభు కుమారుడనే పుత్రుడు జన్మించాడు. దండకారణ్యంలో చిన్న వృక్షంలా నిలబడివుండగా లక్ష్మణుడితణ్ణి ఖండించాడు. శంభు కుమారుడావిధంగా మరణించాడు.
– కంభరామాయణం

**విద్యుజ్జిహ్వుడు 3 :** రావణుని ముఖ్య అనుచర రాక్షసుల్లో ఒకడు. ఇతడు మంత్రగాడు. సీతకు రాముని తలను, విరిగిన విల్లుని తన మాయా జాలంతో చూపి రావణుని వివాహమాడమని కోరాడు.
– రామాయణం

**విద్యుత :** అలకాపురిలోని అప్సరస. అష్టావక్రుని గౌరవార్థం జరిగిన నృత్య ప్రదర్శనలో పాల్గొంది.
– మహాభారతం

**విద్యుతాక్షుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు.
– మహాభారతం

**విద్యుత్పర్ణ :** కశ్యప ప్రజాపతికి, ప్రథకు జన్మించిన అప్సరస. ఈమె, మిశ్రకౌశి, తిలోత్తమ అందానికి ప్రతీకలు. – మహాభారతం

**విద్యుత్ప్రభ 1 :** చూ॥ ముక్త ఫలకేతుడు.

**విద్యుత్ప్రభుడు :** ఓ ఋషి. – చూ॥ మహాభారతం

**విద్యుత్కేశి :** ఓ రాక్షస రాజు. ఇతని కుమారుడు అతి క్రూరుడైన వసుకేశి. – చూ॥ సుకేశి

**విద్యుత్కేశుడు :** ఓ అజానుబాహుడైన రాక్షసుడు.
– చూ॥ ప్రహేతి

**విద్యుద్వర్చసుడు :** ఓ విశ్వదేవుడు. పితృగణాలకు సంబంధించినవాడు. – మహాభారతం

**విద్యుద్రూపుడు :** కుబేరునికి ఆంతరంగిక మిత్రుడైన యక్షుడు. ఇతడు మేనక కుమార్తె మదనికను వివాహమాడెను. వీరిద్దరూ కైలాసంపై కూర్చొని వుండగా గరుడుని కుటుంబంలో జన్మించిన కంక అనే పక్షి అక్కడకు రాగా చిన్నపోరాటం తర్వాత కంక చనిపోయింది. ఇది తెలిసిన అతని సోదరుడు వచ్చి విద్యుద్రూపుడిని సంహరించి మదనికను వివాహమాడు.
– మార్కండేయపురాణం

**విద్యుద్ధర్ముడు :** ఓ దేవగంధర్వుడు. – చూ॥ నహుటడు

**విద్యున్మతి :** ఓ స్త్రీ. ఈమె కొలనులో స్నానం చేస్తుండగా సింధుద్వీపుడనే రాజు ఈమెను చూడగా అతని రేతస్సు పతనమవుతుంది. – వరాహపురాణం

**విద్యున్మాలి 1 :** తారకాసురుని కుమారుల్లో ఒకడు. త్రిపురాసురుల్లో ఒకడు. – చూ॥ త్రిపురాసురులు

**విద్యున్మాలి 2 :** ఓ ధైర్యవంతుడైన అసురుడు. రావణుని స్నేహితుడు. రావణుని అనంతరం శ్రీరాముని అశ్వమేధ యాగపు అశ్వాన్ని పాతాళానికి ఎత్తుకుపోగా శతృఘ్నుడితడిని వధించాడు. – పద్మపురాణం

**విద్రావణుడు :** కశ్యపుడుకి మనుకు జన్మించిన కుమారుడు. – మత్స్యపురాణం

**విద్రుతుడు :** యయాతి కుటుంబంలో జన్మించిన రాజు. రుచికుని కుమారుడు. – భాగవతం

**విద్రుముడు :** అనంతుని తండ్రి. ఇతనికి వార్ధక్యంలో అనంతుడు జన్మిస్తాడు. కాని అతడు నపుంసకుడౌతాడు. పుంసకుడవడానికి విద్రుముడు శివుని ప్రార్థించగా కోర్కెనెరవేరుతుంది కాని ఇతడు సము ద్రంలో స్నానం చేస్తుండగా మొసలి లాక్కొనిపోతుంది.

**విద్యోత :** అలకాపురిలోని ఓ దేవకన్య. అష్టావక్రుని గౌరవార్థం నృత్యంలో పాల్గొంది. – మహాభారతం

**విద్యోతుడు :** ధర్ముడను ఋషికి, దక్ష ప్రజాపతి కుమార్తె లంబకు జన్మించిన పుత్రుడు. – భాగవతం

**విధవ :** భర్త చనిపోయిన స్త్రీని విధవ అంటారు. సంతానవతి కాకుండా భర్తచనిపోతే ప్రాచీన కాలంలో భర్త చిన్న తమ్ముడివల్ల సంతానం పొంది వంశాభివృద్ధికి తోడ్పడవచ్చు. – మనుస్మృతి

**విధాత :** భృగు ఖ్యాతిలకు జన్మించిన కుమారుల్లో ఒకడు. రెండోవాడు ధాత. మేరువు కుమార్తె నియతిని వివాహమాడగా వీరికి మృకుండుడు జన్మిస్తాడు. ఈ మృకుండుని కుమారుడే మార్కండేయుడు.
– విష్ణుపురాణం

**విధిసారుడు :** ఇతడొక రాజు. క్షేత్రజ్ఞుడి కొడుకు. ఇతని కుమారుడు అజాతశతృవు. – మహాభారతం

**విధువు :** చంద్రుడి మరో పేరు.

**వినత :** దక్షుని కుమార్తె. కశ్యప ప్రజాపతికి భార్య. వారికి అరుణుడు, గరుడుడు, ఓ కుమార్తె సుమతి జన్మిస్తారు. చూ॥ గరుడుడు.

**వినతాశ్వుడు :** సుద్యుమ్న కుమారుడు. వైవశ్వత మనువు మనుమడు. తన తండ్రి తర్వాత పశ్చిమ దేశానికి రాజయ్యాడు. – వాయుపురాణం

**వినతుడు :** సీతను వెదకడానికి సుగ్రీవుడు తూర్పు దిక్కుకు పంపిన వానరుడు. – రామాయణం

**వినది :** పురాణప్రసిద్ధమైన ఒక నది. – మహాభారతం

**వినాయకచతుర్థి :** ఇది హిందువుల ముఖ్య పండుగలలో ఒకటి. పౌర్ణమి తర్వాత నాల్గవ రోజున భాద్రపద మాసంలో గణేశుని జన్మదినోత్సవం రోజున జరుపుతారు. గణేశుని విగ్రహాలను చేసి ఆ రోజు పూజిస్తారు. వినాయకుడు ప్రతి ఇంటా తీపితో చేసిన ఉండ్రాళ్లు తిని నడుస్తుండగా ఓ పామును చూసి క్రిందపడగా పొట్టపగిలి ఉండ్రాళ్లు బయటపడగా వాటిని ఏరుకుని పొట్టలో వుంచుకొని ఆ పామునే తన పొట్టకు కట్టుకొనగా చంద్రుడు పరిహసించాడని అందువల్ల ఆ రోజు ఎవరూ చంద్రుడ్ని చూడరని శపిస్తాడు. – బ్రహ్మవైవర్త పురాణం

**వినాయకుడు :** శివుని కుమారుడు. ఇతడి ముఖం ఏనుగు ముఖంలా వుంటుంది. ఇతడు శివుని గణాలకు అధిపతి కనుక గణపతిగా పిలుస్తారు.

*జననం :* శివపార్వతులు వానర రూపంలో కామకేళి జరుపగా పార్వతి గర్భవతి అయ్యింది. ఆ గర్భాన్ని వాయుదేవుని కివ్వగా అతడు దాన్ని అంజన గర్భంలో వుంచగా హనుమంతుడు జన్మించాడు. అలాగే శివ పార్వతులు ఏనుగు రూపాలలో కామకేళి జరుపగా గణపతి అనబడే వినాయకుడు జన్మించాడు.

1. *వినాయకుని తొండం తెగిన కథ :* ఒకసారి పరశు రాముడు శివుని దర్శనానికి వెళ్లగా గణపతి అడ్డు పడగా వారి మధ్య పోరాటం జరగగా పరశు రాముడు గణపతి తొండాన్ని నరికాడు. – పద్మపురాణం

2. పార్వతి ఏకాంతంలో గణపతిని కాపలావుంచి వెళ్లగా శివుడు లోనికి వెళ్లబోగా గణపతి అడ్డగించగా శివుడు కోపంతో తలనరికాడు. కోపం తగ్గిన తర్వాత ఓ ఏనుగు తలను అతికించి గణపతిని సజీవుడ్ని చేశాడు.
– పద్మపురాణం

*గణపతి కాకిగా మారుట :* దక్షిణాదిన అనావృష్టి తాండవిస్తుండగా అగస్త్యుడు శివుని ప్రార్థించి కావేరీ నదిని తన కమండలంలో నింపుకొని పయనమయ్యాడు. ఇంద్రునికిష్టం లేక గణపతిని ఆశ్రయించగా అతడు కాకి రూపం ధరించి కమండలం పై కూర్చోగా అది ఒరిగి కావేరీ నీరు భూమిపై పడగా కాకి, అగస్త్యుడు పోరాడుకున్నారు. గణపతి నిజరూపుడై ఆ పుణ్యనది నీటిని తిరిగి అగస్త్యుడు కమండలంలో నింపాడు. ఆ ఒలికిన నీరే కొంత కావేరిగా దక్షిణా పథాన ప్రవహిస్తోంది.

*గణపతి వివాహం :* గణపతి, సుబ్రహ్మణ్యస్వామిలకు వివాహపు వయసురాగా ముందు ఎవరికి వివాహం చెయ్యాలనే మీమాంస కలిగి శివపార్వతులు వారికో పరీక్ష పెట్టారు. ఎవరు ప్రపంచాన్ని చుట్టి ముందు వస్తే వారికి వివాహం ముందు చేస్తామని శివ పార్వతులు చెప్పగా సుబ్రహ్మణ్య స్వామి తన నెమలి వాహనంపై ప్రపంచాన్ని చుట్టిరావడానికి బయలు దేరగా గణపతి మాత్రం తల్లిదండ్రుల చుట్టూ ప్రదక్షిణ చేస్తే భూ ప్రపంచ మంతా తిరిగినట్లేనని భావించి అలాగే చేస్తాడు. అందువల్ల ముందు గణపతికి వివాహం చేశారు.

*విఘ్నేశ్వరత్వం :* ఏ పని చెయ్యాలన్నా విఘ్నం జరగకుండా వుండాలంటే ముందు గణపతికి పూజ చేయాలి. దీనికి ఉదాహరణ తారకాసురుణ్ణి చంపడానికి సుబ్రహ్మణ్యస్వామికి సైన్యాధిపత్యం ఇవ్వడానికి ఇంద్రుడు మంత్ర జలంతో సుబ్రహ్మణ్య స్వామి కాళ్లు కడగబోగా అతని కాళ్లు చేతులు బిగుసుకుపోయాయి. ఇది గమనించిన శివుడు ఇంద్రుడ్ని ముందుగా గణపతికి పూజ నిర్వహించమని చెప్పగా ఇంద్రుడు గణపతిని పూజించాడు. అప్పుడు సుబ్రహ్మణ్య స్వామి

చేతులు కాళ్లు కదలసాగాయి. ఆ తర్వాత అతడ్ని సైన్యాధి పతిని చేశారు.

*మహాభారత రచన :* వ్యాసుడు తన మదిలో ప్రవాహంలా జాలువారుతున్న మహాభారత కథను గ్రంథస్తం చేయబోయి బ్రహ్మను కోరగా అతడు గణపతే అందుకు తగినవాడని చెప్పగా వ్యాసుడు గణపతిని ప్రార్థించి తన కోర్కె విన్నవించగా గణపతి ఓ షరతు విధిస్తాడు. తన కలం ఆగకూడదని ఆగనంతవేగంగా పఠనం చేయాలని చెప్పగా నేను చెప్పేవి మరల రెండవ సారి అడగరాదని వ్యాసుడు షరతుని విధించగా రెండున్నర సంవత్సరాల కాలంలో ఆ గ్రంథ రచన పూర్తయ్యింది.

*గణపతి ఇతర పేర్లు :* వినాయక, విఘ్నరాజ, ద్వైమాతుర గణాధిప, ఏకదంత, హేరంబ, లంబోదర, గజానన.

**వినాశనం :** ప్రజాపతి కశ్యపునికి అతని భార్య కాళికవల్ల జన్మించిన అసురుడు. – మహాభారతం

**విపశ్చిత్తు 1 :** స్వారోచిష మనువు కాలంలోని ఇంద్రుడి పేరు. – చూ॥ మన్వంతరాలు

**విపశ్చిత్తు 2 :** విదర్భ రాజకుమారి అయిన పేవరి భర్త. తన భార్యకు చేసిన పాపాల వల్ల ఇతడు నరకం వెళ్లాడు. – మార్కండేయ పురాణం

**విపాఠుడు :** కర్ణుడి సోదరుడు. మహాభారత యుద్ధంలో అర్జునుడి చేతిలో మరణిస్తాడు. – మహాభారతం

**విపాప్మ :** ఒక విశ్వదేవుడు. – మహాభారతం

**విపాఠ :** ఒక బాణం. మహాశక్తివంతమైనది. – మహాభారతం

**విపాశ :** పురాణ ప్రసిద్ధమైన నది. పంజాబ్‌లో ప్రవహించే ఐదు నదుల్లో ఒకటి. వసిష్ఠుడు తన పుత్రుడు శక్తి తనను విడచివెళ్లినపుడు తాళ్లతో బంధించుకొని ఈ నదిలో దూకగా ఆ కట్లు విడిపోయి అతడు రక్షించబడ్డాడు. ఈ నదీ దేవత వరుణుని కొలువులో అతన్ని సేవిస్తుంటుంది. ఈ నదిలో బహి, హిక అనే అసురులు జీవిస్తుంటారు. పితృగణాలకు ఇచట కర్మలు నిర్వహించి నిగ్రహంతో మూడురోజులు జీవిస్తే జనన మరణాలకు అతీతులౌతారు. – మహాభారతం

**విపులుడు 1 :** వసుదేవుడు రోహిణిలకు జన్మించిన పుత్రుడు. బలరాముని సోదరుడు. – భాగవతం

**విపులుడు 2 :** భృగు వంశంలో జన్మించిన ఓ ఋషి. ఇతడు దేవశర్మ శిష్యుడు. దేవశర్మ భార్య రుచి అద్భుత సుందరి. ఇంద్రుడీమె సాంగత్యం కోరాడని దేవశర్మకు తెలిసి ఓ యజ్ఞం చేయడానికి వెళ్తూ విపులుడిని తన భార్యకు రక్షగా వుండమని ఇంద్రుడు మాయావి కనుక ఏ రూపంలో నైనా రావచ్చని చెప్పి వెళ్తాడు. విపులుడు స్తంభించిన విద్యతో రుచి శరీరంలో కలసి ఇంద్రుడు రాగా నిరాకరించడమేకాక గురువు వచ్చిన తర్వాత విషయం చెప్తాడు. గురువు వరం కోరుకొమ్మన్నగా జీవితాంతం ధర్మవర్తనుడుగా జీవించే వరం కోరుకుంటాడు. రుచి సోదరి ప్రభావతి వివాహం అంగరాజైన చిత్రరథుడితో జరుగుతుంది. ఆ వివాహానికి రుచి వెళ్లబోతుండగా కొన్ని పుష్పాలు ఆమె కాళ్ల చెంత పడగా వాటిని మెడలో వేసుకొని వివాహానికి వెళ్లగా అలాంటిపుష్పాలే కావాలని రుచిని ఆమె సోదరి అడగగా విపులుడిని ఇందుకు పంపుతారు. ఆ పుష్పాలు తెచ్చే దారిలో అబద్ధాలు చెప్పినవాడు విపులుడిలాగే నరకానికి వెళ్తాడని రెండు సంఘటనల్లోని వ్యక్తులు మాట్లాడుకొనడం విని గురువును వాటి వివరణ కోరతాడు. అప్పుడు దేవశర్మ స్తంభన విద్యతో రుచితో నీవు ఐక్యమైనపుడు ఆమె ముఖం నీ ముఖం కలిసాయని, నీ జననేంద్రి యావయవాలు, ఆమె జననేంద్రియావయవాలు కలిసాయని, అది నీవు కావాలని చేసిన పాపం కాదు గనుక ఆ పాపం నీకు వర్తించదని చెప్తాడు. – మహాభారతం

**విపులం :** గిరివ్రజం వద్దగల ఒక పర్వతం. – మహాభారతం

**విపృదుడు :** వృష్ణి వంశపు రాజు. ద్రౌపది స్వయంవరంలో పాల్గొంటాడు. ధర్మజుని సభలో వుంటాడు. – మహాభారతం

**విప్రచిత్తి :** ప్రజాపతి కశ్యపునికి దనువువల్ల జన్మించిన 33 క్రూర రాక్షసుల్లో పెద్దవాడు. శింహిక ఇతని భార్య. ఈమె హిరణ్యకశిప, హిరణ్యాక్షుల సోదరి. – విష్ణుపురాణం

ఇతడు తదనంతర జన్మలో జరాసంధుడిగా జన్మించాడు. వరుణుని కొలువులోవుండి అతణ్ణి పూజిస్తుంటాడు. మహావిష్ణువు వామనుడుగా అవతరించినపుడు

అతడ్ని చుట్టు ముట్టిన రాక్షసుల్లో ఇతడొకడు. అంత కంటే పూర్వకాలంలో మహావిష్ణువు ఇం(దుడుగా అవతరించి ఇతణ్ణి సంహరించాడు. – మహాభారతం

**వి(పుడు :** (ధువుడి వంశంలోని రాజు. సుచ్ఛాయ శిష్టుల కుమారుడు. – మహాభారతం

**విభండకుడు :** కశ్యపుని కుటుంబంలో జన్మించిన ఓ రుషి. ఇతడొకసారి ఊర్వశిని చూడటం తటస్థించి వీర్య(సావంకాగా ఆ వీర్యాన్ని ఓ జింక మింగగా ఓ కుమారుడికి జన్మనిచ్చింది. ఆ కుమారుడే రుష్యశృంగుడు. విభండకుడు ఇం(దుని భవనంలో వుండి ఇం(దుణ్ణి తేజోవంతుడ్ని చేశాడు. ఇతడు (పజాపతులంత గొప్పవాడు. – మహాభారతం

**విభాండకుడు :** కశ్యపుని కుటుంబలో జన్మించిన ఓ రుషి. ఒకసారి ఊర్వశిని చూసి రేతపతనం కాగా దాన్ని మింగిన జంతువుకు ఓ కుమారుడు జన్మించాడు.

**విభావరి :** (బహ్మ మానస పు(తిక. ఈమె రా(తికి (పతీక. ఈమె ఉమ శరీరంలోకి (పవేశించడంవల్ల ఉమ నలుపురంగులోకి మారింది. – మత్స్యపురాణం

**విభావసి :** మందారుడనే విద్యాధరుని కుమార్తె. స్వరోచికి మృగ, పక్షి జాతుల భాషను తెలుసుకునే విద్యను ఇచ్చి అతణ్ణి పెండ్లాడుతుంది.

**విభావసుడు 1 :** కోపిష్టి అయిన రుషి. సు(పతికుడనే అతడి సోదరుణ్ణి కూడా శపించాడు.

**విభావసుడు 2 :** ఓ రుషి. యుధిష్టురిడి పై అభిమానం కలవాడు. – మహాభారతం

**విభావసుడు 3 :** (పజాపతి కశ్యపుడికి, దనువుకు జన్మించిన కుమారుడు. వృతాసుర ఇం(దులకు మధ్య జరిగిన యుద్ధంలో పాల్గొన్నాడు. – భాగవతం

**విభిందుడు :** ఓ సహృదయుడైన రాజు. 46 వేల గోవుల్ని మేధాతిథికి దానమిచ్చాడు. – రుగ్వేదం

**విభీషణుడు 1 :** పులస్త్యుని కుమారుడైన వి(శవసు మాలినిలకు రావణ, కుంభకర్ణ, విభీషణులు ఓ కూతురు శూర్పణఖ జన్మించారు. రావణుని నాయకత్వంలో కుంభకర్ణుడు, విభీషణుడు తపస్సుచేసి వరాలు పొందారు. విభీషణుడు కోరుకున్న వరం ధర్మవర్తనుడుగా జీవించడం. రావణుడు సీతను అపహరించినపుడు విభీషణుడు దీన్ని వ్యతిరేకించగా రావణుడి తణ్ణి బహిష్కరిస్తాడు. అప్పుడు ఇతడు రాముడితో చేతులు కలిపి రావణుని సైనిక రహస్యాలు రాముడికి చెప్తాడు. రావణుడి వధ తర్వాత లంకకు రాజౌతాడు. లంకకు విశ్వకర్మ మెరుగులు దిద్దుతాడు. ఆ తర్వాత సహ(సముఖ రావణుని కుమారుడు సు(గీవుని కుమార్తెను, విభీషణుడి కోడల్ని ఎత్తుకుపోగా విభీషణుడు రాముడికి నివేదించగా క్షీరసాగరంలో మూడు రోజులు యుద్ధం తర్వాత సహ(సముఖ రావణుడ్ని వధించి రాముడు వీరిని రక్షిస్తాడు. శ్రీరాముడు అశ్వమేధ యాగం చేసినపుడు సు(గీవుడు సైన్యాన్ని నడపగా ఆర్థిక విషయాలు విభీషణుడు చూశాడు – రామాయణం

★ **విభీషణుడు 2 :** లంకను పాలించిన ఒక రాజు. ఒకసారి ఘటోత్కచుడు ధర్మజుని దూతగా ఇతని వద్దకు వెళ్లగా అతడిని గౌరవించి కానుకలిచ్చి రాజసూయ యాగానికి సహాయపడ్డాడు. – మహాభారతం

**విభీషణుడు 3 :** సు(బహ్మణ్యస్వామి పరిచారకుల్లో ఒకడు. – మహాభారతం

**విభుడు 1 :** భారత కుటుంబంలోని ఒక రాజు. (పస్తోత కుమారుడు, పృస్థసేనుడి తం(డి. – భాగవతం

**విభుడు 2 :** శకుని సోదరుడు, కురుక్షే(త యుద్ధంలో భీముడితణ్ణి వధించాడు. – మహాభారతం

**విభువు :** 5వ మనువు కాలంలో ఇం(దుడు. – చూ॥ మన్వంతరాలు

**విభూతి :** విశ్వామి(తుని కుమారుల్లో ఒకడు. వేదాలను పరిపుష్టం చేశాడు. – మహాభారతం

**విభూరసి :** అద్భుత అనబడే అగ్నికి కుమారుడు. – మహాభారతం

**వి(భాజరాజుడు :** శుక మహర్షి కుమార్తెకు మామ. వ్యాసుని కుమారుడైన శుకమహర్షి పివరిని వివాహమాడగా నల్గురు కుమారులు, కీర్తి అనే కుమార్తె జన్మించారు. కీర్తి వి(భాజ రాజకుమారుడైన అణుహుడిని వివాహమాడింది. (బహ్మదత్తుడు వీరి పు(తుడు. – దేవీ భాగవతం

★ ఇతడు రావణుని సోదరుడు కాదు

**వి(భ్రాజుడు :** యయాతి వంశంలోనివాడు. అణుహుడి తండ్రి. కృతికి కుమారుడు. – భాగవతం

**విభ్వుడు :** అంగిరసుని కుమారుడైన సుధాన్వుడి కుమారుడు. రుభు, విభ్వా, వాజులు సుధాన్వుడి కుమారులు. – ఋగ్వేదం

**విమదుడు :** ఓ సత్యసంధుడైన రాజు. కమద్యు అనే రాజకుమారి స్వయంవరంలో ఇతణ్ణి వరించగా ఇతర రాజులు ఇతనిపై పడగా ఇతడు అశ్వనీదేవతల్ని ప్రార్థించగా వారు ఆ రాజుల్ని సంహరించారు. విమదుడామెను వివాహమాడాడు. – ఋగ్వేదం

**విమర్దుడు :** ఒక రాజు. సురాష్ట్రుడ్ని ఓడించి అతడి రాజ్యం ఆక్రమించుకుంటాడు. – మార్కండేయ పురాణం

**విమల :** సరభి సంతతి అయిన రోహిణికి జన్మించిన ఆవు. రోహిణికి ఇద్దరు సంతానం ఒకటి విమల రెండవది అనల. – మహాభారతం

**విమల తీర్థం :** ఓ పుణ్యతీర్థం. ఇచట కొలనులోని చేపలు బంగారు, వెండి రంగులో వుటాయి. ఈ కొలనులో స్నానం చేస్తే పాప విముక్తులై ఇంద్రలోకం చేరతారు. – మహాభారతం

**విమల పిండకం :** ఓ సర్పం. ప్రజాపతి కశ్యపుడికి కద్రువకు జన్మించింది. – మహాభారతం

**విమలాశోక తీర్థం :** ఓ పవిత్ర స్థలం. ఓ రాత్రి ఇచట గడిపితే స్వర్గప్రాప్తి లభిస్తుంది. – మహాభారతం

**విమలుడు 1 :** దక్షిణ భారతదేశానికి రాజు. సుద్యుమ్నుని కుమారుడు. – భాగవతం

**విమలుడు 2 :** రత్నాతట అనే నగరానికి రాజు. శ్రీరాముని అశ్వమేధయాగ సమయంలో శత్రుఘ్నుడికితడు సహకరించాడు. – రామాయణం

**విమలోదకుడు :** బ్రహ్మ ఒకసారి హిమాలయాలపై యాగం చేశాడు. సరస్వతికూడా ఈ యాగంలో పాల్గొంది. ఆ సమయంలో బ్రహ్మ ధరించిన నామం విమలోదకుడు. – మహాభారతం

**విముఖుడు 1 :** ప్రాచీన భారతదేశంలోని ఓ ఋషి. ఇతడు ఇంద్రుని సభలో సభ్యుడు. – మహాభారతం

**విముఖుడు 2 :** దక్షిణ భారతదేశంలో జన్మించిన ఓ ఋషి. – మహాభారతం

**విమోచనం :** కురుక్షేత్ర తీరంలో గల ఓ పుణ్యస్థలం. ఇక్కడ స్నానంచేసి కోపం నుండి విముక్తమైతే లంచాలు తీసుకున్న పాపం నశిస్తుంది. – మహాభారతం

**వియతి :** నహుషుని కుమారుల్లో ఒకడు. – భాగవతం

**వియముడు :** శతశృంగ మహర్షి ముగ్గురు కుమారుల్లో ఒకడు. అంబరీషుని సేనాధిపతి సుదేవుడిని సంహరించాడు. ఇతడు కూడా ఓ యుద్ధంలో మరణించాడు. – మహాభారతం

**విరజ 1 :** ఓ గోవుల కాపరి. ఒకసారి శ్రీకృష్ణుడు రాధను ఏడ్పించడానికి ఈమెను ఓ వనానికి తీసుకు వెళ్లగా రాధతో ఈ విషయం మరో పశువుల కాపరి చెప్పగా వారికై రాధ వెతికింది. శ్రీకృష్ణుడు మాయం కాగా రాధ విరజను గుడ్లు మిటకరించి చూడగా ఈమె నీరై నదిగా మారింది. – దేవీ భాగవతం

**విరజ 2 :** కశ్యప కద్రువలకు జన్మించిన ఓ సర్పం. – మహాభారతం

**విరజుడు 1 :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. కురుక్షేత్ర యుద్ధంలో భీముడు ఇతణ్ణి వధించాడు. – మహాభారతం

**విరజుడు 2 :** మహా విష్ణువు కాంతి నుండి జన్మించాడు. రాజ్యపాలనాసక్తి లేక తపస్సు చేశాడు. ఇతనికి కీర్తిమానుడనే కుమారుడు కలడు. – మహాభారతం

**విరజుడు 3 :** వైవశ్వత మనువు 8 మంది కుమారుల్లో ఒకడు.

**విరజం :** ద్వారకలోని ఒక శిఖరం. శ్రీకృష్ణుడు ఒంటరిగా వుండదలచినపుడు ఈ శిఖరం ఎక్కేవాడు. – మహాభారతం

**విరసం :** కశ్యపుని కుటుంబంలో పుట్టిన ఓ సర్పం. – మహాభారతం

**విరాజుడు :** కురు వంశంలోని ఒక రాజు. అవీక్షిత్తు కొడుకు, కురువుకు మనుమడు. – మహాభారతం

**విరాటనగరం :** మత్స్యదేశ రాజధాని. ఒకసారి కౌరవులు, త్రిగర్తులు ఈ దేశంపై దాడిచేశారు.

**విరాటుడు :** మత్స్య దేశపు రాజు. పాండవుల అజ్ఞాతవాసం ఇతని కొలువులోనే గడిపారు. విరాటుని గోవుల్ని కౌరవులు బలవంతంగా తోలుకెళ్లినపుడు అజ్ఞాతవాసం పూర్తై అర్జునుడు కౌరవులతో పోరాడి

గోవుల్ని వెనక్కు మరలించాడు. అర్జునుడి కుమారుడు అభిమన్యుడు విరాటుని పుత్రిక ఉత్తరను వివాహమాడాడు. *ఇతర విశేషాలు :* మరుద్గణాల శరీర భాగం నుండి ఇతడు జన్మించాడు. ఇతడికి ఉత్తరుడు శంఖుడు అను ఇద్దరు కుమారులు. ఉత్తర అనే కుమార్తె. రాజసూయ యాగం ముందు పాండవులు ఇతణ్ణి ఓడించారు. ఇతని భార్య పేరు సుదేష్ణ, మహాభారత యుద్ధంలో పాండవుల ఏడుగురు సైన్యాధిపతుల్లో ఇతడొకడు. ద్రోణాచార్యుడితణ్ణి వధించాడు. ఇతడి బావమరిది సింహబలుణ్ణి అజ్ఞాతవాస సమయంలో భీముడు సంహరించాడు. - మహాభారతం

**విరాటం :** మత్స్యదేశాన్ని విరాటం అనేవారు. విరాటుడు ఈ దేశానికి రాజు. - మహాభారతం

**విరాట్టు 1 :** ప్రియవ్రతుడి మనుమడు. ఇతని తండ్రి కర్ధముడు. - అగ్నిపురాణం

**విరాట్టు 2 :** బ్రహ్మ మొదటి అవతారాన్ని విరాట్పురుషుడని అంటారు.

**విరాధుడు :** ఓ రాక్షసుడు. దండకారణ్యంలో శ్రీరాముడితణ్ణి వధించాడు. పూర్వ జన్మలో ఇతడు తుంబురుడను గంధర్వుడు. కుబేరుని ఆజ్ఞపై రంభను తీసుకురావడానికి వెళ్లి చెప్పిన సమయానికి తేకపోవడంవల్ల రాక్షసుడిగా జన్మించమని కుబేరుడు శపించాడు. ఇతడు విముక్తి కోరగా త్రేతాయుగంలో శ్రీరాముడు నిన్ను వధించినపుడు నిజరూపుడివై గంధర్వలోకం చేరతావని చెప్తాడు. అలా రాక్షసుడుగా మారిన ఇతడు దండకారణ్యంలో సీతను ఎత్తుకుపోగా రామలక్ష్మణులు ఇతని వెంటపడగా వారిని తన భుజాలపై ఎక్కించుకోగా శ్రీరాముడు ఇతని చేతులు నరికాడు. ఆ తర్వాత చంపబోగా తనపూర్వ వృత్తాంతం చెప్పి గంధర్వలోకం చేరతాడు. - రామాయణం

**విరావం :** ఓ అశ్వం. ఇల్వలుడు అగస్త్యుని రథానికి కట్టడానికి ఇచ్చిన అశ్వాలలో ఇదొకటి. మరొకటి సురావం. - మహాభారతం

**విరూపకుడు :** ఓ అసురుడు. ప్రాచీన కాలంలో ప్రపంచాన్ని పాలించాడు. - మహాభారతం

**విరూపాక్షుడు 1 :** భూమిని పైకెత్తి వుంచే 8 ఏనుగుల్లో ఇదొకటి. ఇది దాని తలను విదిల్చినప్పుడు భూకంపాలు వస్తాయి. - చూ॥ అష్టదిగ్గజాలు

**విరూపాక్షుడు 2 :** రావణుని తరపున పోరాడిన రాక్షసవీరుల్లో ఒకడు. మాల్యవానుడికి సుందరికి జన్మించిన ఏడుగురు కుమారుల్లో ఒకడు. వీరంతా రావణుని తరపున పోరాడారు. - ఉత్తరరామాయణం, రామరావణ యుద్ధంలో కుంభకర్ణుడు మరణించిన తర్వాత రావణుని సైన్యాన్ని నడిపిన ముఖ్యుల్లో ఇతడొకడు. ఇతడు సుగ్రీవునితో తలపడి మరణించాడు. - రామాయణం

**విరూపాక్షుడు 3 :** కశ్యప ప్రజాపతికి దనువుకు జన్మించిన 33 మంది క్రూర రాక్షసుల్లో ఇతడొకడు. ఇతడే తర్వాతి జన్మలో చిత్రవర్మగా జన్మించాడు. - మహాభారతం

**విరూపాక్షుడు 4 :** నరకాసురుని అనుచరుడైన ఓ అసురుడు. లోహిత గంగ తీరాన జరిగిన యుద్ధంలో మరణించాడు. - మహాభారతం

**విరూపాక్షుడు 5 :** ఘటోత్కచుని స్నేహితుడైన ఓ అసురుడు. - మహాభారతం

**విరూపాక్షుడు 6 :** రాజధర్మ అనే మొసలికి స్నేహితుడైన ఓ అసురుడు. - మహాభారతం

**విరూపాక్షుడు 7 :** ఏకాదశరుద్రుల్లో ఒకడు.

**విరూపాశ్వుడు :** ఒక రాజు. తన జీవితకాలంలో మాంసం భుజించలేదు. - మహాభారతం

**విరూపుడు 1 :** సూర్యవంశపు రాజైన అంబరీషుడి కొడుకు. తక్కిన ఇద్దరు అంబరీషుడి కుమారులు కేతుమానుడు, శాంభుడు. - భాగవతం

**విరూపుడు 2 :** క్రోధం ఒకసారి రూపం మార్చుకొని విరూపుడుగా మారి ఇక్ష్వాకునితో మాట్లాడింది. - మహాభారతం

**విరూపుడు 3 :** ఓ అసురుడు. శ్రీకృష్ణుడితణ్ణి వధించాడు. - మహాభారతం

**విరూపుడు 4 :** అంగిరసుని 8 మంది కుమారుల్లో ఒకడు. - మహాభారతం

**విరోచన 1 :** ప్రహ్లాదుని కుమార్తె. త్వష్టుడీమెను వివాహమాడగా విరజుడు జన్మించాడు.

**విరోచన 2 :** సుబ్రహ్మణ్యస్వామి పరిచారిక. - మహాభారతం

**విరోచనుడు 1 :** ఓ అసురుడు. ప్రహ్లాదుని కుమారుడు. బలిచక్రవర్తికి తండ్రి. ప్రహ్లాదునికి ముగ్గురు కుమారులు. విరోచనుడు, కుంభ, నికుంభులు. విరోచనుడు అసురుడయ్యి యజ్ఞ యాగాదులను సక్రమంగా నిర్వహించేవాడు. బ్రాహ్మణుల యెడల గౌరవంగా వుండేవాడు. ఇతని కుమారుడు బలి మహాబలి చక్రవర్తిగా ప్రసిద్ధుడు. – *మహాభారతం*

*విరోచనుడి మరణం :* పురాణాలలో ఇతని మరణాన్ని గురించి రెండు కథనాలున్నాయి.

1. తారకాసురునితో జరిగిన యుద్ధంలో ఇంద్రుడు విరోచనుడిని వధించాడు.
– *మహాభారతం, పద్మపురాణం*

2. సూర్యదేవుడు విరోచనుడికి ఓ కిరీటం బహుమతిగా ఇచ్చి ఈ కిరీటం ఇతని తలపై వున్నంతవరకు మరణం లేదని వరమిస్తాడు. మహావిష్ణువు ఓ అందాల స్త్రీగా మారి విరోచనుడిని మభ్యపెట్టి ఆ కిరీటాన్ని తొలగించి ఆ తర్వాత వధిస్తాడు. – *గణేశపురాణం*

*ఇతర విశేషాలు :*

విరోచనుడికి ఇద్దరు భార్యలు – విశాలక్ష్మి, దేవి. బల, యశోదరులు వీరి సంతానం. యశోదర త్వష్టకు భార్య. – *భాగవతం*

విరోచనుడికి ఐదుగురు సోదరులు, ఒకసోదరి. కుంభ, నికుంభ, ఆయుష్మాన్, శిభి, బాస్కలి : సోదరి విరోచన. – *వాయుపురాణం*

విరోచనుడు, సుధాన్వుడు, తామిద్దరిలో ఎవరు గొప్పో తెలుసుకోవ డానికి ప్రహ్లాదుడి వద్దకు వెళ్లగా సుధాన్వుడే గొప్పవాడని ప్రహ్లాదుడు చెప్తాడు. పృథు చక్రవర్తి కాలంలో భూమిని అసురులు పిండినపుడు విరోచనుడు లేగ దూడగా మారాడు. ఇతడు ప్రాచీన ప్రసిద్ధ రాజుల్లో ఒకడు.

**విరోచనుడు 2 :** ధృతరాష్ట్రుని పుత్రుల్లో ఒకడు. ఇతడు ద్రౌపది స్వయంవరానికి వచ్చాడు. – *మహాభారతం*

**విరోహణం :** తక్షకుని కుటుంబంలో జన్మించిన సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది.
– *మహాభారతం*

**విలాసుడు :** భాసుని స్నేహితుడైన రుషి. ఇతడు పశ్చిమ తటవద్ద తపస్సు చేశాడు. వీరు జ్ఞాన సంపదతోనే స్వర్గం చేరారు. – *యోగవాశిష్టం.*

**విలోముడు :** అగ్ని అనే రాజు యొక్క కొడుకు. అగ్ని పురాణంలో కపోత రోముడి కుమారుడిగా చెప్పబడింది.

**విలోహితుడు :** కశ్యపుని కుమారుడైన రాక్షసుడు. ఇతడికి మూడు తలలు, మూడుకాళ్లు, మూడు చేతులు కలవు.
– *వాయుపురాణం*

**విలోహితం :** ఓ నరకం. – *మహాభారతం*

**వివక్తవాదం :** ఆదిశంకరుని అద్వైతంలో ఒక భాగం. ఇంద్రియగోచరమైన ప్రపంచం మాయ కాబట్టి మార్పు కూడా మాయేనని ఈ సిద్ధాంతం చెబుతుంది.

**వివర్ధనుడు :** ప్రాచీన భారతేదేశంలో ఒక రాజు. యుధిష్ఠిరుని కొలువులో ప్రముఖ సభ్యుడు. – *మహాభారతం*

**వివస్వానుడు 1 :** చూ॥ సూర్యుడు.

**వివస్వానుడు 2 :** ఓ అసురుడు. గరుడుడితణ్ణి సంహరించాడు. – *మహాభారతం*

**వివస్వానుడు 3 :** పితృగణాలకు సంబంధించిన దేవత.
– *మహాభారతం*

**వివస్వానుడు 4 :** యాగం చేసిన మొట్టమొదటి మానవుడు. ఇతడు మనువు యములకు తండ్రి అని చెప్పబడింది. ఈ భూమిపై ప్రజలంతా ఇతడి సంతతేనని తైత్తరీయి సంహిత పేర్కొంది.

**వివహం :** వేగంగా వీచే గాలి. ప్రళయకాలంలో ఇది వినాశనాన్ని సృష్టిస్తుంది. – *మహాభారతం*

**వివాహం :** ప్రాచీన కాలంలో వివాహాన్ని ఓ పవిత్ర క్రతువుగా భావించేవారు. విద్యముగిసిన తర్వాత తండ్రి లేక గురువు "సమావర్తనం" చేస్తారు. దీంతో బ్రహ్మచర్యం ముగిసి వివాహార్హత లభిస్తుంది. వివాహం ఎనిమిది రకాలు. బ్రాహ్మ, ఆర్ష, ప్రాజా పత్య, దైవ, గాంధర్వ, అసుర, రాక్షస, పైశాచికాలు. – *అగ్నిపురాణం*

**వివిక్తుడు :** కుశద్వీపానికి ఒక రాజు. ఇతడు హిరణ్యరేతసుని కుమారుడు. – *భాగవతం*

**వివిత్సుడు :** ధృతరాష్ట్రుని కుమారుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో భీమసేనుడు ఇతణ్ణి వధించాడు.
– *మహాభారతం*

**వివిదుడు :** ఓ అసురుడు. కంసుని అనుచరుడు. ఇతర అసురులైన ప్రలంబిక, తృణావర్త, ముష్టిక, అరిష్టక మొదలగు ఇతర కంసుని అనుచరులతో పాటు లోకాన్ని అల్లకల్లోలం చేశాడు. – *భాగవతం*

**వివింద్యుడు :** ఓ అసురుడు. మహాభారత యుద్ధంలో రుక్మిణి కుమారుడైన చారుదేష్ణుడితో పోరాడి చని పోయాడు. – మహాభారతం

**వివింశతి :** ధృతరాష్ట్రుని కుమారుడు. ద్రౌపది స్వయం వరంలో పాల్గొన్నాడు. ద్వైతవనంలో గంధర్వుడితణ్ణి బంధించాడు. గోగ్రహణ సమయంలో అర్జునుడితో యుద్ధంచేసి పారిపోయాడు. – మహాభారతం

**వివింశుడు :** సూర్యవంశపు రాజైన వింశుడి కొడుకు. వింశునికి ఖానివేత్రుడితోపాటు 15 మంది కుమారులు. – మహాభారతం

**విశదుడు :** ఓ రాజు. జయద్రథుని కుమారుడు. సేన జిత్తుకు తండ్రి. – మహాభారతం

**విశల్యకరణి :** చూ॥ మృతసంజీవిని.

**విశాఖయూపం :** యాత్రికులకు ఓ పుణ్యస్థలం. ఇది ఇంద్రుడు, వరుణుడు ఇతర దేవతాగణం తపస్సు చేయడంవల్ల పుణ్యస్థలం అయ్యింది. – మహాభారతం

**విశాఖ రూపుడు :** ప్రద్యోతనుడను రాజు యొక్క కుమా రుడు. ఇతని తదుపరి ఇతడి కుమారుడైన నంది వర్ధనుడు రాజ్యపాలన చేసెను. – మహాభారతం

**విశాఖుడు 1 :** ఓ రుషి ఇంద్రుని సభలో వుండి ప్రకాశవంతం చేశాడు. – మహాభారతం

**విశాఖుడు 2 :** స్కందదేవుని ముగ్గురు సోదరుల్లో ఒకడు. తక్కిన ఇద్దరు శాఖుడు, నాగమేయుడు. ఒకసారి స్కందదేవుడు శివుడిని కలవగా శివుడు, పార్వతి, గంగ, అగ్ని అందరూ సుబ్రహ్మణ్యస్వామి తమ వద్దకి రావాలని కోరుకోగా స్కందదేవుడు నాల్గు విభాగము లుగా మారి నల్గురి వద్దకు చేరాడు. వారే స్కందుని ముగ్గురు సోదరులు.

**విశాల 1 :** చంద్రవంశపు రాజైన అజమీఢుని రాణి – మహాభారతం

**విశాల 2 :** గయలో గయుడను రాజు యాగం చేశాడు. సరస్వతి విశాల పేరుతో ఈ యాగానికి వచ్చింది. – మహాభారతం

★ **విశాల 3 :** మహావీర్యుని కుమారుడైన భీముడను రాజు భార్య. త్రయ్యారుణి, పుష్కరిణి, కపి అనే పుత్రు లీమె సంతానం. – వాయుపురాణం

**విశాలకుడు :** ఓ యక్షుడు. కుబేరుని కొలువులో వుంటాడు. – మహాభారతం

**విశాలపురి :** గంగానది పరీవాహక ప్రాంతంలో గల ఓ పుణ్యస్థలం. బదిరి అరణ్యంలో వుంది. నరనారా యణుల ఆశ్రమం ఇచ్చటే వుంది. విశాలుడను రాజు ఈ నగరాన్ని నిర్మించాడు. – చూ॥ విశాలుడు

**విశాలపురం :** విశాల రాజ్యపు రాజధాని.

**విశాలాక్షి :** సుబ్రహ్మణ్య స్వామి పరిచారిక. – మహాభారతం

**విశాలాక్షుడు 1 :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో భీముడితణ్ణి వధించాడు. – మహాభారతం

**విశాలాక్షుడు 2 :** విరాటుని చిన్న తమ్ముడు. ఇతని మరో పేరు మదిరాక్షుడు.

**విశాలాక్షుడు 3 :** గరుడుని కుమారుల్లో ఒకడు. – మహాభారతం

**విశాలాక్షుడు 4 :** మిథిలానగర రాజు. ధర్మజుని రాజసూయ యాగానికి వచ్చాడు. – మహాభారతం

**విశాలం :** గిరివ్రజం నుండి మిథిలా నగరానికి పోయే మార్గంలో ఉండే ఒక రాజ్యం.

**విశాల్య 1 :** పురాణ ప్రసిద్ధిగాంచినది. ఇది వరుణుడు కొలువులో అతడ్ని పూజిస్తుంటుంది. ఇదో పుణ్యనది. ఈ నదిలో స్నానం చేస్తే అగ్ని స్థోమయాగం చేసిన ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**విశాల్య 2 :** ఇదో ఔషధం. బాణపు ముక్కులు దేహంలో గుచ్చుకున్నపుడు వాటిని బయటకు లాగడానికి దీనిని ఉపయోగిస్తారు. – మహాభారతం

**విశిఖుడు :** పక్షులకు ఒకరాజు. ఇది గరుడునికి శుకికి జన్మించింది. – బ్రహ్మాండ పురాణం

**విశిరుడు :** సుబ్రహ్మణ్యస్వామి పరిచారకుడు. – మహాభారతం

**విశుండి :** కశ్యపుని కుటుంబంలో జన్మించిన సర్పం. – మహాభారతం

**విశోక 1 :** శ్రీకృష్ణుని భార్యల్లో ఒకరు. – మహాభారతం

★ మత్స్యపురాణంలో విశాల ఉత్కక్షాయుడను రాజు భార్యగా పేర్కొనబడింది.

**విశోక 2 :** సుబ్రహ్మణ్యస్వామి పరిచారిక.
- మహాభారతం

**విశోకుడు 1 :** భీమసేనుని రథసారధి. మహాభారతంలో భగదత్తుని దెబ్బకు మూర్ఛపోయాడు. – మహాభారతం

**విశోకుడు 2 :** కేకయ యువరాజు. మహాభారత యుద్ధంలో కర్ణుడితణ్ణి సంహరించాడు. – మహాభారతం

**విశోకుడు 3 :** త్రివిక్రమ శ్రీకృష్ణుని వల్ల జన్మించిన యాదవ యువరాజు. ఇతడు నారదుని శిష్యుడు. 'సాత్వత తంత్రం' అనే గ్రంథం రచించాడు.
- భాగవతం

**విశ్రవసుడు :** రావణుని తండ్రి.

బ్రహ్మ కుమారుడైన పులస్త్యునికి హవిర్భుక్కువల్ల జన్మించిన పుత్రుడు. ఇతనికి ఇలబిలవల్ల వైశ్రావణుడు జన్మించెను. కైకసి అనే భార్యవల్ల రావణుడు, అతని సోదరులు జన్మించారు.

*మహాభారతం చెప్పిన వైశ్రావణుని జన్మ వృత్తాంతం:*

1. వైశ్రావణుడు (కుబేరుడు) పులస్త్యునికి జన్మించాడు. తండ్రిని కాదని తాత బ్రహ్మను సేవించగా పులస్త్యుడు కోపగించి తన శరీర సగ భాగం నుండి విశ్రవసుడిని సృష్టించి ఇతనిద్వారా వైశ్రావణుడిపై పగ తీర్చుకోగా బ్రహ్మ అనుగ్రహం వల్ల వైశ్రావణుడికి లంకాధిపత్యం, లోకపాల బిరుదు, పుష్పకవిమానం యక్షరాజరికం వచ్చాయి. కుబేరుడు 3 అందమైన రాక్షస కన్యలైన పుష్పోత్కట, రాక, మాలినిలను విశ్రవసుడికిచ్చి సంతృప్తిపరచగా కైకసి అనబడే పుష్పోత్కటకు రావణ కుంభకర్ణులు, రాకకు, శూర్పణఖ, మాలతికి విభీషణుడు జన్మించారు.

2. సుమాలి కూతురైన కైకసి విశ్రవసువు సాయంత్ర వేళ తపస్సు చేసుకొను చుండగా అతడిని వివాహమాడమని కోరిందని సాయంవేళ కోరావు గనుక నీకు రాక్షసులు జన్మిస్తారని విశ్వవసు అన్నట్లు, వీరికి రావణ, కుంభకర్ణ, విభీషణ, శూర్పణఖలు జన్మించినట్లు ఉత్తర రామాయణం చెబుతోంది.

**విశ్వావాశ్రమం :** ఆనర్త దేశ సరిహద్దుల్లో గల ఓ పుణ్య స్థలం. కుబేరు ఒక్కడే జన్మించాడు.

**విశ్వ :** ప్రజాపతి దక్షుని కుమార్తెలలో ఒకరు.
- మహాభారతం

**విశ్వకర్మ :** ఇతడు దేవశిల్పి. అష్టావసువుల్లో ఒకడైన ప్రభావసు కుమారుడు. తల్లి యోగసిద్ధి. ఇతని భార్య ప్రహ్లాదిని. ఇతని కుమార్తె సంజ్ఞ సూర్యుని భార్య. ఇతనికి నలుడను వానరుడు, విశ్వరూపుడు అను పుత్రులు కలరు.

*శాపం–శాపఫలం :* ఇతడొకసారి సింగారించుకుని ప్రియుని వద్దకు వెళ్లుచున్న అప్సరస ఘృతాచిని కామించగా ఆమె ఇతనిని భూలోకమున జన్మించమని శపించగా ఇతడామెకు శూద్ర యోనియందు జన్మించమని ప్రతి శాపమిచ్చెను. ఇతడు బ్రాహ్మణుడుగా ప్రయాగలో జన్మించెను. ఆమె కూడా భూలోకమున జన్మించెను. ఒకసారి వీరిద్దరూ తటస్తించి తమ పూర్వ జన్మ వృత్తాంతము తెలిసికొని రమించిరి. వీరికి జన్మించిన సంతతే కంచరులు, వడ్రంగులు, కంసాలులు అయిరి.

*ఇతర విశేషాలు :* ఇతడు ఇంద్రుని సభలో వున్నాడు. యముని సభను, వరుణుని భవనాన్ని నిర్మించాడు. ఇతడు బ్రహ్మ కొలువులో వుండి అతడ్ని పూజిస్తాడు. ఇతడొకసారి బ్రహ్మ వనంలో యాగం చేశాడు. పుష్పక విమానాన్ని తయారు చేసిందితడే. ఇతడు విజయ మను ధనస్సును తయారుచేసి ఇంద్రుడికి చ్చాడు. త్రిపురాసుర సంహారంలో శివుని రధాన్ని ఇతడే తయారు చేశాడు. – మహాభారతం

విశ్వకర్మ ఒకసారి ఓ గుర్రం తలనరికి తలలేని మహా విష్ణువు శరీరానికి అతికించగా హయగ్రీవుడని పిలవబడి హయగ్రీవుడనే రాక్షసుణ్ణి వధించాడు. లంకానగరాన్ని విశ్వకర్మ నిర్మించాడు. – ఉత్తర రామాయణం

తన కూతురు సంజ్ఞ సూర్యుని వివాహ మాడి అతని వేడికి తాళలేక తండ్రికి చెప్పుకోగా ఇతడు సూర్యుడ్ని అరగదీసి ఆ పొడితో సుదర్శన చక్రాన్ని తయారు చేసి మహావిష్ణువుకిచ్చాడు. – మహాభారతం

**విశ్వకుడు :** రుగ్వేదకాలం నాటి రుషి. ఒకసారి ఇతని కుమారుడు విశ్వపుడు అరణ్యంలో తప్పిపోగా అశ్వనీ దేవతలు చూపించారు. – రుగ్వేదం

**విశ్వకృత్తు :** ఓ విశ్వదేవుడు. పితృగణాలకు సంబంధించినవాడు. – మహాభారతం

**విశ్వగంధుడు :** అనేనసుడి కొడుకు పృధుడు. ఇతని కొడుకు విశ్వగంధుడు. విశ్వగంధుని కొడుకు చంద్రుడు.
– భాగవతం

**విశ్వజిత్తు 1 :** అంగవంశపు రాజు. ఇతడు జయద్రధుని కుమారుడు. – అగ్నిపురాణం

**విశ్వజిత్తు 2 :** యయాతి కుటుంబీకుడు. ఇతడు సౌవ్రత కుమారుడు. రిపుంజయునికి తండ్రి. – భాగవతం

**విశ్వజిత్తు 3 :** బృహస్పతి మూడవ కుమారుడు. ఇతడు ప్రపంచంలోని అన్ని జీవరాశుల తెలివితేటలు కలవాడుకనుక ఈ పేరొచ్చింది. – మహాభారతం

**విశ్వజిత్తు 4 :** ఓ అసురుడు. ఇతడొకసారి ప్రపంచాన్ని పాలించాడు. విధివల్ల ఆ పదవి కోల్పోయాడు.
– మహాభారతం

**విశ్వదంష్ట్రుడు :** ఓ అసురుడు. ఇతడు కూడా ప్రపంచాన్ని పాలించాడు. – మహాభారతం

**విశ్వదేవులు :** దేవతల్లో ఓ గుంపు. ధర్మదేవుడు దక్షుని కుమార్తెలను 10 మందిని వివాహమాడెను.
– విష్ణుపురాణం

అందులో విశ్వ ఒకరు. విశ్వకు జన్మించిన వారే విశ్వదేవులు. విశ్వదేవులలో ఒకడైన సాధ్యకు జన్మించిన వారు సాధ్యసులు. మరుత్వతికి జన్మించినవారు మరుత్తులు. వసువుకు జన్మించిన వారు వసువులు. బానుకు జన్మించినవారు బానులు. మూహూర్తికు జన్మించినవారు ముహూర్తులు. లంబఘోషకు, యామి నాగవితికి జన్మనిచ్చారు.

**విశ్వపతి :** మనువను అగ్ని రెండవ కుమారుడు. ఈ అగ్ని ప్రపంచానికంతటికీ రాజుగా వేదాలు పేర్కొన్నాయి.
– మహాభారతం

**విశ్వభుక్కు 1 :** భూమిపై 5 గురు ఇంద్రులు పాండవులుగా జన్మించారని చెప్పబడింది. అందులోని ఒక ఇంద్రుడు విశ్వ బుక్కు. తక్కిన నలుగురు భూతదాముడు, శిబి, శాంతి, తేజస్వి. – మహాభారతం

**విశ్వభుక్కు 2 :** బృహస్పతి నాల్గవ కుమారుడు. ఇతడు జీవరాశుల జీర్ణకోశంలో వుండి ఆహారాన్ని అరిగేటట్లు చేస్తాడు. అన్ని యాగాలలో ఈ అగ్నిని పూజిస్తారు. పురాణాలు గోమతీనది ఇతని భార్యగా పేర్కొంటున్నాయి.
– మహాభారతం

**విశ్వరంధి :** సూర్యవంశపు రాజైన పృధువు కుమారుడు. యువనాశ్వుడికి తాత, చంద్రుడనే రాజుకు తండ్రి.
– దేవీభాగవతం

**విశ్వరుచి :** ఓ గంధర్వరాజు. పృధు చక్రవర్తి కాలంలో గంధర్వులు భూమిని గోవును చేసి దాని నుండి అన్నీ రాబట్టుకొంటుంటే ఆ గోవును పితికిందితడే.

**విశ్వరూప :** ధర్ముడను ముని భార్య. ధర్మవ్రత వీరి కుమార్తె. – వాయుపురాణం

**విశ్వరూపుడు 1 :** ఓ రాక్షసుడు. వరుణుని కొలువులో వుండి అతణ్ణి పూజిస్తుంటాడు. – మహాభారతం

**విశ్వరూపుడు 2 :** త్వష్ట కుమారుడు. ఇతడు విశ్వకర్మ కుమారుడు. ఇతడిని త్రిశిరసుడని కూడా అంటారు.

**విశ్వవసు :** పరశురాముని నల్గురు సోదరుల్లో ఒకడు.
– బ్రహ్మాండపురాణం

**విశ్వవేది :** శౌరి అనే రాజుకి మంత్రి. శౌరి అతని ముగ్గురు సోదరులు ప్రజాపతి కుమారులు. ఈ రాజ్యానికి ప్రధాన పాలకులు. శౌరిసోదరుడైన ఖనిత్రుడు. ఈ నలుగురుకి నల్గురు పురోహతులున్నారు. విశ్వవేది ఆ నల్గురి పురోహితుల్ని భేతాళులుగా మార్చి ఖనిత్రునిపైకి పంపగా రాజు స్వచ్ఛతను చూసి వీరు వెనక్కు పారిపోగా వారందర్ని విశ్వవేది చంపాడు.
– మార్కండేయపురాణం

**విశ్వశంభువు :** ఇదో అగ్ని. నీటిలో వుంటుంది.
– ఋగ్వేదం

**విశ్వసఖుడు :** వృషితాశ్వుడి కుమారుడు. ఇతడి కొడుకు హిరణ్యానాభుడు. – రఘువంశం

**విశ్వసహుడు :** మూలకుడి కొడుకు. ఇతని కుమారుడు మహాబలుడు. – భాగవతం

**విశ్వసాహ్యుడు :** మహాస్వంతుడి కొడుకు. ఇతని కుమారుడు మహాబలుడు. – భాగవతం

**విశ్వాచి :** ఓ అప్సరస. ఊర్వశి మొదలగు వారివలే ఓ దేవకన్య. యయాతి ఒకసారి ఈమెతో క్రీడించాడు. ఈమె అర్జునుని జన్మదినోత్సవ వేడుకల్లో నృత్యం చేసింది. – మహాభారతం

**విశ్వానరుడు :** ఓ రాజు. పిల్లలు లేక బాధ పడేవాడు. శివుని అనుగ్రహంవల్ల సుచిస్మిత అనే భార్యవల్ల గృహపతి అనే కుమారుడు జన్మించాడు. కాని జీవిత కాలం

3 సంవత్సరాలని నిర్దేశించబడింది. కాని తక్కువ కాలంలో సంగవేదం మొత్తం నేర్చుకొని శివుని అనుగ్రహం వల్ల చాలాకాలం జీవించాడు.

**విశ్వనాధుడు :** ఓ సంస్కృత గ్రంథకర్త. విమర్శకుడు. ప్రముఖ రచన 'సాహిత్య దర్పనం'. ఇతడు క్రీ.శ. 14వ శతాబ్దంలో ఒరియా ప్రాంతంలో జన్మించాడు.

**విశ్వామిత్రం :** కురుక్షేత్రానికి సరిహద్దులో గల ఓ పుణ్యస్థలం. ఇచ్చట స్నానంచేస్తే బ్రాహ్మణులకు దక్కే గౌరవం లభిస్తుంది. - మహాభారతం

**విశ్వామిత్రాశ్రమం :** కౌశికి నదీ తీరాన గల ఓ పుణ్య స్థలం. విశ్వామిత్రుని ఆశ్రమం ఇచ్చటే వుంది.
- మహాభారతం

**విశ్వామిత్రుడు :** పురాణ ఇతిహాసాలలో ప్రముఖ వ్యక్తిగా గణుతికెక్కిన రాజర్షి. ఇతడు గాధి కుమారుడు.

*జన్మవృత్తాంతం :* కుశనాభునికి 6 గురు కుమార్తెల తర్వాత గాధి జన్మించాడు. గాధికి ఓ కుమారుడైన విశ్వామిత్రుడు, కుమార్తె సత్యవతి జన్మించారు. సత్య వతి రుచికుడిని వివాహమాడింది. కుశుని కుటుం బంలో జన్మించడం వల్ల విశ్వామిత్రుడిని కౌశికుడని కూడా పిలుస్తారు. ఇతడు పాలించిన రాజ్యం కన్యాకుబ్జం.

*విశ్వామిత్రుడు రాచరికం వదలి రుషియగుట :*
- చూ॥ వశిష్ఠుడు

తన తపశ్శక్తి వలననే వశిష్ఠుని ఎదుర్కొన గలనని తెలిసి సిద్ధాశ్రమము నేర్పరచుకుని తపస్సు చేయ నారంభించెను. ఇతని తపస్సు భగ్నము చేయుటకై ఇంద్రుడు మేనకను పంపగా ఇతడికి తపోభంగమై మేనక యందు శకుంతలకు జన్మనిచ్చెను. మరల ఇందుకు చింతించి మేనకను శకుంతలను విడచి తపస్సు చేయనారంభించెను. విశ్వామిత్రుని వద్ద గాలవుడను ముని పుత్రుడు విద్యనభ్యసించగా విద్యా నంతరము గురుదక్షిణ కోరుటకు విశ్వామిత్రుడు నిరా కరించెను. కాని గాలవుడు గురుదక్షిణకు సమ్మతించ మని కోరగా విశ్వామిత్రుడు అట్లయిన ఒక చెవి మాత్రమే నీలంగావుండు 800 గుర్రముల నిమ్మని కోరెను. అట్టి అశ్వములకై తిరిగి తిరిగి 600 అశ్వము లను, యయాతి పుత్రికయగు మాధవిని విశ్వామి త్రునికి సమర్పించగా మాధవియందు విశ్వామిత్రునకు అష్టకుడను పుత్రుడు జన్మించెను. - మహాభారతం

1. వశిష్ఠునిపట్ల వైరముతో త్రిశంకుడను రాజును తన తపశ్శక్తిని ధారబోసి బొందితో స్వర్గమునకు బంప ప్రయత్నించి అది సాధ్యపడక అపర స్వర్గము నేర్పరచి తన తపశ్శక్తిని మరల కోల్పోయెను గాని వశిష్ఠునిపై కోపము చల్లారలేదు.

2. త్రిశంకుని తర్వాత అతడి కుమారుడు హరిశ్చంద్రుడు చక్రవర్తి అయ్యెను. అతడికి పుత్ర సంతానము లేక వరుణుని ప్రార్థించగా అతడనుగ్రహించెనుగాని బ్రహ్మోపవీతానంతరం అతడిని బలియిమ్మని కోరెను. బ్రహ్మోపవీతానంతరం హరిశ్చంద్రుని కుమారుడు లోహితుడు పారిపోగా వశిష్ఠుని సంప్రదించి అతని బదులు మరో బ్రాహ్మణ బాలుని యజ్ఞ పశువుని గావించమని సలహా ఇవ్వగా శునశ్శేపుడను బ్రాహ్మణ బాలుని కొని అతడిని బలికొరకు తీసుకొని వచ్చు చుండగా విశ్వామిత్రుడు అతడిని రక్షించి తన కుమా రుని బలికి పంపదలచగా వారు నిరాకరించిరి. అంతట శునశ్శేపుని ఓ మంత్రమును ఉచ్చరించమని కోరగా బలి సమయమున అతడు ఆ మంత్రో చ్చారణ చేయగా వరుణుడు ప్రత్యక్షమై ఆ బాలుని రక్షించెను. వశిష్ఠుని ఈ బాలుడు ఎవరికి చెందునో చెప్పమనగా విశ్వామిత్రునికి చెందునని తీర్పునివ్వగా శునశ్శేపుని తన కుమారుడుగా స్వీక రించెను.
- భాగవతం - రామాయణం

3. ఒకసారి ఇంద్రలోకమున వశిష్ఠ విశ్వామిత్రులు ఎదురుపడి భూలోకమున సత్యసంధుడెవరని చర్చ రాగా వశిష్ఠుడు హరిశ్చంద్రుడని పల్కగా హరిశ్చం ద్రునిపై కంటే వశిష్ఠుని పైగల కోపముతో హరి శ్చంద్రుని విశ్వామిత్రుడు దానం కోరి రాజ్యమును గైకొనుటయేగాక హరిశ్చంద్రుని తీవ్ర కష్టాలకు గురి చేసి కూడా అతడి సత్యసంధత నుండి మరల్చలేక తన ఓటమినంగీకరించుటయేగాక హరిశ్చంద్రుని సత్య సంధతను లోకమునకు చాటెను.
- చూ॥ హరిశ్చంద్రుడు

4. వశిష్ఠునితో సమానముగా బ్రహ్మర్షి కాదలచి ఘోర తపస్సు చేయుచుండగా ఇంద్రుడు రంభను పంపగా విశ్వామిత్రుడుడామెను పాషాణమగునట్లు శపించెను.

5. ఇతడు తన వనమున తపస్సు చేసుకొనుచుండగా మరీచ సుభాహులు తపోభంగము చేయుచుండిరి.

తన తపశ్శక్తితో వారిని నిర్వీర్యము చేయగల్గియు తన తపశ్శక్తిని దుర్వినియోగ పర్చక దశరథుని అతడి కుమారులైన రామలక్ష్మణులను యాగ రక్షణకు పంపమని కోరెను. విశ్వామిత్రుని కోపము తెలిసిన వాడై బాలురయినప్పటికి రామలక్ష్మణులను విశ్వామిత్రునితో పంపగా వారికి ధనుర్విద్య, సకల శస్త్రాస్త్ర విద్యలు నేర్పి తాటకి మారీచ సుభాహులను వధింప చేసి వారిని సీతా స్వయంవరానికి తీసుకొని వెళ్లగా శివచాపాన్ని విరిచి శ్రీరాముడు సీతను వివాహమాడెను.
– రామాయణం

6. ఒకసారి విశ్రామిత్రుడు వశిష్ఠుని వద్దకు వెళ్లగా రావోయి రాజర్షీ అని పిలువగా విశ్వామిత్రుడు వశిష్ఠుని కుమారుని చంపెను. మరల కొంత కాలమునకు వశిష్ఠుని ఆశ్రమమునకు పోగా వశిష్ఠుడు రాజర్షి యనియే సంబోధించగా మరల వశిష్ఠుని కుమారులను జంపెను. మరొకసారి మరల రాగా వశిష్ఠుడట్లే సంబోధించగా నిశ్శబ్దముగా వెనుకకు పోగా రావోయి బ్రహ్మర్షీ అని పిలిచాడు. ఎలా అట్లు పిలిచితివని అడుగగా నీలో కోపము నశించినది కనుక నీవు బ్రహ్మర్షివి అని చెప్పెను. దేవతలంతా విశ్వామిత్రుని బ్రహ్మర్షిగా అభివర్ణించినను వశిష్ఠుడంగీకరించిననే నేనర్హుడనని పల్కెను. – విచిత్ర రామాయణం

**విశ్వాయువు :** ఓ విశ్వదేవుడు. పితృదేవతలకు సంబంధించిన వాడు. – మహాభారతం

**విశ్వావసుడు :** ఓ గంధర్వరాజు. ప్రజాపతి కశ్యపుడు ఇతని తండ్రి. తల్లి ప్రథ. విశ్వావసు మేనకలకు ప్రమద్వరుడు జన్మించాడు. అర్జునుని జన్మ దినోత్సవ వేడుకల్లో ఇతడు పాల్గొన్నాడు. ఇతడు సోముని వద్ద చాక్షుషవిద్య నేర్చుకొని చిత్రరథుడనే గంధర్వుడికి నేర్పాడు. ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. ఇతడు ఇంద్రుని సభకు వన్నె తెచ్చినవాడు. జమదగ్ని చేసిన యాగంలో ఇతడు పద్యం చదివాడు. విశ్వావసుడు ఓ శాపంవల్ల కబందుడనే రాక్షసుడుగా మారాడు. దిలీపచక్రవర్తి చేసిన యాగంలో వీణ మీటాడు. ఇతడు యాజ్ఞవల్క్యుడ్ని ప్రశ్నలడిగి సమాధానాలు విని స్వర్గం చేరాడు. ఇతడు, మరి కొందరు గంధర్వులే ఊర్వశిని పురూరవుని వద్ద నుండి తీసుకుపోయారు. పృథు చక్రవర్తి కాలంలో భూమాత నుండి ఎవరి కవసరమైనపుడు వారు పిండుకున్నపుడు ఇతడు దూడగా మారాడు.

**విశ్వుడు :** ఒక రాజు. మయుడనే రాక్షసాంశతో జన్మించాడు.
– మహాభారతం

**విశ్వేదేవతలు :** శ్రాద్ధ కాలంలో అర్పించే దేవతలు. వీళ్ళు పదిమంది. వసుబంధులు, క్రతుదక్షులు, కాల కాములు, దురివిరోచనులు, పురూరవాద్రువులు.

**విశ్వేశ్వరుడు :** కాశీలోని చంద్రశేఖరస్వామి. ఇతని భార్యలు అన్నపూర్ణ, విశాలాక్షి.

**విషచికిత్స :** పాముకాటుకు చికిత్స చేసే విధానం.

**విషధుడు :** రేవతీ బలరాముల పుత్రుడు.
– వాయుపురాణం

**విషయ :** దుష్టబుద్ధి కూతురు. చంద్రహాసుడ్ని ప్రేమిస్తుంది. నిద్రిస్తున్న చంద్రహాసుడివద్ద లేఖ చదివి అందులో 'విషము' అనే పదాన్ని 'విషయ' అనే పదంగా మార్చి అతనిని వివాహమాడుతుంది.

**విషువత్తు :** రాత్రింబవళ్లు సమానంగా వుండే కాలం.
– విష్ణుపురాణం

**విషూచిక :** ఓ వ్యాధి. కర్కట అనే రాక్షసి బ్రహ్మ వరం వల్ల రోగంగా మారింది. అప్పుడది విషూచిక అనే పేరు పొందింది.

**విష్కురుడు :** ప్రాచీన కాలంలో ప్రపంచాన్ని పాలించిన అసురుడు. – మహాభారతం

**విష్టరకుడు :** ఓ బోయవాడు. సంయమనుడనే రుషి ఇతణ్ణి జీవహింస చేయవద్దని నివారించబోగా "ఇదంతా ఈశ్వరాజ్ఞ, ఎవరి కర్మ ఫలాన్ని వారనుభవించక తప్పదు" అని బదులిస్తాడు. – వరాహపురాణం

**విష్వక్సేనుడు 1 :** ఓ ప్రాచీన రుషి. ఇంద్రుని సభలో వుండేవాడు. – మహాభారతం

**విష్వక్సేనుడు 2 :** విష్ణువు మరోపేరు.

**విష్వగశ్వుడు 1 :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. పృథువు కొడుకు. అద్రికి తండ్రి. గోదానం చేశాడు. శాకాహారి. – మహాభారతం

**విష్యగ్జ్యోతి :** ప్రియవ్రతుడి వంశంలోని ఒక రాజు.

**విష్ణాపుడు :** విశ్వకుడను రుషి కుమారుడు. ఇతడొకసారి తప్పిపోయి అశ్వనీ దేవతల సహకారం వల్ల దొరికాడు. – *రుగ్వేదం*

**విష్వాచుడు :** ఓ అసురుడు. ఇతడి వంశాన్ని అశ్వనీ దేవతలు నిర్మూలిస్తారు. – *రుగ్వేదం*

**విష్టి :** సూర్యుని కూతురు, కురూపి. ఈమె భర్త విశ్వరూపుడు. కుమారులు గండుడు, అతిగండుడు, రక్తాక్షుడు, క్రోధనుడు, దుర్ముఖుడు, కుమార్తె హర్షణ – *బ్రహ్మాండపురాణం*

**విష్ణుచిత్తుడు :** ఓ విష్ణుభక్తుడు. తమిళనాడులో జీవించాడు. ఇతడు గరుడుని అంశ అని చెప్తారు. ఇతని మరోపేరు పెరియాళ్వార్. ఆళ్వారుల్లో ప్రసిద్ధి చెందిన ఆండాళ్ ఇతని కుమార్తె, ఒకసారితడు తులసి మొక్కలు నాటడానికి వెళ్లగా ఓ బాలిక దొరికింది. ఆమెకు గోదా అని నామకరణం చేయగా తర్వాతి కాలంలో ఆండాళ్‌గా ప్రసిద్ధి చెందింది. ఈమె భూదేవి శరీరభాగం నుండి జనించిందనే కథ కూడా వుంది.

**విష్ణుజ్వరం :** ఓ పెద్ద వ్యాధి. శతృవులను నాశనం చేయడానికి దీన్ని ప్రయోగించేవారు. దీనికి వ్యతిరేకం శివజ్వరం. ప్రాచీనకాలంలో శ్రీకృష్ణ బాణాసురుల మధ్య జరిగిన పోరులో బాణాసురుడు శ్రీకృష్ణునిపై శివజ్వరాన్ని ప్రయోగించగా దాన్ని ఎదుర్కోవడానికి శ్రీకృష్ణుడు విష్ణు జ్వరాన్ని ప్రయోగించాడు. – *భాగవతం*

**విష్ణుదత్తుడు :** వాసుదత్తుని కుమారుడైన ఓ బ్రాహ్మణ బాలుడు. ప్రయాణానికి అపశకునాలెదురైతే ప్రమాదం ఎదుర్కోవలసి వస్తుందని ఇతని కథ చెప్తుంది.

విష్ణుదత్తుడు 16 ఏళ్ల వయస్సు వచ్చిన తర్వాత వల్లభి అనే నగరానికి చదువుకోసం వెళ్లబోగా ఇతనితో మరో ఏడుగురు యువకులు కలసి ఒకే మాటగా ప్రయాణం చేద్దామని నిర్ణయించుకున్నారు. ఓ అపశకునం ఎదురైనా తక్కినవారి పట్టుదలపై ముందుకు ప్రయాణించి రాత్రి కాగా ఓ ఇంట్లో తలదాచుకున్నారు గాని విష్ణుదత్తుడుకి నిద్ర రాలేదు. ఇంట్లో ఓ స్త్రీ మాత్రమే ఉంది. కొంత రాత్రి గడచిన తర్వాత ఆమె ప్రియుడు వచ్చి ఆమెతో కామకలాపాలు సాగించ సాగాడు. ఆ తర్వాత ఆమె భర్త తన అనుచరులతో వచ్చి ఆ ఇంటి చుట్టూ కాపలా వుంచి అతడు ఓ కత్తితో లోనికి వెళ్లి నిద్రిస్తున్న ప్రియుడి తలను ఖండించి అతడు తన భార్య ప్రక్క తెలియనట్లు నిద్రించసాగాడు. ఆమె తర్వాత మేల్కొని ఆమె ప్రియుడి మొండాన్ని తలను దూరంగా దాచి తిరిగి వచ్చి తన భర్తను అదే కత్తితో తలనరికి అరవ సాగింది. చుట్టు ప్రక్కల వున్నవారు రాగా ఈ ప్రయాణికులు తన భర్తను చంపారని గగ్గోలు పెట్టగా విష్ణుదత్తుడు తను చూసిందంతా చెప్పి ఆమె ప్రియుడి శవం ఎక్కడ దాచిందీ చూపగా వారు ప్రయాణికుల్ని వదలి ఆమెను శిక్షిస్తారు. – *కథాసరిత్సాగరం*

**విష్ణుదాసుడు :** ప్రాచీన కాలంలో జీవించిన విష్ణు భక్తుడు. చోళరాజు పాలించిన కాలంలో జీవించాడు. చోళుడు దేవాలయంలో ఆభరణాలతో విష్ణువును పూజించగా తర్వాత వచ్చిన ఈ బ్రాహ్మణుడు తులసి దళాలతో విష్ణువును పూజించగా చోళుడు ఇతడ్ని పరిహాసం చేసి నీ పూజలు నా పూజల ముందు ఎందుకు పనికిరావు. నాకే ముందు విష్ణువు దర్శనమిస్తాడని ప్రగల్బాలు పలికి తన నగరంలో పూజారులను నియమించి అట్టహాసంగా పూజలు నిర్వహిస్తుండగా విష్ణుదాసుడు తన కుటీరంలో ధ్యానం తర్వాత అన్నం వండేవాడు. ఒక రోజు ఆ వండినది కన్పించలేదు. రెండవ రోజు అలాగే జరగగా ఆ తర్వాత కాపుకాసి దాన్ని ఎవరు తీసుకు పోతున్నారో చూసి వెంటపడగా ఓ చిక్కిశల్యమైన తక్కువ జాతివాడు తీసుకుపోవడం చూసి అతడిని ఆపి ఒట్టి అన్నం ఎలా తింటావని నెయ్యి కూడా అతడికి వడ్డించగా అతడు విష్ణురూపం దాల్చి తన విమానంలో వైకుంఠం తీసుకొని వెళ్లాడు. – *పద్మపురాణం*

**విష్ణుధర్మ :** గరుడుని సంతానంలో ఒకరు. – *మహాభారతం*

**విష్ణుపద తీర్థం :** ఇదో పుణ్యస్థలం. ఇక్కడ స్నానం చేసి వామనుణ్ణి పూజిస్తే విష్ణులోకం ప్రాప్తిస్తుంది. ఇది విపాశా నదీ తీరంలో వుంది. – *మహాభారతం*

**విష్ణుపదం :** గంగానది జన్మస్థలం. – *చూ॥ గంగ*

**విష్ణుపురాణం :** అష్టాదశ పురాణాల్లో ఇదొకటి. ఇది విష్ణువు యొక్క వరాహావతారంలోని కార్యనిర్వహణను వివరిస్తుంది. దీనిలో 23 గ్రంథాలున్నాయి. దీన్ని

ఆషాఢమాసంలో పౌర్ణమి రోజున గోవుతోపాటు దాన మిస్తే విష్ణులోక ప్రాప్తి కల్గుతుంది.

– చూ॥ పురాణాలు.

**విష్ణుపూజ :** లక్ష్మి, గంగ, ధాత, విధాత, యమున నవ విధాలు వాస్తు పురుషుడు, శక్తి, కూర్మం, అనం తుడు, పృథ్వి, రుగ్మడు మొదలైన వారు విష్ణువుకు ఉపదేవతలు కనుక ఆ క్రమంలో పూజించాలి. ఇలా విష్ణు పూజా క్రమంలో పూజలు చేస్తే కోరిన కోర్కెలు తీరతాయి. – అగ్ని పురాణం

**విష్ణుపంజరం :** శివుడు కాత్యాయనికి ఉపదేశించిన మంత్రం పేరు. – చూ॥ పార్వతి

**విష్ణుమతి :** శాతానికుడను రాజు భార్య. ఈమె కుమా రుడు సహస్రానికుడు. – కథాసరిత్సాగరం

**విష్ణుమూర్తి :** ఈ నశించే లోకంలో త్రిమూర్తులనబడు సృష్టి స్థితిలయకారుల్లో విష్ణువు ఒకడు. వీరు కూడా నశించేవారే. చతుర్యుగాలు బ్రహ్మకు ఒకరోజు. ఓ బ్రహ్మ జీవిత కాలంలో 14 మంది ఇంద్రులు జన్మించి నశిస్తారు. ఇది బ్రహ్మ జీవిత కాలం. రెండు బ్రహ్మ జీవితకాలాలు ఓ విష్ణు జీవితకాలం. ఆ కాలం తర్వాత విష్ణువు నశిస్తాడు. శివుని జీవిత కాలం ఇద్దరు విష్ణువు జీవిత కాలాలతో సమానం. ఈ కాలం తర్వాత శివుడు నశిస్తాడు. – దేవీ భాగవతం

మొత్తం నశించిన తర్వాత ప్రళయం వస్తుంది. 120 బ్రహ్మ సంవత్సరాల తర్వాత అంతా శూన్యమే. ఆ నిశ్శబ్ద కాలంలో మహావిష్ణువు ఓ అరటి ఆకుపై నీటిలో నిద్రిస్తూ వుంటాడు. ఇది తర్వాతి కాలానికి మొదలు. ఈ కాలంలో మహా విష్ణువును బాలము కుందుడని పిలుస్తారు. నీరంలో జన్మించాడు కనుక నారాయణుడని అంటారు. ఆ సమయంలో విష్ణువు నాభినుండి ఓ కలువ పువ్వు పుడుతుంది. ఆ కలువ పుష్పం నుండి బ్రహ్మ జన్మించి మహా విష్ణువును తన కార్యమేమని ప్రార్థించగా సృష్టి చేయమని చెప్తాడు. ప్రళయ కాలంలో ఈ బ్రహ్మ నశించి మరో బ్రహ్మ జన్మిస్తాడు. అంటే ఓ విష్ణువు జీవితకాలంలో ఇద్దరు బ్రహ్మలు జన్మించి నశిస్తారు.

*ఆది :* మనకు అందని కాలంలో విష్ణువు వట పత్రం మీద బాలముకుందుడగా శయనించి ఆలోచించడం మొదలు పెట్టాడు. నేనెవరు ? నన్ను సృష్టించిందెవరు? ఎందుకు ? నేనేం చెయ్యాలి ? అంతలో ఓ ఆకాశవాణి విన్పించింది. నేనే అంతా. నేను తప్ప ఎవరూ లేరు. నేను తప్ప ఎల్ల ప్పుడూ వుండేదిలేదు. ఆ ధ్వని వెనుక నుండి మహా దేవి ప్రత్యక్షమై "విష్ణూ ఆశ్చర్యపోవడానికేముంది ? లోకాన్ని సృష్టించే స్థితిలో వుంచి నశింపచేయడానికి సర్వశక్తి నిన్ను సృష్టించింది. దానికి ఏ సిద్ధాంతాన్ని అంటగట్ట లేము. మనమంతా ఏదో ఒకటి చెయ్య డానికి సృష్టించ బడ్డాం. నీవు చేయవలసింది సత్వం. బ్రహ్మ చేయవలసింది క్రియ. అతడు నీ నాభి నుండి జనిస్తాడు. బ్రహ్మ కనుబొమల నుండి శివుడు జన్మిస్తాడు. అతని గుణం తమసం. బ్రహ్మ సృష్టిస్తాడు. నీవు ఆ స్థితిని కాపాడుతావు. శివుడు దాన్ని నశింప జేస్తాడు. నేను మాయను. బ్రహ్మను సృష్టి చేయడానికి గొప్ప శక్తి నీలో వుంది" ఈ మాటలు విన్న విష్ణువు ధ్యానంలోకి వెళ్లాడు.

*విష్ణువు అవతారాలు :* అధర్మం పెచ్చుపెరిగి న్యాయం కుంటుపడినపుడు వాటిని పదిలం చేయడానికి విష్ణువు ఎన్నో అవతారాలెత్తాడు. అవతారాలకు మూలం ఈ ప్రపంచంలోని శక్తే కారణం. ఈ ప్రపంచపు ఆత్మ నుండే దేవతలు, జంతువులు, మానవులు, సకల చరాచర జగత్తు సృష్టించబడింది. మొదట బ్రహ్మ సనత్కుమారుడిగా జన్మించి బ్రాహ్మణ విద్యార్థిగా తన విధులు నిర్వర్తించాడు. రెండవ అవతారం భూమిని సృష్టించడం. వరాహం, మూడవది, దేవరుషి నార దుడుగా జన్మించి పంచరాత్రమనే వైష్ణవ ధర్మాన్ని కర్మకాండలను నేర్పాడు. నాల్గవ సారి నరనారాయ ణులుగా జన్మించి అసాధ్యమైన తపస్సు చేసి నిరూపిం చాడు. 5వ అవతారం కపిలుడు. ఇందులో అసుర డను తన శిష్యుడికి సాంఖ్యాన్ని బోధించాడు. 6వది అత్రి మహర్షి కోరికపై అతడి కుమారుడైన దత్తాత్రే యుడిగా జన్మించాడు. ఏడవసారి స్వాయంభవ మన్వంతరాన్ని రక్షించడానికి ప్రజాపతి రుచి ఆకూతికి దేవ గణాలైన యముడు తదితరులతో పాటు యజ్ఞుడిగా జన్మించాడు. నాభి భగవానుడు ఆమె భార్య మేరుకు 8వ అవతారంగా జన్మించాడు. 9వ అవతారం పృధువు అంతరాత్మగా జన్మించి భూమి ప్రకృతిని మార్చి ఔషధ వృక్షాలు పెరగడానికి తోడ్పడ్డాడు. 10 అవతారం

మత్స్యావతారం. ఇది చాక్షుష మనువు కాలంలో జరిగింది. 11వది కూర్మావతారం. ఇది మందర పర్వతాన్ని ఎత్తడానికి జన్మించింది. 12వ అవతారం ధన్వంతరి. 13వ అవతారం మోహిని. 14వ అవ తారం నృసింహం. 15వ అవతారం వామనుడు. 16వ అవతారం పరశురాముడు. 17వ అవతారం వాయసుడు. 18వ అవతారం శ్రీరాముడు. 19వ అవతారం వ్యాసుడు. 20వ అవతారం శ్రీకృష్ణుడు. 21వ అవతారం బుద్ధుడు. ఇది కలియుగ ప్రారంభం. 21వ అవతారం బ్రాహ్మణుడైన విష్ణుయశుస్సుని కుమారుడైన కల్కి

మహావిష్ణువు అవతారాలు లెక్కలేనన్ని. వేలకు వేల అవతారాలు, కొలనులో నీరు ఎగదన్ని పైకి వచ్చిన ట్లుగా అన్ని కాలాల్లో ఎన్నో అవతారాలు. ఋషులు, మనువులు, దేవతలు, మనువు కుమారులు, ప్రజా పతులు వీరంతా విష్ణువు గుర్తులు లేకుంటే మహా విష్ణువు భాగాలు. – *రామాయణం, భారతం, భాగవతం, దేవీ భాగవతం, అగ్నిపురాణం.*

*కుటుంబం :* మహావిష్ణువు నివాసం వైకుంఠం. లక్ష్మీ దేవి ఇతని భార్య. ఈమెకాక గంగ, సరస్వతి కూడా మహావిష్ణువు భార్యలే. – చూ॥ *గంగ*

మహావిష్ణువు వారసుడనబడే పుత్రుడు కన్పించడు. బ్రహ్మ మాత్రమే మహావిష్ణువు పుత్రుడు. బ్రహ్మ కాక విష్ణువు మనసు నుండి మరో కుమారుడు జన్మిం చాడు. అతడు విరజసుడు. విష్ణువు మోహిని రూపం దాల్చినపుడు శివుడికి మోహినికి జన్మించిన కుమా రుడు శాస్తుడు. – చూ॥ *శాస్తుడు*

*శాపాలు, ప్రతిశాపాలు :*

*లక్ష్మిశాపం :* 1. మహా విష్ణువు ఒకసారి లక్ష్మిని చూచి నవ్వగా లక్ష్మి కోపించి మహావిష్ణువు తల తెగు నట్లు శపించెను ఒకసారి హయగ్రీవుడను రాక్షసుడు దేవతలతో యుద్ధం చేయుచుండగా మహావిష్ణువు దేవతల పక్షాన పోరాడి అతడిని గెలవలేక ధనస్సు గడ్డం క్రింద ఆన్చి ఆలోచిస్తుండగా చెదపురుగులు ధనుస్సు త్రాడును తెంచగా ధనస్సు ఒక్కసారి విరిగి మహావిష్ణువు తల త్రెంచగా విశ్వకర్మ ఓ గుర్రంతలను అతికెను. ఆ తలతో యుద్ధంచేసి హయగ్రీవు డిని వధించెను. అట్లు లక్ష్మి వల్ల కల్గిన శాపవిముక్తి హయ గ్రీవుని వధ వల్ల జరిగెను.

2. రాక్షసులు దేవతలను జయించలేక శుక్రాచార్యుని తల్లిని ప్రార్థించగా ఆమె దేవతలను జయించగల పుత్రుని కొరకు తపస్సు చేస్తుండగా మహావిష్ణువు తన సుదర్శన చక్రంతో ఆమెను వధించగా భృగుమ హర్షి తన భార్య వధకు చింతించి మహావిష్ణువుకు భార్యా వియోగం కల్గునని శపించెను. శ్రీరామావతా రానికి ముఖ్య కారణం ఈ శాపమే.

3. జలంధరుని భార్య వృంద తనను మాయాజలంధ రుని రూపంలో వంచించినపుడు మహావిష్ణువును శపించెను. – చూ॥ *వృంద*

*పోరాటాలు – యుద్ధాలు :*

మహావిష్ణువు చెవుల నుండి జన్మించిన మధుకైటబులు బ్రహ్మ పై దాడిచేయగా వారిని సంహరించెను. మహి షాసురుని మంత్రి అంధకుడ్ని సంహరించెను. రాహు కేతువులు అమృతం సేవించబోగా తన సుదర్శన చక్రంతో వారి కంఠమును ఖండించెను.

ఒకసారి బ్రహ్మ విష్ణువులు శివలింగపు ఆద్యంతాలు చూడగలమని పందెం కాసుకొని మహావిష్ణువు సాధ్యం కాక సత్యాన్ని పల్కగా బ్రహ్మ చూశానని అబద్ధ మాడి శివుని శిక్షకు పాత్రుడయ్యాడు. నేమి, సుమాలి, మలయవానులను అసురులను వధించెను.

*మహావిష్ణువు ఆయుధాలు – ఆభరణాలు :*

మహావిష్ణువు హృదయంపై శ్రీవత్సమనే ముద్ర వుంటుంది. అది భృగుమహర్షి తన్నగా ఏర్పడింది. పాంచజన్యమనే శంఖం వుంటుంది. దీనిని తాకి నంతనే మానవుడు తెలివైనవాడౌతాడు. సుదర్శన చక్రం ఇతని ముఖ్య ఆయుధం. విశ్వకర్మ దీన్ని సూర్యుడిని సానబట్టి తయారు చేశాడు. దీనిని వద లితే ఎంతటి శతృవునైన దునుమాడుతుంది. ఇతని గధ పేరు కౌమోదకి. భూమి మెచ్చేవాడు కనుక కౌమోదకుడని, అతని ఆయుధం కనుక కౌమోదకి అని పిలుస్తారు. నందకం ఇతని ఖడ్గం పేరు. శారంగం అనబడేది విష్ణుచాపం. ఒకసారి విష్ణు మహేశ్వరుల శక్తిని పరీక్షించుకోబోగా విశ్వకర్మ విష్ణువు కోధనస్సు, శివునికోధనస్సు ఇచ్చాడు. ఈ పోటీలో శివుడు ఓడిపోగా దాన్ని శివుడు విదేహ రాజైన దేవవ్ర తుడికివ్వగా దాన్ని శ్రీరాముడు సీతా స్వయంవరంలో విరిచాడు. విష్ణువు తన ధనస్సును రుచికుడికివ్వగా

అది జమదగ్నికి తర్వాత పరశురాముడికి వెళ్లగా శివచాపాన్ని విరచిన శ్రీరాముడికి పరశురాముడు ఈ విష్ణుచాపాన్ని ఇచ్చాడు. ఇతడి మెడలో కౌస్తుభం అనే హారం వుంటుంది. అది క్షీరసాగర మదనంలో వెలువడింది. వైజయంతి ఇతని హారం. గరుడుడు ఇతడి వాహనం, దారుకుడు ఇతని రథికుడు.

*మహావిష్ణువు నామాంతరాలు :* విష్ణు, నారాయణ, కృష్ణ, వైకుంఠ, విష్టారశ్రవసు, దామోదర, హృషికేశ, కేశవ, మాధవ, స్వభు, దైత్యారి, పుండరీకాక్ష, గోవింద, గరుడధ్వజ, పితాంబర, అచ్యుత, శారంగి, విష్వక్సేన, జనార్ధన, ఉపేంద్ర, ఇంద్రవరజ, చక్రపాణి, చతుర్భుజ, పద్మనాభ, మధురిపు, వాసుదేవ, త్రివిక్రమ, దేవకీనందన, శ్రీపతి, పురుషోత్తమ, వనమాలి, కంసారాతి, అధోక్షజ, విశ్వంభర, ఖైట భజిత, విధు, శ్రీవత్సలాంభవ, పురాణ పురుష, యజ్ఞ పురుష, నరకాంతక, జలశాయి, విశ్వరూప, ముకుంద, మురమర్థన. – *అమరకోశం*

ఇతడు అదితి గర్భాన ఒకసారి జన్మించడం వల్ల ఆదిత్యుడని కూడా అంటారు.

**విష్ణుయశునుడు :** కల్కికి మరో పేరు. – *చూ॥ కల్కి*

**విష్ణురాతుడు 1 :** పరీక్షిత్తు మరోపేరు. – *చూ॥ పరీక్షిత్తు*

**విష్ణురాతుడు 2 :** ఇతడు ద్వాదశాదిత్యులు సంచరించు క్రమమును శకుని నడిగి తెలిసికొనెను. – *భాగవతం*

**విష్ణులోకం :** వైకుంఠాన్ని విష్ణులోకం అంటారు. ఇది మేరుపర్వతంపై ఇంద్ర, అగ్ని, యమ, శివ, బ్రహ్మలోకాలతోపాటు వుంది. – *భాగవతం*

**విష్ణువర్ధనుడు :** ఒక రాజు. తన రాజ్యంలోని కోమట్లను హింసించేవాడు. – *చూ॥ భాస్కరపంతులు*

**విష్ణువృద్ధుడు :** ఒక రాజు. త్రసదశ్యుని కుమారుడు. ఇతడు జన్మతః క్షత్రియుడు. తపస్సువల్ల బ్రాహ్మణుడయ్యాడు. – *బ్రహ్మాండపురాణం*

**విష్ణువ్రతం :** విష్ణువుపై మనసును లగ్నం చేసి చేసే వ్రతం. దీన్ని ఆచరిస్తే కోరిన కోర్కెలు తీరతాయి. పుష్య మాసంలో పౌర్ణమి రోజు నుండి విష్ణువ్రతం నాల్గు రోజులు కొనసాగించాలి. మొదటిరోజున కృష్ణుడిగా, రెండవరోజున అచ్యుతుడిగా, మూడవ రోజున అనంతుడిగా, నాల్గవ రోజున హృషికేశుడిగా అభివర్ణిస్తూ వ్రతం కొనసాగించాలి. మొదటి రోజున పుష్పాలను పాదాలచెంత, రెండవ రోజున ఉదర భాగాన, మూడవరోజున కళ్లవద్ద, నాల్గవ రోజున తలపైన వుంచి పూజించాలి. – *అగ్నిపురాణం*

**విష్ణుశర్మ 1 :** శృంగార శేఖరుని పురోహితుడు. వరరుచికి మాతామహుడు. ఇతని కుమార్తెయగుశీలవతిని చంద్రగుప్తుడను బ్రాహ్మణునికిచ్చి వివాహము చేసెను. ఆమెకు వరరుచి జన్మించెను.
– *విక్రమాంక చరిత్రము*

**విష్ణుశర్మ 2 :** కలియుగమున బ్రాహ్మణుడుగా అవతరించు విష్ణువు పేరు. – *భాగవతం*

**విష్ణుసావర్ణి :** ధర్మసావర్ణి కొడుకు. ఇతడి కుమారుడు దేవసావర్ణి. – *బ్రహ్మవైవర్తపురాణం*

**విసృష్టుడు :** యదువంశం వాడు. కంసుడి తమ్ముడు.

**విహంగముడు :** ఖరుడి సోదరుడు. – *రామాయణం*

**విహంగం :** ఐరావత వంశంలోని ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణిస్తుంది.
– *మహాభారతం*

**విహవ్యుడు :** వర్చసుడి కొడుకు. ఇతని కొడుకు వితత్యుడు. – *మహాభారతం*

**విహారం :** ప్రాచీన వంగ దేశానికి ఉత్తరాన గల ఒక దేశం.

**విహుండుడు :** హుండుడను అసురుని కొడుకు. దేవాసుర యుద్ధంలో హుండుడు నహుషుని చేతిలో మరణించగా విహుండుడు నహుషుడిపై యుద్ధంచేసి మొదట ఓడిపోయాడు. విహుండుడు తపస్సుచేసి మహాశక్తివంతుడు కాగా దేవతలు మహావిష్ణువును తమను రక్షించమని వేడుకున్నారు. విష్ణువు అందమైన స్త్రీగా మారి విహుండుడిని కలిసాడు. విహుండుడు ఆమెను మోహించగా నాకంగీకారమే గాని కామోద పుష్పాలు ఏడుకోట్లు సంపాదించి వాటితో శివుడ్ని పూజించి వాటిని దండగా గుచ్చి నామెడలో వేస్తే నిన్ను పెండ్లాడతానని షరతు విధిస్తుంది. ఆ పుష్పాలు ఎక్కడా కన్పించక తిరుగుతుండగా శుక్రాచార్యుడు కన్పించి అవి చెట్లుకావు, పుష్పాలు కావు, ఆమె క్షీర సాగర మదనంలో జన్మించిన దేవత. గంగాద్వారం ఆమె నివాసం. ఆమె నవ్వితే ఆ పెదవుల నుండి పుష్పాలు జాలువారుతాయి. ఆమె దుఃఖిస్తే ఆ పుష్పాలు ఎర్రన

వుతాయని చెప్తాడు. అప్పుడు విహుండుడు గంగా ద్వారం వద్దకు వెళ్ళబోగా నారదుడు ఎదురై అక్కడకు వెళ్లడం కష్టమని గంగాతీరం వెంట నిలబడి ఆ పుష్పాలు సేకరించమని చెప్పి నారదుడు ఆ దేవతను కలసి మహావిష్ణువు మానవుడిగా జన్మించాడని చెప్పగా ఆమె విచారపడుతుంది. అందువల్ల ఆమె పెదవుల నుండి ఎరుపురంగు పూలు జాలువారగా వాటిని విహుం డుడు సేకరించి శివుడ్ని పూజించడానికి రాబోగా శివపార్వతులు తమ ఇంద్రియ దృష్టితో చూసి పార్వతిని బాలుడిగా మారి ధవళ పుష్పాలతో, పూజిం చమని చెప్తాడు. విహుండుడు ఎర్రని పూలతో బాలుడి రూపంలో వున్న పార్వతి ధవళ పుష్పాలతో శివుని పూజిస్తూ ఇద్దరికి వైరం వచ్చి ఆ బాలుడు విహుం డుడిని సంహరిస్తాడు. – పద్మపురాణం

**వీట :** ఇదో చెక్క బంతి. కౌరవ పాండవులు ఆడుకుం టుంటే ఈ బంతి నూతిలో పడగా ద్రోణుడు తన ధనుర్బాణాలతో పైకి తీస్తాడు. – మహాభారతం

**వీణ :** తపతీ నది మరో పేరు.

**వీతధ్వజుడు :** జనక వంశపు రాజు. కృతధ్వజుడి సోద రుడు. వీరి తండ్రి ధర్మధ్వజుడు, కొడుకు శాండిల్యుడు. – భాగవతం

**వీతభయుడు :** పూరు వంశంలోని ఒక రాజు. మనస్య కొడుకు శుండుడి తండ్రి. – అగ్నిపురాణం

**వీతహవ్యుడు :** ఏకవీరుడుకి మరోపేరు. ఇతని మరోపేరు హేహయుడు. – చూ॥ ఏకవీరుడు

**వీతి :** ఒక అగ్ని. – మహాభారతం

**వీతిహోత్రుడు 1 :** పూర్వజన్మలో శబరి భర్త. – చూ॥ శబరి

**వీతిహోత్రుడు 2 :** ప్రాచీన రాజు ప్రియవ్రతునికి విశ్వకర్మ కుమార్తె బర్హిష్మతికి జన్మించిన 10 మంది కుమారుల్లో ఒకడు. – భాగవతం

**వీతిహోత్రుడు 3 :** తాలజంఘుని 100 మంది సంతా నంలో పెద్దవాడు. పరశురాముని ధాటికి పారిపోయి ఇతని నాయకత్వంలో హిమాలయాల్లో దాక్కొని పరశు రాముడు మహేంద్రగిరికి తపస్సుకు వెళ్లిన తర్వాత తిరిగి వస్తాడు. – బ్రహ్మాండపురాణం

**వీతిహోత్రం :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజ్యం. ఈ రాజ్యంలో క్షత్రియుల్ని పరశురాముడు నాశనం చేశాడు. – మహాభారతం

**వీర 1 :** భరద్వాజుడనబడే అగ్ని భార్య. – మహాభారతం

**వీర 2 :** పురాణ ప్రసిద్ధమైన భారతదేశపు నది. – మహాభారతం

**వీర 3 :** కరందముడి భార్య. అవీక్షిత్తు తల్లి. – మార్కండేయ పురాణం

**వీరకుడు :** అంగవంశంలోని ఒక రాజు. ఇతడు శిభి కుమారుడు. ఇతనికి ముగ్గురు సోదరులు. వీరు పృధుదర్భ, కైకయ, భద్రకులు.

**వీరకేతుడు :** ఓ అయోధ్య రాజు.

**వీరకం :** ఇదో రాజ్యం. దీని ఆచార వ్యవహారాలు ప్రత్యేకంగా వుండేవి. – మహాభారతం

**వీరణకం :** ధృతరాష్ట్రుని కుటుంబంలో జన్మించిన సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. – మహాభారతం

**వీరణి :** రిపుంజయుడి భార్య.

**వీరణుడు :** ఒక ప్రజాపతి. ఇతడు స్వచ్ఛత ధర్మాలను గూర్చి సనత్కుమారుడి నుండి నేర్చుకొని దాన్ని రైభ్యు డను రుషికి చెప్తాడు.

**వీరదాసు :** హరిశ్చంద్రుడు వీరబాహుడికి అమ్ముడయి నపుడు పెట్టుకున్న పేరు.

**వీరద్యుమ్నుడు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. ఇతని కుమారుడు భూరిద్యుమ్నుడు. ఆ కుమారుడు అరణ్యంలో తప్పిపోగా రాజు అరణ్యమంతా గాలిస్తూ ఓ రుషిని కలిశాడు. ఆ రుషి మనిషి యొక్క జీవితం లోని ఆశను గూర్చి వివరించాడు. – మహాభారతం

**వీరధన్వుడు 1 :** త్రిగర్త దేశ వీరుడు. కౌరవుల పక్షాన పోరాడి దృష్టద్యుమ్నుడి చేతిలో మరణించాడు. – మహాభారతం

**వీరధన్వుడు 2 :** ఓ గంధర్వుడు. – చూ॥ పుండరీక ముఖుడు

**వీరధర్ముడు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. – మహాభారతం

**వీరనగరం :** దేవికా నదీతీరంలో పులస్త్యబ్రహ్మ తపస్సు చేసిన ప్రదేశం.

**వీరపాండ్యుడు :** మధురా నగరపు రాజు. ఉగ్రపాండ్యుడి కొడుకు. *- స్కాందపురాణం*

**వీరబాహుడు 1 :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు.

**వీరబాహుడు 2 :** హరిశ్చంద్ర మహారాజును కొన్న కాటికాపరి.

**వీరభద్రుడు :** శివుని అంగరక్షకుల్లో ఒకడు.

*జననం :* సతీదేవి దక్షుని యజ్ఞ గుండంలో దూకి మరణించిందని తెలిసి శివుడు కోపంతో తన జుట్టును నేలకు విసిరి కొట్టగా వీరభద్రుడు, భద్రకాళి మరి కొందరు భూత గణాలు జన్మించి దేవాసురుల్ని వధించారని దేవీ భాగవతం, ఇదే సమయంలో శివుని నోటినుండి వీరభద్రుడు జన్మించాడని మహాభారతం చెప్తున్నాయి. దక్షుని యజ్ఞవిధ్వంసం తర్వాత వీరభద్రుడు సృష్టిని ధ్వంసం చేయదలచగా శివుడు అతణ్ణి శాంతింపజేసి నీవు ఆకాశంలో మంగళ అనే నక్షత్రంగా స్థిరపడతావని, ప్రతివారు నిన్ను పూజిస్తారని వరమిస్తాడు. నిన్ను పూజించిన వారికి ఆరోగ్యం సంపద కల్గుతుందని దీవిస్తాడు. వీరభద్రుని కాంతిలో కొంతభాగం నుండి ఆది శంకరుడు జన్మించాడని భవిష్యపురాణం చెప్తోంది.

*వీరభద్రుని శక్తి :* ఇతడు శివుని అనుచరుడేకాక శివుని సైన్యానికి ఓ సేనాని. త్రిపురాసుర సంహారంలో జలంధరునితో యుద్ధంలో ఇతడు శివునికి తోడుగావున్నాడు. *- పద్మపురాణం*

దేవతల రక్షకుడు. ఇతడు రాక్షసులను నాశనం చేసి దేవతలను రక్షించేవాడు. ఒకసారి కశ్యపుడు ఇతర రుషులు అరణ్యంలో అగ్నికి ఆహుతి కాగా వీరభద్రుడు ఆ అగ్నిని మింగి తన శక్తితో వారికి జీవం పోశాడు. ఒకసారి ఓ సర్పం దేవతలను మింగగా వీరభద్రుడు ఆ సర్పాన్ని సంహరించి వారిని రక్షించాడు. పంచమౌద్దుడను రాక్షసుడు దేవతల్ని రాక్షసుల్ని వాలి సుగ్రీవుల్ని తన నోటిలో బంధించగా అతడితో ఎన్నో ఏళ్లు యుద్ధం చేసి అతణ్ణి వధించి వారిని రక్షించాడు. *- పద్మపురాణం*

**వీరమణి :** శివభక్తుడైన రాజు. శృతావతి ఇతని భార్య. ఒకరోజు వీరమణి కోరికపై శివుడు యోగినీలతో పోరాడగా వారు శివుణ్ణి ఓడించారు.

**వీరమహేంద్రం :** నాగావను అసురుడు నివసించే ప్రాంతం. *- చూ॥ నాగాస్త్రం*

**వీరమోక్షం :** ఓ పుణ్యస్థలం. ఈ స్థలాన్ని దర్శిస్తే పాప పరిహారం జరుగుతుంది. - మహాభారతం

**వీరవర్మ 1 :** నారదుడు స్త్రీ రూపం దాల్చినపుడు తాలధ్వజుడికి నారదుడికి జన్మించిన సంతానం. *- చూ॥ తాలధ్వజుడు*

**వీరవర్మ 2 :** సారస్వత నగరాన్ని పాలించిన రాజు. ధర్మజుడు అశ్వమేధ యాగం చేసినపుడు ఆ యాగాశ్వాన్ని బంధించి యముడి సహాయంతో శ్రీకృష్ణార్జునులతో యుద్ధం చేశాడు. చివరకు శ్రీకృష్ణుడు ఇతనితో ఓ ఒప్పందానికి రాగా అశ్వాన్ని విడచిపెట్టాడు. *- జైమిని భారతం*

**వీరవ్రతుడు :** భరతుని కుటుంబంలో జన్మించిన ఒక రాజు. ఇతడు మధుని కుమారుడు. ఇతని కొడుకులు మంతుడు, అమంతుడు. - మహాభారతం

**వీరసింహుడు 1 :** వ్యాలిముఖుడను అసురుడి సైన్యాధిపతి. ఇతడు సుబ్రహ్మణ్య స్వామితో యుద్ధం చేశాడు. *- స్కందపురాణం*

**వీరసింహుడు 2 :** వీరమణి అనే రాజుకి కొడుకు. రుక్మాంగదుడికి స్నేహితుడు. ఇతడు శ్రీరాముడి అశ్వమేధ యాగాశ్వాన్ని బంధించి శత్రుఘ్నుడితో యుద్ధం చేశాడు. - పద్మపురాణం

**వీరసేనుడు 1 :** నలుని తండ్రి. ఇతడు శాఖాహారి. *- చూ॥ దమయంతి*

**వీరసేనుడు 2 :** కోసలను పాలించిన ఒక రాజు. *- చూ॥ చంద్రసేనుడు*

**వీరాశ్రమం :** ఓ పుణ్యాశ్రమం. దీన్ని దర్శించిన వారికి అశ్వమేధయాగం చేసిన ఫలితం లభిస్తుంది. - మహాభారతం

**వీరిణి :** చూ॥ వీరణి

**వీరుడు 1 :** కశ్యపునికి దనువుకు జన్మించిన ఓ అసురుడు. - మహాభారతం

**వీరుడు 2 :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. - మహాభారతం

**వీరుత్తు :** చూ॥ వీరుధ

**వీరుధ :** నాగమాత సురసి ముగ్గురు కుమార్తెలలో ఒకరు. మిగిలిన ఇద్దరు అనల, రుహలు. వీరుధ నుంచి లతలు, గుల్మాదులు జన్మించారు. - మహాభారతం

**వీర్యవానుడు :** ఓ విశ్వదేవుడు. - మహాభారతం

**వీర్యశుల్కం :** ప్రాచీన కాలంలో రాజులు తమ కుమార్తెలను వీరులకిచ్చి వివాహం చేసేవారు. దీనిలో ధనం కన్నా శౌర్య ప్రదర్శనే ముఖ్యం. ఈ రకమైన వివాహ విధానాన్ని వీర్యశుల్కమనే వారు. - అగ్నిపురాణం

**వేక :** రాక్షస వంశంలోని ఒక స్త్రీ. ఈమె పుష్పోత్కట, కైకసిలకు సోదరి.

**వేగవాణుడు 1 :** ధృతరాష్ట్రుని కుటుంబంలో జన్మించిన సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. - మహాభారతం

**వేగవాణుడు 2 :** ఓ అసురుడు. కశ్యపదనులకు జన్మించాడు. ఇతడు తదనంతర జన్మలో కేకయ యువ రాజుగా జన్మించాడు. - మహాభారతం

**వేగవాణుడు 3 :** ఓ అసురుడు. సాళ్వరాజు అనుచరుడు. కురుక్షేత్ర యుద్ధంలో శ్రీకృష్ణుడి కుమారుడు సాంబుడి తణ్ణి వధించాడు. - మహాభారతం

**వేగవాహిని :** ప్రాచీన భారతదేశంలో ఒక నది. ఇది వరుణుని కొలువులో వుండి అతణ్ణి పూజిస్తుంది. - మహాభారతం

**వేగవంతుడు :** సాళ్వుడి సైన్యంలో ఒక సేనాని. సాంబుడితణ్ణి ఓడిస్తాడు. - మహాభారతం

**వేణ :** పురాణాలలో పేర్కొనబడిన ప్రసిద్ధ నది. ఇదివరుణుని కొలువులో వుంటుంది. ఈనదీ పరీవాహక ప్రాంతంలోని రాజ్యాన్ని సహదేవుడు తన దక్షిణ దేశ జైత్రయాత్రలో ఆక్రమించాడు. ఈ నదీలోయలో 3 రోజులు నిరాహారులై భక్తిభావంతో గడిపితే నెమళ్లు హంసలు నడిపే రథంపై స్వర్గం చేరతారు. అగ్ని జనించే నదుల్లో ఇదొకటి. - మహాభారతం

**వేణాటు :** భారతదేశంలో దక్షిణ కొసన గల చిన్న దేశం. ఇది నిదానంగా విస్తీర్ణంలో పెరుగుతూ త్రివేంద్రం అయ్యి కేరళ రాష్ట్రంలో భాగమయ్యింది.

**వేణా సంగమం :** భారతదేశంలో ఓ పుణ్యస్థలం. ఇచ్చట స్నానంచేస్తే అశ్వమేధ యాగ ఫలితం లభిస్తుంది. - మహాభారతం

**వేణి :** కురువంశంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. - మహాభారతం

**వేణిక :** శాక ద్వీపంలో పురాణప్రసిద్ధమైన ఓ నది. - మహాభారతం

**వేణీస్కందం :** కౌరవ కుటుంబంలో జన్మించిన సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. - మహాభారతం

**వేణుజంఘుడు :** ఓ ప్రాచీన రుషి. యుధిష్ఠరుని కొలువులో కన్పించేవాడు. - మహాభారతం

**వేణుధారి :** ఓ యాదవుడు. ఇతడొకసారి అక్రూరుని భార్యను ఎత్తుకుపోయాడు. - మహాభారతం

**వేణుపం :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజ్యం. - మహాభారతం

**వేణుమండలం :** కుశద్వీపపు ఏడు భాగాలలో ఇదొకటి. ఈ ఏడు భాగాలలో దేవతలు, గంధర్వులు, మానవులు కలసిమెలసి జీవించేవారు. మృత్యువు వారి దరిచేరేది కాదు. - మహాభారతం

**వేణుమంతం :** పురాణప్రసిద్ధమైన ఒక పర్వతం. ఇది తెల్లని రంగులో వుండేది. ఉత్తర భారతంలో మందర పర్వతంతో సమానస్థాయిలో వుండేది. - మహాభారతం

**వేణువేశాధిరుడు :** సుబ్రహ్మణ్యస్వామి పరిచారకుడు. - మహాభారతం

**వేణుహయుడు :** చంద్రవంశపు రాజుల్లో ఒకరు. శతాజిత్తు కొడుకు. మహాహయ, హేహయులితని సోదరులు. - భాగవతం

**వేతసరనం :** ప్రాచీన కాలంలో ఓ పుణ్యస్థలం. మృత్యు దేవత ఇక్కడ తపస్సు చేసింది. - మహాభారతం

**వేతసిక :** బ్రహ్మమెచ్చిన పుణ్యస్థలం. ఇచ్చట స్నానంచేస్తే అశ్వమేధ ఫలితం లభిస్తుంది. శుక్రలోక ప్రాప్తి కల్గుతుంది. - మహాభారతం

**వేతాళజనని :** సుబ్రహ్మణ్యస్వామి పరిచారిక. - మహాభారతం

**వేతాళపంచవింశతి :** వేతాళుడు చెప్పిన 25 కథల సమాహారం. - చూ॥ వేతాళుడు

**వేతాళం (బేతాళం) :** ఓ పాపాత్మ. కథలో ఎన్నో వింత కథలున్నాయి. చాలా కథల్లో దయ్యాలు ప్రధానపాత్ర వహించాయి. బేతాళుడు చాలా కథల్లో ప్రముఖంగా కన్పిస్తాడు. జ్ఞానవాశిష్ఠలో చివరికితడికి ముక్తి లభించినట్లు చెప్పబడింది. కథాసరిత్సాగర కథల్లో ఈ బేతాళ కథలు ఆసక్తిరమైనవి.

**వేత్రకీయగృహం :** ఏకచక్రపురం దగ్గరలోగల ఓ ప్రాంతం. - మహాభారతం

**వేత్రకీయవనం :** ఇదో అరణ్యం. భీమసేనుడు బకాసురుణ్ణి ఈ అరణ్యంలోనే వధించాడు. - మహాభారతం

**వేత్రవతి :** పురాణాలలో చాలా ప్రసిద్ధి చెందిన నది. - మహాభారతం

**వేత్రిక :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజ్యం. దుర్యోధనుడు ఈ రాజ్యవీరుల్ని భీష్ముడికి రక్షకులుగా పంపాడు. - మహాభారతం

**వేదకల్పం :** అధర్వణ వేదంలో ఒక భాగం. మంజుకేశుడు అధర్వణవేదాన్ని ఐదు సంహితలు చేసి నక్షత్ర కల్పం, వేదకల్పం, సంహితకల్పం, అంగిరస కల్పం, శాంతి కల్పంగా పేర్కొన్నాడు. - అగ్నిపురాణం

**వేదగర్భ :** దేవికి గల మరోపేరు. దేవి శుంభ మరి ఇతర అసురులను వధించినపుడు ఇంద్రుడామెను వేద గర్భగా స్తుతించాడు. - అగ్నిపురాణం

**వేదదర్శుడు :** అధర్వణవేదాన్ని సుమంతుడి శిష్యుడి దగ్గర నేర్చుకొని దాన్ని శౌల్కాయని, బ్రహ్మబలి, నిరోషుడు, పిప్పలాయనుడు అనే వారికి బోధించాడు. - భాగవతం

**వేదదిషుడు :** చేది రాజైన బృహద్రదుని కుమారుడు. - భాగవతం

**వేదన :** ఓ దేవత. జీవులకు బాధను కల్పించే దేవత. అధర్ముడు హింసను వివాహమాడగా నృత, నిరుత అనే కుమార్తెలు జన్మించారు. వారి నుండి భయ, నరక, మాయ, వేదనలు జన్మించారు. మృత్యువు మాయ కుమార్తెకాగా, దుఃఖం వేదన కుమార్తె. - అగ్నిపురాణం

**వేదనిధి :** ఓ రుషి. - చూ॥ ప్రమోహిని

**వేదరాశి :** ఓ బ్రాహ్మణుడు. చంద్రకాంత భర్త. భార్య జారిణి కాగా ఆమెను ఇంటినుండి వెళ్లగొడతాడు. - తులా కావేరీ మహాత్యం.

**వేదవతి :** సీత పూర్వజన్మ . - చూ॥ సీత

**వేదవంతుడు :** బంధుమంతుడి కొడుకు. ఇతని కొడుకు బంధుడు. - భాగవతం

**వేదవ్యాసుడు :** చూ॥ వ్యాసుడు.

**వేదశర్మ 1 :** చూ॥ విదురుడు.

**వేదశర్మ 2 :** శివశర్మ అనే బ్రాహ్మణుడి కొడుకు. - చూ॥ శివశర్మ

**వేదశిరుడు 1 :** భృగు మహర్షి సంతతిలోని ఓ రుషి. మార్కండేయ ధూర్మలకు జన్మించాడు. పివరి ఇతని భార్య. ఇతడొకసారి తపస్సు చేస్తుండగా శుచి అనే అప్సరస తపోభంగం చేసింది. వారికి ఓ కుమార్తె జన్మించగా యమధర్ముడామెను ఎత్తుకు పోబోగా వేద శిరుడు యమధర్ముడ్ని నది కమ్మని శపించాడు. - స్కందపురాణం

**వేదశిరుడు 2 :** కృశాశ్వ ధిషణలకు జన్మించిన రుషి. పాతాళంలో నాగుల నుండి విష్ణుపురాణం నేర్చి తన శిష్యుడు ప్రమతికి బోధించాడు. - విష్ణుపురాణం

**వేదశృతి :** పురాణ ప్రసిద్ధమైన నది. శ్రీరాముడు అగస్త్యాశ్రమాన్ని దర్శించడానికి ఈ నదిని దాటాడు. - రామాయణం

**వేదస్పర్శుడు :** కబంధ రుషి శిష్యుడైన పురోహితుడు, పండితుడు. ఇతడు అధర్వవేదాన్ని నాల్గు భాగాలు చేసి నల్గురు శిష్యులకిచ్చాడు. - వాయుపురాణం

**వేదస్మృతి :** ఓ నది. - మహాభారతం

**వేదాలు :** సంస్కృతంలో విద్ అనగా తెలుసుకొనుట. ఆర్యులు తెలుసుకున్న జ్ఞాన సంపద సంకలనమే వేదాలు. వేదాల పుట్టుక ప్రాముఖ్యత *:* బ్రహ్మ యజ్ఞం చేసి అగ్ని వాయు సూర్యుల నుండి రుగ్, యజు, సామవేదాలను సృష్టించాడని ఇవి సకల కాలాలకు వర్తిస్తాయని చెప్పబడింది. వేదాలలో ఆధ్యాత్మిక భౌతిక జీవన విధానాలు గోచరిస్తాయి. వీటిని గమనిస్తే ఇవి మతగ్రంథాలని మొట్టమొదట ఆర్యుల మానసిక

సామాజిక స్థితిగతుల్ని వివరిస్తాయని చెప్పవచ్చు. ఇందులో రుగ్వేదానికి ఎక్కువ ప్రాముఖ్యత వుంది.

*వేద విభజన :* మహావిష్ణువు వ్యాసుడిగా అవతరించి వేద విభజన చేశాడు. వ్యాసుడు వేదాలను నాల్గు విభాగాలుగా చేశాడు. అవి రుగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణ వేదం. ఆ తదనంతరం వ్యాసుని శిష్యులైన పైలుడు భాస్కలుడు, వైశంపాయనుడు, యాజ్ఞవల్క్యుడు, జైమిని, సుమంతుడు, సుకర్మ ఆ తదుపరి వారి శిష్యులైన పిప్పలాదుడు మరింత వివరణలతో వేదాలను సుసంపన్నం చేశారు.

వ్యాసుడు మతం పూజ క్రతువులలో ఒకే విధానాన్ని ప్రవేశపెట్టడానికి ప్రయత్నించాడు. ఆ తదనంతరం వేదాలకు నైరుక్త, యాజ్ఞిక, వైయాకరణ, జ్యోతిష, సాంప్రదాయక, ఆధ్యాత్మిక, ఐతిహాసకాలు అనే ఏడు రకాల భాష్యాలు చెప్పబడ్డాయి. పాశ్చాత్యులు వేదాధ్యయనంలో చారిత్రక భాష్యం కూడా ప్రవేశపెట్టారు. వేదా లలో ముఖ్య దేవతలు ఇంద్రుడు, వరుణుడు, అగ్ని, మిత్ర, మరుత్తులు. పురాణకాలం నాటికి విష్ణువు, శివుడు, బ్రహ్మ ముఖ్యదేవతలు కాగా ఇంద్రాది దేవతల ప్రాముఖ్యత తగ్గింది. – చూ॥ *రుగ్వేదం, సామవేదం, యజుర్వేదం, అధర్వణవేదం.*

**వేదాశ్వ :** ప్రాచీన భారతదేశంలోని ఒక నది. ప్రజలీ నీటిని త్రాగడానికి ఉపయోగించేవారు.
– మహాభారతం

**వేది :** బ్రహ్మకు భార్య. – మహాభారతం

**వేదిక :** ధర్మరాజు భార్య. – మహాభారతం

**వేదీతీర్థం 1 :** ఓ పవిత్ర తీర్థం. సింధునది జన్మ స్థలం వద్ద వుండి చేరటం కష్టమైన ప్రాంతం. దీన్ని దర్శించి ఇక్కడ స్నానం చేస్తే అశ్వమేధం చేసిన ఫలితం, స్వర్గ ప్రాప్తి లభిస్తుంది. – మహాభారతం

**వేదీతీర్థం 2 :** కురుక్షేత్రాన్ని ఆనుకొని వున్న ఓ పుణ్య స్థలం. ఇచ్చట స్నానం చేస్తే 1000 గోవుల్ని దానం చేసిన ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**వేదుడు :** అయోధ్య దౌమ్యుడి కుమారుడు.
– చూ॥ *అయోధ్య దౌమ్యుడు*

**వేధ :** బ్రహ్మ మరో పేరు.

**వేనుడు 1 :** ఓ ప్రాచీన రాజు. దుష్టపాలనకు ప్రతీక. చాక్షుషమనువు సంతతిలోనివాడు. కురువు కుమారుడైన అంగుడికి సునీత వల్ల జన్మించాడు. సునీత యముని పెద్దకుమార్తె అని విష్ణుపురాణం, కాల మృత్యుల కుమార్తె అని వామన పురాణం చెప్తున్నాయి. వేనుడు తన తాత గుణాలవల్ల దుష్టచింతనా పరుడయ్యాడు.

*వేనుడి దుష్టత్వానికి మూల కథ :* వేణుని తల్లి అయిన సునీతకు తన తండ్రి గుణాలైన పరులను హింసించడం ప్రవృత్తి. ఆమె తపస్సు చేసుకొనే ఓ గంధర్వ బాలుడ్ని తఫతఫాలుగా హింసిస్తుంటే చివరికి సహించలేని ఆ బాలుడు ఓ బాలికా నీవు గృహస్తురాలైన తర్వాత నీకు జన్మించే కుమారుడు దేవతలను బ్రాహ్మణులను హింసించి పాపాత్ముడగును అని శపించాడు.

*వేనుడి దుష్టపాలన :* వేనుడు రాజైన తర్వాత యజ్ఞ యాగాదులు జరపరాదని శాసించాడు. దాన ధర్మాలు చేయరాదన్నాడు. నేనే యజ్ఞ పురుషుడ్ని. నేనే దేవుణ్ణి. నన్నే పూజించమన్నాడు. ఈ ఆశాసనం తెలిసి రుషులు వేనుడ్ని కలసి వేదాలు పవిత్రమైనవి. అందులో దేవతలను గూర్చి యజ్ఞయాగాలు చేయమని చెప్పబడిందని అలా చేయకపోతే దేవతలు శాంతించరని చెప్పినా వినలేదు. అప్పుడు రుషులంతా ఏకమై మంత్రించిన దర్భలతో వేనుడిని కొట్టగా అతడు మరణించాడు. రాజులేని రాజ్యం దొంగలకు అరాచకాలకు నిలయమయ్యింది. అది గ్రహించిన రుషులు వేనుడి మృత శరీరంలోని ఎడమ చేతిని మదించగా ఓ మరుగుజ్జు బాలుడు జన్మించాడు. అతడు వేనుడి పాపాలకు ప్రతీక. ఆ తర్వాత వేనుడి కుడిచేతిని మదించగా ధనుర్ధారుడైన అజానుబాహుడైన పృధుచక్రవర్తి ఆవిర్భవించాడు. రుషులతడ్ని రాజుగా ప్రకటించారు.
– వామనపురాణం

**వేనుడు 2 :** వైవశ్వత మనువు 10 మంది పుత్రుల్లో ఒకడు. – మహాభారతం

**వేల :** మేరువు కూతురు. సముద్రుడి భార్య.

**వేహతం :** ఓ మందు. శరీరసౌష్టవాన్ని పెంచుతుంది.
– మహాభారతం

**వైకర్తనుడు :** కర్ణుని మరో పేరు. – మహాభారతం

**వైకుంఠుడు :** రైవత మనువు కాలంలో విష్ణువు శుభ్రుడి భార్య వికంఠకు కొడుకుగా జన్మిస్తాడు. ఇతడు వైకుంఠ లోకాన్ని నిర్మించాడు. - భాగవతం

**వైఖానసులు :** వేదకాలం నాటి ఋషుల సమాహారం. వీరు వందమంది. బ్రహ్మచేతి గోరునుండి వీరు జన్మించారు. - తైత్తరీయ ఉపనిషత్తు

**వైజయంతం 1 :** తిమిధ్వజుడను అసురుని రాజధాని నగరం పేరు. ఇతని మరోపేరు శంచరుడు.

**వైజయంతం 2 :** ఇంద్రుని జెండా పేరు. - మహాభారతం

**వైజయంతం 3 :** క్షీరసాగరం మధ్యగల పర్వతం. బ్రహ్మ ప్రతిరోజు ఈ పర్వతాన్ని దర్శించి భక్తితో ధ్యానం చేస్తాడు. - మహాభారతం

**వైజయంతి :** ఐరావతానికి గల రెండు గంటలు. ఇంద్రుడు వీటిని సుబ్రహ్మణ్యస్వామికి బహూకరించగా అతడు విశాఖుడి కొకదాన్ని ఇచ్చాడు. - మహాభారతం

**వైదూర్యపర్వతం :** శూర్పారక దేశంలో గల గోకర్ణ తీర్థం వద్ద గల ఓ పర్వతం. అగస్త్యుడొకసారి దీనిపై ఆశ్రమం నిర్మించుకున్నాడు. ఈ ఆశ్రమాన్ని దర్శించిన తర్వాత నర్మదానదిలో స్నానం చేస్తే పుణ్యలోకాల ప్రాప్తి లభిస్తుంది. - మహాభారతం

**వైతరణి 1 :** ఓ నరకం. - చూ॥ నరకాలు

**వైతరణి 2 :** పితృలోకం నుండి ప్రవహించే సమయంలో గంగానది పేరు.

**వైతాళి :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. - మహాభారతం

**వైతాళుడు :** జాతుకర్ణి శిష్యుడు. - భాగవతం

**వైతండుడు :** 8 మంది వసువుల్లో ఆపుని కొడుకు. ఇతనికి నల్గురు కుమారులు. వారు వైతాండ, శ్రమ, శాంత, ధ్వని. - విష్ణుపురాణం

**వైదర్భి 1 :** సగరుని భార్యల్లో ఒకరు. సూర్య వంశపు రాజైన సగరునికి ఇద్దరు భార్యలు. ఒకరు వైదర్భి రెండోది శైబ్య. వైదర్భిని సుమతి అని, శైబ్యను కేశిని అనికూడా పిలుస్తారు. వైదర్భికి 60,000 మంది సంతానం కాగా శైబ్యకు అసమంజసుడనే కుమారుడు జన్మించాడు. - చూ॥ సగరుడు

**వైదర్భి 2 :** కుశుని భార్య. కుశా వైదర్భిలకు నల్గురు కుమారులు. వారు కుశాంబ, కుశనాభ, అసూర్త రాజస, వసులు. - రామాయణం

**వైదర్భి 3 :** ఓ రాజు. ఇతని కుమార్తె లోపాముద్రను అగస్త్య మహర్షికిచ్చి వివాహం చేశాడు. - మహాభారతం

**వైదేహుడు :** విదేహ రాజులను పిల్చేపేరు.

**వైదేహం :** విదేహ రాజ్యానికి మరో పేరు. - మహాభారతం

**వైద్యుడు :** సునాదేవికి వరుణిడి వల్ల జన్మించిన కుమారుడు. ఇతని కుమారులు గృణి, ముని ఒకరి కొకరు తలపడి మరణించారు. - వాయుపురాణం

**వైనతేయుడు 1 :** గరుడుని ప్రసిద్ధ కుమారుల్లో ఒకడు. - మహాభారతం

**వైనతేయుడు 2 :** వినత కుమారుడైన గరుడుని పేరు. - మహాభారతం

**వైన్యుడు :** పృథువు మరో పేరు. వేనుని వామ బాహువున పుట్టెను.

**వైభ్రాజకం :** ఓ ఉద్యానవనం. మహామేరువు వద్దగల సుపార్శ్వ పర్వతంపై కలదు. - భాగవతం

**వైమానికం :** ఓ పుణ్యస్థలం. ఇచ్చట స్నానం చేస్తే అప్సరసలు తిరిగే లోకాల్లో స్వేచ్ఛగా విహరించగలరు. - మహాభారతం

**వైమిత్ర :** సప్త మాతృకల్లో ఒకరు. తక్కినవారు కాకి, హాలిమ, మాలిని, బృహద, ఆర్య, పలాల.

**వైరాటుడు :** ధృతరాష్ట్రుని 100 మంది పుత్రుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో భీముడితణ్ణి వధించాడు. - మహాభారతం

**వైరాజు :** సప్త పితరుల్లో ఒకడు. తక్కిన ఆరుగురు అగ్నిష్వత్తుడు, సోమపుడు, గార్హిపత్యుడు, ఏక శృంగుడు, చతుర్వేదుడు, కాలుడు. - మహాభారతం

**వైరామసులు :** ప్రాచీన భారతదేశంలో ఓ కులం ప్రజలు. వీరు ధర్మరాజుకి రత్నములనిచ్చి రాజసూయ యాగానికి వచ్చారు. - మహాభారతం

**వైవస్వతతీర్థం :** ఇదో పుణ్యతీర్థం. ఈ తీర్థంలో స్నానం చేస్తే చేసినవాడే ఓ పుణ్యతీర్థంగా మారతాడు. - మహాభారతం

**వైవస్వతుడు :** ఏడవ మనువు. వివశ్వానుడి కుమారుడు. మత్స్యావతారం సమయంలో ఇతడు వైవస్వత మనువుగా జన్మించాడు. ఇతని భార్య శ్రద్ధ. వీరికి చాలా మంది సంతానం కలరు. వారిలో ప్రముఖులు యమ, యమి, అశ్వనీ కుమారులు, రేవతుడు, సద్యుమ్నుడు, ఇక్ష్వాకుడు, నృగుడు, శణ్వతి, దిష్ట, ధృష్ట, కరూష, నరిశ్వంత, నాభాగ, పృషధ, కవులు.

**వైశాఖా వ్రతం :** చూ॥ ధృష్టబుద్ధి.

**వైశాఖం :** ఓ నెల పేరు. చైత్రమాసం తర్వాత, జ్యేష్ఠ మాసం ముందు వస్తుంది. ఈ నెలలో రోజులో ఒక పూట ఉపవాసం వుంటే బంధువుల్లో, స్వకులంలో ప్రసిద్ధుడౌతాడు. – మహాభారతం

**వైశాలాక్షం :** బ్రహ్మ విరచించిన న్యాయ సూత్రాలు. విశాలాక్షుడైన శివుడు దీన్ని సంక్షిప్తీకరించాడు కనుక దీన్ని వైశాలాక్షం అన్నారు. – మహాభారతం

**వైశాలిని :** విశాల రాజు కుమార్తె. కరందముని కుమారుడైన అవిక్షిత్తును వివాహమాడింది. ప్రసిద్ధ రాజైన మరుత్తుడు వీరి కుమారుడు. – మార్కండేయ పురాణం

**వైశేషికం :** అణువాదం మీద ఆధారంగా ఏర్పడిన భారతీయ భౌతికవాద ఆలోచనా విధానం.

**వైశంపాయనుడు :** వ్యాసుని శిష్యుల్లో ప్రసిద్ధుడు. వ్యాసుని ముఖ్య శిష్యుల్లో అసితుడు, దేవలుడు, వైశంపాయనుడు, సుమంతుడు, జైమిని, పైలుడు మరి కొందరు. – దేవీ భాగవతం

వ్యాసుని మహాభారతాన్ని జనమేజయుడికి వైశంపాయనుడు చదివి విన్పించాడు. ఇది వ్యాసుని ఆజ్ఞపై చేశాడు. భారతం యొక్క గొప్పతనాన్ని పొగిడాడు. ఇతడు అమాయకత్వంతో ఓ బ్రాహ్మణుడిని చంపగా స్వర్గలోకం చేరిన రుషి. – మహాభారతం

**వైశ్య :** చాతుర్వర్ణాలలో ఒకటి. – చూ॥ చాతుర్వర్ణాలు

**వైశ్రవణుడు :** కుబేరుడి పేరు. – చూ॥ కుబేరుడు

**వైశ్యదేవం :** ఇదో యాగం. బ్రాహ్మణులే ఈ యాగం చేయడానికి అర్హులు. మారణాయుధాలతో రక్షణ కొరకు ఈ యాగం చేయాలి. ఈ యాగం చేసే సమయంలో అగ్నికి ఆజ్యంగా ఊదడం, గుడ్డలతో విసరడం చేయరాదు. అందువల్ల యాగం చేసేవాడు వ్యాధి గ్రస్తుడవుతాడు. నెయ్యి లేక మీగడ, ఫలాలు, నీళ్లు, చెట్లు చేమలు వాడాలి. సగం కాలిన కట్టెలు కూడా వాడరాదు. ఒక వేళ చెట్టు, కట్టెలు వాడేట్లయితే వాటిని నేతితో ముందుగా శుద్ధి చెయ్యాలి. ఈ యాగం చేసినపుడు గోవులకు వరి అన్నం పెట్టాలి. – దేవీభాగవతం

**వైశ్వానరుడు 1 :** ఓ రుషి. ఇంద్రుని భవనంలో వుంటాడు. – మహాభారతం

**వైశ్వానరుడు 2 :** అగ్నియొక్క మొదటి పుత్రుడ్ని భానుడంటారు. చాతుర్మాసయాగంలో పర్జన్యమనే అగ్నితో పాటు దీనిని కూడా పూజించారు. – మహాభారతం

**వైశ్వానరుడు 3 :** కశ్యపునికి మనుకు పుట్టిన కుమారుడు. – భాగవతం

**వైష్ణవ చాపం :** విష్ణువు యొక్క విల్లు. – చూ॥ విష్ణువు

**వైహాయసం :** నర నరాయణుల ఆశ్రమం వద్దగల ఓ పవిత్ర గుండం. – మహాభారతం

**వైహారం :** ఒక పర్వతం. గిరివ్రజానికి చుట్టూ వున్న ఐదు పర్వతాల్లో ఇదొకటి. – భాగవతం

**వంక్షు :** పురాణ ప్రసిద్ధమైన నది. ఈ నదీ పరీవాహక ప్రజలు ధర్మరాజు రాజసూయయాగానికి వచ్చి కానుకలిచ్చారు. – మహాభారతం

**వంగకాయలు :** బసవన్న జంగముల కర్చన చేసి భోజనము పెట్టుచూ లింగధారులకు తప్ప అన్యులకు ప్రవేశము లేదనగా కొందరు దొంగలు వంగకాయలు కొంగున ముడివేసుకొని కూర్చుండిరి. లింగదారులే ఈశ్వరాంగణమునకు ప్రవేశమున కర్హులని బసవన్న అనగా వీరును భయపడి ఈశ్వరాంగణమున కొచ్చి కూర్చొనగా వీరి ముడిన కట్టుకున్న వంగకాయలు ప్రాణలింగములయ్యెను. – బసవ పురాణం

**వంగుడు :** అణువంశస్థుడు. బలి రెండవ కుమారుడు. వంగదేశమితని పేరునే వచ్చెను. – పురాణనామచంద్రిక

**వంగుడు :** జనకుని కొలువులో ఓ పండితుడు. శాస్త్రవేత్త. కహోధకుడిని పాండిత్య పరీక్షలో ఓడించి నీటిలో ముంచాడు. – చూ॥ అష్టావక్రుడు.

**వంగం :** ప్రాచీన భారతదేశంలో ఓ ముఖ్య రాజ్యం. ఇప్పటి బెంగాల్ అప్పటి వంగదేశం. అర్జునుడు ఈ ప్రాంతాన్ని తన విహారయాత్రలో సందర్శించాడు.

భీమసేనుడు దీనిపై దండెత్తాడు. ఈ దేశ రాజులు ధర్మజునికి కానుకలిచ్చారు. కర్ణుడు ఒకసారి ఈ ప్రాంతాన్ని జయించాడు.

**వంచులం :** ఓ పక్షి. దీని అరుపు విజయానికి సంకేతం. - రామాయణం

**వంద :** ఒక అప్సరస. ఈమె తన చెలికత్తెలతో భూలోకమునకు వచ్చి తపస్సు చేయు ఓ బ్రాహ్మణునికి విఘ్నము కలిగించగా అతడు వీరిని మొసలులు కండని శపించగా వారు నారదుని సలహా కోరగా అర్జునుడు తీర్థయాత్రకు వచ్చినపుడు మిమ్ములను బయటకు విసిరినప్పుడు శాపవిమోచనము కల్గునని చెప్పెను. వీరు మొసలులుగా జీవించిన తీర్థము నారీ తీర్థమని పిలవబడెను. అర్జునుడు వీటిని బయటకు పడవేయగానే శాపవిమోచనమయ్యెను. - మహాభారతం

**వందన :** పురాణ ప్రసిద్ధమైన ఓ నది. - మహాభారతం

**వందనుడు :** ఓ రుషి. అసురులితణ్ణి ఓ నూతిలోకి తొయ్యగా అశ్వనీదేవతలు రక్షించారు. - రుగ్వేదం

**వంది :** ఒక రుషి. జనక మహారాజు యజ్ఞశాలలో అష్టావక్రుడితడితో వాదము చేసి నెగ్గెను.

**వంశ :** ప్రజాపతి కశ్యపుడికి ప్రధకు జన్మించిన కుమార్తె. - మహాభారతం

**వంశమూలకం :** కురుక్షేత్రం ప్రక్కనగల ఓ పుణ్యస్థలం. ఇక్కడ స్నానం చేస్తే అతని జాతి వృద్ధి చెందుతుంది. - మహాభారతం

**వంశగుల్మ :** పుణ్యతీర్థం. సోన, నర్మద నదులు ఈ తీర్థంలో మొదలవుతాయి. ఈ తీర్థంలో స్నానం చేస్తే అశ్వమేధ ఫలం లభిస్తుంది. - మహాభారతం

**విందానువిందులు :** చూ॥ విందుడు 2.

**విందుడు 1 :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో భీమసేనుడితణ్ణి వధించాడు. - మహాభారతం

**విందుడు 2 :** అవంతి రాజకుమారుడు. ఇతని సోదరుడు అనువిందుడు. దక్షిణ దేశ జైత్రయాత్రలో సహదేవుడితణ్ణి ఓడించాడు. అక్షౌహిణి సైన్యంతో కౌరవుల పక్షాన పోరాడిన వీరుడు. దుర్యోధనుని 10 మంది సైన్యాధిపతుల్లో ఇతడొకడు. ఇతడు కుంతి భోజుడితో యుద్ధం చేశాడు. యుద్ధ సమయంలో శల్యుణ్ణి విరాట రాజకుమారుడి నుండి రక్షించాడు. ఇతడు అనువిందుడు, ఐరావతుడితో యుద్ధం చేశాడు. చివరికి విందుడు అర్జునుడి చేతిలో మరణించాడు. - మహాభారతం

**విందుడు 3 :** కేకయ దేశ రాజకుమారుడు. కౌరవుల పక్షాన పోరాడి సాత్యకి చేతిలో మరణించాడు. - మహాభారతం

**విందుమానుడు :** భరత వంశంలో జన్మించిన రాజు మరీచి కుమారుడు. వందుడి తండ్రి. - భాగవతం

**వింధ్యచూలిక :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజ్యం. - మహాభారతం

**వింధ్యపర్వతం :** ఏడు పర్వత శ్రేణుల్లో ఇదొకటి. ఇది ఉత్తర దక్షిణ భారత దేశాలను విడగొడుతుంది. అగస్త్యుడొకసారి ఈ పర్వతాన్ని కాలితో తన్ని దారి చేశాడు. - చూ॥ అగస్త్యుడు
సుందోపసుందులను అసురులు దీనిపై తపస్సు చేసి వరాలు పొందారు. సుందుని శాపం వల్ల ఈ పర్వతం వేడెక్కి ఎల్లప్పుడు పొగచిమ్ముతుంటుంది. ఈ పర్వత దేవత కుబేరుని కొలువులో అతణ్ణి పూజిస్తుంటుంది. ఈ పర్వతంపై దుర్గాదేవి ఎల్లప్పుడు నివాసముంటుంది. ఒకసారి ఇది శివుని రథ చక్రానికి ఇరుసుగా వుంది. ఈ పర్వతం సుబ్రహ్మణ్యస్వామికి ఇద్దరు పరిచారకుల్నిచ్చింది. - మహాభారతం

**వింధ్యావళి :** మహాబలి భార్య. ఈమెకు బాణుడను కుమారుడు, కుంభనాస అనే కుమార్తె జన్మించారు. - మత్స్యపర్వతం

**వింశుడు :** ఇక్ష్వాక రాజు పెద్దకుమారుడు. ఇతని కుమారుడు నిపుంశుడు. - మహాభారతం

**వృకతేజసుడు :** వృకలుని సోదరుడు. - చూ॥ వృకలుడు

**వృకరధుడు :** కర్ణుని తమ్ముడు. భీముడితణ్ణి ఓడించాడు.

**వృకలుడు :** ధ్రువుని మనుమడు. ఉత్తానపాదుని కుమారుడు ధ్రువుడు. ధ్రువుని కుమార్తె సుచ్ఛాయ శిష్టిని వివాహమాడగా వారికి 5 గురు సంతానం. వారిలో వృకలుడొకరు. - విష్ణుపురాణం

**వృక్షక :** భృగువు కూతురు. బాల్యంలోనే వైధవ్యం పొంది మాఘస్నానాలు చేసి పుణ్యలోకాలకు వెళ్తుంది. సుందోపసుందుల సంహారార్థం ఈమె సుందరా కారంతో వస్తుంది. బ్రహ్మ ఈమెకు తిలోత్తమగా నామ కరణం చేశాడు. – పద్మపురాణం

**వృక్షప్రతిష్ఠ :** ప్రాచీన భారతీయులు వృక్షాలను, ఉద్యాన వనాలను ప్రతిష్టించడం పాపవిముక్తికి స్వర్గప్రాప్తికి మార్గమని నమ్మేవారు. వేదాలలో చెప్పిన విధంగా వృక్షాలను ప్రతిష్టించి పూజించేవారు. బ్రాహ్మణులతో చెట్లను కడిగించడం వేదములోని సూక్తులను పఠించడం ఆ చెట్ల యజమానులతో ఆ వృక్షాలను కడిగించి ఆ సందర్భంలో గోవుల్ని, ఆభరణాలను, వస్త్రాలను దానం చేయడం చేసేవారు.
– అగ్నిపురాణం

**వృక్షవాసి :** ఓ యక్షుడు. కుబేరుని కొలువులో వుంటాడు.
– మహాభారతం

**వృక్షాయుర్వేదం :** నివేశన స్థలాల వద్ద చెట్లను నాటే విధానాన్ని వృక్షాయుర్వేద మంటారు. ఇంటికి ఉత్త రాన ఇత్తి చెట్టు, తూర్పున అరటి, దక్షిణాన మామిడి, పశ్చిమాన అరటి నాటాలి. దక్షిణాన ముళ్ళ చెట్లు వాటంతటవే పెరగాలి. క్షీణిస్తున్న చెట్లకు ఏమి చెయ్యా లనేది కూడా ఈ శాస్త్రంలో వివరించబడింది.
– అగ్నిపురాణం

**వృక్షాలు :** ప్రజాపతి కశ్యపుడు అనలను నివాహమాడగా ఆమె చక్కని ఫలాలనందించే వృక్షాలకు జన్మనిచ్చింది.
– రామాయణం

**వృకుడు 1 :** కేకయ రాజైన ధృష్టకేతుకి దూర్య అనే భార్యవల్ల జన్మించిన కుమారుడు. – భాగవతం

**వృకుడు 2 :** శ్రీకృష్ణుడు మిత్రవిందకు జన్మించిన కుమారుడు. – భాగవతం

★ **వృకుడు 3 :** ఓ అసురుడు. దేవతలనందరిని తన ఆధీనంలో వుంచుకోదలచాడు. నారదుని వద్దకు వెళ్లి త్రిమూర్తులలో ఎవరు త్వరగా వరమిస్తారో చెప్పమ నగా శివుడని నారదుడు సమాధానమిస్తాడు. అప్పుడు వృకుడు శివుని గూర్చి తపస్సు చేసి తన శరీరంలోని ఒక్కో భాగాన్ని త్రుంచి శివుడికర్పిస్తూ చివరకు తన తలను తెగగొట్టుకోబోగా శివుడు ప్రత్యక్షమై కావలసిన వరం కోరుకొమ్మంటాడు. ఎవరి తలపై తన చేతివేలు పెడితే వారు భస్మమవ్వాలని వరం కోరుకోగా శివుడు అనుగ్రహిస్తాడు. వృకుడు ఆ వరాన్ని శివుడి మీదే మొదట ప్రయోగించబోగా శివుడు పారిపోయి విష్ణువును శరణువేడగా విష్ణువు ఓ బ్రాహ్మణ బాలుడి వేషంలో వృకుడి ముందుకు వెళ్లి అతని పరుగుకు కారణం అడగగా వృకుడు ఆ బాలుడికి జరిగింది చెప్పగా శివుడికి ఆ శక్తి లేదు. అవన్నీ భూటకం. నీ వేలు చీమతలపై పెట్టినా అది భస్మంకాదు. కావా లంటే నీ తలపై పెట్టుకొని చూడమని నమ్మబలకగా అతడు తన చేతిని తన తలపైనే పెట్టుకోగా భస్మ మవుతాడు. – భాగవతం

**వృకుడు 4 :** ఓ రాజు. ద్రౌపది స్వయంవరంలో పాల్గొంటాడు. మహాభారత యుద్ధంలో ఓ పర్వత రాజు చేతిలో మరణిస్తాడు. – మహాభారతం

**వృకుడు 5 :** పాండవుల పక్షాన పోరాడిన ఓ వీరుడు. ద్రోణుడితణ్ణి సంహరిస్తాడు. – మహాభారతం

**వృకుడు 6 :** ప్రాచీన కాలంలో ఒక రాజు. ఇతడు శాఖాహారి. – మహాభారతం

**వృకుడు 7 :** శూరుడికి అతని భార్య మారిషవల్ల జన్మించిన కుమారుడు. ఇతడు దూర్వాక్షిని వివాహమాడగా తక్ష, పుష్కరులు జన్మిస్తారు.
– భాగవతం

**వృకోదరుడు :** భీముని మరో పేరు. – మహాభారతం

**వృక్ణుడు :** మధువు పుత్రుడు. ఇతని 100 మంది పుత్రులు. వీరిలో పెద్దవాడు వృష్టి.

**వృజినీవానుడు :** మనువుకు జన్మించిన క్రోష్టుడి కుమారుడు. ఇతని కుమారుడు ఉషంగుడు.
– మహాభారతం

**వృజుడు :** పృథు కుటుంబంలో జన్మించిన ఒక రుషి.

**వృతుడు :** అనాయువు పుత్రుడు. – మహాభారతం

**వృత్తుడు 1 :** ప్రజాపతి కశ్యపుడికి కద్రువకు జన్మించిన ఓ సర్పం. – మహాభారతం

★ ఈ కథ భస్మాసురుని కథను తలపిస్తుంది.

**వృత్తుడు 2 :** సుచ్ఛాయాశిష్టిల కుమారుడు.
– మత్స్యపురాణం

**వృత్రాసురుడు :** ఓ బలశాలి అయిన రాక్షసుడు.
*జనన కారణం :* ఇతడు చిత్రకేతుడను చక్రవర్తి యొక్క పునర్జన్మ. చిత్రకేతు భార్య కృతద్యుతి. సంతానం లేక అంగిరసుడ్ని ప్రార్థించగా ఓ పుత్రుడు జన్మించి బాల్యంలోనే మరణించాడు. కాని అంగిరసుడతణ్ణి పునర్జీవితుణ్ణి చేశాడు. చిత్రకేతుడు బ్రహ్మనారదుల వద్ద విద్యనభ్యసించాడు. 8 రోజులు ధ్యానంలో వుండి గంధర్వుడిగా మారి ఆకాశంలో విహరిస్తూ శివుని తొడలపై ఆసీనురాలై వున్న పార్వతిని చూసి నవ్వగా ఆమె కోపించి రాక్షసుడివి కమ్మని శపించింది.
*జన్మవృత్తాంతం :* ఇతడి జననాన్ని గురించి రెండు కథనాలున్నాయి. ఒకటి కశ్యపుడు అగ్నినుండి వృతా సురుడ్ని సృష్టించాడు. రెండు ఇతడు త్వష్ట కుమారుడు.
*మొదటి కథనం :* కశ్యపునికి దనువు వల్ల హిరణ్య కశిపుడు జన్మించగా మహావిష్ణువు అతడ్ని వధించాడు. దనువు దుఃఖించగా మరో కుమారుడు బలుడ్ని ప్రసా దించాడు. ఇంద్రుడు తన ఆయుధంతో చంపగా కశ్య పుడు కోపంతో తను ముడివేసిన జుట్టులో సగభా గాన్ని పీకి భస్మంచేసి ఇంద్రుని చంపగల పుత్రుడు జన్మించుగాక అనగా అందుండి పసుపు కళ్లతో భీకరా కారుడై ఓ రాక్షసుడు జన్మించాడు. అతనికి వృత్రుడని నామకరణం చేసి తన కోరిక వెల్లడించాడు.
*రెండవ కథనం :* ప్రజాపతి త్వష్ట వృతాసురుడ్ని ఇంద్రు డ్ని సంహరించడానికి సృష్టించాడు. దానికి బలమైన కారణం వుంది. విశ్వరూపుడనబడే త్వష్టకు త్రిశిర సుడనే పుత్రుడ్ని ఇంద్రుడ్ని సంహరించడానికి సంతా నంగా పొందాడు. ఇంద్రుడితడి మూడు తలలను నరకగా విశ్వరూపుడు అధర్వవేదాన్ని స్మరిస్తూ 8 రోజులు తీవ్ర యజ్ఞం చేయగా ఆ యజ్ఞ గుండం నుండి అర్ధరాత్రి ఓ కాంతివంతమైన బలాఢ్యుడైన పురుషుడు అవతరించి విశ్వరూపుడ్ని "తండ్రీ నీకేమి కావాలని అడిగాడు". విశ్వరూపుడు ఇంద్రుడిని వధిం చమని కోరాడు.
*వృతాసురుని మరణం :* వృతాసురుని శక్తి సంపదలు విని ఇంద్రుడు భయపడి సప్తరుషులను ఇతని వద్దకు రాయబారం పంపాడు. అర్ధ సింహాసనం ఇస్తానని, మైత్రితో జీవిద్దామని కబురు చేశాడు. ఇంద్రుడు మోసం చేయడని నమ్మకమేమిటని వృతాసురుడు ప్రశ్నించగా అలాచేస్తే బ్రహ్మ హత్యాపాతకం ఇంద్రుడు భరిస్తానన్నాడని వీరు చెప్పగా ఇతడు స్నేహ హస్తం అందిస్తాడు. ఇంద్రుడు సమయం చూసి రంభను వృతాసురుని దగ్గరకు పంపగా వృతాసురుడు ఆమెను మోహిస్తాడు. ఆమె ఇతనితో మద్యం సేవించేటట్లు చేయగా ఇతడు మూర్ఛపోగా ఇంద్రుడు ఇతణ్ణి తన వజ్రాయుధంతో సంహరిస్తాడు. బ్రహ్మహత్యాపాతకం భరిస్తాడు. – పద్మపురాణం
*ఇతర విశేషాలు :* ఇంద్రుడు వృతాసురుడ్ని సంహరించి తెచ్చుకున్న బ్రహ్మహత్యాపాతకాన్ని కరూశం వద్ద వది లించుకున్నాడు. వృతాసురుడు మణిమానుడిగా పునర్జ న్మించాడు. ఇంద్రుని వజ్రాయుధం వృతా సురుడ్ని తలపై మోదగా 10 పెద్ద ముక్కలు, 100 చిన్న ముక్కలు అయ్యింది.
*ఇతని నామాంతరాలు :* అసుర, అసురశ్రేష్ఠ, అసు రేంద్ర, దైత్య, దైత్యపతి, దైత్యేంద్ర, దానవ, దానవేంద్ర, దితిజ, సురారి, త్వష్టక, విశాత్మ. – మహాభారతం

**వృద్ధకన్య :** కునిగర్భుడను రుషి కూతురు.
– చూ॥ కునిగర్భుడు

**వృద్ధకన్యాశ్రమం :** గర్గ వంశస్థుడొకరు ఇచ్చట తపస్సు చేసి ఓ కన్యను బడసి మరణించెను. ఆమె వివాహము చేసుకొనక తపస్సు చేయుచూ వృద్ధురాలయ్యెను. అట్లే స్వర్గము చేరకోరగా నారదుడు కనబడి వివాహము చేసికొనక స్వర్గము పోరాదని చెప్పగా ఆమె తపస్సులో గాలవాత్మజుని కోరగా అతడు ఒక రాత్రి మాత్రము ఆమెతో గడుపుటకు సమయమిచ్చెను. ఆమె తపోఫ లమున ఓ రోజు యవ్వనవతియై అతనితో గడిపెను. అందువల్ల ఆమె స్వర్గము చేరెను. – మహాభారతం

**వృద్ధక్షత్రుడు 1 :** సింధు రాజైన జయద్రధుని తండ్రి.

**వృద్ధక్షత్రుడు 2 :** పురువంశంలో జన్మించిన రాజు. పాండవుల పక్షాన పోరాడి అశ్వత్థామ చేతిలో మరణించాడు. – మహాభారతం

**వృద్ధక్షత్రుడు 3 :** వృష్ణి వంశంలోని ఒక రాజు. కురుక్షేత్ర యుద్ధంలో పాండవుల పక్షాన పోరాడి బాల్హికుడి చేతిలో మరణించాడు. – మహాభారతం

**వృద్ధక్షేముడు :** త్రిగర్త దేశపు రాజు. సుశర్మకు తండ్రి.
– మహాభారతం

**వృద్ధగార్గ్యుడు :** ఓ ప్రాచీన రుషి. ఇతడు పితరులతో వారికి అర్పించవలసిన కానుకలను గూర్చి మాట్లాడాడు. - మహాభారతం

**వృద్ధశర్మ :** ఆయుష్షను రాజుకు, స్వర్భానుకు జన్మించిన 5 గురు కుమారుల్లో ఒకడు. తక్కిన నల్గురు నహుషుడు, రజి, గయ, అనేనషులు. - మహాభారతం

**వృదిక :** ఓ ప్రేతం. ఒకసారి శివుని వీర్యం చెట్లపై పడగా ప్రేతాలు జన్మించాయి. మానవ చర్మమే వీటి ఆహారం. సంతానప్రాప్తికి వీటిని పూజించడమే మార్గం. - మహాభారతం

**వృష :** పురాణ ప్రసిద్ధమైన ఓ నది. - మహాభారతం

**వృషకుడు 1 :** శకుని సోదరుడు. వీనిని కురుక్షేత్ర యుద్ధమున అర్జునుడు ఓడించెను. - మహాభారతం

**వృషకుడు 2 :** ఓ కళింగ రాజకుమారుడు. ఇతడు మహాభారత యుద్ధంలో మరణించాడు. - మహాభారతం

**వృషకేతుడు :** కర్ణుని కుమారుల్లో ఒకడు. ధర్మజుని అశ్వమేధాన్ని అనుసరించి వెళ్లగా బభ్రువాహనుడు వధించాడు. - జైమిని భారతం

**వృషంకుడు :** ప్రాచీన రుషి. శ్రీరాముని అరణ్యవాసానంతరం అయోధ్యకు వచ్చిన తర్వాత పశ్చిమ భారతం నుండి వచ్చి శ్రీరామునికి వందనం చేసిన వారిలో ఒకడు. - ఉత్తర రామాయణం

**వృషక్రాథుడు :** కౌరవుల పక్షాన పోరాడిన యోధుడు. ద్రోణుని గరుడ వ్యూహంలో మధ్య భాగాన నిలబడ్డాడు. - మహాభారతం

**వృషణుడు :** యదువంశంలోని వాడు. కార్తవీర్యార్జునుని మూడవ కుమారుడు.

**వృషదంశ :** మందర పర్వతం వద్దగల ఒక పర్వతం. అర్జునుడు శ్రీకృష్ణుడితో కలసి శివలోకం వెళ్లినట్లు కలగన్నాడు. ఆ కలలో ఈ పర్వతాన్ని కూడా చూశాడు. - మహాభారతం

**వృషదర్పుడు :** శిబి చక్రవర్తి కుమారుడు. ఇతనికి భద్ర, సువీర, కేకయులు సోదరులు. - భాగవతం

**వృషద్భానువు :** హిరణ్యాక్షుని భార్య.

**వృషధ్రుడు :** మనువు కుమారుడు. వేటలో పొరపాటున హోమధేనువును వధించగా దాన్ని కావలికాస్తున్న బాభ్రవ్యుడితణ్ణి శూద్రుడవు కమ్మని శపిస్తాడు. ఇతడు ప్రతీకార శాపమిస్తాడు. - మార్కండేయ పురాణం

**వృషధ్వజుడు 1 :** ప్రవీరుని కుటుంబంలో జన్మించిన రాజు. - మహాభారతం

**వృషధ్వజుడు 2 :** రాజసావర్ణి కొడుకు. ఈశ్వర భక్తుడు. సూర్యుణ్ణి హింసించబోతాడు. ఇతని కుమారుడు హంసధ్వజుడు.

**వృషపర్వుడు 1 :** ఓ సద్గుణుడైన అసురుడు. ఇతడు కశ్యప దనువులకు జన్మించాడు. దీర్ఘప్రజ్ఞుడిగా భూమిపై పునర్జన్మించాడు. శర్మిష్ఠ ఇతని కుమార్తె. - మహాభారతం

**వృషపర్వుడు 2 :** ప్రాచీన రాజర్షి. ఆకాశవాణి పాండవుల అరణ్యవాస సమయంలో ఈ రాజర్షిని దర్శించమని చెప్పగా వారు దర్శించారు. ఈ రాజర్షి పాండవులకు అరణ్య మార్గాలను సూచించాడు. వెనక్కు తిరిగి వచ్చే సమయంలో కూడా పాండవులితణ్ణి దర్శించారు. - మహాభారతం

**వృషప్రస్థగిరి :** ఓ పుణ్యస్థలం. పాండవుల అరణ్యవాస సమయంలో ఈ స్థలాన్ని దర్శించారు. - మహాభారతం

**వృషభగిరి :** ఒక పర్వతం. ప్రస్తుతం దీన్ని రత్నగిరి అని పిలుస్తున్నారు.

**వృషభధ్వజుడు :** చూ॥ శివుడు.

**వృషభాద్రి :** ఒక పర్వతం. వృషభుడనే రాక్షసుడిక్కడ సంహరించబడటం వల్ల ఈ పేరు వచ్చింది.

**వృషభానుడు :** ఒక రాజు. యాగార్థ భూమిని శుభ్రపరుస్తుండగా రాధ★ అనే బాలిక దొరకగా తన స్వంత కుమార్తెవలే పెంచాడు. - పద్మపురాణం

★ **వృషభాసురుడు :** ఒక రాక్షసుడు. కొండ ఎత్తున వుండి గోపికలతో విహరించు శ్రీకృష్ణుని చంపబోయి అతనిచే చంపబడెను. - భాగవతం

★ రాధ వృషభానుడి స్వంత కుమార్తెగా బ్రహ్మవైవర్త పురాణంలో చెప్పబడింది.

★ ఒక రాక్షసుడు. విష్ణుమూర్తిని ప్రార్థించి అతడు ప్రత్యక్షము కాగా తనతో పోరుమని కోరెను. విష్ణుమూర్తి ఇతనిని ఓ పర్వతముపై సంహరించగా ఆ పర్వతమునకు వృషభాద్రి అను పేరు వచ్చెను. - వేంకటాచల మహాత్మ్యం.

**వృషభుడు 1 :** గాంధార రాజైన సుబలుని కుమారుడు. శకునికి సోదరుడు. ఇతడు తన ఐదుగురు సోద రులతో కలసి ఐరావతుడితో పోరాడి చనిపోగా ఇతడు తప్పించుకున్నాడు. - మహాభారతం

**వృషభుడు 2 :** ఓ అసురుడు. ఇతని మరోపేరు అరిష్ఠుడు. - చూ॥ అరిష్ఠుడు

**వృషభేక్షణుడు :** శ్రీకృష్ణుని మరోపేరు. - మహాభారతం

**వృషరథుడు :** కర్ణుని సోదరుడు.

**వృషలాక్షుడు :** భరత వంశపు రాజుల్లో ఒకడు. చతు రంగుడి కొడుకు. - భాగవతం

**వృషలి :** అజామిళుడి వద్ద దాసి. ఆ బ్రాహ్మణుడు భార్యను విడచి ఈమెతోనే రతి సుఖములను అనుభవించెడి వాడు. - భాగవతం

**వృషలుడు :** ఒక ఆంధ్ర జాతివాడు. కణ్వవంశజుడైన సుశర్ముడను రాజు భృత్యువు. రాజును చంపి ఇతడే రాజ్యమేలెను. తదుపరి ఇతని తమ్ముడగు కృష్ణుడను వాడు రాజయ్యెను. - భాగవతం

**వృషసేనుడు 1 :** కర్ణుని కుమారుడు. మహాభారత యుద్ధమున అర్జునుడితనిని చంపెను. - మహాభారతం

**వృషసేనుడు 2 :** ఒక రాజు. యముని సభలో సభ్యుడు. - మహాభారతం

**వృషాకపి 1 :** 11 మంది రుద్రుల్లో ఒకడు. మిగిలిన వారు హర, బహురూప, త్రంబక, అపరాజిత, శాంభు, కపర్థి, రైవత, మృగవ్యాధ, సర్ప, కపాలిలు. - అగ్నిపురాణం

**వృషాకపి 2 :** మహావిష్ణువుకు గల మరోపేరు.

**వృషాకపి 3 :** ఓ రుషి. దేవతలు చేసిన యాగానికి ఇతర రుషులతో పాటు ఇతడు పాల్గొన్నాడు. - మహాభారతం

**వృషాదర్భి 1 :** కాశీరాజైన ఉశీనారుని మరోపేరు. - చూ॥ ఉశీనారుడు

**వృషాదర్భి 2 :** ఓ కాశీ రాజు. యువనాశ్వుడనబడే వృష దర్బుని కొడుకు. వజ్రాలు, స్త్రీలను, భవనాలను దానంచేసి స్వర్గం చేరాడు. - మహాభారతం

**వృషాదర్భి 3 :** శిబి చక్రవర్తి ప్రసిద్ధ కుమారుల్లో ఒకడు. సప్తర్షులు భూమి అంతా ప్రదక్షిణ చేస్తుండగా ఇతడు యజ్ఞం చేస్తూ అతని కుమారుడిని వారికి కానుకగా ఇచ్చాడు. ఆ బాలుడు ఎంతో కాలం జీవించలేదు. సప్తర్షులు ఆకలికి తట్టుకోలేక ఈ బాలుడి మాంసం తినబోగా వృషాదర్భి వారిని ఆ పని చేయవద్దని కోరగా వారు వినకపోవుటచే వృషదర్భి ఓ ప్రేతాన్ని సప్తర్షులపై పంపగా ఇంద్రుడు ఆ ప్రేతాన్ని చంపుతాడు. - మహాభారతం

**వృషామిత్రుడు :** ఓ రుషి. ఇతడు ధర్మజుడ్ని ప్రేమించే వాడు. గౌరవించేవాడు. - మహాభారతం

**వృషుడు 1 :** స్కందుని యోధుల్లో ఒకడు. - మహాభారతం

**వృషుడు 2 :** ఒక రాక్షసుడు. - మహాభారతం

**వృషుడు 3 :** కార్తవీర్యార్జునుడి కొడుకు. పరశురాముడి నుండి తప్పించుకుంటాడు. - బ్రహ్మాండపురాణం

**వృషుడు 4 :** భరత వంశపు రాజు. శకుంతలకు కొడుకు. ఇతని సోదరుడు దుర్మరణుడు. - భాగవతం

**వృషుడు 5 :** వృషభాకారంలో వుండే శివుని అవతారం. - శివపురాణం

**వృషాంకుడు :** ఓ ప్రాచీన రుషి. శ్రీరాముడు అరణ్యా వాసం నుండి తిరిగివచ్చినపుడు పశ్చిమ భారతా న్నుండి వచ్చి శ్రీరామునికి అభివాదం చేసిన వారిలో ఒకడు. - ఉత్తర రామాయణం

**వృషాండుడు :** ప్రాచీన కాలంలో భూమిని ఏలిన ఓ అసురుడు. కాళి పారద్రోలగా భూమిని వదలి వెళ్లాడు. - మహాభారతం

**వృష్ణి 1 :** సాత్వతుని కుమారుడు. - భాగవతం

**వృష్ణి 2 :** భజమానుని పుత్రుడు. నిమ్రోచి, కంకరాజు ఇతడి సోదరులు. - భాగవతం

**వృష్ణి 3 :** వృష్ణుని 100 మంది కుమారుల్లో పెద్దవాడు. - భాగవతం

**వృష్ణి 4 :** కురునికి విలోమ వల్ల జన్మించిన పుత్రుడు. - భాగవతం

**వృంద :** కాలనేమి పుత్రిక. జలంధరుని భార్య. శివుడు జలంధరునితో యుద్ధం చేయుచుండగా జలంధరుడు శివుని రూపమున పార్వతిని వంచింపబోగా అది గ్రహించిన పార్వతి జలంధరుని భార్య వృంద పాతి వ్రత్యమును చెడగొట్టమని కోరెను. మహావిష్ణువు

జలంధరుని రూపమున వృందతో రమించగా అది తెలిసిన వృంద మహావిష్ణువును భార్యాదుఃఖము కల్గి వానరుల సహాయమున భార్యను పొందగలవని శపించి చితిపేర్చుకొని దగ్ధమయ్యెను. ఆమె భస్మమైన చోట దేవతలు గింజలు చల్లగా అవి తులసి, ఉసిరి, మాలతి మొక్కలుగా మొలచెను. – శివపురాణం

**వృందారకుడు 1 :** ధృతరాష్ట్రుడి కొడుకుల్లో ఒకడు. కురుక్షేత్ర యుద్ధంలో భీముని చేతిలో మరణించాడు. – మహాభారతం

**వృందారకుడు 2 :** కౌరవుల పక్షాన పోరాడిన ఒక యోధుడు. అభిమన్యుని చేతిలో మరణించాడు. – మహాభారతం

**వ్యవహారం :** ఇది 18 విధానాలు. 1 ఇవ్వడం, పుచ్చుకోవడం. 2. ఆస్తిని ఇతరులకు దానం ఇవ్వడం. 3. ఆస్తిని హక్కులేని వాడు అమ్ముకోవడం. 4. సంయుక్తంగా సంపాదించిన ధనాన్ని ఒక్కడే తస్కరించడం. 5. దాన మిచ్చిన ఆస్తిని తిరిగి ఇవ్వకుండటం. 6. జీతం ఇవ్వకపోవడం. 7. అధికార ధిక్కారం. 8. అమ్మడం కొనడం జరిగిపోయిన తర్వాత అనుమానించడం. 9. పశుసంపద వాటి సంరక్షకుడికి మధ్యన్యాయ పరమైన విభేదాలు. 10. సరిహద్దు విభేదాలు. 11. ఇతరులను కొట్టడం. 12. దొంగతనం 13. గలభా, 15. ఇతరుల భార్యను దొంగిలించడం. 16. భార్య భర్తల బాధ్యతలు, 17. విభజించుకోవడం. 18. జూదం. వీటిని రాజు పరిశీలించాలి. రాజు లేకుంటే బ్రాహ్మణులు వీటిని పరిష్కరించాలి. – మనుస్మృతి

**వృశ్యుడు :** ఒక రాజు. యముని సభలో వుంటాడు. – మహాభారతం

**వ్రజనుడు :** అజమీఢునికి కేశిని వల్ల జన్మించిన పుత్రుడు. – మహాభారతం

**వ్రజీరవానుడు :** యదువంశంలోని ఒక రాజు. క్రోష్టువు కుమారుడు. కుశంకుడికి తండ్రి. – భాగవతం

**వ్రజుడు :** స్వాయంభువు మన్వంతరంలోని ఒక రాజు. హవిర్ధానుడి కొడుకు. ఇతని తల్లి ధిషణ – అగ్నిపురాణం పృథు వంశంలోని రుషి. ధిషణ హవిర్ధానుల పుత్రుడు. – విష్ణుపురాణం

**వ్రతం :** వైదిక సంహితలు విధించిన నియమాలు. – అగ్నిపురాణం

**వ్యాఘ్రకేతువు :** పాంచాల దేశ యోధుడు. పాండవుల పక్షాన పోరాడాడు. కర్ణుడితణ్ణి గాయపరచాడు. – మహాభారతం

**వ్యాఘ్రదత్తుడు 1 :** పాండవుల పక్షాన పోరాడిన రాజు. రథం పైనుండి యుద్ధం చేయగల నేర్పరి. ద్రోణునితో పోరాడాడు. ద్రోణుడితణ్ణి సంహరించాడు. – మహాభారతం

**వ్యాఘ్రదత్తుడు 2 :** మగధ దేశపు రాజకుమారుడు. కౌరవుల పక్షాన పోరాడి సాత్యకి చేతిలో మరణించాడు.

**వ్యాఘ్రపాదుడు :** ఓ ప్రాచీన రుషి. ఉపమాన్యుడి తండ్రి. – మహాభారతం

**వ్యాఘ్రబలుడు :** శ్రీ దత్తుడను రాజుకి మంత్రి. – కథాసరిత్సాగరం

**వ్యాఘ్రాక్షుడు :** సుబ్రహ్మణ్య స్వామి అనుచరుడు. – మహాభారతం

**వ్యాఘ్రేశ్వరుడు :** కాశీ క్షేత్రానికి వచ్చు భక్తులను దుందుభి అను రాక్షసుడు చంపి తినేవాడు. శివుడు తన భక్తులను కాపాడుటకు వ్యాఘ్ర రూపమున వచ్చి దుందుభిని సంహరించుట వలన శివుని వ్యాఘ్రేశ్వరుడని చెప్పెదరు. – విష్ణుపురాణం

**వ్యాధి :** వ్యాధి, జర, శోక, తృష్ణ, క్రోధలు మృత్యువు యొక్క సంతతి. – అగ్నిపురాణం

**వ్యాలీముచుడు :** సుబ్రహ్మణ్యుడితో పోరాడిన ఓ అసురుడు. ఇతడు ఆ యుద్ధంలో మరణించాడు. – స్కందపురాణం

**వ్యాసకాశి :** చూ॥ వ్యాసుడు.

**వ్యాసవనం :** కురుక్షేత్రం వద్దగల ఓ అరణ్యం. ఇచ్చట వున్న మనోజవతి తీర్థంలో స్నానం చేస్తే 1000 గోవులు దానమిచ్చిన ప్రతిఫలం లభిస్తుంది. – మహాభారతం

**వ్యాసస్థలి :** కురుక్షేత్రానికి ప్రక్కనేగల ఓ పుణ్యస్థలం. తనయుని ఎడబాటువల్ల వ్యాసుడిక్కడ ఆత్మహత్య చేసుకొనే ప్రయత్నం చేశాడు. ఈ స్థలం దర్శిస్తే 1000 గోవులు దానమిచ్చిన ప్రతిఫలం లభిస్తుంది. – మహాభారతం

**వ్యాసుడు :** మహాభారత గ్రంథకర్త అయిన ఓ రుషి.

వంశవృక్షం : విష్ణువు, బ్రహ్మ, వశిష్ఠ, శక్తి, పరాశర, వ్యాస.

జననం : పరాశరునికి మత్స్యగంధి అనబడే కాళికి జన్మించాడు. జన్మించిన అతడిపేరు కృష్ణ. ఇతడు ఓ ద్వీపంలో జన్మించడం వల్ల కృష్ణ ద్వైపాయనుడన బడ్డాడు. వేదాలను విభజించడం వల్ల వేద వ్యాసుడని పిలిచారు. ఇతడు గొప్ప ఇతిహాసమైన మహాభారత గ్రంథ కర్త.

*జనన వృత్తాంతం :* ఇంతకు ముందే చెప్పినట్లు కాళి వ్యాసుని తల్లి. చేది రాజైన వసువు వేటకు వెళ్లగా జంతువుల క్రీడలు చూసి రేతపతనం కాగా దానిని తన భార్యకు పంపబోగా మార్గమధ్యమున కాళింది నదిలో పడింది. దానిని అద్రిక అనే ఒక చేప మింగింది. ఆ చేపను రెండుగా కొయ్యగా ఓ బాలిక ఓ బాలుడు బయటకు రాగా బాలుడ్ని రాజుకిచ్చి బాలికను మత్స్యకారుడు పెంచాడు. ఆమె చేపల వాసన రావడం వల్ల మత్స్యగంధిగా పిలవబడింది. ఆమె తన తండ్రికి తోడుగా ఓ పడవలో ప్రయాణీ కుల్ని కాళింది నదిని దాటించేది. ఆ పడవలో పరాశరుడు ఒకసారి ప్రయాణిస్తూ ఈమెను మోహించగా ఆమె నిరాకరించింది. అంతట పరా శరుడు తన అపర సృష్టితో ఓ ద్వీపాన్ని ఆమె శరీరపు వాసనను పోగొట్టి తన కలయిక వల్ల కన్యాత్వం కూడా పోదని అభయమిచ్చి ఆమెతో సంగమించాడు. నీకు జన్మించే బాలుడు విష్ణ్వాంశ అని అతడు వేదా లను విభజించగలడని, ప్రపంచ ప్రసిద్ధి పొందుతాడని చెప్పి వెడలిపోయాడు.

ఆ తర్వాత ఆమె ప్రసవించగా ప్రకాశవంతమైన అంద మైన బాలుడు జన్మించి తల్లీ నేను తపస్సుకు వెళ్తున్నాను. నీవు నన్ను తలచినపుడు నీకు దర్శనమి స్తానని అభయమిచ్చి అచటనుండి వెడలిపోయాడు.

– *దేవీ భాగవతం*

*ఆధ్యాత్మిక జీవనం :* వ్యాసుని జీవితంలో ఆధ్యాత్మిక భౌతిక కోణాలు రెండు దర్శనమిస్తాయి. తనతల్లి సత్య వతిని శంతనుడు వివాహం చేసుకునేవరకు ఇతడికి హస్తినాపురంతో సంబంధం లేదు. పాండవ కౌరవుల వైరుధ్యాలలో మాత్రం వ్యాసుడు పాల్గొన్నవి మాత్రమే భౌతిక జీవన విశేషాలు. అంతవరకూ అతడు అర ణ్యంలో తపస్సు చేస్తూ తన ఆశ్రమంలో శిష్యపరం పరతో వేదాధ్యయనం, బోధన చేస్తూ జీవించాడు. ఆ సమయంలో చెట్లపై గూళ్లు కట్టుకొని జీవిస్తున్న పిచ్చుకల్ని వాటి పిల్లల పోషణార్థం అవి పడే కష్టాన్ని వాటి రక్షణార్థం రెక్కల మధ్య కాపాడడాన్ని చూసిన వ్యాసుడికి సంతానం లేని జీవనం వ్యర్థంగా తోచింది. ద్వైదీభావం ఆవరించింది.

అదే ఆలోచనతో హిమాలయసానువుల్లో ప్రయా ణిస్తూ తన కోరిక ఎలా నెరవేరుతుందో ఆలోచిస్తూ ఎవరిని గూర్చి తపస్సు చేస్తే తన కోర్కె నెరవేరు తుందో తెలియని స్థితిలో వుండగా నారదుడు తటస్థించి సంతానలేమి అతని చింతనకు కారణమని గ్రహించి దేవిని గూర్చి తపస్సు చేస్తే అతని కోరిక నెరవేరు తుందని చెప్పగా వ్యాసుడు మహామేరువుకు తపస్సు చేయడానికి వెళ్లాడు.

అతడు తపస్సు చేస్తుండగా మామూలుగానే అప్స రసలు ఇతడి తపస్సు విఘ్నం చేయడానికి వచ్చారు. అందులో ఘృతాచి అనే అప్సరస పంచ రంగుల చిలుకగా మారి వ్యాసుని ముందు నిలబడగా వ్యాసుని రేతపతనమై అది వంట చెరకుపై పడగా అందుండి దేవతా పురుషుడు జన్మించాడు. చిలుకను చూసి వీర్యస్రావం కావటం వల్ల అతడు జన్మించాడు. కనుక శుకుడని నామకరణం చేశాడు. బ్రహ్మోపవీతం తర్వాత శుకుడు బృహస్పతి వద్ద విద్యాభ్యాసం చేసి తిరిగి తండ్రి ఆశ్రమానికి వచ్చి ఇతర శిష్యులతో కలసి వ్యాసుని వద్ద విద్యనభ్యసించాడు.

*కుమారుని ఎడబాటు :* ఈ కాలంలోనే కుమారుడైన శుకమహర్షి వివాహం గృహస్త జీవితం గడిపి భార్యను కుటుంబాన్ని వదలి తపస్సు చేయడానికి కైలాసంవెళ్లి ఘోరతపస్సు చేసి కైలాస శిఖరాన్ని చీల్చుకొని దైవాంశ పొంది ఆకాశానికి వెళ్లి రెండవ సూర్యుడుగా ప్రకాశించాడు. తనయుడిని తలస్తూ కైలాసానికి వెళ్లి విచారసాగరంలో వున్న వ్యాసుడ్ని శివుడు సము దాయించగా తిరిగి తన ఆశ్రమానికి వచ్చాడు. ఈ లోపు చదువు పూర్తయిన తన శిష్యులంతా అతని ఆశ్రమం వీడిపోగా అతడి మనసు తల్లి వైపుకు మరలింది.

*భౌతిక జీవనం :*
ఇదే కాలంలో హస్తినాపురంలో ఎన్నో మార్పులు సంభవించాయి. శంతన మహారాజు గంగాదేవిని వివాహమాడగా భీష్ముడు జన్మించిన తర్వాత గంగా దేవి భీష్ముడిని వదలిపోగా వేటకువెళ్లిన శంతనుడు వ్యాసుని తల్లి మత్స్యగంధిని ప్రేమించగా ఆమె కుటుంబం మత్స్యగంధి సంతానమే రాజ్యాధికారం వహించాలని కోరగా శంతనుడు నిరాకరించగా భీష్ముడు వారిని ఒప్పించి తాను ఆజన్మ బ్రహ్మచారిగా వుంటానని ప్రతిజ్ఞ చేసి తన తండ్రికి మత్స్యగంధి నిచ్చి వివాహం జరిపించాడు. సత్యవతి(మత్స్యగంధి)కి శంతనుని వల్ల చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు జన్మించారు. చిత్రాంగదుడు బాల్యంలోనే చనిపోగా విచిత్ర వీర్యుడు కాశీరాజు కుమార్తెలు అంబిక, అంబాలికలను వివాహమాడి సంతాన ప్రాప్తి కలుగక ముందే మరణించాడు. కుటుంబ వృద్ధి జరగదని భావించిన సత్యవతి వ్యాసుడ్ని తలచుకోగా వ్యాసుడు తనమాట ప్రకారం తల్లిని కలిశాడు. తల్లి కోరికపై ఇతడు అంబికకు ధృతరాష్ట్రుడు, అంబాలికకు పాండురాజు, ఇంటిదాసికి విదురుడు జన్మించడానికి కారకుడయ్యాడు.

*వ్యాసుడు–కౌరవపాండవులు :* పాండవుల మహాప్రస్థానం వరకు హస్తినాపురంలోని ప్రతి సంఘటనతో వ్యాసుడికి ఎంతో కొంత సంబంధం లేకపోలేదు.

*వ్యాసుడికి హస్తినాపురంతో సంబంధం ఉన్న కొన్ని ముఖ్య సంఘటనలు :*
వ్యాసుడు గాంధారికి 100 మంది పుత్రులు, ఒక పుత్రిక జన్మిస్తారని వరమిచ్చాడు. గాంధారి ఓ మాంసపు ముద్దను ప్రసవించగా వ్యాసుడు దానిని 100 ముక్కలు చేసి కుండల్లో వుంచగా అందుండి కౌరవులు జన్మించారు. కుంతితో కలసి పాండవులు అరణ్యంలో వుండగా వారికి దుఃఖోపశమనం చేశాడు. వారికొకసారి పాంచాలి పూర్వజన్మ వృత్తాంతాలు వివరించాడు. ధర్మజుని రాజసూయ యాగానికి ఏర్పాట్లన్ని వ్యాసుడే చూశాడు. పాండవులకు అన్యాయం చెయ్యవద్దని ధృతరాష్ట్రునికి సలహా ఇచ్చాడు. యుద్ధాన్ని నివారించడానికి ప్రయత్నించాడు. గాంధారి పాండవులను శపించకుండా ఆపాడు. మహాభారత యుద్ధానంతరం రాజ్యపాలన గూర్చి ధర్మజునికి సలహాలిచ్చాడు. ధృతరాష్ట్రుడు కోరగా మరణించిన వారి ఆత్మలను గంగానది ప్రవాహంపై నుండి అతడికి చూపించాడు. జనమేజయునికి వ్యాసుడు సలహాలిచ్చాడు.

*సాహిత్యకారుడుగా వ్యాసుడు :* జీవిత చరమాంకంలో వ్యాసుడు తిరిగి హిమాలయ గుహల్లో జీవించాడు. తన జీవితంలోని వివిధ మానవుల జీవన మానసిక ప్రవృత్తులు కదలాడాయి. జీవితంలోని సంఘటనలు ఓ వరుస క్రమంలో గుర్తుకు రాసాగాయి. ఈ సమయంలోనే వ్యాసుడు వేదాలను విభజించాడు. మహాభారత ఇతిహాసాన్ని రచించడం జరిగింది. అయితే మహాభారత రచన వ్యాసుడ్ని తర్వాతి తరాలకు సుప్రసిద్ధుడ్ని చేసింది. కౌరవ పాండవుల కథ అతని నోటి నుండి గంగా ప్రవాహంలా జాలువారింది. దీనిని గ్రంథస్తం చేయడానికి బ్రహ్మ గణపతికి మాత్రమే సాధ్యమనగా వ్యాసుడు గానం చేస్తుంటే గణపతి రాస్తూపోయాడు. ఈ గ్రంథ రచన రెండున్న సంవత్సరాలు పట్టగా వ్యాసుని శిష్యులైన వైశంపాయనుడు, జైమిని దీనిని ప్రజల హృదయాలకు జేర్చడంలో కృతకృత్యులయ్యారు. – మహాభారతం

*ఎందరో వ్యాసులు :*
పురాణాల ప్రకారం ఒక్కో మన్వంతరంలో ఒక్కో వ్యాసుడు జన్మిస్తారని అలా 28 మంది వ్యాసులు జన్మించి వారి వారి కాలంలో విభజన చేశారని పురాణాలు పేర్కొంటున్నాయి. వచ్చే ద్వాపరయుగంలో అశ్వత్థామ వ్యాసుడుగా జన్మిస్తాడని పురాణాలు చెప్తున్నాయి.

*ఇతర విశేషాలు :*
పండితులు వ్యాసుడు క్రీ.పూ. 1800 – 1500 నాటి వాడని, వ్యాసుడంటే విపులంగా చెప్పేవాడని వేదాలన్నింటిని వర్ణించాడు కనుక వ్యాసుడన్నారని చెప్తారు. వ్యాసుడ్ని మహాభారతంలో కృష్ణ, కృష్ణ ద్వైపాయన, ద్వైపాయన, సత్యవతీసుత, సత్యవతాత్మజ, పారాశరాయ, పారాశరాత్మజ, బాదరాయణ, వేదవ్యాస అనే నామాంతరాలతో వర్ణించబడింది.

**వృషితాశ్వుడు :** పూరు వంశంలో ఒక రాజు. ఇతడు ధర్మబద్ధుడు. ఎన్నో యాగాలు చేశాడు. ఇతని భార్య కాక్షివాణుని కుమార్తె భాద్ర. ఈమె భారతదేశంలోనే అందగత్తె అని చెప్పబడింది. ఇతడు అకాలమరణం

చెందాడు. రాజు చనిపోయినపుడు సంతానంలేదు. చనిపోయిన శరీరంపై పడి ఆమె దుఃఖించగా అతని ఆత్మ "నీ మీద నాకున్న ప్రేమ నీ బహిష్టుకాలంలో 8వ రోజు, 14వ రోజు నీతో వుంటుంది. నీకు సంతాన ప్రాప్తి కల్గుతుంది అని చెప్తుంది. రాజు కోర్కె ప్రకారం ఆమె విధి నిర్వహించగా అతని మృత దేహంవల్ల ఆమెకు ఏడుగురు సంతానం కల్గారు.
– మహాభారతం

**వృష్టి :** పగటి కాలానికి మరోపేరు.

**వృష్టుడు :** ధ్రువుని వంశంలోని ఒక రాజు. పుశపార్ణుడి కుమారుడు. సర్వతేజసుడను పుత్రుడు కలడు.
– భాగవతం

**వృకం :** ప్రాచీన భారతావనిలో ఒక రాజ్యం.
– మహాభారతం

**వ్యూఢోరుడు :** ధ్రుతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో భీముడితణ్ణి వధించాడు.
– మహాభారతం

**వ్యూహం :** సైన్యాన్ని నాల్గు భాగాలుగా విభజించడం. సిపాయిలు, గుర్రాలు, ఏనుగులు, రధాలు, వ్యూహాలలో కొన్ని అర్థచంద్రవ్యూహం, గరుడవ్యూహం క్రౌంచ వ్యూహం, చక్రవ్యూహం, మకరవ్యూహం, మండల వ్యూహం, మండలార్థ వ్యూహం, వజ్ర వ్యూహం, శాక్త వ్యూహం, శ్యేనవ్యూహం, సర్వతోభద్ర వ్యూహం, సువర్ణ వ్యూహం, సూచి ముఖ వ్యూహం. – మహాభారతం

**వ్యోమారి :** ఓ విశ్వదేవుడు. – మహాభారతం

**వ్యోమాసురుడు :** మయూరాసురుని కొడుకు. కృష్ణుడి తణ్ణి సంహరించాడు.

**వ్యోముడు :** భరతుని వంశంలో జన్మించిన ఒక రాజు. ఇతడు దాశార్హుని కుమారుడు, జీమూతునికి తండ్రి.
– భాగవతం




**శకటాలుడు :** ఓ తెలివైన మంత్రి. – చూ॥ వరరుచి

**శకటుడు :** ఓ అసురుడు. – చూ॥ కృష్ణుడు

**శకం :** సింధునది సంగమ స్థానంలోని పశ్చిమ దిక్కున గల ప్రాంతం. ఈ దేశంలో నివసించే వారిని శాకుల నేవారు. – మహాభారతం

**శకంధర :** ఆంధ్రదేశంలోని ఓ సామంతరాజు ఏలిన ప్రాంతం.

**శకుని 1 :** ధృతరాష్ట్రుని వంశంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది.
– మహాభారతం

**శకుని 2 :** హిరణ్యాక్షుని కుమారుడైన ఓ అసురుడు. శంబర, త్రిమూర్ధ, శంకు, ఆర్య ఇతని సోదరులు.
– అగ్నిపురాణం

**శకుని 3 :** భరత వంశంలోని ఓ రాజు. భీమరధుని కుమారుడు. ఉరుద్భికి తండ్రి. – భాగవతం

**శకుని 4 :** ఇక్ష్వాకుని కుమారుల్లో ఒకడు.

**శకుని 5 :** ఓ ముని. ఇతనికి 9 మంది కుమారులు. వారు ధ్రువ, శాలి, బుధ, తార, జ్యోతిష్మాన్, నిర్మోహ, జతకామ, ధ్యానకాష్ఠ, గుణాధికులు. మొదటి 5 గురు గృహస్త జీవితం గడపగా తక్కిన నల్గురు బాల్యంలోనే సన్యాసం స్వీకరించారు. – పద్మపురాణం

**శకుని 6 :** దురాలోచనాపరుడైన దుర్యోధనుని మేన మామ. గాంధార రాజు సుబలుని పుత్రుడు. గాంధారికి సోదరుడు. వృషకుడు, అచలుడు ఇతని సోదరులు. ఇతని కుమారుడు ఉలూకుడు. హస్తినాపురంలో వుంటూ దుర్యోధనుని దుర్మార్గపు చేష్టలకు పాండవులను వనవాసులను చేయుటలో ద్రౌపది వస్త్రాపహరణంలో చివరికి సంధివిఫలమై మహాభారతం సంగ్రామం జరగడంలో ఇతడి కుయుక్తులే ప్రముఖమైనవి కాగా చివరికి మహాభారత యుద్ధంలో సహదేవుని చేతిలో మరణిస్తాడు.

*ఇతడి నామాంతరాలు :* గాంధారపతి, గాంధారరాజ, గాంధార రాజపుత్ర, గాంధార రాజసుత, కితన పార్వతీయ, సౌబల, సాబలక, సౌబలేయ, సుబలజ, సుబలపుత్ర.

**శకునం :** శుభాశుభ సూచికలను శకునం అంటారు. అన్ని దేశాలలో వీటి నమ్మకం వుంది. భారతదేశంలో కూడా ప్రాచీన కాలం నుండి నేటివరకు ఈ సూచికలను నమ్ముతారు. ఇవి రెండు రకాలు. శుభ సూచకాలు, అశుభ శూచకాలు.

నల్లటి విత్తనాలు, ఎండిపోయిన పేడ, కట్టెలు, గుండుతో వున్న వ్యక్తులు మన ప్రయాణానికి ఎదురైతే అశుభం. ఎక్కడికి ప్రయాణం ఎంతదూరం, పనేమిటి అని ఎవరైనా అడిగితే అది అశుభం. మాంసాహారం తినే జంతువులు ఎదురైనా అశుభమే.

తెల్లని పుష్పాలు, నీళ్లకుండలు, శుభ సూచికలు, ఆయుధాలు, రాజముద్రికలు, ఫలాలు, తేనె, భాగవత నామస్మరణలు విన్పించినా అవి శుభసూచికలే. రాత్రుళ్లు కన్పించేవి పగలు, పగలు కన్పించేని రాత్రి పూట కన్పిస్తే అశుభం. అలాగే జంతువులు, పక్షులు వాటి అరుపులు రకరకాల శకునాలకు ప్రతీకలు – వాటినిబట్టి ప్రాచీనకాలం నుండి నేటి వరకు వారి ప్రయాణాలు జరపడం మానుకోవడం అపశకునాలకు తగిన పూజలు నిర్వహించడం మన సాంప్రదాయంలో భాగం.

**శకునిక :** సుబ్రహ్మణ్యస్వామి సేవిక. – మహాభారతం

**శకునిగ్రహం :** వినత మరో రూపమే శకుని గ్రహం. బ్రాహ్మణులు దీన్ని స్కందీపస్మారమని పిలుస్తారు.
– మహాభారతం

**శకులు :** ఒక ప్రత్యేక తెగకు చెందిన ప్రజలు. వీరు వసిష్ఠుని గోవు హృదయం నుండి జన్మించారు. భీమసేనుడు తూర్పు రాజ్యాలను జయించినపుడు వీరిని కూడా జయించాడు. నకులుడొకసారి జయించాడు. ధర్మజుని రాజసూయ యాగానికి వచ్చారు. పాండవులు వీరిని యుద్ధంలో పాల్గొనమని ఆహ్వానించారు. కాంభోజరాజుతోపాటు వీరు దుర్యోధనుడికి తమసేవలందించారు. శ్రీకృష్ణుడొకసారి, కర్ణుడొకసారి వీరిని జయించారు. వీరు మొదట క్షత్రియులు బ్రాహ్మణులకు కోపం కలిగించి శూద్రులయ్యారు.
– మహాభారతం

శకులు, యవనులు హైహయ రాజులకు సహాయపడ్డందువల్ల వీరిని పరశురాముడు, సగరుడు, భరతుడు వీరి దేశం నుండి వెడలగొట్టారు.
– భాగవతం

**శకుంతల :** విశ్వామిత్రునికి మేనక వల్ల జన్మించిన పుత్రిక. విశ్వామిత్రుడు దీర్ఘతపస్సులో వుండగా దానిని విచ్ఛిన్నం చేయడానికి ఇంద్రుడు మేనక అనే అప్సరసను పంపగా ఆమె అతడి తపస్సు భగ్నం చేసి అతని వల్ల గర్భవతియై ఆ శిశువును మాలిని నదీ తీరాన వదలి దేవలోకం చేరింది.

పక్షులు ఆ శిశువు చుట్టూ చేరి రక్షించి పెంచాయి. శాకుంతలాలచే రక్షింపబడింది కనుక ఆమె శకుంతల అని పిలవబడింది. ఆ దారిని వెళ్తున్న కణ్వమహర్షి ఆ శిశువును తన ఆశ్రమంలో వుంచి పెంచి పెద్ద చేశాడు. చంద్ర వంశపు రాజైన దుష్యంతుడు ఈమెను వివాహమాడగా ఆ దంపతులకు భరతుడు జన్మించాడు. అయితే వీరి దాంపత్య జీవితాన్ని గురించి భారతీయ భాషల్లో రెండు కథనాలున్నాయి. ఒకటి వ్యాస భారతంలోని కథనం కాగా రెండవది కాళిదాసు విరచిత గ్రంథం.

*వ్యాస శకుంతల :* శకుంతల కణ్వుని ఆశ్రమంలో పెద్దదై అందాలయువతిగా పరిణమించగా కణ్వుడు లేని సమయంలో దుష్యంతుడు వేటకు వచ్చి కణ్వుని ఆశ్రమానికి రాగా శకుంతల అతడిని ఆహ్వానించింది. గాంధర్వ వివాహం చేసుకొని దాంపత్య జీవితం గడిపి మరల వచ్చి రాజ్యానికి తీసుకువెళతానని చెప్పి దుష్యంతుడు వెళ్లిపోగా ఆమె గర్భవతియై ఓ పుత్రుడికి జన్మనిచ్చింది. కణ్వుడు ఆశ్రమానికి వచ్చి ఏది జరగాలో అదే జరిగిందని తలచి బిడ్డతో సహా శకుంతలను రాజు భవంతికి పంపగా దుష్యంతుడు ఆమెను గుర్తించక నిరాకరించగా ఓ దైవవాణి జరిగింది విన్పించగా దుష్యంతుడు ఆమెను సాదరంగా ఆహ్వానిస్తాడు. ఆమె పుత్రుడే భరతుడు.

*కాళిదాసు శకుంతల :* గాంధర్వ వివాహం వరకు కథ పైన చెప్పినట్లే అయినా దుష్యంతుడు వెళ్తూ గుర్తుగా తన వేలి ఉంగరం ఆమెకు బహూకరిస్తాడు. ఒకసారి దుర్వాసుడు ఆశ్రమానికి రాగా అమె భర్త ఆలోచనల్లో పడి అతడిని గమనించకపోవడం వల్ల ఆమెను అతని భర్త గుర్తించదని శపిస్తాడు. శకుంతల చెలికత్తెలు శాపవిమోచన కోరగా అతడి గుర్తుగల చిహ్నం ఏదైనా చూపిస్తే గుర్తించగలడని చెప్తాడు. శకుంతల ఓ కొలనులో స్నానం చేస్తుండగా ఆ ఉంగరం జారిపోయింది. ఆమె దుష్యంతుని రాజప్రాసాదానికి వెళ్లి అతడిచే తిరస్కరించబడగా మేనక ఈమెను కశ్యపుని ఆశ్రమంలో చేర్చి దేవలోకం వెళ్తుంది.

కొలనులో పడిన శకుంతల ఉంగరాన్ని ఓ చేప మ్రింగగా మత్స్యకారుడు ఆ చేపను కోయగా బయటపడిన ఆ ఉంగరం చూసి రాజభటులు అతణ్ణి బందీగా తీసుకు వెళ్తారు. ఆ ఉంగరం చూసిన రాజు గతం గుర్తుకు వచ్చి విచారంగా జీవిస్తూ కాలయాపన చేస్తూ దేవతల

కోరికపై అసురులతో యుద్ధం చేసి తిరిగి వస్తూ కశ్యపుని ఆశ్రమంలో సింహం నోట్లో చెయ్యిపెట్టి పళ్లుపట్టి లాగుతున్న బాలుణ్ణి చూసి ఆ ఆశ్రమం వద్దకు వెళ్లి శకుంతలను గుర్తించి ఆమెను ఆ బాలుణ్ణి తన రాజప్రాసాదానికి తీసుకొనివెళ్తాడు. తర్వాత ఆ బాలుడే భరతుడనే ప్రసిద్ధ చక్రవర్తి అవుతాడు.

**శకుంతుడు :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు. ఇతడు వేదాంతి. – మహాభారతం

**శకృద్గృహం :** ప్రాచీన భారతదేశంలో ఓ గ్రామీణ ప్రాంతం. – మహాభారతం

**శక్రకుమారిక :** ఓ పవిత్ర స్థలం. ఇచ్చట స్నానమాచరిస్తే స్వర్గలోక ప్రాప్తి కలుగుతుంది. – మహాభారతం

**శక్రదేవుడు :** కళింగ రాజకుమారుడు. కౌరవుల పక్షాన పోరాడి భీమునిచే సంహరింపబడ్డాడు. – మహాభారతం

**శక్రవాసి :** ఓ నాగువు. గిరివ్రజం వద్దగల అరణ్యంలో నివసించేది. ఇది గౌతముని ఆశ్రమం వద్ద వుంది. – మహాభారతం

**శక్రావర్తం :** ఓ పుణ్యస్థలం. ఇచట దేవతల్ని తమ పూర్వీకుల్ని పూజిస్తే పుణ్యలోకాలు చేరతారు. – మహాభారతం

**శక్తి 1 :** సుబ్రహ్మణ్యస్వామి ఆయుధం. విశ్వకర్మ సూర్యుడ్ని సానబట్టి ఆ రవ్వలు భూమిపై పడగా వాటితో విష్ణువు ఆయుధమైన సుదర్శన చక్రం, శివుని ఆయుధమైన త్రిశూలం, కుబేరుని పుష్పకవిమానం, కుమారస్వామి ఆయుధమైన శక్తిని తయారుచేశాడు. – విష్ణుపురాణం

**శక్తి 2 :** 'శ' అనే శబ్ధానికి అర్థం భాగ్యం, 'క్తి' అనగా బలం. శక్తి అనగా సౌభాగ్యం బలము బహూకరించ గల స్త్రీ. భగవతి అనగా జ్ఞానము, సంపద, బలము స్త్రీ లక్షణాల కలయిక. కాబట్టి శక్తి అనగా భగవతి, శక్తి, దేవి, అంబిక, పార్వతి. ఆమె శివుని సహచరి. ఈ శక్తి దేవతలందరిలో వుంటుంది. ఒకసారి దేవాసురులకు యుద్ధం సంభవించగా దేవతలు, బ్రాహ్మణి, వైష్ణవి, శంకరి, కౌమారి, వారహి, యామ్య, కౌబేరి, వారుణి శక్తులు చండికకు సహాయపడగా దేవతల లోకము ఆనందించింది. వీటితో పాటు శంకరుడు భూమిపై జనించి చండికను అభినందించాడు. ఆ శక్తే మహిషాసురుణ్ణి వధించింది. – దేవీ *భాగవతం*

**శక్తి 3 :** అరుంధతికి వసిష్ఠుని వల్ల జన్మించిన కుమారుల్లో పెద్దవాడు. కల్మషపాదుడను అసురుడు ఈ శక్తిని తినివేయగా గర్భిణిగా వున్న అతని భార్య అదృశ్యంతి వసిష్ఠుని వద్ద దుఃఖించింది. వ్యాసుని తండ్రియైన పరాశరుడు అదృశ్యంతి కుమారుడు. శక్తి శివుని యొక్క అవతారం. గోసాయన, భారద్వాజ, ఆపస్తంభ, అర్గోదరుడు శక్తి యొక్క శిష్య పరంపర లోనివారు. – వామనపురాణం

**శక్తిభద్రుడు :** క్రీ.శ. 7వ శతాబ్దంలో జీవించిన గొప్ప సంస్కృత నాటక కర్త. శంకరాచార్యుడి శిష్యుడు. 'ఆశ్చర్య చూడామణి' అనే గ్రంథం రచించి గురువుకు చదివి విన్పించగా శంకరాచార్యుడు నిశ్శబ్దంగా వుండటం చూసి గురువుకు నచ్చలేదని భావించి ఆ గ్రంథాన్ని తగలబెట్టాడు. మరుసటిరోజు శంకరాచార్యుడు ఆ గ్రంథాన్ని ఇమ్మని కోరగా జరిగింది శక్తి భద్రుడు చెప్పగా శంకరాచార్యుడు యథాతథంగా ఆ గ్రంథాన్ని పఠనం చేయగా శక్తిభద్రుడు ఆశ్చర్య చకితుడయ్యాడు. ఈ కథ కేరళలో ప్రసిద్ధమయ్యింది.

**శక్తిమతి :** సురథుడనే రాజు పాలించిన పట్టణం. – *జైమిని భారతం*

**శక్రుడు 1 :** మనస్వి కుమారుడు. మనస్వి పూరుచక్రవర్తి ముని మనుమడు. సౌవీరి ఇతని తల్లి. ఇతని సోదరులు సంహోనుడు, వాగ్మి. ఇద్దరూ కూడా యుద్ధ విద్యలో నేర్పరులు. – మహాభారతం

**శక్రుడు 2 :** ఇంద్రుని నామాంతరం. – చూ॥ ఇంద్రుడు

**శచి :** పులోముడి కుమార్తె. ఇంద్రుని భార్య. కొడుకు జయంతుడు. కూతురు జయంతి. నహుషుడు ఇంద్రుడైనప్పుడు శచీదేవిని తన కోరిక తీర్చమనగా సప్తర్షులు మోసుకువచ్చే పల్లకిమీద వస్తే అంగీకరిస్తానంటుంది. సప్తర్షులు నిరాకరించగా ఆమె ఆపద నుండి బయటపడుతుంది.

శచీదేవి అంశే ద్రుపదనందన పాండవుల భార్య ద్రౌపది. ఈమె గొప్ప ఆసనంపై ఇంద్రుని సభలో ఆసీనురాలై వుంటుంది. ఈమె శ్రీకృష్ణుడ్ని, సత్యభామను దేవమాత వద్దకు తీసుకువెళ్తుంది. ఇంద్రుడు

బ్రహ్మ హత్యాపాతకంతో దేవలోకం నుండి వెళ్ళిన పుడు ఈమె బృహస్పతి సంరక్షణలో వుంటుంది. ఈమె సుబ్రహ్మణ్య స్వామి జన్మ సమయంలో అక్కడే వుంటుంది. – మహాభారతం

**శచీదేవి :** కన్యకాంబగా వెలసిన దేవత. – చూ॥ కన్యకాంబ

**శతకుంభ :** ఓ పుణ్యనది. అగ్ని జన్మస్థలం. – మహాభారతం

**శతగామి :** జటాయువు కొడుకు.

**శతగోపుడు :** ఓ యాదవుడు. నందుడి బావమరిది. రాధకు తండ్రి. – పాండురంగ మహాత్యం

**శతఘంట :** సుబ్రహ్మణ్యస్వామి స్త్రీ పరిచారిక. – మహాభారతం

**శతచంద్రుడు :** శకుని సోదరుడు. ఇతడు మహాభారత యుద్ధంలో కౌరవుల పక్షాన పోరాడి భీముని చేతిలో ఓటమిచెందాడు. – మహాభారతం

**శతజిత్తు 1 :** సహస్రజిత్తు కుమారుడైన ఓ యాదవ రాజు. ఇతడికి ముగ్గురు కుమారులు. వారు మహా హయ, వేణుహయ, హేహయులు. – భాగవతం

**శతజిత్తు 2 :** జాంబవతికి శ్రీకష్ణుని వల్ల జన్మించిన కుమారుడు. ప్రభాస తీర్థంలో యాదవుల మధ్య జరిగిన యుద్ధంలో మరణించాడు. – మహాభారతం

**శతజ్యోతి :** సుభ్రాతుడను రాజకుమారుడు. ఈ రాజుకు లక్షమంది కుమారులు. – మహాభారతం

**శతద్యుమ్నుడు :** చాక్షుష మనువుకు నడ్వల వల్ల జన్మించిన కుమారుడు. – విష్ణుపురాణం
నడ్వలకు 10 మంది పుత్రులు. అందులో శతద్యుమ్నుడొకడు. ఇతడు మద్గలుడను బ్రాహ్మణునికి బంగారు ఇంటిని బహూకరించగా స్వర్గ లోకప్రాప్తి లభించింది. – మహాభారతం

**శతద్రు :** ప్రస్తుత నది సట్లజ్‌కి పురాణకాలం నాటి పేరు. పుత్రశోకంతో వసిష్ఠుడు ఈ నదిలోకి దూకగా ఈ మహర్షిని శక్తివంతుడైన అగ్నిగా భావించి ఈ నది 10 భాగాలుగా చీలిపోయింది. అప్పటి నుండి ఈ నదికి శతద్రు అనే పేరు వచ్చింది. – మహాభారతం

**శతధన్వుడు 1 :** అశోకుడి వంశంవాడైన సోమశర్మ కొడుకు. ఇతడి కొడుకు బ్రహద్రథుడు.

**శతధన్వుడు 2 :** ఓ యాదవ రాజు. సత్రాజిత్తు తన కుమార్తెను ఇతడికిచ్చి వివాహం చేస్తానని చెప్పి తర్వాత శ్రీకృష్ణుడికిస్తాడు. ఇతడు కృతవర్మ అక్రూరుడి మాటలు విని సత్రాజిత్తును సంహరించగా దానికి ప్రతిగా శ్రీకృష్ణుడితణ్ణి వధిస్తాడు. – భాగవతం

**శతధృతి 1 :** బ్రహ్మ నామాంతరం

**శతధృతి 2 :** ప్రాచీనబర్హి భార్య. సముద్రుడి కూతురు. ప్రచేతసుల తల్లి.

**శతపత్రవ్రతం :** ద్వారకకు పశ్చిమాన గల అరణ్యం. సుకక్ష అనే పర్వతం ఈ అరణ్యం మధ్యలో వుంది. – మహాభారతం

**శతపర్వ :** శుక్రాచార్యుడి భార్య. – మహాభారతం

**శతబల :** కుమార పర్వతంపై గల రావిచెట్టు. దీని కొమ్మల నుండి పాలు, మజ్జిగ, నెయ్యి, చెరకు రసం పారుతూ వాటితోపాటు దైవికమైన వస్తువులు, వస్త్రాలు ఇచట నుండి వచ్చే నదుల్లో ప్రవహిస్తాయి. ఈ నది నుండి వచ్చే బియ్యం ఈ ప్రాంత ప్రజలు పొందుతారు. దేవతలు పొగిడే మీనాక్షిదేవి ఇక్కడ నివసిస్తుంది. ఈ నదిలో నీటిని త్రాగేవారికి ఆకలి దప్పులు వుండవు. – దేవీభాగవతం

**శతబలి :** సుగ్రీవుని సైన్యంలోని ఓ గొప్ప వానరుడు. సీతను అన్వేషించడానికి ఉత్తర దిశకు పంపిన వానరులకు నాయకత్వం వహించాడు. – రామాయణం

**శతబిందువు :** బిందుమతి తండ్రి. ఇతడు తన కుమార్తెను మాంధాతకిచ్చి వివాహం చేశాడు. – భాగవతం

**శతభిష :** ఓ నక్షత్రం. ఈ నక్షత్రం కన్పించిన రోజున సుగంధ ద్రవ్యాలు దానమిస్తే మరణానంతరం అప్సరసతో సుఖించవచ్చు. – మహాభారతం

**శతముఖుడు 1 :** ఇంద్రుడి నామాంతరం. నూరు యజ్ఞాలు చేసినవాడని అర్థం.

**శతముఖుడు 2 :** ఇందుముఖి తండ్రి. ఇతడు పాతాళ రావణుడ్ని ఓడిస్తాడు. కఠోరకుఠారమనే దివ్యాస్త్రాన్ని తన కూతురికి కట్నంగా ఆమెభర్త సహస్రముఖ రావణుడికి సమర్పిస్తాడు. – చూ॥ సహస్రముఖ రావణుడు.

**శతముఖుడు 3 :** ఓ అసురుడు. శివుడ్ని గూర్చి కఠోర తపస్సు చేస్తాడు. 100 సంవత్సరాలు అలా తపస్సు చేసి తన శరీర భాగాల్ని అగ్నికర్పిస్తాడు. శివుడు ఇతడి భక్తికి మెచ్చి ఎన్నో వరాలు ఇస్తాడు.
– మహాభారతం

**శతయూపుడు :** కేకయ రాజర్షి. రాజ్యాన్ని తన కుమారుడికి వదలి అరణ్యాలకు వెళ్తాడు. అక్కడ ధృతరాష్ట్రుడికి అరణ్యజీవితంలో గడపవలసిన విధానాన్ని బోధిస్తాడు. ఇతడి తాత పేరు సహస్ర చిత్యుడు. – మహాభారతం

**శతరథుడు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. యముని కొలువులో వుండి అతణ్ణి పూజిస్తుంటాడు.
– మహాభారతం

**శతరుద్రుడు :** 'జీవితం భ్రమ' అనే విషయాన్ని శ్రీరాముడికి వివరించడానికి వ్యాసుడితని కథను చెప్తాడు. ఇతనికి స్వప్నంలో అనేక జన్మలు గడుస్తాయి. స్వప్నంలో బ్రాహ్మణుడిగా, రాజుగా, చక్రవర్తిగా, అప్సరసగా, స్త్రీగా, ఆడ లేడిగా ఇంకెన్నో జీవితాలు గడిపి రుద్ర రూపంతో వుండగా స్వప్నం నుండి బయటపడి స్వస్వరూపుడై మాయాప్రభావానికి ఆశ్చర్యపడతాడు.
– జ్ఞానవాసిష్ఠం

**శతరూప :** స్వాయంభవ మనువు సోదరి. స్వాయంభవ మనువు తన సోదరినే వివాహమాడగా వీరికి ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు జన్మిస్తారు. ప్రసూతి, ఆకూతి అనే కుమార్తెలు కూడా వీరికి జన్మిస్తారు. ప్రసూతిని దక్షప్రజాపతి, ఆకూతిని రుచి ప్రజాపతి వివాహమాడారు.
– విష్ణుపురాణం

**శతలోచనుడు :** సుబ్రహ్మణ్యస్వామి అనుచర యోధుల్లో ఒకడు. – మహాభారతం

**శతవని :** ఓ రాజర్షి. ఇతని కుమారుడు శాతవనేయుడు.
– ఋగ్వేదం

**శతవలి :** సుగ్రీవుడి సేనలో ఓ వానర నాయకుడు. సీతాన్వేషణకు ఇతడు ఉత్తర దిశగా వెళ్తాడు.
– రామాయణం

**శతశీర్ష :** నాగరాజైన వాసుకి భార్య. – మహాభారతం

**శతశృంగుడు 1 :** శతశృంగ పర్వతంపై నివసించిన ఓ రుషి. పాండురాజును స్త్రీ సంగమానికి పాల్పడితే మరణిస్తావు అని శపించిందితడే. – మహాభారతం

**శతశృంగుడు 2 :** ఓ రాక్షసుడు. ఇతడికి ముగ్గురు కొడుకులు. వారు సమ్యమ, వియమ, సుయమ.
– మహాభారతం

**శతశృంగం :** పాండు రాజు క్రతువులు నిర్వహించిన పర్వతం. పాండవులు జన్మించింది ఈ పర్వతం మీదే. రుషుల సమక్షంలో ఇచ్చటే వీరికి నామకరణం జరిగింది. ఈ పర్వతం పైనే పాండురాజు మరణించాడు. అర్జునుడు కృష్ణుడితో కలసి కలలో విహార యాత్ర చేసినపుడు ఈ పర్వతాన్ని కూడా దర్శించాడు.
– మహాభారతం

**శతసహస్రం :** కురుక్షేత్రంలోని ప్రసిద్ధ పుణ్యస్థలం. ఇచ్చట స్నానం చేస్తే 1000 గోవులు దానం ఇచ్చిన ఫలితం లభిస్తుంది. ఇతర పుణ్యస్థలాల కంటే 1000 రెట్లు పుణ్యప్రదమైనది – మహాభారతం

**శతసాహస్రకం :** గోమతి నది వద్ద గల రామతీర్థానికి దగ్గరలో గల పుణ్యస్థలం. ఇక్కడ స్నానం చేసి శాస్త్రాలు విధించిన నిబంధనలతో ఆహారం తీసుకుంటే 1000 గోవులు దానమిచ్చిన ప్రతిఫలం లభిస్తుంది.
– మహాభారతం

**శతసేనుడు :** యదువంశంలోని వాడు. కృష్ణుడి వంశస్థుడైన ఉగ్రసేనుడి కొడుకు.

**శతహ్రద :** విరాధుడనే రాక్షసుడి తల్లి. ఈమె భర్త పేరు జయుడు. – రామాయణం

**శతాక్షి :** దేవి మరో నామంతరం.

**శతానంద :** సుబ్రహ్మణ్యస్వామి పరిచారిక.
– మహాభారతం

**శతానందుడు 1 :** జనకుని పురోహితుడు. గౌతమ అహల్యలకు జన్మించాడు. శ్రీరాముని పాదంసోకి అహల్య నిజరూపం దాల్చినపుడు ఇతడు ఆహ్లాదించాడు. సీతారామ కళ్యాణానికి ఇతడు ముఖ్య పురోహితుడు.
– రామాయణం

**శతానందుడు 2 :** ఓ మహర్షి. ఇతనికి దైవికమైన శక్తులున్నాయి. ఇతడు అంపశయ్యపైగల భీష్ముడ్ని దర్శించాడు. – మహాభారతం

**శతానీకుడు 1 :** యయాతి వంశంలోని ఒక రాజు. బృహద్రథుని కుమారుడు. ఇతని కుమారుడు దుర్దముడు. – భాగవతం

**శతానీకుడు 2 :** పరీక్షిత్తు కుమారుడైన జనమేజయుడికి జన్మించిన ఓ యువరాజు. ఇతడు విదేహ రాజ కుమారిని వివాహమాడగా అశ్వమేఘదత్తుడు జన్మించాడు. ఇతనికి సహస్రానీకుడను మరో కుమారుడు కూడా కలడు. – మహాభారతం

**శతానీకుడు 3 :** కురువంశంలో జన్మించిన రాజర్షి. ఇతడికి స్మృతిగా నకులుడు తన కుమారుడికి ఇదే నామకరణం చేశాడు. – మహాభారతం

**శతానీకుడు 4 :** నకులుని కుమారుడు. ద్రౌపదీ నకులులకు జన్మించాడు. ఉపపాండవుల్లో ఒకడు. నకులుడు తన పూర్వీకుడగు కురు వంశ రాజర్షి అయిన శతానీకుడి పేరు ఇతనికి పెట్టాడు. ఇతడు విశ్వదేవుని అంశ వల్ల జన్మించాడు. ఇతడు మహా భారత యుద్ధంలో జయత్సేన, దుష్కర్ణ, చిత్రసేనుల్ని ఓడించాడు. ఇతడు కృషసేన, శృతకర్మ, అశ్వత్థామలతో యుద్ధం చేశాడు. ఈ యుద్ధంలో భూతకర్మనుడిని, కళింగయువ రాజుని సంహరించాడు. అశ్వత్థామ అస్త్రానికి ఇతడు మరణించాడు. ఇతనికి గల నామాంతరాలు నకుల పుత్ర, నకుల దాయాద, నాకులి. – మహాభారతం

**శతానీకుడు 5 :** విరాటుని సోదరుడు. సూర్యదత్తుడని కూడా పిలుస్తారు. కౌరవులు విరాటుని గోవుల్ని తోలుకు పోతుంటే ఇతడు వారితో యుద్ధం చేశాడు. మహాభారత యుద్ధంలో పాండవుల పక్షాన పోరాడాడు. భీష్ముని వల్ల గాయపడ్డాడు. శల్యుడితణ్ణి వధించాడు. – మహాభారతం

**శతానీకుడు 6 :** విరాటుని చిన్న తమ్ముడు. మహాభారత యుద్ధంలో ద్రోణుడితణ్ణి సంహరించాడు. – మహాభారతం

**శతాయువు 1 :** పురూరవుడికి ఊర్వశికి జన్మించిన 6 గురు కుమారుల్లో ఒకడు. – మహాభారతం

**శతాయువు 2 :** కౌరవుల పక్షాన పోరాడిన యోధుడు. భీష్ముడు పన్నిన యుద్ధ వ్యూహంలో నిల్చి పోరాడి మరణించాడు. – మహాభారతం

**శత్రుఘాతి :** శత్రుఘ్నుడి కుమారుడు. ఇతడు వైదిశం అనే నగరానికి రాజు. – రామాయణం

**శత్రుఘ్నుడు :** శ్రీరాముని సోదరుడు. ఇతడు లక్ష్మణుడు సుమిత్ర కుమారులు. శృతకీర్తి ఇతని భార్య. రాముని ఆజ్ఞపై మధువనంలోని లవణాసురుడ్ని సంహరించి మధురాపురి నగరాన్ని నిర్మించాడు. ఇతడి తర్వాత ఇతని ఇద్దరు కుమారులు ఈనగరంలోనే నివసించారు. సూర్యవంశం అంతరించిన తర్వాత ఈ నగరం యాదవుల వశమయ్యింది. – రామాయణం

**శత్రుజిత్తు :** ఓ యువరాజు. ధ్రువ సంధి రెండవ భార్య లీలావతికి జన్మించాడు. – చూ॥ ధ్రువసంధి

**శత్రుంజయుడు 1 :** శౌవీర యువరాజు. ద్రౌపది స్వయంవరానంతరం జరిగిన యుద్ధంలో అర్జునుడు ఇతణ్ణి వధించాడు. – మహాభారతం

**శత్రుంజయుడు 2 :** ధృతరాష్ట్రుని కుమారుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో భీష్ముడ్ని కాపాడడానికి నియమించబడ్డాడు. ఇతడు కేకయ రాజుతో యుద్ధం చేశాడు. భీముడితణ్ణి వధించాడు. – మహాభారతం

**శత్రుంజయుడు 3 :** కౌరవుల పక్షాన పోరాడిన యోధుడు. కర్ణుడికి సోదరుడు. అర్జునుడు ఇతణ్ణి వధించాడు.

**శత్రుంజయుడు 4 :** మహాభారత యుద్ధంలో పాల్గొన్న మరో వీరుడు. అభిమన్యుడితణ్ని వధించాడు. – మహాభారతం

**శత్రుంజయుడు 5 :** ద్రుపదుని కుమారుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో అశ్వత్థామ ఇతణ్ణి వధించాడు. – మహాభారతం

**శత్రుంజయుడు 6 :** సౌవీర రాజు. భరద్వాజుని కుమారుడైన కణికుడు ఇతనికి రాజనీతి బోధించాడు. – మహాభారతం

**శత్రుతపనుడు :** ఓ అసురుడు. కశ్యప ప్రజాపతి దనులకు జన్మించాడు. – మహాభారతం

**శత్రుంతపుడు :** దుర్యోధనుని తరపున పోరాడిన ఓ రాజు. విరాటుని గోవుల్ని కౌరవులు మరల్చినపుడు జరిగిన యుద్ధంలో అర్జునుడితణ్ణి వధించాడు. – మహాభారతం

**శత్రుమర్దనుడు :** రుతధ్వజుడికి మదాలసకు జన్మించిన మూడవ కుమారుడు. – మార్కండేయ పురాణం

**శత్రుసహుడు :** ధృతరాష్ట్రుని కుమారుడు. మహాభారత యుద్ధంలో భీముడితణ్ణి వధించాడు. – మహాభారతం

**శతోదరి :** సుబ్రహ్మణ్యస్వామి పరిచారిక.
– మహాభారతం

**శథుడు :** కశ్యప ప్రజాపతి దనులకు జన్మించిన ఓ అసురుడు. – మహాభారతం

**శని :** సూర్యునికి సంజ్ఞ యొక్క సేవిక ఛాయవల్ల జన్మించిన ముగ్గురు కుమారుల్లో ఒకడు. తక్కిన ఇద్దరు మను, తపతిలు.

ఇతడు బ్రహ్మ కొలువులో వుండి అతణ్ణి పూజిస్తుంటాడు. ఇతని గుణాలు విపరీతమైనవి. ఇతడు రోహిణి నక్షత్రాన్ని భయపెట్టినపుడు భూమిపై ఎన్నో దుర్ఘటనలు జరుగుతాయి. ఇతడు తర్వాతి యుగంలో మనువు అవుతాడు. ప్రతిరోజు పూజించాల్సిన గ్రహాల్లో ఒకడు. – మహాభారతం

శివుడు త్రిపురాసురులతో యుద్ధం చేసే సమయంలో ఇతడు మరో రథంలో వుండి నరకాసురుడితో యుద్ధం చేశాడు. – భాగవతం

**శబరి :** అడవిలో జీవించే తెగ ప్రజానీకంలో ఓ స్త్రీ. అరణ్యవాస సమయంలో శ్రీరాముడీమెకు ముక్తిని ప్రసాదించాడు.

*పూర్వజన్మ :* చిత్రకవచుడను గంధర్వరాజు కూతురు. ఓ పండితుడైన వీతిహోత్రుడీమెను వివాహమాడాడు. ఇతడెప్పుడూ బ్రహ్మజ్ఞానం గురించి ధ్యానిస్తుంటే ఇతని భార్య మాలిని (శబరి) కల్మషుడనే వేటగాణ్ణి తన విటుడిగా పరిగ్రహించగా వీతిహోత్రుడామెను వేటగాడిని ప్రేమించావు గనుక ఆటవికురాలివి కమ్మని శపించాడు.

*మాతంగాశ్రమం వద్ద జీవనం :* మాలిని కన్నీటితో ఈ శాపంనుండి విముక్తి కోరగా శ్రీరాముని దర్శనంతో విముక్తి కల్గుతుందని భర్త శాపవిమోచనం చెప్తాడు. వెంటనే ఆమె అటవిక స్త్రీగా మారి మాతంగాశ్రమ ప్రాంతానికి వచ్చి జీవించసాగింది. అచ్చట ఆమె మాతంగుని శిష్యులకు సపర్యలు చేస్తూ వారి ఆశీస్సులు పొంది శ్రీరామునికై నిరీక్షిస్తూవుంది. అది శ్రీరాముని అరణ్యవాస సమయం. ఎన్నో ఆశ్రమాలు దర్శించి శ్రీరాముడు మాతంగాశ్రమం చేరాడు. ఇంతలో శబరి ఎన్నో ఫలాలు సేకరించి వాటిని కొరికి రుచిచూచి తర్వాత రామలక్ష్మణులకు ఇచ్చింది. ఆ తర్వాత దక్షిణానికి కొంత దూరం ప్రయాణిస్తే పంపానది వస్తుందని అది దాటిన తర్వాత రుష్యమూక పర్వతం వస్తుందని అచట సూర్యపుత్రుడైన సుగ్రీవుడు నివసిస్తున్నాడని అతడి సహకారంతో సీతజాడ తెలుకోవచ్చని చెప్పి శ్రీరాముడికి నమస్కరించి కనులు మూయగా ఆమె మాలిని అనే గంధర్వ స్త్రీగా మారగా వీతిహోత్రుడు ఓ విమానంలో వచ్చి ఆమెను గంధర్వలోకం తీసుకువెళ్లాడు. – కంభరామాయణం

**శబరిమల :** దక్షిణ భారతదేశంలోని ఓ పవిత్ర స్థలం. దీనికి శ్రీరాముని వలన ముక్తి నొందిన శబరితో సంబంధం వున్నట్లు చారిత్రక ఆధారాలు లేవుగాని ఈ పర్వతం మీద గల శస్త దేవతా విగ్రహం మాత్రం అతి ప్రాచీనమైనది. ప్రతి సంవత్సరం లక్షలాది మంది ప్రజలు కొండలు అడవులు దాటి పాదచారులై వచ్చి ఈ విగ్రహాన్ని దర్శించుకుంటారు. చారిత్రక ఆధారాల కంటే గుడిలో వెలసిన విగ్రహం అయ్యప్పకు మాత్రం ఎంతో ప్రాముఖ్యత వుంది.

ప్రాచీనకాలంలో పాండ్యరాజ వంశం రెండుగా విడిపోయింది. ఒక విభాగానికి వెల్లియూర్, మరో విభాగానికి మధుర కేంద్రాలయ్యాయి. మధుర రాజు ఒకసారి వేటకు వెళ్లగా ఓ అందమైన శౌర్యవంతుడైన మళయాళ యువకుడు కన్పించగా అతడిని తన సైన్యానికి ఓ అధికారిని చేసి తన వెంట తీసుకు వచ్చాడు. ఇతర అధికారులు రాజు అతనికిచ్చే ప్రాముఖ్యతకు ఈర్ష్యపడి రాణిని వారి ఆయుధంగా చేసుకొనగా అమె తీవ్ర అస్వస్థతకు గురైనట్లు నటించింది. వైద్యులు ఆ వ్యాధి నయంచేయలేక పోయారు. ఆమె పన్నాగంలో భాగమైన ఓ వైద్యుడు చిరుతపులి పాలు తీసుకువస్తే ఆమె వ్యాధి నయం చేస్తానంటాడు. అయ్యప్ప అడవికివెళ్ళి ఎన్నో ఆడచిరుతలను రాజభవనంలోకి తానొక సింహంపై కూర్చొని తోలుకు వచ్చాడు. రాజు నిర్ఘాంతుడై అయ్యప్ప వివరాలడగగా దేవుడు నా తండ్రి, ప్రపంచమంతా నా ఇల్లే అని చెప్పి ఈ కుతంత్ర ప్రపంచంలో వుండలేక కేరళకు వెళ్లిపోతాడు. అయ్యప్ప వెళ్లిపోవడం రాజుని విచారంలో ముంచింది. తన స్థిరాస్తిని దానమిచ్చి తంపన్ అనే సేనాని వద్ద పంటాలం వద్ద కొంత భూమికొని అతని కుటుంబసభ్యులతో కాలం గడిపాడు.

అయ్యప్ప కేరళ వెళ్తుండగా దారిలో పరశురాముడు కన్పించి కేరళను రక్షించడానికి చాలా చోట్ల నీ విగ్రహ ప్రతిష్ఠ చేశానని మనం కలసిన ఈ ప్రాంతంలో కూడా నీ విగ్రహాన్ని ప్రతిష్ఠిస్తానని చెప్పి అక్కడ కూడా అయ్యప్ప విగ్రహం ప్రతిష్టించాడు. అప్పటి నుండి అయ్యప్పకు అదే నివాసం. పంటాలంలో వుంటున్న రాజుకు కలలో అయ్యప్ప కన్పించి తాను శబరిమలలో వున్నానని తనను కలవాలంటే అచటకి రమ్మని చెప్పగా రాజు తన సైన్యంతో అడవుల్లో గాలిస్తూ వెళ్లి పరశురాముడు ప్రతిష్టించిన విగ్రహం వద్ద ఓ గుడి కట్టిస్తాడు. దినచర్యలను కూడా నిర్దేశిస్తాడు. అది అరణ్యం కావడం వల్ల నెలకు 5 రోజులు పూజలు చేయాలని మకర సంక్రాంతి పండుగ రోజుగా నిర్ణయిస్తాడు. మకర సంక్రాంతి రోజున భక్తులు ఆహారం తీసుకెళ్తూ స్వామియే శరణం అయ్యప్ప అని నినదిస్తూ అతని దర్శనం చేసుకుంటారు.

**శబరులు :** మ్లేచ్ఛ తెగకు చెందిన ప్రజలు. వీరు వశిష్ఠుని గోవు మలమూత్రాలనుండి జన్మించారు. సాత్యకి కౌరవ సైన్యాన్ని దునుమాడినప్పుడు శబరులు శవాల గుట్టలుగా పడ్డారు. అంతకు ముందు రోజుల్లో మాంధాత రాజ్యంలో వీరు దోపిడీదారులుగా జీవించారు. శివుడు ఒకసారి అటవికుడుగా మారినప్పుడు శబరుల రూపంలో వున్నాడు. పరశురాముడు క్షత్రియుల్ని నిర్వీర్యం చేసినపుడు కొందరు గుహల్లో దాక్కొని క్షత్రియులతో సంబంధాలు తెగిపోయి శబరులయ్యారు. – *మహాభారతం*

**శబలాక్షుడు :** దైవ స్వరూపుడైన ఓ మహర్షి. అంపశయ్యపై నుండగా భీష్ముడ్ని ఇతడు దర్శించాడు. – *మహాభారతం*

**శబలము :** ఒక ఏనుగు. ప్రభాస తీర్థమున నుండి మునులను బాధపెట్టుచుండగా కేసరియను వానరుడు చంపెను.

**శబలం :** కశ్యప ప్రజాపతి కద్రువలకు జన్మించిన ఓ నాగు.

**శబస్తుడు :** ఇక్ష్వాకు వంశస్థుడు. మొదటి యువనాశ్వుడి కొడుకు. బృహదశ్వుడి తండ్రి. గౌడ దేశంలో శాబస్తి అనే పట్టణాన్ని నిర్మించాడు.

**శబళాశ్వుడు :** కురు వంశంలో జన్మించిన ఒక రాజు. కురువు మనుమడు అశ్వవానుడితని తండ్రి. ఇతనికి బళాశ్వుడు కాక మరో ఏడుగురు కుమారులు. వారు పరీక్షిత్తు, ఆదిరాజు, విరాజు, శాల్మలి, ఉచ్చైశ్రవస, భంగకార, జిటారి. – *మహాభారతం*

**శబళాశ్వులు :** వీరణికి దక్షుడివల్ల కల్గిన 1000 మంది పుత్రులు. ఇంతకు ముందు దక్షుడు అశక్ని వల్ల 500 మందిని సృష్టించాడు. వారిని హర్యశ్వసులంటారు. నారదుడు వీరిని తప్పుదోవ పట్టించి సృష్టి చేయకుండా నిరోధించాడు. శబళాశ్వులను కూడా సృష్టి చేయమని ఆదేశించగా నారదుడు మీ అన్నలు సృష్టి చేయడానికి నిరాకరించారు. సృష్టి చేయడానికి ముందు భూమిలోతు, అడుగు భాగం, పైభాగం గూర్చిన జ్ఞానం గడించండని చెప్పగా వారందరు బయలుదేరి తిరిగి రాలేదు. బ్రహ్మ ఇందుకు కోపించి నారదుణ్ణి ఒకే నివాసం లేకుండునట్లు, దేశదిమ్మరిగా శపించాడు. – *విష్ణుపురాణం*

**శమఠడు :** ఓ రుషి. ధర్మజుడికి గయా మహాత్మ్యం వివరిస్తాడు. – *మహాభారతం*

**శమి :** ఉశినారుడి కొడుకు ఒక రాజు. – *భాగవతం*

**శమీకుడు 1 :** ఓ రుషి. పశువుల్ని పోషిస్తూ పాలనురుగు సేవిస్తూ జీవించాడు. పరీక్షిత్తును శపించిన శృంగి మహర్షికి తండ్రి. ఇతడు ఇంద్రుని సభలో అతడ్ని పూజిస్తుంటాడు. జనమేజయుడికి చనిపోయిన వారి ఆత్మలు వ్యాసుడు చూపిస్తున్నపుడు ఇతడు అచట వున్నాడు. – *మహాభారతం*

**శమీకుడు 2 :** వృష్ణి వంశంలోని గొప్ప వీరుల్లో ఒకడు. ద్వారకలోని ఏడుగురు మహారథుల్లో ఒకడు. ద్రౌపది స్వయంవరానికి వచ్చాడు. – *మహాభారతం*

**శమీవృక్షం :** ఇదో వృక్షం. భృగుని శాపం వల్ల అగ్ని ఎన్నో ప్రదేశాలలో దాక్కుని దేవతలకు కూడా కన్పించలేదు. చివరకు అగ్ని శమీవృక్షం యొక్క తొర్రలో కన్పించింది. దేవతలు అగ్నికి ఇది పునర్జన్మగా భావించి శమీ వృక్షాన్ని పూజనీయమని అగ్నికి మాతృక అని పేర్కొన్నారు. – చూ॥ అగ్ని

**శముడు 1 :** ఆహువను వసువు ముగ్గురు కుమారుల్లో ఒకడు. తక్కిన ఇద్దరు జ్యోతి, శాంత. – *మహాభారతం*

**శముడు 2 :** ధర్మ దేవుని ముగ్గురు కుమారుల్లో ఒకడు. తక్కిన ఇద్దరు కాముడు, హర్షుడు. ఇతని భార్య ప్రాప్తి. – మహాభారతం

**శమ్యాకుడు :** ఓ బ్రాహ్మణుడు. భీష్ముడితో ధనాన్ని గురించి వాదిస్తాడు. – మహాభారతం

**శమ్యానిపాతం :** కొలతలో ఒక విధానం. ఓ బలవంతు డైనవాడు వస్తువును విసిరితే అతడికి అది పడిన ప్రదేశానికి మధ్యగల దూరాన్ని శమ్యానిపాతం అంటారు. – మహాభారతం

**శమ్యాప్రాసం :** సరస్వతి నదీతీరంలోని ఓ పుణ్యతీర్థం. ఇక్కడ వ్యాసుడొకసారి ఆశ్రమం నిర్మించుకొని నివసించాడు. – మహాభారతం

**శయుడు :** ఓ మహర్షి – ఋగ్వేదం

**శరగుల్మ :** రాముని సైన్యంలోని ఒక వానరం – రామాయణం

**శరణుడు :** వాసుకి వంశంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. – మహాభారతం

**శరద్వంతుడు :** గౌతముడి కొడుకు. చిన్నతనం నుండీ ధనుర్వేదం మీద ఆసక్తి. ఇంద్రుడు పంపిన జానపదిని చూసి రేత పతనం కాగా కృపి, కృపులు జన్మిస్తారు. కృపుడి కితడు విలువిద్య నేర్పుతాడు. – మహాభారతం

**శరభుడు 1 :** కశ్యప ప్రజాపతి దనువులకు జన్మించిన అసురుడు. – మహాభారతం

**శరభుడు 2 :** ఓ రుషి. యముని కొలువులో అతణ్ణి పూజిస్తుంటాడు – మహాభారతం

**శరభుడు 3 :** చేది రాజైన దృష్టకేతుడి సోదరుడు. ఇతడు పాండవుల స్నేహితుడు. అశ్వమేధ యాగం సందర్భంగా అశ్వాన్ని రక్షించడంలో అర్జునుడికి సహకరిస్తాడు. – మహాభారతం

**శరభుడు 4 :** శకుని సోదరుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో భీముడితణ్ణి వధించాడు. – మహాభారతం

**శరభుడు 5 :** వీరభద్రుడు శరభుడి అవతారం ఎత్తి నరసింహమూర్తిని ఓడిస్తాడు. – శివపురాణం

**శరభం 1 :** తక్షకుని వంశంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణిస్తుంది. – మహాభారతం

**శరభం 2 :** ఐరావత వంశంలో జన్మించిన ఓ నాగు. జనమేజయుని సర్పయాగంలో మరణిస్తుంది. – మహాభారతం

**శరభంగాశ్రమం :** ఓ పుణ్యస్థలం. ఈ స్థలాన్ని దర్శిస్తే వారి కుటుంబాలు నిర్మలమవుతాయి. – మహాభారతం

**శరభంగుడు :** శ్రీరాముని అరణ్యవాస సమయంలో దండకారణ్యంలో నివశించిన ఓ రుషి. ఇంద్రుడు ఈ రుషిని దేవలోకం రమ్మనగా శ్రీరాముని దర్శనానంతరం వస్తానంటాడు. శ్రీరాముడు తను నివసించడానికి తగిన ప్రదేశం చూపమని ఈ రుషిని అడగగా సుతిక్షుని ఆశ్రమం చూపి ఆ తర్వాత దేహం విడిచి బ్రహ్మలోకం చేరాడు. – రామాయణం

**శరలోముడు :** ఓ రుషి. దాశూరుడి తండ్రి. శరలోముడికి ఒక్కడే కుమారుడు. తండ్రీ కొడుకులు, ఇద్దరూ మగధలోని పర్వతంపై వేరు వేరు చోట్ల తపస్సు చేయగా తండ్రి సమాధిలోనికి వెళ్లాడు. తండ్రి కర్మకాండల తర్వాత ఇతడు భూమి పై కాక చెట్టుపై కూర్చొని తపస్సు చేశాడు. ఓ అరణ్య కన్య ఇతడిని ఒప్పించి ఇతడివల్ల ఓ కుమారుడిని కని 12 సంవత్సరాల తర్వాత దాశూరుడికిచ్చి వెడలిపోగా కొడుకు జీవితం, వస్తువులు అన్నీ కూడా భ్రమేనని జ్ఞానోపదేశం ఉదాహరణలతో చెప్తుండగా ఆకాశ మార్గాన వెళ్తున్న వసిస్టుడు ఈ కథను విని శ్రీరాముడికి 'జీవితం' భ్రమ అని విశదీకరించడానికి ఈ కథ చెప్తాడు. – జ్ఞానవాసిష్ఠం

**శరవణం :** సుబ్రహ్మణ్యస్వామి జన్మించిన స్థలం. – మహాభారతం

పార్వతీ పరమేశ్వరులు రహస్యముగా ఇచటకు వచ్చి రతి క్రీడ సలుపుచుండగా పురుషులచ్చటకి వచ్చిరి. పార్వతి సిగ్గుతో తొలగెను. క్రీడా భంగము జరుగుటచే వారు కోపించి ఈయరణ్యము చుట్టూ దశయోజనముల దూరములోపు వచ్చు వారికి స్త్రీత్వము వచ్చునని శపించెను. అచ్చటికి వచ్చిన ఇలుడు స్త్రీ అయ్యెను. – మత్స్యపురాణం

**శరవిందుడు :** (శబిందుడు.) భరతుని వంశంలో జన్మించిన ఓ రాజు. ఇతని తండ్రి పేరు చిత్రరధుడు. ఇతడు మహాపండితుడు. ఇతనికి 10 వేల మంది భార్యలు. ప్రతి భార్యకు లక్షల మంది సంతానం. – భాగవతం

**శరస్తంభం :** ఓ ప్రాచీన పుణ్యస్థలం. ఇచ్చట స్నానం చేస్తే అప్సరసల సేవలందుకుంటారు. – మహాభారతం

**శరారి :** సీతను వెదకడానికి వెళ్లిన వానరాల్లో ఒకటి. – రామాయణం

**శరావతి :** ఓ చిన్న నది. దీని తీరంలో రెల్లు ఎక్కువగా వుంటుంది కనుక శరావతిగా పేరొచ్చింది.

**శరాసనుడు :** చూ॥ చిత్ర శరాసనుడు.

**శరుడు :** ఓ దేవ గంధర్వుడు. అర్జునుడి జన్మదినోత్సవ వేడుకల్లో పాల్గొంటాడు. – మహాభారతం

**శర్మకం :** ప్రాచీన ప్రసిద్ధినొందిన ఓగ్రామీణ ప్రాంతం. భీష్ముడు దీన్ని వశపరచుకున్నాడు. – మహాభారతం

**శర్వ :** ఓ పవిత్ర నది. – మహాభారతం

**శర్యాతి 1 :** వైవశ్వత మనువు కుమారుడు. ఇతడికి ఆనర్తుడను కుమారుడు, సుకన్య అనే కుమార్తె జన్మించారు. సుకన్యను చ్యవనుడు వివాహమాడగా ప్రమతి ఆ దంపతులకు జన్మించాడు.
శర్యాతి యముని సభలో అతడ్ని పూజిస్తుండేవాడు. శర్యాతి కొరకు చ్యవనుడు యజ్ఞం చేయగా ఇంద్రుని ఆజ్ఞను ధిక్కరించి అశ్వనీ కుమారులు ఆయజ్ఞంలో సోమరసం సేవించారు. ఇతని వంశంలో ప్రసిద్ధ రాజులైన హైహయ, తాలజంఘులు జన్మించారు. – మహాభారతం

**శర్యాతి 2 :** పూరు వంశంలోని ఒక రాజు. ప్రాచీన వానుడి కుమారుడు. అహంయాతికి తండ్రి. – మహాభారతం

**శర్యాతివనం :** అర్జునుడు తన కలల యాత్రలో శ్రీకృష్ణుడితో పాటు ఈ వనాన్ని దాటి కైలాసం వెళ్లాడు. – మహాభారతం

**శర్మి :** ఓ బ్రాహ్మణ పండితుడు. – *చూ॥ పర్ణశాల*

**శర్మిష్ఠ :** వృషపర్వుఋడను అసురరాజు కుమార్తె. – *చూ॥ దేవయాని.*

**శర్వుడు :** ఏకాదశ రుద్రుల్లో ఒకడు. – భాగవతం

**శర్వుడు :** నరిష్యంతుడి వంశస్థుడైన రాజు.

**శల :** వాసుకి వంశంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. – మహాభారతం

**శలకరం :** తక్షకుని వంశంలో జన్మించిన ఓ నాగు. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. – మహాభారతం

**శలభ :** అత్రిమహర్షి భార్య – బ్రహ్మాండపురాణం

**శలభి :** సుబ్రహ్మణ్యస్వామి పరిచారిక. – మహాభారతం

**శలభుడు 1 :** కశ్యప ప్రజాపతి దనులకు జన్మించిన అసురుడు. ఇతడు తర్వాతి జన్మలో బాల్హిక రాజైన ప్రహ్లాదుడిగా జన్మించాడు. – మహాభారతం

**శలభుడు 2 :** పాండవుల పక్షాన పోరాడిన వీరుడు. ఇతడిని కర్ణుడు వధించాడు. – మహాభారతం

**శలాక :** వసిష్ఠ గోత్రికుడైన మహర్షి ధనంజయుని భార్య. – *చూ॥ ధనంజయుడు*

**శలావంతుడు :** శలకుని తండ్రి. – చాందోగ్యోపనిషత్తు

**శలుడు 1 :** ధృతరాష్ట్రుని వందమంది కుమారుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో భీముడితణ్ణి వధించాడు. – మహాభారతం

**శలుడు 2 :** ఇక్ష్వాకు వంశంలోని పరీక్షిత్తు కుమారుడైన ఒక రాజు. మండూక రాజు కుమార్తె సుశోభన ఇతని తల్లి. ఇతడి ఇద్దరు సోదరులు దల, బలులు.

**శలుడు 3 :** వామదేవుడి వద్ద నుండి తిరిగి ఇస్తానని అశ్వాలు తీసుకొని ఇవ్వకపోవుటచే వామదేవుడు కొందరు రాక్షసుల్ని సృష్టించగా వారితణ్ణి వధించారు. – మహాభారతం

**శలుడు 4 :** కురు వంశంలో జన్మించిన సోమదత్తుని కుమారుడు. భూరి శ్రవసుడితడి సోదరుడు. ఇతడు ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. ధర్మజుని రాజసూయయాగానికి వచ్చాడు. దుర్యోధనుని సైన్యంలో ఓ గొప్పవీరుడు. భీష్ముడు పన్నిన యుద్ధ వ్యూహంలో దక్షిణ దిశన నిల్చి పోరాడాడు. అభిమన్యుడితో పోరాడాడు. చివరికి శృతవర్మ చేతిలో మరణించాడు. వ్యాసుడు గంగానది ప్రవాహంపై చూపిన మరణించిన యోధుల ఆత్మల్లో ఇతడు కూడా వున్నాడు. – మహాభారతం

**శలుడు 5 :** కంసుడు శ్రీకృష్ణుని చంపడానికి వినియోగించిన మాయావులయిన ముగ్గురిలో ఒకడు. తక్కిన ఇద్దరు చానూరుడు, ముష్టికుడు. ఇతడు శ్రీకృష్ణుని ఒక్క తన్నుకు మరణిస్తాడు. – భాగవతం

**శల్యసారధ్యం :** చూ॥ శల్యుడు.

**శల్యహరణి :** చూ॥ మృత సంజీవిని.

**శల్యుడు :** మద్ర రాజు. పాండు రాజు భార్య మాద్రి ఇతడి సోదరే. కౌరవుల పక్షాన పోరాడిన నాయకుల్లో ఒకడు. భీష్ముని కోరికపై తన సోదరి మాద్రిని పాండు రాజుకిచ్చి వివాహం చేశాడు. రుక్మాంగద, రుక్మరథు లైన తన కుమారులతో పాటు ఇతడు ద్రౌపది స్వయం వరానికి వచ్చాడు. ఓటమి ఎరిగి మత్స్య యంత్రాన్ని కొట్టదలచలేదు. ద్రౌపది వివాహ సమయంలో భీము డితణ్ణి ఓడించాడు. పశ్చిమ ప్రాంత విజయ యాత్రలో నకులుడు తన మేనమామ శల్యుడ్ని కలిశాడు. ఇతడు ధర్మజుని రాజసూయయాగంలో పాల్గొన్నాడు. శిశుపా లుడు శ్రీకృష్ణుడి కంటే శల్యుడే అగ్రతాంబూలం ఇవ్వ దగ్గవాడని పేర్కొన్నాడు. యుధిష్ఠిరుడు రాజైనప్పుడు ఓ మంచి ఖడ్గం, బంగారు కూజ బహుమతిగా ఇచ్చాడు. మహాభారత యుద్ధ ప్రారంభానికి ముందే కర్ణుడికి సారధ్యంచేసి అతణ్ణి నిర్వీర్యుడయ్యేటట్లు చేస్తానని పాండవులకు అభయమిస్తాడు.

అక్షౌహిణి సైన్యంతో శల్యుడు కౌరవులతో కలిశాడు. కాని ధర్మజుడే యుద్ధంలో గెలవాలనేది అతని కోరిక. శల్యుడు విరాట యువరాజు ఉత్తరుడ్ని, వీరాటుని తమ్ముణ్ణి వధించాడు. భీష్ముడు చనిపోయినపుడు యుద్ధ రంగం నుండి పారిపోయాడు. పాండవయోధు లెందరితోనో యుద్ధం చేశాడు. జయద్రథుడ్ని రక్షించ డానికి అర్జునుడితో యుద్ధం చేశాడు. కర్ణుడు నకుల సహదేవుల్ని, ధర్మజుడ్ని వధించగల సమయంలో వారిని కాపాడాడు. ద్రోణుని మరణానంతరం దుర్యో ధనుడు కర్ణునికి సారధ్యం వహించమనగా ఇష్టం లేకున్నా అంగీకరించి అతడిని మాటలతో తూలనాడి నిర్వీర్యుణ్ణి చేశాడు. కర్ణుని మరణానంతరం నాయ కత్వం స్వీకరించి భీముడితో ధర్మజుడితో తీవ్రపో రాటం చేశాడు. ఆ తర్వాత జరిగిన యుద్ధంలో ధర్మ జుడితణ్ణి వధించాడు. ఇతడు ప్రహ్లాదుని సోదరుడైన సంహ్లాదుని పునర్జన్మ. అనగా హిరణ్యకశిపుని కుమా రుడి పునర్జన్మ.

*నామాంతరాలు :* ఆర్తాయని, బాల్హిక పుంగవ, మద్రాధిప, మద్రరాజ, మద్రజనాధిప, మాద్రిక, మద్రరాట్, సౌవీర.

**శవస్తుడు :** యవనాశ్వుడి కొడుకు. శావస్తి నగరంలో జన్మించాడు కనుక ఆ పేరు వచ్చింది. ఇతడి కొడుకు బృహదశ్వుడు. – భాగవతం

**శశబిందుడు :** చూ॥ – శరవిందుడు

**శశయానం :** ఓ పుణ్యస్థలం. సరస్వతీ నదిలోని నీటిలో ఈ ప్రాంతంలో పూర్ణచంద్రుడు కుందేలు రూపంలో కన్పిస్తాడు. ఇచ్చట స్నానం చేస్తే మనిషి చంద్రుడిలా ప్రకాశిస్తాడు. – మహాభారతం

**శశలోముడు :** పురాణ ప్రసిద్ధి చెందిన ఒక రాజు. కురుక్షేత్రంలో తపస్సుచేసి స్వర్గం చేరాడు. – మహాభారతం

**శశాదుడు 1 :** వికుక్షి అనే అయోధ్య రాజు కొడుకు. శశాదుడి కొడుకు పురంజయుడు. – బ్రహ్మాండపురాణం

**శశాదుడు 2 :** చూ॥ వికుక్షి

**శశాంకుడు :** చంద్రుని నామాంతరం. కుందేలు చిహ్నంగా కలవాడని అర్థం.

**శశికళ :** కాశీరాజు సుబాహుని కుమార్తె. ఈమె యుధా జిత్తు పారద్రోలిన రాజకుమారుడు సుదర్శనుడ్ని వివాహమాడింది.

తండ్రి మరణానంతరం యుధాజిత్తు అను రాజు రాజ్యం నుండి పారద్రోలగా తన తల్లి మనోరమతో సుదర్శనుడు అరణ్యంలో భరద్వాజుని ఆశ్రమంలో కాలం గడిపాడు. ఇతని తండ్రి ధ్రువసంధి. అతడి మిత్రుడైన నిషాదుడు ఓ విచిత్ర రథం బహూకరిం చాడు. ఈ రథంపై అతడు ఎక్కడికి వెళ్లినా తన చుట్టూ ఎంతో మంది సైన్యం వుండేవారు. ఇది ఆ రథం మహత్మ్యమే. శశికళ రాజ్యం కోల్పోక ముందే ఇతడ్ని వివాహమాడాలని నిర్ణయించింది. తండ్రి స్వయంవరం ప్రకటించాడు. సుదర్శనుడ్ని వివాహమా డటం శ్రేయస్కరం కాదని చెప్పాడు. స్వయంవరానికి ముందు రోజే యుధాజిత్తు తదితర రాజులందరూ కాశీకి వచ్చారు. వీరు సుదర్శనుడికి ఆమెను కట్టబెట్టా లని నిర్ణయించాదని విని ఇతనిపై దాడికి పూనుకోగా యధాతథంగా స్వయంవరం జరుగుతుందని ప్రకటించి ఆ రాత్రి కూడా తన కుమార్తె మనసు మార్చడానికి ప్రయత్నించి విఫలుడై ఆ రాత్రే సుదర్శనుడికిచ్చి వివాహం

చేశాడు. మరుసటి రోజు ఉదయం ఈ వార్త తెలిసి యుధాజిత్తు తదితర రాజులు సుదర్శనుణ్ణి వెంబడించగా తన విచిత్ర రథం, సైనికుల సహాయంతో వారందరిని ఓడించి తన నిజ రాజ్యమైన అయోధ్యకు చేరుకోగా ప్రజలు స్వాగతించారు. ఆ తర్వాత ఇతడు సుప్రసిద్ధ చక్రవర్తిగా పేరొందాడు.

– మార్కండేయపురాణం

**శశకం :** ఓ కులం. కర్ణుడు ఈ కులం ప్రజల రాజుని తన జైత్రయాత్రలో జయిస్తాడు. – మహాభారతం

**శశికం :** ప్రాచీన భారతదేశంలో ఓ గ్రామీణ ప్రాంతం. – మహాభారతం

**శశిబిందుడు :** ఒక రాజు. లక్ష మంది భార్యలున్నారు. ఒక్కొక్క భార్యకు చాలామంది సంతానం కలరు. ఇతడనేక యాగాలు చేశాడు.

**శశోలోకముఖి :** సుబ్రహ్మణ్యస్వామి పరిచారిక. – మహాభారతం

**శాకటాయనుడు :** ఓ ప్రసిద్ధ వ్యాకరణకర్త. యస్కపాణిని కంటే ముందువాడు. ఉగాది సూత్రపాట అనే గ్రంథ రచయిత. పాణిని ఉదహరించిన వ్యాకరణకర్తల్లో ముఖ్యుడు.

**శాకద్వీపం :** 7 ద్వీపాల్లో ఇదొకటి. ఈ ద్వీపాన్ని గురించి సంజయుడొకసారి ధృతరాష్ట్రుడికి వివరించాడు. జంబూద్వీపం, ప్లక్షద్వీపం, శాల్మలిద్వీపం, కోశద్వీపం, క్రౌంచద్వీపం, శాకద్వీపం, పుష్కరద్వీపం కలిసి సప్త ద్వీపాలంటారు.

**శాకల ద్వీపం :** పురాణ కాలంలోని ఓ రాజ్యం. అర్జునుడు దీన్ని జయించాడు. – మహాభారతం

**శాకం :** శాకద్వీపంలోని ఓ వృక్షం. ఈ వృక్షం మూలంగానే ఆ ద్వీపానికాపేరు వచ్చింది.

**శాకంబరి :** దేవికి ప్రీతిపాత్రమైన పుణ్యస్థలం. ఇక్కడ మూడురాత్రులు ఉపవాసం వుంటే 12 సంవత్సరాలు శాకాన్ని తిన్న ఫలితం లభిస్తుంది. – మహాభారతం

★ **శాకలం :** పురాణప్రసిద్ధమైన నగరం. మద్రదేశానికిది కొంతకాలం రాజధాని. – మహాభారతం

**శాకల్యముని :** జనకుడు యాగముచేసి మునులందరను పిలచి ధనరాసులను గుట్టలుగా పోసి అయ్యా! మీలో ఘనులెవ్వరో తేల్చుకొని ఆ ధనరాసులను వారే తీసుకొనుడని" చెప్పెను. బ్రాహ్మణులు పోటీపడిరి. యాజ్ఞవల్క్యుడు నేనే ఘనుడనని తన శిష్యులచే ధనరాసులను తీయించుచుండగా శాకల్యుడు నేను నీకంటే ఘనుడనని పోటీపడి యాజ్ఞవల్క్యుని 5 ప్రశ్నలడగ్గా అతడు సమాధానమిచ్చెను. ఆ తదుపరి యాజ్ఞవల్క్యుడు 5 ప్రశ్నలు వేయగా జవాబు చెప్పలేక ఓటమి నంగీకరించి ప్రాణత్యాగం చేసెను.

**శాకల్యం :** మద్రదేశానికి రాజధాని.

**శాకల్యుడు :** గురుపరంపరలోని ఓ మహర్షి. వేద సంహితల్ని క్రమబద్ధీకరించారు. ఇప్పుడు ప్రసిద్ధమైన వేదసంహిత శాకల్య శాఖ అని పిలవబడుతుంది. పరీక్షిత్తు మహారాజుకు వైద్యం చేస్తానని తక్షకుని ధనం ఆశించి వంచించిన కశ్యపుడ్ని ప్రజలు ఈసడించగా ఇతడు కశ్యపుడ్ని గోదావరి సరస్వతీ నదుల్లో స్నానం చేసి పాపపరిహారం చేసుకొమ్మని సలహా ఇచ్చాడు. ఆ తర్వాత పోయిన ప్రతిష్ఠ కశ్యపుడు తిరిగి పొందాడు. పరశువను రాక్షసుడొకసారి బ్రాహ్మణ వేషమున ఇతని ఆశ్రమమునకు వచ్చి ఆకలిగ యున్న దనగా ఇతడు ఆహారము పెట్టగా ఈ అన్నము నాకు చాలదు. నేను రాక్షసుడను, నిన్ను కూడా తిని వేయుదననగా అది నీకు సాధ్యముకాదని, నన్ను బ్రహ్మాది దేవతలు కాపాడుచుందురని చెప్పినా వినక ఇతనిపైకి రాబోగా వేయితలలు, రెండు వేల చేతులు కన్పించగా నీవు సామాన్యుడవు కావు, నన్ను రక్షించి జ్ఞానమొసంగమనెను. గంగానదీ తీరమున కేగి అచట స్నానం చేసి సరస్వతిని ప్రార్థింపుమని చెప్పెను. – బ్రహ్మాండపురాణం

**శాకవక్రుడు :** సుబ్రహ్మణ్య స్వామి యోధుల్లో ఒకడు. – మహాభారతం

**శాకాయనుడు :** ఓ మహర్షి. – చూ॥ బృహద్రధుడు

**శాకుని :** ఓ రుషి. మధురారణ్యంలో నివసించేవాడు. ఇతడికి ఏడుగురు పుత్రులు. ధ్రువశీల, బుధశీల అనువారు గృహస్థులు. అగ్నిహోత్రులు. – పద్మపురాణం

**శాకులు :** సింధునది సంగమ స్థానంలోని పశ్చిమ ప్రాంత భూమి శాకదేశం. ఇచ్చట నివసించే ప్రజలు శాకులు.

★ ఇప్పటి సియాల్‌కోట్ ప్రాచీన శాకలం అని ఆధునిక పండితులు చెప్తున్నారు.

**శాక్యముని :** బృహద్బలుడి వంశం వాడు. తండ్రి గోత ముడగుట వల్ల ఇతడిని గౌతముడంటారు. ఇతడి ఏడవతరం వాడు సుమిత్రుడు. శాక్యముని క్రీ.పూ. 600 వాడని చెప్తారు. ఇతడినే బుద్ధుడని అంటారు. – *చూ॥ బుద్ధుడు*

**శాక్తేయులు :** తంత్రోపాసకులు. వామాచార సంప్రదాయాన్ని అవలంభిస్తారు. 'సర్వం శక్తిమయం జగత్' అని వీరి నమ్మిక.

**శాఖుడు :** *జన్మవృత్తాంతం మొదటి కథ :* సుబ్రహ్మణ్యస్వామి తమ్ముడు. అష్టావసువుల్లో ఒకడైన అగ్నికి శరస్తంబ వల్ల కుమారస్వామి జన్మించాడు. అతనికి ముగ్గురు సోదరులు వారు శాఖుడు, విశాఖుడు, నైగమేయుడు. – *విష్ణుపురాణం*

*జన్మవృత్తాంతం : రెండవ కథ :*
తారకాసుర వధానంతరం ఇంద్రుడు మహామేరువుపై నివసిస్తుండగా దేవతలు మహర్షులు సుబ్రహ్మణ్య స్వామి రక్షణలో వున్నారు. ఇంద్రుడు ఎప్పటికైనా సుబ్రహ్మణ్యస్వామి వల్ల తన పదవికి ముప్పువస్తుందని తన వజ్రాయుధంతో సుబ్రహ్మణ్య స్వామి పై దాడిచేయగా ఆ గాయం నుండి శాఖ, విశాఖలు జన్మించారు. అనగా శాఖుడు సుబ్రహ్మణ్య స్వామి పుత్రుడు. – *కథాసరిత్సాగరం*

**శాతకర్ణుడు 1 :** ఆంధ్రజాతీయుడైన ఒక రాజు. శ్రీకృష్ణుని కుమారుడు. ఇతని పుత్రుడు పౌరమాసుడు. వీరి వంశము పెక్కేండ్లు పాలించెను. – *భాగవతం*

**శాతకర్ణుడు 2 :** పుర్ణోత్సంగుడను రాజు కొడుకు. ఇతడు 56 సంవత్సరాలు రాజ్యపాలన చేశాడు. – *మత్స్యపురాణం*

**శాతాతపుడు :** స్మృతులను కవిత్వంలో వచనంలో 6 అధ్యాయాలలో రచించినవాడు.

**శాబస్తి :** గౌడదేశంలో శాబస్తుడు నిర్మించిన పట్టణం.

**శాభాక (శాలక) :** ధనంజయ వశిష్ఠుని గోత్రికుడు. ఇతడో పండితుడు. ఇతడికి 100 మంది భార్యలు. వారిలో ఒకరు శాభాక. శాభాకకు జన్మించిన పుత్రుడు కరుణముని. ఇతడు ఈగగా మారి భార్య పూజలతో తిరిగి నిజరూపుడౌతాడు.

**శామీ :** యముణ్ణి అనుసరించే కుక్క. ఇది సరమ సంతానం. – *బ్రహ్మాండపురాణం*

**శామిత్రం :** యజ్ఞంలో చేసే ఓ ప్రత్యేకమైన క్రతువు. – *మహాభారతం*

**శారద :** ఓ బ్రాహ్మణుడి కుమార్తె. వివాహం కాగానే భర్త పాముకాటుకు మరణించగా ఒక బ్రాహ్మణుడీమెను 'ఉమామహేశ్వర వ్రతం' చెయ్యమంటాడు. ఆమె ఆ వ్రతం చేయగా పార్వతి ప్రత్యక్షమై ఈమె పూర్వజన్మ విశేషాలను చెప్పి పూర్వజన్మలోని భర్తవల్ల స్వప్న సంభోగం జరిగి కుమారుడు జన్మిస్తాడని వరమిస్తుంది. – *బ్రహ్మాండపురాణం*

**శారదండాయని :** ఓ కేకయరాజు. ఇతని భార్య శృతసేన కుంతికి చిన్న చెల్లెలు. వీరికి చాలాకాలం సంతానం లేకపోగా భార్య అనుమతితో పుంశవన యజ్ఞం చేయగా ముగ్గురు కుమారులు జన్మించారు. అందులో దుర్జయుడొకరు. – *మహాభారతం*

**శారద్వతి :** ఓ అప్సరస. అర్జునుని జన్మదినోత్సవ వేడుకల్లో పాల్గొంది. – *మహాభారతం*

**శార్ఙ్గరవుడు :** జనమేజయుని సర్పయాగ పురోహితుల్లో ఒకడు. – *మహాభారతం*

**శార్ఙ్గం :** శ్రీకృష్ణుడి ధాపం. ఇంద్రుడి ధాపమైన 'విజయతో సమానమైనది. దీన్ని బ్రహ్మ నిర్మించి శ్రీకృష్ణుడిచ్చాడు. – *మహాభారతం*

**శార్ఙ్గికులు :** మందపాలుడి కొడుకులు. ఖాండవ దహన సమయమున ఆ వనములో వుండికూడా రక్షింపబడ్డారు. – *మహాభారతం*

**శార్దూలి :** క్రోధవశ కశ్యపుల కుమార్తె. ఈమె పులి, చిరుతపులులకు మాతృక. – *రామాయణం*

**శార్దూలుడు :** రావణుని కొలువులో గల వేగువాడు. ఇతడు సుగ్రీవుడు రాముని లంకలో ప్రవేశించమని చెప్పుటవిని దానిని రావణుని కెరింగించెను. – *రామాయణం*

**శాలకటంకటం :** అలంబషుని నామంతరం. – *చూ॥ అలంబష*

**శాలి :** గురుపరంపరలోని ఓ రుషి.

**శాలికుడు :** దివ్యశక్తి సంపన్నుడైన రుషి. శ్రీకృష్ణుడు హస్తినకు వెళ్తుండగా శ్రీకృష్ణ భగవానుడితో చర్చలు జరిపాడు. – *మహాభారతం*

**శాలిపిండం :** కద్రు కశ్యపులకు జన్మించిన ఓ నాగు. - మహాభారతం

**శాలివాహనుడు :** ఓ శకపురుషుడు. విక్రమార్కుడ్ని నర్మద వరకు తరిమివేశాడు. అందువల్ల నర్మదకు దక్షిణాన శాలివాహన శకం, ఉత్తరాన విక్రమార్కశకం వాడుకలో వుంది. వైద్య, అశ్వశాస్త్రాలే కాక సప్తశతి అనే సంకలనాన్ని రచించాడు.

**శాలిశిరసుడు :** కశ్యపప్రజాపతి మునికి జన్మించిన ఓ దేవ గంధర్వుడు. అర్జునుడి జన్మదినోత్సవ వేడుకల్లో పాల్గొన్నాడు. - మహాభారతం

**శాలిశూకుడు :** అశోకుడి మనుమడైన సంయుతుడి కొడుకు. ఇతని కుమారుడు సోమశర్ముడు. - భాగవతం

**శాలిసూర్యం :** కురుక్షేత్రంలోని ఓ పుణ్యస్థలం. శాలి హోత్రుడను రుషి ఇచ్చట జీవించాడు. ఇచ్చట స్నానం చేస్తే 1000 గోవుల దానం ఇచ్చిన ప్రతిఫలం లభిస్తుంది. - మహాభారతం

**శాలిహోత్రుడు :** ప్రాచీన కాలంలోని ఓ రుషి. వ్యాసుడు ఇతని ఆశ్రమంలో కొంత కాలం నివసించాడు. పాండవులు వారి అరణ్యవాస సమయంలో హిడిం బితో కలసి ఈ ఆశ్రమం దర్శించారు. ఇచట కొల నులో నీటిని త్రాగి వారి దప్పిక తీర్చుకున్నారు. - మహాభారతం

**శాలూకుని :** కురుక్షేత్రంలోని ఓ పుణ్యస్థలం. ఇచ్చట గల దశాశ్వతీర్థంలో స్నానంచేస్తే 10 అశ్వమేధ యాగాలు చేసిన ప్రతిఫలం లభిస్తుంది. - మహాభారతం

**శాల్మలి :** చంద్రవంశపు రాజు. కురు రాజు మనుమడు. అవీక్షిత్తు కుమారుడు. ఇతనికి ఏడుగురు సోదరులు. - మహాభారతం

**శాల్మలీ ద్వీపం :** ప్లక్ష ద్వీపానికి రెట్టింపు విస్తీర్ణం వుండే ఈ ద్వీపాన్ని ఇక్షు రసం చుట్టి వుంటుంది. ఈ ద్వీపంలో 7 పర్వతాలున్నాయి. వీటిలో వజ్రాలు వుంటాయి. ఏడు నదులుకూడా ఈ ద్వీపంలో ప్రవహిస్తాయి. ఈ నదుల జ్ఞాపకమే పాపాలను పరిహరిస్తుంది. ఇక్కడ నాల్గు కులాల ప్రజలుంటారు. వారిని కపిలులు, అరుణలు, పితలు, కృష్ణలు అని పిలుస్తారు. వీరు వాయు రూపంలో విష్ణువును పూజిస్తారు. శాల్మలి వృక్షం ఈ ద్వీపంలో పెరుగుతుంది. - విష్ణుపురాణం

**శాల్యసేని :** దక్షిణ భారతదేశంలోని ఓ పురాతన స్థలం. - మహాభారతం

**శాల్యాయనుడు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. జరాసంధుడికి భయపడి బంధువులతో సేవకులతో దక్షిణాదికి పారిపోయాడు. - మహాభారతం

**శావస్తి (శాబస్తి) :** శివస్తుడు నిర్మించిన నగరము. - భాగవతం

**శావంతుడు :** పృధుచక్రవర్తి వంశంలో జన్మించిన జనక రాజు. యువనాశ్వుడి కుమారుడు, బృహద శ్వునికి తండ్రి. - దేవీభాగవతం

**శాశ్వతుడు :** ఇక్ష్వాకు వంశస్థుడు. పృథువు కుమారుడు. విశ్వగంధుడు. విశ్వకుడు అని కూడా పిలుస్తారు.

**శాస్త :** జగన్మోహిని, శివుల కొడుకు. దేవతలకు రక్ష కుడు. ఇతడి కొడుకు కాలభైరవుడు. - స్కాందపురాణం

**శిక్షకుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. - మహాభారతం

**శిఖావర్తుడు :** ఓ యక్షుడు. కుబేరుని కొలువులో అతణ్ణి పూజించేవాడు. - మహాభారతం

**శిఖావానుడు :** ఓ రుషి. ధర్మజుని కొలువులో జీవించాడు. - మహాభారతం

**శిఖిద్వజుడు :** ఏడవ మన్వంతరంలోని పూర్వ ద్వాపర యుగంలో ఒక రాజు. మాళవ దేశాన్ని పాలించాడు. ఇతని భార్య చూడాలి. భార్యాభర్త లిద్దరూ రాజ యోగాన్ని ఆచరిస్తారు. కాని భార్య చూడాలే ముందు సిద్ధిపొందుతుంది. - జ్ఞానవాసిష్ఠం

**శిఖండం :** వృత్రాసురుని రక్తం నుండి జన్మించిన పదా ర్థాలు. వీటిని తినడం బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు నిషిద్ధం. - మహాభారతం

**శిఖండి 1 :** అనమిత్రుడి కొడుకు.

**శిఖండి 2 :** శూద్రుడి కొడుకు. విధూరధుడి పౌత్రుడు. - భాగవతం

**శిఖండి 3 :** పురువంశంలో జన్మించిన అంతర్ధానుడి భార్య. హవిర్ధానుడి తల్లి. - విష్ణుపురాణం

**శిఖండి 4 :** హవిర్ధానుడు అంగవంశంలోనిధిషణను వివాహమాడగా వీరికి ప్రాచీన బర్హి, శుక్ర, గయ, కృష్ణ, వ్రజ, అజినులు జన్మించారు. - విష్ణుపురాణం

★ **శిఖండిని :** అంబ పునర్జన్మే శిఖండి. అంబ భీష్ముడ్ని చంపాలనే ప్రతినతో తనువు చాలించి ద్రుపదుడి పుత్రికగా జన్మించింది. ఈమె భీష్ముడిని వధించడానికి అర్జునుడికి సహాయపడింది.

అభిమన్యుని వివాహానికి ఉపప్లావ్యం వచ్చింది. ఈమె మగరూపంలో ద్రోణాచార్యుని వద్ద ధనుర్విద్య అభ్యసించింది. మహాభారత యుద్ధం మొదటిరోజు అశ్వత్థామతో యుద్ధం చేసింది. ద్రోణుడిని చూసి యుద్ధ రంగంనుండి పారిపోయింది. శల్యుని అస్త్రాన్ని తన దివ్యాస్త్రంతో ఓడించింది. భీష్ముని మరణానంతరం జరిగిన మహాసంగ్రామంలో అశ్వత్థామ శిఖండిని వధించాడు.

*నామంతరాలు :* భీష్మహంత్, ద్రౌపదేయ, ద్రుపదాత్మజ, పాంచాల్య,

**శిగ్రులు :** ఓ ప్రత్యేక కులం ప్రజలు. దాశరాజ్ఞ యుద్ధంలో సుదాసుడికి వ్యతిరేకంగా పోరాడి ఓడిపోయారు.
– రుగ్వేదం

**శితికేషుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు.
– మహాభారతం

**శితికంఠ :** బలభద్ర రాముడిని పాతాళానికి తీసుకువెళ్లే సమయంలో అతడి ముందుండి తోడ్కొని వెళ్లిన నాగుల్లో ఒకరు. – మహాభారతం

**శిని :** యాదవ వంశంలోని ఒక రాజు. ఇతడు ఇతర రాజులందర్ని ఒక్కడే జయించి దేవకిని తెచ్చి వసుదేవుడికిచ్చి వివాహం చేశాడు.

దేవమీఢుని కుటుంబంలో జన్మించిన శినికి సోమదత్తుడికి గొప్పపోరాటం జరిగింది. – మహాభారతం

**శిఫ :** రుగ్వేదంలో ప్రస్తావించబడిన ఓ నది. ధనం దొంగిలించినందుకు కుయన అనే అసురుడు ఈ నదిలోకి తోయబడ్డాడు. – రుగ్వేదం

★ **శిబి 1 :** హిరణ్య కశిపుని మనుమడు. హిరణ్యకశిపునికి నల్గురు కొడుకులు. వారు అనుహ్రాద, హ్రాద, ప్రహ్లాద, సంహ్లాదులు. అందులో సంహ్లాదుడికి ముగ్గురు కుమారులు. వారు ఆయుష్మాన్, శిబి, భాస్కలుడు.
– అగ్నిపురాణం

**శిబి 2 :** ఇదోక దేశం. ఇక్కడ నివసించే ప్రజలను శైబ్యులని పిలుస్తారు. – చూ॥ శైబ్యులు

**శిబి 3 :** ఉశీనారుని వంశంలో జన్మించిన రాజు. ఇతడు ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. పాండవుల పక్షాన పోరాడాడు. ద్రోణుడితణ్ణి సంహరించాడు. ఇతనికి నల్గురు కుమారులు. వారు భద్ర, సువీర, కేకయ, వృషదర్భులు. – భాగవతం

**శిబి 4 :** ఓ ఇంద్రుడు. తామస మన్వంతరంలో దేవతలు నాల్గు తెగలు. సుపారసులు, సత్యసులు, సుదేసులు, హరిసులు, ప్రతి తెగలో 27 మంది దేవతలు. 100 యజ్ఞాలు చేసిన శిబి ఇంద్రుడయ్యాడు.
– చూ॥ మన్వంతరాలు

**శిబి 5 :** ఆదిపురుషుడైన విష్ణువు వంశంలో అత్రి, పురూరవసు, ఆయుసు, నహుష, యయాతి, ఉశీనారులు జన్మించారు. ఆ వంశ వృక్షంలో ఉశీ నారుని కుమారుడే శిబి. ఇతడొక రాజర్షి. యయాతి కుమార్తె అయిన మాధవికి జన్మించాడు.

*సుహోత్రుడు దారి తొలగిన కథ :* కురు వంశజుడైన సుహోత్రుడు మహర్షులను దర్శించి వస్తుండగా శిబి తన రథంపై ఎదురయ్యాడు. ఇద్దరు ఘనత వహించిన వారే. ఒకరికొకరు అభివాదం చేసుకున్నారు గాని ఒకరి కొకరు దారి ఇవ్వలేదు. కారణం ఎవరు తక్కువ వారో వారే ముందు దారి ఇవ్వాలి. దాన్ని ఎవరు తేల్చాలి అనే సమస్య ఎదురుకాగా నారదుడు వచ్చి "కురు వంశ రాజా నీవు క్రూరుల్ని గౌరవంగా, గౌరవనీయుల్ని క్రూరులుగా చూస్తావు. పాపాత్ములకు నీవు గుణవంతుడివి, గుణవంతులకు పాపాత్ముడవు. మంచితనం ఎవరిలో వుంటే 100 రెట్లు మంచితనం వారికి వస్తుందని దేవతల ఆజ్ఞ. ఉశినార రాజు నీకంటే గొప్పవాడని చెప్పగా సుహోత్రుడు దారితొలగాడు.
– మహాభారతం

★ పృథు వంశంలో జన్మించిన అంతర్ధానుని భార్య. ఈమెకు అంతర్ధానుని వల్ల హవిర్ధానుడు జన్మించాడు. హవిర్ధానుడు అగ్ని వంశంలో జన్మించిన ధిషణను వివాహమాడగా ఆరుగురు కుమారులు జన్మించారు. వారు ప్రాచీన బర్హి, శుక్ర, గయ, కృష్ణ, వ్రజ, అజనులు. - విష్ణుపురాణం

★ మహాభారతం శిబి హిరణ్యకశిపుని పుత్రుడని, ఇతడి తర్వాత జన్మలో ద్రుముడను రాజుగా జన్మించాడని పేర్కొంది.

*శిబికి పరీక్ష :* శిబి చక్రవర్తి ఘనత ముల్లోకాలలో వ్యాపించింది. అతడిని పరీక్షించనెంచి అగ్ని, ఇంద్రుడు పావురం, డేగగా మారి పావురాన్ని డేగ వెంటాడగా అది వచ్చి శిబి తొడపై కూర్చుంది. శిబి ఎవరివని అడగగా నేను పావురం రూపంలో వున్న మునిని ఓ డేగ నన్ను తరుముకొస్తోంది. రక్షించమని కోరింది. డేగ ఈ పావురం నా ఆహారమని దాన్ని వదలమని కోరగా శిబి అందుకంగీకరించక దాని బరువుకు సమానమైన మాంసం ఇస్తానని చెప్పగా డేగ అందు కంగీకరించి నీ కుడి తొడ మాంసమే కావాలని కోరింది. అప్పుడు శిబి తన తొడ నుండి శరీర ఖండాలు కోసి తూచగా అది ఎంతకీ సరితూగక చివరికి తానే త్రాసులో కూర్చోగా వారు నిజస్వరూపులై నీవంటి దయామయుడు లేడు. నిన్ను పరీక్షించడానికి ఈ రూపం దాల్చమని శిబిని ఆశీర్వ దించారు. కపోత రోముడను కుమారుడు జన్మిస్తాడని వరమిచ్చారు.
– మహాభారతం

*ఇతర విశేషాలు :* యయాతి స్వర్గం నుండి భూమిపై పడగా నాలోని సద్గుణాలను యయాతికి బదలా యిస్తానని అభయమిచ్చాడు. ఇతడికి ఇంద్రుడంటే అపార గౌరవం. అర్జునుడికి కౌరవులకు గోగ్రహ ణంలో జరిగిన యుద్ధాన్ని ఇంద్రునితోపాటు తిలకిం చాడు. ఇతడు తన కుమారుడిని బ్రాహ్మణునికి దానము ఇచ్చి స్వర్గం పొందాడు. ఇతడు ఎన్నడూ మాంసాహారం తినలేదు. పావురం, గ్రద్ధ కథ మహా భారతంలో రెండుసార్లు ఉదహరించబడింది. ఒకదానిలో చక్రవర్తి ఉశీనారుడు కాగా రెండవ కథలో చక్రవర్తి శిబి.

**శియాతి :** పురాణ కాలంలోని ఓ ప్రసిద్ధ ప్రాంతం. ఇంద్రుడు సూరపద్ముడనే అసురుడికి దడిచి ఇచ్చటికి వచ్చి తపస్సు చేశాడు. – స్కందపురాణం

**శిరీషకం :** కశ్యపుని వంశంలో జన్మించిన ఓ నాగు. – మహాభారతం

**శిరీషి :** విశ్వామిత్రుని కుమారుడు. ఓ వేదాంతి. – మహాభారతం

**శిల :** ధర్మర్షి కుమార్తె. మరీచి మహర్షి ఈమెను వివాహ మాడాడు. కారణమేదైనా ఇతడు ఆమెను గయ దేవాల యంలో శిల కమ్మని శపించాడు. – వాయుపురాణం

**శిలకుడు :** శలావతుడి కొడుకు. – చూ॥ ప్రవాహణుడు

**శిలవానుడు :** ఇతడో మహర్షి. ఇతడొకసారి శ్రీకృష్ణు డితో సంభాషించాడు. – మహాభారతం

**శిలాదుడు :** ఓ ముని. అయోనిజుడైన కొడుకు కోసం శివుణ్ణి ప్రార్థించగా నంది శిలాదుడి కొడుకుగా పుడతాడు.

**శిలాయూపుడు :** విశ్వామిత్రుని కుమారుడు. ఓ వేదాంతి. – మహాభారతం

**శిలి :** తక్షకుని వంశంలో జన్మించిన ఓ నాగు. జనమే జయుని సర్ప యాగంలో మరణించింది. – మహాభారతం

**శిలుడు :** ఒక రాజు. పారియాత్రుడి కొడుకు. కోరికలు తీరక ముందే ముసలితనం వస్తుంది. ఇతడి కొడుకు ఉన్నాభుడు. – రఘువంశం

**శిలోద్భేదం :** ఒక పుణ్యతీర్థం.

**శిక :** అనలుడనే వసువు భార్య. మనోజవుడు, అవిజ్ఞాత గతి ఈమె కొడుకులు. – మహాభారతం

**శివగంగ :** అగ్ని పెద్దకొడుకైన అంగిరసుడి భార్య.

**శివజ్వరం :** చూ॥ విష్ణుజ్వరం.

**శివదూతి :** శుంభ నిశుంభులు దేవతలను బాధిస్తుంటే శివుడు కౌశికను దూతగా వీరివద్దకు పంపుతాడు. అందుకే ఈమెను శివదూతి అంటారు. – మార్కండేయపురాణం

**శివధర్మం :** 18 ఉపపురాణాల్లో ఒకటి.

**శివపూజ :** శివపూజ చేయడానికి కొన్ని పద్ధతులు ఉన్నాయి. మొదట నందికేశుడ్ని మహాకాలుణ్ణి పూజించాలి. ఆ తర్వాత గంగ, యమున, గణాలు, వాస్తుపురుషుడు, శక్తి, ధర్ముడ్ని పూజించాలి. ఆ తర్వాత శివశక్తుల్ని పూజించాలి. ఆ తర్వాత హమ్, హూం, హాం శివమూర్తయే అని శివుడ్ని పూజించాలి. – అగ్నిపురాణం

**శివబ్రాహ్మణుడు :** ఓ శివభక్తుడు. శ్రీకాళహస్తిలో శివలిం గార్చన చేసేవాడు. ఈ లింగాన్నే తిన్నడు కూడా పూజించేవాడు. దాన్ని శివబ్రాహ్మణుడు అసహ్యిం చుకునేవాడు. శివుడు ఆ బ్రాహ్మణుడ్ని రహస్యంగా వుండమని తిన్నడి భక్తిని చూపెడతాడు. ఒకసారి ఈ ప్రాంతంలో కరువురాగా మధురను పాలిస్తున్న

సత్కీరుడి సభలో కొన్ని పద్యాలు చెప్పి చదవమం టాడు. సత్కీరుడు శివ బ్రాహ్మణుడ్ని ఆక్షేపించగా తిరిగి వచ్చి శివుడికి చెప్పగా శివుడితనికి సాయుజ్యం ప్రసాదిస్తాడు.

**శివభస్మం :** శివభస్మానికి ప్రత్యేకత వుంది. దీని ప్రత్యేక తవల్ల విష్ణువుకు స్వస్వరూపజ్ఞానం కలిగి శివభక్తు డయ్యాడు.

**శివరాత్రి :** ఓ పుణ్యదినం. బ్రహ్మ విష్ణువులకు జరిగిన యుద్ధాన్ని నివారించడానికి వీరిద్దరి మధ్య శివుడు ప్రత్యక్ష మవుతారు. ఆ రోజు మాఘ మాసంలోని చతుర్ధశి. అందుకని ఆ రోజున శివరాత్రి జరుపు కుంటారు. – రామాయణం

ఈ రోజు పూజ చేసి అనేక పాపాలు చేసిన సుకుమా రుడు స్వర్గానికి వెళ్తాడు. – శివరాత్రి మహాత్మ్యం

**శివం :** ప్లక్ష ద్వీపాల్లోని ఏడు విభాగాల్లో ఒకటి.
– మహాభారతం

**శివలింగం :** దారుకవనంలో రుషి పత్నుల ప్రవర్తనను చూసి ఆగ్రహించిన మునులు శివుణ్ణి శిక్షిస్తారు. ఇది భూలోకంలో శివుణ్ణికాక శివలింగార్చనకు ప్రాధాన్యత చేకూర్చింది. దీనికి భృగు మహర్షి శివుడిని శపిం చటమే కారణం.

**శివశర్మ :** సర్వశాస్త్ర పారంగతుడైన బ్రాహ్మణుడు. ఇతనికి 5 గురు కుమారులు. భార్య గుణవతి. తన కుమారులకు తనయెడగల భక్తిని పరీక్షించనెంచి మొదటి కుమారుడ్ని తన భార్యను వధించమని, రెండవ కుమారుడ్ని తన భ్రమతో ఓ అందాల స్త్రీని సృష్టించి తనను వివాహమాడటానికి ఒప్పించమని చెప్పగా అతడందుకు తన తలనే నరుక్కుని పితృభక్తిని చాటాడు. మూడవ కుమారుణ్ణి బ్రతికించమని రెండవ కుమారుణ్ని ఆదేశించగా అతడు దాన్ని నిర్వర్తిం చాడు. నాల్గవ కుమారుడిని నేను ముదుసలిని కనుక ఇంద్రలోకం వెళ్లి అమృతం తెచ్చి తన ముసలితనం పోగొట్టమనగా ఆ కోర్కెను నాల్గవ కుమారుడు నిర్వర్తి స్తాడు. ఆ తర్వాత ఆ నల్గురికి స్వర్గలోక ప్రాప్తి కల్గేట్లు చేసి ఆతర్వాత 5వ కుమారుడి సేవలతో 800 సంవత్సరాలు జీవించి తన తప శ్శక్తితో స్వర్గంచే రాడు. 5వ కుమారుడు సోమశర్మ దీర్ఘ తపస్సుచేసి అసురులు మీదపడగా భయపడి ప్రాణ త్యాగం చేస్తాడు. అతడే తర్వాతి జన్మలో ప్రహ్లాదుడిగా జన్మిస్తాడు.
– పద్మపురాణం

**శివస్వామి :** కాశ్మీర రాజ్యాన్ని పాలించిన అవంతి వర్మనుడి ఆస్థానంలో క్రీ.శ. 854 – 884 మధ్య జీవించిన ప్రసిద్ధ సంస్కృత కవి. ఇతడి పద్యం కిరాతా ర్జునీయం తరహాలో రచించబడిన కఫినాభ్యు దయం మాత్రమే లభ్యమవుతోంది.

**శివుడి చాపం :** విశ్వకర్మ శివుడికోసం చేసి ఇచ్చిన ధనుస్సు. దక్షుడు యజ్ఞం నిర్వహిస్తూ తన కుమార్తె అయిన సతిని శివునిపై కోపంతో పిలవలేదు. పిలవని యజ్ఞానికి వచ్చిన కుమార్తెను దూషించగా ఆమె ఆ యజ్ఞగుండంలో దూకి ప్రాణత్యాగం చేస్తుంది. శివుడు ఉగ్రుడై తనకు విశ్వకర్మ ఇచ్చిన ధనస్సుతో దానవుల్ని దేవతల్ని కూడా బాధిస్తాడు. దేవతలు శరణు వేడగా ఆ ధనస్సు దేవతలకివ్వగా వారు దేవరాతుడికిస్తారు. అది చివరకు జనకుని నగరమైన మిధిల చేరుతుంది. దానిని శ్రీరాముడు విరుస్తాడు.

**శివుడు :** మూర్తిత్రయంలో ఒకడు. భారతీయ రుషులు ఆధ్యాత్మిక చింతనాపరులు. దేవుడు మూడు రూపా లలో దర్శనమిస్తాడని, ఒక్కోరూపం ఒక్కోకార్య క్రమా నికి నియోగించబడ్డాడని చెప్తున్నారు. వారు బ్రహ్మ, విష్ణువు, శివుడు. బ్రహ్మ సృష్టికి, విష్ణువు స్థితికి, శివుడు నశించడానికి కారకులని కల్పాంతంలో వారు ప్రకృతిలో ఐక్యమవుతారని ఆ తదుపరి కల్పంలో వారి స్థానాలను వారు స్వీకరిస్తారని చెప్తున్నారు. శివునిలోని ప్రధాన గుణం తమసం.

*శివుని జన్మ వృత్తాంతం :* ప్రధానంగా శివుని జన నాన్ని గురించి ఐదు ఇతి వృత్తాలున్నాయి. అవి

1. కల్పం మొదలుకాగానే బ్రహ్మ తనలాంటి పుత్రుడు కావాలని ధ్యానముద్రలో వుండగా నీలిరంగులో వున్న బాలుడు అతడి తొడలపై కూర్చొని బిగ్గరగా ఏడు స్తున్నాడు. ఎందుకు ఏడుస్తున్నావని బ్రహ్మ అడగగా నా పేరేమిటన్నాడు. రుద్రుడు నీ పేరు బ్రహ్మ అని చెప్పినా ఏడవడం మానమన్నా ఏడుసార్లు ఏడ్చాడు. అప్పుడు బ్రహ్మ అతడికి మరో ఏడు పేర్లు పెట్టాడు. ఏడు రూపాలకు ఏడుగురు భార్యలు, సంతతిని ఏర్ప

రచాడు. రుద్రుడు దక్ష ప్రజాపతి కుమార్తె సతిని వివాహమాడాడు. – విష్ణుపురాణం

2. మహా విష్ణువు నాభి నుండి బ్రహ్మ జన్మించగా బ్రహ్మ నుదురు నుండి రుద్రుడు ఆవిర్భవించాడు. బ్రహ్మ గుణం సృష్టికాగా రుద్రుని గుణం క్షయం. బ్రహ్మ లోకాన్ని సృష్టిస్తే రుద్రుడు దాన్ని అంత మొందిస్తాడు. – *దేవీ భాగవతం*

3. బ్రహ్మ కోపాగ్ని నుండి రుద్రుడు, తొడల నుండి నారదుడు, వేలినుండి దక్షుడు, మనసునుండి సనకాదులు, ఎడమ వేలి నుండి వీరణిజన్మించారు. – *దేవీభాగవతం*

4. బ్రహ్మమానసపుత్రులైన సనక, సనందన, సనాతన, సనత్కుమారులు సృష్టికార్యాన్ని నిర్వహించడానికి నిరాకరించగా బ్రహ్మ కుపితుడయ్యాడు. అతడి నుదుటి మధ్య నుండి నీలి రంగు శరీరంతో ఓ బాలుడు జన్మించి ఏడుస్తూ తన పేరు, కార్యాచరణ బ్రహ్మనడగగా ఏడవకు అని చెప్పి పేర్లు, నిర్వహణ నిర్ణయించాడు. ఇతడు రుద్రుడుగా ప్రసిద్ధి చెందాడు. ఇతడికి మరో 11 పేర్లు, రూపాలు వాటి నిర్వహణ నిర్ణయించాడు. ఇందులో శివుడొకడు. శివుడు సృష్టి స్థితి లయకారుల్లో ఒకడయ్యాడు. రుద్రసంహారమంటే నూతన సృష్టికి నాంది మాత్రమే.

5. యుగం మొదట విష్ణువు నాభి నుండి బ్రహ్మజనించగా మధుకైటబులు బ్రహ్మను చంపబోగా విష్ణువు నొసట నుండి శూలంతో శివుడు జన్మించాడు. – *మహాభారతం*

*శివుని కుటుంబ జీవితం :* శివునికి ఇద్దరు భార్యలు. గంగ, పార్వతి. గంగ శివుని తలపై వుంటుంది. పార్వతికి మరెన్నో పేర్లున్నాయి. మహామేరువు పర్వతంపై దేవగణాల నగరాలలో ఇతడిదో నగరం. అది యశోవతి. శివునికి పార్వతివల్ల సుబ్రహ్మణ్యుడు, గణపతి జన్మించారు. వీరుకాక ఇతర స్త్రీల వల్ల ఇతర రూపాలు ధరించినప్పుడు ఇంద్రజిత్తు, హనుమంతుడు జన్మించారు.

– *చూ॥ ఇంద్రజిత్తు, హనుమంతుడు*

*శివుని అవతారాలు :* శివునికి సంపూర్ణ అవతారాలు లేకున్నా అతడి అసంపూర్ణ అవతారాలు కొన్ని వున్నాయి. అవి దుర్వాసుడు, వానరుడు, వశిష్ఠుని కుమారుడు శక్తి, వరుణుడు.

*శివుడు వివిధ సందర్భాలలో ఇచ్చిన వరాలు :* సింహవక్త్రుడు, రుక్మి, బాణుడు, సుదక్షిణ, సాళ్యుడు, వృకాసురుడు, రతీదేవి, ఇంద్రజిత్తు, భృగు, గాంధారి, జరాసంధుడు, మంకణుడు, సగరుడు, భగీరథుడు, జయద్రథుడు, అంబ, సోమదత్తుడు, విష్ణువు, పరశురాముడు, స్కందుడు, అరుంధతి వివిధ సందర్భాలలో శివుడి నుండి వరాలు పొందారు.

*శివుని సంపదలు :* శివుని జుట్టు అంట గట్టుకొని ఎరుపు రంగులో వుంటుంది. దాన్నికపర్దం అంటారు. కావున శివుడిని కపర్థి అనికూడా పిలుస్తారు. ఇతడు త్రినేత్రుడు. అతడి నొసటన మూడవ కన్నువుండి దానిలో అగ్ని నిండి వుంటుంది. అందువల్ల అగ్ని లోచనుడంటారు. చేతిలో శూలం వుంటుంది. మరో ఆయుధం పినాకం. గంగ, చంద్రుడు తలను అలంకరించి వుంటారు. మెడకు మానవుల కపాలాలు దండగా వేలాడుతూ ఉంటాయి. జంతు చర్మాన్ని ధరిస్తాడు. ఏనుగు చర్మం ఆసనంగా వుంటుంది. శరీర అవయవాలన్నీ సర్పాలు చుట్టి వుంటాయి.

*బ్రహ్మహత్యాపాతకం – విముక్తి :* బ్రహ్మ ఐదవతల ఊడబెరికి నందువల్ల శివునికి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకొని విముక్తి కొరకు ప్రపంచమంతా సంచరించాడు. దానినుండి విముక్తి లభించక కురుక్షేత్రంలో వున్న విష్ణువును ప్రార్థించగా తన అంశలో యోగశాయి జన్మించి ప్రయాగలో వున్నాడు. అతడి కుడి కాలి నుండి వరుణానది, ఎడమకాలి నుండి అసినది ప్రవహిస్తుం టాయని వాటి మధ్య యోగశాయి భగవానుడు వుంటాడని అది లోకాలన్నింటిలో పవిత్రమయిన ప్రదేశం కనుక అచట స్నానం చేస్తే బ్రహ్మహత్యాపాతకం నుండి విముక్తమవుతావని చెప్పగా దాన్ని ఆచరించి బ్రహ్మ హత్యాపాతకం నుండి శివుడు విముక్తుడయ్యాడు. దానినే ప్రయాగ, కాశీ, వారణాసి అంటారు.

*శివుని సాహస కృత్యాలు – విష్ణువుతో పోరాటం :* శివ విష్ణువుల మధ్య విభేదాలు చాలాసార్లు వచ్చినా రెండు సార్లు మాత్రమే వారు తలపడ్డారు. ఒకసారి

శివుడికి విష్ణువుకి మధ్య, రెండవసారి విష్ణువు అంశ నారాయణశ్రీతో జరిగిన యుద్ధం.

1. శివుడు విష్ణువుతో యుద్ధంచేయడానికి కారణాలు కన్పించవు. దేవతలే వీరిద్దరిలో ఎవరు శక్తివంతులో తెలుసుకోదలచి ఒకరిపై ఇంకొకరిని ఉసిగొల్పారు. విశ్వకర్మ రెండు విల్లులు తయారు చేసి వారికి చెరొకటి ఇచ్చాడు. అవే శివచాపం, విష్ణుచాపం. వీరి పోరాటంలో శివుడు ఓడిపోగా తన విల్లును విదేహ రాజైన దేవవ్రతుడికివ్వగా అది సీతాస్వయంవరం రోజున శ్రీరాముడు విరిచాడు. విష్ణువు తన విల్లును రుచికుడికివ్వగా అది చివరకు పరశురాముడికి చేరి దానితోనే శ్రీరాముడిపైకి వస్తాడు. - రామాయణం

2. శివుడు ఉగ్రుడై తన శూలాన్ని దక్షుని యజ్ఞంపైకి విసరగా అది యజ్ఞాన్ని ధ్వంసం చేసి బదరికాశ్రమంలో తపస్సుచేస్తున్న నారాయణశ్రీ హృదయానికి తగిలి అతడు 'హూం' అని శబ్దించగా వెనక్కువెళ్లి శివుని చేరింది. శివుడు కోపంగా నారాయణ శ్రీ పైకి వెళ్లగా నారాయణశ్రీ శివుని కంఠంపై చెయ్యివేయగా కంఠం నల్లబడింది. నారాయణుడు గడ్డి పరకను మంత్రించి వదలగా అది గొడ్డలిగా మారి శివునిపైకి వెళ్లగా శివుడు దాన్ని ఖండించాడు. వీరి మధ్య యుద్ధం ప్రళయం సృష్టించగా బ్రహ్మాది దేవతలు వచ్చి నారాయణ శ్రీ విష్ణువని, విష్ణువు నాభినుండి నేను అతడి రౌద్రం నుండి నీవు జన్మించావుకనుక యుద్ధం ఆపమని శివుణ్ణి కోరగా శివుడు శాంతించాడు.
- *మహాభారతం*

అంతేకాక శివుడు కామదేవుణ్ణి భస్మంచేశాడు. భగీరథుని కోర్కెపై ఆకాశగంగను తన తలపై బంధించాడు. క్షీరసాగర మదనంలో కాలకూట విషం వెలువడగా దాన్ని మింగి తన కంఠంలో బంధించాడు. త్రిపురాసురుల్ని వధించాడు. సూర్యుణ్ణి ఓడించాడు. అంథకుడనే రాక్షసుణ్ణి సంహరించాడు. కిరాతుని రూపంలో అర్జునుడి శక్తిని పరీక్షించాడు. ఏకాదశ రుద్రులు శివుని కుమారులు.

*ఇతర విశేషాలు :* శివుని కుమారుడైన గణపతి, సుబ్రహ్మణ్యుడు, వివిధ రూపాలలో దక్షిణ భారతదేశంలో పూజిస్తారు. శివలింగాలు, అన్ని ప్రాంతాలలో వివిధ రూపాలలో వివిధ లోహాలతో తయారుచేసి ప్రతిష్టించి అర్చన చేస్తారు. శివభస్మానికి ఎంతో ప్రాముఖ్యత వుంది.

*శివుని పేర్లు :* అజ, అంబికాపతి, అనంత, అంధకఘాతి, బహురూప, అధర్వ, భగాగ్ని భణ, భావఘ్న, శంకర, శర్య, శితికంఠ, శ్రీకంఠ, శుక్ర, శూలభృత, శూలధర, శూలపాణి, ఏకాక్ష, గణాధ్యక్ష, గౌరీశ, గిరీశ, హర, హర్యోక్ష, జఠాధర, మహాదేవ, మహాగణపతి, పినాకపాణి, త్రిలోచన, త్రిపురహర్త, త్ర్యంబక, విలోహిత, వృషభాంక మొదలగునవి శివుని సమానార్థకాలు. శంభు, ఈశ, పశుపతి, శూలి, మహేశ్వర, ఈశ్వర శర్వ, ఈశన, శంకర, చంద్రశేఖర, భూతేశ, ఖండపరశు, మృత్యుంజయ, విరూపాక్ష, రుద్ర, ఉమాపతి, అష్టమూర్తి, గజాని, మహానట అనునవి శివుణ్ణి గూర్చిన మరికొన్ని పేర్లు.

**శివోద్భేదం :** ఓ పుణ్యస్థలం. ఇచ్చట పవిత్రస్నానం చేస్తే 1000 గోవులు దానంచేసిన ఫలితం లభిస్తుంది.
- *మహాభారతం*

**శిశిర పర్వతం :** మేరు పర్వతం వద్ద గల మరో పర్వతం.
- *చూ॥ మేరుపర్వతం*

**శిశిరుడు :** సోముడను వసువు కుమారుడు. సోముని భార్య మనోహరకు జన్మించిన నల్గురు కుమారుల్లో ఒకడు. తక్కిన ముగ్గురు వర్చసు, పాణుడు, రమణుడు.
- *మహాభారతం*

**శిశునాగుడు :** శిశునాగ వంశానికి మూలపురుషుడు. మగధరాజైన నందివర్ధనుడిని జయించి ఈ రాజ్యాన్ని స్థాపించాడు. మొదట కాశీ నివాసి అయినా మగధలో స్థిరపడ్డాడు. ఇతని కుమారుడు కాకవర్ణుడు. శిశునాగ వంశస్తులు 10 మంది. వీరు 360 సంవత్సరాలు రాజ్యమేలారు. వీరు 1. కాకవర్ణుడు, 2. క్షేమ ధర్ముడు, 3. క్షేమజిత్తు, 4. వింధ్య సేనుడు, 5. భూమి మిత్రుడు. 6. అజాత శతృవు, 7. వంశకుడు, 8. ఉదాసి, 9. నందివర్ధనుడు, 10. మహానంది

**శిశుపాలుడు :** చేదిరాజు.

*పూర్వజన్మలు :* శనక మహర్షి తదితరుల శాపంవల్ల వైకుంఠ ద్వారపాలకులైన జయవిజయులు 3 సార్లు అసురులుగా జన్మించారు. మొదటిసారి హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు, రెండవసారి రావణ కుంభకర్ణులు, మూడవసారి శిశుపాల, దండ వర్తకులు.

*శిశుపాలుని జననం :* చేది రాజైన దమఘోష శృత శ్రవసులకు జన్మించాడు. ఇతడు 3 కళ్లు, నాల్గు చేతులతో జన్మించి పుట్టగనే గాడిదలా ఏడ్చాడు. ఇతడి జననం చూసి తల్లిదండ్రులు వదలి వేద్దామనుకోగా ఓ భూతం ప్రత్యక్షమై ఇతడు తర్వాత అత్యంత శక్తివం తుడౌతాడని ఒకే ఒక్కడు ఇతడిని చంపగలడని అతడు ఇప్పటికే జన్మించాడని, ఎప్పుడైతే ఈ బాలుడు అతణ్ణి చూస్తాడో ఇతని మూడో కన్ను నశిస్తుందని, అతడి తొడపై కూర్చొన గానే రెండు చేతులు ఊడిపో తాయని చెప్తుంది. ఈ విషయం అన్ని దేశాలకు వ్యాపించింది. ధమఘోషుడు ఈ శిశువును వచ్చిన ప్రతి రాజు ఒడిలోను కూర్చోబెట్టాడు. ఒకసారి శ్రీకృష్ణుడు బలభద్రరాముడు రాగా శిశుపాలుని తల్లి శ్రీకృష్ణుని ఒడిలో కూర్చోబెట్టగా మూడోకన్ను, రెండు చేతులు ఊడిపోయాయి. శ్రీకృష్ణుని మేనత్త అయిన శృతశ్రవసు కృష్ణుడ్ని తన కుమారుణ్ణి ఎన్నడూ చంప వద్దని కోరగా 100 తప్పుల వరకు క్షమిస్తానని చెప్పాడు. *– మహాభారతం*

శిశుపాలుడు ద్రౌపది స్వయంవరానికి వచ్చి విల్లు ఎక్కుపెట్టలేక పడిపోయాడు. కళింగ రాజకుమార్తె స్వయం వరానికి వచ్చాడు. జరాసంధుని సైన్యానికి నాయకుడు. ధర్మజుని రాజసూయ యాగానికి వచ్చాడు. రాజసూయ యాగానికి శ్రీకృష్ణుడ్ని పెద్దగా ఎన్నుకోవడాన్ని ఆక్షేపించి భీముడ్ని అవమానిస్తాడు. ఆ తర్వాత జరిగిన యుద్ధంలో శ్రీకృష్ణుడు శిశుపా లుడ్ని వధించగా అతడి కాంతి శ్రీకృష్ణునిలో లీనమయ్యింది.

**శిశుమారముఖి :** సుబ్రహ్మణ్య స్వామి అనుచరురాలైన ఒక స్త్రీ. *– మహాభారతం*

**శిశుమారుడు :** ఓ రుషి. మొసలి రూపంలో నీళ్లలో నివసిస్తాడు. ఇంద్రుణ్ణి పొగడడానికి నిరాకరిస్తాడు. తన తపశ్శక్తితో సామవిద్యను పొందుతాడు. *– పంచవింశ బ్రాహ్మణం*

**శిశుమారం :** మొసలి రూపంలోని నక్షత్ర సముదాయం వలే కన్పించే విష్ణువు రూపం. తోక వద్ద ధ్రువుడు వుంటాడు. అది తిరుగుతూ సూర్యచంద్రుల్నికూడా తిప్పుతుంది. కాంతి దృశ్యాలకు కారకుడైన శ్రీమహా విష్ణువు దీనికి మూలకారకుడు. *– విష్ణుపురాణం*

**శిశురోమ :** తక్షకుని వంశంలో జన్మించిన ఓ నాగు. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. *– మహాభారతం*

**శిశువు :** సుబ్రహ్మణ్య స్వామి అనుగ్రహం వల్ల సప్తమా తృకలకు జన్మించిన కుమారుడు. ఈ శిశువు నేత్రాలు రక్తపు ఎరుపులో వుంటాయి. ఇతణ్ణి వీరాష్టకుడని అంటారు. *– మహాభారతం*

**శిష్ట :** ధాన్యధ్రువుల కుమారుడు. ఇతడు అగ్నికూతురు. సుఛాయను వివాహమాడగా కృప, రిపుంజయ, వృత్త, వృకులు జన్మించారు. *– మత్స్యపురాణం*

**శిష్టి :** ధ్రువుని కుమారుడు. శాంభు వల్ల ధ్రువుడికి ఇద్దరు పుత్రులు శిష్టి, భయ. శిష్టికి సుఛాయవల్ల ఐదు గురు పుత్రులు. అందులో పెద్దవాడు రిపుడు. రిపుని కుమారుడే చాక్షుష మనువు. *– మహాభారతం*

**శీఘ్రనుడు :** సంపాతి కుమారుల్లో ఒకడు. *– మత్స్య పురాణం*

**శీఘ్రుడు :** సూర్యవంశపు రాజుల్లో ఒకడు. అగ్నిపూర్ణుని కొడుకు. మరువుకు తండ్రి. *– భాగవతం*

**శీతపూతన :** ఓ భయంకర స్త్రీ దయ్యం. ఇది స్త్రీలకు గర్భస్రావం జరిగేట్లు చేస్తుంది. *– మహాభారతం*

**శీతాశి :** పురాణప్రసిద్ధ నది. ఇది శాకద్వీపం గుండా ప్రవహిస్తుంది. *– మహాభారతం*

**శీర్కాలి :** దక్షిణ భారతదేశంలో ఓ పుణ్య స్థలం. దీని మరోపేరు బ్రహ్మపురం. కుంభకోణం దగ్గరలో వుంది. తిరుజ్ఞాన సంబంధార్ జనించడం వల్ల దీనికి ప్రసిద్ధత వచ్చింది.

**శీలకుడు :** శీలవతుడి కొడుకు. – చూ॥ ప్రవాణుడు

**శీలవతి :** పాతివ్రత్యానికి ప్రతీక అనదగ్గ స్త్రీ. పతిభక్తికి చిహ్నం. ఈమె భర్త ఉగ్రశ్రవసుడు. ఇతడు కుష్టువ్యాధి గ్రస్తుడు. ఇతడ్ని తన భుజాలపై ఎక్కించుకొని ప్రతి ఇంటికి వెళ్ళి ఆహారం సేకరించి ఇతడిని పోషించేది. ఒకరోజు ఓ ఇంటిముందు ఆగగా ఆ ఇంటి ద్వారం నుండి నీరు బయటకు వస్తుంటే ఆమె వెనుదిరిగి రాగా ఎందుకు ఆ ఇంటికి వెళ్ళలేదని భర్త ప్రశ్నించగా అదొక వేశ్యా గృహమని చెప్పింది. భర్త ఆ వేశ్య సాంగత్యం కోరగా పతిభక్తురాలైన శీలవతి అతడిని ఆ వేశ్య ఇంటికి తీసుకువెళ్ళింది. మరిన్ని వివరాలకు *– చూ॥ అణిమాండవ్యుడు, అత్రి, అరుంధతి*

**శీలవానుడు :** ఓ దేవర్షి. ఇతడు శ్రీకృష్ణుడితో ఒకసారి సంభాషించాడు. - మహాభారతం

**శుకనాభుడు :** రావణుని తరఫున పోరాడిన ఓ రాక్షసుడు. - రామాయణం

**శుకసారణులు :** రావణుని చారులు. వీరు రాముని వద్దకు వెళ్లి విభీషణుడ్ని తిరిగి రావణుని వద్దకు రమ్మంటారు. రాముని బలాబలాలను అంచనా వేస్తారు. వీరిని వానరులు గుర్తించి చంపబోగా రాముడు వదిలివేస్తాడు. - రామాయణం

**శుకసంగీతి :** ఓ గంధర్వుడు. - చూ॥ ప్రమోహిని

**శుకి :** తామ్ర కశ్యప ప్రజాపతులకు జన్మించిన ఐదుగురు కుమార్తెలలో ఒకరు. ఈమె నతకు జన్మనివ్వగా, నతకు వినత జన్మించింది.

**శుకుడు 1 :** వ్యాసుని కుమారుడు.

*జననం :* వ్యాసునికి ఓ కుమారుడు కావాలనే కోర్కె జనించింది.

అందుకు శివుడ్ని గూర్చి తపస్సు చేశాడు. తనకు జన్మించే కుమారుడు అగ్ని, భూమి, ఆకాశం, గాలి, నీరు కలిస్తే ఎంతటి శక్తివంతమో అలాంటి కుమారుడు కావాలనేది అతని కోరిక. 100 సంవత్సరాలు అతడు తపస్సు చేయగా శివుడు ప్రత్యక్షమై వ్యాసునికి అలాంటి కుమారుడు జన్మనిస్తాడని వరమిచ్చాడు. వరం పొంది తన ఆశ్రమంలో వుండగా ఘృతాచి అనే అప్సరస చిలుక రూపంలో ఆశ్రమానికి రాగా దాని అందం చూసి వ్యాసునికి వీర్య స్రావం కాగా ఆ వీర్యం నుండి శుకుడు జన్మించాడు.

*శుకుని బాల్యం :* శివుడే ఇతనికి ఉపనయనం చేసి శుకి వల్ల ఇతడు జన్మించాడు కనుక శుకదేవుడని నామకరణం చేశాడు. ఇతడు బాల్యం నుండే చురుకైనవాడు. బృహస్పతి వద్ద విద్యాభ్యాసం చేసి తండ్రి ఆశ్రమానికి తిరిగి రాగా వ్యాసుడు వివాహం చేసుకొని గృహస్థాశ్రమం స్వీకరించమని కోరగా అందుకు నిరాకరించి సన్యాసిగానే జీవిస్తానని చెప్తాడు. ఆ తర్వాత వ్యాసుని ఆశ్రమంలోనే వ్యాసుని శిష్యుడైన శూతుడితో కలసి భాగవతం అధ్యయనం చేశాడు. ఆ తర్వాత వ్యాసుడు ఆధ్యాత్మిక చింతన బోధించాడు. కాని శుకుడు మానసిక సంతృప్తి చెందకపోవుటచే వ్యాసుడు మిథిలా నగరం వెళ్లి జనకుని శిష్యరికం చెయ్యమని కోరగా ఎన్నో దేశాలు పర్వతాలు ప్రజానీకాన్ని పరిశీలిస్తూ మిథిలకు చేరి జనకునితో సంవాదన అనంతరం తండ్రి ఆశ్రమానికి తిరిగివస్తాడు.

*గృహస్త జీవితం :* పితృగణాధిపతి కూతురు పీవరిని వివాహమాడగా వీరికి కృష్ణ, గౌరప్రభ, దేవశృత, భూరి అనే పుత్రులు, కీర్తి అనే పుత్రిక జన్మిస్తారు. కీర్తి విభ్రాజుడను రాజు కొడుకు అణుడ్ని వివాహమాడింది. - దేవీ భాగవతం

*ఇతర విశేషాలు :* వ్యాసుడు మహాభారతం రచించి శుకుడికి చెప్పాడు. దీన్ని శుకుడు గంధర్వ యక్ష రాక్షసులకు చదివి విన్పించాడు. ఇలా అతడు కుటుంబ జీవితం గడుపుతుండగా నారదుడు ఇతణ్ణి కలుస్తాడు. వారి సంభాషణ శుకుడ్ని మోక్ష మార్గం వైపుకి మరల్చి తండ్రిని కుటుంబాన్ని వదలి కైలాసం వెళ్లి నిశ్చల తపస్సు చేసి సిద్ధిని పొంది ఆకాశ మార్గాన పైకివెళ్లి రెండవ సూర్యుడిగా ప్రకాశిస్తాడు. దేవర్షులు ఇతడ్ని అభినందిస్తారు. వ్యాసుడు కుమారుడికై దుఃఖించి కైలాసం వచ్చి రోదిస్తుండగా శివుడు ప్రత్యక్షమై నీవు కోరిన పుత్రుడు జన్మించాడు. అలాగే నీవుకోరినట్లే అత్యంత శక్తివంతుడై వెలుగొందుతున్నాడు కనుక విచారించవద్దని అనునయిస్తాడు.

**శుకుడు 2 :** రావణుని దూత. ఇతడు ఇతని స్నేహితుడు శారణుడు గూఢచర్య నిపుణులు. వీరు రావణుడి మిత్రులు, శత్రువుల కార్యక్రమాలు గమనించి రావణుడికి నివేదించేవారు. రామరావణ యుద్ధానికి ముందు వానర రూపంలో రాముని సైన్యంలో చొరబడి గూఢ చర్యం చేయబోగా జాంబవంతుడు, హనుమంతుడు వీరిని ఒక్క తన్ను తన్నగా నిజరూపులై శ్రీరాముని శరణువేడగా వారిని వదిలివేశాడు. - రామాయణం

**శుకుడు 3 :** చంద్రవంశపు రాజుల్లో ఒకడు. - భాగవతం

**శుకుడు 4 :** శర్యాతి వంశంలో ఒకరాజు. ఇతడు పృషత కుమారుడు. ముల్లోకాలను జయించి ఎన్నో యజ్ఞాలు చేసి తర్వాత రాజ్యం వదలి శతశృంగ పర్వతంపై తపస్సుచేసి మోక్షం పొందాడు. - మహాభారతం

**శుకుడు 5 :** గాంధార రాజైన సుబలుని కుమారుడు. ఐరావణుడు కురుక్షేత్ర యుద్ధంలో ఇతణ్ణి వధించాడు.
– *మహాభారతం*

**శుకుడు 6 :** శరభ అను వానరం కొడుకు. ఇతడికి వ్యాఘ్రివల్ల రుక్షుడు జన్మించాడు. – *బ్రహ్మాండపురాణం*

**శుకుడు 7 :** వ్యాసుని కుమారుడు. శుకుని కంటే ముందు తరంవాడు. ఇతడు దక్షిణ పాంచాల రాజైన అణుహుడికి, బ్రహ్మదత్తుడికి సమకాలీనుడు. ఈ మహర్షికి ఆరుగురు కుమారులు. వారు భూరి శ్రవసుడు, శంభు, ప్రభు, కృష్ణ, సౌరప్రభ, దేవశ్రుతులు. పీవరి, ఏకశృంగులితని భార్యలు. – *బ్రహ్మాండపురాణం*

**శుక్తిమతి 1 :** చేదిరాజైన ధృష్టకేతుడి రాజధాని.
– *మహాభారతం*

**శుక్తిమతి 2 :** ఉపరిచర వసువు రాజధాని ప్రక్కగా ప్రవహించే నది. కోలాహలమనే పర్వతం ఈ నదిని ప్రేమించి తనలో ఇముడ్చుకోగా ఉపరిచర వసువు ఈ పర్వతాన్ని ఒక్క తన్ను తన్నగా ఓ కేంద్రమేర్పడి ఆ నది నీరు బయటకు ప్రవహించింది. కోలాహలం వల్ల ఈ నదికి ఓ కొడుకు, గిరిక అనే పుత్రిక జన్మించారు. వీరిని ఉపరిచర వసువుకివ్వగా ఆ కొడుకొను సేనానిగా చేసి గిరికను ఉపరిచరవసువు వివాహమడాడు. – *మహాభారతం*

**శుక్రుడు 1 (శుక్రాచార్యుడు) :** ఇతడు భృగు మహర్షి కుమారుడని కొన్ని పురాణాలు మనుమడని కొన్ని పురాణాలు చెప్తున్నాయి. శుక్రుని తల్లి కావ్యమాత అని పురాణాలు చెప్తున్నాయి. భృగువుకు కవి అనే మరోపేరు కూడా వున్నందువల్ల శుక్రుడు భృగు మహర్షి తనయుడనే భావించాలి.

*శుక్రుని ప్రేమాయణం :* భృగు మహర్షి మందర పర్వత లోయల్లో ఘోర తపస్సు చేశాడు. బాలుడిగా వున్న శుక్రుడు తండ్రిని సేవిస్తుండేవాడు. ఒక రోజు తలపైకెత్తి ఆకాశం వైపు చూడగా ఓ అప్సర కన్య కవ్వించగా ఆమెతోపాటు స్వర్గం వెళ్లాడు. ఇంద్రుడి తణ్ణి ఆహ్వానించాడు. అక్కడే తను చూసిన సుందరిని చూసి తన శక్తితో చీకటిమయంచేసి ఆమెతో చెట్లపొదల్లో నాల్గుచాతుర్యుగాలు గడిపాడు. దానివల్ల అదృష్టహీనుడై భూమిపై వడ్ల మొక్కగా మొలిచి ఓ బ్రాహ్మణ స్త్రీ గర్భంలో అతడి ఆత్మ ప్రవేశించి దశార్ణ దేశంలో జన్మించి మునుల సాహిత్యంలో మేరు పర్వతంపై జీవించాడు. అప్సర కన్య ఓ ఆడ లేడిగా జన్మించింది. దానితో సంగమించడం వల్ల ఓ మానవుడు జన్మించాడు. అతడి పుత్రవాత్సల్యం వల్ల అతని తపశ్శక్తి నశించి ఓ పాము కాటుకు మరణించి తిరిగి మద్ర రాజుగా జన్మించాడు. ఆ తర్వాత చాలా జన్మలెత్తి చివరకు గంగాతీరంలో నివసించి ఓ మహర్షి కుమారుడిగా జన్మించాడు. అప్పటివరకు ఆత్మలేని శరీరం భృగు మహర్షి ప్రక్కనే పడివుంది. 1000 దివ్య సంవత్సరాల తర్వాత భృగుమహర్షి కళ్లు తెరచి చూసి తన తనయుడి దేహాన్ని చూసి అకాలమరణం చెందిన తన కుమారుని చూసి యముణ్ణి శపించబోగా యముడు మహర్షీ మీకు తెలియని సత్యముందా కాలానికి బ్రహ్మ విష్ణువులు కూడా అతీతులు కాదుకదా నా కర్తవ్య నిర్వహణ చేశానేకాని వేరుకాదు నీ కుమారుడి కార్యాలే అతని స్థితికి కారణమని విన్నవించి శుక్రుడ్ని పునర్జీవితుణ్ణి చేశాడు.

*గృహస్త జీవితం :* శుక్రునికి ఎంతో మంది భార్యలు పిల్లలు వున్నారు. ఇంద్రుని భార్య జయంతి శుక్రుని భార్యల్లో ఒకరు ప్రియవ్రతుని కుమార్తె ఊర్జస్వతి మరొక భార్య. వీరికి జన్మించిన దేవయాని యయాతి భార్య. – *దేవీ భాగవతం*

శుక్రునికి నల్గురు పుత్రులు వారంతా అసురులకు పురోహితులే. – *మహాభారతం*

ఇతడు తన తల్లి కావ్యమాతకు పునర్జీవింపచేశాడు. జమదగ్నిని పునర్జీవితుణ్ణి చేశాడు. యయాతిని శపించాడు. – *చూ॥ కావ్యమాత, జమదగ్ని యయాతి*

మహాబలి అసురులకు రాజుగా వుండగా అతడు వామనావతారంలో మహావిష్ణువుకి మూడడుగుల దానం ఇవ్వగా శుక్రుడు విష్ణువు యొక్క మోసాన్ని గ్రహించి బలిచక్రవర్తి తన కమండలంలోని నీటిని విష్ణువు అరచేతిలో తీర్థం పొయ్యబోగా శుక్రుడు సూక్ష్మరూపుడై కమండలపు నాళానికి అడ్డుపడగా వామనుడు దర్భతో పొడవగా శుక్రుని ఓ కన్ను నశించింది.

శుక్రుడు ఒకసారి కుబేరుని సంపదనంతా కొల్ల గొట్టగా అతడు శివునితో మొరపెట్టుకోగా శివుడు

శుక్రుడిని మింగివేశాడు. శుక్రుడు శివుణ్ణి గూర్చి ప్రార్థించగా శివుని శిశ్నంగుండా బయటకు వచ్చాడు. - *మహాభారతం*

శుక్రాచార్యుడు మహిషాసురుడికి విద్యామంత్రి బాధ్యతలు నిర్వర్తించారు. ఇతడు ప్రహ్లాదుడికి కూడా గురువుగా వున్నాడు. ఇతడు శివుణ్ణిగూర్చి ప్రార్థించి 'మృతసంజీవిని' మంత్రాన్ని పొందాడు.

*శుక్రునికి గల పేర్లు :* భార్గవ, భార్గవదాయాద, బృగు కులో ద్వహ, కవిపుత్ర, కావ్య, ఉశనసుడు.

**శుక్రుడు 2 :** వసిష్ఠుని కుమారుల్లో ఒకడు. వసిష్ఠునికి ఊర్జకు ఏడుగురు కొడుకులు. వారు రజసుడు, ★గోత్రుడు, ఊర్ధ్వబాహుడు, సవనుడు, ★అనఘ, సుతపసుడు, శుక్రుడు. మూడవ మన్వంతరంలో వీరే సప్తర్షులు. - *విష్ణుపురాణం*

**శుక్రుడు 3 :** పృథు వంశంలో జన్మించిన ఒక రాజు. పృధువుకు అంతర్ధానుడు, జన్మించగా అంతర్ధానుడి కొడుకు హవిర్ధానుడు. హవిర్ధానుడు ధిషను వివాహ మాడగా వారికి 6 గురు కొడుకులు. వారు ప్రాచీన బర్హి, శుక్రుడు, గయుడు, కృష్ణుడు, వ్రజుడు, అజినుడు. - *విష్ణుపురాణం*

**శుక్లుడు :** పాండవుల పక్షాన పోరాడిన వీరుడు. పాంచాల దేశస్తుడు. ఇతడిని మహాభారత యుద్ధంలో కర్ణుడు వధించాడు. - *మహాభారతం*

**శుచి 1 :** ఓ దేవుడు. అగ్నివంశజుడు. బ్రహ్మదేవుని పెద్దకుమారుడైన అగ్నిదేవుని కుమారుడు. ఇతడికి ఇద్దరు సోదరులు. వారు పావదుడు, పవమానుడు. ఈ సోదరులందరికి కలసి 45 గురు కుమారులు. అంటే తండ్రి, సోదరులు, సోదరుల కుమారులు కలసి 49 మంది అగ్నులు. - *విష్ణుపురాణం*

**శుచి 2 :** మనువు నడ్వలకు 10 మంది కుమారులు. వారుకురు, పురు, శాతద్యుమ్న, తపస్వి, సత్యవాను శుచి, అగ్నిష్టోమ, అతిరాత్ర, సుద్యుమ్న, అభిమన్యులు.

**శుచిక :** ఓ అప్సరస. అర్జునుని జన్మదినోత్సవ వేడుకల్లో పాల్గొంది. - *మహాభారతం*

**శుచిముఖి :** వజ్రనాభుని కుమార్తె అయిన ప్రభావతి చెలికత్తె. - *చూ॥ ప్రభావతి*

**శుచిముఖం :** ఒక నరకం. - *చూ॥ నరకాలు*

**శచిరథుడు :** భరత వంశంలో జన్మించిన ఒక రాజు. చిత్రరథుని కుమారుడు. ధృషణకు తండ్రి. - *భాగవతం*

**శుచంతి :** ఒక ముని. అత్రిమహర్షిని గౌరవిస్తాడు. ఇతడిని గురించి రుగ్వేదంలో ప్రస్థాపన వుంది. - *రుగ్వేదం*

**శుచివ్రతుడు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. - *మహాభారతం*

**శుచిష్మంతుడు :** చూ॥ వరుణుడు.

**శుచిస్మిత 1 :** భర్తే దైవమని పూజించే ఓ బ్రాహ్మణ స్త్రీ. - *చూ॥ ధనంజయుడు*

**శుచిస్మిత 2 :** ఓ అప్సరస. కుబేరుని కొలువులో వుంటుంది. - *మహాభారతం*

**శుద్ధుడు :** భృగు వంశంలో జన్మించిన ఒక రాజు. అనేనసుడి కొడుకు. ఇతడి కూతురు శుచి.

**శునకుడు 1 :** సూర్య వంశపు రాజు. కృతుని కొడుకు. వీతిహోత్రునికి తండ్రి. - *భాగవతం*

**శునకుడు 2 :** పురంజయుని మంత్రి. ఇతడు రాజుని చంపి తన కుమారుడిని రాజుని చేశాడు. - *భాగవతం*

**శునకుడు 3 :** చంద్రహంతుడను రాక్షసుని అంశతో జన్మించిన రాజర్షి. ఇతడు చంద్రతీర్థం వద్ద సమాధి లోకి వెళ్లాడు. ఇతడు హరిణాశ్వుడను రాజు వద్ద ఖడ్గం బహుమతిగా పొంది ఉశీనారుడికిచ్చాడు. - *మహాభారతం*

**శునకుడు 4 :** ఓ రుషి. నైమిశారణ్యంలో శౌనకాదుల సమక్షంలో సూతుడు పురాణ పఠనం చేసినట్లు పేర్కొనబడింది.

భృగువంశమున గృత్సమదుడికి శునకుడనే కొడుకు కలడు. అతని కుమారుడు శౌనకుడు. - *భాగవతం*

రురు చక్రవర్తి భార్య ప్రమద్వరకు జన్మించిన పుత్రుడు శునకుడు. ఇతడు పండితుడు. వేద శాస్త్రాలలో నిష్ణా తుడు. శౌనకుడికి తాత - *మహాభారతం*

రురుని కుమారుడైన శునకుడు యుధిష్ఠరుని కొలువులో సభ్యుడు. - *మహాభారతం*

★ గోత్ర, అనఘులకు బదులు గాత్ర, అలఘులని అగ్నిపురాణం చెప్తోంది.

**శునశ్శేపుడు :** ఓ బ్రాహ్మణ బాలుడు. హరిశ్చంద్రుడు కొడుకు బదులు ఇతణ్ణి బలి ఇవ్వబోగా విశ్వామిత్రుడు రక్షించాడు. దేవవ్రతుడనే పేరు కూడా వుంది.
– చూ॥ *విశ్వామిత్రుడు*

శునశ్శేపుడు ఆ తర్వాత రుషిగా మారి రుగ్వేదంలోని మొదటి మండలం రచించాడు. ఇంద్రుడితడికి బంగారు రథం బహుమతిగా ఇచ్చారు. – చూ॥ *అంబరీషుడు*

**శునస్సఖుడు :** ఇంద్రుడు మారువేషంలో కౌశికి తీర్థంలో కలువపూలను దొంగిలించడానికి ఓ సన్యాసి వేషంలో వెళ్లాడు. అప్పుడతనికి ఓ కుక్క తోడుంది. యాతధావి అనే కొలనుకు కాపలావుండే స్త్రీ ఒక్కగుద్దుతో ఇంద్రుణ్ణి పడగొట్టింది. కుక్క వెంట వుండి వెళ్లాడు కనుక ఇంద్రుడికి శునస్సఖుడను పేరు సార్థకమయ్యింది. – *మహాభారతం*

**శునాదేవి :** వరుణుడి భార్య. – *వాయుపురాణం*

**శుని :** చంద్రవంశపు రాజు. వివనవుడి కొడుకు. శ్రుతుడికి తండ్రి. – *భాగవతం*

**శుభ :** ధ్రువుని తల్లి. అశ్వమేధం నుండి జన్మించింది.
– *హరివంశం*

**శుభదంతి :** శుభదంతుడనే దిగ్గజం భార్య.

**శుభదత్తుడు :** పాటలీపుత్రంలో నివసిస్తూ కట్టెలమ్ముకొని జీవించేవాడు. ఇతడు అడవికి వెళ్లి కట్టెలుకొట్టి తెచ్చి వంట చెరకుగా అమ్మేవాడు. ఒకసారి అడవికి వెళ్లి నల్గురు మానవతీత వ్యక్తుల్ని చూసి భయపడగా వారు యక్షులమని చెప్పి తమ సేవకుడుగా నియమించుకుంటారు. ఇతడన్ని పనులు చేసేవాడు. భోజన సమయం వచ్చే సరికి ఓ ఖాళీ పాత్రను చూపి వడ్డన చేయమనేవారు. ఇతడు ఆ ఖాళీపాత్రలో చేయిపెట్టగా కావలసిన పదార్థాలు వచ్చేవి. ఇతని సేవలు విని యోగించుకున్న తర్వాత ఇతణ్ణి వరం కోరుకొమ్మనగా ఆ మంత్ర పాత్ర కావాలని కోరుకోగా అది జాగ్రత్తగా చూసుకోవాలి కనుక ఇంకేదైనా వరం కోరుకొమ్మనగా అదే కావాలని కోరాడు. ఆ తర్వాత ఇంటికి తిరిగి వచ్చి దేవి మహాత్మ్యం చెప్పి చూపరులను ఆశ్చర్య పరుస్తూ తన ఘనతను చెప్పుకుంటూ అతి గర్వంతో ఆ పాత్రను తన తలపై పెట్టుకొని ఇతరుల నాకర్షించబోగా అది క్రిందపడి ముక్కలయ్యింది. దానితో అతడు తిరిగి అడవికి వెళ్లి కట్టెలు కొట్టుకొని పూర్వ జీవనమే కొనసాగించవలసి వచ్చింది.

**శుభవక్త్ర :** సుబ్రహ్మణ్యస్వామి సేవిక. – *మహాభారతం*

**శుభాంగదుడు :** ఒక రాజు. ఇతడు ద్రౌపది స్వయంవరానికి వచ్చాడు. – *మహాభారతం*

**శుభాంగి :** దశరథుని తెగలో జన్మించిన కన్య. చంద్ర వంశపు రాజైన కురువు ఈమెను వివాహమాడగా విదురుడను వాడు జన్మించాడు. – *మహాభారతం*

**శుభ్రుడు :** హవిర్ధానుడి కొడుకు. – *మత్స్య పురాణం*

**శుష్కుడు :** గోకర్ణ దేవాలయంలో నివసించిన ఓ మహర్షి. భగీరథుడు గంగను స్వర్గం నుండి భూమికి తెచ్చి అది భూమిపై ప్రవహించే సమయంలో సముద్ర తీరంలోని దేవాలయాలు గంగ నీటితో మునిగిపోగా ఇతర మహర్షులతో ఇతడు పరశురాముడి వద్దకు వెళ్లగా నీటమునిగిన దేవాలయాలను పరశురాముడు నీటిపైకి వచ్చేటట్లు చేశాడు.

**శుష్ణుడు :** ఓ అసురుడు. ఈ మాయావిని ఇంద్రుడొకసారి బంధించి కారాగారంలో పెట్టాడు. – *రుగ్వేదం*

**శూకరం :** పురాణప్రసిద్ధమైన ఓ రాజ్యం. ఈ దేశరాజు కృతి ధర్మజుని రాజసూయయాగానికి వేల ఏనుగులు బహుమతిగా ఇచ్చాడు. – *మహాభారతం*

**శూద్రకుడు :** సంస్కృత నాటక కర్త. క్రీ.శ. 2వ శతాబ్దివాడు. 'మృచ్ఛకటికం' అతడి రచన. ఇది పది అంకాలుగా విభజించబడింది. అతి ప్రాచీన సంస్కృత నాటకం, కొందరు ఇతడు రాజని కూడా చెప్తారు. 'పద్మ ప్రాభృతకం' అనే గ్రంథం కూడా రచించాడని చెప్తారు.

**శూద్రుడు :** చూ॥ చాతుర్వర్ణం.

**శూన్యపాలుడు :** ఓ మహర్షి. ఇతడు దేవలోక నివాసి.
– *మహాభారతం*

**శూన్యబంధువు :** తృణబంధుడి కొడుకు. – *భాగవతం*

**శూన్యవాదం :** బౌద్ధశాలలోని ఓ శాఖా వాదం. ఇది ప్రపంచం శూన్యమని చెప్తుంది.

**శూరతరుడు :** ఒక రాజు. అత్యంత బలశాలి అయిన పతక్కరుడ్ని వధించాడు. పతక్కరుడు కౌరవుల పక్షాన పోరాడాడు. – *మహాభారతం*

**శూరపద్మాసురుడు :** ఓ అసుర వీరుడు. ఇతడు దేవలోకంపై దండెత్తగా ఇంద్రుడు ఓడిపోయి తంజావూరు ప్రాంతంలోని శియాలకి పారిపోయి అచట తపస్సు చేశాడు. – *స్కందపురాణం*

**శూరసేనపురం :** మధురకు నామాంతరం.

**శూరసేనుడు 1 :** యదు వంశ రాజు. మధురాపురి ఇతని రాజ్యం. ఈ రాజ్యాన్ని సూర్యవంశపు రాజులు పాలించేవారు.

కాళింది నదీ పరీవాహక ప్రాంతంలో మధువనే అసురుని కుమారుడు లవణుడు ప్రజల్ని బాధిస్తుండగా శతృఘ్ను డితణ్ణి వధించి తను పరిపాలించాడు. ఆ తర్వాత శతృఘ్నుని కుమారులు పాలించారు. అప్పటి నుండే ఇది మధుర అనే రాజ్యంగా పిలవబడింది. ఆ తర్వాత సూర్యవంశ పాలన అంతమై యదువంశం దీన్ని పాలించింది. యదువంశపు మొదటి రాజు శూర సేనుడు. ఇతని కుమారుడు కృష్ణుని తండ్రి వసు దేవుడు. వసుదేవుడు గోవుల కాపరిగా జీవించగా ఉగ్రసేనుడు మధురను పాలించాడు. ఉగ్రసేనుడి కుమారుడే కంసుడు. శూరసేనుని కుమార్తె కుంతి. ఈమెను కుంతి భోజుడనే రాజు దత్తత తీసుకున్నాడు. శూరసేనుడి తండ్రి దేవమీఢుడు. – మహాభారతం

**శూరసేనుడు 2 :** కార్తవీర్యార్జునుని కొడుకు. ఇతడు జమదగ్నిని వధించాడు. – బ్రహ్మాండపురాణం

**శూరసేనుడు 3 :** పాండవులకు వ్యతిరేకంగా పోరాడిన రాజు. భీష్ముని క్రౌంచ వ్యూహంలో దుర్యోధనుని ప్రక్కన నిలిచాడు. – మహాభారతం

**శూరసేనుడు 4 :** ప్రతిష్ఠాన పురాన్ని పాలించిన సోమ వంశపు రాజు. ఇతడు సంతానం లేక ఎందరో దేవత లను ప్రార్థించగా చివరకు సర్పరూపంలో ఓ పుత్రుడు జన్మించాడు. రహస్యంగా ఉపనయనము, వివాహం జరిపించాడు. చివరకు గౌతమీ దేవి దయవల్ల ఈ సర్పం మానవ రూపం దాల్చింది. – బ్రహ్మాండపురాణం

**శూరసేనులు :** మధురా మండలానికి పూర్వనామం. ఈ ప్రాంత ప్రజల్ని శూరసేనులని పిలిచేవారు. వీరు జరాసంధునికి భయపడి దక్షిణాపథానికి పారిపో యారు. దక్షిణాపథ జైత్రయాత్రలో సహదేవుడు వీరిని ఓడించాడు. వీరు ధర్మజుని రాజసూయ యాగానికి కానుక లిచ్చారు. మహాభారత యుద్ధంలో వీరు అర్జునుడ్ని సాత్యకిని ఎదుర్కొన్నారు. కురు క్షేత్రంలో ధర్మజుడు, భీముడు, వందలాదిమంది శూరసేనుల్ని వధించారు. – మహాభారతం

**శూరుడు 1 :** చంద్రవంశపు రాజు. విధూరధుని కొడుకు. శినికి తండ్రి. – భాగవతం

**శూరుడు 2 :** కార్తవీర్యార్జునుని కొడుకు. కార్తవీర్యా ర్జునుని ప్రధానమైన పుత్రుల్లో శూరుడు, శూరసే నుడు, ధిషనుడు, మధు, జయధ్వజులు కొందరు. – బ్రహ్మాండపురాణం

**శూరుడు 3 :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. – మహాభారతం

**శూరుడు 4 :** ఇలీన అనే రాజుకు రథంతరి అనే భార్య వల్ల జన్మించిన కుమారుడు. ఇతనికి నల్గురు సోద రులు. వారు దుషంత, భీమ, ప్రవసు, వసులు. – మహాభారతం

**శూరుడు 5 :** సౌవీర యువరాజు. ద్రౌపది స్వయం వర సమయంలో అర్జునుడితణ్ణి వధించాడు. – మహాభారతం

**శూరుడు 6 :** ఓ యాదవ రాజు.

– చూ॥ శూరసేనుడు *1.*

**శూరుడు 7 :** దశరధుని భార్య సుమిత్రకు తండ్రి. ఇతడు దశరధుని పుత్రకామేష్టి యాగానికి ఆహ్వానించ బడ్డాడు. – రామాయణం

**శూర్పకుడు :** ఓ అసురుడు. మన్మథుని చేతిలో మరణి స్తాడు. అందుకే మన్మధుడికి శూర్పకారాతి అనే పేరు వచ్చింది.

**శూర్పణఖ :** సుమాలి కుమార్తె కైకసికి విశ్రవసు వల్ల నల్గురు సంతానం. వారు రావణ, కుంభకర్ణ, విభీష ణులు మరియు శూర్పణఖ. ఈమె విద్యుజిహ్వుడను అసురుని వివాహమాడింది. వీరికి శంభు కుమారుడు జన్మించాడు. రావణుడు తన జైత్రయాత్ర నుండి తిరిగి వస్తుండగా కాలకేయులతో పోరాడి వారిని వధిం చాడు. కాలకేయుల సోదరుడైన విద్యుజిహ్వుడు రావ ణునితో పోరాడి మరణించాడు. శూర్పణఖ తన సోదరుడైన రావణునితో తన బాధ చెప్పుకోగా ముల్లో కాలలో నీకు నచ్చినవాడిని ఎంచుకుంటే అతడితో నీ వివాహం జరిపిస్తానని చెప్పి ఓదార్చుతాడు. – ఉత్తర రామాయణం

శంభు కుమారుడు దండకారణ్యములో శివుడ్ని గూర్చి తపస్సు చేస్తుండగా రామలక్ష్మణులు ఇచటకి వచ్చి

పంచవటం వద్ద తమ ఆశ్రమాన్ని నిర్మించుకుం టుండగా శంభు కుమారుడు సీతపై వ్యామోహంతో అతడు కూడా ఓ వృక్షంగా మారి నిలబడతాడు. లక్ష్మణుడు దాన్ని ఖండించగా అతడు మరణిస్తాడు. అదే సమయంలో అచటికి వచ్చిన శూర్పణఖ శ్రీరా ముణ్ణి ప్రేమించి సీత వున్నంతకాలం అది సాధ్యం కాదని సీతపై దాడిచేయబోగా ఇదంతా గమనిస్తున్న లక్ష్మణుడు ఆమె ముక్కు చెవులు కోసి అవమాన పరచగా ఆమె రావణుడికి దీన్ని నివేదిస్తుంది. ఇదే రామరావణ యుద్ధానికి మూలమవుతుంది.

– *కంభ రామాయణం*

**శూర్పారకం :** కేరళకు ప్రాచీన నామం. సముద్రుడు ఈ ప్రాంతాన్ని ముంచెత్తగా అచటి రుషులు పరశు రాముడికి నివేదించగా శూర్పారకాన్ని విసురుతాడు. అది పడిన ప్రాంతం వరకు సముద్రుడు వెనక్కు వెళ్తాడు. అలా ఏర్పడిన ప్రాంతమే శూర్పారకం. ఇచ్చట గల శూర్పారక తీర్థంలో స్నానం చేస్తే బంగారు రాశులు లభిస్తాయి. దక్షిణాపథ జైత్రయాత్రలో దీన్ని సహదేవుడు జయించాడు. ఇచ్చట జమదగ్ని క్రతువు చేసిన స్థలం వుంది. దీనికి దగ్గరలో పాషాణ తీర్థం, చంద్ర తీర్థం అనే పవిత్ర స్థలాలున్నాయి. ధర్మరాజు ఒకసారి ఈ తీర్థాన్ని దర్శించాడు. శూర్పారకాన్ని అపరాంత భూమి అని కూడా పిలుస్తారు.

– *మహాభారతం*

**శేషాద్రి :** ఒక పర్వతం పేరు. క్షీర సముద్ర మదనం కోసం మందర పర్వతాన్ని ఊడబెరుక్కొని వస్తాడు. బలభద్రరాముడు ఇతని అంశ. విష్ణువుకు శయ్యగా వుండే వాడు. మరోపేరు అనంతుడు.

**శేషుడు :** కద్రువ కశ్యపుల కుమారుడు. ధర్మంవైపు నిలచి తల్లి వినతకు చేసిన అన్యాయానికి నిరసించి బ్రహ్మను గూర్చి తపస్సు చేస్తాడు. బ్రహ్మ ఇతణ్ణి భూ భారం వహించమంటాడు. – *మహాభారతం*
వాయు శేషులకు ఒకసారి యుద్ధం జరిగి శేషుడు ఓడిపోతాడు. – *వేంకటాచల మహాత్మ్యం*

**శైఖావత్యుడు :** ఓ ప్రాచీన రుషి. సాళ్వరాజు అంబను నిరాకరించగా ఆమె ఇతని ఆశ్రమానికి వచ్చి తన బాధను వివరించగా ఆమెను ఓదార్చాడు.

– *మహాభారతం*

**శైబ్య 1 :** సగరుని భార్యల్లో ఒకరు. సగరునికి ఇద్దరు భార్యలు. ఒకరు సుమతి రెండు కేశిని. సుమతికి వైదర్భి అని, కేశినికి శైబ్య అనే నామాంతరాలు కలవు. శైబ్య కుమారుడు అసమంజసుడు. – *దేవీ భాగవతం*

**శైబ్య 2 :** సాళ్వరాజైన ద్యుమత్సేనుని భార్య. ఈమె సత్యవాణుడి తల్లి. చూ॥ సత్యవాణుడు.

**శైబ్య 3 :** శ్రీకృష్ణుని భార్యల్లో ఒకరు. శ్రీకృష్ణుడు శరీర త్యాగం చేసినపుడు ఈమె అగ్నిలో దూకి మరణించింది.

– *మహాభారతం*

**శైబ్యం :** కృష్ణుడి రథానికి వుండే అశ్వాలలో ఒక దాని పేరు. – *మహాభారతం*

**శైభ్యుడు 1 :** ప్రాచీన భారతీయ రాజుల్లో ఒకడు. సృంజ యుని తండ్రి. నారదునికి స్నేహితుడు. పర్వతమునికి కూడా స్నేహితుడు. – *మహాభారతం*

**శైబ్యుడు 2 :** శిబి భూమికి రాజు. ఈ ప్రాంత రాజు గొవాసుడు ధర్మజుని మామ. ఇతడు ధర్మజుని కొలు వులో సభ్యుడు. ఇతడు అక్షౌహిణి సైన్యంతో అభి మన్యుని వివాహానికి వచ్చాడు. ఇతడు మహాభారత యుద్ధంలో క్రౌంచ వ్యూహాన్ని రక్షించడానికి నిల బడ్డాడు. ఇతడు ఉశీనారుడి మనుమడు.

– *మహాభారతం*

**శైబ్యుడు 3 :** వృష్ణి కుటుంబంలో జన్మించిన ఓ క్షత్రియ యువరాజు. ఇతడు అర్జునుడి వద్ద నుండి ధనుర్విద్య నేర్చుకొన్నాడు. – *మహాభారతం*

**శైబ్యుడు 4 :** ఓ క్షత్రియరాజు. శ్రీకృష్ణుడితణ్ణి ఓడించాడు. – *మహాభారతం*

**శైబ్యుడు 5 :** కౌరవుల పక్షాన పోరాడిన యోధుడు. భీష్ముడు పన్నిన వ్యూహంలో నిలబడి పోరాడాడు.

– *మహాభారతం*

**శైబ్యుడు 6 :** సౌవీర రాజు. జరాసంధుడు గోమంత నగరాన్ని ఆక్రమించినప్పుడు పశ్చిమ ద్వారాన్ని కాప లాకాశాడు. ఇతని కుమార్తె రత్న అక్రూరుణ్ణి వివాహమాడింది. – *మత్స్యపురాణం*

**శైభ్యులు :** ఉశీనరుడి కొడుకైన శిబి వంశస్థులు.

**శైరీషకం :** పురాణ ప్రసిద్ధిగాంచిన ఓ ప్రాంతం. నకు లుడు తన పశ్చిమ ప్రాంత జైత్ర యాత్రలో ఈ ప్రాంతాన్ని జయించాడు. – *మహాభారతం*

**శైలకంపి :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. - మహాభారతం

**శైలాభ :** ఓ సనాతన విశ్వదేవుడు. - మహాభారతం

**శైలాలయుడు :** ప్రాచీన కాలములో ఒక రాజు. భగదత్తుని ముత్తాత. కురుక్షేత్రంలోని తపోవనంలో తపస్సుచేసి ఇంద్రలోకం చేరాడు. - మహాభారతం

**శైలూషుడు :** ఓ గంధర్వుడు. గంధర్వుల్లోని ఓ వర్గాన్ని శైలూషులంటారు. తూర్పున సముద్ర తీరాన ప్రజల్ని ఇబ్బంది పెడుతున్న వీరిని ఓడించడానికి శ్రీరాముడు భరతుణ్ణి పంపాడు. - కంభరామాయణం

సింధునదీ తీరంలోగల శైలూషుడనే గంధర్వుడ్ని, అతడి 3 కోట్ల సంతానాన్ని భరతుడు వధించాడు. - అగ్నిపురాణం

శైలూష గంధర్వుని కుమార్తె సరమను విభీషణుడు వివాహమాడాడు. - ఉత్తర రామాయణం

శైలూషుడనే గంధర్వుడు కుబేరుని కొలువులో అతణ్ణి పూజిస్తుంటాడు. - మహాభారతం

**శైలోద :** మేరుమందర పర్వతాల మధ్యగల ప్రాంతం. దీన్ని అర్జునుడు జయించాడు. ధర్మజుని రాజసూయ యాగానికి వీరు బంగారు కానుకలు తెచ్చారు.

**శైవ :** అనిలుడి భార్య.

**శైవచాపం :** శివుని ధనస్సు. విశ్వకర్మ రెండు ధనస్సులు చేసి విష్ణువుకు శివుడికి ఇచ్చి తమ బలాలు పరీక్షించుకొమ్మన్నాడు. దక్షయజ్ఞం విధ్వంసాన్ని ఈ ధనస్సుతోనే చేసి ఆ తర్వాత తన భక్తుడైన విదేహ రాజుకిచ్చాడు. వారు దీన్ని పూజించారు. సీతాస్వయంవరంలో దీన్ని శ్రీరాముడు విరిచాడు.

**శైవం 1 :** ఒక పురాణం. వాయుదేవ ప్రోక్తం.

**శైవం 2 :** శివ ప్రాశస్త్యాన్ని తెలిపే గ్రంథం. ఈ ప్రాశస్త్యాన్ని నమ్మి ఆచరించే వారిని శైవమతస్థులంటారు.

**శైవాలం :** ప్రాచీన భారతదేశంలో ఓ పట్టణం. - మహాభారతం

**శైశవం :** పురాణప్రసిద్ధమైన ఓ ప్రాంతం. ఈ ప్రాంత క్షత్రియ రాజులు ధర్మరాజుకు రాజసూయ యాగంలో కానుకలిచ్చారు. - మహాభారతం

**శైశిరాయణుడు :** ఓ మహర్షి. ఇతడికి గోపాలి అనే భార్యవల్ల కాలయవనుడనే పుత్రుడు జన్మించాడు. శైశిరాయణుడు త్రిగర్త రాజు పురోహితుడు. ఒకసారి ఆ రాజు ఈ మహర్షి శక్తిని పరీక్షించదలచి తన భార్యను రమించమని ఆదేశించాడు. - హరివంశం

**శైశిరింధ్ర :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజ్యం. - మహాభారతం

**శైశిరేయుడు :** శాకల్యుని శిష్యుడైన ఒక ఆచార్యుడు. శాకల్య జ్ఞానానికి ఇతడు వ్రాసిన గ్రంథం శైశిరీయ సంహిత విశిష్ఠమని చెప్పబడింది.

**శైశునాగులు :** శిశినాగుడి వంశస్థులు. వీళ్లు పదిమంది. ప్రద్యోతుల తర్వాత మగధదేశాన్ని మూడు వందల అరవై రెండేళ్లు పాలించారు.

**శోణపురం :** చూ॥ శోణితపురం.

**శోణానది :** పురాణ ప్రసిద్ధమైన నది. ఇది వరుణుని కొలువులో అతణ్ణి పూజిస్తుంటుంది. ఇంద్రప్రస్థం నుండి రాజగృహం వెళ్తూ శ్రీకృష్ణుడు ఈ నదిని దాటాడు. వంశ గుల్మతీర్థమనే పుణ్యతీర్థం ఈ నదిలో వుంది. ఇచ్చట స్నానం చేస్తే అశ్వమేధ యాగ ఫలితం లభిస్తుంది. ఇది అగ్ని పుట్టుకకు కారణమైన నదుల్లో ఒకటి. విశ్వామిత్ర రామలక్ష్మణులు ఈ నదీ తీరాన విశ్రమించారు. - రామాయణం

**శోణాశ్వుడు :** సుశర్మ చక్ర రక్షకుడు. - మహాభారతం

**శోణితపురం :** బాణాసురుని రాజధాని. ఈ నగరాన్ని శివ, కార్తికేయ, భద్రకాళి, అగ్ని రక్షిస్తుంటారు. శ్రీకృష్ణుడు వీరందరిని ఓడించి ఉత్తర ద్వారం గుండా ప్రవేశించి బాణాసురుడ్ని సంహరించి అనిరుద్ధుడ్ని ఉషను బంధవిముక్తుల్ని చేశాడు.

**శోణితోదుడు :** ఓ యక్షుడు. ఇతడు కుబేరుని కొలువులో వుండి అతణ్ణి పూజిస్తుంటాడు. - మహాభారతం

**శౌనకుడు 1 :** ఓ ప్రసిద్ధ పండితుడు. రుగ్వేదఅను క్రమణి, అరణ్యకం, రుక్ప్రాతిశాఖ్య రచనల గ్రంథ కర్త అని చెప్పబడింది. ప్రఖ్యాత ఆశ్వలాయనాచార్యుడు ఇతని శిష్యుడు. కాత్యాయని, పతంజలి, వ్యాసుడు ఇతని వర్గీయులే. ఇతని అసలు పేరు గృత్సమదుడు. శునకుని కుమారుడైనందువల్ల శౌనకుడనబడ్డాడు.

★ వంశవృక్షం : రురు – శునక – శౌనక – ఉగ్రశ్రవసుడు. – వాయుపురాణం

ముఖ్య రచనలు :

1. రుక్ ప్రాతీశాఖ్య, 2. రుగ్వేద ఛందానుక్రమణిక, 3. రుగ్వేదర్షానుక్రమణిక, 4. రుగ్వేద అనువాకానుక్రమణిక, 5. రుగ్వేద సూక్తానుక్రమణిక, 6. రుగ్వేద కథానుక్రమణిక, 7. రుగ్వేదపాద విధాన, 8. బృహద్దేవత, 9. శౌనకస్మృతి, 10. చరణ వ్యూహ, 11. రుగ్విధాన. శౌనకుడు వాస్తుశాస్త్రం మీద కూడా ఓ గ్రంథం రచించినట్లు మత్స్యపురాణం పేర్కొంది.

శిష్యులు : ఆశ్వలాయనుడు ఇతని ముఖ్య శిష్యుడు. ఇతడొకసారి "గృహ్యసూత్ర, శౌతసూత్ర" అనే గ్రంథాలను రచించి గురువుకు అంకితమివ్వగా అవి చదివి శౌనకుడు తను శ్రౌతశాస్త్రం మీద వ్రాసిన గ్రంథాన్ని నాశనం చేశాడు. అశ్వలాయనుడు రుగ్వేదంపై శౌనకుడు వ్రాసిన గ్రంథాలు చదివి వాటికి భాష్యం వ్రాశాడు. ఆశ్వలాయనుని శిష్యుడైన కాత్యాయనుడు శౌనకుని 10 గ్రంథాలు ఆశ్వలాయనుని 3 గ్రంథాలు చదివి మరో రెండు గ్రంథాలు రచించి తన శిష్యుడు పతంజలికి ఇచ్చాడు.

దీన్నిబట్టి ఆశ్వలాయన, కాత్యాయన, పతంజలి, వ్యాసులు శౌనకుని శిష్యక్రమణికగా తెలుస్తోంది.

**శౌనకుడు 2 :** ధర్మజునితో పాటు అరణ్యవాసానికి వెళ్లిన బ్రాహ్మణుడు. – మహాభారతం

**శౌనహోత్రుడు :** శునహోత్రుని పుత్రుడు. ఇతడు యాగము చేయుచుండగా ఇంద్రుడు అచటికి వచ్చెను. అసురులు ఇంద్రుని జంపుటకచటికి రాగా శౌనహోత్రుడ తనిని రక్షించెను. ఇంద్రుడు ఇతడిని పునర్జన్మలోభృగు వంశమున శౌనకునికి జన్మింతువని వరమిచ్చెను.

**శౌరి :** శూరసేనుడి కుమారుడు. వసుదేవుని నామాంతరం.

**శౌల్కాయని :** వ్యాసుని శిష్యపరంపరలోని వాడు. ఓ రుషి.

**శౌష్కలుడు :** రావణుని పురోహితుడు. ఇతడు సీతను రావణునికిచ్చి వివాహము చేయమని జనకుని వద్దకు దూతగా బోయెను.

**శౌశల్యం :** పురాణ ప్రసిద్ధమైన దేశం. – మహాభారతం

**శౌశ్రుతి :** త్రిగర్తరాజైన సుశర్మ సోదరుడు. మహాభారత యుద్ధంలో కౌరవుల పక్షాన పోరాడి అర్జునుడి చేతిలో మరణిస్తాడు. – మహాభారతం

**శంకరస్వామి :** ఉపవర్షుణి తండ్రి. – చూ॥ ఉపవర్షుడు

**శంకరాచార్యుడు :** భారతీయ ఆధ్యాత్మిక తాత్త్విక చింతనకు ఆధ్యుడైన శంకరాచార్య కాలడిలో ఓ నంబూద్రి కుటుంబంలో జన్మించాడు. ఇతడు క్రీ.పూ. 509 క్రీ.శ. 84 మధ్య జీవించాడని చెప్తారు. అయితే ఇతడు జీవించింది మాత్రం 32 సంవత్సరాలే. తండ్రి శివగురు, తల్లి ఆర్యాంబ. శివుని ప్రార్థించగా చివరకు శివుడే వీరికి పుత్రుడుగా జన్మించాడని చెప్తారు. ఇతడి ఐదేళ్ల ప్రాయంలో ఉపనయనం చేశారు. 8 ఏళ్ల వయస్సులో వేదాలు ఇతిహాసాలు, శాస్త్రాలలో సంపూర్ణ జ్ఞానం పొందాడు. అప్పటికే తండ్రి చని పోయాడు. శంకరాచార్యుడికి చిన్నతనం నుండి భౌతిక జీవనం మీద ఆసక్తి లేదు. సన్యాసం స్వీకరించాలనే కోర్కె వుండేది. అది తల్లిని బాధించేది. ఒక రోజు ఇతడు ఏటిలోకి స్నానానికి వెళ్లగా మొసలి ఇతణ్ణి పట్టుకోగా తల్లిని ఈ చివరి క్షణాలలోనయినా సన్యాసం స్వీకరిస్తానని కోరగా ఆమె అంగీకరించగా వెంటనే మొసలి వదలివేసింది. తన కోర్కె ప్రకారం సన్యాసం స్వీకరించి తల్లికి ఆమె చివరి క్షణాలలో వచ్చి కలుస్తానని చెప్పి దేశాటనకు బయలుదేరాడు. గురువు కోసం శంకరాచార్యుడు ఉత్తరాదికి పయనమయ్యాడు. నర్మదా నదీ తీరంలో శ్రీగౌడపాదుని శిష్యుడైన గోవింద భగవత్పాదులను కలసి తనను శిష్యుడిగా చేర్చుకొమ్మని కోరగా అతడు శంకరుడికి సన్యాసమిచ్చి శిష్యునిగా స్వీరించాడు. అదే సమయంలో నర్మదకు తీవ్ర వరదలు వచ్చి తీర ప్రాంతాలను ముంచెత్తగా తన కమండలం తీసుకొని జలాకర్షణ మంత్రం ఉచ్చరించగా వరద నీరంతా నదిలోకి వెళ్లిపోయింది. ఆ తర్వాత గోవింద భాగవత్పాదులు శంకరుడ్ని కాశీకి వెళ్లి ప్రధాన త్రయానికి భాష్యం వ్రాయమని సూచించాడు.

కాశీలో వుండగా ఇతడి వద్ద పద్మపాదుడు, హస్తామలకుడు శిష్యులుగా చేరారు. తోటకాచార్యుడొక శిష్యుడు.

★ ధర్మవృద్ధ – శునహోత్ర – గృత్సమద – శునక – శౌనక అని కూడా వాయుపురాణంలో మరొకచోట పేర్కొనబడింది.

ఇదే సమయంలో విశ్వనాథ దేవాలయం నుండి చండాలుడు ఎదురుపడగా శంకరాచార్యుడు త్రోవలో తప్పుకోమనగా తప్పుకోవలసింది శరీరమా ? ఆత్మయా ? అని చండాలుడు ప్రశ్నించగా శంకరుడు అతని పాదాలపై పడి బ్రహ్మజ్ఞానం తెలిసినవాడే తనకు గురువని చెప్తాడు. ఆ చండాలుడే శివుడు.

ఆ తర్వాత శివుని కోరికపై బదరికాశ్రమం వెళ్లి వ్యాసుడ్ని గోవిందపాదుడ్ని కలిసి వారి కోరికపై గ్రంథ రచనకు ఉపక్రమించాడు. ఆ తర్వాత ఇతడు మండన మిశ్రుడ్ని అతడి భార్య భారతీదేవిని తన పాండిత్యంతో ఓడించి తనదైన సిద్ధాంతాన్ని భారతదేశం నలు మూలలా ప్రచారం చేశాడు అదే అద్వైత సిద్ధాంతం. వీటి ప్రచారం కోసం భారతదేశం 4 దిక్కులు శృంగేరి, జగన్నాథ, ద్వారక, బదరీనాథ్‌ల వద్ద మఠాలను నెల కొల్పాడు. కంచిలోని శంకర పీఠం కూడా ఇతడు నెలకొల్పిందే. కంచి వద్ద సర్వజ్ఞాన పీఠం పొందాడు. ఇతని ముఖ్య రచనలు 4 విభాలుగా విభజించ వచ్చును. భాష్యాలు, స్వీయరచనలు, స్తోత్రాలు, మంత్రాలు.

**శంకరి :** వరతాను అను బ్రాహ్మణుడి భార్య. వీరికి తర్వాతి జన్మలో సంతానం లేదు. చూ॥ వరతాను.

**శంకరుడు 1 :** చూ॥ శివుడు

**శంకరుడు 2 :** భార్యచేతిలో మరణించిన సాధారణ బ్రాహ్మణుడు. ఇతని భార్య ఓ నీచ ప్రవృత్తి కలది. పేరు కలిప్రియ. తన భర్త శంకరుడిని చంపి తన ప్రియుడితో వెళ్లిపోతుండగా అడవిలో జంతువులు ఆమె ప్రియుడ్ని చంపేశాయి. పశ్చాత్తాపంతో వెనక్కు వచ్చి తన భర్త శవాన్ని పూజించింది. తోటి స్త్రీలు చెప్పగా కార్తీకవ్రతం ఆచరించింది. భర్తను చంపిన పాపం నశించి చనిపోయిన తర్వాత స్వర్గం చేరింది. - పద్మపురాణం

**శంకుకర్ణుడు 1 :** వారణాసిలోని కపర్థీశ్వర తీర్థంలో నివసించిన ముని. ఒకరోజు సన్నగా ఎముకలా వుండి ఆకలితో వున్న దయ్యం ఇతని వద్దకు వచ్చి "నేను పూర్వజన్మలో ధనవంతుడైన బ్రాహ్మణుడ్ని. తల్లి దండ్రుల్ని కుటుంబాన్ని సరిగానే చూసుకున్నాను కాని దేవతలను, అతిథుల్ని, గోవుల్ని గౌరవించలేదు. అయితే ఒకసారి విశ్వనాథుడి విగ్రహం అంటుకుని పూజించాను. వెంటనే నేను మరణించి దయ్యంగా మారాను. నేను స్వర్గం వెళ్లే మార్గం చెప్పమని అడిగాడు. శంకుకర్ణుడు నీకంటే అదృష్టవంతుడు లేడు. నీవు విశ్వనాథుడి పాదాలు అంటుకొన్నావు. అదే నిన్ను నా దగ్గరకు పంపింది. నీవు ఈ పుణ్యతీర్థంలో స్నానంచేస్తే దయ్యం రూపం నశించి స్వర్గం చేరతావనగా అతడు అలాగే చేసి స్వర్గం చేరాడు. - పద్మపురాణం

**శంకుకర్ణుడు 2 :** ధృతరాష్ట్రుని కుటుంబంలో జన్మించిన సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. - మహాభారతం

**శంకుకర్ణుడు 3 :** శివుని పరిచారకుడు. కుబేరుని కొలువులో వుంటాడు. - మహాభారతం

**శంకుకర్ణేశ్వరుడు :** శివుని స్వరూపాలలో ఒకటి. ఈ మూర్తిని పూజిస్తే అశ్వమేధయాగం చేసిన దాని కంటే 10 రెట్లు ఫలితం లభిస్తుంది. - మహాభారతం

**శంకుడు 1 :** హిరణ్యాక్షుని కుమారుడు. శంబర, శకుని, ద్విమూర్ధ, శంకు, ఆర్యుడు హిరణ్యాక్షుని కుమారులు. - అగ్నిపురాణం

**శంకుడు 2 :** ఓ యాదవ రాజు. ఇతడు ద్రౌపది స్వయం వరానికి వచ్చాడు. - మహాభారతం

**శంకురోమ :** కశ్యప కద్రువలకు జన్మించిన 100 తలల సర్పం. - మహాభారతం

**శంకుశిరస్సు :** దనువు పుత్రులలో ఒకడు.

**శంఖచూడుడు 1 :** ఓ అసురుడు. సుదాముడు శాపం వల్ల ఈ జన్మం సంభవించింది. - చూ॥ తులసి

**శంఖచూడుడు 2 :** కుబేరుని సేవకుడు. ఒకసారి, శ్రీకృష్ణుడు బలబధ్రరాముడు గోపికలతో శృంగార కేళిలో వుండగా ఇతడు ఆ స్త్రీలను ఎత్తుకుపోగా శ్రీకృష్ణుడు ఇతణ్ణి వధించి అతని తలపై గల మణిని బలభద్రరాముడికి బహూకరించాడు. - భాగవతం

**శంఖణుడు :** వజ్రనాభుడి కొడుకు.

**శంఖతీర్థం :** సరస్వతీ నదీతీరంలోని ఓ పవిత్ర స్థలం. - చూ॥ మహాభారతం

**శంఖనఖం :** వరుణుని కొలువులో నివసిస్తూ అతణ్ణి పూజించే ఓ సర్పం. - మహాభారతం

**శంఖపదుడు :** స్వారోచిష మనువు కొడుకు. మనువు ఇతనికి సాత్వత ధర్మం బోధించగా దాన్ని ఇతడు తన కుమారుడైన సువర్ణాభుడికి బోధించాడు.
– మహాభారతం

**శంఖపర్వతం :** మేరు పర్వతం వద్ద గల మరో పర్వతం.
– చూ॥ కురంగపర్వతం

**శంఖపాలుడు :** లోకపాలకులు నల్గురిలో ఒకడు.

**శంఖపిండం :** కశ్యప కద్రువలకు జన్మించిన ఓ నాగు.
– మహాభారతం

**శంఖమేఖలుడు :** ఓ మహర్షి. ప్రమద్వర పాముకాటుకు గురికాగా ఆమెను చూడటానికి స్థూలకేశుని ఆశ్రమానికి వెళ్లాడు. – మహాభారతం

**శంఖరిక :** సుబ్రహ్మణ్యస్వామి సేవిక. – మహాభారతం

**శంఖశిరసుడు :** కశ్యప కద్రువలకు జన్మించిన ఓ నాగు.
– మహాభారతం

**శంఖం :** ఒక ఏనుగు. ప్రభాస తీర్థంలో మునులను బాధిస్తుంటే కేసరి అనే వానరం దీన్ని చంపుతుంది.

**శంఖస్రవస :** సుబ్రహ్మణ్యస్వామి సేవిక. – మహాభారతం

**శంఖాలు :** శంఖచూడుడి ఎముకల నుండి జనించినవి.
– బ్రహ్మవైవర్తపురాణం

**శంఖిని :** కురుక్షేత్రంలోని ఓ పుణ్యస్థలం. ఇచ్చటున్న తీర్థంలో స్నానం చేస్తే వారి అందం పెరుగుతుంది.
– మహాభారతం

**శంఖుడు 1 :** కశ్యప ప్రజాపతి కద్రువకు జన్మించిన ఓ నాగు. ఒకసారి ఇతణ్ణి ఇంద్రుని రథసారథి మాతాలికి పరిచయం చేశాడు. బలభద్రరాముని ఆత్మ పాతాళానికి వెళ్లేటపుడు ఈ నాగు తోడుంది.
– మహాభారతం

**శంఖుడు 2 :** విరాటరాజు కుమారుడు.
ఇతడి సోదరుడు ఉత్తరుడు, సోదరి ఉత్తరలతోపాటు ద్రౌపది స్వయంవరానికి వెళ్లాడు. విరాటజరాజు గోవుల్ని కౌరవులు తోలుకొని వెళ్ళేటప్పుడు వారితో తలపడ్డాడు. మహాభారత మొదటి రోజు యుద్ధంలో భూరిశ్రవసుడితో యుద్ధంచేశాడు. తర్వాత ద్రోణుని చేతిలో మరణించాడు. మరణానంతరం ఇతని ఆత్మ విశ్వదేవునిలో ఐక్యమయ్యింది. – మహాభారతం

**శంఖుడు 3 :** ఓ మహర్షి. లిఖితుడను రుషి సోదరుడు. అనుమతి లేకుండా లిఖితుడి ఆశ్రమంలోని పుష్పాలు కోసినందుకు ఇతడ్ని లిఖితుడు శిక్షించాడు.
– చూ॥ *లిఖితుడు*

**శంఖుడు 4 :** ఓ కేకయ యువరాజు. ఇతడు ఇతని నల్గురు సోదరులు పాండవుల పక్షాన పోరాడారు.
– మహాభారతం

**శంఖుడు 5 :** హయగ్రీవుడను అసురుని నామాంతరం.
– చూ॥ హయగ్రీవుడు

**శంఖం :** కుబేరుని కొలువులో వుండే కన్పించని ధనాగారం. దీన్ని సద్బ్రాహ్మణులకు దానం చేయడం వల్ల పాంచాల రాజైన బ్రహ్మదత్తుడు స్వర్గలోకం వెళ్లాడు.
– మహాభారతం

**శంతనుడు :** చంద్రవంశపు రాజైన ప్రతీపుని కుమారుడు. దేవాపి, బాహ్లికులితని సోదరులు. దేవాపి రాజ్యం వదలి వెళ్లగా శంతనుడు రాజయ్యాడు. గంగ షరతులకు లోబడి ఆమెను వివాహమాడాడు. వీరికి భీష్ముడు జన్మించాడు. శంతనుడు ఆమె షరతులను అతిక్రమించినందుకు భీష్ముడ్ని వదలిపోగా తర్వాత ఇతడు సత్యవతిని ఆమె తల్లిదండ్రుల షరతులకు లోబడి భీష్ముడు ప్రతిజ్ఞ చేయగా ఆమెను వివాహమాడాడు. వారికి చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు జన్మించారు. ఇతర విశేషాలకు – చూ॥ భీష్ముడు

**శంపాకుడు :** ఓ సదాచార సంపన్నుడైన బ్రాహ్మణుడు. జీవితంలో పశ్చాత్తాపానికి మించిన ప్రాయశ్చిత్తం లేదని భావించేవాడు.

**శంబరాసురుడు 1 :** దేవాసుర యుద్ధంలో ప్రముఖ పాత్ర వహించాడు. చాలా యుద్ధాల తర్వాత శివుడి తణ్ణి వధించాడు. ఇతడు ఎన్నో మాయా విద్యలు వచ్చినవాడు. ఇతడి మాయలకు భయపడి దేవతలు అరణ్యంలో దాక్కోగా ఇతడు యధేచ్ఛగా వారి భవనాలు తగులబెట్టాడు. దేవతలు శంబరుని పంపిన సేనానాయకుల్ని వధించగా ఇతడు తన మాయాజాలంతో దమ, వ్యాలి, ఘలు అనే రాక్షసుల్ని సృష్టించగా వీరు దేవతల్ని చంపడం మొదలుపెట్టగా దేవతలు బ్రహ్మకు చెప్పుకోగా అతడు యుద్ధాన్ని మరింత ఉధృతం చేయమనగా దేవతలు ఈ ముగ్గుర్ని చంపగా శంబరుడు పారిపోయి దాకున్నాడు.
– జ్ఞానవాసిష్ఠం

ఇతడు దస్యులకు రాజు. ఇతడి రాజ్యంలో 100 నగరాలు వుండేవి. ఈ నగరాల్లో జీవించే పాణిలు ఆర్యులకు ముఖ్యశత్రువులు. శంబరుడ్ని ఆర్యులు సంహరించారు. - రుగ్వేదం

ఇతర విశేషాలు : శంభరుడు కశ్యప దనులకు జన్మించాడు. దేవతల కోరికపై దశరథుడితణ్ణి ఒకసారి ఓడించాడు. మరొకసారి ఇంద్రుడు ఓడించాడు.

**శంబరాసురుడు 2 :** హిరణ్యాక్షుని కొడుకు. శకుని ద్విముద్ర, శంకు, ఆర్యకు సోదరుడు. ఇతడు మాయావి. శ్రీకృష్ణుని కుమారుడు ప్రద్యుమ్నుడు ఇతడిని ఇతడి భార్య మాయావతిని వధించాడు. - భాగవతం

**శంబళిపురం :** కలియుగంలో విష్ణుమూర్తి విష్ణువర్మ అనే పేరుతో జన్మించే పట్టణం - భాగవతం

**శంబూకుడు :** ఓ శూద్ర రుషి. శ్రీరాముని పాలనలో ఎంతో మంది పిల్లలు చనిపోతుండగా ఎంతో మంది రాజుకు నివేదించారు. వసిష్ఠుని సలహాపై రాముడు విమానంలో దేశమంతా పరిశీలించి ఓ శూద్రుడు తపస్సు చేయడమే ఈ వైపరీత్యాలకు కారణమని ఇతణ్ణి వధించాడు. - కంభరామాయణం

**శంభుడు 1 :** కశ్యప సురభిలకు పుత్రుడైన త్వష్టకు మనుమడు. త్వష్టకు విశ్వరూపుడను కొడుకుగలడు. విశ్వరూపునికి 14 మంది కొడుకులు. ఇందులో 11 మందిని ఏకాదశ రుద్రులంటారు. శంభుడందులో ఒకడు.

**శంభుడు 2 :** అంబరీషుని ముగ్గురు కుమారుల్లో ఒకడు. తక్కిన ఇద్దరు విరూపుడు, కేతుమానుడు. శంభుడు ఎన్నడు మాంసం భుజించలేదు. - మహాభారతం

**శంభుడు 3 :** విద్యుజిహ్వ, శూర్పణఖల కుమారుడు. ఇతడు దండకారణ్యంలో తపస్సు చేస్తుండగా సీతను చూసి కామించి ఆమె అందాన్ని చూడటానికి వృక్షంగా మారగా లక్ష్మణుడి బాణానికి కూలి మరణించాడు. - కంభరామాయణం

శంభుడు కుశధ్వజుని కూతురు వేదవతిని తన కిచ్చి వివాహం చేయమని కోరగా అతడు నిరాకరించినందుకు అతడు నిద్రిస్తుండగా వధించాడు. వేదవతి ఇతణ్ణి శపించింది. ఆ శాపఫలం వల్ల శంభుడు లక్ష్మణుడి చేతిలో మరణించాడు. - ఉత్తర రామాయణం

**శంభుడు 4 :** రుక్మిణీ శ్రీకృష్ణుల పుత్రుడు. - మహాభారతం

**శంభుడు 5 :** భరత వంశంలోని ఒక రాజు. ఉగ్రసేనుని 80 మంది పుత్రులలో ఒకడు. - భాగవతం

**శంభువు 1 :** ధ్రువుడి భార్య. వీరికి ఇద్దరు కుమారులు. వారు శిష్టి, భవ్యుడు.

**శంభువు 2 :** ఓ అగ్ని. ఇది వేదాధ్యయనం చేసిన బ్రాహ్మణుడితో సమానమైన శక్తి కలది. - మహాభారతం

**శంయుడు :** బృహస్పతి కొడుకు. భార్య సత్య. భరద్వాజుడు, భరతుడు ఇతని కుమారులు. - మహాభారతం

**శాంఖాయనుడు :** చూ॥ సాంఖ్యాయణుడు.

**శాండిలి 1 :** దక్షుని కుమార్తెలలో ఒకరు. ఈమె ధర్మదేవుడ్ని వివాహమాడగా అష్టావసువుల్లో ఒకడైన అనిలుడు జన్మించాడు. - మహాభారతం

**శాండిలి 2 :** ఒక యోగిని. ఈమె గరుడుని శపించడం వల్ల ఒకసారి గరుడుని ఈకలన్ని ఊడిపోయాయి.

**శాండిలి 3 :** ఓ పతివ్రత అయిన దేవి. ఈమె దేవలోకంలో వుంటుంది. పతివ్రతా లక్షణాలను ఈమె కేకయ యువరాణి సుమనసుకి వివరిస్తుంది. - మహాభారతం

**శాండిల్యుడు 1 :** ఓ గొప్ప రుషి. శాతానికుడు అతని భార్య విష్ణుమతి సంతానం లేక ఇతడిని దర్శించగా ఇతడిచ్చిన వరి అన్నం భుజించగా ప్రసిద్ధ చక్రవర్తి అయిన సహస్రానీకుడు జన్మించాడు. - కథాసరిత్సాగరం

ఇతడు ధర్మజుని కొలువులో సభ్యుడు. ఇతనికి పండితురాలైన కుమార్తె కలదు. బంగారు కూజాలో నీటినివ్వడం కంటే ఎద్దుల బండి దానం చేయడం ఉత్తమమని చెప్పాడు. భీష్ముడు అంపశయ్యపై నుండగా దర్శించిన రుషుల్లో ఒకడు. - మహాభారతం

**శాండిల్యుడు 2 :** మరీచి కుమారుడైన కశ్యపుని వంశంలో జన్మించిన రుషి. ఈ మహర్షి కుటుంబంలో అగ్ని జన్మించడంవల్ల వీరిని శాండిల్య గోత్రీయులని పిలుస్తారు. సుమన్యుడను రాజు ఈ రుషికి ఆహారం ఇతర ద్రవ్య పదార్థాలు ఇచ్చాడు. - మహాభారతం

**శాండిల్యుడు 3 :** ఓ రాజు. శివభక్తుడు. కాని యువకుడుగా వున్నపుడు కాముకతతో స్త్రీలకు రక్షణ

లేకుండా పోయింది. శివుని భక్తుడైనందువల్ల యముడు కూడా ఇతడిని ఏమీ చేయలేకపోవుటచే శివుడే విషయం తెలిసి ఇతడిని 1000 సంవత్సరాలు తాబేలుగా జీవించమని శపించాడు.

**శాండిల్యుడు 4 :** ఇతడో విష్ణు భక్తుడు. అయితే వేదాలలో పేర్కొన్నట్లుగాక వేదాలకు వ్యతిరేక పద్ధతిలో విష్ణు పూజకు ఓ గ్రంథం రచించాడు. ఈ పాపానికి ఇతడు నరకం వెళ్లాడు. ఇతడే తర్వాత జమదగ్నిగా జన్మించాడు. - వృద్ధహరితస్మృతి

**శాండిల్యుడు 5 :** ఓ రుషి. ఇతడి భక్తి సూత్రాలు నారదుని భక్తి సూత్రాలంత ప్రసిద్ధి చెందాయి. ఇతడు భక్తిని శాస్త్రీయ పద్ధతిలో బోధించాడు.

★ **శాంత 1 :** అష్టావసువుల్లో ఒకడైన ఆపుడి కుమారుడు. ఆపుడికి నల్గురు కొడుకులు. వెంతపు, శ్రమ, శాంత, ధ్వని.

**శాంత 2 :** ప్రియవ్రతుని కుమారుడైన ఒక రాజు. - భాగవతం

**శాంత 3 :** దశరధుని కుమార్తె. అంగ దేశపు రాజైన లోమపాదుడు పెంచుకున్న రుష్యశృంగ మహర్షి కిచ్చి వివాహం చేశాడు. - రామాయణం

ఒక రుషి. దర్భల కొసలు తినుచు తపస్సు చేసుకొనుచుండెడివాడు. ఇతని తపస్సు భగ్నము చేయుటకు ఇంద్రుడు ఐదు గురు అప్సరసలను పంపగా అతడు కొలనులోని భవనములో వీరితో విహరించెను. ఈ కొలనునే పంచాప్సరమని పిలిచెదరు. - రఘువంశం

**శాంతనవుడు :** పాణినికి ముందు జన్మించిన ఓ వ్యాకరణ కర్త. 'పిట్యాత్ర' అనే గ్రంథం రచించాడు. వేదాలలోని స్వరాలను గురించిన వివరణ ఇందులో ప్రధానాంశం. 87 సూత్రాలున్న ఈ రచన నాల్గు అధ్యాయాలుగా విభజించాడు.

**శాంతమయుడు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. - మహాభారతం

**శాంతరజసుడు :** కాశీరాజు. త్రిక కల్పవుడి కొడుకు. ఇతని కొడుకు రాజి అనే రాజు. - భాగవతం

**శాంతి 1 :** ప్రసూతి దక్షులకు జన్మించిన కూతురు. ప్రసూతికి శాంతితో కలసి 24 మంది సంతానం. - విష్ణుపురాణం

**శాంతి 2 :** దుష్యంతుని కుమారుడైన భరతుని వంశంలో జన్మించిన రాజు. ఇతని తండ్రి నీలుడు, తాత అజమీఢుడు, కొడుకు సుశాంతి. - భాగవతం

**శాంతి 3 :** నాల్గవ మన్వంతరంలో ఇంద్రుడి పేరు. - మహాభారతం

**శాంతి 4 :** అంగిరసుడి కుమారుడు. ఇతని మరో పేరు ఆత్మేయుడు. ఓ రుషి. ఉపరిచర వసువు చేసిన యజ్ఞంలో పాల్గొన్నాడు. - మహాభారతం

**శాంతి 5 :** భూతి అనే మునికి శిష్యుడైన రుషి. ఒకసారి యజ్ఞకర్తగా భూతి వెళ్లి శాంతికి తన ఆశ్రమ నిర్వహణ బాధ్యతలు అప్పగించగా అగ్ని దొరకడం కష్టమై అగ్ని దేవుణ్ణి ప్రార్థించాడు. అతడు ప్రత్యక్షం కాగా తన గురువుకు సంతానం ఇమ్మని ప్రార్థించగా భూతికి 'భౌత్యమానుడు' జన్మించాడు. శిష్యుని గురుభక్తికి మెచ్చి భూతి శాంతికి సంగవేదం బోధించాడు. - మార్కండేయ పురాణం

**శాంతికల్పం :** అధర్వణ వేదంలో ఐదు సంహిత విభాగాల్లో ఒకటి. దీన్ని మంజుకేశుడు సంకలనం చేశాడు. మిగిలిన సంహిత విభాగాలు నక్షత్ర కల్పం, వేద కల్పం, సంహిత కల్పం, అంగిరస కల్పం. శాంతి కల్పంలో విగ్రహాలకు గుర్రాలు, ఏనుగులు బలి ఇచ్చే విధి విధానాలు పేర్కొనబడినవి.

**శాంతి దేవ :** దేవకుడను రాజు కుమార్తె ఈమెను. వసుదేవుడు వివాహమాడాడు. - వాయుపురాణం

**శాంభుడు :** చూ॥ శుంభనిశుంభులు.

**శుంగుడు :** అశోకుని వంశములోని వాడగు బృహద్రదుని సేనాపతి. ఇతడు రాజును చంపి రాజ్యము నాక్రమించెను. ఇతని పుత్రుడు అగ్నిమిత్రుడు. - భాగవతం

**శుంఠికం :** పురాణ ప్రసిద్ధమైన ఒక పట్టణం. భారతదేశ తూర్పుదిక్కున కలదు. కర్ణుడు దీన్ని జయించాడు. - మహాభారతం

★ అష్టావసువుల్లో ఒకడైన అహరుడి కొడుకు. ఇతని సోదరులు శమ, జ్యోతిస, ముని. - మహాభారతం

**శుంధుడు :** పురువంశంలోని ఒక రాజు. పురు చక్రవర్తి మనుమడు ప్రాచీనవానుడు. ప్రాచీనవానుడి కొడుకు మనస్యుడు. వీతభయుడు మనస్యుని కొడుకు. వీత భయుని కొడుకు శంధుడు. శంధుడి కొడుకు బహు విధుడు. – అగ్నిపురాణం

**శుంభనిశుంభులు :** కశ్యప ప్రజాపతి దితికి జన్మించిన ఇద్దరు అసురులు. పాతాళం నుండి భూమి పైకి వచ్చి బ్రహ్మను గూర్చి దేవతలు లేక మానవులలో పురుషుల వల్ల మరణం లేనట్లు వరం పొందారు. ఆ తర్వాత దేవతలపై దండెత్తి వారిని ఓడించగా దేవి కాళికగా అవతరించి వీరి సైన్యాన్ని చివరికి వీరిని వధించింది.

**శృంగవాన :** ఇలావృతానికి ఉత్తరాన గల పర్వతం నీలగిరి, శ్వేతగిరి, శృంగవాన అనే మూడు పర్వతాలు ఎన్నోనదులకు మాతృకలు. ఇవి ఒక్కొక్కటి 2,000 మైళ్లదూరంలో వున్నాయి. – దేవీ భాగవతం. అర్జునుడు తన ఉత్తర భారత జైత్రయాత్ర తర్వాత ఈ పర్వతం మీదగా కురు దేశంలోకి ప్రవేశించాడు. ఈ పర్వతం ఎన్నో ఖనిజాలకు ప్రసిద్ధి, ఎందరో సాధు వులు నివసించేవారు. ఈ పర్వతం ఉదయం సాయం త్రం స్మరించదగ్గ పవిత్రమైనది. – మహాభారతం

**శృంగవానుడు :** ఓ ప్రాచీన రుషి. గాలవుని కుమారుడు. ఇతడు బలవంతంగా వృద్ధ కన్యను వివాహమాడ వలసి వచ్చింది. ఓ రోజు రాత్రి గడిపిన తర్వాత ఆమె ఇతడిని వదలి వెళ్లిపోగా ఇతడు కుటుంబాన్ని విడచి ఆమెను వెతుక్కుంటూ వెళ్లాడు. – మహాభారతం

**శృంగవిషుడు :** ఓ రుషి. ఇతడి ఉదరం నుండి ఇంద్రుడు జన్మించాడు. – రుగ్వేదం

**శృంగవేదం :** కౌరవ్యకులంలో జన్మించిన ఓ నాగు. జనమేజయుని సర్పయాగంలో మరణిస్తుంది.

**శృంగారవల్లి :** తమిళ మహాకవి కంచరుడి తల్లి.

**శృంగార శేఖరుడు :** ఒక రాజు. రాగ మంజరికి తండ్రి. ఈమె చంద్రగుప్తుడ్ని ప్రేమించిందని తెలిసి అతనికిచ్చి వివాహచేస్తాడు. వీరి కుమారుడే విక్రమార్కుడు. – విక్రమార్క చరిత్రము

**శృంగిబేరిపురం :** ఓ పుణ్యస్థలం. గుహుడు శృంగవా సుడు తర్వాత రామలక్ష్మణుల్ని తన పడవలో గంగను దాటించాడు. రాముని పాదస్పర్శతో ఇతడు నివసిం చిన ప్రాంతం పవిత్రమయ్యింది. – రామాయణం

**శృంగుడు (శృంగి) :** శమీకుడనే ముని కొడుకు. తన తండ్రిపై చనిపోయిన పాముని విసిరాడని తెలిసి పరీక్షిత్తుని 7 రోజుల్లో పాముకాటుకు మరణిస్తావని శపిస్తాడు. – మహాభారతం

**శృంగేరి :** శంకరాచార్యుడు స్థాపించిన మఠం.

**శ్యమంతకమణి :** ఇదో మణి. దీన్ని సూర్యుడు సత్రాజి త్తుకిస్తాడు. దీనివల్ల రోజుకి ఎనిమిది బారువుల బంగారం లభిస్తుంది. శ్రీకృష్ణుడొకసారి దీన్ని అడగ్గా ఇవ్వనిరాకరిస్తాడు. సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనుడు వేటకు వెళ్తూ ఈ మణిని తీసుకొనివెళ్లగా ఓ సింహం ఇతణ్ణి చంపుతుంది. జాంబవంతుడు ఈ సింహాన్ని చంపి ఆ మణిని తన కుమార్తె జాంబవతికిస్తాడు. మణికోసం శ్రీకృష్ణుడే ప్రసేనుణ్ణి చంపాడనే వదంతు లురాగా దాన్ని నివారించడానికి శ్రీకృష్ణుడు దాన్ని వెతకడానికి వెళ్లి జాంబవంతుణ్ణి ఓడించి ఆ మణిని గ్రహిస్తాడు. జాంబవంతుడు తన కూతురు జాంబ వతిని కూడా శ్రీకృష్ణుడికిచ్చి వివాహం చేస్తాడు. ఆ మణిని తిరిగి సత్రాజిత్తుకివ్వగా అతడు తన కుమార్తె సత్యభామను శ్రీకృష్ణునికిచ్చి వివాహం చేస్తాడు. ఆ తరువాత శతధన్వుడను రాజు ఈ మణికై సత్రాజి త్తును చంపగా శ్రీకృష్ణుడు శతధన్వుని జంపెను. ఆ మణి శతధన్వుని కుమారుడు భోజునికడ నుండగా అక్రూరుడు తెచ్చి శ్రీకృష్ణునికిచ్చెను.

**శ్రద్ధ 1 :** ప్రసూతి దక్షప్రజాపతిలకు జన్మించిన కూతురు. వీరికి 24 మంది కుమార్తెలు. ఇందులో 13 మందిని ధర్మదేవుడు వివాహమాడాడు. అందులో శ్రద్ధ ఒకరు. ధర్మదేవునికి శ్రద్ధకు జన్మించిన కుమారుడు కాముడు. – విష్ణుపురాణం

**శ్రద్ధ 2 :** సూర్యుని కుమార్తె. ఈమె నామాంతరాలు వైవస్వతి, సావిత్రి, ప్రసవిత్రి. – చూ॥ సావిత్రి

**శ్రద్ధ 3 :** వైవశ్వత మనువు భార్య. – చూ॥ వైవశ్వత మనువు

**శ్రద్ధ 4 :** కర్దమ ప్రజాపతి దేవహూతిలకు జన్మించిన కుమార్తె. ఈమె అంగిరసుని భార్య. అంగిరసునికి ఈమెవల్ల ఇద్దరు కుమారులు, నల్గురు కుమార్తెలు. కుమారులు : ఉతత్యుడు, బృహస్పతి, కుమార్తెలు : సీనీవాలీ, కుహూ, రేకా, అనుమతి.

**శ్రద్ధావతి :** వరుణుని ఓ నగరం.
– చూ॥ అష్టదిక్పాలకులు

**శ్రముడు :** అష్టావసువుల్లో ఒకడైన ఆపుడి కుమారుడు. ఆపుడి నల్గురు కుమారులు వైరుండ, శ్రమ, శాంత, ధ్వని.

**శ్రవణ ద్వాదశి :** ఓ పుణ్యదినం. రెండు నదుల సంగమం వద్ద స్నానం చేసి ఒక రోజు ఉపవాసం వుంటే మోక్షం లభిస్తుంది.

**శ్రవణం :** 27 నక్షత్రాలలో ఒకటి. ఈ నక్షత్రం రోజున శ్రాద్ధ కర్మలు నిర్వహిస్తే స్వర్గం లభిస్తుంది.
– మహాభారతం

**శ్రవణుడు :** మూరాసురుని ఏడుగురు కొడుకుల్లో ఒకడు. ఆ ఏడుగురు తామ, అంతరీక్ష, శ్రవణ, వసు, విభావసు, నభస్వాన, అరుణ. వీరందరిని శ్రీకృష్ణుడు సంహరించాడు. – భాగవతం

**శ్రవుడు :** ఇక్ష్వాకు రాజైన యువనాశ్వుని కుమారుడు. ఇతడు శ్రావస్తుడి తండ్రి. – మహాభారతం

**శ్వన :** ప్రజాపతి భార్య. ఈమె కుమారుడు అనిలుడు.
– మహాభారతం

**శ్వనుడు :** సత్యుడను అగ్ని కొడుకు. – మహాభారతం

**శ్వఫల్కుడు :** అక్రూరుని తండ్రి. వృష్ణికి ఇద్దరు కుమారులు. ఒకడు శ్వఫల్కుడు, రెండోవాడు చిత్రకుడు. శ్వఫల్కుడు ఎచ్చటవుంటే అతిసార వ్యాధులు రావడం గాని, అనావృష్టిగాని సంభవించవనేది దైవానుగ్రహం. కాశీరాజ్యంలో ఒకసారి అనావృష్టి రాగా కాశీరాజు ఇతణ్ణి తన దేశానికి తీసుకువెళ్లాడు. ఆ తర్వాత ఆ దేశంలో వర్షాలు కురవగా కాశీరాజు తన కుమార్తెను ఇతడికిచ్చి వివాహం చేశాడు.

**శ్యాపర్ణులు :** ఓ పురోహిత వర్గం. విశ్వంతరుడను రాజుకు పురోహితులు. రాజు ఒకసారి వీరిని వదలి సోమయాగం చేయదలచాడు. ఆ సమయంలో రామభార్గవేయుడను శ్యాపర్ణుడు సోమయాగం చేయడానికి నూతన పద్ధతి అనుసరించి తమ వర్గ పౌరోహిత్యాన్ని నిలబెట్టాడు. – ఐతరేయ బ్రాహ్మణం

**శ్యామ 1 :** మేరువు యొక్క తొమ్మిది మంది కుమార్తెలలో ఒకరు. వీరిని నవ కన్యలంటారు. వీరిని అగ్నీధ్రుని కుమారులు వివాహమాడారు. – భాగవతం

**శ్యామ 2 :** శాకద్వీపంలో ఓ పర్వతం. ఇది మబ్బు అంత నల్లగా వుండి ఎత్తుగా వుంటుంది.
– మహాభారతం

**శ్యామకుడు :** మరీషునికి శూరకు జన్మించిన పుత్రుడు.
– భాగవతం

**శ్యామబాల :** ఓ అదృష్టవంతురాలైన నాయకి.
– చూ॥ భద్రశ్రవుడు

**శ్యామరశ్మి :** ఓ రుషి. కపిలుడి శిష్యుడు. మొదట వేదాల్ని అంగీకరించాడు. ఆ తర్వాత కపిలుడి వల్ల వాటి గొప్పదనం తెలుసుకుంటాడు.

**శ్యామలాదేవి :** పరాశక్తి అవతారం. మతంగుడి కుమార్తె కనుక మాతంగి అని కూడా పిలిచేవారు. నిర్మాల్యంతో పూజించేవారు కనుక ఉచిష్టశ్యామలాదేవి అనికూడా అంటారు. – పురాణనామచంద్రిక

**శ్యామాయనుడు :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు.
– మహాభారతం

**శ్యామాశ్రమం :** ప్రాచీన పుణ్యస్థలం. ఇచ్చట పక్షం రోజులుండి స్నానం చేస్తే 'అంతర్ధాన' శక్తి లభిస్తుంది.
– మహాభారతం

**శ్యావార్యుడు :** అర్చనావసుడను మహర్షి పుత్రుడు.
– చూ॥ అర్చనావసుడు

**శ్వావిల్లోకూపహం :** కురుక్షేత్రంలో గల ఓ పుణ్యస్థలం.
– మహాభారతం

**శ్వాస :** ధర్మదేవుడి భార్య. దక్ష ప్రజాపతి కుమార్తె. ధర్మదేవుడికి శ్వాసకు అష్టావసువుల్లో ఒకడైన అనిలుడనే వసువు వారికి జన్మిస్తాడు. – మహాభారతం

**శ్వాహితుడు :** నృజినవంతుడి కొడుకు. ఓ యదువంశం వాడు.

**శ్విత్రేపుత్రుడు :** చూ॥ శ్వైత్రేయుడు.

**శ్రాద్ధ దేవుడు :** సంజ్ఞ సూర్యుల కొడుకు. ఇతడే వైవశ్వత మనువు. – భాగవతం

**శ్రాద్ధం :** పితృలకు మానవులు చేసే తర్పణం. పురాణాలలో దీనికి చాలా ప్రాముఖ్యత వుంది. పితృలనగా చనిపోయిన ఆత్మలు కాదు. అవి ఓ తెగకు చెందిన దేవగణాలు.

**శ్రావణుడు :** చూ॥ దశరథుడు.

**శ్రావస్తి :** ఇక్ష్వాకు వంశస్థుడైన శ్రావస్థుని రాజధాని. శ్రావస్థుడు నిర్మించాడు గనుక ఈ నగరానికీ పేరు వచ్చింది. – మహాభారతం

**శ్రావస్తుడు :** శ్రావుడి కుమారుడు. చూ॥ శ్రావుడు

**శ్రావితం :** రాముడి కొడుకైన లవుడి రాజధాని.

**శ్రావుడు :** యువనాశ్వుడి కొడుకు. ఇక్ష్వాకు వంశ రాజు. ఇతని కుమారుడు శ్రావస్తుడు. – మహాభారతం

**శ్రీ :** ఒక సాలె పురుగు. పూర్వ జన్మమున ఊర్ణనాభుడు. ఇది గజారణ్యంలోని బిల్వవనంలో వుండెను. తిన్నడను శివభక్తుడు పూజకై బిల్వదళములు కోయగా ఇది ఆ దళముల మధ్య ఉండి శివలింగము చేరెను. దీని వలననే శ్రీకాళహస్తి యను పేరు వచ్చెను. – చూ॥ శ్రీకాళహస్తి

**శ్రీకంఠుడు :** చూ॥ శివుడు

**శ్రీకుంజం :** కురుక్షేత్రంలోని ఓ పుణ్యస్థలం. ఇది సరస్వతీ తీర్థం. ఇచ్చట స్నానం చేస్తే అగ్నిష్టోమయాగ ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**శ్రీకుండలుడు :** విజయహేమకుండలుని కుమారుడు.

**శ్రీకుండం :** ఓ పవిత్ర స్థలం. ఇచట బ్రహ్మను పూజిస్తే 1000 గోవులు దానమిచ్చిన ప్రతిఫలం లభిస్తుంది. – మహాభారతం

**శ్రీకృష్ణుడు :** చూ॥ కృష్ణుడు

**శ్రీఖండం :** మలయ పర్వతం యొక్క నామాంతరం.

**శ్రీతీర్థం :** కురుక్షేత్రంలోని ఓ పుణ్యస్థలం. ఇచ్చట స్నానంచేసి దేవతలను పితృగణాలను పూజిస్తే సంతానప్రాప్తి కల్గుతుంది. – మహాభారతం

**శ్రీదాముడు :** చూ॥ సుదాముడు

**శ్రీదేవి :** దేవకుని కుమార్తె. వసుదేవుడీమెను వివాహమాడాడు. వీరికి నందకుడితో సహా ఆరుగురు కుమారులు. – భాగవతం

**శ్రీధరుడు :** త్రేతాయుగంలో వర్ధిల్లిన ఒక రాజు.

**శ్రీపర్వతం :** ఓ పవిత్ర పర్వతం. అరణ్యాలలో ప్రవహించే నదుల్లో స్నానం చేసి ఈ పర్వతంపై శంకరుడ్ని పూజిస్తే అశ్వమేధ యాగ ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**శ్రీబింబకి :** మృణాంకవతి తండ్రి. – చూ॥ శ్రీదత్తుడు

**శ్రీభానుడు :** సత్యభామకు జన్మించిన 10 మంది కుమారుల్లో ఒకడు. – భాగవతం

**శ్రీమతి :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరి. – మహాభారతం

**శ్రీమాత :** దేవి స్వరూపిణి. కర్ణాతకుడనే రాక్షసుడు మహర్షుల భార్యలను బ్రాహ్మణ రూపంలో ఎత్తుకుపోతుంటే అతడిని వధించడానికి దేవి ఎత్తిన అవతారం. – స్కందపురాణం

**శ్రీమానుడు :** దత్తాత్రేయుని కుమారుడైన నిమికి జన్మించిన కొడుకు.

**శ్రీరాముడు :** చూ॥ రాముడు

**శ్రీవత్సం :** మహావిష్ణువు ఛాతీపై గల పుట్టుమచ్చ. – చూ॥ భృగువు

**శ్రీవహం :** కశ్యప కద్రువలకు జన్మించిన ఓ నాగు. – మహాభారతం

**శ్రుతకర్ముడు 1 :** సహదేవుని కుమారుడు. మహాభారత యుద్ధంలో మొదటిరోజు దుర్ముఖుడితో తలపడ్డాడు. చిత్రసేనుడి కొడుకుతో ద్వంద్వ యుద్ధం చేశాడు. శలుడ్ని సంహరించాడు. అశ్వత్థామతో పోరాడాడు. దేవావృద్ధకుమారుడ్ని సంహరించాడు. చివరికి అశ్వత్థామ చేతిలో మరణించాడు. – మహాభారతం

**శ్రుతకర్ముడు 2 :** (శృతకీర్తి) – చూ॥ శృతకీర్తి 2

**శ్రుతకీర్తి 1 :** శతృఘ్నుని భార్య. ఈమె జనకుని చిన్న తమ్ముడు కుశధ్వజుని ముగ్గురు కుమార్తెలైన మాంఢవి, ఊర్మిళ, శృతకీర్తిలలో ఒకరు. – రామాయణం

**శ్రుతకీర్తి 2 :** అర్జునుడి కుమారుడు. ద్రౌపదికి ధర్మజుని వల్ల ప్రతివింధ్యుడు, భీముని వల్ల శృతుడు, అర్జునుని వల్ల శృతకీర్తి, సహదేవునివల్ల శృతకర్ముడు, నకులుని వల్ల శాతానికుడు జన్మించారు. విశ్వదేవుని అంశతో జన్మించాడు. ఇతడు జయత్సేనుడితో పోరాడాడు. చివరకు అశ్వత్థామ చేతిలో మరణించాడు. – మహాభారతం

**శ్రుతకీర్తి 3 :** చూ॥ శృతదేవి

**శృతంజయుడు :** త్రిగర్త రాజైన సుశర్మ సోదరుడు. మహాభారత యుద్ధంలో అర్జునుడు ఇతణ్ణి వధించాడు. – మహాభారతం

**శ్రుతదేవి :** శ్రీకృష్ణుని తండ్రి వసుదేవుని సోదరి. – భాగవతం

తక్కిన నల్గురు సోదరీమణులు మానిని, పృథ, శృతకీర్తి, శృతశ్రవస.

**శ్రుతదేవుడు :** ఒక బ్రాహ్మణుడు. మిథిలా నగరవాసి. సద్ధర్ముడు. ఇతడిని దర్శించుటకై కొందరు రుషులతో శ్రీకృష్ణుడు ఇతడి సేవలందుకొనుచూ ఇతని గృహమున గడిపెను. అప్పుడే మిథిల రాజగు బృహదాశ్వుని ఇంటకూడా శ్రీకృష్ణుడుండెను. – భాగవతం

**శ్రుతధ్వజుడు :** విరాట రాజు సోదరుడు. పాండవుల పక్షం వాడు. – మహాభారతం

**శ్రుతనాభుడు :** సూర్యవంశపు రాజు. భగీరథుని కొడుకు. సింధు ద్వీపునికి తండ్రి. – భాగవతం

**శ్రుతపర్వుడు :** ఒక రాజు. అగస్త్యుడి వద్దకు ధనమునకు పోగా అతని వద్ద లేక ఇతడునూ అగస్త్యునితో పాటు పృద్నశ్వుడను రాజు వద్దకు వెళ్లెను. – మహాభారతం

**శ్రుతముఖ్యుడు :** వసుదేవుడి కొడుకుల్లో ఒకడు. ఇతడి తల్లి సహదేవి. – భాగవతం

**శ్రుతయజ్ఞుడు :** భరతవంశంలోని ఒక రాజు. వివనవుని మనుమడు. కర్మజిత్తు కొడుకు. – భాగవతం

**శ్రుతర్వుడు 1 :** ఓ రుషి. అశ్వనీదేవతలు ఓ నదిని తేనెగా మార్చి వసిష్ఠుడిని సంతోషపెట్టి శ్రుతర్వ, నర్వ రుషుల్ని రక్షించారు. – రుగ్వేదం

**శ్రుతర్వుడు 2 :** ధృతరాష్ట్రుని నూర్గురు కుమారుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో మరో 12 మంది తన సోదరులతో కలిసి భీమునితో యుద్ధం చేశాడు. భీముడితణ్ణి వధించాడు. కౌరవుల్లోని గొప్ప రధికుల్లో ఒకడు. – మహాభారతం

**శ్రుతవర్మ :** ధృతరాష్ట్రుడి కుమారుడు. భీముడితణ్ణి మహాభారత యుద్ధంలో వధిస్తాడు. – మహాభారతం

**శ్రుతశ్రవస :** చేది రాజైన ధమఘోషుడి భార్య. వసుదేవుడి సోదరి. వీరి కుమారుడు శిశుపాలుడు. శ్రీకృష్ణుడు శిశుపాలుణ్ణి వంద తప్పులవరకు క్షమిస్తానని తన మేనత్తకు వాగ్దానం చేశాడు. – భాగవతం

**శ్రుతశ్రవసుడు 1 :** ఓ రాజర్షి. ఇతడు యముని కొలువులో వుండి అతణ్ణి పూజిస్తుంటాడు. – మహాభారతం

**శ్రుతశ్రవసుడు 2 :** ఓ మహర్షి. ఇతడి కుమారుడు సోమశ్రవసుడు. సరమశాపం నుండి విముక్తం కావడానికి సోమశ్రవసుడిని కోరగా ఇతడు తన తపశ్శక్తి వల్ల శక్తివంతుడని ఇతడు ఆ పాపవిముక్తం చేయగలడని చెప్పి తన కుమారుడు సోమశ్రవసుణ్ణి పంపగా జనమేజయుడితణ్ణి పురోహితుడుగా యజ్ఞం ముగించాడు.

**శ్రుతశ్రవుడు :** ఛాయ సూర్యుల కొడుకు. ఇతడే సావర్ణి. – బ్రహ్మాండపురాణం

**శ్రుతశ్రీ :** ఓ అసురుడు. గురుత్మంతుడు ఇంద్రలోకం వెళ్లి తన బలపరాక్రమాలు తెలియజేయడానికి శ్రుతశ్రీతోపాటు శ్రుతసేన, విపశ్వాన, రోచనాముఖ, కాలక, అహర, ప్రస్తుత అనే రాక్షసుల్ని వధించానని చెప్తాడు. – మహాభారతం

**శ్రుతసేన :** శారదండాయని యను రాజు భార్య. కుంతికి చెల్లెలు. ఈమె భర్తచే వియోగింపబడి తర్ధముడు, దుర్ధయుడు అను పుత్రులకు జన్మనిచ్చెను. – మహాభారతం

**శ్రుతసేనుడు 1 :** జనమేజయుని సోదరుడు. జనమేజయుని సర్పయాగానికి వచ్చిన పరమశివుడైన కుక్కను అకారణంగా కొట్టగా అది సరమకు చెప్పగా సరమ జనమేజయుడ్ని శపించింది. – చూ॥ సరమ

**శ్రుతసేనుడు 2 :** సహదేవుని కుమారుడు. ఇతడిని శృతకర్ముడని కూడా అంటారు. చూ॥ శ్రుతకర్ముడు

**శ్రుతసేనుడు 3 :** ఓ అసురుడు. గరుడుడితణ్ణి సంహరించాడు. చూ॥ శ్రుతశ్రీ

**శ్రుతసేనుడు 4 :** తక్షకుడను సర్పం చిన్న తమ్ముడు. – మహాభారతం

**శ్రుతసోముడు :** ద్రౌపదికి భీముని వల్ల కల్గిన పుత్రుడు. ఉపపాండవులలో ఒకడు. – మహాభారతం

**శ్రుతాంతుడు (చిత్రాంగుడు) :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో భీముడితణ్ని వధించాడు. – మహాభారతం

**శ్రుతానీకుడు :** విరాటుని సోదరుడు. ఇతడు పాండవులకు ఆప్తుడు. – మహాభారతం

**శ్రుతాయుధుడు :** కళింగదేశంలో ఒకరాజు. పర్ణాశకు వరుణుని వల్ల జన్మించాడు. మహాభారత యుద్ధంలో కౌరవుల పక్షాన పోరాడాడు. మొదట ఇతడు భీమునితో పోరుసల్పగా భీముడితని సహచరులైన సత్య, సత్యదేవుల్ని వధించాడు. ఆ తర్వాత ఇతడు అర్జునునితో పోరాడగా అర్జునుడితడి రధాన్ని కూల్చాడు.

కోపం పట్టలేక ఇతడు వరుణుడు తనకిచ్చిన గధను శ్రీకృష్ణునిపై ప్రయోగించగా అది శ్రీకృష్ణుని మెడలో పూలమాలయై తిరిగి వచ్చి శ్రుతాయుధుడ్నే మోదగా మరణించాడు. – మహాభారతం

**శ్రుతాయువు 1 :** చూ॥ శ్రుతాయుధుడు.

**శ్రుతాయువు 2 :** పురూరవసు కుమారుడు. – చూ॥ పురూరవసు

**శ్రుతాయువు 3 :** ఓ క్షత్రియ రాజు. క్రోధవశుడను అసురుని అంశనుండి జన్మించాడు.
ఇతడు మహారథుడు. ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. యుధిష్ఠరుని కొలువులో సభ్యుడు. ఇతడు మహాభారత యుద్ధంలో కౌరవుల పక్షాన పోరాడాడు. మొదటి రోజున ఇతడు ఐరావణుడితో పోరాడాడు. ఇతడు అంబుష్ఠ దేశానికి రాజు. భీష్ముని క్రౌంచ వ్యూహంలో మధ్య భాగాన నిలబడ్డాడు. యుద్ధంలో ధర్మజుడితణ్ణి ఓడించాడు. తర్వాత జరిగిన మహా సంగ్రామంలో అర్జునుడితణ్ణి వధించాడు. – మహాభారతం

**శ్రుతాయువు 4 :** కౌరవుల తరపున పోరాడిన వీరుడు. అయుతాయువు సోదరుడు. ఈ ఇద్దరూ కౌరవుల పక్షాన పోరాడారు. దక్షిణ భారత సేనలకు నాయకత్వం వహించి అర్జునుడి చేతిలో మరణించారు. – మహాభారతం

**శ్రుతావతి :** భరద్వాజ మహర్షి కుమార్తె. ఒకసారి భరద్వాజుడు ఘృతాచి అనే అప్సర కాంతను చూసి వీర్యస్కలనం కాగా అందుండి శృతావతి జన్మించింది. ఈమె ఇంద్రుడిని వివాహమాడగోరి ఘోరతపస్సు చేసింది.

**శ్రుతాహ్వుడు :** పాండవుల పక్షాన పోరాడిన రాజు. అశ్వత్థామ ఇతణ్ణి వధించాడు. – మహాభారతం

**శ్రుతి :** ప్రాచీన భారతదేశంలోని ఒక రాజు – మహాభారతం

**శ్రుతుడు 1 :** భీమసేనుని కుమారుడు. – అగ్నిపురాణం

**శ్రుతుడు 2 :** సూర్యవంశపు రాజు. సుభాషణుడి కొడుకు, జయుని తండ్రి. – భాగవతం

**శ్రుతుడు 3 :** భరత వంశంలోని ఒక రాజు. ధర్మనేత్రుని కొడుకు. ద్రుఢసేనుని తండ్రి. – భాగవతం

**శ్రుతుడు 4 :** శ్రీకృష్ణునికి కాళింది వల్ల జన్మించిన పుత్రుడు. – భాగవతం

**శ్రేణిమానుడు :** ఓ రాజర్షి. నాల్గవ కాలకేయుడి పునర్జన్మ. ఇతడు ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. ఇతడు కుమారదేశాన్ని పాలించాడు. తూర్పు దేశాల జైత్రయాత్రలో భీముడితణ్ణి ఓడించాడు. ఇతడు పాండవుల పక్షాన మహాభారత యుద్ధంలో పోరాడి ద్రోణుని చేతిని మరణించాడు. – మహాభారతం

**శ్వేతకర్ణుడు :** సత్యకర్ణుడి కొడుకు. భార్య మాలిని. ఇతని కొడుకు అజపార్శ్వుడు. – హరివంశం

**శ్వేతకి :** ఒక రాజు. ఇతడు ఎన్నో యజ్ఞాలు నిర్వహించేవాడు. ఇకసారి ఇతడు చేసే యజ్ఞం చాలా కాలం పట్టగా రుత్విక్కులు అలసి వెళ్లిపోగా వేరే రుత్విక్కులతో నిర్వహించాడు. శివుని గూర్చి పూజలు చేసి వరాలు కోరుకొమ్మనగా ఎన్నో యజ్ఞాలు చేసే వరం ఇవ్వమని కోరాడు. 12 సంవత్సరాలు అగ్నికి ఆహుతిస్తూ విరామం లేకుండా యజ్ఞం చెయ్యమని శివుడు సలహా ఇచ్చాడు. శ్వేతకి దుర్వాసుడిని రుత్విక్కుగా ఈ యజ్ఞాన్ని వందేళ్లు కొనసాగించాడు. – మహాభారతం

**శ్వేతకేతుడు :** ఓ మహర్షి. ఆరుణి లేక ఉద్దాలకుడను రుషి కుమారుడు. గౌతమి గోత్రీకుడు. ఇతని సోదరి సుజాత. సుజాత కుమారుడే అష్టావక్రుడు. అంటే శ్వేతకేతుడికి అష్టావక్రుడు మేనల్లుడు. వీరిద్దరూ ఉద్దాలకుని ఆశ్రమంలోనే పెరిగారు.
*శ్వేతకేతుని గర్వభంగం :* తండ్రి వద్ద నేర్చుకొన్న విద్యతో గర్విష్ఠి కాగా తండ్రి నీవు విన్నవి, కన్నవి, నా దగ్గర నేర్చుకున్నవి కాక వినని కనని తెలియని విషయాలేమైనా నేర్చుకొన్నావా అనగా దానికతడు తెలియదని అంగీకరించగా పరమాత్మ అంటే మొదట ముగింపు లేనిది దానికి కారణం ఏమిటో తెలుసుకొమ్మన్నాడు. తండ్రి వద్ద విద్యానంతరం పాంచాల దేశం వెళ్లి రాజ కుటుంబీకులు కొలువైన జైవాలి వెళ్లగా ప్రవాహనరాజు కొన్ని ప్రశ్నలు వేయగా వాటికి సమాధానం చెప్పలేక తండ్రి ఉద్దాలకుడికి చెప్పగా రాజు వద్దకే వెళ్లి సమాధానం తెలుసుకో మంటాడు. అతడు తడబడగా ఉద్దాలకుడే రాజు వద్దకు వెళ్లి వాటి సమాధానం తెలుసుకున్నాడు. – చాందోగ్యోపవిషత్తు

*యజ్ఞవిధానాల రూపశిల్పి :* కౌసికి బ్రాహ్మణుల్లో శ్వేత కేతుడు ఆచార్యుడనదగ్గవాడు. యజ్ఞాలలో పాల్గొనే పురోహితులకు కొన్ని విధివిధానాలు ఏర్పరచాడు. ఇంతేకాక బ్రహ్మచారిణులకు తపస్వినులకు ప్రత్యేక మైన ఆచారాలను రూపొందించాడు. ఇతనికి ముందు ధర్మ శాస్త్రాలలో తీపి రుచిగల పదార్థాలు వీరికి నిషిద్ధం. శ్వేతకేతుడు ఇది తప్పుడు సిద్ధాంత మని తేల్చాడు. ఒకసారి జాతూకర్ణ్యుడను బ్రాహ్మణుడు కాశీ విదేహ కోసల రాజులకు పౌరోహిత్యం చేయడానికి వెళ్లగా కోపించి తండ్రితో చెప్పగా పౌరోహిత్యం తెలివి తేటలను పెంచుకోవడంకోసం వెళ్లాలి గాని భౌతిక అవసరాలకు కాదన్నాడు.

*కామశాస్త్ర గ్రంథరచన :* ఇతడు నందివ్రాసిన కామ శాస్త్ర గ్రంథాన్ని 500 అధ్యాయాలుగా సంక్షిప్తీక రించగా తర్వాత బాభ్రవ్యుడు మరింత సంక్షిప్తంచే యగా దీనికి వేరే రెండు గ్రంథాలను జతపరచి సంక్షిప్తీకరించి తన ప్రసిద్ధ గ్రంథం కామసూత్ర రచిం చాడు. ఇతడు మద్యపానం, పరస్త్రీల పొందు బ్రాహ్మణు లకు పాపమని ఎలుగెత్తి చాటిన మొదటివాడు. దీనికి మహాభారతంలో ఓ చిన్న కథ ఆధారమని చెప్తారు. ఇతడు ఉద్దాలకుని భార్యకు వేరే అతని శిష్యుడి అక్రమ సంబంధం వల్ల జన్మించాడు. ఆ తర్వాత తన తల్లిని వేరే బ్రాహ్మణుడు ఎత్తుకు పోయాడు. ఏకపత్ని, ఏక భర్తృత్వాన్ని ఇతడు ప్రతిపాదించి ప్రచారం చేశాడు.

**శ్వేత ద్వీపం :** ఓ ద్వీపం. ఇచ్చట మహావిష్ణువు బ్రహ్మ విద్యను తెలుసుకోవడానికి తపస్సు చేశాడు. క్షీర సముద్రానికి ఉత్తరాన మేరుపర్వతానికి 32000 మైళ్ల ఎత్తున వుంటుంది. ఇచ్చటి నివాసులకు స్పర్శజ్ఞానం లేదు. వీరు ఆహారం తీసుకోరు. జ్ఞానవంతులు. వీరి శరీరం నుండి సువాసనలు విరజిమ్ముతాయి. వీరి శరీరం ఎముకలు, వజ్రాయుధమంత గట్టిగా వుంటాయి. వీరి తలలు గొడుగులంత వెడల్పుగా వుంటాయి. నాల్గు చేతులు, 60 పళ్ళు వుంటాయి. వీరు శివుడ్ని పూజిస్తారు. – మహాభారతం

**శ్వేతపర్ణుడు :** హస్తినాపురానికి తూర్పున గల భద్రావతీ నగర రాజు. భీముడు ధర్మజుని అశ్వమేధ యాగానికి ఇతనితో పోరాడి ఇతని వద్ద గల అందమైన అశ్వాన్ని ఈ యజ్ఞం కొరకు తెచ్చాడు. – *జైమిని భారతం*

**శ్వేతభద్రుడు :** ఓ కావలి. ఇతడు కుబేరుని సంపదకు కావలివాడు. – మహాభారతం

**శ్వేతరశ్మి :** ఓ ఏనుగు. ఓ గంధర్వుడు శాపవశాన కళింగ రాజ్యంలో ఓ తెల్ల ఏనుగుగా జన్మించాడు. అప్పుడు రత్నదీపుడు రత్నకూట ద్వీపాన్ని పాలించే వాడు. ఇతడు గొప్ప విష్ణుభక్తుడు. ఇతడు విష్ణువును గూర్చి తపస్సు చేసి తక్కిన రాజ్యాలనన్నింటిని జయించి రాజకుమార్తెలను వివాహమాడాలని వరం కోరగా కళింగ దేశంలో శ్వేతవర్ణంలో ఓ ఏనుగు వుందని దాన్ని నీకు పంపిస్తానని అది గాలిలో కూడా ప్రయాణిస్తుంది కనుక అన్ని రాజ్యాలను జయించి నీ కోర్కె తీర్చుకొమ్మని వరమిస్తాడు. అతడలాగే జయించి ఎందరో రాజకుమార్తెలను వివాహమా డతాడు. ఒకరోజు గాలిలో ఆ ఏనుగుపై ప్రయాణి స్తుండగా ఓ గద్ద ఆ ఏనుగు ముఖాన్ని పొడవగా అది క్రిందపడి మూర్ఛిల్లింది. లోకపాలకులను పూజించాడు. అయినా అది లేవకపోగా తన తలను ఖండించుకో బోగా ఓ దైవవాణి "పతివ్రత అయిన స్త్రీ ఆ ఏనుగును అంటుకుంటే లేగవగలదు" అని చెప్తుంది. వెంటనే రాజు తన పట్టపు రాణిని తీసుకొచ్చి ఏనుగును అంటుకొమ్మన్నాడు. ఏనుగు జీవించలేదు. ఆ తదుపరి తన భార్యలు, ఆ తర్వాత తన నగరంలోని స్త్రీలు అంటుకున్నా అది జీవించలేదు. రాజు సిగ్గు పడ్డాడు. ఇంతలో తామ్రలిప్తి నుండి హర్షగుప్తుడనే వ్యాపారి తన భార్య శీలవతితో అచటికి వచ్చాడు. శీలవతి ఆ ఏనుగును అంటుకోగానే అది మరల సజీవి అయ్యింది.

ఆ దంపతులకు ఎన్నో కానుక లిచ్చిన శీలవతి చెల్లెలు రాజ దత్తను వివాహమడి శ్వేతరశ్మిపై తీసుకువెళ్లి చతుశ్శుల ద్వీపంలో వుంచి ఆమెకు ఎంతో మంది పరిచారికలను ఏర్పాటుచేశాడు. పగలు తన భవనలో వుండి పరిపాలన సాగిస్తూ రాత్రిళ్ళు ఆమెతో గడిపేవాడు. ఒక రోజు పనివారు ఎవరి పనిలో వారుండగా ఒక వైశ్య యువకుడు పడవ పగిలి ఒక కర్ర ముక్క సహా యంతో ఈ ద్వీపంలోకి రాగా రాజదత్త అతడ్ని చూసి ఆలింగనం చేసుకుంది. అదే సమయంలో రాజు వచ్చి అది చూసి వైశ్య యువకుడ్ని క్షమించి వదలి

వేశాడు. రాజు తన నగరానికి వెళ్లి తన సంపదనంత పేదసాదలకు ఇచ్చి నగరం విడిచి వెళ్లిపోబోగా ఒక్కసారి ఏనుగు గంధర్వ రూపం దాల్చి నేనో గంధర్వుడ్ని. నేను నా అన్న వదిన విష్ణుభక్తులం. మేమొకసారి దేవాలయానికి వెళ్లగా ఓ సిద్ధుడు విష్ణుగానం చేస్తుండగా మా వదిన అతడి వంక నిశ్చలంగా చూసింది. దానికి నా సోదరుడు ఆగ్రహించి అతడిని ధూషించగా నా అన్నను వదినను మానవులుగా జన్మించమని శపించాడు. నేను కోపంతో ఆటవస్తువును విసరగా నీవు బొమ్మలా వ్యవహరించే ఏనుగువు కమ్మని శపించాడు. ఆ ఏనుగే నేను. నా అన్న నీవు. నీ భార్య రాజదత్త పూర్వజన్మలో నీ భార్య అని చెప్పగనే వారికి పూర్వజన్మ లభించింది.
– కథాసరిత్సాగరం

**శ్వేతవక్త్రుడు :** సుబ్రహ్మణ్య స్వామి యోధుల్లో ఒకడు.
– మహాభారతం

**శ్వేతవాహనుడు :** అర్జునుని నామాంతరం.
– చూ॥ అర్జునుడు

**శ్వేతసిద్ధుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు.
– మహాభారతం

**శ్వేతాశ్వతరుడు :** 'శ్వేతాశ్వతరం' అనే ఉపనిషత్తు గ్రంథ రచయిత. ఆరు విభాగాలుగా వుండే ఈ రచన ఆధ్యాత్మిక తాత్విక విషయాలను చర్చిస్తుంది.

**శ్వేతుడు 1 :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. ఇతడి నీతి ఆధ్యాత్మిక శక్తివల్ల చనిపోయిన తన కుమారుడిని బ్రతికించాడు. ఇతడెన్నడు మాంసం తినలేదు. ఇతడు ఉదయం, సాయంత్రం స్మరించ దగ్గ వ్యక్తి.
– మహాభారతం

**శ్వేతుడు 2 :** ఓ ప్రసిద్ధ ప్రాచీన భారతీయ రాజు.
– మహాభారతం

**శ్వేతుడు 3 :** విరాట రాజు కుమారుడు. కోసల రాజ కుమార్తె. సురథకు విరాటరాజు వల్ల జన్మించాడు. ఇతడు మహాభారత యుద్ధంలో భీష్ముని చేతిలో మరణించాడు. – మహాభారతం

**శ్వేతుడు 4 :** సుబ్రహ్మణ్య స్వామియోధుల్లో ఒకడు.
– మహాభారతం

**శ్వేతుడు 5 :** సుదేవుడను రాజు అన్న కొడుకు. పాపకర్ముడైన అగస్త్యుని దర్శనంతో స్వర్గం చేరాడు. జీవితపు చరమాంకంలో తీవ్ర తపస్సుచేసి స్వర్గం చేరి కూడా ఇతడెన్నడూ ఆకలితో వున్నవారికి అన్నం పెట్టనందువల్ల స్వర్గంలో కూడా ఆకలి దప్పులతో అలమటించగా బ్రహ్మ సలహాపై భూమిపై తిరిగి జన్మించి అగస్త్య దర్శనంతో మోక్షం లభించి తిరిగి స్వర్గం చేరాడు. – మహాభారతం

**శ్వేనగామి :** ఖరుడను అసురుని సైన్యాధిపతి. ఖరునికి రాముడితో యుద్ధం చేసే సమయంలో 12 మంది సేనానులు కలరు. ఇందులో శ్వేనగామి ఒకడు.
– రామాయణం

**శ్వేనచిత్రుడు :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజు. ఇతడు ఎన్నడు మాంసం భుజించలేదు. – మహాభారతం

**శ్వేనజిత్తు 1 :** ఇక్ష్వాకువంశ రాజైన నలుడి కుమారుడు. తన తండ్రికి ప్రీతిపాత్రుడైనవాడు. – మహాభారతం

**శ్వేనజిత్తు 2 :** భీమసేనుని మామ. – మహాభారతం

**శ్వేని :** కశ్యప ప్రజాపతికి తామ్రకు జన్మించిన కుమార్తె. శ్వేనులనే పక్షులకు మాతృమూర్తి.

**శ్వేనుడు :** ఓ ప్రాచీన మహర్షి. ఇతడు ఇంద్రుని కొలువులో వుండేవాడు. – మహాభారతం

**శ్వేనులు :** శ్వేనికి జన్మించిన పక్షులు. – చూ॥ శ్వేని

**శ్లేష్మకం :** ఓ అరణ్యం. రావణ, కుంభకర్ణ, విభీషణ, శూర్పణఖలు కైకసికి విశ్రవసువల్ల జన్మించిన ప్రదేశం. – కంభరామాయణం

**శ్వైత్రేయుడు :** శ్విత్రకుమారుడు. శూక్త, శ్వైత్రేయులు శతృవులకు దడచి నీటిలో దాక్కున్నారు. – రుగ్వేదం

**శ్వోత్థుడు :** ఒక రాజు. – చూ॥ శరలోముడు



ష : ఈ అక్షరం అర్థం 'గౌరవం'.

**షట్చక్రవర్తులు :** హరిశ్చంద్రుడు, నలుడు, పురుకుత్స్యుడు, పురూరవుడు, సగరుడు, కార్తవీర్యార్జునుడు.

**షఢర్భకులు :** మరీచి ఆర్గురు కుమారులను షఢర్భకులంటారు. వీరు శాపవశాన అనేక జన్మలెత్తుతారు. చివరికి దేవకిపుత్రులుగా జన్మించిన తర్వాత నిజ రూపాన్ని పొందుతారు. – చూ ॥ కంసుడు

**షడ్గుణాలు -1 :** భగవంతుడికి సంబంధించిన ఆరు గుణాల్ని షడ్గుణాలంటారు.

**షడ్గుణాలు-2 :** రాజనీతికి సంబంధించిన ధర్మాల్ని షడ్గుణాలంటారు. అవి సంధి, విగ్రహ, యాన, ఆసన, ద్వైద, ఆశ్రయాలు. శత్రువుతో శాంతిగా మాట్లాడటం సంధి. యుద్ధం చేయడం విగ్రహం. యుద్ధం చేయడానికి సన్నాహయానం, ఏమీ చేయకపోవడం ఆసనం. ఇరుపక్షాలకు మాటసహాయం చెయ్యడం ద్వైదం. ఇంకొకర్ని ఆశ్రయించడం ఆశ్రయం.

– అగ్నిపురాణం

**షణ్ముఖుడు :** సుబ్రహ్మణ్యస్వామి నామాంతరం.

**షష్ఠీదేవి :** మూల ప్రకృతి, ఆరో భాగం నుండి జన్మించిన దేవి. అందుకే షష్ఠీదేవి అంటారు. దేవసేన అనికూడా అంటారు. ఈమె పిల్లల్ని రక్షిస్తుంది. యోగంవల్ల సిద్ధి పొందుతుంది. అష్టమాతృకలలో ఉత్తమురాలు. సుబ్రహ్మణ్యుడి భార్య. ప్రియవ్రతుడుకి ఎంతోకాలం సంతానం లేదు. వివాహమే ఇష్టం లేదు. బ్రహ్మ కోరికపై మాలినిని వివాహం చేసు కున్నాడు. ఎంతో కాలం పిల్లలులేరు. పుత్రకామేష్టి యాగం చేశాడు. భార్య గర్భవతి అయ్యికూడా 12 సంవత్సరాలకు జీవంలేని శిశువుకు జన్మనివ్వగా దాన్ని శ్మశానమునకు తీసుకువెళ్తుండగా షష్ఠీ దేవి ప్రత్యక్షమై జీవం పోసింది. – *దేవీ భాగవతం*

**షష్ఠీహ్రదం :** ఓ పుణ్యస్థలం. అన్నదానం కన్నా ఇచ్చట స్నానం చేయడం ఉత్తమం. – మహాభారతం

**షోడశ మహారాజులు :** గయుడు, శశిబిందువు, పృధువు, సుహోత్రుడు, భరతుడు, దిలీపుడు, రంతి దేవుడు, మాంధాత, అంగుడు, శిబి, అంబరీషుడు, మరుత్తు, వృదుడు, రాముడు, యయాతి, భగీరథుడు.

**షోడశరాజకం :** 16 మంది రాజుల కథలివి. అభిమన్యుని మరణానంతరం యుద్ధ విముఖుడైన ధర్మజునికి వ్యాసుడు వీరి కథలు చెప్పి కార్యోన్ముఖుణ్ణి చేస్తాడు. వారు మరుత్తుడు, సహోత్రుడు, పౌరవుడు, శిబి, శ్రీరాముడు, భగీరథుడు, దిలీపుడు, మాందాత, యయాతి, అంబరీషుడు, శశిబిందుడు, గయుడు, రంతిదేవుడు, భరతుడు, పృథువు, పరశురాముడు.



**సక్తుప్రస్థుడు :** ఓ పేద బ్రాహ్మణుడు. ఆహారం లేక ఉంచవృత్తిపై ఆధారపడి జీవించేవాడు. ఒకసారి ఇతనికి కుంచెడు పేలపిండి లభించగా అతడు, అతని భార్య, కుమారుడు, కోడలు సమానముగా పంచుకొని తినబోవుచుండగా ఓ అతిథి రాగా తన భాగము నిచ్చెను. అతడి ఆకలి తీరకుండుటచే వరుసగా తన భార్య, కొడుకు, కోడలు భాగాలు కూడా అతనికిచ్చెను. అతడు నిజరూపుడై తను ధర్మదేవతయగుట తెల్పి వారినందరిని స్వర్గమునకు గొనిపోయెను.

– మహాభారతము

**సగరపుత్రులు :** చూ॥ సగరుడు.

**సగరుడు :** సూర్యవంశపు రాజు. అయోధ్యను పాలించాడు. ఈ వంశంలో ఇతని పూర్వీకులలో ఇక్ష్వాకు, మాంధాత, త్రిశంకు, హరిశ్చంద్రులు ప్రముఖ చక్రవర్తులు. ఇతడు బాహుకుని కుమారుడు.

జననం :బాహుకుడిని సుబాహుడని అనేవారు. ఇతని భార్య యాదవి. ఈమె సగరుడిని ఔర్యుని ఆశ్రమంలో ప్రసవించింది. ఈమెకు చాలాకాలం సంతానం లేదు. సుబాహుడెన్నో యజ్ఞాలు చేయగా యాదవి గర్భం దాల్చింది. ఆమెకు ఏడవనెల గర్భిణిరాగా సవతి ఈమెకు విషం ఇవ్వడం వల్ల ఎంతకూ ఆమె ప్రసవం జరగలేదు. ఇంతలో రాజు ముసలివాడై తాలజంఘుడు అనురాజు ఇతనిపై దాడిచేయగా భార్య యాదవితో ఔర్యుని ఆశ్రమంలో తలదాచుకొని అక్కడే కన్నుమూసాడు. సతీసహగమనం చేయబోగా ఔర్యుడామెను ఆపి గర్భస్థ శిశువు ప్రసిద్ధుడవుతాడని చెప్తాడు. ఆమె ప్రసవించిన తర్వాత అతనికి సగరుడని నామకరణం చేశాడు.

అయోధ్య రాక *:* తాలజంఘుని ఆగడాలకు అయోధ్య ప్రజలు చెల్లాచెదురయ్యారు. వారు వసిష్ఠుని ఆశ్రయించగా అతడు సుబాహుడు ఔర్యుని ఆశ్రమంలో మరణించాడని అతని కుమారుడు ఆశ్రమంలో పెరుగుతున్నాడని కనుక మీరంతా ఔర్యుని ఆశ్రమానికి వెళ్లి అతడిని అయోధ్యకు తోడ్కొనిరండని సలహా ఇవ్వగా వారంతా ఔర్యుని ఆశ్రమానికి వస్తారు. సగరుడికి

ఔర్వ్యుడే ఉపనయనం చేసి వేదాధ్యయనం చేయిస్తాడు. తన తల్లి ద్వారా తమ కథ విని ఔర్వ్యుని ఆశీర్వచ నాలతో అయోధ్యనుండి వచ్చిన ప్రజలతో తిరిగి అయోధ్యకు వచ్చి తాలజంఘుని తరిమివేసి అయోధ్యకు పట్టాభిషిక్తుడవుతాడు. - బ్రహ్మాండపురాణం

★ *కుటుంబం :* సగరునికి ఇద్దరు భార్యలు. ఒకరు సుమతి. ఈమెను వైదర్భి అనికూడా అంటారు. రెండో భార్య కేశిని. ఈమెను శైభ్య అని పిలుస్తారు. సుమతి గరుడుని కుమార్తె. వీరికి ఎంతోకాలం సంతానం లేక సగరుడు తన భార్యలతో భృగుప్రస్రవనపర్వతం చేరి 100 సంవత్సరాలు తపస్సు చేయగా భృగువు ప్రత్యక్షమై ఓ భార్య 60,000 మంది పుత్రులకు మరో భార్య వంశోద్ధారకుడైన ఓ పుత్రుడికి జన్మనిస్తారని ఆశీర్వదించాడు. సుమతి 60,000 మందిని కోరు కోగా కేశిని ఒక పుత్రుడ్నే కోరుకుంది. ఆ తర్వాత శైభ్య అసమంజసుడికి జన్మనివ్వగా సుమతి ఓ మాంసపు ముద్దకు జన్మనివ్వగా వాటిని ఖండాలు చేసి నేతి కుండలలో వుంచగా 60,000 శిశువులుగా మారారు.

- రామాయణం

సగరుడు అన్ని ప్రాంతాలను జయించాడు. కేకేయుల్ని నాశనం చేశాడు. అశ్వమేధయాగం చేశాడు. సగరుని పుత్రులు అతిశయంతో ప్రజల్ని ఇబ్బందులు పెట్టారు. వీరి గర్వం అణచడానికి ఇంద్రుడు సగరుని అశ్వాన్ని పాతాళంలోని కపిలుని ఆశ్రమంలో దాచాడు. అశ్వం కోసం వెదకి తిరిగి తిరిగి వారు భూమిని తవ్వి పాతాళం చేరి కపిలుని ఆశ్రమంలో అశ్వాన్నిచూసి అతడితపోభంగం చేయగా అతడి కోపాగ్నికి అందరూ భస్మమయ్యారు. ఆ తర్వాత అసమంజసుడి కుమా రుడైన అంశుమానుడికి రాజ్యాధికారం అప్పగించి భార్యతో ఔర్వ్యాశ్రమంలో శేష జీవితాన్ని ధ్యానంలో గడిపాడు. ఆ తర్వాత అంశుమానుడి పుత్రుడైన భగీ రథుడు కైలాసం నుండి గంగను భూమికి తెచ్చి పాతా ళానికి తీసుకెళ్ళగా గంగ ప్రవహించడంవల్ల భస్మమైన సగరుని పుత్రులకు మోక్షం లభించి స్వర్గం చేరారు.

**సణువు :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజ్యం.

- మహాభారతం

**సతి :** దక్షుడి పెద్దకుమార్తె. తల్లి అసిక్ని. ఈమె శివుడ్ని వివాహం చేసుకుంటుంది. బైరాగి అయిన శివుడ్ని వివాహమాడినందుకు దక్షుడీమెను ఆదరించడు. అతడు చేసిన యజ్ఞానికి ఈమెను ఆహ్వానించడు. అయినా ఈమె రాగా దక్షుడీమెను దుర్భాషలాడగా ఆమె యజ్ఞగుండంలోపడి మరణించి పార్వతిగా పున ర్జన్మిస్తుంది. - చూ॥ పార్వతి

**సత్కృతుడు :** జయత్సేనుడి కొడుకు. సూర్యవంశపు రాజు. - భాగవతం

**సత్య :** శ్రీకృష్ణుని భార్యల్లో ఒకరు. - మహాభారతం

**సత్య - 2 :** శామ్య అనే అగ్ని భార్య. ముల్లోకాలలో ఇంతటి అందగత్తె లేదని ప్రసిద్ధి. భరద్వాజుడు ఈ దంపతుల కుమారుడు. - మహాభారతం

**సత్యకర్ముడు - 1 :** భరతుని కుటుంబంలోని ఒక రాజు. ధృతవ్రతుని కొడుకు; అమరథునికి తండ్రి.

- భాగవతం

**సత్యకర్ముడు - 2 :** త్రిగర్త రాజైన సుశర్మ సోదరుడు. మహాభారత యుద్ధంలో అర్జునుడ్ని చంపుతానని ప్రతిజ్ఞ చేసి అతనిచేతిలోనే మరణించాడు.

- మహాభారతం

**సత్యకాముడు :** ఓ మహర్షి. ఇతని తండ్రి ఇతడి చిన్న తనంలోనే చనిపోగా తల్లి జాబాలి పెంచింది. చదువు కొనే సమయం వచ్చి తల్లిని ఓ గురువుదగ్గర వేదాలు నేర్చుకొంటానని తన గోత్రం ఏమని అడిగితే ఏం చెప్పాలని తల్లినడగగా నా చిన్నతనంలోనే పెళ్ళయింది. నీ తండ్రి నువ్వు పుట్టగానే చనిపోయాడు. అతడి గోత్రం నాకు తెలియదు. సత్యకాముడ్నని జాబాలి కొడుకునని చెప్పమంటుంది. ఇతడు గౌతముడి వద్దకు వెళ్ళి అలాగే చెప్పగా అతడి సత్యవాక్కులకు మెచ్చి ఇతనికి 400 బక్కచిక్కిన ఆవుల్ని ఇచ్చి మేపుకురమ్మనగా 1000 బలిసిన గోవులతో తిరిగివస్తానని సమాధానం చెప్పి అరణ్యాలకు వెళ్తాడు. దేవతలకు ఇతనిపై సానుభూతి

★ దేవీభాగవతం సుమతికి 100 సంవత్సరాలైనా ప్రసవం జరగలేదని ఆమె శివుడ్ని ప్రార్థించగా శివుడు ప్రత్యక్షమై ఆమె మాంసపు ముద్దను ప్రసవించగా శివుడు 60,000 ముక్కలుగా కత్తిరించగా ఒక్కో ఖండం ఒక్కొక్క శిశువుగా మారారని పేర్కొంది.

కల్గింది. వాయువు, అగ్ని, సూర్యుడు, ప్రాణుడు ఇతడికి దైవిక జ్ఞానాన్ని ప్రసాదించారు. ఇతడు 1000 బలిసిన గోవులతో గౌతముడివద్దకు తిరిగిరాగా అతడి తేజస్సు చూసి ఏమి జరిగిందో తెలు సుకొని అతడికి పరమాత్మను గురించి బోధించాడు. సత్యకాముడికెం దరో శిష్యులు లభించారు. అందులో ఉపకోశ లుడు ముఖ్యుడు. – *చాందోగ్యోపనిషత్తు*

**సత్యకీర్తి :** హరిశ్చంద్రుడి మంత్రి.

**సత్యకుడు :** యాదవ వంశంలోని ఒకరాజు. సాత్యకి తండ్రి. రైవత పర్వతంపై శ్రీకృష్ణుడు ఉత్సవాలు జరిపినప్పుడు ఇతడుకూడా పాల్గొన్నాడు. ఇతడు అనమిత్రుడి కొడుకైన శనికి కుమారుడు. అభిమన్యుడు మరణించినపుడు ఇతడు కూడా పితృగణాలకు తర్పణ చేశాడు. – *మహాభారతం*

**సత్యకేతువు-1 :** సూర్యవంశపు రాజుల్లో ఒకడు. ధర్మకేతువు కొడుకు. అమరధుని తండ్రి. – *భాగవతం*

**సత్యకేతువు-2 :** పాంచాల రాజు. పరశురాముడితో యుద్ధం చేశాడు. – *బ్రహ్మాండపురాణం*

**సత్యకేతువు - 3 :** పూరువంశపు రాజు. సుకుమారుడి కొడుకు. – *అగ్నిపురాణం*

**సత్యజిత్తు-1 :** యయాతి వంశంలోని ఒకరాజు. సునీతుడి కొడుకు; క్షేముడికి తండ్రి. – *భాగవతం*

**సత్యజిత్తు-2 :** ద్రుపదుని సోదరుల్లో ఒకడు. గురుదక్షిణకోసం అర్జునుడు ద్రుపదునిపై దండెత్తి నపుడు అతడితో యుద్ధం చేసి ఓడిపోతాడు. ద్రౌపది వివాహానంతరం బంధుత్వం వల్ల ఇతడు కురుక్షేత్ర యుద్ధంలో పాండవుల పక్షాన పోరాడి ద్రోణుని చేతిలో మరణిస్తాడు. – *మహాభారతం*

**సత్యతపుడు-1 :** గోడిలుని శాపంవల్ల త్రాచుగా మారిన ఓ బ్రాహ్మణ బాలుడు. ఇతని అసలుపేరు ఉతత్యుడు. ప్రాచీన కాలంలో దేవదత్తుడనే బ్రాహ్మణుడు ఓ రాజు. ఇతని భార్య రోహిణి. సంతానం లేదు. పుత్రకామేష్టి యాగం చేశాడు. ఎందరో సాధువులు ఇందులో పాల్గొన్నారు. సుహోత్రుడు బ్రాహ్మణుడిగా, యాజ్ఞవల్క్యుడు పురోహితుడుగా, బృహస్పతి యజ్ఞకర్తగా, పైలుడు వేదాలు చదువుతుండగా గోడిలుడు స్తోత్రాలు గానం చేశాడు. అతడు పాడుతుండగా పాముచ్చి బుసకొడుతుంటే దేవదత్తుడు అతని ధ్వనిని ఛీత్కరించగా అతడు కోపించి నీకు జన్మించేవాడు సర్పంగా జన్మిస్తాడని శపిస్తాడు. దేవవ్రతుడు అతడి పాదాలపై పడగా సర్పంగా జన్మించినా గొప్ప రుషి అవుతాడని శాపవిమోచనం చెప్తాడు. ఆ తర్వాత ఉతత్యుడు జన్మిస్తాడు. ఇతడు అంతర్ముఖుడుగా ప్రవర్తించేవాడు. అతడి శైలిని మార్చడానికి ప్రయత్నించి విఫలంచెందారు. ప్రతివాడు ఇతడు సర్పమనే భావించి ఛీత్కారం చేయగా అతడు ఇల్లు వదలి గంగాతీరంలో ఓ గుడిసె వేసుకొని తీవ్రమైన తపస్సు చేశాడు. ఇతడు ఎవరికీ హానిచేసే వాడు కాదు. అబద్ధం చెప్పేవాడు కాదు. చుట్టుపక్కల వారు ఇతడిని సత్యతపసుడని పిల్చేవారు. అలా ఆ కుటీరంలో మానసిక ప్రశాంతతలేకుండా 14 సంవత్సరాలు జీవించాడు. ప్రజలతడి నిజాయితీకి అచ్చెరు వందారు. ఒకరోజు ఓ ఆటవికుడు ఓ పందిపై బాణం విసరగా అది శరీరంలోదిగి ఆశ్రమంలోకి పారిపో యింది. ఆటవికుడు అదెక్కడుందో అడగ్గా

"ఎవరైతే చూసారో వారు మాట్లాడతారు
మాట్లాడగలిగినవారు చూడలేరు"

అని సమాధానం ఇచ్చి ఎందుకు ఎవరిని పదేపదే ప్రశ్నిస్తావని అడగగా అతని విల్లు బాణాలు క్రిందపడి జ్ఞానోదయమై కుటీరాన్ని విడచివెళ్లాడు. అతని గొప్పతనం ఊరూరాపాకి చివరకు రాజుకి తెలిసి తనకు మారుడిని ఇంటికి తీసుకువెళ్తాడు. ఇప్పటికి బ్రాహ్మణులు పౌర్ణమినాడు ఇతడ్ని తలుస్తారు. – *దేవీభాగవతం*

వరాహపురాణంలో సత్యతపుడు ఓ బోయవాడని అతడు అరణ్యమున తిరుగు ప్రజలను హింసించి బ్రతికెడివాడని అతడొకసారి అరుణియను మునిని కొట్టబోగా అతడు నిర్భయముగా నుండుట చూచి అతని శిష్యుడై అతడివెంటే తిరుగుతూ ఓ పులి బారి నుండి అరుణుని రక్షించి అతడి శిష్యుడయ్యెను. అరుణి నీవెన్నడు వికట వృక్షములను తినకుము. సత్యమునే మాట్లాడుమని చెప్పి వెడలగా అతడు ఇంకే అహారము దొరకక తపస్సు చేసుకొనెను. దుర్వాసు డొకసారి రాగా అతడికి ఆహారమివ్వ దలచగా నీవేమి ఆహారమిత్తువని అనగా శివుని ప్రార్థించి ఓ మణిపా

త్రను పొంది సకల పదార్థముతో దుర్వాసునికి విందు చేయగా దుర్వాసుడు ఇతనికి సత్యసంధుడని నామ కరణము చేసెను. ఆ తర్వాత ఇంద్రుడు ఉపేంద్రుడు బోయవాడు, పందిరూపంలో ఇతణ్ణి పరీక్షించనెంచి బోయవాడు ఆశ్రమములో దూరిన పందిని ఇవ్వమనగా "కన్ను చూసినా మాట్లాడలేదు

నోరు మాట్లాడినా చూడలేదు" అని సత్యసంధతను నిరూపించుకొని పందిని కాపాడగా వారు నిజ రూపులై ఇతనికి వరములిచ్చిరి – వరాహపురాణం

**సత్యతపుడు – 2 :** ఓ రుషి. ఓ అప్సరస కన్య. ఇతని తపభంగం చేయబోగా ఓ చెట్టుగా మారమని శపించాడు. ఆ తర్వాత శాపవిమోచనం చేశాడు.

**సత్యదేవి :** దేవకుడను రాజు కుమార్తె. వసుదేవుని 7 గురు భార్యలో ఒకరు. – మత్స్యపురాణం

**సత్యదేవుడు :** కళింగ వీరుల్లో ముఖ్యుడు. సుతాయుష్ను అనే రాజకి అండగా వుండి భారతయుద్ధంలో కౌరవుల పక్షాన పోరాడి భీముడి చేతిలో మరణిస్తాడు. – మహాభారతం

**సత్యధర్ముడు – 1 :** చంద్రవంశపు రాజు. ఇతడు ధర్మరాజుకు సహాయపడతాడు. – మహాభారతం.

**సత్యధర్ముడు – 2 :** సుశర్మ సోదరుడు. మహాభారత యుద్ధంలో కౌరవుల పక్షాన పోరాడి అర్జునుని చేతిలో మరణిస్తాడు. – మహాభారతం

**సత్యధృతి – 1 :** శతానందుని కుమారుడు. ధనుర్వేదం నేర్చుకున్నాడు. ఊర్వశిని చూసిరేతపతనం కాగా అందుండి కృపి, కపాచార్యుడు జన్మిస్తారు. కృపి ద్రోణాచార్యుని భార్య.

**సత్యధృతి 2 :** క్షేమకుడను రాజు కొడుకు. ఇతడు మహాభారతయుద్ధంలో పాండవుల పక్షాన పోరాడాడు. – మహాభారతం

**సత్యధృతి 3 :** రథంపై నుండి యుద్ధం చేసిన ఓ వీరుడు. ఇతడిని గొప్ప రధుల్లో ఒకడని పేర్కొన్నారు. ఇతడు ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. ఇతడు సుచిత్రుడి కొడుకు. హిడింబి సుతుడైన ఘటోత్క చునికి ఎల్లపుడు సహాయం చేసేవాడు. ఇతడు వేద వేదాంగ పండితుడు. మహాభారత యుద్ధంలో ఇతడ్ని ద్రోణుడు సంహరించాడు. – మహాభారతం

**సత్యభామ :** శ్రీకృష్ణుని భార్య.

ఒకసారి నారదుడు దేవలోకంలోని కల్పవృక్షం నుండి పుష్పాలు తెచ్చి శ్రీకృష్ణునికివ్వగా అతడు వాటిని తన భార్యలకు పంచి సత్యభామకు మాత్రం ఇవ్వడం మరచాడు. సత్యభామ అలకపాన్పు ఎక్కగా శ్రీకృష్ణుడు గరుడ వాహనంపై సత్యభామతో కూడి దేవలోకం వెళ్ళి ఇంద్రుడ్ని జయించి కల్పవృక్షాన్ని తీసుకువచ్చి సత్యభామవనంలో నాటాడు. అప్పుడు నారదుడు సత్యభామ వద్దకురాగా గర్వంతో కూడిన ఆనందంలో ప్రతి జన్మలోనూ శ్రీకృష్ణుడే తన భర్తకావాలంటే ఏమి చెయ్యాలని అడుగగా తులాపురుషదానం చెయ్యమని చెప్తాడు. తులాభారంలో శ్రీకృష్ణుడిని ఒక ప్రక్క తక్కిన ఆభరణములను, కల్పవృక్షాన్ని మరోప్రక్క తూచి నారదుడికే దానంగా ఇవ్వగా నారదుడు కల్పవృక్షాన్ని తిరిగి దేవలోకంలో నాటాడు. సత్యభామ శ్రీకృష్ణుడ్ని నేను చేసిన మంచి పనులేమిటి, ఎలా నిన్ను భర్తగా పొందానని అడగగా శ్రీకృష్ణుడే ఆమెపూర్వజన్మ వృత్తాంతం వివరించాడు.

*పూర్వజన్మ :* కృతయుగాంతంలో దేవశర్మ అనే బ్రాహ్మణుడుండేవాడు. అతని కూతురు గుణవతి. ముసలి వయసులో తనకూతుర్ని తన శిష్యుడైన చంద్రశర్మకిచ్చి వివాహం చేశాడు. ఒకసారి మామా అల్లుళ్ళు దర్భలు సమిధలకు అరణ్యానికి వెళ్ళగా ఓ రాక్షసి వారిని చంపింది. వైకుంఠం నుండి విష్ణువు వచ్చి వీరిని వైకుంఠం తీసుకువెళ్ళాడు. ఇది తెలిసిన గుణవతి దుఃఖిస్తూ మూర్ఛిల్లింది. తర్వాత తేరుకొని తన ఇంటి సామాగ్రినంతా అమ్మి భర్తకు తండ్రికి కర్మ కాండలు జరిపి కాయకష్టంతో జీవిస్తూ ఉపవాసాలు చేస్తూ కృత్తిక, ఏకాదశి వ్రతాలను పాటించింది. ఆమె చలికి, ఎండకు తట్టుకోలేని పరిస్థితిలో గంగానదిలో స్నానం చేస్తూ చలికి ఒణికిపోగా విష్ణువు వాహనం పంపగా ఆ విమానంలో వైకుంఠం వెళ్లింది. దేవకన్యలామెకు ఉపచారాలు చేశారు. మహావిష్ణువు శ్రీకృష్ణుడుగా జన్మించినపుడు అతడి పరివారం కూడా భూలోకంలో జన్మించారు. గుణవతి తండ్రి దేవశర్మ సత్రాజిత్తుగా, ఆమె భర్త అక్రూరుడిగా, ఆమె సత్య భామగా జన్మించారు. – పద్మపురాణం

*ఇతర విశేషాలు :*

ఈమెకు శ్రీకృష్ణునివల్ల భీముడు తదితర కుమారులు జన్మించారు. నరకాసురుడు అదితి చెవికుండలాలు తీసుకుపోగా శ్రీకృష్ణుడు సత్యభామా సమేతుడై అతడితో యుద్ధంచేసి అతణ్ణి వధించి ఆ చెవికుండ లాలను అదితికి ఇవ్వగా అదితి శ్రీకృష్ణుడు శరీర పరిత్యాగం చేసేవరకు నీకు ముసలితనం రాదని సత్యభామను ఆశీర్వదించింది. శ్రీకృష్ణుని నిర్యాణా నంతరం అర్జునుడు ద్వారకకురాగా ఆమె విలపించి అరణ్యానికి తపస్సు చేసుకోవడానికి వెళ్ళింది.

**సత్యయజ్ఞుడు :** పులుషుడి కొడుకు. వేద వేదాంగాల్ని అభ్యసించినా బ్రహ్మస్వరూపం తెలియక ఇతడు, ప్రాచీ నశాలుడు ఉద్దాలకుడి దగ్గరకు వెళ్లారు.

– చూ॥ ఉద్దాలకుడు

**సత్యయుగం :** కృతయుగానికి నామాంతరం.

**సత్యర :** ఓ కేకయ యువరాణి. సత్యవ్రతుడు (త్రిశం కుడు) అనే అయోధ్యరాజు ఈమెను వివాహమాడాడు.

– వాయుపురాణం

**సత్యరథుడు :** త్రిగర్త రాజైన సుశర్మ సోదరుడు.

– *మహాభారతం*

**సత్యలోకం :** బ్రహ్మలోకానికి మరోపేరు.

**సత్యవతి–1 :** వ్యాసుని తల్లి. ఈమె దేవతాస్త్రీ అయిన అద్రి కుమార్తె. ఓ శాపంవల్ల గంగానదిలో చేపగా జీవిస్తుంది. ఒకసారి ఉపరిచరవసువు వీర్యం గంగా నదిలో పడగా ఆ చాప దానిని మింగి గర్భవతి అవు తుంది. ఓ మత్స్యకారుని వలలో పడుతుంది. ఆ మత్స్యకారుడు దాన్ని కొయ్యగా అందుండి ఒక బాలుడు, బాలిక బయటపడ్డారు. అతడు వారిని రాజుకి అప్పగించగా బాలుడ్ని తాను వుంచుకొని బాలికను మత్స్యకారుడికే ఇచ్చాడు. ఆ బాలుడు తర్వాత మత్స్య రాజుగా ప్రసిద్ధిచెందాడు. ఆ బాలిక నల్లగా వుండటం వల్ల కాళిగా పిలవబడింది. రాజు ఆమె మత్స్యపు వాస నరావడం వల్ల మత్స్యగంధి అన్నాడు.

ఆ తర్వాత ఆమె సత్యవతి అనికూడా పిలువబడింది. ఆ చేపలుపట్టే మత్స్యకారుడు తన పడవలో ప్రజల్ని గంగానది ఇరువైపులకూ జేర్చేవాడు. ఒకరోజు పరా శర మహర్షి ఆ పడవలో వెళ్తూ ఈమెను మోహించి పడవలోనే మంచును సృష్టించి ఆమెతో సంగమిం చాడు. ఆమెకు ఓ బాలుడు జన్మించాడు. పరాశరుడు ఆమె కన్యత్వం పోనట్లు వరమిస్తాడు. అంతేకాక అతడి కలయికనుండి ఆమె శరీరం సువాసనలు వెద జల్లడం వల్ల కస్తూరిగంధిగా పిలువబడింది. పుట్టిన బాలుడు వెంటనే పెద్దవాడై తల్లి కోరినపుడు రాగలనని వరమిచ్చి తపస్సుకు అరణ్యాలకు వెళ్ళాడు. అతడి పేరు కృష్ణ. ఆ తర్వాత అతడే వ్యాసుడిగా ప్రసిద్ధి కెక్కాడు. చంద్రవంశపు రాజైన శంతనుడు వేటకువెళ్ళి కస్తూరీ గంధ వాసనలు చూసి అటుగా వెళ్ళి కస్తూరి గంధిని చూసి ఆమెను మోహించాడు. అప్పటికే అతనికి గంగ వల్ల ఓ కుమారుడున్నాడు. అతడి ఆమోదంతో శంతనుడు ఆమెను వివాహం చేసుకోగా చిత్రాంగదుడు, విచిత్ర వీర్యుడు ఆమెకు జన్మించారు. చిత్రాంగదుడు వివాహం కాకముందే మరణించగా విచిత్రవీర్యుడు కాశీరాజు కుమార్తెలైన అంబిక అంబాలికలను వివాహమాడాడు. సంతానం కలుగక ముందే ఇతడు మరణించగా వంశం అంతమవుతుం దని భావించి సత్యవతి తన కుమారుడు వ్యాసుని తలంచగా అతడు ప్రత్యక్షమయ్యాడు. వ్యాసునివల్ల అంబికకు ధృతరాష్ట్రుడు, అంబాలికకు పాండురాజు జన్మించారు. ఆమె కుమారుని మరణంతో వేదన చెందుతూ మరెన్ని బాధలు చూడాలోనని తలచి కోడళ్ళతో కలసి తపస్సు చేయడానికి అరణ్యమునకెళ్ళి ఆ తర్వాత స్వర్గస్తురాలయ్యింది.

*ఇతర విశేషాలకు : చూ॥ వ్యాసుడు – భీష్ముడు*

**సత్యవతి 2 :** విశ్వామిత్రుని సోదరి. *చూ॥ జమదగ్ని*

**సత్యవతి 3 :** కేకయ రాజకుమారి. త్రిశంకుడి భార్య. హరిశ్చంద్రుని తల్లి. – మహాభారతం

**సత్యవతి 4 :** నారదుని భార్యల్లో ఒకరు. – మహాభారతం

**సత్యవర్మ :** త్రిగర్త రాజైన సుశర్మ సోదరుల్లో ఒకడు.

– *మహాభారతం.*

**సత్యవాక్కు 1 :** చాక్షుష మనువు కుమారుల్లో ఒకడు. చాక్షుష మనువు, నడ్వలకు సత్యవాక్కుతో కలిపి 10 మంది కుమారులు. – *అగ్నిపురాణం.*

**సత్యవాక్కు 2 :** ఓ దేవగాంధర్వుడు. ప్రజాపతి కశ్యపుడికి ముని అనే భార్యవల్ల జన్మించాడు. – *మహాభారతం.*

**సత్యవానుడు 1 :** పాతిప్రత్యానికి చిహ్నమైన సావిత్రి భర్త. – చూ॥ సావిత్రి.

**సత్యవానుడు 2 :** చూడుము: రుతుంబరుడు.

**సత్యవానుడు 3 :** కౌరవసేనానుల్లో ఒకడు. – మహా భారతం.

**సత్యవంతుడు :** ద్యుమత్సేనుడి కొడుకు. ఇతణ్ణి చిత్రాశ్వుడనీ అంటారు. తండ్రి రాజ్యం పోగొట్టుకోవడం వల్ల అరణ్యంలో పెరుగుతాడు. సావిత్రి ఇతణ్ణి వరిస్తుంది. మరణించిన ఇతణ్ణి సావిత్రి సజీవుణ్ణి చేసుకుంటుంది. ఇతణ్ణి సత్యవానుడని అంటారు. – చూ॥ సావిత్రి

**సత్యవ్రత :** గాంధారి సోదరి. ధృతరాష్ట్రుని భార్య. – మహాభారతం.

**సత్యవ్రతుడు 1 :** త్రిశంకుని పేరు. – చూ॥ త్రిశంకుడు

**సత్యవ్రతుడు 2 :** సత్యతపసుని మరోపేరు. – చూ॥ సత్యతపుడు.

**సత్యవ్రతుడు 3 :** ధ్రుతరాష్ట్రుని కుమారుల్లో ఒకడు. ఇతడి నామాంతరాలు సత్యసంధుడు, సత్యసేనుడు. – మహాభారతం.

**సత్యవ్రతుడు 4 :** సుశర్మ సోదరుడు. శాపగ్రస్తుడైన ఇతడు అర్జునుని చంపుతానని ప్రతిజ్ఞచేసి అతనిచేతిలోనే మరణిస్తాడు. – మహాభారతం.

**సత్యశ్రవుడు 1 :** కౌరవుల పక్షాన పోరాడిన వీరుడు. అభిమన్యుడితణ్ణి వధించాడు. – మహాభారతం.

**సత్యశ్రవుడు 2 :** వ్యాసుని రుగ్వేద శిష్యుల్లో ఆచార్యుడు పురోహితుడు. మార్కండేయుని కుమారుడు. – వాయుపురాణం.

**సత్యసేన :** గాంధారి సోదరి. ధృతరాష్ట్రుని భార్య. – మహాభారతం.

**సత్యసేనుడు 1 :** చూ॥ సత్యసంధుడు 3.

**సత్యసేనుడు 2 :** త్రిగర్త రాజు శుశర్మ సోదరుడు. ఇతడు మహాభారత యుద్ధంలో అర్జునుడి చేతిలో మరణించాడు. – మహాభారతం.

**సత్యసేనుడు 3 :** కర్ణుని కుమారుడు. కర్ణుని రథ చక్రానికి రక్షకుడుగా వ్యవహరించాడు. – మహాభారతం.

**సత్యసంధుడు 1 :** మిత్రదేవుడు సుబ్రహ్మణ్యస్వామి కిచ్చిన అనుచరుల్లో ఒకడు. రెండోవాడు సువ్రతుడు. – మహాభారతం.

**సత్యసంధుడు 2 :** భారతీయ ప్రాచీనరాజు. ఆడినమాట తప్పనివాడు. ఉపవాసాలు చేసేవాడు. ఓ బ్రాహ్మణుడ్ని రక్షించడానికి తన జీవితాన్నే ఫణంగా పెట్టాడు. – మహాభారతం.

**సత్యసంధుడు 3 :** ధృతురాష్ట్రుని కుమారుడు. కౌరవ సేనలోని 11 మంది గొప్ప రధికుల్లో ఒకడు. శల్యుడిని రక్షించే కర్తవ్యం నిర్వహించాడు. అభిమన్యుడితణ్ణి గాయపరచాడు. సాత్యకి ఇతనిపై అస్త్రవర్షం కురిపించాడు. భీముడితన్ని వధించాడు. నామాంతరాలు. సత్యవ్రతుడు, సత్యసంధుడు.

**సత్యహితుడు :** పూరువంశంలోని ఒకరాజు. రుషభుని కొడుకు, సుధాన్యుని తండ్రి. – అగ్నిపురాణం.

**సత్యాయుస్సు :** పురూరవ ఊర్వశిలకు జన్మించిన ఆర్గురు కుమారుల్లో ఒకడు. వారు ఆయుస్సు, శ్రుతాతాస్సు, సతాయుస్సు, సత్యాయుస్సు, రయ, విజయ, జయలు.

**సత్రాజిత్తు :** ఓ యాదవరాజు. నిమ్నుడి కొడుకు. సత్రాజిత్తు సోదరుడు ప్రసేనుడు. శమంతకమణి పరంగా ప్రసేనుడు మరణించాడు. కృతవర్మ సత్రాజిత్తు మరణానికి కారకుడు. ఇతడి కుమార్తె సత్యభామను శ్రీకృష్ణుడు వివాహమాడాడు. చూ॥ సత్యభామ, శ్యమంతకమణి

**సత్యుడు 1 :** ఓ రుషి. ఇతడు ధర్మజుని కొలువులో వుండేవాడు. – మహాభారతం.

**సత్యుడు 2 :** ఓ అగ్ని. నిశ్చయ వానుడను అగ్ని పుత్రుడు. కాలధర్ముడివద్ద పనిచేసేవాడు. బాధపడే జీవుల బాధ తగ్గించేవాడు. అందుకే ఇతడిని నిష్కృతి అని పిలిచేవారు. ఇతడు ప్రజలు ఆటలాడుకునే ఇళ్ళను తోటలను ప్రకాశింపచేసేవాడు. ఈ అగ్నికి స్వనుడను కుమారుడు కలడు. – మహాభారతం.

**సత్యుడు 3 :** కళింగరాజు సైన్యంలో వున్న ఓ వీరుడు. ఇతడు పాండవులకు వ్యతిరేకంగా పోరాడాడు. కళింగ రాజు రథచక్రాలను రక్షించేవాడు. ఇతడిని భీమసేనుడు వధించాడు. – మహాభారతం.

**సత్యుడు 4 :** విదర్భదేశంలో అహింసను నమ్మిన ఓ బ్రాహ్మణుడు. ఇతడు బలిచేయకుండా యజ్ఞం చేశాడు.

ఇతని భార్య పుష్కరధారణి ఈ యజ్ఞానికి తోడ్పడింది. ధర్మదేవుడు జంతువుగా వచ్చి శాపవశాన ఇలా అయ్యావని నన్ను యజ్ఞానికి బలిఇస్తే శాపవిమోచన జరుగుతుందని చెప్పినా ఇతడు అహింసకు కట్టుబడి అతణ్ణి బలిఇవ్వడు. ఆ తర్వాత ఆ జంతువు 8 అడుగులు ముందుకు వెళ్ళి వెనక్కువచ్చింది. దాని మాయాజాలంవల్ల ఆకాశంలో అప్సరసలు విమానాలు కన్పించాయి. తనను బలిస్తేనే స్వర్గానికి వెళ్తావని చెప్పగా సత్యుడికి బలి ఇవ్వాలనే ఆలోచన కల్గుతుంది. ఆలోచన వచ్చినవెంటనే అతని తపశ్శక్తి నశిస్తుంది. – మహాభారతం

**సత్యుడు 5 :** శ్రీకృష్ణుని మరోపేరు. – భాగవతం

**సత్యుడు 6 :** వితహవ్యుని వంశంలో జన్మించిన వితత్యుని కుమారుడు. ఇతని కొడుకు సంతుడు. – మహాభారతం.

**సత్యులు :** దేవతల్లో ఓ సంతతి. వీరు మూడవ మన్వంతరంలో వుండేవారు. అప్పటి మనువు ఉత్తముడు. దేవగణాలకు అధిపతి ఇంద్రసుశాంతి. అప్పుడు 5 దేవగణాలుండేవి. ఒక్కోగణంలో 12 మంది దేవతలుండేవారు. ఆ గణాలు సుధామాసులు, సత్యులు, జపులు, ప్రతర్ధనులు, వశవర్తి. – విష్ణుపురాణం

★ **సత్యేయుడు :** పూరు వంశంలో జన్మించిన రాజు. రౌద్రాశ్వ దేవకన్య ఘృతాచిలకు జన్మించిన పదిమంది కుమారుల్లో ఒకడు. – భాగవతం.

**సత్యేషుడు 1 :** ఓ రాక్షసుడు. ప్రాచీనకాలంలో ఇతడు ప్రపంచాన్నంతా పాలించాడు. విధివైపరీత్యంవల్ల వైదొలగాడు. – మహాభారతం.

**సత్యేషుడు 2 :** త్రిగర్తరాజు సుశర్మ సోదరుడు. ఇతడ్ని మహాభారత యుద్ధంలో అర్జునుడు వధించాడు. – మహాభారతం.

**సదముడు :** రాక్షసుడు. విదముడి సోదరుడు. – చూ॥ విదముడు.

**సదశ్వుడు :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. యముని భవంతిలో వుండి అతణ్ణి పూజిస్తాడు. – మహాభారతం

**సదస్యోర్మ :** ఒక రాజు. యముడ్ని పూజిస్తాడు. – మహాభారతం.

**సదాకాంత :** పురాణ ప్రసిద్ధమైన ఒకనది. – మహాభారతం.

**సదాచారం :** ప్రతి దేశానికి దాని మంచి లక్షణాలు దానికి వుంటాయి. సల్లక్షణాలున్న వ్యక్తి రెండులోకాలను జయించినట్లే. సత్ అంటే సాదువులని, వీరు వ్యవహరించే తీరును సదాచారమని అంటారు. సప్తర్షులు, ప్రజాపతులు, మనువులు, సదాచారులకు ఉదాహరణలు. ఒకసారి ఔర్యుడు సదాచారమంటే ఏమిటో సగరుడికి వివరించాడు. ఇందులో తెల్లవారదానికి రెండుగంటలు ముందు నిద్రలేవాలని మూత్ర విసర్జనకు నైరుతి దిక్కుకు వెళ్ళాలి. మలవిసర్జన సమయంలో అది మన నీడపై పడరాదు. మల విసర్జన గోవులకెదురుగా, చెట్టునీడన, సూర్యుని వైపుకు, గురువు, బ్రాహ్మణునివైపుగా తిరిగి విసర్జించరాదు. అతిధులను ఆహ్వానించేముందు నదిలో గాని, నూతిలోని నీటితోగాని స్నానం చేసి నూతన దుస్తులు ధరించి పితృగణాలకు, పూర్వీకులకు పూజచేసిన తర్వాత ఆహ్వానించాలి. – విష్ణుపురాణం.

**సదాజిత్తు :** భారతవంశంలో ఒకరాజు. కుంతి కొడుకు. మహిష్మానుడి తండ్రి. – భాగవతం.

**సదావీర :** పురాణ ప్రసిద్ధమైన ఒక నది. ఆధునిక భారతదేశంలోని కరతోయ ఇదే. – మహాభారతం.

**సనకాదులు :** సనక, సనందన, సనాతన, సనత్కుమారులైన బ్రహ్మ మానసపుత్రులను సనకాదులని పిలుస్తారు. వీరు బాల్యంలో వుండగనే బ్రహ్మ వీరిని సృష్టి చేయమని కోరగా వీరు నిరాకరించాడు. వీరు సత్యుని అవతారాలు కనుక సృష్టి చేయుటకంగీకరించలేదు. నాల్గయిదేళ్ళ ప్రాయంలో వేదాలు అధ్య యనం చేసి కలసి ప్రయాణించారు. వీరెల్లపుడు గౌరవనీయులే. ఒకసారి వీరు వైకుంఠం వెళ్ళగా ద్వార పాలకులైన జయవిజయులు అడ్డుపడగా వారిని శపించారు. సనకాదులు బ్రహ్మ సృష్టికార్యం మొదలు పెట్టకముందే అవతరించారు. – దేవీభాగవతం

★ మహాభారతం ఇతడు రుద్రాశ్వ దేవకన్య మిశ్రకేశీలకు జన్మించాడని చెప్తోంది.

**సనత్కుమారుడు :** సనకాదుల్లో ఒకడు.
– చూ॥ సనకాదులు

**సనత్సుజాతుడు :** సనత్కుమారుని మరోపేరు.
– చూ॥ సనకాదులు

**సనాజిత్తు :** యదువంశంలోనివాడు. హేహయుడి పౌత్రుడైన కుంతి కొడుకు. ఇతడిని సోభంజు అని కూడా పిలుస్తారు.

**సనాతనుడు :** ఓ రుషి. ఇతడు ధర్మజుని కొలువులో వుండేవాడు. – మహాభారతం.

**సనీయం :** ప్రాచీన దక్షిణభారతదేశంలోని ఓ రాజ్యం.
– మహాభారతం.

**సనందనుడు :** సనకాదుల్లో ఒకడు. – చూ॥ సనకాదులు.

**సన్నతమంతుడు :** పూరువంశస్తుడు. సుమతి కొడుకు. కృతి తండ్రి.

**సన్నతి 1 :** పులహమహర్షి కుమారుడైన క్రతువుకు భార్య. అత్యంతకాంతివంతులైన వాలఖిల్యులు సన్నతికి జన్మించారు. – అగ్నిపురాణం.

**సన్నతి 2 :** బ్రహ్మదత్తుని భార్య. ఈమె ఓ తపస్వి. భార్యాభర్తలిద్దరూ మానససరస్సువద్ద తపస్సు చేశారు.
– పద్మపురాణం

**సన్నతేయుడు :** పురుచక్రవర్తి మూడవ కొడుకైన రౌద్రాన్యుడు, దేవకన్య మిశ్రకేశికి జన్మించిన కొడుకు. ఇతడు గొప్ప వీరుడు. ఇతనికి రుచేయు, వనేయు, జలేయు, పక్షేయు, కృపనేయు, స్థండిలేయు, తేజేయు, సత్యేయు, ధర్మేయులనే 9 మంది పుత్రులు జన్మించారు.

**సన్యస్తపాదం :** పురాణ ప్రసిద్ధ స్థలం. ఇచ్చట ప్రజలు జరాసంధుడికి భయపడి దక్షిణానికి పారిపోయారు.

**సన్యాసం :** బ్రాహ్మణ జీవితంలో నాల్గవపాదం సన్యాసం. బ్రహ్మచర్యం, గృహస్థ్య, వానప్రస్త, సన్యాసాలు, సన్యాసమంటే రుషితుల్యం. జీవిత నాల్గవ అంకంలో ప్రపంచంతో అన్ని సంబంధాలు తెంచుకోవాలి. ఒంటరిగా జీవించాలి. ఆహారంకోసం మాత్రమే గ్రామంలోకి వెళ్ళాలి. సంపదను వదలివేయాలి. సంపాదన కూడ బెట్టరాదు. మహర్షిలా జ్ఞానసంపద పొందాలి. అందరిని సమానులుగా గుర్తించాలి. జీవితం, మరణాలను గూర్చి ఆలోచించరాదు. తెలియక రాత్రిగాని పగలుగాని జీవహింస చేస్తే ఆరు ప్రాణాయామాలు చేసి దేహం విడవాలి. పద్మాసనంలో కూర్చోవాలి.

**సన్నివేశుడు :** త్వష్టకు అతని భార్య రచనవల్ల జన్మించిన పుత్రుడు. – భాగవతం

**సన్నిహతితీర్థం :** ఓ ప్రాచీన పుణ్యస్థలం. బ్రహ్మ మొదలగు దేవతలు నెలకొకసారి ఈ తీర్థాన్ని దర్శిస్తారు. సూర్య గ్రహణం రోజున ఇచట స్నానంచేస్తే 6 అశ్వ మేధాలు చేసిన ఫలితం లభిస్తుంది. పితృ గణాలను పూజించడం ఇచ్చట చేసే ముఖ్య కార్యక్రమం.
– మహాభారతం.

**సన్నిహితుడు :** ఓ అగ్ని. ఇది జీవుల శరీరంలో చలనం కలుగచేస్తుంది. ఇది మనువు మూడవ కుమారుడు.
– మహాభారతం

**సప్తకులాచలాలు :** మహేంద్ర, గంధమాదన, మలయ, సహ్య, శుక్తిమంత, వింధ్య, పారియాత్ర పర్వతాలను సప్తకులాచలాలు అంటారు. కులపర్వతాలని కూడా పిలుస్తారు.

**సప్తకృత్తు :** ఓ విశ్వదేవుడు. శ్రాద్ధకర్మలకు సంబంధించిన గణదేవుడు.

**సప్తగోదావరం :** శూర్పారక దేవాలయం వద్ద గల ఓ పుణ్యతీర్థం. ఇచ్చట స్నానంచేస్తే స్వర్గలోకప్రాప్తి లభిస్తుంది. – మహాభారతం.

**సప్తచరువు :** ఓ పుణ్యస్థలం. చరు అంటే బలిదానం. ఒకసారి దేవతలు మానవులు బలి ఇచ్చిన జంతువుల శరీరభాగాలు యజ్ఞగుండంలో వేసి రుగ్వేదం నుండి ఏడు పాటలు పాడారు. దీనివల్ల 1 లక్ష గోవుల్ని దానం ఇచ్చిన దానితో సమానం లేకుంటే 100 రాజసూయ యాగాలతో సమానం. ఈ ఏడు గీతాలను చరు అంటారు. వీటికి మెచ్చిన విష్ణువు వారికి అష్టైశ్వర్య సిద్ధి కల్పించాడు. వారి కోరికలన్నీ తీర్చాడు. అలా ఇచ్చి మేఘంలో మెరుపులా మాయ మయ్యాడు. కనుక ఈ స్థలాన్ని సప్తచరువు అని పిలిచారు.

**సప్తజనాశ్రమం :** ఏడుగురు రుషులు తలక్రిందులుగా నీటిలో వుండి స్వర్గానికి వెళ్ళిన ప్రదేశం. శ్రీరామ సుగ్రీవులు ఇది దాటే కిష్కిందకు వెళ్ళారు.
– రామాయణం.

**సప్తజిత్తు :** కశ్యపునికి దనువువల్ల జన్మించిన కూతుర్లలో ఒకరు. – మత్స్యపురాణం.

**సప్తద్విజులు :** గురువు కొరకు తెచ్చిన గోవును మార్గ మధ్యంలో చంపి ఆకలితీర్చుకున్న బ్రాహ్మణులు. కుండి నిపురంలోని ఓ గురువు అచట కరువు ఏర్పడగా తన మేనల్లుడి వద్దకు ఓ గోవును పంపమని తన ఏడుగురు బ్రాహ్మణ శిష్యులను పంపాడు. అతడు వారికి ఓ గోవును ఇచ్చి పంపగా వీరు ఆకలికి తాళ లేక మార్గమధ్యంలో దానిని చంపి వారి ఆకలి తీర్చుకొని తక్కిన మాంసఖండాలను తమ గురువుకిచ్చి జరిగిన విషయం చెప్పగా సాధ్యమైనంత న్యాయంగా వ్యవహ రించారు కనుక తన శిష్యులను చూసి గర్వించాడు.

– కథాసరిత్సాగరం.

**సప్తద్వీపాలు :** జంబూద్వీపం, ప్లక్షద్వీపం, సాల్మల ద్వీపం, కుశద్వీపం, క్రౌంచద్వీపం, శాకదీపం మరియు పుష్కరద్వీపాలు సప్తద్వీపాలు. జంబూ ద్వీపాన్ని ఉప్పు సముద్రం, ప్లక్షద్వీపాన్ని కార సముద్రం, సాల్మల ద్వీపాన్ని మద్యం, కుశ ద్వీపాన్ని నెయ్యి, క్రౌంచ ద్వీపాన్ని పెరుగు, శాకద్వీపాన్ని పాలు, పుష్కర ద్వీపాన్ని స్వచ్ఛమైన నీరు చుట్టి వుంటాయి. వీటికి మధ్య జంబూద్వీపం వుంటుంది. జంబూ ద్వీపం మధ్య మేరుపర్వతం వుంటుంది. – విష్ణుపురాణం

ఏడు సముద్రాల, ఏడు ద్వీపాల పుట్టుక.

– చూ॥ ప్రియవ్రతుడు

**సప్త నాగులు :** ఏడు నాగులు. అవి అనంత, తక్షక, కర్క, పద్మ, మహాపద్మ, శంఖిక మరియు గులికలు. వీటిన న్నింటిని దేవాలయాలలో వెడల్పాటి ముఖంతో ప్రతిష్ఠిస్తారు.

**సప్తమాతృకలు :** ఏడుగురు దేవతలే సప్తమాతృకలు. వారు బ్రాహ్మణి, వైష్ణవి, మహేశ్వరి, కౌమారి, వారాహి, ఇంద్రాణి, చాముండి. వీరందరికి శివునితో సంబంధం వుంది. వాళ్ళ పేర్లను బట్టి వారు బ్రహ్మ, విష్ణువుల శరీర విభాగాలనుండి జన్మించారు. దీనికి మరో కథ కూడా వుంది. శివుడు విష్ణువు అంధకుడనే రాక్షసుడిని చంపబోయి విఫలురై సప్తమాతృకలను సృష్టించారు. అంధకుడిని ప్రతి రక్తపు బొట్టు నుండి ఓ అసురుడు జన్మిస్తుంటే సప్తమాతృకలు శివుని సృష్టి అయిన యోగేశ్వరితో కలసి అంధకుడి రక్తం క్రిందపడకుండా తాగారు. అప్పుడు శివుడు తేలిగ్గా అంధకుడిని చంప గలిగాడు.

వామన పురాణం సప్తమాతృకల జన్మవృత్తాంతం ఇలా పేర్కొంది : ప్రాచీన కాలంలో దేవాసురులకు భీకర యుద్ధం జరిగింది. చండ, ముండలు చనిపోగా రక్త బీజుడు అపార సైన్యంతో దేవతలపై దాడి చేయగా ఆ సైన్యాన్ని చూసి కౌశికి, మహేశ్వరి, కాళి దిక్కులు పిక్కటిల్లేలా అరవగా మహేశ్వరి నోటినుండి బ్రాహ్మిణి, ముక్కంటి మహేశ్వరి కళ్ళనుండి కౌమారి, ఆమె చేతులనుండి వైష్ణవి, ఆమె వెనుక భాగమునుండి వారాహి, హృదయము నుండి నారసింహి, ఆమె పాదాల నుండి చాముండి జన్మించి రక్తబీజుడ్ని వధించారు. వీరే సప్త మాతృకలు.

**సప్తరావ :** గరుడుని ప్రసిద్ధ సంతానంలో ఒకరు.

– మహాభారతం.

**సప్తర్షికుండం :** కురుక్షేత్రంలోగల ఓ పవిత్ర తీర్థం. ఇచ్చట స్నానం చేసినవారు చక్కటి కార్యక్రమాలు నిర్వహిస్తారు. – మహాభారతం

**సప్తర్షులు :** ఓ రుషిగణం. ఈ గణంలో 7 గురు రుష లుంటారు. ప్రతి మన్వంతరంలో ఒక్కోగణం వుంటుంది. మహా ప్రళయానికి ముందు 14 మన్వం తరాలు వుంటాయి. కనుక 98 మంది సప్తర్షులుం టారు. ఇప్పటి మన్వంతరంలోని సప్తర్షులు మరీచి, అంగిరస, అత్రి, పులస్త్య, వశిష్ట, పులహా మరియు క్రతువులు. వీరు బ్రహ్మ మానసపుత్రులు.

**సప్తలోకాలు :** భూలోకం, భువర్లోకం, స్వర్గలోకం, మహాలోకం, జనలోకం, తపోలోకం, సత్యలోకాలను సప్తలోకాలంటారు. భూలోకంలో మానవులు, భువర్లో కంలో యక్ష కింపురుష గంధర్వ రాక్షసులు, స్వర్గ లోకంలో దేవతలు నివసిస్తారు. వారి పుణ్య విశేషా లను బట్టి పైలోకాలకు వెళ్తారు.

**సప్తసముద్రాలు :** చూ॥ సప్తద్వీపాలు.

**సప్తసారస్వతం :** కురుక్షేత్రంలో ఓ పుణ్యస్థలం. సరస్వ తికి అంకితమివ్వబడిన పుణ్యతీర్థం. ఒకసారి బ్రహ్మ పుష్కరం వద్ద యాగం చేశాడు. నదుల్లో సరస్వతి మాత్రమే రాలేదు. అప్పుడు బ్రహ్మ సరస్వతిని జ్ఞాపకం చేసుకోగా సరస్వతి తపస్సు చేస్తున్న రుషుల ముందుకు ఏడు రూపాలలో ప్రత్యక్షమయ్యింది. అప్పటి నుండి ఆ స్థలానికి సప్తసారస్వతమనే పేరు వాడుకలోకి వచ్చింది.

– మహాభారతం

**సప్తసాలాలు :** మణిభద్రుని కుమారులు. వీరు ఏడుగురు అగస్త్యుని శాపం వల్ల వృక్షాలుగా మారారు. అగస్త్యుని విమోచనం కోరగా మహావిష్ణువును రామావతారంలో మీరు దర్శించినపుడు శాపవి మోచన మవుతుందని చెప్పాడు.

**సప్తాశ్వాలు :** సూర్యుని రథాలకుండే ఏడు అశ్వాలను సప్తాశ్వాలంటారు. సూర్యుని రథం 9 వేల యోజనాల పొడవుంటుంది. ఆ రథపు కాడి 18 వేల యోజనాల పొడవు, ఇరుసు 15 లక్షల యోజనాల వెడల్పు వుంటుంది. రథచక్రం ఈ ఇరుసుతో బంధింపబడి వుంటుంది. ఈ రథాన్ని ఏడు గుర్రాలు లాగుతాయి. అవి వైదిక చందస్సులు. వాటి పేర్లు గాయత్రి, బృహతి, ఉష్ణిక, జగతి, త్రిష్టుప్, అనుష్టుప్, పంక్తి. – విష్ణుపురాణం.

**సప్తోపాయాలు :** చూ॥ చతురోపాయాలు.

**సభానరుడు :** భరతవంశంలోని ఒక రాజు. అను ద్రుహ్యుని కొడుకు; కాలనరుడికి తండ్రి. – *భాగవతం*

**సభానలుడు :** యయాతి పౌత్రుడు. అణువు పెద్ద కొడుకు.

**సభాపతి :** కౌరవుల పక్షాన పోరాడిన యువరాజు. ఇతడిని అర్జునుడు సంహరించాడు. – *మహాభారతం.*

**సమాగులు :** వ్యాసుని శిష్యులలో ఒక వర్గం వారు. – *చూ॥ గురుపరంపర*

**సమం :** పుష్కర ద్వీపానికి మధ్యనున్న ప్రసిద్ధ క్షేత్రం. దేవాదులిక్కడ నివశిస్తారు. – *మహాభారతం.*

**సమంగం 1 :** ఓ నది. అష్టావక్రుడు ఈ నదిలో స్నానం చేయడంవల్ల అతడి వంకరలు పోయాయి. – *చూ॥ అష్టావక్రుడు*

**సమంగం 2 :** దక్షిణభారతదేశం లోని ఓ రాజ్యం. – *మహాభారతం.*

**సమంగుడు 1 :** ఓ గోవులకాపరి. దుర్యోధనుని పశువులను కాసేవాడు. – *మహాభారతం.*

**సమంగుడు 2 :** ఓ ప్రాచీనరుషి. సుఖమయ జీవితాన్ని గూర్చి ఇతడు నారదుడితో సంభాషించాడు. – *మహాభారతం.*

**సమంతపంచకం :** పరశురాముడు ఏర్పరచిన ఓ పుణ్యస్థలం. పరశురాముడు ఐదు నదులను సృష్టించి రక్తంపారేట్లుచేసి ఆ రక్తంలో చేతులు కడుక్కొని పితృలకు తర్పణ చేశాడు. పరశురాముని ప్రాచీనుల ఆ కార్యాచరణవల్ల ఇది పవిత్ర తీర్థం అయ్యింది. ద్వాపరయుగాంతం, కలియుగారంభంలో కౌరవ పాండవులు ఇచట యుద్ధం చేయడంవల్ల ఇది సమంతపంచకమయ్యింది. యుద్ధానికి బలరాముడు ఈ స్థలాన్ని సూచించాడు. దుర్యోధనుడిక్కడే మరణించాడు. – *మహాభారతం*

**సమంతరం :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజ్యం. – *మహాభారతం.*

**సమరధుడు :** విరాటరాజు సోదరుడు. ఇతడు పాండవులకు సహాయం చేసినవారిలో ముఖ్యుడు. – *మహాభారతం.*

**సమరుడు :** భారతవంశంలోని ఒక రాజు. పృథుసేనుని 100 మంది కుమారుల్లో ఒకడు.

**సమవేగవశం :** దక్షిణ భారతదేశంలోని ఒక రాజ్యం. – *మహాభారతం.*

**సమసారభుడు :** వేదవేదాంగాలు చదివిన బ్రాహ్మణుడు. జనమేజయుని సర్పయాగంలో ఓ అతిథి. – *మహాభారతం.*

**సమాధిచెట్టి :** భార్యాభర్తలు ధనదాహంవల్ల ఇతడిని చంపబోగా దేవిని ధ్యానించి ఆత్మజ్ఞానం పొందిన వైశ్యుడు. దేవి కృపను గురించి వ్యాసుడు జనమేజయుడికి చెప్పి సురధుడనురాజు, సమాధి చెట్టి అను యిరువురూ దేవిని ప్రార్థించి ఎలా ఆత్మజ్ఞానం పొందారో వివరించాడు.

స్వారోచిష మనువు కాలంలో సురధుడనే రాజు కోలా పురాన్ని పాలించేవాడు. అతడు సత్యవంతుడు. పర్వత ప్రాంత తక్కువ కులంవారు ఇతడి ప్రసిద్ధ సైన్యమును ఓడించగా ఇతడు అడవికి వెళ్ళి సమేధసుని ఆశ్రమంలో తలదాచుకున్నాడు. అయినా తన భార్యాపిల్లల్ని గురించిన ఆలోచన పోలేదు. ధనాగారంలోని ధనం దుర్విని యోగమౌతుందేమోనని చింతించేవాడు. అదే సమయంలో ఆ ఆశ్రమానికి మరో మనిషి వచ్చాడు. రాజు అతడ్ని గురించి అడగగా నేను సమాధి చెట్టియారనని, నా భార్యాపిల్లలు ధనంకోసం వేదించి నన్ను చంపబోగా ఇచటికి వచ్చానని చెప్పాడు. అప్పుడు

సుమేధసుడు వీరిద్దరిని దేవిని గూర్చి ధ్యానించమని మీ కోరికలు నెరవేరతాయని చెప్పగా రాజు, సమాధి చెట్టి దేవిని గూర్చి నాల్గు సంవత్సరాలు ధ్యానం చేసి చివరకు ఓ గుండం తవ్వి తమ శరీర భాగాలు కత్తిరించి ఆ యజ్ఞగుండంలో పడవేస్తుండగా దేవి ప్రత్యక్షమై రాజుని తన రాజ్యానికి వెళ్ళమని చెప్పగా రాజు తన రాజ్యానికి వెళ్ళి తిరిగి సుఖంగా రాజ్య పాలన చేశాడు. సమాధిచెట్టి ఆత్మజ్ఞానం కోరగా దేవి ప్రసాదించగా అతడు దేవిని ధ్యానిస్తూ భవబంధాలు మరచి జీవితం గడిపాడు. – *దేవీ భాగవతం.*

**సమివింజయుడు :** యాదవుల్లో రథంపై వుండి యుద్ధం చేయగల ఏడుగురు వీరుల్లో ఒకడు. – *మహాభారతం.*

**సమీచి :** ఓ దేవకన్య. ఈమె వర్గకు సహచరి.
– *చూ॥ వర్గ.*

**సమీచి 2 :** చూ॥ లత.

**సముడు :** ధృతరాష్ట్రుడి వందమంది కొడుకుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో భీముడితణ్ణి వధించాడు.
– *మహాభారతం.*

**సముద్రవేగుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు.
– *మహాభారతం.*

**సముద్రసేనుడు :** ఓ క్షత్రియరాజు. తెలివైనవాడు. అర్థశాస్త్ర పారంగతుడు. ఇతడు కాళీయుడను అసురుని పునర్జన్మ. తూర్పురాజ్యాల జైత్రయాత్రలో భీముడితణ్ణి ఓడించాడు. మహాభారత యుద్ధంలో ఇతణ్ణి పాండవులు వధించారు. – *మహాభారతం.*

**సముద్రి :** ప్రాచీనబర్హి భార్య. ప్రచేతసుల తల్లి.
– *మత్స్య పురాణం.*

**సముద్రుడు :** సముద్రం. సగరుని 60,000 పుత్రులు యాగాశ్వం కొరకు తవ్వగా ఏర్పడింది. అందుకని దీన్ని సాగరమన్నారు. ఇతడు సగరుని పుత్రుడుగా వుండటానికి అంగీకరిస్తాడు. ఇతడు బ్రహ్మని, కశ్యపుణ్ణి తడుపుతాడు. బ్రహ్మ ఇతణ్ణి రాజుగా పుట్టమని చెప్పి అప్పుడు కూడా గంగే భార్య అవుతుందని చెప్తాడు. – *హరివంశం.*

**సముద్రోన్మాదుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. – *మహాభారతం.*

**సమూహుడు :** ఓ విశ్వదేవుడు. పితృగణాలలోనివాడు.
– *మహాభారతం*

**సమేడి :** సుబ్రహ్మణ్యస్వామి అనుచరుడు.
– *మహాభారతం*

**సమృద్ధి :** ధృతరాష్ట్రుని కుటుంబంలో జన్మించిన ఓ నాగు. జనమేజయుని సర్పయాగంలో మరణించింది.
– *మహాభారతం.*

**సమ్మర్దనుడు :** వసుదేవుడు దేవకికి జన్మించిన పుత్రుల్లో ఒకడు. – *భాగవతం*

**సమ్రాట్టు :** స్వాయంభవు మనువు కుమారుడైన ప్రియవ్రతుని ఇద్దరు కుమార్తెలలో ఒకరు. రెండవ కుమార్తె కుక్షి. – *విష్ణు పురాణం*

**సమ్మిలేయుడు :** పూరువంశంలోని ఒకరాజు. భద్రాశ్వుని 10 మంది కొడుకుల్లో ఒకడు. – *అగ్నిపురాణం.*

**సర :** పార్వతి మరోపేరు.

**సరకతీర్థం :** కురుక్షేత్రంలోని ఓ పుణ్యస్థలం. చతుర్థశి రోజున ఇచట శివుడ్ని ప్రార్థిస్తే కోర్కెలు తీరి స్వర్గం చేరుతారు. ఈ తీర్థంలోనే రుద్రకోట కొసకుండ తీర్థాలున్నాయి. దీనికి తూర్పున మరో పుణ్యస్థలం నారదునిది. – *మహాభారతం.*

**సరమ :** దేవతల కుక్క. దీని సంతానం శ్యామ, శబల వీరిద్దరు యముడికి దూతలు. వీరికి నాల్గు కళ్లుంటాయి. వీటి సంతానాన్ని సరమేయులంటారు. సరమ అక్రమంగా జనమేజయుడి సోదరుడు దండించాడని జనమేజయుడ్ని శపించింది. సరమబ్రహ్మకొలువులో అతణ్ణి పూజిస్తుంది. ఇది సుబ్రహ్మణ్యుడి పాపాత్మ. గర్భస్త స్త్రీల గర్భాలలో చేరి శిశువుల్ని దొంగిలిస్తుంది. దేవతల వద్ద పాలుత్రాగి ఇంద్రుడికి అబద్ధం చెప్పగా శిక్షిస్తాడు. గోవుల్ని ఫణి ఎక్కడ దాచాడో చూసిరమ్మని సరమను పంపి అందుకు ప్రతిగా ఇంద్రుడు సరమ సంతానానికి జీవన సదుపాయం కల్పిస్తాడు.
– *మహాభారతం.*

**సరయూ నది :** పురాణ ప్రసిద్ధ నది. గంగానది 7 ఉపనదుల్లో ఇదొకటి. ఈ నదిలో స్నానం చేస్తే పాప పరిహారం జరుగుతుంది. ఇది వరుణుని కొలువులో అతణ్ణి పూజిస్తుంది. ఇంద్రప్రస్థం నుండి గిరివ్రజం వెళ్తూ కృష్ణార్జునులు భీముడు ఈ నదిని దాటారు.

ఈ నదిలోని గోతాన వద్ద శ్రీరాముడు నీటిలో మునిగి విష్ణుపథం చేరాడు. అగ్ని జనకునికి ఇది మాతృక. వశిష్టుడు గంగను కైలాసం వెళ్ళకుండా అడ్డుకోగా గంగ చీల్చుకుని ప్రవహించేది సరయూనది వద్దనే. అయోధ్యా నగరం సరయూనది తీరానే వుంది.

– మహాభారతం రామాయణం

**సరస్వతి 1 :** బ్రహ్మ కుమార్తె. బ్రహ్మ హృదయం నుండి కామదేవుడు, కనుబొమ్మలనుండి క్రోధుడు, క్రింది పెదవి నుండి లోభుడు, సరస్వతి బ్రహ్మముఖం నుండి జన్మించారు. బ్రహ్మ సృష్టికి సిద్ధపడి ధ్యానంలో వుండగా సత్యగుణం పెల్లుబుకుతుండగా ఓ బాలిక జన్మించగా ఎవరునీవు అని బ్రహ్మ ప్రశ్నించాడు. నేను నీ నుండి జన్మించాను. నా బాధ్యతలేమిటని అడిగింది. బ్రహ్మ నీ పేరు సరస్వతి. జ్ఞానుల పెదాల పైన ఒక రూపంలో, నదిగా మరోరూపంలో నాతో మూడవ రూపంలో ఉండమని చెప్పాడు.

– *బ్రహ్మపురాణం.*

కుంభకర్ణుడిని తప్పుదారిపట్టించింది. కుంభకర్ణుడు తీవ్ర తపస్సు చేసి వరము కోరుకోగా బ్రహ్మ ఆజ్ఞపై అతడు నిర్దేవత్వం కావాలని మనసులో అనుకోగా సరస్వతి అతడి పెదాలపై వుండి నిద్రావత్వ అన్పించింది.

*సరస్వతి నదియై బడబాగ్నిని సముద్రమునకు చేర్చుట:* భార్గవులకు హేహయులకు మధ్య విభేదాలు వచ్చి ఔర్వుడు బడబాగ్నిగా మారి లోకాలను దహించి వేస్తుంటే మహావిష్ణువు సరస్వతిని ఆ బడబాగ్నిని సముద్రంలో దాచి రమ్మనగా నేనస్వతంత్రురాలను. నా తండ్రి అను మతి లేనిదే ఏదీ చెయ్యలేననగా దేవతలు బ్రహ్మను కోరిరి. బ్రహ్మ ఆజ్ఞపై సరస్వతి బడబాగ్నిని తనలో దాచుకొని ఉత్తరదిక్కుగా పయనించి సముద్రంలో దాచింది.

*సరస్వతి బ్రహ్మ భార్యయగుట :* బ్రహ్మకు సరస్వతి, సావిత్రి, గాయత్రి అను ముగ్గురు భార్యలని పురాణాలన్నీ పేర్కొంటుండగా మత్స్యపురాణం ఆ ముగ్గురూ ఒకరేనని చెప్తోంది.

మత్స్యపురాణ కథనం : బ్రహ్మ తన శక్తితో ఓ స్త్రీని సృష్టించాడు. బ్రహ్మతానే ఆమె ప్రేమలో పడగా ఆమె కుడివైపుకి తిరిగింది. అప్పుడు బ్రహ్మ కుడివైపున ఓ ముఖం ఏర్పడింది. అతడి చూపులనుండి తప్పించుకోవడానికి మరోవైపుకు తిరగగా ఆ రెండువైపులా బ్రహ్మ ముఖాలేర్పడగా ఆమె ఆకాశంలోకి దూకగా బ్రహ్మతలపై మరో ముఖం ఏర్పడగా ఆమె తప్పించుకోలేక బ్రహ్మను వివాహమాడి 100 సంవత్సరాలు కాపురం చేయగా స్వాయంభవుడు జన్మించాడు.

*సరస్వతి విగ్రహం :* సరస్వతి తెల్లని దుస్తుల్లో తెల్లని కమలంపై ఆసీనురాలై చేతిలో రుద్రాక్షలు, పుస్తకం, వీణ చేతిలో ధరించివుంటుంది. ఆమె కూర్చున్న, నిలబడిన, నాట్యం చేస్తున్న రూపాలలో విగ్రహం వుంటుంది.

*ఇతర విశేషాలు :*

ఈ నదీతీరాన వ్యాసుడు తపస్సుచేయగా శుకుడు జన్మించాడు. రుగ్వేదంలో చాలాచోట్ల ఈమెను గూర్చిన వివరణ వున్నది. ఈమె ఇంద్రుని కొలువులో వుంటుంది. త్రిపురాదహనంలో సరస్వతి శివుని రథానికి మార్గం చూపింది.

**సరస్వతి 2 :** ఉత్తర భారతదేశంలో గంగానదికి ఓ ఉపనది. పురాణకథకై – *చూ॥ సరస్వతి 1.*

*ఇతర విశేషాలు :*

మతినారుడు సరస్వతీ నదీ తీరంలో తపస్సు చేయగా ఆమె ప్రత్యక్షమయ్యింది. మతినారుడామెను వివాహమాడగా తంసుదు వారికి జన్మించాడు. ప్లక్షవృక్షం దీని జన్మస్థానం. దీని నీటిని పీలిస్తే పాపప్రక్షాళన జరుగుతుంది. పాండవులు అరణ్యవాస సమయంలో ఈ నదిని దాటారు. సరస్వతీ పరీవాహక ప్రాంతంలో శ్రీకృష్ణుడు యజ్ఞం చేశాడు. కామ్యకవనం ఈ నదీ తీరంలోనే వుంది. దధీచుని ఆశ్రమం ఈ నదీ తీరంలోనే వుంది. అగ్నిపుట్టుకకు సరస్వతి కూడా మాతృక. అర్జునుడు సాత్యకి కుమారుడిని ఈ ప్రాంతానికి రాజుని చేశాడు. శ్రీకృష్ణుని 16000 మంది భార్యలు సరస్వతీ నదిలో దూకి మరణించారు.

– *మహాభారతం*

★ సరస్వతి, గంగ, లక్ష్మి ఒకరినొకరు శపించు కున్నారు. చూ॥ గంగ.

**సరస్వతి 3 :** మనువు భార్య. – *మహాభారతం*

**సరస్వతి 4 :** దధీచి భార్య. వీరికి జన్మించినవాడు సారస్వతుడు. – *మహాభారతం*

**సరస్వతీ సంగమం :** ఓ పుణ్యస్థలం. బ్రహ్మ ఇతర దేవతలు ఇచ్చట విష్ణువును పూజించారు. ఇచ్చట స్నానం చేస్తే బ్రహ్మలోకం చేరతారు. – *మహాభారతం.*

**సరస్వతీ సాగరసంగమం :** సరస్వతీనది సముద్రంలో కలిసే స్థలం. ఇది పుణ్యస్థలమయ్యింది. దక్షుని శాపవ శమున కాంతిని కోల్పోయిన చంద్రుడు ఇచట స్నానం చేసి తిరిగి తన కాంతిని పొందాడు. – *చూ॥ చంద్రుడు.*

**సరస్వత్యరుణాసంగమం :** ఓ పుణ్యస్థలం. కురుక్షేత్రంలో వుంది. ఇచ్చట స్నానంచేసి మూడు రాత్రులు ఉపవాసం వుంటే బ్రహ్మహత్యాపాతకం నశిస్తుంది. – *మహాభారతం*

**సరిద్వీపుడు :** గరుడుని సంతానంలో ప్రముఖుడు. – *మహాభారతం.*

**సర్గ/సృష్టి :** మొట్టమొదటి సృష్టి బ్రహ్మ. రెండవ సృష్టి భూతసర్గ, మూడవది వైకారిక సర్గ. ఈ మూడింటిని ప్రకృతిసృష్టి అంటారు. నాల్గవది ముఖ్యసర్గ. ఇది కదలనిది. అనగా భౌతికమైనది. ఐదవది తిర్యగ్యోని సృష్టి. ఆరవది ఊర్ధ్వస్త్రోతసు అనగా దేవసర్గ. ఏడవది ఆర్యాకస్త్రోత్ర. దీన్నే మనుసర్గ అంటారు. ఎనిమిదవది అమరావసర్గ. అది తాత్విక సాత్వికం. అనగా మూడు ప్రకృతిసర్గలు, 5 వైకృత సర్గలు కలసి ఎనిమిది. తొమ్మిదవది కౌమార సర్గ. అది ప్రకృతివైకృత సర్గల కలయిక. ఈ తొమ్మిది సర్గలు సృష్టికి మూలకారకాలు. – *అగ్నిపురాణం*

**సర్పదేవి :** నాగతీర్థమని కూడా పిలుస్తారు. ఇది కురుక్షేత్రంలో వుంది. ఇచ్చట స్నానం చేస్తే అగ్నిస్తోమ యజ్ఞం చేసిన ప్రతిఫలం లభిస్తుంది. – *మహాభారతం.*

**సర్పబలి :** దక్షిణభారతదేశంలో హిందువులలోని ఓ కులం వారు సర్పాలు శాంతించడానికి చేసే అర్పణం. పురాణపరంగా దీనికి, జనమేజయుని సర్పయాగంలో తప్పించుకున్న తక్షకునికి సంబంధం వుంది.

**సర్పమాలి :** దైవిక శక్తులుగల ఓ మహర్షి. ఇతడు శ్రీకృష్ణుడు హస్తినాపురం వెళ్ళే దారిలో కృష్ణుడితో సంభాషించాడు. – *మహాభారతం*

**సర్పయాగం 1 :** చూ॥ జనమేజయుడు.

**సర్పయాగం 2 :** రురుని ప్రేయసియగు ప్రమద్వరను సర్పమొకటి కరచుటచే మరణించగా సర్పములపై పగబట్టి రురుడు పాములను వెదకివెదకి చంపుచుండె డివాడు. – *మహాభారతం*

**సర్వ :** పురాణ ప్రసిద్ధమైన ఒక నది. – *మహాభారతం*

**సర్వకర్ముడు :** సౌదాసుడి కొడుకు. పరశురాముడు క్షత్రియుల్నందర్ని వధిస్తుంటే పరాశరమహర్షి ఇతణ్ణి రక్షించాడు. – *మహాభారతం*

**సర్వకామదుఘ :** సురభి కూతురు. ఇది ఉత్తర దిక్కున వుంటుంది. – *మహాభారతం*

**సర్వకాముడు :** ఋతుపర్ణుడను రాజు కొడుకు. – *భాగవతం*

**సర్వగతుడు :** కాళీ భీమసేనుల కొడుకు. – *భాగవతం*

**సర్వగుడు :** బలంధర భీమసేనులకు జన్మించిన పుత్రుడు. – *మహాభారతం*

**సర్వతేజుడు :** ధ్రువుని కుటుంబంలో జన్మించిన రాజు. ఇతని తండ్రి వ్యుష్ఠుడు. – *మహాభారతం*

**సర్వతోభద్రం :** వరుణుడి భవనం పేరు. – *మహాభారతం*

**సర్వదమనుడు :** శకుంతల దుష్యంతుల కుమారుడైన భరతుని పేరు. – *చూ॥ భరతుడు*

**సర్వదేవతాతీర్థం :** కురుక్షేత్రంలోని ఓ పవిత్ర స్థలం. ఇచ్చట స్నానం చేస్తే 1000 గోదానాల ప్రతిఫలం లభిస్తుంది. – *మహాభారతం*

**సర్వపాపవిమోచన కూపం :** ఇదో నుయ్యి. పాపాలను హరిస్తుంది. ఇందులో స్నానం చేస్తే దురదృష్టం దరిచేరదు. – *మహాభారతం*

**సర్వర్థి :** వత్సదుడి భార్య. పుష్పార్ణుడు, చంద్రకేతుడు మొ॥ వారు ఈమె కొడుకులు.

**సర్వర్తుకం :** రైవతక పర్వతం దగ్గరలోగల ఓ సుంద రారణ్యం. – *మహాభారతం*

**సర్వసారంగం :** ధృతరాష్ట్రుని కుటుంబంలో జన్మించిన ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. – *మహాభారతం*

**సర్వసేనుడు :** కాశీరాజు. ఇతని కుమార్తె సునందను భరత చక్రవర్తి వివాహమాడాడు. భుమన్యుడు వీరికి జన్మించాడు.

**సర్పాలు :** కద్రూకశ్యపుల సంతతి సర్పాలు. వీరిలో శేషువు విష్ణువుకు తల్పమయ్యెను. వాసుకి మందర పర్వతమునకు అల్లికై క్షీరసాగరమదనమునకు తోడ్ప డెను. కొందరు శివునికి భూషణములై అతడి మెడకు అలంకారములయ్యెను. సర్పముల తల్లి కద్రువ, ఆమె సవతి వినత పందెముకాసుకొని మోసమున కద్రు గెలిచి వినత కుమారుడైన గరుడునిచే సేవ చేయించు కొని గరుడుడు ఇంద్రలోకమునకు పోయి అమృత మును వారికిచ్చి శాపవిముక్తుడయ్యెను. ఆ అమృతము సేవించబోయి దర్భలను నాకగా సర్పముల నాలుకలు చీరుకొని పోయెను. ఆ తరువాత గరుడునికి భయపడి వేరు లోకములో జీవించెడివి. అదియే నాగ లోకము.

**సర్పాస్యుడు :** ఓ రాక్షసుడు. ఖరదూషణుల సైన్యానికి అధిపతి. ఇతడు పంచవటి వద్ద రామలక్ష్మణులతో యుద్ధము చేసెను. ఇతడుగాక మరి 11 మంది సైన్యాధిపతులు ఖరదూషణలకు కలరు.
– రామాయణం

**సర్వాంతం :** గరుడుని సంతతిలో జన్మించిన ఓ పక్షి.
– మహాభారతం

**సర్పిర్మాలి :** ధర్మజుని కొలువులో వున్న ఓ మహర్షి.
– మహాభారతం.

★**సర్పుడు 1 :** త్వష్ట కుమారుడు. త్వష్ట కుమారులు ఏకాదశరుద్రులు. – అగ్నిపురాణం.

**సర్పుడు 2 :** శ్రీకృష్ణుని మరోపేరు.

**సవనుడు 1 :** స్వాయంభవ మనువు కుమారుడైన ప్రియ వ్రతుని కొడుకు. ఇతని తల్లి సురూప. ఇతడుకాక ఈమెకు 9 మంది పుత్రులు.

సవనుడి మృత శరీరంనుండి ఏడుగురు పుత్రులు జన్మించారు. వారిని మరుత్తులని పిలుస్తారు. *మరుత్తుల జన్మకథ :* సవనుడు సునాభుని కుమార్తె సువేదను వివాహమాడాడు. సంతానం కలుగక ముందే సవనుడు మరణించగా సువేద అతని మృత శరీరంపైబడి దుఃఖించింది. దాన్ని దహనం చేయ కుండా అడ్డుకుంటుంటే ఆకాశవాణి నీవు పతివ్రతవే అయితే నీ భర్త దహన చితిపై నీవు దూకి మరణించ మనగా ఆమె అలాగే చేయగా భార్యాభర్తలిద్దరూ సజీవులై ఆకాశంలోకి ఎగిరారు. అచట వారిద్దరూ రతిక్రీడ సలపగా అతని వీర్యం భూమిపై పడింది. వీరిద్దరూ బ్రహ్మలోకం చేరారు. ఆ వీర్యం అమృతమ నుకొని సవనుడి సోదరుల భార్యలు వారి భర్తల అంగీకారంతో దాన్ని సేవించగా వారికి ఏడుగురు పుత్రులు జన్మించారు. భర్తలు వీరిని వదిలివేశారు. ఆ పిల్లల ఏడ్పులు దిక్కులు పిక్కటిల్లగా బ్రహ్మ ప్రత్యక్షమై వీరిని ఆశీర్వదించి మహత్తులని నామ కరణం చేశాడు. మొట్టమొదటి స్వాయంభువ మన్వంతరంలో వీరే మరుత్తులు.

**సవనుడు 2 :** భృగుమహర్షి ఏడుగురు కొడుకుల్లో ఒకడు. తక్కిన ఆరుగురు చ్యవనుడు, వజ్రశీర్షుడు, శుచి, ఔర్యుడు, శుక్రుడు, విభువు.

**సవర్ణ :** ప్రాచీనబర్హి అనే మహర్షి భార్య. సముద్రుడి కూతురు. వీరికి 10 మంది పుత్రులు. వారిని ప్రచేత సులంటారు. అందరూ ధనుర్విద్యా పారంగతులే. వీరంతా 10,000 సంవత్సరాలు సముద్రం అడుగున వుండి తపస్సు చేశారు. – విష్ణుపురాణం.

**సవితుడు :** కశ్యప ప్రజాపతికి అదితివల్ల జన్మించిన 12 మంది కుమారుల్లో ఒకడు. వీరిని ఆదిత్యు లంటారు. అంటే సవితుడు కూడా ద్వాదశాదిత్యుల్లో ఒకడు. – చూ॥ ద్వాదశాదిత్యులు

**సవ్యసాచి :** అర్జునుడి మరోపేరు.

**సవ్యసివ్యుడు :** సింహిక విప్రచిత్తిలకు జన్మించిన కుమా రుల్లో ఒకడు. పరశురాముడు ఇతడితో సహా అసు రుల్ని వధించాడు. – బ్రహ్మాండపురాణం.

**సవ్యుడు :** అంగిరసుని కుమారుడు. సవ్యుడు ఇంద్రుడే. అంగిరసుడు ఇంద్రుడితో సమానుడైన కుమారుడు కావాలని దేవతలను ప్రార్థించగా ఇంద్రుడు తనతో సమానుడు మరొకరు వుండటం ఇష్టంలేక ఇంద్రుడే అంగిరసుడి కుమారుడుగా జన్మించాడు. – ఋగ్వేదం.

**ససేమిరా :** విశాల నగరాధీశుడు నందుడికి జయంతు డనే కొడుకుండేవాడు. అతడోసారి వేటకు వెళ్ళి పులికి

★ మహాభారతం సర్పుడు ఏకాదశ రుద్రుల్లో ఒకడని బ్రహ్మ మునిమనుమడని, స్థాణుడి కొడుకని పేర్కొంది.

దడిచి చెట్టు ఎక్కగా భల్లూకం అతణ్ణి రక్షిస్తుంది. పులి భల్లూకాన్ని రాజకుమారుడ్ని తనకు వదిలితే భల్లూకాన్ని వదలిపెడతానన్నా అంగీకరించదు. అతడు నిద్రపోతుంటే భల్లూకం అతడి రక్షణ బాధ్యత తీసుకుంటుంది. రాజకుమారుడు నిద్రలేవగా భల్లూకం విశ్రమించి రాజకుమారుడిని కాపలాకాయమంటుంది. పులి రాజకుమారుడిని భల్లూకాన్ని క్రిందకుతోస్తే వదిలిపెడతాననగా అతడు భల్లూకాన్ని క్రిందకు తోయగా అది చెట్టుకొమ్మను పట్టుకొని వేలాడుతూ రాజకుమారుడిని మతిభ్రష్టుడిగా శపిస్తుంది. అప్పటి నుండి జయంతుడికి 'ససేమిరా' అనే మాట తప్ప ఏదీరాదు. చివరకు శతనందుడనే మంత్రివల్ల మతిస్థిమితం కల్గుతుంది. – *కలి చరిత్ర*

**సహ :** ఓ దేవకన్య. అర్జునుడిని ఇంద్రలోకంలోకి ఆహ్వానించినవారిలో ఒకదు. – *మహాభారతం*

**సహజన్య :** ఆర్గురు ఉత్తమ అప్సరస్త్రీలలోఒకరు. తక్కిన ఐదురుగు ఊర్వశి, పూర్వచిత్తి, మేనక, ఘృతాచి, విశ్వాచులు. ఈమె కుబేరుడి ఆస్థానంలో నర్తకి. – *మహాభారతం*

**సహజిత్తు :** భరతవంశంలోని ఒకరాజు. మహాభోజుని కుమారుల్లో ఒకడు. – *భాగవతం*

**సహజుడు :** ఓ చేదిరాజు. – *మహాభారతం*

**సహదేవి :** దేవకుడి కూతురు. వసుదేవుడి భార్య. – *భాగవతం*

**సహదేవుడు 1 :** పాండవులలో ఐదవ వాడు. పాండురాజు క్షేత్రబీజమున మాద్రియందు అశ్వనీ దేవతలకు జన్మించిన వాడు. పాండురాజు మరణా నంతరం మాద్రి అతనితోపాటు సహగమనం చేయగా ఇతడిని, నకులుడిని కుంతియే హస్తినలో పెంచింది. లక్కగృహ దహనానంతరం ఇంద్రప్రస్థం రాజధానిగా పాండవులు పాలనచేశారు. ధర్మజుడు జూదంలో ఓడిపోయిన తర్వాత ఇతడు ఇతర సోదరులతో విరాటుని కొలువులో తంత్రిపాలుడను పేరుతో వున్నాడు.

*ఇతర విశేషాలు :* ఇతని జీవితాన్ని పెద్దవాళ్ళకోసం త్యాగం చేశాడు. గురుదక్షిణగా అర్జునుడు ద్రుపదునితో పోరాడినపుడు అర్జునుని రథచక్రాలకు నకులునితోపాటు రక్షణగా నిలబడ్డాడు. ఇతనికి ద్రౌపదివల్ల శృతసేనుడు జన్మించాడు. రుద్రదేశ రాజైన ద్యుతిమానుడి కుమార్తె విజయను వివాహమాడాడు. వారికి సుహోత్రుడను పుత్రుడు జన్మించాడు. ధర్మజుని ఆజ్ఞపై దక్షిణదేశాలను జయించాడు. ఇతడు లక్షాధిపతి. విభీషణుడి వద్ద నుండి కప్పం కట్టించడానికి ఘటోత్కచుణ్ణి నియమించాడు. శకునిని చంపుతానని ప్రతిజ్ఞ చేశాడు. మహాభారతయుద్ధంలో త్రిగర్త యువరాజు నిర్మితుడిని శల్యుడి కుమారుడిని, శకుని కుమారుడు తటాకుడిని, శకునిని సంహరించాడు. ఇతడు ఆశ్వినేయుడు, అశ్వనీసుత, భరతశార్దుల భరతసత్తమ, కౌరవ్య, కురునందన, మాద్రిపుత్ర, మాద్రేయ, నకులానుజ, పాండవ, పాండునందన, తంత్రిపాల, అనే పేర్లతో మహాభారతంలో పేర్కొనబడ్డాడు. – *మహాభారతం*

**సహదేవుడు 2 :** ఇంద్రుని కొలువులోని ఓ రుషి. – *మహాభారతం*

**సహదేవుడు 3 :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. ఇతడు యముని కొలువులో అతణ్ణి పూజించేవాడు. – *మహాభారతం*

**సహదేవుడు 4 :** జరాసంధుని కొడుకు. కంసుని భార్యయైన అస్తి, ప్రాప్తి ఇతని సోదరీమణులు. ఇతడు ద్రౌపదీ స్వయంవరంలో పాల్గొన్నాడు. జరాసంధుని మరణానంతరం శ్రీకృష్ణుడితణ్ణి మధురకు రాజును చేశాడు. మహాభారతయుద్ధంలో అక్షౌహిణి సైన్యంతో పాండవులకు సహాయపడ్డాడు. ద్రోణుడితణ్ణి సంహరించాడు. – *మహాభారతం*

**సహదేవుడు 5 :** ఓ రాక్షసుడు. ధూమాక్షుడి కొడుకు, క్రుశాశ్వుడి తండ్రి. – *భాగవతం*

**సహదేవుడు 6 :** సూర్యవంశపురాజు. ధర్మందనుడి కొడుకు; జయత్సేనుడి తండ్రి. – *భాగవతం*

**సహదేవుడు 7 :** సూర్యవంశపు రాజు. సుదాసుడి కొడుకు; సోమకుడి తండ్రి. – *భాగవతం*

**సహభోజ :** గరుడుని వంశంలోని ఓ పక్షి. – *మహాభారతం*

**సహస్రకంఠుడు :** దశకంఠరావణుడి సోదరుడు. పుష్కర ద్వీపంలో వుండేవాడు. ఇతణ్ణి సీత వధిస్తుంది. దశకంఠ రావణుని వధించిన రాముని పొగడుచుండగా

సీత అదియేమి గొప్ప, అతని అన్న సహస్రకంఠుడు న్నాడనగా రామలక్ష్మణులు అతనితో యుద్ధముచేసి మూర్ఛపోగా సీత అతడిని సంహరించెను.
- కంభ రామాయణం

**సహస్రచిత్యుడు :** కేకేయ రాజు. శతయూపుడి తాత. రాజ్యాన్ని తన అన్న కుమారునికి అప్పగించి తపస్సు చేయడానికి అరణ్యాలకు వెళ్ళాడు. తన శరీరాన్ని ఓ బ్రాహ్మణుడికిచ్చి స్వర్గం చేరాడు.

**సహస్రజిత్తు :** భరతవంశంలోని ఒకరాజు. మహాభోజుని కొడుకు. - భాగవతం

**సహస్రజ్యోతి :** సమ్రాట్టుకు జన్మించిన ముగ్గురు కొడుకుల్లో ఒకడు. ఇతనికి 10 లక్షలమంది సంతానం.
- మహాభారతం

**సహస్రనామ :** విష్ణువు 1000 పేర్లను చెప్పే శ్లోకాలు. శివునికి పార్వతికి సహస్రనామాలున్నా విష్ణువు సహస్రనామాలే ప్రసిద్ధి చెందాయి.

**సహస్రపాదుడు :** ఓ రుషి. మరో రుషి ఖగముడి శాపం వల్ల సర్పంగా మారగా రురు చక్రవర్తి తిరిగి రుషిగా మార్చాడు. రురు చక్రవర్తి సర్పయాగం గురించి సహస్రపాదుడివల్ల తెలుసుకున్నాడు. - మహాభారతం

**సహస్రబాహువు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు.
- మహాభారతం

**సహస్రముఖ రావణుడు :** చూ॥ సహస్రకంఠుడు.

**సహస్రవాక్కు :** ధృతరాష్ట్రుని 100 మంది కొడుకుల్లో ఒకడు. - మహాభారతం

**సహస్రాక్షుడు :** పాండుదేశపు రాజు. స్త్రీ లోలుడు. తుంగభద్రానదిలో 100 మంది స్త్రీలతో దిగంబరంగా స్నానం చేస్తుండగా దుర్వాసుడక్కడికి వస్తాడు. దుర్వాసుణ్ణి గౌరవించకపోవడంతో రాక్షసుడవు కమ్మని శపిస్తాడు. ఇతడే తృణావర్తుడిగా జన్మించి శ్రీకృష్ణుడి తాడనంతో శాపవిమోచనమౌతుంది. - బ్ర.వై.

**సహస్రానీకుడు :** చంద్రవంశపు రాజుల్లో ఒకడు.
- చూ॥ ఉదయనుడు

**సహిష్ణువు :** పులహప్రజాపతి ముగ్గురు కుమారుల్లో ఒకడు. ఇతని తల్లి క్షామ. ఇతని సోదరులు కర్ధమ, ఉర్వరీయానుడు.

**సహుడు 1 :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. మహాభారతయుద్ధంలో భీముడితణ్ణి వధించాడు.
- మహాభారతం

**సహుడు 2 :** ఓ శక్తివంతమైన అగ్ని.
- మహాభారతం

**సహోఢ :** కన్యగావుండగా గర్భిణియై వివాహమైన తర్వాత ప్రసవించిన స్త్రీ. - చూ॥ పుత్రులు

**సహ్యం :** ఓ పర్వతం. సప్తకుల పర్వతాల్లో ఇదొకటి. నహుడొకసారి అప్సరసలతో దీనిపై విహరిస్తాడు. సీతను వెదకడానికి వెళ్లిన వానరాలు దీన్ని అధిరోహిస్తారు. - మహాభారతం

**సహ్యుడు :** భరతవంశపు రాజు. బలి భార్యకు దీర్ఘతమసుడివల్ల ఆరుగురు కొడుకులు జన్మిస్తారు. వారిలో ఇతడొకడు. అంటే ఇతడు బలిక్షేత్రజ పుత్రుడనబడతాడు. - భాగవతం

**సాకేతపురి :** అయోధ్యకు మరోపేరు. శ్రీరాముని రాజధానీ నగరం. - రామాయణం

**సాగరకుడు :** సాగరమనే ప్రాంతంలో నివసించిన ఓ క్షత్రియరాజు. ఇతడు ధర్మజుని రాజసూయ యాగంలో పాల్గొన్నాడు. - మహాభారతం

**సాగరోదకం :** సముద్రంలోని పుణ్యోదకం. ఇచ్చట స్నానం చేస్తే గాలిలో నడిచే రథంపై స్వర్గం చేరతారు.
- మహాభారతం

**సాగరం :** కన్పించని అశ్వంకోసం సగరుని పుత్రులు 60,000 మంది భూమిని తవ్వగా ఏర్పడింది కనుక అలా ఏర్పడిన సముద్రాన్ని సాగరం అన్నారు.
- చూ॥ సగరుడు

**సాగ్నులు :** బ్రహ్మ పుత్రులైన పితృగణం. అగ్నిష్వత్తసులు, బర్హిషదసులు, అనగ్నిసులు, సాగ్నులు, బ్రహ్మకు జన్మించిన పితృగణాలు. - అగ్నిపురాణం

**సాతవాహనుడు :** ఒకరాజు. బృహత్కథా గ్రంథరచయిత గుణాఢ్యుడు ఇతని మంత్రి. చూడుము: గుణాఢ్యుడు

**సాతుడు :** వైశ్రావణుడి స్నేహితుడు. ఓ యక్షుడు. ఇతడు శాపగ్రస్తుడు. చూ॥ దీపకర్ణి

**సాత్యకి (యుయుధానుడు) :** ఓ యాదవ వీరుడు. శ్రీకృష్ణునికి ఆప్తుడు. వృష్ణి వంశజుడు. యుధాజిత్తు

చిన్నకుమారుడు శాని. ఇతడి మనుమడు సాత్యకి. ఇతడి అన్న అనమిత్రుడికి ప్రసేనుడు, సత్రాజిత్తు, శ్వఫల్కుడు, అక్రూరులు కుమారులు. వీరంతా యాదవ వీరులే. ఇతడు మరుద్దేవతల అంశ. అపౌరుషకార్యములను చేయనిచ్చగించడు. ఇతడు ద్రౌపది స్వయంవరమున పాల్గొనెను. అర్జునుడు సుభద్రను వివాహమాడినపుడు ఇతడు యాదవుల తరపున ఇంద్రప్రస్థమునకు కట్నకానుకలు తీసుకొనివెళ్ళెను. కౌరవులు క్రూరులని సంధిపొసగదని యుద్ధమే శరణ్యమని ముందుగా బలరాముని ముందు పేర్కొనెను. ఇతడు గొప్ప సైన్యంతో పాండవుల పక్షాన చేరెను. ఇతడు మొదటిరోజు యుద్ధంలో కృతవర్మతో పోరాడాడు. భీష్ముని బాణాగ్ని నుండి అర్జునుని రక్షించాడు. అలంబసుడిని సంహరించాడు. ధృష్టద్యుమ్నుడ్ని ఒకసారి ద్రోణుడినుండి రక్షించాడు. వ్యాఘ్రదత్తుడ్ని సంహరించాడు. సుదర్శనుణ్ణి సంహరించాడు. భూరిశ్రవసుణ్ణి సంహరించాడు. సోమదత్తుణ్ణి. సంహరించాడు. మరణించిన ద్రోణుడి శిరస్సు ఖండించిన ధృష్టద్యుమ్నుడిపై తన గధతో వెళ్లగా భీమసహదేవులు వారించారు. విందానువిందుల్ని సంహరించాడు. సాళ్వరాజును వధించాడు. అభిమన్యుని కర్మకాండలు నిర్వహించాడు. కృతవర్మను చంపినపుడు శ్రీకృష్ణుడు అడ్డుపడినా మరెందరినో సంహరించాడు. సరస్వతీ నదీ పరీవాహక ప్రాంతానికి అర్జునుడితడి కుమారుడిని రాజును చేశాడు. – మహాభారతం

శ్రీకృష్ణుడు చేసిన ప్రతి యుద్ధంలో సాత్యకి అతనికి తోడున్నాడు. బాణాసురుడితో యుద్ధంలో జరాసంధునితో యుద్ధంలోను ఇతడు కృష్ణుడికి సహాయ పడ్డాడు. – భాగవతం

**సాత్వతి :** శ్రీకృష్ణుడి మేనత్త. ధనుఘోషుడి భార్య. ఈమెకు శిశుపాలుడు అవసరమున్న అవయవాల కన్నా ఎక్కువ అవయవాలతో జన్మించగా ఎవరు ఇతణ్ణి ఎత్తుకున్నపుడు ఆ అవయవాలు పోతాయో వారి చేతిలో ఇతడికి మరణమున్నదని తల్లికి తెలుపగా శ్రీకృష్ణుడి తణ్ణి ఎత్తుకున్నపుడు అవి పోతాయి. ఆమె శ్రీకృష్ణుడ్ని వేడుకోగా 100 తప్పులు క్షమిస్తాననని మేనత్త సాత్వతికి మాటిస్తాడు. – భాగవతం

**సాత్వతుడు 1 :** యదువంశంలోని ఒక రాజు. దేవక్షత్రుని కుమారుడు. సాత్వతుడికి ఏడుగురు కుమారులు. వారు భజ, భజి, దివ్య, వృష్టి, దేవపుష్ఠ, అనంతక, మహాభోజులు. – మహాభారతం.

**సాత్వతుడు 2 :** శ్రీకృష్ణుని మరోపేరు.

**సాత్వికుడు :** ఓ బ్రాహ్మణుడు. తన తపశ్శక్తివల్ల స్వర్గం చేరి తర్వాత అతిశయంవల్ల రాక్షసుడయ్యాడు.

గౌడదేశంలో సాత్వికుడనే బ్రాహ్మణుడు తపస్సుచేసి స్వర్గం చేరతాడు. ఆ తర్వాత ఇతడు జంబూద్వీపంలో ఇతర రుషులతో కలసి జీవిస్తూ వారితో అతిశయంగా ప్రవర్తించగా రాక్షసుడివికమ్మని శపిస్తారు. శాపవిమోచనం కోరగా రామునికథ విన్నప్పుడు శాపవిమోచనం కల్గుతుందని చెప్తారు.

శతృఘ్నుడు అశ్వమేధయాగ సమయంలో అశ్వం వెంటవెళ్ళగా భారతదేశం చివరికి వెళ్ళేసరికి అశ్వం కదలక మొరాయిస్తుంది. హనుమంతుడు తన శక్తి నంతా ఉపయోగించినా కదలకపోగా దీని ఆంతర్యం ఏమిటని శౌనకమహర్షిని అడగగా సాత్వికుడి పూర్వకథ చెప్పి అతనికి రామకథను విన్పించమని సలహా ఇస్తాడు. శతృఘ్నుడు అప్పుడు రామకథను విన్పించగా రాక్షసరూపంలో వున్న సాత్వికుడు శాపవిమోచనం జరిగి అశ్వాన్ని వదలి స్వర్గం వెళ్తాడు. అప్పుడు అశ్వం అచట నుండి తిరిగి నడుస్తుంది. – పద్మపురాణం

**సాద్యస్కం :** రాజర్షులు చేయవలసిన ఓ యజ్ఞం. ఇది ఒకే రోజులో పూర్తిచెయ్యాలి. – మహాభారతం

**సాధువు :** శివుని అవతారం. హిమాలయ మైనక పర్వతాలు తీవ్రమైన తపస్సుచేయగా దేవతలు వాటికి ముక్తి కల్గితే ప్రపంచానికి ముప్పు కల్గుతుందని భావించి శివుణ్ణి ప్రార్థించగా శివుడు సాధువనే బ్రాహ్మణుడుగా వెళ్ళి శివుడ్ని ఖండిస్తూ మాట్లాడి వారు శివుణ్ణి ప్రార్థించడం ఆపాడు. – బ్రహ్మాండపురాణం

**సాధ్య :** సాధ్యుల తల్లి. – చూ॥ సాధ్యులు

**సాధ్యులు :** ఓ గణదేవతలు. వీరు విరాట్ పురుషుడి నుండి జన్మించారు. ఎన్నో పురాణ కథల్లో వీరికి ముఖ్యపాత్ర వుంది. – మహాభారతం.

వీరు దక్షప్రజాపతి మనుమలు. దక్షప్రజాపతికి అసిక్ని వల్ల 60 మంది కుమార్తెలలో 10 మంది ధర్మదేవుడ్ని

వివాహమాడారు. విశ్వదేవులు ధర్మదేవుడికి విశ్వకు జన్మించగా ధర్మదేవుడికి సాధ్యకు సాధ్యులనే దేవగణం జన్మించారు. - విష్ణుపురాణము.

**సామగులు :** వ్యాసుని శిష్యపరంపరలోని ఓ వర్గం.
- చూ॥ *గురు పరంపర*

**సామవేదం :** ఇదో ప్రత్యేకవేదం కాదు. రుగ్వేదంలోని చాలా రుక్కులకు స్వరకల్పన చేయబడింది. రుక్కుల శక్తి సామవేదం కల్పించిన స్వరం మీద ఆధారపడిందని విశ్వసిస్తారు. ఇది భారతీయ సంగీతానికి మూలమని కూడా భావిస్తారు.

**సామం :** చతురోపాయాల్లో ఒకటి.
- చూ॥ *చతురోపాయం*

**సామ్రాజ్ఞి :** ప్రియవ్రతుని కుమార్తె. - బ్రహ్మపురాణం

**సాముద్రకతీర్థం :** అరుంధతీవటంవద్ద గల ఓ పుణ్యస్థలం. ఇచ్చట స్నానం చేసి మూడురోజులు ఉపవాసం వుంటే అశ్వమేథయజ్ఞ ప్రతిఫలం మరియు 1000 గోవుల దానమిచ్చిన ప్రతిఫలం లభిస్తుంది.
- మహాభారతం

**సాముద్ర నిష్కుటం :** భారతదేశంలోని పురాణ ప్రసిద్ధమైన పట్టణప్రాంతం. - మహాభారతం

**సాయణుడు :** వేదాలను పరిపుష్టం చేసిన రుషి. కాలక్రమంలో భాషాభేదాలు వ్యాకరణ భేదాలు వచ్చి వేదార్థం తెలియనపుడు వేదాలను తేలికగా అర్థం చేసుకోవడానికి యాస్కుడు నిరుక్తం వ్రాయగా సాయణుడు 'వేదార్థప్రకాశం' అనే గ్రంథం రచించాడు.

**సారణుడు 1 :** యాదవ వంశంలో జన్మించిన ఓ క్షత్రియుడు. వసుదేవుడు దేవకికి జన్మించాడు. శ్రీకృష్ణుని సోదరుడు. సుభద్ర కట్నకానుకల్ని ఇతడు పాండవులకు తీసుకొని వెళ్ళాడు. ధర్మజుని అశ్వమేథయాగానికి శ్రీకృష్ణుడితోపాటు వెళ్ళాడు. జాంబవతి కొడుకు సాంబుడు స్త్రీ వేషం వేసుకొని మునులను పరిహసించడంలో ఇతనికి ప్రమేయం వుంది.
- మహాభారతం

**సారణుడు 2 :** రావణుని మంత్రుల్లో ఒకడు.
- రామాయణం

**సారమేయాశనం :** ఓ నరకం.

**సారమేయుడు 1 :** భారతదేశంలోని ఒక రాజు. శ్వఫల్కుని కొడుకు. - భాగవతం

**సారమేయుడు 2 :** సరమ అనే కుక్క కొడుకు.
- చూ॥ *సరమ.*

**సారసుడు 1 :** గరుడుని సంతానంలో ఒకరు.
- మహాభారతం

**సారసుడు 2 :** యదువు కొడుకుల్లో ఒకడు. దక్షిణ భారతదేశంలో వేదానదీ తీరంలో క్రౌంచ నగరాన్ని స్థాపించాడు. - హరివంశం

**సారస్వతుడు 1 :** చూ॥ అపాంతరతమసుడు.

**సారస్వతుడు 2 :** ఓ ప్రాచీన రుషి. దధీచి కుమారుడు. ఒకసారి దధీచి దేవకన్య అయిన అలంబుసను చూసి వీర్యస్రావమై అది సరస్వతీనదిలో పడగా ఆ నది ఓ బిడ్డకు జన్మనిచ్చింది. ఇతడు పెరిగి పెద్దవాడై సారస్వతుడిగా ప్రసిద్ధిగాంచాడు. దధీచి మరణానంతరం కరువుకాటకాలు రాగా రుషులంతా ఈ నదీ తీరాన్ని వదలిపోగా సరస్వతీనదీతీరంలో నదిలోని చేపలే ఆహారంగా స్వీకరిస్తూ ధ్యానంచేస్తూ వేదాధ్యయనం చేస్తూ జీవించాడు. 12 సంవత్సరముల తరువాత క్షామం పోయి రుషులంతా తిరిగిరాగా వారికి వేదాలు బోధించే అధ్యాపకుడే లేడు. అప్పుడు సారస్వతుడే వేదవిద్య 60,000 రుషులకు బోధించాడు. అతడు వేదవిద్య బోధించిన ప్రాంతానికి సారస్వత తీర్థం అనే పేరొచ్చింది. తుంగకారణ్యం అనేది దీనికి మరోపేరు. దుర్వాసుని శాపంవల్ల సరస్వతి ఓ బ్రాహ్మణుడి ఇంట జన్మించింది. ఆ బ్రాహ్మణుడు ఆత్రేయ గోత్రీకుడు. ఆమె సారస్వతుడికి జన్మనిచ్చింది. ఆ తర్వాత సరస్వతే వేదాలు బోధించి కురుక్షేత్రానికి పంపింది. అతడు అచ్చట తపస్సు చేసి తైత్తరీయ సంహితను ఓ క్రమ పద్ధతిలో కూర్చి తన శిష్యులకు బోధించాడు. ఆ క్రమపద్ధతే కాలక్రమంలో సారస్వత పాఠంగా ప్రసిద్ధికెక్కింది. - సంస్కార రత్నమాల.

**సారస్వతుడు 3 :** పశ్చిమ భారతదేశంలోని ఓ రుషి. ఇతడు అత్రి కుమారుడు. - మహాభారతం

**సారస్వతుడు 4 :** తుంగకారణ్యంలో ఎందరో శిష్యులకు వేదాలు బోధించిన రుషి. - పద్మపురాణం

**సాలపోతకుడు :** ఇతడొక సర్పరాజు. ఇతడు ఉత్తముని భార్య యగు బహుళను తన మాయాజాలంతో తన భవనమునకు తేగా ఇతని కుమార్తె నంద తన తల్లికి

సవతి యగుట ఇష్టములేక బహుళను దాచెను. ఇతనికి కోపము వచ్చి మూగదికమ్మని కుమార్తెను శపించెను. తుదకు బలాకుడు వచ్చి బహుళను తీసుకొనిపోయి ఆమె భర్తకప్పగించెను.
– మార్కండేయ పురాణం.

**సాలెపురుగు :** చూ॥ శ్రీ

**సాల్వుడు 1 :** ధమఘోషుని కుమారుడు. శిశుపాలుని సోదరుడు. ఇతడు కాశీరాజు కుమార్తె అంబను ప్రేమించగా స్వయంవరం నాడు భీష్ముడు రాజులందరిని జయించి అంబను ఆమె చెల్లెళ్ళను తీసుకు వెళ్ళి ఆమె సాల్వుడిని ప్రేమించిందని తెలిసి అతని వద్దకు పంపగా అతడు ఆమెను వివాహమాడ నిరాకరిస్తాడు. ఇతడు సౌభానగరాన్ని నిర్మించుకుంటాడు. ద్రౌపది స్వయంవరంలో కూడా పాల్గొంటాడు. శిశుపాలుని వధకు ఆగ్రహించి ద్వారకపై దండెత్తి శ్రీకృష్ణుని చేతిలో మరణిస్తాడు. – *భాగవతం.*

**సాల్వుడు 2 :** ముగ్గురు సాల్వులు; నల్గురు మద్రులు వ్యుసితాశ్వుడి మృత శరీరం నుండి భద్రకు జన్మించారు.
– *చూ॥ భద్ర*

సాల్వదేశపు పాలకుల్ని సాల్వులని పిలుస్తారు. జరాసంధునికి భయపడి దక్షిణానికి వలసవెళ్ళారు. సావిత్రి భర్త సత్యవంతుడు ఈ రాజ్యంలోనివాడే. ఈ దేశ ప్రజలు కౌరవ, పాండవుల పక్షాన పోరాడారు.
– మహాభారతం

**సాల్వుడు 3 :** తక్కువ కులస్తుడైన ఒక రాజు. ఇతడు పాండవ సైన్యాన్ని ఎదుర్కొన్నాడు. ఇతనికి గల ఏనుగు అతి భయంకరమైనది. దుర్యోధనుడితణ్ణి గౌరవించాడు. ధృష్టద్యుమ్నుడితడి ఏనుగును సాత్యకి సాల్వుడ్ని వధించారు. – మహాభారతం

**సాల్వుడు 4 :** కుశధ్వజుని సమకాలికుడు. కుశధ్వజుడు ఇతన్ని యజ్ఞానికి సహాయమడగగా నిరాకరించాడు. ఆ తర్వాత కుశధ్వజుడు యజ్ఞం చేయగా సీత జన్మించింది.
– ఉత్తర రామాయణం

**సాత్వేయుడు :** నితంతుని కొడుకు. ఇతడు, ఇతని సోదరులగు శూరసేనాదులు అజిత అను ఒక్కకాంతనే వివాహమాడారు. –మహాభారతం

**సాళ్వం :** ఒకదేశం. ఆర్యావర్తంలోని మధ్యరాజ్యాల్లో ఒకటి.

**సావర్ణి 1 :** 8వ మనువు. చూ॥ మన్వంతరం.

**సావర్ణి 2 :** ఓ రుషి. ఇంద్రుని సభలో వుండేవాడు. సత్యయుగంలో ఇతడు 6 వేల సంవత్సరాలు తపస్సు చేశాడు. – మహాభారతం

**సావర్ణుడు 1 :** ఓ రుషి. ధర్మజుని కొలువులో వుండేవాడు. – మహాభారతం

**సావర్ణుడు 2 :** ఓ మనువు. – *చూ॥* మన్వంతరాలు

**సావిత్రి 1 :** సత్యవానుడి భార్య.

మద్రదేశమును అశ్వపతి అనే రాజు పాలించేవాడు. అతని భార్య మాలతి. ఆ దంపతులు వృద్ధులైనా సంతానం లేక దేవి సావిత్రిని గూర్చి 18 ఏళ్ళు పూజలు చేయగా దేవి ప్రత్యక్షమై ఓ బాలిక జన్మిస్తుందని వరమిచ్చింది. అలా పుట్టిన బాలికకు సావిత్రి అని నామకరణం చేశారు.

*వివాహం :* ఆమెకు యుక్త వయసువచ్చి అందంగా వున్నా వివాహమాడటానికి ఎవరూ ముందుకు రాలేదు. ఆమె పౌర్ణమిరోజు స్నానమాచరించి బ్రాహ్మణుల ఆశీర్వాదం తీసుకొని తండ్రిముందు నిలబడగా అతడు బాధపడి బయట ప్రపంచంలో యాత్రలు చేసిరమ్మని నీకు నచ్చిన వరుడిని చూసుకొమ్మనిచెప్పి మంత్రులనిచ్చి పంపగా అడవుల కెళ్ళి రుషుల ఆశ్రమంలో గడిపింది.

ఒకసారి నారదుడు రాజభవనానికి వచ్చి అశ్వపతితో మాట్లాడుతుండగా సావిత్రి మంత్రులు తిరిగివచ్చారు. సావిత్రి నారదుడికి తండ్రికి వందనమాచరించి తనకు తగిన వరుడు సాల్వరాజైన ద్యుమత్సేనుడి కొడుకని చెప్పగా అశ్వపతి వారిని గురించిన సమాచారం సేకరించాడు. ద్యుమత్సేనుడు వయసురీత్యా గుడ్డివాడయ్యాడని శతృవులు దేశాన్ని ఆక్రమించుకోగా భార్యాపిల్లలతో అరణ్యంలో జీవిస్తున్నాడని చెప్పాడు. నారదుడు సత్యవానుడికి అన్ని సుగుణాలు వున్నాయని కాని ఒక సంవత్సరంలో అతడు చనిపోతాడని చెప్తాడు. రాజు ఎన్ని చెప్పినా సావిత్రి తన నిర్ణయాన్ని మార్చుకోకపోవడంతో రాజు తన పరివారంతో అరణ్యానికి వెళ్ళి తన కూతుర్ని సత్యవానుడికిచ్చి వివాహం చేయగా సావిత్రి అరణ్యంలోనే అత్తమామలతో, భర్తతో గడిపింది.

*సత్యవానుడి మరణం :* నారదుడు చెప్పిన సమయం దగ్గరకు రానేవచ్చింది. సావిత్రి మూడు రోజులు ఉపవాసంవుంది. మామ చెప్పినా వినలేదు. నాల్గవ రాత్రి మేల్కొనేవుండి ఉదయం భర్తతో కట్టెలు కొట్టడానికివెళ్ళింది. చెట్టెక్కిన సత్యవానుడికి తీవ్రమైన తలనొప్పి వచ్చి గొడ్డలి వదలి సావిత్రి ఒడిలో పడ్డాడు. కాలుడు ప్రత్యక్షమయ్యాడు. సావిత్రి గుర్తించి అతనికి పాదాభివందనం చేసింది. సావిత్రీ నీవు పతివ్రతవ గుటవల్ల నీకు దర్శనమిచ్చాను. నీ పతిప్రాణాలు తీసుకొనివెళ్ళడానికే వచ్చానని తాడుని విసిరి అతడి ఆత్మను బంధించి తీసుకెళ్తుండగా సావిత్రి అతడిని వెంబడించింది. యమధర్మరాజు ఆమెను నీపతి ప్రాణ ముదక్క వేరు వరము కోరుకొమ్మనగా మొదట తన మామకు చూపువచ్చునట్లు, రెండవసారి తన మామ రాజ్యం తిరిగి వచ్చేటట్లు, మూడవసారి తనకొక పుత్రుడుని ప్రసాదించమని కోరుకోగా యముడు ఆమె కోరికను మన్నించాడు. మరల యముడితోపాటు ఆమె వెళ్తుండగా నాల్గవ వరం కోరుకొమ్మనగా సత్య వానుడికి 100 మంది సంతానం కల్గాలని కోరుకోగా యముడు అభయమిచ్చాడు. సావిత్రి మరణించిన వాడికి పుత్రప్రాప్తి సాధ్యంకాదు కనుక సత్యవానుడి ప్రాణాలు తిరిగి ఇవ్వమని కోరగా ఆమె పతిభక్తికి మెచ్చి సత్యవానుడిని జీవింపచేశాడు. ఆ తర్వాత భర్త, అత్తమామలతో వారి రాజ్యానికి వెళ్ళి చిరకాలం రాజ్యాన్ని పాలించారు. – *మహాభారతం*

**సావిత్రి 2 :** తపతి పెద్దకూతురు. సూర్యుని కుమార్తె. బ్రహ్మ ఈ సోదరీమణులను వివాహమాడాడు. కొన్ని పురాణాలు సావిత్రి, గాయిత్రి, సరస్వతి ఒక్కరేనని పేర్కొనగా కొన్ని పురాణాలు వేరువేరని పేర్కొంటున్నాయి. ఒకసారి బ్రహ్మ యజ్ఞం చేయడానికి పుష్కరానికిరాగా విష్ణువు, శివుడు తక్కిన ఋషులంతా వచ్చారు. సావిత్రి సమయానికి రాకపోవడంవల్ల బ్రహ్మ ఇంద్రుడిని మరో యువతిని తీసుకొని వస్తే ఆమెను వివాహమాడి యజ్ఞం ప్రారంభిస్తానని చెప్పగా ఇంద్రుడు గాయత్రి అనే సుగుణవంతురాలను తేగా బ్రహ్మ ఆమెను వివాహమాడి యజ్ఞం ప్రారంభించగా సావిత్రి ఆల స్యంగా వచ్చి ఇది చూసి ఉగ్రురాలై బ్రహ్మ, విష్ణు, శివ, ఇంద్రాదులను శపించింది. లక్ష్మి, ఇంద్రాణిలు సావిత్రి వెనుకవెళ్ళగా వారిని కూడా శపించింది. అప్పుడు గాయత్రి వారందరికి తగిన విధంగా శాప విమోచనం కల్గించింది. – *పద్మపురాణం*

ఇతర విశేషాలు : ఈమె బ్రహ్మ కొలువులో వుంటుంది. ఒకసారి అశ్వపతి ఈమెను పూజించగా యజ్ఞవాటిక నుండి ప్రత్యక్షమై ఓ పుత్రిక జన్మిస్తుందని వర మిచ్చింది. ఆ బాలికే మహాపతివ్రతగా ఎంచబడే సత్య వానుడి భార్య.

**సావిత్రి 3 :** ఉమాదేవి సేవిక. – *మహాభారతం*

**సావిత్రి 4 :** ఈమె ఒకరాజు భార్య. తన చెవిపోగులను దానంచేసి స్వర్గం చేరింది. – *మహాభారతం*

**సావిత్రుడు 1 :** ఏకాదశ రుద్రుల్లో ఒకడు. – *మహాభారతం*

**సావిత్రుడు 2 :** అష్టవసువుల్లో ఒకడు. – *మహాభారతం*

**సావిత్రుడు 3 :** సుమేరు పర్వత శిఖరాగ్రం. జ్యోతిష్క అనేది మరో పేరు. దీన్ని అధిరోహించడం చాలా కష్టం. అద్భుతమైన రత్నాలుంటాయి. శివపార్వతులు ఈ శిఖరాగ్రంపై తపస్సు చేశారు. గంగ దేవతా రూపంలో శివుణ్ణి గురించి తపస్సుచేసింది. – *మహాభారతం*

**సాళ్వుడు :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. ఇతడు యముని భవనంలో వుండి అతణ్ణి పూజిస్తుంటాడు. – *మహాభారతం*

**సాహసికుడు :** బలి కుమారుడు. ఇతడు శ్రీకృష్ణుని గూర్చి తపస్సు చేసెను. ఇతడు గంధమాదన పర్వతముపైనుండగా చంద్రునికై పోవు తిలోత్తమ నాపి ఆమెతో రాత్రింబవళ్ళు క్రీడించెను. వీరి ఆహ్లాదకర విన్యాసాలకు అచట తపస్సు చేసుకొను చున్న దుర్వాసుడు కోపించి నీవు రాక్షసుడవై జన్మించు మని శపించెను. సాహసికుడు క్షమింపుమని కోరగా కృష్ణుని భక్తుడగుటచేత నీవు బృందావనమందు సంచరించునపుడు శ్రీకృష్ణునిచేత వధించబడినపుడు శాపవిమోచన జరుగునని చెప్పెను. – *బ్ర.వై.పురాణం*

**సాహస్రకం :** ఓ పవిత్ర యాత్రాస్థలం. ఇది కురు క్షేత్రంలో వుంది. ఇచట స్నానం చేస్తే 1000 గోవులు దానమిచ్చిన ప్రతిఫలం లభిస్తుంది. – *మహాభారతం*

**సికటాక్షం :** ఓ పుణ్యస్థలం. దీన్ని ధర్మజుడొకసారి దర్శించాడు. - మహాభారతం

**సకటుడు :** ఓ ప్రాచీన రుషి. మహాభారతయుద్ధం జరిగే సమయంలో ద్రోణుడి వద్దకు వచ్చి యుద్ధాన్ని ఆపమని కోరాడు. - మహాభారతం

**సితధ్వజుడు :** మిథిలానగర రాజు. అజుడి కొడుకు. కుని తండ్రి.

**సితుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. - మహాభారతం.

**సిద్ధ :** ఓ దేవ గాంధర్వుడు. ఇతడు కశ్యప ప్రజాపతి ప్రాధలకు జన్మించాడు. - మహాభారతం

**సిద్ధగ్రహం :** ఓ పాపాత్మ. సిద్ధులు దీన్ని ప్రయోగిస్తే వారు నరమాంసభక్షులవుతారు. - మహాభారతం

**సిద్ధపాత్రుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. - మహాభారతం

**సిద్ధార్థుడు 1 :** ఒకరాజు. క్రోధవశుడను అసురుని పునర్జన్మ. - మహాభారతం

**సిద్ధార్థుడు 2 :** సుబ్రహ్మణ్య స్వామి అనుచరయోధుల్లో ఒకడు. - మహాభారతం

**సిద్ధార్థుడు 3 :** బుద్ధుని చిన్ననాటి పేరు. - చూ॥ బుద్ధుడు

**సిద్ధార్థుడు 4 :** దశరథుని మంత్రుల్లో ఒకడు. - రామాయణం

**సిద్ధాశ్రమం :** ఓ ఆశ్రమం. ఇచ్చటే వామనుడు బలిని పాతాళానికి అణగదొక్కాడు. ఆ తర్వాత ఇది ఓ పుణ్యస్థలంగా మారింది. తన యాగరక్షణకు విశ్వామిత్రుడు రామలక్ష్మణులను వెంటబెట్టుకొని వెళ్తూ దీన్ని వారికి చూపాడు. - రామాయణం

**సిద్ధి 1 :** దక్షుడి 13 కుమార్తెలలో ఒకరు. ఈమెను ధర్మదేవుడు వివాహమాడాడు. - విష్ణుపురాణం

**సిద్ధి 2 :** ఓ దేవత. ఈమె కుంతిగా పునర్జన్మ పొందింది. ఈమె సుబ్రహ్మణ్యస్వామి అసురులపై యుద్ధానికి వెళ్ళే సమయంలో ముందు నిలబడింది. ఏ కార్యక్రమం మొదలుపెట్టినా ముందు ఈ దేవతను ప్రార్థించాలి. - మహాభారతం

**సిద్ధులు :** ఓ దేవగణం. వీరు హిమాలయాల్లో కణ్వుని ఆశ్రమంవద్ద నివసిస్తారు. వీరు యముని కొలువులో వుండి అతణ్ణి పూజిస్తారు. - మహాభారతం

**సినీవాక్కు :** ధర్మజుని కొలువులో ఓ రుషి. - మహాభారతం

★ **సినీవాలి 1 :** అంగిరసుని కూతురు. అంగిరసుని భార్య స్మృతికి నల్గురు కుమార్తెలు. వారు కుహు, రాక, అనుమతి, సినీవాలి. - విష్ణుపురాణం

ఆమె శరీరం చిన్నదవటంవల్ల దృశాదృశ్య అని కూడా అంటారు. చూడగల్గింది, చూడలేనిది అని అర్థం. శివుడీమెను తన నొసటన ధరించాడు అందువల్ల ఈమెను రుద్రసుత అనికూడా అంటారు.

★ **సినీవాలి 2 :** బృహస్పతి సుభల కుమార్తె. ఈమెను కర్దమ ప్రజాపతికిచ్చి వివాహం చేసినా అతణ్ణి విడచి చంద్రుడితో కలసి జీవించింది. - వాయుపురాణం

**సిరియాళుడు :** చిరుతొండడను శివభక్తుని కుమారుడు. - *చూ॥ చిరుతొండడు.*

**సీత :** రాముని భార్య .

*జన్మకారణం :* సరస్వతి, లక్ష్మి, గంగ, మహావిష్ణువు భార్యలు. సరస్వతి శాపంవల్ల లక్ష్మి భూమిపై తులసిగా, వేదవతిగా, సీతగా జన్మించి ఆ తర్వాత వైకుంఠం చేరింది. ఆ శాపాల ఫలితంగా సరస్వతి, గంగ భూమిపై నదులై జన్మించారు. ధర్మధ్వజ, కుశధ్వజ సోదరులు పోయిన సంపదకొరకు శ్రీమహాలక్ష్మిని గూర్చి తపస్సు చేయగా శ్రీమహాలక్ష్మి వారి ద్దరికి జన్మిస్తానని అభయమిచ్చింది.

ధర్మధ్వజునికి అతనిభార్య మాధవికి లక్ష్మి జన్మించింది. ఆమెకు తులసిగా నామకరణం చేశారు. - *చూ॥ తులసి*

కుశధ్వజు మాలవతిలకు శ్రీమహాలక్ష్మి వేదవతిగా జన్మించింది. శంభుడనే అసురుడు ఇతడి గృహానికి వచ్చి

★ అధర్వణవేదంలో ఈమె విష్ణువు భార్యగా పేర్కొనబడింది.

★ అంగిరసుని మూడవ కుమార్తెయని, శ్రద్ధకు జన్మించిందని భాగవతం పేర్కొంది.

వేదవతిని చూసి మోహించి కుశధ్వజుడినడగగా అతడు నిరాకరించాడు. అర్ధరాత్రి సమయంలో శంభుడు వచ్చి కుశధ్వజుడిని వధించగా వేదవతి చూపులకు శంభుడు భస్మమయ్యాడు. వేదవతి విష్ణువును భర్తగా పొందనెంచి ఘోర తపస్సు చేస్తుంది. అలాచేస్తుండగా పుష్పకవిమానంలో వస్తున్న రావణుడీమెను చూసి మోహించి ఆమె జుట్టు పట్టుకొని తీసుకుపోబోగా ఆమె భస్మమయ్యింది. ఆ భస్మాన్ని ఇతడు ఓ పెట్టెలో పెట్టుకొని లంకకు తీసుకొనివెళ్ళి మండోదరికిచ్చాడు. మండోదరి ఆ పెట్టె తెరచి చూడగా ఓ బాలిక కన్పించింది. అసుర గురువైన శుక్రుని సలహాపై ఆ బాలిక లంకలో వుండటం అరిష్టమని భావించి తన సేవకులతో ఆ పెట్టెను సముద్రంలోకి విసిరివేయగా అది కొట్టుకొనివచ్చి మిథిలానగరంలోని భూమిలో వుండిపోయింది. జనకరాజు యాగానికి ఆ స్థలాన్ని అనువైనదిగా ఎంచి దున్నబోగా ఈ పెట్టె దొరికింది. అందులోని పాపను చూసి తన భవనానికి తీసుకువెళ్ళి సీతగా నామకరణం చేసి తన కూతురుగా పెంచాడు. – దేవీ భాగవతం

*సీత జన్మవృత్తాంత పాఠాంతరాలు:* పద్మాక్షుడనే రాజు శ్రీమహాలక్ష్మిని పుత్రికగా పొందనెంచి మహా విష్ణువును గూర్చి తపస్సు చేయగా మహావిష్ణువు ప్రత్యక్షమై అతడికోపెట్టెను బహుమతిగా ఇచ్చాడు. అందులోనుండి ఓ అందాల బాలిక జన్మించింది. ఆమెను పద్మగా నామకరణం చేశాడు. యుక్తవయసు రాగా స్వయంవరం ప్రకటించగా రాక్షసులు ఆ మండపాన్ని ధ్వంసం చేసి పద్మాక్షుడిని సంహరించారు. పద్మ అగ్నిలోదూకి బూడిదకాగా రాక్షసులు వెనుదిరిగారు. ఒకరోజు రావణుడు తన పుష్పకవిమానంలో వెళ్తూ అగ్నినుండి బయటకు వచ్చిన పద్మను చూసి ఆమెవద్దకు చేరగా తిరిగి ఆమె అగ్నిగుండంలో దూకింది. రావణుడు దాన్ని మొత్తం వెతకగా 5 వజ్రాలు దొరకగా వాటిని ఓ పెట్టెలో వుంచి మండోదరికి ఇచ్చాడు. మండోదరి ఆ పెట్టెను తెరచి చూడగా ఓ బాలిక కన్పించింది. పద్మాక్షుడి మరణకారణమైన ఈ బాలిక లంకకు నాశనకారి కాగలదని భావించి ఆ పెట్టెను పారేయమని రావణుని బలవంతపెట్టగా అతడు ఆ పెట్టెను మిథిలానగరంలో పాతిపెట్టాడు. అప్పుడామె వెనుతిరిగి లంకకువచ్చి నిన్ను నీ వంశాన్ని నాశనం చేస్తానని శపించింది. మిథిలలో ఓ బ్రాహ్మణుడు దుక్కి దున్నుతుండగా ఈ పెట్టె దొరకగా దాన్ని జనక రాజుకిచ్చాడు. ఆ పెట్టెలోని బాలికకు సీతగా నామకరణం చేసి జనకుడు పెంచాడు. – *ఆనందరామాయణం*

★ రావణుడు ముల్లోకాలని బాధిస్తూ తన బాణాలతో రుషులను హింసిస్తూ బాణాలకు అంటిన రక్తాన్ని ఓ కుండలో వుంచేవాడు. పృత్సరుడనే రుషి దర్భలను పాలతో పూజిస్తూ ఆ పాలను ఓ కుండలో వుంచేవాడు. అతడు లక్ష్మిసమానురాలైన తనకో కూతురు కావాలని ప్రార్థించేవాడు. రావణుడు ఆ కుండను బలవంతంగా ఎత్తుకుపోయి తన కుండలోని రక్తంతో కలిపి మండోదరికిచ్చాడు. మండోదరి రావణుని ఆగడాలను సహించలేక ఆ కుండలోని రక్తాన్ని ఆత్మహత్య చేసుకోవాలనే తలంపుతో తాగగా ఆమె గర్భిణియై ఓ బాలికకు జన్మనిచ్చింది. ఆమే సీత. – *అద్భుతరామాయణం.*

*వివాహం, అరణ్యవాసం : చూ॥ రాముడు.*

*సీతారాముల ఎడబాటుకు పూర్వకారణం :* జనకుని ఇంట బాలికగావున్న సమయంలో ఉద్యానవనంలో ఆడుకుంటుండగా అవి మాట్లాడుకోవడం సీతవిన్నది. "రాముడనే ఓ అందగాడు జన్మించాడని అతడు సీతను వివాహమాడతాడని" చెప్పుకుంటున్నాయి. సీత వాటిని దైవికశక్తులుగా భావించి వాటిని పట్టుకొని ఓ పంజరంలో వుంచింది. అవి ఇది న్యాయంకాదని మేము చెట్లపై వనాలలో స్వేచ్ఛా విహారం చేస్తూ జీవిస్తాము కనుక వదిలిపెట్టమని కోరగా సీత మగ చిలకను వదలి ఆడ చిలుకను బంధించి వుంచింది. ఆడచిలుక గర్భిణియని చెప్పినా విడువలేదు. ఆ ఎడబాటు సహించలేని మగచిలుక తన తలను నేల

★ దేవీ భాగవతంలో మరోచోట రావణుడు మండోదరిని వివాహమాడినపుడు ఆమె జాతకచక్రం చూసి ఆమెకు పుట్టిన మొదటి బిడ్డ వంశ వినాశకారి అగునని చెప్పి ఆమెను వధించుట ఉత్తమమని చెప్పగా రావణుడు అలాకాక పుట్టినమొదట బిడ్డను ఓ పెట్టెలో వుంచి జనకుని నగరంలో పాతిపెట్టాడు. ఆ పాప సీత అని పేర్కొనబడింది.

కేసి బాదుకొనుచుండగా పంజరంలోని ఆడచిలుక బాధపడుతూ మావలెనే నీకుకూడ నీ భర్త నుండి ఎడబాటు కల్గుతుందని సీతను శపిస్తుంది.

మాయసీత– చూ॥ మాయాసీత

వాల్మీకి ఆశ్రమంలో సీత ; లవకుశుల జననం: రావణుని వధానంతరం రాముడు సీతా లక్ష్మణ సమేతుడై అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడై రాజ్యపాలన చేశాడు. రాముడు తన పాలన గురించి ప్రజానీకపు అభిప్రాయాలు తెలుసుకోవడానికి గూఢచర్యం చేసేవాడు. ఒకరోజు ఇద్దరు భార్యాభర్తలు వాదులాడుకొనుచూ రాముడు రావణుని చెంతవున్న సీతను పరిగ్రహించడం నీఛమని, నేనైతే నిన్ను తిరిగి చేపట్టేవాడిని కాదని ఓ చాకలివాడు తన భార్యను అనడం విని రాముడు సీతను అడవులకు పంపాడు. దానికి కారణం సీతకు చిలుక ఇచ్చిన శాపమే. మగచిలుక గంగా నదిలో పడి మరణించి క్రోధన అనే చాకలి వాడుగా జన్మించింది. ఇలా రామునిచే సీత అడవులకు పంపడానికి కారణమయ్యింది. వాల్మీకి ఆశ్రమంలో ఆమె ప్రసవించి లవకుశులకు జన్మనిచ్చింది. వారు శ్రీరాముని అశ్వమేధ యాగాన్ని పట్టి బంధించగా, దానిని విడిపించుటకు లక్ష్మణ, భరత, శతృఘ్నులు వచ్చి యుద్ధంలో ఓడిపోగా రాముడే వచ్చి యుద్ధం చేసి వీరు తన కుమారులే అని తెలుసుకొని సీతను తిరిగి తీసుకువెళ్ళబోగా ఆమె తన తల్లి భూదేవిని తలవగా భూమి చీలి అందుండి దేవకన్యలువచ్చి సీతను భూమిలోకి ఆమె తల్లి చెంతకు చేర్చుతారు. అంతటితో లక్ష్మికి సరస్వతి శాపం ముగిసి వైకుంఠం చేరుతుంది.

**సీమంతిని :** చిత్రాంగదుని భార్య. – స్కంద పురాణం

**సీరధ్వజుడు :** సీత తండ్రి జనకుని పేరు. – చూ॥ జనకుడు

**సుకక్షం :** ద్వారకానగరానికి పశ్చిమానగల ఓ పర్వతం. ఇదో పురాణ ప్రసిద్ధ పర్వతం. – మహాభారతం

**సుకన్య 1 :** చ్యవనమహర్షి భార్య. – చూ॥ చ్యవనుడు

**సుకన్య 2 :** మాతరిశ్వ రుషి భార్య. మంకపాకరుషి ఈమె కుమారుడు. మంకణుడుని కూడా అంటారు.

**సుకమలుడు :** ఓ యక్షుడు. మణివరుడికి దేవజని వల్ల జన్మించాడు. – బ్రహ్మాండపురాణం.

**సుకర్ముడు1 :** సుబ్రహ్మణ్యస్వామికి విధాత ఇచ్చిన అనుచరుల్లో ఒకడు. రెండోవాడు సువ్రతుడు. – మహాభారతం

**సుకర్ముడు 2 :** సామవేదాన్ని బోధించిన పురోహితుడు. సుత్యుడి కుమారుడైన ఇతడు సామవేదాన్ని 1000 విభాగాలు చేశాడు. – చూ॥ గురుపరంపర

**సుకర్ముడు3 :** తల్లిదండ్రులను సేవించి గుణవంతుడిగా పేరుతెచ్చుకున్న ఓ బ్రాహ్మణుడు. – చూ॥ పిప్పలాదుడు

**సుకల :** తన భర్తను గౌరవించి ప్రేమించిన భార్య.

**సుకీనకుడు :** భార్గ్వదధ వంశస్తుడైన రిపుంజయుడి మంత్రి. – చూ॥ రిపుంజయుడు.

**సుకుట :** ప్రాచీన భారతావనిలో ఓ రాజ్యం. ఈ రాజ్య ప్రజల్ని సుకుటులనేవారు. – మహాభారతం

**సుకుమారి 1 :** శాకద్వీపంలోని ఓ పురాణప్రసిద్ధనది. – మహాభారతం

**సుకుమారి 2 :** స్పృంజయుడనురాజు కూతురు. ఈమె నారదుని భార్య. – చూ॥ పర్వతుడు

**సుకుమారుడు 1 :** ఓ పులిందరాజు. ఇతని రాజధాని కూడా పులిందం అంటారు. ఇతడు సుమిత్రుడి కొడుకు. తూర్పు రాజ్యాల జైత్రయాత్రలో భీమసేనుడు ఈ తండ్రీకొడుకుల్నిద్దర్నీ ఓడించాడు. మరోసారి సహదేవుడు ఓడించాడు. వీరు మహాభారత యుద్ధంలో పాండవుల పక్షాన పోరాడారు. – మహాభారతం

**సుకుమారుడు 2 :** ఓ సర్పం. తక్షకుని కుటుంబంలో జన్మించింది. ఇది జనమేజయుని సర్పయాగంలో బూడిదయ్యింది. – మహాభారతం

**సుకుమారుడు 3 :** పూరువంశ రాజు. వర్షకేతు కుమారుడైన విభువు కుమారుడు. సత్యకేతుడను రాజు సుకుమారుడి కొడుకు. – అగ్నిపురాణం.

**సుకుమారుడు 4 :** భావ్యుడను శాకద్వీపపురాజు కొడుకు. – మహాభారతం

**సుకుమారుడు 5 :** ఓ సంస్కృత కవి. ఇతడి గురుభక్తిని గురించి ఓ కథ వుంది. ఇతడు గురువుకెంత భక్తితో సేవచేసినా ఇతడ్ని గురువు ఆక్షేపించేవాడు. అది భరించలేక ఒకరోజు గురువును చంపాలని ఓ బండ

రాతిని రాత్రిసమయంలో తొయ్యబోతూ గురుపత్ని గురువుల సంభాషణ విన్నాడు. "సుకుమారుడ్ని ఎందుకు నిందిస్తున్నారు. అతడెంతో బాధ్యతతో వుంటున్నాడు కదా! అని గురుపత్ని అడగగా అలా ఆక్షేపించడంవల్ల మరింత సుగుణవంతుడవుతాడనే ఏకైక కారణం చేతనే అలా నిందిస్తున్నాని సమాధానమిస్తాడు" అది విన్న సుకుమారుడు బండరాయిని తోయడంమాని చీకట్లోకి వెళ్ళిపోయి మరునాడు గురువును "గురుద్రోహం" చేసినవారికి శిక్ష ఏమిటని ప్రశ్నించగా ఓ గొయ్యి తవ్వి ఊక నింపి దానిలో నిలబడి నిప్పంటించుకొని మరణించడమే శిక్ష అని చెప్పగా అతడు అలాగే చేస్తాడు. సుకుమారుడే అతడని తెలుసుకొని గురువు బ్రతిమాలినా ఆ శిక్ష విధించుకొని అది మండుతుండగా 'శ్రీకృష్ణవిలాసం' అనే కావ్యం గానం చేస్తాడు. 66వ పద్యం గానం చేసే సమయానికి అతని నాలుక మంటల్లో కాలిపోతుంది. అందుకని అది అసంపూర్తి కావ్యంగా మిగిలిపోతుంది.

**సుకుమారుడు 6 :** సుమంతుడి కొడుకు.

**సుకుమారుడు 7 :** ధర్మరాజు చక్ర రక్షకుడు.
- *మహాభారతం*

**సుకుమారం 1 :** ఓ పవిత్ర స్థలం. ఇది శాకద్వీపంలోని జలధారగిరి పర్వతంవద్ద కలదు. - *మహాభారతం*

**సుకుమారం 2 :** పులిందుల రాజధాని.
- *చూ॥ సుకుమారుడు 1.*

**సుకుసుమ :** సుబ్రహ్మణ్యస్వామి సేవిక.
- *మహాభారతం*

**సుకేతనుడు :** భృగు కుటుంబంలోని ఒకరాజు. సునీతుడి కొడుకు. ధర్మకేతుడి తండ్రి. - *భాగవతం*

**సుకేతుడు 1 :** సూర్యవంశపు రాజు. నందివర్ధనుడి కొడుకు; దేవరాతుని తండ్రి. - *భాగవతం*

**సుకేతుడు 2 :** పూరువంశపు రాజు. విరథుడిగా ప్రసిద్ధుడు. భరతుని ఐదుగురు కుమారుల్లో ఒకడు. భరతుని ఐదుగురు కుమారులు సుహోత్రుడు, సుహోతుడు, గయ, గర్భ, సుకేతులు. - *అగ్నిపురాణం*

**సుకేతుడు 3 :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. ఇతడు ఇతని కుమారుడు సునాముడు ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. - *మహాభారతం*

**సుకేతుడు 4 :** శిశుపాలుని కుమారుల్లో ఒకడు. మహాభారతయుద్ధంలో ద్రోణుడితణ్ణి వధించాడు.
- *మహాభారతం*

**సుకేతుడు 5 :** ఓ శక్తివంతుడైన రాజు. పాండవుల పక్షాన పోరాడాడు. ధనుర్విద్యాపరుడైన కృపుడి బాణానికి మరణించాడు. - *మహాభారతం*

**సుకేతుడు 6 :** తాటక అనే రాక్షసి తండ్రి. ఇతడు సురక్షకుడి కొడుకు. - *కంభరామాయణం*

**సుకేశి 1 :** గాంధార రాజు కుమార్తె. ఈమె శ్రీకృష్ణుని భార్య. శ్రీకృష్ణుడీమెకిచ్చిన భవంతి ద్వారాలు జాంబూనాద బంగారంలా కన్పిస్తాయి. - *మహాభారతం*

**సుకేశి 2 :** ఓ దేవకన్య. అలకాపురివాసి. అష్టావక్రుని గౌరవార్థం నృత్యంచేసింది. - *మహాభారతం*

**సుకేశి 3 :** మగధరాజైన కేతువీర్యుని కూతురు. ఈమె మూడవ మరుత్తుడ్ని వివాహమాడింది.

**సుకేశుడు :** ఓ రాక్షసుడు. విద్యుత్కేశ, సాలకంతకలకు జన్మించాడు. రాక్షసజాతిలో హేతి, ప్రహేతి జన్మించగా ప్రహేతి వివాహం చేసుకోలేదు. హేతి కాలుడి సోదరి భయను వివాహమాడగా విద్యుత్కేసుడు జన్మించాడు. విద్యుత్కేసుడు సంధ్యకుమార్తె సాలకంత కను వివాహమాడగా సుకేశుడు జన్మించాడు. ఆ దంపతులు ఇతడిని ఒంటరిగా వదలి మరికొంత కాలం ఆనందంగా దాంపత్య జీవితం గడపదలిచారు. ఆ బాలుడు ఒంటరిగా అరణ్యంలో సూర్యునివలే ప్రకాశిస్తూ ఏడుస్తుండగా శివపార్వతులు చూసి జాలిపడి ఒక్కసారిగా యువకుడయ్యేటట్లు వరమిచ్చి చిరంజీవిగా ఆశీర్వదించి ఆకాశమార్గాన పయనించే ఓ నగరాన్ని ఇచ్చారు. సుకేశుడు గంధర్వకన్య అయిన గ్రామ్యకిని వివాహమాడగా మాలి, సుమాలి, మాల్యవానులు జన్మించారు.

**సుకందకం :** ప్రాచీన భారతదేశంలోని ఒక రాజ్యం.
- *మహాభారతం*

**సుక్షత్రుడు :** కోసల రాజకుమారుడు. మహాభారత యుద్ధంలో పాండవుల పక్షాన పోరాడాడు.
- *మహాభారతం*

**సుక్రతువు :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. సంజయుడు ప్రాచీన రాజుల్ని గూర్చి పొగిడే సమయంలో ఇతడ్ని కూడా ఉదహరించాడు. - *మహాభారతం*

**సుగతి :** భారతదేశంలోని ఒకరాజు. ఇతడు గయుడి కుమారుల్లో ఒకడు. - భాగవతం

**సుగుణుడు :** పాండుపుత్రుడు భీముడికి, అతని భార్య జలంధరకు జన్మించిన పుత్రుడు. - మహాభారతం

**సుగోప్త :** ఓ విశ్వదేవుడు. పితృగణంలోనివాడు.

**సుగంధి 1 :** వసుదేవుడి 13 భార్యల్లో ఒకరు. ఈమెవల్ల జన్మించినపుత్రుడు పుండ్రుడు. - వాయుపురాణం

**సుగంధి 2 :** ఓ దేవకన్య. ఈమె అర్జునుని జన్మదినోత్సవ వేడుకల్లో నాట్యం చేసింది. - మహాభారతం.

**సుగంధం :** ఓ పుణ్యస్థలం. దీన్ని దర్శిస్తే పాపాలు నశించి స్వర్గం లభిస్తుంది. - మహాభారతం

**సుగంధుడు :** ఓ రాక్షసుడు. హిరణ్యాక్షుడికి, దేవతలకు జరిగిన యుద్ధంలో అగ్ని సంహరించిన ఏడుగురు అసురుల్లో ఒకడు. - పద్మపురాణం

**సుగ్రీవి :** కశ్యపతామ్రలకు జన్మించిన స్త్రీ. ఈమె గుర్రాలకు, ఒంటెలకు, గాడిదలకు మాతృక.
- మత్స్యపురాణం

**సుగ్రీవుడు :** గరుడుని సోదరుడైన అరుణుడు స్త్రీ రూపం దాల్చి అరుణిగా మారగా ఇంద్రుడు అరుణితో సంగమించగా వాలి, సూర్యుడు సంగమించగా సుగ్రీవుడు జన్మించారు. వీరు గౌతముని ఆశ్రమంలో పెరిగారు. కిష్కిందరాజైన రుక్షజుడు వీరిని పెంచాడు. అతడి మరణానంతరం వాలి కిష్కిందకు రాజయ్యాడు. సోదరులు అన్యోన్యంగా వుండేవారు. ఒకసారి దుందుభి అనే రాక్షసుడు వాలిని ద్వంద యుద్ధానికి పిలవగా వాలి అతణ్ణి ఓడించి రుష్యమూక పర్వతంపై విసరగా ఆ పర్వతంపైకి వాలివస్తే అతడి తల ముక్కలవుతుందని శపించాడు. వాలి దుందుభిల యుద్ధం పెక్కు రోజులు జరుగగా దుందుభి మాయాజాలంవల్ల వాలి మరణించాడని సుగ్రీవుడు కిష్కిందపాలన చేస్తుండగా వాలి తిరిగివచ్చి సుగ్రీవుని తరమగా అతడు రుష్యమూక పర్వతంపై తలదాచుకున్నాడు. సీతాన్వేషణ సమయంలో హనుమంతుడిద్వారా శ్రీరాముడు, సుగ్రీవులు స్నేహితులై శ్రీరాముడు వాలిని వధించి కిష్కిందకు సుగ్రీవుడిని రాజును చేస్తాడు. సుగ్రీవుడు సీతాన్వేషణలో రాముడికి సహాయపడి రావణుడి వధానంతరం శ్రీరామునితోపాటు అయోధ్యకు వస్తాడు. అశ్వమేధయాగ సమయంలో సుగ్రీవుడు అశ్వరక్షణ బాధ్యత తీసుకుంటాడు. సహస్రకంఠరావణుడు సుగ్రీవుడి కూతుర్ని ఎత్తుకుపోగా శ్రీరాముడు అతడితో యుద్ధం చేస్తాడు. సీత బాణానికి సహస్రకంఠుడు మరణించగా సుగ్రీవుడు తన కుమార్తెతో కిష్కిందకు వెళ్ళి రాజ్యపాలన చేస్తాడు. - రామాయణం.

**సుగ్రీవం :** శ్రీకృష్ణుని రథానికి పూన్చివుండే ఐదు అశ్వాలలో ఇదొకటి. తక్కిన నాల్గు అశ్వాలు కామగ, శైభ్య, మేఘపుష్ప, వాలాహక.

**సుఘోషం :** నకులుని శంఖంపేరు. - మహాభారతం

**సుచంద్రుడు 1 :** ఇక్ష్వాకు వంశంలో ఒకరాజు. ఇక్ష్వాకు అలంబుసుల కుమారుడు. విశాలనితి. విశాల నగర పట్టణాన్ని ఇతడే నిర్మించాడు. విశాలుడి పుత్రుడు హేమచంద్రుడు. సుచంద్రుడితని కొడుకు. సుచంద్రుని కొడుకు ధూమ్రాశ్వుడు. - రామాయణం.

**సుచంద్రుడు 2 :** ఓ అసురుడు. సింహిక కొడుకు.
- మహాభారతం

**సుచంద్రుడు 3 :** కశ్యప ప్రజాపతి ప్రధలకు జన్మించిన ఓ గంధర్వుడు. ఇతడు అర్జునుని జన్మదినోత్సవ వేడుకల్లో పాల్గొన్నాడు. - మహాభారతం

**సుచక్షుషం :** గంగానది ఏడు ఉపనదుల్లో ఒకటి.
- *చూ॥ గంగ*

**సుచక్రుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు.
- మహాభారతం

**సుచరువు 1 :** ధృతరాష్ట్రుని కుమారుల్లో ఒకడు. మరో ఏడుగురు సోదరుల్తో అభిమన్యుడ్ని ఎదుర్కొన్నాడు.
- మహాభారతం

**సుచరువు 2 :** రుక్మిణి శ్రీకృష్ణుల పుత్రుల్లో ఒకడు. రుక్మిణి తక్కిన కుమారులు ప్రద్యుమ్నుడు, చారుదేష్ణుడు, సుదేష్ణుడు, చారుదేహుడు, చారుగుప్తుడు, భద్రబాహువు.

**సుచిత్ర :** ధృతరాష్ట్రుని కుటుంబంలో జన్మించిన ఓ నాగు. జనమేజయుని సర్పయాగంలో భస్మమయ్యింది.

**సుచిత్రుడు 1 :** పులిందరాజైన సుకుమారుడి కొడుకు.
- *చూ॥ సుకుమారుడు*

**సుచిత్రుడు 2 :** ధృతరాష్ట్రుని కొడుకుల్లో ఒకడు. ఇతడు అభిమన్యుడ్ని ఎదుర్కొన్నాడు. - మహాభారతం

**సుచిత్రుడు 3 :** పాండవుల పక్షాన పోరాడిన రాజు. ఇతడు రథంపై వుండి యుద్ధం చేయడంలో నేర్పరి. ఇతడు, ఇతడి కుమారుడు చిత్రవర్మ యుద్ధభూమిలో నడుస్తుండగా ద్రోణుడు సంహరించాడు.
– మహాభారతం.

**సుచిరోషితుడు :** దశరథుని మంత్రుల్లో ఒకడు.
– రామాయణం.

**సుచేతసుడు :** వితహవ్య వంశంలోనివాడు. గృత్స మదుడి కొడుకు. ఇతడి కొడుకు సుచేతసుడు.
– మహాభారతం

**సుచ్ఛాయ :** ధ్రువుడి కొడుకైన శిష్ఠి భార్య. ధ్రువశంఖు లకు ఇద్దరు కుమారులు. వారు శిష్ఠి, భవ్యుడు. శిష్ఠి సుచ్ఛాయలకు ఐదుగురు పుత్రులు. వారు సద్గుణ సంపన్నులైన రిపుడు, రిపుంజయుడు, విప్రుడు, వృకలుడు, వృకతేజసుడు. – విష్ణుపురాణం

**సుజన్మకృత్తు :** సోమకుడి కొడుకు. ఇతనికి 100 మంది పుత్రులు. కడపటి వాడైన పృషతుడి కొడుకు ద్రుపదుడు.
– భాగవతం

**సుజాత :** ఉద్దాలకుని కూతురు. – చూ॥ ఋగోదరుడు

**సుజాతుడు 1 :** ధృతరాష్ట్రుని కొడుకు. మహాభారత యుద్ధంలో భీమునితో పోరాడి మరణించాడు.
– మహాభారతం

**సుజాతుడు 2 :** పులహ, శ్వేతలకు జన్మించిన వానరుడు. ఇతడు వానరులకు రాజు. – బ్రహ్మాండపురాణం.

**సుజానువు :** ఓ సాధుపుంగవుడు. శ్రీకృష్ణుడు హస్తినకు వెళ్ళే మార్గమధ్యంలో ఇతడు శ్రీకృష్ణుడితో మాట్లాడాడు.
– మహాభారతం

**సుజ్యేష్ఠుడు :** అగ్నిమిత్రుని కొడుకైన ఒకరాజు. ఇతని కొడుకు వసుమిత్రుడు. – భాగవతం

**సుతను 1 :** యుధిష్ఠురుని కూతురు. వజ్రనగరానికి రాజు కొడుకైన అశ్వసుతుని భార్య. – వాయుపురాణం

**సుతను 2 :** ఆహుకుడు అనబడే ఉగ్రసేనుని కూతురు. శ్రీకృష్ణుడీమెను అక్రూరునికిచ్చి వివాహం చేశాడు.
– మహాభారతం

**సుతపుడు 1 :** భరత వంశపు రాజు. హోముని కొడుకు, బలుని తండ్రి. – భాగవతం

**సుతపుడు 2 :** ప్రాచీనకాలంలో ఓ ప్రజాపతి. ఇతడికి పృష్ణిగర్భుడను కొడుకు జన్మించాడు. పృష్ణిగర్భుడు విష్ణువు యొక్క అంశ. – చూ॥ అదితి

**సుతపుడు 3 :** వశిష్ఠుని ఏడుగురు కుమారుల్లో ఒకడు. వారు రజసుడు, గోత్రుడు, ఊర్ధబాహుడు, సవనుడు, అనఘుడు, సుతపుడు, శుక్రుడు. వీరంతా మూడవ మన్వంతరంలో సప్తర్షులు. వీరు ఊర్జకు జన్మించారు.

**సుతపుడు 4 :** ఉపమాన్యుడను రుషికి తండ్రి.
– బ్రహ్మాండ పురాణం

**సుతపుడు 5 :** భృగువంశంలోని ఓ రుషి.
– చూ॥ ఉగ్రతపసుడు

**సుతపుడు 6 :** భరద్వాజ వంశంలో జన్మించిన ఓ రుషి. ఇతనికి ఇద్దరు భార్యలు. మొదటి భార్య పితృ కన్యకవల్ల కల్యాణమిత్రుడు జన్మించాడు. అందగత్తె అయిన రెండవ భార్యను సూర్యుడు బలాత్కరించగా ఆమెకు అశ్వనీసుతుడు జన్మించాడు. సుతపుడు ఆమెను వేశ్యగా పరిగణించి ఆమెను అతడి కొడుకును పంపివేయగా శ్రీకృష్ణుని కోరికమేరకు వారిని తిరిగి పరిగ్రహించాడు. – బ్రహ్మవైవర్త పురాణం

**సుతపుడు 7 :** ఓ రుషి. ఇతడొకసారి ఉత్పలావతి అనే రాకుమారిని ప్రేమించి కోర్కెతీర్చమనగా ఆమె నిరాక రించినందుకు జంతువుగా జన్మించమని శపిస్తాడు. శాపవిమోచనం చేయమని అర్థించగా ఆమెను ఆశీర్వ దించి లోలుడను పుత్రుడు జన్మిస్తాడని తామస మన్వంతరంలో మనువు అవుతాడని చెప్తాడు.
– మార్కండేయ పురాణం

**సుతలం :** పాతాళంలో ఒక భాగం. – చూ॥ పాతాళం

**సుతసోముడు :** ఉపపాండవుల్లో ఒకడు. భీమసేన ద్రౌప దిలకు జన్మించాడు. ఇతడు విశ్వదేవుని అంశతో జన్మించాడు. ఇతడు చంద్రుని ఆశీర్వాదంతో జన్మిం చాడు. కనుక సుతసోముడని నామకరణం చేశారు. కురుక్షేత్ర యుద్ధం మొదటిరోజున కర్ణుడితో యుద్ధం చేశాడు. యుద్ధపు చివరి ఘడియల్లో అర్ధరాత్రి ఇతడు నిద్రిస్తున్న సమయంలో అశ్వత్థామ వధించాడు.
– మహాభారతం

**సుతార :** ఓ గంధర్వ కన్య. శాపగ్రస్తురాలు.
– చూ॥ ప్రమోహిని.

**సుతీక్ష్ణుడు :** ఓ రుషి. రామలక్ష్మణులు అరణ్యవాసంలో వున్నపుడు శరభాంగ, సుతీక్ష్ణుడి ఆశ్రమాలు దర్శించారు. ఒకసారి ఇంద్రుడితణ్ణి దేవలోకానికి ఆహ్వానించాడు. అప్పుడే సీతారామలక్ష్మణులు ఈ ఆశ్రమానికి రాగా ఇంద్రుడు రాముని కార్యక్రమానంతరం కలుస్తానని ఆశ్రమం వీడివెళ్లాడు. శ్రీరాముడు ఇతణ్ణి ఎక్కడ నివసించాలో చెప్పమని కోరగా తన ఆశ్రమంలోనే వుండమని చెప్తాడు. ఇతడు అగస్త్యుని సోదరుడు; శిష్యుడు. ఇతడు దుష్యన్యుడను క్రూరుడ్ని సద్గుణ సంపన్నుడిగా మార్చుతాడు. – రామాయణం

**సుతీర్థం :** కురుక్షేత్రంలోని ఓ ప్రాచీన పుణ్యస్థలం.

**సుతేజనుడు :** ధర్మజుడికి స్నేహితుడైన ఒకరాజు. – మహాభారతం

**సుతేజసుడు :** వసిష్ఠుడి కొడుకుల్లో ఒకడు. ఉత్తమ మనువు కాలంలో సప్తర్షుల్లో ఒకడు. – మార్కండేయ పురాణం

**సుత్రాముడు :** దేవేంద్రుడి పేరు.

**సుత్వ :** సామవేద ఆచార్యుడు, రుషి అయిన సుమంతుడి కొడుకు. – చూ॥ గురుపరంపర

**సుదక్షిణ :** దిలీప చక్రవర్తి భార్య. – చూ॥ దిలీపుడు

**సుదక్షిణుడు :** పౌండ్రకరాజు కుమారుడు. శ్రీకృష్ణుడు యుద్ధంలో ఇతణ్ణి సంహరించగా ఇతని తల కాశీలో పడింది. అతని కుమారుడు సుదక్షిణుడు తండ్రి చెవి పోగులను బట్టి తలను గుర్తించి శ్రీకృష్ణుడ్ని చంపాలని శివుడ్ని గూర్చి తపస్సు చేశాడు. శివుని సలహాపై ఓ భూతాన్ని సృష్టించి దాన్ని శ్రీకృష్ణుడిపైకి పంపగా శ్రీకృష్ణుడు తన సుదర్శన చక్రాన్ని ప్రయోగించగా అది ఆ భూతాన్ని సంహరించడమే కాక సుదక్షిణుడ్ని బూడిదచేసి తిరిగి ద్వారకక వచ్చింది. – భాగవతం

**సుదక్షిణుడు 2 :** కాంబోజ రాజ్యానికి రాజు. ఇతడు ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. మహాభారత యుద్ధంలో అక్షౌహిణి సైన్యంతోవచ్చి కౌరవులకు సహాయపడ్డాడు. ఓ గొప్పవీరుడు. అర్జునుడితణ్ణి సంహరించాడు. దానికి ప్రతిగా ఇతని తమ్ముడు అర్జునునిపై పోరాడి మరణించాడు. – మహాభారతం

**సుదక్షిణుడు 3 :** పాండవులపక్షాన పోరాడిన ఒక వీరుడు. ద్రోణుడు తన అస్త్రంతో ఇతణ్ణి రథంపై నుండి క్రిందకు పడగొట్టాడు. – మహాభారతం

**సుదత్త :** శ్రీకృష్ణుని భార్యల్లో ప్రముఖురాలు. ద్వారకలోని హేతుమానుడి భవంతిని ఈమెకిచ్చాడు. – మహాభారతం

**సుదర్శన :** అగ్నిదేవుని భార్యల్లో ఒకరు. ఇక్ష్వాకు వంశజుడైన దుర్యోధనుడను రాజు కుమార్తె. ఇతడిని నీలుడని అంటారు. సుదర్శన తల్లి నర్మద. సుదర్శన అందాలరాశి. ఆమె అందానికి ముగ్ధుడై అగ్ని దేవుడీమెను ప్రేమించి వివాహమాడతాననగా కన్యగా నాకు ఆ హక్కు లేదని తన తండ్రి అంగీకారం తీసు కొమ్మని కోరగా అగ్నిదేవుడు నీలుడ్ని అడగగా అగ్ని దేవుడే అడిగినపుడు కాదనలేక ఆమెను అగ్నిదేవుడి కిచ్చి వివాహం చేశాడు. కొన్ని పురాణాలలో నీలుడు మహిష్మతి రాజని కూడా పేర్కొనబడింది.

**సుదర్శన :** జంబూద్వీపంలోని ఓ వృక్షం. ఇది 11 వేల యోజనాల పొడవుంటుంది. – మహాభారతం

**సుదర్శనద్వీపం :** జంబూద్వీపానికి మరోపేరు. ఒకసారి సంజయుడు ఈ ద్వీపాన్ని గురించి ధృతరాష్ట్రుడికి వివరించాడు. – మహాభారతం

**సుదర్శనుడు 1 :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. శ్రీకృష్ణుని సమకాలీనుడు. దేవతలు కూడా ఇతణ్ణి గౌరవించేవారు. నగ్నజిత్తు అనే రాజు ఇతణ్ణి బంధించి కారాగారంలో వుంచగా శ్రీకృష్ణుడు నగ్నజిత్తును తక్కిన రాజుల్ని ఓడించి సుదర్శనుడ్ని కారాగారం నుండి తప్పించాడు. – మహాభారతం

**సుదర్శనుడు 2 :** కౌరవుల పక్షాన పోరాడిన రాజు. సాత్యకి ఇతణ్ణి వధించాడు. – మహాభారతం

**సుదర్శనుడు 3 :** మాల్వదేశపు రాజు. ఇతడు పాండవుల పక్షాన పోరాడాడు. అశ్వత్థామ ఇతణ్ణి సంహరించాడు.

**సుదర్శనుడు 4 :** ధృతరాష్ట్రుని కొడుకుల్లో ఒకడు. ఇతడు భీమసేనుడితో పోరి అతడిచేతిలో మరణించాడు. – మహాభారతం

**సుదర్శనుడు 5 :** కోసల రాజైన ధృవసంధి కుమారుడు. ఇతడు మనోరమ కొడుకు. – చూ॥ ధృవసంది

**సుదర్శనుడు 6 :** రుషభుని కొడుకైన భరతుని ఐదుగురు కొడుకుల్లో ఒకడు. విశ్వరూపుడి కుమార్తె పంచజనని భరతుడు వివాహమాడగా వారు జన్మించారు.

**సుదర్శనుడు 7 :** సుదర్శన అగ్నిదేవులకు జన్మించిన పుత్రుడు. ఇతడు ఓఘవానుడి పుత్రిక ఓఘవతిని వివాహమాడెను. సుదర్శనుడు మేధావి, ధర్మచరితుడు. వీరు కురుక్షేత్రంలో నివసించేవారు. అతిథులను గౌరవించడం విధి అని, తను లేనప్పుడు కూడా అతిథులను గౌరవంతో చూడమని ఒకవేళ శరీరాన్ని ఆశించినా అర్పించాలని భార్యకు చెప్పాడు. భార్య అందుకు తన అంగీకారం తెల్పింది. సుదర్శనుడు మృత్యువును జయించడానికి ప్రయత్నిస్తుంటే మృత్యువు ఇతడిలోని ఏదో ఒక చెడును చూసి కబళించాలని ప్రయత్నిస్తోంది. ఒకరోజు సుదర్శనుడు అడవికి వెళ్ళగా ఓ బ్రాహ్మణుడు అతిథిగా వచ్చాడు. ఓఘవతి అన్ని సపర్యలు చేసింది. బ్రాహ్మణుడు ఆమె సాంగత్యాన్ని కోరగా భర్త మాటలను గౌరవించి ఆమె అతడితో గడిపింది. ఆ సమయంలో ఇంటికి వచ్చి తలుపులు తీసివుండట చూసి సుదర్శనుడు కేకలు వేయగా బ్రాహ్మణుడు జరిగింది వివరించినా సుదర్శనుడిలో ఏ మార్పు రాలేదు. అప్పుడు బ్రాహ్మణుడు ధర్మదేవుడిగా నిజరూపుడై సుదర్శనుడ్ని దీవించాడు. దీనివల్ల ఓఘవతి సగం శరీరం ఓఘవతి నదిగా మారగా తక్కిన సగం సుదర్శనుడి ఆత్మలో కలిసింది. అలా సుదర్శనుడు మృత్యువును జయించాడు.

**సుదర్శనుడు 8 :** ఓ విద్యాధరుడు. ఇతడు గంధర్వ కన్యలతో దేవలోకంలో విహరిస్తూ అంగిరసుడు ఇతర రుషులు అటురాగా వారిని తూలనాడగా అంగిరసుడు ఓ సర్పం కమ్మని శపించాడు. శాపవిమోచనాన్ని కోరగా శ్రీకృష్ణుడు నిన్ను తాకినపుడు శాపవిమోచనం అవుతుందంటాడు. ద్వాపర యుగంలో కాళింది నదిలో సర్పంగా జీవించాడు. నందగోపుడ్ని తన నోటితో కరచుకోగా తక్కిన గోపాలురు భయ కంపితులుకాగా శ్రీకృష్ణుడు ఆ సర్పాన్ని బలంగా లాగి విసిరి వేయగా గంధర్వరూపుడై దేవలోకం వెళ్ళాడు. - భాగవతం

**సుదర్శనుడు 9 :** ఓ బ్రాహ్మణుడు. పాపచరితుడు. ఎన్నో పాపాలు చేసి ధర్మ వ్యతిరేకంగా జీవించి 100 మన్వంతరాలు నరకంలో వుండి తర్వాత రాబందుగా పుట్టాడు. ఆ తర్వాత కాకిగా జన్మించి విష్ణువుకాళ్ళు కడిగిన నీళ్ళుపడి మోక్షం లభించి స్వర్గం చేరాడు.

**సుదర్శనుడు 10 :** మనువు కుటుంబంలో జన్మించిన దీర్ఘబాహుడి కొడుకు. ఇతడు ఎన్నో రాజ్యాలను జయించాడు. వసిష్ఠుడితని పురోహితుడు. ఒకసారి మహాకాళి ప్రత్యక్షమై ప్రళయం వస్తుందని వషిష్ఠుడితో కలసి హిమాలయాలలో వుండమని సలహానివ్వగా దాన్ని పాటిస్తాడు. 10 సంవత్సరాలు జలప్రళయానంతరం తిరిగి అయోధ్యకు వస్తాడు.

- భవిష్యపురాణం

కాళికాపురాణంలో హిమాలయాల్లోని ఓ చిన్నముక్కను తీసుకొచ్చి దానిపై ఖాండవ నగరాన్ని నిర్మించుకొని పాలించాడని ఆ తర్వాత భైరవ వంశజుడైన విజయుడు ఇతణ్ణి సంహరించాడని చెప్తోంది.

★ **సుదర్శనం (సుదర్శనచక్రం) :** మహావిష్ణువు ఆయుధం. సూర్యుడు విశ్వకర్మ కుమార్తె సంజ్ఞను వివాహమాడాడు. అతని వేడిని భరించలేక తండ్రికి చెప్పగా విశ్వకర్మ సూర్యుడ్ని ఓ తిరిగే యంత్రంలో పెట్టిసానబెట్టగా ఆ పొడితో విశ్వకర్మ సుదర్శన చక్రాన్ని, పుష్పకవిమానాన్ని, త్రిశూలాన్ని, శక్తిని తయారుచేసి సుదర్శనచక్రాన్ని మహావిష్ణువుకిచ్చాడు. *శక్తి :* ఈ సుదర్శన చక్రం అతిశక్తివంతమైనది. శత్రువుల కూటమిలోకి వెళ్ళి విధ్వంసం సృష్టిస్తుంది. మహావిష్ణువు తలచగానే ఈ చక్రం సూర్యగోళంలో సూర్యునివలె ప్రకాశిస్తూ అగ్నిని, వేడిని సృష్టించి శతృవుల్ని నాశనం చేసి తిరిగి విష్ణువు చేతికి వస్తుంది.

- విష్ణుపురాణం

**సుద్యుడు :** యయాతివంశంలోని ఒకరాజు. నమస్యుని మనుమడు. చారుపాదుడి కొడుకు. - భాగవతం

**సుద్యుమ్నుడు 1 :** చాక్షుస మనువు కుమారుల్లో ఒకడు. ప్రజాపతి వైరాజ్యకుమార్తె నడ్వలకు చాక్షుష మనువుకు జన్మించిన 50 మంది ప్రసిద్ధ సంతతిలో ఇతడొకడు.

- విష్ణుపురాణం.

**సుద్యుమ్నుడు 2 :** ఒకరాజు. ఒకే జన్మలో స్త్రీగా జన్మించి పురుషుడుగా మారి మరల స్త్రీగా మారాడు.

★ మహావిష్ణువు అవతారాలలో శ్రీకృష్ణుడు మాత్రమే ఈ సుదర్శన చక్రాన్ని తరచు వాడినట్లుగాను ఇది ఖాండవ దహన సమయంలో అగ్ని శ్రీకృష్ణుడికి ఇచ్చి నట్లుగా మహాభారతంలో చెప్పబడింది.

ఈ రాజర్షి యముని కొలువులో అతణ్ణి పూజిస్తుం టాడు. ఇతడు పాలనచేసే సమయంలో న్యాయపాల నకోసం లిఖితుడనే రుషి రెండు చేతులు నరికాడు. ఇతడు రాజధర్మాన్ని అన్నివేళలా పాటించడంవల్ల స్వర్గప్రాప్తి లభించింది.

**సుధామని :** వసుదేవుడి తమ్ముడైన అనీకుడి భార్య.

**సుధాముడు 1 :** జనకుని మంత్రుల్లో ఒకరు. – రామాయణం

**సుధాముడు 2 :** దాశర్గ రాజుల్లో ఒకడు. ఇతనికిద్దరు కుమార్తెలు. వీరిలో ఒకరు విదర్భరాజైన భీముడ్ని వివాహమాడింది. మరొకరు చేదిరాజైన వీరబాహుడ్ని వివాహమాడింది. – మహాభారతం

**సుధాముడు 3 :** సుబ్రహ్మణ్యస్వామి సేవకుల్లో ఒకరు. – మహాభారతం

**సుధాముడు 4 :** ఓ గోవులకాపరి. రాధ శాపంవల్ల అసురుడిగా జన్మించాడు. – చూ॥ రాధ, తులసి

**సుధాముడు 5 :** పాండవుల తరఫున పోరాడిన వీరుడు. – మహాభారతం

**సుధాముడు 6 :** కంసుని ఉద్యానవన సంరక్షకుడు. ఇతడు పూలదండలతో శ్రీకృష్ణబలరాముల్ని పూజించాడు.

**సుధాముడు 7 :** కుచేలుని చిన్ననాటి పేరు. – చూ॥ కుచేలుడు

**సుధామం 1 :** ఉత్తరభారతదేశంలోని ఒక రాజ్యం. అర్జునుడు దీన్ని జయించాడు. – మహాభారతం

**సుధామం 2 :** పురాణప్రసిద్ధమైన నది. కేకయరాజ్యం నుండి తిరిగి అయోధ్యకు వస్తూ ఈ నదిని దాటాడు. – రామాయణం

**సుదాసుడు 1 :** కోసలరాజ్య రాజుల్లో ఒకడు. ఇతడు ప్రాతఃసంధ్యాకాలాల్లో స్మరించదగ్గ వ్యక్తి. – మహాభారతం

**సుదాసుడు 2 :** ఓ ఆర్యరాజు. ఇతడ్ని విశ్వామిత్రుడు ప్రమాదం నుండి రక్షించాడు. – ఋగ్వేదం

**సుదాసుడు 3 :** ఓ అయోధ్య రాజు. సర్వకాముడి కొడుకు. కల్మషపాదుడికి తండ్రి. – భాగవతం

**సుదినం :** కురుక్షేత్రంలో ఓ పుణ్యస్థలం. ఈ తీర్థంలో స్నానం చేస్తే సూర్యలోకం వెళ్తారు. – మహాభారతం

**సుదేవి 1 :** అరిహుడను అంగరాజు కుమార్తె. ఋక్షుడను రాజు ఈమెకుమారుడు. – మహాభారతం

**సుదేవి 2 :** దశార్హుని వంశంలో జన్మించిన రాజకు మారి. పూరువంశరాజైన నికుంభుడీమను వివాహ మాడగా వీరికి అజమీడుడు జన్మించాడు. – మహాభారతం

**సుదేవి 3 :** మనువు కుమారుడైన ఇక్ష్వాకుని భార్య. ఈమె దేవవ్రతుడను కాశీరాజు కుమార్తె. రాజు అడవికి వేటకువెళ్ళి శాపవశాన ఆడపందిగా వున్న ఓ బ్రాహ్మ ణస్త్రీకి తను ఓ సంవత్సరకాలం చేసిన పుణ్యాన్ని దానం చేసి శాపవిమోచనం కల్గిస్తాడు. ఇక్ష్వాకు సుదే విలు విష్ణువు అవతారమని భావిస్తారు.

*శాపం–శాపవిమోచన కథ :* ఇక్ష్వాకు రాజు తన భార్యతో అడవికి వేటకువెళ్ళగా ఓ మగపంది ఇక్ష్వాకు డితో పోరాడతాననగా అటవికుల్నే చూసి పారిపోయే నువ్వు రాజుతో ఎలా పోరాడతావని అడగగా అతడితో పోరాడి స్వర్గం చేరతాననగా ఆడపంది వారి సంతానం ఇక్ష్వాకుడిపై పడగా తనబాణంతో మగపందిని సంహ రించగా ఓ గంధర్వుడు ఆ పంది శరీరం నుండి బయ టకువచ్చి ఆకాశమార్గాన పైకి వెళ్తుండగా ఆ రాజు భార్య సుదేవి ఆడపందిని పిలవగా గాయాలతో వచ్చి తన భర్త పూర్వజన్మను గూర్చి వివరిస్తుంది. నా భర్త రంకవిద్యాధరుడను గంధర్వుడు. పులస్త్యుడు తపస్సు చేసుకుంటున్న ఆశ్రమంవద్ద అతడు పాటలు పాడుతుండగా పులస్త్యుడు తన ఆశ్రమాన్ని వేరే చోటకు మార్చుకున్నాడు. అక్కడికి కూడా వెళ్ళి పుల స్త్యుడిని తన పాటలతో తపభంగం చేయగా అతడు పందిగా జన్మించమని శపించాడు. నా భర్త ఇంద్రుని కోరుకోగా ఇంద్రుని కోరికపై ఇక్ష్వాకుని బాణానికి హతుడైనపుడు శాపవిమోచనం జరుగుతుందని చెప్పాడు. ఇప్పుడు శాపవిమోచనమై గంధర్వుడిగా నిజరూపుడయ్యాడని చెప్పి ఇక్ష్వాకుని భార్య ఒకరోజు చేసిన పుణ్యాన్ని నాకు దానం చేస్తే నాకు శాపవిమో చనమౌతుందని కోరగా ఈమె కథను చెప్పుమంటుంది. నేను వసుదత్తుడను బ్రాహ్మణుని కుమార్తెను. నా పేరు సుదేవ. అతి ప్రేమవల్ల నేను ఎవ్వరిని లెక్కచేయలేదు. శివశర్మ అనే బ్రాహ్మణుడు నన్ను వివాహమాడాడు. అతడొక విద్యాపారంగతుడు. అతడిని లెక్కచేయక

అనాగరికంగా వ్యవహరించగా నా తండ్రి నన్ను ఇంటి నుండి వెళ్ళ గొట్టగా ఎన్నో దేశాలు తిరిగి ఓ ఇంటికి ఆహారం కోసం వెళ్ళి నా భర్త మంగళ అనే భార్యతో సుఖ జీవనం చేస్తుండటం చూసి సిగ్గుపడ్డాను. భార్యా భర్తలు నాకు ధనం, నగలు ఇచ్చారు. అంతరంగంలో బాధపడి మరణించుచూ ఆ తర్వాత ఎన్నో జంతువుల పునర్జన్మలెత్తి ఇప్పుడు ఆడపందిగా జీవిస్తున్నాను. మహావిష్ణువు అవతారమైన ఇక్ష్వాకు లక్ష్మీ అవతార మైన మీరు ఒకరోజు పుణ్యాన్ని దానమిస్తే స్వర్గానికి చేరతాననగా వారు ఆ దానం చేయగా ముక్తి లభించి స్వర్గం చేరుతుంది. – పద్మపురాణం

**సుదేవుడు 1 :** విదర్భరాజు అంతరంగికుడైన ఓ బ్రాహ్మణుడు. దమయంతిని వెతకడానికి రాజితణ్ణి పంపాడు. – *చూ॥ దమయంతి*

**సుదేవుడు 2 :** అంబరీష చక్రవర్తి సేనాని. ఇతడు అత్యంత ధైర్యశాలి. ఇతడు యుద్ధంలో మరణించి స్వర్గం చేరాడు. అంబరీషుడు స్వర్గం వెళ్ళినప్పుడు ఇతణ్ణి చూసి "ఇతడికి స్వర్గప్రాప్తి ఎలా కలిగిందని" ఇంద్రుడ్ని ప్రశ్నించగా యుద్ధంలో వీరోచిత మరణం సంభవిస్తే స్వర్గం ప్రాప్తికలుగుతుంది." అని ఇంద్రుడు చెప్పగా ఆ వివరాలు అంబరీషుడు కోరతాడు. సుదేవుడొకసారి అంబరీషుని ఆజ్ఞపై అసురులపై యుద్ధానికి వెళ్ళి ఆ సైన్యాన్ని చూసి శివుడ్ని గూర్చి తపస్సు చేసి తన శక్తినంతా ఉపయోగించి అసురుల్ని వధించి అదే యుద్ధంలో అతడు మరణించాడు. అందువల్ల స్వర్గం చేరాడని ఇంద్రుడు చెప్పాడు. – మహాభారతం

**సుదేవుడు 3 :** కాశీరాజైన హర్యాశ్వుడి కొడుకు. తండ్రి మరణానంతరం కాశీకి రాజయ్యాడు. ఆ వెంటనే వితహవ్యుడను రాజు పుత్రులు ఇతణ్ణి బందీని చేశారు. తర్వాత దివోదాసు కాశీకి రాజయ్యాడు. – *మహాభారతం*

**సుదేవుడు 4 :** ఓ ప్రసిద్ధ రాజు. ఇతడు క్షత్రియుడైనా శాపవశాన వైశ్యుడై శాపవిమోచనానంతరం తిరిగి క్షత్రియుడౌతాడు.

*శాపం – విమోచనం :* ధూమ్రక్షుని చుట్టము సుదేవుడి స్నేహితుడు అయిన నలుడు బాగా మద్యం సేవించి ప్రమతి అనే రుషి భార్యను బలాత్కరించగా ప్రమతి సుదేవుడిని రక్షించమని కోరగా "నేను వైశ్యుడను" అని సుదేవుడు తప్పించుకోగా ప్రమతి అయితే నీవు వైశ్యుడివే అగుగాక అని శపిస్తుంది. సుదేవుడు తన తప్పు తెలుసుకొని శాపవిమోచనం కోరగా నీ పుత్రికను ఓ క్షత్రియుడు ఎత్తుకుపోయినపుడు శాపవిమోచనం కల్గుతుందని చెప్తుంది. నాభాగుడను రాజు సుదేవుడి కుమార్తె సుప్రభను బలవంతంగా ఎత్తుకు పోగా సుదేవుడికి శాపవిమోచనమై క్షత్రియుడననే భావం కల్గుతుంది. – మార్కండేయ పురాణం

**సుదేష్ణ 1 :** మత్స్యదేశ రాజైన విరాటుని భార్య. ఈమె కేకయరాజు కుమార్తె. ఈమె మరో పేరు చిత్ర. పాండవుల అజ్ఞాతవాసంలో ద్రౌపది ఈమెకు పరిచారికగా వుంది. కీచకుని మోహం కాదనజాలక సుదేష్ణ ద్రౌపదిని కీచకుని వద్దకు పంపింది. కీచకుని మరణానంతరం ద్రౌపదిని వెళ్ళిపొమ్మని కోరింది. ఉత్తరాభిమన్యుల వివాహానికి ఉపప్లావ్యం వెళ్ళింది.

**సుదేష్ణ 2 :** బలి అనే రాజు భార్య. దీర్ఘ తమసుడను రుషివల్ల ఈమెకు ఐదుగురు కుమారులు జన్మించారు. వారు అంగ, వంగ, కళింగ, పాండు, సుహ్మలు. – *భాగవతం*

**సుదేష్ణుడు :** శ్రీకృష్ణుడికి రుక్మిణికి జన్మించిన కుమారుడు. – *భాగవతం*

**సుదేష్ణం :** పురాణ ప్రసిద్ధమైన భారతావనిలోని ఓ రాజ్యం. – *మహాభారతం*

**సుధమషుడు 1 :** ఇతడు కురువంశపురాజు. ఇతడు కురుక్షేత్రాన్ని నిర్మించిన కురురాజు కొడుకు. ఇతని సోదరులు సుధన్వుడు, పరీక్షిత్తు, అరిమేజయుడు. – *అగ్నిపురాణం*

**సుధమషుడు 2 :** సుహోత్రుడి తండ్రి. ఉపరిచర వసువు ఇతని వంశంలోనే జన్మించాడు. – *భాగవతం*

**సుధమషుడు 3 :** పాంచలరాజైన ద్రుపదుని కుమారుల్లో ఒకడు. గొప్పవీరుడు. ఇతడి సోదరుడు వీరకేతుడు. వీరకేతుడు మరణించగా తన సోదరులందరితోకూడి ద్రోణుడితో పోరాడి అతడి చేతిలో మరణించాడు. – *మహాభారతం*

**సుధన్వుడు 1 :** బ్రహ్మ సృష్టి మొదలుపెట్టినపుడు నాల్గు వైపుల కాపలా నియమించాడు. తూర్పున సుధన్వుడు, దక్షిణాన శంఖపాదుడు, పశ్చిమాన కేతుమానుడు, ఉత్తరాన హిరణ్యరోముడ్ని నియమించాడు. – అగ్నిపురాణం.

**సుధన్వుడు 2 :** అంగిరసుని కొడుకు. ఇతడు అంగిర సుడి 8వ కుమారుడు. ప్రహ్లాదుని కొడుకు విరోచ నుడు, ఇతడు కేశిని అనే అప్సరసను వివాహమాడటా నికి పోటీపడ్డారు. ఇతడు అంపశయ్యపై గల భీష్ముడ్ని దర్శించాడు. ఇతడు సుబ్రహ్మణ్యస్వామికి ఓ రథాన్ని బహూకరించాడు. ఇతనికి ముగ్గురు కొడుకులు. రుభుడు, విభుడు, వాజుడు.

– మహాభారతం, రుగ్వేదం

**సుధన్వుడు 3 :** పాండవులతో పోరాడిన ఓ వీరుడు. అర్జునుడితణ్ణి సంహరించాడు. – మహాభారతం

**సుధన్వుడు 4 :** ద్రుపదుని కుమారుడు. సుధనాషుడి సోదరుడు. వీరకేతుణ్ణి ద్రోణుడు చంపగా ఇతడు సుధనుషుడు ఇతర సోదరులు ద్రోణుడితో పోరాడగా ఆ యుద్ధంలో ఇతడు మరణించాడు. – మహాభారతం

**సుధన్వుడు 5 :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. మాంధాత ఇతడ్ని ఓడించాడు. – మహాభారతం

**సుధన్వుడు 6 :** సాంఖాస్యరాజు. ఇతడు మిథిలా నగరాన్ని తన సైన్యంతో ముట్టడించి నగరాన్ని సీతను తనకు ఇవ్వమనగా యుద్ధం జరిగి ఆ యుద్ధంలో ఇతడు చనిపోగా సాంఖాస్య రాజ్యాన్ని జనకుడు తన సోదరుడు కుశధ్వజుడికిచ్చాడు. – రామాయణం

**సుధర్మ 1 :** దేవతల సమావేశ మందిరం. – భాగవతం

**సుధర్మ 2 :** యాదవుల సమావేశ మందిరం. దీనిని దాశార్హి అనికూడా పిలుస్తారు. ఇది ఒక యోజనం పొడవు. ఒక యోజనం వెడల్పు వుంటుంది. అర్జునుడు సుభద్రను ఎత్తుకుపోయినపుడు యాదవ సైనికులు ఈ మందిరానికి వచ్చి నివేదించారు.

– మహాభారతం

**సుధర్మ 3 :** ఇంద్రుని రథాన్ని తోలే మాతాలి భార్య. మాతాలికి ఈమె వల్ల గుణకేశి అనే పుత్రిక జన్మించింది.

– మహాభారతం

**సుధర్ముడు 1 :** వృష్ణి వంశపు రాకుమారుడు. ఇతడు యుధిష్ఠురుని కొలువులో సభ్యుడు. అర్జునుని వద్ద ధనుర్విద్య నేర్చుకున్నాడు.

**సుధర్ముడు 2 :** దాశర్గ రాజు. ఇతడి యుద్ధ విన్యాసాలు మెచ్చి తన సేనకు నాయకుడ్ని చేశాడు.

–మహాభారతం

**సుధర్ముడు 3 :** పాండవులకు వ్యతిరేకంగా పోరాడిన వీరుడు. – మహాభారతం

**సుధామ 1 :** కుశద్వీపంలోని ఓ బంగారు పర్వతం.

– మహాభారతం

**సుధామ 2 :** ఘృతపృస్థుడనురాజు కొడుకుల్లో ఒకడు.

– మహాభారతం

**సుధాములు :** దేవతల్లో ఓ గణం. మూడవ మన్వం తరంలో మనువుపేరు ఉత్తముడు. దేవతలకు పాలకుడు సుశాంతి అనే ఇంద్రుడు. దేవగణాలు ఐదు. ఒక్కొక్క గణంలో 12 మంది సభ్యులు. ఆ గణాలు సత్యులు, జపులు, ప్రతర్థనులు, సుధాములు, వశవర్తినులు.

**సుధిలు :** తామస మన్వంతరంలో ఓ దేవగణం. ఈ మన్వంతరంలో నాల్గుదేవగణాలున్నాయి. అవి : సపా రులు, హరి, సత్యులు, సుధిలు. ప్రతిగణంలో 27 మంది దేవతలుంటారు.

**సుధేష్ణుడు :** రుక్మిణీ కృష్ణుల కొడుకు. – భాగవతం

**సధృతి :** విదేహరాజైన సత్యధృతికి గల మరోపేరు. ఇతడు మహావీర్యుడి కొడుకు. దృష్టకేతుకు తండ్రి.

– భాగవతం

**సుధృష్టం :** పురాణప్రసిద్ధమైన భారతావనిలోని ఓ రాజ్యం. – మహాభారతం

**సునయుడు :** ఒకరాజు. పరిప్లవుడను రాజుకొడుకు. మేధావికి తండ్రి. ఇతడి పురోహితుడు ప్రమతి.

– భాగవతం, మహాభారతం

**సునయం :** పురాణప్రసిద్ధమైన ఓ ప్రాంతం.

– మహాభారతం

**సునంద 1 :** కేకయ రాజకుమారి. కురువంశరాజైన సార్వభౌముడీమెను వివాహమాడాడు. వీరికి జయత్సే నుడు జన్మించాడు. – మహాభారతం

**సునంద 2 :** కాశీరాజైన సర్వసేనుడి కూతురు. దుష్యంతుని కుమారుడైన భరతుడు ఈమెను వివాహ మాడాడు. భుమన్యుడు వీరికి జన్మించాడు.

– మహాభారతం

**సునంద 3 :** చేదిరాజైన సుభాహుడి సోదరి. ఈమెను దమయంతికి తోడు పంపాడు. సుభాహుడనే బ్రాహ్మ ణుడితో దమయంతి మాట్లాడటం విని రాజమాతకు తెలియజేస్తుంది. సునంద, సూరబాహుల తండ్రి వీర బాహుడు. – మహాభారతం

**సునంద 4 :** శిబి రాజ్య రాజకుమారి. చంద్ర వంశపు రాజైన ప్రతాపుడీమెను వివాహమాడాడు. వీరికి దేవాపి, శంతను, బాల్హికులు జన్మించారు. - మహాభారతం

**సునందుడు 1 :** ఓ గోపాలుడు. - చూ॥ ఉగ్రసేనుడు.

**సునందుడు 2 :** ప్రద్యోతుడను రాజు కొడుకు. ఇతడి మరణంతో నైమిశారణ్యంలోని రుషులు ప్రపంచం నీచమైనదని భావించి హిమాలయాలకు వెళ్లి విష్ణు పురాణం పఠించారు. - భవిష్య పురాణం

**సునందం :** విశ్వకర్మ నిర్మితమైన ముసలాయుధం. ఇది కుజంభుడనే రాక్షసుడి దగ్గర వుండేది. స్త్రీ స్పర్శ తగిలితే దీని శక్తి నశిస్తుంది. ముదావతి దీన్ని అంటు కోవడం వల్ల దీని శక్తి నశిస్తుంది. - మార్కండేయ పురాణం.

**సునక్షత్రుడు :** భరతవంశంలోని ఒకరాజు. ఇతడు నిరమిత్రుడి కొడుకు. బృహత్సేనుడి తండ్రి. - భాగవతం

**సునర్తకనటుడు :** పార్వతి తపస్సులో వుండగా మారు రూపంలో పార్వతి వద్దకు వెళ్ళినపుడు అతడు పెట్టుకున్నపేరు. - శివస్తోత్ర శతకం

**సునస :** పారిపత్ర పర్వతాన్నుండి జనించే నది.

**సునాభుడు (పద్మనాభుడు) 1 :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో భీముడితణ్ణి వధించాడు. - మహాభారతం

**సునాభుడు 2 :** వరుణుడి మంత్రి. ఇతడు పిల్లలు మనుమలతో పుష్కరతీర్థం వద్ద వరుణుడిని పూజిస్తూ జీవిస్తాడు. - మహాభారతం

**సునాభుడు 3 :** ఓ దానవుడు. వజ్రనాభుడి సోదరుడు. ఇతని కుమార్తెలైన చంద్రవతి, గుణవతిలను గద, సాంబులు ఎత్తుకుపోతారు. - హరివంశం

**సునాభం :** ఓ పర్వతం. దీని దేవత కుబేరుణ్ణి పూజి స్తుంటుంది. - మహాభారతం

**సునాముడు 1 :** సుకేతుడికొడుకు. ఇతడు ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. - మహాభారతం

**సునాముడు 2 :** ఉగ్రసేనుడి కొడుకు. కంసుని సోదరుడు. ఇతణ్ణి బలభద్రరాముడు, శ్రీకృష్ణుడు సంహరించారు.

**సునాముడు 3 :** గరుడుని కొడుకు. ఇతనికి చాలా సంతానం కలదు. - మహాభారతం

**సునాముడు 4 :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. - మహాభారతం

**సునీథి :** మృత్యుదేవత మానస పుత్రిక. ముల్లోకాలలో అందమైనదని ప్రసిద్ధి. అంగుడివల్ల కేశుడనే పుత్రుడికి జన్మనిచ్చింది. - చూ॥ కేశుడు

సునీథి; *ధృవుని తల్లి :* స్వాయంభవ మనువుకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అని ఇద్దరు కుమారులు. ఉత్తానపాదుడికి సురుచి, సునీథి భార్యలు. సురుచికి ఉత్తముడు, సునీథికి ధృవుడు జన్మించారు. తండ్రికి ధృవుడన్నా అతని తల్లి సునీథి అన్నా మక్కువ లేదు. - చూ॥ ఉత్తానపాదుడు

**సునీథుడు 1 :** ఓ మహర్షి. ఇంద్రుని కొలువులో అతణ్ణి పూజిస్తుంటారు. - మహాభారతం

**సునీథుడు 2 :** యముని కొలువులో అతణ్ణి పూజిస్తుండే ఒకరాజు. - మహాభారతం

**సునీథుడు 3 :** శిశుపాలుడి మరోపేరు. - చూ॥ శిశుపాలుడు.

**సునీథుడు 4 :** సునీత రాజ్యానికి రాజు. యుధిష్ఠరుడు రాజవ్వడానికి ఈర్ష్యపడ్డాడు. - మహాభారతం

**సునీథుడు 5 :** వృష్ణి వంశపు రాజుల్లో ఒకడు. శ్రీకృష్ణుని కుమారుడు ప్రద్యుమ్నుడితనికి ధనుర్విద్య నేర్పాడు. - మహాభారతం.

**సునీథుడు 6 :** భరతవంశపు రాజు. సుషేనుడి కొడుకు. - భాగవతం

**సునీథం :** ఓ రుక్కు. దాని పఠనం చేయడంవల్ల సర్పాలను దూరంగా వుంచవచ్చు. - మహాభారతం

**సున్హుడు :** అంగదేశపు రాజు. సుబ్రహ్మణ్యుడు ఇతని మరో పేరు. బలి చివరి కొడుకు. సౌన్య నగరాన్ని నిర్మించారు.

**సునేత్రుడు :** ధృతురాష్ట్రుడి సంతానంలో ఒకడు. కుండక, హస్తి, వితర్క, క్రాథ, కుండిన, హరిశ్రక, భుమన్యు, ప్రతీప, ధర్మనేత్ర, అపరాజ ఇతని సోదరులు. - మహాభారతం

**సుపర్ణ :** చూ॥ పార్వతి

**సుపర్వనుడు :** భగదత్తుని మరోపేరు.
– చూ॥ భగదత్తుడు

**సుపర్ణుడు 1 :** ఓ దేవ గాంధర్వుడు. కశ్యప ప్రజాపతికి ముని అనే భార్యవల్ల జన్మించాడు. – మహాభారతం

**సుపర్ణుడు 2 :** ఓ దేవ గాంధర్వుడు. కశ్యప ప్రజాపతికి అతని భార్య ప్రధవల్ల జన్మించాడు. – మహాభారతం

**సుపర్ణుడు 3 :** మయూరాసురుడి సోదరుడు. ఇతడు తర్వాతి జన్మలో కాలకీర్తి అనే రాజుగా జన్మించాడు.
– మహాభారతం

**సుపర్ణుడు 4 :** గరుడుని మరో పేరు. – మహాభారతం

**సుపర్ణుడు 5 :** సాత్వ ధర్మాన్ని వాయుదేవుడికి బోధించిన మహర్షి. తపస్సు క్రమశిక్షణతో ఆచరించి ముక్తినొందాడు. – మహాభారతం

**సుపర్ణుడు 6 :** మహావిష్ణువు మరొకపేరు. **– మ.భా.**

**సుపారులు :** తామస మన్వంతరంలో ప్రసిద్ధులైన దేవ గణం. ఈ మన్వంతరంలో వీరుగాక మరో మూడు రకాల గణదేవతలుండేవారు.

**సుపార్శ్వుడు 1 :** ఓ క్షత్రియరాజు. ఇతడు కపటుడను అసురుని పునర్జన్మ. – మహాభారతం

**సుపార్శ్వుడు 2 :** యయాతి వంశంలో జన్మించిన ఒకరాజు. దృఢనేమి కొడుకు; సుమతికి తండ్రి.
– భాగవతం

**సుపార్శ్వుడు 3 :** ప్రహస్తుని సోదరుడైన అసురుడు. ఇతడు రావణుని మంత్రి. చూడుము:అకంపనుడు.

**సుపార్శ్వుడు 4 :** సంపాతి కొడుకు. సంపాతి ముసలి తనంలో ఇతడు సంరక్షించాడు. – రామాయణం

**సుపార్శ్వం :** జంబూద్వీపంలోని ఒక పర్వతం. ఈ పర్వత శిఖరాగ్రంపై మహాకాదంబం అనే వృక్షం వుంది. ఆ చెట్టు తొర్ర నుండి 5 ఐదు నదులు జన్మించి ఇలావృత్తానికి పశ్చిమ తీరానికి ప్రవహిస్తాయి. దేవ తలు ఈ నదుల నీటిని త్రాగడంవల్ల వారు వదిలేగాలి వల్ల 100 యోజనాలు సువాసనలు వెదజల్లుతుంటుంది.
– దేవీభాగవతం

**సుపుంజకుడు :** విప్రచిత్త సింహికల కొడుకు. ఇతడ్ని పరశురాముడు వధించాడు. – బ్రహ్మాండపురాణం.

**సుపుణ్య :** పురాణ ప్రసిద్ధమైన ఓ నది. – మహాభారతం

**సుపుష్ట :** మహాభీముడి భార్య. అయితానీకుడి తల్లి.
– మహాభారతం

**సుప్తఘ్నుడు :** మలయవానుడను అసురుడికి సుందరి వల్ల జన్మించిన ఏడుగురు పుత్రుల్లో ఒకడు.
– చూ ॥ సుందరి, మలయవానుడు

**సుప్రజ :** భానుడను అగ్ని భార్య. భానుడికి సుప్రజ, బృహదశ్వ అను ఇద్దరు భార్యలు. వారిద్దరిలో ఒక్కొక్క రికి ఆరుగురు సంతానం. – మహాభారతం

**సుప్రతర్ధనుడు :** ప్రాచీన భారతావనిలో ఒకరాజు. ఇతడు అర్జున కృపాచార్యులమధ్య జరిగిన యుద్ధాన్ని చూశాడు. – మహాభారతం

**సుప్రతిముడు :** ప్రాచీనకాలంలోని రాజుల్లో ముఖ్యుడని సంజయుడు వివరించాడు. – మహాభారతం

**సుప్రతిష్ఠ :** సుబ్రహ్మణ్యుడి సేవిక. – మహాభారతం

**సుప్రతీకుడు 1 :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు.
– మహాభారతం

**సుప్రతీకుడు 2 :** ఓ మహర్షి, ఇతణ్ణి, ఇతని సోదరుడు విభావసుడు ఏనుగువు కమ్మని శపించాడు.
– చూ॥ గరుడుడు

**సుప్రతీకుడు 3 :** ఓ యక్షుడు. – చూ॥ గుణాఢ్యుడు

**సుప్రతీకం 1 :** ఓ దిగ్గజం. భూమిని మోసే అష్టదిగ్గ జాల్లో ఒకటి. ఐరావత, వామన, కుముద, అంజన ఈ సుప్రతీకం సంతతి. –మ.భా.

**సుప్రతీకం 2 :** భగదత్తుని ఏనుగుపేరు. ఎన్నో వీరోచిత కార్యాలు చేసిన ఈ ఏనుగు కురుక్షేత్ర యుద్ధంలో అర్జునుడి చేతిలో మరణించింది. – మహాభారతం

**సుప్రభ 1 :** శ్రీకృష్ణుని భార్య. ద్వారకలోని పద్మకూటం ఈమె నివాసం. – మహాభారతం

**సుప్రభ 2 :** కశ్యప ప్రజాపతి స్వర్భానులకు జన్మించిన ఓ రాక్షసి. – అగ్నిపురాణం

**సుప్రభ 3 :** పద్మకూటం ద్వారా ప్రవహించే సర స్వతీనదిని 'సుప్రభ' అంటారు. – చూ ॥ సరస్వతి

**సుప్రభ 4 :** వదాన్యుడను రుషి కుమార్తె. అష్టావక్రుడీ మెను వివాహమాడాడు.

**సుప్రభ 5 :** దక్షుని కుమార్తెలలో ఒకరు. మరో దక్షుని కుమార్తె జయకు, సుప్రభకు బాణాలు ఇతర ఆయు ధాలు జన్మించాయి.

**సుప్రభ 6 :** సురతుడను రాజు కుమార్తె. నాభాగుడి భార్య. ఈమె ఒకసారి అగస్త్యుడిని భయపెట్టగా అగస్త్యుడీమెను ఈమె కుమారుడు భలనందుడిని వైశ్యులుగా జన్మించమని శపించగా వారు వైశ్యుల య్యారు. ఆమెకు కొంత వయసు వచ్చిన తర్వాత తన కుమారుడికి క్షత్రియుడి బాధ్యతలు బోధించగా వారు తిరిగి క్షత్రియులయ్యారు.
– మార్కండేయ పురాణం

**సుప్రభుడు :** సుకేశి దుర్జయుల పుత్రుడు.
– వరాహపురాణం

**సుప్రయోగ :** పురాణప్రసిద్ధమైన ఓ నది. ఈ పవిత్రనది నుండి అగ్ని జనించిందని చెప్తారు. – మహాభారతం

**సుప్రవృద్ధుడు :** సౌవీర రాజకుమారుడు. జయద్రథుడు ద్రౌపదిని ఎత్తుకుపోయేటప్పుడు అతడి వెనుక వున్నాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో అర్జునుడితణ్ణి వధించాడు. – మహాభారతం

**సుప్రసాదుడు :** సుబ్రహ్మణ్యస్వామి వీరుల్లో ఒకడు.
– మహాభారతం

**సుప్రియ :** కశ్యప ప్రజాపతి దక్షుడి కూతురైన ప్రధలకు జన్మించిన ఓ అప్సరస. ఈమె అర్జునుడి జన్మదిన వేడుకల్లో పాల్గొంది. – మహాభారతం

**సుబలుడు :** గాంధార రాజు. శకుని తండ్రి. సుబలుని కుమార్తె గాంధారి. శకుని, గాంధారి ఆర్థికపరమైన అవగాహన ఎక్కువకలవారు. పుట్టిగుడ్డివాడైనా కుటుంబానికి గల పలుకుబడి రీత్యా గాంధారిని ధృత రాష్ట్రునికిచ్చి వివాహం చేశాడు. సుబలుడు తన కుమారులైన శకుని, అచల, వృషకాలతో కలసి యుధి ష్ఠరుని రాజసూయ యాగానికి వచ్చారు. యాగం తర్వాత వీరు దేశం దాటేవరకు నకులుడు వెంట వున్నాడు. – మహాభారతం

**సుబందుడు :** అసమతి అనే రాజు ప్రధాన పురో హితుడు. ఒకసారి రాజు ఇతణ్ణి తొలగించి కిరాట, ఆకులి అనే పురోహితుల్ని నియమించుకున్నాడు. వీరు రాజు ఆజ్ఞపై సుబందుడిని చంపగా అతని సోదరులు వేదాలలోని శ్లోకాలు పఠించగా తిరిగి బ్రతికాడు.
– రుగ్వేదం.

**సుబాహు 1 :** కద్రువకు కశ్యప ప్రజాపతివల్ల జన్మించిన ఓ నాగు. – మహాభారతం

**సుబాహు 2 :** ఓ అప్సరస. ప్రధకు కశ్యప ప్రజాపతివల్ల జన్మించింది. ఈమె అర్జునుని జన్మదినోత్సవ వేడుకల్లో పాల్గొంది. – మహాభారతం

**సుబాహుడు 1 :** హరుడను అసురుని పునర్జన్మ. ఓ క్షత్రియరాజు. పాండవులు ఇతణ్ణి మహాభారత యుద్ధంలో పాల్గొనడానికి ఆహ్వానిద్దామని తలచారు.
– మహాభారతం

**సుబాహుడు 2 :** క్రోధవశుడను రాక్షసుని పునర్జన్మ. ఓ క్షత్రియ రాజు.

**సుబాహుడు 3 :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో భీముడితణ్ణి సంహ రించాడు. – మహాభారతం

**సుబాహుడు 4 :** కాశీరాజు. ఈతని అందమైన కుమార్తె శశికళను ద్రువసంధి కుమారుడు సుదర్శనుడు వివా హమాడాడు. ఇతడు ఎన్నడూ ఓటమి ఎరుగడు కాని తూర్పు దేశాల జైత్రయాత్రలో భీమసేనుడు ఓడించాడు. ఇతడు తన కుమారుడు సుకుమారుడితో కలసి ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. – మహాభారతం

**సుబాహుడు 5 :** తాటకి అనే రాక్షసి ఇద్దరు కుమారుల్లో ఒకడు. రెండోవాడు మారీచుడు. సుందుడను గంధ ర్వుడు వీరి తండ్రి. తాటకివలె వీరికి మాయామర్మాలు బాగా తెలుసు. సుందుడు అగస్త్యుని ఆశ్రమంపైకి వెళ్ళగా అతన్ని తన తపశ్శక్తితో భస్మం చేయగా తాటకి, మారీచ, సుబాహులు అగస్త్యుని ఆశ్రమంపైకి వెళ్ళగా అగస్త్యుడు వీరిని శపించాడు. శ్రీరాముడు అరణ్యవాస సమయంలో సుబాహుడిని వధించాడు.

**సుబాహుడు 6 :** వీరబాహుడను రాజు కొడుకు. చేది రాజు. సునందుడి సోదరుడు. – మహాభారతం

**సుబాహుడు 7 :** హిమాలయ పర్వతప్రాంతంలోగల కులిందరాజ్యానికి రాజు. ఈ రాజ్యం ఏనుగులు, గుర్రాలు ఇతర రకరకాల జంతువులకు ప్రసిద్ధి. పాండవులు అరణ్యవాస సమయంలో ఈ రాజ్యంలోకి వెళ్ళగా వీరిని అతిధిమర్యాదలతో సత్కరించాడు. ఇతడు మహాభారత యుద్ధంలో పాండవులపక్షాన పోరాడాడు.
– మహాభారతం

**సుబాహుడు 8 :** ఇతడు పాండవులకు వ్యతిరేకంగా మహాభారత యుద్ధంలో పోరాడిన వీరుడు. యుయుత్సుడితడి రెండు చేతులూ నరికివేశాడు.

– *మహాభారతం*

**సుబాహుడు 9 :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు.

– *మహాభారతం*

**సుబాహుడు 10 :** సూర్యవంశపు రాజైన సగరుని తండ్రి. – *చూ॥ సగరుడు*

**సుబాహుడు 11 :** జీవితకాలంలో మాంసం ముట్టని ఒక వీరుడు. – *మహాభారతం*

**సుబాహుడు 12 :** విష్ణుభక్తుడైన చోళరాజు. ఇతడెన్నో యజ్ఞాలు చేసినా స్వర్గం చేరలేదు. ఆ తర్వాత అతడి రెండవ కుమారుడు విజ్వలుడు వాసుదేవుడిని గురించి ప్రార్థన చేయగా సుబాహుడు అతని రాణి వాటిని తిరిగి గానం చేయగా స్వర్గం చేరాడు. – *పద్మపురాణం*

**సుబేల :** లంక వద్ద గల ఒక పర్వతం. – *మహాభారతం*

**సుబ్రహ్మణ్యుడు :** శివుని కుమారుడు.

*జన్మకారణం :* కశ్యప ప్రజాపతికి దనువువల్ల వజ్రాంగుడు జన్మించాడు. వజ్రాంగుడు బ్రహ్మను తన దానవత్వం పోవడానికై తపస్సు చేసిరాగా భార్య కన్పించక అడవులన్నీ తిరిగాడు. ఆమె ఓ చెట్టు కింద విలపిస్తూ అతడు ధ్యానంలో వుండగా ఇంద్రుడు తనను ఎన్నో ఇబ్బందులకు గురిచేశాడని చెప్పగా వజ్రాంగుడు వజ్రసంకల్పుడై ఇంద్రుడ్ని శిక్షించడానికి తపస్సు చేయగా బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడు. తనకు దేవతలు, ప్రత్యేకంగా ఇంద్రుడికంటే శక్తివంతుడైన పుత్రుడు కావాలని కోరగా బ్రహ్మ వరమిచ్చాడు. 12 నెలల తర్వాత వజ్రాంగి ప్రసవించింది. ఆ శిశువుకి తారకాసురుడని నామకరణం చేశారు. పుట్టినదే తడవుగా అతడు బ్రహ్మను గూర్చి తపస్సు చేయగా బ్రహ్మ ప్రత్యక్షమై నిన్ను ఎవరూ వధించలేరని ఒక వేళ వధిస్తే ఏడురోజులు కూడా నిండని పసివాడే చంపగలడని వరమిస్తాడు. తారకాసురుడు ముల్లోకాలను జయించి దేవలోకాలను భయభ్రాంతులను చేస్తాడు. పార్వతి శాపవశాన దేవతలకు పిల్లలుకల్గే అవకాశం లేదు.

ఒకసారి పార్వతీపరమేశ్వరులు కామకేళి జరుపుతుండగా 1000 దేవ సంవత్సరాలైనా ముగియకుండుటచే ముల్లోకాలు వణికిపోయినాయి. భూమి కంపించింది. దేవతలు శివుని ప్రార్థించగా నా వీర్యాన్ని ఎవరు భరిస్తారని అడగగా, భూమి భరిస్తుందని చెప్పగా అతని వీర్యం భూమిపై పడింది. పార్వతికి ఇది నచ్చక మా కలయికను భగ్నం చేసిన మీకు సంతానం కల్గదని శపించింది.

శివుని వీర్యం భూమిపైబడి భూమిని చెట్లను పర్వతాలను నింపగా ఆ తర్వాత మిగిలినది దేవతలను అగ్నిని కోరగా అగ్ని దానిని భరించి అది బూడిదై తెల్లని కొండ ఏర్పడి తర్వాత అడవిగా మారింది.

తారకాసురుడు ఏడు రోజుల బాలుడివల్లనే మరణిస్తాడు అదికూడా శివునికి జన్మించిన వాడివల్లే సాధ్యమవుతుంది. అప్పుడు శివుడు సతివియోగానికి దుఃఖిస్తూ ధ్యానంలో గడుపుతుండగా దేవతలు కామదేవుడ్ని పంపగా అతడు శివుని త్రినేత్రానికి భస్మమయ్యాడు. పార్వతి తపస్సు చివరికి వచ్చేసరికి శివుడు ప్రత్యక్షమై ఆమెను వివాహమాడాడు.

*జననం :* శివుని వీర్యాన్ని భరించిన అగ్ని బ్రహ్మవద్దకు వెళ్ళి నేను భరించలేకున్నాను. ఏమి చేయనని కోరగా దేవతలు బ్రహ్మవద్దకు వెళ్ళమన్నారు. ఆ దారిలో గంగ కన్పించగా ఆ గర్భాన్ని గంగను భరించమనికోరగా ఆమె అంగీకరించింది. ఆ వీర్యాన్ని అన్ని సంవత్సరాలు భరించడంవల్ల అతని శరీరం, కళ్ళు, జుట్టు బంగారు రంగుకు మారాయి. గంగ 500 సంవత్సరాలు భరించి శిశువును ప్రసవించక బ్రహ్మనుకోరగా ఉదయ పర్వతంపై గర్భాన్ని విడిస్తే 1000 సంవత్సరాల తర్వాత ఓ బిడ్డ జన్మిస్తాడని చెప్తాడు. 1000 సంవత్సరాలకు అక్కడ చెట్లు బంగారు రంగుకు మారాయి. అప్పుడు అక్కడ ఓ శిశువు జన్మించాడు. అతడే సుబ్రహ్మణ్యస్వామి. అతడిని ఆకాశంలో విహరిస్తున్న దేవతలు కృత్తికల రూపంలో ఈ శిశువును చూసి తమ పాలిచ్చి పెంచారు. అందువల్ల ఆరు ముఖాలేర్పడి కృత్తికలచే పెంచడంవల్ల కార్తికేయుడని పిలవబడ్డాడు. బ్రహ్మ అగ్నికి ఈ విషయం తెలియచేయగా ఆ శిశువును చూడటానికి అగ్ని వస్తూ గంగకు చెప్పాడు. అగ్ని గంగ ఎవరి పుత్రుడో నిర్ణయించుకోలేకపోతుంటే మహావిష్ణువు తీర్పివ్వగలడని చెప్పగా శివపార్వతులు అక్కడికి వచ్చారు. శివుడ్ని

గంగా అగ్ని ప్రశ్నించగా మొదట అతడు ఎవరివంక చూస్తాడో వారి సంతతి అనగా అతడు నాల్గు ముఖాలతో నల్గురివంక చూశాడు. ఆ నాల్గు ముఖాలు కుమార, విశాఖ, శాఖ మరియు నాగమేయ. అప్పుడు శివుడు గంగ కుమారుడు కుమారస్వామి, పార్వతి కుమారుడిగా స్కందుడని, నా కుమారుడుగా గుహ్యుడని, అగ్ని కుమారుడుగా మహాసేనుడని, కృత్తికలుచే పెంచబడ్డాడు గనుక కార్తికేయుడని శరవనం అనే అడవిలో జన్మించాడు కనుక శరవణుడని అయితే 6 ముఖాలతో జన్మించాడు కనుక షణ్ముఖుడని ప్రసిద్ధిచెందుతాడని చెప్పాడు.

అలా ప్రవచించిన శివుడు దేవతలను తలంచగా విష్ణువు బ్రహ్మ ఇతర దేవతలు అచటకివచ్చి శివునితో "దేవతల కోర్కె తీర్చడానికి అగ్ని ద్వారా సుబ్రహ్మణ్యుడికి జన్మనిచ్చావు. వెంటనే ఇతడిని సర్వసేనాని చేసి అసురులతో యుద్ధానికి ఉపక్రమింపమని చెప్పగా బ్రహ్మ, విష్ణు, శివుడు ఇతర దేవతలు సుబ్రహ్మణ్యుడిని కురుక్షేత్రం తీసుకొనివచ్చి అతడిని దేవతల సర్వసేనానిగా ప్రకటించారు. శివుడు, విష్ణువు ఇతర దేవతలు తమ సేనానులను సుబ్రహ్మణ్యుడికి బహుమతిగా ఇవ్వగా దేవాసుర సంగ్రామం జరగగా అతడు తారకాసురుడిని అతడి పుత్రులను, మాహిషుడ్ని, బాణుడ్ని సంహరించి రాక్షస సంహారం కావించాడు.

*సుబ్రహ్మణ్యస్వామి ఇతర విశేషాలు :* ఇంద్రుడు ఇతడి శౌర్య పరాక్రమములు విని తన పదవికి గండము వచ్చునని తలచి ఇతనిపైకి యుద్ధానికి వచ్చి తన వజ్రాయుధమును విసరగా అది సుబ్రహ్మణ్యుని దక్షిణ పార్శ్వంబును తాకగా విశాఖుడను వాడును కన్యాకుమార గణంబులును జన్మించగా ఇంద్రుడు భయపడి సుబ్రహ్మణ్య స్వామి శరణువేడి తన ఇంద్రపదవిని చేపట్టమని కోరెను. అందుకు యితడు నిరాకరించెను. అంతలో శూరపద్మాసురుడను రాక్షసుడు ఇతనిపైకి యుద్ధమునకు రాగా అతడినవలీలగా సంహరించెను. ఇంద్రుడందుకు మెచ్చుకొని తన కుమారితయగు దేవసేననిచ్చి వివాహముచేసెను. సుబ్రహ్మణ్యస్వామిని శివుడు భూతగణాలకు నాయకుణ్ణి చేశాడు.

– స్కాందపురాణం

**సుభ :** అంగిరసుని భార్య. బృహత్కీర్తి మొ॥ ఏడుగురికి తల్లి. – మహాభారతం

**సుభగ 1 :** కశ్యప ప్రజాపతి ప్రథలకు జన్మించిన కుమార్తె. – మహాభారతం

**సుభగ 2 :** తనకు చుట్టముకాని వారిని గాని ఇతరుల భార్యలనుగాని సంబోధించడానికి ఉపయోగించే పదం. –మనుస్మృతి

**సుభగుడు :** శకుని సోదరుడు. ఇతడు మహాభారత యుద్ధంలో భీమునిచే చంపబడ్డాడు. – మహాభారతం

**సుభద్ర 1 :** వసుదేవునికి దేవకికి జన్మించింది. ఈమె సోదరులు శ్రీకృష్ణుడు, సారణుడు.

*వివాహం :* అర్జునుని ఓ సంవత్సర తీర్థయాత్రా సమయంలో చివరికి ప్రభాసతీర్థం వచ్చాడు. అచట గదుడి వల్ల సుభద్ర అందచందాలను గురించి తెలుసుకొని ఆమెను వివాహమాడదలచాడు. ఓ సన్యాసిరూపంలో ఓ చెట్టుక్రింద కూర్చుని శ్రీకృష్ణుడ్ని తలచుకున్నాడు. శ్రీకృష్ణుడు వచ్చి ఈ తలంపుకి ఇచ్చట కూర్చోవడానికి కారణం తెలుసుకొని కృష్ణుడంగీకరించి ద్వారకకు తిరిగి వెళ్ళాడు.

అతికొద్ది రోజులకే రైవతపర్వతంపై యాదవులు పండుగ జరుపుకున్నారు. అచ్చటికి బలభద్ర రాముడు, సారణుడు తక్కినయాదవ వీరులంతా వచ్చారు. అర్జునుడచట ఆమెను చూసి సుభద్రను వివాహం చేసుకొనే మార్గం చెప్పమనగా స్వయంవరం లేక బలాత్కారంగా ఎత్తుకుపోవడం క్షత్రియుల లక్షణమని చెప్పాడు. రైవత పర్వతంమీద పండుగ తర్వాత యాదవులంతా సుభద్రతో సహా ద్వారకకు వెళ్ళగా అర్జునుడు ఆ దగ్గరలోని అరణ్యంలో కపట సన్యాసిగా కూర్చున్నాడు. యాదవులు ఇతడిని సన్యాసిగా ఎంచి ద్వారకకు తీసుకువెళ్ళి అతనికి సపర్యలు చేయడానికి సుభద్రను నియమించగా సన్యాసి అర్జునుడి గుణగణాలు శౌర్యపరాక్రమాలు ఆమెకు వివరించి చెప్పాడు. ఆమెకు కూడా అర్జునునిపై మక్కువ కలదని తెలుసుకున్న తర్వాత తన నిజరూప మెరింగించి ఆమెను ఎత్తుకుపోగా యాదవులు అతడివెంటపడగా శ్రీకృష్ణుడు అతడెవరో వివరించి యాదవులను శాంతింపచేశాడు.

*ఇతర విశేషాలు :* ఆ తర్వాత అర్జున సుభద్రల వివాహం శాస్త్రోక్తంగా జరిగింది. వీరికి అభిమన్యుడనే కుమారుడు

జన్మించాడు. పాండవుల అజ్ఞాతవాస సమయంలో ఈమె ద్వారకలోనే వుంది. ఉపప్లావ్యంలో అభిమన్యుడు ఉత్తరల వివాహానికి వచ్చింది. మహాభారత యుద్ధంలో అభిమన్యుడు మరణించగా శ్రీకృష్ణుని పాదాలపై పడి దుఃఖించింది. అశ్వమేధ యాగ సమయంలో హస్తినకు రావడం తప్ప తర్వాత ఆమె నిశ్శబ్ద జీవితం గడిపింది. - మహాభారతం

**సుభద్ర 2 :** సురభి కూతురు.

**సుభద్ర 3 :** ఓ అరటిచెట్టు. గరుడుడు అమృతం కొరకు దేవలోకం వెళ్ళినపుడు ఈ చెట్టును తన యాత్రకు ఓ గుర్తుగా వుంచుకున్నాడు. - రామాయణం

**సుభద్రుడు :** యదువంశంవాడు. వసుదేవుడి కొడుకు. తల్లి పౌరవి.

**సుభానుడు :** సత్యభామ పదిమంది కుమారుల్లో ఒకడు. - చూ|| సత్యభామ

**సుభాంగదుడు :** ఓ రాజు. ద్రౌపది స్వయంవరానికి వచ్చాడు. - మహాభారతం

**సుభాంగి :** దాశార్హ కుటుంబంలో జన్మించిన కన్య. చంద్రవంశపురాజు కురువు ఈమెను వివాహమాడాడు. వీరికి విదురుడు జన్మించాడు. - మహాభారతం

**సుభార్య :** పృష్ణి కుమారుడైన స్వఫల్కుని కుమార్తె. అక్రూరుని సోదరి. - భాగవతం

**సుభాషణుడు :** సూర్యవంశపు రాజుల్లో ఒకరు. యయుధానుడి కొడుకు; శృతుడి తండ్రి. -భాగవతం

**సుభీముడు :** తపుడను పాంచజన్యాగ్ని కొడుకు. యజ్ఞానికి ఆటంకం కల్గించే 15 అగ్నులలో ఇదొకటి. - మహాభారతం

**సుభువు :** యదువంశం వాడు. కంసుడి తమ్ముడు.

**సుభూమిక :** సరస్వతీ నదీతీర ప్రాంతం. ప్రాచీన కాలంలో అప్సరసలు ఇచటికి వచ్చి స్నానం చేసేవారు. దేవగంధర్వులు ప్రతినెల ఒకసారి ఈ ప్రాంతాన్ని దర్శించేవారు. శ్రీకృష్ణుడు ఈ పవిత్ర స్థలాన్ని దర్శించి బ్రాహ్మణులకు ధనం దానమిచ్చాడు. - మహాభారతం

**సుభ్రజుడు :** సుబ్రహ్మణ్యుడికి సూర్యుడిచ్చిన ఇద్దరు సేవకుల్లో ఒకడు. రెండోవాడు భాస్వరుడు. - మహాభారతం

**సుభ్రూ :** సుబ్రహ్మణ్యస్వామి పరిచారిక. - మహాభారతం

**సుమణి :** సుబ్రహ్మణ్యుడికి చంద్రుడిచ్చిన ఇద్దరు సేవకుల్లో ఒకడు. మరొకడు మణి. - మహాభారతం

**సుమతి 1 :** వరుణుని కొలువులో వుండి అతణ్ణి పూజించే ఒక రాక్షసుడు. - మహాభారతం

**సుమతి 2 :** ఓ గొప్పఋషి. భీష్ముడు అంపశయ్యపై నుండగా అతణ్ణి దర్శించిన ఋషుల్లో ఒకడు. - మహాభారతం

**సుమతి 3 :** గరుడుని సోదరి. సగరుని భార్య. - చూ|| సగరుడు

**సుమతి 4 :** కాకుస్థుని కొడుకు. ఒకరాజు. సూర్యవంశం. - రామాయణం

**సుమతి 5 :** ఋషభుని మనుమడు. భరతుని కొడుకు. ఒక రాజు. భరతుడు ధర్మపాలకుడు. ఇతడు చాలా కాలం పాలించి ఎన్నో యజ్ఞాలు చేసి సుమతిని రాజును చేసి తాను సాలగ్రామంలో తపస్సుచేసి శరీరం విడిచాడు.

**సుమతి 6 :** ఒకరాజు. ద్యుమత్సేనుడి కొడుకు; సుబలకు తండ్రి. - భాగవతం

**సుమదుడు :** హేమకూట పర్వతంపై తపస్సు చేసిన ముని. ఇతడు 12 సంవత్సరాలు తపస్సు చేయగా ఇంద్రుడు కామదేవుడ్ని ఇతర అప్సరసల్ని పంపినా ఫలితం లేకపోయింది. దేవి ప్రత్యక్షమై వరం కోరుకొమ్మనగా పోయిన రాజ్యం తిరిగి సంపాదించాలని కోరతాడు. దేవి కరుణించి శ్రీరాముని అశ్వమేథాశ్వం నీ రాజ్యం వచ్చేవరకు పాలించేటట్లు వరమిస్తుంది. అప్పుడితడు శత్రువులను జయించి అహిచ్ఛత్రాన్ని పాలిస్తాడు. శత్రుఘ్నుడు శ్రీరాముని అశ్వమేధయాగ అశ్వంతో ఈ రాజ్యం వచ్చినపుడు అతణ్ణి ఆహ్వానించి అతడితోపాటు అయోధ్యకు వెళ్తాడు. ఆ తర్వాత రాజ్యాన్ని తన సంతానానికి అప్పగించి ముక్తి పొందుతాడు. - పద్మపురాణం

**సుమన :** సోమ శర్మణుడి భార్య. ఓ బ్రాహ్మణ వనిత. - చూ|| సోమశర్మణుడు

**సుమనసు :** కేకయ రాకుమారి. దేవలోకంలో నివసించేది. ఈమె ఒకసారి దేవితో ఆధ్యాత్మిక విషయాలను చర్చించింది. - మహాభారతం

**సుమనసుడు 1 :** ఓ కిరాత (ఆటవికుడు)క రాజు. యుధిష్ఠురుని కొలువులో వుండేవాడు.
– మహాభారతం

**సుమనసుడు 2 :** ధృవుని సంతతిలోని పూరుడి కొడుకు. పూరుడికి అత్రివల్ల ఆరుగురు బలాఢ్యులైన పుత్రులు జన్మించారు. వారు అంగ, సుమనస, స్వాతి, క్రతు, అంగిరస, గయులు.

**సుమనుడు 3 :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. యముని కొలువులో అతణ్ణి పూజించేవాడు.
– మహాభారతం

**సుమనోముఖం :** కశ్యపుని వంశంలో జన్మించిన ఓ నాగు. – మహాభారతం

**సుమంగళ :** సుబ్రహ్మణ్యస్వామి సేవిక. – మహాభారతం

**సుమండలుడు :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. అర్జునుడి ఉత్తరభారత జైత్రయాత్రలో ఇతణ్ణి జయించాడు.
– మహాభారతం

**సుమంతుడు :** వ్యాసుని శిష్యుడు. వ్యాసుని ముఖ్య శిష్యులు అసితుడు, దేవలుడు, వైశంపాయనుడు, సుమంతుడు, జైమిని. వ్యాసుడితడికి అన్నివేదాలు మహా భారతం వినిపించాడు. ఇతడు యుధిష్ఠురుని కొలువులో సభ్యుడు. భీష్ముడు అంపశయ్యపైనుండగా దర్శించిన ముఖ్యుల్లో ఇతడొకడు. – మహాభారతం

**సుమందుడు :** దుష్యంతుని సోదరుల్లో ఒకడు. మతినా రుడికి ఇద్దరు పుత్రులు. ఒకరు సంతురోధుడు, రెండో వాడు ప్రతిరథుడు. సంతురోధుడికి ముగ్గురు కుమా రులు. వారు దుష్యంత, ప్రవీర, సుమందులు. దుష్యం తుడికి శకుంతలవల్ల భరతుడు జన్మించాడు.
– అగ్నిపురాణం

★**సుమంత్రుడు :** అయోధ్య రాజైన దశరథుని మంత్రి. సుమంత్రుడు దశరథుని 8 మంది మంత్రుల్లో అతి ముఖ్యుడు. అంతరంగికుడు. సంతానంకోసం యజ్ఞం చేసినపుడు ఇతడే రుష్యశృంగుడ్ని యజ్ఞకర్తగా తీసుకువచ్చాడు. – రామాయణం

**సుమన్యుడు :** ఓ ప్రాచీన రాజు. శాండిల్యుడికి అంతు లేనంత ఆహారధాన్యాలను బహుమతిగా ఇచ్చాడు.
– మహాభారతం

**సుమల్లిక :** ప్రాచీన భారతదేశంలోని ఓ పట్టణ ప్రాంతం.
– మహాభారతం

**సుమహుడు :** పరశురాముడి రథ చోదకుడు.
– మహాభారతం

**సుమాలి 1 :** సుకేశుడి కొడుకైన ఓ రాక్షసుడు. మాలి సోదరుడు. అగస్త్యుడు తాటకిని అతని కుమారుల్ని శపించినపుడు వారిని పాతాళంలో ఆ తర్వాత రావణుని సహాయంతో లంకలో వుంచాడు. – రామాయణం

**సుమాలి 2 :** పాతాళ రావణుని కొడుకుల్లో ఒకడు. శ్రీరాముడు పాతాళ రావణుడ్ని సంహరించిన తర్వాత తక్కినవారికి అభయమిచ్చి సుమాలిని రాజుని చేసి విభీషణుడి ఆజ్ఞకు కట్టుబడి నడుచుకొమ్మని చెప్పాడు.

**సుమాలి 3 :** ప్రహేతి కొడుకైన అసురుడు. వృత్రాసు రుడి అనుచరుడు. పృదువు భూమిని గోవుగా మార్చిన పుడు ఇతడు దూడగా మారాడు. – భాగవతం

**సుమాలిని :** సారస్వతపుర రాజైన వీరవర్మ కుమార్తె. ఈమెకు యుక్తవయసురాగా తండ్రి ఈమెను ఎవ్వరిని వివాహము చేసుకొందువని అడుగగా నరులనెపుడైన యముడు గొనిపోవునుగాన తాను యముడినే వివా హము చేసుకొనెదనని చెప్పెను. నారదుడీ విషయము యముని కెరింగించగా నరరూపమున వచ్చి ఈమెను వివాహమాడి నీకేమి కావలెనని కోరగా శ్రీకృష్ణపాద పద్మ దర్శనము తప్ప తనకేమియు వద్దనెను. అశ్వ మేథయాగ సమయమున శ్రీకృష్ణార్జునులు వచ్చి వీర వర్మతో యుద్ధము చేసినపుడీమెకు శ్రీకృష్ణుని దర్శన భాగ్యము కల్గెను. – జైమినిభారతం

**సుమాల్యుడు :** మహాపద్ముని 8 మంది కుమారులలో ఒకడు. వీరందరూ ధరణిని పాలించారు.

**సుమిత్ర 1 :** దశరథుని భార్యల్లో ఒకరు. ఈమె కుమా రులు లక్ష్మణ, శతృఘ్నులు. – చూ॥ దశరథుడు

**సుమిత్ర 2 :** శ్రీకృష్ణుని భార్యల్లో ఒకరు. – మహాభారతం

**సుమిత్రుడు 1 :** ఓ యాదవరాజు. వృష్ణి కుమారుడు. యుధాజిత్తు సోదరుడు. – భాగవతం

**సుమిత్రుడు 2 :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు.
– మహాభారతం

★ మహాభారతం సుమంత్రుడు దశరథుని మంత్రేకాక రథసారథి అని కూడా పేర్కొంది.

**సుమిత్రుడు 3 :** ఓ సౌవీర రాజు. దత్తామిత్రుడని కూడా అంటారు. క్రోధవశుడను అసురుని పునర్జన్మ. యుధిష్ఠరుని కొలువులో సభ్యుడు. పాండవ పక్షపాతి. – మహాభారతం

**సుమిత్రుడు 4 :** ఓ రుషి. యుధిష్ఠరుని కొలువులో ప్రముఖుడు. – మహాభారతం

**సుమిత్రుడు 5 :** కళింద నగరానికి రాజు. ఇతడి కొడుకు సుకుమారుడు. భీమసేనుని తూర్పు రాజ్యాల జైత్రయాత్రలో తండ్రీకొడుకులనిద్దరిని ఓడించాడు. – మహాభారతం

**సుమిత్రుడు 6 :** పంచాగ్నులలో ఒకటైన తపుడి కొడుకు. వీరు యజ్ఞాలకు విఘ్నం సృష్టిస్తారు. – మహాభారతం

**సుమిత్రుడు 7 :** హేహయ వంశంలోని ఒక రాజు. ఇతడు వేటకు వెళ్ళి ఓ లేడివెంట చాలాదూరం వెళ్ళి నిరుపయోగంకాగా అచ్చట ఓ తపోవనంలోకి వెళ్తాడు. అచట మునులతో కోరికలు, ఇతరులతో సంబంధాలను గూర్చి చర్చిస్తాడు. రుషభుడను రుషి సలహామేరకు కోర్కెలు వదలుకొని తపస్సు చేసి ముక్తిని పొందుతాడు. – మహాభారతం

**సుమిత్రుడు 8 :** అభిమన్యుని రథసారథి. – మహాభారతం

**సుమిత్రుడు 9 :** సురథుని కొడుకు. ఇక్ష్వాకు వంశంలో చివరి రాజు. పూరువంశపు క్షేమకుడు, మగధవంశీకుడైన నందుడు ఇతని సమకాలికులు. అలెగ్జాండర్ ఈ సమయంలోనే భారతదేశంలోకి వచ్చాడు. – భాగవతం

**సుమిత్రుడు 10 :** జాంబవతీ శ్రీకృష్ణుల కొడుకు. యాదవుల అంతర్గత పోరాటంలో మరణించాడు. – భాగవతం

**సుమీఢుడు :** సూర్యవంశపు రాజైన సుహోత్రుడి కొడుకు. ఐక్షవాణి అనే భార్యవల్ల ముగ్గురు కుమారులు. వారు సుమీఢుడు, అజమీఢుడు, పురుమీఢుడు. – మహాభారతం.

**సుముఖి 1 :** అశ్వసేనుడనే సర్పం తల్లి. ఈమె తన ముఖంతో కొడుకుని రక్షించింది కనుక సుముఖి అనబడింది. ఈ అశ్వసేనుడే కర్ణుడి బాణంపై వుండి అర్జునుణ్ణి వధించబోయాడు.

**సుముఖి 2 :** ఓ అప్సరస. కుబేరుని కొలువులో వుండేది. అష్టావక్రుని గౌరవార్థం నృత్యం చేసింది. – మహాభారతం

**సుముఖుడు 1 :** కశ్యప ప్రజాపతి కద్రువలకు జన్మించిన సర్పం.

**సుముఖుడు 2 :** ఆర్యకుడనే భుజంగరాజు మనుమడు. చికురుడి కొడుకు. గరుత్మంతుడు చికురుడ్ని చంపి ఆ తర్వాత సుముఖుణ్ణి చంపుతానంటాడు. కాని ఇంద్రుడి సలహాపై మానేస్తాడు. ఇతని భార్య గుణకేశి. – చూ॥ *గుణకేశి*

**సుముఖుడు 3 :** యుధిష్ఠరునికి ఎన్నో కానుకలు సమర్పించిన ఒకరాజు. – మహాభారతం

**సుముఖుడు 4 :** గరుడుని కొడుకుల్లో ఒకడు. – మహాభారతం

**సుముఖుడు 5 :** గరుడుని వంశంలోని ఓ పక్షి. – మహాభారతం

**సుమేధుడు :** వరమిత్రుడను బ్రాహ్మణుని కుమారుడు. ఇతనికి ఇతని స్నేహితుడగు సోమవంతుడికి ఉపనయనముగావించి ధనార్జనకై ఆ దేశపు రాజువద్దకు పంపగా ఆ రాజు సీమంతిని దంపతులకు విశేషముగా దానములు చేయుచున్నది కనక దంపతుల వేషమున ఆమెవద్దకు వెళ్ళమనగా వారట్లా చేసిరి. సీమంతిని వీరిని నిజముగ దంపతులుగనే భావించి కానుకలిచ్చెను గాని స్త్రీ వేషమున వున్నవాడు నిజముగా స్త్రీయయ్యెను. అందుకతని తండ్రి దుఃఖించి రాజు వద్దకుబోయి నీవే కారణముగనుక పురుషుడగు టకు సలహా కోరెను. రాజు శివుని గూర్చి తపస్సు చేసెను గాని సీమంతిని స్త్రీగా భావించినందువల్ల స్త్రీత్వము తప్పలేదు. – స్కాంద పురాణం

**సుమేరువు :** చూ॥ మహామేరువు.

**సుయజుడు :** భౌమన్యుడి కొడుకు; భరతుడి కుమారుడు. ఇతని తల్లి పుష్కరిగి. – మహాభారతం

**సుయజ్ఞ :** పూరు వంశరాజైన ప్రసేనజిత్తు కుమార్తె. ఈమె మహాభౌముడిని వివాహమాడగా అయుతనాయి జన్మించాడు. – మహాభారతం

**సుయజ్ఞుడు 1 :** ఉశీనర దేశపురాజు. ఇతడు యుద్ధములో మరణించగా భార్యలు శవముపైబడి ఏడ్చుచుండగా యముడు బాల రూపమున వచ్చి వారికి జనన మరణముల గూర్చి వివరించెను. – భాగవతం

**సుయజ్ఞుడు 2 :** రుచిప్రజాపతికి ఆకూతియందు ఈ పేరునబుట్టెను. ఇతడు దక్షిణయను యువతిని వివాహమాడెను. సురూపవామ దేవతలకు జన్మనిచ్చెను. సకలలోకములయందలి ఆర్తిని హరించెను. – భాగవతం

**సుయముడు :** శతశృంగుడను రాక్షసుని మూడవ కొడుకు. అంబరీషుని సేనాని సుయముడిని సంహరించాడు. – మహాభారతం

**సుయశ 1 :** బాహుదుడను రాజు కుమార్తె. అనాశ్వుడి కొడుకైన పరీక్షిత్తు భార్య. వీరికి జన్మించిన పుత్రుడు భీమసేనుడు. – మహాభారతం

**సుయశ 2 :** కాశీరాజైన దివోదాసు భార్య. – చూ॥ నికుంబుడు

**సుయశ 3 :** నందికేశ్వరుడి భార్య.

**సుయశశ్శు :** అశోకుడి కొడుకు. ఇతడి కొడుకు పండితుడు. – భాగవతం

**సురక్షత్తు :** విశ్వామిత్రుని కొడుకు. బ్రహ్మవాది. – మహాభారతం

**సురక్షకుడు :** ఓ గంధర్వరాజు. తాటకికి తాత. – చూ॥ తాటకి

**సురజు :** కశ్యప ప్రజాపతి ప్రథలకు జన్మించిన అప్సరస. అర్జునుని జన్మదినోత్సవ వేడుకల్లో నాట్యం చేసింది. – మహాభారతం

**సురత :** కశ్యప ప్రజాపతి ప్రథలకు జన్మించిన దేవకన్య. ఈమె అర్జునుని జన్మదినోత్సవ వేడుకల్లో నాట్యం చేసింది. – మహాభారతం

**సురథ :** శిబి చక్రవర్తి తల్లి. – మహాభారతం

**సురథుడు 1 :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజు. – చూ॥ సమాధిచెట్టియార్

**సురథుడు 2 :** పూరువంశపు రాజు. జహ్నువు కొడుకు. ఇతడి సోదరులు శృతసేన, ఉగ్రసేన, భీమసేనులు. – అగ్నిపురాణం

**సురథుడు 3 :** జనమేజయుని ఇద్దరు కొడుకుల్లో ఒకడు. రెండోవాడు మహిమానుడు. సురథుని కొడుకు విదూరథుడు. – అగ్నిపురాణం

**సురథుడు 4 :** విశ్వకర్మనుడి కుమార్తె. చిత్రాంగద భర్త. – చూ॥ విశ్వకర్మణుడు

**సురథుడు 5 :** క్రోధవశుడను అసురుని అంశతో జన్మించిన రాజు. –మహాభారతం

**సురథుడు 6 :** శిబిదేశానికి చెందిన కోటికాశ్యుని తండ్రి. – మహాభారతం

**సురథుడు 7 :** త్రిగర్త రాజు. జయద్రధుని అనుచరుడు. ద్రౌపదిని జయద్రధుడపహరించినపుడు జరిగిన యుద్ధంలో మరణించాడు. – మహాభారతం

**సురథుడు 8 :** మహాభారత యుద్ధంలో పాండవులకు వ్యతిరేకంగా పోరాడిన వీరుడు. – మహాభారతం

**సురథుడు 9 :** ద్రుపదుడి కొడుకుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో అశ్వత్థామ ఇతణ్ణి సంహరించాడు. – మహాభారతం

**సురథుడు 10 :** ఓ పాంచాల మహారథుడు. మహాభారత యుద్ధంలో పాండవుల పక్షాన పోరాడి అశ్వత్థామ చేతిలో మరణించాడు. – మహాభారతం

**సురథుడు 11 :** జయద్రధుడికి దస్సలకు జన్మించిన కొడుకు. జయద్రధుడిని అర్జునుడు మహాభారత యుద్ధంలో సంహరించిన తర్వాత సింధు దేశానికి ఇతడు రాజయ్యాడు. అశ్వమేధయాగ సమయంలో అర్జునుడితో పోరాడి మరణించాడు. – మహాభారతం

**సురథుడు 12 :** కుండలి నగరిని పాలించిన ఓ రాజు. శ్రీరాముని అశ్వాన్ని బంధించి దాని రక్షణకు వచ్చిన హనుమంతుణ్ణి, సుగ్రీవుణ్ణి బంధించాడు. శ్రీరాముడు వచ్చి ఇతణ్ణి ఓడించి వారిని విడిపించాడు.

**సురదుడు :** శ్వేతుడి తమ్ముడు. శ్వేతుడి అనంతరం విదర్భదేశానికి రాజౌతాడు.

**సురనిందని :** జ్యేష్టాదేవి వరుణుల కూతురు. అధర్ముడి చెల్లెలు.

**సురప్రవీతుడు :** పాంచజనయగ్ని అయిన తపుడి కొడుకు. తపుడు ఇతర అగ్నుల యజ్ఞాలకు ఆటంకం కల్గిస్తాడు. – మహాభారతం

**సురభి 1 :** దేవతల గోవు. – చూ॥ కామదేనువు, సౌరభి.

**సురభి 2 :** బ్రహ్మ హూంకారనాదం నుండి జన్మించింది. ఈ గోవు పెరిగిన కొద్దీ దాని కడుపులో నుండి పాలు ధారగా ప్రవహించి క్షీరసాగరం ఏర్పడింది. సురూప, హంసిక, సుభద్ర, సర్వకామదుఃఖ ఈమె సంతతి. వీరు నాల్గు దిక్కుల్ని రక్షిస్తారు. సురభి ఏడవలోకమైన రసాతలంలో నివసిస్తుంది. – మహాభారతం

**సురభి పట్టణం :** ప్రాచీన దక్షిణ భారతదేశంలో ఓ పట్టణప్రాంతం. సహదేవుడు తన సైన్యాన్ని పంపి తన ఆధీనంలోకి తెచ్చుకొన్నాడు. - మహాభారతం

**సురభిమానం :** ఓ అగ్ని. - మహాభారతం

**సురభువు :** ఉగ్రసేనుడి నాల్గవ కూతురు. ఈమె భర్త శ్యామకుడు.

**సురవీధి :** ఇంద్రలోకంలోని నక్షత్రతోరణం. - మహాభారతం

**సురహంతుడు :** పాంచజనయాగ్ని అయిన తపుడి కొడుకు. తపుడు యజ్ఞాలను ఆటంకపరిచే అగ్నులలో ఒకడు. - మహాభారతం

**సురాదేవి (వారుణి) :** వరుణిని కూతురు. వరుడికి వరుణుడి సోదరుడి భార్య దేవికి జన్మించాడు. దేవతలలో అందాలరాశి దేవి. మద్యానికి దేవత. ఈమె బ్రహ్మ గొలువులో అతణ్ణి పూజిస్తుంటుంది. - మహాభారతం

**సురారి :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. ఇతణ్ణి మహాభారతయుద్ధంలో పాల్గొనడానికి పాండవులు ఆహ్వానించారు. - మహాభారతం

**సురావానం :** ఇల్వలుడు అగస్త్యునికిచ్చిన రథానికి పూన్చిన అశ్వాలలో ఒకటి. - చూ॥ అగస్త్యుడు.

**సురాష్ట్రం 1 :** దక్షిణ భారతదేశంలోని పశ్చిమతీరానగల పురాణప్రసిద్ధ రాజ్యం. సహదేవుడు ఆకృతి అనే ఈ ప్రాంతరాజుని ఓడించాడు. ఈ రాజ్యంలో చమసోద్భేద, ప్రభాసక్షేత్ర, పిండారకం వంటి పవిత్ర స్థలాలున్నాయి. - మహాభారతం

**సురాష్ట్రం 2 :** ఓ క్షత్రియ వంశం. రుషర్ధితుడనే క్రూరుడైన రాజు ఈ వంశంలో జన్మించాడు.

**సురాష్ట్రుడు :** ఒకరాజు. ఇతనికి ముగ్గురు భార్యలు. పట్టమహిషి ఉత్పలావతి. కాని సంతానములేదు. భార్యలు మరణించిరి. శత్రురాజులు దండెత్తి ఇతని రాజ్యమును వశపరచుకొనగా ఇతడరణ్యములకేగెను. అప్పుడు కుండపోత వర్షంలో అడవంతా నీటిమయ మవ్వగా ఇతడొక లేడి దొరికి దాని తోకపట్టుకొని ఈదుచుండగా అది మనుష్య భాషమున "నీవు నా పుచ్చమునకు తగులుచుంటివి. ఇది అధర్మమనగా నీవెవ్వరివనగా నేను సురాష్ట్రుని పట్టమహిషిని. శాపవశమున ఇట్లయితినని చెప్పెను. సురాష్ట్రుని చేయి దాని పుచ్చము తగులుటచే అది గర్భవతియయ్యెను. - మార్కండేయ పురాణం

**సురుచి :** ఉత్తానపాదుని భార్య. ఉత్తముని తల్లి. ధ్రువునకు సవతి తల్లి. ఒకనాడు ఉత్తానపాదుడి తొడపై ఉత్తముడు కూర్చొనగా రెండవతొడపై ధ్రువుడు కూర్చొనగా ఉత్తమునితల్లి నీకా అర్హత లేదనెను. ధ్రువుడు తపమునకేగెను. ఉత్తముడు వివాహము లేకయే యుండి అరణ్యమునకు వేటకు బోవగా యక్షులితనిని సంహరించిరి.

**సురుచుడు :** గరుడుని కొడుకు. - మహాభారతం

**సురూప:** విశ్వకర్మ కుమార్తెలలో ఒకరు. స్వాయంభవ మనువు ఈమెను, ఈమె సోదరి బర్హిష్మతిని వివాహమాడగా సురూపకు 10మంది కుమారులు. వీరికి ఓ చెల్లెలు ఊర్జస్వతి కలదు. - దేవీ భాగవతం

**సురేణువు :** సరస్వతి ఉపనది. ఇది రుషభ ద్వీపంగుండా ప్రవహిస్తుంది. - మహాభారతం

**సురేషువు 1 :** పాంచజన్యాగ్నిలో ఒకటైన తల కొడుకు. పంచజన్యాగ్నులు యజ్ఞానికి అవాంతరాలు కల్పిస్తాయి. - మహాభారతం

**సురేషువు 2 :** ఓ సనాతన విశ్వదేవుడు.

**సురోచన :** సుబ్రహ్మణ్యస్వామి పరిచారిక. - మహాభారతం

**సురోచిషుడు :** అరుంధతీ వశిష్ఠుల కుమారుడు. - భాగవతం

**సురోద :** మద్యంతో నిండివుండే ఏడు సముద్రాలలో ఒకటి. - మహాభారతం

**సురోమన :** తక్షకుని కుటుంబంలోని ఓ సర్పం. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. - మహాభారతం

**సులక్షణ :** కాశీనగరంలోని ప్రియవ్రతుడి కూతురు. తల్లి శుభవ్రత. కన్యాగండంలో పుట్టిందనే దిగులుతో తండ్రి మరణిస్తాడు. ఆ తర్వాత తల్లి కూడా మరణించగా ఈమె శివుడిగూర్చి తపస్సు చేసి అతడి దయవల్ల పార్వతికి చెలికత్తె అవుతుంది. - కాశీమాహాత్మ్యం

**సులక్షణుడు :** ఒక రాజు. అశ్వాన్ని దొంగిలించినందుకు మాండవ్యుడి కంఠంలో శిల దించమని ఆజ్ఞాపించిందితడే. - పద్మపురాణం

**సులక్ష్మి :** క్షీరసాగర మదనంలో వెలువడిన నల్గురు దేవ కన్యలలో ఒకరు. ఆ నల్గురు : సులక్ష్మి, వారుణి, కామోద, శ్రేష్ఠ. – పద్మపురాణం

**సులభ :** స్త్రీ సన్యాసిని. తపస్సుచేసి ఎన్నో సిద్ధులు పొందింది. ఈమె కావలసినపుడు శరీరం నుండి ఆత్మను వేరుచేసుకొని కావాలన్నపుడు కలవగలదు. ఈమె మిథిలానగరం వెళ్ళి శరీరంవదలి ఒకరోజంతా జనకుని శరీరంలో వుండి అతడితో ఎన్నో విషయాలపై చర్చ జరిపింది. – మహాభారతం

**సులోచనుడు :** ధృతరాష్ట్రుని 100 మంది కొడుకుల్లో ఒకడు. మహాభారతయుద్ధంలో భీమసేనుడితణ్ణి వధించాడు. – మహాభారతం

**సువక్త్రుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. – మహాభారతం

**సువర్చల 1 :** సూర్యుని భార్యల్లో ఒకరు. – మహాభారతం

**సువర్చల 2 :** దేవలుడను మహర్షి కుమార్తె. శ్వేతకేత ఈమెను వివాహమాడాడు. గృహస్తజీవనాన్ని గడుపుతూనే వీరు మోక్షం పొందారు. – మహాభారతం

**సువర్చల 3 :** పరమేష్ఠి భార్య. ఈమె కొడుకు ప్రతీహుడు. – భాగవతం

**సువర్చల 4 :** హనుమంతుడి భార్య.

**సువర్చస :** దధీచి మహర్షి భార్య. ఇంద్రుని కోరికపై దధీచి తన ఎముకల్ని ఇవ్వగా వాటితో వజ్రాయుధం చేయబడింది. దధీచి భార్య ఇంద్రుని వంశంపై ఆగ్రహం చెంది ఆ వంశం నశించునట్లు శపించి తన భర్త చితిపై తనూ ఆహుతికాబోగా ఆకాశవాణి నీవు గర్భవతి, అది ధర్మంకాదనగా ఆమె ఓ కత్తితో గర్భాన్ని చీల్చి పిండం బైటకు తీసి ఆమె మరణించింది. ఆ పిండమే సర్పిలాదుడు. – పద్మపురాణం

**సువర్చసుడు 1 :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఓకడు. మహాభారత యుద్ధంలో భీముడితణ్ణి వధించాడు. – మహాభారతం

**సువర్చసుడు 2 :** సుకేతుడి కొడుకు. తండ్రీకొడుకులిద్దరూ ద్రౌపది స్వయంవరానికి వచ్చారు. – మహాభారతం

**సువర్చసుడు 3 :** పాంచజన్యాగ్నిలో ఒకటైన తపుడి కొడుకు. – మహాభారతం

**సువర్చసుడు 4 :** ఓ సత్యసంధుడైన ముని. సత్యవాణుడి తండ్రి ద్యుమత్సేనుడు ఇతడి ఆశ్రమంలో నివసించాడు. సావిత్రి సత్యవాణులు కట్టెలకోసం అడవికెళ్ళి సమయానికి రాకపోవుటచే ద్యుమత్సేనుడు విచారిస్తుంటే అతణ్ణి ఓదార్చాడు. – మహాభారతం

**సువర్చసుడు 5 :** గరుడుని కొడుకుల్లో ఒకడు. – మహాభారతం

**సువర్చసుడు 6 :** కౌరవుల పక్షాన పోరాడిన ఓ సైనికుడు. అభిమన్యుడితణ్ణి వధించాడు. – మహాభారతం

**సువర్చసుడు 7 :** హిమవానుడు సుబ్రహ్మణ్యస్వామికిచ్చిన సేవకుల్లో ఒకడు. రెండోవాడు అతివర్జనుడు.

**సువర్చసుడు 8 :** ఖనినేత్రుడి కొడుకు. ఇతడిని కరందాముడని కూడా పిలుస్తారు. – చూ॥ కరంధాముడు

**సువర్ణ :** ఇక్ష్వాకు వంశంలో జన్మించిన రాకుమారి. పూరు వంశానికి చెందిన సుహోత్రుడిని వివాహమాడగా వీరికి హస్తి అనే కుమారుడు జన్మించి తదనంతరకాలంలో రాజయ్యాడు. – మహాభారతం

**సువర్ణతీర్థం :** ప్రాచీన భారతదేశంలోని ఓ గొప్ప పవిత్ర స్థలం. ఇచ్చట విష్ణువు రుద్రుడిని గురించి తపస్సు చేసి ఎన్నో వరాలు పొందాడు. అందుకే దానికంత ప్రశస్తి. ఇచ్చట శివుడ్ని పూజిస్తే అశ్వమేథయాగం చేసిన ఫలితం లభిస్తుంది. గణపతితో సమాన ప్రతిపత్తి కల్గుతుంది. – మహాభారతం

**సువర్ణచూడుడు :** గరుడుని ప్రసిద్ధ పుత్రుల్లో ఒకడు. – మహాభారతం

**సువర్ణముఖి :** ఓ నది. దీన్ని సువర్ణముఖరానది అని కూడా అంటారు. ఇది శ్రీకాళహస్తి దగ్గర ఉంది. అగస్త్యుడు దక్షిణకాశిని సేవించడానికి శ్రీకాళహస్తి వచ్చి ఇచ్చట నది లేకపోవడంతో శివుణ్ణి ప్రార్థించి ఆకాశగంగను తెప్పిస్తాడు. ఇదే సువర్ణముఖి. – శ్రీకాళహస్తి మాహత్మ్యమ్

**సువర్ణవర్మ :** ఓ కాశీరాజు. ఇతని కుమార్తె వపుష్ఠమను జనమేజయుడు వివాహమాడాడు. – మహాభారతం

**సువర్ణష్ఠీవి :** సృంజయుడను రాజు కొడుకు. నారద పర్వతులు ఇతని నివాసంలో వుండగా సంతాన లేమి

బాధపెడుతోందని విన్నవించుకొని వారి సలహా మేరకు తపస్సు చేయగా సువర్ణష్ఠీవి జన్మిస్తాడు. ఇతడు పుట్టుకతోనే పండితుడు. బాల్యంలోనే తపస్సు చేశాడు. ఇంద్రుడు భయపడి ఇతణ్ణి తపోభంగం చేయబోయి చివరికి ఇతడు అడవిలోవుండగా మాయాసింహం ఇతణ్ణి సంహరిస్తుంది. సృంజయుడు ఇది నారదునికెరిగించగా అతడు ఇంద్రునితో చెప్పి తిరిగి ఇతణ్ణి బ్రతికిస్తాడు. – మహాభారతం

**సువర్ణశిరసుడు :** పింగళవర్ముడి కొడుకైన ఓ రుషి. సామవేదాన్ని గానం చేస్తూ పశ్చిమ భారతదేశంలో నివసించాడు. – మహాభారతం

**సువర్ధనుడు :** ధృతరాష్ట్రుని 100 మంది కుమారుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో భీముడితణ్ణి సంహరించాడు.

**సువర్ణాభుడు :** ఒకరాజు. శంఖపాదుని కొడుకు. స్వారోచిషమనువు మనుమడు. సాత్వత ధర్మాన్ని గురించి తండ్రి సలహాలిచ్చాడు.

**సువర్ణుడు 1 :** ఓ దేవ గాంధర్వుడు. ఇతడు అర్జునుడి జన్మదినోత్సవ వేడుకల్లో పాల్గొన్నాడు. – మహాభారతం

**సువర్ణుడు 2 :** ఓ బ్రాహ్మణ ముని. ఇతడి శరీరం బంగారు వర్ణంలో వుండేది. ఇతడు ఒకసారి మనువుతో మంచిచెడులను గురించి సంభాషించాడు. – మహాభారతం

**సువస్త్ర :** పురాణప్రసిద్ధమైన భారతావనిలోని ఓ నది. – మహాభారతం

**సువాక్కు :** ప్రాచీన భారతదేశంలో ఓ మహర్షి. ధర్మజుడిని అమితంగా గౌరవించేవాడు. – మహాభారతం

**సువాయ :** ప్రాచీనకాలంలో పురాణప్రసిద్ధమైన ఓ పుణ్యనది. – మహాభారతం

**సువాస్తు :** రుగ్వేదంలో పేర్కొనబడిన ఓ ప్రసిద్ధనది. – రుగ్వేదం.

**సువాస్తుకుడు :** ప్రాచీనభారతదేశంలో ఒకరాజు. పాండవులు మహాభారత యుద్ధంలో పాల్గొనడానికి ఇతనికి ఆహ్వానం పంపారు. – మహాభారతం

**సువాహుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. – మహాభారతం

**సువిశాల :** సుబ్రహ్మణ్యస్వామి సేవిక. – మహాభారతం

**సువీరుడు 1 :** భరతవంశపు రాజు. క్షేమ్యుడి కొడుకు; రిపుంజయుడి తండ్రి. – భాగవతం

**సువీరుడు 2 :** క్రోధవశుని అంశతో జన్మించిన ఓ రాజు. – మహాభారతం

**సువీరుడు 3 :** ద్యుతిమనుడి కొడుకు. ఇంద్రునితో సమానుడై శక్తివంతుడైన పాలకుడు. – మహాభారతం

**సువీరం :** ఓ క్షత్రియవంశం. ఈ వంశంలో అజబిందుడనే క్రూరుడు జన్మించాడు.

**సువేణుడు :** యౌవనాశ్వుడి కొడుకు. భీముడితో గదాయుద్ధం చేసి ఇద్దరూ మూర్ఛిల్లుతారు. – మహాభారతం

**సువేణు :** పురాణ ప్రసిద్ధమైన నది. మార్కండేయుడు ఈ నదిని బాల్యంలో శ్రీకృష్ణుని గర్భంలో దర్శించాడు. – మహాభారతం

**సువేద :** ప్రియవ్రతుని కొడుకైన సవనుడి భార్య. – చూ॥ సవనుడు

**సువేల :** దక్షిణ సముద్రతీరంలోగల ఓ పర్వతం. రామలక్షణులు లంకకువెళ్ళేముందు ఈ పర్వతం ఎక్కి లంకను పరిశీలించారు. – రామాయణం

**సువ్రత :** దక్ష ప్రజాపతి వీరణిలకు జన్మించిన కుమార్తె. ఈమెకు దక్షుడు, ధర్ముడు, బ్రహ్మ, రుద్రుల వల్ల ఒక్కొక్క బిడ్డ జన్మించారు. వారు దక్షసావర్ణి, ధర్మసావర్ణి, బ్రహ్మసావర్ణి, రుద్రసావర్ణి. – బ్రహ్మాండపురాణం

**సువ్రతుడు 1 :** భరతవంశపురాజు. క్షేముడి కొడుకు; విశ్వజిత్తు తండ్రి. – భాగవతం

**సువ్రతుడు 2 :** అంగరాజ వంశంలోని ఓ రాజు. ఉశీనారుడి కొడుకు. – అగ్నిపురాణం

**సువ్రతుడు 3 :** సోమశర్మనుడను బ్రాహ్మణుడి కొడుకు. – చూ॥ ధర్మాంగదుడు

**సువ్రతుడు 4 :** ప్రాచీన ఉత్తరభారతంలో నివసించిన ప్రసిద్ధ రుషి. – మహాభారతం

**సువ్రతుడు 5 :** మిత్రదేవుడు సుబ్రహ్మణ్యుడికిచ్చిన ఇద్దరు సేవకుల్లో ఒకడు. మరొకడు సత్యసంధుడు. – మహాభారతం

**సువ్రతుడు 6 :** విధాత సుబ్రహ్మణ్యస్వామికిచ్చిన ఇద్దరు సేవకుల్లో ఒకడు. మరొకడు సుకర్ముడు. – మహాభారతం

**సుశర్మ :** త్రిగర్త దేశాధీశుడు. వృద్ధక్షేముడి కొడుకు. ఇతడు ద్రౌపది స్వయంవరానికి వచ్చాడు. ఇతడు మత్స్యదేశంపై దండెత్తమని దుర్యోధనుడ్ని ప్రోత్సహించి అతడికి సహాయపడ్డాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో సుశర్మ విరాటరాజుని బంధించగా భీముడతణ్ణి ఓడించి బందీనిచేసి ధర్మజుని వద్దకు తీసుకురాగా ధర్మజుడు అతణ్ణి క్షమించి వదలివేశాడు. సుశర్మ పాండవులకు వ్యతిరేకంగా పోరాడాడు. పాండవ సేనలోని యోధులైన ద్రోణ, అర్జున, భీమసేనులతో యుద్ధంచేశాడు. ద్రోణుడు మరణించినపుడు యుద్ధ భూమి నుండి పారిపోయాడు. ఆ తర్వాత అర్జునుణ్ణి వధిస్తానని శపథంచేసి అతడిచేతిలో మరణించాడు.
– మహాభారతం

**సుశాంతి 1 :** భరత వంశంలోని రాజు. శాంతికి కొడుకు. పురుజుడికి తండ్రి. – భాగవతం

**సుశాంతి 2 :** మూడవ మన్వంతరంలోని ఇంద్రుడి పేరు.

**సుశీల 1 :** సుశీలుడను గంధర్వుని కుమార్తె.
– చూ॥ ప్రమోహిని

**సుశీల 2 :** ఓ గోవు. సురభికి సోదరి. జమదగ్ని ఆశ్రమంలో వుండేది. ఒకసారి జమదగ్ని తన భార్యను చంపమని కుమారుడు పరశురాముడ్ని ఆజ్ఞాపించగా అతడు దాన్ని నెరవేర్చాడు. పరశురాముని కోర్కెపై తిరిగి ఆమెను బ్రతికించినా జమదగ్ని విచారం పోలేదు. అతడు పాతాళం వెళ్ళి సురభిని పూజించగా సురభి తన సోదరి సుశీలను జమదగ్ని కిచ్చింది. దీనినే కార్తవీర్యార్జునుడు బలవంతంగా తీసుకెళ్ళాడు.
– బ్రహ్మాండపురాణం

**సుశీలుడు 1 :** ఓ గంధర్వుడు. సుశీల అనే గంధర్వస్త్రీకి తండ్రి. – చూ॥ ప్రమోహిని

**సుశీలుడు 2 :** ఓ బ్రాహ్మణుడు. పెక్కుమంది సంతానంతో దుర్భర జీవితం గడిపాడు. ఓ సద్బ్రాహ్మణుడి బోధనవల్ల వరుసగా 9 సంవత్సరాలు నవరాత్రి ఉపవాసాలు పాటించగా దేవి ప్రత్యక్షమై అతణ్ణి ధనవంతుణ్ణిచేసింది. – దేవీభాగవతం

**సుశోభన :** ఓ మండూక రాజకుమారి. ఇక్ష్వాకు వంశ రాజైన పరీక్షిత్తు ఈమెను వివాహమాడగా వీరికి శల, బల, దలులు జన్మించారు.

**సుశ్యామ :** ఓ అప్సరస. ఆర్ష్టిసేన కొడుకు రుతధ్వజుడి భార్య. వీరికి వృద్ధ అనే కుమార్తె జన్మించింది.
– బ్రహ్మాండపురాణం

**సుశ్రవసః :** ఓ విదర్భ రాజకుమారి. పురువంశరాజైన జయత్సేనుడీమెను వివాహమాడగా ఆర్వాచీనుడు జన్మించాడు. – మహాభారతం

**సుశ్రవసుడు :** రుగ్వేదకాలంనాటి రాజు. శతృవు లొకసారి ఇతణ్ణి చుట్టుముట్టగా ఇంద్రుడిని ప్రార్థించగా ఇంద్రుడు 10099 శతృసైన్యాన్ని తరమివేశాడు.
– రుగ్వేదం

**సుశ్రవసుడు 2 :** దేవతల గూఢచారి. కాత్యాయన ముని తపస్సు చేయటాన్ని సరస్వతికి చేరవేశాడు. సరస్వతి మునికి దర్శనమిచ్చి తపస్సు చేయనవసరం లేదు. సారస్వత మహర్షి నీకు కావలసిన జ్ఞానం బోధిస్తాడని చెప్పగా కాత్యాయనుడు తపస్సుమాని సారస్వత మహర్షివద్దకు వెళ్తాడు.

**సుశ్రుతుడు :** ఇతడు గొప్ప శస్త్రచికిత్సా నిపుణుడు. ఇతడు గాధికి మనుమడు. విశ్వామిత్రుని కుమారుడు. ఆయుర్వేదంలో ప్రసిద్ధగ్రంథమైన 'సుశ్రుతసంహిత' అనే గ్రంథం రచించాడు. – మహాభారతం

**సుషేణుడు :** వానరవీరుడైన వాలికి మామ. తారకు తండ్రి. ఇతడు సీతను వెదకడానికి 1000 కోట్ల వానరుల్ని పంపాడు. ఇతడు ఆయుర్వేద వైద్యనిపుణుడు. ధర్ముడనే వానరుడి కొడుకు. రామరావణ యుద్ధంలో విద్యున్మాలిని వధించాడు. ఇంద్రజిత్తు మరణానంతరం రావణుడు భయంకర పోరాటం చేసినపుడు లక్ష్మణుడు ఇతర వానరులు మూర్ఛపోగా విశాల్యకరణి, సావర్ణ్యకరణి అనే మొక్కలతో వైద్యం ద్వారా వీరిని మేల్కొల్పాడు. ఇతడు శ్రీరాముని పట్టాభిషేకానికి వచ్చాడు. – రామాయణం.

**సుసామనుడు :** ధనుంజయ గోత్రంలో జన్మించిన ఉత్తమ బ్రాహ్మణుడు. యుధిష్ఠరుని రాజసూయ యాగంలో పాల్గొన్నాడు. – మహాభారతం

**సుసంకులం :** ప్రసిద్ధప్రాచీన పట్టణ ప్రాంతం. అర్జునుడు దీన్ని జయించాడు. – మహాభారతం

**సుస్థల :** ప్రాచీన భారతదేశంలో పురాణప్రసిద్ధ స్థలం. ఈ ప్రాంతప్రజల్ని సుస్థలులని పిలుస్తారు.
– మహాభారతం

**సుహనుడు :** వరుణుని కొలువులో అతడ్ని పూజిస్తుండే ఓ అసురుడు. – *మహాభారతం*

**సుహని :** భరతవంశపురాజు. భూమన్యుని కొడుకు. తల్లి పుష్కరిణి. – *మహాభారతం*

**సుహస్తుడు :** ధృతరాష్ట్రుని 100 మంది కొడుకుల్లో ఒకడు. మహాభారత యుద్ధంలో భీమసేనుడు వధించాడు. – *మహాభారతం*

**సుహస్త్యుడు :** ఋగ్వేదంలో పేర్కొనబడిన ఓ ముని. ఘోషుడి కొడుకు. – *ఋగ్వేదం*

**సుహు :** ఓ యాదవరాజు. ఉగ్రసేనుడి కొడుకు. – *భాగవతం*

**సుహోత :** భరత చక్రవర్తి కొడుకుల్లో ఒకడు. సుహోత్రుడనికూడా అంటారు. – *చూ॥ సుహోత్రుడు 2.*

**సుహోత్రుడు 1 :** జమదగ్ని మహర్షి కుమారుల్లో ఒకడు. రేణుక జమదగ్నులకు 5గురు పుత్రులు. వారు సుహోత్ర, వసు, విశ్వావసు, పరశురామ, రుమగ్వాణులు.

**సుహోత్రుడు 2 :** దుష్యంతుని కుమారుడైన భరత చక్రవర్తికి ఐదుగురు కుమారులు. వారు సుహోత్ర, సుహోత, గయ, గర్భ, సుకేతులు. – *అగ్నిపురాణం*

**సుహోత్రుడు 3 :** చంద్రవంశపురాజు. ఇతడు భరతుని మనుమడు. భూమాన్యుడి అన్నకొడుకు. ఇతనితల్లి పుష్కరిణి. ఇతడు భూప్రపంచాన్ని మొత్తం జయించాడు. ఆ తర్వాత అశ్వమేధయాగం ఇతర యాగాలు చేశాడు. ఇతడు ఇక్ష్వాకు వంశ రాకుమారి సువర్ణను వివాహమాడగా ముగ్గురు పుత్రులు జన్మించారు. వారు సుమీఢుడు, పురుమీఢుడు, అమీఢులు. ఇతడు దయార్ధుడు. ఇతడు చూపిన ఆదరణకు ఇంద్రుడు మెచ్చి ఇంద్రుడు బంగారు వర్షం ఓ సంవత్సరం కురిపించాడు. నదులన్నీ బంగారు నీళ్ళతో ప్రవహించాయి. ఇంద్రుడు బంగారు చేపల్ని కూడా వర్షించాడు. రాజు ఈ బంగారాన్నంతా బ్రాహ్మణులకు పంచాడు. – *మహాభారతం*

**సుహోత్రుడు 4 :** పాండవులలో ఒకడైన సహదేవుడి కొడుకు. ద్యుతిమానుడి కుమార్తె విజయను సహదేవుడు వివాహమాడగా సుహోత్రుడను పుత్రుడు జన్మించాడు. – *మహాభారతం*

**సుహోత్రుడు 5 :** ఓ ఋషి. ధర్మజుడ్ని ఇతడు గౌరవించేవాడు. – *మహాభారతం*

**సుహోత్రుడు 6 :** కురువంశపు రాజు. ఉశీనారుడి కుటుంబంలో జన్మించిన శిబిమార్గానికి అడ్డుపడి నారదుని సలహాపై దారి వదిలాడు. – *చూ॥ శిబి*

**సుహ్మ 1 :** పురాణప్రసిద్ధమైన ఒకరాజ్యం. భారతదేశానికి తూర్పునవున్న ఈ రాజ్యాన్ని పాండురాజు ఒకసారి, తూర్పుదేశాల జైత్రయాత్రలో భీమసేనుడొకసారి జయించారు. – *మహాభారతం*

**సుహ్మ 2 :** ఉత్తర భారతదేశంలోని పర్వతప్రాంతంలోని ఒకరాజ్యం. అర్జునుడు తన ఉత్తర భారతదేశ జైత్రయాత్రలో దీన్ని జయించాడు. – *మహాభారతం*

**సుహ్యుజ (సుహ్మ) :** భారత వంశపురాజు. సుతపసుడి మనుమడైన బలి కొడుకు. బలికి సంతానం లేకపోవుటచే దీర్ఘతమసుడి ద్వారా అతని భార్య ఆర్గురు కొడుకులకు జన్మనిచ్చింది. వారు అంగ, వంగ, కళింగ, సుహ్య, పుండ్ర, అద్రూపులు. – *భాగవతం*

**సూకరం 1 :** పురాణాలలో ప్రసిద్ధరాజ్యంగా పేర్కొనబడిన ప్రాంతం. ఈ రాజ్యాధిపతి శూకరుడు. వేల ఏనుగుల్ని యుధిష్ఠురుడికి రాజసూయ యాగంలో బహుమతిగా ఇచ్చాడు. – *మహాభారతం*

**సూకరం 2 :** ఓ నరకం.

**సుకరముఖం :** ఓ నరకం

**సూక్ష్ముడు :** ప్రజాపతి కశ్యపుడికి దనువుకు జన్మించిన ఓ క్రూర రాక్షసుడు. జయద్రథుడు ఇతడి అంశతో జన్మించాడు. – *మహాభారతం*

**సూచి :** ఇనుప సూది. పురాణాలలో దీనికి ఎంతో ప్రాముఖ్యతవుంది. భారతదేశాన్ని గురించిన ఓ పుణ్య కథ వుంది. రావణుని మరణానంతరం విభీషణుడు లంకకు రాజయ్యాడు. అక్కడ దొరికే లోహం బంగార మొక్కటే. అతడి పాలనలో లంక సుభిక్షంగా వుంది. ఒకసారి భారతదేశంలో దొరికిన ఇనుపసూది తీసుకెళ్ళి భద్రంగా దాచుకున్నాడు. ప్రతిరోజు సముద్రం దాటి రామేశ్వరం వచ్చి పూలసజ్జతో రాముడ్ని పూజించి తిరిగివెళ్ళేవాడు. ఒకసారి ఆ పూలసజ్జలో ఓ బ్రాహ్మణుడున్నాడు. లంక వెళ్ళిన తర్వాత అది గమనించి ఆ బ్రాహ్మణుణ్ణి సత్కరించి ఓ పెట్టెలో అమూల్య వస్తువు

నుంచి అతణ్ణి తిరిగి భారతదేశం పంపాడు. ఆ బ్రాహ్మణుడు ఆ పెట్టె తీసిచూడగా సూది కన్పించి ఆశ్చర్యపోయాడు.

**సూచిక :** కరక్కతి అనే రాక్షసి స్వరూపం.

**సూచీవక్త్రుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. – మహాభారతం

**సూతుడు 1 :** నైమిశారణ్యంలో పురాణ పఠనంచేసి ఇతర రుషులకు విన్పించాడు. ఇతడు వ్యాసుని శిష్యుడు. వ్యాసుని కుమారుడు శుకుడు, ఇతడికి సహాధ్యాయ రుషులకు నైమిశారణ్యం కలియుగంలో వేదికగా నిల్చింది. కలియుగం రాబోతున్న తరుణంలో ద్వాపరయుగాంతంలో రుషులంతా నైమిశారణ్యం చేరారు. వీరు కలియుగంలోని పాప ప్రక్షాళనకు మార్గం చెప్పమని బ్రహ్మను సలహా కోరగా బ్రహ్మ ఓ చక్రం ఇచ్చి దీనివెంట వెళ్ళండి అది భూమిపై ఎక్కడ పడితే అది కలియుగంలో కూడా ప్రశాంతంగా వుంటుంది. సత్యయుగం వచ్చే వరకు అచ్చటనే గడపండని సలహా ఇచ్చాడు. అది ఆగినచోటే నైమిశారణ్యం. రుషులంతా అక్కడికి వచ్చి సూతుడ్ని చూసి నీవు వ్యాసుని శిష్యుడివి. పురాణ కథలన్నీ నీ ద్వారా విన్పిస్తే మేము పాపరహితులమై మోక్షం పొందుతామని అడగగా సూతుడు తన శిష్యుడు శౌనకుడికి కథ చెప్పినట్లుగా పురాణాలు చెప్పగా రుషులంతా విన్నారు. అవే ప్రజలకు చేరాయి. – దేవీభాగవతం

కురుక్షేత్ర సంగ్రామం మొదలయినపుడు సూతుడు పురాణ పఠనం చేస్తుండగా బలభద్ర రాముడు అతడి తల నరికాడు. ఆ తర్వాత దాన్ని తిరిగి అమర్చాడు. – చూ॥ *బలభద్రరాముడు.*

భీష్ముడు అంపశయ్యపైనుండగా దర్శించిన మహర్షుల్లో సూతుడొకడు. – మహాభారతం

**సూతుడు 2 :** విశ్వామిత్రుని కొడుకుల్లో ఒకడు. వేదాలను ప్రచారంచేశాడు. – మహాభారతం

**సూతుడు 3 :** వర్ణ సంకరంవల్ల జన్మించినవాడు. – చూ॥ వర్ణాలు

**సూత్రం :** చూ॥ వేదాలు

**సూత్రాలు :** శుభాశుభకర్మల గురించి వేదాలలో వివరించబడిన విధులు. ఇవి పద్దెనిమిది : బోధాయన, ఆపస్తంబ, సత్యాషాఢ, ద్రాహ్యాయక, అగస్త్య శాకల్య, అశ్వలాయన, శాంభవీయ, కాత్యాయన, వైఖానస, శౌనకీయ, భరద్వాజ, అగ్నివైశ్య, జైమినీయ, వాధూల, మాధ్యందిన, కౌండిన్య, కౌషీతక, హిరణ్యకేశి.

**సూనృత :** ధర్మదేవుని కూతురు. ఉత్తానపాదుడు ఈమెను వివాహమాడగా వీరికి నల్గురు సంతానం జన్మించారు. – హరివంశం

**సూరన :** పింగళి సూరన ఆంధ్ర ప్రబంధ కవులలో ప్రతి భావంతుడు. ఇతడు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమున నుండెను. ఇతడి రచనలు రాఘవ పాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము. ఇందులో 'కళాపూర్ణోదయము' విచిత్ర కల్పిత కథలతో నుండి బహు జనాదరణ పొందిన ప్రబంధ కావ్యము.

**సూరసేని :** పురు రాజు కొడుకైన ప్రవీరుడి భార్య. వీరికి జన్మించిన కొడుకు మనస్యుడు. – మహాభారతం

**సూరిశర్మ :** శివదత్తుడనే బ్రాహ్మణుడి కుమారుల్లో ఒకడు. ఒకసారి అరణ్యానికి వెళ్ళి పులి ఓ మృగాన్ని చంపడం చూసి భయపడి పరుగెత్తుతూ రాళ్ళపై పడి మరణిస్తాడు. ఆ మరణిస్తూ మృగిని తలచుకోవడం వల్ల మృగమైపుడతాడు. చనిపోయిన మృగి మృగమై పుడుతుంది. ఇవి దంపతులవుతాయి. పరశురాముడి వల్ల శ్రీకృష్ణ స్తోత్రం విని స్వర్గం చేరుకుంటాయి. – *బ్రహ్మాండపురాణం.*

**సూర్యకేతువు :** ఓ రాక్షసి. ఇతడు దేవతలను ఓడించి ఇంద్రుడ్ని వెడలగొట్టాడు. అప్పుడు సూర్యవంశపు రాజైన పురంజయుడు అయోధ్యను పాలిస్తున్నాడు. ఇంద్రుడు పురంజయుడి సహాయంకోరగా నీవు ఎద్దుగా నిలబడితే నేను దానిపై కూర్చొని యుద్ధం చేస్తానని చెప్పాడు. అలాగే ఎద్దుపై కూర్చొని సూర్యకేతుడితో యుద్ధం చేసి సంహరించి ఇంద్రుడి స్థానాన్ని అతడికప్పగించాడు. ఎద్దు మోపు (కకుద) పై కూర్చొని యుద్ధంచేశాడు కనుక కకుస్థుడను పేరొచ్చింది. – కంభరామాయణం

**సూర్యగ్రహణం :** చూడుము:రాహుకేతువులు; చంద్రుడు

**సూర్యతీర్థం :** కురుక్షేత్రంలోని ఓ పవిత్రస్థలం. ఇచ్చట స్నానంచేసి పితృగణాలను పూజిస్తే అగ్నిస్తోమయాగ ఫలితం లభిస్తుంది. సూర్యలోకప్రాప్తి లభిస్తుంది. – మహాభారతం

**సూర్యదత్తుడు :** విరాటరాజు సోదరుడు. గోగ్రహణ సమయంలో కౌరవులతో పోరాడాడు. ఇతడిని శతానికుడని కూడా పిలుస్తారు. కురుక్షేత్ర యుద్ధంలో 100 మంది త్రిగర్తవీరుల్ని చంపి మధ్యభాగానికి దూసుకు వెళ్ళి ద్రోణుని చేతిలో మరణించాడు. – మహాభారతం

**సూర్యధ్వజుడు :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. ద్రౌపది స్వయంవరంలో పాల్గొన్నాడు. – మహాభారతం

**సూర్యనేత్ర :** గరుడుని కుటుంబంలో జన్మించిన ఓ పక్షి. – మహాభారతం

**సూర్యభానుడు :** అలకాపురి ద్వారపాలకుడు. రావణ కుబేరులకు జరిగిన యుద్ధంలో కుబేరుడికి సహాయపడ్డాడు. – ఉత్తర రామాయణం

**సూర్యమాసుడు :** కౌరవుల పక్షాన పోరాడిన వీరుడు. అభిమన్యుడితణ్ణి సంహరించాడు. – మహాభారతం

**సూర్యవంశం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రముఖ వంశం. బ్రహ్మ విష్ణువు నాభినుండి జనించగా అతడు 10 వేల సంవత్సరాలు పరాశక్తిని గూర్చి తపస్సు చేసి సృష్టి ప్రారంభించాడు. మొదట ఇతడు ఏడుగురు మానసపుత్రుల్ని సృష్టించాడు. ఇందులో మరీచి సృష్టిలో ప్రముఖపాత్ర వహించాడు. మరీచి కొడుకు ప్రజాపతి కశ్యపుడు సృష్టికార్యాన్ని మరింత తీవ్రంగా చేశాడు. సూర్యుడు కశ్యప ప్రజాపతి కొడుకు. సూర్యునికి ఇక్ష్వాకు, నాభాగ, ధృష్ఠ, శర్యాతి, నరిష్యంతి, ప్రాంశు, నృగ, దిష్ఠ, కరూష, ప్రహధ్ర జన్మించారు. ఇందులో ఇక్ష్వాకుడు రాజయ్యాడు. ఇక్ష్వాకు వంశంలోని వారందర్నీ సూర్యవంశజులంటారు.

**సూర్యవర్చసుడు :** ఓ దేవగాంధర్వుడు. ఇతడు కశ్యప ప్రజాపతికి జన్మించాడు. అర్జునుడి జన్మదినోత్సవ వేడుకల్లో పాల్గొన్నాడు. – మహాభారతం

**సూర్యవర్మ :** త్రిగర్త రాజు. ఇతని సోదరుడు కేతువర్మ అర్జునుడితో అశ్వమేథ యాగంలో యుద్ధం చేశాడు. ఇద్దరు అర్జునుడి చేతిలో మరణించారు. – మహాభారతం

**సూర్యసావర్ణి :** ఛాయ, సూర్యుల కొడుకు. ఇతడు మనువు అవుతాడు. ఇతని కుమారులు రాజులౌతారు. ఇతడి మన్వంతరంలో గాలవుడు, దీప్తిమంతుడు, పరశురాముడు, అశ్వత్థామ, కృపుడు, వ్యాసుడు, ఋష్యశృంగుడు, సప్తర్షులు. ఇంద్రుడు బలి. – భాగవతం

**సూర్యశ్రీ :** ఓ పితృగణదేవుడు. – మహాభారతం

**సూర్యసావిత్రుడు :** పితృగణదేవుడు. – మహాభారతం

**సూర్యాక్షుడు :** ప్రాచీనభారతదేశంలో ఒకరాజు. క్రథ శరీరభాగం నుండి జన్మించాడు. – మహాభారతం

**సూర్యాపీడుడు :** జనమేజయుడికి కాశ్యవల్ల జన్మించిన కొడుకు. – మహాభారతం

**సూర్యారణ్యుడు :** ఇక్ష్వాకు వంశస్తుడు. త్రిశంకుడు అనగా సత్యవ్రతుడి తండ్రి. ఇతణ్ణి త్రయారణ్యుడని కూడా అంటారు.

**సూర్మి :** అనుహ్లాదుడి భార్య. భాష్కలుడు, మహిషుడు ఈమె కొడుకులు. – బ్రహ్మాండపురాణం

**సూర్యుడు 1 :** ప్రపంచానికి వెలుగునిచ్చే దేవుడు.

కశ్యప ప్రజాపతి అదితిలకు జన్మించిన కుమారుడు. కశ్యప ప్రజాపతికి అదితికి జన్మించిన వారిని ఆదిత్యులు, వసువులు, రుద్రులు అంటారు. ఆదిత్యులు 12 మంది. వారు వరుణ, సూర్య, సహ్రాంశు, ధాత, తపన, సవిత, గభాస్తి, రవి, పరంజయ, త్వష్ఠ, మిత్ర, విష్ణు – అగ్నిపురాణం

ధాత, ఆర్యమా, మిత్ర, శుక్ర, వరుణ, అంశ, వివశ్వాని, పూశ, సవిత, త్వష్ట మరియు విష్ణు. – మహాభారతం

ఈ ఆదిత్యులను ఒక్కోసారి సమానార్థకంలో కూడా వాడతారు. వివస్వానుడ్ని సూర్యుడని, వివస్వానుడు వైవశ్వత మనువుకు జన్మనిచ్చాడని ఇతడికి మొదటి రాజైన ఇక్ష్వాకుడు జన్మించడంవల్ల ఈ వంశాన్ని సూర్యవంశమని పిలుస్తారు.

సూర్యుడు తూర్పున ఉదయించి పశ్చిమానికి ప్రయాణిస్తుంటాడు. దానివల్ల పగలు రాత్రి ఏర్పడతాయి. పురాణాలు ఇతడో పెద్ద రథంపై ప్రయాణిస్తాడని ఈ రథానికి ఏడు అశ్వాలు వుంటాయని చెప్తున్నాయి.

**సూర్యుడు 2 :** ఓ అసురుడు. కశ్యప ప్రజాపతి కద్రులకు జన్మించిన కొడుకు. దర్దుడను రాజు ఇతడి పునర్జన్మ. – మహాభారతం

**సేకం :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజ్యం. సహదేవుడు దక్షిణభారత జైత్రయాత్రలో దీన్ని జయించాడు. – మహాభారతం

**సేచకం :** ధృతరాష్ట్రుని కుటుంబంలో జన్మించిన ఓ నాగు. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. – మహాభారతం

**సేతుడు :** భరతుని కుటుంబంలోని ఒకరాజు. ఇతడు బభ్రువు కొడుకు; అనారబ్ధుడి తండ్రి. – భాగవతం

**సేతువు :** శ్రీరాముడు రావణుడితో యుద్ధం చేయడానికి సముద్రంపై కట్టిన వారధి. ఇచ్చట స్నానం చేయడం పాపనివారిణి.

**సేదుకుడు :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. ఒకసారి బ్రాహ్మణులు దక్షిణ ఇమ్మని, ఈ వీరోచితుడైన రాజు వద్దకు వెళ్ళగా వారిని వృషదర్భుడి వద్దకు పంపాడు. – మహాభారతం

**సేనాచిత్తుడు :** భరతుని వంశంలో ఒకరాజు. విశదుడి కొడుకు; రుచిరాశ్వుడి తండ్రి. – మహాభారతం

**సేనాజిత్తు 1 :** మహాభారత కాలంనాటి ఒకరాజు. ఇతడిని పాండవులు యుద్ధంలో పాల్గొనుటకు ఆహ్వానించాలని తలచారు. – మహాభారతం

**సేనాజిత్తు 2 :** ఒకరాజు. కుమారుడి మరణంతో చింతాక్రాంతుడై జీవిస్తుంటే బ్రాహ్మణుల సలహాపై మానసిక శాంతి పొందాడు. – మహాభారతం

**సేనాజిత్తు 3 :** ఒకరాజు. విశదుడి కొడుకు. రుచిరాశ్వుడి తండ్రి. రచిరాశ్వుడు కాక మరో ముగ్గురు కొడుకులున్నారు. వారు దృఢనసు, కాశ్య, వత్సులు. – మహాభారతం

**సేనాబిందుడు 1 :** పురాణకాలంలోని ఓ క్షత్రియరాజు. తుహణ్ణడను అసురుని శరీరం నుండి జన్మించాడు. ఇతడు ద్రౌపది స్వయంవరానికి వచ్చాడు. అర్జునుడు ఉత్తర రాజ్యాల జైత్రయాత్రలో ఉలూకుడితో కలసి ఇతణ్ణి ఓడించాడు. పాండవులు మహాభారత యుద్ధానికి ఆహ్వానించారు. ఇతడ్ని క్రోధవంతుడని కూడా అంటారు. ఇతడు శ్రీకృష్ణ, భీమసేనుడంతటి బలవంతుడు. మహాభారత యుద్ధంలో మరణించాడు. – మహాభారతం

**సేనాబిందుడు 2 :** పాంచాలదేశ వీరుడు. మహాభారత యుద్ధంలో అభిమన్యుడు వధించాడు. – మహాభారతం

**సేనాముఖం :** సైన్యంలో ఓ విభాగం. – చూ॥ అక్షౌహిణి

**సేనాని (సేనాపతి) :** ధృతరాష్ట్రుని వందమంది కొడుకుల్లో ఒకడు. భీమసేనుడితణ్ణి మహాభారత యుద్ధంలో వధించాడు. – మహాభారతం

**సేనుడు :** రుషభుని కొడుకు. సేనుడితో కలసి రుషభుడికి 19 మంది కొడుకులు. – భాగవతం

**సేయుడు :** వేదప్రచారం చేసిన విశ్వామిత్రుని కొడుకుల్లో ఒకడు. – మహాభారతం

**సేశ్వరీసాంఖ్యం :** భగవంతుడి ఉనికిని అంగీకరించిన సాంఖ్యాతాత్వికచింతన.

**సైరంధ్రి :** విరాటరాజు కొలువులో పాండవులు అజ్ఞాతవాసంలో వున్నపుడు ద్రౌపది పేరు. – చూ॥ ద్రౌపది

**సోణానది :** పురాణప్రసిద్ధమైన ఒకనది. ఈ నదీ దేవత వరుణుని కొలువులో అతణ్ణి పూజిస్తుంది. ఇంద్రప్రస్థం నుండి రాజగృహం వెళ్ళేటపుడు శ్రీకృష్ణుడీనదిని దాటాడు. వంశగుల్మమనే పవిత్ర స్థలం ఈ నదిలో వుంది. అచట స్నానంచేస్తే అశ్వమేథయాగ ఫలితం లభిస్తుంది. అగ్ని పుట్టుకకు ఈ నది ఓ మాతృక. – మహాభారతం

రామలక్షణ విశ్వామిత్రులు ఈ నదీతీరాన నివసించారు. – రామాయణం

**సోణితాపురం :** బాణాసురుని రాజధాని. ఈ నగరాన్ని శివుడు, కార్తికేయుడు, భద్రకాళి, అగ్ని రక్షిస్తుంటారు. శ్రీకృష్ణుడు వీరిని జయించి నగర ప్రవేశం చేసి బాణాసురుడ్ని సంహరించి అనిరుద్ధుడ్ని విడిపించాడు. – మహాభారతం

**సోదర్యవానం :** ఇంద్రుని రథం. ఇద్దరు వీరులు ఈ రథంపై కూర్చొని ఏకకాలంలో యుద్ధం చేయడం దీని ప్రత్యేకత. ఈ రథంపై కూర్చొని ఇంద్రుడు 99 మంది అసురుల్ని వధించాడు. ఇతడి వద్దనుండి ఉపరిచరవసువు ఆ తర్వాత బృహద్రధి అతడి నుండి జరాసంధుడి వద్దకు మారి జరాసంధుని మరణానంతరం చివరకు ఇంద్రుడిని చేరింది. – మహాభారతం

**సోభంజి :** యదువంశంవాడు. సనాజిత్తు పేరు.

**సోమ 1 :** సోమ తీగలనుండి పిండిన రసం. యజ్ఞాలలో దేవతలు సోమరసం సేవిస్తారు. ఇదో మత్తుపానీయం.

**సోమ 2 :** ఓ దేవకన్య. అర్జునుడి జన్మదినోత్సవ వేడుకల్లో నాట్యం చేసింది. – మహాభారతం

**సోమకీర్తి :** ధృతరాష్ట్రుని వందమంది కుమారుల్లో ఒకడు. – మహాభారతం

**సోమకుడు 1 :** సోమకవంశంలోని క్షత్రియుల్నందర్నీ సోమకుడని పిలుస్తారు. – మహాభారతం

**సోమకుడు 2 :** పాంచాలరాజు. దయార్థుడు. సుభాహుడి మనుమడు. సహదేవుడి కొడుకు. బ్రాహ్మణుల సలహాపై తన కొడుకుని బలి ఇవ్వగా 100 మంది సంతానం కల్గారు. ఇతడు ప్రపంచంలోని అన్ని పవిత్ర స్థలాలు దర్శించాడు. నరకాన్ని కూడా దర్శించాడు. జీవితాంతంవరకు మాంసాహారం స్వీకరించలేదు. ఇతడు యముని కొలువులో అతణ్ణి పూజిస్తుంటాడు. – మహాభారతం

**సోమగిరి :** ఓ పర్వతం. దీన్ని ఉదయం, సాయంత్రం స్మరించడం మంచిది. – మహాభారతం

**సోమతీర్థం :** కురుక్షేత్రంలోని ఓ ప్రాచీన పుణ్యతీర్థం. ఇచట స్నానం చేస్తే రాచరికం పొందుతారు. – మహాభారతం

**సోమద :** ఓ గంధర్వకన్య. చూడుము:చూలి

**సోమదత్తుడు 1 :** ఇక్ష్వాకు వంశంలోని ఒకరాజు. సహదేవుడి మనుమడు. కృశాశ్వుని కొడుకు. – వాల్మీకి రామాయణం

**సోమదత్తుడు 2 :** కురు వంశంలోని ఒక రాజు. ప్రదీపుడి మనుమడు. బాల్హికుడి కొడుకు. సోమదత్తుడికి ముగ్గురు కుమారులు. వారు భూరి, భూరిశ్రవసుడు, శలుడు. వీరు ద్రౌపది స్వయంవారినికి వచ్చారు. ధర్మజుని రాజసూయ యాగానికి వచ్చారు. దేవకి స్వయంవరానికి వచ్చినపుడు ఇతనికి శినికి ద్వంద యుద్ధం జరిగింది. శినితో ఓటమిని భరించలేక అతడి కుమారుణ్ణి అతని భవంతిలోనే తన్నే కుమారుడు జన్మించాలని శివుణ్ణి గూర్చి తపస్సు చేయగా భూరిశ్రవసుడు జన్మించి అతనికోర్కె నెరవేర్చాడు. ఇతడు మహాభారత యుద్ధంలో సాత్యకి, భీమసేనులతో పోరాడాడు. సాత్యకి ఇతణ్ణి వధించాడు. ఇతని ఆత్మకు ధృత రాష్ట్రుడు శాంతి చేశాడు. వ్యాసుడు గంగానదిపై మహర్షుల ఆత్మలు చూపినపుడు ఇతడిని చూపాడు. – మహాభారతం

**సోమధేయం :** తూర్పు భారతదేశంలోని ఓ ప్రాచీన రాజ్యం. భీమసేనుడు ఈ ప్రాంత ప్రజల్ని ఓడించాడు. – మహాభారతం

**సోమపదం :** ఓ పవిత్రస్థలం. ఇచ్చట మహేశ్వర పాద మనే ఈ పవిత్ర స్థలంలో స్నానం చేస్తే అశ్వమేథ యాగ ఫలితం లభిస్తుంది. – మహాభారతం

**సోమపుడు 1 :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. – మహాభారతం

**సోమపుడు 2 :** పితృగణ దేవతల్లో ఒకడు.

**సోమపుడు (సోమం) 3 :** ఏడుగురు పితృగణ దేవతల్లో ఒకడు. ఇతడు బ్రహ్మకొలువులో నివసిస్తాడు. – మహాభారతం

**సోమరసం :** చూ॥ సోమ1

**సోమలుడు :** సప్తపితరుల్లో ఒకడు. బ్రహ్మలోకంలో నివసిస్తాడు. సోమపుడని కూడా అంటారు. – మహాభారతం

**సోమవతీసోమవంతులు :** చూ॥ సుమేధుడు

**సోమవర్చస్సు :** ఓ విశ్వదేవుడు. పితృగణదేవతల్లో ఒకడు. – మహాభారతం

**సోమశర్ముడు 1 :** ఓ బ్రాహ్మణుడు. చూ॥ గుణాఢ్యుడు.

**సోమశర్ముడు 2 :** శివశర్మ కొడుకు. చూ॥ శివశర్మ

**సోమశ్రకం :** పాంచాలదేశంవద్ద గల పుణ్యస్థలం. అర్జునుడు అంగారపర్ణుడ్ని ఇక్కడ ఓడించాడు. – మహాభారతం

**సోమశ్రవసువు :** ఓ రుషి. ఇతనితండ్రి శ్రుతశ్రవసుడు. జనమేజయుడు శృతశ్రవసుడ్ని కలసి యాగానికి పౌరోహిత్యం చేయుటకు సోమశ్రవసుడిని పంపమని కోరాడు. – చూ॥ శృతశ్రవసుడు

**సోమసంస్థలు :** శ్రౌతాగ్నిలో వేల్చే యజ్ఞ భేదాలు. ఇవి ఏడు రకాలు. అగ్నిష్టోమ; అత్యగ్నిస్టోమ, ఊక్థ్యమ, షోడశి, అతిరాత్ర, అప్తోర్యామ, వాజపేయాలు.

**సోమాశ్రమం :** ఇదో పవిత్రస్థలం. దీన్ని దర్శించిన వారు ఇతరుల గౌరవం పొందుతారు. – మహాభారతం

**సోమాశ్రయాయణం :** గంగా తీరానగల ఓ పుణ్యస్థలం. ఒకసారి పాండవులు దీన్ని దర్శించారు. చిత్రరథుడు కన్యలతో జలవిహారం చేసిందిక్కడే. – మహాభారతం

**సోముడు 1 :** భానుడికి అతని మూడవ భార్య నిశాకు జన్మించాడు. నిశ సోముడికి అగ్నికి, రోహిణికి జన్మనిచ్చింది. – మహాభారతం

**సోముడు 2 :** అష్టావసువుల్లో ఒకడు. – చూ॥ అష్టావసువులు

**సోముడు 3 :** జరాసంధుని నల్గురు కుమారుల్లో ఒకడు. తక్కిన ముగ్గురు సహదేవ, తుర్య, శ్రుతశ్రులు.

**సౌగంధికం :** కుబేరుని ఉద్యానవనం. వాయువు ఈ వనంలోని వాసనలను కుబేరుని భవంతిలోకి తీసుకు వెళ్ళి అచ్చటే వుంటాడు. ఈ ఉద్యానవనం సౌగంధిక పుష్పాలతో నిండి వుంటుంది. – మహాభారతం

**సౌగంధికవనం :** ఓ పుణ్యస్థలం. ఇచ్చట బ్రహ్మ ఇతర రుషులు, సిద్ధులు, చరనులు, గంధర్వులు, కిన్నెరలు, నాగులు నివసిస్తారు. మానవుడు ఈ పుణ్యస్థలిని దర్శిస్తే పాపప్రక్షాళన జరుగుతుంది. – మహాభారతం

**సౌతి :** రోమహర్షుడను రుషి కొడుకు. ఇతడి అసలుపేరు ఉగ్రస్రవసుడు. మహాభారతాన్ని క్రమపద్ధతిలో పెట్టిందితడే. వ్యాసుని, వైశంపాయనుల భారతంలో శ్రీకృష్ణునికి, యాదవులకు ప్రాముఖ్యత లేదు. ఇతడు స్వర్గారోహణపర్వానికి హరివంశాన్ని అనుబంధంగా చేర్చి ఆ కొరత తీర్చాడు.

**సౌదాసుడు :** ఇక్ష్వాకు వంశపురాజు. కల్మషపాదుడని కూడా పిలుస్తారు. – చూ॥ కల్మషపాదుడు

**సౌధృతేయుడు :** సుదృతి కొడుకు. ఇతని కొడుకు కేవలుడు. – *భాగవతం*

**సౌనంద :** చూ॥ ముదావతి

**సౌబలుడు :** వైశ్యుడు. ధృతరాష్ట్రునికి ఇద్దరు భార్యలు. ఒకరు గాంధారి, రెండవభార్య వైశ్యస్త్రీ అయిన సౌబలి. సాబలితండ్రి సౌబలుడు. – దేవీభాగవతం

**సౌభకం :** శిశుపాలుడి స్నేహితుడు సాల్వుడు శివుడి గురించి తపస్సు చేసి గరుడ, గంధర్వ రాక్షసాదులకు సాధ్యపడని ఆకాశంలో విహరించే వాహనాన్ని వరంగా పొందుతాడు. శివుడు దీన్ని నగరరూపంలో నిర్మించమని మయుడికి చెప్తాడు. దానిపేరే సౌభకం. శ్రీకృష్ణుడు దీన్ని తన గదతో తుత్తునియలు చేస్తాడు. – మహాభారతం

**సౌభద్రం :** నారీ తీర్థాలలో ఒకటి. – చూ॥ నారీ తీర్థాలు

**సౌభపతి :** సాళ్వరాజు పేరు. సౌభమనే రథం కలవాడ గుటవల్ల సౌభపతి అని పిలువబడ్డాడు.

**సౌభర :** ఓ అగ్ని. వర్చసుడి శరీరభాగం నుండి జనించింది. – *మహాభారతం*

**సౌభరి 1 :** ఓ రుషి. కాళింది నదీ తీరంలో తపస్సు చేశాడు. – చూ॥ *గరుడుడు*

**సౌభరి 2 :** వింధ్య పర్వతంపై ఆశ్రమం నిర్మించుకున్న రుషి. అశ్వమేధయాగ సమయంలో అర్జునుడితణ్ణి దర్శించాడు. ఉద్దాలకుడిచే శపించబడిన చండిని గూర్చి వివరించగా అర్జునుడు చండిని శాపవిముక్తి చేశాడు.

**సౌభరి 3 :** పురాణప్రసిద్ధుడైన రుషి. మాంధాత 50 మంది కుమార్తెలను వివాహమాడాడు. యమునానదీ తీరంలో తపస్సు చేస్తూ రెండు చేపలు రతిక్రీడలు సల్పడం చూసి మాంధాతకు అతని కుమార్తెను వివాహమాడదలచినది చెప్పగా ఇష్టంలేని మాంధాత ఎవరికైనా నచ్చితే వివాహమాడమని చెప్పగా తన తపశ్శక్తిచే మాంధాత 50 మంది కుమార్తెలకు నవయవ్వనుడుగా దర్శనమివ్వగా వారంతా అతణ్ని వివాహమాడటానికి ఇష్టపడతారు. వారినందరిని వివాహం చేసుకొని కొంతకాలం గడిపి ఈ జీవితంపై విరక్తిచెంది అరణ్యానికి వెళ్ళగా భార్యలు కూడా అతనితో వెళ్ళారు. – *విష్ణుపురాణం, పద్మపురాణం*

**సౌభాగ్యగౌరి :** పార్వతీదేవి ఓ ప్రత్యేక రూపం. పార్వతి ఓ ఎడమచెయ్యి భుజానికి తగుల్తూ తలపై వుండి రెండవ చెయ్యి అద్దంపట్టుకొని, ఓ కుడిచెయ్యి ఫలాలు పట్టుకొని మరోకుడిచెయ్యి పైకెత్తి నిలబడిన పార్వతి రూపం సౌభాగ్యగౌరి. – *అగ్నిపురాణం.*

**సౌభాగ్యసుందరి :** నారదుని స్త్రీ రూపం. – చూ॥ *తాలజంఘుడు*

**సోమదత్తి :** సోమదత్తుడి కొడుకు భూరిశ్రవసుడిని సోమదత్తి అంటారు. – మహాభారతం

**సౌమనసం 1 :** భూమిని మోసే అష్టదిగ్గజాల్లో ఒకటి. – చూ॥ అష్టదిగ్గజాలు

**సౌమనసం 2 :** ఓ పర్వతశిఖరం. ఈ బంగారు శిఖరం పై విష్ణుమూర్తి వామనావతారంలో మొదటిపాదం పెట్టాడు. రెండవ పాదం వేలదు పర్వతంపైన, మూడ వపాదం బలి తలపై పెట్టాడు. – రామాయణం

**సౌమని :** ఓ బ్రాహ్మణ స్త్రీ. భర్త మరణించిన తదుపరి జారిణిగా మారి గోమాంసాన్ని కూడా భుజిస్తుంది.

తర్వాత జన్మంలో చండాల కన్యగా జన్మిస్తుంది. శివ రాత్రి తీర్థవాసులను ముష్టి అడుగుతుంది. ఒకడు దండ ఇవ్వగా అది తినడానికి పనికిరాదని విసరి కొట్టగా శివలింగంపై పడి ఈమెకు పుణ్యలోకప్రాప్తి కల్గుతుంది. - శివపురాణం

**సౌమ్య :** ఒక ఉపపురాణం.

**సౌమ్యాక్షద్వీపం :** పురాణప్రసిద్ధమైన ఒక ద్వీపం. - మహాభారతం

**సౌరభి :** ఓ గోవు. సురభి కూతురు. షడ్రసాలను (అమృతం) తాగిన బ్రహ్మ ముఖం నుండి సురభి జన్మించి క్షీరం వర్షించగా అది క్షీరసాగరమయ్యింది. ఆ క్షీరపు నురుగుతో రుషులు జీవించారు. క్షీరసాగరాన్ని నాల్గు గోవులు రక్షించాయి. అందులో తూర్పున కాపలా వున్న గోవు సౌరభి.

**సౌరభేయి :** ఓ అప్సరస. - చూ॥ వర్ణ

**సౌరాష్ట్రం :** ఒక రాజ్యం. ఇప్పటి సూరత్ చుట్టుప్రక్కల ప్రాంతాన వున్న దేశాలు. దీన్ని సురాష్ట్రమని కూడా అంటారు.

**సౌరం :** ఒక ఉపపురాణం.

**సౌవర్ణ :** ప్రాచీన బర్హి భార్య. ప్రచేతసుల తల్లి. - మహాభారతం

**సౌవారి :** పూరుని మనుమడు, ప్రవీరుడి కుమారుడు అయిన మనస్యుడి భార్య. - మహాభారతం

**సౌవీరం :** సింధూనది వద్దగల ప్రాచీన రాజ్యం. - మహాభారతం

**సౌశృతి :** త్రిగర్త రాజైన సుశర్మ సోదరుడు. మహాభారత యుద్ధంలో కౌరవుల పక్షాన పోరాడి అర్జునుడి చేతిలో మరణిస్తాడు. - మహాభారతం

**సౌశల్య :** ప్రాచీన భారతదేశంలో ఓ రాజ్యం. - మహాభారతం

**సౌహృదం :** ప్రాచీన దక్షిణ భారతదేశంలో ఒకరాజ్యం. పురాణ ప్రసిద్ధమైన రాజ్యం. - మహాభారతం

**సంకటుడు :** కకుభ్దేవి ధర్మదేవుల కొడుకు.

**సంకల్ప :** దక్షప్రజాపతి కూతురు. ఈమెతో కలిసి 10 మంది దక్షుని కుమార్తెలను ధర్మదేవుడు వివాహమాడాడు. - భాగవతం

**సంకల్పుడు :** ధర్మదేవుడు సంకల్పులకు జన్మించిన కొడుకు. - భాగవతం

**సంకర్షణుడు :** చూ॥ బలభద్రరాముడు

**సంకోచుడు :** భూమినంతా పాలించిన ఓ రాక్షసుడు. ఆ తరువాత మరణించాడు. భీష్ముడు అంపశయ్యపై నుండగా ధర్మజుడు అతణ్ణి దర్శించినపుడు ఎంతటి శక్తివంతుడు, బలవంతుడు అయినా ఏదో ఒకరోజున మరణించక తప్పదని ఈ జీవనం ఆత్మప్రయాణంలో ఓ భాగమని చెప్తూ భీష్ముడు ధర్మరాజుకి ఈ రాక్షసుడి శక్తిని, అతడి మరణాన్ని ఉదహరిస్తాడు. - మహాభారతం

**సంకృతి :** భరతవంశపు రాజు. రంతిదేవుని తండ్రి. నరకుని కొడుకు. - భాగవతం

**సంఖ్య :** ప్రాచీన భారతదేశంలో 19 వరకు అంకెలు లేవు. గొప్ప గణశాస్త్రకారుడైన భాస్కరాచార్యుడు తన లీలావతి గణితంలో ఆ పందొమ్మిది అంకెలను ఈ పేర్లతో అభివర్ణించాడు. ఏకం, దశం, శతం, సహస్రం, అయుతం, లక్షం, ప్రయుతం, కోఠి, అర్బుదం, అబ్జల, ఖర్వం, త్రిఖరం, మహాపర్వం, శంఖు, జలధిం, అంత్యం, మధ్యం, పదార్థం, దశపదార్థం.

**సంక్రముడు :** విష్ణువు సుబ్రహ్మణ్యుడికిచ్చిన ముగ్గురు సేవకుల్లో ఒకడు. తక్కిన ఇద్దరు చక్రవిక్రములు. - మహాభారతం

**సంగతుడు :** మౌర్య వంశపురాజు. సుయశసుడి కొడుకు; శాలశూరకుడి తండ్రి. - మహాభారతం

**సంగవుడు :** దుర్యోధనుని పశుశాల సంరక్షకుడు. మహాభారత యుద్ధంలో దుర్యోధనుడికి సహాయపడతాడు. - మహాభారతం

**సంగృహుడు :** సముద్రుడు సుబ్రహ్మణ్యుడిక్చిన ఇద్దరు సేవకుల్లో ఒకడు. మరొకడు విక్రముడు. - మహాభారతం

**సంగ్రామజిత్తు :** భద్రాశ్రీకృష్ణులకు జన్మించిన పదిమంది కొడుకుల్లో ఒకడు. - భాగవతం

**సంచారకుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. - మహాభారతం

**సంజయంతి :** ప్రాచీన దక్షిణ భారతదేశంలో ఓ నగరం. సహదేవుని దక్షిణభారత దేశ జైత్రయాత్రలో వీరికి

రాయబారం పంపి లోబరచుకొన్నాడు. ఈ రాజ్యం నుండి కానుకలు పొందాడు. - మహాభారతం

**సంజయుడు :** ధృతరాష్ట్రుని మంత్రి. రుషితుల్యుడు. సూతుడు. గవల్గనుడి శరీర భాగం నుండి జన్మించాడు. వ్యాసుని వరంవల్ల కురుక్షేత్ర సంగ్రామాన్ని పూస గుచ్చినట్లు అంధుడైన ధృతరాష్ట్రునికి వివరించాడు. కౌరవ పాండవులు యుద్ధోన్ముఖులై కురుక్షేత్రంలో వుండగా వ్యాసుడు ధృతరాష్ట్రుడిని చూడటానికి రాగా అతడు యుద్ధం చూడలేని అశక్తతను వెల్లడించగా వ్యాసుడు సంజయుడికి అంతర్దృష్టి వుంది కనుక యుద్ధక్షేత్రంలో బయట, రహస్యంగా జరిగే అన్ని విషయాలను నీకు విశదీకరిస్తాడని ధృతరాష్ట్రుడికి చెప్తాడు. వ్యాసుని వరంవల్ల దుర్యోధనుడు కురు క్షేత్రంలో మరణించే వరకూ అన్ని సన్నివేశాలను వివ రించిన తర్వాత అతని అంతరదృష్టి పోయింది.

ఇతర విశేషాలు : ధర్మజుని రాజసూయయాగ సమయంలో అతిధులను ఆహ్వానించాడు. పాండ వులు జూదంలో ఓడి అరణ్యవాసం వెళ్ళగా విదురుడు కోపంతో పాండవులతో వెళ్ళగా ధృతరాష్ట్రుని కోరికపై సంజయుడు వెళ్ళి విదురుడిని వెనక్కు తీసుకు వచ్చాడు. ధృతరాష్ట్రునికి పాండవుల ప్రతిజ్ఞ గురించి, సహాయకుల్ని గురించి వివరించాడు. శ్రీకృష్ణుడి గొప్ప తనాన్ని వివరించాడు. సాత్యకి సంజయుడ్ని బంధిం చగా వ్యాసుని ఆశీర్వచనాలతో బయటపడ్డాడు. జీవిత చరమాంకంలో ధృతరాష్ట్ర గాంధారిలతో పాటు అర ణ్యానికి వెళ్ళగా అరణ్యంలో ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతి మరణించగా ఆ విషయాన్ని గంగా తీరంలోని రుషులకు వివరించాడు.

**సంజయుడు 2 :** సౌవీర రాజ్యయువరాజు. జయద్రధుడు పాంచాలిని ఎత్తుకుపోయే సమయంలో అతడికి తోడు న్నాడు. అర్జునుడికి వీరికి జరిగిన యుద్ధంలో ఇతడు మరణించాడు.

**సంజయుడు 3 :** మరో సౌవీర యువరాజు. ఇతని తల్లి విదుల. ఇతడు యుద్ధభూమి నుండి పారిపోగా విదుల తిరిగి యుద్ధభూమికి పంపింది.

- మహాభారతం

**సంజీవకుడు :** పంచతంత్రంలోని ఒకపాత్ర.

**సంజీవమణి :** సర్పాల శిరస్సుపై వుండే మణి. బభ్రు వాహనుడు ఈ మణితోనే తన తండ్రి అర్జునుడ్ని సజీవుణ్ణి చేస్తాడు. - చూ॥ బభ్రువాహనుడు

**సంజీవని :** ఔషధ మొక్క. మరణించిన వారిని బ్రతికిం చగలదు. ద్రోణచంద్ర పర్వతాలపై వుంటుంది. రామ రావణ యుద్ధంలో లక్ష్మణుడు మూర్ఛిల్లినపుడు హనుమంతుడు పర్వతంతో సహా ఈ ఔషధిని తెచ్చి లక్ష్మణుడ్ని బ్రతికిస్తాడు. - రామాయణం

**సంజ్ఞ :** సూర్యుని భార్య. విశ్వకర్మ కుమార్తెగా అన్ని పురాణాలు పేర్కొంటున్నాయి. మహాభారతం మాత్రం త్వష్ట కుమార్తె అనే చెప్తోంది. సంజ్ఞ సూర్యుని వేడిని భరించలేక తన సహచరి ఛాయను తన రూపంలో సూర్యునివద్ద వుంచి తన కుమారులైన మను, యమ లను కూడా చాయ రక్షణలో వుంచి తపస్సు చేయడా నికి అరణ్యానికి వెళ్ళింది. సూర్యుడు ఛాయనే సంజ్ఞగా భావించి ఆమెను కూడగా ఆమెవల్ల శనైశ్వరుడు, మరో మనువు తపతిలకు జన్మనిచ్చాడు. ఛాయ యముడ్ని శపించింది. అప్పుడు సూర్యుడు తన దూరదృష్టితో చూసి ఛాయ తన భార్యకాదని తన భార్య సంజ్ఞ అరణ్యంలో ఆడగుర్రం రూపంలో వుందని తెలుసు కొని అశ్వంగా మారి ఆమెతో రమించగా అశ్వనీ కుమారులు, రేవంతుడు జన్మించారు.

సూర్యుని అతివేడిని భరించలేక సంజ్ఞ తన తండ్రికి చెప్పుకోగా విశ్వకర్మ సూర్యుడిని తన చక్రంలో వుంచి సానబట్టగా నాల్గోవంతు వేడి తగ్గింది. అలా సానబెట్టి నపుడు రాలిన పొడితో విశ్వకర్మ విష్ణువు సుదర్శన చక్రాన్ని, శివుడికి త్రిశూలాన్ని, కుబేరునికి పుష్పక విమానాన్ని, సుబ్రహ్మణ్యుడికిశక్తి అనే ఆయుధాన్ని తయారుచేసి ఇచ్చాడు. - విష్ణుపురాణం

**సంతర్జనుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు.

**సంతర్ధనుడు :** కేకయరాజైన ధృష్టకేతు కొడుకు. ఇతడు ధర్మజుని రాజసూయ యాగానికి వచ్చాడు.

- మహాభారతం

**సంతానగోపాలుడు :** ఓ బ్రాహ్మణుడి కొడుకు మరణిం చగా అతడిని తిరిగి బ్రతికించడానికి అర్జునుడు ప్రయత్నించిన కథ. - చూ॥ అర్జునుడు

**సంతానిక :** సుబ్రహ్మణ్యస్వామి పరిచారిక.

- మహాభారతం

**సంతుడు :** వితహవ్యుడి రాజకుటుంబంలో జన్మించిన సత్యుడికొడుకు. ఇతడి కొడుకు శ్రవసుడు. *- మహాభారతం*

**సంతురోదుడు :** పూరువంశపు రాజు. మతినారుడి కొడుకు. *- అగ్నిపురాణం*

**సందంశ :** ఓ నరకం

**సంధానకరణి :** చూ॥ మృత సంజీవని

**సంధి :** ప్రశుశుక్రుడి కొడుకు. ఇతడి కొడుకు అమర్షణుడు. *- భాగవతం*

**సంధ్య 1 :** వశిష్ఠుని భార్య. అరుంధతి పూర్వజన్మ. *- చూ॥ వశిష్ఠుడు.*

**సంధ్య 2 :** సాలకంఠకి అను రాక్షసితల్లి. సంధ్య కూతురైన ఈ సాలకంఠకి విద్యుత్కేశుడిని వివాహమాడింది. *- ఉత్తర రామాయణం*

**సంధ్య 3 :** కాలం కలయికలు. ఒక రోజులో అలాంటి మూడు సంధ్యలుంటాయి. ఉదయ సంధ్య, మధ్యాహ్న సంధ్య, సాయం సంధ్య. రాత్రి పగలు కలిసేది ఉదయ సంధ్య. పగలు సమయంలో మధ్యాహ్న సంధ్య, పగలు రాత్రి కలిసే సమయం సాయంసంధ్య. వేదాలలో బ్రాహ్మణులు వృక్షాలని ఈ మూడు సంధ్యలు మూలాలని, వేదాలు దాని కొమ్మలని, క్రతువులు ఆకులని చెప్పబడింది. బ్రాహ్మణులు వాటిని సరిగా నిర్వహించకపోతే వారు మరుజన్మలో కుక్కలుగా జన్మిస్తారు. అంతేకాకుండా ఈ సంధ్యాసమయాలలో వారి కర్తవ్యం సరిగా నిర్వహించకపోతే వేదాలు చెప్పిన ఏకార్యము వారు నిర్వహించే హక్కు కోల్పోతారు.

**సంధ్య 4 :** ఓ పవిత్ర నది. వరుణుని కొలువులో అతణ్ణి పూజిస్తుంది. *- మహాభారతం*

**సంధ్య 5 :** ఉదయకాలపు దేవత ప్రతీభ్యాదేవి అని కూడా పిలుస్తారు.

**సంధ్యాకరనంది :** 12వ శతాబ్దంలో జీవించిన ఓ సంస్కృత కవి. 'రామపాలచరిత' ఇతడి రచన. రామపాలుడు 11వ శతాబ్దంలో బెంగాల్ని పాలించాడు.

**సంధ్యారాగం :** సంధ్యాసమయంలో ఆకాశంలో కన్పించే ఎరుపురంగు. హిమవాణుడి కూతురు రాగిణి శివుడ్ని భర్తగా కోరి తపస్సు చేసింది. బ్రహ్మ ఇతర దేవతలు ఆమెవద్దకు వచ్చి శివుడి శక్తిని భరించలేవని చెప్పగా రాగిణికి కోపంరాగా బ్రహ్మ ఈమెను శపించి సంధ్యా రాణిగా మార్చాడు. *- చూ॥ పార్వతి*

**సంధ్యావళి:** రుక్మాంగదుడి భార్య. *- చూ॥ ధర్మాంగదుడు*

**సంపాతి 1 :** ఓ పక్షి. జటాయువు అన్న. కశ్యపప్రజాపతికి వినతవల్ల అరుణుడు, గరుడుడు జన్మించారు. అరుణుడికి ఇద్దరు సంతానం వారు సంపాతి, జటాయువు. ఒకసారి అన్నదమ్ములిద్దరూ సూర్యునివైపు ఎగిరి ఆ వేడికి జటాయువు భరించలేనని తన రెక్కలతో కాపాడగా ఆ రెక్కలు కాలి సంపాతి సముద్రపు ఒడ్డున పడిపోయింది. హనుమంతుడు ఇతర వానరసైన్యం సీతను వెతకడానికి వెళ్ళినపుడు సంపాతి వారికి దారి చూపింది. *- రామాయణం*

**సంపాతి 2 :** ఓ రాక్షసుడు. కైకసి సోదరి కుంభినకి కొడుకు.

**సంపాతి 3 :** పాండవులకు వ్యతిరేకంగా పోరాడిన యోధుడు. ద్రోణుడి గరుడవ్యూహంలో మధ్య నిలబడ్డాడు. *- మహాభారతం*

**సంప్రియ :** మధువంశపు రాకుమారి. విదురుడు అను రాజువివాహమాడగా వీరికి అనశ్వుడు జన్మించాడు. *- మహాభారతం*

**సంప్రీతి :** శముడి భార్య.

**సంభల :** పురాణకాలంలో ఓ గ్రామం. మహావిష్ణువు కల్కిగా జన్మిస్తాడు. *- మహాభారతం*

**సంభావ :** గాంధారి సోదరి. ధృతరాష్ట్రుని భార్య. *- మహాభారతం*

**సంభనాశ్యుడు :** చూ॥ బర్హిణాశ్యుడు

**సంభవుడు :** పూరువంశపు రాజు. ఊర్జకొడుకు; జరాసంధుని తండ్రి. *- అగ్నిపురాణం*

**సంభూతి 1 :** జయద్రధుని భార్య. వీరి కుమారుడు విజయుడు. *- భాగవతం*

**సంభూతి 2 :** బ్రహ్మ మానసపుత్రుడు మరీచి. అతని భార్య సంభూతి. వీరికి పౌర్ణమాసుడను పుత్రుడు కలడు. *- అగ్నిపురాణం*

**సంభూతుడు :** త్రసదశ్యుడి కొడుకు; ఒకరాజు; అనారణ్యుడి తండ్రి. *- వాయుపురాణం*

**సంయమని :** యముని రాజధాని నగరం.
చూ॥ అమరావతి

**సంయమానుడు 1 :** సోమదత్తుడి మరోపేరు.
- చూ॥ సోమదత్తుడు

**సంయమానుడు 2 :** కాశీరాజు. భౌతిక విషయాలపై అనాసక్తి కలవాడు. ధర్మచింతనుడు. పంచశిఖుడి నుండి యోగం, సాంఖ్యం తెలుసుకొని అన్నీ వదలి అరణ్యాలకు వెళ్ళి శరీరాన్ని వదిలాడు.

**సంయముడు :** శతశృంగుడనే రాక్షసుడి కొడుకు. అంబరీషుడి సైన్యాధిపతి సుదేవుడితణ్ణి వధిస్తాడు.
- మహాభారతం

**సంయాతి 1 :** నహుషుడి మూడవ కొడుకు. నహుషుని తక్కిన కొడుకులు యతి, యయాతి, ఆయాతి, ధ్రువుడు. - మహాభారతం

**సంయాతి 2 :** ఓ రాజు. పూరువు యొక్క ముని మనుమడు. ప్రాచీనవానుడి కొడుకు. యదు వంశపు అశ్మిక ఇతని తల్లి. దృషద్వానుడి కూతురు వరాంగిని వివాహమాడగా అహంయాతి జన్మించాడు. - మహాభారతం

**సంయోధకంటకుడు :** ఓ యక్షుడు. కుబేరుని సేవకుడు.
- రామాయణం

**సంరాజుడు :** చిత్రరథ, ఊర్ణలకు జన్మించినాడు. ఇతడు ఉత్కలను వివాహమాడాడు. వీరికి జన్మించిన మరీచి తదనంతరం ప్రసిద్ధుడయ్యాడు. - భాగవతం

**సంవరణుడు :** చంద్రవంశపు రాజు. భరతుని వంశంలోనివాడు. అజమీదుని మనుమడు రుక్షుని కొడుకు. ఇతడు సూర్యుని కుమార్తె తపతిని వివాహమాడాడు. పంచాల రాజు ఒకసారి ఇతణ్ణి ఓడించాడు. శత్రువులకు భయపడి సింధూనది తీరంలో నివసించాడు. తిరిగి రాజ్యం పొందడానికి వశిష్ఠుడిని పురోహితుగా నియమించుకున్నాడు. వశిష్ఠుని సలహాతో రాజ్యం పొంది అతణ్ణి మూల పురోహితుడుగా యజ్ఞంచేశాడు. తపతివల్ల 'కురు'అను పుత్రుడు జన్మించాడు. ఇతడు సూర్యుని భక్తుడు. ఇంతటి అందగాడు లేడని ప్రసిద్ధి. ఇతడి రాజ్యంలో 12 సంవత్సరాలు వర్షాభావం కలిగింది. పౌరవుడని, పౌరవనందనుడని అజమీఢుడు అనే పేర్లతో భారతంలో అభివర్ణించబడ్డాడు.

**సంవర్తకుడు 1 :** కశ్యప ప్రజాపతి కద్రువలకు జన్మించిన ఒక నాగు. - మహాభారతం

**సంవర్తకుడు 2 :** ఓ అగ్ని. ఎప్పుడూ మాల్యవనం పర్వతంపై మండుతూ వుంటుంది. - మహాభారతం

**సంవర్తవాసి :** ఓ పుణ్యతీర్థం. ఒక్కడ స్నానం చేసిన వారు చూపరులవుతారు. - మహాభారతం

**సంవర్తుడు : (సంవర్తనుడు) :** అంగిరసునికి 8 మంది కుమారులు. వారు బృహస్పతి, ఉతత్యుడు, సంవర్తుడు, పయస్తుడు, శాంతి, ఘోర, విరూపుడు, సుధాశ్వుడు. ఇతడికి ఇతని సోదరుడు బృహస్పతి యజ్ఞం నిర్వహించడానికి నిరాకరించగా ఇతడే నిర్వహించాడు. ఇతడు ఇంద్రుని సభలో సభ్యుడు. బ్రహ్మ కొలువులో అతణ్ణి పూజిస్తుంటాడు. ప్లక్షవర్తనతీర్థంలో మరుత్తుడు చేసిన యజ్ఞం నిర్వహించాడు. భీష్ముడ్ని అంపశయ్యపై దర్శించాడు. మరుత్తుడికి బంగారం కోసం శివుడ్ని ప్రార్థించాడు. ఇతడు ఇంద్రుడి వజ్రాయుధాన్ని ఒకసారి నిర్వీర్యం చేశాడు. ఇతడు ఇంద్రుడ్ని మరుత్తుని యజ్ఞానికి రావించాడు.
- మహాభారతం

**సంవహుడు :** ఓ గాలి దేవతల రథాలను ప్రయాణింపజేస్తుంది. వ్యాసుడు తన కుమారుడితో వాయువు ఏడురకాలని చెప్తాడు.

1. ప్రవాహం. ఇది మేఘాలను కదిలిస్తుంది.
2. ఆవహం. ఇది ఉరుములు సృష్టిస్తుంది.
3. ఉద్వహం. ఇది సముద్రపునీటిని ఆవిరిగా మార్చి వర్షాలు కురిపిస్తుంది.
4. సంవహం. ఇది ఆకాశంలో మేఘాలను కదిలిస్తుంది.
5. వివహం. ఇది మేఘాలకు ఆకృతినిస్తుంది.
6. పరివాహం. ఇది ఆకాశగంగను కదలకుండా వుంచుతుంది.
7. పరావహం. ఇది ఆత్మలను ప్రయాణింపచేస్తుంది.

**సంవేద్య :** ఓ పవిత్రస్థలం. ఇచ్చట స్నానం చేస్తే జ్ఞానం లభిస్తుంది. - మహాభారతం

**సంవృత్తం :** కశ్యపవంశంలో జన్మించిన ఓనాగు.
- మహాభారతం

**సంవృత్తి :** బ్రహ్మను అతడి కొలువులో పూజించే ఓ దేవి.
- మహాభారతం

**సంశతి :** పరమానుడను అగ్ని భార్య. వీరికిద్దరు సంతానం. సభ్య, ఆవసత్యులు. - మత్స్యపురాణం

**సంశప్తకులు :** త్రిగర్తాధిపతి సుశర్మ ఇతడి సోదరుల్ని సంశప్తకులని పిలుస్తారు. మహాభారతయుద్ధంలో దుర్యోధనుడికి సహాయపడి అర్జునుణ్ణి ఓడించాలని తలచి వీరే ఓడిపోతారు. *- మహాభారతం*

**సంశృత్యుడు :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు. వేదాలను బోధించాడు. *- మహాభారతం*

**సంసారుడు :** గురుపరంపరలో ఒకడు. *- చూ॥ గురుపరంపర*

**సంస్థానం :** పురాణాలలో పేర్కొనబడిన ఓ ప్రాంతం. ఈ ప్రాంత ప్రజలు కురుక్షేత్రంలో భీష్ముడికి రక్షణగా నిలిచారు. *- మహాభారతం*

**సంహత :** ధృతరాష్ట్రుని రెండవభార్య. ఈమె గాంధారి మేనకోడలు. *- మహాభారతం*

**సంహతాపం :** ఐరావత వంశంలో జన్మించిన ఓనాగు. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. *- మహాభారతం*

**సంహనుడు :** పురువంశపు రాజు మనస్యుని కొడుకు. పురు మనుమడు. ఇతని తల్లి సౌవీరి. *- మహాభారతం*

**సంహాద్రి :** ఓ రాక్షసుడు. సుమాలి కొడుకు.

**సంహారుడు :** భైరవులలో ఒకడు. *- చూ॥ భైరవులు*

**సంహిత :** వివిధ ప్రకృతి దేవతలను స్మరించే రుక్కులు. ఈ శ్లోకాలు మంత్రాల రూపంలో వుంటాయి.

**సంహితాకల్పం :** అధర్వణవేదంలోని సంహితా విభాగం. అధర్వణవేదాన్ని మంజుకేశుడు ఐదు విభాగాలు చేశాడు. అవి నక్షత్రకల్పం, వేదకల్పం, సంహిత కల్పం, అంగిరసకల్పం, శాంతికల్పం.

**సంహితాశ్వుడు :** భృగువంశంలోని ఒకరాజు. హర్యాశ్యుడి మనుమడు. నికుంబుడి కొడుకు. సంహితాశ్యుడి మనుమరాలు రేణుక జమదగ్ని మహర్షిని వివాహమాడింది. *- బ్రహ్మాండపురాణం*

**సంహ్లాదుడు 1 :** సుమాలి కేతుమతిల కుమారుడైన ఓ రాక్షసుడు. సుమాలికి 10 మంది కొడుకులు. వారు ప్రహస్త, అకంపన, వికట, కాలకాముఖ, ధూమ్రాక్ష, దండ, సుపార్శ్వ, సంహ్లాద, ప్రక్వాత, భాసకర్ణులు. *- ఉత్తర రామాయణం*

**సంహ్లాదుడు (సంహ్రాదుడు) 2 :** హిరణ్యకశిపుని నల్గురు కుమారుల్లో ఒకడు. ఆ నల్గురు అనుహ్రాద, హ్రాద, ప్రహ్లాద, సంహ్రాదులు. సంహ్రాదుడికి ఆయుష్మాన్, శిబి, భాస్కరులు పుత్రులు. *- అగ్ని పురాణం*

**సాంకాశ్యపురం :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజ్యం. ఈ దేశ రాజైన సుధాన్యుడు ఒకసారి మిథిలపై దండెత్తాడు. *- రామాయణం*

**సాంకాశ్యుడు :** ప్రాచీన భారతదేశపు రాజు. ఇతడు యముని కొలువులో వుంటాడు. *- మహాభారతం*

**సాంఖ్యయోగ శాస్త్రం :** చూ॥ కపిలుడు

**సాంఖ్యాయనుడు :** సనత్కుమారుని శిష్యుడైన ఓ ఆచార్యుడు. బృహస్పతితో సమాన ప్రతిభావంతుడు. *- భాగవతం*

**సాంగుడు :** హవిర్ధానుడి కొడుకు. *- మత్స్యపురాణం*

**సాందీపని:** శ్రీకృష్ణబలభద్రరాములకు గురువు. వీరు వేదాలను, చిత్రలేఖనం, ఖగోళశాస్త్రం, వైద్యం, విలువిద్యలాంటి అన్ని కళలు ఇతనివద్దే నేర్చుకున్నారు. *- భాగవతం.*

**సింధు 1 :** పురాణ ప్రసిద్ధమైన భారతదేశంలోని ఒక నది. పురాణాలలో ఆకాశగంగలో ఓ శాఖగా పరిగణించబడింది. భగీరథుని కష్టఫలంగా గంగ బిందు కొలనులో పడింది. అచ్చట నుండి 6 శాఖలుగా ప్రవహించింది. మూడు తూర్పుగా, నాల్గు పశ్చిమంగా ప్రవహించాయి. సుచక్షు, సీత, సింధు పశ్చిమాన, హ్లాదిని, పావని, నలిని తూర్పుగాను ప్రవహించగా ఏడవశాఖ భగీరథునివెంట పాతాళానికి వెళ్ళి సగర పుత్రులను పునీతుల్ని చేసింది.

ఇతర విశేషాలు *:* సంవర్గుడను రాజు ఓడిపోయి సింధునదీ పరీవాహక ప్రాంతంలో దాక్కున్నాడు. ఇది వరుణిని కొలువులో వుంటుంది. మార్కండేయుడు ఈ నదిని ముకుందుడి కడుపులో చూశాడు. అగ్ని పుట్టుకకు ఈ నది కూడా మాతృక. ఇచ్చట స్నానం చేస్తే స్వర్గప్రాప్తి లభిస్తుంది. రుగ్వేదంలో చాలాచోట్ల ఈ నది ప్రస్తావించబడింది. *- రుగ్వేదం*

**సింధు 2 :** ఒక రాజ్యం. పురాణప్రసిద్ధమైనది. ఈ రాజ్యపురాజు జయద్రధుడు ద్రౌపది స్వయంవరానికి వచ్చాడు. *- మహాభారతం*

**సింధుతమం :** ఓ పుణ్యస్థలం. ఇచ్చట స్నానంచేస్తే గుట్టల బంగారం లభిస్తుంది. *- మహాభారతం*

★**సింధుద్వీపుడు :** సూర్యవంశపు రాజు. బాలకాశ్వుని తండ్రి, జహ్నువు కొడుకు. పృథుదక తీర్థంలో తపస్సు చేసి బ్రాహ్మణత్వం పొందాడు. – మహాభారతం

**సింధుపులిందం :** ప్రాచీన భారతదేశంలో ఓ ప్రసిద్ధ రాజ్యం. – మహాభారతం

**సింధు ప్రభావ :** ఓ పుణ్యస్థలం. సింధునది ఇచ్చట నుండే ప్రారంభమవుతుంది. సిద్ధులు, గంధర్వులు తరచు దీన్ని దర్శిస్తారు. ఇచ్చట ఐదు రోజులు ఉప వాసముండి స్నానమాచరిస్తే గుట్టల బంగారం లభిస్తుంది. – మహాభారతం

**సింధుసౌవీరం :** ఉత్తర భారతదేశపు పశ్చిమ ప్రాంతానగల పురాణ ప్రసిద్ధ స్థలం. వీరికి ధర్మమంటే తెలియదు. – మహాభారతం

**సింహకేతువు :** మహాభారత యుద్ధంలో పాండవుల పక్షాన పోరాడిన వీరుడు. కర్ణుడితణ్ణి వధించాడు. – మహాభారతం

**సింహచంద్రుడు :** యుధిష్ఠరునికి సహాయపడిన ఒకరాజు. – మహాభారతం

**సింహపురం :** భారతదేశంలోని ఓ పురాణ ప్రసిద్ధ నగరం. ఇది ఉత్తర భారతదేశంలోని పర్వతప్రాంతంలో వుంది. మహాభారతకాలంలో చిత్రాయుధుడు ఈ నగరాన్ని పాలించాడు. ఉత్తరభారత జైత్రయాత్రలో అర్జునుడు దీన్ని జయించాడు. – మహాభారతం

**సింహబలుడు :** కీచకులలో పెద్దవాడు. విరాటరాజు భార్య సుధేష్ణ సోదరుడు. అజ్ఞాతవాసంలో ద్రౌపది సుధేష్ణ పరిచారికగా వున్నపుడు ఇతడామెను మోహిస్తాడు. సుధేష్ణ ద్రౌపదిని కల్లు తెమ్మని సింహబలుడి ఇంటికి పంపగా అతడు బలాత్కరించబోగా ఆమె తప్పించుకొని భీమునితో నాటకమాడి సింహబలుణ్ణి అతడితో వధింపచేస్తుంది. – మహాభారతం

**సింహళం :** నేటి శ్రీలంకను సింహళం అనేవారు. ఇచ్చట ప్రజల్ని సింహళులనేవారు. దేవతల గోవు ప్రక్కభాగాలనుండి వీరు జన్మించారు. సింహళ దేశ రాజు ధర్మజుని రాజసూయ యాగంలో పాల్గొని ఎన్నో కానుకలిచ్చాడు. వీరు మహాభారతయుద్ధంలో కౌరవుల పక్షం వహించి ద్రోణుని గరుడ వ్యూహంలో కంఠం వద్ద నిలబడ్డారు. – మహాభారతం

**సింహవక్త్రుడు :** ఓ అసురుడు. సుబ్రహ్మణ్యస్వామితో పోరాడాడు. – మహాభారతం

**సింహసేనుడు 1 :** కార్తవీర్యార్జునుడి సైన్యానికి అధిపతి. ఇతడు రావణుడిని పట్టుకొని కారాగారంలో పెట్టాడు. – బ్రహ్మాండపురాణం

**సింహసేనుడు 2 :** పాంచాలవీరుడు. ఇతడు పాండవుల పక్షాన పోరాడి ద్రోణునిచేతిలో మరణించాడు. – మహాభారతం

**సింహసేనుడు 3 :** మరో పాంచాలవీరుడు. కర్ణుడితణ్ణి సంహరించాడు. – మహాభారతం

**సింహిక :** ఓ రాక్షసి. ప్రజాపతి కశ్యపునికి దితివల్ల హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడు, కుమార్తె సింహిక జన్మించారు. విప్రచిత్తి ఈమెను వివాహమాడగా రాహుకేతువులు జన్మించారు. అందువల్ల రాహుకేతువుల్ని సింహికేయులని పిలుస్తారు. – విష్ణుపురాణం, అగ్నిపురాణం

మహాభారతం సింహిక దక్షుని కూతురని, కశ్యప ప్రజాపతి భార్య అని పేర్కొంది. హనుమంతుడు సముద్రందాటి లంకకు చేరగా అతడి నీడను చూసి మింగబోగా అతడు తప్పు కున్నాడు. – రామాయణం

**సుందరి :** మాల్యవానుడి భార్య. ఓ రాక్షసి. వీరికి ఏడుగురు కుమారులు. వారు వజ్రముష్టి, విరూపాక్ష, దుర్ముఖ, సుప్తఘ్ను, యజ్ఞకేశ, మత్త, ఉన్మత్తులు.

**సుందరికం :** ఓ పుణ్యతీర్థం. ఇచ్చట స్నానం చేసినవారు సుందర రూపం పొందుతారు. – మహాభారతం

**సుందరీవల్లి :** మహా విష్ణువు కుమార్తె. సుబ్రహ్మణ్యస్వామిని భర్తగా పొందటానికి ఈమె మరో మహా విష్ణువు కూతురు అమృతవల్లి ఆకాశగంగ తీరాన తపస్సుచేశారు. – స్కంద పురాణం

**సుందరుడు 1 :** ఓ గంధర్వుడు. వీరబాహుడి కొడుకు. వశిష్ఠుని శాపంవల్ల రాక్షసుడుగా మారి మహావిష్ణువు కృపవల్ల తిరిగి గంధర్వుడయ్యాడు. – స్కందపురాణం

★ భాగవతం సింధుద్వీపుడు భగీరథుడి కొడుకైన శ్రుతనాభుడి కొడుకని పేర్కొంది.

**సుందరుడు 2 :** ఓ ఆంధ్ర రాజు. కళింగసేనుడి కొడుకు. శాతకర్ణి తండ్రి. – విష్ణుపురాణం

**సుందుడు :** నిశుంబుడి కొడుకు. సోదరుడు ఉపసుందుడు. ఈ ముగ్గురు అత్యంత క్రూర రాక్షసులు. సోదరులైన సుందోపసుందులు ముల్లోకాలను జయించాలని వింధ్య పర్వతంపై తపస్సు చేశారు. వారితపో భంగం దేవతలకు సాధ్యపడలేదు. బ్రహ్మ ప్రత్యక్షం కాగా మాలోమేము పోరాడుకుంటే తప్ప మరణం లేనట్లు వరం పొందారు. గర్వాంధకారులై ముల్లోకాలను జయించగా తిలోత్తమ ఈ ఇద్దరిని ప్రేమించినట్లు నటించి వారిలో వారికి శతృత్వం పెంచగా వారు ఒకరితోఒకరు యుద్ధంచేసి మరణించారు. – మహాభారతం

**సుందోపసుందులు :** చూ॥ సుందుడు.

**సైంధవాయనుడు :** విశ్వామిత్రుని కుమారుల్లో ఒకడు. వేదాలను ప్రజాయుత్తం చేశాడు. – మహాభారతం

**సైంధవారణ్యం :** భారతదేశంలోని ఓ పవిత్ర స్థలం. – మహాభారతం

**సైంధవుడు 1 :** చూ॥ జయద్రధుడు

**సైంధవుడు 2 :** శౌనకమహర్షి శిష్యుడు. గురుపరంపరలో ఒకడు.

**సైంధవులు 3 :** సింధుదేశ ప్రజానీకం సైంధవులనబడేవారు. – మహాభారతం

**సైంహికేయులు :** సింహిక కుమారులైన రాహు కేతువుల్ని సైంహికేయులంటారు. – *చూ॥ రాహుకేతువులు; సింహిక.*

**సృగాల వాసుదేవుడు :** కరవీర పట్టణంలో వుండేవాడు. జారాసంధుడికి మిత్రుడు. జరాసంధుడితో కలసి శ్రీకృష్ణుణ్ణి ఎదిరించి అతని చేతిలో వధింపబడ్డాడు. – హరివంశం

**సృంజయుడు :** ఒకరాజు. ఒకసారితనికడకు పర్వత నారదులు వచ్చిరి. వారికి సపర్యలు చేయుటకు అతడు తనకుమార్తె దమయంతిని వియోగించెను. నారదుడామెను వలచుటచే ఆమెనతడికిచ్చి వివాహముచేసెను. సృంజయుడు మూత్రపురీషములు కూడ బంగారమగునట్లు కాగల పుత్రుని బడయనెంచి బ్రహ్మను గూర్చి తపస్సుచేసి ఆ కోర్కెను నారదునితో కూడ చెప్పెను. అలా జన్మించిన కుమారుని పేరు సువర్ణష్ఠీవి. సృంజయుని ఇంట బంగారము ప్రతిరోజు పెరుగుట చూచి కొందరు క్రూరులు ఇతడి కుమారుని శరీరములో బంగారమున్నదని తలచి అతడిని చంపి చీల్చిరి. సృంజయుడు అపార దుఃఖముచే నారదునికి విన్నవించగా వాని దుఃఖమును పోగొట్టి కుమారుని బ్రతికించెను. – మహాభారతం

ఒకసారి ఇంద్రుడు తన వజ్రాయుధంతో శార్దూల రూపముగావించి ఇతని కుమారుని చంపగా నారదుడు బ్రతికించెను. – భాగవతం

**సృమరం :** ఓ పిల్లలేడి. కశ్యపుడి కుమార్తె. మృగమంద రుక్షాలకు, సృమణలకు, చమరాలకు జన్మనిచ్చింది. – రామాయణం

**సృష్ట్యాధిపత్యం :** సృష్ట్యాధిపత్యమనగా సృష్టిలోని వివిధ విభాగాలకు అధిపతులు. వారు భూమికి – పృథువు; ఓషది, యజ్ఞ, వ్రత, నక్షత్రాదులకు – చంద్రుడు; ఉదకానికి – వరుణుడు; ధనం– యక్షులకు – కుబేరుడు; ద్వాదశాదిత్యులకు – విష్ణువు; వసువులకు – అగ్ని; ప్రజాపతులకు – దక్షుడు; దేవతలకు – శుక్రుడు; దైత్యదానవులకు – ప్రహ్లాదుడు; పితరులకు – యముడు; పిశాచ, రక్షః పశుభూత యక్ష భూతములకు – శివుడు; పర్వతాలకు – హిమవంతుడు, నదులకు – సముద్రుడు; గంధర్వాదులకు – చిత్రరధుడు; సర్పాలకు – వాసుకి, దిగ్గజాలకు – ఐరావతం; గుర్రాలు – ఉచ్చైశ్రవం; పక్షులకు – గరుత్మంతుడు; మృగాలకు – సింహం; అశ్వములకు ఉచ్చైశ్వరమును మొదట సర్వశక్తి సంపన్నుడైన ఈశ్వరుడే నియమించెను. – పు.నా. చంద్రిక

**సౌంభకం :** సాళ్వుడి విమానం. శివాజ్ఞచే మయుడు దీన్ని నిర్మించి సాళ్వుడికిస్తాడు. – *చూ॥ సాళ్వుడు*

**స్కందగ్రహం :** ఓ పాపాత్మ. ఇది 16 ఏళ్ళలోపు పిల్లల్ని ఆవరిస్తుంది. దీన్ని మాతృగ్రహమని, పురుష గ్రహమని కూడా పిలుస్తారు. – మహాభారతం

**స్కందాపస్మారుడు :** సుబ్రహ్మణ్యస్వామి శరీరం నుండి వెలువడిన ఓ దయ్యం. ఇది గర్భిణీస్త్రీల గర్భంలో ప్రవేశించి శిశువులపై తన ప్రతాపం చూపుతుంది. – మహాభారతం

**స్కందుడు :** చూ॥ సుబ్రహ్మణ్యుడు

**స్కంధ :** ఓ సర్పం. ధృతరాష్ట్రుని కుటుంబంలో జన్మించింది. జనమేజయుని సర్పయాగంలో మరణించింది.
– మహాభారతం

**స్కంధాక్షుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు.
– మహాభారతం

**స్తనకుండం :** ఓ పవిత్ర స్థలం. ఈ పవిత్ర స్థలంలో స్నానం చేస్తే వాజపేయ యజ్ఞం చేసిన ప్రతిఫలం లభిస్తుంది. – మహాభారతం

**స్తనపోషికం :** ప్రాచీన దక్షిణభారతదేశంలో ఒక రాజ్యం.
– మహాభారతం

**స్తనవాల :** ప్రాచీన దక్షిణ భారతదేశంలో ఓ స్థలం.
– మహాభారతం

**స్తండిలేయుడు :** పురురాజు కుమారుడైన రుద్రాశ్వుడి కొడుకు. స్తండికాయుడి తల్లి మిత్రకేశి. స్తండిలేయుడు గొప్ప ధనుర్విద్యా పారంగతుడు. –మహాభారతం

**స్తంబమిత్ర :** ఓ పక్షి. మందపాల జరితలనే పక్షులకు జన్మించింది.

**స్తంబుడు :** సప్తర్షుల్లో ఒకడు. స్వారోచిష మనువు కాలంలోనివాడు. ఆ కాలపు సప్తర్షులు ఊర్జ, స్తంభ, ప్రాణ, వాత, వృషభ, నిరయ, పరివాణుడు.

**స్మరదూతి :** జలంధరుని భార్య. వృందకు సేవిక.
– పద్మపురాణం

**స్మృతి :** జ్ఞాపకశక్తికి దేవత. ఈమె సుబ్రహ్మణ్యస్వామి సైన్యానికి ముందు నడిచింది. ఈమె అంగిరసుని భార్య. స్మృతి అంగిరసులకు సినీవాలి, కుహు, రాక, అనుమతి అనే కుమార్తెలు జన్మించారు.
– విష్ణుపురాణం

**స్మృతులు :** ధర్మశాస్త్రములు. ఇవి వేదార్థప్రతిపాదిత గ్రంథములు. ఇందు మనుస్మృతి బృహద్గ్రంథము ఇందు మానవ ధర్మశాస్త్రము మొదలుకొని జగత్సృష్టి వరకు అన్ని విషయములు చెప్పబడినవి. కలియుగ విహితములైన ధర్మములు పరాశర స్మృతియందు చెప్పబడెను. పురాణములవలె ఇవియును 18. అవి: 1) మనుస్మృతి, 2) బృహస్మృతి స్మృతి, 3) దక్షస్మృతి, 4) గౌతమస్మృతి, 5) యమస్మృతి, 6) అంగీరస స్మృతి, 7) యాజ్ఞవల్క్య స్మృతి, 8) ప్రచేత స్మృతి, 9) శాతాతప స్మృతి, 10) పరాశర స్మృతి, 11) సంవర్త స్మృతి, 12) ఓశనప స్మృతి, 13) శంఖ స్మృతి, 14) లిఖితస్మృతి, 15) ఆత్రేయ స్మృతి, 16) విష్ణు స్మృతి, 17) ఆపస్తంబస్మృతి, 18) హరీత స్మృతి

**స్యందిక :** కోసల దేశంలోని ఓ నది. శ్రీరాముడు అరణ్యవాసానికి వెళ్ళేటప్పుడు ఈ నదిని దాటాడు. ఈ నదిలో నెమళ్లు, హంసలు సంచరిస్తుంటాయి.
– రామాయణం

**స్రక్షం :** భారతదేశంలోని పురాణప్రసిద్ధమైన ఒక ప్రాంతం. – మహాభారతం

**స్రజుడు :** పితృగణాలకు చెందిన ఓ విశ్వదేవుడు.
– మహాభారతం

**స్వనయుడు :** భావయవ్యుడి కుమారుడు. ఇతడి కుమార్తెను కక్షివానుడు వివాహమాడతాడు.
– చూ॥ కక్షివంతుడు

**స్వప్నం :** మనసు నాల్గు స్థితులలో ఇదొకటి. స్వప్నాలు జరగబోయే వాటికి సూచికలని భారతీయులు నమ్ముతారు. ఇవి రెండురకాలు శుభసూచికలు, అశుభ సూచికలు. *అశుభాలు :* శరీరమంతా గడ్డిచెట్లు పెరగడం. తల నగ్నంగా కన్పించడం, మురికి బట్టలు ధరించడం, సర్పాలను చంపడం, చెట్లెక్కడం, తక్కువకులం వారిపై ఎక్కి కూర్చోవడం, నది నీటిలో కొట్టుకుపోవడం, మురికి నీటిలో స్నానం చేయడం, శరీరావయవాలు దెబ్బతినడం, డోకులవ్వడం, దక్షిణానికి ప్రయాణించడం, దయ్యాలతో ఆడటం, నూనె తాగి నీటిలో మునగడం, రక్తపురంగు బట్టలు ధరించడం. ఈ కలలు రాత్రిలో మొదటి భాగంలో వస్తే ఆ కల ఫలితం ఒక సంవత్సరంలో రెండవ భాగంలో వస్తే పక్షం రోజుల్లోనే వాటి ఫలితం కల్గుతుంది. తెల్లవారు జామున వస్తే దాని ఫలితం రెండు రోజుల్లోనే కనిపిస్తుంది. వీటి పరిహారానికి కల తర్వాత నిద్రపోవడం లేకుంటే స్నానం చేయడం, శివుడ్ని విష్ణువుని పూజించి పురుషసూక్తం చదవడం చేయాలి.

*శుభస్వప్నాలు :* పర్వతం ఎక్కడం, భవనపు పై అంతస్తు ఎక్కడం, ఏనుగు, గుర్రమునెక్కడం, తెల్లటి పుష్పాలు పూచే చెట్లు ఎక్కడం, జుట్టు రాగిరంగుగా మారడం,

చంద్రుడ్ని సూర్యుడ్ని కౌగిలించుకున్నట్లు, రక్తంలో స్నానం చేయడం, ఆయుధాలు ధరించడం, రాజ ముద్రిక స్వీకరించడం. ఇవన్నీ శుభసూచికలు.
– అగ్నిపురాణం

**స్వధాదేవి :** పితృగణాల భార్య. సృష్టి ప్రారంభించినపుడు 7 రకాల పితృగణాలను సృష్టించాడు.
– చూ॥ పితృగణాలు.

బ్రాహ్మణులు పెట్టే శ్రాద్ధాలే వారికి ఆహారం. బ్రహ్మ బ్రాహ్మణులు పెట్టే శ్రాద్ధాన్నే వారికి ఆహారంగా నిర్ణయించాడు. పితృగణాలకు శ్రాద్ధం పెట్టని బ్రాహ్మణులు నీచులు, వేదజ్ఞానం లేనివారుగా పరిగణించబడతారు. అలా బ్రాహ్మణులు పెట్టే శ్రాద్ధం పితృగణాలకు అందక బ్రహ్మకు చెప్పుకోగా బ్రహ్మ ఓ స్త్రీని సృష్టించి బ్రాహ్మణులు శ్రాద్ధం నిర్వహించేటపుడు ఈమెను జ్ఞాపకం చేసుకొని మాత్రమే చెయ్యాలి. అలా చేసినపుడు ఆహారం పితృగణాలకు చేకూరుతుంది. స్వధాదేవికి పితృగణాలవల్ల ఇద్దరు కుమార్తెలు జన్మించారు. వారు మేన, ధారిణి. వీరు వేదాలను విస్తృత ప్రచారం చేశారు. – విష్ణుపురాణం.

**స్వభోజనం :** ఓ నరకం. – చూ॥ నరకం

**స్వయంజాతుడు :** తండ్రివల్ల తన స్వంత తల్లికి జన్మించినవాడు. – మనుస్మృతి

**స్వయంప్రభ :** మాయ అనే అసురుని కూతురు. మాయాసురుడికి స్వయంప్రభ, సోమప్రభ కుమార్తెలు. వైశ్వానరుడి కుమారుడైన నలకూబరుడు ఈమెను వివాహమాడాడు. ఈమె రంభకు సేవకురాలు.

**స్వయంభుడు :** ఓ ఆచార్యుడు. పురోహితుడు. శ్రాద్ధ కర్మలు నిర్వహించడానికి, పితృగణాలకు తర్పణ చేయడానికి అధ్యుడు. –మహాభారతం

**స్వయంవరం :** క్షత్రియ పద్ధతి వివాహం. రాజకుమారి తన ఇచ్ఛవచ్చినవాడిని ఎన్నుకొని వివాహం చేసుకొనే పద్ధతి. ఇందులో మూడురకాలు. మొదటిది ఇచ్ఛా స్వయంవరం. ఇందులో కన్య తనకు నచ్చిన వరుడ్ని వివాహమాడుట. రెండవది స్వయంవిప్తా స్వయంవరం. దీనిలో వరుడికి పరీక్షపెట్టుట. మూడవది శౌర్యాశుల్క స్వయంవరం. ఇందులో వరుడు తన ధైర్యసాహసాలతో వధువుని ఎత్తుకుపోవుట. మొదటి దానికి సావిత్రి వివాహం, రెండవదానికి సీత వివాహం, మూడవదానికి సుభద్ర వివాహం ఉదాహరణలు.

**స్వరవేది :** ఓ అప్సరస. – చూ॥ ప్రమోహిని

**స్వరాష్ట్రం :** పురాణప్రసిద్ధమైన ప్రాచీన భారతదేశంలోని ఒక రాజ్యం. – మహాభారతం

**స్వరూపుడు :** ఓ అసురుడు. ఇతడు వరుణుని కొలువులో అతణ్ణి పూజిస్తాడు. – మహాభారతం

**స్వరోచిషుడు :** ద్యుతిమానుడనే రాజుకు వరూధిని వల్ల జన్మించిన పుత్రుడు. ఇతడు అన్ని జీవజాలాల భాషలు నేర్చుకొన్నాడు. కళావతి నుండి పద్మినీ విద్యను నేర్చుకున్నాడు. ఇతనికి విజయుడు, మేరు మందుడు, ప్రభవుడు తన భార్యలైన మనోరమ, విభవ, కళావతి వల్ల జన్మించారు. ఆ తర్వాత ఓ అరణ్యదేవతవల్ల స్వారోచిషుడు ఇతనికి జన్మించాడు. స్వారోచిషుడు చక్రవర్తి అయ్యాడు. ద్యంతి మానుడని కూడా ఇతణ్ణి పిలిచేవారు. – మార్కండేయపురాణం

**స్వర్గతీర్థం :** ఓ పుణ్యస్థలం. నైమిశారణ్యంలోవుంది. ఇక్కడ ఓ నెల నివసించి పితృగణాలకు తర్పణ చేస్తే పురుషమేధయజ్ఞఫలితం లభిస్తుంది. – మహాభారతం

**స్వర్గద్వారం :** ప్రాచీన పుణ్యతీర్థం. కురుక్షేత్రంలో వుంది. ఇచ్చట స్నానం చేస్తే స్వర్గలోక ప్రాప్తి లభిస్తుంది.
– మహాభారతం

**స్వర్గమార్గ తీర్థం :** ఓ పుణ్యస్థలం. ఇచ్చట స్నానం చేస్తే బ్రహ్మలోక ప్రాప్తి లభిస్తుంది. – మహాభారతం

**స్వర్ణ :** ఓ దేవకన్య. క్రౌంచుని ఆశీర్వాదంవల్ల ఈమెకు వృంద జన్మించింది. ఈ కుమార్తె అందానికి ఆశ్చర్య పడనివారు లేరు. శుక్రుడొకసారి వృందను జలంధరుడనే అసురుడుకిచ్చి వివాహం చెయ్యమన్నాడు.
– పద్మపురాణం

**స్వర్ణగ్రీవుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు.
– మహాభారతం

**స్వర్ణబిందుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు.
– మహాభారతం

**స్వర్ణముఖి :** శ్రీకాళహస్తివద్దగల ఒకనది. అగస్త్యుడు దక్షిణాదిన నదిలేదని శివుడ్ని గూర్చి తపస్సు చేయగా శివుడాకాశ గంగను కొంత ఇస్తాడు. అదే స్వర్ణ ముఖీనది. – శ్రీకాళహస్తీ మహత్యం

**స్వర్గరోముడు :** సూర్యవంశపురాజు. ఇతడు మహారోముడి కొడుకు. ప్రస్థరోముడి తండ్రి. – భాగవతం

**స్వర్భానవి :** స్వర్భానుడి కూతురు. పురూరవసుడి కొడుకు అయుషుడీమెను వివాహమాడాడు. నహుషుడితో మొదలై ఐదుగురు కుమారులు జన్మించారు. – మహాభారతం

**స్వర్భానుడు :** ఓ దానవుడు. కశ్యప ప్రజాపతి దనువు లకు జన్మించాడు. కంసుని తండ్రి ఉగ్రసేనుడు స్వర్భా నుడి పునర్జన్మ. – మహాభారతం

**స్వవత్కుడు (స్వఫల్కుడు) :** అక్రూరుడి తండ్రి. – చూ॥ స్వఫల్కుడు

**స్వశ్వుడు :** రుగ్వేదంలో గొప్పవాడిగా పేర్కొనబడిన ఒకరాజు. సంతానం కొరకు సూర్యుడ్ని ప్రార్థించగా సూర్యుడే ఇతని పుత్రుడిగా జన్మించాడు. ఒకసారి ఇతడికి, ఎలుశుడనే రుషికి యుద్ధం జరగగా ఇంద్రుడు రుషిని రక్షించాడు. – రుగ్వేదం

**స్వస్తికం :** గిరివ్రజంలో నివసించిన ఓ సర్పం. ఇది వరుణుని కొలువులో వుంటుంది. – మహాభారతం

**స్వస్తికుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. – మహాభారతం

**స్వస్తిమతి :** సుబ్రహ్మణ్యస్వామి సేవిక. – మహాభారతం

**స్వస్తిమానతీర్థం :** కురుక్షేత్రంలోని ఓ ప్రాచీన పుణ్యస్థలి. ఇచ్చట స్నానంచేస్తే 1000 గోవులు దానమిచ్చిన ప్రతిఫలం లభిస్తుంది. – మహాభారతం

**స్వస్త్యాత్రేయుడు :** ఓ ప్రాచీన రుషి. దక్షిణ భారత దేశంలో నివసించాడు. – మహాభారతం

**స్కాందం :** ఒక పురాణం. శివమాహాత్మ్యాన్ని తెలియజేస్తుంది.

**స్థాణుడు 1 :** బ్రహ్మకుమారుడు. ఇతడి నుండే ఏకాదశ రుద్రులు జన్మించారు. – మహాభారతం

**స్థాణుడు 2 :** ఏకాదశ రుద్రుల్లో ఒకడు. – మహాభారతం

**స్థాణుడు 3 :** ఓ రుషి. ఇంద్రుని కొలువులో వుండేవాడు. – మహాభారతం

**స్థాణుతీర్థం :** కురుక్షేత్రంలోని ఓ పుణ్యస్థలి. ఇచట ఓ రాత్రి గడిపి స్నానంచేస్తే రుద్రలోకం వెళ్తారు. – మహాభారతం

**స్థాణుస్థానం :** ఓ పుణ్యతీర్థం. సరస్వతీనది తూర్పుతీరాన వుంది. వశిష్ఠుడిక్కడే ఒకసారి తన ఆశ్రమం నిర్మించు కున్నాడు. ఇచట స్థాణుడు తపస్సుచేయడంవల్ల పుణ్య తీర్థమయ్యింది. ఇచ్చటే దేవతలు సుబ్రహ్మణ్యస్వామిని సేనాపతిగా ఎన్నుకున్నారు. – మహాభారతం

**స్మార్తం :** హిందూమత సాహిత్యం. స్మార్తం అనే పదానికి స్మృతిమీద ఆధారపడిందనే అర్థం వుంది.

**స్వాతి :** చాక్షుష మనువు మనుమరాలు. చాక్షుష మనువుకు అతని భార్య నడ్వల వల్ల 10 మంది కుమారులు జన్మించారు. వీరిలో ఒకడైన ఊరుడికి ఆగ్నేయవల్ల స్వాతికాక మరో ఐదు గురు పుత్రులు. వారు అంగ, సుమనస, క్రతు, అంగిరస, గయులు – అగ్నిపురాణం

**స్వాయంభువ మనువు :** బ్రహ్మపుత్రుడు మొట్టమొదటి మనువు. స్వాయంభవ మనువు బ్రహ్మ మానస పుత్రుడు. శతరూప బ్రహ్మ మానస పుత్రిక. స్వాయంభువుడు తపస్సుచేసి అధికారం కోసం వరాలు పొందాడు. శతరూపను తనే వివాహమాడాడు. బ్రహ్మ ఇతడిని మనువుగా ఎంపికచేశాడు. వీరికి ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు జన్మించారు. అంతేకాక ప్రసూతి, ఆకూతి అనే కుమార్తెలు కూడా జన్మించారు. ప్రసూ తిని దక్షప్రజాపతికి, ఆకూతిని రుచిప్రజాపతికి ఇచ్చి వివాహం చేశాడు. రుచి, ఆకుతిలకు యజ్ఞుడు, దక్షిణ జన్మించారు. వారు కవలలు. స్వాయంభవుడు, శతరూప మొట్టమొదటి మానవజాతి అని నమ్ము తారు. ఆ నమ్మకానికి ఆధారం ఈ క్రింది కథ: బ్రహ్మ మొదట మనిషిగా జన్మించాడు. అతడి శరీరం నుండి శతరూప జన్మించింది. శతరూప అందానికి అతడు ముగ్ధుడై కాముకత ఆవరించి తన కుమార్తెనే అలా చూసి నందుకు సిగ్గుపడి శతరూప మరోవైపుకి తిరగగా మరోముఖం అటువెలసింది. అలా ఆమె నాల్గువైపులకు తిరగడంవల్ల బ్రహ్మకు నాల్గుముఖాలు వచ్చాయి. అతడి కాముకత నశించగా అతడి నుండి స్వాయంభువుడు జన్మించాడు. – మత్స్యపురాణం

**స్వారోచిష మనువు :** స్వారోచిషుడికి వనదేవతయందు జన్మించినవాడు. ఇతడు చాలాకాలం తపస్సు చేయగా విష్ణువు రెండవ మనువయ్యెదవని వరమిచ్చెను. ఇతడి మన్వంతరమున విపశ్చితుడు ఇంద్రుడయ్యెను. ఊర్జుడు, స్తంబుడు, ప్రాణుడు, దత్తోళి, రుషభుడు, అరివంతుడు సప్తర్షులైరి. చైత్రుడు, రోచష్మదుడు, నీమానుడు, కింపురుషుడు మొదలగు మనుపుత్రులు రాజులైరి. – మార్కండేయ పురాణం

**స్వాహ :** బృహస్పతి కుమార్తె. ఎప్పుడూ ఆగ్రహంతోవుండే ఈమెకు కాముడు జన్మించాడు. – మహాభారతం

**స్వాహాదేవి :** అగ్నిదేవుని భార్య.

జన్మవృత్తాంతం *:* సృష్టి మొదలైనపుడు దేవతలకు సరిపడ ఆహార ఏర్పాటు చేయబడకపోవడంవల్ల వారు బ్రహ్మలోకం వెళ్ళి బ్రహ్మను ప్రార్థించిరి. బ్రహ్మ మూల ప్రకృతిని ధ్యానించగా ఆమె ఏమి కావాలని కోరగా బ్రాహ్మణులు అర్పించే హవిస్సు అగ్ని జీర్ణం చేసుకోలేకపోతోంది. అతడిశక్తి చాలడంలేదు కనుక నీవు అగ్నితో కలసి బ్రాహ్మణులర్పించే హవిస్సును జీర్ణం చేసుకొని దాన్ని దేవతలకు ఆహారంగా మార్చమని కోరతాడు. ఆమె శ్రీకృష్ణుడ్ని వివాహం చేసుకోవాలనే తలంపు కలదని అతణ్ణి ప్రార్థించగా వరాహకల్పంలో నగ్నజిత్తు కుమార్తెగా జన్మించినపుడు నీవు నా భార్య కాగలవు ఇప్పుడు అగ్నిని వివాహమాడ మని కోరతాడు. అలా అగ్నిని వివాహమాడగా ఆమెకు పావరక, పవమాన, శుచిలు జన్మిస్తారు.
– దేవీ భాగవతం

ఈమె బ్రహ్మ కొలువులో వుంటుంది. సుబ్రహ్మణ్య స్వామి దేవతల సేనానిగా నియమించబడినపుడు ఇతర దేవతలతో ఆమెకూడా వుంది. – మహాభారతం

**స్థిరుడు :** మేరువు సుబ్రహ్మణ్యస్వామికిచ్చిన ఇద్దరు సేవకుల్లో ఒకడు. మరొకడు అతిస్థిరుడు.

**స్విష్టకృత్తు :** విశ్వపతి అనే అగ్ని,మనువు రెండవ కొడుకు. మనువు యొక్క రెండవ కుమార్తె రాగిణిని కూడా ఈ పేరునే పిలుస్తారు. యజ్ఞగుండంలోని పదార్థాలను ఈ అగ్ని తీసుకెళ్తుంది. – మహాభారతం

**స్త్రీరాజ్యం :** ప్రాచీన భారతదేశంలో ఒక రాజ్యం. ఈ రాజు ధర్మజుని రాజసూయ యాగంలో పాల్గొన్నాడు.
– మహాభారతం

**స్త్రీలు–అలంకారం :** ప్రద్వేషిణి దీర్ఘతముణ్ణి వివాహమాడి గౌతమాదులకు జన్మనిచ్చి కూడా అసంతృప్తి గానే వుంటుంది. దీర్ఘతముడు కారణమడిగితే భర్త భార్యను పోషించాలిగాని, భార్య భర్తను పోషించరా దంటుంది. కనుక నీవు ఎక్కడికైనా వెళ్ళమంటుంది. దీర్ఘతముడు కోపించి పతిహీనులైన స్త్రీలు ధనవంతులైనా అనలంకృతులు, మాంగల్య రహితులుగా శపిస్తాడు.
– మహాభారతం

**స్త్రీలు–రహస్యం :** కర్ణుడి జన్మరహస్యం మహాభారత యుద్ధానంతరం వరకు కుంతి దాచి వుంచినందుకు ధర్మజుడు కుంతిపై కోపంతో స్త్రీలు రహస్యాన్ని దాచకుండునట్లు శపిస్తాడు. – మహాభారతం

**స్థూణకర్ణుడు :** యుధిష్ఠురుని కొలువులో ఒక రుషి.
– మహాభారతం

**స్థూణుడు :** విశ్వామిత్రుని కొడుకుల్లో ఒకడు. వేదాలను ప్రచారం చేశాడు. – మహాభారతం

**స్థూలకర్ణుడు (స్థూణకర్ణుడు) :** ఓ యక్షుడు. శిఖండి. అరణ్యమునకుబోయి తనకు పురుషత్వము లేకున్నను స్త్రీనిచ్చి పెండ్లిచేసినందుకు వగచుచుండగా ఇతడు తన పురుషత్వమునిచ్చి శిఖండి స్త్రీత్వమును తీసుకొనెను. మరి పది రోజులలో అతడి పురుషత్వమునతని కిత్తునని శిఖండి వెడలెను. ఇంతలో కుబేరుడు అచటి కిరాగా స్థూలకర్ణుడు స్త్రీత్వముతో సిగ్గుపడెను. కుబేరుడు శిఖండి బ్రతికున్నంతవరకు నీకు పురుషత్వమురాదని శపించెను. శిఖండి తిరిగిరాగా కుబేరుడు ఇందులో నీ తప్పు లేదు తిరిగిపొమ్మని చెప్పెను. ఇతడిని స్థుణకర్ణుడని కూడా పిలిచేవారు.

**స్థూలకేశుడు :** ఓ ప్రాచీన రుషి. రురుడి భార్య ప్రమద్వర పెంపుడు తండ్రి. – చూ॥ ప్రమద్వర

**స్థూలరాలుక :** ప్రాచీనకాలంలో ఓ నది.
– మహాభారతం

**స్థూలశిరుడు :** ఓ రుషి. రామాయణ భారతకాలాలలో జీవించాడు. ఇతడు ధర్మజుని కొలువులో సభ్యుడు. ధర్మజుడితని ఆశ్రమాన్ని ఒకసారి దర్శించాడు. మేరు పర్వతపు నైరుతి వైపున ఇతడొకసారి తపస్సు చేశాడు. భీష్ముడ్ని అంపశయ్యపై దర్శించాడు. ఇతడి శాపంవల్ల కబంధుడు రాక్షసుడయ్యాడు.

**స్థూలాక్షుడు 1 :** ఒక రాక్షసుడు. పంచవటి వద్ద ఖరదూషణాధులతో రాముడు యుద్ధం చేసినపుడు స్థూలాక్షుడు, మహాకపాలీ, ప్రమథి కూడా మరణించారు.
– రామాయణం

**స్థూలాక్షుడు 2 :** ఓ సాత్త్వికుడైన రుషి. భీష్ముడు అంపశయ్యపై నుండగా దర్శించిన మునుల్లో ఒకడు.
– మహాభారతం

**స్యూమరశ్మి :** ఓ ప్రాచీన రుషి. ఇతడు గోవు కడుపులోకి వెళ్ళి కపిలుడితో కర్మ, ముక్తి గురించి వివరించాడు. రుగ్వేదంలో గూడా అశ్వనీదేవతలు వీరి బాణాలతో ఈ రుషిని రక్షించినట్లు పేర్కొనబడింది. - రుగ్వేదం

**స్వేదజుడు :** ఓ అసురుడు. చూడుము: రక్తజుడు.



**హ :** ఈ అక్షరశబ్దానికి అవలోకనమని, రుద్రుడని రెండర్థాలున్నాయి.

**హతహవ్యుడు :** ధరుడి కొడుకు. ద్రవిళుడి సోదరుడు. - *భాగవతం*

**హనుమంతుడు :** దేవతల అంశతో జన్మించిన వానరుడు. పురాణాలలో ఇతడి జన్మవృత్తాంతాన్ని గురించి రకరకాల కథనాలున్నాయి.

1) మోహిని రూపంలో గల విష్ణువును చూసిన శివునికి వీర్యస్రావంకాగా సప్తర్షులు దాన్ని సంగ్రహించి అంజన గర్భంలో ఉంచగా హనుమంతుడు జన్మించాడు. - *శివపురాణం*

2) దశరథుడు పుత్రకామేష్ఠియాగం చేసినపుడు యజ్ఞఫలాన్ని తన భార్యలకు పంచినపుడు ఓ కాకి కొంత భాగాన్ని తన ముక్కున కరచుకొని ఎగిరిపోగా ఆ ఫలం తపస్సు చేస్తున్న అంజన చేతిపై పడగా ఆమె దాన్ని భుజించడంవల్ల ఆ యజ్ఞఫలానికున్న శక్తివల్ల అంజన గర్భవతియై హనుమంతుడికి జన్మనిచ్చింది. - *ఆనందరామాయణం*

3) శివుడు అంజన భర్త కేసరిని ఆవరించగా కేసరి అంజన సంపర్కం జరిగింది. ఆ తర్వాత వాయువు కూడా తన శక్తిని కేసరిలో పూరించగా కేసరి అంజనల సంపర్కం జరిగింది. శివ, వాయువుల శక్తివల్ల అంజనగర్భం ధరించగా హనుమంతుడు జన్మించాడు. - *భవిష్యపురాణం*

4) శివపార్వతులు ఏనుగుల రూపం దాల్చి కామక్రీడలో పాల్గొనగా గణపతి జన్మించాడు. తర్వాత వారు వానర రూపంలో కామక్రీడ సల్పగా వానర రూపంలోని సంతతి పార్వతికి ఇష్టంలేకపోవుటచే శివుడు తన యోగశక్తితో ఆ గర్భాన్ని వాయువుకివ్వగా అతడు దాన్ని మోసుకొనిపోయి కేసరి భార్యయైన అంజన గర్భంలో వుంచగా హనుమంతుడు జన్మించాడు. అంజనకు ఆమెకథ ఆమెకుంది. ఆమె పుంజకస్థలి అనే బృహస్పతి సేవిక. పూలుకోసుకురావడానికి వెళ్ళి అచ్చట అప్సరకన్యల కేళీకలాపాలు చూసి కాముకతవల్ల బృహస్పతివద్దకువచ్చి అతణ్ణి ముద్దులతో నింపగా ఆడకోతివి కమ్మని శపించాడు. ఆమె బృహస్పతిని శాపవిమోచనం కోరగా శివునిశక్తివల్ల ఓ పుత్రుడికి జన్మనిచ్చిన తర్వాత శాపవిమోచనం కల్గుతుందని చెప్పాడు.

అలా అంజన అనే వానరంగా జన్మించి కేసరిని వివాహమాడి శివుని వీర్యంవల్ల గర్భందాల్చింది. శివశక్తి సంపన్నుడైన పుత్రుడు అంజనకు జన్మిస్తున్నాడని వాలి నారదుడివల్ల తెలుసుకొని నారదుని సలహాపై ఐదు రకాల మూలకాలను అంజనగర్భంలోకి పంపి గర్భస్రావం కల్గాలని కోరుకోగా ఆ మూలికలశక్తితో అతి బలాఢ్యుడైన హనుమంతుడు జన్మించాడు. - *కంభ రామాయణం*

*నామకరణం-వరాలు :* ఇతడు పుట్టగానే అంజనకు శాపవిమోచనమై స్వర్గము చేరుకోబోగా తల్లీ నాకు ఆహారం ఎలా అని అడగగా ఎర్రని ఫలాలను చూపింది. ఎర్రగా కన్పించే సూర్యుడే ఫలమని సూర్యునివైపు లంఘించగా సూర్యుని చేరుకునేలోపు అంతకంటే పెద్దగా కన్పించిన రాహువుపైకి, ఆ తర్వాత ఐరావతం కన్పించగా దానిమీదకు దూకగా ఇంద్రుడు తన వజ్రాయుధం ప్రయోగించగా అది హనుమంతుడి మూతికి తగిలి భూమిపై పడగా వాయువు చూసి అతణ్ణి పాతాళానికి తీసుకొనివెళ్ళాడు. వాయువు పాతాళానికి వెళ్ళగా భూమిపై గాలిలేక సకలచరాచరజీవులు వెళ్ళి వాయువును ఓదార్చి అతడి తనయుణ్ణి సజీవుణ్ణి చేశాయి. హనుమంతుడని నామకరణంచేసి ఇంద్రుడు, అగ్ని ఇతర దేవతలు హనుమంతుడికి ఎన్నో వరాలు ప్రసాదించారు. - *రామాయణం*

*విద్యాభ్యాసం :* హనుమంతుడు వేదాలను సర్వశాస్త్రాలను సూర్యుడివద్ద అభ్యసించాడు. గురుదక్షిణ చెల్లిస్తాననగా వానరజాతిలో సుగ్రీవుడు నా పుత్రుడు తన అన్న వాలికంటే బలహీనుడు కనుక ఎల్లకాలం

సుగ్రీవునికి అండగా వుండమని కోరతాడు. అప్పటి నుండి సుగ్రీవ హనుమంతుల స్నేహబంధం జీవి తాంతం కొనసాగింది.

సీతాపహరణం తర్వాత శ్రీరామదర్శనం జరగగా అప్పటినుండి శ్రీరాముడి సేవకుడిగా వుంటూ సుగ్రీవ రాములకు మైత్రీబంధం నెరపి వాలిని సంహరింప చేసి సుగ్రీవుణ్ణి కిష్కిందరాజుని చేస్తాడు. రామరావణ యుద్ధానంతరం సుగ్రీవుడికి మంత్రిగా వ్యవహరి స్తాడు. ఆ యుద్ధ సమయంలో ఎందరో అసురుల్ని సంహరిస్తాడు. సంజీవిని తెచ్చి లక్ష్మణుణ్ణి బ్రతికిస్తాడు.
– రామాయణం

రామావతారానంతరం వయసుమీరి కదలీ వనంలో జీవిస్తాడు. ఒకసారి సౌగంధిక పుష్పాలకై వెళ్తున్న భీముడ్ని ఓడిస్తాడు. హనుమంతుడు అర్జునుడి జెండా పై వుండటానికి అంగీకరిస్తాడు. – మహాభారతం

**హన్యమానం :** దక్షిణభారత దేశంలోని ఓ ప్రసిద్ధ పుణ్యస్థలం. – మహాభారతం

**హయగ్రీవుడు 1 :** కశ్యప ప్రజాపతి దనులకు జన్మించిన ఓ అసురుడు. బాల్యంలోనే నదీతీరంలో దేవిని గూర్చి తపస్సుచేయగా దేవి ప్రత్యక్షమై వరంకోరుకొమ్మనగా దేవదానవుల వల్ల ఓటమి లేకుండునట్లు, మరణమే లేనట్లు వరం అడిగాడు. అందుకు దేవి నిరాకరించగా గుర్రపుతలవున్నవాడివల్ల తప్ప మరణం లేనట్లు వరం కోరగా దేవి ప్రసాదించింది. ఈ వరగర్వంతో ఇతడు దేవతలను సదాచారులను హింసించగా శ్రీమహా విష్ణువు ఇతడితో తలపడి ఇతడ్ని ఓడించలేక ధ్యాన ముద్రలో తన ధనస్సును మెడకు ఆన్చి కూర్చోగా వింటి త్రాడుతెగి మహావిష్ణువు తలతెగిపడింది. దేవతలు గుర్రపుతలను తెచ్చి అతికించగా హయగ్రీ వుడితో మరలా యుద్ధంచేసి వధించాడు.

**హయగ్రీవుడు 2 :** నరకాసురుని రాజ్యానికి కాపలావున్న ఓ అసురుడు. శ్రీకృష్ణుడితణ్ణి వధించాడు.

**హయగ్రీవుడు 3 :** విదేహ వంశంలో జన్మించిన ఒకరాజు. – మహాభారతం

**హయగ్రీవుడు 4 :** ఓ సాధువర్తనుడైన రాజు. తన శత్రువులను జయించి కూడా అనుచరులు సహకారం లేక చివరకు చంపివేయబడ్డాడు. ఎంత గొప్పవీరుడైన సరైన సహాయకులు లేకుండా రాణించదని చెప్ప డానికి వ్యాసుడు ధర్మజుడికీకథ చెప్పాడు.
– మహాభారతం

**హయగ్రీవుడు 5 :** విష్ణువు యొక్క అవతారమని వేదాలు అంగీకరించక దాన్ని యజ్ఞుడి అవతారం అన్నారు. తైత్తరీయ అరణ్యకం విష్ణువు యొక్క మొదటి దశగా పేర్కొంది.

అగ్ని, ఇంద్రుడు, వాయు, యజ్ఞులు హవిర్భాగాన్ని పంచుకోవాలని కలసి యజ్ఞం చేశారు. తర్వాత యజ్ఞఫలాన్ని యజ్ఞుడొక్కడే అపహరించుకుపోగా దేవతలంతా వెంబడించారు. దేవి ఇచ్చిన విల్లుతో దేవతలను వెడలగొట్టాడు. దేవతలు చెదపురుగులై వింటిత్రాడిని తెంచగా ఆ త్రాడు యజ్ఞుడి శిరస్సు ఖండించింది. విష్ణువు తన తప్పును అంగీకరించగా అశ్వనీదేవతలు ఓ గుర్రపు తలను తెచ్చి యజ్ఞుడి మొండానికి అతికించారు. అశ్వపుతల కల వాడవటం చేత హయగ్రీవుడన్నారు. – తైత్తరీయసంహితం

**హయజ్ఞానం :** గుర్రాలను నడిపే విద్య.

**హయశిర :** దను వంశస్థురాలు. వైశ్యానరుడి కూతురు. క్రతువు భార్య.

**హయశిరసుడు :** చూ॥ హయగ్రీవుడు.

**హయహయుడు (హైహయుడు) :** లక్ష్మి విష్ణుమూర్తి అశ్వరూపాల్లో వుండి సంభోగం జరిపినపుడు జన్మించి నవాడు. ఇతణ్ణి తుర్వసుడి ఆశ్రమంలో విడిచిపెడ తారు. చపుడనే విద్యాధరుడు ఇంద్రుడి సలహాపై ఇతణ్ణి కాళింది నదీ తీరంలో విడిచిపెట్టగా యయాతి కొడుకితణ్ణి పెంచుకుంటారు. ఇతడు కాలకేతుని సంహరించి ఏకావళిని వివాహమాడతాడు.
– దేవీ భాగవతం

**హరకల్పుడు :** విప్రచిత్తి సింహిలకు జన్మించిన కొడుకు. పరశురాముడితణ్ణి వధించాడు. – వాయు పురాణం

**హరి 1 :** విష్ణువు నామాంతరం.

**హరి 2 :** సుబ్రహ్మణ్యుడి యోధుల్లో ఒకడు.
– మహాభారతం

**హరి 3 :** పాండవుల తరఫున పోరాడి కర్ణుని చేతిలో మరణించిన యోధుడు. – మహాభారతం

**హరి 4 :** తారకాక్షుని కొడుకు, ఓ అసురుడు. ఇతడు బ్రహ్మ నుండి మృత సంజీవిని తయారుచేసే వరం పొందాడు. - మహాభారతం

**హరి 5 :** అకంపనుడను రాజు కొడుకు. ధనుర్విద్యలో మహావిష్ణువుతో సమానుడు. శక్తిలో ఇంద్రుడితో సమానుడయ్యి శత్రువుల చేతిలో చిక్కి మరణించాడు. - మహాభారతం

**హరి 6 :** గరుడుని వంశంలో జన్మించిన శక్తివంతమైన పక్షి. - మహాభారతం

**హరి 7 :** కశ్యప ప్రజాపతి క్రోధలకు జన్మించిన కూతురు. - రామాయణం

**హరి 8 :** ధర్మదేవునికి దక్షుని కూతురివల్ల నల్గురు పుత్రులు. వారు హరి, కృష్ణ, నర, నారాయణులు.

**హరులు 1 :** రావణుని సేవకుల్లో ఒకతెగ. వీరు వానర సేనతో పోరాడారు.

**హరులు 2 :** అశ్వాలలో ఓ జాతి. వాటి కంఠంపై పొడవైన జుట్టు వుండి బంగారు రంగులో వుంటాయి. - మహాభారతం

**హరికేశుడు :** ఓ యక్షుడు. పూర్వభద్రుడి కొడుకు. శివుడి గురించి తపస్సు చేయగా శివుడితణ్ణి కాశీ నగరానికి దండనాయకుణ్ణి చేస్తాడు. - మహాభారతం

**హరిగ్రామం :** విదర్భదేశంలోని ఒక పట్టణం.

**హరిజట :** అశోకవనంలో సీతకు కాపలాగావున్న రాక్షసి. - రామాయణం

**హరిణం :** ఐరావత కుటుంబానికి చెందిన ఓ నాగు. జనమేజయుని సర్పయాగంలో మరణించింది. - మహాభారతం

**హరిణాంకుడు :** చంద్రుడి నామాంతరం. లేడి చిహ్నంగా కలవాడని అర్థం.

**హరిణాశ్వుడు :** ప్రాచీన భారతదేశంలో ఒకరాజు. రఘువు వద్దనుండి ఓ ఖడ్గాన్నిపొంది దాన్ని శునకుడను రాజుకు బహుమతిగా ఇచ్చాడు. - మహాభారతం

**హరిణి :** హిరణ్యకశిపుని కూతురు. ఈమెను రోహిణి అని కూడా పిలుస్తారు. విశ్వపతి అనే అసురుణ్ణి వివాహమాడింది. - మహాభారతం

**హరితాలం :** పర్వతాలపై వుండే లోహం. ఇది సాయం సంధ్యలో మేఘాల మెరుపు రంగులో వుంటుంది.

**హరితాశ్వుడు :** సూర్యవంశపు రాజు. సంగీత విద్యలో నారదుణ్ణి ఓడిస్తాడు. సరస్వతి సిగ్గుపడేలా చేస్తాడు. బ్రహ్మను సంతోషింపచేస్తాడు. విష్ణువును నిద్రపుచ్చుతాడు. ఇదిచూసి ఈశ్వరుడికి ఈర్ష్య కల్గుతుంది. అంతేకాక ఇతడు అంధకాసురుణ్ణి సంహరిస్తాడు. - కంబ రామాయణం

**హరితుడు 1 :** ఒకరాజు. హరిశ్చంద్రుడి మనుమడు. రోహితుడి కొడుకు. - భాగవతం

**హరితుడు 2 :** స్వాయంభవు మనువు మనుమడు. వపుష్మానుడి కొడుకు. సాల్మలి ద్వీపంలో హరితవర్షం అనే రాజ్యానికి రాజు. - మార్కండేయ పురాణం.

**హరితుడు 3 :** ధూమ్రవర్ణ అనే నాగవనితకు యదువుకు జన్మించిన కొడుకు. ఇతడు నాగద్వీపమనే రాజ్యాన్ని స్థాపించి మద్గురజాతికి నాయకుడయ్యాడు. - హరివంశం

**హరిదాసుడు :** పులహాశ్వేతలకు జన్మించిన ఓ వానర రాజు. - బ్రహ్మాండపురాణం

**హరిద్రకం :** కశ్యపుని వంశంలో జన్మించిన ఓ నాగు. - మహాభారతం

**హరిద్వారం :** గంగాద్వారం. ఇదో క్షేత్రం. విష్ణువు దీన్ని నిర్మించాడు. దక్షుడు యజ్ఞం ఇక్కడే చేశాడని చెప్తారు.

**హరిధాముడు :** ఓ గొప్ప రుషి. ఇతడు రుషిగా వుండగా 20 అక్షరాల కృష్ణ మంత్రాన్ని ధ్యానించాడు. అందువల్ల తదనంతర జన్మలో గోకులంలో రంగ వేణిగా జన్మించాడు. -పద్మపురాణం

**హరిపిండ :** సుబ్రహ్మణ్యస్వామి సేవిక. - మహాభారతం

**హరిబభ్రుడు :** యుధిష్ఠరుని కొలువులోని ఓ గొప్ప మహర్షి. - మహాభారతం

**హరిభద్ర :** కశ్యప క్రోధలకు జన్మించిన కూతురు. పులహుడను రుషిని వివాహమాడి వానరాలకు, కిన్నిరులకు, కింపురుషులకు జన్మనిచ్చింది. - బ్రహ్మాండపురాణం

**హరిమిత్రుడు :** యమునా నదీ తీరంలోని ఓ ఆశ్రమంలో జీవించిన బ్రాహ్మణుడు. వికండులుడనే పాపుడు ఇతని సాంగత్యంవల్ల కాళిందిలో రెండు సార్లు స్నానం చేసి స్వర్గం చేరాడు. - పద్మపురాణం

**హరిమేధసుడు :** ప్రాచీనకాలంలో ఓ సాధువర్తనుడైన రాజు. ఇతడొకసారి యజ్ఞం చేయగా ధ్వజవతి అనే కుమార్తె జన్మించి పశ్చిమ ప్రాంతంలో నివసించింది. – మహాభారతం

**హరివంశం :** మహాభారతానికి అనుబంధ గ్రంథం. ఇది 10,000 పద్యాలతో కూడినది. దీని ముఖ్యోద్దేశ్యం విష్ణువు గొప్పదనం తెలియజేయడం. ఇది మూడు భాగాలు. హరివంశపర్వ, విష్ణుపర్వ, భవిష్య పర్వాలు. ఇందులో శ్రీకృష్ణుని బాల్యం, విష్ణువు అవతారాలు ముఖ్య కథ. – మహాభారతం

**హరివర్షం :** హేమ పర్వతానికి ఉత్తరానగల ప్రాంతం. అర్జునుడు తన ఉత్తరభారత జైత్రయాత్రలో ఈ ప్రాంతాన్ని జయించాడు. – మహాభారతం

**హరివర్షుడు :** అగ్నీధ్రుడి కొడుకు. ఇతడు పాలించినందు వల్ల ఇతడి దేశాన్ని హరివర్షమని పిలిచేవారు. – విష్ణుపురాణం

**హరివాసం :** ఉత్తర భారతదేశంలోని ఒక పట్టణం. తన ఉత్తరభారత దిగ్విజయ యాత్రలో అర్జునుడిక్కడికి వస్తాడు. – మహాభారతం

**హరివీరుడు :** చూ॥ ధనశర్మనుడు

**హరిశ్చంద్రుడు 1 :** త్రిశంకుడి కొడుకు. సూర్యవంశపు రాజుల్లో అత్యంత మహనీయుడుగా ఆడి తప్పని వాడిగా సత్యసంధుడిగా గణుతికెక్కాడు.
ఇచ్చినమాట నిల్పుకోవడానికి తన రాజ్యాన్ని మొత్తం విశ్వామిత్రుడికి ధారపోశాడు. అదీ చాలక తన భార్యను అమ్మి కొంతతీర్చి ఇంకా అప్పు మిగలగా చండాలుడి వద్ద సేవకుడిగా చేరి స్మశానంలో కాపలా దారుడిగా జీవించాడు. చివరకు త్రిమూర్తులు ప్రత్యక్షమై అతడికి ఎన్నో వరాలిచ్చారు. – చూ॥ విశ్వామిత్రుడు

**హరిశ్చంద్రుడు 2 :** ప్రాచీన కాలంలో ఓ చక్రవర్తి. బ్రహ్మ ప్రసాదితమైన ఓ భవంతిలో నిత్య సౌభాగ్యవంతుడై ఏడు ద్వీపాలను పాలించాడు. – పద్మపురాణం
ఇతడి ఐశ్వర్యసౌభాగ్యాలకు ఆశ్చర్యపోయి సనత్కుమారుడిని తను పూర్వజన్మలో ఎవరు ఇంతటి నిత్యభోగాలకు కారణమని అడగగా అతడు ఇతని పూర్వజన్మను గురించి వివరించాడు.
"పూర్వజన్మలో సత్యవంతుడివైన వైశ్యుడివని, నీ వృత్తి ధర్మాన్ని విడుచుట వల్ల నీవాళ్ళు నిన్ను బహిష్కృతుడ్ని చేశారని అయినా భార్యతో కలసి ఓ కొలనులో పూలుకోసి ఇంద్రద్యుమ్నుని కుమార్తె చంద్రమతికి వ్వగా ఆమె వాటిని యజ్ఞానికి ఉపయోగించింది. ఆ యజ్ఞ సమయంలో విష్ణువు, ఆదిత్యుడి విగ్రహాలను చూసి భక్తితో ప్రార్థించావు గనుక ఈ జన్మలో ఈ భాగ్యం కల్గిందని చెప్పాడు.

**హరిశ్చంద్రుడు 3 :** 9వ శతాబ్దంలో జీవించిన సంస్కృత కవి. ఇతడి ముఖ్యరచన 'ధర్మశార్మాభ్యుదయం'.

**హరుడు 1 :** ఓ ప్రసిద్ధ దానవుడు. కశ్యపదనులకు జన్మించాడు. సుహుకుడను రాజుగా పునర్జన్మించాడు. – మహాభారతం

**హరుడు 2 :** ఏకాదశ రుద్రుల్లో ఒకడు. – మహాభారతం

**హరుడు 3 :** శివుని నామాంతరం.

**హర్యంకుడు :** అంగరాజ వంశంలో జన్మించిన ఒక రాజు. చంపుడను రాజుకొడుకు. బృహద్రదుని తండ్రి. – అగ్నిపురాణం

**హర్యశ్వుడు 1 :** కాశీరాజైన సుదేవుడి తండ్రి. వితహవ్యుని పుత్రులితణ్ణి వధించారు. – మహాభారతం

**హర్యశ్వుడు 2 :** సూర్యవంశపు రాజు. ఇతడు అయోధ్యను పాలించాడు. ఓ శక్తివంతుడైన రాజు. యయాతి కుమార్తె మాధవిని వివాహమాడి గాలవుడి గురుదక్షిణ సమస్యను పరిష్కరించాడు. ఇతడి జీవితకాలంలో మాంసం భుజించలేదు. – మహాభారతం

**హర్యశ్వులు :** దక్షునికి అసిక్ని అనే భార్యవల్ల జన్మించిన 5000 మంది పుత్రులను హర్యశ్వులని పిలుస్తారు. – చూ॥ అసిక్ని

**హర్షుడు 1 :** ధర్మదేవుని ముగ్గురు కొడుకుల్లో ఒకడు. తక్కిన ఇద్దరు శమ, కాములు. హర్షుడు నందను వివాహమాడాడు. – మహాభారతం

**హర్షుడు 2 :** ఓ గొప్ప సంస్కృత కవి. తల్లి మామిల్ల దేవి. తండ్రి హీరుడు. ఇతడు కనూజును పాలించిన జయచంద్రుని కవుల సభలో సభ్యుడు. ఇతడి 'నైషధం' గొప్ప ఐదు సంస్కృత కావ్యాల్లో ఒకటిగా ప్రసిద్ధిగాంచింది. 12వ శతాబ్దివాడు.

**హర్షుడు 3 :** క్రీ.శ. 660-665 మధ్యప్రాంతంలో ఉత్తర భారతదేశాన్ని పాలించిన రాజు. ఇతడు రాజు కన్నా కవిగా ప్రసిద్ధుడు. నాగానందం, ప్రియదర్శిక, రత్నావళి ఇతడి రచనలు. బాణుడు ఇతడి జీవిత చరిత్రను గ్రంథస్థం చేశాడు.

**హలధరుడు :** బలభద్రరాముని పేరు. - మహాభారతం

**హలాయుధుడు :** క్రీ.శ. 10వ శతాబ్దంలో జీవించిన ఓ ప్రసిద్ధ సంస్కృత కవి. 'కవిరహస్యం' అనే రచన ఇతని ముఖ్య గ్రంథం. ఈ రచనలో నాయకుడు శ్రీకృష్ణుడు.

**హలంధనుడు :** నాభాగుడి కొడుకు. ఇతడి కుమారుడు వత్సప్రీత. - *భాగవతం*

**హలికం :** కశ్యపుని వంశంలో జన్మించిన ఓ నాగు. - *మహాభారతం*

**హలిమ :** సప్తమాతృకల్లో ఒకరు. - *చూ॥ సప్తమాతృకలు.*

**హలీమకం :** వాసుకి కుటుంబంలో జన్మించిన ఓ నాగు. జనమేజయుని సర్పయాగంలో మరణించింది.

**హవనుడు :** ఏకాదశరుద్రుల్లో ఒకడు. - మహాభారతం

**హవిగ్నుడు :** ఉదయం సాయంత్రం స్మరించదగ్గ ప్రాచీన రాజుల్లో ఒకడు. - మహాభారతం

**హవిర్ధానుడు :** పృథు చక్రవర్తి మనుమడు. పృథుచక్రవర్తికి ఇద్దరు కుమారులు. అంతర్ధానుడు, వాది. అంతర్ధానుడికి శిఖండినివల్ల హవిర్ధానుడు జన్మించాడు. హవిర్ధానుడికి ఆర్గురు కుమారులు. వారు ప్రాచీనబర్హి, శుక్ర, గయ, కృష్ణ, వ్రజ, అజినులు. - విష్ణుపురాణం

**హవిర్ధామనుడు :** మనువంశంలోని అంతర్ధామనుడి కొడుకు. - మహాభారతం

**హవిర్భుక్కు :** ప్రీతికి మరోపేరు. ఈమె పులస్త్యుడి భార్య. వీరి కొడుకు విశ్రవసుడు.

**హవిర్భువు :** పులస్త్యుని భార్య. - *చూ॥ పులస్త్యుడు*

**హవిశ్రవసుడు :** కురురాజు కుటుంబంలో జన్మించిన ఒకరాజు. చంద్రవంశజుడు. - మహాభారతం

**హరిష్మంతుడు :** ఓ రుషి. ఇంద్రసభలో సభ్యుడు. - మహాభారతం

**హరిష్మతి :** అంగిరసుని కుమార్తెలలో ఒకరు. - మహాభారతం

**హరిష్మానుడు :** ఓ గొప్ప రుషి. ఇంద్రుని కొలువులో సభ్యుడు.

**హవ్యఘ్నుడు :** ఓ రాక్షసుడు.

**హవ్యవాహనుడు 1 :** చూ॥ గృహపతి

**హవ్యవాహనుడు 2 :** అగ్ని, శుచిలకు జన్మించిన కొడుకు.

**హవ్యవాహుడు :** ధరుడను వసువు కొడుకు. - మత్స్యపురాణం

**హవ్యుడు :** ప్రియవ్రతుడి కొడుకు. శాకద్వీపాన్ని పాలించాడు. ఇతనికి సుకుమారుడు, మణీవకుడు, కుసుమోత్తరుడు, మోదకుడు, మహాద్రువుడు పుత్రులు. - *బ్రహ్మాండపురాణం*

**హస్తామలకుడు :** ఆదిశంకరాచార్యుని శిష్యుల్లో ఒకడు. - *చూ॥ శంకరాచార్యుడు.*

**హస్తి 1 :** చంద్రవంశంలో జన్మించిన ఒకరాజు. - మహాభారతం

**హస్తి 2 :** చంద్రవంశపు రాజు. సుహోత్రుడు సువర్ణలకు జన్మించాడు. త్రిగర్తరాజకుమారి యశోధరను వివాహమాడాడు. వీరికి వికంఠుడు జన్మించాడు. హస్తినాపుర నగరాన్ని హస్తి నిర్మించాడు. - మహాభారతం

**హస్తి 3 :** ఒక ఏనుగు. పూర్వజన్మలో ఇదే పేరున్న శివకింకరుడు శివరాధన చేస్తూ శ్రీకాళహస్తిలో శివసాయుజ్యం పొందుతుంది.

**హస్తికశ్యపుడు :** ప్రాచీన కాలంలో ఉత్తర భారత దేశంలో నివసించిన గొప్ప రుషి. శ్రీకృష్ణుడు పర్వతంపై తపస్సు చేస్తున్నప్పుడు ఇతడు శ్రీకృష్ణుని కలసి సంభాషించాడు. - మహాభారతం

★ **హస్తినాపురం :** పాండవుల రాజధానీ నగరం. - మహాభారతం

**హస్తిపద :** కశ్యపుని వంశంలో జన్మించిన ఓ నాగు. - మహాభారతం

**హస్తిపిండం :** కశ్యపుని వంశంలో జన్మించిన ఓ నాగు. - మహాభారతం

**హస్తిపురం :** చూ॥ హస్తినాపురం

★ ఇప్పుడు గంగానదిలో వుంది. ఢిల్లీకి 60 మైళ్ల దూరంలో వుంది. దీనిని హస్తిపురమని కూడా పిలిచేవారు.

**హస్తిభద్రం :** కశ్యపుని వంశంలో జన్మించిన ఓ నాగు. – మహాభారతం

**హస్తిసోమ :** పురాణాలలో తరచుగా పేర్కొనబడిన ఓ నది. – మహాభారతం

**హస్తుడు :** రోచన వసుదేవుల కొడుకు. యదువంశం వాడు. – భాగవతం

**హాటకదేశం :** హిమాలయాలకు ఉత్తరానగల ఒక దేశం. గుహ్యాములు ఇచట నివసించేవారు. ఉత్తర భారతదేశ జైత్రయాత్రలో అర్జునుడు వీరితో సఖ్యం కుదుర్చుకున్నాడు. – మహాభారతం

**హాటకి :** ఓ నది. ఓ సారి పార్వతీపరమేశ్వరులు వితలంలో కామకేళి జరపగా వారి వీర్యంనదిగా ఏర్పడింది. అదే హాటకి. – భాగవతం

**హారకేయూక :** చూ॥ లవణుడు

**హారవుడు :** బ్రహ్మ కన్నీటి బిందువులనుండి జన్మించిన ఓ అసురుడు. శివలింగం నుండి ఉద్భవించిన అగ్నికి ఆహుతయ్యాడు. – స్కంద పురాణం

**హారం :** పురాణ ప్రసిద్ధమైన ప్రాంతం. నకులుడు యుద్ధం చేసి ఈ దేశరాజుని ఓడించాడు. ఇతడు యుధిష్ఠురుని రాజసూయ యాగంలో పాల్గొన్నాడు.

**హారీతుడు 1 :** ఓ గొప్ప రుషి. భీష్ముడు అంపశయ్యపై నుండగా దర్శించినవారిలో ఒకడు. ఒకసారి ధర్మజుని సభలో నిత్యసత్యాలను గురించి, మానసిక ప్రశాంతతను గురించి ఉపన్యసించాడు. ఆ ఉపన్యాసం 'హారిత గీత'గా ప్రసిద్ధి చెందింది. – మహాభారతం

**హారీతుడు 2 :** స్మృతులను గురించి (వ్యవహార నియమాలు) రెండు రచనలు చేశాడు. వాటిని 'లఘు హారితం' వృద్ధహారిత స్మృతులంటారు.

**హార్ధికుడు 1 :** ఓ క్షత్రియరాజు. అశ్వపతి అనే అసురుడి అంశవల్ల జన్మించాడు. – మహాభారతం

**హార్ధికుడు 2 :** కృతవర్మ మరోపేరు. యదువంశంలోని హృదికుడి కుమారుడు కనుక హార్ధికుడని పిలిచేవారు. – మహాభారతం

**హాలాస్యం :** ఒక పుణ్యక్షేత్రం. మధురానగరపు ప్రాచీన నామం. ఇక్కడి దేవుడు సుందరేశ్వరుడు. – స్కందపురాణం

**హాలాహలం :** క్షీరసాగరమదన సమయంలో వెలువడిన విషం. అది పుట్టగనే దేవదానవులు భయపడి శివుణ్ణి ప్రార్థించగా అది లోకాల్ని దహించకుండా వుండటం కోసం తన కంఠంలో బంధిస్తాడు. అందుకనే శివుడు నీలకంఠుడయ్యాడు. – భాగవతం

**హాలాహలులు :** రాక్షసుల్లో ఒక తెగ. వీరు త్రిమూర్తుల మొదటి సృష్టి. వీరు అతి త్వరలో శక్తివంతులై బ్రహ్మ వల్ల వరాలు పొంది ముల్లోకాలను జయించారు. చివరకు కైలాసం, వైకుంఠం వెళ్ళే దారులను బంధించారు. వెయ్యి సంవత్సరాలు శివుడు, విష్ణువు వీరితో యుద్ధం చేసి సంహరించారు. విష్ణువు లక్ష్మితో చెప్పగా ఎగతాళిగా నవ్వింది. శివునిదీ అదే పరిస్థితి. మహా విష్ణువు లక్ష్మిపై కోపం వహించగా లక్ష్మి విష్ణువును, పార్వతి శివుడ్ని వదలి వెళ్ళగా వీరి శక్తి క్షీణించడం మొదలయ్యింది. బ్రహ్మ కారణంకనుగొని లక్ష్మి పార్వతులను అనునయించి తిరిగి వారి భర్తలకు అప్పచెప్పి ఇక నుండి సృష్టి బాధ్యత తనదేనని చెప్పాడు. అప్పటి నుండి శివుడు, విష్ణువు సృష్టి హక్కులను కోల్పోయాడు. – దేవీ భాగవతం

**హాసిని :** అలకాపురిలోని ఓ అప్సరస అష్టావక్రుడు గౌరవార్థం నృత్యం చేస్తుంది. – మహాభారతం

**హాహా :** ఓ గంధర్వుడు. కశ్యప ప్రజాపతి ప్రధలకు జన్మించాడు. అర్జునుని జన్మదినోత్సవ వేడుకల్లో పాల్గొన్నాడు. ఇతడు కుబేరుని కొలువులో వుంటాడు. అర్జునుడు దేవలోకం వచ్చినపుడు ఆహ్వానించిన వారిలో ఒకడు. – మహాభారతం

**హిడింబివనం :** హిడుంబడు అను రాక్షసుడు నివసించిన అడవి.

**హిడింబి :** చూ॥ ఘటోత్కచుడు; హిడింబుడు.

**హిడింబుడు :** ఓ రాక్షసుడు. లక్షాగృహ దహనం తర్వాత వీరు అరణ్యంలో పయనిస్తుండగా ఇతడు వీరిపై పడతాడు. భీముడితణ్ణి సంహరించి అతడి చెల్లెలు హిడింబిని వివాహమాడగా ఘటోత్కచుడు జన్మిస్తాడు. – మహాభారతం

**హితోపదేశం :** పంచతంత్రం మూలంగా తీసుకొని సంస్కృతంలో వ్రాయబడిన మరో రచన. ఇది క్రీ.శ. 10–12 శతాబ్దాల మధ్య రచింపబడింది. లభ్యమయ్యే

అత్యంత పాతగ్రంథం క్రీ.శ. 1373లో వ్రాయబడింది. ధవళచంద్రుడను రాజు వద్ద గల నారాయణ పండితుడు రచించాడు. ఇది 43 కథల సంకలనం. ఇందులో 25 పంచతంత్రంలో వున్నవి. ఈ గ్రంథం నాల్గు విభాగాలు. మిత్రలాభం, సుహృద్భేదం, విగ్రహం, సంధి.

**హిరణ్మయం :** జంబూద్వీపంలోని ఓ ప్రాంతం. నీల పర్వతాలకు దక్షిణాన నిషత పర్వతాలకు ఉత్తరాన వున్న ప్రాంతం. – భాగవతం

**హిరణ్యగర్భుడు :** శ్రీకృష్ణుని మరోపేరు. – మహాభారతం

**హిరణ్యధనుడు :** ఓ అరణ్య తెగకు రాజు. ధనుర్విద్యా కోవిదుడైన ఏకలవ్యుని తండ్రి. – చూ॥ ఏకలవ్యుడు

**హిరణ్యనాభుడు 1 :** సూర్యవంశంలో జన్మించిన ఒక రాజు. విధృతికొడుకు; ప్రష్యుడి తండ్రి. – భాగవతం

**హిరణ్యనాభుడు 2 :** సృంజయుని కొడుకుల్లో ఒకడు. సువర్ణష్ఠీవి మొదట సృంజయునికి జన్మించగా అకాల మరణం చెందాడు. నారదుడితణ్ణి బ్రతికించి హిరణ్యనాభుడని నామకరణం చేశాడు. ఇతడు 1000 సం॥ జీవించాడు. – మహాభారతం

**హిరణ్యపురం :** ఇది దైత్యుల నగరం. పులోమనుకాలక అనికూడా పిలుస్తారు. కాలకపుత్రులు కనుక దైత్యుల్ని కాలకేయులని కూడా పిలుస్తారు. దేవతలు, నాగులు ఇతర రాక్షసుల బారినుండి తన పుత్రులు రక్షింపబడాలని పులోమ బ్రహ్మనుగూర్చి తపస్సు చేయగా అతడి వరంవల్ల ఈ నగరం సృష్టించబడింది. కాలకేయుల బాధలవల్ల దేవతల జీవితాలు దుర్భరంకాగా ఇంద్రుడు అర్జునుడి సహాయం కోరతాడు. అర్జునుడు కాలకేయుల్ని నిర్మూలించి ఈ నగరాన్ని ధ్వంసం చేస్తాడు. – మహాభారతం

**హిరణ్యబింధువు :** హిమాలయాల వద్ద గల ఓ పుణ్యతీర్థం. అర్జునుడి తీర్థయాత్రల్లో దాన్ని దర్శించాడు. ఇచ్చట స్నానంచేస్తే చేసినపాపాలు నశిస్తాయి. ఇది కాలంజర పర్వతంపై వుంది. – మహాభారతం

**హిరణ్యబాహువు :** వాసుకి వంశంలో జన్మించిన ఓ నాగు. జనమేజయుని సర్పయజ్ఞంలో మరణించింది. – మహాభారతం

**హిరణ్యరేతసుడు :** ప్రియవ్రతుడి కొడుకుల్లో ఒకడు. కుశద్వీపాన్ని పాలించాడు. ఇతడికి ఏడుగురు కొడుకులు. – భాగవతం

**హిరణ్యరోముడు :** విదర్భరాజు. ఇతడిని భీష్మకుడని కూడా అంటారు. దక్షిణ ప్రాంతంపై కూడా తన అధికారం చలాయించాడు. – చూ॥ భీష్మకుడు

**హిరణ్యవర్మ :** దశార్ణరాజు. ఇతని కుమార్తెను శిఖండి వివాహమాడాడు. – మహాభారతం

**హిరణ్యశృంగం :** మైనాక పర్వతానికి పొడిగింపుగావున్న పర్వతం. ఇది కైలాస పర్వతానికి ఉత్తరాన వుంది. ఇచ్చట వజ్రాలు దొరుకుతాయని ప్రసిద్ధి. – మహాభారతం

**హిరణ్యసరస్సు :** పశ్చిమ తీరంలోగల ఓ పుణ్యతీర్థం. చంద్రుడు ఇక్కడ స్నానం చేసి తన పాపాలు కడిగివేసుకున్నాడు. – మహాభారతం

**హిరణ్యస్తూపుడు :** అంగిరసుని కుమారుడు. గొప్ప రుషి. – ఋగ్వేదం

**హిరణ్యహస్తుడు :** వధ్రిమతి అనే రాజకుమారికి అశ్వనీ దేవతల అంశవల్ల జన్మించిన పుత్రుడు. ఈమె ఓ నపుంసకుడ్ని వివాహమాడింది. అందువల్ల ఈమె అశ్వనీదేవతలను ప్రార్థించగా హిరణ్యహస్తుడిని ప్రసాదించారు. ఇతడు రుషియై మదిరాశ్వుడను రాజు కూతుర్ని వివాహమాడాడు. – మహాభారతం

**హిరణ్యుడు :** హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల్ని పిలిచేపేరు.

**హిరణ్యంతుడు :** అగ్నీధ్రుడి కొడుకు. హిరణ్యవర్షాన్ని పాలించాడు. – విష్ణు పురాణం

**హిరణ్వతి :** ఒకనది. ఈ నదీ తీరానే పాండవసేన యుద్ధం చేసింది. – మహాభారతం

**హీకుడు :** విపాశ నదిలో జీవించే ఓ రాక్షసుడు. ఇతడి స్నేహితుడు బహి. వీరిద్దరికి కలసి జన్మించిన పుత్రుడు బాహికుడు. – మహాభారతం

**హీహీ :** పిశాచాలలో ఒక తెగ. – భాగవతం

**హుతం :** ఐదు గొప్ప యజ్ఞాలలో ఒకటి. – చూ॥ ప్రహుతం

**హతవావ్యవాహుడు :** ధరుడనే వసువుల ఇద్దరు పుత్రుల్లో ఒకడు. రెండోవాడు ద్రవిణుడు. – మహాభారతం

**హుతాశనుడు :** ఓ అగ్నిపేరు.

**హూణులు :** ఓ తెగ ప్రజలు. వీరు వశిష్ఠుడి ఆశ్రమం లోని నంది నోటి నురుగు నుండి జన్మించారు. నకులుడు వీరిని జయిస్తాడు. వీరు ధర్మజుని రాజ సూయ యాగంలో పాల్గొని అతనికి కానుకలిస్తారు. – మహాభారతం

**హూహూ :** కశ్యప ప్రజాపతి ప్రథలకు జన్మించిన ఓ గంధర్వుడు. ఇతడు అర్జునుడి జన్మదినోత్సవ వేడు కల్లో పాల్గొన్నాడు. దేవలోకంలోకి అర్జునుణ్ణి ఆహ్వానిం చాడు. ఇతడు ఇంద్రసభలో వుంటాడు. ఓ గంధర్వుని శాపం వల్ల మొసలిగా మారాడు.

– చూ॥ ఇంద్రద్యుమ్నుడు

**హేతి :** ఓ రాక్షసుడు. – చూ॥ ప్రహేతి

**హేమ :** మయుని ప్రేయసి. – చూ॥ మయుడు

**హేమకాంతుడు :** వంగరాజైన కుశకేతుడి కొడుకు. శతవర్చసుడను రుషిని చంపి బ్రహ్మహత్యా పాతకం మూటగట్టుకున్నాడు. ఆ తర్వాత వైతుడనే బ్రాహ్మ ణుడికి నీరు అందజేసి ఆ పాతకం నుండి బయట పడ్డాడు. – స్కంద పురాణం

**హేమకుండలుడు :** ఓ వైశ్యుడు. చూ॥ వికుండలుడు

**హేమగుహ :** కశ్యపుని వంశంలో జన్మించిన ఓ నాగు.

**హేమచంద్రుడు :** ఓ రాజు. విశాలుడను రాజుకొడుకు; సుచంద్రుడి తండ్రి.

**హేమనాభుడు :** మైనాకుడి మరో పేరు.

**హేమనేత్రుడు :** ఓ యక్షుడు. కుబేరుని కొలువులో వుండి అతణ్ణి పూజిస్తాడు. – మహాభారతం

**హేమపద్మాకరం :** మధురాపురానికి ఆగ్నేయ మూలన గల ఒక సరస్సు. శివలింగాభిషేకానికి నీళ్ళు దొరకటం లేదని అచటి ప్రజలు శివుణ్ణి ప్రార్థించగా శివుడు త్రిశూలంతో నీటిని రప్పిస్తాడు. అక్కడ తన శిరస్సుపై గల గంగను ప్రవేశపెట్టి బంగారు పద్మాలు మొలిచే టట్లు చేస్తాడు. అందుకని దాన్ని హేమపద్మాకరమని పిలిచారు. – స్కందపురాణం

**హేమ ప్రభ :** చూ॥ వల్లభుడు

**హేమప్రభావతి :** చూ॥ వరతాను

**హేమమాలి 1 :** ఇతడు వైశ్రావణుడికి పూజకు పుష్పాలు అందజేసేవాడు. ఇతడికో అందమైన విశాలాక్షి అనే భార్య వుంది. ఒకరోజు మానససరసు నుండి పుష్పాలు తెస్తూ భార్య జ్ఞాపకంవచ్చి ఇంటికివెళ్ళి ఆమెతో గడిపాడు. కుబేరుడు దేవాలయానికి పూజకు వెళ్ళి సాయంత్రం వరకు పూలకోసం వేచి వుండి హేమమాలి కోసం ఇంటికి పంపాడు. విషయం తెలిసి కుబేరుడతణ్ణి శపించాడు. అతడు 18 రకాల కుష్ఠు వ్యాధిగ్రస్తుడ య్యాడు. భార్యనుండి విడివడి అలకాపురి నుండి క్రిందపడి హేమాద్రికి చేరాడు. అచ్చట మార్కండేయ మహర్షిని కలిసి తన పొరపాటు కథ వివరించగా ఆషాఢ కృష్ణైకాదశి వ్రతం చేయమని సలహా ఇస్తాడు. అప్పుడు శాపవిమోచనం జరిగి వైకుంఠం వెళ్తాడు.

**హేమమాలి 2 :** ద్రుపదుని కొడుకుల్లో ఒకడు. మహా భారత యుద్ధంలో అశ్వత్థామ ఇతణ్ణి వధించాడు.

– మహాభారతం

**హేమరథుడు :** సూర్యవంశపు రాజు. చిత్రరథుడి మనుమడు. క్షేముడి కొడుకు; సత్యరథుడి తండ్రి.

– మహాభారతం

**హేమవర్ణుడు :** రోచమానుడి కొడుకు. ఇతడు పాండ వుల పక్షాన కౌరవులతో పోరాడాడు. – మహాభారతం

**హేమాంగదుడు :** యదు వంశంలోనివాడు. రోచన వసుదేవుల రెండవ కొడుకు.

**హేముడు :** అణువంశస్థుడు. జయద్రథుడి కొడుకు. బలిపితామహుడు.

**హేరంబకం :** ప్రాచీన దక్షిణ భారతదేశంలో ఒక ప్రాంతం. ఇచ్చట నివసించే ప్రజల్ని హేరంబులని పిలుస్తారు. సహదేవుడు తన దక్షిణదేశ జైత్రయాత్రలో వీరిని జయించాడు. – మహాభారతం

**హేహయుడు :** చూ॥ ఏకవీరుడు

**హైమవతం :** పురాణాలలో ప్రసిద్ధిగాంచిన హిమాలయా లకు ఉత్తరప్రాంతం. శుకబ్రహ్మర్షి మహామేరు నుండి మిథిలకు వెళ్ళే సమయంలో ఈ ప్రాంతం గుండా వెళ్ళాడు. – మహాభారతం

**హైమవతి 1 :** శతద్రునదికి మరోపేరు.

– చూ॥ శతద్రు

**హైమవతి 2 :** విశ్వామిత్రుని భార్యల్లో ఒకరు.

– మహాభారతం

**హైమవతి 3 :** శ్రీకృష్ణుని భార్యల్లో ఒకరు. శ్రీకృష్ణ నిర్యాణం తర్వాత ఆమె అగ్నిలో దూకి మరణించింది. - మహాభారతం

**హైరణ్యవతి :** పురాణప్రసిద్ధ ప్రాంతమైన హిరణ్మయ ప్రాంతం గుండా ప్రవహించే నది. - మహాభారతం

**హైరంభం :** ఒక పర్వతం. మణిపురానికి దక్షిణాన వుంది. కపిలా నదికి జన్మస్థానం.

**హైహయం :** కార్యవీర్యార్జునుడు పాలించిన దేశం. నర్మదానదీ తీరప్రాంతం.

**హైహయుడు 1 :** చూ॥ హయహయుడు

**హైహయుడు 2 :** హైహయదేశపు రాజైన కార్తవీర్యార్జునుడి మరోపేరు. పరశురాముడి చేతిలో మరణిస్తాడనే శాపం వుంది. అపుడి ఆశ్రమం ఇతడివల్ల తగలబడటంవల్ల అతడి శాపానికి గురవుతాడు.

**హోత్రవాహనుడు :** ఓ సాధువర్తనుడైన రాజు. అంబకు తాత. - *చూ॥ అంబ*

**హోమధేనువు :** ఓ గోవు. యజ్ఞానికి కావలసిన పాలిచ్చే గోవు.

**హోముడు :** భరతవంశానికి చెందిన ఒకరాజు. కృశద్రధుడి కొడుకు; సుతపసుడి తండ్రి. - *భాగవతం*

**హంస :** ఓ పక్షి. చూ॥ సృష్టి

**హంసకాయుడు :** ఓ క్షత్రియుడు. ధర్మజుని రాజసూయ యాగంలో పాల్గొన్నాడు. - మహాభారతం

**హంసకూటం :** హస్తినాపురానికి శతశృంగపర్వతానికి మధ్యగల పర్వతం. పాండురాజు శతశృంగానికి వెళ్ళే దారిలో దీన్ని దాటాడు. శ్రీకృష్ణుడొకసారి దీని శిఖరాన్ని పెకలించి ద్వారకలో వుంచాడు. - మహాభారతం

**హంసగీత :** ధర్మప్రకాశాన్ని తెలిపే గ్రంథం హంసరూపధారుడైన బ్రహ్మ సాధ్యులకు ఉపదేశించాడు గనుక హంసగీత అనబడింది.

**హంసచూడుడు :** ఓ యక్షుడు. కుబేరుని కొలువులో అతణ్ణి పూజిస్తుంటాడు. - మహాభారతం

**హంసజుడు :** సుబ్రహ్మణ్యస్వామి యోధుల్లో ఒకడు. - మహాభారతం

**హంసధ్వజుడు :** చంపానగర రాజు. విష్ణుభక్తుడు. ఇతని పాలనాకాలంలో స్వలింగసంపర్కం ఎక్కువగా వుండేది. ధర్మజుని అశ్వమేధాశ్వాన్ని బంధించాడు. వీరికి జరిగిన యుద్ధంలో హంసధ్వజుడి కొడుకులు సుధాన్యుడు, సురతుడు మరణించగా హంసధ్వజుడు యుద్ధ రంగంలోకి రాగా అర్జునుడికి ప్రాణాపాయమని తలచి శ్రీకృష్ణుడు వీరికి రాజీచేసి స్నేహితుల్ని చేశాడు. - మహాభారతం

**హంసప్రపతన తీర్థం :** గంగా నదీ తీరంలో ప్రయాగ వద్ద గల ఓ పుణ్యతీర్థం. - మహాభారతం

**హంసవక్త్రుడు :** సుబ్రహ్మణ్యస్వామి పక్షాన పోరాడి ఎందరో అసురుల్ని వధించాడు. - మహాభారతం

**హంసి :** భగీరథుని కూతురు. ఈమెను కౌత్సుడు వివాహమాడాడు. - మహాభారతం

**హంసిక :** సురభి కూతురు. ఇది దక్షిణ దిక్కుకు సహాయపడుతుంది.

**హంసుడు 1 :** కృతయుగంలో మహావిష్ణువు అవతారం. బ్రహ్మ సమక్షంలో సనకుడికి ఇతర రుషులకు యోగం గురించి విశదీకరించాడు. ఇతడిని యజ్ఞుడని కూడా అంటారు. ఇతడు ప్రజాపతికూడా. ప్రజాపతిగా సాధ్య దేవులకు ముక్తి మార్గాన్ని బోధిస్తాడు. దాన్నే హంసగీత అని పిలుస్తారు. - మహాభారతం

**హంసుడు 2 :** అరిష్ట కశ్యప ప్రజాపతులకు జన్మించిన గంధర్వుడు. ధృతరాష్ట్రుడు ఇతడి అంశగా జన్మించాడని నమ్ముతారు. - మహాభారతం

**హంసుడు 3 :** జరాసంధుని మంత్రి. హంస, డింభకులు సాళ్వదేశరాజైన బ్రహ్మదత్తుడి కుమారులు. వీరు ధనుర్విద్యాకోవిదులు. పరశురాముడు వీరి గురువు. విచక్షుడు, జనార్ధనుడు హంసుని స్నేహితులు. జనార్ధనుడు బ్రహ్మదత్తుని స్నేహితుడైన మిత్రసహుల కొడుకు. హంస, డిభక జనార్ధుల వివాహం ఒకేసారి జరిగింది. శివుడు వీరికి రుద్రాస్త్రమహేశ్వరాస్త్ర, బ్రహ్మ శాస్త్రలను ఇద్దరు సేవకులను బహుమతిగా ఇచ్చాడు. *దుర్వాసుని శాపం :* శివుని వరంవల్ల వారు గర్వాంధులై లోకకంఠకులుగా మారడమేగాక దుర్వాసుడిని ఇబ్బందిపెట్టగా దుర్వాసుడు మహావిష్ణువు చేతిలో వధింపబడతారని శపించి ఈ విషయాన్ని శ్రీకృష్ణుడితో కూడా చెప్పాడు.

మరణం : హంస డింభకులు అశ్వమేథయాగం చేశారు. అందరు రాజుల నుండి కప్పం వసూలు చేశారు. శ్రీకృష్ణుడందుకు నిరాకరించగా వారు శ్రీకృష్ణునిపై యుద్ధానికి వెళ్ళగా డింబకుడ్ని వధించి హంసుడ్ని తన్నగా పాతాళం వెళ్ళి పడి అక్కడ పాముకాటుకు మరణిస్తాడు. – హరివంశం

జరాసంధుడు హంసుడు మరణించినందుకు ఎంతో కాలం దుఃఖిస్తాడు. భీమసేనుడు తూర్పు దేశాల జైత్ర యాత్రకు వెళ్ళినప్పుడు జరాసంధుడితో పోరాడి నపుడు కూడా జరాసందుడు వీరిని తలచుకున్నాడు. – మహాభారతం

**హింగుళం :** పర్వత ప్రాంతాల్లో వుండే ఓ మూలకం. ఇది సూర్యాస్తమయ సమయంలో ఆకాశపుటెరుపు రంగులో వుంటుంది. – మహాభారతం

**హుండుడు :** విప్రచిత్తి కొడుకు. ఓ అసురుడు. అశోక సుందరి అనే సుబ్రహ్మణ్యస్వామి సోదరిని ఎత్తుకు పోయాడు. – విష్ణుపురాణం

**హృదీకుడు :** ఓ యాదవుడు. కృతవర్మ తండ్రి. – మహాభారతం

**హృద్యుడు :** ఓ గొప్ప రుషి. ఇంద్రుని కొలువులో వుండే వాడు. – మహాభారతం

**హృషీకేశుడు :** హృషీకమంటే విషయేంద్రియ ప్రపంచం. దీనికతీతుడైనందువల్ల భగవంతుణ్ణి హృషీకేశుడంటారు.

**హ్రదోదరుడు :** దేవాసుర యుద్ధంలో సుబ్రహ్మణ్యస్వామి వధించిన ఓ అసురుడు. – మహాభారతం

**హ్రస్వరోముడు :** మిథిలానగర రాజు. సర్వరోముడి కొడుకు. రెండోజనకుడి తండ్రి.

**హ్లాదిని :** గంగానది యొక్క ఉపనది. గంగ శివుని తల నుండి బిందు సరస్సులో పడి ఒకపాయను భగీరథుడు పాతాళానికి తీసుకువెళ్ళగా మూడుపాయలు తూర్పు వైపుకి వెళ్తాయి. అందులో ఇదొకటి.

**హ్రాదుడు 1 :** హిరణ్యకశిపుని కొడుకు. హ్లాదుడని కూడా అంటారు.

**హ్లాదుడు 2 :** ఓనాగు. బలభద్రరాముని ఆత్మను పాతాళానికి తీసుకువెళ్ళిన నాగుల్లో ఒకటి. – మహాభారతం

**హ్రీ :** స్వాయంభువ మనువుకు శతరూపవల్ల జన్మించిన 16 మంది కుమార్తెలలో ఒకరు. హ్రీదేవి బ్రహ్మ కొలువులో అతణ్ణి పూజిస్తుంటుంది. అర్జునుడు ఇంద్రలోకానికి ప్రయాణించినపుడు ఆటంకాలు ఏర్పడకుండా ద్రౌపది ఈమెను ప్రార్థించింది. సుబ్ర హ్మణ్యుడికి సేనాధిపత్యం జరిగినపుడు ఈమె కూడా వుంది. – మహాభారతం

**హ్రీనిషేవుడు :** అసురవంశంలో జన్మించిన ఉదార మనస్కుడైన రాజు. దురదృష్టం ఇతణ్ణి రాజ్యహీనుణ్ణి చేసింది. – మహాభారతం

**హ్రీమంతుడు :** ఓ సనాతన విశ్వదేవుడు. – మహాభారతం















# పూర్వగాథాలహరి

శ్రీ మహావిష్ణువు అవతారాలలో తన ఆయుధమైన సుదర్శన చక్రాన్ని దశావతారాలలో ఏ అవతారములో ఉపయోగించాడు?

సీత తండ్రి జనకుని పేరేమిటి? జనకుడనడానికి కారణమేమిటి?

ద్రౌపతికి ఐదుగురు భర్తలగుటకు కుంతి ఆదేశమే కారణమా? లేక పురాణాలలో మరో కారణమేమైనా వుందా ?

భార్గవరాముడి క్షత్రియ వధకు తండ్రి మరణమా? లేక వంశానుగత శత్రుత్వమా?

ఇంద్రుడనునది ఒక పేరా? లేక ఓ పదవా?

త్రిశంకు స్వర్గమంటే ఏమిటి?

పుష్పక విమాన రూపశిల్పి ఎవరు?

రావణ కుంభకర్ణులు సోదరులవడానికి వెనుక కథ ఏది?

ప్రజాపతులెవరు? దక్షప్రజాపతికి శివుడు అల్లుడెట్లయ్యెను?

సృష్టికి మూలం ఏది ?

పై సందేహాలు కొన్నే ఈ సంకలనము నిండా మీరు తెలుసు కొనవలసిన, తెలియని పురాణ ఇతిహాస గాథలు ఎన్నెన్నో !

నూతన పాఠకుల కోసం శుద్ధ వ్యావహారికములో పురాణ ఇతిహాస చారిత్రక వ్యక్తుల కథలు, గాథలు కడురమ్యముగా వివరించిన విశిష్ట సంకలనం.















విక్టరీ పబ్లిషర్స్

# 30-17-3ఎ, వారణాసి వారి వీధి, సీతారాంపురం,
విజయవాడ - 520 002, ఫోన్ : 0866-2444156